శాస్త్ర నిఘంటువు – 8

తెలుగు

# తెలుగు సాహిత్య కోశము

## ప్రాచీన సాహిత్యము

సంకలన కర్తలు

శ్రీ నల్లపాటి శివనారాయ్య, ఎం.ఏ;
రిసెర్చి అసిస్టెంట్

శ్రీ కారంచేడు వేంకట కృష్ణమాచార్యు, ఎం.ఏ (తె): ఎం.ఏ (సం):
పబ్లికేషన్ అసిస్టెంట్

శ్రీమతి ఎం. ప్రమీలారెడ్డి, ఎం.ఏ; ఎం.ఫిల్;
రిసెర్చి అసిస్టెంట్

శ్రీ సీలా జంగయ్య, ఎం.ఒ.ఎల్;
రిసెర్చి అసిస్టెంట్

పరిష్కర్త

డా. శ్రీమతి ప. విజయభారతి, ఎం.ఏ; పి.హెచ్.డి;
రిసెర్చి ఆఫీసర్, తెలుగు అకాడమి.




తెలుగు అకాడమి
హైదరాబాదు
1980

telugu saahitya koSamu : *Compilers :* Sri N. Siva Narayya; Sri K. V. Krishnamacharya; Smt. M. Pramila Reddy; Sri N. Jangaiah.
*Scrutiniser :* Dr. Smt. B. Vizia Bharati. First Edition 1980, PP, viii+1282+xiv



*First Edition, 1980*
*Copies : 1,000*

Published by TELUGU AKADEMI, Hyderabad-29 (Andhra Pradesh) under the Centrally Sponsored Scheme of Production of Books and Literature in Regional languages at the University level, of the Government of India in the Ministry of Education and Social Welfare (Department of Culture), New Delhi.



***Price :* Rs. 47-75**

---

**Printed in India**
**Text at Pragati Art Printers, Lakidikapul, Hyderabad - 500004**
**Cover at Anupama Printers, Shantinagar, Hyderabad - 500028**
**Andhra Pradesh**

# ప్రవేశిక

వివిధ శాస్త్ర విషయాలలో పారిభాషిక పద నిఘంటువులు రూపొందిస్తే అధ్యాపకులకు, విశేషించి అధ్యయనపరులకు ప్రయోజనకరంగా ఉంటాయనే ఉద్దేశంతో తెలుగు అకాడమి శాస్త్ర నిఘంటువుల ప్రచురణ పథకానికి రూపకల్పన చేసింది. ఆయా శాస్త్ర విషయాలను విశిష్టంగా పరిచయం చేస్తూ, పరిభాషా పదాలకు లఘు వివరణమూ, పరస్పర సంబంధ నిర్దేశమూ నిర్వహిస్తూ- ఛందః పదకోశం, సాహిత్య పదకోశం, వ్యాకరణ పదకోశం అనే మూడు నిఘంటువులను ఇదివరకే ప్రచురించటం జరిగింది.

వాటికి పూరక గ్రంథమైన తెలుగు సాహిత్య కోశంలో మొదటి భాగంగా ప్రాచీన సాహిత్యాన్ని వెలువరిస్తున్నాము. ఏ విభాగానికి ఆ విభాగం అకారాదిక్రమంలో ప్రచురిస్తే అధిక ప్రయోజనకరంగాను, పరిశీలనకు త్వరితగతిని ఉపకరించేదిగాను ఉంటుందనే ఉద్దేశంతో-ప్రాఙ్నన్నయ యుగం నుంచి క్రీ.శ. 1850 వరకు ఉన్న సాహిత్యాన్ని ప్రాచీన సాహిత్యంగాను, క్రీ.శ.1850 నుంచి క్రీ. శ. 1950 జనవరి 26 వరకు ఉన్న సాహిత్యాన్ని ఆధునిక సాహిత్యంగాను విభజించి ఈ కోశాన్ని ప్రచురిస్తున్నాం.

తెలుగు సాహిత్యానికి, సంస్కృతికి చెందిన వివిధ విషయాలను సమగ్రంగా చెప్పే గ్రంథాలు తెలుగులో ఇంచుమించు లేవనే చెప్పాలి. నన్నయ నుండి ఇప్పటి వరకు ఆంధ్రదేశంలో వెలువడిన సాహిత్యం గురించీ, కవుల చరిత్ర గురించీ, వారి కావ్యాల గురించీ ఇతోధికంగా గ్రంథాలు వెలువడ్డాయి. అలాగే తెలుగు వారి సంస్కృతి గురించి వివరించే గ్రంథాలు కూడా వెలువడ్డాయి. కాని పై వాటిని సమన్వయం చేసి, సమగ్రంగా కాని, సంక్షిప్తంగా కాని ఒక చోట కూర్చిచెప్పిన గ్రంథాలు తెలుగులో లేవు. ఇతర భాషా సాహిత్యాలలో ఇట్లాంటి గ్రంథాలు చాలా ఉన్నాయి.

ఉదా : ఆక్స్‌ఫర్డ్ ఆంగ్ల సాహిత్య కోశము.

పై ఆంగ్ల సాహిత్య కోశంలో కవి కావ్యాదులకు, సాహిత్య ప్రక్రియలకు, రచనలలో వచ్చిన ప్రముఖ పాత్రలకు, సాహిత్య పోషకులకు, సాహిత్యంతో సంబంధమున్న

నగరాలకు, ఉద్యమాలకు, సమాజాలకు, పత్రికలకు సంబంధించిన ఆరోపాలు చోటు చేసుకొన్నాయి.

ఈ సాహిత్యకోశం వంటి ఒక కోశాన్ని తెలుగులో ప్రచురిస్తే తెలుగు పాఠకులకు ఉపయోగకరంగా ఉంటుందనే ఉద్దేశంతో తెలుగు అకాడమి పాలక మండలివారు ఒక పథకాన్ని తలపెట్టి, సాహిత్య కోశపు రచనా ప్రణాళికను రూపొందించారు. పై ప్రణాళిక ననుసరించి ఈ కోశాన్ని సంకలనం చేయటం జరిగింది.

## రచనా ప్రణాళిక :

ప్రత్యక్షంగా కాని, పరోక్షంగా కాని సాహిత్యంతో సంబంధమున్న ముఖ్యమైన పేర్లన్నీ ఈ కోశంలో ఆరోపాలుగా ఉంటాయి. వీటి వివరణ, ఆరోప ప్రాముఖ్యాన్ని బట్టి విస్తృతిలో మార్పు పొందినా-సాధారణంగా సూటిగా, లఘువుగా ఉంటుంది. వీనిలో ఉప ఆరోపాలు ఉండవు.

ముఖ్యమైన ప్రాచీన శాసనాల పేర్లు ఆరోపాలుగా ఉంటాయి; వీటికి సంబంధించిన ఐతిహాసిక వివరణలు, భాషా వివరణలు ఉంటాయి.

గ్రంథకర్తల ఆరోపాలలో కాలం, స్థలం, బిరుదులు, రచనలు, కీర్తి ప్రతిష్ఠలకు సంబంధించిన సంక్షిప్త పరిచయం ఉంటుంది. తెలుగులో రచయితగా ఉన్న గ్రంథకర్త, ఇతర భాషలలో వ్రాసిన గ్రంథాల పేర్లు కూడా ఉంటాయి. తెలుగు భాషా సాహిత్యాలకు సేవచేసిన ఇతర దేశస్థుల పేర్లు కూడా ఉంటాయి.

రచనల ఆరోపాలలో గ్రంథకర్త, కృతి భర్త, రచనాకాలం, ప్రక్రియ, ఇతివృత్తం మొదలయిన వివరాలు ఉంటాయి. తెలుగు రచన చేసిన గ్రంథకర్త, ఇతర భాషలలో చేసిన రచనలు కూడా ఆరోపాలుగా ఉంటాయి. తెలుగు భాషా సాహిత్యాలకు సంబంధించిన రచనలు అవి ఏ భాషలో ఉన్నా కూడా ఆరోపాలుగా ఉంటాయి. నిఘంటువులవంటి సంప్రదింపు గ్రంథాల పేర్లు కూడా ఉంటాయి.

ప్రక్రియా వైవిధ్యాన్ని పురస్కరించుకొని వివిధ ప్రక్రియలు ఆరోపాలుగా ఉంటాయి. ఆ ప్రక్రియలకు సంబంధించిన సాధారణ వివరణ ఉంటుంది.

పురాణపాత్రలు మినహా, సాహిత్యంలో వచ్చి తెలుగు ప్రజలలో నిలిచిపోయిన ప్రముఖ పాత్రలు ఆరోపాలుగా ఉంటాయి. ఉదా: వరూధిని, కలభాషిణి, విరంచుకుడు, నిగమశర్మ, గిరీశం, కాంతం, పేరిగాడు మొదలయినవి.

తాము స్వయంగా రచనలు చేయకపోయినా తెలుగు భాషా సాహిత్యాల అభివృద్ధికి సాయపడిన పోషకుల పేర్లు ఆరోపాలుగా ఉంటాయి.

సాహిత్యాభివృద్ధికి దోహదం చేసిన భాషా సాహిత్యోద్యమాలు ఆరోపాలుగా ఉంటాయి.

భాషా సాహిత్యాభివృద్ధికి తోడ్పడిన వివిధ సమాజాలు ఆరోపాలుగా ఉంటాయి.

భాషా సాహిత్యాభివృద్ధికి సేవచేసిన పత్రికలు ఆరోపాలుగా ఉంటాయి.

తెలుగు భాషా సాహిత్యాభివృద్ధికి విశేషంగా ప్రోత్సాహం ఇచ్చిన నగరాలు ఆరోపాలుగా ఉంటాయి.

ఈ రకమైన రచనా ప్రణాళికతో వెలువడిన తొలి తెలుగు సాహిత్యకోశం ఇదే.

ఇందులోని ప్రతి ఆరోపాన్ని గురించి న్యాయంగా చెప్పవలసి వస్తే ఇంకా విస్తృతంగా చెప్పవలసే ఉంటుంది. కాని నిర్ణయించుకొన్న రచనా ప్రణాళిక మేరకు, ఆయా ఆరోపాల ప్రాముఖ్యాన్ని దృష్టిలో పెట్టుకొని-కొన్ని పరిధులకు లోబడి ఆయా ఆరోపాల రచన చేయటం జరిగింది. సహృదయులైన పాఠకులు ఈ దిగువ విషయాలను దృష్టిలో ఉంచుకోవలసిందిగా కోరుతున్నాము.

ఆంధ్ర దేశంలోని కవులు వ్రాసిన తెలుగు రచనలే గాక ఆంధ్రేతర గ్రంథాలను, అలభ్య గ్రంథాలను కూడా ఆరోపాలుగా చేర్చటం జరిగింది.

పేర్లు మాత్రమే తెలిసి, వివరాలు తెలియకపోయినా ఆయా రచయితలను, రచనలను ఆరోపాలుగా చేర్చటం జరిగింది.

కవుల దగ్గర కావ్యాల గురించి కాని, కావ్యాల దగ్గర కవులను గురించి కాని ఎక్కువగా చెప్పలేదు.

ముఖ్యమైన కొన్ని నామాంతరాలకు మాత్రమే ఆరోపాలను ఇవ్వటం జరిగింది.

సాహిత్యంలో ప్రతిఫలించిన చారిత్రక, మత, సాంఘిక సంప్రదాయాలను సాధ్యమైనంత వరకు సేకరించి ఆరోపాలుగా చేర్చటమైంది.

ప్రాచీన సాహిత్యంతో సంబంధమున్న కొన్ని ముఖ్య శాసనాలను మాత్రమే ఆరోపాలుగా చేర్చటం జరిగింది.

తెలుగు వారా కాదా అనే వివాదం ఉన్న సంస్కృతాంధ్ర కవులను, కావ్యాలను కూడా ఆరోపాలుగా చేర్చటం జరిగింది. వివాదగ్రస్తమైన విషయాలను సూచించటమే గాని నిర్ధారించలేదు.

సంస్థానాల చరిత్రను, సాహిత్య పోషణను తెల్పటమేగాని ఆయా సంస్థానాలకు చెందిన అధిపతి కవులను కూడా ప్రస్తావించవలసి వచ్చింది వారిని గూర్చిన వివరాలు మాత్రం ఆధునిక సాహిత్య విభాగంలోనే ఉంటాయి.

ఆధునిక సాహిత్య యుగారంభ కర్తలయిన కీ. శే. కందుకూరి వీరేశలింగం-ఆయన సమకాలికులతో ఆధునిక యుగాన్ని ఆరంభించటం జరిగింది

ప్రాచీనాధునిక యుగ విభజనలో ప్రసిద్ధులయిన కొందరు కవులను వారి ప్రశస్తిని బట్టి అటో ఇటో చేర్చటం జరిగింది.

తెలుగు సాహిత్యంలో వివాదగ్రస్తం కాని విషయాలు చాల తక్కువ. కవుల పేర్ల విషయంలోను, కాలనిర్ణయం విషయంలోను, కవి పోషకుల విషయంలోను పండితుల మధ్య భిన్నాభిప్రాయాలున్నాయి. తాత పేరు మనుమడికి పెట్టడం అనే ప్రాచీన సంప్రదాయం వల్ల కొన్ని వివాదాలు తలఎత్తాయి. సాహిత్య చరిత్రకారులు వారిని భిన్నరీతులలో పేర్కొనటం జరిగింది. సాధ్యమయినంత వరకు ప్రచారంలో ఉన్న నామాంతరాలను సమన్వయం చేసి ఇందులో ఇచ్చాం. మరి కొన్నింటిని సవరణ పత్రంలో పొందుపరిచాం.

అకారాది క్రమంలో ఆరోపాల కూర్పును మొదటి నాలుగు అక్షరాల వరకు మాత్రమే పరిమితం చేయటం జరిగింది.

పాఠకుల సౌలభ్యం కోసం ఆయా ఆరోపాల దిగువన ప్రధానాధార గ్రంథాన్ని సూచించటం జరిగింది.

విద్యార్థులకు, అధ్యాపకులకు, పరిశోధకులకు, సాహిత్యాభిమానులకు, జిజ్ఞాసువులకు - ఇది ఉపాదేయంగా ఉంటుందనీ, సంప్రదింపు గ్రంథంగా కూడా ఉపయోగపడుతుందనీ ఆశిస్తున్నాము.

ఆరోపాల సంకలన కార్యక్రమంతో పాటు పరిష్కరణ బాధ్యతలు కూడా పూర్తిగా అకాడమి ఉద్యోగులే స్వీకరించారు.

వినూత్న పద్ధతిలో ఈ సాహిత్య కోశానికి రచనా ప్రణాళికను తయారు చేసిన తెలుగు అకాడమీ పూర్వపు డిప్యూటీ డైరెక్టరూ, ప్రస్తుత హైదరాబాదు కేంద్రీయ విశ్వ విద్యాలయ తెలుగు శాఖాధిపతులూ అయిన ప్రొఫెసరు డా. కొత్తపల్లి వీరభద్రరావు ఎం. ఏ. పిహెచ్. డి. గారికి అకాడమి హృదయ పూర్వక కృతజ్ఞతలు తెలియ చేస్తున్నది.

ఆరోపాల రచనతో పాటు, సంపాదకత్వాన్ని స్వీకరించి సకాలంలో ఆరోపాలను పరిష్కరించిన డా॥ శ్రీమతి బి. విజయభారతి, రీసర్చి ఆఫీసరు, ప్రశంసార్హురాలు.

పరిష్కృత ఆరోపాలకు తుది పరిశీలకులుగా ప్రముఖ ఆంగ్లాంధ్ర భాషాసాహిత్య వేత్తలు, తెలుగు అకాడమి విద్యావిషయిక స్థాయీసంఘ సభ్యులైన డా॥ అవసా రామకృష్ణా రావుగారు వ్యవహరించారు. వారి సూచనల ప్రకారం కొన్ని ఆరోపాలను చేర్చటం జరిగింది. వారికి కృతజ్ఞతలు.

ఆరోపాల రచన చేయటంతో పాటు - సాహిత్యకోశం సంకలన కార్యక్రమానికి పూర్తి బాధ్యతలు వహించి, అనుకొన్న సమయానికే సంకలనం పూర్తికావటానికి తోడ్పడిన శ్రీ ఎన్. శివనారయ్య, రిసెర్చి అసిస్టెంట్, ప్రశంసాపాత్రులు.

ఆరోపాల ఏరుపులో కొంతకాలం పాటు సహాయపడిన శ్రీ గుమ్మా శంకరరావు, రిసర్చి అసిస్టెంట్, శుద్ధప్రతి తయారీలో తోడ్పడిన శ్రీమతి కె. జానకి, బి. ఏ; శ్రీమతి కె. విజయలక్ష్మి అభినందనీయులు.

ఈ గ్రంథ ప్రచురణకు కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలు, అకాడమి పాలక మండలి వారు ఇచ్చిన సహాయ సహకారాలకు మేము కృతజ్ఞులము.

ఈ గ్రంథాన్ని సకాలంలో చురుకుగా ముద్రించి ఇచ్చిన ప్రగతి ఆర్ట్ ప్రింటర్స్ వారికి, సర్వాంగ సుందరంగా ముఖపత్ర రచన చేసిన శ్రీ గోలి శివరామ్ గారికి, శ్రీ శివరామ్ బ్లాక్ మేకర్స్ వారికి, ముచ్చటగా మూడు రంగులలో ముద్రించి ఇచ్చిన అనుపమ ప్రింటర్స్ వారికి కూడా మా కృతజ్ఞతలు.

ఈ కోశ రచనలో తెలుగు సాహిత్యానికి-చరిత్రకు సంబంధించిన ఎన్నో ప్రామాణిక గ్రంథాలను సంప్రదించటం జరిగింది. ఆయా గ్రంథకర్తలకు, సంపాదకులకు, ప్రచురణకర్తలకు కృతజ్ఞతలు తెలియజేస్తున్నాము. ఉపయుక్త గ్రంథ సూచిని ఈ గ్రంథం చివర ఇవ్వటమైంది.

కోశ రచనా ప్రణాళికను అనుసరించి, సంకలనం చేసిన ఆరోపాలకు ఏకరూపత, సంక్షిప్తత-కొన్ని చోట్ల సమగ్రత తీసుకొని రావటానికి సంకలన కర్తలందరూ కృషి చేశారు. మేమాశించిన రీతిలో ఈ గ్రంథం పాఠకులకు ఉపయుక్తమైతే చేసిన పరిశ్రమకు దానినే ఫలితంగా భావిస్తాము.

ఇటువంటి సాహిత్యకోశాన్ని తెలుగులో నవీన పద్ధతిలో కూర్చటం ఇదే ప్రథమ యత్నం.

ఏ గ్రంథమైనా నూటికి నూరుపాళ్లు సమగ్రం అని చెప్పటానికి వీలులేదు. ఈ కోశాన్ని సమగ్రంగా పాఠకులకు అందించటానికి మా శాయశక్తులా ప్రయత్నం చేశాం. అయినా రచయితలు - రచనలకు సంబంధించిన ఆరోపాలు కొన్ని దీనిలో చోటు చేసుకొని ఉండకపోవచ్చు. పునః పరిశీలనయోగ్యాలైన విషయాలేవైనా ఉంటే, వాటినిగురించి మాకు తెలియచేస్తే, పరిశీలించి పునర్ముద్రణలో చేర్చటానికి ప్రయత్నిస్తాము.

ఎన్. వెంకటస్వామి
డైరెక్టరు

# విషయ సూచిక

అంకము

నామాంతరం : ఉత్సృష్టికాంకము.

ఇది దశ విధ రూపకాలలో ఒకటి. నాటక భాగమైన అంకంతో సార్థక్యం కల్పించటం కోసం దీనిని కొందరు ఉత్సృష్టి కాంకం అంటారు. దీనిలో ఇతివృత్తం ప్రఖ్యాతమైందిగాని, కల్పితమైంది కాని కావచ్చు. కరుణము ప్రధాన రసం. వీరాదులు యథాసంభవంగా ఉపయోగించవచ్చు. ప్రాకృత మనుష్యులు నాయకులు. ఇందులో స్త్రీ విచార విషయాన్ని తరచుగా, యుద్ధ జయాపజయాదులను వాఙ్మాత్రంగా ఉపయోగించాలి. సంధి వృత్త్యాదులలో ఇది భాణతుల్యము. (తె.వి.స. 6)

అంగిడి బసవయ్య

కాలం : 18 వ శతాబ్దం.

రచన : ఇందుమతీ కల్యాణము (అలభ్యం). 6 పద్యాలు దొరికాయి.

విశేషాలు : ఇందుమతీ కల్యాణాన్ని కావ్యంగా తెలుగులో వ్రాసిన వాళ్ళలో ఈయన రెండోవాడు. మొదటివాడు పెనుమత్స వేంకటాద్రి కవి. (క్రీ. శ. 1500 ప్రాంతం.). అప్పటినుంచీ దాదాపు పదిమంది కవులు ఈ కావ్యాన్ని వ్రాశారు. పూర్తి కావ్యం దొరకలేదు. వేంకటాద్రి, బసవయ్య సమకాలికులు కావచ్చు. కవి ప్రబంధరత్నాకర కర్త ఎలకూచి... జగ్గన్నకు పూర్వుడు. రసవంతంగా కవిత చెప్పాడు. (ఆంధ్ర - 8-83)

అంగద రాయబారము

జానపద హరికథ గేయ రచన.

ఇతివృత్తం రామాయణానికి సంబంధించింది. రావణునితో యుద్ధం ప్రారంభించే ముందు రాముడు "అంగదుడు" అనే వానిని పిలిపించి రాయబారానికి పంపడం దీనిలోని కథ. చూ. పౌరాణిక గేయములు

అంగ భవ భంగ తిరుకాళహస్తి లింగశతకము (అలభ్యం)

కర్త : బొడ్డపాటి కొండయ్య

త్రిపురాసుర సంహారాన్ని ప్రస్తుతించే మూడు పద్యాలు మాత్రం లభించాయి. ఎలకూచి జగ్గన్న వాటిని తన ప్రబంధ రత్నాకరంలో ఉదాహరించాడు. (ఆంధ్ర-9)

అంగిడి నరసింహం

కాలం : 1. వ శతాబ్దం

స్థలం : విశాఖపట్టణ ప్రాంతం
రచన : రాజ రాజాభిషేకము (అలభ్యం)

ఇతడు పూర్వ కవిస్తుతిలో శ్రీనాథుని వరకు గల కవులనే స్తుతించడం వల్ల, ఇతని కాల నిర్ణయం గురించి కొంత వివాదం జరిగింది. రచనలో ప్రాసుట చేసుట లాంటి ప్రయోగాలు చేశాడు కాబట్టి, ప్రబంధ యుగం వాడు కాదనీ తర్వాత వాడేననీ విమర్శకులు నిర్ధారించారు.

ఇతడు రామకృష్ణ భట్టారకుని కుమారుడు. (ఆరుప్ర 11-268)

**అంగుష్ఠావధానము**

చూ. అవధానాలు

**అంజనము**

అంజనమంటే మాయా శక్తులున్న లేపనమనిగాని, తైలమని గాని అర్థం చెప్పవచ్చు. దీనిని వన మూలికల నుంచి తీసిన పసరుగా కూడా కొందరు చెబుతారు 12-15 శతాబ్దాల మధ్య కాలపు ప్రజలు అంజనాన్ని బాగా వాడేవారు.

ఇంట్లో దొంగతనం జరిగి వస్తువులు పోయినప్పుడు, భూస్థాపితమైన విధి నిక్షేపాలను పసిగట్టే సందర్భాలలోనూ, ఈ అంజనాన్ని ఉపయోగించినట్లు తెలుస్తున్నది. పోయిన వస్తువులు ఎవరు దొంగిలించిందీ, అవి ఎవరింట్లో ఉన్నదీ, ఏ సీమకు తరలి పోయిందీ, వాటిని అమ్మితే ఎవరి కమ్మిందీ, మొదలయిన విషయాలను తెలుసుకోవటానికీ, పూర్వులు 'లంకెల బిందెల'ని నమ్మే విధి నిక్షేపాలుండే తావులను సరిగ్గా పసిగట్టి- ఆ భూ ప్రదేశాన్ని త్రవ్వే సందర్భంలోనూ అకాలపు ప్రజలు ఈ అంజనాన్ని వాడేవారు. పసరు, తైలముల వంటి పూతలు కాకుండా మంత్రాక్షరములతో గదులుగా గీసి ఆ అంజనంలో భూత, భవిష్యద్వర్తమానాలు చూడడమనేది కూడా ఒకనాడు వ్యాప్తిలో ఉండేది. (తెలుగు-ఏ-జూ-77)

**అండలూరి వారు**

గ్రామ నామంతో ఉన్న ఇంటిపేరు. ఈ ఇంటిపేరుతో చాలామంది ఉన్నారు. ఇంటిపేరులో 'ఊరి' అంతంగా ఉంది. ఇట్లే వేమూరి, చెన్నూరి, కొల్లూరి మొదలయిన ఇంటిపేర్లు. (భారతి-మా-45-228)

**అంతర్వేది మాహాత్మ్యము (అలభ్యం)**

కర్త : (చూ) పెనుమత్స గోపరాజు
అంకితం : ర్యాలిలో నెలకొనియున్న కేశవస్వామికి.
క్షేత్ర మాహాత్మ్యాన్ని తెలిపే రచన.

ర్యాలిగ్రామం గోదావరి మండలంలో రాజోలుతాలూకాలో ఉంది. బమ్మెర కేసన, మల్లన కవులు రచించిన 'విష్ణు భజనానందం' లో ఈ కావ్య ప్రసక్తి ఉంది.

**అందుగుల వెంకయ్య**

కాలం : క్రీ. శ. 1630 ప్రాంతం

స్థలం : విజయనగరం.

పోషణ : అర్వీటి కోదండరామరాజు (అళియ రామరాజు మనుమని మనుమడు)

రచన : నరపతి విజయము (రామరాజీయము)

ఆరవీటి వంశరాజుల చరిత్రను సరసంగాను రమ్యంగాను చెప్పాడు చరిత్రకారులకు చాలా అమూల్యమైన విషయాలను అందించి ఆనాటి రాజకీయ, సాంఘిక పరిస్థితులను తెలుసుకోవటానికి మహోపకారం చేశాడు.

చారిత్రక కావ్యంలో కూడా కవిత్వపాటవాన్ని ప్రదర్శించిన విద్వత్కవి. చిత్ర, గర్భ, బంధ కవిత్వ కల్పనలే కాక ప్రహరణ కలితవృత్తం, పాలాశదల వృత్తం, కుసుమిత లతావేల్లితవృత్తం వంటి అపూర్వ వృత్తాలు రసవంతంగా వ్రాశాడు. (సా.చ.సం.244) (ఆరుద్ర-10-198)

**అంబరీష చరిత్ర**

కర్త : చూ. పెనుపత్స అనంతరాజు

కవి దీనిని వ్రాశాడని విష్ణు భజనానంద కావ్యకర్తలు బమ్మెర శేసకవి, పిల్లకవి చెప్పారు.

**అంబాయమ్మ శతకము**

కర్త : తెలియదు

తమిళదేశంలో వెలువడిన తెలుగు శతకం. కందపద్యాలతో ఉంది. (ద.దే.వా.పీఠిక-7)

**అంబాల బాణము (అలభ్యం)**

కర్త : తెలియదు.

కాలం : 1670 కి ముందటిది.

రత్నాకరం గోపాలరాజు ఈ గ్రంథాన్ని పేర్కొన్నాడు. (ఆరుద్ర.12-191).

**అంబికావాదము (అలభ్యం)**

కర్త : కాకునూరి అప్పకవి

ఇది యక్షగానమట. (అప్పకవీయం)

**అంబికా శతకము (అలభ్యం)**

కర్త : రావిపాటి త్రిపురాంతకుడు.

కాలం : క్రీ. శ. 14 వ శతాబ్ది పూర్వార్ధం.

ప్రత్యేకత : ఈ గ్రంథంనుంచి పెదపాటి జగన్నాథకవి 3 పద్యాలను ఉదాహరించాడు. 'ప్రయోగ రత్నాకరం' అనే మరొక తెలుగు గ్రంథంలో మరి 2 పద్యాలు ఉదాహృతాలు. కీ. శే. వేటూరి ప్రభాకరశాస్త్రి ఈ పద్యాలను

'ప్రబంధ రత్నమాల' లో ప్రచురించారు. సున్నితమైన శృంగార భక్తిభావన ఈ పద్యాలలో కనిపిస్తుంది. (తె. రా. చ.)

**అకలంక శ్రీకృష్ణమార్యుఁడు.**

కాలం : 1775 ప్రాంతం

స్థలం : వినుకొండ సీమ

రచనలు : 1. కృష్ణవిలాసము (యక్షగానం) 2. ధనుర్విద్యా విలాసము 3. శకుంతలా పరిణయము 4. కొమ్మాలపాటి దండకము.

గురువు- సింగరాచార్య శ్రీ రఘునాథ భట్టరార్యుడు.

ప్రౌఢకవి, ఉద్దండపండితుడు లక్ష్మమ్మ నృసింహ గురుల పుత్రుడు. కృష్ణవిలాస కృతిలో శారద వస్యము అనే రచనావిశేషాన్ని రెండుచోట్ల ప్రయోగించాడు. అర్థచమత్కారాలూ, శబ్దాలంకారాలూ ఇతని రచనలో కొల్లలు. కొమ్మాలపాటి పురాధిపతులు ఇతన్ని ప్రోత్సహించినట్లు తెలుస్తున్నది.

'కృష్ణ విలాసము' కొమ్మాలపాటి పురాధిపతి తనయుడైన రమణరాజు ప్రోత్సాహంతో కవి రచించాడట. (య.వా.చ)

**అక్కనామాత్యుడు**

కాలం : క్రీ. శ. 1690 ప్రాంతం

స్థలం : చోళదేశం.

రచన : బాలకృష్ణ లీలా విలాసము

కవి సరబాద లింగోజీ పుత్రుడు. తంజావూరును పాలించిన మహారాష్ట్ర రాజు శహాజీ (1684-1712) కాలంలో ప్రఖ్యాతుడు. (ద.దే.వా. 233)

**అక్కన్న మాదన్నలు-భాగవతమేళము**

గోలకొండ కుతుబ్షాహీల పరిపాలన కాలంలో పేరెన్నికగన్న రాజనీతిజ్ఞులు అక్కన్న మాదన్నలు. వీరు తానీషా మంత్రులు. వీరి యాజమాన్యంలో ఒక భాగవతమేళం ఉండేదని, అది 'మధుర మంగా పుంశ్చలీ విలాసం' లో ఉదాహృతమని 'యక్షగాన వాఙ్మయం' నుండి తెలుస్తున్నది.

ఈ మేళం బాచిపూడి రీతిలో దేశసంచారం చేస్తూ ప్రదర్శనలనిచ్చేదట.

ఈ భాగవతదళం విజయనగరం, ఆనెగొంది రాచనగర్లలో నాటకాన్ని ప్రదర్శించినప్పుడు- ఆ నటులలో అందగాడైన ఒక స్త్రీ పాత్రధారిని, అక్కడి రాజుగారి సోదరి వలచి వలపించుకొన్నట్టు ఒక ఐతిహ్యముంది. దీనినిబట్టి ఆ భాగవతదళం విశిష్టత తెలుసుకోవచ్చు (నా.ర.చ-114)

**అక్కమహాదేవి చరిత్ర**

నామాంతరం : అక్క మహాదేవి బోధోల్లాసము.

కవయిత్రి : బాలపాపాంబ.

**అక్కమహాదేవి బోధోల్లాసము**

నామాంతరం : అక్క మహా దేవి చరిత్ర.

కవయిత్రి : బాలపాపాంబ.

ఇది యక్షగానం. దీనిలో బసవేశ్వరుని సమకాలీనులయిన అక్క మహాదేవి - అల్లమ ప్రభువుల చరిత్ర ఉంది దీనిలో జంపెలు, రచ్చరేకులు ఏకతాళ మొ॥ దేశి పద రచనలు, జోలపాటలు, మంగళ హారతులు మొ॥ ఉన్నాయి. ఈ కథ కొంత ప్రభులింగలీలలలో ఉన్నదట. (తె. వి. స. - 4)

**అక్కయ్య**

కాలం : 17 వ శతాబ్దం.

స్థలం : తంజావూరు

రచనలు : 1. శ్రీకృష్ణలీలా విలాసము 2. భీమసేన విజయము

తంజావూరును పాలించిన మహారాష్ట్ర రాజుల కాలంనాటి వాడు. యక్షగానాలనే ప్రబంధోచిత వర్ణనలతో తీర్చిదిద్దాడు. ఇతని తండ్రి తిమ్మయ దండనాథుడని తెలుస్తున్నది కాని ఎవరి దగ్గర ఉండేవాడో నిర్దిష్టంగా తెలియ రాలేదు. (య.గా. సంపుటి 4) (అరుద్ర 12-166)

**అక్కెనపల్లి నృసింహకవి**

కాలం : 18వ శతాబ్ది చివరిపాదం, 19వ శతాబ్ది పూర్వార్థం.

స్థలం : కృష్ణా మండలంలోని యెల్లమంద.

రచనలు : ఓషవతీ పరిణయము, ఆదిలక్ష్మీ విలాసము, వల్లభాంబా పరిణయము.

విద్వత్కవి. భోగయామాత్యుని పుత్రుడు. అనేక సంస్థానాలు దర్శించి సమ్మానాలు పొందాడు విశాఖపట్టణం మండలంలోని గోడే సూర్య ప్రకాశ రాయనికి ఓషవతీ పరిణయాన్ని, పులిపాక రామమంత్రికి వల్లభాంబా పరిణయాన్ని అంకితం చేశాడు. (క. చ. 114)

**అక్కెనప్రగడ హరిదాసు**

కాలం : 18వ శతాబ్ది

రచనలు : 1. శ్రీరామ నిత్యోత్సవ యక్షగానము 2. అమరేశ్వరస్వామి బాల చాముండి అమ్మవారిఏకాంతసేవ 3. కుబ్జా కృష్ణవిలాసము

ఇతని రచనలలో మొదటి రెండూ ముద్రితాలట. ( య. వా. చ.)

**అక్షర గద్య**

కవి : మల్లికార్జున పండితుడు.

శివస్తోత్ర పరమైన రచన.

**అక్షరగుచ్ఛము**

కాలం : క్రీ శ. 19వ శతాబ్ది.

కర్త : పరవస్తు చిన్నయ్యసూరి.
వ్యాకరణగ్రంథం. (రమణీయం పీఠిక)

**అక్షరప్రశ్న - (చాటువు)**

ఇది ఒక చిత్ర కవితా ప్రక్రియ. ఇలాంటి పద్యాన్ని బొబ్బిలి వాస్తవ్యుడు విస్సాప్రెగడ కామరాజకవి వ్రాశాడట. కొన్ని నియమ నిబంధనలకు లోబడి పద్యంలో కావలసిన అక్షరాలను కనుక్కోవచ్చునట. ఇలాంటి చాటువులు తెలుగు సాహిత్యంలో విరళంగా ఉన్నాయి (చా. ప. ర.)

**అక్షరాంక గద్య**

కర్త : పాల్కురికి సోమన.
ప్రత్యేకత : 'అ' నుంచి 'క్ష' వరకు ఒక్కొక్క పాదం ప్రథమాక్షరంగా చేసి వ్రాసిన స్తోత్రం. (యు. భా: చై. ల. రి)

**అక్షింతల సింగరశాస్త్రి**

కాలం : 19వ శతాబ్దం (మధ్యభాగం)
స్థలం : రేపర్ల (వనపర్తి సంస్థానం)
రచనలు : అన్నపూర్ణాష్టకము, ద్వాదశ మంజరి, భాస్కర ఖండము, శ్రీశైల మల్లికార్జున రత్నపంచకము మొ॥

అంక్షింతల సుబ్బాశాస్త్రి రెండవకుమారుడు. వనపర్తి సంస్థానాధీశ్వరుల ఆశ్రితుడు. తర్క వేదాంతశాస్త్ర పారంగతుడు. వెంకటగిరి, గద్వాల, వనపర్తి, ఆత్మకూరు సంస్థానాలలో సత్కారాలు పొందినవాడు. జటప్రోలులోని 'అయ్యవారి పల్లె' వీరి స్వగ్రామమని కొందరు వ్రాశారు. (అం. సం. సా.)

**అక్షింతల సుబ్బాశాస్త్రి**

కాలం : క్రీ. శ. 1807 - 1871
స్థలం : రేపర్ల గ్రామం, వనపర్తి సంస్థానం
రచన : భాష్యార్థ రత్నమాల

వనపర్తి సంస్థాన ప్రభువుల ఆశ్రితుడు, వేదాంతశాస్త్ర పారంగతుడు బ్రహ్మసూత్ర భాష్యానికి "భాష్యార్థ రత్నమాల" అనే వివరణ వ్రాసి జటప్రోలు సంస్థానంలో కూడా సమ్మానం పొందినాడు.

ఈతడొక ప్రహసనం కూడా వ్రాసినట్లున్నది. కాని దాని వివరాలు తెలియవు. వీరిది జటప్రోలు సంస్థానంలోని అయ్యవారిపల్లె అని కొందరు అంటున్నారు. ఇతని కుమారుడు సింగరశాస్త్రి కూడా విద్వత్కవి. (అం. సం. సా.)

**అఖండ సచ్చిదానంద అవధూత**

కాలం : క్రీ. శ. 16 శతాబ్ది
రచన : పురూరవ చరిత్ర

విశిష్టత : ఈయన పై గ్రంథాన్ని పూర్తిగా వ్రాశాడో లేదో తెలియదుగాని, ఒక్క ఆశ్వాసం మాత్రమే దొరికింది. పురూరవ చక్రవర్తికి నారదుడు చేసిన తత్త్వోపదేశమే ఈ గ్రంథం. ఈయనకు వేదాంతమంటే ఇష్టమని, సాంఖ్యయోగం అభిమానమని చెప్పవచ్చు. రచన సరళంగా ఉంది.

(ఆరుద్ర - 8-275)

అఖిల పురాణ సారము (అలభ్యం)

కర్త : గణపవరపు వేంకటకవి (చూ) (ఆరుద్ర. 11-180)

అఖిల రూపాత్మక శతకము

కర్త : ఎడ్ల రామదాసు

తత్త్వ ప్రధానమైన శతకం. ఈ శతకంలో కవి చతుర్విధయోగాలను నిరూపించినాడు. సద్గురు కటాక్షంలేనిదే తత్త్వబోధ అలవడదని చెప్తూ కపట యోగులను, వేషధారులను, మద్య మాంసాదులు సేవించే వారిని నిశితంగా విమర్శించినాడు. (శ. సా. వి. 317)

అగస్త్య నిఘంటువు

నామాంతరాలు : 1. అగస్త్య శబ్దసంగ్రహ నిఘంటువు 2. అగస్త్య వ్యాకరణోక్త శబ్దసంగ్రహ నిఘంటువు.

కర్త : విద్యానాథాగస్త్యుడు

దాక్షిణాత్య సంస్కృత విద్వత్కవియైన విద్యానాథుడు - అగస్త్యుడు అభిన్నులని కృష్ణ చరిత్రము అనే సంస్కృత గద్యకావ్యం ద్వారా తెలుస్తున్నది. ఇది అతడు రచించిన నిఘంటువు. (ప్ర. య. భూ. 42)

అగస్త్యరాజు రామన

కాలం : 17-18 శతాబ్దుల నడిమి కాలము కావచ్చు.

స్థలం : నెల్లూరు మండలం

రచన : సీతాకల్యాణము (యక్షగానం)

అక్కమాంబా చెన్నమంత్రుల పుత్రుడు. సరళంగా సలక్షణంగా రచన చేశాడు. (య. వా. చ.)

అగస్త్య వ్యాకరణోక్త సంగ్రహ నిఘంటువు.

నామాంతరం : అగస్త్య నిఘంటువు.

కర్త : విద్యానాథాగస్త్యుడు.

అగస్త్య శబ్ద సంగ్రహ నిఘంటువు.

నామాంతరం : అగస్త్య నిఘంటువు.

కర్త : విద్యానాథాగస్త్యుడు.

**అగస్త్యుడు:**

కాలం : క్రీ. శ. 1295-1323 ప్రాంతం.

ఆస్థానం : కాకతి రెండో ప్రతాప రుద్రుని ఆస్థాన కవి.

రచనలు : 74 రచనలున్నా యంటారు. సంస్కృతమో, తెలుగో తెలీదు. రెండు గ్రంథాలపేర్లు మాత్రం తెలుస్తున్నాయి.

1. బాల భారతము.

2. నలకీర్తి కౌముది. (సంస్కృత ఖండకావ్యం)

విజయనగర యువరాజైన కుమారకంపన అర్ధాంగి, మధురా విజయ రచయిత్రి అయిన గంగాదేవి, ఈ కవి శిష్యురాలు.

ఈ అగస్త్యుడే విద్యానాథుడని పండితుల అభిప్రాయం. (ప్రా. ప.దే.చ.)

**అగస్త్యేశ్వర శతకము**

కర్త : మల్లంపల్లి మల్లికార్జున పండితుడు

ఇది శైవ భక్తి శతకం. దీనిని కాకినాడ ఆంధ్రసాహిత్య పరిషత్తు వారు ప్రకటించారు. కవి, తన పాప కృత్యాలు ఈశ్వరేచ్ఛ వలననే జరిగాయని అంటూ తనను రక్షించమని, శివుని వ్యాజోక్తులతో హెచ్చరించాడు. శివలీలలు దీనిలో చమత్కారంగా ఉన్నాయి. శార్దూల మత్తేభ వృత్తాలతో కూర్చిన శతకమిది. రచన ప్రౌఢంగా ఉంది. (శ. సా. వి.)

**అగ్నిగుండాల వారి మర్యాద**

దీనిపై ఒక చాటువు ఉంది. అగ్నిగుండాల గ్రామం గుంటూరుజిల్లా వినుకొండ తాలూకా ఈపూరు ఫిర్కాలో ఉంది. ఈ గ్రామ కరణం పరమనిష్ఠాపరుడట. ఆయన దేవతార్చన సాయంత్రానికి కూడా రాదట. అందువల్ల ఆయన ఇంటికి వచ్చిన చుట్టాలు పూజ అయ్యేదాకా వేచి ఉండవలసి వచ్చేదట. ఈ అనుభవాన్ని చాటుకవి సున్నితమైన హాస్యంతో 'అగ్నిగుండాల వారి మర్యాద' గా చక్కగా వర్ణించి చెప్పాడు (చా. ప. ర)

**అచలాత్మజా పరిణయము**

కర్త : కిరీటి వెంకటాచార్యులు (చూ)

మూడాశ్వాసాల ఆంధ్ర ద్వ్యర్థి కావ్యం. కృతినామంలోనే శ్లేషను ఆశ్లేషించిన కావ్యాలలో ఇది మొదటిది. సీతా పార్వతుల పరిణయ గాథలు దీనిలో వర్ణింపబడ్డాయి. (ఆం. సం. సా.)

**అచింతేంద్రుడు**

కాలం : క్రీ. శ. 1163 ప్రాంతం

శాసనకర్త : కాకతి రుద్రదేవ చక్రవర్తి సమకాలికుడు.

కాకతి రుద్రదేవుని హనుమకొండ ప్రశస్తిగల సంస్కృత శాసనాన్ని వ్రాశాడు. రామేశ్వర దీక్షితుని కుమారుడు. (ప్రా. ప. దే. చ )

**అచ్చతెలుగు భాగవతము**

కవి : అల్లమురాజు రామకృష్ణకవి.

కావ్యం మనోహరమైన శైలిలో ఉంది.

**అచ్చతెనుగు రామాయణము**

కర్త : కూచిమంచి తిమ్మకవి.

అంకితం : కుక్కుటేశ్వర స్వామికి.

తిమ్మకవి రచించిన అయిదో గ్రంథం ఇది. దీనిలో రామాయణ కథ ఆరు కాండలలో క్లుప్తంగా ఇంచు మించు 1300 పద్యాల్లో అచ్చ తెనుగులో చెప్ప బడిఉంది.

సీతాసుందరీ పరిణయం, అచ్చతెనుగు రామాయణం అనే రెండు అచ్చ తెనుగు కావ్యాలు వ్రాయడం చేత ఇతనికి అభినవ వాగనుశాసనుడని బిరుదు వచ్చింది.

ఇది తెలుగు పంచకావ్యాల్లో ఒకటని కొందరి అభిప్రాయం.

(క. త-13; 189)

**అచ్చతెనుగు వెంగన్న**

నామాంతరం . వెలిదండ్ల వేంకటపతి

**అచ్చవెల్లి రంగనాథుడు (అచ్చవెల్లి రంగన్న)**

రామాయణకర్త. ఇతన్ని పొత్తపి వేంకట రమణకవి తన, "లక్షణ శిరోమణి" గ్రంథంలో పేర్కొన్నాడు. ఇతని యింటిపేరు "వెలిచేటి" అని కొందరు, "చక్రపాణి" అని కొందరు అభిప్రాయపడ్డారు. వీరు భిన్నులనే వాదంకూడా ఉంది ఇతడు రంగనాథ రామాయణ కర్తయైన రంగనాథుడని కొందరి అభిప్రాయం.

(క. త 4-10) (ద్వి. సా. చ. 187)

**అచ్చి లక్ష్మణాచార్యులు**

కాలం : 18వ శతాబ్దం.

స్థలం : వరంగల్లు.

రచన : ముముక్షు జనకల్పము.

విశిష్టాద్వైతమత ప్రశస్తిని తెలుపుతూ రచన చేశాడు.

(క. స. 206)

**అచ్చి రామానుజాచార్యులు**

కాలం : 1700 ప్రాంతం.

స్థలం : వరదన్నపేట. (హైదరాబాదు ప్రాంతం)

రచనలు : 1. తత్త్వార్థ దర్పణము, మోక్షసారము, ముముక్షు జనకల్పము.

వేదాంత పరమైన రచనలు చేశాడు. (క. స. 200)

**అచ్యుత దేవరాయలు**

కాలం : క్రీ. శ. 18 శతాబ్ది

శ్రీకృష్ణ దేవరాయల తరవాత విజయనగర పాలకుడు. అచ్యుతరాయాభ్యుదయానికి కృతిపతి. సాహిత్య పోషకుడు.

విశిష్టత : ఈయనకు కవిపండిత గోష్ఠి అంటే ఇష్టం. అచ్యుత రాయాభ్యుదయ మనే సంస్కృత కావ్యాన్ని వ్రాసిన రాజనాథ డిండిముడు (అరుణగిరి నాథుని కుమారుడు) ఈతని ఆస్థానకవి. సంస్కృతంలో వరదాంబికా పరిణయాన్ని వ్రాసిన తిరుమలాంబ ఇతని ఆస్థాన కవయిత్రి. రాధా మాధవకవి బిరుదాంచితుడైన చింతలపూడి ఎల్లయ్య, అచ్యుతరాయల ఆస్థానంలో ఉన్నాడు. (వి. న. చ.)

**అచ్యుత రాయ శతకము**

కర్త : రాఘవదాస కవి.

రచనాకాలం : తెలియదు. (ద. దే. వా. 503)

**అచ్యుత రాయాభ్యుదయమ్ (సం)**

కర్త : అయిదో డిండిమభట్టు (చూ).

విజయనగర చక్రవర్తియైన అచ్యుతరాయలను ప్రశంసిస్తూ చెప్పిన గ్రంథం. అచ్యుతరాయల వంశము, దండయాత్రలు మొ॥ విషయాలనూ, రాయల వైభవాన్నీ తెలుపుతున్నది. (తె. వి. స-8)

**అచ్యుతాబ్ధి**

నామాంతరం - మేలత్తూరు (మేలట్టూరు)

గ్రామనామం. కావేరి తీరంలో ఉంది. తంజావూరు నాయకరాజు అచ్యుత నాయకుడు 1580 ప్రాంతాలలో భాగవత మేళాలు ప్రదర్శించే కుటుంబాలకు ఈ గ్రామాన్ని దానం చేశాడు.

మేలత్తూరు భాగవత మేళాలు దక్షిణదేశంలో ప్రఖ్యాతమైనవి. (అరుద్ర 11-195)

**అచ్యుతాభ్యుదయము (అలభ్యం)**

కర్త : (చూ) రఘునాథ నాయకుడు.

రచనా కాలం : 1600 ప్రాంతం.

ద్విపద కావ్యం. కవి తన తండ్రి అచ్యుతప్పనాయకుని జీవిత చరిత్రను ఇతివృత్తంగా తీసుకొని రాశాడు.

నాయకాభ్యుదయ రచనలలో ఇది తొలిది.

రఘునాథుని ఆస్థానంలోని స్త్రీలు దీన్ని చదివి వినిపిస్తుండే వారట. (ద. దే. వా. 36)

**అజ చరిత్రము**

రచనా కాలం : 19 వ శతాబ్ది పూర్వార్ధం.

కర్త : మతుకుమల్లి నృసింహకవి.
ఆరాశ్వాసాల ప్రబంధం. ముద్రితమట. (క. ప. 115)

**అజ్జరం**

గ్రామనామం. ఇంటి పేరుగా కూడా ఉంది. ఈ వంశీయుల మూల పురుషుడొకాయన గజపతులను వేదశాస్త్రాది విద్యలతో మెప్పించి ఈ గ్రామాన్ని అగ్రహారంగా పొందాడట. ఈ యింటి పేరు గల వారిలో అజ్జరపు పేరయలింగం విద్వత్కవి, ఒడయనంబి విలాస కావ్య కర్త. (ఆంధ్ర. 9-178)

**అజ్జరపు పేరయ లింగం**

కాలం : క్రీ. శ. 16 శతాబ్ది చివరి భాగం.
రచన : ఒడయనంబి విలాసము.
అంకితం : ఆచంటలోని రామేశ్వర స్వామికి.
గురువు : ఇవటూరి పెదరామనారాధ్యుడు.

విశిష్టత : ఈయన విష్ణు భజనానంద కావ్యకర్తలు బమ్మెర కేసకవి — మల్లకవి అనే జంట కవులకు బావమరిది. అజ్జరపు వాళ్ళ మూల పురుషుడు ఒకాయన గజపతులను వేదశాస్త్రాది బహు విద్యలతో మెప్పించి 'అజ్జరం' గ్రామాన్ని అగ్రహారంగా పొందాడట. గజపతులు తెలుగు విద్వాంసులను గౌరవించారన్న విషయం ఈయన వ్రాసిన 'ఒడయనంబి విలాసం' వల్ల తెలుస్తున్నది. మహా భక్తుడు, కవియైన తమిళ ఒడయనంబి (సుందర నాయనారు) చరిత్రను పేరయ లింగం ఆరాశ్వాసాల ప్రబంధంగా చెప్పాడు. పాపమ్మ, కొండన్నలు ఇతని తలిదండ్రులు. ఇతని రచన హృదయంగమంగా ఉంటుంది. (ఆంధ్ర - 9-178)

**అజ్ఞాత గ్రంథ సంధాత**

- పేరు తెలియదు.

కాలం : క్రీ. శ. 16వ శతాబ్ది.
గ్రంథం : ఉదాహరణ పద్యములు.

ఈ పేరుతో ఈ సంకలన గ్రంథం ఆంధ్ర సాహిత్య పరిషత్తువారి కార్యాలయంలో ఉంది. కవి ప్రబంధ రత్నాకర సంకలన కర్తయైన పెదపాటి జగ్గనకు సమకాలికుడో పూర్వుడో అయి ఉంటాడు.

విశిష్టత : ఈయనపేరు తెలియక పోయినప్పటికీ తెలుగు సాహిత్యానికి అమూల్యమైన సేవచేశాడు. ఈయనపై గ్రంథాలను సంకలనం చేయకపోతే కొంతమంది ప్రాచీన తెలుగుకవుల పేర్లు, వారి రచనల గురించి ఈకొద్ది పాటి వివరాలుకూడా తెలిసేవి కావు. జగ్గన్న ఉదాహరించని 36 కావ్యాలపేర్లు చెబుతూ 32 మంది కవుల పద్యాలను సేకరించాడు. పెదపాటి జగ్గన్న ప్రబంధ రత్నాకరంలోని పద్యాలను, ఈయన ఉదాహరణ పద్యాలను కలిపి అకారాది క్రమంలో వేటూరి ప్రభాకరశాస్త్రి తమ నూతన సంకలనాన్ని "ప్రబంధ రత్నావళి" అనే పేరిట ప్రచురించారు. (ఆంధ్ర- 9)

అజ్ఞానధ్వాంత చండభాస్కరము

కర్త : కంభంపాటి అమరేశ్వరశాస్త్రి.

కాలం : క్రీ. శ. 1760 ప్రాంతం.

ఇది విచార దశకమనే పదిప్రకరణాలుగల అద్వైత వేదాంత గ్రంథం. చక్కని వ్యావహారిక భాషలో రచించబడినది. (వ. వా-40)

అడపా నారపప్ప

కాలం : 18 వ శతాబ్దం

కృతిపతి. సాహిత్య పోషకుడు. వేతపూడి కృష్ణకవి రచించిన "జానకీ రాఘవము"నే ప్రబంధాన్ని అంకితం పొందాడు

అడవి నామములు

చూ. పౌరాణిక గేయములు.

అడిదము

ఇంటిపేరు. సిలాద్రికవి యుద్ధంలో శౌర్యసాహసాలు చూపి కళింగ రాజువల్ల అడిదము (కత్తి) కానుకగా గ్రహించటంచేత అతని వంశంవారు అడిదము వారయ్యారట. "అడిదము సూరకవి చరిత్ర" పీఠికలో ఈవిషయం చెప్పబడింది

అంతకు ముందు వీరి యింటిపేరు "గ్రంథవారణము" వారట

(క. త-8-253)

అడిదము సిలాద్రి కవి

కాలం : క్రీ. శ. 1458 ప్రాంతం

స్థలం : విజయనగర సంస్థానం.

రచన : రణరంగ విజయము. (అలభ్యం)

అంకితం : పూసపాటి రాచిరాజుగాని, అతని కుమారుడు తమ్మిరాజు గాని కావచ్చు.

కళింగ రాజులయిన పూసపాటి రాచిరాజు, పూసపాటి తిమ్మిరాజులకు సమకాలికుడు. తమ్మిరాజు కపిలేశ్వర గజపతి సేనాని. రాచిరాజు ప్రౌఢ దేవరాయల వద్ద రణోద్యోగి.

విశిష్టత : ఈతడు కవియేగాక, యుద్ధ వీరుడై ధైర్యసాహసాలను ప్రదర్శించాడు. రాజు కవిని సన్మానించి, ఒక 'అడిదము' (కత్తి) ను కానుకగా యిచ్చాడు. అప్పటి నుంచి ఈ కవి సంతతి ఇంటి పేరు 'అడిదము' వారైంది. ప్రసిద్ధ తిట్టు కవి అడిదము సూరకవి ఈ వంశంలోని వాడే. (అరు ద - 6) (క.త. 8-253)

ఇతని కాలాన్ని గురించి భిన్నాభి ప్రాయాలున్నాయి. 17 వ శతాబ్దం వాడని కొందరంటున్నారు. (ఆం.సం సా-411)

**అడిదము బాలభాస్కరుడు 1**

నామాంతరం. అడిదము భాస్కరుడు.

**అడిదము భాస్కరుడు**

నామాంతరం : బాలభాస్కరుడు. 1

కాలం : క్రీ. శ. 1690–1760 నడుమ.

స్థలం : విశాఖపట్టణ మండలంలోని భూపాలరాజు రేగ గ్రామం.

రచనలు : 1. శుద్ధాంధ్ర రామాయణము. (అలభ్యం) 2. లక్షణ సారము.

అడిదము సూరకవి తండ్రి. చినలచ్చమంత్రి కుమారుడు లభించినట్లయితే ఇతని శుద్ధాంధ్రరామాయణం తొలి అచ్చ తెలుగు రామాయణ కావ్యమై ఉండేది. (క.ప.)

**అడిదము రామకవి**

కాలం : 18 వ శతాబ్ది చివరి భాగం.

రచనలు : ఇతని పంచచామరములు, చెరువు మీది పద్యములు కొన్ని లభించాయి. గ్రంథాలు లభించలేదు. కవి శ్రీరామ తీర్థక్షేత్రంలోని శ్రీరాముని మీద, "సరోజనేత్ర రామతీర్థ జానకీ మనోహరా" అనే మకుటంతో పంచచామరాలు చెప్పాడు. (క.ప. 183)

**అడిదము సూరకవి**

కాలం : క్రీ. శ. 1720–1780 ప్రాంతం.

స్థలం : విశాఖపట్టణ మండలం.

కృతులు : 1. కవిసంశయ విచ్ఛేదము 2. రామలింగేశ శతకము 3. ఆంధ్ర చంద్రాలోకము 4. ఆంధ్రనామ శేషము 5. కవిజనరంజనము 6 శ్రీరామ [illegible]ము. ఇంకా అనేక చాటువులు.

పోషకులు : విజయనగరం, పర్లాకిమిడి, బొబ్బిలి, పాలకొండ, పాచిపెంట, చెముడు, శృంగవరపు కోట సంస్థానాధిపతులు.

శారదానుగ్రహ సముద్భూతైన విద్వత్కవి. విజయనగర సంస్థాన ప్రభువుల ఆస్థానంలో పూసపాటి పెదవిజయ రామరాజు, చినవిజయ రామరాజుగార్ల కాలంలో ఉన్నాడు. భాస్కరామాత్యుని పుత్రుడు. ఎక్కువకాలం శృంగవరపుకోటలో ఉండి అక్కడి దివాను బోణుగుపాటి వెంకట మంత్రితో సన్నిహితంగా ఉన్నాడు. అతని మీద సూరకవి చెప్పిన పద్యాలు బహుళ ప్రచారం పొందాయి. అనంతర కవులు వాటిని అనుసరించారు. ఇందులో కొన్ని మకుటంతోనూ, మకుట రహితంగానూ ఉన్నాయి.

ఇతడు తిట్టు కవిత్వానికి ప్రసిద్ధుడు. వంతులూరి అన్నమరాజుపై ఇతడు తిట్టు పద్యాలు చెప్పాడు. "సూరకవి తిట్టు కమసాలి సుత్తె పెట్టు" అని లోకోక్తి.

(అరుద్ర-12) (క. ప.)

**అత్తలూరి పాపకవి**

కాలం : 19 వ శతాబ్దం.
స్థలం : ఉర్లాం సంస్థానం
రచన : చెన్నబసవ పురాణము

శ్రీగిరి మంత్రి కుమారుడు, ప్రౌఢకవి. ఈకవి తన కావ్యాన్ని ఉర్లాం సంస్థానాధీశుడైన కిందుకూరి అమృతలింగమునకు అంకితం చేసినట్లు తెలుస్తున్నది. కవి కృతిపతి వంశాన్ని విపులంగా వర్ణించాడు. ఈకవి పూర్వులు దేశపాండ్యాలట. సాహిత్య పోషకులుగా కృతిపతులుగా ప్రసిద్ధి పొందారట. ఇతడు ధరణికోట ప్రభువైన వాసిరెడ్డి వేంకటాద్రినాయని కొలువులోకూడా ఉన్నట్లు తెలుస్తున్నది. అమరేశ్వర స్వామిమీద ఒక సీసమాలిక చెప్పాడు. ఇతని చాటువులు లభిస్తున్నాయి.

(చా. ప. ౨)

**అత్తాను రామానుజాచార్యుడు**

కాలం : 16 వ శతాబ్దికి పూర్వుడు
స్థలం : ముని గ్రామం
రచన : శ్రీ రుక్మిణీ కురవంజి

ఈ కృతికర్త దేశ కాలాదులను తెలుసుకోవడానికి తగిన ఆధారాలు లభించలేదు. ఇతడు పాండ్రాజు వంశం వాడని, అత్తాను వారితో సంబంధం కలవాడని మాత్రం ఈతని కృతి వలన తెలుస్తున్నది. (పు. మూ.)

**అద్దంకి**

కాకతీయ సామ్రాజ్య పతనానంతరం స్వతంత్రంగా వెలసిన రెడ్డి రాజ్యాలలో ప్రముఖమైంది. అప్పటి రెడ్డి నాయకులకు తొలి రాజధాని. ప్రోలయరెడ్డి ఈ రాజ్య సంస్థాపకుడు. ఆయన కుమారులు ప్రోలయ వేమారెడ్డి - మాచారెడ్డి ఎర్రాప్రెగడను పోషించి కృతులు అంకితం పుచ్చుకొన్నారు. అద్దంకి రెడ్డి ప్రభువులు కవి పండితులకు ఎన్నో అగ్రహారాలను దానాలుగా ఇచ్చారు. అద్దంకి నగరం సమతల ప్రదేశంలో ఉంది. శత్రువుల తాకిడి ఈనగరానికి ఎక్కువగా ఉండేది. అందువల్ల అనవోతారెడ్డి కొండవీటి గిరిదుర్గాన్ని నిర్మించి, తన రాజధానిని కొండవీటికి మార్చాడు. అద్దంకి ఇప్పుడు ప్రకాశంజిల్లాలో ఉంది.

**అద్దంకి గంగాధర కవి**

కాలం : క్రీ. శ. 16 శతాబ్ది ఉత్తరార్ధం.
స్థలం : గోలకొండ ప్రాంతం.

రచన : తపతీ సంవరణోపాఖ్యానము

గురువు : కేదార గురుడు.

విశిష్టత : వీరయామాత్యుని కుమారుడు. గోలుకొండ కుతుబ్‌శాహి ప్రభువులకు కావ్యాలను అంకితం చేసిన వాళ్ళలో ఈయన మొదటి వాడని ప్రతీతి. తనను శ్రీకృష్ణుని తోను, గంగాధరుని కావ్యకన్యను రాధతోను పోల్చుకొన్న మల్కిభ రాముడే ఇబ్రహీం కుతుబ్షాహి (1550-80) భారతాఖ్యానమందు గలుగుతాపత్య చరితంబు ఘనత మెరిసేటట్టు "వివిధ శృంగార మహిమలతో" విస్తరించి తనపేర చెప్పమని కవిని పురమాయించాడట. అతని కోరికపై కవి నన్నయ భారతంలో 28 గద్య పద్యాలలోఉన్న చిన్న కథను పెంచి, అష్టాదశ వర్ణనలు చొప్పించి వ్రాశాడు. ఈయన తర్కశాస్త్ర పండితుడు. సంగీత శాస్త్రం తెలిసిన వానివలె కనిపిస్తాడు. రచన మనోహరంగా ఉంది. (అరుద్ర-8-136)

**అద్దనూరి రామదాసు**

రచన : సకల లక్షణ సారము.

**అద్భుత దర్పణము (సం)**

కర్త : మహాదేవకవి. (18వ శతాబ్దం)

పది అంకాలున్న నాటకం. రామకథ. ప్రత్యేక రీతిలో రచింపబడింది. ఒక అద్భుతమైన అద్దంలో లంకలో జరుగుతున్న సంగతులు చూపెట్టడం ఇందులోని క్రొత్తదనం.

విదూషక పాత్ర కూడా ప్రవేశపెట్టబడింది. (తె. వి. స. 6-241)

**అద్భుతరస గేయములు (జానపద సాహిత్యం)**

జానపదులకు అద్భుతరసంపైన మక్కువ ఎక్కువ. సాధారణ విషయాలకు అలౌకికాలు, అద్భుతాలు అయిన కల్పనలు చేసి చెప్పడం వారికి ఆనందదాయకం. అద్భుత రసం ప్రధానంగా ఉన్న గేయాలు 'అద్భుతరస గేయములు'. వీటిలో ఇతర రసాలున్నాయి. 'అద్భుతరసం' ప్రధానంగా ఉంటుంది. దీనివల్ల వారిలో ఒక విధమైన భయమూ భక్తియో కలుగుతుంది.

అసాధ్యమైన విషయాన్ని ఆకాంక్షించినపుడు, ఏ మానవాతీత శక్తియో, మంత్రమో, తమకోరిక తీరిస్తే ఎంతో బాగుంటుందని కోరిక మనసులో మెదలడం మానవ సహజం. ఇటువంటి అద్భుతరస ప్రధానమైన కథలు ప్రపంచంలోని అన్ని భాగాల్లోనూ అగుపిస్తాయి. మానవాతీత శక్తులను అవతరింపచేసి, అసాధ్య కార్యాలను నెరవేర్చుకోవడం శిష్టసాహిత్యంలో క్రొత్తకాదు. ఈ విచిత్ర ఉటూహాల సంభవా సంభవాలను వదిలిపెడితే అసారస్వతంలోని ఉత్సాహం అనన్య సామాన్యం.

ఈ గేయాల్లో మానవాతీత శక్తులుగల దేవతలు, మంత్రదండం, భూతద్దం అద్దం, పావుకోళ్ళు మొ॥ వాటికి ప్రవేశం ఉంటుంది. అద్భుతరస ప్రధానమైన గేయాల్లో బాలనాగమ్మకథ మిక్కిలి ప్రచారంలోకి వచ్చింది. గాంధారికథ, కాంభోజ

రాజుకథ, బాలరాజుకథ, ధర్మాంగద పాముపాట మొ॥ అద్భుత రసానికి, నీతి బోధలకు నిలయాలైన పాటలు. (వా. చ)

**అద్వైత సిద్ధాంతము (అలభ్యం)**

కర్త : అల్లసాని పెద్దన

**అథర్వణ కారికావళి (సం.)**

నామాంతరం-వికృతి వివేకము

కాలం : క్రీ. శ. 1300 ప్రాంతం.

కర్త : అథర్వణాచార్యులు.

ఇది వ్యాకరణ గ్రంథం. ఇందులో చింతామణి సూత్రాలకు వివరణలు, వవరణలు చూపుతూ వార్తికాలు అథర్వణునిచే వ్రాయబడ్డాయి.

ద్వితీంత్రిణీ సీతారామకవి టీకతో దీన్ని వెలువరించారు.

ఈ గ్రంథాన్ని అహోబలపండితుడు వ్రాసి దీనికి అథర్వణకారికావళి అని పేరుపెట్టి నట్లు పండితులలో ఒకవాదం ఉంది. ఈ విషయంలో పండితుల్లో భేదాభిప్రాయం ఉంది. (తె. వి. స-4)

**అథర్వణ ఛందస్సు**

కర్త : అథర్వణాచార్యులు

అలభ్యం. కాని దీనినుంచి చాలా పద్యాలను పూర్వ తెలుగు లాక్షణికు లయిన గౌరన, అర్వాచీన లాక్షణికులైన అప్పకవి, కూచిమంచి తిమ్మకవి, కస్తూరిరంగకవి, ఆంధ్ర కౌముది కర్త మొదలయినవారు ఉదాహరించారు. (అము ద్ర-2)

**అథర్వణాచార్యుడు**

కాలం : క్రీ. శ. 13 శతాబ్ది కావచ్చు.

రచనలు : 1. భారతం (అలభ్యం.) 2. వికృతి వివేకము. (అథర్వణ కారికావళి,) (అలభ్యం.) (సంస్కృతం.) 3. అథర్వణ ఛందస్సు. (అలభ్యం.)

జైన సంప్రదాయానికి చెందిన ఆంధ్ర విద్వత్కవి. తిక్కనకు అర్వాచీనుడు కాని, పూర్వుడు కాని కావచ్చని పండితాభిప్రాయం.

విశిష్టత : ఇతని గ్రంథాలనుంచి లాక్షణికులు ఉదాహరించారు. గౌరన తన లక్షణ దీపికలో అథర్వణచ్ఛందాన్ని పేర్కొన్నాడు. అర్వాచీనులు కస్తూరి రంగకవి, కూచిమంచి తిమ్మకవి, అప్పకవి, ఆంధ్ర కౌముది కర్త మొదలయినవారు ఇతనివి ఉదాహరించారు. ఇతని భారత రచనను గురించి చాల కథలు ప్రచారంలో ఉన్నాయి. ఇతని వికృతి వివేకానికి అథర్వణకారికావళి అన్న నామాంతరం ఉంది. ఇతని రచన చక్కని నుడికారంతో ఉంటుందట. (అము ద్ర-2)

**అథర్వణాచార్యుని భారతము (అలభ్యం)**

కర్త : అథర్వణాచార్యుడు.

ప్రత్యేకత : దీనిలోని కొన్నిపద్యాలు మాత్రమే దొరుకుతున్నాయి. దొరికిన పద్యాలను బట్టి- కవి తన భారతాన్ని విరాటపర్వం నుంచి ఆరంభించి, కావ్యాదిని అంతకుముందు జరిగిన భారత కథను సంగ్రహంగా చెప్పినట్లు కొందరు భావిస్తున్నారు. దీనిలోనుంచి ఒక పద్యాన్ని తిమ్మకవి తన సర్వలక్షణ సార సంగ్రహంలోను, నాలుగు పద్యాలను అప్పకవి అప్పకవీయంలోను, ఒక పద్యాన్ని కాకుంభట్టు తన కవి చింతామణిలోను, నాలుగు పద్యాలను పెదపాటి జగ్గన్న తన ప్రబంధ రత్నాకరంలోను ఉదాహరించారు. తిక్కన భారతం ముందు అథర్వణభారతం నిలువలేదని అంటారు. కవి ఆదిపర్వంనుంచి శల్యపర్వం వరకు రచించిఉంటాడని మరికొందరి ఊహ.

ఈ భారతం జలమైపోవడానికి ఎన్నో కారణాలు, గాథలు ప్రచారంలో ఉన్నాయి. (కవిజనాశ్రయ పీఠిక - ఆం. క. చ.-303-306)

**అధికరణము**

కావ్యంలో కథాంశాల విభాగాలను సూచించే పదం. సాధారణంగా శాస్త్ర భాగాలకే ఈపదం వాడతారు అధికరణంలో, విషయము, సందేహము, పూర్వపక్షము ఉత్తరపక్షము(సిద్ధాంతము), నిర్ణయము అనే అయిదు విషయాలుంటాయి. పూర్వమీమాంసా శాస్త్రాలలో ఈ అధికరణములు ఉన్నాయి. (కావ్యాలంకార సంగ్రహం)

**అధికార్లవారు**

ఇది వృత్తిసూచకమైన ఇంటిపేరు. అధికార్లుగా ఆయా వంశీకులు చెలాయిస్తే అదే వారి ఇంటిపేరై స్థిరపడ్డది. పంతులవారు, ఉపాధ్యాయులవారు అనే ఇంటిపేర్లు ఆయా వృత్తులను అవలంబించటంవల్లనే వచ్చాయని చెప్పవచ్చు. (భారతి-మా-45-229)

**అధ్యాత్మ కీర్తనలు**

కర్త : తాళ్ళపాక అన్నమయ్య.

ప్రత్యేకత : భగవత్సాన్నిధ్యం దొరకటానికి భక్తి శృంగారాలు రెండూ సమానమైనవని కవి ఉద్దేశం. భగవంతుని విలాసపురుషునిగా భావించి సత్త్వశృంగారాలను మేళవించి ఈ కీర్తనలు వ్రాశాడు. కేవలం బహిరసుఖంవల్ల భగవత్సాన్నిధ్యం చేకూరదని బోధిస్తూ భక్తిలో శాంత, దాస్య, సఖ్య, వాత్సల్య, మధురభావాలు అనే పంచవిధ భక్తిరూపాలను చెప్పాడు. మోక్షసాధనకు భక్తిప్రపత్తులే రాజమార్గమని వైష్ణవమతం నమ్ముతుంది. ఒక్కొక్క భక్తిమార్గంలో కొన్ని వేల గేయాలు వ్రాశాడు. (అరుప్ర-6)

**అధ్యాత్మరామాయణ కీర్తనలు**

కర్త : సుబ్రహ్మణ్యకవి.

ఇవి శ్రీ శేషగిరి ముద్ర'తో రచించిన కీర్తనలు. సంస్కృత అధ్యాత్మ రామాయణంలోని విషయాలకు తెలుగుసేత. ఇది సుమారు 104 కీర్తనలతో కూడిన

గ్రంథం సంస్కృత సమాసాలు, పాండిత్య ప్రకర్షను సూచించే పద యమకాలు ఉన్నాయి.

విశిష్టమైన ఆధ్యాత్మ విషయాలు దీనిలో ఉన్నాయి. క్షేత్రయ్య చెప్పిన 40 రాగాలకు తోడు సుమారు 20 రాగాలను కవి దీనిలో అదనంగా చెప్పాడు.

(తె.వి.స.4)

**అధ్యాత్మరామాయణము**

కవి : అల్లమరాజు రామకృష్ణకవి.

రచనాకాలం : 1830-35 ప్రాంతం. (క. స.)

**అధ్యాత్మ రామాయణము (అలభ్యం)**

కర్త : ఇమ్మడి జగదేవరాయడు.

పొన్నతోట ఓబళకవి తన వామనపురాణావతారికలో ఈ గ్రంథాన్నిగురించి చెప్పాడు. (న. దే. వా. 487)

**అధ్యాత్మ రామాయణము**

కర్త : కణాదము పెద్దన సోమయాజి. (క. స.)

ప్రబంధం.

**అధ్యాత్మ రామాయణము**

కర్త : కోటమరాజు నాగయ్య.

పద్యకావ్యం. కాండ విభాగం ఉంది. నిర్దుష్టంగా హృద్యంగా ఉన్న రచన.

(క.స.)

**అధ్యాత్మ రామాయణము**

కర్త : పరశురామ పంతుల రామమూర్తి

**అధ్యాత్మ రామాయణము**

కర్త : మోదుమూరి పండరినాథకవి. (క. స.)

పద్యకావ్యం.

**అధ్యాత్మ రామాయణము**

కర్త : రాపాక శ్రీరామకవి.

అంకితము : ఇల్లిందకుంటలోని దైవానికి. (యా. వా. చ.380)

**అధ్యాత్మ రామాయణము**

కర్త : శరభకవి.

కర్త కంచర్ల అయ్యన కవి పౌత్రుడట. (క. శ.16)

**అధ్యాత్మలు**

పదరచనా విశేషాలు. ఇవి యక్షగానాలలో ప్రయుక్తం. ఇవి రేకులకు దరువులకు సరివచ్చే రచనా విశేషాలు. విజయ రాఘవుని ప్రహ్లాద చరిత్ర అవతారికలో అతవి రచనలు పేర్కొనబడిన సీసమాలికలో ఏలలు, విడిపదాలు, సంకీర్తనలు మొ॥

వాటితోపాటు ఇవి పేర్కొనబడ్డాయి. వీటి లక్ష్యం తెలియదు. యక్షగానాలలో వీటి ప్రయోగం క్వాచిత్కం. తెలంగాణా ప్రాంతానికి చెందిన మట్టెవాడ భీమేశునికి అంకిత మైన శివరాత్రి మాహాత్మ్య యక్షగానంలో ఇవి పలు తావుల ప్రయుక్తాలు.
(య. వా. చ. 308-309)

**అధ్యాయము**

కథాంశాల విభాగం అధ్యాయము. సామాన్యంగా ఈపదం శాస్త్రభాగాలకు మాత్రమే వ్యవహరిస్తారు.

**అనంత రవి**

కాలం : 18వ శతాబ్దం తుదిభాగం.

రచన : మువ్వార్త వైభవము. (ద్విపద)

వేంకట రాయని పుత్రుడు. విశిష్టా ద్వైతమత స్వరూపాన్ని తన రచనలో వివరించాడు. (ద్వి. సా. చ. 322)

**అనంతశెట్టి తిమ్మాశెట్టి**

కాలం : 18వ శతాబ్దం.

స్థలం : తంజావూరు.

సాహిత్య పోషకుడు. తంజావూరులోని ఫేనువాళము గరిడికి, పెద్ద గరిడికి చెందినవాడు. నాసికేత పురాణకర్త అయిన తిరుమలనాథ కవిని ప్రోత్సహించి అతని చేత కావ్యాలు రచింప జేశాడు. మల్లువంశ చరిత్రను దేవమల్లు చరిత్ర పేరుతో గ్రంథస్థం చేయించాడు. (క. స.)

**అనంత నారాయణుడు**

నామాంతరం : పంచరత్నకవి.

కాలం : 18వ శతాబ్దం.

ఆస్థానం : క్రీ. శ. 1712-1728 నడుమ తంజావూరును పాలించిన మహారాష్ట్ర రాజు శరభోజీ ఆస్థానం.

రచన : రాఘవ చరిత్రము. (ద్వితీయసర్గ) (సం)

బిరుదు : పంచరత్నకవి.

శరభోజీ రచించినట్లు చెప్పబడుతున్న 'రాఘవ చరిత్రము'నే సంస్కృత కావ్యం ద్వితీయసర్గ ఇతడు రాశాడేమో అని కొందరూ, ఆ రచనలో రాజుకు తోడ్పడ్డాడేమో అని కొందరూ భావిస్తున్నారు. (ద. దే. వా. 241)

**అనంత మహత్త్వము (అలభ్యం)**

నామాంతరం : అనంత మాహాత్మ్యము.

కర్త : బొడ్డపాటి పేరయ్య. (క. స.)

**అనంత మాహాత్మ్యము**

నామాంతరం : అనంత మహత్త్వము.

కర్త : బొడ్డపాటి పేరయ్య.

అలభ్యం. దీనిలోనుంచి పెదపాటి జగ్గన్న తన ప్రబంధ రత్నాకరంలో ఒక పద్యాన్ని ఉదాహరించాడు. దీనిలో సూర్య స్తుతి ఉంది. కృతికర్త సూర్యశతకాన్ని కూడ రచించాడట. (ఆంధ్ర ప్ర-౧)

**అనంతరాజు జన్నయ కవి**

కాలం : 17వ శతాబ్దం.

రచన : రామకథాభిరామము.

జన్నయమంత్రి పౌత్రుడు. అప్పయామాత్యుని పుత్రుడు. మృదు మధురంగా కవిత చెప్పిన కవి. (క. చ. 75)

**అనంతరాజు సుబ్బరాయకవి**

కాలం : క్రీ. శ. 1825-1845.

స్థలం : కార్వేటినగర సంస్థానం.

రచన : సదాశివశతకము.

క్రీ. శ. 19వ శతాబ్దం మధ్యకాలంలో కార్వేటినగర సంస్థానాన్ని పాలించిన కుమార వేంకట పెరుమాళ్లరాజు ఆస్థానంలోని అష్టదిగ్గజాలలో ఒకడు. చిత్రకవితా ప్రియుడు సంస్థానప్రభువు ప్రేరణతో సదాశివశతకం రచించినాడు. (ఆం. సం. సా.)

**అనంతవ్రతకథ (అలభ్యం)**

కర్త : కాకునూరి అప్పకవి.

ఇది కావ్యమట. (అప్పకవీయము ౩౩)

**అనంత సూరి**

కాలం : 1259-1295 ప్రాంతం.

శాసనకర్త : ఇమ్మడి మల్లికార్జున నాయకుని పానుగల్లు సంస్కృత శాసనం రచించాడు. కాకతి రుద్రమదేవి కాలంవాడు కావచ్చును. (ప్రా.వ.చే.ప.)

**అనంతాచార్యులు**

కాలం : 16 వ శతాబ్దం.

స్థలం : నెల్లూరు మండలం.

సాహిత్య ప్రియుడు లింగమకుంట రామకవిచేత "చతుర్వాటికా మాహాత్మ్యం" వ్రాయించి శ్రీరామునికి అంకితం చేయించాడు. (క. చ.)

**అనంతామాత్యుడు**

కాలం : క్రీ. శ. 15 శతాబ్ది పూర్వార్ధం.

నివాసం : పెనమకూరు, కృష్ణామండలం.

రచనలు : 1. భోజరాజీయము, 2. ఛందో దర్పణము, 3. రసాభరణము.
సమకాలికులు : శ్రీనాథుడు, పెదకోమటి వేమారెడ్డి.
గురువు : గోవింద చక్రవర్తి.

తిక్కన కుమారుడు. భోజరాజీయం ఇతని తొలి కావ్యం. ఇతని నివాసం ధ్రువపురి అనీ ధూళిపూడి అనీ దరువూరనీ భిన్నాభిప్రాయాలున్నాయి. ఇతని ముత్తాత బయ్యన మంత్రి తిక్కనసోమయాజిచేత భవ్యభారతి అనే బిరుదు పొందాడట (రె.రా చ)

**అనంతుని ఛందస్సు**

నామాంతరం : ఛందో దర్పణము (చూ).

**అనఘం కొండయ్య**

కాలం : 17 వ శతాబ్దం.
స్థలం : గుంటూరు మండలం.
రచనలు : తెలియరాలేదు.
బిరుదు : అభినవదండి

ఈ కవి వెలుగోటి యాచమనాయకుని ఆస్థానంలోని వాడనీ, అతనిచేత బిరుదు పొందాడనీ తెలుస్తున్నది.

రుక్మావతి పరిణయకర్త అనఘం కోదండరామయ్య ఇతని అన్న కుమారుడు.
(అరుద్ర-10-254)

**అనఘం కోదండరామయ్య**

కాలం : 17 వ శతాబ్దం.
స్థలం : గుంటూరు మండలం.
రచన : రుక్మావతీ పరిణయము.

వేంకటగిరి సంస్థానానికి చెందిన కవి. ఇతని రచన వల్ల ఇతని పినతండ్రి కొండయ్య కవిని గురించి తెలుస్తున్నది.

వీరి పూర్వీకుడు అనఘయామాత్యుడట. అతని పేరే ఆ కుటుంబంవారికి ఇంటి పేరైంది. (అరుద్ర- 10-254)

**అనముగుర్తి రంగయ్య**

కాలం ; 1800 ప్రాంతం.
రచన ; యాదగిరి మాహాత్మ్యము.

తిమ్మయామాత్యుని కుమారుడు. (క. స. 178)

**అనర్ఘ రాఘవమ్ (సం)**

కర్త : చెరుకూరు లక్ష్మీధరుడు.

ఇది సంస్కృత అనర్ఘ రాఘవానికి సంస్కృత వ్యాఖ్యానం. (తె. వి. స-4)

**అనర్ఘ రాఘవము**

కర్త : బిజ్జల తిమ్మరాజు.
కాలం : క్రీ. శ. 16 వ శతాబ్ది చివరి భాగం.

అంకితం : ప్రాకటూరి రామేశ్వరస్వామికి.

ప్రత్యేకత : ఇది అయిదు ఆశ్వాసాల తెలుగు ప్రబంధం. సంస్కృతంలో ఇది చాలా ప్రసిద్ధమైన నాటకం. సంస్కృత నాటకకర్త మురారి రచించిన అనర్ఘ రాఘవాన్ని పండితులు భాషా జ్ఞానంకోసం చదువుతారు. మాతృక "పఠన పాఠక రమ్యమైనట్లు ప్రదర్శన రమ్యము" కాజాలదని విజ్ఞుల భావన. మురారి విజ్ఞానానికి కొరత లేకుండా అనర్ఘ రాఘవాన్ని బిజ్జల తిమ్మరాజు అనువదించాడని పండితాభిప్రాయం.

(ఆంప్ర-9-197)

అనవేమారెడ్డి

క్రీ. శ. 1364 నుంచి 1386 వరకు కొండవీటిని పాలించిన రెడ్డి ప్రభువు. సాహిత్య ప్రియుడు. ప్రోలయవేముని రెండో కుమారుడు. ఇతని ఆస్థానంలో బాల సరస్వతి, త్రిలోచనాచార్యుడు అనే సంస్కృత కవులు, ప్రకాశ భారతీ యోగి అనే తెలుగుకవి ఉన్నారు.

బిరుదులు : ధర్మవేమన, కర్పూర వసంతరాయడు.

విశిష్టత : ఇతని కులదైవం త్రిపురాంతక దేవుడు. కులదేవత మూల గూరమ్మ. (అమీనాబాదు - గుం. జి.) షట్కాల శివపూజా పరాయణుడు . ప్రజలకు మధురాన్నం, మృదులాంబరాదులు ఇచ్చినట్లు చాటువున్నది. వినుకొండ దుర్గాన్ని స్వాధీనం చేసుకొని కొండవీటి రాజ్యంలో కలిపాడు. ఎన్నో దాన శాసనాలు వేయించాడు. పరమ ధార్మిక ప్రభువు. (శ్రీనాథుడు- కొ. శ్రీ. మూ)

అనవేమారెడ్డి దక్షారామ శాసనము

శాసనకర్త : చూ. ప్రకాశ భారతియోగి.

అనవేముని ఆస్థానంలోని తెలుగు కవియైన ప్రకాశ భారతీయోగి వ్రాసిన ఈ శాసనంలో రెండు సీసపద్యాలు మాత్రం దొరికాయి. (శ్రీనాథుడు-కొ. శ్రీ. మూ)

అనామయము

కర్త : మల్లికార్జున పండితుడు.

శివస్తోత్ర పరమైన రచన.

అనియాది గణపతి దేవుడు

కాలం : 18వ శతాబ్దం.

రచన : శివయోగ సారము.

మూలనామాత్యుని పుత్రుడు. తన గ్రంథంలో శైవమత ప్రశస్తిని వివరించాడు. (క. స-55)

అనిరుద్ధ చరిత్ర

కర్త : కనుపర్తి అబ్బయామాత్యుడు.

ఇది మనోహరమైన ప్రబంధం. ఉషానిరుద్ధుల పరిణయం దీనిలోని ఇతివృత్తం. (తె. వి. వ.8)

**అనిరుద్ధ చరిత్రము (అలభ్యం)**

కర్త : పడకంట్ల గురురాజకవి.

నాటకమట. ఈకవి మరోరచన "శేషధర్మాల"లో దీని ప్రసక్తి ఉంది. (క. స.)

**అనిరుద్ధ చరిత్ర (అలభ్యం)**

కర్త : భావనపెమ్మన.

64 పద్యాలు మాత్రం సంకలన గ్రంథాలనుంచి లభించాయి (ఆరుద్ర-9)

**అనిరుద్ధ విలాసము**

కర్త : మరింగంటి వేంకట నృసింహాచార్యులు.

యక్షగానం.

**అనుభవ దర్పణము**

కవి : పరమానంద తీర్థుడు. (చూ.)

అంకితం : దత్తాత్రేయ గురునకు.

అద్వైత వేదాంత ప్రతిపాదకమైన నాలుగాశ్వాసాల ద్విపద కావ్యం. (ద. దే వా. 208)

**అనుభవ సారము**

కర్త : పాల్కూరికి సోమనాథుడు (చూ)

245 పద్యాలున్న గ్రంథం.

కృతిభర్త : గోడగి త్రిపురారి.

శివతత్త్వ సార కర్త పండితారాధ్యుని స్తుతి ఈ కృతిలో ఉంది. 245 పద్యాలున్నాయి. ఇందులో గురుభక్తి మహిమ, భక్తి స్వరూపం, భక్త లక్షణం, శివపూజా పద్ధతి, ఇష్ట లింగార్చన విధి, సంగమ సేవ మొ॥ వీరశైవ మత ధర్మాలున్నవి ఇది పాల్కురికి సోమన్న తొలి రచన. దీనిలో పరమత నింద, మతావేశం తక్కువగాఉంది. ఇతడు రెండో ప్రతాపరుద్రునికి, ఇందులూరి అన్న మంత్రికి సమకాలికుడు. బసవేశ్వరుని తర్వాతి వాడు. (క. శ. 3)

**అనుభవామృతము**

కర్త : ఘట్టు వీరాఖ్యుడు.

కాలం : 18 వ శతాబ్ది కావచ్చు.

వేదాంత విషయ ప్రతిపాదకమైన ద్విపద కావ్యం. గ్రంథం పూర్తిగా లభించలేదు. మూడు, నాలుగు, ఐదు అశ్వాసాలు మాత్రం లభించాయి. తత్, త్వం, అసి అనే పదార్థాల వివరణం ఉంది. రచన చక్కని జాతీయాలతో సరళంగా సాగింది. దీని ప్రతి మద్రాసు ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారంలో ఉంది.

సత్యభామా విజయ కర్త ఘట్టు శేషకవి తండ్రి వీరార్యుడట. వీరిరువురూ ఒకరేనా లేక భిన్న వ్యక్తులా అన్న విషయం నిర్ధారణ కాలేదు. (ద్వి. సా. చ. 308)

**అనుభూతి ప్రకాశమ్ [సం]**

కర్త : విద్యారణ్యుడు.

ఇది సంస్కృత వేదాంత గ్రంథం. (తె. వి. స. 4)

**అనుపులు**

పదకవితా విశేషాలు. యక్షగానాలలో ఇవి అతి విరళంగా కనిపిస్తాయి. వీటిలో ఒకచోట త్రిపుటగతి, మరొకచోట జంపెగతి ఉన్నాయి. వీటికి "హనుపులు" అనే నామాంతరం కూడా ఉంది. ఇవి పిరచోడవ్వ చరిత్రలోను, కపోత వాక్యంలోను, భీమసేన విజయంలోను ఉన్నాయి. (య. గా. చ 309)

**అన్నంభట్టు**

కాలం : క్రీ. శ. 17 వ శతాబ్దం – ఉత్తరభాగం.

స్థలం : గరికపాడు (నైజాం మండలం).

రచనలు : 1. తర్క సంగ్రహము 2. తర్క సంగ్రహదీపిక 3. సుబోధిని సుధాసారము (రాణకోజ్జీవినిమీమాంస) 4. మితాక్షర (బ్రహ్మసూత్ర వ్యాఖ్యానం) 5. అష్టాధ్యాయిటీక (వ్యాకరణం) 6. కైయట ప్రదీప వ్యాఖ్యానము (ఉద్యోతనము) 7. సిద్ధాంజనము (జయదేవతత్వ చింతామణి టీక) 8. న్యాయ పరిశిష్ట ప్రకాశనము (ఉదయన గ్రంథవ్యాఖ్య) 9. తత్వబోధినీ టీక (వేదాంతము) 10. మితాక్షర (కాశికా గ్రంథవ్యాఖ్య).

సంస్కృతాంధ్రాలలో పండితుడు. గొప్ప తార్కికుడు. అద్వైత విద్యాచార్య తిరుమలుని కుమారుడు. కొండవీటిలో పన్నెండు సంవత్సరాలు న్యాయవిద్య నేర్చుకొని, స్వస్థలంలో న్యాయ విద్యాలయాలను ఏర్పాటు చేశాడు. కాశీకి వెళ్ళినంత మాత్రాన ద్విజుడు అన్నంభట్టు కాలేడు అని లోకంలో నానుడి ఉంది (కాశీగమన మాత్రేణ నాన్నంభట్టాయతే ద్విజః). అన్నంభట్టు కాశీకిపోయి అక్కడి పండితులనుంచి ప్రశంసలు పొందాడు. ఇతని రచనలు పండిత లోకంలో వ్యాప్తి పొందాయి.

(తె. వి. స. 4)

**అన్నంరాజువారు**

మనిషి పేరుతో ఉన్న ఇంటిపేరు. తెలుగుదేశంలో ఈ ఇంటిపేరు వారున్నారు. (భారతి. మా. 45-229)

**అన్నదేవరపేట**

అన్నదేవరపేట, ప్రక్కిలంక మొ॥ వి "పైడావారి" ఎస్టేటులు.

పిఠాపురం సంస్థానాధిపతులైన రాజా వేంకట నీలాద్రినాయుడు (1793-1828) ఈ రెండు ఎస్టేటులను ఇనుగంటి చినచిన్నారాయని కుమారుడు, తన బావమరిదీ అయిన ఇనుగంటి పాపారాయనిపేర ఖరీదుచేసి ఇచ్చారు. తరువాత కాలంలో "పైడావారు" ఈ ఎస్టేట్లను విక్రయంలో కొన్నారు. ఇవికాక అరెంపూడి ముఠా, జగన్నాథపురం మొఖాసా

గ్రామంలో కొంత, కోటపాడు శివారులోని రామేశం పేట. గొలుగొండ తాలూకాలోని పెద్దిపాలెం, కైలాసపట్నం మొ॥ ఈ ఎస్టేటు దారులకు చెందినవే.

పిఠాపురం నివాసి "పైడా సర్వయ్య" ఈ ఎస్టేటుదారులకు మూల పురుషుడు. ఏలూరు మోతేవారు, గూటాల మన్యంవారు మొ॥ జమీందారులు ఈ పై వారికి వియ్యంకులు.

వీరేశలింగంగారి సంఘ సంస్కరణోద్యమానికి వీరు చేదోడుగా ఉన్నారు. కాశీ, కోటిపల్లి, దాక్షారామం, భద్రాచలం, మొ॥ క్షేత్రాలలో అనేక సత్రాలు, కాకినాడలో అనేక దేవాలయాలు, వేద పాఠశాల, ఆయుర్వేద వైద్యశాల మొ॥ వీరి వితరణ గుణానికి నిదర్శనాలు.

రాజావారి కళాశాల, వైద్య కళాశాల, స్త్రీల కళాశాల, రామచంద్రాపురం కళాశాల పైడావారి వదాన్యతకు చిహ్నాలు.

ఒలుసు ప్రకాశ వేదాద్రి, పుల్లెల దక్షిణామూర్తి, పరవస్తు రంగాచార్యులు, భాగవతుల హరిశాస్త్రి, కప్పగంతుల రామశాస్త్రి, కాళ్ళకూరి నారాయణరావు, కాశీభట్ట బ్రహ్మయశాస్త్రి, ఓరుగంటి సోమశేఖరకవి, సుబ్రహ్మణ్యశాస్త్రి, వెంకటనారాయణ పాత్రి, అయ్యగారి బాపిరాజు శర్మ, మొ॥ వారు పైడావారి సన్మానాలు పొందిన ప్రముఖులలో కొందరు.

పైవారిలో కప్పగంతుల రామశాస్త్రి సంస్కృత భీమఖండాన్ని ఈ పైడావారి ఆశ్రయంలోనే పరిశోధించి, పరిష్కరించి వెలుగులోకి తెచ్చాడు. ఓరుగంటి సోమశేఖర కవి పలు జమీందారీలలో సన్మానింపబడినవాడు. అతని "ప్రభావతీ పరిణయము" "రావు బహద్దూర్ పైడా వేంకట చలపతికి" అంకితమిచ్చాడు. ఇతనివి ఇంకా అనేక గ్రంథాలున్నాయి. "అయ్యగారి బాపిరాజు" వ్రాసిన "కన్యక" అనే అయిదంకాల రూపకం, ఈ ప్రభువుకే అంకితం ఇవ్వబడింది. "కాశీభట్ల సుబ్బయ్యగారి" "శ్రావణ విజయము" పైడా రామకృష్ణయ్యగారికి అంకితం.

కపిలేశ్వరపురం హిందూ ధర్మశాస్త్ర గ్రంథనిలయానికి పైడా జమిందారులు పోషకులు. (ఆం సం. సా_ 520, 521, 522)

అన్నపూర్ణా పరిణయము

కర్త : శివాజీ (చూ)

రెండంకాల నాటకం. తంజావూరిలోని దైవం కొంకణేశ్వరునకు సంబంధించిన కథ. అతడు అన్నపూర్ణాదేవిని వివాహమాడటం ఇందులో వర్ణింపబడింది.

నాటక రచన సంస్కృత నాటక పద్ధతిలో సాగింది. నాంది, ప్రస్తావన, సూత్రధార, పారి, పార్శ్వక ప్రసంగం, నాటకాంతంలో ఆశీర్వాదం ఉన్నాయి. అంక విభజన కనిపిస్తున్నది.

ఒక ప్రాతప్రతిలో ఈ నాటకంలో ఎవరు ఎవరు ఏయే పాత్రలు వేశారో ఆ వివరణ ఉంది. నాటకంలోని పాత్రలు, పాత్రధారుల పట్టికనుబట్టి గ్రంథస్థం చేయడం విశేషం.

అమృతకవి తులసి రంగయ్య ఈ నాటకం ప్రతి నగరి నాటకశాలకు రాయించి ఇచ్చాడట. (ద. దే. వా- 285)

**అన్నపూర్ణాష్టకము**

కర్త : అక్షింతల సింగరశాస్త్రి. (చూ.)

వివరాలు తెలియవు. (ఆం. సం. సా.)

**అన్నమరాజు**

కాలం : క్రీ. శ. 18 శతాబ్ది.

ఇతని మీద చాటు పద్యాలున్నాయి. ఈయన విజయనగరం సమీపంలోని భూపాలరేగ గ్రామాన్ని గుత్తకు దీసుకొని, చెరువు బిగగట్టించి మాన్యానికి నీరురాకుండా, చెరువులోనుంచి మురుగునీరు పోనీయకుండా చేసి, చిక్కులు పెడితే, ఆ సందర్భాల్లో అడిదం సూరకవి చాలా పద్యాలు చెప్పాడు. (చా. ప. ర)

**అన్నమాచార్య చరిత్ర**

రచనాకాలం : 1530-50 నడుమ.

కర్త : తాళ్ళపాక చిన్నన్న.

ద్విపద కావ్యం. చరిత్ర ప్రాముఖ్యం ఉన్న రచన. (తె వి. స-4)

**అన్నయ ప్రెగ్గడ**

కాలం : క్రీ. శ. 1149.

చూ : గుండిమెడ అన్నమంత్రి. (శాసన రచయిత, శాసన ప్రదాత)

(తె. క.చ-195)

**అన్నయప్రెగ్గడ దక్షారామ శాసనము (సం)**

కాలం : క్రీ. శ. 1149.

స్థలం : దక్షారామ భీమేశ్వరాలయం.

శాసన ప్రదాత, రచయిత : అన్నయ ప్రెగ్గడ (గుండిమెడ అన్నమంత్రి).

శాసన విషయం : ఈశాసన రచయిత కమ్మనాటి త్రిభువన మల్లదేవరాజ చోడునికి ప్రెగ్గడ. ఈశాసనం ప్రకారం ఈతని పూర్వీకులు వంగిపురం అగ్రహారంలో ఉండేవారు. తెలుగుదేశంలోని చాలా క్షేత్రాలలో ఈశాసనకర్త అయాదేవతలను ప్రతిష్ఠించినట్లు తెలుస్తుంది. (తె. క. చ-195)

**అన్నశాస్త్రి**

కాలం : 17వ శతాబ్దం.

రచనలు : తెలియ రాలేదు.

ఇతడు విజయనగర రాజైన వెంకటపతి రాయల సభలో, గామదేవి కవిని జయించి బంగరు పల్లకిని, "ఏరాకరము" అనే గ్రామాన్ని బహుమానంగా పొందాడట.

ఈతని కొడుకులు ముగ్గురూ గొప్ప పండితులు. 1. విశ్వనాథుడు. (సిద్ధాంత సిద్ధాంజనం మీద వ్యాఖ్యానం రాశాడు). 2. పెరియప్పకవి. (శహాజీ రాజపురాగ్రహా రగ్రహీత). 3. వైనతేయ సూరి. (ద. దే. వా. 179)

**అన్నసముద్రము చిన వీరయ్య**

కాలం ; 17, 18 వ శతాబ్దాల మధ్య కాలం.

స్థలం ; నైజాం మండలం.

రచన ; సంస్కృత గ్రంథం. వేతాళ చరిత్రమ్ కావచ్చును.

ఇతని గ్రంథాన్ననుసరించి బంగారు రంగప్ప తెలుగులో, బేతాళ చరిత్రమనే ద్విపద కావ్యాన్ని వ్రాశాడు. ఇది రేచర్ల గోత్రజుడైన వేతాళ నాయకుని చరిత్రను తెలిపే రచన. (క. స - 178)

**అన్యాపదేశ కావ్యము**

నీతి కావ్య శ్రేణికి చెందిన కావ్యాలే అన్యాప దేశాలు. దీనిలో నీతి వైరాగ్య బోధ ఉంటుంది; కాని విధానం మాత్రం వేరుగా ఉంటుంది. ఇవి నీతిని సూటిగా బోధింపక, అన్యాపదేశంగా బోధిస్తాయి. అప్రస్తుత విషయ వర్ణనమో, విషయ నిర్వాణమో ఇందులో అంతర్గతమై ఉండి నీతి భాసిస్తుంది. (తె. వి. స-8)

**అన్యాపదేశ శతకము (సం)**

కర్త ; నీలకంఠ దీక్షితులు (తె. వి. స-8)

**అపరోక్షానుభూతి (సం)**

కర్త ; విద్యారణ్యుడు.

ఇది సంస్కృత వేదాంత గ్రంథం. (తె. వి. స-4)

**అప్పకవీయము**

నామాంతరం ; ఆంధ్రశబ్ద చింతామణి.

రచనాకాలం ; 1656 ప్రాంతం.

కర్త ; కాకునూరి అప్పకవి.

తెలుగులో పరమ ప్రామాణికమైన లక్షణ గ్రంథం. నన్నయ్య ఆంధ్రశబ్ద చింతామణికి ఇది పద్యరూపమైన వ్యాఖ్య. దీనికి "ఆంధ్రశబ్ద చింతామణి" అని అప్ప కవి పేరుపెట్టినా "అప్ప కవీయం" అనేపేరే దీనికి సుప్రసిద్ధం అయింది.

అప్పకవి తనకు శాలివాహనశకం 1578 మన్మథ నామసంవత్సరం శ్రావణ బహుళ అష్టమినాడు (క్రీ. శ 1656 ఆగష్టు 3వతేదీ) కలలో దేవుడు కనిపించి నన్నయ వ్యాకరణాన్ని తెనిగించుమని ఆదేశించినట్లు చెప్పుతున్నాడు.

మొదటి ఆశ్వాసంలో కావ్య స్వరూపాదులు, భాషాష్టక వివరణం, తత్స మాదుల నిరూపణ, రెండో ఆశ్వాసంలో వర్ణాలకు సంబంధించిన అంశాలు, రేఫ, ఱకార నిర్ణయం, బీజాక్షరాదులు, అక్షర శుభాశుభఫలాలు, మూడో ఆశ్వాసంలో యతిప్రాస భేదాలు, నాలుగో ఆశ్వాసంలో గణాది విషయం, షట్ప్రత్యయాలు, 26 ఛందాలకు

చెందిన కొన్నికొన్ని వృత్తాలు, ఉద్ధుర మాలావృత్తాలు, అర్ధసమ విషమ వృత్తాలు, జాత్యుపజాతులు, చాటు కావ్య స్వరూపాలు, ఉదాహరణ కావ్యలక్షణం, లక్ష్యం చిత్ర, బంధ, గర్భ కవితారీతులు, ఐదో ఆశ్వాసంలో సంధి విషయాలు ఉన్నాయి.

వ్యాకరణ గ్రంథవ్యాఖ్యగా అప్పకవీయం ఉద్దిష్టమైనా సంధుల వరకే ఇందులో దొరుకుతున్నాయి. (అప్పకవి ప్రణాళిక ప్రకారం ఇది ఎనిమిది ఆశ్వాసాలు. కాని మనకు ఇప్పుడిది ఐదు ఆశ్వాసాలు మాత్రమే లభ్యం. మిగిలిన మూడాశ్వాసాలూ అప్ప కవి వ్రాశాడో లేదో తెలీదు.)

వ్యాకరణ విషయికంగా ఇది అసమగ్రం. కాని ఛందో విషయికంగా సమగ్రం.
(ఛం. ప. కో)

**అప్పగింత పాటలు**

ఈ పాటలు ఒక ప్రత్యేక రచనా ప్రక్రియ కలవి కావు. కల్యాణ కథలలో తల్లిదండ్రులు వియ్యాల వారికి తమ కన్యలను అప్పగించే సందర్భాలను పురస్కరించుకొని పుట్టినవీ పాటలు. ఇవి జానకీ పరిణయమనే యక్షగానంలో ప్రయుక్తం. తెలుగు నాట జానపదులలో ఈ పాటలు ప్రచురంగా ఉన్నాయి. (య. వా. ఓ- 310)

**అప్ప దీక్షితుడు**

కాలం : 17 వ శతాబ్దం.

ఆస్థానం : తంజావూరును పాలించిన శహాజీ ఆస్థానం (1684-1712).

స్థలం : గౌరీమాయూరం (చోళదేశం).

రచనలు : 1. ఆచార నవనీతమ్ (సం) 2. మదనభూషణ భాణము (సం) 3 గౌరీ మాయూర చంపు (సం).

ఇతడు ఆనందరాయ మఖి ఆశ్రితుడు. రాజు కోరికను అనుసరించి ధర్మశాస్త్ర సార ప్రాయమైన ఆచార నవనీతాన్ని రచించాడట ఇందులో మానవ జీవితంలోని ప్రధాన ఘట్టాలలో చేయవలసిన కర్మలన్నీ (అంత్య క్రియలు, శ్రాద్ధ కర్మలు, మొ॥ వి వివరాలు) చెప్పబడ్డాయి. ఈ గ్రంథాన్ని అప్పదీక్షితులు శహాజీమంత్రి అయిన ఆనందరాయ మఖి పేర పెట్టాడట. ఇందులో ఆనందరాయుడి తండ్రి త్ర్యంబకరాయ మఖి క్రీ. శ. 1698 ప్రాంతంలో శహాజీ తోడ్పాటుతో నిర్వహించిన ఒక యజ్ఞం ప్రసక్తి ఉంది.

ఇతని రచనలన్నీ సంస్కృతాలే. (న. దే. వా.)

**అప్పన మంత్రి**

కాలం : క్రీ. శ. 1347 కు పూర్వం.

రచన : చారుచర్య.

చాలా చిన్న గ్రంథం. 76 పద్యాలు మాత్రమే వున్నాయి. ఇతడు కాకతి ప్రతాపరుద్రుని కాలంలోనో అంతకు పూర్వమో ఉండి ఉంటాడు.

ఉభయ భాషా కవిత్వ విశారదుడు. ఈతడూ ఆంధ్రభోజుడు ఒకరేనన్న వాదం ఉంది.
(ఆరుద్ర-2)

**అప్పన సుకవి**

కాలం : 17 వ శతాబ్దం కావచ్చు.
రచన : వరదరాజ మంజరి. (ద్విపద)
(కలియుగ మంజరి)

కవినిగూర్చిన వివరాలు తెలియలేదు. ఇతడు తాతాచార్యులను పేర్కొన్నాడు. కావ్యేతివృత్తం కంచిలోని వరదరాజస్వామి ఉత్సవాలకు సంబంధించినది. ఈ తాతాచార్యులు 17 వ శతాబ్దంవారై ఉంటారని పండితులు ఊహిస్తున్నారు. రచన రమణీయంగా ఉంది (ద్వి. సా. చ- 278)

**అప్పయార్యుడు**

కాలం : క్రీ. శ. 1291- 1323 ప్రాంతం.
స్థలం : ఓరుగల్లు.
రచన : జినేంద్ర కళ్యాణాభ్యుదయమ్. సంస్కృత కావ్యం. దీనికి 'అర్హాతి ప్రతిష్ఠ' అనే నామాంతరముంది.

ఇతడు కాకతి ప్రతాపరుద్రుని ఆస్థానంలోని జైనకవి. (ప్రా. న. దే. చ)

**అప్పయ్య దీక్షితులు**

కాలం : క్రీ. శ. 1586-1614 ప్రాంతం.
స్థలం : కాంచీపుర ప్రాంతం- అడెపలోల గ్రామం.
నామాంతరాలు : అప్పదీక్షితులు, అప్పయదీక్షితులు

రచనలు ; 1. పరిమళము- వ్యాఖ్య 2. సిద్ధాంతలేశము 3. మయూఖావళి 4 మధ్వతంత్ర ముఖమర్దనము 5 మధ్వ విధ్వంసనము 6. యాదవాభ్యుదయ వ్యాఖ్య 7. హరివంశ సారచరితకు సర్వాంకష వ్యాఖ్య 8. రామాయణ సారస్తవము 9. భారత తాత్పర్య సంగ్రహము. 10. వసుమతీ చరిత సంక్షేపము 11. అమరటీక 12. వృత్తి వార్తికము 13. కువలయానందము 14. చిత్రమీమాంస 15. లక్షణరత్నావళి.

ఈయన విఖ్యాత దాక్షిణాత్య విద్వాంసుడు. చంద్రగిరి నేలిన వేంకటపతి రాయల గౌరవాదరాలకు పాత్రుడు. అద్వైత మతాభిమాని. ఈయనను అద్వైత విద్యాచార్యుడని, అపర శంకరావతారమని కూడా పిలిచేవారట.

ఈయన రచనలు 104 ఉన్నవి. ఎక్కువ శతకాలు, స్తోత్రాలు రచించాడు. అనేక రాజాస్థానాలలో గౌరవింపబడ్డాడు. సర్వశాస్త్ర పండితుడు. ప్రతి శాస్త్రంలోను ఒక గ్రంథం వ్రాశాడట. జ్యోతిష్టోమాది యాగాలు చేశాడు.

చినతిమ్మనాయకుడీతని ప్రథమ పోషకుడు. తంజావూరును పాలించిన చెవ్వప్ప నాయకుడు ఇతన్ని సన్మానించాడట. తంజావూరు మంత్రి, నందనాయకుడూ అయిన గోవింద దీక్షితుడు అప్పయ్య నాయకుని మిత్రుడట.

ఈయన గ్రంథాలు చాలా ప్రామాణికమైనవని పండితాభిప్రాయం. ఈయన శివభక్తుడయినా విష్ణుద్వేషి అయిన పరశైవుడు కాడు. శతాధిక గ్రంథకర్త అయినా

కొన్ని గ్రంథాలు మాత్రమే లభించాయి. ఈయన "చిత్రమీమాంస" అనే అలంకార గ్రంథ సిద్ధాంతాలను జగన్నాథ పండితరాయలు ఖండించి, అనేక రకాలుగా వ్యక్తి దూషణ చేశాడు. (తె. వి. స - 6-221) (తం. ఆ. నా. 184)

**అప్పల నరసింహకవి**

నామాంతరం : వేంకటనరసింహకవి (శ. సా. వి - 385)

**అప్పారాయ యశశ్చంద్రోదయమ్ [సం]**

కర్త : అనివిళ్ళ వేంకటశాస్త్రి

సంస్కృతంలో రచింపబడిన అలంకార శాస్త్ర గ్రంథం. దీనిలోని ఉదాహరణలు నూజివీడు జమీందారయిన మేకా వేంకట నరసింహ అప్పారావు స్తుతిపరాలు. (తె. వి. స - 4)

**అప్పారావు మొదలి- మాత్తూరి**

కాలం : పందొమ్మిదవ శతాబ్ది పూర్వార్థం

స్థలం : కోటగిరి

రచన : మాతృశతకము

గురువు : మరింగంటి రంగాచార్యుడు.

ఇతడు ద్రావిడుడైనా తెలుగు భాషపై అభిమానం కలవాడు. (శ. సా. వి)

**అప్పాశాస్త్రి**

నామాంతరం : పూర్ణ బ్రహ్మానంద యోగి

కాలం : క్రీ. శ. 1884-1712 నడుమ తంజావూరును పాలించిన శహాజీ కాలం.

స్థలం : తిరువారూరు మానవిక్రమం.

రచనలు : 1. ప్రాయశ్చిత్త దీపికా. (సం) 2 ఉపాసనాక్రమ దీపిక (సం)

గురువు : పరబ్రహ్మానంద యోగి.

అద్వైతి వేదాంతి. శహాజీ ఇతన్ని ఇతని గురువునీ చాలా మన్నించే వాడట. (M. R. T P. 34)

**అభిజ్ఞాన శాకుంతలము**

రచనాకాలం ; 19 వ శతాబ్దం

కర్త : చదలువాడ సీతారామశాస్త్రి.

వచన నాటకం.

**అభినయ దర్పణము**

కర్త : కవిగిరి వేంకటగిరి.

అంకితము : ఖండోజీ రాయనికి

పద్యకావ్యం. మూడు అనుబంధాలు (భాగాలు) న్నాయి.

మూలం : సంస్కృతంలో నందికేశ్వరుడు రచించిన అభినయదర్పణం.

ఇందులో నాట్యశాస్త్రానికి సంబంధించిన అభినయ విషయాలు ఉన్నాయి. కృతిపతి తంజావూరు పాలకుడైన శహాజీ బంధువట.

లిం మగుంట మాతృభూతకవి కూడా దీన్ని సంస్కృతం నుంచి అనువదించాడు. అది ముద్రితం. (ద. దే. వా. 227)

**అభినవ కర్ణామృతము (సం)**

కర్త ; చూ. తిరుమల బుక్కపట్టణం (ఇమ్మడి) అణ్ణయ దీక్షితులు

సంస్కృత రచన. సురపురం సంస్థానాధీశ్వరుల సమాదరణలో వెలసిన గ్రంథ పరంపరలో ఇది ఒకటి. (ఆం. సం. సా-5,6)

**అభినవ కాదంబరి (సం)**

నామాంతరం ; త్రిమూర్తి కల్యాణము.

కర్త ; అహోబల నరసింహసూరి.

సంస్కృత గద్యకావ్యం. (తె. వి. స-4-719)

**అభినవ భారతము**

కర్త ; చూ. ముతుకుమల్లి మాధవకవి.

వివరాలు తెలియవు. (ఆం. సం. సా-195, 391)

**అభినవ భోజులు**

సాహితీ ప్రియులై, సాహిత్య పోషకులైన రాజులను భోజ మహారాజుతో పోల్చి చెప్పడం కవుల అలవాటు. అట్టి వారిని ఆంధ్రభోజుడనీ, అభినవ భోజుడనీ బిరుదనామాలతో వ్యవహరించడం కూడా ప్రచారంలో ఉంది.

తంజావూరును పాలించిన రఘునాథ నాయకుడు (1600-31) అభినవ భోజరాజుగా తన ఆస్థానంలోని పండితులచేత ప్రశంసింప బడ్డాడు

**అభినవ రామాభ్యుదయము (సం)**

కవయిత్రి : అభిరామ కామాక్షి

ఇది 24 ఆశ్వాసాల కావ్యం. (తె. వి. స - 6)

**అభినవ శృంగార సుందరి**

కర్త : తిరుమల బుక్కపట్టణం బుచ్చి వేంకటాచార్యులు. (చూ)

ఇది రూపక భేదాల్లో ఒకటైన భాణం. (ఆం.సం.సా.)

**అభినవాంధ్ర నిఘంటువు (అలభ్యం)**

కవి : గణపవరపు వేంకటకవి

అకారాది క్రమంలో ఒక దేశీయ నిఘంటువును వేంకటకవి రచించినట్లు జయంతి రామయ్య పంతులు గారు చెప్పారు. ఇది అదే కావచ్చు. (ఆం.ప్ర 11-163)

**అభిమన్యు కల్యాణము**

రచనా కాలం : 1800 ప్రాంతం.

కర్త ; శేషము చెన్నభట్టారకుడు.

అంకితం : శ్రీరామునికి.

అయిదాశ్వాసాల ద్విపద కావ్యం. రచన శృంగార రస బంధురంగా ఉంది. శశిరేఖ అభిమన్యుల వివాహాన్ని కవి నూతన రీతిలో చెప్పాడు. ఈ కథ భారతంలో సూచన మాత్రంగానే ఉంది. దీని ప్రతి వేంకటేశ్వర ప్రాచ్య పరిశోధనా సంస్థలో ఉంది. (ద్వి. సా. ప 379)

**అభిమన్యు పరిణయము**

కర్త : పిసెము లక్ష్మీపతి

రచనాకాలం ; 1700 ప్రాంతం

ఐదాశ్వాసాల పద్యకావ్యం. శేషము వెన్న భట్టారకుని ద్విపద కావ్యాన్ని అనుసరించి కవి ఈ కావ్యాన్ని రచించాడు. దీని ప్రతి మదరాసు ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారంలో ఉంది. రచన అంత ప్రశస్తం కాదట (ద్వి. సా. ప. 380)

**అభిమన్యు విలాసము**

కర్త : చిత్రకవి వేంకటరమణ (అరు.ప్ర.-9)

**అభిరామ కామాక్షి**

కాలం : క్రీ. శ. 16 శతాబ్ది పూర్వార్ధం.

రచన : అభినవ రామాభ్యుదయమ్ (సం)

కవయిత్రి తండ్రి సభాపతి, మొదటి అరుణ గిరినాథుని మేనమామ.
(తె. వి. ప-6)

**అభిరామ వాసుదేవము (అలభ్యం)**

కవి : యనపల్లి వెంకటయ్య (చూ)

పద్య కావ్యం (అరు.ప్ర.-12.61)

**అభిరాముడు**

నామాంతరం : డిండిమభట్టు. 1. (చూ)

**అభివ్యక్తి వాదులు**

వైయాకరణులు. శ్రవణేంద్రియ గోచరమయ్యే పదాలు వాక్యాలేకాక, దానిచే అభివ్యక్తమయ్యే బుద్ధినిష్ఠమైన శబ్దము నిత్యము. అఖండము, అవికారము, అచలము, అనశ్వరమునైనదని భావించేవారు.

**అభిషిక్త రాఘవము**

కాలం : 18వ శతాబ్ది పూర్వార్ధం,

కర్త : నడిమింటి వెంకటపతి.

అంకితం : ముట్ల వెంకట రామరాజుకు.

భోజ చంపువుకు అనువాదం. ప్రౌఢమైన రచన. కావ్యంలో భోజుని ప్రశంస ఉంది.

కృతిపతి, సిద్ధవటం పాలకులైన మట్లవారి వంశీయుడు. 1730లో ఆసీమను పాలించిన అప్పయ్యరాజు (తిరువేంగళరాజు) కు పినతండ్రి అట. (అరుద్ర 12-71)

**అభ్యుదయ రచనలు**

అభ్యుదయము అనే పేరుతో ఉన్న రచనలు. సంస్కృతంలో వేదాంత దేశికుల వారి యాదవాభ్యుదయం ఇలాంటి రచనలకు మార్గదర్శకమైంది.

వీనిలో ప్రత్యేక వ్యక్తుల జీవితచరిత్ర ముఖ్యవిషయంగా ఉంటుంది. ఇవి పద్యరూపంలో ఉన్న జీవితచరిత్రలని చెప్పవచ్చు. తెలుగులో అచ్యుతాభ్యుదయము, రఘునాథాభ్యుదయము, రఘునాథ నాయకాభ్యుదయము, విజయరాఘవనాయకాభ్యుదయము ఇలాంటి రచనలు.

**అమరకోశవ్యాఖ్య (సం)**

కర్త : చూ. బొమ్మకంటి అప్పయాచార్యుడు.

సంస్కృతంలో అమరసింహుడు వ్రాసిన అమర కోశానికి వ్యాఖ్యయిది. (తె. వి. స - 4)

**అమరచింత**

ఇది మహబూబ్‌నగర్ మండలంలోని ఒక సంస్థానం. కాకతీయుల కాలంలో గోనబుద్ధారెడ్డి అధీనంలో ఉన్న 'వర్ధమానపురం' ప్రాంతాన్ని పాకనాటి గోపాల్‌రెడ్డి బుద్ధారెడ్డి నుండి పొందాడు. ఇది క్రీ. శ 1292 ప్రాంతంలో జరిగింది. ఆ తరువాత గోపాలరెడ్డి రెండవ కొడుకు చినగోపిరెడ్డికి "అయిదు మహాస్థానాల గౌడరికం" వచ్చింది. అందులో అమరచింత ఒకటి. ఇదే సంస్థానానికి ముఖ్యమై కాలక్రమంలో "ఆత్మకూరు" అనేపేరు ప్రసిద్ధి చెందింది (చూ ఆత్మకూరు). (ఆం. సం. సా.)

**అమరచింత రామచంద్రకవి**

కాలం : క్రీ. శ 19వ శతాబ్దం.

స్థలం : అమరావతి.

రచనలు : తెలియరావేమి.

క్రీ శ. 19వ శతాబ్దం మధ్యకాలంలో పసుపర్తి సంస్థానాన్ని పాలించిన రాజా ప్రథమ రామేశ్వర రాయలకు సమకాలీకుడని మాత్రం తెలియవస్తుంది. అతనిచేత సన్మానింప బడ్డాడు. (ఆం. సం. సా.)

**అమరుటీక (సం)**

కర్త : అప్పయ్య దీక్షితులు.

ఇది అమరుక కావ్యానికి టీక కావచ్చు. రచన ప్రౌఢంగా కాక సర్వ సాధారణంగా ఉంటుంది. (తె. వి. స-6)

**అమరనిఘంటు టీక**

కర్త : నాగదేవభట్టు.

సంస్కృతంలోని అమరుక కావ్యానికి తెలుగు టీక.

ఈ కృతిలో అతి ప్రాచీనమైన తెలుగు నుడికారం ఒక్కాగా ఉన్నదట. కృతికర్త ప్రశంస క్రీడాభిరామంలోను మల్లినాథ సూరి రచించిన "వైశ్యవంశ సుధార్ణవము" లోనూ ఉంది.

**అమర పదకల్ప ద్రుమము**

కాలం : క్రీ శ. 19 వ శతాబ్ది

కర్త : ఫక్కి వేంకట నరసయ్య.

ఇతని రచనలలో అమర కల్పద్రుమం బదులుగా అనువ కల్పద్రుమ కావ్యాన్ని కొందరు పేర్కొన్నారు. ఈ రెండూ ఒకటే కావచ్చు. లేదా అమరపద కల్పద్రుమం నిఘంటువు కావచ్చును. వివరాలు తెలియరాలేదు. (క. స.– 241)

**అమర సింహుడు**

కాలం : 18 వ శతాబ్దం.

స్థలం : తంజావూరు.

సాహిత్యప్రియుడు. కృతిపతి. తంజావూరును (1788–89) పాలించాడు, ప్రతాపసింహుని కుమారుడు. తల్లి యమునాంబిక. మాతృభూతకవి "పారిజాతాపహరణ నాటకాన్ని" ఈ రాజుకు అంకితం చేశాడు తాయిమాన్ కోయిల్ లోని మాతృభూతేశ్వరుని దేవి సుగంధి కుంతలాంబ ఇతనికి స్వప్నంలో దర్శనమిచ్చి తన భక్తుడైన మాతృ భూతకవిని ఆదరించమని చెప్పిందట. (వ. దే. వా.– 272)

**అమరావతి**

రాజా వాసిరెడ్డి వెంకటాద్రినాయని కాలంలో ఈ సంస్థానం మిక్కిలి ప్రసిద్ధి గాంచింది

ఇది క్రీ శ 17 వ శతాబ్ది చివరికాలంలో మొగల్లునిసుతో ఆరంభమై స్థానిక రాజ్యాలైన రాఘవపురం, చింతలపాడు మొ॥ జమీలు కలుపుకొని విస్తరించింది వాసిరెడ్డి సదాశివయ్య ఈ వంశానికి మూలపురుషుడు ఈ సంస్థానంలో సాహిత్య పోషణ కూడా బాగా జరిగింది పాపయారాధ్యులు, అమరవాది రామకవి, దివి నిమ్మకవి మొ॥ పెక్కురు కవులను ఈ ప్రభువులు పోషించారు. ఆ తరువాత రఘునాథనాయుడు కాలం వరకు ఈ సంస్థానం ఉచ్ఛదశలో ఉన్నది (ఆం. సం. సా.)

**అమరుక కావ్యము (అలభ్యం)**

కర్త : కానుకొలను అన్నమరాజు.

సంస్కృత కావ్యానికి ఆంధ్రీకరణం. ప్రబంధరత్నాకరంలో ఈ కావ్య ప్రశంస ఉన్నది. దీనిలోని రెండు పద్యాలు మాత్రం లభించాయి. సంస్కృతంలో ఈ అమరుక కావ్యాన్ని అమరుకుడే వ్రాశాడని, శంకరాచార్యులవారే వ్రాశారని పండితుల మధ్య భేదాభిప్రాయముంది. అన్నమరాజు తరవాత చాలామంది కవులు దీనిని తెనిగించారు. (అరుద్ర–8–98)

**అమరుక కావ్య టీక**

నామాంతరం : శృంగారామరుక కావ్యము.

రచనాకాలం : 1550 ప్రాంతం.

కర్త : తాళ్ళపాక తిరువేంగళాచార్యులు.

ప్రత్యేకత : సంస్కృతామరుక కావ్యానికి చక్కని అనువాదం. ఇందులోని వివరణ రూప పరిచయ వాక్యాలు శిష్టవ్యావహారికంలో ఉన్నాయి. అమరుకానికి ఇదే మొదటి అనువాదం కావచ్చును. (తె. వి. స- 4)

**అమరుక శతకము (అలభ్యం)**

కర్త : చూ. కానుకొలను అన్నమరాజు.

సంకలన గ్రంథమైన "ఉదాహరణ పద్యములు" లో దీనిలోని పద్యాలు ఉదాహృతం.

**అమరేశ్వరస్వామి బాలచాముండి అమ్మవారి ఏకాంత సేవ**

కర్త : అక్కెన ప్రగడ హరిదాసు.

ప్రదర్శనకు అనువైన యక్షగాన నాటకం. (య. వా. చ.)

**అమాత్య మల్లని శాసనము**

కాలం : క్రీ. శ. 1149.

శాసన ప్రదాత : అమాత్య మల్లడు.

శాసన విషయం : శాసనప్రదాత అమాత్య మల్లడు భీమేశ్వరునికి అఖండ దీపం నిలిపినట్లు ఈ శాసనం వల్ల తెలుస్తుంది. దీనిలో అసమగ్రంగా ఒక కంద పద్య ముంది. (తె. క. చ- 248)

**అమీన్ ఖాన్ (అమీన్‌ఖానుడు)**

కాలం : క్రీ. శ. 16 శతాబ్ది పూర్వార్ధం.

సాహిత్య పోషకుడు. పొన్నికంటి తెలగన విరచితమైన తొలి అచ్చతెలుగు కావ్యం యయాతి చరిత్రకు కృతిపతి.

విశిష్టత : ఈయన గోలకొండ నవాబు ఇబ్రహీం కుతుబ్‌షాహికి సైన్యాధిపతి. ఇతనికి తెలుగు సాహిత్యమంటే చాలా ఇష్టమట. అమీన్‌ఖాన్, తెలగన్న ఈ కావ్యం వ్రాస్తున్నాడని తెలిసి, మరింగంటి అప్పన్నద్వారా కబురంపి తెలగన్నచేత కృతి వ్రాయించి అంకితం పుచ్చుకొన్నాడు. ఈయన తెలగన్నకు చాలా బహుమానాలిచ్చాడట. ఒక శాసన పద్యాన్నిబట్టి ఇతడు 1592 వరకు జీవించిఉన్నట్లు తెలుస్తున్నది. (అరుద్ర-8-144)

**అమృతనాథుడు**

కాలం : క్రీ. శ. 1168.

రచనలు : తెలియరాలేదు.

ఈయన మైలమ భీముని మీద ఒక పద్యం చెప్పాడు. ఆ పద్యాన్ని కాచన బసవన అనే లాక్షణికుడు 'కవి సర్పగారుడం' లో ఉదాహరించాడు. పై పద్యంలో

ప్రస్తావితుడైన మైలమ భీమనను వేములవాడ భీమకవి [illegible] ఈ అమ్మిరాజు జైనుడు కావచ్చునని పండితులు ఊహిస్తున్నారు. (తె. క. చ- 287)

**అమృతలహరి (సం)**

కర్త : చూ జగన్నాథ పండితరాయలు (క్రీ. శ. 1590-1665).

ఇది ప్రశస్తమైన స్తుతి కావ్యం. దీనికి యమునా స్తుతి అని నామాంతర ముంది. (తె వి. స-6)

**అయితన (అదిత్యుడు)**

కాలం : క్రీ శ 1125 ప్రాంతం.

స్థలం : తెనాలి తాలూకా ఈమని గ్రామం.

శాసన రచయిత.

ఈమని గ్రామ కరణం. ఇతడు ఘంటసాల కాపుకు ఈమని శాసనాన్ని రచించాడు. అయితన అనేది ఆదిత్య శబ్దభవం. (తె. క. చ-190)

**అయితన ఏలూరు శాసనము**

కాలం : క్రీ శ. 1190.

శాసన ప్రదాత : అయితన.

శాసన ప్రదేశం : పశ్చిమ గోదావరి జిల్లా ఏలూరు.

శాసన విషయం : అయితన కాటయ వరిపుత్రుడని, ఏలూరులో వేంచేసిన సోమేశ్వర స్వామికి ఉభయ సంధ్యలలోను వెలిగించటానికి సంధ్యాదీపాలు నిలిపినట్లు ఈ శాసనం వల్ల తెలుస్తుంది. ఈ శాసనం ఏలూరులోని మసీదు స్తంభం మీద చెక్కి ఉంది. దీనిలో ఒక కంద పద్యముంది. (తె. క. చ-310 a)

**అయితమసెట్టి ఏలూరు శాసనము**

కాలం : క్రీ. శ. 1201.

శాసన ప్రదాత : అయితమసెట్టి.

ప్రస్తావిత స్థలం : నరసిపురం.

శాసన ప్రదేశం : పశ్చిమ గోదావరి జిల్లా- ఏలూరు మసీదు.

శాసన విషయం : అయితమసెట్టి ప్రోలిసెట్టికి - ప్రోలమకు పుత్రుడు. నరసిపురంలో వేంచేసియున్న శ్రీకృష్ణునకు అఖండ దీపం నిలిపినట్లు శాసనంవల్ల తెలుస్తుంది. దీనిలో ఒక చంపకమాల, చివర గద్య ఉన్నాయి. (తె. క. చ-314 a)

**అయితాంబ ఏలూరు శాసనము**

కాలం : క్రీ. శ. 1228.

శాసనం వేయించినవారు : అయితాంబ.

శాసన ప్రదేశం : పశ్చిమగోదావరి జిల్లా- ఏలూరు.

శాసన విషయం : నరసీపురంలో వేంచేసియున్న సోమేశ్వరస్వామికి - విష్ణువుకు ఈమె ఉభయ సంధ్యాదీపాలను నిలిపిందట. 'గుడుపూండి' గోకర్ణ దేవునికి అయి

తాంబ తల్లి మల్లాంబ చాల దాన ధర్మాలు చేసి గుడి కట్టించినట్లు ఈ శాసనంవల్ల తెలుస్తుంది. ఈ శాసనం ఏలూరు మసీదులో ఒక స్తంభం మీద చెక్కి ఉంది దీనిలో ఓ సీస పద్యం, ఒక కంద పద్యం ఉన్నాయి. (తె. క. చ-320 a)

**అయినాపురపువారు**

"పురపు" శబ్దం చివరలో ఉన్న గ్రామనామంతో ఉన్న ఇంటిపేరు. విజాపురపు వారు, అనరాపురపు వారు ఇలాంటి పేర్లవారే. (భారతి-మా-45-228)

**అయ్యంకి బాలసరస్వతి**

చూ. తురగా రాజకవి-అయ్యంకి బాలసరస్వతి.

**అయ్యంకి మల్లన**

నామాంతరం : మాచయగారి మల్లన (చూ)

తండ్రి మాచయ్య పేర ఇతడు మాచయ్యగారి మల్లనగా ప్రసిద్ధుడయ్యాడు.

**అయ్యగారి**

గృహనామం. వీరు మొదట దెందులూరి వారు. దెందులూరి లింగయారాధ్యుని (18వ శతాబ్దం) అందరూ, "అయ్యగారు" అని పిలవడంతో ఆ నామం అతని వంశీయులకు ఇంటిపేరుగా స్థిరపడినదట (క. త-13-200)

**అయ్య దీక్షితులు**

నామాంతరం : రామభద్ర దీక్షితుడు,

**అయ్యనభట్టు**

కాలం : క్రీ శ. 980 ప్రాంతం.

శాసన రచయిత.

రెండో యుద్ధమల్లుని కుమారుడయిన విజయాదిత్య నామాంతరమున్న బాడప మహారాజు "అరుంబాక" గ్రామంలో వేసిన తామ్ర శాసనకర్త ఇతడు. సంస్కృత శ్లోకాల నడుమ తెలుగు కంద పద్యాన్ని సంస్కృతంలోనే వ్రాశాడు (తె. క. చ-97)

**అయ్యన్న**

కాలం : 17 వ శతాబ్దం.

స్థలం : చెంగల్పట్టు జిల్లా.

రచనలు : వ్యాస తాత్పర్య నిర్ణయమ్ (సం)

గురువు : శ్రీనిధి వెంకటేశాచార్యుడు.

వెలిదిండ్ల వేంకటపతి కుమారుడు. ఇతని తెలుగు రచనలు లభించలేదు. (వ దే వా-503)

**అయ్యల భాస్కర కవులు**

చూ. { అయ్యలరాజు అయ్యలయ్య.
అయ్యలరాజు భాస్కరకవి.

అయ్యలరాజు అయలయ్య
అయ్యలరాజు భాస్కరకవి

వ్యవహార నామం : అయ్యల భాస్కరకవులు.
కాలం : క్రీ. శ. 16 శతాబ్ది ఉత్తరార్ధం.
రచన : రెట్టమత శాస్త్రము.

విశిష్టత : ఈజంట కవులు అయ్యలరాజు వంశంవారు. ఒంటిమిట్ట రఘువీర శతకకర్త, అయ్యలరాజు తిప్పయ్య కోవలో పిన్నక్కయ్యకు అయ్యలయ్య, నాగన్నకు, భాస్కరకవి కుమారులు. వీరు తెనాలి రామకృష్ణునికి సమకాలికులని పండితాభిప్రాయం. వీరు తెనిగించిన రెట్టమత శాస్త్రంలో వర్షానికి, పంటలకు సంబంధించిన వివరాలున్నాయి. వీరి కావ్యం దోనయామాత్యుని సస్యానందం వంటిది. (ఆరుద్ర-9)

అయ్యలరాజు త్రిపురాంతకుడు

నామాంతరం : (రాయకవి), త్రిపురాంతకుడు.
కాలం : క్రీ శ. 1440 ప్రాంతం.
స్థలం : కర్ణాటాధీశుని ఆస్థానం.
రచన : ఒంటిమిట్ట రఘువీర శతకము.

ఈకవికి మునిమనుమడు అయ్యలరాజు రామభద్రకవి. క్రీ. శ. 1540 ప్రాంతంలో ఉన్నాడు.

ఇతన్ని పోషించిన కర్ణాటాధీశుడు రెండవ దేవరాయలు కావచ్చు. ఈతని కవిత్వశైలి అనర్గళమై మనోహరంగా ఉంటుంది. "రాయకవి" అనేది ఇతని బిరుదనామమో. గృహనామమో అయి ఉంటుందని పండితులు భావిస్తున్నారు. (క. త-10)

అయ్యలరాజు నారాయణకవి

నామాంతరం : అయ్యలరాజు నారాయణామాత్యుడు.

అయ్యలరాజు నారాయణామాత్యుడు

నామాంతరం : అయ్యలరాజు నారాయణ కవి.
కాలం : 17వ శతాబ్దం.
స్థలం : నెల్లూరు ప్రాంతం.
రచనలు : 1. నఖగర్త్మ పురాంజనేయ శతకము (అలభ్యం) 2. హంసవింశతి 3. దశావతార కథా సంగ్రహము.

అపారమైన శాస్త్ర వైదుష్యం, ప్రతిభ - భావ సౌకుమార్యం గల కవి. ఇతని వంశంలో అయిదుగురు కవులున్నారట వారు అయ్యలరాజు పర్వతరాజు, రామభద్రయ్య, భాస్కరుడు, కొండయ్య, తిమ్మయ్య అనే వారు.

కొండమాంబ సూరనామాత్యులీతని తలిదండ్రులు. (ఆరుద్ర 11-247)

అయ్యలరాజు భాస్కరకవి

చూ : అయ్యలరాజు అయ్యలయ్య.

అయ్యల భాస్కర కవులలో ఒకడు. అయ్యలరాజు నాగన్న కుమారుడు.

అయ్యలరాజు రామభద్రుడు

కాలం : క్రీ. శ 16 వ శతాబ్దం.

రచన : రామాభ్యుదయము.

స్వస్థలం : కడప జిల్లా "ఒంటిమెట్ట".

కృతిభర్త : గొబ్బూరి నరసరాజు. (అళియ రామ రాయల మేనల్లుడు).

కృష్ణరాయల ఆస్థానాన్ని అలంకరించిన అష్టదిగ్గజాలలో ఒకడు అని అంటారు. అక్కయామాత్యుని పుత్రుడు. ప్రౌఢంగా రసవంతంగా రచన చేశాడు. ఒంటిమిట్ట రఘువీర శతకకర్త అయ్యలరాజు త్రిపురాంతకుడు, ఈయనకు ముత్తాత. ఇతడు మిుపేద. ఎక్కువమంది పిల్లలుండటం వల్ల ఇతనికి, "పిల్లల రామభద్రుడ"నే పేరుంది. జీవనోపాధికోసం విజయనగరం పోయి శ్రీ కృష్ణదేవరాయలప్రాపు సంపాదించాడు. రామభద్రుని భక్తికి మెచ్చి శ్రీరాముడే "అష్టఘుణ గండభేరుండ"మై ఎనిమిది గంటాలు పుచ్చుకొని పై కావ్యం వ్రాశాడని ప్రతీతి. (వి. న. చ. మా. పే. రా.)

అయ్యలార్యుడు

కాలం : క్రీ. శ. 1384- 1399 ప్రాంతం.

రచన : భాస్కర రామాయణం, యుద్ధకాండ.

దేవరకొండ పద్మనాయక ప్రభువైన పెద వేదగిరి నాయకుని ఆస్థానంలోని వాడు.

విశిష్టత : భాస్కర రామాయణ కర్త హుళక్కి భాస్కరుడు వ్రాయకుండా విడిచిన యుద్ధకాండ శేషాన్ని ఇతడు పూర్తిచేశాడు. రచన సరళంగా ఉంది.

(రె. రా. చ.)

అరుణగిరి నాథుడు I

నామాంతరం : డిండిమ భట్టు - II (చూ).

అరుణగిరి నాథుడు II

నామాంతరం : డిండిమభట్టు - IV (చూ).

అరుణాచల కవి

కాలం : 18 వ శతాబ్దికి పూర్వం.

రచన : బిల్హణోపాఖ్యానము (ద్విపద).

నారనార్యునికి సుబ్బమాంబికకు కుమారుడు. ఈ కవి తాను ప్రాస విశ్రమ తత్త్వాలు తెలియని వాడననీ హరిసేవ వలన కవిత్వం చెప్ప నేర్చాననీ చెప్పుకొన్నాడు. కవిత్వం సరసంగా ఉంది. (ద్వి. సా. చ. 441)

అరుణాచల పురాణము

కర్త : పెదపాటి సోమయ్య.

అలభ్యం. ఇందులోని పద్యాలు కొన్ని సంకలన గ్రంథాలలో ఉదాహరింపబడ్డాయి.

అరేబియన్ నైట్స్ కథలు

కర్త : పురాణము కృష్ణశాస్త్రులు.

1840 లో ముద్రితం.

వ్యావహారిక భాషలో విరచితమైన కథలు. (వ. వా.)

అర్చకం అయ్యవమాచార్యులు

కాలం : క్రీ. శ. 1820 ప్రాంతం.

స్థలం : పెద్దమందడి గ్రామం - వనపర్తి సంస్థానం.

రచనలు : చెన్నకేశవ శతకము, చెన్నకేశవ విలాసము, రామేశ్వర విజయము.

వీరు వనపర్తి సంస్థానంలో పండితులుగా ఉండేవారు. (ఆం సం. సా.)

అర్చిరాది ప్రబంధము

కర్త : సింగరాచార్యులు.

ద్విపద కావ్యం.

అర్ధ కందములు

కర్త : వేంకటరామ విద్యానందుడు.

అర్ధకందాలతో కూర్చిన రచన.

కవి అర్ధ కందాలలో తన భావాలను ఇముడ్చి చెప్పి, వాటికి టీక తాత్పర్యాలు కూడా సమకూర్చాడు (తె. వి న.4)

అర్ధచంద్రికలు

నామాంతరం : అర్ధరేకులు

గేయఫణితులలో ఒక భేదం.

చిత్రకవి-పెద్దన, అప్పకవి త్రిపుట, జంపె మొదలైన రేకులలో సగం పరిమితి గలవి అర్ధచంద్రికలని సూచించారు. చంద్రిక అంటే రేకు అని, ఇక్కడ చంద్రరేఖ అనీ పండితులు అర్థం చెప్పారు.

ఉదాహరణ కావ్యాలలో రగడ భేదాలయిన కళికోత్కళికలు ఎటువంటివో, యక్షగానాలలో రేకులు, అర్ధచంద్రికలు అటివి. ఇవి చాలా యక్షగానాలలో ప్రయుక్తం. చక్రపురి రాఘవాచారి విప్రనారాయణచరిత్రలో, కందుకూరి రుద్రయ సుగ్రీవ విజయంలో, పాపరాజు విష్ణు మాయా విలాసంలో ఇవి ఉన్నాయి. (య. వా. చ-235-38)

అర్ధనారీశ్వర వేషము

ఈవేషాన్ని ధరించటంలో కూచిపూడి భాగవతులు ప్రసిద్ధులు. నటావతార చరిత్ర అనే గ్రంథాన్నిబట్టి పూర్వం ఈవేషాన్ని స్త్రీలే ధరించే వారని తెలుస్తుంది.

ఈ వేషానికి ఆహార్యం సగం శివుని వలెనూ రెండోసగం పార్వతి వలెనూ ఉంటుంది. నొసటి భాగం నుండి పై ఉత్తరీయాన్ని ఒకవైపు తిప్పి నాట్యంచేస్తే శివుడుగాను, రెండోవేపు తిప్పిచేస్తే పార్వతిగాను కన్పిస్తూ నృత్యం మనోహరంగా ఉంటుంది.

కూచిపూడి వారిలో పురుషులే ఈవేషం వేస్తారు. (నా. ర.చ-227)

అర్థ పద్యములు

ఒక రచనా విశేషం.

కందార్థాలు, సీసార్థాలు, గీతార్థాలు, వృత్తార్థాలు, ద్విపదార్థాలు అనే పేర కొన్ని రచనా విశేషాలు 18-19 శతాబ్దుల యక్షగానాలలో కనిపిస్తున్నాయి.

వీటిలో తొలి సగము పద్యంగాను, మలి సగం వరువుగాను కనిపిస్తుంది. వీటికి రాగతాళాలు పేర్కొనటం కూడా కద్దు. వీటిలో కొన్నిటికి కందాలంకారం, సీసాలంకారం అనే పేర్లు కూడా ఉన్నాయి. (య వా. చ-264)

అర్ధరేకులు

నామాంతరం : అర్ధచంద్రికలు (చూ).

అర్థాఖ్యుడు

సప్తవిధ కవులలో ఒకడు.

మిత శబ్దాలలో గొప్పగా అర్థాలను ఇమిడ్చి కృతిని రచించేవాడు.

(అప్పకవీయం-28)

అర్హత్ప్రతిష్ఠ (సంస్కృతం)

నామాంతరం : జినేంద్ర కళ్యాణాభ్యుదయమ్.

కర్త : అప్పయార్యుడు.

అలంకార కౌస్తుభము (సం)

కర్త : కిరీటి వేంకటాచార్యులు (చూ).

సంస్కృతంలో రచింపబడ్డ అలంకార గ్రంథం. (అం. సం. సా.)

అలంకార ముక్తావళి (సం)

కర్త : చెరుకూరు లక్ష్మీధరుడు. (తె. వి. స-4)

అలంకార రత్నాకరము (సం)

కర్త : యజ్ఞ నారాయణ దీక్షితుడు.

అంకితం : రఘునాథ నాయకునకు (1600-33).

అలంకార గ్రంథం. ప్రతి పద్యం రఘునాథాంకితం. సందర్భోచితంగా రఘునాథుని చేతలు వర్ణింపబడ్డాయి. (తం. అ. నా. 11)

అలంకార రాఘవమ్ (సం)

కర్త : యజ్ఞేశ్వరుడు.

ఇది అలంకారశాస్త్ర గ్రంథం. (తె. వి. స-4)

అలంకార సంగ్రహము (అలభ్యం)

నామాంతరం : 'సకలాలంకార సంగ్రహ రాధా సుధా పూరణము.

కర్త : (చూ) ఆసూరి మరింగంటి సింగరాచార్యులు.

అలంకార సారము (అలభ్యం)

కవి : గణపవరపు వేంకటకవి.

ఈ గ్రంథం కవి రచించిన సర్వలక్షణ శిరోమణిలోని భాగం కావచ్చునని, ప్రత్యేకంగా ప్రసిద్ధమై ఉంటుందని పండితాభిప్రాయం. (ఆంధ్ర 11-161)

అలంకార సుధానిధి (సం)

కర్త : సాయణాచార్యుడు.

సాహిత్య శాస్త్రం. దీనిలోని కొన్ని ఉదాహరణలను కవి తన సోదరుడు భోగనాథుని రచనల నుంచి తీసుకొన్నాడు. కొన్ని కవి స్వయంగా చెప్పాడు. దీనిలోని ఉదాహరణలు సాయణుని జీవిత విశేషాలను తెలియజేస్తాయి. (తె. వి. స.1-1190)

అలంకార సుధాసింధువు (సం)

కర్త : అనివిళ్ళ వేంకటశాస్త్రి.

సంస్కృతంలో అలంకార శాస్త్రగ్రంథం. (తె. వి. స-4)

అలంకార సూర్యోదయమ్ (సం)

కర్త : యజ్ఞేశ్వరుడు.

ఇది అలంకార శాస్త్రగ్రంథం. (తె. వి. స-4)

అలక పాటలు

ఇవి అప్పగింత పాటలవలె సందర్భ పురస్కృతమైనవేగాని ప్రత్యేకమైన ప్రక్రియ కలవి కావు. పెక్కు అలక పాటలు జానపదులలో ప్రసిద్ధం. ఇవి యక్ష గానాలలో ప్రయుక్తాలు. (య. వా. చ-310)

అలక రాజేశ్వరీదేవి

కాలం : క్రీ. శ 19 వ శతాబ్దం.

స్థలం : విజయనగర సంస్థానం

మార్కండేయ పురాణాన్ని అంకితం పొందింది.

ఈమె విజయనగరం సంస్థానాధీశ్వరుడైన విజయరామ గజపతి (క్రీ. శ. 1826-1879) సతీమణి. భేరూ సింహరాజుల కుమార్తె. మండ కామేశ్వర కవిని మార్కండేయ పురాణాంధ్రీకరణకు ప్రోత్సహించి, ఆ గ్రంథాన్ని అంకితంగా పుచ్చుకున్న విదుషీమణి. (అం. సం. సా. 429)

అలఘు కౌముది

కర్త : బహుజనపల్లి సీతారామాచార్యులు.

విద్యార్థులకు ఉపకరించే లక్షణ గ్రంథం.

అలమేలు మంగాపరిణయము

కవి : తూము పరశురామరెడ్డి.

ప్రబంధం.

అలమేలు మంగా వివాహము

కర్త : బేతపూడి కృష్ణకవి.

అంకితం : జగన్నాయకునకు.

పద్యకావ్యం.

అల్లమరాజు బాపయకవి

కాలం : 1735 ప్రాంతం.

రచన : గౌతమీ మాహాత్మ్యము.

కవి గోదావరీ మండలానికి చెందినవాడు కావచ్చును. (క. స. – 143)

అల్లమరాజు రంగధామకవి

నామాంతరం : రంగశాయి.

కాలం : 1800 ప్రాంతం.

రచన : నారాయణాచల మాహాత్మ్యము. కొన్ని చాటు పద్యాలు.

ఇతడు బాపయకవికి మనుమడు. సుబ్రహ్మణ్యకవికి తండ్రి. ఇతని తండ్రిపేరు ఎల్లన్న. విజయనగర సంస్థాన ప్రభువైన నారాయణ గజపతి రాజు ఆశ్రితుడు. అతనిపై ఎనిమిది అర్థాలు వచ్చే చాటు పద్యాలు వ్రాశాడట. (క. స– 175)

అల్లమరాజు రామకృష్ణకవి

కాలం : 18, 19 శతాబ్దాల నడిమి భాగం.

స్థలం : చేబ్రోలు-పిఠాపురం ప్రాంతం.

రచనలు : 1. వైనతేయ విజయము, 2 సత్యభామా విలాసము, 3. గౌతమీ మాహాత్మ్యము, 4. ద్రౌపదీ పరిణయము, 5. సుశోభా వివాహము, 6. హనుమదాఖ్యానము 7. కవిజన మనోరంజనము, 8. కవి చకోర చంద్రోదయము, 9. మదాలసా పరిణయము, 10. శంతను విలాసము, 11 అధ్యాత్మ రామాయణము, 12. అచ్చ తెలుగు భాగవతము, 13 రామకృష్ణీయము (ఆంధ్రశబ్ద చింతామణి వ్యాఖ్య).

విద్వత్కవి రంగధామార్యుని పుత్రుడు. 1835 ప్రాంతానికే ఎనిమిది గ్రంథాలు రచించాడట. (క. స.)

అల్లమరాజు వేంకటకవి

కాలం : క్రీ. శ. 19వ శతాబ్దం (ఉత్తరార్థం).

స్థలం : పిఠాపురం సంస్థానం.

రచన : కొన్ని కీర్తనలు, ఒక నీతి బోధశతకము (పేరులేదు).

పిఠాపురంసంస్థానాశ్రితుడు. రాజారావుగంగాధర రామ రాయ బహద్దరు కాలంలోని వాడు.

అతనిపై "గంగాధర రామరాయ ఘన జనగేయా" అనే మకుటంతో ఒక నీతి బోధ శతకం వ్రాశాడు. కొన్ని 'కీర్తనలు' కూడా వ్రాసినట్లు తెలుస్తుంది.

(ఆం. సం. సా. 253)

## అల్లసాని పెద్దన

కాలం : క్రీ. శ 15, 16 శతాబ్దాల నడిమికాలం.
స్థలం : బళ్ళారి మండలంలోని దోరాల (దోర్నాల).
గురువు : శఠగోపయతి.
రచన : స్వారోచిషమనుసంభవము.
అలభ్యరచనలు : 1 హరికథాసారము 2. రామస్తవరాజము 3. అద్వైత సిద్ధాంతము 4. చాటు పద్యాలు.
బిరుదు : ఆంధ్రకవితాపితామహుడు.

శ్రీకృష్ణదేవరాయల ఆస్థాన కవులలో అగ్రగణ్యుడు. చొక్కనామాత్యుని పుత్రుడు. అష్టదిగ్గజాల్లో మొదటివాడు. సంస్కృతాంధ్రాలలో కవిత్వం ఎట్లా ఉండాలో ఒక పెద్ద ఉత్పల మాలికను చెప్పి రాయలచేత గండపెండేరం తొడిగించుకున్నాడు. ఇతని మనుచరిత్ర ఆంధ్ర వాఙ్మయంలోని మొట్టమొదటి ప్రబంధంగా పండితులు పరిగణిస్తున్నారు. తరవాతి ప్రబంధాలన్నిటికీ ఇదే మార్గదర్శకమైంది. ఈ మను చరిత్ర కృతి అందుకొనే వేళ పెద్దనను రాయలు ఇతోధికంగా సత్కరించి ఆయన ఎక్కిన పల్లకీ దండె, స్వయంగా చేతితో ఎత్తి లేపాడట. మార్గమధ్యంలో ఎక్కడైనా పెద్దన ఎదురైతే పట్టపుటేనుగు మీది నుంచి దిగి అతన్ని తన చేయూత యిచ్చి ఎక్కించుకొనేవాడట.

పెద్దన కవిత నిరర్గళం. సంస్కృతాంధ్రపద సంయుక్తంగా ఉంటుంది. సందర్భోచిత లోకోక్తులుంటాయి. స్వాభావిక వర్ణనలు, పాత్రపోషణలో నేర్పు చూపాడు. ఏ పద్యం చదివినా రసవంతంగా ఉంటుంది.

ఆంధ్ర కవితా పితామహ బిరుదం పెద్దనకు పూర్వం [illegible] కవికి ఉంది. పెద్దన తరవాత [illegible] ఉన్నాయి. ఇతని హరి కథా సారంలోని పద్యాలను లాక్షణికులు ఉదాహరించారు. రాయల ఆస్థాన కవులలో ఇతడు అగ్రగణ్యుడు. అష్టదిగ్గజాలలో ప్రముఖుడు. రాయలనుంచి కోకట గ్రామాదులనేక అగ్రహారాలు పెద్దన పొందాడు. పెద్దన కేవలం కవియే కాక రాజకార్య విషయాలలో రాయలకు హితోపదేశం చేసేవాడు.

పెద్దన స్వస్థలాన్ని గురించి భిన్నాభిప్రాయాలున్నాయి. (క. చ. ?)

## అల్లాడ విజయసింహభూపతి విలాసము

కవయిత్రి : సౌందరి.

ఈ ప్రబంధం, రంగాజమ్మ రచించిన మన్నారుదాస విలాస ప్రబంధానికి అనుసరణం అని పండితులు అంటున్నారు. (మదరాసు ప్రాచ్యలిఖిత పుస్తకాగారం. 30. 786) గద్యలోనూ, గ్రంథంలోనూ, పేర్లలోనూ మార్పులు తప్ప మిగిలిన గ్రంథమంతా మన్నారుదాస విలాస ప్రబంధంవలెనే ఉన్నదట. రంగాజమ్మ మన్నారుదాసుడనబడే విజయరాఘవ నాయకునిపై చెప్పిన విశేషాలన్నీ, ఇందులో విజయసింహభూపతిపై చెప్పబడ్డాయి. (ద. దే. వా- 153)

**అల్లాడి రామచంద్రశాస్త్రి**

క్రీ. శ. : 19 వ శతాబ్దం.
రచన : సిద్ధాంత శిరోమణి ప్రకాశము.
సుబ్బాజీ పండితుని పుత్రుడు.

సకలశాస్త్ర పురాణవేత్త. కాశీ వెళ్ళి పండితులను వాదంలో జయించాడు. కాశీలోని రత్నేశ్వర పండితునకు, రామచంద్రశాస్త్రికి మధ్య జరిగిన భూభ్రమణ శాస్త్రవాదం సిద్ధాంత శిరోమణిలో ఉన్నదట (క. త-)

**అల్లూరి అప్పలరాజు**

కాలం : 1800 ప్రాంతం.
స్థలం : గోదావరీ మండలం.

సాహితీ పోషకుడు కొత్తలంక మృత్యుంజయ కవిని ఆదరించినట్లు తెలుస్తున్నది. "పరాత్మజా పరిణయ" ప్రబంధావతారికలో ఇతని పేరున్నది. (క. స.)

**అల్లో నేరేళ్ళు**

నామాంతరం : ముంతలు చెరిగే పాటలు.

గీతప్రబంధ విశేషం. ఒకరకమైన పెళ్ళి పాటలు. చాలా యక్షగానాలలో ప్రయుక్తం. సూర్యరాయాంధ్ర నిఘంటువులో వీటికి రాజనంబూ ఫలాలు, నమస్కారాలు, బాలక్రీడా విశేషాలు, ఒక పాట అని వివిధార్థాలున్నాయి. "అల్లో నేరేడల్లో" అనేమాట ఈ పాటకు పల్లవి వంటిది. ప్రతిచరణాంతంలో ఇది పునరావృతమవుతుంది

అనేక యక్షగానాలలో దీని చరణాలు అన్నీ జంపె రేకులే.

ఇవి ఒక రకమైన పెళ్ళిపాటలే గాక, వీటికి సంప్రదాయ సందర్భం కూడా ఉంది. కకుత్స్థ విజయ, పాంచాలీ పరిణయాది కావ్యాలలో ఇవి పెళ్ళిపాటలుగా ప్రసక్తం. కల్యాణకథాత్మకాలయిన యక్షగానాలలో ముత్తైదువుల సువ్విపాట తరవాత ఇవి ఉంటాయి. ముంతలు దంచటం సువ్విపాటకు, ముంతలు చెరగటం అల్లోనేరేళ్ళకు సందర్భాలు. జానకీ పరిణయంలో ఇవి ఉన్నాయి. (య. వా. చ- 311)

**అళియ రామరాజు**

కాలం : క్రీ. శ. 16 శతాబ్ది మధ్యభాగం.

ఈయన శ్రీకృష్ణదేవరాయలకు అల్లుడు. తిరుమలరాయలకు అన్న. నరస భూపాలీయ కృతి భర్త ఓబయ నరసరాజు రామరాజుకు మేనల్లుడు. ఈ రాజు వేద శాస్త్ర సకల భాషా కవిత్వాది విద్యాపాలకుడు. ఈయన ఆశు కవిత, శతలేఖినీ పద్యాది లోకోత్తర కవితా విశేషాలను చూపిన భట్టుమూర్తిని ఆస్థానంలోకి ఆహ్వానించి, సన్మానించి ఆ కవికి "రామరాజభూషణ" బిరుదు ప్రదానం చేశాడు (తె. వి. స- 4)

**అవచి తిప్పయ్యసెట్టి**

కాలం : క్రీ. శ. 14 శతాబ్ది ఉత్తరార్ధం.

సాహిత్య పోషకుడు : శ్రీనాథకవి విరచిత "హరవిలాస" కావ్యానికి కృతిపతి.

**విశిష్టత :** తిప్పయ కొండవీటి రెడ్డి ప్రభువుల సుగంధ భాండాగార అధ్యక్షుడు. అవచి దేవయశెట్టి కొడుకు. తిప్పయ మోటుపల్లి వస్తూ పోతూ ఉండేవాడు. అప్పుడే కవి శ్రీనాథునితో ఈతనికి స్నేహం ఏర్పడి అతని పద్యాలు, కావ్యాలు విని ఉండవచ్చు శ్రీనాథుని మోటుపల్లి ప్రాంతంనుంచి కొండవీడు చేర్చినవాడు ఈ తిప్పయ సెట్టే.
(ఆంధ్రప్ర- 4)

**అవతరణిక**

చూ : అవతారిక.

**అవతార దర్పణము (అలభ్యం)**

కవి : పిల్లలమర్రి పినవీరభద్రుడు. (చూ.).

రమణీయ వాగ్రీతితో రచించిన కావ్యమట. (ఆంధ్రప్ర- 6- 201)

**అవతారిక**

గ్రంథాలకు గాని శ్లోకాదులకు గాని పూర్వాపర ప్రకరణ సంబంధాన్ని తెలిపే లఘుపీఠిక.

మొత్తం మీద ఉపోద్ఘాతము, ప్రస్తావము, పీఠిక, భూమిక, తొలిపలుకు, మున్నుడి, అవతారిక, అవతరణిక, ఉపక్రమణిక అనే పదాలన్నీ కొంచెం తేడాతో పర్యాయ పదాలుగానే అర్థమిస్తాయని చెప్పవచ్చును. (కావ్యాలంకార సంగ్రహం)

**అవధానాలు**

అంతరాయాలు ఎన్ని ఉన్నప్పటికీ మనసును విషయాంతరాలనుంచి మరలించి, ముఖ్యవిషయాలను ధారణచేయటంపై కేంద్రీకరించటాన్ని స్థూలంగా అవధానమని చెప్ప వచ్చు. ఇవి మొదట వైదిక విద్యలో ఉండి తరవాత లౌకిక విద్యలోకి వచ్చాయట. భూత భావి వర్తమాన విషయాలను తెలుసుకోవటానికి, ఋషులు, పండితులు సర్వశాస్త్ర భావాలను అలవరచుకోవటానికి ఈ అవధాన మనేది ఒక దివ్యదృష్టి వంటిదని పండితుల అభి ప్రాయం.

అవధానాలలో ముఖ్యమైనవి:

1. అష్టావధానం 2. శతావధానం 3. సహస్రావధానం 4. ద్విసహస్రావధానం 5. పంచసహస్రావ ధానం 6. నాట్యావధానం 7. నేత్రావధానం 8. అంగుష్ఠావధానం 9. ఘంటావధానం.

అష్టావధానంలో 1. కావ్యపాఠము 2. కవిత్వము 3. శాస్త్రార్థము 4. ఆకాశపురాణము 5. లోకాభిరామాయణము 6. వ్యస్తాక్షరి 7. చదరంగము 8. పుష్పగణనము -అనే విషయాలు ఒక్కొక్కసారిగా ప్రవృత్తాలవుతాలు. సమస్యా పూరణం కవిత్వంలోకే వస్తుంది. కొందరు పై విషయాలను కొన్నింటిని తగ్గించి వాటి స్థానంలో దత్తపది, నిషిద్ధాక్షరి, యాంత్రిక చిత్రము (16 చదరపు గడులలో ఎటు కూడినా ఒకే అంకె వచ్చే చిత్రం), తురంగోద్గమనం, ఘంటా గణనం మొదలయిన వాటిని చేర్చుకొంటారు. సమర్థులయిన మరికొందరు అష్టావధానులు, శతావధానులు - మరి 10, 12 విషయాలను కూడా నిర్వహించి సభ్యులను ఆనంద పరుస్తారు.

శతావధానంలో నూరుమంది పృచ్ఛకులకు వారుకోరిన వర్ణ్యాలను గురించి కోరిన వృత్తాలలో సమాధానాలు చెప్పాలి. దీనిలో కవిత్వం ఒక్కటే విషయంగా ఉంటుంది. ఈ అవధానంలో మొదటిసారి ఒక పాదాన్ని చెప్పుకొంటూపోయి- రెండోసారి రెండోపాదాన్ని చెప్పి- నాలుగు వరసలలో పద్యాలను, సమస్యలను పూర్తిచేసి, ధారణతో శలాకా పరీక్షకు నిల్చి పృచ్ఛకుల ఇష్టానుసారంగా అన్ని పద్యాలను అప్పగించాలి.

అష్టావధానంలో పద్యాలతోపాటు తక్కిన విషయాలను కూడా పొరపాటు లేకుండా చెప్పాలి. అష్టావధానానికి కనీసం 4 గంటలు, శతావధానానికి కనీసం 16 గంటల సమయం పడుతుంది.

అష్టావధాన, శతావధానాల మీద వికాసాలయిన సహస్ర, ద్వి సహస్ర, పంచ సహస్ర, నాట్యావధానాలకు ఇంకా ఎక్కువ కాలం పడుతుంది.

నేత్రావధాన, అంగుష్ఠావధాన, ఘంటావధానాలు కూడా సాహితీ ప్రియులకు నూతన ఉత్తేజాన్ని, వినోదాన్ని కలిగిస్తాయి.

పూర్వాంధ్ర కవులలో రామరాజు భూషణుడు 'శతలేఖినీ పద్య సంధాన ధౌరేయుడు, దురూహ్యసాధిత వ్యస్తాక్షరీధురీణుడు.' అట్లే చిత్ర భారత కావ్యరచయిత చరికొండధర్మన కూడా 'శతలేఖ్యవధాన పద్యరచనా సంధా సురత్రాణ చిహ్నిత నాముడ'ట. స్త్రీలలో రామభద్రాంబ, మధురవాణి కూడా శతలేఖినీ విద్యను ప్రదర్శించేవారట.

ఆధునికులలో మాడభూషి వేంకటాచార్య ప్రభృతులు, అష్టావధాన విద్యచేత ఆంధ్ర దేశాన్ని ఆనందాబ్ధిలో ఓలలాడించిన వారు, కింకవీంద్ర ఘటాపంచాననులు అయిన తిరుపతి వేంకటకవులు - కొప్పరపు కవులు ప్రసిద్ధులు.

అవధానం సభారంజకం కావాలంటే అవధానికి ఉభయ భాషాపాండితి, శాస్త్ర ప్రవేశం, ప్రతిభ, అనర్గళమైన ఆశుకవితాధార, సమయస్ఫూర్తి, అసాధారణ ధారణా

శక్తి, అనివరతాభ్యాసము, గురుకరుణ, పరదేవతానుగ్రహం అవసరమని పండితాభిప్రాయం. (తె. వి. స-6)

**అవనిజా చరిత్ర**

కర్త : నల్లపాటి శేషాచలదాసు.

యక్షగానం.

సీత తన వనవాసాదికాన్ని గురించి శ్రీరామునితో చెప్పటం దీనిలోని ప్రధానేతి వృత్తం. దీనిలో ప్రసిద్ధ రాగతాళాలలోని దరువులు, పద్యగద్యాలు ఉన్నాయి. రచన బాగా ఉంది.

ఇది బందరు సరస్వతీ ముద్రాక్షరశాలలో ముద్రితమై, నంకా సుబ్రహ్మణ్యం అనే ఆయనచే ప్రచురితం. (య. వా. చ-141)

**అవసరాల పద్మరాజు**

కాలం : క్రీ. శ. 18 వ శతాబ్దం చివర- 19 వ శతాబ్దం ప్రారంభం.

స్థలం : పిఠాపురం సంస్థానం.

రచన : బాలభాగవత చంపువు.

విద్వత్కవి. పిఠాపురం సంస్థానాధిపతి అయినట్టి రావు వేంకట నీలాద్రి రాయని మంత్రి (ఆం. సం. సా-271)

**అవుడూరి కిచ్చయ్య**

కాలం : 18 వ శతాబ్దం.

రచనలు : 1. రఘువంశము 2. మాధవాభ్యుదయము

గురువు : చెన్న కృష్ణశాస్త్రి.

గురువయామాత్యుని పుత్రుడు. కాళిదాసు రఘువంశాన్ని అనువదించాడు. (క. చ-34)

**అశ్వనృత్యాలు**

ఈ నృత్యాలు పూర్వం నుంచి కృష్ణా, గుంటూరు మండలాలలో ఎక్కువ ప్రచారంలో ఉన్నాయి. దసరా, నవరాత్రి ఉత్సవ సమయాలలో ఈ నృత్యాలను ముఖ్యంగా నిమ్నజాతుల వారు ఎక్కువగా ప్రదర్శిస్తారు. గొంతాలమ్మను పందిట్లో ప్రతిష్ఠించి 9 రోజులు ఉత్సవం జరిపి, తరువాత గొంతాలమ్మను తృప్తిపరచి ఉత్సవంతో సాగనంపుతారు. ఈ ఉత్సవంలో డబ్బు, ధాన్యం, వస్త్రాలు సంపాదిస్తారు.

మెడవరకు గల ఒక గుర్రపుతలను పేడతో చేయించి, వివిధ రంగులతో అలంకరించి, ఇతర శరీర భాగాన్నంతా- తేలిక వెదురుబద్దలతో గుర్రపు ఆకారాన్ని తయారుచేసి- చుట్టూ ఒక రంగుచీరనుగట్టి- అట్లా తయారయిన గుర్రాన్ని నడుములకు తగిలించుకొని, వెనకకు ముందుకూ ఎగురుతూ అద్భుతంగా నృత్యం చేస్తారు. వీరి నృత్యానికి ఉత్తేజాన్ని కలిగించేది డప్పుల వాయిద్యం (తప్పెట). వాయిద్యాల వరుసలను అనుసరించి నృత్యగతి మారుస్తూ ఉధృతంగా నాట్యం చేస్తారు. ఈ నృత్యాలలో డప్పు

వాయిద్యాన్ని కొంచెంసేపు నిలిపి, అందరూ సమష్టిగా చేతులలో చిరుతలు పుచ్చుకొని జానపదగేయం పాడుతూ నృత్యం చేస్తారు. 'కంచెల చెరిగే చేడి కురులపై తుమ్మెదలాడిన ఓలాలా !' అనే సుప్రసిద్ధ జానపదగేయం ఈ సందర్భంలోనిదే.

మనుషులు అశ్వనృత్యం చేసే విషయమేగాక- అచ్చంగా గుర్రంచేత నృత్యం చేయించే విధానం గుంటూరు జిల్లాలో ఉంది. గుర్రాన్ని వివిధ సామగ్రితో శోభాయమానంగా అలంకరించి- నాలుగు కాళ్ళకు గజ్జెలు కట్టి, తప్పెట వాయిద్యపు దరువుకు తగినట్లు లయప్రకారం గుర్రంతో నృత్యం చేయిస్తారు. ఈ నృత్యం కన్నులపండువుగా ఉంటుంది. ప్రత్యేకంగా ఈ నృత్యం కోసం గుర్రాలను బాగా మేపి తయారుచేస్తారు. తిరునాళ్ళ సమయాలలో, వివాహ సమయాలలో ఈ నృత్యాలు విశేషంగా జరుగుతుంటాయి. 'నాయుడోళ్ళింటి కాడ- నల్ల తుమ్మచెట్టు కింద' అనే జానపదగేయం, ఒకరికి కాళ్ళు ఇచ్చాన్- ఒకరికి చేతులు ఇచ్చాన్' అనే గేయం ఈ అశ్వనృత్య సమయంలో అద్భుతంగా ఉపయోగిస్తారు. (నా. ర. చ-)

## అశ్వలక్షణ సారము

కర్త : తెలియదు

1929 లో ముద్రితం. ఇందులో "హయలక్షణ విలాసము" అనే గ్రంథం కూడా కలిసిపోయి అచ్చుపడింది. ముద్రిత ప్రతిలో 62 వ పద్యం నుంచి ఉన్న గ్రంథాన్ని మనుమంచి భట్టు రచించిన 'హయలక్షణ విలాసం' గా పండితులు గుర్తించారు. (క. త- 5- 287)

## అశ్వశాస్త్రమ్ (సం.)

కర్త : శిష్టు కృష్ణమూర్తిశాస్త్రి.

అశ్వ లక్షణాలను వివరించే శాస్త్ర గ్రంథం. దీన్ని ఒకే ఒక్క రాత్రిలో రచించినట్లు ఒక కథ చెబుతారు.

ఒకప్పుడు మాడుగుల జమీందారు ఒక గుర్రాన్ని కొనబోయారు. దాని లక్షణాలు శాస్త్ర సమ్మతంగా లేవని అక్కడి వారన్నారు. అప్పుడు జమీందారుగారు శిష్టు కృష్ణమూర్తి గారితో ఆ లక్షణాలు శాస్త్రసమ్మతాలని చూపగలిగితే మంచిబహుమతి నిస్తామన్నారట. ఆ రాత్రికిరాత్రే వారీ అశ్వశాస్త్రాన్ని రచించారట జమీందారు గారీయనను బహుధా సత్కరించారట. ఈ రచన సంస్కృతంలో ఉంది. (ఆం. సం. సా. )

## అశ్వారాయ చరిత్ర

నామాంతరం : శ్రీరామ పట్టాభిషేకము.
కవి : శ్రీనాథుని వెంకటరామయ్య.
కాలం : క్రీ. శ. 1700 ప్రాంతం.
స్థలం : అశ్వారావుపేట.
సంస్థానం : పాల్వంచ.

చరిత్రాంశాలతో కూడిన కావ్యం. ఈ గ్రంథంలో పాల్వంచ సంస్థానాధీశులకు జాఫయుద్దౌలాకు ధంసాలో జరిగిన యుద్ధం అభివర్ణిత మైనదట. నేడిది అలభ్యం.

(అం. సం. సా)

**అష్టకము**

దేశి రచనా విశేషం.

ఇది కొన్ని యక్షగానాలలో నాయిక విరహవేదనాది సందర్భాలలో ప్రయుక్తం. దీనిలో నాలుగు పాదాలు, నాలుగు రెళ్ళెనిమిది చరణాలుంటాయి. చరణాలనుబట్టి దీనికీపేరు వచ్చింది ప్రతి పాదం ఒక త్రిపుటరేకు. ఇది సరిగా మత్త కోకిల మాత్రా సంఖ్యలో సరిపోతుంది. వృషభ గతి ఉంటుంది. నాలుగు పాదాలలోను అన్త్యప్రాస, అంత్యప్రాస కనిపిస్తుంది. ప్రతిపాదంలో నాలుగు మాత్రలపై - అంటే ద్వితీయ చరణ ప్రథమాక్షరం యతిస్థానం

విష్ణుమాయా విలాసం, ప్రసన్న వేంకటేశ్వర విలాసాదులలో ఇది కనిపిస్తుంది.

(య వా. చ-312)

**అష్టదిక్పాలక విలాసము**

రచన : కంఠీరవ రాజు (చూ.)

యక్షగానం. పావకి, నైవస్వత, నైరుతి, వారుణి, వాయవి, కౌబేరి నాటకాలు ఇందులోవే. ఇవి విడిగా కూడ ప్రసిద్ధి చెందాయి. ఈ ఎనిమిదీ ఇందులోని అవాంతర విభాగాలు అష్టదిక్పాలక సమేతుడైన ఇంద్రుడు నాటకశాలకు విచ్చేసి దానికి రావడం, ఆయా దిక్పాలక ప్రతినిధులైన నాట్యగత్తెలు పంతం పట్టి నాట్యం చేయడం, వారి విద్యల తారతమ్యాలను నిర్ణయింప గలవాడు కంఠీరవ రాజు ఒక్కడేనని అతని సభకు వచ్చి నాట్యం చేయడం వర్ణితాలు

(య. వే. వా. 151)

**అష్టదిగ్గజములు**

కాలం : 16 వ శతాబ్దం.

స్థలం : శ్రీకృష్ణదేవరాయల ఆస్థానం

రాయల ఆస్థానంలో అష్టదిగ్గజాలవలె ఎనిమిదిమంది కవులుండేవారని ఒక ప్రతీతి ఉంది. ఈ అష్టదిగ్గజాలకు కడప జిల్లాలో తిప్పలూరు గ్రామాన్ని రాయలు అగ్రహారంగా ఇచ్చినట్లు శాసనముంది. దాన పరిగ్రహీతలయిన ఎనిమిదిమంది కవులపేర్లు తెలియదు. వీరి వివరాలతో రాయలు వేయించిన శాసనమేదీ దొరకలేదు.

రాయల ఆస్థానంలో ఎనిమిదిమంది తెలుగు కవులున్నారన్న మాట పరంపరగా వస్తున్నదని చరిత్రకారులు కొందరభిప్రాయపడ్డారు. అల్లసాని పెద్దన, నంది తిమ్మన, ధూర్జటి, మాదయ్యగారి మల్లన, అయ్యలరాజు రామభద్రుడు, పింగళిసూరన, రామరాజభూషణుడు, తెనాలి రామకృష్ణుడు అనే ఎనిమిదిమంది కవులు అష్టదిగ్గజాలనే వాడుక ఉంది. ఇందులో మొదట పేర్కొన్న అయిదుగురు శ్రీకృష్ణదేవరాయల ఆస్థానంలోవి

వారు అయినట్లు నిదర్శనలున్నాయి. కాని మిగిలిన ముగ్గురు అష్టదిగ్గజాలలోనివారు కాక పోవచ్చు. పైన చెప్పిన ఐదుగురు కాక తక్కినవారు రాయల ఆస్థానంలో సంస్కృత, కర్ణాటక కవులై ఉండవచ్చు. శ్రీకృష్ణదేవరాయలకు ఆంధ్ర భాషాభిమాన మెక్కువ. కాబట్టి, "దేశ భాషలందు తెలుగు లెస్స" అని అన్నప్పటికీ, అష్టదిగ్గజాలు అని ప్రతీతి పొందిన కవులందరూ తెలుగువారే కానక్కరలేదు.

ఇతరభాషా కవులు కూడా రాయల ఆస్థానంలో చేరి, అష్టదిగ్గజ నామంతో ప్రసిద్ధులై సాహిత్య గోష్ఠులలో పాల్గొని ఉండవచ్చు. రాయల మంత్రియైన తిమ్మరుసునకు అల్లుడు నాదెండ్ల అప్పయామాత్యునికి కృతి అంకితమిచ్చిన మాదయగారి మల్లన రాయల ఆస్థానంలో ఉండే- రాయల అల్లుడు రామరాజు సభలో, కాలంలోవున్న రామరాజభూషణ పింగళి సూరన్నలు రాయల ఆస్థానంలో ఉండటానికి వీలుండవని కొందరు పండితులు చెప్పారు. ఇక తెనాలి రామకృష్ణుని కాల నిర్ణయానికి ఆధారం దొరకలేదని, "ఆంధ్ర కవుల చరిత్ర" లో తెనాలి కవి వెంకటపతి రాయల కాలంలో ఉన్నాడని పండితులు నిరూపించారు. సంకుసాల నృసింహకవి, కందుకూరి రుద్రకవులు కూడ అష్టదిగ్గజాల్లో ఉన్నారనే ప్రతీతి కూడా లేకపోలేదు. ఏది ఏమైనా పైన పేర్కొన్న తెలుగు కవులే అష్టదిగ్గజాలని ప్రతీతి పొందారు.

పద్యకవిత్వం మొదట ఆంధ్రీకరణమై, తరవాత విపులీకరణమై, ఆ తరవాత అనుకరణమై, చివరకు స్వకపోల కల్పితమై, క్రమంగా అభివృద్ధికి వచ్చినట్లు ఆయా కవుల కావ్యాలే చాటుతున్నాయి రాయల కాలంలో అష్టదిగ్గజాల ప్రాపులో విపులీకరణ, అనుకరణ, స్వకపోల యుక్తాలయిన గ్రంథాలు ఎన్నో వచ్చాయి. ప్రబంధ సుందరి అష్టదిగ్గజాల కాలంలో సర్వాలంకృత సుందరి అయింది. (క.త-7 వి.న చ-నూ.పే-రా).

## అష్టదిగ్గజాల సీసాలు (అలభ్యం)

కవి : నెల్లూరి వీరరాఘవ కవి (చూ).

## అష్టపది

మధుర కవితా శాఖకు చెందిన రచనా విశేషం.

అష్టపది అంటే ఎనిమిది పదాలు గలదని అర్థం. అష్టకము, ఇది కూడా సమానార్థకాలే కాని లక్షణ గ్రంథాలలో వీటి లక్షణాలు వేరువేరుగా ఉన్నాయి. జయదేవుని గీత గోవిందంతో దీనికి ప్రతిష్ఠ వచ్చింది. సంకీర్తన లక్షణంలో దీనికి తాళ్ళపాక చిన్నన్న లక్షణం కూడా చెప్పాడు.

యక్షగానాలలో అక్కడక్కడ ప్రయుక్తం. ఇది చూర్ణిక వలె తరచు సంస్కృత పద ఘటితంగానే ఉంటుంది అష్టపదిలో మధురగతికి ప్రాముఖ్యముంటుంది. ఇది మొదట ఏ గతితో నడుస్తుందో సాంతం అదే గతితో నడపటం దీని నియమం.

(య వా. చ-314)

## 'అష్టపది'

కర్త : రాజా పెదసోమ భూపాలుడు.

ఇది చిన సోమ భూపాలుని కృతమని పరిష్కర్తల భావన.

జయదేవుని గీత గోవిందంలోని 'ప్రియేచారుశీలే' అనే ప్రశస్త గీతానికి సంస్కృతాంధ్ర భాషలలో ఛందో బద్ధంగా సంభాషితమైన వ్యాఖ్యారూప నిష్పత్తి ఈ "అష్టపది". అష్టపదిలోని ఒక్కొక్క చరణము ఇందులో శ్లోకము, పద్యము, వచనము, చూర్ణిక — అనే నాల్గు రీతులలో వ్రాయబడింది. సోమభూపాలుని మధుర సాహితీ నిర్మాణ నైపుణ్యం, నాట్యకళాకౌశలం, రాగతాళాభినయ జ్ఞానం మూర్తి కట్టిన రసిక జన మనోభిరామమైన రచన. (ఆం. సం. సా.)

**అష్టప్రాస రామశతకము**

కర్త : వైయాకరణ గజకంఠీరవ యుణయవల్లి కృష్ణమాచార్యులు (చూ).

సంస్కృత శతకం (ఆం. సం.సా)

**అష్టభాషలు**

సంస్కృతము; ప్రాకృతము; శౌరసేని; మాగధి; పైశాచి; చూళిక; అపభ్రంశము; ఆంధ్రము – ఈ ఎనిమిదింటినీ అష్టభాషలుగా అప్పకవి చెప్పాడు. (అప్పకవీయము 1-77)

**అష్టభాషాదండకము**

కవి : తాళ్ళపాక చినతిరుమలాచార్యుడు.

ప్రత్యేకత : శ్రీ వేంకటేశ్వరుని స్తుతిస్తూ ఎనిమిది భాషలలో చెప్పిన దండకం.

ఇతడు చాతురాష్టభాషా చక్రవర్తి, అని చిన్నన్న తన అష్టమహిషీ కల్యాణంలో పేర్కొన్నాడు సంస్కృత, ప్రాకృత. శౌరసేనీ, మాగధీ, పైశాచీ, ప్రాచ్యతింతి, సార్వదేశీ భాషలలో ఈ దండకం వ్రాశాడట. (తె. వి. స-4)

**అష్టమహిషీ కల్యాణము**

కర్త : తాళ్ళపాక చిన్నన్న.

అంకితం : అలమేలు మంగకు

అయిదాశ్వాసాల ద్విపద కావ్యం.

ప్రత్యేకత : పెద తిరుమలయ్య రచించిన గ్రంథాలను చిన్నన్న ఈ గ్రంథములో పేర్కొన్నాడు. చిన తిరుమలయ్యను 'చాతురాష్ట భాషా చక్రవర్తి'గా చిన్నన్న చెప్పినది ఇందులోనే. శ్రీ కృష్ణుని బాల్యక్రీడలు. అతడు ఎనిమిదుగురు దేవేరులను వివాహమాడటం ఇందులోని ఇతి వృత్తం. (తె. వి. స-1)

**అష్టమహిషీ కల్యాణము**

కర్త : రెడ్డిపల్లె పెద్దమరాజు

అలభ్యం. దీనినుంచి 2 పద్యాలను అజ్ఞాత గ్రంథ సంధాత తన 'ఉదాహరణ పద్యములు'లో ఉదాహరించాడు. ఒక పద్యంలో మంగళాచరణం, రెండోదానిలో వాల్మీకి ప్రశంస ఉంది. (అముద్ర-8)

## అష్టాంగరుధి రార్చనము

క్రీ. శ. 12-15 శ. మధ్యకాలంలో ప్రచారంలోఉన్న శైవభక్తులకు సంబంధించిన మతాచారం. అష్టదిక్కులలో ఉన్న అష్టభైరవులకు భక్తులు తమ అష్టాంగాలనుంచి రక్తాన్ని చిందింపజేసి ఆరక్తంతో అభిషేకం చేసేవారు. ఆ కాలపు ప్రజలు కొందరు ఖండిత శిరస్సులను అష్టాంగాల రక్తంలో నానబెట్టి అష్టభైరవ మూర్తులకు సమర్పించే వారు. అష్టాంగాల నెత్తురుతో పూజ చేసేవారు. రుద్ర, భైరవ, వీరభద్రులనే గాక-శక్తి, చండి ,దుర్గ, మహాకాళి-భేతాళులను కూడా పూజించేవారు. ఆ కాలంలో అన్ని వర్ణాల భక్తులు ఈరకపు రక్తపు పూజ చేసేవారని తెలుస్తున్నది. (తెలుగు-జ-మా-75)

## అష్టాదశ పురాణములు

మత్స్య, మార్కండేయ, భాగవత, భవిష్యత్, బ్రహ్మాండ, బ్రాహ్మ, బ్రహ్మ వైవర్త, వామన, వాయవ్య, వైష్ణవ. వరాహ, అగ్ని నారద, పద్మ, లింగ, గరుడ, కూర్మ, స్కాంద పురాణాలు.

## అష్టాదశ వర్ణనలు

కావ్య ప్రయోజనాన్ని, లక్షణాలను, భేదాలను చెప్తూ లక్షణకారులు మహాకావ్యానికి కొన్నికొన్ని లక్షణాలు ఉండాలని చెప్పారు. కావ్యంలో ఉండాలని వారు చెప్పిన అష్టాదశ వర్ణనలు ఇవి:-

నగరము, సముద్రము, ఋతువు, చంద్రోదయము, అర్కోదయము, ఉద్యానము, సలిలక్రీడ, మధుపానము, రతోత్సవము, విప్రలంభము, వివాహము, పుత్రోత్పత్తి, మంత్రము, ద్యూతము, ప్రయాణము, నాయకాభ్యుదయము, శైలము, యుద్ధము. ప్రబంధయుగంలో వెలువడిన కావ్యాలన్నిటా ఈవర్ణనలు విధిగా ఉండేవి. ఈవర్ణనలు కొంచెం పాతవైన తర్వాత క్రొత్తదనం చూపడానికి వీటిలోనే కొన్ని మార్పులు చేస్తూ వచ్చారు. అప్పరవి ఇరువదిరెండు వర్ణనలు ఉండాలని చెప్పారు. ఏయే వర్ణనలు ఎలా ఉండాలో కూడా లాక్షణికులు సూచించారు. వీటిలో కొన్ని తగ్గినా కావ్య పరిపూర్ణతకు భంగం వాటిల్లదు. (కావ్యాలంకార సంగ్రహము)

## అష్టాధ్యాయి టీక (సం)

కర్త : చూ. అన్నంభట్టు.

ఇది సంస్కృతంలో రచింపబడ్డ వ్యాకరణానికి టీక. (తె. వి. స-4)

## అష్టావక్ర దీపికా వ్యాఖ్యానమ్ (సం)

కర్త : విశ్వేశ్వరుడు.

(తె. వి. స-4)

## అష్టావధానము

చూ. అవధానాలు.

**ఆంగ్ల రూపకాలు**

భారతీయుల దశరూపకాల వలనే ఆంగ్లంలోను దృశ్యకావ్య భేదాలు పది ఉన్నాయి. 1. విషాదరూపకము (Tragedy) 2. ఆహ్లాదరూపకము (Comedy) 3. ప్రహసనము (Farce) 4 దివ్యలీలా రూపకము (Miracle play) 5. అద్భుత రూపకము (Mystery play) 6. మూకాభినయ రూపకము (Pantomime) 7. బుట్టబొమ్మలు (Masks) 8 గేయ రూపకము (Melo-drama) 9. నృత్య రూపకము (Bal'et) 10 సంగీత రూపకము (Opera)

ఇవికాక ఆంగ్లంలో బర్లెస్క్, మైమ్, మోనొలాగ్, ఇంటర్లూడ్ మొ॥ ఉన్నాయి. ఆధునిక కాలంలో పాశ్చాత్యదేశాలలో ఏకాంకికలు (one act-plays) బహుళ ప్రచారంలోకి వచ్చాయి. (తె. వి.స.-6)

**ఆంగ్ల శ్రవ్య కావ్యాలు**

ఆంగ్ల భాషలో పద్యకావ్యాలను ఆత్మాశ్రయ కావ్యాలు, పరాశ్రయ కావ్యాలని రెండురకాలుగా విభజించారు. పరాశ్రయ కావ్యాలివి:

1. పురాణం (Epic) 2. లఘుకావ్యము 3. వీర కావ్యము (Ballad) 4. గ్రామీణ కావ్యము (Pastoral) 5. వర్ణనాత్మక కావ్యము (Descriptive) 6. కథాకావ్యము (Narrative) 7. హితోపదేశ కావ్యము (Didactic) 8. దృశ్యకావ్యము.

ఆత్మాశ్రయ కావ్యాలు;

1. గేయ కావ్యము (Lyric) 2. తత్త్వకావ్యము లేక మర్మకావ్యము (Philosophical or mystic) 3 మృతి విషయిక కావ్యము (Elegy) 4. ఆక్షేప కావ్యము (Satire) 5. ఉదాత్తగేయ కావ్యము (Ode) 6. లేఖా కావ్యము (Epistle) 7. ఐంఛి కావము (Sonnet) (తె వి. స.-6)

**ఆంగ్లాధి రాజ్య స్వాగతము**

కర్త : పరవస్తు వేంకట రంగాచార్యులు.

**ఆంజనేయ శతకము**

కర్త : అయ్యలరాజు నారాయణ కవి.

కందపద్యాలతో ఉన్న శతకం.

**ఆండాళ్**

గోదాదేవి. చూ .

**ఆంధ్ర**

ఈ సంస్థానం శ్రీకాకుళం మండలం గజపతి నగరం డివిజనులో ఉండేది. చిన్న పల్లెటూరే అయినా కొండ జమీందారీలలో ఇది చాలా ప్రాచీనమైనది; ప్రముఖమైనది కూడా.

క్రీ. శ. 18 వ శతాబ్దానికి చెందిన 'గారయదొర' ఈ సంస్థాన పాలకులకు మూల పురుషుడు.

ఈ సంస్థానం మన్నెపు ప్రాంతంలో ఉండడం చేత ప్రత్యేక ఉత్సవాల సందర్భంలో తప్ప పండితులెవ్వరూ ఇక్కడ ఉండేవారు కారట.

ఈ సంస్థానాధిపతులు శాస్త్ర విద్యల్ని ఎక్కువగా పోషించారు. ఆంధ్ర రామన్న దొర కుమారుడైన గారయ దొర పండిత పోషకుడు. నిష్ఠలకామయ్య శాస్త్రి, పంతుల సుబ్రహ్మణ్యశాస్త్రి, తాతా కామావధాన్లు, తాతా భైరవన్న వీరి ఆస్థాన పండితులలో ముఖ్యులు.

గారయదొర కుమారుడు రామందొర తటాకారామాది ప్రతిష్ఠలు సల్పినవాడు. నిష్ఠల కామయ్యశాస్త్రి, పంతుల బ్రహ్మయ్యశాస్త్రి, తాతా పెద కామయ్య, తాతా విశ్వనాథ శాస్త్రి, తాతా శ్రీరామశాస్త్రి వీరి ఆస్థాన పండితులు.

రామందొర దత్తపుత్రుడైన గారయదొర నిష్ఠల సుబ్రహ్మణ్యశాస్త్రి, పంతుల సోమయ్యనాథశాస్త్రి, ఓరుగంటి భైరవశాస్త్రి, కాశీ అప్పన్నశాస్త్రి, తర్కశాస్త్రనిధి అగు గంటి సూర్యనారాయణశాస్త్రి, జ్యోతిశ్శాస్త్ర వేత్త తాతా అక్కాజీ రామయ్య మొ॥ వారిని పోషించాడు. గంటి సీతారామావధాన్లు మొ॥ వేద పండితులు కూడా వీరి ఆస్థానంలో ఉండేవారు.

దువ్వూరి రామావధాన్లు, దువ్వూరి సత్యనారాయణావధాన్లు, జ్యోతిశ్శాస్త్ర వేత్త నిష్ఠల సింహాచల సిద్ధాంతి మొ॥ వేద పండితులకు ఈ ఆస్థానాల్లో వార్షికాలుండేవి. ఈ సింహాచల సిద్ధాంతిగారే భద్రాచల మాహాత్మ్యం, లక్షణాపరిణయం, త్రిపురవిజయం అనే గ్రంథాలు రచించారు.

వీరి వంశంలోని వారే అయిన రామప్రతాపరావు బహద్దరు వేద పండితులైన దువ్వూరి రామావధాన్లు, దువ్వూరి సత్యనారాయణావధాన్లు, తాతా జానకి రామయ్య, తాతా జగన్నాథస్వామి, తాతా వరహాలు మొ॥ పండితులను పోషించారు.

(ఆం సం. సా.)

## ఆంధ్ర కర్ణామృతము

నామాంతరం : శ్రీకృష్ణ కర్ణామృతము.

కర్త : వెలగపూడి వెంగనామాత్యుడు (వెంగయామాత్యుడు).

మూడాశ్వాసాల పద్యకృతి.

బిల్వ మంగళుని సంస్కృత గ్రంథానికి తెలుగుసేత. సులక్షణసారంలో ఇందులోని పద్యం ఒకటి ఉదహరింపబడింది. (దీనిని వచనంగా మహామల్వారి వేంకట కృష్ణుడు రాశాడు.) (వ. దే. వా 389)

## ఆంధ్రకవి రామయ్య

కాలం : 15 వ శతాబ్దం.

రచన : విష్ణుకాంచీ మాహాత్మ్యము (అలభ్యం).

ఈ కవిని నాచన సోముడు నుతించాడు. 16 వ శతాబ్ది వాడైన ఉదాహరణ గ్రంథ సంధాత ఇతన్ని ఉదహరించాడు. ఇతని గ్రంథంలోని పన్నెండు పద్యాలు లభించాయి. రచన మనోహరంగా ఉంటుంది. (ఠ. వ-196)

## ఆంధ్రకామందకము

కర్త : జక్కరాజు వేంకట కవి.

రచనా కాలం : క్రీ. శ. 1548.

కృతి భర్త : కొండ్రాజు వేంకటాద్రి.

ఎనిమిది ఆశ్వాసాల పద్యకావ్యం.

ప్రత్యేకత : ఈ గ్రంథానికి సంస్కృతంలో 36 ప్రకరణాలున్నాయి. కామందకుడు సంస్కృతంలో వ్రాసిన నీతి సారం మూలం. మొదటి కామందకాన్ని తెలుగులో క్రీ. శ. 1355 ప్రాంతంలో ఒక ప్రాచీన కవి వ్రాశాడట. మొదటి తెనిగింపునుండి కొన్ని పద్యాలను మడికి సింగన్న తన సకల నీతి సమ్మతంలో ఉదాహరించాడు. ఈ గ్రంథం రెండో తెనిగింపు. సామాన్య ప్రజలకు కూడా రాజనీతి సుబోధకంగా ఉండేటట్లు కవి వ్రాశాడు. సంస్కృత నీతి సారానికి "ఉపాధ్యాయ నిరపేక్ష", "నయ ప్రకాశం" అనే రెండు వ్యాఖ్యానాలున్నాయి. సంస్కృత నీతిసారాన్ని మల్లినాథ సూరి కూడా స్మరించాడు. ఇందులోని ఒక పద్యం వల్ల రచనా కాలం తెలుస్తున్నది. ప్రశస్తమూ, సరళమూ అయిన రచన. (ఆము. న-9)

## ఆంధ్ర కాళిదాసు

కాలం : తెలియదు.

స్థలం : కృష్ణామండలం.

రచనలు : శంకర విజయము (అనువాదం).

సంస్కృతాంధ్రాలలో విద్వాంసుడైన ఈ కవికి కాళిదాసు అనేది బిరుదు నామమో నిజనామమో తెలియరావడం లేదు. కావలి వేంకట రామస్వామి గారు ఇతన్ని పేర్కొన్నారు.

ఆలూరి కుప్పన కవికి ఆంధ్ర కాళిదాసు అనే బిరుదున్నది. ఇతను శంకర విజయాన్ని ఆచార్యవిజయమనే పేర అనువదించాడు. వీరిరువురూ భిన్నవ్యక్తులా కాదా అన్నది నిర్ధారింపబడలేదు. (ఠ. వ. 18)

## ఆంధ్ర కౌముది

కాలం : క్రీ. శ. 17 వ శతాబ్ది.

కర్త : గణపవరపు వేంకటకవి.

ఇది ప్రత్యేక గ్రంథం కాదు. 'సర్వలక్షణ శిరోమణిలోని' మూడో ఉల్లాసం. ఇందులో వ్యాకరణ సంబంధమైన ముప్పది ఐదు విషయాలు వేయిపాదాల సీసమాలికలో చెప్పబడినాయి. (ఏ. త- 12)

### ఆంధ్ర కౌముది (సం)

కాలం : క్రీ. శ. 17 వ శతాబ్దం.
కర్త : మండ నరసింహకవి.

ఇది సంస్కృతంలో రచించబడ్డ తెలుగు వ్యాకరణం. సూత్ర వివరణలు సంస్కృతంలో ఉన్నా ఉదాహరణలు తెలుగులోనే ఉన్నాయి. అక్కడక్కడ రూప నిష్పాదన ప్రక్రియ కూడా చూపబడింది.

ఇందులో పరిభాష, సంధి, అజంతం, హలంతం, కారకం, క్రియ అనే పరిచ్ఛేదాలున్నాయి. (తె. వి. స- 4)

### ఆంధ్ర చంద్రాలోకము

కాలం : క్రీ. శ. 18వ శతాబ్దం.
కర్త : అడిదం సూరకవి.
అంకితం : దేవ దేవునికి.

ఇది అలంకారశాస్త్ర గ్రంథం. "చంద్రాలోకం' అనే సంస్కృత గ్రంథానికి తెలుగు అనువాదం.

సంస్కృతంలో జయదేవ కవిగా పేరుపొందిన పీయూషవర్షుడు చంద్రాలోకాన్ని వ్రాశాడు అప్పయ దీక్షితులవారు "కువలయానందం" అనే అలంకార గ్రంథాన్ని వ్రాశారు అందులోని కారికలే జయదేవుని చంద్రాలోకంగా ప్రచారం పొందాయి. అప్పయ దీక్షితులవారి గ్రంథాన్నే సూరకవి అనుసరించాడు. కాని అది కాళిదాసు రచించిన గ్రంథమని చెప్పాడు. దీన్ని క్రీ శ. 1900 లోనే మూల శ్లోకాలతో పాటుగా వావిళ్ళ వారు ముద్రించారు ఇందులో 40 శ్లోకాలకు సూరకవి అనువాదం లేకపోతే పరవస్తు వేంకట రంగా చార్యులవారిచే రచింపజేసి ప్రకటించారట.

(కవిసంశయ విచ్ఛేదం-పీఠిక)

### ఆంధ్ర ద్విరూప కోశము

కర్త : గణపవరపు వేంకటకవి.
చూ. ద్విరూపకోశము.

### ఆంధ్ర ధాతుమాల

కర్త : పరవస్తు చిన్నయసూరి.
వ్యాకరణ గ్రంథం.

### ఆంధ్రనామ శేషము

కర్త : అడిదం సూరకవి
అంకితం: దేవ దేవునికి

నిఘంటువు. పైడిపాటి లక్ష్మణమంత్రి ఆంధ్రనామ సంగ్రహమనే నిఘంటువు వ్రాశాడు. అయితే అందులో కొన్నిమాటలు చెప్పలేదు. దానికిది

పూరకగ్రంథం. ఇది 1840 లోనే ముద్రించబడింది. వివిధ మకుటాలతో [illegible] పద్యాలున్నాయి. (ఆముద్ర-12)

## ఆంధ్ర నామ సంగ్రహము

కర్త : పైడిపాటి లక్ష్మణకవి.

నిఘంటుగ్రంథం. అయిదు వర్గాలలో దేవతలు, మానవులు, స్థావరాలు, తిర్యక్కులను తెలిపే అచ్చ తెలుగు పదాలూ, నానార్థకాలైన అచ్చ తెలుగు పదాలూ, ఇందులో ఉన్నాయి. ఇందులో లేని పదాలను ఆంధ్ర నామశేషమనే పేర అడిదం సూరకవి రచించాడు. ఆంధ్ర భాషాభిజ్ఞులకు మిక్కిలి ఉపయోగించే గ్రంథం.

## ఆంధ్ర నాయక శతకము

కర్త : (చూ.) కాసుల పురుషోత్తమ కవి.

వ్యాజస్తుతి శతకాలలో మిక్కిలి ప్రసిద్ధమైనది. ఇది శ్రీకాకుళ క్షేత్రంలోని ఆంధ్రవిష్ణువు దేవుని గురించి వ్రాయబడిన శతకం. ఈ శతకం రచనను గూర్చి ఒక ఐతిహ్యం ఉంది.

శ్రీకాకుళాంధ్ర నాయకస్వామికి పూజలు లోపించినందుకు స్వామి భూగర్భములో మునిగి అంతర్హితుడైనాడట. అప్పటి చల్లపల్లి సంస్థానాధిపతి, గొప్పనైన అంకినీడు బహద్దరు, పురుషోత్తమకవి గొప్ప ఉపాసనా శక్తి కలవాడని విని, స్వామిని తిరిగి వెలకొనేట్లుగా చేయమని ప్రార్థించాడట. కవి స్వామిని 108 పద్యాలలో స్తుతించాడు. ఒక్కొక్క పద్యానికి ఒక్కొక్క అంగుళం పైకిలేస్తూ స్వామి తిరిగి బయటకు వచ్చాడట. ఆ 108 పద్యాల సంకలనమే ఈ "ఆంధ్రనాయక శతకం" అని ప్రతీతి. కవి ఈ ఆలయపు జీర్ణస్థితి చూసి వేదనతో ఈ శతకం చెప్పాడని కొందరంటారు. ఇందులో 'చిత్ర చిత్రప్రభావ దాక్షిణ్యభావ హత విమత జీవ శ్రీకాకుళాంధ్రదేవ' అనే మకుటంతో కూడిన 100 సీసపద్యాలున్నాయి. చక్కని తెలుగు నుడికారాలకు, వ్యాజస్తుతికి ఈ శతకం పేరుపొందింది. కవిత సంభాషణాత్మక శైలిలో ఉండి పోతన, శ్రీనాథులను గుర్తుకు తెస్తుంది. (ఆం. సం. సా-158, 159)

## ఆంధ్ర నిఘంటువు

నామాంతరం : చిన్నయసూరి నిఘంటువు.
కాలం : క్రీ. శ. 19వ శతాబ్ది.
కర్త : పరవస్తు చిన్నయసూరి.

ఇది అముద్రితం. దీని వ్రాతప్రతి [illegible] సంపుటాలు ఆంధ్ర సాహిత్య పరిషత్తు వారు సంపాదించి ఇటీవలి వరకు సంరక్షించి సూర్యరాయాంధ్ర నిఘంటువులో ఉపయోగించారు. కాని ఇప్పుడవి కనిపించడం లేదు.

ఇదే బహుజనపల్లి వారి శబ్దరత్నాకరానికి మూలం (రమణీయం - పీఠిక)

## ఆంధ్ర నిఘంటువు (అలభ్యం)

కర్త : గణపవరపు వేంకటకవి.

**ఆంధ్ర ప్రక్రియా కౌముది (అలభ్యం)**

కర్త : గణపవరపు వేంకటకవి (చూ). (ఆరుద్ర- 11-180.)

**ఆంధ్ర ప్రతాపరుద్రీయము (అలభ్యం)**

కర్త : చూ గణపవరపు వేంకటకవి.

ఇది సర్వలక్షణ శిరోమణిలో ఆరునుంచి తొమ్మిది వరకు గల ఉల్లాసాలలోనిది కావచ్చునని విమర్శకుల అభిప్రాయం. ఆధునిక యుగంలో ఇదే పేరుతో చెలమచర్ల రంగాచార్యులు ఒక గ్రంథాన్ని వ్రాశారు. (ఆరుద్ర- 11-180)

**ఆంధ్రప్రయోగ రత్నాకరము**

కాలం : 17వ శతాబ్దం.

కర్త : గణపవరపు వేంకటకవి

ఇది ప్రశస్తమైన లక్షణ గ్రంథం. నేడు లభ్యం కాని అపూర్వ గ్రంథాలు ఇందులో ఉదాహృతాలు. ఇది అముద్రితం. దీని వ్రాతప్రతి తంజావూరు పుస్తకాలయంలో ఉంది. (కవిజనాశ్రయం పీఠిక-వావిళ్ళ)

**ఆంధ్ర ప్రయోగ రత్నాకరము**

రచనా కాలం : 14 వ శతాబ్దం.

కర్త : అప్పనకవి.

వ్యాకరణ గ్రంథం.

కవి ఈ గ్రంథాన్ని తండ్రికే అంకితం చేశాడట. విపరాలు తెలియరాలేదు.

(క. స- 139)

**ఆంధ్రభాషా భూషణము (అలభ్యం)**

కర్త : మరింగంటి సింగరాచార్యులు.

వ్యాకరణ గ్రంథం.

ఈ పేరుగల గ్రంథాన్ని ఇంతకుముందే తెలుగులో దశకుమార చరిత్ర కర్త కేతన వ్రాశాడు. కవి దీనిని తన పట్టనిబుద్ధోయేట వ్రాశాడు. (తె. వి. స-6)

**ఆంధ్ర భాషాభూషణము**

కర్త : మూల ఘటిక కేతన.

ఇది కర్ణాట భాషాభూషణము ననుసరించి చేసిన రచన. 196 పద్యాలున్నాయి.

ప్రత్యేకత : ఈ గ్రంథం తెలుగులో మొదటి వ్యాకరణ గ్రంథం. "నన్నయభట్టాది కవిజనంబుల కరుణన్" క్రొత్తగా వ్యాకరణం వ్రాస్తున్నానని చెప్పాడు కవి. ఆంధ్ర భాషను "తెలుగు" అని లకార మధ్యంగాను, "తెనుగు" అని నకార మధ్యంగాను ఆరోజుల్లో వ్యవహరించేవారు. కవి ఈ గ్రంథంలో ప్రాస స్థానంలో రెండు రూపాలనూ

వాడాడు. బాల వ్యాకరణకర్త చిన్నయసూరి కోకొల్లలుగా సూత్రాల సులువులు, ఉదాహరణలు దీనినుంచి తీసుకొన్నారు. (అరుద్ర-2)

## ఆంధ్ర భాషార్ణవము

నామాంతరం : ఆంధ్రామరకోశము.
కవి : నుదురుపాటి వెంకన్న (చూ).
అంకితం : మాతృభూతేశ్వర స్వామికి

అచ్చతెనుగు నిఘంటువు. పద్యకృతి. స్వర్గవ్యోమదిక్కాలాది వర్గాల విభాగం- మూడు కాండలున్నాయి. తత్సమపదాలకు సరియైన అచ్చతెలుగు పదాలు ఇవ్వబడ్డాయి. ప్రథమ కాండలో 168 పద్యాలు, ద్వితీయ కాండలో 310 పద్యాలు, తృతీయ కాండలో 146 పద్యాలున్నాయి మకుట నియమం క్రమంగా పాటించటం జరిగింది.

కవి, రాయరఘునాథుని ప్రోత్సాహంతో దీన్ని రచించాడు. ఇందులో రఘునాథ తొండమాన్ వంశవృక్షం విపులంగా ఉంది. చివరలో కావ్యం రఘునాథునికే అంకితం చేసినట్లుంది. చారిత్రక ప్రాధాన్యం గల రచన. ఇది మూడుసార్లు (క్రీ.శ. 1898, 1900 1910 సంవత్సరాలలో) వేర్వేరు ముద్రాక్షరశాలలో ముద్రితం.

దీనికి బ్రౌనుదొర తయారు చేయించిన శబ్దసూచి, ఆగస్టు 1850 లోనే పూర్తయినా ముద్రితం కాలేదు. (ద. దే. వా- 427)

## ఆంధ్ర భోజుడు

కాలం : క్రీ. శ. 1347 కు పూర్వుడు. కాకతి రెండో ప్రతాపరుద్రుని కాలంగాని, అంతకుముందుగాని కావచ్చు.
రచన : నీతి భూషణము (అసముగ్రం).

విశిష్టత : 'నీతిభూషణం' లోని 20 పద్యాలను మడికి సింగన 'సకల నీతి సమ్మతం' లో చేర్చాడు. ఇందులో కవి రసవంతమైన కవితాధారతో నీతులను చక్కగా చెప్పాడు. గంభీరమైన భావాలున్నాయి. ఆంధ్ర భోజుడన్నది కవి బిరుదనామం కావచ్చును. చాటుపద్యకర్త అప్పన మంత్రి, ఇతడూ ఒకటే అన్న వాదం ఉన్నది. (అరుద్ర-2)

## ఆంధ్ర భోజుడు

బిరుదు. ఈ బిరుదు శ్రీకృష్ణదేవరాయల కుంది. ధారా నగరాధిపతియైన భోజుడు సంస్కృత వాఙ్మయాన్ని, సంస్కృత కవులను పోషించినట్లే, ఈయన ఆంధ్ర భాషను కవులను పోషించటంవల్ల ఈయనకీ బిరుదు వచ్చింది.

ఈ పేరుగల మరొక తెలుగుకవి ఉన్నాడు కాని, అది ఆయన పేరో, బిరుదో తెలియదు. ఈయన 'నీతిభూషణము' అనే రాజనీతి గ్రంథాన్ని వ్రాశాడు. నీతి భూషణంలోని పద్యాలను కొన్నింటిని క్రీ. శ. 14వ శతాబ్దిలో ఉన్న మడికి సింగన తన

సంకలన గ్రంథమైన 'సకల నీతి సమ్మతం' లో ఉదాహరించాడు. అందువల్ల ఈ ఆంధ్ర భోజుడు మడికి సింగనకు పూర్వుడై ఉండవచ్చునని చెప్పవచ్చు. ఈయన క్షేమేంద్రుడనే కవికి సమకాలికుడు కావచ్చునని కొందరి అభిప్రాయం. (తె. వి. స- 4)

**ఆంధ్ర మన్వర్థ దీపిక**

కర్త : చూ. మండకామేశ్వరకవి.

వివరాలు తెలియవు. (ఆం. సం. సా-429)

**ఆంధ్ర మేఘ సందేశము**

కర్త : మతుకుమల్లి నృసింహకవి.

రచనా కాలం : 19 వ శతాబ్దం.

పద్యకావ్యం. అనువాద రచన. (క. స.-115)

**ఆంధ్ర రసమంజరి (అలభ్యం)**

కర్త : గణపవరపు వేంకటకవి.

ఇది గణపవరపు వేంకటకవి కృతిగా ఆంధ్రకవి తరంగిణి కారులు మాత్రమే పేర్కొన్నారు. (క. త-12-234)

**ఆంధ్ర వసంత తిలక భాణము (అలభ్యం)**

కాలం : క్రీ. శ. 17 వ శతాబ్దం.

కర్త : గణపవరపు వేంకటకవి. (క. త-12)

**ఆంధ్ర విశ్వ గుణాదర్శము (విశ్వగుణా దర్శము)**

కర్త : తిరుమల బుక్కపట్టణము చినతాతాచార్యులు.

పద్యకావ్యం. వేంకటాధ్వరి సంస్కృతంలో రచించిన విశ్వగుణా దర్శానికి అనువాద మిది. (వీరేశలింగం పంతులు-సమగ్ర పరిశీలన)

**ఆంధ్ర వేదాంతము (అలభ్యం)**

కర్త : తాళ్ళపాక పెద తిరుమలాచార్యుడు. (క. త-6)

**ఆంధ్ర వ్యాకరణమ్ (సం)**

నామాంతరం : ఆంధ్రశబ్దాను శాసనమ్.

కర్త : ఓపర్తి శేషాచల (పతి) కవి.

వ్యాకరణ గ్రంథం. సంస్కృతానికి పాణినీయం వలె తెలుగుకు సూత్రాలు, ప్రకృతి ప్రత్యయ నిర్ణయం చెప్తూ రచించిన భాష్యం. (ద. దే. వా-213)

**ఆంధ్ర శబ్ద చింతామణి (సం)**

కర్త : నన్నయభట్టు.

రచనా కాలం : క్రీ. శ. 11 వ శతాబ్దం.

ప్రత్యేకత: వ్యాకరణ గ్రంథం. మహాభారతాంధ్రీకరణకు పూర్వం అప్పటి వ్యావహారికాంధ్ర, తత్సమ భాష గ్రాంధికతా ముద్రకు అర్హంగా నన్నయ చేతిలో పొందిన సంస్కారమే ఆంధ్రశబ్దచింతామణి. సంస్కృతంలో సుమారు 80 ఆర్యావృత్తాలతో ఉన్న గ్రంథం. ఇందులో సమాసము, విభక్తి, క్రియ, అచ్చు, హల్లు, అన్వయం మొ॥ వాటిని సంస్కృతం నుంచి గ్రహించి, ద్రుతము మొ॥ కొన్ని సంజ్ఞలను నన్నయ స్వయంగా కల్పించి రచన చేసినట్లు కనిపిస్తుంది.

కొన్ని నియమాలతో రూప నిష్పాదన ప్రక్రియను బోధిస్తూ, పాఠకుల సౌకర్యం కోసం తన రచనను కారికలుగా చేశాడు. "చింతామణి" లోని రసం, గుణ దోషాలు, యతి, ప్రాస, మొ॥ కావ్య సామాన్య లక్షణాలను స్పృశించి, అప్పటికి అవసరమైన వ్యాకరణాంశాలనే చర్చించాడు. మొత్తం మీద ఈ వ్యాకరణంలో సంధి, అజంత, హలంత, క్రియా పదాల ప్రక్రియ స్థూలంగా నిరూపితం. (తె. వి. స-4)

ఆంధ్ర శబ్ద చింతామణి

కర్త : చిన్నమడిరి అనంతాచార్యులు (చూ).

వ్యాకరణ గ్రంథం. (ఆ. సం. సా.)

ఆంధ్ర శబ్ద చింతామణి

నామాంతరం : అప్పకవీయము (చూ).

కర్త : కాకునూరి అప్పకవి.

ఆంధ్ర శబ్ద చింతామణి వ్యాఖ్య

కాలం : క్రీ. శ. 19 వ శతాబ్దం.

కర్త : పరవస్తు చిన్నయసూరి.

'ఆంధ్ర శబ్ద చింతామణి' అనే తెలుగు వ్యాకరణం సంస్కృతంలో వ్రాయబడింది. దానికి వ్రాసిన వ్యాఖ్య ఈ గ్రంథం. (రమణీయం పీఠిక)

ఆంధ్ర శబ్ద చింతామణి వ్యాఖ్యానము

కర్త : ఎలకూచి బాలసరస్వతి.

సంస్కృతంలో ఉన్న ఆంధ్ర శబ్ద చింతామణికి తెలుగులో వ్యాఖ్యానం. ఆంధ్ర సాహిత్య పరిషత్తువారు ఈ గ్రంథాన్ని ప్రకటించారు.

ఆంధ్ర శబ్దాను శాసనమ్ (సం)

నామాంతరం : ఆంధ్ర వ్యాకరణమ్.

కర్త : నివర్తి శేషాచలకవి.

ఆంధ్ర శబ్దాను శాసనము

కర్త : పరవస్తు చిన్నయసూరి.

వ్యాకరణ గ్రంథం.

ఆంధ్ర సిద్ధాంత కౌముది

రచనాకాలం : 19వ శతాబ్ది పూర్వార్ధం.
కర్త : మతకుమల్లి నృసింహకవి.
వ్యాకరణగ్రంథం.

ఆంధ్ర హరి వంశము

కర్త : తాళ్ళపాక పెద తిరుమలాచార్యుడు.
అలభ్యం. (క. త-8)

ఆంధ్రాభ్యుదయము

పత్రిక.
స్థలం : హనుమకొండ.
19 వ శతాబ్దంలో సాహిత్యసేవ చేసిన పత్రిక. మరింగంటి కవుల రచనలు కొన్ని దీనిలో ప్రచురితమయ్యాయి.

ఆంధ్రామర కోశము

నామాంతరం : ఆంధ్ర భాషార్ణవము.
కర్త : నుదురుపాటి వెంకన్న

ఆంధ్రాష్టపది

కర్త : కామసముద్రం అప్పలాచార్యులు (నూ).
కృష్ణ లీలా తరంగిణి అనే సంస్కృత గ్రంథం ఆధారంగా ఇది రచించబడింది. (ఆం. సం. సా.)

ఆంధ్రులు - కన్నడ వాఙ్మయము

క్రీస్తు పూర్వం నుండీ ఆంధ్రులు, ఘన సామ్రాజ్య ధురంధరులనీ, ఆర్య నాగరికతను దక్షిణా పథంలో విస్తరింప చేశారనీ తెలుస్తున్నది. కన్నడ వాఙ్మయంలో పేరు పొందిన కవుల పూర్వీకులు ఆంధ్రులట. వారిలో అధిక సంఖ్యాకులు వేంగీ మండలం నుండి కన్నడదేశానికి వెళ్ళి స్థిరపడ్డారనీ ఆ విషయం కన్నడ కవి చరిత్రంలో ఉన్నదనీ తెలుస్తున్నది. అలాంటి వారిలో -

పూజ్య పాద (470 ప్రాంతం) దండి (7-వ శతాబ్దం), నాగార్జున (8 వ శతాబ్దం), ఆది పంప (941), పొన్న (950), నాగవర్మ (990), రన్న (993), రాజాదిత్య (1120), మైదువ రామయ్య (1160), మోళిగయ్య (1160), హరీశ్వర, రాఘవ, కెరయ, పద్మరస (1165), చక్రపాణి రంగనాథ (1195), పోలాళ్వదండనాథ (1223), భీమకవి (1369), ముఖ్యులు.

ఆది కవిగా పేరుపొందిన పంపమహాకవి, ప్రథమ కన్నడ లక్షణగ్రంథ కర్త నాగవర్మ వేంగీ మండలం నుండి వెళ్ళినవారే. నాగవర్మ వెన్నమయ్య పుత్రుడట.

కన్నడ బసవ పురాణానికి మూలం తెలుగు బసవ పురాణమే.

1. వా. చ. వం. సు- గ్రంథప్రవేశం-32
2. సా. వ. వ. సం-5-సం-5-190.

**ఆకాశపు వారు**

పంచ భూతాలలో ఒక భూతమైన ఆకాశం పేరుతో తెలుగు దేశంలో కొంద రింటి పేరుంది. (భారతి-మా-45-229)

**ఆకువీటి చినవేంకటరాజు**

చూ. అరవీటి చినవేంకటరాజు

కృష్ణరాయ విజయకర్త ధూర్జటి ఇతని ఆస్థానంలో ఉండే వాడని కొందరంటు న్నారు. కాని అతడు అరవీటి చిన వేంకటరాజు అని పరిశోధకులు గుర్తించారు.

**ఆకువీటి పెదవెంకటాద్రి**

కాలం : 16 వ శతాబ్దం.

స్థలం : ఆకువీడు (తుంగభద్రా తీరప్రాంతం).

సాహిత్య పోషకుడు. ఆకువీటి పుర ప్రభువు పింగళి సూరనను ప్రోత్స హించి "రాఘవ పాండవీయ" మనే ద్వ్యర్థి కావ్యాన్ని రచింపజేశాడు. ఈ కావ్యం శ్రీ విరూపాక్షస్వామికి అంకితం.

ఈతని తాత ఇమ్మరాజు శ్రీకృష్ణదేవరాయల రాజమహేంద్రపుర యుద్ధంలో పాల్గొన్నాడట. ఈయనను అరవీటి పెదవేంకటాద్రి అని కొందరు అంటారు.

**ఆకొండి వేంకటకవి**

కాలం : (1820-).

స్థలం : గజరాయని వలస. బొబ్బిలి ప్రాంతం.

రచనలు : తత్త్వసంగ్రహ రామాయణము, రామశతకము, శ్రీరమణ శతకము మొ॥వి.

జగన్నాథశాస్త్రి కుమారుడు. తల్లి అచ్చమ్మ. ఇతని శతకాలలో రామ శతకాలు రెండున్నాయి. ఒకటి "రామా" అనే మకుటంతోను, ఇంకొకటి "రామప్రభూ" అనే మకుటంతోను ఉన్నాయి.

ఇతని రచన ప్రౌఢంగా సరసంగా ఉంటుంది. (3. స- 231)

**ఆఖ్యానము**

వచన కావ్య భేదం. కవి తాను స్వయంగా చూసినదానిని చెప్పటం ఆఖ్యానము. (తె. వి. వ- 6)

**ఆఖ్యాయిక**

సంస్కృత గద్య కావ్య భేదాల్లో ఒకటి. దీని పరిచ్ఛేదాలకు "ఉచ్ఛ్వాసము" లనిపేరు. యదార్థ విషయాలతో కూడిన రచన. ఇంచు మించుగా కవి స్వీయ చరిత్ర వంటిది. దీన్ననుసరించి తెలుగులో కథా కావ్యాలు వచ్చాయి. సంస్కృతంలో చెప్పిన

కొన్ని లక్షణాలు తెలుగులో పాటిస్తున్నారు. కథకూ ఆఖ్యాయికకూ కొంచెం తేడా ఉన్నది. హర్ష చరితాదులు ఆఖ్యాయికలు.

**ఆచంట రామేశ్వర శతకము**

రచనాకాలం : 1850.

కర్త : మేకా బాపన్న.

సీసపద్య శతకం. "భూత లోకేశ, ఆచంటపుర నివేశ, భావభవనాశ, రామేశ, పార్వతీశ" అనే మకుటంతో ఉంది. రచన చక్కనిది. (క. స. 142)

**ఆచార నవనీతమ్ (సం)**

కర్త : అప్పదీక్షితుడు.

ఈ గ్రంథాన్ని అప్పదీక్షితుడు రచించి తన పోషకుడైన ఆనందరాయమణి పేర పెట్టాడని అంటారు.

ఇందులో మానవ జీవితంలోని ప్రధాన ఘట్టాల్లో చేయవలసిన విధులు విపులంగా చెప్పబడ్డాయి. సమకాలీన చారిత్రకాంశాలు, సాంఘిక విషయాలు కూడా ప్రస్తావింపబడ్డాయి. (M. R. T. 31)

**ఆచార్య పంచాశత్ (సం)**

కర్త : వేంకటాధ్వరి.

ఇది వేదాంత దేశికుల మాహాత్మ్యాన్ని వర్ణించే గ్రంథం. (తె. వి. స-6)

**ఆచార్య రంగాచార్యులు**

కాలం : క్రీ. శ. 19వ శతాబ్దం-ఉత్తరార్థం.

స్థలం : వనపర్తి సంస్థానం.

వనపర్తి సంస్థానాస్థాన విద్వాంసులుగా ఉండేవారు. వీరి రచనలను గురించిన వివరాలు తెలియవు. (ఆం. సం. సా.)

**ఆచార్యవింశతి (సం)**

కర్త : చూ. తిరుమల ఉక్క పట్టణం (ఇమ్మడి) అణ్ణయదీక్షితులు.

సంస్కృత రచన. (ఆం. సం. సా-516)

**ఆచార్యవింశతి**

కర్త : కర్ణమడకల అనంతాచార్యులు (చూ).

వివరాలు తెలియవు. (ఆం సం. సా.)

**ఆచార్య విజయము**

కర్త : ఆలూరి కుప్పన (చూ).

ఆరాశ్వాసాల పద్యకావ్యం. శంకరాచార్యుని చరిత్ర ఇతి వృత్తం.

మూలం : ఆనందగిరి రచించిన 'శంకర విజయము' అనే గ్రంథం. కవి దీన్ని మహాపురాణంగా పేర్కొన్నాడు. చెన్నపురిలోని కొందరి ప్రార్థనపై ఇతడీ గ్రంథాన్ని అనువదించాడట.

**ఆచార్య విజయము**

నామాంతరం : శంకరవిజయము.

కర్త : చూ. రాపాక లక్ష్మీపతి.

లభించిన ప్రతి అసమగ్రంగా ఉన్నది. (ఆం. సం. సా. 186)

**ఆచార్య వైభవము**

కర్త : చూ హొసదుర్గం శ్రీనివాస రాఘవాచార్యులు.

విశేషాలు తెలియవు (కేశవపంతుల- సం. సా.)

**ఆట భాగవతము**

నామాంతరం : పారిజాత నాటకము.

కర్త : నరుకూరి నారాయణకవి.

యక్షగానం. ఆంధ్రదేశంలో తరచుగా ప్రవర్తింపబడేది. (య. వా. చ )

**ఆణిమిళ్ళ సీతారామకవి**

కాలం : 18 వ శతాబ్దం

రచన : జానకీపతి శతకము.

ఇతని తండ్రి వేంకటశాస్త్రి ఊంచిమంచి జగ్గకవికి ప్రతిస్పర్ధి. ఇతని రచనప్రౌఢంగా జటిలంగా ఉంటుంది. (శ. స- 291)

**ఆతుకూరి మొల్ల**

కాలం : క్రీ శ. 16 శతాబ్ది పూర్వార్ధం.

రచన : రామాయణము.

స్థలం : గోపవరము (నెల్లూరు మండలం)

ఈమె పేరు "మల్లి" అని కొందరు అంటున్నారు.

విశిష్టత : ఈమె తన రామాయణంలో పూర్వ కవిస్తుతిలో శ్రీనాథుని పేర్కొన్నదిగాని క్రీ. శ. 16 వ శతాబ్ది కవులను పేర్కొనలేదు. కాబట్టి ఆ శతాబ్ది పూర్వార్ధంలో ఉండవచ్చు. ప్రధానమైన కథాంశాలతో రామాయణ కథను సంక్షేపించి వ్రాసింది. ఈమె ఇంటిపేరు ఆతుకూరు. తండ్రిపేరు కేసయ. గోపవరపు శ్రీ కంఠేశ్వరుని వల్ల కవితా సంపద లభించిందని చెప్పుకొన్నది. గోపవరం పేరుతో తెలుగుదేశంలో చాలా గ్రామాలున్నాయి ఏ గోపవరమో స్పష్టంగా తెలియదు. నెల్లూరుజిల్లాలోనిదని భావిస్తున్నారు. ఈమె రాయల సమకాలికురాలనీ, కాదనీ పండితులలో భిన్నాభిప్రాయాలున్నాయి. ఈమె రచించిన రామాయణం బహుళ ప్రచారం పొందింది.

(తె. వి. స- 4)

**ఆత్మకూరు**

ఇది మహబూబ్‌నగర్ మండలంలో ఉంది. నిజాం పురాతన సంస్థానాలలో

ఒకటి. పాకనాటి రెడ్లు ఈ సంస్థానాన్ని పాలించారు. వీరి ఇంటి పేరు "ముక్కవారు." వీరి మూల పురుషుడు గోపాలరెడ్డి.

క్రీ. శ 1292 లో ఈ గోపాలరెడ్డి కాకతీయ సామ్రాజ్య సామంతుడైన గోన బుద్ధారెడ్డిని దర్శించి, సేవించి, అతనివద్ద "ముక్తాలనాడ గౌడరికం" సంపాదించాడు. ఆ తరువాత ఈ వంశంవారు నవాబులకు సహాయ పడుతూ తమ సంస్థానాన్ని విస్తరింప చేశారు.

ఈ పాకనాటి వంశంలోని వాడైన ఇమ్మడి గోపిరెడ్డి (గోలకొండ సుల్తాన్ అబ్దుల్లా కుతుబ్షాకు సమకాలికుడు) కుమారుడైన గోపిరెడ్డికి "అమరచింత", "వర్ధమాన్"లు పైతృకమైన ఆస్తిగా సంక్రమించాయి. ఆ అమరచింతకు "ఆత్మకూరు" రాజధానిగా నిలిచింది. ఇది గద్వాలకు అత్యంత సమీపంలో ఉంది

ఈ సంస్థానాధీశులు కావ్య కళామర్మజ్ఞులు కావడంచేత సాహితీ క్షేత్రంలో బంగారు పంటలు పండించారు. సురపురం కేశవయ్య, బుక్కపట్టణం రంగాచార్యులు, తర్కతీర్థ బాలసరస్వతి శ్రీనివాసాచార్యులు, దీక్షితులు నరసింహశాస్త్రి మొ॥ అనేక కవి పండితులు ఈ సంస్థానంలో ఉంటూ కీర్తిప్రతిష్ఠలను ఆర్జించి పెట్టారు. ఈ సంస్థానంలో ప్రతియేడు ఫాల్గుణ శుక్ల పక్షంలో సాహిత్యసభలు, శాస్త్రగోష్ఠులు, కవి గాయక సమ్మేళనాలు, ఉచిత రీతిని సత్కారాలు జరుగుతుండేవి. (అం. సం. సా)

**ఆత్మకూరు సోమన్న**

కాలం : క్రీ.శ 1600-1650 ప్రాంతం.
స్థలం : నెల్లూరు మండలంలోని ఆత్మకూరు.
రచన : ద్విపద భారతము (11 పర్వాలు).

ద్విపద భారత కవిత్రయంలో ఇతడు మూడవవాడు కర్ణపర్వం మొదలు కొని స్వర్గారోహణ పర్వం వరకూ మొత్తం పదకొండు పర్వాలు రచించడమేగాక అరణ్య పర్వ రచనలో తిమ్మయ వదలిన భాగాలను పూరించి ద్విపద భారతాన్ని పూర్తి చేశాడు. ప్రౌఢమూ, రసవంతమూ అయిన కవిత్వం. ఇతని కాలాన్ని గురించి భిన్నాభిప్రాయాలున్నాయి. (ఆరుద్ర 10-21)

**ఆత్మబోధప్రకరణము వ్యాఖ్య**

కర్త : పరశురామపంతుల బ్రహ్మానంద రాజయోగి

ఆత్మబోధ ప్రకరణానికి వ్యాఖ్య. సుబోధకంగా ఉంది. (వ. వా 41)

**ఆత్మరామ శతకము**

కర్త : పరశురామ పంతుల లింగమూర్తి.

ఇది వేదాంత ప్రధానమైన గ్రంథము. అముద్రితము ఉస్మానియా విశ్వవిద్యాలయ సంస్కృత అకాడమీ తాళపత్ర గ్రంథాలయంలో ఉంది. దీనిలో కవి సద్గురుమహిమ, యోగ మార్గమున బట్టబయలును జూచు విధానము వివరించినాడు

జపతపాలపట్ల కవి విముఖత చూపినాడు. సుషుమ్నా మార్గంలో ఆత్మారాముని దర్శించువాడే యోగి అని లింగమూర్తి తెలిపినాడు. (శ. సా. వి. 320)

## ఆత్మానంద రసమంజరి

రచనాకాలం : 1700 ప్రాంతం.
కర్త : శేషదాసు తిరువెంగళాచార్యుడు.
అంకితం : కృష్ణారాయపురంలోని వేణుగోపాలస్వామికి.

వేదాంత ప్రతిపాదకమైన ద్విపదకావ్యం. మూడాశ్వాసాలున్నాయి. పరబ్రహ్మ వర్ణనతో కావ్యం ఆరంభమైంది. అద్వైత వేదాంతాన్ని అలంకారికంగా కవి వర్ణించాడు. దీని ప్రతి మదరాసు ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారంలో ఉంది. (ద్వి. సా. చ. 355)

## ఆత్మైకబోధము

కర్త : యోగానంద అవధూత.
ద్విపద కావ్యం.

ఇది వేదాంత విషయ ప్రతి పాదకమైన గ్రంథం. విషయం ముఖ్యం కాని, వ్యాకరణం, యతిప్రాసలు ప్రధానం కాదంటాడు కవి. (ఆరుద్ర-8-274)

## ఆత్రేయపురపు తమ్మయ

కాలం : 1826 పూర్వము.
స్థలం : గోదావరీ మండలం.
రచన : 1) గొల్లకలాపము (ఏడిద భాగవతము).
2) కృతులు.

యక్షగాన కవిగా ప్రసిద్ధుడు. ఇతడు భామా కలాపాన్ని కూడా రచించి ఉండవచ్చునని పండితులు అభిప్రాయపడుతున్నారు. ఇతని కృతులలోనూ పదములలోనూ ఆత్రేయ పురి గోపాల ముద్ర కనిపిస్తున్నది. (య. వా. 98)

## ఆదిత్య పురాణము

కర్త : ఎలకూచి పినయాదిత్యుడు (చూ).
అంకితం : పొంపూరి గురవమంత్రికి.

ఎనిమిది ఆశ్వాసాల పద్యకావ్యం. దీనిప్రతి ఆంధ్రసాహిత్య పరిషత్కార్యాలయంలో ఉన్నదట. (ద. త.-12-115)

## ఆదిత్య హృదయము

కర్త : చూ. గోపీనాథము వెంకటకవి.
లఘుకృతి. పద్యకావ్యం. (ఆం. సం. సా-467)

## ఆదినారాయణ చరిత్రము (అలభ్యం)

కర్త : కవి రాక్షసుడు.
ఒక లక్షణ గ్రంథంలో ఈ గ్రంథం పేర్కొనబడింది. (క.స. 31)

ఆదిపర్వము-వచనము

కర్త : వైయాకరణము రామానుజాచార్యులు.

తొలిముద్రణ: క్రీ. శ. 1847.

నన్నయ భారతంలోని ఆదిపర్వానికి వచన రూపం. ఈ గ్రంథము పరవస్తు చిన్నయసూరిచే సరిచూడబడి క్రీ. శ. 1847 లో నన్నయ వ్రాసిన ఆది ర్వంతో బాటు ముద్రితమైనది. ముఖపత్రం మీద చిన్నయ సూరి పేరుండటం వల్ల దాన్ని సూరి రచనగా ఇటీవలి వారు భ్రమపడడటం జరిగింది. ఆ ముఖపత్రాన్ని సరిగా చూచినట్లయితే గ్రంథకర్తను గూర్చి సందేహమురాదు.

చక్కని వాడుక భాషలో సాగిన రచన. (వ వా-61)

ఆదిపురాణము (కన్నడం)

కర్త : పద్మకవి (పంపమహాకవి).

జైన కావ్యం. మొదటి తీర్థంకరుని చరిత్ర ఇందులోని ఇతివృత్తము. పద్మకవి తెలుగులోనూ, కన్నడంలోనూ కూడా రచనలు చేసి కన్నడంలో 'ఆదికవి' అనీ కవిసార్వభౌముడనీ పేరుపొందాడు. (క. న-117)

ఆదిపురాణము (అలభ్యం)

కర్త : లింగమగుంట సర్వకవి.

ప్రత్యేకత : గ్రంథం దొరకలేదు. పెదపాటి జగ్గన్నకు ముందువాడయిన అజ్ఞాత గ్రంథ సంకలన కర్త దీనిలోని 2 పద్యాలను సేకరించి తన "ఉదాహరణ పద్యాలు"లో ఉదాహరించాడు. లింగమగుంట సర్వన్న, పెదపాటి ఎర్రన (మల్హాణ చరిత్ర కృతి కర్త) నుతించిన సర్వ దేవుడు ఒకరేనని, భిన్నులని పండితులలో అభిప్రాయ భేదాలున్నాయి. తెనాలి రామకృష్ణ కవికి అల్లుడయిన లింగమగుంట రామయ్యకు ఈ లింగమకుంట సర్వకవి తాత.

ఆదిపురాణం జైన కావ్యం. మొదటి తీర్థంకరుడైన పురుదేవుని చరిత్ర ఇందులో ఉంది. దీన్ని జినసేనుడు సంస్కృతంలో రాశాడట పంపకవి కన్నడంలోనికి అనువదించాడు. సర్వదేవుడు తెలుగులో రచించాడు.

(ఆరుద్ర-8-131 క. న. 283)

ఆదిపురాణము

కర్త : వాగీంద్ర చూడామణి.

కాలం : 1100 కు పూర్వం.

అలభ్యం. జైన మత సంబంధమైన కావ్యం. కవి వాదీంద్ర చూడామణిగా ప్రసిద్ధుడు. ఇది ఏ భాషలో ఉన్నదో తెలియదు. అప్పకవి దీన్ని ఉదహరించాడు. (క న. 216)

ఆదిలక్ష్మి విలాసము

కర్త : అక్కెనపల్లి నృసింహకవి.

రచనా కాలం : 1810-1820 ప్రాంతం.

అంకితం : అంతర్వేదిలోని నృసింహస్వామికి.

నాలుగాశ్వాసాల ప్రౌఢకావ్యం. కామేశ్వరి కథ దీనిలోని ఇతివృత్తం. (క. స.)

**ఆధ్యాత్మ రామాయణ కీర్తనలు**

కర్త : చూ. మునిపల్లె సుబ్రహ్మణ్యకవి.

అంకితం : శేషశైలేశునికి.

కవి కాళహస్తి పాలకుల ప్రేరణతో ఈ కీర్తనలు రచించి శేషశైలేశునికి అంకితం చేశాడు. 'శ్రీ శేషగిరిపతి' అనే ముద్రతో వ్రాయబడిన ఈ కీర్తనలు అత్యంత ప్రసిద్ధమైనవి. (ఆం. సం. సా.)

**ఆధ్యాత్మ రామాయణము**

కర్త : కాణాదము పెద్దన సోమయాజి (చూ).

కవి గద్వాల రాజుల ఆశ్రయంలో ఉన్నప్పుడు ఈ రామాయణాన్ని రచించినట్లు తెలుస్తున్నది. (ఆం. సం. సా.)

**ఆధ్యాత్మ రామాయణము**

కర్త : చూ. ముడుంబై వేంకట కృష్ణమాచార్యులు.

పౌరాణిక రచన. చక్కని శైలిలో ఉంది. (ఆం. సం. సా.)

**ఆనందకల్ప ద్రుమము**

కర్త : పక్కి వేంకట నరసయ్య.

చూ. అమర పదకల్ప ద్రుమము.

**ఆనంద కానన మాహాత్మ్యము**

కర్త : లింగము కుంట రామకవి.

అంకితం : శ్రీ వేంకటేశ్వరునికి.

అయిదాశ్వాసాల చంపూ కావ్యం.

ప్రత్యేకత : దీని ప్రతి మద్రాసు ప్రాచ్యలిఖిత గ్రంథాలయంలో ఉంది. ఆనంద కాననం అంటే కాశీక్షేత్రం. కవి వైష్ణవుడు కాబట్టి కాశిని విష్ణుక్షేత్రంగా వర్ణించి, అందువల్లనే దానికి ఆ మాహాత్మ్యం వచ్చిందని చెప్పాడు. వాయుపురాణంలోని లక్ష్మీ సంహితలో ఉన్న ఆనంద కానన మాహాత్మ్యానికిది తెనిగింపు. ఇది రామకవి రచనలలో చివరిది కావచ్చు. కవి తాను దీనికి ముందే చతుర్వాటికా మాహాత్మ్యం, మత్స్య పురాణం, వామన పురాణం, వేంకట మాహాత్మ్యం వ్రాశానని ఒక పద్యంలో చెప్పాడు. కవి ఈ కావ్యాన్ని కోనమంత్రి ప్రోత్సాహంతో రాసినట్లు చెప్పుకొన్నాడు. (ఆరుద్ర 8-134)

**ఆనంద గణేశ్వరము**

కవి : కొండమడుగు పురుషోత్తమ కవి.

అంకితం : దీబగుంట వీరేశ్వరస్వామికి.

మూడాశ్వాసాల ప్రబంధం. కుంజేటి బుచ్చయ్య కోరికపై కవి ఈ గ్రంథాన్ని రచించాడట. (క. స.)

**ఆనంద గీతలు**

కర్త : మల్లికార్జున పండితుడు.
రచనాకాలం: 1150 ప్రాంతం.

అలభ్యం. శైవమత సంబంధమైన రచన కావచ్చును.

**ఆనంద తారతమ్య ఖండన (సం)**

కర్త : చూ. తిరుమల బుక్కపట్టణం (ఇమ్మడి) శ్రీనివాసాచార్యులు.

సంస్కృత రచన. (ఆం. సం. సా. -516)

**ఆనంద పదములు**

కర్త : మల్లికార్జున పండితుడు.
కాలం : 1150 ప్రాంతం.

అలభ్యం. శైవమత సంబంధమైన పద వాఙ్మయానికి చెందిన పదాలు.

**ఆనందరంగ చ్ఛందము**

నామాంతరాలు : 1. లక్ష్మణ చూడామణి.
2 అనందరంగ రాట్ఛందము.
కర్త : కస్తూరి రంగకవి.
కృతిభర్త : "దూప్లే"కు దుబాసిగా పనిచేసిన "ఆనందరంగ పిళ్ళె".

ఇది నాలుగు ఆశ్వాసాల ఛందోగ్రంథం. మొదటి ఆశ్వాసంలో అక్షరగణ నిర్ణయం, ప్రసిద్ధవృత్త జాత్యుపజాతులు చెప్పబడ్డాయి. రెండో ఆశ్వాసంలో గణ, వర్ణ, దేశ్యాదికమూ, మూడో ఆశ్వాసంలో కొన్ని సంధులూ, విభక్తి విశేషాలూ, ఉన్నాయి. నాలుగో ఆశ్వాసంలో షట్ప్రత్యయాలూ, 26వ ఛందస్సులోని కొన్నివృత్తాలూ, ఉద్ధురమాలా వృత్తాలూ చెప్పబడ్డాయి.

జాత్యుపజాతులకు లక్షణాలు పేర్కొనబడినా లక్ష్యాలు చూపబడలేదు. శప్రాసం వంటి కొన్ని విశేషాంశాలు ఇందులో ఉన్నాయి. ఇతర లాక్షణికులు ఉదాహరించని కృతులు ఇందులో కనిపిస్తాయి. ప్రథమాశ్వాసంలో కృతిపతియైన ఆనందరంగ పిళ్ళె వృత్తాంతం ఉంది. చారిత్రికంగాను సాహిత్యపరంగాను విలువైన గ్రంథం. (ఛం. వ. కో.)

**ఆనందరంగ పిళ్ళె**

కాలం : క్రీ శ. 1750 ప్రాంతం.

సాహిత్య పోషకుడు కస్తూరి రంగకవి కృత రంగరాట్ఛందానికి కృతిపతి. ఇతని ఆస్థానంలోనే కస్తూరి రంగకవి ఉండేవాడు. ఇతడు ఫ్రెంచి గవర్నర్ డూప్లెకు దుబాసిగా వ్యవహరించేవాడట. (తె. వి. స-6)

ఆనంద రంగరాట్ ఛందము

నామాంతరాలు : లక్షణ చూడామణి.

కర్త : కస్తూరి రంగకవి.

చూ: ఆనంద రంగచ్ఛందము. (న. జే. వా. 252)

ఆనందరాఘవ నాటకమ్ (సం)

కర్త : రాజ చూడామణి దీక్షితుడు.

చారిత్రిక ప్రశస్తిగల కావ్యం. (తం. ఆ. నా. 290)

ఆనంద రాయమఖి

కాలం : 17 వ శతాబ్దం.

స్థలం : తంజావూరు.

రచనలు : 1. ఆశ్వలాయన గృహ్య సూత్ర వ్యాఖ్య (సం).

2. విద్యాపరిణయమ్ (సం).

3. జీవానందమ్ (సం).

4. ఆచార నవనీతమ్ (సం).

ఇందులో మొదటి రచన తప్ప మిగిలినవేవీ ఇతడు రచించలేదని పరిశోధకులు చెప్తున్నారు. ఇతడు నరసింహ రాయమఖి కుమారుడు. నరసింహ రాయమఖి త్రిపుర విజయచంపూ కర్త. తంజావూరును పాలించిన ఏకోజీకి మంత్రి. ఆనంద రాయమఖి కూడా తంజావూరు మహారాష్ట్ర రాజులైన శహాజీ (1681-1712), శరభోజీల వద్ద మంత్రిగా ఉన్నాడు. వేదకవి విద్యాపరిణయ జీవానంద కావ్యాలను రచించి తన పోషకుడైన ఆనంద రాయమఖి పేర వెలువరించాడని తెలుస్తున్నది. ఆచార నవనీతమ్ అప్పాదీక్షితుని కృతి యట. (తం. ఆ. నా. )

ఆనంద లహరి (అలభ్యం)

కర్త : పోచిరాజు వీరన్న

శతకమట. కవి కృతమైన శిల్హణ చరిత్రలో దీని ప్రసక్తి ఉంది.

ఆనంద సాగరోత్సవమ్ (సం)

కర్త : నీలకంఠ దీక్షితులు. (ఆ. వి. స-6)

ఆనంద సుందరీ చరితమ్ (సం)

కర్త : ఘనశ్యాముడు.

సట్టకం.

ఆనంద సుందరీ చాతుర్య విలాసము

కర్త : బసవరాజు నాగేంద్ర కవి.

కాలం : 1800 ప్రాంతం.

మూడాశ్వాసాల ప్రబంధం. రచన హృద్యంగా ఉందని పండితాభిప్రాయం.

**ఆనివిళ్ళ వేంకటశాస్త్రి**

కాలం : క్రీ. శ. 1750 ప్రాంతం.
స్థలం : పశ్చిమ గోదావరి మండలం.
సంస్థానాలు : పెద్దాపురం, నూజివీడు.
రచనలు : 1 మహేశ్వర మహాకావ్యము 2. సతీశతకము 3. భాస్కర ప్రశస్తి 4 రుక్మిణీ పరిణయము 5. అలంకార సుధాసింధువు 6. రస ప్రపంచము 7. అప్పారాయ యశశ్చంద్రోదయము 8. ఆపస్తంబ శ్రౌత సూత్రవ్యాఖ్య.

ఈయన అనేక శాస్త్రాలలో పండితుడు. పెద్దాపురం, నూజివీడు మొదలయిన సంస్థానాధీశుల చేత గౌరవింపబడినవాడు. (తె. వి. స.-4)

**ఆనెగొంది**

నామాంతరం : నరపతి సంస్థానం.

నిజాముకు లోబడిన ఒక సంస్థానం. నిజాం రాష్ట్రానికి నైఋతి దిశలో, తుంగభద్రానదికి ఉత్తర తీరాన, హొసపేట తాలూకాలోని కమలాపురం సమీపంలో ఆనెగొంది గ్రామం ఉంది. ప్రస్తుతం ఇది మైసూరు రాష్ట్రంలోని రాయిచూరుకు చెందింది. ఆనెగొంది అనగా— ఏనుగు గొంది (సందు) అని అర్థం. ఏనుగుల వలె కన్పించే మూడు కొండలమధ్య సందులో ఈ దుర్గం నిర్మింపబడింది. క్రీ. శ. 14 వ శతాబ్దం ప్రథమ భాగంలోని వాడైన కంపిలిరాయలు ఈ కూడలిలో శత్రుజన దుర్గమంగా "హొసమతి" అనే పేరుతో ఈ నగరాన్ని నిర్మించాడట. కాలక్రమంలో ఆ పేరు మారుమరిగి 'ఆనెగొంది' అనే పేరు స్థిరపడింది.

విజయనగరానికి మూలకందమని భావింపబడుతున్న ఈ నగరం పూర్వం నుంచీ రాజాశ్రయ కేంద్రంగా ఉండేది "రాయవంశావళి" అనే గ్రంథంలో క్రీ. శ. 1014-1076 నాటి నందుడు మొదలుగా చాళుక్యరాజు, విజయధ్వజుడు, అనయరాజు, నరసింహదేవరాయలు, ప్రతాపరాయలు, జంబుకేశ్వరుడు (1297-1334) వరకు పాలించారని తెలుస్తున్నది.

విజయనగర నిర్మాణానంతరం దీనికి ప్రాముఖ్యత తగ్గింది.

అళియ రామరాయల సంతతికి చెందినవారు 12 తరాల వరకు దీన్ని పాలించారు. తర్వాత వీరిలో చివరివాడైన తిరుమల దేవరాజు (1756-1786) సోదరి 'చెల్లమ్మ' సంతతివారు, ఆ తరువాత తిరుమల దేవరాజు దౌహిత్రి "కేశవమ్మ" సంతతివారు దీన్ని పాలించారు.

నరపతి సంస్థానాన్ని పాలించిన ఆర్వీటి వంశంవారు కవి పండిత పోషకులు.

శ్రీరంగరాజుకు అన్న అయిన తిరుమలదేవరాజు "దోనూరు కోనేరుకవి" విరచితమైన బాలభాగవతాన్ని అంకితం పొందాడు. రామరాజభూషణుడు అళియరామరాయల ఆస్థానకవి. ఇతని వసుచరిత్రాది గ్రంథాలు జగత్ప్రసిద్ధాలు.

అళియరామరాయల పౌత్రుని పౌత్రుడైన కోదండరామరాజు అందుగుల వెంకయ్య వ్రాసిన రామరాజీయమను నామాంతరం కల నరపతివిజయాన్ని అంకితంగా గ్రహించాడు. ఇతని తమ్ముడు అరవీటి తిమ్మరాయలు ద్విపద రామాయణ కావ్యకర్త. ఇది విరూపాక్షస్వామికి అంకితం. ఈ వంశంలోని వాడైన చిన వేంకట రాయలు, కుమార ధూర్జటి శ్రీ రామునికి అంకితంగా వ్రాసిన "కృష్ణరాయ విజయ" కావ్యానికి ప్రేరకుడు.

ఆనెగొంది సంస్థానాన్ని ఆశ్రయించిన కవి వంశాలలో అంబాళం వారి వంశం ప్రసిద్ధమైనది. అంబాళం రఘునాథాచార్యులు భారత చంపువునకు వ్యాఖ్య రచించాడట. నరసింహాచార్యులు విశ్వగుణాదర్శ వ్యాఖ్యాత.

క్రీ. శ. 1860 ప్రాంతం వాడైన కొండరామకవి 'గవి రంగనాథ శతక' కర్త. ఇతడు తిరుమల దేవరాయల కాలంవాడు.

రాణి కుప్పమ్మగారి దత్తపుత్రుడైన శ్రీరంగరాయలు ఆంధ్ర సాహిత్య పోషకుడు. 1915లో బళ్ళారిలో జరిగిన ఆంధ్రసాహిత్య పరిషత్సభకు ఆనెగొందిరాజా శ్రీ శ్రీరంగరాయలు అధ్యక్షులై, ఆంధ్ర భాషాభివృద్ధికి కృషిచేశారు.

పానుగంటి లక్ష్మీ నరసింహారావు కొంతకాలం ఆనెగొందిలో దివానుగా పని చేశారు.

ఆంధ్రవర్ణ దర్పణం, భాషాపరిణామం మొ॥ రచనలు చేసిన శ్రీ ఇమ్మాని వేంకట గోవిందరావునాయని వారు 1904లో ఈ సంస్థాన పండితులుగా ఉన్నారు.

శ్రీరంగ దేవరాయల కుమారులైన శ్రీమంత్ సర్కార్ శ్రీకృష్ణదేవరాయల వారు కర్ణాటాంధ్రభాషాభిమానులు. నూతలపాటి పేరరాజుకవి 'విజయనగర చరిత్రము' అనే గ్రంథం వ్రాసి ఈ రాజుకు అంకితం ఇచ్చారు. (ఆం. స. సా.)

**ఆపస్తంబశ్రౌతసూత్రవ్యాఖ్య**

కర్త : అవివేశ్వ వేంకటశాస్త్రి. (తె.వి.స.4)

**ఆపస్తంబ షట్కర్మ నిబంధనమ్ (సం)**

కర్త : కాకునూరి అప్పకవి.

**ఆమడూరి నరసింహభట్టు**

కాలం : క్రీ.శ. 1590 కి పూర్వం.

రచన : షోడశరాజ చరిత్ర (అలభ్యం.)

విశిష్టత : వెన్నెలకంటి అన్నయ్య షోడశకుమార చరిత్ర వ్రాసినట్లే, ఈయన షోడశరాజచరిత్ర అనేకావ్యం వ్రాసినట్లు పెదపాటి జగన్న ప్రబంధ రత్నాకరంలో ఉదాహరించిన పద్యం వల్ల తెలుస్తున్నది. సాంప్రదాయం ప్రకారం పురాణాలలో షట్చక్రవర్తులు, షోడశమహారాజులు ఉన్నారు. గయునినుంచి భగీరథుని వరకు ఉన్న 18 మంది రాజులచరిత్రను వివిధ కాలాలలో వివిధ కవులు తెలుగులో కావ్యాలుగా వ్రాశారు. (అప్ర-8)

ఆముక్త మాల్యద

నామాంతరం : విష్ణుచిత్తీయము.

కర్త : శ్రీకృష్ణ దేవరాయలు.

తెలుగులో మహాకావ్యాలలో ఒకటి.

ఈ ప్రబంధంలో ఏడు ఆశ్వాసాలున్నాయి. కాని కథ స్వల్పం. గోదాదేవి అనే కన్యకను శ్రీ రంగేశ్వరుడు వివాహం చేసుకోవడం ప్రధాన ఇతివృత్తం. భూదేవి అవతారమైన గోదాదేవి విష్ణుచిత్తుడనే వైష్ణవభక్తునికి దొరుకుతుంది తండ్రి విష్ణుచిత్తుడు స్వామికి అర్పించమని ఇచ్చిన పుష్పమాలను ముందు తన కొప్పులో ముడుచుకొని, ఆ తరువాత శ్రీ రంగేశ్వరునికి అర్పిస్తుంది. తాను ముడుచుకున్న మాలను స్వామికి అర్పించటం వల్ల గోదాదేవికి "ఆముక్తమాల్యద" అని పేరు వచ్చింది. శ్రీవిల్లిపుత్తూరు నివాసి. పరమ భాగవతోత్తముడు, గోదాదేవి తండ్రిఅయిన విష్ణుచిత్తుని కథ దీనిలో ముఖ్యమైంది. కాబట్టి దీనికి విష్ణుచిత్తీయమనే నామం వ్యాప్తిలోకి వచ్చింది. విశిష్టాద్వైతమే శ్రేష్ఠమని చాటినగ్రంథం. ఖాండిక్య కేశధ్వజుల సంవాదం ముఖ్యమైనది. గోదాదేవికథ, మాలదాసరి కథ, మాలదాసరివల్ల విముక్తిపొందిన బ్రహ్మరాక్షసికథ ఇందులో ఉన్నాయి. నాలుగో ఆశ్వాసంలో యామునాచార్యుని చరిత్ర వర్ణితం. యామునాచార్యుడు అన్యమతస్థులను ఓడించి పాండ్యరాజుచేత వైష్ణవమతం స్వీకరింపజేసి, రాజు సోదరిని పరిణయమాడాడు .

రాయలు సమకాలిక జీవితాన్ని సునిశితంగా పరిశీలించి తన కావ్యంలో పొందుపరిచాడు ఈ కావ్యంలో కథా వైచిత్రికన్న, విశిష్టాద్వైత ప్రశస్తి, రాజనీతి ఉత్ప్రేక్షాది అలంకారాలలో ప్రబంధోచిత వర్ణనలకు ప్రాముఖ్యం ఇవ్వబడింది. ఋతువర్ణన పురవర్ణనలు ఇంత హృద్యంగా ఉన్న కావ్యాలు చాలా తక్కువ. (క. త. 7)

ఆముక్తమాల్యద - వ్యాఖ్యానము

కర్త : తెలియదు.

100 పత్రాల ప్రతి సాహిత్య పరిషత్పుస్తక భాండాగారంలో ఉంది. అన్ని పద్యాలకూ అర్థం వ్రాయకుండా కర్త కొన్నింటికి అర్థం కొన్నింటికి భావం వ్రాశాడు. (సా. స.)

ఆముఖము

గ్రంథాన్ని గురించి చెప్పటం.

చూ. అవతారిక. (వా. చ. -1)

ఆయుర్వేద సుధానిధి (సం)

కర్త : సాయణాచార్యుడు.

ఇది వైద్య శాస్త్ర గ్రంథం. (త. వి. స-1191)

అయ్యవాళ్

నామాంతరము : చూ. శ్రీధర వేంకటేశాచార్యుడు.

ఆరతి

చూ. మంగళము.

ఆరవీటి కోదండ రామరాజు

నామాంతరం : రామరాజు.

కాలం : 17 వ శతాబ్దం.

విజయనగర సామ్రాజ్యాధిపతి. సాహిత్య పోషకుడు. ఇతడు అళియ రామరాయల మనుమని మనుమడు.

అందుగల వెంకయ్య చేత అరవీటి వారి వంశ చరిత్రను "రామ రాజీయము"నే కావ్యంగా వ్రాయించి అంకితం పొందాడు. (ఆరుద్ర-10 199)

ఆరవీటి కోనేటమ్మ

కాలం : 17వ శతాబ్దం.

స్థలం : విజయనగరం.

కవి పండిత పోషకురాలు.

అరవీటి తిరుమల రాజు పత్ని. అరవీటి వారి వంశ చరిత్రను చెప్పిన అందుగల వెంకయ్య తన రామ రాజీయంలో ఈమెను ప్రస్తుతించాడు. కవులను పోషించి కృతులను అంకితం పొందినదట. (ఆరుద్ర 10-199)

ఆరవీటి చిన వేంకటరాజు

కాలం : క్రీ. శ. 17వ శతాబ్దం - పూర్వార్ధం.

ఆరవీటి కోదండ రామరాజు కుమారుడు. తల్లి నాంచారమ్మ. ఇతడు సాహిత్య ప్రియుడు. కృష్ణదేవరాయల ఆస్థానకవియైన ధూర్జటి మనుమని పౌత్రుడైన కుమార ధూర్జటికి పోషకుడు. అతనిని ప్రోత్సహించి శ్రీరామచంద్రునికి అంకితంగా 'కృష్ణ రాయ విజయము' అనే గ్రంథాన్ని రచింపజేశాడు. ఆరవీటి, అవుకు అనే ఇంటి పేర్లతో ఇద్దరు చిన వేంకటరాజులు చరిత్రలో కనిపిస్తున్నారు. వారిలో ఎవరు కుమార ధూర్జటికి ఆశ్రయమిచ్చారనే విషయం మీద భిన్నాభిప్రాయాలున్నాయి. (ఆ.తె.)

ఆరవీటి తిమ్మరాజు

నామాంతరం : అరవీటి తిరుమల రాజు.

కాలం : 17 వ శతాబ్దం - ప్రథమార్ధం.

రచన : ద్విపదరామాయణము.

అరవీటి రాజవంశంలోని వాడు. సాహిత్య ప్రియుడు. ఆరవీటి కోదండరామ రాజుకు తమ్ముడు. తన కావ్యాన్ని "విరూపాక్ష స్వామికి" అంకితం ఇచ్చాడు. (ఆం. సం. సా.)

ఆరవీటి తిరుమలరాజు

నామాంతర : చూ. అరవీటి తిమ్మరాజు. (ఆరుద్ర 10-199)

ఆరాత్రికము

చూ. మంగళము.

ఆరాధ్యుల నామావళులు

నామాంతరం : సహస్రగణమాలిక.

కర్త : మల్లికార్జున పండితారాధ్యుడు.

ఇది తెలుగు, కన్నడ భాషలలో విరచితం. (ద. దే. వా-316)

ఆరుంబాక శాసనము (సం)

కాలం : క్రీ. శ. 980 ప్రాంతం.

శాసన కర్త : అయ్యనభట్టు.

శాసనం వేయించిన వాడు : రెండవ యుద్ధ మల్లుని కుమారుడు విజయాదిత్యుడు (చాళుక్య మహారాజు).

విషయం : ఇది తామ్ర శాసనం. సంస్కృత శాసనమైనప్పటికి శ్లోకాల మధ్య యతి ప్రాసలతో కూడిన తెలుగు కంద పద్యం సంస్కృతంలో ఉంది. (తె. క. చ-97)

ఆరెమరాఠీల కథ

కర్త : తెలియదు.

జానపద చారిత్రక గేయం. బహుళ ప్రచారంలో ఉంది.

చూ. చారిత్రక గేయములు.

ఆర్యకుడు

నామాంతరం : ఘనశ్యాముడు.

ఆర్యా శతకము (అలభ్యం)

కవి : గింతలపల్లి గోపాలయ్య (చూ.).

అంకితం : వజ్రగిరిలోని గోపాలునికి.

కవి దీన్ని ఒక జాము కాలంలో చెప్పాడట ఇది సంస్కృత శతకమని కొందరి అభిప్రాయం. (ఆం. సం. సా; అరుద్ర. 11-204)

ఆర్యాశతీ శివస్తోత్రమ్ (సంస్కృతం)

రచన : పాపయారాధ్యులు (చూ).

పాపయారాధ్యుల వారి సంస్కృత కృతులలో ఇది ఒకటి. (ఆం. సం. సా.)

ఆలపాటి

గ్రామ నామం. వ్యవహారంలో ఇంటిపేరుగా ప్రచారంలోకి వచ్చింది. ఇది ఉత్తర ఆర్కాటు జిల్లాలోని వాలాజ తాలూకాలో ఉంది. ప్రస్తుతం ఇది తమిళనాడు రాష్ట్రానికి చెందిన గ్రామం. కొందరు తెలుగు వారు ఈయింటి పేరుతో ప్రసిద్ధులైనారు. ఉత్తర ఆర్కాటులోని షోలింగరు క్షేత్ర ప్రసక్తి తెలుగు కావ్యాలలో కనిపిస్తున్నది. (య. వా. చ-367)

ఆలపాక పెద్దు

కాలం : 1816 జీవించాడు.

స్థలం : ఆలపాక.

రచనలు : కల్యాణ నాటకము.

అంకితము : బిల్వేశ్వరస్వామికి.

ఈ కవి పాపాంబా వైద్దెప్పల పుత్రుడు. లింగమాంబా పెద్దనల పౌత్రుడు.

ఆలపాక ఉత్తరార్కాటు జిల్లాలో ఉంది. బిల్వేశ్వర స్వామి క్షేత్రమైన 'తిరువలం' కూడా అక్కడిదే. దీనినే బిల్వపురి అని వ్యవహరిస్తారు. "బిల్వపురి కోకిలాంబ" కవికి ఇలవేల్పు. (యు. వా. ప. 86)

ఆలూరి కుప్పన కవి

కాలం : 18 వ శతాబ్ది ఉత్తరార్ధం.

స్థలం : చెన్నపురి ప్రాంతం.

రచనలు : 1. పంచనదీ స్థల పురాణము (అనువాదము) 2. రామాయణము (యక్షగానం) 3. భాగవత దశమస్కంధము (యక్షగానం) (పార్థ సారధి విజయము) 4. పరమ భాగవత చరిత్ర 5. ఇందు మతీ పరిణయము 6. హరి కథాసుధారసము. 7. ఆచార్య విజయము.

బిరుదు : ఆంధ్ర కాళిదాసు.

గురువు : కస్తూరి రంగ కవి.

సరళంగా, రసవంతంగా కవిత్వం చెప్పిన కవి.

ఇతని రచనలలో ఆచార్య విజయము, భాగవత యక్షగానంలో దశమస్కంధం మాత్రం లభించాయి. భాగవతంలోని దశమ స్కంధాన్ని మాత్రమే యక్షగానంగా పార్థసారధి విజయమనే పేర రచించినట్లు తెలుస్తోంది.

తుళజేంద్రుడు ఇతనికి, ఆంధ్ర కాళిదాస బిరుదాన్నిచ్చాడట. ఇతడు రెండవ తుల జాజీ (1729-35) కావచ్చును. (ప. దే. వా 249)

ఆలూరి నరసింహ కవి

కాలం : క్రీ. శ. 1759 ప్రాంతం.

స్థలం : మైసూరు.

బిరుదు : నవీన కాళిదాసు.

రచన : నంజరాజ యశోభూషణమ్ (సం).

ఇతని తెలుగు రచన లేమీ తెలియరాలేదు. మైసూరు సంస్థానాయకుడైన నంజరాజుకు ఆశ్రితుడు. (ఆంధ్రప్ర-12-83 ; ప. దే. వా-481)

ఆవల్ సత్రం రామలింగయ్య

కాలం : 1889 ప్రాంతం.

స్థలం : ఎట్టియాపురం సంస్థానం (తమిళదేశం).

రచనలు : తెలియరాలేదు.

జగదీశ్వర రామకుమార ఎట్టప్ప మహారాజు ఆస్థానంలోని ఆంధ్రద్రావిడ మహాకవి. (ద. దే. వా. 513)

ఆశుకవిత

చతుర్విధ కవితాభేదాలలో ఒకటి.

కొందరు కవులు సాధారణంగా బాగా ఆలోచించి, సావధానంగా కవిత చెబుతారు. అలా కాకుండా, కవులు కొందరు వచనంలో మాట్లాడినట్లే అతివేగంగా భావాలను ఛందోనియమబద్ధంగా వ్యక్తం చేస్తారు. దీనినే ఆశు కవిత్వమంటారు.

ఆశుకవితలో ఆశుకవిత, సమస్యాపూరణం, శతలేఖినీ, సమయలేఖినీవిద్యలు మాలికా కవిత్వం అనే విభాగాలున్నవి.

తత్కాలోచితంగా, త్వరితగతిని, నిరర్గళంగా ధారాశుద్ధితో కవిత చెప్పడమే ఆశుకవిత.

కొందరు గంటకు నూరుపద్యాలు చెప్పి శత ఘంటకవులుగా ప్రసిద్ధులయ్యారు. తెలుగుదేశంలో జక్కన, పెద్దన, భట్టుమూర్తి, చరిగొండ ధర్మన, మాడభూషి వేంకటాచార్యులు, తిరుపతి వేంకటకవులు, కొప్పరపు కవులు, ఆశు కవితకు పేరొందినవారు. (తె. వి స-6)

ఆశ్వలాయన గృహ్య సూత్రములు (సం)

కర్త : అనంతరాయ మఖి

ఆశ్వాసము

కావ్యపరి భాషలో కథాంశముల విభాగాన్ని ఆశ్వాసము అంటారు. ఆశ్వాసము అంటే ఊపిరి పీల్చుకోవడం అని అర్థం. ఒక్కొక్క విభాగమూ ఒక సారి సునాయాసంగా చదవదగిన భాగం అన్న ఉద్దేశంతో ఈ ఆశ్వాసము అనే పదప్రయోగం ఏర్పడి ఉండవచ్చును (కావ్యాలంకార సంగ్రహం-267)

ఆషరంశాయి

కాలం : 18 వ శతాబ్దం.

స్థలం : పుదుకోట.

ఖడ్గ లక్షణ శాస్త్రం అకళింపు చేసుకొన్నవాడు. ఖడ్గ పరీక్షలో నిపుణుడు. "ఖడ్గ లక్షణ శిరోమణి" కర్త నవనప్ప ఇతని నుండి కొంత విషయ సేకరణ చేశాడట (ఖ. ల. శిరో.)

ఆసఫ విలాసమ్ (సం)

కర్త : జగన్నాథ పండితరాయలు.

శ్లోకాలతో అసఫఖాన్‌ను ప్రశంసిస్తూ వ్రాసిన గ్రంథం. అసఫ్‌ఖాన్ ఢిల్లీ దర్బారులోని సైనికాధికారి. చక్రవర్తిని దర్శించడంలో కవికి చాలా తోడ్పడ్డాడట. అతనిపై కవి చెప్పిన కావ్యమిది. (తె. వి. స-4)

### ఆసూరి మరింగంటి సింగరాచార్యులు

నామాంతరం : మరింగంటి సింగరాచార్యులు. (తె. వి. స-6)

### ఆస్థాన సంతోషి

నామాంతరం : కటికము (చూ).

దక్షిణాంధ్ర యక్షగానాలలో ఈపాత్ర బాగా రూపు కట్టింది. ఆంధ్ర యక్షగానాలలో కూడా ఈ హాస్య పాత్ర ఉంది. ఇది విదూషక పాత్ర వంటిదే అయినా ఇతని దొంత వెర్రిగొల్లని వాలకం. రాజులు హాస్యచతురులై ఇతనికి మిక్కిలి చనువు ఇస్తుంటారట. ఇతడు తన సహజ వికృతాకార చేష్టాభాషణాదులతో (కొంత సత్తిగాని, చెవుడు గాని నటించి) హాస్యాన్ని ప్రదర్శిస్తాడు. తంజావూరు కవులు ఈ పాత్రను ముచ్చట దీర చిత్రించారు. శహాజీ యక్షగానాలలో ఇది మరీ విశిష్టమైన పాత్ర. ఇతన్ని 'వికటాంగుడని' శహాజీ వ్యవహరించాడు. (య. వా. పు-203)

### ఆహ్నికము

పారిభాషిక పదం. గ్రంథ విభాగం. ఆహ్నికం అంటే ఒక రోజులో నిర్వర్తింప బడినది అనిగాని, రచింప బడినది అనిగాని, చదువదగినది అనిగాని అర్థం. వ్యాకరణ మహాభాష్యం యొక్క పాదాల (అష్టాధ్యాయి) భాగానికి ఆహ్నికమని పేరు. తెలుగులో ఈ రకమైన విభాగం లేదు.

### ఆళ్వారులు

దక్షిణ భారతదేశంలో అవతరించిన వైష్ణవ భక్తులు పన్నెండుమంది ఉన్నారు. వీరికే 'గురు పరంపర' అని వ్యవహారనామం. కారణ జన్ములు. విష్ణువు అంశచేత వివిధ ప్రాంతాలలో వివిధ వర్ణాలలో జన్మించారు. అందరూ వైష్ణవ సిద్ధాంతాన్ని ప్రబోధించినవారే.

కలియుగారంభంలో జన్మించారని వైష్ణవ సాంప్రదాయం ద్వారా తెలుస్తున్నది కాని ఆధునిక చరిత్రాన్వేషకులు క్రీస్తు తరువాత రెండు, ఎనిమిది శతాబ్దాల మధ్య కాలంలో వెలసినట్లు పేర్కొన్నారు.

ఈ ఆళ్వారులు భగవదర్చా విగ్రహ రసపాన మత్తులు. బ్రహ్మానుభవంలో ఆరితేరినవారు. 'బ్రహ్మ' యందు ఉన్న తమ ఉనికి బ్రహ్మయొక్క "అస్తిత్వాని"కి రుజువని భావించారు. అంతరశుద్ధి, శీలము మాత్రమే భగవదనుగ్రహానికి మూలమని వీరి నిశ్చితాభిప్రాయం.

అంతరశుద్ధి, సౌశీల్యాదులు వర్ణాన్ని ఆశ్రయించి ఉండవు కదా! కాబట్టే వీరు వర్ణాశ్రమ విభేదాలను పాటించకుండా భగవత్ జ్ఞానాన్ని అందరికీ పంచిపెట్టారు. వీరు వేరు వేరు వర్ణాలలో జన్మించి, భగవత్ జ్ఞానాన్ని సర్వమానవులకు విచ్చలవిడిగా పంచి పెట్టి హిందూ మతానికి పునఃప్రాణ ప్రతిష్ఠను కల్పించారు. భగవంతుని సాక్షాత్కారం

వల్ల కల్గిన దివ్యానందాన్ని ఇతరులకు పంచిపెట్టడమే వీరి ప్రథమోద్దేశ్యం. తమకు కల్గిన సాక్షాత్కారానుభవాన్ని వీరు "పాశుర" రూపంలో రచించి ప్రజలకందించారు.

వీరంతా విశిష్టాద్వైత మత సిద్ధాంతాలకు బహుళ ప్రచారం కల్పించిపెట్టిన దేవదూతలు. పరలోకంలో ఎప్పుడో ప్రాప్తించే 'ముక్తి' జీవితపరమార్థం కాదని, ఈ లోకంలోనే ప్రాప్తమయ్యే భగవత్కైంకర్య రూపమైన "భక్తి" జీవిత పరమార్థమనీ బోధించారు.

పన్నిద్దరాళ్వారులల్లో 'పొయ్గైయాళ్వార్' ప్రథముడు. "కాసారయోగి" అని పేరు. పాంచజన్యాంశలో పుట్టాడు.

'పూదత్తాళ్వార్' ద్వితీయుడు. భూతయోగి అని పేరు. గదాంశలో పుట్టాడు. మహాయోగి అని పిలువబడే 'పేయాళ్వార్' తృతీయుడు. నందక అంశలో పుట్టాడు. ఈ ముగ్గురు సమకాలికులని, ద్వాపరయుగానికి చెందిన వారని వైష్ణవ సంప్రదాయ రచనలు తెలుపుతాయి. వీరు నాలాయిర దివ్య ప్రబంధంలో 'పాశుర' శతకాలు వ్రాసినట్లు తెలుస్తుంది నాల్గవ వాడైన 'తిరుమలిశైయాళ్వార్' చక్రాంశజుడైన 'భక్తిసారయోగి'. ద్వాపర యుగం కడపటి సంవత్సరంలో జన్మించాడు. భక్తిసారయోగి పాడిన పాటలు రెండు వందలకు పైగా దివ్య ప్రబంధంలో ఉన్నాయి. నారాయణ పారమ్యాన్ని వాదించే గ్రంథాలు వ్రాసినట్ల 'నమ్మాళ్వార్లు' ఐదవ వ్యక్తి. ఇతని కాలంలో వైష్ణవ భక్తి పరాకాష్ఠ చెందింది. వైష్ణవులకు వేదతుల్యమైన 'తిరువాయిమొళి' ఇతని రచన. ఇతనిది మధురభక్తి. 'కులశేఖరాళ్వారులు' ఆరవవాడు. వాత్సల్య భావరూపమైన భక్తిని అవలంబించాడు. 'పెరియాళ్వారు', అతని కూతురు 'ఆండాళ్' (గోదాదేవి) తరువాతి ఆళ్వార్లు. గోదాదేవిది మధురభక్తి.

ఆళ్వారులలో ఈమె ఏకైక మహిళ 172 పాశురాలు రచించింది. అందులో 'తిరుప్పావై' మొదటిది. ఇది పరిమాణంలో చిన్నదైన ప్రముఖ రచన. శ్రీవైష్ణవుల నిత్యానుసంధానాల్లో ఒకటి 'తొండరడిప్పొడి ఆళ్వారు' దాస్య భక్తిని అవలంబించాడు. 'విప్రనారాయణుడు'గా ఇతడు తెలుగు సాహిత్యంలో ప్రఖ్యాతి చెందినవాడు. 'తిరుప్పాణాళ్వారు' పంచమ కుల సంజాతుడు. ఆముక్తమాల్యదలోని 'మాలదాసరి'యే ఈ తిరుప్పాణాళ్వారు. భగవంతుని దివ్య సౌందర్య సాక్షాత్కారానుభవానికి ఇతడు నిదర్శనం. ఆళ్వార్లలో 'తిరుమంగైయాళ్వారు' చివరివాడు. ఆరు తమిళ గ్రంథాలు వ్రాశాడు. ఇవి ద్రావిడవేదానికి షడంగాలుగా ప్రసిద్ధి చెందాయి. పూర్వాశ్రమంలో క్షత్రియుడుగా, దుశ్చరితుడుగా ఉన్న ఇతడు, భక్తి ప్రభావానికి లోనై ఆళ్వారులలో ఒకడైనాడు.

నాలాయిర దివ్యప్రబంధంలో "తిరుమంగైయాళ్వారు" రచనలే అధికంగా కనిపిస్తాయి. నమ్మాళ్వారులది రెండవస్థానం. తరువాత 'విష్ణుచిత్తుని' రచనలే అధికంగా ఉన్నాయి.

ఈ రచనలన్నీ తమిళభాషలో ఉన్నాయి. కాని, వాటి ప్రభావం ఇతర భాషలపై చాలా ఉంటుంది. కర్ణాటాంధ్రాది ప్రాంతాలలోని వైష్ణవులకు సహితం ఇవి వేద తుల్యమైన రచనలు. ఈ రచనల ప్రభావం చేతనే ఆముక్తమాల్యదాది ప్రముఖవైష్ణవ పారమ్యబోధకమైన రచనలు వెలువడ్డాయి. (తె. వి. స-6; చైతన్యలహరి-129)

## ఇంగ్లీష్ మెట్టులు

ఇవి మధుర గతిలోసాగే చౌపద్యష్టకాల వంటివి. మూడోపాదంలో రెండు మాత్రలు ఎక్కువగా ఉంటాయి. దీనిలో విశేషమేమీ లేదని, ఇట్టిమెట్లు తెలుగులో చాలా ఉన్నాయని పండితాభిప్రాయం.

కేశవ పట్టణం తియ్యగయ్య వ్రాసిన సీల నాటకంలో దీనిని ఒక విశిష్టమైన దరువుగా పేర్కొన్నాడు. (చూ చౌపద్యష్టకం) (యు. వా. చ-315)

## ఇంటిపేరులేని కొందరు ప్రాచీన కవులు-కవిపోషకులు

ప్రాచీన కవులు కొందరు కృత్యాది పద్యాలలోగాని, ఆశ్వాసాంత గద్యాలలోగాని తమ ఇంటిపేరు చెప్పలేదు. కవులు-తమ, తమ పోషకుల కుల గోత్రాదులు, నివాస స్థానాదులు, తాత ముత్తాతలు, తల్లిదండ్రులు, అన్నదమ్ములు, తల్లి తల్లి, తండ్రి తల్లితో కూడిన విపుల వంశ వర్ణన చేశారు. ప్రాచీన శాసనాలలో కూడా చాలా వాటిలో శాసన దాతల, ప్రతి గ్రహీతల ఇంటిపేరు కనిపించదు. దాన శాసనాలలో వారాలు, వర్జ్యాలు, సంవత్సరాలు మాత్రమే ఎక్కువ కనిపిస్తాయి కవులకు, కవిపోషకులకున్న బిరుదులు కూడా చాలా కనిపిస్తాయి. వేములవాడ భీమకవి, మూలఘటిక కేతన తమ వంశనామాలను చెప్పుకొన్నారు. వంశనామం, ఇంటిపేరు ఒకటేనని-కాదనీ వేర్వేరని పండితుల మధ్య భేదాభిప్రాయాలున్నాయి.

ఇంటిపేరు పూర్వకాలంలో ఉండేది కాదని, కొందరు అంటుంటారు. తెలుగు దేశంలో ప్రాచీన కాలంలో పుట్టిన కవులు, కవిపోషకులు కొందరికి ఇంటిపేరు స్పష్టంగా లేకపోవటం గమనార్హం. కొందరికి వారి పూర్వీకులు నివసించిన గ్రామం పేరో, ఆ వంశంలో ప్రసిద్ధుడైన వ్యక్తిపేరో, లేక బిరుదమో, ఇంటిపేరుగా స్థిరపడటం జరుగుతున్నది. ఇంటిపేరు లేకపోవటానికి కారణాలేమిటో, కొందరికి ఉండటానికి కూడా కారణాలు ఏమిటో తేల్చి చెప్పటానికి ఆధారాలు ఇంచుమించు శూన్యమనే చెప్పాలి.

ఇంటిపేరులేని కొందరు ప్రాచీనాంధ్ర సంస్కృత కవులు-కవిపోషకులు- -

1. నన్నయభట్టు (ఆదికవి) 2. నారాయణభట్టు (నన్నయ సహాధ్యాయుడు) 3. అధర్వణాచార్యుడు (అధర్వణచ్ఛందం) 4. రాజరాజ నరేంద్రుడు (తూర్పుచాళుక్య రాజు) 5. నన్నెచోడుడు (రాజకవి) 6. మల్లికార్జున పండితారాధ్యుడు (శివతత్త్వసారం) 7. శివదేవయ్య (పురుషార్థసారం) 8. శ్రీపతి పండితుడు (శ్రీకర భాష్యం) 9. మనుమసిద్ధి (విక్రమ సింహపురిరాజు) 10. గోకర్ణుడు (గోకర్ణచ్ఛందం) 11. జయ

దేవుడు (జయదేవచ్ఛందం) 12. అప్పన మంత్రి (చారుచర్య) 13. బద్దెన (నీతిశాస్త్ర ముక్తావళి) 14. మంచన (కేయూరబాహుచరిత్ర) 15. మారన (మార్కండేయ పురాణం).

## సంస్కృత కవి పండితులు

16. అచింతేంద్రుడు (అన్మకొండ ప్రశస్తి శాసనకవి) 17. నందిమిత్రుడు (గణపవరం శాసనకవి) 18. అనంతసూరి (పానుగల్లు శాసనకవి) 19 విద్యానాథుడు (అగస్త్యుడు) (ప్రతాపరుద్ర యశోభూషణమ్) (బాలభారతమ్) 20. అప్పయాార్యుడు (జైనకవి) (జినేంద్రకల్యాణాభ్యుదయమ్) 21. గంగాదేవి (మధురా విజయమ్) 22. విశ్వనాథుడు (సౌగంధికాహరణమ్) 23. నరసింహుడు (కాదంబరీ కల్యాణ నాటకమ్) 24. రుద్రదేవుడు (నీతిసారమ్) 25. జయాపసేనాని (నృత్త రత్నావళి).

## పద్మనాయక - రెడ్డిరాజుల యుగాలు

26. మల్లికార్జునభట్టు (భాస్కర రామాయణం) 27. కుమార రుద్రదేవుడు (భాస్కర రామాయణం) 28. అయ్యలార్యుడు (భాస్కర రామాయణం) 29. గౌరన (హరిశ్చంద్ర చరిత్ర) 30. శరభాంకుడు (శరభాంకలింగశతకం) 31. కృష్ణమాచార్యులు (సింహగిరి వచనాలు) 32. దోనయామాత్యుడు (సస్యానందం) 33. కందనామాత్యుడు (నీతి తారావళి) 34. విశ్వేశ్వర కవి చంద్రుడు (చమత్కారచంద్రిక) 35. ఎర్రాప్రెగ్గడ (అరణ్యపర్వశేషం) 36. శ్రీగిరి కవి (పద్యబంధాలు) 37. అనంతామాత్యుడు (భోజరాజీయం) 38. బాలసరస్వతి (ఇప్పగల్లు శాసనకవి) 39 వామనభట్టబాణుడు (వేమభూపాల చరితమ్) 40. శ్రీనాథుడు (కవిసార్వభౌముడు) మొదలయిన వారనేకులున్నారు.

## గజపతి రాజుల, తొలి - మలి రాయల యుగాలు

41. శ్రీధరుడు (శ్రీధరచ్ఛందం) 42. భైరవకవి (శ్రీరంగ మాహాత్మ్యం) 43. మనుమంచిభట్టు (హయలక్షణ విలాసం) 44. ఈశ్వరఫణిభట్టు (పరతత్త్వ రసాయనం) 45. మాడయకవి (మైరావణ చరిత్ర) 46. చంద్రమౌళి (హరిశ్చంద్ర పద్యకావ్యం) 47. దేవరాజ భట్టు (హరిశ్చంద్ర పద్యకావ్యం) 48. రాజనాథ కవి (సాళువాభ్యుదయమ్) 49. శ్రీకృష్ణ దేవరాయలు (ఆముక్తమాల్యద) 50. ధూర్జటి (శ్రీ కాళహస్తి మాహాత్మ్యం) 51. ఈశ్వర దీక్షితుడు (రామయణ వ్యాఖ్య - (సం) 52. భట్టుమూర్తి (రామరాజ భూషణుడు) (నరస భూపాలీయం) (వసుచరిత్ర) 53. అచ్యుత దేవరాయలు (కవి పోషకుడు) 54. తిరుమల రాయలు (కవి పోషకుడు) 55. తిరుమలాంబ (వరదాంబికా పరిణయమ్).

## నవాబుల యుగం

56. హరిభట్టు (మత్స్య పురాణం) 57. విశ్వేశ్వర కవి (విశ్వేశ్వరచ్ఛందం).

## ఆరవీటి రాజుల యుగం

58. ఏకామ్రనాథుడు (ప్రతాప చరిత్ర) 59. పోలమరాజు (పర్వత పురాణం) 60. పోతరాజు (బేతాళ పంచ వింశతి) 61. సిద్ధన ప్రెగ్గడ (శాకుంతలం) 62. పెదకెంపరాయడు

(గంగాగౌరీ విలాసం) 63. భాస్కరాచార్యులు (వాసవీ మాహాత్మ్యం) 64. రాజలింగ కవి (కూర్మ పురాణం).

## ఇంటిపేరులో మనిషిపేరున్న కొందరు ప్రాచీన కవులు-కవిపోషకులు

ప్రాచీన సంస్కృతాంధ్ర కవులకు, కవిపోషకులకు చాలామందికి ఇంటి పేరు (వంశనామం) ఉంది. ఇంటిపేరు గ్రామనామ సూచకంగానో, వృత్తి సూచకంగానో, బిరుదుసూచకంగానో, ప్రజ్ఞాప్రకర్షలను సూచించే విధంగానో ఉంది. కొందరికి అసలు ఇంటిపేరే కనిపించకపోగా, మరికొందరి ఇంటిపేర్లలో మనిషిపేరు స్పష్టంగా కనిపిస్తుంది. వారి వారి వంశంలో తాత ముత్తాతలో, తండ్రులో లేక ఆ వంశంలోని పూర్వులో గొప్పవారయితే ఆ గొప్పవారిపేరే అనంతర తరాలవారికి ఇంటిపేరుగా శాశ్వతంగా నిలిచిపోయినట్లు కనిపిస్తున్నది.

ఇంటిపేరులో మనిషిపేరున్న కొందరు కవులు - కవిపోషకులు (నన్నయ నుంచి క్రీ.శ. 1650 వరకు) -

1. భాస్కరునికేతన (కాదంబరి) 2. గౌరనగారి భైరవ కవి (శ్రీరంగ మాహాత్మ్యం) 3. ప్రోలయ వేమారెడ్డి (అద్దంకి) 4. కోమటి వేమారెడ్డి (కొండవీడు) 5. అయ్యల రాజు త్రిపురాంతకుడు (ఒంటిమిట్ట రఘువీర శతకం) 6 బొప్పరాజు గంగన్న (భాగవతం-షష్ఠస్కంధం) 7. చేచనగారి శంకర కవి (హరిశ్చంద్రోపాఖ్యానం) 8. కూచి రాజు ఎర్రన్న (కొక్కోకం) 9. కాసిరాజు రామయ్య (బృహన్నారదీయం) 10. సిద్ధి రాజు తిమ్మరాజు (పరమయోగి విలాసం) 11. అయ్యలరాజు రామభద్రుడు (రామాభ్యుదయం) 12. మాదయ్యగారి మల్లన (రాజశేఖర చరిత్ర) 13. తిప్పయ్యగారి భానుకవి (పంచతంత్రం) 14. బైచరాజు వేంకటనాథుడు (పంచతంత్రం) 15. రామరాజు రంగప్పరాజు (సాంబోపాఖ్యానం) 16. జక్కరాజు వేంకటకవి ([illegible]) 17. కొండ్రాజు వేంకటాద్రి (రెట్టమత శాస్త్రం - కృతికర్త) 18. గంగరాజు [illegible] (సాముద్రిక శాస్త్రం) 19. భావన పెమ్మన (శివయుద్ధ చరిత్ర) 20. [illegible] (విష్ణుకథానిధానం) 21. కంచిరాజు సూరయ్య (కన్నప్ప చరిత్ర) 22. దామరాజు సోమయ్య (భరత శాస్త్రం) 23. పోతరాజు వీరయ్య (త్రిపుర విజయం) 24. ముద్దరాజు పెదరామన (రాఘవ పాండవీయవ్యాఖ్య) 25. శ్రీపతి భాస్కరకవి (చిత్రశతకం) 26. భద్రకవి లింగకవి (దేవాంగ పురాణం) 27. పెద్దిరాజుగారి రామరాజు (సీతమ్మ శతకం) 28. నాచన్నగారి సూరన్న (వనమాలి విలాసం).

## ఇందిరాల గోదా పారిజాతము

నామాంతరం : ఇందిరాల భాగవతము.

కర్త : మరింగంటి వేంకట (ద్వితీయ) నృసింహాచార్యులు.

ఇది కూచిపూడి భాగవతమట. యక్షగానమని కొందరంటున్నారు. అముద్రితం. (తె. వి. స-6)

## ఇందిరాల భాగవతము

నామాంతరం : ఇందిరాల గోదా పారిజాతము.

కర్త : మరింగంటి వేంకట (ద్వితీయ) నృసింహాచార్యులు.

## ఇందీవరాక్షుడు

అల్లసాని పెద్దన రచించిన మను చరిత్రలోని ఒక పాత్ర

ఇతడు గంధర్వరాజు. స్వరోచికి మేనమామ (వరూధిని సోదరుడు కావచ్చును). బ్రహ్మ మిత్రుడనే ముని, శిష్యులకు ఆయుర్వేద విద్య నేర్పుతూ ఉండగా, ఇతడు వెళ్ళి ఆ విద్యను తనకు నేర్పుమని అడుగుతాడు. ఆ ముని రాచ బిడ్డలకు నేర్పనని నిరాకరించాడు ఇందీవరాక్షుడు శాంబరీ మాయతో బ్రాహ్మణ బాలుడై అముని వద్దనే విద్య నేర్చుకొని తరువాత నిజ రూపం ధరించి నీవు నేర్పనంత మాత్రాన నేను నేర్చు కోలేనా అని గర్వంతో మునిని ఈసడించాడు. ముని ఆగ్రహంతో ఇతనిని రాక్షసునివి కమ్మని శపించాడు. కాళ్ళ మీద పడి బతిమాలగా శాపవిమోచనాన్ని అనుగ్రహించాడు. శాపఫలితంగా ఇందీవరాక్షుడు రాక్షసుడై కన్న కూతరైన మనోరమనే బాధిస్తుంటాడు. మనోరమ స్వరోచిని శరణు వేడుతుంది. స్వరోచి ప్రయోగించిన అగ్నేయాస్త్రంతో ఇందీవ రాక్షుడికి రాక్షస రూపం పోయి శాపవిమోచనం కలిగింది. కూతురు మనోరమను స్వరోచి కిచ్చి వివాహం చేసి తాను నేర్చిన ఆయుర్వేద విద్యను అల్లునికి అరణంగా ఇచ్చాడు.' వంచన, అహంకారం తగవని ప్రబోధించడానికి కవి ఈ పాత్రను మలిచాడు. (మనుచరిత్ర - పీఠిక)

## ఇందుపురేమి ధర్మాజి

కాలం : క్రీ. శ. 16 శతాబ్ది చివరిభాగం.

సాహిత్య పోషకుడు. హరివంశం (ఆశ్చర్యపర్వం - శేషధర్మాలు) కావ్య రచయిత తామరపల్లి తిమ్మయ్యను పోషించాడు. ఈయన ప్రోత్సాహం వల్లనే తిమ్మయ్య కావ్యం వ్రాసి శ్రీరామునికి అంకిత మిచ్చాడు. ఈ ధర్మాజీ పెదతండ్రి నారాయణరావు అనే అయన గోలుకొండ నవాబుల దగ్గర ఉద్యోగి. ఈ నారాయణ రావును, నవాబు కుతుబ్‌శాహి (క్రీ శ. 1580) ని తిమ్మయ్య తన కావ్యంలో నుతించాడు. పెదతండ్రి నారాయణరావు వలెనే ధర్మాజీ కూడా గోలకొండ నవాబుల దగ్గర ఉద్యోగి కావచ్చునేమో! (అరుద్ర-9-238)

## ఇందుమతీ కల్యాణము

కర్త : అంగద బసవయ్య.

ప్రత్యేకత : కావ్యం పూర్తిగా దొరకలేదు. కొన్ని పద్యాలు మాత్రం లభించాయి. పెదపాటి జగ్గన్న తన సంకలన గ్రంథమైన ప్రబంధ రత్నావళిలో దీనిలో నుంచి 5 పద్యాలను ఉదాహరించాడు. ఈ పద్యాలు పురవర్ణన, వారకాంతల వర్ణన, సూర్యోదయ వర్ణన, ఇందుమతి మీద తండ్రి భోజుడు అక్షింతలు చల్లే వర్ణన, పుత్రోదయ వర్ణనలకు సంబంధించి ఉన్నాయి.

క్రీ.శ. 1500 నుంచి 1900 వరకు తెలుగులో సుమారు 12 మంది కవులు ఇందుమతీ కల్యాణాన్ని కావ్యంగా వ్రాశారు. (ఆరుద్ర-8-83)

**ఇందుమతీ కల్యాణము**

కర్త : తెనాలి రామభద్రకవి.
రచనా కాలం : 1575 ప్రాంతం.
అంకితం : పాలచూరి కృష్ణనృపాలునికి.

నాలుగాశ్వాసాల కావ్యం.

ప్రత్యేకత: ఇందుమతీ కల్యాణాన్ని తెలుగులో చాలామంది వర్ణించారు. రఘువంశంలోని అజమహారాజు ఇందుమతిని వివాహం చేసుకోవటం ఇందులోని ఇతివృత్తం. కాళిదాసు సంస్కృతంలో వ్రాసిన రఘువంశంలోని పంచమ సర్గ నుంచి అష్టమ సర్గదాకా బహుశా దీనికి మూలమై ఉంటుంది. ఈ కావ్యాన్ని తెనాలి రామభద్ర కవికంటె ముందుగా ముగ్గురు కవులు తెనిగించారు. వారు పెనుమత్స వేంకటాద్రి, అంగిరస బసవయ్య, చిత్రకవి అనంతకవి. రామభద్రకవి తరవాత దీనిని ఎనిమిది మంది కవులు (క్రీ. శ. 1500 నుంచి 1900 వరకు) తెలుగులోకి అనువదించారు.

రామభద్రకవి కవిత్వం మనోహరమైనది. (ఆరుద్ర-8-131)

**ఇందుమతీ కల్యాణము (అలభ్యం)**

కవి : పెనుమత్స వేంకటాద్రి (చూ).

**ఇందుమతీ పరిణయము (అలభ్యం)**

కవి : అబూరి కప్పన.
రచనాకాలం : 18 వ శతాబ్దం. (ఆ. తే. వా. - 201)

**ఇందుమతీ పరిణయము**

కర్త : కామసూరి కృష్ణయ్య.
రచనా కాలం : 1700 ప్రాంతం.

ఐదాశ్వాసాల ప్రబంధం. మూలం రఘువంశ కావ్యంలోని అజ మహారాజు చరిత్ర. ఇందులోని కవిత్వం హృద్యంగా ఉంటుంది. (కే. వ - 42)

**ఇందుమతీ పరిణయము**

కవి : కుమార ధూర్జటి (చూ).
అంకితం : మేకా పినపప్పరాజుకు (నరసింహపప్పరాజు).
రచనా కాలం : 16 వ శతాబ్దం.

ఆరాశ్వాసాల ప్రబంధం. కృష్ణరాయ విజయానికి ముందే కవి దీన్ని వ్రాశాడు. సంస్కృత రఘువంశంలోని 5,6, సర్గలు ఆధారంగా కథ నడచినా స్వతంత్ర కల్పనలున్నాయి. అభంగ శృంగార రససంగతంగా తాను కావ్యాన్ని రాసినట్లు కవి చెప్పుకొన్నాడు.

తిరుపతి వేంకటకవుల పరిష్కారణతో ఈ గ్రంథం ముద్రింపబడింది. (ఆరుద్ర 10-203)

**ఇందుమతీ పరిణయము (అలభ్యం)**

రచనా కాలం : 1580 ప్రాంతం.
కర్త : చిత్రకవి అనంతకవి. (ఆరుద్ర-9)

**ఇందుమతీ పరిణయము (అలభ్యం)**

కర్త : పోలూరి గోవిందకవి (చూ).

ప్రబంధం. దీనిని గురించిన వివరాలు తెలియరావడం లేదు. కావలి వేంకట రామస్వామిగారు ఇది గోవిందకవి రచన అని పేర్కొన్నారు. ఇతడు తంజావూరి రాజుల కాలంవాడు. (ద. దే. వా. 235)

**ఇందుమతీ పరిణయము (అలభ్యం)**

కర్త : చూ. మండపాక పేరయకవి.
కాలం : 1800 ప్రాంతం.

ప్రబంధం. కర్త విద్వత్కవి, మండపాక పార్వతీశ్వర కవికి పితామహుడు. వివరాలు తెలియవు. (ఆం. సం. సా-307)

**ఇందుశతకము**

కాలం : 17 వ శతాబ్ది ప్రారంభం.
కవి : పుసులూరి సోమరాజకవి.

ఇందుశతకానికి "చంద్రదూత శతకి"మని నామాంతరముంది.

పుసులూరి సోమరాజకవి ఇందుశతకంలో రాధాకృష్ణుల ప్రణయాన్ని, గోపికా విరహాన్ని రసవంతంగా శృంగార రసభరితంగా చిత్రించినాడు. దీనిలో 'ఇందూ నంద నందను మందనుండికద నీవేతెంచుటన్ రాకలన్" అనే మకుటము ఉన్నది. ఈ శతకంలో కవి లీలాశుకుని శ్రీకృష్ణకర్ణామృతము, జయదేవుని గీతగోవిందము, పోతనామాత్యుని భాగవత పద్యాల ననుసరించినాడు. ఈ కవి లీలాశుకుని కర్ణామృతము ఆంధ్రీకరించిన వెలగపూడి వేంగయకవికి తరవాతివాడు. (శ. సా. వి 527)

**ఇంద్ర విజయము (అలభ్యం)**

కర్త : నన్నయ భట్టు.

ఇది ప్రబంధ మట. ఈ గ్రంథం నన్నయకృతం కాదని చాలమంది విమర్శకులు నిర్ణయించారు.

**ఇంద్రసేనము**

కర్త : పేరు తెలియదు.
కాలం : క్రీ. శ. 18వ శతాబ్దం.

'ఉదాహరణ పద్యములు' సంకలనం చేసిన అజ్ఞాత గ్రంథ సంధాతకు ముందున్న కావ్యం.

ప్రత్యేకత : అజ్ఞాత గ్రంథ సంధాత కావ్యాల పేర్లే చెప్పి, కవి పేరు చెప్పకుండా విడిచాడు. ఈ కావ్యకర్త తెలియకపోయినా, గ్రంథం ప్రబంధం అయి ఉంటుందని ఇందులోని పురవర్ణనకు సంబంధించిన పద్యం చెబుతున్నది (ఆరుద్ర-9)

ఇంద్రాత్మజా పరిణయము

కర్త : పాపయారాధ్యులు (చూ.). (ఆ.సం సా.)

ఇటికెల (ఇటుకల) తిమ్మయ్యసెట్టి

కాలం : 18వ శతాబ్దం కావచ్చు.

రచన : కన్యకా పురాణము (కన్యకా చరిత్రము) (యక్షగానం).

గురవయసెట్టి మనుమడు. తిమ్మనయ్య కుమారుడు. ఇతని గురువు శివరామయ్య అని కొన్ని ప్రతులలోను కృష్ణ మాహ్వయుడని కొన్ని ప్రతులలోను ఉంది. సలక్షణమైన భాషలో రచనచేశాడు. ఇతనికిముందే కన్యకా పురాణాన్ని భాస్కరాచార్యులు పద్య కావ్యంగా రచించాడు. (య. వా. చ)

ఇతిహాసము

కావ్య భేదం. పూర్వరాజాదుల కథలను తెలిపేది ఇతిహాసం ఉదా:- భారత రామాయణాదులు. పురాణంలో కూడా కథలు చాలా చేరి ఉండటం వల్ల కాలక్రమంలో ఇతిహాస మనగా చిన్నది, పురాణ మనగా పెద్దది అనే భావం వ్యాపించి ఇతిహాసానికీ పురాణానికీ అంత భేదం లేకుండా పోయింది. పురాణ పదాన్నే రెంటికీ వాడటం సామాన్యమైంది. (కావ్యాలంకార సంగ్రహం)

ఇతిహాసము - పురాణము

వ్యుత్పత్తిని బట్టి ఇతిహాస పురాణ శబ్దాలు రెండూ కొంచెముంచుమించుగా సమానార్థకాలుగానే కనిపిస్తాయి. క్రమంగా వాఙ్మయంలో వాటికి భిన్నార్థా లేర్పడినాయి. ఇతిహాసం కథా ప్రధానం. పురాణానికి పంచలక్షణాలు ప్రాచీనులు పేర్కొన్నారు. సర్గము, ప్రతి సర్గము, వంశము, మన్వంతరము, వంశాను చరితం అనేవి ఆ అయిదు లక్షణాలు.

(ఇతిహాసం కథా ప్రధానం. పురాణం సర్గ, ప్రతి సర్గాది పంచలక్షణోపేతం) పురాణాలలో క్రమంగా వర్ణనలు, కథలు ప్రవేశించాయి. అందువల్ల ఇతిహాస పురాణ పదాలకు రెంటికీ ఇప్పుడు సామాన్యంగా పురాణ పదాన్నే వాడుతున్నారు.

ఈ రెంటిలోను దేశ చరిత్ర, సంఘ చరిత్ర, నీతి, ధర్మము, క్షేత్రప్రాశస్త్యం మొదలయిన వివిధ విషయాలు కథా రూపంగా ఉంటాయి. వ్యాసుడు తన భారతాన్ని సంహిత, ఆఖ్యానము, ఉపాఖ్యానము, కథ, కావ్యము, పురాణము, ఇతిహాసము అని వివిధ నామాలతో పేర్కొన్నాడు.

తెలుగులో మారన మార్కండేయ పురాణం, శ్రీనాథుని కాశీఖండ భీమ ఖండాలు-స్కాందపురాణాంతర్గతాలు. మడికి సింగన పద్మ పురాణం, హరిభట్టు మత్స్య కూర్మ నారసింహ పురాణాలు, నంది - ఘంటల వరాహ పురాణము, సూరన్న గరుడ పురాణము, వెన్నెలకంటి సూరన్న విష్ణు పురాణం మొ॥ అన్నీ పైన చెప్పిన ఇతిహాస, పురాణాల కిందనే వస్తాయి. (తె. వి. స-6)

## ఇతిహాస సంగ్రహము

కర్త : తెలియదు.
అంకితం : జూపల్లి కొండలరాయ ప్రభునికి.
వివరాలు తెలియరాలేదు. (క. త. 11-144)

## ఇనుగంటి రామరాయలు

కాలం : క్రీ. శ. 1810-1870.
స్థలం : బొబ్బిలి సంస్థానం.
సాహిత్య పోషకుడు.

ఇనుగంటి సీతారామ చంద్రుని కుమారుడు. బొబ్బిలి సంస్థానాధిపతి రాజా రాయడప్ప రంగారాయల అల్లుడు. మంచలేముల వేంకటరామ కవిని ప్రోత్సహించి "క్రియాయోగసార" గ్రంథరచనకు కారకుడైనాడు (ఆం. సం. సా-309)

## ఇనుగంటి సీతారామచంద్రుడు

కాలం : 18 వ శతాబ్దం చివర- 19 వ శతాబ్దం ప్రారంభం.
స్థలం : బొబ్బిలి సంస్థానం.
సాహిత్యపోషకుడు.

ఇనుగంటి వారు బొబ్బిలి సంస్థానాధిపతులకు దగ్గిర బంధువులు. ఈ వంశంలో సీతారామచంద్రుడు ప్రసిద్ధుడు. ఇతడు బొబ్బిలి రాజా రాయడప్పరంగరాయల (1790-1830) వియ్యంకుడు. రాజా శ్వేతాచలపతి రంగారాయల (1830-1862) మేనత్త భర్త. విశిష్టాద్వైత సిద్ధాంత విజ్ఞాని. "ప్రపదన పారిజాత" గ్రంథ రచనకు మిక్కిలి ప్రోత్సహించిన వాడు.

ఇతడు బొబ్బిలి సంస్థానానికి ప్రధానమంత్రిగా, సర్వసైన్యాధి పతిగా ఉండే వాడు. ఇతని కుమారుడు ఇనుగంటి రామరాయలు. (ఆం. సం. సా-309)

## ఇనుగండ్ల కృష్ణప్రధాని

స్థలం : నందపురాగ్రహారం.
రచన : ధర్మరాజాశ్వమేధము (ద్విపద).
గురువు : తిరుమల వెంకట దేశికుడు.

ఇతడు ఏ కాలం వాడో తెలియదగిన ఆధారాలు లేవు. తండ్రి పేరు ఇనుగండ్ల సోమయమంత్రి. గురువైన తిరుమల దేశికుని వంశంవారు గద్వాలలో ఉన్నారట. (మ. మా.)

ఇప్పగల్లు శాసనము

శాసన కర్త : బాల సరస్వతి.

ఈ శాసనాన్ని అనవేమారెడ్డి ఆస్థానంలోని సంస్కృత పండితుడు బాల సరస్వతి వ్రాశాడు. (తె. రా. చ)

ఇప్పల బక్కిరెడ్డి

కాలం : తెలియదు

ఈయన భాగ్యవంతుడని, దానశీలియని ఒక చాటువువల్ల తెలియవస్తున్నది. (చాటుకవి పేరు తెలియదు.) (చా. ప. ర)

ఇబ్రహీం కుతుబ్‌శాహి (మలికిభరాముడు)

కాలం : క్రీ. శ. 16వ శతాబ్ది ఉత్తరార్ధం.

వ్యవహారనామం : మల్కిభ రాముడు.

విశిష్టత : ఇతడు గోల్కొండ రాజధానిగా 1550–1580 ల నడుమ నిజాం రాష్ట్రాన్ని పాలించిన నవాబు. ఇతడు తెలుగులో పండితుడట. తపతీ సంవరణోపాఖ్యానాన్ని వ్రాసిన అద్దంకి గంగాధర కవిని, సుగ్రీవ విజయ, నిరంకుశోపాఖ్యాన, జనార్దనాష్టకాలను వ్రాసిన కందుకూరి రుద్రకవిని ఈ నవాబు పోషించాడు. రుద్రకవికి ఈ 'మలికిభరాముడు' చింతల పాలెం అనే గ్రామాన్ని అగ్రహారంగా ఇచ్చాడు. మరింగంటి సింగరాచార్యులనే కవిని ఆదరించాడట. ఈయనపై చాలా చాటువులు ఉన్నాయి. (సా. చ. సం.)

ఇమ్మడి అంకుశేంద్రుడు

కాలం : 17 వ శతాబ్దం.

స్థలం : మైసూరు.

సాహిత్య పోషకుడు. కృతిపతి.

మైసూరు రాజవంశానికి చెందినవాడు. జగదేవరాయని సోదరుడైన అంకుశేంద్రుని కుమారుడు. రేవూరి ఏకామ్ర కవిని ఆదరించి అతని "సత్యాపరిణయ, జాంబవతీ పరిణయ" కావ్యాలను అంకితం పొందాడు. (ద. దే. వా.)

ఇమ్మడి కెంప గౌనయ్య బల్లాపురపు శాసనము

కాలం : 17 వ శతాబ్దం.

శాసన భాష : తెలుగు–వచనం.

ఈ శాసనం బెంగుళూరు బల్లాపురపు పేటలో ఉన్న రంగనాథాలయంలో ఉంది.

శాలివాహన శకం 1549 లో వేయించిన దాన శాసనం.

విషయం: ఎలహంక నాడు ప్రభువులైన కెంప నంజయ గౌడు పౌత్రుడూ కెంపగౌడు పుత్రుడూ అయిన ఇమ్మడి కెంపగౌడు రంగనాథాలయానికి దానం చేస్తూ వేయించిన శిలాశాసనం. దానవివరాలతోబాటు దక్షిణ దేశంలోని కొన్ని పుణ్యక్షేత్రాలు చిక్క–

నాయనిపల్లె, బళ్ళాపురం, చంద్రగిరి, కోలూరు, కొత్తకోట, కావేరి పట్నం, శ్రీరంగ పట్నం, నరసీపురం, బేలూరు, రాయకోట, నాగమంగలం, ఇక్కేరి మొ॥వి ఇందులో ప్రస్తావితాలు. (ద. దే. వా-469)

## ఇమ్మడి జగదేవరాయని దళవార గ్రామశాసనము

కాలం : క్రీ. శ.1623 ప్రాంతం.

శాసన భాష : తెలుగు (వచనం).

శాసనం వేయించిన వారు : ఇమ్మడి జగదేవరాయడు.

స్థలం : మైసూరు రాజ్యంలోని చెన్నపట్టణం తాలూకాలోని దళవార గ్రామములో ఉంది.

విషయం: ఇది దాన శాసనం. శాసనకర్త తన తండ్రి జగదేవరాయనికి పుణ్యంగా సమర్పించిన భూదాన ఆయ ధర్మ శాసనక్రమం వివరంగా ఉంది.

(ద. దే. వా-469)

Epigraphia Carnatica Vol. IX. Chennapattana No. 182. Page 349.

## ఇమ్మడి రాణా జగదేవ రాయడు

స్థలం : మైసూరు ప్రాంతం.

కాలం : 16 వ శతాబ్దం.

రచనలు : 1. ఆధ్యాత్మ్య రామాయణము (అలభ్యం) 2. చండికా దేవీ నవరత్నములు (సం) (అలభ్యం) 3. గీత ప్రబంధములు (అలభ్యం).

రాజకవి. కవి పండిత పోషకుడు.

విజయనగర రాజుల చేత మైసూరులోని ఒక ప్రాంతానికి పాలకులుగా నియమింపబడి, తర్వాత స్వతంత్రులైన, "రాణా" వంశీయుడు. బెంగుళూరుకు 37 మైళ్ళ దూరంలో చెన్నపట్టణం కోట కట్టించాడు.

వీణావాదన నిపుణుడు. అనేక గీత ప్రబంధాలు రచించి వీణపై వాయించేవాడట. చండికా దేవిపై నవరత్నాలు సంస్కృతంలో రచించి వీణపై వాయిస్తుండేవాడట. అవన్నీ నేడలభ్యాలు.

ఇతన్ని గురించి చాటువులు కూడా ఉన్నాయి. పొన్నతోట బొటకవి ఇతని ఆస్థానంలోని వాడే. ఆతని కృతులు జగదేవ రాయనికే అంకితం.

(ద. దే. వా. 485, 488)

## ఇరవై ఆరు ఘంటాల వచనము

కవి : గణపవరపు వేంకట కవి.

ఈ కవి రచించిన 'సర్వలక్షణ శిరోమణి'లోని చతుర్థోల్లాసంలోని ఒక ప్రకరణం, ఈ పేరుతో ప్రసిద్ధమైంది. (ఆరు॥వ 11-161)

ఇల్లమనాయకేంద్ర శతకము

కర్త : కొట్రా వేంకటేశ్వరులు.

దీనిలో మకుటము "అరికరి మృగేంద్ర! చీడికులాబ్ధి చంద్ర, నవ్యగుణ సాంద్ర! యిల్లమనాయ కేంద్ర" అని ఉంది. (శ. సా. వి. 288)

ఇళాదేవీయము

నామాంతరం : రాధికా సాంత్వనము (చూ).

కవయిత్రి : ముద్దుపళని.

ఈడూరి ఎల్లయామాత్యుడు

కాలం : 16 వ శతాబ్దం.

స్థలం : కాటుపోలను.

గురువు : కేదార గురుడు

సాహిత్య పోషకుడు. శంకరకవి రచించిన హరిశ్చంద్రోపాఖ్యానానికి కృతిపతి. గోలకొండ కుతుబ్షాహీల కాలంలోని వాడు. కుతుబల ముల్కు (ఇబ్రహీం కుతుబ్షా) చేత జలసీమా రక్షణార్థమై నియోగింపబడ్డాడట. ఈడూరి కరణంగా ఉండేవాడు. అద్దంకి గంగాధర కవికి సమకాలికుడు కావచ్చును. (క. స-262)

ఈడూరి నూకనారాధ్యుడు

కాలం : 15 వ శతాబ్ది పూర్వార్ధం.

స్థలం : నైజాం మండలంలోని హనుమకొండ ప్రాంతం.

సాహిత్యపోషకుడు. కొలని గణపతి దేవుడు రచించిన "శివయోగ సారం" అనే గ్రంథానికి కృతిపతి. ఇతడు కవికి గురువూ, మేనమామ అట. ఇతని పూర్వీకులు వేంగిమండలానికి చెందిన వారనీ తర్వాత హనుమకొండ ప్రాంతానికి వచ్చి ఉంటారనీ పండితాభిప్రాయం (క. త. గ-261)

ఈదురుపల్లి భవానీశకవి

నామాంతరం : ఈదులపల్లి భవానీ శంకరకవి.

ఈదుల పల్లి భవానీ శంకరకవి

నామాంతరం : ఈదురుపల్లి భవానీశ కవి.

కాలం : క్రీ. శ. 17 వ శతాబ్దం చివర - 18 వ శతాబ్దం ప్రారంభం.

స్థలం : గోదావరీ మండలం. అమలాపురం ప్రాంతం.

రచనలు : శృంగారమంజరి, ధర్మ కుండము.

సమకాలికులు : వక్కలంక వీరభద్ర కవి, ఏనుగు లక్ష్మణ కవి మొ॥వారు.

గురువులు : ఇవటూరి శంభులింగము, వెలుతురుపల్లి వేంకటకవి.

శంకరామాత్యుని పుత్రుడు. పిఠాపురం సంస్థానాధీశ్వరుడైన రావుమాధవ రాయనికి ఆశ్రితుడు. ఇదే సంస్థానానికి చెందిన వక్కలంక వీరభద్ర కవికి సహా

ధ్యాయుడనని కవి స్వయంగా తన శృంగార మంజరిలో చెప్పుకున్నాడు. ధర్మ ఖండము అనువాద కావ్యం. ఇతని రచన నిర్దుష్టంగా రసవంతంగా ఉంటుంది.

(అ. సం. సా. 246, 247)

**ఈరపరాజు, సూరపరాజు (భట్టు కవులు)**

కాలం : తెలియదు.

వీరు జూపల్లి ధర్మారాయుడనే వితరణశీలి దగ్గరకు ధన సంపాదనం కోసం వెళ్ళారట. ధర్మారాయుడు విద్వత్కవులను తప్ప కేవల కవులను ఆదరించని కారణంగా వీరికి సత్కారం లభించలేదు ఈ విషయం చాటువుల వల్ల తెలుస్తున్నది. (చా.ప.ర)

**ఈవని పెద్దిరాజు రామరాజు**

నామాంతరం : (ఈవని) రామరాజు.
కాలం : క్రీ. శ. 16వ శతాబ్ది
రచనలు : తెలియ రాలేదు.

సీతమ్మ పై రచించిన రెండు చాటు పద్యాలు మాత్రం లభించాయి. ఇవి ఒక శతకంలోనివేమోనన్న అనుమానం ఉంది. ఈ పద్యాలను వ్యక్తుల నామాలలో సంధులపల్ల వచ్చే అఖండ యతులను పేర్కొంటూ అప్పకవి చాటు ధారలుగా ఉదాహరించాడు. ఈయన పద్యాలను అప్పకవి స్వీకరించాడు కాబట్టి కవి ప్రసిద్ధుడే కావచ్చు. ఆ చాటువులు ఒక శతకం లోనివే అయినట్లయితే తెలుగులో 'సీతమ్మ' పేర శతకం చెప్పిన తొలి శతక కర్త ఈయనే అవుతాడు. (అప్పకవీయం 3-232,233)

**ఈవని రామరాజు**

నామాంతరం : ఈవని పెద్దిరాజు రామరాజు.

**ఈవని వెంకటేశ కవి**

కాలం : 16 వ శతాబ్దం
స్థలం : మైసూరు (బెంగుళూరు ప్రాంతం).
రచన : వామన పురాణము (7, 8 ఆశ్వాసాలు.).

ఇతడు పొన్నతోట బొటళ కవికి వామన పురాణ రచనలో సహాయపడ్డాడు. 7, 8 ఆశ్వాసాలు ఇతడు రచించినట్టు గద్య వల్ల తెలుస్తున్నది. (వ. దే. వా. 493)

**ఈశోపనిషత్తు**

కర్త : ..వస్తు వేంకట రంగ చార్యులు.
కాలం : 19 వ శతాబ్దం.

సంస్కృతం లోని ఈశోపనిషత్తుకు పద్యానువాదం. (క. స-248)

**ఈశ్వర దీక్షితుడు**

కాలం : 16 వ శతాబ్దం.
సమకాలికులు : అష్టదిగ్గజాలు, రాధా మాధవకవి.

రచనలు 1. రామాయణ వ్యాఖ్యలు 2. బృహద్వివరణ (సం) 3. లఘువివరణ (సంస్కృతం).

శ్రీకృష్ణదేవరాయల ఆస్థానంలోని వాడు. కృష్ణరాయల ఆస్థానంలో సంస్కృత కర్ణాటక కవులు కూడా కొందరున్నారు. ఈయన సంస్కృతంలో అఖండ ప్రజ్ఞావంతుడు. (వి. న. చ.)

ఈశ్వర ఫణిపతి

నామాంతరం : ఈశ్వర ఫణిభట్టు (చూ).

ఈశ్వర ఫణిభట్టు

నామాంతరం : ఫణిపతి.

కాలం : క్రీ. శ. 1450-1500 ప్రాంతం.

రచన : పరతత్త్వరసాయనము (పద్య ప్రబంధం)

కృతి భర్త : సదానందావధూత (యోగి).

ఈ కవి బమ్మెర పోతన తరువాత కాలం వాడు. అల్లసాని పెద్దనకు పూర్వుడు కావచ్చు.

విశిష్టత : ఈ కవి భారతంలోని హరసనత్కుమార సంవాదాన్ని ఆధారం చేసుకొని ఈ గ్రంథం రాశాడు. సంస్కృత భారతంలో కొన్ని ప్రతులలో ఈ భాగం లేదట. తిక్కన దీన్ని ఆంధ్రీకరించాడు. ఈ కవి ప్రబంధ ఫోరణిలో సందర్భోచితంగా పట్టణారణ్య వర్ణనలు చేశాడు. సులభమైన పదాలతో విషయాన్ని చక్కగా చెప్పాడు. (క. చ-6-242)

ఈశ్వర భట్టోపాధ్యాయుడు

కాలం : 14వ శతాబ్దం.

బిరుదు : 'సూరి'.

సంస్కృత కవి. శాసన కర్త.

మల్యాల వంశ భూపతుల ప్రశస్తిని తెలుపుతూ ఉన్న 'బూదపూరు' శాసన కర్త ఇతడే.

విశిష్టత : కాకతి యుగం నాటివాడు. ప్రశస్తి వ్రాయటంలో అంది వేసిన చేయి. పాణినీయ వ్యాకరణంలో, చిత్ర కవితలో సిద్ధహస్తుడు. ఇతడు బూదపూరు శాసనాన్ని నిష్కంఠ్య, నిస్తాలవ్య, నిర్మూర్ధన్య, నిర్దంత్య, నిరోష్ఠ్యంగా వ్రాశాడు. దీనిని బట్టి ఇతడు రచనలో ఎంత నిపుణుడో తెలుస్తుంది. ఇతని రచనలు లభించలేదు. (ప్రా. వ. డీ. చ.)

ఈశ్వరీ పరిణయము (అలభ్యం)

కర్త : చూ. చాటరాజు లక్ష్మణరసకవి.

కాళిదాసు కుమార సంభవానికి ఆంధ్రీకరణమట. ప్రస్తుతం ఇది అలభ్యం.
(ఆం. సం. సా_419)

ఈశ్వరుని ఏకాంతసేవ (చాటువులు)

ఈశ్వరుని ఏకాంతసేవను వర్ణిస్తూ సుమారు పది చాటువులున్నాయి. అన్నీ ఉత్పలమాలలే. కవి వివరాలు తెలియవు. కవిత్వం ఒక మాదిరిగా ఉంది.
(చా. ప. ర.)

ఈహామృగము

ఇది దశవిధ రూపకాలలో ఒకటి. మృగంవలె దొరకని నాయికను నాయకుడు కోరటం వల్ల దీనికీ పేరు వచ్చింది. ఇందులోని వస్తువు ప్రఖ్యాత కల్పిత మిశ్రమము. అంకాలు నాలుగుంటాయి. గర్భావమర్శాలు తప్ప మిగిలిన మూడు సంధులు ఉండవచ్చు. ధీరోద్ధతు లయిన నరదివ్యులలో ఒకరు నాయకుడుగా, మరొకరు ప్రతినాయకుడుగా ఉండవచ్చు. అనురాగం లేని దివ్య స్త్రీని బలాత్కరించటం ఇందులో ముఖ్యం. అందువల్ల శృంగారాభాసం అక్కడక్కడ కనిపిస్తుంది. నాయక ప్రతినాయకులకు నాయికా సంబంధి వైరం వర్ణితం. ఇతర లక్షణాలలో ఇది వ్యాయోగ తుల్యము.
(తె. వి. స_6)

ఉంద్రాజవరము

పశ్చిమ గోదావరి మండలంలోని పూర్వ జమీందారీలలో ఇది ఒకటి. చాలా చిన్న సంస్థానం. క్రీ. శ. 19వ శతాబ్దం ఉత్తర భాగంలో ముళ్ళపూడి తిమ్మన ఈ జమీని కొన్నారు.

ముళ్ళపూడి తిమ్మనగారి మనుమడైన తిమ్మరాజు ఈ సంస్థాన పాలకులలో అతి ప్రసిద్ధుడు. ఇతోధికంగా సాహిత్య సేవ చేశాడు. తణుకు పట్టణంలోని నరేంద్రనాథ సాహిత్యమండలికి సంస్థాపకుడు. ఇతని కుమారుడు హరిశ్చంద్ర ప్రసాదు పారిశ్రామిక రాజకీయ రంగాలలో కీర్తి ప్రతిష్ఠలనార్జించాడు. (ఆ. సం. సా.)

ఉచ్ఛ్వాసము

కావ్యంలోని కథాంశాల విభాగాలను కొందరు ఉచ్ఛ్వాసాలుగా వ్యవహరించారు. ఉచ్ఛ్వాసము అంటే ఊపిరి తీసుకోవడం. కావ్యంలోని ఈ ఒక్కొక్క విభాగమూ ఒకసారి సునాయాసంగా చదవ దగ్గది అనే అర్థంతో ఈ కథాంశ విభాగాలను ఉచ్ఛ్వాసాలుగా సూచించడం జరిగింది. (కావ్యాలంకార సంగ్రహం)

ఉడతల పాపయ్య మంత్రి

కాలం: 19వ శతాబ్దం.

స్థలం : గోదావరీ మండలం.

మిక్కిలి మల్లిఖార్జున కవిని ప్రోత్సహించి అతనిచేత భగవద్గీతను తెలుగులో రాయించాడు. ఇతన్ని అల్లంరాజు సుబ్రహ్మణ్య కవి తన శతకంలో పేర్కొన్నాడు.
(శ. క. చ. 606)

**ఉత్కలిక**

ఛందోభేదం కళికలో ఉపయోగించే రగడ పాదంలో సగభాగంతో రూపొందిస్తే ఉత్కళిక అవుతుంది. కళికాపాదంలో ఎన్ని ఏ విధమైన గణాలుంటాయో అన్నిటిలో ఉత్కళికా పాదానికి ఉంటాయి. (చూ. ఉదాహరణ కావ్యములు ఛ. ప. కో-246)

**ఉత్కలికా ప్రాయము**

సంస్కృత గద్యలోని నాలుగు రకాలలో ఇది ఒకటి. వృత్త గంధి గద్యకు, దీనికి భేదముంది. రెండూ దీర్ఘ సమాసబహుళాలే అయినా, వృత్త గ్రంధిలోవలె దీనిలో వృత్త భాగం కనిపించదు. (తె. వి. స-6)

**ఉత్తమ గండచ్ఛందము**

కర్త : తెలీదు.

రచనాకాలం : క్రీ. శ. 1432 ప్రాంతం.

కృతి భర్త : ఉత్తమ గండ బిరుదుగల సాళువ కంపరాజు. ఇతడు హయలక్షణసార కృతిపతి కూడా.

ఛందో లక్షణ గ్రంథం. ఇందులోని పద్యాలు "ఉందు ఛందాల ఉత్తమ గండ వర్య" అనే మకుటంతో కవి సర్వగారుడంలో ఉదాహరింపబడ్డాయి

ఇది అముద్రితం.

(కవిజనాశ్రయం పీఠిక-వావిళ్ళ)

**ఉత్తర గీత వ్యాఖ్య**

కర్త : పరమానంద తీర్థులు.

కాలం : 16 వ శతాబ్దం - ఉత్తరార్ధం.

చంపువో, వచనమో తెలియదు. కవి మాత్రం వేదాంతి, యోగి. ఇతని రచనలన్నీ వేదాంత గ్రంథాలే. (ఆరుద్ర-8)

**ఉత్తర గీతా మంజరి**

కర్త : పల్లూరి లక్ష్మినారాయణ యోగి.

అంకితం : అమృతానంద యోగికి.

మంజరీ ద్విపద కావ్యం. మహాభారతం అశ్వమేధ పర్వంలోని ఉత్తర గీతకు ఆంధ్రీకరణ. అమృతానంద యోగి కవికి గురువు. అర్జునుడు శ్రీకృష్ణుని పరబ్రహ్మతత్త్వం తెలుపమని అడగగా శ్రీకృష్ణుడు చెప్పిన పరతత్త్వ స్వరూపం - వివరంగా ఉంది.

దీని ప్రతి వేంకటేశ్వర ప్రాచ్య పరిశోధనా సంస్థలో ఉంది.

(ద్వి. వా. చ. 315)

**ఉత్తర గోగ్రహణము**

కర్త : తెలియదు.

జానపద పౌరాణిక గేయం.

కథ భారతానికి సంబంధించినది.

చూ. పౌరాణిక గేయములు. (వా. చ)

**ఉత్తర గోపుర కథ పట్టు**

నామాంతరం : గొడుగుల వచనము.

రచనాకాలం : క్రీ. శ. 1700 ప్రాంతము

రామాయణం యుద్ధ కాండలోని కథ. రావణుడు లంక ఉత్తర గోపుర మధిరోహించి, వానర సేనతో సువేలాచలానికి వచ్చిన శ్రీరాముని సైన్యాన్ని చూసి అనుతాపం చెందే ఘట్టం వర్ణితం.

పావులూరి మల్లన గణితంలో సూత్ర వ్యవహారంలోని సీసపద్యంలో ఈ 'గొడుగుల' ప్రసక్తి ఉంది. మంచి రచన. (వ. వా. 47)

**ఉత్తర చంపువు (సం)**

కవి : భగవంతార్యమఖి.

ఈ కవి మొదటి శంభోజీ దగ్గర మంత్రిగా ఉండేవాడు. (వ. దే. వా-121)

**ఉత్తర చంపువు (సం)**

కర్త : వెంకట కృష్ణ దీక్షితుడు.

కవి తంజావూరు మహారాష్ట్ర రాజుల నాటివాడు.

**ఉత్తర చరిత్ర (సం)**

కర్త : వేంకటాధ్వరి.

ఉత్తర రామాయణానికి సంబంధించిన ఇతి వృత్తం. (తె. వి. స-8)

**ఉత్తర రంగకవి**

కాలం : 1772 కు పూర్వం.

రచన : భక్తాంఘ్రిరేణు చరిత్రము.

కవిని గూర్చిన వివరాలు తెలియరాలేదు. సలక్షణమైన రచన చేసిన యక్షగాన నాటక కర్తగా ప్రసిద్ధుడు. (య.వా. చ-54)

**ఉత్తర రామాయణము**

రచనా కాలం : 18 వ శతాబ్దం.

కర్త : కంకంటి పాపరాజు.

అంకితం : మదన గోపాలస్వామికి.

ఇది సుప్రసిద్ధ ప్రబంధం. ఈ రచనలో పుష్పగిరి తిమ్మన పాపరాజుకు సాయపడ్డాడని పండితులంటారు. దీనిలో శృంగార, కరుణ, వీర రసాలు అద్భుతంగా

పోషింపబడ్డాయి. వర్ణనా బాహుళ్యం ఉంది. కొన్ని ద్వ్యర్థిపదాలు, అచ్చతెలుగు పదాలు ఉన్నాయి. ధార అనర్గళం.

తిక్కన నిర్వచనోత్తర రామాయణంలో వదిలిన కథలన్నీ దీనిలో ఉన్నాయి. సీతా వనవాసం కరుణరసానికి, రావణ దిగ్విజయం వీరరసానికి, కపిల సందర్శనం బీభత్స రసానికి, బలిచక్రవర్తి సన్నిధి హాస్య భయాన కాద్భుత రసాలకు నిలయంగా ఉన్నాయి దీనిలోని గద్యలు కూడా ప్రౌఢమై పద్యాలవలె ఉంటాయి. కవిత రస వత్తరంగా ఉంది. (తె. వి. స-4)

## ఉత్తర రామాయణము

కర్త : జయంతి రామభట్టు.

తిక్కన రచించగా మిగిలిన ఉత్తరరామాయణంలోని తుది భాగం. కుశలవుల విద్యాభ్యాసం, పౌండరీక వాజపేయాది యాగాచరణం, శ్రీరామ నిర్యాణం ఇందులో వర్ణిత . దీనిలోని కవిత్వాన్ని తిక్కన కవిత్వంతో ఏ విధంగాను పోల్చటానికి వీలులేదు. (తె. వి. స-8)

## ఉత్తర రామాయణము

కర్త : ముదుంబై వేంకట కృష్ణమాచార్యులు.

చూ. ద్విపదోత్తర రామాయణము.

## ఉత్తర హరి వంశము

కర్త : నాచన సోముడు.

సమకాలికులు : ఎఱ్ఱాప్రెగ్గడ, ప్రోలయ వేముడు.

అంకితం : హరిహర నాథునికి.

ప్రత్యేకత : ఆరు అశ్వాసాల గ్రంథం. ఎర్రన హరి వంశం వ్రాసిన తర వాతనే నాచన సోముడు ఉత్తర హరి వంశాన్ని వ్రాశాడు. పురాణ కథలను తీసుకొని, ప్రబంధాలుగా వ్రాయడం సోమునితోనే మొదలయింది. ఈయన శ్రీకార పద్యం భక్తి భావం కంటె శృంగార రసంతో ప్రారంభమైంది. తెలుగు సాహిత్యంలో ఇది ఒక విశిష్ట కావ్యం మూలం సంస్కృతమే అయినా అనువాదం స్వేచ్ఛగా ప్రబంధ పద్ధతిలో సాగింది. ప్రౌఢమై రసవత్తరమైన కావ్యం. కవి లోకోక్తులు మనోహరంగా వాడాడు (అరుద్ర-3)

## ఉత్తర హరిశ్చంద్ర కథ

కర్త : తెక్కెళ్ళపాటి లింగన.

పద్య కావ్యం. ఈ కృతిలో కవి తన ఇతర రచనలను పేర్కొన్నాడు. (యా. వా. చ)

## ఉత్తర హరిశ్చంద్ర చరిత్ర

కాలం : గౌరనకు తర్వాతి కాలం.

కర్త : గద్దె చంద్రశేఖర కవి.

అంకితం : చెంగల్వరాయనికి (కుమార స్వామికి).

ద్విపద కావ్యం.

చిత్తూరు మండలంలో కుమారస్వామికి చెంగల్వరాయడని ప్రచారం ఉంది. హరిశ్చంద్రుడు విశ్వామిత్రుని వలన బాధలు పడి చివరకు అతని అనుగ్రహాన్ని పొంది సుఖంగా రాజ్యం చేస్తున్న తరుణంలో ఒకనాడు ఆతని మంత్రులు పూర్వ కథను జ్ఞప్తికి తేవడం మొదలుగా హరిశ్చంద్రుని పూర్వజన్మ వృత్తాంతం ఇందులో ఉంది ఆ కారణంగా దీనిని కవి ఉత్తర హరిశ్చంద్ర కథగా పేర్కొన్నాడు.

రచన సంస్కృతాంధ్ర పద బహుళంగా ఉంది. కావ్యంలో మనోహరమైన భావాలున్నాయి. (ద్వి. సా. చ-407)

## ఉత్తరా పరిణయము

కర్త : చూ. రేమెల వేంకటరాయ కవి.

రచనా కాలం : 19 వ శతాబ్ది.

భారత కథ ఈ రచనకు మూలాధారం. విరటుని పుత్రిక అయిన ఉత్తరను, అభిమన్యుడు వివాహమాడడం ఇందలి ఇతి వృత్తం. రచనలో ధారా శుద్ధి ఉన్నది. (అం సం సా-250)

## ఉత్తారక పంచకాభ్యుదయము

కర్త : తెలియదు.

వైష్ణవ గ్రంథం. (వా.చ-వం.ము-83)

## ఉదయగిరి

ఇది విజయనగర రాజ్యానికి, కొండవీటి రాజ్యానికి హద్దుగా ఉన్న దుర్గం విజయనగర రాజ ప్రతినిధులు దీనికి ఏలికలుగా ఉండేవారు. గజపతులు కొండవీటిని జయించిన తరవాత దీని మీద కూడా దాడి చేశారు. విజయనగర ప్రభువులు గజపతులను ఓడించి ఉదయగిరి ప్రాంతం నుంచి తరిమి వేసినట్లు చరిత్ర చెబుతుంది. ఇక్కడ సాహిత్య పోషణ జరిగినట్లు దాఖలాలు ఉన్నాయి. మొదటి దేవరాయల రాజ ప్రతినిధి సిద్ధయ - విక్రమార్క చరిత్ర వ్రాసిన జక్కనను పోషించాడు

## ఉదయ నోదయము

కర్త : నారన్న గారి సూరన్న.

కృతికర్త : ముడియం భాస్కరుడు. (అళియ రామరాజు దండనాయకుడైన బయకార రామప్పయ్య దగ్గర సైనికోద్యోగి.)

ప్రత్యేకత : ఇందులో వత్సరాజపుత్రుడైన ఉదయనుని కథ ఉంది. కవి ముందు ఉదయనుని తండ్రి చరిత్రను చెప్పి, తరువాత వత్సరాజు చరిత్రను చెప్పారు. దీని వ్రాతప్రతి తంజావూరు సరస్వతీ మహల్ గ్రంథాలయంలో ఉంది. కవి మరణానంతర

రం, ఈ కావ్యాన్ని, కవి కుమారుడైన నారన్న ముడియం భాస్కరునికి అంకితమిచ్చాడు.
(ఆరుద్ర-9-241)

## ఉదయాదిత్యాలంకారము (అలభ్యం)

కర్త : చూ. ఉదయాదిత్యుడు.

ఇది కన్నడ గ్రంథమో, ఆంధ్ర గ్రంథమో తెలియదు. (క. త-2)

## ఉదయాదిత్యుడు

కాలం : వివాద గ్రస్తం.
స్థలం : వర్ధమాన పురం.
రచన : ఉదయాదిత్యాలంకారం. (అలభ్యం).

ఇది కన్నడ గ్రంథమో, ఆంధ్ర గ్రంథమో తెలియదు. ఇతడు పదకొండవ శతాబ్ది చివర ఉన్నాడని అంటారు. వర్ధమాన పురపాలకుడుగా ప్రసిద్ధి పొందాడు. (క. త. 2)

## ఉదవి నాయకుడు

కాలం : వివాదగ్రస్తం.
స్థలం : చోళదేశం.
రచన : పర్వత నారదోపాఖ్యానము. (అసమగ్రం)
సమకాలికులు : పోలూరి గోవిందకవి, గులిపల్లి గోపన్న.
కవి : చెరుకూరి సదాశివుని తమ్ముడు.

(ఆరుద్ర 12-159)

## ఉదార రాఘవము (సం)

కర్త : శాకల్య మల్లభట్టు.

18 సర్గల కావ్యం. శ్రీరాముని చరిత్ర. సులభసుందర శైలిలో చెప్పబడింది.
(తె. వి. స.-6-220)

## ఉదాహరణ కావ్యము

ఇది తెలుగులో ఒక విశిష్టమైన సాహితీ ప్రక్రియ. దేశి కవితాశాఖకు చెందినది. గ్రంథ స్వరూపంలోను, కవితావస్తు విన్యాసంలోను, ఛందస్సాహితీరీతులలోను దేశీయతా ముద్ర ఉన్న దేశి రచన. ఆశు, మధుర, చిత్ర, విస్తర కవితా భేదాలలో ఇది మధుర కవితకు చెందినది. భాషలో ఉన్న సప్త విభక్తులను సంబోధన విభక్తిని ఉదహరిస్తూ స్తుతి రూపంలో ఉండే లఘు కృతి. ఇందులో సప్త విభక్తులతోపాటు, కళికోత్కళికలు, వివిధ రగడలు ప్రయుక్తమవుతాయి. ఇది మొదట దైవస్తుతికి, పిమ్మట మహాపురుష, నాయక స్తుతులకు ప్రయుక్తం. తెలుగులో పాల్కురికి సోమన బసవోదాహరణము తొలి ఉదాహరణ కావ్యం. రావిపాటి త్రిపురాంతకుని త్రిపురాంతకోదాహరణము, తాళ్ళపాక అన్నమాచార్యుల శ్రీ వేంకటేశ్వరోదాహరణ మొదలైన ప్రసిద్ధమైన ఈ జాతి రచనలు.

ఇందులో మొత్తం 26 పద్యాలుంటాయి. సంబుద్ధితోపాటు ఒక్కొక్క విభక్తి మూడేసి పద్యాలలో ఉంటుంది. ఈ మూడు పద్యాలలో మొదటిది వృత్త పద్యం అయి ఉండాలి. రెండవది రగడ. మూడవది అర్ధ రగడ (వీటినే కళిక, ఉత్కళికలుగా వ్యవహరిస్తారు). వృత్తంలోని విషయాన్ని బట్టి ఆ వృత్తం ఒక విభక్తి పదంతో ముగుస్తుంది. విభక్త్యంత పదం విభక్తివలె కనిపించాలి గాని విభక్తి కాకూడదు మూడేసి పద్యాలతో ఎనిమిది విభక్తులు అయ్యాక ఎనిమిది విభక్తులతో ఒక వృత్తం ఉంటుంది. ఇది సార్వ విభక్తికము. దీని తర్వాత అంకితాంక పద్యం ఉంటుంది. పాల్కురికి సోమన బసవోదాహరణాన్ని సంస్కృతంలో కూడా ఉదాహరణ కావ్యంగా రచించాడు

(తె. వి. స6-; ఛ. ప. కో - 310)

## ఉదాహరణ పద్యములు

కాలం : క్రీ శ. 16 శతాబ్ది

సంకలన కర్త : పేరు తెలియదు.

ప్రత్యేకత: ఈ గ్రంథంవల్ల తెలుగు సాహిత్యానికి చాలా ఉపయోగం జరిగింది. ఈ గ్రంథం లేకపోతే కొందరు ప్రాచీన తెలుగు కవుల పేర్లు, సాహితీ లోకానికి తెలిసేవి కావు. మడికి సింగన్న "సకల నీతి సమ్మతం" తెలుగులో తొలి సంకలన గ్రంథమనీ, ఈ గ్రంథం ఆ కోవలో రెండోదనీ, పెదపాటి జగ్గన్న సంకలన గ్రంథం ప్రబంధ రత్నాకరం మూడోదనీ పండితాభిప్రాయం. ప్రబంధరత్నాకరాన్ని, ఉదాహరణ పద్యాలను అకారాదిక్రమంలో చేర్చి 'ప్రబంధ రత్నావళి' అనే సంకలన గ్రంథాన్ని వేటూరి ప్రభాకర శాస్త్రిగారు ప్రచురించారు.

పెదపాటి జగ్గన్న ఉదాహరించని 35 కావ్యాలపేర్లు 32 మంది ప్రముఖాంధ్ర కవుల పద్యాలున్నాయి. ఈ సంకలన గ్రంథం అసలు పేరు సంధాత ఏమి పెట్టాడో గాని, ఇప్పుడీ సంకలన గ్రంథం పై పేరుతో ఆంధ్రసాహిత్య పరిషత్తు వారి కార్యాలయంలో ఉంది. గ్రంథం అసంపూర్ణమైనా లభించిన అన్ని పద్యాలు మణి పూసల వంటివి.

ఏ కవి పేరు చెప్పకుండా, గ్రంథం పేరైనా చెప్పకుండా ఉదాహరణ పద్యాలలో సుమారు 50 పద్యాలున్నాయి. అందులో పద్యాల శైలి కొన్ని శ్రీనాథుని, మరి కొన్ని ధూర్జటిని గుర్తు తెస్తాయి. చిల్లర పద్యాలలో కొన్ని ఎవరు వ్రాశారో, ఏ గ్రంథంలోవివో తెలియదు. సంధాత పేరు తెలియకపోయినా తెలుగువారికి చిరస్మరణీయుడు.

(ఆరుద్ర - 8)

## ఉదాహరణమాల (సం)

కర్త : భోగనాథుడు. (తె. వి. స-4)

## ఉదాహరణము (అలభ్యం)

కర్త : గణపవరపు వేంకటకవి (చూ).

రచనా కాలం : 17వ శతాబ్ది మధ్యభాగం.

ఉదాహరణము (అలభ్యం)

కర్త : మకతల కృష్ణమ్మ.

ఉదాహరణ కావ్యరీతిలో చేసిన రచన కావచ్చును. (క. స-42)

ఉద్దండరాయశతకము

కర్త : దిట్టకవి రామచంద్రకవి

అంకితం : మద్దాలిలోని ఉద్దండరాయనికి.

మత్తేభవృత్తాలతో ఉన్న శతకం "మద్దాలి యుద్దండరాయ జయశ్రీ సువిధేయ భక్తజన గేయా నిత్యభాగ్యోదయా" అనే మకుటంతో శతకమంతా జ ప్రాసతో ఉంది. ఏకయతి నియమంతో కవి చాలా రసవంతంగా చక్కని శైలిలో దీన్ని రచించాడు. ఇది కవి ప్రౌఢికితార్కాణం. (శ. క. చ. 481)

ఉద్యోతము

శాస్త్ర గ్రంథాలలో శాస్త్రీయ విషయాలను తెలిపే విభాగాలకు ఈ పేరుంది. ఉద్యోతము అంటే వెలుగు అని అర్థం. వెలుగుతో చీకటి తొలగిపోయే విధంగా శాస్త్రీయ విషయాల వలన తెలియని విషయం బోధపడుతుందని అర్థం. అందుకే శాస్త్ర గ్రంథ విభాగాలను "ఉద్యోతాలు" అంటారు.

ఉద్భటారాధ్య చరిత్ర

కర్త : తెనాలి రామకృష్ణ కవి.

అంకితం : ఊరదేచమంత్రికి.

మూడు ఆశ్వాసాల పద్యకావ్యం.

ప్రత్యేకత: ఈ గ్రంథంలోని శైలి, సీస పద్యాల నడక శ్రీనాథుని అనుకరించినట్లు స్పష్టంగా కనిపిస్తుంది.

ఇతి వృత్తం: శైవ మహాచార్యుడైన ఉద్భటుని చరిత్ర. (ె. వి. స-4)

ఉన్నవ యోగానందుడు

కాలం : క్రీ. శ. 1750 ప్రాంతం.

స్థలం : గుంటూరు జిల్లాలోని ఉన్నవ గ్రామం.

రచనలు : రుక్మిణీ పరిణయము, రాజగోపాల శతకము.

సరళంగా, హృదయంగమంగా రచన చేశాడు. (క స-175)

ఉన్మత్త రాఘవము

కర్త : విరూపాక్షరాయలు.

ఇది నాటకం. సంస్కృత రూపకానికి ఆంధ్రీకరణమట. (తె.వి.స-4)

ఉన్మేషము

గ్రంథ విభాగాలకు ఉన్మేషములని పేరు. ఈ పదం ఎక్కువగా శాస్త్ర గ్రంథాలలోనే వాడతారు. ఉన్మేషము అంటే వికాసము, వెలుగు అని అర్థం. ఈ శాస్త్ర

గ్రంథ పఠనం వల్ల చదివే వారికి వికాసం కలుగుతుందన్న భావంతో ఆ విభాగాలకు ఈ పేరు ఉంచారు.

ఉపకథ

గద్య కావ్య భేదాలలో ఒకటి పెద్ద కథలలోని అవాంతర కథనే ఉపకథ అంటారు. ఈనాడు వ్యవహారంలో ఉన్న కథానికాపదం పూర్వ లక్షణ గ్రంథాలలో మృగ్యం. కావ్యాదర్శ వ్యాఖ్యాత "కథాలికా" అనే గద్య ప్రబంధ భేదాన్ని చూపినాడు. పూర్వపు 'కథాలికా', పదమే ఇప్పటి 'కథానిక', అయి ఉండవచ్చునని పండితాభిప్రాయం. (తె వి స-4)

ఉపకర్ణామృతము

చూ. బాలగోపాల శతకము

కర్త: పుసులూరి సోమరాజు కవి,

ఉపక్రమణిక

చూ. అవతారిక.

ఉపదేశక్రమము

కర్త: పరమానంద తీర్థులు.

రచనాకాలం : 16వ శతాబ్దం.

ప్రత్యేకత : ఇది చక్కని వ్యావహారిక వచనంలో ఉన్న కావ్యం. ఉపదేశాలన్నీ వేదాంతాన్ని గురించే ఉన్నాయి. కవి వేదాంతి, యోగి. దీని ప్రతి మద్రాసు ప్రాచ్య లిఖిత గ్రంథాలయంలో ఉంది.

ఇది సంస్కృత భారతం అశ్వమేధ పర్వంలోని ఉత్తర గీతకు అనువాద ప్రాయమని విమర్శకుల అభిప్రాయం. ఈ కవిదే ఉత్తరగీత వ్యాఖ్య ఉంది. (ఆరుద్ర-8)

ఉపసూరి సింహాములు

పౌరుష నామం. క్రీ. శ. 16 వ శతాబ్దంలో రామనాథపురం-తిరుపత్తూరు సీమలను పాలించిన గోళ్ళ పెదరామప్ప, గోళ్ళ చినరామప్పలకు ఈ బిరుదం ఉంది. వీరు అచ్యుత దేవరాయల సామంతులట. (చూ. గోళ్ళ పెదరామ నాయకుడు -ద. దే. వా-18)

ఉపమాక వేంకటేశ్వర శతకము

కర్త : పైడిపర్తి అప్పయ కవి.

అంకితం : కాకర్లపూడి రామభద్ర పాయకరాయ ప్రభువునకు.

ఉపమాక విశాఖమండలంలోని పుణ్యక్షేత్రం. కవి అక్కడి వేంకటేశ్వరుని నుతిస్తూ శతకం చెప్పాడు. రచన ప్రౌఢంగా ఉంది.

ఉపరూపకాలు

దృశ్య ప్రబంధ భేదాలు.

భరతుడు దశ రూపకాలను, నాటికను మాత్రం చెప్పాడు. ఉపరూపకాలను చెప్పలేదు. సాహిత్య దర్పణకారుడు 18 ఉపరూపకాలను, శారదాతనయుడు 20 ఉపరూపకాలను పేర్కొన్నారు. కోహలుడు ఉపరూపకాలకు మార్గ-దేశి భేదాన్ని కల్పించాడు. ఈయన 10 మార్గ భేదాలను, 10 దేశి భేదాలను సూచించాడు.

భరతుడు పేర్కొన్న ప్రధాన దశ రూపకాలు గాక, 36 ఉపరూపకాల పేర్లు తెలుస్తున్నాయి. ఆ ఉపరూపకాలివి :

1. నాటిక 2. తోటకము 3. గోష్ఠి 4. సట్టకము 5. నాట్యరాసకము 6. ప్రస్థానము 7. ఉల్లోప్యకము 8. కావ్యము 9. ప్రేక్షణికము లేక ప్రేంఖణము 10. రాసకము 11. సల్లాపకము 11. శ్రీగదితము 13. శిల్పకము 14. విలాసిక 15. మత్తల్లిక (దుర్మల్లిక) 16. ప్రకరిణి 17. హల్లీసకము 18. భాణిక 19. హాసిక 20. వ్యాయోగిని 21. డిమిక 22. కలోత్సాహవతి 23. చిత్ర 24. జుగుప్సిత 25. చిత్రతాల 26. దోంబిక 27. షిద్గకము 28. రామక్రీడము 29. రాగకావ్యము 30. నృత్తపారము 31. భాణము 32. పారిజాతకము (పారిజాతలత) 33. నర్తనకము 34. ప్రేరణము 35. కల్పవల్లి 36. మల్లిక.

ఇందులో తోటకము, నాట్య రాసకము ముఖ్యమైనవి. (తె. వి. స-6)

ఉపాఖ్యానము

ఇది శ్రవ్య కావ్యభేదం. ఇతరుల వల్ల వినిన దానిని చెప్పటం ఉపాఖ్యానం అంటారు.

పురాణాలలోనూ కావ్యాలలోనూ ఉపాఖ్యానాలు బహుళంగా కనిపిస్తాయి. (తె. వి. స-6)

ఉపోద్ఘాతము

ఒక శాస్త్రాన్ని గాని గ్రంథాన్ని గాని ప్రారంభించేముందు దాని విషయం కొద్దిగా సూక్ష్మంగా చెప్పడాన్ని ఉపోద్ఘాతం అంటారు. దీన్నే పన్నశము అని కూడా అంటారు. ఇది శాస్త్రారంభక రచనగా ప్రసిద్ధం. (చూ. అవతారిక)

ఉప్పల నరసింహకవి

కాలం : క్రీ. శ. 19వ శతాబ్దం.

స్థలం : కర్నూలు జిల్లాలోని ముడివేముల గ్రామం.

ఆశుకవి. ఒకప్పుడు కరువు వచ్చి ప్రజలు బాధపడుతుంటే ఈ కవి "కాకర్ల" గ్రామంలో ఉన్న రామలింగేశ్వర స్వామిని విష్ఠురం అడుతూ ఆశువుగా పద్యాలు చెప్పాడు. రచనలు తెలియరాలేదు. (వా. వ. ర.)

ఉప్పల బక్కన్నప్ప కవి

కాలం : క్రీ. శ. 19వ శతాబ్ది.

స్థలం : కర్నూలు జిల్లా ముడివేముల గ్రామం.

ఇతడు ఒడ్డెపాళెం అంకాళ శక్తి (అంకాళమ్మ) జాతరను వర్ణిస్తూ చెప్పిన సీస పద్యం ఒకటి లభించింది. (చా. ప. ర.)

ఉప్పల సింహాద్రి నరసింహకవి

కాలం : క్రీ. శ. 19వ శతాబ్ది.
రచన : వేంకటేశ్వర విలాసం (అలభ్యం.).
స్థలం : కర్నూలు జిల్లాలోని ముడివేముల గ్రామం.

ఈయన వ్రాసిన "వేంకటేశ్వర విలాసం"లోని విరహ వర్ణనకు సంబంధించిన పద్యమొకటి దొరికింది. (చా. ప. ర.)

ఉప్పుగుండూరి పెరియన్న కవి

కాలం : క్రీ. శ. 1600 ప్రాంతం.
స్థలం : కాంచీపుర మండలం.
రచన : మీనకేతనాభ్యుదయము (అసమగ్రం).

ఇతడు శ్రీరంగరాయల కుమారుడూ, అళియరామ రాయల మనుమడూ అయిన పెద వేంకట రాయల ఆస్థానంలో ఉండేవాడు. అతనికే తన కావ్యాన్ని అంకితమిచ్చాడు.

బిరుదు : "సత్కవి వేశ్యాభుజంగుడు".

తెలుగు కవులు రాజులను రాయవేశ్యాభుజంగులని వర్ణించారు గానీ కవులకే ఇలాంటి బిరుదులుండటం అరుదు. ఇతని తండ్రి వెంకటకవి. "ఆంధ్రకవితా పితామహ" బిరుదాంచితుడైన ఉప్పుగుండూరి వెంకటకవీ, ఇతని తండ్రీ ఒక్కరేనా అన్న విషయం సంశయగ్రస్తంగా ఉంది. (క. త-11-86; ఆరుద్ర-9-243)

ఉప్పుగొండూరు వేంకటకవి

కాలం : క్రీ.శ. 16వ శతాబ్దం.
సంస్థానం : మట్లవారి ఆస్థానం.
రచనలు : తెలియరాలేదు.
బిరుదు : ఆంధ్రకవితా పితామహుడు.

విశిష్టత : ఈయన పెనుకొండ వెంకటపతిరాయల కాలంలో అమర భూములకు నాయకులయిన 'మహామండలేశ్వరు'లు మట్ల వారికి ఆశ్రితుడు. ఈయన 'ఉభయ చ్ఛత్ర చామర శంఖ సంఘ తాంకు'డట. ఎల్లమరాజు ఈయనను పిలిచి శాశ్వత ధర్మమేది అని అడగగా, 'కృతి శాశ్వతం' అని ఈయన చెప్పటం వల్ల ఆ ప్రేరణతో మట్ల అనంతరాజు కకుత్స్థ విజయం వ్రాసి ఉంటాడు. అనంతరాజును ప్రోత్సహించి కృతి రచింప జేసి, తండ్రికే అంకితం చేయించిన ఘనత ఈ కవిదే. (ఆరుద్ర-9-143)

ఉప్పులూరి వేంకటరెడ్డి

కాలం : తెలీదు.
కృతులు : సకల లక్షణ సార సంగ్రహమనే లక్షణగ్రంథం.

(కవిజనాశ్రయం పీఠిక-వావిళ్ళ)

ఉమాపతి కవి

ఈ కవి నాదిండ్ల ఉమాపతిగా ప్రసిద్ధుడు.

కాలం : 1460 ప్రాంతం

రచన : చిదానందమంజరి.

వెంగమాంబ, శేషయామాత్యుల పుత్రుడు. ఇతనికి చిదానంద ఘనయోగి అనే సిద్ధుడు స్వప్నంలో సాక్షాత్కరించి ఈ రచనకు పురికొల్పాడట. వేదాంత విషయాలను మృదు మధురంగా చెప్పడం ఈ కవి ప్రత్యేకత. (ద్వి. సా. చ. 303)

ఉరుటూరి వేంకటకృష్ణకవి

కాలం : 17 వ శతాబ్దం.

స్థలం : ముళవాగళు

రచన : రాఘవయాదవ పాండవీయము.

సమకాలికుడు : కోడూరి వేంకటాచలకవి.

బిరుదు : శ్లేషకవితాపితామహుడు.

ఈ కవి మైసూరు సీమకు చెందిన "ముళబాగళు" ప్రాంతం వాడు. 3వ రహస్య ఖండకర్త "కోడూరి వేంకటాచలకవి"కి మామ వరసవాడు. మహా ప్రబంధ నిర్మాత. (ఆం.సం.సా-26)

ఉర్లాము

ఇది గంజాం మండలం లోనిది. ఈ సంస్థానం 1803 లో ఏర్పడింది. ఉర్లాము, దేవాది గ్రామాలను ఈ రెంటి సమీపంలో ఉన్న అయిదు చేచిరాకు గ్రామాలను కుంఫిణీ వారు వేలం వేస్తే "కన్నేపల్లి కూర్మనాథ సర్వతోముఖ యాజులు" దాన్ని కొన్నారట.

ఈ సర్వతోముఖయాజుల తరువాత 'రామావధానుల' కాలంలో ఈ ఎస్టేటు దివాలా తీసింది. తిరిగి వేలం వేస్తే చికాకోలులో ప్రైవేటు న్యాయవాది బుద్ధిరాజు బసవరాజు దీన్ని కొన్నారు. వీరి తరువాత వారి దౌహిత్రులైన కందుకూరి బసవరాజు, వారి కుమారులు విశ్వనాథరావు పంతులు ఈసంస్థానానికి వారసులైనారు. విశ్వనాథరావు పంతులుగారు చిన్నతనంలో అకాలమరణం పొందారు. తర్వాత వారి భార్య "మహాలక్ష్మమ్మ", వారి తరువాత, వారికి దగ్గరి వారసుడైన కందుకూరి సన్యాసిరాజు ఎస్టేటుకు అధికార్లుగా ఉన్నారు.

వీరి కుమారులు బాల సూర్యప్రసాదరావు, లక్ష్మీప్రసాదరావులు తండ్రి అనంతరం ఎస్టేటుకు అధికారులై దానిని రెండుగా విభజించారు. బాల సూర్య ప్రసాదరావుకు "దేవాది" భాగం, లక్ష్మీప్రసాదరావుకు "ఉర్లాం" భాగం లభించాయి.

ఈ సంస్థానాధీశ్వరులు ప్రతి సంవత్సరం వేద, శాస్త్ర పరీక్షలు సల్పి అర్హులైన వారికి వార్షికాలిచ్చేవారు. పరీక్షించేందుకై వివిధ శాస్త్ర పారంగతులను అధికారులుగా నియమించేవారు.

ఈ జమిందారీ చాలా చిన్నదైనప్పటికీ వీరు గావించిన సాహిత్య పోషణ చాలా గొప్పది. వీరు గావించిన పండిత సత్కారాలు అత్యంత శ్లాఘనీయాలు.
(ఆ. సం. సా.)

ఉలిచి భావజ్ఞుడు

కాలం : 18 వ శతాబ్దికి పూర్వం.

రచన : పరశురామాయణము (ద్విపద).

కవిని గూర్చిన వివరాలు తెలియవు. లభించిన గ్రంథం అసమగ్రంగా ఉంది. రచన అంత ప్రశస్తంకాదు. ఉలర్ దొర ఇతని గ్రంథంలోని విషయాన్ని సమగ్రంగా మద్రాసు జర్నల్‌లో వ్రాశాడట. (ద్వి. సా. చ-367)

ఉలూచీ పరిణయము (అలభ్యం)

కర్త : సూర్పేటి హరియప్ప.

యక్షగానం. అవుదూరి కిచ్చయ్య మాధవాభ్యుదయంలో ఈ కావ్య ప్రసక్తి ఉంది. (య. వా. చ)

ఉల్లాసము

కావ్య విభాగం. కొన్ని కావ్యాలను ఉల్లాసములుగా విభజించడం వ్యాప్తిలో ఉంది. విషయ సౌలభ్యం చేత దేనిలో మనస్సు ఉల్లాసాన్ని పొందుతుందో అది ఉల్లాసము. ఈ అర్థంలో కొందరు తమ కావ్యాల కథాంశాలను ఉల్లాసాలుగా విభజించడం జరిగింది. (కావ్యాలంకార సంగ్రహం)

ఉషా కల్యాణము

కర్త: శైవ మాయన కవి.

రచనాకాలం : 18వ శతాబ్దం.

అయిదాశ్వాసాల ప్రబంధం. రచన రసవంతంగా ఉంది. (క. స-168)

ఉషాపరిణయ నాటకము (అలభ్యం)

కర్త : విజయ రాఘవ నాయకుడు.

ప్రదర్శన యోగ్యమైన నాటకాలలో తరచు ఉషాపరిణయం కథ స్వీకృతం. విజయరాఘవుడూ అదే ఉద్దేశంతో ఈ రచన కొనసాగించి ఉంటాడు. అతని నగరి నాటకశాలలో తరచుగా సంగీత నృత్య రూపకాలు ప్రదర్శించబడుతుండేవి. (ద.దే.వా-88)

ఉషాపరిణయమ్ (సం)

కర్త : చూ. వామనభట్ట బాణుడు.

ప్రసిద్ధమైన నాటకం. (రె. రా. చ)

ఉషాపరిణయము

కర్త: తాళ్ళపాక చిన్నన్న.

రెండువేల ద్విపదలున్న కావ్యం. హరి వంశాన్ని అనుసరించి తానీ రచన చేసినట్లు కవి చెప్పుకొన్నాడు. మనోహరమైన రచన. దీనిని ఉషాభ్యుదయ కావ్యంగా కొందరు పేర్కొన్నారు. (తె. వి. స-4)

**ఉషాపరిణయము**

కర్త: తిరుమల బుక్కపట్టణము వేంకటాచార్యులు.

సంస్కృత నాటకం.

**ఉషాపరిణయము (సం)**

కర్త : దామెర్ల అంక భూపాలుడు (చూ).

రచనాకాలం : క్రీ. శ. 1625-1649 మధ్యకాలం.

అంకితం : శ్రీరామునికి.

అయిదాశ్వాసాల కావ్యం.

ఇతి వృత్తం ప్రఖ్యాతం. చిత్ర కవిత్వ రీతులు మిక్కిలిగా ఉన్నాయి. కవి ఒక పద్యంలోనే ఆరు బంధాలు ఇమిడ్చి చెప్పాడు. ఒక పద్యంలో 108 కందాలను ఇమిడ్చి "ఏకాదశబంధ గర్భ కంకణ బంధ కందం" వ్రాశాడు. పాండిత్య ప్రకర్ష ఎక్కువ కవిపిస్తుంది.

పులికాట్ మైలాపూర్‌ల మధ్య చెన్నపట్టణాన్ని, దామెర్ల అయ్య నృపతి కట్టించినట్లు ఈ కృతిలో (1-94) చెప్పబడింది. కవి తండ్రియైన చెన్న భూపాలుని పేరనే ఆ నగర నిర్మాణం జరిగించట. అయ్య నృపతి అంక భూపాలుని సోదరుడు. పూనమల్లి రాజధానిగా కొన్ని ప్రాంతాలను పాలించాడు. (ఆయుప్ర 11-59)

**ఉషాపరిణయము**

కర్త : (చూ) మేలత్తూరు వేంకటరామశాస్త్రి.

సంగీత నృత్య రూపకం. మదరాసు అడయార్ కళా క్షేత్రం వారు రుక్మిణీదేవి అరండేల్ ఆధ్వర్యంలో దీనిని ప్రదర్శించి మన్ననలు పొందారు. (శా. ధ్వ-124)

**ఉషాపరిణయము**

కవయిత్రి : రంగాజమ్మ.

రచనా కాలం : 1633-73 నడుమ.

నాలుగాశ్వాసాల ప్రబంధం. సంస్కృత హరి వంశంలోని కథకు స్వతంత్రానుసరణం. తెనుగులో ఈ కథ ఎఱ్ఱన, నాచన సోమన, పోతన ఈమె కంటె ముందు చెప్పేఉన్నారు. అయితే ప్రత్యేక పద్యకావ్యంగా రాసిన ఘనత ఈమెదే. సమకాలీన వేషభాషలు, ఆచార వ్యవహారాలు విపులంగా బాగా తెలుపుతున్న రచన. (ద. దే. వా. 139)

**ఉషాపరిణయము**

కర్త : విరిపాటి నృసింహరాజు.

యక్షగానం. కథ ప్రసిద్ధం. మార్పులు లేవు. రచన సరళ గ్రాంథికంలో ఉంది. దీనిలో ద్విపదలెక్కువ. (య. వా. చ. 51)

ఉషాభ్యుదయము

నామాంతరం : ఉషాపరిణయము.

కర్త : తాళ్ళపాక చిన్నన్న.

ఉషాభ్యుదయము

కర్త : చూ. పూసపాటి వెంకటపతిరాజు.

అంకితం : శ్రీరామతీర్థంలో వెలసిన సీతారామస్వామికి.

అయిదాశ్వాసాల ప్రౌఢ ప్రబంధం. శృంగారం ఇందులోని ప్రధాన రసం. హరివంశంలో ప్రసిద్ధిచెందిన ఉషానిరుద్ధుల చరిత్ర దీనిలోని వృత్తాంతం. ఇది పిల్ల వసుచరిత్రగా ప్రసిద్ధి చెందింది కవి ప్రతిభా పాండిత్యాలకు నికషము.

(ఆం. సం.'సా-414)

ఉషాభ్యుదయము (అలభ్యం)

కర్త : పోడూరి పాపన్న.

రచనాకాలం. 1800 ప్రాంతం.

"శివరామాభ్యుదయ" వ్యర్థి కావ్యకర్త అయిన పోడూరి పెదరామామాత్యుని కృతులనుండి ఈ కావ్యరచనా విశేషాలు తెలిశాయి.

ఉషాస్వప్నము

కర్త : తెలియదు.

జానపద పౌరాణిక గేయం.

సుప్రసిద్ధమైన కథ. భాగవతంలో నుండి తీసుకోబడింది.

చూ. పౌరాణిక గేయములు.

ఊంజల్

ఇది ఒక ఊయలపాట. ఊంజల్ తమిళ శబ్దం. తెలుగులో లాలి పాటలు, ఉయ్యాలపాటలు, జోలపాటలు ఉన్నాయి గాని వాటి గతి వేరు, దీని గతి వేరు. చిన్న పిల్లలను నిద్రబుచ్చేటప్పుడు, దేవాయతన కల్యాణోత్సవాలు జరిగేటప్పుడు ఈ పాట ఉంటుంది. పార్థసారథి విజయం, ఆండాళు చరిత్రలలో కల్యాణ సందర్భాలలో- వధూవరులను సఖులు ఉయ్యాలలూచిన సందర్భాలలో ఇవి ప్రయుక్తాలు. ఆండాళ్ చరిత్రలో ఊంజల్ పాట వెంటనే ఒకలాలిపాట కూడా ఉంది.

వివాహ వేళలలో వధూవరులను ఉయ్యాలలూపే ఆచారం తమిళ, మళయాళాది రాష్ట్రాలలో ఇప్పటికీ ఉంది. (య. వా. చ-315)

ఊడుమూడి సూరపరాజు

కర్త : 16వ శతాబ్దికి తర్వాతి కాలం.

స్థలం : ఊసన్నాడ (గోదావరి మండలం).
రచన : వేంకటేశ్వర శతకము.
గురువు : అనంతకవి.

బ్రహ్మరాజు, భద్రమ్మల కుమారుడు. రసవంతంగా కవిత్వం చెప్పాడు. (క. వ-300)

ఊరదేచమంత్రి

కాలం : క్రీ. శ. 16 శతాబ్దం.
స్థలం : కొండవీడు.
రచన : దేవీ పంచస్తవి వ్యాఖ్య (అలభ్యం).

తెనాలి రామలింగకవి విరచిత ఉద్భటారాధ్య చరిత్రకు కృతిపతి. స్వయంగా పండితుడేగాక సాహిత్యపోషణ కూడా చేశాడు. నాదెండ్ల గోపమంత్రి కొండవీటి సీమను పాలించేటప్పుడు అతనికి మంత్రిగా ఉండేవాడు. ఇతడు దేవీ పంచస్తవికి వ్రాసిన వ్యాఖ్య నేడు అలభ్యం. గోప మంత్రి ఇతనికి క్రీ.శ. 1517 ప్రాంతంలో ఒక అగ్రహారాన్ని ఇచ్చినట్లు తెలుస్తున్నది. (క. త-7)

ఊరుటూరి శాసనము (సం)

కాలం : క్రీ శ. 848 ప్రాంతం.
శాసన కర్త : అజ్ఞప్తి పండరంగడు.

గుణగ విజయాదిత్యుని సేనాని పండరంగడు వేయించినది. దీనిలో సంస్కృత శ్లోకముంది. (తె. శి. చ-23)

ఊరెె సరసకవి

కాలం : తెలియదు.

చాటుకవి. ఈ కవి తననెవరో తిరస్కరించి పలకగా పెద్ద చంపకమాల వృత్తంలో ఒక చక్కని పద్యం చెప్పాడు (చా. ప. ర)

ఊరెె వీరభద్ర కవి

కాలం : తెలియదు.
రచన : కరటికోద్ధారిణి (అలభ్యం).

ఈయన పై గ్రంథాన్ని వ్రాయటమే గాక వేసకొండ గంగ జాతరను వివ లంగ వర్ణిస్తూ పద్యాలు చెప్పాడు. ఒక పద్యం లభించింది. (చా.ప.ర)

ఊర్మిళాదేవి నిద్ర

చూ. పౌరాణిక గేయములు.

జానపద పౌరాణిక గేయ రచన.

ఇతి వృత్తం రామాయణానికి సంబంధించింది.

శ్రీరాముని తమ్ముడు లక్ష్మణుడు 14 సంవత్సరాలు సోదరుని వెంట అరణ్య

వాసం జరిపిన తరువాత, తిరిగి వచ్చి తన భార్య అయిన ఊర్మిళను నిద్రలేపడం మొ॥ విషయాలు చమత్కారంగా చిత్రింపబడ్డాయి.

**ఋగ్వేద కవి వేంకటాచలపతి కవి**

నామాంతరం : ఋగ్వేది వేంకటాచలపతి కవి (చూ).

ఋగ్వేద కవి అనే వ్యవహార నామాన్ని బట్టి వీరిరువురూ వేర్వేరు వ్యక్తులని కొందరు అభిప్రాయ పడ్డారు. 'ఋగ్వేది' అనే ఇంటి పేరు వల్ల ఋగ్వేద కవిగా ఈ కవి ప్రసిద్ధుడైనాడు.

**ఋగ్వేది వేంకట నారాయణ కవి**

కాలం : క్రీ. శ. 19 వ శతాబ్దం.
స్థలం : కార్వేటి నగర సంస్థానం.
రచనలు : గీత గోవిందము, లక్ష్మణాపరిణయము, కృష్ణ విలాసము, మదన గోపాల విజయము మొ॥వి.

కార్వేటినగర ప్రభువైన మాకరాజు వెంకట పెరుమాళ్ళ రాజు ఆస్థానంలోని అష్టదిగ్గజాలలో ప్రముఖుడు. సంగీత సాహిత్య వేత్త, సంస్కృతాంధ్రాలలో పండితుడు. జయదేవ కవి కృతమైన 'గీత గోవింద' కావ్యాన్ని తెలుగులోనికి అనువదించాడు. ఇతని రచనలు అధిక భాగం సంస్కృతాలు. (ఆం సం. సా.)

**ఋగ్వేది వేంకటాచల కవి**

వ్యవహారనామం : ఋగ్వేద కవి వెంకటాచలపతి కవి.
కాలం : 18 వ శతాబ్ది పూర్వార్ధం.
స్థలం : కార్వేటి నగరం.
రచన : చంపూ రామాయణము.
బిరుదు : కవిరాజ కంఠీరవ.
గురువు : తిరు వేంగళాచార్యుడు.

కార్వేటి నగరాధిపతి వెల్లంటి కనవరాజుకు ఆశ్రితుడు. సంస్కృతాంధ్ర కవితా విశారదుడు. ఆశుకవి. దామర్ల అక్కన్నృపాలుని సభలో 'వరకవి గంగ సింధురము' అని పేర్వడిన ఒకానొక కవిని ఓడించి, కవి రాజ కంఠీరవ బిరుదం గ్రహించాడట. ఇతని తండ్రి పేరు కూడా తిరు వేంగళాచార్యుడేనట.

(క.. త - 13 - 117 - 119)

**ఋతుక్రీడా వివేకమ్ (సం)**

కర్త : చెరుకూరు లక్ష్మీధరుడు. (తె. వి. స - 4)

**ఎచ్చంగూడు**

అగ్రహారం. 16 వ శతాబ్దంలో తంజావూరు మంత్రి గోవిందదీక్షితుడు యజ్ఞం చేసినప్పుడు, ఒక్కొక్క తిథి పేరిట ఒక్కొక్క గ్రామాన్ని దానం చేశాడట

ఆ దాన కైంకర్యాలన్నీ రాజైన రఘునాథుడే ఇచ్చాడట. అనాడు ఇచ్చిన ఏకాదశ అగ్రహారమే ఈ ఎచ్చంగూడు (అరుద్ర-10-79)

ఎట్టియాపురము సంస్థానం

దక్షిణదేశంలో తెలుగుభాషను ఆదరించిన సంస్థానాలలో ఒకటి. ఈ సంస్థాన పాలకులలో 19వ శతాబ్ది వారైన వెంకటేశ్వర ఎట్టప్ప, జగదీశ్వర రామకుమార ఎట్టప్ప మహారాజులు సంస్కృతాంధ్ర ద్రవిడభాషావిశారదులు. సంస్కృతంలో సంగీతకృతులు దేవతాస్తుతి పరంగా చేశారు.

జగదీశ్వర రామకుమార ఎట్టప్ప మహారాజు (1839 ప్రాంతం) ఆస్థానంలో గుడుగుముల అహోబలశాస్త్రి, బాలయ్య, గోపాలయ్య, కేశవరాజు భట్రాజు, అవల్ నత్తం రామలింగయ్య, విశాత్తియం కృష్ణయామాత్యులు మొదలైన వారుండేవారు.

సుబ్బరామదీక్షితులను ప్రోత్సహించి కవిత్రయభారతాన్ని తమిళంలోకి అనువదింప చేసినది ఈ జగదీశ్వర రామకుమార ఎట్టప్ప మహారాజే. (ద. దే. వా-513)

ఎడపాటి ఎర్రన

కాలం : క్రీ. శ. 16 శ. ప్రారంభం.

రచనలు : 1 మల్హాణ చరిత్రము 2 కుమారనైషధము (అలభ్యం).

ఈయన ఇంటి పేరు పెదపాటి వారని కొందరి అభిప్రాయం. ఇతడు ఎడపాడు గ్రామకరణమట. గ్రామ నామాన్ని బట్టి ఇంటి పేరు ఎడపాటి అయి ఉంటుందని కొందరు పండితులంటారు. ఇతని తండ్రి సోమయామాత్యుడు. ఇతని కవిత్వం మృదుమధురంగా ఉంటుంది (ఆం. వి. స-6-597)

ఎడవల్లి పర్వతన్న

కాలం : క్రీ. శ. 16 శతాబ్ది.

రచనలు : తెలియరాలేదు. రెండు చాటువులు మాత్రం లభించాయి. (ఒక తిట్టు చాటువు, ఒక దీవన చాటువు.)

విశిష్టత : బంగారు కామయ్యను పర్వతన్న ఒక చాటువులో తిట్టాడు. కర్నూలును పాలించిన గోపాలరాజు అనే ఆయన కత్తిని పొగడుతూ మరొక చాటువు చెప్పాడు. (గోపాలరాజు అళియ రామరాజు తమ్ముని కుమారుడని కొందరు పండితులంటారు) పై రెండు పద్యాలను అప్పకవి ప్రమాణాలుగా తీసుకొన్నాడు. గోపాలరాజు కత్తి మీద పర్వతన్న చెప్పిన పద్యాన్ని ఋవళికి చూపించిన ప్రామాణిక ప్రయోగాలలో అప్పకవి ఉదాహరించాడు. (అరుద్ర-9-254)

ఎడవిల్లి

అగ్రహారం. నెల్లూరు జిల్లా పొదిలి తాలూకాలో ఉన్న గ్రామం. ఎలకూచి బాలసరస్వతి పూర్వీకుడైన తిరుమలయ్య తన పాండిత్యంతో అళియ రామరాయలను మెప్పించి ఈ అగ్రహారాన్ని, వెల్లగొడుగులు, పసిడిచామరాలు, మణి భూషణాలు మొదలైన వాటిని బహుమతిగా పొందాడట. (అరుద్ర-10-29)

## ఎడ్ల రామదాసు

కాలం : 19 వ శతాబ్ది.

రచన : 1. స్వప్రకాశ శతకము 2. అఖిలరూపాత్మ శతకము.

శతకకవి. (శ. సా. వి)

## ఎడ్ల వారు

సాధు జంతువుల పేరుతో ఉన్న ఇంటి పేరు. స్వప్రకాశ శతకం, అఖిల రూపాత్మ శతకం వ్రాసిన రామదాసు (క్రీ. శ. 19 శ. పూర్వార్ధం) ఇంటి పేరు 'ఎడ్ల'. ఇట్లే దున్నవారు, ఆవులవారు, ఏనుగు వారు, గుర్రంవారు, ఉన్నారు.

(భారతి_మా_45_229_శ.సా.వి.)

## ఎనుములపల్లి పెద్దనామాత్యుడు

కాలం : క్రీ. శ. 16 శతాబ్ది పూర్వార్ధం.

సాహిత్య పోషకుడు. చరిగొండ ధర్మన రచించిన చిత్ర భారతానికి కృతి కర్త. ఇతడు గోల్కొండ నవాబులు - జంషిద్ కుతుబ్ శాహికి, ఇబ్రహీం కుతుబ్ శాహికి సమకాలికుడు. ఇతడు చిత్తాపు ఖానుని దగ్గర మంత్రిగా ఉండేవాడట. చిత్తాపు ఖానుడు తొలుత "సీతాపతి" అనే హిందువనీ మహమ్మదీయ దండ యాత్రల కాలంలో మతం మార్చుకున్నాడనీ అంటారు. (తె. వి. స_6) (క. స_97)

## ఎనుముల రామన్న

కాలం : 19వ శతాబ్దం పూర్వార్ధం.

స్థలం : గోదావరీ మండలం.

సాహిత్య పోషకుడు. అల్లమరాజు సుబ్రహ్మణ్య కవి రచించిన మణిధ్వజ చరిత్రను అంకితం పొందాడు. ప్రతిగా కవికి కొంత భూమిచ్చి సత్కరించాడు,

(క. చ, 3_253)

## ఎరియని శాసనము

కాలం : క్రీ. శ. 1142.

ప్రస్తావిత స్థలం : గుంటూరు జిల్లా తెనాలి తాలూకా వలివేరు గ్రామం.

శాసన ప్రదాత : ఎఱియడు.

శాసన విషయం : దీనిలో దాత గుణగణాలన్నీ ప్రస్తావించబడ్డాయి. చాల చోట్ల దాత అఖండ దీపాలను నిలిపాడట. ఆశ్రితులను, బుధులను, బంధువులను ఆదరించాడట. "వలివేర్ భాండారికి" దాత నిశ్చలమతితో అఖండ దీపం నిల్పినట్లు దీని వల్ల తెలుస్తున్నది. దీనిలో ఒక శార్దూలం, ఒక ఉత్పలమాల, ఒక కందపద్యం ఉన్నాయి.

(తె. క. చ_239, 240)

## ఎరుక (యక్షగానము)

నామాంతరం : సుజ్ఞాన పెరుక.

కర్త : రామబ్రహ్మయోగి.

అంకితం : రామబ్రహ్మమునకు (గ్రంథకర్త గురువు).

ఇది రామబ్రహ్మయోగి రచించిన సుజ్ఞానపెరుక అనే యక్షగానం. ప్రీతిలేని నిర్గుణుని పతిగా కోరిన బుద్ధి కాంతకడకు ఎఱుక అనే ఎఱుకత వచ్చి కొంత వేదాంత గోష్ఠి చేయడం ఇందులోని ముఖ్య విషయం. కవి దీనిలోని విషయ క్లిష్టత నుజ్జగించి, ఉదాత్తతను పాటించి రచన చేశాడు. దీనిలో జంపె, కుఱుచ జంపె, ఆది, ఏక, అట, త్రిపుటలలోనే దరువులు, ద్విపదలు, పద్యాలు, ఏల, చూర్ణిక మొదలయిన రచనా విశేషాలున్నాయి. ద్విపదలలో ప్రాస యతి ఉంది. ఈ యక్షగానం ప్రాచీన యక్షగాన పక్కకి దగ్గరగా ఉంది (య. వా. చ-26)

ఎరుకమ్మ కథ

కరుణరస ప్రధానమైన జానపదగేయం.

చూ. కరుణరస గేయములు. (వా.చ.)

ఎరుకల కథ

నామాంతరం : చోడిగాని కలాపం (చూ).

ఎరుకల కథ

కర్త : నక్కలపాటి సంజీవకవి.

రచనా కాలం : 18 వ శతాబ్దం

పుత్ర వాంఛతో ఉన్న యశోద కడకు విష్ణునియోగంతో యోగమాయ ఎఱుకతగా రావడం ఇందులోని విషయం. దీనిలో ఎరుకల కాంభోదిలో రెండు దరువులు పంతువరాళి, సౌరాష్ట్రంలో ఒక్కొక్కటి, నటతాళంలో ఒకటి, రెండు దీర్ఘ ద్విపదలు కొన్ని పద్యాలు, రెండు చోట్ల అల్పవచనాలు ఉన్నాయి. (య. వా. చ-45)

ఎరుకల కురవంజి

కర్త : సన్నిధిరాజు జగన్నాథకవి.

రచనా కాలం : 1819 కి పూర్వం.

ఈ యక్షగానంలో జీవోత్పత్తి నుంచి కైవల్య ప్రాప్తి వరకుగల తత్త్వం అద్వైతపరంగా వర్ణించ బడింది. దీనిలో కొద్ది దరువులు, పద్యాలు ఉన్నాయి. ద్విపదలు, వచనాలు ఎక్కువ. (య. వా. చ. 79)

ఎరుకల నాంచారి కథ

కర్త : తెలియదు.

జానపద శృంగార గేయం.

ప్రసిద్ధం.

చూ. శృంగార గేయములు. (వా. చ.)

ఎరుకల సాని

కాలం : 15, 16, 17 శతాబ్దాలు విజయనగర, తంజావూరు నాయక రాజుల కాలం.

కావ్యాలలోనూ, యక్షగానాలలోనూ నాటకాలలోనూ ఉండే ఒక పాత్ర. ఎరుకల స్త్రీలు పూర్వం ఎరుక చెప్పటం ద్వారా సంఘంలో మంచి పలుకుబడిని కలిగి ఉండే వారు. రాజులు, రాణులు, పండితులు సోదెకు చెవులు కోసుకొని, వారిని ఆహ్వానించి, గద్దె అడిగి బహుమానాలను ఇచ్చేవారు. ఎరుకల సాని ఏ రాజాస్థానంలో ప్రవేశించాలన్నా ఎట్టి అభ్యంతరం ఉండేదికాదు.

సమాజంలో పలుకుబడితో పాటు, అంతటి స్థానాన్ని సాహిత్యంలోనూ పొంది ఎరుకత ప్రత్యేకంగా ఒక పాత్రగా తెలుగు దేశంలో నిలిచిపోయింది. అప్పటి ప్రతి కురవంజిలోనూ, యక్షగానాలలోనూ ఈ పాత్ర ప్రవేశించి, నాయికకో, నాయకునకో ఎరుక చెప్పి నిష్క్రమించేది.

ఆముక్తమాల్యదలో ఎరుకలసాని వర్ణన చక్కగా ఉంది. ఈమె వన్నెల రవిక తొడిగి, ముంజేతులకు-నుదుట పచ్చ బొట్టులతో, పైటలో మూపున చిన్న బుడుతడిని కట్టుకొని చాలా పాత పైడిబుట్ట నెత్తిన పెట్టుకొని, కనుబొమల సందున నామం పెట్టి, నొసట విభూతితో, కన్నులకు కాటుకతో కనిపిస్తుంది. దారి కట్టు, మొనకట్టు, కవికట్టు, స్త్రీ వశ్యం కలిగించే తాయిత్తులను, వేరులను వీరు అమ్ముతుండేవారు.

ఈమెకు కురవంజి అనేది సార్థక నామం. ఈ పేరుతో అనేక కురవంజులు, యక్షగానాలు తెలుగులో వచ్చాయి. ఈ పాత్ర కురవంజిలో విధిగాను, యక్షగానాలలో క్వాచిత్కంగాను ఉంటుంది. యాదవదాసు గరుడాచల నాటకం (చెంచులక్ష్మి) లో ఈ పాత్ర ఉంది. (చూ-సింగి-సింగడు). (నా. ర. చ-91-92)

ఎరుక సానమ్మ పిల్లలమర్రి శాసనము

కాలం : క్రీ. శ. 1215.

శాసనం వేయించిన వారు : ఎరుక సానమ్మ.

ప్రస్తావిత వ్యక్తి : ఇవటూరి సోమయ.

శాసన విషయం : పిల్లలమర్రి గ్రామంలో బేతిరెడ్డి భార్య బేతేశ్వర దేవుని ప్రతిష్ఠించిన సందర్భంలో వేయించిన దాన శాసనం. ఇవటూరి సోమయ బేతేశ్వర, ఎరకేశ్వర స్వాములను ప్రతిష్ఠించినట్లు కూడా ఉంది. పాల్కురికి సోమనాథుని కాల నిర్ణయానికి ఇవటూరి సోమయ (సోమనాథయ్య)ను కూడా సాహిత్యకారులు ఆధారంగా స్వీకరించారు. (తె. క. చ-339)

ఎర్రన మంత్రి

కాలం : 15, 16 శతాబ్దాల నడిమి కాలం.

స్థలం : విజయనగరం.

సాహిత్య పోషకుడు. మాదయ కవి రచించిన దేవేంద్ర విజయమనే ద్విపద కావ్యాన్ని అంకితం పొందాడు. ఈ గ్రంథం అలభ్యం. ఎర్రన మంత్రి కృష్ణ దేవ

రాయల తండ్రి నరసరాయల కాలంలోనూ అన్నయైన వీరనరసింహరాయల కాలంలోనూ ఉండి ఉంటాడని ఊహిస్తున్నారు. (క. త-166)

ఎఱ్ఱ మంచరాజు

కాలం : క్రీ. శ. 1118.

స్థలం : శ్రీగిరి పశ్చిమ దేశం (కొండపడుమటి సీమ).

ఈయన కొండపడుమటి సీమకు అధిపతి. ఈయన శౌర్య ప్రతాపాలను నుతిస్తూ విశ్వకర్మకులజుడైన సూరదు శాసనం వ్రాశాడు. మంచరాజుకు ఈ సూరదు దండ నాయకుడు కావచ్చును. (తె. క. చ-185)

ఎఱ్ఱమిల్లి మల్లికార్జునుడు

కాలం : 19వ శతాబ్దం.

రచన : చారు దర్వీషు కథలు.

ఇతడు ఫారసీ భాషలో పండితుడు. నలుగురు ఫకీర్ల చరిత్రలను తెలిపే కథలను ఫారసీ భాషనుండి తెలుగులోకి అనువదించాడు. (వ. వా.)

ఎఱ్ఱమిల్లి సూర్యప్రకాశ కవి

స్థలం: గోదావరి జిల్లా అమలాపురం.

కాలం : 1810 ప్రాంతం.

రచన : హనుమచ్ఛతకము

శతకకర్తగా ప్రసిద్ధుడు. రచన సరళంగా ఉంటుంది. (శ. సా. వి.)

ఎఱ్ఱాప్రెగ్గడ

కాలం : క్రీ. శ. 14 శ. పూర్వార్ధం.

పోషణ : ప్రోలయ వేమారెడ్డి, మల్లారెడ్డి.

స్థలం : అద్దంకి సీమలోని గుడ్లూరు.

బిరుదులు : శంభుదాసుడు, ప్రబంధ పరమేశ్వరుడు.

రచనలు : 1. అరణ్యపర్వశేషము (భారతం), 2. నృసింహపురాణము, 3. హరివంశము, 4. రామాయణము, 5. కవిసర్పగారుడము (వివాదగ్రస్తం).

కవిత్రయంలో మూడోవాడు, పోతమాంబా సూరనార్యుల పుత్రుడు.

విశిష్టత : ఈయన ప్రతిభా పాండిత్యాలలో నన్నయ, తిక్కనలకు సమానుడై భారతారణ్యపర్వశేషాన్నే గాక హరివంశాన్ని కూడా రచించి భారతానికి సమగ్రత కల్పించాడు. ఈయన అరణ్యపర్వశేషాన్ని నన్నయపేరు మీదుగనే తెనిగించి రాజరాజనరేంద్రునికే అంకితం చేశాడు. ఈ అరణ్య పర్వశేషాన్ని నన్నయ శైలిలో ఆరంభించి, తిక్కన శైలిలో ముగించాడు. అందులో ఈయన శైలి, నన్నయ - తిక్కనల రచనలనే రెండు మహాసముద్రాలను కలిపే జలసంధివలె ఉంటుంది,

ఈయన శైలి వస్త్వౌచిత్యశుద్ధికి నెలవు. శ్రీనాథ మహాకవి ఇతని సూక్తివైచిత్రిని ప్రశంసించాడు. నృసింహపురాణంలో ప్రహ్లాదుని భక్తి వర్ణనలో ఎఱ్ఱన పోతనకు

ఉజ్జ్వలంతి అయ్యాడు. ఈయన కావ్యాలన్నింటిలో ప్రబంధ లక్షణాలు ప్రస్ఫుటంగా కని పిస్తాయి కనక ఈయనకు "ప్రబంధ పరమేశ్వర" బిరుదం సార్థకమైంది ఎర్రన తండ్రి సూరనామాత్యుడు ఉభయ కవిత్వ ప్రౌఢుడట. వీరి యింటి పేరు 'చదలవాడ వార'ని కొందరంటున్నారు. కాని దానికి తగిన ఆధారాలు లేవు.

ఈతడు "కవి సర్పగారుడా"న్ని రచించినట్లు కస్తూరి రంగకవి రచించిన ఆనంద రంగ రాట్ఛందస్సులోని కొన్ని పద్యాలవలన తెలుస్తున్నది. కాని ఇది నిర్ధారింప బడలేదు. (వా. చ.)

ఎలకుర్తి రామయ్య

కాలం : క్రీ. శ. 1590 కి ముందు.

రచన : రామలింగ శతకము (అలభ్యం).

విశిష్టత : ఈయన రచించిన పై శతకంలోని ఒక పద్యాన్ని పెదపాటి జగ్గన్న తన ప్రబంధరత్నాకరంలో ఉదాహరించాడు. ఈ పద్యంలో శివుని అర్ధనారీశ్వర రూపాన్ని కవి చక్కగా వర్ణించాడు. (అరుద్ర-9)

ఎలకూచి తిరుమలయ్య

కాలం : క్రీ.శ. 16వ శతాబ్దం.

రచనలు : తెలియరాలేదు.

పాకనాటిలో ఉండే ఒక ఉద్దండ పండితుడు. అళియ రామరాయలను మెప్పించి వెల్ల గొడుగులు, పసిడి చామరాలు, పల్లకీలు, మణిభూషణాలు, నెలూరు జిల్లా పొదిలి తాలూకాలోని "ఎడవిల్లి" అనే అగ్రహారం బహుమతిగా పొందాడు. ఇతని వంశీయుడే ఎలకూచి బాలసరస్వతి. (అరుద్ర-10-29)

ఎలకూచి పినయాదిత్యుడు

నామాంతరం : పిన్నయ ప్రభాకరుడు.

కాలం : 17వ శతాబ్దం.

స్థలం : జటప్రోలు ప్రాంతం.

రచన : ఆదిత్యపురాణము.

క్రీ. శ 1650 ప్రాంతం వాడట. ఎలకూచి బాలసరస్వతికి తమ్ముడు, చతుర్విధ కవిత్వ రచనా ధౌరేయుడు. ఇతని తాత భైరవుడు రామరాజు ఆస్థాన కవి యట. (క. త-12-110)

ఎలకూచి బాలసరస్వతి

నామాంతరం : ఎలకూచి వేంకటకృష్ణయ్య.

కాలం : క్రీ. శ. 1600 ప్రాంతం.

స్థలం : పాకనాడు.

బిరుదులు : మహామహోపాధ్యాయ భట్టారక, బాలసరస్వతి.

కృతులు : 1. బాలసరస్వతీయము (ఆంధ్రశబ్ద చింతామణికి టీక) 2. భర్తృహరి త్రిశతికి అనువాదం 3. యాదవ రాఘవ పాండవీయము 4. రంగకౌముదీ నాటకము 5 చంద్రికాపరిణయము 6. భాషావివరణము 7. నాహాటము 8. వామన పురాణము 9. భ్రమరగీతిప్రబంధము 10. కార్తికేయాభ్యుదయము.

అసాధారణ శేముషీమహిమకలవాడు. ప్రౌఢంగా, హృదయంగమంగా కవిత చెప్పాడు. ఇతడు కృష్ణదేవుని కుమారుడు. బాల్యంలోనే పాండిత్యం చూపడంవల్ల ఇతనికి బాలసరస్వతి అనే బిరుదం వచ్చిందట. అదే వ్యవహారనామం అయిందని చెప్తారు ఇతని నివాస స్థలాన్ని గురించి కృష్ణామండలం వాడనీ, గోదావరిమండలం వాడనీ, మహబూబ్‌నగర్ జిల్లా వాడనీ భిన్నాభిప్రాయాలున్నాయి. ఇతని పూర్వీకులు నెల్లూరు జిల్లాలోని ఎడవిల్లి అగ్రహారాన్ని అళియ రామరాయల నుండి పొందారట. ఇతని రచనలలో కొన్ని మాత్రమే లభించాయి. (క. త-11-147)

ఎలకూచి వేంకటకృష్ణయ్య

నామాంతరం : ఎలకూచి బాలసరస్వతి (చూ.).

ఎల్లకర నరసింహ కవి

కాలం : క్రీ. శ. 16 శతాబ్ది మధ్య ప్రాంతం.

గురువు : తిరుమల లక్ష్మణాచార్యుడు (1511-1568)

రచనలు : 1. మార్కండేయ పురాణము (ద్విపద) 2. భారత సావిత్రి (వచనం).

విశిష్టత : కృష్ణయార్యుని పుత్రుడు. పద్మసాలీల ప్రోత్సాహంతో మార్కండేయ పురాణాన్ని వ్రాశాడు. దీనికి మూలం సంస్కృత మార్కండేయ పురాణం 'వావిరి, ముల్లోక వాసులకెల్ల, నెనరొప్ప పంచవన్నెల వస్త్రసమితి, నినచంద్ర సాక్షిగా', ఇచ్చిన వాళ్ళు, ఒంటికంబపు మేడ సాధించిన వాళ్ళు, భావన ఋషి వంశంలోని వాళ్ళు అయిన పద్మసాలీలు ఈయనను పిలిపించి పురాణం ద్విపదలో చెప్పమన్నారు. దీనికి ముందే ఈయన బహుళ ప్రచారంలో ఉన్న "భారత సావిత్రి" వ్రాశాడట. ఈ కవి గ్రంథాల ప్రతులు మద్రాసు ప్రాచ్యలిఖిత భాండాగారంలో ఉన్నాయి. ఇతని రచన రమణీయంగా ఉంటుంది. (ఆంధ్ర-11-68)

ఎల్లని అమరావతి శాసనము

కాలం : క్రీ. శ. 1158.

శాసన ప్రదాత : ఎల్లడు.

శాసన రచయిత : నల్ల పాచార్యుడు.

ప్రస్తావిత స్థలం : గుంటూరు జిల్లా అమరావతి.

శాసన విషయం : ఎల్లడు కమ్మకులోద్భవుడని, ఈయన బంధు మిత్రులను పోషించాడని, సత్కవులను సత్కరించాడని, వివిధ మిత్రులు ఈయనను నుతించారని శాసనం చెబుతుంది. ఇతడు అమరావతిలో వేంచేసియున్న అమరేశ్వర స్వామికి గుడి కట్టించి, అఖండ దీపం నిలిపినట్లు తెలుస్తుంది. దానశీలి యట. దీనిలో ఒక శార్దూలం,

ఎనిమిది ఉత్పలమాలలు, రెండు చంపకమాలలు, ఒక మత్తేభం, ఒక సీస పద్యం, ఒక కందపద్యం ఉన్నాయి. (తె. క. చ_268_271)

ఎల్లమ్మ పాట

కర్త : తెలియదు.

జానపద పారమార్థిక గేయం.

ఎల్లమ్మ గ్రామదేవత. ఇది ఆ దేవత మాహాత్మ్యం తెలిపే గేయం. పామర జనులలో ప్రచారం ఎక్కువ.

చూ. పారమార్థిక గేయములు (ఆం. వా. చ.)

ఎల్లయ

కాలం : 19 వ శతాబ్దం. 1846 ప్రాంతం.

స్థలం : సేలం ప్రాంతంలోని ఉద్దండ మల్ల సముద్ర గ్రామం.

రచనలు : 1. చంద్రతారా విలాసము (నామాంతరం : తారాశశాంకము).

సంగీత సాహిత్య విద్యాప్రవీణుడు. ఇతడు క్రీ శ. 1846 ప్రాంతంలో 'ఈరోడ్' పట్టణంలో ఉన్నట్లు కోలా శేషాచల కవి, "నీలగిరి యాత్ర" నుండి తెలుస్తున్నది. పెట్లుప్పు, ప్రత్తి మొ॥ సరకుల వ్యాపారం చేసే "ఫిషర్‌దొర" దగ్గర ఇతడు ఏజంటుగా ఉండేవాడట. ఈ కవి అనేక శృంగార నాటక ప్రబంధాలు రచించినట్లు తెలుస్తోంది. కాని అవేమీ దొరకలేదు. ఇతడు ఈరోడ్‌లో ఒక సత్రం కట్టించాడట. సేలం ప్రాంతాన్నే పూర్వం చేర దేశం అని వ్యవహరించేవారు. (వ. దే. వా_406)

ఎలుగంటి పెద్దన

కాలం : క్రీ. శ. 16 శతాబ్ది.

రచన : సార సంగ్రహ గణితము (అసమగ్రం).

మూలం : వీరాచార్యుల సార సంగ్రహ గణితం.

ఇందులో 1) భిన్న గణితము 2) ప్రకీర్ణగణితము ఉన్నాయి.

మల్లమ్మ కొండయల పుత్రుడు. ఇతడు సకల గణిత పద్ధతులలోను పారీణుడనని చెప్పుకొన్నాడు రాజసభలలో ధీరుడట. ఈయన భిన్న ప్రకీర్ణ గణితాల ప్రతి ఒకటి మద్రాసు ప్రాచ్యలిఖిత గ్రంథాలయంలో ఉంది. తొలి యుగాల లోని కొందరు తెలుగు కవులు శాస్త్ర గ్రంథాలను అనువదిస్తే, అరవీటి రాజుల యుగంలో మళ్ళీ వాటిని తెనిగించటం జరిగింది. వీరాచార్యుల సారసంగ్రహ గణితాన్ని ఇదివరకే చాళుక్య యుగంలో పావులూరి మల్లన అనువదించాడు. (అరుద్ర_9)

ఏకవీరాదేవి

నామాంతరం : ఓరుగంటి ఎల్లమ్మ.

ఈమె కాకతీయుల కాలం (12,13 శతాబ్దాలు) లోని శైవదేవత. పరశు రాముని తల్లియైన రేణుకాదేవి అని ప్రతీతి. మాహురం అనే గ్రామంలో వెలిసి ఉండ

టంచేత ఈమెను మాహురమ్మగా పిలుస్తారు. ఈమె నగ్నదేవత. అనాడు ఈమెను రాయలసీమ, తెలంగాణాలలో ఎల్లమ్మ దేవత అని కూడా పిలుస్తుండేవారు.

కాకతీయుల కాలంలో బవనీలు, మాదిగ స్త్రీలు ఎల్లమ్మ కథను వీరావేశంతో చెబుతూ ఉండేవారని, వారు ప్రయోగించే "జవనిక" జుక జుంజుం జుకజుం జుమ్మంటూ సాగేదని, క్రీడాభిరామం వల్ల తెలుస్తుంది. ఈమె అలయాలు మండపాక, పొలవాస, మాహూరు గ్రామాలలో ఉండేవట. కాకతీయ సామ్రాజ్ఞి రుద్రమ మొగిలిచర్లలో ఉన్న ఏకవీరను ఆరాధించటానికి వెళుతూ ఉండేదట. (నా. ర. చ-63)

**ఏకవీరా మాహాత్మ్యము**

నామాంతరం : నింబజా మాహాత్మ్యము.
కవి : బడగలనాటి నరసకవి.
అంకితం : ధేనువాళము గరిడిలోని రఘురామునికి.
రచనాకాలం : 1740 ప్రాంతం.

ద్విపద కృతి. అయిదు ఆశ్వాసాలున్నాయి. బ్రహ్మాండ పురాణంలో ఈ కథ ఉన్నట్లూ ఆదే, తెనుగులో చెప్పబడినట్లూ తెలుస్తున్నది.

ఇతి వృత్తం ఏక వీరాదేవి మాహాత్మ్యం.

ఈ గ్రంథాంతంలో ఉన్న ప్రతి విలేఖరి వ్రాతలవల్ల కాలనిర్ణయం చేశారు రచన సరళంగా సాగింది. (ద. దే. వా. 292)

**ఏకాంత సేవ**

కర్త : చూ. గోగులపాటి కూర్మనాథ కవి.
అంకితం : రామతీర్థంలో వెలసిన శ్రీరామునికి.

గేయకావ్యం. (ఆం. సం. సా-416)

**ఏకాంత సేవా కలాపము**

కర్త : చెళ్ళపిళ్ళ నరసకవి.
కాలం : 18 వ శతాబ్దం.

ఇది యక్షగానం. దీని ప్రతి నేడు లభ్యం కావడంలేదు. (య. వా. చ.)

**ఏకాంతసేవా ప్రబంధము**

కర్త : చూ. కోవెల రాఘవాచార్యులు.

వివరాలు తెలియవు. (ఆం. సం. సా-458)

**ఏకాదశీ మాహాత్మ్యము**

నామాంతరం : రుక్మాంగద చరిత్ర.
కర్త : ప్రౌఢకవి మల్లన.
అంకితం : భీమేశ్వర స్వామికి.

ప్రత్యేకత: ఇది ఏకాదశి మాహాత్మ్యాన్ని తెలియజేసే కావ్యం. ఇందులో అయిదాశ్వాసాలున్నాయి. ఏకాదశి పుట్టుకను గురించిన మూలకథ భవిష్యోత్తర పురా

ణంలో ఉంది. విష్ణువు మురాసురుడనే రాక్షసునితో యుద్ధం చేసి అలిసిపోవడం, విష్ణు సంకల్పంతో ఆయన శరీరం నుంచి ఒక కన్య ఉద్భవించి, రాక్షసునితో యుద్ధంచేసి చంపటం; విష్ణువు సంతోషించి ఆ కన్యకు కోరిన వరాలివ్వటం, సర్వ తిథులలోను ఏకాదశికి ప్రాధాన్య మిమ్మని ఆ కన్యకోరటం మొదలయినవి ఈ కథాంశాలు. రచన ప్రౌఢంగా ఉంది. (తె. వి. స-4)

ఏకాదశీ వ్రత చంపువు (సం)

రచన : పాపయారాధ్యులు (చూ).

ఓజోగుణ భూయిష్ఠమైన రచన. (ఆం. సం. సా.)

ఏకామ్ర నాథుడు I

నామాంతరం : ఏకోరామ నాథుడు (చూ).

ఏకామ్ర నాథుడు II

కాలం : క్రీ. శ. 16 వ శతాబ్ది చివరి ప్రాంతం.

స్థలం : ఓరుగల్లు ప్రాంతం.

రచనలు : 1. ప్రతాప చరిత్రము 2. ద్వాత్రింశత్సాల భంజికల కథలు.

సమకాలికుడు : దోనూరి కోనేరు నాథుడు.

విశిష్టత : సంస్కృతంలో రాజతరంగిణిని కల్హణుడు వ్రాసినట్లే, కాకతీయ రాజవంశపు చరిత్రను ప్రతాప చరిత్రగా వచనంలో ఏకామ్రనాథుడు వ్రాశాడు. ఇందులో చరిత్రకు విరుద్ధమైన విషయాలు కొన్ని చెప్పాడు. రుద్రమ గణపతి దేవుని కూతురైతే, ఆమెను భార్యఅని పొరబడ్డాడు. మొల్ల తిక్కన కాలంనాటి కవయిత్రి అని చెప్పాడు. ఇలాంటివి కొన్ని ఉన్నప్పటికి మధ్య యుగాంధ్ర దేశరాజకీయ, సాంఘిక చరిత్ర ఈయన ప్రతాప చరిత్ర వల్ల బాగా తెలుస్తున్నది. (ఆరుద్ర-9)

ఏకామ్ర లింగశతకము

కర్త : నిమ్మల లక్ష్మణార్యుడు.

రచనా కాలం : 15 వ శతాబ్దం తర్వాతి కాలం.

సీసపద్య శతకం. "కంచి ఏకామ్రలింగ" అనే మకుటం ఉంది. తురుష్కుల దుర్మార్గాలు చూసి ఆవేదనతో దేవునికి మొరపెట్టుకొన్నట్టుగా నిందాస్తుతి రూపంలో ఉంది.

ఏకోజీ II

నామాంతరం : బాబాసాహెబు.

కాలం : క్రీ.శ. 1737 లో తంజావూరును పాలించిన మహారాష్ట్ర రాజు.

రచనలు : 1. రామాయణము, 2. విఘ్నేశ్వర పరిణయము (విఘ్నహర గణేశ పరిణయము), 3. నీతి, భక్తి పదములు.

రాజకవి. సంస్కృతాంధ్ర మహారాష్ట్రి భాషలలో పండితుడు "ఏక రాజేంద్ర వినుతా" అనే మకుటంతో తంజ్రి తుక్కోజీమీద పదాలు చెప్పాడు. రచన సంస్కృత పద భూయిష్ఠంగా ఉంది. (ద. దే. వా-255-శారదాధ్వజం-100)

ఏకో రామనాథుడు

నామాంతరం : ఏకామ్రనాథుడు.

కాలం : 14వ శతాబ్దం.

రచన : అన్యవాద కోలాహలము. (కర్తృత్వం వివాదాస్పదం).

ప్రసిద్ధ శైవాచార్యుడు. పాల్కురికి సోమనాథుని శిష్యుడు. అన్యవాద కోలాహల కర్తృత్వాన్ని గురించి భిన్నాభిప్రాయాలున్నాయి. ఈ కృతిలో పాల్కురికి సోమనాథుని గ్రంథాల నుండి శైవ మతోద్ధారకాలైన ప్రమాణాలను గ్రహించడంచేత ఇతడే ఆ కృతిని రచించి ఉంటాడని పండితుల అభిప్రాయం.

(అన్యవాద కోలాహలం-1949 ముద్రణ పీఠిక)

ఏడిద భాగవతము

నామాంతరం : గొల్లకలాపము.

కర్త : ఆత్రేయపురపు తమ్మయ.

ఏడిద అనే గ్రామం గోదావరీమండలంలో రామచంద్రపురం తాలూకాలో ఉంది. ఆ పేరుతో అక్కడి గొల్లకలాపం ఏడిద భాగవతంగా ప్రసిద్ధమైంది.

ఏదుట్ల శేషాచలుడు

కాలం : తెలియదు.

స్థలం : ఖిల్లా గణపురం (మహబూబ్‌నగర మండలం).

రచనలు : జగన్నాటకము, బారిగడ్డుపల నృసింహ శతకము.

ఇతని జగన్నాటక కృతిని బట్టి ఈ కవి పింగళి సూరనకు తరువాతివాడని ఊహించవచ్చును. ఇతడు చెన్నయ పండితుని పౌత్రుడు, నాగేశ్వర (నాగభూషణ) పండితునిపుత్రుడు. ఇతని ఇంటిపేరు ఏదుట్ల. ఈ ఏదుట్ల గ్రామం జటప్రోలు సంస్థానం లోనిది. కాబట్టి వీరు మొదట ఏదుట్లలోనుండి, తరువాత "ఖిల్లా గణపురా"నికి తరలి వచ్చారని పండితాభిప్రాయం. (మ. మా)

ఏనుగు

ఇంటిపేరు. పైడిపాటి జలపాల మంత్రి కళింగ గజపతులను మెప్పించి ఒక ఏనుగును, సోమేశ్వర అగ్రహారాన్ని బహుమతిగా పొందాడట ఆ తర్వాత ఆయన వంశీయులంతా ఏనుగు వారనే పేరు వ్యవహారంలోకి వచ్చింది. వీరిలో ఏనుగు గురవ మంత్రి, ఏనుగు లక్ష్మకవి ప్రసిద్ధులు. (ఆరుద్ర-10-223)

ఏనుగు అనంతాచార్యుడు

కాలం : 1700 ప్రాంతం.

రచన : గౌరీపరిణయము (అలభ్యం).

ఇతడు ఏనుగు లక్ష్మణ కవికి అన్న. తిమ్మకవి పుత్రుడు. లక్ష్మణకవి మనుమడు. ఏనుగు లక్ష్మణకవి రచించిన సుభాషిత రత్నావళిలో ఇతని ప్రసక్తి ఉన్నది. (క. స-7)

## ఏనుగుధాటి సుబ్బరాజు

చాటుకవి.

ఈయన రామగిరి దుర్గంలో ఒక గడిమన్నె కోటకు అధిపతియైన కరణం మల్లన్న మీద చాటువులు చెప్పాడు. రాజు లేనప్పుడు శత్రువులు కోటను ఆక్రమిస్తే మంత్రి మల్లన్నను పురికొల్పుతూ చెప్పిన పద్యాలు లభించాయి. (చా. ప. ర.)

## ఏనుగు లక్ష్మణ కవి

కాలం : క్రీ. శ. 1740-1800 ప్రాంతం.

ఆస్థానం : తూర్పుగోదావరి జిల్లాలోని పెద్దాపురం.

రచనలు : 1. రామేశ్వర మాహాత్మ్యము 2. జాహ్నవీ మాహాత్మ్యము 3. రామవిలాసము 4. సంస్కృత సూర్య శతకము 5. విశ్వేశ్వరోదాహరణము 6. కొన్నిదండకాలు, స్తుతులు 7. సుభాషిత రత్నావళి.

సమకాలికుడు-కూచిమంచి తిమ్మనకవి.

ఈయన పండిత కుటుంబానికి చెందినవాడు తిమ్మకవి పేరమాంబల పుత్రుడు. వీరు పెద్దాపుర సంస్థాన ప్రభువులయిన వత్సవాయ గజపతుల ఆస్థాన కవులు. కవి పూర్వీకుల అసలు ఇంటి పేరు పైడిపాటి వారట. వీరి పూర్వులలో జలపాలామాత్యుడనే ఆయన వత్సవాయ ప్రభువు నుంచి ఏనుగును బహుమానంగా తీసుకొన్నాడట. అప్పటి నుంచి వీరి ఇంటి పేరు ఏనుగు వారుగా మారినట్లు తెలుస్తున్నది.

ఈయన రచనలలో సుభాషిత రత్నావళి చివరిదని పండితాభిప్రాయం. ఈ గ్రంథంలో ఈయన కవిత్వ శైలి నిగ్గుదేరి మనోహరంగా ఉంది. మిగిలిన కృతులకు అంత ప్రశస్తి లేదు.

లక్ష్మణ కవి తిమ్మకవి కవిత్వాన్ని ప్రశంసిస్తూ ఒక చాటువు చెప్పాడు. తిమ్మకవి లక్ష్మణకవిని నుతిస్తూ మరొక పద్యం చెప్పాడు. (తె. వి స-6 - చా. ప. ర.)

## ఏనుగు లక్సకవి

నామాంతరం : లక్ష్మణకవి.

కాలం : 17 వ శతాబ్దం.

స్థలం : గోదావరి మండలంలో, సోమేశ్వర గ్రామం.

రచనలు : 1. రాజశేఖర చరిత్రము (అలభ్యం) 2. ధ్రువ చరిత్రము (అలభ్యం) 3. తులాకావేరీ మాహాత్మ్యము 4. ద్రౌపదీ పరిణయము (అలభ్యం) 5. భీమసేన విజయము 6. భళ్ళాంబరాయ చరిత్రము (అలభ్యం)

పెద్దాపురం సంస్థానాధీశుల ఆశ్రితుడు. పెద్దాడ గ్రామ కరణం. పెద్దాడనే సోమేశ్వర మంటారు.

ఇతని మనుమని పేరు కూడ లక్ష్మణ కవియే. అతడు సుభాషిత రత్నావళి కర్త. ఈ కవి పూర్వీకులలో ఒకరికి గజపతి ఏనుగును బహూకరించాడట. అప్పటి నుండీ వీరి ఇంటి పేరు ఏనుగుగా ప్రచారంలోకి వచ్చింది. వీరి అసలు ఇంటి పేరు పైడిపాటివారు.

ఇతని కృతులు అన్నీ లభించడంలేదు. చాలవరకు అవి పెద్దాపుర సంస్థానాధీశులకూ వారి బంధువులకూ అంకితాలట.

**పోషకుడు :** పెద్దాపురం సంస్థానాధీశుడు సార్వభౌమ తిమ్మ జగపతి.

లక్ష్మకవి కవిత్వంమనోహరంగా ఉంటుందనీ కవిత్రయం వారి పోకడలున్నాయనీ పండితాభిప్రాయం. (క. త-12-160)

## ఏనుగుల వీరాస్వామయ్య

కాలం : 1780-1836.

స్థలం : చెన్నపట్టణం.

రచన : కాశీయాత్రా చరిత్ర.

బ్రిటిషు వారి కాలంలో ఉన్న తెలుగు వారిలో ప్రసిద్ధుడు. 1833 ప్రాంతంలో కాశీయాత్రచేసి ఆ విశేషాలను గ్రంథ రూపంలో ప్రకటించాడు. (వ. వా)

## ఏర్చూరి సింగన్న

కాలం : క్రీ. శ. 1450-1500 ప్రాంతం.

స్థలం : నల్లగొండ జిల్లా ఏర్చూరు గ్రామం.

రచనలు : 1)భాగవతం, షష్ఠస్కంధం 2) కువలయాశ్వ చరిత్ర (అసముగ్రం).

కసవనామాత్యునికి ముమ్మడాంబకు పుత్రుడు.

విశిష్టత: ఈ కవి మహాభాగవతంలో షష్ఠస్కంధాన్ని ఆంధ్రీకరించాడు. ఇతని రచనా శిల్పం పోతన వరవడినే దిద్దుకొన్నది. అసలు కొన్నిచోట్ల పోతనే పద్యాలు వ్రాశాడా అనిపిస్తుంది. ఇతడు తెలుగు కవులలో కవిత్రయం వారిని, భాస్కరుని, నాచనసోముని, శ్రీనాథుని స్తుతించాడు. శ్రీనాథుని కవి మనోనాథుడని పేర్కొన్నాడు. కవి పట్టపురాజు పోత రాజేనని ఈ కవి భావన. షష్ఠ స్కంధంలో ఉన్న 40 కథల్లో అజామిళోపాఖ్యానాన్ని, చిత్రకేతూపాఖ్యానాన్ని రసవత్తరంగా రచించాడు.

ఇతడు షష్ఠ స్కంధాన్ని పూరించాడని కొందరూ, పూర్తిగా రాశాడని కొందరూ అంటున్నారు. ఇతడు రచించిన భాగం శ్రీకృష్ణునికే అంకితం.

(ఆరుద్ర-5)

## ఏలపదాలు

నామాంతరం : ఏలపాటలు.

దేశీ సారస్వతానికి చెందిన పాటలు.

యక్షగానాలలో విశేషంగా ప్రయుక్తాలు. మంచిపరపతి ఉన్నపదాలు. ఏలలు నాలుగు రకాలుగా లక్షణ గ్రంథాలు చెప్పాయి. తెలుగులో ఏల అనేది గీత ప్రబంధముగా ప్రసిద్ధం. వీటిని ఎట్లా కావాలనుకొంటే అట్లా హేలగా రాగతాళాలు సాగదీస్తూ పాడుకోవటానికి వీలుగా ఉంటాయి.

కన్నడ లాక్షణికుడు నాగవర్మ 'ఏళె' ను కర్ణాట జాతిగా పరిగణించాడు. బసవ పురాణం, కావ్యాలంకార చూడామణి, వేంకటనాథుని పంచతంత్రం, మల్లన రాజశేఖర చరిత్ర, పాంచాలీ పరిణయం, వసుచరిత్ర, ప్రభావతీ ప్రద్యుమ్న కావ్యాలలో ఏలల ప్రశంస ఉంది. తాళ్ళపాక వారి సంకీర్తన లక్షణంలో దీని నిర్వచనముంది. యక్షగానాలలోని ఏలలు ఎక్కువభాగం నాయక సంబుద్ధి మధ్యాలు. ఏలలు మార్గరూపకాలలో ప్రయుక్తాలట. పాల్కురికి సోమన బసవపురాణంలో చెప్పిన ఏలలు శివ పరాలయిన సంబుద్ధులయి ఉంటాయని పండితాభిప్రాయం. (య. వా. చ-281)

ఏలపాటలు

నామాంతరం : ఏలపదాలు (చూ).

ఏసుక్రీస్తు నూతన నిర్ణయము

కర్త : రెవరెండ్ క్యారీ.

ఈ గ్రంథం యేసుక్రీస్తు నూతన నిర్ణయాన్ని గురించి చెప్పే గ్రంథం. ఇది శ్రీరామపురంలో క్రీ. శ. 1810లో అచ్చైనది. ఈ గ్రామం వంగదేశంలో కలకత్తాకు దగ్గరగా ఉన్నది. ఆనాటి భాష, ముద్రణ రూపాలు ఈ పుస్తకం నుండి తెలుసుకోవచ్చు. "ఏసు క్రీస్తు మంగళ సమాచారము" అనేది ఈ పుస్తకంలో "యశుఖ్రీష్టుని మంగళ సమాచారము" అని ముద్రితం. ఇది క్రైస్తవుల "ధర్మ పుస్తకము" గా ప్రసిద్ధి పొందింది. (వ. వా-53)

ఏసుక్రీస్తు ప్రభుశతకము

నామాంతరం : ఏసు నాయక శతకము.

కర్త : చౌదరి పురుషోత్తమకవి.

ఏసు క్రీస్తు నామామృత పానమత్తుడైన పురుషోత్తమకవి ప్రభువునుకీర్తించడానికి ఎన్ని కావ్యాలైనా, ఎన్ని జిహ్వాలైనా సరిపోవని భావించి ఈ శతకాన్ని కూడా రచించాడు. ఏసు క్రీస్తు జగత్తును పాప విముక్తి చేయడానికి, దీనజనులను రక్షించడానికి విచ్చేసినాడని కవి ఈ శతకంలో చాటిచెప్పినాడు. "నరావతారధారి యేసునాథ దీన రక్షకా" అనే మకుటముంది. చౌదరి పురుషోత్తమ కవి గేయాలను, వృత్తాలను సరసంగా రచించడంలో చతురుడు. చక్కని నుడికారాలున్నాయి.

(శ. సా. వి-248)

ఏసునాయక శతకము

నామాంతరం : ఏసుక్రీస్తు ప్రభు శతకము (చూ).

కర్త : చౌదరిపురుషోత్తమ కవి. (శ. సా. వి-248)

ఐతరీయోపనిషద్దీపిక (సం)

కర్త: విద్యారణ్యుడు.

ఇది ఐతరీయోపనిషత్తుకు వ్యాఖ్య. (తె. వి. స)

ఒంగోలు వెంకన్న

స్థలం: గుంటూరు మండలం.

ఈయనను తిడుతూ బందా రమణప్ప అనే కవి రచించిన పద్యం లభించింది. (చా. ప. ర.)

ఒంటిమిట్ట రఘునాయకాష్టకము

కర్త: తెలియదు.

ఒంటిమిట్టలోని శ్రీరామునికి అంకితంగా చెప్పిన అష్టకం.

ఒంటిమిట్ట రఘువీర శతకము

కర్త : అయ్యలరాజు (రాయకవి) త్రిపురాంతకుడు.

రచనా కాలం : క్రీ. శ. 1440 ప్రాంతం.

పోషకుడు : రెండవ దేవరాయలు (ప్రౌఢ).

ప్రత్యేకత : "రఘువీరా జానకీ నాయకా" అనే మకుటంతో 108 పద్యాలున్నాయి. ఈ శతకం మత్తేభ, శార్దూల వృత్తాలతో, ఉంది. ఒంటిమిట్ట అనే శబ్దం కొన్ని పద్యాలలో మాత్రం ఉంది. ఈ శతకానికి "ఒంటిమిట్ట రఘువీర శతక" మనే పేరు మకుటాన్ని బట్టి రాలేదని, ఒంటిమిట్టలోని శ్రీరామచంద్రుని బట్టి వచ్చిందని పండితుల ప్రాయం. ఈ శతకాన్ని అయ్యలరాజు రామభద్రకవి, అయ్యల భాస్కర కవులు పేర్కొన్నారు. (క. త. .8)

ఒక గురుపు ఆఇదు బ్రాహ్మలయొక్క పెద్ద స్వామిమీద ప్రసంగించిన తర్కమితె

కర్త: వెంజమన్ షుల్జి.

రచనాకాలం: 1747.

క్రైస్తవ మత సంబంధమైన గ్రంథం. 18వ శతాబ్దం నాటి తెలుగు భాషా స్వరూపానికి ఈ గ్రంథం మచ్చుతునక. వచనంలో ఉంది. (వ. వా.)

ఒగ్గు గొల్లలు

నామాంతరం: బీరన్నలవారు.

వీరు గొల్లజాతిలో ఒక తెగ. జానపద కళాకారులు. తెలంగాణ ప్రాంతలోని గొల్లలు సుద్దులు చెబుతుంటారు. గుంటూరు జిల్లా నరసరావుపేట ప్రాంతంలోని కొందరు గొల్లలు పగటి వేషాలు వేస్తుంటారు. ఒగ్గు గొల్లలు తెలంగాణాలోని అన్ని జిల్లాలలోనూ ఉన్నారు.

వీరి ప్రదర్శన రాత్రులు, పగలు కూడా జరుగుతాయి. వీరి కథనం యక్ష గాన పద్ధతిలో నడుస్తుంది. వీరి దళంలో సుమారు నలుగురు సభ్యులుంటారు. ఒకరు కథ చెబితే మిగిలినవారు వంత పాడతారు.

నోటితో పాట, ముఖంతో అభినయం, ఆంగికచలనాదులు కథలో ఉంటాయి. కథకుడు పంచకట్టి, నడుముకు కట్టు కట్టి, తలకు పాగా చుట్టి, కాళ్ళకు గజ్జెలు కడతాడు. వీరి వాయిద్యాలలో ప్రముఖమైంది ఒక రండోలు. దీని శబ్దం గంభీరంగా ఉంటుంది. ఒగ్గు వారి కథలకు తెలంగాణాలో విశేషప్రచారముంది. (నా. ర. చ-280-281)

## ఒడయనంబి విలాసము

కర్త: అజ్జరపు పేరయ లింగం.

కృతిభర్త: ఆచంట రామేశ్వరస్వామి.

ఆరు ఆశ్వాసాల ప్రబంధం. భక్తికన్నా రక్తికి ప్రాధాన్యం ఉంది.

ప్రత్యేకత: ఇది సుందరనయనారు (ఒడయనంబి) చరిత్ర. సుందర నయనారుకు 18 సం॥ లోపుగానే రెండుసార్లు పెళ్ళయింది. ఇతడు శివభక్తుడేగాని వేశ్యాలోలుడు. పరమనాచి అనే సాని కూతురు ఈతని ప్రేయసి. ఈ సాని "చన్ను"నే శివలింగంగా భావించిన విటనయనారు ఒడయనంబి. ఆ కాలంలో నయనార్లు విషయవాంఛలకు లోనై. దేవుని స్నేహితునిగా భావించేవారు. శివుడే స్వయంగా తన భక్తులకు, భక్తురాండ్రకు కుంటెనకాడుగా పనిచేసినట్లు ఈ కావ్యంలో ఉంది. పాతివ్రత్యం కంటె వేశ్యా వృత్తి మేలని శివునిచేత కవి చెప్పించాడు. అరవై ముగ్గురు నయనార్లలో పరమనాచికి కూడా స్థానముంది. శివుడు వెలయాలికివ్వటంకోసం రోజుకు వేయి మాడలు ఒడయనంబికి మంజూరు చేసినట్లుంది. ఈ కథను పాల్కురికి సోమన్న పండితారాధ్య చరిత్రలో మహిమ ప్రకరణంలో సుదీర్ఘంగా కథనం చేశాడు. దీనిలోని కవిత లలితమై, సరసజన హృదయంగమంగా ఉంది. (ఆరుద్ర 9-178)

## ఒడ్డెపూడి అక్కనరెడ్డి

కాలం : తెలియదు.

ఈయన గొప్ప దానశీలియని చాటువుల వల్ల తెలుస్తున్నది. కాశి, గోలకొండ, కటకము, ఢిల్లీ, నిజాంపురం, కొండపల్లి, బందరు, రాజమహేంద్రవర సీమలలో ఈయనకు సాటి వచ్చే దానశీలిలేడని చాటువు చెబుతుంది. చాటు కవి వివరాలు గాని, అక్కనరెడ్డి వివరాలు గాని తెలియవు. (చా. ప. ర)

## ఒడ్డెపూడి పెద్దయ్య

కాలం : క్రీ. శ. 1550 ప్రాంతం.

స్థలం : ఒడ్డెపూడి.

రచన : మాఘమాహాత్మ్యము.

కృతిభర్త : దాసరి చినగంగన్న.

విశిష్టత : ఈయన ఒడ్డెపూడి గ్రామానికి కరణం. చినగంగన్న ఈయనను పిలిపించి పై కావ్యాన్ని చమత్కృతి కావ్యంగా చెప్పించాడు. కృతి వారకాంతవలె ఉండాలని భావించే రోజులలో పతివ్రత లాగ శోభించాలని భావించిన కవి. కావ్యం పఠాంత రాగాలలో బాగా ఒప్పాలని చెప్పాడు. ఈయన మాఘమాహాత్మ్యానికి మూలం సంస్కృత వాయుపురాణం. రసవంతమైన కవిత్వం చెప్పిన కవి. (ఆరుద్ర-9-242)

**ఓంకార వాదార్థనయమణి కలికా (సం)**

కర్త : చూ. తిరుమల బుక్కపట్టణం (ఇమ్మడి) శ్రీనివాసాచార్యులు.

సంస్కృత రచన. విశిష్టాద్వైత సిద్ధాంత పరంగా వ్రాయబడింది. సుర పురం సంస్థానాధీశ్వరుల సమాదరణలో వెలసిన గ్రంథ పరంపరలో ఇది ఒకటి.
(అం. సం.సా.-516)

**ఓగిరాల జగన్నాథ కవి**

కాలం : 19 వ శతాబ్దం.
స్థలం : గోదావరి మండలంలోని సీలపల్లి.
రచన : సుమనో మనోభిరంజనము.
గురువు : మంత్రి ప్రగడ వేంకట రామపంతులు.

వేంకటేశ్వరా మాత్యుని పుత్రుడు. ఓగిరాల రంగానాథ కవి ఇతని పెద తండ్రి కుమారుడట. విద్వత్కవి. కాకినాడలో "సుధీరంజని" అనే పేరుతో మాసపత్రికను నడిపాడు. (క. స-72)

**ఓగిరాల రంగనాథకవి**

కాలం : క్రీ. శ 19వ శతాబ్ది.
స్థలం : గోదావరి మండలంలోని సీలపల్లి గ్రామం.
కృతులు : 1. ద్విరేఫ వర్ణ దర్పణము 2. నవీన కల్యాణ కల్పవల్లిక (అలభ్యం).

సమర్థుడైన విద్వత్కవి. ఇతనిని గురించి ఇతని పినతండ్రి కుమారుడు జగన్నాధకవి (సుమనోమనోభిరంజన కృతికర్త) చెప్పాడు. ఇతడు అనేక రసవత్ప్ర బంధాలు రాశాడట కాని అవి లభ్యం కాలేదు. (క. స-176)

**ఓఘవతీ పరిణయము**

కర్త : అక్కెనపల్లి నృసింహకవి.
రచనా కాలం : 1817. క్రీ. శే.
అంకితం : గోడే సూర్యప్రకాశ రాయనికి.

మూడాశ్వాసాల ప్రబంధం. రచన ప్రౌఢంగా ఉంటుంది. దీన్ని కృతిపతి సోదరపుత్రులు నారాయణ గజపతి రాయలు అచ్చువేయించారు. (క. స-114)

**ఓడం**

మధుర కవితకు చెందిన రచనా విశేషం. 'శ్రీరామ పుత్రి' అనే మారు పేరుతో ఒక కవయిత్రి వ్రాసిన "సీమంతినీ చరిత్రము" అనే యక్షగానంలో ఉంది.

ఈ పేరు అతి విచిత్రమని, ఇతరత్ర అశ్రుత పూర్వమని పండితులంటున్నారు.
(య. వా. చ-316)

## ఓపిలిసిద్ధి శాసనము

కాలం : క్రీ. శ. 1224.

శాసన ప్రదాత : ఓపిలి సిద్ధి.

ప్రస్తావిత స్థలాలు : పాకనాడు, పొత్తపినాడు.

శాసన విషయం : ఇది 21 పద్యాలు, ఒక చిన్న గద్యతో కూడిన పెద్దశాసనం. ఓపిలి సిద్ధి వంశీయులు సూర్యవంశీయులనీ, ఆ వంశంలోని రాజు కరికాలుడు వారి మూలపురుషుడనీ, ఆ తరువాత రాజులందరూ పరాక్రమశాలురు-దానశీలురని ఈ శాసనం వల్ల తెలుస్తున్నది. (తె. క. చ-316-320)

## ఓబయ నరసరాజు

కాలం : క్రీ. శ. 16 శతాబ్ది పూర్వార్ధం.

సాహిత్య పోషకుడు. నరస భూపాలీయం అనే నామాంతరమున్న కావ్యాలంకార సంగ్రహాన్ని అంకితం పొందాడు.

ఈయన అళియ రామరాజు, తిరుమలరాయల సోదరద్వయానికి మేనల్లుడు. తొరంగంటి దుర్గాధ్యక్షుడు. (తె. వి. స-4)

## ఓరుగంటి ఎల్లమ్మ

నామాంతరం : చూ. ఏకవీరాదేవి.

## ఓరుగంటి రామకవి

రచన : కవితా లక్షణ సారచ్ఛందస్సు.

వివరాలు లభ్యం కాలేదు.

## ఓరుగంటి సోమశేఖర కవి

కాలం : 18వ శతాబ్దం.

రచన : రామకృష్ణార్జున రూపనారాయణీయము.

సంస్కృతాంధ్రాలలో విద్వాంసుడు. భారత భాగవత రామాయణాలకు సంబంధించిన కథను త్ర్యర్థి కావ్యంగా రచించాడు. (క. స-310)

## ఓరుగల్లు

ప్రస్తుతం వరంగల్ జిల్లాలో ఉన్న ప్రముఖ ప్రాచీన చారిత్రక నగరం. ఇది కాకతీయుల రాజధాని. క్రీడాభిరామ కావ్యంవల్ల ఈ నగర విశేషాలు, ఆనాటి మత సాంఘిక పరిస్థితులు తెలుస్తున్నాయి. కాకతి చక్రవర్తులు ఈ నగరంలో ఎందరో సంస్కృతాంధ్ర కవి పండితులను పోషించారు. రెండో ప్రతాపరుద్రుడు" నీతిసారముక్తావళి" కర్త అని పండితాభిప్రాయం. ప్రతాపరుద్ర యశోభూషణం వ్రాసిన విద్యానాథుడు'

బాలభారతం వ్రాసిన అగస్త్యుడు (విద్యానాథుడు), నృత్త రత్నావళి గ్రంథకర్త జాయప సేనాని, సౌగంధికాహరణం వ్రాసిన విశ్వనాథుడు ఇక్కడివారే.

ఓరుగల్లు కోట నిర్మాణం గణపతి దేవుని కాలంలో ఆరంభమై రుద్రమ కాలంలో పూర్తయింది. ఇది చాలా అపురూపమైన కోట. దీనికి లోపల రాతి ప్రాకారం, వెలుపల మట్టి ప్రాకారాలు మొత్తం మూడు ప్రాకారాలున్నాయి. నగరంలోని వేయి స్తంభాల గుడి, సమీపంలోని రామప్ప గుడి శిల్ప కళా సంపదకు కలికి తురాయిలు. ఇది ఒకప్పుడు వైభవంగా విలసిల్లిన మహానగరం.

## కంకంటి నరసింహకవి

కాలం : 18వ శతాబ్దం.

స్థలం : రాయలసీమ.

రచన : విష్ణుమాయావిలాసము (ద్విపద).

సమకాలీనులు : పుష్పగిరి తిమ్మన, ధరణిదేవుల రామయ్య.

అప్పయార్య నరసమాంబల పుత్రుడు. విష్ణు మాయావిలాస యక్షగాన కర్త కంకంటి పాపరాజు ఇతని సోదరుడు. ఇతని గ్రంథం ముద్రితం. (క త-12-74)

## కంకంటి పాపరాజు

కాలం : 18వ శతాబ్దం (1775-1800).

స్వస్థలం : రాయలసీమ.

నివాసస్థలం : నెల్లూరు జిల్లా గూడూరు తాలూకా దుగరాజపట్నం.

రచనలు ; 1. విష్ణుమాయావిలాసము (యక్షగానం) 2. ఉత్తరరామాయణము.

సమకాలికులు : పుష్పగిరి తిమ్మన, వేకుమళ్ళ రంగశాయి.

నరసమ్మ, అప్పయామాత్యుల కుమారుడు. డచ్చివారు భారతదేశానికి వ్యాపారం కోసం వచ్చినప్పుడు ఈయన వారివద్ద ఉద్యోగిగా ఉండేవాడని తెలుస్తున్నది. పులికాటు (ప్రళయకావేరి)లో అమీన్‌గా ఉండే వాడని కొందరంటున్నారు. ఇతని కవిత్వం రసవంతంగా పండిత పామర రంజకంగా ఉంటుంది. అలంకారాలు ఉపయోగించడంలో ఇతడు నేర్పరి. ఉత్తర రామాయణరచనలో ఇతనికి పుష్పగిరి తిమ్మన తోడ్పడ్డాడట.

ఇతని కాలాన్ని గురించి భిన్నాభిప్రాయాలున్నాయి. (క. చ-3-102 - క. త-12-65)

## కంకణ బంధమ్ (సం)

కర్త : చూ. శిష్టు కృష్ణమూర్తి శాస్త్రి.

రామాయణ కథాత్మకమైన రచన. (ఆం. సం. సా.)

## కంచం యల్లయార్యుడు

కాలం : తెలియదు.

నామాంతరాలు : యల్లయసూరి, యల్లుభట్టు.

రచనలు : 1. దైవజ్ఞ విలాసము 2. వాత్స్యాయన గృహ్యసూత్ర సరణి 3. జ్యోతిష దర్పణము 4. బాల ప్రబోధము 5. కారికా కదంబము 6. గణక దర్పణము 7. సర్వతోభద్ర 8 తత్త్వ చింతామణ్యుపన్యాసము 9. మీమాంసా సూత్ర దీపిక 10. స్మృతి కదంబము.

ఇతడు పైగ్రంథాలను వ్రాసినట్లు స్మృతి కదంబంలో చెప్పుకొన్నాడు. ఇతని రచనలన్నీ సంస్కృతాలే. (తె. వి స-6)

**కంచర్ల గోపన్న**

నామాంతరం : చూ. భద్రాద్రి రామదాసు

**కంచిఏకామ్ర లింగ శతకము**

కర్త : తెలియదు.

దీని ప్రతి కాకినాడ ఆంధ్రసారస్వత పరిషత్తులో ఉంది. 94 పద్యాలున్నాయి. ఈ శతకం హరిహరులకు సమాన ప్రతిపత్తి ఇచ్చింది. ఈశ్వర భక్తి నిరూపణం దీనిలో ఉంది. పరమేశ్వరుడు దిగిరాకపోతే వ్యాజోక్తుల తూలనాడిందీ శతకం. కలియుగ లక్షణాలను, సాంఘిక దుర్నీతిని విపులంగా అధిక్షేపిస్తూ, కపటభక్తి, బాహ్యవేష ధారణలను ఖండిస్తూ ఈశతకంలో చాలా పద్యాలున్నాయి. (శ సా. వి)

**కంచికావ్యము (హరిశ్చంద్రోపాఖ్యానము)**

రచనా కాలం : 16 వ శతాబ్దం.

కర్త : కంచి వీర శరభ కవి.

అంకితం : శ్రీశైల మల్లికార్జున స్వామికి.

ఇది హరిశ్చంద్రుని కథను తెలిపే కావ్యం. ద్వైతవన వర్ణనంతో కథ ఆరంభమైంది. గౌరన, శంకర కవి వంటి వారు తెలుగులో హరిశ్చంద్ర కథ చెప్పారు. శంకర కవి చెప్పిన దానికంటే దీనిలో విశేషమేమీ లేదని పండితుల అభిప్రాయం. బ్రౌన్‌దొర కవి శరభయ్య కంచివాడని, శరభయ్య హరిశ్చంద్రకావ్యాన్ని "కంచి కావ్యం" అంటారని చెప్పాడు. ప్రస్తుతం దీని ప్రతులు దొరకటం లేదు. దీనిమీద ఒక వ్యాఖ్యానం అముద్రిత గ్రంథాలలో ఉంది. (ఆరుద్ర-9-257)

**కంచి దండకము**

నామాంతరం : వరదరాజ మంజరి (చూ).

కర్త : అప్పన.

**కంచిరాజు సూరయ్య**

కాలం : క్రీ. శ. 1590 కి ముందు.

రచన : కన్నప్ప చరిత్ర (అలభ్యం).

విశిష్టత : ఈయన కన్నప్ప చరిత్రకు మూలం కాళహస్తి మాహాత్మ్యం. సూరయ్య కన్నప్ప చరిత్రనుంచి పెదపాటి జగన్న ప్రబంధ రత్నాకరంలో నాలుగుపద్యా

లను ఉదాహరించాడు. అందులో రెండు విష్ణువును, ఒకటి వినాయకుని స్తుతించేవి. నాలుగోది పుళింద గ్రామణి కాంతలు ఎట్లా చూశారో చెప్పే పద్యం. సామెతలను వాడి పద్యాలను చమత్కరించటం ఇతని ప్రత్యేకత. కవి విష్ణుభక్తుడు కాబట్టి విష్ణు స్తుతి పరమైన పద్యాలు కూడా తన రచనలో చేర్చాడు. (ఆరుద్ర-9)

### కంచి వీరశరభకవి

కాలం : క్రీ. శ. 16 శతాబ్ది.

రచన : హరిశ్చంద్రోపాఖ్యానము (కంచి కావ్యము).

గురువు : ఇవటూరి పర్వతారాధ్యుడు.

విశిష్టత: శోభనాద్రి, గురవమ్మల పుత్రుడు. గౌరన, శంకరకవి వంటివారు తెలుగులో హరిశ్చంద్ర కథ వ్రాశారు. తన కంటె ముందు అనేక మంది ఈ కథను రచించి నప్పటికీ తాను అంత కంటె బాగా మెరుగు పెట్టివ్రాస్తానని ఈ కవి చెప్పు కొన్నాడు. ద్వైత వన వర్ణనతో కావ్యం ప్రారంభించాడు. పద్యం ఎత్తుగడలో శంకర కవిని అనుసరించాడు.

బ్రౌన్ దొర ఈయన కంచివాడనీ, ఈయన కావ్యాన్ని "కంచి కావ్య"మంటా రనీ చెప్పారు. ఇది ముద్రితమే గాని ప్రతులు లేవు. ఈ కావ్యం మీద వ్యాఖ్యానం ఒకటి అముద్రిత గ్రంథాలలో ఉంది. (ఆరుద్ర-9-257)

### కంచెర్ల అయ్యన్న

కాలం : క్రీ. శ. 16 శతాబ్ది.

స్థలం : కృష్ణామండలం.

రచన : కాశీఖండము (ద్విపద) (అలభ్యం).

మల్లన గురవమ్మల పుత్రుడు. ఇతని ముత్తాత మేదూరి కరణం. ఈయన మనుమడు శరభ కవి. అధ్యాత్మరామాయణం వ్రాశాడట. ఈయనకవేకా కచాలా సత్కార్యాలు కూడా చేశాడట. వడుగులు, పెళ్ళిళ్ళు చేయించడం, అన్న సత్రాలు పెట్టించడం, నూతులు తవ్వించడం మొదలైనవే కాక మధురకు వెళ్ళే త్రోవలో రావి చెట్లను నాటించాడట. దేవ ప్రతిష్ఠలు చేయించాడు. శ్రీకాకుళ ఆంధ్ర విష్ణువు సేవకోసం అయ్యన్న ముత్తాత క్రీ. శ. 1438లో భూదానం చేశాడు. (ఆరుద్ర-9-240)

### కంటని (కంటుడు) నాదెండ్ల శాసనము

కాలం : క్రీ. శ. 1138.

స్థలం : గుంటూరు జిల్లా-నరసరావు పేట తాలూకా నాదెండ్ల గ్రామము.

శాసన ప్రదాత, రచయిత : కంటడు.

శాసన విషయం : కంటడు వెలనాటి గొంకరాజు వద్ద మహానియోగి పదవిలో ఉండి, అందలాలు, "లలితాత పత్ర విచయంబులు" పొందాడని, సాహిత్య విద్యాధరుడని, నాదెండ్ల మూలస్థాన దేవరకు అఖండ దీపాన్ని విలిపాడనే విషయాలను ఈ శాసనం చెబుతుంది. దీనిలో ఒక చంపకమాల, రెండు ఉత్పలమాలలు, రెండు

శార్దూలాలు, మూడు కంద పద్యాలు ఉన్నాయి. ఇతని సంస్కృత శాసనం కూడా ఒకటి ఉంది. (తె క చ-236, 237)

## కంటమ (బెజవాడ) శాసనము

కాలం : క్రీ. శ. 1.52.

శాసనం వేయించిన వారు : కంటమ.

శాసన విషయం : బెజవాడ నేలిన బొద్దన నారాయణునికి నాగార్జునుడనే ఆయన ధనాధ్యక్షుడట. కంటమ నాగార్జునునికి అత్త. ఈమె బెజవాడలో వేంచేసి ఉన్న మల్లేశ్వర స్వామికి అఖండ దీపం నిలిపిందని ఈ శాసనం వల్ల తెలియవస్తున్నది. దీనిలో ఎత్తు గీతితో ఒక సీసపద్యముంది (తె. క. చ-260)

## కంఠీరవ కవి

కాలం : తెలియదు.

స్థలం : కార్వేటినగర సంస్థానం.

రచన : రత్నాకరమ్ (సం).

ఈ కవి కార్వేటినగర సంస్థానానికి చెందినవాడు. రత్నాకరమనే చారిత్రక కావ్యం సంస్కృతంలో వ్రాసి రాజరాజుకు అంకితం ఇచ్చాడు. (ఆం. సం. సా.)

## కంఠీరవ నరసరాజు

నామాంతరం : కంఠీరవ రాజు (చూ).

## కంఠీరవ రాజు

నామాంతరాలు : 1. మూకరసు 2. కంఠీరవ నరసరాజు.

కాలం : (1704-14) లో మైసూరును పాలించిన రాజు.

రచనలు : 1. కొరవంజి కల్లె 2. పంచాయుధ కల్లె 3 లక్ష్మీవిలాసము 4. కలవాణీ విలాసము 5 నాట్య విద్యావిలాసము 6. వసంతోత్సవ విలాసము 7. విభక్తికాంతా విలాసము.

రాజకవి. మైసూరు ప్రభువైన చిక్క దేవరాయల కుమారుడు.

ఇతడు పుట్టుకచే మూగవాడు, చెవిటివాడు అయినా సంగీత, సాహిత్యాలలో అభిలాషను పెంచుకొని, సంస్కృత, ప్రాకృత, తమిళాంధ్ర, కర్ణాటక భాషలలో పాండిత్యం సంపాదించి, రచనలు చేశాడని అంటున్నారు.

ఈ కృతులు ఇతడు రచించాడనడం కన్నా ఇతని పై ఇతని ఆస్థానంలోని వారెవరో చెప్పి ఉంటారనడమే సమంజసమని కొందరు భావిస్తున్నారు.

ఇతని వన్నీ యక్షగానాలే. ఇతని కృతులలో సహజంగా కనిపించే లక్షణాలు: 1. గ్రంథాదిని తెలుగు పద్యాలు గాని, సంస్కృత శ్లోకాలు గాని ఉంచడం. 2 వచనాలు, ద్విపద, సీసం, వృత్తాలు, దరువులు జంపె, త్రిపుటలు, రచనలో వాడడం. 3. అటతాళము, ఏక, ధ్రువ, మధ్య తాళాలు తరచుగా వాడడం, మొదలైనవి. ప్రాకృతం,

కన్నడం కొన్నింటిలో కనిపిస్తున్నది. రచనలో సాంగత్య ఛందోపద్ధతి అక్కడక్కడా కనిపిస్తున్నది. చాలా కృతులలో కంఠీరవరాజే నాయకుడు.
(ఆరుద్ర-12-78: ద. దే. వా-450-52)

కంఠీరవ రాజు పదములు

రచనా కాలం : 18 వ శతాబ్దం.

మైసూరును పరిపాలించిన కంఠీరవ రాయల (1704-1714) పై శృంగార పరంగా చెప్పిన పదాలు. ఇవి కంఠీరవ రాజు ఇతర కృతులవలె అతడే రచించినవో ఇతరులు అతని మీద చెప్పినవో నిర్ణయించడం కష్టం. (ద. దే. వా-458-64)

కంఠీరవాచార్యులు

కాలం : 19 వ శతాబ్దం.
స్థలం : వనపర్తి సంస్థానం.

వనపర్తి సంస్థానాస్థాన విద్వాంసులుగా ఉన్నారు. రచనలను గూర్చిన విశేషాలు తెలియవు. (ఆం. సం. సా)

కందనామాత్యుడు

కాలం : క్రీ. శ. 1360-1400 ప్రాంతం.
స్థలం : వెలిగందల.
రచన : నీతితారావళి.

మడికి సింగన ఈ కందనామాత్యుని, అతని సోదరుడైన కేసన మంత్రిని నుతించాడు. ఇతడు కవి, కృతిపతి కూడా.

విశిష్టత : మడికి సింగన తన 'సకల నీతి సమ్మతం'లో ఇతని నీతి తారావళి నుంచి పన్నెండు పద్యాలను సంకలనంచేశాడు. కందన పద్యమొకటి "కవి జనాశ్రయం"లో కనిపిస్తున్నది. "నీతి తారావళి"లోని మరొక పద్యాన్ని కొరవి గోపరాజు అనుకరించాడు. మడికి సింగన రచించిన పద్మపురాణం, భాగవత దశమస్కంధం కందనామాత్యునికే అంకితాలు. సబ్బినాటి రామగిరి దుర్గం రాజధానిగా ఏలిన సబ్బినాటి గురిజాల ముప్ప భూపాలుని మంత్రి వెలిగందల గ్రామ కరణం కాబట్టి వెలిగందలామాత్యుడు అనేది నామాంతరం. ఇతని కాలం క్రీ.శ. 1380-1440 అని కొందరు నిర్ణయించారు
(ఆరుద్ర-4క. త-29)

కందర్పకేతు విలాసము(అలభ్యం)

కర్త : (చూ) తెనాలి రామకృష్ణ కవి.

కందర్ప సంభవమ్ (అలభ్యం)

కర్త : చూ. విశ్వేశ్వర కవిచంద్రుడు.

సంస్కృత గ్రంథం. ఈ కవి రచించిన చమత్కార చంద్రికలో దీని ప్రస్తావన ఉంది.
(ఆరుద్ర-4)

## కందర్ప సంభవమ్ (అలభ్యం)

కర్త : చూ. సర్వజ్ఞ సింగభూపాలుడు.

సంస్కృతంలో రచింపబడ్డ భాణం. (ఆరుద్ర-3-౯)

## కందాడై అప్పకొండాచార్యుడు

కాలం : తెలియదు.

స్థలం : కృష్ణాతీర ప్రాంతము.

కొన్ని రచనలు : 1. మానసోల్లాసవ్యాఖ్య (మనుస్మృతి) 2. సిద్ధాంతసారము (సం.) 3. తత్త్వ నిర్ణయము (సం.) 4. కుదృష్టిభంగము (సం.) 5. తత్త్వామృతము (సం.) 6. విశిష్టాద్వైతనిర్ణయము (సం.) 7. తత్త్వ నిష్కర్ష (సం.) 8. సజ్జనామృతము (సం.) 9. రహస్యత్రయసారార్థము (సం.) 10. మాఘ భంగము.

ఈయన రచనలు అరవైకి పైగా ఉన్నాయి. అన్నీ సంస్కృతాలే.

(తె. వి. స-4)

## కందార్థాలు

వేదాంత విషయ ప్రతిపాదకాలైన కంద పద్యాలు. ఈ కందాలకు చివరగల పాదాన్ని ఆ పద్య లక్షణంతో పూర్తి చేయక చివరి సగంపాదంనుంచే ఒక రమ్యమైన పాటను దానికి సమకూరుస్తారు. దానినే కందార్థ మంటారు. ఇవి ఏక్తారమీద (సితార) తంబూరా మీద పాడుతుంటారు. అతి గహనమైన తత్త్వశాస్త్ర విషయాలను సరళంగా, సుబోధకంగా చెప్పే ఈ కందార్థాలు తెలుగులో ప్రాచీనకాలంనుండే ఉన్నాయి.

(య. వా. చ.)

## కందుకూరి అమృతలింగం

కాలం : 19వ శతాబ్దం.

ఉర్లాం సంస్థానాధిపతి. సాహిత్యపోషకుడు. అత్తలూరి పాపకవి రచించిన చెన్నబసవ పురాణానికి కృతిపతి. ఇతని పెద తండ్రి సాంబపతి ఢిల్లీ నాయకుని నుండి బహుమతులు పొందాడట.

"శ్రీమత్ప్రసాద రాయయశోవిలాసం" నుండి ఈ విషయం తెలుస్తున్నది.

(క. చ-3-118) (ఆం. సం. సా.)

## కందుకూరి బసవరాజు

కాలం : క్రీ. శ. 19వ శతాబ్దం.

స్థలం : ఉర్లాము (సంస్థానాధిపతి).

"సత్యవతీ పరిణయ" కావ్యానికి కృతిపతి. కవి పండిత పోషకుడు.

ఉర్లాము జమీందారైన బుద్ధిరాజు బసవరాజు దౌహిత్రుడు. బుద్ధిరాజు బసవ రాజుకు పుత్రసంతతిలేదు. అందుచేత అతని కూతురైన "వియ్యమ్మ" గారి కుమారుడే

తాత గారి తరువాత జమీందారైనాడు. సత్యవతీ పరిణయం కర్త బుద్ధిరాజు వీరన ఇతని మేనల్లుడే.

ఖళ్ళమూడి లక్ష్మణశాస్త్రి వీరి ఆస్థాన పండితుడు. పండితుల బ్రహ్మదేవ కవి వంటి విద్వత్కవులను పండితులను ఇతడు ఆదరించాడు. (ఆం. సం. సా.)

## కందుకూరి మల్లిఖార్జున మంత్రి

కాలం : క్రీ. శ. 18, 19 వ శతాబ్దాల నడిమి కాలం.

ఉర్లాం సంస్థానాధీశుల మూల పురుషులలో ఒకడు. సాహిత్య పోషకుడు. కువలయాశ్వ చరిత్రను అంకితం పొందాడు. వీరు దేశ పాండ్యాలుగా ప్రసిద్ధులు. (ఆం. సం. సా. క. స. 120)

## కందుకూరి రుద్రకవి

కాలం : క్రీ. శ. 16 శతాబ్ది.

స్థలం : కందుకూరు.

గురువు : గురువరాచార్యుడు.

రచనలు : 1. నిరంకుశో పాఖ్యానము (చంపువు) 2. సుగ్రీవ విజయము (యక్ష గానం) 3. జనార్దనాష్టకము (కందుకూరి రుద్ర విషయము) 4. కందుకూరి రుద్రకవి శతకము.

విశిష్టత : పెదలింగన కుమారుడు. కందుకూరు ఇప్పటి ప్రకాశం జిల్లాలో ఉంది. కందుకూరు ఇంటి పేరున్న రుద్రకవి నామధేయులు ముగ్గురున్నారని ఇప్పటి రుద్రకవి వంశ్యులు చెబుతున్నారు. ప్రథమ రుద్రకవి కృష్ణ దేవరాయలనాటి వాడని, రెండో రుద్రకవి ఇబ్రహీం కుతుబ్ శాహి నాటి వాడని, వీరుకాక కవిత నేర్పిన రుద్రకవి మరొకాయన ఉన్నాడని అంటారు. రాయల ఆస్థానంలో ప్రవేశించి అష్టదిగ్గజాంలో ఈశాన్యమూల కూర్చున్న రుద్రకవీ, తిట్టు కవిత చెప్పిన రుద్రకవీ ఒకరా కాదా అనే విషయంలో పండితుల మధ్య భేదాభిప్రాయాలున్నాయి. రాయల కాలంలోని రుద్రకవి ఏ కావ్యాలు వ్రాశాడో తెలియదు గాని, మల్కిభరాం కాలంలోని రుద్రకవి నిరంకుశో పాఖ్యానమనే శృంగార కావ్యం చెప్పాడు. గోలుకొండ నవాబు ఇబ్రహీం కుతుబ్ శాహి ఈయనకు "చింతల పాలెం" అనే అగ్రహారాన్ని దానం ఇచ్చి సత్కరించాడు. ఒక రుద్రకవి గుంటుపల్లి భాస్కరామాత్యుని కాలం (1620 ప్రాంతం)లో ఉన్నట్లు అప్పకవీయంలో ఉంది. ఈయన 'సుగ్రీవ విజయం' దొరికిన యక్షగానాలలో మొదటిది. కొందరు చెన్నశౌరి (క్రీ. శ. 15 శతాబ్ది) రచించిన "సౌభరి చరితము" మొదటి యక్షగానమంటారు గాని అది అలభ్యం. మృదుమధురంగా కవిత్వం చెప్పటంలో రుద్రకవి దిట్ట. (ఆరుద్ర-8-167)

## కందుకూరి రుద్రకవి శతకము

కర్త : కందుకూరి రుద్రకవి.

ప్రత్యేకత : ఈ శతకం పూర్తిగా దొరకలేదు. దీని మకుటం 'బలవదరీః

దరీకుహర భాస్వదరీయవరీ దరీ హరీ' అని చాలా పొడుగ్గా పాండిత్య ప్రకర్షతో ఉంది. ఈ శతకంలోని భావాలు చాలా సరళంగా చమత్కారంగా ఉంటాయి. ఏమాత్రం సవ్వడయినా మానవ మాత్రులే నిద్ర పోలేరనీ, అలాంటిది సముద్రపు హోరు, పాము బుసలు ఉన్నప్పుడు దేవుడు ఎలా నిద్ర పోగలడని కవి ఒక పద్యంలో చమత్కరించాడు.

వేటూరి ప్రభాకరశాస్త్రి దీనిలోని మూడు పద్యాలను సేకరించి చాటు పద్యమణి మంజరి రెండో భాగంలో ప్రచురించారు. రుద్ర కవిని గురించిన కొత్త విశేషాలు సేకరించి తెలుగు దేశానికి ఎరుక పరచినవారు వీరే. (ఆరుద్ర-8-84)

కందుకూరి రుద్ర విషయము

కర్త : కందుకూరు రుద్రకవి.
నామాంతరం : జనార్ద నాష్టకము.
చూ : జనార్దన పంచరత్నాలు.

కందుకూరి వీరేశలింగ మంత్రి

కాలం : క్రీ. శే. 18, 19, శతాబ్దాల నడిమి కాలం.
స్థలం : ఉర్లాం సంస్థానం.

సాహిత్య పోషకుడు. పంచాక్షరీ మాహాత్మ్య కావ్యానికి కృతిపతి.

ఈతడు ఉర్లాం సంస్థానాధీశుల మూల పురుషులలో ఒకడనీ "శ్రీమత్ప్రసాద రాయ యశోవిలాసం" అనే గ్రంథంలో చెప్పబడింది. అత్తలూరి పాపకవి రచించిన చెన్నబసవ పురాణంలో ఇతని ప్రశంస ఉంది. (క. చ-3-118) (ఆం. సం. సా.)

కందుకూరు

పూర్వపు కందుకూరు చిన్న రాజ్య భాగానికి కేంద్రం. (ప్రస్తుతం ఇది ప్రకాశం జిల్లాలో ఉంది.) దీని ఏలిక శివలింగారెడ్డి మంచి సంస్కృత పండితుడేగాక-సంస్కృతంలో హరిదత్తుడు వ్రాసిన "గిరిశశ్రుతి సూక్తిమాల"కు "తత్త్వ ప్రకాశిక" పేర సంస్కృతంలో వ్యాఖ్య వ్రాశాడు.

అద్దంకి రాజధానిగా కొంత భాగం తెలుగు దేశాన్ని ఏలిన ప్రోలయ వేమా రెడ్డి వంటి వారికి కందుకూరు రెడ్లు దాయాదులు. వీరిలో మల్లారెడ్డి ప్రభువు ఎర్రా ప్రెగ్గడను పోషించి, అతనికి ప్రోలయ వేముని ప్రాపు కల్పించాడు. (రె. రా. చ)

కందుకూరు - ధర్మవర శాసనాలు

కాలం : క్రీ. శ. 850 ప్రాంతం.

ఈ శాసనాలలో సీస పద్యాలున్నాయి. ఇది చంపూ పద్ధతికి చెందిన శాసనం. దీనిలోని సమాస రచన, సీస పద్య రచన దిగువ విధంగా ఉన్నాయి:

"స్వస్తి సర్వలోకాశ్రయ చాళుక్యభీమ మహారాజుల విజయ రాజ్య సంవత్స రంబు యేనగు నేటి ఉత్తరాయన సంక్రాంతి స్థితి ధర్మపురమ్మున, స్వస్త్యనేక గుణగణా లంకృత మహామహీమండల ప్రకాశిత కీర్తి శ్రీ మత్పండరంగు-"

సీస పద్యభాగము :

"సింహాసనం బెక్కి రాహుతునొడిచిన
వల్లభు కొల్వున నెల్ల నెఱుగ
కన్నరా భూపతి వెన్నాటిలోఁ జూచె
నంకిలాండను తేని బింకముడిచె" (సా. చ. సం.)

## కంప భూపతి శాసనములు

శాసన కర్త : కంపభూపతి.

కాలం : 1442 1459, ప్రాంతాలు.

ఇతడు విజయనగర రాజపుత్రుడైన కంపరాయలు కాదు. బొబిశరాజు, ఓబాయమ్మల పుత్రుడైన కపభూపతి. ఇతడు వేయించిన శాసనాలు రెండు లభించాయి. ఒకటి తిరుపతి దేవస్థానంలో ఉంది. భాష తమిళం. ఇది 1459 నాటిది. రెండవది కర్నూలు జిల్లా పెద్ద చింతకుంట గ్రామంలో ఉంది. ఇది 1442 నాటిది. ఈ రెండింటి వల్లా కంప భూపతి కాలమూ తద్వారా మనుమంచిభట్టు కాలమూ నిర్ధారితాలు. మనుమంచి భట్టు కంపభూపతికి తన కావ్యాన్ని అంకితం చేశాడు. (క. న. 155)

## కంపరాయ చరితమ్ (సం)

నామాంతరం ; మధురా విజయమ్.

కవయిత్రి : గంగాదేవి.

## కంబ నృపాలుడు

కాలం : తెలియదు.

ఈయన నెల్లూరు మండలంలోని ఉదయగిరి దుర్గాధిపతి. చాలా దానధర్మాలు చేశాడట. ఈయన గుణగణాలను, దానశీలాన్ని కీర్తిస్తూ చాటువులు దొరుకుతున్నాయి. ఈయన వివరాలుగాని, చాటుకవి వివరాలుకాని తెలియవు. (చా. వ.ర)

## కంభంపాటి అమరేశ్వరశాస్త్రి

కాలం : క్రీ. శ. 1760 ప్రాంతము.

రచన : "అజ్ఞానధ్వాంత చండ భాస్కరము"

కవి పండితుడు, వేదాంతి. అద్వైతవేదాంత గ్రంథాన్ని చక్కని వ్యావహారిక భాషలో వ్రాశాడు. (వ. వా - 40)

## కంభంపాటి నారపామాత్యుడు (నారప్ప)

కాలం : క్రీ. శ. 16 శతాబ్ది.

రచన : భగవద్గీత (ఆంధ్రీకరణం).

గురువు : రామబ్రహ్మం.

విశిష్టత : ఈయన మహాభారతంలో తిక్కన అనువదించకుండా విడిచిన 'గీతను'ను ఆంధ్రీకరించాడు. తెలుగులో గీతను తొలిసారిగా ఆంధ్రీకరించిన ఖ్యాతి

ఈ నారప్పకే దక్కింది. ఇతని రచన సరళంగా సులభ గ్రాహ్యంగా ఉంటుంది.
(క. స-109; అరుద్ర-8-276)

**కంస చరిత్ర**

కర్త : మేరత్తూరు వేంకటరామశాస్త్రి.

మేరత్తూరు భాగవత మేళనాటకం. సులలితమైన కైశికీ వృత్తిలో రచన సాగింది. (తె. వి. స-4)

**కంసవధ (సం)**

కవి : రాజ చూడామణి దీక్షితుడు.

**కంసవధ (సం)**

కర్త : చూ. వారణాసి ధర్మసూరి.

సంస్కృత రూపకం. (తె. వి. స-4)

**కంస విజయము (అలభ్యం)**

కర్త : విజయరాఘవ నాయకుడు.

యక్షగాన నాటకం.

ఆలయోత్సవాలలో ప్రదర్శించడానికి రచించిన కృతికావచ్చును.
(ద. దే. వా-89)

**కచ్చి రంగయ్య**

ఈయన దానధర్మాలు చేసి మంచి పేరు ప్రతిష్ఠలు తెచ్చుకొన్నాడట. నలుగురు మెచ్చే విధంగా దానం చేసేవాడట. ఇతనిమీద చాటువులున్నాయి. (చా. ప. 6)

**కచ్చేరీ నృత్యము**

దేవదాసీలు ప్రదర్శించే నృత్యం. రాజాశ్రయమైనది. ఒకే నర్తకి ఏకధాటిగా నృత్యం చేయటం దీనిలోని ప్రత్యేకత. పూర్వం రాజాస్థానాలలో అభివృద్ధి చెందిన ఈ నృత్యం దేవదాసీలచేత ఆరాధింపబడి, తెలుగు దేశంలో కచ్చేరి నృత్య కళగా రూపొందింది. కూచిపూడివారి నాట్యానికి పూర్తి భిన్నంగా ఉంటుంది.

ఈ నృత్యాన్ని బొబ్బిలి, విజయనగరం, కార్వేటి నగరం, వేంకటగిరి, కాళహస్తి మొదలయిన సంస్థానాధిపతులు పోషించారు.

అప్పటి నాట్యశాస్త్రకారులు నృత్యాన్ని, నృత్తాన్ని, అభినయాలను మేళవించి ఒక నృత్యక్రమాన్ని ఏర్పాటు చేసి దీనిని బాగా ప్రచారంలోకి తీసుకొచ్చారు. దేవదాసీలు క్షేత్రయ్య పదసాహిత్యానికి నృత్యాభినయాలను రూపకల్పన చేసి దీనిని ప్రదర్శించేవారు.

సంస్థానాధీశ్వరుల ఆదరణ తగ్గిన తరువాత దేవదాసీలు కేవల ఉదరపోషణ కోసం దీనిని ఉపయోగించవలసి వచ్చింది. ఇప్పుడీ నృత్యం తెలుగు దేశంలో ఎక్కడో కొందరు వృద్ధ దేవదాసీలవద్ద తప్ప కన్పించదు. (నా. ర. చ-244)

**కచ్చపేశ్వర దీక్షితులు**

కాలం : క్రీ. శ. 19వ శతాబ్దం.

స్థలం : కార్వేటినగర సంస్థానం.
రచన : రామచంద్ర యశోభూషణమ్.

క్రీ. శ. 19వ శతాబ్దం ఉత్తరార్థంలో కార్వేటినగర సంస్థానాన్ని పాలించిన రాజాబొమ్మరాజు బహద్దుట ఆశ్రితులు. వీరి తండ్రి వాసుదేవ యజ్వ. వీరి "రామచంద్ర యశోభూషణం" ప్రతాపరుద్రీయాన్ని పోలిన అలంకార గ్రంథం. (ఆ. సం. సా.)

కటికము

నామాంతరాలు : కటిక, కట్టియము, కటికీడు, కోలకేతడు, కేతినాయుడు, అస్థాన సంతోషి, సంతోషుడు, బాగుదారు, చోపుదారు, బరాబరి.

కటికము రాజోద్యోగి. రాజకథా ప్రసక్తిగల అన్ని యక్షగానాలలో ఈ పాత్ర ఉంటుంది. ఇతని పనులు పలురకాలు. రాజుగారి వాకిలి కావలివాడుగా, వేత్రహస్తుడుగా కన్పిస్తాడు. రాజు రాకను సభకు తెలియజేసి రాజుగారి ముందు నడుస్తూ త్రోవలో ఉన్న అడ్డంకులు తొలగిస్తాడు. రాజు గద్దె ఎక్కగానే కైవారాలు, హెచ్చరికలు, పరాకులు పలుకుతాడు.

దక్షిణాంధ్ర యుగ యక్షగానాలు కొన్ని ఈ పాత్ర రాకతో ప్రారంభమవుతాయి. ఇతడు భాగవతులతో కూడా హాస్యప్రసంగం చేస్తాడు. రాజదర్శనార్థం వచ్చిన వారిని ఎకసక్కెం చేయటం ఇతని పని. (చూ-అస్థాన సంతోషి) శహాజీ తన నాటకాలలో ఇతనిని "వికటాంగుడ"ని వ్యవహరించాడు. (య. వా. చ-202-3)

కటికి కామన్న

ఈయన సాళువ తిమ్మభూపాలుని కొలువులో చిన్న ఉద్యోగి. సింగరాజనే ఒక భట్టు కవికి రాజ దర్శనం కలిగించాడు. రాజు అతని పరోపకారపరత్వానికి మెచ్చుకొని కామన్నను, కవిని కూడా ఘనంగా సత్కరించాడట. ఆ సందర్భంలో భట్టుకవి సింగరాజు ఒక పద్యం చెప్పాడు. (చా. ప. ర.)

కట్టమూరి కామేశ్వర కవి

కాలం : 19వ శతాబ్దం.
స్థలం : విశాఖమండలం.
రచన : రామప్రభూ శతకము.

ప్రయాగ కామేశ్వర కవిగా వావిళ్ళవారిచే ముద్రితమైన రామప్రభూశతకం ఇతనిదట. (శ. క. చ. 799)

కట్టమూరి బుస్సన్న

కాలం : 16వ శతాబ్దం.
స్థలం : చోళమండలం కావచ్చును.

సంగీత సాహిత్యాలలో ఆసక్తి ఉన్నవాడు. పోలూరి గోవిందకవిని ప్రోత్సహించి అతనిచేత "రాగతాళ చింతామణి" అనే గ్రంథాన్ని రచింపజేశాడు.

(ద. దే. వా-235 ఆరుద్ర 92-159)

కట్టువరపు చిట్టిమ రాజు

రచన : ద్వాదశరాజ చరిత్రము.

కూచిమంచి తిమ్మకవి సర్వలక్షణసారసంగ్రహంలో ఇతన్ని పేర్కొన్నాడు.
(వా. చ. వం. సు-378)

కట్టా

ఇంటిపేరు. పూర్వం కరికాల చోళుడు కావేరికి ఆనకట్ట కట్టించాడు. అందు చేత అతని సంతతి వారికి కట్టావారనే ఇంటి పేరు వచ్చింది. ద్విపద రామాయణ కర్త కట్టా వరదరాజు ఈ వంశీయుడే. (రామాయణం- బాలకాండ-173-178)

కట్టా వరదరాజు

కాలం : 17 వ శతాబ్దం.

స్థలం : కడప మండలం.

రచనలు : 1. పరమ భాగవత చరిత్ర 2. శ్రీరంగ మాహాత్మ్యము 3. ద్విపద రామాయణము.

గురువు : యతిరాజయోగి.

రామరాజు కుమారుడు. సరస చతుర్విధ కవితాధురీణుడు. "సాహితీ భోజుడనని" చెప్పుకొన్నాడు. ఇతని కావ్యాలన్నీ దైవాంకితాలే. లక్షణ సమ్మతంగా వింతలు, జాతి వార్తలు, ఉపమలు ధారాళంగా ప్రయోగిస్తూ హృద్యమైన రచనలు చేశాడు. వ్యావహారిక రూపాలు కూడా వాడాడు. తెనుగునాట ఇతని రామాయణం కడు ప్రసిద్ధమైంది. కట్టావారు కరికాలచోళుని వంశంవారట. కరికాల చోళుడు కావేరికి ఆనకట్టకట్టించాడు అందుచేత అతని సంతతి వారికి కట్టా వారనే ఇంటి పేరు వచ్చిందట.

హరిదాసు రాజు ఇతని తండ్రి అని కొందరూ, తాత అని కొందరూ వ్రాశారు. హరిదాసు రాజు దానశాసనం ఒకటి కడప జిల్లా మాధవపురంలో ఉంది.
(రామాయణ బాలకాండ 173-178) (అరుద్ర-10-191)

కఠినప్రాస శతకము (అలభ్యం)

కాలం : క్రీ. శ. 17 వ శతాబ్ది.

కర్త : గణపవరపు వేంకటకవి.

ఇది అముద్రితం.

కవి తన పాండిత్య ప్రకర్ష చూపే ఉద్దేశంతోనే యమకశతకం, కఠినప్రాస శతకం వంటివి వ్రాశాడు. (క. త-12)

కడపాధినాయకాష్టకము

కర్త : తెలియదు.

కడపలోని దైవాన్ని ఉద్దేశించి చెప్పిన అష్టకం. ప్రసిద్ధమైన రచన.

కడలు సీమ

ప్రాచీన నాడులలో ఒకటి. ఇది ప్రస్తుతపు కాకినాడ తాలూకాలో ఉన్నది.

దక్షారామ శాసనం ఒక దానిలో-ఈ సీమలోని శీల, మంజీరు అనే గ్రామాలు ప్రసక్తాలు. శ్రీనాథుని 'భీమఖండం'లో 'కదలి సీమయు' అని ఈ సీమ ప్రసక్తి ఉంది.

(సం. ఆ. వి. కో-5)

**కడియాల వారు**

ఆభరణ విశేషంతో ఇంటి పేరున్న వారు. అందెలవారు, పోగులవారు మొదలయిన ఇంటి పేర్లు ఇలాంటివి. (భారతి-మా-45-230)

**కత్తివారు**

కత్తులు చేయటం వల్లనో, ధరించటం వల్లనో, ఉపయోగించటం వల్లనో, ఇది కొన్ని కుటుంబాల వారికి ఇంటిపేరుగా నిలిచిపోయింది. ఈ ఇంటి పేరుతో కొన్ని కుటుంబాలు ప్రకాశం జిల్లాలో ఉన్నాయి. (భారతి-మా-45-230)

**కథ**

సంస్కృత గద్యకావ్యాలలో ఇది ఒకటి. అవాంతర విభాగాలు, పద్యాలు, లేకుండా ఉండే గద్య ప్రబంధం కథ. కథకు - ఆఖ్యాయికకు భేదం లేదని కొందరంటారు. కల్పిత వృత్తాంతముండేది కథ అనీ, సత్యవృత్తాంతం ఉన్నది ఆఖ్యాయిక అనీ ప్రాచీనులు నిర్వచించారు. (తె. వి. స-6)

**కథాకావ్యము**

ఈ కావ్యానికి కావ్యలక్షణాలన్నీ ఉంటాయి (చూ. కావ్యం).

ఇందులోని కథలలో ఇతి వృత్తం వేరువేరుగా ఉన్నప్పటికీ ప్రతి కథలోనూ, కావ్యలక్షణాలు నిండుగా ఉంటాయి.

తెలుగులో కేతన దశకుమార చరిత్ర, మంచన కేయూర బాహు చరిత్ర, జక్కన విక్రమార్క చరిత్ర, అనంతామాత్యుని భోజరాజీయము, కొరవి గోపరాజు సింహాసన ద్వాత్రింశిక, దూబగుంట నారాయణ కవి పంచతంత్రము, వేంకటనాథ బానసరిపుల పంచతంత్రము, పాలవేకరి కదిరీపతి శుకసప్తతి, అయ్యల రాజు నారాయణ హంస వింశతి మొదలైనవి కథా కావ్యాలుగా ప్రఖ్యాతి చెందాయి. వీటికన్నింటికి సంస్కృత మూలాలున్నాయి. ఇవి సాధారణంగా నీతిని ప్రతిపాదించే కావ్యాలే అయినా, అద్భుతమైన రసనిరూపణం వీటిలో కనిపిస్తుంది. స్వతంత్ర కథా కావ్యాలు కూడా తెలుగులో చాలా వచ్చాయి. (తె. వా.)

**కనకతప్పెట్ల కోలాట నృత్యము**

నామాంతరం : డప్పుల కోలాట నృత్యము (చూ).

**కనకబండి గట్టుయ్య**

కాలం : 18 వ శతాబ్దం.

స్థలం : నేలకొండపల్లి (నైజాం మండలం).

రచనలు : హరిశ్చంద్ర కథ, కాటమ రాజు కథ, పోలరాజు కథ.

ప్రసిద్ధులైన రాజుల కథలు ద్విపదలో పాడుకోడానికి అనువుగా వ్రాశాడు.
(క. స. 54)

కనకరంజిత శిఖామణీ పరిణయము

కర్త : గూళికల్లు వేంకటరమణ కవి.
అంకితం : శ్రీ వేంకటేశ్వరస్వామికి.

శృంగార ప్రబంధం. ఆరాశ్వాసాలున్నాయి. కవి ఏదైనా ఒక గ్రంథాన్ని రచించాలనే తలంపుతో ఉండగా శ్రీ వేంకటేశ్వరుడు స్వప్నంలో కనపడి విక్రమార్క చరిత్ర ప్రబంధంగా చేయమని చెప్పాడట. ఈ ప్రబంధంలో విక్రమార్క చరిత్రకూడా ఉంది.

ప్రత్యేకత : విక్రమార్కుని వైశ్య సోదరుడయిన భట్టి కనక రంజిత శిఖా మణిని పెళ్ళిచేసుకోవడం ప్రధానమైన ఇతివృత్తం. ఆరో ఆశ్వాసంలో కావ్యం అసం పూర్ణంగా ఆగిపోయింది. ఈ కావ్యకర్త ప్రాచీన సంస్కృత కవులను, తెలుగు కవులను నుతించాడు. నుతించిన ప్రముఖాంధ్రకవులలో విక్రమార్క చరిత్ర కృతికర్త జక్కన లేడు.
(ఆరుద్ర-9-237)

కనకలేఖాకల్యాణమ్ (సం)

కర్త : చూ. వామనభట్ట బాణుడు.

ఇది ప్రసిద్ధమైన సంస్కృత నాటకం. (రె. రా. చ.)

కనకాజెట్టి వెంకటకృష్ణాజెట్టి

చూ. వెంకటకృష్ణకవి (నామాంతరం.)

కనకాభిషేకము

ప్రాచీన కాలంలోని రాజులు పండితులకు విద్వాంసులకు చేసే సత్కారాలలో ఇది ఒకటి. విద్వాంసులకు సాహిత్య శాస్త్ర విషయాలలో వాదోపవాదాలు నిర్వహించి విజేతలను కనకాభిషేకంతో సత్కరించడం విజయనగర రాజుల కాలంలో కనిపిస్తుంది. శ్రీనాథ మహాకవికి జరిగిన కనకాభిషేకం ఇలాంటిదే. లోకోత్తర ప్రతిభాశాలియైన మహా కవికిగాని, విద్వల్లోక మకుటాయమానుడైన మహా విద్వాంసునికి గాని చేయదగిన మహా గౌరవాలలో కనకాభిషేకమే ప్రధానమైనది.

కనకాభిషేక గౌరవాన్ని పొందే వ్యక్తి మీద వేదమంత్ర పురస్సరంగా బిందెలతో బంగారు నాణాలను స్నానం చేయిస్తున్నట్టుగా పోస్తారు. క్రిందపడిన నాణాలను సభాసదులకు పంచిపెడతారు కనకాభిషేక గౌరవం కవికి లభిస్తుంది. బంగారు నాణాలు తక్కిన వారికి లభిస్తాయి. దీన్నే సువర్ణ స్నానమని అంటారు. బంగారు నాణాలతో బాటు విలువైన మణులను కూడా కలిపి మణీ కనకాభిషేకము చేయడం కూడా పూర్వం ఉండేది.

వ్యాఖ్యాతృ చక్రవర్తి మల్లినాథ సూరి సర్వజ్ఞసింగ మహీపాలునిచేత ఈ సత్కారాన్ని పొందాడు. శ్రీనాథుడు ప్రౌఢ దేవరాయల నుండి కనకాభిషేక సత్కారాన్ని

గ్రహించాడు. ఆ సందర్భంగా బంగారు నాణాలను అందరికీ పంచి పెట్టించాడట. స్నానోదకాన్ని పానం చేయరాదని అన్నాడట. రఘునాథ నాయకుడు యామద్వయంలో కావ్యం చెప్పి తండ్రియైన అచ్యుతప్ప నాయకునిచేత కనకాభిషేక సత్కారాన్ని పొందాడు. ఆ రఘునాథుడే సుధీంద్రుడనే మధ్వాచార్యునికి కనకాభిషేకం చేశాడు. తన ఆస్థానంలోని మధురవాణికి స్వర్ణాభిషేకం చేశాడు. ఇతని కుమారుడు విజయరాఘవ నాయకుడు తన ఆస్థానంలోని కవయిత్రి రంగాజమ్మకు కనకాభిషేకం చేశాడు. కుందుర్తి గోవిందయ్య వీరవేంకటపతిరాయలచేత ఈ సత్కారం పొందాడట. మరింగంటి జగన్నాథ సూరికూడా కనకాభిషేక సత్కారం పొందినవాడే. 17వ శతాబ్దంలో నివృత్తి శేషాచల కవికి శహాజీ మహారాజు కనకాభిషేకం చేశాడు

(1. శ్రీనాథభారతము 2. ద. దే. వా. 134- 3. శృంగారశ్రీనాథము-189)

## కనుపర్తి అబ్బయామాత్యుడు

కాలం : క్రి. శ. 1730-1780 ప్రాంతం.

రచనలు : 1. అనిరుద్ధ చరిత్ర. 2. కవిరాజ మనోరంజనము (పురూరవశ్చరితము)

రాయనమంత్రి నరసమాంబల పుత్రుడు ఇతని తాతకు ముత్తాత బసవనామాత్యుడు, కొండవీటిరాజుల దగ్గర మంత్రి అట. ఇతని తండ్రి, తాతలు కొండవీటి సీమలోని కనుపర్రు గ్రామ కరణాలుగా ఉండేవారు ఇతని కవిత్వం ప్రౌఢంగాఉంటుంది. కవిరాజ మనోరంజనానికి పిల్ల వసుచరిత్రమనే ప్రసిద్ధి ఉంది. ఈ కవి సంగీత సాహిత్యాలలో మంచి ప్రతిభ గలవాడు. 18వ శతాబ్దపు కవులలో ప్రౌఢుడు

(తె. వి. స-6: క. చ. 3-80)

## కనుమారి

నామాంతరం : భృగుపాతము (చూ.).

## కన్నడభారతము

నామాంతరం : విక్రమార్జున విజయము (కన్నడం).

కర్త : పంపకవి (పద్మకవి).

ఈ కవి వేంగీపుర వాస్తవ్యుడట. తెలుగులో కూడ రచనలు చేశాడు.

## కన్నప్ప

ధూర్జటి "కాళహస్తి మాహాత్మ్యము"లో ఇదొక ప్రసిద్ధ పాత్ర. కవిశైవుడు శివభక్తి తత్పరుడు. మోక్షసాధనకు పురాణాలను, శాస్త్రాలను పఠించనక్కరలేదనీ కేవలం త్రికరణ శుద్ధితో కూడిన భగద్భక్తి చాలుననీ నిరూపించే పాత్ర ఇది.

కన్నప్ప కిరాతవంశంలో పుట్టాడు. ఇతనికి కొంత పూర్వజన్మ వృత్తాంతం ఉంది. ద్వాపరయుగంలోని "అర్జునుడే" ఈ కన్నడట. అర్జునుడు ఉత్తమకులంలో పుట్టి క్షాత్ర ధర్మం ప్రకారం నిర్దిష్టమైన పంథాలో జీవనం సాగించినా తామసప్రవృత్తి కలిగినవాడై బంధు సంహారం కోరాడు, కాబట్టి మోక్షానికి అర్హుడు కాలేక పోయాడట. తత్ఫలితంగా అతడు కలియుగంలో కిరాతవంశంలో పుట్టాడు. శివభక్తి తత్పరుడైనాడు. ఒకనాడీతడు

అరణ్యంలో వేటాడి మిక్కిలి పరిశ్రమించిన వాడై అలసి ఒకచోట నిద్రించాడు. అతనికి కలలో జంగమయ్య కనిపించి సమీపంలో ఉన్న కొండ మలుపులో వెలసిన పరమేశ్వరుడిని కొలిచి మోక్షం పొందమని ఆదేశిస్తాడు. ఆ ప్రకారంగానే కన్నప్ప కొండ దిగువన నెలకొన్న శివలింగాన్ని కనుగొంటాడు.

అన్నిటికన్నా ప్రధానం 'భక్తి'. అది లోపించకూడదు. కన్నప్ప శివలింగాన్ని అర్చించిన విధానం విచిత్రంగా ఉంటుంది. అతడు పామరుడు. శాస్త్రజ్ఞాన శూన్యుడు. పుక్కిళ్ళలో నీటిని తెచ్చి స్వామికి అభిషేకం చేశాడు. అది అపవిత్రమని భావించలేదు. మాంసాదులను నైవేద్యం పెట్టాడు. అది దుష్కృత్యమని అతనికి తెలియదు. అతనికి తెలిసిందొక్కటే-భక్తి. స్వామి సేవ. ఇదంతా ఒక శివద్విజుడు పరిశీలిస్తాడు. అతడు కూడా ప్రతి నిత్యం యథోచితంగా స్వామిని పూజించేవాడే. స్వామి సన్నిధిలో ఈ మాంసాదులుండడం అతనికి బాధాకరంగా అనిపించింది. అప్పుడు పరమేశ్వరుడు తిన్నని యొక్క మూఢభక్తిలోని గాఢత్వాన్ని ఆ బ్రాహ్మణుడికి తెలపాలని సంకల్పించి తిన్ననికి ఒక పరీక్ష పెడతాడు.

ఒకనాడు స్వామి కంటిలోనుండి రక్తం ధారగా ప్రవహించడం ప్రారంభించింది. భక్తుడికిది ఓర్వరాని సంఘటన. కన్నడు తన చేతనైన ఉపచారాలు చేశాడు. తగ్గలేదు. కంటికి కన్నే ప్రతిగా నిల్పాలనుకున్నాడు. ఊహ వచ్చినంతనే తన కన్నును పెరికి స్వామి కంటికి అమర్చాడు. రక్తస్రావం తగ్గింది కాని వెంటనే రెండవ కంటి నుండి రక్తం కారింది. భక్తి తత్పరుడైన కన్నప్పకు స్వార్థం అడ్డు రాలేదు. తన రెండవ కంటితో పరమ శివుని రెండవ కంటిని బాగుచేశాడు. ఇదంతా రహస్యంగా పరిశీలించిన బ్రాహ్మణుడు కన్నప్ప అకుంఠిత భక్తికి ఆశ్చర్యపోతాడు.

శైవ వాఙ్మయంలో ఇలాంటి ఘట్టాలు ఎక్కువగానే ఉంటాయి. వారు భక్తి ప్రదర్శించడంలో కొన్ని భయంకర కృత్యాలు చేస్తారు. సిరియాలుడి కథ కూడా ఇట్టిదే. భక్తి పారవశ్యంలో భగవంతుని కైంకర్యం కొరకు ఎంతటి కఠిన పరీక్షలనైనా సులభంగా ఎదుర్కోవాలనే సత్యాన్ని బోధించడమే వీటి పరమార్థం.

కిరాతుడైనప్పటికీ, అనాగరికుడూ, అపండితుడూ అయిన కన్నప్ప త్రికరణ శుద్ధిగా పరమేశ్వరుడిని సేవించి మోక్షాన్ని పొందాడు. అరువత్తి మూవరు నయనార్లలో ఒకడుగా ప్రసిద్ధి పొందాడు.

శుష్క పాండిత్యంతో కాక, భక్తి ద్వారా పరమేశ్వరుడు సులభసాధ్యుడని చెప్పడానికి ఈ కథ చక్కని ఉదాహరణము.

## కన్నప్ప కథ

ఇది పాల్కురికి సోమన విరచిత బసవపురాణంలో ఒక శివభక్తుని కథ. ధూర్జటి విరచిత శ్రీకాళహస్తిమాహాత్మ్యంలోని తిన్నని కథకు ఈ కన్నప్ప కథ మూలం.

### కన్నప్ప చరిత్ర (అలభ్యం)

కర్త : పేరు తెలియదు.

"సీమంతినీ చరిత్ర" కృతికర్త వీరభద్ర కవి తన ముత్తాత కన్నప్ప చరిత్రను వ్రాసినట్లు చెప్పాడు. (య. వా. చ. 435)

### కన్నప్ప చరిత్ర (అలభ్యం)

కర్త : కంచిరాజు సూరయ్య.

దీని నుంచి పెదపాటి జగ్గన్న తన 'ప్రబంధ రత్నాకరం'లో 4 పద్యాలను ఉదాహరించాడు. మొదటి రెండు పద్యాలు విష్ణుస్తుతికి, మూడో పద్యం వినాయక స్తుతికి, నాలుగోది పుళింద గ్రామణి కాంతలకు సంబంధించిన పద్యాలు. శైవ మత పరమైన గ్రంథమైనా కవి ఇందులో విష్ణుస్తుతి చేశాడు. (అరుద్ర-9)

### కన్యకా పురాణము

నామాంతరాలు : 1. వైశ్య పురాణము (చూ ) 2. వాసవీమాహాత్మ్యము.

కర్త : భాస్కరాచార్యులు.

### కన్యకా పురాణము (చరిత్ర)

కర్త : ఇటికెల (ఇటుకల) తిమ్మయ.

యక్షగానం ప్రసిద్ధమైన వైశ్యుల ఇలవేల్పు కన్యకా పరమేశ్వరి చరిత్ర దీనిలోని ఇతివృత్తం. మూలం స్కాందపురాణం.

ఇది ప్రదర్శనకు అనువుగా లేదు. దీనిలో తాళప్రధానాలైన దరువులు ద్విపద వచనాలు ఎక్కువ (య. వా. చ-77)

### కన్యకామ్మవారి కథ

దేశీయ వృత్త రచనలలో ప్రాచీనమైన కరుణ రసపూరిత గాథ ఇది. ఈమెయే కన్యకా పరమేశ్వరి. వైశ్యులకు ఇలవేల్పు.

కుసుమశ్రేష్ఠి పెనుగొండ పట్టణ నివాసి. అతని కూతురే వాసవీకన్య, ఈమెయే కన్యకా పరమేశ్వరి. ఈ వాసవకన్య సౌందర్యరాశి. సుగుణాలప్రోవు.

ఒకప్పుడు 'విష్ణువర్ధనుడ'నే రాజు ఈకన్యకను చూడ్డం తటస్థించింది. వివాహమాడ్డం కోసరం కుసుమశ్రేష్ఠికి రాయబారం పంపుతాడు. అది ఇష్టంలేని కన్యక, కొందరు బంధుమిత్రులూ కలసి రాయబారం తిరస్కరిస్తారు. ఇది తెలిసిన రాజు ప్రతీకారం తీర్చుకోవడానికి సైన్యంతో వస్తాడు. కాని వాసవీ కన్యక, కోటి స్త్రీలతో కలసి అగ్నికి ఆహుతి అయింది. పుష్పక విమానంలో శివుడు ప్రత్యక్షమై ఆమెను తీసుకెళ్ళడం జరుగుతుంది. వాసవీ కన్య "పార్వతీదేవి" అవతారమని వైశ్యుల అభిప్రాయం. కరుణ రసపూరితమైన ఈ గాథ మిక్కిలి ప్రచారం చెందింది. (జా. గే. వా)

## కన్నెకంటి వేంకటసుబ్బయ్య

కాలం : 1835 ప్రాంతం.

స్థలం : నందివెలుగు గ్రామం.

సాహిత్య ప్రియుడు. గాదె ఆది శేషకవిని ప్రోత్సహించి అతనిచేత 'కొచ్చెర్ల ధామ' అనే మకుటంతో ఒక శతకం రచింప జేశాడు. (క స_19)

## కపిల గోసంవాదము

రచనాకాలం : 1750 ప్రాంతం.

కర్త : రామావజ్ఝల కొండు భట్టు.

అంకితం : అహోబల నృసింహ స్వామికి.

ఆరాశ్వాసాల ప్రబంధం. అధ్యాత్మ విద్యా ప్రతిపాదకమైన గ్రంథం. (క. స_47)

## కపిలేశ్వర పురము

ఈ సంస్థాన పాలకుల గృహనామం "బలుసు" వారు. బులుసువారని వ్యవహారంలో ఉంది.

మొదటి నాగినీడు, చిక్కనీడు, ఇమ్మడి నాగినీడు వీరికి మూల పురుషులు. బులుసు పెద సర్వారాయుడు క్రీ.శ. 1818 లో ఉప్పలపాటి రామరాజు వద్దనుండి ఈ కపిలేశ్వరపురం ఎస్టేటును కొన్నారట. అప్పుడు ఇందులో కేదారిలంక, నారాయణలంక, చోళ్ళలంక, వాడపాలెం, వీధివారిలంక—అనే అయిదు శివారు గ్రామాలుండేవి. క్రీ. శ. 1852 లో పెద సర్వారాయుడుగారి కుమారులు బుచ్చి కృష్ణయ్య గారు 'కేసనకుర్రు' ఎస్టేటును కొన్నారు. అన్నంపల్లి, కేసనకుర్రు, కొండకుదురు, గాడిలంక, తిళ్ళకుప్ప, మురుమళ్ళ—అనే ఆరు గ్రామాలు ఇందులో చేరాయి. క్రీ. శ. 1908 లో జమీందారైన బుచ్చి సర్వారాయుడు గారు బందరు నవాబు వద్దనుండి క్రీ.శ. 1916 లో "హసన్‌బాదా" గ్రామాన్ని కొని జమీలో కలుపుకున్నారు

ఈ సంస్థానం ప్రభువులు కూడా సాహిత్య పోషణ గావించిన వారే. పెద సర్వారాయుడు భూరి దానాలు చేస్తూ ప్రజారంజకంగా పాలించారట. క్రీ.శ. 1870_1896 వరకు జమీందారుగానున్న పట్టాభి రామయ్య, 1908 లో జమీందారైన బుచ్చి సర్వారాయుడు సాహితీ ప్రియులు. కవి పండిత పోషణ చేసి ప్రసిద్ధిపొందారు. (అం సం. సా.)

## కపోత వాక్యము

కర్త : వెంకటగిరి.

అంకితం : శ్రీ వేంకటేశ్వరునికి.

ద్విపద కావ్యం. మహాభారతం శాంతి పర్వంలోని కపోతోపాఖ్యానం మూలం. ఇది శ్రీరాముడు సుగ్రీవునికి చెప్పిన కథ అట. ఈ రచన భారత కథ కంటె వేరుగా ఉంది. శరణాగతులను ఆదుకొనడం ధర్మమనీ, పక్షులు కూడ శరణాగతుడైన వానిని కాపాడినవనీ ఈ కథ తెలుపుతున్నది. దీనికి భిన్నప్రతులున్నాయి. (ద్వి.సా.చ-364)

**కపోత వాక్యము**

కర్త : బలభద్రదాసి.

అంకితం : కర్పూర చెన్నునికి.

ఈ యక్షగానంలోని కథ భారతం శాంతి పర్వంలోని పరోపకార పరాయణ ధర్మ ప్రబోధాత్మకమైన కపోత వాక్యోపాఖ్యానం ఆధారంగా రచింప బడింది.

దీనిలో ద్విపదలు, కందాలు, చౌపదులు, జాళిపదాలు, నడలు, రేకులు, అనువులు, అర్ధ చంద్రికలు, సువాల మొదలయిన దరువులు ఉన్నాయి. (య. వా. చ)

**కమలనాభామాత్యుడు**

కాలం : 14 శతాబ్దం కావచ్చు.

స్థలం : కాల్పట్టణము.

రచన : పద్మ పురాణ సంగ్రహము (అలభ్యం).

ఇతడు కవి సార్వభౌముడైన శ్రీనాథునికి తాత. ఇతడు కాల్పట్టణాధీశ్వరుడనీ, పద్మపురాణ సంగ్రహ కర్త అనీ శ్రీనాథుడు చెప్పాడు. కాల్పట్టణం నెల్లూరు జిల్లాలోని కొత్త పట్టణమని కొందరూ, కృష్ణా జిల్లాలోని కాశీపట్టణమని కొందరూ అభిప్రాయపడుతున్నారు. (క. స-30; శ్రీనాథ భారతము)

**కమలాకర చరిత్ర (అలభ్యం)**

కర్త : తెలియదు.

కాలం : 1670 కి పూర్వపు రచన.

రత్నాకరం గోపాలరాజు ఈ కావ్యాన్ని పేర్కొన్నాడు. (ఆరుద్ర-12-191

**కమలినీ కలహంసము**

కర్త : పరవస్తు వేంకట రంగాచార్యులు.

సంస్కృత మూలానికి అనువాద గ్రంథం.

**కమలినీ కలహంసమ్ (సం)**

కర్త : రాజచూడామణి దీక్షితుడు.

చారిత్రక ప్రశస్తి గల నాటకం. (తె.వి.స-8-241)

**కమ్మనాడు**

ప్రాచీనమైన నాడులలో ఇది ఒకటి. దీనిలో ఆరువేల గ్రామాలుండేవట. గుంటూరు మండలంలో బాపట్ల మొదలు - వినుకొండ, నర్సరావుపేట తాలూకాలు

ఒంగోలు తాలూకాలో కొంత భాగం కలిసి కమ్మనాడుగా ప్రసిద్ధి. పావులూరి మల్లన "ఇల కమ్మనాటిలోపల" అని ఈ నాడును పేర్కొన్నాడు. ఓపిలిసిద్ధి కమ్మనాటిని క్రీ శ. 1224 లో పాలించినట్లు శాసనముంది. ఈ నాడుకు రాజధాని కొణిదెన. దీని పూర్వ నామము-కొట్టియదొాన. ఇది నరసరావుపేట తాలూకాలో ఉంది. (స౦ ఆ.వి.కో-5)

కరంభకము (శ్రవ్యకావ్య భేదం)

ఒక్కొక్క పాదం ఒక్కొక్క భాషలో రచించిన కావ్యము కరంభకము. తెలుగులో ఇట్టి కావ్యాలు లేవని విమర్శకుల అభిప్రాయం. (తె వి స-8)

కరణము మల్లన్న

కాలం : తెలియదు.

ఈయన రాయగిరి దుర్గంలో ఒక గడిమన్నె కోటకు అధికారియైన సాళువ చెంచు భూపాలుని మంత్రి. రాజు లేని వేళలో శత్రువులు కోటను ఆక్రమిస్తే ఇతన్ని పురి కొల్పుతూ-ఆస్థాన కవి ఏనుగుధాటి సుబ్బరాజు ఈయన మీద పద్యాలు చెప్పాడు. (చా. ప. ర)

కరణికోద్ధారణి (అలభ్యం)

కర్త : ఊరె వీరభద్ర కవి.

ఈ కావ్యాన్ని గురించిన వివరాలు తెలియవు కాని, కవి దొానకొండ గంగ జాతరను విపులంగా వర్ణిస్తూ చెప్పిన, ఇందులోని పద్యం ఒకటి దొరికింది. (చా. ప.ర)

కరాలపాటి రంగయ్య కవి

కాలం : 1814-1863.

స్థలం : చెన్నపురి

కృతులు : 1. భూతపురీ మాహాత్మ్యము 2. కవిజన మనోహరము.

చెన్నపురిలోని పచ్చయ్యప్ప కళాశాలలోను, ప్రెసిడెన్సీ కళాశాలలోను అధ్యాపకుడుగా ఉండేవాడు. మొట్టమొదటగా, భారత . భాగవత రామాయణ కావ్యాలను లేఖన ప్రమాదాలు లేకుండా ముద్రించిన వాడితడే.

ఈతని కవిత్వం నిర్దుష్టమై రసవంతంగా ఉంటుంది. (వీరేశలింగం పంతులు-సమగ్ర పరిశీలన)

కరియ బంటన విజయము (కన్నడం)

కర్త : బొమ్మలాట సాంబయ్య.

కన్నడ భాషలో రచించబడ్డ యక్షగానం. ఆయా ప్రాంతాల్లో దీనిని కవి కుటుంబ సభ్యులు ప్రదర్శించే వారట. (య వా. చ)

**కరియంబబుని కథ**

కర్త : దొడ్డి నరసింహ కవి.

**అంకితం** : కవి ఇష్టదైవమైన దొడ్డికొండ యోగళలేశునికి.

యక్షగానం. ధారాపురాధిపతి కరియబంటు, హాళియ బీడు రాజు ఆహ్వానం మీద హాళియబీడుకు బయలుదేరగా దారిలో పుండరీకాక్షి అతన్ని ప్రేమించడం, పుండరీకాక్షి తల్లియైన రక్కసి కూతురి వలపు తెలుసుకొని రాజును చంపడం, వెంటనే రక్కసి శాపవిమోచనం చెంది గంధర్వస్త్రీగా మారడం, శివుడు ప్రత్యక్షమై రాజును బ్రతికించి పుండరీకాక్షితో వివాహం జరిపించడం ఇందులోని కథ.

తాళప్రధానాలైన దరువులు, వచనాలు, ద్విపదలు, పద్యాలు, అర్ధచంద్రికలు, రచ్చరేకులు, ధవళాలు, శోభనాలు, గౌరీకల్యాణం పాట ఉన్నాయి రచన చక్కగా సాగింది. (య. వా. చ)

**కరివేల్పు శతకము**

**కాలం** : 18వ శతాబ్దం.

కర్త : పైబర్సు అప్పనకవి.

రచన ప్రౌఢంగా హృదయంగమంగా ఉంది. సీస పద్య శతకం. "బళిర కరివేల్పః పసిడి దువ్వలువదాల్పః" అనేది మకుటం. (శ. క. చ-337)

**కరుణ రసగేయములు - జానపద సాహిత్యము**

"కరుణ రసం" ప్రధానంగా గల గేయాలన్నీ "కరుణరస గేయాలు".

జానపద వాఙ్మయంలో శృంగారం తరవాత కరుణాద్భుత రసాలకు సమ ప్రాధాన్యం లభించింది. ఈనాటికి చెందిన గేయాలలో స్త్రీలకు సంబంధించినవి ఎక్కువ. అత్తలు కలిగించే ఆరాటం, తోడి కోడండ్రు చూపే అసూయ, భర్తల కాఠిన్యం మొ॥ వాటికి గురియైన పడతుల చరిత్రలు వర్ణించే పాటలు ఎన్నో ఉన్నాయి. ఈ పాటల్లో విషాదంతో పాటు ఆ ఇల్లాళ్ళ మాహాత్మ్యం కూడా కొంత జతపరుపబడింది. కామమ్మ కథ, లక్ష్మమ్మ కథ, సన్యాసమ్మ కథ, పాపమ్మ కథ, ఎరుకమ్మ కథ మొ॥ వికరుణ రసాత్మక గేయాలలో ముఖ్యమైనవి. ఈ కథలలో కథా నాయికలు సహనము, త్యాగం ప్రదర్శించి చివరకు సహగమనం చేసినట్లుగా వర్ణించబడి ఉండడం చేత ఇవి పాషాణ హృదయాలకు కూడా పరమ విషాదం కలిగిస్తాయి. (వా. చ.)

**కరుణా కందళమ్ (అలభ్యం)**

కర్త : విశ్వేశ్వర కవి చంద్రుడు

సంస్కృత గ్రంథం. (ఆరుద్ర-4)

**కరుణాలహరి (సం)**

కర్త : చూ. జగన్నాథ పండితరాయలు (క్రీ. శ. 1590-1665).

ఇది ప్రసిద్ధమైన స్తుతి కావ్యం. (తె. వి. వ-8)

కర్ణావతంసమ్ (సం)

కర్త: లొల్ల లక్ష్మీధరుడు.

ఇది సంస్కృత కావ్యం. (తె. వి. స-4)

కర్నమడక్షల అనంతాచార్యులు

కాలం : తెలియదు.

రచనలు : 1. ఆచార్యవింశతి. 2. ఆంధ్రశబ్ద చింతామణి 3. మదనవిజయభాణము.

న్యాయ వేదాంత వ్యాకరణ మీమాంసా సాహిత్యాలలో దృఢ వ్యుత్పత్తి: గౌరవం కలవాడు. కాశీ శివకుమారపండితుని మెప్పు పొందాడు. జీవిత చరమ దశలో కాశీ క్షేత్రంలో నివసించి అచటనే పరమపదించాడు. (ఆం. సం. సా.)

కర్నూలు నవాబు కథ

కర్త : తెలియదు.

జానపద చారిత్రకగేయం.

చూ. చారిత్రక గేయములు. (వా. చ.)

కర్పూరము కృష్ణమాచార్యులు

కాలం : 1650 ప్రాంతం.

స్థలం : నల్లగొండ జిల్లా (చర్లపల్లి).

రచన : భగవద్గీత (ద్విపద).

పండితకవి. తన రచనను చర్లపల్లిలోని కేశవస్వామికే అంకితం చేశాడు. (1.క. త-12-256-2. గోలకొండ కవుల సంచిక.)

కర్మజ్ఞాన వివరణము

నామాంతరం: మీమాంసా శాస్త్రసారము.

కర్త : నడిమింటి సర్వమంగళేశ్వరశాస్త్రి.

మీమాంసా శాస్త్రసారం ఈ రచనలో పొందుపరచబడింది. కర్త వైదిక వైదుష్యానికి ప్రతీకగా ఉన్న ఈ రచన బహుధా ప్రశంసల నందుకొన్నది.

కర్లపాలెము సింగన

కాలం : 1760 ప్రాంతం.

స్థలం : గుంటూరు జిల్లాలోని కర్లపాలెము.

రచన : నృసింహ శతకము.

కవి సీతారామయ్య బుచ్చమ్మల పుత్రుడు. ఇతని రచన సరళంగా ఉంటుంది. కర్లపాలెము బాపట్ల తాలూకాలో నిది. ఇతడు ఆ గ్రామకరణం. (క. స. 286)

కర్మవిపాకమ్ (సం)

కర్త : విశ్వేశ్వరుడు. (తె. వి. స-4)

కర్మాంత వార్తికమ్ (సం)
కర్త : వెంకటమఖి. (తం. అం. నా-251)

కర్రివారు
రంగు పేరుతో కొందరి ఇంటి పేరుగా దేశంలో నిలిచి ఉంది.
ఇట్లే ఎర్రవారు అనే ఇంటిపేరు కూడా. (భారతి-మా-45-230)

కలకేత బ్రహ్మయ్య కథ
ఇది పాల్కురికి సోమన విరచిత బసవపురాణంలోని శివభక్తుని కథ.
(ఆరుద్ర-2-122)

కలభాషిణి
చూ. కళాపూర్ణోదయము.

పింగళి సూరన్న వ్రాసిన కళాపూర్ణోదయ కావ్యంలోని నాయిక. వేశ్యకుల సంజాత. నిజమైన శృంగార భావాలకు ప్రకాశకురాలు. ఈమె పూర్వ జన్మలో సరస్వతీ దేవి చేతి చిలుక. ఈ జన్మలో కలభాషిణి. తరువాతి జన్మలో మధురలాలసగా జన్మించి కళాపూర్ణునికి భార్య అయింది. మణికంధరుడే మరు జన్మలో కళాపూర్ణుడు. ఈమె జన్మతః వారకాంత అయినా గుణాల విషయంలో ప్రబంధ నాయికలయిన కుల స్త్రీల కంటె చాలా మేల్తరమైనది. ఒకే కాలంలో ఇటు మణికంధరునిపట్ల-అటు నలకూబరుని పట్ల మనసుంచినట్లు సూరన్న ఈమెను వర్ణించాడు. అందుకే ఈమెను గణికగా చిత్రించాడేమో!

నారదుడు ద్వారకలోని శ్రీకృష్ణుని చూడటానికి మణికంధర శిష్యసమేతంగా వచ్చినప్పుడు ఈమె-మణికంధరుని సాహిత్య పటిమకు, గుణసంపదకు ఆకర్షింపబడి అతనిపట్ల బద్ధానురాగం ఉండికూడా - నలకూబరుని మనసులో నిలుపుకొన్నది. నలకూబరుని రూప లావణ్యాదులు మెచ్చి, ఇంకా తృప్తి పడక విమానంతో పాటు కొంతదూరంపోయి చూసి మళ్ళీ తిరిగి వచ్చి నలకూబరునిగురించి నారదుని అడిగి తెలుసుకుంటుంది. కలహశీలియైన నారదుడు రంభకు వేరొక ప్రతిస్పర్ధిని తయారుచేయాలనుకున్నాడు. అట్లే జరిగింది.

ఈమెలో వినయం, అధైర్యం, దైన్యం మొ॥ భావాలతోపాటు హృదయ పూర్ణమైన వలపు కలసి ఉండే తప్ప అహంకారం లేదు. నారదుడు సర్వజ్ఞుడు కాబట్టి-మణికంధరునికి కలభాషిణిపై కోర్కె ఉన్నదని తెలుసుకొని, మణికంధరుడు చదివిన దండకాన్ని చదవమని కలభాషిణిని అడుగుతాడు. నారదుని మూలంగా తన కోర్కెలు సఫలమవుతాయనే ఉద్దేశంతో ఈమె నారదుని శిష్యురాలిగా చేరి గానవిద్యను అభ్యసిస్తుంది

నారదుని నుంచి పొందిన కామరూపధారణ శక్తితో మాయారంభగా నలకూబరుని చేరింది. కాని విధివశాత్తు అతడు నలకూబర రూపంలో ఉన్న మణికంధరుడే అయినాడు. పైపెచ్చు రంభవల్ల శాపంకూడా లభించింది. కలభాషిణి భగ్నమనోరథురాలైనా మణికంధరునిపట్ల బద్ధానురాగ కాబట్టి త్యాగశీలతతో ప్రియుని చేతికి స్వయంగా కత్తి

అందించి అతని భాగ్యోదయానికి కారకురాలయింది. మరు జన్మలో మధురలాలసగా అతనికి (కళాపూర్ణుడు) భార్య అయింది.

ఈ పాత్ర చిత్రణలో కవి అంతవరకూ కవితా లోకంలో ఉన్న కొన్ని నియమాలను అపోహలను అధిగమించాడు. మణికంధరునిపై అనురాగం ఉండికూడా నలకూబరునిపై వ్యామోహం పెంచుకోవడం లోకవృత్తంలోని మానవస్వభావ చిత్రణమేతప్ప వేరుకాదు. ఈమె ప్రణయ స్వరూపంకూడా ప్రకృతి సహజంగా సాగినదే కాని ప్రబంధ ధోరణిని అనుసరించలేదు. ఈమె మాయారంభగా, మాయా నలకూబరుని (మణికంధరుని) చేరిన ఘట్టం తెలుగు సారస్వతంలో అపూర్వం. ఈ ఘట్టానికీ షేక్ స్పియర్ "ట్వెల్ఫ్ నైట్" నాటక ఘట్టానికీ పోలిక ఉందని విజ్ఞులంటున్నారు. షేక్ స్పియర్ 16వ శతాబ్దంలోని ఆంగ్ల మహాకవి. సూరనకు సమకాలికుడే అవుతాడు.

(క. పూ. పీఠిక-కట్టమంచి)

### కలవాణీ విలాసము

కవి : కంఠీరవరాజు (చూ.)

యక్షగానం. సంగీత నృత్య నాటకంవలె రచన సాగింది. కంఠీరవ రాజే కథా నాయకుడుగా చిత్రించబడడం ఇందులోని విశేషం. (ద. దే. వా-454)

### కలాపకము

శ్రవ్య కావ్య భేదం.

క్రియాసమాప్తికోసం పరస్పరాపేక్ష ఉన్న నాలుగు పద్యాల మొత్తం. క్రియా పదం చివరి పద్యంలో ఉంటుంది. (తె. వి. స-6)

### కలిదిండి భావ నారాయణ

కాలం : క్రీ. శ. 16 శతాబ్ది.
స్థలం : కృష్ణా జిల్లా కైకలూరు తాలూకాలోని కలిదిండి గ్రామం.
రచన : విష్ణుపురాణము (పురుషోత్తమ ఖండము.).
గురువు : శ్రీరంగాచార్యులు.

వీరి యింటి పేరు తొలుత అడవి వారట. కలిదిండి గ్రామ నివాసాన్ని బట్టి కలిదిండి వారైనారట. ఇతడు వెంకటాద్రి సూరమాంబల కుమారుడు.

విశిష్టత : సరసత, మృదుత్వం, చక్కదనం, అలంక్రియాస్ఫురణ ఉన్న కావ్యాన్ని దేవునికి అంకితమిస్తే అది సంత్కృతి అవుతుందనీ, పరులకు కృతియిస్తే దుష్కృతి అవుతుందనీ ఈ కవి అన్నాడు. ఇతని కవిత మనోహరంగా ఉన్నా కొన్ని వ్యాకరణ దోషాలు ఉన్నాయని అంటారు. (ఆరుద్ర-9-234)

### కలిదిండి రామభూపతి

కాలం : తెలియదు.

ఈయన ఏదోచిన్న సంస్థానానికి పాలకుడని ఒక చాటువు వల్ల తెలుస్తుంది.

చాటు కవి వివరాలు తెలియవు. కలిదిండి గ్రామం కృష్ణాజిల్లా కైకలూరు తాలూకాలో ఉంది. (చా. ప. ర)

కలియుగ మంజరి

నామాంతరం : వరదరాజ మంజరి (చూ).

కర్త : అప్పన.

కలివిడంబనమ్ (సం)

కర్త : నీలకంఠ దీక్షితులు.

కలియుగ చర్యలలోని దోషాలు దీనిలోని ఇతివృత్తం. (తె. వి. స_6)

కలువచేరు శాసనము

కాలం : 1423_1434 ప్రాంతం.

రాజమహేంద్రవరరెడ్డి ప్రభువు వీరభద్రారెడ్డి భార్య, కాటయ వేమారెడ్డికి దొడ్డాంబికల పుత్రిక అయిన "అనితల్లి" వేయించిన శాసనం.

ప్రత్యేకత : ఈ శాసనంలో 42వ శ్లోకంలో "అనితల్లి" కాటయ వేమారెడ్డికి దొడ్డాంబికకు పుత్రిక అని స్పష్టంగా ఉంది. దొడ్డాంబిక కొండవీటి అనవోతారెడ్డి కుమార్తె అని, కుమారగిరిరెడ్డి చెల్లెలని చరిత్రకారుల నిర్ణయం. అల్లాడరెడ్డి కుమారుడైన వీరభద్రారెడ్డి అర్ధాంగి అనితల్లి. "కలువచేరు" నేటి "కల్వచర్ల" అని, తూర్పు గోదావరి జిల్లాలో ఆలమూరుకు, కపిలేశ్వర పురానికి దగ్గరలో ఉందని పండితాభిప్రాయం. ఇది "అనితల్లి" దైవశ్రేష్ఠుడయిన ఒక బ్రాహ్మణునకు ఇచ్చిన దానశాసనం. (క. శ. 5)

కల్నల్ కాలిన్ మెకంజీ

కాలం : క్రీ. శ. 1764_1821.

ఆంధ్ర భాషకు మహోపకారం చేసిన విదేశీయుడు.

ఈయన తెలుగు దేశ చరిత్రకు సంబంధించిన కైఫీయతులలోని వృత్తాంతాలను దేశంలోని విజ్ఞానులూ సంస్కారయుతులూ అయిన వారినుంచి సేకరించి 10 వేలకు పైగా మూడు వందలు సంపుటాలుగా రూపొందించి భద్రపరిచాడు. ఈపనికి ముఖ్యంగా తోడ్పడినవారు కావలి వెంకట బొర్రయ్య _ ఆయన సోదరుడు లక్ష్మయ్య.

వ్రాతప్రతులుగా ఉన్న కైఫీయతులు_వృత్తాంతాలు మొత్తం వ్యావహారిక భాషలో ఉన్నవి. ఇవి క్రీ. శ. 1800_1812 మధ్య వ్రాయబడినవి.

ఆంగ్ల ప్రభుత్వ ప్రథమ దశలో వ్యవహార భాష అయిన తెలుగును రాజకీయ భాషగా ప్రవేశపెట్టినవాడు మెకంజీ. (వ. వా_54)

కల్పిత కల్పలత

కర్త : గణపవరపు వేంకటకవి (చూ.).

ఇది ప్రత్యేక కావ్యంకాదు. ఒక కావ్యంలోని అంతర్భాగం. చిత్ర కవితలో ఒక అపూర్వమైన కల్పన. కవివృత్త చతుష్టయంలో, ఇరవై అయిదు రకాల చిత్రకవితలు చొప్పించి ఇందులో చెప్పాడట. (అరుద్ర-11-167)

కల్యాణకౌముదీ కందర్ప నాటకము (అలభ్యం)

కవి : కృష్ణాధ్వరి.

అంకితం : రఘునాథ నాయకునికి (1600-33).

గ్రంథం తెలుగో సంస్కృతమో తెలియదు. దీన్ని గురించి భిన్నాభిప్రాయా లున్నాయి. (అరుద్ర-10-218)

కల్యాణ చంపువు (సంస్కృతం)

రచన : పావయారాధ్యులు (చూ).

ఈ కవి రచించిన అనేక గ్రంథాలలో ఇది ఒకటి. (ఆం. సం. సా.)

కల్యాణ పురంజనము

కర్త : తిరుమల బుక్కపట్టణం బుచ్చి వేంకటాచార్యులు. (చూ)

(ఆం. సం. సా.)

కల్యాణి

కర్త : చూ. విక్రాల నరసింహాచార్యులు.

ముద్రిత గ్రంథం. (ఆం. సం. సా.)

కల్యాణి గీతమంజరి

కర్త : చూ. హొసదుర్గం కృష్ణమాచార్యులు.

మంగళహారతి పాటల సంకలన గ్రంథం. ఈ కవి వైష్ణవ సాంప్రదాయ పరమైన పాటలను రాగతాళాది యుక్తంగా వ్రాశాడు. అవి బహుళప్రచారం చెందాయి. ఇప్పటికీ అనేక వైష్ణవ కుటుంబాలలోని స్త్రీలు, ఈ పాటలను పాడుతుంటారు. వైష్ణవాచార్యుల వైభవాన్ని, సంప్రదాయాన్ని చాటుతూ రచించబడిన భక్తి గేయాలివి. (ఆం. సం. సా.)

కలువాయి శతకము

కర్త : డబ్బీరు నరసకవి.

శృంగారశతకం. కలువాయి గ్రామంలోని కృష్ణుని సంబోధిస్తూ "చెలువ నీవేగి కలువాయి చిన్నికృష్ణు దోడుకొని వేగరాగదే తోయజాక్షి" అనే మకుటంతో సీస పద్యాలున్నాయి.

కలువాయి నెల్లూరు జిల్లాలోనిదట.

కవికంఠపాశము (అలభ్యం)

కర్త : తెలియదు.

లక్షణ గ్రంథం. (వా. చ.- వం. సు-196)

**కవి కంఠాభరణము (అలభ్యం)**

కర్త : తెలియదు.

లక్షణ గ్రంథం. (వా. చ; వం. సు_196)

**కవి కంఠీరవ కృష్ణమాచార్యులు**

కాలం : క్రీ. శ. 1835 ప్రాంతం.
స్థలం : జటప్రోలు సంస్థానం.
రచన : నిరోష్ఠ్యరామాయణము (సం).
బిరుదు : కవి కంఠీరవ.

సంస్కృతాంధ్ర పండితుడు. సుమారు 150 సం॥ ల పూర్వం జటప్రోలు సంస్థానంలో ఆస్థాన విద్వాంసులుగా ఉండేవారు. (ఆం. సం. సా)

**కవి కదంబము (అలభ్యం)**

కవి : (చూ) ఆసూరి మరింగంటి సింగరాచార్యులు.

కవి 11 వయేట చేసిన రచన.

**కవి కర్ణరసాయనము**

నామాంతరం : మాంధాతృ చరిత్ర.
కర్త : సంకుసాల నృసింహ కవి.
అంకితం : శ్రీరంగంలోని రంగనాథస్వామికి.

ఆరు ఆశ్వాసాల ప్రబంధం. మాంధాతృ చక్రవర్తి చరిత్ర_అతడు విమలాంగి అనే రాజ కుమార్తెను వివాహమాడటం ఇందులోని కథ.

ఈ కావ్యంలో శృంగార రసవర్ణనం వింటే యతి అయినా విటుడవుతాడనీ, వైరాగ్య వర్ణనం వింటే విటుడైనా యతి అవుతాడనీ కవి చెప్పుకొన్నాడు. తెలుగు సాహిత్యంలో దీనికొక విశిష్ట స్థానం ఉంది. కవిత్వం ప్రౌఢంగా ఉంది. (ప. వి. స_6)

**కవి కల్పకము (అలభ్యం)**

కర్త : కాకునూరి అప్పకవి.

ఇది లక్షణ గ్రంథం. (అప్పకవీయం)

**కవి గజాంకుశము**

కర్త : భైరవ కవి.
కాలం : 15 వ శతాబ్దం.

అలంకార, ఛందః శాస్త్ర గ్రంథం. 78 పద్యాలు మాత్రం లభించాయి. గణ వర్ణాదుల మేలుకీళ్ళు ఇందులో చెప్పబడ్డాయి.

ప్రత్యేకత : కొన్ని లక్షణాలను చెబుతూ కస్తూరి రంగకవి తన ఆనంద రంగరాట్ఛందంలో ఇందులోని పద్యాన్ని ఉదాహరించాడు. (క. శ_5_235)

కవిగిరి

నామాంతరం : వేంకటగిరి (చూ.).

ఇతన్ని కవిగిరి నందికేశ్వరుడు అని కొందరు పేర్కొన్నారు. అభినయ దర్పణం రచించడం వలన ఇతన్ని ప్రతి విలేఖరులు కవిగిరి నందికేశ్వరుడుగా పొరబడ్డారేమో అని కొందరి అభిప్రాయం. ఇతని నిజనామం వేంకటగిరి. (ద.దే.వా-226)

'కవి చక్రవర్తి'

కాలం : క్రీ. శ. 1199-1261 ప్రాంతం.

శాసన కర్త. కాకతి గణపతి దేవుని 'పాకాల' సంస్కృత శాసనం వ్రాశాడు.

ఇతని బిరుదమే గాని వ్యవహారనామం తెలియదు. (ప్రా. ద. దే. చ)

కవి చింతామణి

కాలం : 1480-1520.

నామాంతరం : కావ్యాను శాసనము.

కర్త : వెల్లంకి తాతంభట్టు.

ఇది లక్షణ గ్రంథం. దీనిలో పిల్లలమర్రి పినవీరన వరకు ఉన్న కవుల గ్రంథాల నుంచి ఉదాహరణ లివ్వటం జరిగింది ఇందులో భాషాలక్షణాధికారం, వర్ణ నిర్ణయాధికారం, వళిప్రాసాధికారం, దోషాధికారం అనే నాల్గధికారా లున్నాయి.

(తె. వి. స-6-674)

కవి చౌడప్ప

కాలం : క్రీ శ. 16వ శతాబ్దం.

స్థలం : పుల్లూరు.

రచనలు : 1. కవి చౌడప్ప శతకము; చౌడప్ప సీసాలు (30).

విశిష్టత : కుందవరపు వంశీయుడు. ఆత్మ సంబోధనతో పద్యాలు చెప్పాడు.

బూతు కవిగా ప్రసిద్ధుడు. మట్ల అనంతరాజు కొలువులో చౌడప్ప, ఘంటన్న అనే హాస్యగాళ్ళు ఉండేవారట. ఇతడు తంజావూరు రఘునాథ నాయకుని కూడా వర్ణించుకొన్నట్లు చెప్పాడు. "పది నీతులు పది బూతులు- పది శృంగారములు గల్గు పద్యములు సభం-జదివినవాడే అధికుడ"ని, బూతు చెప్పకపోతే సభలో దొరకు నవ్వు పుట్టదని ఈయన ఉద్దేశం. ధరణీ నాయక కోటిని తన కవిత్వ ప్రౌఢితో మెప్పించిన సరసాగ్రేసర చక్రవర్తి. ఈయన గాన విద్యా ప్రవీణుడట. ఎక్కువగా కంద పద్యాలే చెప్పాడు. రచన మనోహరంగానూ హాస్య భరితంగానూ ఉంటుంది. ఇతడు పుల్లూరిలోని గోపాలదేవుని స్తుతించడంచేత పుల్లూరు గ్రామవాసిగా కొందరు భావిస్తున్నారు.

(ఆరుద్ర-9)

కవి చౌడప్ప శతకము

కర్త : కవి చౌడప్ప.

ఆత్మ సంబోధనతో సుమారు 200 పద్యాలున్న శతకం. ఎక్కువగా కంద పద్యాలున్నాయి.

ప్రత్యేకత : ఈ శతకంలోని కొన్ని విషయాలు వాస్తవ విషయాలయినా జుగుప్స కలిగించే విధంగా ఉన్నాయి. "నీతులు-బూతులు లోకఖ్యాతులు" అని శతక కర్త అభిప్రాయం. హాస్యంతో బూతులు జోడిస్తే రాజుకు నవ్వు వస్తుందట. అందానికి రంభను, రాగానికి కాంభోజిని ఇందులో చెప్పాడు. కావ్యంలో మంచి భౌతికవాదముంది. ప్రజలు బాగా తినాలని, తినిపించాలని, సుఖంగా ఉండాలని, ఇయ్యలేని వాళ్ళు కనీసం ఇప్పించగలగాలని ఈ శతకం చెబుతున్నది. ఎవరైనా కవులకు ఇవ్వకపోతే వారిని బాగా తిట్టవచ్చునని కవి చెప్పాడు. కవి జీవితానుభవమున్నవాడు. పద్యాలలోని భావం సూటిగా ఉంటుంది. తన కందాలు తిక్కన్న కందాలను మించినవని ఆత్మ విశ్వాసంతో చెప్పుకొన్నాడు. (ఆరుద్ర-11)

### కవి చౌడప్ప సీసాలు

కర్త : కవి చౌడప్ప.

ప్రత్యేకత : ఇది ఒక నిఘంటువని పండితాభిప్రాయం. "చౌడప్ప సీసాలు" అనే పేరుతో ఒక శుద్ధాంధ్ర నిఘంటువులో 30 పద్యాలు దొరికాయి. వీటిని శతక కర్త చౌడప్ప చెప్పాడో మరే చౌడప్ప అయినా చెప్పాడేమోనని పండితుల మధ్య భేదాభిప్రాయాలున్నాయి. ఈ సీసాల వ్రాత ప్రతి చివర "చౌడప్ప సీసములు సంపూర్ణముగా క్రొత్తపల్లి లక్ష్మయ్య వ్రాసెను" అని ఉందట. పద్యాలు గ్రామీణులకు ఆనందం కలగ జేస్తాయి గాని, పండిత జన పఠన యోగ్యం కావని కొందరు అంటారు. రచన మనోహరంగా ఉంది. (ఆరుద్ర-11)

### కవిజన మనోహరము

కర్త : కరాలపాటి రంగయ్య.

పద్యకావ్యం. శైలి చక్కనిది. (వీరేశలింగం పంతులు-సమగ్రపరిశీలన)

### కవి జనరంజనము

నామాంతరం : చంద్రమతీ పరిణయము.

కర్త : అడిదం సూరకవి.

తొలి ముద్రణ : 1889.

ఇది మూడాశ్వాసాల ప్రబంధం. మొత్తం 280 పద్యాలే ఉన్నాయి. దీనికి పిల్లపసుచరిత్ర అనే ప్రసిద్ధి వచ్చింది. అవతారిక లేదు. కొన్ని ప్రతులలో వేరే పద్యాలు చేర్చబడ్డాయి. ఇందులో హరిశ్చంద్రుడు చంద్రమతిని పెళ్ళి చేసుకోవడం వర్ణితం. కొన్ని సంభాషణలు సంస్కృతంలో ఉన్నాయి, రచన మనోహరంగా ఉంది. (ఆరుద్ర-12)

### కవిజన సంజీవని

రచనాకాలం : క్రీ. శ. 1580-1650.

నామాంతరాలు : 1. కవి లోకసంజీవని 2. కవి సంజీవని 3. కవిజీవ సంజీవని.
కర్త : ముద్దరాజు రామన.

ప్రత్యేకత : ఇది చాలా ప్రామాణికమైన లక్షణ గ్రంథం. ఇందులో యతి పద్ధతి, విభక్తి పద్ధతి, సమాస పద్ధతి, సంధి పద్ధతి అని నాలుగు తరంగాలున్నాయి. దీనిలో ప్రథమశ్రేణి తెలుగు గ్రంథాలనుండి ప్రయోగాలు ఉదహరింపబడ్డాయి. అనంతర లాక్షణికులయిన అప్పకవి, అహోబల పండితుడు, చిత్రకవి అనంతకవి, కూచిమంచి తిమ్మన, అడిదం సూరకవి, లింగమగుంట తిమ్మన దీనిలోని ప్రయోగాలను గ్రహించి ఉదాహరించారు. లభించిన అన్ని తరంగాలూ అసమగ్రం. సమగ్రప్రతి దొరకలేదు. 1930లో వావిళ్ళవారు దీన్ని అచ్చువేశారు. (తె. వి. స. 6-675; ఆరుద్ర-9-205)

## కవి జనాశ్రయము

కర్త : మల్లియరేచన.

తెలుగులో మొదటి ఛందో లక్షణ గ్రంథం. కన్నడ భాషలోవి "ఛందోంబుధి" అనే గ్రంథం ఈ రచనకు ప్రేరేపకమని తెలుస్తున్నది.

ప్రత్యేకత : దేశి కవితకు సంబంధించిన "ప్రగీతి" ని రేచన ఈ గ్రంథంలో చెప్పాడు కాబట్టి "దేశికవిత"ను మొదట ప్రస్తావించిన నన్నెచోడుని సమకాలికుడు కావచ్చు.

ద్రావిడ భాషలో యాప్పిరుంగలమ్‌కారిక్కై అనే ఛందో గ్రంథంలో రేచన ఛందం ఉదాహృతం. (ఆరుద్ర-2)

## కవి జనోజ్జీవిని

కర్త : రాయ రఘునాథ రాజు (చూ).

సమస్యా పూరణ గ్రంథం. ఒకే ఆశ్వాసం. దుష్కరమైన ఈ సమస్యలు తన ఆస్థాన కవి వెంకన్న ఇవ్వగా తాను పూరించినట్లు కర్త చెప్పుకొన్నాడు. మొత్తం నూరు ఉన్నాయి. బృహదంబికా ప్రార్థనతో గ్రంథం ఆరంభించబడింది.

అక్షర వంచన, యతి వంచన, కఠిన ప్రాస, అంతర్లాపి, వృత్త గోపనం, పాద పూరణం మొదలైన అనేక సమస్యలు చతురంగా పూరించబడ్డాయి. కర్త పుదుక్కోటను పాలించిన రాజు. (ద. దే. వా. 421)

## కవి జీవ సంజీవని

నామాంతరం : కవిజన సంజీవని.

కర్త : ముద్ద రాజు రామన.

## కవితార్కికసింహ మంచాలకట్ట గోవిందాచార్యులు

స్థలం : మంచాలకట్ట గ్రామం (జటప్రోలు సంస్థానం).
బిరుదం : కవి తార్కిక సింహ.

రచనలు : తెలియరాలేదు.

వీరు తర్క, వ్యాకరణ, వేదాంత, మీమాంసా శాస్త్ర పారంగతులు. నెల్లూరు సంస్కృత కళాశాలలో ఉపాధ్యాయులుగా పని చేశారు. జటప్రోలు సంస్థానాధి పతుల చేత గౌరవ సత్కారాలు పొందారు. (ఆం. సం. సా.)

కవితా లక్షణ సారచ్ఛందస్సు

కర్త : ఓరుగంటి రామకవి.

ఇది ఒక లక్షణ గ్రంథం. ఇందులో ఉదాహరణాది భేదాల గురించి విపులంగా చెప్పబడింది. ఇవి మరి ఏ యితర లక్షణ గ్రంథాల్లోనూ చెప్పబడలేదు. (కవి జనాశ్రయం పీఠిక-వావిళ్ళ)

కవిత్రయము

కాలం : క్రీ. శ. 11-13 శ. నడిమి కాలం.

సంస్కృత వ్యాసభారతాన్ని ఆంధ్రీకరించిన ముగ్గురు కవులకు కవిత్రయమని పేరు.

| కవి పేరు | కాలం | బిరుదులు |
|---|---|---|
| 1. నన్నయభట్టు | క్రీ. శ. 1023-1063 | ఆదికవి, వాగనుశాసనుడు |
| 2. తిక్కన | క్రీ. శ. 1210-1290 | ఉభయ కవి మిత్రుడు, కవిబ్రహ్మ |
| 3. ఎర్రాప్రెగ్గడ | క్రీ శ 14 శతాబ్ది పూర్వార్థం | శంభుదాసు-ప్రబంధ పరమేశ్వరుడు |

(పూర్తి వివరాలకు చూడు : 1. నన్నయభట్టు 2. తిక్కన 3. ఎర్రాప్రెగ్గడ)

కవిదర్పణచ్ఛందము

కర్త : పక్కి వేంకట నరసయ్య.

రచనాకాలం : క్రీ. శ. 1830 ప్రాంతం కావచ్చును.

లక్షణ గ్రంథం.

కవి పండడు

నామాంతరం : దేసటి పండడు (చూ).

కవిఘాటి బలభద్రకవి

స్థలం : మధుర మండలం.

కాలం : 18వ శతాబ్దం.

రచన : గజారణ్య సంహిత.

నామాంతరాలు : జంబుకేశ్వరమాహాత్మ్యము, గజారణ్య క్షేత్రమాహాత్మ్యము.

రామకవీంద్రుని కుమారుడు. ఇతని గ్రంథం పూర్తిగా లభించలేదు. (ద. దే. వా-401)

కవి భల్లటుడు

కాలం : క్రీ. శ. 1360-1380 ప్రాంతం.

స్థలం : రాయచూరు మండలం.

రచనలు : 1. గణమంజరి 2. పదమంజరి 3. విక్రమార్క చరిత్ర 4. శూద్రక రాజచరిత్రము 5. బేతాళ పంచవింశతి 6. కవిభల్లట ఫక్కిక. అన్నీ అలభ్య గ్రంథాలే.

ఇతని కొన్ని శ్లోకాలను, పద్యాలను లాక్షణికులు ఉదాహరించారు. మొదటి రెంటిలోని శ్లోకాలను కందుకూరి వీరేశలింగం, కస్తూరి రంగకవి ఉదహరించారు. ఇవి సంస్కృత గ్రంథాలు కావచ్చు. బేతాళ పంచవింశతి నుంచి, శూద్రకరాజ చరిత్ర నుంచి, కవి భల్లట ఫక్కిక నుంచి అప్పకవి కొన్ని పద్యాలు ఉదాహరించాడు.

ఈ కవి రంగనాథ రామాయణకర్త గోన బుద్ధారెడ్డిచేత సత్కారాలు పొందాడట. భల్లటనామం ఆంధ్రులలో ప్రసిద్ధం కాకపోవడం చేత ఇది కవి బిరుదనామం కావచ్చునని కొందరు భావిస్తున్నారు. ఇతని కాలాన్ని గురించీ, స్థలాన్ని గురించీ భిన్నాభిప్రాయా లున్నాయి. (ఆరుద్ర-4)

### కవిభల్లట ఫక్కిక (అలభ్యం)

కర్త : చూ. కవి భల్లటుడు.

అప్పకవి దీనినుంచి కొన్ని పద్యాలు ఉదాహరించాడు. ఇది వ్యాకరణ గ్రంథమట. (ఆరుద్ర-4)

### కవి మల్లుడు

నామాంతరం : శాకల్య మల్లుడు (మల్లయార్యుడు)

### కవి మూషిక మార్జాలము (అలభ్యం)

కర్త : తెలియదు.

లక్షణగ్రంథం. అనంతర లక్షణ కవులు దీనిని పేర్కొన్నారు. (వా. చ. వం. సు. 196)

### కవి మూషిక మార్జాలము

కర్త : చూ. పట్టాభి రామకవి.

నరసరావుపేట సంస్థానానికి చెందిన పట్టాభిరామకవి రచనేలలో ఒకటి. వివరాలు తెలియవు. (ఆం. సం. సా-194)

### కవి రాక్షస చ్ఛందము (అలభ్యం)

కర్త : కవిరాక్షసుడు.

కాలం : క్రీ. శ. 1380 ప్రాంతం.

నామాంతరం : కవిరాక్షసీయము.

ఇది లక్షణగ్రంథం. రెండు పద్యాలు మాత్రమే లభ్యాలు. (కవి జనాశ్రయం పీఠిక-వావిళ్ళ)

### కవి రాక్షసుడు

కాలం : 14 వ శతాబ్దం.

స్థలం : గోదావరీ మండలంలోని ద్రాక్షారామం.
రచనలు : 1. కవి రాక్షసచ్ఛందము 2 ఆది నారాయణ చరిత్రము 3. షడర్థ నిర్ణయమ్ (సం) 4. కవి రాక్షసీయమ్ (సం) 5. దేవకీనందన శతకము (వివాదగ్రస్తం).

లాక్షణిక కవి. ఇతడే వేములవాడ భీమకవి అని కొందరు అభిప్రాయపడ్డారు కాని అది నిరాధారం. ఇతని నిజనామం ఏమై ఉంటుందో తెలియరాలేదు. అప్పకవి కవిరాక్షసుని లక్షణ గ్రంథాన్ని, కస్తూరి రంగకవి కవి రాక్షసీయాన్ని పేర్కొన్నారు. గౌరన ఇతని శ్లోకాలు ఉదాహరించాడు. దేవకీ నందన శతకం ఇతనిది కాదని పరిశీలకులంటున్నారు. (క. స-31)

## కవి రాక్షసీయమ్ (సం)

కర్త : కవిరాక్షసుడు.

అలభ్యం. నూరు శ్లోకాల గ్రంథమట. ఈ కవి ఇదే పేరుతో తెలుగులో కూడా ఒక గ్రంథం రచించినట్లు తెలుస్తున్నది. అందులోని పద్యాలు ఆనంద రంగరాట్ఛందంలో ఉదాహృతాలు. (క. స-31)

## కవి రాక్షసీయము

నామాంతరం : కవి రాక్షసచ్ఛందము (అలభ్యం).
కర్త : కవి రాక్షసుడు.

ఇందులోని పద్యాలు ఆనంద రంగరాట్ఛందంలో ఉదాహృతాలు. కవి రాక్షసుడు ఒక లక్షణ గ్రంథాన్ని రచించినట్లు అప్పకవి చెప్పాడు. ఆ గ్రంథం ఇదే కావచ్చును. ఇదే గ్రంథాన్ని ఈ కవి నూరు శ్లోకాలలో సంస్కృతంలో కూడా వ్రాశాడట. (తె. వి. స-6; క. స-31)

## కవి రాజ మనోరంజనము

నామాంతరం : పురూరవ చరిత్ర.
కర్త : కనుపర్తి అబ్బయామాత్యుడు.

ఇది చక్కని ప్రబంధం. రచన రామరాజ భూషణుని వసుచరిత్రను తలపిస్తుంది. దీనిని పిల్ల వసుచరిత్ర అని పండితులంటారు. షట్చక్రవర్తులలో ఒకడైన పురూరవుని చరిత్ర ఈ కావ్యేతి వృత్తం. (తె. వి. స-6)

## కవి రాజు

స్థలం : గంజాం గ్రామం.
రచన : మృగయా చంపువు (సం).

కవి రాజు అనేది బిరుదనామం కావచ్చు. (తె. వి. ప-6-244)

## కవి లోక చింతామణి

నామాంతరాలు : కావ్యాను శాసనము, కావ్య చింతామణి.

కర్త : వెల్లంకి తాతంభట్టు.
కాలం : క్రీ. శ. 15 వ శతాబ్ది-ఉత్తరార్థం.

లక్షణ గ్రంథం. చాల మంది లాక్షణికులు దీనిని ఉదాహరించారు. ఇందులో భాషానిర్ణయం, వర్ణనిర్ణయం, యతిప్రాస భేదాలు, దోషాధికారం ఉన్నాయి. ప్రధానంగా ఇది వ్యాకరణ గ్రంథం.

## కవిలోక సంజీవని

నామాంతరం : కవిజన సంజీవని. (చూ )
కర్త : ముద్దరాజు రామన.

## కవి వాగ్బంధనము

నామాంతరం : కవి సార్వభౌమచ్ఛందస్సు.
కాలం : క్రీ. శ. 1260 ప్రాంతం.
కర్త : తిక్కన సోమయాజి.

ఇది లక్షణ గ్రంథం. అముద్రితం. ప్రతి సమగ్రంగా లభ్యమవుతున్నది. తంజావూరి పుస్తక భాండాగారంలో ఈ పుస్తక క్రమసంఖ్య 703. "ఇదే కవి సార్వభౌమచ్ఛందస్సు సంఖ్య 1289 సమగ్రం" అని ప్రాచ్యలిఖిత పుస్తకశాలలో ఉంది.

కర్తృత్వం వివాదాస్పదం. ఈ ప్రతిలో చివరన ఉన్న పద్యం వల్ల దీన్ని తిక్కన రచించాడని తెలుస్తున్నది. ఈ పద్యాన్ని లింగమకుంట తిమ్మకవి ఉదహరించాడు. (కవి జనాశ్రయం పీఠిక-వావిళ్ళ)

## కవి శిరోభూషణమ్ (సం)

నామాంతరం : అహోబల పండితీయము.
కర్త : అహోబలపతి.

ఇది ఆంధ్ర శబ్ద చింతామణికి సంస్కృత వ్యాఖ్య. కవి ఈ వ్యాఖ్యలో, వాల్మీకి, నన్నయ ఏకమై తన రూపంలో పుట్టారని చెప్పుకొన్నాడు. గ్రంథాంత గద్యలో తాను "అభినవ నన్నయ భట్టాచార్యుడన"ని చెప్పుకొన్నాడు. ఈ గ్రంథంలో కవి అప్ప కవిని ఉదాహరించాడు. అహోబల పండితుడు రచించడం వల్ల ఇది అహోబల పండితీయంగా ప్రఖ్యాతి పొందింది.

ఆంధ్ర శబ్ద చింతామణికి అహోబలపతి వ్యాఖ్య వ్రాసినట్లే, ఎలకూచి బాల సరస్వతి కూడా దీనికి "బాలసరస్వతీయము" అనే వ్యాఖ్య వ్రాశాడు. (తె.వి.స-6-547)

## కవి సంజీవని

నామాంతరం : కవిజన సంజీవని. (చూ )
కర్త : ముద్దరాజు రామన.

## కవి సంశయ విచ్ఛేదము

కర్త : అడిదం సూరకవి.

కాలం : క్రీ. శ. 18-19 శతాబ్దాలు.

వ్యాకరణ విషయ ప్రధానంగా వ్రాసిన గ్రంథము. మూడు తరంగాలు ఉన్నాయి. ప్రథమ తృతీయ తరంగాలలో శబ్ద లక్షణ విశేషాలు, పూర్వ కవుల ప్రయోగాలు ఉదాహరణలతో చెప్పబడ్డాయి.

తృతీయ తరంగంలో తద్భవ రూపాలు చూపబడ్డాయి. అప్పకవీయంలో చూపని ఎన్నో వ్యాకరణ విశేషాలీ గ్రంథంలో ఉన్నాయి. తిమ్మావఝ్ఝల కోదండ రామయ్య దీన్ని పరిష్కరించారు. (తె. వి. స-4-1144)

కవి సర్పగారుడము

కర్త : ఎఱ్ఱాప్రెగ్గడ.

ఇది ఛందో గ్రంథం. కస్తూరి రంగకవి తాను రచించిన ఆనంద రంగ రాట్ఛందంలో కవిసర్పగారుడంలోని కొన్ని పద్యాలు ఉదాహరించడంవల్ల ఈ గ్రంథం ఎఱ్ఱాప్రెగ్గడ రచించినట్లు తెలుస్తున్నది.

బసవన కవి, పట్టాభి రామకవి కూడా కవి సర్పగారుడం పేరుతో ఛందో గ్రంథాలు వ్రాశారు. ఈ గ్రంథ కర్త యైన ఎఱ్ఱాప్రెగ్గడ కవిత్రయంలోని వాడో, భిన్నుడో నిర్ధారణ కాలేదు. (ఆం. ప్ర. య. భూ.)

కవి సర్పగారుడము

కర్త : కాచన బసవన (కాచిరాజు బసవన్న)
కాలం : క్రీ. శ. 1480-1530.
అంకితం : శ్రీ గిరి మల్లికార్జునునికి.

ఇది ప్రసిద్ధ ఛందో గ్రంథం. చాల వరకు లభ్యం. అముద్రితం. దీని ప్రతులు ఆంధ్ర సాహిత్య పరిషత్తులోనూ, ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారంలోనూ ఉన్నాయి. ఇందులో ఇతర గ్రంథాలలోని పద్యాలు అనేకం చేరి ఉన్నాయట. లాక్షణికులు దీన్ని ఉదాహరించారు. ఇందులోని పద్యాలు శబ్ద రత్నాకరంలో ఉదాహృతాలు. (కవి జనాశ్రయం పీఠిక-వావిళ్ళ)

కవి సర్పగారుడము

కర్త : చూ. పట్టాభి రామకవి.
కాలం : 17 వ శతాబ్దం.

ఛందో గ్రంథం. కవి నరసరావుపేట సంస్థానానికి చెందిన వాడు. (ఆం. వ సా-194)

కవి సార్వభౌమచ్ఛందస్సు

నామాంతరం : కవి వాగ్బంధనము (చూ).
కర్త : తిక్కన సోమయాజి.

కవి సింగరన్న

కాలం : క్రీ. శ. 17 వ శతాబ్దం.

రచనలు : త్రైశంకవోపాఖ్యానము (అలభ్యం).

ఇతడు 1600 ప్రాంతం వాడుగాని 1656 కు పూర్వుడుగాని కావచ్చును. అప్ప కవి ఇతన్ని పేర్కొన్నాడు. (క త-12-150)

కవీశ్వర గిరియప్ప కవి

కాలం : క్రీ. శ. 1827-1895.

స్థలం : మైసూరు.

రచనలు : 1. బాలికా గీత ముక్తా కలాపము 2. చామరాజేంద్ర చతుర్వింశతి.

బిరుదు : కవీశ్వర.

తండ్రి సూరప, తల్లి సుబ్బమ్మ. పుట్టుకతో కవి. కథలు అల్లేవాడట. ఆశు కవి. ఆయా సందర్భాలలో చెప్పిన కవితలు ఖిలమైనవి. మూడవ కృష్ణరాయ వొడయరు, చామరాజేంద్ర వొడయరుల ఆస్థానంలో ఉండినవాడు. భరతశాస్త్ర ప్రవీణుడు. (ద. దే. వా. 480)

కవుల షష్ఠము

కర్తలు : నంది మల్లయ్య-ఘంట సింగయ్యలు.

చూ. భాగవతము (షష్ఠస్కంధం).

కసది సూరమదేవి శాసనము

శాసనప్రదాయిని : కసది సూరమదేవి.

కాలం : క్రీ. శ. 1209.

ప్రస్తావిత వ్యక్తి : కోట కేతరాజు.

శాసన ప్రదేశం : గుంటూరు జిల్లా-అమరావతి.

శాసన విషయం : సూరమదేవి అమరావతినేలిన కోట కేతరాజుకు భోగ స్త్రీ యని, తన తల్లి అమరసానికి ధర్మార్థంగా-అమరావతిలో వేంచేసియున్న అమరేశ్వర స్వామికి అఖండదీపం నిలిపిందనీ శాసనం వల్ల తెలుస్తుంది. దీనిలో ఒక చంపకమాల చివరఅసంపూర్తిగా కొంత గద్య ఉన్నది. (తె. శ. చ-315)

కసవయామాత్యుడు

కాలం : 1560 కి పూర్వం.

సాహిత్యపోషకుడు. కృతిపతి. గంగరాజు చౌడయ్యను ప్రోత్సహించి అతని చేత సాముద్రిక శాస్త్రాన్ని పద్యకావ్యంగా వ్రాయించాడు. ఆ గ్రంథం ఇతనికే అంకితం. (క. వ 71)

కసవరాజు రామకృష్ణరాజు

కాలం : క్రీ. శ. 19 వ శతాబ్దం-పూర్వార్థం.

స్థలం : కార్వేటినగర సంస్థానం.

కవి పండిత పోషకుడు. ఇతడు క్రీ. శ. 1810 ప్రాంతంలో ఈ సంస్థానా

మాత్యుడుగా ఉండేవాడు. పాలముంగలం అప్పయ కవిని ఈతడు ఆదరించాడట. ఈ కృష్ణమరాజు కృతులు గాని, కృతి పొందిన గ్రంథాల వివరాలుగాని తెలియవు.

(ఆం. సం. సా.)

కసింకోట

ఇది చికాకోలు సర్కారులోని ఫౌజుదారీ విభాగం. క్రీ.శ. 1802 లో విజయ నగర సంస్థానాధీశులు ఈ సంస్థానాన్ని ఖరీదు చేశారు. మేకపాక, గుంటావారిపాలెం మొదలైనవి తరువాతి కాలంలో ఈ సంస్థానంలో కలిశాయి. క్రీ.శ. 1804 లో వెంకటా చల పంతులు వీటిని ఖరీదు చేశారు.

ఈ సంస్థానం చిన్నదైనా, పాలకులు శక్తి కొలది సాహిత్యపోషణ చేసిన వారే. గండు సోమనాథశాస్త్రి, కోపల్లి వేంకటరామ సిద్ధాంతి, తుమురాడ సంగమేశ్వర శాస్త్రి మొ॥వారు కసింకోట సంస్థానంలోని ప్రసిద్ధ కవి పండితులు. భీమ విక్రమ వ్యాయోగం మొ॥ వి. ఈ సంస్థానం నుండి వెలువడ్డ రచనలు. (ఆం. సం. సా-523)

కరిస్తూ రంగకవి

కాలం : క్రీ. శ. 1740-60 ప్రాంతం.

స్థలం : దక్షిణదేశం, చెన్నపురి, తిరుచినాపల్లి ప్రాంతాలు.

రచనలు : 1. అనందరంగ రాట్ ఛందస్సు (లక్షణ చూడామణి).

2. సాంబనిఘంటువు.

3. కృష్ణార్జున చరిత్రము.

4. పద్మనాయక చరిత్రము.

కామాక్షమ్మ, వేంకట కృష్ణయామాత్యుల పుత్రుడు. ప్రసూఖలాక్షణికుడు. సంస్కృతాంధ్ర భాషా కోవిదుడు. ఇతడు తిరుచినాపల్లిలో ఫ్రెంచివారి వద్దగల చిన్న సేనాధికారిగా ఉండేవాడట. అనందరంగపిళ్ళై ఆస్థానకవి. అనందరంగపిళ్ళై పుదుచ్చేరిలో ఫ్రెంచి గవర్నర్ డూప్లేకు దుబాసిగా ఉండేవాడు. అతని దినచర్యా గ్రంథంనుండి కవిని గురించి తెలుస్తున్నది. ఇతని కవిత మనోహరమై సుబోధకంగా ఉంటుంది.

(వ. దే. వా. 251)

కరిస్తూ రంగప్ప

కాలం : క్రీ. శ. 18 వ శతాబ్దం - మధ్యకాలం.

ఈ కవి వేంకటగిరి సంస్థానాన్ని (క్రీ. శ. 1755-1777) పాలించిన వెలు గోటి బంగారు యాచమనాయనికి ఆశ్రితు. ఆ ప్రభువుపైన "పంచరత్నాలను" శృంగార రసయుక్తంగా చెప్పాడట. ఇతడే తరువాతి పాలకుడైన వెలుగోటి కుమారయా చేంద్రుని (క్రీ. శ. 1777-1804) పైన కూడా నవరత్నాలను చెప్పినట్లు "వెలుగోటి వారి వంశావళి" పేర్కొన్నది.

రంగరాట్ఛంద కర్త, ఈ కస్తూరి రంగప్ప ఒకరో, కాదో తెలియదు.

(ఆం. సం. సా-4-57)

కస్తూరి రంగ శతకము

కర్త : రాయభట్టు వీరరాఘవ కవి.
కాలం : 18 వ శతాబ్దానికి ముందు.

సీస పద్య శతకం.

"రాత్రి చరవైరి కస్తూరి రంగశౌరి" అనే మకుటంతో ఒకప్రతి ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారంలో ఉన్నదట. ఈ శతకం వీరరాఘవ కవిదే కావచ్చు.
(క. స_225; శ. క. చ; వం. సు_361)

కస్తూరి వారు

సుగంధ ద్రవ్యమైన ఈ కస్తూరినే ఇంటి పేరుగా పెట్టుకొన్న కొన్ని కుటుంబాల వారు తెలుగు దేశంలో ఉన్నారు. ఆనంద రంగ రాట్ఛందం కృతికర్త రంగకవి ఇంటి పేరు కస్తూరి.

కస్తూరి వారి వలెనే కర్పూరం వారు కూడా ఇంటి పేరుతో ఉన్నారు.
(భారతి_మా_45_230)

కళాకారిణులకు దానాలు

కాలం : కొండవీటి రెడ్డిరాజులు (13, 14 శతాబ్దాలు).

"ధర్మవేమన"గా ప్రసిద్ధి పొందిన అనవేమారెడ్డి సంగీత, సాహిత్య నాట్య శాస్త్రాలలో ప్రవీణలయిన కంచి, పొన్ని, పేరి మొ॥ కళాకారిణులను సన్మానించటమేగాక పేరి అనే నర్తకికి గుంటూరు జిల్లాలోని "పేరుకలపూడి" గ్రామాన్ని దానం చేశాడు.

కంచి అనే దేవదాసికి (నాట్యకత్తె) "కంచికచర్ల" అనే గ్రామాన్ని బహూకరించాడు.

పొన్ని అనే కళాకారిణికి "పొన్నవరం" అనే గ్రామాన్ని దానం చేసి, ఆమె జీవిత పర్యంతమేగాక, వంశపారం పర్యంగా అనుభవించటానికి హక్కు కలిగించాడు.
(నా. ర. చ_70)

కళాకారులకు ఇల్లూవాకిళ్ళ దానశాసనాలు

కాలం : కాకతీయులకాలం (12, 13 శతాబ్దాలు).

దేవాలయ కైంకర్యం చేసే నర్తకీమణులకు, మృదంగ విద్వాంసులకు, గాయకులకు రాజులు గృహదానాలు చేసినట్లు పిల్లలమర్రి శాసనంలో ఉంది.

పానుగల్లు శాసనంలో మైలాంబ అనే ఆమె గాయకులకు, నర్తకీమణులకు గృహదానాలు చేసినట్లు తెలుస్తున్నది.

ధర్మసాగర శాసనంలో "జలజ కరండ" మనే అపూర్వమైన వాద్య ప్రశంస ఉంది. పదిమంది కరండ వాద్య కారులకు, కొందరు నాట్యకత్తెలకు కొన్ని నివర్తనాల భూమిని ఇచ్చినట్లు ఉంది.

చేబ్రోలు శాసనం ఒక దానిలో గణపతి దేవుడు, జాయప సేనాని పదహారు మంది ఆటకత్తెలకు గృహదానాలు చేసినట్లుంది. (నా. ర. చ_53)

## కళాకారులకు మాన్యాలు-సమ్మానాలు

కాలం : కాకతీయులు (12, 13 శతాబ్దాలు).

గుంటూరు జిల్లా మంగళగిరి తాలూకాలోని మందారం గ్రామం (మందడం) దానమిచ్చినట్లు చేప్పే మల్కాపురం శాసనంలో విశ్వేశ్వర శివాచార్యుని గోళకీమఠ విద్యాస్థానానికి, పది మంది నర్తకులకు, ఎనిమిదిమంది మార్దంగికులకు, కాశ్మీరు గాయకునికి, పద్నాలుగురు గాయనీమణులకు, కరదా వాద్యంలో ఆరితేరిన ఆరుగురు కళాకారులకు-వృత్తిమాన్యాలిచ్చి నాట్య సంగీతాదులకు పోషణ కల్పించినట్లుంది. (నా. ర. చ-53)

## కళాధరోపాఖ్యానము

కర్త : ముడియం వేంకటరమణ కవి.

అంకితం : దత్తాత్రేయ స్వామికి.

ఈ కావ్యంలో నాటకచ్ఛాయలున్నాయి. దీన్ని అతి విచిత్రమైన కథా కావ్యంగా రచించాలని కవి ఉద్దేశించాడు.

ప్రత్యేకత : ఈ కావ్యంలో కళాధరుడు నాయకుడు. అతడు శ్వేతద్వీపంలో పుట్టాడు. సాక్షాత్తు శ్రీ మహా విష్ణువు కంట జన్మించాడు. ఈ కళాధరుని చరిత్రను నాటకచ్ఛాయలలో వచ్చేటట్లు ఒక విష్కంభంగా కవి వ్రాశాడని దీన్ని పరిశోధించిన పండితులు చెప్పారు. ఈ కావ్యం అముద్రితం. (అరుద్ర-9-260)

## కళానిధి

దామెర్ల వెంకళ భూపాలుడు వ్రాసిన బహుళాశ్వ చరిత్రలోని ఒక పాత్ర.

ఇది నిగమశర్మ, విరంకుశులను బోలిన పతితుని గాథ. వేశ్యావ్యామోహంలో పడి అంతా పోగొట్టుకొని, చివరకు దైవకృపవల్ల భోగవైభవాలను తిరిగి పొందిన వైశ్యకుమారుడు కళానిధి.

ఇతని కథను శుకయోగి పరీక్షిత్తుకు చెప్పినట్లు దామెర్ల వెంగళ భూపాలుడు చెప్పాడు. (అరుద్ర-11-50)

## కళానిధి (సం)

కర్త : చతుర కల్లినాథుడు.

ఇది సంస్కృత సంగీత రత్నాకరానికి వ్యాఖ్య. (నా. ర. చ-85)

## కళాపూర్ణుడు

ఈయన పింగళి సూరన్న కళాపూర్ణోదయ కావ్యంలో నాయకుడు. ఈయన ప్రణయాన్ని కవి ప్రబంధోచిత మర్యాదలతో చాలా దీర్ఘంగా, పురాణ పురుషుల కవసరమైన భార్యాద్వయంతో వర్ణించాడు.

కళాపూర్ణుని ప్రణయ ఘట్టమంతా శాప్రపు మూసలో పోతపోయబడింది. ఈ ఘట్టంలో ప్రత్యేకత లేదు. కళాపూర్ణుని (మణికంధరుడు) వెనకటి జన్మప్రణయాన్నే కవి

ఉదాత్తంగా అపూర్వంగా చిత్రించాడు. కలభాషిణీ, మణికంధరుల ముగ్ధప్రణయం - నారద మహర్షికి భయపడి వారు తమ ప్రేమను గుప్తంగా ఉంచుకోవడం సుమనోజ్ఞంగా చిత్రించాడు. మణికంధరుడు కవీ, గాయకుడూ-తర్వాతి జన్మలో ఈ మణికంధరుడే కళాపూర్ణుడు. బ్రహ్మ, సరస్వతీ దేవి ప్రతిబింబాన్నే కళాపూర్ణుడుగా చెప్పాడు. కాబట్టి సమస్త కళలకూ ప్రతీకగా, శాస్త్ర కళా దృష్టుల సంయోగంగా రూపొందిన పాత్ర ఇది.

నాయక పాత్రను ప్రబంధోచితంగా తీర్చి దిద్దడంలో నాటి దక్షిణ నాయక లక్షణాలను, ధీరోదాత్త లక్షణాలను కవి ఇతనిలో సమన్వయం చేశాడు. అభినవ కౌముదికి కానుకగా మృగేంద్ర వాహన ఆలయంలో దాచిన వీణనూ, మధురలాలసకు కానుకగా రతనాల అందెలనూ బహూకరించడం నాటి ప్రబంధ నాయకులకు తగినది గానే ఉంది. కళాపూర్ణుడు అత్యుత్తమ కళా ఖండానికి ప్రతీక కాగా మధురలాలస ఆ కళా ఖండం పట్ల వ్యక్తమయ్యే ప్రీతి.

అభినవ కౌముది ఆ కళా ఖండంలో కనిపించే వెన్నెలవంటి ఆహ్లాద లక్షణం అని విమర్శకులు అంటున్నారు. (కళాపూర్ణోదయం-మున్నుడి-మ. కో.రె)

## కళాపూర్ణోదయము

కర్త : పింగళి సూరన్న.

రచనా కాలం : 1560 ప్రాంతము.

కృతిభర్త : నంద్యాల కృష్ణమరాజు.

సమకాలికులు : గోలకొండ పాలకుడు ఇబ్రహీం కుతుబ్‌శాహి; ఇంగ్లండు దేశంలోని షేక్‌స్పియర్ (1546-1616).

ఎనిమిది ఆశ్వాసాల ప్రబంధం.

ఇది తెలుగు సారస్వతంలో అపూర్వమేగాక అద్వితీయమైన కావ్యం. సూరన్న రచించిన గ్రంథాలన్నింటిలో ఇది ఉత్తమోత్తమం. భారత, మనుచరిత్రాది గ్రంథాలవలె ఇది పరివర్తనం కాని, ప్రాచీన కథా మూలకం కాని కాదు. సూరన్న స్వశక్తితో సృష్టించిన అపూర్వమైన కావ్య రత్నం. భావనా శక్తి, సందర్భ శుద్ధి, పాత్రోచిత పద్యరచన దీనిలో పరాకాష్ఠనందుకున్నాయి. ఇతి వృత్తం విషయంలోనే కాక కథా ప్రారంభం, కథన పద్ధతి, కథా నాయికా పాత్ర చిత్రణ, పాత్రల పేర్లు - చిత్రణ, రసపోషణ-ఇత్యాదులన్నీ ఈ కావ్యంలో, నూతన రీతులలో ప్రవేశపెట్టాడు కవి.

సూరన్న కృత్యాదిలో చెప్పిన ప్రతిజ్ఞ ననుసరించే ఈ కావ్యాన్ని వ్రాశాడు. అపూర్వ కథాసంవిధానానికి పూనుకోవటం వల్ల ఉపజ్ఞకు, కవి భావనా శక్తికి, ఇందులో మంచి ప్రవేశం దొరికింది.

సాధారణంగా అన్ని ప్రబంధాలలోనూ శృంగార, వీర రసాలు తప్ప తక్కిన రసాలు మృగ్యాలు. దీనిలో కవి అన్ని రసాలకు 'చోటు' చూపిస్తూ విశాలమైన కథను కల్పించాడు.

కవికి ప్రబంధ కవులకున్న వర్ణనాశక్తికి తోడు కథా కల్పనా శక్తి, వివిధ సందర్భాలను సంధానం చేసే ప్రతిభ, భావనా శక్తితో సమానమైన భాషా పాటవం, పుష్కలంగా ఉండటం చేత కావ్యం సర్వాంగ సుందరంగా భాసిస్తున్నది. విషయాన్ని బట్టి చూస్తే "కళా పూర్ణోదయం" సాటిలేనిది. దీనిలోని శైలి ప్రబంధ సంబంధి. శ్లేష, అంత్య ప్రాస, యమకము, భాషాద్వయానులోమ విలోమ శ్లేష, చిత్రకవితలు తరచు ప్రయుక్తం. అక్కడక్కడ రగడలు, దండకాలు ఉన్నాయి.

ఇందులోని కథ కాలక్రమానుసారంగాకాక, కార్యకారణ క్రమంలో నడుస్తుంది. కథా ప్రారంభానికి కావ్య ప్రారంభానికి చాలా దూరం ఉంది.

వేశ్యకుల సంజాతమైన "కలభాషిణి" ఈ కావ్యంలో నాయిక. ఈ విషయంలో కూడా 'కళా పూర్ణోదయం' వినూత్నపథంలో నడచింది.

షేక్స్పియర్ మహాకవి రచించిన 'కామెడీ ఆఫ్ ఎర్రర్సు' నాటకంలోని ఘట్టానికి, కళా పూర్ణోదయంలోని మాయారంభ, మాయానలకూబరుల సంవాద ఘట్టానికి పోలికలున్నాయి. షేక్ స్పియర్ "ట్వెల్త్ నైట్" నాటక ఘట్టం దీనికింకా సన్నిహితంగా ఉంటుంది. వీరిరువురూ ఒకే కాలంలో ఉన్నా కొన్ని వేల మైళ్ళ దూరంలో ఉన్న మేధావులు. వీరి రచనలో పోలికలుండటం వింత. (కళాపూర్ణోదయం-పీఠిక-కట్టమంచి)

**కళావతి**

అల్లసాని పెద్దన రచించిన మనుచరిత్రలోని పాత్ర. మనుచరిత్ర ఆంధ్ర పంచ కావ్యాలలో ఒకటి. ఈమె పారమహర్షి (బ్రహ్మర్షి) కూతురు. తల్లి పుంజికస్థల అనే అప్సరస. ఈమె బాల్యంలో చంద్ర కిరణాలే ఆహారంగా పెరిగిందట. తండ్రి ఈమెను పెంచాడు. ఈమెను "దేవాపి" అనే గంధర్వుడు పెండ్లియాడదలచి పారర్షి నడిగాడు. అందుకంగీకరించకపోవడంతో ఆ మహర్షి తల నరికివేసి పారిపోయినాడు. ఒక్కతెగా మిగిలిపోయిన కళావతి మంటలో దూకి మరణించ ప్రయత్నించగా, పార్వతీదేవి వారించి ఆమెకు పద్మిని అనే విద్య నుపదేశించి స్వరోచి భర్త కాగలడని పలికి వెళ్ళినదట. ఈమె మనోరమకు చెలికత్తె. ఒక మునిచే శాపం పొంది క్షయరోగి అయింది స్వరోచి చికిత్సతో రోగాన్ని బాసి స్వరోచిని పెండ్లియాడింది. ఈమె పుత్రుడు విభావసుడు. ఈ పాత్ర అల్లసాని పెద్దనచే చక్కగా తీర్చబడినది. ఈమె నుండి స్వరోచి పద్మినీ విద్యను గ్రహించాడు. (మనుచరిత్ర-అల్లసాని పెద్దన)

**కళ్యావతి**

స్థలం : తంజావూరు.
కాలం : 17వ శతాబ్దం.
రచన : ప్రబంధసార శిరోమణి (సంకలన గ్రంథం).

ప్రసిద్ధ కావ్యాలలోని మంచి పద్యాలను సేకరించి కూర్చుకొన్న గ్రంథం. తంజావూరు సరస్వతీ మహల్ గ్రంథాలయంలో లభించింది. ఈమె రచనలు తెలియరాలేదు. (ఆరుద్ర-12-130)

## కళావతీ శతకము (అలభ్యం)

కవి : తేళ్ళపూడి కసవరాజు.

ఇందులోని మూడుపద్యాలను సంకలన గ్రంథ కర్తలు ఉదాహరించారు. కళావతి శృంగార చేష్టలు వర్ణించే శతకం. ఆ చేష్టలే కావ్య వస్తువుగా కవి దీన్ని రచించిఉంటాడు. దొరికిన పద్యాలు భిన్న ఛందస్సులలో ఉండటం వల్ల ఇది శతకం కాదేమో అనీ చిన్న కావ్యమై ఉండవచ్చుననీ విమర్శకులు ఊహిస్తున్నారు. (ఆరుద్ర-9)

## కళువె నంజరాజు

కాలం : క్రీ. శ. 1759 ప్రాంతం.

స్థలం : మైసూరు.

రచనలు : 1. కాశీ మహిమార్థ దర్పణము. 2. హాలాస్య మాహాత్మ్యము. 3. శివ భక్త విలానము (కన్నడం) 4. భద్రగిరి మాహాత్మ్యము (కన్నడం) 5. వచన భారతము (కన్నడం) (నంజరాజ వాణీవిలాసము).

తండ్రి : కళువె వీరరాజు.

గురువు : హరిదత్తాచార్యుడు.

కృతికర్త, కృతిభర్త కూడా. కన్నడం, తెలుగు భాషలలో రచనలు చేశాడు. మైసూరు రాజుల దగ్గర దండనాయకుడుగా ఉండి ప్రసిద్ధి పొందాడు. చిక్కదేవరాయల ఆస్థానంలోని వాడు.

ఆలూరి నరసింహ కవి రచించిన "నంజరాజ యశోభూషణము" ఇతన్నిగూర్చి వ్రాసినదే.

నానా భాషా విశేష కావ్య రచనాధురీణుడు. కన్నడంలో ఇతడు రచించిన వచన భారతంలో కొన్ని భాగాలలో చిక్కదేవరాయలపేరు కూడా గద్యలో ఉంది. కాశీ మహిమార్థ దర్పణము మొదట కన్నడంలో రచించి తర్వాత తెలుగులో వ్రాశాడట. (వా. చ. 259)

## కళువె (కళలె) వంశీయులు

వీరు మైసూరు రాజుల దగ్గర దండ నాయకులుగా ఉండి సంస్కృతాంధ్ర భాషా పండితులై తెలుగులో రచనలు చేశారు. వీరి స్వస్థలం మైసూరు జిల్లాలోని నంజనగూడు సమీపంలోని "కళువె" గ్రామమట. కళలె అన్నది సరియైన పేరు. అదే వ్యవహారంలో "కళువె" అయింది. వీరిలో దొడ్డరాజు, చిక్కదేవరాయల (1671-1704) దళవాయి. ఇతని కుమారుడు వీరరాజు. దండ నాయకుడు. కవి. ఇతని తర్వాత దేవరాజు, నంజరాజు వరుసగా అక్కడ దండనాయకులుగా ఉన్నారు. వీరిలో వీరరాజు, నంజరాజు కవులుగా ప్రసిద్ధులు. వీరు తెలుగులోనూ కన్నడంలోనూ కూడా రచనలు చేశారు.

## కళువె వీరరాజు

కాలం : క్రీ. శ. 1700 ప్రాంతం.

స్థలం : మైసూరు చిక్కరాయల ఆస్థానం.
రచనలు : 1. వచన భారతము 2. వైద్య సంహితాసారార్ణవము (కన్నడం).
3. వీర రాజోక్తి విలాసము (కన్నడం).

గౌరమ్మ దొడ్డరాజుల పుత్రుడు. మైసూరు రాజ్య నిర్మాతలలో అత్యంత సమర్థుడైన చిక్కరాయలకు వీరరాజు తండ్రి దొడ్డరాజు, మంత్రిగా దండనాథుడుగా ఉండే వాడు. తండ్రి అనంతరం ఈయన చిక్కరాయలకు మంత్రిగా, దండనాథుడుగా వ్యవహరించాడు. 1732-59ల మధ్య దండనాయకుడుగా ఉన్నాడని కొందరంటున్నారు. ఈయన కర్ణాటాంధ్ర సంస్కృత భాషలలో కవి. శైలి మృదువైనది. వచన భారత రచనలో ఇతనికి చెంజి దుర్గాధీశుడైన తుపాకుల అనంత భూపాలుడు సహాయపడ్డాడట.

(తె. వి. స-6)

## కాంచీపుర మాహాత్మ్యము

కర్త : కావలి వెంకట బొర్రయ్య.
వచన కావ్యం.

## కాంచీపుర మాహాత్మ్యము (అలభ్యం)

కర్త : దగ్గుపల్లి దుగ్గన (చూ).
అంకితం : చందలూరి దేవయామాత్యునకు. (క. త-6-101)

## కాంచీ మాహాత్మ్యము (అలభ్యం)

కర్త : కుడిచెర్ల తిప్పరాజు.

దీనినుంచి ఆరు పద్యాలను అజ్ఞాత గ్రంథ సంధాత తన ఉదాహరణ పద్యాలలో సంకలనం చేశాడు. మూడు పద్యాలు పుర వర్ణనకు, ఒకటి భారద్వాజ స్తుతికి, మరొకటి కవి తన పితామహుడు దర్భాసనం మీద కూర్చున్న తీరు వర్ణనకు సంబంధించి ఉన్నాయి. (ఆరుద్ర-8)

## కాండము

కావ్యంలోని కథాంశ విభాగాలను సూచించే పదం. కొన్ని విభాగాల మొత్తమును 'కాండము' అంటారు. రామాయణంలో కొన్ని సర్గల మొత్తం కలిపి ఒక కాండము. ఒకొక్క సర్గలోనూ అనేక శ్లోకా లుంటాయి. (కావ్యాలంకార సంగ్రహం).

## కాండూరి వేంకటదాసు

కాలం : క్రీ. శ. 18 వ శతాబ్దం.
రచనలు : 1. భార్గవ పురాణము, 2. దీన చింతామణి శతకము.

రామానుజమ్మ లక్ష్మణార్యుల పుత్రుడు. ఇతని కవిత్వం సరళంగా ఉంటుంది.

(క. స. 239)

## కాంద్రపేటిరామానుజాచార్యులు

కాలం : క్రీ. శ. 1600 ప్రాంతం.

స్థలం : నైజాం రాష్ట్రంలోని కాంద్రవేడు.
రచనలు : తిరువాయి మొడి (ద్విపద).
బిరుదు : "శృంగార కవి రాయడు."

ఇది ఇతని తెలుగు రచనగా చెప్పబడింది. కాబట్టి కవి ఇతర భాషలలోకూడా రచనలు చేసిఉంటాడు. (క. త-12-149)

## కాంద్రేగులవారు

గోదావరి మండలంలోని 'గజ్జరమ'నే వ్యవహార నామం కలిగిన సంస్థానాన్ని వీరు పాలించారు.

క్రీ. శ. 1762-1765 ప్రాంతాలలో శ్రీనివాస జగన్నాథరావు ఈ సంస్థానాన్ని సంపాదించారు. ఇతనికి జోగి పంతులని వ్యవహారనామం. వెంకటరాయడు ఇతని సోదరుడు. ఈ సోదరులిరువురూ కుంఫిణీ వారివద్ద దుబాసీలుగా పనిచేసేవారు. క్రీ. శ. 1761 లో నిజాము నవాబు నిజామలీ ఖానుకు, కుంఫిణీవారికి ఉత్తర సర్కారు కౌలు విషయంలో రాయబారాలు జరిగాయి. ఈ దుబాసీలు వాటిని అతి చాకచక్యంతో నిర్వహించి ఉభయుల మన్ననలూ పొంది నిజాం ప్రభుత్వం చేత మజుందార్, సెరిస్తదారులవంటి గౌరవ లాంఛనాలు పొందారు. దీనికి కుంఫిణీవారి ఆమోదం కూడా లభించింది. తరువాతి కాలంలో దివి పరగణాలలోని కొన్ని సీమలను సంపాదించి, సంస్థానాన్ని ఏర్పరచుకున్నారు. వేంకటరాయడు, జగ్గప్ప, గోపాలరావు మొ॥వారు ఈ సంస్థాన పాలకులు. క్రీ.శ. 1853లో ఈ సంస్థానం కుంఫిణీ సర్కారులో కలిసి పోయింది.

సంస్థాన పాలకుల సంతతికి చెందినవారిలో రాజా కాంద్రేగుల శ్రీనివాస జగన్నాథరావు పంతులు సాహిత్యపోషకుడు. ప్రసిద్ధులైన శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి గారు ఈ ప్రభువు ఆశ్రితులలో ప్రముఖులు. శ్రీపాదవారి గణేశ పురాణం ఈ ప్రభువుకు అంకితం.

ఇతడు సంస్కృత విద్యాలయాన్ని స్థాపించాడు. రాజమహేంద్రవరంలోని 'ఆంద్రేతిహాస పరిశోధక మండలి' సభ్యుడు. రాజపోషకుడు. పూర్వుడైన జోగిపంతులు కుంఫిణీవారికి దుబాసిగా ఉన్న కాలంలో అతనికీ, నిజాం ప్రభువుకు మధ్యనడచిన ఉత్తర ప్రత్యుత్తరాలను ఈ జగన్నాథరావు పంతులు భద్రపరచి ఈ పరిశోధక మండలికి ప్రసాదించి చరిత్ర రచనకు మిక్కిలి సహాయం చేశాడు. (ఆం. సం. సా- 524)

## కాంబెల్ ఎ. డి.

కాలం : క్రీ. శ. 1760-1840.
రచనలు : వ్యాకరణము (Telugu grammar), నిఘంటువు.

తెలుగు భాషా పరిశ్రమ చేసిన ఆంగ్లేయుడు. తెలుగు భాషకు ఆంగ్లంలో వ్యాకరణం రచించిన వారిలో ఇతడే ప్రథముడు. ఆ కాలంలో తెలుగు భాషను 'జెంటూ' భాష అని పాశ్చాత్యులు పిలిచేవారు. తెలుగు భాష ఇటాలియన్ ఆఫ్ ది ఈస్ట్ (Italion of the East) అని చెప్పినవాడు ఇతడే. ఇతడు కృతిపతి కూడా. రావి

పాటి గురుమూర్తి శాస్త్రి తమ వ్యాకరణాన్ని 1837లో ఈయనకు అంకితం ఇచ్చారు.
(తె. వి. స. 6)

## కాంబెల్ కోశము

కర్త : ఎ. డి. కాంబెలు.

కాలము : క్రీ. శ. 1821.

తెలుగు భాషా నిఘంటువు. దీనిలో కొన్ని తెలుగు పదాలకు ఆంగ్లంలో అర్థాలు వ్రాయబడ్డాయి. (తె. వి. స. 6-619)

## కాంభోజరాజు కథ

రచన : జంగం సుబ్బయ్యదేవర.

అడుగడుగునా అద్భుతరసం ఉట్టిపడే జానపద గేయం.

కాంబరీపట్టణపురాజు కాంభోజరాజు. కాంభోజరాజు కుమారుడు 'చెరాబందిరాజు'. కథపేరు కాంభోజరాజని ఉన్నా కథానాయకుడు చెరాబందిరాజే. చెరాబందిరాజు తల్లి "మాణిక్యాలదేవి". ఈమె భర్త ఆగ్రహానికి గురై అరణ్యంలోని 'చెర'లో బంధింప బడింది. అక్కడే పంచాక్షరీ మహామంత్రంతో కొడుకును కన్నది. చెరలో పుట్టాడుకాబట్టి 'చెరాబందిరాజు' అయ్యాడు. ఇతడు 12 సం॥ల వరకు స్వర్గంలో పెరిగి దివ్య శక్తులతో పరమేశ్వరానుగ్రహంతో తిరిగి వస్తాడు. తండ్రి ఆరోగ్యం బాగు చేయడం కొరకు సప్త సముద్రాల అవతలనున్న 'యోజనగంధి' వద్దనున్న "మాల్లాదేమందు" తేవడానికి వెళ్ళి మందుతోపాటు యోజనగంధిని రత్నాలగంధిని వివాహం చేసుకుని వస్తాడు. ఈ మందు సంపాదించే ప్రయాణంలో అడుగడుగునా నమ్మశక్యంగాని అద్భుత కృత్యాలు గేయంలో కనిపిస్తాయి. (జా. గే. వా.)

## కాంభోజరాజు కథలు

కర్త : తెలియదు.

తొలిముద్రణ : క్రీ. శ. 1849.

ఈ కథలు రెండు రకాలుగా లభించాయి. ఒక ప్రతిలో అనంతామాత్యకృతి మైన భోజరాజీయంలోని పద్యాలు ఉన్నాయి. రెండవదానిలో పద్యాలు లేవు. రచన భిన్నంగా ఉన్నది. ప్రాచీన కావ్యకథలనూ ఆంధ్ర దేశంలో వ్యాప్తిలో ఉన్న కథలనూ జోడించి కూర్చిన గ్రంథం. (వ. వా-82)

## కాకతీయ చరితమ్ (సం)

కర్త : చూ. నరసింహుడు.

అలభ్యం. (ప్రా. వ. దే. చ.)

## కాకతీయ వంశావళి

కర్త : తెలియదు.

దీని ప్రతి ఆంధ్రసాహిత్యపరిషత్తు (కాకినాడ)లో ఉంది.

## కాకమాని గంగాధరుడు

కాలం : క్రీ. శ. 16 శతాబ్ది.
చూ : అజ్ఞాత గ్రంథ సంధాత.
రచన : బాలభారతము (అలభ్యం.).

విశిష్టత : ఈయన కావ్యంలోని 15 పద్యాలను అజ్ఞాత గ్రంథ సంధాత తన "ఉదాహరణ పద్యములు"లో చేర్చాడు. అగస్త్యుడు సంస్కృతంలో బాలభారతం వ్రాశాడు. రెండో ప్రతాపరుద్రుని ఆస్థానంలో ఉండి, ప్రతాపరుద్ర యశోభూషణం అనే అలంకార శాస్త్రాన్ని రచించి ఆ రాజుకు అంకితం యిచ్చిన విద్యానాథుడే అగస్త్యుడని పండితాభిప్రాయం. ఈ బాల భారతానికి మహా మంత్రి తిమ్మరుసు "మనోహర" అనే వ్యాఖ్య వ్రాశాడు.

ఈ కవి వ్రాసిన బాలభారతం సంస్కృత బాలభారతానికి అనువాదమో కాదో చెప్పలేము. సంధాత ఉదాహరించిన పద్యాలలో ఒకటి వినాయక ప్రార్థనకు, 5 పద్యాలు పూర్వకవిస్తుతికి, మిగతా తొమ్మిది పద్యాలు కథకు సంబంధించి ఉన్నాయి. పూర్వ కవి స్తుతిలో కవి ముగ్గురు సంస్కృత కవులను స్తుతించి, ఒక శార్దూలంలో వాల్మీకిని, రెండో శార్దూలంలో వ్యాసుని నుతించాడు. ఒక సీసంలో కాళిదాసాదులను ప్రస్తుతించాడు. అగస్త్య, విద్యానాథుల స్తుతి లేకపోవటం గమనార్హం. కంద పద్యంతో నన్నయను, ఉత్పలమాలతో తిక్కన్నను సత్కరించాడు కవి.

నన్నయ బిరుదును గురించి ఈ కవి స్పష్టంగా చెప్పాడు. నన్నయ తాను 'విపులశబ్ద శాసనుడ'నని చెప్పుకొన్నాడు. శ్రీనాథుడు నన్నయను "శబ్ద శాసనునన్నపాచార్యవర్యు" అనీ, జక్కన్న "శబ్ద శాసన వరేణ్యులునాగ బ్రశస్తికెక్కిరి" అనీ నన్నయను పొగిడారు. తెలుగు సాహిత్య లోకంలో నన్నయది బిరుదో విశేషణమో తేలక ఒకప్పుడు సతమతమయ్యారు. అయితే ఇది బిరుదే అని తెలుగు సాహిత్య లోకం ఒకనాడు భావించేదని చెప్పటానికి ఈ కాకమాని గంగాధరుని పద్యం పనికి వస్తుంది. కవి నన్నయను "శబ్ద శాసన బిరుదున్" అన్నాడు.

పాంచాలీపరిణయ, రాజ వాహన విజయ కావ్య కర్త కాకమాని మూర్తి కవి గంగాధరుని బంధువో కాదో తెలియదు. ఒకే వూరు కావచ్చునేమో? కాకమాను గ్రామం గుంటూరు జిల్లా పొన్నూరు తాలూకాలో ఉంది. (ఆరుద్ర-9)

## కాకమాని మూర్తి కవి

కాలం : 16 వ శతాబ్దం.
స్థలం : దక్షిణ దేశం (కర్ణాటక ప్రాంతం).
రచనలు : 1. పాంచాలీ పరిణయము 2. రాజ వాహన విజయము 3. బహుళాశ్వ చరిత్ర (అలభ్యం).

రామలింగభట్టు పుత్రుడు. ప్రౌఢ కవి. తెనుగు కవితావిరించిగా ప్రశంసలు పొందాడు. దామెర్ల వారి ఆశ్రయంలో రచనలు చేశాడని ఊహిస్తున్నారు. కాలాన్ని

గురించి భిన్నాభిప్రాయాలున్నాయి. ఇతని బహుళాశ్వ చరిత్ర అలభ్యం. లక్షణ గ్రంథాలలో, ఇతనివిగా చెప్పబడ్డ ఉదాహరణలు, దామెర్ల వెంగళరాజు బహుళాశ్వ చరిత్రలో కన్పిస్తున్నాయి.

ప్రతి పద్య చమత్కృతి, రసపుష్టి, ఇతని రచనలో బంధురంగా కనిపిస్తాయి. (క. చ-3-6; ఆరుద్ర-11-65)

**కాకరపర్తి కృష్ణకవి**

కాలం : 1800 ప్రాంతం.

స్థలం : విశాఖ మండలం.

రచనలు : శశిరేఖా పరిణయము, ముఖ లింగ క్షేత్ర మాహాత్మ్యము.

తిరుపతి పాత్ర కవి సీతమాంబల పుత్రుడు. విద్వత్కవి. విశాఖపట్టణం జమీందారుల ఆస్థానంలో ఉండే వాడు. ఇతని కవిత్వం దోషరహితంగా హృదయంగమంగా ఉంటుంది. (క. చ-3-216)

**కాకరపర్తి తిరుపతి పాత్ర కవి**

కాలం : 18 వ శతాబ్దం.

స్థలం : విశాఖ మండలం.

రచనలు : సత్యభామా కృష్ణ సంవాదము మొ॥ వి.

విద్వత్కవి. ఇత ఇతర రచనలు తెలియరాలేదు. విశాఖపట్టణం జమీందారులైన జగ్గారాయని వారిచేత అగ్రహారాదులు పొందాడట ఇతని కుమారుడు కృష్ణ కవి కూడా విద్వత్కవి. (క. న-37)

**కాకరపర్తి బుచ్చి పాత్ర కవి**

కాలం : 19 వ శతాబ్దం.

స్థలం : విశాఖ మండలం.

రచన : సత్యవతీ పరిణయము (ప్రబంధం).

కృష్ణకవి పుత్రుడు విశాఖ పట్టణం జమీందారు గొడే నారాయణ గజపతి తండ్రి ఆశ్రితుడు. అతనికి అంకితం చెయ్యాలనే తలంపుతో సత్యవతీ పరిణయం వ్రాశాడు కాని కృత్యాది, ఆశ్వాసాంత పద్యాలు రచించకుండానే మరణించాడట. కవి మరణానంతరం అతని సోదర పుత్రుడు వేంకటశాస్త్రి, పౌత్రుడు సీతారామశాస్త్రి కృత్యాది రచించి నారాయణ గజపతికి ఆ గ్రంథం అంకితం చేశారు. (క-న.-146)

**కాకర్లపూడి**

చూ. కాకర్లపూడి గోపాల పాయకరావు.

వంశనామం. సత్యవరం సంస్థానాధీశుల పూర్వీకుడు కవవరాజు, కాకర్లపూడి రాజధానిగా పాలించినప్పటినుండి, వారి ఇంటి పేరు "కాకర్లపూడి" అయింది.

ఈ కాకర్లపూడి వారివి శిష్టు కృష్ణమూర్తి కవి ఒక పెద్ద ఉత్పలమాలలో ప్రశంసించాడు. (క. త-13-64; వా. వ. ర)

## కాకర్లపూడి గోపాలరాయ పాయకరావు

కాలం : క్రీ. శ. 1720–1790 ప్రాంతం.

సంస్థానం : సత్యవరము (విశాఖ మండలం).

కవి పండిత పోషకుడు. రుక్మవతీ పరిణయము, శ్రీకృష్ణలీలా సుధారసము అనే కావ్యాలు ఇతనికి అంకితం చేయబడ్డాయి.

వీరి పూర్వీకులు 'కాకర్లపూడి' గ్రామం రాజధానిగా రాజ్యం పాలించడంవల్ల కాకర్లపూడి వీరి వంశనామంగా ప్రసిద్ధమైంది. శానంపూడి తిమ్మకవి, రేకపల్లి సోమనాథ కవి ఇతని ఆస్థాన కవులు. వారి నితడు అగ్రహార దానాలతో సత్కరించాడట.

(క. శ–13–61)

## కాకర్ల లింగన్న శాస్త్రి

స్థలం : గుంటూరు మండలం.

చాటుకవి. మార్కాపురం గ్రామంపై కొన్ని చాటు పద్యాలు చెప్పాడు. ఇతని రచనలు లభించలేదు.

## కాకునూరి అప్పకవి

కాలం : క్రీ. శ. 17 వ శతాబ్దం.

జన్మస్థలం : కామెపల్లి.

రచనలు : 1. ఆంధ్ర శబ్ద చింతామణి (అప్పకవీయం) 2. అనంత వ్రత కథ (కావ్యం) 3. శ్రీనగాధీశశతకము 4. కవి కల్పకము (లక్షణగ్రంథం) 5 సాధ్వీజన ధర్మము (ద్విపద) 6 అంబికావాదము (యక్షగానం) 7. అపస్తంబషట్కర్మ నిబంధనమ్ (సం) 8. కాల బాలార్ణవ సంగ్రహమ్ (సం).

ప్రసిద్ధ లాక్షణికుడు. పైన చెప్పినవే కాక సంస్కృతాంధ్ర గ్రంథాలు మరి కొన్నిటిని కూడా ఇతడు రచించినట్లు తెలుస్తున్నది. అప్పకవీయం తప్ప ఇతర గ్రంథాలేవీ దొరకలేదు. ఇతడు వెంగన సీనమల పుత్రుడు. ఇతని జన్మస్థలం గురించి భిన్నాభిప్రాయాలున్నాయి. ఇతనిది మహబూబ్ నగర్ జిల్లాలోని గ్రామమని కొందరూ, హైదరాబాదు రాష్ట్రంలో "లేమావిళ్ళ" కు చెందినవాడని కొందరూ అంటున్నారు.

కామెపల్లి శ్రీశైలానికి ఈశాన్యాన తంగేడు సీమలో కొండవీటికి పడమట కృష్ణకు యోజనం దూరంలో ఉన్నదట. (అరుద్ర–6–47; అప్పకవీయం–వావిళ్ళ)

## కాకునూరి తిమ్మకవి

కాలం : క్రీ. శ. 1600 ప్రాంతం.

స్థలం : నాగర్‌కర్నూలు తాలూకా, లేమావిళ్ల గ్రామం (మహబూబ్‌నగర్ జిల్లా).

రచన : కాలామృతమ్ (సంస్కృతం).

ప్రత్యేకత : దీనిలో వాస్తు ప్రకరణం మాత్రమే వుంది. ఇది జ్యోతిష గ్రంథం. కాకునూరి అప్పకవి "మదీయాన్వయ ప్రభుండు" అని చెప్పుకొన్న తిమ్మన ఇతడేనని కొందరి అభిప్రాయం.

ఇతని గ్రంథానికి కవి తార్కిక సింహుడు, వేదాంతాచార్యులు ఆంధ్రంలో టీక వ్రాశారట. (ఆరుద్ర-6-45)

కాకునూరి సోమన్న

కాలం : క్రీ. శ. 1500-1550 ప్రాంతం.

స్థలం : మహబూబ్‌నగర్-జిల్లా నాగర్‌కర్నూలు-తాలూకా లేమావిళ్ళ గ్రామం.

రచనలు : తెలియరాలేదు.

తిమ్మరాజు పుత్రుడు. కాకునూరి అప్పకవికి పూర్వుడు. చిన్నప్పుడే కాశీకి వెళ్ళి బ్రహ్మేంద్రులవద్ద శాస్త్రాలు చదివాడు. వేదశాస్త్ర పురాణాదివాదాలలో మధురలో పండితులను ఓడించాడు. (ఆరుద్ర - 6-47)

కాకునూరు

పౌరుషనామం.

ఈ పేరుతో ఒక గ్రామం మహబూబ్‌నగర్ జిల్లా కల్వకుర్తి తాలూకాలో ఉంది.

కాకునూరి అప్పకవి పూర్వీకులలో ఒకరైన సోమన (1530 ప్రాంతాలు) మధుర లోని పండితులను వేదశాస్త్ర పురాణాది వాదాలలో ఓడించాడట. వాళ్ళ కాకునూరింటిని చేయడంవల్ల (అవమానాన్ని నూరింతలు చేయడం) అతనికి కాకునూరింటి వాడనే పౌరుష నామం వచ్చిందట. (అప్పకవీయం-పీఠిక-72-ఆరుద్ర-6-47)

కాచన బసవన

నామాంతరం : కాచిరాజు బసవన.

కాలం : 1470-1530 నడిమికాలం.

కృతులు : 1. కవి సర్పగారుడము 2. ప్రయోగసారము.

క్రీ శ. 1550 ప్రాంతం వాడైన చిత్రకవి పెద్దన ఈ బసవనను స్తుతించాడు. కాచిరాజు అనేది తండ్రి పేరై ఉంటుందని కొందరి అభిప్రాయం. అప్పకవి ఇతన్ని పేర్కొన్నాడు. (కవిజనాశ్రయం పీఠిక-వావిళ్ళ)

కాచభూపతి (రెడ్డి)

కాలం : క్రీ. శ 1291-1323 ప్రాంతం.

స్థలం : రాయచూరు ప్రాంతం.

రచన : రంగనాథ రామాయణము (ఉత్తరభాగం).

రంగనాథరామాయణం (ద్విపద) పూర్వభాగ కర్తఅయిన గోనబుద్ధారెడ్డికొడుకు. ఉత్తర భాగాన్ని సోదరుడు విట్ఠల భూపతితో కలిసి వ్రాశాడు. కాకతి రెండో ప్రతాప రుద్రుని సమకాలికుడుగాని, ఆ తరవాత కాలంవాడు కాని కావచ్చు. రచన సరళంగా

ఉంటుంది. సోదరులిరువురూ తండ్రి బుద్ధభూపతి ఆనతిమీద రామాయణ ఉత్తర భాగాన్ని ద్విపదలోనే రచించి తండ్రికే అంకితంగా ఇచ్చారు. వీరివి గురించి తెలిపే శాసనం ఒకటి మహబూబునగర్‌లోని బూదపూరులో ఉన్నది. (ఆరుద్ర-3)

కాచిరాజు బసవన్న

నామాంతరం : కాచన బసవన (చూ).

కాటమరాజు కథ

కర్త : కనకబండి గట్టయ్య.

రచనాకాలం : 18వ శతాబ్దం.

ద్విపదలో గాన యోగ్య గా ఉన్న రచన. (క. స-54)

కాటమరాజు కథ

కర్త : తెలియదు.

జానపద చారిత్రక గేయం.

కాటమరాజుకు, మనుమసిద్ధికి మధ్య జరిగిన యుద్ధం ఇందలి కథావస్తువు. ఈ కాటమరాజు కనిగిరి సీమకు చెందినవాడు. నెల్లూరి సీమను పాలిస్తున్న మనుమసిద్ధి భూపాలుడు, ఈ కాటమరాజు అడిగిన సుంకం చెల్లించలేదని అతనిపై ఖడ్గతిక్కన ఆధ్వర్యంలో సైన్యం పంపుతాడు. పాలేటి ఒడ్డునగల పంచలింగాల వద్ద ఘోరమైన యుద్ధం జరిగింది.

ఆ యుద్ధ వివరాలను తెలిపే ఈ గేయం జానపదులలో అత్యంత ప్రచారం చెందింది. (వా. చ - జా. గే. వా.

కాటుమరాజు వెంకటయోగి

కాలం : 1812 కి కొంచెం పూర్వుడు.

రచన : ముక్తికాంతా విలాసము (యక్షగానం).

వెంకమాంబా చెంచమరాజుల పుత్రుడు. వేదాంతపరమైన రచన చేశాడు. (య. వా. చ )

కాటయ వేమారెడ్డి

కాలం : క్రీ. శ. 15వ శతాబ్దం పూర్వార్ధం.

స్థలం : కొండవీడు, రాజమహేంద్రవరం.

రచన : "కుమారగిరి రాజీయమ్" (సంస్కృతం)

అనవోతారెడ్డి అల్లుడు కుమారగిరిరెడ్డికి బావమరిది, మంత్రి కొండవీటి రాజ్య పాలనాభారం తగ్గించుకోవటానికి కుమారగిరి కాటయవేముని తన ప్రతినిధిగా రాజమహేంద్రవరరాజ్యానికి పాలకునిగా పంపాడట. కాటయవేముడు రణశూరుడేగాక రాజనీతిజ్ఞుడుగా కుమారగిరి సామ్రాజ్య రక్షకుడుగా ప్రసిద్ధుడు పెద కోమటి వేమునికి బద్ధశత్రువు. సాహిత్యంలో కూడా అభినివేశం కలవాడు. సంస్కృత భాషావేత్త ఇతని

కుమారగిరి రాజీయమ్ కాళిదాసు నాటకాలకు వ్యాఖ్యానం. కవి పాండితీ ప్రకర్షకు తార్కాణంగా ఉంది. దీన్ని కుమారగిరిరెడ్డికి అంకితం ఇచ్చాడు. కాటయ వేముని శౌర్య ప్రతాపాలను కవులు కీర్తించారు. ఇతనిమీద చాటువులు కొన్ని లభించాయి.
(రె. రా. చ)

## కాటిపాపలవారు

వీరు ఇంద్రజాల ప్రదర్శకులు. పూర్వ కాలం నుంచీ ఆంధ్రదేశంలో ఉన్నారు. వీరు మచ్చుచల్లిపిల్లల్ని ఎత్తుకు పోతారనే ఒక ఎదంతి దేశంలో ఉంది.

వీరు ఇంద్రజాలంతో ప్రజలను భయకంపితుల్ని చేస్తారు. వీరి వేషం గంభీరం గాను, భయంకరంగానూ ఉంటుంది ప్రదర్శకుడు రంగు రంగుల దుస్తులు వేసు కొంటాడు. రెండు లేక మూడు పెద్ద గంటలను వేలాడదీస్తాడు. అతను నడుస్తుంటే వచ్చే గంటల చప్పుడు భయంకరంగా ఉంటుంది. నొసటన బొట్లు, మెలి తిరిగిన మీసాలు, ఈకల మాదిరి చిత్రించిన రేకుల కిరీటం, చంకన జోలె, చేతిలో ఎముకలు పుచ్చుకొని భూతవైద్యునివలె గంభీరంగా ఉంటాడు.

ప్రదర్శన చేసేటప్పుడు నోటిలోనుంచి నాలుగైదు పౌన్ల పెద్ద గుండ్లను, విగ్రహాలను, ఇతర సామానులను, తేళ్ళను, మంత్రగబ్బలను, కప్పలను నోట్లోనుంచే పుట్టి స్తారు. శవాన్ని తగలబెట్టేటప్పుడు వీరు కాటిమీద తిష్ఠవేసి సుంకంకట్టిందాకా నానాహంగామా చేయటం ఇప్పటికీ దేశంలో ఉంది. (నా. ర. చ-296)

## కాణాదము పెద్దన సోమయాజి

కాలం : క్రీ. శ. 17వ శతాబ్దం చివర; 18వ శతాబ్దం ప్రారంభం.

స్థలం : గద్వాల.

రచనలు : 1. మత్స్యపురాణము (ఆంధ్రానువాదం). 2. శేషశైలేశ లీల, 3. భద్రాపరిణయము (ముకుందవిలాసము.) 4. అధ్యాత్మ రామాయణము 5. రామాయణ చంపువు. 6. యథా శ్లోక తాత్పర్య రామాయణము (బాలకాండ).

తిమ్మనార్యుని పుత్రుడు. చతుర్విధ కవితావిశారదుడు. కొంతకాలం సురపురం సంస్థానాధీశ్వరుల ఆదరణలో ఉంటూ మత్స్య పురాణాన్ని ఆంధ్రంలో సంతరించినాడు. "శేషశైలేశ లీల"ను పంచవర్గీయ అక్షరాలు లేకుండా కావ్యంగా వ్రాశాడు ఆ తరువాత గద్వాల సంస్థానంలో సోమభూపాలుని ఆశ్రయించి భద్రాపరిణయం అనే నామాంతరం కల ముకుంద విలాసాన్నీ, అధ్యాత్మ రామాయణాన్ని వ్రాశాడు సోమభూపాలుడు ప్రారం భించిన యథా శ్లోక తాత్పర్య రామాయణాన్ని అనువదించిన వారిలో ఇతడొకడు "బాల కాండ"ను అనువదించాడు.

సురపురం సంస్థానాధీశ్వరులచేత 'అభినవ అల్లసాని పెద్దన' అనే బిరుదం పొందాడు. ఇతని గ్రంథాలలో ఉన్నన్ని శబ్దాలంకారాలు, చిత్రబంధ కవిత్వ పద్యాలు మరి

ఏ కవి గ్రంథంలోనూ లేవని వీరేశలింగం గారు వ్రాశారు. ఇతని కవిత్వం రసవంత మైనది. (ఆం. సం. సా. క. చ. 3-83)

**కాదంబరి (సం)**

కర్త : చూ. నృసింహ భట్టు.

ఇది ఆయిదంకాల నాటకం. పెదకోమటి వేమారెడ్డి తన సాహిత్య చింతా మణిలో దీన్ని పేర్కొన్నాడు. అప్పటికి ఇది ప్రఖ్యాతమైన నాటకం. (రె. రా చ-473)

**కాదంబరి**

కర్త : భాస్కరుని కేతన (చూ).

పద్యకావ్యం. నాలుగు పద్యాలు మాత్రం లభించాయి. భట్టబాణుని సంస్కృత కాదంబరికి అనువాదం కావచ్చు. ఈ రచన క్రీ. శ. 1260కి ముందే జరిగి ఉండవచ్చు పెదపాటి జగ్గన, కస్తూరి రంగకవి ఇందులోని పద్యాలను ఉదాహరించారు.

**కాదంబరీ కల్యాణ నాటకమ్ (సంస్కృతం)**

కర్త : (చూ) నరసింహుడు.

అలభ్యం. కాకతీయుల కాలం నాటి రచన. (ప్రా. ద. దే. చ-689)

**కానాల నరసింహకవి**

కాలం : 17 వ శతాబ్దం కావచ్చు.

స్థలం : తరిగొండ.

రచన : శేషధర్మములు.

వేంకటేశ అమాత్యుని పుత్రుడు. ఇతని కవిత్వం అనర్గళమైన ధారతో మృదు మధురంగా ఉంటుంది. రచనలో కొన్ని విలక్షణ ప్రయోగాలు కనిపిస్తాయి. (క. స-104; క. చ.-3-204)

**కానుకొలను అన్నమరాజు**

కాలం : క్రీ. శ. 1500 ప్రాంతం.

స్థలం : కృష్ణామండలం కావచ్చు.

రచన : అమరుక శతకము (అలభ్యం).

అన్నమయ్య అనేది ఇతని నామాంతరం. అమరుక కావ్యాన్ని తొలిసారిగా తెలుగులో అనువదించినవాడు ఈ అన్నమరాజు. ఇతని జన్మస్థలాన్ని గురించి భిన్నాభి ప్రాయాలున్నాయి. భాస్కర క్షేత్రం అని కొందరంటు న్నరు. సంస్కృతంలో అమరుక శతకాన్ని అమరుకుడే వ్రాశాడనీ, శంకరాచార్యులవారు వ్రాశారనీ పండితుల మధ్య అభి ప్రాయ భేదాలున్నాయి. అమరుక సంస్కృత శతకానికి సుమారు 20 వ్యాఖ్యానా లున్నాయి.

ఇతని అమరుకం నుంచి అజ్ఞాత గ్రంథ సంకలనకర్త తన 'ఉదాహరణ పద్యాల'లో రెండు పద్యాలను ఉదాహరించాడు. ఈ అన్నమయ్యను గురించి తెలిపే

శాసనం ఒకటి లభించిందనీ దానివల్ల ఇతని తాత సూరపరాజు తండ్రి అన్నయ్య అని తెలుస్తున్నదనీ కొందరు చెప్తున్నారు. ఇతని శైలి చక్కనిది.
(ఆరుద్ర-8-89, శ.క.చ-737)

కానుకొలను నాయనప్ప

నామాంతరం : వేంకటదాసు (చూ).
అచ్చతెనుగు శతక కర్త.

కానుకొలను వెంకటదాసు

నామాంతరం : నాయనప్ప.
కాలం : 1804 ప్రాంతం.
రచన : 1. శ్రీకృష్ణ నాటక యక్షగాన మహాప్రబంధ రాసక్రీడా విలాసము
2. చింతగుంట పాలెపు రామశతకము.

భావయామాత్యుని పుత్రుడు. ఇతడు పన్నెండేండ్ల వయసులో రామశతకం రచించాడట. చింతగుంట పాలెం బందరులో ఒక పేట. దీనికి తింత్రిణీగర్తపుర మనేది సంస్కృతం.
(య. వా. చ-108)

కానూరి వీరభద్రకవి

కాలం : 18 వ శతాబ్ది.
స్వస్థలం : కొలిపాక (కొలనుపాక).
రచన : బసవ మహిమామృత విలాసము.
గురువు : గుడ్డద మారెయ్య.
సమకాలికులు: కిందుకూరి బసవరాజు, కామరాజు శంకరుడు, బుద్ధిరాజు వీరేశు.

ఈ కవికి వియ్యన అనే పేరు కూడా ఉంది. తల్లి అక్కనాగమ్మ. తండ్రి పేరు తెలియదు. గుడ్డద మారెయ్య వీరభద్రకవికి ఇష్టలింగాదిక జ్ఞానోపదేశం చేశాడు. కొలనుపాక సోమేశ్వర స్వామి భక్తుడైన సీతారామ శాస్త్రి కవిని ప్రోత్సహించి రచనలు చేయించాడట.
(య. వా. చ. 360)

కాపనాయకుని శాసనము (కాపడు)

కాలం : క్రీ. శ. 1132.
స్థలం : తెలియదు.
శాసన ప్రదాత : కాపనాయకుడు (కాపడు).

శాసన విషయం: ఈ శాసనదాత కాపడు వెలనాటి గొంకరాజు కొలువులో ఒక నాయకుడు. ఈయన శివునికి అఖండ దీపం నిల్పాడట. 'యొంబర్తి' అనే గ్రామంలో మహేశ్వరుని ప్రతిష్ఠించి, అఖండ భక్తితో శివాలయం నిర్మించాడని ఈ శాసనం వల్ల తెలుస్తున్నది. దీనిలో మూడు చంపకమాలలు, రెండు ఉత్పలమాలలు, ఒక శార్దూలం రెండు కందపద్యాలు ఉన్నాయి.
(తె. క. చ-230, 231)

కామందకము (అలభ్యం)

కర్త : తెలియదు.

నీతి శాస్త్ర గ్రంథం.

సంస్కృత కామందకీయానికి ఇది అనువాదం కావచ్చు. మడికి సింగన సకల నీతి సమ్మతంలో ఇందులో నుంచి ఇంచుమించు మూడు వందల పద్యాలు సంకలనం చేశాడు. కవిత మనోహరమై ప్రౌఢంగా ఉంది. (క. త-4-191)

కామకళానిధి

కవి : నెల్లూరి శివరామ కవి (చూ)

అంకితం : మహారాష్ట్ర ప్రభువు జయసింహునికి (1740 ప్రాంతం).

కొక్కోక కవి రచించిన 'రతి రహస్యము' అనే సంస్కృత గ్రంథానికి అనుసరణ. నాలుగు ఆశ్వాసాల ప్రబంధం.

ఇందులో తంజావూరును పాలించిన మహారాష్ట్ర రాజుల వంశావళి విస్తృతంగా వర్ణింపబడి నాటి చారిత్రక విశేషాలను తెలుపుతున్నది. 1930 లో శృంగార గ్రంథ మాల వారు దీన్ని ముద్రించారు. (ద. దే. వా-260)

కామక్క

కాలం : 1125 ప్రాంతం.

స్థలం : తెనాలి తాలూకా ఈమని గ్రామం.

శాసన ప్రదాయిని. ఘంటసాల పోతినాయకుని కుమార్తె. ఈమె తన తండ్రి పోతినాయకునకు తల్లి ప్రోలమకు ధర్మార్థంగా ఈవనిలోని అగస్త్యేశ్వరస్వామి (తొందేశ్వరుడు) కి అఖండ దీప దానం చేస్తూ శాసనం వేయించింది.

(చూ. ఘంటసాల కామక శాసనము.)

కామన దక్షారామ శాసనము

కాలం : క్రి. శ. 1149.

శాసన ప్రదాత : కామన.

ప్రస్తావిత స్థలం : దక్షారామం.

శాసన విషయం : శాసన ప్రదాత చతుర్థకులజుడు (శూద్రుడు) అని, వదాన్యుడని, దండనాయకుడని, దక్షారామంలోని భీమేశ్వరునికి అఖండ దీపం నిలిపాడని ఈ శాసనం వల్ల తెలియవస్తుంది. దీనిలో అసమగ్రంగా ఒక చంపకమాల, ఒక శార్దూలం ఉన్నాయి. (తె. క. చ-248)

కామనూరి కృష్ణయ్య

కాలం : 18 వ శతాబ్దం.

రచన : ఇందుమతీ పరిణయము.

గోవిందామాత్యుని కుమారుడు. హృద్యంగా కవిత చెప్పిన కవి. రఘు

వంశంలోని అజమహారాజు చరిత్రనే ఇందుమతి పరిణయ ప్రబంధంగా పొందుపరచాడట.
(క. చ-3-154)

**కామపరాణి (కడలుపల్లి) శాసనము**

కాలం : క్రీ. శ. 1154.

శాసనం వేయించిన వారు : కామపరాణి.

ప్రస్తావిత స్థలం : కడలుపల్లి.

శాసన విషయం : కామపరాణి రాజకుమార్తె కావచ్చును. ఈమె బల్ల నరేంద్రుని అర్ధాంగి. కడలుపల్లిలో వేంచేసిన భుజంగమేశ్వరునికి అఖండ దీపం నిలిపినట్లు ఈ శాసనం వల్ల తెలియవస్తుంది. దీనిలో అసమగ్రంగా ఒక ఉత్పలమాల ఉంది. (తె. క. చ-264)

**కామమ్మ కథ**

కర్త : మదాసు వెంకయ్య.

అత్యంత కరుణ రస పూరితమైన జానపద గేయం. పిచ్చుకుంట్ల వారికి కల్పవృక్షం.

'సహగమనం' ఈ కథలోని ముఖ్య విషయం. భర్త మరణించగానే హైందవ స్త్రీలు సహగమనం చేయడం పూర్వపు ఆచారం. దీన్ని "రామమోహనరాయలు" ఇంగ్లీషు వారి సహాయంతో మాన్పించాడు. కాని కొందరు పతివ్రతలు ప్రత్యేకంగా బ్రిటిషు ప్రభుత్వం కాలంలో వారి అనుమతితో సహగమనం చేసే వారట. ఈ కథ అలాంటిది బహుశ 18 వ శతాబ్దినాటి వృత్తాంతం అయి ఉండవచ్చు.

లక్ష్మయ్య వెంకమ్మల ముద్దు కూతురైన "కామమ్మ" "తిరుపతి మారయ్య"కు భార్య అయింది. మారయ్య చాలా కాలం చెన్నపురిలో పనిచేసి ధనం సంపాదించి తిరిగి స్వగ్రామం చేరుకొన్నాడు. ప్రథమంగా భార్యను కాపురానికి పంపమని కబురంపాడు. కామమ్మ పిఠాపురం నుండి సామర్లకోటకు వచ్చింది. మొదటనే అస్వస్థతగా ఉన్న "మారయ్య"కు రోగం ముదిరింది. మరణించాడు. కామమ్మ తన జీవితంలో భర్తకు చేసిన సేవల్లా నోటిలో "తులసితీర్థం" పోయడమే.

కామమ్మ సహగమనం చేయగోరగా ఆమెను అందరూ ఆటంక పరుస్తారు. దొరల అనుమతి అవసరమంటారు. కామమ్మ కాకినాడ కలెక్టరును, చెన్నపురిలోని ప్రముఖ ఇంగ్లీషు దొరలను దర్శించి వారికి తన మాహాత్మ్యాన్ని చూపిస్తుంది. ఎవ్వరెంత కాదన్నా చివరికి తన పంతం నెగ్గించుకుంటుంది. ఇది ఈ గేయంలోని కథ.
(జా. గే. వా)

**కామయ చంద్రా శతకము**

కర్త : పచ్చమెట్ట పాపకవి.

రచనాకాలం: 1765-1840 ప్రాంతం.

కవి తన పోషకుడైన మగటపల్లి కామయ శ్రేష్ఠి మీద చెప్పిన కంద పద్య శతకం. "కామయ చంద్రా" అనే మకుటంతో ఉంది. (శ. క. చ-826)

**కామరసు వేంకటపతి సోమయాజి**

కాలం : 17 వ శతాబ్దం.

స్థలం : తంజావూరు.

రచన : విజయ రాఘవ చంద్రికా విహారము.

నామాంతరం : విజయరాఘవ చంద్రికా విలాసము.

క్రీ. శ. 1633-73 నడుమ తంజావూరు నేలిన విజయరాఘవుని పట్టపు కవి. పద కవితలో దిట్ట. ఇతని పదాలు కొన్ని క్షేత్రయ్య పదాలుగా చెలామణి అవుతున్నాయని విమర్శకులు అంటున్నారు. అంత్యప్రాసలు, యమకాలు, చక్కని కొనమెరుపులు ఇతని సొమ్ము. సందర్భానుసరించి వచ్చి శృంగారవర్ణన కూడా చేశాడు. ఆంధ్ర యక్షగానాలలో కొరవంజి పాత్ర తొలుత ప్రవేశపెట్టినది ఇతడే. (ద. దే. వా-129)

**కామవల్లీ మహాలక్ష్మి కథ**

నామాంతరం : కామేశ్వరి కథ (చూ).

**కామసముద్రము అప్పలాచార్యులు**

కాలం : క్రీ. శ. 18 వ శతాబ్దం ఉత్తరార్ధం.

స్థలం : గద్వాల.

రచనలు : 1. కృష్ణలీలా తరంగిణి (లేక) ఆంధ్రాష్టపది. 2. యథాశ్లోకతాత్పర్య రామాయణము (కిష్కింధాకాండ).

బిరుదం : విద్వత్కవి కుంజర.

కృష్ణమాచార్యుల కుమారుడు. గద్వాల సోమభూపాలుని ఆస్థాన కవిగా ఉండేవాడు. చతుర్విధ కవితా విశారదుడు. సంస్కృత ప్రాకృతాంధ్రాలలో శతాధిక గ్రంథ సంధానం చేశాడు సంస్కృతంలోని కృష్ణలీలా తరంగిణిని "ఆంధ్రాష్టపది" అనే పేరుతో తెలుగులో వ్రాశాడు. "యథాశ్లోక తాత్పర్య రామాయణం"లోని కిష్కింధాకాండను మూడు ఆశ్వాసాలుగా అనువదించాడు. (ఆం. సం. సా)

**కామిదేవి శాసనము**

కాలం : క్రీ. శ. 1148 ప్రాంతం.

శాసనం వేయించినవారు : మల్లధరిత్రీనాథుని కులసతి కామిదేవి.

ప్రస్తావిత స్థలం : అమరావతి, గుంటూరు జిల్లా.

శాసనవిషయం : ఈ శాసనం ప్రకారం కామిదేవి మల్లభూపతి అర్ధాంగి. ఈమె భక్తితో అమరావతిలోని అమరేశ్వరునకు అఖండదీపం ఎత్తించింది. అట్లే కేశవస్వామికి కూడా అఖండదీపం నిలిపింది. అమరావతి నేలిన ఎల్లమహీపతికి-వెన్నమాంబకు

ఈమె తనయయని శాసనం వల్ల తెలుస్తున్నది. దీనిలో ఒక తరువోజ, ఒక చంపకమాల ఉన్నాయి. (తె. క. చ.)

కామినేని (మొదటి) ఎల్లారెడ్డి

కాలం : 15వ శతాబ్దికి పూర్వుడు.

స్థలం : దోమకొండ సంస్థానం

దోమకొండ సంస్థానాధిపతులకు మూలపురుషుడుగా భావించబడుతున్న "కామినేని చౌదరి"కి నాలుగవ తరంవాడు. ఇమ్మడి కాచారెడ్డి కుమారుడు. సాహిత్య పోషకుడు.

ఇతడు సప్త సంతాన ప్రతిష్ఠాత అనీ, బాలభారత, కిరాతార్జునీయాది సత్కృతి సంతతిని అంకితం పొందినవాడని సూతసంహిత ద్వారా తెలుస్తున్నది. ఈ వంశంలోని వాడే అయిన కామినేని మల్లారెడ్డి రచించిన "శివధర్మోత్తరము" "పట్టమెట్ట సోమనాథ సోమయాజి" రచించిన "బ్రహ్మోత్తర ఖండం" కూడా ఈ అభిప్రాయాన్ని బలపరుస్తున్నాయి. ఇతని కాలంలోనే కాకమాని గంగాధరుడనే కవి బాలభారతం వ్రాశాడు కాని ఇతడు కృతి పుచ్చుకొన్నది ఈ బాలభారతమో కాదో తెలియదు. ప్రోలుగంటి చెన్నయ్య మంత్రి (సౌభరి చరిత్ర-యక్షగాన రచయిత) కూడా ఒక బాలభారతం వ్రాశాడు. ఎల్లారెడ్డి ఎవరి కృతిని అంకితం పుచ్చుకొన్నాడో నిర్ణయించటానికి ఆధారాలు లేవు. ఈయన కృతి పుచ్చుకొన్న రెండో గ్రంథం "కిరాతార్జునీయం" కూడా ఎవరు వ్రాశారో తెలియదు.

(ఆం. సం. సా-180) (ఆరుద్ర-9-210)

కామినేని (ఇమ్మడి) ఎల్లారెడ్డి

కాలం : క్రీ. శ. 16వ శతాబ్దం ద్వితీయార్ధం - 17వ శతాబ్దం ప్రారంభం.

స్థలం : దోమకొండ సంస్థానం.

రచనలు : వాసిష్ఠము, లైంగధర్మము (వాసిష్ఠ లైంగధర్మము).

దోమకొండ సంస్థానాధీశ్వరుడైన 'ముమ్మడి కాచారెడ్డి'కి కుమారుడు. కామినేని ఎల్లారెడ్డి కవికి సోదరుడు. వీరి సోదరుడు మల్లారెడ్డి దోమకొండ పాలకుడట. పట్టమెట్ట సోమనాథ సోమయాజి కవిని ప్రోత్సహించి బ్రహ్మోత్తర ఖండ గ్రంథాన్ని వ్రాయించి అంకితం పొందాడు. ఇతడు బహు పురాణజ్ఞుడని, బహు భాషావేత్త అని తెలుస్తున్నది. కాని ఇతని రచనలు లభ్యం కాలేదు. ఈయన రచించిన వాసిష్ఠ లైంగ ధర్మం ఒక గ్రంథమేనా లేక రెండు గ్రంథాలా అన్నది తేలని ప్రశ్నగా ఉంది.

(ఆం. సం. సా-184)

కామినేని కామిరెడ్డి

కాలం : క్రీ. శ. 16వ శతాబ్ది.

కామినేనివారు మెదకు మండలాధిపతులు. గోలకొండ నవాబుల సామంతులు.

విశిష్టత : ఇతడు కవి. పండిత పోషకుడు. కృతిపతి. ఈయన పట్టమెట్ట సోమనాథుని చేత స్కాంద పురాణంలోని సూత సంహితను ఆంధ్రీకరింపజేసి అంకితం

పుచ్చుకొన్నాడు. ఆశ్రయించిన సోమనాథుని పోషించాడు. అకలంక క్రియ కావ్యాలు చెప్పిన సోమనాథునికి అందలాలు, అశ్వాలు, ధనం బహూకరించాడు.

బాలభారత, కిరాతార్జునీయ కావ్యాలు అంకితం పుచ్చుకొన్నకామినేని ఎల్లారెడ్డికి నలుగురు మనుమలు. వారిలో ముగ్గురు కృతి భర్తలు. అందులో ఇద్దరు స్వయంగా కృతి కర్తలు. ఈయన ఎల్లారెడ్డి రెండో మనుమడు. తులికుతుష్షా సమకాలికుడు. పట్టమెట్ట సోమనాథుడు, ఇతడూ మల్లికార్జున పండితారాధ్యుల వంశంలోని లింగారాధ్యులవారికి శిష్యులట. ఈయన తమ్ముడు (ఇమ్మడి) ఎల్లారెడ్డి సోమనాథ విరచిత బ్రహ్మోత్తర ఖండానికి కృతిభర్త. ఇంకో తమ్ముడు మల్లారెడ్డి షట్చక్రవర్తి చరిత్ర, శివ ధర్మోత్తరం పద్మపురాణాలను వ్రాశాడు. (అరుద్ర-9)

## కామినేని జంగమరెడ్డి

కాలం : క్రీ. శ. 16వ శతాబ్దం చివర-17వ శతాబ్దం ప్రారంభం.
స్థలం : దోమకొండ సంస్థానం.

దోమకొండ సంస్థాన పాలకుడు. "ముమ్మడి కాచారెడ్డి"కి కుమారుడు. ఈ వంశంలో ప్రసిద్ధి చెందిన మల్లారెడ్డి, ఎల్లారెడ్డి అనే సోదర కవులు ఈ జంగమరెడ్డికి తమ్ములు.

జంగమరెడ్డి "సత్కవి వర్య కోటికిం బంగరుకొండ" అని సూత సంహిత పేర్కొన్నది. ఇతడు రచించిన గ్రంథాలు కాని ఇతని పోషణలో ఉన్న కవి పండితులకు సంబంధించిన వివరాలుగాని లభించలేదు. (ఆం. సం.సా-180)

## కామినేని మల్లారెడ్డి

కాలం : క్రీ. శ. 16వ శతాబ్దం చివర- 17వ శతాబ్దం ప్రారంభం.
స్థలం : దోమకొండ సంస్థానం.
రచనలు : షట్చక్రవర్తి చరిత్రము,శివధర్మోత్తరఖండము,పద్మపురాణము మొ॥వి.
బిరుదులు : సత్కవిరాజు, సర్వజ్ఞభోజుడు, భాషాశేషాహి.

బిక్కనవోలు ప్రభువు. దోమకొండ సంస్థానాధీశుల వంశంలోని వాడు. ముమ్మడి కాచారెడ్డి కుమారుడు. ఇతని సోదరుడైన కామారెడ్డి క్రీ.శ. 1636లో "అబ్దుల్లా హుసేన్‌కుతుబ్ షాహి" చేత దోమకొండ సంస్థానపు సన్నదు సంపాదించాడని తెలుస్తున్నది. ఆ కారణంచేత అతని సోదరుడైన ఈ మల్లారెడ్డి క్రీ. శ. 17వ శతాబ్ది-ప్రథమ భాగానికి చెందినవాడని అభిప్రాయం.

మల్లారెడ్డి సాహిత్యమూర్తి. కామినేని వంశానికి ఎత్తిన కీర్తి పతాక. రెడ్డి కవులందరిలో ఇతడు ప్రాచీనుడు. చాలామంది తెలుగు కవుల ప్రత్యేకతను పుణికి పుచ్చుకొన్నాడు. తొలి రచనలో శ్లేష వైపు మొగ్గినా తన చివరి గ్రంథంలో మృదు భావాలకే ప్రాధాన్యమిచ్చాడు. ఈయన సోదరుడు కామిరెడ్డి, పట్టమెట్ట సోమనాథ విరచిత సూత సంహితకు కృతిభర్త. మరొక సోదరుడు ఇమ్మడి ఎల్లారెడ్డి, సోమనాథ విరచిత

బ్రహ్మోత్తర ఖండానికి కృతిభర్తగాక, స్వయంగా కవియై వాసిష్ఠలైంగధర్మం అనే కృతి (కృతులు) వ్రాశాడు.

శబ్దశాస్త్ర పరిచయం చూపటానికి-వ్యాకరణ పదాలను, అలంకారాలను, రీతులను కూడా శ్లేషలలో చేర్చి పద్యాలు వ్రాశాడు. శ్రీనాథ, పెద్దన, భట్టుమూర్తుల పోకడలు ఇతనిలో కనిపిస్తాయి. (ఆం. సం. సా-180-82; ఆరుద్ర-9-215)

## కామినేని రాజన్న చౌదరి

కాలం : క్రీ. శ. 1748-1757.

స్థలం : దోమకొండ సంస్థానం (బిక్కనవోలు).

కవి, పండిత పోషకుడైన రాజన్న చౌదరి క్రీ. శ. 1748 నుంచి క్రీ. శ. 1757 వరకు దోమకొండ సంస్థానాధిపతిగా ఉన్నాడు. ఈ వంశపు ప్రభువులలో మిక్కిలి ప్రసిద్ధి చెందినవాడు. ఇంతవరకు ఈ సంస్థానానికి "బిక్కనవోలు" రాజధానిగా ఉండేది. ఇతని కాలంలో రాజధాని "కామారెడ్డి"కి మార్చబడింది. ఆ తరువాత మళ్ళీ దోమకొండకు మార్చబడింది.

రాజన్న చౌదరి రాజర్షిగా ప్రఖ్యాతుడు. భక్తి ప్రపత్తులు అధికం. సాహిత్యాభిమాని. సాహితీ పోషకుడు. రాపాక లక్ష్మీపతి ఇతని ఆస్థానకవి. ఈ కవి 'భద్రాయురభ్యుదయము' రాజన్న చౌదరి ప్రేరణ చేతనే వ్రాయబడింది. (ఆం.సం.సా-17-185)

## కాముని పౌర్ణమి వినోదాలు

తెలంగాణాలోని గ్రామీణ ప్రజలకు ఇది చాలా ఆనందదాయకమైన పండుగ. పౌర్ణమికి మూడు రోజులు ముందుగానే వెన్నెల రాత్రులలో గుంపులు, గుంపులుగా ఈ వినోద కార్యక్రమాలు ప్రారంభమవుతాయి. ఈ పున్నమి ఒక్క తెలంగాణాలోనే కాకుండా ఉత్తర హిందూస్థాన మంతటా కడు వేడుకగా పూర్వకాలంనుంచి జరుగుతూనే ఉంది. ఇది ప్రసిద్ధి చెందిన వసంతోత్సవం.

వావి వరుసలు లేకుండా ఒకరిమీద మరొకరు వసంతాలను చిమ్ముకుంటూ, ఒడలు మరిచి తన్మయత్వంలో ఈ వినోదాలను జరుపుకుంటారు. కుల మత వైషమ్యాలు లేకుండా ఎంతో అన్యోన్యంగా ఈ వినోదాలు సాగుతాయి.

ఇలాంటి వసంతోత్సవాలు తీరాంధ్రదేశంలో-వివాహానంతరం కంకణాలు విప్పే రోజున జరుగుతాయి. ముఖ్యంగా సీతారాముల కల్యాణ సమయంలో బళ్ళమీద వసంతాలతో నింపిన భాండాలు పెట్టుకొని-గ్రామవీధుల్లో కనిపించిన వారిమీద వసంతాలను విరజిమ్మి, గులాములు చల్లుతారు. మామ, బావ వరస అయిన వారి మెడలలో పిడకలు, కప్పలు, మామిడి టెంకలు మొదలయిన వాటితో దండలు వేసి, వినోదిస్తారు.

ఈ పున్నమి సందర్భంలో వెన్నెల పాటలు, అల్లో నేరేళ్ళు, కోలాటపు పాటలను స్త్రీలు, జాజర పాటలు, కోలాటపు పాటలను పురుషులు పాడుతూ ఉంటారు. కోలాటం పాటలు పాడే వినోదంలో స్త్రీపురుషులిద్దరూ పాల్గొంటారు. ఈ సంద

ర్భంలో పురుషుల కోలాటం పాటలు ఉద్ధృతంగాను, స్త్రీల కోలాటాలు లలిత మధురంగాను ఉంటాయి. (చూ. వసంత మహోత్సవాలు) (నా. ర. చ_286_287).

**కామేశ్వరి కథ**

కాలం : క్రీ. శ. 13_15 శతాబ్దాలు.

నామాంతరం : కామవల్లి కథ.

పూర్వం ఈ కథను బ్రాహ్మణ గృహాలలో ప్రసిద్ధంగా చెప్పుకుంటూ ఉండేవారట. ఇరుగు పొరుగు అమ్మలక్కలందరూ పని పాటలు అయిపోయాక ఉదయం నుంచి సాయంత్రం వరకూ ఈ కథను కర్ణానందంగా వినేవారట. అందుకే "అక్కలు లేచేవరకు_నక్కలు కూసె" అనే సామెత వచ్చింది.

ఇది మొదట బ్రాహ్మణ స్త్రీల ద్వారా ప్రచారంలోకి వచ్చినా, క్రమంగా ఇతర జాతుల స్త్రీలలోకి కూడా వ్యాపించి ఎక్కువ ప్రచారంలోకి వచ్చింది. ఇది ఇప్పుడు గుంటూరు, కృష్ణా జిల్లాలలో బాగా వ్యాప్తిలో ఉంది. దీనిని జక్కులవారు కూడా ప్రచారంలోకి తెచ్చారు "కామవల్లీ మహాలక్ష్మి కైటభారి వలపు బాడుచు వచ్చె జక్కులపురంధ్రి" అని క్రీడాభిరామంలో ఉంది.

వైకుంఠంలో లక్ష్మీనారాయణుల సమక్షంలో నారదుడు శ్రీరామ ప్రశంస చేయగా లక్ష్మి అతనిని చూడగోరింది. విష్ణువు ఆమెను వారించి శ్రీరాముని తీసుకొని రమ్మని శంభు భట్టును అయోధ్యకు పంపాడు. గరుడ వాహనుడై వస్తున్న శ్రీరాముని చూసిన లక్ష్మీదేవి విష్ణువే తనను అలరించడానికి ఆ రూపంలో వచ్చాడనుకొన్నది. ఆమె సమీపించబోగా శ్రీరాముడు నిరాకరించాడు. తాను ఏక పత్నీవ్రతుడనని చెప్పి తప్పించుకొని పోతున్న శ్రీరాముని లక్ష్మీదేవి అతని వ్రతం చెడేటట్లు శపించింది శ్రీరాముడు కూడా ఆమెను కామేశ్వరిగా జన్మించి విరహంతో తపించమని శపించాడు.

లక్ష్మి ఈ సంగతి విష్ణువుతో చెప్పగా శివునికి జన్మించి భక్తుల కోరికలు తీరుస్తూ ఉండమనీ తాను కృష్ణావతారం ఎత్తుతాననీ చెప్తాడు. శివ పార్వతులకు లక్ష్మి సప్త కన్యకలుగా జన్మించింది. వారికోసం బ్రహ్మ ఒక పట్టణం నిర్మించాడు. వారి రక్షణార్థం ఉన్నవారే పోతురాజు కూనలమ్మలు. ఏడుగురిలో చివరిది కామేశ్వరి. ఆమె రుక్మిణిగా జన్మించి శ్రీకృష్ణుని పొందిందని ఒక కథ ఉంది. ఆమె కల్క్యవతారంలో విష్ణుని చేరుతుందనే గాథ కూడా ఒకటి ఉంది. (నా. ర. చ_68, ద్వి. సా. చ. 464)

**కామేశ్వరీ చరిత్రము**

కర్త : వేటూరి భావనా మాత్యుడు.

అంకితం : ఎర్రగుంటి చెరువుదగ్గర వెలసిన కామేశ్వరీ దేవికి.

ద్విపద కావ్యం. తెలుగు దేశంలో కామేశ్వరి కథ సుప్రసిద్ధం. ఈమెనే 'కామవల్లీ మహాలక్ష్మి', ఆదిలక్ష్మి, కామేశ్వరి, కామవల్లి, అక్కలు అనే పేర్లతో కొలుస్తుంటారు. ఆదిలక్ష్మి శ్రీరాముని చూచి మోహించింది. ఆయన ఏకపత్నీవ్రతుడు.

రాముడు లక్ష్మిని శపిస్తే, ఆమె రాముని శపించింది. తరువాత అవతారంలో ఆమె కామేశ్వరిగా పుట్టింది. శ్రీరాముడు కృష్ణునిగా అవతారమెత్తినా, కామేశ్వరి అయనను పొందలేక పోయింది. తరవాత కల్క్యవతారంలో కూడా ఆమె ఆయనను పొందలేదు. ఈమె కథను శ్రీనాథుడు 'క్రీడాభిరామం'లో సూచించాడు. 'కామవల్లీ మహాలక్ష్మి కైటభారి వలపుపాడుచు వచ్చె జక్కుల పురంధ్రి' అని చెప్పాడు. తరవాత అక్కలనోము వర్ణించాడు. ఈమె పార్వతి కడుపున సప్త కన్యలుగా పుట్టింది. స్త్రీల పాటలలో కామేశ్వరి కథ ప్రసిద్ధం. ఈ కథను అక్కినేపల్లి నరసింహకవి కూడా "ఆదిలక్ష్మి విలాసము" అనే పేర పద్య కావ్యంగా వ్రాశాడు. (ఆరుద్ర-9)

కారిక

కావ్య పరిభాష. అర్థాన్ని చెప్పే శ్లోకరూపమైన వ్యాఖ్యానానికి 'కారిక' అని పేరు. ఇది సంస్కృత కావ్యాలకే వర్తిస్తుంది. (కావ్యాలంకార సంగ్రహం)

కారికా కదంబమ్ (సం)

కర్త : కంచం ఎల్లయార్యుడు.

ఈ పుస్తకం వ్రాసినట్లు కవి స్మృతికదంబంలో చెప్పాడు. (తె. వి. స-4)

కారికావళి

కర్త : మరింగంటి లక్ష్మణ దేశికులు.

అముద్రితం. (తె. వి. స-8)

కార్తిక మాహాత్మ్యము

కర్త : కుందుర్తి వేంకటాచల కవి (చూ).

అంకితం : తీర్థపుర (తురయూరు) క్షేత్రంలో వెలసిన గోపాలస్వామికి.

ఆరు ఆశ్వాసాల పద్య కావ్యం. కార్తిక మాస మహిమతోపాటు మరి కొన్ని ఉపాఖ్యానాలూ ఉన్నాయి. తీర్థపురి పాలకుడైన వేంకటాచల నృపుని కోరికపై కవి ఈ రచన చేసినట్టు తెలుస్తుంది. రచన సలక్షణమైనది. (ద. దే. వా-371)

కార్తికవ్రత మాహాత్మ్యము

కర్త : చూ. మందపాక కామకవి.

కార్తిక మాసంలో ఆచరింపబడే "కార్తిక వ్రతం" యొక్క మాహాత్మ్యాన్ని తెలిపే రచన. (ఆం. సం. సా-307)

కార్తికేయాభ్యుదయము (అలభ్యం)

కవి : ఎలకూచి బాలసరస్వతి.

చంపూ కావ్యం. (క. త-11-144)

కార్వేటి నగరము

ఇది పురాతనమైన పదమటి పాళయములలో ఒకటి. తొండమండలం, తుండీర మండలం అని ఈ ప్రాంతానికి పూర్వం వ్యవహారముండేదట.

ఈ సంస్థానాన్ని పూర్వం రెడ్డిరాజులు, సాళువ వంశీయులు పాలించారట. ఉత్తర సర్కారుల నుండి వచ్చిన "మాకరాజు", 'బొప్పరాజు' అనే సూర్యవంశ క్షత్రియులు ఈ సంస్థాన ప్రభువులకు మంత్రులుగా ఉంటూ, వారు నిస్సంతుగా మరణించగానే సంస్థానాన్ని ఆక్రమించుకున్నారు. "కరికాల చోళుడు" వీరికి మూలపురుషుడట. వీరు చాలా కాలం చంద్రగిరి పాలకులకు సామంతులుగా ఉంటూ వచ్చారు. ఆ తరువాత కర్ణాటక నవాబు క్రింద ఉండేవారు. క్రీ. శ. 1801 నాటి ఒడంబడిక ప్రకారం ఇది కుంఫిణీవారి హస్తగతమైంది.

కాళహస్తికి సమీపంలో ఉన్న 'నారాయణ వనం' ఈ సంస్థానపు మొదటి రాజధాని. సంస్థాన పాలకులలో ఒకడైన మొదటి పెరుమాళ్ళ రాజు (క్రీ. శ. 1719-1732) కాలంలో 'కార్వేడు' నిర్మించబడి రాజధాని మార్చబడింది. ఇది పుత్తూరుకు పడమరగా మూడు కోసుల దూరంలో ఉంటుంది.

క్రీ. శ. 1850 లో రాజా బొమ్మరాజు బహద్దరు కాలంలో, సంస్థానం అప్పులపాలైనందున దీనిలోనుండి అనేక గ్రామాలను అమ్మివేయవలసి వచ్చింది. ఈ శతాబ్దంలోని వారైన కుమార వేంకట పెరుమాళ్ళరాజు ఈ సంస్థాన ప్రభువులలో చివరివాడు. వీరి కాలంలో సంస్థానం భారత గణతంత్ర రాజ్యంలో కలిసి పోయింది.

కార్వేటి నగర పాలకులు మధుర సాహితీ సేవకులు, గాన విద్యానిధులు, కళా పోషకులు, సప్త సంతాన ప్రతిష్ఠాపకులు.

విజయనగర ప్రభువులవలె వీరికి సంస్థానంలో అష్టదిగ్గజ కవులను పోషించే అలవాటు ఉంది. మాకరాజు పెరుమాళ్ళకాలంలో ఈ సంస్థానంలో అష్టదిగ్గజాలున్నట్లు తెలుస్తున్నది. వీరిలో తిరుమలరాజు, కనవరాజు, రామకృష్ణరాజు, తిరువేంగళరాజు, వేంకట పెరుమాళ్ళరాజు, బొమ్మరాజు, కుమార వేంకట పెరుమాళ్ళరాజు మొ॥ పెక్కురు ప్రభువులు కవిపండితులను పోషించి సాహిత్యసేవ గావించారు.

ఋగ్వేది వేంకటరాజుకవి, పోలిపెద్ది వెంకటరాయుడు, పాలమంగలం అప్పయ కవి, శ్రీశైల కవి, రాయభట్టు వీరరాఘవ కవి, అనంతరాజు సుబ్బరాయ కవి, అప్పయాచార్యులు, చదలవాడ మల్లన, శ్రీనివాస కవి, కంఠీరవ కవి, కచ్ఛపేశ్వర దీక్షితులు మొ॥ పెక్కురు కవులు ఈ ఆస్థానంలో సమాదరింపబడ్డారు. (ఆం. సం. సా.)

## కాలజ్ఞాన తత్త్వములు

కర్త : వీరబ్రహ్మయోగి.

కులమత భేదంలేవి, అష్టాంగ యోగంతో కూడిన వేదాంత మార్గాన్ని బోధిస్తున్న ఈ తత్త్వాలు తెలుగు దేశపు గ్రామసీమలలో బహుళప్రచారంలో ఉన్నాయి. రచన సరళమైన జాను తెనుగులో నడిచింది. కందాలు, కందార్థాల ద్వారా వేదాంత సాహిత్యాన్ని సర్వజన సాధారణం చేసినవీ తత్త్వాలు. (తె. వి. స-4)

## కాలజ్ఞానము

కవయిత్రి : బాలపాపాంబ.

ఈ గ్రంథం యోగశాస్త్రానికి, తత్త్వ శాస్త్రానికి సంబంధించినది (తె.వి.స-4)

**కాల బాలార్ణవ సంగ్రహమ్ (సం)**

కర్త : కాకునూరి అప్పకవి.

సంస్కృతంలోని కాల బాలార్ణవానికి ఇది శ్లోకరూప సంగ్రహం.

**కాల మాధవమ్ (సం)**

నామాంతరం : ధర్మశాస్త్రం-కాలనిర్ణయమ్.

కర్త : విద్యారణ్యుడు. (తె. వి. స-4)

**కాలామృతము**

కర్త : కాకునూరి తిమ్మకవి

దీనిలో వాస్తు ప్రకరణం మాత్రమే ఉంది. ఇది జ్యోతిషగ్రంథం. (ఆరుద్ర-6)

**కాలామృతము**

కర్త : తిరుమల భట్టారకుడు.

రచనాకాలం : 1450-1500 ప్రాంతం.

జ్యోతిష గ్రంథం. సంస్కృత గ్రంథానికి అనువాదం.

**కాలుపల్లి అర్చనమంత్రి**

కాలం : తెలియదు.

రచన : ఘటికాచల మాహాత్మ్యము (ద్విపద).

తండ్రి రామసుబ్రతుడు. తల్లి అక్కమాంబ. ఇతని రచన అంత ప్రౌఢంగా లేదు. ఇతని గ్రంథం ఆంధ్రసాహిత్య పరిషత్తులో ఉంది. (ద్వి. సా. చ. 180)

**కావన ఏలూరు శాసనము**

కాలం : క్రీ. శ. 1192.

శాసనప్రదాత : కావన.

ప్రస్తావిత స్థలం : కొలని సోమేశ్వరాలయం.

శాసనప్రదేశం : పశ్చిమ గోదావరి జిల్లా ఏలూరు.

శాసన విషయం : ఈ శాసనం ఏలూరులోని మసీదు స్తంభం మీద చెక్కి ఉంది. కావన తన తల్లి దండ్రులకు ధర్మార్థంగా కొలని సోమేశ్వర స్వామికి అఖండ దీపం విలిపినట్లు దీనివల్ల తెలుస్తున్నది. దీనిలో ఒక సీస పద్యముంది. (తె.క.చ-310)

**కావలి లక్ష్మయ్య**

కాలం : 19వ శతాబ్దం పూర్వార్ధం.

కావలి వెంకట బొర్రయ్య సోదరుడు. తెలుగు దేశచరిత్రకు సంబంధించిన కైఫీయతులను సముపార్జడంలో కల్నల్ మెకంజీకి సహాయపడ్డాడు.

(చూ. కావలి వెంకట బొర్రయ్య).

**కావలి వేంకటు బొర్రయ్య**

కాలం : క్రీ. శ. 1776-1803.

స్థలం : పశ్చిమ గోదావరి జిల్లా ఏలూరు.

రచనలు : 1. శ్రీరంగపట్టణ రాజ వంశావళి 2. యాదవ రాజుల వంశావళి 3. కాంచీపుర మాహాత్మ్యము.

ఈయన సంస్కృతాంధ్ర పండితుడు. ఫారశీ, హిందుస్థానీ, ఇంగ్లీషు, కన్నడం, తమిళం, మహారాష్ట్ర భాషలు నేర్చుకొన్నాడు. ఆంగ్లేయ అధికారుల వద్ద (ఈస్టిండియా కంపెనీ) ఉద్యోగిగా ఉండేవాడు. మొదట "డెంట్ దొర" వద్ద లేఖకుడుగాను, తరవాత కల్నల్ మెకంజీ వద్ద ప్రధాన లేఖకుడుగాను, దుబాసిగాను పని చేశాడు.

కల్నల్ మెకంజీ శ్రీరంగ పట్టణాన్ని ముట్టడించి టిప్పుసుల్తాన్‌తో యుద్ధం చేసి కోటను సాధించినప్పుడు, ఆ ముట్టడిని ప్రత్యక్షంగా చూసి తెలుగులో కావ్యంగా వ్రాశాడు. దానికి మెకంజీ సంతోషించి ఇతన్ని బహూకరించాడు. (కావ్యం పేరు తెలియదు).

హరిహర్ దగ్గర ఆర్థర్ వెలెస్లీ దొర 'ధోండియా' అనే మహారాష్ట్ర నాయకుని పట్టుకొన్నప్పుడు కూడా బొర్రయ్య ఒక కావ్యం చెప్పాడట. (కావ్యం పేరు తెలియదు).

ఉమ్మత్తూరు సంస్థాపనం దగ్గర నుంచి దానిని పాలించిన శ్రీరంగ పట్టణ రాజులందరి వంశావళిని గ్రంథంగా వ్రాశాడు. ఇది గాక యాదవ రాజుల వంశావళి అనే గ్రంథం కూడా వ్రాశాడు. శాసనాలను మొదట తెలుగులో చదివి అర్థం చేసుకొన్నవాడు ఈయనేననీ, దేశ పటాలను కూడా బాగా గీసేవాడనీ చెబుతారు. సంస్కృతంలో శ్లోకాలు కొన్ని రచించాడట. ఇతడు ఇరవై ఆరేళ్ళ చిన్న వయస్సులోనే మరణించాడు.

(తె. వి. స-4)

## కావూరి ఎల్లయ్య

కాలం : క్రీ. శ. 16 శతాబ్ది.

స్థలం : గుంటూరు మండలం.

రచనలు : 1. మిత్రవిందా పరిణయము (అలభ్యం) 2 బ్రహ్మాండ పురాణము.

గురువు : తిరుమల తిరు వేంకటాచార్యుడు.

వెంకనా మాత్యుని పుత్రుడు. ఇతని ఇంటి పేరును "రావూరి"గా కొందరు పేర్కొన్నారు. కావూరి అని చెప్పేవారు, ఈయన గుంటూరు జిల్లా నరసరావుపేట తాలూకా కావూరి నివాసి కావచ్చునని అంటున్నారు. మొదటి కావ్యంలో కవి తన వంశ చరిత్రను చెప్పాడట కాని, అది అలభ్యం. రెండో దానిలో కవి తన వివరాలేమీ చెప్పలేదు. ఈయన నన్నయభట్టును "ఆంధ్ర కవీంద్రుల కాదియైన శబ్దాను శాసను చరణముల్ సేవించి" అని స్తుతించాడు. ఇతని రచన లలితమై మనోహరంగా ఉంటుంది

(క. స-26)

## కావేరి రాజు

కాలం : తెలియదు.

కార్వేటి నగర సంస్థాన పాలకుడు. కృతిపతి. సాహిత్య పోషకుడు. శ్రీశైల కవి రచించిన "వంశానుక్రమణ దర్పణము" అనే ఏకాశ్వాస గ్రంథాన్ని అంకితం పొందాడు.

రామభద్రరాజు మొదలుగా కావేరి రాజు వరకు గల కార్వేటి నగర రాజన్యుల వంశ చరిత్రం ఇందులో వర్ణింపబడింది. (ఆం. సం. సా)

**కావ్య ప్రకాశికవ్యాఖ్య**

కర్త : తాళ్ళపాక తిరు వేంగళాచార్యులు.
రచనా కాలం : క్రీ. శ. 1550 ప్రాంతం.

కావ్య ప్రకాశికకు వివరణ గ్రంథం. (తె.వి స-4)

**కావ్య ప్రకాశికావ్యాఖ్యానమ్ (సం)**

కర్త : యజ్ఞేశ్వరుడు.

ఇది మమ్మటుని కావ్య ప్రకాశికకు వ్యాఖ్యానం. (తె. వి. స-4)

**కావ్య ప్రబంధము**

దీనికి కావ్య లక్షణాలు, ప్రబంధ లక్షణాలు ఉంటాయి (చూ. కావ్యము, ప్రబంధము). ఈ రెండు లక్షణాలతో తెలుగులో కావ్య రచన జరిగింది. కావ్య ప్రబంధాలకు ఉదాహారణగా ఎర్రన నృసింహ పురాణము, నాచన సోమన ఉత్తర హరి వంశము, పినవీరన శృంగార శాకుంతలము, శ్రీనాథుని శృంగార నైషధము మొదలైన కావ్యాలను చెప్పవచ్చు.

**కావ్యము**

ప్రాచ్య పాశ్చాత్య లాక్షణికులు కావ్య శబ్దానికి చాల వ్యుత్పత్తులు చెప్పి కావ్యాన్ని చాలా రకాలుగా నిర్వచించారు. అవి ఈ దిగువ విధంగా ఉన్నాయి.

వర్ణింప దగినది కావ్యము. —లోచన కారుడు

వర్ణించేవాడు కవి. అతని కర్మ కావ్యము. —విద్యాధరుడు

రసభావాలను విమర్శించేవాడు కవి. అతని కర్మకావ్యము. —భట్టగోపాలుడు

దోషాలు కానివి, సగుణాలు, సాలంకారాలు, అయిన శబ్దార్థాలు కావ్యము. —మమ్మటుడు

దోషములేని, గుణాలంకార రసభరితమైన వాక్యము కావ్యము. —భోజుడు

గుణాలంకార రీతి రసోపేతమైన సాధు శబ్దార్థ సందర్భం కావ్యము. —వాగ్భటుడు

దోషములేని, గుణాలంకార రీతి మంతమైన వాక్యము కావ్యము. —పీయూషవర్షుడు

రసాదులతో కూడిన వాక్యము కావ్యము. —శౌద్ధోదని

రసాత్మకమైన వాక్యము కావ్యము. —విశ్వనాథుడు

రమణీయార్థ ప్రతిపాదకమైన శబ్దం కావ్యము. —జగన్నాథుడు

రసాలంకార యుక్తము, సుఖ విశేష సాధనము అయిన వాక్యము కావ్యము. —కేశవమిశ్రుడు

ఛందస్సహితమైన రచనా విశేషం కవిత్వము. యుక్తితో భావనను జత పరిచి, సత్యాన్ని ఆనందంతో సమ్మేళనం చేసే కళయే కవిత్వము. —జాన్సన్

ఆవేశం అప్రయత్నంగా మూర్తీభవించి ఉండే పదాలు, భావాలు కవిత్వము —జాన్‌స్టూవార్ట్ మిల్

భావానికి ఒక రకంగా భ్రాంతిని కలిగించేటట్లు పదాలను ఉపయోగించే కళయే కవిత్వము. చిత్రలేఖకుడు రంగుల సాయంతో చేసే పనిని కవిత్వం శబ్దాల సాయంతో చేస్తుంది. —మెకాలే

భావనా వ్యక్తీకరణమే కవిత్వం. —షెల్లీ

భావనావేశాలను వ్యక్తం చేసే భాష కవిత్వము. —లేహంట్

శాస్త్రానికి వ్యతిరేకమైంది కవిత్వము. దాని అవ్యవహిత ఫలము సత్యంకాదు ఆనందము. —కోలరిడ్జ్

శక్తిమంతాలయిన భావాలు అప్రయత్నంగా పెట్టబడటమే కవిత్వము. —వర్డ్స్‌వర్త్

మానవ హక్కులకు సాధ్యమైనంత అధికానందకరంగాను, నిర్దుష్టంగాను చెప్ప గలగటమే కవిత్వము. అది మానవుడు సత్యాన్ని చెప్పటానికి మిక్కిలి సన్నిహితంగా వచ్చే సర్వ సమగ్రమైన వాగ్రూపము. కవితా సత్య సౌందర్య నియమాలను అనుసరించే జీవిత విమర్శ కవిత్వము. —మాథ్యూ ఆర్నాల్డ్

ఉత్తమావేశాలకున్న ఉత్తమ హేతువులను భావన చేత ధ్వనింప జేయటం కవిత్వము. —జాన్ రస్కిన్

ఉప్పొంగి వచ్చే భావ పరంపరల వ్యక్తీకరణమే కవిత్వము. —జాన్ కేబెల్

భావనాయుక్తాలయిన ఆలోచనావేశాలను ఛందస్సహితమైన భాషలో వ్యక్తీక రించటం ద్వారా ఆనందాన్ని ఉత్పాదించే కళ కవిత్వము. —ప్రొఫెసర్ కోర్ట్ హోప్

ప్రాచ్య, పాశ్చాత్య పండితులు కావ్య స్వరూపాన్ని పై రకాలుగా నిర్వ చించారు. అన్ని నిర్వచనాలను సమన్వయించుకొంటే కావ్య స్వరూపం పూర్తిగా తెలుస్తుంది.

కావ్యము శ్రవ్యము, దృశ్యమని రెండు రకాలు ఇందులో పద్య, గద్య భేదా లున్నవి. పద్యకావ్యం ఇతివృత్తాన్నీ రచననూ బట్టి మహాకావ్యం, ఉపకావ్యమని రెండు రకాలు.

వస్తువునుబట్టి కావ్యం ప్రఖ్యాతము, ఉత్పాద్యము, మిశ్రము అని మూడు రకాలు. ప్రఖ్యాతమంటే పురాణ ప్రసిద్ధము (రామాయణాదులు). ఉత్పాద్యమంటే కేవల కల్పితము (కళాపూర్ణోదయం వంటివి) మిశ్రమంటే కొంత ప్రఖ్యాతము, కొంత ఉత్పాద్యము (అభిజ్ఞాన శాకుంతలం వంటి కావ్యాలు). (తె వి స-6)

**కావ్యానుశాసనము**

నామాంతరం : కవి (లోక) చింతామణి.

కర్త : వెల్లంకి తాతంభట్టు.

**కావ్యాలంకార చూడామణి**

కర్త : విన్నకోట పెద్దన.

కృతిపతి : చాళుక్య విశ్వేశ్వర భూపతి.

ప్రత్యేకత : కావ్యగుణాలు, అలంకారాలు సుబోధకంగా చెప్పిన గ్రంథం. తెలుగులో రసచర్చ చేసిన మొదటి గ్రంథం లభ్యమైనంతవరకు ఇదే. విశ్వేశ్వర భూపతి ధైర్య సాహసాలను చిత్రిస్తూ కవి వ్రాసిన సంస్కృత శ్లోకం "పంచధారల" శాసనంలో ఉంది. అదే శ్లోకం తెలుగు పద్యంగా ఈ గ్రంథంలోనూ కనిపిస్తుంది. ఇందులో అలంకార విషయం ఎక్కువగాను, ఛందోవ్యాకరణ విషయం తక్కువగాను ఉంది. ఇందులో తొమ్మిది ఉల్లాసాలున్నాయి.

ప్రథమోల్లాసంలో – భావప్రకరణము, ద్వితీయోల్లాసంలో – రసప్రకరణము, తృతీయోల్లాసంలో–నాయికా నాయక ప్రకరణము, చతుర్థోల్లాసంలో–కావ్యభేదప్రకరణము పంచమోల్లాసంలో–అర్థాలంకార ప్రకరణము, షష్ఠోల్లాసంలో – శబ్దాలంకార కావ్య దోష ప్రకరణము, సప్తమోల్లాసంలో – ఛందః ప్రకరణము 1 భాగము, అష్టమోల్లాసంలో– ఛందః ప్రకరణము 2 భాగము, నవమోల్లాసంలో – వ్యాకరణం ప్రకరణము ప్రాయబడిన గ్రంథము. (రె. రా. చ.) (వేదం వేంకటరాయశాస్త్రి వివరణ)

**కావ్యాలంకార సంగ్రహము**

నామాంతరం : (చూ.) నరస భూపాలీయము.

కర్త : మూర్తికవి.

**కాశికాధీశ్వర వచనములు**

నామాంతరం : శివయోగ వచనములు.

కర్త : తెలియదు.

రచనాకాలం : 16వ శతాబ్దం.

ఇవి శైవవాఙ్మయానికి సంబంధించినవి. ఈ వచనం 'శ్రీగురుదేవా' అని ప్రారంభమై "శ్రీ కాశికాధీశ్వరా" అనే వాక్యసంబోధనతో పూర్తి అవుతుంది.

(వ. వా–30)

**కాశికా విశ్వనాథ శతకము**

కర్తలు : వేల్పూరి విస్సన్న, వేల్పూరి సాంబశివకవి.

కాశీలోని విశ్వనాథుని ఆలయాన్ని తురుష్కులు ధ్వంసం చేయడం చూసి ఆవేశపూరితుడై విస్సన్న 78 పద్యాలు ఆశువుగా చెప్పాడట. ఆ వెంటనే ఔరంగజేబు సైన్యం కాశీ నుండి తొలగి పోయిందని చెప్తారు. తర్వాత కొంత కాలానికి అతని

మనుమడు సాంబశివకవి ఆ శతకాన్ని పూర్తి చేశాడు. "విజిత పరయూధ కాశికా విశ్వనాథ" అనేది దీని మకుటం. ఇది సీస పద్య శతకం. శ్రీ విశ్వేశ్వర శతకంగా ప్రసిద్ధం.
(శ. క. చ-754)

## కాశీ కావళ్ళవారు

తెలుగు దేశంలో పూర్వకాలం నుంచీ వస్తున్న ఒక రకమైన చిత్ర కళా ప్రదర్శనంగా కాశీ కావళ్ళను చెప్పవచ్చు. నోటితో పాట పాడుతూ, అభినయిస్తూ, కాళ్ళతో నృత్యం చేస్తూ కాశీకి పోయే కథను కాశీకావళ్ళ వారు చక్కగా ప్రదర్శిస్తారు.

కాషాయ వస్త్రాలు ధరించి, ఒక కావడిని భుజాన వేసుకొని-రెండు ప్రక్కలా కాశీ విశ్వనాథుని విగ్రహాల నుంచి-పసుపు కుంకుమలతో, పుష్పాలతో అలంకరించి, సుమారు మూడు గజాల చిత్ర పటాన్ని కావడి కొమ్ముకు తగిలించి-కాశీ విశ్వేశ్వరుని సందర్శనాన్ని గురించి వరుస క్రమంలో కథను చెప్తారు. అన్ని రసాలు ఈ కథా విధానంలో ఉంటాయి.

పూర్వ కాలంలో కాశీయాత్ర చేయాలంటే ఎన్ని కష్టాలను ఎదుర్కోవలసి వచ్చేదో ఈ కథ ద్వారా వీరు వివరిస్తారు. కథా విధానం ద్విపదవలె నడుస్తుంది.

యాత్రికులు బయలుదేరిన దగ్గర నుంచి కాశీకి పోయే దారిలోని అడవుల వర్ణన, క్రూర మృగాల అర్భాటాలు, నదీ ప్రవాహాలు, సత్రాలు, దొంగ దోపిళ్ళు, మజిలీలు, ఇతర యాత్రా స్థలాలు, పర్వతాలలో ప్రయాణం, ఈ మధ్యలో వచ్చే ఇబ్బందులు, బాధలు, క్రూర మృగాల బారి నుంచి తప్పుకోవటం, యమలోకాన్ని జయించినట్లు వ్యతిరేక శక్తులనన్నిటినీ యమదూతలుగా చిత్రించటం, కష్టాలుగట్టెక్కి గంగానదిని దాటటం, తుదకు స్వర్గతుల్యమైన కాశీ విశ్వేశ్వరాలయాన్ని చేరి ముక్తి పొందటం-ఆయా విషయాలను మానవ జీవితానికి అన్వయించి-మానవులు స్వర్గానికి చేరుకోవటం ఎంత కష్టమో పై కష్టాలను ఉదాహరణగా చెబుతూ కథకుడు బహురమ్యంగా ఈ కథను నడుపుతాడు.

నేటికీ తెలుగు దేశపు గ్రామ సీమలలో ఈ కాశీ కావళ్ళవారున్నారు.
(నా. ర. చ-321-322)

## కాశీ ఖండము (అలభ్యం)

కర్త : కంచెర్ల అయ్యన్న.
కాలం : 15 వ శతాబ్దం చివర, 16 వ శతాబ్దం ప్రారంభం.

ప్రత్యేకత : ఈ కాశీ ఖండం ద్విపద కావ్యమని గ్రంథ కర్త మనుమడు తన అధ్యాత్మ రామాయణంలో చెప్పాడు. ఇంతకుముందు కాలంలో కాశీ ఖండాన్ని కావ్యంగా శ్రీనాథుడు, ద్విపద కావ్యంగా మోచర్ల నన్నయ (తుమ్మిడి గ్రామ వాసి) చెప్పారు.
(ఆరుద్ర-9)

## కాశీ ఖండము

కర్త : మోచర్ల నన్నయ.

కాలం : 1650 కి ముందు.

ప్రత్యేకత : శ్రీనాథుడు కాశీ ఖండాన్ని కావ్యంగా పూర్వమే వ్రాశాడు. అదే పేరుతో ఈ నన్నయ కవి ద్విపద కావ్యం వ్రాశాడు. కావ్యం అముద్రితం. ఇది నరాంకిత మట. ఎవరికి అంకితం ఇచ్చాడో తెలియదు. నరులకు అంకితం ఇస్తే లాభమేమీ లేదని ఈ కవి తన తర్వాతి కావ్యాన్ని దేవునికి అంకితం ఇచ్చాడు. (ఆరుద్ర-9-238)

**కాశీ ఖండము**

కర్త : శ్రీనాథుడు.
రచనా కాలం : క్రీ. శ. 1430-33 ల మధ్య.
కృతి భర్త : వీరభద్రారెడ్డి.

ఏడాశ్వాసాల ప్రబంధం. సంస్కృత కాశీ ఖండం దీనికి ఆధారం. "కాశీ ఖండం అయః పిండం" అంటారు.

ప్రత్యేకత : అగస్త్యుడు కాశీని వదలి పెట్టటంతో మొదలై వ్యాసుడు కాశీని వదలి రావటం వరకు ఇందులో ఉంది. ఇది స్వతంత్రాను వాదం. ఇది శ్రీనాథుని కృతులలో ప్రౌఢమైనది. ఇందులో సాముద్రికం, యోగ శాస్త్రం, మంత్ర శాస్త్రానికి సంబంధించిన విషయాలున్నాయి. కాశీ ఖండంలో శ్రీనాథుని పలుకు నుడికారపు సొంపులు విస్తృతంగా కనబడతాయి. వ్యాస విషాద సన్నివేశం భీమ ఖండ, కాశీ ఖండాలు రెంటి లోనూ ఉంది. (ఆరుద్ర-4)

**కాశీ చెన్న బసవేశ్వరుడు**

కాలం : క్రీ. శ. 1600 ప్రాంతం.
రచన : 1. వివేక సింధువు (వేదాంత గ్రంథం-వచనం) 2. సాంఖ్య విచారము (తత్త్వ గ్రంథం).

విశిష్టత : ముకుంద యోగి మహారాష్ట్ర భాషలో వివేక సింధువును వ్రాస్తే దానిని ఈయన తెలుగులో వచన గ్రంథంగా వ్రాశాడు. ఈ వేదాంత గ్రంథాన్ని వేగినాటి కొండన్న తెలుగులో పద్య కావ్యంగా వ్రాశాడు. ఒకే గ్రంథాన్ని తెలుగులో వచన కావ్యంగా ఒకరు, పద్య కావ్యంగా ఒకరు రచించడం అపూర్వం. ఈ ఇద్దరూ సమకాలికులు కావచ్చు. సాంఖ్య విచారం అనే తత్త్వశాస్త్ర గ్రంథాన్ని వచన రూపంలో వ్రాసిన చెన్న బసవయ్య ఇతడేనేమో అని పండితులు భావిస్తున్నారు. ఈ శాస్త్ర గ్రంథం వాడుక భాషలో ఉంది. ప్రశస్తమైన రచన. (ఆరుద్ర-9)

**కాశీనాథయ్య**

కాలం : 18వ శతాబ్దం.
స్థలం : తంజావూరు మండలంలోని మేలట్టూరు.
రచనలు : పదములు.

ప్రసిద్ధపదకర్త. అనేక శబ్దాలు, స్వరజతులు రచించాడు. ఇతని దశావతార శబ్దం, మండూక శబ్దం, నేటికీ కూచిపూడి భాగవతులు ప్రదర్శిస్తుంటారు.

ఇతడు తంజావూరును పాలించిన మహారాష్ట్ర రాజు ప్రతాప సింహుని (1739-63) కాలం లోని వాడని పరిశోధకుల అభిప్రాయం. (శారదాధ్వజం-160)

## కాశీనాథుని వీరారాధ్యుడు

కాలం : తెలియదు.

రచనలు : ధర్మగుప్తాభ్యుదయము, భద్రాయుశ్చరిత్రము.

ఈ కవి శ్రీపతి పండితుని వంశీయుడట. ప్రౌఢంగా రచన చేశాడు.

(క. స. 227.)

## కాశీపురము

శృంగవరపు కోట జమిందారీఅని నామాంతరం. కొండజమిందారీలలో ఒకటి. "మఖీ" వారు దీని పాలకులు. ఇది జయపురం సంస్థానం నుండి వెలువడింది. "మఖి" వారు జయపురం విక్రమ దేవవర్మకు అనుయాయులుగా ఉండగా ఆ రాజు ఈ జమిందారీని వీరికి ప్రసాదించాడట.

మఖీ కాశీపతిరాజు ఈ సంస్థాన పాలకులలో ఒకడు. ఇతడు విజయనగరం పెద విజయరామరాజుకు బొబ్బిలి యుద్ధంలో సహాయపడ్డాడు. ఇతని తరువాత పాలకుడు 'రాజభూపాలరాజు'. ఇతనికాలం నుండి విజయనగరం వారికి ఈ జమిందారులతో వైరం ఏర్పడింది. రాజభూపాలరాజు కుమారుడు 'వీరభద్రరాజు' తరువాతి పాలకుడు. వీరభద్రరాజు కొండ జమిందారుల కుట్రలో పాల్గొన్నాడు. ఈ పితూరీలను అణచినపుడు వీరభద్రరాజు బంధింపబడ్డాడు. ఇతడు రాయలసీమలోని గుత్తి దుర్గపు జైలులోనే మరణించాడు.

పద్మనాభ యుద్ధానంతరం సంస్థానం పూర్వ పాలకులకు అప్పగింపబడలేదు. కొంతకాలం కుంఫిణీవారి వశంలో ఉండి, ఆ తరువాత విజయనగర సంస్థానంలో కలసి ఒక తాణా అయింది.

జయపురం వారిచే ఏర్పడ్డ ఈ సంస్థానం ఎక్కువకాలం నిలవలేదు. నిలిచిన కొద్దికాలంలో వీరు సాహిత్య పోషణ చేసే అవకాశం అంతగా లేకపోయింది. పేరి వంశ మూలపురుషుడైన 'పేరి సర్వేశ మఖి' ఈ జమిందారుల కోరికపై ఈ సంస్థానంలో ఆస్థాన పండితుడుగా స్థిరపడి, గౌరవ సత్కారాలు పొందాడు. ఇతని కుమారుడు జగన్నాదు వేదంలోను, ధనుర్వేదంలోను ప్రవీణుడట. ఈ జమిందారులవద్ద దివానుగా ఉన్న పాత్రుని మహంతి కృష్ణమహంతి పట్నాయకు కవి పోషకుడు. అండలూరి శరభకవి కృతమైన ముక్తి చింతామణి ఇతనికి అంకితం ఇవ్వబడింది. (ఆం. సం. సా. [illegible]-628)

## కాశీ మహిమార్థ దర్పణము

కర్త : కళువె నంజరాజు.

స్థలమాహాత్మ్యాన్ని తెలిపే రచన. ఇది [illegible]రిక వచనంలో ఉన్న కావ్యం స్కాంద పురాణంలోని కాశీఖండానికి అనువాదం. [illegible]నాకొ కాశీ పట్టణము భూమి యందున్నదైనాగాని అక్కడ వాసం చేసుకొని ఉండేవారికి పునర్[illegible] గనుక

తాను భూమి గదా అయినాగాని స్వర్గమందు ఉండేవారికి పునరావృతి గలదు........" అనే విధంగా దీనిలో వచన రచన నడిచింది. పూర్వకవుల వ్యావహారిక రచనకు దీనిని ప్రముఖ ఉదాహరణగా చెప్పవచ్చు. నంజరాజు ఈ కావ్యాన్ని మొదట కర్ణాట భాషలో వ్రాసి, తరవాత తెలుగులో వ్రాసినట్లు గ్రంథాంత గద్యనుబట్టి తెలుస్తున్నది. మూలంలోని అధ్యాయక్రమం తెలుగులోకూడా ఉంది. (తె. వా-కొర్లపాటి)

**కాశీ మహిమార్థ దర్పణము (కన్నడం)**

కర్త : కళసె నంజరాజు.

సంస్కృత స్కాంద పురాణంలోని కాశీఖండానికి అనువాదం. దీన్ని కవి తర్వాత తెలుగులో వ్రాశాడు. (ద. దే. వా)

**కాశీయాత్రా చరిత్ర**

కర్త : ఏనుగుల వీరస్వామయ్య.

మిక్కిలి వ్యాప్తిపొందిన వచన గ్రంథం కవి 1833లో కాశీయాత్ర చేస్తూ ఆ రోజుల దినచర్యనే గ్రంథరూపంలో వ్రాశాడు. ఆ కాలపు ఆయా దేశప్రజల వేష భాషా పరిస్థితులను తెలిసికొనడానికి ఇది దర్పణం వంటిది. సులభమైన వ్యవహార భాషలో ఉంది. ముద్రితం. (వ. వా-63)

**కాశీ లక్ష్మీపతి కవి**

కాలం : క్రీ. శ. 19 శతాబ్ది.

స్థలం : నెల్లూరు మండలంలోని అనికేపల్లి.

చాటుకవి. రచనలు చాలా ఉన్నాయని వినికిడి. కాని పంచ చామరాలు మాత్రమే దొరికాయి. (చా. ప. ర)

**కాసలనాడు**

కాసలనాడు అంటే వసతి "దీర్ఘాసి" శాసనంలో ప్రసక్తమైన దక్షిణ కోసల ప్రాంతం. ఇది ఉత్కళ(ఒరిస్సా) దేశానికి దక్షిణ, పశ్చిమ ప్రాంతాలలో, తూర్పు సముద్ర తీరానికి నూరుమైళ్ళ దూరంలో ఉంది. ఈ ప్రాంతంనుంచి వచ్చిన బ్రాహ్మణులను 'కోసలేయులు" లేదా కాసలనాటి వారవి అంటారు. క్రీడాభిరామంలో కాసల్నాటి వారి ప్రసక్తి ఉంది. (సం. ఆ. వి. కో-5)

**కాసుల పురుషోత్తమ కవి**

కాలం : 18వ శతాబ్ది. ఉత్తరార్థం-19వ శతాబ్దం ప్రారంభం.

స్థలం : చల్లపల్లి సంస్థానం-పెదప్రోలు గ్రామం.

రచనలు : ఆంధ్రనాయక శతకము, హంసలదీవి శతకము, గోపాల శతకము, మానసబోధ శతకము, భక్త కల్పద్రుమ శతకము.

గురువు : అద్దంకి తిరుమలాచార్యుడు.

చల్లపల్లి సంస్థానాధీశ్వరుల సమాదరణలో వెలసిన ముఖ్యులైన కవులలో

కాసుల పురుషోత్తమ కవి ఒకడు. గొప్ప ఉపాసనా శక్తి కలవాడు. తల్లి రమణమ్మ, తండ్రి అప్పలరాజు. చల్లపల్లి సంస్థానాధీశ్వరుడు శ్రీమంతు రాజా ఇమ్మడి అంకినీడు బహద్దరు (1798-1819) ఆస్థానకవి. తెలుగు వారికి కలకాలం నిలువదగిన శతక కృతిని సమర్పించిన కీర్తి ఇతనిదే.

ఈయన ఆంధ్రనాయక శతకం వ్యాజోక్తి శతక హారానికి నాయకమణి. శ్రీకాకుళాంధ్ర దేవుని దేవాలయం జీర్ణస్థితిలో ఉన్నప్పుడు, దేవుని నిందిస్తూ కవి ఆంధ్ర నాయక శతకాన్ని వ్రాశాడు. ఈ ఆలయం నదీపాతం కాగా శ్రీమంతు రాజా అంకినీడు బహద్దరు తిరిగి కట్టించారట. (శ. క. చ. 487)

కాసె సర్వప్ప

కాలం : క్రీ. శ. 17 శతాబ్దికి పూర్వం.

స్థలం : బొలికొండ సీమలోని చెర్వుపల్లి గ్రామం.

రచన : సిద్ధేశ్వర చరిత్రము. (ద్విపద)

తల్లి దండ్రులు లక్ష్మమ్మ, మల్లరాజులు.

విశిష్టత : తెలుగులో తొలి చరిత్ర గ్రంథకర్త ఏకామ్రనాథుడైతే ఆ శ్రేణిలో రెండోవాడు సర్వప్ప. సర్వప్ప తాను అట్టే చదువుకోలేదని వినయంగా చెప్పు కొన్నాడు. ఈయన ద్విపద కావ్యం కాకతీయుల చరిత్రను వివరంగా తెలుపుతున్నది ఉత్తమాదర్శంతో పూర్వరాజుల కథలను చెప్పటంలో కాసె సర్వప్ప చిత్తశుద్ధి ప్రశంస నీయం. ప్రతిభ, వ్యుత్పత్తి, అభ్యాసాదులు కొరవడినా, ఈయన రచనను చారిత్రక విషయ సంగ్రహణం కోసం జిజ్ఞాసువులు చదువుతుంటారు. ఇతని రచనలో తొలుత సిద్ధేశ్వర చరిత్ర, తర్వాత కాకతీయుల చరిత్ర, ఆ వెనుక ప్రతాపరుద్రుని చరిత్ర ఉన్నాయి. కొన్ని భాగాలు ప్రక్షిప్తాలని విమర్శకులు అంటున్నారు.

(ద్వి. సా. చ. 381-ఆరుద్ర-8)

కాళకవి

నామాంతరం : చెంగల్వ కాళయ.

కాళహస్తి

ఇది చిత్తూరు జిల్లాలోని ఒక పురాతన సంస్థానం. దామెర వంశీయులైన "వెలమవారు" దీని పాలకులు. బోయల్ దొరగారి వ్రాతల ప్రకారం "కామినేని రామానాయుడు" వీరికి మూల పురుషుడు. విజయనగరపు కృష్ణదేవరాయల చేత ఈ రామా నాయుడు ఈ ప్రాంతానికి అధికారిగా నియమింపబడ్డాడు. ఈ జమీందారులు విజయ నగర ప్రభువులకు సేనానులుగా, సామంతులుగా ఉంటూ ప్రఖ్యాతిగాంచారు. వీరిలో దామెర్ల తిమ్మానాయనింగారు ప్రసిద్ధులు.

ఔరంగజేబు పాదుషా ఈ సంస్థానాన్ని ఆర్కాటు నవాబుకు సామంత రాజ్యంగా చేశాడు. తర్వాత క్రీ. శ. 1802లో ఇది పూర్తిగా కుంఫిణీ వాళ్ళకు వశ

మయ్యింది. ఈ సంస్థానపు పాలకులలో రాజా దామరల కుమార వేంకట లింగమనాయుడు చివరి వాడు. తదనంతర కాలంలో ఇది భారత గణతంత్ర రాజ్యంలో లీనమైపోయింది.

కాళహస్తి పాలకులు విజయనగర సామ్రాజ్యంతో సహచర్యం కలవారు కాబట్టి విజయనగర చక్రవర్తుల సాహిత్య వాసనలు వీరికి కొంత అబ్బినాయి. ఈ ప్రభువులు సాహిత్య పోషకులే కాదు, నిర్మాతలు కూడ. దామెర్ల వెంగళ భూపాలుడు "బహుళాశ్వ చరిత్రము" అనే ప్రసిద్ధ ప్రబంధాన్ని సంధానించాడు. దామెర్ల అంక భూపాలుడు "ఉషాపరియణ" కర్త. క్రీ. శ. 1860 ప్రాంతంవాడైన దామెర్ల వెంకట పతి నాయుడు ఉద్దండ పండితుడు. వీరు శిష్టు కృష్ణమూర్తిశాస్త్రిని కొంత కాలం తమ సంస్థానంలో ఉంచుకొని పోషించారు. వీరి కుమారుడు సర్వశాస్త్రి ఆస్థానకవిగా స్త్రీపతి అమరుకం, జ్ఞాన ప్రసూనాంబికా శతకం రచించారు. మహా మహోపాధ్యాయ కొక్కొండ వేంకట రత్నం పంతులుగారు వీరి ఆస్థానంలో "విద్వత్కవీశ్వర" బిరుదంతో సత్కరింపబడ్డారు.

జగత్ప్రసిద్ధుడైన కుమార ధూర్జటి వీరి ఆశ్రయంలోనే కృష్ణరాయ విజయము, ఇందుమతీ పరిణయం రచించాడు. ఈతని కుమారుడు లింగరాజ కవి "శ్రీకాళహస్తి మాహాత్మ్యం" సంతరించాడు. "అభిషిక్త రాఘవ" కర్త అయిన "నడిమింటి వేంకటపతి కవి", చిత్ర కవిత్వ దర్పణ" రచయిత రావుకొండలరాయుడు, ధూర్జటి వెంకటపతి కవి, మునిపల్లె సుబ్రహ్మణ్య కవి, విక్రాల రాఘవాచార్యులు, వేదాంతి షణ్ముఖదాసు మొ॥ పెక్కురు ప్రసిద్ధ కవులు ఈ సంస్థానాధిపతులచేత పోషింపబడ్డారు.

కాళహస్తి రాజులపై శిష్టు కృష్ణమూర్తి కవి రచించిన చాటువులు చాలా ఉన్నాయి. (ఆం. సం.సా.)

**కాళహస్తి కవి**

కాలం : క్రీ. శ. 1586-1614 ప్రాంతం.

రచన : వసుచరిత్ర (సంస్కృతం).

ఈయన సర్వశాస్త్ర పండితుడు. గురువు-అప్పయ్య దీక్షితులు. తెలుగులో రామరాజ భూషణుడు (భట్టుమూర్తి)రచించిన వసుచరిత్రను సంస్కృతంలోకి భాషాంతరీకరణం చేశాడు. (తె. వి. స-6)

**కాళహస్తి మాహాత్మ్యము**

కర్త : చూ. ధూర్జటి లింగరాజకవి.

అంకితం: దామెర్ల వేంకటపతినాయునికి.

పౌరాణిక రచన. పన్నెండు అశ్వాసాలు గల గ్రంథం. కృష్ణ దేవరాయల అష్టదిగ్గజాలలో ఒకరైన ధూర్జటి మహాకవి రచన కన్న ఇది భిన్నమైనది. ధూర్జటి రచన స్కాందపురాణంలో షడధ్యాయి కథ ఆధారంగా రూపొందింది. లింగరాజ కవి రచన "శివరహస్య ఖండము" అనే పురాణంలో ఉత్తర భాగంలోని 120 వ అధ్యాయం

లోని కథను ఆధారంగా తీసుకొని రచించబడింది. వేంకటగిరి సంస్థానాధీశ్వరులైన రాజా ముద్దు కృష్ణయాచేంద్రుల వారిచేత ముద్రింపించబడిన సంస్కృత "కాళహస్తి మాహాత్మ్యము"లోని కథలు, లింగరాజ కవి రచనలోని కథలనే పోలి ఉన్నవట. ఈ రెంటిలో ఏది దేనికి మూలమో తెలియదు. (ఆం. సం. సా.)

## కాళహస్తి లింగ శతకము (అలభ్యం)

కర్త : బొడ్డపాటి కొండయ్య.

ఇది తిరుకాళహస్తి లింగ శతకంగా ప్రసిద్ధం. "అంగభవభంగ తిరుకాళహస్తి లింగ" అనేది దీని మకుటం. త్రిపురాసుర సంహార ఘట్టంలోని మూడు పద్యాలు మాత్రం దొరికాయి. పెదపాటి జగ్గన్నపై మూడు పద్యాలను తన సంకలన గ్రంథమైన "ప్రబంధ రత్నాకరం"లో ఉదాహరించాడు. (శ. క. చ-250; ఆరుద్ర-9)

## కాళహస్తీశ్వరయజ్వ

కాలం : 19 వ శతాబ్దికి పూర్వం.

రచన : సంస్కృత భాగవత పురాణ వ్యాఖ్య.

క్రీ. శ. 19 వ శతాబ్దంలో కార్వేటినగర సంస్థానాశ్రితుడుగా ఉన్న కచ్ఛపేశ్వర దీక్షితుల పూర్వీకుడు. సంస్కృత భాగవత పురాణ వ్యాఖ్యాత. (ఆం. సం. సా.)

## కాళ్ళవారు

అవయం పేరుతో ఇంటిపేరున్న వారు దేశంలో ఉన్నారు. వివిధ అవయవాలను సూచిస్తూ కూడా కొన్ని ఇంటిపేర్లున్నాయి. ముక్కువారు, బొడ్డువారు ఇలాంటి ఇంటి పేర్లు. (భారతి-మా-45-230)

## కాళిందీ కన్యాపరిణయము

కర్త : చూ. అహోబల పండితుడు.

అంకితం : శ్రీరామునికి.

ప్రౌఢ ప్రబంధం. నరసరావుపేట సంస్థానానికి చెందిన అహోబల పండితుని రచనల్లో ఒకటి. ఇది పౌరాణిక రచన. శ్రీకృష్ణుడు కాళిందుని గర్వమడచి అతని కూతురైన 'కాళింది'ని వివాహమాడడం ఇందులోని ఇతివృత్తం. గ్రంథం ముద్రితం. (ఆం. సం. సా-193)

## 'కాళికాంబ హంస కాళికాంబ' శతకము

కర్త : సిద్ధప్ప (దూదేకుల)

ఇది 400 పద్యాలున్న శతకమట. ఈ శతకాన్ని సిద్ధప్ప గురువైన వీరబ్రహ్మయోగి వ్రాసినట్లు కూడా తెలుగు దేశంలో ప్రచారముంది. (తె. వి. స-4-1195)

## కాళియ మర్దనము

కర్త : విజయ రాఘవ నాయకుడు.

అంకితం : రాజగోపాలునికి.

రచనా కాలం : క్రీ. శ. 1643-51 ప్రాంతం.

ఇది నాటకంగా చెప్పబడ్డా యక్షగాన లక్షణాలే ఎక్కువ కనిపిస్తున్నాయి. శ్రీకృష్ణుడు కాళీయుని మర్దించడం ఇతివృత్తం. గోభిల, గోప్రళయ మునుల కోరికపై రాజగోపాలుడు కాళీయ భుజంగ భంగ నాట్యప్రసంగం చూపినట్లు కవి చెప్పాడు

విజయ రాఘవుడు కొన్ని పురాణ గాథలు తన నగరంలోనే తన సమక్షంలోనే జరిగినట్లు వ్రాశాడు. ఈ కథ కూడా అలాంటిదే. (ద. దే. వా-107)

## కాళ్ళకూరి గౌరీకాంతకవి

నామాంతరం : కాళ్ళకూరి గౌరీశంకరకవి.

కాలం : క్రీ. శ. 1770-1840 ప్రాంతం.

స్థలం : శ్రీకాకుళం మండలం-గొప్పేట.

రచన : ధర్మనందన విలాసము.

సూరయామాత్యుని పుత్రుడు. వెలిచేటి గురురాయడనే దండనాయకునికి ఆశ్రితుడు. తన రచనను పోషకుడైన గురురాయనికే అంకితం చేశాడు. గొప్పేట చీపురుపల్లికి సమీపంలో ఉన్నది. (ఆం. సం. సా-421)

## కాళ్ళకూరి గౌరీశంకర కవి

నామాంతరం : కాళ్ళకూరి గౌరీకాంతకవి.

## కిన్నెర బ్రహ్మయ్య కథ

ఈ కథ పాల్కురికి సోమన విరచిత బసవ పురాణంలో ఉంది. ఈయన శివభక్తుడు. (ఆంధ్రవ-2-212)

## కిరాత విలాసము

కర్త : శహాజీ (1684-1712)

అంకితం : శివునికి.

యక్షగాన నాటకం. కిరాత రూపంలోని శివ పార్వతుల ప్రణయాన్ని వర్ణించిన కృతి. (ద. దే. వా. 183)

## కిరాతార్జునీయము

కర్త : తెలియదు.

అంకితం : కామినేని (మొదటి) ఎల్లారెడ్డి.

దోమకొండ సంస్థానాన్ని పాలించిన కామినేని (మొదటి) ఎల్లారెడ్డి ఈ గ్రంథానికి కృతిభర్త. సూత సంహిత, శివధర్మోత్తరము, బ్రహ్మోత్తర ఖండము మొ॥వి ఈ కిరాతార్జునీయం కామినేని ఎల్లారెడ్డికి అంకితం ఇవ్వబడిందని తెలుపుతున్నాయి. (ఆం. సం. సా-180)

## కిరాతార్జునీయము

కర్త : గోపాలుని సింగయ్య.

అంకితం : ఆహోబిలం లోని నృసింహస్వామికి.

అయిదాశ్వాసాల ప్రబంధం. సంస్కృతంలోని కిరాతార్జునీయానికి తెలుగు సేత. అనువాదం సరళంగా రసవంతంగా ఉంది. (య. వా. చ.)

## కిరాతార్జునీయము

కర్త : బొమ్మలాట సాంబయ్య.

ఇది బొమ్మలాటకు యోగ్యమైన యక్షగానం. దీనిలోని కథ ప్రసిద్ధమైనది. ఈ యక్షగాన రచనలో సాంబయ్యకు అతని సోదరులు కూడా తోడ్పడినట్లు తెలుస్తున్నది. దీని రచన చక్కగా ఉన్నది. సంభాషణ లెక్కువ. తాళ ప్రధానాలైన దరువులు, రేకులు, అర్ధచంద్రికలు, ధవళాలు, ద్విపదలు, కొన్నిపద్యాలు, చిన్న సంధివచనాలు ఉన్నాయి. దీనిలో లేపాక్షి వీరభద్ర స్తుతి కూడా ఉంది. (య. వా. చ. 48)

## కిరాతార్జునీయము

కర్త : శంబరధరుడు (చూ.)

యక్షగానం. బొమ్మలాటకు అనువుగా రచింపబడింది. ఆనాడు దీనిని ఎక్కువగా తోలుబొమ్మలాట పద్ధతిలో ప్రదర్శిస్తుండేవారు. (శారదా ధ్వజం-160)

## కిరాతార్జునీయ వ్యాఖ్య (సం)

కర్త : కృష్ణమాచార్యులు ఆర్. వి.

భారవి విరచిత సంస్కృత కిరాతార్జునీయ కావ్యానికిది గద్యరూప వ్యాఖ్య. (తె. వి. స-6)

## కిరీటి వేంకటాచార్యులు

నామాంతరం : తిరుమల బుక్కపట్టణము వేంకటాచార్యులు.

కాలం : క్రీ. శ. 18వ శతాబ్దం.

స్థలం : సురపుర సంస్థానం.

రచనలు : అలంకార కౌస్తుభము (సం), భావశతకము (సం), శృంగారలహరి (సం), శృంగారతరంగిణీ నాటకము (సం), (ఝంఝూమారుతము) గదాధరీయ ఖండనము (సం), దశావతార స్తోత్రము (సం), హయగ్రీవయతి రాజదండకములు, అచలాత్మజా పరిణయము (తెలుగు) గజసూత్రవాదము, శృంగారలహరి మొదలయినవి.

బిరుదములు : 1. సర్వతంత్ర స్వతంత్ర, 2. కవితార్కిక కంఠీరవ, 3. శ్లేషయమక చక్రవర్తి 4. తర్కాలంకార వాగీశ్వర మొదలైనవి.

గురువు : పరకాల మఠస్వామి (మైసూరు)

శ్రీనివాస తాతాచార్యుల పుత్రుడు. క్రీ. శ. 1730 ప్రాంతంవాడు. సంస్కృతాంధ్ర పండితుడు. సంస్కృతంలో ఎక్కువగా రచనలుచేశాడు. సురపురంలోనేకాక గద్వాల, ఆత్మకూరు సంస్థానాలలో కూడా ప్రసిద్ధిపొందాడు. వీరి ఇంటిపేరు

"తిరుమల ఒక్కపట్టణం" వారు. కాశీ మొదలైన పట్టణాలకు వెళ్ళి పరమత వాదులను ఓడించి స్వమత పనస్థా పరమత ఖండనములనే చామరాలనీ, విశిష్టాద్వైతమనే కిరీటాన్నీ ధరించాడట. 32 సంవత్సరాలు మాత్రం జీవించాడు. (ఆం. సం. సా.)

కిర్లంపూడి ముత్యాలు

కాలం : క్రీ. శ. 19వ శతాబ్దం.
స్థలం : విజయనగర సంస్థానం.
రచనలు : సంగీతకృతులు.

విజయనగర సంస్థానాశ్రితుడు. విజయరామగజపతి (క్రీ. శ. 1826-1879) ఆస్థానంలోనివాడు.

ఇతడు సంగీత సాహిత్య సరస కవిత్వాభినయాది మర్మాలు తెలిసినవాడట. అనేక భజన కీర్తనలు వ్రాశాడని ప్రతీతి. (ఆం. సం. సా-422)

కిర్లంపూడి

నేటి గోదావరి మండలంలోని ఒక సంస్థానం. మొదట పెద్దాపురం ముఠాలో ఉండేది. తరువాత పిఠాపురం పాలకుల వశమయింది. పిఠాపురం పాలకులలో 17వ వాడు రాజా వేంకట నీలాద్రిరాయుడు (1793-1828). ఇతని భార్య ఇనుగంటి వారి రమణయ్యమ్మ. ఈ దంపతులకు సంతానం లేకపోవడం వలన రాజాగారి తోడి అల్లుడైన రావు వెంకయ్యగారి పుత్రుడైన బుచ్చి తమ్మయ్యను దత్తత తీసుకున్నారు. కొంతకాలం తరువాత వెంకటరమణయ్యమ్మ గారికిని, నీలాద్రిరావుగారికిని మధ్య కలతలు ఏర్పడ్డాయి. రాణిగారు పుట్టింటికి దత్తపుత్రునితో సహా వెళ్ళిపోయారు. ఆ సందర్భంలో రాణీగారే స్వయంగా పెద్దాపురం వారినుండి ఈ సంస్థానాన్ని ఖరీదు చేసింది. ఈ విధంగా ఈ సంస్థానం ఇనుగంటివారి స్వాధీనంలో ఉండేది. కొంత కాలం తరువాత ఇందులోని కొంత భాగం తుని, బొబ్బిలి పాలకులకు చెందింది. కొంత భాగం మాత్రమే ఇనుగంటి వారి స్వాధీనంలో ఉండేది.

పై బుచ్చితమ్మయ్య దౌహిత్రుడు రాజాగోపాల వెంకటరామ చిన్నారావున్నూ ఇతని పెదతల్లి కుమారుడు బుచ్చితమ్మయ్యయున్నూ కవి పండిత పోషకులు. సుప్రసిద్ధులైన శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి వీరి పోషణలో చాలా కాలం ఉన్నాడు. సత్యవోలు కామేశ్వరరాయ కవి వీరి ఆస్థానంలోని వాడే. ఈ కామేశ్వరరాయ కవి తరువాతి పాలకుడైన రాజగోపాల సూర్యారావు బహద్దరు గారి కాలంలో కూడా ఈ సంస్థానంలో ఉన్నాడు. సత్యవోలు సోమసుందరరాయ కవి (1841-1936) ఈ కామేశ్వరరాయ కవికి సోదరుడు.

నీలాద్రిరావు దత్తపుత్రులైన బుచ్చితమ్మయ్యగారి భార్య బుచ్చి సీతయ్యమ్మ "ధర్మవరం"లో స్థాపించిన ధర్మ పాఠశాలలో చర్ల బ్రహ్మయ్యశాస్త్రి ఉపాధ్యాయులు. చర్ల బ్రహ్మయ్యశాస్త్రి కాశీకి వెళ్ళి సర్వశాస్త్రాలు అభ్యసించి రావడానికి ఈ సంస్థాన పాలకులు చాలా సహాయం చేశారు. అంతేకాదు సుప్రసిద్ధులైన చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రి

గారి అభ్యుదయానికి ఈ సంస్థాన పాలకులే కారకులు. వీరికి ఈ సంస్థానంలో వార్షికాలు ఉండేవి. తిరుపతి వేంకట కవులు వార్షికాలు తీసుకున్నది ఈ ఒక్క సంస్థానంలో మాత్రమే. (ఆం. సం. సా-526, 527)

**కీరబహత్తరి**

నామాంతరం : తోతీనామా లేక చిలుక కథలు.

కర్త : తెలియదు.

తొలి ముద్రణ క్రీ. శ. 1842. దీనిలో 52 కథలు ఉన్నవి. శుకసప్తతి కథలకివి భిన్నమైనవి. ఈ కథలలో పారసీకపు పేర్లు తరచుగా వస్తుండటాన్ని బట్టి ఇవి పార్సీ భాష నుంచి అనువదింపబడినవేమో అని ఊహించవచ్చును. ఈ కథలకు కీరబహత్తరి-తోతీనామా లేక చిలుక కథలు అని పేరుండటం కూడా దీనికి నిదర్శనం. కథా సంవిధానం, ఉపోద్ఘాతం ఉత్తమంగా ఉన్నాయి. (వ. వా-61)

**కీర్తనలు**

చూ. సంకీర్తనలు, పదములు.

గేయరచనా విశేషం. ఇవి పద సంప్రదాయం నుంచి వచ్చినవే. వీటిలో భగవన్నామ గుణాదికాలు కీర్తింపబడటం వల్ల వీటికీ పేరు వచ్చింది. ఇవి సుందర కాండ, ఏకాంతసేవ, బాలగోపాల విలాసం మొదలయిన యక్షగానాలలో ఉన్నాయి. యక్షగానాలలో సామాన్యంగా రేకులో, పదాలో, దరువులో ఉండవలసినచోట కీర్తనలనే పేరుతో ఈ గేయరచనలు కనిపిస్తున్నాయి ఛందోనిబద్ధత కలిగి ఉండి కాని, లేకుండా గాని రాగతాళాధారాళమైన పదాలు, దరువులు, కీర్తనలు-అన్నీ ఒక పాదునుంచి వచ్చిన వేనని పండితులంటారు.

ఈ కీర్తనలు మాత్రాగణబద్ధ శోభితాలు. సాధారణంగా ఇవి భగవన్నామ స్తుతి పదాలై ఉంటాయి. ఇందులోనూ పల్లవి-తాళం-దరువులుంటాయి. కొన్నింటిలో చిందు కూడా ఉంటుంది. కీర్తనలలో ఎన్నో రకాలున్నాయి. భజన కీర్తనలు, అడుగుల భజన కీర్తనలు, కోలాటం కీర్తనలు మొ॥నవి.

కొన్ని తాళం, లయలకే పరిమితాలు. చిందు వేయడానికి వీలైన కీర్తనలను అడుగుల భజన కీర్తనలంటారు.

చిరుతల రామాయణం వంటి భజన కీర్తనలు, రాకమచర్ల భజన కీర్తనలు, పాండురంగ భజన కీర్తనలు - ఈ రకమైనవి. అవే కాక కోలాటం కీర్తనలు కూడా ఉన్నాయి. దరువులో కోలలువేస్తూ కోలాటం కీర్తనలు చదువుతారు. మద్దెల, తాళాలు, చిటికలు, చిరుతలు, కోలలు, ఈ కీర్తనలకు ఉపకరణాలు. అన్నమాచార్య కీర్తనలు భక్తిరస సంభరితాలు. త్యాగరాజ కీర్తనలు రాగరస రంజితాలు.

(య. వా. చ-317)

**కీర్తికాంతా స్వయంవరము**

కర్త : మానూరి గోపాలరాయకవి (చూ).

అంకితం : మైసూరు ప్రభువైన కృష్ణ రాజేంద్ర భూపాలునికి.
ముద్రితం. (ద. దే. వా-480)

**కుంచాల సుబ్బారాయుడు**

కాలం : తెలియదు.

చాటుకవి. ఈయన మధ్వపతి శేషగిరి రాయడు అనే ఆయనను పొగడుతూ ఒక సీస పద్యం చెప్పాడు. (చా. ప. ర)

**కుంజేటి బుచ్చయ్య**

కాలం : 18 వ శతాబ్దం కావచ్చు.

సాహిత్యప్రియుడు. కొండమడుగు పురుషోత్తమ కవిని ప్రోత్సహించి అతని చేత ఆనంద గణేశ్వరమనే రచన చేయించాడు. ఈ గ్రంథం సానంద గణేశ్వరంగా కందుకూరి వారు పేర్కొన్నారు. (క చ. 3-171)

**కుంటుముక్కల పినభైరవుడు**

కాలం : 15 వ శతాబ్దం.
బిరుదు "మహాపాత్ర".

కొండపల్లి దుర్గాధ్యక్షుడు. సాహిత్య పోషకుడు. గజపతుల కాలంలో ఉండేవాడు. వినుకొండ దుర్గాధిపతి కుంటముక్కల మల్ల మంత్రి ఇతనికి పినతండ్రి.

కూచిరాజు ఎర్రనచేత "సకల నీతి కథానిధానము" వ్రాయించి తన ఇష్టదైవమైన తిరుపతి వేంకటేశ్వరునికి అంకితంగా ఇప్పించాడు. అతని ఇంకో కృతి "పురాణసారం" తానే అంకితంగా పుచ్చుకున్నాడు. (ఆరుద్ర-6-103)

**కుంటుముక్కల మల్లమంత్రి**

కాలం : 1488-1497 ప్రాంతం.
బిరుదు : "మహా పాత్ర".

వినుకొండ దుర్గాధిపతి. సాహిత్య పోషకుడు. కూచిరాజు ఎర్రన కవి రచించిన కొక్కోకము ఇతనికే అంకితం.

ఇతని కీర్తి కటకం, గుల్బర్గ, ఢిల్లీ నగరాల వరకు వ్యాపించిందని గాథలు కొన్ని ప్రచారంలో ఉన్నాయి. కటకం గజపతుల చేత మహా పాత్ర బిరుదు పొందాడు. కుంటముక్కల పినభైరవుడు ఇతనికి అన్న కుమారుడు. (ఆరుద్ర-8-101)

**కుంటుముక్కల తిమ్మయ్య**

కాలం : క్రీ. శ. 16 శతాబ్ది కావచ్చు.
రచన : శైవాచార సంగ్రహము.

కొక్కోక కావ్యం అంకితం తీసుకొన్న కుంటముక్కల మల్లయమంత్రి అన్నకొడుకనీ, క్రీ. శ. 1510 ప్రాంతం వాడని కొందరూ, క్రీ. శ. 1520-1560 మధ్య వాడని కొందరూ అంటున్నారు.

విశిష్టత : ఈయన కావ్యంలోని పద్యాలను పెదపాటి జగ్గన్న, ప్రబంధరత్నాకరంలోను, అజ్ఞాత గ్రంథ సంధాత 'ఉదాహరణ పద్యములు' లోనూ ఉదాహరించారు. ఈయన గ్రంథం తాలూకు వ్రాతప్రతి పూర్తిగా లభించింది. మద్రాసు ప్రాచ్యలిఖిత భాండాగారం వారు దీనిని ప్రచురించారు. గంటి సోమయాజి ఈ గ్రంథానికి విపులమైన పీఠిక వ్రాశారు. (ఆరుద్ర-9)

## కుండావఝ్ఝుల గోపాల కృష్ణకవి

కాలం : 18 వ శతాబ్దం.
స్థలం : ములకనూరు (కరీంనగర్ మండలం).
రచన : శ్రీకృష్ణ జన్మ ఖండము.

వివరాలు తెలియరాలేదు. (క. న-60)

## కుంత లక్ష్మప్ప

కాలం : తెలియదు.

ఈయన దానధర్మాలు చేసిన వాడని ఒక చాటువు వల్ల తెలుస్తున్నది. చాటువు చెప్పిన కవిపేరు తెలియదు. (చా. ప. ర)

## కుందుర్తి అహోబలమంత్రి

కాలం : క్రీ. శ. 16 శతాబ్ది చివరిభాగం.
స్థలం : కుందుర్తి.
రచనలు : తెలియరాలేదు.

విశిష్టత : ఆరవీటి రాజులు దేశాన్ని పాలించే రోజుల్లో సుప్రసిద్ధమైన పండిత కుటుంబాలలో కుందుర్తి వారిది ఒకటి. అహోబలమంత్రి అశ్వపతులను, గజపతులను తన పాండిత్యం చేత మెప్పించాడు. గజపతి, అశ్వపతుల సభలలో పండితులను వాదంలో గెలిచి కవి అహోబలమంత్రి అని పేరుపొందాడట. కుందుర్తి బళ్ళారి మండలంలోనిదనీ, కృష్ణదేవరాయలీ గ్రామాన్ని అగ్రహారంగా పండితుల కిచ్చాడనీ తెలుస్తున్నది. ఈ సంగతి ఇతని మునిమనుమడు రచించిన "మిత్రవిందా పరిణయం"లో ఉంది ఈయన కుమారుడు కుందుర్తి గోవిందయ్య "భారతీ పరిణయం" అనే కావ్యాన్ని రచించి వీర వేంకటపతి రాయలకు అంకిత మిచ్చాడు.

(క. త-11-131; ఆరుద్ర 9-244; న. దే. వా-366)

## కుందుర్తి గోవిందయ్య

కాలం : క్రీ. శ. 17 వ శతాబ్దం.
స్థలం : కుందుర్తి (బళ్ళారి మండలం).
రచన : భారతీ పరిణయము (అలభ్యం).

విశిష్టత : ఈయన కుందుర్తి అహోబల మంత్రి కొడుకు. విశ్వపరితోషకారి గోవిందశౌరి'గా ప్రఖ్యాతుడు. వీర వేంకటపతిరాయలచేత (1680 ప్రాంతం) మణి

కనకాభిషేకం చేయించుకొన్నాడు. ఈయన కావ్యం దొరకలేదు.

(ద. దే. వా-365; ఆరుద్ర-9)

కుందుర్తి వేంకటాచలకవి

కాలం : 18 వ శతాబ్దం

ఆస్థానం : మధురను పాలించిన విజయరంగ చొక్కనాథుని (1706-32) ఆస్థానం.

రచనలు : 1 మిత్రవిందా పరిణయము 2. కార్తిక మాహాత్మ్యము 3. భారతము (వచనం) (అలభ్యం) 4. భాగవతము (వచనం) (అలభ్యం) 5. రామాయణము (వచనం) (అలభ్యం) 6 నాటకములు, చాటుకృతులు (లభ్యం).

బిరుదు : 'కథాశుకవి'.

గురువు : రేవూరి కాళహస్తి దేశికుడు.

విద్వత్కవి. ఇతని కృతులలో మొదటి రెండు మాత్రం దొరికాయి. అన్నీ భగవదంకితాలే అని కార్తిక మాహాత్మ్యం పీఠిక నుండి తెలుస్తున్నది. ఇతని తాత గోవిందామాత్యుడు 'భారతీ పరిణయ' కర్త. ఇతడు వీరవేంకటపతి రాయలను (1680 ప్రాంతం) మెప్పించాడట. కవి తండ్రి రామయ్య పాండ్య దేశాధీశ్వరుని మంత్రిగా ఉండేవాడు.

వేంకటాచల కవి చాలా నాటకాలు, ప్రబంధాలు, చాటుకృతులు రచించినట్లు తెలుస్తున్నది. అవి లభ్యం కాలేదు. (ద. దే. వా-366)

కుంభకర్ణ విజయమ్ (సం)

కర్త : సరిపల్లి వేంకట రంగాచార్యులు.

సంస్కృతంలో రచింపబడిన కావ్యం.

కుకుత్స్థ విజయము

కర్త : మట్ల అనంతరాజు.

కృతి భర్త: మట్ల ఎల్లమరాజు (కవికి తండ్రి).

ఐదు ఆశ్వాసాల ప్రబంధం. వీరరస ప్రధానం.

ప్రత్యేకత : ఇది ఇక్ష్వాకుని మనుమడయిన కుకుత్స్థుని కథ. మొదట ఇక్ష్వాకుని కథ, తరవాత ఆయన కొడుకు సుకుమారుని కథ ఉంటాయి. చివరలో నాలుగో ఆశ్వాసంలో కుకుత్స్థుని కథ ఉంటుంది ప్రబంధాలలో అరుదుగా ఉండే "కొరవంజి" పాత్ర ఈ ప్రబంధంలో కనిపిస్తుంది. దీనిలో కొన్ని విశేషపద ప్రయోగాలున్నాయి. అపురూపమైన కొన్ని వృత్తాలను కూడా ముద్రాలంకారాలతో కవి దీనిలో వాడాడు ఈ కావ్యకర్తకు సంస్కృతంలో పాండిత్యం బాగా ఉందని, తెలుగు మాటల కూర్పులో చాలా మెలకువలు చూపాడని పండితాభిప్రాయం. ఈ కావ్యంలో శృంగారం కలిసి వీర రసమే ఎక్కువగా కనిపిస్తుంది. కవిత్వం నిర్దుష్టంగా ఉంది.

(ఆరుద్ర-9-134)

కుక్కుటేశ్వర శతకము

కర్త : కూచిమంచి తిమ్మకవి.
కాలం : క్రీ. శ. 1756-60 ప్రాంతం.
కృతిభర్త : కుక్కుటేశ్వరుడు.

అధిక్షేప ప్రధానమైన శతకం. ఇందులో కవి-సజ్జన దుర్జన లక్షణాల్ని వివరించి, దుష్ట ప్రభువుల చిత్త వృత్తినీ, కుకవుల మానసిక ప్రవృత్తినీ, పామరజనుల స్థితిగతుల్ని, సాంఘిక దురాచారాల్ని అధిక్షేప పూర్వకంగా విమర్శించాడు. ఈ శతకం తూర్పు గోదావరి జిల్లా పిఠాపురంలో వేంచేసి ఉన్న కుక్కుటేశ్వరస్వామికి అంకితం శైలి ప్రౌఢంగా ఉంది. (శ. సా. వి; సా చ సం-205)

కుచేలోపాఖ్యానము

కర్త : తెలియదు.

జానపద పౌరాణిక గేయం. సుప్రసిద్ధమైన కథ. భాగవతంలోనిది.

చూ పౌరాణిక గేయములు.

కుచేలోపాఖ్యానము

కర్త : ఘట్టు ప్రభువు.

మూడాశ్వాసాల పద్యకావ్యం. బహుళ ప్రచారాన్ని పొందిందట.
(ఆరుద్ర-12-54)

కుడిచెర్ల తిప్పరాజు

కాలం : క్రీ. శ. 16వ శతాబ్ది.
రచన : కాంచీ మాహాత్మ్యము.

విశిష్టత : ఈయన కావ్యం నుంచి "ఉదాహరణ పద్యములు" అనే సంకలన గ్రంథంలో ఆరు పద్యాలున్నాయి. పూర్వకవులు దగ్గుపల్లి దుగ్గన "శివకాంచీ మాహాత్మ్యం", ఆంధ్రకవి రామయ్య "విష్ణుకాంచీ మహాత్మ్యం" వ్రాసినట్లే ఈయన "కాంచీ మాహాత్మ్యం" అనే కావ్యం వ్రాశాడు. ఇందులో 3 పద్యాలు పురవర్ణనకు, ఒకటి భరద్వాజుని స్తుతికి, మరొకటి కవి తన పితామహుడు దర్భాసనం మీద కూర్చున్న తీరుకు సంబంధించి ఉంటాయి. కవి తన కావ్యంలో విశేషంగా శ్లేషలు వాడి ట్లు తోస్తున్నది.
(ఆరుద్ర-9)

కుడుముల రామయామాత్యుడు

స్థలం : వినుకొండ సీమ.

ఇతనిపై చాటుపద్యాలున్నాయి.

ఈయన మహిత గుణశాలియైన దానశీలి అని ఒకచాటువు వల్ల తెలుస్తున్నది మరొక చాటువులో రాళ్ళబండి పట్టాభిరామకవి ఇతనిని రాయన భాస్కరుని వంటి దాతగా నుతించాడు. (చా ప. ర.)

## కుడుముల వాసయ్య

కాలం : చూ. రాళ్ళబండి పట్టాభిరామకవి.

స్థలం : వినుకొండ.

ఈయన గొప్ప దాత. కుడుములవారు రాయన భాస్కరునివలె దాతలని రాళ్ళబండి పట్టాభిరామకవి చాటు పద్యాలలో చెప్పాడు. (చా. ప. ర.)

## కుదృష్టి భంగమ్ (సం)

కర్త : కందాడై అప్పకొండాచార్యుడు. (తె. వి. స-4)

## కుపమ

కాలం : క్రీ. శ. 1055 ప్రాంతం.

స్థలం : గోదావరీ మండలం.

దక్షారామ దాన శాసనం వేయించింది. ఈమె ఆదికవి నన్నయ భట్టుకు ఇష్టుడు, సహాధ్యాయుడు అయిన నారాయణ భట్టు కూతురు. దక్షారామ భీమేశ్వరునికి అఖండ దీపారాధన నిమిత్తం "లోహపు దివియ"ను దానం చేసి శాసనం వేయించింది. ఈమె సాహిత్య విద్యా నిపుణురాలట. చూ. కొమర్రాజువారి వ్యాసం - రాజరాజనరేంద్ర పట్టాభిషేక సంచిక క్రీ. శ. 1922, పుట 114. (తె. క. చ-161)

## కుపమ దాక్షారామ శాసనము

కాలం : క్రీ. శ. 1055.

శాసన రచయిత : తెలియదు.

శాసనం వేయించినవారు : నారాయణభట్టు కుమార్తె కుపమ.

శాసన విషయం : దక్షారామ భీమేశ్వరునికి అఖండ దీపారాధనకై 'లోహపు దివియ'ను దానం చేయటం. "త్రైలోక్య మల్లదేవర ప్రధాని నారాయణభట్టు" అని ఈ శాసనం చెప్తున్నది. ఇతడూ, నన్నయ్యభట్టు సహాధ్యాయియైన నారాయణభట్టూ ఒకరేనని చాలా మంది భావిస్తున్నారు. (తె. క. చ-161)

## కుప్పమ్మ

కాలం : 13వ శతాబ్దం.

రచన : తెలియరాలేదు.

అయ్యలరాజు రామభద్రుని సకల కథాసార సంగ్రహంలో ఈమె ప్రసక్తి ఉన్నదట. ద్విపద రంగనాథ రామాయణ రచనలో ఈమె తోడ్పడింది.

నన్నయకు భారత రచనలో తోడ్పడిన నారాయణభట్టు కుమార్తె కుప్పమ్మ కూడా కవితా విశారద అని అంటారు. ఆమె పేరు. (క. స-73)

## కుప్పయ మంత్రి

కాలం : 17వ శతాబ్దం.

స్థలం : తంజావూరు.

ప్రతి విలేఖకుడు. సంస్కృతాంధ్రాలలో పండితుడు. తంజావూరును మహారాష్ట్ర రాజులు పాలించిన కాలంలో రాజైన శహాజీ (1684-1712) ఆనతి మేరకు ప్రాచీన తెలుగు గ్రంథాలకు ప్రతులు వ్రాశాడు.

## కుప్పాళ్ మల్లు

కాలం : 18వ శతాబ్దం.

స్థలం : గంధర్వకోట (చోళదేశం).

సాహితీ పోషకుడు. కృతిపతి. నుదురుపాటి వెంకన్నను ప్రోత్సహించి బ్రహ్మాండ పురాణంలోని దేవమల్లు చరిత్రను తెలుగులో రచింపజేశాడు. ఆ కావ్యం ఇతనికే అంకితం. రామనాథపుర సంస్థాన పాలకుడైన ముద్దువడుగురాజు నుండి ఇతడు నిరవధికైశ్వర్యాన్ని పొందిన సేనా నాయకుడట. గంధర్వకోట పుదుక్కోటకు ఇరవై మైళ్ళ దూరంలో ఉంది. (ద. దే. వా)

## కుబ్జా కృష్ణ విలాసము

కాలం : 18వ శతాబ్దం.

కర్త : అక్కెన ప్రగడ హరిదాసు.

పద్యకావ్యం. వివరాలు తెలియవు. (య. వా. చ.)

## కుమార కృష్ణయాచేంద్రుడు

ఈయన వేంకటగిరి నేలిన ప్రభువు. ఈ ప్రభువు గుణగణాలను ప్రస్తుతిస్తూ చాలా చాటు పద్యాలున్నాయి. (చా. ప. ర.)

## కుమారగిరి రాజీయమ్ (సం)

కర్త : కాటయ వేమారెడ్డి (చూ).

కాళిదాసు నాటకత్రయానికి వ్యాఖ్య. సమకాలీన విశేషాలు కొన్ని ఈ కృతిలో కవి చెప్పాడు. కాటయ వేముని బావమరదీ, కొండవీటి ప్రభువూ అయిన కుమారగిరి పేర ఈ వ్యాఖ్య రచింపబడింది. (రె. రా. చ.)

## కుమారగిరిరెడ్డి

కాలం : క్రీ. శ. 1386-1402 ప్రాంతం.

బిరుదు : వసంతరాజు.

రచన : 'వసంతరాజీయమ్" (నాట్యశాస్త్ర గ్రంథం) (అలభ్యం)

కొండవీటిరెడ్డి ప్రభువు. అనవోతారెడ్డి కుమారుడు. సంగీత, నాట్య, సాహిత్య శాస్త్రాలలో అభిరుచి ఉన్నవాడు.

కాటయవేముని "కుమారగిరి రాజీయమ్"లో కుమారగిరి రచించిన నాట్యశాస్త్ర ప్రసక్తి ఉంది. నాట్య వేదవిదులైన భరతుడు, భోజుడు వ్రాసిన గ్రంథాలను చూసి ఇతడు ఈ గ్రంథం వ్రాశాడట.

విశిష్టత : విరివిగా వసంతోత్సవాలు జరిపి, సంగీత, సాహిత్య, నాట్య గోష్ఠులతో కాలం గడిపేవాడు. ప్రసిద్ధ నర్తకి "లకుమాదేవి" ఇతని ప్రియురాలు. ఆమె అభినయం ఇతనికి నాట్యశాస్త్ర గ్రంథ రచనకు ప్రోత్సాహం ఇచ్చిందని అంటారు.
(తె. రా. చ.)

కుమారగురు విలాసము (అలభ్యం)

కర్త : చిత్రకవి వేంకటరమణ. (ఆరుద్ర-9)

కుమార ధూర్జటి

నామాంతరం : వెంకటార్యుడు.

కాలం : 17వ శతాబ్దం.

స్థలం : విజయనగర ప్రాంతం.

రచనలు : 1. కృష్ణరాయవిజయము, 2. సావిత్రీ చరిత్రము (అలభ్యం) 3. ఇందుమతీ పరిణయము.

గురువు : ఓరుగంటి కాశీపతి.

ఆరవీటి చిన వెంకటరాయల ఆస్థానకవి. నవ్య పటు వాక్చమత్కృతిగలవాడు. తండ్రి కాశయామాత్యుడు. శ్రీకృష్ణదేవరాయల సభలో ప్రస్తుతింపబడ్డ ధూర్జటి కవి ఇతనికి పెద తాత.

ఇతడు సూచివీడు, విజయనగర సంస్థానాలు సందర్శించినట్లు తెలుస్తున్నది కుమార ధూర్జటి ఇతని బిరుదనామమని కొందరి తలంపు. ఇతని కుమారుడు లింగరాజు పెదకాళహస్తి మాహాత్మ్యాన్ని, మనుమడైన వెంకట రాయకవి రత్నావళీ పరిణయాన్ని రచించారు. (ఆరుద్ర-10-203)

కుమార నైషధము (అలభ్యం)

కర్త : ఎడపాటి ఎర్రన.

ఇది చక్కని ప్రబంధమట. దీనిలోని కొన్ని పద్యాలను పెదపాటి జగ్గన్న తన సంకలన గ్రంథమైన "ప్రబంధరత్నాకరం"లో ఉదాహరించాడు.
(తె. వి. స-6-597)

కుమారరాముని కథ

కర్త : తెలియదు.

జానపద చారిత్రక గేయం.

చూ. చారిత్రక గేయాలు. (అం వా. చ)

కుమార రుద్రదేవుడు

కాలం : క్రీ. శ. 1291-1323 ప్రాంతం.

రచన : భాస్కర రామాయణంలో అయోధ్యకాండ.

సాహిణిమారన కుమారుడు. బుద్ధయ మనుమడు. తాను రచించిన రామాయణ భాగాన్ని తండ్రికే అంకితమిచ్చాడు. (ఆరుద్ర-శ)

## కుమార సంభవము

కర్త : నన్నెచోడుడు.

అంకితం: జంగమ మల్లికార్జున శివయోగికి.

కవి పాకనాటి తెలుగు చోడరాజ కవి. చోడబల్లి కుమారుడు.

ప్రత్యేకత : లభించిన ప్రాచీన తెలుగు కావ్యాలలో ఇది విశిష్టమైనది. పన్నెండు ఆశ్వాసాలున్నాయి. ఈ కావ్యంలో వైరి సమాసాలు, వ్యాకరణ విరుద్ధ ప్రయోగాలు ఉన్నాయి. కవి కృత్యవతారికలో కాళిదాసును ఉద్భటుని స్తుతించాడు. సంస్కృతంలో ఈ యిద్దరు కవులూ "కుమారసంభవా"న్ని వ్రాశారు. ఈ కావ్యాలలోని కొన్ని శ్లోకాలను కవి తన కావ్యంలో అనువదించాడు. ఈ కావ్యం దాదాపు స్వతంత్ర రచన అని చెప్పుకోవచ్చు. రచన ప్రౌఢంగా ఉంది. శివపార్వతుల వివాహ ఘట్టాలు, కుమారస్వామి జననం, తారకాసుర వధా ఘట్టాల సందర్భంలో శివపురాణ గాథలతో పాటు, కాళిదాస ఉద్భటులనుంచి కూడా విషయ సంగ్రహణం చేశాడు. ఇందులో గణేశ జననం, దక్షయజ్ఞం, సతీదేవి దహనమైపోయి పార్వతిగా జన్మించడం, రతీ మన్మథ సంవాదం, గిరిజా కల్యాణం, కుమారస్వామి జననం, తారకాసుర వధా ఘట్టాలున్నాయి. కవి తాను కావ్యంలో వ్రాసే తెలుగును "జాను తెనుగు" అన్నాడు. మార్గ, దేశి కవితలను ప్రస్తావించాడు. "వస్తుకవిత", 'గూఢకవిత' లను పేర్కొన్నాడు. 'జాను తెనుగు' అంటే సర్వులకు సుబోధకమైన తెలుగు అని కవి తలంపు కావచ్చు. ఇందులోని వర్ణనలు సహజంగా ఉంటాయి. అష్టాదశ వర్ణనలు, ద్వాత్రింశ కాలంకారాలున్నాయి. ఇందులోని శయ్య అసాధారణం. కల్పనా శిల్పం అద్భుతం. దీనికి కొన్ని కావ్యలక్షణాలు, కొన్ని ప్రబంధ లక్షణాలున్నాయి. కనక పండితులు దీనిని కావ్య ప్రబంధం అంటారు.

(ప్రా. ద. దే. చ.)

## కుమార సంభవ చంపూకావ్యమ్ (సం)

కర్త : రెండవ శరభోజీ.

ఇతివృత్తం ప్రసిద్ధం.

కవి అసాధారణ ప్రతిభా విశేషాలు కలవాడు. బహు భాషా కోవిదుడు. పురాణ గాధను కావ్య ప్రబంధంగా రసవంతంగా రూపొందించాడు.

## కుమారార్జునీయము (అలభ్యం)

కవి : సుగుటూరి ముమ్మడి తమ్మ భూపాలుడు (చూ.).

## కుమారీ శతకము

కర్త : పక్కి వెంకట నరసయ్య.

ఇది బాలికలకోసం ప్రత్యేకంగా రచించిన శతకం. స్త్రీలు చక్కని గుణశీలాదు

లను అలవర్చుకోవాలని, పాతివ్రత్య ధర్మాన్ని పాటిస్తూ ధర్మశాస్త్ర పద్ధతిలో నడుచుకోవాలని ఈ శతకం బోధిస్తుంది. తెలుగు నాట బహుళ ప్రచారంలో ఉన్నది.

(శ. సా. వి-381)

**కుమారేచ భూపాలుడు**

నామాంతరం : కుమారయాచ భూపతి (చూ).

**కుముదవల్లీ విలాసము**

కర్త : పొనుగోటి జగన్నాథరాయలు (చూ.).

కృతిపతి : సముద్రాల తిరుమలాచార్యులు.

ఐదాశ్వాసాల గ్రంథం.

మూలం : పన్నెండుమంది ఆళ్వారులలో ఒకడైన తిరుమంగై యాళ్వార్ చరిత్ర. ఇతనిని పరకాలుడు అనే పేరుతో తెలుగులో వ్యవహరిస్తారు. ఇతని భార్య "కుముదవల్లి" లక్ష్మీదేవి అవతారం.

ఈ కథ భద్రాచలం దేవాలయం కట్టించిన రామదాసు కథను పోలి ఉంటుంది. భక్తుడు రాజద్రవ్యం స్వామి కార్యానికి వెచ్చించడం, భగవంతుడే చివరకు ఆ సొమ్ము చెల్లించడం వంటి సంఘటనలున్నాయి. 1925లో ముద్రింపబడింది. (అముద్ర-11-282)

**కుముద్వతీ పరిణయము**

కర్త : బొమ్మిడి వీరయకవి.

అంకితం : మేకా అప్పనృపాలునకు (మేంక అప్పనృపాలుడు).

దీని ప్రతి కాకినాడ సారస్వత పరిషత్తులో ఉంది. (సా. ప. ప. 23-5)

**కుముద్వతీ పరిణయము (అలభ్యం)**

కర్త : చూ. మండపాక పేరయకవి.

ప్రబంధం. వివరాలు తెలియవు. (అం. సం. సా.-307)

**కుముద్వతీ పరిణయము**

కవి : పట్లే కుమారానంత భూపాలుడు (చూ.).

శృంగార ప్రబంధం.

ఇతివృత్తం : కాశీరాజు కుమార్తె కుముద్వతికి శ్రీరాముని కుమారుడు కుశునికీ జరిగిన పరిణయ గాథ.

మూడు ఆశ్వాసాలు మాత్రం లభించాయి. కవిత్వం మృదుమధుర పద సంయుతంగా ఉన్నదట. (క. త-12-99)

**కురవంజి**

కర్త : ఫణిహారం ఎంబారయ్య.

యక్షగానం. రామానుజాచార్యులొకసారి కురవంజి, నేపథ్యం స్వీకరించి కాంచీ

పుర పట్టమహిషి అరుందేవితాయి దగ్గరకు వెళ్ళి, విశిష్టాద్వైత పరంగా పాంచ భౌతిక దేహతత్త్వము, జీవేశ్వర మర్మములు మొదలయిన వాటి గురించి ఉపన్యసించడం, పెరియ పెరుమాళ్లు (శ్రీమహావిష్ణువు) సింగడై రావడం ఇందులోని కథ.

దీనిలో దరువులు, తాళప్రధానాలయిన పదాలు, ద్విపదలు, వృత్తాలు, సంధివచనాలు ఉన్నాయి. ఏల, ముచ్చట, అల్లోనేరేళ్ళు, పాళిపదం, సువ్వాల ధాతు విశేషాలు ఉన్నాయి. (య. వా. చ-72)

## కురవాటి సీమ

ప్రస్తుత ఏలూరు కొవ్వూరు తాలూకాలు (పశ్చిమ గోదావరి జిల్లా) పూర్వం ఈ కురవాటి సీమలో చేరిన ప్రదేశాలు. ఈ కురవాటి సీమ ప్రసక్తి "క్రీడాభి రామం"లో (వేంగి కురవాటికా దేశ విపిన భూమి) ఉంది. కురవాటి సీమ రామచంద్రాపురం-కాకినాడ తాలూకాలకు చెందిన భూమి అని కొందరంటున్నారు. ద్రాక్షారామ శాసనాలలో ఆ ప్రాంతం గృధ్రవాటి సీమగా చెప్పబడిందట. ఇదే కురవాటి సీమ అయిందని కొందరి అభిప్రాయం. (సం. ఆ. వి. కో-5; శ్రీనాథకవి, 2-49)

## కురవి రామకవి

స్థలం : కార్వేటి నగర సంస్థానం.

రచన : దశరూపక పద్ధతి, కువలయానంద విశ్వగుణాదర్శ చంపువులకు వ్యాఖ్య, 'లాస్య' నామక వ్యాఖ్య.

కార్వేటి నగర సంస్థానాశ్రితుడు. నాట్యశాస్త్ర పారంగతుడు. సంస్కృతాంధ్రాలలో రచన చేశాడు. ఇతని దశరూపక పద్ధతి గీర్వాణకృతి. ఈ కవి కువలయానందానికి, విశ్వగుణాదర్శ చంపూ గ్రంథానికి వ్యాఖ్య రచించినట్లు వినికిడి. అవి అలభ్యం. అనంతుని భారత చంపువునకు "లాస్య" మనే వ్యాఖ్య రచించాడు. (ఆం. సం. సా.)

## కురుపాము

శ్రీకాకుళ మండలంలోని పార్వతీపురానికి 10 మైళ్ళ దూరంలో ఈ సంస్థానం ఉండేది. ఇది 700 చ॥మైళ్ల వైశాల్యం కలిగి పార్వతీపురం, గుణుపురం తాలూకాలలోకి వ్యాపించింది.

ఈ సంస్థానం పాలకులు చంద్రవంశంలోని 'శిలావంశానికి' చెందినవారట. వీరికి "అగ్గివీరుడు" మూల పురుషుడు. ఈ సంస్థానాధీశులకు "వైరిచర్ల" అనే కుల బిరుదం ఉంది. ఈ వైరిచర్లకూటంలో అగ్నివీరుడికి ఆరవతరంవాడైన "సన్యాసి దొర" మొదటివాడు. వీరు ఓఢ్ర జాతీయులైన కొండరాజులు.

పూర్వం ఈ సంస్థానం "జయపురం సంస్థానం" లో అంతర్భాగమట. తరువాతి కాలంలో జయపురపాలకుడైన "విశ్వంభరదేవు" వలన ఈ సంస్థానం రూపొందింది. జయపురం వారు ఈ సంస్థానాన్ని ప్రత్యేకంగా గుర్తించక పూర్వమే, క్రీ. శ. 1435లో

కటకంలోని గజపతుల పతనానంతరం వీరు స్వతంత్రులైనారని, ఆ తదుపరి జయపుర పాలకులు వీరిని గుర్తించి, సంస్థానాధిపత్యం స్థిరపరిచినారని కూడా ఒక కథనం ఉంది.

వైరిచెర్ల సన్యాసిరాజు తరువాత ఈ సంస్థానం వారు చాలాకాలం యుద్ధాలలోను, కోర్టు వ్యాజ్యాలలోను మునిగి ఉండడంచేత, ఇక్కడ సాహిత్యపోషణ ఎక్కువగా కనిపించదు. అయినప్పటికి వీరు నడిమింటి పండిత కుటుంబాన్ని తూర్పుగోదావరి మండలంనుంచి రప్పించి, తమ సంస్థానంలో అగ్రహారాదులనిచ్చి స్థిరపరచుకున్నారు. "నడిమింటి సర్వమంగళేశ్వర శాస్త్రి" ఈ కుటుంబం వారిలో ముఖ్యుడు.

సూర్యనారాయణరాజు కుమారుడైన వైరిచెర్ల వీరభద్ర రాజు (1898 ప్రాంతం), ఇతని సతీమణి అనకాపల్లి ఆడపడుచైన లక్ష్మీనరసాయమ్మ సాహిత్యంలో అభిరుచికలవారు. 'మహావాక్యరత్నావళి' కర్తఅయిన పులుగుర్త నృసింహామాత్యుడు, గురువంతి వేంకటాచల శర్మ మొదలైనవారు వీరి ఆస్థానంలో విద్వాంసులుగా ఉన్నారు.

కృష్ణామండలం గుడివాడ తాలూకాకు చెందిన మద్వ్రశ్రీ నందిగిరి వేంకటప్పారావు పంతులు కురుపాము సంస్థానాధీశ్వరుల దర్బారులోజరిగే సాహిత్య చర్చల్లో పాల్గొని అనేక బహుమానాలు పొందాడు.

వీరభద్రరాజు క్రీ. శ. 1918లో మరణించాడు. ఇతని కుమారులు నరసింహ సూర్యనారాయణరాజు, నారాయణ గజపతిరాజులకు కురుపాము సంస్థానంతోపాటు కుప్పిలి, గొట్టుపల్లి సంస్థానాలు కూడా సంక్రమించాయట. తదనంతర కాలంలో ఈ సంస్థానం భారత గణతంత్ర రాజ్యంలో కలసిపోయింది. (ఆం. సం. సా-103)

### కురుసంధానము

కర్త : టూ. విక్రాల నరసింహాచార్యులు.

అముద్రిత గ్రంథం. (ఆం. సం. సా)

### కులకము

శ్రవ్యకావ్య భేదం. క్రియా సమాప్తి కోసం పరస్పరాపేక్ష ఉన్న ఐదు పద్యాల మొత్తం. క్రియా పదం చివరి పద్యంలో ఉంటుంది. (తె. వి. స-6)

### కులశేఖర మహీపాల చరిత్రము

కర్త : శేషము రఘునాథార్యుడు.

ప్రబంధం. ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారం వారు దీన్ని ప్రచురించారు. (య. వా. చ-89)

### కులాచారము

కాలం : క్రీ. శ. 11 - 15- శతాబ్దాల మధ్య కాలము.

(చూ-భైరవీ చక్రము).

### కువలయానంద ప్రకాశము

కర్త : దవికినేని రామయకవి.

అప్పయదీక్షితులు సంస్కృతంలో రచించిన కువలయానందానికి ఇది ఆంధ్రీకరణం. ఈ రచనలో ఇతనికి రంగాచార్యులు తోడ్పడ్డాడట.

## కువలయానందమ్ (సం)

కర్త : అప్పయ్య దీక్షితులు.

ఇది చాలా విఖ్యాతి పొందిన అలంకార గ్రంథం. అలంకార శాస్త్రగ్రంథాలలో మొదటిదైన చన్ద్రాలోకానికిది వివరణ గ్రంథం. చంద్రా లోకంలోని లక్ష్యలక్షణాలతో నే దీని రచన సాగింది. కొన్ని కొత్త రసాలు అలంకారాలకు కొత్త లక్షణాలు, ఉదాహరణలు ఉన్నాయి. కవి ఇతర కవుల శ్లోకాలను ఉదాహరణలుగా గ్రహించాడు. చంద్రా లోకంలోని నూరు అలంకారాలే గాక, దీనిలో అదనంగా 22 అలంకారాలున్నాయి. అలంకార విషయంలో దీన్ని పండితులు పరమ ప్రమాణంగా స్వీకరిస్తున్నారు. దీనికి చాలా వివరణ గ్రంథాలు వచ్చాయి. (తె. వి. స-6)

## కువలయానంద వ్యాఖ్య (అలభ్యం)

కర్త : కురవి రామకవి.

సంస్కృత కువలయానందానికి వ్యాఖ్యానం. ఈ గ్రంథం తెలుగో, సంస్కృతమో తెలియదు. (ఆం. సం. సా.)

## కువలయావళి (సం)

కర్త : చూ. సర్వజ్ఞ సింగభూపాలుడు.

నామాంతరం : రత్న పాంచాలిక.

ఇది ప్రఖ్యాతమైన నాటిక. (ఆరుద్ర 3-4)

## కువలయాశ్వ చరిత్ర

కర్త : తెలియదు.

అంకితం : కందుకూరి మల్లికార్జున మంత్రికి.

ఈ గ్రంథం ఉర్లాం సంస్థాన మూలపురుషులలో ఒకరైన కందుకూరి మల్లికార్జున మంత్రికి అంకితంగా రచింపబడింది. కవిని గురించిన వివరాలు తెలియవు. అత్తలూరి పాపకవి రచించిన చెన్న బసవ పురాణంలో దీని ప్రసక్తి ఉంది.
(క.చ-3-118) (క. స-120)

## కువలయాశ్వ చరిత్ర (అలభ్యం)

కాలం : క్రీ. శ. 1450-1500 ప్రాంతం.

కర్త : ఏర్చూరి సింగన్న.

ప్రత్యేకత : గ్రంథం పూర్తిగా దొరకలేదు. ఇది మార్కండేయ పురాణంలోని కథ. కువలయాశ్వుడు ఒక పందిని వేటాడుతూ పాతాళానికి వెళ్ళి, రాక్షసుని వధించి. మదాలసను పెళ్ళి చేసుకొంటాడు. 12 పద్యాలను పెదపాటి జగ్గన్న ప్రబంధరత్నావళిలో ఉదాహరించాడు. "గిరస గింజలాట" అనే పిల్లల ఆటను తెలుగులో మొదట చెప్పిన కావ్యం ఇది. (ఆరుద్ర-6)

కువలయాశ్వ చరిత్ర

కర్త : నందూరి కేతన (చూ).

కాలం : క్రీ. శ. 1300 ప్రాంతం.

ఈ కవి కేయూర బాహుచరిత్ర కృతిపతి నందూరి గుండయ మంత్రికి అన్న అని కొందరంటున్నారు. ఇతడే మూలఘటిక కేతన కావచ్చునని మరికొందరి అభిప్రాయం. (క. త-3-166)

కువలయాశ్వ చరిత్ర

కర్త : మూలఘటిక కేతన (నిర్ధారణ కాలేదు).

ప్రబంధ రత్నావళిలో కేతన రచించిన కువలయాశ్వ చరిత్రము పేర్కొనబడింది. అతడు నందూరి కేతన గాని మూలఘటిక కేతనగాని కావచ్చు. దీనిపై భిన్నాభిప్రాయాలున్నాయి.

కువలయాశ్వ చరిత్ర

కర్త : పవరం చిననారాయణ నాయకుడు (చూ).

అంకితం : పవరం పెద నారాయణ నాయకునకు.

రచనా కాలం : క్రీ. శ. 1580 ప్రాంతం.

అయిదు ఆశ్వాసాల ప్రౌఢకావ్యం. జాతి వార్తా చమత్కృతి, యుక్తి, క్రియా గౌరవాలు నింపుకొన్న రచన. కవి దీన్ని తన పెంపుడు తండ్రికి అంకితం ఇచ్చాడు.

మూలం : మార్కండేయ పురాణంలోని మదాలస కథ. కొద్దిగా మార్చి రసవత్తరంగా క్రొత్తరీతిలో చెప్పాడు కవి. సమకాలీన సంఘ జీవితం-వాస్తవికత ఈ రచనలో కనిపిస్తాయి. గొల్లపదాలు, ధరమరాజు పదాలు, కోడిపందాలు మొ॥ వానితో జాతీయతను సంతరించుకొన్న రచన. (ఆంధ్ర ప్ర 11-156)

కుశలవ కథ (కుశలవోపాఖ్యానము)

కర్త : తెలియదు.

కాలం : 18 వ శతాబ్దానికి ముందు.

ద్విపద కావ్యం. కథ క్రొత్తది శ్రీరామచంద్రుని దగ్గర దాసాకృతిగా ఒక స్త్రీ ఉన్నదని కైక సీతతో చెప్పడం, ఆమె రాముడు లేని సమయంలో ఆ బాణాన్ని పొడి చేసి తాగడం, ఆపై ఆమెకు గర్భం నిలవడం-అనే ఘట్టాలున్నాయి. కుశలవుల జన్మ ప్రకారం నుండే కావ్యం మొదలవుతున్నది. పై వృత్తాంతాలు కథలో ప్రసక్తానుప్రసక్తంగా కవి చెప్పాడు. (ద్వి. సా. చ-375)

కుశలవ యుద్ధము

జానపద పౌరాణిక గేయ రచన.

ఇతి వృత్తం రామాయణ కథకు సంబంధించింది.

ఉత్తరరామాయణంలోని కథ. రాముని కుమారులు యాగాశ్వాన్ని బంధించడం, తన్నిమిత్తం తండ్రితో యుద్ధం చేయడం మొ॥ వి ఇందులోని విషయాలు.

చూ. పౌరాణిక గేయములు. (ఆం. వా. చ.)

**కుశలవ విజయ నాటకమ్ (సం)**

కర్త : వెంకటకృష్ణ దీక్షితుడు.

**కుశలవో పాఖ్యానము (అలభ్యం)**

కర్త : చిరుమూరి గంగరాజు.

రచనాకాలం : క్రీ. శ. 1560 కి పూర్వం.

రెండు పద్యాలు మాత్రం దొరుకుతున్నాయి. ఒకటి ప్రబంధ రత్నాకరం (పెదపాటి జగ్గన్న) లో శ్రీరాముని వర్ణించే పద్యం. రెండవది ఉదాహరణ పద్యాల సంకలన కర్త సేకరించిన, వ్యాసనుతి ఉన్న పద్యం.

తెలుగులో కుశలవుల కథను ప్రత్యేకంగా చెప్పిన మొదటి కావ్యం ఇదే.

(క. స.)

**కుశలవోపాఖ్యానము**

కర్త : లావనూరి రామనార్యుడు.

అంకితం : రామభద్రునికి.

ద్విపద కావ్యం. జైమిని భారతంలోని అశ్వమేధ పర్వాంతంలో ఉన్న కుశలవ చరిత్రకు స్వతంత్రానువాదం. కవి, అవతారికలోను, కథలోను రమ్యమైన మార్పులు చేశాడు. కవి సంగీత సాహిత్య వైదుష్యం రచనలో తేటతెల్లమవుతున్నది.

(ద్వి. సా. చ-368)

**కూచకొండ రామాయణము**

కర్త : తెలియదు.

జానపద పౌరాణిక గేయరచన.

చూ. పౌరాణిక గేయములు. (ఆం. వా. చ.)

**కూచిపూడి**

కూచిపూడి గ్రామం పూర్వనామం కుచేలపురం. ఇది కూచిపూడి భాగవతుల స్వగ్రామం. ఇప్పటి కృష్ణా జిల్లాలో ఉంది. కూచిపూడి భాగవతులకు ప్రథమ కులపతి సిద్ధేంద్రయోగి. ఈయన భామా కలాప సృష్టి ప్రతిష్ఠా మహాత్ముడు. ఈయన తన భాగవత మేళాన్ని వెంటబెట్టుకుని గోలకొండ తానీషా ప్రభువు దగ్గర ఒక నృత్య రూపకాన్ని ప్రదర్శించి, నవాబును మెప్పించి, తనపేర, తన అనుచరులపేర శాసన పూర్వకంగా కుచేల పురాన్ని (ఇప్పటి కూచిపూడి) దానం పొందాడట. మాచుపల్లి కైఫీయత్‌లో ఈ విషయం స్పష్టంగా ఉంది.

ఈ కళాక్షేత్రం ఆంధ్ర విష్ణువు వెలసిన శ్రీకాకుళ క్షేత్రానికి అతి సమీపంలో ఉంది.

కూచిపూడి భాగవతులు క్రీ.శ. 15 వ శతాబ్దం నాటికే వీధి భాగవతాలను ప్రదర్శించే వారని కొందరంటున్నారు. దీనికి ఆధారం క్రీ. శ. 1502 సంవత్సరం నాటి మచ్చుపల్లి కైఫియత్.

కళారంగంలో ప్రత్యేక స్థానాన్ని పొందిన భామాకలాపం, గొల్లకలాపం రెండూ కూచిపూడివారి సొత్తు. వీరు క్రీ. శ. 16 శతాబ్దం నుంచి నేటివరకు పై కలాపాలను దిగ్విజయంగా ప్రదర్శిస్తూ అఖిల భారతదేశంలో ప్రశంసలనందుకొంటున్నారు.

(య. వా. చ-30. ద్వి. భా; నా. ర. చ-135)

కూచిపూడి గొల్ల కలాపము ప్రత్యేకత

దీని కర్త సిద్ధేంద్ర యోగి అనీ, కాదనీ పండితుల మధ్య భేదాభిప్రాయం ఉంది. దీనిని భాగవతుల రామలింగశాస్త్రి వ్రాశాడని ప్రబలమైన ప్రతీతి ఉండి లేక పోలేదు.

దీనిలో రెండు రకాలున్నాయి. ఒక దానిలో గొల్లభామ, పిండోత్పత్తి విషయం నుంచి ఎత్తుకొని సుదీర్ఘంగా ఒక వేదాంతోపన్యాసం చేస్తుంది. రెండో దానిలో సముద్ర మథన గాథ, సుంకరి కొండని సరసం ప్రసక్తాలు. మొదటి దానిని సిద్ధేంద్రుడు వ్రాశాడని, అది వేదాంత విషయపరంగా ఉండి ప్రజలకు అర్థంకాకుండా ఉన్నప్పుడు, రెండో రకమైన కలాప రచన జరిగి ఉంటుందని కొందరు ఊహిస్తున్నారు.

దీనిలో నాయిక గోపకన్య. ఆమె "బ్రాహ్మణ గోప జన్మలలో ఏది ఉత్తమమైంది? బ్రాహ్మణుడు గొప్పవాడా, గోపుడు గొప్పవాడా?" అని బ్రాహ్మణునితో వాదోపవాదాలు జరుపుతుంది.

ఈ ప్రదర్శనంలో ఇద్దరు గొల్ల వదెతులు చల్ల అమ్మే వేషాలు ధరించి భాగవతంలో వర్ణితమైన పిండోత్పత్తిని గురించీ, నవమాసాల పిండము పిండం బయటపడిన తరువాత, ప్రపంచ సృష్టి ఏ విధంగా ఉందేదీ అభినయంతో చూపుతారు. ఇందులో వేదాంత చర్చ ప్రధానం.

ఇక రెండో రకం గొల్ల కలాపంలో గొల్లభామతోపాటు సుంకరి కొండడుంటాడు. ఇతని వాలకమే విచిత్రంగా ఉంటుంది. ఈ కలాపంలో కొండని రాక పోకలు చాలా విసురుగా ఉంటాయి. ఇతడు ఏలపాట పాడుకొంటూ హేలగా వస్తాడు. వచ్చిన కొండడు మొదట సుంకం ఇమ్మంటాడు. సుంకం ఇవ్వలేకపోతే ఒక ముద్దిమ్మని భామను సమీపిస్తాడు. ఆమె తప్పించుకోవటానికి ప్రయత్నిస్తుంది. ఇద్దరి మధ్య జరిగే వాగ్వివాదం సరదాగానూ, మోటుగానూ కూడా ఉంటుంది. గొల్లభామ తన గయ్యాళి అత్తను పిలుస్తానని సుంకరిని బెదిరిస్తుంది. ఇంతలో అత్త రావటం సుంకరిని గద్దించి కోడలు పిల్లను తీసికొనిపోవటం మనోజ్ఞంగా ఉంటాయి.

ఈ కలాపం కూచిపూడివారి రసగుళిక.

(య. వా. చ-34, 35, 201; నా. ర. చ-141-142)

## కూచిపూడి భరతనాట్యము

ఈ నాట్యం ఆంధ్రదేశంలోనే గాక యావద్భారత దేశంలోనే చాలా ప్రసిద్ధికి వచ్చింది.

భావ, రాగ, తాళయుక్తంగా అభినయించే నాట్యాన్నే భరతనాట్యమంటారు. నాట్యం నృత్యమనీ, నృత్తమనీ రెండు రకాలు. భావాన్ని స్పష్టపరిచేది నృత్యం. భాషతో భావాలను వ్యక్తం చేసేది నృత్తం. కూచిపూడి నాట్యాచార్యులు వీటన్నిటినీ మేళవించి నృత్యం చేస్తారు. పాటలో ఉన్న ప్రతి పదం యొక్క భావాన్ని అభినయం ద్వారా చూపిస్తారు. ఈ విధంగా సంగీతం, సంగీతం ద్వారా పదం, పదం ద్వారా అభినయం, అభినయం ద్వారా భావ విశిష్టతను వెల్లడిస్తూ-నృత్తమూ, నృత్యమూ కూచిపూడి సంప్రదాయంలో ప్రాముఖ్యం వహించి ఉంటాయి. (నా. ర. చ-144)

## కూచిపూడి భాగవతుల 'తెరమీది జడ'

పూర్వం భాగవతుల ప్రదర్శనలలో ముఖ్యంగా భామా కలాప ప్రదర్శనంలో తెరమీద ఒక జడవేసి తద్వారా తమ పాండిత్య ప్రకర్షను ప్రదర్శించేవారు. ఈ జడ వర్ణనను పరిశీలించి తప్పులు పట్టటానికి పండిత ప్రకాండులందరూ ముందు వరుసలో కూర్చుండేవారట.

జడను 27 నక్షత్రాలలో ఒక నక్షత్ర మాలగా అలంకరించి, తెర వెలుపలి భాగంలో ప్రేక్షకులకు కనిపించేటట్లు వ్రేలాడదీసే వారు ఒక్కొక్క బిళ్ళకు ఒక్కొక్క శ్లోకం చదివేవారు. జడగంటలను నవగ్రహాలని పిలిచేవారు. ఆ జడను మయుడనే శిల్పి స్వయంగా సృష్టించాడని ప్రతీతి. తలకు సూర్యుడు, చంద్రుడూ అలంకరింపబడేవి. స్థూలంగా జడస్వరూప మిది.

ప్రదర్శన ప్రారంభంలో ఈ జడవర్ణనను ప్రదర్శిసూ ఉండగా ప్రేక్షకులుగా కూర్చున్న పండితుల్లో ఎవరైనా లేచి జడను గురించి ప్రశ్నిస్తే, భాగవతులు తగిన సమాధానం చెప్పి వారిని ఆశ్చర్య చకితుల్ని చేసేవారు. అలా సమాధానం చెప్పలేకపోతే ప్రశ్నించిన పండితోత్తములు ఆ జడను కత్తిరించి కళాకారులను అవమానపరిచేవారు. అలాంటి సందర్భాలను రానీయకుండా వేదాంతం లక్ష్మినారాయణ వంటి ఉద్దండులు ఎంతో ప్రావీణ్యంతో జడవర్ణనను పూర్తి చేసి ప్రేక్షకులను ముగ్ధులను చేసి పండితులను పామరులను రంజింపచేసేవారట. (నా. ర చ-142, 143)

## కూచిపూడి 'భామ' ధరించే భూషణాలు

కూచిపూడి "భామాకలాపం"లోని సత్యభామ పాత్ర చాలా విశిష్టమైంది. ఆమె ఆంగిక, వాచికాభినయాలే గాక ఆహార్యం అపురూపంగా ఉంటుంది. భాగవతులు ఈ "భామ"కు ఎన్నో రకాల ఆభరణాలను అలంకరిస్తారు. రోజుకు కొన్ని నగల చొప్పున, ఏడు రోజులకు ఏడు రకాలయిన వివిధ ఆభరణాలను పూర్వం స్త్రీలు ఉపయోగించేవారు,

పెద్ద జడ, చిన్నజడ, శిఖ, రాగి రేకులు, మొగలి రేకులు, రాగిడి, చంద్రవంక, కమ్మలు, జూకాలు, తాయెత్తులు, చేర్లు, పాపిటతురాయి, పాపిట పింజరాలు, కడియాలు, దండకడియాలు, పోచీలు, దస్టెడ, అడ్డబాస, బిళ్ళల మొలత్రాడు, కట్టడపు బులాకి, ముక్కుపుల్ల మొదలయినవి భామకు అలంకారాలు.

ఇవిగాక కాసులపేరు, సూర్యుడు, ముత్యాలు, ఒకరకమైన తాయెత్తులు, కిత కి వడ్డాణం, జడ కుప్పెలు కూడా ఉంటాయి. జడ బిళ్ళలు నవరత్నాలు చెక్కినట్లుంటాయి. ఆ బిళ్ళల్లో సూర్యుడు, చంద్రుడు, నక్షత్రాలు మొదలయిన ఖగోళశాస్త్ర సంబంధి విశేషాలుంటాయి. (నా. ర.చ.-156)

కూచిపూడి భామాకలాపము-విశిష్టత

కర్త : సిద్ధేంద్ర యోగి (చూ).

ఇది కూచిపూడి కళాక్షేత్రానికి కులపతియైన సిద్ధేంద్ర యోగి అపూర్వ సృష్టి.

దీని ప్రదర్శన ప్రక్రియ విశిష్టమైనదే అయినా రచనా ప్రక్రియ యక్షగాన ప్రాయం. యక్షగాన రచనలో ముఖ్యాంశాలయిన దరువులు, ద్విపదలు, గద్య పద్యాలు దీనిలో ఉంటాయి. మాచుపల్లి కైఫీయత్ ప్రకారం దీనికి ముందే కూచిపూడి భాగవతులు వీధి నాటకాలాడటంలో ప్రసిద్ధులుగా ఉండేవారని తెలుస్తుంది. ఆయా వీధి నాటకాలే సిద్ధేంద్రుని భామాకలాప రచనకు ఉద్బోధకాలయి ఉంటాయని పండితాభిప్రాయం. ప్రదర్శన ప్రక్రియలో ఇది యక్షగానాదులవలె గాక, అలంకార శాస్త్రి, భరతనాట్య శాస్త్రి విధి నిబద్ధమైనది. ఇది నృత్యప్రధానమైనది. నృత్యానుకూలంగా, రసపరి రమ్యంగా ప్రదర్శనకు తగినట్లు సంగ్రహంగా పాత్ర సామగ్రిని తయారు చేసుకోవటంలో-కర్త సిద్ధేంద్రునికి జయదేవుని గీత గోవిందం ఒరవడియైనదని కొందరు పండితులంటారు.

కలాప మనేది వైకృత శబ్దమైతే దీనికి కలత, కలహము అనే అర్థాలు నిఘంటువులలోను, నొచ వెళ్ళబోసుకోవటం అనే అర్థం వ్యవహారంలోను ఉన్నాయి. దీనిలోని నాయిక "భామ"-అంటే సత్యభామ. ఈమె సఖితో తన విరహాన్ని వెళ్ళబోసుకోవడం ఈ కలాపంలో కనిపిస్తుంది. నటులలో భామ వేషగానికి ఒక ప్రత్యేకత ఉంటుంది. భామాకలాపంలో, నాయికా, నాయక, సఖీ పాత్రలు మూడే ముఖ్యం.

దీనిలో నాయకుడు కృష్ణుడు. తిమ్మన సత్య ఖండిత, స్వాధీనపతిక. సిద్ధేంద్రుని సత్య విప్రలబ్ధ. దీనిలో సఖి పాత్రకు ఒక ప్రత్యేకత ఉంది. ఇది మాధవి పాత్ర. ఈ పాత్ర అపూర్వమేగాక అతి సుందరమైనది. ఈ పాత్రను ప్రదర్శక ముఖ్యులొకరు నిర్వహిస్తారు. వేషధారణలో విశేషమేమీ ఉండదు. ఈ పాత్ర భుజంమీద ఒక కండువా మాత్రమే ఉంటుంది. నాయకునితో మాట్లాడేటప్పుడు ఈ పాత్ర మగధీరునిగానూ, నాయికతో మాట్లాడేటప్పుడు పైన ఉన్న కండువాను పమిటగా ఒయ్యారంగా సవరించుకొని స్త్రీ చేష్టలతో మనోహరంగా, చమత్కారంగానూ మాట్లాడుతుంది. ఈ పాత్ర అక్కలలో అక్క, బావలలో బావ. ప్రదర్శకులకు, నాయికా నాయకులకు, ప్రేక్షకులకూ, ప్రతినిధిగా వ్యవహరిస్తాడు.

భామాకలాపంలో పారిజాత కథ సత్యాస్వప్న కథనంలో ఇమిడి పోయింది. భామాకలాపంలో సత్య వలవంత, కల, కలత నిదుర, చెలికత్తెతో సొదవెళ్ళబోసుకోవటం, నాయకునితో రాయబారాలు, సంవాదాలు, చివరలో రుక్మిణితో సవతి కయ్యం అనేవి ప్రధాన విషయాలుగా ఉంటాయి.

ఈ భామాకలాపం శృంగార రస పేశల సుధా కలశం. అలంకార శాస్త్రసార నికషోపలం. రచన ప్రౌఢ భావ బంధురము, భావోచిత పదబంధ సుందరం. ప్రదర్శనం భరత విద్యా ప్రమాణ రమణీయం. ఎందరో భాగవత శ్రేష్ఠులు దీనిని తెలుగు దేశంలో ప్రదర్శించి చరితార్థులయ్యారు. (య. వా. చ-31-33; నా. ర. చ-139-140)

## కూచిమంచి గంగన

కాలం : క్రీ. శ. 18వ శతాబ్దం-ఉత్తరార్ధం.
స్థలం : పిఠాపుర సంస్థానం.
రచన : శతకంఠ రామాయణము.

కూచిమంచి తిమ్మకవి పౌత్రుడు. కూచిమంచి జగ్గకవికి పుత్రుడు. పిఠాపురం సంస్థానాధిపతి "రావు చినమాధవరాయల"కు ఆశ్రితుడు.

వేములవాడ భీమకవి శతకంఠ రామాయణాన్ని రచించినట్లు ప్రసిద్ధి. ఆ వెనుక తెలుగులో ఈ పేరుతో రచన చేసినవాడు గంగన. (ఆ. సం. సా-246)

## కూచిమంచి జగ్గకవి

కాలం : క్రీ. శ. 1684-1757 ప్రాంతం.
స్థలం : తూర్పు గోదావరిజిల్లా - కందరాడ గ్రామం.
రచనలు : 1. జానకీపరిణయము 2. ద్విపద రాధాకృష్ణ చరిత్ర 3. సుభద్రా పరిణయము 4. చంద్రరేఖావిలాపము 5. సోమదేవరాజీయము 6. కొన్ని శతకములు, చాటు రచనలు.

కవి సార్వభౌమ బిరుదాంచితుడూ, బహుగ్రంథ కర్తా అయిన కూచిమంచి తిమ్మకవికి కనిష్ఠ సోదరుడు. తిట్టుకవిగా ప్రసిద్ధుడు. పిఠాపురం సంస్థానాధిపతి అయిన చినమాధవరాయల ఆశ్రితుడు. లచ్చమాంబా గంగనార్యులపుత్రుడు. ఇతని సోమదేవరాజీయం కాసె సర్వప్ప రచించిన సిద్ధేశ్వర చరిత్ర ననుసరించి ఉన్నదట. ఇతని చాటు రచనలు-శతకాలు అనేకం ఉన్నవని తెలుస్తున్నది. "రామ భక్త మందార రమా" అనే శతకం ఇతనిదే. (వా. చ. 81; తె. వి. స.-6-381)

## కూచిమంచి తిమ్మకవి I

కాలం : 18 వ శతాబ్దం.
స్థలం : గోదావరి మండలం. పిఠాపురం సంస్థానంలోని కందరాడ గ్రామం.
సంస్థానం : పిఠాపురం.
బిరుదు : కవి సార్వభౌమ, అభినవవాగనుశాసనుడు.
రచనలు : 1. రుక్మిణీ పరిణయము 2. సింహశైల (సింహాచల) మాహాత్మ్యము

3. నీలాసుందరీ పరిణయము 4. రాజశేఖర విలాసము 5. అచ్చ తెనుగు రామాయణము 6. సారంగధర నృపచరితము (భళ్ళాణ చరిత్రము) 7. సాగర సంగమాహాత్మ్యము 8. రసిక జన మనోభి రామము 9. సర్వ లక్షణ సారసంగ్రహము 10. సర్పపుర క్షేత్ర మాహాత్మ్యము 11. భర్గ శతకము 12. శివలీలావిలాసము 13. కుక్కు-టేశ్వర శతకము 14. చిరవిభవ శతకము 15. కృష్ణ దండకము.

గురువు : దెందులూరి లింగనారాధ్యుడు.

సమకాలికులు : ఈమనపల్లి భవానీ శంకరకవి. ఏనుగు లక్ష్మణకవి. వక్కలంక వీరభద్రకవి.

లచ్చమాంబా గంగనామాత్యుల పుత్రుడు. తిట్టుకవిగా ప్రసిద్ధి పొందిన జగ్గ కవికి అన్న. పిఠాపురం ప్రభువైన రావు మాధవరాయ నృపతి ఆస్థానంలోని వాడు. అతడే ఈ కవికి, "కవి సార్వభౌమ" బిరుదం ఇచ్చాడట.

భర్తృహరి సుభాషిత కర్త ఏనుగు లక్ష్మణకవి ఇతడిని ప్రశంసిస్తూ ఒక పద్యం వ్రాడట. తిమ్మకవి కూడా అతనిపై ఒక పద్యం చెప్పినట్లు తెలుస్తున్నది. కవి గాన విద్యా విశారదుడు. పుంభావ సరస్వతి ఇతని కాలం 1684-1757 గా కొందరు నిర్ధారించారు. ఇతని చాటువులు కొన్ని ప్రచారంలో ఉన్నాయి. ఈయన పరమ భక్తుడు. తన కావ్యాలను నరాంకితం చేయక పిఠాపురంలోని కుక్కుటేశ్వరస్వామికి 12 గ్రంథాలను, సర్పపురంలో వేంచేసిన భావనారాయణస్వామికి ఒక గ్రంథాన్ని అంకితమిచ్చాడు. కవి పరమ స్వతంత్రుడు. జాను తెనుగు నుడికారాలను అప్రయత్నంగా ఉపయోగించ టంలో దిట్ట. చెరుకు రసం వంటి మధుర ప్రసన్నమైన శైలి ఈయనది. అనర్గళ మైన కవితాధార కలవాడు ఈయన కావ్య కర్తయే గాక ప్రముఖ తెలుగు లాక్షణికుడు. ప్రముఖ పూర్వకవుల రచనా పద్ధతి ఈయన రచనలన్నింటిలో ప్రస్ఫుటంగా కనిపి స్తుంది. ఇతని రసికజన మనోభిరామం పిల్లవసుచరిత్రగా ప్రసిద్ధికెక్కింది.

(తె. వి. స-4-814, 815)

## కూచిమంచి తిమ్మకవి II

కాలం : క్రీ. శ. 18 వ శతాబ్దం ఉత్తరార్ధం - 19 వ శతాబ్దం ప్రారంభం.

స్థలం : పిఠాపురం సంస్థానం (చంద్రమపాలెం).

రచన : సుజన మనః కుముద చంద్రిక (సం).

గురువు : దేవులపల్లి సీతారామస్వామి.

ఈ కవి రావు వేంకట నీలాద్రిరాయని (1778-1828) కి సమకాలికుడు. రావు చిన మాధవరాయలకు సమకాలికుడూ, రసికజన మనోభిరామ కర్తా అయిన కూచిమంచి తిమ్మకవికి ఇతడు ప్రపౌత్రుడు. కూచిమంచి జగ్గకవి పుత్రుడు. కుక్కుటేశ్వర స్వామి భక్తుడు. శివపారమ్య బోధకమైన 'సుజన మనః కుముద చంద్రిక' ఇతని రచన.

(ఆం. సం. సా-248)

## కూచిమంచి వేంకటరాయడు

కాలం : క్రీ. శ. 19వ శతాబ్ది పూర్వార్ధం.
జన్మస్థలం : తూర్పు గోదావరి జిల్లా-పిఠాపురానికి దగ్గర ఉన్న "రావువారి చంద్రమ పాలెం".
రచన : సుకవి మనోరంజనము.
బిరుదు : లక్షణచక్రవర్తి.

లాక్షణిక కవి. (ఛందః పదకోశము)

## కూచిమంచి సోమసుందర కవి

కాలం : క్రీ. శ. 1850 లోపు.
రచన : భక్త చింతామణి శతకము.

ఈయన కూచిమంచి తిమ్మకవి, జగ్గ కవుల వంశీయుడు. మత్తేభ, శార్దూల వృత్తాలలో శతక రచన చేశాడు. (శ. సా. వి)

## కూచిరాజు ఎర్రన్న

నామాంతరం : రాచరామన.
కాలం : క్రీ. శ. 1450-1500 ప్రాంతం.
బిరుదులు : నవఘంటా సుత్రాముడు, అవధాన కవీశ్వరుడు.
రచనలు : 1. కొక్కోకము (రతి రహస్యము) 2. పురాణసారము 3. సకల నీతి కథా నిధానము.

అష్టభాషా కవితా ప్రవీణుడు. కూచన మంత్రి ముత్తమ్మల పుత్రుడు. వినుకొండ దుర్గాధి పతుల ఆశ్రయంలో ఉన్నాడు.

విశిష్టత : కామ శాస్త్రంతో పాటు నీతి శాస్త్రం కూడా వ్రాసి కవిగా పేరు పొందాడు. ఇతని రచనలో పొల్లులు, అనవర్థాలు, పునరుక్తాలు చెల్లని విడి సలు కనబడవు. (అరుద్ర-6-95)

## కూరగాయల రామన్న

ఇతని మీద చాటుపద్యం ఉంది.

ఈయన శ్రీకృష్ణదేవరాయలవారి సువారంలో కూరగాయల శాఖకు అధికారి అందువల్లనే ఈయన ఇంటిపేరు కూరగాయల వారుగా వచ్చిందట. రాయలు చేయించిన ఒక సమారాధనంలో కూరగాయల ఏర్పాటు చక్కగా చేసినందుకు రాయలు సంతోషించి ఈయనకు వేయి వరహాలు బహుమానమిస్తే అధన్నీ ఈయన కవులకు దానం చేశాడట. (చా ప. ర)

## కూరత్తాళ్వారు చరిత్ర

కర్త : తెలియదు

ద్విపద కావ్యం. లఘుకృతి. మూడు అకులపైన ఉంది. అవి శిథిలావస్థలో

ఉన్నాయి. కూరత్తాళ్వారు శ్రీరామానుజుల శిష్యుడు. అతనిని గూర్చి చెప్పిన రచన ఇది. దీని ప్రతి వెంకటేశ్వర ప్రాచ్యపరిశోధనా సంస్థలో ఉన్నది. (ద్వి. సా. చ. 283)

కూర్మక్షేత్ర మాహాత్మ్యము

చూ. శ్వేతాచల మాహాత్మ్యము.

కర్త : కొటికెలపూడి వేంకటకృష్ణకవి.

కూర్మపురాణము

కర్త చూ. మండకామేశ్వర కవి.

అంకితం : పూసపాటి విజయరామ గజపతికి (1826–79).

ఆంధ్రీకృత గ్రంథం. విజయరామ గజపతి విజయనగరం సంస్థానాధిపతి. ఇతని కుమారుడైన ఆనంద గజపతి కోరిక మేరకు కవి ఈ కావ్యాన్ని వ్రాసి విజయ రామ గజపతికే అంకితం చేశాడు. (అం. సం. సా–422)

కూర్మ పురాణము

కాలం : 16 వ శతాబ్దం.

కర్త : రాజలింగకవి.

అంకితం : శ్రీశైల మల్లికార్జున స్వామికి.

కవి పోషకుడు : చెముకు లక్ష్మణ మంత్రి.

ప్రత్యేకత: ఇది వామన పురాణాలలో ఒకటి. పదిహేడు వేల శ్లోకాలున్న ఈ పురాణాన్ని కవి ఆరాశ్వాసాల కావ్యంగా తెనిగించాడు. ఈ కావ్యంలో కవి శివ కవులను, ఇతర కవులను విడివిడిగా నుతించాడు. పండితారాధ్యుని, పాల్కురికి సోమన్నను, పిడపర్తి సోమన్న–బసవన్నలను, శరభాంకుని, ఘటిక సిద్ధేశ్వరుని నుతించాడు. కవి నుతించిన ఇతర కవులలో పింగళిసూరన్న అర్వాచీనుడు. ఈ కావ్యంలో కవి తనగురించి వివరాలేమీ చెప్పలేదు. ఈ కావ్యంలోనుంచి అప్పకవి–అభేదప్రాసా నికి ప్రమాణంగా ఒక దోధక వృత్తాన్ని చూపించాడు. ఇది పురాణమైనా కవితప్రబంధ ధోరణిలో ఉంది. కవిత సరళంగా ధారాశుద్ధి కలిగి ఉంది. (ఆరుద్ర–9)

కూర్మపురాణ సార సంగ్రహము

కాలం . 19 వ శతాబ్దం పూర్వార్ధం.

కర్త : తిమ్మరాజు లక్ష్మణరాయకవి.

పురాణకథలను సులభమైన వచనంలో ఆంధ్రీకరించే ఉద్దేశ్యంతో కవి ఈ రచన చేశాడట. (క. వ. 207)

కృష్ణకథ (అలభ్యం)

కర్త : దామెర్ల వెంగళ భూపాలుడు.

ఈ కవి రెండవకృతియైన బహుళాశ్వచరిత్రలో ఈ కావ్య ప్రసక్తి ఉంది. వివరాలు తెలియ రాలేదు. (అం.సం. సా)

## కృష్ణకవి

కాలం : క్రీ. శ. 18 శతాబ్ది.

రచన : శకుంతలా పరిణయము.

నరసింహార్యుని పుత్రుడు. ఈ కవి పై గ్రంథాన్ని చిరుమామిళ్ళ పాపయ్య ప్రేరణవల్ల వ్రాశాడట. ఇతని రచనలో రామరాజ భూషణుని వసుచరిత్ర పోకడ లున్నాయి. (తె. వి స-6)

## కృష్ణచరితమ్ (సంస్కృతం)

కర్త : అగస్త్యుడు (చూ).

గద్యకావ్యం. (ప్రా. ద. భా. చ-నండూరి రామకృష్ణమాచార్య)

## కృష్ణ చెంచులక్ష్మి సంవాదము-పాట

కర్త : తెలియదు.

జానపద గేయం. హాస్యం ప్రధాన రసం. శృంగారం కూడా చోటు చేసుకుంది.

కథ ప్రసిద్ధం.

చూ. హాస్యరస గేయములు. (ఆం. వా. చ)

## కృష్ణ జననము (అలభ్యం)

రచనాకాలం : 1850 కి పూర్వం.

కర్త : తెలియదు.

యక్షగాన నాటకం. తంజావూరు సరస్వతీ మహలులోని "నాటక పాత్రలు" అనే సంపుటంలో కొన్ని నాటకాలతో పాటు ఈ నాటకం పేరుకూడా ఉంది. ఇది దొరవారి నాటకంగా చెప్పబడింది.

1833-55 కాలంనాటి తంజావూరు ప్రభువు శివాజీ రచన కావచ్చును. (య. వా. చ-362)

## కృష్ణ జన్మ ఖండము

కర్త : గోపీనాథము వెంకటకవి.

రచనాకాలం : 19వ శతాబ్దం.

ఎనిమిది ఆశ్వాసాల ప్రబంధం. ఇది సంస్కృత బ్రహ్మకైవర్త పురాణంలోని కథ.

## కృష్ణతులాభారము (అలభ్యం)

కర్త : మరింగంటి సింగరాచార్యులు.

## కృష్ణదండకము

రచనాకాలం : క్రీ. శ. 1715-1729ల మధ్యకాలం.

కర్త : కూచిమంచి తిమ్మకవి.

ఇది అముద్రితం. (ఆరుద్ర-12)

**కృష్ణదండకము**

నామాంతరం : కృష్ణరాజ దండకము.

కర్త : ఉకుమళ్ళ రంగశాయి.

**కృష్ణదాన చరిత్రము (అలభ్యం)**

కర్త : తెలియదు.

రచనాకాలం : 1850కు పూర్వం.

తంజావూరు సరస్వతీ మహలు నాటక పాత్రలు అనే గ్రంథ సంపుటంలో దీని పేరున్నది ఇది దొరవారి నాటకాలు అనే శీర్షిక క్రింద పేర్కొనబడింది. 1833-55 నాటి శివాజీ కాలపు రచన కావచ్చును.

**కృష్ణదాసకవి**

కాలం : తెలియదు.

రచన : రాధాకృష్ణ విలాసము.

వేంకటదాసు కుమారుడు. ఈ కవి జయదేవుని గీత గోవిందాన్ని తెలుగులో రాధాకృష్ణ విలాసంగా వ్రాశాడు. కవిత్వం హృద్యంగా ఉంది.

(క. చ. 3-184)

**కృష్ణనాటకము**

నామాంతరం : బాలకృష్ణ నాటకము.

కవయిత్రి : తరిగొండ వేంకమాంబ.

యక్షగాన నాటకం. కవయిత్రి దీనికి పెట్టినపేరు కృష్ణనాటకమే అయినా ఇది బాలకృష్ణ నాటకంగా ప్రచారంలో ఉంది. విషయం గోపికాకృష్ణ సంవాదం-రాధాకృష్ణుల ప్రణయం. (ఆ. భా. క.-74)

**కృష్ణభుజంగము (అలభ్యం)**

కర్త : చూ. నెల్లూరి వీరరాఘవకవి.

దీనిని వ్రాసినట్లు కవి తన వసుంధరాపరిణయ కావ్యంలో చెప్పుకొన్నాడు.

(తె. వి. స-8)

**కృష్ణమల్లకథ (అలభ్యం)**

కవి : (చూ) గణపవరపు వేంకటకవి

పాతిక సంవత్సరాల వయస్సులో కవి దీన్ని చతుర్భద్రగా చెప్పాడట.

(ఆరుద్ర 11-160: క. త.-12-232)

**కృష్ణమాంబ**

నామాంతరం : కృష్ణాజి (చూ.)

కృష్ణమాచార్యులు

కాలం : క్రీ. శ. 1291–1323 ప్రాంతం.

స్వస్థలం : సింహాచల క్షేత్రం.

రచనలు : 1. సింహగిరి వచనాలు (సింహగిరి నరహరి వచనములు) 2. చూర్ణికలు, శఠగోపవిన్నపాలు.

విశిష్టత : వచన వాఙ్మయ కర్తలలో మొదటివాడు. కాకతి రెండో ప్రతాప రుద్రుని కాలంవాడు. సంకీర్తన వాఙ్మయానికి మూల పురుషుడు. ఏకామ్రనాథుని ప్రతాపరుద్ర చరిత్రలో ఇతని ప్రసక్తి ఉంది. తామ్ర పత్రికలు వేయించి, తన రచనలను తామ్ర ఫలకాల మీద వ్రాయించాడని అంటారు. ఇతడు రామానుజాచార్యుల కాలం వాడట. గాయకుడు, భక్తుడు కూడా. తాళ్ళపాక కవులు ఈయన్ని పేర్కొన్నారు. (ఆరుద్ర–3)

కృష్ణయ్య

కాలం : 18 వ శతాబ్దం.

స్థలం : కామలాపురం.

రచన : పార్వతీ పరమేశ్వర పరిణయము.

చెంచయ్య పుత్రుడు. కామలాపురం పెన్నానదీ తీరాన ఉన్నదట. రసవంతంగా కవిత్వం చెప్పాడు. (క. స–42)

కృష్ణరాజ దండకము

కర్త : చేకుమళ్ళ రంగశాయి (చూ).

కవి వైదుష్యాన్ని ప్రతిబింబించే రచన. (ఆరుద్ర–10–169)

కృష్ణరాయ విజయము

కర్త : చూ. కుమార ధూర్జటి.

అంకితం : శ్రీరామచంద్రునికి.

రచనాకాలం: 1640 ప్రాంతం.

ఇది నాల్గు ఆశ్వాసాలు గల ప్రబంధం చారిత్రక రచన. అరవీటి చిన వేంకటరాజు ప్రేరణచే వ్రాయబడింది.

ఈ గ్రంథం విజయనగర సార్వభౌముడైన శ్రీకృష్ణ దేవరాయల చరిత్రను తెలుపుతుంది. ప్రథమాశ్వాసంలో విజయనగర వర్ణన, ద్వితీయాశ్వాసంలో విద్యారణ్య కృత విజయనగర నిర్మాణ వృత్తాంతం, కృష్ణ రాయల పట్టాభిషేకం, అతని దిగ్విజయ ప్రయత్నాలు, మూడవ ఆశ్వాసంలో గజపతి తన కూతురును కృష్ణరాయల కిచ్చి వివాహం చేసిన వృత్తాంతం వర్ణింపబడింది.

ఈ గ్రంథం చరిత్రకారులకు అంత ఉపయోగకరం కాదు. ప్రబంధ దృష్టితో చేయబడిన రచన. కవిత్వం మృదుమధుర పద సంయుతంగా ఉంది. (క. త.)

**కృష్ణలీలా తరంగిణి (సం)**

కర్త : శ్రీనారాయణ తీర్థులు.

గీత కావ్యం. పన్నెండు తరంగాలున్నాయి. జలదధ్వాన గంభీరాలై రసవంతాలైన ఈ తరంగాలు చాలా ప్రసిద్ధి పొందాయి. (తె. వి. స_6_230)

**కృష్ణలీలామృతం (అలభ్యం)**

కవి : నెల్లూరి వీరరాఘవ కవి (చూ).

**కృష్ణలీలా విలాసము**

కర్త : శహాజీ (చూ).

యక్షగానం ఇది కృష్ణస్తుతితో ఆరంభమైంది. సభానాయకాదుల వర్ణనతో బాటు కథా క్రమం_శ్రీకృష్ణుని జననం_బాల్యక్రీడలు, సత్యభామా వివాదాలను వర్ణించిన కృతి. మంత్రసాని ప్రసంగం, బాలకృష్ణుడు పోరుపెట్టగా రక్ష కట్టేందుకు వచ్చిన జోగి తెలుగు, అరవం, మరాఠీ, హిందుస్థానీ భాషలలో మాట్లాడ్డం. గొల్లెతల అసభ్య ప్రసంగాలు_పాత్రోచితంగా చెప్పబడ్డాయి. (వ. దే. వా_187)

**కృష్ణవిలాసమ్**

కర్త : చూ. ఋగ్వేది వేంకటనారాయణకవి.

సంస్కృత రచన. వివరాలు తెలియవు. (ఆం. సం. సా)

**కృష్ణ విలాసమ్**

కర్త : చూ. శంకరానందుడు.

ఇది 14 సర్గలలో శ్రీకృష్ణుని జీవిత చరిత్రను వర్ణించే కావ్యం. (తె. వి. స_6)

**కృష్ణ విలాసము**

కర్త : అకలంక శ్రీకృష్ణమార్యుడు.

యక్షగానం. దీనిలో దేవకిపై కంసుడు కత్తిదూయటం మొదలు రుక్మిణీ కల్యాణం వరకుగల కథ ఉంది. రచన ప్రౌఢమైనది. అర్థచమత్కార శబ్దాలంకారాలు ఉన్నాయి. దరువులు, ద్విపదలు, పద్యాలు, ఒక చూర్ణిక, జోలపాట, ఏలపదాలు ఉన్నాయి. (య. వా. చ_58)

**కృష్ణ విలాసము**

కర్త : విజయరాఘవుడు.

యక్షగాన నాటకం. ప్రదర్శన యోగ్యంగా రచింపబడింది.

**కృష్ణవిలాసము**

కవి : విశ్వేశ్వర కవి (చూ).

అంకితం: తలమల రామచంద్రారెడ్డికి.

అయిదాశ్వాసాల ప్రబంధం. శృంగార రస ప్రధానం.

రచన ప్రౌఢమై చమత్కార భరితంగా ఉంది. (ద. దే. వా-498)

**కృష్ణవిలాసము**

కవి : వెన్నెలకంటి వెంకటాచలం (చూ).

అంకితం : జానకి రామయ్యకు.

ప్రబంధం సరళమై హృదయంగమంగా ఉందని పండితులు ప్రశంసించారు. (ఆరుద్ర-10-250)

**కృష్ణశతకము**

కాలం : 1850కి పూర్వం.

కర్త : చీదెళ్ళ రామకవి.

"కృష్ణా" అనే మకుటంతో ఉన్న కందపద్య శతకం. వేదాంత విషయ ప్రతిపాదకం. దీన్ని కృష్ణగురు శతకంగా కొందరు పేర్కొన్నారు.

**కృష్ణశతకము**

కవయిత్రి : తరిగొండ వేంకమాంబ.

ద్విపద శతకం. ఇందులో 137 ద్విపదలున్నాయట. కృష్ణ అనే మకుటంతో ఉంది. (క. స. 229)

**కృష్ణశతకము (అలభ్యం)**

కర్త : (చూ) తిక్కన.

ఇది తిక్కన రచించాడని ప్రతీతి. తగిన ప్రమాణాలు లేవు. (ఆరుద్ర-2)

**కృష్ణశతకము**

కర్త : తిరుక్కడయూరి కృష్ణదాసు.

పూర్తి కందపద్యశతకం. "కృష్ణా" అనే మకుటంతో ఉన్నది. (తె. వి. స-6)

**కృష్ణశతకము**

కర్త : నూర్వీటి హరియప్ప. (శ. సా. వి.)

**కృష్ణశతకము**

కర్త : మంచెళ్ళ కృష్ణకవి.

ఇదే వరదరాజ శతకంగా శతక సముచ్చయంలో ముద్రితమైంది. ఏకప్రాస మకుటం ఉన్న చంపకమాలికావృత్త శతకం. కవిపేరు అందులో బాలకృష్ణయ్య అనిఉంది. బాలయ కుమారుడు కృష్ణయ్యను బాలకృష్ణయ్యగా శతక కవుల చరిత్రకారులు పేర్కొన్నారు. (శ. క. చ.-748)

**కృష్ణశతకము**

రచనాకాలం : 18వ శతాబ్దం.

కవయిత్రి : మదిన సుభద్రయ్యమ్మ.

ఈమె విశాఖ మండలానికి చెందిన కవయిత్రి. (క. స.)

కృష్ణశతకము

కర్త : ముడుంబై వేంకటకృష్ణమాచార్యులు,

కృష్ణా "దీనరక్షామణీ" అనే మకుటంతో ఉన్న శతకం.

కృష్ణశృంగార కథావళి

రచనాకాలం : 1840 కి పూర్వం.

కర్త : మంచెళ్ళ కృష్ణకవి.

నాటకం రచనహృదయంగమంగా ఉంటుంది. (క. స.)

'కృష్ణసచిపునిమల్లా' శతకము

కర్త : ముమ్మడి మల్లన్న.

కొప్పరావూరి (గుంటూరు తాలూకా)కి చెందిన కృష్ణమంత్రిని నుతిస్తూ చెప్పిన శతకం. (ఆరుద్ర-8)

కృష్ణాజి

నామాంతరం : కృష్ణమాంబ.

కాలం : 17వ శతాబ్దం.

రచనలు : అలభ్యం.

గురువు : చెంగల్వ కాళకవి.

క్రీ. శ. 1633-73 నడుమ తంజావూరును పాలించిన విజయరాఘవ నాయకుని ఆస్థానంలో ప్రఖ్యాతి చెందింది.

ఈమె గొప్పతనాన్ని ఈమె గురువే ప్రశంసించాడు. ఈమె సంస్కృతాంధ్రాంలో కవితా చాతురిగలది. సమస్యా పూరణం, ఛందః శాస్త్రాలలో నిపుణురాలు. అడిగిన వృత్తంలో కోరిన సమస్యలను మొదట శ్లోకాల్లో చెప్పి దానిని తెనిగించే ప్రతిభ కలదట. ఈమె విజయరాఘవుని కొలువులో వసంతకేళిక వినిపించేదని రంగాజమ్మ పేర్కొన్నది. (ఆరుద్ర-11-115; స. వే. వా-114)

కృష్ణాధ్వరి

కాలం : 17 శతాబ్దం.

ఆస్థానం : క్రీ. శ. 1600-33 నడుమ తంజావూరు నేలిన రఘునాథ నాయకుని ఆస్థానం.

రచనలు : 1. నైషధపారిజాతీయము (శ్లేషకావ్యం) 2. కల్యాణ కౌముదీ కందర్ప నాటకము (అలభ్యం) 3. రఘునాథభూపాలీయము(అలభ్యం) 4. శృంగార సంజీవని (అలభ్యం) 5. కాళ చింతామణి (అలభ్యం) 7. నైషధ పారిజాతావతారిక (పారిజాత కథ) (అలభ్యం).

ఇందులో మొదటిది మాత్రమే తెలుగు గ్రంథం. మిగిలినవన్నీ సంస్కృత

రచనలని పరిశీలకులు భావిస్తున్నారు. కవి తాను రచించిన గ్రంథనామాలన్నీ ఒక సీస పద్యంలో చెప్పాడు. ఇతని రచనలన్నీ రఘునాథునికే అంకితాలు. నైషధ పారిజాతీయం రెండుసార్లు చెప్పబడింది. కాబట్టి ఒకటి నాటకమో ద్విపదయో అయి ఉంటుం దని కొందరూ, సంస్కృతం అయివుంటుందని కొందరూ అభిప్రాయపడ్డారు.

కవిని గురించి ఎక్కువ తెలియరాలేదు. శృంగార సంజీవని అమరుక కావ్యానికి తెలుగు అని కొందరి ఊహ.

ఈతని కృతులలో లభించింది నైషధ పారిజాతీయము ఒక్కటే. మిగిలినవి సంస్కృతమో, తెలుగో వివాదగ్రస్తంగానే ఉంది. ఇతడు మనోహరంగా కవిత్వం చెప్పిన ప్రతిభావంతుడైన కవి. (ద. దే. వా-76; క. త. 30; అరుద్ర-10-213)

## కృష్ణానంద సరస్వతి

కాలం : 17 వ శతాబ్దం.

రచన : సిద్ధాంత సిద్ధాంజనమ్ (సం).

గురువు : భాస్కర దీక్షితుడు.

1684-1712 నడుమ తంజావూరు నేలిన శహాజీ కాలంనాటి వాడు. అద్వైత వేదాంత శాఖకు చెందిన రచనలు చేశాడు. (M. R. T-34)

## కృష్ణానేని తిరుపతిఙ్మా పతి

కాలం : 18 వ శతాబ్దం.

స్థలం : వినుకొండ సీమ కావచ్చు.

సాహిత్య పోషకుడు. అకలంక శ్రీకృష్ణమార్యుని ప్రోత్సహించి ధనుశ్శాస్త్ర గ్రంథం రచింపజేశాడు. ఆ గ్రంథం, వేటూరి వారి పీఠికతో ముద్రితం. ఇతడు 1775 వరకు ఉన్నాడని పండితులు నిర్ణయించారు. (య. వా. చ-56)

## కృష్ణానేని తిరుపతి మాణిక్యరాయడు

కాలం : క్రీ. శ. 16 వ శతాబ్దం చివర-17 వ శతాబ్దం ప్రారంభం.

స్థలం : రాచూరు సంస్థానం.

రాచూరు సంస్థాన పాలకుడు. రేపల్లె సంస్థాన పాలకుడైన జంగన్నా రావుకు సోదరుడు. ఈ తిరుపతి మాణిక్యారావు కాలంలోనే క్రీ. శ. 1792 లో "మూర్తుజాన్నగరుసర్కారు" సంస్థానం రెండు భాగాలుగా విభజింపబడింది. అందులోని రాచూరు భాగం ఈ తిరుపతి రాయనికి లభించింది.

తిరుపతి రాయడు సాహిత్యాభిలాషి. సాహితీ పోషకుడు. మొహమ్మద్ జాఫర్ అనే పేరుగల క్రాసనగురిని ఆశ్రయించి ధనుర్విద్యారహస్యాలను తెలుసుకున్నాడట. ఆ విద్యయందుగల అభిమానం చేత తన ఆస్థాన కవి అయిన అకలంక కృష్ణ కవిని ప్రోత్సహించి "ధనుర్విద్యా విలాసము" అనే గ్రంథం రచింపచేశాడు. (ఆం.సం. సా)

## కృష్ణాపాత్రుని వేంకట మంత్రి

స్థలం : కొండపల్లి.

సాహిత్య పోషకుడు. చల్లా గురవయ్యను ప్రోత్సహించి అతని చేత

యాజ్ఞవల్క్య విజయాన్ని ద్విపద కావ్యంగా రాయించాడు. కాలం నిర్ధారణగా తెలియదు.
(ద్వి. సా. చ-459)

**కృష్ణాభ్యుదయము**

రచనా కాలం : 18 వ శతాబ్ది.
కర్త : గొంతేటి సూరన.
అంకితం : పొల్లాప్రగడ కామమంత్రికి.
ఐదాశ్వాసాల ప్రబంధం. కృష్ణుని లీలలను వర్ణించే గ్రంథం.

**కృష్ణాభ్యుదయము**

రచనా కాలం : 18 వ శతాబ్దం.
కవి : ముప్పిరాల సుబ్బరాయకవి.
అంకితం : చక్కిలాల వేషయామాత్యునికి.
అయిదాశ్వాసాల ప్రబంధం. ఇతని కవిత్వం మృదుమధురంగా ఉంటుంది. ఈ గ్రంథంలో కవి తన ఇతర రచనలను పేర్కొన్నాడు. (క. స.)

**కృష్ణార్జున చరిత్రము**

రచనా కాలం : 18 వ శతాబ్దం.
కర్త : కస్తూరి రంగకవి.
అయిదాశ్వాసాల కావ్యం. గయోపాఖ్యానంలోని కథ. రచన సరళంగా హృదయంగమంగా ఉంది. (తె. వి. స-6)

**కృష్ణార్జున చరిత్రము**

కర్త : మంత్రిప్రగడ సూర్యప్రకాశకవి.
ఇది ద్వ్యర్థి కావ్యం.
కవిస్తుతిలో అడిదం సూరకవి ప్రశంస ఉంది. దీన్ని కొందరు కృష్ణార్జున సంవాదంగా పేర్కొన్నారు.
(వీరేశలింగం పంతులు-సమగ్ర పరిశీలన; కవి సంశయ విచ్ఛేదము-పీఠిక-20)

**కృష్ణార్జున సంవాదము**

నామాంతరం : గయోపాఖ్యానము.
కర్త : నాదెండ్ల గోపమంత్రి.
రచనాకాలం : 15 వ శతాబ్దం.
అంకితం : కొండపీటిలోని రామేశ్వరస్వామికి.
మూడాశ్వాసాల ద్విపద కావ్యం.
ప్రత్యేకత : శ్రీకృష్ణుడు సూర్యునికి అర్ఘ్యం ఇవ్వటానికి దోసిట్లో నీళ్ళు పట్టుకొన్న సమయంలో ఆకాశంలోపోయే గయుడనే గంధర్వరాజు ఉమ్మి వేయటం, శ్రీకృష్ణుడు గయుని చంపటానికి ప్రతిజ్ఞ పట్టటం, నారదాదేశాను సారం గయుడు అర్జునుని శరణు వేడటం, గయుని విషయమై సుభద్ర, అక్రూరుడు, ద్రౌపది రాయబారాలు చేయటం, అర్జునుడు ఒప్పుకోకుండ కృష్ణునితో యుద్ధం చేయటం దీనిలోని ప్రధాన కథ.

ఈ కథనే 'గయోపాఖ్యానం' అనేపేర చాలామంది అనంతర కవులు పద్యకావ్యాలుగా రూపకాలుగా వ్రాశారు. ఈ కథ మూలభారతంలో లేదు. ఏ పురాణంలోనూ లేదు. గోపమంత్రి ఈ కథను ఎట్లా కల్పించాడో తెలియదు. కవి వ్రాసిన సంవాద ద్విపద కావ్యానికి మూలం తెలియదు.

గోల్కొండ నవాబులు జంషిద్ కుతుబ్ శాహి (క్రీ. శ. 1543-1550) ఇబ్రహీం కుతుబ్‌శాహి సమకాలికుడైన చరిగొండ ధర్మన అనేకవి ఈ కావ్యంలోని ఇతివృత్తాన్నే గ్రహించి 'చిత్రభారతం' అనేపేర పద్యకావ్యం వ్రాశాడు.

ఈ గ్రంథంలోని కవిత్వం మృదువై మనోహరమైన లోకోక్తులతో నిండి ఉంటుంది. తెలుగు దేశంలో ప్రసిద్ధమై చిలకమర్తి లక్ష్మీనరసింహం విరచిత రంగస్థల నాటకంగా కొన్నివేల ప్రదర్శనలు పొందిన గయోపాఖ్యానం నాటకానికి మూలం ఈ గ్రంథం కావచ్చు. ఇందులోని పాత్రచిత్రణ మిక్కిలి ఉదాత్తమైనదని విజ్ఞుల అభిప్రాయం. దీని ప్రతిని సురవరం ప్రతాపరెడ్డి సంపాదించి 1932 లో ముద్రించారు.

(క. త-7)

**కృష్ణార్జున సంవాదము (అలభ్యం)**

కాలం : 18వ శతాబ్దం.

కర్త : పోచిరాజు వీరన్న. (క. స.- 222)

**కృష్ణార్జున సంవాదము**

కర్త : పుట్టిపాక ఓబయకవి.

దీని ప్రతి కాకినాడ సారస్వత పరిషత్తులో ఉంది. (సా. ప. ప. 23-5)

**కృష్ణార్జున సంవాదము**

నామాంతరం : కృష్ణార్జున చరిత్రము.

కవి : మంత్రిప్రగడ సూర్యప్రకాశకవి.

**కృష్ణార్జున సంవాదము (అలభ్యం)**

కర్త : రాజవోలు సుబ్బారాయుడు (చూ).

దీన్ని మహాప్రబంధంగా కవి చెప్పుకొన్నాడు.

**కృష్ణార్జున సంవాదము**

నామాంతరం : గయోపాఖ్యానము.

కర్త : రామనామాత్యుడు.

రచనాకాలం : 18వ శతాబ్దం.

అంకితం : అహోబల నృసింహస్వామికి.

రెండు ఆశ్వాసాల ప్రబంధం. గయునిగూర్చి శ్రీకృష్ణార్జునులకు జరిగిన సంవాదం ఇందులోని కథ. (క. స.- 190)

**కృష్ణార్జున సంవాదము**

కర్త : వెలిచేరు వేంకటరామ ప్రధాని. (య. వా. చ)

**కృష్ణార్జున సంవాదము**

నామాంతరం : భగవద్గీతాయోగశాస్త్రము.
కర్త : వేముగంటి పర్తోజీ పండితుడు.
రచనాకాలం : 18వ శతాబ్దం.

పద్యకావ్యం. భగవద్గీతకు అనువాద రూపం. రచన సరళంగా ఉంది. (క. న. 94)

**కృష్ణాస్తుతి (సం)**

కర్త : చూ. వారణాసి ధర్మసూరి.

సంస్కృతంలో రచింపబడ్డ స్తోత్ర గ్రంథం. (తె. వి. స-4)

**కేతన కొమ్మన పాములపాడు శాసనము**

కాలం : క్రీ. శ. 1172.
శాసన ప్రదాత : కేతన కొమ్మన.
ప్రస్తావిత స్థలం : గుంటూరు తాలూకా పాములపాడు గ్రామం.

శాసన విషయం : ఈ శాసనం పాములపాడులోని మల్లికార్జున స్వామి ఆలయానికి ఎదుట ఉన్న నంది నాగస్తంభం మీద చెక్కి ఉంది. తన తల్లిదండ్రులకు ధర్మార్థంగా కేతన కొమ్మన మల్లికార్జున స్వామివారికి అఖండదీపం నిలిపినట్లు ఈ శాసనం చెబుతున్నది. దీనిలో రెండు ఉత్పల మాలలున్నాయి. (తె. శ. చ-308. b)

**కేతన ప్రెగ్గడ శాసనము**

కాలం : క్రీ. శ. 1147.
శాసన ప్రదాత : కేతన ప్రెగ్గడ.

శాసన విషయం : శాసన ప్రదాతయైన కేతన ప్రెగ్గడ కేశవ స్వామికి అఖండ దీపాన్ని నిలిపాడు. ఇతడు దేచనా మాత్యునికి ఎఱమాంబికకు పుత్రుడు. దీనిలో ఒక తరువోజ (అసమగ్రం), రెండు కందపద్యాలు ఉన్నాయి. ఇందులో ఒక పద్యం అసమగ్రం. (తె. శ. చ-245)

**కేదార ఖండము (అలభ్యం)**

కర్త : పెదపాటి సోమయ్య.
రచనా కాలం : 1500 ప్రాంతం.

సంకలన గ్రంథాలలో దీని ప్రసక్తి ఉన్నది. ఈ కవి సకలపురాణము, అరుణాచల పురాణము వ్రాశాడట. (వా. ల-వం. సు-278)

**కేనోపనిషత్తు**

కర్త : పరవస్తు వేంకట రంగాచార్యులు.

సంస్కృత మూలానికి పద్యానువాదం. ఆంధ్రీకరణం సరళంగా ఉంది.

కేయూర బాహుచరిత్ర

కర్త : మంచన.

రచనాకాలం : క్రీ శ. 1206 ప్రాంతం.

అంకితం : నండూరి గుండన మంత్రికి.

నాల్గు ఆశ్వాసాల ప్రబంధం. సంస్కృతంలో రాజశేఖర కవి వ్రాసిన దృశ్య కావ్యం విద్ధసాలభంజిక ఈ కావ్యానికి మూలం. కవి ఈ కావ్యంలో బోలెడు కథలు చేర్చాడు.

ప్రత్యేకత : "బాల రసాలసాల" అనే పోతన ప్రసిద్ధ పద్యానికి మూలం 150 సం॥ ముందుదైన ఈ కావ్యంలో కనిపిస్తున్నది. ఈ కావ్యంలోని పద్యాలను పెద్దన కూడా అనుకరించాడు. మడికి సింగన "సకలనీతి సమ్మతం" లో రెండు పద్యాలను దీనినుంచి ఉదాహరించాడు. రచన ప్రౌఢంగానూ రసవంతంగానూ ఉంది.

(ఆరుద్ర-2)

కేవలాత్మ శతకము

కర్త : బాలారాం పంతులు.

కవి కేవలాత్ముని గురువుగా భావించి ఈ శతకాన్ని వ్రాశాడు. కేవలాత్ముడు కలియుగంలో కారణాచార్యులై వచ్చాడట. యుగాలు, జగాలు, గురువు, అంతాభ్రాంతి అనీ, భ్రాంతిలేనిది "బట్టబయలు," ప్రపంచమ తామాయ అని కవి ఇందులో చెప్పాడు.

(శ. సా. వి-315)

కేశవనగరము

'గద్వాల'కు నామాంతరం.

చూ. గద్వాల. (ఆం. సం. సా.)

కేశవ పండితుడు

కాలం : క్రీ. శ. 17 శతాబ్ది.

రచనలు : 1. రాజారామ పాల చరితమ్ (సం) 2. శహాజీ చరితమ్ (సం).

(తె. వి. స-6)

కేశవరాజు భట్రాజు

కాలం : 1839 ప్రాంతం.

స్థలం : ఎట్టియాపురం సంస్థానం (తమిళదేశం).

రచనలు : తెలియలేదు.

జగదీశ్వర రామకుమార ఎట్టప్ప మహారాజు ఆస్థానంలోని తెలుగు కవి.

(ద. దే. వా. 513)

కేశవవిలాసము

కర్త : శేషభట్టరు సింగరాచార్యులు (చూ).

'శూద్రధర్మోత్పలద్యోతునీ స్మృతి కౌముది' లో ఈ కవి కేశవ విలాసాది గ్రంథరచన గావించినట్లున్నది. (మ. మా)

**కేశవశతకము**

కవయిత్రి : మదిన సుభద్రయ్యమ్మ.

రచనా కాలం : 18 వ శతాబ్దం. (క. స.-298)

**కేశవస్వామి శతకము**

కర్త : మరింగంటి వేంకట రాఘవాచార్యులు.

ఇది అంత్యనియమమున్న ప్రౌఢ శతకం. పూర్వమొకప్పుడు హనుమకొండ నుంచి వెలువడి న"ఆంధ్రాభ్యుదయం" అనే పత్రికలో ప్రకటితం. (తె. వి. స-6)

**కేసనకుర్రు**

'కపిలేశ్వరపురం' సంస్థానంలోని భాగం. క్రీ.శ. 1852లో కపిలేశ్వరపురం జమీందారు బుచ్చికృష్ణయ్య 'కేసనకుర్రు' ఎస్టేటును దంతులూరి బుచ్చి కృష్ణమరాజు వద్ద నుండి కొని తమ జమీలో కలుపుకున్నారు.

వివరాలకు : చూ. కపిలేశ్వరపురం. (ఆం. సం. సా)

**కేసరి వారు**

బిరుదును సూచించే ఇంటిపేరు. ధైర్య సాహసాలను ప్రదర్శించిన వంశీయులకు ఇలాంటి బిరుదుతో వ్యవహరించటం కద్దు. ఈ వంశీయులు సింహవిక్రములు కావచ్చు. ఆ బిరుదే ఇంటిపేరుగా నిలిచిపోయింది. (భారతి-మా-45-229)

**కైపదము**

కైపదము లిచ్చి పూరించమనడం ప్రాచీనరాజాస్థానాలలో కవి పండిత గోష్ఠులలో తరచుగా జరిగే వినోదం. కైపదమంటే సమస్య అని అర్థం. చూ. సమస్యాపూరణం.

**కైప మాయన కవి**

కాలం : 19వ శతాబ్దం.

రచనలు : ఉషా కల్యాణము (ప్రబంధం).

కామాక్షి మహాదేవశాస్త్రిల కుమారుడు. విద్వత్కవి. రసవంతంగా కవిత చెప్పాడు. (క. స. 168)

**కైయట ప్రదీప వ్యాఖ్య (సం)**

కర్త : శేషచింతామణి. (తె. వి. స-6)

**కైయట ప్రదీప వ్యాఖ్య (సం)**

కర్త : శేష నాగోజీ. (తె. వి. స-6)

## కైయట ప్రదీప వ్యాఖ్యానమ్ (సం)

కర్త : అన్నంభట్టు. (చూ).

సంస్కృత వ్యాకరణ శాస్త్రం. ఉద్యోతనం. (తె. వి. స-4)

## కైయటుని మహాభాష్య ప్రదీప వ్యాఖ్య (సం)

కర్త : నీలకంఠ దీక్షితులు. (తె. వి. స-6)

## కైవల్య నవనీతము

కర్త : వేంకటరామ విద్యానందుడు.

ఇది పద్యకావ్యం. వేదాంత విషయాలను తెలిపే గ్రంథం. (తె. వి. స-4)

## కైవారము

రచనా విశేషం. 1. రాజుల నుద్దేశించి వందిమాగధులు పఠించే రాజవంశ బిరుద ప్రశంసాత్మకమైన గద్య విశేషంగా ప్రసిద్ధం. 2. తంజావూరు యక్షగానాలలో ఇది నాందీ ప్రాయంగా ఉంది. గ్రంథ ప్రారంభ పద్యమైనంతనే రూపక ప్రరోచన సూచనగా ప్రయుక్తమైంది. ఇది ప్రాయికంగా సంస్కృత సమాస ప్రచురము. సంబుద్ధ్యంతమై, రెండేసి సంబుద్ధులకు అంత్యప్రాసం కలిగిన ఒక స్తోత్ర పాఠప్రాయమైన రచన. శ్రీనాథుడు భీమఖండంలో గంధర్వులు "కైవార పదానుసారకమనీయముగా ప్రావేశిక ధ్రువాగానవళులం బరిఢవించి" రని దీనిని చెప్పాడు. (య. వా. చ-272)

## కొంటె కోణంగి

మేలటూరి భాగవత మేళ నాటకాలలోని ఒక పాత్ర. ఇతని వాలకమే అదో రకంగా ఉంటుంది. ఇతర భాగవత ప్రదర్శనలలోని మాధవి, ధర్మి, విదూషక, కేతిగాడు వంటి పాత్రే ఇది.

ఇతని ప్రవేశానికి ఒక హద్దూ, పద్దూ లేదు ప్రదర్శన జరిగేటప్పుడు సమయానుకూలంగా ఎప్పుడుబడితే అప్పుడు వచ్చి ప్రేక్షకులను ఆనంద పరుస్తాడు. పాత్రల మధ్య కలహాలు పెడతాడు. వాటిని చమత్కారంగా పరిష్కరిస్తాడు. ఒకొకసారి ప్రేక్షకులలో ప్రేక్షకుడుగా నటిస్తాడు.

హంగుదారులు 'ఎవరోయి నీవు' అని ప్రశ్నిస్తారు. "నేనా కొంటెకోణంగిని ఈరోజు జరగబోయే వరదరాజ పెరుమాళ్ళ వసంతోత్సవం జయప్రదంగా జరిపించటానికి, భాగవత ప్రదర్శన నిరాటంకంగా జరిపించటానికి వచ్చానని చెప్తూ, చుట్టు ప్రక్కల గ్రామాలనుంచి వచ్చిన ప్రజలకు ఉచిత మర్యాదలు జరిపించారా" అనీ, "రావలసిన పెద్దలందరూ వచ్చారా," అనీ హంగుదార్లను అడిగి, సమాధానాలు అందుకొని చటుక్కున నిష్క్రమిస్తుంటాడు. (నా. ర. చ-107)

## కొండపల్లి

ఇది కొండవీటి రెడ్డి ప్రభువుల కాలంలో వెలసిన చిన్నగిరి దుర్గం. ఇక్కడ సాహిత్య పోషణ జరిగిన దాఖలాలు ఉన్నాయి. కొండవీటి రాజులకు ఇది ఉత్తర సరి

హద్దు. పెద్ద బండరాళ్ళతో కోటను నిర్మించారు. కుమారగిరి కుమారుడు రాచవేమారెడ్డి కాలంలో ఒక ప్రక్క గజపతులు, రెండో ప్రక్క విజయనగర రాజులు దండయాత్రలు చేసి కోటను సర్వనాశనం చేశారు అవశేషాలు నేటికి నిలిచి ఉన్నాయి ఇది కృష్ణా మండలంలో ఉంది కొండవీటి రెడ్ల దగ్గర చాలా అగ్రహారాలు పొందిన రాయన భాస్కరుడు ఈ దుర్గాధిపతిగా ఉండేవాడు. ఈయనను కీర్తిస్తూ చాలా చాటువులున్నాయి.

## కొండమడుగు పురుషోత్తమకవి

కాలం : క్రీ.శ. 18 వ శతాబ్దం.

రచన : అనంద గణేశ్వరము (సానంద గణేశ్వరము).

గిరియప్ప నందనుడు. తనకు 'అయ్యలూరు' మొదలైన అగ్రహారాలున్నట్లు చెప్పుకొన్నాడు. కుండేటి బుచ్చయ్య కోరికపై ఈ కవి రచనలు చేశాడట. ఇతని కవిత్వం శ్రావ్యంగా ఉంటుంది. (క. చ. 3-170)

## కొండయ

కాలం : తెలియదు.

రచన : విక్రమార్క చరిత్ర (ద్విపద).

ఇతడు తిమ్మయకవి పుత్రుడు దేవయామాత్యుని పుత్రుడైన పెద్దయమంత్రి ప్రేరణతో రచనలు చేశాడు. అవతారికలో నన్నయను స్తుతించాడు

(ద్వి. సా. చ-457)

## కొండయ్య

కాలం : తెలియదు

రచన : పల్నాటి వీరచరిత్రలో కొంత భాగం.

రామిశెట్టి కుమారుడు శ్రీనాథ కృతంగా చెప్పబడుతున్న ద్విపద పల్నాటి వీర చరిత్రలో కొమ్మరాజు యుద్ధభాగాన్ని ఇతడు రచించాడు. రచన చక్కనిది విలక్షణమైన పదప్రయోగాలున్నాయి. (ద్వి. సా. చ-387)

## కొండవీటి కోటయ్య

కాలం : క్రీ.శ. 1800 ప్రాంతం.

రచన : శివశతకము.

ఇతని రచన ప్రశస్తంగా లేక పోయినా విషయ ప్రాధాన్యం కలదిగా ప్రసిద్ధి. ఇది నీతి శాస్త్రానికి అనువాద మట. (శ. క. చ-778)

## కొండవీటి గుడికట్టు లెక్క

నామాంతరం. చూ. కొండవీటి దండకవిలె.

## కొండవీటి దండకవిలె

కర్తలు : తర తరాల గణకులు.

నామాంతరం : గుడికట్టు లెక్క.

ఇది గణక గ్రంథం. కొండవీటి సీమలో ప్రాచీనకాలం నుంచి ఉన్న గ్రామాల, సీమల లెక్కలు దీనిలో ఉన్నాయి. కొండవీటి ఏలికలైన రాజుల, రాజకుమారుల, నాయకుల, వంశావళికి సంబంధించిన విషయాలు బిరుదావళితో సహా ఉన్నాయి ఇది రెడ్డిరాజుల చరిత్ర నిర్మాణంలో చాలా ఉపయోగపడుతున్నది. పూర్తి వివరాలతో అన్ని రకాల లెక్కలు ఒక తరం వారి నుంచి మరొక తరం వారి వరకు ఉంటాయి. దీనిలో గ్రామాల, సీమలకు సంబంధించి వివరణాత్మకంగా పరిపాలనా విధానం, గ్రామ సీమలలో చేసే ప్రభుత్వ సేవలు, దేవాలయాలకు సంబంధించిన సర్వ విషయాలు, వ్యవసాయము భూమిసాగు, వివిధచేతి పరిశ్రమలకు సంబంధించిన చాలా వివరాలు దొరుకుతాయి.

కొండవీటి సీమకు సంబంధించిన ప్రతి విషయం దీనిలో వివరంగా ఉంటుంది దీనిని 'దండుకవిలె' అని కూడా కొందరంటారు.

కవిలె అంటే వ్రాసి పెట్టిందని, దండుకవిలె అంటే సైన్యానికి సంబంధించిన సర్వ విషయాలున్న గ్రంథమని కూడా కొందరు పండితులంటున్నారు.

ఒరిస్సా గజపతులు ఆంధ్ర దేశాన్ని జయించినప్పటి నుంచి ఈ కవిలె ఉందంటారు. గజపతులు దేశాన్ని సైన్య పరిపాలనార్థం విభజించారని, అప్పటి నుంచీ దీనికి 'దండు కవిలె' అనే పేరు వచ్చి చెలామణిలో ఉందనీ, దేశాన్ని కొన్ని 'దండు పాడులు'గా విభజించారని, అలాంటి పాడులలో 'కొండవీటి దండుపాడు' ఒకటని పండితులంటున్నారు.

ఈ 'దండకవిలె' చరిత్రకారులకు అమూల్యమైన సమాచారం ఇచ్చిందనటంలో సందేహంలేదు. (రె. రా. చ-14-15)

## కొండవీడు

ఇది గుంటూరు మండలంలో ప్రసిద్ధి చెందిన పర్వతదుర్గం. కాకతీయ సామ్రాజ్యం పతనమైన తరవాత రెడ్డి నాయకులు స్వతంత్రులై, తొలుత అద్దంకి రాజధానిగా రెడ్డి రాజ్యం స్థాపించారు. విజయనగర రాజుల దండయాత్రలకు తట్టుకోలేక అనవోతా రెడ్డి కొండవీటి గిరిదుర్గాన్ని నిర్మించి, తన రాజధానిని అద్దంకి నుంచి కొండవీటికి మార్చాడు.

రెడ్డి రాజులందరూ సంస్కృతాంధ్ర కవులను పోషించారు. కుమార గిరిరెడ్డి "వసంత రాజీయమ్" పేర నాట్య శాస్త్రాన్ని వ్రాశాడు కవి, అదినేడు అలభ్యం. హర విలాస కావ్య కృతిభర్త అవచితిప్పయ్య సెట్టి కుమారగిరి సుగంధ భాండాగారానికి అధ్యక్షుడు. పెదకోమటి వేమారెడ్డి స్వయంగా కవియే గాక సంస్కృతాంధ్ర కవి పోషకుడు. వేమ భూపాల చరిత్ర వ్రాసిన వామనభట్ట బాణుడు పెదకోమటి వేముని ఆస్థాన సంస్కృత కవి. శ్రీనాథుడు పెదకోమటి వేముని విద్యాధికారి. శృంగార నైషధ కావ్య కృతి భర్త మామిడి సింగన పెదకోమటి వేముని మంత్రి.

"ధర్మ వేముడు"గా పేరు పొందిన అనవేమారెడ్డి సంస్కృతాంధ్ర కవులను

పోషించాడు. బొల్ల లక్ష్మీధరుని వంటి సంస్కృత పండితులు కొండవీటి వారే. కృష్ణార్జున సంవాదం అనే ద్విపద కావ్యాన్ని వ్రాసిన నాదెండ్ల గోపమంత్రి విజయనగర రాజాజ్ఞ ప్రకారం కొండవీటి దుర్గాధిపతి అయ్యాడు.

కాటయ వేముని అన్నవర దానశాసనంలో దీని ప్రసక్తి ఉంది. ఈ దుర్గం శత్రువులకు దుర్భేద్యంగాను, సైన్య సమీకరణానికి అనువుగానూ, శిల్పకళా సంపదతో చూసే వారికి ఐశ్వర్యం కలిగించేదిగాను నిర్మితమైంది. క్రీ. శ. 1516 లో శ్రీకృష్ణ దేవరాయలు దీనిని జయించాడు. క్రీ. శ. 1536 ప్రాంతాలకు ఇది కుతుబ్‌షాహీల పాలనలోకి వచ్చింది. (భారతి-సం-20 సం-10. పుటలు-14-27)

## కొండత్రాయుని కథ

కర్త : తెలియదు.

జానపద చారిత్రక గేయం. కొండత్రాయుడు తెలంగాణ ప్రాంతంలో పేరు మోసిన వీరుడు. అతని కథ దీనిలోని ఇతివృత్తం.

చూ. చారిత్రక గేయములు. (అం. వా. చ.)

## కొండా రామకవి

కాలం : క్రీ.శ. 19వ శతాబ్దం.

రచన : శ్రీగవిరంగధామ శతకము.

విశిష్టత : ఈయన, వసు చరిత్ర కృతిభర్త అయిన తిరుమలరాయల ఆస్థానం లోని వాడు. రాజు ఆనతి మేరకు శతక రచన చేశాడు. పేరుకు శతకమయినా సర్వ కావ్య లక్షణాలతో శతకారంభం చేశాడు విజయనగర పట్టణ, తిరుమలరాయల ప్రశంస చేసి ఆ ప్రభువుమీద పంచరత్నాలు, శ్రీకరములయిన సీసాలు చెప్పాడు. కవి ఎంతో విధేయతతో తాను పామరుడనని చెప్పుకొన్నాడు.

ఈయన శతకంలో అక్కడక్కడ తప్పులున్నా, అనంతరకవులు కొందరు ఇతన్ని అనుసరించి శతకాలు చెప్పారు. (ఆరుద్ర-9)

## కొండూరి అక్క దండనాథుడు

కాలం : క్రీ.శ. 16వ శతాబ్దం.

మంత్రి. సాహిత్య పోషకుడు. నారన్నగారి సూరన రచించిన "వనమాలి విలాస" కావ్యానికి కృతిపతి. ఇతడు ఏ రాజు దగ్గర మంత్రిగా ఉండేవాడో తెలియ రాలేదు (క. స-297)

## కొండూరు

మొదట ఇది కాళహస్తి సంస్థానంలో ఒక భాగం. క్రీ.శ. 1910లో కాళహస్తి నుండి విడివడి ప్రత్యేకమైన జమీందారీగా రూపొందింది. పంటరెడ్ల కోవకు చెందిన 'రేబాల' వారు దీని జమీందారులు. మోపూరు వాస్తవ్యుడైన 'రేబాల పట్టాభిరామారెడ్డి' కుమారుడైన లక్ష్మీనరసారెడ్డి (1868-19.7) అభ్రకం వ్యాపారం చేసి లక్షలార్జించాడట.

అందువలన క్రీ. శ. 1910 లో కాళహస్తి పాలకుల నుండి ఈ ఎస్టేటును ఖరీదు చేశాడు. క్రీ.శ. 1910 లో రావుబహద్దర్ బిరుదం సంపాదించాడు.

లక్ష్మీనరసారెడ్డి విద్యాభిమాని. నెల్లూరు విద్యాసంస్థల్లో చదివే విద్యార్థుల సహాయార్థం పేష్కషు పోగా సాలీనా 2,800 రూ॥ల నికరాదాయం కల గ్రామాన్ని ప్రత్యేకించి, తమ విద్యాభిమానాన్ని నిరూపించుకున్నారు. వేదం వారి సర్వంకషవ్యాఖ్య రచనకు, ప్రచురణకు వీరే కారకులట. నరసారెడ్డి తమ్ముని కుమారుడైన పట్టాభిరామా రెడ్డి కూడా కవిపండిత పక్షపాతి. వేదం వారి గృహావసతి కయ్యే వ్యయాన్ని వీరు భరించారు. (ఆం. సం. సా-528)

## కొండ్రాజు వేంకటాద్రి

కాలం : క్రీ.శ. 16వ శతాబ్ది చివరి భాగం.

గురువు : భట్టరు చిక్కాచార్యులు.

సమకాలికులు : తెనాలి రామకృష్ణకవి.

సాహిత్యపోషకుడు. కృతిపతి.

ఇతడు అర్వీటి వంశస్థుడు. విరూరి వేదాద్రి మంత్రికి ఆశ్రయం ఇచ్చిన పెదసింగ భూపాలునికి మేనల్లుడు.

విశిష్టత : ఆంధ్ర కామందక కావ్యకర్త జక్కరాజు వేంకట కవిని, రెట్ట మత శాస్త్ర కావ్యకర్తలైన అయ్యలయ్యను, భాస్కరకవిని, పోషించి వారి కృతులను అంకితం పొందాడు. ఆంధ్ర కామందకం, రాజనీతి గ్రంథమైతే, రెట్ట మత శాస్త్రం వర్షాలకు, పంటలకు సంబంధించిన శాస్త్ర గ్రంథం. (ఆరుద్ర-9)

## కొక్కోకము (రతి రహస్యము)

కర్త : కూచిరాజు ఎర్రన.

కాలం : 1450-1500 ప్రాంతాలు.

కృతిపతి : కుంటముక్కల మల్లమంత్రి. వినుకొండ దుర్గాధిపతి.

ప్రత్యేకత : సంస్కృతంలో 'కొక్కోకం' అనే గ్రంథానికిది తెనుగుసేత. తెలుగులో మనకు దొరుకుతున్న కామశాస్త్ర గ్రంథాలలో ఇదే మొదటిది. ప్రాచీనతమమైన వాత్స్యాయన కామ సూత్రాల కంటె తెలుగుదేశంలో ఈ 'కొక్కోకా'నికే ప్రశస్తి వచ్చింది. పంచ కావ్యాలకు వ్యాఖ్యానం వ్రాసిన మల్లినాథసూరి 'కొక్కోకం' నుంచి ఉదాహరణ లిచ్చాడు. ఎర్రన సంస్కృతంనుంచి 3 ప్రకరణాలు (అధికారాలు) అనువదించాడు. మగ వారిలోను, ఆడవారిలోను ఉండే పద్మినీజాతి మొ॥జాతిభేధాలు, ఏయే దేశాల స్త్రీలకు ఎలా తృప్తి కలుగుతుందో మొదటి ఆశ్వాసం వివరిస్తుంది. ఆరవైనాలుగు బంధాలు, అందులోని భేదాలు, విపరీత బంధాలకు తగిన వాళ్ళెవరో రెండో ఆశ్వాసం తెలుపుతుంది. మూడో ఆశ్వాసంలో ఆడవాళ్ళను వశపరచు కోవటానికి మంత్రాలు. మూలికలూ మొ॥ చెప్పాడు. వాటితోపాటు వీర్యవృద్ధి, గర్భోత్పత్తి వంటి విషయాలున్నాయి. ఆంధ్రీకరణం భావ ప్రధానమైంది. ఎర్రన్న పతివ్రతా లక్షణాలు, ఇల్లాలు

భర్తతో సుఖించే పద్ధతి, ఇల్లాలికి ఎవరెవరి స్నేహ సంభాషణలు కూడవో, పడక గది ఎలా ఉండాలో చెప్పాడు. కామశాస్త్ర విషయాలతోపాటు నీతి విషయాలు కూడా స్పష్టంగా చెప్పాడు.

ఈ గ్రంధం చాలాసార్లు అచ్చుపడింది. పాఠాంతరాలు ఎక్కువ.

(ఆరుద్ర-6-95)

## కొచ్చెర్లకోట వెంకటమంత్రి

కాలం : క్రీ.శ. 16 వ శతాబ్ది ఉత్తరార్థం.

స్థలం : కొండవీడు

సాహిత్య పోషకుడు. ఈ వంశీయులకు గజపతులు "మహాపాత్ర" బిరుదం ఇచ్చారట. చల్లా గురవయ్యమంత్రిచేత. "యాజ్ఞవల్క్య విజయం" వ్రాయించి శ్రీరామ చంద్రునికి అంకితం ఇప్పించాడు ఇతడు కొండవీటికి స్థలకరణంగా ఉండేవాడు.

(ఆరుద్ర-10-552)

## కొచ్చెర్లధామ శతకము

కర్త : గాదె ఆది శేషకవి.

సీస పద్య శతకం కవిత గర్భకవిత్వంతో కూడి ప్రౌఢంగా ఉంది కన్నె కంటి వెంకట సుబ్బయ్య ప్రేరణతో ఈ శతకం చెప్పాడట.

## కొటికెల పూడి

గ్రామనామం. ఇంటి పేరుగా స్థిరపడింది ఆంధ్ర దేశంలో ప్రకాశం జిల్లా ఒంగోలు సమీపంలో ఒకటి, కృష్ణా జిల్లా నందిగామ తాలూకాలో మరొకటి కొటికెలపూడి గ్రామాలున్నాయి.

## కొటికెల పూడి కోదండ రామకవి

కాలం : క్రీ. శ. 19 శతాబ్దం-ప్రథమార్ధం.

స్థలం : బొబ్బిలి సంస్థానం.

రచనలు : ప్రపదన పారిజాతము, నృసింహ పురాణము, తారక బ్రహ్మ మాహాత్మ్యము, జానకీరామ శతకము, జానకీ వల్లభ శతకము, దేవచూడామణి శతకము, భారత శతకము, మాధవ శతకము, మారుతి శతకము, రాజవతంస శతకము, వేణుగోపాల శతకము, శ్రీపతి శతకము, సుధా తరంగము మొ॥

బొబ్బిలి సంస్థానాశ్రితుడు సంస్థానాధీశ్వరుడైన రాజా శ్వేతాచలపతి బహద్దరు (1810-1862) ఆస్థానంలోని వాడు. రాజా గారికి బాల్యంలో సహాధ్యాయి. ఇతని తల్లిదండ్రులు వెంకుసోమదేవి, వేంకటకృష్ణ సోమయాజులు. ఇతడు అష్టోత్తర త్రింశదాంధ్ర గిర్వాణ కావ్యఘటికుడని, నానావేదాంత బోధవిధి అని, జ్యోతిషామ్నాయ విద్యావిశారదుడని, కార్తాంతికసంఘ సన్నుతుడని, ఉభయ కవిత్వ రచనానల్పచాతురీ

ధురీణుడని పేర్కొనబడ్డాడు. ఇతని కాలం 1807-1883 అని కొందరు నిర్ధారించారు. ప్రపవన పారిజాతము, అనే రచన ప్రభువైన శ్వేతాచలపతి రంగరాయ బహద్దరుకు అంకితం. (అం. సం. సా-304; శ. సా. వి 219)

## కోటికెలపూడి వీరరాఘవాచార్యులు

కాలం : క్రీ. శ. 17వ శతాబ్దం, ఉత్తరభాగం.
స్థలం : వినుకొండ.
సంస్థానం : గద్వాల సంస్థానం.
రచనలు : 1. యథాశ్లోక తాత్పర్య భారతము 2 నవీనందోర్గిణపర్వము.

ఇతడు గద్వాల ప్రభువుల ఆస్థానంలో ఉండేవాడు. రంగశాయి పుత్రుడు. రాజా పెద సోమభూపాలుని ఆదేశానుసారం 'యథాశ్లోక తాత్పర్యభారతం' 8 ఆశ్వాసాలుగా వ్రాశాడు. ఆ పరంపరలోనిదే ఈ "నవీనందోర్గిణపర్వం" కావచ్చును. (మ. మా.)

## కోటికెలపూడి వేంకటకృష్ణసోమయాజి

కాలం : క్రీ. శ. 18వ శతాబ్దం చివర-19వ శతాబ్దం ప్రారంభం.
స్థలం : బొబ్బిలి సంస్థానం.
రచనలు : విజ్ఞానేశ్వరీయం, తారక బ్రహ్మము, దిలీపచరిత్రము, ప్రబంధచంద్రోదయము, మేఘ సందేశము. శ్వేతాచల మాహాత్మ్యము మొ॥.

బొబ్బిలి సంస్థానాశ్రితుడు. వేంకట రామయ్యపుత్రుడు. క్రీ. శ. 1790-1830కి చెందిన రాయడప్పరంగారావు ఆస్థాన విద్వత్కవి. శతాధిక గ్రంథకర్తయట. పైన పేర్కొన్నవి ఇతని రచనలలో కొన్ని. అందులోని కూర్మక్షేత్ర మాహాత్మ్యము రంగారావుకు అంకితం ఇవ్వబడింది. (అం. సం. సా-303)

## కోటికెలపూడి సోమనాథుడు

కాలం : క్రీ శ. 16 శతాబ్ది.
స్థలం : కొటికెలపూడి.
రచన : విశ్వామిత్రోపాఖ్యానము (చంపువు).
బిరుదు : శారదాభరణాంకుడు.

విశిష్టత : ఆంధ్రదేశంలో ప్రకాశం జిల్లా ఒంగోలు సమీపంలో ఒకటి, కృష్ణా జిల్లా నందిగామ తాలూకాలో మరొకటి కొటికెల పూడి గ్రామాలున్నాయి. కవి ఏ వూరివాడో తెలియదు. కావ్యంలో కవిత్వం ఎట్లా ఉండాలో కవి చెప్పాడు. ఈయన తండ్రి కోటయ్య కూడా పండితుడట. కుకవి కుంజర ఘటా పంచాననుడట. తండ్రిలాగేకొడుకు కూడా కుకవుల పాలిటి గొడ్డలి. ఈయన వ్రాసిన విశ్వామిత్రోపాఖ్యానం చమత్కార ప్రగల్భాలతో కూడిన ప్రౌఢ కావ్యం. ఇతడు ఇంకో కావ్యాన్ని కూడా వ్రాసినట్లు తెలుస్తున్నది. (ఆరుద్ర-9-250)

**కొట్టర ఎర్రమంత్రి**

గొప్పదాత. ముప్పయి ఇద్దరు మంత్రుల సీసమాలిక ఈయన గురించి తెలియజేసింది. ఈయనపై వేరొక చాటువు కూడా ఉంది. (చా. ప. ర)

**కొట్నముల పాటలు**

నామాంతరం : చూ. సువ్వి-సువ్వాల పాటలు.

**కొత్రుబాలకవి**

నామాంతరం : వేంకటేశ్వర కవి.
కాలం : క్రీ. శ. 1730-1790.
స్థలం : బొబ్బిలి సంస్థానం (ఇల్లంనాయుడువలస.)
రచన : భల్లాణ చరిత్రము, విమలాంగిపరిణయము, ఇల్లమనాయ కేంద్ర శతకము.
సమకాలికుడు : అడిదం సూరకవి.
బిరుదు : బాలకవి

బొబ్బిలి సంస్థాన పాలకులను ఆశ్రయించిన ప్రాచీన కవులలో ఇతడొకడు. ఇతని అసలు పేరు "వేంకటేశ్వరకవి". సోమనార్య పుత్రుడు. ఇల్లంనాయుడు వలస "రాజాము" ఎస్టేటుకు సమీపంలో ఉంది. బాల్యంలోనే కవిత చెప్పి బాలకవిగా ప్రసిద్ధుడయ్యాడు.

బాలకవి కొన్ని శతకాలు, ప్రబంధాలు వ్రాసినట్లు తెలుస్తున్నది. భల్లాణ చరిత్రము, విమలాంగిపరిణయం అనే రెండు రచనల పేర్లు మాత్రం తెలుస్తున్నాయి. ఇందులోని భల్లాణచరిత్రము అలభ్యం. విమలాంగి పరిణయం అసమగ్రంగా లభించింది. బాలకవి సూరకవిని పొగడుతూ చెప్పిన చాటువులు సూరకవి బాలకవిని పొగడుతూ చెప్పిన చాటువులు ప్రచారంలో ఉన్నాయి.

బొబ్బిలి ప్రభువులు ఇల్లంనాయుడు వలస గ్రామాన్ని కొత్రు వంశీయులకు అగ్రహారంగా ఇచ్చారట. (ఆం. సం. సా. 300-1; చా. ప. ర)

**కొడిచెర్ల శ్రీనివాసకవి**

కాలం : క్రీ.శ. 17వ శతాబ్దం.
స్థలం : రాజమహేంద్రవరం.
రచన : శేష ధర్మ రత్నాకరము (శేషధర్మములు).
బిరుదు : ఐవరగండ.

భవాని, కొండయ్యల పుత్రుడు. ప్రౌఢంగా రసవంతంగా కవిత్వం చెప్పాడు. ఇతడు మంత్రి శిఖామణియై బిరుదాలు పొందినట్లు తెలుస్తున్నది. (క. చ.-3-49)

**కొణిదెన నాగయ్యకవి**

కాలం : క్రీ శ. 17వ శతాబ్దం కావచ్చు.

స్థలం : నంజనగుడి (మైసూరు సీమలోనిది).
రచనలు : బ్రహ్మనారద సంవాదము, పతివ్రతాభరణము, రాధామాధవసంవాదము

ఈ కవి దక్షిణదేశానికి చెందినవాడు మైసూరులో స్థిరపడిన తెలుగు కుటుంబాలలో కొణిదెనవారు ప్రసిద్ధులు. (వ. దే. వా-పీఠిక)

**కొత్త అమరప్ప**

చాటుకవి.

ఈయన లోకానుభవంతో సంఘంలోనిసత్యాలను వివరిస్తూ "కొత్త అమరప్ప" మకుటంతో పద్యాలు చెప్పాడు ఈ పద్యాలు చాటువులుగా చెలామణిలో ఉన్నాయి. వివరాలు తెలియరాలేదు. (చా. ప. ర.)

**కొత్తపల్లి రామచంద్రాచార్యులు**

నామాంతరం : రామాచార్యులు.
కాలం : క్రీ. శ. 18 వ శతాబ్దం.
స్థలం : గద్వాల సంస్థానం.
రచనలు : యథాశ్లోక తాత్పర్య రామాయణము (అయోధ్యకాండము)
బిరుదము: విద్వన్మహాకవి.

పలువురు కవులచేత అనువదింపబడిన యథాశ్లోక తాత్పర్య రామాయణంలోని అయోధ్యకాండను అయిదాశ్వాసాలుగా అనువదించాడు. కొందరు సాహిత్యకారులీయనను రామాచార్యులుగా పేర్కొన్నారు. (ఆం. సం. సా.) (క. స. 200)

**కొత్తపల్లి రామాచార్యులు**

నామాంతరం : కొత్తపల్లిరామచంద్రాచార్యులు.

**కొత్తపల్లి వెంకటరామలక్ష్మీనారాయణ శర్మ**

కాలం : క్రీ.శ. 19 వ శతాబ్దం.
రచన : పాల్వంచ సంస్థాన చరిత్రము.
బిరుదం: సాహిత్య విశారద.

వీరు రాజా పార్థసారథి అప్పారావు పోష్యవర్గంలోని వారు. పాల్వంచ సంస్థాన విద్యాశాఖాధికారిగానూ, ఆంధ్రవాఙ్మయ సేవాసమితి కార్యదర్శిగానూ పనిచేసి కీర్తి పొందారు. రాజాపార్థసారథి అప్పారావు జీవితం విపులంగా వర్ణిస్తూ "పాల్వంచ సంస్థాన చరిత్రము" అనే గ్రంథం వ్రాశారు. (ఆం. సం. సా)

**కొత్తలంక మృత్యుంజయ కవి**

కాలం : క్రీ. శ. 1800 ప్రాంతం.
నివాసం : గోదావరి మండలంలోని కొమరగిరి గ్రామం.
రచనలు : 1. బృహన్నారదీయము 2 ధరాత్మజా పరిణయము 3. విరోష్ఠ్య నలచరిత్రము

విశ్వనాథుని పుత్రుడు. పాండితీ ప్రకర్షగల కవి. ఇతని నివాసమైన 'కొమరగిరి' కౌశికీ నదీతీరంలోని గ్రామమట. అల్లూరి అప్పలరాజు, రుద్రరాజు, తిరుమలరాజు

అనే వారి పేర్లు ఇతని కృతులలో కనిపిస్తున్నాయి. వీరితనికి ఆశ్రయమిచ్చినవారై ఉండవచ్చును. (క. స. 172) (తె. వి స-6)

**కోతై యాళ్వారు**

చూ : గోదాదేవి.

**కొప్పర్తి నరసకవి**

కాలం : క్రీ.శ. 18వ శతాబ్దం కావచ్చు.

రచనలు : తెలియరాలేదు.

రావూరి సంజీవకవిదిగా ముద్రితమైన రుక్మిణీ పరిణయ కావ్యం ఇతనిదని కొందరు భావిస్తున్నారు. ఈ కవిని గురించిన వివరాలు తెలియవు. (క. స.281)

**కొప్పుల వల్లభరాజు**

కాలం : క్రీ.శ. 17 వ శతాబ్దం.

స్థలం : కొట్టాపురం (విశాఖపట్టణం, శృంగవరపు కోట తాలూకాలోని కొట్టాం కావచ్చు)

బిరుదం : "పట్టతలాట కేళావిరాయ రాజ దేవేంద్ర రాజాధిరాజచంద్రగాయగోవాళ జగనొబ్బగండ."

కొట్టాపురాన్ని పాలించిన రాజు. సాహిత్య పోషకుడు. కృతిపతి. అంగర నరసింహం రచించిన "రాజరాజాభిషేకం" అంకితం పొందాడు. (ఆరుద్ర 11-268)

**కొమరగిరి సంజీవకవి**

కాలం : తెలియదు.

రచనలు : శశాంకశేఖర శతకము, హరిహర సంవాదము.

శేషయ్య లచ్చమ్మల పుత్రుడు. ఆశుకవి. శశాంకశేఖర శతకాన్ని రెండు గడియల కాలంలో ముగించాడట. హరిహర సంవాదం కూడ రెండు గడియలలోనే వ్రాశాడట. (క. స. 280)

**కొమరగిరి సుబ్బయామాత్యుడు**

కాలం : క్రీ.శ. 16 వ శతాబ్దం.

సాహిత్య పోషకుడు. కృతిపతి. యాదాటి వేంకట నారాయణ రచించిన బ్రహ్మోత్తర ఖండము (ద్విపద) ఇతనికే అంకితం. సంస్కృత స్కాంద పురాణం లోని బ్రహ్మోత్తర ఖండంలో ఉన్న మందర అనే బ్రాహ్మణుని కథ, పింగళ అనే వేశ్య కథ కవి ఇతని ప్రోత్సాహంతో ద్విపదగా చెప్పాడు. (ద్వి. సా. చ-172)

**కొమరని పాలకొల్లు శాసనము**

కాలం : క్రీ. శ. 1192.

శాసనప్రదాత : కొమరరు.

శాసనప్రదేశం : పశ్చిమ గోదావరి జిల్లా పాలకొల్లు.

శాసన విషయం : ఈ శాసనం పాలకొల్లులోని రామేశ్వరాలయంలో ఒక రాతి స్తంభం మీద చెక్కి ఉంది. శాసన ప్రదాత కొమరరు (కొలని) సోమేశ్వరస్వామికి

రెండు సంధ్యదీపాలు నిలిపినట్లు ఈ శాసనం వల్ల తెలుస్తుంది. దీనిలో ఒక కంద పద్యముంది. (తె. క. చ-310 b)

## కొమర్రాజు వేంకట శివుడు

కాలం : క్రీ. శ. 19 శతాబ్ది.

రచన : రేపాల రాజలింగ శతకము, జ్యోతిష గ్రంథము, శతకాలు.

ఈయన సుప్రసిద్ధ చారిత్రక పరిశోధకులు. కొమర్రాజు లక్ష్మణరావు పంతులు గారి జనకులు. మునగాల ప్రభ్వీరాజానాయని లచ్చమ్మారావుగారి మంత్రి. (శ. సా. వి.)

## కొమ్మన ఏలూరు శాసనము

కాలం : క్రీ. శ. 1223.

శాసన ప్రదాత : కొమ్మన.

శాసన ప్రదేశం : పశ్చిమ గోదావరి జిల్లా ఏలూరు

ప్రస్తావిత స్థలం : సరసీపుర సోమేశ్వరాలయం.

శాసన విషయం : ఈ శాసనం అసంపూర్ణంగా ఉంది. సరసీపురంలో వేంచేసి ఉన్న సోమేశ్వరస్వామికి భూదానం చేయటమో, అఖండ దీపం నిలపటమో జరిగి ఉండవచ్చు. దొరికిన ఒక్క కంద పద్యం కూడా అసమగ్రంగా ఉంది. శాసనం ఏలూరు మసీదులోని ఒక స్తంభం మీద చెక్కి ఉంది. (తె క. చ-315 b)

## కొమ్మన ప్రెగ్గడ (బాపట్ల) శాసనము

కాలం : క్రీ. శ. 1160.

శాసన ప్రదాత : కొమ్మన ప్రెగ్గడ.

ప్రస్తావిత స్థలం : గుంటూరు జిల్లా బాపట్ల (భావపట్టు).

శాసన విషయం : వెలనాటి గొంకరాజు కొలువులో శాసన ప్రదాత వంశీయులు సంధి విగ్రహాది కార్యాలు నిర్వహించేవారట. గొంకరాజు చేత వీరు శివాలయాలను నిర్మింప చేశారని, కొమ్మన బాపట్లలో వేంచేసియున్న భావనారాయణస్వామికి అఖండ దీపం నిలిపాడనీ ఈ శాసనం తెలియ జేస్తుంది. దీనిలో రెండు ఉత్పలమాలలు, రెండు చంపకమాలలు, మూడు కంద పద్యాలు ఉన్నాయి. (తె. క. చ-277-279)

## కొమ్మన శాసనము

కాలం : క్రీ. శ. 1144.

ప్రస్తావిత స్థలాలు : ఘంటసాల, వేంగి.

శాసన ప్రదాత : కొమ్మన (కొమ్మనసెట్టి).

శాసన విషయం : కొమ్మన దాత. ఘంటసాల జలధీశ్వ దేవునికి ఒక అఖండ దీపాన్ని, వేంగిలో వేంచేసిన శివునికి ఒక అఖండ దీపాన్ని నిల్పినట్లు దీనిలో ఉంది. దీనిలో రెండు చంపకమాలలు అసమగ్రంగాను, రెండు కంద పద్యాలు సమగ్రంగాను ఉన్నాయి. (తె. క. చ-242)

### కొమ్మమ చందోలు శాసనము

కాలం : క్రీ. శ. 1154.

శాసనం వేయించిన వారు : ముత్తయ నాయకుని కుమార్తె కొమ్మమ.

ప్రస్తావిత స్థలం : ధనదవోలు (చందోలు)

శాసన విషయం : ఈ శాసనంలో కొమ్మమ్మ పూర్వీకుల వంశవిపుల వర్ణన ముంది. వీరు వెలనాటి గొంక భూపతికి భృత్యులట కొమ్మమ చందోలులో వేంచేసి యున్న చోడ నారాయణస్వామికి అఖండ దీపం నిలిపినట్లు తెలుస్తుంది. దీనిలో ఒక ఉత్పలమాల, ఒక చంపకమాల, రెండు కంద పద్యాలు, చివర గద్య ఉన్నాయి. (తె. శ. చ-262, 263)

### కొమ్మమ పెరవలి శాసనము

కాలం : క్రీ. శ. 1156.

శాసనం వేయించిన వారు : కొమ్మమ (కొమ్మమాంబ)

ప్రస్తావిత స్థలం : పెరవలి.

శాసనం విషయం : కొమ్మమ్మ నిడుప్రోలు కొమ్మయకు-మల్లాంబికకు తనయ. వెలనాటి గొంక రాజు కొలువుకాడైన మారయ పండనికి అర్ధాంగి. ఈమె పెరవలిలో వేంచేసిన మాధవస్వామికి గుడి కట్టించింది. గుడికి సమీపంలో చెరువు త్రవ్వించి, ఒక తోట కూడా వేయించిందట. ఈమె కుమారుడు చోడదండేశుడు ఏరెడ్ల చెరువు త్రవ్వించి, పుట్టెడు ధాన్యం పండే భూమిని దేవమాన్యంగా ఇచ్చాడట. దీనిలో మూడు కంద పద్యాలు, ఎత్తు గీతితో ఒక సీస పద్యం, మధ్యలో కొంత గద్య తరవాత చివరలో రెండు ఉత్పలమాలలు ఉన్నాయి. (తె. శ. చ-265)

### కొమ్మాలపాటి ఓబనకవి

కాలం : తెలియదు.

సాహితీప్రియుడు. కవి కూడా. ఈయన మంచెళ్ళ కృష్ణయ్య అనే కవిని సవ్యాఖ్యాన వసుచరిత్ర ఇమ్మని కోరుతూ రాసిన ఒక పద్యం లభించింది. (చా. ప. ర.)

### కొమ్మాలపాటి దండకము

కర్త : అకలంక శ్రీకృష్ణమార్యుడు.

నరసారావుపేట తాలూకా కొమ్మాలపాటిలోని కోదండ రాముడు కవి యిష్ట దైవం. అతనిపై చెప్పిన దండకమిది. (య. వా. చ. 56)

### కొమ్మాలపాటి రామాయణము (సుందరకాండము)

కర్త : (జూలకంటి) నారాయణకవి.

అంకితం : కొమ్మాలపాటి సీతారామస్వామికి

యక్షగానం. దీనిలోని కథ ప్రసిద్ధమైనది. రచన చక్కగా ఉంది. ప్రసిద్ధ రాగతాళాలలో దరువులు, ద్విపదలు, పద్యాలు, సంధివచనాలు ఉన్నాయి.

(య. వా. చ)

కొమ్మాసాని

కాలం : క్రీ. శ. 1108.

అమరావతిలో అమరేశ్వరాలయంలో శాసనం వేయించింది.

ఈమె సెజ్జప్రోలి నాయకుని భార్య. అమరావతిలోని అమరేశ్వరునికి అఖండ దీపదానం చేసింది. ఈమె వేయించిన దానశాసనం అమరేశ్వరుని ఆలయంలో ఒక గోడలో స్థాపితమైన స్థంభం మీద చెక్కి ఉంది. (తె. క. చ-184)

కొమ్మాసాని అమరావతి శాసనము

కాలం : క్రీ శ. 1108 ప్రాంతం.

శాసన స్థలం : అమరావతి.

శాసనం వేయించిన వారు : కొమ్మాసాని.

శాసన ప్రసక్తుడు : వెలనాటి చోడులలో తొలివాడైన గొంకరాజు.

ఇది అమరావతిలోని అమరేశ్వరాలయంలోని సన్యాసి మందిరంగోడలో స్థాపితమైన స్థంభంపై చెక్కి ఉంది. దీనిలో 36 పంక్తులున్నాయి.

శాసన విషయం : ఈ శాసన కాలం నాటికి గొంకరాజు మొదటి కులోత్తుంగ చోళుని కింద మండలేశ్వరుడుగా, సేనా నాయకుడుగా ఉన్నాడు. (మొదటి కులోత్తుంగ చోళుడు ఈ గొంకరాజు కుమారుడైన చోడుని పెంచి అతనికి రాజ్యమిచ్చాడు. ఇతనిని చరిత్ర కారులు రాజేంద్ర చోడుడని, వెలనాటి చోడుడని అంటారు).

దీనిలో మూడు ఉత్పలమాలికలు, రెండు కందాలు, కొంత గద్య ఉన్నాయి. నన్నయ్య తరవాత ఉత్పలమాలికా వృత్తా లున్న శాసనాలలో ఇది మొదటిది.

(తె. క. చ-184)

కొయ్యబొమ్మలాటలు

తెలుగు దేశంలో అతి ప్రాచీన కాలం నుంచీ ఈ ఆట ఉంది. నేటి నాటకాలకు పూర్వ రూపాలు వీధి నాటకాలు, చెక్కబొమ్మలు, కొయ్యబొమ్మలు, పేడ బొమ్మలని చెప్పవచ్చు. కాళిదాసు, భవభూతి, భాసుడు వ్రాసిన నాటకాలకు నాంది ఈ కొయ్య బొమ్మలేనని ప్రతీతి.

వివిధ రకాలదేవుళ్ళ బొమ్మలను కొయ్యతో చేసి, చక్కగా రంగులుదిద్ది దీప స్తంభాల వెలుతురులో వీటిని ఆడిస్తూ ఉండేవారు. ఆడించటానికి యోగ్యంగా ఉండే టంత తేలికగా ఈ బొమ్మలను తయారు చేసేవారు.

దసరాకు పిల్లలు ఆడించుకొనే హనుమంతుని బొమ్మలూ, సంక్రాంతి కొలువులో పెట్టే బొమ్మలూ, పెళ్ళిళ్ళకు ఆడించే బుట్టబొమ్మలు. దేవుళ్ళ వాహనాలుగా ఉపయోగించే గరుత్మంతుడు, హనుమంతుడు, నెమలి, హంస మొదలయిన కొయ్యబొమ్మలు ఇప్పటికీ ఉన్నాయి. నేడీకళ క్షీణ దశలో ఉంది. (నా. ర. చ-201)

కొరవంజి

చూ. యక్షగానము.

ఒక కావ్యప్రక్రియ. యక్షగానప్రాయమైన రచన. సోదిచెప్పే ఎరుకత పాత్ర ప్రవేశం ఉన్న యక్షగానాలు కొరవంజులుగా ప్రసిద్ధిపొందాయి. ఎరుకత సింగి, ఆమె భర్త సింగడు. ఈ ఎరుకత కావ్య నాయికకు సోదెచెప్పడం, తాను చూచిన ప్రదేశాలు వర్ణించడం, ఆమెను వెదుక్కుంటూ సింగడు రావడం వారి హాస్యచేష్టలు- ఇవి సాధారణంగా కొరవంజులలో ఉంటాయి.

కొరవంజి కల్లై

కర్త : కంఠీరవరాజు.

యక్షగానం. ఇందులో నాలుగు కృతులున్నాయి. 1. ఆంధ్ర కొఱవంజి 2. కన్నడ కొఱవంజి 3. ప్రాకృత కొఱవంజి 4. తమిళ కొఱవంజి (తిగుల కొఱవంజి). కవి ఒకే ఇతివృత్తంతో నాలుగు భాషలలోనూ రాశాడు. ఇతని రచనలలో ఇదే పెద్దది. కంఠీరవరాజు శ్రీరంగనాథుని దర్శించి తిరిగి వస్తుండగా పాంచాల రాకుమారి ఇతన్ని మోహించడం ఆమెకు కొరవంజి ఎరుక చెప్పడం ఇందులోని కథ (వ. దే. వా. 453)

కొరవంజి గద్దె

ఎరుకత చెప్పేసోదెనే గద్దెఅని అంటారు. అంటే ఆమె సోది చెప్పేటప్పుడు ఒక కూనరాగపు ఒడుపుతో చదివే గద్యఅని చెప్పవచ్చు. మన్నారు దాసవిలాస నాటకంలో ఈ సోదె ఉంది. (య. వా. చ-273)

కొరవి అన్నమంత్రి

ఈయనమీద ఒక చాటుపద్యముంది. కవి ఎవరో తెలియదు. (చా. ప. ర)

కొరవి

గ్రామనామం. మహబూబాబాదు మండలంలో మానుకోట సమీపంలో ఉంది. ఇది పూర్వం ప్రసిద్ధి పొందిన రాజధానీ నగరమట. ఇక్కడి వీరభద్రస్వామి ఆలయంలో ఒక శాసనం ఉన్నది.

ఈ గ్రామనామం కొందరికి ఇంటిపేరుగా ఉంది.

కొరవి గోపరాజు

కాలం : క్రీ. శ. 1384-1429 ప్రాంతం.
స్థలం : వేములగల్లు (నైజాం మండలం).
రచన : సింహాసన ద్వాత్రింశిక.

కసవరాజు కామాంబికల పుత్రుడు. గోపరాజు పౌత్రుడు. వీరిమూలపురుషుడు వెన్నయామాత్యుడు 1180-1230 ప్రాంతంవాడట. గోపరాజు తన కాలపు సాంఘిక పరిస్థితులను తనకావ్యంలో తెలియజేశాడు. కవిత్వం రసవంతమై మృదు మధురంగా ఉంటుంది.) ఇతని కాలాన్ని గురించి భిన్నాభిప్రాయాలున్నాయి. 1430-90 ప్రాంతం

వాడని కొందరు భావిస్తున్నారు. ఇతని పెదతండ్రి కుమారులు బాచనసింగనలు రాచకొండ రాజైన రెండవ సర్వజ్ఞ సింగ భూపాలుని వద్ద మంత్రులుగా ఉండేవారట.

గోపరాజు రచనలలో భువనగిరి, ధర్మపురి, ఓరుగల్లు మొదలైన నగరాల వర్ణన ఉన్నది. (రె. రా. చ; క. త)

## కొరవి సత్యనారన

నామాంతరం : భీమన.
కాలం : క్రీ.శ. 1320-1345 ప్రాంతం.
స్థలం : చందవోలు.
రచన : రామాయణము (అలభ్యం).
బిరుదు : ఆంధ్రకవితా పితామహుడు.

కొరవి గోపరాజుకు పినతాత. సింగయ్య గంగమ్మల పుత్రుడు. అమరేశ్వర మంత్రికి పౌత్రుడు. గోపరాజు ఇతన్ని ఒక పద్యంలో పేర్కొన్నాడు. ఇతడు రాచకొండవాడు కావచ్చుననీ, పద్మనాయక ప్రభువుల ఆస్థానంలో ఉండేవాడనీ పండితులు భావిస్తున్నారు.

పూర్వం వరంగల్లు ప్రాంతాన్ని కొరవి రాష్ట్రం అని వ్యవహరించేవారు. కవి పూర్వులు అక్కడివారు కావచ్చును. (ఆరుద్ర-4)

## కొలని గణపతిదేవుడు

కాలం : క్రీ. శ. 15 శతాబ్ది పూర్వార్థం.
రచన : శివయోగసారము.
కృతిభర్త: ఈడూరి నూకనారాధ్యుడు.

ఈ కవి రెండో ప్రౌఢ దేవరాయల కాలం వాడు కావచ్చు. కాకతి రుద్రమ అల్లుడైన ఇందులూరి అన్నయ మంత్రి వంశంలోనివాడట. ఇతని తండ్రి ఆదిమూర్తి. తాత గణపతి.

విశిష్టత : ఈ కవి ప్రౌఢమయిన కవిత్వం చెప్పాడు. శివప్రతిపాదకమైన ఆధ్యాత్మిక విషయం ఇతివృత్తంగా రచన చేశాడు. శివయోగసారంలో పూర్వోత్తర భాగాలున్నాయి. (క. త-5)

## కొలని రుద్రదేవుడు

కాలం : క్రీ.శ. 13 వ శతాబ్దం.
రచన : రాజరుద్రీయమ్ (సం).
వ్యాకరణగ్రంథం. (ప్రా. ద. భా. చ; న. రా. అ)

## కొలిపాక ఎర్రయామాత్యుడు

కాలం : క్రీ.శ. 1530 ప్రాంతం.
స్థలం : కంభం మెట్టు (నైజాం మండలం).

సాహిత్యప్రీతి గలవాడు. కృతిపతి. హరిభట్టు రచించిన వరాహ పురాణాన్ని అంకితం పొందాడు. ఈయన కంభంమెట్టు గ్రామానికి కరణంగా ఉండేవాడట.
(వా. చ-56)

**కొలిపాక మాహాత్మ్యము**

రచనాకాలం : క్రీ.శ. 1823 ప్రాంతం.
కర్త : చిత్తారు గంగాధర కవి.
ద్విపద కావ్యం. (క. స 53)

**కొల్లాపురము**

మహబూబ్ నగర మండలంలో ఉన్న పట్టణం. జటప్రోలు సంస్థానానికి రాజధాని. సుమారు 150 సంవత్సరాల క్రితం జటప్రోలునుండి రాజధాని ఈ కొల్లాపురానికి మార్చబడింది.

వివరాలకు— చూ. జటప్రోలు. (కేశవపంతుల-సం. సా.)

**కొసనయ సెట్టి (కొణిదెన) శాసనము**

కాలం : క్రీ. శ. 1151.
శాసన ప్రదాత : కొసనయసెట్టి.
ప్రస్తావిత స్థలం : గుంటూరు జిల్లా- చిలకలూరు పేట తాలూకా- కొణిదెన గ్రామం.

శాసన విషయం : కొసనయ సెట్టి వాసయసెట్టికి - దండ్యమకు పుత్రుడనీ, కొట్టియదొనె (కొణిదెన)లో చెరువు త్రవ్వించి, శివునికి గుడి కట్టించాడనీ, మాన్యులకు, గుడిసానులకు, గుడి అర్చనకు కూడా దానాలు ఇచ్చాడనీ దీనివల్ల తెలుస్తున్నది. సోమేశ్వరునకు అఖండదీపం నిలిపినట్లు, పేరు చెక్కిన స్తంభాన్ని శివునికి నిలిపినట్లు ఈ శాసనం చెబుతున్నది. దీనిలో ఒక సీస పద్యం, రెండు కంద పద్యాలు ఉన్నాయి.
(తె. క. చ-257)

**కోటకొండ-కపట్రాల భాగవతులు**

భాగవత కళను ప్రచారం చేయాలనే తలంపుతో క్రీ.శ. 1700-1750 ప్రాంతంలో బనగానపల్లె నవాబు కూచిపూడి నుంచి కొందరు కళావేత్తల కుటుంబాలను ఆహ్వానించి, కోటకొండ-కపట్రాలవద్ద వారికి భూములిచ్చి, కర్నూలు జిల్లాలో భాగవత కళాప్రచారాన్ని ప్రోత్సహించాడట. కూచిపూడి నుంచి వెళ్ళినవారిలో చల్లావారు ప్రసిద్ధులు. వీరు పారిజాతాపహరణాన్ని పారంపర్యంగా ప్రదర్శించేవారు. కర్నూలు నవాబు కోటకొండ భాగవతులకు 200 ఎకరాల భూమిని సర్వహక్కులతో ఇచ్చారట.

భరతనాట్య సంప్రదాయ ప్రవర్తకులలో వీరు కూచిపూడి వారికంటె ప్రాచీనులు. వీరిని పోతమూరి భాగవతులు అని వ్యవహరించేవారు. వీరు అహోబిల నృసింహస్వామి సన్నిధిలో నిత్యం నాట్యసేవ చేసేవారట. ప్రసిద్ధమైన 'శ్రీవెలయపాల వారిధి పవ్వళించ జో, జో' అన్న జోలపాట వీరిదే. వీరు గీత నాట్యాలలో ప్రతిభా

వంతులు. క్రీ శ. 1280 ప్రాంతలో వీరు ప్రత్యేక సంప్రదాయం నెలకొల్పి ఉంటారని పండితులంటున్నారు. (నా. ర. చ-166)

**కోట కోటీశము**

చూ. రాళ్ళబండి పట్టాభిరామకవి.

ఈయన గొప్పదాత. ఈ విషయాన్ని భట్టుకవియైన పట్టాభిరామకవి చాటు పద్యంలో చెప్పాడు. (చా. ప. ర)

**కోట ధూర్జటి కవి**

కాలం : తెలియదు.

చాటుకవి. 'కోటాంబ'ను వేడుకొంటూ చెప్పిన పద్యం ఒకటి లభించింది. (చా. ప. ర)

**కోటమరాజు నాగయ**

కాలం : క్రీ.శ. 18 వ శతాబ్దం.

రచన : అధ్యాత్మ రామాయణము.

భాస్కర మంత్రి, చాయమ్మల పుత్రుడు. ఇతని రచన అంత ప్రశస్తం కాక పోయినా నిర్దుష్టంగా, రమణీయంగా ఉంటుంది. ఇతని రామాయణంలో కాండ విభాగం ఉంది. (క. స. 107)

**కోట ముమ్మడి దేవుని ఇప్పటం శాసనము**

కాలం : క్రీ. శ. 1212.

శాసన ప్రదాత : కోటముమ్మడి దేవుడు.

శాసన ప్రదేశం : గుంటూరు జిల్లా-మంగళగిరితాలూకా - ఇప్పటం గ్రామం.

శాసన విషయం : కోటముమ్మడి దేవుడు గండ భూపతి సుతుడు. ఈయన బ్రాహ్మణులకు కొంత భూమిని దానం చేసినట్లు ఈ శాసనం వల్ల తెలుస్తున్నది. ఇప్పటం గ్రామంలో వేంచేసియున్న మల్లేశ్వరస్వామి ఆలయానికి ఎదుటి భాగంలో ఉన్న ఒక రాతి మీద ఈ శాసనం చెక్కి ఉంది. దీనిలో ఒక సీస పద్యముంది. (తె.క.చ-315 ఎ)

**కోట రామచంద్రపురము**

గోదావరి మండలంలోని ప్రాచీన సంస్థానాలలో ఒకటి. "కాకర్లపూడి" వారు దీని పాలకులు. అచ్యుత రామరాజు, రామచంద్రరాజు అనే సోదరులు వీరి పూర్వులు కాకర్లపూడి జగన్నాథరాజు శాశ్వతకర నిర్ణయం నాటి జమీందారు.

కాకర్లపూడి వారు సాహిత్యాభిలాషులు. కాకర్లపూడి వేంకటకృష్ణ రాజు ఆస్థానంలో శిష్టుకృష్ణమూర్తిశాస్త్రి ఆస్థాన విద్వాంసులుగా ఉన్నారు. కాకర్లపూడి రామచంద్రరాజు, జగన్నాథరాజు సోదరులు కూడా కృష్ణమూర్తి శాస్త్రి గారిని ఆస్థాన కవులుగా పోషించారు. వీరి ఆస్థానంలోని పిడపర్తి శివరామ సిద్ధాంతి, కృష్ణ సిద్ధాంతి మొ॥ వారు సుప్రసిద్ధులు. పండిత కవులైన తిరుపతి వేంకట కవులు, రామచంద్రరాజు

కాలంలో ఈ సంస్థానాన్ని దర్శించి గౌరవాదరాలు పొందారు. నెమలూరి వేంకట శాస్త్రి కాకర్లపూడి అచ్యుత రామరాజు ముఖ్య ఆశ్రితుడు. (అం. సం. సా_529)

## కోట శివరామ కవి

కాలం : క్రీ. శ 16 శతాబ్ది
స్థలం : కాళహస్తి ప్రాంతం.
రచన : సానందోపాఖ్యానము (చంపువు)
గురువు : ధూర్జటి కవి.

కోట బాలనయ్య పుత్రుడు

శృంగార రసానికి ప్రాముఖ్య మిచ్చి ప్రబంధాలు నిర్మించే కాలంలో భయానక బీభత్స రసాలకు ప్రాముఖ్య మిచ్చి, కరుణరసాన్ని దృష్టిలో పెట్టుకొని కావ్యం వ్రాసిన కవి. ఇతని గురువైన ధూర్జటి అష్టదిగ్గజాలలోని వాడు కావచ్చు. ఈ కవి కాశీవర ప్రసాద సాహిత్య వైభవుడు సానందోపాఖ్యానం అద్భుత లోకోత్తరమైన ఇతిహాసమట. ఇతని కవిత్వం మృదువుగా ఉంటుంది. ఇతని రచనకూ భద్రకవి లింగన సానంద చరిత్రకూ పోలికలు కనిపిస్తున్నాయి. కాలంలో లింగకవే ముందటి వాడు. (ఆరుద్ర 9_249)

## కోట సింగరాజు

స్థలం : పట్టిస గ్రామం.

ముప్పది ఇద్దరు మంత్రులను తెలిపే సీసమాలిక ఈయనను పేర్కొన్నది. ఇతని దానధర్మాలను తెలియచేసే చాటువులు దొరుకుతున్నాయి. (చా. ప. ర.)

## కోటి తిరుమల నాయకుడు

కాలం : క్రీ.శ. 18 వ శతాబ్దం.
స్థలం : పుదుకోట.

పుదుకోట ప్రభువు సాహిత్య పోషకుడు. కృతిపతి. పుదుకోట పాలకుడైన రాయరఘునాథుని తండ్రి ఈ వంశీయులు తొండమాన్ రాజులుగా ప్రసిద్ధులు. నుదురుపాటి సీతారామయ్య ఇతని మీద తిరుమల రాయోదాహరణ కావ్యం చెప్పాడు. ఇతని మీద చాల చాటు పద్యాలున్నాయి. (చా. ప. ర.)

## కోటి రఘునాథరాయలు

నామాంతరం : రాయరఘునాథరాజు.
కాలం : క్రీ. శ. 1767_1789 వరకుపుదుకోటను పాలించాడు.
రచన : పార్వతీ పరిణయము.

ఈయన గొప్ప పండితుడు. కవి. విజయ రఘునాథ తొండమాన్ పుత్రుడు. ఈయనను నుతిస్తూ చాలా చాటు పద్యాలు లభించాయి. సూర్యశేఖర కవి, మన్నారు కవి మొదలయిన వారు చాలా చాటువులు ఈయన మీద చెప్పారు. నుదురుపాటి వేంకనార్యుడు ఈయన ఆస్థాన కవి. (చా. ప. ర.)

**కోటి రాజగోపాలరాయలు**

కాలం : తెలియదు.

స్థలం : పుదుక్కోట.

ఈయన పుదుక్కోట ప్రభువు కావచ్చు. ఈయనను కీర్తిస్తూ ఎవరో చాటు కవి అయిదు కంద పద్యాలు చెప్పాడు. కవికి సంబంధించిన వివరాలు తెలియవు. (చా. ప. ర.)

**కోటి వేంకనార్యుడు**

కాలం : క్రీ.శ 18 శతాబ్ది.

స్థలం : పుదుక్కోట

చూ. నుదురుపాటి వెంకన్న. (శ సా వి.)

**కోటీశ్వర కవి**

కాలం : క్రీ.శ. 17వ శతాబ్దం- చివరి పాదం.

రచన : భోజకన్యాపరిణయము.

చక్రప్ప మంగమ్మల కుమారుడు. ఇతని రచన ప్రౌఢంగా రసవంతంగా ఉంటుంది. కాని వ్యాకరణ విరుద్ధ ప్రయోగాలున్నవి. (క. చ-3-186)

**కొట్ర వేంకటేశ్వర కవి**

"కొట్రబాలకవి"గా ప్రసిద్ధుడు.

వివరాలకు చూ. కొట్ర బాలకవి.

**కోడి సుబ్బారాయుడు**

ఈయన దానశీలియని దొరికిన ఒక చాటు పద్యంవల్ల తెలుస్తుంది చాటు పద్య కర్త ఎవరో తెలియదు. (చా. ప. ర.)

**కోడి పందెములు**

కాలం : కాకతీయుల కాలం (13, 14 శతాబ్దాలు).

ఇది చాలా ప్రాచీనమైన ఆట. కోడి పందేలకు తెలుగులో శాస్త్రాలున్నాయి. అమరుడు కాళ్ళకు కత్తులు కట్టే పద్ధతిని "చరణాయుధ" యుద్ధమని చెప్పాడు దండి దశకుమార చరిత్రలో చెప్పిన కోడి పందేల విషయాన్ని కేతన తెలుగు దశకుమార చరిత్రలో విస్తృతంగా వర్ణించాడు. అప్పటికే ఈ కోడి పందేలు ప్రాచుర్యంలో ఉన్నాయని చెప్పవచ్చు క్రీడాభిరామంలో ఈ పందేలను చాలా విపులంగాను, హాస్యజనకంగాను మనోరంజకంగాను కవి వర్ణించాడు.

పలనాటి యుద్ధానికి "కోడిపోరు" ఒక ముఖ్య కారణం తెలుగు దేశంలో సంక్రాంతి పండుగ రోజుల్లో ఈ కోడి పందేలను విశేషంగా నిర్వహిస్తారు

(ఆ. సాం. చ-93-94)

**కోడివారు**

పక్షి నామ సూచకంగా ఉన్న ఇంటిపేరు. పక్షి నామాలతో తెలుగు దేశంలో కొన్ని కుటుంబాలవారి ఇళ్ళపేర్లున్నాయి. పిచికలవారు, చిలకవారు ఇలాంటివి.
(భారతి-మా-45-229)

**కోడూరి వల్లభసూరి**

కాలం : క్రీ. శ. 16వ శతాబ్దం.
రచనలు : పాటిగణితము (అసమగ్రం).
బిరుదు : కవి దేవేంద్రుడు.
గురువు : ప్రబోధానందస్వామి.

రామపండితుని పుత్రుడు ఎర్రయామాత్యుని పౌత్రుడు. బొమ్మలాట కాశయ ప్రేరణతో లీలావతీ గణితంలోని ఒక భాగాన్ని తెలుగులో వ్రాశాడు. బొమ్మలాట కాశయ శ్రీకృష్ణ దేవరాయలను అచ్యుత దేవరాయలను కొలిచినవాడట.
(క. స. 216)

**కోడూరి వేంకటాచల కవి**

కాలం : క్రీ. శ. 1650-1700 ప్రాంతం.
స్థలం : మైసూరులోని కోడూరు.
రచన : శివరహస్య ఖండము (శంకర సంహిత).
గురువు : యడవల్లి వెంకటకవి.
బిరుదు : బాలసరస్వతి.

సుగుటూరి వంశీయుడైన భైరవమూరి ముళువాగళ రాజు ప్రోత్సాహంతో రచనలు చేశాడు. లక్ష్మమ్మ, శంకరామాత్యుల పుత్రుడు. ప్రౌఢంగా కవిత్వం చెప్పగల దిట్ట.
(ద. దే. వా-491)

**కోతి ఆట పదము**

ఇది యక్షగానాలలో ప్రయుక్తం. కోతి ఆడే చైతక్కులకు తగినట్లు లయాత్మకంగా ఉండటమే దీని లక్షణం. చౌదరి రామదాసు రుక్మిణీ విలాస యక్షగానంలో సింగడు కోతిని ఆడించే సందర్భంలో ఇలాంటి పదమొకటి ఉంది. (య. వా. చ-321)

**కోదండ రామరాజు**

కాలం : క్రీ శ. 17 వ శతాబ్దం ప్రథమ భాగం.

ఇతడు అరవీటి అళియరామరాయల పౌత్రుని పౌత్రుడు.

"అందుగుల వెంకయ్య" కవి రచించిన రామరాజీయమనే నామాంతరం గల 'నరపతివిజయము' అనే గ్రంథాన్ని ఇతడు అంకితంగా పొందాడు. ఇది చారిత్రక గ్రంథం.
(ఆం. సం. సా)

## కోదండ రామశతకము

కర్త : పూండ్ల చెంగయ్య.

సీసపద్య శతకం. "శయన పురిధామ దనుజ సంచయ విరామ చండకర కోటి ధామ, కోదండరామ" అనే మకుటంతో ఉంది. (శ క. చ. 801)

## కోదండరాముని ముసునూరి శాసనము

కాలం : క్రీ. శ. 1230-31 ప్రాంతం.

శాసన ప్రదాత : కోదండ రాముడు.

ప్రస్తావిత స్థలం : మురణపురం.

శాసన విషయం : క్రీ. శ 1230-3 ప్రాంతంలో తిరుకాళత్తి తిక్కరాజు (మనుమసిద్ధి తండ్రి) అనే రాజు రాజ్యం చేసేటప్పుడు ఈ దానశాసనం వెలిపినట్లు తెలుస్తుంది. కోదండ రాముడనే వ్యక్తి మురణపురంలో వేంచేసియున్న గండగోపాల స్వామికి కొంతభూమిని దానంచేసి సప్తస తానాలలో కొట్నెటిని విలిపి స్వామికి దీపదానం చేశాడట. దీనిలో ఒక సీసపద్యం, చివర కొంత గద్య ఉన్నాయి. (తె. క. చ-320)

## కోన తిమ్మరాజు

కాలం : క్రీ. శ. 1600 ప్రాంతం.

స్థలం : రాజమహేంద్రవరం.

రాజమహేంద్రవర ప్రభువు. సాహిత్య పోషకుడు. వేంకటాచార్యులు అనే కవిని ప్రోత్సహించి 'ముక్తిచింతామణి' ప్రబంధం వ్రాయించాడు. (క. న-258)

## కోన నారాయణ

నామాంతరం : వెల్లుట్ల నారాయణ.

కాలం : క్రీ. శ. 17వ శతాబ్దం.

స్థలం : తెలంగాణా ప్రాంతం-బమ్మెర గ్రామం.

రచన : వజ్రాభ్యుదయము (అసమగ్రం).

గురువు : బోయనపల్లి నరసింహం.

ఇతని ఇంటి పేరును గూర్చి భేదాభిప్రాయాలున్నాయి. కవికి దేవుడే కలలో కనబడి కావ్య రచనకు ప్రోత్సహించాడట.

సంస్కృత పాండిత్య విశేషంతో హృద్యంగా రచన చేశాడని పరిశీలకులు చెప్తున్నారు. ఇతడు బమ్మెర పోతనామాత్యుని వంశంలోనివాడని కొందరు భావిస్తున్నారు. (క త. 12-256, ఆరుద్ర-11-263)

## కోన మంత్రి

కాలం : క్రీ. శ. 16వ శతాబ్దం.

స్థలం : నెల్లూరు మండలం.

సాహిత్య ప్రియుడు. లింగమకుంట రామకవిని ప్రోత్సహించి, శ్రీ వేంక టేశ్వరునికి అంకితంగా "ఆనంద కానన మాహాత్మ్యం" రచింపజేశాడు. (క. స.-185)

## కోనసీమ

గౌతమీ వసిష్ఠానదుల మధ్య ప్రదేశం.

ఇది ప్రస్తుతం తూర్పు గోదావరి జిల్లాలోని అమలాపురం, రాజోలు, కొత్త పేట తాలూకాలున్న ప్రదేశం. దీనికి కోనదేశమనివ్యవహారనామమున్నది.కొరవి గోపరాజు దీన్ని "గోణమండలమ"ని పేర్కొన్నాడు. నన్నయభట్టు నందంపూడి శాసనంలో 'రెండే రుల నడిమి విషయము' అని కోనసీమను గూర్చి చెప్పాడు. అజ్జరపు పేరయలింగం "ఒడయనంబివిలాసం"లో ఈ కోనసీమ వర్ణనం ఉంది.

(సం. ఆ. వి. కో-5; రె. రా. చ-2-46)

## కోనేటి దీక్షిత చంద్రుడు

కాలం : క్రీ. శ. 17వ శతాబ్దం.
స్థలం : తంజావూరు.
రచన : విజయరాఘవ కల్యాణము.
గురువు : శతక్రతు శ్రీనివాస తాతాచార్యులు.

రామానుజాచార్యుని తనయుడు. విజయరాఘవనాయకుని (1633-73) కాలంలో ఉండేవాడు. అతనినుండి అగ్రహారాలు, బిరుద వాద్యాలు, ఆభరణాంబరాలు పొందిన పండితుడు. సంగీత సాహిత్య విద్యాధురీణుడు. (ద. దే. వా-123)

## కోరుమిల్లి శాసనమ్ (సం)

కాలం : క్రీ. శ. 1022.
స్థలం : తూర్పు గోదావరి జిల్లా-రామచంద్రపురం తాలూకా-కోరుమిల్లి-
శాసనకర్త : వేతనభట్టు.
శాసనం వేయించినది : రాజరాజ నరేంద్రుడు.

శాసన విషయం : రాజరాజనరేంద్రుడు పట్టాభిషిక్తుడైనప్పుడు చంద్రగ్రహణ కాలంలో చీడమార్యుడనే బ్రాహ్మణునికి కోరుమిల్లి గ్రామాన్ని అగ్రహారంగా చేసి, దాన మిచ్చిన విషయం దీనిలో ఉంది.

దీనిలో సంస్కృత శ్లోకాలు, సంస్కృత గద్య ఉన్నాయి. ఆ తరవాత సంస్కృత ఛందస్సుకు విలక్షణమైన దేశీయ ఛందస్సుతో సంస్కృత భాషలో ఒకఛందోభేదముంది.

(తె. శ. చ.-109,110)

## కోలంక-వీరవరము

పిఠాపురం సంస్థానంలోని గొల్లప్రోలు, దాని పరిసర గ్రామాలతో కూడినది ఈ "కోలంక" ఎస్టేటు. "వీరవరము" ఎస్టేటు పెద్దాపురం సంస్థానం వారి వద్ద నుండి క్రీ. శ. 1844 లో పిఠాపురం వారు ఖరీదు చేశారు.

పిఠాపురం సంస్థానాన్ని క్రీ. శ. 1793-1823 మధ్య కాలంలో పాలించిన రావు వేంకటనీలాద్రి రాయణికి ఇద్దరు కుమారులున్నారు. తండ్రి అనంతరం జ్యేష్ఠుడైన వేంకట సూర్యనారాయణులు 1844 లో పాలనను స్వీకరించారు. చిన్నవారైన వేంకట మహీపతిరాయలు కుటుంబ పోషణ నిమిత్తం అన్నగారి నుండి గొల్లప్రోలుపరగణాల లోని తొమ్మిది గ్రామాలను సంపాదించాడు. ఈ గ్రామాలే "కోలంక ముఠా" అనేపేర ప్రత్యేక "జమీ"గా రూపొందాయి. వేంకట మహీపతిరాయల తరువాత వారి జ్యేష్ఠ కుమారుడైన సూర్యరాయలు కోలంక పాలకులయ్యారు. వేంకటమహీపతిరాయల తల్లి రాణి భావయమ్మారావుగారు పిఠాపురం నుండి "వీరవరం" ఎస్టేటును కూడా పౌత్రుడైన సూర్యరాయలకు ఇచ్చారు. వీరే రాజా వేంకట సూర్యరాయని పేర "కోలంక-వీరవరం" సంస్థానాన్ని పాలించారు. వీరు నిస్సంతులైనందున, కుమార మహీపతిరావును దత్తు తీసుకొన్నారు. అతని మరణానంతరం అతని భార్య రాణి రామాయమ్మారావు బహద్దరు క్రీ. శ. 1932 లో వెంకటగిరి రాజా వారి నాలుగవ కుమారుడు ప్రద్యుమ్న కృష్ణ మహీపతిని దత్తుతీ కొన్నారు.

కోలంక ఎస్టేటు ప్రథమ పాలకుడైన వేంకట మహీపతిరాయణి సతీమణి అయిన లక్ష్మీనరసయ్యమ్మ గారు కవి పండిత పోషకులు. చర్ల బ్రహ్మయ్యశాస్త్రి గారిచే ధవళేశ్వరంలో సంస్కృత పాఠశాలను స్థాపింపచేసి, ఉచిత భోజనాదులకు భూవసతులు కల్పించారు.

రాజా వేంకట సూర్యరాయణి సతీమణి చెల్లయ్యమ్మారావుకు కొత్తపల్లి లచ్చయ్య కవి ఆశ్రితుడు. చెల్లయ్యమ్మారావు శతకం, సూర్యశతకం మొదలగునవి ఇతని రచనలు. చెల్లయ్యమ్మారావు బహద్దరు ఆంధ్రప్రచారిణీ గ్రంథమాల మొదలైన సాహితీ గ్రంథ ప్రకాశక సంస్థలకు రాజ పోషకులుగా ఉన్నారు. కూచిమంచి సుబ్బారావు కూడా వీరి ఆస్థానంలోనే ఉండేవారు. జగ్గమాంబ జీవిత చరిత్రము, రమణ యాంబా జీవిత చరిత్ర మొ॥ వీరి రచనలు. (ఆం. సం. సా-110)

**కోలచల కుమారస్వామి సోమయాజి**

కాలం : క్రీ. శ. 15 శతాబ్ది.

రచన : రత్నాపణ వ్యాఖ్య.

ఈయన ప్రసిద్ధ సంస్కృత కావ్యవ్యాఖ్యాత కోలచల మల్లినాథసూరి కుమారుడు. తన అన్న పెద్దయార్యుడు చాలా గ్రంథాలు వ్రాశాడని 'రత్నాపణ' వ్యాఖ్యలో చెప్పాడు. కాని అవి దొరకలేదు. (తె. వి. స-4)

**కోలచల మల్లినాథ సూరి.**

కాలం : క్రీ. శ. 15 శతాబ్ది.

స్థలం : తెలంగాణాలోని మెదక్ మండలంలోని "కొలచెలమ" అని కొందరు, తూర్పుగోదావరిజిల్లా "రాజమహేంద్రవరమని" కొందరు అంటారు.

బిరుదులు : పదవాక్య పారావార పారీణుడు, మహామహోపాధ్యాయుడు.

రచనలు : 1. సంజీవనీ వ్యాఖ్య (సం) 2. ఘంటాపథము వ్యాఖ్య (సం)
3. సర్వంకష వ్యాఖ్య (సం) 4. జీవాతు వ్యాఖ్య (సం)
5. సర్వపథీన వ్యాఖ్య (సం) 6. తరళము వ్యాఖ్య (సం)
7. సిద్ధాంజనము వ్యాఖ్య (సం) 8. పరిమళము వాఖ్య (సం)
9. నిష్కంటిక వ్యాఖ్య (సం) 10. రఘువీరచరితమ్(కావ్యం)

ఈయనను గురించి పండితులలో భిన్నాభి ప్రాయాలున్నాయి. పెద్దిభట్టు ఈయనకు తమ్ముడు. మల్లినాథుడు మందబుద్ధికాగా, పెద్దిభట్టు కుశాగ్రబుద్ధి అట. ఒక యోగి తన్ను చిరకాలం సేవించిన మల్లినాథునికి సారస్వత మంత్రముపదేశించే సమయంలో అక్కడ పెద్దిభట్టు ఉన్నందువల్ల-ఆ మంత్రాన్ని పెద్దిభట్టుకే ఉపదేశించి దీని ఫలాన్ని అన్నయైన మల్లినాథునికే చెందేటట్లు వరమిచ్చాడట. అందువల్ల పెద్దిభట్టుతాను వ్రాసిన గ్రంథాల నన్నింటిని అన్న పేరనే వ్రాశాడనే ఒక ప్రబలమైన ఐతిహ్యం ప్రచారంలో ఉంది. పెద్దిభట్టు గ్రంథాలు దొరకలేదు.

మల్లినాథసూరి కుమారుడు కుమారస్వామి తన తండ్రిని- తన "ప్రతాప రుద్రీయ రత్నాపణ వ్యాఖ్య" లో నుతించాడు.

మల్లినాథుడు చాలా సంస్కృత గ్రంథాలకు చక్కని వ్యాఖ్యలు వ్రాశాడు. ఈయనకు ముందు చాలా వ్యాఖ్యలున్నప్పటికీ, మల్లినాథుడు తృప్తిపడక ఈ వ్యాఖ్యలు వ్రాశాడు. వ్యాఖ్యలు వచ్చిన తరవాతనే సంస్కృత పంచ కావ్యాలకు విశేషమైన ప్రచారం వచ్చిందనే ప్రతీతి ఉంది. భారత దేశంలోని సంస్కృత కావ్య వాఖ్యాతలలో ఈయనకున్న పేరు మరొకరికి లేదు. (తె. వి. స-4)

## కోలాట నృత్యము

జానపద నృత్య విశేషం. పాల్కురికి సోమన్న కోలాట నృత్యాన్ని "కోలాట గొడియ" అని వర్ణించాడు. సామర్లకోటలోని చాళుక్య భీమేశ్వరాలయ శిల్పంలో ఈ కోలాట నృత్యం చిత్రితం. విజయనగర శిథిల శిల్పాలలోను, శ్రీశైలదేవాలయ ప్రాకారపు గోడలపైన కూడా కోలాటం వేసే నర్తకీమణుల శిల్పాలున్నాయి.

తెలుగుదేశపు జానపద నృత్యాలలో కోలాట నృత్యాన్ని స్త్రీలు, పురుషులు, పిల్లలుకూడా చేస్తూ ఉంటారు. భక్తి భావంతో దేవుని స్తంభాన్ని పట్టుకొని ఇంటింటికి తిరిగి, ప్రతి ఇంటిముందూ కోలాట ప్రదర్శన చేస్తారు. వీటిని పెద్ద తిరునాళ్ళ సమయాలలోను, దసరా ఉత్సవాలలోను బహిరంగంగా వీధులలోను ప్రదర్శించటం కద్దు. నోటితో పాట, కాళ్ళతో నృత్యం, చేతులలోని చిరతలతో తాళం వేస్తూ ఈ నృత్యాన్ని జానపదులు మనోహరంగా ప్రదర్శిస్తారు. తెలుగు జానపద సాహిత్యంలో కోలాట నృత్యం పాటలు ఎన్నో ఉన్నాయి. ఇందులో జడకోపు, చుట్టు కోపు, చక్రంకోపు అని చాలా రకాలున్నాయి. (చూ. హల్లీసక నృత్యం). (నా. ర-చ-296-300)

**కోలా శేషాచల కవి**

కాలం : క్రీ. శ. 1800 ప్రాంతం.
స్థలం : చెన్నపట్టణం- చింత్రాదిపేట.
రచన : నీలగిరి యాత్ర (వచనం).

సైనిక శాఖాధ్యక్షుని కార్యాలయంలో గుమాస్తాగా ఉండేవాడు. ఉదకమండలంలో తన కార్యస్థానం ఉన్నప్పుడు, 1846 మే 12వ తేదీ నుండి 1847 జనవరి 13వ తేదీ వరకు జరిగిన వృత్తాంతాన్ని నీలగిరి యాత్ర పేరుతో గ్రంథస్థం చేశాడు.
(ద. దే. వా-406)

**కోలాహలుడు**

రామరాజ భూషణుని వసుచరిత్రలోని పాత్ర. వసుచరిత్ర ఆంధ్ర పంచ కావ్యాలలో ఒకటి.

కోలాహలుడు హిమవంతుని కుమారుడు (పర్వతము). శుక్తిమతి అనే పేరుగల (నదిని) స్త్రీని కామించి ఆమె మార్గాన్ని నిరోధించాడు. వసురాజు ఇతన్ని కాలి గోటితో దూరంగా విసిరివేశాడట. ఆ వెనుక ఇతడు వసురాజు పాదములచెంత పడియుండి అతనికి క్రీడా శైలంగా కొనసాగినాడు శుక్తిమతీ కోలాహలుల పాత్రలను కొన్ని ప్రకృతులకు ప్రతీకగా కవి చిత్రించాడు.

శుక్తిమతియందు ఇతనికి కలిగిన కుమార్తె గిరిక. కుమారుడు వసుపదుడు. ఈ గిరిక వసురాజుకు భార్య అయింది. ఆ వివాహ సందర్భంలో కోలాహలునికి ఇంద్రుడు ఒక పట్టణాన్ని ఇచ్చాడట ఈ కథకు మూలం మహాభారతంలో ఉంది.

**కోవెల తిరువేంగడదాసు**

కాలం : క్రీ. శ. 1800-1850 ప్రాంతం.
స్థలం : మంగళగిరి కావచ్చు.
రచన : తిరుమంగయాళ్వారు చరిత్ర.

ఈ కవి కోవెల వేంకటాచార్యుని పౌత్రుడు నరసింహాచార్యుని పుత్రుడు. శ్రీరంగ తిరుమల శ్రీభట్టరార్యుని శిష్యుడు. (య. వా. చ. 131)

**కోవెల రాఘవదాసు**

కాలం : క్రీ. శ. 1800-1850.
స్వస్థలం : మంగళగిరి కావచ్చు.
రచన : ప్రణయకలహ కలాపము.

ఈ కవి తలిదండ్రులు రంగమ, తిరువేంగడాచార్యులు. గురువు శ్రీరంగ రాజభట్టరు.
(య. వా. చ. 133)

**కోవెల రాఘవాచార్యులు**

రచన : ఏకాంతసేవా ప్రబంధము.

ఇతడు చల్లపల్లి సంస్థానాశ్రితుడైన "ముక్తేవి పెరుమాళ్ళయ్య" కవికి దౌహిత్రుడు. శ్రీకాకుళాంధ్ర విష్ణువు మీద పెద ముక్తేవి లక్ష్మీ నారాయణస్వామి మీద అనేక గేయాలను వ్రాసినట్లు తెలుస్తున్నది. (అం. సం. సా. 158)

**కోశము**

అన్యోన్యాపేక్ష లేని శ్లోక సమూహాన్ని కోశమంటారు. దీనిని నిఘంటువు అని కూడా అంటారు. (తె. వి స-6.)

**కోసూరు వారు**

"ఊరు" శబ్దం చివరలో ఉంది, గ్రామ నామంతో ఉన్న ఇంటిపేరు. ఈ "ఊరు" శబ్దం ఇంటి పేరులో చివరలో ఉండి చాలా పేర్లున్నాయి. గూనూరు, పూనూరు ఇలాంటివి. (భారతి-మార్చి 45-288)

**కోడూరి శోభనాద్రిదాసు**

నామాంతరం : దేవవరపు శోభనాద్రి.

కాలం : 17వ శతాబ్దం.

స్థలం : కొడూరు.

రచన : బాలక్రీడా విహారము.

కొడూరు గ్రామ నివాసం వలన ఇతడు కొడూరి శోభనాద్రిగా వ్యవహరింపబడ్డాడని విమర్శకులు అంటున్నారు. కొడూరులోని సంతాన గోపాలునికి తన కృతిని అంకితం ఇచ్చాడు. (అరుద్ర-11-269) (య. గా. చ-II-30)

**కౌబేరి నాటకము**

రచనాకాలం : క్రీ. శ. 1700 ప్రాంతం.

కర్త : కంఠీరవరాజు.

ఇది అష్ట దిక్పాలక విలాసనాటకంలోని భాగం. ఆయా దేవతల ప్రశస్తిని వెల్లడించే రచన. యక్షగానమే అయినా సంగీత నృత్య రూపకంవలె ఉంటుంది.

**కౌముదీ వ్యాఖ్యానమ్ (సం)**

కర్త : చూ. సుగుటూరి ముమ్మడి తమ్మభూపతి.

సంస్కృత వ్యాకరణమైన సిద్ధాంత కౌముదికి ఇది వ్యాఖ్య.

(అం. సం. సా-261)

**కౌలూరి ఆంజనేయ కవి**

కాలం : క్రీ శ. 16వ శతాబ్దికి అనంతరం.

కృతులు : సుకవికర్ణామృతం అనే లక్షణ గ్రంథం.

ఇతడు లింగమగుంట తిమ్మన బాలబోధ ఛందస్సు వ్రాసినట్లు చెప్పాడు.

(కవిజనాశ్రయం పీఠిక-వావిళ్ళ)

కౌసలేయచరిత్రము

కర్త : లయగ్రాహి గరుడాచల కవి (చూ).
అంకితం : బోరవెల్లిలోని కేశవ స్వామికి.

అయిదాశ్వాసాలుగల కావ్యం. రామాయణ కథ దీనిలోని ఇతివృత్తం.

బోరవెల్లి సంస్థానపు రాణి గిరియమ్మ ప్రోత్సాహంతో చేయబడ్డ రచన. ప్రారంభంలో బోర్వెల్లి గద్వాల వంశ చరిత్రలు, సీమలు, ఆయాపాలకులొనర్చిన ఘన కార్యాలు, గిరియమ్మ వంశావతార వర్ణనం ఉన్నాయి.

లభించిన తాళపత్ర ప్రతిలో అశ్వాసాంత గద్యలిపి, మిగిలిన దానికన్న విడిగా ఉంది. కొన్ని అశ్వాసాల చివర గద్యం వ్రాయబడక ఖాళీ స్థలం కన్పిస్తుంది. ఇది గ్రంథకర్త వ్రాసిన ప్రతిగాదని, తరువాత వ్రాయబడినదని భావించవచ్చు.

(మ. మూ. 44-50)

కౌసల్య బైకలు

జానపద పౌరాణిక గేయ రచన.

ఇతి వృత్తం రామాయణ కథకు సంబంధించినదే. కాని రచనలో వైశిష్ట్యం కనిపిస్తుంది. బైకలంటే వేవిళ్ళు. కాని, ఏ గ్రంథంలోనూ, కౌసల్య వేవిళ్ళను గూర్చి ఇంత విపులంగా వ్రాయబడలేదు. కవి కేవలం సమాజంలో తాను చూచిన విషయాలను దృష్టిలో ఉంచుకొని, ఆ విశేషాలను ఆనాటి పాత్రలకు అంట గట్టాడు.

చూ: పౌరాణిక గేయములు. (అం. వా. చ.)

కౌసల్యా పరిణయము (అలభ్యం)

రచనా కాలం : క్రీ. శ. 1800 ప్రాంతం.
కర్త : పోడూరి పెదరామామాత్యుడు. (శ. స. 128)

కౌసల్యాపరిణయము

కర్త : చూ. శ్రీపాద వెంకటాచల కవి.

వివరాలు తెలియవు. (ఆం. సం. సా-422)

కౌస్తుభములు

కర్త : చెయ్యూరు చెంగల్వరాయశాస్త్రి.

ఇవి నృత్య సంబంధమైన లఘు కృతులు. (తె. వి. స-4)

క్రాంజ వేంకటాద్రి

కాలం : క్రీ. శ. 16 వ శతాబ్ది.
స్థలం : గుళమూర్తి అగ్రహారం.

మవుతున్నాయి క్రైస్తవమత ప్రచారం కోసం ఆరంభమైన తెలుగు ముద్రణ తెలుగు భాషకెంతో అభ్యుదయాన్ని సాధించి పెట్టింది. (వ. వా-54)

**క్షత్ర ఖేలనమ్ (సం)**

కర్త : సురభి నరసింగరావు (చూ).

గీర్వాణ గ్రంథం. (ఆం. సం. సా.)

**క్షత్ర బంధోపాఖ్యానము**

కర్త : మరింగంటి వేంకట (ప్రథమ) నృసింహాచార్యులు. (తె. వి. స.6)

**క్షమా వింశతి**

కర్త : మరింగంటి వేంకట రాఘవాచార్యులు. (తె. వి. స-6)

**క్షేత్రమాహాత్మ్య రచనలు**

నామాంతరం : స్థలపురాణాలు.

తెలుగులో ఈ సాహిత్యం ఎక్కువగా ఉంది. ప్రబంధం వలె తెలుగులో దీనిని ఒక విశిష్ట ప్రక్రియగా చెప్పవచ్చు. ఇవి చంపూ పద్ధతిలో నడచిన కావ్యాలుగానో, కావ్య-ప్రబంధాలుగానో, ప్రబంధాలుగానో కేవల వచన కృతులుగానో ఉన్నాయి.

విలాసవంతులై, భోగజీవితాన్ని గడిపి, పరమ కిరాతుక చర్యలు చేసిన పాపాత్ములు కూడా ఒక క్షేత్రాన్ని గాని. క్షేత్రస్వామినిగానీ, దర్శించడం వల్లనూ, ఉద్దేశపూర్వకంగా కాకపోయినా, యాథాలాపంగా గాని, మరో ఉద్దేశంతోగానీ, ఆ దైవానికి పూజాదికాలు చేయడం వల్లనూ, దురిత దూరులై పుణ్యలోకాలను చేరటానికి అర్హులవుతారని చెప్పడం, ఈ క్షేత్రమాహాత్మ్యాలలోని సామాన్యాంశం.

తెలుగులో ఎర్రన నృసింహ పురాణం, కాశీఖండ, భీమఖండాలు, పాండురంగ మాహాత్మ్యము, శ్రీకాళహస్తి మాహాత్మ్యము, శ్రీరంగ మాహాత్మ్యము, వేంకటాచల మాహాత్మ్యము, హాలాస్య మాహాత్మ్యము మొ॥ ఇటువంటి స్థలమాహాత్మ్యాలలో కొన్ని గ్రంథాలు ఇవి యక్షగాన రూపంలోనూ, పద్య కావ్యాలుగానూ కూడా ఉన్నాయి.

(తెలుగు వాఙ్మయము)

**క్షేత్రయ్య**

నామాంతరం : మువ్వ వరదయ్య.

కాలం : క్రీ. శ. 17 వ శతాబ్దం.

స్థలం : కృష్ణా జిల్లా-దివి తాలూకాలోని మువ్వగ్రామం.

రచన : పదాలు, కీర్తనలు.

గొప్ప పదకర్త. దక్షిణాదిన మోవపురం, మోపూరు, మువ్వలవారి పల్లె అనే పేర్లతో చాలా గ్రామాలున్నాయి. అందులో క్షేత్రయ్య ఎక్కడివాడో ఇంకా వివాద

గ్రస్తంగానే ఉంది. స్వగ్రామం ఏదైనా అనేక క్షేత్రాలు దర్శించి ఆయా క్షేత్ర దైవతాలపైనా, రాజులపైనా మధురభక్తి సంప్రదాయానికి చెందిన శృంగార కృతులు మొత్తం 4,500 చెప్పాడని తెలుస్తోంది నేడు 400 కూడా లభించడం లేదు. ఇతడు చిన్నతనంలో చదువు సంధ్యలబ్బక దేశ సంచారం చేస్తూ తిరిగాడనీ, ఒక యతి ఉపదేశం వల్ల మధురభక్తి పారీణుడైనాడనీ అంటారు.

మధుర తిరుమలేంద్రుని మీద రెండువేల పదాలు, తంజావూరు విజయరాఘవుని మీద వేయి పదాలు, గోలకొండ పాదుషా మీద 1500 పదాలు చెప్పినట్టు మేరువ పదంలో చెప్పుకున్నాడు. తంజావూరి రఘునాథుని కూడా దర్శించినట్లు చాటువు ఉంది. చెంజిని పాలించిన తుపాకుల వెంకట కృష్ణప్ప నాయకుని ఆశ్రయించి అక్కడ కొంత కాలం ఉన్నాడట.

ఏ క్షేత్రానికి వెళితే ఆ దేవుణ్ని మువ్వగోపాలఅని పిలిచి తన యిష్టదైవంతో అభేదం కల్పించుకొని పదాలు రాశాడు. (ఆరుద్ర-11-76-100)

## క్షేమేంద్రుడు

నామాంతరం : లక్కాభట్టు.
కాలం : క్రీ. శ. 1347 కు పూర్వుడు.
రచనలు : 1. ముద్రామాత్యము (అలభ్యం) 2. శతపక్షి సంవాదము (అలభ్యం) 3. శూద్రకరాజు చరిత్రము (అలభ్యం).

విశిష్టత : క్షేమేంద్రుడన్నది ఇతని బిరుదనామం. అసలు పేరు లక్కాభట్టు అని చెప్తున్నారు.

సంస్కృత కవి క్షేమేంద్రుని వలె పండితుడై ఈ బిరుదునుపొంది ఉంటాడు. "కవి వాగ్బంధనము" లో ఈతని ప్రసక్తి ఉంది. (ఆరుద్ర-2) (క. స)

## ఖండకథ

గద్యకావ్య భేదాలలో ఇది ఒకటి. ఏకదేశవర్ణనముండే ప్రబంధాన్ని ఖండకథ అంటారు. (తె. వి. స-6)

## ఖండ కావ్యము (శ్రవ్యకావ్యభేదం)

నామాంతరాలు : సంఘాతము, సంఘాతకము.

"ఖండకావ్యం భవేత్కావ్యస్యైక దేశానుసారి చ" అని సాహిత్యదర్పణము. ఇది నిబద్ధకావ్యము. మహాకావ్యం కంటె చిన్నది. మహాకావ్యంలోని లక్షణాలన్నీ దీనిలో ఉండవు (ఉదా: మేఘదూతాదులు). ఈ ఖండకావ్యాలు తెలుగులో 19, 20 శతాబ్దాలలోనే ఎక్కువగా వచ్చాయి. (తె. వి. స-6)

## ఖండ కపాలాఖ్యానము

నామాంతరం : మనువంశపురాణము (చూ).
కర్త : పోచిరాజు పీరన్న. (క. చ. 3-162)

**ఖండోజీరాయడు**

కాలం : క్రీ.శ. 17వ శతాబ్దం.
స్థలం : తంజావూరు.

సాహిత్యపోషకుడు, కృతిపతి. తంజావూరును పాలించిన మహారాష్ట్ర రాజుల బంధువర్గంలోనివాడు. దర్పా వేంకటగిరి కవికి ఆశ్రయమిచ్చి రచనలు చేయించాడు. అభినయ దర్పణ కృతిభర్త. (ఆరుద్ర 12-155.)

**ఖండము**

గ్రంథవిభాగం. కొన్ని కావ్యాలను, శాస్త్రగ్రంథాలను ఖండాలుగా విభజించటం వ్యవహారంలో ఉంది.

**ఖడ్గ నృత్యము**

నామాంతరం : వీరభద్ర విన్యాస నృత్యం (చూ).

**ఖడ్గ లక్షణ శిరోమణి**

నామాంతరం : అసిప్రబంధము.
కవి : నవనప్ప (చూ).

పద్యరూప శాస్త్ర గ్రంథం. 77 పద్యాలు, 2 వచనాలు ఉన్నాయి. అసి మొదలుగా ముప్పది రెండాయుధాలు-అంతర్భేదాలు-వాని లక్షణాలు, ముద్రలు, పిడుల వివరాలు చెప్పబడ్డాయి.

మూలం : ఇందులో "అసి" అనే ఖడ్గాన్ని గురించి చెప్పేటప్పుడు ప్రత్యేకంగా "లక్ష్మీనారాయణ సంవాదము" అనే గ్రంథాన్ని అనుసరించినట్లు కవి చెప్పుకొన్నాడు. ఆ గ్రంథం పేరు ప్రచారంలో లేదు. అసి తర్వాత 143 రకాల ఆయుధ భేదాలు కవి చెప్పాడు. ఇందులో అరబ్బీ, పారసీకం మొదలైన ఇతర భాషా పదాలు, సాంకేతిక పదాలు, అనేకం వాడబడ్డాయి. ఈ కృతిలో కవి, తిరుమల చిదంబరుడు, చిగిరి లక్ష్మరాముడు, శెంకిసుమాలు, అషకుశాయి, సుభా భక్తుడు అనే వారిని పేర్కొన్నాడు. వీరంతా ఖడ్గ లక్షణాలు తెలిసినవారు. కవికి శాస్త్ర విషయ సంపాదనంలో తోడ్పడినవారు. ఇలాంటి గ్రంథం, ఇతర భాషలలో లేదు. ఇది ముద్రితమైంది. దీన్ననుసరించిరచింపబడ్డ కత్తుల లక్షణాలను తెలిపే చిన్న వచన కృతి ఒకటి ఆంధ్ర సాహిత్యపరిషత్ పుస్తకభాండాగారంలో ఉంది. (ద. దే వా-438-43)

**గంగకవి**

కాలం : క్రీ.శ. 17వ శతాబ్దం కావచ్చు.
స్థలం : వేదాద్రిపురం.
రచన : శతముఖ రామాయణము (సీతావిజయము) (నాల్గవ ఆశ్వాసం).

లింగకవితో కలిసి శతముఖ రామాయణం వ్రాశాడు. లింగకవి గంగకవి ఇద్దరూ జంట కవులు. నిర్దుష్టంగా రసవంతంగా కవిత చెప్పారు. గంగకవి నృసింహో

పాసకుడు తాను రచించిన నాల్గవ ఆశ్వాసాన్ని భోగనృపాలునికి అంకితం చేశాడు.
(క. స. 211)

## గంగనకవి

కాలం : క్రీ శ 1450 ప్రాంతం.
స్థలం : నైజాం మండలం.
రచన : భాగవత పంచమ స్కంధము.
అంకితం : శ్రీకృష్ణునికి.

బొప్పనామాత్యుని పుత్రుడు. పోతన రచించిన భాగవతంలోని పంచమస్కంధం ఇతడే వ్రాశాడని అంటారు. ఇతడు పోతన, వెలిగందల నారయల తరువాతి కాలంవాడని కొందరి అభిప్రాయం. ఇతని రచనగా ప్రసిద్ధమైన పంచమ స్కంధంలో పోతన రచన కూడా ఉన్నదని పండితులంటున్నారు. ఇతని రచన సరళంగా ఉంటుంది. పోతన భాగవతంలో ఖిలమైన భాగాలను ఇతడు పూరించి ఉండవచ్చును. (క. స. 52)

## గంగరాజు చౌడయ్య

కాలం : క్రీ. శ. 1590 కి పూర్వం.
రచనలు : 1. సాముద్రిక శాస్త్రము (అలభ్యం).
2 నందన చరిత్ర (అలభ్యం)

విశిష్టత : ఈ కవి వ్రాసిన మొదటి గ్రంథంనుంచి రెండు పద్యాలను, రెండో గ్రంథంనుంచి ఏడు పద్యాలను సంకలన కర్తలు ప్రబంధరత్నాకరంలోను ఉదాహరణ పద్యాలలోను ఉదాహరించారు. ఇష్టదేవతా ప్రార్థనలో "ఉద్యన్నవ భావశబ్ద రసతత్వా"న్ని తన కృతికి వాణి ఎప్పుడూ ఇవ్వాలని చౌడయ్య కోరుకున్నాడు.

నందన చరిత్రలోని కథ, వివరాలు తెలియడంలేదు. సాముద్రిక శాస్త్రపు వ్రాతప్రతులు రెండు దొరికాయి. ఒకటి చౌడయ్యదనీ, రెండవది కసవ మంత్రికి అంకితమైన మరొక గ్రంథమనీ పండితాభిప్రాయం. చౌడయ్య నందనచరిత్రలాగే సాముద్రికం కూడా నష్టమైంది. (అరుద్ర-9)

## గంగాగౌరీ విలాసము

కర్త : పెద తెంపరాయడు.
అంకితం : హల్బూరులోని సోమేశ్వర స్వామికి.

యక్షగానం. పూర్తిగా లభించలేదు.

ప్రత్యేకత : తెంపరాయనికి సోమేశ్వరుడు కలలో కనిపించి ఆలయం కట్టించమని చెప్పి, దానికి కావలసిన ధనం దొరికే స్థలం కూడా చెప్పారట. అతనికే ఈ కృతి అంకితం. ఇది ప్రదర్శన యోగ్యమైన యక్షగానమే గాని, పూర్తిగా దొరకలేదు. దీనిలో నుంచి రెండు పద్యాలను, పదాలను పండితులు ఉదాహరించారు. తెలుగులో తొలితరం యక్షగాన కర్తలుగా సౌభరి చరిత్రకర్త ప్రోలుగంటి చెన్నయ్య, సుగ్రీవ విజయకర్త

కందుకూరి రుద్రకవి గుర్తింపు పొందారు. తొలి యక్షగాన కర్త ఎవరు అనే విషయం మీద పండిత లోకంలో భేదాభిప్రాయాలున్నాయి. (అరుద్ర-9-229)

## గంగాగౌరి సంవాదము (అలభ్యం)

కవి : వేములవాడ సోమనాథుడు (చూ).

## గంగాగౌరి సంవాదము పాట

జానపదగేయం. హాస్యరస ప్రధానం. ఇతివృత్తం ప్రసిద్ధం.

చూ. హాస్యరస గేయాలు. (ఆం. వా. చ.)

## గంగాదేవి

కాలం : క్రీ. శ. 1291-1323 మధ్యప్రాంతం.

స్థలం : విజయనగరం.

రచన : మధురావిజయమ్ (కంపరాయచరితమ్) (సంస్కృతం).

గురువు : అగస్త్య విద్యానాథుడు.

ఈమె విజయనగర సామ్రాజ్య స్థాపకులలో ఒకరైన బుక్కరాయల కోడలు. కుమార కంపరాయల భార్య. విదుషీమణి. తన భర్త దిగ్విజయ యాత్రను వర్ణిస్తూ మధురా విజయ కావ్యాన్ని రచించింది. ఆ యుద్ధయాత్రలో ఈమె అతని వెంట ఉన్నదట. ప్రతిభా విశేషాలుగల కవయిత్రి. సర్గకొక ఛందం వాడి అత్యద్భుతంగా రచన చేసింది.

విశిష్టత : విజయనగర సామ్రాజ్య చరమ కాలంనాటి చారిత్రక సామాజిక పరిస్థితులకు ఈమె గ్రంథం అద్దం పట్టింది. (ప్రా. ద. దే. చ )

## గంగాధర కవి

కాలం : క్రీ.శ. 1450 ప్రాంతం.

రచన : చెన్నమల్లేశ శతకము.

గురువు : గురు బసవన్న.

ఇతడు భళ్ళాణరాయని కాలంలో ఉండేవాడని పరిశోధకులు తలపోస్తున్నారు. ఈ కవి తన శతకంలో వీరశైవులనే పేర్కొన్నాడు. రచనలో పోతనామాత్యుని పోలికలు కనిపిస్తున్నాయి. ఇతని రచన 1844 లో ముద్రితం. తన గురువైన గురుబసవన్నకూ శ్రీశైల మల్లికార్జునునికీ అభేదం చెప్పాడు. విభూతి పురాన్ని చాలసార్లు పేర్కొన్నాడు. (శ. క. చ. 416)

## గంగాధర మఖి

కాలం : క్రీ.శ. 17వ శతాబ్దం.

స్థలం : తంజావూరు.

రచనలు : రసికరంజని (సం).

తంజావూరును పాలించిన మొదటి ఏకోజీకి మంత్రి. అప్పయ్య దీక్షి

తుని కువలయానందానికి ఇతని రసిక రంజని వ్యాఖ్య. ఇతని కుమారులు నరసింహ మఖి, త్ర్యంబకరాయమఖి, భగవంతరాయమఖి మహారాష్ట్రుల ఆస్థానంలో మంత్రులుగా ఉండేవారు (ద. దే. వా. 181)

## గంగాధరుడు

కాలం : క్రీ.శ. 13వ శతాబ్దం.
రచన : మహాభారత నాటకమ్ (సం) (ప్రా. ద. భా చ)

## గంగా పార్వతీ సంవాదము

కర్త : శహాజీ (చూ).

శివస్తుతితో మొదలైన యక్షగాన నాటకం. ఇతర నాటకాల ఫక్కీలోనే ఈ రచన సాగింది. సవతుల పోట్లాట ఇందులోని కథ. (ద. దే. వా. 188)

## గంగాపుర మాహాత్మ్యము

కర్త : మల్లారెడ్డి దేశాయి.

ఇది స్థల మాహాత్మ్యాన్ని చెప్పే కావ్యం. పూర్తిగా లభించలేదు.

ప్రత్యేకత : కవి తన స్వస్థానమైన గంగాపురం గొప్పదనీ, దాని "సుక్షేత్ర మహిమంబు తెలిసి పలుక దరమె శంభునికైన విధాతకైన" అనీ భావించి దీనిని పద్య కావ్యంగా వ్రాశాడు. ఇది అముద్రితం, (ఆరుద్ర-9-233)

## గంగా మాహాత్మ్యము

కాలం : క్రీ శ 18వ శతాబ్దం.
కర్త : ఏనుగు లక్ష్మణ కవి.

కావ్యం. (క. స. 204)

## గంగాలహరి

రచనాకాలం : క్రీ శ. 19వ శతాబ్దం తొలిపాదం.
కర్త : మండపాక రామస్వామిశాస్త్రి.

## గంగాలహరి (సం)

కర్త : జగన్నాథ పండితరాయలు.

ఇది సంస్కృత రచన. 52 శ్లోకాలలో ఉన్న గంగాస్తుతి. (తె. వి. స -4)

## గంగావతరణమ్ (సం)

కర్త : నీలకంఠ దీక్షితులు.

ఇది ఉద్గ్రంథమట. (తె. వి. స-6)

## గంగాస్తవము

రచనాకాలం : క్రీ.శ. 19వ శతాబ్ది తొలిపాదం.
కర్త : మండపాక రామస్వామిశాస్త్రి.

## గంగాస్తవరాజమ్ (సం)

కర్త : పేరి కాశీనాథ శాస్త్రి.

సంస్కృత రచన. (ఆ సం. సా.-427)

## గంగిరెడ్లవారు

వీరు కాకతీయుల కాలంనుంచి ఉన్నట్లు తెలుస్తున్నది పూర్వులకున్న పెక్కు వినోద విశేషాలలో గంగిరెడ్ల వినోదమొకటి.

వీరు గంగిరెడ్లను రంగురంగుల బట్టలతో అలంకరించి, వివిధ భూషణాలను అలంకరింపజేసి, సన్నాయి, డోలు మొదలయిన వాయిద్యాలతో వీటిని చక్కగా నటింప చేయటం జనపదాలలో తరచూ ఉంది. వీరు సన్నాయి చక్కగా ఆలపిస్తారు ముఖ్యంగా సంక్రాంతి పండుగ రోజులలో గంగిరెడ్లఆట ఆడిస్తారు ఎద్దు యజమాని చెప్పినట్లే చక్కగా అభినయిస్తాయి. సాధారణంగా రెండు ఎద్దులుగాని, ఆవు తకుమించి గాని ఉంటాయి. వాటికి సీతారాములనో, లేక రామలక్ష్మణులనో పేర్లు పెట్టి రాగయుక్తంగా మాటలు చెపుతూ ఆడిస్తారు. గ్రామ సీమలలో జరిగే గంగిరెడ్ల ఆట కనుల పండువుగా ఉంటుంది. (ఆ. సాం. చ-95)

## గంగుల పిన ఎల్లయ

కాలం : క్రీ. శ. 17 వ శతాబ్దం.

రచన : కాటమరాజు కథ (ద్విపద).

వీరకథా వాఙ్మయం పట్ల ఆసక్తితో కవి దీన్ని రచించి ఉంటాడు. శ్రీనాథుని వచన పద్ధతిలో తాను వ్రాశానని కవి చెప్పుకొన్నాడు. ఇతని రచన నెల్లూరు గుంటూరు మండలాలలో ప్రసిద్ధమైనదట. జాతీయాలు, సామెతలు వాడడంలో కవి నిపుణుడు. (ద్వి. సా. చ-392)

## గంగోత్పత్తి రగడ (కన్నడం)

కర్త : పాలకురికి సోమనాథుడు.

కన్నడ రచన.

## గంగోలు

పోలవరం జమీందారీ వేలం వేయబడినప్పుడు కొంతభాగం విడదీయగా 'గూటాల' ఎస్టేటు ఏర్పడింది 'గూటాల' ఎస్టేటులో నుండి విడదీయబడిన కొన్ని గ్రామాలు ఈ 'గంగోలు' ఎస్టేటుగా రూపొందాయి. క్రీ శ 1849 లో హోతా గంగయ దీన్ని ఖరీదు చేసి, జమీందారీని అభివృద్ధి చేయడానికి చాలా కృషిచేశారు. వ్యవసాయం అభివృద్ధి చేశారు. వారి అనంతరం క్రీ శ 1878 లో వారి కుమారులు 'వీరభద్రయ్య' జమీపాలనను స్వీకరించారు.

వీరభద్రయ్య సాహిత్యాభిలాషి. అనేక గ్రంథప్రచురణ సంస్థలకు రాజపోషకులు. రాజమహేంద్రవరంలోని 'ఆంధ్రేతిహాస పరిశోధకమండలి' కి పోషకులు

ఉన్నారు. రాళ్ళబండి సుబ్బారావు సంపాదకత్వంలో ఈ పరిశోధక మండలివారు ముద్రించిన సంచికలకు అనేక విరాళాలిచ్చి తమ సాహిత్యాభిమానాన్ని చాటుకున్నారు. (ఆ.సం.సా.)

## గంటి భాగవతులు

వీరు చిరకాలంగా ఆంధ్రదేశంలో ఉన్న బొమ్మలాటవారు. వీరు దీప స్తంభాల వెలుతురులో బొమ్మలను ఆడిస్తూ ఉండేవారు. బొమ్మలతోపాటు మనిషికూడా ఆడుతూ ఉండేవాడు. వీరు ఎక్కువగా భాగవతగాథలనే ప్రచారం చేయటంవల్ల వీరిని కూడా భాగవతులన్నారు.

వీరు నలుగురైదుగురు కలసి ఒక దీప స్తంభాన్ని పట్టుకొని, పాటలతో, పద్యాలతో బయలుదేరి ఈ బొమ్మలాటను ప్రదర్శించేవారు. ఇంటి ముందరి ఖాళీస్థలం వీరి రంగస్థలం. చుట్టుప్రక్కల ఇళ్ళజనం వీరి ప్రేక్షకులు. ప్రదర్శనకాలం తక్కువ. ఈ బొమ్మలాట యాచనకే ఉపయుక్తం. బొమ్మలాడించు కోవటానికి ప్రమిదలో గంటెడు నూనెపోసి, స్తంభపు ప్రమిదలో కానుకలు వేస్తేచాలు.

గంటెడు చమురుతో తృప్తిపడి ప్రదర్శనలను సాగించేవారుకనక వీరిని 'గంటి భాగవతులు' అన్నారు. (నా. ర. చ-174-175)

## గంటివారు

ఈ 'గంటి' శబ్దం ఇంటిపేరులో భాగంగా ఉన్న కుటుంబాల వారున్నారు. వారు గంటివారు, మాగంటివారు, చాగంటివారు, కాపుగంటివారు, పానుగంటి వారు మొదలయినవారు. (భారతి-మా-45-230)

## గండతల

కాలం : క్రీ.శ. 12-15 శతాబ్దం మధ్యకాలంలోని ఆచారం.

శైవ భక్తులు భక్త్యావేశాలతో తమ తలలను బలిగాసమర్పించటం 'గండతల' లేక 'మిడితల' సమర్పణ అంటారు. భక్తుడు తన కంఠాన్ని వర్తులాకారంగా ఉన్న 'గండ కత్తెర'లో దూర్చి తలను స్వయంగా కత్తిరించు కోవటం కూడా ఆ కాలంలో ఉండేది. ఈ బలి కార్యక్రమం 'కాళికాదేవి' గుడివద్దనే జరిగేనట.

భక్తులయిన బావమరదులిద్దరు పోటీపడి, అంబికకు "గండతల" సమర్పించి నట్లు అనంతామాత్యుని "భోజరాజీయం"లో ఉంది. ఈ 'గండతల' కార్యక్రమానికి ముందు బలికాబోయే భక్తులను మేళతాళాలతో ఊరేగిస్తూ అంబిక గుడి దగ్గరకు తీసుకొని వెళ్ళేవారు. ఈ మేళానికి "మిడిమేళము" అని పేరు ఉంది.

ఈ గండతల సన్నివేశాన్ని చిత్రించిన శిలాఫలకాలు నెల్లూరు జిల్లా గూడూరు తాలూకా 'మల్లాయ్' ప్రాంతంలో ఉన్నాయట (తెలుగు-జ-మా-75)

## గండపెండెరం మీద బొమ్మకట్టడం

కాలం : క్రీ. శ. 12-15 శతాబ్దం మధ్యకాలం.

రాజులు కొందరు, శత్రురాజులను జయించి విజయగర్వంతో వారిని తమ

పాదాల కిందనే ఉండి సేవ చేయమనే అర్థం వచ్చేటట్లు గండపెండెరం మీద తాము జయించిన రాజుల బొమ్మ కట్టించి ధరించేవారు.

బొమ్మకట్టే ఆచారం రెండు రకాలు. విజేతలయిన రాజులు తమ శత్రువుల బొమ్మలను, తాము ఉమ్మివేసే "తమ్మపడిగ" మీద చెక్కించట మొదటిది తాము కాలికి ధరించే గండపెండేరం మీద బొమ్మ చెక్కించట రెండోది.

గండపెండేరం మీద బొమ్మకట్టే విధానానికి, శాసన సాహిత్యాధారాలున్నాయి క్రీ. శ. 1357 ప్రాంతంలో విశాఖ జిల్లాలోని వడ్డాదివి రాజధానిగా కొంత కళింగాంధ్ర దేశాన్ని పాలించిన అర్జునదేవుడనే రాజు 12 మంది రాజులను జయించినట్లూ, వారి ప్రతిరూపాలను తాను కాలికి ధరించే గండపెండేరం మీద చెక్కించి తన శత్రువులను అవమానించినట్లూ సింహాచలంలోని శాసనం ద్వారా తెలుస్తున్నది. సాహిత్యంలో ఈ దీని ప్రసక్తి ఉంది. (చూ-తమ్మపడిగమీద బొమ్మకట్టటం) (తెలుగు-ఏ-జూ-77,

## గండభేరుండ కవి

చూ. తరిగొప్పుల మల్లన.

## గండు సోమనాథశాస్త్రి

కాలం : క్రీ శ. 19వ శతాబ్దం.
స్థలం : కసింకోట సంస్థానం.
రచన : భీమ విక్రమము.

ఆంధ్ర గీర్వాణ భాషా కోవిదుడు. వ్యాకరణ శాస్త్ర పారంగతుడు. కసింకోట సంస్థానాశ్రితుడు. (ఆం. సం. సా-523)

## గంపలగూడెము

'వెల్లంకి' వారు ఈ సంస్థాన పాలకులు. "మల్లారావు" వీరికి మూలపురుషుడు.

ఈ సంస్థానం మొదట పెద్దదిగా ఉండి తదనంతర కాలంలో చాలా చీలికలై పోయినట్లు తెలుస్తున్నది. గోలకోండ నవాబుల కాలంలో కనకగిరి, జమ్ములవాయి, మేడూరుఘాటు పరగణాలపై వీరు దేశపాండ్యా అధికారులు. వీరి వంశంలోని వెంగళరావు (1659-1687) నవాబులవద్ద సన్నదు సంపాదించాడు. ఇతని కుమారుడు గోపాలరావు ఔరంగజేబు నుండి దేశపాండ్యాగిరీ పట్టా పొందాడు గోపాలరావుకు నలుగురు కుమారులు. వీరి సంస్థానాన్ని నాలుగు భాగాలుగా చేసుకున్నారు. అందులో గంపలగూడెం విభాగం జ్యేష్ఠుడైన వెంకటరావుకు చెందింది ఈ వెంకటరావు మనుమలకాలంలో ఈ ఎస్టేటు తూర్పు, పడమరలనే రెండు విభాగాలైంది. కానీ తూర్పు భాగంవారు సంతానం లేకుండా మరణించడంతో సంస్థానం మళ్ళీ ఏకమైంది ఈ వెంకటరావు ప్రపౌత్రుడు రాజా వెల్లంకి వెంకటకృష్ణారావు, 1848 మరణించాడు పుత్ర సంతానం లేనందున సంస్థానం అల్లుడైన కోటగిరి జగన్నాథ రాయడికి లభించింది ఈ జగన్నాథ రాయడు సంతానం లేనందున వెంకటకృష్ణారావును దత్తత తీసుకున్నాడు కాని

అతర్వాత సత్యనారాయణ, పార్థసారథి అనే ఇద్దరు కుమారులు కలిగారు. ఈ ముగ్గురు కలిసి ఎస్టేటును మూడు విభాగాలుగా పాలించారు.

వీరిలో దత్తత స్వీకరింపబడిన వెంకటకృష్ణారావు ప్రసిద్ధుడు. కవితాప్రియుడు. కృతికర్త. వీరి బొబ్బిలి విజయాది నాటకాలు ప్రఖ్యాతి చెందినవి. శేషాద్రి రమణ కవులు వీరి అస్థాన విద్వాంసులు. చెళ్ళపిళ్ల వేంకటశాస్త్రి, దంటు సుబ్బావధాని, దేవినేనిసూరయ్య దాసరి లక్ష్మణ కవి ప్రభృతులు ఈ ప్రభువుచేత అనేక పర్యాయాలు సన్మానింపబడ్డారు. ఆంధ్రభారతి, గ్రంథాలయ సర్వస్వాది పత్రికలకు పోషకులు.

వెంకట కృష్ణారావు దేశాభిమాని. జాతీయోద్యమంలో పాల్గొని, ఆంధ్రరాష్ట్ర రాజకీయ మహాసభకు అధ్యక్షులుగా ఉండి, ప్రభుత్వాజ్ఞలను ధిక్కరించిన నేరం క్రింద జైలు శిక్షను అనుభవించారు. (ఆం. సం. సా–530)

## గంపలవారు

గంపలు అల్లటం వల్లనో, ధాన్యాదులతో గంపలను నింపటంవల్లనో కొన్ని కుటుంబాల వారి ఇంటి పేరు 'గంపలవారు' గా నిలిచిపోయింది.

అట్లే గాదెలు అల్లటం మూలంగానో, గాదెలు ధాన్యాదులతో నింపటం మూలంగానో కొన్ని కుటుంబాల వారికి గాదెల వారన్నది ఇంటి పేరుగా నిలిచిపోయి ఉంటుంది. పరికరాల పేర్లతో వచ్చిన ఇంటిపేర్లివి. (భారతి–మా–45–230)

## గజమాల

ఎనిమిది పద్యాలుండే కావ్యము. (అప్పకవీయం)

## గజల్

హిందూస్థానీ సంగీత సంప్రదాయానికి చెందిన గీత రచనా విశేషం. ఇది యక్షగానాలలో ప్రయుక్తం. గజల్, దోరా, తోహరా మొ॥ కొన్ని పార్సీమట్లు క్రీ.శ. 19 శతాబ్దం ఉత్తరార్ధంలో తెలుగు దేశంలో ధార్వాడ నాటక సమాజంవారి నాటకాలకు ప్రచారం వచ్చిన కాలంలో తెలుగు సారస్వతంలో ప్రవేశించాయి.

దీనిలో తరచు ఆది తాళ విశిష్టత కనిపిస్తుంది. దీనిలో పాదానికి నాలుగు మాత్రల దళాలయిదు, తరవాత అరుమాత్రల దళం ఒకటి ఉంటుంది. నాలుగు దళాలపై యతి; రెండేసి పాదాలకు ప్రాస విహితం.

బాగేపల్లి వారి కుచేలోపాఖ్యానం యక్షగానంలో ఇది ఉంది. (య.వా.చ–321)

## గజసూత్ర వాదము

కర్త : కిరీటి వెంకటాచార్యులు.

వివరాలు తెలియవు.

## గజారణ్య క్షేత్ర మాహాత్మ్యము

రచనాకాలం : క్రీ.శ. 18వ శతాబ్దం కావచ్చును.

కర్త : తెలియదు.

వచన గ్రంథం.

ఆంధ్రసాహిత్య పరిషత్తులో దీనిప్రతి ఉన్నది. ఇది కవిధాటి బలభద్రకవి రచించిన ఇదే పేరుగల పద్యకృతికి వచనానువాదమని పండితాభిప్రాయం.

(అపుద్ర-12-306; ద. దే. వా-401)

## గజారణ్యక్షేత్ర మాహాత్మ్యము

నామాంతరం : గజారణ్య సంహిత.

కర్త : కవిధాటి బలభద్ర కవి.

## గజారణ్య సంహిత

నామాంతరాలు : 1. గజారణ్య క్షేత్ర మాహాత్మ్యము.

2. జంబుకేశ్వర మాహాత్మ్యము.

కర్త : కవిధాటి బలభద్రకవి (చూ).

అంకితం : శ్రీగిరి గౌరరాజు బసవరాజుకు.

పద్యకృతి. ఇది పూర్తిగా లభించలేదు పూర్వ ఖండంలో ద్వితీయాశ్వాసం మొదలు, షష్ఠాశ్వాసం వరకు ఉన్న భాగం మాత్రం దొరికింది. దీని వచనానువాదం కూడ ఉంది. వచనానువాద కర్త ఎవరో తెలియదు.

ఇతివృత్తం : గజారణ్య క్షేత్రమంటే జంబుకేశ్వరం. ఈ క్షేత్ర మహిమ ఇందులో చెప్పబడింది. మూలం పద్మపురాణం. (అరుద్ర 12-306; ద. దే. వా-401)

## గజేంద్రమోక్షము (అలభ్యం)

కవి : రఘునాథ నాయకుడు (చూ).

రఘునాథుని ఆస్థానంలోనివారు ఈ యక్షగానాన్ని చదివి వినిపిస్తూండేవారట.

(ద. దే. వా-86)

## గజేంద్రమోక్షము

కర్త : తెలియదు.

జానపద పౌరాణిక గేయం. ఇతివృత్తం భాగవతంలోనిది. అతి ప్రసిద్ధం.

చూ. పౌరాణిక గేయములు. (అం. వా. చ.)

## గడియమదేవి నాదెండ్ల శాసనము

కాలం : క్రీ. శ. 1139.

స్థలం : గుంటూరు జిల్లా-నరసరావుపేట తాలూకా-నాదెండ్ల గ్రామంలోని మూలస్థానేశ్వరాలయంలో రాతి స్థంభం మీద ఉన్నది.

శాసన ప్రదాయిని : గడియమదేవి.

శాసన విషయం : దీనిలో మన్మమండరాజు నాదెండ్లలో మూలస్థాన దేవరకు గుడి కట్టించిన విషయం ప్రసక్తం. గడియమదేవి నాదెండ్లకు సమీప గ్రామమైన

"ఎడ్లపూండి" (ఎడ్లపాడు)లో వేంచేసిన మహేశ్వరునకు దానం చేసినట్లు, నాదెండ్లలోని మూలస్థానీశ్వరుని భక్తితో పూజించి అఖండ దీపం నిల్పినట్లు శాసనంలో ఉంది. ఈమె మన్మమండరాజు తల్లి. దీనిలో 3 చంపకమాలలు, 2 ఉత్పలమాలలు, 2 కంద పద్యాలు. మధ్యలో కొద్దిగా గద్య ఉన్నాయి. (తె. క. చ-234, 235)

## గడియారము భాస్కరశాస్త్రి

కాలం : క్రీ. శ. 18 వ శతాబ్దం-ఉత్తరార్ధం.

స్థలం : వేంకటగిరి.

ఈతడు ప్రసిద్ధిచెందిన పండితకవి అని నెల్లూరు జిల్లా మాన్యూలు చెప్తున్నది. ఇతని రచనలను గురించిన వివరాలు తెలియవు. (ఆం. సం. సా-460)

## గడ్డిపాటి పగటి వేషధారులు

వీధి భాగవతాలకు కూచిపూడి కేంద్రమైనట్లే కృష్ణా జిల్లాలో వీరంకి లాకుకు మైలు దూరంలో ఉన్న గడ్డిపాడు పగటి వేషాలకు ప్రసిద్ధి చెందింది. రెండు శతాబ్దలకు పూర్వమే ఈ గ్రామవాసులు పగటి వేషధారణలో ప్రసిద్ధులట. పల్లావఝుల వేంకట్రామయ్య అనే తెలుగు బ్రాహ్మణుడు మైసూరు ప్రాంతం నుంచి వచ్చి తెలుగు దేశంలో స్థిరపడి పోయాడట. ఇతడు ఈ కళను రాణింపుకు తెచ్చాడట.

పల్లావఝులవారు, శ్రీకారం వారు, కూచివారు, కనుపూరివారు, బెల్లంకొండవారు, బాపట్లవారు, కవులవారు గడ్డిపాటిలో ప్రసిద్ధులయినవేషధారులు. వీరుదాదాపు అరవై రకాల చిత్ర విచిత్ర వేషాలు ధరించేవారు. ఇవి కొన్ని నిత్య జీవితానికి సంబంధించినవి, కొన్ని పౌరాణికాలు, కొన్ని కల్పనలు, కొన్ని హాస్యరసపూరితమైనవి. వేషానికి తగ్గ అభినయం, వాచికం అతిచమత్కారంగా చేసి ప్రజలను వినోదింప చేసే వీరు పశ్చిమ గోదావరి జిల్లా అప్పారావుపురంలో ఉన్నారు. (నా. ర. చ-226)

## గడ్డిపాటి వారు

తృణ విశేషంతో కూడిన గ్రామ నామంతో ఉన్న ఇంటి పేరు. కృష్ణాజిల్లా వీరంకి లాకు సమీపంలోని ఈ గ్రామం పగటి వేషాలు వేసే భాగవతులతో చాలా ప్రసిద్ధి పొందింది. గుంటూరు మండలంలో ఈ ఇంటి పేరు వారున్నారు. గరికపాటి వారు ఇలాంటి వారు. (భారతి-మా-45-229)

## గణిత దర్పణమ్ (సం)

కర్త : కంచం ఎల్లయార్యుడు.

ఈ పుస్తకం వ్రాసినట్లు కవి స్మృతి కదంబంలో చెప్పాడు. (తె. వి స-4)

## గణప నారాధ్యుడు

కాలం : క్రీ.శ. 14 వ శతాబ్దం.

స్థలం : ఓరుగల్లు ప్రాంతం.

రచన : స్వరశాస్త్రము (కొంత లభ్యం).

గణ్ణయామాత్య, దేవమాంబల పుత్రుడు. ఈ కవి యోగ శాస్త్రవేత్త. యోగ శాస్త్రాలను పరిశోధించి స్వరశాస్త్రాన్ని ద్విపదలో వ్రాశాడు. ఇతని తండ్రి గణ్ణయా మాత్యుడు ఓరుగంటి ప్రతాపరుద్ర మహారాజుకు మంత్రి అట. గణపనారాధ్యుని అన్న రామరాజు కాకతీయ సామ్రాజ్య పతనానంతరం ఢిల్లీ సుల్తాను మహమ్మద్ తుగ్లామ్‌షా మన్ననలు పొందాడట. ఇతని రచన రసవంతమైనది. (క. త-4-52)

## గణపవరపు వేంకటకవి

కాలం : క్రీ. శ. 17 వ శతాబ్ది.

స్థలం : కృష్ణా మండలంలోని కామెపల్లి సీమలోని గణపవరం.

రచనలు : 1. విద్యావతీ దండకము 2. పెద్దశగిరి విజయము 3. ప్రబంధ రాజ వేంకటేశ్వర విజయ విలాసము 4. తారావళులు 5. యమక శతకము 6. శృంగార మంజరి 7. కృష్ణమల్ల కథ 8. బాల రామాయణము (ద్విపద) 9. సర్వలక్షణ శిరోమణి 10. వేంకటేశాంధ్రము 11. ఆంధ్ర కౌముది 12. కల్పిత కల్పలత 13. ఉదాహరణము 14. లింగనిర్ణయము 15. ఆంధ్ర ప్రతాపరుద్రీయము 16. రేఫ ఱకార నిర్ణయము 14. అఖిన వాంధ్ర నిఘంటువు 18. గణయతి ప్రాస లక్షణ సీసమాలిక 19. ఆంధ్ర ప్రయోగ రత్నాకరము 20. షట్ప్రత్యయ ప్రస్తారసరణి 21. అలంకార సారము 22. ఇరవై ఆరు ఛందాల వచనము 23. పరమ భాగవత చరిత్ర 24. వసంత తిలక భాణము 25. కఠిన ప్రాస శతకము 26. ద్విరూప కోశము 27. ఆంధ్ర ప్రక్రియా కౌముది 28. యతిరాజు బిరుదు గద్య 29. జాంబవతీ విలాసము 30. చక్రవాళ తారావళి 31. అఖిల పురాణ సారము 32. యతిప్రాసల సీసమాలిక 33. ఆంధ్ర రసమంజరి (కర్తృత్వం సందేహం).

గురువు : పెరుంబుదూరి యతిరాజాచార్యులు.

తండ్రి అప్పయార్యుడు. తల్లి మంగమాంబ. అష్టభాషా కోవిదుడు. చిత్ర కవితపై ఇతనికి మక్కువ. కల్పిత కల్పలత అనే చిత్ర కవితావిశేషాన్ని, ఒక కావ్యంలో చొప్పించినట్లు చెప్పుకొన్నాడు. పైన పేర్కొన్న ఇతనిరచనలలో కొన్ని ఒకే గ్రంథంలోని వేర్వేరు ఉల్లాసాలు. ఇవి ప్రత్యేకంగా కూడా ప్రసిద్ధి చెందాయి.

ఈ కవి కర్ణాట, తుండీర, పాండ్య చోళమండల ప్రభువులచేత సత్కారాలు పొందాడు. ఆనాటి కర్ణాట ప్రభువు క్రీ. శ. 1630-42 నాటి మూడవ వెంకటపతి రాయలు కావచ్చు. విజయ రాఘవుని సభలోనూ, మన్నలు పొంది ఉంటాడని విమర్శకుల ఊహ. ఇతన్ని సత్కరించిన తుండీర (చెంజి) మండలాధిపతి వరదప్ప నాయకుడు. ఇతడు ఆంధ్ర రసమంజరిని కూడా రచించినట్టు కవి తరంగిణి పేర్కొన్నది.

పాండ్య దేశాధీశ్వరుడైన చొక్కనాథ నాయకుని సోదరుడు ముద్దళఘరి

ఇతనిని ఆదరించాడు. ఈ కవి అవధాన విద్యలో చతురుడు. ఇరవై వరకూ అవధానాలు చేశాడట. (ఆరుద్ర-11-161; క. త-12-234)

గణమంజరి (సం)

కర్త : చూ. కవిభల్లటుడు.

అలభ్యం. దీనిలోని శ్లోకాలను కందుకూరి వీరేశలింగం, కస్తూరి రంగకవి ఉదాహరించారు ఇది సంస్కృత గ్రంథం కావచ్చునని పలువురు భావిస్తున్నారు. (ఆరుద్ర-4)

గణ యతి ప్రాస లక్షణ సీసమాలిక

కర్త : గణపవరపు వేంకటకవి (చూ).

సర్వలక్షణ శిరోమణిలోని ప్రథమోల్లాసంలో ఈ విషయాలు చెప్పబడ్డాయి. అదే ప్రత్యేక రచనగా పరిగణింపబడుతూ వచ్చింది. (ఆరుద్ర-11-161)

గణవర్ణన పదములు (అలభ్యం)

రచనా కాలం : క్రీ. శ. 12 వ శతాబ్దం.

కర్త : మల్లికార్జున పండితుడు.

గణసౌజన్యాఖ్యాన శతకము

రచనా కాలం : క్రీ. శ. 1750 ప్రాంతం.

కర్త : చెన్నాప్రగడ నాగరాజు.

శతకం. మకుట నియమం లేదు. ఇందులో ప్రాచీన శివభక్తులను గురించిన ప్రశంస ఉన్నది. ఇది శైవ స్థాపనాచార్య స్తుతి శతకంగా ప్రసిద్ధం. (శ. క. చ-430)

గణాడంబరము (అలభ్యం)

రచనా కాలం : క్రీ. శ. 12 వ శతాబ్ది.

కర్త : మల్లికార్జున పండితుడు.

గణికాగుణ ప్రవర్తన తారావళి

రచనా కాలం : క్రీ. శ. 1800 కు పూర్వం.

కర్త : రాచవేటికవి.

27 పద్యాలున్న తారావళి.

గణిత దీపిక

రచనా కాలం : క్రీ.శ. 16 వ శతాబ్దం.

కర్త : బద్దెపీటి దత్తప్ప.

కృతి భర్త : సుగుటూరి చిక్కరాయలు (మైసూరులోని కోలారు ప్రాంతానికి అధిపతి).

పద్యకృతి. దీనికి వ్యాఖ్యానం కూడా ఉన్నది. చిక్కరాయల ప్రోత్సాహంతో కవి దీనిని రచించాడు.

ప్రత్యేకత : వివిధ యుగాలలోని ప్రాచీన తెలుగు కవులు శాస్త్ర కావ్యాలను తెనిగించటం ఆనవాయితి. వీరాచార్యుల సార సంగ్రహ గణితాన్ని చాళుక్యయుగంలో పావులూరి మల్లన అనువదించాడు. ఆరవీటి రాజుల యుగంలో ఈ గణితాన్ని ఎలుగంటి పెద్దన తెనిగించాడు. దీనినే "గణిత దీపిక" అనే పేరుతో ఆరవీటి రాజుల యుగంలో ఒద్దెపీటి దత్తప్ప వ్రాశాడు. (ఆరుద్ర-9; ద. దే. వా. 489)

## గణిత శాస్త్రమ్ (సం)

కర్త : లీలావతి.

ఈ సంస్కృత కావ్యంలోని శ్లోకాలు మహా పటిష్ఠంగా ఉంటాయి. ఇందులోని లెక్కలు పండితులకే దుర్గ్రాహ్యంగా ఉంటాయట. ఈ గ్రంథం ఫ్రెంచి, ఆంగ్ల భాషలలోనికి పరివర్తనం చేయబడింది. (కవయిత్రులు-38)

## గణిత సార సంగ్రహము

నామాంతరం : పావులూరి గణితము.

రచనాకాలం ; క్రీ. శ. 1060-1070 ప్రాంతం.

కర్త : పావులూరి మల్లన.

విశిష్టత : సంస్కృతంలో మహావీరాచార్యుడు రచించిన 'సారసంగ్రహ గణితాని'కి ఇది తొలి తెలుగు అనువాదం.

మూల పద్ధతులు, సూత్రాలు గ్రహించి, ఉదాహరణలు మాత్రం కవి స్వతంత్రంగా ఇచ్చాడట. (ఆరుద్ర-2)

## గణేశ్వర కవి

కాలం : క్రీ. శ. 16వ శతాబ్దం.

గోలకొండ కుతుబ్‌శాహీల ఆస్థాన కవి.

ఈయన ప్రోత్సాహం వల్లనే - మెదకు జిల్లా బిక్కనవోలు రాజధానిగా, పాలించిన,గోలకొండ కుతుబ్‌షాహీల సామంతుడయిన కామినేని మల్లారెడ్డి, పద్మపురాణాన్ని తెనిగించాడు. ఈ గణేశ్వర కవి 'సంస్కృతాంధ్ర భాషావర కావ్య కల్పన విచక్షణ' ఉన్న వాడన్నారుగాని, ఆయన రచనలేవీ దొరకలేదు. (ఆరుద్ర-9-216)

## గదాధరీయ ఖండనమ్ (సం)

నామాంతరం : ఝుంఝూమారుతమ్.

కర్త : కిరీటి వేంకటాచార్యులు (చూ).

సంస్కృత గ్రంథం. (ఆం. సం. సా.)

## గద్దె చంద్రశేఖర కవి

కాలం : క్రీ.శ. 15వ శతాబ్ది తర్వాతికాలం.
స్థలం : చిత్తూరు మండలం.
రచన : ఉత్తర హరిశ్చంద్ర చరిత్ర (ద్విపద).

తండ్రి వీరభద్రాచార్యుడు. ఈ కవి కాళహస్తీశ్వరుని భక్తుడు. సంస్కృతాంధ్ర భాషలలో ప్రవీణుడు. సంస్కృత పదాలు బహుళంగా వాడాడు. మనోహరమైన భావనా సంపద ఇతని రచనలో చూడవచ్చును. (ద్వి. సా. చ. 407)

## గద్దె రామలింగ కవి

కాలం : తెలియదు.
స్థలం : భీమవరం తాలూకాలోని బొండాడ.
రచన : చోడలింగ శతకము (పరవాది గజాంకుశము).
గురువు : సిద్ధరాముడు.

తండ్రి నాగయ్య. తల్లి పంచాక్షరీ దేవి. భీమవరం తాలూకా పడమటి గోదావరి జిల్లాలోనిది. ఈ కవి సిద్ధాంతం గ్రామంలోని సీతలింగేశ్వరుని, తణుకు తాలూకాలోని గోస్తనీ నదిని ప్రశంసిస్తూ పద్యాలుచెప్పాడు. గురువును శివరూపంగా స్తుతించాడు. ఇతని శైలి చక్కనిది. శ్రుతి వాక్యాలనూ, ప్రసిద్ధమైన పలుకుబళ్ళనూ రచనలో పొందుపరిచాడు. (శ. క. చ. 299)

## గద్య కావ్యము

ఛందోబద్ధం కాని వచన రచనను గద్యం అంటారు. "గద్యం కవీనాం నికషం వదంతి" అనే ఆర్యోక్తి గద్య ప్రాశస్త్యాన్ని తెలుపుతున్నది. గద్యాన్ని ప్రశస్తంగా వ్రాయటం పద్య కావ్య రచనకంటె కష్టతరమని పండితాభిప్రాయం. సంస్కృతంలో ఈ గద్య 1. ముక్తకము 2. వృత్తగంధి 3. ఉత్కలికాప్రాయము 4. చూర్ణకము అని నాలుగు రకాలు. గద్య కావ్య భేదాలు చాలా ఉన్నాయి.

(తె. వి. స-6)

## గద్యము

వచనం. పాదవిభాగం, గణనియమం లేని పద సముదాయం గద్యము.

తెలుగు కావ్యాలలో ఆశ్వాసాంతాలలో కవులు తమగురించీ కావ్యాన్ని గురించీ చెప్పుకొనే వాక్యం గద్యంగా ప్రసిద్ధి చెందింది. (ఛ. ప. కో-11)

## గద్వాల

నైజాం మండలంలోని సంస్థానం.

కేశవ నగరమని దీనికి నామాంతరం. ఇది విద్వద్గద్వాల అని ప్రసిద్ధి గాంచింది.

మహబూబ్‌నగర మండలంలో ఉన్న "గద్వాల" ఈ సంస్థానానికి ముఖ్య పట్టణం. వీరి పూర్వపు రాజధాని 'రాజోలు'.

కాకతీయుల కాలంనాడు గద్వాలపాలకుల పూర్వులలో ఒకరికి కృష్ణా, తుంగభద్రా నదుల మధ్యనున్న కొన్ని సీమలపై 'నాడగౌడరికం' ఉండేది. ఆ తరువాత వీరు కొంతకాలం విజయనగరాధీశ్వరుల సామంతులుగనూ, తదుపరి హైదరాబాద్ నిజాముకు విధేయులుగనూ ఉన్నారు.

గద్వాల ప్రభువుల 'గృహనామం' ముష్టిపల్లివారు. వీరిది పాకనాటిరెడ్ల వంశం. ముష్టిపల్లి పెద్దన నృపాలుడు వీరి మూలపురుషుడు.

ఈ సంస్థానాధీశ్వరులలో సోమనాద్రి మిక్కిలి శూరుడు. గద్వాలకోటను కట్టించినవాడు. సాహిత్యపోషకుడు. ప్రతి సంవత్సరం కార్తిక, మాఘ పూర్ణిమలకు విద్వత్సభలు జరిపించి, పండితులకు భూరిదానాలిచ్చేవాడట. బోరవెల్లి గ్రామనివాసి, ముకుందవిలాసాది గ్రంథకర్త అయిన కాణాదం పెద్దన ఈ ఆస్థానంలోనివాడు.

ఈ సోమనాద్రి మనుమడు చినసోమభూపాలుడు స్వయంగా కవి. "రతి రహస్యము" అనే మనోహరప్రబంధం, అష్టపదులు వ్రాశాడు. ఈతని కాలంలో సారస్వత సేవ బహుచక్కగా జరిగింది.

బోరవెల్లి శేషాచార్యులు, కామసముద్రం అప్పలాచార్యులు, తిరుమల కృష్ణమాచార్యులు, తిరుమల బుక్కపట్టణం బుచ్చివెంకటాచార్యులు, ధర్మవరం రామకవి, కొత్తపల్లి రామాచార్యులు, నరసింగయ్య, కొటికలపూడి వీరరాఘవాచార్యులు మొ॥ కవి పండితులు అనేకులు చినసోమభూపాలునికి కొంచెం పూర్వం, కొంచెం తర్వాతను, సమకాలికులుగను ఈ సంస్థానాన్ని ఆశ్రయించారు.

తరువాత పేర్కొనదగిన సంస్థానాధీశుడు ముష్టిపల్లి రామభూపాలుడు. రాజకవి "ఛందోముకురము" గ్రంథకర్త. పురాణం దీక్షాచార్యుల శిష్యుడు సుమారు డెబ్బది సంవత్సరములకు పూర్వం గద్వాల నాశ్రయించిన కవులలో తిరుమలరాయకవి దిట్ట. ఆ తరువాత పుల్లగుమ్మి నివాసి పురాణం దీక్షాచార్యులు ఛందోముకురాది గ్రంథాలను వ్రాశాడు.

ఈ రామభూపాలుని ఆస్థానంలోనే తిరుపతి వేంకటకవులు శతావధాన, చాటుకవితా ప్రదర్శన లిచ్చారట.

రామభూపాలుని కుమారుడు సీతారామ భూపాలుడు అనన్యసామాన్య దానధురీణుడు. ఆదిపూడి ప్రభాకరరావుగారీతని ఆస్థానకవి. వేదం వేంకటరాయశాస్త్రి, గాడేపల్లి వీర రాఘవశాస్త్రి, అవ్వారి సుబ్రహ్మణ్యశాస్త్రి మొ॥ వారు వీరిని ఆశ్రయించి దానధురీణతచే సమ్మానితులైరి. ఆశుకవిత్వం, సమస్యాపూరణం, శతావధానం మొదలగునవి ఈ రాజులకు అత్యంత ప్రీతికరములు.

ఈ భూపాలుని రాణి ఆదిలక్ష్మీ దేవమ్మగారు కూడా కవిపండిత గాయకాదులను సత్కరించేవారు. (ఆం. సం సా)

## గన్న భూపాలుడు

కాలం : క్రీ. శ. 1402-1420.

సాహిత్య పోషకుడు. శ్రీనాథ విరచిత "ధనంజయ విజయా"నికి కృతిభర్త. కొండవీటి రెడ్డి ప్రభువు పెదకోమటి వేమారెడ్డికి మామ.

విశిష్టత : ఫిరంగిపురం శాసనంలో ప్రసక్తుడయిన "ధాన్యవాటి పురాధిపతి" ఈ గన్న భూపాలుడే. మూర్తిత్రయోపాఖ్యానం వ్రాసిన దంతులూరి బాపరాజు శ్రీనాథు సుకవీంద్రుచే "ధనంజయ విజయంబను సత్కావ్యమంది వెలసె....దంతులూరి గన్న భూపాలమౌళి" అని చెప్పాడు. (రె. రా. చ)

## గన్నయ సేనాని

నామాంతరం : గోనగన్నారెడ్డి.

కాలం : క్రీ. శ. 13 వ శతాబ్దం.

స్థలం : ఓరుగల్లు.

సాహిత్య పోషకుడు. ప్రతాపరుద్ర చక్రవర్తి దగ్గర సేనానిగా, రాజధానీ నగర సంరక్షకుడుగా ఉండేవాడట. మారన కవి రచించిన మార్కండేయ పురాణం ఈ గన్నయ సేనానికి అంకితం. ఇతడు ప్రతాపరుద్రుని తురుష్కులు బంధించిన అనంతరం మతం మార్చుకొని మల్లిక్ మక్బూల్ అనే పేరుతో ఓరుగల్లు పాలకుడయ్యాడని అంటారు. (ఆరుద్ర-2)

## గన్నవరం అనంత కృష్ణశాస్త్రులు

కాలం : క్రీ. శ. 19 వ శతాబ్దం.

స్థలం : వేంకటగిరి సంస్థానం.

రచనలు : తెలియ రాలేదు.

వేంకటగిరి సంస్థానాశ్రితుడు. క్రీ. శ. 1832-1892 ల నడుమ వేంకటగిరి పాలకుడైన సర్వజ్ఞకుమార యాచేంద్రుని ఆస్థాన విద్వాంసుడు. (ఆం. సం.సా-488)

## గయోపాఖ్యానము

కర్త : తెలియదు.

జానపద పౌరాణిక గేయము. ఇతివృత్తం ప్రసిద్ధం. భారత కథకు సంబంధించినది.

చూ. పౌరాణిక గేయములు. (ఆం. వా. చ.)

## గయోపాఖ్యానము

నామాంతరము : కృష్ణార్జున సంవాదము.

కర్త : రామనామాత్యుడు.

## గరగ నృత్యము

జానపద నృత్య విశేషం.

ఒకప్పుడు పెంపు గలిగిన గరగజాతి ప్రజలు ఈ నృత్యం చేసేవారు. గరగ ప్రజలు ముఖ్యంగా దేవతలను ఆరాధిస్తారు. వీరు జాతర సమయంలో ఐదు శిరస్సుల నాగును సర్వాంగ సుందరంగా అలంకరించి, నెత్తిమీద పెట్టుకొని తప్పెట్ల వాయిద్యంతో భక్తి ప్రధానంగా నృత్యం చేస్తారు. వీరు ఎక్కువగా దేవీ నవరాత్రుల ఉత్సవాలలో పాల్గొంటారని, అక్కడక్కడా ఒక తెగవలె తెలుగు దేశంలో ఉన్నారని తెలుస్తున్నది.
(నా. ర. చ_281_282)

## గరళపురి ఛందస్సు

కర్త : తెలియదు.

లక్షణ గ్రంథం. అముద్రితం. పది పత్రాలున్నవట. వీర భూపాలీయమని పిలువబడే వీరన ఛందస్సు, ఈ గ్రంథమూ ఒకే విధంగా ఉన్నట్లు పండితులు చెప్తున్నారు. ఇవి రెండూ ఆంధ్రశబ్ద చింతామణికి వివరణ గ్రంథాలే. దీని ప్రతి ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారంలో ఉంది. (ద. దే. వా. 478)

## గరళపురీ మాహాత్మ్యము

కర్త : తెలియదు.

ఇది నంజంగూడు క్షేత్ర మాహాత్మ్యము. ఇక్కడి దేవుని పేరు నంజుండేశ్వర స్వామి. (వ. వా._50)

## గరిమెళ్ళ సుబ్బయ్య

కాలం : క్రీ. శ. 18వ శతాబ్దం.

స్థలం : బొబ్బిలి సంస్థానం.

బొబ్బిలి సంస్థానాశ్రితుడు. సంస్థానాధీశ్వరుడైన రాయడప్ప రంగారావుకు "సంకల్ప సూర్యోదయ" గ్రంథ రచనలో ఇతోధికంగా తోడ్పడినట్లు తెలుస్తుంది.

వివరాలు తెలియవు. (ఆం. సం. సా_302)

## గరుడ పురాణము (అలభ్యం)

కర్త : పింగళి సూరన (చూ.)

ప్రభావతీ ప్రద్యుమ్నంలో ఈ కావ్య ప్రశంస ఉన్నది.

## గరుడాంజనేయ సంవాదము (అలభ్యం)

కర్త : రాజవోలు సుబ్బారాయుడు (చూ).

రమణ వాగ్ధాటీ నిరాఘాట విస్ఫూర్తితో ఈ కావ్యం చెప్పినట్లు కవి చెప్పుకొన్నాడు.

## గరుడాచల విలాసము

కర్త : దినవహి ఓబయమంత్రి.

యక్షగానం. పురాణ గాథ. నరసింహుడు ప్రహ్లాదుని కోరిక మీద వేదాచలం విడిచి లక్ష్మీ సమేతుడై గరుడాచలం చేరడం, ఆ తరవాత చెంచెత పరిచయం - ఆమెను వివాహం చేసుకోవడం - ఇందులోని కథ.

ఈ యక్షగాన రచన చక్కని శైలితో ఉంది. దరువులన్ని తాళప్రధానాలై మంచి పరువుగల నడకతో సాగినవి. అట, ఏక, త్రిపుట, రూపకము, జంపె, కుఱుచ జంపె తాళాలు వాడారు. (య. వా. చ-59)

## గరుడాచల సోమయాజి

కాలం : క్రీ. శ. 19 వ శతాబ్దం.
స్థలం : వేంకటగిరి సంస్థానం.

వేంకటగిరి సంస్థానాశ్రితుడు. క్రీ. శ. 1832-1892 లో వేంకటగిరిని పాలించిన సర్వజ్ఞ కుమార యాచేంద్రుని ఆస్థాన విద్వాంసుడు.

రచనలను గూర్చిన వివరాలు తెలియవు. (ఆం. సం. సా-468)

## గరుడాద్రి సుబ్రహ్మణ్య కవి

కాలం : క్రీ. శ. 19 వ శతాబ్దం మధ్య కాలం.
స్థలం : చిత్తూరు ప్రాంతం
సంస్థానం : కార్వేటి నగర సంస్థానం.
రచన : శత్రుఘ్న విజయము.

కార్వేటి నగర సంస్థానాశ్రితుడు. వేంకట పెరుమాళ్ళ రాజుకు సవతి తమ్ముడైన "తిరుమల రాజు"కు తన కావ్యాన్ని అంకితం ఇచ్చాడు. (ఆం. సం. సా.)

## గర్భకవిత

ఇది చతుర్విధ కవితా భేదాలలో ఒకటిగా కొందరు చెప్పారు. మరికొందరు దీన్ని చిత్ర కవితలో భాగంగా పేర్కొన్నారు.

ఒకే పద్యంలో మరొక పద్యాన్ని గాని, పద్యాలను గానీ ఇమడ్చటం గర్భ కవిత్వం. కంద గీత గర్భ చంపకము, మత్తేభ కందగర్భ సీసము, స్రగ్విణీ గర్భ భుజంగ ప్రయాతము, కంద గర్భమణిగణ నికరము, చతుర్విధ కందం, మొదలయినవి గర్భ కవితకు ఉదాహరణలు.

గణపవరపు వెంకట కవి ఈ ప్రక్రియలో సిద్ధహస్తుడు. కొందరు ఈ విధంగా కావ్యాలనే రచించారు. రావిపాటి లక్ష్మీనారాయణ రచించిన భారత గర్భ రామాయణం ఈ కోవలోనిదే పద్యం మొత్తం రామాయణార్థాన్ని ఇస్తుండగా అందులో ఇమిడిన మరొక పద్యం భారతార్థంతో ఉంటుంది. (తె. వి. స-6; ఛం. ప. కో-307)

## గాంగేయోపాఖ్యానము (అలభ్యం)

కర్త : తెలీదు.
కాలం : క్రీ.శ. 18 వ శతాబ్దానికి పూర్వం.

వెలగపూడి కృష్ణయామాత్యుని పూర్వీకులు చేసిన రచనగా పేర్కొనబడింది. క్రీ. శ. 1720 ప్రాంతంలో వెలగపూడి కృష్ణయ్య రచించిన భానుమద్విజయంలో దీని ప్రసక్తి ఉన్నది. (ద. దే. వా-388)

## గాంధారి కథ

ఇది అద్భుత జానపద కథా గేయం. ప్రసిద్ధం. అతిప్రాచీనం కావచ్చు. ఇదొక విచిత్రమైన జంగం కథ.

తారశిల పట్టణ రాజు "వసుపతి" భార్య "దేవపద్మ గంధి", శ్రీశైల మల్లికార్జునునివల్ల 'గాంధారి'ని కన్నది. సుందరగిరి పట్టణపు రాజు 'గాండీవరాజు'. అతని కుమారుడే బాలరాజు. ఇతడు గాంధారిని ప్రేమించి వివాహం చేసుకోవాలనుకుంటాడు. ఇందుకు పద్మగంధి ఆటంకం తెలిపి, తన తమ్ముడైన "సుహితు"ని కిచ్చి పెళ్ళి చేయాలనుకుంటుంది. గాంధారీ బాలరాజులు అద్భుత కృత్యాలు చేసి, శక్తి సామర్థ్యాలు ప్రదర్శించి చివరకు గంగాతీరంలో వివాహం చేసుకుంటారు. ఇది ప్రధాన కథ. ప్రధాన కథకు అనుకూలంగా కథ పొడుగునా అద్భుతరసం తాండవిస్తుంటుంది. (జా. గే. వా)

## గాథ

ఇది శ్రవ్య కావ్య భేదాలలో ఒకటి. తల్లి దండ్రులు, పితృదేవతలు, భూమి మొ॥ వాటిని గురించి చేసే స్తోత్రాలనూ, దాతలు-వీర పురుషులను ప్రశంసించే గీతాలనూ గాథలంటారు. (తె. వి. స-6)

## గాదె ఆదిశేషకవి

కాలం : క్రీ శ. 19వ శతాబ్దం పూర్వార్ధం.
స్థలం : నందివెలుగు గ్రామం కావచ్చు.
రచన : కొచ్చెర్ల ధామ శతకము.

అప్పయ్య కుమారుడు. ప్రౌఢ కవి. కన్నెకంటి వెంకట సుబ్బయ్య ప్రేరణంతో రచనలు చేశాడు. గర్భ కవిత్వంతో కూడిన పద్యాలు ఇతని శతకంలో చాలా ఉన్నాయి. (క. స-19)

## గాధేయోపాఖ్యానము

కర్త : రేవూరి అనంతయ్య (చూ).
అంకితం : బధిర కృష్ణ భూపాలునికి.

ఐదాశ్వాసాల ప్రబంధం. ఇది ఏకాశ్వాస ప్రబంధమని కందుకూరి వారు వ్రాశారు. అయితే ఐదాశ్వాసాల ప్రతి ఆంధ్ర సాహిత్య పరిషత్తులో ఉన్నది. శృంగార గాధేయోపాఖ్యానం అనే పేరుతో ఇందులోని ఆఖరు ఆశ్వాసం వేరుగా అచ్చువేయబడింది. శృంగార గ్రంథమాల వారు దీన్ని ప్రచురించారు. రచనలో శబ్దాలంకారాలు ఎక్కువ. మృదువైన సూక్తులతో నిండి ఉన్న గ్రంథం. (ద. దే. వా-376)

గాయక పారిజాతము

కర్తలు : తచ్చూరు సింగరాచార్యులు, చిన సింగరాచార్యులు.

సంగీత శాస్త్ర గ్రంథం. (తె. వి. స-4-1194)

గాయక లోచనము

కర్తలు : తచ్చూరు సింగరాచార్యులు, చిన సింగరాచార్యులు.

సంగీత శాస్త్ర గ్రంథం. (తె. వి. స-4-1194)

గాయక సిద్ధాంజనము

కర్తలు : తచ్చూరు సింగరాచార్యులు, చిన సింగరాచార్యులు.

సంగీత శాస్త్ర గ్రంథం. (తె. వి. స-4-1194)

గారడీ విద్య

దీనినే ఇంద్రజాలమంటారు. పూర్వం ఈ విద్యను రాజాస్థానాలలో ప్రదర్శించి సన్మానాలను, లాంఛనాలను పొందేవారట.

దీని ప్రసక్తి పండితారాధ్య చరిత్రలోను, అన్నమయ్య సర్వేశ్వర శతకం లోను గోపరాజు సింహాసన ద్వాత్రింశికలోనూ ఉంది.

వేపాకులను దూసి తేళ్ళను తెప్పించటం, అరచేతిలో రూపాయలు సృష్టించటం అప్పటికప్పుడు మామిడి టెంకలను పాతి, మొక్క మొలిపించటం, మనిషిని బుట్టలో పెట్టి మాయం చేయటం, గొంతుకోసి రక్తం చూపించటం, మన దగ్గరి వస్తువును మాయం చేసి ఇంకొకరి జేబుల నుంచి తెప్పించటం-మొదలయినవెన్నో గారడీ విద్యలో ఉంటాయి.

ఈ విద్య ప్రాచీనకాలం నుంచి ఇప్పటివరకూ ఆశ్చర్య వినోదాలకు ఆకరంగా నిలిచే ఉంది. (నా. ర. చ-272-274)

గారయ దొర

కాలం : క్రీ. శ. 19వ శతాబ్దం ప్రథమ భాగం.

స్థలం : ఆంధ్ర సంస్థానం-శ్రీకాకుళ మండలం-గజపతి డివిజను.

కవి పండిత పోషకుడు. క్రీ. శ. 1798లో ఆంధ్ర సంస్థానాధీశ్వరుడైన రామం దొరకు ఈయన కుమారుడు. ఓలేటి వారికి లక్ష్మీపురాగ్రహారం, పోచిర పెద్ది వారికి గదబవలస అగ్రహారం ఇచ్చి సన్మానించాడు.

నిష్ఠల కామయ్యశాస్త్రి, పంతుల బ్రహ్మయ్యశాస్త్రి తాతా కామావధాన్లు, తాతా వైద్యన్న వీరి ఆస్థాన పండితులలో ముఖ్యులుగా తెలియవస్తున్నది. (ఆం. సం. సా.)

గార్గ్యపురము సుబ్బశాస్త్రి

కాలం : క్రీ. శ. 18 వ శతాబ్దం.

స్థలం : గద్వాల.

రచన : యథాశ్లోక తాత్పర్య రామాయణము (అరణ్యకాండ) (దూ).

బిరుదము : ఉభయకవితా నిస్సహాయ సాహితీధురీణ.

పెక్కురు కవులచేత గద్వాల ప్రభువులు యథాశ్లోక తాత్పర్య రామాయణ ప్రబంధాన్ని అనువదింప చేశారు. అందులో ఈ కవి, అరణ్యకాండను మూడాశ్వాసాలుగా అనువదించాడు వీరి ఇంటిపేరు గార్గేయపురంగా కొందరు పేర్కొన్నారు

(ఆం. సం. సా.) (క. స-295)

## గార్లపాటి లక్ష్మణకవి

కాలం : క్రీ.శ. 16 వ శతాబ్దం.

రచన : వీరభద్ర చరిత్రము (అలభ్యం)

ఈ కవి శిష్యుడు పోశెట్టి లింగకవి ఇతన్ని పేర్కొన్నాడు. వివరాలు తెలియవు. (క. స. 207)

## గాలి నరసయ్య

నామాంతరం : అహోబల పండితుడు (చూ).

## గాలివారు

పంచభూతాలలో ఒకభూతమైన "గాలి" ని ఇంటి పేరుగా పెట్టుకొన్నవారు తెలుగు దేశంలో ఉన్నారు. క్రీ. శ. 17 శతాబ్దిలో ఆంధ్రశబ్ద చింతామణికి కవిశిరోభూషణమనే సంస్కృత వ్యాఖ్య వ్రాసిన అహోబల పండితుని ఇంటిపేరు ప్రభంజనం వారని, అయన అసలుపేరు "గాలి" నరసయ్య అని ప్రతీతి ఉంది.

(భారతి-మా-45-229; తె. వి. స-6-547)

## గిరిక

రామరాజ భూషణుని వసుచరిత్రలోని పాత్ర. వసుచరిత్ర ఆంధ్ర పంచ కావ్యాలలో ఒకటి.

గిరిక శుక్తిమతి యందు కోలాహలునకు జన్మించిన పుత్రిక. సుకవుల చెంత విద్య నార్జించింది. కిన్నరుల వలన సంగీత మభ్యసించింది. గంధర్వాప్సరోభామినులైన మంజువాణి ప్రభృతులు ఈమెకు చెలికత్తెలు. ఈమెలో ఉత్తమ నాయికా లక్షణాలన్నింటినీ కవి నిక్షేపించి ముగ్ధమనోహరంగా వర్ణించాడు. ఈమె సంగీత సాహిత్య విద్యలలో పరిపూర్ణత పొందిన ఉత్తమ నాయిక.

ఈమె వీణ వాయిస్తుండగా వసురాజు మిత్రుడు విశారదుడు కపట ముని వేషంలో వారిని సమీపించి ఆమె వృత్తాంతాన్ని తెలుసుకుంటాడు. అతడు గిరిక భవిష్యత్తును చెప్తూ వసురాజు పతికాగలడని సూచిస్తాడు. వసురాజు సందర్శనం తత్సంబంధమైన విరహమూ అనుపమానమైన ఘట్టాలు. వసురాజును చూసిన గిరిక తల్లి పిలుస్తోందని చెలికత్తె కలహంసి తెలపగానే అక్కడనుండి వెళ్ళిపోతుంది. ఆ తరవాత వియోగభారంతో వెన్నెల వేడికి తాళలేక "కిన్నర వధూరాజత్కరాంభోజ కాంభోజీ మేళ విపంచికారవ

సుధా పూరంబు కోరంబుగా" ఏడ్చింది. ఇంతటి స్నిగ్ధ సుకుమారులు ప్రబంధ నాయికలలో మరెవ్వరూ లేరు.

గిరిక చెలికత్తె మంజువాణి గిరికా విరహ వృత్తాంతాన్ని వసురాజుకు తెలిపి అతని మనస్సు తెలుసుకొని గిరికకు తెలియచేస్తుంది. ఆమె వసురాజునుంచి తెచ్చియిచ్చిన ఆనవాలు ఉంగరం గిరికకు అపరిమితమైన సంతోషం కలిగించింది. ఇంద్రాది దేవతలు పెండ్లి పెద్దలై వచ్చి నిర్వర్తించిన కల్యాణ ఘట్టంలో గిరిక లజ్జావతిగా, తల్లి దండ్రుల ఎడబాటుకు పరితపించే నూతన వధువుగా భాసిస్తుంది. ఈ పాత్రను రామరాజ భూషణుడు అనుపమానంగా చిత్రించాడు.

## గిరిజా కల్యాణము (అలభ్యం)

కవి : పింగళి సూరన (చూ).

ఇందులోని ఒక పద్యం ఆనందరంగ రాట్ఛందంలో ఉదాహరింపబడింది.

## గిరిజాధి నాయక శతకము (అలభ్యం)

కర్త : చక్రపాణిరంగనాథుడు.

వృత్తశతకం. కొన్ని పద్యాలు మాత్రం లభించాయి. (శ. క. చ-729)

## గిరియమ్మ

కాలం : క్రీ. శ. 17వ శతాబ్దం—ఉత్తరార్థం, 18వ శతాబ్దం ప్రారంభం.
స్థలం : బోరవెల్లి (సంస్థానాధీశ్వరురాలు).

కవి పండిత పోషకురాలు.

గద్వాల పెదసోమభూపాలుని (1663-1712)కి కూతురు. బోరవెల్లి సంస్థానాధిపతి చిన సోమభూపాలుని ధర్మపత్ని. లయగ్రాహి గరుడాచల కవిని ప్రోత్సహించి బోరవెల్లి కేశవస్వామికి అంకితముగా "కౌసలేయ చరిత్రము" వ్రాయించింది.

(ఆం. సం. సా.)

## గిరిరాజకవి

ఈయన ప్రసిద్ధ వాగ్గేయకారుడైన త్యాగరాజుకు తాత. సంస్కృతాంధ్ర భాషలలో మిక్కిలి ప్రజ్ఞావంతుడు. సంగీత విద్యా సంపన్నుడు. ఈయన తెలుగులో భక్తి వేదాంత విషయకాలయిన కీర్తనలు చాలా వ్రాశాడట. (తె. వి. న-4)

## గీత గోవిందము

కర్త : చూ. ఋగ్వేది వేంకటనారాయణ కవి.

జయదేవ కవికృతమైన "గీతగోవింద" రచనకు ఇది ఆంధ్రీకరణం.

(ఆం. సం. సా.)

## గీత రఘునందనము

కర్త : ముమ్మడిదేవుల తిరుమల కవి.

ఈ యక్షగానంలో రామాయణ కథ యథా వాల్మీకంగా ఉన్నది దానివలె నిది "పాఠ్యేగేయేచ మధుర" మ్మన దగినది. రఘునందనము గానే గీత గోవిందం స్ఫురణకు వస్తుంది. గీత గోవిందం భావ ప్రధానం. గీత రఘునందనం వస్తు ప్రధానం. దీనిలో పాటలెక్కువ.

ఇది గతి గంభీరములైన ద్విపదలతో ఏలలు, అర్థ చంద్రికలు, లాలిపాట, శోభనములు, గేయ విశేషాలతో నిర్వచనంగా ఉంది. రచన నిర్దుష్టమైనది. (య. వా. చ-106)

## గీత రత్నావళి (సంస్కృతం)

కర్త : జాయప సేనాని (చూ). (ప్రా ద. భా బ.)

అలభ్యం.

## గీత సూక్తములు

కర్త : మల్లికార్జున పండితుడు.

రచనాకాలం : క్రీ శ. 1150 ప్రాంతం.

## గీతార్థసార సంగ్రహము

కర్త : చూ. వెలుగోటి సర్వజ్ఞకుమార యాచేంద్రులు (1832-1892).

సర్వ మతాలలోని సారాన్నీ వాటి పరస్పర వైవిధ్య వైరుధ్యాలనూ దృష్టిలో ఉంచుకొని, శాస్త్ర దృష్టితో చర్చించి వ్రాయబడిన గ్రంథం. (అం. సం. సా-461)

## గుంటుపల్లి తిప్పమంత్రి

కాలం : క్రీ. శ. 16వ శతాబ్ది.

స్థలం : వినుకొండ ప్రాంతం.

సాహిత్య పోషకుడు. కొటికెలపూడి సోమనాథ కవి విరచిత విష్ణుమిత్రోపాఖ్యానానికి కృతిపతి.

విశిష్టత : నవాబులు తెలుగుదేశాన్ని ఏలే రోజుల్లో వినుకొండ పరగణాను రామలింగ భాస్కరుడు పాలించేవాడు. ఇతనికి ముద్దమంత్రి అనే దత్తపుత్రుడున్నాడు. అతనికి ఈ తిప్పమంత్రి పినతండ్రి. (ఆరుద్ర-9-251)

## గుంటుపల్లి ముద్దమంత్రి (ముత్తమంత్రి)

కాలం : క్రీ. శ. 16వ శతాబ్ది.

స్థలం : వినుకొండ ప్రాంతం.

కవి పండిత పోషకుడు. దాశార్థి చరిత్ర అనే కావ్యానికి కృతిపతి.

విశిష్టత : ఈయన, కొటికెలపూడి సోమనాథ విరచిత విష్ణుమిత్రోపాఖ్యానం కృతిభర్త గుంటుపల్లి తిమ్మరాజుకు అన్న కొడుకు. నవాబుల పాలనలో వినుకొండ పరగణాను రామలింగ భాస్కరుడు పాలించాడు. ఈ భాస్కరునికి దత్తపుత్రుడే గుంటుపల్లి ముత్తమంత్రి. ఇతనిపై ఎందరో కవులు చాటువులు చెప్పారట

శ్రీముఖ సంవత్సరాది సంచికలో ఈయనపై కవులు చెప్పిన కొన్ని చాటువులను పండితులు ఉదాహరించారు. (ఆరుద్ర-9-251)

## గుంటుపల్లి సాంబన

కాలం : తెలియదు.

ఈయన చాలా పేరు ప్రతిష్ఠలున్నవాడని ఒక చాటువు వల్ల తెలుస్తున్నది. చాటుకవి పేరు తెలియదు. (చా. ప. ర.)

## గుంటూరు (చాటువు)

ఈ నగరం మీద ఒక చాటు పద్యం దొరుకుతున్నది. కవి ఎవరో, ఎప్పటివాడో తెలియదు. ఈ పద్యంవల్ల గుంటూరును నారాయణోదయ నరపతి పాలించినట్లు, తిక్కన తాత, తండ్రి, కుమారుడు గుంటూరుకు విభులైనట్లు, తిక్కన చిన్నతనంలో గుంటూరి నల్లకాణాంబను ఆరాధించి, ఆ శక్తి అనుగ్రహంతో పాండిత్యాన్ని పొందినట్లు తెలుస్తున్నది. (చా. ప. ర.)

## గుండభట్టు నారాయణ కవి

కాలం : తెలియదు.

చాటుకవి.

ఈయన విట్ఠలపెద్ది మంత్రి మీద చెప్పిన చాటు పద్య మొకటి లభిస్తున్నది. (చా. ప. ర.)

## గుండిమెడ అన్నమంత్రి

కాలం : క్రీ.శ. 12వ శతాబ్దం.

నామాంతరం : అన్నయ్య ప్రెగ్గడ.

1. త్రిభువన మల్లదేవ చోడ మహారాజు శాసన రచయిత (1091).
2. దక్షారామ శాసన ప్రదాత (1149).

విశేషాలు : ఈయన కమ్మనాటి త్రిభువన మల్లదేవచోడునికి, అతని కుమారుడైన నన్నిచోడరాజుకు మహామంత్రియట. మహామాత్య పదవీ విరాజితుడు. ఈయన దాన ధర్మాలను గురించి త్రిభువన మల్లదేవ చోడుని శాసనం చెబుతున్నది. ఈయన సాహిత్యపారంగతుడే గాక, సుకవీంద్రుడట. ఈయన పూర్వీకులు వంగిపురం అగ్రహారంలో ఉండేవారట. ఈయన కమ్మనాడులోని "ఎద్దనపూడి" (చిలకలూరిపేట తాలూకా) గ్రామాన్ని పండితులకు అగ్రహారంగా ఇచ్చాడట. ఈ దిగువ క్షేత్రాలలో ఆయా దేవతలను ప్రతిష్ఠించాడు.

1. శ్రీ పర్వతం-మల్లికార్జున-త్రిపురాంతకులు 2. సేతువు-రామేశ్వరుడు 3. సౌరాష్ట్రం-సోమనాథుడు 4. ద్రాక్షారామం-భీమేశ్వరుడు 5. ధాన్యవాట-అమరేశ్వరుడు 6. గుండిమెడ-మహాదేవుడు 7. త్రిప్రయాగ-మాధవుడు 8. ఒడ్డదేశం-శ్రీ పురుషోత్తముడు 9. జీహరిగిరి-నరసింహుడు (సింహాచలం). 10. ప్రేపల్లి-భావనారాయణుడు

11. గంజాము-భావనారాయణుడు 12. చెఱుకూరు-త్రివిక్రముడు 13. కొట్యదోన-శ్రీ శంకరేశ్వరుడు, కేశవుడు 14. చేబ్రోలు-మహాసేనుడు 15. సామిమల-కుమారస్వామి 16. మద్దితేపులు-మారభట్టారకుడు. (తె. క. చ. 195, 196)

## గుడారు వేంకటదాసు

కాలం : తెలియదు.

రచన : 1. ప్రబంధ రాజ శిరోభూషణ ప్రకృష్ట బలరామ చరిత్రము (బలరామ చరిత్రము).

తండ్రి గురవేంద్రుడు. తల్లి రంగమ్మ. ఇతడు గణపవరపు వేంకటకవి కృతిని చూచి పై రచన చేసి ఉండవచ్చును. ఇతని కవిత ప్రౌఢంగా ఉంది. (క. చ. 3-154)

## గుడిపాటి కోదండకవి

కాలం : క్రీ.శ. 18వ శతాబ్ది.

రచన : రసమంజరి.

క్రీ. శ. 1873 నాటికి ఇతని రచన ముద్రితం. ఈ కవిని విద్వత్కవి, కోదండపతి అని కూడా వ్యవహరిస్తున్నారు. వీరమాంబ రంగయామాత్యుల పుత్రుడు. వెంగళమంత్రి పౌత్రుడు.

సంస్కృతంలో భానుకవి రచించిన రసమంజరిని ఆంధ్రీకరించాడు. ఇతని కవిత్వం కొన్ని దోషాలున్నా రసవంతమైనదని పండితాభిప్రాయం.

(ద. దే. వా. పీఠిక-118; క. చ. 3-134)

## గుడుగుముల అహోబలశాస్త్రి

కాలం : క్రీ.శ. 1839 ప్రాంతం.

స్థలం : ఎట్టియాపురం సంస్థానం (తమిళదేశం).

రచనలు : తెలియరాలేదు.

అష్టాదశాగమవేత్త. ఆంధ్ర సంస్కృతాలలో పండితుడు. జగదీశ్వర రామకుమార ఎట్టప్ప మహారాజు ఆస్థానంలోని వాడు. (ద. దే. వా. 513)

## గుణగ విజయాదిత్యుని శాసనాలు

కాలం : క్రీ. 848 ప్రాంతం.

ఈయన వేంగిచాళుక్య ప్రభువు. పండరంగడు ఈయన సేనాని. ఈయన వేయించిన దాన శాసనాలు అసమగ్రంగా దొరికాయి. ఈ శాసనాలు పద్యబద్ధాలు. ఈ శాసనాలు రాజచరిత్రను నిరూపించే వస్తు ప్రధాన రచనలేగాక వీటిలో వాఙ్మయ లక్షణాలున్నాయి. దొరికిన శాసన భాగాలు దేశీ ఛందమైన తరువోజలో ఉన్నాయని పండితులు చెబుతున్నారు.

ఈయన శాసనాలలోని విషయం రాజవర్ణన. ఆయన చేసిన దానమో, సంపాదించిన విజయమో, సాధించిన కార్యమో వర్ణితమై ఉండవచ్చు, కాని ఆ శాసన భాగాలు

మనకు పూర్తిగా దొరకలేదు. శాసనాలలో దొరికిన భాగాలలోని "శ్రీ నిరవద్యుండు", 'చిత్తజాతసముడు' "శివపదవర సేవితుడు" అనే పదాలను బట్టి సంస్కృత పదాలు తెలుగులో విశేషంగాచేరుతుండేవని స్పష్టమవుతుంది. ఈ పదాలు వ్యస్త, సమస్త పదాలుగా చెప్పవచ్చు. వ్యస్త పదాలంటే వేరు వేరుగా ఉండేవని, సమస్త పదాలంటే రెండు మూడు కలిసి సంస్కృతంలో ఒక పదంగా ఏర్పడి తెలుగులోకి వచ్చినవని చెప్పవచ్చు. ఈ పదాలతో కవితా భావాలు, అలంకార సంప్రదాయాలు, వర్ణనలు మొ॥ అన్నీ చేరాయి.

'చిత్తజాతసముడు' అనేపదం రాజుకు వాడిన విశేషణం. రాజు మన్మథునితో సమానుడని అర్థం. మన్మథుడు రూపంలో అందరికంటె శ్రేష్ఠుడని, అట్టివాడు రాజుకు సమానంగా వర్ణింపదగినవాడని సంప్రదాయ సిద్ధంగా తెలిసి వ్రాయటం తెలుగువారు తెలుగు భాషలో కనిపెట్టింది కాదు. ఇది సంస్కృతం నుంచి వచ్చిన పద్ధతి. అందువల్ల ఈ శాసనాలలో కనిపించే "శివపదవర సేవితుండు" మొ॥ పదాలు, వాటిలోని కవితా కల్పనలు సంస్కృతం నుంచే తెలుగులోకి వచ్చి చేరాయని విశ్వయించవచ్చు. తెలుగు దేశంలో ఈ పద్ధతి రచన-తెలుగు ఛందస్సులలో సంస్కృత ప్రభావం వల్లనే వచ్చినట్లు రూఢిగా చెప్పవచ్చు. (తె. వా.)

## గుణనిధి

శ్రీనాథ మహాకవి విరచిత కాశీ ఖండంలోని ఒక పాత్ర. గుణనిధి కాంపిల్య నగర వాసులైన యజ్ఞదత్త సోమిదేవమ్మల పుత్రుడు. దర్పకుని తోడి జోడు సౌందర్య రేఖగా ప్రతిపాదించబడిన పాత్ర. ద్యూత క్రీడారతుడు. బ్రాహ్మణాచారాలను వదలడమే గాక తదాచార నియమాలను నిందించే వరకు వెళ్ళినవాడు. చెడు స్నేహాన్ని పట్టి చెడినాడు. గుణనిధి తల్లి గుణనిధిని ఎంతగానో వెనక వేసుకు వచ్చి అతని చెడు అలవాట్లను కప్పి పుచ్చింది. గుణనిధి వివాహితుడే అయినా భార్యను సరిగా చూడక చెడు త్రోవలు త్రొక్కినాడు. తండ్రికి రాచ మర్యాదగా లభించిన నవరత్నాంగుళీయకాన్ని దొంగతనంగా (తండ్రికి తెలియకుండా) ఎత్తుకెళ్ళి, జూదంలో కోల్పోయాడు. దీనితో బాటు, ఎన్నో నగలను (సొమ్ములను) కుదువలు వేసి తెచ్చిన డబ్బును జూదమాడి కోల్పోయాడు. తన చౌర్యము బైటపడే సమయానికి ఇల్లు వీడి ఎవరికి చిక్కకుండా పారిపోయాడు. శివరాత్రి రోజున శివాలయం చేరి అక్కడి భక్తులు శివునికి నైవేద్యంగా పెట్టిన పిండి వంటకాలను అపహరించి ఆకలి తీర్చుకోవడం కోసం నిద్ర పోకుండా జాగరం చేస్తాడు. భక్తులందరూ నిద్రించిన తరువాత తెల్లవారుఝామున గుణనిధి గర్భాలయంలో ప్రవేశించి, కొడిగట్టిన దీపాన్ని వెలిగించి ఆ వెలుగులో పక్వాన్న పాత్రను దొంగిలించి పారిపోయే సందర్భంలో కాలివేలు ఒకనికి తాకడం, అతడు దొంగ దొంగ! అని అరవడం జరుగుతాయి. కళవళపడి లేచిన జనంలో పదిమంది గుణనిధిని కొట్టగా అతడు మరణించాడు. గుణనిధిని కొనిపోవడానికి శివభటులు-యమభటులు వచ్చి పరస్పరము వాదులాడుకొని, శివభటులు అతనిని కైలాసపతి అనుగ్రహానికి పాత్రుని చేశారు. శివపూజ మహిమ ఎట్టిదో ఈ కథలో కవి సూచించాడు. తెలిసిగాని తెలియక

గాని ఒక్కనాడు పర్వదినాన శివాలయంలో జాగరముండి దీపం వెలిగించిన ఫలమే అన్ని దుఃఖాలను దూరం చేస్తుందని ఈ కథ తెలుపుతున్నది.

### గుణాలంకార మణిమాలిక (అలభ్యం)

కర్త : పడకండ్ల గురురాజకవి.

### గుత్తికొండ అప్పన్న

కాలం : తెలియదు.

ఈయనను నుతిస్తూ ఎవరో కవి ఒక చాటువు చెప్పాడు. (చా. ప. ర.)

### గునుగుటూరి వెంకటకృష్ణ కవి

కాలం : క్రీ. శ. 17 వ శతాబ్దం.
స్థలం : మైసూరు.
రచన : నలరాఘవ యాదవ పాండవీయం.
బిరుదు : శ్లేషకవితా పితామహుడు.

కోడూరి వెంకటాచలకవికి మేనమామ. చిత్ర విస్తర కవితలలో దిట్ట. (ఆరుద్ర-12-84)

### గుమ్మడపు పాపరాజు

కాలం : తెలియదు.
స్థలం : గుళ్ళపాడు.

సాహితీ ప్రియుడు. కృతిపతి. గుళ్ళపాటి పురాధీశ్వరుడైన జగ్గన ప్రభుని కుమారుడు. చెన్నూరి శోభనాద్రి రచించిన "శృంగార సుధా సముద్ర పూర్ణ చంద్రోదయ"మనే ప్రబంధాన్ని అంకితం పొందాడు. ఇతడు పద్మనాయక ప్రభువట. (క. స-270)

### గుమ్మడపు రమణరాజు

కాలం : క్రీ. శ. 18 వ శతాబ్దం.
స్థలం : కొమ్మాలపాడు (నరసారావుపేట తాలూకా).

సాహిత్య పోషకుడు. కొమ్మాలపాటి పురాధిపతియైన మన్నె హంవీర పాపన్న భూపతికి బుచ్చిమాంబకు పుత్రుడు. అకలంక శ్రీకృష్ణ మార్యుడనే కవిని ప్రోత్సహించి "కృష్ణ విలాసము" అనే యక్షగానాన్ని రచింప జేశాడు. "కొమ్మాలపాడు దండకము" ఈ కృష్ణ మార్యునిదే.

### గుమ్మడివెల్లి కృష్ణయ్య

ఈయన వితరణను తెలియపరిచే ఒక చాటువున్నది. చాటు పద్య కర్త పేరు తెలియదు. (చా. ప. ర.)

### గురజ

కృష్ణా మండలంలోని ప్రాచీన సంస్థానం. 'చార్‌మహల్' అనేది దీని మొదటి

పేరు. కలిదిండి, గుడివాడ, బత్తరజల్లి, విన్నకోట అనే నాలుగు పరగణాలు కల సంస్థానం కాబట్టి 'చార్‌మహల్'గా ప్రసిద్ధి చెందింది. కానుకొల్లు, బేతవోలు అనేవి దీనికి పూర్వపు రాజధానులు.

పద్మనాయక వంశానికి చెందిన "కమదన" వారు ఈ సంస్థాన పాలకులు. వీరి నివాసం "గురజ"లో ఉండడం చేత సంస్థానానికి ఆ పేరు స్థిరపడింది.

ఈ సంస్థానం వారి పూర్వీకులు ఓరుగల్లు ప్రాంతంలో సామంతులుగా ఉండే వారట. తదనంతర కాలంలో ఈ ప్రాంతానికి తరలివచ్చి స్థిరపడ్డారు. కమదన గురవయ్య, గొడ్డళ్ళ అయ్యన్న (1738–1759), సుబ్బయ్య, అంకప్ప (1759–1873), రాయన్న, పెద పాపయ్య మొ॥ వారు పూర్వపాలకులు.

క్రీ. శ. 1764 నుండి సంస్థానం చిక్కుల్లో పడింది. అప్పులు పెరగడం చేత నూజివీడు, మొగల్తుర్రు, కాంద్రేగుల జమీందార్లు సంస్థానాన్ని కౌలుకుతీసుకున్నారు. సంస్థానం 1788–1791 మధ్య కాలంలోనూ, 1801–1803 మధ్య కాలంలోనూ కుంఫిణీ వారి వశంలో ఉండేది. 1813 లో అప్పులు అధికంగా ఉండడం చేత కలిదిండి, బత్తర జల్లి పరగణాలను వేలం వేశారు. పరిపాలన చక్కగా లేకపోవడం చేత ఈ సంస్థానం 1876 నాటికి పూర్తిగా హరించుకు పోయింది. వారసులకు భరణం మాత్రం మిగిలింది. క్రీ. శ. 19 వ శతాబ్దం ఉత్తరార్ధంలో పాపయ్యరావు అనే వారసుడు, ఎర్నగూడెం తాలూకాలోని వేగవరం, బొర్రంపాలెం ఎస్టేటులను కొని, భరణం స్వీకరిస్తూ గురజలోనే నివాసం సాగించాడు. అతని తర్వాతి వారసుడైన (పాపయ్యరావు రెండవ కుమారుడు) వేంకటనరసింహ రామచంద్రరావు సంస్కృతాంధ్ర భాషల్లో అపార పాండిత్యం కలిగిన వాడు. కవి పండిత పక్షపాతి. ఇతని కుమారుడు వేంకటవరదరాజ శోభనాద్రి ఆంధ్ర భాషలో నిరుపమాన వైదుష్యం కలవాడు. సారస్వత సర్వస్వ పత్రికా పోషకుడు.

కాశీనాథుని మల్లనారాధ్యునివంటి ప్రముఖ కవిపండితులు ఈ "కమదనము" వారిచే మడిమాన్యాదులు పొందారు. (ఆం. సం. సా–531, 532).

## గురజాల పేరయార్యుడు

కాలం : 18 వ శతాబ్దం.

కవి పోషకుడు. సాహిత్య ప్రియుడు. పోడూరి పెదరామామాత్యుని ప్రోత్సహించి అతని చేత శివరామాభ్యుదయము అనే ద్వ్యర్థి కావ్యం వ్రాయించాడు. (క. స–128)

## గురుగీతా సారము

కర్త : కంభంపాటి నారపామాత్యుడు.

వేదాంత గ్రంథం. గ్రంథంలో భుజంగగురుడు, గోపాల శిష్యుడు అనే వారి ప్రసక్తి ఉంది. ఈ కవికి గురువు దేసువకొండ రామబ్రహ్మ గురుడు.

### గురుదీక్షాబోధ

కర్త : పిడుపర్తి (మొదటి) బసవకవి.
ద్విపద కావ్యం.

ప్రత్యేకత : కెరియ పద్మరసు అనే కన్నడ కవి ఈ కావ్యాన్ని మొదట సంస్కృతంలో, తరవాత కన్నడ రగడలో వ్రాశాడట. దీనినే, ఈ కవి ఆంధ్రీకరించినట్లు స్వయంగా చెప్పుకొన్నాడు.

వీరభూపాలుని ప్రోత్సాహంతో ఈ రచన చేశాడు. (క. త-6-29)

### గురుబోధ

కర్త : సోమన.

మూడాశ్వాసాల ద్విపద కావ్యం. శైవవేదాంత ప్రతిపాదకమైన గ్రంథం. శైలి సరళంగా ప్రసన్నంగా ఉంది. (ద్వి. సా. చ-299)

### గురుశిష్య సంవాదము

కర్త : తెలియదు.

గ్రంథం అసమగ్రంగా లభించింది. శైవ వేదాంత ప్రతిపాదకమైన ద్విపద కావ్యం. దీని ప్రతి మద్రాసు ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారంలో ఉంది. (ద్వి. సా. చ-296)

### గురుశిష్య సంవాదము

కర్త : యోగానంద అవధూత.

ద్విపద కావ్యం. గురు శిష్య సంవాదరూపంలో ఉన్న వేదాంత గ్రంథం. గురుసేవా విధానం, వైరాగ్య పద్ధతి, షోడశ వికారాలు, గుణత్రయ విభాగం-మొదలైన విషయాలున్నాయి.

ప్రత్యేకత : కవికి విషయం ముఖ్యం కాని వ్యాకరణం, ఛందస్సు, యతి ప్రాసలు ముఖ్యం కావని చెప్పాడు. (ద్వి.సా.చ. 296; ఆరుద్ర8-274)

### గురుశిష్య సంవాదము (అలభ్యం)

కవయిత్రి : హోసూరి సాకమ్మ.

వేదాంతపరమైన రచన. (ద. దే. వా-408)

### గుర్రము చినకపోదయ్య

కాలం : 1817 కి పూర్వుడు.
స్థలం : రొంపిచర్ల.
రచన : వీరచోడవ్వ చరిత్ర.

ఈ కవి తలిదండ్రులు సోమమ గణపతయ్యలు. ఇతడు రెండు గ్రంథాలు వ్రాసి రొంపిచర్ల శంకరేశ్వరునికి అంకిత మిచ్చినట్లు తెలుస్తున్నది. ఆ రెండవ రచన పేరు తెలియరాలేదు. ([illegible]. చ. 86)

## గువ్వల చెన్నడు

చాటుకవి. లోకానుభవంతో పద్యాలు చెప్పాడు. ఇతనివి చాలా చాటువులు దొరుకుతున్నాయి. (చా. ప. ర.)

## గువ్వలచెన్న శతకము

కాలం : క్రీ.శ. 16వ శతాబ్ది.

ప్రత్యేకత : ఈ శతక కర్త పట్టాభిరామ కవి అనీ, గువ్వల చెన్నడనీ అభిప్రాయ భేదాలున్నాయి. గువ్వల చెన్నని మీద అల్లసాని పెద్దన పద్యాలను చెప్పినట్లు బ్రౌన్‌దొర, ఆయన పండితులు చెబుతున్నారు. పై పండితులు పై శతక పద్యాలను సేకరించే నాటికే, పట్టాభిరామకవి పేరు మరుగున పడి ఉండవచ్చును. మరున్నందన, వజ్రపంజర శతకాలు వ్రాసిన పట్టాభిరామకవి కవిత చిక్కగా ఉంటుంది. ఈ శతకం లోని శైలి సరళంగా ఉంటుంది. వ్యావహారిక ప్రయోగాలున్నాయి. సప్త సంతానాలలో ఏది చెడినా, పద్యం మాత్రం చెడదని ఈ శతకంలోని ఒక పద్యం చెబుతున్నది (ఆరుద్ర-9-227)

## గూటాల

ఇది గోదావరి మండలంలోని ఎస్టేటు. ఇంజరము, గూటాల, చిడిపి, తిరుగుడు మెట్ట, పెద్దేహం, ముంగొండపాలెం మొ॥ ఈ ఎస్టేటుకు సంబంధించిన గ్రామాలు.

ఈ ఎస్టేటు మొదట "పోలవరం" రాజాగారి స్వాధీనంలో ఉండేది. క్రీ. శ. 1812లో పోలవరం ఎస్టేటంతా వేలం వేయబడినప్పుడు దాన్ని నూజివీడు జమీందారు గారైన అప్పారావుగారు ఖరీదు చేశారు. తరువాత క్రీ. శ. 1827లో మన్యం సత్యలింగ మనే వైశ్య శ్రేష్ఠుడు దీన్ని నూజివీడు రాజాగారివద్ద నుండి సుమారు 2,30,000 రూపా యలకు కొన్నాడట.

ఈ ఎస్టేటు సంపాదకులు మన్యం సత్యలింగం. వీరి తండ్రి మన్యం కనకయ్య. వీరు కాకినాడలో వర్తకులు. విదేశీ వ్యాపారాల్లో అమిత లాభం పొందారు, ఫ్రెంచి వారి ఏలుబడిలో ఉన్న "యానాము"లో స్థిరపడిపోయారు. మన్యం సత్యలింగంగారు 1827-1850 లో సంస్థాన పాలనం అతి నైపుణ్యంతో నిర్వహించారు.

ఈ ఎస్టేటు పాలకులలో క్రీ. శ. 19వ శతాబ్దం ఉత్తరార్ధానికి చెందిన "చిన కనకయ్య" ప్రసిద్ధుడు. ఇతడు ఫ్రెంచి కుంపిణీ వారికి ఆప్తమిత్రుడు. ఫ్రెంచివారి నుండి లక్షరూపాయలకు అనేక భూములను ఖరీదు చేసి ఎస్టేటును పెంపు చేశాడు. కాని ఈయన చిన్న వయసులోనే మరణించాడు. తరువాత ఈయన భార్య "మహాలక్ష్మమ్మ" ఈ సంస్థాన పాలనను చేపట్టింది.

ఈమె సంగీత సాహిత్యాలలోను, లలిత కళలలోను అభిరుచి కలది. ప్రసిద్ధి చెందిన చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రిగారు తమ 'నానారాజ సందర్శనం'లో ఈమె వితరణ గుణాన్ని చక్కగా ప్రశంసించారు.

ప్రసిద్ధ కాశీ పండితులు పుల్య దక్షిణామూర్తిశాస్త్రి, గాడేపల్లి సుబ్బావధాని వంటి ప్రసిద్ధులైన కవి పండితులు ఈ మహాలక్ష్మమ్మ గారిచే సన్మానింపబడ్డారు.

(ఆం. సం. సా-129-133)

## గూళికల్లు వేంకట రమణకవి

కాలం : క్రీ.శ. 16 శతాబ్ది ఉత్తరార్థం - 17 వ శతాబ్ది పూర్వార్థం.

రచనలు : 1. హరివంశము (అలభ్యం) 2. కనకరంజిత శిఖామణీ పరిణయము (అసమగ్రం).

గురువు : సుమతీంద్రుడు.

ఈ కవి పూర్వ కవిస్తుతిలో రామలింగని, తిమ్మనను పేర్కొన్నాడు కాబట్టి వారికి అర్వాచీనుడు. ప్రౌఢంగా రచన చేశాడు. వేంకట మంత్రి రంగమాంబల పుత్రుడు.

విశిష్టత : ఈయన మొదటి కావ్యం నామమాత్రావశిష్టం. అలభ్యం. రెండో కావ్యాన్ని వేంకటేశ్వరస్వామి కలలో కనబడి చెప్పి వ్రాయమంటే వ్రాశాడట. విక్రమార్కుని వైశ్య సోదరుడు భట్టి, కనకరంజిత శిఖామణిని పెళ్ళి చేసుకోవటం ఇందులోని ప్రధాన కథ. (అరుద్ర-9-236)

## గృహరాజ దిబ్బ

చూ. గృహరాజ సౌధము.

## గృహరాజ సౌధము

కొండవీటి సామ్రాజ్యాన్ని పాలించిన కుమారగిరి రెడ్డి (1383-1400) విలాస భవనం. ఆస్థాన నర్తకియైన లకుమతోను అంతఃపుర స్త్రీలతోను కుమారగిరిరెడ్డి ఈ భవనంలో విహరిస్తుండే వాడట. నేటికీ కొండవీటిలోని ఒక దిబ్బ "గృహరాజదిబ్బ"గా వీరి చిహ్నంగా మిగిలి ఉంది. స్థానికులు దీనిని "భోగం దాని మేడ" అని ఇప్పటికీ వ్యవహరిస్తున్నారు.

## గేయకావ్యము

గేయమంటే తాళ లయబద్ధంగా పాడటానికి అనువైందని అర్థము. పద్యాలను కొంత వరకు రాగయుక్తంగా పాడవచ్చు. వాల్మీకి రామాయణాన్ని మొదట కుశలవులు తాళ లయబద్ధంగా గానం చేసినట్లు తెలుస్తున్నది. తెలుగు సాహిత్యపు ఉత్పత్తి మొదట గేయాత్మకంగా ఉండి ఉండవచ్చునని పండితాభిప్రాయం.

శివ గీతాలున్నట్లు పండితారాధ్య చరిత్రవల్ల తెలుస్తున్నది. వీర గాథలు గేయకావ్యాలుగా దేశంలో వ్యాప్తి చెందాయి. జానపద సాహిత్యంలో గేయ శాఖ చాలా ప్రముఖమైంది. క్రీడాభి రామం జక్కుల పాటను పేర్కొన్నది. భక్తి గీతాలలో ఉత్తమ గీతాలు తాళ్ళపాక కవుల సంకీర్తనలు. శృంగార గేయాలలో క్షేత్రయ్య మువ్వగోపాల పదాలు ప్రసిద్ధాలు. త్యాగరాజు కృతులు సుప్రసిద్ధాలై ఉత్తమ

రచనలుగా తెలుగులో నిలిచాయి. పలనాటి వీరకథ, బొబ్బిలిరాజు కథ, దేశింగు రాజు కథ, బంగారు తిమ్మరాజు కథ మొ॥నవి తెలుగు దేశంలో నేటికీ ప్రచారంలో ఉన్నాయి. గేయాలకు గ్రామ సీమలలో ఆదరణ ఎక్కువ. గేయాలన్నీ రగడభేదాలే. ఇవి 3,4,5,6,7 గణాల కూర్పుగా సాగే గాన యోగ్యములైన రచనలు. యతిప్రాస నియమాలు, పాద సంఖ్యా నియమాలు ఐచ్ఛికాలు. (తె. వా: ఛం. ప. కో-316)

## గొంకరాజు మునుగోడు శాసనము

కాలం : క్రీ. శ. 1114.

శాసనప్రదాత : వెలనాటి గొంకరాజు.

స్థలం : గుంటూరు జిల్లా-పెదకూరపాటి ఇలాకా - మునుగోడు గ్రామం.

శాసన విషయం : ఈ శాసనం కూరపాటి సమీప గ్రామమైన మునుగోడు శ్వేత జినేశ్వరాలయం దగ్గర ఉంది. గ్రామం నడివీధిలో ఉన్న రాతిమీద ఈ శాసనం ఉంది. దీనిలో రెండు ఉత్పలమాలలున్నాయి. క్రీ. శ. 1100 నాటికి జైనమత మున్నట్లు ఈ శాసనంవల్ల తెలుస్తున్నది. (తె. క. చ-184)

## గొంకరాజు - II శాసనము

కాలం : క్రీ. శ. 1142.

ప్రస్తావిత స్థలం : గుంటూరు జిల్లా-రేపల్లె తాలూకా-భట్టిప్రోలు గ్రామం.

శాసన ప్రదాత : వెలనాటి రెండో గొంకరాజు.

శాసన విషయం : రెండో గొంకరాజు భట్టిప్రోలులో వేంచేసిన విష్ణువర్ధనేశ్వరునకు అఖండ దీపం నిల్పటం. దీనిలో ఒక చంపకమాల, ఒక ఉత్పలమాల ఉన్నాయి. (తె. క. చ-239)

## గొండ్లి నృత్యము

కాలం : కాకతీయులు - 12, 13 శతాబ్దాలు.

ఇది దేశీయ నృత్త విశేషం. కుండలాకారంలో చేసే నృత్యం. బతకమ్మ బొడ్డెమ్మల ఉత్సవ సమయాలలో పిల్లన గ్రోవులూదుతూ, ఆటలాడుతూ కుండలాకారంగా నృత్యం చేసేవారట. పురుషులు కోలాటం వేస్తూ, చిరతలు మ్రోగిస్తూ, చిందులు త్రొక్కుతూ పాటలు పాడుతుంటే, స్త్రీలు వలయాకారంగా చప్పట్లు చరుస్తూ బతకమ్మ పాటలు పాడేవారట. ఈ నృత్యం తెలంగాణాలో ఈనాటికీ విశేష ప్రచారంలో ఉంది.

(చూ. బతుకమ్మ పండుగ-బొడ్డెమ్మ పండుగ) (నా. ర. చ-63-69)

## గొంతేటి సూరన

కాలం : క్రీ.శ. 18వ శతాబ్దం.

రచన : కృష్ణాభ్యుదయము.

రామయామాత్యుని పౌత్రుడు. కాశిరాజు పుత్రుడు. ఇతని కవిత సామాన్యంగా ఉంది. (క. ష. 297)

## గొట్టిపర్తి ఎర్రమనాయని శాసనము

కాలం : క్రీ. శ. 1200.

శాసనప్రదాత : ఎర్రమనాయుడు.

శాసన విషయం : దీనిలో 2 ఉత్పలమాలలు, సీస పద్యాలు అసమగ్రంగాను, పద విభాగం చేయటానికి కష్టంగాను ఉన్నాయి. మరొక కంద పద్యం కూడా ఉంది. శాసనప్రదాత ఒకానొక "పూండి"లో తటాకం త్రవ్వించినట్లు మాత్రం తెలియవస్తున్నది. ఎర్రమనాయుడు చతుర్థ కులజుడట. (తె. క. చ-311)

## గొట్టుముక్కల రాజగోపాల శతకము

కర్త : దిట్టకవి రామచంద్ర కవి.

"గొట్టు ముక్కల పురొకా రాజగోపాలకా" అనే మకుటంతో ఏకయతి (కవర్గయతి) నియమంతో ఉంది. చక్కని ధారాశుద్ధి గల రచన. (శ. క. చ-841)

## గొడుగుల వచనము

నామాంతరం : ఉత్తర గోపుర కథపట్టు.

రామాయణంలోని యుద్ధకాండ భాగం. ఇందులోని ఒక ఉదాహరణను పావులూరి మల్లన ఇవ్వడంవల్ల దీనికి గొడుగుల వచనం అని పేరు వచ్చింది. ఈ భాగం కుందుర్తి వెంకటాచల కవి వచన రామాయణంలోనిదని పండితులు కొందరు భావిస్తున్నారు. (వ. వా. 48)

## గొబ్బి పదములు

రచనాకాలం : క్రీ.శ. 1150 ప్రాంతం.

కర్త : మల్లికార్జున పండితుడు.

## గొబ్బి పదాలు

నామాంతరం : గొబ్బి పాటలు

దేశి సారస్వతానికి చెందినవి. గొబ్బి పదాలు యక్షగానాలలో ప్రయుక్తాలు. గొబ్బిగోపి శబ్దభవమని, గొబ్బి నృత్యం గోపికల రాసక్రీడ వంటిదని పండితాభిప్రాయం. రాజాస్థాన్‌లో ప్రచారంలో ఉన్న గర్బనృత్యంవంటిదే గొబ్బి నృత్యమని, గర్బ శబ్దభవమే గొబ్బియని కొందరి తలంపు. (ఇది ప్రాయికంగా స్త్రీలు ప్రదర్శించే మండలాకారనృత్యం). ఆ నృత్యానుకూలమైన గీత ప్రబంధ విశేషమే గొబ్బి పదం. ఈ గొబ్బి పదాన్ని తాళ్ళపాక అన్నమాచార్యులు తన కృతుల్లో వ్రాశాడు. (య.వా.చ - 280-81)

## గొబ్బి పాటలు

నామాంతరం : గొబ్బి పదాలు (చూ)

## గొబ్బిళ్ళు

గీత రచనా విశేషం. ఇది యక్షగానాలలో ప్రయుక్తం. గొబ్బిపదం కంటె విలక్షణమైనది. సూర్యరాయాంధ్ర నిఘంటువులో దీనికి 'ఒక ఆడు పిల్లల పండుగ

(సంక్రాంతి) వేడుక, క్రీడా విశేషము, పాట, నమస్కార భేదము అని అర్థాలున్నాయి. పండుగలు వేడుకలకు, వేడుకలు క్రీడలకు, ఆటలు పాటలకు దారితీయటం తెలుగునాట ప్రసిద్ధం.

తాళ్ళపాకవారి సంకీర్తన లక్షణంలో ఇది ఒక నిబంధ పదంగా పరిగణింపబడింది అర్ధచంద్రక పదము, ఏలపదము, చందమామ పదము మొ॥ వాటితో పాటు "పాద యుగళముగ బహుజన సంప్రయుక్తిఁబరగు"నని సంకీర్తన లక్షణంలో ఉంది. గణపతి రెడ్డి గోపాల విలాసంలో, చూడమ్మ రుక్మిణీ కల్యాణంలో ఇది ఉంది.

(య.వా.చ - 321-322)

గొబ్బూరి నరసరాజు

కాలం : క్రీ.శ. 16వ శతాబ్దం

స్థలం : విజయనగరం కావచ్చును.

సాహిత్య పోషకుడు. అష్ట దిగ్గజాలలో ఒకడైన అయ్యలరాజు రామభద్రుడు రచించిన రామాభ్యుదయ కావ్యం ఇతనికే అంకితం. ఇతడు తిరుమల రాయని మేనల్లుడట.

గొల్ల కలాపము

కర్త : అత్రేయపురపు తమ్మయ

ప్రసిద్ధమైన గొల్లకలాపాన్ని పోలినరచన. గొల్లభామ సముద్రమథన కథాఖ్యానం చేయడం, తమ వంశ ప్రాశస్త్యాన్ని చెప్పడం - ఆధ్యాత్మిక సంవాదాలు ఉన్నాయి.

ఈ యక్షగానంలో ద్విపదలు, దరువులు, కందములు, వచనములు ఉన్నాయి. దరువులకు అక్కడక్కడ రాగనామాలు పేర్కొన్నాడు కవి. (య. వా. చ. 97)

గొల్ల కలాపము

చూ : గొల్లభామ వేషము కథ

కర్త : నక్కలపాటి సంజీవ కవి (య. వా. చ. 35)

గొల్ల కలాపము

కర్త : సిద్ధేంద్రయోగి

ఇది తొలుత భామాకలాపంలో కలిసి ఉండేదనీ తర్వాతికాలంలో ప్రత్యేక రూపకంగా రూపొందిందనీ తెలుస్తున్నది. దీనిలో గొల్లభామ పిండోత్పత్తి మొదలుకొని సుదీర్ఘంగా ఒక వేదాంతోపన్యాసం ఇవ్వడం, బ్రాహ్మణ శ్రేష్ఠులతో వేదాంత చర్చలు జరపడం కనిపిస్తుంది.

ఈ రచనను అనుసరించి తర్వాతివారు ఇదేపేరుతో ఈ కలాపాన్ని మరింత పెంచి వ్రాశారు.

(య. వా. చ. 35)

గొల్ల పదాలు

పద సారస్వతంలోవివి.

పిల్లనగ్రోవి గొల్లజాతి గాన కళాప్రతిష్ఠకొక ప్రాచీనచిహ్నం. సుద్దుగొల్లలు పదవిద్యకు పద్దులు. కృష్ణలీలలు, కాటమరాజు కథానులాపాలు వారి గుత్తపాటలు. గొల్లకలాపంలోని సుంకరి కొండని ఏల పదాలు గొల్ల గోవాళ్ళ హేలా రసికత్వానికి గుర్తులు.

నాయకరాజుల కాలపు యక్షగానాలలో గొల్లవారివేషభాషలు చొప్పింపబడ్డాయి. రంగాజమ్మ కృతులలో వీరి హాస్య ప్రసంగాలున్నాయి గాని పదాలులేవు. విజయరాఘవుని పూతనాహరణంలో గొల్లపదాలున్నాయి. పూతన కళేబరాన్ని ఈడ్చేటప్పుడు గొల్లపదం, మ్రొక్కుబడిపదాలు, 'రామాయణ బావుతాలు పదుచ్చుకొన్న', ప్రబుద్ధునిపదం, సివమాడే గొల్లనిపదం దీనిలో ఉన్నాయి. (య. వా. చ. 292-295)

## గొల్లప్రోలు

ఇది పిఠాపురం సంస్థానంలో ఒకభాగం. పిఠాపురం సంస్థానాధిపతి అయిన రాజా వేంకట సూర్యనారాయణింగారికి (1824-1850) నలుగురు కుమారులున్నారు. వారిలో ద్వితీయుడైన రాజా గంగాధర రామారావు (1844-1890) సంస్థానాధిపతిగా ఉన్నకాలంలో కనిష్ఠసోదరుడైన వేంకటరాయణింగారి కుటుంబవ్యయం కొరకు తూర్పుగోదావరిమండలంలోని ఇసుకపల్లి, గొల్లప్రోలు, భోగాపురం అనే గ్రామాలతో కూడిన ఈ ఎస్టేటును తమ్మునికి ఇచ్చారు. ఎస్టేటు అన్యాక్రాంతం చేయగూడదనే ఒప్పందం ఉండింది.

వెంకట్రాయణింగారికి రామాయమ్మ, వెంకాయమ్మ అని ఇద్దరు భార్యలు. వెంకట్రాయణింగారు నిస్సంతుగా మరణించారు. 1889లో వెంకాయమ్మకూడా మరణించడంతో రామాయమ్మ ఎస్టేటుకు సర్వాధికారిణి అయ్యింది. 1886లో ఈ రామాయమ్మ తన చెల్లెలి కుమారుడిని దత్తు తీసుకున్నది. ఈ సాకుతో పిఠాపురం రాజా ఈ ఎస్టేటుపై దావా వేశారుగాని, న్యాయస్థానం రామాయమ్మకే అనుకూలంగా తీర్పునిచ్చింది.

ఈ రామాయమ్మ గారు కవి పండిత పోషకురాలు. కాకినాడలోని వేద పాఠశాలకు విరాళమిచ్చి, పలువురు బీద విద్యార్థులకు విద్యా సౌకర్యం కల్పించారు.

(అం. సం. సా-533)

## గొల్ల భాగవతులు

వీరు తెలుగు దేశంలో పూర్వకాలం నుంచీ ప్రసిద్ధి చెందిన భాగవతులు. కృష్ణుడు గొల్లవాడనే విశ్వాసం కొద్దీ కృష్ణలీలాది భాగవత కథలనే ఎక్కువగా ప్రదర్శించేవారు. మొదట వీరి భాగవతాలు కళకోసం ప్రదర్శింప బడ్డా, రాను రాను యాచనకే వినియోగమయినాయి.

గొల్ల భాగవతులు పెళ్ళిళ్ళకూ, ఉత్సవాలకూ, తిరునాళ్ళకూ, పండుగలకూ, వ్యవసాయ తరుణం అయిపోయిన తరువాత తమ కథలను ప్రదర్శించేవారు. ఒకే గ్రామంలో ఒకే జట్టు ప్రతి వీథిలోనూ ప్రదర్శించేవారు. ఇంటింటా చందాలు వసూలు చేసేవారు. ప్రజలు వీరికి చందాలతోపాటు, కిరీటాలనుకూడా బహూకరించేవారు. పూర్వం గొల్ల భాగవతులకు మంచి ప్రసిద్ధి, ప్రచారం కూడా ఉండేవి. (నా. ర.చ-175)

## గొల్లభామ కథ (చాటువు)

ఈ కథమీద ఒక చాటువు దొరుకుతున్నది. ఈ పేరు మీద నిర్మించిన చలన చిత్రం (1944–1946)లో కూడా ఈ పద్యాన్ని వాడుకున్నారు ఈ పద్యానికి మూలం "రసికజన జీవనమ్" అనే గ్రంథంలోని శ్లోకమట.

చాటుకవి పేరు తెలియదు. (చా. ప. ర.)

## గొల్లభామ వేషము

కర్త : భారతి రామరాజు.

గొల్లకలాపాన్ని పోలిన రచన. దీనిలో చల్ల అమ్మడానికి వచ్చిన గొల్ల భామకు ఒక బ్రాహ్మణునికి జరిగిన సంభాషణ, గొల్లభామ నిత్యకృత్యాలు, గొల్లవారి కులాచారాలు, సముద్ర మథన కథ మొదలయినవి వర్ణించాడు కవి. కాని హాస్య ప్రసంగాలలో అసభ్యత అధికంగా ఉంది

దీనిలో దరువులు, ద్విపద, పద్యములు, వచనము, శ్లోకములు, తద్వ్యాఖ్యానము, ఏలలు ఉన్నాయి. (య. వా. చ–83)

## గొల్లభామ వేషము కథ

నామాంతరం : గొల్ల కలాపము

కర్త : నక్కలపాటి సంజీవకవి

యక్షగానం. దీనిలో గొల్లభామ సింగారించుకొని వీథిలోనికి చల్ల అమ్మడానికి వస్తుంది. అక్కడ ఆమె తమ కులంలోని తెగలు, కులాచార విధి నిషేధాలు ఏకరువు పెట్టి జగమెల్ల గొల్ల అని సిద్ధాంతీకరిస్తుంది. ఆమె పేరు మంచయాన. చివరి వరకు గొల్లభామ గొంతే వినిపిస్తుంది. కాబట్టి దీనిని గొల్లకలాపం అని కూడా అంటారు. దీనిలో దరువులు, ద్విపదలు, పద్యాలు, వచనాలు ఉన్నాయి రచన చక్కగా ఉంది. సముద్ర మథనగాథ, సుంకరి కొండని సరసం ప్రసక్తాలు.

ఈ రచన సిద్ధేంద్రుని గొల్లకలాపాన్ని అనుసరించి సాగింది.

(య.వా.చ. – 35–44)

## గొల్లసుద్దులవారు

తెలుగు దేశంలో ఒక రకమైన జానపద గాథలైన గొల్ల సుద్దులను వీరు చెబుతుంటారు. ఈ సుద్దులవారు ఒక్క గొల్లలనే యాచిస్తారు.

యాదవుల చరిత్రకు సంబంధించిన కృష్ణలీలలు, కాటమరాజు కథ మొ॥వాటిని వీరు ప్రచారం చేస్తూ ఉంటారు. అయ్యలరాజు నారాయణ కవి "హంస వింశతి"లో ఈ గొల్ల సుద్దులను వర్ణించాడు. వీరు కథా వివరాన్ని పెద్ద పెద్ద వస్త్రాలపై చిత్రించి, బొమ్మల సహాయంతో కథ చెబుతారు.

వీరు కొమ్ములు, వీరణాలను వాయిస్తారు. కొందరు శంఖాలను కూడా పూరిస్తారు. ఆవులను, గొర్రెలను పెంచే గొల్లవారి ప్రధాన దేవత గంగమ్మ. ఈ గంగమ్మ

జాతర దొనకొండ, అలవలపాడులలో అతి ప్రాచీన కాలం నుంచీ జరుగుతూనే ఉంది. గంగ జాతర్లలో ఈ గొల్ల సుద్దులను ఎక్కువగా చెబుతూ ఉంటారు.

(నా. ర. చ-274-275)

## గోండు జాతి నృత్యాలు

తెలంగాణాలోని కేసలాపురం భీమదేవు ఆలయం గోండుజాతి వారికి సంబంధించింది. ఇక్కడ గోండుజాతివారు జరిపే జాతరకు వేలాది గోండుజాతి ప్రజలు గుమిగూడతారు.

ఈ ఉత్సవంలో పాల్గొనటానికి గోండు కవులు, వాద్యకారులు, గాయకులు తప్పక హాజరవుతారు. ఈ ఉత్సవాలలో వివాహమైన నూతన వధువులు ప్రధాన పాత్ర వహిస్తారు. విగ్రహం ముందు నిలబడి - రాత్రి తెల్లవార్లూ తన్మయత్వంతో వివిధ రకాలయిన నృత్యాలు చేస్తారు. ఈ జాతరలో జరిగే ప్రదర్శనలకు గోండు ప్రజలే గాక ఇతరులు కూడా వస్తుంటారు. ఈ జాతర 15 రోజులపాటు జరుగుతుంది.

(నా. ర. చ-281)

## గోకర్ణ చ్ఛందస్సు (అలభ్యం)

కర్త : యా. గోకర్ణుడు.
రచనాకాలం : క్రీ. శ. 1130 ప్రాంతం.

దీనిలోని పద్యాలను అప్పకవి, కస్తూరి రంగకవి ఉదాహరించారు. గోకర్ణుడు ఈ ఛందో గ్రంథ కృతిపతి అని కొందరు భావిస్తున్నారు.

(క. త.-2) (కవిజనాశ్రయం. పీఠిక)

## గోకర్ణ దేవచోడుని శాసనము

కాలం : క్రీ. శ. 1127.
స్థలం : ఏలేశ్వర ప్రాంతం కావచ్చు.
శాసనప్రదాత : గోకర్ణ దేవచోడుడు.

శాసనవిషయం : ఈయన కోడూరుపురవరేశ్వరుడట. ఏలేశ్వరంలో వేంచేసియున్న దేవునికి అంగ భోగ రంగ భోగాలకు, ధూప దీప నైవేద్యాలకు "చెదకోడూరు" గ్రామాన్ని దానం చేశాడు. గోకర్ణ ఛందస్సును ఈయనే వ్రాశాడని పండిత నిర్ణయం. పై గ్రంథంలోని పద్యాలను ప్రాచీన కవులు గౌరన, అప్పకవి పేర్కొని ఉదాహరించారు. (తె. క. చ-191)

## గోకర్ణుడు (గోకర్ణ దేవుడు)

కాలం : క్రీ.శ. 1130 ప్రాంతం.
జన్మస్థలం : వర్ధమానపురం.
కృతులు : గోకర్ణ చ్ఛందస్సు. ఈ గ్రంథం సమగ్రంగా దొరకలేదు.

లాక్షణికులు ఇతన్ని ఉదాహరించారు.

(కవిజనాశ్రయం పీఠిక-వావిళ్ళ)

## గోగులపాటి కూర్మనాథ కవి

కాలం : క్రీ. శ. 1720–1790.

స్థలం : గజపతి నగర సమీపంలోని దేవులపల్లి.

రచనలు : ఏకాంతసేవ, మృత్యుంజయ విలాసము, లక్ష్మీనారాయణ సంవాదము, చోర సంవాదము (లేక) తిరుమంగ యాళ్వారి చౌర్యగాథ, జగన్నాథ స్వామివారి రాయబారము (లక్ష్మీ నారాయణ సంవాదము), సుందరీ మణి శతకము, సింహాద్రి నారసింహ శతకము, విజయరామ శతకము మొ॥.

గురువు : తిరుమల పెద్దింటి సంపత్కుమార వేంకటాచార్యులు.

ఇతడు గౌరమాంబా బుచ్చనామాత్యుల పుత్రుడు. పెద విజయరామరాజు కాలంలో విజయనగర సంస్థాన ఆస్థాన విద్వత్కవిగా పేరు పొందాడు. బహు గ్రంథ కర్త. సంస్థానాస్థానోద్యోగిగా ప్రభువుల నుండి అనేకాగ్రహారాలు దానం పొందాడు. దేవులపల్లి విశాఖ జిల్లాలోనిది.

ఇతని రచనలన్నీ భగవదంకితాలు. వీటిలో సింహాద్రినారసింహ శతకం అత్యంత ప్రచారంలోకి వచ్చింది. ఇతని కీర్తనలు ప్రసిద్ధ పుణ్యక్షేత్రాలలో నేటికీ పాడుతున్నారు. (ఆం. సం. సా–416)

## గోడే జగన్నాథరావు

కాలం : క్రీ.శ. 19 వ శతాబ్దం పూర్వార్ధం.

స్థలం : విశాఖ మండలం.

జమీందారీ కుటుంబానికి చెందినవాడు. సాహిత్య ప్రియుడు. ఇతడు సన్యాసం స్వీకరించిన తరువాత ఇతనిపై నిమిషకవి వేంకటేశకవి ఒక శతకం చెప్పాడు. "జ్ఞానభోగి గోడే జగన్నాథయోగి" అనేది దాని మకుటం. (క. చ–259)

## గోడే జగ్గారాయడు

కాలం : క్రీ. శ. 18 వ శతాబ్దం.

స్థలం : విశాఖ మండలం.

విశాఖపట్టణ ప్రాంతంలోని జమీందారు. సాహిత్య పోషకుడు. కాకరపర్తి తిరుపతి పాత్రకవిని ఆదరించి, అతనిని అగ్రహారాది దానాలతో సత్కరించాడట. (క. చ–37)

## గోడే సూర్యప్రకాశరావు

కాలం : క్రీ.శ. 19 వ శతాబ్ది పూర్వార్ధం.

స్థలం : విశాఖ మండలం.

సాహిత్య ప్రియుడు. గోడే జగ్గరాయని కుమారుడు. అక్కెనపల్లి నృసింహ కవి రచించిన ఓఘవతీ పరిణయం అంకితం పొందాడు. ఇతని సోదర పుత్రుడు ఈ గ్రంథాన్ని ముద్రించాడట. (క. చ–114)

## గోదాదేవి

నామాంతరాలు : ఆముక్తమాల్యద, ఆండాళ్, కొదైయాళ్వార్.

గోదాదేవి వైష్ణవ భక్తురాలు. విష్ణుచిత్తుని కూతురు. పన్నిద్దరాళ్వారులలో ఒకతె. కృష్ణ దేవరాయలు రచించిన ఆముక్తమాల్యదలో ఈమె కథ ఉంది.

శ్రీకృష్ణ దేవరాయలకు కళింగయాత్రా సందర్భంలో కలలో తెలుగు రాయడు ప్రత్యక్షమై ఆముక్తమాల్యద రచనకు పురికొల్పాడట. హరి, పూర్వం కృష్ణావతారంలో సుధాముడనే మాలాకారుడు ఇచ్చిన పూదండలను మగవాని చేతినుండి గ్రహింపవలసి వచ్చినదే అని బాధపడుతూ స్వీకరించాడు. ఆ కొదువ అతని మనస్సులో ఉంది. అందుకని తాను ముందుగా ధరించిన దండను రంగనాథునికి అర్పిస్తూ ఉండిన ఆ గోదాదేవి కథను—ఆమెను శ్రీరంగనాథుడు పెండ్లి చేసుకొన్న కథను వర్ణించి చెప్పుమన్నాడు "ప్రియాపరి భుక్తమాల్యము ధరించి నేనానందించిన కథను కావ్యంగా చెప్పడానికి నీవే సమర్థుడవని" తెలుగురాయడు, కన్నడరాయడైన శ్రీకృష్ణరాయలకు చెప్పాడట. అందుపై రాయలు విష్ణుచిత్తుని కథనూ గోదాదేవి కథనూ ఈ కావ్యంలో చెప్పాడు.

విష్ణుచిత్తుని కథ ఇందులో ఉంది కాబట్టి ఈ కావ్యానికి విష్ణుచిత్తీయమనే పేరు వచ్చింది. గోదాదేవి పూలదండలను తాను ముందుగా ధరించి భగవంతునికి అర్పించేది. అందుచేతనే ఆమెకు తమిళంలో చూడిక్కొడుత్త నాంచారు అని పేరు వచ్చింది. ఆముక్తమాల్యద అన్నా అదే అర్థం. ఆమె పేర ఈ కావ్యానికి ఆముక్త మాల్యద అనే పేరు వచ్చింది.

గోదాదేవి విష్ణుచిత్తునికి కన్న కూతురు కాదు. తులసివనంలో లభించింది. భూమి నుంచి లభించింది కాబట్టి 'గోద' అనే పేరనే పెరిగింది. ముకుందుడే స్వయంగా ఈమెను ప్రసాదించినట్లు విష్ణుచిత్తుడు భావించి ఆ శిశువును పెంచాడు. ఆమె యౌవనవతి అయింది. ఇక్కడ కవి ఆమె సౌందర్యాన్ని ప్రౌఢతరంగా వర్ణించాడు.

గోద "భూదేవి". సాధారణ మానవాంగన కాదు. మాల దాసరి కథ వలన గానము విశేష ఫలదమని విన్నది. విని "గోద"గా జన్మించింది. తమిళంలో ఈమెను కోదైయాళ్వార్ అంటారు. తమిళంలో కొదై అంటే పూమాల అని అర్థం.

గోదాదేవికి పూర్వజన్మలో చెలులయిన నాగకన్యలు పొరుగిండ్ల వైష్ణవుల కూతుళ్ళుగా జన్మించి ఆమెకు చెలులయ్యారు. నిరంతరం రంగనాథుని ధ్యానిస్తూ అతని కల్యాణగాథలు వింటూ ఆమె రంగనాథునిపై మనసు నిలుపుకొన్నది. అతన్ని గురించి పాడుతూ సేవలు చేసింది. గోదాదేవి "ధనుర్మాస వ్రతాన్ని" స్వీకరించి ఆ నెల రోజులూ గానం చేసిన పాటలే "తిరుప్పావు".

ద్రావిడ వేదమనబడే ఆళ్వారుల రచనలలోకెల్లా పవిత్రతమమైన "తిరుప్పావు" వైష్ణవులకు నిత్యానుసంధానం.

గోదాదేవి విరహాన్ని ఆమె కృశత్వాన్ని గమనించిన విష్ణుచిత్తుడు ఆమెను గూర్చిన తన వేదనను స్వామికి నివేదిస్తాడు. స్వామి అతనికి మాలదాసరి కథ చెప్పి

ఆమెను శ్రీరంగానికి తీసుకు వెళ్ళమంటాడు. శ్రీరంగంలో గోదాదేవిని చూసిన రంగ నాథుడు ఆమెను తన అంతఃపురానికి చేర్చి ఆమెవలెనే ఒక మాయా యువతిని చేసి విష్ణుచిత్తుని దగ్గర ఉంచుతాడు. గుడి నుండి బయటికి వచ్చిన విష్ణుచిత్తునికి కూతురు కనిపించదు. "అంత ప్రీతి ఉంటే నన్నడిగి వివాహం చేసుకోవాలిగాని నన్నడగకుండా ఇలా చేయడం న్యాయమా" అని విష్ణుచిత్తుడు రంగనాథునికి మొరపెట్టుకుంటాడు. "నీ కుమార్తెను ఇంటిలోనే వదలివచ్చి నాపై నిందలు వేయవద్దని" రంగనాథుడు అతన్ని ఇంటికి పంపివేసి బ్రహ్మరుద్రులను, సరస్వతిని, గౌరిని, పెండ్లి మాటల కొరకు విష్ణుచిత్తుని ఇంటికి పంపుతాడు. సకలదేవతల సమక్షంలో శాస్త్రోక్తంగా గోదాదేవి రంగనాథుల వివాహం జరుగుతుంది.

గోదాదేవి "నాచ్చియార్ తిరుమొళి" అనే ద్రవిడ ప్రబంధం వ్రాసింది. ఇందులో స్వప్నంలో స్వామి తనను వివాహమాడినట్లు వర్ణించింది.

## గోదావధూటీ పరిణయము

కర్త : మరింగంటి వేంకట (ప్రథమ) నృసింహాచార్యులు (చూ).

దీనిని క్రీ. శ. 1956 లో నల్లగొండ రామగిరి మహిళా భక్త సమాజం వారు ముద్రించారట. (తె. వి. స-6)

## గోదావరీ లహరి (సం)

కర్త : చూ. పేరి కాశీనాథశాస్త్రి.

సంస్కృత రచన. (ఆం సం. సా-427)

## గోదావరీ శతకము

రచనాకాలం : క్రీ.శ. 1466 ప్రాంతం కావచ్చును.

కర్త : ప్రెగ్గడపల్లి పోతయ్య.

గ్రంథప్రతి అసమగ్రంగా లభించింది. మత్తేభ శార్దూల వృత్తాలున్నాయి. రచన చక్కనిది. (శ. క. చ. 738)

## గోన గన్నారెడ్డి

చూ. గన్నయ్య సేనాని. (వా. చ-21)

## గోన బుద్ధరాజు (బుద్ధారెడ్డి)

కాలం : క్రీ. శ. 1291-1323 ప్రాంతం కావచ్చును.

రచన : రంగనాథ రామాయణము.

విశిష్టత : ఇతడు రాయచూరు శాసన ప్రసక్తుడైన విట్ఠలనాథుని కుమారుడు. కాకతి రెండో ప్రతాపరుద్రుని సామంతుడు. సర్వ పురాణ విచారతత్పరుడు. బహు కళాగమ విచక్షణుడు. కవి సార్వభౌముడు. కవి కల్పతరువు, కవిలోకభోజుడు, కవి పురందరుడుగా కీర్తింపబడ్డాడు, బుద్ధరాజు తన రచనలో రంగనాథుడనే కవి తోడ్పాటు తీసుకుని ఉండవచ్చు. అందువల్ల ఈ రామాయణం రంగనాథ రామాయణంగా కూడ

ప్రసిద్ధికి వచ్చి ఉండవచ్చు. కవి సుబోధకమైన శైలిలో చక్కని తెలుగువసంతో కథ నడిపాడు. మూలంలో లేనివి చాలా ఈతని రచనలో చోటు చేసుకున్నాయి. ఇతడు తన తండ్రి విఠలరాజు కోరికమీద అతనికి అంకితంగా ఈ రామాయణాన్ని రచించాడట. దీని కర్తృత్వం గురించి భిన్నాభిప్రాయాలున్నాయి. (ఆరుద్ర-3)

## గోన రామభూపతి

కాలం : తెలియదు.

బిరుదులు : మీసరగండ, గండరగండ.

ఇతన్ని గురించి చాటువులవల్ల తెలుస్తున్నది. ఈయన శౌర్యాన్ని మెచ్చి ఎవరో రాయలు దాలు బహూకరించాడట. ఈయన గోన బుద్ధారెడ్డి వంశీయుడు. చాటు పద్య కర్త పేరు తెలియదు (చా. ప. ర.)

## గోపన

కాలం : క్రీ. శ. 1370 ప్రాంతం.

స్థలం : చెంజి దుర్గం.

రచన : సింధుమతీ విలాసము.

ఇతడు చెంజిదుర్గ పాలకుడు నరసనామాత్యుని పుత్రుడు. ఇతని కాలాన్ని గురించి కొంత వివాదం ఉంది. క్రీ.శ. 1700 ప్రాంతం వాడనీ తెలంగాణాలోని 'గార్ల' ఇతని జన్మస్థలమనీ గోలకొండ కవుల సంచికలో ఉంది. కంపరాయల దక్షిణ దేశ దండ యాత్రలో అతనికి సహాయపడిన వాడని కొందరు అంటున్నారు. శ్రీరంగ దేవాలయ తూర్పు ప్రాకారంలోని శిలాశాసనంలోని శ్లోకాలు ఇతన్ని గురించినవేనన్న అభిప్రాయం కూడా ఉంది. (గో. కొం. క. సం, 398; ద. దే. వా-5)

## గోపరాజు రామ ప్రధాని

ఈయన ముప్పది ఇద్దరు మంత్రులలోని వాడు. గణపతి వంశానికి చెందిన గణపతి రాజువద్ద మంత్రిగా ఉండి కరణిక వృత్తిని నియోగి బ్రాహ్మణులకు చెందేటట్లు చేశాడట. ఈయన దానధర్మాలను, అప్పటి శాఖాభేదాలను వివరించే పద్యాలు, శ్లోకాలు దొరుకుతున్నాయి. (చా. ప. ర.)

## గోపరాజు రాయనామాత్యుడు

కాలం : క్రీ.శ. 18వ శతాబ్దం.

స్థలం : కొలనుపాక కావచ్చును.

అయ్యవార్యమంత్రి సుతుడు. సాహితీపోషకుడు. రావూరి సంజీవ కవిని రత్న హాట కాంబరాదులతో సత్కరించి, అతనిచేత వీరనారాయణునిపై శతకం రచింప జేశాడు. వీరనారాయణుడు కొలనుపాకలోని దైవం. (శ. క. చ-375)

## గోపాలపురము

తూర్పు గోదావరి మండలంలోని నాటి ర్యాలీ తాలూకాలోని ఈతకోట, ఊడి మూడి, కొమ్మరాజులంక, గంటి, గోపాలపురం, నరేంద్రపురం, పెదపూడి, పొడగట్లపల్లి

బెల్లంపూడి, అమరేశ్వరం అనే గ్రామాలతో కూడిన ఎస్టేటు ఇది. ఒకనాడు పెద్దాపురం సంస్థానంలోని ఈతకోట పరగణాలో ఒక భాగంగా ఉండేది. చాలా చేతులుమారి చివరకు క్రీ.శ. 1845 లో ఉప్పలపాటి జోగి జగన్నాథరాజు గారికి చెందింది. జగన్నాథరాజు గారు కొచ్చెర్లకోట వారిదైన ఈ ఎస్టేటును ప్రభుత్వం వారు వేలం వేయగా కొన్నారు. ఇతని తరువాత సతీమణి జానకయ్యమ్మగారు, దత్తపుత్రులు విజయగోపాల రాజుగారు ఎస్టేటును అనుభవించారు. ఈ విజయగోపాలరాజుకు జోగి జగన్నాథరాజు, సత్యఅప్పల వేంకటపతిరాజు అని ఇద్దరు కుమారులు. 1950లో ఈ ఎస్టేటు, జమీందారీ రద్దు చట్టం మేరకు అంతరించింది.

సంస్థానాన్ని సంపాదించిన జగన్నాథరాజు, అతని సతీమణి కూడా వితరణ గుణం కలవారు. సాహితీపోషకులు.

జానకయ్యమ్మగారు విజయనగరం నుంచి అప్పనభొట్ల గోపాలశాస్త్రి, అద్దేపల్లి కృష్ణశాస్త్రి ప్రముఖులను పిలిపించి వారికి జానకీ పురాగ్రహారంలో వృత్తుల నేర్పరచి పోషించారు. వెంకట విజయగోపాలరాజు కూడా విద్వత్పక్షపాతి. అద్దేపల్లి కృష్ణశాస్త్రి, చావలి రామసూరి ప్రముఖులు వీరి ఆస్థానంలో ఉండేవారు. ప్రసిద్ధ జ్యోతిశ్శాస్త్ర వేత్త పిడపర్తి చినపూర్ణయ్య సిద్ధాంతి గోపాలపురం సంస్థానాస్థాన విద్వాంసుడు. విజయగోపాల రాజ గ్రంథాలయం వీరి స్మృతి చిహ్నం. ఇతని కుమారుడు జోగి జగన్నాథరాజు ఆంధ్రేతిహాస పరిశోధక మండలికి రాజపోషకులుగా ఉన్నారు. (ఆం.సం.సా-534-535)

## గోపాలపేట

ఇది నిజాం రాష్ట్రంలోని ప్రాచీన సంస్థానం. నేటి మహబూబ్‌నగర మండలంలో ఉంది.

జనుంపల్లి వారు ఈ సంస్థాన పాలకులు. ఈ సంస్థానం తెలంగాణాలో అతి ప్రసిద్ధమైన వనపర్తి సంస్థానం నుండి వెలువడింది. కాబట్టి వనపర్తి పాలకులకు మూలపురుషుడైన దేశ్‌ముఖ్ శ్రీవీరకృష్ణభూపతి ఈ సంస్థానాధిపతులకు కూడా మూలపురుషుడు. వనపర్తి సంస్థాన పూర్వీకులలో (అష్టభాషా) బహిరీ గోపాలరాయడు అతిప్రసిద్ధుడు. ఈతని కుమారుడైన వెంకట్‌రెడ్డి తండ్రిగారి పేర గోపాలపేట సంస్థానాన్ని ఏర్పరచి చుట్టుపట్ల ఉన్న కొన్ని గ్రామాలను ఈ సంస్థానంలో చేర్చాడు. తమ్ముడైన రంగారెడ్డిని ఈ సంస్థాన పాలకుడుగా నియమించాడు. అప్పటినుండి ఇది ప్రత్యేక సంస్థానంగా రూపొందింది.

ఈ సంస్థానాధిపతులు మాతృక అయిన వనపర్తి సంస్థానాధీశులూ, పొరుగు నున్న గద్వాల సంస్థానాధీశులూ అనుసరించిన మార్గంలోనే ప్రయాణించి బహుళంగా సంస్కృతాంధ్ర సారస్వతానికి సేవ చేశారు.

జగపాలరావు గారి కాలంలో సాహిత్యసేవ పరాకాష్ఠ నందుకున్నది. వల్లా లక్ష్మీనరసింహశాస్త్రి, బుక్కపట్టణం రాఘవాచార్యులు, కేశవపంతుల సింగయ్య సిద్ధాంతి, కూకునూరి అప్పకవి వంశీయులైన కొందరు కవిపండితులు, ఈతనిచేత పోషింపబడ్డారు.

ఈ సంస్థానానికి చెందిన చింతకుంట గ్రామంలోని 'మంగువారు' అత్యంత ప్రసిద్ధులైన విద్వత్కవులు.

బుక్కపట్టణం రాఘవాచార్యులు వ్యాకరణశాస్త్రంలో ఉద్దండుడు. కాశీ పండితుడు. వీరి కుమారుడు శతావధాని రామచంద్రాచార్యులు బహుగ్రంథ కర్త. వీరి తమ్ముడు శ్రీరంగాచార్యులు సంగీత సాహిత్య విద్వాంసుడు వీరందరూ గోపాలపేట సంస్థానాశ్రితులే.

ఈ సంస్థానాధీశులు కేసంపేట గ్రామంలోని తిరుణాళ్ళలో విద్వత్కవిగాయక సన్మానాలు చేస్తూ తమ సాహిత్యాభిమానాన్ని నిరూపించుకున్నారు.

(ఆం. సం. సా-535; కేశవపంతుల - సం. సా-55, 56)

## గోపాలయ్య

కాలం : క్రీ.శ. 1839 ప్రాంతం.
స్థలం : ఎట్టియాపురం సంస్థానం (తమిళదేశం).
రచనలు : తెలియరాలేదు.

జగదీశ్వర రామకుమార ఎట్టప్పమహారాజు ఆస్థానంలోని తెలుగు పండితుడు.

(ద. దే. వా-513)

## గోపాలరాజు

కాలం : క్రీ.శ. 16వ శతాబ్దం.

అళియ రామరాయల తమ్ముని మనుమడని కొందరి అభిప్రాయం. ఈతని పరాక్రమాన్ని శ్లాఘిస్తూ కవులు పద్యాలు చెప్పారు. ఎడవల్లి పర్వతన్న ఇతని కత్తిని పొగడుతూ చెప్పిన ఒక పద్యాన్ని అప్పకవి ఉదహరించాడు.

(క. త-9-252; అప్పకవీయం-3-33)

## గోపాలలీలా సుధా లహరి

రచనాకాలం : క్రీ. శ. 18వ శతాబ్దం.
కర్త : ప్రయాగ కామేశ్వర కవి.
అంకితం - శ్రీరామ తీర్థంలోని శ్రీరామునికి.
మూడు ఆశ్వాసాల ప్రబంధం. (క. స-33)

## గోపాల విలాసము

కర్త : పాకనాటి గణపతిరెడ్డి.

యక్షగానం. దీనిలో శ్రీకృష్ణ జననము, బాల్యక్రీడలు వర్ణింపబడిఉన్నాయి. పోతనగారి పోకడలనే కాక పద్యాలనే కొన్నింటిని యథాతథంగా గ్రహించినట్లు తెలుస్తున్నది.

ఈ యక్షగానంలో ద్విపదలు, పద్యములు, సంధి వచనములు గాక అర్థచంద్రికలు, అల్లోనేరేళ్ళు, ఏలలు, జోలలు, త్రిభంగులు, గొబ్బిళ్ళు, వెన్నెల పదములు మొదలయినవి ఉన్నాయి. (య. వా. చ.-95)

**గోపాల శతకము**

కర్త : పరమానంద తీర్థులు.

ప్రత్యేకత : శ్రీకృష్ణుని మీద చెప్పిన శతకం. కవి వేదాంతి, యోగి కాబట్టి ఈ శతకంలో కూడా వేదాంతాన్ని చెప్పి ఉండవచ్చు. దీనిప్రతి లభించిందని పండితులు చెబుతున్నారు. (ఆరుద్ర-8)

**గోపాలుని సింగయ్య**

కాలం : క్రీ.శ. 18వ శతాబ్ది చివరిపాదం.
స్థలం : కర్నూలు మండలం.
రచనలు : ప్రభావతీ ప్రద్యుమ్నము, కిరాతార్జునీయము.

భాస్కరామాత్యుని పౌత్రుడు. వీరన మంత్రి పుత్రుడు. చతుర్విధ కవితా విశారదుడు. ప్రౌఢంగా రసవంతంగా రచన చేశాడు. (య. వా. చ.)

**గోపికా గీతలు (అలభ్యం)**

కర్త : విజయ రాఘవనాయకుడు.

దేశి కవితా విభాగానికి చెందిన రచన.

**గోపికా జలక్రీడలు**

కర్త : తెలియదు.

జానపద పౌరాణిక గేయం. ఇతివృత్తం భాగవతంలోనిది ప్రసిద్ధం.
చూ. పౌరాణిక గేయములు. (ఆం. వా. చ.)

**గోపికా నాటకము (అలభ్యం)**

కవయిత్రి : తరిగొండ వేంకమాంబ.

యక్షగానం కావచ్చు. (ఆ. భా. క-75)

**గోపీనాథ కవి**

నామాంతరం : డొంకా గోపీనాథుడు.
కాలం : క్రీ శ. 1670 ప్రాంతం.
స్థలం : విశాఖ మండలం.
రచన : విచిత్ర రామాయణము (వచనం)

నారాయణ మంత్రి పుత్రుడు. ఉత్తర దేశంలోని జయపుర సంస్థాన ప్రభువైన విశ్వంభర దేవునిచేత సమ్మానాలు పొందాడు. ఉత్కళ భాషలో సిద్ధేంద్రయోగి రచించిన రామాయణాన్ని విచిత్ర రామాయణంగా తెలుగులో వ్రాశాడు. రచన సరసమైనది. (వా. చ.-వం. సు. 271) (క. స. 62)

### గోపీనాథము వెంకటకవి

కాలం : క్రీ. శ. 19 వ శతాబ్దం.
స్థలం : కావలి తాలూకాలోని లక్ష్మీపురాగ్రహారం.
సంస్థానం : వేంకటగిరి.
రచనలు : శ్రీమద్రామాయణము, కృష్ణ జన్మ ఖండము, బ్రహ్మానంద శతకము, భగవద్గీతాశాస్త్రము, శిశుపాలవధ, రాధికాపరిణయము, శ్రీమద్రామానుజ చరిత్రము, ఆదిత్యహృదయము, వెలుగోటి వారి వంశావళి మొ॥ వి.

క్రీ. శ. 19 వ శతాబ్దిలోని గొప్ప కవులలో ఒకడు. వేంకట లక్ష్మమ్మంబా పద్మనాభుల పుత్రుడు. కవి తన 16 వ ఏట ఒక మహాయోగి వద్ద ఒక విద్య నేర్చినాడని, తత్ప్రభావం చేత సకల విద్యా ప్రవీణుడై పేరు పొందాడని ప్రతీతి.

వేంకటగిరి సంస్థాన పాలకుడైన సర్వజ్ఞకుమారయాచేంద్రుడు (1832-1892) ఈ కవి వైదుష్యానికి మెచ్చి ఈతనిని ఆస్థాన విద్వాంసునిగా నియమించి, అనేక అగ్రహారాలు దానాలు చేసి గౌరవించాడట. (ఆం. సం. సా-462, 463)

### గోపీనాథ రామాయణము

రచనాకాలం : 19 వ శతాబ్దం.
కర్త : గోపీనాథము వేంకట కవి.
అంకితం : శ్రీకృష్ణునికి.

ఇది చక్కని పద్య కావ్యం. రచన వాల్మీకి రామాయణాన్ని అనుసరించి జరిగింది. రచన రసవంతంగా ఉంటుంది. కవిత ప్రాచీన కవుల కవితను తలంపుకు తెస్తుంది. 19 వ శతాబ్దంలో వెలువడిన రామాయణాలలో ప్రశంసా పాత్రమైనది. శ్రీమద్రామాయణంగా ప్రఖ్యాతం. (తె. వి. స-4)

### గోపేంద్ర తిప్పరాజు

కాలం : క్రీ.శ. 15 వ శతాబ్దం.
రచన : తాళదీపిక.

ఈయన ఒక దుర్గపాలకుడట. (నా. ర. చ-85)

### గోమన నాదెండ్ల శాసనము

కాలం : క్రీ. శ. 1124.
స్థలం : నరసరావుపేట తాలూకా నాదెండ్ల గ్రామం.
శాసనప్రదాత : కొసనిసెట్టి కుమారుడు గోమన.

శాసనవిషయం : పెనుగొండ విభుడైన కొసనిసెట్టిని నుతిస్తూ పద్యాలు ఈ శాసనంలో ఉన్నాయి. కొసనిసెట్టి-ప్రోలమలకు పుట్టిన గోమన (గ్రామిసెట్టి) నాదెండ్ల గ్రామంలో పార్వతీశ్వరుని నిలిపి, దేవాలయాన్ని కట్టించాడు. వైశ్యవంశాన్ని నుతిస్తూ దీనిలో ఒక శార్దూలం, ఒక ఉత్పలమాల, ఒక మత్తేభం, చివరలో కొంత గద్య ఉంది. ఈ కొసనిసెట్టి కోష్ఠాగారాధిపతి అట. (తె. శ. చ-188)

## గోరంట్ల మాధవ శతకము

కర్త : బాణాల వీరశరభేంద్రుడు.

శృంగార సీసపద్య శతకం. దూత సందేశం ఇందులోని విషయం. "గోరంట్ల మాధవుణ్ణి తోడుకొని వేగ రావమ్మ తోయజాక్షి" అనే మకుటంతో విరహిణి చెలికత్తెకు చెప్పినట్లుగా ఉంది. (శ. క. చ-455)

## గోరంట్ల మాధవాష్టకము

కర్త : తెలియదు.

ప్రసిద్ధమైన అష్టకం. గోరంట్లలో వేంచేసిన మాధవునిపై ఒక శతకం కూడా ప్రసిద్ధమై ఉంది ఈ గోరంట్ల ఎక్కడ ఉన్నదీ నిశ్చయంగా నిర్ధారితం కాలేదు.

## గోవర్ధనోద్ధరణము

కర్త : విజయరాఘవ నాయకుడు.

రచనాకాలం : క్రీ.శ. 17వ శతాబ్దం.

ఇతివృత్తం పౌరాణికం. కవి పరమభాగవతుడు. విష్ణుగాథలు ఇతివృత్తాలుగా యక్షగానాలు వ్రాశాడు. (ద.దే. వా-87)

## గోవిండ్ల నింబగిరి శాస్త్రి

కాలం : క్రీ.శ. 1750 ప్రాంతం.

స్థలం : కోరుట్ల గ్రామం - కరీంనగర్ మండలం.

రచన : తెలియరాలేదు.

ఇతడు ఒక ప్రహసన గ్రంథాన్ని రచించినట్లు తెలుస్తున్నది.

(గో. కాం. క. సం.)

## గోవింద నామములు

జానపద పౌరాణిక గేయ రచనలు.

చూ. పౌరాణిక గేయములు (అం. వా. చ)

## గోవిందవాక్యాలు (గేయాలు)

కర్త : వీరబ్రహ్మయోగి.

తెలుగుదేశంలో బహుళ ప్రచారమందిన గేయాలు. జాను తెనుగులో రచన సాగింది. కందాల, కందార్థాల ద్వారా వేదాంత సాహిత్యాన్ని సర్వజన సాధారణం చేసిన ఘనత ఈ గేయాలకే దక్కుతుంది. (తె. వి. స-4)

## గోవిందశతకము

కర్త : పరశురామ పంతుల లింగమూర్తి.

ఇది వేదాంతప్రధానమైన గ్రంథము. అముద్రితము. ఉస్మానియా విశ్వవిద్యాలయ సంస్కృత అకాడమీ తాళపత్ర గ్రంథాలయంలో ఉంది. దీనిలో కవి సద్గురుమహిమ, యోగమార్గము మొదలయిన అంశాలను వర్ణిస్తూ జపముపట్ల విముఖత చూపినాడు. సుషుమ్నా మార్గంలో ఆత్మారాముని దర్శించేవాడే యోగి అని వివరించాడు. ఈ శతకంలోని కొన్ని పద్యాలలో కవి చేసిన గోవింద నామ కీర్తన అతని సాధనలోని మొదటి దశను సూచిస్తుంది. దీనిలో యోగవిద్యాప్రాధాన్యము, జ్ఞాని లక్షణాలు మొదలయినవి కవి వివరించాడు. (శ. సా. వి-320)

## గోవుపాట

కర్త : తెలియదు.

జానపద పౌరాణిక గేయం. ప్రసిద్ధమైన కథ.

చూ. పౌరాణిక గేయములు. (ఆం. వా. చ.)

## గోవ్యాఘ్ర సంవాదము

కర్త : వేల్పూరి వెంకటేశ్వరకవి.

రచనాకాలం : క్రీ.శ. 1800-1850 నడుమ.

పద్య కావ్యం. వ్యాకరణ విరుద్ధమైన ప్రయోగాలున్నా కవిత్వం మృదువుగా శ్రావ్యంగా ఉన్నదని విమర్శకులు ప్రశంసించారు. (క. స-260)

## గోళ్ళ చినరామప్ప

కాలం : క్రీ.శ. 16వ శతాబ్ది.

స్థలం : రామనాడు, తిరుపత్తూరు సీమలు.

బిరుదు : ఉపనూరిసింహము.

విశిష్టత : అచ్యుత దేవరాయలకు సామంతులుగా గోళ్ళ పెదరామప్ప, గోళ్ళ చిన రామప్ప అనే సోదరులు రామనాడు, తిరుపత్తూరు సీమలను ఏలారు. ద్రావిడ దేశంలో రాజ్యం చేస్తున్నా గోళ్ళ సోదరులు తమ మాతృ భాషా సాహిత్యాలను పోషించారు. ఈయన పచ్చకప్పురపు తిరువేంగళరాజు అనే కవిని పిలిపించి తన అన్న పెద రామప్ప పేర 'చొక్కనాథ చరిత్ర' అనే ద్విపద కావ్యాన్ని చెప్పించాడు. ఈయన అన్న పెద రామప్పను తిరువేంగళరాజు "అచ్యుత దేవరాయ ప్రతాప దక్షిణ బాహు దండాంకు" డని చెప్పాడు. చినరామప్ప శాసనాలు క్రీ.శ. 1540 లో కూడా కొన్ని కనిపిస్తాయి. (అరుద్ర-9)

## గోళ్ళ పెద్ద రామనాయకుడు

కాలం : క్రీ. శ. 1530 ప్రాంతం.

స్థలం : రామనాథపురం జిల్లా తిరుపత్తూరి సీమ.

సాహిత్య పోషకుడు. పచ్చకప్పురపు తిరువేంగళ కవి చేత చొక్కనాథ చరిత్రను కృతి పొందాడు. ఇతడు "నన్నెనందలి" పురాన్ని పాలించాడట. ఇతనికీ ఇతని తమ్ముడు చినరామనాయకునికీ 'ఉపనూరిసింహములు' అని బిరుదు ఉండేది. ఇతడు అచ్యుతరాయల దగ్గర దండనాయకుడుగా ఉండేవాడు. (ద.దే.వా-18)

## గౌడ పురాణము

కర్త : మల్లికార్జున సిద్ధయోగి (చూ).

రచనాకాలం : క్రీ.శ. 1700 ప్రాంతం.

ద్విపద కావ్యం. మూడు ఆశ్వాసాలున్నాయి. మతపరమైన గ్రంథం. కొలనుపాకలో గౌడమతస్థాపన చేసిన వృత్తాంతం ఈ గ్రంథంలో ఉంది.

(క. త-12-258)

## గౌతమ తర్కము

కర్త : పేరి కాశీనాథశాస్త్రి (చూ.)

తర్కశాస్త్ర సంబంధమైన గ్రంథం. కవి తర్కశాస్త్ర ప్రవీణుడు. తర్కశాస్త్రంలో అనేక మతాలున్నాయి. అందులో గౌతమ సిద్ధాంతాన్ని గ్రహించి ఈ రచన చేశాడు. (ఆం. సం. సా-427)

## గౌతమీ మాహాత్మ్యము

కర్త : అల్లమరాజు బాపయకవి.

రచనాకాలం : క్రీ.శ. 1735 ప్రాంతం.

ప్రబంధం. రచన అంత ప్రశస్తంగా లేదని విమర్శకాభిప్రాయం.

(క. స-143)

## గౌతమీ మాహాత్మ్యము

కర్త : అల్లమరాజు రామకృష్ణ కవి.

రచనాకాలం : క్రీ.శ. 1830 ప్రాంతం.

పద్యకావ్యం. రచన ప్రశస్తమైనది. అల్లమరాజు బాపయకవి ఇదే పేరుతో ఒక కావ్యాన్ని వ్రాశాడు. (క. స-185)

## గౌరన

కాలం : తెలియదు.

రచన : స్వరమంజరి.

స్వరమంజరి అనే పేరుతో తత్త్వసారాన్ని కావ్యంగా రచించాడట. ఈతని మనుమడు కొండయ్య తన పల్నాటి వీర చరిత్రలో ఈ కవిని పేర్కొన్నాడు.

గౌరన

కాలం : క్రీ.శ. 1560 కి పూర్వం.

రచన : నవగ్రహస్తోత్రములు (అలభ్యం).

ఇతని పద్యాలను జగ్గకవి తన ప్రబంధ రత్నాకరంలో ఉదాహరించాడు. వివరాలు తెలియవు. (క. స-64)

గౌరన

కాలం : క్రీ.శ. 1384-1429 ప్రాంతం.

రచనలు : 1. హరిశ్చంద్ర చరిత్ర (ద్విపద) 2. నవనాథ చరిత్ర (ద్విపద) 3. లక్షణ దీపిక (సంస్కృతం) 4. నవగ్రహ స్తవము (అలభ్యం).

బిరుదు : సరససాహిత్య లక్షణచక్రవర్తి.

సమకాలికులు : శ్రీనాథుడు, పద్మనాయక ప్రభువులైన సర్వజ్ఞ సింగ భూపాలుడు, అతని కుమారుడు రెండో మాధవనాయడు.

అయ్యలుమంత్రి పోతాంబల పుత్రుడు. తండ్రిపేరు ఎల్లమంత్రి అని కొన్ని ప్రతులలో ఉన్నదట. ఇతని పెదతండ్రి పోతనామాత్యుడు మాధవనృపాలుని (1376 ప్రాంతం) మంత్రి. గౌరన సారంగధర చరిత్ర ద్విపదగా చెప్పాడని కొందరంటారు కాని ఆ కథ నవనాథ చరిత్ర లోనిదే. తేట తెనుగు పలుకుబడులతో దేశిచ్ఛందంలో రచన చేశాడు. ఇతనిని అనంతర కవులు అనుసరించారు. ఇతని మొదటి రెండు రచనలూ ద్విపదలో ఉన్నాయి. మూడోది ఛందః శాస్త్ర గ్రంథం. నాలుగోది నవగ్రహాలను స్తుతించే గ్రంథం.

నవగ్రహ స్తవాన్ని రచించిన గౌరన వేరని కొందరంటున్నారు. (రె. రా. చ.)

గౌరరాజు

కాలం : క్రీ.శ. 1600 కు పూర్వం.

స్థలం : పొత్తపినాడు.

రచన : తెలియరాలేదు. ఒక చాటుధార మాత్రం లభించింది.

విశిష్టత : ఈయన పొత్తపినాటికి అధిపతి అయిన లక్కా నృపాలుని మీద చాటువు చెప్పాడు. విత్య సమాస విశ్రాంతుల ఘట్టంలో అప్పకవి గౌరరాజు చాటుధార లోని 'నాక' శబ్దాన్ని ప్రమాణంగా తీసుకొని పై ప్రయోగాన్ని ఉదాహరించాడు. (కడప జిల్లా రాజంపేట తాలూకా గుండ్లూరులో లక్కా నృపాలుని శాసనాలున్నాయని పండితాభిప్రాయం). (అరుద్ర-9-256)

గౌరరాజు చాటుధార

కర్త : గౌరరాజు (చూ).

అప్పకవీయంలో ఉదాహృతం.

### గౌరి కల్యాణం పాట

జానపద వాఙ్మయానికి చెందిన గేయ రచనా విశేషం.

ఇది ఆడువారి పెండ్లి వేడుక పాటగా ప్రాచీన కాలం నుంచి తెలుగునాట ప్రసిద్ధం. జక్కన విక్రమార్క చరిత్ర, అనంతుని భోజరాజీయం, కాకమాని మూర్తి కవి పాంచాలీ పరిణయం, మల్లన రాజశేఖర చరిత్రలలో దీని ప్రసక్తి ఉంది. ఇది కొన్ని యక్షగానాలలో ప్రయుక్తం. (య. వా. చ-259)

### గౌరీ కల్యాణమ్ (సం)

కర్త : చక్రకవి. (తె. వి. స-6-222)

### గౌరీ కల్యాణము

కర్త : వక్కలంక వీరభద్రకవి (చూ).
రచనాకాలం : క్రీ.శ. 18 వ శతాబ్దం.

ఈ కావ్యం కాళిదాసు కుమారసంభవానికి ఆంధ్రీకరణం. రచన సరళంగా హృద్యంగా ఉంది. (తె.వి.స-6)

### గౌరీనాథాష్టకమ్ (సం)

కర్త : భోగనాథుడు. (తె. వి. స-4)

### గౌరీ పరిణయము (అలభ్యం)

కర్త : ఏనుగు అనంతార్యుడు.
రచనాకాలం : క్రీ శ. 1700 ప్రాంతం.

పద్యకావ్యం. ఏనుగు లక్ష్మణకవి సుభాషిత రత్నావళిలో దీని ప్రశంస ఉంది. (క. స-7)

### గౌరీ రమణ శతకము

కర్త : అమలాపురపు సన్యాసికవి.

కందపద్య శతకం. 'ల' ప్రాసంతో గౌరీ రమణా అనే మకుటంతో ఉంది. లలితమైన కవితా చమత్కారం ఇందులో కనిపిస్తుంది. (శ. క. చ-749)

### గౌరీ వివాహము

కర్త : వెణుతురుపల్లి విశ్వనాథ కవి (చూ).

ద్విపద కావ్యం.

### గౌరీ శంకర విలాసము

కర్త : పేల్పూరి వెంకటకవి.

యక్షగానం. శృంగార నాటక ప్రబంధమని చెప్పవచ్చును. గంగా శంకరుల చైత్రరథ వన విహారం - అక్కడ శివునితో గంధర్వాంగనల పొందు - గౌరీదేవి ఆగమనము - సవతుల కయ్యము-శివుడెల్లో వారిని సమాధానపరచడం ఇందలి విషయం.

ఇది కూర్మనాథకవి మృత్యుంజయ విలాసాన్ని పోలి ఉంది. దీనిలో పద్యాలు, వచనాలు, ద్విపదలు ఉన్నాయి. రచన చక్కగా ఉంది. (య. వా. చ-103)

గౌళికాశాస్త్రము (అలభ్యం)

కర్త : వెలగపూడి కృష్ణయామాత్యుడు.

ఏకాశ్వాస గ్రంథం. ఇప్పుడు ప్రచారంలో ఉన్న బల్లిపలుకు శాస్త్రం వెలగపూడి కృష్ణయ్య రచించినదో కాదో తెలియడం లేదు. ముద్రిత ప్రతులలో కర్త పేరు లేదు. (ద. దే. వా-389)

గ్రహణభుక్తి దీపిక (సం)

కర్త : తిరుమల బుక్కపట్టణం (ఇమ్మడి) శ్రీనివాసాచార్యులు. చూ.

సంస్కృత రచన. సురపురం సంస్థానాధీశ్వరుల సమాదరణలో వెలసిన గ్రంథ పరంపరలో ఇది ఒకటి. (ఆం. సం. సా-516)

ఘంటయ

చూ. ఘట్టు ప్రభువు.

ఘంటసాల కామక శాసనము

కాలం : క్రీ.శ. 1125.

స్థలం : తెనాలి తాలూకా ఈమని గ్రామం.

శాసనకర్త : ఈమని కరణం అయితన (ఆదిత్యుడు).

శాసన ప్రదాయిని : ఘంటసాల కామక.

శాసన విషయం : ఘంటసాల పోతినాయకుని కుమార్తె కామక్క భక్తి పురస్సరంగా ఈమనిలో వేంచేసియున్న అగస్త్యేశ్వరస్వామి ధ్వజస్తంభం మీద శాసనం వేయించింది. ఈమని అగస్త్యేశ్వరస్వామికి అఖండ దీపం నెలకొల్పింది. దీనిలో 3 కందపద్యాలు, 1 గీతపద్యం, చివర గద్య ఉన్నాయి. (తె. శ. చ-189)

ఘంట సింగయ్య

కాలం : క్రీ.శ. 15 వ శతాబ్దం.

చూ. నంది మల్లయ్య - ఘంట సింగయ్య.

గురువు : అఘోర శివుడు.

ఇతడు నాగయామాత్యుని కుమారుడు.

నంది మల్లయ్యతో కలిసి రచనలు చేశాడు. ఈతనికి కృష్ణరాయల సభలో ఉండిన ముక్కు తిమ్మన మేనల్లుడట.

ఘంటాపథమ్ వ్యాఖ్య (సం)

వ్యాఖ్యాన విశేషం. సంస్కృతంలో భారవి వ్రాసిన 'కిరాతార్జునీయ' కావ్యానికి కోలాచల మల్లినాథసూరి రచించిన మనోహరమైన వ్యాఖ్య. (తె. వి. స-4)

**ఘంటావధానము**

చూ. అవధానాలు.

**ఘటుసాసి మల్లుభట్టు**

కాలం : క్రీ. శ. 1590 కి పూర్వం.

రచన : జలపాలి మాహాత్మ్యం (అలభ్యం).

విశిష్టత : ఈయన వ్రాసిన కావ్యం ఏలూరులో ఉన్న జలపాలీశ్వరుని మహిమను చెప్పే స్థలపురాణం. ఈయన కృతి నుంచి పెదపాటి జగ్గన్న తన ప్రబంధ రత్నాకరంలో మూడు పద్యాలను ఉదాహరించాడు. పతివ్రత మహిమను చెప్పే అనసూయ కథను ఒక సీస పద్యంలోను, మరొక సీస పద్యంలో వారకాంతలను, ఇంకో సీస పద్యంలో స్త్రీ గర్భ చిహ్నాలను కవి పేర్కొన్నాడు. కవిత్వం మరీ సాధారణంగా ఉంటుంది (అరుద్ర-9)

**ఘటికాచల మాహాత్మ్యము (కృత్యాది)**

కర్త : వేంకటగిరి.

అంకితం : ఖండోజీ రాయనికి.

తెనాలి రామలింగ కవి వ్రాసిన ఘటికాచల మాహాత్మ్య గ్రంథం ప్రతిని అతని మనుమడు ఖండోజీ రాయనికి తెచ్చి ఇచ్చాడట. అది అప్పటికి ఎవరికీ కృతి ఇవ్వబడలేదు ఖండోజీరాయడు తన ఆస్థాన కవి వేంకటగిరి చేత కృత్యాది పద్యాలు వంశావళి వ్రాయించుకొన్నాడట.

ఉత్తర ఆర్కాటు జిల్లాలోని షోలింగర్ అనే క్షేత్రమే ఘటికాచలం. ఇక్కడి నృసింహ క్షేత్రపు మాహాత్మ్యమే దీనిలోని కథ. ఈ ఘటికాచల మాహాత్మ్యాన్ని ఆధునికులలో 1. కొక్కొండ వేంకట రత్నం పంతులు పద్య కావ్యంగానూ 2. రావూరి దొరసామిశర్మ గద్య పద్య కావ్యాలుగానూ వ్రాశారు. (ద. దే. వా-230)

**ఘటికాచల మాహాత్మ్యము**

కర్త : తెనాలి రామకృష్ణ కవి.

అంకితం : ఖండోజీరాయనికి.

ప్రత్యేకత : ఇది క్షేత్ర మాహాత్మ్యాన్ని తెలియ చేసే గ్రంథం. ఘటికాచలం నృసింహ క్షేత్రం. చోళ సింహపురము (ఉత్తర ఆర్కాటు జిల్లాలోని షోలింగరు) దగ్గర వున్నది.

మూడు ఆశ్వాసాల కావ్యం. కృత్యాది లేదు. కవి మరణానంతరం రామకృష్ణుని మనుమడు కృత్యాది రచింపజేసి దీన్ని ఖండోజీ రాయనికి అంకితంగా ఇచ్చాడు. (తె. వి. స-4)

**ఘటికాచల మాహాత్మ్యము**

కర్త : కాలువల్లి అర్చన మంత్రి.

లఘు ద్విపద కృతి. ఇరవై పత్రాలు మాత్రం ఉన్నాయి ఘటికాచలం మీద ఆంజనేయుడు శివుని గూర్చి తపస్సు చేసి వరాలు పొందడం ఇందులోని కథ రచన అంత ప్రశస్తం కాదు. దీని ప్రతి ఆంధ్ర సాహిత్య పరిషత్తులో ఉంది.

(ద్వి. సా. చ-180)

ఘటికాచలము

నృసింహ క్షేత్రం. ఇది చోళ సింహపుర సమీపంలో ఉంది. ప్రస్తుత తమిళ నాడు రాష్ట్రానికి చెందిన ఉత్తర ఆర్కాడు జిల్లాలోని షోలింగర్ క్షేత్రమే ఘటికాచల మని పరిశీలకులు నిర్ధారించారు.

ఈ క్షేత్ర మాహాత్మ్యాన్ని తెనాలి రామలింగ కవి పద్యకావ్యంగా రచించాడు

(ద. దే. వా-2 0)

ఘటికాద్రి కవి

కాలం : క్రీ. శ. 1850 కి పూర్వుడు.
రచన : శనైశ్వర శతకము.
గురువు : కనుపర్తి వేంకటకవి.

నారాయణయ్య వేంకమాంబల పుత్రుడు. ఇతని రచన అంత ప్రౌఢం కాదు.

(శ. క. చ-610)

ఘట్టు ప్రభువు

నామాంతరం : ఘంటయ.
కాలం : క్రీ. శ. 1750 ప్రాంతం.
స్థలం : నెల్లూరు మండలం.
రచనలు : కుచేలోపాఖ్యానము, సురాభాండేశ్వరము, యాజ్ఞవల్క్య చరిత్రము.

ఈ కవి నిజ నామం శేషకవి అట. ఇతడు విద్వత్కవి. ఎల్లనామాత్యుని పుత్రుడు. ఇతనిని ఘంటయఅని కొందరు పేర్కొన్నారు. ఘట్టు శేషకవి, ఘట్టు ప్రభువు వేర్వేరు వ్యక్తులని కొందరూ ఒకరేనని కొందరూ భావిస్తున్నారు. ఇతడు ఘడియకు నూరు పద్యాలు చెప్పగల సమర్థుడు. భ్రమరాంబికా వరప్రసాద కవిత్వ వైభవుడు.

సత్యభామా విజయములో శేషకవి పేరున్నది. ఇతడు వీరార్యుని పుత్రుడు. కాబట్టి ఘట్టు ప్రభువు కన్న భిన్నుడని చెప్పవచ్చు. ఘట్టు ప్రభువు కాలం విషయంలో కూడా భిన్నాభిప్రాయాలున్నాయి. ఇతడు 1750 ప్రాంతం వాడని వీరేశలింగం గారి అభిప్రాయం. ఇతడు కర్నూలు మండలానికి చెందినవాడని కొందరంటున్నారు ఇతని రచనలన్నీ ముద్రితాలు. కుచేలోపాఖ్యానం, సురాభాండేశ్వరం కావ్యాలలోని గద్యలు ఒకే రీతిలో ఉన్నాయి. యాజ్ఞవల్క్య చరిత్ర గద్య భిన్నంగా ఉంది శేషకవి నామం తాతకూ మనుమనికీ ఉండి ఉండవచ్చు ఈ కావ్యాలు భిన్న కర్తృకాలో ఏక కర్తృకాలో నిర్ధారించడం కష్టం.

(ఆరుద్ర 12-54) (క.స. - 65) (ద్వి.సా.చ - 307)

ఘట్టు వీరాఖ్యుడు

కాలం : క్రీ.శ. 18వ శతాబ్దం.

రచన : అనుభవామృతము (ద్విపద).

ఘట్టు రాచయ పుత్రుడు. వీరభద్రేశ్వరుని భక్తుడు. సత్యభామా విజయకర్త ఘట్టు శేషకవి తాను వీరార్యుని పుత్రుడనని చెప్పుకొన్నాడు. ఈ వీరాఖ్యుడు, వీరార్యుడు వేర్వేరు వ్యక్తులో, ఒకరో నిర్ధారణ కాలేదు. ప్రౌఢంగా రచన చేశాడు.

(ద్వి. సా. చ - 307)

ఘట్టు వేంకటరామ కృష్ణమాచారి

రచన : పట్టాభి రామాయణము (యక్షగానం).

(వా.చ - వం.సు. 271)

ఘట్టు శేషకవి

(చూ) : ఘట్టు ప్రభువు.

కాలం : క్రీ. శ. 18 వ శతాబ్దం.

స్థలం : కర్నూలు మండలం కావచ్చును.

రచన : సత్యభామా విజయము (ద్విపద).

వీరార్యుని పుత్రుడు. ఈ వీరార్యుడు అనుభవామృత కర్తయైన వీరాఖ్యుడేమో అని కొందరు భావిస్తున్నారు. ఈ శేషకవి, ఘట్టు ప్రభువులను గూర్చి పండిత లోకంలో భిన్నాభిప్రాయాలున్నాయి. వీరిద్వరూ భిన్నులు కారని చాలమంది అభిప్రాయం. ఇతడు విద్వత్కవి. రచనలో తెలుగు జాతీయాలనూ సామెతలనూ కొల్లలుగా ప్రయోగించాడు. భ్రమరాంబికా భక్తుడు. కాబట్టి కర్నూలు మండలం వాడని కొందరు భావిస్తున్నారు.

(ఆరుద్ర-12-54)

ఘనం సీనయ్య

(చూ) : వంగల సీనయ్య.

ఘనశ్యాముడు

నామాంతరం : ఆర్యకుడు.

కాలం : క్రీ. శ. 18 వ శతాబ్దం.

స్థలం : తంజావూరు.

రచనలు : 1. మదన సంజీవనమ్ (సం) (భాణం)2. దామరుకమ్ (సం) 3. అబోధాకరమ్ (సం) 4. ఆనంద సుందరీ చరితమ్ (సం) 5. ప్రచండ హృదయ దీపిక (సం) 6. నవగ్రహ చరితమ్ (సం) 7. ఉత్తర చరిత్ర వ్యాఖ్య (సం) అన్యాపదేశ శతకము మొ॥ వి.

మహారాష్ట్రుడు. తండ్రి మహాదేవుడు. తల్లి కాశీదేవి. సంస్కృతంలో

64 గ్రంథాలు, ప్రాకృతంలో 20 గ్రంథాలు, దేశ భాషలలో 25 గ్రంథాలు వ్రాశాడట. ఇతని తెలుగు రచనలు లభించలేదు.

తంజావూరును పాలించిన తుకోజీ (1728-35) దగ్గర గృహ మాత్యుడు (సర్కేలు)గా ఉండేవాడు. అక్కడి వ్యవహార భాష తెలుగు కనుక తెలుగులో రచనలు చేసి ఉండవచ్చును. నూరుకు పైగా కావ్యాలకు వ్యాఖ్యానాలు రాశాడు రామాయణ యుద్ధకాండను చంపూరూపంలో రాశాడట. అబోధాకరము త్ర్యర్థికావ్యం. శ్రీకృష్ణ, నల, హరిశ్చంద్రుల కథలు అందులో ఉన్నాయి. ఇతని భార్యలు సుందరి, కమలలు విదుషీమణులు. గ్రంథ రచనలో భర్తకు తోడ్పడే వారట. (తె వి.స-6-222)

## ఘూర్జర చరిత్ర

రచన : పాపయారాధ్యులు (చూ).

వివరాలు తెలియవు. (ఆం సం. సా)

## చండ విద్యావతీ దండకము

నామాంతరం : విద్యావతీ దండకము.

కాలం : క్రీ. శ. 17 వ శతాబ్దం.

కర్త : గణపవరపు వేంకట కవి.

పాండ్యమండలాధీశ్వరుడు, వీరప్ప నాయకుని పుత్రుడు, చొక్కనాథ నాయకుని సోదరుడూ అయిన ముద్దళఘరి భూపాలుడు విద్యావతి అనే విలాసవతిని (వేశ్యను) ప్రేమించడం, తన నాట్యస్థల పాత్రలందు సమ్మాన పాత్రగా పరిగ్రహించడం ఈ దండకంలోవి కథా విషయం.

ఇది బమ్మెరపోతన రచించిన భోగినీదండకాన్ని పోలి ఉంది (క. త-12)

## చందమామ పదాలు

పదకవితా విశేషం.

తాళ్ళపాక చిన్నన్న సంకీర్తన లక్షణంలో దీనికి లక్షణముంది. నాయకుడు కాని, నాయిక కాని భరించరాని విప్రలంభ శృంగారాన్ని దూతికద్వారా అన్యాపదేశంగా చెబుతూ, చంద్రునికి విన్నవించే పదాలే ఇవి. లక్షణా కల్యాణమనే యక్షగానంలో ఈ చందమామ పదమున్నది. (య. వా. చ-277)

## చందలూరి గంగయామాత్యుడు

కాలం : క్రీ.శ. 15వ శతాబ్ది-ఉత్తరార్థం.

స్థలం : ఉనయగిరి దుర్గం.

ఇతడు రెండు కావ్యాలకు కృతిపతి.

1. దగ్గుపల్లి దుగ్గన నాసికేతోపాఖ్యానము 2. నంది మల్లయ, ఘంట సింగయలు రచించిన ప్రబోధ చంద్రోదయము.

ఇతడు గజపతుల సామంతుడూ, ఉదయగిరి దుర్గాధిపతీ అయిన బసవ భూపతి

దగ్గర మంత్రిగా ఉండేవాడు. దుగ్గన ఇతన్ని చందలూరి గంగయామాత్యునిగా చెప్పాడు. తర్వాతివారైన నంది మల్లయ, ఘంట సింగయ్యలు, "పెసరువాయ వంశవార్ధి బిసరుహ హరి మండలా" అని ఇతన్ని సంబోధించారు. చందలూరు ఇతని గ్రామనామం కావచ్చు. ఇతని పినతండ్రి పేరుకూడా గంగయ్యే. అతడూ అమాత్యుడే. దుగ్గన మరో కృతి కాంచీపుర మాహాత్మ్యం, ఈతని పినతండ్రి కుమారుడైన దేవయామాత్యునికి అంకితం.

(ఆరుద్ర-6-229) (క. త.-6-101)

## చందలూరి దేవయామాత్యుడు

కాలం : క్రీ. శ. 15 వ శతాబ్ది-ఉత్తరార్ధం.
స్థలం : ఉదయగిరి ప్రాంతం.

సాహిత్య పోషకుడు. దగ్గుపల్లి దుగ్గన రచించిన "కాంచీపుర మాహాత్మ్యం" కృతిపతి. చందలూరి గంగయ మంత్రి కుమారుడు.

నాసికేతోపాఖ్యాన కృతిపతి చందలూరి గంగయ ఇతని పెదతండ్రికుమారుడు.

(క. త-6-102)

## చందవోలు

ప్రస్తుతం గుంటూరు మండలంలో ఉంది. పూర్వం ఇది వెలనాటి చోళులకు రాజధాని. దీనికి గొంకరాజు, పృథ్వీశ్వరుడు మొ॥వారు ప్రభువులుగా ఉండేవారు. శైవ, జైన, బౌద్ధమత వాదాలు వెలనాటి సీమలోనే తొలుత జరిగాయి. జైన బౌద్ధులు వివాదంలో ఓడిపోయి, శైవులు గెలిచినదీ రాజ్యంలోనే. పండిత త్రయంలో పండితారాధ్యుడనే ప్రముఖ శైవ కవిని వెలనాటి రాజు ఆదరించి, గౌరవించాడు. చందవోలుకు ధనదపురమనే నామాంతరముంది. మంచన కేయూర బాహు చరిత్రవల్ల చందవోలు రాజధానిగా దేశాన్ని ఏలిన వెలనాటి చోడుల వైభవ ప్రాభవాలు తెలుస్తాయి.

## చంద్రకవి

కాలం : క్రీ.శ. 18 వ శతాబ్దం.
స్థలం : మైసూరు.
రచన : శ్రీకృష్ణ భూపాలీయము.

ఇతడు మైసూరు ప్రభువైన శ్రీకృష్ణ రాజేంద్ర భూపాలుని ఆస్థానంలో ఉండేవాడు. విద్వత్కవి. (ద. దే. వా-480)

## చంద్ర తారావళి (అలభ్యం)

కర్త : రావిపాటి త్రిపురాంతకుడు.
రచనాకాలం : క్రీ. శ. 14 వ శతాబ్ది పూర్వార్థం.

కవి అనవేమారెడ్డి, కుమారగిరి రెడ్డి, రాయని భాస్కరుల సమకాలికుడు. ఇది లక్షణ గ్రంథం. 27 పద్యాల కృతిలో నాలుగు మాత్రం లభించాయి. చంద్రా! రోహిణీ వల్లభా! అనే మకుట ముంటుంది.

ప్రత్యేకత : ఈ గ్రంథం నుంచి పెదపాటి జగన్నాథ కవి, మరొక అజ్ఞాత కవి నాలుగు పద్యాలను ఉదాహరించారు. వీటిని కీ. శే. వేటూరి ప్రభాకరశాస్త్రి తమ 'ప్రబంధ రత్నమాల'లో ప్రకటించారు. (రె. రా. చ.)

## చంద్రతారా విలాసము

నామాంతరం : తారాశశాంకము.
కర్త : ఎల్లయ (చూ).
రచనాకాలం : క్రీ.శ. 1846 ప్రాంతం.

యక్షగానం. తారా శశాంకుల ప్రేమ గాథ దీనిలోని ఇతివృత్తం. (ద. దే. వా-406)

## చంద్రదూత శతకము

నామాంతరం : ఇందుశతకము.
కర్త : పుసులూరి సోమరాజు కవి (చూ).
రచనాకాలం : క్రీ.శ. 1700 కి పూర్వం. (క. స. 309) (శ. సా. వి-527)

## చంద్రదేవుని ఏలూరు శాసనము

కాలం : క్రీ. శ. 1209.
శాసనప్రదాత : చంద్రదేవుడు.
శాసనప్రదేశం : పశ్చిమగోదావరి జిల్లా ఏలూరు.
ప్రస్తావిత స్థలం : కొలని (సరసీపురం) సోమేశ్వరాలయం.

శాసన విషయం : శాసన ప్రదాత దండెమాంబకు ఎర్రమనాయకునికి పుత్రుడు. భార్య ముప్పమ్మకు ధర్మార్థంగా-కొలని గ్రామంలో వేంచేసియున్న సోమేశ్వర స్వామికి సంధ్య దీపాలు శాశ్వతంగా నిలిపినట్లు ఈ శాసనం వల్ల తెలుస్తున్నది. దీనిలో ఒక సీస పద్యముంది. (తె. క. చ-314 b)

## చంద్రభాను చరిత్ర

కర్త : తరిగొప్పుల మల్లన.
అంకితం : ఇలవేల్పు దత్తాత్రేయునికి.

అయిదాశ్వాసాల ప్రబంధం.

ప్రత్యేకత : ఈ కావ్యం సత్యభామ కుమారుడైన చంద్రభానుని చరిత్ర. అతనికి కుముదినితో జరిగిన పరిణయం ఇందులో వర్ణితం. కథ చిన్నదైనా ఆశు, విస్తర, చిత్ర, మధుర కవితలున్నాయి. పింగళి సూరన్న నవ్యరీతి, మూర్తికవి వాణీ యిందులో కనిపిస్తాయి. రసవంతమైన రచన. శ్లేషలకు కాక కథకు ప్రాముఖ్యముంది. కళాపూర్ణోదయంలో నారదునికి కృష్ణుడు, ఆయన భార్యలు సంగీతం నేర్పితే ఆ బాకీ తీర్చటానికన్నట్లు ఈ కావ్యంలో నారదుడు చంద్రభానునికి సంగీతం నేర్పుతాడు. చంద్రభాను చరిత్రను చూసే అనంతరం సమీపకాలంలో సురభి మాధవరాయలు "చంద్రికా

పరిణయం" అనే కావ్యం వ్రాశాడు ఈ కావ్యం "నవీన తర సుధారసమధురతా బంధుర" మన్నాడు కవి. (ఆరుద్ర-9)

## చంద్రమతీ పరిణయము

నామాంతరం : కవిజనరంజనము.

కర్త : అడిదము సూరకవి (చూ).

## చంద్రమౌళి

కాలం : క్రీ. శ. 1450-1500 ప్రాంతం. గౌరనకు తరవాత కాలంవాడు.

రచన : హరిశ్చంద్రోపాఖ్యానము (అలభ్యం).

రెండు పద్యాలు మాత్రం లభ్యం.

విశిష్టత : ఈ కవి గౌరన ద్విపదలో వ్రాసిన హరిశ్చంద్రోపాఖ్యానాన్ని పద్య కావ్యంగా వ్రాశాడు. క్రీ. శ. 1580 ప్రాంతంలో జంటకవులు తురగా రాజకవి, అయ్యంకి బాలసరస్వతి ఈ కవిని స్తుతించారు. పెదపాటి జగ్గన్న ప్రబంధ రత్నాకరంలోను, గణపవరపు వేంకటకవి "ఆంధ్ర కౌముది"లోను, కూచిమంచి తిమ్మకవి "సర్వ లక్షణసార సంగ్రహం"లోనూ ఈ కవి హరిశ్చంద్ర కావ్యంలోని పద్యాలను ఉదాహరించారు. (ఆరుద్ర-6-87)

## చంద్రరేఖా విలాపము

కర్త : కూచిమంచి జగ్గకవి.

ఇది ప్రసిద్ధి పొందిన దూషణ కావ్యం. పూసపాటి విజయరామరాజు బావమరది చింతలపాటి నీలాద్రిరాజు సత్కారం చేస్తానని చెప్పి కావ్యం వ్రాయించుకొని, తరవాత తిరస్కరిస్తే కవి కోపించి, అతనిని దూషిస్తూ ఈ బూతుకావ్యాన్ని వ్రాశాడు. దీనిలో కవికి తిట్టు కవిత్వంలో ఉన్న అసమాన పాండిత్యం కనిపిస్తుంది. కవి ఈ కావ్యాన్ని తొలుత "చంద్రరేఖా విలాసము"నే పేరుతోనే ప్రారంభించాడు. కృతిపతి దానిని తిరస్కరించినప్పుడు 'విలాసము'ను, 'విలాపము'గా మార్చాడు. ఈ కావ్యం ముళ్ళపూడి తిమ్మరాజు నెలకొల్పిన నరేంద్రనాథ సాహిత్యమండలి పక్షాన ముద్రితమైంది. (వా. చ-81)

## చంద్రశేఖర గోవర్ధనుడు

కాలం : క్రీ. శ. 18 వ శతాబ్దం.

స్థలం : తంజావూరు మండలం.

కృతులు : సంస్కృత రచనలు, వ్యాఖ్యాన గ్రంథాలు.

ఇతడు తంజావూరును పాలించిన మహారాష్ట్ర రాజు తుక్కోజీ (1728-35) మంత్రియైన ఘనశ్యాముని కుమారుడు. (తె. వి. స-6-223)

చంద్రశేఖర చరిత్ర (అలభ్యం)

కర్త : తెలియదు.

కాలం : క్రీ. శ. 1670 కి పూర్వం.

రత్నాకరం గోపాలరాజు ఈ కావ్యాన్ని పేర్కొన్నాడు. (ఆరుద్ర-12-191)

చంద్రశేఖర విలాసము

కర్త : అష్టావధాన కవి.

నాటకం. మూడు భాషలలో (సంస్కృతం, తెలుగు, మహారాష్ట్రం) రచింపబడింది. నాట్య, తాళ లక్షణాలతో కూడి ఉంది.

ఇతివృత్తం : ఇది పారిజాత వృత్తాంతాన్ని శివపరంగా మార్చి చెప్తున్న రచన. నారదుడు తెచ్చిన పారిజాతం కారణంగా గంగాగౌరులు కలహించడం, చంద్రశేఖరుడు వారిని ప్రసన్నులను చేసుకోవడం ఇతివృత్తం. (ద. దే. వా-235)

చంద్రహాస విలాసము

కర్త : యాదవామాత్య కవి.

అంకితం : భద్రాద్రిలోని శ్రీరామునికి.

ఇది జైమిని భారతంలోని చంద్రహాసుని కథ. పద్య కావ్యం. (తె.వి స-6)

చంద్రాంగద చరిత్రము

కర్త : పైడిమర్రి వెంకటపతి.

అంకితం : శ్రీరామునికి.

ఆరాశ్వాసాల ప్రౌఢ ప్రబంధం. నలచక్రవర్తి మనుమడైన చంద్రాంగదునికీ సీమంతినికీ జరిగిన పరిణయగాథ వర్ణితం.

ఈ కథకు మూలం స్కంద పురాణం బ్రహ్మోత్తర ఖండంలోని, సోమవార వ్రత మాహాత్మ్యంలో ఉందని పరిశోధకులు భావిస్తున్నారు. మూల కథకూ ఈ ప్రబంధానికీ చాలా భేదం ఉన్నదట.

అష్టాదశ వర్ణనలు, సమకాలీన సంఘ చిత్రణం కావ్యమంతటా కనిపిస్తాయి. వసుచరిత్ర, ఆముక్తమాల్యదల అనుకరణం కనిపిస్తున్నది. ఇది 1897 లోనే ముద్రితమయింది. (ఆరుద్ర-10-242)

చంద్రాంగదోపాఖ్యానము (అలభ్యం)

కర్త : చింతలపల్లి సంజీవయ్య (చూ).

ఈ గ్రంథం రాజాంకితమట. (ఆరుద్ర-11-205)

చంద్రాననా దండకము

కర్త : నుదురుపాటి చిదానంద కవి (చూ).

అంకితం : పుదుక్కోటను 1844-86 ల నడుమ పాలించిన రామచంద్రతొండమానుకు.

శృంగారపరమైన రచన. చారిత్రకాంశాలున్నాయి. (ద. దే. వా-446)

చంద్రాననా దండకము

కర్త : నుదురుపాటి సాంబశివకవి (చూ).

రచనాకాలం : క్రీ. శ. 19 వ శతాబ్దం-మొదటి పాదం.

అంకితం : హిజ్ ఎక్సలెన్సీ బిరుదాంకితుడు 1815-39 ల నడుమ పుదుకోట్టను పాలించిన రాయ రఘునాథ తొండమాన్‌కు.

శృంగారపరమైన రచన. చారిత్రకాంశాలతో కూడి ఉంది. (ద.దే.వా-445)

'చంద్రా భరణా' శతకము (అలభ్యం)

కర్త : చక్రపాణి రంగనాథుడు.

కందపద్య శతకం. కొన్ని పద్యాలు మాత్రం లభించాయి.

(శ. క. చ. 729)

చంద్రాభ్యుదయము

కర్త : పోచన.

రచనా కాలం : క్రీ. శ. 18 వ శతాబ్దం.

అంకితం : చిన్నయామాత్యునకు.

ప్రబంధం. శబ్దాలంకారాలతో రచన శ్రావ్యంగా ఉంది. పండితుల ప్రశంసలు పొందిన రచన. (క. చ. 3-206)

చంద్రాలోకము

నామాంతరం : ఆంధ్ర చంద్రాలోకము.

కర్త : ఆడిదము సూరకవి.

అలంకార శాస్త్ర గ్రంథం. సంస్కృత మూలానికి తెలుగుసేత.

చంద్రాష్టోత్తరైక శతక స్తవమ్ (సం)

కర్త : శ్రీశైలము వేంకటార్యుడు.

స్తోత్రరూపంగా కాకుండా వర్ణనాత్మకంగా ఉన్న రచన. దీని ప్రతి కాకినాడ సాహిత్య పరిషత్తులో అసమగ్రంగా ఉంది. (సా. ప. ప. 25-4)

చంద్రికా పరిణయము

కర్త : ఎలకూచి బాలసరస్వతి.

అంకితం : సరస్వతీ దేవికి.

శృంగార వీర అద్భుత రసాలతో మేళవించిన ప్రబంధం. పూర్తిగా లభ్యం కాలేదు. మొదటి ఆశ్వాసం, రెండో ఆశ్వాసం కొద్దిగా ఉన్న అసమగ్ర ప్రతి ఒకటి మాత్రం లభించింది.

పాండవవీరుడు భీముడు, కాశీరాజు కుమార్తెను స్వయంవరంలో వివాహం చేసుకోవడం దీనిలోని ఇతివృత్తం. మూలం భారతం ఆదిపర్వంలో ఉన్నదట. కవి కొన్ని ఘట్టాలు కల్పించాడు. దీనిని కవి జూపల్లి వెంకటాద్రి ప్రోత్సాహంతో వ్రాశాడు. ప్రథమాశ్వాసంలో జూపల్లి వారి వంశ చరిత్ర ఉంది. (ఆరుద్ర 10-35)

చంద్రికా పరిణయము

కర్త : సురభి మాధవరాయలు (చూ).
తొలిముద్రణ : క్రీ. శ. 1904.
అంకితం : జటప్రోలులోని మదనగోపాల స్వామికి.

ఆరాశ్వాసాల అతిప్రౌఢ ప్రబంధం. వసుచరిత్ర పోకడలతో రచించినట్లున్నది. వాల్మీకి రామాయణంలో సూత్రప్రాయంగా ఉన్న కథను కవి ప్రబంధంగా తీర్చిదిద్దాడు. సుచంద్రుడనే రాజు తమిస్రాసురుని సంహరించి పాంచాల దేశాధీశుని పుత్రిక చంద్రికను పరిణయమాడటం ఇందులోని ఇతివృత్తం. శ్లేష గాంభీర్యంలో వసుచరిత్రను మించిపోయిందనీ, కావ్యవైశేషికాది శాస్త్ర మర్యాదలను సంధిస్తూ, కల్పనా ప్రౌఢిమలో ఆముక్తమాల్యదను తలపిస్తున్నదనీ, పండితాభిప్రాయం. ఈ గ్రంథానికి అవధానం శేషశాస్త్రిగారు, వెల్లాల సదాశివశాస్త్రులు గారు కలసి టీక వ్రాశారు. శరదాగమ సమాఖ్య వ్యాఖ్య జతచేశారు. జటప్రోలు వారు దీన్ని 1904 లో ముద్రించారు. దీనికి తరిగొప్పుల మల్లన రచించిన చంద్రభాను చరిత్రకూ పోలికలున్నాయని పండితులు భావిస్తున్నారు. రెండింటిలోనూ నాయికలు పూర్వ జన్మలో అప్సరసలు. తపోభంగం చేసి శాపగ్రస్తలవుతారు. వేటకు పోయిన నాయకులు నాయికా వృత్తాంతం తెలుసుకుంటారు. (ఆరుద్ర-10-41)

చంపుడు గుడి

కాల : క్రీ. శ. 11-15 శతాబ్దాల మధ్య కాలం.
నామాంతరం : భైరవునిగుడి.

శివసాయుజ్యాన్ని పొందటానికి, విశేషించి శైవులు తమ భక్త్యావేశాలను ప్రజలకు తెలియ జెప్పటానికీ, ఈ చంపుడు గుడులలో తమ శిరస్సులను ఖండించుకొని బలి అయిపోతుండేవారు. ఆనాటి సామాన్య ప్రజలు దీనిని దేశీయమైన తెలుగు భాషలో "చంపుడు గుడి" అని పిలిచేవారు. ఈ గుడిలోని బలిసమర్పణ కార్యక్రమం బాగా ప్రజాదరణ కూడా పొంది ఉండవచ్చు.

ఈ చంపుడు గుడి కొందరు రెడ్డి ప్రభువులు ఒక పవిత్రమైన సంస్థగా నిర్వహించేవారు. కాకతీయ, రెడ్డి ప్రభువుల కాలంలో ఈ "చంపుడు" కార్యక్రమం జరగటానికి ప్రత్యేకించి వీరభద్రస్వామికి, భైరవునికి, భద్రకాళికి దేవాలయ నిర్మాణం జరిగినట్లు శ్రీశైలంలోని ఒక శాసనాన్ని బట్టి తెలుస్తున్నది.

అనవేమారెడ్డి (ధర్మవేమన) వంటి ప్రభువులు, ఈ చంపుడు గుడి బలి సమర్పణ కార్యక్రమానికి కొన్ని ప్రత్యేకమైన ఏర్పాట్లు కూడా చేసే వారట.

అనవేమారెడ్డి "వీర శిరోమంటపము" అనే ఒక శిలా మంటపాన్ని శ్రీశైల మల్లికార్జునస్వామి దేవాలయావరణంలోనే ఇందు నిమిత్తం నిర్మింపచేసినట్లు ఆ మంటపం మీద ఉన్న శిలా శాసనాన్ని బట్టి తెలుస్తుంది. (తెలుగు-జన-మార్చి'75)

## చంపూ కావ్యము

ఇది శ్రవ్యకావ్య భేదాలలో ఒకటి. గద్యలతోను, పద్యాలతోను, కూర్చిన కావ్యాన్ని చంపువు అంటారు. చంపూ కావ్యాలు 12 రకాలని ప్రాచీనులు చెప్పారు.

పిల్లలమర్రి పినవీరభద్రుడు దీనిని "చంబూ" కావ్యమన్నాడు (తె. వి. స-6)

## చంపూ రామాయణము

కర్త : (చూ) ఋగ్వేది వేంకటాచల కవి.

అంకితం : వెల్లంటి కసవరాజుకు.

మూలం : భోజ మహారాజు, లక్ష్మణసూరి సంస్కృతంలో రచించిన చంపూ రామాయణం.

ఇది ముద్రితం. ఎనిమిది ఆశ్వాసాల ప్రబంధం. అనువాద గ్రంథం. ఆంధ్రీకరణం రసవంతంగా ఉంది. అక్కడక్కడ దోషాలు కనిపిస్తున్నాయని పరిశీలకులంటున్నారు. (క. త-117)

## చకిలాల లింగప్ప

కాలం : క్రీ. శ. 14 వ శతాబ్దం.

సాహిత్య పోషకుడు. పోశెట్టి లింగకవిని ప్రోత్సహించి "నవచోళ చరిత్ర" రచింప జేశాడు. ఈ గ్రంథం శ్రీరాములపల్లిలోని మృత్యుంజయ స్వామికి అంకితం. గ్రంథంలో అంతటా కవి లింగప్పను సంబోధించి చెప్పాడు. ఈ రచనకు మూలం కన్నడ గ్రంథమట. (ద్వి. సా. చ-129)

## చక్కిలాల వేషయామాత్యుడు

కాలం : క్రీ. శ. 18 వ శతాబ్దం.

సాహిత్య ప్రియుడు. ముప్పిరాల సుబ్బరాయ కవిని ప్రోత్సహించి అతని చేత రచనలు చేయించాడు. ఆ కవి రచించిన కృష్ణాభ్యుదయ ప్రబంధాన్ని అంకితం పొందాడు. (క. స-293)

## చక్రకవి

కాలం : క్రీ. శ. 17 వ శతాబ్దం.

స్థలం : మధుర తిరుమల నాయకుని ఆస్థానం.

రచనలు : 1. జానకీ పరిణయమ్ (సం) 2. రుక్మిణీ పరిణయమ్ (సం) 3. గౌరీ కల్యాణమ్ (సం) 4. ద్రౌపదీ కల్యాణమ్ (సం) 5. చిత్ర రత్నాకరము.

ఇతని చంపువులు ఇంకా అనేకం ఉన్నవట. (తె. వి. స-222)

## చక్రపాణి రంగనాథుడు

కాలం : క్రీ. శ. 13 వ శతాబ్ది ఉత్తరార్థం.
స్థలం : వరంగల్లు ప్రాంతం.
రచనలు : 1. శివభక్తి దీపిక 2. గిరిజాధినాయక శతకము 3. చంద్రాభరణ శతకము 4. శ్రీగిరినాథ విక్రమము (అలభ్యం).

ఇతడు రెండో ప్రతాప రుద్రునికి, పాల్కురికి సోమనాథునికి సమకాలికుడు. బసవేశ్వరునికి, పండితారాధ్యునికి తరువాతి వాడు. ఇతన్ని గురించి చాలా కథలున్నాయి. పాల్కురికి సోమన కొడుకు చతుర్ముఖ బసవేశ్వరునితో రంగనాథుడు వాదానికి దిగి ఓడి పోయాడట. శ్రీశైలమల్లికార్జున స్వామిని చూడకుండా పోతే రెండు కళ్ళూపోయాయి. తరవాత స్వామి దర్శనం చేసుకొన్నాక ఒక కన్ను వచ్చినట్లు, పాల్కురికి సోమనను ప్రార్థిస్తే రెండో కన్నువచ్చినట్లు జనశ్రుతి. సోమనాథునితోనే ఈయన వాదించినట్లు కొందరంటారు. రంగనాథ రామాయణమని ప్రసిద్ధి చెందిన ద్విపద రామాయణాన్ని ఇతడే రచించాడని కొందరు అంటున్నారు. గ్రంథంలో ఎక్కడా ఇతని పేరు లేదు. గోనబుద్ధారెడ్డి పేరే ఉంది. ఈ కవి పెక్కు సంస్కృతాంధ్ర గ్రంథాలు రచించాడని జనశ్రుతి. ఇతడు మొదట వైష్ణవుడనీ పాలకురికి సోమనాథునితో వాదంలో ఓడిపోయి అతని శిష్యుడై శైవాన్ని అవలంబించాడనీ అంటారు. దీనికి ఆధారాలులేవు. ఇతని కాలం గురించి పండితులలో భిన్నాభిప్రాయాలున్నాయి.

(క. త–3) (క. స–176; గోలకొండ కవుల సంచిక)

## చక్రపురి రాఘవాచార్యుడు

కాలం : క్రీ. శ. 16 వ శతాబ్ది ఉత్తరార్థం.
స్థలం : చిత్తూరు మండలం.
రచనలు : 1. నలచరిత్ర (ద్విపద) 2. విష్ణుభక్తి చరిత్ర (విష్ణుపురాణము) (ద్విపద) 3. విప్రనారాయణ చరిత్ర (యక్షగానం).
గురువు : కందాళ దొడ్డయాచార్యుడు.

విశిష్టత : ప్రస్తుత తమిళనాడులోని ఉత్తర ఆర్కాట్ జిల్లాలోఉన్నషోలింగర్ (చోళ లింగపురం) నివాసి. షోలింగర్‌కు ఘటికాచలమనే నామాంతరముంది. 108 దివ్య తిరుపతులలో ఇది ఒకటి. ఈ క్షేత్రంలో కందాళవారిది ఆచార్య పీఠం. కందాళవంశం లోని తిరువెంగళయ్య కొడుకు రాఘవాచారి ఇతడు విద్యావిశారదుడు. తొలియక్షగాన కర్త రాఘవాచారి అని, కందుకూరి రుద్రయకాదనీ పండితుల మధ్య భేదాభిప్రాయా లున్నాయి. ఇతని రచనలో వ్యాకరణ దోషాలున్నప్పటికీ శైలి ఇంపుగా ఉంటుంది.

(అరుద్ర–9)

## చక్రపూజ

కాలం : క్రీ. శ. 11–15 శతాబ్దాల మధ్యకాలం,
చూ. భైరవీ చక్రము

చక్రలాంఛన విధి

కర్త : మరింగంటి సింగరాచార్యులు. (తె. వి. స.-6)

చక్రవాళ తారావళి

కాలం : క్రీ. శ. 17వ శతాబ్ది.

కర్త : గణపవరపు వేంకట కవి.

ఇది అముద్రితం. అలభ్యం.

తారావళులు కవి చిన్ననాటి రచనలట. (క. త-12)

చక్రవాళ మంజరి

రచనాకాలం. : క్రీ. శ. 1493-1550 ప్రాంతం.

కర్త : తాళ్ళపాక పెదతిరుమలాచార్యులు. (తె. వి. స-6)

చక్రవాళము

నామాంతరం : చతుర్భద్రము.

ఇది ఒక శ్రవ్యకావ్య భేదం. ఇందులో మొదట ఒక పద్యము, తరువాత ఎనిమిది దళాలున్న గద్య ఉంటుంది. ఇది కళిక. ఈ పద్య గద్యాలు రెండూ ముక్తపదగ్రస్తాలై సంబోధనాంతాలుగా ఉంటాయి. (తె. వి. స-6)

చక్రటాతి లక్ష్మీనరస కవి

చూ. చాటరాతి లక్ష్మీనరసకవి.

చతుర కల్లినాథుడు

కాలం : క్రీ.శ. 15 వ శతాబ్దం.

రచన : కళానిధి (సంగీత రత్నాకర వ్యాఖ్యానం).

ఇమ్మడి ప్రౌఢదేవరాయల (1446-65) కాలంలోని పండితుడు.

(నా. ర. చ -85)

చతుర్దండి ప్రకాశిక (సం)

కవి : వేంకటమఖి.

రచనాకాలం : 17వ శతాబ్దం.

సంగీత శాస్త్ర గ్రంథం. తంజావూరు రాజైన విజయారాఘవుని ప్రేరణతో కవి ఈ గ్రంథం రచించాడు. (తం. ఆం. నా-252)

చతుర్భద్రము

చూ. చక్రవాళము

చతుర్భుజాభిషేకము (అలభ్యం)

కవి : వేములవాడ సోమనాథుడు. (చూ.)

**చతుర్వాటికా మాహాత్మ్యము**

కర్త : లింగమగుంట రామకవి.
అంకితం : శ్రీరామచంద్రునికి.

ప్రత్యేకత : ఇది అయిదాశ్వాసాల ప్రబంధం. దీని ప్రతి మద్రాసు ప్రాచ్య లిఖిత భాండాగారంలో ఉంది. చతుర్వాటిక అంటే చదలువాడ. ఇది నెల్లూరు మండలంలో గుండ్లకమ్మవద్ద ఉంది. ఇక్కడికి లింగమగుంట గ్రామం దగ్గరగా ఉంటుంది. కవి తన స్వగ్రామ మాహాత్మ్యాన్ని దీనిలో వ్రాశాడు. రామకవి మామ తెనాలి రామకృష్ణుడు పాండురంగ మాహాత్మ్యాన్ని, ఘటికాచల మాహాత్మ్యాన్ని వ్రాశాడు. మామ, అల్లుడు కూడా స్థల పురాణాలే వ్రాయటం గమనార్హం.

ఈ కావ్యం అనంతాచార్యుని ప్రేరణతో కవి రాశాడట.

(ఆరుద్ర-8-133 క. స-185)

**చతుర్విధ కంద శతకము (అలభ్యం)**

నామాంతరం : యోగశాస్త్ర శతకము.
కర్త : వెలగపూడి కృష్ణయామాత్యుడు.

**చతుర్విధ కవిత్వాలు**

ఆశు, మధుర, చిత్ర, విస్తర భేదాలతో కవిత్వరీతులను నాలుగు రకాలుగా లాక్షణికులు విభజించారు. కొందరు ఈ విభాగాలను ఆశు, గర్భ, చిత్ర, బంధ కవిత్వాలుగా పేర్కొన్నారు. ఆశు, చిత్ర కవితలను అందరూ ఒప్పుకొన్నా మధుర, విస్తర, గర్భ, బంధ కవిత్వాలను గురించి పండితులలో భిన్నాభిప్రాయాలున్నాయి. గర్భ, బంధ కవిత్వాలను విస్తరకవితలో భాగాలుగా లాక్షణికులలో కొందరు అంగీకరించారు. (కావ్యాలంకార సంగ్రహం)

**చతుర్వేద తాత్పర్య సంగ్రహమ్ (సం)**

కర్త : శివలింగారెడ్డి (చూ).
నామాంతరం : తత్త్వ ప్రకాశిక

**చతుర్వేదసారము**

కర్త : పాల్కురికి సోమన (చూ).
రచనాకాలం : 14వ శతాబ్దం.

ప్రత్యేకత : 357 సీసపద్యాల గ్రంథం. దీనికి "బసవలింగ" మకుటమున్నది. వీరశైవం శ్రుతి స్మృతి సమ్మతమని నిరూపించటానికి, తన చతుర్వేద పారంగత్వాన్ని చాటటానికి కవి దీనిని వ్రాశాడు. శైవ మతానికి సంబంధించిన ముఖ్యవిషయాలు ఇందులో వివరంగా ఉన్నాయి. (యు. భా; చై. ల)

**చతుశ్శ్లోకి కల్పతరు వ్యాఖ్య (సం)**

కర్త : రేపూరి కాళహస్తి కవి.

ఈ గ్రంథం కలకత్తా విశ్వవిద్యాలయంవారు అచ్చువేయించారు. కవి మైసూరు చెన్నపట్టణ పరిపాలకుడైన రెండవ జగదేవరాయని ఆస్థాన పండితుడు. ఈ పాలకులను గురించిన విశేషాలు ఈ గ్రంథంలో ఉన్నాయి. (ద. దే. వా. పీఠిక-7)

**చతుష్షష్టి విద్యాసంగ్రహమ్ (సం)**

కర్త : చూ పురుషోత్తమ కవి.

సంస్కృత రచన.

చతుష్షష్టి విద్యలను గురించిన సమగ్ర వివరణము ఈ గ్రంథంలో ఉంది. (అం. సం సా.-455)

**చదలువాడ**

గ్రామ నామమే ఇంటిపేరుగా వ్యవహారంలోనికి వచ్చింది. ఈ గ్రామం గుండ్ల కమ్మ నదికి సమీపంలో ఉన్నది.

**చదలువాడ మల్లన**

కాలం : క్రీ. శ. 16 శతాబ్ది ఉత్తరార్థం.

స్థలం : చదలువాడ.

రచన : 1. విప్రనారాయణ చరిత్ర (చంపువు) 2. రుక్మాంగద చరిత్ర 3. సంవరణచరితము (కర్తృత్వం సందేహం).

సమకాలికులు : సారంగు తమ్మయ్య.

కామాక్షమ్మ లింగనామాత్యుల పుత్రుడు.

విశిష్టత : కవిత్రయంలో ఒకడైన ఎర్రా ప్రెగ్గడ వంశీయుడు. ఈయన మొదట గుండ్లకమ్మకు సమీపాన ఉండే చదలవాడలోనూ, తరవాత కాళహస్తి, కార్వేటి నగరాలలోనూ ఉండేవాడు. ఈయన వ్రాసిన విప్రనారాయణ చరిత్రను, కార్వేటి నగర పాలకుడైన మాకరాజు తిమ్మరాజుకు, ద్విపద రుక్మాంగద చరిత్రను రామయ్య భాస్కరుడనే (బాచరుసయ్య) కొండవీటి పాలకునికి అంకితమిచ్చాడు. రసవంతమైన కవిత్వం చెప్పిన దిట్ట.

సారంగు తమ్మయ "వైజయంతీ విలాసం"లో విప్రనారాయణుని కథ చెప్పాడు. సారంగు తమ్మయ్యా ఇతడూ సమకాలికులే అయినా ఒకరి కావ్యాన్ని ఇంకొకరు చూడక పోవడంచేత ఒకే కథను (విప్రనారాయణ చరిత్రను) ఇతివృత్తంగా గ్రహించి కావ్య రచన చేయడం జరిగి ఉంటుందని పరిశీలకులు భావిస్తున్నారు. (ఆరుద్ర-8-149)

**చదలువాడ లింగన**

కాలం : తెలియదు.

స్థలం : కార్వేటి నగర సంస్థానం.

ఇతడు "చదలువాడ మల్లన"కు తండ్రి. మల్లన రచించిన 'విప్రనారాయణ చరిత్ర' కృతి ప్రస్తావనలో ఇతడు కూడా కవి అని, పెక్కు కావ్యాలు రాజాంకితాలుగా రచించాడనీ చెప్పబడింది. కావ్యాల పేర్లు తెలియరాలేదు. (అం. సం. సా.)

## చదలువాడ సీతారామశాస్త్రి

కాలం : 19వ శతాబ్దం.

రచనలు : దక్కను పూర్వకథలు, అభిజ్ఞాన శాకుంతలము, మాళవికాగ్ని మిత్రము మొ॥ ఆరు నాటకాలు.

19వ శతాబ్దిలోని విద్వత్కవులలో పేరొందినవాడు. ఆరు సంస్కృత నాటకాలను వచన రూపంలో అనువదించాడు. దక్షిణ దేశంలో వాడుకలో ఉన్న కథలను 'దక్కను పూర్వకథల' నే పేరుతో సులభశైలిలో రాశాడు. (క. స. 292)

## చదువుల సోమలింగయ్య

కాలం : 18వ శతాబ్దం-చివరి భాగం.

రచన : మదన సాయక విలాసము.

అన్నపూర్ణమ్మ వేంకటాచలమయారాధ్యుల పుత్రుడు. ఇతని కవిత్వం మృదు మధురంగా ఉంటుంది. నిర్దుష్టం కాదని పండితులంటారు. (క. చ.3-207)

## చమత్కార చంద్రిక (సం)

కర్త : విశ్వేశ్వరుడు.

ఇది సంస్కృతాలంకార గ్రంథం. దీనిలోని ఉదాహరణలన్నీ సర్వజ్ఞ సింగ భూపాలుని అభివర్ణిస్తుంటాయి. (తె. వి. స-4)

## చమత్కార మంజరి

నామాంతరం : లక్షణాపరిణయము.

కర్త : సింహాద్రి వెంకటాచార్యులు (చూ).

## చమత్కార రామాయణము (అలభ్యం)

కర్త : తెలియదు.

అప్పకవి దీనిని పేర్కొన్నాడు. (ఆరుద్ర-9-255)

## చరిగొండ ధర్మన

కాలం : క్రీ. శ. 16 వ శతాబ్ది పూర్వార్ధం.

రచన : చిత్రభారతము.

బిరుదు : శతలేఖినీ సురత్రాణ.

గోల్కొండ నవాబులు జంషిద్ కుతుబ్‌శాహి (క్రీ. శ. 1543-1550) ఇబ్రహీం కుతుబ్‌శాహి (క్రీ. శ. 1550-1580) లకు సమకాలికుడు కావచ్చు.

మాదమ్మ తిమ్మనామాత్యుల పుత్రుడు.

విశిష్టత : శ్రీకృష్ణునకు, పాండవులకు, "గయుడు" అనే గంధర్వ రాజు మూలంగా జరిగిన యుద్ధాన్ని ఈ కవి కథా వస్తువుగా తీసుకొని ప్రౌఢంగా రసవంతంగా కవిత్వం చెప్పాడు. అవధానాలలో ప్రవీణుడు. అష్టావధానం, శతావధానం చేసేవాడట. (తె. వి. స-6)

## చరిగొండ నరసింహ కవి

కాలం : క్రీ. శ. 16వ శతాబ్దం.
రచన : శశిబిందు చరిత్ర.

విశిష్టత : చరిగొండ ధర్మన్నకు సోదరుడని అంటారు. కందుకూరి రుద్ర కవికి కొంచెం పూర్వుడు ఈయన కావ్యంలోని 3 పద్యాలను అప్పకవి ఉదాహరించాడు. చరిగొండ నరసింహ కవి 'వెలగ' శబ్దానికి "వెల్గ" అనీ, కందుకూరి రుద్ర య తరువాత కాలంలో "మొలక" శబ్దానికి మొల్క అనీ ప్రయోగించారని అప్పకవి చెపుతూ పరిహ సించాడట. కవి శశిబి దు చరిత్రలో వచ్చి శృంగారాన్ని వర్ణించినట్లు అప్ప కవి ఉదాహ రించిన పద్యాలవల్ల తెలుస్తున్నది. (అరుద్ర-9-261)

## చరిగొండ హొన్నయ్య

కాలం : క్రీ శ. 1700 ప్రాంతం.
స్థలం : చరిగొండ (మహబూబునగరు మండలం).
రచన : జ్యోతిష రత్నాకరము (పద్యకావ్యం) (క. స.-312)

## చరిత్ర కావ్యము

రాజులకూ, దేశాలకూ, ప్రజలకూ సంబంధించిన రాజకీయ, మత, సాంఘిక, ఆర్థిక విషయాంను తెలియజేసే కావ్యాలు చరిత్ర కావ్యాలు రామాయణంలోని సూర్య వంశ రాజ క్రమవర్ణన, రాజవంశ క్రమవర్ణన చరిత్ర అవుతుందని కొందరి అభిప్రాయం.

అశ్వఘోషుని బుద్ధచరిత, బాణభట్టు హర్ష చరిత, క్షేమేంద్రుని రాజావళి, కల్హ ణుని రాజ తరంగిణి, బిల్హణకవి విక్రమాంక దేవచరితము చరిత్ర కావ్యాలు. అట్లే తెలుగు వారు రచించిన సంస్కృత కావ్యాలు వామభట్ట బాణుని వేమభూపాల చరితము, రెండవ, మూడవ రాజనాథ డిండిములు వ్రాసిన అచ్యుతరాయాభ్యుదయమ్, సాళువాభ్యుద యమ్, గంగాదేవి మధురా విజయమ్ (కుమారకంప రాయచరితమ్), తిరుమలాంబ వర దాంబికా పరిణయమ్, రామభద్రాంబ రఘునాథాభ్యుదయమ్, జగన్నాథ పండితుని జగదా భరణమ్ మొ॥ అన్నీ చరిత్ర కావ్యాలే.

తెలుగులో కాసె సర్వప్ప సిద్ధేశ్వర చరిత్ర, రంగరాయ చరిత్ర (18 శ.) మొ॥వి చరిత్ర కావ్యాల కిందకు వస్తాయి. (తె. వి. స-6)

## చర్ల బ్రహ్మయ్యశాస్త్రి

కాలం : క్రీ. శ. 19 వ శతాబ్దం.
స్థలం : "కడియెద్ద" గ్రామం (తాడేపల్లిగూడెం సమీపంలోనిది).
రచన : తెలియరాలేదు.

వీరు పండిత కుటుంబానికి చెందినవారు. సంస్కృతాంధ్రాలలో మహా పండి తులు వ్యాకరణ శాస్త్రం, షడ్దర్శనాదులు ఆమూలాగ్రంగా అధ్యయనం చేశారు.

జగద్విఖ్యాతి గాంచిన తిరుపతి వేంకటకవులు ఈ బ్రహ్మయ్యశాస్త్రిగారి వద్దనే వ్యాకరణ శాస్త్రం, భాష్యాంతం చదివారు. వీరు స్వగ్రామంలోనే ఒక సంస్కృత పాఠశాలను స్థాపించి, శిష్యులకు ఉచితంగా విద్యాబోధన చేస్తూ, భోజనాది సౌకర్యాలను కూడా ఏర్పాటు చేసేవారట. (తిరుపతి కవుల సమీక్ష)

## చల్ మోహనరంగ పదాలు

కర్త : తెలియదు.

ప్రసిద్ధమైన జానపద శృంగార పదం.

చూ. శృంగార గేయములు. (ఆం. వా. చ)

## చల్లపల్లి

నామాంతరం : దేవరకోట.

ఇది కృష్ణా మండలం దివి తాలూకాలోని ప్రాచీన సంస్థానం తూర్పున బందరు తాలూకా, దక్షిణ పశ్చిమ దిశలలో కృష్ణానది, ఉత్తర దిశలో గన్నవరం, గుడివాడ తాలూకాలు దీనికి సరిహద్దులు. గోలకొండ నవాబుల సన్నదు పొందిన నాటినుండి వీరి పూర్వులు ఈ సంస్థానాన్ని పాలిస్తూ వచ్చారు.

యార్లగడ్డ గుర్వినీడు (క్రీ.శ. 1576–1596) ఈపాలకుల కూటస్థుడు. ఈ వంశంలో మొదటి అంకినీడు (క్రీ. శ. 1710–1723) చాలా ప్రసిద్ధుడు. క్రీ. శ. 1746–1791 మధ్యకాలంలో పాలించిన కోదండ రామన్న దేశాహిగొప్ప వ్యవహార నిపుణులు. ఫ్రెంచి వారి నుండి గూడూరు, ఆకులమన్నాడులకును, దివి సీమలోని ఆరు లంకలకును ఫర్మానా సంపాదించారు. వీరు మిక్కిలి సాహిత్యాభిమానులు. "ముక్తేవి పెరుమాళ్ళయ్య" వంటి మహాకవులు వీరి ఆస్థానంలోని వారు.

ముక్తేవి పెరుమాళ్ళయ్య పుత్రుడు సుందర రామదాస కవి, దౌహిత్రులు కోవెల రాఘవాచార్యులు ఈ ఆస్థానంలో గౌరవాదరాలు పొందారు.

క్రీ. శ. 1798 నుండి 1819 వరకు పాలించిన ఇమ్మడి అంకినీడు "కానుల పురుషోత్తమకవి"కి పోషకులు.

క్రీ. శ 1846–75 మధ్య చల్లపల్లి సంస్థానాన్ని పాలించిన మూడవ అంకినీడు బహద్దరు భాషాభిమానులు. వేమూరి సుబ్బావధానులు, యడవల్లి అప్పావధానులు, మద్దూరి కృష్ణావధానులు మొ॥ పెక్కురు కవి పండితులు ఆనాటి చల్లపల్లి కోటలో గౌరవాదరాలు పొందారు.

క్రీ శ. 1876 నుండి చలపల్లిని పాలించిన మల్లికార్జున ప్రసాదనాయుడు బహద్దరు గీర్వాణాంధ్ర భాషలో గొప్ప పండితులు. సాహిత్య చక్రవర్తి బిరుదాంచితులైన వేమూరి నరహరిశాస్త్రి, వారి సోదరులు వేమూరి శివరామశాస్త్రి వీరి ఆస్థాన పండితులు.

అంకినీడు ప్రసాద బహద్దరు ఆస్థానంలో అద్దేపల్లి సోమనాథశాస్త్రి ఆస్థాన

విద్వాంసులుగా ఉన్నారు. బలిజేపల్లి లక్ష్మీకాంతం వంటి మహానుభావులను వీరు గౌరవించి ఆదరించారు.

వీరి కుమారులు రాజా శివరామ ప్రసాదబహద్దరు క్రీ. శ. 1929 లో జమీకి వచ్చారు. బి.ఎ. పట్టభద్రులు. తుమ్మల సీతారామమూర్తి చౌదరి రచించిన "రాష్ట్రగాన" కృతి భర్త. వీరు దేశభక్తులు. అనేక సాహిత్య సంస్థలకు భూరివిరాళాలిస్తూ సాహిత్య పోషణ చేశారు. (ఆం. సం. సా-153-164)

**చల్లపల్లి వెంకనార్యుడు**

నామాంతరం : చల్లపల్లి వెంకయ్య.
కాలం : క్రీ. శ. 16 వ శతాబ్దం.
స్థలం : చోళదేశం.
రచన : శ్రీకృష్ణ విలాసము.
సమకాలికులు : పోలూరి గోవిందకవి, గులిపల్లి గోపన్న.

రంగనార్యుని పుత్రుడు. సరసంగా కవిత్వం చెప్పాడు. (ద. దే. వా-238)

**చల్లపల్లి వెంకయ్య**

నామాంతరం : చల్లపల్లి వెంకనార్యుడు (చూ). (ఆరుద్ర-12-159)

**చల్లవారు**

మజ్జిగను జానపదులు చల్ల అంటారు. ఈ చల్లపేరు ఇంటి పేరుగా ఉన్న వారు గుంటూరు మండలంలో ఉన్నారు. (భారతి-మా-45-230)

**చల్లా గురవయ మంత్రి**

కాలం : క్రీ. శ. 4వ శతాబ్ది ఉత్తరార్థం.
స్థలం : కొండపల్లి (బెజవాడ సమీపంలోనిది).
రచన : యాజ్ఞవల్క్య విజయము.
బిరుదు : బాలసరస్వతి.

పేరమంత్రి పుత్రుడు. కొండవీటి స్థల కరణం వేంకటమంత్రి ప్రేరేపణతో సుబోధకంగా కవిత్వం వ్రాశాడు. (క. త-12-171)

**చల్లా పట్టాభిరామయ్య**

కాలం : క్రీ. శ. 19 వ శతాబ్దం.
స్థలం : విశాఖమండలం

మొఖాసాదారు. ఇతడు అడిదం బాలభాస్కర కవి II (1808-1874) ఆగ్రహానికి గురైనట్లు కొన్ని పద్యాలవల్ల తెలుస్తున్నది. (కవిసంశయ విచ్ఛేదము-పీఠిక-15)

**చల్లా సూరయ**

కాలం : క్రీ. శ. 17 వ శతాబ్దం.
సలం : తంజావూరు సీమలోని పొందవాక గ్రామం.

రచన : వివేక విజయము.
గురువు : శ్రీమత్సదానంద చిన్మయయోగి.

మారయ లక్ష్మమ్మల పుత్రుడు. అద్వైత వేదాంత ప్రతిపాదకంగా రచనలు చేసిన కవి. ఇతని కవిత్వం సరళంగా ఉంటుంది. (ద. దే. వా-293)

**చాగయ రామదేవుడు**

వ్యవహారనామం : రాఘవామాత్యుడు.
కాలం : క్రీ శ. 15 వ శతాబ్దం.

చాగయ కుమారుడు. సాహిత్య పోషకుడు. భైరవకవి రచించిన శ్రీరంగ మాహాత్మ్యం ఇతనికే అంకితం. ఇతని అన్న విఠ్ఠల మంత్రి ఇమ్మడి సైపఖానాది రాజ్య భారధుర్యుడట. (క త-5-239)

**చాటురాతి లక్ష్మినరసకవి**

నామాంతరం : చత్రాతి లక్ష్మినరసకవి.
కాలం : క్రీ. శ. 18 వ శతాబ్దం.
స్థలం : విజయనగర సంస్థానం.
రచనలు : పద్మనాభ యుద్ధము, ఈశ్వరీ పరిణయము, విశేషాంధ్రము, ఖండనారాతి భీమ శతకము మొ॥ వి.

విజయనగర సంస్థానాధిపతి అయిన నారాయణ గజపతి రాజుకు (1794-1845) ఆశ్రితుడు. కనకాంబావీరరాఘవుల పుత్రుడు. ఇతడు విజయనగర సంస్థానంలో రాజకీయ ఉద్యోగిగా ఉంటూ, కవితా వ్యవసాయం సాగించాడు ప్రౌఢ విద్వత్కవి. విజయనగర సంస్థానపు దివానైన పూసపాటి సీతారామరాజు దౌష్ట్యాన్ని తన శతకంలో విమర్శించాడు. (ఆం. సం. సా-419-420; క. స-207)

**చాటు కథా చమత్కృతులు (అలభ్యం)**

కర్త : నెల్లూరి వీరరాఘవ కవి.
ఇవి మొత్తం 50 కథలట. (ద. దే. వా-258)

**చాటు పద్యము**

అనిబద్ధ కావ్యము.
చూ. ముక్తకము.

**చాటు పద్య సహస్రము**

కాలం : క్రీ. శ. 19 వ శతాబ్దం.
కర్త : పడకండ్ల గురురాజ కవి.

**చాటు శతకము**

కాలం : ప్రాచీన కాలం.
కర్త : తెలియదు.

ఇది సంకలన శతకం. సామాన్య నీతులు, రాజనీతి క్షేత్ర మహిమ, రాజుల మంత్రుల గురించి వ్రాసిన పద్యాలే ఈ శతకం. అరవీటి బుక్కరాయలు, కుమార

వేంకటపతి. సర్వజ్ఞ సింగ, బంగరుయాచ, వెలుగోటి కొండ మొ॥ ప్రభువులను వివిధ కవులు ప్రస్తుతించిన పద్యాలు దీనిలో ఉన్నాయి. (శ. సా. వి-630)

**చానమ**

ఈమె ఖడ్గ తిక్కన భార్య. కవి తిక్కనకు వరుసకు వదినగారు. యుద్ధ రంగం నుండి వెను తిరిగి వచ్చిన భర్త నుద్దేశించి ఈమె చెప్పిన కంద పద్యం ప్రచారంలో ఉంది. అది ఈమె చెప్పినదో లేక ఇతరులు రచించి ఆ కథను ప్రచారంలోకి తెచ్చారో నిర్ధారణగా తెలియదు. (ఆం. కవయిత్రులు)

**చాపకూడు**

దేశంలోని సకల వర్ణాలవారు ఒకచోట చేరి పంక్తి భోజనం చేయటమే చాప కూడు. సర్వవర్ణ సమానత్వం, పతిత జనోద్ధరణ, తిరుమంత్రోపదేశంతో కూడిన శ్రీవైష్ణవ మత సిద్ధాంతఫలితంగా ఈ చాపకూడు వ్యాప్తిలోనికివచ్చింది. ఈ మత ప్రవక్త శ్రీమద్రామానుజాచార్యులు. వీరవైష్ణవ మత సిద్ధాంతాలకు ప్రభావితుడైన పలనాటి బ్రహ్మ నాయుడు వైష్ణవుడుగా మారి, వివిధ వర్ణాల స్త్రీలను పెళ్ళాడి, సంతానం కని, చాప కూడు భుజించాడు.

పలనాటి యుద్ధానికి చాపకూడు ప్రబల కారణమంటారు. గురజాల ప్రభువు నలగామరాజు, మంత్రిణి నాగమ్మ శైవులయినట్లు, మాచర్ల ప్రభువులు మలి దేవాదులు-మంత్రి బ్రహ్మన్న వైష్ణవులైనట్లు-పలనాటి యుద్ధానికి మత వైషమ్యాలకు తోడు ఈ "చాపకూడు" కారణమైనట్లు పలనాటి వీరచరిత్రవల్ల తెలుస్తున్నది.

(సా. మంజూష-274)

**చాముండికా విలాసము (అలభ్యం)**

నామాంతరం : చౌడేశ్వరీ విలాసము.
కర్త : నన్నయభట్టు అని కొందరి అభిప్రాయం.

**చారిత్రక గేయములు**

జానపద గేయ వాఙ్మయం వస్తు రస ప్రధానాన్ననుసరించి కొన్ని భాగాలుగా విభజింపబడింది. వాటిలో ఇదొక భాగం.

వీనికే "వీరగీతములు" అని కూడా పేరున్నది. వాస్తవంగా జరిగిన ఒక వీర సంఘటనను చూచియో, వినియో భావోద్రేకం కలిగిన జానపదుడు, ఆ సంఘటన విశేషాన్ని లయాన్వితంగా గానం చేస్తాడు. అది నాటి ప్రజలను మిక్కిలిగా ఆకర్షించి నప్పుడు మౌఖికంగానే ప్రచారం చెందడం సహజం. ఇట్టి వీరగాథల్లో కొన్ని అతిశయోక్తులు చేరవచ్చు. లేదా వర్ణనా విశేషాల్లో సమకాలీన ప్రభావం అధికంగా కనిపించవచ్చు. వాటిని వదిలివేస్తే చారిత్రక సత్యాలు అనేకం కనిపిస్తాయి.

నిజానికి ఆంధ్ర భాషలో ఇట్టి వీరగాథలు అనేకం. కాని వాటిలో ముద్రితాలు చాలా తక్కువ. ఇటీవలి కాలంలో కొన్ని ముద్రింపబడ్డాయి. బొబ్బిలిరాజు కథ, కాటమరాజుకథ, దేశింగురాజుకథ, అరెమరాతీల కథ, కుమారరాముని కథ, కొండ్రలాయని కథ మొ॥వి కొన్ని ప్రముఖ వీరగాథలు. (ఆం.వా.చ.)

చారుచంద్రోదయము

కవి : చెన్నమరాజు చెన్నమరాజు (చూ).

అంకితం : తాడిపర్తిలోని గోపాలస్వామికి.

అయిదాశ్వాసాల శృంగార ప్రబంధం. కల్పితేతి వృత్తంతోడి కావ్యం. శ్రీకృష్ణుని కుమారుడైన చారుచంద్రుని కథ, ఆహ్లాదకరంగా కమనీయంగా ఉంది. ప్రబంధ కవుల పోకడల ననుసరించిన రచన. (ఆరుద్ర-10-239)

చారు చర్య

కవి : అప్పన మంత్రి (చూ).

76 పద్యాలున్న వైద్యశాస్త్ర గ్రంథం.

సంస్కృతంలో భోజరాజు రచించిన గ్రంథానికిది సంగ్రహానువాదం. ఆత్మ సంబోధనాత్మకంగా ఉంది. దైనందినిక జీవితంలో చేసే ప్రతి పనీ-పళ్ళు తోమడం-స్నానం చేయడం-భోజన పానీయాది సేవనం-కామోప భోగాలను అనుభవించడం మొదలైన విషయాలన్నీ శాస్త్రీయంగా చేయవలసిన పద్ధతులు ఈ గ్రంథంలో ఉన్నాయి. (ఆరుద్ర-2)

చారు దర్వేషు కథలు

కర్త : ఎర్రమిల్లి మల్లికార్జునుడు.

కాలం : క్రీ. శ. 1856 ప్రాంతం.

దర్వేషు అంటే పారసీ భాషలో "ఫకీరు" అని అర్థమట. నలుగురు ఫకీర్ల చరిత్రలను తెలిపే కథలు కాబట్టి, వీటికి "చారుదర్వేషు కథలు" అనే పేరు వచ్చింది. పూర్వం ఇది చాలా వ్యాప్తిలో ఉండేది. అనేక ముద్రణలు పొందింది. (వ. వా-62)

చారుధేష్ణ చరిత్ర (అలభ్యం)

కర్త : తెలియదు.

అప్పకవి ఈ కావ్యాన్ని పేర్కొన్నాడు.

చారు లీలా విలాసము

కర్త : మారుపెద్ది చెంగల్వరాయకవి (చూ).

దీనిప్రతి అసమగ్రంగా లభించింది. ఈ ప్రబంధంలోని రచన, కథా సంవిధానం ప్రౌఢంగా ఉన్నాయి.

(ద. దే. వా. 510)

చాళుక్య విశ్వేశ్వర భూపతి

కాలం : క్రీ.శ. 15వ శతాబ్ది పూర్వార్ధం.

స్థలం : విశాఖ మండలం.

సాహిత్య పోషకుడు. విన్నకోట పెద్దన రచించిన కావ్యాలంకార చూడామణి ఇతనికే అంకితం.

విశాఖ జిల్లా సర్వసిద్ధికి సమీపంలో ఉన్న "పంచధారల" దగ్గర ఉన్న శ్రీ ధర్మ లింగేశ్వర స్వామికి ఇతడు మండపం కట్టించాడట. ఈ నిర్మాణ కాలం క్రీ. శ. 1407 ప్రాంతం.

**చింతకుంట కోదండ రామకవి**

కాలం : క్రీ. శ. 1790 ప్రాంతం.

రచన : సునందా పరిణయము (ప్రదీప చరిత్రము).

అక్కన మంత్రి పుత్రుడు. రాయన భాస్కరుని వంశంలోనివాడు. రస వంతంగా కవిత్వం చెప్పాడు. (క. చ-3-126)

**చింతలపల్లి ఎల్లనార్యుడు**

కాలం : క్రీ. శ. 16వ శతాబ్దం.

స్థలం : కమలాపురి.

రచనలు : లభ్యం కాలేదు.

బోరవెల్లి సంస్థానంలో క్రీ. శ. 18వ శతాబ్దంలో ఆస్థాన కవిగా ఉన్న చింతలపల్లి ఛాయాపతికి పూర్వుడు, ఏడవ తరంవాడు. అచ్యుతరాయలచేత అగ్రహారాలను పొంది కమలాపురంలో కాపురమున్నట్లు చింతలపల్లి ఛాయాపతి రచించిన రాఘవాభ్యుదయం ద్వారా తెలియవస్తున్నది. (ఆం. సం. సా.)

**చింతలపల్లి గోపాలయ్య**

కాలం : క్రీ. శ. 1625 ప్రాంతం (17వ శతాబ్దం).

స్థలం : జటప్రోలు సంస్థానంలోని గంగాపురం.

రచన : ఆర్యాశతకము (అలభ్యం).

గద్వాల, జటప్రోలు సంస్థానాలలో పేరు పొందాడు. ఈ కవి ఒక జాములో ఆర్యా శతకాన్ని చెప్పినట్లు అతని తరువాతివారి రచనలవల్ల తెలుస్తున్నది. ఇతడు గోపాల మంత్రిగా ప్రసిద్ధుడు. ఇతని శతకం వజ్రగిరి గోపాలునికి అంకితం. తండ్రి వీర రాఘవ కవి, మట్ల అనంతరాజు ఆస్థానంలో ఉండేవాడు.

(క. త-12-200, ఆరుద్ర-11-204)

**చింతలపల్లి చినవీరరాఘవ కవి**

నామాంతరం : చింతలపల్లి వీరరాఘవ కవి.

కాలం : క్రీ.శ. 18వ శతాబ్దం.

స్థలం : గంగాపురం (మహబూబ్‌నగర మండలం).

రచనలు : 1. మధురవాణీ విలాసము (అసమగ్రం) 2. శతకాలు (అలభ్యం).

వేంకటార్యుని పుత్రుడు. చిత్ర కవితాధురీణుడు. శతావధాన కర్త. వివిధశాస్త్రాలలో నిష్ణాతుడు. రాయదుర్గంలో జాములోపల ఒక శతకాన్ని చెప్పాడట. బోరవెల్లి సంస్థానాస్థాన

కవి అయిన చింతలపల్లి ఛాయాపతికి సోదరుడు. మధురవాణీ విలాసకర్త ఇతడేనా లేక ఇతని తాత వీరరాఘవ కవియా అన్న విషయం వివాదాస్పదంగా ఉంది. ఇతడు చాలా సంస్థానాలు దర్శించి సమ్మానాలు పొందాడు. (క. చ-3-137; ఆరుద్ర-11-214)

**చింతలపల్లి ఛాయాపతి**

కాలం : క్రీ.శ. 18వ శతాబ్దం.
స్థలం : గద్వాల ప్రాంతంలోని బోరవెల్లి సంస్థానం.
రచన : రాఘవాభ్యుదయము.
గురువు : తిరుమల శ్రీనివాసాచార్యులు.
బిరుదు : నవఘంట సురత్రాణ.

శతావధాన కర్త. ఇతని తండ్రి గోపాలభట్టు, తాత వీరరాఘవ కవి. ఛాయాపతి ఆంధ్ర గీర్వాణ భాషలలో నవఘంట సురత్రాణ బిరుదాంకితుడట. ఇతడు మొదట దేవరకొండ సీమలోని బోయినపల్లిలో ఉండేవాడనీ తర్వాత బోరవెల్లి సంస్థానాధీశుల ఆహ్వానంపై అక్కడ ఉన్నాడనీ అంటారు. బోరవెల్లి సంస్థానాధిపతి వేంకటపతి (రెడ్డి) ప్రోత్సాహంతో రచనలు చేశాడు. చిత్ర కవితారీతులు, ముద్రాలంకారాలపట్ల అభిమానం ఉన్నవాడు. కవిత్వం ప్రౌఢంగా ఉంటుంది.
(ఆం. సం. సా) (ఆరుద్ర-11-207)

**చింతలపల్లి వీరరాఘవ కవి**

నామాంతరం : చింతలపల్లి చినవీర రాఘవకవి (చూ).

**చింతలపల్లి సంజీవకవి**

కాలం : క్రీ. శ. 18వ శతాబ్దం.
స్థలం : గంగాపురం (మహబూబ్‌నగర మండలం).
రచన : చంద్రాంగదోపాఖ్యానము (అలభ్యం).

బోరవెల్లి సంస్థానాస్థాన కవి అయిన చింతలపల్లి ఛాయాపతికి పినతండ్రి కుమారుడు. తండ్రిపేరు చింతలపల్లి అప్పకవి. తల్లి గిరియమ్మ. ఇతడు రాజాస్థానాలలో విద్యా ప్రదర్శనలు చేసి మెప్పు పొందాడు. ఇతని ప్రసక్తి మధురవాణీవిలాసంలో ఉంది.
(మ. మా.)

**చింతలపాటి నరసింహరాయడు**

కాలం : తెలియదు.

ఈయన దానశీలియని ఒక చాటువు వల్ల తెలుస్తున్నది. చాటు పద్య కర్త ఎవరో తెలియదు. (చా. ప. ర.)

**చింతలపాటి ప్రకాశరాయడు**

కాలం : తెలియదు.

చింతలపాటి వంశీయులలో ఈయన గొప్ప దాన శీలి అని ఒక చాటువు వల్ల తెలుస్తుంది. చాటుపద్య కర్త ఎవరో తెలియదు. (చా. ప. ర.)

## చింతలపూడి ఎల్లయ

కాలం : క్రీ.శ. 16వ శతాబ్దం.
రచనలు : రాధామాధవము, తారకబ్రహ్మ రాజీయము.
సమకాలికులు: అష్టదిగ్గజాలు.
బిరుదు : రాధామాధవ కవి.

విశిష్టత : ఈయన రాయల ఆస్థానంలో సమస్యాపూరణంలో అద్వితీయు డని పేరు పొందాడు. 'రాధామాధవము' అనే కావ్యాన్ని మెచ్చి రాయలు ఈయనకు 'రాధామాధవ కవి' బిరుదు ప్రదానం చేశాడట.

ఇతని రచన మృదు మధురమూ, హృదయంగమమూ అని పండితుల అభి ప్రాయం. విష్ణుమాయా నాటకము ఇతనిదే అన్న ప్రతీతి ఉన్నది. కాని ఆ రచన ఇతనిది కాదని పండితులు నిరూపించారు. (వి. న. చ.)

## చిక్కదేవరాయలు

నామాంతరం : చిక్కదేవరాజు.
కాలం : క్రి. శ. 1672-1704 మధ్య మైసూరు సీమను పాలించినరాజు.
స్థలం : మైసూరు సీమ.
రచనలు : 1. వచన భారతము (కన్నడం) 2. గీతాగోపాలము (కన్నడం) 3. విన్నపాలు (కన్నడం).
బిరుదు : నవకోటి నారాయణుడు.

శ్రీరంగపట్టణం రాజధానిగా మైసూరు సీమను పాలించిన వారిలో తెలుగు భాషను పోషించిన మొదటిరాజు. ఇతని మీద తెలుగులో చాటువులు, యక్షగానాలు చాలా ఉన్నాయి. కన్నడంలో రచనలు చేశాడు. మేలుకోటలోని దైవంపై ఇతడు రాసిన విన్నపాలు ప్రసిద్ధమైనవి. కళువెనంజరాజు రాసిన కన్నడ భారతంలో కొంత ఇతని పేర ఉన్నది. గీత గోపాలం అనే లలిత కావ్యం కన్నడంలో ప్రసిద్ధి పొందింది. (ఆరుద్ర-12-74)

## చిక్కదేవరాయ విలాసము

కర్త : తెలియదు.
అంకితం : క్రి. శ. 1672-1704 వరకు మైసూరును పాలించిన చిక్కదేవరాయలకు. యక్షగానం. ప్రశస్తమైన కవిత. చారిత్రకాంశాలున్నాయి.
(ద. దే. వా. 447)

## చిక్క భీమరాజు శాసనము

కాలం : క్రి. శ. 1163 ప్రాంతం.

శాసనప్రదాత: చిక్కభీమరాజు.

శాసన రచయిత : పెద్దనాచార్యుడు.

ప్రస్థావిత స్థలం : బంగేరు గ్రామం.

శాసన విషయం : చిక్కభీమరాజు ధర్మార్థంగా దక్షారామ భీమేశ్వర స్వామికి అఖండ దీపం నిలిపినట్లు శాసనంవల్ల తెలుస్తున్నది. (తె. క. చ-295)

## చిక్కవరము

కృష్ణా మండలంలోని గన్నవరానికి సమీపంలో నెలకొన్న ఎస్టేటు. ఎస్టేటు దారులు బొబ్బిలి జమీందారుల జ్ఞాతుల కోవకు చెందినవారు. అజ్జంపూడి, గరికపర్రు, చిక్కవరం, పెదపులిపాక మొ॥ పదకొండు గ్రామాలు ఈ ఎస్టేటులో చేరుతాయి.

బొబ్బిలి పాలకుడైన రావు వేంకటశ్వేతాచలపతి రామకృష్ణ రంగారావు (1862-1926) మనుమడైన రాజా జనార్దన కృష్ణరంగారావు ఈ చిక్కవరం ఎస్టేటును ఖరీదు చేశాడు. ఇతడు వేంకటశ్వేతాచలపతి రామకృష్ణరంగారావుకు రెండవ భార్యవల్ల కలిగిన పౌత్రులలో కనిష్ఠుడు.

ఈ జనార్దన కృష్ణరంగారావు కళాభిమాని. విద్యా పోషకుడు. కెప్టెన్ ఆర్థర్ మన్రో, తాపీధర్మారావు నాయుడు, వాసిరెడ్డి శ్రీకృష్ణ వంటి ప్రముఖులకడ విద్యాభ్యాసం చేసి కీర్తి గాంచినాడు. ఈ రాజాగారికి ఇద్దరు కుమార్తెలు, ఇద్దరు కుమారులు. జ్యేష్ఠుడైన వేంకట ఆనంద కుమార కృష్ణరంగారావు మల్లాది రామకృష్ణశాస్త్రి గారి శిష్యుడు. సాహిత్యాభిమాని. (ఆం. సం. సా-536-537)

## చిగిలి లక్ష్మారాముడు

కాలం : క్రీ. శ. 18వ శతాబ్దం.

స్థలం : పుదుకోట.

ఖడ్గశాస్త్రవేత్త. "ఖడ్గలక్షణ శిరోమణి" రచించిన నవనప్ప, ఖడ్గ క్రమాన్ని ఇతని దగ్గర తెలుసు కొన్నాడట. ఆ గ్రంథంలో ఇతని ప్రస్తావన ఉంది.

## చిట్టాపురము

కర్త : వీరభద్రయ్య.

ఇది గుంటూరు జిల్లా వినుకొండ తాలూకా ఈపూరుఫిర్కాలో ఉన్న గ్రామం. వీరభద్రయ్య అనే ప్రభుత్వోద్యోగి ఈ గ్రామాన్ని వర్ణిస్తూ పద్యం చెప్పాడు. వట్టె నామాలవారి ప్రాభవం ఈ గ్రామంలో ఎక్కువగా ఉండేదని ఈ చాటువులో ఉంది. (చా. ప. ర.)

## చిట్టి రామాయణము

జానపద పౌరాణిక గేయరచన.

చూ. పౌరాణిక గేయములు. (ఆం. వా. చ.)

## చిత్తజల్లు వారు

చిత్తకార్తెలో ఎక్కువగా వానజల్లులు రావటం కద్దు. చిత్తలో వచ్చే జల్లు కొన్ని కుటుంబాల వారి ఇంటి పేరైంది. చిత్తజల్లు వారు గోదావరి మండలంలో ఉన్నారు. (భారతి-మా-45-230)

## చిత్తబోధ శతకము

కర్త : తాడేపల్లి పానకాలరాయకవి.

చంపకోత్పలమాలలతో కూర్చిన శతకం. "శ్రీహరి పదమ్ములు కోరి భజింపు చిత్తమా" అనేది మకుటం. రచన మనోహరంగా ఉంది. దీనిలోని కథ ఆంధ్రనాయక శతకంలోని కథవలెనే ఉంటుంది. ఇదే కథ శివపరంగా రాజోలు తాలూకా 'పలివెల'లోని కొప్పులింగేశ్వరస్వామిని గురించి కూడా చెబుతారు. (శ. క. చ-464)

## చిత్త శతకము

కర్త : శ్రీపతి భాస్కరకవి.

ప్రత్యేకత : వేదాల పేరు చెప్పి ప్రజలను మోసపుచ్చే వాళ్ళను ఎదిరించి, వేద విహిత కర్మలను నిరసిస్తూ చెప్పిన శతకం. మత విభేదాలను నిరసిస్తూ, సర్వ మానవ సమానత్వాన్ని బోధిస్తుంది. విగ్రహారాధన, వేదపారాయణం చేయవద్దని స్పష్టంగా చెబుతుంది. భజనలలో, సూర్య నమస్కారాలలో ప్రజలకున్న నమ్మకాలను సడలింప జేస్తుంది. ఈ శతకం నాస్తికత్వాన్ని ప్రచారం చేసినా, మంచి పౌరునికి ఉండవలసిన నీతులన్నీ చెబుతుంది నాస్తికమతాన్ని బోధించిన ఇలాంటి గ్రంథం మన ప్రాచీన గ్రంథాలలో అరుదు, ఇందులో బౌద్ధమతంలోని మంచి గుణాలను కవి ప్రత్యేకంగా చెప్పాడు. (ఆరుద్ర-9-223)

## చిత్తారు గంగాధర కవి

కాలం : క్రీ. శ. 1823 ప్రాంతం.
స్థలం : నల్లగొండ జిల్లా చర్లపల్లి గ్రామం.
రచనలు : 1. కొలిపాక మాహాత్మ్యము 2. శృంగార భల్లాణ చరిత్రము 3. శృంగార సిరియాళ చరిత్రము 4. శుకసప్తతి వచనము.

(శ. స-53)

## చిత్రకవి అనంతకవి

కాలం : క్రీ. శ. 16 వ శతాబ్ది చివరి భాగం.
స్థలం : కడప జిల్లా గండికోట ప్రాంతం.
రచనలు : 1. విష్ణుచిత్తీయ వ్యాఖ్య (అలభ్యం) 2. హరిశ్చంద్ర నలోపాఖ్యానానికి "ప్రకాశిక" వ్యాఖ్య 3. ఇందుమతీ పరిణయము (అలభ్యం) 4. హరిహరశ్లేషోదాహరణము (అలభ్యం) 5. సకల జీవన సంజీవనము (అలభ్యం) 6. వంశావళి (అలభ్యం).

విశిష్టత : ఈయన లక్షణసార సంగ్రహం వ్రాసిన చిత్రకవి పెద్దన్న కుమారుడు. ఈయన కుమారుడు చిత్రకవి వేంకటరమణ కూడా కఠిన ప్రబంధాలకు అర్థాలు చెప్పే పండితుడే. పైన పేర్కొన్న కావ్యాలలో మూడు నుంచి ఆరు వరకున్నవి అనంత కవి వ్రాశాడని కొడుకు వేంకటరమణ చెప్పాడు. అన్నీ అలభ్యాలే. ఇతడు గండి కోటను పాలించిన పెమ్మసాని చిన తిమ్మనాయని కాలంలో ఉన్నాడట. ఈయన భట్టు మూర్తి విరచిత ద్వ్యర్థి కావ్యం హరిశ్చంద్ర నలోపాఖ్యానానికి వ్యాఖ్య వ్రాశాడు. ద్వ్యర్థి కావ్యాలలో తొలి గ్రంథం రాఘవపాండవీయానికి ముద్దరాజు పెదరామన వ్యాఖ్య వ్రాస్తే, రెండో ద్వ్యర్థి కావ్యానికి ఈయన వ్యాఖ్య వ్రాశాడు. వ్యాఖ్యానం ఆ కాలపు వ్యావహారిక భాషలోనే ఉంది. అయితే దీనిని పండితులు కృతక భాషలోకి మార్చివేశారు. ఈయన కఠిన ప్రబంధాలకు అర్థం చెప్పటంలో ప్రత్యేకత సాధించాడు. హరిశ్చంద్ర నలోపాఖ్యాన వ్యాఖ్యానపు గద్యలో తాను 'పురాతనాధునాతన కఠిన ప్రబంధార్థ బోధన సమర్థమాన సాంభోజుణ్ణి' అని చెప్పుకొన్నాడు. ఈయన రచనలలో ఇదొక్కటే లభిస్తున్నది.

(ఆరుద్ర-9-207)

## చిత్రకవిత

నాలుగు విధాలయిన కవితలలో ఇది ఒకటి చూడగనే మేధకు అతి శ్రమాపాదకమై, ప్రయోక్త నేర్పునకు సూచకమై, ఏదో విచిత్ర లక్షణాన్ని భాసింప చేసేది చిత్ర కవిత. ఏదో ఒక చమత్కారం దీనిలో తప్పక ఉంటుంది ఏకాక్షరి, ద్వ్యక్షరి, త్ర్యక్షరి, తలకట్లు, గుడులు, కొమ్ములు మొదలైన వాటిలోనూ పాదభ్రమకము, పద్యభ్రమకము, పాదగోపనము మొదలైనవాటితోనూ కూడి ఉండి వింతగా మనస్సునలరించే కవితను చిత్ర కవిత్వమంటారు.

పాదగోపనం, పద్యభ్రమకం, పాదభ్రమకం, నామగోపనం, ఓష్ఠ్య, నిరోష్ఠ్య, సంకర జిహ్వ, అచల జిహ్వ వృత్తాలు, మొదలైనవి ఇందులో ఉంటాయి. గర్భకవిత్వం బంధకవిత్వం మొదలైనవన్నీ చిత్రకవితా భేదాలు.

చిత్ర కావ్యాలలో ముందుగా శబ్దచిత్రం, అర్థచిత్రం, ఉభయచిత్రం అని మూడు భేదాలున్నాయి. ద్వ్యర్థి కావ్యాలు, త్ర్యర్థి కావ్యాలు చిత్రకవితా భాగాలే.

నన్నెచోడుడు, గణపవరపు వెంకటకవి, శహాజీ మొ॥ వారు ఈ కవితపై ఆసక్తి చూపారు. (ఛం. ప. కో-304; తె. వి. స-6)

## చిత్రకవి పెద్దన

కాలం : క్రీ. శ. 16వ శతాబ్ది (1510-70 నడుమ).
స్థలం : కడప మండలం.
రచనలు : 1. లక్షణసార సంగ్రహము (లక్షణగ్రంథం) 2. ఒక శతకము.
గురువు : కందాళ అణ్ణాగారు.

విశిష్టత : ఇతడు తెలుగులో మొదటిసారిగా నాటక లక్షణాన్ని చెప్పిన లక్షణ కారుడు. కడప జిల్లా గండికోట తాలూకాలోని వెల్లలూరి నివాసి. కందాళ అణ్ణాగారి

కుమారుడయిన అప్ప పండితుడు విరూరి వేదాద్రికి గురువు (విరూరి వేదాద్రి తెనాలి రామకృష్ణ విరచిత పాండురంగ మాహాత్మ్యానికి కృతిభర్త). ఈయన పూర్వ లాక్షణిక లను నుతించాడు. ఈ కవి ఛందోభాగం అనంతుని ఛందాన్ననుసరించి రచించాడట. ఈయన చిత్రకవి అనంతకవికి, వేంకటరమణ కవికి పూర్వుడు. లింగమకుంట తిమ్మకవి ఇతన్ని నుతించాడు. ఇతడు హనుమంతునిపై చెప్పిన శతకం లభించలేదు. అణ్ణ పండి తుని శాసనాలు తిరుపతి దేవస్థానంలో ఉన్నాయి. (ఆరుద్ర-8)

## చిత్రకవి వేంకటరమణ

కాలం: క్రీ. శ. 18వ శతాబ్ది చివరిభాగం.

స్థలం : కడపజిల్లా గండికోట ప్రాంతం.

రచనలు : 1. సాంబ విలాసము 2. రామాయణము 3. కుమారగురువిలాసము 4. అభిమన్యువిలాసము 5. త్రిలోకసంజీవనము 6. రాఘవ పాండ వీయ వ్యాఖ్య 7. విష్ణుచిత్తీయ వ్యాఖ్య 8. వసుచరిత్రవ్యాఖ్య. అన్నీ అలభ్యాలు.

విశిష్టత : ఈయన హరిశ్చంద్ర నలోపాఖ్యాన వ్యాఖ్యాత చిత్రకవి అనంత కవి కొడుకు. రాఘవపాండవీయ, విష్ణుచిత్తీయ, వసుచరిత్రాది ప్రముఖ దివ్యకావ్యార్థ బోధన సమర్థుడు. చతుర్విధ కవితాపారీణుడు. అప్పకవి ఈయన సాంబవిలాసంలోని రెండు ప్రయోగాలను ఉదాహరించాడు. ఈయన రామాయణం పిండిప్రోలు లక్ష్మణ కవి కృత "రావణదమ్మీయం" వంటి దంటారు. (ఆరుద్ర-9)

## చిత్రకవి సింగరయ్య

కాలం : 17వ శతాబ్దం.

రచన : బిల్హణీయము.

ప్రౌఢకవి. చతుర్విధ కవితాధురీణుడు. బిల్హణీయాన్ని ఇతడు శ్రీరామునికి అంకితం చేశాడట. ఇతని అనంతరం ఇతని కుమారుడు నరసింహ కవి ఆ కావ్యంలోని కృత్యాదిని తొలగించి పండిపెద్ది కృష్ణస్వామికి ఇచ్చాడనీ, కృష్ణస్వామి ఆ కావ్యాన్ని తన కావ్యంగా వెల్లడించుకున్నాడనీ ఐతిహ్యం ఉంది. కావ్యం ప్రథమాశ్వాసంలోని చక్ర బంధాన్నిబట్టి ఇది సింగరయ్య రచనగా విమర్శకులు భావిస్తున్నారు. ఇతని కవిత్వం రసవంతమైనది. (క. చ.-3-156)

## చిత్రకూట మాహాత్మ్యము

నామాంతరం : తిల్ల గోవిందరాజ నాటకము.

కర్త : (చూ.) తిరుమల కవి.

అంకితం : శ్రీకృష్ణునికి.

యక్షగాన నాటకం. నటనాప్రధానమైన రచన.

విష్ణుపారమ్యాన్ని తెలిపే కథ. ప్రసిద్ధ రంగాలలో కర్ణాట, హిందుస్థానీ బాణీలకు చెందిన దరువులు, "సమపదము" అనే రచనా విశేషం, అష్టకం, ఉత్తర ప్రత్యుత్తర పదం ఉన్నాయి. గుజరాతికోపు, జక్కిణి పేరణి, పదచాళిక కూడా ఉన్నాయి.

ఈ నాటకం నాలుగునాళ్ళ విషయంగా కవి రాశాడు వరుసగా నాలుగు రోజులు ప్రదర్శింపబడుతుండేదేమో.

నాటకం చివర, 'తిల్లగోవింద రాజనాటకము ముగిసెను' అని ఉంది. తిల్లవనంలో జరిగిన కథ కాబట్టి ఆ పేర ప్రఖ్యాతమై ఉండవచ్చును. (య. గా. సంపుటి-4)

చిత్రభారతము

కర్త : చరిగొండ ధర్మన.

కృతిపతి: ఎనుములపల్లి పెద్దయామాత్యుడు.

ప్రత్యేకత : విచిత్రములైన కథలతో కూర్చిన కావ్యం. ఇందులో శ్రీకృష్ణ పాండవులకు గంధర్వ రాజు గయుని మూలంగా జరిగిన యుద్ధం వర్ణితం. ప్రసిద్ధమైన గయోపాఖ్యానం నాటకం (చిలకమర్తి) లోని కథకు మూలం ఈ చిత్ర భారతమే! దీనికి మూలం భారతంలో కాని, ఏ పురాణంలో గాని ఉన్నట్లు కనిపించదు. నాదెండ్ల గోపమంత్రి ఇదే ఇతి వృత్తంగా 'కృష్ణార్జున సంవాదం' అనే పేరుతో ద్విపదలో ఇంతకు ముందే వ్రాశాడు. (తె. వి. స-6)

చిత్రమీమాంస

కర్త : అప్పయ్య దీక్షితులు.

కవి గ్రంథాలలో ఇది పట్టయిన రచన. ముందు కారికను వ్రాసి, ఆ తరవాత వచన రూపంలో అన్య మతాలను చర్చించి, అవసరమైనచోట వాటిని ఖండిస్తూ రచన చేశాడు. దీనిలో కావ్య భేదాలయిన ధ్వని, గుణీభూత వ్యంగ్య చిత్రాల నిర్వచన ముంది. తరవాత చిత్రంలో శబ్ద చిత్రం శోభా విహీనమని దానిని విడిచి, అర్థ చిత్రాన్ని మాత్రమే కవి వివరించాడు. ఉపమాలంకారాన్ని తీసుకొని, దానిమీద 22 అలంకారాలు ఎట్లా ఆధారపడి ఉన్నవో వివరించాడు. ఈ గ్రంథ సిద్ధాంతాలను జగన్నాథ పండితుడు తీవ్రంగా ఖండించి అప్పయ్య దీక్షితుల మీద వ్యక్తి దూషణ మెండుగా చేశాడు.

(తె. వి. స-6)

చిత్రమీమాంసా ఖండనమ్ (సం)

కర్త : జగన్నాథ పండితరాయలు.

ఇది సంస్కృతంలో రచింపబడిన అలంకార శాస్త్ర గ్రంథం. (తె వి. స-4)

చిత్రరత్నాకరము

కర్త : చక్రకవి.

ఆరు భాగాలుగా విభజింపబడింది. ప్రశ్నోత్తర రూపంలో ఉన్న పద్యాలతో కూడిన రచన. హాస్యరస పూరితంగా ఉంది. (తె. వి. స-7-222)

చిత్రాంగదా పరిణయము (అలభ్యం)

కర్త : రాజవోలు సుబ్బారాయడు (చూ).

గంభీర శబ్ద గుంభనా చాతురితో ఈ కావ్యం రచించినట్టు కవి చెప్పుకొన్నాడు.

చిత్రాడ

ఆంధ్ర దేశంలోని ఒక గ్రామం.

ఇక్కడి "అముద్రితాంధ్ర గ్రంథ సర్వస్వము" అనే సంస్థలో ప్రాచీన అముద్రిత ప్రతులు సేకరించి భద్రపరచేవారు. అనేక ప్రాచీన కావ్యాలు ఈ సంస్థ ద్వారా పాఠకులకు పరిచయమైనవి. (క. త-12-163)

చిదంబర కవి

రచన : రామకుమార విజయము (ద్విపద)

అక్కమాంబ, నారాయణు లితని తలిదండ్రులు. ఇతడు పదవాక్య నిధియట. సంస్కృతాంధ్ర సత్కవితా రహస్య విదుడనని చెప్పుకొన్నాడు. (ద్వి. సా. చ. 374)

చిదంబరుడు

కాలం : క్రీ. శ. 16వ శతాబ్ది.

రచన : రాఘవ పాండవ యాదవీయమ్ (సం).

ఈయన విజయనగరాన్ని ఏలిన వేంకటపతి రాయలకు సమకాలికుడు. అనంత నారాయణుని పుత్రుడు. (తె. వి. స-6)

చిదానంద మంజరి

నామాంతరం : మాయా చిదానంద మంజరి.

కర్త : ఉమాపతి (నాదిండ్ల ఉమాపతి)

ద్విపదవేదాంత గ్రంథం. 31 పత్రాలున్న ప్రతి సారస్వతపరిషత్తు(కాకినాడ)లో ఉంది. వేదాంతానికి సంబంధించిన కథలను మృదు మధురమైన శైలిలో చెప్తున్న రచన.

చిదానందుడనే రాజు వేటకు వెళ్ళి మాయా శాంభవి అనే సుందరిని వివాహమాడి లౌకిక సుఖాలలో మత్తుడై ఉండగా, ఒక యోగి అతని దగ్గరకు వచ్చి వేదాంత విజ్ఞాన రహస్యాలు బోధించడం ఇందులోని ఇతివృత్తం. చిదానందునికి ఉపదేశింపబడిన అద్వైత జ్ఞానం కాబట్టి చిదానంద మంజరిగా ప్రసిద్ధమైంది. (ద్వి. సా. చ. 303)

చిన తిమ్మరాజు

కాలం : క్రీ. శ 16వ శతాబ్దం (ప్రథమభాగం).

సాహిత్య పోషకుడు. కృతిపతి.

అరవీటి అళియ రామరాయల పెద తండ్రి కుమారులలో ఒకడు. ఈతని అన్నగారైన పెద్దతిమ్మరాజు, దోనూరి కోనేరు కవిచేత బాలభాగవత (ద్విపద) కావ్యాన్ని

వ్రాయించి ఇతనికి అంకితం ఇప్పించాడు. ఇది క్రీ. శ. 1547లో అంకితం చేయబడింది. (ఆరుద్ర)

**చిన బాపరాజు**

కాలం : క్రీ. శ.1800 ప్రాంతం.

స్థలం : విజయనగరం.

సాహిత్యపోషకుడు. కృతిపతి. విజయనగర సంస్థానాధీశుల కుటుంబంలోనివాడు. అల్లమరాజు రంగధామ కవి రచించిన "నారాయణాచల మాహాత్మ్య ప్రబంధా"న్ని అంకితం పొందాడు. (క. వ .175)

**చిన రామలింగన్న**

కాలం : క్రీ. శ. 1725–1760.

స్థలం : రాఘవపురం.

ఇతడు వాసిరెడ్డివారి రెండవ కోవకు చెందిన రాఘవపురాధిపతులకు చెందిన వాడు. నిరంతర యుద్ధ కార్యకలాపాలలో నిమగ్నుడై ఉంటూనే సాహిత్య పోషణ గావించాడు. దివి రమణ కవిని పోషించి, అతనిచేత శృంగారధామము అనే కావ్యాన్ని వ్రాయించాడు. (ఆం. సం. సా.)

**చినరెడ్డి**

నామాంతరం : చినరెడ్డిగారి సుంకిరెడ్డి. (మ. మా.)

**చినరెడ్డిగారి సుంకిరెడ్డి**

కాలం : క్రీ. శ. 17వ శతాబ్దం.

స్థలం : అనంతపురం పరగణా–రావులచెరువు గ్రామం.

సాహిత్య పోషకుడు. పొత్తపి వెంకటామాత్యుని (పొత్తపి వెంకటయ్య) చేత సుబ్బరాయశతకం రచింపజేశాడు. (ఆరుద్ర. 12–85)

**చినవేంకటపతి రాయలు**

ఆరవీటి వంశీయుడు.

ఈయనను నుతిస్తూ ఒక చాటుపద్యం లభ్యం. చాటుకవి పేరుగాని, వివరాలు గాని తెలియవు. (చా. ప. ర.)

**చినవేంకట రాయలు**

చూ. ఆరవీటి చినవేంకట రాజు.

కాలం : క్రీ. శ.17 వ శతాబ్దం మధ్యకాలం (1650– 60 ప్రాంతం కావచ్చు).

ఇతడు ఆరవీటి కోదండరామరాజుకు కుమారుడు. తల్లి నాంచారమ్మ. కుమార ధూర్జటి కవిని కృష్ణరాయ విజయమనే కావ్యాన్ని వ్రాయమని ప్రోత్సహించినవాడు ఇతడే. (క. త.)

## చినవేంగమ రాజు

కాలం : క్రీ. శ. 1689- 1706 ప్రాంతం.
స్థలం : అనెగొంది.

సాహిత్య పోషకుడు. అనెగొంది సంస్థానాధీశుడైన తిరుమలరాజుకు బంధువు. వికటకవి బుచ్చాలి గోపాలయ్యచేత మధుర నేలిన రాణీ మంగమ్మ మీద అశ్లీల కావ్యాలను రచింపజేశాడు. మధురమంగా పుంశ్చలీ విలాసకర్త ఇతడే అని కొందరి అభిప్రాయం. ఇతని దౌష్ట్యాన్నిగురించి చాలా కథలు ప్రచారంలో ఉన్నాయి.

(ద. దే. వా. 329) (ఆరుద్ర 86)

## చినసోమ భూపాలుడు

కాలం : క్రీ. శ. 1762- 1793.
స్థలం : గద్వాలం.
బిరుదము : "నవభోజరాజు"

ఇతడు గద్వాల సంస్థాన ప్రభువు. పెద సోమభూపాలుని పౌత్రుడు. తిరుమల రాయని పుత్రుడు. "అష్టపది" ని ఇతడే వ్రాసినట్లు పరిష్కర్తలు భావించారు. కాని, పెద సోమభూపాలుడే కర్త అని కొందరి అభిప్రాయం,

రాజా పెద సోమభూపాలుని కాలంలో ప్రారంభింపబడిన 'యథాశ్లోకతాత్పర్య రామాయణం' ఈ రాజు కాలంలో పూర్తి చేయబడింది. ఈ సంస్థానాధీశ్వరుని కాలంలో పండిత గాయక సభలేగాక, ఈ క్రింది గ్రంథ రచనలూ జరిగాయి.

బోరవెల్లి కాణాదము పెద్దనగారి ఆధ్యాత్మ్య రామాయణం, ముకుంద విలాసం, మత్స్య పురాణం, శేషశైలేశలీల, రామాయణ చంపువు, యథాశ్లోక తాత్పర్య రామాయణం (బాలకాండం); బోరవెల్లి శేషాచార్యుల యథాశ్లోక తాత్పర్య రామాయణం (యుద్ధ కాండము); కామసముద్రం అప్పలాచార్యుల ఆంధ్రాష్టపది, యథాశ్లోక తాత్పర్య రామాయణం (కిష్కింధాకాండము): తిరుమల క్రిష్ణమాచార్యుల యథాశ్లోక తాత్పర్య రామాయణం (సుందరకాండ), శ్రీ తిరుమల బుక్కపట్టణం బుచ్చి వెంకటాచార్యుల వేదాంత కారికావళి, అభినవశృంగార మంజరీ భాణము, కళ్యాణ పురంజనము, శృంగార సర్వస్వము మొ॥; ధర్మవరం రామకవి గారి ముకుంద విలాసం; కొత్తపల్లి రామాచార్యుల యథాశ్లోక తాత్పర్య రామాయణం (అయోధ్యకాండం); ఎరసింగమయ్య నృసింహవిలాసం శ్రీ కొటికలపూడి వీర రాఘవాచార్యుల యథాశ్లోక తాత్పర్యభారతం (ఉద్యోగపర్వం) మొ॥ ఈ చినసోమ భూపాలుని కాలంలో జరిగిన రచనలు.

వీరేకాక ఆగంతకులైన పెక్కురు కవి, పండితులు వీరి పోషణలో ఉండేవారు.

(కేశవపంతుల-సం. సా.)

## చిన్న మాదిగవారు

జానపద కళాకారులు.

వీరు మాల మాదిగ కులస్థులనే యాచిస్తారు. సర్కారు జిల్లాలలో వీరుఎక్కువ. ఊరూరు తిరుగుతూ ప్రదర్శనలిస్తారు. వీరి ప్రదర్శన పగటిపూట జరుగుతుంది ఈ ప్రదర్శన వీధిభాగవతానికి దగ్గరగా ఉంటుంది వీధిభాగవతుల వలెనే వేషధారణ చేస్తారు వీరి కథలు ఎక్కువగా చరిత్రాత్మకాలు.

వీరు ఏ గ్రామంలో ప్రదర్శనలిచ్చినా ఒక వారంరోజులకుమించి ఆ గ్రామంలో ఉండరట.

వీరు తమ ప్రదర్శనలు అన్నీ ముగిసిన తరవాత ఒక తంతు "నడుపుతారు". క్షుద్రదేవతల తృప్తికోసం జంతుబలి ఇచ్చాక భీభత్సంగా వేషం వేసుకొన్న ఒక యువకుడు ఆయా దేవతల ముందు తాండవం చేస్తాడు అలాగే గ్రామప్రదక్షిణ చేసి, సమీపంలోని చెరువులో స్నానం చేసి, తిరిగి ఆ గ్రామానికి రాకుండా వెళ్ళి పోతాడట కట్లా ప్రదక్షిణ చేయటంవల్ల పాడిపంటలకు, ఆగ్రామ ప్రజలకు శుభం కలుగుతుందని జానపదుల నమ్మకం. (నా. ర చ_ 283)

## చిన్నయ సూరి నిఘంటువు

నామాంతరం : ఆంధ్ర నిఘంటువు.

## చిన్నయామాత్యుడు

కాలం : క్రీ. శ. 18 వ శతాబ్ది.

సాహిత్య పోషకుడు. అమ్మన మంత్రి కుమారుడు. పోచన రచించిన చంద్రాభ్యుదయమనే ప్రబంధాన్ని అంకితం పొందాడు. (క. చ_ 3_ 206)

## చిమ్మపూడి అమరేశ్వరుడు

కాలం : క్రీ. శ. 14 వ శతాబ్ది ఉత్తరార్థం.

రచన : విక్రమసేనము (లభ్యమైనది అసమగ్రం).

కొండవీటి అనవేమారెడ్డి, పెదకోమటి వేముల కాలంలోనివాడు

విశిష్టత : ఇతనిని తొమ్మిదిమంది తెలుగుకవులు స్తుతించారు. శ్రీనాథుడు, గోపరాజు, అనంతామాత్యుడు, ప్రౌఢకవి మల్లన, రామరాజభూషణుడు, అయ్యంకి బాలసరస్వతి, అంగర నృసింహకవి, కూచిమంచి జగ్గకవి, నూతనకవి సూరన్న. ఇతడు "సహస్రముఖ దృష్టి" కలవాడని, "వచః ప్రసాద సంసిద్ధుడు" అని కవిస్తుతి. పెదపాటి జగ్గన్నకవి, అప్పకవి, కూచిమంచి తిమ్మకవి విక్రమసేనంలోని పద్యాలను ఉదాహరించారు. దొరికిన పద్యాలు 54. (ఆరుద్ర_ 3)

## చిర విభవ శతకము

రచనాకాలం : క్రీ. శ. 1715_ 1729 మధ్యకాలం.

కర్త : కూచిమంచి తిమ్మకవి.

కృతిభర్త : కుక్కుటేశ్వరుడు.

ఇది భక్తి శతకం. ఎక్కువగా శైవ గాథలే ఉన్నాయి "చిరవిభవా భవా

విజిత చిత్తభవా యభవా మహాభవా" అనే మకుటంతో ఏకప్రాస చంపక మాలికలు 101 ఉన్నాయి. (శ. క. చ. 763)

## చిరుత వజీరు శతకము

కర్త : పూసపాటి వీరపరాజు.

కందపద్య శతకం. "చిరుతవజీరా" అనే మకుటంతో, అచ్చతెలుగు పదాలతో, రచన రమణీయంగా ఉంది. నీతిబోధకమైన కృతి. బాలబాలికలకు మిక్కిలి ఉపయోగకరం. (శ. క. చ. 608)

## చిరుతొండనంబి కథ

ఇది పాల్కురికి సోమన విరచిత బసవపురాణంలో ఒక శివభక్తుని కథ. రసవంతంగా ఉంటుంది శ్రీనాథుని హరవిలాసంలోని సిరియాళుని కథకు ఈకథే మాతృక. (వా. చ- 18)

## చిరు మామిళ్ళ పాపయ్య

కాలం : క్రి. శ. 18 వ శతాబ్దం.

సాహిత్య పోషకుడు. కృష్ణకవిని ప్రోత్సహించి అతనిచేత శకుంతలా పరిణయ ప్రబంధాన్ని రచింపజేశాడు.

## చిరుమూరి గంగరాజు

కాలం : క్రి. శ. 1560 కి పూర్వం.

రచన : కుశలవోపాఖ్యానము (అలభ్యం).

విశిష్టత: తిక్కన రచించిన నిర్వచనోత్తర రామాయణంలో తెలుగులో కుశలవుల చరిత్ర మొదట గ్రంథస్థమైంది. కుశలవోపాఖ్యానం పేరుతో ప్రత్యేక కావ్యం వ్రాసినవాడు గంగరాజు.

ఇతని రెండు పద్యాలు మాత్రం సంకలనగ్రంథాల్లో లభించాయి. (ఆరుద్ర-9)

## చిలువపడగరేని పేరణము

కర్త : మరింగంటి వేంకట (ప్రథమ) నృసింహాచార్యులు.

ఇది అచ్చతెలుగు కావ్యం. నాగకేతనుడైన దుర్యోధనుని పరిణయ గాథ దీనిలోని ఇతివృత్తం. (తె. వి. స- 6)

## చిల్లకూర దివాకర కవి

రచన : భరతసార సంగ్రహము.

వివరాలు తెలియరాలేదు. (వా. చ-వం. సు )

## చిల్లర వెన్నయమంత్రి

కాలం : క్రి. శ. 15వ శతాబ్ది ఉత్తరార్థం.

స్థలం : నెల్లూరు మండలం,

సాహిత్య పోషకుడు. పిల్లలమర్రి పినవీరభద్రుడు రచించిన శృంగార శాకుంతలానికి కృతిపతి. సాళువగుండ నరసింహరాయల (1456-90) సమకాలికుడు. ఈ మంత్రి నెల్లూరు దగ్గర బిట్రగుంట సమీపంలోని సోమరాజు పల్లె నివాసి ఈయన పూర్వీకులు పంటరెడ్ల వద్ద మంత్రులుగా ఉండేవారట (ఆరుద్ర-6-202)

## చిల్లరిగె యోగానందకవి

కాలం : క్రీ. శ 19వ శతాబ్దం ఉత్తరార్థం- 20వ శతాబ్దం ప్రారంభం
స్థలం : లక్కవరం సంస్థానం
రచన : 'కనకవల్లి' (నవల).

లక్కవరం సంస్థానాన్ని పాలించిన "మంత్రి ప్రెగ్గడ భుజంగరావు" ఆశ్రితుడు. ఇతని ఇతర రచనలు గూర్చిన వివరాలు తెలియవు. (ఆం సం. సా-372)

## చీకటి

ఇది కళింగ సీమలోని ప్రాచీన సంస్థానం. బాహుదా నదీ పరీవాహ ప్రాంతంలో ఏర్పడిందట.

సంస్థాన పాలకులకు మూలపురుషుడు "కేశవ రౌతురాయి" లేక "వీరకర్దమ సింహుడు". ఇతడే చీకటి కోటను నిర్మించాడు. 1634-1695 మధ్య సంస్థానాన్ని పాలించిన జోదుమణి రౌతురాయి పాలకులలో 16వ తరంవాడు. ఆ తరువాత కృష్ణచంద్ర రాజేంద్రదేవు (1770-1790), రాజా పీతాంబర రాజేంద్రదేవు మొ॥వారు ప్రముఖులు. ఈ పీతాంబర రాజేంద్రదేవు కాలంలోనే శాశ్వత పరిష్కారం జరిగింది. ఆ తరువాత విశ్వంభరుడు, కిశోరచంద్రుడు, రాధామోహనుడు, గౌరచంద్రదేవు మొ॥వారు సంస్థానాధిపతులుగా ఉండి సాహిత్యసేవ చేశారు.

గౌరచంద్రదేవు సాహిత్యాభిమాని. ఉర్లాము పండితుడైన బంకుపల్లి మల్లయ్యశాస్త్రిని గౌరవించాడు. రాజమహేంద్రవరంలోని ఆంధ్రేతిహాస పరిశోధక మండలికి రాజపోషకుడు. గజపతి నగర ప్రాంతం వాడైన పప్పు అప్పల నరసింహశాస్త్రి వీరి ఆస్థాన పండితుడు. (ఆం. సం. సా.)

## చీదెళ్ళ రామకవి

కాలం : క్రీ. శ. 1850కి పూర్వుడు.
రచన : కృష్ణశతకము (కృష్ణగురు శతకము).

వేదాంత విషయ ప్రతిపాదకమైన శతకం రచించాడు. ఇతర రచనలు తెలియరాలేదు. (శ క. చ- 562)

## చుండి-కాళయామాత్యుడు

నామాంతరం : కాళామాత్యుడు.
కాలం : 16వ శతాబ్దం.
స్థలం : విజయనగరం.

సమకాలికులు : తుళువ కృష్ణదేవరాయలు.

సాహిత్యపోషకుడు. కృతిపతి. ఎడపాటి ఎఱ్ఱన రచించిన 'మల్హణచరిత్రను' అంకితం పొందాడు.

ఇతడు కృష్ణదేవరాయల ఆస్థానంలోని వాడని ఊహిస్తున్నారు. కృతికర్త ఎడపాటి ఎఱ్ఱన ఇతని బంధువట. (క. స. 209)

చూర్ణకము

సంస్కృతంలోని నాలుగు రకాల గద్యలలో ఇది ఒకటి. ఇది హ్రస్వ సమాసాలతో ఉండే గద్య. సంస్కృతంలో ద్వి వచన బహువచన సందర్భాలైన విభక్త్యను శాసనాలతో ఉంటుంది. (తె. వి. స-6)

చెంగమలవల్లి పరిణయము (అలభ్యం)

రచనాకాలం : క్రీ.శ. 17వ శతాబ్దం.

కర్త : విజయరాఘవ నాయకుడు (చూ).

మధురోక్తులతో ప్రతిభావంతంగా కూర్చిన కృతియట. (ద. దే. వా-87)

చెంగల్వ కాళయ

నామాంతరం : కాళకవి.

కాలం : క్రీ. శ. 17 వ శతాబ్దం.

రచన : రాజగోపాల విలాసము.

తంజావూరు విజయరాఘవుని ఆస్థానం (1633-73) లో ఉండేవాడు. తండ్రి వెంకటయ్య, తల్లి కృష్ణమ్మ. ఇతని తాతపేరు కాళయ.

ఈ కవి విస్తర కవితా విశారదుడు. రఘునాథుని కాలంలోకూడా ఉన్నాడు. కృష్ణాజీ, రామ భద్రాంబలకు విద్యాగురువు. రఘునాథుని కాలంలో గుర్తింపు లేక పోయినా కవిని విజయరాఘవుడు రాజ చిహ్నలిచ్చి గౌరవించాడు. విజయరాఘవుడు రాజ్యానికి వచ్చిన సంవత్సరమే ఇతడు "రాజగోపాల విలాసం" అతనికి అంకితమిచ్చాడు. విజయ రాఘవుడు తనయింటి స్త్రీలతోకూడా కవి యింటికి విందుకు వచ్చి ఇంటివారందరికీ వరుస సొమ్ములు, కొడుకులకు చతురంత యానాలు, ఆభరణాలు బహూకరించాడట.

(ద. దే. వా-117, 14)

చెంగల్వ వేంకటయ్య

కాలం : క్రీ.శ. 16 వ శతాబ్దం.

రచన : పార్వతీ పరిణయము (ప్రబంధం అలభ్యం).

ఇతడు రణరంగ గంధ వారణ బిరుదాంకుడైన శ్రీకంఠునికి మంత్రిగా ఉండేవాడట. ఇంకా అనేక గ్రంథాలు వ్రాశాడని అతని కుమారుడు చెంగల్వకాళయ చెప్పాడు. కాని ఇతని ఒక్కరచన కూడా లభించలేదు.

(ద. దే. వా. 113) (రా. గో. వి. 1- 29)

చెంచీత పాట- చెంచులు

తెలుగుదేశంలోని ఈ చెంచుపాట పూర్వంనుంచీ సుప్రసిద్ధమైందే; భద్రాచల ప్రాంతాలనుంచి ఆంధ్రదేశంలోని పల్లెసీమలకు అప్పుడప్పుడూ వచ్చే చెంచులు ఈపాటను పాడుతుంటారు.

చెంచులు ముగ్గురు నలుగురు కలిసి జట్లుజట్లుగా ఉంటారు. ఒకరు చరణం పాడితే మిగతావారు 'చెంచీతా' అని, "నందాన" అని, "తందానా" అనిగాని శ్రుతి కలుపుతారు. అందరూ చిన్న జేగంటలు, ఆ గంట కొట్టటానికి చిన్న కట్టెపుల్లలు పట్టుకొని పాడేపాటకు తాళంగా ఉపయోగిస్తారు.

చెంచుల వేషధారణ విచిత్రంగా ఉంటుంది. కాళ్ళకు చాలీచాలని లాగులు, యాచనలో సంపాదించిన చొక్కాలు, పూలదండలు, తలపాగాలు, పాగలపై నెమలి ఈకలు, పులిగోరులు, అడివిపంది కోరలు అలంకరించుకొంటారు. "ఏవూరు ఓభామ చెంచీతా; ఎవ్వారిదానవే చెంచీతా!" అనే జానపదగేయం చక్కగా పాడుతూ ఊరంతా తిరిగి యాచిస్తారు. (నా. ర. చ- 307- 308)

చెంచు నాటకము (అలభ్యం)

కవయిత్రి : తరిగొండ వేంకమాంబ.

యక్షగానం కావచ్చు. (అ. భా. క- 75)

చెంచు పదాలు

ఇవి తెలుగు యక్షగానాలలో చెంచులు రంగప్రవేశం చేసిన సందర్భంలో పాడేపదాలు. కోనేటి దీక్షిత చంద్రుని విజయరాఘవ కల్యాణంలో విజయరాఘవుని మృగయా విహారమైన తర్వాత చెంచులు కరకుట్లు వండి శౌరికి అరగింపుజేసి విందు వినోదాలు జరుపుకొన్న సందర్భాలలో ఈ పదాలున్నాయి. దీనిలోని కాటమరాజు పదం, కంబమురాయని పదం, దరమరాజు పదం- ఇవన్నీ ఏలలు. ఇనికాక దీనిలోని పోలేరమ్మ పదం, కూనలమ్మ పదం మొ॥నవి చెంచుపదాలుగా ప్రసిద్ధాలు. (య. వా. చ-295-97)

చెంచెతకథ

కర్త : తెలియదు.

జానపద పౌరాణిక గేయం. కథ ప్రసిద్ధం. దీనికే చెంచులక్ష్మికథ అని ఇంకొక పేరుంది. చూ. పౌరాణిక గేయములు. (అం. వా. చ.)

చెంజి

నామాంతరం : జింజి.

దక్షిణదేశంలోని సంస్థానాలలో ఒకటి. ఇక్కడ తమిళం ప్రధాన భాష అయినా తంజావూరు, మధుర నాయకరాజుల ప్రభావం వల్ల తెలుగు భాషకూడా ఆదరింపబడింది. కొంతకాలం పాటు ఈ మండలాన్ని తెలుగు నాయక రాజులు పాలించారు.

సూరప్ప నాయకుని ఆస్థానంలో అప్పయ్య దీక్షితుని మామ అయిన రత్నఖేట

శ్రీనివాస దీక్షితుడు ఆస్థాన విద్వాంసుడుగా ఉండేవాడు. 16వ శతాబ్దంలో వెంకట నృపతి చెంజి పాలకుడై నాడు. తారాశశాంక విజయ కృతిపతి వంగల సీనయ పూర్వులు ఈ చెంజి రాజులకు మంత్రులుగా, దండనాయకులుగా ఉన్నారు. ఈ రాజులు కవులూ, కవి పోషకులు కూడా. చెంజిదుర్గ పాలకుడైన తుపాకుల అనంత భూపాలుడు వచన భారత రచనలో కళువె వీరరాజుకు సహాయపడడమే గాక విష్ణుపురాణము, రామాయణ సుందరకాండము వచన కావ్యాలుగా తెలుగులో వ్రాశాడు. (ద. దే. వా-479)

## చెండ్లాట పాటలు

పెండ్లి వేడుకలలో పాడే పాటలు. ముత్తైదువలు వధూవరులచేత పూల చెండ్లాడించే ముచ్చటకు సంబంధించిన వీటి రచనలో ఒక నియతి ఉండదు. కొన్ని యక్ష గానాలలో ఈ చెండ్లాట పాటలు, ఏలలలో ఉన్నాయి. ఇవి తిమ్మరాజు లక్ష్మణరావు రుక్మిణీ కల్యాణంలో ఉన్నాయి. (య. వా. చ-322)

## చెందలూరి చిక్కయ్య

కాలం : 16వ శతాబ్దం.

రచన : నాసికేతోపాఖ్యానము (అలభ్యం) 6 పద్యాలు దొరికాయి.

విశిష్టత : ఈయనకు ముందే నాసికేతోపాఖ్యానాన్ని దగ్గుపల్లి దుగ్గన్న వ్రాసి చెందలూరి మంత్రులలో ఒకరయిన అనంతయ్యగారి గంగయ్యకు అంకితమిచ్చాడు. దుగ్గన్న రచనవలె చిక్కయ్య కావ్యం కూడా బహుళప్రచారం పొందింది. ఇతని కవిత నిర్దుష్టమై హృద్యంగా ఉంటుందట.

పెదపాటి జగ్గన్న చిక్కయ్య నాసికేతోపాఖ్యానం నుంచి ఆరు పద్యాలు, దుగ్గన్న శివకాంచీ మాహాత్మ్యం నుంచి రెండు పద్యాలను ఉదాహరించాడు గాని, దుగ్గన్న నాసికేతోపాఖ్యానం నుంచి ఉదాహరించలేదు. ఇతని కావ్యం పూర్తిగా దొరకలేదు. (అరుద్ర-8)

## చెక్కభజనలు

తెలుగు దేశంలో పూర్వకాలం నుంచీ ప్రచారంలో ఉన్నవి భజనలు. పల్లె వాసులు తీరిక సమయాలలో ఈ భజనలు చేస్తూ ఉండేవారు. దేవుని విగ్రహంతో ఉన్న దీపస్తంభాలను చేతబుచ్చుకొని ఇంటింటికీ తిరుగుతూ భజనలు చేస్తారు. భజన సమాజంలో సభ్యులు దాదాపు 20 మంది ఉంటారు. ఈ భజనలో నోటితోపాట, చేతిలోని చెక్కల ద్వారా తాళం, గజ్జెలు కట్టిన కాళ్ళతో నృత్యం చూడటానికి ఎంతో ఇంపుగా ఉండి, ఎంతో ఉత్తేజాన్ని కలిగిస్తుంది.

ఇది చాలా శ్రమతోకూడుకొన్న కళారూపం. ఒక్కొక్క పాటకు ఒక్కొక్క రకమైన నృత్యముంటుంది. ఆంధ్రుల భక్తిరస ప్రధానమైన కళారూపాలలో ఇది చాలా ముఖ్యమైంది. ఎందరో కవులు భజన గీతాలు వ్రాశారు. (నా.ర.చ- 306)

## చెన్నకృష్ణ కవి

కాలం : క్రీ.శ. 18వ శతాబ్దం.

స్థలం : వనపర్తి సంస్థానం.
రచన : యాదవ భారతీయము.

ఈ కవి తన కృతిని జనుంపల్లి వల్లభరాయనికి అంకితం చేశాడు. (అం.సం.సా.)

## చెన్నకేశవ విలాసము

కర్త : చూ. అర్చకం అయ్యమాచార్యులు

కవి జన్మస్థలమైన పెద్దమందడి గ్రామంలోని చెన్నకేశవస్వామి పరమైన రచన. (అం.సం.సా)

## చెన్నకేశవ శతకము

కర్త : చూ. అర్చకం అయ్యమాచార్యులు.

గద్వాలలోని చెన్నకేశవుని పరమైన శతకం. (అం.సం.సా)

## చెన్నపట్టణము

ప్రసిద్ధ నగరం. నేటి వ్యవహార నామం మదరాసు. తమిళనాడు రాష్ట్ర రాజధానీ నగరం.

క్రీ.శ. 1625 ప్రాంతాలలో దామెర్ల అయ్య నృపతి తన తండ్రి చెన్న భూపాలుని పేర ఈ పట్టణాన్ని, పులికాట్, మైలాపూర్‌ల మధ్య నిర్మించాడట. ఇతడు పూనమల్లి రాజధానిగా కొన్ని ప్రాంతాలను పరిపాలించాడు. ఇతని కాలనిర్ణయంలో భిన్నాభిప్రాయాలున్నాయి. ఈ నగరం మూడు శతాబ్దాలపాటు, ఆంధ్రరాష్ట్రం వేరయ్యేవరకు ఆంధ్రులకు సంగీతసాహిత్య కేంద్రంగా పరిఢవిల్లింది. దక్షిణ దేశంలో వెల్వడ్డ ఆంధ్ర సారస్వతమంతా చెన్నపురి ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారంలో భద్రపరచబడింది తరువాత దీనిని ఆంధ్రదేశానికి తరలించారు. దామెర్ల అంకభూపాలుడు తన "ఉషాపరిణయం"లో ఈ నగర నిర్మాణాన్ని పేర్కొన్నాడు. (ఆరుద్ర-11-58)

## చెన్నపురీ విలాసము

కర్త : మతుకుమల్లి నృసింహ కవి.
కాలం : క్రి.శ. 1816.

చెన్నపట్టణ సౌభాగ్యాన్ని వర్ణించే రచన.

## చెన్నబసవ పురాణము

కర్త : చూ. అత్తలూరి పాపకవి.
అంకితం : కందుకూరి అమృతలింగంకు.

అయిదాశ్వాసాల పద్యకావ్యం. చెన్న బసవన్న వృత్తాంతం ఇందులోఉంది. కల్యాణ పురాధిపతియైన బిజ్జలుని మంత్రి బసవేశ్వరునికి ఈ చెన్న బసవన్న మేనల్లుడు. ప్రౌఢమై హృద్యమైన రచన. కృతిపతి ఉర్లాం సంస్థానానికి చెందినవాడు. (అం.సం.సా.)

చెన్న బసవయ్య

కాలం : క్రీ.శ. 16 వ శతాబ్దం.

రచన : సాంఖ్య విచారము.

వివేక సింధువును వచన గ్రంథంగా రచించిన కాశీ చెన్న బసవేశ్వరుడూ, ఇతడూ అభిన్నులని కొందరు పరిశీలకులు భావిస్తున్నారు. (క.స. 69; ఆరుద్ర-9-261)

చెన్నమరాజు చెన్నమరాజు

కాలం : క్రీ.శ. 17 వ శతాబ్దం.

స్థలం : తాడిపత్రి.

రచనలు : చారుచంద్రోదయము.

శేషామాత్య సర్వాంబల పుత్రుడు. చెన్నమరాజు పౌత్రుడు.

సంస్కృతాంధ్ర భాషా విశేష సార సారస్య పరిజ్ఞాన ధురీణుడు. పెమ్మసాని తిమ్మనాయకుని వద్ద ఉండేవాడు. వీరి పూర్వులలో చెన్నమరాజు అనే ఆయన మంత్రిగా ప్రసిద్ధుడవటం వల్ల తర్వాత ఆ కుటుంబం వారికి చెన్నమరాజు అనేది ఇంటిపేరుగా వ్యవహారంలోకి వచ్చింది. మొదట వీరి ఇంటిపేరు "అన్మచింతల" వారు. ఈ కవికి వెంకటపతిరాయలు కుంచెకాళాంజి పట్టించుకొనే గౌరవాన్ని ప్రసాదించి విశేషంగా సన్మానించాడట. పెమ్మసాని తిమ్మనాయకుడు ఇతన్ని విశేషంగా ఆదరించినట్లు తెలుస్తున్నది.

ఇతని కవితాధార కమనీయమైనది. (ఆరుద్ర 10-239)

చెన్నమల్లు సీసములు

కర్త : పాల్కురికి సోమనాథుడు

32 సీస పద్యాల కృతి.

విశిష్టత : బసవేశ్వరుని మేనల్లుడయిన చెన్నబసవని పేరిట ఈ సీసాలను సోమన వ్రాశాడు. సోమన జీవసమాధిలోకి పోయేటప్పుడు ఆ బిలంలో వున్న 32 మెట్లుదిగేటప్పుడు మెట్టుకొక పద్యంచొప్పున చెప్పినట్లు శైవులు ఐతిహ్యం చెబుతారు. కర్ణాటక దేశంలో సోమనాథుడు సిద్ధిపొందిన "కలికె" మనే గ్రామంలో ఉత్సవ సమయాలలో ఇప్పటికీ ఇవి పాడుతూ ఉంటారు. (క.త.-3)

చెన్నమల్లేశ శతకము

కర్త : గంగాధర కవి.

తొలి ముద్రణ : క్రీ.శ. 1884.

ఈ కవి భల్లాణరాయని కాలపు కవి అని కొందరంటున్నారు. ఇతడు తన శతకంలో వీరశైవులనే పేర్కొన్నాడు. ఇది 'చెన్న మల్లేశ, శివలింగ, శరణు, శరణు' అనే మకుటంతో ఉన్న సీసపద్య శతకం. (క. వ-53)

చెన్నా ప్రెగడ నాగరాజు

నామాంతరం : నాగేశ్వరకవి.

కాలం : క్రీ. శ. 1750 ప్రాంతం.
స్థలం : గోదావరీ మండలం.
రచనలు : గణసౌజన్యాఖ్యాన శతకము, శైవ సిద్ధాంత శిఖామణి.
గురువు : మల్లంపల్లి రామలింగారాధ్యుడు.

వీరభద్ర గురువాంబల పుత్రుడు. ప్రాచీన శివభక్తుల స్తుతితో కూడిన శతకం రచించాడు. మకుట నియమం పాటించలేదు. ఇతని రెండో రచన వీరశైవ వేదాంత ప్రతిపాదకమైనది. (ద్వి. సా. చ-302; శ. క. చ-429)

## చెన్నాప్రెగడ నాగేశ్వరకవి

చెన్నాప్రెగడ నాగరాజు (చూ).

## చెనూ్నరి శోభనాద్రి

కాలం : తెలియదు.
రచన : శృంగార సుధా సముద్ర పూర్ణ చంద్రోదయము.

రామచంద్రుని పుత్రుడు. ప్రౌఢంగా కవిత్వం చెప్పే నేర్పు కలవాడు. ఇతని రచనలోని కథాంశం యామినీ పూర్ణతిలకా బిల్హణుల కథ. (క. చ-3-185)

## చెనూ్నరు రామన్న

కాలం : క్రీ.శ.19వ శతాబ్ది పూర్వార్ధం.
స్థలం : హుజూరునగరు తాలూకా-యాదవాకిళ్ళ గ్రామం.
రచన : రామాయణము.

విద్వత్కవి. రామాయణాన్ని సంస్కృతం నుండి ఆంధ్రీకరించి హుజూరునగరు తాలూకా చిలుకూరిలోని శ్రీరామస్వామికి అంకితమిచ్చాడు. (క. స.-190)

## చెముడు

కళింగ సీమలోని ప్రాచీన కొండజమీందారీలలో ఒకటి. నేటి శ్రీకాకుళం మండలంలోని సాలూరు డివిజన్‌లో, సాలూరుకు ఉత్తరంగా, పాతిక కోసుల దూరంలో ఈ గ్రామం ఉంది. చెముడు జమీందారీకి ఈ గ్రామమే ముఖ్యపట్టణం.

సంస్థాన పాలకుల పూర్వులు జయపురం రాజుగారి కొలువులో సరదారులు. వీరు "రణసింహ" బిరుదాంకితులు. విజయనగరం దివాను పూసపాటి సీతారామరాజు కాలంలో ఈ జమీందారీ విజయనగరం వారి స్వాధీనమైంది. కొండ జమీందారుల తిరుగుబాటు కాలంలో 'లక్ష్మిరాజు' ఈ సంస్థాన పాలకుడు. విజయనగరం సీతాపతిరాజు ఇతనిని అధికారం నుండి తొలగించి, ఒకటి రెండు గ్రామాలను మాత్రం మొఖాసాగా ఇచ్చాడట. ఇప్పటినుంచి క్రీ. శ. 1794లో విజయనగరం విజయరామరాపు పద్మనాభ యుద్ధంలో మరణించినంత వరకు ఈ సంస్థానపు సమాచారం తెలియదు.

క్రీ. శ. 1784లో నార్తరను డివిజన్ కలెక్టరు, చెముడు పాలకుల వారసుడైన సోమరాజును పిలిపించి పూర్వపు ఎస్టేటును అతనికి కొలుకిచ్చాడు. ఇతని తోనే

శాశ్వత పరిష్కారం జరిగింది. ఆ తరువాత క్రీ. శ. 1889 వరకు ఈ వంశంవారే జమీందారీని అనుభవించారు. క్రీ. శ. 1889లో కురుపాము జమీందారు 'రాజా వైరిచెర్ల సూర్య నారాయణరాజు' ఈ ఎస్టేటును "చెముడు" జమీందారుల వద్దనుండి కొన్నాడు. ఆ తరువాత వైరిచర్ల వీరభద్రరాజు, అతని తరువాత వైరిచెర్ల నారాయణ గజపతి ఈ ఎస్టేటును పాలించారు. తదనంతర కాలంలో జమీందారీల రద్దు చట్టంప్రకారం అంతరించిపోయింది.

చెముడు పాలకులు ఆంధ్రభాషాభిమానులు. తిట్టు కవితలో దిట్టయైన "అడిదము సూరకవి" చాటువులలో చెముడు సంస్థానం ప్రసక్తి కనిపిస్తుంది. ఆంధ్రదేశంలో ప్రసిద్ధ పండిత కుటుంబానికి చెందిన "నడిమింటి" వారిని ఈ సంస్థానాధిపతులు సన్మానించి లక్ష్మీపురాగ్రహారాన్ని దయచేయించారు. చెముడు పాలకులలో చివరివాడైన "రాజావైరిచెర్ల నారాయణ గజపతిరాజు" రాజమహేంద్రవరంలోని ఆంధ్రేతిహాస పరిశోధక మండలికి యావజ్జీవ సభ్యుడు. (ఆం. సం. సా.540-43)

## చెయ్యూరు చెంగల్వరాయశాస్త్రి

నామాంతరం : మారుపెద్ది చెంగల్వరాయ కవి.

కాలం : క్రీ. శ. 1810-1900.

స్థలం : చెంగల్పట్టు జిల్లా మధురాంతకం తాలూకాలోని చెయ్యూరు.

రచనలు : 1. ముత్తు కుమారశతకము 2. శబ్దములు (నృత్యంలో ఉపయుక్త రచనలు) 3. కౌస్తుభములు (కృతులు) 4. సుందరేశవిలాసము (సంగీత నాటిక) 5. వల్లీ నాటకము (సంగీత నాటిక).

ఈయన సంస్కృతంలో, తెలుగులో, సంగీతంలో మంచి పండితుడు. నాట్యశాస్త్రంలో నిష్ణాతుడు. (తె. వి. స-4)

## చెఱకూరు

నెల్లూరి మండలంలోని "చుండి" సంస్థానంలో ఒకభాగం. రాజా వాసుదేవ చూడామాణిక్య ప్రసాద బహద్దరు ఈ ఎస్టేటుకు అధికారి.

ఈ వాసుదేవ చూడామాణిక్య ప్రసాద బహద్దరు తెనాలి తాలూకా పెదపాలెం నివాసి, భూస్వామి అయిన వాసిరెడ్డి వెంకయ్య కుమారుడు. వీరు అమరావతి సంస్థానాధీశుల కోవలోనివారు. క్రీ. శ. 1905లో చింతలపల్లి సంస్థానాధిపతియైన రాజా వాసిరెడ్డి చంద్రమౌళి గారికి దత్తత చెందినారు. దేవరకోట సంస్థానాధీశుడైన రాజా యార్లగడ్డ మల్లిఖార్జున ప్రసాదు గారికి అల్లుడు.

యార్లగడ్డ మల్లికార్జున ప్రసాద్‌గారు అల్లుడైన ఈ వాసుదేవ చూడామాణిక్య ప్రసాదుకు "చుండి" సంస్థానంలోని "చెఱకూరు" ఎస్టేటును ఖరీదు చేసి ఇచ్చారు. ఈ మాణిక్య ప్రసాదు శిల్పకళా పోషకుడు. సంగీత సాహిత్యాభిమాని.

(ఆం. సం. సా-543-544)

## చెరుకు లక్ష్మణ మంత్రి

కాలం : క్రీ. శ. 16వ శతాబ్ది.

కొరపట్ల పురాధికారి; సాహిత్యపోషకుడు.

కూర్మపురాణ కర్త రాజలింగ కవిని ఈయన పోషించాడు. ఈతని ప్రోద్బలంతోనే రాజలింగకవి కూర్మ పురాణాన్ని తెనుగులో వ్రాశాడట. వీరు నివసించిన కొరపట్ల పురం కోరాపుట్టి ప్రాంతం కావచ్చు. ఈ మంత్రికి రాజలింగకవి మేలువాడై, ఆప్తుడై, సచివుడై, మహాహితవరై, సఖుడై చరించేవాడు. ఈయన రాజలింగకవివల్ల మృదూక్తులతో ఉండే శివకథా కథనం వినేవాడు. కూర్మపురాణాన్ని తొలిసారిగా రాజలింగ కవిచేత తెలుగులో కావ్యంగా చెప్పించిన ఘనత ఈ మంత్రికే చెల్లింది. (అరుద్ర-9-235)

## చెరుకూరి సదాశివుడు

కాలం : క్రీ. శ. 16వ శతాబ్దం.

స్థలం : చోళదేశం.

కవిపండిత పోషకుడు. కృతిపతి. పోలూరి గోవిందకవిని ఆదరించాడు. చెరుకూరువారనే పంటరెడ్లు కవి పండితులను ఆదరించి వారిచేత కావ్యాలు రాయించారు. పోలూరి గోవిందకవి రెండు కృతులు (తాళదశ ప్రాణప్రదీపిక, పర్వత నారద సంవాదం) ఇతనికి అంకితం ఇచ్చాడు. (అరుద్ర-12-158)

## చెరుకూరు లక్ష్మీధరుడు

స్థలం : చెరుకూరు (గుంటూరు మండలం).

రచనలు : 1. శ్రుతిరంజని (సం) 2. భరతశాస్త్రమ్ (సం) 3. తిమ్మభూపాలీయమ్ (సం) 4. ఋతుక్రీడా వివేకమ్ (సం) 5. షడ్భాషా చంద్రిక (సం) 6. స్వర్ణమంజరి (సం) 7. అలంకార ముక్తావళి (సం) 8. అనర్ఘరాఘవమ్ (సం) 9. ప్రసన్న రాఘవమ్ (సం).

ఈయన విజయనగర ప్రభువు తిరుమల రాయల ఆస్థాన కవి. ఇతని రచనలన్నీ సంస్కృత గ్రంథాలే. (తె. వి. స-4)

## చెరుకూరువారు

గ్రామ నామం ఇంటిపేరుగా ఉన్నవారు తెలుగుదేశంలో ఉన్నారు. ప్రోలయ వేమారెడ్డి ఆస్థాన విద్వత్కవి, సౌందర్యలహరి వ్యాఖ్యాత, "సరస్వతీ విలాసమ్" (ధర్మశాస్త్ర గ్రంథం) వ్రాసిన లక్ష్మీధరుని ఇంటిపేరు చెరుకూరు. ఈ గ్రామం గుంటూరు మండలంలోని పొన్నూరుకు సమీపంలో ఉంది.

(తె. వి. స-4-1048)

## చెరువుమీది పద్యములు

రచనాకాలం : క్రీ.శ. 18వ శతాబ్దం.

కర్త : అడిదము రామకవి.

"కదలు మిటమాని దివిజ గంగాభవాని" అనే మకుటంతో చెప్పిన పద్యాలు. ఇవి చెప్పి ఇతడు గంగాభవాని అనుగ్రహం సంపాదించాడట. (క. స. 183.)

## చెల్వూరు సన్న్యాసి

కాలం : క్రీ. శ. 1810 ప్రాంతం.

రచన : బసవ కల్యాణము.

గురువు : గిరిమఠమళియ భగిచంద్రశేఖరుడు.

ఈ కవి లావేరు శైవ మతానికి చెందినవాడు. (య. వా. చ-362)

## చెళ్ళపిళ్ళ నరసకవి

కాలం : క్రీ.శ. 1795-1840.

స్థలం : కడియం (గోదావరీ మండలం).

రచనలు : 1. అహల్యా సంక్రందన విలాసము (అలభ్యం) 2. యామినీ పూర్ణ తిలకా విలాస ప్రబంధము 3. ఏకాంత సేవా కలాపము (వేంకటేశ్వర విలాసము).

చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రికి పినముత్తాత. కామ కవి పుత్రుడు. పిఠాపురం సంస్థానాధీశుడైన వేంకట నీలాద్రిరాయని కాలంలో సంస్థానం దర్శించి వారిచేత విశేష సత్కారాలు పొందాడు. పిఠాపురం నీలాద్రిరాయనికి మేనమామలైన చింతపట్ల వేంకటరాయ మాధవరాయ సోదరులకు ఈ నరసకవి విద్యా గురువు.

ఈయన ప్రౌఢ ప్రబంధ కర్త. శతావధానాలు చేసేవాడు. యామినీ పూర్ణ తిలకా విలాసం పిల్లవసు చరిత్రగా పేరు పొందింది. ఈయన ఆశుకవితా రచనలో అసమాన యశం గడించాడు. ఈయనకు దొండకాయంటే చాలా ఇష్టమట. ఆ దొండకాయ మీద ఆశువుగా ఒక పద్యం చెప్పాడు. కవుల శాపవాక్కులకు తిరుగులేదంటూ ఇతడు చెప్పిన పద్యం బహుళ ప్రచారం పొందింది.

ఇతని ఏకాంత సేవాకలాపము వేంకటేశ్వర పరమైన రచన.

(క. చ-3-187; చా. ప. ర.)

## చెంగరసీమ

చాగల్నాడు అని వ్యవహారంలో ఉండేది. రాజమహేంద్రవరానికి ప్రాగుత్తరంగా ఉండిన ప్రదేశమే ఇది అని పలువురు భావిస్తున్నారు.

(శ్రీనాథ కవితా సమీక్ష 2-57)

## చేకూరి రామస్వామి

కాలం : క్రీ.శ. 17 వ శతాబ్దం.

స్థలం : పాటలపురం.

మంత్రి. సాహిత్య పోషకుడు. ధూర్జటి వేంకటరాయ కవి రచించిన రత్నావళీ పరిణయ ప్రబంధ కృతిపతి. సాహితీ రసాస్వాదన తత్పరుడు.

దక్షిణార్కాడు జిల్లాలోని తిరుప్పళయారునే ఆనాడు పాటల పురమని పిలిచేవారు. గడిలము అనబడే గరుడ తీర్థాన్ని, దక్షిణ పినాకినీ నదిని ఇతని వంశ వర్ణన సందర్భంలో కవి పేర్కొన్నాడు. (ఆరుద్ర-10-210)

## చేకూరు సిద్ధయ్య

కాలం : తెలియదు.

స్థలం : తెలియదు.

రచనలు : 1. హరిభక్తామృతసారము (అలభ్యం) 2. శ్రీరంగ మాహాత్మ్యము.

గురువు : నల్లగొండ లక్ష్మీనరసయ్య.

ఈ కవిని గురించిన వివరాలు తెలియ రాలేదు. రచన సంస్కృత పద జటిలంగా ఉన్నదట. (ఆరుద్ర-12-308)

## చేజెర్ల నారాయణకవి

స్థలం : పాకనాడు.

రచన : శ్రీగండవరపమ్మ దండకము.

## చేడ రాఘవరెడ్డి

కాలం : క్రీ.శ 18వ శతాబ్దం.

స్థలం : నైజాం మండలంలోని తమ్మారావుపేట.

రచన : రామాయణము (ద్విపద కావ్యం). (క. స. 181)

## చేబ్రోలు

"ప్రోలు" శబ్దం చివరగా ఉన్న గ్రామనామంతో ఉన్న ఇంటిపేరు. రాయప్రోలు, జటప్రోలు, గొల్లప్రోలు ఇలాంటివి. (భారతి-మా-45-228)

## చేబ్రోలు శాసనము

శాసనకర్త : దేసటి పండడు (చూ).

ఈ శాసనం మార్గ దేశి కవితలతో ఉంది. (క. త-2)

## చేమకూర అప్పన

కాలం : తెలియదు.

స్థలం : తెలియదు.

రచన : సారంగధర చరిత్ర.

బాణాల శంభుకవి ఇతన్ని పేర్కొన్నాడు. 'ఇతని' సారంగధర చరిత్రను తాను ద్విపద కావ్యంగా వ్రాశానని చెప్పుకొన్నాడు. దీని ప్రతి అడయారు లైబ్రరీలో శిథిలావస్థలో ఉన్నదట. చాటు పద్య మణిమంజరిలో "చేమకూర అప్పన" మీద ఒకటీ, "చేమకూర అప్పరాజు మంత్రి" మీద ఒకటీ చాటువులున్నాయి. వీరిద్దరూ ఒకరుకాదని పండితాభి

ప్రాయం. చేమకూర అప్పన్నే చేమకూర వెంకట కవి అని కొందరు తలపోస్తున్నారు.
(క.త-12-47)

## చేమకూర అప్పరాజు

కాలం : తెలియదు.

ఇతడు కవి, దాత. భట్టు కవి కూడా అని తెలుస్తున్నది. అయితే ఏ రాజు దగ్గర మంత్రిగా ఉండేవాడో తెలియదు. ముప్పయి ఇద్దరు (32) మంత్రుల సీసమాలికలలో ఇతని పేరు ఉంది.

ఇతని గురించి రెండు చాటువులు మాత్రం లభించాయి.

(చా. ప. మణి. 105-106)
ఆరుద్ర-10-96)

## చేమకూర వేంకటరాజు

నామాంతరం : 1. చేమకూర వేంకటపతి 2. చేమకూర వేంకటకవి.

కాలం : క్రీ. శ. 17 వ శతాబ్దం.

స్థలం : తంజావూరు.

రచనలు : 1. సారంగధర చరిత్ర 2. విజయ విలాసము.

తంజావూరును పాలించిన రఘునాథ నాయకుని ఆస్థానంలోని ప్రసిద్ధ కవి. లక్ష్మణామాత్యుని కుమారుడు. ఇతని రచనలన్నీ రఘునాథ నాయకునికే అంకితాలు. బాకాల శంభుకవి పేర్కొన్న చేమకూర అప్పన్న ఇతడే అని కొందరంటున్నారు. మొదట క్షత్ర ధర్మాన్ని పాటించేవాడనీ, తర్వాత కవిత్వం చెప్ప నేర్చాడనీ పీఠిక వల్ల తెలుస్తోంది. పాండిత్యప్రకర్ష గల కవి.

ఇతడు మొదట సారంగధర చరిత్ర వ్రాసి ప్రభువుకు వినిపిస్తే అతడు మెచ్చలేదట. తర్వాత, ప్రతి పద్య రసాస్వాదంగా విజయ విలాసం వ్రాసి వినిపించగా చేమకూర మంచి పాకాన బడిందని మెచ్చుకున్నాడట. రఘునాథుడు నేపాళ రాజును, చోళగుని జయించి తిరిగి వచ్చిన తర్వాత ఈ కావ్యాంకితం జరిగింది. అనితర సాధ్యమైన మార్గంలో పయనించిన ఈ కవిని రాజు ఘనంగా సత్కరించాడు. మంజుల పదార్థాలు, భూషణాంబరాలు, వాహనాలు ఇచ్చి స్వహస్తాలతో ముత్యాల కడియాన్ని బహూకరించాడు. ఈతని శబ్ద శిల్ప, రసపుష్టి, జాతివార్తా చమత్కృతులు పండిత పామరులకు ప్రశంసా పాత్రాలయ్యాయి. అడుగడుగునా సామెతలు, జాతీయాలు కూర్చడంలో కవి నేర్పరి.
(ఆరుద్ర-10-102)

## చొక్కనాథ చరిత్ర

నామాంతరాలు : 1. చౌషష్టి లీలా విలాసము 2. మధురాపురాణము.

కృతికర్త : పచ్చకప్పురపు తిరువేంగళకవి.

కృతిపతి : గోళ్ళ పెదరామ నాయకుడు.

ఇతనికీ, ఇతని సోదరునికీ ఉపనూరి సింహములని బిరుదు.

మూలగ్రంథం : సంస్కృతంలో స్కాందంలోని హాలాస్యక్షేత్ర మాహాత్మ్యం.

విశిష్టత : తొమ్మిదాశ్వాసాల ద్విపద కావ్యం. హాలాస్య క్షేత్రంలోని సుందరేశ్వరుని (చొక్కనాథుని) అరవై నాలుగు లీలలు ఇందులో వర్ణింపబడ్డాయి. తెలుగులో హాలాస్య మాహాత్మ్యం మొదట చెప్పిన గ్రంథం ఇదే. అనంతర కవులు కొందరీ గ్రంథాన్ని చంపువుగాను, వచన కావ్యంగాను వ్రాశారు. ఇందులో చెయ్యేటి (బాహుదానది) దరిని వెలసిన ఓరుగంటమ్మ, ఏకవీరాదేవి స్తుతింపబడ్డారు. కవిత్వమనేది ఎలా ఉండాలో కవి ఈ కావ్యంలో చెప్పాడు. యుగానికి పదహారు చొప్పున నాల్గు యుగాలలోనూ సుందరేశ్వరుడు కావించిన లీలలు ఇందులో వర్ణితాలు.

ఈ కావ్యాన్ని కవి గోళ్ళ చినరామ నృపతి కోరికపై రచించి అతని అగ్రజుడైన పెదరామ నృపతికి అంకితం చేశాడు. రచన సరళ సుందరంగా ఉంటుంది.

(ద. దే వా-18)

## చొక్కవజీరు శతకము

కర్త : తెలియదు.

కాలం : క్రీ. శ. (1706-32).

విజయరంగ చొక్కనాథునిపై చెప్పిన శతకం. ఏడు పద్యాలు మాత్రం దొరికాయి. (చా. ప. ర.-75-81)

## చొల్లంగి

భీమ మండలంలోని పుణ్యక్షేత్రం. సప్తసాగర యాత్రా క్షేత్రాలలో ఒకటి.

కాకినాడకు దక్షిణంగా యానాముకు పోయే మార్గంలో తుల్యభాగాసాగర సంగమ ప్రాంతంలో ఈ గ్రామం ఉంది. తుల్యాసాగర సంగమప్రాంత పుణ్య క్షేత్రాలకు రాజా రావు సుబ్బమ్మారావు బహద్దరు రాణిగారు అధిపతులు. ఈమె ధవళేశ్వరనివాసి. సాహిత్యాభిమాని. కొట్ర లక్ష్మీనారాయణ శాస్త్రిగారి శుద్ధాంధ్ర నిఘంటువైన లక్ష్మీనారాయణీయము ముద్రించడంలో తోడ్పడినారు.

నేటికీ ఈ క్షేత్రంలో పర్వదినాలలో ఉత్సవాలు జరుగుతాయి.

(ఆం. సం. సా-544)

## చోడలింగ శతకము

నామాంతరం : పరవాది గజాంకుశము.

కర్త : గద్దె రామలింగ కవి.

శైవ పరమైన శతకం. సమస్త దేవతలు దశావతారములు శివుని పూజించినట్లు కవి ఇందులో వర్ణించాడు, ప్రసిద్ధ శైవ క్షేత్రాల ప్రసక్తి ఇందులో ఉంది. 'చోడలింగమా' అనేది మకుటం. (శ. క. చ-299)

## చోడిగాడు

నామాంతరాలు : సోలిగాడు, సింగడు.

చోడిగాని కలాపంలో కథానాయకుడు. ఇతని అర్ధాంగి సింగి. తోలు బొమ్మల ఆటలోని జుట్టుపోలిగాడు, బంగారక్క, అల్లాటప్పగాడు, కేతిగాడు ఎంత ప్రముఖ పాత్రలో చోడిగాని కలాపంలో ఇతనిది అంత ప్రముఖ పాత్ర.

ఈ పాత్ర ప్రాచీన కాలం నుంచి నేటి వరకు ఆంధ్రప్రజా జీవితంలో నిలిచి ఉంది.

"వచ్చెర బాబూ చోడిగాడు ! ముక్కుమీద చుక్కబొట్టు-నిక్కి నిక్కి చూసు కుంటూ" అని రంగప్రవేశం చేస్తాడు వాలకం చమత్కారంగా ఉంటుంది. చేతిలో వంకర దుడ్డు కర్ర, ముఖం నిండా సున్నపు బొట్లు, బొట్ల మధ్య నల్ల చుక్కలు, నల్ల గుడ్డ అంటగట్టిన తలకు ఒక పక్కన కాకి ఈకల కట్ట, మొలకు గోచీపెట్టి-వాలకం చూస్తేనే కడుపు చెక్కలయ్యే నవ్వు తెప్పించేటట్లు అతి విచిత్రంగా ఉంటాడు. కురవంజి కథా రూపంలోని సింగీ-సింగని ప్రణయ కలహమే ఈ చోడిగాని కలాపానికి కథావస్తువు. తనను మరిపించి పారిపోయిన సింగిని వెదుక్కుంటూ, వియోగాన్ని అభినయిస్తూ-చివరకు సింగిని కలుసుకొని-తనను వదిలి ఎక్కడికి వెళ్ళిందో, ఎందుకు వెళ్ళిందో, మొ॥ ప్రశ్నల ద్వారా వాగ్వివాదం జరిపి-చివరికి సింగిని తీసుకొని ఇద్దరూ ఇంటికి చేరటంతో చోడిగాని కలాపం సమాప్తం.

పోలిగాని (చోడిగాని) పేరు ప్రజా జీవితంలో ఎలా హత్తుకు పోయిందో ఉదాహరణలు చూస్తే తెలుస్తుంది. ఫలానావాడు పోలిగాడులా ఉన్నాడని, గాలిగా తిరిగే వాళ్ళను పోలిగాడిలా తిరుగుతున్నాడని అంటారు. కొంచెం వికృతంగా ఉన్నవాళ్ళను పోలిగాడిలా ఉన్నాడనీ, భార్య తోడు లేకుండా వచ్చిన వాడిని పోలిగాడులా వచ్చాడనీ, "ఏరా పోలిగా" అని రక రకాలుగా పిలుస్తూ ఉండటం గమనించవచ్చు.

(నా. ర. చ-261-262)

## చోడిగాని కలాపము

నామాంతరాలు : పోలిగాని కలాపం, ఎరుకల కథ.

ఇది భామాకలాపం, గొల్లకలాపం వంటి జానపద ప్రక్రియ. దీనిలో చోడిగాడే కథానాయకుడు. కురవంజిలోని సింగీ-సింగని ప్రణయ కలహమే ఈ కలాపానికి కథా వస్తువు.

దీనిలో చోడిగాని (సింగని) వాలకం అతి విచిత్రంగా ఉంటుంది. సింగని మరిపించి పారిపోయిన సింగిని వెదుక్కుంటూ, వియోగాన్ని అభినయిస్తూ, చివరకు సింగిని కలుసుకొని-తనను వదిలి ఎక్కడికి వెళ్ళిందో, ఎందుకు వెళ్ళిందో మొ॥ ప్రశ్న లతో వాగ్వివాదం జరిపి-సింగిని తీసుకొని సింగడు ఇంటికి చేరటంతో ఈ కలాపం సమాప్త మవుతుంది.

"ముక్కుమీద చుక్కబొట్టు- నిక్కి నిక్కి చూచుకుంటూ-వచ్చెరబాబూచోడిగాడు" అని చోడిగాడు ప్రవేశించి, తన సింగి పోయిందని ప్రేక్షకులకు చెప్పి-సింగి అర్ధరాత్రి

ప్రక్కలోనుంచి మాయమైందని చెప్పి "ఎందుబోతివే : ఓలె సింగి" అనే ఘట్టంతో ఇది ప్రారంభమవుతుంది.

కథా గమనంలో సింగడు సింగిని వెదుక్కుంటూ వేటాడటం, సింగిని చూపమని దేవతలను వేడుకోవటం, ఆఖేట నృత్యాభినయం చేస్తాడు. ఆ తరవాత దశావతారాలు అభినయించి, నారాయణమూర్తిని ప్రార్థించటం, తరవాత రామాయణ గాథను స్మరించి, శ్రీరాముని వేడుకొని రామాయణ కథను పదాభినయం ద్వారా అభినయించి, సింగి కనిపించలేదనే ఆవేదనతో స్మృతి తప్పి, తూలి పడిపోతూ నిష్క్రమిస్తాడు.

ఇంతలో సింగి "ఎరుకో, ఎరుక" అంటూ ప్రవేశిస్తుంది. సూత్రధారుడు సింగిమీద ప్రశ్నలవర్షం కురిపిస్తాడు. సింగి తన కుల గోత్రాలను, వృత్తి విద్యావిలాసాలను, తన వన్నె చిన్నెలను, తన సింగని వన్నె చిన్నెలను వర్ణిస్తుంది.

హటాత్తుగా సింగడు ప్రవేశించి-సింగి దొరకనే దొరికిందని సంతోషంతో తబ్బిబ్బయిపోయి, మెలికలు తిరిగి-సంతోషం పైకి కనిపించకుండా సింగితో వాగ్వివాదానికి దిగుతాడు. ఈ వాగ్వివాదంలో సున్నితమైన హాస్యంతోపాటు మొరటు హాస్యం, అసభ్య శృంగారం ఉంటుంది.

దీనిని రాత్రి తెల్లవార్లూ ప్రదర్శిస్తారు. కురవంజిలోని సింగి-సింగని వాదాలు నృత్యాలు దీనిలో ఉంటాయి. దీనిలో "జక్కిణీచిందు" అనే విశేష నాట్య ముంటుంది. ఇది భార్యాభర్తల సంవాదం కావటం వల్ల ప్రేక్షకులను బాగా ఆనంద పరుస్తుంది.

(నా. ర. చ.-262-264)

## చోపుదారు

మేలటూరు భాగవత మేళ నాటకాలలో ఇది ఒక పాత్ర. భాగవత ప్రారంభం ముందు కొంటె కోణంగి పాత్ర ప్రవేశించి, నిష్క్రమించగానే విఘ్నేశ్వర నృత్యం అవుతుంది. విఘ్నేశ్వర నిష్క్రమణానంతరం ఇతడు తనకు తానే "చోపుదారు వచ్చేనే, రాజసభకు, చోపుదారు వచ్చేనే" అనుకొంటూ ప్రవేశిస్తాడు. ఆ వెనువెంటనే సభా రంగానికి వచ్చే రాజుగారి రాకను గురించి సభ వారందరికీ చెబుతాడు. ఇతడు ప్రేక్షకులను ఉద్దేశించి "రాజుగారు వస్తున్నారు గనుక ఎక్కడివారక్కడ గప్ చిప్" అంటూ హాస్య ధోరణిలో నిష్క్రమిస్తాడు.

(చూ. కటికమువాడు) (నా. ర. చ-107)

## చోర సంవాదము

నామాంతరం : తిరుమంగయాళ్వారి చౌర్యగాథ.

కర్త : చూ. గోగులపాటి కూర్మనాథ కవి.

సాంప్రదాయిక రచన. దైవాంకితం. (ఆం. సం. సా-416)

## చౌడప్ప శతకము

చూ. కవి చౌడప్ప శతకము.

## చౌడేశ్వరికథ

కర్త : తెలియదు.
రచనాకాలం : క్రీ. శ. 18వ శతాబ్దంలోపు.

ద్విపదకావ్యం. ప్రతి సమగ్రంగా లేదు. శక్తి చౌడేశ్వరి రూపంలో మహిషాసురుని మర్దించి దేవతలను రక్షించిన వృత్తాంతం ఇందులోని కథ. దీని ప్రతి వేంకటేశ్వర ప్రాచ్య పరిశోధనా సంస్థలో ఉంది. (ద్వి. సా. చ. 184)

## చౌడేశ్వరీ విలాసము (అలభ్యం)

నామాంతరం : చాముండికా విలాసము.
కర్త : నన్నయభట్టు (వివాదాస్పదం).

మూడాశ్వాసాల ప్రబంధమట. ఇది నన్నయదని కొందరు భావించారు. (క. స. 100)

## చౌదరి పురుషోత్తమకవి

కాలం : క్రీ. శ. (1803-1890).
రచనలు : ఏసునాయక శతకము, ఏసుక్రీస్తు ప్రభు శతకము, కీర్తనలు, సత్క్రైస్తవ శతకము.

నిర్దుష్టమైన శైలిలో క్రైస్తవమత సిద్ధాంతాలను ప్రచారం చేసిన కవి. ఇతని ఏసునాయక శతకం విశేష వ్యాప్తి పొందింది. (శ. సా. వి.)

## చౌపదాలు

రచనా విశేషం. ఇవి యక్షగానాలలో ప్రయుక్తాలు. దీనినే చతుష్పద, చవుపద అని కూడా అంటారు. సంగీత రత్నాకరంలో చతుష్పదీ ప్రబంధ లక్షణముందట. బలభద్రదాసి కపోతవాక్యం యక్షగానంలో ఇది ఉంది. ఇది ఛందోదర్పణం, అప్పకవీయం మొ॥ లక్షణ గ్రంథాలలోని చౌపద, విశాళ చౌపద, కర్ణాట చతుష్పద లక్షణాలకు భిన్నంగా ఉంటుంది. (య. వా. చ. 278)

## చౌపద్యష్టకము

దేశి సారస్వతంలోని రచనా విశేషం. ఈ పేరుతో ఉపాధ్యాయుల మృత్యుంజయకవి వామన చరిత్రలో ఒక రచన ఉంది. ఇది అష్టకంలో సగం పరిమితి గలది. అంటే అష్టకంలోని నాలుగు దళాలు దీనికొక ప్రమాణాంశమవుతుంది. అందుకే దీనిని చతుష్పది అని కూడా అంటారు. చవుపది—చౌపది + అష్టకమైనది. అష్టకంలోని రెండో దళంలో కంటె దీని రెండో దళంలో రెండు మాత్రలెక్కువ. దీనిలో అంత్యప్రాస నియతంగా ఉండదు. (య. వా. చ. 313)

## చౌషష్ఠి భేద చిత్రసీసము

కర్త : గణపవరపు వేంకటకవి.
కాలం : క్రీ. శ. 17వ శతాబ్ది.

ఈ కవి గర్భ, చిత్ర, బంధ కవిత్వాలు వ్రాశాడు. అందులో అనేక పద్యాలు ఒక సీసగర్భంలో వ్రాశాడు. దాని విశిష్టతను చెప్పడానికి దానికి అతడు పెట్టిన పేరే చాలు. ఆ పేరు ఇలా ఉంది.

"బహువిధ చిత్రకంకణ బంధద్విగుణిత సీసచరణ చతుష్టయ గర్భిత, ద్విపద, కందద్వయ సమవృత్త, చౌపద యుగళాటవెలది, తేటగీతి, మదన విలసిత, తురంగవృత్త, బహువిధతాళ వృత్తాష్టక, ధవళ, శోభాన, గానా రాత్రిక, గానజంపె, త్రిపుటార్ధ చంద్రిక, సువ్వాల లాలిపద ఏలామంజరి, సమతా డిండిమ తాళవృత్త, మణిగణ నికర, తురగ వల్గన, రగడోదాహరణ సంబుద్ధి కళికోత్కళికార్థాహిరీ, రాగదళ, ముఖారి రాగాటదళ, కాంభోది రాగరూపక తాళదళ, కాంభోదిరాగ సమపద, కన్నడరాగ సాంగత్య, కొరవంజి దళ రేవగుప్తిరాగ సమపద, సావేరిరాగైక తాళదళ, బిలహరిరాగాట తాళసమపద, పుష్ప మాలికాబంధ, గోమూత్రికాబంధ, శార్ఙబంధ, షోడశదళ పద్మబంధ, పాదుకా బంధ, నవ రంగ బంధ, ఖడ్గబంధ, గుచ్ఛబంధ, ఛత్రబంధ, చామరబంధ, గదాబంధ, చక్రబంధ, శకటబంధ, నాగబంధ, రథబంధ, వీణాబంధ, శంఖబంధ, మృదంగబంధ, పాదభ్రమక బంధ, పాదార్థ భ్రమకవింశతి బంధ, భేదకందానుష్టుప్ శ్లోకాంతర్గత చతుర్భద్ర, నవ రంగ, సర్వతో భద్రాందోళికా యుక్తానులోమ విలోమకంద భాషా శ్లేషకంద, కందాటవెలది గర్భితాంత్య తేటగీతియుక్త చౌషష్టిభేద చిత్రసీసం". దీన్ని 'విశిష్టసీస' మనికూడా అంటారు. (క. శ-12)

## చౌషష్టి లీలావిలాసము

నామాంతరం : చొక్కనాథ చరిత్ర (చూ).

## ఛందశ్శాస్త్రము

పద్యరచనకు గల నియమాలను తెలిపేది ఛందశ్శాస్త్రం. అక్షరగణ నిబద్ధమైన పద్యపాదాలలో ఉండే అక్షర సంఖ్యనుబట్టి ఛందమేర్పడింది. పాదానికి పది అక్షరా లుండే అట్టి పాదాలతో ఏర్పడిన పద్యం పదవఛందములోనిదని అర్థం. ఈ పది అక్షరా లనూ గురు లఘువుల క్రమస్థితిలో సాధ్యమైనన్ని మార్పులు చేయగా అందులో 1024 భేదాలు ఏర్పడుతాయి. లాక్షణికులు ఇలాంటి ఛందాలు 26 చెప్పారు. ఇంతకుమించిన అక్షరాలు గల ఛందాలను ప్రచితిచ్ఛందాలుగా పేర్కొన్నారు. (ఛం.ప.కో-72)

## ఛందోదర్పణము

నామాంతరం : అనంతుని ఛందస్సు.

రచన : అనంతామాత్యుడు.

అంకితం : శ్రీకృష్ణునికి.

నాలుగాశ్వాసాల లక్షణ గ్రంథం. (రె.రా.చ.)

## ఛందోదర్పణము

కర్త : వెల్లంకి తాతంభట్టు.

ఇతనికన్న పూర్వుడైన అనంతామాత్యుడొక 'ఛందోదర్పణం' వ్రాశాడు. దానికన్న ఇది భిన్నమైనది అప్పకవీయం 1-5 లో "అనంతామాత్య ఛందంబును, చందో దర్పణంబును" అని అప్పకవి దీనివి పేర్కొన్నాడు. ఈ రెండు ఛందోదర్పణాలను వేరుగా చెప్పడానికే అనంతుని ఛందోదర్పణాన్ని "అనంతుని ఛందము" అనీ, వెల్లంకి తాతంభట్టు కృతమైన గ్రంథాన్ని కేవలం "ఛందోదర్పణం" అనీ వ్యవహరించడం పరిపాటి. (ఛం.ప.కో.)

ఛందో నిరంకుశము

కర్త : పైన సుబ్రహ్మణ్యము.

ఛందో రత్నాకరము

కర్త : త్యాగరాజ మొదలి.

సులభశైలిలో రచించిన చిన్న ఛందో గ్రంథం.

ఛందోగ్యోపనిషద్దీపిక

కర్త : విద్యారణ్యుడు.

ఇది ఛాందోగ్యోపనిషత్తుకు వ్యాఖ్య. (తె. వి. ప 4)

జంగం కథలు

పూర్వకాలం నుంచి తెలుగుదేశంలో బహుళ ప్రచారం పొందిన కథలు. ఇప్పుడు వీటిని బుర్రకథలు అంటున్నారు. పూర్వం మత ప్రబోధానికి, దేశభక్తికీ ప్రతిబింబంగా నిలిచిన ఈ కథలు క్రమంగా యాచనకూ ఉదరపోషణకూ ఉపయోగ పడుతున్నాయి.

జంగాలే ఈ కథలను చెప్పటంవల్ల వీటికీ పేరు వచ్చింది. సిరికి జంగాలు, బుడిగె జంగాలు, ఈతముక్కు జంగాలు, సెట్టి బలిజలు వంశపారంపర్యంగా వీటిని ప్రచారంలోకి తెచ్చారు. శైవమత ప్రచారానికే ఈ కథలు పూర్వకాలంలో ఉపయుక్తం. వీరశైవ మతవ్యాప్తి జరిగే కాలంలో అంటే 12-13 శతాబ్దుల నాటికే వీటికి మంచి ప్రచారముండేది. బైచరాజు వెంకటనాథకవి తన పంచతంత్ర కావ్యంలో 'కడివోని తెర నాటకపుటూరి జంగాలు' అన్నాడు కాబట్టి ఈ కథలు చెప్పే జంగాలు, నాటకాలు కూడా ఆ రోజుల్లో ఆడేవారని తెలియవస్తుంది. (నా.ర.చ-205)

జంగాల ముమ్మయ్య

కాలం : క్రీ. శ. 1600 ప్రాంతం.

స్థలం : నెల్లూరు మండలం - బట్టేపాడు ప్రాంతం.

బిరుదులు: చలమర్తిగండ, కర్ణాట తిలక మొదలైనవి.

కృతిపతి. ద్విపద భారతకర్త బట్టేపాటి తిమ్మయ రచించిన విరాటపర్వ భాగం ఇతనికే అంకితం.

ఇతడు బట్టేపాడు పాలకుడు కావచ్చునని పండితులు ఊహిస్తున్నారు.
(ఆరు! -10-20)

**జంతరు పెట్టె**

ఇది పూర్వకాలంనుంచి తెలుగుదేశపు జనపదాలలో విస్తృతప్రచారంలోఉంది. "కాశీపట్నం చూడరబాబూ" అనే దానితో మొదలయ్యే జానపదగేయం ఈ ప్రదర్శనలో ప్రయుక్తం. ప్రదర్శకులు చిన్నపిల్లలకు దీనిలో బొమ్మల్ని చూపిస్తూ పై పాటనుపాడుతూ ఉంటారు. ఒకరు తాళం కొడుతూ, చూపే ఈ బొమ్మలలో కాశీ, గంగానది కనిపిస్తాయి. పాటను అనుసరించి ఒక బొమ్మ తరవాత మరొక బొమ్మను చూపిస్తారు.

గ్రామసీమలలోని పెద్దలు, పిన్నలు కూడా ఈ జంతరు పెట్టె ప్రదర్శనను విరగబడి చూసేవారు. (నా.ర.చ-303)

**జంతు బలి**

క్రీ. శ. 12-15 శతాబ్దాల మధ్యకాలంలో సాధారణంగా శైవ దేవతలను, గ్రామ దేవతలను,క్షుద్ర దేవతలను, కులదేవతలను సంతృప్తిపరచటానికి ప్రజలు దున్నపోతులు, కొమ్ము పొట్టేళ్ళు మొ॥ పశువులను బలియిస్తుండేవారు. "లంకెల బిందెల" వంటి నిధి నిక్షేపాలను త్రవ్వి బయటకి తీయబోయేటప్పుడు ఈ జంతుబలి తప్పక జరిగేది.

ప్రాచీనులు దాచిన ఈ నిధులను రాక్షసులో, దేవతలో, భూతప్రేత పిశాచాదులో—ఎవరో ఒకరు అదృశ్యరూపంతో రక్షిస్తూ ఉంటారని, వారి రక్షణనుంచి ప్రజలు నిధులను త్రవ్వి తెచ్చుకొనేటప్పుడు ఆయా దేవతల ప్రీతికొరకు జంతువులను బలి ఇచ్చేవారని తెలుస్తున్నది.

జంతువులను బలిఇచ్చిన తరువాత, బలి భోజనాదులుచేసి సంతర్పణచేసేవారు.
(తెలుగు-ఏ-జూ 77)

**జంతుర్నాడు**

"జంతుర్నాటి డెబ్బది" అని సింహాచల క్షేత్రంలో శాసనాలున్నాయి. కాబట్టి ఆ ప్రాంతంలో డెబ్బది గ్రామాలుండేవని చెప్పవచ్చు. విశాఖపట్టణం మండలంలోని సింహాచల క్షేత్రానికి ఇరవై మైళ్ళ పరిసర ప్రాంతాలలోని కొత్తవలస, శృంగవరపుకోట తాలూకాలు పూర్వం ఈ "జంతుర్నాడు"గా వ్యవహరింపబడేవి. (సం.ఆ.వి.కో-5)

**జందాళ నంజప్ప**

కాలం : క్రీ. శ. 1850 ప్రాంతం.
రచన : జ్ఞాన కురవంజి (యక్షగానం).
గురువు : జ్యోతి రామగురుడు.

కవిని గూర్చిన వివరాలు తెలియలేదు. ఇతని గురువైన జ్యోతి రామన పారిజాత నాటక కర్త కావచ్చునని ఊహిస్తున్నారు. ఇతని రచన పేలవమైనా అద్వైతతత్త్వ ప్రతిపాదకం. సాంకేతిక పరిభాష ఎక్కువగా వాడాడు. (య.వా.చ-108)

## జంబుకేశ్వర మాహాత్మ్యము

నామాంతరాలు : 1. గజారణ్య సంహిత 2. గజారణ్య క్షేత్ర మాహాత్మ్యము.
కర్త : కవిఘాటి బలభద్ర కవి.

## జక్కన్న

కాలం : క్రీ. శ. 15 వ శతాబ్ది.
స్థలం : తీరాంధ్రదేశం.
రచన : విక్రమార్క చరిత్ర (కథాకావ్యం).

అన్నయామాత్యుని పుత్రుడు. పెద్దయామాత్యుని పౌత్రుడు. ఇతనిది ప్రౌఢమైన కవిత్వం. ఉత్ప్రేక్షాదుల పట్ల ఇతనికి మక్కువ ఎక్కువ. అష్టాదశ వర్ణనలు, లోకోక్తులు. ఇతని రచనలో మనోహరంగా చోటుచేసుకున్నాయి. ఇతని తాత పెద్దయామాత్యుడు నెల్లూరి పాలకుడైన తిరుకాళ విభునిచేత సత్కారాలు పొందాడు.

ఈ కవి పేరు 'పేరమరాజు' అని కొందరు భావిస్తున్నారు.
(వా.చ.వం.సు. 208) రె.రా.చ.

## జక్కరాజు వేంకట కవి

నామాంతరం : జక్కరాజు వేంకట రామకృష్ణ కవి.
కాలం : క్రీ. శ. 18 శతాబ్ది ఉత్తరార్థం.
రచన : ఆంధ్ర కామందకము.
కృతి భర్త : కొండ్రాజు వెంకటాద్రి,

విశిష్టత : కామందకం అనే సంస్కృత గ్రంథాన్ని తెనిగించిన కవులలో ఈయన రెండోవాడు. క్రీ. శ. 1355 ప్రాంతంలో ఒక ప్రాచీన కవి వ్రాసిన కామందకం ప్రచారంలో ఉండేది. ప్రాచీన కామందకం నుంచి 308 పద్యాలను స్వీకరించి మడికి సింగన్న తన సకల నీతి సమ్మతంలో ఉదాహరించాడు. సామాన్య ప్రజలకు కూడా బోధపడేటట్లు రాజనీతిని గురించి వ్రాశాడు. ఇతని రచన సరళంగా ఉంటుంది. (ఆరుద్ర—9)

## జక్కరాజు వేంకట రామకృష్ణ కవి

నామాంతరం : జక్కరాజు వేంకట కవి (చూ).

## జక్కుల పాట

(చూ. యక్షగానము).

## జక్కుల పురంధ్రీకులు

కాకతీయుల కాలంలో తెలుగుదేశంలో జక్కుల వారనే జాతి వారుండేవారు. వీరినే మన ప్రాచీన కవులు తమ గ్రంథాలలో జక్కుల పురంధ్రీకులని

వర్ణిస్తూ వచ్చారు. వీరే యక్షులు కావచ్చునేమో అని పండితులు కొందరంటున్నారు. 'జక్కుల పురంధ్రి' ప్రసక్తి క్రీడాభిరామంలో ఉంది. (నా.ర.చ-67)

## జక్కుల వారు-దానాలు

కాలం : విజయనగరరాజుల కాలం (15, 16 శతాబ్దాలు).

యక్షగానం అతి ప్రాచీనమైన కళారూపమనీ, వీటిని ప్రదర్శించే వారే జక్కుల వారనీ పండిత నిర్ణయం. సుప్రసిద్ధులైన కవులు యక్షగానాలను వ్రాయగా, గాయకులైన జక్కులవారు వాటిని ప్రదర్శించేవారు. వీరిని రాజులు, ధనికులు ఆదరించి పోషించే వారు. క్రీ. శ. 1506-1509 మధ్యకాలంలో విజయనగర రాజ్యాన్నేలిన వీరనరసింహ రాయలు (శ్రీకృష్ణదేవరాయలు అన్న) యక్షగాన కవులను, ప్రవర్తకులను గౌరవించే వాడట.

క్రీ. శ. 1514 లో కర్నూలు జిల్లా చెరువుబెళగల్లు గ్రామంలో తాయికొండ నాటక ప్రదర్శనలిచ్చిన-నాగయ్య కుమారుడు నట్టువ నాగయ్యకు, నాయికగా నటించిన పోతవర గ్రామవాస్తవ్యుడు నట్టువ తిమ్మయ్య కుమార్తెకు - ఆఊరి కరణం తిరువత్తూరు సోమరసు కొడుకు బసవరసు కొంతభూమిని దానమిచ్చినట్లు తెలుస్తుంది.

(నా.ర.చ-92-93)

## జగదాభరణమ్ (సం)

కర్త : జగన్నాథపండితరాయలు.

ఇది సంస్కృత శ్లోకాలలో ఢిల్లీ పాదుషాను ప్రశంసించే గ్రంథం.

(తె.వి.స-4)

## జగదీశ్వర రామకుమార ఎట్టప్పమహారాజు

కాలం : క్రీ.శ. 1839 ప్రాంతం.

రచనలు : 1. దేవతాస్తుతులగు శ్లోకములు 2. కార్తికేయ ముద్రతో చూర్ణికలు 3. ఇతరములైన గేయ రచనలు.

దక్షిణదేశంలోవి ఎట్టియాపుర సంస్థానపాలకుడు. పండిత పోషకుడు. కవి. సంస్కృత, ఆంధ్ర, ద్రావిడ భాషలలో సంగీత రచనలు చేశాడు.

ఇతని ఆస్థానంలో గుడుగుముల అహోబలశాస్త్రి, విళాత్తియం కృష్ణయామాత్యులు, అవల్నత్తం రామలింగయ్య, బాలయ్య, గోపాలయ్య, కేశవరామ భట్రాజు, బాలస్వామి దీక్షితులు, వీణ మీనాక్షి, సుందరమయ్య మొ॥ వారుండేవారు.

(ద. దే. వా-513)

## జగదేవ భూపతి

కాలం : తెలియదు.

ఇతన్ని గురించి చాటువుల వల్ల తెలుస్తున్నది.

ఈయన ఒక రాజని, రాణికుల తేజుడని, దీన కల్పద్రుమ మని ఈ చాటువు

చెప్తున్నది. చాటుకవి పేరు తెలియదు. రాజా వంశీయుడైన జగదేవరాయలు ప్రఖ్యాతుడు. ఇతడూ అతడూ ఒకరే కావచ్చు. (చా. ప. ర.)

**జగన్నాటకము**

కర్త : ఏదుట్ల శేషాచలుడు (చూ).
అంకితం : శ్రీరామునికి.

ఐదు అశ్వాసాల ఆధ్యాత్మిక గ్రంథం. స్వతంత్ర కావ్యం. సకల సామాజికోత్పత్తి, సమస్త వస్తు సృష్టి ఈ గ్రంథంలో వివరింపబడింది.

గద్వాల సంస్థానాధీశ్వరుడు ఆంధ్ర సాహిత్య అకాడెమి వారికి దీని తాళపత్ర ప్రతిని ఇచ్చాడు. ఈ ప్రతి శిథిలావస్థలో ఉన్నది. (మ. మా.)

**జగన్నాథ కవి**

కాలం : క్రీ. శ. 18వ శతాబ్దం.
ఆస్థానం : క్రీ. శ. 1712–1728 నడుమ తంజావూరును పాలించిన మొదటి శరభోజీ ఆస్థానం.
రచనలు : 1. శరభరాజ విలాసమ్ (సం) 2. రతీ మన్మథ నాటకమ్ (సం).

సంస్కృతాంధ్రాలలో పండితుడు. ఇతని తెలుగు రచనలు లభించలేదు. శరభోజీ చరిత్రనూ అతని పూర్వీకుల చరిత్రనూ, ఇతని శరభరాజ విలాసం తెలుపుతున్నది. రతీ మన్మథ నాటకం ఆనాటి ఉత్సవాదులలో ప్రదర్శించటానికి అనువుగా రాసిన నాటకం.

ఆనాడు సంస్కృత నాటకాలు తరచు ప్రదర్శింపబడుతుండేవి. ఇతని రతీమన్మథ నాటకాన్ని కిర్లంపూడి కామేశ్వర రాయకవి (క్రీ. శ. 1900 ప్రాంతం) తెనిగించారు. (ద. దే. వా–242)

**జగన్నాథపండిత రాయలు**

కాలం : క్రీ.శ. 1590–1665.
స్థలం : కోనసీమలోని ముంగండ అగ్రహారం.
బిరుదు : పండితరాజు.
ఆస్థానం : మొగల్ చక్రవర్తి షాజహాన్ ఆస్థానం.
రచనలు : 1. అమృతలహరి 2. కరుణాలహరి 3. గంగాలహరి 4. లక్ష్మీలహరి 5. సుధాలహరి 6. జగదాభరణమ్ 7. ప్రాణాభరణము 8. ఆసఫ విలాసము 9. భామినీ విలాసము 10. చిత్ర మీమాంసా ఖండమ్ 11. రస గంగాధరమ్ 12. మనోరమా కుచమర్దనమ్ 13. యమునా వర్ణనము.

ఈయన చిన్నతనంలో స్వగ్రామంలోనే సకల విద్యలను నేర్చుకొన్నాడు. కాశీపట్టణంలోని శేష వీరేశ్వరుని శిష్యుడై వ్యాకరణంలో నిష్ణాతుడయ్యాడు. శాస్త్రార్థ

దక్షుడై, వేదాలలో పండితుల నోడించే ఉద్దండుడైనాడు. జయపుర ప్రభువు ఆహ్వానంపై అక్కడికి పోయి మహా పాఠశాలలో విద్యాధికారిగా ఉన్నాడు.

ఢిల్లీ దర్బారులోని, కాజీ అసఫ్ ఖాన్ అనే సైన్యాధికారీ, 'రామ ముకుందు' అనే అతడూ ఇతన్ని జహంగీరు చక్రవర్తికి పరిచయం చేశారట. ఢిల్లీ చక్రవర్తుల గౌరవాదరాలను పొందాడు.

క్రీ. శ. 1628 లో షాజహాన్ ఇతన్ని 'పండితరాజు' బిరుదుతో సత్కరించాడు. పాదుషా తనతోపాటు ఈయనకు ఆసనం ఇచ్చి గౌరవించే వాడట. షాజహాన్ పెద్ద కుమారుడు దారాషుకో ఈయనకు శిష్యుడై శాస్త్రాలను, దర్శనాలను, ఉపనిషత్తులను, నేర్చుకొని తన భాషలోకి అనువదించాడు.

ఔరంగజేబు పాదుషా అయినతరవాత ఈయన ఢిల్లీ విడిచి దేశ సంచారం చేస్తూ కాశీలో కొంతకాలం ఉండి, అక్కడినుంచి కామ రూప (అస్సామ్) ప్రభువైన 'ప్రాణ నారాయణు'ని చేరి అక్కడ 1662 వరకు ఉన్నాడట

ఇతడు 'లవంగి' అనే యవన కన్యను స్వీకరించినట్లు ప్రతీతి ఉంది. దానికి ఆధారాలు లేవు. ఈయన నానాశాస్త్ర పారంగతుడని, అష్టభాషాకవిత్వక్షముడని ఈయన శిష్యుడు శ్రీ కులపతి మిశ్రుడు చెప్పాడు. ఇతని సంస్కృతరచనలే తెలియవస్తున్నాయి. (తె. వి. స-4)

## జగన్నాథ యోగి శతకము

కర్త : నిమిష కవి వేంకటేశకవి.
అంకితం : గోడే జగన్నాథరావుకు.

తత్త్వ ప్రధానమైన సీసపద్య శతకం.

దీనిలో పిండోత్పత్తి క్రమం, హఠయోగం మొదలైనవి వర్ణితాలు. 'జ్ఞాన భోగి-గోడే జగన్నాథ యోగి' అనే మకుటంతో ఉంది. కృతిపతి జగన్నాథరావు యోగి అయినతర్వాత అతన్ని ఉద్దేశించి రచించిన కృతి. (శ. క. చ-690; శ. సా. వి-352)

## జగన్నాథస్వామివారి రాయబారము

నామాంతరం : "లక్ష్మీనారాయణ సంవాదము".
కవి : గోగులపాటి కూర్మనాథ కవి. (ఆం. సం. సా-416)

## జగన్నాథాష్టకమ్ (సం)

కర్త నడిమింటి సర్వమంగళేశ్వర శాస్త్రి.

భక్తిరస పూరితమై కర్ణపేయంగా ఉన్న అష్టకం. యావద్భారతదేశంలోనూ ప్రచారం పొందింది. "జగన్నాథస్వామీ నయన పథగామీ భవతుమే" అనే మకుటంతో ఉన్నది.

## జగన్నాయక శతకము

కర్త : తెలియదు.

"నీల కుధరాధ్యక్ష జగన్నాయకా" అన్న మకుటంతో ఉంది. సంస్కృత సమాసాలు, అనుప్రాసలు రచనలో కొల్లలు. ఉత్తమమైన శతకం కాదని బ్రౌన్‌దొర వ్యాఖ్యానించాడు. దీని ప్రతి మదరాసు ప్రాచ్య లిఖిత గ్రంథాలయంలో ఉంది.
(ఆరుద్ర_238)

## జగన్నాయక శతకము

రచనాకాలం : 1790 ప్రాంతం.

కర్త : వరాహగిరి కొండ్రాజామాత్యుడు.

దీనిలో మంచి నీతులతో పాటు కవి లోకజ్ఞత తెలుస్తున్నది. పౌరాణిక గాథలకు కవి సరసమైన నీతులు జోడించి బోధించాడు. "దేవా జగన్నాయకా" అనే మకుటంతో చెప్పిన వృత్త శతకం. (శ. సా. వి._380)

## జగన్నాయక శతకము

కర్త : సింహాద్రి అంకన్న.

పూరీ జగన్నాథునిపై చెప్పిన శతకం. "దారో జగన్నాయకా" అనే మకుటంతో ఉంది. కర్త పేరు కద్ర కవి అనీ అంకేంద్రుడని భిన్నాభిప్రాయాలున్నాయి.
(ఆరుద్ర 11_237 శ. క. చ_672)

## జగన్మోహన భాణము

కర్త : చూ విక్రాల నరసింహాచార్యులు.

పౌరాణిక భాణం. నాటక ప్రక్రియలో "భాణం" ఒకటి. (ఆం.సం. సా.)

## జగన్మోహన విలాస నాటకము

కవి : మేలత్తూరు వేంకట రామశాస్త్రి (చూ).

సంగీత రూపకం. చాలా ప్రఖ్యాతి చెందింది. నృసింహ జయంత్యుత్సవ సందర్భాలలో దక్షిణదేశంలో నేటికీ దీన్ని ప్రదర్శిస్తున్నారు. (ద.దే.వా. శారదా. 124)

## జగన్మోహినీ దండకము

కర్త : తామ్ర అరుణాద్రి కవి.

వెంకటగిరి ప్రభువైన కోనేరు చిన రంగభూపాలుని పైచెప్పిన దండకం. ఆ రాజు తంజావూరు పాదుషా మీద దండెత్తి జయించి నగర ప్రవేశం చేసినప్పుడు అతన్ని ఒక వేశ్య ప్రేమించడం ఇందులోని విషయం. (వా.చ.వం.సు. 386)

## జటప్రోలు

ఇది నేటి మహబూబ్‌నగర్ మండలంలోనిది. క్రీ. శ. 1527 నుండి ఈ సంస్థానాధిపతులు జటప్రోలును రాజధానిగా చేసుకుని పాలించారు. సుమారు 200 సం॥ల క్రితం రాజధాని, నేటి 'కొల్లాపురం' నగరానికి మార్చబడింది.

ఈ సంస్థానం మొదట కాకతీయులకు, తరువాత విజయనగర సామ్రాజ్యానికీ, ఆ తరువాత గోలకొండ సుల్తానులకు సామంత మండలంగా ఉంటూ వస్తున్నది.

ఈ సంస్థానాధిపతులు సురభివారు. రేచర్ల వారి వంశ మూల పురుషుడైన చెవ్విరెడ్డి నామాంతరం గల బేతాళనాయుడే వీరికి కూడా మూలపురుషుడు. ఆ వంశంలోని 13వ తరంవాడైన "మాదా నాయుడు" జటప్రోలు వారికి శాఖా మూలపురుషుడు. 14వ తరంవాడైన కుమార మాదానాయుడు క్రీ. శ. 1527 లో ఆనెగొంది రామదేవరాయల వద్ద "జటప్రోలును" పారితోషికంగా పొందాడు.

ఈ వంశపు సంస్థానాధిపతులు కొందరు స్వయంగా కవులు. మరికొందరు అశేష కవి పండిత పోషణ గావించినవారు. వీరిలో 19వ తరంవాడైన (క్రీ. శ. 1600 ప్రాంతం) సురభిమాధవరాయలు "చంద్రికా పరిణయ"కర్త. మహామహోపాధ్యాయ బిరుద భూషితుడైన "ఎలకూచి బాలసరస్వతి" వీరి ఆస్థానంలో ఉన్నాడు. సురభి వేంకట లక్ష్మరాయబహద్దరు విద్వత్కవి సార్వభౌముడై కవి పండిత పోషణ గావించాడు. జగన్నాథరావు కవిసార్వభౌమ బిరుదాంకితులైన హొసదుర్గం కృష్ణమాచార్యులచేత లక్ష్మీ నృసింహ విలాసం, జటప్రోలు మదన గోపాల మాహాత్మ్యం మొ॥ గ్రంథాలు రచింప చేశాడు. వెల్లాల సదాశివశాస్త్రిగారు సురభి వేంకట లక్ష్మరావు బహద్దరు ఆస్థానంవాడు. చంద్రికా పరిణయ వ్యాఖ్యాత.

అక్షింతల సుబ్బశాస్త్రి, అక్షింతల సింగరశాస్త్రి, వెల్లాల రాఘవజోస్యులు, వెల్లాల శంకరశాస్త్రి, వెంకట రామశాస్త్రి మొ॥ వారును, మంచాలకట్ట గ్రామనివాసులైన పలువురు విద్వాంసులును ఈ సంస్థానంలోనివారే. "వైయాకరణగజ కంఠీరవ" యణయ వల్లి కృష్ణమాచార్యులు, "కవికంఠీరవ" కృష్ణమాచార్యులు సుమారు 150 సం॥ల క్రితం వీరి ఆస్థాన విద్వాంసులుగ ఉండి అనేక తెలుగు, సంస్కృత గ్రంథ రచన గావించారు.

రాణీ వేంకట రత్నమాంబ ఆ సంస్థానాధీశ్వరిణిగా ఉన్నకాలంలో కూడా విద్వత్కవి పోషణ జరిగింది. కవిసార్వభౌమ శ్రీపాద కృష్ణమూర్తిగారు ఈ సంస్థానాధీశ్వరులచేత మిక్కిలి గౌరవసత్కారాలు పొందారు. (కేశవపంతుల–సం.సా.)

## జనక సుతాభ్యుదయము

కర్త : మరింగంటి వేంకట (ప్రథమ) నృసింహాచార్యులు. (తె. వి. స–6)

## జనార్దన పంచరత్నాలు

కర్త : రుద్రకవి.

ప్రత్యేకత : కందుకూరులోని జనార్దనస్వామిపై అష్టకం చెప్పినట్లే కవి పంచరత్నాలు కూడ చెప్పాడు. ఇవి తత్సమ పదభూయిష్ఠంగా ఉన్నాయి. కందుకూరి రుద్ర విషయము అనే గ్రంథంలో ఈ పంచరత్నాలు ఉన్నాయి. వీటి వ్రాత ప్రతి మదరాసు ప్రాచ్యలిఖిత గ్రంథాలయంలో ఉంది. (ఆరుద్ర–8–184)

## జనార్దన రంగారాయబహద్దరు

కాలం : క్రీ. శ. 19వ శతాబ్దం (ప్రథమార్ధం).

స్థలం : బొబ్బిలి సంస్థానం.
రచనలు : హరిభక్తి సుధోదయము, మిత్రవిందాపరిణయము, వేణుగోపాల శతకము మొ॥.
బిరుదం : పోషిత సత్కవి నికాయ.

బొబ్బిలి సంస్థానాధీశ్వరుల వంశంలోనివాడు. క్రీ. శ. 1810-1862 కాలం వాడైన రాజా శ్వేతాచల రంగారాయ బహద్దరుకు సోదరుడు. రాయడప్ప రంగారాయని పుత్రుడు. ప్రముఖ విద్వత్కవి. కవి పండిత పోషకుడుగా ప్రసిద్ధి కెక్కినవాడు. ఇతని రచన రసవంతంగా ఉంటుంది (అం. సం. సా- 306, 307)

**జనార్దనాష్టకము**

కర్త : కందుకూరి రుద్రకవి.
అంకితం : కందుకూరులోని జనార్దనస్వామికి.

ప్రత్యేకత : ఇది కందుకూరి జనార్దనస్వామి మీద రుద్రకవి చెప్పిన అష్టకం. చక్కని శృంగార రచన. తెలుగులో అష్టకాలు వ్రాసినవారు అరుదు. గోరంట్ల మాధవాష్టకం, ఒంటిమిట్ట రఘునాయకాష్టకం, కడపాధి నాయకాష్టకం ఇలాంటివే.
(అరుద్ర-8-167)

**జనుంపల్లి వల్లభరాయలు**

కాలం : 18 వ శతాబ్దం.
స్థలం : వనపర్తి. మహబూబ్‌నగర్ మండలం.

సాహితీ పోషకుడు. చెన్నకృష్ణ కవిచేత "యాదవ భారతీయ" మనే ద్వ్యర్థి కావ్యాన్ని అంకితం పొందాడు. వనపర్తి సంస్థాన పాలకుడు గాని ఆ కుటుంబానికి చెందినవాడు గాని కావచ్చును. (అం. సం. సా.)

**జన్నుపల్లి కృష్ణభూపతి**

కాలం : తెలియదు.

ఈయన దానధర్మాలను, ధైర్య సాహసాలను నుతిస్తూ చాటు పద్యాలు దొరికాయి. చాటుకవి వివరాలు తెలియవు. (చా. ప. ర,)

**జమాబందీ దండకము**

రచనాకాలం : 18 వ శతాబ్దం.
కర్త : వద్దిపర్తి కోనరాట్కవి (చూ).

సమకాలీన సంఘస్థితిని వర్ణించే దండకం. ఈ కవి తన స్వంతదావా విషయాలను, కోర్టు వ్యవహారాలను శ్రీరామునికి నివేదిస్తూ ఒక శతకాన్ని కూడా రాశాడు.
(వా. చ. వం. సు.)

**జముకుల కథలు**

ఈ కథలు కాకతీయుల కాలంనుంచే ప్రచారంలో ఉన్నాయని పండితులంటారు. ఈకథలు చెప్పేటప్పుడు వాయించే వాయిద్యాన్ని జమిలిక, జమిడిక అంటారు. ఎక్కువగా

ఇవి తెలంగాణా ప్రాంతంలోను, విశాఖపట్టణం తూర్పు పశ్చిమ గోదావరి జిల్లాలలోనూ ప్రచారంలో ఉన్నాయట. ఈ కథలు శృంగార రసాత్మకంగా కరుణ రసాన్ని ప్రతిబింబించేవిగా ఉంటాయి.

గ్రామం మధ్యలో చిన్న పందిరి వేసి రెండు దీపాలు పెట్టి కథ చెబుతుంటారు. కథకులు ముగ్గురు. మధ్యవర్తి కథ చెప్తూ ఉంటే, ఒక వంతదారు హాస్యాన్ని, రెండో ఆయన వ్యాఖ్యానాన్ని అందిస్తాడు. కథకుడు తెల్లకట్టు పంచ, నల్లకోటు, తలకు గుడ్డ చుట్టి చక్కగా నృత్యం చేస్తూ కలియ దిరుగుతాడు. కథా విధానంలో స్త్రీ పాత్రలు వచ్చినప్పుడు అక్షరాలా స్త్రీ అభినయాన్ని చేస్తాడు. ఇవి కూడా జానపద కథలలో విశిష్టమైనవి. (నా. ర. చ-269-271)

## జయంతి కామేశ్వరకవి

కాలం : క్రీ. శ. 19 వ శతాబ్దం.

రచన : జానకీ వర శతకము.

ఇతడు విద్వత్పోషకుడుగా ప్రసిద్ధి పొందాడు. వృత్తిరీత్యా మద్రాసు హైకోర్టులో న్యాయవాదిగా ఉండేవాడు. సలక్షణమైన భాషలో రచనలు చేశాడు. ఇతని శైలి మధురంగా ఉంటుంది. (శ. క. చ-687)

## జయంతి రామభట్టు

కాలం : తెలియదు.

నివాసం : భద్రాచల ప్రాంతం.

రచన : ఉత్తర రామాయణము (తుది ఆశ్వాసం).

కృష్ణ భట్టారక సుభద్రాంబల కుమారుడు. తిక్కన రచించగా మిగిలిన ఉత్తర రామాయణంలోని తుది ఆశ్వాసాన్ని రచించాడు. కుశలవుల విద్యాభ్యాసం, పౌండరీక వాజసనేయాది క్రతువులు, రాముడు వైకుంఠంలో ప్రవేశించటం మొదలైన విషయాలను ఈ ఆశ్వాసంలో చెప్పాడు. (తె. వి. స-6)

## జయదేవ కవి

కాలం : క్రీ. శ. 11 శతాబ్ది కావచ్చు.

రచన : జయదేవుని ఛందము (అలభ్యం).

విశిష్టత : కవిజనాశ్రయ కర్త రేచనకు పూర్వుడు. రేచన ఒక పద్యంలో ఈ జయదేవుని పేర్కొన్నాడు. జయదేవ ఛందంలోనిదని ఒక పద్యాన్ని ఆనందరంగరాట్ఛందంలో కస్తూరి రంగకవి ఉదాహరించాడు. సంస్కృతాంధ్ర కవులలో జయదేవులు మొత్తం ముగ్గురున్నారు. ఏ జయదేవుడు ఈ ఛందోగ్రంథాన్ని వ్రాశాడో చెప్పటం కష్టం (అం. క. త-2)

## జయదేవుని ఛందము (అలభ్యం)

కర్త : జయదేవ కవి (చూ).

కవి జనాశ్రయ కర్త దీనిని పేర్కొన్నాడు. కస్తూరి రంగకవి ఒక పద్యాన్ని దీని నుంచి ఉదాహరించాడు. (క. త-2)

**జయ విజయాభ్యుదయము**

కర్త : రాజవోలు సుబ్బారాయుడు (చూ).
అంకితం : శ్రీ వేంకటేశ్వరస్వామికి.

ఆరాశ్వాసాలున్న కేవల కల్పిత ప్రబంధం. పింగళి సూరన తనకు మార్గదర్శి అని కవి చెప్పుకొన్నాడు. కథా కల్పనలోనూ పేర్ల పెట్టడంలోనూ "కళాపూర్ణోదయం" పోలికలు కనిపిస్తాయి. రచన సరళంగా ఉంటుంది.
(క. త-11-180; ఆరుద్ర-10-249)

**జయసింహ వల్లభుని విప్పర్ల శాసనము**

కాలం : క్రీ. శ. 641 ప్రాంతం.

ఇది జయసింహవల్లభుడు నరసరావుపేట తాలూకాలోని విప్పర్ల గ్రామంలో వేంచేసి యున్న కపోతేశ్వరస్వామి ఆలయంలో వేయించిన తెలుగు శాసనం. క్రీ. శ.7 వ శతాబ్దంలోని తెలుగు శాసనాలలో ఇది ప్రముఖమైంది. తెలుగు భాషా స్వరూపం ఇందులో స్పష్టంగా ఉంది. ఇందులో అనేక సంస్కృత పదాలు కలసిన పద్ధతిలో వాక్య నిర్మాణం కనిపిస్తుంది. ఇది రాజానుమతిని వేయించిన శాసనం. దీనిలో తెలుగు భాషా రూపమేగాని వాటి వాఙ్మయపు ఛాయలు అంతగా కనిపించవు. "స్వస్తి శ్రీమత్ లోకాశ్రయ జయసింహ మహారాజు లాకున్"తో మొదలయి "కుడుచువారు"తో ముగుస్తుంది. (వా. చ-11)

**జయసింహుడు**

కాలం : క్రీ. శ. 18 వ శతాబ్దం.
స్థలం : తంజావూరు.

తంజావూరును పాలించిన మహారాష్ట్ర రాజు. తుక్కోజీ (1728-1736) కుమారులలో ఒకడు కవి, పండిత పోషకుడు. కృతిపతి. నెల్లూరి శివరామకవి ఇతని ఆశ్రయంలో ఉండేవాడు. అతని కామ కళానిధి జయసింహునికే అంకితం.
(ఆరుద్ర-12-140)

**జలక్రీడలు**

కర్త : శహాజీ (చూ).
రచనాకాలం : క్రీ. శ. 1700 ప్రాంతం.

కృష్ణ స్తుతితో మొదలైన నాటకం. శ్రీకృష్ణుని క్రీడలు - విహారాలు - గోపకన్యలను పెండ్లాడటం - వర్ణించబడింది. (ద.దే.వా-188)

**జలక్రీడలు**

కర్త : భారతి రామరాజు.

యక్షగానం. భాగవత దశమ స్కంధ పూర్వ భాగంలోని కథ వర్ణింపబడింది ముఖ్యంగా యశోదతో గోపికలు కృష్ణుని అగడాలు చెప్పడం, గోపికా వస్త్రాపహరణ (జలక్రీడలు) విషయాలు వివరంగా ఉన్నాయి. రచన చక్కగా ఉంది. దీనిలో దరువులు, ద్విపదలు, పద్యములు, వచనములు, కందార్థములు, సీసార్థములు, చూర్ణికలు ఉన్నాయి. (య. వా. చ-82)

**జలక్రీడా విలాసము**

కర్త : నిముషకవి రామయ్య.

యక్షగానం. దీనిలోనికథ శ్రీకృష్ణుని గోపికా వస్త్రాపహరణం. శైలి సామాన్యమైనది. దీనిలో దరువులు, ద్విపదలు, పద్యాలు ఉన్నాయి. దరువులకు రాగ తాళాలే గాక, పల్లవి, అనుపల్లవి, చరణములు మొదలైన సంకీర్తన లక్షణ ప్రక్రియ నిరూపించారు. దీనికి శృంగార ప్రబంధమని పేరు. (య. వా. చ-49)

**జలపాలి మాహాత్మ్యము (అలభ్యం)**

కవి : ఘటసాసి మల్లుభట్టు.

స్థలపురాణం. ఏలూరులో ఉన్న జలపాలీశ్వరుని మహిమను చెప్పే కావ్యం. ఇందులోని మూడు పద్యాలను పెదపాటి జగ్గన్న సంకలనం చేశాడు. (ఆరుద్ర-9)

**జవ్వాదివారు**

జవ్వాదివారు పూర్వపు తరాలనుంచి జమీందారులు కారు. వీరిది అత్యంత నవీనమైన ఎస్టేటు. క్రి. శ. 1943 లో ఏర్పడింది.

"జవ్వాది లక్ష్మయ్య నాయుడు" క్రీ. శ. 1943 లో ఓగిడి, కొయ్యేటిపాడు ఎస్టేటులను ఖరీదుచేసి, ఈ కుదురులో మొదటి జమీందారైనాడు. ఈతని పితామహుడైన "లక్ష్మయ్య నాయుడు" కాలంనుంచికూడా, వీరు అత్యంత శ్రీమంతులై ఉండి, జమీందారీ ఫాయాతో సంస్థాన మర్యాదలను సాగించేవారు. జవ్వాది లక్ష్మయ్య నాయుడు సాహిత్యాభిమాని. పెనుగొండ సాహిత్య పరిషత్తుకు వ్యవస్థాపకాధ్యక్షుడు. ఇతని ఆధ్వర్యంలో రూపెత్తిన "సరస్వతీ గ్రంథమాల" ఇతని కావ్యప్రచురణాభిలాషకు చక్కని తార్కాణం

చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రి, శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి, చిలకమర్తి లక్ష్మీనరసింహం, మల్లాది సూర్యనారాయణశాస్త్రి, తాతా సుబ్బరాయశాస్త్రి, చర్ల భాష్యకారశాస్త్రి, కాశీ కృష్ణాచార్యులు మొ॥ ప్రముఖ విద్వత్కవులు ఈ లక్ష్మయ్య నాయుడు చేత సత్కరింపబడ్డారు. ఇతడు సుమారు 12 కృతులను అంకితం పొందాడు.

ఇతనితోబాటు ఇతని కుటుంబంలో పెక్కురు కృతిభర్తలు ఉన్నారు. ఇతని తండ్రి అయిన వెంకయ్య, అన్న నరసింహమూర్తి, భార్య ఆదిలక్ష్మమ్మ, పెద్ద కుమారుడు వెంకటరామశాస్త్రి, వియ్యంకుడైన కూనపరెడ్డి వీరరాఘవయ్య నాయుడు — ఈ అయిదుగురి కృతిభర్తృత్వంలో సుమారు 8 గీర్వాణాంధ్ర కృతులు రూపుదిద్దుకున్నాయి. (ఆం.సం.సా-545-47)

**జాంబవతీ కుమార శృంగార విలాసము**

కర్త : మరింగంటి వేంకట (ప్రథమ) నృసింహాచార్యులు. (తె.వి.స-6)

**జాంబవతీ పరిణయమ్ (సం)**

కర్త : రేపూరి ఏకామ్రకవి.

అంకితం : ఇమ్మడి అంకుశేంద్రునికి.

శ్రీకృష్ణ పరమైన కావ్యం.

**జాంబవతీ పరిణయమ్ (అలభ్యం)**

కర్త : చూ. శ్రీకృష్ణదేవరాయలు.

సంస్కృత కావ్యం. శ్రీకృష్ణదేవరాయలు దీనిని వ్రాసినట్లు ఆముక్త మాల్యదలో చెప్పుకొన్నాడు. (తె.వి.స-6)

**జాంబవతీ విలాసము (అలభ్యం)**

కర్త : గణపవరపు వేంకటకవి

కాలం : క్రీ. శ. 17వ శతాబ్దం.

కవి మాటలను బట్టి ఈ గ్రంథం గురించి తెలుస్తున్నది. (క.త-12)

**జాజర పాటలు**

కాలం : క్రీ. శ. 12-13 శతాబ్దాలు.

కాకతీయుల కాలంలో ప్రచారంలో ఉన్న ఈ పాటలను గురించి నాచన సోమన తన వసంతవిలాసంలో-"వీణాగానము వెన్నెలతేట-రాణ మీరగా రమణుల పాట; ప్రాణమైన పిన బ్రాహ్మణుపీట-జాణలు మెత్తురు జాజరపాట" అని చెప్పాడు.

బ్రాహ్మణ పీట జాజరపాట రాణించె ననటాన్ని బట్టి-అవి ఆనాటి బ్రాహ్మణులలో ఎక్కువగా ప్రచారంలో ఉన్నాయని చెప్పవచ్చు. (నా. ర. చ-64)

**జాతకచంద్రిక వ్యాఖ్య**

కర్త : వైయాకరణ గజకంఠీరవ యుణయవల్లి కృష్ణమాచార్యులు (చూ)

సంస్కృత గ్రంథం. (అ. సం. సా.)

**జాతి స్వరమట్టు**

ఇది మంగళ గీతమని పండితాభిప్రాయం. గజేంద్రాళ్వారు చరిత్ర యక్షగానంలో ఇది ఉంది. (య. వా. చ-323)

**జాతులు**

పద్య భేదాలలో ఒక విభాగం. మాత్రాగణాలు మాత్రం ఉంటాయి. అక్షరాల చేతనైనా, అక్షరగణాల చేతనైనా, మాత్రాగణాల చేతనైనా, నిబద్ధములైె పాదాలతో ఏర్పడే పద్యాలు జాతులవుతాయి. సంస్కృతేతరములైన దేశీయ భాషలలో రూపొందే పద్యాలన్నీ మాత్రాగణబద్ధములే. వాటిలో కొన్ని స్వీకృతాలై సంస్కృత

చ్ఛందంలో జాతులు అనే ఒక వర్గంగా రూపొందినవి. అవికాక తెలుగులో రూపొందిన మాత్రాగణబద్ధ పద్యాలనే తెలుగులో 'జాతులు'గా వ్యవహరిస్తారు.

తెలుగున జాతులకు యతి, ప్రాసల చెల్లింపు విషయంలో ప్రత్యేక లక్షణమున్నది. ఇందులో 14 భేదాలున్నవి. సంస్కృత జాతి పద్యాలు రెండు రకాలు. 1. ఆర్యభేదాలు 2. వైతాళీయాలు.

తెలుగులోని 14 భేదాలు ఇవి : 1. కందము 2. ఎత్తుగీతి 3. ప్రగీతి 4. మేలనగీతి 5. ద్విపద 6 త్రిపద 7. చౌపదులు 8. పంచపద 9. సప్తపద 10. షట్పదులు 11. తరువోజ 12. ఉత్సాహము 13. అక్కరలు 14. రగడలు.

(ఛం. ప. కో.)

**జానకిరామయ్య**

కాలం : క్రీ.శ. 17వ శతాబ్దం.

సాహిత్యాభిమాని. కృతిపతి. వెన్నెలకంటి వేంకటాచల కవి రచించిన కృష్ణ విలాస ప్రబంధం ఇతనికే అంకితం. (అరుద్ర-10-253)

**జానకీ కల్యాణ నాటకము (అలభ్యం)**

కర్త : విజయ రాఘవ నాయకుడు.

ఆలయోత్సవాదులలో ప్రదర్శించడానికి వ్రాసిన ప్రదర్శన యోగ్యమైన నాటకం కావచ్చును. (ద. దే. వా-89)

**జానకీ కళ్యాణము (అలభ్యం)**

నామాంతరం : జానకీ పరిణయము.

కవి : రఘునాథుడు.

యక్షగానం. ఇది చాటుకావ్యంగా రఘునాథ నాయకాభ్యుదయంలో పేర్కొనబడింది. (ద. దే. వా-35)

**జానకీ పతి శతకము**

రచనాకాలం : క్రీ.శ. 18వ శతాబ్దం.

కర్త : అణిమిళ్ళ సీతారామ కవి.

వృత్తాలతో కూడి ఉంది. రచన ప్రౌఢంగా జటిలంగా ఉంది. తత్సమ పదాలు ఎక్కువ. కొన్ని పద్యాలలోని శైలి మధురంగా ఆనందజనకంగా ఉందవి పండితాభిప్రాయం. (శ. క. చ-433)

**జానకీపతి శతకము**

రచనా కాలం : క్రీ. శ. 1800 కి పూర్వం.

కర్త : రామభద్రకవి.

'జానకీపతీ' అనే మకుటంతో ఉన్న వృత్త శతకం. రామదాసు చరిత్రలో ఈ శతక పద్యాలు ఉదహరింపబడ్డాయి. (శ.క.చ-468)

**జానకీ పరిణయమ్ (సం)**

కవి : చక్రకవి.

ఎనిమిది సర్గల కావ్యం. శ్రీరామ జననం మొదలు సీతా కల్యాణం వరకుగల కథ ఇందులో ఉంది. (తె.వి.స-6-222)

**జానకీ పరిణయమ్ (సం)**

కర్త : రామభద్ర దీక్షితులు.

సంస్కృత రూపకం. రామాయణ కథలో కొన్ని చిత్ర విచిత్ర కల్పనలు చేసి కూర్చిన రూపకం.

**జానకీ పరిణయము**

రచనాకాలం : క్రీ శ. 1700 ప్రాంతం.

కర్త : కూచిమంచి జగ్గకవి.

కథ ప్రసిద్ధం. (వా చ-81)

**జానకీ పరిణయము (అలభ్యం)**

కర్త : తేకుమళ్ళ రంగశాయి (చేకుమళ్ళ రంగశాయి).

తేకుమళ్ళ రంగశాయి తాను జానకీ పరిణయ యక్షగానాన్ని వ్రాసినట్లు వీర రాఘవ శతకంలోనూ, కృష్ణదండకంలోనూ చెప్పుకొన్నాడు. ఇది తత్త్వప్రతిపాదకంగా రచించబడినదనీ శృంగారానికి ఇందులో ప్రాధాన్యంలేదనీ తెలుస్తున్నది. (య వా.చ-17)

**జానకీ పరిణయము**

నామాంతరం : (చూ) జానకీ కళ్యాణము.

రచనాకాలం : క్రీ. శ. 1600 ప్రాంతం.

కవి : రఘునాథుడు.

**జానకీ రాఘవము**

రచనాకాలం : క్రీ. శ. 18వ శతాబ్దం.

కర్త : బేతపూడి కృష్ణకవి.

అంకితం : అడపా నారప్పకు.

విద్యావ్యాసాల ప్రబంధం.

**జానకీ రామ శతకము**

రచనాకాలం : క్రీ. శ. 19వ శతాబ్దం.

కర్త : అడిదము బాలభాస్కరకవి II.

**జానకీ రామశతకము**

కర్త : కొటికెలపూడి కోదండరామకవి.

303 సీసపద్యాలతో కూడిన శతక రచన. "జానకీరామ దేవతా సార్వభౌమ" అనే మకుటంతో శ్రీరామస్తవ పరమైన రచన. ఒక్కొక్క శతకం ఒక్కొక్క అంకంగా ఉంది. ఇందులో కవి జన్మకాలం చెప్పబడింది. (ఆం.సం.సా-305)

జానకీ రామశతకము

కర్త : చూ. మండపాక కామకవి.

శ్రీరామ స్తుతిరూపమైన శతకరచన, (ఆం.సం.సా-308)

జానకీరామ శతకము

కర్త : వద్దిపర్తి కోనమరాజకవి (కోనరాట్కవి).

సీసపద్య శతకం. శ్రీరామునికి కవి తన స్వంత వృత్తాంతాన్ని నివేదిస్తూ రచించిన కృతి. "జానకీ రామ, రవికుల సార్వభౌమ" అనే మకుటంతో ఉంది. కోర్టువారి ఎదుట ఇతడు శ్రీరాముని స్తుతించినట్లూ తీర్పు ఇతని పక్షంగానే జరిగినట్టూ చెబుతారు. (శ.క చ-806)

జానకీరాఘు శతకము

కర్త : వేల్పూరి వేంకటకవి.

రచనాకాలం : క్రీ. శ. 1850 కి పూర్వం.

రచన మనోహరంగా ఉంది. "రామదనుజ విరామ సంగ్రామభీమ, జానకీరామ, రవికుల సార్వభౌమ" అనే మకుటంతో సీస పద్యాలున్నాయి. (శ. క. చ-593; య. వా. చ.)

జానకీ వర శతకము

రచనాకాలం : క్రీ. శ. 19 వ శతాబ్దం.

కర్త : జయంతి కామేశ్వర కవి.

"జానకీవరా" అనే మకుటంతో ఉన్న వృత్త పద్య శతకం. శైలి మృదు మధురంగా ఉంది. భక్తి రసప్రధానమైన రచన. ఇందులో ముకుందమాల పోలికలున్నాయని పండితాభిప్రాయం. (శ. క. చ-687)

జానకీవల్లభ శతకము

కర్త : చూ. కొటికలపూడి కోదండ రామకవి.

శ్రీ రామస్తవ పరమైన శతకం. "శ్రీ జానకీవల్లభా" అనే మకుటంతో, మత్తేభ వృత్తాలతో ఉంది. (ఆం. సం. సా-305)

జానపద గేయ వాఙ్మయము

దేశ విభాగానికి లేక గ్రామానికి జనపదమని పేరు. దీనికి సంబంధించినది జానపదం. జానపదులలో ప్రచారంలో ఉన్న వాఙ్మయం జానపద వాఙ్మయం. జానపద వాఙ్మయం చాలా మట్టుకు గేయ రూపంలోనే కనిపిస్తున్నది. అట్టి వాఙ్మయ రూపానికే "జానపద గేయ వాఙ్మయం" అని పేరు.

ఇది సాధారణంగా ఆశురచనయై పద వాక్య పునరుక్తులతో కూడి ఉంటుంది. స్థానిక పరిచిత సంఘటనలే ఈ గేయాలలోని "వస్తువు". ఈ గేయాల ప్రచారం కూడా

మౌఖికంగానే జరుగుతుంది. జానపద గేయాలకు కాల, కర్తృత్వ నిర్ణయం చేయడం కష్టం ఒక్కొ పర్యాయం బహుకర్తృకమైన గేయాలు కూడా ఉంటాయి. వ్యావహారిక భాషా ప్రయుక్తమై, సహజ నిరాడంబర శైలితో కూడిన ఈ రచనలు ఎంతో రమ్యంగానూ, జానపద ప్రజల నిష్కల్మష హృదయానికి అత్యంత సమీపంగానూ ఉంటాయి. ఈ కవితయే కొన్ని మార్పులతో, దేశికవితగా ఆవిర్భవించి ఉండవచ్చునని విమర్శకుల అభిప్రాయం

ఆంధ్ర భాష సుస్థిర రూపం దాల్చిన నాటినుండి (క్రీ. శ. 6, 7 శతాబ్దాల కాలం నుండి) ఈ జానపద గేయాల అస్తిత్వం కనిపిస్తుంది. ప్రాఙ్నన్నయ యుగంలోని కొన్ని ప్రాచీన శాసనాలలో ఈ గేయాలు ఉన్నాయి. నన్నెచోడుని కుమార సంభవంలో గౌడు గీతాలు, రోకటిపాటలు, అంకమాలికలు మొ॥ దేశీయ రచనలు పేర్కొనబడ్డాయి. పండితారాధ్య చరిత్రలో తుమ్మెద పదాలు, పర్వతపదాలు, ఆనందపదాలు, వాలేశు పదాలు, వెన్నెలపదాలు, నివాళిపదాలు, రోకటి పదాలు, మొ॥ పేర్కొనబడ్డాయి. శ్రీనాథాదుల రచనల్లో వీటి ప్రసక్తి కనిపిస్తుంది. తాళ్ళపాక అన్నమాచార్యులు తన కాలంలోని జానపద గేయ రీతులనన్నింటినీ తన సంకీర్తనల్లో ప్రయోగించాడు. చిన తిరుమలాచార్యుడు ఏలలు, అర్ధ చంద్రికలు, గొబ్బిళ్ళు, చందమామ పదాలు మొ॥ వాటి లక్షణాలను వివరించాడు. దక్షిణాంధ్ర యుగంలో వెలసిన యక్షగానాలలో జానపద గేయాలవంటి దేశి రచనలు, దరువులు, రగడలు మొ॥వి పెక్కు వ్రాయబడ్డాయి. పాపరాజు, రుద్రకవి, కూర్మనాథకవి వంటి వారు కూడ యక్షగాన రచనలు చేసి జానపద కవితను ఆదరించారు. జానపద గేయాలు కొద్ది మార్పులతో ఆధునిక రచనలలో కూడా చోటు చేసుకొన్నాయి. వస్తు రసాది భేదాలను బట్టి జానపద గేయాలను పౌరాణిక గేయాలు, చారిత్రక గేయాలు, పారమార్థిక గేయాలు మొ॥ విభాగాలుగా విభజించారు.

ఈ వాఙ్మయం మౌఖికంగా సాగిరావడం చేత చాలా భాగం నష్టమైపోయింది. ఇటీవల కొంత వాఙ్మయం ముద్రితమైంది. ఈ జానపద వాఙ్మయాన్ని తొలుత లోకానికి ప్రచారం చేసింది "బ్రౌను" దొర. తరువాత "జె ఎ. బోయల్" కొన్ని ప్రముఖ జానపద గేయాలను సేకరించారు. ఇటీవల ఆధునిక కాలంలో జానపద వాఙ్మయ సేకరణకు, వాటిని ముద్రించి ప్రచారంచేయడానికి కృషి ఎక్కువగా జరుగుతున్నది. (ఆం. వా. చ.)

జాను తెనుగు

ఆంధ్రభాషలో తత్సమ, తద్భవ, దేశ్య, గ్రామ్యాలనే నాలుగు భేదాలను లాక్షణికులు నిర్వచించారు. ఈ నాలుగింటిలోనూ దేశ్యమనే భేదాన్ని ప్రాచీనులు "జాను తెనుగు" అని వ్యవహరించారు. ఈ జాను తెనుగు శబ్దాన్ని తెలుగులో తొలుత ప్రయోగించినవాడు నన్నె చోడుడు. జాను తెనుగు అంటే తత్సమ, తద్భవాలకు భిన్నమైన "దేశి తెనుగు' అని పాల్కురికి సోమన తన "వృషాధిప శతకం"లో స్పష్టంగా నిర్వచించాడు. కాబట్టి సోమన్న "వృషాధిప శతకం"లో చెప్పిన కేవల 'దేశి' తెలుగే "జాను తెనుగు" అని పండితులు అభిప్రాయపడుతున్నారు. (తె. వి. స-6)

జాయప సేనాని

కాలం : క్రీ. శ.13వ శతాబ్దం.

రచనలు : 1. నృత్త రత్నావళి (సం) 2. గీత రత్నావళి (సం) 3. వాద్య రత్నావళి (సం).

ఈయన కాకతి గణపతి దేవుని (1198-1262) గజసాహిణి. అతని బావ మరది అని కూడా అంటారు. ఈతని శ్లోకాలకు లక్ష్యాలుగా రామప్ప గుడిలోని మనోహర నాట్య భంగిమలను శిల్పులు గండరించారట. (ప్రా. ద. భా. చ-న. రా. అ)

జావళీలు

ఇవి ఒకరకమైన శృంగార పదాలు. నాయికా విరహం, నాయకాహ్వానం సర్వ సాధారణంగా వీటిలోని విషయాలు. పూర్వం రాజుల కొలువు కూటాలలో, కామందుల లోగిళలో వివాహ సందర్భాలలో మేజువాణీల (భోగం మేళాల) లోని నట్టువ పాపలు వీనిని అభినయించేవారు.

నాయక రాజుల ఆస్థానాలలోని పదకేళిక, పంతువగ పదాలు జావళీలవలె ఉంటాయి.

జావళీలలో కొన్ని దేవుని పరమైనవి ఉన్నాయి (దశావతార జావళీలు). క్షేత్రయ్య పదాలకు ఇవి ఒజ్జ బంతులు. విప్రలంభ శృంగారం, ప్రియావాహనం, అభి నయోప యోగిత్వం వీటి ప్రధాన ధర్మాలు. విడిగా కూడా వీటికి ప్రచారముంది. యక్ష గానాలలో ఇవి ప్రవేశించాయి. చందన మహారాజు చరిత్రలో ఇవి చాలా ఉన్నాయి. (య. వా. చ-323-324)

జాహ్నవీ మాహాత్మ్యము

కర్త : ఏనుగు లక్ష్మణ కవి.

గంగాదేవి మాహాత్మ్యాన్ని ఈ కావ్యం వర్ణిస్తున్నది. (తె. వి ప-6)

జాళపదాలు

రచనా విశేషం.

ఇవి యక్షగానాలలో ప్రయుక్తాలు. ఇవి అప్పకవీయంలోని కర్ణాట చతుష్పద లక్షణానికి (పంచగణంబులు మూడు రవియు....ప్రాసంబుదాక రెంటిపయినగు విశ్రమ మున"-అ. క. 4-286) సరిపోతాయి. వీటిలోని ప్రాసయతి విశేషం. వీటికి ద్విపదతో సామ్యాన్ని గమనించవచ్చు. బలభద్రదాసి కపోత వాక్యంలో ఇవి ఉన్నాయి. (య. వా. చ-278)

జింకా శంకరయ్య

కాలం క్రీ. శ 18వ శతాబ్దం.

స్థలం : గుంటూరు జిల్లా-పల్నాడు తాలూకా-మిరియాల గ్రామం.

సోమరాజు రామలింగ కవికి, శంకరయ్యకు కలిపి మాన్యాలుండేవట. ఈయన

తన భాగస్వామియైన రామలింగ కవినే ఇబ్బందులు పెడుతుంటే, ఈయనను తిడుతూ రామలింగ కవి ఒక పద్యం చెప్పాడు. (చా.ప. ర.)

**జిజ్ఞాసాదర్పణమ్ (సం)**

కర్త : చూ. తిరుమల బుక్కపట్టణం (ఇమ్మడి) శ్రీనివాసాచార్యులు.

సంస్కృత గ్రంథం. విశిష్టాద్వైత సిద్ధాంతపరమైన రచన.

(ఆం. సం. సా–516)

**జినేంద్ర కళ్యాణాభ్యుదయమ్ (సం)**

నామాంతరం : అర్హత ప్రతిష్ఠ. (ప్రా.ద.దే.చ)

కర్త : చూ. అప్పయార్యుడు.

**జినేంద్ర పురాణము (అలభ్యం)**

కర్త : పద్మకవి (పంపకవి).

కన్నడ కవిగా ఖ్యాతి పొందిన పద్మకవి తెలుగులో ఈ జినేంద్ర పురాణాన్ని రచించినట్లు తెలుస్తున్నది. దీని ప్రసక్తి ప్రబంధ రత్నావళిలో ఉంది.

(వా. చ; వం. సు; క. స–117)

**జీవన్ముక్తి ప్రకరణము**

కర్త : పరశురామ పంతుల లింగమూర్తి.

వేదాంత రచన. ఇదేపేరుతో ఈకవి పుత్రుడు రామమూర్తి ఒక పద్యకావ్యం వ్రాశాడు. కాబట్టి ఇది వచనగ్రంథం కావచ్చు. (ఆరుద్ర–12–19)

**జీవన్ముక్తి వివేకమ్ (సం)**

కర్త : విద్యారణ్యుడు.

ఇది సంస్కృత వేదాంత గ్రంథం. (తె. వి. స–4)

**జీవ ప్రబోధము**

రచనాకాలం : క్రీ. శ. 18వ శతాబ్దం.

కర్త : వాసుదేవయోగి.

నాలుగాశ్వాసాల వేదాంత గ్రంథం. కవిత్వం సలక్షణంగా హృద్యంగా ఉంది.

**జీవాతు వ్యాఖ్య (సం)**

కర్త : కోలచల మల్లినాథ సూరి.

సంస్కృతంలో శ్రీహర్ష మహాకవి వ్రాసిన 'నైషధ కావ్యా'నికిది సంస్కృతంలోనే వ్రాసిన మనోహరమైన వ్యాఖ్య. (తె. వి. స–4)

**జీవానందమ్ (సం)**

కర్త : వేదకవి.

ఏడు అంకాల నాటకం. వైద్య, వేదాంతశాస్త్రాల విలువలు ఇందులో

చెప్పబడ్డాయి. ఇది సాంకేతిక నాటకంగా ప్రసిద్ధం. (తె. వి. స-6-241)

జూపల్లి కొండలరాయ ప్రభువు

కాలం : క్రీ.శ. 15వ శతాబ్దానికి పూర్వుడు.
స్థలం : నైజాం మండలం.

పర్తియాల సంస్థానాధీశుడు. కవి, పండిత పోషకుడు. 'ఇతిహాస సంగ్రహము' అనే కావ్యాన్ని అంకితం పొందాడు. (క. త-11-144)

జూపల్లి ధర్మారాయడు

ఈయన వితరణ శీలి. కేవలకవులను సత్కరించక, విద్వాంసులు, విద్వత్కవులనే సత్కరించే వాడట. ఈరపరాజు, సూరపరాజు అనే భట్టుకవులలో ఈరపరాజు ధర్మారాయుని దర్శిస్తే సత్కరించలేదట. కారణం అతని కవిత్వం ధర్మారాయునికి నచ్చకపోవడమే.

ఈయన ధనాధిక్యాన్ని తెలియజేసే చాటువు ఒకటి కనిపిస్తున్నది. (చా.ప.ర.)

జూపల్లి రాగన

కాలం : క్రీ. శ. 15వ శతాబ్దం.
స్థలం : పర్తియాల సంస్థానం (నైజాం మండలం).
రచన : పేరు తెలియరాలేదు.
అంకితం : పర్తియాల శ్రీ రాఘవునకు.

ఇతడు సంస్థానాధీశుల కుటుంబానికి చెందినవాడు. కవి పండిత పోషకుడు. అగ్రహార దానాలు చేశాడట. స్వయంగా కవి. ఒక గ్రంథాన్ని ఆంధ్రీకరించి తన యిష్టదైవానికి అంకితం ఇచ్చాడట. గ్రంథం పేరున్నభాగం శిథిలమైంది. (క.త-11-145)

జూపల్లి వేంకటాద్రి

కాలం : క్రీ. శ. 17వ శతాబ్ది ప్రథమ పాదం.

పర్తియాల సంస్థానాధిపతి. సాహిత్య పోషకుడు. ఎలకూచి బాలసరస్వతి చేత చంద్రికా పరిణయం ప్రబంధంగా వ్రాయించి సరస్వతీదేవికి అంకితం ఇప్పించాడు. ఈ వంశీయులందరూ వివిధశాస్త్ర కవితా సంగీత రహస్య విదులట. చంద్రికా పరిణయం ప్రథమాశ్వాసంలో జూపల్లి వారి వంశ చరిత్ర విపులంగా ఉంది. (ఆరుద్ర-10-35)

జూలకంటి నారాయణ కవి

కాలం : క్రీ. శ. 1775 ప్రాంతం కావచ్చు.
స్థలం : జూలకల్లు.
రచన : కొమ్మలపాటి రామాయణము (సుందర కాండము).

గుర్వన పుత్రుడు. రామాయణాన్ని గానయోగ్యంగా రచించాడు. రచన చక్కనిది. (య.వా.చ.)

## జూలూరి అప్పయ్యశాస్త్రి

కాలం : క్రీ.శ. 19వ శతాబ్ది పూర్వార్థం.

స్థలం : చెన్నపట్టణ ప్రాంతం.

రచనలు : 1. శ్రీనివాస తారావళి 2, రామ పంచాశత్కందములు 3. యదువంశ భూషణ శతకము 4. మనుచరిత్ర (ప్రతి పద టీక) 5. వసుచరిత్ర (ప్రతి పద టీక) 6 కవి కర్ణ రసాయనము (టీక) 7. విజయ విలాసము (టీక).

ఈయన గుంటూరు సీమలో విజాముపేట వాస్తవ్యుడు. పాపన్న, చెల్లమ్మల పుత్రుడు. ఈయన కావ్యరచనతోపాటు వ్యాఖ్యానాలు వ్రాశాడు. బ్రౌన్ దొర పోషించిన తెలుగు పండితులలో మిక్కిలి ప్రసిద్ధుడు. బ్రౌన్ దొర దగ్గర 20 సంవత్సరాలు పనిచేశాడు. ఈయన వ్యాఖ్యానాలన్నీ సుబోధకమైన వ్యావహారిక భాషలో ఉన్నాయి. (శ. క. చ-524; తె. సా. విమర్శ-91)

## జేగంట భాగవతులు

వీరు పూర్వకాలం నుంచీ ఆంధ్రదేశంలో సంచారం చేస్తుండే భాగవతులు. "ఎందుకయ్యా ఉంచినావు బందిఖానాలో రామయ్య తండ్రీ" అని రామదాసు బందిఖానా విశేషాన్ని పాటరూపంలో వల్లిస్తూ తెలుగుదేశంలో తిరుగుతూ ఉండేవారు.

వీరు ఒకచేతిలో పెద్ద జేగంట, రెండోచేతిలో రామలక్ష్మణ విగ్రహాలతో కూడిన ఒక దీపపు స్తంభాన్ని పట్టుకొని, చంకలో నెమలి పింఛం, కాళ్ళకు గజ్జెలు కట్టి నృత్యం చేస్తూ, పాటపాడుతూ, ఒక చేతిలో జేగంట వాయిస్తూ - ఇంటింటిముందూ స్తంభాన్ని ఉంచి, స్తంభం చుట్టూ కలియ దిరుగుతూ - నృత్యంతో, పాటతో, ప్రేక్షకులను ముగ్ధలను చేస్తూ - యాచిస్తూ ఉంటారు. జేగంటవారినృత్యం భక్తి భావపూరితంగా ఉంటుంది. (నా.ర.చ-173-174)

## జేతపూడి సుందరరాయడు

కాలం : క్రీ. శ. 19వ శతాబ్దం.

రచన : నీలగిరి యాత్ర.

కోలా శేషాచల కవి రచనను చూసిన వెనుక ఇతడు కూడా తన యాత్రా విశేషాలను పుస్తక రూపంలో ప్రచురించాడు.

## జైతరాజు ముమ్మయ్య

కాలం : క్రీ. శ. 1590కి పూర్వం.

రచన : విష్ణుకథానిధానము (అలభ్యం).

విశిష్టత : ఈయన కృతి చమత్కృతికి ఆటపట్టుగా ఉంటుంది. 43 పద్యాలు సంకలన కర్తలు ఉదాహరించారు. పెదపాటి జగ్గన్న ప్రబంధ రత్నాకరంలో, పూర్వ సంకలన కర్త ఉదాహరణ పద్యాలలో ఈయన పద్యాలు కనిపిస్తాయి. కావ్యం

పేరునుబట్టి విష్ణుకథలుంటాయనుకొన్నా, కవికి హరిహర రూపం అంటే చాలా యిష్టం. మూడు పద్యాలలో శివతాండవాన్ని చెప్పాడు.

తత్సమ పదాలతో సుదీర్ఘ సమాసాలలో కవిత్వం ఎంత బాగా చెబుతాడో, అంత బాగా చిన్న చిన్న మాటలలో సైతం వ్రాసే నేర్పున్న కవి. పూర్వ కవులంటే ఈయనకు భక్తి భావం. వర్తమాన కవులెవరికీ తీసిపోరనే విశ్వాసమున్నవాడు. ముమ్మయ్య పద్యాలన్నీ ముత్యాలే ! (ఆరుద్ర-9)

## జైమిని భారతము

కర్త : పిల్లలమర్రి పినవీరన.

కృతి భర్త : సాళువగుండ నరసింహరాయలు.

ఎనిమిది ఆశ్వాసాల గ్రంథం. సంస్కృతంలోని జైమిని భారతాన్ని అనుసరించి వ్రాయబడింది. జైమిని అనే మహారాష్ట్ర దేశీయుడు బహుశ క్రీ. శ. 12 శతాబ్దిలో భారతంలోని అశ్వమేధ పర్వాన్ని క్రొత్తగా వ్రాశాడు. వ్యాసభారతంలో లేని బోలెడు కథలను జైమిని వ్రాశాడు. ఇందులో కూడా లేనివి కల్పించి పినవీర కవి రచించాడు. ఉద్దాలకుడు, చండిక కథలో అహల్య రాయిగా మారినట్లు, చండిక రాయికావటం, యజ్ఞాశ్వంవల్ల శాపవిమోచన కావటం ఉంది. పంచమాశ్వాసంలో ప్రమీలార్జునీయం, కుశ లవులు రాముని యజ్ఞాశ్వాన్ని పట్టుకొనే కథ, షష్ఠాశ్వాసంలో అష్టమాశ్వాసంలో చంద్రహాస కథ ఉన్నాయి. మిగిలిన భాగాలన్నీ అర్జునుని యుద్ధాలు, యజ్ఞాశ్వాన్ని బంధించి శత్రువులు గట్టి వ్యూహాల మధ్య పెడితే అర్జునుడు జయించటం, విడిపించటం మొ॥ ఘట్టాలున్నాయి.

ఈ కావ్యంలో సున్నితమైన హాస్యం, మోటు సరసం కూడా ఉంది. కవికి తెలిసిన రాజనీతి, యుద్ధతంత్రాలు, శ్యేనవ్యూహం, గృధ్రవ్యూహం, పద్మవ్యూహం మొ॥ వాటి ప్రస్తావన వుంది. జిగేలుమనిపించే తెలుగు నుడికారపు మెరుపులు ఈ కావ్యంలో కొల్లలు. వ్యాకరణ విరుద్ధ ప్రయోగాలు, చుట్టుక, పట్టుక, తోలుక, ఆలందుక, ఎత్తుక అనే ప్రయోగాలు ఉన్నాయి. (ఆరుద్ర-6)

## జైమిని భారతము

కర్త : సముఖము వేంకటకృష్ణప్ప నాయకుడు.

అంకితం : విజయరంగ చొక్కనాథునికి (1706-32).

వచన గ్రంథం. అయిదాశ్వాసాలున్నాయి. అధ్యాయక్రమంలో గద్యలు వ్రాయబడ్డాయి.

సంస్కృతంలో, జైమిని భారతం అని పిలువబడే అశ్వమేధపర్వం, తెలుగులో పిల్లలమర్రి పినవీరభద్రుడు వ్రాసిన జైమిని భారతం ఈ రచనకు ఆధారాలు.

కవి పినవీరభద్రుని సామెతలు, జాతీయాలు, యథాతథంగా వాడుకొన్నాడు. పద్య కావ్యాలలోవలె అవతారిక, ఆశ్వాసాంత పద్యాలు, గద్య మొ॥ నియమాలు పాటింపబడ్డాయి.

ఇందులోని స్త్రీ మండల వృత్తాంతంలోని కొంతభాగం దీనితో ముద్రించకుండా అహల్యా సంక్రందనం గ్రంథంలో అనుబంధంగా ముద్రితం. పాత్రలకు సర్వనామాలు వాడకుండా పేర్లేవాడటం యమకాది అలంకార ప్రాచుర్యం ఈ రచనలో కనిపిస్తాయి.

## జైమినీయ న్యాయమాలా విస్తరమ్ (సం)

కర్త : విద్యారణ్యుడు.

ఇది మీమాంస గ్రంథం. దీనిని రాజు (హరిహరుడో-బుక్కరాయలో) కోరికపై తానే వ్యాఖ్యానించానని కవి చెప్పాడు. (తె.వి.స-4)

## జోల పాటలు

చూ : లాలిపాటలు.

ఇవి తెలుగుదేశంలో చిర ప్రసిద్ధమైన పాటలు. దీనిని ఉయ్యాలపాట అనికూడా అంటారు. జోల శబ్దం సంస్కృత "దోలా" శబ్దభవమని ఒక అభిప్రాయం. 'జో' అనే ఊతమాటకు బహువచన రూపమని మరొక అభిప్రాయం. లాలిపాట వలె ఇది కేవలం ఊయల పాట కానక్కరలేదు. పాపలు ఎక్కడున్నప్పటికీ, వారిని నిద్రపుచ్చేటప్పుడు పాడబడటమే దీని ముఖ్యలక్షణము. జోకొడుతూ "నిదురపో" అని వీపుతట్టటం దీని అర్థం. ఇవి యక్షగానాలలో ప్రయుక్తాలు.

జోలపాటలు సర్వసాధారణంగా జంపెగతిలో నడుస్తాయి. గణపతిరెడ్డి గోపాల విలాసంలో ఈ పాటలున్నాయి. (య.వా.చ-324)

## జ్ఞానకురవంజి

కర్త : జందాళ నంజప్ప.

యక్షగానం. ఈ జ్ఞానకురవంజి స్త్రీ కథ, పురుష కథ అని ద్విధావిభక్తము. మొదటి భాగంలో ఎవరో మునికాంతకు ముక్తికాంత ఎఱుకతయై అద్వైత తత్వాన్ని గూర్చి ఎఱుక చెప్పడం; అపరార్థంలో పరమాత్మ అయిన సింగడు సింగిని వెదకుతూ రావడం - వారి సంవాదం ఉన్నాయి. రచన అంత ప్రశస్తం కాదు. ఇది క్రీ. శ. 1867లో ముద్రితమైంది. రాజమండ్రి గౌతమీ గ్రంథాలయంలో ఒక ప్రతి ఉంది. (య.వా.చ-108)

## జ్ఞాన చింతామణి (అలభ్యం)

కర్త : చూ. శ్రీకృష్ణదేవరాయలు.

సంస్కృత గ్రంథం కావచ్చును.

రాయలు దీనిని వ్రాసినట్లు ఆముక్తమాల్యదలో చెప్పుకొన్నాడు. (తె.వి.స-6)

## జ్ఞానరత్న ప్రకాశిక

కర్త : చూ. తిరుమల బుక్కపట్టణం (ఇమ్మడి) శ్రీనివాసాచార్యులు.

సంస్కృత రచన. విశిష్టాద్వైతపరమైన గ్రంథం. (ఆం.సం.సా-516)

## జ్ఞాన వాసిష్ఠ రామాయణము

కవయిత్రి : తరిగొండ వెంకమాంబ.

ఇది ద్విపద కావ్యం. మతికి సింగన దీనిని పద్యకావ్యంగా వ్రాశాడు. కవయిత్రి తాను తరించటానికి ఈ కావ్యం వ్రాశానని కృత్యాదిలో చెప్పింది. దీనిలో వైరాగ్యాన్ని, ఆత్మానాత్మ వివేకాన్ని బోధించే కథలెన్నో ఉన్నాయి. కఠిన వేదాంత భావాలు సుబోధకంగా దీనిలో ఉన్నాయి. ఔచిత్యంగాను, భావమార్దవంగాను ఈ కావ్యముంది.

(ఆ.సా.చ స-236)

## జ్ఞాన సూర్యోదయము

కర్త : ఢిల్లీ వేంకటకవి.

అంకితం : ముమ్మడి మల్లన్నకు.

ప్రత్యేకత : ఇది రామాయణంలో సీతాదేవి కోరికపై శ్రీరాముడు బోధించిన తత్త్వవిషయాలున్న ద్విపదకావ్యం. క్లిష్టమైన విషయాలు బాగా సరళమైన పద్ధతిలో చెప్పబడ్డాయి. దీనిప్రతి కాకినాడ ఆంధ్ర సాహిత్య పరిషత్తులో ఉంది. ఈ కృతిలోని కొంత భాగాన్ని పరిషత్తువారు ప్రచురించారు. (ఆ.ప.ద్ర-8-273)

## జ్ఞానోపదేశాల సంక్షేపము

రచనాకాలం : క్రీ. శ. 1746-47 ప్రాంతం.

కర్త : బెంజమిన్ షూల్జి.

క్రైస్తవమత సంబంధమైన రచన. వ్యావహారిక భాషలో ఉంది.

## జ్యోతి రామయ్య

కాలం : క్రీ. శ. 1815 ప్రాంతం.

రచన : పారిజాత నాటకము.

సుబ్బన్న కుమారుడు. శ్రీధరమల్లె వేంకటస్వామి తన బ్రహ్మోత్తరఖండంలో ఇతన్ని పేర్కొన్నాడు. అయితే పారిజాత నాటకకర్త అతడేనన్న విషయం చెప్పలేదు. ఇతడు శ్రీధరమల్లె వేంకటస్వామిని ప్రోత్సహించి రచనలు చేయించాడట. (య.వా.చ.)

## జ్యోతిష దర్పణమ్ (సం)

కర్త : కంచం యల్లయార్యుడు.

ఈ పుస్తకం వ్రాసినట్లు కవి తన స్మృతికదంబంలో చెప్పాడు.

(తె.వి.స-4)

## జ్యోతిష రత్నాకరము

రచనాకాలం : క్రీ. శ. 1700 ప్రాంతం.

కర్త : చరిగొండ హొన్నయ్య.

పద్యకావ్యం. జ్యోతిషశాస్త్ర విషయాలను వివరిస్తున్న గ్రంథం.

ఝుంఝూ మారుతమ్ (సం)

నామాంతరం : గదాధరీయ ఖండనమ్.
కర్త : కిరీటి వేంకటాచార్యులు (చూ). (ఆం. సం. సా.)

ఝుంఝూమారుతము సుబ్బకవి

రచన : క్రీ. శ. 1850 రచన.
రచన : శ్రీ సూర్యనారాయణ శతకము.

టిప్పణము

కావ్య పరిభాష. టీకకు వివరణ. కఠినంగా ఉన్న కావ్య భాగాలకు మాత్రమే ఉండే వివరణం. చూ.టీక. (బ్రౌన్-తెలుగు-ఇంగ్లీషు)

టీక

కావ్య పరిభాష. మూల గ్రంథానికి అర్థాన్ని సమగ్రంగా వివరించేది టీక. "టీకా నిరంతర వ్యాఖ్యా" అని యాకరము. ఇందులో ప్రతిపదార్థం చెప్పడం జరుగుతుంది. టీకా సహితమైన కావ్యాలు తెలుగులో చాలా ఉన్నాయి.

సూరన్న రాఘవ పాండవీయానికి ముద్దరాజు పెదరామన్న టీక వ్రాశాడు. అట్లే నెల్లూరి వీరరాఘవ కవి వ్రాసిన యాదవరాఘవ పాండవీయానికి సరిపెల్ల విశ్వనాథ శాస్త్రి టీక వ్రాశాడు. సురభి మాధవరాయల చంద్రికా పరిణయానికి ముగ్గురు పండితులు వేర్వేరుగా టీకా తాత్పర్యాలు వ్రాశారు. కావ్యంలోని మూల భావాన్ని పఠితలకు సుబోధకం చేయడమే టీక ప్రయోజనం. ప్రాచీన కావ్యాలు చాలా వరకు టీకా తాత్పర్య సహితంగా ముద్రితాలు.

టుప్టీక

కావ్య పరిభాష. లఘుటిప్పణం అని అర్థం. అంటే స్వల్పమైన టీక (వివరణం). టుప్టీక అనేది సంస్కృతంలో కనిపిస్తున్నది. జైమిని మహర్షి రచించిన పూర్వ మీమాంసా సూత్రాలకు శబరస్వామి భాష్యం వ్రాశాడట. దానికి కుమారిల భట్టు గొప్ప వ్యాఖ్యానం రచించాడు. ఈ వ్యాఖ్యానం శ్లోక వార్తికము, తంత్రవార్తికము, టుప్టీక అని మూడు భాగాలుగా ఉంది.

ఇటీవలి కాలంలో వ్యాఖ్యానాలకు టుప్టీకలనే వ్యవహారంలేదు. టుప్టీక పంజిక కంటె చిన్నది. పంజిక అంటే విపులమైన వివరణం. (తె. వి. స-7-360)

టెక్కలి

కళింగ సీమలోని పురాతన సంస్థానాలలో ఇది ఒకటి. దీని పాలకులు కాదంబ రాజ వంశీయులట. క్రీ. శ. 15 వ శతాబ్దం నాటి పురుషోత్తమదేవుని సేనానియైన "గోపాల దేవుడు" మొదట సామంతుడుగా ఉంటూ, తరువాత స్వతంత్రుడై "టెక్కలి"

పాలకుడైనాడట. ఈ పాలకులకు "జగద్దేవ" బిరుదం ఉంది. నరసింహ ఖేడి, రఘునాథ జగద్దేవు, రామకృష్ణ జగద్దేవు మొ॥ వారు ఈ సంస్థాన పాలకులలో ఆద్యులు.

ఈ సంస్థాన పాలకులలో లక్ష్మీనారాయణ హరిచందన జగద్దేవుకు "విద్యా వాచస్పతి", "పురాతత్త్వ విశారద" బిరుదాలు ఉన్నాయి. ఇతని కుమారుడైన "గోపీనాథ హరిచందన జగద్దేవు" ప్రాచీన శాసన పరిశోధకుడుగా, సంస్కృతాంధ్ర భాషాభిమానిగా ప్రసిద్ధి చెందాడు. ఆంధ్రేతిహాస పరిశోధక మండలికి ఇతడు రాజ పోషకుడు.
(ఆం. సం. సా–547, 548)

**ఉేకుమళ్ళ**

గ్రామ నామం. ఇదే కొందరికి ఇంటి పేరుగా వచ్చింది. ఉదా :– ఉేకుమళ్ళ రంగశాయి (ద్విపద భాగవత కర్త).

**ఉేకుమళ్ళ రంగశాయి**

కాలం : క్రీ. శ. 17 వ శతాబ్దం.
స్థలం : ధర్మపురి (నైజాము మండలం).
రచనలు : 1. జానకీ పరిణయ యక్షగానం (అలభ్యం) 2. తిరుపళ్ళూరు వీర రాఘవ శతకము (అలభ్యం) 3. వాణీవిలాస వనమాలిక 4. ద్విపద భాగవతము 5. కృష్ణరాజ దండకము (అలభ్యం).
సమకాలికులు : కంకంటి పాపరాజు, మహంకాళి వెంకయ్య, పుష్పగిరి తిమ్మన.
గురువు : రామభద్రయ్య.

ఇతని ఇంటి పేరు ఉేకుమేళ అని గద్యలో ఉంది.

ఇతని రచనలలో చాలా వరకు అలభ్యాలు. వాణీవిలాస వనమాలికను మహంకాళి వెంకయ్య తోడ్పాటుతోను ద్విపద భాగవతాన్ని పుష్పగిరి తిమ్మన తోడ్పాటుతోను రచించాడట. ఇతని కాలం 1575–1632 ప్రాంతమని పండితాభిప్రాయం.
(క. త–12–75.)

**డప్పుల కోలాట నృత్యము**

నామాంతరాలు : 1. తప్పెట్ల కోలాట నృత్యం. 2. కనక తప్పెట్ల కోలాట నృత్యం.

ఇది ప్రాచీన నృత్య విశేషం. డప్పుల వాయిద్యాన్ని తప్పెట్ల వాయిద్యమని కూడా అంటారు. దీనిని తెలుగు దేశంలో నేటి నిమ్నజాతులనబడే మాదిగవారు వాయిస్తూ ఉంటారు. వివాహాలకు, జాతర్లకు, పీరుల పూజకు డప్పుల వాయిద్యాన్ని ఎక్కువగా ఉపయోగిస్తారు. ఈ నాటికీ ప్రతి పల్లెలో – ఒక కార్యక్రమాన్ని గాని, ఒక విశేషాన్ని గాని ప్రజలందరికీ తెలియజెప్పాలంటే డప్పుతో ఊరంతా దండోరా వేయిస్తారు. ఈ డప్పు గుండ్రంగాను, కణకణమని ధ్వని వచ్చే విధంగాను ఉంటుంది.

ఈ తప్పెట్ల వాయిద్యానికి అనుగుణంగా కోలాటపు పాటలను పాడుతూ చక్కగా నాట్యం చేయటాన్ని డప్పుల కోలాట నృత్యమంటారు.

"నీలాలారా! నిమ్మాలారా! నీళ్ళకుపోయే కన్యాలారా!" అనే జానపద గేయాన్ని ఆలపిస్తూ - డప్పులను వాయిస్తూ, కోలాటం అద్భుతంగా వేస్తారు. మామూలు కోలాటంలో అందరూ చిరుతలు ఉపయోగిస్తే, ఈ కోలాట నృత్యంలో అందరూ చంకల్లో డప్పులను ధరిస్తారు. డప్పులు మ్రోగించే పుల్లలతోనే - మధ్యమధ్యలో ఒకరితో ఒకరు కోలాటంవేస్తూ దరువు చెడకుండా-ఎగిరెగిరి గజ్జెల కాళ్ళతో నృత్యంచేస్తూ కోలాటం వేస్తారు కోలాట నృత్యం ఆశ్చర్యకరంగా ఉంది, ఉత్తేజాన్ని కలగజేస్తుంది.

కొన్నితరాలనుంచి ఈ నృత్యంలో ఆరితేరినవారు తెలుగు దేశంలో ఉన్నారు.

(నా.ర.చ-279-280)

## డబ్బీరు నరస కవి

కాలం : తెలియదు.

స్థలం : నెల్లూరు జిల్లా కావచ్చును.

రచన : కలువాయి శతకము.

కవిని గూర్చిన వివరాలు తెలియరాలేదు. కలువాయిలోని కృష్ణుని సంబోధిస్తూ "చెలువ నీవేగి కలువాయి చిన్నికృష్ణ, దోడుకొని రాగదే తోయజాక్షి" అనే మకుటంతో శృంగారమయంగా శతకం చెప్పాడు. విశాఖమండలంలో కూడా డబ్బీరు వారున్నారట.

(శ.క.చ. 714)

## డిండిమ కవి

కాలం : క్రీ. శ. 16వ శతాబ్దం (అచ్యుత దేవరాయల రాజ్యారంభకాలం.)

రచనలు : 1. సాళువాభ్యుదయమ్ (సంస్కృతం) 2. అచ్యుత రాయాభ్యుదయమ్ (సంస్కృతం) 3. భాగవత చంపువు-(సంస్కృతం)

పోషకుడు, కృతి భర్త : అచ్యుతదేవరాయలు.

విశిష్టత : అచ్యుత దేవరాయల ఆస్థానంలోని కవి. డిండిమ భట్టు బిరుదాంచితుడు. అరుణ గిరినాథుని కుమారుడు ఈ రాజనాథ డిండిముడు. ఈకవి తండ్రియైన డిండిమభట్టునే శ్రీనాథుడు ఓడించి కంచుఢక్కను పగలగొట్టి కనకాభిషేకం చేయించుకొన్నాడు. సంస్కృతాంధ్ర భాషలలో మంచి పండితుడు. ఇతని సాళువాభ్యుదయం సాళువ వంశీయుల చరిత్రను, అచ్యుతరాయాభ్యుదయం ఆ రాజు దిగ్విజయ యాత్రలను వర్ణిస్తున్నది.

(వి.న.చ-నూ.పే.రా)

## డిండిమ ప్రహసనము

నామాంతరం : 1. శృంగార సీస పద్య శతకము (చూ).

2. లోకోత్తర స్వారస్యయుత శతకము. (ద.దే.వా-449)

## డిండిమ భట్టు I

కాలం : క్రీ. శ. 15వ శతాబ్ది.

నామాంతరం : అభిరాముడు. ప్రౌఢ దేవరాయల ఆస్థానం. వంశపారంపర్యంగా వచ్చిన బిరుదం డిండిమభట్టు.

స్థలం : విజయనగరం,

విజయనగర ఆస్థానంలో ఈ బిరుదంతో అయిదుగురున్నారు. వీరి చరిత్ర "విభాగ రత్నమాల" అనే గ్రంథంలో ఉంది. వీరిది అసలు ఉత్తర ఆర్కాటు జిల్లాలోని మెట్టు పది అగ్రహారం. ఆ గ్రామంలో రాజనాథ విగ్రహం ప్రతిష్ఠితం కావటంవల్ల దానికి రాజనాథపురమని పేరు వచ్చిందట. అక్కడ 70 పండిత కుటుంబాలుండేవట. ఆ వంశంలోని అరుణ గిరినాథుడనే బ్రాహ్మణుడు ప్రౌఢదేవరాయలను అగ్రహారం అడిగితే రాయలు తిరస్కరించాడట. అప్పుడు ఈ పండితుడు ఢిల్లీపోయి తన వైదుష్యంతో సుల్తాన్‌ను మెప్పించి, అతని దగ్గర నుంచి ప్రౌఢ దేవరాయల వద్దకు ఒక రాజ శాసనం తెచ్చిచూపి అగ్రహారాన్ని పొందాడట. అప్పటి నుంచి ఆ వంశంవారు విజయనగర రాజుల కొలువులో పండితులుగా, కవులుగా ఉన్నారు. అభిరాముడు శ్రీ కంఠాగమములో పండితుడై డిండిమ ప్రభువనే పేర ప్రఖ్యాతుడయ్యాడు. (తె.వి.స-696)

## డిండిమ భట్టు II

కాలం : క్రీ. శ. 14 శతాబ్ది చివర 15 శతాబ్ది మొదట.

రచన : యోగానంద ప్రహసనము.

స్థలం : విజయనగరం.

పోషణ : ప్రౌఢదేవరాయలు.

ఈయన అసలు పేరు అరుణగిరి నాథుడు. మొదటి రాజనాథుని కుమారుడు. మొదటి డిండిమభట్టుకు మనుమడు. ఇతని యశస్సు డిండిమ వాయిద్యధ్వనిచే ఘోషింప బడుతుండటం వల్ల ఈయనకు డిండిమ కవి సార్వభౌముడనే బిరుదు కలిగింది.

సాహిత్య శాస్త్రవిషయిక వివాదాలలో వీరు ఎవరి చేతిలోనైనా ఓడిపోతే, ఆ గెలిచిన వారికి "కవి సార్వభౌమ" బిరుదునిచ్చి సత్కరించేది నియమం. శ్రీనాథుడు ప్రౌఢ దేవరాయల ఆస్థానంలో ఈ రెండో డిండిమభట్టును వివాదంలో ఓడించి, కంచుఢక్క పగులగొట్టి, "కవి సార్వభౌమ" బిరుదు స్వీకరించి, రాయలచేత కనకాభిషేకం చేయించు కొన్నాడు. (తె.వి.స-696)

## డిండిమ భట్టు III

చూ: డిండిమ కవి

## డిండిమ భట్టు IV

కాలం : క్రీ. శ. 15వ శతాబ్ది.

స్వస్థలం : వారేంద్ర అగ్రహారం.

స్థలం : విజయనగరము.

బిరుదులు : డిండిమ కవి సార్వభౌముడు, కుమార డిండిముడు, కవిరాజరాజు.

రచన : వీరభద్ర విజయము (డిమము)

వీరనరసింహ కృష్ణదేవరాయల ఆస్థానంలోని వాడు. ఈయన రెండో రాజనాథుని కుమారుడు. రెండో అరుణగిరి నాథుడు. ఈయనకు చాలా భాషలలో పాండిత్య మున్నదట. (తె.వి స_696)

**డిండిమ భట్టు V**

కాలం : క్రీ. శ. 15వ శతాబ్ది.

స్థలం : విజయనగరము.

బిరుదు : డిండిమ కవిసార్వభౌముడు

రచనలు : 1. భాగవతచంపువు (సం) 2. అచ్యుత రాయాభ్యుదయమ్ (సం).

అసలుపేరు రాజనాధుడు. అచ్యుతరాయల ఆస్థానంలోని వాడు. ఈయన నాలుగో డిండిమ భట్టు కుమారుడు. మంచి పండితుడు. పై రెండు రచనలు డిండిమకవి (డిండిమ భట్టు III) రాసినవని కొందరు భావిస్తున్నారు. (తె.వి.స_696)

**డిండిమము**

మధురగతిలో నడిచే పదం. "డిండిమము" అంటే 'రాయడి గిడి గిడి' అనే ఒక వాద్య విశేషం. ఈ పదంపై వాద్య సంబంధంగా ప్రవర్తిల్లే పదం కావచ్చునేమో అని పండితులంటారు. వేంకపతి కాళీయమర్దనంలో, రంగాజమ్మ మన్నారుదాస విలాసంలో ఇది ప్రయుక్తం. (య.వా,చ_325)

**డిమము**

ఇది దశవిధరూపకాలలో ఒకటి. డిమ సంఘాతం వలె నాయక సంఘాతం ఉండటంవల్ల దీనికీపేరు వచ్చింది. దీనిలోని వస్తువు ప్రఖ్యాతమై ఉండాలి దేవ కిన్నర గంధర్వ యక్ష రాక్షస, భుజగ భూత ప్రేత పిశాచాదులు - పదునార్గురు ధీరోద్ధత నాయకులు ఉండవలె. అవమర్శ సంధిగాక మిగిలిన నాలుగు సంధులు, నాలుగు అంకాలు, కైశికీ వృత్తిగాక మిగిలిన మూడు వృత్తులు విధించవచ్చు. దీనిలో రౌద్రం ప్రధాన రసంగా, హాస్య శృంగారాలు కాక మిగిలినవి అంగరసాలుగా ఉండవచ్చు. దీనిలో మాయ, ఇంద్రజాలము, క్రోధము, అద్భుతం మొ॥ చేష్టలను, చంద్రసూర్యోప రాగోల్కాదులను వర్ణించవచ్చు. ప్రస్తావనాపాత్ర ప్రవేశాది నాట్య ధర్మాలలో ఇది నాటక తుల్యము.

(తె.వి.స_6)

**డొంకా గోపినాథుడు**

నామాంతరం : గోపీనాథకవి (చూ).

**డోరా**

హిందూస్తానీ సంగీత సంప్రదాయానికి చెందిన గీత విశేషం. ఇది ఒక పార్శీ

మట్టు. క్రి. శ. 19-20 శతాబ్దంనాటి హరికథలలో తరచుగా, యక్షగానాలలో విరళంగా కథాఖ్యాన సందర్భంలో ఇది కనిపిస్తుంది. కథాఖ్యానానికి - యక్షగానాలలో ద్విపద, జంగం కథలలో రగడ, హరికథలలో దోరాలు ఉపయుక్తం కావటం పరిపాటి. ద్రుతగతి దీని స్వభావం. ఇదిగాక, ఇట్టివే అయిన దోరాగజల్, దొహరా దరువు అనేవి యక్షగానాలలో ప్రయుక్తం. మొదటిది "కపట వేశ్యా నాటకం"లోను, రెండోది "సీతా స్వయం వరం" యక్షగానంలోను ఉన్నాయి. (య.వా.చ-325)

## ఢిల్లీ వేంకట కవి

కాలం : క్రీ. శ. 16వ శతాబ్దం.
రచన : జ్ఞాన సూర్యోదయము (ద్విపద).
అంకితం : ముమ్మడి మల్లన్నకు (గుంటూరు తాలూకా కొప్పురావూరు)

గోవిందయ్య, నరసమ్మల పౌత్రుడు. ఈయన ముమ్మడి మల్లన్న శిష్యుడు. రామాయణంలో సీతాదేవి ప్రార్థిస్తే శ్రీరాముడు బోధించిన విషయాలను జ్ఞానసూర్యోదయం పేర ద్విపద కావ్యంగా చెప్పాడు. వేదాంతమైనా సరళంగా చెప్పగల ప్రతిభ ఈ కవికి ఉంది. తన కావ్యాన్ని గురువుకే అంకితం చేశాడు. (అరుద్ర-8)

## ణత్వదర్పణమ్

కర్త : చూ. తిరుమల బుక్క పట్టణం (ఇమ్మడి) శ్రీనివాసాచార్యులు.

సంస్కృత రచన. సురపురం సంస్థానాధీశ్వరుల పోషణలో వ్రాయబడింది. (అం.సం.సా-516)

## తంగం (తంగపాట్టు)

ఇది ఒక తమిళగీత ప్రబంధ విశేషం. దైవస్తుతి పరంగా ఉంటుంది. ఇది కురుచేటి సుబ్బరాయ కవి గౌరీశంకర విలాస యక్షగానంలో ఉంది. తమిళ సాహిత్య ప్రభావంతో తెలుగులో ప్రవేశించిన రచనా విశేషం. (య. వా. చ-326)

## తంజాపురము (తంజావూరు)

పూర్వపు చోళదేశంలోని ప్రసిద్ధమైన నగరం. ప్రస్తుత తమిళనాడు రాష్ట్రంలో ఉంది. కావేరీనది పాయయైన మణిముక్త అనే పేరుగల వడవారు నది ఈ నగరానికి సుమారు మైలుదూరంలో ఉంది. ఇది 'తంజ' అనే రాక్షసిని శివుడు సంహరించిన స్థానమని స్థల మాహాత్మ్య గ్రంథాలు తెలుపుతున్నవి. ఇక్కడ తంజేశ్వర స్వామికి ఒక ఆలయం ఉంది.

ఈ నగరం 10, 11 శతాబ్దాలలో చోళ మండలానికి తాత్కాలిక రాజధానిగా ఉండేది. ఆ తరువాత నుండి చోళులకు - తెలుగు నాయకరాజులకు రాజధానిగా ఉంది. ఇక్కడ వెలసిన తెలుగు వాఙ్మయం, తెలుగు సాహిత్యంలో, 'దక్షిణాంధ్రయుగ వాఙ్మయం'గా ప్రసిద్ధి పొందింది. దేశిసారస్వతం ఇక్కడ ఇతోధికంగా వెలువడింది. రఘునాథ నాయకుడు, విజయరాఘవ నాయకుడు వంటి రాజకవులూ, చేమకూర వేంకట

కవి, రంగాజమ్మ, మధురవాణి, రామ భద్రాంబ, చెంగల్వ కాళకవి, కామరసు వెంకటపతి, పురుషోత్తమ దీక్షితుడు మొదలైన కవులూ ఇక్కడివారే.

నాయకరాజుల తర్వాత మహారాష్ట్ర రాజులు ఈ మండలాన్ని పాలించినపుడు కూడా తెలుగుసాహిత్యం ఇక్కడ బహుముఖంగా విస్తరిల్లింది. శహాజీ, తుక్కోజీ, శివాజీ వంటి రాజకవులు తెలుగు సాహిత్యాన్ని ఆదరించి నాటి సారస్వతాన్ని భద్రపరిచారు. గిరిరాజకవి, ముద్దుపళని, శేషాచలకవి, మాతృభూతకవి, మేలత్తూరు వెంకటరామశాస్త్రి, త్యాగరాజు, బాలకవి సుబ్బన్న, శ్రీ నారాయణతీర్థులు, పరమానందతీర్థులు, చల్లా సూరయ అప్పటి ప్రసిద్ధ కవులు.

**తంజావూరి వరదరాజశతకము**

కర్త : రాఘవదాస కవి. (ద. దే. వా. పీఠిక)

**తంజావూరి సత్రము**

సామెత.

తంజావూరును పరిపాలించిన నాయకరాజుల కాలంలో విశేషంగా జరిగే అన్నదానాలను పురస్కరించుకొని ఏర్పడ్డ సామెత.

రఘునాథ నాయకుడు ప్రతిరోజూ 50 వేల మంది బ్రాహ్మణులకు తక్కువ కాకుండా అన్నదానం చేసేవాడు. విజయరాఘవుడు అంతకెక్కువగా రోజూ లక్ష బ్రాహ్మణులకు అన్నదానం చేసేవాడు. సత్రాలలో తినని వారికి స్వయంపాకాలు ఇచ్చేవారు. పని లేని సోమరిపోతులకు ఈ సత్రాల్లో పడి తినటం అలవాటైంది. రాగభోగాల వారిని పిలిపించి వారికి వినోదాలు కూడా ఏర్పాటు చేసేవారట. దీనిమీద ఒక యక్షగాన నాటకం కూడా ఉంది. నేటికీ ఎక్కడైనా వంటలు, భోజనాలూ నిరంతరం సాగుతూంటే దాన్ని తంజావూరి సత్రం అంటూంటారు. (ద. దే. వా. పీఠిక-136)

**తంజావూరు అన్నదాన మహానాటకము**

నామాంతరం : "సత్రమరులు"
కర్త : పురుషోత్తమదీక్షితులు.
రచనాకాలం : క్రీ.శ. 1669 (కీలకనామ సంవత్సరం).
కృతిపతి : విజయరాఘవుడు.

దక్షిణాంధ్రయుగపు ఇతర నాటకాలలో వలె ఇందులో నాయినా నాయక పాత్రలు లేవు. ఉత్తమ పాత్రలులేకుండా మధ్య మాధమ పాత్రలతోనే కథ నడిచింది. హాస్యాద్భుత రస ప్రధానంగా వ్రాసినట్టు కవి చెప్పుకొన్నాడు. ఇది విలక్షణమైన నాటకం. ప్రహసన మని చెప్పొచ్చు.

తంజావూరు నాయకరాజులు అన్నదానానికి ప్రసిద్ధులు. వారి సత్రాలలో పడి తినడానికి వచ్చే సోమరిపోతుల వెకిలిచేష్టలు, చిన్నబుద్ధులు ఇందులోని ఇతివృత్తం. ఆయా సందర్భాలను బట్టి ఇందులో అసభ్య ఘట్టాలు చాలా ఉన్నాయి.

తమిళ భాషలో కొన్ని సంభాషణలుండటం వల్ల సామాన్య ప్రజా జీవితంలో తమిళభాష ప్రాధాన్యం తెలుస్తున్నది. నాటి సంఘాన్ని అద్దంపట్టినట్టు చూపుతున్న నాటకం. (ద.దే.వా-127) (ఆరుద్ర-11-134-136)

## తంజావూరు మహారాజు శరభోజీ సరస్వతీ మహలు పుస్తక భాండాగారము

స్థలం : తంజావూరు.

కాలం : క్రీ.శ. 17,18,19 శతాబ్దాలు.

తంజావూరులోని పుస్తక భాండాగారం. తంజావూరును పాలించిన తెలుగు నాయక రాజులు, మహారాష్ట్ర రాజులు, దీన్ని అభివృద్ధి చేశారు. మొదటి శహాజీ (1684-1712) కాలం నుండి ఇక్కడ గ్రంథ సంచయనం ప్రతులు వ్రాయించడం విశేషంగా మొదలైంది. గ్రంథ విలేఖకులను పోషించి శిథిలావస్థలో ఉన్న అనేక ప్రాచీన గ్రంథాలకు మేలి ప్రతులు వ్రాయించినవారు మహారాష్ట్ర రాజులు. కుమార సంభవం, ద్విపద భారతం వంటి గ్రంథాలు వీరి కృషివల్లనే తెలుగువారికి లభించాయి. నింబాజీ అనే ఉద్యోగి కుప్పియ చేత ద్విపద భారతం ప్రతి రాయించాడు.

పాలగిరి కచ్చాలప్ప, సంబటూరి బుచ్చన్న మనుమడు పాపరాజు, చరిగొండ పెదఅయ్యపరాజు, చరిగొండ పెద్దిరాజు, కళావతి, వెల్లటూరి అప్పయ్య, ఆనకనూరి చెలువరంగప్ప, ప్రతాపరాయడు (విఠలుడు-అసలు పేరు) మొ॥ వారంతా, ఆయా కాలాలలో రాజుకోసము, తమ కోసమూ కూడా ప్రతులను వ్రాసుకొన్నారు.

అయితే రెండవ శరభోజీ పేర ఈ భాండాగారం ప్రసిద్ధమైంది. తెలుగు గ్రంథాలు అనేకం ఇక్కడ నుండి ఇతర గ్రంథాలయాలకు తరలించబడ్డాయి. కొన్ని తెలుగు గ్రంథాలు నాగరలిపిలో కూడా ఉన్నాయి. గణితం, జ్యోతిషం, ఖగోళవిజ్ఞానం, వైద్య శాస్త్రాలకు సంబంధించిన అపూర్వగ్రంథాలు ఎన్నో ఉన్నా అధిక భాగం తంజావూరి నాయకరాజుల కాలానికీ, మహారాష్ట్ర రాజులకూ చెందినవే. శరభోజీ కాలంనాడు ఇందులో ఆంగ్లం, తెలుగు, తమిళం, మరాఠీ, కన్నడం, సంస్కృత భాషలకు చెందిన గ్రంథాలు సుమారు 22,000 ఉండేవట.

శరభోజీ దేవనాగరలిపిలో గ్రంథాలను ముద్రించడానికి ముద్రణాయంత్రాన్ని నెలకొల్పి కొన్ని గ్రంథాలను అచ్చువేశాడు. (ఆరుద్ర 12-130) (ద.దే.వా 2-78)

## తంత్ర శిఖామణి (సం)

కర్త : రాజ చూడామణి దీక్షితుడు.

రచనాకాలం : క్రీ. శ. 1637 ప్రాంతం.

గురువైన వేంకటమఖి ప్రేరణతో కవి ఈ రచన చేశాడట. చారిత్రక ప్రశస్తి గల కావ్యం. ఇందులో వేంకటమఖి రచనలు పేర్కొనబడ్డాయి.

(తం. ఆం. నా-250-251)

**తందన పదాలు**

జానపద వాఙ్మయానికి చెందిన పదాలు. 'తందనాన' అని కాని "తందానతాన" అని కాని ఊత పదం ప్రతి పాదాంతంలో ఆవృతమయ్యే పద విశేషాలివి. ఇవి సంగీతంలో గానాంగ విశేషమైన తాన శబ్ద సంబంధి కావచ్చు. ఈ పదాలు ప్రాచీన కాలం నుంచి తెలుగు దేశంలో ఉన్నట్లు, వేంకటనాథుని పంచతంత్రం, కళాపూర్ణోదయం. భోజసుతా పరిణయం, దశావతార చరిత్ర మొ॥ కావ్యాలలోని వీటి ప్రసక్తిని బట్టి ఊహించవచ్చు.

ఇవి శహాజీ "జలక్రీడలు" యక్షగానంలో ఉన్నాయి. (య వా.చ-327)

**తక్కసీల వెంకన్న**

కాలం : క్రీ. శ. 1760 ప్రాంతం.
స్థలం : రాయచూరు జిల్లా అలంపురం తాలూకాలోని తక్కసీల గ్రామం.
రచనలు : పార్వతీ దండకము, సీతారామ శతకము. (క. స-229)

**తక్కెళ్ళపాటి లింగన**

కాలం : క్రీ. శ. 18 వ శతాబ్దం.
రచనలు : 1. విద్యుత్ప్రభా విలాసము 2. మదనమోహినీ విలాసము 3. ఉత్తర హరిశ్చంద్ర కథ 4. సూర్యతనయా పరిణయము.

చిట్టయ్య పౌత్రుడు. తండ్రి పేరు వేంకటపతి. తల్లి సూరమ్మ. వివరాలు తెలియరాలేదు. ఇతని కవిత్వం అంత ప్రౌఢంగా లేదని పండితులంటారు.

(య. వా. చ.)

**తచ్చూరు సింగరాచార్యులు - చిన సింగరాచార్యులు**

కాలం : క్రీ. శ. 18 శతాబ్దం చివర. జంటగా రచనలు చేశారు.
రచనలు : 1. స్వరమంజరి 2. గాయక పారిజాతము 3. సంగీత కళానిధి 4. గాయక లోచనము 5. గాయక సిద్ధాంజనము.
గురువు : సుబ్బరాయశాస్త్రి.

సంగీత సంస్కృతాంధ్రాలలో గొప్ప పండితులు. తచ్చూరు సింగరాచార్యులు ఫిడేలు వాయిద్యంలో సమర్థులు. సాంకేతిక రచనలు చేసినవారిలో వీరే ప్రథములట. వీరి గురువైన సుబ్బారాయశాస్త్రి శ్యామశాస్త్రిల కుమారుడు. (తె.వి.స-4-1194)

**తణికెళ్ళ సుబ్బయశాస్త్రి**

కాలం : క్రీ. శ. 19 వ శతాబ్దం.
స్థలం : పిఠాపురం సంస్థానం (తాటిపర్తి గ్రామం),
రచన : సూర్యరాయ తారావళి

పిఠాపురం సంస్థానాధీశ్వరుడైన రావు వేంకట సూర్యరాయని ఆశ్రితుడు. సంస్కృతాంధ్రాలలో అసమాన పాండిత్యం గలవాడు. (ఆం.సం.సా-250)

**తత్త్వగుణాదర్శ చంపువు (సం)**

కర్త : చూ. తిరుమల బుక్కపట్టణం (ఇమ్మడి) అణ్ణయ దీక్షితులు.

సంస్కృత రచన. విశిష్టాద్వైత సిద్ధాంతపరంగా వ్రాయబడింది. సురపురం సంస్థానాధీశ్వరుల సమాదరణలో వ్రాయబడిన గ్రంథం. (ఆం.సం.సా-516)

**తత్త్వ చంద్రోదయము**

కర్త : ముమ్మడి మల్లన్న.

అంకితం : శ్రీరామునికి.

విశిష్టత : కవి మల్లన్న దీనిని చిన్నతనంలోనే ద్విపదగా వ్రాశాడు. కృష్ణుడు రుక్మిణి కోరికపై అద్వైత మార్గం ఉపదేశించడం ఇందులోని ఇతివృత్తం. దీని ప్రతి ఒకటి కాకినాడ ఆంధ్రసాహిత్య పరిషత్తులో ఉందట. ఇందులో వేదాంత విషయాలు సుబోధకంగా చెప్పబడ్డాయి. (అముద్ర-8-272)

**తత్త్వ చింతామణ్యుపన్యాసమ్ (సం)**

కర్త : కంచం ఎల్లయార్యుడు (తె.వి.స-4)

**తత్త్వ దీపిక బోధ**

నామాంతరం - తత్త్వదీపికా ప్రబోధము.

కర్త : మారేపల్లి వేంకటయోగి.

అంకితం : అలమేలు మంగాసహితుడైన తిరుపతి వేంకటేశ్వరునికి.

ద్విపద కావ్యం.

అలమేలు మంగమ్మ అర్థిస్తే తిరుపతి వేంకటేశ్వరుడు కరుణించి చెప్పిన వేదాంత విషయాలు ఈ గ్రంథంలోని ఇతివృత్తం. ఇది అముద్రితం. దీని ప్రతి కాకినాడ ఆంధ్రసాహిత్య పరిషత్తువారి గ్రంథాలయంలో ఉంది. (అముద్ర-8-274)

**తత్త్వ దీపికా ప్రబోధము**

నామాంతరం : తత్త్వ దీపిక బోధ.

కర్త : మారేపల్లి వేంకటయోగి.

**తత్త్వ నిర్ణయమ్ (సం)**

కర్త : కందాడై అప్పకొండాచార్యుడు. (తె. వి. స-4)

**తత్త్వ నిష్కర్ష (సం)**

కర్త : కందాడై అప్పకొండాచార్యుడు. (తె. వి. స-4)

**తత్త్వ ప్రకాశిక**

కర్త : చూ. శివలింగారెడ్డి (కందుకూరు రెడ్డిప్రభువు).

నామాంతరాలు : 1. శ్రుతి సూక్తిమాల 2. గిరీశ శ్రుతి సూక్తిమాల.

అద్దంకి రెడ్డిప్రభువు ప్రోలయ వేమారెడ్డిని నుతిస్తూ దీనిలో రెండు శ్లోకా లున్నాయి. సంస్కృతంలో హరిదత్తాచార్యులు వ్రాసిన "గిరీశ శ్రుతి సూక్తిమాల" అనే 150 శ్లోకాల సంస్కృత గ్రంథానికిది సంస్కృత వ్యాఖ్యానం. (రె. రా. చ.)

**తత్త్వ ప్రకాశిని**

నామాంతరం : శివ రహస్య ఖండము (చూ).

కర్త : ముదిగొండ బ్రహ్మయ లింగమ.

**తత్త్వ బోధినీ టీక (సం)**

కర్త : చూ. అన్నంభట్టు.

ఇది సంస్కృతంలోని సంక్షేప శారీరకమనే వేదాంత గ్రంథానికి సంస్కృతం లోనే రచింపబడ్డ వ్యాఖ్యానం. (తె. వి. స-4)

**తత్త్వమార్తాండమ్ (సం)**

కర్త : చూ. తిరుమల బుక్కపట్టణం (ఇమ్మడి) శ్రీనివాసాచార్యులు.

గీర్వాణ రచన.

విశిష్టాద్వైత సిద్ధాంతాలను సమగ్రంగా వివరిస్తుంది. ఇమ్మడి శ్రీనివాసా చార్యుల రచనలో అత్యంత ప్రసిద్ధి చెందింది. (ఆం. వ్యం. సా-516)

**తత్త్వముద్రా భద్రోదయమ్ (సం)**

కవయిత్రి : త్రివేణి.

ఇది విశిష్టాద్వైత మత సాంప్రదాయికమయిన వేదాంత గ్రంథం. దీని వ్రాత ప్రతి తంజావూరు సరస్వతీమహల్‌లో ఉంది. (అ.భా. కవయిత్రులు)

**తత్త్వములు-కొందరు తత్త్వ కర్తలు**

ప్రజలలో తత్త్వ విచారాన్ని పెంపొందించటానికి కొందరు ప్రజా కవులు గేయ పద్ధతులలో తత్త్వాలను వ్రాశారు. భారతీయుల అత్యున్నత వేదాంత భావనలను గీతాల ద్వారా సామాన్య ప్రజలకు అందించిన తత్త్వ కర్తలు తెలుగులో చాలామంది ఉన్నారు. వీరు పూర్వ వేదాంతార్థాలను వివరించటంతో తృప్తి పడక, నూతన తత్త్వార్థా లను వెదికి ప్రతిపాదించారు.

వీరిలో వేమన, వీరబ్రహ్మ యోగి, దూదేకుల సిద్ధయ్య ప్రముఖులు, వీరుగాక వైరాగ్య జ్ఞానదాయకాలయిన తత్త్వాలు తెలుగులో వ్రాసినవారు చాలా మంది ఉన్నారు. ఏకంటి లక్ష్మప్ప, నాసరయ్య, నరసింహదాసు, పీర్ మహమ్మద్ హుస్సేన్ దాసు, పీరు మొహిద్దీన్-వీరందరూ గంభీరార్థ బోధకాలు, మర్మ కవిత్వంతో కూడిన తత్త్వాలు వ్రాశారు.

అధునికులలో ఎడ్ల రామదాసు ఒక తత్త్వకర్త. ఈయన కీర్తనలు, తత్త్వాలు ప్రజలలో బాగా వ్యాపించి ఉన్నాయి. (సా. చ. స-326)

## తత్త్వ సంగ్రహ రామాయణము

కర్త : అకొండి వేంకటకవి.
రచనాకాలం : క్రీ. శ. 19వ శతాబ్ది పూర్వార్ధం.
అంకితం : శ్రీకృష్ణునికి.

పద్యకావ్యం. ఇందులో కొన్ని భాగాలు మాత్రం ముద్రితాలు. రచన ప్రౌఢంగా ఉంది. (క. స-232)

## తత్త్వామృతమ్ (సం)

కర్త : కందాడై అప్పకొండాచార్యుడు. (తె. వి. స-4)

## తత్త్వార్థ దర్పణమ్ (సం)

కర్త : అప్పయ్య దీక్షితుడు.

ఆధ్యాత్మిక సంబంధమైన గ్రంథం. (తె. వి. స-6-245)

## తత్త్వార్థదర్పణము

కర్త : అచ్చి రామానుజాచార్యులు.
రచనాకాలం : క్రీ. శ 1700 ప్రాంతం.

ద్విపద కావ్యం. (క.స-201)

## తపతీ సంవరణోపాఖ్యానము

కర్త : అద్దంకి గంగాధర కవి.
కృతిభర్త : ఇబ్రహీం కుతుబ్‌శాహి (మల్కిభరాముడు).

విశిష్టత : కృతిభర్త కోరికపై కవి, నన్నయ భారతం అరణ్య పర్వంలోని చిన్న కథను తీసుకొని అష్టాదశ వర్ణనలతో పెంచి అయిదాశ్వాసాల కావ్యంగా వ్రాశాడు.

ఇది సూర్యుని కుమార్తె తపతితో సంవరణుని వివాహానికి సంబంధించిన ఇతివృత్తం. తపతీ సంవరణ కావ్యాన్ని కొందరు వసుచరిత్రతో పోల్చారు. కవి అక్కడక్కడ తన తర్కశాస్త్ర పాండిత్యాన్ని, సంగీత జ్ఞానాన్ని ప్రదర్శించాడు. కుతుబ్‌శాహి అస్థానకవి "వరుహి" వ్రాసిన "ఖుత్బుముస్తరీ" అనే ప్రబంధంపై ఈ కావ్య ప్రభావ ముందని అంటారు. మల్కిభరాముని ప్రణయగాథ ఇందులో సూచితమట.

(అరుద్ర-8-139)

## తప్పెట్ల కోలాటు నృత్యము

నామాంతరం : డప్పుల కోలాట నృత్యం (చూ).

## తమ్మపడిగ మీద బొమ్మపెట్టుటం

కాలం : క్రీ. శ. 12-15 శతాబ్దుల మధ్యకాలం.

ఉమ్మివేసే పాత్రను తమ్మపడిగ అంటారు. ఈ పాత్రమీద బొమ్మను చెక్కించటమే బొమ్మపెట్టటం. విజయగర్వోన్మత్తులయిన రాజులు - శత్రురాజుల బొమ్మలను

తమ 'తమ్మపడిగ' మీద చెక్కించి అతనిని అవమానిస్తున్నట్లు భావిస్తూ అపాత్రలో ఉమ్మివేసేవారు.

రాచకొండ వేదగిరి నేడు - కొండవీటి మాచారెడ్డిని జయించి అతని బొమ్మను 'తమ్మపడిగాన పొదిగించి'నట్లు - మాచారెడ్డి అన్న పెదకోమటి వేమారెడ్డి వేదగిరి నేడుని జయించినట్లూ - రెడ్డి ప్రభువులు - వెలమ దొరలు పరస్పరం ఇట్లా అవమాన పరచు కొన్నట్లు "వెలుగోటి వారి వంశావళి"ని బట్టి తెలుస్తుంది.

ఈ బొమ్మలను - విజేత వేసే ఉమ్మికి చేయిచాస్తున్నట్లుగాను, అతనికి నమస్కారం జేస్తున్నట్లుగాను వివిధ భంగిమలలో చెక్కించేవారట. (తెలుగు-ఏ-జూ-77)

**తమ్మారం వీథి భాగవతులు**

ఈ భాగవతులు పగటివేషాలు వేయటంలోను, వీథినాటకాలు చక్కగా ప్రదర్శించటంలోను ప్రసిద్ధి వహించారు. వీరు తమ్మారం - అమ్మనబ్రోలుకు చెందిన కళావంతులు, తమ్మారం ప్రస్తుతం ప్రకాశం జిల్లాలో ఉంది.

కూచిపూడివారు వేసే పగటి వేషాలతో ప్రభావితులైన ఈ భాగవతులు కూడా అద్భుతంగా పగటివేషాలు వేసేవారు. (నా.ర.చ-169)

**తమ్ముప్రోలయ దక్షారామ శాసనము**

కాలం : క్రీ. శ. 1149.
ప్రస్తావిత స్థలాలు : దక్షారామం, పట్టపుమెట్ట అగ్రహారం.
శాసన ప్రదాత : తమ్ము ప్రోలయ.

శాసన విషయం : శాసన ప్రదాత మిక్కిలి దానశీలియనీ, "పట్టపుమెట్ట" అనే అగ్రహారంలో శివుని ప్రతిష్ఠించి, ఆ గ్రామాన్ని దానం చేశాడనీ, దక్షారామ భీమేశ్వరునకు అఖండ దీపం నిలిపాడనీ ఈ శాసనం వల్ల తెలుస్తున్నది. దీనిలో అసమగ్రంగా ఒక శార్దూలం, రెండు ఉత్పలమాలలు, మధ్యలో కొంత గద్య, చివర అసమగ్రంగా ఒక కంద పద్యం ఉన్నాయి. (తె. క. చ-247)

**తరంగాలు**

దైవస్తుతి పరమైన సంకీర్తనలు.

శ్రీ నారాయణ తీర్థుల వారి శ్రీకృష్ణ లీలా తరంగిణి తెలుగు దేశంలో అవతరించటంతో-సంస్కృత ఘటితమైన సంకీర్తనలకు "తరంగాలు" పేరు ప్రసిద్ధమైంది.

తీర్థపాదుడు తెలుగులో వ్రాసిన పారిజాతాపహరణ యక్షగానంలో శ్రీకృష్ణ లీలా తరంగిణిలోని మూడు తరంగాలు ప్రసక్తమైనాయి. శేషాంబ మిత్రవిందా పరిణయంలో కూడా కొన్ని తరంగాలు ప్రయుక్తాలు. దీనిలోని తరంగాలు తాళ జాతులవలె ఉండటం విశేషం. (య. వా. చ-327-328)

**తరళమ్ వ్యాఖ్య (సం)**

కర్త : కోలచల మల్లినాథసూరి.

సంస్కృతంలోని "ఏకావళి"కిది సంస్కృతంలో వ్రాసిన మనోహరమైన వ్యాఖ్య. (తె. వి. స-4)

## తరిగొండ వేంకమాంబ (వేంగమాంబ)

కాలం : క్రీ. శ. 19 వ శతాబ్దం పూర్వార్థం.

స్థలం : కడప మండలంలోని తరిగొండ.

గురువులు : వేదాంతోప దేశికుడు, సుబ్రహ్మణ్య దేశికులు.

రచనలు : 1. వేంకటాచల మాహాత్మ్యము 2. జ్ఞాన వాసిష్ఠ రామాయణము 3. రాజ యోగసారము 4. ద్విపద భారతము 5. ద్విపద భాగవతము 6. నర సింహ శతకము 7. నరసింహ విలాస కథ 8. కృష్ణ నాటకము 9. రమాపరిణయము (పెండ్లి పాట) 10. చెంచునాటకము 11. కృష్ణ మంజరి (ద్విపద) 12.- శ్రీ రుక్మిణీ నాటకము 13. గోపికా నాటకము 14. ముక్తికాంతా విలాసము 15. శివనాటకము 16. పారిజాతాప హరణ సత్కృతి.

ఈమె గ్రంథాలు కొన్ని తరిగొండలోని నృసింహస్వామికి అంకితాలు. అందు వల్లనే ఈమెకు తరిగొండ వేంకమాంబ అనే ప్రసిద్ధి కలిగిందట. ఈమె తండ్రి కృష్ణార్యుడు, తల్లి మంగమాంబ. పుట్టింటి వారు కానాలవారు. భర్త వెంకటాచలపతి. కొన్ని రచనలు సుబ్రహ్మణ్య గురునికి అంకితం చేసింది.

తాను విద్యాధికురాలను కానని చెప్తూ, పండితులను ఆదరించమని వేడుకొన్న వినయశీలి. శతకాలు, ద్విపదలు, యక్షగానాలు ఇన్ని ప్రక్రియా వైవిధ్యంతో, విషయ వైవిధ్యంతో రచించిన వనితలు తక్కువ. ఈమె మంచి విదుషీమణి. ఈమె గ్రంథాలు ప్రాయికంగా వేదాంతపరాలు. శైలి మృదువుగా హృదయంగమంగా ఉంటుంది. వ్యాకరణ నియమాలు అంతగా పాటించలేదు. ఈమె వేంకటాచల మహాత్మ్యంలో తాను శృంగార వర్ణన చేయలేనని శృంగారం పేర అసభ్య వర్ణనలు చేయలేననీ చెప్పింది. కావ్యాలలో అనుచిత వర్ణనలు లేవు. వినయపరురాలు.

(అ. భా. రచయిత్రులు-74; సా. చ. -232)

## తరిగొప్పుల దత్తన

కాలం : క్రీ. శ. 1586-1614 ప్రాంతం.

రచనలు : తెలియరాలేదు.

విశిష్టత : ఈయన వసుచరిత్ర కృతిభర్త తిరుమల దేవరాయల కుమారు డయిన రెండో వేంకటపతి రాయల దగ్గర వ్రాయసకాడు. రాజాధిరాజ రాజ పరమేశ సకల కర్ణాటకాంధ్ర రాజధౌరేయ తిరుమల రాయ తనయ చంద్రుడగు వేంకటపతి క్షితీంద్రమణికి ఈ దత్తన్న అనుపమ కావ్యకర్త. ఆశు, విస్తర, చిత్ర, మధుర కవితలతో చంద్రభాను చరిత్రను కావ్యంగా వ్రాసిన తరిగొప్పుల మల్లన ఈతనికి తమ్ముడు. ఈ మల్లన్న కూడా వేంకటపతి రాయల యొద్ద వ్రాయసకాడు.

దత్తన్న వ్రాతలు ద్వీపాంతర నృపులను సైతం ఆకర్షించేదట. (ఆరుద్ర-9)

**తరిగొప్పుల మల్లన**

కాలం : క్రీ. శ. 1586-1614 ప్రాంతం.

స్థలం : తరిగొప్పుల గ్రామం. కర్నూలు జిల్లా నందికొట్కూరు తాలూకాలో ఉంది.

రచన : చంద్రభాను చరిత్ర.

బిరుదు : గండభేరుండ కవి.

గురువు : దత్తాత్రేయ యోగీంద్రుడు.

నరసామాత్య తిప్పాంబల కుమారుడు.

విశిష్టత : ఇతడు వెంకటపతి రాయల కొలువులో వ్రాయసకాడు. సభాపతులకు తలలో నాలుక లాంటివాడు. రాజుదగ్గర పలుకుబడి ఉన్నవాడు. పింగళి సూరన్న నవ్య కవితారీతినీ, భట్టుమూర్తి కొత్త బాణీనీ ఇతడు అనుసరించాడు. ఈయన ఆశు, విస్తర, చిత్ర, మధుర కవితలలో దిట్ట. ఈయన తాను చెప్పే విస్తర రచనలు సూరి హృదయాలను, ఆశువులు రసజ్ఞులను, యమకాది చిత్రాలు మాన్యసత్కవులను, మధుర కవితలు ప్రాజ్ఞులను మెప్పిస్తాయని చెప్పుకొన్నాడు. ఈయన కావ్యాన్ని అనుసరించి సమీప కాలంలో అర్వాచీనుడు సురభిమాధవ రాయలు చంద్రికా పరిణయం అనే కల్పిత ప్రబంధం వ్రాశాడు. (ఆరుద్ర-9)

**తర్క భూషణము వేంకటాచార్యులు**

కాలం : క్రీ. శ. 19వ శతాబ్దం.

స్థలం : వేంకటగిరి సంస్థానం.

రచన : శృంగార కల్పవల్లి.

వేంకటగిరి సంస్థాన పాలకుడైన సర్వజ్ఞ యాచేంద్రుని (1832-1892) ఆస్థాన కవులలో ఇతడు ప్రసిద్ధుడు. బహుశాస్త్రవేత్త. శృంగార కల్పవల్లి ఇతని ఆలంకారిక రచన. ఈ రచనకు మెచ్చి ప్రభువతనికి "వెదురుగుంట" గ్రామాన్ని అగ్రహారంగా ఇచ్చి గౌరవించాడట. (ఆం సం.సా-468)

**తర్క సంగ్రహ దీపిక (సం)**

కర్త : చూ. అన్నంభట్టు.

ఇది సంస్కృతంలో రచింపబడ్డ న్యాయశాస్త్ర గ్రంథం. తర్కవిద్య నేర్చుకొనేవారు ప్రారంభంలో ఈ గ్రంథాన్ని చదువుతారట. దీనిమీద పది వ్యాఖ్యలున్నాయి. దీనికి మంచి వ్యాప్తి ఉంది. దీనిలో విషయం సంక్షిప్తంగా, నిశ్చితంగా, సుగమంగా ఉంటుంది. న్యాయ, వైశేషిక రీతులకు దీనిలో సమన్వయముంది. ఇది తర్క సంగ్రహ దీపికకు వ్యాఖ్యానం. ఇది స్వతంత్రమైన, నిశ్చితమైన గ్రంథం. బుద్ధి చర్చలో గౌతమ భావాలు, ఇతర చర్చలలో కాణాదుని భావాలు ఇందులో నిరూపితం. ఈ గ్రంథం సర్వుల ఆమోదాన్ని పొందింది. (తె.వి.స-4)

## తర్క సంగ్రహమ్ (సం)

కర్త : చూ. అన్నంభట్టు.

ఇది సంస్కృతంలో న్యాయశాస్త్ర గ్రంథం. తర్కవిద్య నేర్చుకొనేవారు ప్రారంభంలో ఈ గ్రంథాన్ని తప్పక చదువుతారు. దీనిపై ఇరవై అయిదు వ్యాఖ్యానాలు వచ్చాయి. దీనికి మంచి వ్యాప్తి ఉంది. దీనిలో విషయం సంక్షిప్తంగా, ,నిశ్చితంగా సుగమంగా ఉండడమేకాక న్యాయ, వైశేషిక రీతులకు చక్కని సమన్వయముంది. (తె.వి స-4)

## తలంటు పాటలు

ఇవి పెండ్లి వేడుకలలోని పాటలు. వధూవరులకు మంగళస్నానాలు చేయించే టప్పుడు ఈ పాటలు పాడటం కద్దు. కొన్నిచోట్ల వీటిని "తలంటు శోభనపు "పాటలు అని కూడా అంటారు. కల్యాణ కథలున్న యక్షగానాలలో ఇవి ప్రయుక్తం. వేంకటాచలమయ్య ఏకాంత సేవలో ఇవి ఉన్నాయి. (య.వా.చ-328)

## తలంటు శోభనపు పాటలు

నామాంతరం : చూ. తలంటు పాటలు.

## తలమల రామచంద్రారెడ్డి

కాలం : క్రీ.శ. 17వ శతాబ్దం.

స్థలం : తిరుచినాపల్లి మండలం (సేలం జిల్లా).

కృతిపతి. సాహిత్యపోషకుడు. విశ్వేశ్వర పండితుడు వ్రాసిన కృష్ణవిలాసం అంకితం తీసుకొన్నాడు.

నామకల్లు తాలూకాలోని తలమల అనే కొండ క్రింది ప్రదేశం వీరి స్వస్థలం. ఇతని పూర్వీకులు తలమల కొండమీద శ్రీ వేంకటేశ్వరస్వామికి ఆలయం కట్టించి తలమల పేరుతో ప్రఖ్యాతులయ్యారు. (ద.దే.వా-497)

## తలమల సంస్థానము

దక్షిణదేశంలో తెలుగు భాషను ఆదరించిన సంస్థానాలలో ఒకటి. తిరుచినాపల్లి మండలంలో నామకల్లు తాలూకా ప్రాంతం తలమలగా వ్యవహృతం. ఇక్కడి పాలకుడు రామచంద్రారెడ్డి విశ్వేశ్వర పండితుని ప్రోత్సహించి కృష్ణ విలాసము అనే కావ్యాన్ని రచింపజేసి అంకితం పొందాడు. (ద.దే.వా)

## తలుపు దగ్గర పాటలు

ఇవి ప్రధానంగా పెండ్లి వేడుక పాటలు. ప్రణయకలహ విషయికంగా దూరమై పోయిన నాయికా నాయక పునస్సమాగమ సందర్భాలలో నాయికా నాయక సంవాదపురస్సరంగా ఈ పాటలు పుట్టినవి. ఇవి చాలా యక్షగానాలలో ప్రయుక్తాలు. ప్రతిపాటకు సాధారణంగా పాదానికి చతుర్మాత్రాక దళాలు ఏడుంటాయి. నాలుగు దళాలపై యతి, రెండేసి పాదాలకు ప్రాస, మధురగతితో ప్రతిపాట ఉంటుంది. (య.వా.చ-329)

**తల్లాప్రెగ్గడ సూర్యప్రకాశరావు**

చూ. తురగా రామకవి.

ఈయన తురగా రామకవికి బావ. క్రొత్తగా కట్టిన ఇల్లు చూపిస్తూ ఈయన చేసిన హాస్యాన్ని రామకవి అవమానంగా భావించి శపించగా ఆ ఇల్లు పాడుబడి పోయిందట. (చా. ప. ర.)

**తాడికొండ మల్లనారాధ్యుడు**

కాలం : క్రీ. శ. 18వ శతాబ్దం ఉత్తరార్ధం – 19వ శతాబ్దం పూర్వార్ధం

స్థలం : నరసరావుపేట సంస్థానం.

రచనలు : తెలియరాలేదు. చాటువులు– శతకాలు చెప్పినట్లు తెలుస్తున్నది.

మల్లనారాధ్యుడు మంత్రశాస్త్ర విదుడు, సంస్కృతాంధ్ర భాషాకోవిదుడు. నరసరావుపేట సంస్థానాధిపతి అయిన పెద వేంకట గుండారాయణింగారిని తమ కవితాశక్తిచేత మెప్పించి "నంది వెలుగు" గ్రామంలో మాన్యం పొందారు. వీరు ఆశువుగా ఏకప్రాసతో "వీరాధిప గుండభూప విభవదిలీపా ।" అనే మకుటంతో ఒక శతకం చెప్పినట్లు తెలుస్తున్నది వీరి రచనలకు సంబంధించిన వివరాలు తెలియవు.

(ఆం.సం.సా–194, 195)

**తాడిగొట్ల చెన్నకేశవుడు**

సాహిత్యాభిమాని. ఈయన మీద బుచ్చయ్యశాస్త్రి అనే ఒక కవి ఒక పంచ చామరం చెప్పాడు. (చా.ప.ర.)

**తాడిగోళ్ళ కదిరీపతి**

నామాంతరం : పాలవేకరి కదిరీపతి.

కాలం : క్రీ.శ. 17వ శతాబ్దం తొలిపాదం.

స్థలం : కోలారు ప్రాంతం (మైసూరులోనిది).

రచన : శుక సప్తతి.

కదిరిరాజు పుత్రుడు. కరియ మాణిక్య నృపుని పౌత్రుడు -కావ్య రచనా నైపుణ్యం, శబ్ద గౌరవ ప్రాగల్భ్యంగల కవి. తన కాలం నాటి సమాజ స్వరూపాన్ని, వేష భాషలను సందర్భోచితంగా రచనలో చూపాడు. ఇతని శుక సప్తతి తెలుగులో విలక్షణ మైన రచన.

వీరి పూర్వీకుల ఇంటిపేరు "పాలవేకరి". తర్వాత తాడిగోళ్ళ గ్రామాన్నిబట్టి తాడిగోళ్ళ వారుగా ప్రఖ్యాతులయ్యారు. వీరిది నెల్లూరు మండలం అని కొందరంటున్నారు

(అరుద్ర–11–247)

**తాడిపల్లి పానకాల రాయకవి**

స్థలం : కృష్ణా మండలం. బెజవాడ సమీపంలోని తాడేపల్లి.

రచనలు : 1 నేత్రదర్పణము 2. సకల వైద్య శాస్త్రార్థ సంగ్రహము

మంగళగిరిలోని దేవునిబట్టి ఈతనికి పేరుపెట్టినట్లు తెలుస్తున్నది. పై రెండు రచనలూ ఒకే పేరుగల ఇరువురు కవులు వేర్వేరుగా రచించినవని కొందరు అభిప్రాయ పడుతున్నారు. (క. త-13-240)

**తాడువాయి నరసింహము**

స్థలం : గుంటూరు జిల్లా - సత్తెనపల్లి తాలూకా - తాడువాయి గ్రామం.

తిరుమల బుక్కపట్టణం తాతాచార్యులు ఈయన గుణ గణాలను ప్రశంసిస్తూ చాటువులు చెప్పాడు. (చా. ప. ర.)

**తాడేపల్లి పానకాలరాయకవి**

స్థలం : కృష్ణానదీ తీరంలోని తాడేపల్లి.

రచనలు : 1 సకలవైద్య శాస్త్రార్థ సంగ్రహము (అసమగ్రము) 2. చిత్త బోధ శతకము 3. మానసబోధ శతకము 4. రామశతకము 5. రుక్మిణీ పతి శతకము 6. లక్ష్మీ శతకము 7. మంగళాద్రి నారసింహ శతకము.

కవి పితృ పితా మహులు భిషగ్వరులట. ఇతడు వైద్య విద్యలోనే కాకుండా రాజనీతిలో కూడ కోవిదుడు. మృదు మధురంగా కవిత చెప్పాడు. నేత్ర దర్పణ కర్త తాడేపల్లి పానకాలరాయ కవినీ ఇతన్నీ అభిన్నులుగా కొందరు తలపోస్తున్నారు. వీరి కాలాన్ని నిర్ణయించేందుకు ఆధారాలు లేవు. (క.త-13-235)

**తాతా కామావధానులు**

కాలం : క్రీ. శ. 19వ శతాబ్దం ప్రథమభాగం.

స్థలం : ఆంధ్ర సంస్థానం.

క్రీ. శ. 19వ శతాబ్దం ప్రథమభాగంలో ఆంధ్ర సంస్థానాన్ని పాలించిన గారయ దొర ఆస్థాన పండితుల్లో ముఖ్యులైన వారిలో ఒకడు.

వివరాలు తెలియవు. (ఆం. సం. సా.)

**తాతా పెదకామయ్య**

కాలం : క్రీ. శ. 19 వ శతాబ్దం.

స్థలం : చల్లపేట.

సంస్థానం : ఆంధ్ర.

క్రీ. శ. 19వ శతాబ్దంలో ఆంధ్ర సంస్థానాన్ని పాలించిన రామన్న దొరగారి ఆస్థాన పండితులలో ఒకడు.

వివరాలు తెలియవు. (ఆ.సం.సా)

**తాతా విశ్వనాథశాస్త్రి**

కాలం : క్రీ. శ. 19 వ శతాబ్దం.

స్థలం : చల్లపేట.

సంస్థానం : ఆంధ్ర.

రచనలు : తెలియరాలేదు.

క్రీ.శ. 19 వ శతాబ్దంలో ఆంధ్ర సంస్థానాన్ని పాలించిన రామన్న దొరగారి ఆస్థాన పండితులలో ఒకడు. (అం.సం.సా.)

**తాతా వైద్యనన్న**

కాలం : క్రీ. శ. 19 వ శతాబ్దం - ప్రథమ భాగం.

స్థలం : "ఆంధ్ర" సంస్థానం.

క్రీ. శ 19 వ శతాబ్దం ప్రథమ భాగంలో ఆంధ్ర సంస్థానాన్ని పాలించిన గారయదొర ఆస్థాన పండితులలో ఒకరు. ఇతర వివరాలు తెలియవు.

(అం. సం. సా.)

**తాతా శ్రీరామశాస్త్రి**

కాలం : క్రీ. శ. 19 వ శతాబ్దం.

స్థలం : చల్లపేట.

సంస్థానం : ఆంధ్ర.

క్రీ. శ. 19 వ శతాబ్దంలో ఆంధ్ర సంస్థాన పాలకుడైన రామన్న. దొర ఆస్థాన పండితులలో ఒకడు. వివరాలు తెలియవు. (అం. సం. సా.)

**తాపీ వారు**

ఇళ్ళు కట్టడంలో ఉపయోగించే పనిముట్టుతో ఉన్న ఇంటి పేరు. మనుషులు కట్టడంలో చేసేపనిని కూడా తాపీ పని అనటం కద్దు ఈ ఇంటి పేరుతో కొన్ని కుటుంబాలు తెలుగుదేశంలో ఉన్నాయి. (భారతి-మా-45-230)

**తామరపల్లి తిమ్మయ్య**

కాలం : క్రీ. శ. 1575 ప్రాంతం.

స్థలం : గోదావరీ మండలం.

రచన : హరివంశంలోని ఆశ్చర్య పర్వం.

అంకితం : శ్రీ రామునికి.

విశిష్టత : శరణయామాత్యుని పుత్రుడు. తామరపల్లి వారికి పూర్వం పైడిగంటం వారనే ఇంటి పేరు ఉండేదట. వీరు తూర్పు గోదావరి జిల్లా రామచంద్రపురం ప్రాంతం వారు కావచ్చు. తిమ్మయ్యకు ముందు ఏడో తరం వాడయిన అబ్బ మంత్రి ప్రౌఢదేవరాయలను (క్రీ. శ. 1423-1450)మెప్పించి పైడిగంటం బహుమానంగా పుచ్చుకొన్నాడట. ఈ కవివి "ఇందుపురేమి" ధర్మాజీ పోషించాడట. ఈ ధర్మాజి పెద తండ్రి నారాయణరావు గోలకొండ నవాబుల వద్ద ఉద్యోగి. ఈయన హరివంశంలో

ఎర్రన వదిలిన పర్వాలలో ఒక పర్వం మాత్రమే (ఆశ్చర్య పర్వంలోని ధర్మబోధలున్న శేషధర్మాలను) ఆంధ్రీకరించాడు. (ఆరుద్ర-9-238)

**తామరపల్లి శరణుమంత్రి**

కాలం : క్రీ.శ. 16 వ శతాబ్దం.
రచన : సభాభిరామము (అలభ్యం).

చంద్రమంత్రి పుత్రుడు. హరివంశం (ఆశ్చర్య పర్వం) కావ్య రచయిత తామరపల్లి తిమ్మయ్యకు తండ్రి. ఈయన సభాభిరామం గురించిన వివరాలు తెలియవు. (ఆరుద్ర-9-238)

**తామ్ర అరుణాద్రి కవి**

కాలం : క్రీ.శ. 10 వశతాబ్దం (పూర్వార్ధం కావచ్చును).
స్థలం : దక్షిణ దేశం.
రచన : జగన్మోహినీ దండకము.

కవి వెండ్లూరి ప్రభువుల ఆశ్రితుడు. కోనేరు భూశథ పుత్రుడైన రంగ భూపాలునిపై దండకం చెప్పాడు (వా. చ. వం. సు-386)

**తారకబ్రహ్మ మాహాత్మ్యము**

కర్త : చూ కొటికెలపూడి కోదండ రామకవి.

ఆంధ్రీకృత రచన. మూలం సంస్కృతంలో ఉంది. బ్రహ్మాండ పురాణంలోని మంత్రఖండలో ఉన్న తారకబ్రహ్మ మాహాత్మ్యం అయిదు ఆశ్వాసాలుగా తెలుగులో రచించబడింది.

విష్ణువు రామునిగా అవతరించి, శంబరుడు అనే రాక్షసుని సంహరించడం దీనిలోని ప్రధాన ఇతివృత్తం. (ఆం.సం.సా-305)

**తారకబ్రహ్మము**

కర్త : చూ. కొటికెలపూడి వేంకటకృష్ణ సోమయాజి.

వచన రచన. రామ మహిమాను వర్ణనము.

వివరాలు తెలియవు. (ఆం. సం. సా-303)

**తారకబ్రహ్మ రాజీయము**

కాలం : క్రీ. శ. 16 వ శతాబ్దం.
కర్త : (చూ) చింతలపూడి ఎల్లయ.
అంకితం : శ్రీరామునికి.

వేదాంత గ్రంథం. నాలుగాశ్వాసాలు మాత్రం లభించాయి.

విశిష్టత : సంస్కృతంలో ప్రయాగ నారాయణాశ్రమి వ్రాసిన గ్రంథానికి ఇది ఆంధ్రాను వాదం. అచ్యుతరాయల దగ్గర ఉద్యోగిగా ఉన్న తిమ్మరుసు కోరికపై రచింపబడినదట. (తె. వి. స-4)

**తారకబ్రహ్మరామశతకము (అలభ్యం)**

కవి : మరింగంటి సింగరాచార్యులు.

**తారక యోగము**

కర్త : పరశురామపంతుల లింగమూర్తి.

వేదాంత గ్రంథం. పండిత పామర జనరంజకంగా ఉంది. కవికి నారాయణ గురువు మంత్రోపదేశం చేశాడట. ఆ విషయాలను స్మరిస్తూ రచన చేశాడు.

(క.స-6; ఆరుద్ర-12-19)

**తారావళి**

నామాంతరం : నక్షత్రమాల.

శ్రవ్యకావ్య భేదం ఇరవై ఏడు నక్షత్రాలున్నట్లే 27 పద్యాలతో కూర్చిన పద్యమాలికను తారావళి అంటారు.

తారావళి పేరుతో రావిపాటి త్రిపురాంతకుడు మొదటిసారిగా తెలుగులో నక్షత్రమాలిక వ్రాశాడు. (తె.వి.స-6)

**తారావళి**

కర్త : చూ. దేవులపల్లి బాపన్నకవి.

సంస్కృత కావ్యం. రామాయణార్థ బోధకంగాను, నక్షత్ర నామ చిహ్నితంగానూ వ్రాయబడింది. (ఆం.సం.సా-247)

**తారావళి**

కవి : బుచ్చాలి గోపాలయ్య (చూ).

అంకితం : కవి ఇష్టదైవం రంగనాయకులకు.

హాస్య శృంగార భరితమైన రచన. (ఆరుద్ర-12-86)

**తారావళులు (అలభ్యం)**

కవి : గణపవరపు వేంకటకవి (చూ).

ఇతని చక్రవాళ తారావళులు అనేకం ఉన్నాయి. కొన్ని అలభ్యాలు. కవి పన్నెండో ఏటనే తారావళుల రచన మొదలు పెట్టాడట. (క.శ-12-234)

**తారా శశాంకము**

నామాంతరం : చంద్రతారా విలాసము (చూ).

ఎల్లయ్య రచించిన చంద్రతారా విలాసాన్ని సమకాలికులు తారాశశాంకమని పేర్కొన్నారు.

(కోలాచల శేషాచలకవి - నీలగిరి యాత్ర; వ.దే.వా-407)

**తారా శశాంక విజయము**

నామాంతరం : శశాంక విజయము.

కర్త : శేషము వేంకటపతి (చూ).

**తాలాంక నందినీ పరిణయము**

కర్త : మరింగంటి వేంకట (ద్వితీయ) నృసింహాచార్యులు.

ఇది ఆరాశ్వాసాల ప్రౌఢప్రబంధం. శశిరేఖా పరిణయం దీనిలోని ఇతివృత్తం. అముద్రితం. (తె.వి.స-6)

**తాళ చింతామణి (అలభ్యం)**

కవి : కృష్ణాధ్వరి.

అంకితం : రఘునాథ నాయకునికి (1575-1633).

సంస్కృత గ్రంథం. సంగీతశాస్త్ర సంబంధమైన "తాళ" లక్షణాలను గురించి చెప్పి ఉండవచ్చు.

**తాళదశ ప్రాణ ప్రదీపిక**

కర్త : పోలూరి గోవిందమంత్రి.

అంకితం : చెరుకూరి సదాశివునికి.

ఇది భరతుని నాట్యశాస్త్రంలోని తాళాధ్యాయానికి అనువాదం. రెండో ఆశ్వాసంలో గీతం ప్రాముఖ్యాన్ని, స్వరూపాన్ని గురించీ, మూడో ఆశ్వాసంలో గీతం, గ్రామ మూర్ఛనల గురించీ వివరించాడు. నాలుగో ఆశ్వాసంలో గీతంలోని ఔడవ, షాడవ, సంపూర్ణ, తాన రూపాలయిన త్రివిధ రాగభేదాలను ప్రధానంగా ప్రతిపాదించాడు. అయిదో ఆశ్వాసంలో నృత్త వాద్య స్వరూపాలను వివరించాడు. (తె.వి.స-4)

**తాళ దీపిక**

కర్త : గోపేంద్ర తిప్పరాజు.

ఇది ప్రత్యేకంగా సంగీతశాస్త్రంలోని వివిధ తాళాలకు లక్షణం చెప్పే గ్రంథం (నా.ర.చ-85)

**తాళములు**

తాళప్రధానమైన గేయ రచనలు.

ఇవి వివిధ యక్షగానాలలో ప్రయుక్తం. కన్నడ లాక్షణికుడు కవి జిహ్వాబంధకారుడు ఏకత్రిపుటాదులను తాళాలుగా, "రఘటా" (రగడ) భేదాలుగా పరిగణించాడు. కస్తూరి రంగకవి ఆనంద రంగరాట్ ఛందంలో నవ విధ రగడలకు తాళాలను పరిగణిస్తూ, జంపె త్రిపుటాదులను తాళాలుగా పేర్కొన్నాడు.

జంపె త్రిపుటాదులు యక్షగానాలలో జంపె త్రిపుటలని, కొన్నిచోట్ల జంపె రేకులు, త్రిపుటరేకులని; కొన్నిచోట్ల జంపె తాళము, త్రిపుట తాళమని పేర్కొనబడ్డాయి.

జంపె, త్రిపుట, అట, ఏక, రూపక, ధ్రువ, మఠ్యతాళాలూ కలిసి సప్త తాళా

లుగా సంగీత ప్రపంచంలో ప్రసిద్ధం. (సంగీత దర్పణం చూ.) ఇంకా లఘుశేఖర, రచ్చతాళ, చిత్ర తాళాలు కూడా ఉన్నాయి. (చూ. రేకులు రగడలు)
(య. వా. చ-237-38)

**తాళ్ళపాక అన్నమాచార్యులు**

కాలం : క్రీ. శ. 1408-1503 ప్రాంతం.
స్థలం : తాళ్ళపాక (కడపజిల్లా రాజంపేట-సిద్ధవటం ప్రాంతం).
రచనలు : 1. ఆధ్యాత్మిక కీర్తనలు 2. శృంగార సంకీర్తనలు 3. శృంగార మంజరి (ద్విపద) 4. శృంగార లక్షణమ్ (సంస్కృతం) 5. సంకీర్తన లక్షణమ్ (సంస్కృతం) 6 వేంకటాచల మాహాత్మ్యమ్ (సంస్కృతం) 7. రామాయణము (ద్విపద) 8. వేంకటేశ్వర శతకము.

ఇతడు ప్రసిద్ధి పొందిన వాగ్గేయకారుడు. తన జీవిత కాలమంతా వేంకటేశ్వర స్వామి మీద పదాలు వ్రాసి, పాడి, పాడించి ధన్యుడయ్యాడు.

కడప, చిత్తూరు జిల్లాలలోని దైవతాలపై కీర్తనలు వ్రాశాడు. ఇతడు కడప జిల్లాలోని ఒంటిమిట్ట నృసింహస్వామిని, కడపలోని వేంకటేశ్వరుని కోనలోని చెన్నరాయని, జమ్మలమడుగు తాలూకా ముడియములోని నరసింహస్వామిని, కర్నూలుజిల్లా నంబటూరులోని చెన్నరాయని, తిరుపతిలోని గోవిందరాజులను, తుంగభద్రా తీరస్థ గోపాల కృష్ణుని, విఠలేశ్వరుని కీర్తించాడు.

ఇతని కీర్తనలు శ్రీరంగంలోను, అహోబలంలోను తామ్ర ఫలకాలమీద ఉన్న వట. సింహాచలంలో అధ్యయనోత్సవ సమయంలో నేటికీ "అన్నమాచార్య సంగీతత్త కరుళప్పాడు" అని ఆరంభించి ఇతని కీర్తనలు ఆలపిస్తుంటారు. 32 వేల పైచిలుకు పదాలు వ్రాసి రాగి రేకులమీద వేయించారని పండితాభిప్రాయం. సాళువ గుండ నరసింహ రాయలు అన్నమయ్యకు బాల్యసఖుడట. తనమీద శృంగార పదాలు చెప్పలేదని రాయలు కోపించి చెరసాలలో అన్నమయ్యను బంధించాడనీ, చివరకు తప్పు తెలుసుకొని ఆరాధించాడనీ అంటారు. ఈయన ఉభయ భాషా పండితుడు. సంగీత రత్నాకరం, సంగీత చంద్రిక, సంగీత సుధాకరం, భరత శాస్త్రం మొ॥ గ్రంథాల్లో చెప్పిన పదలక్షణాలను పూర్తిగా తెలుసుకున్నవాడు.

అన్నమయ్య మధుర భక్తితో తానే నాయికగా, అలవేలు మంగగా చెప్పిన గేయాలు ఎన్నో ఉన్నాయి. దూతికగా దివ్య ప్రేయసీ ప్రియులకు రాయబారాలు, రాజీలు, రహస్యాలు చెప్పటాలు ఎన్నో ఉన్నాయి. శృంగార లక్షణ గ్రంథాలలోని లక్షణాలకు వ్యతిరేకం కానివి, ఆ సూత్రాలకు లొంగనివి వేలకు వేలు ఈయన వ్రాశాడు. అష్టవిధ నాయికలు, ఒకప్పుడు ఒక కీర్తనలోనే కనిపిస్తారు. ఉపమానాలు, ఉత్ప్రేక్షలు మొ॥ అలంకారాలు పుంఖానుపుంఖంగా దొరుకుతాయి. పురాణేతిహాసాలను, దశావతారాలు,

జ్యోతిష్యంలోని ద్వాదశ రాసులను సైతం శృంగారంలోకి అనువదించి పదాలుగా చెప్పాడు. అన్నమయ్య రచనంతా దేశియమే! అడుగడుగునా సామెతలు నానుడులే!

ఈ కవి వ్రాసిన కీర్తనలలో జోల పాటలు, ఉయ్యాల పాటలు, తలుపు దగ్గర పాటలు, మేలు కొలుపులు, తుమ్మెద పదాలు, లాలి పదాలు, చిలుక పదాలు, కోకిల పదాలు, మంగళ హారతులు, వెన్నెల పదాలు మొ॥ ఎన్నో వ్రాసి పద కవితా శాఖకు మార్గదర్శకుడయ్యాడు. (క త-8; ఆరుద్ర-6; తె. వి. స-4)

## తాళ్ళపాక చిన తిరుమలాచార్యుడు

నామాంతరం : వేంకటేశ్వర దీక్షితులు.

కాలం : క్రీ. శ. 1495-1553 ప్రాంతం.

రచనలు : 1. శృంగార సంకీర్తనలు 2. సంకీర్తన లక్షణము 3. అష్టభాషా దండకము.

విశిష్టత : ఇతడు తాళ్ళపాక అన్నమయ్య మనుమడు. తాళ్ళపాక పెద తిరుమలయ్య పెద్ద కుమారుడు ఇతనికి తాతగారే బ్రహ్మోపదేశం చేశాడట. సంస్కృతాంధ్రాలలో మహాకవి. విద్వాంసుడు. అష్టభాషా కవి చక్రవర్తి అని చిన్నన్న ఇతనిని పేర్కొన్నాడు. తండ్రి తాతల వలెనే ఇతడు కూడా శ్రీ వేంకటేశ్వరస్వామిపై శృంగార సంకీర్తనలు వ్రాశాడు. ఇతని కుమారుడే తిరువేంగళప్ప. (తె. వి స-4)

## తాళ్ళపాక చిన తిరువేంగళనాథుడు

చూ. తాళ్ళపాక చిన్నన్న.

## తాళ్ళపాక చిన్నన్న

నామాంతరం : చిన తిరువేంగళనాథుడు.

కాలం : క్రీ. శ. 1498-1561 ప్రాంతం.

రచనలు : 1. అష్టమహిషీ కల్యాణము 2 పరమయోగి విలాసము 3 ఉషా పరిణయము 4. అన్నమాచార్య చరిత్రము.

అన్నీ ద్విపద కావ్యాలు. ఇతడు పెద తిరుమలాచార్యుని నాలుగో కుమారుడు.

విశిష్టత : "చిన్నన్న ద్విపద కెరగు"నని తెనాలి రామకృష్ణ కవిచే ప్రస్తుతిగన్న కవీశ్వరుడు. "దినములోననె వేయి ద్విపదలిం పొంద, వినుత వర్ణనతో విరచించువాడ" నని కవి శిరఃకంప యోగ్య ప్రతి ద్విపద, నవ విరుదాంకుండననీ తన అష్ట మహిషీ కల్యాణంలో చెప్పుకొన్నాడు. కావ్యం చెప్పి శ్రీ వేంకటేశ్వరుని మెప్పించాడు. ఈతడు 'జలజాత వాసిని చనుబాల పుష్టి' చేత కవితా రచన చేసినవాడట.

ద్విపద లక్షణాన్ని ఇతడొక్కడే చక్కగా నిర్వచించాడు. లక్షణ కర్తలు ఎవ్వరూ ఇతనివలె నిర్వచించలేదు. "తాళ్ళపాక చిన్నన్న దండె మీటులుగావు" అని "అల తాళ్ళపాక చిన్నన్న రోమములైతె తంబురాదండెకు దంత్రులగునె" అని అర్వాచీనులు కొందరు ఇతనిని గాయకునిగా స్మరించారు ఇతడు గాయకుడనటానికి

విదర్శనంగా వ్రాసిన సంకీర్తనలు లభించలేదు. ఈ కవి సాలె వారికి ఆచార్యుడై వంశ మర్యాదలకు సంరక్షకుడై వన్నెకెక్కాడు. సాలెవారు తామ్ర శాసనం వేయించి, చిన్నన్న వంశపారంపర్యంగా తమ వంశ పారంపర్యంగా గురుశిష్యతా సంబంధం కల్పించుకొన్నారు. (తె. వి. స-4)

**తాళ్ళపాక తిమ్మక్క**

కాలం : క్రీ. శ. 15వ శతాబ్దం.

రచన : సుభద్రాకల్యాణము (ద్విపద).

తాళ్ళపాక అన్నమాచార్యుల సతీమణి.

తెలుగులో భర్తతోపాటే కావ్యం వ్రాసిన సతీమణి తిమ్మక్క. ఈమె భారతం ఆదిపర్వంలోని "విజయవిలాస" ఘట్టాన్ని స్వీకరించి "సుభద్రా కల్యాణం" పేరుతో ద్విపదగా వ్రాసింది. నన్నయ్య అర్జునుడి చేత వేంగి దేశమంతా తీర్థయాత్రలు చేయిస్తే తిమ్మక్క అర్జునుని అహోబిలం, తిరుపతి, కంచి తీర్థయాత్రలు చేయించింది. మూలాన్ని అతిక్రమించి స్వతంత్రంగా చెప్పిన ఘట్టాలు ఈ సుభద్రా కల్యాణంలో ఉన్నాయి. శైలి చక్కనిది. ఈమె పలుకుబళ్ళను విజయవిలాస కర్త చేమకూర వేంకటకవి ఉపయోగించుకున్నాడు. (ఆరుద్ర-6)

**తాళ్ళపాక తిరువేంగళాచార్యులు**

కాలం : క్రీ. శ. 1550ప్రాంతం.

రచనలు : 1. అమరుక కావ్య వ్యాఖ్య (శృంగారామరుక కావ్యము) 2. కావ్య ప్రకాశికా వ్యాఖ్య 3. నామలింగాను శాసన వ్యాఖ్య.

తాళ్ళపాక అన్నమాచార్యుల మనుమడైన చిన తిరుమలయ్య పుత్రుడు. గొప్ప విద్వాంసుడు. (తె. వి. స-4)

**తాళ్ళపాక నరసింగన్న**

కాలం : క్రీ. శ. 15 శతాబ్ది ఉత్తరార్థం.

రచనలు : అలభ్యం.

ఇతడు అన్నమాచార్యునికి అతని మొదటి భార్య తిమ్మక్కవల్ల కలిగిన పుత్రుడు. ఇతనికి నరసయ్య, నరసింహాచార్యులు అనే వ్యవహార నామాలున్నాయి. తెనాలి రామకృష్ణకవి 'చిన్నన్న ద్విపదకెరగు' అని చెప్పిన పద్యంలో చిన్నన్న, పెద తిరుమలయ్యలతోపాటు నరసింగన్నను కూడ "పద్యగద్య శ్రేణిని మిన్నంది మ్రోగు"నని మెచ్చుకొన్నాడు కాని ఇతడు వ్రాసిన గ్రంథాలు దొరకలేదు. (తె. వి స-4)

**తాళ్ళపాక పెద తిరుమలాచార్యులు**

కాలం : క్రీ. శ. 1493-1553 ప్రాంతం.

రచనలు : 1. శృంగార సంకీర్తనలు 2. అధ్యాత్మ సంకీర్తనలు 3. వేంకటేశ్వర

పదనాలు 4. వేంకటేశ్వర ఉదాహరణము 5. వేంకటేశ్వర శతకము 6. చక్రవాళ మంజరి. (అన్ని గ్రంథాలు లభ్యం).

బిరుదులు : 1. శ్రీ మద్వేద మార్గ ప్రతిష్ఠాపనాచార్యులు 2. శ్రీ రామానుజ సిద్ధాంత స్థాపనాచార్యులు 3. వేదాంతాచార్యులు 4 కవితార్కిక కేసరి.

శృంగార దండకము, శృంగార వృత్త శతకము, వైరాగ్య వచన గీతములు, సుదర్శన రగడ, రేఫఅకార నిర్ణయము, మేలు కొలుపు ద్విపద, భగవద్గీతా రచనము, ఆంధ్ర వేదాంతము, ఆంధ్ర హరి వంశము కూడా వ్రాశాడట.

ఈ కవి తాళ్ళపాక అన్నమాచార్యులకు రెండో భార్య అక్కలాంబ వల్ల కలిగిన కొడుకు. విద్వత్కవి.

విశిష్టత : ఈ కవి తిరుపతి వేంకటేశ్వర భక్తుడు. ఇతడు పై గ్రంథాలు వ్రాసినట్లు తాళ్ళపాక చిన్నన్న అష్టమహిషీ కల్యాణంలో పేర్కొన్నాడు. రేవణూరి వేంకటాచార్యుడు ఈ కవిని శకుంతలా పరిణయంలో పేర్కొన్నాడు. ఇతడు తండ్రి అన్నమయ్య సంకీర్తనలను తన సంకీర్తనలను రాగిరేకులపై చెక్కించి భద్రపరిచాడు. సంకీర్తన భాండాగారానికి ఒక వైపు తన విగ్రహాన్ని, రెండోవైపు అన్నమయ్య విగ్రహాన్ని చెక్కించాడు. (తె. వి. స-4)

## తాళ్ళపాక పెద తిరువేంగళనాథుడు

కాలం : క్రీ. శ. 1493-1553 ప్రాంతం.

ఈ కవి తాళ్ళపాక పెద తిరుమలయ్య మూడో కుమారుడు. అన్నమయ్యకు మనుమడు.

స్వామి సన్నిధిలో సంకీర్తనలు వ్రాసి పాడేవాడట. కాని, గ్రంథాలు దొరక లేదు. ఇతడు సంకీర్తనలు పాడేటప్పుడు స్వామి ఆడేవాడని రేవణూరి వేంకటాచార్యుడు శకుంతలా పరిణయంలో చెప్పాడు. (తె. వి స-6)

## తాళ్ళపాక వేంకటేశ్వర దీక్షితులు

చూ. తాళ్ళపాక చిన తిరుమలాచార్యుడు.

## తాళ్ళపాక శ్రీనివాసుడు

కాలం : నిర్ధారణగా తెలియదు.

రచన : వెంకటేశ శతకము.

శతకకర్త. ఇతడు ప్రసిద్ధ వాగ్గేయకారుడైన అన్నమయ్య వంశీయుడు. "కమల వసుధేశ, సర్వయుగాధి పేశ, విమల శశికోటి సంకాశ వెంకటేశ" అనే మకుటంతో రచన చేశాడు. ఇది అంత ప్రసిద్ధి పొందలేదు. (ఆరుద్ర-11-240)

## తింత్రిణీ గర్తపుర పట్టాభిరామ శతకము

కర్త : కానుకొలను నాయనప్ప.

రచనాకాలం : క్రీ శ. 1816 ప్రాంతం.

అచ్చ తెనుగు శతకం. కంద పద్యాలతో ఉంది. "చింతగుంట పాలెపు రామా" అనేది దీని మకుటం. కవి దీన్ని తన పన్నెండవ యేట వ్రాశాడట.

(క. సప్త - 109)

తిక్కన

కాలం : క్రీ. శ. 1210-1290 ప్రాంతం.
స్థలం : విక్రమ సింహపురి (నెల్లూరు).
ఆస్థానం : మనుమసిద్ధి ఆస్థానం.
బిరుదులు : ఉభయకవి మిత్రుడు, కవిబ్రహ్మ.
రచనలు : 1. విజయసేనము (అలభ్యం) 2. నిర్వచనోత్తర రామాయణము 3. ఆంధ్ర మహా భారతము (15 పర్వాలు) 4. కవి వాగ్బంధనము (కవి సార్వభౌమచ్ఛందము) (అలభ్యం) 5. కృష్ణ శతకము(అలభ్యం).

ఈయన క్రీ. శ. 13 శతాబ్ది పూర్వార్ధంలో నెల్లూరు రాజధానిగా దేశాన్ని పరిపాలించిన మనుమసిద్ధికి మంత్రి, ఆస్థాన కవి. అన్నమాంబ కొమ్మనామాత్యులకు పుత్రుడు. తన ప్రభువు శత్రువులచే పరివేష్టితుడైనప్పుడు తిక్కన ఓరుగల్లు వచ్చి, తన రాజనీతిని ప్రదర్శించి, కాకతిగణపతి దేవుని సాయం పొంది, మనుమసిద్ధికి విజయం చేకూర్చి పెట్టాడు.

శైవులు, వైష్ణవులు ఆంధ్ర దేశంలో క్రీ. శ. 12, 13 శతాబ్దాలలో పరస్పరం ద్వేషించుకొంటున్నందు వల్ల, సంఘంలో అలజడి చెలరేగింది. వైష్ణవులు - శైవులు అన్యోన్య దర్శన, స్పర్శన, భాషణాదులు మానివేసిన తరుణంలో, రెండు మతాల వారికి సామరస్యం కలిగించటానికి పూనుకొన్న వారిలో తిక్కన ప్రథముడు. ఈయన వంశం పండితులకు, మంత్రి దండనాథులకు నెలవై పేరు మోసింది. తిక్కన తాత భాస్కర మంత్రి తెలుగులో ఒక రామాయణాన్ని వ్రాసినట్లు ప్రబలమైన ప్రతీతి ఉంది. తిక్కన యజ్ఞం చేసి సోమయాజి అయ్యాడు.

తిక్కన కవిత్రయంలో మూడోవాడు. ఈయన కవితా శిల్పంలో, పాత్ర చిత్రణలో, నాటకీయమైన సంభాషణలు నడపడంలో దిట్ట. పాత్రల ముఖంగానే కథను నడపటంలో అద్వితీయుడు. ఈయన మంత్రి, యుద్ధనీతి విశారదుడు కావటంవల్ల ఇతని రచనలలో యుద్ధ వర్ణనలు సహజంగాను, గంభీరంగాను ఉంటాయి. అలతియలతి దేశ్య పదాలతో అనల్పార్థాన్ని చెప్పటంలో అందెవేసిన చేయి. రసోచిత పదాలు, వృత్తాలు ప్రయోగించటంలో నిపుణుడు.

ఆంధ్రావళి మోదాన్ని పొందటానికి దీర్ఘసమాసాలను తగ్గించి, దేశి మార్గాన్ని అవలంబించాడు. ఈయన రచనలు తెనుగుతనానికి కాణాచి. క్లిష్టమైన అధ్యాత్మిక విషయాలను కూడా స్పష్టంగా వ్యక్తం చేయగల శక్తి తెలుగు భాషకున్నదని తొట్ట తొలుత నిరూపించిన వాడు తిక్కన. భారతాన్ని హరిహరనాథ దేవునికి అంకితం చేసి,

శివ-కేశవ అభేదాన్ని ప్రచారం చేసి ధర్మాద్వైతాన్ని స్థాపించటానికి తిక్కన ప్రయత్నించాడు. (ఆ. వా. చ.)

**తిక్కన భారతము**

రచన : తిక్కన.

అంకితం : హరిహరనాథునికి.

ఆంధ్ర మహాభారతంలో విరాటపర్వం మొదలు చివరి పర్వమైన స్వర్గారోహణ పర్వం వరకు 15 పర్వాలు తిక్కన వ్రాశాడు. వ్యాస భారతాన్ని ఆధారం చేసుకొని వ్రాసినా ఇది సర్వ స్వతంత్రాంధ్రీకరణంగా ఉంది. భారతాంధ్రీకరణ సందర్భంలో కొన్ని చోట్ల మూలాన్ని అతిక్రమించటంలో, తిక్కన వెనుకాడలేదు. ఇది అపూర్వమేగాక అత్యుత్తమమైనదని పండితాభిప్రాయం. భారతాన్ని ఆంధ్రీకరించిన కవిత్రయంలో నన్నయ కంటె తిక్కనశైలి సులభతరమైంది. "అలతి అలతి పదముల" తోనే రచన సాగించి, విస్తృత సంస్కృత సమాసాలను ఇతడు పరిహరించాడు. తిక్కన రచనా పద్ధతివి అనంతర కాలంలో చాలా మంది తెలుగు కవులకు మార్గదర్శకమైంది. విషయ ప్రాముఖ్యాన్ని బట్టి, తిక్కన కవిత విరాటోద్యోగ పర్వాలలో ఉత్కృష్టంగాను, శాంతి - అనుశాసనిక పర్వాలలో సంక్షిప్తంగాను ఉంటుంది. వ్యర్థ పదాలను పరిహరించి ఆయా సందర్భాలలో దేశ్యపదాలను వాడటంలో తిక్కన అద్వితీయుడు. వీర, శృంగార, దుఃఖ రసపోషణలో అందెవేసినచేయి.తిక్కన భారతంలోని యుద్ధ వర్ణనలు సహజంగా ఉండటమే గాక, మిక్కిలి శోభాయమానంగా ఉంటాయి. తిక్కన రచనా పద్ధతి, వర్ణనా పద్ధతి పాశ్చాత్య ప్రముఖ కవులు 'హోమర్' (ఇలియడ్, కర్త), మిల్టన్ (పారడైజ్ లాస్ట్) లను గుర్తు చేస్తాయి. తిక్కన సన్నివేశ కల్పన, పాత్రపోషణ, నాటకీయ ధోరణి, కవితా శిల్పం భారత రచనలో పరాకాష్ఠ నందుకున్నాయి. సంస్కృత మూలంలోని నిర్జీవ పాత్రలకు జీవం పోసి, తెలుగు భారతంలో సజీవ పాత్రలుగా మలిచాడు. తెలుగు భారతాన్ని పరమ స్వతంత్రంగా ఆంధ్రదేశపు జాతీయ ఇతిహాసంగా రూపొందించి, ప్రతి తెలుగు వాని హృదయంలో శాశ్వత స్థానం ఆక్రమించుకొనేటట్లు చేశాడు తిక్కన.

(ప్రా.ద.దే.చ.)

**తిట్ల దండకము**

రచనాకాలం : క్రీ. శ. 1800-75 నడుమ.

కర్త : చూ. పోలిపెద్ది వేంకటరాయకవి.

రావూరి దొరస్వామి "దండక వాఙ్మయం" (ఆంధ్రపత్రిక సంవత్సరాది సంచిక, హేమలంబ, 1957) లో ఇది దండకంగా చెప్పబడింది. (ఆం.సం.సా )

**తిన్నడు**

నామాంతరం : కన్నప్ప.

చూ. కన్నప్ప.

**తిమ్మకవి**

కాలం : క్రీ. శ. 18వ శతాబ్దం.

రచనలు : తెలియరాలేదు.

బిరుదు : శృంగార కవి.

నాసికేత పురాణ కర్తయైన తిరుమలనాథకవి ఈ తిమ్మకవికి తనయుడు. (ద.దే వా-290)

**తిమ్మ జగపతి మహారాజు**

కాలం : క్రీ.శ. 17వ శతాబ్దం.

స్థలం : పెద్దాపురం.

క్రీ. శ. 1649-1668 నడుమ సార్వభౌమ బిరుదంతో పెద్దాపురాన్ని పాలించిన రాజు. సాహిత్యపోషకుడు. ఏనుగు లక్ష్మకవిని ఆదరించి అతనిచేత రచనలు చేయించాడు. ద్రౌపదీ పరిణయ కావ్యకృతిపతి.

**తిమ్మ భూపాలీయమ్ (సం)**

కర్త : చెరుకూరు లక్ష్మీధరుడు.

ఇది, కవి తన ప్రభువైన తిరుమల రాయల పేరిట-ప్రసన్న రాఘవ సంస్కృత నాటకానికి సంస్కృతంలో చేసిన వ్యాఖ్యానం. (తె. వి. స-4)

**తిమ్మరాజు**

కాలం : క్రీ. శ. 15 వ శతాబ్దం చివరి భాగం.

కృతిపతి. నంది మల్లయ-ఘంట సింగయకవులు రచించిన,"శృంగార షష్ఠం" ఇతనికి అంకితం. ఇతని తండ్రిపేరు చిక్క తిమ్మరాజట. కర్ణాటక రాజవంశంలోనివాడై ఉంటాడనీ, ఆర్వీటి వాడనీ, పండితులు ఊహిస్తున్నారు. (ఆరుద్ర 6-250)

**తిమ్మరాజు లక్ష్మణరాయ కవి**

కాలం : క్రీ. శ. 19వ శతాబ్దం.

రచనలు : మార్కండేయ పురాణసార సంగ్రహము, కూర్మ పురాణసార సంగ్రహము, మత్స్యపురాణసార సంగ్రహము

పురాణ కథలను సులభమైన వచనంలో రచించిన కవులలో ముఖ్యుడు. మత్స్య పురాణ సార సంగ్రహాన్ని పువ్వాడ వేంకటరావుతో కలసి వ్రాశాడట. (క.స. 207)

**తిమ్మరుసు**

కాలం : క్రీ. శ. 16 వ శతాబ్దం.

స్థలం : విజయనగరం.

సాహిత్య పోషకుడు. నంజయ్య పుత్రుడు.

శ్రీకృష్ణదేవరాయల మంత్రి అయిన తిమ్మరుసుకు భిన్నుడు కావచ్చునని భావిస్తున్నారు. ఇతడు అచ్యుత రాయల వద్ద ఉద్యోగిగా ఉండేవాడట. చింతలపూడి ఎల్ల

నార్యుని (రాధామాధవకవి) ప్రోత్సహించి, "తారక బ్రహ్మరాజీయము" అనే వేదాంత గ్రంథాన్ని రచింప జేశాడు. రాధామాధవకవి శ్రీకృష్ణదేవరాయల కాలంలోని వాడే.
(కవి. స_ప్త - 25)

**తిరుక్కుడయూరి కృష్ణదాసు**

కాలం. : క్రీ. శ. 1800 కు పూర్వం.
రచనలు : 1. రామదాస చరిత్రము (యక్షగానం).
2. కృష్ణ శతకము.

ఇతని రామదాసు చరిత్రలో అనేక కీర్తనలు - పెక్కు శతకాల నుండి పద్యాలూ, ఉదాహృతాలు. (తె వి.స - 6)

**తిరుకాళ_త్తి**

నామాంతరం : నెల్లూరు చోడ తిక్కరాజు (మనుమసిద్ధి తండ్రి)
(తె.క.చ - 379)

**తిరుక్కురళ్ (సం)**

క_ర్త : వేదం పట్టాభిరామశాస్త్రి.

తమిళంలోని తిరుక్కురళ్‌లోని కొన్ని పద్యాలకు సంస్కృతానువాదం.
(తె.వి.స - 4)

**తిరునగరి వెంకటాచార్యులు**

స్థలం : హనుమకొండ
కాలం : క్రీ. శ. 17 వ శతాబ్దం.
రచన : యతిరాజ శతకము.

ఈ కవి ఇతర రచనలు తెలియరాలేదు. కవిత రసవంతంగా ఉంటుంది.
(గోలకొండ కవుల సంచిక - 411).

**తిరునాళ్ళ దండకము**

క_ర్త : తెలియదు.
అంకితం : వెలుగోటి కుమారయాచమ నాయకునికి (1777-1804).

ఈ గ్రంథక_ర్త ఎవరో తెలియదు. వేంకటగిరి సంస్థానంలో కాశీ విశ్వనాథ దేవాలయం అత్యంత ప్రసిద్ధి చెందింది. వెలుగోటి బంగారు యాచమనాయడు దీనిని కట్టించాడట. కుమారయాచమనాయడు (క్రీ.శ. 1777-1804) ఈ దేవాలయాన్ని అభివృద్ధి పరచి ప్రతి సంవత్సరం ఉత్సవాలు జరిపించేవాడట. విశ్వనాథస్వామి ఉత్సవసందర్భంలో జరిగే తిరునాళ్ళ వేడుకలను కన్నులకు కట్టినట్లుగా వర్ణించే రచన ఇది. వేంకటగిరి పాలకుడైన కుమార యాచమనాయనికి అంకితం. (ఆం.సం.సా-460)

**తిరుపాణాళ్వారు**

నామాంతరం : మాలదాసరి (చూ).

**తిరుమంగయాళ్వారి చౌర్యగాథ**

కర్త : చూ గోగులపాటి కూర్మనాథ కవి.
నామాంతరం : చోర సంవాదము.

(ఆం.సం.సా-416)

**తిరుమంగయాళ్వారు చరిత్ర**

కర్త : కోవెల తిరువేంగళదాసు.
అంకితం ; శోభనాచల నరసింహస్వామికి.

ఈ యక్షగానంలో పన్నిద్దరాళ్వారులలో ఒకడైన తిరుమంగయాళ్వారు పూర్వ చరిత్ర వర్ణితం. ఈ గ్రంథంలో సగం పద్యాలే ఉన్నాయి. ప్రసిద్ధ రాగతాళాలు, దరువులు, ద్విపదలు ఉన్నాయి దీనిని కవి "శృంగార నాటక గేయ ప్రబంధ"మని పేర్కొన్నాడు. (య.వా.చ. 132)

**తిరుమల కవి**

కాలం : క్రీ. శ. 18 వ శతాబ్దం.
స్థలం : పాండ్య మండలం.
రచన : 1. చిత్రకూట మాహాత్మ్యము (యక్షగానం).
(నామాంతరం -తిల్ల గోవిందరాజు నాటకం).

విద్వత్కవి. మధుర పాలకుడైన విజయరంగచొక్కనాథుని (1704 - 31) ఆస్థానంలోనివాడు. ద్విపద భారత సభాపర్వ కర్త బాలసరస్వతికి మనుమడు. వేంకటాధ్వరి పుత్రుడు ఇతని రచన సలక్షణంగా ఉంటుంది. (అరుద్ర-12-122)

**తిరుమల కృష్ణమాచార్యులు**

కాలం : క్రీ.శ. 18వ శతాబ్దం.
స్థలం : గద్వాల.
రచన : యథాశ్లోక తాత్పర్యరామాయణము (సుందరకాండము) (చూ.).

గద్వాలను పాలించిన సోమభూపాలుని ఆస్థాన కవి. అష్టభాషాకవితా ధురంధరుడు గద్వాల ప్రభువుల ప్రోత్సాహంతో అనువదింప బడిన యథాశ్లోక తాత్పర్య రామాయణములోని సుందరకాండను మూడు ఆశ్వాసాలుగా అనువదించాడు. (ఆ.సం.సా.)

**తిరుమల చిదంబరుడు**

కాలం : క్రీ. శ. 18 వ శతాబ్దం.
స్థలం : పుదుకోట.

ఖడ్గశాస్త్రవేత్త. ఖడ్గలక్షణ శిరోమణి రచించిన నవనప్పకు శాస్త్ర విషయాలలో ఇతడు సహకరించాడు. విశ్వకర్మనుమించిన ప్రజ్ఞ కలవాడని నవనప్ప ఇతన్ని నుతించాడు.

## తిరుమల దేవరాయలు

కాలం : క్రీ.శ. 16 వ శతాబ్ది ఉత్తరార్థం.

కవి, పండిత పోషకుడు. రామరాజభూషణ బిరుదాంచిత భట్టుమూర్తి విరచిత వసుచరిత్రకు కృతిపతి.

శ్రీకృష్ణదేవరాయల అల్లుడైన (అళియ) రామరాజుకు తమ్ముడు.

(తె.వి స-4)

## తిరుమలదేవరాయలు

కాలం : క్రీ. శ. 1831-1868.

స్థలం : ఆనెగొంది.

కవి పండిత పోషకుడు. గొప్ప సాహితీప్రియుడు. ఇతనివద్ద విద్యావిశారదుడైన కోలాచలం సేతుపతిశాస్త్రి కొంతకాలం దివానుగా పనిచేశాడట. (ఆం.సం.సా.)

## తిరుమలనాథకవి

కాలం : క్రీ.శ. 18 వ శతాబ్దం.

స్థలం : తంజావూరు.

రచనలు : 1. పరమ భాగవత చరిత్ర 2. పరమార్థదీపిక 3. పద్మినీ పరిణయము 4. దేవమల్లు చరిత్ర 5. నాసికేత పురాణము.

తిమ్మకవి పుత్రుడు. ఇతని రచనలలో నాసికేత పురాణం ఒక్కటి మాత్రం దొరికింది. తంజావూరులోని ధేనువాళము గరిడికి, పెద్దగరిడికి చెందిన జెట్టి కులస్థులు కొందరు కవులను పోషించారు. అందులో ఒకడైన అనంతజెట్టి తిమ్మాజెట్టి ప్రేరణతో, తిరుమల నాథకవి రచన సాగించాడు.

తండ్రి తిమ్మకవికి వలెనే ఇతనికి కూడా "శృంగారకవి" అనే బిరుదం ఉన్నదని కొందరి అభిప్రాయం. (ద.దే.వా-289)

## తిరుమల బుక్కపట్టణం (ఇమ్మడి) అణ్ణయ దీక్షితులు

కాలం : క్రీ. శ. 18వ శతాబ్దం మధ్యకాలం.

స్థలం : సురపురం సంస్థానం-బుక్కపట్టణం.

రచనలు : ఆచార్యవింశతి, తత్త్వగుణాదర్శ చంపువు, వ్యావహారికత్త్వ ఖండన సారము, అభినవ కర్ణామృతము, రసోదార భాణము మొ॥వి.

తిరుమల బుక్కపట్టణం ఇమ్మడి శ్రీనివాసాచార్యుల సోదరుడు. తుంగభద్రా నదీ దక్షిణతీరంలోని ఔకుసీమలో 'గుత్తి'కి దక్షిణంగా, 25 క్రోసుల దూరంలో ఉన్న బుక్కపట్టణం ఇతని నివాసం. క్రీ. శ. 1760-66 మధ్య సురపురం సంస్థానానికి వచ్చి ఆస్థాన పండితుడుగా స్థిరపడ్డాడు.

క్రీ శ. 1752లో సురపురం సంస్థానాన్ని పాలించిన పామినాయకుడు వైష్ణవ మతం స్వీకరింపదలచి, అణ్ణయ దీక్షితులను, అతని సోదరుడైన శ్రీనివాసాచార్యులను,

సంస్థానానికి ఒప్పించుకున్నాడట. ఈ సోదరులిద్దరూ గీర్వాణ భాషాభివృద్ధికీ, విశిష్టాద్వైత సిద్ధాంత ప్రచారానికి ఉపయుక్తంగా అనేక గ్రంథాలు వ్రాశారు. పామినాయకుని తరువాత అతని కుమారుడైన వేంకట నాయకుడు రాజైనాడు. కవి సోదరులు అతని కాలంలో కూడా ఆస్థాన విద్వాంసులుగా, రాజగురువులుగా ఉంటూ ప్రఖ్యాతి చెందారు. పైన పేర్కొన్నవి గాక అణ్ణయ దీక్షితుల రచనలింకా ఉన్నాయి. కాని, వాటిని గురించిన వివరాలు లభించటంలేదు. వీరి రచనలన్నీ సంస్కృతంలోనే ఉన్నాయి.

(ఆం. సం. సా-514, 516, 518)

**తిరుమల బుక్కపట్టణము (చిన) తాతాచార్యులు**

కాలం : క్రీ.శ. 19వ శతాబ్దం.
స్థలం : చితాపురం అగ్రహారం (కృష్ణా మండలం).
రచన : ఆంధ్ర విశ్వగుణాదర్శము (విశ్వగుణా దర్శము).

ఆశుకవిగా, ప్రబంధ కవిగా ప్రసిద్ధుడు. సంస్కృతంలో వెంకటాధ్వరి రచించిన విశ్వగుణాదర్శ చంపూ కావ్యాన్ని తెనుగు చేశాడు. వడ్లమన్నాటి వెంకటాచలం పంతులు ప్రేరణతో ఈ కావ్యం ఆంధ్రీకరించాడట. ఇతని చాటువులు ప్రసిద్ధాలు. తాడువాయి నరసింహం మీద, మేళ్ళ వాగుకు చెందిన ఒక వేశ్యమీద ఇతడు చెప్పిన పద్యాలు బహుళ ప్రచారం పొందాయి. బొగ్గవరపు పెదపాపరాజ కవి అనే స్నేహితుడు కష్టాలలో ఉన్నప్పుడు అతని కుటుంబాన్ని ఆదుకొన్న సౌజన్యమూర్తి. (ఆం. సం. సా.)

**తిరుమల బుక్కపట్టణము బుచ్చి వేంకటాచార్యులు**

కాలం : క్రీ శ. 19వ శతాబ్దం ప్రారంభం కావచ్చు.
స్థలం : ఆత్మకూరు.
రచనలు : వేదాంత కారికావళి, అభినవ శృంగార మంజరీ భాణము, కల్యాణ పురంజనము, శృంగార సర్వస్వము.

వీరు వ్యాకరణ తర్కశాస్త్ర విశారదులు. ఆత్మకూరు సంస్థానాస్థాన పండితులలో ఒకరు. సురపురము, గద్వాల మొ॥ పరిసర సంస్థానాలలో కూడా విశేష గౌరవాదరాలు పొందినట్లు తెలియవస్తున్నది.

వీరు సర్వతంత్ర స్వతంత్ర, కవితార్కిక కంఠీరవ ఇత్యాది బిరుదాంచితులైన తిరుమల బుక్కపట్టణం కిరీటి వేంకటాచార్యులవారి తమ్ముడు. (ఆం. సం. సా.)

**తిరుమల బుక్కపట్టణము వేంకటాచార్యులు**

నామాంతరం : కిరీటి వేంకటాచార్యులు.

**తిరుమల బుక్కపట్టణము (ఇమ్మడి) శ్రీనివాసాచార్యులు**

కాలం : క్రీ. శ. 18 వ శతాబ్దం మధ్య భాగం.
స్థలం : సురపురం సంస్థానం-బుక్కపట్టణం.
రచనలు : తత్త్వమార్తాండము, ఆనంద తారతమ్య ఖండన, జిజ్ఞాసాదర్పణము,

జ్ఞానరత్న ప్రకాశిక, తత్వదర్పణము, ప్రణవదర్పణము, ఓంకారవాదార్థ నయమణికలికా, విరోధ నిరోధము, విరోధవరూధినీ ప్రమాధిని (ఖండన గ్రంథం), నయద్యుమణి (దీపికా సహితం) ప్రధాన ప్రతితంత్ర దర్పణము, సిద్ధాంత చింతామణి, తత్త్వరత్న ప్రదీపిక గ్రహణభుక్తి దీపిక, హరిమణి దర్పణము మొ॥వి.

ఇతడు తుంగభద్రకు దక్షిణ తీరంలోని ఔకు సీమలో గుత్తికి దక్షిణంగా 25 కోసుల దూరంలో ఉన్న "బుక్కాపట్టణం" అనే గ్రామానికి చెందినవాడు. క్రీ. శ. 1752 లో సురపురం సంస్థానాన్ని పాలించిన పామి నాయుడు వైష్ణవం స్వీకరింప గోరి వీరిని సంస్థానానికి ఆహ్వానించాడట. 1760-66 ల మధ్య సురపురాన్ని ప్రవేశించిన ఇతడు ఆస్థాన విద్వాంసుడుగా ఉంటూ, గీర్వాణ భాషాభివృద్ధికీ, విశిష్టాద్వైత సిద్ధాంత ప్రచారానికీ ఉపయుక్తంగా అనేక రచనలు చేశాడు.

[ఆత్మకూరు సంస్థానానికి చెందిన తిరుమల బుక్కాపట్టణం శ్రీనివాసాచార్యులొకరున్నారు. ఈ ఇరువురు భిన్నమైనవారు కావచ్చుననే అభిప్రాయం దొణప్పగారి "ఆంధ్ర సంస్థానాలు-సాహిత్య పోషణ" అనే గ్రంథంలో ద్యోతకమవుతుంది.]

ఇమ్మడి అణ్ణయ దీక్షితులు ఇతని సోదరుడు. అతడూ సురపుర సంస్థానంలోనే ఉండేవాడు. (ఆం. సం. సా-514-518)

## తిరుమల భట్టారకుడు

కాలం : కీ. శ. 1450-1500 ప్రాంతం.

స్థలం : హైదరాబాదు రాష్ట్రంలోని లేమావిళ్ళ గ్రామం.

రచన : కాలామృతము.

ఇతడు అప్పకవి వంశీయుడట.

## తిరుమలరాజు

నామాంతరం : పొట్లపాడి తిమ్మరాజు.

కాలం: క్రీ. శ. 16వ శతాబ్దం ప్రథమభాగం.

సాహిత్య పోషకుడు. ఆరవీటి అళియ రామరాయలకు ఇతడు పెద తండ్రి.

దోనూరి కోనేరునాథుడనే కవి "బాలభాగవతం" అనే పద్యకావ్యాన్ని వ్రాసి ఇతనికి అంకితం ఇచ్చాడు. ఈ గ్రంథరచన 1543 తరవాతనే జరిగి ఉంటుందని కొందరి అభిప్రాయం. (ఆరుద్ర)

## తిరుమలరాజు

కాలం : క్రీ. శ. 19వ శతాబ్దం.

స్థలం : కార్వేటినగర సంస్థానం.

"శత్రుఘ్న విజయము" కృతిపతి.

తిరుమలరాజు కార్వేటినగర సంస్థాన పాలకుల బంధువర్గంలోని వాడు. క్రీ.శ. 16వ శతాబ్దంలో సంస్థాన ప్రభువుగా ఉన్న మొదటి కుమార వేంకట పెరుమాళ్ళరాజుకు సవతి తమ్ముడు. గరుడాద్రి సుబ్రహ్మణ్య కవిని ఆదరించిన సాహితీప్రియుడు. సుబ్రహ్మణ్యకవి కావ్యమైనట్టి "శత్రుఘ్న విజయ" ప్రబంధానికి కృతిభర్త. (అం.సం.సా.)

**తిరుమల రాయోదాహరణము**

రచనాకాలం : క్రీ. శ. 17వ శతాబ్ది చివర 18వ శతాబ్ది ప్రథమపాదం.

కర్త : సుదురుపాటి సీతారామయ్య (చూ).

అంకితం : కోటి తిరుమల నాయకునికి.

గ్రంథం అసమగ్రంగా లభించింది. పుదుక్కోట రాజుల వంశం వాడైన కోటి తిరుమల నాయకుని గురించి వివరించే కావ్యం. (ద.దే.వా-410)

**తిరుమలాంబ**

కాలం : క్రీ. శ. 1535 ప్రాంతం.

స్థలం : విజయనగరం.

రచన : వరదాంబికా పరిణయమ్ (సం).

ఈమె విజయనగర చక్రవర్తి అచ్యుతరాయల అస్థాన కవయిత్రి అని కొందరూ, అతని భార్య అని కొందరూ అభిప్రాయపడుతున్నారు. సంస్కృతాంధ్రాలలో విదుషీమణి. అచ్యుతరాయల వివాహమాదిగా అతని విజయాలను ఈకవయిత్రి కావ్యంగా రచించింది. ఈమె కావ్యంలో చారిత్రకాంశాలున్నాయి.

**తిరుమలాచార్యుడు**

నామాంతరం : శ్రీశైల దీక్షితుడు. (తె.వి.స-6)

**తిరువడాంబ శతకము**

కర్త : పుష్పగిరి తిమ్మన (చూ).

56 పద్యాలు మాత్రం లభించాయి. ములికినాడులో చిత్రావతీనదికి ఉపనదియైన కుశావతి ఒడ్డున సుగంధపురంలో వెలసిన పార్వతీదేవిని తిరువడంబ అంటారట. ఇది నేటి హిందూపురం తాలూకాలో ఉంది.

కుమార్తె పెళ్ళికోసం చేసిన అప్పుల బాధ తీర్చమని తిమ్మన ఈ దేవిని ప్రార్థిస్తూ ఈ శతకం చెప్పాడని అంటారు. (ఆరుద్ర 10-153)

**తిరువళ్ళూరు వీరరాఘవ శతకము (అలభ్యం)**

కర్త : ఉేకుమళ్ళ రంగశాయి. (శ.సా.వి.)

**తిరువాయి పాటి వేంకట కవి**

కాలం : 19వ శతాబ్దం-పూర్వార్ధం.

స్థలం : కొలనుపాక.

రచనలు : యాదగిరీంద్ర శతకము, యాదగిరి నరసింహ శతకము.

పరాంకుశుని కుమారుడు. మణవాల జీయ్యరు మనుమడు. (శ.క.చ-847)

**తిరువాయి మొడి**

కవి : కాంద్రవేటి రామానుజాచార్యులు (చూ).

ద్విపద కావ్యం. వైష్ణవ సంప్రదాయ గ్రంథం. (క.త-12-149)

**తిరు వేంగళనాథరాజు**

కాలం : క్రీ. శ. 18 వ శతాబ్దం-పూర్వార్థం.

స్థలం : కార్వేటినగర సంస్థానం.

ఇతడు కవిపండిత పోషకుడు. కార్వేటి నగర సంస్థానానికి చెందిన కనవ రాజుకు తమ్ముడు. (ఆం.సం.సా)

**తిలాన తరగతి**

ఇది ఒక దాక్షిణాత్య గీత ప్రబంధ విశేషం. నృత్యానుకూలమైన ప్రయోగం కలది. ఇది తెలుగు యక్షగానాలలో ప్రయుక్తం. బాగేపల్లి వారి కుచేలోపాఖ్యానంలో ఉంది. (య.వా.చ-329)

**తిల్ల గోవిందరాజ నాటకము**

నామాంతరం : చిత్రకూట మాహాత్మ్యము (చూ).

**తుక్కాదేవి**

రచన : తుక్కా పంచకమ్ (శ్లోకాలు).

ఈమెను గురించి చాల కథలు ప్రచారంలో ఉన్నాయి. ఈమె ప్రతాపరుద్ర గజపతి కుమార్తె. గజపతి ఓడిపోయి తన కుమార్తెను రాయలకిచ్చి వివాహం చేశాడు. ఈ వివాహం ఆమె తల్లికి నచ్చక రాయలను చంపించవలె ననుకొన్నప్పుడు, రాయలు విషయాన్ని గ్రహించి ఈమెను పుట్టింటికి పంపాడట. ఈమె పుట్టింటికి పోకుండానే కర్నూలు జిల్లాలోని నల్లమల అడవులలో స్థిర నివాస మేర్పరచుకొని, భర్తృ వియోగ దుఃఖాన్ని తెలుపుతూ అయిదు శ్లోకాలు వ్రాసి పంపిందని చెప్తారు. (తె. వి. స-4)

**తుక్కా పంచకమ్ (సం)**

నామాంతరం : భృంగ పంచకమ్.

కవయిత్రి : తుక్కాదేవి.

శ్రీకృష్ణ దేవరాయలు తన దేవేరి తుక్కాదేవిని అనుమానించి పుట్టింటికి పంపితే, ఆమె నల్లమల అడవులలో నివాసమేర్పరచుకొని, తాననుభవిస్తున్న దుఃఖాన్ని అయిదు శ్లోకాలలో వ్రాసి రాయల వారికి పంపిందట. అవే ఈ తుక్కా పంచకము. కాని ఇవి ఆమె వ్రాయలేదని పండితులంటున్నారు. పై శ్లోకాలలోని రెండు శ్లోకాలు వల్లభదేవుని సుభాషితావళిలోను, ఒక శ్లోకం ముకుళ భట్టు వ్రాసిన అభిధావృత్తి మాతృక

కాలం : తెలియదు.

లోనూ ఉన్నాయట. అందువల్ల పై శ్లోకాలను తుకా్కదేవి వ్రాయలేదని, ప్రాచీనుల శ్లోకాలనే దేవేరి రాయలవారికి పంపి ఉంటుందని విమర్శకులు అభిప్రాయ పడుతున్నారు. (తె. వి. వ-4)

## తుకో్కజీ

నామాంతర్యం : తులజాజీ (చూ).

## తుపాకుల అనంత భూపాలుడు

కాలం : క్రీ. శ. 1700 ప్రాంతం.
స్థలం : చెంజి (చంద్రగిరి).
రచనలు : 1. విష్ణుపురాణము 2. సుందరకాండము 3. భగవద్గీత (కళువె వీర రాజుతో కలిసి చేసిన రచన) 4. వచన భారతము.

కృష్ణరాజు పుత్రుడు. రాజకవి. చంద్రగిరి దుర్గ పాలకుడు. వచన రచనలో అగ్రగణ్యుడు.

మైసూరు సేనానాయకుడైన కళువె వీరరాజుతో కలసి వచన భారతం వ్రాశాడు. అందులో ఆది, సభా, భీష్మ పర్వాలు మాత్రం లభిస్తున్నాయి. భారతం అనుశాసనికపర్వం వచనం తంజావూరు గ్రంథాలయంలో ఉన్నదట. అందులో అనంత భూపాలుని గద్యయే ఉన్నదట. ముద్రితమైన భగవద్గీత (భీష్మపర్వంలోనిది) లో కూడ అనంత భూపాలుని గద్యయే ఉన్నది. కాని ఇది కళువె వీరరాజుతో కలిసి చేసిన రచన. ఈ వచన భారత రచనలో నారాయణయ్య అనే అతని తోడ్పాటు కూడా ఉందని కొందరు ఊహిస్తున్నారు. (క. త. 13-109; ద. దే. వా-479)

## తుమరాడ పాపకవి

కాలం : క్రీ.శ. 19వ శతాబ్దం.
స్థలం : విజయనగర సంస్థానం.
రచన : వైరాగ్య దర్పణము.

ఇతని గ్రంథం నుండి విజయనగర సంస్థాన చరిత్ర కొంత తెలియవస్తున్నది. (ఆం. సం. సా-418)

## తుమ్మ రాయపరెడ్డి

కాలం : క్రీ.శ. 17వ శతాబ్దం.
స్థలం : గుంటూరు మండలం.

సాహితీ ప్రియుడు. పింగళి ఎల్లనార్యుని ప్రోత్సహించి అతనిచేత క్రైస్తవ మత ప్రతిపాదకమైన సర్వేశ్వర మాహాత్మ్యమనే ప్రబంధాన్ని వ్రాయించాడు.

## తుమ్మలపల్లి నాగభూషణకవి

కాలం : క్రీ.శ. 1750 ప్రాంతం.
రచన : బసవ పురాణము. (వీ. శై. వా. చ-179)

## తుమ్మలపల్లి శివరామయ్య

కాలం : క్రీ.శ. 18వ శతాబ్దం.
స్థలం : నారాయణ పట్టణం.
రచన : సోమేశ్వర శతకము.

కవి హరిహరుని పుత్రుడు. బహుశాస్త్రవేత్త. తాను రచించిన శతకానికి తానే వ్యాఖ్యానం కూడా వ్రాసి జతపరిచాడట. (క. త. 12-314)

## తుమ్మెద పదాలు

పద కవితా విశేషం.

పాల్కురికి సోమన్న వీటిని పేర్కొన్నారు. ఇవి యక్షగానాలలో ప్రయుక్తాలు. కవితా జగత్తులో శృంగాపదేశ విషయాలు ప్రసిద్ధాలు. భాగవత దశమ స్కంధంలో భ్రమర గీతాలున్నాయి. వీటిలో ప్రాయికంగా ప్రియ వ్యపదేశం, శృంగార రసస్ఫూర్తి ఉంటుంది. అన్నమాచార్యుల శృంగార సంకీర్తనలలోను, ఏగంటి వచనాలలోను ఈ పదాలున్నాయి. (య. వా. చ-275-276)

## తురంగ పంచకము

కవి : నుదురుపాటి వెంకన్న (చూ).
రచనాకాలం : క్రీ.శ. 18వ శతాబ్దం.

అయిదు సీస పద్యాలలో చేసిన రఘునాథ తొండమాన్ అశ్వ వర్ణన. ఇందులో కవి అశ్వశాస్త్ర సంప్రదాయాలను పేర్కొన్నాడు. రచన ప్రౌఢంగా ఉంది.
(ద. దె. వా-అనుబంధం-541)

## తురగా రాజకవి-అయ్యంకి బాలసరస్వతి

కాలం : క్రీ. శ. 1580-1617.
రచన : నాగర ఖండము.
కృతిభర్త : ధవళేశ్వరపు మార్కండేయుడు.

విశిష్టత : తెలుగు జంట కవులలో వీరిది నాలుగో జంట. మొదటి జంట నంది- ఘంటలు; రెండో జంట బమ్మెర కేస- మల్ల కవులు; మూడో జంట అయ్యల రాజు అయ్యల భాస్కర కవులు. ఈ కవులు అభినవ విశ్రుత కవితా విభవులు; అఖిలాగమాంత విదులు. రాజకవి రసికుడు. బాల సరస్వతి అసమ ప్రతిభా విరాజి. స్కాంద పురాణంలోని "సనత్కుమార సంహిత" అనే నాగర ఖండాన్ని చంపువుగా వ్రాశారు. ఇందులో విశ్వకర్మ గొప్పతనం విశదంగా ఉంది. కృతిపతి మార్కండేయుడు, గోలకొండ నవాబు మహమ్మద్ కుతుబ్‌షాకు సన్నిహితుడైన అధికారి అట. (ఆరుద్ర-9; క. స-183)

## తురగా రామకవి

కాలం : క్రీ. శ.18వ శతాబ్దం.

ఈయన శాపానుగ్రహశక్తి ఉన్న కవి. తిట్టు కవిగా ప్రసిద్ధుడు. ఈయన వేట

వరపు పోతరాజును శపిస్తూ, తర్వాత ఆయన భార్య ప్రాధేయపడగా దీవిస్తూ చాటు పద్యాలు చెప్పాడు.

ఈ కవి తన బావయైన తల్లా ప్రెగ్గడ సూర్యప్రకాశరావు మీద కోపించి శపిస్తూ చెప్పిన పద్యమొకటి లభిస్తున్నది. నాగరఖండ కర్త ఇతడే అని వీరేశలింగం పంతులుగారు వ్రాశారు. (చా. ప. ర.)

**తురగా వెంకంరాజు**

కాలం : తెలియదు.

స్థలం : గుంటూరు మండలం.

రచనలు : మర్యాద రామన్న చరిత్ర.

ఆశుకవి. గుంటూరు జిల్లా పరస తాళ్ళూరనే గ్రామం వెళ్ళినపుడు, నర్ర పేరయ్య అనే గృహస్థు పెళ్ళిపందిట్లో తనను సమ్మానించలేదని ఆ పెళ్ళివారిని దూషిస్తూ చెప్పిన సీస పద్యం లభించింది. (చాప.ర.)

**తురయూరు సంస్థానం (తురైయూరు)**

దక్షిణదేశంలో, తెలుగు భాషా పోషణచేసిన సంస్థానం. ఇది తీర్థపురిగా కావ్యాలలో ప్రసిద్ధమైంది. తిరుచినాపల్లి మండలం కొల్లడమునకు ఉత్తరంగా ఉంది. దీనికి కొంతకాలం 'తురయూరు' రాజధానిగా ఉండేది. తర్వాతి కాలంలో వెంగనూరు రాజధాని అయింది. తంజావూరు, మధుర నాయకరాజుల తెలుగు భాషా సాహిత్యాల ప్రభావం వల్ల ఇక్కడ తెలుగు సారస్వతం అభివృద్ధి చెందింది. ఇక్కడి రాజులు పాండ్య భూపాలురకు సామంతులు. కృష్ణరాయల కాలంలో అన్నారెడ్డి, సూరారెడ్డి అనే సోదరులు అతవి దగ్గర నాయకులుగా ఉండేవారట. వారు నెల్లూరు మండలంలోని పల్లవోలి సీమవారు. తీర్థగిరి, మలైనాడు ప్రదేశాలలోని దోపిడి గాండ్రను అణచడానికి, రాయలు వీరిని పంపాడనీ, తర్వాత ఆ ప్రదేశాన్ని వారికి సర్వమాన్యంగా ఇచ్చాడనీ తెలుస్తున్నది. వీరికి రేవూరి కవులు ఆస్థాన కవులుగా ఉండేవారు. రేవూరి అనంతకవి రచించిన "గాధేయోపాఖ్యానం" తురయూరును పాలించిన లింగారెడ్డికి అంకితం. కుందుర్తి వెంకటాచల కవి తీర్థపురి పాలకులకు ఆశ్రితుడు.

**తురుమిళ్ళ రామన**

కాలం : క్రీ. శ. 16 వ శతాబ్దం.

స్థలం : కడప మండలం,

రచన : శేషధర్మములు.

గురువు : రఘునాథ భట్టాచార్యులు.

ఇతడు వేముల పుర పాలకుడైన కూనపులి చిన్న నాయకునికి కార్యనిర్వాహక కర్త. చిత్ర బంధ కవిత్వాలలో దిట్ట. తండ్రిపేరు నాగ మంత్రి. శేషధర్మములు వ్రాసిన వారిలో తాను ప్రథముడనని చెప్పుకున్నాడు. (మ. మా.)

## తులగాన నీలకంఠకవి

కాలం : తెలియదు.

స్థలం : తులగాము గ్రామం.

రచనలు : మాయా విలాసమ్ (సం), నీలకంఠల విలాసము.

సంస్కృతాంధ్రాలలో విద్వత్కవి. తులగాము గ్రామం గంజాం జిల్లా పర్లాకిమిడి తాలూకాలో ఉంది. ఇతని మాయా విలాసం పిడుపర్తి సోమనాథుని ప్రభులింగ లీలల ననుసరించి ఉంది. (భారతి–అంగిరస. ఫాల్గునం)

## తులజాజీ (తుళజాజీ)

నామాంతరం : తుక్కోజీ.

కాలం : క్రీ. శ. 18 వ శతాబ్దం.

రచనలు : 1 శివ కామ సుందరీ పరిణయము, 2. రాజరంజన విద్యావిలాసనాటకము, 3. నీతిపదములు, 4. సంగీత సారామృతమ్ (సం).

తంజావూరును పాలించిన (1728–36) మహారాష్ట్ర రాజు. కవి. కవి పోషకుడు. ఏకోజీ దీపాంబికల పుత్రుడు. సంగీత సాహిత్యాలను అభిమానించిన రాజు. తన రాజ్యంలో హిందూస్థానీ గాన పద్ధతులు ప్రవేశపెట్టాడు. సంగీత సారామృతం ఇతని సంగీతశాస్త్ర ప్రౌఢికి నిదర్శనం. ఇందులో శహజీ కాలం నాటినుండి ప్రచారంలో ఉన్న అనేక సంగీత పద్ధతులను నిర్వచించాడు.

ఇతని మీద ఎన్నో శృంగార పదాలు ఉన్నాయి. (ద దే.వా–24)

## తులసినోము పాట

కర్త : తెలియదు.

జానపద పారమార్థిక గేయం. ఇతివృత్తం సుప్రసిద్ధం.

చూ. పారమార్థిక గేయములు (ఆం.వా.చ.)

## తులసి బసవయ్య

కాలం : క్రీ. శ. 1590 కి ముందు.

రచన : సావిత్రి కథ (ప్రబంధం) (అలభ్యం).

విశిష్టత : తెలుగులో చాలామంది కవులవలె ఈయనకూడా సావిత్రి కథను ప్రబంధంగా వ్రాశాడు. ఈ కావ్యంలోనుంచి 26 పద్యాలను సేకరించి పెదపాటి జగ్గన్న తన ప్రబంధ రత్నాకరంలో ఉదాహరించాడు. ఇతర ప్రబంధాలలో కనబడని వర్ణనలుగాని, కల్పనలుగాని ఇందులో లేవు. కోడి కూరను సొగసుగా వర్ణించాడు. (ఆరుద్ర–9)

## తులసి రంగయ్య

కాలం : క్రీ. శ. 19 వ శతాబ్దం.

స్థలం : తంజావూరు.
రచనలు : తెలియరాలేదు
బిరుదు : అమృతకవి.

తంజావూరును పాలించిన మహారాష్ట్రరాజు శివాజీ (1833-55) ఆస్థానంలో ఉండేవాడు.

శివాజీ రచించిన అన్నపూర్ణా పరిణయ నాటకాంతంలో రంగనాథ కవీశ్వరుడు ఆశీర్వదించినట్లు ఉంది. అతడు ఇతడేనని కొందరి అభిప్రాయం. ఆ నాటక ప్రతిని నగరికి రాయించి ఇచ్చినది కూడా, అమృతకవి తులసి రంగయ్యయే. (ద.దే.వా-284-85)

**తులసీ రామాయణము**

కర్త : చూ. మండ కామేశ్వర కవి.

ఆంధ్రీకృత రచన. హిందీభాషలో తులసీదాసు రచించిన రామచరిత మానస సరోవర గ్రంథానికి ఇది ఆంధ్రీకరణం. కవి ఈ గ్రంథ రచన విషయంలో శిష్టు కృష్ణమూర్తిశాస్త్రి సహాయం స్వీకరించాడు. అయోధ్యకాండ భాగం కృష్ణమూర్తిశాస్త్రి రచన. మిగిలిన భాగం కామేశ్వర కవిది. హిందీ భాషలో ప్రసిద్ధమైన దోహా, చౌపాయి మొ॥ ఛందాలు తెలుగులోకూడా ఉపయోగింపబడడం ఈరచనలోని విశిష్టత.(ఆం.సం.సా-422)

**తులా మాహాత్మ్యము**

నామాంతరం : తుల్యానదీ మాహాత్మ్యము.
కర్త : ఏనుగు లక్ష్మణకవి.

**తుల్యానదీ మాహాత్మ్యము**

నామాంతరం : తులా మాహాత్మ్యము.
కర్త : ఏనుగు లక్ష్మణకవి (చూ).
అంకితం : వత్సవాయ జగన్నాథరాజుకు.
రచనాకాలం : క్రీ. శ. 17 వ శతాబ్దం.

ప్రబంధం. పెద్దాపురం సంస్థానాధీశ్వరుల వంశ చరిత్ర అవతారికలో విపులంగా ఉన్నది. (క.త-12-170)

**తుళువ నరసరాజు**

కాలం : క్రీ. శ. 15 వ శతాబ్దం.
స్థలం : ఉత్తరార్కాడు జిల్లా.

కర్ణాట దేశాధీశుడైన సాళువగుండ నరసింగరాయల సేనాపతి. సాళువగుండ నరసింగరాయల అనంతరం అతని పిల్లల తరపున రాజ్యం చేసింది ఇతడే. సాళువ వంశ పతనానంతరం ఇతడే రాజయ్యాడు. సాహితీ పోషకుడు. నంది మల్లయ్య - ఘంట సింగయ్యల చేత వరాహ పురాణం తెలుగులో వ్రాయించి అంకితం పుచ్చుకొన్నాడు. ఈ కర్ణాటక రాజులకు "ధరణీ వరాహ" అనే బిరుదు ఉంది. ఇతని కుమారుడే తుళువ శ్రీకృష్ణ దేవరాయలు. (ఆర్యుద-6-238)

**తూము పరశురామరెడ్డి**

కాలం : క్రీ.శ. 18 వ శతాబ్దం.
స్థలం : మహబూబునగరు మండలంలోని మామిడిమడ గ్రామం.
రచన : అలమేలు మంగా పరిణయము. (గో.కాం.క.సం)

**తెట్టు**

నెల్లూరు జిల్లా కావలి సమీపంలోని గ్రామం. ప్రసిద్ధ ఆశుకవి మోచర్ల వెంకన్న నివాసం. వెంకన్న వేంకటగిరి రాజావారి కొలువులో ప్రవేశించినప్పుడు "తెట్టు" గ్రామాన్ని చులకన చేసి మాట్లాడితే-అంత్యాను ప్రాసతో అత్యాశువుగా ఈ"తెట్టు" గ్రామ విశిష్టతను చాటి చెప్పాడట. (చా.ప.ర)

**తెట్టు సంస్థానం**

ఇది ప్రాచీనమైన కమ్మ రాష్ట్రంలోని ఆంధ్ర క్షత్రియ సంస్థానాలలో ఒకటి. కొండ వీడు మొదలుకొని, నెల్లూరులోని కందుకూరు తాలూకా గుడ్లూరు వరకుగల ప్రాంతం ఈ సంస్థానంలో ఉండేది. "తెట్టు" ఆనాటి పాలకులకు ముఖ్యపట్టణం. ప్రస్తుతం ఇది ఒక చిన్న గ్రామం మాత్రమే.

ఈ సంస్థానపాలకులకు వేజెళ్లవారని పేరు. వీరినే గుడ్లూరు ప్రభువులనికూడా పిలిచేవారు. క్రీ.శ 15వ శతాబ్దానికి చెందిన 'వేజెళ్ల పోలమరాజు' ఈ సంస్థానాన్ని స్థాపించాడు. సుమారు క్రీ.శ. 18వ శతాబ్దం చివరివరకు ఈ వంశంవారే ఈ సంస్థానాన్ని పాలించారు. 18 వ శతాబ్దం ఉత్తరార్ధంలో వేజెళ్ళ వేంకటనారాయణరాజు ఈ సంస్థానాన్ని పాలించాడు. ఇతనికే పెద్ద నారాయణరాజని పేరు. క్రీ.శ. 18 వ శతాబ్దం ప్రథమ భాగానికిచెందిన "వేజెళ్ళ అయ్యపరాజు" "గుడ్లూరు సీమను" జాగీరుగా సంపాదించి 'టంగుటూరు'లో కోటను కట్టుకొని జాగీరును అనుభవించాడు. అప్పటి నుండి వీరికి గుడ్లూరు ప్రభువులనే పేరుకూడా వ్యవహారంలోకి వచ్చింది.

ఈ సంస్థానపు ప్రభువులు గావించిన సాహిత్యసేవకు సంబంధించిన వివరాలు ఎక్కువగా లభించలేదు. కాని ప్రసిద్ధివహించిన 'మోచెర్ల వెంకన్న', 'మోచెర్ల దత్తప్ప' అనే సోదరకవులు ఈ వేజెళ్ళవారి సంస్థానంలోని వారే.

వేజెళ్ళ సంస్థానాధీశ్వరులలో "పెదనారాయణరాజే" చివరివాడు. ఆ తరువాత సంస్థానం కర్ణాటక నవాబుకు దఖలుపడిన పరిమిలా ఈ వంశం వారికి భరణాలు ఏర్పాటు చేయబడినాయి. (ఆం.సం.సా-173-176)

**తెనాలి అన్నయ్య**

కాలం : క్రీ.శ. 16 వ శతాబ్ది పూర్వర్ధం.
స్థలం : గుంటూరు మండలం - తెనాలి అగ్రహారం.
రచన : సుదక్షిణా పరిణయము (చంపువు).
గురువు : కందాళ శ్రీరంగాచార్యులు.

రామయమంత్రి పుత్రుడు.

విశిష్టత : ఈయన తెనాలి రామకృష్ణుని రెండో తమ్ముడు. ఇందుమతీ కల్యాణ కర్త తెనాలి రామభద్ర కవికి రామకృష్ణుడు, శ్రీగిరి కవి, అన్నయ్య తాతలవుతారట. ఈయన తాను పూర్వకవి పద్ధతిని పలుక గలిగిన వాడనని చెప్పుకొన్నాడు.

రచన ప్రౌఢంగా సలక్షణంగా ఉంది. (ఆరుద్ర-8-128)

## తెనాలి ఇమ్మడి రామకృష్ణుడు

కాలం : క్రీ. శ. 16 శతాబ్ది.
స్థలం : గుంటూరు మండలం - తెనాలి అగ్రహారం.
రచనలు : తెలియరాలేదు.

విశిష్టత : ఈయన తెనాలి శ్రీగిరి కవి కుమారుడు. ఈయన సంస్కృతాంధ్రాలలో కీర్తి పొందాడని, ఇతని కుమారుడు రామభద్ర కవి తన ఇందుమతీ కల్యాణంలో చెప్పాడు. ఈయన కావ్యాలు తెలియరాలేదు. (ఆరుద్ర-8-130)

## తెనాలి రామకృష్ణకవి

కాలం : క్రీ.శ. 16వ శతాబ్దం.
నామాంతరం : తెనాలి రామలింగడు.
సమకాలికులు : నాదెండ్ల గోపమంత్రి, నాదెండ్ల అప్పమంత్రి. ఈరదేచమంత్రి మొ॥
రచనలు : 1. ఘటికాచల మాహాత్మ్యము 2. ఉద్భటారాధ్య చరిత్రము 3. పాండురంగ మాహాత్మ్యము 4. లింగ పురాణము (కర్తృత్వం సందేహం) 5. కందర్పకేతు విలాసము (అలభ్యం) 6. హరిలీలా విలాసము (అలభ్యం).
బిరుదు : వికటకవి.

రామయ్య, లక్ష్మమ్మల పుత్రుడు.

విశిష్టత : ఉద్భటారాధ్య చరిత్రలో కవిపేరు రామలింగమనీ, పాండురంగ మాహాత్మ్యంలో కవిపేరు రామకృష్ణ కవి అనీ ఉంది. ఇందులో మొదటిది శైవ గ్రంథం, రెండోది వైష్ణవగ్రంథం. "లింగ" "కృష్ణ" భేదాలుండటంవల్ల, ఈ రెంటికీ కర్త ఒకడు కాదేమోనని పండితులు శంకిస్తున్నారు. "రామకృష్ణ కవిలింగ" అనే ప్రయోగం ఒకానొక చాటువులో లభిస్తున్నది. ఇతడు లింగ పురాణం రాశాడని చెప్తారు. కాని దానికి ఆధారాలేమీ లేవు. రెండు కావ్యాలలోని భావాలను బట్టి కవి నామధేయాలు "లింగడు", కృష్ణుడు" ఒకరేనని పండితులు నిరూపించారు. ఈ కవిని గురించి చాలా హాస్య కథలు తెలుగు దేశంలో ప్రచారంలో ఉన్నాయి. అవన్నీ కవికి సంబంధించినవి అవునో కాదో చెప్పటం కష్టం. ఇతడు సరస్వతీ స్వరూపుడని ప్రసిద్ధి. అతని హాస్యకథలను బట్టి వాక్చమత్కృతి కలవాడంటారు. కానీ ఆయన కవిత్వంలో హాస్యమంతగా కనిపించదు. కన్నడంలో కూడా ఇతని హాస్య కథలు విస్తృత ప్రచారంలో ఉన్నాయి. రామకృష్ణుని కావ్యాల కృతి భర్తల కాలాన్ని బట్టి ఈ కవి కృష్ణదేవరాయలకు వయసులో చిన్నవాడుగా, సమకాలికుడై, 15 శతాబ్ది ఉత్తరార్ధం నుండి, 16వ శతాబ్ది పూర్వార్ధంవరకు

జీవించి ఉండవచ్చు. ఈయన రాయల అష్టకవి దిగ్గజాల్లో ఒకడని ప్రబలమైన ప్రతీతి ఉంది. అది పొసగనూవచ్చు. తెనాలి కవి మొదట శైవుడై, అనంతరం వైష్ణవం స్వీకరించి ఉండవచ్చని పండితాభిప్రాయం. పాండురంగ మాహాత్మ్యంలో వైష్ణవ పరమైన గ్రంథమయినా శివభక్తి ఎక్కువగానే కనిపిస్తుంది. రామకృష్ణునిది ఒక ప్రత్యేకమైన స్వతంత్ర శైలి. ఇతని పద గుంఫనం అద్భుతమైంది నిగమ శర్మోపాఖ్యానం, అయుత నియతోపాఖ్యానాలు రామకృష్ణుని కవితకు మచ్చు తునకలు. మాధుర్య, సౌకుమార్యాది గుణాలున్న చక్కని శైలి, తీర్చిదిద్దినట్లు పద్యాలు వ్రాయటం, రస భావాల తీర్పు, కథా నిర్మాణ శక్తి, కథా రచనా శక్తి, బాగా తెలిసినవాడు రామకృష్ణ కవి. అచ్చ తెలుగు కూర్పులు చేయటంలో ఈ కవి మేటి. ఈతని కవితలో చక్కని జాతీయాలు, లోకోక్తులుంటాయి. ఈతని "నిగమశర్మ అక్క" పాత్ర శాశ్వతంగా నిలిచి ఉంది. భిన్న విధాలయిన ఈయన చాటువులు సుప్రసిద్ధాలు. (తె. వి. స-4)

## తెనాలి రామభద్రకవి

కాలం : క్రీ. శ. 16 వ శతాబ్ది.

స్థలం : గుంటూరు మండలం-తెనాలి అగ్రహారం.

రచన : ఇందుమతీ కల్యాణము (చంపువు).

విశిష్టత : ఇందుమతీ కల్యాణంలో ఈయన చెప్పిన ఒక పద్యం వల్ల, తెనాలి వారి కుటుంబంలోని మూడు తరాలలోని కవులు తెలుస్తున్నారు. తెనాలి రామకృష్ణుడు, శ్రీగిరికవి, అన్నయ్య వీరందరూ ఈయనకు తాతలు. శ్రీగిరికవి కొడుకు ఇమ్మడి రామకృష్ణునికి ఈయన రెండో కొడుకు. తాను "ప్రాజ్ఞ హృదయాబ్జరవి"నని ఈయన చెప్పుకొన్నాడు. ఈయన కృతి అముద్రితంగా తంజావూరు సరస్వతీ మహల్ గ్రంథాలయంలో ఉంది. ఇతని కవిత్వం మనోహరమైనది. (ఆరుద్ర-8-131)

## తెనాలి రామలింగకవి

కాలం : క్రీ. శ. 17 వ శతాబ్దం.

స్థలం : గోలుకొండ ప్రాంతం.

రచన : ధీరజన మనోవిరాజితము.

కవి అక్కన్న మాదన్నల కాలంలోని వాడు. ఉద్భటారాధ్య చరిత్ర కృతికర్త రామలింగకవి కంటె భిన్నుడు. విశ్వబ్రాహ్మణులకు సంబంధించిన వృత్తాంతాన్ని కావ్యంగా వ్రాశాడు.. (క. సప్త-298)

## తెనాలి రామలింగడు

చూ. తెనాలి రామకృష్ణుడు.

ఈయన "రామకృష్ణ కవి లింగడు"గా కూడా ప్రసిద్ధుడనే ప్రయోగం ఒకానొక చాటువులో లభిస్తున్నది. ఇతని హాస్య కథలు కన్నడంలో కూడా విస్తృత ప్రచారంలో ఉన్నాయి.

**తెనాలి వీరరాఘవుడు**

కాలం : క్రీ. శ. 16 వ శతాబ్ది.
స్థలం : గుంటూరు మండలం - తెనాలి అగ్రహారం.
రచనలు : తెలియరాలేదు.

విశిష్టత : ఈయన తమ్ముడు తెనాలి రామభద్ర కవి ఇందుమతీ కల్యాణ కర్త. ఇతడు తెనాలి శ్రీగిరికవికి మనుమడు. ఇమ్మడి రామకృష్ణకవి పుత్రుడు. ఈ వీర రాఘవుడు నరస కవితామహత్వంలో తాత తండ్రుల నందరినీ మించినవాడని ఇందుమతీ కల్యాణ కర్త రామభద్రుడు చెప్పాడుగాని, ఇతడు వ్రాసిన కావ్యాలను గురించి తెలియరాలేదు. (ఆరుద్ర-8-130)

**తెనాలి శ్రీగిరి కవి**

కాలం : క్రీ. శ. 16 వ శతాబ్ది పూర్వార్ధం.
స్థలం : గుంటూరు మండలంలోని తెనాలి అగ్రహారం.
రచన : శ్రీశైల మాహాత్మ్యము (అలభ్యం).

విశిష్టత : ఇతడు ప్రసిద్ధుడయిన తెనాలి రామకృష్ణ కవికి తమ్ముడు. సుదక్షిణా పరిణయకర్త అన్నయ్య కూడా ఇతని సోదరుడే. వీరు గార్లపాటి రామయామాత్యుని కుమారులు. వీరి గురించి ఇతని మనుమడైన తెనాలి రామభద్రకవి తన ఇందుమతీ కల్యాణంలో చెప్పాడు. (ఆరుద్ర-8-128)

**తెన్గుగు వ్యాకరణము**

రచనా కాలం : క్రీ. శ. 19 వ శతాబ్ది.
కర్త : రావిపాటి గురుమూర్తిశాస్త్రి.

ఇది చిన్న వ్యాకరణ గ్రంథం. చిన్నయసూరి బాలవ్యాకరణానికి ముందు ఇదే పాఠ్యగ్రంథంగా ఉండేది ఇందులో వ్యావహారిక రూపాలను కూడా సాధించారు.
(తెనుగు వ్యాకరణ వికాసం)

**తెలుగు జొమ్మయ్య కథ**

ఇది పాల్కురికి సోమన విరచిత బసవ పురాణంలో ఒక శివభక్తుని కథ.
(ఆరుద్ర-2-212)

**తెలుగు దేశంలో ఇంటిపేర్లు**

తెలుగు వారికి పేరుముందు ఇంటిపేరు ఉండటం పూర్వకాలం నుంచీ వస్తున్న సంప్రదాయం. ప్రప్రథమంలో వారు నివసించే గ్రామాలతో ఇంటిపేరు వస్తూ ఉండేది. ఇంటిపేరు చివరలో పూరి, పూరు, వూరు, పల్లి, పిల్లి, పూడి, పాటి, ప్రోలు, పురపు మొదలయిన పదాలు గ్రామార్థంలో రూఢమైనాయి.

కొందరి ఇంటి పేర్లలో వృత్తి సూచన బిరుదావళి సూచన, ప్రజ్ఞాప్రకర్షల సూచన ఉంటుంది. ఏ ఒక్క ఇంటిపేరూ ఒక కులానికిగాని, జాతికిగాని చెంది ఉండదు. ఒకే ఇంటిపేరు అన్ని జాతులలోను, అన్ని వర్ణాలలోను ఉండటం కద్దు.

ఇంకా ఈ ఇంటిపేర్లు ఈ దిగువ విధంగా ఉంటాయి : దేవుళ్ల పేర్లు, దివ్య స్థలాల పేర్లు, దివ్య గ్రంథాలపేర్లు, భూతాల పేర్లు, మనుష్యుల పేర్లు, జంతువుల పేర్లు, పక్షులపేర్లు, చెట్ల పేర్లు, అవయవాల పేర్లు, అలంకారాల పేర్లు, పరికరాల పేర్లు, కాయగూరల పేర్లు, భోజన పదార్థాల పేర్లు, రంగుల పేర్లు, కాలతల విశేషాల పేర్లు, వాద్య విశేషాల పేర్లు, వ్యాయామ విశేషాల పేర్లు, వ్యవహార విశేషాల పేర్లు - కొన్ని ఇంటి పేర్లు కుటుంబం పేరుతోనే దేశంలో స్థిరపడి పోయాయి. గంటి కుటుంబం, సోమయాజుల కుటుంబం, పంతుల కుటుంబం ఇలాంటివి.

తెలుగు దేశంలో పై రకాలయిన ఇంటిపేర్లు సుమారు ఒక కోటి వరకు ఉండవచ్చునని పండితుల అంచనా. ఇంటిపేర్ల చరిత్ర సంగ్రహించి పరిశోధించటం కష్టమైనపని. ప్రతి ఇంటి పేరుకీ ఒక రకమైన ప్రాముఖ్యం ఉండి తీరుతుంది. ఈ ఇంటి పేర్లన్నీ నేటి వ్యవహారంలో ఉన్నాయి. ఇవి చిత్ర విచిత్రంగా ఉంటాయి.

(భారతి - మార్చి 1945-228)

## తెలుగు భాషకు నిఘంటువులు కూర్చిన ఆంగ్లేయులు

కాలం : క్రీ.శ. 19వ శతాబ్ది పూర్వార్ధం.

1. కాంబెల్ దొర (చూ) తెలుగు-ఇంగ్లీష్ నిఘంటువు (1821).
2. బ్రౌన్, ఛార్లెస్ ఫిలిప్ (1) తెలుగు-ఇంగ్లీష్ నిఘంటువు (1853)
   (2) ఇంగ్లీష్-తెలుగు నిఘంటువు (1895).

(వీరేశలింగం పంతులు - సమగ్ర పరిశీలన-305; తె. సా. విమర్శ-89)

## తెలుగు భాషకు వ్యాకరణం వ్రాసిన ఆంగ్లేయులు

కాలం : క్రీ. శ. 19 వ శతాబ్ది పూర్వార్ధం.

1. విలియమ్ కేరి-తెలుగు భాషా వ్యాకరణము (Grammar of Telinga language-1814) 2. కాంబెల్ దొర-తెలుగు భాషా వ్యాకరణము (A Grammar of Telogoo language-1816) 3. విలియం బ్రౌన్-జంటూ వ్యాకరణము (తెలుగు వ్యాకరణం-1817) 4. బ్రౌన్, ఛార్లెస్‌ఫిలిప్-తెలుగు భాషా వ్యాకరణము (A Grammar of the Telugu language-1840) 5. ఇల్లిస్ దొర-తెలుగు భాషా వ్యాకరణము (Note : A Grammar of Teloogo language-1849)

(తె.సా. విమర్శ-89; వీరేశలింగం పంతులు-సమగ్ర పరిశీలన-305)

## తెలుగు భాషలో తొలి పుస్తక ముద్రణ

కాలం : క్రీ.శ. 1746 ప్రాంతం.

శ్రీరాంపూర్ (కలకత్తా)బాప్టిస్టు మిషనరీలు క్రీ.శ. 1746 లో నాగరి, తెలుగు, తమిళము, కన్నడం మొ॥ భాషలలో అచ్చు అక్షరాలు పోతపోయించారు. 1772 లో చెన్నపట్టణంలో అచ్చుయంత్రాన్ని నెలకొల్పారు.

తెలుగు భాషలో అచ్చయిన తొలి తెలుగు గ్రంథం, ప్రష్యా (జర్మనీ) లోని మాగ్డింబర్గ్‌కు చెందిన హ్యాలీ గ్రామంలో 1746-47లో వెలువడినట్లు పండితులు చెబు

తున్నారు. ఆ తొలి తెలుగు గ్రంథం బెంజమన్ షూల్జీ విరచితమైన" నూరు జ్ఞాన వచనములు".

తొలి తెలుగు గ్రంథముద్రణ శ్రీరాంపూర్ (కలకత్తా)లోనూ, మదరాసులోని ఫోర్ట్ సెయింట్ జార్జి కాలేజి ప్రెస్ (1812)లోనూ ప్రారంభమైంది.

(తె.సా.విమర్శ-89)

**తెలుగు భాషా వ్యాకరణము (Grammar of Telinga language)**

కర్త : విలియమ్ కేరి.

కాలం : క్రీ.శ. 1814 ప్రాంతం.

ఆంగ్లేయుడు వ్రాసిన వ్యాకరణం. ఈ వ్యాకరణ పీఠికలో, తెలుగు సంస్కృత భాషాజన్యమైనప్పటికీ, తెలుగు భాషలో విలక్షణ పదజాలమున్నదని గుర్తించి, వివరించారు. (తె.సా.విమర్శ-92)

**తెలుగు భాషా వ్యాకరణము (A Grammar of Teloogo language)**

కర్త : ఎ. డి. కాంబెల్.

రచనా కాలం : క్రీ. శ. 1816 ప్రాంతం.

ఆంగ్లేయుడు వ్రాసిన తెలుగు భాషా వ్యాకరణం. తెలుగు భాష సంస్కృత భాషాజన్య మైనదని చెప్పి, తెలుగుభాషా వ్యాకరణాన్ని వ్రాసిన విలియమ్ కేరి సిద్ధాంతాన్ని ఖండిస్తూ వ్రాసిన వ్యాకరణం.

తెలుగు సంస్కృత భాషాజన్యం కాదని, తమిళాది దాక్షిణాత్య భాషలతో సాన్నిహిత్యం తెలుగు భాషకున్నదని వాదించి, సిద్ధాంతీకరించిన భాషా వ్యాకరణమిది. ఇది 1816, 1818, 1840 లో మూడు ముద్రణలు పొందినదట.

(చూ. తెలుగు వ్యాకరణం-విలియమ్‌కేరి).

(చూ. తెలుగు వ్యాకరణం-ఇల్లీస్ దొర). (తె. సా. విమర్శ-92)

**తెలుగు భాషా వ్యాకరణము (1817)**

నామాంతరం : జంటూ వ్యాకరణము.

కర్త : విలియమ్ బ్రౌన్.

ఇది తెలుగు బాషకు ఆంగ్లేయుడు వ్రాసిన వ్యాకరణము.

(వీరేశలింగం పంతులు - సమగ్ర పరిశీలన-305)

**తెలుగు భాషా వ్యాకరణము (A Grammar of the Telugu language)**

రచనాకాలం : క్రీ శ. 1840.

కర్త : బ్రౌన్, ఛార్లెస్ ఫిలిప్ (చూ).

ప్రసిద్ధుడైన బ్రౌన్ దొరకు ముందు విలియమ్ కేరి (1814), కాంబెల్ దొర (1816), విలియమ్ బ్రౌన్ దొర (1817) తెలుగు భాషా వ్యాకరణాన్ని వ్రాశారు.

బ్రౌన్ తన వ్యాకరణంలో - తెలుగు భాషకు సంస్కృత భాషకు జన్య జనక సంబంధం లేదని సిద్ధాంతీకరించి ఎ. డి. కాంబెల్, ఇల్లిస్ దొరల వాదాన్ని బలపరుస్తూనే, సంస్కృత పదజాలంపై మాత్రం తెలుగు విశేషంగా ఆధారపడి ఉన్నదని అభిప్రాయ పడ్డాడు. (తె. సా. విమర్శ-12)

**తెలుగు రాయలు**

నామాంతరం : సాంపరాయని తెలుంగాధీశుడు (చూ).

**తేడపాచిపెంట**

నామాంతరం : "పాచిపెంట".

వివరాలకు-చూ. పాచిపెంట. (ఆం. సం. సా.)

**తేరపకవి**

కాలం : 1750 ప్రాంతం.

స్థలం : కర్ణాట దేశం.

రచన : తేరపావన శతకము.

ఇతడు కర్ణాట దేశీయుడైనా, తెలుగులో రచనలు చేశాడు. ఉళక్కి సోదరుడట. కామాక్షితాయి పెంపుడు కొడుకు. "తేరపావన నరేంద్ర-రమ్యగుణ సాంద్ర దశరథ రామచంద్ర" అనే మకుటంతో శతకం వ్రాశాడు. రచన సరళంగా ఉంది. (క. సప్త-91)

**తేరపావన శతకము**

రచనాకాలం: 1750 ప్రాంతం.

కర్త : తేరపకవి.

కవి కర్ణాట దేశీయుడు. "తేరపావన నరేంద్ర-రమ్యగుణ సాంద్ర-దశరథ రామచంద్ర" అనే మకుటంతో సీసపద్య శతకం వ్రాశాడు.

**తేవారము**

ఇది దైవస్తవ పరమైన తమిళ పద్య ప్రబంధ విశేషం. మాత్రాఛందో ఘటితం. (దీనిలోని "తేవ" శబ్దం సంస్కృత దేవ శబ్దానికి తమిళ తద్భవం కావచ్చు). క్రీ. శ. 19వ శతాబ్దం యక్షగానాలలో ఇది ప్రయుక్తం. తిరునారాయణాచార్యుల "శకుంతల" నాటకంలో, సత్యనారాయణ కథాసుధాలహరిలో ఇది ప్రయుక్తం. మరి కొన్ని యక్షగానాలలో తేవారము అచ్చంగా మాలినీవృత్తంవలె ఉంటుంది. (య. వా. చ-330)

**తేళ్ళపూడి కసవరాజు**

కాలం : క్రీ. శ. 16వ శతాబ్దికి పూర్వం.

రచన : కళావతీ శతకము (అలభ్యం).

పెదపాటి జగ్గన్న ఇతన్ని పేర్కొన్నాడు. ఇతనివి 3 పద్యాలు మాత్రం లభించాయి. (ఆరుద్ర - 9)

**తైత్తరీయోపనిషద్దీపిక (సం)**

కర్త : విద్యారణ్యుడు.

ఇది తైత్తరీయ ఉపనిషత్తుకు వ్యాఖ్య. (తె.వి.స-4)

**తొండమాన్ వంశావళి**

రచనాకాలం : క్రీ. శ. 18 వ శతాబ్దం.

కర్త : నుదురుపాటి వెంకన్న (చూ).

373 పాదాల సీస మాలిక. తొండమాన్ రాజుల వంశచరిత్ర విపులంగా ఉంది. పుదుక్కోట నిర్మాణాదులనూ మధుర, తంజావూరు రాజ్యాలతో సంబంధాలను తెలిపే ప్రామాణికమైన రచన. చరిత్రకారులకు మిక్కిలి ఉపయోగం. (ద.దే.వా-428)

**తొండమాన్వంశ ప్రతాప మాలిక**

కర్త : నుదురుపాటి సాంబశివ కవి.

రచనాకాలం : 18, 19 శతాబ్దం.

342 పంక్తుల సీసమాలిక. తన తండ్రి వెంకన్న రచించిన తొండమాన్ వంశావళికి అనుబంధంగా, కవి ఆ తర్వాతి రాజులను గూర్చిన విశేషాలతో పొందుపరిచాడు. చారిత్రకంగా అమూల్యమైన రచన. బ్రిటిషువారు రాయ రఘునాథునకు "హిజ్ ఎక్సెలెన్సీ" బిరుదు నివ్వడం వంటి చారిత్రక విషయాలను గ్రంథస్థం చేసిన రచన. (ద. దే. వా-445)

**తొండరడిప్పొడి యాళ్వారు**

చూ. విప్రనారాయణుడు.

**తొక్కడము మన్నారు శెట్టి**

కాలం : క్రీ. శ. 18 వ శతాబ్దం.

స్థలం : తంజావూరు.

తంజావూరులోని ధేనువాళము గరిడికి చెందినవాడు. సాహిత్య పోషకుడు. వెంకటశెట్టి, రంగమ్మల పుత్రుడు. బడగల నాటి సరస కవిని ప్రోత్సహించి రచనలు చేయించాడు. ఇతని సోదరుడు రామాశెట్టి కవి. అతని శతకం ఒకటి లభించింది.

ఇతని తండ్రి వెంకటశెట్టి జనుల తొక్కడములు వదిలించడంవల్ల తొక్కడము వెంకటశెట్టిగా ప్రసిద్ధుడైనాడు. తొక్కడము వీరి ఇంటి పేరుగా వాడుకలోనికి వచ్చింది. (ద.దే.వా-291)

**తొక్కడము రామాశెట్టి**

కాలం : క్రీ. శ. 1700 ప్రాంతం.

స్థలం : తంజావూరు.

రచనలు : "బాల చక్రవేమ భవ్యనామ" శతకము.

కవి ధేనువాళము గరికికి చెందిన తొక్కాడము మన్నారు శెట్టి సోదరుడు. వీరిరువురూ సాహిత్యాభిలాష కలిగిన వారు. కవి పండిత పోషకులు.

ఇతని రచన సరళంగా ఉంటుంది. (ద.దే.వా-293)

**తొలిపలుకు**

నామాంతరం : మున్నుడి.

గ్రంథాన్ని గురించీ, గ్రంథకర్తను గురించీ కొద్దిగా వ్రాసే పరిచయ వాక్యం. చూ. అవతారిక.

**తోహరా**

హిందూస్థానీ సంగీత ప్రభావం వల్ల తెలుగులో ఉద్భవించిన గీత రచన. ఇది 'దోరా' అనే పార్సీమట్టుకు మరొక పేరేమోనని పండితులు సందేహిస్తున్నారు. లక్షణంలోను, గతిలోను 'దోరా' లక్షణాలే దీనిలో ఉంటాయి. కథా సుధాలహరి మొదలైన కొన్ని యక్షగానాలలో ఇది ప్రయుక్తం. (య. వా. చ-380)

**తోకలవారు**

పశు పక్ష్యాదుల కుండే "తోక" పేరుతో కొన్ని కుటుంబాల వారి ఇంటి పేరు తెలుగు దేశంలో నిలిచిపోయింది. (భారతి-మా-45-230)

**తోటకూరవారు**

ఆకుకూర నామమే కొన్ని కుటుంబాల వారికి ఇంటి పేరుగా నిలిచి పోయింది. అట్లే తియ్యగూర ఇంటి పేరు కూడా. (భారతి-మా-45-230)

**తోట విజయరాఘవ కవి**

కాలం : క్రీ. శ. 19 వ శతాబ్దం.

స్థలం : మదరాసు.

రచనలు : నాయకీనాయక శతకము, ప్రార్థసారథి శతకము.

గురువు : కోడూరి కృష్ణమాచార్యులు.

పండితకవి. మదరాసు తిరువల్లిక్కేణి హిందూ బాలికాంధ్ర ద్రావిడ పాఠశాలలో ఉపాధ్యాయుడుగా పని చేశాడు. (శ. స-218)

**తోతినామా లేక చిలుక కథలు**

నామాంతరం : కీరబహత్తరి (చూ).

కర్త : తెలియదు. (వ. వా-61)

**తోభ్య చరిత్రము**

నామాంతరం : సర్వేశ్వర మాహాత్మ్యము (చూ).

కర్త : పింగళి ఎల్లనార్యుడు.

## తోలుబొమ్మలాటలు - విశిష్టత

తెలుగు దేశంలో ఇవి సుమారు వెయ్యి సంవత్సరాలుగా ఉన్నట్లు శాసన, సాహిత్యాధారాలున్నాయి. వీటిలో సాహిత్యం, సంగీతం, శిల్పం, చిత్రలేఖనం వంటి ఇతర కళలన్నీ కలిసి ఉన్నాయి. కడుపుబ్బ నవ్వించే హాస్యం ఉంటుంది.

తోలుబొమ్మలాట వారు బొమ్మలతో చక్కగా నాట్యం చేయిస్తారు. తెరవెనక నుంచి సూత్రధారుడు ఎంతో చాకచక్యంగా పాత్రాభినయం చేయిస్తూ ఉంటాడు. నాటక ప్రదర్శనకు ఎన్ని హంగులుంటాయో దాదాపు వీటికీ అన్ని హంగులుంటాయి. ఈ జట్టులోని పురుషులు పురుష పాత్రలను, స్త్రీలు స్త్రీపాత్రలను, పిల్లలు పిల్లల పాత్రలను తీసుకొంటారు. భర్త రాముడుగా వాచికం చెప్పి పాడితే, భార్య సీతగా వాచికం చెప్పి పాడుతుంది. తెరమీద బొమ్మలు ఎంతవేగంగా నాట్యం చేస్తూఉంటే అంతవేగంగా తెరలోపలి వ్యక్తులు అభినయిస్తూ ఉంటారు.

తోలుబొమ్మలాటల వారికి ప్రత్యేక సాహిత్యమంటూ లేదనీ, ఒకవేళ ఉన్నా అది దొరకలేదనీ పండితాభిప్రాయం. గోన బుద్ధారెడ్డి - కాచవిభుడు - విఠలరాజు మంజరీ ద్విపదలో వ్రాసిన "రంగనాథ రామాయణం" వీరి ప్రధాన జీవిక అని కొందరు భావిస్తున్నారు. కొన్ని యక్షగానాలను కూడా, వీరు బొమ్మలాట సాహిత్యంగా ఉపయోగిస్తూ దేశాటనం చేస్తూ జీవిస్తున్నారు.

వీటిలో హార్మోనియం శృతిగా ఉంటుంది. తాళాలు ఉంటాయి. వాద్యకాండ్రందరూ తెరవెనక వంతపాట పాడుతూ ఉంటారు. ఆడించేవారి కాళ్ళకింద బల్ల చెక్కలుంటాయి. ఆయాఘట్టాలను అనుసరించి చెక్కలను త్రొక్కుతూ ఉంటారు. రథాలు, గుర్రాలు పరుగులెత్తేటప్పుడూ, యుద్ధ ఘట్టాలలోనూ ఈ చెక్కలను టకటకా తొక్కుతూ ఉంటే చాలా రసవత్తరంగా ఉంటుంది. నగారా మ్రోతలకు ఖాళీ డబ్బాలను ఉపయోగిస్తారు పిడుగు పడ్డట్లు, ఉరుములు ఉరిమినట్లు డబ్బాలను మ్రోగిస్తారు.

తోలుబొమ్మలాటలకు సామాన్యంగా భారత రామాయణగాథలు ఇతివృత్తాలుగా ఉంటాయి. లంకా దహనం, మైరావణ, ఇంద్రజిత్తు వధ, యయాతి కథ, కీచకవధ ప్రహ్లాద చరిత్ర, రంగనాథ రామాయణం వంటివేగాక పల్నాటి వీరచరిత్ర, దేశింగురాజు కథవంటి వాటిని బొమ్మలాటవారు ప్రదర్శిస్తుంటారు.

వీటిలో బంగారక్క - కేతిగాడు లాంటివి విశిష్టమైన హాస్యపాత్రలు.

(నా.ర.చ-183-194)

## తోలుబొమ్మలాటలు - శాసన, సాహిత్యాధారాలు

ప్రాచీన తెలుగు శాసన సాహిత్యాలలో వీటి ప్రసక్తి ఉంది. కాకతీయులు వేయించిన గూడూరు, పానుగల్లు శాసనాలలో బొమ్మలాట వారి ప్రసక్తి ఉంది. పై శాసనాలను బట్టి వాటిలో ఉదాహృతులయిన కామ్మోజు, బ్రమ్మోజులు బొమ్మలాటలో సూత్రధారులని, వారు మరాఠీవారని, బొమ్మలాటలు అసలు మరాఠీవారివని తెలుస్తున్నది.

క్రీ. శ. 1208 ప్రాంతంలో తెలుగుదేశపు దుర్జయాన్వయులు - బొమ్మలాట సూత్రధారి బోమలయ అనేవానికి దానం చేసినట్లు ముక్త్యాల శాసనం ద్వారా తెలుస్తున్నది. ఇంకో శాసనంలో కడప జిల్లా కమలాపురం తాలూకాలోని చిడిపిరాల అనే గ్రామాన్ని - చంద్రయ్య, బొమ్మలాట అమృతకవి అనేవారు - తెరనాటకాలు ఆడటానికి పెద చిట్టెయ్య అనే వ్యక్తికి దానమిచ్చినట్లుంది.

చాళుక్యుల కాలం నాటికే తోలుబొమ్మలాటలు ఉన్నట్లు సాహిత్యాధారాలున్నాయి.

శివరాత్రి ఉత్సవాలలో వీటి ప్రదర్శన జరిగినట్లు పాల్కురికి సోమన్న పండితారాధ్య చరిత్రలో చెప్పాడు. నాచన సోముని ఉత్తర హరివంశంలోనూ, శ్రీనాథుని పల నాటి వీర చరిత్రలోనూ వీటి ప్రసక్తి స్పష్టంగా ఉంది.

ఇక కాకతీయుల కాలంలో మంజరీ ద్విపదలో రచితమైన "రంగనాథ రామాయణం", నాటి నుంచీ నేటి వరకు కూడా ఈ బొమ్మలాట వారికి జీవిక. తెలుగుదేశపు గ్రామసీమలలో నివసించే ఈ బొమ్మలాటవారు ఈ 20 శతాబ్దిలో కూడా "రంగనాథ రామాయణం"లోని గాథలనే బొమ్మలాటలుగా ప్రదర్శిస్తున్నారంటే ఆశ్చర్యపడవలసిన పనిలేదు (నా.ర.చ-184-186)

**త్యాగరాజ మొదలి**

కాలం : క్రీ. శ. 1830-1880 ప్రాంతం

స్థలం : ద్రావిడదేశం.

కృతి : 1. విద్వత్కర్ణామృతము (సుబ్రహ్మణ్య విజయము) 2. ఛందో రత్నాకరము.

ఈతని కవిత్వం సలక్షణమై మృదు మధురంగా ఉంటుంది.

(వీరేశలింగం పంతులు-సమగ్ర పరిశీలన)

**త్యాగరాజ వినోద విచిత్ర ప్రబంధ నాటకము**

నామాంతరం : (చూ) త్యాగరాజ వినోద చిత్ర ప్రబంధ నాటకము.

**త్యాగరాజ వినోదచిత్ర ప్రబంధ నాటకము**

నామాంతరం : త్యాగరాజ వినోద విచిత్ర ప్రబంధ నాటకము.

కర్త : శహాజీ (చూ).

అంకితం : త్యాగేశునికి.

ఆరు అంకాల నాటకం.

ఈ నాటకంలో సంస్కృతం, తెలుగు, మహారాష్ట్రి భాషలు వాడారు. సంస్కృతం ఎక్కువ. మృదు చిత్రవిస్తర కవితా నిర్వాహక విద్వాంసులకు కర్ణరసాయనంగా కవి దీన్ని వ్రాశాడట.

వివిధ నృత్య ప్రక్రియలలో శివునికీ, భద్రకాళికీ పందెం జరుగుతుంది.

భద్రకాళి ఓడిపోగా త్యాగేశుడామెను పందెంలో గెలిచినందుకు గాను పాణిగ్రహణం చెయ్యడం ఇందులోని ఇతివృత్తం.

ఇది శహాజీ సంగీత సాహిత్య ప్రతిభా సార్థకమైన రచన. రాగ తాళ కల్పన- సంగీత స్వరకల్పన- అద్భుతంగా నిర్వహింపబడ్డాయి. చిత్ర కవిత పాలు ఎక్కువ. ఇందులో భద్రకాళి శహాజీ రచించిన సంగీత ప్రధానమైన "త్యాగరాజ వినోద విచిత్ర ప్రబంధ నాటకాన్ని" ప్రదర్శిస్తుంది. (ద.దే.వా-189)

## త్యాగరాజు

కాలం : క్రీ.శ. 1767-1847.

స్థలం : తిరువయ్యూరు.

రచనలు : 1. నౌకా చరిత్రము 2. ప్రహ్లాద నాటకము 3. సీతారామ విజయము 4. కీర్తనలు. (సుమారు 600).

బిరుదు : నాదబ్రహ్మ.

గురువు : తులజాజీ చేత అర్ధ సింహాసన గౌరవం పొందిన శొంఠి వేంకట రమణయ్య.

ప్రముఖ వాగ్గేయ కారుడు. రామబ్రహ్మము కుమారుడు. ఇతని రచనలన్నీ భక్తి సంగీత పూరితాలు. సంగీత వాఙ్మయప్రపంచంలో త్రిమూర్తులనదగిన అన్నమయ్య క్షేత్రయ్య, త్యాగయ్యలలో ఇతడు తృతీయుడైనా అద్వితీయుడని పండితాభిప్రాయం. రామభక్తాగ్రణి. శహాజీ ఆస్థానంలో ప్రసిద్ధుడైన గిరిరాజ కవి ఇతని తాతగారట. త్యాగయ్య రామభక్తి నిరుపమానం. ఈతని పంచరత్న కీర్తనలు సంగీత సాహిత్యాలలో కవి ప్రౌఢతకు నిదర్శనాలు.

తిరువయ్యూరులో త్యాగరాజు పరమపదించిన చోట, ఆరాధనోత్సవాలు ప్రతి ఏడు పుష్య బహుళ పంచమినాడు జరుగుతుంటాయి. అక్కడ ఆలయం ఉంది. ఈ ఉత్సవాలలో పాల్గోవడం తమ జన్మ సార్థకతగా దక్షిణాది గాయకులు భావిస్తుంటారు. ఈ సంప్రదాయాన్ని ప్రారంభించినవారు గోవిందస్వామి పిళ్లై, బెంగుళూరు నాగరత్నం గారలు. (శారదా ధ్వజం-176)

## త్యాగేశ పదములు

నామాంతరం : శహాజీ రాజ పదములు (చూ).

## త్ర్యంబకరాయ మఖి

కాలం : క్రీ.శ. 17వ శతాబ్దం.

స్థలం : తంజావూరు.

రచనలు : 1. శ్రీ ధర్మమ్ (సం) 2. ధర్మాకూతమ్ (సం).

తంజావూరులో శహాజీ (1684-1712), శరభోజీ (1712-28) ల దగ్గర మంత్రిగా ఉండేవాడు. అప్పయ్య దీక్షితుని వంశంవాడు. గంగాధర మఖి కొడుకు.

ఇతడు 1696 లో కుంభకోణం దగ్గర 'స్వామిమల'లో యజ్ఞం చేశాడట. ఈ విషయం అప్పయ దీక్షితుని "ఆచార నవనీతం" లో పేర్కొనబడింది.

ధర్మాకూతం రామాయణానికి క్రొత్త పద్ధతిలో చేయబడ్డ వ్యాఖ్యానం.

(ద. దే. వా-181)

## త్రాగుబోతు ఆలుమగలు

ఈ పాత్రలు పింగళి సూరన్న రచించిన కళా పూర్ణోదయంలోనివి. సూరన్న వీరి సరసంతోపాటు వికారాలను కూడా వర్ణించాడు. వీరు విమానంలో జూదం ఆడుతూ పోతుండగా, యజ్ఞశర్మ భార్యలు రేవులో నీటబడి చేప మ్రింగిన తరువాత మింటికి ఎగ జిమ్మ బడ్డారు. ఆ నలుగురు సరిగ్గా ఆ సమయంలో పైన పోతున్న ఈ విమానంలో పడ్డారు. దేవతా మిధునం సరాగాలాడుకు-టూ, ఏకపాత్రలో మద్యపానం చేస్తూ, పాచిక లాడుతూ, ఆ నలుగురి ఎదుటా నిస్సంకోచంగా ప్రవర్తించడాన్ని సూరన్న విపులంగా వర్ణించాడు. ఇదొక రకమైన శృంగార తత్త్వం. ఈ స్త్రీల రూప లావణ్యాలకు తన నాథుని మనస్సెక్కడ చలిస్తుందో అని ఆ దివ్యకాంత భయపడుతుంది. అందుకే గోదా వరీ సమీపంలోని ధర్మపురిలో, ఒక వేశ్య సౌధోపరి భాగంపై వారిని వదలి వెళ్ళిపోతుంది. సూరన చిత్రించిన విభిన్న ప్రణయ తత్వాలలో ఇదొకటి.

(చూ. కళా పూర్ణోదయం; క. పూ. మున్నుడి-మ. కో. రె.)

## త్రింశత్తు

ముప్పది పద్యాలతో ఉండే కావ్య భేదం. (అప్పకవీయం)

## త్రికము

మూడు పద్యాలతో ఉన్న కావ్యం త్రికము. (అప్పకవీయం)

## త్రికాలవేది

ఇది మాదయగారి మల్లన విరచిత రాజశేఖర చరిత్రములోని పాత్ర. పింగళి సూరన్న ప్రభావతీ ప్రద్యుమ్నంలోని "శుచిముఖి" వంటిదే ఈ చిలుక. ఇది "ఉపమాతిశయోక్తి కామధేనువు"కు ఒజ్జబంతి యట. ఈ చిలుకకు ఈ పేరు పెట్టినది భాషాదేవి. ఏ శాస్త్ర విషయాలలోనైనా వేదవ్యాసునితో సైతం వాదించి, తానే గెలుస్తానని చమత్కారంగా చెబుతుంది. ఎట్టి రాయబారాన్ని అయినా చక్కగా నిర్వహిస్తానన్నది.

రాజశేఖరునికి, కాంతిమతికి వివాహమైన తరువాత - అప్పగింతల సమయంలో కాంతిమతి తల్లి కుమార్తెను ఈ చిలుకకే అప్పగిస్తుంది. ఈ చిలుక చక్కగా పౌరో హిత్యం నెరుపుతుంది. తెలుగు ప్రబంధాలలోని విలక్షణమైన పక్షిపాత్రలలో ఇది ఒకటి.

(తె.వి.సా-4-968)

## త్రిపుర విజయ చంపువు (సం)

కర్త : నరసింహ రాయమఖి.

## త్రిపుర విజయమ్ (సం)

కర్త : భోగనాథుడు. (తె. వి. స-4)

త్రిపుర విజయము (అలభ్యం)

కర్త : పెదపాటి సోమయ్య.

దీనిలోనుంచి ఒక సీస పద్యాన్ని అజ్ఞాత గ్రంథ సంధాత తన "ఉదాహరణ పద్యములు"లో సంకలనం చేశాడు. (ఆరుద్ర-9)

త్రిపుర విజయము (అలభ్యం)

కర్త : పోతరాజు వీరయ్య.

దీనిలోనుంచి నాలుగు సీస పద్యాలను అజ్ఞాత గ్రంథ సంధాత తన "ఉదాహరణ పద్యములు"లో ఉదాహరించాడు. (ఆరుద్ర-9)

త్రిపుర సంహార మకుటము (అలభ్యం)

కర్త : పాలపర్తి సోమేశ్వరుడు.

శతకం కావచ్చు. దీనినుంచి త్రిపురాసుర సంహారాన్ని వర్ణించే ఒక పద్యాన్ని పెదపాటి జగ్గన్న తన "ప్రబంధ రత్నాకరం"లో ఉదాహరించాడు. (ఆరుద్ర-9)

త్రిపుర సుందరీ శతకము

రచనాకాలం : క్రీ.శ. 1850 కి పూర్వం.

కర్త : శ్రీనివాసకవి.

ఈ శతకకర్త పేరు నిశ్చయంగా తెలియలేదు. ఇది 1888లో ఒకసారి, అంతకు పూర్వం ఒకసారి ముద్రితమైంది. ముద్రణ దోషాలు, లేఖన దోషాలు చాలా ఉన్నాయట. భక్తుడు త్రిపురసుందరీ దేవిని స్తుతిస్తున్నట్టుగా ఉన్న ఈ శతకంలో కవి మధుర మీనాక్షి, అరుణాచలదేవి, శ్రీకాళహస్తి జ్ఞాన ప్రసూనాంబ, కంచి కామాక్షి, కాశీ విశాలాక్షి అందరూ త్రిపుర సుందరీ మూర్తులేనని చెప్పాడు. "త్రిపురసుందరీ, ఆదిపురీ నివాసినీ" అనేది మకుటం. (శ. క. చ-547)

త్రిపురాంత కోదాహరణము (ఉదాహరణ గ్రంథం)

కర్త : రావిపాటి త్రిపురాంతకుడు.

రచనాకాలం: క్రీ. శ. 14 వ శతాబ్ది పూర్వార్ధం.

సమకాలికులు : రాయన భాస్కరుడు, అనవేమ, కుమారగిరిరెడ్డి.

విశిష్టత : ఈ గ్రంథాన్ని మొదట కీ. శే. మానవల్లి రామకృష్ణ కవి, తరవాత శ్రీ నిడదవోలు వేంకటరావు సంపాదకత్వం వహించి ప్రచురించారు. 'ఉదాహరణం' అంటే సంస్కృతంలో క్షుద్ర కావ్యంగా పరిగణిస్తారు.

తెలుగులో మొదటిఉదాహరణం పాల్కురికి సోమన 'బసవోదాహరణము.' త్రిపురాంత కోదాహరణం ద్వితీయమైనా, కావ్య శ్రేష్ఠతలో అద్వితీయం. (ఆరుద్ర-3-86)

త్రిపురారి దండకము (అలభ్యం)

కర్త : చూ. నెల్లూరి వీరరాఘవ కవి.

కవి తన వసుంధరా పరిణయంలో ఈ రచన గురించి చెప్పుకొన్నాడు. శివకేశ

వాత్మకమైన దండకం. ఇందులో స్తంభోద్భవం మొదలుగా తర్వాతి కథను కవి గద్య కావ్యంగా వ్రాశాడట. (ద. దే. వా-258)

## త్రిపురాసుర సంహారము

కర్త : తెలియదు.

జానపద పౌరాణిక గేయం. ఇతి వృత్తం ప్రసిద్ధం.

చూ. పౌరాణిక గేయములు (ఆం. వా. చ)

## త్రిభంగులు

గీత రచనావిశేషం.

క్రీ. శ. 16 వ శతాబ్దం చివరి నుంచి యక్షగానాలలో వీటి ప్రాచుర్యం కనిపిస్తుంది. త్రిభంగి - కవిజనాశ్రయం, కావ్యాలంకార చూడామణి, ఛందోదర్పణం, లక్షణసార సంగ్రహం, అప్పకవీయం మొదలైన లక్షణగ్రంథాలలో "ఉద్ధుర మాలావృత్తములు"లో ఒకటిగా పరిగణింపబడింది.

త్రిభంగిని గీత ప్రబంధంగా-బృహద్దేశి, సంగీత రత్నాకరం, సంగీత దర్పణం పేర్కొన్నాయి. తాళ విశేషంగా సంగీత మకరందం, సంగీత దర్పణం; తాళ ప్రబంధంగా సంగీత మకరందం పేర్కొన్నాయి. పై లక్షణాలేవీ తెలుగు యక్షగానాలలోని త్రిభంగులకు పట్టవు. లయగ్రాహి, లయవిభాతి మొ॥ వాటితోపాటు పరిగణింపబడిన త్రిభంగులు లయ విశిష్టాలు. వీటిలో జంపెతాళగతి ప్రచురం. గణపతిరెడ్డి గోపాల విలాసంలోను, జానకీ పరిణయంలోను, వాసంతికా పరిణయంలోను ఇవి ప్రయుక్తాలు. చూ. తిస్త్రబకము. (య.వా.చ-331-32)

## త్రిభువన మల్లదేవ చోడ మహారాజు శాసనము (సం)

కాలం : క్రీ. శ. 1091 ప్రాంతం.

స్థలం : తెలియదు.

శాసన ప్రదాత : త్రిభువనమల్లదేవ చోడ మహారాజు.

శాసన విషయం : త్రిభువన మల్లదేవ చోడుడు కేశవస్వామి ఆలయానికి అఖండ దీపం నెలకొల్పటం దీనిలోని ముఖ్య విషయం. శాసన రచయిత గుండిమెడ అన్న మంత్రి సాహిత్యంలో పండితుడనీ, సుకవీంద్రుడనీ శాసనంలో ఉంది. శాసన ప్రదాత రాజు కంటె, శాసన రచయిత గురించీ, అతని గుణగణాల గురించీ విపులంగా ఉంది. (తె. క. చ-194)

## త్రిభువన మల్లదేవుని శాసనము (తె)

కాలం : క్రీ. శ. 1137.

స్థలం : గుండియపూడి.

శాసన రచయిత : తెలియరాలేదు.

శాసన ప్రదాత : త్రిభువన మల్లదేవుడు.

శాసన విషయం : 'గుండియపూడి' గ్రామాన్ని త్రిభువన మల్లదేవుడు

భక్తితో శివునకు దానం చేయటం. దీనిలో ఒక చంపకమాల, చివర గద్య భాగము ఉన్నాయి. (తె. క. చ-233)

త్రిభువన మల్లరాజు కొణిదెన శాసనము

కాలం : క్రీ. శ. 1142.
స్థలం : గుంటూరు జిల్లా-చిలకలూరిపేట తాలూకా-కొణిదెన గ్రామం.
శాసన ప్రదాత : త్రిభువన మల్లరాజు.

శాసన విషయం : ఈ శాసనంలో త్రిభువన మల్లరాజు గుణగణాలున్నాయి. రాజు ఇక్కడికి దాపులో ఉన్న బల్లికురువ గ్రామాన్ని, కొట్యదొన (కొణిదెన) గ్రామాన్ని మహా దేవునికి దానం చేశాడట. శాసన ప్రదాత ఆదిత్య వంశ తిలకుడే కాక వెంకణా దిత్యుడట. ఈ శాసనం కొణిదెనలో వేంచేసి యున్న శంకరేశ్వరుని ఆలయంలో ఉంది. శాసనమంతా "తరువోజ"లో ఉంది. (తె. క. చ-239)

త్రిమూర్తి కల్యాణమ్ (సం)

నామాంతరం : కాదంబరి.
కర్త : అహోబల నృసింహసూరి.

గద్య కావ్యం. (తె. వి. స-4)

త్రిలింగములు

శ్రీ పర్వతము-కాళేశ్వరము-దక్షారామము అనే మూడు క్షేత్రాలలోని లింగాలు. వీటివల్లనే ఆంధ్ర దేశానికి త్రిలింగ సంజ్ఞ ఏర్పడినదని చెబుతారు.

త్రిలింగ లక్షణశేషము

నామాంతరం : ప్రౌఢ వ్యాకరణము.
కర్త : బహుజనపల్లి సీతారామాచార్యులు.
అంకితం : విజయనగర ప్రభువు ఆనంద గజపతి మహారాజుకు.

వ్యాకరణ గ్రంథం. బాల వ్యాకరణానికిది సవరణ, పూరణ గ్రంథం అని చెప్పవచ్చు. ఈ గ్రంథం తొలి ముద్రణ 1885 ఫిబ్రవరి నెలలో జరిగింది. దీనికి కూడా వివరణ గ్రంథాలు వచ్చాయి. బులుసు వేంకట రమణయ్య "సుబోధినీ" వ్యాఖ్యానం వ్రాశారు. టి. అర్ముగం పిళ్ళ 'కుమారదేవ పండితీయము' అనే వివరణం వ్రాశారు. (గజపతి రాజుల తెలుగు సాహిత్య పోషణ-146; తె.వి.స-4)

త్రిలోక సంజీవని (అలభ్యం)

కర్త : చిత్రకవి వెంకట రమణకవి (చూ)

త్రిలోచనాచార్యుడు

కాలం : క్రీ. శ. 14 వ శతాబ్ది ఉత్తరార్థం.
బిరుదు : శారదావల్లభుడు.
శాసన కర్త : వానపల్లి తామ్ర శాసనం రచించాడు. కొండవీటి నేలిన అనవేమారెడ్డి

ఆస్థానంలోని వాడు. (శ్రీనాథుడు–కొ. శ్రీ. మూ.)

**త్రివర్గ దీపిక**

కర్త : వేంకటరామ విద్యానందుడు.

ద్రావిడ భాషలో మకుటాయ మానమైన "తిరుక్కురళ్" గ్రంథానికి ఇది తెలుగులో వచ్చిన తొలి అనువాదం. మూలంలోని ధర్మకాండ, అర్థకాండ అనే రెండు భాగాలకు మాత్రమే ఇది తెనిగింపు. (తె. వి. స–4)

**త్రివిక్రమ విలాసము**

కర్త : రావూరి సంజీవరాయ కవి

రచనా కాలం : క్రీ. శ. 1780 ప్రాంతం.

కవి కృష్ణభక్తుడు. విష్ణుస్తుతి పరంగా ఈ కావ్యాన్ని రచించాడు. బహుళ ప్రచారం పొందిన రచన. (శ.క.చ. 373)

**త్రివిధ నీతిమాల**

కర్త : బహుజనపల్లి సీతారామాచార్యులు.

బాల బాలికలకు ఉపయుక్తంగా వ్రాసిన గ్రంథం.

**త్రివేణి**

కాలం : తెలియదు.

రచనలు : 1. రంగాభ్యుదయచంపువు 2. రంగనాథ సహస్రము 3. శ్రీరంగాభ్యుదయము 4. సంపత్కుమార విజయము 5. రంగరాట్సముదయము 6. తత్త్వముద్రాభద్రోదయము 7. శుక సందేశము 8. భృంగ సందేశము

ఈమె ఉదయేంద్రపుర అనంతాచార్యుల కుమార్తెయట. శ్రీరంగేశుని భక్తురాలు. సంస్కృత కవయిత్రి. (ఆ.భా. కవయిత్రులు)

**త్రిస్తబకము**

గీత రచనా విశేషం.

త్రిభంగుల వంటి రచనా విశేషమే యిది. ఇది గీతప్రబంధమో, తాళప్రబంధమో, తాళ విశేషమో కావచ్చునని పండితాభిప్రాయం. ఇది తెలుగు యక్షగానాలలో విరళ ప్రచారం కలది. విష్ణు మాయా విలాసం, భీమసేన విజయం వంటి యక్షగానాలలో ఇది ప్రయుక్తం.

దీనిలో ప్రతిపాదము, ఆద్యంత్య ప్రాసలతో కూడిన మూడు దళాల స్తబకం. (దీనిలో ఓలాల అనేది ఊతపదంగా ఉంటుంది). మూడు స్తబకాల సమాహారమే త్రిస్తబకము. (య.వా.చ)

**త్రైశంకవోపాఖ్యానము (అలభ్యం)**

కర్త : కవి సింగరన్న (చూ).

పద్యకావ్యం. ఇందులో కవి బహుశః హరిశ్చంద్రుని కథ చెప్పిఉంటాడని ఊహిస్తున్నారు. ఇందులోని పద్యాన్ని అప్పకవి లక్ష్యంగా ఉదహరించాడు. (క.త-12-150)

### త్రోటకము

ఇది నాటకానికి సదృశంగా ఉంటుంది. కొన్ని భేదాలు మాత్రం ఉన్నాయి. ఇందులో అయిదుకాని, ఎనిమిదికాని, తొమ్మిదికాని అంకాలుంటాయి. ప్రతి అంకంలోనూ విదూషకుడుంటాడు. శృంగార రసము అంగి. వీర హాస్యాదులు అంగాలు దివ్యమానుష సంయోగము దీని ముఖ్య లక్షణము. దీనిని కొందరు తోటకము అని అంటారు. ఉదా : విక్రమోర్వశీయము. (తె.వి.స - 6)

### దండకము

ఒక సంస్కృత వృత్త విశేషం. ఉద్ధురమాలా వృత్తాలకు సంబంధించినది. దీనిలోని పాదం ఇరవై ఆరు అక్షరాలకు మించి ఉంటుంది. సంస్కృతచ్ఛందోజాతమైనా తెలుగులో దీని కున్నంత వ్యాప్తి సంస్కృతంలో లేదు.

సంస్కృతంలో సాధారణంగా నగణద్వయం మీద ఏడు మొదలుకొని ఇష్టం వచ్చినన్ని రగణాలను నిల్పటం దండక లక్షణం. దీనిని నాలుగు పాదాలుగా కాని, ఏక పాదంగా కాని వ్రాయవచ్చు.

తెలుగు దండకం లక్షణాలివి : 1. ననహలపై కావలసినన్ని తగణాలు చివర గురువు 2. మొదటి నుంచి చివరి వరకు తగణాలు, చివర గురువు 3. ననలపై నగణాలు (999 అక్షరాల పర్యంతం రగణాలు నిలపవచ్చు) 4. ననలపై యగణాలు.

దండకం తెలుగులో గణబద్ధమైన వచనంగా ప్రఖ్యాతి పొందింది. తెలుగులో లభించిన ఈ రకమైన లఘుకృతులలో భోగినీదండకమే మొదటిది. నన్నయ భారతం, నృసింహ పురాణము, మార్కండేయ పురాణం, విక్రమార్క చరిత్ర, భాగవతము, పారిజాతాపహరణము, శ్రీకాళహస్తి మాహాత్మ్యము, పాండురంగ మహాత్మ్యము, కళా పూర్ణోదయము, రసికజన మనోభిరామము మొ॥ కావ్యాలలో దండకాలు స్తుత్యాత్మకాలై విరాజిల్లుతున్నాయి. చాలా దండకాల తాళపత్ర ప్రతులు అముద్రితంగా ప్రాచ్యలిఖిత గ్రంథాలయాల్లో భద్రంగా ఉన్నాయి. తెలుగులో దేవతాస్తుతికి సంబంధించిన దండకాలే గాక, భక్తి, శృంగార రసాత్మకాలున్నాయి. భయం, కోపం, ఆశ్చర్యం, బీభత్సం దండక రచనకు ముఖ్య విషయాలని కొందరంటారు.

ఆంజనేయ దండకం, నృసింహ దండకం, సూర్యనారాయణ దండకం, కనకదుర్గ దండకం, పోలేరమ్మ దండకం, నూకాలమ్మ దండకం ప్రసిద్ధాలు. ఇవికాక నవీన యుగంలో గాలివాన దండకం, ధూమశకట దండకం, దోపిడీ దండకం, జమాబందీ దండకం, పొగాకు దండకం లాంటివి వచ్చాయి. తొందర, ఆపత్తు, భయం, అధికార బాధ వీటిలోని ఇతి వృత్తాలు. వీటిలో చాలా దండకాల కర్తల పేర్లు తెలియవు.

(తె.వి.స-6)

## దండనాయక మల్లినాయకుని శాసనము

కాలం : క్రీ. శ. 1237.
శాసన ప్రదాత : మల్లినాయకుడు.
ప్రస్తావిత స్థలం : క్రాంజ గ్రామం (కాజ?).

శాసన విషయం : ఈయన చోడని దండనాథుడట. మల్లి నాయకుడు మహా సామంత, మహాసామంతాధిపతి, మహా ప్రచండ దండనాయకుడట. తన తల్లి కొమరమ దేవికి ధర్మార్థంగా క్రాంజ గ్రామంలో వేంచేసిన ఈశ్వరునకు అఖండ దీపం నిలిపినట్లు, వివిధ దానాలు చేసినట్లు ఈ శాసనం వల్ల తెలియవస్తున్నది. దీనిలో తొలుత కొంత గద్య, ఎత్తు గీతితో ఉన్న ఒక సీస పద్యం ఉన్నాయి. (తె.క.చ. 321)

## దండెయాడింపు పాట

గీత రచనా విశేషం. ఇది యక్షగానాలలో ప్రయుక్తం. ఒక వాద్య ప్రబంధం వంటిది. తాళ మృదంగ వాద్య పురస్సరంగా పూర్వం వివాహాది శుభ సందర్భాలలో ప్రవర్తిలుతుండేది. ఇది వీరభద్రకవి విరచిత బసవ మహిమామృత యక్షగానంలో ఉంది. (య.వా.చ. 334)

## దంతలూరి వేంకట కృష్ణంరాజు

కాలం : క్రీ. శ. 18 వ శతాబ్ది.

శిష్టు కృష్ణమూర్తి కవి ఈ రాజును ప్రశంసిస్తూ కొన్ని పద్యాలు చెప్పారు. (చా.ప.ర.)

## దంతులూరి గన్న భూపాలుడు

కాలం : క్రీ. శ. 14 వ శతాబ్ది.
కృతిభర్త: శ్రీనాథకవి విరచిత ధనంజయ విలాస కావ్యానికి.

ఈయన పెదకోమటి వేమారెడ్డికి మామ. ఈయన ప్రసక్తి పెదకోమటి వేముని భార్య సూరాంబిక వేయించిన ఫిరంగిపురం సంతాన సాగర తటాక శాసనంలో ఉంది (సూరాంబిక గన్న భూపాలుని కుమార్తె). గన్న భూపాలుడు ధాన్యవాటీ పురాధీశ్వరుడు. (శ్రీనాథుడు 149, 153 - కా.శ్రీ మూ.)

## దంపుళ్ళ పాటలు

చూ. సువ్వాల ద్విపదలు.

## దక్కను పూర్వకథలు

కర్త : చదలువాడ సీతారామశాస్త్రి.
రచనాకాలం : క్రీ.శ. 19వ శతాబ్దం.

దక్షిణ దేశంలో వాడుకలో ఉన్న ప్రాచీన కథలు. రచన సులభ వ్యావహారికంలో ఉంది.

దక్షయజ్ఞము

కర్త : తెలియదు.

జానపద పౌరాణిక గేయము. ప్రసిద్ధమైన కథ.

చూ పౌరాణిక గేయములు. (ఆం. వా. చ.)

దక్షాధ్వరము (అలభ్యం)

కర్త : మల్లికార్జున పండితుడు.

రచనాకాలం : క్రీ.శ. 12వ శతాబ్దం.

దక్షారామము

ఇది తూర్పు గోదావరి జిల్లాలో ప్రసిద్ధమైన పుణ్యక్షేత్రం. ఇక్కడ వేంచేసిన దైవం భీమేశ్వరుడు. ఆంధ్రదేశంలోని పంచారామాలలో ఒకటి. భీమేశ్వరాలయంలోని దాన శాసనాలు-చారిత్రక పరిశోధకులకు, సాహిత్యవేత్తలకు చాలా ఉపయోగపడినాయి. దీనికి దక్షిణ కాశి అనే పేరు కూడా ఉంది. వ్యాసుడు కాశీని వదిలిపెట్టి, భీమ మండలంలో తిరిగినట్లు కాశీఖండ, భీమేశ్వర పురాణాలవల్ల తెలుస్తున్నది. ఇది శ్రీనాథ మహాకవికి కాణాచి. చారిత్రక ప్రాముఖ్యమున్న ప్రదేశం.

ఇక్కడి చెరువులో సప్త గోదావరీ జలమున్నదట. ఆంధ్రసాహిత్యంలో ఈ క్షేత్ర ప్రసక్తి ఎక్కువగా కనిపిస్తుంది.

దక్షిణ ద్వారకాస్థల వర్ణన (అలభ్యం)

కర్త : విజయరాఘవ నాయకుడు.

రచనాకాలం : క్రీ.శ. 17వ శతాబ్దం.

మన్నారుగుడి అంటే దక్షిణ ద్వారక. ఇదే చంపకారణ్య క్షేత్రం. 'దక్షిణ ద్వారకా స్థల వర్ణనా భాగ ముద్ధరించిన సుప్రసిద్ధ చరిత', అని కవి పేర్కొనబడ్డాడు. కాబట్టి ఈ స్థల మాహాత్మ్యాన్ని సంస్కృతంనుండి తీసుకొని తెలుగులో వ్రాసి ఉంటాడని తోస్తున్నది. సంస్కృతంలో "అగ్నికల్పం"లో ఈ క్షేత్ర వర్ణన మున్నదట.

(ద. దే. వా-88)

దక్షిణాంధ్ర వాఙ్మయము

(క్రీ. శ. 1600 నుండి 1800 వరకు)

ఆంధ్ర వాఙ్మయ చరిత్రలో కృష్ణరాయల యుగం తరువాతది దక్షిణాంధ్ర యుగం. తెలుగుదేశంలో కాకుండా దక్షిణదేశ సంస్థానాలైన తంజావూరు, మధుర, పుదుక్కోట, మైసూరు, చెంజి, సుగుటూరు మొ॥ సంస్థానాలలో వెలువడిన తెలుగు సారస్వతాన్ని దక్షిణాంధ్ర వాఙ్మయంగా పండితులు పరిగణిస్తున్నారు. దీనినే దక్షిణదేశీయాంధ్ర వాఙ్మయమని కూడా అంటారు. తెలుగు సాహిత్యాన్ని పోషించిన సంస్థానాలలో మధుర, తంజావూరు ముఖ్యమైనవి. విజయనగర రాజుల కాలంలో కంపరాయలు (14వ శతాబ్దం) దక్షిణదేశాన్ని జయించి తురుష్కులను పారద్రోలిన తర్వాత అయా

రాజ్యాలకు పూర్వపాలకులనే ప్రతినిధులుగా నియమించటం జరిగింది. కృష్ణదేవరాయల కాలంలో చోళపాండ్య మండలాలలో కల్లోలాలు రేగినప్పుడు నాగమనాయకుడు కృష్ణ రాయల ప్రతినిధిగా దక్షిణమండలాన్ని స్వాధీనం చేసుకొని దానిని రాయలకు వశం చేయ కుండా తానే పాలింపసాగాడనీ, రాయల ఆజ్ఞపై నాగమనాయకుని కుమారుడు విశ్వనాథ నాయకుడు తండ్రిని జయించి బందీగా రాయల వారికి అప్పగించాడనీ చరిత్ర చెపుతున్నది. ఈ విశ్వనాథనాయకునే మధురలో తన సామంతునిగా రాయలు నియమించాడు (1509–30 ప్రాంతం). విశ్వనాథుని వెంట విజయనగరం నుండీ, ఆంధ్రదేశం నుండీ, అనేక తెలుగు కుటుంబాలు మధురకు చేరుకున్నవట. ఈ విధంగా తెలుగు వారనేకులు తమిళ దేశంలో స్థిరపడటం జరిగింది. విశ్వనాథ నాయకుని సంతతివారు మధుర మండలాన్ని క్రీ. శ. 1736 వరకు పాలించారు. వీరి కాలంలో తెలుగు దక్షిణదేశంలో వ్యవహారభాషగా నిలద్రొక్కుకున్నది. విజయనగర ప్రభువైన అచ్యుతనాయకుని (16 వ శతాబ్దం)కాలంలో ఆతని తోడిఅల్లుడు పినచెవ్వప్ప తంజావూరు మండలానికి ప్రతినిధిగా నియమితుడయ్యాడు. ఇది 1550–80 ప్రాంతాలలో జరిగింది. అప్పటి నుంచి అతని సంతతి వారు కొంతకాలం విజయనగర సామ్రాజ్యానికి విధేయులుగానూ తరువాత స్వతంత్రులుగానూ 1673 వరకు తంజావూరును పాలించారు. రాజులు తెలుగువారు కావడం చేత తెలుగు భాషకు అక్కడ చాలా ప్రాముఖ్యం లభించింది. ఆ వెనుక తంజావూరు మహారాష్ట్ర రాజుల వశమైంది. వారు మహారాష్ట్రులైనా అంతవరకూ ఆ మండలంలో వ్యవహారంలో ఉన్న తెలుగును ఆదరించి సాహిత్యపోషణ చేశారు. 1674 నుండి 1855 వరకు తంజావూరులో వీరిపాలన కొనసాగింది. ఈ కాలంలో వెలువడిన తెలుగు సాహిత్యం అపారం. కావ్యాలు, యక్ష గానాలు, సంగీత నృత్యరూపకాలు, దండకాలు, శతకాలు, ఉదాహరణ కావ్యాలు మొదలైన అన్ని శాఖలలోనూ ఇతోధికంగా తెలుగు సారస్వతం వెల్లివిరిసింది.

పుదుకోట నేలిన తొండమాన్ రాజులు, సుగుటూరు పాలకులు, మైసూరు పాలకులు, చెంజి నాయకులు తెలుగు సాహిత్యాన్ని ఆదరించారు. అన్ని సారస్వత శాఖలలోనూ, దక్షిణాంధ్రయుగంలో సాహిత్యాభివృద్ధి జరిగినా, దక్షిణాంధ్ర యుగం అనగానే ఎక్కువగా యక్షగానాలు స్ఫురిస్తాయి. ఈ కాలంలో మోహశృంగార కావ్యాలు ఎక్కువగా వెల్వడ్డాయని కొందరంటారు. స్థూలంగా పరిశీలిస్తే ఈ యుగంలో వెలు వడిన వాఙ్మయం అన్ని శాఖలకూ సంబంధించి ఉన్నదని తెలుస్తుంది. వేదాంత సంబంధ మైన రచనలు, యక్షగానాలు, తీర్థమాహాత్మ్యాలు ఈ యుగంలో కొల్లలు. సాంత్వనరచ నలు, విలాస కావ్యాలు కూడా ఆ యుగ లక్షణాన్ని ప్రతిబింబిస్తూ వెలువడిన రచనలని చెప్పవచ్చును. వచన వాఙ్మయం మధురాపురాంధ్ర వాఙ్మయపు ప్రత్యేకత.

## దగ్గుపల్లి దుగ్గన

కాలం : క్రీ. శ. 15 వ శతాబ్ది ఉత్తరార్థం.

రచనలు : 1. కాంచీపుర మాహాత్మ్యము (అలభ్యం) 2. నాసికేతోపాఖ్యానము.

ఇతడు శ్రీనాథునికి బావమరిది, శిష్యుడు కూడా. తిప్పన, ఎల్లమ్మల పుత్రుడు. సమకాలికులు నందిమల్లయ - ఘంట సింగయ, దూబగుంట నారాయణ కవి.

ఈ కవి చిత్తవృత్తి పారమార్థిక పరాయణం, శమ సంపన్నం. ఇతడు సకల విద్యాచతురుడు. ప్రసాద గుణంతో కవిత చెప్పాడు. ఇతడు కృష్ణా మండల నివాసి అనీ గుంటూరు మండల నివాసి అనీ అభిప్రాయ భేదాలున్నవి. (క. త-6-101)

## దత్తయోగీంద్ర కావ్యము

కర్త : వేగినాటి కొండన్న.

రచనాకాలం : క్రీ. శ. 1600 ప్రాంతం.

అంకితం : దత్తాత్రేయ స్వామికి.

సీస పద్య శతకం. వేదాంత నీతి విషయాలున్నాయి. (ఆరుద్ర-9-260)

## దత్తరత్న ప్రదీపిక (సం)

కర్త : చూ. తిరుమల బుక్క పట్టణం (ఇమ్మడి) శ్రీనివాసాచార్యులు.

సంస్కృత రచన. (ఆం. సం. సా-516)

## దత్తాత్రేయ చరిత్రము (అలభ్యం)

కర్త : వెలగపూడి వంశానికి చెందిన కవి. పేరు తెలియడంలేదు.

వెలగపూడి కృష్ణయామాత్యుని భానుమద్విజయ కావ్యంలో దీని ప్రసక్తి ఉంది. (ద. దే. వా-388)

## దత్తాత్రేయ యోగి

కాలం : క్రీ. శ. 16 వ శతాబ్దం. 1550 ప్రాంతం కావచ్చును.

స్థలం : మాహూరీ క్షేత్రం.

రచన : వేదాంత వ్యవహార సార సంగ్రహము.

ఇతడు మహారాష్ట్రుడు. తెలుగు దేశంలో ఎక్కువ ప్రఖ్యాతి పొందాడు. ఇతని శిష్యులు చాల మంది తెలుగు వారట. వారి సహాయంతో పై వేదాంత గ్రంథాన్ని వ్రాసి ఉంటాడని విమర్శకుల అభిప్రాయం. (క. స-93)

## దత్తాత్రేయ శతకము

కర్త : నిత్యానందయోగి.

దీనిలో సాంఖ్య, తారక, అమనస్క, అచల సిద్ధాంతాల వివరణం ఉంది. (శ.సా.వి.)

## దత్తాత్రేయ శతకము

కవి : (చూ) పరమానంద తీర్థుడు.

కంద పద్యాల శతకం. ఆంధ్రదేశంలో మంచి ప్రచారంలో ఉండేది. ఈ పద్యాలు ఒరవడిగా పెట్టి చూచివ్రాత వ్రాయించేవారు. (ద.దే.వా-298)

## దత్తాత్రేయులు, సింగరాజు వేంకట సుబ్బయ్య

కాలం : క్రీ. శ. 1840 ప్రాంతం.

రచన : రామాయణము (వచన కావ్యం).

జంట కవులు. వీరి రచనలో దత్తాత్రేయులు రచించిన అరణ్య కిష్కింధ కాండలు, వేంకట సుబ్బయ్య రచించిన యుద్ధకాండ మాత్రం లభిస్తున్నాయి. (క.స-94)

## దత్తెన సోమన రాజమహేంద్రవర శాసనము

కాలం : క్రీ. శ. 1149.

చూ. సోమన ప్రెగ్గడ.

శాసనప్రదాత, రచయిత : దత్తామాత్యుని కుమారుడు సోమన (సోమన ప్రెగ్గడ).

శాసన విషయాలు : శాసన ప్రదాత సోమన చాళుక్య భీమవరం (సామర్లకోట), దక్షారామం, అమరావతి, సోమారామం (గుడిపూడి), పాలకొల్లు (క్షీరారామం), పట్టిసం (వీరభద్రేశ్వరం), జాపట (భావపట్టు), చేబ్రోలు (తామ్రపురి), పిఠాపురం, ఘంటసాల, కొతరం, ఏలేశ్వరం, వేగేశ్వరం (వేంగి), బెజవాడ (విజయవాటిక), ఉండవల్లి, వేల్పూరు, గుంటూరు, కళ్ళేపల్లి (కడలుపల్లి) మొదలయిన చోట్ల ఆయా దైవాలకు అఖండ దీపాలు నిలిపాడట. గుంటూరులో గుడులు కట్టించి చెరువులు త్రవ్వించాడట. మరికొన్ని చోట్లకూడా ఈ సోమన అఖండ దీపాలు నిలిపాడట. దీనిలో ఎత్తుగీతితో ఒక సీసపద్యం, ఒక శార్దూలం, ఒక కంద పద్యం ఉన్నాయి. (తె.క.చ-246ఎ, 246బి)

## దమ్మడపు సెబాసు మంత్రి

కాలం : తెలియదు.

ఈయిన దాన శీలాన్ని కీర్తిస్తూ ఎనిమిది చాటు పద్యాలు దొరికాయి. కవి పేరు తెలియదు. (చా.ప.ర.)

## దమ్మవళం పుల్లప్ప

కాలం : తెలియదు.

స్థలం : గుంటూరు జిల్లా నరసరావుపేట సమీపంలోని కుంకులగుంట.

ఇతడు పెద్ద దాత. ఇతని మీద మూడు చాటువులున్నాయి. ఈయన నరసరావుపేట జమీందారులు మల్రాజు గారి కొలువులో ఉండి, వసూలు చేసిన శిస్తు పైకాన్ని సంతర్పణలకు, బహుమానాలకు ఖర్చు పెట్టాడట. (చా.ప.ర.)

## దరువులు

దేశి సారస్వతానికి చెందిన గేయ రచనలు.

ఇవి బహు యక్షగానాలలో ప్రయుక్తం. దరువు సంస్కృత నాటకాలలోని ధ్రువవలె ప్రయోజన వ్యవహార నామం. దరువు ఒక విధమైన రేకు కావచ్చు లేక తత్పరి

యోగ సందర్భానికి పఠికివచ్చే గేయ రచన కావచ్చు. దరువులు రాగతాళ ఉభయ ప్రధానాలుగా రూపొందాయి.

దరువు "ధ్రువా" శబ్ద భవమని పండితుల తలంపు. సంస్కృత నాటకాలలో ధ్రువాగాన ప్రసక్తి ఉంది. భరతుని నాట్యశాస్త్రంలో దీని గురించి ప్రత్యేకంగా చెప్పబడింది. నాట్యదర్పణంలో ధ్రువాలక్షణానికి లక్ష్య పురస్సరమైన చక్కని వివరణ, సమన్వయ మున్నాయి. భరతుడు చెప్పిన ప్రావేశికాది పంచవిధ ధ్రువలలో - ప్రావేశిక ధ్రువకు మాత్రమే తెలుగు యక్షగానాలలో విశేష ప్రసక్తి ఉంది.

భామా కలాపాదులలో, అర్వాచీన యక్షగానాలలో పాత్రలు తెర నుంచి బయటికి వచ్చే సందర్భంలో ఉన్నవి ప్రావేశిక దరువులు.

శ్రీనాథుని భీమ ఖండంలో ప్రావేశిక ధ్రువాగాన ప్రసక్తి, గోపరాజు సింహాసన ద్వాత్రింశికలో ధ్రువా ప్రబంధం పేర్కొనబడ్డాయి. తాళ్ళపాక వారి సంకీర్తన లక్షణంలో "దరువు" పేర్కొనబడింది. 16 శతాబ్దం చివరినుంచి వచ్చిన యక్షగానాలలో ఈ దరువులు తరచు కనిపిస్తాయి.

యక్షగానాలలో దరువు అనేక ప్రయోజనాలకు ఉపయుక్తం. పాత్ర వర్ణన, ప్రవేశం, స్వీయోదంత కథనం, పాత్రాంతరాలతో సంవాదం, ప్రకృతి వర్ణన, సన్నివేశ వర్ణన, కథానుసంధానం_మొ॥ సందర్భాలలో దరువులు సామాన్యాలు.

తెలుగు యక్షగానాలలో కొరవంజి దరువులు, జక్కిణి దరువులు, గుజరాతు వగవింత కోపు దరువులు, కోలాట దరువులు, కోలాట వర్ణములు, వృత్త దరువులు, టప్పాదరువులు ఉన్నాయి. (య. వా. చ_242_48)

## దర్భా గిరిరాజకవి

కాలం : క్రీ. శ. 17 వ శతాబ్దం.

స్థలం : తంజావూరు (శహజీ, శరభోజీల ఆస్థానం).

రచనలు : 1. వాదజయము 2. సర్వాంగ సుందరీ విలాసము 3. శాహేంద్ర చరిత్రము 4. రాజమోహన కొఱవంజి 5. రాజ కన్యా పరిణయము 6. లీలావతీ కల్యాణము 7. శాహరాజ పదములు.

ప్రసిద్ధ పదకర్త ఔబళన్న, జానకమ్మల పుత్రుడు. వేంకటగిరి ఇతనిసోదరుడే ఈ కవి వ్రాసిన పదాలు నాడే ప్రచారం పొందాయట. సంగీత సాహిత్యాలలో చతురుడు. శహాజీ తన నాటకాలలో గిరిరాజ పదాలను స్మరించాడు. (ద. దే. వా_219)

## దశకుమార చరిత సంక్షేపమ్ (సం)

కర్త : అప్పయ్య దీక్షితులు.

ఇది అంత ప్రౌఢం కాని సర్వ సాధారణ గ్రంథమట. దీనిని దశకుమార చరిత సంగ్రహం అని కూడా అంటారు. (తె. వి. స_6)

దశకుమార చరిత సంగ్రహమ్ (సం)

కర్త : అప్పయ్య దీక్షితుడు.

(చూ) దశకుమార చరిత సంక్షేపము.

దశ కుమార చరిత్ర

కర్త : మూల ఘటిక కేతన.

కృతి భర్త : కవి బ్రహ్మ, ఉభయకవి మిత్రుడు-తిక్కన.

ప్రత్యేకత : సంస్కృతంలో దండి వ్రాసిన దశకుమార చరిత్రకు ఇది పద్యానువాదం. పన్నెండు ఆశ్వాసాలున్నాయి. దీనిని కేతన "అంచిత భావ రసోదయాభి రామం"గా వ్రాశాడు. తెలుగుదనం ఉట్టిపడే రచన. కథా కథనంలో అనంతర కవులకు ఇతడు మార్గదర్శకుడయ్యాడు. సమకాలిక సమాజ చిత్రణం హృద్యంగా చేసిన రచనలలో ఇది ఒకటి. (ఆరుద్ర-2)

దశ గతులు

కర్త : హులక్కి భాస్కరుడు.

కాలం : క్రీ. శ. 13 వ శతాబ్దం.

అంకితం : సాహిణిమారునకు.

వివరాలు తెలియ రాలేదు. (క.న. 312)

దశమ స్కంధము (భాగవతం)

కర్త : మడికి సింగన.

రచనా కాలం : క్రీ. శ. 1350 ప్రాంతం.

కృతి భర్త : కందనామాత్యుడు.

ద్విపద కావ్యం. ఈ దశమ స్కంధాన్ని "ద్విపద భాగవతం" అనే పేర తంజావూరు సరస్వతీ మహల్‌వారు 1950 లో అచ్చు వేశారు. ఇందులో మూడు కాండ లున్నాయి. లభించిన గ్రంథం అసమగ్రం. కవి ఇందులో వర్ణన, పాత్ర చిత్రణల కోసం ఆగకుండా కథ చెప్పుకుపోయాడు. (ఆరుద్ర-4)

దశరథ కుమార చరిత్ర (అలభ్యం)

కర్త : తెలియదు.

కాలం : క్రీ. శ. 1670 కి పూర్వపు రచన.

రత్నాకరం గోపాల రాజు ఈ కావ్యాన్ని పేర్కొన్నాడు.

(ఆరుద్ర-12-191)

దశరథ రాజనందన చరిత్రము

నామాంతరం : నిరోష్ఠ్య రామాయణము.

కర్త : (చూ) ఆసూరి మరింగంటి సింగరాచార్యులు.

అంకితం : శ్రీ వేంకటేశ్వరస్వామికి.

నిరోష్ఠ్య ప్రబంధం. అయిదాశ్వాసాలున్నాయి. పూర్వ కవులలో శాకల్య మల్లన రామాయణాన్ని సంస్కృతంలో నిరోష్ఠ్యంగా రచించాడట. తెలుగులో తనదే మొట్టమొదటి నిరోష్ఠ్య ప్రబంధం అని కవి చెప్పుకొన్నాడు. కవి దీన్ని తన 19 వ యేట రచించాడట. ఇది అచ్చుపడినా నేడు ప్రతులు లభ్యం కావడంలేదు.

(ఆరుద్ర-8-263; క.త-13-12)

## దశరూపక పద్ధతి

కర్త : చూ. కురవి రామకవి.

ఇది 110 పద్యాలు కలిగిన గీర్వాణ కృతి. నాట్యశాస్త్ర మర్యాదలను వివరంగా చెప్పే గ్రంథం. (ఆం.సం.సా.)

## దశశ్లోకి (సం)

కర్త : నింబార్కుడు.

పది శ్లోకాల పరిమితి గల గ్రంథం. నింబార్కుడు తన సిద్ధాంతాన్ని అతి నిపుణంగా ఈ పది శ్లోకాలలోనూ సంక్షేపించాడట. (తె వి.స-7-488)

## దశావతార కథా సంగ్రహము

కర్త : అయ్యలరాజు నారాయణామాత్యుడు (చూ).

మూడు ఆశ్వాసాల కావ్యం. ధరణి దేవుల రామయ్య వ్రాసిన దశావతార చరిత్రకు ఇది సంగ్రహం కావచ్చు. (ఆరుద్ర-11-249)

## దశావతార చరిత్రము

నామాంతరం : రసికజన కంఠాభరణ శ్రీకృష్ణ దశావతార చరిత్రము

కర్త : ధరణి దేవుల రామమంత్రి (రామయమంత్రి).

అంకితం : మగదల కృష్ణ మంత్రికి.

పది ఆశ్వాసాల పద్య కావ్యం. పదకొండు అవతారాల వర్ణన ఉంది. తరువాతి చాలా మంది కవులకిది ఆధార గ్రంథమైంది. శైలి జటిలంగా ఉన్నా, కవిత్వం మనోహరమైనది. రచనలో సంస్కృత, ప్రాకృత పదాలేకాక తమిళ, కన్నడ, హిందుస్థానీ పదాలు కూడా చోటు చేసుకున్నాయి. ప్రసిద్ధ సంస్కృత శ్లోకాల ఛాయలు అక్కడక్కడా కనిపిస్తాయి.

ప్రత్యేకత : దశావతారాల్లో చేరని శ్రీకృష్ణావతారం ఒకటి ఎక్కువగా చెప్పటమైంది. ఈ కావ్యాన్ని పుష్పగిరి తిమ్మన వ్రాసి రామయమంత్రి పేర ప్రకటించాడనే ప్రవాదం లోకంలో ఉంది కాని అది నిరాధారం. (క. స-195)

## దశావతార చరిత్ర వ్యాఖ్య

కర్త : గరిమెళ్ళ వెంకయ్య (చూ).

దశావతార చరిత్ర కావ్యానికిది వ్యాఖ్య. (తె. సా. విమర్శ-91)

## దశావతార పద్యము

కర్త : భీమన్న.

గ్రంథం అలభ్యం. దీనిలో నుంచి ఒక పద్యాన్ని అజ్ఞాత గ్రంథ సంధాత "ఉదాహరణ పద్యములు"లో ఉదాహరించారు. ఈ పద్యం ప్రబంధ కవి యుగంలో రచితం కావచ్చు. ఈ పద్యకర్త వేములవాడ భీమకవి మాత్రం కాదు. ఈ భీమన్న భిన్నుడు. (అరుద్ర-9)

## దశావతారముల పాట

కర్త : తెలియదు.

జానపద పౌరాణికగేయం. శ్రీమహావిష్ణువు యొక్క మత్స్యాది దశావతారాలను వర్ణించే గేయం.

చూ. పౌరాణిక గేయములు. (ఆం. వా. చ)

## దశావతార స్తోత్రమ్

కర్త : కిరీటి వేంకటాచార్యులు (చూ).

సంస్కృత రచన. (ఆం. సం. సా.)

## దళము

కావ్య విభాగం. ఇతివృత్తాన్ని (విషయాన్ని) కొన్ని గ్రంథాలలో దళాలుగా విభజిస్తుంటారు. కావ్య భాగాలను దళాలుగా చెప్పడం వల్ల కావ్యం శాఖా రూపంగా గోచరిస్తున్నది. (కావ్యాలంకార సంగ్రహం)

## దళవాయి (పెద) తిమ్మప్ప

కాలం : క్రీ. శ. 18 వ శతాబ్దం (-1732).

స్థలం : రాయదుర్గం.

రచన : ప్రసన్న వేంకటేశ్వర విలాసము.

గురువు : వేంకట వరద దేశికుని పుత్రుడైన వీరరాఘవాచారి.

రాయదుర్గ పాలకుడు. వేంకటధరాధిపుని పుత్రుడు. ఇతడు కాకుండా ఇంకొక తిమ్మప్ప కూడా ప్రసిద్ధుడుగా ఉండడం వల్ల ఇతనిని పెద తిమ్మప్ప అని వ్యవహరిస్తున్నారు. (య. వా. చ-42)

## దాక్షాయణీ పరిణయము (అలభ్యం)

కర్తలు : బమ్మెర కేసనకవి-మల్లకవి.

కృతిభర్త : గురిజాల మల్లన సోమమంత్రి.

చారిత్రక ప్రాముఖ్యం ఉన్న కావ్యం. ఇందులోని కొన్ని పద్యాలను కందుకూరి వారు ఉదాహరించారు. కృతిపతి మనవడి కాలం వరకు (క్రీ. శ. 1756 వరకు) ఈ కావ్యం ప్రతులు వ్రాసుకుంటూ ఉండేవారట. అట్టి వ్రాత ప్రతులలో ఒక ప్రతి కూడా ఇప్పుడు దొరకటం లేదు.

కృతిపతి గురిజాల పాలకుడైన పులిజాల సోమమంత్రి అని కొందరంటున్నారు. ఈ రెండు పేర్లూ ఒకరి నుద్దేశించినవే కావచ్చు. (అరుద్ర-9; క. స-46)

## దాట్ల వేంకటకృష్ణ నరపాలుడు

కాలం : క్రీ. శ. 18 వ శతాబ్దం.

స్థలం : గోదావరీ మండలంలోని ధర్మవరము.

సాహిత్య పోషకుడు. మంగళగిరి ఆనందకవి రచించిన విజయనందన విలాస కావ్యం ఇతనికే అంకితం.

దాట్ల గ్రామవాసులైనందున వీరికి "దాట్ల" అనే ఇంటి పేరు వచ్చిందట. వీరి మూల పురుషుడు కోట కేతరాజు. (క. త-13-92)

## దానప్ప

కాలం : క్రీ. శ. 18 వ శతాబ్దికి పూర్వం.

రచన : శారీరోపనిషత్తు (ద్విపద).

రాగాంబ, రాయని మంత్రి పుంగవుల కుమారుడు. రాయని మంత్రి గణిత శాస్త్రాది ప్రజ్ఞా విశారదుడే గాక, మహితాంధ్ర భాషా చమత్కార వరుడని దానప్ప చెప్పాడు. తాను మాత్రం ఛందో వ్యాకరణాది పరిజ్ఞానమూ, కవిత్వ గుంభనలూ తెలియని వాడనని వినయంగా చెప్పుకొన్నా రసవంతంగా రచన చేశాడు. (ద్వి.సా.చ-319)

## దామరాజు లక్ష్మీనారాయణ

కాలం : క్రీ. శ. 19 వ శతాబ్దం.

స్థలం : ఏలూరు.

రచన : బృందావన విహారము.

ఈ కవి శివరామామాత్యుని పుత్రుడు. వీరు తొలుత మల్కాపుర ప్రాంతంలో ఉండే వారనీ, తర్వాత ఏలూరికి వచ్చి స్థిరపడ్డారనీ తెలుస్తున్నది. ఇతని రచన మల్కాపురంలోని శ్రీ సీతారామస్వామికి అంకితం. ఇతని ఇతర రచనలు తెలియరాలేదు. (క. స-208)

## దామరాజు సోమయ్య

కాలం : క్రీ. శ. 1590 కి పూర్వం.

రచన : భరతశాస్త్రము.

విశిష్టత : చాలా మంది పూర్వ కవులు వివిధ శాస్త్ర గ్రంథాలను పద్య రూపంలో వివరించినట్లే ఈయన భరత శాస్త్రాన్ని వ్రాశాడు. ఈయన భరత శాస్త్ర కావ్యంలో నుంచి ఐదు పద్యాలను పెదపాటి జగ్గన్న తన ప్రబంధ రత్నాకరంలో ఉదాహరించాడు. మూడు పద్యాలు ఆశీర్వచనాలు. కవి ఒక పద్యంలో రాజు ఎలా కొలువుండాలో చెప్పాడు. అయిదో పద్యంలో నటునికి ఉండవలసిన లక్షణాలు చెప్పాడు.

భరత నాట్యాన్ని తెలుగులో విశదంగా చెప్పే గ్రంథాలలో ఇది మొదటిది.
(ఆరుద్ర-9)

దామరుకమ్ (సం)
కర్త : ఘనశ్యాముడు.
ప్రహసనం.

దాము మొగ్గన్న
కాలం : క్రీ. శ. 18 వ శతాబ్దం.
స్థలం : బందరు.

సాహిత్య ప్రియుడు. పోచిరాజు వీరన్న రచించిన "భల్లాణ చరిత్ర"ను అంకితం పొందాడు. (క. స-222)

దామెర్ల అంకభూపాలుడు
కాలం : క్రీ. శ. 17 వ శతాబ్దం.
స్థలం : పులికాట్ ప్రాంతంలోని వాలూరు.
రచన : ఉషాపరిణయము.

చెన్నభూపతి, అక్కమాంబల పుత్రుడు. తల్లి పేరు తిమ్మాంబ అని కొన్ని ప్రతులలో ఉంది. ఘటికా శత గ్రంథ కల్పన, చిత్రకావ్య రచన, పద బంధ సంధాన విస్తరణంలో అందెవేసిన చెయ్యి. ఇష్టదైవం రఘురాముడు కలలో కనపడి, కావ్యాన్ని అంకితం ఇమ్మని కోరాడట.

దామెర్ల వెంగళ భూపాలుడు (బహుళాశ్వ చరిత్ర కృతిపతి) ఇతని పిన తండ్రి.

ఒకప్పుడు పులికాట్ ప్రాంతం కాళహస్తి సంస్థానం క్రింద ఉండేది. వాలూరే ఇప్పటి "వేలూరు". ఇతని తండ్రి చెన్న భూపాలుని పేరనే చెన్నపట్టణం నిర్మించబడి మదరాసు నగరంగా రూపొందింది. అంక భూపాలుని అన్న వెంకటభూపాలుడు వాలూరి పురాధీశ్వరుడు. వీరి ఇంటి పేరు దామెరగా కూడా వ్యవహారంలో ఉంది.
(ఆరుద్ర-11-58; ఆం. సం. సా.)

దామెర్ల కుమార వేంకటప్పనాయుడు
కాలం : క్రీ. శ. 1760 ప్రాంతం.

కాళహస్తి సంస్థానాధీశ్వరుడు. సాహిత్య పోషకుడు. అధ్యాత్మ్య రామాయణ కీర్తనలు వ్రాసిన సుబ్రహ్మణ్య కవిని తంజావూరు జిల్లాలోని మునిపల్లె నుంచి ఆహ్వానించి కాళహస్తికి రప్పించి, తన ఆస్థానంలో పోషించాడు. (తె. వి. స-4)

దామెర్ల తిమ్మరాయలు
ఈయన శ్రీకాళహస్తి సంస్థానాధిపతి. ఈయనకు వైభవ ప్రాభవాలున్నప్ప

టికి కవి పండితులను ఆదరించలేదట. అందువల్ల ఈయన అపకీర్తి పాలైనట్లు ఒక చాటువు వల్ల తెలుస్తున్నది. చాటుకవి వివరాలు తెలియవు. (చా. ప. ర.)

## దామెర్ల వెంకటపతి రాయలు

కాలం : క్రీ. శ. 17 వ శతాబ్దం.

స్థలం : కాళహస్తి.

సాహిత్య పోషకుడు. కృతిపతి. ధూర్జటి లింగరాజు రచించిన 'పెదకాళహస్తి మాహాత్మ్యం, ఇతనికే అంకితం.

ఇతడు కాళహస్తి ప్రభువైన దామెర్ల అక్కప్పనాయని పుత్రుడు. ఇతని మీద చాటువులున్నాయి. ఇతడు విద్యారసికుడనీ, త్యాగి అనీ ప్రతీతి. (క.త-12-253)

## దామెర్ల వెంగళభూపాలుడు

కాలం : క్రీ. శ. 1625 ప్రాంతం.

స్థలం : దక్షిణ దేశం (కాళహస్తి సంస్థానం).

రచనలు : 1. బహుళాశ్వ చరిత్ర 2. కృష్ణ కథ (అలభ్యం).

సమకాలికుడు : వెలుగోటి యాచమనాయకుడు.

ప్రతిభావంతుడైన రాజకవి. తన కావ్యాన్ని తండ్రికే అంకితం చేశాడు. గురువమాంబా వెంకటాద్రులు ఇతని తల్లి దండ్రులు. ఇతని రచన నూతన పద్ధతిలో సాగింది. కాకమాని మూర్తికవి బహుళాశ్వ చరిత్రకూ, ఇతని రచనకూ చాలా సాదృశ్యం ఉంది. అతనివిగా పేర్కొనబడ్డ ఉదాహరణలు కొన్ని ఇతని రచనలలో కనబడుతున్నాయి. బహుళాశ్వ చరిత్రకు ముందే ఇతడు కృష్ణ కథను చెప్పాడట.

(ఆరుద్ర-11; 42-61)

## దామెర్ల వేంకటపతి నాయుడు

కాలం : క్రీ. శ. 18 వ శతాబ్దం-మధ్య భాగం.

స్థలం : కాళహస్తి సంస్థానం.

సాహిత్య పోషకుడు. కాళహస్తి పాలకులైన దామెర్ల అక్కప్ప నాయుడనే నామాంతరం గల 'అక్కరాజు' కుమారుడు. ధూర్జటి లింగరాజకవిని ప్రోత్సహించి అతడు రచించిన "కాళహస్తి మాహాత్మ్యము" అనే గ్రంథాన్ని క్రీ. శ. 1730 లో అంకితం పొందాడు. (అం. సం. సా)

## దామెర్ల వేంకటరాయభూపాలుడు

కాలం : క్రీ. శ. 19 వ శతాబ్దం.

స్థలం : కాళహస్తి.

రచన : సేతు మాహాత్మ్యము (లేక) సేతు ఖండము.

వేంకటరాయభూపాలుడు కాళహస్తి ప్రభువంశీయుడు. బొబ్బిలి సంస్థానాధిపతి శ్వేతాచలపతి రంగారావు (క్రీ. శ. 1830-62) బంధుకోటిలోనివాడు. వేంకయ

పుత్రుడు. సేతు మాహాత్మ్యమనే నామాంతరం గల సేతు ఖండమనే గ్రంథం రచించి బొబ్బిలిలోని వేణుగోపాలస్వామికి అంకితం చేశాడు. (ఆం. సం. సా–101)

## దామెర్ల వేంకటాద్రిభూపాలుడు

కాలం : క్రీ. శ. 16 వ శతాబ్దం.
స్థలం : దక్షిణ దేశం–పులికాట్ ప్రాంతం.
సమకాలికులు : కులీకుతుబ్‌షా (1550–1580).

కాళహస్తి పాలకుల వంశంలోనివాడు. బహుళాశ్వ చరిత్ర కృతిపతి. ఇతని కుమారుడే ఈ కావ్యం వ్రాసి తండ్రికి అంకితం ఇచ్చాడు. ఇతని పెద్ద కుమారుడైన చెన్నభూపతి పేర చెన్నపట్టణం వెలిసింది. అదే నేటి మదరాసు నగరంగా రూపొందింది.

వేంకటాద్రి కులీకుతుబ్‌షా చేత విశేషంగా సత్కరింపబడ్డాడట. పులికాట్ ప్రాంతం కొన్నాళ్ళు కాళహస్తి సంస్థానంలో చేరి ఉండేది.

(ఆరుద్ర–11–55; ఆం. సం. సా.)

## దారిద్ర్యహర శివశతకము

కర్త : చూ. మండ లక్ష్మీకామేశ్వరశాస్త్రి.

శతక రచన. దారిద్ర్యనివారణకై భగవంతుడైన పరమేశ్వరుని ధ్యానించడం దీనిలోని విషయం. (ఆం. సం. సా–430)

## దార్ల సుందరమ్మ

కాలం : క్రీ. శ. 1830 ప్రాంతం.
స్థలం : చెర్లగుడిపాడు, గుంటూరు మండలం.
రచన : భావలింగ శతకము.

ఈమె వేమన వలె మూఢాచారాలపై దాడి చేస్తూ రచనలు చేసింది. సంఘ దురాచారాలపై తనకున్న నిశితమైన ప్రౌఢ భావాలను నిశ్శంకంగా కావ్య రూపంలో చెప్పి మిక్కిలి ప్రశంసలు పొందింది. (తె. వి. స–4)

## దాశరథి శతకము

కర్త : భద్రాద్రి రామదాసు.

తెలుగులో ప్రసిద్ధి పొందిన శతకాలలో ఒకటి. (తె. వి. స–4)

## దాశార్హ చరిత్ర

కర్త : తెలియదు.
కృతిపతి : గుంటుపల్లి ముత్తమంత్రి.

విశిష్టత : కృతిపతి గుంటుపల్లి ముత్తమంత్రి నవాబు కాలంలో వినుకొండ పరగణాను పాలించిన రామలింగ భాస్కరునికి దత్తపుత్రుడు.

కృతికర్తను గురించిన వివరాలు తెలియడం లేదు. (ఆరుద్ర–9–251)

## దాస గోస్వామి

కాలం : క్రీ. శ. 1560 ప్రాంతం.
స్థలం : మాహరీ క్షేత్రం.
రచన : పరమానంద బోధ ప్రకరణము.
గురువు : దత్తాత్రేయ యోగి.

దాస గోసాయిగా ప్రసిద్ధుడు. ఈతనిని పింగళి సూరన, తరిగొప్పుల మల్లన, మల్లారెడ్డి పేర్కొన్నారు. ఇతడు పరమానంద బోధ ప్రకరణాన్ని తొలుత మహారాష్ట్రి భాషలో రచించి, తర్వాత తెలుగులో వ్రాశాడట ఇతడు దీన్ని గోపాలభట్టు అనే శిష్యునికి ఉపదేశించాడని జనశ్రుతి. (క. స-94)

## దాసరి చిన గంగన్న

కాలం : క్రీ. శ. 1550 ప్రాంతం.
స్థలం : కొండపల్లి సమీపంలోని పురుషోత్తమ పట్టణం.

సాహిత్యపోషకుడు. మాఘ మాహాత్మ్య కావ్య రచయిత ఒడ్డెపూడి పెద్దయ్యను పోషించాడు.

విశిష్టత : ఈయన పురుషోత్తమ పట్టణానికి మోతుబరి. శాస్త్రీతి హాసాలను నాటక కావ్య లక్షణాలను, లక్షణ గ్రంథాలను, జ్యోతిషాగమ సంగీత రహస్యాలను ప్రతిభతో విమర్శించినవాడట. కటకం గజపతుల సామంతుడు బాహుబలేంద్ర హరిశ్చంద్రుడు ఈయనను బహుమతులతో సత్కరించాడట. ఈ హరిశ్చంద్రుని గోలకొండ నవాబు కులీకుతుబ్‌షా పుత్రుడు హైదరుఖాను జయించి పట్టుకొన్నాడు.
(క. స-132; అరుద్ర-9)

## దాసరివారు

ఈ పేరుతో ఒక రకమైన వైష్ణవ భక్తులు యాచన వృత్తిగా జీవించే వారున్నారు. ఇదే ఇంటిపేరుతో తెలుగు దేశంలో కమ్మవారు,నిమ్నజాతులవారు, కళావంతులు ఉన్నారు (భారతి-మార్చి-45-229)

## దాసరులు

కాలం : క్రీ. శ. 14, 15 శతాబ్దాలు.

విజయనగర సామ్రాజ్య కాలంలో ఈ పేరుతో కొందరున్నట్లు ఆముక్త మాల్యద వల్ల తెలుస్తున్నది. వీరు శంఖు చక్రాలు కలిగి, ఇత్తడితో చేసిన కుండలాలు ధరించి, జింక కొమ్ములు, అలుగులు, మొగిలి ఆకుల గొడుగు, గుర్రపు వెంట్రుకలతో తయారైన విసనకర్ర, తోలుతిత్తి, చిట్టి తాళాలు, చంకన బుట్ట, మెడలో తులసి పేరులు, ముఖాన తెల్లని పంగనామాలు మొదలయిన వేషధారణకలవారై, చాండాలిక అనే కిన్నెరను వాయిస్తూ పదాలను పాడుతూ, మాల మాదిగ వారికి గురువులుగాను, పురోహితులుగాను ఉంటూ, యాచిస్తూ ఉండేవారని ఆముక్తమాల్యద కావ్యంలో వివరంగా ఉంది.

వీరు యాచకులుగా తెలుగు దేశపు గ్రామ సీమలలో ఇప్పటికీ కనిపిస్తూనే ఉంటారు. (నా. ర. చ-90, 91)

## దాసలీల (సం)

కర్త : మాధవభట్టు.

విష్ణుస్తోత్ర ప్రధానమైన గ్రంథం. (తె. వి. స-6)

## దిట్టకవి

దిట్టంగా కవిత్వం చెప్పడం వల్ల వెణుతురుపల్లి (వెణుకుదురుపల్లి) వెంకయ్యకు దిట్టకవి అనే బిరుదు వచ్చింది. ఇదే కాలక్రమాన వారికి ఇంటిపేరుగా స్థిరపడింది. (అరుద్ర-10-223)

## దిట్టకవి నారాయణ కవి

కాలం : క్రీ. శ. 18వ శతాబ్దం-ఉత్తరార్ధం.
స్థలం : నరసరావుపేట సంస్థానం.
రచన : రంగరాయ చరిత్రము (లేదా) రంగరాయ కదనరంగ చరిత్రము.

నరసరావుపేట సంస్థాన కవి. పాపరాజు పుత్రుడు. సంస్థాన పాలకుడైన మల్రాజు రామారాయణికి ఆశ్రితుడు. చారిత్రక కావ్యకర్త. 1757లో బొబ్బిలి సమీపాన జరిగిన యుద్ధాన్ని అతి విపులంగా చారిత్రికాంశాలతో కావ్య రూపంలో గ్రంథస్థం చేశాడు. అదే రంగరాయ చరిత్ర. రచనలో దోషాలున్నా రసవంతంగా కవిత్వం చెప్పిన దిట్ట. (ఆం. సం. సా-190, 194, 196, 205)

## దిట్టకవి రామచంద్రకవి

కాలం : క్రీ.శ. 1750 ప్రాంతం.
స్థలం : కృష్ణా జిల్లా-నందిగామ తాలూకా-గొట్టుముక్కల.
రచనలు : 1. రఘుకుల తిలక శతకము 2. మహిషాసురమర్దనీ శతకము 3. ఉద్దండరాయశతకము 4. రాజగోపాలశతకము 5. హేలావతీ దండకము 6. వాసిరెడ్డివారి వంశచరిత్ర (ఒక ప్రబంధమున కృత్యాది).

శాపానుగ్రహ సమర్థుడైన కవి. సంస్కృతాంధ్రాలలో దిట్ట. రంగరాయ చరిత్ర కర్త నారాయణకవి ఇతని తండ్రి. రసవంతంగా పండితులు మెచ్చేటట్లు కవిత్వం చెప్పాడు. (శ. క. చ-838)

## దిట్టకవి రామయోగి

కాలం : క్రీ.శ. 1845 ప్రాంతం.
స్థలం : మచిలీపట్టణం.
రచన : రుక్మిణీపతి శతకము.

సుందర రామసూరి పుత్రుడు యాదవ రాయకవి పౌత్రుడు. విద్వత్కవి. కాంచీనగరానికి వెళ్ళి, అక్కడి పండితులతో తర్క వ్యాకరణాలలో వాదం చేసి, జయిం

చాడట. ఆంధ్రుల గౌరవ ప్రతిష్ఠలను సుప్రతిష్ఠితం చేసిన ఈ కవి గ్రంథాలు, మచిలీపట్టణం దగ్గర వచ్చిన ఉప్పెనలో సముద్రార్పితములైనాయట. (శ. క. చ-849)

## దిట్టకవి విశ్వనాథ కవి

నామాంతరం : (చూ) వెణుతురుపల్లి విశ్వనాథకవి.

## దిట్టకవి వెంకటామాత్యుడు

కాలం : క్రీ.శ. 16వ శతాబ్దం.

స్థలం : గోదావరీ మండలంలోని ద్రాక్షారామం.

రచనలు : తెలియరాలేదు.

విద్వత్కవి. సంస్కృతాంధ్ర భాషా విశారదుడు. బిరుదు దిట్టకవి. అదే వీరి ఇంటి పేరుగా వ్యవహారంలో ఉన్నది. ఇతని కుమారుడే వెణుతురుపల్లి విశ్వనాథకవి. (క. త-12-156)

## దిట్టకవి వెంకటామాత్యుడు

కాలం : క్రీ. శ. 1610-1680 ప్రాంతం.

స్థలం : గోదావరి మండలంలోని ద్రాక్షారామం.

రచన : విష్ణుపురాణము (అలభ్యం)

సంస్కృతాంధ్ర గ్రంథాలు అనేకం రచించినట్లు ఇతని శిష్యుడైన ఈదులపల్లి భవానీశ కవి చెప్పాడు.

వెణుతురుపల్లి వారే దిట్టకవి బిరుద నామంతో ప్రసిద్ధులయ్యారు. ఈతని పితామహుడు వెంకటామాత్యునికి తొలుతగా దిట్టకవి బిరుదు ఉండేది. (క. త-12-175)

## దినవహి ఓబయ మంత్రి

కాలం : క్రీ.శ.16వ శతాబ్దం కావచ్చు.

స్థలం : నందవరము.

రచన : గరుడాచల విలాసము (యక్షగానం).

ఓబయ్య, చెన్నమాంబల పుత్రుడు. నందవరానికి కరణంగా ఉండేవాడు. ఇతని రచన సుగ్రీవ విజయ యక్షగానం కంటె ఎక్కువ ప్రచారంలో ఉండేదట. (య.వా.చ.)

## దిలారామ కథ

కర్త : తెలియదు.

తొలిముద్రణ : 1843.

దిలారాం అనే పేరుగల ఢిల్లీ పాదుషా కూతురును అమరావతి పట్టణపు రాజు కొడుకు పెండ్లాడుట ప్రధాన కథాంశంగా ఉన్న ఈ విచిత్ర కథాకోశంలో, రాజకుమారుల మంత్రికుమారుల దేశాటనలు,మంత్రి కుమారుడు తన అత్యద్భుత ప్రజ్ఞా యోగవిశేషాలతో ఎన్నో తడవలు రాజకుమారుని రక్షించడం, అతని నేర్పు చేతనే చివర సర్వ క్షేమములు కలుగడం చమత్కార జనకంగా ఉన్నాయి. (వ. వా. 61)

**దిలీప చరిత్రము (అలభ్యం)**

కర్త : కొటికెలపూడి వేంకటకృష్ణకవి.
అంకితం : శ్రీరామునికి.

నాలుగాశ్వాసాల ప్రబంధం. ఈ కవి రచించిన శ్వేతాచల మాహాత్మ్యము నుండి పై గ్రంథ విషయం తెలుస్తున్నది. (క. ప. 236; ఆం.సం.సా. 303)

**దివాకరుని శాసనము**

కాలం : క్రీ. శ. 1144.
స్థలం : వెలనాటి సీమ.
శాసన ప్రదాత : దివాకరుడు.
శాసన ప్రసక్తుడు : వెలనాటి గొంకవిభుడు.

శాసన విషయం : ఈ శాసనంలోని పదకొండు పద్యాలలో శాసన దాత గురించి విపుల వర్ణనముంది. దివాకరుడు వెలనాటి గొంకరాజుకు అమాత్యుడట. దీనిలో రెండు చంపక మాలలు, రెండు ఉత్పలమాలలు, అసమగ్రంగా ఒక మత్తేభం, ఒక శార్దూలం – ఐదు కంద పద్యాలు ఉన్నాయి. (2 కంద పద్యాలు అసమగ్రం).
(తె క.చ–240, 241)

**దివి రమణకవి**

కాలం : క్రీ. శ. 18 వ శతాబ్దం
స్థలం : రాఘవపురం.
రచన : శృంగార ధామము.

వాసిరెడ్డివారి వంశానికి చెందిన వాడూ, రాఘవపురాధిపతీ అయిన చినరామ లింగన్న పోషణలో ఈ కవి ఉన్నాడు. ఇతని కవిత సలక్షణంగా లేకపోయినా రస వంతంగా లలిత చమత్క్రియా విలసితంగా ఉంటుందని పండితులంటారు.
(ఆరుద్ర 10–246; ఆం సం.సా.)

**దివ్యదేశ మాహాత్మ్య దీపిక**

కర్త : ముష్టిపల్లి వెంకటభూపాలుడు (చూ).
అంకితం : రాజవోలులోని కేశవస్వామికి.

ద్విపద కావ్యం. 108 దివ్య తిరుపతుల వృత్తాంతాలున్నాయి. 23 తాళ పత్రాలపైన వ్రాసిన గ్రంథం. సరళమైన భాషలో భగవన్మహిమలను, ఆయా దివ్యస్థలాల మహిమలను ఉటంకిస్తూ నడచిన రచన, కావ్యమంతటా కవికి గల భగవద్భక్తి గోచర మవుతున్నది. (ఆరుద్ర 11–216)

**దిశోజ రామారాయడు**

కాలం : తెలియదు.

ఈయనను కీర్తిస్తూ ఒక కవి సీసపద్యం చెప్పాడు. కవి పేరు తెలియదు. (చా.ప.ర)

**దీన చింతామణి శతకము**

కర్త : కాండూరి వేంకటదాసు.
రచనా కాలం : క్రీ.శ. 18వ శతాబ్దం.

మత్తేభ వృత్తాలలో కూర్చిన శతకం. "కృష్ణా! దీన చింతామణీ" అనే మకుటం ఉంది.

**దీప కళిక (అలభ్యం)**

కర్త : మల్లికార్జున పండితుడు.
రచనా కాలం : క్రీ.శ. 1150 ప్రాంతం.

శైవ మతపరమైన రచన.

**దుర్గా సౌందర్య శతకమ్ (సం)**

కర్త : చూ. పేరి కాశీనాథశాస్త్రి.

దుర్గాదేవి పరమైన శతకం. సంస్కృతంలో ఉంది. (ఆం.సం.సా-427)

**దువ్వూరి విశ్వనాథశాస్త్రి**

కాలం : క్రీ.శ. 18వ శతాబ్దం చివర-19వ శతాబ్దం ప్రారంభం.
స్థలం : పిఠాపురం సంస్థానం.
రచన : మాధవ విలాస భాణము.

పిఠాపురం సంస్థానాస్థాన విద్వత్కవి. తర్కశాస్త్రనిధి. రావు వేంకట నీలాద్రిరాయని (1778-1828) ఆస్థానంలోని వాడు. ప్రభువు ఆదేశంపై మాధవ విలాస భాణం రచించాడట. (ఆం.సం.సా-247)

**దూతాంగదము**

కర్త : చూ. విక్రాల నరసింహాచార్యులు.

పౌరాణికేతివృత్తం. అముద్రితం. (ఆం.సం సా.)

**దూదేకుల సిద్ధప్ప**

చూ. సిద్ధప్ప.

**దూపాటి సీమ**

కాలం : చూ. భారతుల పేరయ్యశాస్త్రి.

ఈ సీమ ప్రస్తుతం ప్రకాశం జిల్లాలో ఉంది.

ఈ సీమలో దరిద్ర దేవత తాండవిస్తున్నదని చెప్పటానికి శాస్త్రి ఒక సీసపద్యం చెప్పాడు. ఈ సీమలో అన్ని కాలాలలో బ్రహ్మమేడాకులు, పల్లేరుకాయలు, జిల్లేడు కాయలు, గరికపోచలు, నాగజెముడు పళ్ళు, తూకానికి మించిన తూకపురాళ్ళు, నుసిరాలే

పూరిళ్లకు లోటు లేకుండా ఉండేదని చెప్పాడు. పచ్చని పైరు పంటలు యింపుమించు దూపాటి సీమలోనే లేవని కవి చమత్కారంగా ఈ పద్యంలో చెప్పాడు. (చా.ప.ర.)

## దూబగుంట నారయ

నామాంతరం : దూబగుంట నారాయణకవి.

## దూబగుంట నారాయణ కవి

నామాంతరం : నారయ.
కాలం : క్రీ. శ. 1470 ప్రాంతం.
స్థలం : ఉదయగిరి దగ్గరలోనున్న దూబగుంట.
రచన : పంచతంత్రము.

విశిష్టత : నాగమాంబ బ్రహ్మనామాత్యుల పుత్రుడు. కృత్యాదిలో కవి త్రయాన్ని తప్ప ఎవరినీ స్తుతించలేదు. దగ్గుపల్లి దుగ్గయ, నంది మల్లయ, ఘంట సింగయలకు సమకాలికుడు కావచ్చు. కవికాలం నాటికే ఒక పంచతంత్రం అనువాదమై ప్రసిద్ధమై క్రీ. శ. 1347 నాటి మడికి సింగన "సకలనీతి సమ్మతం" అనే సంకలన గ్రంథంలో చేరినా దూబగుంట కవి ఎందుకో దీనిని మళ్ళీ అనువదించాడు. ఈ కవి హరిహరభక్తుడనీ, ఆంధ్ర కవిత్వ విశారదుడనీ, రాజపూజితుడనీ, ప్రబంధ వాచకాభరణ మనీ తెలుస్తున్నది. ఇతడు వ్రాసిన పంచతంత్రానికి మూలం విష్ణుశర్మ సంస్కృత పంచ తంత్రం. ఇతడు దూబగుంటకు కరణంగా ఉండేవాడు. బసవ భూపాలుని ఆశ్రితుడు. ఇతని కవిత్వం ధారాశుద్ధి కలిగి మనోహరంగా ఉంటుంది. (ఆధ్ర.వ-6-123)

## దూర్వాసుల సూర్యనారాయణ సోమయాజి

కాలం : క్రీ. శ. 19వ శతాబ్దం.
స్థలం : విజయనగర సంస్థానం.
రచనలు : గీతములు, స్వరజతులు, మొదలయినవి.

విజయనగర సంస్థాన విద్వాంసుడు. విజయరామ గజపతి (1826-1879) కి ఆశ్రితుడు. విజయరామ గజపతిపైన 20 గీతములు, 15 స్వరజతులు వ్రాశాడట. పూసపాటివారి పూర్వులు చేసిన విజయ యాత్రాదులను వర్ణిస్తూ ఇతడు 72 మేళ కర్తలలో కృతులను సంతరించాడట. (ఆం. సం. సా-422)

## దృగ్దృశ్య వివేకము

కర్త : తెలియదు.

వచనము. వేదాంతపరమైన రచన. ఈ గ్రంథ ప్రతితో బాటు నవకృతోప దేశము, ఉమామహేశ్వర సంవాదము, నారసామాత్యుని గురుగీతా సారము ఉన్నవి. ఇది తాళపత్ర ప్రతి. (ఆం.సా.ప.ప. 13-3,4)

## దేవకి వేంకట సుబ్బకవి

స్థలం : మధురానగరం, దక్షిణదేశం.

కాలం : క్రీ. శ. 18వ శతాబ్దం.
రచన : రామాయణము

ఇతడు మధుర నాయకుల కాలంలోని వచన రచయిత అళఘురయ్య పుత్రుడు. ఇతని రామాయణంలో అరణ్య, కిష్కింధ, సుందర, యుద్ధ కాండలు మాత్రమే లభ్యమైనాయి. ఇది సంస్కృత రామాయణానికి సరియైన తెనుగు రామాయణమని దీనిలోని అధ్యాయ క్రమం వల్ల తెలుస్తున్నది. (వ. వా.-46)

## దేవకీ నందన శతకము

కాలం : క్రీ. శ. 14వ శతాబ్ది ఉత్తరార్ధం కాని, 15వ శతాబ్ది పూర్వార్ధం కాని కావచ్చు.
కర్త : వెన్నెలకంటి జన్నమంత్రి.

దీని కర్తృత్వం కవి రాక్షసునిదిగా ప్రతీతి. పరిశీలనానంతరం ఇది జన్నమంత్రే వ్రాశాడని పండితులు నిరూపించారు. జక్కన "విక్రమార్క చరిత్ర"లో "పద్యశతంబున దేవకీ తనయు విధేయు జేసెన"ని తన కృతిభర్త సిద్ధయ తండ్రి జన్నమంత్రిని నుతించాడు. తాను "కొండంత కవి"ని కానని, సాధారణ కవినని జన్నమంత్రి సవినయంగా మనవి చేశాడు. (ఆరుద్ర-4; క.స. 31)

## దేవకీ పురము

గ్రామం. ఉత్తరార్కాడు జిల్లా ఆరణి తాలూకాలోనిది. దేవకాపురం అన్న పేరుతో వ్యవహారంలో ఉంది.

తుళువ నరసనాయకుని నాయనమ్మ దేవకీదేవి పేరిట ఈ గ్రామం కట్టారు. ఇక్కడి బృహదంబ దేవాలయానికి తెలుగు రాజులు ఎన్నో దానాలు చేశారు.

నంది మల్లయ-ఘంట సింగయ్యలు కొన్నాళ్ళు ఇక్కడ ఉండి వరాహ పురాణం తెనిగించారట. (ఆరుద్ర-6-238)

## దేవగుప్తాపు రామభద్ర కవి

కాలం : క్రీ శ. 1790 ప్రాంతం.
రచన : మహాదేవ శతకము, (భవానీధవ శతకము).

లింగకవి పౌత్రుడు. భాస్కర కవి పుత్రుడు. రచన సరళంగా రసవంతంగా ఉంటుంది. (క స.193)

## దేవ చూడామణి శతకము

కర్త : చూ. కొటికలపూడి కోదండరామకవి.

'రామా దేవ చూడామణీ' అనే మకుటంతో వ్రాయబడిన శతకం.

(ఆం.సం.సా-305)

## దేవదాసీలు

ఆంధ్రదేశంలో దేవదాసీలు, భాగవతులు, నృత్యకళను పోషించి అభివృద్ధి

లోకి తెచ్చారు. దేవదాసీల నృత్యకళకు దేశంలో ప్రత్యేకమైన స్థానముంది.

వీరు దేవాలయ మండపాలలో, దేవుని సన్నిధిలో సంప్రదాయాన్ని అనుసరించి ఆరాధన నృత్యాలు, అష్ట దిక్పాలక నృత్యాలు, కేళికా ప్రదర్శనలు, కలాపాలు మొదలయినవి ప్రదర్శించేవారు.

వీరు సాధనచేసే నృత్యకళ, నట్టువమేళ సంప్రదాయమని – నాట్యమేళ, భాగవతమేళ సంప్రదాయమని రెండు రకాలు.

వీరు స్వామి సన్నిధిలో, రాజు సన్నిధిలో నాట్యం చేయటానికి అధికార ముద్రల్ని పొంది ఉంటారు. జీవిత సర్వస్వాన్ని దేవునికే అంకితం చేసేవారు కూడా ఉండేవారు.

దేవాలయ నర్తకీమణులలో ఒకరిని మించి మరొకరు పోటీపడి నాట్యకళను ఆరాధించేవారు. ఎంతోమంది నాట్యకత్తెలు బృందగానాలలో పాల్గొన్నప్పటికీ రాజనర్తకి మాత్రం ఒక్కతే ఉండేది.

తెలుగుదేశ చరిత్రలో చాలామంది రాజనర్తకీమణులు తారసిల్లుతారు. ప్రతాపరుద్రుని ఆస్థానంలో మాచల్దేవి, కుమారగిరి రెడ్డి ఆస్థానంలో లకుమాదేవి, శ్రీకృష్ణ దేవరాయల ఆస్థానంలో రంజకం కుప్పాయి, తంజావూరి రఘునాథరాయల ఆస్థానంలో చంద్రరేఖ – రూపవతి – శశిరేఖ – లోకనాయిక రాజనర్తకీమణులుగా వెలుగొందారు. పై దేవదాసీలందరూ "రాజనర్తకి" సంప్రదాయానికి చెందినవారు. నాట్యానికే పరిమితం కాకుండా వీరిలో కొందరు రాజకీయ రంగంలో కూడా వెలుగొందారు. దానధర్మాలుచేసి ప్రసిద్ధులైనారు.

లకుమాదేవి తనతల్లి దండ్రులకు ధర్మార్థంగా దక్షారామ భీమేశ్వరునికి అఖండ దీపదానం చేసి చరిత్ర ప్రసిద్ధురాలయింది.

ఒకానొక దేవదాసి ఆలయానికి రాజు నుండి దానం సంపాదించి పెట్టింది. ఈమె పేరు తెలియరాలేదు.

ఈమె క్రీ. శ. 1433–34 సం॥లో "మడము" అనే గ్రామంలో అగ్నీశ్వర దేవాలయంలో దేవదాసి అట. "అరంవళత్త నాచ్చియార్"అనే తమిళదేశపు సాని. ఈమె రెండో దేవరాయలను దర్శించి అతనివల్ల ఒక దేవాలయానికి దానం సంపాదించింది. రాజాదరణకు పాత్రమైన దేవదాసీలకు గృహాలే గాక గృహారామాలు కూడా ఉండేవట.

(నా.ర.చ–85, 242)

## దేవమల్లు చరిత్ర (అలభ్యం)

కవి : తిరుమలనాథ కవి (చూ).

మూలం : బ్రహ్మాండ పురాణంలోని కథ అని సాహిత్య చరిత్రకారులు చెప్తున్నారు.

## దేవయాని చరిత్ర

కర్త : తెలియదు.

జానపద పౌరాణిక గేయం.

కథ భారతానికి సంబంధించినది. ప్రసిద్ధం.

చూ. పౌరాణిక గేయములు. (ఆం. వా. చ.)

**దేవరకోట**

నామాంతరం : ఒల్లపల్లి సంస్థానము. (ఆం. సం. సా_153_164)

**దేవరాజ భట్టు**

కాలం : క్రీ. శ. 15 వ శతాబ్ది.

రచన : హరిశ్చంద్రోపాఖ్యానము (అలభ్యం) 2. పద్యాలు లభ్యం.

ఇతడు శంకర కవికి పూర్వుడు.

విశిష్టత : ఈ కవి గౌరన ద్విపద హరిశ్చంద్రోపాఖ్యానంలో వ్రాసిన భావాలను అనుసరించకుండా స్వంతంగా చక్కని కల్పనలు చేశాడు. ఈతని హరిశ్చంద్ర పద్య కావ్యంలోని రెండు పద్యాలు "ప్రబంధ రత్నావళి"లో ఉదాహృతమైనాయి.

(ఆరుద్ర_6_92)

**దేవవరపు శోభనాద్రి**

నామాంతరం : కోడూరి శోభనాద్రిదాసు.

**దేవహూతి విలాసము**

కర్త : ముడుంబి వేంకటాచార్యులు.

రచనాకాలం : క్రీ.శ. 1700 ప్రాంతం.

(క. స_257)

**దేవాంగ పురాణము**

కర్త : భద్రకవి లింగకవి.

అంకితం : ముదునూరి క్షేత్రాధిపతి రామేశ్వరునికి.

ఏడాశ్వాసాల ద్విపద కావ్యం. మూలం బ్రహ్మాండ పురాణంలో ఉన్నదని అంటున్నారు.

విశిష్టత : ఇది దేవాంగ కులస్థుల వంశ చరిత్ర. ఇందులో దేవాంగ ఋషి జననం, దేవతావస్త్ర నిర్మాణం, ఆ ఋషి ఎత్తిన విద్యాధర, పుష్పదంత, బేతాళ, వరరుచి, దివసాళి, దేవరదాసి అనే అవతారాలున్నాయి. ఇందులో చివరి అవతారం దేవరదాసయ్య. ఇతడు జైనులను ఖండించి, శైవమతాన్ని స్థాపించాడు. ఈ కావ్యాన్ని కాళహస్తి నాయని ప్రేరణతో వ్రాశాడట. ముదునూరిలోని దైవాన్ని రామలింగము అని కూడా అంటారు. కావ్యంలో జైన మత ఖండనం_శైవమత ప్రశస్తి, ఇంద్రజాల, రస వైద్యాది విషయాలు ఉన్నాయి. (ఆరుద్ర_9_229; ద. దే. వా_13)

## దేవాది

దీన్ని కొందరు "దేవిడి" అని కూడా అంటారు. ఇది "ఉర్లాము" జమీందారీ లోని ఒక గ్రామం. ఉర్లాముకు సమీపంలో ఉంటుంది.

ఈ జమీందారులలో ఒకడైన కందుకూరి సన్యాసిరాజుగారి కుమారులు "బాల సూర్య ప్రసాదరావు, లక్ష్మీప్రసాదరావు" గార్లు ఈ జమీందారీని విభజించి పంచు కున్నప్పుడు ఇది "బాలసూర్య ప్రసాదరావు"కు చెందింది.

ఈ జమీందారు సాహితీ ప్రియుడు, కృతిపతి, కృతికర్త కూడ.

(ఆం. సం. సా.)

## దేవిడి

నామాంతరం : దేవాది.

## దేవీ పంచస్తవి (అలభ్యం)

కర్త : ఊరదేచ మంత్రి (చూ).

(క.త-7)

## దేవీ భాగవతము

కర్త : పాపయారాధ్యులు.

అంకితం : కాశీ విశ్వనాథస్వామికి.

కవి రాజా వాసిరెడ్డి వెంకటాద్రినాయనింగారి దత్తపుత్రుడైన జగన్నాథబాబు ప్రేరణచేత ఈ గ్రంథం రచించి, శ్రీ కాశీ విశ్వనాథస్వామి వారికి అంకితం చేశాడు. ఇది సంస్కృతంలోని దేవీ భాగవతానికి అనువాదం. (ఆం.సం.సా.)

## దేవీ లీలా తరంగణి (సం)

కర్త : చూ. మండ కామేశ్వర కవి.

ప్రోత్సాహకుడు : ఆనందగజపతి మహారాజు.

లలితాంబికా స్తవం. పది "తరంగాలు" ఉన్నాయి. విజయనగర సంస్థాన ప్రభువు. ఆనందగజపతి కోరికమేరకు వ్రాయబడింది. ఇందులోని మొదటి 9 "తరంగా"లలో పదేసి శ్లోకాలు, పదవ "తరంగం"లో 16 శ్లోకాలు, మొత్తం106 శ్లోకాలు ఉన్నాయి. కవి స్వయంగా దీనికి వ్యాఖ్యానం వ్రాసి జతపరచాడు.

(ఆం.సం.సా-429)

## దేవీ విజయము (అలభ్యం)

కర్త : తెలియదు.

అప్పకవిచే ఉదాహృతం.

## దేవుని యొక్క సువార్తలు

ముద్రణ కర్త : రెవరెండు క్యారీ.

అనువాదకుడు - గ్రాంజెస్, ఎ. డి.

క్రైస్తవ ధర్మ ప్రతిపాదకమైన గ్రంథం.

ఇందులో మార్కు, మత్తయి, లూకా సువార్తలు గ్రీకు భాషనుండి జిక్రాన్, ఆనందరాయర్ల సహాయంతో గ్రాంజెస్ అనువదించాడు. ఇది శ్రీరామపురంలో 1812లో ప్రకటితం. (వ. వా-51)

## దేవులపల్లి కవిపరంపర

దేవులపల్లి వారి కుటుంబం చిరకాలం నుండీ పిఠాపుర సంస్థానాధీశ్వరుల ఆశ్రయంలో వర్ధిల్లింది. వీరి వంశం వారు పిఠాపురంలో ఆస్థాన విద్వాంసులుగా ఉంటూ సన్మానాలు పొందారు. అనేక ఇతర సంస్థానాలు సందర్శించి, ఆయా ప్రభువుల చేత సత్కారాలు పొంది, పిఠాపురం కీర్తి చంద్రికలను నలుమూలలా వ్యాపింప చేశారు. పిఠాపుర సంస్థానంలోని "చంద్రమ పాలెం" వీరి నివాసస్థానం.

వీరికి "వెంకటసూరిమణి" మూలపురుషుడు. వీరి పూర్వులలో ఒకరైన "రామశాస్త్రి" విజయనగరం "విజయరామ నృపతి"ని మెప్పించి 'వెలగవాడ'ను అగ్రహారంగా పొందారట. వీరి మనుమడైన "రామశాస్త్రి" వేంకట నీలాద్రి రాయని సమాదరంలో వర్ధిల్లాడు. "సాహిత్య చక్రవర్తి" బిరుదాంచితుడు. "సాహితీ దర్పణము" అనే అలంకార గ్రంథం, బాలభాగవత 'సుధీచంద్రిక' వ్యాఖ్య ఇతని రచనలు.

పై రామశాస్త్రి తమ్ముని కుమారుడైన 'కృష్ణశాస్త్రి' విశ్వగుణాదర్శ వ్యాఖ్యను, తర్కసారమనే న్యాయశాస్త్ర గ్రంథాన్ని, "సాహితీసారము" అనే అలంకార శాస్త్రాన్ని వ్రాసి శిష్యకోటికి సర్వ విద్యాప్రదాత అయినాడట.

రావు గంగాధర రామారావు బహద్దరు (1844-1890) కాలంలో, పిఠాపురం సంస్థానాస్థాన విద్వత్కవులలో దేవులపల్లి సోదర కవులు అత్యంత ప్రసిద్ధులు. దేవులపల్లి సుబ్బరాయశాస్త్రి, దేవులపల్లి వేంకటకృష్ణశాస్త్రి సోదరులు "దేవులపల్లి సోదర కవులు"గా స్థిరపడ్డారు. సుబ్బరాయశాస్త్రి శ్రీరామపంచాశత్తు, మహేంద్ర విజయం, రామరాయ విలాసం, మల్హణస్తవం, రాజనీతి ప్రకాశకమైన కుమార శతకం, మందేశ్వర శతకం మొదలగు రచనలు చేశారు. నయనోల్లాసము, యతిరాజ విజయం మొదలైనవి వేంకటకృష్ణశాస్త్రి (1868-1912) రచనలు. వీరి తరువాతి వారుకూడా ఆధునిక కవులుగా పేరుప్రఖ్యాతులు పొందారు. (ఆం. సం సా.)

## దేవులపల్లి చంద్రశాస్త్రి

కాలం : క్రీ. శ. 18 శతాబ్దం.
స్థలం : విశాఖ మండలం.
రచనలు : తెలియరాలేదు.
గురువు : అమలాపురపు సన్యాసికవి.

పంచముఖేశలింగ శతకం ప్రతి చివర ఇతనిదొక సీసమాలిక ఉంది. అందులో ఇతడు తన గురువైన సన్యాసికవి కట్టమూరి కామేశ్వరకవి నుండి ఆంధ్ర భాషా కవిత్వ

విశేషాలు తెలుసుకొన్నాడనీ, రామాయణం వ్రాశాడనీ, రుద్రాక్ష మాహాత్మ్యాది ప్రబంధాలు మూడు రచించాడనీ చెప్పాడు. (శ.క.చ-571)

## దేవులపల్లి బాపన్నకవి

కాలం : క్రీ. శ. 18 వ శతాబ్దం.
స్థలం : పిఠాపురం సంస్థానం.
రచన : తారావళి (సం).

పిఠాపురం రాజా "కుమార వేంకట మహీపతి రాయల" (1765-93) కు ఆశ్రితుడు. విద్వత్కవి.

ఈ కవి పిఠాపురం రాజా చేత "ఫకీరుద్దీన్ పాలెం"లో కొంత భూమిని దానం పొంది గౌరవింపబడ్డాడు. (ఆం.సం.సా-24?)

## దేవులపల్లి రామశాస్త్రి

కాలం : క్రీ. శ. 18 వ శతాబ్దం ఉత్తరభాగం - 19 వ శతాబ్దం ప్రారంభం.
స్థలం : పిఠాపురం సంస్థానం.
రచన : 1. రామాభ్యుదయ చంపువు (సం) 2. సుధీచంద్రిక (పద్మరాజ చంపువుకు వ్యాఖ్య).

పిఠాపురం సంస్థానాధీశ్వరుడైన రావు వేంకట నీలాద్రిరాయనింగారి (క్రీ. శ. 1778-1828) ఆస్థాన విద్వత్కవి. ఉభయభాషా ప్రవీణుడు.

సమకాలిక ప్రసిద్ధకవీ, సంస్థానామాత్యుడూ అయిన అవసరాల పద్మరాజు రచించిన "పద్మరాజ చంపువు"కు "సుధీ చంద్రిక" వ్యాఖ్యను రచించాడు.

(ఆ. సం. సా - 247)

## దేవేంద్ర విజయము (అలభ్యం)

రచనాకాలం : 15, 16 శతాబ్దపు నడిమిభాగం.
కర్త : మాడయ కవి.
అంకితం : ఎర్రిన మంత్రికి.

ద్విపద కావ్యం. ఈ కవి కృష్ణరాయల తండ్రి నరసరాయల కాలంలోనూ, అన్నయైన వీరనరసింహరాయల కాలంలోనూ ఉన్నాడట. ఈ గ్రంథం వివరాలు తెలియరాలేదు.

(క.స-'67)

## దేశింగు రాజు కథ

కర్త : తెలియదు.

జానపద చారిత్రక గేయం.

చూ. చారిత్రక గేయములు. (ఆం. వా. చ.)

## దేసటి పండడు

కాలం : క్రీ. శ. 1145 ప్రాంతం.

శాసనకర్త : (గుంటూరు జిల్లా) చేబ్రోలు లోని కుమారస్వామి ఆలయంలోని శాసనాన్ని ఇతడే రచించాడు.

పై శాసనాన్ని బట్టి ఈ కవి మార్గదేశి కవితలు చెప్పటంలో నిపుణుడని తెలుస్తున్నది. ఈతనిని పండితులు "కవి పండడు" అంటారు. ఇతడు రచించిన కృతుల వివరాలు తెలియరావడం లేదు. (క. త-2)

## దైవజ్ఞ విలాసమ్ (సం)

కర్త : కంచం యల్లయార్యుడు.

ఈ పుస్తకం వ్రాసినట్లు కవి స్మృతి కదంబంలో చెప్పాడు. (తె. వి. స-4)

## దొడ్డారెడ్డి

కాలం : క్రీ. శ. 15 వ శతాబ్ది పూర్వార్ధం.

రాజమహేంద్రవర రెడ్డి ప్రభువు అల్లాడరెడ్డి కుమారుడు. సాహిత్య పోషకుడు. శివలెంక కొమ్మనకృతమైన శివలీలా విలాసం ఇతనికే అంకితం. (రె. రా. చ.)

## దొడ్డి నరసింహ కవి

కాలం : క్రీ. శ. 18 శతాబ్దం.

రచన : కరియబంటుని కథ (యక్షగానం).

గురువు : శంకరాచార్యులు.

ఈ కవి ఇష్టదైవం దొడ్డకొండలోని బొభశేకుడు. ఇతని కృతి బొభశేకునికే అంకితం. జంగాల గ్రామాధిపతి ఫణియప్ప కుమారుడు పద్మనాభయ్య, ఈ కవిని ప్రోత్సహించి రచన చేయించాడట. (య. వా. చ.)

## దొనకొండ గంగజాతర

చూ. పూరె వీరభద్రకవి.

ఈ జాతర ఆంధ్రదేశంలో మిక్కిలి ప్రసిద్ధి పొందింది. గంగ జాతరను స్థానిక యాదవ ప్రముఖులే నిర్వహిస్తారు. ప్రస్తుత ప్రకాశం జిల్లాలోని కనిగిరి, కందుకూరు, దర్శి, పొదిలి, మార్కాపురం, గిద్దలూరు, కంబం ప్రాంతంలోని యాదవ కులం వారందరూ ఈ జాతరలో పాల్గొని మ్రొక్కుబడులు సమర్పించుకుంటారు. ఈ గంగజాతరను విపులంగా వర్ణిస్తూ వీరభద్రకవి చక్కని పద్యం చెప్పాడు. (చా.ప.ర.)

## దొమ్మరి ఆటలు

దొమ్మరిసానులు వెదురుగడలపై ఇచ్చే ప్రదర్శనలనే పూర్వకాలం నుంచి దొమ్మరాటలు అంటున్నారు. వీటి ప్రసక్తి పాల్కురికి సోమన్న పండితారాధ్య చరిత్రలోను, శ్రీనాథుని శృంగార నైషధంలోను, నాచన సోమన ఉత్తర హరివంశంలోను ఉంది. దొమ్మరి ఆటలతో బ్రాహ్మణ విద్యలేవీ సరిపోలవని చంద్రశేఖర శతకంలో ఉంది.

వీరు ఆడే ఆటకు పొడవైన వెదురుగడలను ఉపయోగిస్తారు. దొమ్మరసానులు వెదురుగడలపైన ఆకాశంలో అప్సరసలు ఆడుతున్నారనే భ్రమకలిగించేవారట.

వీరు పురుషులతో పాటు భూమి మీద వివిధ రకాల పిల్లిమొగ్గలు వేసి, చిత్ర విచిత్ర ప్రదర్శనలతో ప్రేక్షకులను దిగ్భ్రమలో ముంచేవారు. నేలలో పాతిన గడమీదనేగాక, గడను పురుషులు ఎదురురొమ్ముమీద, నొసటిమీద నిలబెట్టి వాటిపై బొమ్మరిసానులతో విద్యల్ని ప్రదర్శింపచేసేవారు. ఉత్తర హరివంశంలో వీరిని 'గడసానులు'గా పేర్కొనడం జరిగింది. (నా.ర.చ-301-2)

## దోనయామాత్యుడు

కాలం : క్రీ శ. 14 వ శతాబ్ది ఉత్తరార్థం.

రచనలు : 1. సస్యానందము (శాస్త్రగ్రంథం) 2. సర్వలోకాశ్రయము (అలభ్యం).

మాచిరాజు, రుద్రాంబల పుత్రుడు. ఎలమంచిలి (సర్వసిద్ధి)ని పాలించిన చాళుక్యరాజు మూడో ఉపేంద్రుని ఆస్థానంలో ఉండేవాడు. ఈతని పేరు గోనయ అని కొందరు భావించారు.

సస్యానంద రచనా కాలం భిన్న ప్రతులలో విభిన్న రీతులలో ఉన్నదట. ఆషాఢ శుద్ధ పాడ్యమిని, దాని విశిష్టతను గురించి మొదట తెలుగులో చెప్పిన కవి దోనయామాత్యుడు. కాళిదాసు మేఘ సందేశంలో చెప్పిన "ఆషాఢస్య ప్రథమ దివసే" అనే విషయాన్ని ఈ కవి సమర్థించాడు. (ఆరుద్ర-4)

## దోనూరి కోనేరునాథుడు

కాలం : క్రీ. శ. 16 వ శతాబ్ది మధ్యభాగం.

బిరుదు : కవిసార్వభౌముడు.

రచనలు : 1 బాల భాగవతము (చంపువు) 2. బాలభాగవతము (ద్విపద).

విశిష్టత : ఈయన సంస్కృత, ప్రాకృతాది భాషలు తెలిసినవాడు. కావ్య కర్త. 'పృథ్వీనాయకాస్థాన రత్నకలాపం'. అష్టభాషా కవి మిత్రుడు. సాహిత్య మార్గ నిశ్శంకుడు. వినయలక్ష్మీ సనాథుడు. పోతన తెనిగించిన భాగవతానికి ఇతని బాలభాగవతం సంగ్రహంగా ఉందని పండితాభిప్రాయం. విజయనగర సామ్రాజ్య చరిత్రలో ఆరవీటి వంశంవారి పాత్రను ఈ కవి వ్రాసిన పుస్తకాలవల్ల బాగా తెలుసుకోవచ్చు. ఈయన వ్రాసిన బాల భాగవతానికి పిల్లభాగవతమనే వ్యవహార నామముంది.

ఈ కవి ఆరవీటి వంశజుడైన పొట్లపాడి నల్ల తిరుమలరాజు ప్రోత్సాహంతో బాలభాగవత (పద్య) కావ్యాన్ని రచించి అతని తండ్రి అయిన తిమ్మరాజుకు అంకిత మిచ్చాడు. అదే కావ్యాన్ని ద్విపదగా వ్రాసి తిరుమలరాజు తమ్ముడైన చిన తిమ్మరాజుకు అంకితం ఇచ్చాడు. పొట్లపాడి చిన తిమ్మరాజుకే 'అవుకు చిన తిమ్మరాజు' అనివ్యవహారం. (ఆరుద్ర-9; 1928 జూన్ భారతి; ద్వి సా చ-222)

## దోమకొండ

దీనికి "బిక్కనవోలు" అనే నామాంతరం ఉంది.

నిజాం రాష్ట్రంలోని పురాతన సంస్థానాలలో ప్రసిద్ధి చెందిన ఒక సంస్థానం.

తూర్పు గోదావరి జిల్లాలో ఉన్న బిక్కవోలు దీనికి భిన్నమైంది. ఈ బిక్కనవోలు మెదక్ మండలానికి చెందింది.

పాకనాటి రెడ్లు ఈ సంస్థానాన్ని పాలించారు. వీరి ఇంటిపేరు "కామినేనివారు." ఈ సంస్థానాధిపతులు మొదట గోలకొండ సుల్తానులకు, ఆ తరువాత హైదరాబాద్ నిజాముకు సామంతులుగా ఉంటూ సంస్థానాన్ని పాలించారు.

పాకనాటిరెడ్డి శాఖలో 'కామినేని చౌదరి" మూల పురుషుడట. ఇతనికి "కామిరెడ్డి" అనే నామాంతరం ఉంది. ఈ "కామినేని"కి అయిదవతరం వాడైన కాచారెడ్డికి మనుమడైన మల్లారెడ్డి ఈ వంశానికి అపారమైన కీర్తి ప్రతిష్ఠలను ఆర్జించి పెట్టాడు. ఇతడు రాజకవి. రెడ్డి కవులందరిలో అతి ప్రాచీనుడు. "షట్చక్రవర్తి చరిత్రము, పద్మపురాణము, శివధర్మోత్తర ఖండము" మొ॥ ప్రబంధాలు రచించాడు. "సత్కవిరాజ, సర్వజ్ఞభోజ, భాషా శేషాహి" మొ॥ బిరుదులు పొందినవాడు. ఈ మల్లారెడ్డికి ఎల్లారెడ్డి అనే సోదరుడున్నాడు. ఇతడు బహుపురాణజ్ఞుడట. వాసిష్ఠ లైంగధర్మ కావ్య రచయిత.

వీరికి అయిదవ తరమువాడైన పోతారెడ్డి కుమారుడు "రాజన్న చౌదరి". ఇతడు ఈ సంస్థాన పాలకులలోని ప్రసిద్ధులలో ఒకడు. ఇతడు రాజధానిని బిక్కనవోలు నుండి కామారెడ్డి పేటకు మార్చాడనీ, అతని కుమారుడైన మొదటి రాజేశ్వరరావు "దోమకొండ"ను రాజధానిగా చేశాడనీ అంటారు. రాజన్న చౌదరి సాహిత్యాభిమాని. రాపాక లక్ష్మీపతి వంటి ప్రముఖ కవులను పోషించాడు. "భద్రాయురభ్యుదయము" వంటి గ్రంథాలు ఇతని కాలంలోనే వెలువడ్డాయి. రాజన్న చౌదరి మనుమని మనుమడు "ఉమాపతి". ఇతడు "కామినేని వంశచరిత్రము" అనబడే "ఉమాపతభ్యుదయ" గ్రంథానికి కృతిభర్త.

గత శతాబ్దంలో దోమకొండ ప్రభువుగా ఉన్న 'రాజారాజేశ్వరరావు' బహుళమైన సాహిత్య సేవచేసి, ఉర్దు-తెలుగు నిఘంటువును సంతరించారు. వీరి కుమారుడైన రాజా సోమేశ్వరరావు గద్వాల సంస్థానాధీశుల అల్లుడు. ఈ సంస్థాన పాలకులలో ఈ "సోమేశ్వరరావు" చివరివాడు.

(ఆం.సం సా-175-189; కేశవపంతుల-సం. సా-54)

**ద్రౌపదీ కల్యాణమ్ (సం)**

కర్త : చక్రకవి(చూ).

**ద్రౌపదీ కల్యాణము**

కర్త : చూ. బోయినపల్లి కుమార వెంకటరాయలు.

అంకితం : తిరుపతి వెంకటేశ్వరస్వామికి.

అయిదాశ్వాసాల కావ్యం. నవరసాలంకార యుక్తంగా ఉన్నది. దసరా ఉత్సవాల రోజులలో కవికి తిరుపతి వెంకటేశ్వరుడు కలలో కనబడి ఈ కావ్యం రచించి తనకు అంకితం ఇమ్మని కోరాడట. బోరవెల్లి నరసింహకవి ప్రోత్సాహంతో ఈ రచన సాగించినట్లు కవి చెప్పుకొన్నాడు. (మ. మూ-20,; ఆరుద్ర-11-267)

ద్రౌపదీ కల్యాణము

కర్త : శహాజీ (చూ).

శివస్తుతితో మొదలైన నాటకం. పాండవులు ద్రౌపదిని వివాహమాడడం, ఇందులోని కథ. కవి పురాణగాథను పండిత పామర రంజకంగా మార్చి వ్రాశాడు. సమాజ స్వరూపానికి అద్దం పడుతున్న పాత్ర చిత్రణ, సంభాషణా రీతులు – ఇందులో కనిపిస్తాయి. (ద. దే. వా-190)

ద్రౌపదీ పరిణయము (అలభ్యం)

కర్త : ఏనుగు లక్ష్మకవి (చూ).

అంకితం : పెద్దాపురం సంస్థానాధీశుడు సార్వభౌమతిమ్మ జగపతి మహారాజుకు. (క. త-12-169)

ద్వాత్రింశత్సాల భంజికల కథలు

కర్త : ఏకామ్రనాథుడు.

వచన గ్రంథం.

ఈ కావ్య కర్తృత్వం వివాదగ్రస్తంగా ఉన్నది. విక్రమార్కుని సింహాసనాన్ని అధిష్ఠించడానికి వచ్చే భోజునికి, 32 ప్రతిమలు చెప్పిన కథలు ఇందులో ఉన్నాయి. (క. స-27)

ద్వాత్రింశన్మంత్రి సీస మాలిక

చూ. ముప్పది యిద్దరు మంత్రుల సీసమాలిక.

ద్వాదశ మంజరి

కర్త : అక్షింతల సింగరశాస్త్రి (చూ).

ద్వాదశ రాజ చరిత్ర

కర్త : కట్టవరపు చిట్టమరాజు.

పద్యకావ్యం. కూచిమంచి తిమ్మకవి తన సర్వ లక్షణసార సంగ్రహంలో ఈ కావ్యాన్ని పేర్కొన్నాడు. (వా చ-వం.సు-387)

ద్వారక వారు

దివ్యక్షేత్రం పేరుతో తెలుగు దేశంలో ఉన్న ఇంటిపేరు దేశంలో ఈ ఇంటి పేరు వారున్నారు. (భారతి-మా-45-229)

ద్వికము

రెండు పద్యాలతో ఉన్న కావ్యము. (అప్పకవీయం)

ద్విపద కావ్యము

ద్విపద అనేది దేశీయ ఛందస్సుకు చెందినది. రెండు పాదాలను ఎప్పటికప్పుడు విడమరుస్తూ కవి ద్విపద కావ్య రచన చేస్తాడు. ఈ ఛందస్సు గానానికి అనుకూలంగా

సామాన్యులకు అర్థమయ్యే రీతిలో ఉంటుంది. కథ-అర్థం-భావం ఈ విషయాలలో ద్విపదలకు ఇతర పద్య కావ్యాలకు విశేషంగా భేదం లేదు.

తెలుగులో అతి ప్రాచీనమైన ద్విపద కావ్యాలు పాల్కురికి సోమన బసవ పురాణము, పండితారాధ్య చరిత్ర మొదలగునవి. తరవాత చెప్పుకోదగ్గ ద్విపద కావ్యాలు రంగనాథ రామాయణము, గౌరన హరిశ్చంద్రోపాఖ్యానము, నవనాథ చరిత్ర, భారత, భాగవత రామాయణాలలోని కథలు ద్విపద కావ్యాలుగా తెలుగులో చాలా వచ్చాయి. (చూ. లక్షణాలకు ద్విపద) (తె. వా.)

**ద్విపద భాగవతము (అలభ్యం)**

కర్త : ఉేకుమళ్ళ రంగశాయి (చూ).

నాలుగు స్కంధాలు మాత్రం లభిస్తున్నాయి. ఈ రచనలో పుష్పగిరి తిమ్మన ఇతనికి సహాయపడ్డాడట. (క. త.)

**ద్విపద భాగవతము (అలభ్యం)**

కవయిత్రి : తరిగొండ వేంకమాంబ. (అ. భా. క-74)

**ద్విపద భాగవతము**

కర్త : ధూర్జటి లింగరాజకవి. చూ.

ద్విపద కావ్యం. అముద్రితం. దీని తాళపత్ర ప్రతులు తిరుపతి విశ్వవిద్యాలయ "ప్రాచ్యపరిశోధక సంస్థ"లో కలవట. వివరాలు తెలియవు. (అం. సం. సా.)

**ద్విపద భారతము (అలభ్యం)**

కవయిత్రి : తరిగొండ వేంకమాంబ. (అ. భా. క-74)

**ద్విపద భారతము**

కర్తలు : 1. బస్టేపాటి తిమ్మన (1600 ప్రాంతం) 2. బాల సరస్వతి (1600 ప్రాంతం) 3. అక్కమకూరు సోమన్న (క్రీ. శ. 17 వ శతాబ్దం).

ఈ భారతంలోని పర్వాలు కొన్ని శ్రీరామునికి, మిగిలినవి వేర్వేరు వ్యక్తులకు అంకితం. గ్రంథాన్ని ప్రారంభించినవాడు బస్టేపాటి తిమ్మన. ఇతన్ని నరసయ్య గారి చౌడయ్య ఈ రచనకు ప్రోత్సహించాడట. ఆదిపర్వంలో మూడాశ్వాసాలు శ్రీరామునికి, మిగత 6 అశ్వాసాలు నరసయ్య చౌడునికీ అంకితం.

సభా పర్వాన్ని బాల సరస్వతి రెండాశ్వాసాలుగా వ్రాశాడు. ఇది రంగయ్య గారి అనంతయ్యకు అంకితం.

అరణ్య పర్వం నుంచి ద్రోణపర్వం వరకూ బస్టేపాటి తిమ్మయ వ్రాశాడు. అరణ్య పర్వంలో కొన్ని భాగాలు వదలి సంగ్రహంగా అయిదాశ్వాసాలు వ్రాసి దీన్ని శ్రీరామునికి అంకితం ఇచ్చాడు. విరాటపర్వం జంగాల ముమ్మయ్య అనే పంటరెడ్డి ప్రభువుకు అంకితం. తరువాతి ఉద్యోగ, భీష్మ, ద్రోణ పర్వాలు మూడూ శ్రీరామునికే అంకితం.

కర్ణ పర్వం నుంచి స్వర్గారోహణ పర్వం వరకూ **అత్మకూరు** సోమన్న వ్రాశాడు. అరణ్య పర్వంలో బిక్కేపాటి తిమ్మయ వదలిన భాగాలు కూడా ఇతడు పూర్తి చేశాడు.

ఈ ద్విపద భారతం నాల్గు సంపుటాలుగా అచ్చయింది. విరాటపర్వం ఒక్కటీ మాత్రం 1911 లో అచ్చుపడింది. (అరుద్ర-10-23)

**ద్విపద రాధాకృష్ణ చరిత్రము**

కర్త : కూచిమంచి జగ్గకవి.

కథ ప్రసిద్ధం.

**ద్విపద రామాయణము**

కర్త : అరవీటి తిమ్మరాయలు.

అంకితం : విరూపాక్షస్వామికి. (ఆం. సం. సా.)

**ద్విపదార్థము**

ఈ పేరిటి రచనలలో మొదటి సగం ద్విపదగాను, తరవాత సగం దరువుగాను ఉంటుంది. కందార్థాలు, గీతార్థాలు మొదలయినవి ఇట్టి రచనా విశేషాలు. క్రీ. శ. 18-19 శతాబ్దాల నుంచి ఇవి వ్యాప్తిలోకి వచ్చాయి. ఇవి యక్షగానాలలో ప్రయుక్తాలు. (య.వా.చ-261)

**ద్విపదోత్తర రామాయణము**

కర్త : చూ. ముడుంబై వేంకటకృష్ణమాచార్యులు.

రసవంతమైన ద్విపద కావ్యం. ఉత్తర రామాయణంలోని కథ దీనిలోని ఇతివృత్తం. (ఆం. సం. సా.)

**ద్విరూప కోశము (అలభ్యం)**

కర్త : చూ. గణపవరపు వేంకటకవి.

సర్వలక్షణ శిరోమణిలోని దశమోల్లాసం ఈ పేర ప్రసిద్ధమైంది. (అరుద్ర-11-161)

**ద్విరేఫ వర్ణ దర్పణము**

కర్త : ఓగిరాల రంగనాథకవి.

వ్యాకరణ గ్రంథం. నెల్లూరిలోని అముద్రిత గ్రంథ చింతామణిలో ప్రకటితమైంది. (వీరేశలింగం పంతులు-సమగ్రపరిశీలన)

**ద్విసహస్రావధానము**

చూ. అవధానాలు.

**ద్వ్యర్థి కావ్యము**

తెలుగులో ఇది ఒక విశిష్టమైన ప్రక్రియ. పదాలకు గల భిన్నార్థాల వల్లనో

పదాల విరుపు వల్లనో, ఒకే పద్యానికి రెండు రకాలైన అర్థాలు వచ్చేటట్లు రచించి-అలాగే ఒక కావ్యం వ్రాయడాన్ని కవులు గర్వకారణంగా భావించే వారు. కవి ప్రతిభా వ్యుత్పత్తులు ఈ కావ్య రచనలో వ్యక్తమౌతాయి. శబ్దాన్ని తూచి ఉపయోగించటంలో అధికారమున్న కవులే ఇలాంటి కావ్యాలు రచిస్తారు. ఇది కవి పాండిత్య ప్రకర్షకు గీటురాయి. తెలుగులో పింగళి సూరన రాఘవపాండవీయం తొలి ద్వ్యర్థి కావ్యం. ఒక పద్యంలో రెండు అర్థాలు ఇమిడ్చినట్లే ఇందులో రెండు కథలు (ఒక అర్థంతో చదివితే రామ కథ మరో అర్థంతో చదివితే భారత కథ) ఇమిడి ఉన్నాయి.

తరవాత చెప్పదగిన ద్వ్యర్థి కావ్యం రామరాజభూషణ విరచిత హరిశ్చంద్ర నలోపాఖ్యానము. ఆ తరువాత మూడు కథలను జోడించి, మూడు అర్థాలు వచ్చేటట్లు ఎలకూచి బాలసరస్వతి రాఘవయాదవ పాండవీయాన్ని త్ర్యర్థి కావ్యంగా వ్రాశాడు. అనంతరం గుడుగుటూరి వేంకటకృష్ణ కవి, నలయాదవ రాఘవ పాండవీయమనే పేర చతురర్థి కావ్యాన్ని వ్రాశాడు. (తె. వా.)

## ధణి దాసమంత్రి

కాలం : క్రీ. శ. 18వ శతాబ్దం.

స్థలం : కృష్ణా మండలంలోని బందరు.

సాహిత్య పోషకుడు. మంగళగిరి ఆనందకవి చేత ఏసుక్రీస్తు చరిత్రను, "వేదాంత రసాయనమ"నే పేరుతో వ్రాయించి అంకితం పొందాడు. వీరి వంశవృత్తాంతం కొంత ఆ గ్రంథంలో ఉంది. (క.శ.-13-91)

## ధనంజయ విజయము (అలభ్యం)

కర్త : శ్రీనాథుడు.

అంకితం : దంతులూరి గన్నభూపాలుడు.

ఈ కావ్యాన్ని తాను వ్రాసినట్లు కవి తెలపలేదు కాని, దీనిని శ్రీనాథుడే వ్రాశాడని దంతులూరి బాపిరాజు అనే కవి తన మూర్తిత్రయోపాఖ్యానంలో చెప్పాడు. దీనిలోని కథ కిరాతార్జునీయ కథ అయి ఉండవచ్చునేమో అని పండితాభిప్రాయం. పెద కోమటి వేముని మామయైన గన్న భూపాలుడు కృతిపతి.

(శ్రీనాథుడు-149, 154 - కా.శ్రీ.మా.)

## ధనంజయుని కలమళ్ళ శాసనము

కాలం : క్రీ. శ. 6 శతాబ్ది చివరి పాదం.

ధనంజయుడు రేనాటిచోళుడు. ఇది తొలి తెలుగు శాసనాలలో ప్రముఖమైనది. అనంతర కాలంలో ఇట్లే కొన్ని తెలుగు శాసనాలను రేనాటి చోళులు వేయించారు.

(వా.చ.-11)

## ధనాభిరామము (అలభ్యం)

కర్త : చూ. ఆసూరి మరింగంటి సింగరాచార్యులు.

ద్విపద కావ్యం. కవి పదిహేనవ యేట చేసిన రచన. (శ.త.–13–10)

## ధనాభిరామము

నామాంతరం : సకల జనాభిరామము.
కర్త : నూతన కవి సూరన
రచనా కాలం క్రీ. శ. 1410–80 ప్రాంతం.
కృతి భర్త : దక్షారామ భీమేశ్వరుడు.

మూడాశ్వాసాల కావ్యం. కల్పితేతి వృత్తం.

విశిష్టత : అందం ముఖ్యమని మన్మథుడు, ధనం ముఖ్యమని కుబేరుడు ఇంద్ర సభలో పందెం వేసుకొని భూమికి దిగివచ్చిన చక్కని ఇతివృత్తం ఇందులో ఉంది. రూపమూ, రూకలూ – రెండూ మానవులకు దేవతలకు కూడా అవసరమని భీమేశ్వరుని తీర్పు. ఈకావ్యంలో సమకాలీన సాంఘిక పరిస్థితులు విశేషంగా ఉన్నాయి. దీనిలోని పద్యాలను కూచిరాజు ఎర్రన, సుమతి శతకకారుడు ప్రస్తావించారు. (ఆరుద్ర–6–69)

## ధనాభిరామము (అలభ్యం)

కర్త : విజయ రాఘవ నాయకుడు.

ఇతివృత్తం అప్పటికే ప్రసిద్ధం. కవి ఆ కథనే గ్రహించాడో, లేక ఇది స్వతంత్ర రచనో తెలియరాలేదు.

## ధనుర్విద్యా విలాసము

నామాంతరం : ధనుశ్శాస్త్రము.
కర్త : అకలంక శ్రీకృష్ణమార్యుడు.

శాస్త్ర గ్రంథం. ఈ కృతిని కృష్ణానేని తిరుపతి క్ష్మాపతి ప్రోత్సాహంతో కవి రచించాడు. ఈ గ్రంథం ముద్రితం. వేటూరివారు దీనికి విపులమైన పీఠిక వ్రాశారు. (య. వా. చ–56)

## ధనుశ్శాస్త్రము

నామాంతరం : చూ. ధనుర్విద్యా విలాసము.
కర్త : అకలంక శ్రీకృష్ణమార్యుడు. (వా.చ–వం.సు అనుబంధం)

## ధరణికోట

ప్రస్తుతం గుంటూరు జిల్లాలో ఉన్న చారిత్రక ప్రదేశం. ఇది ఆంధ్ర శాత వాహనుల రాజధాని. దీనికి ధాన్య కటకమని నామాంతర ముంది. ఇది రాజధానిగా ఏలిన శాతవాహనులు బౌద్ధ మతాన్ని పోషించారు. హాలుడు ప్రాకృతంలో గాథాసప్తశతిని సంకలనం చేశాడు. గుణాఢ్యుడు అనే కవి బృహత్కథను ప్రాకృత భాషలో వ్రాశాడు. అనంతర కాలంలో అంటే క్రీ.శ. 1225 ప్రాంతంలో వెలనాటి చోడుల సామంతులు "కోట వంశీయులు" దీనిని రాజధానిగా చేసుకొని రాజ్యం చేశారు. ధరణికోట సమీపం లోనే అమరావతి ఉంది.

ధరణికోటలో బౌద్ధ మతావశేషాలెన్నో ఉన్నాయి. క్రీ.శ. 17,18వ శతాబ్దాలలో కమ్మదొరలైన వాసిరెడ్డివారు దీనిని రాజధానిగా చేసుకొని పాలించారు. వీరు ఎందరో కవులను, పండితులను పోషించి, దాన ధర్మాలు చేశారు.

**ధరణికోట ధనంజయుడు**

కాలం : క్రీ. శ. 13 వ శతాబ్దం

ఈయన ధరణికోటను రాజధానిగా చేసుకొని రాజ్యం చేశాడని ఒక చాటువు తెలియ చేస్తున్నది. చాటుకవి వివరాలు తెలియవు. (చా.వ.ర.)

**ధరణి దేవుల రామమంత్రి**

కాలం : క్రీ. శ. 17 వ శతాబ్దం.
స్థలం : నెల్లూరు మండలంలోని ప్రళయ కావేరిపట్టణం.
రచన : దశావతార చరిత్రము (రసికజన కంఠాభరణ శ్రీకృష్ణ దశావతార చరిత్రము).

సమకాలికులు : పుష్పగిరి తిమ్మన, కంకంటి పాపరాజు.

అష్టభాషా కవిత్వ విశారదుడు. దినైక ప్రబంధ రచనాదక్షుడు. దశావతార చరిత్ర కర్తృత్వం గురించీ ఇతని కాలాన్ని గురించీ భిన్నాభిప్రాయాలున్నాయి. ఇతడు తిమ్మయామాత్యుని పౌత్రుడు. నాగయామాత్యునకు, ఫణియమ్మకు పుత్రుడు.

తెలుగు సాహిత్యంలో ఇతని కావ్యం మనోహరమైనదీ, కఠినమైనదీ అని బ్రౌన్ అభిప్రాయపడ్డాడు. దశావతార చరిత్ర కృతిపతి మగదల కృష్ణమంత్రి డచ్చివారి దగ్గర ద్విభాషిగా ఉండేవాడట.

దశావతార చరిత్రను పుష్పగిరి తిమ్మనయే రచించాడని కొందరంటారు. కాని అది నమ్మదగినది కాదు. (క. త-12-52)

**ధరాత్మజా పరిణయము**

కర్త : చూ. కొత్తలంక మృత్యుంజయ కవి.
రచనాకాలం : క్రీ. శ. 18 వ శతాబ్దం.

ఇది సీతా, పార్వతి కల్యాణాలను ద్వ్యర్థిగా వర్ణించే నాలుగు ఆశ్వాసాల ప్రబంధం. అవతారికలో దీనికర్త అల్లూరి అప్పలరాజని ఉంది. కాని ఆశ్వాసాంత గద్యలలో మృత్యుంజయ కవి పేరే ఉన్నది.

అల్లూరి అప్పలరాజు ఇతని కాశ్రయుడు కావచ్చును. (తె.వి.స.-6)

**ధరాసాగరేశ చరిత్రము**

కర్త : నంబతిఘలు అప్పలాచార్యులు.
రచనాకాలం : క్రీ. శ. 1730 ప్రాంతం.
అంకితం : పరాంకుశ భూపాలునికి.

వివరాలు తెలియవు. (క. స-14)

## ధర్మ ఖండము

కర్త : ఈదులపల్లి భవానీశ కవి.

అంకితం : శివునికి.

తొమ్మిది ఆశ్వాసాల గ్రంథం (పది అని కొందరంటున్నారు). వాల్మీకి మహర్షి చరిత్ర ఇందులోని కథ. సందర్భాను సారంగా అనేక భక్తుల గాథలు కూడా ఉన్నాయి. శివకేశవాభేద నిరూపణ చేసిన గ్రంథం.

మూలం : స్కాంధపురాణం 50 ఖండాలలో ఉన్న కథ. కవికి ఈశ్వరుడు కలలో కనబడి ఈ రచనకు ప్రోత్సహించాడట. క్రీ. శ. 1931 లో ముద్రితం. దీనికి నడకుదుటి వీరరాజు విపులమైన పీఠిక వ్రాశారు. (క. శ_12_223)

## ధర్మగుప్తాభ్యుదయము

కర్త : కాశీనాథుని వీరారాధ్యుడు.

పద్య కావ్యం. (క. స_227)

## ధర్మజకృష్ణ సంవాదము

కర్త : నరసింహ కవి.

ద్విపద కావ్యం. ధర్మరాజుకు శ్రీకృష్ణుడు తత్త్వజ్ఞానం ఉపదేశించడం దీనిలోని విషయం. నాసికేతుని కథ, అజామిళోపాఖ్యానం ప్రసక్తంగా ఉన్నాయి. (ద్వి. సా. చ_278)

## ధర్మ ద్విపద

నామాంతరం : సాధ్వీజన ధర్మము.

కర్త : కాకునూరి అప్పకవి.

## ధర్మనందన విలాసము

కర్త : చూ. కాళ్ళకూరి గౌరీకాంతకవి.

అంకితం : వెలిచేటి గురురాయనికి.

మూడాశ్వాసాలు గల ప్రబంధం. పాండవ జ్యేష్ఠుడైన ధర్మరాజు విదేహ రాజపుత్రి అయిన కళావతిని వివాహం చేసుకోవడం ఈ ప్రబంధంలోని ఇతివృత్తం. ప్రాచీన ప్రబంధ ఫక్కీని అనుసరించి కూర్పబడిన రచన. (ఆం. సం. సా_421)

## ధర్మపురి మాహాత్మ్యము

కర్త : విశ్వేశ్వరుడు.

యక్షగానం. గౌతమీ తీరంలో ఉన్న ధర్మపురి క్షేత్రానికి సంబంధించిన కథ. దరువులు, ద్విపదలు, వచనము, కొన్ని పద్యాలు, కురుచరేకులు, ఉత్కళికలు, చిత్రతాళము, రగడ మొదలయిన విశేషాలున్నాయి. దీని వేరొక ప్రతికి చంద్రరేఖా విలాసమనే పేరున్నది. కథానాయిక పేరు చంద్రరేఖ. (య. వా. చ_72)

### ధర్మపురి రామాయణము

కర్త : ధర్మపురి శేషాచల కవి.

ఆరు కాండలున్నాయి. యక్షగానం. ఇది తెలంగాణాలోనే గాక యావదాంధ్ర దేశంలో విశేష ప్రసిద్ధి వహించింది. శ్రవ్య ధోరణిలో సాగిన రచన.

దీనిలో ద్విపద, పద్యములు, వచనము, ఏలలు ఉన్నాయి. (య.వా.చ-359)

### ధర్మపురి రామాయణము

జానపద పౌరాణిక గేయ రచన.

చూ. పౌరాణిక గేయములు. (అం. వా. చ.)

### ధర్మపురి శేషాచల కవి

కాలం : క్రీ.శ. 1780 ప్రాంతం.
స్వస్థలం : ధర్మపురి (కరీంనగరు జిల్లా).
రచనలు : 1. ధర్మపురి రామాయణము 2. నరసింహ శతకము 3. నరహరి శతకము. (ధర్మపురీ నృకేసరీ శతకము)

ఇతని రచన సలక్షణంగా నిరాడంబరంగా సుందరంగా ఉంటుంది. (య. వా. చ-359)

### ధర్మపురీ నృకేసరీ శతకము

నామాంతరం : నరహరి శతకము.

కర్త : ధర్మపురి శేషాచలకవి.

ధర్మపురిలోని నృసింహస్వామిపైన చెప్పిన ----- [illegible] అనే మకుటంతో ఉంది. చంపకోత్పలమాలికా వృత్తాలతో కూర్చిన శతకం. దీన్నే గోలకొండ కవుల సంచిక నరహరి శతకంగా చెప్పడం జరిగింది. (శ. క. చ-769)

### ధర్మరాజాశ్వమేధము

కర్త : ఇనుగండ్ల కృష్ణప్రధాని (చూ).
అంకితం : శ్రీరంగపతికి.

ఇది ద్విపద కావ్యం. అయిదాశ్వాసాలున్నాయి. ఇందులో ఇప్పుడు 201 కమ్మలు మాత్రమే లభిస్తున్నాయి. చివరిభాగం లభించలేదు. ఇందులోని కవిత్వం అత్యంత సరళంగా ఉంటుంది. (మ. మా.)

### ధర్మరాజు జూదము

కర్త : తెలియదు.

జానపద పౌరాణిక గేయం. కథ ప్రసిద్ధం. భారతంలోనిది.

చూ. పౌరాణిక గేయములు. (అం వా. చ.)

## ధర్మవరం రామకవి

కాలం : క్రీ. శ. 18వ శతాబ్దం.
స్థలం : గద్వాల (సంస్థానం).
రచన : ముకుందవిలాసము (అలభ్యం).

గద్వాల ప్రథమ రాజా సోమభూపాల్ ఆశ్రితుడు. అతవి కోరికపై 'ముకుంద విలాస' గ్రంథాన్ని రచించాడు. (ఆం సం. సా.)

## ధర్మవిజయమ్ (సం)

కర్త : నల్లదీక్షితుడు.

నాలుగు స్తబకాల చంపూకావ్యం. తంజావూరును పాలించిన శహాజీ (1684–1712) రాజు చరిత్ర ఇందులోని ఇతివృత్తం. శహాజీని "అభినవ భోజరాజు"గా కవి వర్ణించాడు. (న. దే. వా–180)

## ధర్మశాస్త్రమ్–కాల నిర్ణయమ్ (సం)

నామాంతరం : కాలమాధవమ్.
కర్త : విద్యారణ్యుడు (తె. వి. న–4)

## ధర్మాంగద చరిత్ర

కర్త : బొమ్మకంటి నృసింహకవి.
అంకితం : శ్రీకృష్ణునికి.

ద్విపద కావ్యం. కవిత్వం నిర్దుష్టంగా, నాతి ప్రౌఢంగా ఉంది. ఇదే పాముల పాటగా ప్రసిద్ధి చెందిన కథ. కవి వర్ణనలు రసోచితంగా ఉన్నాయి. ధర్మాంగదుని పుత్రుడు సర్ప రూపంలో ఉండగా అతని కోడలు తన సౌశీల్యంతో అతన్ని మానవునిగా మార్చడం ఇందులోని ఇతివృత్తం. ఈ కథ గౌతముడు అహల్యకు చెప్పినట్లుగా ఉంది. (ద్వి. సా. చ–438)

## ధర్మాకూతమ్ (సం)

కర్త : త్ర్యంబకరాయ మఖి.
రచనాకాలం : క్రీ.శ. 17వ శతాబ్దం.

రామాయణానికి నూతన పద్ధతిలో చేయబడ్డ వ్యాఖ్యానం. చాలా ప్రసిద్ధిపొందిన దట. శహాజీని గూర్చిన చారిత్రక విశేషాలనేకం దీనిలో కవి చెప్పాడట. (M.RT–30)

## ధవళము

ఇది ఒక మంగళ గీతం. ఆశీర్వాద గేయంగా, హారతి పాటగా, కైవార గీతంగా చాలా యక్షగానాలలో ఉంది. అప్పకవి ధవళానికి ఒక లక్ష్యం చెప్పాడు. ప్రాచీన ప్రబంధాలలో దీని ప్రసక్తి ఉంది. బిల్హణీయంలో 'అత్తరి నయిదువలారతు లెత్తుచు ధవళములు పాడ' అని ఉంది. ఇది గ్రంథాంతంలో ముత్తైదువలు హారతి

వచ్చే సందర్భంలో సాధారణంగా ఉంటుంది. తరచు శోభన గీత పురస్సరంగా ఉంటుంది. ధవళశోభనాలు ఎడబాయని జంట.

ధవళం కొన్ని చోట్ల స్తోత్రపాఠ ప్రచారంగా, జయశబ్దాది సంబుద్ధి గుచ్ఛంగా కూడా ఉంటుంది. దీనిని ఒక రకమైన కైవార గీత మంటారని కొందరి అభిప్రాయం.

సాధారణంగా పాదానికి నాలుగు మాత్రల దళాలు మూడేసి ఉంటాయి. రెండేసి పాదాలకు అంత్యప్రాస కనిపిస్తుంది. అప్పకవీయంలో ఇది జయ శబ్దాదిగా లేదు. ఇది అగస్త్యరాజు రామన సీతాకల్యాణంలోనూ, దక్షిణాంధ్ర యుగానికి చెందిన యక్షగానాలలోనూ ఎక్కువగా కనిపిస్తుంది. (య.వా.చ-334-335)

## ధవళేశ్వరపు మార్కండేయుడు

కాలం : క్రీ.శ. 16వ శతాబ్దం.

బిరుదు : పేషణీ హనుమంతుడు.

సాహిత్య పోషకుడు. కృతిపతి. తురగా రాజకవి, అయ్యంకి బాల సరస్వతులు రచించిన "నాగర ఖండం" ఇతనికే అంకితం.

ఇతడు మహమ్మద్ కుతుబ్షా (1580-1617)కు కుడిభుజమట.

## ధాతుమాల

కర్త : వేదం పట్టాభిరామశాస్త్రి.

ఇది వ్యాకరణ గ్రంథం. పౌరపాటున చిన్నయ సూరి వ్రాసినట్లు ముద్రిత మైంది. ఫోర్ట్ సెంట్ జార్జి కళాశాల విద్యార్థుల కోసం ఒక వ్యాకరణ గ్రంథం అవసర మైన తరుణంలో ఈ గ్రంథ రచన జరిగింది. (తె.వి.స.-4)

## ధాతు వృత్తి (సం)

కర్త : సాయణాచార్యుడు.

ఇది వ్యాకరణ శాస్త్ర గ్రంథం. మాధవీయ ధాతువృత్తి అని దీనికి నామాంతర ముంది. (తె.వి.స -4-1190)

## ధీరజన మనోవిరాజితము

కర్త : తెనాలి రామలింగకవి.

రచనా కాలం : క్రీ. శ. 17వ శతాబ్దం.

విశ్వబ్రాహ్మణుల చరిత్రకు సంబంధించిన గ్రంథం. అమర సింహుడు విశ్వ బ్రాహ్మణులను నిందించడం, దానివలన కలిగిన నష్టాలు-మొదలైన విషయాలున్నాయి. (క. స. 199.)

## ధీరధీ శతకము

కర్త : మోదుకూరి శంకర కవి.

వృత్త పద్య శతకం. చంపకమాలా వృత్తాలున్నాయి. "ధరశరధీ, రధీశసుత

దాశరథీ, దరథేర ధీరధీ" అనే మకుటంతో రచన ప్రౌఢంగా ఉంది. ఇది 1862 నాటికే ముద్రితమైంది. (శ.క.చ-565)

## ధూర్జటి

కాలం : క్రీ.శ. 16 వ శతాబ్దం.
స్థలం : కాళహస్తి.
సమకాలికులు : అల్లసాని పెద్దన, నంది తిమ్మన, అయ్యలరాజు రామభద్రుడు, మాదయగారి మల్లన.
రచనలు : 1) శ్రీకాళహస్తి మాహాత్మ్యం 2) శ్రీకాళహస్తీశ్వర శతకం.

సింగమ్మ ,నారాయణుల పుత్రుడు. తాత జక్కయ. ఇతడు కృష్ణరాయల అష్టదిగ్గజాలలో ఒకడు. కాళహస్తీశ్వర భక్తుడు ఈయనను పెదధూర్జటి అని పండితులనటం కద్దు. మహాకవి ధూర్జటి వంశంలో ధూర్జటి నామధేయులు నలుగురు ఉండడం వలన శ్రీకాళహస్తి మాహాత్మ్యం, శ్రీకాళహస్తీశ్వర శతకాలు వ్రాసిన కవిని పెదధూర్జటి అంటారు. ధూర్జటి యౌవనంలో స్వేచ్ఛగా వేశ్యాలోలుడై తిరిగి, వయసు మళ్ళిన తరవాత పశ్చాత్తాపపడి, శివభక్తాగ్రేసరుడై శ్రీకాళహస్తి మాహాత్మ్యం వ్రాశాడని చెప్తారు. సమకాలికులే ఇతని కవిత్వంలోని మాధుర్యానికి ముగ్ధులైనారు. ఇతని కవిత్వం ద్రాక్షాపాకంలో మృదుపద సంయుతమై అనర్గళ ధారతో భక్తిరస పూరితంగా ఉంటుంది. కుమార ధూర్జటి "కృష్ణరాయ విజయం"లో చెప్పిన "స్తుత మతియైన" పద్యాన్ని బట్టి ఈ కవి రాయల సభలో సన్మానం పొందినట్లు తెలుస్తున్నది. (క.త-7)

## ధూర్జటి లక్ష్మీపతి

కాలం : క్రీ. శ. 19వ శతాబ్దం.
రచన : హంస వింశతి (వచన కావ్యం).

కథావాఙ్మయం ఆరంభ దశలో ఉన్నప్పుడు ఈ కవి హంస వింశతిని సులభ గ్రాహ్యంగా వచనంగా రచించాడు. ఈతని గ్రాంథిక రచన నాటి పండితులనే కాక సామాన్యులను కూడా అలరించింది. (వ. వా.)

## ధూర్జటి లింగరాజకవి

కాలం : క్రీ. శ. 18వ శతాబ్దం.
స్థలం : కాళహస్తి సంస్థానం.
రచనలు : 1. కాళహస్తి మాహాత్మ్యము (పెదకాళహస్తి మాహాత్మ్యము) 2. ద్విపద భాగవతము.

కుమార ధూర్జటి అనే బిరుద నామం కలిగిన 'వెంకటరాయకవి' పుత్రుడు. దామెర్ల వేంకటపతినాయడు ఈ కవిని ఆదరించాడు. లింగరాజకవి క్రీ. శ. 1703లో 'కాళహస్తి మాహాత్మ్యము' అనే కృతిని ఈ వేంకటపతినాయనికి అంకితమిచ్చాడు. రత్నావళీ పరిణయ కర్త వేంకటరాయకవి ఇతని పుత్రుడు. ఇతని కవిత రసవంతంగా ఉంటుంది. (ఆం. సం. సా.)

## ధూర్జటి వేంకటరాయకవి

కాలం : క్రీ. శ. 18 వ శతాబ్దం.
స్థలం : కాళహస్తి ప్రాంతం.
రచనలు : 1. రత్నావళీ పరిణయము 2. అమరము (ఆంధ్రీకరణం).

ఇతడు ధూర్జటి కవి వంశీయుడు. పెద కాళహస్తి మాహాత్మ్యాన్ని కావ్యంగా చెప్పిన ధూర్జటి లింగరాజు పుత్రుడు. వీరు దక్షిణ ఆర్కాటు మండలంలో స్థిరపడినట్లు విమర్శకులు ఊహిస్తున్నారు.

ఈ కవి ఉభయ భాషలలోనూ, కవిత్వం చెప్పగలవాడు చిన్నప్పుడే కొన్ని దండకాలనూ, శతకాలనూ చెప్పాడట అమరాన్ని పద్యకావ్యంగా అనువదించాడు. ధూర్జటి వంశంవారు పరంపరగా మహాకవులుగా ప్రసిద్ధి పొందారు. కాళహస్తి సంస్థానం లోని దర్బారులో ధూర్జటివారి ఆసనం ఒకటి ప్రత్యేకంగా ఉన్నదట.

(ఆరుద్ర 10-210; ద.దే వా-404)

## ధూర్జటి వేంకటార్యుడు

కుమార ధూర్జటి అని ఇతనికి వ్యవహారనామం.

చూ. కుమార ధూర్జటి.

(ఆం. సం. సా.)

## ధేను మహాత్మ్యము

కర్త : లింగనమఖి కామేశ్వర కవి (చూ).
అంకితం : మధురను పాలించిన నాయకరాజు చొక్కనాథ నాయకునకు (1659-82).

వచనకావ్యం. మొట్టమొదట శ్రీరంగస్తుతి మాత్రం పద్యంలో ఉంది మళ్ళీ చివర పద్యంతో కావ్యం ముగిసింది. ఆనాడు, వాడుకలో ఉన్న భాషా స్వరూపానికి ఈ రచన ప్రతీక. విలక్షణమైన నాటి తెనుగు వచనాన్ని ఈ గ్రంథంలో చూడవచ్చును. వచన రూపంలో వచ్చిన మాహాత్మ్య కావ్యాలలో ఇదే మొదటిది. (ద.దే.వా-322)

## ధ్రువ చరిత్ర (అలభ్యం)

కవి : వేములవాడ సోమనాథుడు (చూ).

## ధ్రువ చరిత్రము (అలభ్యం)

కర్త : ఏనుగు లక్ష్మకవి (చూ).
అంకితం : వత్సవాయ జగ్గరాజుకు.

ప్రబంధం. కృతిపతి పెద్దాపుర సంస్థానానికి చెందినవాడు. (క.త-12-169)

## నంజరాజ యశోభూషణమ్ (సం)

కర్త : ఆలూరి నరసింహకవి.
అంకితం : కళవె నంజరాజుకు (మైసూరు దండనాయకుడు).

నంజరాజును నాయకునిగా వర్ణించి చెప్పిన అలంకార శాస్త్రగ్రంథం. విద్యానాథుని ప్రతాప రుద్ర యశోభూషణాన్ని పోలి ఉంటుంది. నంజరాజు కవి. కవి పోషకుడు. శౌర్యశాలి. (క. స. 98)

## నంజరాజ వాణీ విలాసము

నామాంతరం : వచన భారతము.
కర్త : కళువె నంజరాజు.

## నందూరి కామయమంత్రి

కాలం : క్రీ. శ. 18వ శతాబ్దం ఉత్తరార్థం.
స్థలం : గోదావరీ మండలం.

సాహిత్య పోషకుడు. ఏనుగు లక్ష్మణకవిని ప్రోత్సహించి అతనిచేత జాహ్నవీ మాహాత్మ్యము (గంగా మాహాత్మ్యము) అనే కావ్యాన్ని రచింపజేశాడు. (ఆం.సం.సా-254)

## నందూరి కామమంత్రి II

కాలం : క్రీ. శ. 19 వ శతాబ్దం.

సాహితీప్రియుడు. మిక్కిలి మల్లికార్జునకవి రచించిన విక్రమార్క చరిత్ర కృతిపతి. జాహ్నవీ మాహాత్మ్య ప్రోత్సాహకుడైన నందూరి కామమంత్రికి ఇతడు మునిమనుమడు. (శ.క.చ-606)

## నందూరి కేతన

కాలం : క్రీ. శ. 12 వ శతాబ్దం.
రచన : కువలాయాశ్వ చరిత్రము (ప్రబంధం).

వెలనాటి చోడప్రభువైన పృథ్వీశ్వరుని మంత్రి. కువలాయాశ్వ చరిత్ర వ్రాసిన ఒక కేతనను లక్షణ గ్రంథకర్తలు ఉదాహరించారు. అతడే ఇతడై ఉండవచ్చునని పండితాభిప్రాయం. ఇతడు కేయూర బాహు చరిత్ర కృతిపతి. నందూరి గుండయ మంత్రికి అన్న అని కొందరూ, తాత అని కొందరూ అంటున్నారు. తాతకూ మనుమనికీ కేతన పేరుండడం, వారు వంశపారంపర్యంగా అమాత్య పదవి నిర్వహిస్తుండటం ఈ సందేహాలకు కారణమైంది. (క.త-3; క.స-155; అరుద్ర-2)

## నందూరి గుండన మంత్రి

కాలం : క్రీ. శ. 12వ శతాబ్దం.
స్థలం : చందవోలు.

సాహిత్య పోషకుడు. మంచన రచించిన కేయూర బాహు చరిత్ర ఇతనికే అంకితం. ఇతడు వెలనాటిచోడ ప్రభువులైన పృథ్వీశ్వరుని దగ్గర మంత్రిగా ఉండేవాడు. క్రీ.శ. 1182-1208ల మధ్యకాలం వాడని కొందరి అభిప్రాయం. నందూరి కేతనకు ఇతడు సోదరుడు. (అరుద్ర-2)

**నందూరి మల్లయ్య**

కాలం : క్రీ. శ. 1590 కి ముందు.

రచన : హరిదత్తోపాఖ్యానము (అలభ్యం).

విశిష్టత : ఈయన వ్రాసిన పై గ్రంథంలో నుంచి ఒక పద్యాన్ని పెదపాటి జగ్గన్న తన సంకలన గ్రంథం (ప్రబంధ రత్నాకరం)లో ఉదాహరించాడు. కవి పురవర్ణన చేసేటప్పుడు తోటలను గురించి రమ్యంగా చెప్పాడు. (ఆరుద్ర-9)

**నందూరి వెంగళమంత్రి**

కాలం : తెలియదు.

ఈయన మీద ఒక అజ్ఞాత కవి చెప్పిన చాటువు వల్ల పిల్లగిరులు, కోలు పట్టెలు, పెన్నెల కుప్పలు, దాగిలి మూతలు, బంతులు, తన్నువిళ్ళు, దూరు దండేలు అనే బాలక్రీడల పేర్లు తెలుస్తున్నాయి. (చా. ప. ర.)

**నంద నందన చరిత్ర (అలభ్యం)**

కర్త : శ్రీనాథుడు.

రచనాకాలం : క్రీ. శ. 1426 ప్రాంతం కావచ్చు.

కృతిభర్త : పంటమైలారురెడ్డి.

విశిష్టత : పంటమైలారు రెడ్డి విష్ణుభక్తుడు. నంద నందన చరిత్రంలో రాధాకృష్ణుల రాసక్రీడలు ప్రధానేతివృత్తం. శ్రీనాథుని భీమ ఖండంలో ఇష్ట దేవతా స్తుతిలో రాధాకృష్ణుల రాసక్రీడ స్పష్టంగా ఉంది. ఈ కావ్యంలోని పద్యాలను గణపవరపు వెంకటకవి తన ప్రయోగ రత్నాకరంలోనూ, కస్తూరి రంగకవి తన ఆనంద రంగరాట్ఛందం లోనూ ఉదాహరించారు. (శ్రీనాథుడు-కొ. శ్రీ. మూ.)

**నంద నందన శతకము**

కర్త : పుసులూరి సోమరాజ కవి.

ఇది భక్తిశృంగార ప్రధానమైన శతకం. శ్రీకృష్ణుని శృంగార క్రీడలు దీనిలో వర్ణితం. శ్రీకృష్ణుని జారునిగాను, కుహనా రూపధారిగాను కవి చిత్రించాడు. 80 పద్యాలు మాత్రం లభించాయి. ఏకప్రాసము. అన్నీ ఉత్పలమాల వృత్తాలే. (శ. సా. వి-531)

**నందన చరిత్ర (అలభ్యం)**

కర్త : గంగరాజు చౌడయ్య.

ఇందులోని ఏడు పద్యాలను సంకలన కర్తలు ఉదాహరించారు. కావ్యేతి వృత్తాన్ని గురించి తెలియరావడం లేదు. (ఆరుద్ర-9)

**నందమపూడి శాసనము (సం)**

కాలం : క్రీ. శ. 1053 ప్రాంతం.

శాసన రచయిత : నన్నయభట్టు.

శాసనదాన గ్రహీత : నారాయణభట్టు.
శాసనం వేయించినవాడు : రాజరాజనరేంద్రుడు.

శాసనవిషయం : రాజరాజనరేంద్రుడు తన 32వ రాజ్య సంవత్సరంలో నారాయణ భట్టుకు "రెండేరుల నడిమి విషయాన్ని" (నేటి అమలాపురం తాలూకా నందమపూడి గ్రామాన్ని) ధారాదత్తం చేసిన విషయం దీనిలో ఉంది. దీనిలో నారాయణభట్టు గురించి విపుల వర్ణనముంది. నారాయణ భట్టుకు చాలా భాషలు వచ్చినట్లు, ఆయన కవియైనట్లు ఉన్నది. కాని గ్రంథాలు దొరకలేదు. (తె. క. చ-159, 160)

## నందవర చరిత్రము

కర్త : మాచవరము పాపనామాత్యుడు.
అంకితం : వేంకటేశ్వరునికి.

రెండాశ్వాసాల పద్యకావ్యం. దీన్ని నందవరీక చరిత్రమని కూడా అంటారు. కవికి స్వప్నంలో తిరుపతి వేంకటేశ్వరుడు కనిపించి నందవరీకుల చరిత్ర రచించి తనకు అంకితం యిమ్మని అడిగాడట. ధారాశుద్ధిగల రచన.

ఇతివృత్తం : నందవరం అనే ఒక గ్రామాన్ని ఒకరాజునుంచి వీరు అగ్రహారంగా పొందిన వృత్తాంతాన్ని కవి ఇందులో వర్ణించాడు. ఈ గ్రామం కందనోలు సీమలోనిదిగా కవి చెప్పాడు. ఈ గ్రామం ఇప్పుడు ఆదోని తాలూకాలో ఉన్నదట కవిత్వం అంతప్రశస్తం కాదని అంటారు. (క. త-13-171)

## నందవరీక చరిత్రము

కర్త : చూ. నందవర చరిత్రము.
మాచవరపు పాపయామాత్యుడు.

## నందికంత పోతరాజు కటారి

ఈ కటారి ప్రస్తావన "వెలుగోటి వారి వంశావళి"లో ఉన్నది. దీనికి చారిత్రక ప్రాముఖ్యమున్నది. పెద కోమటివేమ మాచారెడ్లకు, కుమార మాదానాయకుని పుత్రులు కుమార పెద వేదగిరి, లింగమనేడులకు యుద్ధం జరిగినప్పుడు, వెలమ నాయకులు విజయనగర రాజుల సహాయంతో కొండవీటి మీద దండయాత్రచేసి, మాచారెడ్డిని వధించారు. తన సోదరుని చంపిన పగతీర్చుకోవటానికి పెదకోమటి వేముడు కుమార పెద వేదగిరినేని మీద దండెత్తి, ఓడించి అతని బొమ్మను తన తమ్మపడిగ మీద చెక్కించాడు.

లింగమనీడు కొండవీటి మీద దండెత్తి పెదకోమటి వేముని ఓడించి అతని బొమ్మను తన తమ్మపడిగ మీద చెక్కించి - రెడ్డిరాజు సింహలాంఛనాన్ని, నందికంత పోతరాజు అనే కటారిని రాచకొండకు తీసుకొనిపోయాడు. వెలుగోటివారి వంశావళిలో లింగమనీడు పెదకోమటి వేముని చెరపట్టి విడిచినట్లు ముమ్మడి సింగ భూపతి (సర్వజ్ఞ సింగభూపాలుడు) వెన్నంటి తరిమినాడని, చివరకు అన్నమ నాయకుడు, లింగమనీడు కలిసి పెద కోమటి వేముని చంపినట్లూ రకరాకాలుగా ఉంది.

పెద కోమటి వేముడు చనిపోకముందే అతని విద్యాధికారియైన శ్రీనాథుడు రాచకొండ వచ్చి, వెలమదొరలను మెప్పించి "నందికంత పోతరాజు కటారిని" బహూకృతి నంది, రాచకొండ నుంచి కొండవీడు చేర్చాడని పండితాభిప్రాయం. ఈ "కటారి" కొండవీడు చేరింది కాబట్టి రెడ్డి ప్రభువు పరాభవం నుంచి తప్పుకొని, ధైర్యంగా కొంత కాలం రాజ్యం చేశాడని చరిత్రకారులు అంటున్నారు. (తె.వి.స_3)

## నంది తిమ్మన్న

నామాంతరం : ముక్కు తిమ్మన.

కాలం : క్రీ. శ. 16 వ శతాబ్దం.

సమకాలికులు : అల్లసాని పెద్దన, అయ్యలరాజు రామభద్రుడు మాదయగారి మల్లన, ధూర్జటి.

గురువు : అఘోర కవి.

రచనలు : 1. పారిజాతాపహరణము 2. వాణీ విలాసము (అలభ్యం).

శ్రీకృష్ణ దేవరాయల ఆస్థానంలో ప్రసిద్ధులయిన అష్టదిగ్గజాలలో ఒకడు. సింగన్న తిమ్మాంబల పుత్రుడు.

విశిష్టత : తొలి తెలుగు జంటకవులు నంది మల్లయ-ఘంట సింగయలలోని సింగన్నకు నంది తిమ్మన్న మేనల్లుడు. శ్రీకృష్ణ దేవరాయల భార్య తిరుమలదేవికి అరణంగా విజయనగరం చేరినకవి. సంస్కృత భాగవతంలో మూడుశ్లోకాలలో ఉన్న కథను తీసుకొని, కల్పనలతో పెంచి 5 అశ్వాసాల కావ్యంగా మనోహరంగా చెప్పాడు. కవిత్వం మృదుమధురం సాలంకారం. సంస్కృతాంధ్ర పదభూయిష్ఠం. కూచిమంచి వెంకటరాయకవి "కవి మనోరంజని" అనే అప్పకవీయ వ్యాఖ్యను బట్టి, తిమ్మన "వాణీ విలాసం" వ్రాశాడని తెలుస్తున్నది ఇతనికి "ముక్కు తిమ్మన" అనే పేరు వాడుకలో ఉంది. ముక్కు పెద్దదిగా ఉండటం, నాసికా వర్ణన రమణీయంగా చేయడం అందుకు కారణాలని ప్రతీతి (రామరాజ భూషణుని వసుచరిత్రలో "నానా సూన వితాన వాసనల" అనే పద్యాన్ని రచించినది ఇతడే అని అంటారు). (క.త; వి న.చ.)

## నంది మల్లయ్య

కాలం : క్రీ. శ. 15వ శతాబ్దం.

చూ. నంది మల్లయ్య-ఘంట సింగయ్య.

గురువు : దక్షిణామూర్తి.

బిరుదు : మలయమారుతకవి.

జంట కవులలో ఒకడు. సింగనామాత్యుని పుత్రుడు.

## నంది మల్లయ్య - ఘంట సింగయ్య

నామాంతరం : రాచమల్లు కవులు.

కాలం : క్రీ. శ. 15 వ శతాబ్ది ఉత్తరార్ధం.

స్థలం : నెల్లూరు మండలం.

రచనలు : 1. ప్రబోధ చంద్రోదయము 2. వరాహ పురాణము 3. భాగవతము - షష్ఠస్కంధం (అలభ్యం)

వీరు పిల్లలమర్రి పిన వీరన, దూబగుంట నారాయణకవి, వగ్గుపల్లి దుగ్గనలకు సమకాలికులు. సాళువ నరసింహరాయలు, అతని సేనాధిపతి తుళువ నరసరాయలు కాలంలో ఉండేవారు.

విశిష్టత : ఘంట సింగయకు 'మలయ మారుతకవి' అనే బిరుదు ఉంది. నంది మల్లయకు ఘంట సింగన్న మేనల్లుడు. ఘంట సింగన్నకు నంది తిమ్మన్న మేనల్లుడు. వీరి కవిత్వం ధారాశుద్ధి కలిగి మనోహరంగా ఉంటుంది. (ఆరుద్ర-6-229)

## నంది మిత్రుడు

కాలం : క్రీ శ. 1214 ప్రాంతం.

కాకతి గణపతిదేవుని సమకాలికుడు. శాసనకర్త. కాకతి గణపతిదేవుని గణప వరం సంస్కృత శాసనం వ్రాశాడు. (ప్రా ద.దే చ.)

## నంద్యాల అనంతాచార్యులు

కాలం : తెలియదు.

స్థలం : గద్వాల సంస్థానం.

తర్కశాస్త్ర పండితుడు. బాల్యంలోనే కాశీకి వెళ్ళి, అచ్చటి తర్కపండితుల వద్ద విద్యాభ్యాసం చేసి, పాండిత్యం సంపాదించాడు. తిరిగి గద్వాల సంస్థానానికి వచ్చి ఆస్థాన పండితుడుగా కీర్తి గడించినాడు. (తె. వి. స-4)

## నంద్యాల కృష్ణమరాజు

కాలం : క్రీ. శ. 16 వ శతాబ్దం.

స్థలం : నంద్యాల సీమ.

సాహిత్య పోషకుడు. పింగళి సూరన్న విరచిత కళాపూర్ణోదయ కావ్యానికి కృతిపతి. ఇతడు అరవీటి బుక్కరాజు పెద్ద భార్యకు పుట్టిన సింగరయ్య సంతతిలోని వాడు. పెనుగొండ రాజధానిగా, విజయనగర రాజులు (తాళికోట యుద్ధానంతరం) రాజ్యం చేసేటప్పుడు ఈ నంద్యాల కృష్ణంరాజు (పెనుగొండకు) సామంతుడుగా నంద్యాల సీమను పాలించాడు. (ఆరుద్ర-9)

## నంద్యాల తిమ్మరాజు

కాలం : క్రీ. శ. 16 వ శతాబ్ది.

సాహితీ పోషకుడు బొడ్డుచర్ల (చిన) తిమ్మన విరచిత ప్రసన్న రాఘవ నాట్య ప్రబంధానికి కృతిభర్త. ఇతడు కళా పూర్ణోదయ కృతిపతి కృష్ణమరాజుకు వరసకు సోదరుడు. ఈ ఇద్దరి తాతలు అన్నదమ్ములు. ఈయన క్రీ. శ. 1560 ప్రాంతంలో జరిగిన యుద్ధాలలో పాల్గొన్నట్లు ప్రసన్న రాఘవ కావ్యంలోని పద్యాలవల్ల తెలుస్తున్నది. నంద్యాల తిమ్మరాజు కల్యాణిపై (గుల్బర్గ) జరిగిన ముట్టడుల్లో పాల్గొని ఉండవచ్చు.

ఈయన పరాక్రమం, సాహిత్య పోషణ సరిసమానాలని పింగళి సూరన్న 3 పద్యాలలో ప్రశంసించాడు. ఇతడు 'కవిత్వ ప్రముఖ బహు కళాపారగు' డన్నాడు సూరన్న చెప్పిన పద్యాల వల్ల తిమ్మరాజు అప్పటికే అనేక కృతులు అంకితం పుచ్చుకొన్నాడని భావించవచ్చు. (ఆరుద్ర-9)

## నంద్యాల నారాయణరాజు

కాలం : క్రీ. శ. 17 వ శతాబ్దం.

సాహిత్య ప్రియుడు. పర్ఘుల నరసింహ కవిని ప్రోత్సహించి శకుంతలా నాటక యక్షగానాన్ని రచింప జేశాడు. దీనికి దుష్యంత చరిత్ర అని నామాంతరం. ఇది పెనుశల (పెంచల) లోని నరసింహ స్వామికి అంకితం. ఈ నారాయణరాజు తన కొరకు వ్రాసుకొన్న (యక్షగాన) ప్రతి లభించింది (క. స-36)

## నంబాకం రాఘవాచార్యులు

కాలం : క్రీ. శ. 19 వ శతాబ్దం.

స్థలం : వనపర్తి సంస్థానం.

వీరు కాశీ పండితులు. తర్కశాస్త్ర పారీణులు. వనపర్తి సంస్థాన విద్వాంసులు. వీరి రచనలు తెలియరాలేదు. (ఆం. సం. సా.)

## నక్కలపాటి వారు

క్రూర జంతువుల పేరుతో ఉన్న ఇంటి పేరు. క్రీ. శ. 18 శతాబ్దం పూర్వార్ధంలో సిద్ధవటం సీమనేలిన మట్ల అనంతరాజు మీద, వేంకట రామరాజు మీద నక్కలపాటి సంజీవ కవి చాటువులు చెప్పాడు. చెరకు తోటలను పాడుచేస్తున్న నక్కల ఆట కట్టించటానికి తన కవితాశక్తిని ప్రదర్శించినట్లు, ఆ బెడద తప్పినట్లు అనంతరాజు మెచ్చి సంజీవ కవి ఇంటి పేరును "నక్కలపాటి" వారని ప్రసాదించినట్లు తెలుస్తున్నది. సంజీవ కవి గొల్లభామ వేషం కథ, ఎరుకల కథ అనే యక్షగానాలు వ్రాశాడు.

(య.వా.చ-ద్వి భా-43-45; భారతి-మా-45-229)

## నక్కలపాటి సంజీవ కవి

నామాంతరం : సంజీవరాయకవి.

కాలం : క్రీ. శ. 17 వ శతాబ్దం చివర.

స్థలం : కడప మండలం - సిద్ధవటం సీమలోని తూడూరు.

రచనలు : 1. గొల్లభామ వేషము కథ 2. ఎఱుకల కథ.

ఇతడు మట్ల అనంతభూపాలుని ఆశ్రితుడు. ఇతని రచనలలో తూడూరు చెన్నకేశవ ముద్ర ఉంది. 1680 లో సిద్ధేంద్ర యోగి రచించిన గొల్లకలాపానికి కొంత ప్రచారం వచ్చిన తరువాత ఈ కవి 'గొల్లభామ వేషము కథ' వ్రాసి ఉండవచ్చును.

ఈ కవి కవి చౌడప్పకు సమకాలికుడని అంటున్నారు. ఈయన మంత్రశాస్త్రంలో ప్రజ్ఞ, వాక్సిద్ధి ఉన్నవాడట. చెరకు తోటలు పాడుచేసే నక్కల ఆట కట్టించటానికి

వాకట్టు కట్టాడనీ, అందుకని ఈయన ఇంటిపేరు నక్కలపాటి వారు అయిందనీ చెప్తారు. ఈయన మట్ల వేంకట రామరాజు మీద, ఆయన విరోధి అయిన వేమల వేంకట రామరాజు మీద, పద్యాలు చెప్పాడు. (య.వా.చ-44; చా.ప.ర)

**నక్కలపాటి సంజీవరాయకవి**

నామాంతరం : నక్కలపాటి సంజీవ కవి (చూ)

**నక్షత్రకుడు**

గౌరన రచించిన ద్విపద హరిశ్చంద్ర కావ్యంలోని పాత్ర. గౌరన సృష్టి. నక్షత్రకుడు విశ్వామిత్రుని శిష్యుడు. హరిశ్చంద్రుని నుండి ధనం వసూలు చేసుకోవడానికి విశ్వామిత్రుడు ఇతన్ని నియోగించాడు. భార్యనూ, పుత్రునీ, వెంటపెట్టుకొని కట్టుబట్టలతో రాజ్యం వదిలి బయలుదేరిన హరిశ్చంద్రుని వెంట ఉండి ఇతడు వారిని అనేక రకాలుగా బాధిస్తాడు. అరణ్యాలలో ప్రయాణం చేస్తున్నప్పుడు వారు అలసిపోయి పరుగెత్తే నడవమని బలవంతంచేయడం, వాడు నడుస్తున్నప్పుడు తనకు అలసటగా ఉందనడం, ఆకలిఅనీ దాహమనీ మొండితనంతో వారిని బాధించడం వంటివి చేస్తాడు. హరిశ్చంద్రుడు కొడుకును ఎత్తుకుంటే అతన్ని దింపి తనను ఎత్తుకోమంటాడు. హరిశ్చంద్రునిచేత భార్యా పుత్రులను అమ్మించి చివరికి అతన్నికూడా అమ్మి తన ధనం వసూలు చేసుకుంటాడు. హరిశ్చంద్రుని కలి, తక్షకాదులకంటె నక్షత్రకుడు మిక్కిలి బాధించాడు. నేటికీ తెలుగు దేశంలో మొండివారిని నక్షత్రకునితో పోల్చి చెప్పుకోవడం ఉంది.

**నక్షత్రమాల**

శ్రవ్యకావ్య భేదం (చూ. తారావళి).

**నగరేశ శతకము**

కర్త : పేరు తెలియదు (రామలింగయ్య కుమారుడు).
స్థలం : బొండాడ.

చోడలింగ శతక కర్త కుమారుడే ఈ నగరేశ శతక కర్త అని పండితాభిప్రాయం. చోడలింగ శతక కర్త రామలింగయ్య. ఇతడు బొండాడలోని నగరేశ్వర స్వామిపై చెప్పిన రెండు శతకాలు వేర్వేరుగా లభించాయి. ఒక శతకంలో 'నగరేశా' అనీ మరొకదానిలో 'నగరేశశివా' అనీ మకుటాలున్నాయి. రచనలో అక్కడక్కడ యతి భంగాలున్నాయట (శ.క.చ.)

**నగ్న నృత్యాలు**

కాలం : కాకతీయులు (12, 13 శతాబ్దాలు).

రేణుకాదేవి జమదగ్ని మహర్షి భార్య. పరశురాముని తల్లి. తండ్రి ఆజ్ఞ ప్రకారం పరశురాముడు తల్లి తలను ఖండించినప్పుడు ఆ తల మాదిగవాడలో పడిందట. శిరస్సు లేకుండా ఉన్న రేణుకాదేవి విగ్రహం ముందు ఆనాటి ప్రజలు నగ్ననృత్యంతో పూజలు జరిపేవారట. ఈ విగ్రహం ముందు స్త్రీలుకూడా నగ్ననృత్యం చేసేవారని తెలుస్తున్నది. (నా.ర చ-63)

**నటేశ విజయమ్ (సం)**

కర్త : వెంకటకృష్ణ దీక్షితుడు.

**నట్టువ మేళములు**

దేవదాసీలు ప్రాచీనకాలం నుంచీ నిర్వహించే నృత్యకళ రెండు రకాలు. మొదటిది కచ్చేరి నృత్యకళ, రెండోది నట్టువ మేళ నృత్యం. కచ్చేరి నృత్యకళ రాజాశ్రయమైంది. నట్టువ మేళం అఖిలాంధ్ర ప్రజానీకానికి పరిచయమైంది.

వివాహాది ఊరేగింపులలోను, మేజువాణీలలోను, పెద్ద తిరునాళ్ళలోను, దేవుని ఉత్సవాలలోను వీటిని ప్రదర్శిస్తూ ఉండేవారు. ఇవి పండిత పామరులను రంజింపజేసేవి. మోటు హాస్యపు పాటలు, పచ్చిశృంగారపు పాటలతో వీటిని అభినయిస్తారు. ప్రాచీన కాలం నుంచీ ఈ కళను ఎక్కువగా దేవదాసీలే ఆరాధించారని పండితాభిప్రాయం.

దేవాలయాలలో ఈ ఆట జరిగేటప్పుడు దేవదాసీలు మేళప్రాప్తితో ప్రారంభించి, పుష్పాంజలి, పేరణి, గీతం, శబ్దం, సలాం, జతి, వర్ణం, పదం, జావళి, తిల్లాన లేక దరువుతో ముగిస్తారు. శబ్దం, సలాం జతుల్లో ఆంగిక ప్రధానమైన ముద్రలు విశేషంగా ప్రదర్శించే నృత్యాన్ని ప్రదర్శించి, ఆ తరవాత వర్ణంలో నృత్త నృత్యాలను సమంగా పోషించి సాత్వికాభినయ ప్రాముఖ్యంతో జావళీలలో ప్రదర్శించి తిల్లాన నృత్యంతో ముగించేవారు. (నా.ర.చ-243)

**నడిమింటి పతంజలిశాస్త్రి**

కాలం : క్రీ. శ. 19 వ శతాబ్దం-పూర్వభాగం.

నడిమింటి సర్వమంగళేశ్వరశాస్త్రి కుమారుడు. మహావిద్వాంసుడు. నేపాలు మహారాజు ఆస్థానంలో సన్మానింపబడిన మహామనీషి ఇతని రచనలను గురించిన వివరాలు తెలియవు. (ఆం.సం.సా-232)

**నడిమింటి వెంకటపతి**

కాలం : క్రీ. శ. 18 వ శతాబ్దం.
స్థలం : కడప మండలం.
రచనలు ; అభిషిక్త రాఘవము, మొదలయినవి.

మట్లవారి ఆస్థానంలో ఉండేవాడు. ఈ కవి చాలా సంస్కృత కావ్యాలు తెనిగించాడట. వాటి పేర్లు కూడా తెలియరావడంలేదు. భోజరాజును గురువుగా భావించి కవిత్వం చెప్పిన మనీషి. సమకాలీన కవులకు కవిత్వ రచనలో సహాయపడేవాడట. రావు కొండలరాయడు కూర్చిన చిత్రకవితా దర్పణంలో ఇతని పద్యాలున్నాయి.

(ఆరుద్ర-12-72)

**నడిమింటి సర్వమంగళేశ్వరశాస్త్రి**

కాలం : క్రీ. శ. 1759-1836.
స్వస్థలం : తూర్పు గోదావరి జిల్లా-గన్నవరం గ్రామం.

సంస్థానం : కురుపాము సంస్థానం.

రచనలు : 1. సునీతి సన్మతీయము 2. విభక్తి విలాసము 3. సర్వమంగళీయము 4. వేదసారము 5. లౌకిక దృష్టాంత మంజరి 6. కర్మజ్ఞాన వివరణము (మీమాంస శాస్త్రసారము) 7. భగవద్గీత భాష్యం 8. శ్రీ లలితా పంచదశీ మంత్ర వర్ణమాలా స్తోత్రమ్ 9. జగన్నాథాష్టకమ్ 10 సూర్యాష్టకమ్ 11. శబ్దమంజరి 12 సమాస కుసుమావళి.

బిరుదులు : అభినవ కాళిదాసు.

కురుపాము సంస్థానాధీపతులైన వైరిచర్లవారు తూర్పు గోదావరి మండలం నుంచి వేంగి నాటికి ఈ నడిమింటి వారిని రప్పించి, సంస్థానంలో ఆస్థాన విద్వాంసులుగా ఉంచుకొని అనేక అగ్రహారాదులతో గౌరవించారు. ఆ వంశంలోని వారైన 'నడిమింటి సర్వమంగళేశ్వర శాస్త్రి' సకలశాస్త్రవేత్త. శాపానుగ్రహ సమర్థుడు. ఆసేతు సీతాచల పర్యంతం ప్రసిద్ధి వహించారు. వీరి తండ్రి చయనులు. తల్లి శ్యామల సోదెమ్మ. వీరు చెముడు వారి సంస్థానంలో లక్ష్మీపురం అగ్రహారం సంపాదించారు. విజయనగరం నారాయణ గజపతి చేత విశేషంగా సన్మానింపబడ్డారు. మేరంగి సంస్థానాధిపతులు 'గొట్టివలస' అగ్రహారం బహూకరించారు. పాలకొండలోను, గోదేవారి వద్దను విశేషంగా గౌరవింపబడ్డారు. కాశీ, పూరీ మొదలైన పండిత నిలయాల్లో విజయభేరీ మ్రోగించారు నవద్వీపం - కాశ్మీరం - హైదరాబాదు - మైసూరు సంస్థానాలలో సమ్మానాలు పొందారు.

వీరు చెప్పిన చాటువులు అనేకంగా ఉన్నాయి. అవి చమత్కారంతో కూడినప్పటికీ, సభ్యలోకంలో పేర్కొనరాని బూతుల బుంగలుగా ఉన్నాయట. అట్టివి కళింగసీమలో ఎక్కువగా వ్యాపించి ఉన్నాయని ప్రతీతి. వీరి రచనలుగా పేర్కొన్న పై గ్రంథాలు కొన్ని మాత్రమే ప్రఖ్యాతాలు. వీరి శబ్దమంజరిని, సమాస కుసుమావళిని సంస్కృతం నేర్చుకొనే వారు నేటికీ ప్రారంభంలో చదువుతుంటారు. (ఆం సం.సా.)

## నత్కీరుడు

ధూర్జటి "కాళహస్తి మాహాత్మ్యము"లో ప్రముఖమైన పాత్ర.

ఇది కలియుగంలో జరిగిన కథ. మధురా నగరాన్ని పాండ్యరాజు పాలిస్తున్నాడు. "నత్కీరుడు" ఆ రాజుగారి ఆస్థాన కవి. మహా విద్వాంసుడు. పాండ్య రాజు పండిత పోషకుడు. సభలో కవిత్వం చెప్పి సభను మెప్పించిన వారికి "వేయిమాడలి"చ్చి గౌరవించే ఆచారం అక్కడ ఉండేది.

ఒక కాలంలో పాండ్య దేశంలో కరువు వచ్చింది. ప్రజలు తిండి గింజలకై అలమటించే కాలం ఏర్పడింది. శివభక్తుడైన ఒక పేద బ్రాహ్మణుడు పడే కష్టాలనుచూచి పరమేశ్వరుడికి అమితమైన జాలి కలిగి, స్వయంగా ఒక పద్యాన్ని వ్రాసి ఆ బ్రాహ్మణుడికి ఇచ్చి, పాండ్యరాజుచేత బహుమతి పొంది సుఖించమని చెప్పాడు. ఆ శివ భక్తుడు అమితోత్సాహంతో బయలు దేరి వెళ్లాడు. పాండ్య సభలో తన పద్యాన్ని చదివి వినిపించాడు. అందరూ బాగుందని మెచ్చుకున్నారు. ఆ పద్యం భావం——"సింధురగమనాధమ్మిల్ల

బాధము సహజ గంధంబు—" అని. నత్కీరుడు దాన్ని తప్పన్నాడు. మానిని వేనలికి పుష్పాలవల్ల సుగంధం అబ్బుతుందిగాని, సహజ సుగంధం ఎక్కడిదని ఆ పండితుడిని అవమానించాడు. పండితుడు అవమాన భారాన్ని భరించలేక నేరుగావెళ్ళి శివుడికే మొర పెట్టుకున్నాడు. అప్పుడు సర్వజ్ఞుడైన పరమ శివుడే స్వయంగా రాజసభకు వెళ్ళి వాదించాడు. పార్వతి వేనలికి సహజగంధం ఉంటుందని, అది తెలియక నత్కీరుడు మొండి వాదన చేస్తున్నాడని గద్దించాడు. అయినా నత్కీరుడు పిడివాదం చేశాడు. మానవ స్త్రీల వేనలికి సుగంధం ఉండదన్నాడు. నిటలాక్షుడు ఆగ్రహంతో కుష్ఠువ్యాధి పీడితుడవు కమ్మని నత్కీరుని శపించాడు. అప్పుడుగాని నత్కీరునికి కనువిప్పు కలుగలేదు. తప్పు మన్నించి శాపవిమోచనం చూపమని వేడుకొనగా, కైలాసగిరిని చూడడంతో శాపం తీరి పోతుందని పరమేశ్వరుడు సెలవిచ్చాడు. ఈశ్వరాజ్ఞ ప్రకారం నత్కీరుడు అనేక పుణ్య తీర్థాలను సేవిస్తూ కైలాసానికి బయలుదేరుతాడు. మార్గ మధ్యంలో ఇతనిని ఒక భూతం ఆవహిస్తుంది. భూత బాధానివారణార్థం శ్రీ సుబ్రహ్మణ్యేశ్వర స్వామిని ప్రార్థించి, బాధా నివారణం పొందుతాడు ఆ స్వామియే ఈతనిని కటాక్షించి—దక్షిణ కైలాసమైన కాళహస్తి క్షేత్రాన్ని దర్శిస్తే కైలాసం దర్శించినట్లేనని చెప్పి అతనికి కాళహస్తి క్షేత్ర దర్శనం చేయిస్తాడు. నత్కీరుడు కాళహస్తి క్షేత్రాన్ని దర్శించి శాప విమోచనం చెంది తమిళ భాషలో ఆ క్షేత్రంపైన నూరు పద్యాలు రచించి భక్తితో గానం చేశాడు. పరమేశ్వరానుగ్రహం పొంది శివసాయుజ్యం పొందాడు.

"కాళహస్తి మాహాత్మ్యము" శైవ భక్తిని బోధించే గ్రంథం.

నత్కీరుడు మహాకవి. సకల శాస్త్ర పారంగతుడు. వేదాంతసారం ఎరిగినవాడు. కాని, కొంత అహంభావి. కవితాదర్పం కలవాడు. కాబట్టే పరమేశ్వరునితో పిడివాదం చేశాడు. ఆగ్రహానికి గురియై శాపగ్రస్తుడైనాడు. కాని, ఆ నిరుపేద బ్రాహ్మణుడు శివ భక్తి తప్పరుడు. అది తప్ప వేరు ధ్యాసలేదు. కాబట్టి పరమేశ్వరానుగ్రహం పొందాడు. నత్కీరుడు కూడ తన అహంకారం విడిచిపెట్టి త్రికరణ శుద్ధిగా పద్య శతకాన్ని రచించి దక్షిణ కైలాసం దర్శించిన తరువాత సాయుజ్యం పొందగలిగాడు.

## నన్నయభట్టు

కాలం : క్రీ. శ. 1023–1063 ప్రాంతం.
స్థలం : రాజమహేంద్రవరం.
బిరుదులు : ఆదికవి, వాగనుశాసనుడు
ఆస్థానం : రాజరాజ నరేంద్రుని ఆస్థానం.
రచనలు : 1. ఆంధ్ర మహాభారతము (ఆది, సభాపర్వాలు, అరణ్యపర్వంలో 144 పద్యాలు).

విశిష్టత : ఆంధ్ర వాఙ్మయంలో తొలి తెలుగుకవి. కవిత్రయంలో మొదటివాడు. రాజరాజనరేంద్రుని కుల గురువు. ఆస్థాన కవి. నన్నయకు పూర్వమున్న కవిత్వం దేశి పద్ధతిలో ఉండేది. నన్నయ సలక్షణమైన భాషలో దేశి-మార్గ పద్ధతులలో గద్య

పద్యాలతో ఉదాత్తమైన కథావస్తువున్న మహా కావ్యాన్ని వ్రాశాడు. తెలుగులో దొరికిన అతి ప్రాచీన కావ్యాలలో ఈయన భారతం మొదటిది. అందువల్ల భారతాన్ని ఆదికావ్యమని, ఈయనను ఆదికవి అనీ అన్నారు. ఆ కాలంలో నన్నయ ఆంధ్రభాషకు చేసిన సేవ అపూర్వమైంది. జన వ్యవహారంలో ఉన్న పదజాలాన్ని పూర్తిగా పరిశీలించి, సంస్కరించి, సంస్కృత పదాలను తెలుగులో వాడే పద్ధతిని నిర్ణయించి, ధారాళమైన నడక ఉన్న కొన్ని సంస్కృత వృత్తాలను గ్రహించి, అప్పటికే ఉత్తమ కావ్యాలున్న కన్నడ వాఙ్మయం నుంచి ప్రశస్త లక్షణాలను సేకరించి, తెలుగులో ఉత్తమమైన కావ్య లక్షణాలను తీర్చి దిద్దాడు. ఇది నన్నయ అసాధారణ ప్రతిభా వ్యుత్పత్తులకు నిదర్శనం.

ఈయన అవిరళ జప హోమ తత్పరుడు, సంహితాభ్యాసుడు, నిత్య సత్య వ్రతుడు తన భారతం ధర్మ తత్త్వజ్ఞులకు ధర్మశాస్త్రంగా, వేదాంత విదులకు వేదాంతంగా-ఇట్లా ఎవరు ఏ దృష్టితో చూస్తే వారికి అట్లాగే కనిపిస్తుందని చెప్పాడు.

నందంపూడి శాసనంలో నన్నయపేరు "నన్నియ"గా పేర్కొనబడింది ఇతని తండ్రి భీమనభట్టు. నన్నయ ఈ క్రింది రచనలు చేశాడని ప్రతీతి.

1. చాముండికా విలాసము (చౌడేశ్వరీ విలాసము) 2. లక్షణ సారము (ఛందస్సు) 3. ఇంద్ర విజయము 4. రాఘవాభ్యుదయము.

అయితే ఇవి అతని రచనలు కావని కొందరు పండితులు నిర్ధారించారు.

(వా. చ.)

## నన్నయభారతము

రచనాకాలం : క్రీ. శ. 11వ శతాబ్దం.
కర్త : నన్నయ.

లభ్యమైన తెలుగు కావ్యాలలో ఇది మొదటిది. ఆంధ్రమహాభారతంలో ఆది సభా పర్వాలను పూర్తిగాను, అరణ్యపర్వంలో 142 పద్యాలను నన్నయ రచించాడు.

నన్నయ వ్యాసుని సంస్కృత భారతాన్ని అనుసరించినా, అనవసరమైన భాగాలను తగ్గించి, అవసరమనుకొన్నచోట్ల పెంచి, ఔచిత్య దృష్టితో కొన్ని మార్పులు చేసి, తన కృతిని స్వతంత్ర కావ్యంగా చెప్పాడు.

ఇతని కవిత ప్రసన్న కథా కలితార్థ యుక్తితో, అక్షర రమ్యతతో, నానారుచిరార్థ సూక్తి సంపదలకు నెలవై వీనులకు విందుగా ఉంటుంది. ఉదంకోపాఖ్యానము, శకుంతలోపాఖ్యానము, నలోపాఖ్యానము, సౌగంధికాహరణము, రురుప్రమద్వరల కథ మొదలగు వృత్తాంతాలను వ్రాయటంలో కవి నేర్పు అప్రతిమానం. కవిత్వం, సంస్కృత పదభూయిష్ఠమైనా క్లిష్టాన్వయాలు లేక, ధారాశుద్ధికి, ధ్వని గాంభీర్యానికి నిధానమై చదువరులకు ఆనందం చేకూర్చుతుంది. నన్నయ భారతంలో వచనం సులలిత పదఘటితమై అతి ధారాళంగా ఒప్పారుతుంది. ఇందులో చంపకోత్పలమాలాది వృత్తాలే కాకుండా తరువోజ, మధ్యాక్కర మొదలగు దేశి పద్యాలుకూడా ఉన్నాయి.

సంస్కృత పదాలను, సంస్కృత వృత్తాలను గ్రహించి కన్నడ వాఙ్మయం నుండి ప్రశస్త లక్షణాలను తీసుకొని మహాభారతాన్ని ఉత్తమ కావ్యంగా తీర్చి దిద్దాడు. ఈ రచనలో నన్నయకు నారాయణభట్టు తోడ్పడ్డాడట. (వా. చ.)

## నన్నెచోడుడు

కాలం : క్రీ శ. 12వ శతాబ్ది ప్రారంభం (నన్నయ తిక్కనల నడిమికాలం).

స్థలం : వెలనాటిసీమ.

రచన : కుమారసంభవము.

బిరుదులు : కవిరాజ శిఖామణి, టెంకణాదిత్యుడు.

తల్లి శ్రీసతి. తండ్రి చోడ బల్లి. కలుపొన్న, కలుకోడి చిహ్నాలు గల యొరమూరికి అధిపతి. ఇతనికి ప్రతాపాన్నిబట్టి టెంకణాదిత్యుడనీ కవితా శక్తిని బట్టి కవి రాజ శిఖామణి అనీ బిరుదులు వచ్చాయట. ఇతని కాలాన్ని గురించి భిన్నాభిప్రాయా లున్నాయి. నన్నయకు పూర్వుడని కొందరూ, సమకాలీనుడని కొందరూ అంటారు.

విశిష్టత : ఈయన రాజకవి. శివపురాణము, కాళిదాసు, ఉద్భటుల కుమార సంభవ కావ్యాలు చదివి, వాటిలోని పార్వతీ పరమేశ్వరుల ప్రణయ వృత్తాంతానికి తార కాసుర వధ అనే వీర రస ప్రధానమైన కథను అంగంగా చేసి, రసాలంకార వర్ణన పరి పూర్ణంగా చేసి తన కావ్యాన్ని వ్రాశాడు. తెలుగులో షష్ఠ్యంతాలను తొలుత ప్రవేశ పెట్టిన వాడీయన. ఈయన కావ్యమే తెలుగులో మొదటి ప్రబంధమని పండితాభిప్రాయము. మార్గ-దేశి కవితలను, వస్తుకవిత మొదలగు పదాలను తెలుగులో మొదట వాడినవాడితడే. ఈయన కన్నడ, తమిళ దేశీయ సంప్రదాయాలతోబాటు కొన్ని పదాలనుకూడా వాడాడు. ఈయన శైలి నన్నయ శైలికంటె భిన్నంగా ప్రౌఢంగా ఉంటుంది. సంస్కృత సమాసాలను సాధ్యమైనంతవరకు తగ్గించి, జాను తెనుగు అనే పేరుతో చమత్కార గర్భితాలయిన తెలుగు పలుకుబళ్ళను ప్రయోగించాడు. ఈయన కవితలో అర్థ శబ్దాలంకారాలేగాక, బంధ కవిత్వం, ఛందో వైవిధ్యం కనిపిస్తుంది. రచనలో వ్యాకరణ విరుద్ధమైన వైరి సమాసాలు కనిపిస్తాయి. ఈయన శాస్త్రవిజ్ఞానము, రచనా ప్రౌఢిమ, ధారాశుద్ధి పరిశీలిస్తే ఈయనకున్న కవిరాజ శిఖామణి బిరుదు సార్థకమని ఒప్పుకోక తప్పదు. (వా. చ.)

## నమస్కార గద్య

కాలం : క్రీ. శ. 13 వ శతాబ్ది ఉత్తరార్థం.

కర్త : చూ. పాల్కురికి సోమన్న.

రచనాకాలం : క్రీ. శ. 13 వ శతాబ్దం.

విశిష్టత : ఇందులో పాదానికి 16 మాత్రలు చొప్పున 118 పాదాలున్నాయి. ప్రాసయతి ఉ-డి. రచన సంస్కృత పద భూయిష్టం. (వై.ల; యువభారతి)

## నయద్యుమణి

కర్త : చూ. తిరుమల బుక్కపట్టణం (ఇమ్మడి) శ్రీనివాసాచార్యులు.

సంస్కృత రచన. టీకా వ్యాఖ్యానంతో కూడి ఉంది. వ్యాఖ్యానం కూడా కవి స్వయంగా వ్రాశాడు. ఈ గ్రంథం సురపురం సంస్థానాధీశ్వరుల సమాదరంతో వెలిసింది. (ఆం పం.సా-516)

## నరకాసుర విజయమ్ (సం)

కర్త : చూ. వారణాసి ధర్మసూరి.

ఇది సంస్కృత రూపకం. (తె. వి. స-4)

## నరకాసుర విజయమ్ (సం)

కర్త : చూ. మాధవకవి.

తొమ్మిది సర్గలు మాత్రమే దొరుకుతున్నాయి. శ్రీ కృష్ణుడు నరకాసురుని చంపటం దీనిలోని ఇతివృత్తం. (తె. వి. స-6)

## నరపతి విజయము

నామాంతరం : రామరాజీయము.

కర్త : అందుగుల వెంకయ్య.

అంకితం : అర్వీటి కోదండ రామరాజుకు.

ఇది చారిత్రక కావ్యం. దీనిలోని ఆరవీటి వంశ క్రమం అళియ రామరాజు తరవాత ఐదు తరాలవరకు వర్ణితం.

విజయనగర రాజులు నరపతులుగా, బహమనీ సుల్తానులు అశ్వపతుగా, కటక రాజేంద్రులు గజపతులుగా చరిత్రలో ప్రసిద్ధులు.

నరపతులయిన విజయనగర రాజుల వంశ చరిత్రకు ఈ కావ్యం అద్దం పడుతున్నది. కోదండ రామరాజు సామ్రాజ్యం క్షీణ దశలో ఉండగా వచ్చిన రచన కావడం చేత దీనిలో ఇతనిని గురించిన విశేషాలున్నాయి గాని సాధించిన ప్రసిద్ధ విజయాలేమీ లేవు. మైసూరు రాజులు స్వతంత్రం ప్రకటించుకో ప్రయత్నించినప్పుడు, మైసూరు రాజులను కోదండ రామరాజు ఆసనపురి యుద్ధంలో ఓడించాడు.

ఇది చరిత్రకారులకు మిక్కిలి ఉపయోగపడుతుంది దీనిలోని ఆరవీటి రాజుల వంశ ప్రశస్తి చాలా వరకు సత్యమేనని ఇతరాధారాలవల్ల కూడా తెలుస్తున్నది. దీనిలోని కవిత సరసమైనది. కవి చిత్ర కవిత్వంలో తనకున్న నేర్పును ప్రదర్శించ టానికి పద్య గర్భగత పద్యాలను వ్రాశాడు. మొత్తం మీద దీనిలోని శైలి రమ్యంగా ఉంటుంది. (సా.చ.స-247)

## నరపతి సంస్థానం

నామాంతరం : చూ. ఆనెగొంది.

## నరసభూపాలీయము

కర్త : మూర్తి కవి.

నామాంతరం : కావ్యాలంకార సంగ్రహము.

అంకితం : తొరగంటి దుర్గాధ్యక్షుడైన ఓబయ నరసరాజుకు.

విశిష్టత : ఇది మూర్తికవి తొలి కావ్యం. ఈ కావ్యం విద్యానాథ విరచిత సంస్కృత ప్రతాపరుద్రీయానికి అనుసరణ. కావ్యాలంకార లక్షణాలు దీనిలో ఉన్నాయి. కనుక దీనిని కావ్యాలంకార సంగ్రహం అన్నారు. విశ్వనాథుడు ప్రతాపరుద్రుని పేర లక్ష్యాలను కూర్చినట్లే, కవి నరసరాజు పేర కావ్య లక్ష్యాలను కూర్చి నరసభూపాలీయనామాన్ని చిరస్థాయిగా చేశాడు. తెలుగులో అలంకార శాస్త్ర గ్రంథాలలో ఇది మేటి. విన్నకోట పెద్దన "కావ్యాలంకార చూడామణి" అప్పటికి ఉన్నా, నరసభూపాలీయానికి ఉన్న ప్రశస్తి ఆ గ్రంధానికి లేదని విజ్ఞుల అభిప్రాయం. విద్యానాథుని "కావ్యలంకార సంగ్రహం" అన్న సంజ్ఞనే గ్రహించి మూర్తి కవి కూడా ఆ పేరునే పెట్టాడు. కాని లక్ష్యాలను బట్టి సంస్కృతంలో "ప్రతాప రుద్రీయ"మని ఈ గ్రంథం ప్రసిద్ధి పొందినట్లే, తెలుగులో "నరసభూపాలీయ"మనే ప్రసిద్ధిపొందింది.

ఆంధ్రీకరించేటప్పుడు మూర్తి కవి మూలంలోని నాయక, కావ్య, రస, గుణ, దోష, అలంకారాదులను వివరించి, నాటక ప్రకరణాన్ని వదిలి వేశాడు. (తె. వి. స-4)

## నరసభోజనుతి

కర్త : తెలియదు.
కాలం : క్రీ. శ. 1700 ప్రాంతం.
స్థలం : మధుర.

విషయం : క్రీ. శ. 1689-1706 మధ్య కాలంలో మధురను పాలించిన తెలుగురాణి మంగమ్మ దళవాయియైన నరసప్ప నాయకుని స్తుతిస్తూ రచించబడిన కృతి. (ద. దే. వా-329)

## నరసయ్య చౌడుడు

కాలం : క్రీ. శ. 1600 ప్రాంతం.
స్థలం : నెల్లూరు మండలం-బట్టేపాడు ప్రాంతం.

కృతిపతి. సాహిత్య పోషకుడు "పంచమ వేద ప్రబంధ సత్కీర్తినిమించిన సత్యధర్మి". శాస్త్ర పురాణార్థసార వివేకుడు. భారతాన్ని ద్విపద కావ్యంగా వ్రాయమని బట్టేపాటి తిమ్మయను ప్రోత్సహించాడు. ద్విపద భారతం ఆదిపర్వంలోని అయిదు ఆశ్వాసాలు ఇతనికే అంకితం. (ఆరుద్ర-10-18)

## నరసరావుపేట

గుంటూరు మండలంలోని ప్రాచీన సంస్థానాలలో నరసరావుపేట ఒకటి ఇది గుంటూరుకు పడమటి దిశలో సుమారు 28 మైళ్ళ దూరంలో ఉంది. దీనికి బెల్లంకొండ సంస్థానమనే వ్యవహార నామం ఉండేది. బెల్లంకొండ, వినుకొండ, నరసరావుపేటలు క్రమంగా ఈ సంస్థానానికి రాజధానులుగా ఉంటూ ఉండేవి.

ఈ సంస్థానాధిపతులు పద్మనాయకులు. గృహనామం 'మల్రాజు' వారు. వెలమదొరలైన ఈ మల్రాజు వారి పూర్వులు నిజాం రాష్ట్రంలోని "కొల్లూర" సంస్థా

నాధీశులుగా ఉండేవారట. ఈ సంస్థానాన్ని పాలించిన మల్రాజు వారిలో రాజా తిరుమల రాయడుగారు ఆద్యుడు. వీరి కుమారుడు 'వల్లారాయడు'నే నామాంతరం గల "వల్లభ రాయడు" ప్రసిద్ధుడు. ఢిల్లీ పాదుషాను మెప్పించి కొండవీటి సర్కారులోని కొంత భాగాన్ని సంపాదించి సంస్థానంలో కలుపుకున్నాడు. వల్లభరాయుని నాలుగవ కుమారుడు 'కొండలరాయడు' తరువాతి సంస్థానాధిపతి. ఇతనికి ఆరుగురు కుమారులున్నారు. వారిలో 3 వ వాడైన "రామన్న" కుల విస్తారకుడు. రామన్నకు ఇద్దరు కుమారులు. వారిలో జ్యేష్ఠుడైన "సీతాద్రిరాయడు"నే నామాంతరం కల "కొండలరాయడు" ప్రముఖుడు. ఈ కొండలరాయనికి చినపాపమాంబ వలన కల్గిన "రాజా వేంకటనరసింహ రాయడు" సంస్థానాధిపతులలో చాలా ప్రసిద్ధుడు. ఇతని కాలంలోనే రాజధాని 'అట్లూరు' గ్రామానికి మార్చబడింది. ఈ ప్రభువు పేరనే ఈ గ్రామం "నరసరావుపేట"అయింది వీరి కుమారుడు పెద వేంకట గుండారాయడు చాలా ప్రసిద్ధుడు. పెద్దాపురం, రేపల్లె, సైదాపురం జమీందారీ భాగాలను వేలంలో ఖరీదు చేసి సంస్థానాన్ని అభివృద్ధి పరిచారు. ఇతడు, ఇతని భార్య రాణీలక్ష్మమ్మ దానధర్మాలలో పేరెన్నిక గన్నవారు. క్రీ. శ. 1832–33 లలో గుంటూరు మండలంలో చాలా గొప్ప కరువు సంభవించగా వీరు నిరు పేదలకు నిత్యాన్న దానాలు జరిపి వారిని ఆదుకున్నారట. ఇటువంటి కొన్ని కారణాల చేత సంస్థానం అప్పులపాలైంది. కుంపిణీ వారికి పేష్కషు చెల్లించలేక పోవడంచేత క్రీ. శ. 1833–46 ల మధ్య ఈ సంస్థానం కుంపిణీ వారి పాలనంలోనే ఉన్నట్లు తెలుస్తుంది. రాజా కొండల్రావు బహద్దరు, రాజా వేంకట నృసింహరావు బహద్దరు ఆ తరవాత సంస్థాన పాలకులుగా ఉన్నారు. జమీందారీ రద్దు చట్టానికి పూర్వమే కొన్ని రాజకీయ కారణాల చేత ఈ సంస్థానం అంతరించిపోయింది.

నరసరావుపేట పాలకులు యథాశక్తి సాహితీ సేవ చేశారు. కవి శిరో భూషణము, కాళిందీ కన్యాపరిణయాదుల కర్తయైన అహోబల పండితుడు ఈ సంస్థానానికి సంబంధించిన వాడు. ఇతని ఇంటి పేరు "గాలి" వారు. గాలివారి వంశంలో చాలా మంది కవి పండితులున్నారు. ఈ సంస్థానాన్ని పాలించిన వల్లభరాయని కుమారుడు కొండల్రావును, ఆతని జ్యేష్ఠుడు జగ్గన్నయును సాహితీ ప్రియులు. కవి పండిత పోష కులు. కొండల్రావు కుమారుడైన 'రామన్న' సుకవి విద్యాధారుడని ప్రఖ్యాతి చెందినవాడు. దిట్టకవి నారాయణ కవి రచించిన "రంగరాయ చరిత్రము"నకు ఇతడు కృతిభర్త. మిక్కిలి ప్రసిద్ధి చెందిన దిట్ట కవులు ఈ సంస్థానానికి భూషణంగా ఉండే వారు. రాజా మల్రాజు పెదవేంకట గుండారావు మిక్కిలి సాహిత్యాభిమాని, తాడి కొండ మల్లనారాధ్యులు, పట్టాభిరామకవి, మతుకుమల్లి కనకాద్రిశాస్త్రి మొ॥ వారు ఈతని ఆస్థానంలో ఉండేవారు. సంస్థానాన్ని చివరి కాలంలో పాలించిన మల్రాజు వేంకట నృసింహరావు బహద్దరు "విచిత్రరాఘవ" కృతిభర్త. విచిత్రరాఘవ కర్తలైన "వేంకట పార్థసారథి కవుల"నే జంటకవులను గౌరవించి తన సాహితీ ప్రియత్వాన్ని ప్రదర్శించారు. (ఆం. సం, సా–196–197)

**నరసాపుర వ్యాకరణము**

నామాంతరం : లఘు వ్యాకరణము (చూ).
కర్త : వేదం వేంకటరమణశాస్త్రి.

**నరసింగమయ్య**

నామాంతరం : లక్ష్మీనరసింహము (చూ).

**నరసింహ కవి**

కాలం : క్రీ. శ. 18వ శతాబ్దికి పూర్వం.
రచన : ధర్మజ కృష్ణ సంవాదము (ద్విపద)

కవిని గురించిన వివరాలు తెలియరావటంలేదు కవిత్వం సామాన్యంగా ఉంది. (ద్వి.సా.చ-278)

**నరసింహ పురాణము (అలభ్యం)**

కవి : ప్రోలుగంటి చెన్నశౌరి.
ఇది ద్విపద కావ్యం.

**నరసింహ పురాణము (నృసింహ పురాణము)**

కవి : హరిభట్టు.
రచనాకాలం : క్రీ. శ 1530 ప్రాంతం.
అంకితం : ప్రోలుగంటి రంగమంత్రికి.

హరిభట్టు నృసింహ పురాణంలోని ఉత్తరభాగాన్నే రచించాడట. కవి మరణా నంతరం అతని పుత్రుడు రాఘవ మనీషి దీన్ని ప్రోలుగంటి రంగమంత్రికి అంకితం ఇచ్చాడు. (క. చ. 311)

**నరసింహరాయ మఖి**

కాలం : క్రీ. శ 1684 ప్రాంతం.
స్థలం : తంజావూరు.
రచన : త్రిపుర విజయ చంపూః (సం).

అప్పయ్య దీక్షితుని వంశీయుడు. గంగాధర మఖి తనయుడు. ఇతడు తంజా వూరును పాలించిన ఏకోజీ దగ్గర మంత్రిగా ఉండేవాడు. (ద.దే.వా-181)

**నరసింహ విలాసకథ (అలభ్యం)**

కవయిత్రి : తరిగొండ వేంకమాంబ.

ఇది యక్షగానం కావచ్చు. (అ.భా.క-75)

**నరసింహ శతకము (అలభ్యం)**

కవయిత్రి : తరిగొండ వేంకమాంబ.

తరిగొండలోని నృసింహస్వామి పేర చెప్పిన శతకం. తరిగొండ కడప మండలంలో వాయల్పాడుకు నాలుగు మైళ్ళ దూరంలో ఉంది. (అ.భా.క-74)

## నరసింహ శతకము

కర్త : ధర్మపురి శేషాచల కవి.

రచనాకాలం : క్రీ. శ. 1780 ప్రాంతం.

ధర్మపురిలోని నృసింహస్వామిపైన చెప్పిన శతకం. "భూషణ వికాస శ్రీధర్మపుర నివాస, దుష్ట సంహార నరసింహ దురిత దూర" అనే మకుటంతో ఉంది. శైలి మృదు మధురం భాష అంతగా లక్షణోపేతమైనది కాదు. (శ.క.చ-436)

## నరసింహాప్పారావు

కాలం : క్రీ శ. 16 వ శతాబ్దం.

సాహిత్య పోషకుడు. కృతిపతి. కుమార ధూర్జటి రచించిన "ఇందుమతీ పరిణయ" ప్రబంధం ఇతనికే అంకితం. ఈ గ్రంథం ముద్రితమట. (క.న-35)

## నరసింహుడు

కాలం : క్రీ. శ. 1291-1323 ప్రాంతం.

ఆస్థానం : కాకతి రెండో ప్రతాపరుద్రుని ఆస్థానం.

రచనలు : 1. కాదంబరీ కల్యాణ నాటకము 2. కాకతీయ చరిత్ర (అలభ్యం).

దశ రూపకాలు ఈ కవి వ్రాశాడనే కింవదంతి ఉందికాని అవేమీ లభించలేదు. ఇతడు అగస్త్య విద్యానాథుని చెల్లెలి కుమారుడు. (ప్రా.వ.దే.చ.)

## నరహరి శతకము

కర్త : ధర్మపురి శేషాచలకవి.

చూ. ధర్మపురీ నృకేసరీ శతకము.

## నరుకూరి నారాయణప్ప

కాలం : క్రీ. శ. 18 వ శతాబ్దం ఉత్తరార్థం.

స్థలం : వేంకటగిరి సంస్థానం (నరుకూరు గ్రామం).

రచన : పారిజాత ప్రబంధము.

గురువు : కొండూరి వేంకటాచార్యులు.

కాళయాంబా ముత్తధీవరుల పుత్రుడు. ఈతడు వెలుగోటి కుమారయాచమ నాయని (1777-1804) కి ఆశ్రితుడు. తన కృతిని ఆ ప్రభువునకే అంకితం ఇచ్చాడు. (ఆం. సం. సా-458)

## నరేంద్ర లింగ శతకము

కర్త : పులివర్రు రాజయ్య.

అంకితం : పులివర్రు లోని నరేంద్ర లింగస్వామికి.

పులివర్రు గుంటూరు మండలంలోనిది. లోక నీతులు ఈ రచనలో కొల్లలు. శైలి సరళంగా ఉంది. బంగారం గురించి కవి ఒక చక్కని పద్యం చెప్పాడు. దీని

అసమగ్ర ప్రతి ప్రాచ్యలిఖిత గ్రంథాలయంలో ఉంది. కవి నాయక రాజ యుగంలోని వాడవి భావిస్తున్నారు. (ఆరుద్ర-11-240)

### నర్ర పేరయ్య

చూ. తురగా వెంకంరాజు.

స్థలం : గుంటూరు జిల్లా పరస తాళ్ళూరు.

ఈయన ఇంట్లో పెళ్ళి జరుగుతుండగా తురగా వెంకంరాజు అనే భట్టు కవికి మర్యాద జరగలేదని ఆ కవి ఈయనను, పెళ్ళి వారినీ దూషిస్తూ ఒక సీస పద్యం చెప్పాడు. (చా. ప. ర.)

### నల కీర్తి కౌముది

కర్త : చూ. అగస్త్యుడు.

ఇది సంస్కృత ఖండ కావ్యం. (ప్రా. ద. దే. చ.)

### నల చరిత్ర

కర్త : తెలియదు.

జానపద పౌరాణిక గేయం. కథ భారత కథకు సంబంధించినది.

చూ. పౌరాణిక గేయములు. (వా. చ.)

### నల చరిత్ర

కర్త : చక్రపురి రాఘవాచారి.

అంకితం : ఘటికాచలం (షోలింగర్)లోని నరసింహస్వామికి

ద్విపదకావ్యం. ఐదు ఆశ్వాసాలున్నాయి. దీనిలోని కథ నన్నయ భారతంలోని నలోపాఖ్యానాన్ని అనుసరించి ఉంది. చిన్నచిన్న మార్పులున్నాయి. నన్నయ భారతంలో దమయంతిని రాజ కుమారులకు ఎవరూ పరిచయం చేయలేదు. శ్రీనాథుడు నైషధంలో భారతీదేవి చేత పరిచయం చేయించాడు. రాఘవాచారి రాజ పురోహితుడైన వసుదేవుని చేత దమయంతిని పరిచయం చేయిస్తాడు. రచన రసవంతంగా ఉంది.

(క.త-12-192; ఆరుద్ర-9)

### నల చరిత్ర

కర్త : బట్టేపాటి తిమ్మయ (చూ).

అంకితం : శ్రీరామునికి.

ద్విపద కావ్యం. మూడాశ్వాసాలున్నాయి. భారత కథలను ద్విపదగా వ్రాస్తున్నప్పుడు అందులోని కొన్ని కథలను కవి ప్రత్యేక కావ్యాలుగా రచించాడు. అందులో నలచరిత్ర ఒకటి. ఇది చాలా ప్రచారం పొందిన కావ్యం. రచన ప్రౌఢంగా ఉంది.

(ఆరుద్ర-10-22)

## నల చరిత్ర

కర్త : రఘునాథ నాయకుడు.
అంకితం : శ్రీరామునికి.

ఎనిమిది ఆశ్వాసాల ద్విపద ప్రబంధం. ఇందులో మహా భారతం అరణ్య పర్వంలోని కథ, శ్రీనాథుని శృంగార నైషధంలోని కథ అందంగా జోడింపబడ్డాయి.

కావ్యావతారికలో కవి తనకు ముందు నలుని కథ వర్ణించిన నన్నయను, శ్రీనాథుణ్ని స్తుతించాడు కావ్యంలో సందర్భానుసారంగా అశ్వరకా నైపుణ్యం, సంగీత శాస్త్ర వివరణలను విస్తరించాడు. నవరస భరితమైన రచన. కవి గద్యలో ఈ కావ్యాన్ని ప్రబంధంగా పేర్కొన్నాడు కాని ఇది ద్విపద కావ్యం. వర్ణనా చమత్కారం, పాత్ర పోషణ, పదాలంకారాలు ప్రశస్తంగా ఉన్నాయి. (అముద్ర-10-62)

## నల చరిత్ర నాటకమ్ (సం)

కర్త : నీలకంఠ దీక్షితులు. (తె.వి.స-4)

## నల నాటకము

కర్త : సిరిప్రెగడ సుబ్బారాయుడు.
అంకితం : బిల్వపురీశునికి.

ఈ యక్షగానాన్ని కవి నాటకంగా పేర్కొన్నాడు. ప్రసిద్ధమైన ఇతివృత్తం. దీనిలో ఆశ్వాస విభాగాలు ఉన్నాయి. రచన వ్యావహారిక భాషలో ఉంది.

దీనిలో ద్విపదలు, వచనములు, ఏలలు, కొన్ని పద్యాలు, శోభనములు ఉన్నాయి. (య వా. చ-100)

## నల యాదవ రాఘవ పాండవీయము (అలభ్యం)

కర్త : (చూ) ఆసూరి మరింగంటి సింగరాచార్యులు.

నాల్గర్థాల శ్లేష కావ్యం. పింగళి సూరన ద్వ్యర్థి కావ్యాన్ని, బాలసరస్వతి త్ర్యర్థి కావ్యాన్ని చూచిన మీదట ఈ రచన చేసి ఉంటాడు. ఇది కవి తన పదహారవ యేట రచించినట్లు చెప్పుకొన్నాడు. (క. త-13-14)

## నల రాఘవ యాదవ పాండవీయము

కర్త : గునుగుటూరి వెంకటకృష్ణయ్య.

చతురర్థి కావ్యం. (ద.దే వా-491)

## నల విలాసమ్ (సం)

కర్త : అహోబల నృసింహసూరి.

ఇది నాటకం. (తె.వి స-4)

## నలాభ్యుదయమ్ (సం)

కర్త : చూ. వామనభట్ట బాణుడు.

ఇది మిక్కిలి ప్రాచుర్యాన్ని పొందిన కావ్యం. (రె. రా. వ.)

**నలుగు పాటలు**

ఇవి ఒక రకమైన పెండ్లి వేడుకపాటలు. వీటి రచనలో ఒక నియతి ఉండదు. పెండ్లాటలకు పీటలు, తలంటుకు శోభనాలు ఉపయోగించినట్లే వీటికి ధవళాలను ఉపయోగించటం కద్దు (మిత్రవిందా పరిణయం). సాధారణంగా ఈ పాటలు ఆ పని పాటలకు అనుగుణమైన గతి స్ఫురణ కలిగి ఉంటాయి.

ఇవి యక్షగానాలలో ప్రయుక్తం. అన్న పూర్ణా పరిణయంలోని నలుగు పాటకు అది చాపుమూలగతి ఉంది. త్యాగరాజు కీర్తనలలో ఉన్న మూడు నలుగు పాటలకు అది తాళమే ప్రయుక్తం. (య.వా చ-337)

**నల్లందిగళ అయ్యావారయ్య**

కాలం : క్రీ. శ. 18 వ శతాబ్దం.

స్థలం : మధుర.

సాహిత్య పోషకుడు. నల్లందిగళ్ వంశావళి కృతిపతి విజయ రంగ చొక్కనాథుని ఆస్థానంలోని వాడు. వీరు నలుగురు అన్నదమ్ములట. రేవూరి చిన అనంతయ్య చేత కావ్యాలు రాయించి అంకితం పుచ్చుకున్నారు. (ఆరుద్ర-12-123)

**నల్లందిగళ వంశావళి**

కర్త : రేవూరి చిన అనంతయ్య (చూ).

అంకితం : నల్లందిగళ అయ్యావారయ్యకు.

సీసమాలిక. మధుర పాలకుడైన విజయరంగ చొక్కనాథునికి ఆప్తులైన నల్లందిగళ్ సోదరులు నలుగురిని గురించి చెప్పిన రచన. వారి వంశావళి, వైభవం ఇందులో చెప్పబడ్డాయి. అయ్యావారయ్య వారిలో ప్రముఖుడు. (ఆరుద్ర-12-123)

**నల్లందిగళ శేషయ్య**

కాలం : క్రీ. శ. 1700 ప్రాంతం.

స్థలం : మధుర మండలం.

సాహిత్య పోషకుడు. తిరుమలార్యుని పుత్రుడు. మధురను పాలించిన విజయ రంగ చొక్కనాథుని ఆస్థానంలోనివాడు. బాలకవి రేవూరి అనంతయ్య ఇతని మీద ఒక ఉదాహరణ కావ్యం చెప్పాడు. అదే శేషార్యోదాహరణం. "నల్లందిగళ వంశావళి" అనే కృతి ఇతని గురించీ ఇతని సోదరులను గురించీ వివరిస్తున్నది. (ఆరుద్ర-12-123)

**నల్ల తిమ్మరాజు**

కాలం : క్రీ. శ. 16 వ శతాబ్దం (ప్రథమ భాగం)

సాహిత్య పోషకుడు. అరవీటి అళియ రామరాయల పెద తండ్రి కుమారుడు. ఇతని తండ్రిపేరు పొట్లపాడి తిరుమలరాజు (తిమ్మరాజు). ఇతడు దోనూరు కోనేరు నాథకవిని ఆదరించి అతనిచేత బాల భాగవతం (పద్య) కావ్యాన్ని వ్రాయించి తండ్రికి

అంకితం చేయించాడు అతని చేతనే బాల భాగవతం (ద్విపద) కావ్యాన్ని వ్రాయించి తన తమ్ముడైన చిన తిమ్మరాజుకు అంకితం చేయించాడు.

కోనేరునాథ కవి ఈ రెండు గ్రంథాలు వ్రాయడానికి ప్రేరకుడు ఈ నల్ల తిమ్మరాజే. ఇతడు అరవీటి తిమ్మరాజుగా ప్రసిద్ధుడు. (ఆరుద్ర)

**నల్ల దీక్షితుడు**

నామాంతరం : భూమినాథకవి.

కాలం : క్రీ. శ. 18 వ శతాబ్దం.

స్థలం : శహజీ రాజపురం.

రచనలు : 1. సుభద్రా పరిణయ నాటకమ్ (సం) 2. ధర్మ విజయమ్ (చంపూ కావ్యం [సం] 3. శృంగార సర్వస్వము (భాణము)

ఇతని నాటకాలను అనాడు ప్రదర్శిస్తుండేవారు. 1684–1712 నడుమ తంజావూరును పాలించిన శహాజీ ఆస్థానంలోని వాడు. శహాజీ రాజపురాగ్రహార ప్రతిగృహీతలలో ఒకడు (వ.దే.వా–130, M.R.T–33, తె.వి స–6–241)

**నల్లనగండ్ల నారనారాధ్యుడు**

కాలం : క్రీ. శ. 18 వ శతాబ్దం కావచ్చు

రచన : బసవ పురాణము (ద్విపద).

గ్రంథారంభం శిథిలమైనందున కవిని గురించిన వివరాలు తెలియరాలేదు. తుమ్మలపల్లి నాగభూషణ కవి కూడా బసవ పురాణాన్ని పద్యకావ్యంగా వ్రాశాడు.

ఈ కవుల రచనా సందర్భాలు ఒకేరీతిగా ఉండడం వల్ల వీరు సమకాలికులో లేక ఒకరి కావ్యాన్నిచూసి మరొకరు వ్రాశారో నిర్ధారించడానికి వీలులేకుండా ఉంది. (ద్వి సా.చ–157)

**నల్లపరెడ్డి**

నామాంతరం : నల్లారెడ్డి (చూ).

**నల్లపాటి వారు**

"పాటి" శబ్దం చివరగా ఉండి, గ్రామ నామంతో ఉన్న ఇంటిపేరు. ఈ ఇంటి పేరుతో గుంటూరు మండలంలో బ్రాహ్మణులు, కమ్మవారు, విశ్వకర్మ కులజులు, నిమ్న జాతుల వారు ఉన్నారు. క్రీ. శ. 19 శతాబ్దం పూర్వార్ధంలో అవనిజా చరిత్ర అనే యక్షగానాన్ని వ్రాసిన శేషాచల దాసు ఇంటిపేరు నల్లపాటి. (య వా.చ–141)

**నల్లపాటి శేషాచలదాసు**

కాలం : క్రీ. శ. 19 వ శతాబ్ది పూర్వార్ధం.

స్థలం : కృష్ణామండలం కావచ్చు.

రచన : అవనిజా చరిత్ర.

ఈయనకు సంబంధించిన ఇతర విషయాలు తెలియవు. ఈయన రచన క్రీ. శ.

1869 సంవత్సరంలో బందరులో ముద్రితమైంది. కవి బందరు ప్రాంతంవాడు కావచ్చు.
(య. వా. చ-141)

## నల్లప్రెగ్గడ కంచెరువుల శాసనము

కాలం : క్రీ. శ 1159
శాసనకర్త : నల్ల ప్రెగ్గడ.
ప్రస్తావిత స్థలం : కంచెరువుల గ్రామం.

శాసన విషయం : నల్ల ప్రెగ్గడ, మహామండలేశ్వర కన్నరచోడ మహారాజుల మంత్రి. ఈయన కంచెరువుల గ్రామంలో వేంచేసియున్న భీమేశ్వరునకు అఖండదీపం నిల్పి, దీప స్తంభాన్ని ఏర్పాటుచేసినట్లు ఈ శాసనం ద్వారా తెలుస్తుంది దీనిలో ఒక కంద పద్యం ఒక సీస పద్యం, ఒక చంపకమాల, చివర గద్య భాగముంది.
(తె క. చ-276, 277)

## నల్లాన్ చక్రవర్తి సంపత్కుమార శ్రీనివాస వేంకటాచార్యుడు

కాలం : క్రీ. శ. 1790-1840 ప్రాంతం.
స్థలం : గోదావరి మండలం-ముక్తేశ్వర గ్రామం.
రచన : శ్రీ తిరుమల వేంకటేశ్వర శతకము.

విద్వత్కవి ఇతని రచన ప్రౌఢంగా, రసవంతంగా ఉంటుంది. (క. స. 281)

## నల్లారెడ్డి

నామాంతరం : నల్లపరెడ్డి.
కాలం : 17వ శతాబ్దం (1667-1696).
స్థలం : తీర్థగిరి (తురయ్యూరు).
రచనలు : 1. స్కాందపురాణము (అలభ్యం).

తురయ్యూరును క్రీ. శ. 1667-1696 నడుమ పాలించినరాజు. కుందుర్తి వేంకటాచల కవిని కార్తిక మాహాత్మ్య రచనకు ప్రోత్సహించిన వేంకటాచల రెడ్డి ఇతని మనుమడు. (ద. దే. వా-369-371)

## నవత్కాలోపదేశమ్

కర్త : తెలియదు.

వేదాంత సంబంధమైన రచన. వచనం. కాగితపు ప్రతి సాహిత్య పరిషత్తులో ఉంది. (ఆం. సా. ప. ప-13-3-4)

## నవగ్రహచరితమ్ (సం)

కర్త ; ఘనశ్యాముడు.

సట్టకం.

## నవగ్రహస్తవము

కర్త : గౌరన.

రచనాకాలం : క్రీ. శ. 1384-1429 ప్రాంతం.

స్తోత్ర గ్రంథం. ఈ గ్రంథం దొరకలేదు గాని ఈ గ్రంథంలోని కొన్ని పద్యాలను పెదపాటి జగన్నాథ కవి ఉదాహరించాడు. (తె. రా. చ.)

## నవచోళ చరిత్రము

కర్త : పోచెట్టి లింగకవి.

అంకితం : బగిరామపల్లెలోని మృత్యుంజయేశ్వరుడుకు.

రచనాకాలం : క్రీ. శ. 15 వ శతాబ్ది చివర భాగం.

కృతిప్రేరకుడు : చికిలాల లింగప్ప.

ద్విపద కావ్యం. ఈ గ్రంథానికి పంచాగ్నుల ఆదినారాయణశాస్త్రి పీఠిక వ్రాస్తూ మృత్యుంజయేశ్వరుడు దేవుడని చెప్పారు. కవి తరంగిణీకారులు అతడు మానవుడే అని అభిప్రాయపడ్డారు. బగిరామపల్లెను శ్రీరాముల పల్లెగా కొందరు పేర్కొన్నారు. కావ్యంలో లింగప్పను సంబోధించటం కనిపిస్తుంది. ఈ రచనకు మూలం ఒక కన్నడ గ్రంథమట. ఈ గ్రంథంలో కరికాల చోళుడు, విక్రమ చోళుడు, ఉత్తుంగ చోళుడు, వరవీర చోళుడు, ఉత్తమ చోళుడు, అవివర చోళుడు, వరధర్మ, సత్యేంద్ర, మనుజేంద్రచోళులనే తొమ్మండుగురు చోళ చక్రవర్తుల కథలున్నాయి.

ఇది చరిత్ర ప్రధానం కాదు. మత విషయకమైనది ఇందులో కొన్ని చారిత్రక గాథలే అయినా కవి ఆయా రాజుల శివభక్తినే ప్రధానంగా వర్ణించి చెప్పాడు. కావ్య శిల్పం, కల్పనా ప్రౌఢి అద్వితీయంగా ఉన్నాయి. శైలి చక్కనిది.

(క. స. 210; ద్వి. సా. చ-129)

## నవనప్ప

నామాంతరం : భాగవతుల నాయనప్ప.

కాలం : క్రీ. శ. 18వ శతాబ్దం.

స్థలం : పుదుక్కోట.

రచన : ఖడ్గలక్షణ శిరోమణి (అసి ప్రబంధము).

శాస్త్రకవి విజయరఘునాథుని (1789-1807) కోరికపై కవి ఈ గ్రంథ రచనకు పూనుకొన్నట్లు తెలుస్తోంది. నుదురుపాటి వారితని బంధుకోటిలోనివారు. వీరు తెనాలి ప్రాంతం వారనీ ఖడ్గ శాస్త్రంలో మిక్కిలి పరిశ్రమ చేసి, దక్షిణ దేశంలో ఆ పరిశ్రమ హెచ్చుగా ఉండటంచేత అక్కడికి వెళ్ళి అక్కడే స్థిరపడ్డారనీ తెలుస్తున్నది. ఇతని తండ్రి నల్ల పిచ్చయ్య, పుదుక్కోట ప్రభువైన రాయరఘునాథుని చేత సన్మానింపబడ్డాడు. (వ. దే. వా-438)

## నవనాథ చరిత్ర

రచనాకాలం : క్రీ. శ. 14 15 శతాబ్దాల మధ్యకాలం.

కర్త : గౌరన.

అంకితం : శ్రీశైల మల్లికార్జున స్వామికి.

ప్రత్యేకత : శ్రీగిరి కవి ఇంతకు ముందే పద్య ప్రబంధంగా వ్రాసిన గ్రంథాన్ని ద్విపదలో ఈ కవి చెప్పాడు. సుప్రసిద్ధ రసవాద సిద్ధులైన తొమ్మండుగురు సిద్ధుల కథలు ఇందులో ఉన్నాయి. సామాన్య ప్రజలలో శైవమతాన్ని, సిద్ధుల కథలను ప్రచారం చేసే ఉద్దేశంతో శ్రీశైల మఠాధిపతి ముక్తి శ్రీ శాంతరాయలు గౌరనను ఈ రచనకు ప్రేరేపించాడు. ఇది నాథ సంప్రదాయానికి చెందిన రచన. నవనాథులెవరు అనే విషయంలో భిన్నాభిప్రాయాలున్నాయి. గౌరన, మీననాథుడు, సారంగధరుడు, గోరక్షసిద్ధుడు, మేఘనాథసిద్ధుడు, విరూపాక్షుడు, నాగార్జునుడు ఖణికుడు, వ్యాళిసిద్ధుడు, కోరక్కనాథుడు అనేవారి చరిత్రలను ఇందులో చెప్పాడు.

భాషా, వ్యాకరణాదులలో నవకవుల పోకడలు కొద్దిగా కన్పిస్తాయి హాస్య రసాన్ని సున్నితంగా పోషించిన ఘట్టాలు కొన్ని ఉన్నాయి. అనాటి పురోహితుల మోసపు పనులను సూచిస్తూ కవి చెప్పిన వంచక పురోహితుని కథ ఇందులోనిదే.

(ద్వి.సా.చ-89, క.త-4-270)

**నవనాథ చరిత్రము (అలభ్యం)**

రచన : శ్రీగిరి.

ఇది పద్యకావ్యం. దీనినే గౌరన ద్విపదగా రచించాడు. గౌరన తన కావ్యంలో ఇతన్ని పేర్కొన్నాడు. (క.త-4-161)

**నవనీత చోరము (అలభ్యం)**

కవి : విజయరాఘవ నాయకుడు.

యక్షగానం. కవి ఇందులో గోపాలుని బాల క్రీడావిశేషాలను హృద్యంగా వర్ణించి ఉంటవచ్చును. (ద.దే.వా-87)

**నవ భారతము (అలభ్యం)**

కవి : తెలియదు.

"శ్రీకృష్ణ విజయ" గ్రంథంలో ఈ ప్రబంధం "పూసపాటి రాచిరాజు" వలన ఆవిష్కరింపబడినట్లు వ్రాయబడింది పూసపాటి రాచిరాజు దీనికి కృతిభర్తా, కృతికర్తా అనే వివరాలు తెలియవు. (ఆం.సం.సా-411)

**నవమాలిక (సం)**

కర్త : విశ్వేశ్వర కవి.

ఇది సంస్కృత నాటిక.

**నవరత్నములు**

శ్రవ్య కావ్యభేదం.

చూ. రత్నావళి

**నవ రామాయణము (అలభ్యం)**

కర్త : చూ. పూసపాటి మొదటి ఆనందరాజు.

అంకితం : సీతారామస్వామికి.

ప్రతి పద్య మనోహరమైన ప్రబంధమట. శ్రీ రామునిపై భక్తి రాజిల్లచేసే విధంగా వ్రాయబడిందని, సీతారామునికే అంకితం ఇవ్వబడిందని తెలుస్తున్నది.

(అం.సం.సా-415)

## నవీనద్రోణపర్వమ్ (సం)

కర్త : కొటికెలపూడి వీరరాఘవాచార్యులు (చూ).

అంకితం : పూడూరి చెన్నకేశవస్వామికి.

ఈ గ్రంథం పూర్తిగా లభ్యం కాలేదు. 66 తాళపత్రాలలో వ్రాయబడిన భాగం మాత్రం దొరికింది. రచనలో కవి పేరు ఎక్కడా కానరాకున్నా కొన్ని ప్రత్యేక కారణాల దృష్ట్యా వీరరాఘవ కృతియేనని సాహితీవేత్తలు నిర్ణయించారు. (మ.మా.)

## నవీన కల్యాణ కల్పవల్లిక (అలభ్యం)

కర్త ; ఓగిరాల రంగనాథ కవి

కవి పినతండ్రి కుమారుడైన జగన్నాథ కవి వలన ఈ రచన గురించి తెలియ వచ్చింది.

## నవ్యతరభోగి శ్రీ సదానందయోగి శతకము

కవి : సదానందయోగి (చూ).

ప్రత్యేకత : సకల తత్వార్థ సంగతులు సంగ్రహించి కవి ఈ శతకం వ్రాశాడు. ఇందులో 99 పద్యాలున్నాయి. కవి అనుభవం ముఖ్యమంటాడు. ద్వైతం, అద్వైతం అనే విభేదాలు అవసరంలేదని, నిత్య నైమిత్తికాలను పాటించనవసరంలేదని ఈ శతకం చెబుతున్నది. బంధముక్తులు రెండు భ్రమేనని, ఆలుబిడ్డలను విడిచినందువల్ల మోక్షం అబ్బదని ఈ శతకం అంటుంది. (ఆదుద్ర-8)

## నాంచారు పరిణయము (అలభ్యం)

కవి : (చూ) భాస్కర శేషాచల కవి.

యక్షగాన కావ్యం. (వ.దే.వా-402)

## నాగదత్తో పాఖ్యానము

ప్రబంధ రాజవేంకటేశ్వర విజయవిలాసము. చూ.

గణపవరపు వేంకట కవి వ్రాసిన ప్రబంధరాజ వేంకటేశ్వర విజయవిలాసం లోని ఒక ఉపాఖ్యానం. ఈ కథ తెనాలి రామకృష్ణుని నిగమశర్మోపాఖ్యానానికీ, కందుకూరి రుద్రకవి నిరంకుశోపాఖ్యానానికి అనుసరణం అని చెప్పవచ్చును.

## నాగదేవభట్టు

కాలం : క్రీ. శ. 1150 ప్రాంతం.

రచన : ఆమరుక తెలుగు టీక.

ఈయనను నాగభట్టోపాధ్యాయుడని కూడా అంటారు. ఈయనను క్రీ. శ. 1434 ప్రాంతంలో ఉన్న మల్లినాథసూరి (అమర టీక నాగదేవభట్టును) పేర్కొన్నాడు. క్రీడాభిరామ కర్త ఈయనను పేర్కొన్నాడు. క్రీ. శ. 1149 దక్షారామ శాసనంలోను క్రీ. శ. 1151 నాటి ప్రేంపల్లి భావనారాయణస్వామి ఆలయ శాసనంలోను ఈయన ప్రసక్తి ఉంది. ఈయన "సానుప్రాస విలాస కావ్య రచనా చాతుర్యధుర్యుడు" అని శాసనం చెబుతున్నది. (తె క. చ-284-285)

## నాగనాథుని మల్లారాధ్యుడు

కాలం : క్రీ.. శ. 15 వ శతాబ్దం చివరి భాగం.
స్థలం : చిల్లపల్లి.

కృతిపతి. పిడుపర్తి రెండో బసవకవి రచించిన ప్రభులింగలీలలు పద్య కావ్యం ఇతనికి అంకితం. ఇతడు చల్లపల్లి గ్రామకరణం. చిల్లపల్లి గ్రామాలు కృష్ణా మండలంలోను, నైజాం మండలంలో కూడా ఉన్నవి. కృతికర్త నైజాం మండలం వాడు కాబట్టి ఇతడూ అక్కడివాడేనని పండితాభిప్రాయం. (క త-5-270)

## నాగర ఖండము

రచన : తురగా రాజకవి, అయ్యంకి బాలసరస్వతి.
కృతిభర్త : భవనేశ్వరపురపు మార్కండేయుడు.
బిరుదు : పేషణీహనుమంతుడు.

ఇది అయిదు అశ్వాసాల గ్రంథం. దీనికి మూలం సంస్కృత స్కాంద పురాణంలోని సనత్కుమార సంహిత అనే నాగర ఖండం.

పార్వతి శివుని "జగత్కారణ దేవుడు" ఎవరు అని అడిగితే "విశ్వకర్మ"ను, ఆయన గొప్పతనాన్ని శివుడు వివరిస్తాడు. విశ్వకర్మ కపికేతనుడు. కృతిభర్త కూడా కపికేతనుడే. దీనిలో శివుని లీలా నామాలు, జంతునిర్మాణ క్రియ, అష్టాదశ జాతి భేదాలు అరవైనాలుగు కళల ఉత్పత్తి, ఆరు దర్శనాలు మొ॥ వివరాలున్నాయి. ఆంజనేయుని జన్మ కథ కూడా ఉంది.

ఈ కావ్య కర్తలు పూర్వకవి స్తుతిలో దాదాపు 40 మందిని చెప్పారు. దీని వల్ల సాహితీ కారులకు, కొందరి కవుల కాలాన్ని నిర్ణయించటం సుకరమైంది.
(అముద్ర-9)

## నాగలూటి శేషనాథుడు

కాలం : క్రీ. శ 1590 కి పూర్వం.
రచన : పర్వత పురాణము.
అంకితం : శ్రీశైలమల్లికార్జునస్వామికి.

విశిష్టత : ఈయనకు ముందు పోలమరాజు అనే కవి పర్వత పురాణం వ్రాశాడు. తెలుగు దేశంలో పర్వతమంటే శ్రీశైల పర్వతానికే వర్తిస్తుంది. పెదపాటి

జగ్గిన్న ప్రబంధ రత్నాకరంలో ఈ కవి వ్రాసిన ఒక పద్యాన్ని ఉదాహరించాడు. ఆ పద్యం ముక్కంటి ప్రశంస.

ఈయన వ్యాకరణ శాస్త్ర పండితుడు. మంచి కవితాధార కలవాడు. సంస్కృత తాంధ్రాలు బాగా చదువుకొన్నాడు. ఛత్రకవి లింగకవి వంటి అనంతర కవులు నాగ జూటి శేషనాథ కవిని నుతించారు. ఈ కవి వ్రాసిన గ్రంథం ప్రతి మద్రాసు ప్రాచ్య లిఖిత భాండాగారంలో ఉంది. (అరుద్ర-9)

## నాగేంద్ర కవి

కాలం : క్రీ. శ. 1400 ప్రాంతం.
స్థలం : భువనగిరి (హైదరాబాదు మండలం).
రచన : రఘూధీశ్వర శతకము.

కవి వైష్ణవ మతాభిమాని అట. ప్రౌఢంగా రచన చేశాడు. (క. చ-108)

## నాగ్నజిత్తీ పరిణయము

కర్త : వల్లూరి నరసింహ కవి
రచనాకాలం : 18 వ శతాబ్దం.

మూడాశ్వాసాల ప్రబంధం. రచన హృదయాహ్లాదకరంగా ఉంది.

## నాచన సోమనాథుడు

కాలం : క్రీ. శ. 1334-90 ప్రాంతం.
పోషణ : బుక్కరాయలు.
స్థలం : విజయనగరము.
సమకాలికులు : ప్రోలయ వేమారెడ్డి, ఎర్రాప్రెగ్గడ.
బిరుదులు : సర్వజ్ఞుడు, సకల భాషాభూషణుడు, సాహిత్య రస పోషకుడు, నంవిధాన చక్రవర్తి, నవీనగుణ సనాథుడు
రచనలు : 1. ఉత్తర హరివంశము, 2. వసంత విలాసము (అలభ్యం)3. హర (రి) విలాసము (అలభ్యం).

అష్టభాషా కవిత్వ విశారదుడు, సకలాగమవేది. ఇతని తండ్రిపేరు కూడ నాచనయేన . ఈయన ఎర్రాప్రెగ్గడతో పోటీగా నిలువగలిగిన కవి. ఎర్రన హరివంశం వ్రాస్తే, సోమన ఉత్తర హరివంశం వ్రాశాడు. పూర్వ హరివంశాన్ని కూడా వ్రాసి ఉంటా డని పండితులు భావిస్తున్నారు. హరి వంశాన్ని రసవత్తరంగా స్వతంత్ర కావ్యంగా వ్రాశాడు. ఈయన యుద్ధవర్ణనలు తిక్కనను గుర్తుచేస్తాయి. ఈయన పురాణ పద్ధతి విడిచి ప్రబంధమార్గం అనుసరించాడు. శైలి శబ్దాలంకార భూయిష్ఠమై, దీర్ఘ సమా సాలతో, ఓజోగుణ ప్రధానంగా ఉంటుంది. లోకోక్తులు, సామెతలు మనోహరంగా ఉంటాయి. రసపోషణలో ఎర్రనకు దీటుగా ఉంటాడు. ఔచిత్యపోషణ, ఆవేశనిగ్రహం ఈయనలో లోపించాయని విమర్శకులు అంటారు. మొదటి బుక్కరాయలు నాచన సోము నికి దానంచేస్తూ క్రీ. శ. 1344 లో పెంచుకలదిన్నె దాన శాసనం వేయించాడు. దీనికే

యుక్కారాయపుర్వం అని పేరు. సోముని "హరివిలాసం" లోనివని చెప్తూ కస్తూరి రంగకవి నాలుగు పద్యాలు ఉదాహరించాడు. ఇతడు హరి విలాసాన్ని రచించలేదని అది హర విలాసమో లేక వసంతవిలాసమో అయి ఉంటుందని పండితులు భావిస్తున్నారు.
(వా.చ.)

## నాచి

కాలం : క్రీ. శ. 7వ శతాబ్దం.
స్థలం : గుంటూరు మండలంలోని ఏలేశ్వరం.
రచన : నాచీ విజయ నాటకమ్ (సం).

ఈమె సంస్కృతాంధ్ర సాహితీ నిష్ణాతుడైన ఏలేశ్వరోపాధ్యాయుల కుమార్తె. పండితురాలు. తండ్రిదగ్గర సర్వవిద్యాశాస్త్ర కళారహస్యాలను అధ్యయనంచేసి, కాశీ యాత్రకు బయలుదేరి మార్గమధ్యంలో పండితులను జయించి, తన జయగాథనే నాటకంగా వ్రాసిందట. ఈమె పాండిత్యాన్ని గురించి ఒక కథ ప్రచారంలో ఉంది.

ఏలేశ్వరోపాధ్యాయులు షాజహాన్ కాలంవాడని కొందరూ ఏడవ శతాబ్దివాడని కొందరూ అంటున్నారు. ఏలేశ్వరం దక్షిణకాశిగా ప్రసిద్ధిపొందింది.
(అ.భా. కవయిత్రులు; క చ.)

## నాచికేతు చరిత్రము

కర్త ; చూ. మిక్కిలి మల్లికార్జున కవి.
అంకితం : వాద్రేవు చలమయ్యకు.

ప్రబంధం కృతిపతి పిఠాపురం సంస్థానాధీశుడైన గంగాధర రామారాయ బహద్దరు అమాత్యుడు. రచన సరళంగా ఉంది. ఇది నాచికేతూపాఖ్యానంగా ప్రసిద్ధం.
(ఆం.సం.సా-254)

## నాచీ విజయనాటకమ్ (సం)

కవయిత్రి : నాచి.

అలభ్యం. కవయిత్రి నాచి అపారశేముషీ ధురంధరురాలు. ఈమె కాశీ యాత్రకు వెళ్ళినప్పుడు మార్గమధ్యంలో పండితులను ఓడించిందట. తిరిగి వచ్చి తన విజయగాథనే నాచీ విజయమనే పేర నాటకంగా రచించింది. (క.చ-33)

## నాటకము

దశరూపకాలలో ఇది ప్రముఖమైంది. ఇందులోని వస్తువు ప్రఖ్యాతము. నాయకుడు ధీరోదాత్తుడై ఉండాలి. శృంగార వీరరసాలలో ఒకటి అంగిరసంగా, రెండోది అంగరసంగా ఉండాలి. దీనిలో 5 నుంచి 10 అంకాలు ఉండవచ్చు. రసనాయక విరుద్ధాలయిన కల్పనలను వదిలివెయాలి. ఇందులో పంచసంధులుంటాయి. నిర్వహణ సంధిలో అద్భుతాన్ని వర్ణించవచ్చు. నాయకవధ సర్వథాత్యాజ్యం. ఇది నాందీ ప్రస్తావనలతో మొదలై, భరత వాక్యంతో ముగుస్తుంది. ఉదా : శకుంతలాదులు. (తె.వి.స-6)

## నాటక దీపము

కర్త : చూ. శిష్టు కృష్ణమూర్తిశాస్త్రి.

## నాటక లక్షణ శాస్త్రము (అలభ్యం)

కవి : (చూ.) ఆసూరి మరింగంటి సింగరాచార్యులు.

అష్టభాషా విశేష కృతుల సంజ్ఞలన్నీ ఇందులో చెప్పబడినవట. కవి పదునాల్గు పదియేను వత్సరాల వయస్సులోనే ఈ రచన చేశాడు. (క.త-13-9)

## నాటిక

భరతుడు తన నాట్యశాస్త్రంలో దశవిధ రూపకాలను చెప్పి, నాటిక లక్షణాలను కూడా చెప్పాడు. దీనిలో వస్తువు కల్పితము. శృంగార రసం ప్రధానంగా నాలుగు అంకాలుంటాయి. ధీరలలితుడయిన రాజు నాయకుడు. రాజు, ఉత్తమ నృపకుల సంజాత, ప్రగల్భ అయిన జ్యేష్ఠభార్య (దేవి) ఉండగనే, క్రొత్తనైన ముగ్ధనాయికను కోరి, ఆమెపట్ల అనురాగాన్ని ప్రదర్శించవచ్చు. నాయిక దేవికి ఆసన్నవర్తిని, సంగీత వ్యాపృత అయి ఉండవలె. నాయికా నాయకుల ప్రణయానికి ఎవరివల్ల విఘ్నం కలుగుతుందో, చివరకు ఆమెయే సమాగమం చేకూరుస్తుంది దీనిలో స్త్రీ పాత్రలు ఎక్కువ. సంధి ప్రవేశక ప్రస్తావనల విషయంలో ఇది ప్రకరణ తుల్యము నాటక ప్రకరణ ధర్మాలున్నాయి కాబట్టి సంకీర్ణము (తె.వి.స-6)

## నాట్యరాసకము

దృశ్యకావ్య భేదం. దీనిలోని వస్తువుకల్పితం. ఒక అంకం ఉంటుంది. నాయకుడు ధీరోదాత్తుడు. వాసవసజ్జిక నాయిక. పీఠమర్దుడు నాయక సహాయుడు. శృంగారం ప్రధాన రసం. హాస్యం అంగము. సంధి, ప్రస్తావన, లాస్యాంగాల విషయంలో ఇది భాణతుల్యము. (తె వి స-6)

## నాట్య విద్యా విలాసము

కవి : కంఠీరవరాజు (మూ).

యక్షగానం. రచనలో సంస్కృతం హెచ్చుగా ఉంది. నాట్యకళా నిపుణులైన స్త్రీలు తమ విద్యావిశేషాలను ప్రదర్శించడం ఇందులోని ఇతివృత్తం. తంజావూరులోవలె స్త్రీ పాత్రలు స్త్రీలే ధరించి అభినయించడం మైసూరులోనూ ఉన్నట్లు తెలుస్తున్నది. (చ.దే నా-454)

## నాట్యావధానము

చూ. అవధానాలు.

## నాదిండ్ల ఉమాపతి

చూ. ఉమాపతి కవి.

## నాదెండ్ల అప్పయామాత్యుడు

కాలం : క్రీ. శ. 16వ శతాబ్దం.

స్థలం : కొండవీడు.

సాహిత్య పోషకుడు. మాదయగారి మల్లన విరచిత రాజశేఖర చరిత్రకు కృతిపతి. ఇతడు మహామంత్రి తిమ్మరుసుకు మేనల్లుడు. నాదెండ్లపుర శాసనుడూ (కరణం) కొండవీటి సీమ పరిపాలకుడూ అయిన నాదెండ్ల గోపమంత్రికి అన్న. (వి. న. చ.)

## నాదెండ్ల గోపమంత్రి

కాలం : క్రీ. శ. 1485–1533 ప్రాంతం.

స్థలం : గుంటూరు జిల్లా నాదెండ్ల.

రచనలు : 1. ప్రబోధ చంద్రోదయ వ్యాఖ్య (సంస్కృతం) 2 కృష్ణార్జున సంవాదము (ద్విపద).

కృష్ణదేవరాయల మహామంత్రి తిమ్మరుసుకు ఈ గోపమంత్రి మేనల్లుడు. మాదయ్యగారి మల్లన రచించిన రాజశేఖర చరిత్రకు కృతిభర్త అయిన నాదెండ్ల అప్పయామాత్యుడు ఈయనకు అన్న. గుంటూరు జిల్లా, నరసరావుపేట తాలూకా నాదెండ్లపుర శాసనుడు (కరణం). గుత్తి దుర్గాధ్యక్షుడై, తరవాత కొండవీటి రాజ్యానికి తిమ్మరుసు మంత్రి పక్షాన పరిపాలకుడై ప్రఖ్యాతి చెందాడు. 1515–1533 ప్రాంతంలో కొండవీటికి పాలకుడుగా ఉన్నాడు. ఈయన వ్రాసిన సంస్కృత గ్రంథ వ్యాఖ్యానాలు ప్రశస్తమైనవి. ఇతడు కవి, భోగి. ఇతడు ఆంధ్రదేశానికి చేసిన సేవ అపారం. తెనాలి రామలింగకవి 'ఉద్భటారాధ్యచరిత్ర'లో గోపమంత్రిని నాలుగు సీస పద్యాలలో నుతించాడు. సంస్కృతంలో ప్రచండకవి, సమస్తశాస్త్రపారంగతుడు అయిన లొల్లలక్ష్మీధరయజ్వ గోపమంత్రి ఆస్థాన విద్వాంసుడు. గోపమంత్రి కవులను ఆదరించేవాడని, సత్పాలకుడని, శాస్త్రపారంగతుడని, మహాత్యాగియని, వీరుడని కృష్ణార్జున సంవాదంలో ఉంది. (క.త–7)

(పీఠిక – కృష్ణార్జున సంవాదము)

## నానార్థ నిఘంటువు

కర్త : పైడిపాటి లక్ష్మణకవి.

ఇది నిఘంటు శతకం. దీనిని చేకుమళ్ళ కామేశ్వరరావు పరిష్కరించి ప్రకటించారు. ఒక భాగం "నానార్థవర్గు" మాత్రం దొరికింది. దీనిలో నూరు పద్యాలున్నాయి. కావ్యావతారిక, ఆశ్వాసాంత గద్య ఉన్నాయి. సంఖ్యానియమం, మకుట నియమం దీనిలో ఉంది. (శ. సా. వి.)

## నానార్థ శివశతకము

పూర్వకవి కృతము.

ఇది రాంపిచర్ల శివుని పేర విరచితం. దీనిలో 135 కంద పద్యాలున్నాయి. చాలా మకుటాలున్నాయి. ఈ నిఘంటు శతకం అకారాది అక్షర క్రమంలో విరచితం. అకారం మొదలు హకారం వరకు 130 పదాలకు మాత్రమే నానార్థాలు చెప్పటం జరిగింది. (శ. సా. వి.)

## నామకోశము

కర్త : బహుజనపల్లి సీతారామాచార్యులు.

నిఘంటువు ఇందులో సంస్కృతాంధ్ర ప్రవిష్ట హూణ భాషా పదాలకు అర్థాలు ఇచ్చారు.

## నామయోగి

కాలం : క్రీ. శ. 16 వ శతాబ్ది.

రచన : వెంకటేశ్వర శతకము (పంచచామరాలు).

విశిష్టత : ఈయన వేదాంత విషయాలను ప్రతిపాదించే పద్యాలను వ్రాశాడు. యోగి అనే వ్యక్తి ఎలా ఉండాలో చెప్పాడు. రతికి ఒప్పనివాడే రాజయోగి అని చెప్పిన ఈ నామయోగి తానూ ఒకనాడు కాముకుడనే చెప్పుకున్నాడు. ఈయన వ్రాసిన 40 పంచ చామరాల ప్రతి ఒకటి తంజావూరు సరస్వతీ మహల్ గ్రంథాలయంలో ఉంది.

(అము ప్ర-8-269)

## నామలింగానుశాసన వ్యాఖ్య

రచనాకాలం : క్రీ. శ 1550 ప్రాంతం.

కర్త : తాళ్ళపాక తిరువేంగళాచార్యులు.

ప్రత్యేకత : సంస్కృత నామలింగానుశాసనానికి తెలుగు వ్యాఖ్య.

(తె. వి. స-1)

## నాయకీ నాయక శతకము

రచనా కాలం : క్రీ. శ. 1840 ప్రాంతం.

కర్త : తోట విజయరాఘవ కవి.

శృంగార రస ప్రధానమైన శతకం.

దీనిలో మకుటము పాటింపబడలేదు. పిటకాంధ్ర మది కింపగునట్లు వ్రాశానని కవి చెప్పుకొన్నాడు. అశ్లీల ఛాయిష్ఠాలైన వర్ణనలతో వారాంగనా వాటికలతో ఈ శతకం బహుళ ప్రాచుర్యాన్ని పొందింది. 1849 లో ముద్రితం.

(శ. సా. వి-563)

## నాయనప్ప

నామాంతరం : కానుకొలను వెంకటదాసు

## నాయనారులు

వీరు క్రీ. శ. 7 శతాబ్దంలో తమిళదేశంలో శైవ మతాన్ని ప్రచారం చేసిన గొప్ప శైవ భక్తులు. వీరు అరువది ముగ్గురున్నారని ఆ మత సంప్రదాయం వల్ల తెలియవస్తున్నది వీరిలో అప్పర్, తిరుజ్ఞాన సంబంధ నాయనారు, సుందరమూర్తి నాయనారు చాలా ప్రసిద్ధులు. పై శివభక్తుల ప్రభావం కన్నడ దేశంలో ఉదయించిన వీర శైవం మీద పడింది. అరువది ముగ్గురు నాయనారులు శివ స్తోత్రాలను వ్రాసి శైవ మతాన్ని జనసామాన్యంలో ప్రచారంచేశారు. నాయనారుల చరిత్రను క్రీ. శ. 11 శతాబ్దంలో ఉన్న శేక్కిళారు అనే కవి "పెరియ పురాణము" అనే పేర తమిళంలో వ్రాశాడు. వీరిని

పురాతన భక్తులనూ కూడా కద్దు. వీరు లింగధారణచేయని మహాభక్తులు. పెరియ పురాణం లోని నాయనారుల చరిత్రలను కన్నడ కవులైన హరిహర షడక్షరి మొదలయిన వారు కావ్యాలుగా వ్రాశారు. వీరు పాశుపతశైవంలోని వర్ణవ్యవస్థను, వైదిక కర్మకాండ మొదలనువాటిని తొలగించి వీరమహేశ్వరాచార వ్రతదీక్షతో శైవాన్ని సంస్కరించారు.

జైన బౌద్ధమతాలు తెలుగుదేశంలో క్షీణించిన తరవాత సుమారు క్రీ. శ. 12వ శతాబ్ది ప్రాంతంలో వచ్చిన శంకరాచార్యుల అద్వైతజ్ఞానం సామాన్యప్రజలకు అందుబాటులో లేకుండాపోయింది. దేశంలో వర్ణవ్యవస్థ వెర్రితలలువేసి దురహంకారపూరితమై ఉంది. శైవాచార్యులు లింగార్చనారూపంలో శైవాన్ని రక్షిస్తున్నప్పటికీ తగిన ప్రోత్సాహం లేక శైవం నిస్తేజమై ఉంది. ఆ సమయంలో తమిళదేశంలోని నాయనారులు శైవాన్ని పునఃప్రతిష్ఠించారు. వీరి శివ భక్తిగీతాల ప్రభావం పాల్కురికి సోమన్న రచనలలో కనిపిస్తుంది.

ఈ "అరువత్తు మూవరు" నాయనారుల కథలను సోమన్న తన బసవ పురాణంలో చెప్పాడు. వీటిని ప్రజలకోసం వీరశైవమత ప్రచారం కోసం కవి వ్రాశాడు కనుక రచనలలో ప్రసాదగుణం, జాను తెనుగు ఎక్కువగా ఉంటుంది. పాండిత్య ప్రకర్ష గాని, వాద ప్రచారానికి యుక్తియుక్తులు గాని, పద డాంభికం గాని ఈ కథాకథనంలో కనిపించవు. నాటకీయత ఉన్నా లేకపోయినా కథలను చిత్తశుద్ధితో, రసవంతంగా చెప్పాడు కవి. పాత్ర చిత్రణ కన్నులకు కట్టినట్లుంటుంది.

నాయనారుల పేర్లు :

1. సుందరమూర్తి 2. తిరునీలకంఠ 3. ఇయల్పహ 4. ఇలయాన్కుడి మార 5. మెయ్పొరుళ్ 6. విరన్మిండ 7. అమర్నీతి 8. ఎరిపత్త 9 ఏనాదినాథ 10. కన్నప్ప 11. గుగ్గులుకలయ 12. మానక్కంజార 13. అరివాట్టాయ 14. ఆనాయ 15. మూర్తినాథ 16. మురుగ 17. రుద్రపశుపతి 18. నందనారు 19. తిరుకుప్పతొండ 20. చండేశ్వర 21. తిరునావుక్కరసు 22. కులచ్చిర 23. కురుంబ 24. కారైక్కాలమ్మయారు 25. అప్పూది అడిగళ్ 26. తిరునీలనక్క 27. నమినంది 28. తిరుజ్ఞాన సంబంధమూర్తి 29. ఏయర్కోన్ కలికామ 30. తిరుమూల 31. దండియడిగళ్ 32. మూర్ఖ 33. సోమాసిమార 34. శాక్య 35. శిరప్పులి 36. చిరుతొండ 37. చేరమాన్ పెరుమాళ్ 38. గణనాథ 39. కూర్రువ 40. పుగల్చోళ 41. నరసింగముని యరైయ 42. అతిభక్త 43. కలికంబ 44. కలియ 45. సత్తి 46. అయ్యడిగళ్ కాడవర్కోన్ 47. గణంపుల్ల 48. కారి 49. నిన్రశీర్ నెడుమార 50. వాయిలార్ 51. మునైయడువార్ 52. కళర్చింగ 53. ఇడంగళి 54. శెరుత్తుణ 55. పుగళ్తుణ 56. కోట్పులి 57. పూశలారు 58. మంగయర్క్కరసి 59. నేశ 60. కోచ్చెంగచోళ 61. తిరునీలకంఠయాళ్పాణ 62. శడయ 63. ఇశైజ్ఞానియారు.

(అభ్రద-2-212; చై.ల,యు.భా-88-89; శివభక్త చరితము - అనుక్రమణిక

బొం.సూ.నా.శర్మ)

**నారద బ్రహ్మ సంవాదము**

కర్త : పరశురామ పంతుల లింగమూర్తి.

వేదాంత గ్రంథం. సామాన్య జనులకు కూడా అర్థమయ్యే రీతిలో ఉంది. (ఆపద-12-191)

**నారదీయ పురాణము (అలభ్యం)**

కర్త : పిల్లలమర్రి పినవీరభద్రుడు (చూ).

సంస్కృత గ్రంథానికి అనువాదం కావచ్చు. (ఆరుద్ర-8-201)

**నారన్నగారి సూరన్న**

కాలం : క్రీ. శ. 16వ శతాబ్దం.

రచనలు : 1. వనమాలి విలాసము 2. ఉదయనోదయము.

ఇతడు ఇంద్రేశ్వరేశ్వర భక్తుడు. నారన పుత్రుడు. గజరావు బిరుదాంకితులైన రాచ వారికి హితుడు. సలక్షణంగా మృదువుగా కవిత చెప్పాడు. ఉదయనోదయాన్ని కవి మరణానంతరం ఆయన కొడుకు నారన్న అళియ రామరాజు కాలంలో సైనికోద్యోగిగా ఉన్న ముడియం భాస్కరుడనే ఆయనకు అంకిత మిచ్చాడు. ఈ భాస్కరుడు రామరాజు దండనాయకుడు బయకార రామప్పయ్య దగ్గర ఉద్యోగి. వనమాలి విలాసం కొండూరి అక్కదండనాథునికి అంకితం. (ఆరుద్ర-9-241)

**నారాయణ కవి**

కాలం : క్రీ. శ. 18వ శతాబ్దం.

స్థలం : తంజావూరు.

రచనలు : శహరాజ నక్షత్రమాల (సం).

క్రీ. శ. 1684-1712 నడుమ తంజావూరును పాలించిన శహాజీ ఆస్థానంలో ఉండేవాడు. (శారదాధ్వజం-69)

**నారాయణ గజపతి రాజు**

కాలం : క్రీ. శ. 1800 ప్రాంతం.

స్థలం : విజయనగరం.

విజయనగర సంస్థాన ప్రభువు. కవి పండిత పోషకుడు. ఇతని ఆస్థానంలోని అల్లమరాజు రంగశాయికవి ఇతని మీద ఎనిమిదేసి అర్థాలువచ్చే చాటుపద్యాలు చెప్పాడు.

అక్కెనపల్లి నృసింహ కవి రచించిన శుభవతీ పరిణయ ప్రబంధాన్ని వీరే అచ్చు వేయించారు. ఈ ప్రబంధం వీరి తండ్రిగారి సోదరుడైన సూర్యప్రకాశరాయనికి అంకితమట. (క.చ-114-175)

**నారాయణ భట్టు**

కాలం : క్రీ. శ. 1020-1070 ప్రాంతం.

స్థలం : వేంగీ మండలం.

బిరుదులు : కవిరాజశేఖరుడు, కవీభవజ్రాంకుశుడు, సరస్వతీ కర్ణావతంసుడు, అష్టాదశావధారణ చక్రవర్తి.

అకలంక శంకనామాత్యునికి సామెకాంబకు పుత్రుడు. నన్నయ వ్రాసిన నందంపూడి శాసనాన్నిబట్టి నారాయణభట్టు సంస్కృత, ప్రాకృత, కర్ణాట, పైశాచికాంధ్ర భాషలలో చక్కని కవిత్వం చెప్పేవాడని తెలుస్తున్నది. నన్నయ తనకిష్టుడు, సహాధ్యాయుడు అని నారాయణభట్టు గురించి చెప్పాడు. అర్జునునకు కృష్ణునివలె నన్నయకు నారాయణభట్టు భారత రచనలో తోడ్పడినట్లు భారత కృత్యాది పద్యాన్నిబట్టి తెలుస్తున్నది. ఇతడు కన్నడ భారత కర్త అని ప్రతీతి. ఇతనికి రాజరాజ నరేంద్రుడు నందంపూడి గ్రామం అగ్రహారంగా ఇచ్చాడు ఇది అంబాజీపేట సమీపంలోని, "ముంజవరపుకొట్టు"కు సరిహద్దు గ్రామం. ఇతని కుమార్తె కుప్పమ్మ కూడా కవితా చాతుర్యం కలది.

(వా.చ-వం.సు-204; క త-1)

## నారాయణమ్మ పాట

కర్త : తెలియదు.

జానపద శృంగార గేయం. గేయంలో నాయిక నారాయణమ్మ. నాయకుడు నారాయణమ్మను మోహించి రంగూన్‌కు లేచిపోదాంరమ్మని ప్రోత్సహిస్తాడు. రంగూన్‌లో తను నారాయణమ్మను ఏవిధంగా సుఖపెడ్తాడో, ఏయే వింతలు విడ్డూరాలు చూపిస్తాడో విపులంగా వర్ణిస్తూ నాయికను బులిపించడం ఈ గేయంలో కనిపిస్తుంది. వర్ణనలు అతి సహజంగా, వాస్తవికతకు దగ్గరగా కనిపిస్తాయి (తె జా.సా-538)

## నారాయణయ్య

కాలం : క్రీ. శ. 18 వ శతాబ్దం.

స్థలం : చెంజి

రచన : తెలియరాలేదు.

సమకాలికులు : తుపాకుల అనంతభూపాలుడు, కళువె వీరరాజు.

వచన భారత రచనలో కళువె వీరరాజుకు తోడ్పడ్డాడు. (ద.దే.వా-479)

## నారాయణ విలాసము

కర్త : విరూపాక్షరాయలు.

ఇది అయిదంకాల నాటకం. (తె.వి.స-4)

## నారాయణ శతకము

కర్త : పక్కి వేంకట నరసయ్య.

కాలం : క్రీ. శ. 19 వ శతాబ్ది.

(వీరేశలింగం పంతులు-సమగ్ర పరిశీలన)

## నారాయణ శతకము

కర్త : తెలియదు.

నారాయణయ్య కర్త అని ముద్రాపకులు వ్రాశారు. పదశతకం. ఇది చిన్ననారాయణ శతకంగా ప్రసిద్ధి పొందింది. స్త్రీలలో ఎక్కువ ప్రచారంలో ఉంది. కవి ఈ శతకంలో లౌకిక సుఖాలందు ఆసక్తులైన మానవులు క్రమంగా వైరాగ్య దశనొంది విషయానంద పరాఙ్ముఖమైన చిత్తవృత్తిని పొందడాన్ని స్పష్టం చేశారు. మానవుని బాల్య, యౌవన వృద్ధాప్య దశలను వర్ణించి చివరి దశలో యమకింకరుల బాధ నుండి ముక్తి నివ్వడానికి నారాయణుడే శక్తివంతుడని వివరించాడు. మానవజన్మయే ఉత్తమమని, ఈ జన్మలోనే ముక్తి కోసం ప్రయత్నించడం జ్ఞాని లక్షణమని ఇందులో ఉంది.

(శ. క.ప-641)

## నారాయణ స్తవము

కర్త : ఫక్కి వేంకట నరసయ్య.

ఈ కవి నారాయణ శతకాన్ని కూడా రచించాడు.

## నారాయణాచల మాహాత్మ్యము

కర్త : అల్లమరాజు రంగధామకవి.
రచనాకాలం : క్రీ. శ. 1800 ప్రాంతం.
అంకితం : చినబావ భూపతికి.

ఇది మూడాశ్వాసాల ప్రబంధం. (క. ప-175)

## నాసికేత పురాణము

కర్త : తిరుమలనాథ కవి (చూ).
కాలం : క్రీ. శ. 18 వ శతాబ్ది మధ్య కాలం.
అంకితం : పెద్ద గరిడిలో వెలసిన శ్రీ కృష్ణునికి.

మూడు ఆశ్వాసాల ద్విపద కావ్యం. మూలం సంస్కృతకఠోపనిషత్తులోనికథ. ఈ కథ తెలుగులో తప్ప ఇతర భాషలలో ఉన్నట్లులేదు. నాసికేత పురాణం కథనే క్రీ. శ. 1460 ప్రాంతంలో దగ్గుపల్లి దుగ్గన ప్రబంధంగా వ్రాశాడు. క్రీ. శ. 1500 ప్రాంతంలో చందలూరి చిక్కయ పద్య కావ్యంగా వ్రాశాడు. అయితే ఈ మూడూ వేటికవి స్వతంత్ర గ్రంథాలు. తిరుమలనాథ కవి రచన సరళంగా ఉంటుంది.

(ద.దే.వా-291)

## నాసికేతోపాఖ్యానము (అలభ్యం)

కాలం : క్రీ.శ. 1500 ప్రాంతం.
కర్త : చందలూరి చిక్కయ్య.

విశిష్టత : ఈ కావ్యాన్ని చిక్కయ్యకు ముందే శ్రీనాథుని బావమరిది దగ్గుపల్లి దుగ్గన్న తెనిగించాడు. దుగ్గన్న కావ్యం పూర్తిగా దొరకింది గాని, చిక్కయ్య కావ్యం నుంచి కొన్ని పద్యాలు మాత్రమే లభ్యం. దీనిలో నుంచి 8 పద్యాలను, పెదపాటి జగ్గన్న తన ప్రబంధ రత్నాకరంలో ఉదాహరించాడు గాని, దుగ్గన్న నాసికేతోపాఖ్యానం నుంచి ఉదాహరించలేదు.

చిక్కయ్య నాసికేతోపాఖ్యానంలో దొరికిన పద్యాలలో పెళ్ళిప్రయత్నాల వర్ణన, పెళ్ళికుమార్తె అలంకరణ వర్ణన, పెళ్ళి భోజనాల వర్ణన, నరకవర్ణన. ఏయే పుణ్యాలు చేస్తే నరకబాధలు తప్పించుకోవచ్చునో ఆయా పుణ్యాల వర్ణన, పుర వర్ణన మొ॥నవి ఉన్నాయి. రచన ప్రౌఢంగా ఉంది. (ఆరుద్ర-8-92)

## నాసికేతోపాఖ్యానము

కర్త : పిగ్గుపల్లి దుగ్గన
కాలం : క్రీ.శ 1460 ప్రాంతం.
కృతిభర్త : ఓంబదాలి గంగయామాత్యుడు.

ఇతడు ఉదయగిరి దుర్గాధిపతి అయిన బసవ భూపతికి మంత్రి. పద్యకావ్యం. మూడాశ్వాసాలు మాత్రం ముద్రింపబడింది. మూడో ఆశ్వాసం పూర్తిగా లేదు.

ప్రత్యేకత : నాచికేతుని కథ కఠోపనిషత్తులోను, మహాభారతంలోను ఉంది. ఇది పారమార్థిక పరాయణంగాను, శమ సంపన్నంగాను ఉంటుంది. శైలి సాధుసుందరంగా ప్రసన్నతా మహితంగా ఉంది. గోదావరి మండలంలోని రామచంద్రాపురం తాలూకాకు చెందిన "మల్లికార్జున కవి" కూడా ఈ కథను పద్యకావ్యంగా వ్రాశాడట. (క.త. 6-105; సా.చ-పింగళి)

## నాళ్ళగట్టు ఎల్లయ్య

కాలం : క్రీ. శ.18వ శతాబ్దం
స్థలం : నందికొట్కూరు తాలూకా పాములపాడు గ్రామం.

సాహిత్య పోషకుడు నాళ్ళగట్టు చిన లింగయ్య పౌత్రుడు. రామాపురానికి కరణంగా ఉండేవాడు. ఘట్టు శేషకవిని ప్రోత్సహించి గట్టు వంశంలో నరసుడవు కాబట్టి ఒక కావ్యం రచించి విశ్వేశ్వరునికి అంకితం ఇమ్మన్నాడు. అదే సత్యభామా విజయం. నవీన సాహిత్యసారాభిలాషతో శేషకవి వ్రాసిన కావ్యం. (ఆరుద్ర-12-55)

## నింబజా మాహాత్మ్యము

నామాంతరం : ఏకవీరా మాహాత్మ్యం (చూ)

## నింబాజీ

కాలం : క్రీ.శ. 17వ శతాబ్దం.
స్థలం : తంజావూరు.

తంజావూరును పాలించిన మహారాష్ట్ర రాజుల ఆస్థానంలోఉద్యోగి. శహాజీ ఆనతి ప్రకారం తెలుగు గ్రంథాలకు ప్రతులు వ్రాయించి భద్రపరిచాడు. నన్నెచోడుని కుమార సంభవం, ద్విపద భారతం మొదలైన గ్రంథాలెన్నింటినో సరస్వతీ మహలు గ్రంథాలయంలో నిక్షిప్తం చేసిన వాడితడే.

## నింబార్కుడు

కాలం : క్రీ.శ. 13వ శతాబ్దం తర్వాతికాలం.

స్వస్థలం : గోదావరీ మండలం.

రచనలు : 1 వేదాంతపారిజాత సౌరభము (సం) (బ్రహ్మసూత్ర వ్యాఖ్యానము) 2. మాధ్వముఖ మర్దనము 3. దశశ్లోకి 4. సవిశేష నిర్విశేష శ్రీకృష్ణ స్తవరాజము.

ప్రసిద్ధ వేదాంత దర్శన కర్త. దేవనది అనే నామాంతరం గల గోదావరీ తీరంలో సువర్ణాశ్రమంలో ఉండేవాడట. ఇతని వివరణము, ఆలోచనా రీతి అపూర్వమైనవిగా వేదాంతులు భావిస్తున్నారు. ఇతని రచనలన్నీ సంస్కృతాలే ఇతని మతాన్ననుసరించి తర్వాతి కాలంలో అనేక వ్యాఖ్యాన గ్రంథాలు వచ్చాయి. విశ్వనాథ చక్రవర్తి ఇతని మతాన్ని అనుసరించి గీతపై టీక వ్రాశాడు (తె.వి. స_7_488)

## నిగమాంత దేశిక ప్రాబోధిక స్తుతి (సం)

కర్త : చూ హోసదుర్గం కృష్ణమాచార్యులు.

వైష్ణవాచార్యులైన వేదాంత దేశికుల పరమైన సుప్రభాతస్తోత్రం. సంస్కృత రచన.

## నిజలింగ చిక్కయ్య కథ

కర్త : పిడుపర్తి సోమనాథుడు (చూ).

యక్షగానం. దీన్ని రెగళ్ల విశ్వనాథుడు వ్రాశాడని కొందరి అభిప్రాయం. (క. త_6_24)

## నిట్టల ప్రకాశదాసు

కాలం : క్రీ శ. 19వ శతాబ్ది పూర్వభాగం.

స్థలం : గోదావరి మండలం.

సమకాలికులు : పిఠాపుర ప్రభువు రావు నీలాద్రి రాయడు.

రచనలు : తత్త్వకీర్తనలు.

ఇతడు భద్రాద్రి రామభక్తుడు. కుల మత భేద బుద్ధిలేని మహాయోగి. ఈయన కీర్తనలు తత్త్వ, శృంగార బోధకాలు. ఇతని గురించి చాలా అద్భుతమైన కథలు స్థానికంగా ప్రచారంలో ఉన్నాయి. తాను వ్రాసిన ఒక కీర్తన పాడుతూ గోదావరినదిమీద ఈయన తేలుతూపోయేవాడట. కాకినాడలో ఈయన సమాధి ఉంది. (తె వి.స_4)

## నిట్టల ప్రకాశదాసు కీర్తనలు

కర్త : ప్రకాశదాసు.

ఇవి ప్రముఖంగా తత్త్వ సంకీర్తనలు. కొన్ని కీర్తనలు భక్తుని మనోభావాన్ని ప్రకటిస్తాయి. మరికొన్ని శృంగార రస స్ఫోరకాలు. పిఠాపురం మహారాజా అయిన రావు నీలాద్రిరావుని రక్షించమని ఒక కీర్తనలో ఉందట. వీటిలో ఒక కీర్తన పాడుతూ కవి గోదావరి నదిమీద తేలిపోయేవాడట. (తె. వి స_4)

## నిడిగంటి వీరయ్య దేవర

రచన : లక్ష్మమ్మ కథ.

జానపద రచయిత. వివరాలు తెలియవు.

## నిడుమామిళ్ళ దాసయామాత్యుడు

నామాంతరం : మామిళ్ళ దాసామాత్యుడు (చూ). (క. స-20)

## నిమిషకవి వేంకటేశకవి

కాలం : క్రీ.శ. 1850 ప్రాంతం.

స్థలం : విశాఖపట్టణం.

రచన : జగన్నాథయోగి శతకము.

గోడే జగన్నాథరావు ఆస్థానంలోని వాడట. ఇతని రచన సరళంగా ఉంటుంది. (క. స-259)

## నిముషకవి రామయ్య

నామాంతరం : రామేశం.

కాలం : క్రీ. శ. 1758 ప్రాంతం.

స్థలం : సామంతకుర్రు గ్రామం.

రచనలు : 1. జలక్రీడా విలాసము 2. రామలింగేశ్వర శతకము 3. విష్ణు సంవేద్య రామేశ్వర పూజా విధానము.

నిముషకవి లింగరాజు పుత్రుడు. గ్రామకరణంగా ఉండేవాడు. (య.వా.చ.)

## నిమ్నజాతులలోని భాగవతులు

ఈ భాగవతులు ప్రాచీనకాలం నుంచి తెలుగుదేశంలో ఉన్నారట. వీరు నిమ్న జాతుల వారి ఇళ్ళలో వివాహాది శుభకార్యాలలో భాగవతాలు ఆడేవారు. వీరిని సకలాంధ్ర దేశంలో మాలదాసులని మాదిగదాసులని, తెలంగాణా ప్రాంతంలో చిందు వారని, బవనీలని (బైండ్లవారు) వ్యవహరిస్తారు. వీరిలో కొందరు భాగవత నాటకాలను ఆడటానికి జట్లుగా తయారయ్యారు.

వీరు ప్రసిద్ధమైన శశిరేఖా పరిణయం, చెంచులక్ష్మి, చుక్కలూరి రామనాటకం, మిత్రింటంట రామాయణం అనే యక్షగానాలను ప్రదర్శించేవారు. 'చెట్టులెక్కగలవా నరహరి' అనే చెంచులక్ష్మి నాటకంలోని గేయం వీరిద్వారా ప్రచారంలోకి వచ్చిందని పండితాభిప్రాయం. ముఖ్యంగా వీరి భాగవతాలు పల్లెసీమలలో వ్యవసాయపు పనుల తరుణం అయిన తరువాత రాత్రులలోను, దసరా ఉత్సవ సమయాలలోను ప్రదర్శిస్తారు (నా.ర.చ-176)

## నిమ్మల లక్ష్మణార్యుడు

కాలం : క్రీ. శ. 15వ శతాబ్ది తర్వాతివాడు.

స్థలం : కంబం (ఖమ్మంమెట్టు ప్రాంతం).

రచన : ఏకామ్రలింగ శతకము.

కవి వీరశైవుడు. తన శతకంలో పూర్వకవులను స్తుతించాడు. వేమన వరకూ

గల కష్టాలను కొందరిని పేర్కొన్నాడు. రచన సరళంగా ఉంటుంది. (ఆరుద్ర-12-313)

## నిరంకుశుడు

చూ : నిరంకుశోపాఖ్యానము.

విశిష్టత : కందుకూరి రుద్రకవి రచించిన నిరంకుశోపాఖ్యానంలోని కథా నాయకుడు "అనర్గళశేముషీ మహిమ" చేత వేదాదివిద్యా నిరంకుశుడౌతాడని భావించి తల్లిదండ్రులు నిరంకుశుడని పేరు పెట్టారు. వేదాలు, శాస్త్రాలు నేర్పారు. సంగీత సాహిత్యాలు బోధించారు. యుక్తవయసు వచ్చాక పెళ్ళి చేశారు. అతన్ని చూసి ఆడ పిల్లలు మోహించేవారు. ఈయన నిగమశర్మకు సరియైన ఉద్జ్ఞ. జూదంలో బాగా ఆరితేరినవాడు. కొంగున పాచికలు ఎప్పుడూ మూటగట్టుకొనే ఉంటాడు. నక్కటక్కులు, నయగారాలు బాగా నేర్చి వచ్చి విటుడైనాడు. ఇతని భార్య అత్తమామలకు అణగిమణగి గుట్టుచప్పుడు గాకుండా చాలా కష్టాలుపడేది. ఈతడు తల్లి ఎన్ని చెప్పినా వినకుండా భార్య నగలను నల్లపూసలతో సహా ఒలుచుకొని, వేశ్యమాత ఒడి నింపాడు. కొన్నాళ్ళ తర్వాత ఒకరాత్రి వేశ్యమాత నయానాభయానా చెప్పి ఇతనిని ఇంటి బయటికి వెళ్ళగొడుతుంది.

అడివులు పట్టి, తిరిగి తిరిగి శివాలయం చేరి శివుని పందేనికి పిలిచి, దేవుని తరఫున, తన తరఫునా తానే పందెం కాచి ఆడాడు. పాచికలు తననే గెలిపించాయి. ఓడిన వాళ్ళు గెలిచిన వాళ్ళకు అడిగిన ఒక వేశ్యను సంపాదించి ఇవ్వటం పందెం. దేవుడు పలక్కపోతే నిరంకుశుడు దేవునికి "బొంగడవండ" వేశాడు. దేవుడు ప్రత్యక్షమై ఏమికావాలని అంటే 'రంభ' కావాలని ఈ ఘటికుడు నిర్భయంగా చెబుతాడు. శివానుగ్రహంవల్ల దేవవేశ్య దిగివచ్చింది. ఇంద్రుడు రంభను శపిస్తాడు. నిరంకుశుడు బుద్ధి చాకచక్యంతో రంభకు శాపవిమోచనం కలిగిస్తాడు. దేవుని దయవల్లనే ఈ నిరంకుశునికి జగత్ప్రసిద్ధి వచ్చింది. చివరకు మోక్షం పొందుతాడు. ఎంత భ్రష్టుడైనా దైవసాన్నిధ్యం చేరవచ్చునని చెప్పడానికి ఈ పాత్రను కవి సృష్టించాడు. (ఆంధ్ర-8)

## నిరంకుశుని భార్య

చూ : నిరంకుశుడు.

విశిష్టత : నిరంకుశోపాఖ్యానంలోని కథా నాయకుడైన నిరంకుశుని భార్య. నిగమశర్మ భార్య అంతటి అమాయకురాలు కాదు నిగమశర్మవలెనే ఈమె భర్త నిరంకుశుడు కూడా వచ్చివిటుడు. సకల వేదశాస్త్రాలు చదువుకున్న నిరంకుశుడు పెళ్ళి చేసుకున్నాడేగాని భార్యను సుఖపెట్టలేదు. తల్లితండ్రులతో సహా బంధువుల నందరినీ మోసం చేసి భార్య నల్లపూసలతో సహా నగలన్నిటిని వేశ్యలపాలు చేశాడు. నిరంకుశుని భార్య కళ్ళ వెంట నీరు తెచ్చుకొని అత్తగారిని చూసి అడగవలసినవి నాలుగు (పన్నెండు పద్యాలలో) అడిగింది.

తనను చిన్నప్పుడే "ఇంతవాడు" ఆ మూడు ముళ్ళూ వేయించి కాపురానికి తీసుకొచ్చారని, చేసుకున్నందుకు కాచిపోయటం తప్పదని అత్తగారి కింద కొడరికం

చేస్తున్నానని పశ్చాత్తాపం చెందింది. "మగడు సంసార నివర్తన చేసి యిల్లు తిరిగిన మనమున గోపించకెట్టి మగ నాలుండదన్" అని తీవ్రమైన ఆవేశాన్ని వ్యక్తీకరించింది. స్త్రీ ఆవేదనను కవి ఈ పాత్రలో చక్కగా చిత్రీకరించాడు. (ఆరుద్ర-8-174)

## నిరంకుశోపాఖ్యానము

కర్త : కందుకూరి రుద్రకవి.

అంకితం : కందుకూరులో ఉన్న సోమేశ్వరస్వామికి.

నిరంకుశుడనే వేశ్యాలోలుని వృత్తాంతం ఇందులోని ఇతివృత్తం.

విశిష్టత : ధర్మశీలుడనే రాజుకు పులహుడు అనే ముని ఈ కథ చెప్పాడు. స్త్రీ కాంక్షవల్ల చాలా తప్పులు చేసి, చివరకు దైవసాన్నిధ్యం చేరిన వాడెవడయినా ఉంటే వాని కథ చెప్పమని రాజు అడగటం, ముని చెప్పటం జరిగింది. ఈ నిరంకుశుడు నిగమశర్మకు, గుణనిధికి సమ ఉజ్జీ. ఎంత భ్రష్టుడయినా దైవసాన్నిధ్యం చేరవచ్చుననేది ఈ కావ్యంలోని సారాంశము. (ఆరుద్ర-6-167)

## నిరోష్ఠ్య కృష్ణ శతకము

కర్త : వైయాకరణ గజకంఠీరవ యుణయవల్లి కృష్ణమాచార్యులు (చూ).

సంస్కృత శతకం. నిరోష్ఠ్య రచన. (ఆం. సం. సా)

## నిరోష్ఠ్య దాశరథీ శతకము (అలభ్యం)

కర్త : చూ. మండపాక పేరయకవి. (ఆం.సం.సా-307)

## నిరోష్ఠ్య నల చరిత్ర

కర్త : చూ. కొత్తలంక మృత్యుంజయకవి.

అంకితం : అంతర్వేదిలోని నరసింహస్వామికి.

ఇది అయిదు ఆశ్వాసాల చిత్రకావ్యం. కొన్ని వ్రాత ప్రతులలో దీనిని రుద్రరాజు తిరుమలరాజు వ్రాసినట్లున్నది. (తె.వి స-6)

## నిరోష్ఠ్య రామాయణమ్ (సంస్కృతం)

కర్త : చూ. శాకల్య మల్లభట్టు (ప్రా ద.దే చ.)

## నిరోష్ఠ్య రామాయణము (సం)

కర్త : కవి కంఠీరవ కృష్ణమాచార్యులు (చూ).

సంస్కృత గ్రంథం. శ్రీరామ చరిత్రము ఇతివృత్తం. ఆత్మకూరు సంస్థానానికి చెందిన సురపురం కేశవయ్య తెలుగులో ఒక నిరోష్ఠ్య రామాయణాన్ని వ్రాశాడు. (ఆం.సం.సా.)

## నిరోష్ఠ్య రామాయణము

కర్త : మరింగంటి సింగరాచార్యులు.

నామాంతరం : దశరథరాజనందన చరిత్రము.

నిరోష్ఠ్య రామాయణము

కర్త : మునిపల్లె కేశవయ్య.

అంకితం : రాజా సోమభూపాల్ (ఆత్మకూరు సంస్థానం).

పూర్తిగా లభ్యం కాలేదు. (ఆం.సం.సా.)

నిరోష్ఠ్య శుద్ధాంధ్ర సీతాకల్యాణము

కవి : (మూ) ఆసూరి మరింగంటి సింగరాచార్యులు

అంకితం : కర్పూరాద్రిలోని శ్రీహరికి.

మూడాశ్వాసాల ప్రబంధం. సీతారామ కల్యాణాన్ని నిరోష్ఠ్యంగా చెప్పిన మొదటి కావ్యం.

కవి తన స్వగ్రామమైన పణకరాజుపల్లెను కర్పూరిపురి అనీ, అక్కడి కొండను కర్పూరాచలమనీ సంస్కృతీకరించి ఉంటాడని ఊహిస్తున్నారు. ఇది కవి తన ఇరవయ్యవ ఏట చేసినరచన ముద్రితమేగాని ప్రతులు లభ్యంకావడం లేదు.

(క త. 13-12; అరు వ 8-259)

నిర్గుణవాద నిరాకరణము

కర్త : చూ. వెలుగోటి సర్వజ్ఞ కుమార యాచేంద్రులు.

మత విషయకమైన విమర్శ గ్రంథం. 1889లో ప్రచురితం. (ఆం.సం.సా.-461)

నిర్వచన విక్రమార్క చరిత్రము

కర్త : మిక్కిలి మల్లికార్జున కవి.

అంకితం : నండూరి కామయమంత్రి.

నిర్వచన పద్యకావ్యం. భేతాళ కథల్లో ప్రసిద్ధిచెందిన "విక్రమార్కుని" కథ ఇందలి ఇతి వృత్తం. రచన సరళమైనది. (ఆం.సం.సా.-254)

నిర్వచనోత్తర రామాయణము

కర్త : తిక్కన.

రచనాకాలం : క్రీ. శ. 1248-1263 ప్రాంతం

కృతిభర్త : నెల్లూరును ఏలిన రెండో మనుమసిద్ధి.

ప్రత్యేకత : 10 ఆశ్వాసాల కావ్యం. ఇది తిక్కన మొదటి కృతి. దీనిలో తిక్కన తన తాత మంత్రి భాస్కరుని నుతించాడు మంత్రి భాస్కరుడొక "పూర్వ రామాయణాన్ని" వ్రాశాడంటారు గాని అది అలభ్యం. తెలుగులో లభిస్తున్న రామాయణాల్లో తిక్కన వ్రాసిన ఈ రామాయణమే మొదటిది. సంస్కృత రామాయణ ఉత్తర కాండలోని "శ్రీరామనిర్యాణం" తప్ప ఈ రామాయణంలో మిగిలిన కథ అంతా ఉంటుంది. ఇందులోని "కవితా శిల్పం" అనన్యం. (ప్రా.ద.దే.చ.)

నివర్తి శేషాచలపతి కవి

నామాంతరం : శేషసుమతి.

కాలం : క్రీ. శ. 17 వ శతాబ్దం.
స్థలం : తంజావూరు.
రచనలు : 1 శాహరాజ విలాసము 2. సరస్వతీ కల్యాణము 3. ఆంధ్ర వ్యాకరణము (సం) (ఆంధ్ర శబ్దానుశాసనము) 4. భోసలకోన శీయము (సం).
విషయం : ఆంధ్రపాణిని.
గౌరవవిశేషాలు : శాహమహారాజు చేత కనకాభిషేక సత్కారం పొందాడు.

వేంకటపతి, అక్కమ్మల పుత్రుడు. కామ కళానిధి వ్రాసిన నెల్లూరి శివరామ కవికి ఇతడు గురువు. సంస్కృతానికి పాణినీయంలాగానే తెలుగుకు సూత్రాలు-ప్రకృతి ప్రత్యయ విభాగం కోసం భాష్యం వ్రాశాడు. ఇది ఆంధ్ర వ్యాకరణం. సరస్వతీ కల్యాణం, యక్షగాన నాటకం, ఇది ఇతడే వ్రాసి శాహమహారాజు పేర పెట్టినట్టుచెప్తున్నారు. (ద.దే.వా-213)

## నివాళి

చూ : మంగళము.

## నివాళి పదాలు

దేశి వాఙ్మయానికి చెందిన పాటలు.

ఇవి ద్విపద వికారమైన రచనలని పండితాభిప్రాయం. ఇవి గురుసిద్ధ లింగం వ్రాసిన శ్రీగిరి కురవంజిలోను పెద్దామాత్యుని భద్రకాళీ కల్యాణంలోను ఉన్నాయి. (య.వా చ-277)

## నిశ్శంక కొమ్మన

నామాంతరం : శివలెంక కొమ్మన (చూ).

## నిష్కంటిక వ్యాఖ్య (సం)

కర్త : కోలచల మల్లినాథసూరి.

సంస్కృతంలో "తార్కిక రక్ష" అనే గ్రంథానికి ఇది మనోహరమైన సంస్కృత వ్యాఖ్య. (తె. వి. స-4)

## నిష్ఠల కామయ్యశాస్త్రి

కాలం : క్రీ.శ. 19వ శతాబ్దం ప్రథమభాగం.
స్థలం : ఇంగిలాపల్లి సంస్థానం-ఆంధ్ర.

ఇతడు 19 వ శతాబ్దం ప్రథమ భాగంలో ఆంధ్ర సంస్థానాన్ని పాలించిన గారయదొర ఆస్థానంలోను, ఆ తరువాత ప్రభువైన రామన్నదొర (రామందొర) ఆస్థానంలోను ఆస్థాన పండితుడుగా ఉండేవాడు. (ఆం. స. సా.)

## నీతి చంద్రిక

కర్త : పరవస్తు చిన్నయ్యసూరి.

రచనాకాలం : క్రీ. శ. 1853.

అంకితం : ఏ. డె. ఆర్బుత్నట్ దొరకు.

వచన గ్రంథం. చిన్నయసూరి సంస్కృతంలోని పంచతంత్ర హితోపదేశ కథలను ఆధారం చేసుకొని మిత్రభేదము, మిత్రలాభము, సంధి-విగ్రహము అనే నాలుగు భాగాలను వ్రాయదలచి మిత్రలాభ, మిత్రభేదాలను మాత్రం పూర్తి చేశాడు. ఈ రెండింటికీ నీతి చంద్రిక అని పేరు. ఈ గ్రంథం మొదటినుంచి పాఠశాలలో పఠనీయ గ్రంథంగా ఉంటూ వచ్చింది. ఇది లక్ష్య గ్రంథం. దీనిలో చక్కని తెలుగు జాతీయాలు లోకోక్తులను వాడే సుభాషితాలు, సామెతలు, కథాకథన పద్ధతిలో ఉన్నాయి. చిన్నయ సూరి దీనికి లక్షణ గ్రంథంగా 1858లో వ్యాకరణం రచించాడు. (వ. వా-85)

## నీతి తారావళి (అలభ్యం)

కర్త : కంచనామాత్యుడు (చూ).

మడికి సింగన తన "సకలనీతి సమ్మతం"లో దీనినుంచి 12 పద్యాలను సంకలనం చేశాడు. మరొకపద్యం "కవి జనాశ్రయం"లో కనిపిస్తున్నది. దీనిలోని ఒక పద్యాన్ని కొరవి గోపరాజు "సింహాసన ద్వాత్రింశిక"లో అనుకరించాడు. (ఆరుద్ర-4)

## నీతి పదములు

కర్త : తులజాజీ (చూ).

తొమ్మిదిమాత్రం లభించాయి ఇవి శివపరంగా చెప్పబడ్డవి. రాజనీతి, భక్తి సత్ప్రవర్తన, సన్మార్గాలను బోధిస్తాయి. (వ.దే.వా-246)

## నీతి భూషణము (అలభ్యం)

కర్త : ఆంధ్రభోజుడు (చూ).

మడికి సింగన తన "సంకలనీతి సమ్మతం"లో దీనినుంచి 25 పద్యాలను సంకలనం చేశాడు. రసవత్తరమైన కవితాధార. నీతులను చక్కగా కవిత్వ ముట్టిపడేటట్లు చెప్పాడు. ఇది రాజనీతిని తెలిపే గ్రంథం కావచ్చును. (ఆరుద్ర-2)

## నీతి శతకము

కర్త : తాళ్ళపాక పెద తిరుమలాచార్యుడు.

దీనిలో రాజనీతులు బహుళంగా ఉన్నాయి. రాజులు, మంత్రులు, సేనాధిపతులు, వివిధాధికారులు, యుద్ధవిధానం, రణరంగ సంప్రదాయాలు మొదలయిన విషయాలకు సంబంధించిన నీతులెన్నో ఉన్నాయి. (శ. సా. వి-371)

## నీతి శతకము

కర్త : పుష్పగిరి తిమ్మన.

భర్తృహరి సుభాషిత త్రిశతికి అనువాదం. ఇతడు పూర్తి గ్రంథాన్ని తెనిగించాడని చెప్తున్నారు కాని నీతి శతకం ఒక్కటే లభించింది. శివాంఘ్రి పూజలుగా ఈ శతకాన్ని తెనిగించినట్లు కవి చెప్పుకున్నాడు. (ఆరుద్ర-10-151)

**నీతి శాస్త్ర ముక్తావళి**

నామాంతరాలు : 1. నీతిసార ముక్తావళి 2. నీతి సారము 3. రాజనీతి.

కర్త : బద్దెన. నన్నెచోడ నరేంద్రుడని, నన్నన గంధవారణుడని ఇతనికి నామాంతరాలు.

రచనాకాలం : క్రీ.శ 13 వ శతాబ్దం.

ప్రత్యేకత : ఈ గ్రంథం కొన్ని ప్రతులలో మూడాశ్వాసాలుగా విభజింపబడింది. విషయం రాజనీతికి సంబంధించినది. శైలి ప్రౌఢం. నన్నెచోడ, తిక్కనల రచనా శిల్పముంది. మడికి సింగన ఈ గ్రంథం నుండి 38 పద్యాలను తన "సకల నీతిసమ్మతం"లో ఉదాహరించాడు. (ఆదు.ప్ర-2)

**నీతి సంగ్రహము**

కర్త : పరవస్తు చిన్నయసూరి.

ఇతర వివరాలు తెలియవు. (రమణీయం పీఠిక)

**నీతిసారమ్ (సం) (అలభ్యం)**

రచనాకాలం : క్రీ. శ. 12 వ శతాబ్దం.

కర్త : రుద్రదేవుడు (ప్రతాపరుద్రుడు).

రాజనీతి శాస్త్ర గ్రంథం. ఈ గ్రంథ ప్రసక్తి ప్రబంధరత్నావళిలో ఉంది. కర్త కాకతీయ మహాసామ్రాజ్యాన్నేలిన ప్రతాపరుద్ర నరపాలుడు ఈ గ్రంథాన్ని తెలుగులో కూడా వ్రాశాడు. (క.న-137)

**నీతిసారము**

కర్త : (చూ) రుద్రదేవుడు.

మడికి సింగన టీవిలోని కొన్ని పద్యాలను తన "సకలనీతి సమ్మతం"లో సంకలనం చేశాడుకాని కర్త పేరు చెప్పలేదు. ఇవి రుద్రాదేవునివని పండితులు భావిస్తున్నారు. (క త-2)

**నీతిసారము**

నామాంతరం : నీతిశాస్త్ర ముక్తావళి (చూ).

కవి : బద్దెన.

**నీతిసార ముక్తావళి**

నామాంతరం : నీతిశాస్త్ర ముక్తావళి.

కవి : బద్దెన.

**నీలకంఠచ్ఛందస్సు**

కాలం : క్రీ. శ. 1650 కి పూర్వం.

కర్త : స్పష్టంగా తెలీదు.

ఇందులోని పద్యాలు అప్పకవీయంలో ఉదాహృతం.

(కవిజనాశ్రయం పీఠిక - వావిళ్ళ)

## నీలకంఠ దీక్షితులు

కాలం : క్రీ. శ. 17వ శతాబ్ది.

స్థలం : మధుర తిరుమల నాయకుని కొలువు.

రచనలు : 1 నీలకంఠ విజయము 2. శివలీలా ర్ణవము 3. గంగావతరణము 4. కలివిడంబనము 5. సభారంజనము 6. శాంతి విలాసము 7. వైరాగ్య శతకము 8. ఆనంద సాగరోత్సవము 9. శివోత్కర్ష మంజరి 10. అన్యాపదేశ శతకము 11. హాలాస్యాభ్యుదయము 12. నలచరిత్ర నాటక వ్యాఖ్య 13. కైయటుని మహాభాష్య ప్రదీప వ్యాఖ్య 14 శైవపురాణ తామసత్వ నిరాకరణము.

ఈయన మధుర నేలిన తిరుమల నాయకుని మంత్రి. రాజనీతిజ్ఞుడు. రాచకార్య నిర్వహణ చేస్తూ, అసాధారణ గ్రంథాలు వ్రాసిన మేధావి. ఈయన శివాద్వైత స్థాపనా చార్యుడు. బహుగ్రంథకర్తయైన అప్పయ్య దీక్షితుల తమ్ముడైన అక్కయ దీక్షితుని కుమారుడు. ఈతని శివభక్తి తత్త్వమెలాంటిదో, పాండిత్య ప్రకర్షకూడా సర్వతోముఖ మైంది. గొప్పవైయాకరణుడు, ఉభయ మీమాంసలు తెలిసినవాడు. కర్మబ్రహ్మ ప్రతి పాదక వేదభాగాలను క్షుణ్ణంగా పరిశీలించినవాడు. (తె.వి.స-6)

## నీలకంఠ విజయ చంపువు (సం)

కర్త : నీలకంఠ దీక్షితులు.

ఇది బహుళ ప్రచారం పొందిన ఉద్గ్రంథం అయిదు అశ్వాసాల ప్రౌఢతర చంపూ కావ్యం. కవి తన రాజనీతి అనుభవాన్ని గురు శుక్ర సంవాదంలో స్ఫురింపచేశాడు.

దూర్వాసుని శాపంవల్ల స్వర్గం రాక్షసుల వశం కావటం, బృహస్పతి సాయంతో ఇంద్రుడు రాక్షసులను సంధిచేసుకోవటం, దేవదానవుల సముద్ర మథనం, తొలుత వెలు వడిన హాలాహలాన్ని శివుడుత్రాగి నీలకంఠుడై జగద్రక్షణచేయటం మొదలైన వృత్తాంతా లున్నాయి. ఈ కావ్యంలో కవి ఆలంకారిక సౌందర్యం, కవితాశిల్పం, కళానైపుణ్యం, శాబ్దిక ప్రతిభ అనన్య సామాన్యాలు. వక్రోక్తి కావ్యజీవితమనే కుంతకుని మతాన్ని అనుసరించి ఈ అలంకారంతో కావ్యకన్యకను అలంకరించాడు కవి.

ఈ కావ్యం అనేక శాస్త్ర సంప్రదాయాలకు ఆకరం. సమస్త సంస్కృత మర్యాదలకు అవధి దీనిలో శయ్యాసౌభాగ్యం, అర్థపుష్టి దండిగా ఉన్నాయి. (తె వి.స-6)

## నీలకంఠ విజయచంపువు వ్యాఖ్య (సం)

కర్త : వేలాల మహాదేవసూరి.

నామాంతరం : విబుధానందము.

ఇది నీలకంఠ దీక్షితుల చంపూ కావ్యానికి మనోహరమైన వ్యాఖ్య. ఈవ్యాఖ్య లేకపోతే నీలకంఠ దీక్షితుని కావ్యాన్ని అర్థం చేసుకోవటం కష్టం. (తె.వి.స-6)

**నీలకంఠ స్తవము (అలభ్యం)**

కర్త : మల్లికార్జున పండితుడు.
రచనాకాలం : క్రీ. శ. 12 వ శతాబ్దం.

**నీలకుంతల విలాసము**

కర్త : తులగాన నీలకంఠ కవి.
దీని ప్రతి కాకినాడ సాహిత్య పరిషత్తులో ఉంది.

**నీలగిరి యాత్ర**

కర్త : కోలా శేషాచల కవి.
అంకితం : గోడే వెంకట జగ్గనృపాలునికి.
రచనాకాలం : క్రీ. శ. 1846 ప్రాంతం.

కవి మద్రాసులో సైనిక శాఖాధ్యక్షుని కార్యాలయంలో పని చేసేవాడు. 12-5-1846 నుంచి 13-1-1847 వరకు ఉదకమండలంలో కార్య స్థానం ఏర్పరచుకొన్న సందర్భంలో జరిగిన వృత్తాంతాన్ని 'నీలగిరియాత్ర' పేరుతో వచన కావ్యంగా రచించాడు. శైలి రసవంతమైనది. ఆయా ప్రాంతాలలోని వాతావరణం-వేషభాషలు ఆచార వ్యవహారాలు మనోజ్ఞంగా వర్ణించిన రచన. (వ వా-64-65)

**నీలగిరి వర్ణనము**

కర్త : చూ. మంచ లక్ష్మీకామేశ్వరశాస్త్రి.

రామస్వామి శెట్టిగారి ముద్రాక్షరశాల, చెన్నపట్టణంలో క్రీ. శ. 1907లో ముద్రితం. (ఆం.సం.సా-429)

**నీలశైలనాథీయమ్ (సం)**

కర్త : చూ. శిష్టు కృష్ణమూర్తిశాస్త్రి.
గీర్వాణ రచన. జగన్నాథక్షేత్ర యాత్రా విషయాలను వివరించే గ్రంథం. (ఆం.సం.సా-326)

**నీలా వివాహము**

కర్త : చూ. రాపాక లక్ష్మీపతి. (ఆం.సం.సా-186)

**నీలాసుందరీ పరిణయము**

నామాంతరం : లచ్చిమగని కత.
కర్త : కూచిమంచి తిమ్మకవి.
అంకితం : పిఠాపురంలోని కుక్కుటేశ్వరస్వామికి.

మూడాశ్వాసాల అచ్చతెనుగు కావ్యం. కుంభకుడనే గొల్లదొరకుమార్తె నీలను శ్రీకృష్ణుడు పెండ్లి చేసుకోవటం దీనిలోని ప్రధానేతివృత్తం. ఒకరి గుణసంపదలు ఒకరు విని నీలాకృష్ణులు "వినుకలి ప్రేమ"లో ఉన్నారు. మదించిన కుంభకుని వృషభాలు గ్రామస్థులను బాధిస్తుంటే-వాటిని పట్టి బంధించమని రాజైన ధర్ముడు గొల్లదొరను శాసిస్తాడు. గొల్లలందరూ భయపడి, ఆ ఎద్దులను పట్టలేకపోయారు. గొల్ల దొర ఆ ఎద్దులను పట్టి బంధించిన వారికి తన కుమార్తెనిచ్చి పెళ్ళిచేస్తానని ప్రకటించాడు. ఏ వెర్రి గొల్ల చేతిలో పడతానో అని నీల వాపోయింది. చివరకు శ్రీకృష్ణుడు ఆ ఎద్దులను పట్టి బంధించి నీలను వివాహం చేసుకోవటం దీనిలోని ఇతివృత్తం. సంస్కృత శబ్దం లేకుండా, అచ్చ తెలుగులో రచన సహజంగా సాగింది. నీలవర్ణన సహజంగాను హృదయంగమంగాను ఉంది. ప్రసన్నమైన శైలితో తెలుగు మాటల పొందిక మనోహరంగా ఉంది. కవికి కుక్కుటేశ్వర స్వామి కలలో కనిపించి కృతి అడిగినట్టూ అతని కోరిక మీదనే తానీ రచన చేసినట్టూ కవి చెప్పుకున్నాడు.

(సా. చ. స-208; తె. వి. స-815)

## నుదురుపాటి చిదానంద కవి

నామాంతరం : చిదాకార కవి.

కాలం : క్రీ. శ. 19 వ శతాబ్దం.

స్థలం : పుదుక్కోట సంస్థానం.

రచన : చంద్రాననా దండకము.

బిరుదు : ఉద్దండ కవి.

ఇతడు నుదురుపాటి వెంకట కవి పౌత్రుడు. మాతృభూతయ్య పుత్రుడు. క్రీ. శ. 1844 - 1886 ల నడుమ పుదుక్కోటను పాలించిన రామచంద్ర తొండమాన్ ఆస్థాన కవి. సలక్షణంగా రచన చేశాడు. (వ వే. వా-446)

## నుదురుపాటి చిదాకార కవి

నామాంతరం : నుదురుపాటి చిదానందకవి (చూ).

## నుదురుపాటి వెంకనన్న

కాలం : క్రీ. శ. 18వ శతాబ్దం.

స్థలం : పుదుక్కోట.

రచనలు : 1. ఆంధ్రభాషార్ణవము (ఆంధ్రామరకోశము) 2. రఘునాథీయము 3. పార్వతీ కల్యాణము 4. తొండమాన్ వంశావళి 5. బృహన్నాయికా దండకము 6. మల్లు పురాణము 7. తురంగ పంచకము.

బిరుదు : మహోద్దండ కవి.

క్రీ. శ. 1769-89లో పుదుక్కోటను పాలించిన రాయరఘునాథుని ఆస్థాన కవి, సీతారామయ్య పుత్రుడు. నుదురుపాటివారు తొండమాన్ రాజులకు (పుదుక్కోటరాజులు)

వంశపారంపర్యంగా ఆస్థాన కవులు. వెంకన విద్వత్కవి. రాజుకు ప్రీతి పాత్రుడు రఘునాథుడు ఇతన్ని విశేషంగా గౌరవించేవాడట. (వ. దే. వా-222)

## నుదురుపాటి సాంబశివ కవి

కాలం : క్రీ. శ. 19వ శతాబ్దం

స్థలం : పుదుక్కోట.

రచనలు : 1. విల్హణీయము 2 తొండమాన్వంశ ప్రతాపమాలిక 3. చంద్రానన దండకము.

బిరుదు : ఉద్దండకవి.

ఇతడు నుదురుపాటి వెంకన్న కుమారుడు. పుదుక్కోటను పాలించిన (క్రీ. శ. 1825-39) రాయరఘునాథుని ఆస్థానంలో ఉండేవాడు. తండ్రి తాతవలె ప్రౌఢకవి. సమకాలీన విషయాలను తన రచనలో పొందుపరిచాడు (వ. దే. వా)

## నుదురుపాటి సీతారామయ్య

కాలం : క్రీ శ. 18వ శతాబ్దం.

స్థలం : పుదుక్కోట.

రచన : తిరుమల రాయోదాహరణము (కొంత భాగం మాత్రం లభించినది.)

బిరుదు : ఉద్దండకవి.

పుదుక్కోటను పాలించిన విజయ రఘునాథ (1730 - 1769) రాయ రఘునాథుల (1769-1789) ఆస్థానంలో ఉన్నట్లు తెలుస్తోంది.

మధుర రాజైన ముద్దు కృష్ణప్ప నాయకుని కాలంలో ఆంధ్రదేశం నుండి దక్షిణాదికి తరలి వెళ్ళిన కుటుంబాలలో నుదురుపాటివారి కుటుంబం ఒకటి. వీరు తొలుత పశ్చిమ గోదావరి జిల్లా నరసాపురం తాలూకాలోని నుదురుపాడు వాస్తవ్యులట.

విద్వత్కవి. ఇతడు అనేక ప్రబంధాలు వ్రాశాడట. అవి లభించలేదు. చాటువులు కొన్ని ప్రచారంలో ఉన్నాయి. ఆంధ్రభాషార్ణవ కర్త వెంకన్న ఇతని కుమారుడు. (వ.దే.వా-410)

## నుదురుపాడు శాసనము I

కాలం : క్రీ. శ. 1158 ప్రాంతం.

శాసన ప్రదాత : కామయ పుత్రుడు (శాసనంలో పేరు నష్టమైంది).

ప్రస్తావిత స్థలం : గుంటూరు జిల్లా సత్తెనపల్లి తాలూకా నుదురుపాడు గ్రామం.

శాసన విషయం : నుదురుపాడు వర్ణన విపులంగా ఉంది. నుదురుపాటి విభుడైన కామయ తనూజుడు అర్థిజనులను, శిష్టజనులను పోషించినట్లు, గ్రామంలో వేంచేసియున్న దేవదేవునికి అఖండ దీపం నిలిపినట్లున్నది. దీనిలో ఒక శార్దూలం, ఒక కంద పద్యం, ఒక ఉత్పలమాల ఉన్నాయి. (తె.క.చ-272)

## నుదురుపాడు శాసనము II

కాలం : క్రీ. శ. 1158 ప్రాంతం.

శాసన ప్రదాతలు : కొండ పశ్చిమ భూమండలాధీశుల (శ్రీగిరి పశ్చిమ దేశ ప్రభువుల)కు కొలువుకాండ్రు (శాసనంలో వీరి పేర్లు లేవు).

దాన శాసనప్రదేశం : గుంటూరు జిల్లా సత్తెనపల్లి తాలూకా నుదురుపాడు గ్రామం.

శాసన విషయం : దీనిలో శాసన ప్రదాతల వదాన్యతను గురించి విపుల వర్ణన ముంది. దాతలు గుడి, కృషి, నిధి, తోట, కొడుకు, చెరువు, నల్లిల్లు (అగ్రహారం) మొ॥ సప్త సంతానాలను నిలిపి, మూలస్థాన దేవరకు హవిర్బల్యర్చనలు ఏర్పాటుచేసి. సానులకు కూడా దానం చేసినట్లు ఈ శాసనంవల్ల తెలుస్తుంది. దీనిలో ఆటవెలదితో ఒక సీస పద్యం, మరొక పెద్ద సీసమాలిక ఉన్నాయి. (తె క.చ-272, 273)

## నుదురుపాడు శాసనము III

కాలం : క్రీ. శ. 1158 ప్రాంతం.

శాసన ప్రదాతలు : కొండ పశ్చిమ భూమండలాధీశులకు (శ్రీగిరి పశ్చిమ దేశ ప్రభువులు) కొలువు కాండ్రు.

దాన శాసనప్రదేశం : గుంటూరు జిల్లా సత్తెనపల్లి తాలూకా నుదురుపాడు గ్రామం.

శాసన విషయం : ఈ శాసనప్రదాతల వదాన్యత గురించి దీనిలో విపుల వర్ణనముంది. ఈ వంశీయులలోని బ్రహ్మన బోయడు, అబ్బయ్య శివునికి అఖండదీపం నిలిపినట్లు రాంకిపురంలో వేంచేసియున్న శివునికి రాంకి మల్లయ మరిది, రాంకి కొండప్పఎరియమ్మల సుతుడైన నూకడు అఖండదీపం ఎత్తినట్లు ఈ శాసనం చెబుతుంది. దీనిలో 2 సీసపద్యాలు, 5 కందపద్యాలు (2 కందాలు అసమగ్రం) ఉన్నాయి. (తె. క. చ - 274, 275)

## నుదురుపాడు శాసనము IV

కాలం : క్రీ. శ. 1158 ప్రాంతం.

శాసన ప్రదాతలు : రాంకిపుర విభులు (శ్రీగిరి పశ్చిమదేశ ప్రభువులకు కొలువు కాండ్రు)

దాన శాసన ప్రదేశం : గుంటూరు జిల్లా సత్తెనపల్లి తాలూకా నుదురుపాడు గ్రామం.

శాసన విషయం : దాతలు రాంకిపుర విభులు కొండ పడమటిసీమ ప్రభువుల కొలువులో ఉండేవారని, వీరు పండ్రెండు ఇండ్లవారని, వీరందరూ సోమకళా శేఖరునకు దానాలు చేశారని ఈ శాసనం వల్ల తెలుస్తుంది. దీనిలో నాలుగు కందపద్యాలున్నాయి. (తె.క.చ-276, 277)

## నూకమ శాసనము

కాలం : క్రీ. శ. 1152 ప్రాంతం.

శాసనం వేయించినవారు : నూకమ.

తండ్రి ముత్తన్న, తల్లి మేడమాంబ. ఈమె తాత తండ్రులు వెలనాటి గొంకరాజు వంశీయులకు వంశ పారంపర్యంగా భృత్యులట. ఈమె చోడ నారాయణ

స్వామికి అఖండ దీపం నిలిపించవి ఈ శాసనంవల్ల తెలియ వస్తున్నది. దీనిలో రెండు ఉత్పలమాలలు, ఒక చంపకమాల, రెండు కంద పద్యాలున్నాయి. (తె.క.చ_259)

## నూకలవారు

ధాన్య విశేషంతో నిలిచిపోయిన ఇంటి పేరు. ఈ ఇంటి పేరుతో ఉన్న కుటుంబాలవారు తెలుగు దేశంలో ఉన్నారు. చేబియ్యం వారు, పప్పువారు ఇలాంటివి. (భారతి_మా_45_230)

## నూటయెనిమిది దివ్యతిరుపతుల సుబ్బరాయ శతకము

కర్త : పొత్తపి వెంకటామాత్యుడు (చూ).

ఈ శతకంలో 110 పద్యాలున్నాయి. 2 నుండి 108 వరకున్న పద్యాలలో నూటయెనిమిది దివ్యతిరుపతులు, దైవతాల వర్ణన ఉంది. 109 వ పద్యంలో కవికి సంబంధించిన వివరాలున్నాయి. 110 వ పద్యంలో కృతిరచనకై ప్రోత్సహించిన చినరెడ్డిగారిని గూర్చి తెలుపబడింది. (మ.మా.)

## నూతన కవి సూరన్న

కాలం : క్రీ. శ. 1410_1480 ప్రాంతం
స్థలం : గోదావరీ మండలం.
రచన : ధనాభిరామము (లంపక్షు) (సకల జనాభిరామము).
సమకాలికుడు : భైరవి కవి.
అంకితం : దాక్షారామ భీమేశ్వరునకు.
గురువు : ముదిగొండ వీరభద్రయ్య.

విశిష్టత : పూర్వకవి స్తుతిలో చివరగా నాచనసోముని పేర్కొన్నాడు కాబట్టి నాచన సోమన్న తరవాత వాడు. తిప్పయామాత్యుని పుత్రుడు. ఈ కవి పద్యాలను కూచి రాజు ఎర్రన, సుమతీ శతకకారుడు ప్రస్తావించారు. హృద్యమైన కవిత. ఇతని కాలాన్ని గురించి వీరేశలింగంగారి అభిప్రాయం వేరుగా ఉంది.

"నూతన కవి" బిరుదనామం కావచ్చు. ఇతని కావ్యంలోని ఇతివృత్తాన్ని తర్వాతి వారు చాలమంది తీసుకొన్నారు. (ఆరుద్ర 6_69)

## నూతన నిబంధనము

కర్త : ప్రిచ్చెట్ ఎడ్వర్డు
ముద్రణ కాలం : క్రీ. శ. 1818.

క్రైస్తవ మత గ్రంథం. వచనంలో ఉంది. శ్రీరామపురం (వంగదేశం)లో ముద్రితం. (తె వి.స_6_663)

## నూతి వారు

'నూతి' ఇంటి పేరుతో తెలుగుదేశంలో కొందరున్నారు. ఆ గ్రామంలో ఎవ్వ

రికీ నూతిలేకుండా వారి ఒక్కరికే నూతి ఉంటే ఆ వంశీయుల నందరినీ నూతివారన్నా రట. అదే ఇంటిపేరుగా నిలిచిందట. (భారతి - మా - 45 - 229)

## నూరు జ్ఞానవచనములు

కర్త : బెంజమన్ షూల్జి.

అచ్చయిన తొలితెలుగు గ్రంథం. బెంజమన్ షూల్జి అనే ఆయన రచించిన ఈ పుస్తకం ప్రష్యా దేశం (జర్మనీ)లో మ్యాగ్డిబర్గ్‌కు చెందిన హ్యాలీ గ్రామంలో ముద్రితమై, క్రీ. శ. 1746_1747 లో ప్రచురితం.

ఇది క్రైస్తవ మత ప్రచారం కోసం రచించి ముద్రింపబడింది.

(తె. సా. విమర్శ-89)

## నూల్వీటి నాగయామాత్యుడు

కాలం : క్రీ. శ. 18 వ శతాబ్దం.

సాహితీప్రియుడు. అవుదూరి కిచ్చయ్యను ప్రోత్సహించి మాధవాభ్యుదయాన్ని రచింపజేశాడు. (య. గా. వా-40)

## నూల్వీటి హరియప్ప

కాలం : క్రీ.శ. 1700 ప్రాంతం కావచ్చు.

రచనలు : 1. ఉలూచీ పరిణయము (యక్షగానం) 2. కృష్ణశతకము.

జానకమ్మ నాగరాజుల పుత్రుడు. మాధవాభ్యుదయ కృతిప్రోత్సాహకుడైన నూల్వీటి నాగయామాత్యుడి మనుమడట. (య. గా. వా-40)

## నృకంఠీరవాభ్యుదయము

కర్త : మరింగంటి వేంకట (ప్రథమ) నృసింహాచార్యులు. (తె. వి. స-6)

## నృత్తరత్నావళి

కర్త : జాయపసేనాని (చూ).

రచనాకాలం : క్రీ. శ. 1198_1262 ప్రాంతం.

ప్రత్యేకత : నాట్యశాస్త్ర గ్రంథం. ఇందులోని శ్లోకాలకు లక్ష్యాలుగానే రామప్ప గుడులలో కనిపించే మనోహర నాట్యభంగిమలు శిల్పాలు గండరించారట. మార్గ, దేశి నృత్తరీతులు ఇందులో ఉన్నాయి. (అరుద్ర-2)

## నృసింహ దండకము (అలభ్యం)

కర్త : ఏనుగు లక్ష్మణకవి_ I (లత్సకవి)

కవి రచించిన రామ విలాస కావ్యంలో దీని ప్రసక్తి ఉన్నది. (క. త.12_163)

## నృసింహ పురాణము

కర్త : ఎఱ్ఱా ప్రెగ్గడ.

అంకితం : అహోబిల నరసింహస్వామికి.

అయిదు ఆశ్వాసాలున్నాయి. బ్రహ్మాండాది పురాణాలలో ఉన్న విషయాన్ని తీసుకొని ప్రబంధంగా రాశాడు.

ప్రత్యేకత : కవి నృసింహవంశాన్ని ఇందులో 8001 గద్య పద్యాల్లోను, హరివంశం పూర్వ భాగంలో 21 గద్య పద్యాల్లోను, ఉత్తర భాగంలో 47 గద్య పద్యాల్లోను వర్ణించాడు. అహోబిలక్షేత్ర వివరణ విపులంగా ఉంది. ఈ కావ్యాన్ని పోతన తరువాతి కవులు అనుకరించారని అంటారు. ఎర్రన భావుకతకు ఈ రచన తార్కాణం.

(ఆముద్ర-3)

## నృసింహ పురాణము

కర్త : చూ. కొటికెలపూడి కోదండరామ కవి.

అంకితం : బొబ్బిలి వేణుగోపాలస్వామికి.

సంస్కృత రచనకు ఆంధ్రీకరణము ఆరాశ్వాసాలు గల వచన గ్రంథం.

(ఆం. సం. సా-305)

## నృసింహ పురాణము

కర్త : పారిగడుపుల ధర్మయామాత్యుడు (చూ).

అంకితం : పారిగడుపుల నృసింహస్వామికి.

లభ్యమైన తాళపత్ర గ్రంథంలోని మొదటి కమ్మ, చివరి కమ్మ లేకపోవడంచేత కవి కాలాదికాలు స్పష్టంగా తెలియరాలేదు.

ఆరాశ్వాసాల గ్రంథం. ఇది పేరుకు నృసింహ పురాణమైనా, ఇందులో జయ విజయుల వృత్తాంతం కూడా సమగ్రంగా ఉంది. ఆశ్వాసాంతగద్యలలో ఆయా విషయాలు క్లుప్తంగా ఉన్నాయి. (మ. మా.)

## నృసింహ పురాణము (అలభ్యం)

కర్త : చూ. వేములవాడ భీమకవి.

దీని నుంచి రెండు పద్యాలను లాక్షణికులు ఉదాహరించారు. (అముద్ర-1)

## నృసింహ పురాణము

కర్త : హరిభట్టు.

చూ. నరసింహ పురాణము.

## నృసింహ భట్టు

కాలం : క్రీ. శ. 1402-1420 కి పూర్వం.

రచన : కాదంబరి (సం).

సాహిత్య చింతామణి కర్త పెదకోమటి వేముడుతన గ్రంథంలో ఇతన్ని ప్రస్తావించాడు: విద్వత్కవి. ఈ కవి అయిదు అంకాల నాటకంగా 'కాదంబరి'ని సంస్కృతంలో వ్రాశాడు. పెదకోమటి వేముని కాలంలో ఈ నాటకానికి మంచి పేరుండేది.

(రె. రా. చ)

నృసింహ భూపాలీయము

నామాంతరం : అలంకార ముక్తావళి.

కర్త : కృష్ణయజ్వ.

ప్రతాపరుద్రీయానికి అనుసరణ గ్రంథాలు చాలా వచ్చాయి. ఈ రచన సంస్కృతానుసారంగా ఉంది. సంస్కృత నరస భూపాలీయమని తెనుగునాట దీనికి వ్యవహారం. విజయనగర ప్రభువగు అళియ రామరాజుకు భాగినేయుడైన గొబ్బూరి నృసింహభూపాలునకు ఆశ్రితుడు కృష్ణయజ్వ. అలంకార ముక్తావళి వ్యాఖ్య ప్రాయంగా వ్రాయబడినది (ఆం. ప్ర. య. భూ-68)

నృసింహమాల్యాదిచ్ఛదస్సు

కర్త : పేరు తెలీదు.

కాలం : క్రీ. శ. 19 వ శతాబ్ది.

ఇది ఒక ఛందోగ్రంథం. అముద్రితం. ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగార ములో దీని ప్రతి ఒకటి ఉంది. మలయాద్రి నారసింహచ్ఛందస్సు అనే ఛందో గ్రంథం లింగరాజు అనే కవి రచించినట్లు తెలుస్తున్నది. అది అలభ్యమని పండితులు చెప్తున్నారు. ఆ గ్రంథం మలయాద్రి నృసింహస్వామికి అంకితం ఈ రెండూ ఒకటే నేమో పరిశీలించవలసి ఉంది. (క-న-213. కవిజనాశ్రయం - పీఠిక)

నృసింహ విలాసము

కర్త : పైడిపాటి వేంకట నృసింహ కవి.

కాలం : క్రీ. శ. 17 వ శతాబ్దం.

మూడాశ్వాసాల పద్యకావ్యం. వేటకు పోయిన నరహరి చెంచెతను వివాహ మాడ్డం దీనిలోని విషయం. రచన సరళంగా ఉంది.

నృసింహ విలాసము

కవి : లక్ష్మీ నరసింహము (చూ)

ఈ కావ్యాన్ని గురించి వివరాలు తెలియరాలేదు.

ఇతివృత్తం చెంచులక్ష్మి కథ కావచ్చు. (క త-12-256)

నృసింహ శతకము

రచనాకాలం : క్రీ. శ. 18 వ శతాబ్దం.

కర్త : కర్లపాలెం సింగన.

మత్తేభవృత్తాలతో కూర్చిన శతకం. అల్లూరిలోని నృసింహ స్వామిపేర రచింపబడింది 'నృసింహా-భక్త సంరక్షకా' అనే మకుటంతో ఉన్నది. కేశవ నామాలకు ఒక్కొక్క పద్యం ఉంది. కొన్ని పద్యాలలో కవి మంత్రశాస్త్ర జ్ఞానం గోచరిస్తున్నది. (శ క చ-478)

నృసింహ శతకము

కర్త : తాడేపల్లి పానకాల రాయుడు.

కందపద్య శతకం. "మంగళాద్రి నృసింహా" అనే మకుటం ఉంది.

## నృసింహ శతకము

కవయిత్రి : తరికొండ వేంకమాంబ.

ఇది ప్రకీర్ణ శతకం. దీనిలో యోగముద్రా రహస్యాలు వివరంగా ఉన్నాయి. ఇది భక్తి, వైరాగ్య, తత్త్వ ప్రధానమైనది. (శ.సా.వి.)

## నృసింహ సహస్ర నామావళి

కర్త : మతుకుమల్లి నృసింహ కవి (ము).

## నెప్పల్లె అప్పనార్య

కాలం : క్రీ. శ. 1575-1625 నడుమ.

రచన : శైవాగమ శిఖామణి.

అంకితం : శ్రీశైల మల్లికార్జున స్వామికి.

గురువు : ఇవటూరి రామనారాధ్యుడు.

విశిష్టత : బ్రహ్మలింగారాధ్యుని పుత్రుడు. వీర మాహేశ్వరాచార పరాయణుడు శైవశాస్త్రార్థ పారాయణుడు. శైవాగమ శిఖామణి. సరసకవితా చాతుర్యమున్న వాడనని గద్యలో చెప్పుకొన్నాడు. (ఆరుద్ర-9-247)

## నెరజాణ పక్షులు

పింగళి సూరన కళాపూర్ణోదయం కావ్యంలోని చిలుకలు. పక్షులను పాత్రలుగా కావ్యాలలో ప్రవేశపెట్టి, కథను నడిపించటంలో సూరన్న అద్వితీయుడు. శృంగార నైషధంలో శ్రీనాథుని హంస మాటకారేకాని కార్యశీలి కాదు. సూరన్న "ప్రభావతీ ప్రద్యుమ్నం"లో శుచిముఖి అనే హంసచేత వేగుల వారి పని చేయించి, సందేశ వాహకంగా చమత్కరించాడు. అలాగే కళాపూర్ణోదయంలో కూడా ఒక చిలుకను ప్రవేశపెట్టాడు. చదువుల రాణిచే చిలుక.

ఇది కల భాషిణియై, అద్భుత శిశువై, మధురలాలసగా మారినది. ప్రణయ వారాశిలో తేలియాడింది. చివరకు ఎన్నో నోముల పంటగా కళాపూర్ణుని పెండ్లియాడినది చిలుక గడుసుది. అంతటి రాజుచేత కాళ్ళు పట్టించుకొని, బ్రతిమాలించుకొన్నది. ఈ పిట్ట జంట సామరస్య దాంపత్యం ఒక రమ్యమైన బాణీలో సాగింది. ఈ చిలుక చేత కవి, మణి కంధరుని కథా విశేషాన్ని చెప్పించాడు.

నందన వనపు చిలుక : సూరన కళాపూర్ణోదయంలో ద్వితీయాశ్వాసంలో కీర దంపతుల ప్రణయాన్ని మనోహరంగా వర్ణించాడు. శ్రీకృష్ణుడు తెచ్చిన పారిజాత వృక్షంతో పాటుగా కొన్ని పక్షులు భూలోకానికి వచ్చాయట. అందులో అన్నీ తిరిగి పోగా ఒక చిలుక పూర్ణగర్భిణియైన తన ఇల్లాలిని వదలలేక ఇక్కడే ఉండిపోయింది. అవల ఆ వనలక్ష్మి సౌందర్యానికి ఆకర్షింపబడి ఆడుపిట్ట ప్రోద్బలంతో ఇక్కడే స్థిర పడినవి. నందనవనంలో బంధువులు-ద్వారకలో ఆలు బిడ్డలు-ఈ పిట్ట జంట.

(కళాపూర్ణోదయం-మున్నుడి-మ.కో.రె.)

నెల్లుట్ల నారాయణ కవి

నామాంతరం : కోన నారాయణ (చూ).

నెల్లూరి చోడ తిక్కరాజు

నామాంతరం : తిరుకాళ్కత్తి.

కాలం : క్రీ. శ. 1208-1239 మధ్యకాలం.

స్థలం : విక్రమ సింహపురి (నెల్లూరు).

ఈయన మనుమసిద్ధికి తండ్రి. నెల్లూరును పాలించిన రాజు. సాహిత్య ప్రియుడు. చతుర్విధ కవితా నిర్వాహకుడైన పెద్దయామాత్యుడు ఇతని ఆస్థానంలో ఉండే వాడట. ఈ పెద్దన విక్రమార్క చరిత్ర కృతికర్తయైన జక్కనకు తాత. ఈయన చోడ తిక్కరాజు ఆస్థానంలో సాహిత్య విద్యా విశేషాలను ప్రదర్శించే వాడని విక్రమార్క చరిత్ర వల్ల తెలుస్తున్నది. (తె.క.చ-379)

నెల్లూరి ముత్తరాజు

కాలం : క్రీ. శ. 1590 కి పూర్వం.

రచన : పద్మావతీ కల్యాణము (అలభ్యం).

విశిష్టత : ఈయన కృతి చమత్కృతికి ఆటపట్టుగా ఉంటుంది. ఈయన కావ్యం నుంచి పెదపాటి జగ్గన్న ఒక పద్యాన్ని ఉదాహరించాడు. ఆ పద్యం విరహంలో ఉన్న కథానాయికను సఖి ఊరడిస్తున్న ఘట్టం లోనిది. ఈ పద్యం వెలలేని వజ్రం. ఈ పద్యంలో కవి "దేవూనై గురుపూనై" అనే సామెతను వాడి చక్కగా చమత్కరించాడు (ఆరుద్ర-9)

నెల్లూరి రాఘవ కవి

నామాంతరం : నెల్లూరి వీరరాఘవ కవి (చూ).

నెల్లూరి రామలింగయ్య

కాలం : క్రీ. శ. 15 వ శతాబ్దం.

స్థలం : కాంచీ పురము.

సాహిత్య పోషకుడు. పిడుపర్తి సోమనాథ కవిని ప్రోత్సాహించి అతనిచేత ప్రభులింగలీలలు ద్విపద కావ్యాన్ని వ్రాయించి, తన గురువైన సిద్ధవీరేశ దేశికునికి అంకితం ఇప్పించాడు. (క. త-6-86)

నెల్లూరి వీర రాఘవకవి

నామాంతరం : నెల్లూరి రాఘవ కవి.

కాలం : క్రీ. శ. 1680-1740 మధ్యకాలం.

స్థలం : నెల్లూరు.

రచనలు : 1. విశేష రామాయణము (సం) 2. వల్లీ రామాయణము (అలభ్యం) 3. రసమంజరి (ఆంధ్రీకరణం) (అలభ్యం) 4. సర్వ

లోకేశ శతకము (అలభ్యం) 5. మంత్రపాద స్తవము (అలభ్యం) 6. యాదవ రాఘవ పాండవీయము 7. వసుంధరాపరిణయము 8. భవభూతి ఉత్తర రామ చరిత్రకు వ్యాఖ్య (అలభ్యం) 9. చాటుకథా చమత్కృతులు (50) (అలభ్యం) 10 త్రిపురారి దండకము (అలభ్యం) 11. కృష్ణ భుజంగము (అలభ్యం) 12 అష్ట దిగ్గజాల సీసాలు (అలభ్యం) 13. కృష్ణలీలామృతం (అలభ్యం) 14. సానంద చరిత్ర (అలభ్యం) 15 స్తంభోద్భవ గద్య(అలభ్యం)

గురువు : పుణ్యకోటి సోమయాజులు.

వెంకటపతి, మంగమ్మల పుత్రుడు రంగనార్యుని పౌత్రుడు. శతలేఖినీ విద్య, ఆశు, చిత్ర, విస్తర కవితలలో పాండిత్యం కలవాడు. సకల శాస్త్రాలు తెలిసిన వాడు. రత్న పరీక్ష, గజ పరీక్షలు కూడా నేర్చిన వాడట. పది అర్థాలు వచ్చేలాగున కావ్యం వ్రాయ గలడట.

ఇతని కృతులు తెలుగు, సంస్కృతం, మొత్తం కలిపి 60 కి పైగా ఉన్నాయి. చాటు కథలే 50 ఉన్నాయి. వీటిలో తెలుగు రచనలు రెండుమాత్రం లభించాయి. అవి నెల్లూరులో అముద్రిత గ్రంథ చింతామణిలో ప్రకటింపబడ్డాయి. ఇతని కుమారుడు శివరామ కవి తంజావూరు మహారాష్ట్ర రాజుల ఆస్థానంలో ఉండేవాడు.

(క. త-13-73-78; ఆరుద్ర-12-148)

## నెల్లూరి శివరామ కవి

కాలం : క్రీ. శ. 1740 ప్రాంతం.

స్థలం : తంజావూరు.

రచనలు : 1. కామకళానిధి 2. రామగీతలు.

గురువు : ఆంధ్రపాణిని శేషాచలకవి.

వీరరాఘవకవి సూరమాంబల కుమారుడు. మొదటి శరభోజీ (1712-1728) కుమారులలో ఒకడైన జయసింహుని ఆస్థానంలో ఉండేవాడు. ఇతని రెండో రచన జయసింహుని ఆస్థానంలో జరగలేదు. మర్రి కృష్ణ భూపాలుడు తన్ను కోరగా రామగీతలు వెనిగించినట్లు చెప్పాడు. ఇతడు సంస్కృతాంధ్ర సాహిత్య సార్వభౌముడు. లక్షణ శాస్త్ర గ్రంథాలను అవగాహన చేసుకొని తెలుగులో ప్రౌఢంగా రచన చేశాడు. (ద.దే.వా-260)

## నేటివ్ సర్క్యులేటర్

కాలం : క్రీ. శ. 1844 ప్రాంతం.

సంపాదకుడు : నారాయణస్వామి.

ఇది ఆంగ్ల పత్రిక. ఈ పత్రికను, దీని ముద్రణాలయాన్ని గాజుల లక్ష్మీనరసింహంసెట్టి కొని "క్రిసెంట్" అనే ఆంగ్ల పత్రికను నడిపాడు

(వీరేశలింగం పంతులు-సమగ్ర పరిశీలన-182)

## నేతివాడు

భోజన సమయాలలో నేయి విశిష్టమైందేగాక విలువైందికూడా. నేతి పేరే ఇంటి పేరుగా కొన్ని కుటుంబాల వారికి తెలుగు దేశంలో నిలిచిపోయింది. (భారతి-మా-45-230)

## నేత్రదర్పణము

కర్త : తాడేపల్లి పానకాలరాయకవి (చూ).

అంకితం : శ్రీకృష్ణునకు.

వైద్య శాస్త్ర గ్రంథం. 35 పద్యాలున్నాయి. నేత్ర రోగ వివరాలు, చికిత్సా విధానాలు చెప్తున్న గ్రంథం. (క. త-13-240)

## నేత్రావధానము

చూ. అవధానాలు.

## నేబతి కృష్ణమంత్రి

కాలం : క్రీ. శ. 1580-1612 ప్రాంతం.

గురువు : కందాళ రంగాచార్యులు.

రచన : రాజనీతి రత్నాకరము.

విశిష్టత : ఈయన గోలకొండ నవాబు కులీ కుతుబ్‌షాహి మంత్రిమండలిలో ఒకడు. ఇతని వంశంలోని ఆరోతరంలోని తాత ఒకాయన పెదంవకోట సుల్తాన్‌వద్ద "నేబతి" పదవిలో ఉన్నాడు. నేబతి అనే మాట "నియాబత్" అనే ఉర్దూ పదానికి తెలుగు రూపం. దీనికి రాయబారి, స్థానాపతి అనే అర్థాలున్నాయి. కృష్ణమంత్రి తండ్రి కమల మంత్రి పానుగంటి పట్టణాధ్యక్షుడు. కృష్ణ మంత్రి ప్రసిద్ధమైన పంచ తంత్రాన్ని వైష్ణవ ప్రబంధంగా మార్చి రాజనీతి రత్నాకరం అనే పేరుతో వ్రాశాడు. ఇతని కవిత్వం పరవళ్ళ బొండుమల్లెల బంతుల్లా ఉంటుందట. (ఆరుద్ర-9-252)

## నైఋతి నాటకము

కర్త : కంఠీరవ రాజు.

అష్టదిక్పాలక విలాసంలోని ఒక భాగం - నాట్యప్రధానం. ఇంద్రుడొకనాడు నాటకశాలకు రాగా అష్టదిక్పాలకుల ప్రతినిధులైన నర్తకీమణులు తమ విద్యావైదుష్యాన్ని ప్రదర్శించడం ఇందులోని ఇతివృత్తం.

## నైషధం తిమ్మమంత్రి

కాలం : క్రీ. శ. 16 వ శతాబ్దం.

స్థలం : నెల్లూరు మండలం.

రచన : లక్షణ మంజరి (లక్షణ గ్రంథం) (ఏకాశ్వాసం)

అంకితం : గరళపురీశ్వరునికి.

పాపయామాత్యుని పుత్రుడు. అష్టాదశవర్ణనలతో ప్రబంధాలను కవులు వ్రాసే

రోజుల్లో వెలువడిన లక్షణ గ్రంథానికి ఇతడు కర్త. ఈయన గ్రంథం అముద్రితం. ఇతడు ఉదయాద్రీశ్వరుని పేర్కొన్నాడు. నిశ్చయంగా ఏ గ్రామంవాడో తెలియదు. గండికోట అ గ్రామానికి సంస్కృతీకరణం కావచ్చు. (ఆం.ద్ర-8; క స-85)

## నైషధ పారిజాతావతారిక (అలభ్యం)

కవి : కృష్ణాధ్వరి.

అంకితం : రఘునాథ నాయకునికి (క్రీ. శ. 1600-33).

ఈ గ్రంథ నామాన్ని గురించి పండితులలో భిన్నాభిప్రాయాలున్నాయి. కవి తాను రచించిన గ్రంథాలన్నీ ఒక సీసపద్యంలో పేర్కొన్నాడు. నైషధ పారిజాతం రెండు సొర్లు చెప్పబడింది. కాబట్టి ఒకటి నాటకమో ద్వ్యర్థిరచనో అయి ఉంటుందని కొందరూ, సంస్కృతం అయి ఉంటుందని కొందరూ అభిప్రాయపడ్డారు. అది పారిజాతావతారిక కాబట్టి పారిజాతకథ అని కొందరు తలపోస్తున్నారు. (ఆరుద్ర-10-218; క.త-12-34)

## నైషధ పారిజాతీయము

కవి : కృష్ణాధ్వరి.

కృతిపతి : రఘునాథ నాయకుడు (క్రీ. శ 1600-33).

ద్వ్యర్థిప్రబంధం. నాల్గు ఆశ్వాసాలు, అయిదవ ఆశ్వాసంలో కొంత భాగం మాత్రం దొరికాయి. ఇది చాలా ప్రౌఢ ప్రబంధమనీ, ఆముక్తమాల్యదను తలపిస్తుందనీ చెప్తారు. శబ్దార్థ శ్లేషాలంకారాలు, ధ్వని అష్టాదశ వర్ణనలు విద్వత్కవి ప్రియంగా కవి వ్రాశాడు కృత్యాది పద్యాలు సంపూర్ణంగా లభించలేదు.

ఇతివృత్తంలో నలుని కథ, పారిజాత కథ కలిసి వచ్చేటట్లు చెప్పబడింది. నలుని కథ తెలుగు నైషధం నుండీ, పారిజాత కథ భాగవతం నుండీ తీసుకుని, తన కథ నానికనుగుణంగా కవి మార్పులు చేశాడు. ఉత్తమ కావ్యంగా పండితుల ప్రశంసలు పొందిన కావ్యం. (వ.దే.వా-78-83)

## నోటు

గీత రచనా విశేషం. ఇది ఒక పార్శీమట్టో, హిందూస్తానీ రాగవిశేషమో అయి ఉండవచ్చునని పండితులూహిస్తున్నారు. దీని నడక చక్కగా సాగుతుంది. బాగేపల్లి అనంతాచార్యుల సుభద్రా పరిణయం యక్షగానంలో ఇది కన్పిస్తుంది. (య.వా.చ-337-38)

## నౌకా చరిత్రము

కర్త : త్యాగరాజు (చూ).

సంగీత రూపకం. ఒకేఒక అంకం ఉంది.

ఇతివృత్తం : కృష్ణుని రాస క్రీడలు, జలక్రీడలు, నౌకా విహారాలను వర్ణించే ఘట్టాలు ఎక్కువ. ఏడేండ్ల వయస్సు గల బాలకృష్ణుడు కథానాయకుడు. రెండు మూడు సంవాద గేయాలున్నాయి. (శారదా ధ్వజం-174)

## న్యాయపరిశిష్ట ప్రకాశనమ్ (సం)

కర్త : మూ. అన్నంభట్టు.

ఇది ఉదయన గ్రంథానికి సంస్కృతంలో వ్రాసిన వ్యాఖ్య. (తె వి స-4)

## న్యాసాష్టకము (అలభ్యం)

కర్త : మల్లికార్జున పండితుడు.

రచనాకాలం : క్రీ.శ. 1150 ప్రాంతం.

## పంగనామాల వారు

ఇంటిపేరు. పంగనామాలు ధరించిన మూలంగానో, మరే కారణం వల్లనో ఈ ఇంటిపేరుతో చాలా కుటుంబాలవారు తెలుగుదేశంలో ఉన్నట్లు తెలియవస్తుంది. 'బొట్టు' ఇంటిపేరు ఇలాంటిదే. (భారతి-మా-45-230)

## పంచకన్యా పరిణయము

కర్త : (మూ) వాలకవి సుబ్బన్న.

అంకితం : శహాజీ (1684-1712) కి (తంజావూరును పాలించిన మహారాష్ట్రరాజు).

ఇతివృత్తం : శ్రీకృష్ణుడు పంచకన్యలను పరిణయమాడటం.

ఇది గోపికావస్త్రాపహరణం దృష్టిలో ఉంచుకొని దానిపై అల్లిన కథ.

విశేషం : ఈ కథ శహాజీయే చెప్పి తెలుగులో రచించమని కవిని అడిగాడట. కవిస్తుతిలో సంస్కృత కవుల ప్రశంస మాత్రం ఉంది. నాటకంలో కేతినాయని పాత్ర విశేషం. అతని మీద ఒక పదం ఉంది. అతడు హాస్యపు చేష్టలు చేయడం సూచింపబడింది. చోళదేశ ప్రశస్తిని వర్ణిస్తూ "గృహము గృహమున దినమొక్క కృతి యొనర్ప జాలు లక్షణకవు"లున్నారని కవి చెప్పాడు. (య.గా సం-3)

## పంచకావ్యములు

సంస్కృతంలో కాళిదాసు రచించిన రఘువంశము, కుమార సంభవము, మేఘ సందేశము, భారవి రచించిన కిరాతార్జునీయము, మాఘుడు రచించిన శిశుపాల వధము అనే అయిదు కావ్యాలనూ పంచకావ్యాలుగా చెబుతారు.

తెలుగులో ఆముక్తమాల్యద, పాండురంగ మాహాత్మ్యం, శృంగార నైషధం, మనుచరిత్ర, వసుచరిత్ర పంచకావ్యాలుగా ప్రసిద్ధాలు.

పోచిరాజు వీరన్న తెలుగులో పంచకావ్యాలను సులభశైలిలో రచించాడట. ఇతని కృతి అలభ్యం. (క.స-222)

## పంచతంత్ర కథలు

కర్త : రావిపాటి గురుమూర్తిశాస్త్రి.

ఈ గ్రంథం 1770 ప్రాంతంలో వ్రాయబడి 1834 లో ముద్రింపబడింది. కథా వాఙ్మయారంభ దశలోని తెలుగు కథలుగా ఇవి మిక్కిలి ప్రాచుర్యాన్ని పొందాయి. 1869 లోపల నాలుగు సార్లు ముద్రింపబడ్డాయి. (వ. వా.)

పంచతంత్రము (అలభ్యం)

కాలం : క్రీ. శ 1250 ప్రాంతం.

కవి : పేరుతెలియదు.

తెలుగులో వచ్చిన పంచతంత్ర గ్రంథాలలో ఇది మొదటిది. మడికి సింగన తన సంకలన గ్రంథమైన 'సకలనీతి సమ్మతం' లో దీనిలోని కొన్ని పద్యాలను ఉదాహరించాడు. (తె. క. చ- 383)

పంచతంత్రము

కర్త : దూబగుంట నారాయణకవి.

కృతిపతి : నెల్లూరు జిల్లా ఉదయగిరి దుర్గాపతి, గజపతుల సామంతుడు, తమ్మ ఘూపతి కొడుకు అయిన బసవ నృపాలుడు.

ప్రత్యేకత : దీనికి మూలం విష్ణుశర్మ సంస్కృతంలో వ్రాసిన పంచతంత్రం దీనికి 50 ప్రపంచ భాషలలో దాదాపు 200 అనువాదాలున్నాయని పండితాభిప్రాయం. నారాయణ కవి కాలం నాటికే ఒక పంచతంత్రం అనువాదమై, ప్రసిద్ధమై క్రీ. శ. 1347 నాటికి మడికి సింగన "సకలనీతి సమ్మతం" వంటి సంకలన గ్రంథంలో చేరిపోయింది. అయినా నారాయణ కవి మళ్ళీ దీనిని అనువదించాడు. భావ సంపుటిలో, భావనా విస్తృతిలో ప్రతిభా గాంభీర్యాలు లేవుగానీ కవన ధోరణి రస విహీనంగా మాత్రం ఉండదు. మంచన, కూచిరాజు ఎర్రన మొదలగు దాదాపు 12 మంది పద్య కావ్యంగానో, గద్య కావ్యంగానో ఈ పంచతంత్రాన్ని తెనిగించారు. బైచరాజు వేంకటనాథుడు, తిప్పయ గారి భాను కవి, రావిపాటి గురుమూర్తిశాస్త్రి, పరవస్తు చిన్నయసూరి, శిష్టు కృష్ణమూర్తి శాస్త్రి, కందుకూరి వీరేశలింగం, కొక్కొండ వేంకటరత్నం, ఉల్లంగి రామచంద్రరావు, నండూరి రామమోహనరావు సాహిత్యంలో వ్రాశారు. విశ్వాత్ముల నరసింహమూర్తి, బాపు, బాలుర కోసం చిత్ర రచన చేశారు. దేశ విదేశాల గుహాలలో కూడా పంచ తంత్రంలోని కొన్ని కథల బొమ్మలను శిల్పులు గండరించారు. వ్యాకరణ విరుద్ధ ప్రయోగాలున్నాయి. ఆ కాలపు వ్యావహారిక రూపాలున్నాయి. (ఆరుద్ర-6-123)

పంచతంత్రము

కర్త : బైచరాజు వేంకటనాథుడు.

రచనాకాలం : క్రీ. శ. 1550-60 ప్రాంతం.

అంకితం : హరిహరనాథునకు.

ఈ గ్రంథంలో దాదాపు 2000 పద్యగద్య లున్నాయి. అయిదు ఆశ్వాసాల. పద్యకావ్యం.

మాతృకలోలేని విషయాలను చేర్చి, వర్ణనలతో పెంచినందువల్ల అక్కడక్కడ కథాగమనం కుంటుపడినట్లు తోస్తుంది. అష్టాదశ వర్ణనలు కూర్చి చేసిన ఈ రచన సాధారణ పాఠకుల కంటె విద్యావంతులకు వేడుక కలిగిస్తుంది. దూబగుంట కవి, బైచరాజు

కవి కూడా పాటలీపుత్రం ఏలేవాడు సుదర్శన ప్రభువే అన్నాడు. ఇద్దరూ ఒకే సంస్కృత మూలాన్ని చూసి ఉండవచ్చు. ఈ పంచతంత్రంలో, మాతృక పంచతంత్రంలోని 43 కథలలో 25 మాత్రం ఉన్నాయి. స్వాభావిక వర్ణనలు, పాత్రపరిశీలనలు, స్వభావ నిరూపణలు ఇందులో ఎక్కువగా కనిపిస్తాయి. (తె.వి.స-4)

**పంచతంత్రము**

కర్త : భాను కవి.

రచనాకాలం : క్రీ. శ. 1510-30 ప్రాంతం.

అంకితం : లక్ష్మీనారాయణునకు.

మూలం : సంస్కృత పంచతంత్రము.

పంచతంత్రాన్ని తెలుగులో దూబగుంట నారాయణ కవి, బైచరాజు వేంకటనాథుడు కూడా పద్యకావ్యాలుగా వ్రాశారు. ఇందులో దూబగుంట నారాయణ కవి పద్యాలను పోలిన పద్యాలు కొన్ని కన్పిస్తున్నాయి. పదిహేనవ శతాబ్దంలో గ్రంథస్థమైన వ్యావహారిక పద రూపాలు కొన్ని ఈ రచనలలో కన్పిస్తాయి. మృదుమధురమైన రచన.

రెంటూరి చిట్టనామాత్యుని ప్రోత్సాహంతో ఈ రచన లక్ష్మీనారాయణుడనే అతడు కృతి పొందాడట. (ఆరుద్ర-6-130)

**పంచతంత్రము**

కాలం : క్రీ. శ. 19 వ శతాబ్ది.

కర్త : శిష్టు కృష్ణమూర్తి.

ఇందులో పంచతంత్ర కథల గురించి ఉంది.

(వీరేశలింగం పంతులు-సమగ్ర పరిశీలన)

**పంచదశి (సం)**

కర్త : విద్యారణ్యుడు.

ఇది సంస్కృత వేదాంత గ్రంథం. (తె వి స-4)

**పంచనదీ స్థలీ పురాణము (అలభ్యం)**

కవి : ఆలూరి కుప్పన.

అనువాద రచన

తిరువాడి క్షేత్రం పంచనదీ స్థలంగా ప్రసిద్ధం. ప్రఖ్యాత వాగ్గేయ కారుడు త్యాగరాజస్వామి సమాధి ఇక్కడనే ఉంది. ఇక్కడి దైవం పంచనదీశ్వర స్వామి. ఈ స్థలపురాణాన్ని కవి సంస్కృతం నుండి గ్రహించి ఉండవచ్చును. (ద. దే. వా-250)

**పంచపాదికా వివరణోజ్జీవని**

కర్త : యజ్ఞేశ్వరుడు.

ఇది వేదాంత గ్రంథం. (తె. వి. స-4)

పంచప్రకార గద్యం

కర్త : పాల్కురికి సోమనాథుడు.

రచనాకాలం : 13వ శతాబ్దం.

శివభక్తి ప్రతిపాదికమైన రచన. ఇందులో అయిదు విధాలైన బసవస్తోత్ర పూర్వక గద్యాలున్నాయి. ఇదే సంస్కృతంలో కూడా రాశాడట. (క. త-3)

పంచబాణ విలాసము (అలభ్యం)

కర్త : తెలియదు.

కాలం : క్రీ. శ. 1670కి పూర్వపు రచన.

రత్నాకరం గోపాలరాజు ఈ కావ్యాన్ని పేర్కొన్నాడు. (అప్ర-12-191)

పంచ భాషలు

ఇవి ప్రాకృతానికి భిన్నరూపాలని కొందరంటున్నారు.

1. ప్రాకృతము 2. శౌరసేని 3 మాగధి 4. పైశాచి 5. అపభ్రంశము. ఈ అయిదూ పంచభాషలనీ భారతీదేవి శైశవ భాషితాలనీ అప్పకవి చెప్పాడు. (అప్పకవీయం-1-72)

పంచముఖేశ కంద పద్యశతకము

కర్త : అమలాపురపు సన్యాసికవి.

రచనాకాలం : క్రీ. శ. 19వ శతాబ్దం.

భక్తి ప్రతిపాదికమైన కంద పద్య శతకం.

పంచముఖేశ లింగ ద్వాత్రింశతి

కర్త : అమలాపురపు సన్యాసికవి.

సీస పద్యాలతో కూడిన రచన.

పంచముఖేశ్వర ప్రభువృత్త శతకము

కర్త : అమలాపురపు సన్యాసికవి.

రచనాకాలం : 19వ శతాబ్దం.

శివభక్తి ప్రతిపాదకమైన శతకం.

పంచరత్న కవి

కాలం : క్రీ. శ. 17 శతాబ్ది.

స్థలం : తంజావూరు.

రచన : శరభోజి రాఘవ చరిత్రమ్.

ఈయన తంజావూరు పాలకుడైన శరభోజి ఆస్థానకవి. (తె.వి.స-6)

పంచరత్న ప్రబంధము

కర్త : శహాజీ (చూ).

అంకితం : త్యాగేశునికి.

యక్షగాన నాటకం. కవి దీన్ని మహా ప్రబంధంగా చెప్పుకొన్నాడు.

విశేషం : శహాజీ కొలువులోని ఇద్దరు నాట్య కత్తెలు, ఒక యోగి, బిరుదు బంట్లు, సావనకాండ్రు, చెంచువారు, శివుని కొలువులో తమ విద్య ప్రదర్శించి బహుమానాలు పొందిరావడం-శివుడు శహాజీని ఆశీర్వదించడం ఇందులోని కథ.

(వ. దే. వా-191)

## పంచ రత్నములు

శ్రవ్య కావ్య భేదం.

చూ. పంచాననావళి.

## పంచ వింశతి శతకములు

రచనాకాలం : క్రీ. శ. 17 వ శతాబ్దం.

కర్త : వెలివేరు వేంకటరామ ప్రధాని.

హరికి అంకితంగా ఈ కవి 25 శతకాలు రాశాడట. వాటిపేర్లు తెలియ రావడం లేదు. (శ.క.చ-712)

## పంచ సహస్రావధానము

చూ. అవధానాలు.

## పంచాక్షరీ మంత్ర మాహాత్మ్యము

కర్త : తెలియదు.

ఒక లఘుకృతి. కర్తృత్వం అవిజ్ఞాతం అని పరిష్కర్తల అభిప్రాయం. ప్రతిచరణం చివరలో 'పంచాక్షరి' అనేపదం ఆవృతి అయ్యేవిధంగా వ్రాయబడిన 70 పంక్తుల రచన. స్త్రీ బాలవృద్ధులకు పారాయణ యోగ్యమట. కందుకూరి వీరేశలింగ మంత్రికి అంకితంగా ఒక పంచాక్షరీమాహాత్మ్యం రచింపబడినట్టు తెలుస్తున్నది. ఈరెండూ ఒకటి కావచ్చు.అసమగ్ర ప్రతి ఒకటి మదరాసులోని ప్రాచ్యలిఖిత గ్రంథాలయంలో ఉంది.

వివరాలకు చూ. కందుకూరి వీరేశలింగ మంత్రి. (అం.సం.సా.)

## పంచాక్షరీ మాహాత్మ్యము (అలభ్యం)

కర్త : తెలియదు.

అంకితం : కందుకూరి వీరేశలింగ మంత్రికి.

## పంచాననావళి

నామాంతరం : పంచరత్నములు.

శ్రవ్య కావ్య భేదం. అయిదు పద్యాలున్న కావ్యము పంచాననావళి. దీనికి పంచరత్నాలు అని నేటి వ్యవహారనామం. (తె.వి.స-6)

## పంచాయుధ కళ్యాణము

కర్త : కంఠీరవ రాజు (చూ).

యక్షగానం. సంగీత నృత్య రూపకంవంటి రచన. విష్ణుమూర్తి పంచాయుధాలు, కంఠీరవరాజును రక్షిస్తున్నట్లుగా ఆయా పాత్రలు అభినయించేటట్లు రచింపబడింది సంస్కృత శ్లోకాలు ఎక్కువగా ఉన్నాయి. (ద. దే. వా-453)

**పంచాశత్తు**

ఏబది పద్యాలుండే కావ్యభేదము. (అప్పకవీయం)

**పంజిక (పంచిక)**

శాస్త్ర పరిభాష. ఒక గ్రంథానికి వ్రాసే విపులమైన వివరణాన్ని పంజిక అంటారు. (కావ్యాలంకార సంగ్రహం)

**పంట మైలారురెడ్డి**

కాలం : క్రీ. శ. 15వ శతాబ్ది పూర్వభాగం.

సాహిత్య పోషకుడు. శ్రీనాథ విరచిత నందనందన చరిత్ర కావ్యానికి కృతిపతి. శ్రీనాథుడు ఈయన దగ్గర దిన వెచ్చాన్ని తీసుకొన్నట్లు ఒక చాటువువల్ల తెలుస్తున్నది. ఈయన ప్రాభవకాలం క్రీ. శ. 1424-1429 మధ్యకాలం. దిన వెచ్చమిచ్చిన రెడ్డిరాజుకు కృతజ్ఞతా సూచకంగా కవి, నంద నందన చరిత్రను అంకితమిచ్చి ఉంటాడని పండిత నిర్ణయం. (శ్రీనాథుడు-153-156-కా. శ్రీ. మూ.)

**పంట లింగారెడ్డి**

కాలం : క్రీ. శ. 17వ శతాబ్దం.

స్థలం : తురయూరు.

సాహిత్య పోషకుడు. కృతిపతి. క్రీ. శ. 1632-1667 నడుమ తురయ్యూరును పాలించిన రాజు. పాండ్య భూపాలుని సామంతుడు. రేవూరి అనంతయ్యచేత వృద్ధాచల మాహాత్మ్యాన్ని వ్రాయించి అంకితం పొందాడు.

వెంగునూరులో వృద్ధాచలేశ్వరునికి ఆలయం కట్టించాడు. ఇతని భార్య ఎఱ్ఱాంబికకు కలలో వృద్ధాచలేశ్వరుడు ప్రత్యక్షమై తనకు వెంగనూరిలో ఆలయం కట్టించమని చెప్పాడట. (అరుద్ర-12-90)

**పండరంగని అద్దంకి శాసనము**

కాలం : క్రీ. శ. 848 ప్రాంతం.

గుణగ విజయాదిత్యుని సేనానియైన పండరంగడు వేయించిన శాసనమిది. దీనిలో దేశీ ఛందానికి చెందిన ఒక తరువోజ, తరువాత కొంత వచన భాగం ఉంది. గుణగ విజయాదిత్యుని (తూర్పు చాళుక్య ప్రభువు) ప్రథమ రాజ్య సంవత్సరంలో (క్రీ. శ. 848) శాసనం వేయటం జరిగింది. పండ రంగడు శత్రు రాజులను జయించి, ఆదిత్య భట్టారకుడనే ఆయనకు భూమి దానం చేసిన విషయం ఇందులో వర్ణితం. ఇది చంపూ పద్ధతికి చెందిన శాసనం. (వా. చ-12; తె. వా.)

## పండరి భజనలు

నృత్య ప్రధానమైన భజనలు, పూర్వకాలంనుంచీ ఈ భజనలు తెలుగు దేశంలో ప్రచారంలో ఉన్నాయి. ఈ కళారూపం అసలు మహారాష్ట్ర దేశానికి సంబంధించింది. పండరీ క్షేత్రంనుంచి పండరి భక్తుల ద్వారా దేశమంతా వ్యాపించింది. చేతిలో చిరతలు, నోటితో పాట. పాటకు తగిన అభినయంతో ప్రాముఖ్యం వహించే వాయిద్యాలు డోలక్, మద్దెల, కంజీర, తంబురా, తాళాలు, హార్మోనియం ఉంటాయి. ఈ భజనలు భక్తి రసపూరితమే గాక-వినటానికి ఇంపుగానూ, సొంపుగానూ ఉంటాయి. తెలుగులో చాలా మంది భక్తిపరులయిన కవులు ఈ భజనలకు గీతాలు వ్రాశారు. (నా. వ. ప-31.)

## పండితత్రయము

శ్రీపతి పండితుడు. (క్రీ. శ. 950-1000), శివలెంక మంచన పండితుడు (క్రీ. శ. 1025 ప్రాంతం) మల్లికార్జున పండితుడు (మల్లికార్జున పండితారాధ్యుడు), (క్రీ. శ. 1150 ప్రాంతం) అనే ముగ్గురు పండితులను పండితత్రయ మంటారు. వీరు ఆంధ్ర దేశంలో వీర శైవమత ప్రచారం చేసిన పండితులు.

ఆంధ్ర దేశంలో వీర శైవ మతం రెండు సంప్రదాయాల మూలంగా వ్యాప్తి చెందింది. అందులో మొదటిది అవైదికమైన బసవ సంప్రదాయం లేదా జంగమ సంప్రదాయం. రెండోది సవైదికమైన పండిత సంప్రదాయం. దీన్నే ఆరాధ్య సంప్రదాయమనీ అంటారు. ఆ రెండో సంప్రదాయానికి చెందిన వారినే లింగధారులని కూడా వ్యవహరిస్తారు. ఈ సంప్రదాయపు ప్రవర్తకులయిన శివాచార్యులు ముగ్గురూ తెలుగు దేశంలో పండిత త్రయంగా విఖ్యాతి పొందారు. వీరు, సృష్టి, స్థితి, లయకారులని ప్రసిద్ధి చెందిన బ్రహ్మ, విష్ణు, మహేశ్వరుల ఆధిక్యాన్ని అణగద్రొక్కి- శివుడొక్కడే పైవ మని, త్రిమూర్తుల కందరాని దివ్యలింగ స్వరూపుడని వేదాగమ,శాస్త్రేతి హాస ప్రమాణాల ద్వారా నిరూపించి ఈ సంప్రదాయాన్ని ఆంధ్ర దేశంలో ప్రవర్తిల్ల చేశారు. శ్రీపతి పండితుడు బ్రహ్మవాదులను, శివలెంక మంచన విష్ణు వాదులను. మల్లికార్జున పండితారాధ్యుడు శివుడు కేవలం సంహార కర్తయనే పాక్షిక శైవ వాదులను ఖండించి, శివభక్తిని, శివుని సర్వోత్కృష్టతను ప్రదర్శించారు. వీరు సంస్కృత భాషలో ఉద్దండ పండితు లయినప్పటికీ ఆంధ్ర దేశీయులయిన కారణం వల్ల తెలుగు భాషనే మత వ్యాపనకోసం సాధనంగా గ్రహించి, తెలుగు భాషకు గౌరవాన్ని ఆపాదించారు. వీరు మత ప్రచారం కోసం విశిష్ట మహిమలను ప్రదర్శించి వీరశైవ మతం చిరస్థాయిగా ఉండేటట్లు పరిశ్రమించారు.

చూ. 1. శ్రీపతి పండితుడు 2. శివలెంక మంచన పండితుడు 3. మల్లికార్జున పండితుడు (తె. వి. స-4)

## పండిత మనోభిరామము

కర్త : బేతపూడి కృష్ణకవి.
రచనాకాలం : క్రీ. శ. 18వ శతాబ్దం.

అంకితం : శ్రీశైలాద్రి నాయకునకు.

రసవంతమైన కవిత్వం గల గ్రంథం. (క. స-38)

**పండితారాధ్య చరిత్ర**

కర్త : పాల్కురికి సోమనాథుడు.

శ్రోత : సూరనామాత్యుడు.

విశిష్టత : ఇది సోమన్న చివరికృతి. ద్విపదకావ్యం. మల్లికార్జున పండితారాధ్యుని పుణ్యచరిత్ర. దుర్మతవాద ఖండన, వీరశైవ దీక్షాబోధ, మహిమా ప్రదర్శన, లింగైక్యాలతోపాటు చాలామంది భక్తుల కథలిందులో ఉన్నాయి. కవి కావ్యకళా ప్రౌఢి, బహు భాషా వేతృత్వం ఇందులో కనిపిస్తున్నది. వర్ణనలు అద్భుతంగా ఉంటాయి. ఈ కావ్యాన్ని "తెలుగు జాతి తొలి విజ్ఞాన సర్వస్వం" అంటారు. శ్రీనాథుడు దీనిని పద్య కావ్యంగా వ్రాశాడు. గురురాజకవి సంస్కృతకావ్యంగా వ్రాశాడు. శ్రీశైలంలో భక్తులు పాడుకొనే గేయాలు, సంస్కృతాంధ్ర, కర్ణాటక, మహారాష్ట్రి తమిళ భాషలలో రచించి కవి ఇందులో కూర్చాడు. సూరనామాత్యుడు పాల్కురికి సోమనాథుని బావమరది అనీ, ఈ కృతి అతనికే అంకితమనీ తెలుస్తున్నది.

(అపుద్ర-2; శ. క. చ-33)

**పండితారాధ్య చరిత్రము (అలభ్యం)**

కర్త : శ్రీనాథుడు.

అంకితం : మామిడి ప్రెగడయ్యకు.

ఇది శ్రీనాథుని మూడో రచన. ఇది శృంగారనైషధ కావ్యం కంటె ముందు రచన అని పండితులు నిర్ణయించారు. రచనాకాలం క్రీ. శ. 1382 ప్రాంతం కావచ్చును.

(శ్రీనాథుడు-72-కొ.శ్రీ.మూ)

**పండిపెద్ది కృష్ణస్వామి**

కాలం : క్రీ. శ. 18 వ శతాబ్ది.

రచన : బిల్హణీయము. (కర్తృత్వం సందేహం).

చిత్రకవి సింగరయ్య వ్రాసిన బిల్హణీయ కావ్యాన్ని అతని మరణానంతరం అతని కుమారుడు నరసింహ కవి కృత్యాదినీ, కొన్ని గద్య పద్యాలనూ తీసివేసి ఇతనికి తెచ్చి ఇచ్చాడట. ఇతడు అతనికి కొంత ధనమిచ్చి ఆ కావ్యాన్ని తనపేర వెల్లడించుకొన్నాడని అంటారు. కావ్యాన్నిబట్టి ఇది కృష్ణస్వామి వ్రాసినట్లే ఉన్నా మొదటి ఆశ్వాసంలోని చక్రబంధాన్నిబట్టి చిత్రకవి సింగరయ్య పేరు తెలుస్తున్నదట. (క.స-289)

**పండుపాట**

కర్త : తెలియదు.

జానపద పౌరాణిక గేయం.

చూ. పౌరాణిక గేయములు. (అం.వా.చ)

పంతుల బ్రహ్మయ్యశాస్త్రి

కాలం : క్రీ. శ. 19 వ శతాబ్దం ప్రథమభాగం.

స్థలం : చిట్టివలస, ఆంధ్ర-సంస్థానం.

19 వ శతాబ్దం ప్రథమభాగంలో ఆంధ్ర సంస్థానాన్ని పాలించిన గాదదొర ఆస్థానంలోనూ, ఆ తరువాతి ప్రభువైన రామచంద్రదొర ఆస్థానంలోనూ ఆస్థాన పండితుడుగా ఉన్నాడు. (ఆం సం సా.)

పంతుల వారు

ఇంటిపేరు. ఈ 'పంతుల' శబ్దం ఇంటిపేరుగా ఉన్న కొన్ని కుటుంబాల వారు తెలుగు దేశంలో ఉన్నారు. పంతుల వారు, చిట్టిపంతులవారు, ఎల్లాపంతులవారు, అన్నా పంతులవారు, అనంత పంతులవారు, మధునాపంతులవారు, పరశురామపంతులవారు, కేశవపంతులవారు మొదలగునవి ఈ కోవకు చెందిన ఇంటిపేర్లు.

(భారతి-మా-45-230)

పందిరి వారు

ఇంటిపేరు. గ్రామ సీమలలో వివాహాది శుభ కార్యాలకు, పశువులను చేలలో కట్టివేయటానికి పందిళ్ళు వేయటం కద్దు. పందిరి ఉన్నందు వల్లనో, లేక పందిరి వేసినందు వల్లనో-మరి ఏ కారణం చేత వచ్చిందోకాని "పందిరి" కొందరి ఇంటి పేరుగా నిలిచిపోయింది. పందిరి వారు గోదావరి మండలంలో ఉన్నారు. (భారతి-మా-45-230)

పగటి వేషాలు

నామాంతరం : బహురూపాలు.

ఇవి అతిప్రాచీన కాలం నుంచి దేశంలో ప్రచారంలో ఉన్నాయి. గూఢ చారులు మారువేషాలు వేసి రత్నాలు, పచ్చలు, కెంపులు అమ్మే వర్తకులుగాను, ఖరీదైన చీరెలను అమ్మే వర్తకులుగాను-శత్రువుల కోటలలో చొరబడి వంచించటం-కోటలోని గుట్టుమట్టులు తెలుసు కోవడం చరిత్రలో కనిపిస్తుంది.

యథావాక్కుల అన్నమయ్య, పాల్కురికి సోమన్న వీటిని తమ కావ్యాలలో పేర్కొన్నారు. "ఢిల్లీ సుల్తాన్ పట్టుకపోతాన్" అని కాకతీయుల మహా మంత్రి యుగంధరుడు కూడా పగటి వేషం వేశాడంటారు.

పౌరాణిక, చారిత్రక, సాంఘిక వేషాలను వేసి ప్రజలను ఆశ్చర్యపడేటట్లు చేయటమే వీటి ఉద్దేశం. జానపదులకు చక్కని వినోదాన్నందించే పగటి వేషాలు నేడు క్షీణ దశలో ఉన్నాయి. (నా.ర.చ-225)

పచ్చకప్పురపు తిరువేంగళ కవి

కాలం : క్రీ. శ. 1530 ప్రాంతం.

స్థలం : దక్షిణ దేశంలోని రామనాథపురం జిల్లా.

రచన : చొక్కనాథ చరిత్ర (ద్విపద) (చౌషష్టిలీలా విలాసము).

తిప్పరాజు కుమారుడు. తిమ్మరాజు పౌత్రుడు. చొక్కనాథుని (హాలాస్యుని) లీలలు తెలుగులో చెప్పిన మొదటి కవి ఇతడే. రామనాడు, తిరుపత్తూరు సీమలను ఏలిన గోక్క, పెదరామప్ప, చినరామప్పల కాలంవాడు. ఇతని పూర్వీకులు ప్రౌఢ దేవరాయలను మెప్పించి పచ్చకప్పురం బహుమతిగా పొందారట. అందువల్ల ఈ పౌరుష నామం సిద్ధించింది. ప్రౌఢంగా కవిత చెప్పటమే కాక కవిత్వం ఎలా ఉండాలో కూడా చెప్పాడు. (ద దే.వా-18)

## పచ్చకప్పురపు వారు

ఇంటి పేరు. ప్రౌఢ దేవరాయల కాలంలో తిమ్మరాజు అనే ఆయన తన చదువులతో ప్రౌఢ దేవరాయలను మెప్పించి "పచ్చకర్పూరం" బహుమానంగా అందుకొన్నాడట. ఆరోజు నుంచి ఈ వంశం వారికి "పచ్చకర్పూరం" వారనేది ఇంటి పేరయింది.

(ఆరుద్ర-9)

## పచ్చమెట్ట పాపకవి

కాలం : క్రీ. శ. 19 వ శతాబ్దం.
స్థలం : విశాఖ మండలంలోని కోనాడ గ్రామం.
రచనలు : కామయచంద్రా శతకం, మహిషాసుర మర్దనీ శతకం, రామాయణ సుందరకాండ దండకం—చాటు పద్యాలు మొదలగునవి.

ఇతని కాలం 1765-1840 అంటున్నారు. పగటపల్లి కామయ్య (1765-1834) అనే వణిక్ శ్రేష్ఠుని మీద ఒక శతకం చెప్పి అతని నుండి సన్మానాలను పొందాడు. కోనాడ గ్రామం విజయనగరం సమీపంలో ఉన్నదట. ఇతని రచన చక్కనిది.

(కవి సంశయ విచ్ఛేదం - పీఠిక-15)

## పచ్చిపులుసు వారు

ఇంటి పేరు. వంటకాల పేర్లతో ప్రసిద్ధమైన ఇంటి పేర్లలో ఇది ఒకటి.

(భారతి-మా-45-230)

## పచ్చిమిరియం ఆదియప్పయ్య

కాలం : క్రీ. శ. 18 వ శతాబ్దం.
స్థలం : తంజావూరు.
రచనలు : పదాలు.

వేంకట రమణ ముద్రతో కీర్తనలు రచించాడు. త్యాగరాజు ఇతని వద్ద రాగ తాళలయాది విషయాలలో తనకు కలిగిన సందేహాలు తీర్చుకొనేవాడట. తంజావూరును పాలించిన మహారాష్ట్రరాజులు ప్రతాప సింహుడు (1739-62) తులజాజి (1762-82) ల కాలంలో ఇతడున్నాడు. (శారదాధ్వజం-165)

## పటుగుణాభిరామ పరశురామ శతకము

కర్త : పరశురామ పంతుల రామమూర్తి కవి.

ఈ పేరుతో, ఈయన వ్రాసినవే రెండు శతకాలున్నాయని పండితులు అంటున్నారు. (తె. వి. స-6-769)

## పట్టుమట్టు సరస్వతీ సోమయాజి

కాలం : క్రీ. శ. 17 వ శతాబ్దం ఉత్తరార్థం.
స్థలం : గోదావరీ మండలం.
రచన : పృథు చరిత్రము.
గురువు : శివలెంక గౌరన.

ఈయన దక్షారామ ప్రాంతంవాడు కావచ్చును. పట్టుపట్టు సోమనాథ కవి వంశీయుడు. పోతనామాత్యుని మనుమడు. శాస్త్రవైదుష్యం గల కవి. శబ్దార్థాలంకారాలతో కూడిన మనోహరమైన రచన చేశాడు. (తె వి.స-6)

## పట్టుమట్టు సోమనాథ సోమయాజి

కాలం : క్రీ. శ. 16 వ శతాబ్దం – ఉత్తరభాగం.
స్థలం : దోమకొండ సంస్థానం – వెలవలపల్లి గ్రామం.
గురువు : లింగారాధ్యుడు.
రచనలు : సూతసంహిత, బ్రహ్మోత్తర ఖండము.

దోమకొండ సంస్థానాన్ని పాలించిన కామినేని కామిరెడ్డి ఆస్థానంలోనివాడు. వెంకటామాత్యుని పుత్రుడు. (ఈ కామిరెడ్డియే "అబ్దుల్లా హుసేన్ కుతుబ్‌షాహి" చేత సంస్థానం సన్నదును సంపాదించాడు).

ఈతడు విద్వత్కవి. ఘడియకు నూరుశ్లోకాలు చెప్పేవాడు. సంస్థానప్రభువైన కామిరెడ్డి ప్రేరణతో సూతసంహితను ఆంధ్రీకరించాడు. కామిరెడ్డి తమ్ముడైన కామినేని ఎల్లారెడ్డి ప్రోత్సాహంతో "బ్రహ్మోత్తర ఖండం" వ్రాశాడు. సూతసంహిత ఇతని ప్రథమ రచన.

ఈ కవి అవధానాలు చేసేవాడు. వ్యాకరణ, తర్క, వేదాంత శాస్త్రాలు బాగా చదువుకొన్న పండితుడు. కవిత్వం గంగాప్రవాహం వలె ఉండాలన్నాడు. యజ్ఞం చేశాడు. తెలుగు కవులలో తిక్కన తరవాత యజ్ఞంచేసి సోమయాజి అయిన వాడీతడే!

(ఆరుద్ర-9-213; ఆం.సం.సా-183)

## పట్టాభి రామకవి

చూ. రాళ్ళబండి పట్టాభి రామకవి.
కాలం : నిర్ధారణ కాలేదు.
రచనలు : 1. మరున్నందన శతకము 2. వజ్రపంజర శతకము 3. గువ్వల చెన్న శతకము 4. మలరాజుగుండా రాయణోపాఖ్యానము(అలభ్యం) 5. శమంతకోపాఖ్యానము (అలభ్యం) 6. కవి సర్పగారుడము (అలభ్యం) 7. కవి మూషిక మార్జాలము (అలభ్యం).

విశిష్టత : పై గ్రంథాలన్నీ ఈయనవిగా వైయాకరణం గోపాల జయదేవ రాజు చెప్పాడని శతక కవుల చరిత్రకారుడు చెప్పాడు. మదన్నందన, వజ్రపంజర శతకాలనుంచి అప్పకవి కొన్ని పద్యాలను ఉదహరించాడు. (గువ్వల చెన్నుని మీద అల్లసాని పెద్దన కూడా పద్యాలను చెప్పాడని బ్రౌన్, ఆయన పండితులు వ్రాశారు.) చివరి నాలుగు గ్రంథాలు దొరకలేదు. ఈ కవి మల్రాజు గుండారాయణోపాఖ్యానం వ్రాశాడన్న కారణంగా ఇతడు నరసరావుపేట సంస్థానానికి చెందినవాడనీ, క్రీ. శ. 19 వ శతాబ్దంలో రాజా మల్రాజు పెద వెంకట గుండా రాయణిం గారి ఆశ్రితుడనీ కొందరు అంటున్నారు. అప్పకవి ఇతన్ని ఉదహరించినందువల్ల ఇతడు అప్పకవికి పూర్వుడని (క్రీ. శ. 1656 కు పూర్వుడు) కొందరి అభిప్రాయం. ఈ కవులు భిన్న వ్యక్తులు కావచ్చును.

(క.స-117; ఆరుద్ర-9; ఆం.సం.సా-194)

### పట్టాభిరామ పండితీయము

రచనాకాలం : క్రీ. శ. 1760-1820 నడుమ.

కర్త : వేదం పట్టాభి రామశాస్త్రి.

ఇది ఆంధ్రశబ్ద చింతామణికి పద్యరూపంలో ఉన్న పెద్ద వ్యాఖ్యానం. వ్యాకరణ గ్రంథం. దీనిని 1951 లో వావిళ్ళవారు ప్రకటించారు. దీనిని తొలుత ఫోర్ట్ సెంట్ జార్జి కళాశాల విద్యార్థుల కోసం వ్రాశారట. (తె. వి. స-4)

### పట్టాభి రామయ్య

కాలం : క్రీ. శ. 18 వ శతాబ్దం.

సంస్థానం : వెంకటగిరి.

రచన : లీలావతీ దండకము.

వెంకటగిరి సంస్థానాన్ని పాలించిన కుమార యాచమనాయని (1777-1804) కి ఆశ్రితుడు. లీలావతీ దండకం రచించి ఈ ప్రభువుకే అంకితం చేశాడు.

(ఆం. సం. సా-459)

### పట్టాభి రామాయణము

కర్త : ఘట్టు వేంకటరామకృష్ణమాచారి.

యక్షగానం. (వా.చ;వం.సు-271)

### పదకండ్ల గురురాజ కవి

కాలం : క్రీ. శ. 19 వ శతాబ్ది పూర్వార్ధం.

స్థలం : బళ్ళారి ప్రాంతం.

రచనలు : శేషధర్మములు, పద్మావతీ పరిణయము, అనిరుద్ధ చరిత్రము, రుక్మిణీ పరిణయము, గుణాలంకార మణిమాలిక, రాఘవేంద్రాష్టకము, చాటు పద్య సహస్రము, భర్తృహరి శతకములకు ఆంధ్రీకరణం. ఇతడు కొన్ని కన్నడ కృతులు కూడా రచించాడట.

ఈ కవి ఆంధ్ర కర్ణాట భాషలలో పండితుడు. రెండు భాషలలోనూ రచనలు చేశాడు. అనిరుద్ధ చరిత్ర, పద్మావతీ పరిణయాలను నాటకాలుగా రచించినట్లు చెప్పుకొన్నాడు. (క.స-57)

## పతంజలి చరితమ్ (సం)

కర్త : రామభద్ర దీక్షితుడు.

ఎనిమిది సర్గల కావ్యం ఇందులో ఆదిశేషుడు పతంజలిగా అవతరించి మహాభాష్యాన్ని రచించడం, మొదలైన వృత్తాంతాలున్నాయి. (తె.వి.స-6-222)

## పతిత పావన చరిత్ర

కర్త : యడవల్లి వేంకటకవి (చూ).

పద్యకావ్యం. (ఆరుద్ర-12-84)

## పతివ్రతా ధరణము

కర్త : కొటికెన నాగయకవి.

పద్యకావ్యం. (ద.దే.వా-పీఠిక-7)

## పత్తి రమణప్ప కవి

కాలం : క్రీ. శ. 19 శతాబ్దం ప్రథమ భాగం.

స్థలం : సాతులూరు, నర్సారావుపేట తాలూకా.

రచనలు : వేంకటరమణ శతకము, విష్ణుసర్వోత్తమ శతకము.

శ్రీనివాసరావు పుత్రుడు. 1820 ప్రాంతాలలో ఉన్నట్లు తెలుస్తున్నది. ఇతని రచనలు ముద్రితాలట. (క.స-181)

## పద మంజరి [సం]

కర్త : కవి భల్లటుడు (చూ).

అలభ్యం. కాని దీనిలోని శ్లోకాలను కందుకూరి వీరేశలింగం, కస్తూరి రంగకవి ఉదాహరించారు. ఇది సంస్కృత గ్రంథం కావచ్చు. (ఆరుద్ర-4)

## పద్ధతి

కావ్యపరిభాష. సూత్రవృత్తిని వాగా వివేచనం చేయడాన్ని పద్ధతి అంటారు

చూ. సూత్రము, వృత్తి.

## పద్మకవి (పంపకవి)

కాలం : క్రీ. శ. 941 ప్రాంతం.

స్థలం : వేంగిపురం.

రచనలు : 1. ఆదిపురాణము (కన్నడం) 3. విక్రమార్జున విజయము (కన్నడం) 3. జినేంద్రపురాణము.

ఇతడు వేంగిపుర నివాసి. కన్నడంలోనూ తెలుగులోనూ రచనలు చేశాడు. ఇతడే కన్నడ భారతాన్ని రచించిన పంపకవి అని కొందరు అంటున్నారు. ఇతడు కన్న

షంలో ఆది కవిగా కన్నడకవి సార్వభౌమునిగా పేరు పొందాడు. ఇతని విక్రమార్జున విజయ గ్రంథమే కన్నడ భారతం. ఇతని జినేంద్ర పురాణాన్ని ప్రబంధ రత్నావళి పేర్కొన్నది. ఇతర తెలుగు రచనలు లభించలేదు. (వా. చ; వం. సు.)

### పద్మనాభ యుద్ధము

నామాంతరం : "విజయరామ యశోభూషణము".

కర్త : మా. పాటూరి లక్ష్మీ నరసకవి.

ప్రముఖ చారిత్రక కావ్యం. క్రీ. శ. 1794 జులైలో కుంఫిణీ వారికీ, విజయనగరం విజయరామ గజపతికీ జరిగిన యుద్ధము చాలా ప్రసిద్ధమైంది. దీనికే పద్మనాభ యుద్ధమని పేరు. ఆ యుద్ధానికి సంబంధించిన గాథ ఈ కావ్యంలోని ఇతివృత్తం. చారిత్రక కావ్యమైన "రంగరాయ చరిత్ర" వలెనే ఇదికూడా అత్యంతప్రఖ్యాతమైన గ్రంథం ఇది పద్య రచన అయినప్పటికీ అనేక వ్యావహారిక పదాలు, అన్యదేశ్య పదాలు వాడబడ్డాయి.

రామతీర్థంలో వెలసిన సీతారామ స్వామికి ఈ గ్రంథం అంకితం ఇవ్వబడిందని కొందరి అభిప్రాయం. కాని, ఈ విషయంలో వివాదాలున్నాయి.

(ఆం సం. సా-419)

### పద్మనాభయ్య

కాలం : 19వ శతాబ్దం.

స్థలం : జంగాల గ్రామం (గుత్తిరాజ్యంలోనిది).

సాహిత్యాభిమాని. ఫణియప్ప పుత్రుడు, ఫణియప్ప జంగాల గ్రామానికి అధిపతియట. జంగాల గ్రామాన్ని సదాశివరాయలు అగ్రహారంగా వీరి పూర్వీకులకు ఇచ్చి ఉంటాడని ఊహిస్తున్నారు.

ఈ పద్మనాభయ్య దొడ్డి నరసింహ కవిని ప్రోత్సహించి అతని చేత కరియ బంటుని కథను యక్షగానంగా రచింప చేశాడు. (య. వా. చ-74)

### పద్మ నాయక చరిత్ర

కర్త : కస్తూరి రంగకవి.

చారిత్రక పద్యకృతి. ఇది అనువాదమట. దీనికి మూలం బడబాగ్నిభట్టు సంస్కృతంలో రాసిన పద్మ నాయక చరిత్ర. (ద. దే. వా-252)

### పద్మ పురాణము

కర్త : కామినేని మల్లారెడ్డి.

అంకితం : సిద్ధరామేశ్వర స్వామికి

సంస్కృత పురాణంలోని కొంత భాగానికి ఆంధ్రీకరణం.

విశిష్టత : గణేశ్వరుడనే గోలకొండ నవాబుల ఆస్థానకవి ప్రోత్సాహంవల్ల మల్లారెడ్డి ఈ కావ్యం వ్రాశాడు. కవి "సంస్కృతాంధ్ర భాషా వర కావ్య కల్పన"

విచక్షణ ఉన్నవాడు. తెలుగు కవులెవరూ ఆంధ్రీకరించని పద్మపురాణంలోని శివరాఘవుల కథను చెప్పాడు. పరమ శివుడు "శంభు భట్టారకుడు" అనే పేర అయోధ్యానగరం ప్రవేశించి శ్రీరామ చంద్రునికి వినిపించిన పురాణ కథాసారం ఈ గ్రంథం లోని విషయం. దీనిలో కవి శబ్ద ప్రీతి కనిపించదు. కథలు రమ్యంగా ఉన్నాయి. నాలుగో ఆశ్వాసంలో రామకథ సంక్షిప్తంగా ఉంది. కవి షట్చక్రవర్తి చరిత్ర, శివధర్మోత్తరాలలో శ్లేషపై మొగ్గినా, ఈ గ్రంథంలో మృదు భావాలకే ప్రాధాన్యమిచ్చాడు. వాల్మీకి రామాయణ కథకు దీనిలోని రామాయణ కథకు కొంత భేదముంది. కవి ప్రతిభతోపాటు పాండిత్యం ఈ కావ్యంలో కనిపిస్తుంది. ఇది మల్లారెడ్డి కావ్యాలలో పరిణత కావ్యమని పండితాభిప్రాయం. రచన రసవంతంగా ఉంది. (తె. వి. స-6; ఆప్ర-9-217; ఆం. సం. సా-182)

## పద్మపురాణ సంగ్రహము (అలభ్యం)

కర్త : కమలనాభామాత్యుడు.

ఈ కావ్య ప్రసక్తి శ్రీనాథుని కాశీఖండంలోను, భీమఖండంలోను ఉంది. కర్త శ్రీనాథునికి తాత అట.

## పద్మపురాణోత్తర ఖండము

కర్త ; మడికి సింగన,
రచనాకాలం : క్రీ. శ. 1420 ప్రాంతం.
కృతిభర్త : కందనామాత్యుడు.

విశిష్టత : పదకొండు ఆశ్వాసాల చంపూకావ్యం. ధర్మార్థకామమోక్షప్రద మైనది, విష్ణు కథా ప్రధానమైనదీ పద్మపురాణం. ఇందులో భాగవత రామాయణ గాథలు ఎక్కువ "మాఘ స్నానాల" మహిమను ఈ గ్రంథం చాటి చెబుతుంది. రుక్మిణీ కల్యాణ ఘట్టంలో, ఈ గ్రంథంలో రుక్మిణి పురోహితుని కొడుకు చేత కృష్ణునికి రాయబారం పంపినట్లున్నది. శైలి సరళంగాను సుబోధకంగాను ఉంది. (ఆరుద్ర-4)

## పద్మపురాణ చంపువు

నామాంతరం : బాలభాగవత చంపువు.
కర్త : అవసరాల పద్మరాజు. (ఆం. సం. సా-247)

## పద్మరాజు

కాలం : 19వ శతాబ్దం.
స్థలం : పిఠాపురం సంస్థానం.
రచన : బాలభాగవతము. (సం)

ఈ కవి పిఠాపురాధీశ్వరుడైన నీలాద్రిరావు దగ్గర మంత్రి.
(తె. వి. స-6-244)

## పద్మవ్యూహము

చూ. పౌరాణిక గేయములు.

మహాభారతంలోని "పద్మవ్యూహం" తెలుగువారి పలుకుబడులలో ధ్వని ప్రధానంగా నిలిచిపోయింది. ఏదైనా చిక్కు సమస్యను ఎదుర్కొన్నప్పుడు పద్మవ్యూహంతో పోల్చటం తెలుగువారి అలవాటు. "పద్మవ్యూహం పదిమందితో చావు పెండ్లితో సమానం" అనే సామెతకూడా వాడుకలో ఉంది.

కురుపాండవ సంగ్రామంలో పద్మవ్యూహంలో ప్రవేశించి బయటికి రావడం తెలియక అందులో చిక్కుకొని వీరమరణం పొందిన అభిమన్యుని గాథ గేయరూపంలో ప్రసిద్ధికెక్కింది చూ. పౌరాణిక గేయములు. (అం.వా.వ.)

## పద్మాకరుడు

కాలం : క్రీ. శ. 1753-1833.

జన్మస్థలం : బుందేలు ఖండ్‌లోని సాగరగ్రామం.

రచనలు : హిందీ భాషలో ఉన్నాయి. జగద్వినోదము, అలీజాహ ప్రకాశ, హితోపదేశము (అనువాదం), గంగాలహరి, రామరసాయన్, ప్రబోధ పచాసా మొదలగునవి.

హిందీ మహాకవులలో పేరుపొందిన ఆంధ్రుడు. ఇతని పూర్వులు గోదావరీ మండలంనుంచి వెళ్ళి ఉత్తర హిందూస్థానంలో స్థిరపడి అచటి రాజులకు గురువులైనారు.

ఇతడు మంత్రతంత్ర శాస్త్రాలలో ప్రవీణుడు. బుందేలు ఖండ్, జయపురం గ్వాలియరు సంస్థానాలలో సమ్మానింపబడ్డాడు. అతని చాటువులు నేటికీ ఉత్తర హిందూస్థానంలో ప్రచారంలో ఉన్నాయి. (తె.వి.స-4-916)

## పద్మావతి

కాలం : క్రీ. శ. 1075-1081 ప్రాంతం.

శాసన ప్రదాయిని : దక్షారామ శాసనం.

స్థలం : దక్షారామం.

ఈమె కళింగవంశ గంగరాజు దేవేంద్రవర్మకు దండనాయకుడైన బణపతి అర్ధాంగి. ఈమె భర్త ప్రసిద్ధిపొందిన దీర్ఘాసి శాసనకర్త. దక్షారామ భీమేశ్వరునికి 'అఖండ దీపం' నెలకొల్పి శాసనం వేయించింది. (తె.క.చ-187)

## పద్మావతీ కల్యాణము (అలభ్యం)

కర్త : నెల్లూరి ముత్తరాజు.

అలభ్యం. ఈ కావ్యం నుంచి ఒక పద్యాన్ని పెదపాటి జగ్గన్న తన ప్రబంధ రత్నాకరంలో ఉదాహరించాడు. ఈ పద్యం విరహంలో ఉన్న కథానాయికను సఖి ఊరడిస్తున్న ఘట్టం లోనిది. (ఆరుద్ర-9)

## పద్మావతీ చరిత్ర (అలభ్యం)

కర్త : తెలియదు.

కాలం : క్రీ. శ. 1670 కి పూర్వ రచన.

రత్నాకరం గోపాలరాజు ఈ కావ్యాన్ని పేర్కొన్నాడు. (అరుద్ర-12-191)

## పద్మావతీ దక్షారామ శాసనము

కాలం : క్రీ. శ. 1075-1081 ప్రాంతం.

స్థలం : గోదావరీ మండలం-దక్షారామం.

శాసనప్రదాయిని : పద్మావతి.

ఈమె దీర్ఘాసి శాసన ప్రసక్తుడైన బణపతి (వనపతి) భార్య.

శాసన విషయం : దక్షారామ భీమేశ్వరునికి అఖండ దీపం నెలకొల్పటం. దీనిలోని సీస పద్యానికి 8 పాదాలుండి, చివర ఆట వెలది ఉంది. ఒక్క పాదంలో తప్ప తక్కిన వాటిలో ప్రాసయతి పాటించబడింది.

దీర్ఘాసిలోని దుర్గ గుడిలో నాట్యమండపం కట్టించడం ఇందులో ప్రసక్తం. (తె.క.చ-187)

## పద్మావతీ పరిణయము (అలభ్యం)

కర్త : పడకండ్ల గురురాజ కవి.

నాటకమట. ఈ కవి రచించిన శేషధర్మములనే కృతిలో దీని ప్రసక్తి ఉంది. (క.స-57)

## పద్మావతీ పరిణయమ్ (సం)

అంకితం : బొమ్మరాజు (కార్వేటినగర సంస్థాన పాలకుడు) కు.

సంస్కృత ప్రబంధం. చంపూ రచన. క్రీ. శ. 19 వ శతాబ్దం ఉత్తరార్థంలో కార్వేటినగర సంస్థానాన్ని పాలించిన రాజా బొమ్మరాజు బహద్దరుకు అంకితమివ్వబడింది. క్రీ. శ. 1890 లో ఈ సంస్థానాధీశుల స్వకీయ శ్రీభారతీలీలాసదన ముద్రాక్షరశాలలో బొమ్మరాజు ఆజ్ఞచేత ముద్రితమైంది. (అం.సం.సా.)

## పద్మావతీ వివాహము

నామాంతరం : భానుమద్విజయము (చూ).

కర్త : వెలగపూడి కృష్ణయామాత్యుడు.

కథానాయిక పద్మావతి పేర దీనికీ పేరుండినట్లు బ్రౌన్ దొర వ్రాతల వల్ల తెలుస్తున్నది.

## పద్మినీ కన్యకాభ్యుదయము

కర్త : మరింగంటి వేంకట (ప్రథమ) నృసింహాచార్యులు.

(తె. వి. స-8)

## పద్మినీ దండకము

కర్త : లక్ష్మీశదాసు.

కూర్మేటి కొండరాజు పుత్రుడైన రాయప్ప ప్రోత్సాహంతో దీన్ని రచించాడు. (వా.చ;వం.ను-386)

**పద్మినీ పరిణయము**

కర్త : ఉన్నవ యోగానందుడు.

ఈ గ్రంథం ముద్రితమేగాని నేడు అలభ్యం. (శ.క.చ–476)

**పద్మినీ పరిణయము (అలభ్యం)**

కవి : తిరుమలనాథ కవి. (ద.దే వా–289)

**పద్మినీ వల్లభము (అలభ్యం)**

కర్త ; బొడ్డపాటి పేరయ్య.

అలభ్యం. "సూర్యా ! పద్మినీ వల్లభా" అనే మకుటంతో దీనిలోని పద్యాలున్నాయి. లభించిన ఒక పద్యాన్ని పెదపాటి జగ్గన్న తన "ప్రబంధ రత్నాకరం"లో ఉదహరించాడు. ఇది ప్రబంధం కావచ్చు. ఆరుపద్యాలు మాత్రం దొరికాయి. (ఆరు|ద–9)

**పద్యనీతి**

నామాంతరం : నీతిసార ముక్తావళి.

కవి : (చూ.) బద్దెన. (ద.దే వా–317)

**పద్యాంధ్ర వ్యాకరణము**

నామాంతరం : పట్టాభిరామ పండితీయము.

కర్త : వేదం పట్టాభి రామశాస్త్రి.

తెలుగు వ్యాకరణం పద్యరూపంలో ఉంది. (తె.వి స–4)

**పద్యాంధ్ర వ్యాకరణము**

రచనాకాలం : క్రీ. శ. 1840 ప్రాంతం.

కర్త : పరవస్తు చిన్నయసూరి.

బాలవ్యాకరణ రచనకుముందు నాలుగు వ్యాకరణ గ్రంథాలు చిన్నయసూరి వ్రాశాడు. అందులో ఇది మొదటిది.

ఇది ఒక్క ప్రకరణం మాత్రమే వ్రాయబడింది. పద్యరూపంలో ఉంది. (రమణీయం పీఠిక)

**పరతత్త్వ ప్రకాశిక**

రచనాకాలం : క్రీ. శ. 1800 ప్రాంతం.

కవి : పెనుమెత్స బుచ్చిరాజు.

వేదాంత గ్రంథం. ఎనిమిదాశ్వాసాలున్నాయి. దీనికి భాగవతంలోని "కపిల దేవహూతి సంవాదము" ఆధారమట. (క.స–146)

**పరతత్త్వ రసాయనము**

కర్త : ఈశ్వర భట్టు.

రచనాకాలం : క్రీ. శ. 1450–1500 ప్రాంతం.

కృతికర్త : సదానందావధూత (యోగి).

విశేషత : ఐదాశ్వాసాల పద్య ప్రబంధం. భారతంలో మోక్షసాధనాన్ని ఉపదేశించమని ధర్మజుడు,భీష్ముని అడిగే సందర్భాన్ని పురస్కరించుకొని, హరసనత్కుమార సంవాదాన్ని ఆధారం చేసుకొని కథ ప్రబంధ ధోరణిలో నడుస్తుంది. ఇందులో కర్మయోగ సాంఖ్యయోగ, యోగతంత్ర, రాజయోగ, భక్తియోగాలు సుబోధకంగా ఉంటాయి. సందర్భోచితంగా పట్టణారణ్య వర్ణనలు దీనిలో ఉన్నాయి. ఆధ్యాత్మిక విషయమైనా కావ్యం ఆహ్లాదకరంగా ఉంటుంది. కోరాడ రామకృష్ణయ్యగారు, లక్ష్మీపతిశాస్త్రిగారు దీనికి విపులమైన పీఠికలు వ్రాశారు. (క. త-6-241)

## పరమ భాగవత చరిత్ర (అలభ్యం)

కర్త : ఆలూరి కుప్పన్న. (ప. దే. వా-250)

## పరమ భాగవత చరిత్ర

కర్త : కట్టా వరదరాజు.

అంకితం : తిరుపతి వేంకటేశ్వరునికి.

ఎనిమిది ఆశ్వాసాల ప్రబంధం. రెండాశ్వాసాలు మాత్రం నేడు లభిస్తున్నాయి. రసవంతమైన రచన పద్నాలుగు మంది పరమ భాగవతుల కథలున్నాయి. ఒక ఆశ్వాసంలో పుండరీకుని కథ ఎనిమిదో ఆశ్వాసంలో రుక్మాంగద చరిత్ర ఉన్నాయి. పరాశరుడు, నారదుడు, ప్రహ్లాదుడు వ్యాసుడు, అంబరీషుడు, శుకుడు, శౌనకుడు, భీష్ముడు, దాల్భ్యయనుడు, అర్జునుడు, వసిష్ఠుడు, విభీషణుడు, పుండరీకాక్షుడు, రుక్మాంగదుడు పరమ భాగవతులుగా ప్రసిద్ధులు. (ఆరుద్ర-10-187)

## పరమ భాగవత చరిత్ర (అలభ్యం)

కర్త : గణపవరపు వేంకటకవి.

వచన ప్రబంధం. కవి రచించిన "ప్రబంధ వేంకటేశ్వర విజయ విలాసం"లో పేర్కొనబడింది. (క. త-12-232)

## పరమ భాగవత చరిత్ర (అలభ్యం)

కర్త : తిరుమలనాథ కవి (చూ.)

## పరమయోగి విలాసము

రచనాకాలం : 16వ శతాబ్దం.

కర్త : తాళ్ళపాక చిన్నన్న.

అంకితం : శ్రీ వేంకటేశ్వర, అలివేలు మంగలకు.

ఎనిమిది ఆశ్వాసాల ద్విపద కావ్యం. వేంకటేశ్వరుడు స్వప్నంలో కనబడి కవిని రచనకు ప్రోత్సహించాడట. ఈ కావ్యం 1530-50 ల నడుమ రచింపబడి ఉంటుందని భావిస్తున్నారు. పన్నెండుగురు ఆళ్వారుల గురించీ, వైష్ణవ మత ప్రవక్తల

గురించీ ఇందులో విపులంగా ఉంది. నిర్దుష్టమైన ధారాశుద్ధిగల రచన. తరువాతి కవులనేకు లకు ఇది మూలగ్రంథమైంది. (క. స-89; తె. వి. స-4)

**పరమయోగి విలాసము**

రచనాకాలం : క్రీ. శ. 16 వ శతాబ్దం.
కర్త : సిద్ధిరాజు తిమ్మరాజు.
అంకితం : మంగళగిరి పానకాంస్వామికి.

ఇది పద్య కావ్యం. అయిదాశ్వాసాలున్నాయి. 1500-64 నడుమ ఈ రచన జరిగి ఉండవచ్చును.

ప్రత్యేకత : వైష్ణవ మతంలో 12 మంది ఆళ్వారులను దివ్యసూరులని, పరమ యోగులని అంటారు. తెలుగులో వీరిని "ఏలిన వారు" అంటారు. అసలు ఆళ్వారులు 12 మంది అయితే కవి వారిని 15 కి పెంచి, వారి దివ్య చరిత్రలు వ్రాశాడు. దివ్య సూరుల చరిత్రలు, రామానుజాచార్యుల చరిత్ర, ఈ పరమయోగి విలాసంలో చెప్ప బడ్డాయి. తన కావ్యం ఉద్యన్నవ భావ బంధురమనీ, రసాన్వయమనీ, సన్నుత శబ్ద శుద్ధి గలదని కవి చెప్పుకొన్నాడు. దీనిలో నుంచి అప్పకవి ఒక ప్రయోగాన్ని ప్రమా ణంగా అంగీకరించి ఉదాహరించాడు. ఈ పరమయోగి విలాసాన్ని ఇదే పేరుతో తాళ్ళ పాక చిన్నన్న ద్విపద కావ్యంగా వ్రాశాడు.

ఇందులోని మూడో ఆశ్వాసంలోని విప్రనారాయణ కథను తర్వాతి కవులు ప్రత్యేక కావ్యాలుగా వ్రాశారు. (క.స-86; ఆరుద్ర-9)

**పరమానంద కవి**

కాలం : క్రీ. శ. 18 వ శతాబ్దం.
ఆస్థానం : క్రీ.శ. 1712-1728 నడుమ తంజావూరును పాలించిన శరభోజీఆస్థానం.
రచన : శివభారతమ్ (సం).

సంస్కృతాంధ్ర భాషా కోవిదుడు. ఇతని శివ భారతం ఛత్రపతి శివాజీ వృత్తాంతాన్ని తెలిపే రచన. (ద.దే.వా-242)

**పరమానంద తీర్థులు**

కాలం : క్రీ.శ. 1590 ప్రాంతం.
స్థలం : తంజావూరులోని చంపకారణ్య క్షేత్రం.
రచనలు : 1. సంపగిమన్న శతకము 2.దత్తాత్రేయ శతకము 3. అనుభవ దర్పణము 4. శివజ్ఞాన మంజరి 5. ముక్తికాంతా పరిణయము 6. బ్రహ్మ విద్యా సుధార్ణవము 7. వివేక చింతామణి 8. ఉపదేశ క్రమము 9. శివముకుంద పరమానంద శతకము 10. వేదాంత వార్తికము.

దత్తాత్రేయ గురుపరంపర లోని వాడు. పరమహంస పరివ్రాజకాచార్యుడు. క్రీ.శ. 1586 నుంచి కర్ణాటక రాజ్యాన్ని పాలించిన వేంకటపతిరాయల ఆశ్రితు డైన తరిగొప్పుల మల్లన్న (చంద్రభాను చరిత్ర కర్త) కూడా దత్తాత్రేయ యోగి

శిష్యుడే. కవిట్టి ఈయన ఆ రాజుకు. కవికి సమకాలికుడు కావచ్చు.

ఇతని వచన కావ్యాలు ఉపదేశ ప్రధానం. బ్రహ్మవిద్యా సుధార్ణవంలో ఒక్కొక్కటి వ్యావహారిక వచన ముంచి ఉపమానంచి రతికిం, సుమంగమున్న కటికాలు అచ్చు పడి తెలుగు దేశంలో బాగా ప్రచారం పొందాయి.

(ఆరు ప్ర-3-2.8; శారదావ్యాజం-120)

## పరమానంద బోధ ప్రకరణము

కర్త : దాస గోస్వామి.
రచనాకాలం : క్రీ.శ. 1580 ప్రాంతం.

వేదాంత వచన గ్రంథం. ప్రకరణాలుగా విభజింపబడింది. కర్త దీన్ని మొదట మహారాష్ట్రి భాషలో వ్రాసి తర్వాత తెనిగించాడు. గోపాలభట్టు అనే శిష్యునికి దీన్ని ఉపదేశించాడని అంటారు. గహనమైన వేదాంత విషయాలు సులభంగా సుగమంగా చెప్తున్న రచన. దాస గోస్వామి దత్తాత్రేయయోగి శిష్యుడనీ గురుముఖంగా తాను గ్రహించిన విషయాలను ఈ రూపంలో గ్రంథస్థం చేశాడనీ కూడా అంటారు.

(క.స-94; వ.వా-33)

## పరమానంద శతకము

కర్త : పరమానంద తీర్థులు.
కాలం : క్రీ. శ. 16వ శతాబ్ది.

ప్రత్యేకత: ఇది తెలుగుదేశంలో బాగా ప్రచారం పొందిన శతకం. శతకకర్త వేదాంతి, యోగి. శివకేశవులకు అభేదం కల్పించి వ్రాశాడు. "శివముకుంద పరమానందా" అనే మకుటంతో 111 కంద పద్యాలు దీనిలో ఉన్నాయి. ఇందులో వేదాంతాన్ని కవి సులభ గ్రాహ్యంగా చెప్పాడు. (ఆప్ర-8)

## పరమార్థ దీపిక (అలభ్యం)

కవి : తిరుమలనాథ కవి (చూ).

## పరవస్తు చిన్నయ సూరి

కాలం : క్రీ. శ. 1809-1862 ప్రాంతం.
స్థలం : శ్రీ పెరుంబూదూరు.
బిరుదు : "సూరి"
గురువు : కంచి రామానుజాచార్యులు.
విద్యాభ్యాసం : చెన్నపురి.
రచనలు : 1. నీతిచంద్రిక (ఆర్బత్‌నాట్ దొరకంకితం) (1853) 2. శబ్దలక్షణ సంగ్రహము (గాజుల లక్ష్మీనరసింహముసెట్టికి అంకితము) (1853) 3. ఆంధ్రశబ్దానుశాసనమ్ (లక్షణ గ్రంథము) (1844). సంస్కృతంలో

తెనుగు భాషను గూర్చి వ్రాసిన గ్రంథం 4. కావ్యాంధ్ర వ్యాకరణము - ఆంధ్ర శబ్దానుశాసనానికి ఆంధ్రీకరణం 5. సంస్కృత సూత్రాంధ్ర వ్యాకరణము - పాణిని అష్టాధ్యాయిని అనుసరించి వ్రాసిన వ్యాకరణ గ్రంథం (1842) 6. బాల వ్యాకరణము (1858) 7. చిన్నయ సూరి నిఘంటువు (అసమగ్రం) 8. విశ్వనిఘంటువు టీక (అలభ్యం) 9. అక్షర గుచ్ఛము 10. విభక్తిబోధిని (1860) 11. నీతి సంగ్రహము 12. ఆంధ్ర శబ్ద చింతామణి వ్యాఖ్య (అలభ్యం) 13. పద్యాంధ్ర వ్యాకరణము (1840).

వెంకటరంగయ్య, శ్రీనివాసమ్మల పుత్రుడు. ఈయన ప్రెసిడెన్సీ కళాశాల, మద్రాసులో పండితులుగా పని చేశారు. తర్క వ్యాకరణాది శాస్త్రాలలో గొప్పపండితుడు.

పంచాంగం తేవప్పెరుమాళ్ళయ్య, బహుజనపల్లి సీతారామాచార్యులు ఈయనకు శిష్యులు. ఈయనకు బ్రౌన్ దొర సుపరిచితుడు. సుజనరంజని అనే పత్రికపెట్టి భాషా సేవ చేశారు. (ఈ పత్రిక సంపాదకత్వాన్ని గురించి అభిప్రాయభేదాలున్నాయి) తెలుగు భాషా స్వరూపాన్ని మార్చివేసిన ఘనత వీరిదే. అనంతర కవులనేకులు ఈయన జీవిత చరిత్రను రచించారు. (రమణీయం-పీఠిక)

## పరవస్తు వేంకట రంగాచార్యులు

కాలం : క్రీ. శ. 1822-1900 ప్రాంతం.

స్థలం : విశాఖపట్టణం.

రచనలు : 1. శ్రీమన్నిశ్శంక చరితము 2. సర్వశబ్దసంబోధిని (చివరిభాగం) 3. లఘు వ్యాకరణమ్(సం) 4. కుంభకర్ణ విజయమ్ (సం) 5. కమలినీ కలహంసము 6. అంగ్లాధిరాజ్యస్వాగతము 7. ప్రపత్తి వాదము 8. శబ్దార్థ సర్వస్వ నిఘంటువు 9. ఈశ, కేన, కఠ, ప్రశ్న, ముండక, మాండూక్యాది దశోపనిషత్తులకు పద్యాను వాదాలు 10. మంజుల నైషధము 11. శాకుంతలము మొదలగునవి.

బిరుదు : మహామహోపాధ్యాయ.

బహుశాస్త్ర విజ్ఞాతుడు. పరవస్తు శ్రీనివాసాచార్యుల పుత్రుడు. గీర్వాణాంధ్ర భాషలలో మహాపండితులు. షట్శాస్త్రాలలో, షడ్దర్శనాలలో విజ్ఞాతులు.

సంగమవలస జమీందారైన మృత్యుంజయ నిశ్శంక బహద్దరు వీరివద్ద శిష్యరికం చేశారట. శిష్యునికిగల సాహిత్యాభిమానానికి మెచ్చి, వీరు శ్రీమన్నిశ్శంక చరిత్రమనే గ్రంథాన్ని వ్రాశారట. వీరు సంగమ వలస సంస్థాన విద్వాంసులుగా ఉన్నారు.

ఉర్లాం జమీందారులు నిర్వహించే వేదశాస్త్ర పరీక్షలలో ఈ రంగాచార్యులవారు ప్రథమ పరీక్షాధికారులు. విశాఖపట్టణంలో "ఆర్షవిద్యా పాఠశాల"ను స్థాపించారు. జగ్గంపేట జమీందారులు ఈ పాఠశాలకు పోషకులుగా ఉండేవారు. గోడే సూర్య ప్రకాశరావు ఆదేశం ప్రకారం పరవస్తు శ్రీనివాసాచార్యులు "సర్వ శబ్ద సంబోధిని"

అనే సంస్కృతాంధ్రనిఘంటువు వ్రాస్తూ నిఘంటువు చివరి దశలో పరమపదించారు. దానిని తదనంతర కాలంలో ఈ వేంకట రంగాచార్యులవారు పూర్తి చేశారు. వీరి రచన సరళమై రసవంతంగా ఉంటుంది. విశాఖపట్టణంలో క్రైస్తవ మత బోధకుల ప్రచారాన్ని విరోధించడానికి ఉపనిషత్తులను ఆంధ్రీకరించి హైందవ మత ప్రచారం చేశారు. (ఆం.వం. సా.)

## పరవాది గజాంకుశము

నామాంతరం : చోడలింగ శతకము (చూ).
కర్త : గద్దె రామలింగకవి.

## పరశురామ నృసింహదాస కవి

కాలం : క్రీ.శ. 19వ శతాబ్దం.
రచన : భద్రాద్రి రామశతకము.

నిగూఢమైన తత్త్వ విషయాలను స్పష్టంగా సరళంగా వివరించి చెప్పడంలో కవి సిద్ధ హస్తుడు. కోటేశ్వర సుబ్బమాంబల పుత్రుడు. (శ.సా.వి-327)

## పరశురామ పంతుల అనంతరామకవి

కాలం : 1830 ప్రాంతం.
స్థలం : వరంగల్లు మట్టెవాడ.
రచన : హనుమద్విజయము.

కవి రామమూర్తి కుమారుడు. లింగమూర్తి మనుమడు. ఇతని రచనలు అనేకం ఉన్నాయట కాని దొరకలేదు. (క. స-6)

## పరశురామ పంతులు బ్రహ్మానంద రాజయోగి

స్థలం : నైజాం మండలం.
రచనలు : 1. ముముక్షు జన చంద్రహాసము (వచనాలు) సత్క్రియానుష్ఠానము (వచనము) 3. ఆత్మబోధ ప్రకరణము వ్యాఖ్య (వచనము).

అద్వైత వేదాంత కవి. (వ. వా-41)

## పరశురామ పంతుల రామమూర్తి

కాలం : క్రీ. శ. 1814.
స్వస్థలం : వరంగల్లు సమీపంలోని మట్టెవాడ.
రచనలు : 1. సీతారామాంజనేయము (యక్షగానం) 2. మనోహర శతకము 3. శుకచరిత్రము 4. వివేకసారము 5. అధ్యాత్మ రామాయణము 6. ఉత్పలమాలా శతకము. (ఈదులవాయి రామస్వామి శతకం.)

ఈ కవి ప్రసిద్ధ వేదాంత గ్రంథమైన సీతారామాంజనేయ సంవాదం రచించిన లింగమూర్తి కవికి కొడుకు. తల్లి లింగమాంబ. ఈయన కవిత్వం ప్రౌఢంగా, సరసంగా ఉంటుంది. శివరాత్రి మాహాత్మ్య యక్షగానం ఇతనిదే కావచ్చునని అంటున్నారు.

(య. వా. చ-362-455; తె. వి. స-6-769; క. స-195)

పరశురామ పంతుల లింగమూర్తి

కాలం : క్రీ. శ. 18వ శతాబ్ది.

స్థలం : మట్టెవాడ. వరంగల్లు ప్రాంతం.

రచనలు : 1. మనశ్శతకము 2. నారదబ్రహ్మ సంవాదము 3. తారకయోగము 4 సీతారామాంజనేయ సంవాదము 5. ఆత్మారామశతకము 6. రతిమన్మథ విలాసము 7. గోవింద శతకము 8. సీతపాట 9. జీవన్ముక్తి ప్రకరణము 10. సాంఖ్యయోగము 11. శివరాత్రి మాహాత్మ్యము (విద్యారణ కాలేజు).

గురువు : మహాదేవయోగి.

రామమంత్రి తిమ్మాంబల పుత్రుడు. గొప్ప వేదాంతి. ప్రౌఢంగా సలక్షణంగా కవిత్వం చెప్పాడు.

ఏక పత్రిక కర్త రామమూర్తి ఇతని కుమారుడు. ఇతని సీతారామాంజనేయ సంవాదం గొప్ప ప్రశస్తిని పొందింది. వేదాంతాన్ని రసవంతంగా చెప్పడం ఈ కవి ప్రత్యేకత. ఆధ్యాత్మిక విషయాలు పామరులకు కూడా చక్కగా అర్థమయ్యేటట్లు వ్రాశాడు. (క. స_212; తె. వి. స_6_769)

పరశు రామాయణము

కాలం : క్రీ. శ. 18 వ శతాబ్దానికి పూర్వం.

కర్త : ఉలిచి భావజ్ఞుడు.

అంకితం : కనకాద్రికి.

ద్విపద కావ్యం. పరశురాముడు కార్తవీర్యుని ఓడించడం ఇందులోని కథ. రచన వీర రస స్ఫోరకంగా, గాన యోగ్యంగా ఉంది. శ్రీరాముడు పరశురాముని విల్లు వంచడం కూడా ఉంది. (ద్వి. సా. చ_367)

పరశురాముడు

కాలం : క్రీ. శ. 18వ శతాబ్దికి పూర్వం.

రచన : సారంగధర చరిత్ర (ద్విపద).

గ్రంథ ప్రతి అసమగ్రంగా ఉండటం వల్ల ఈ కవిని గురించిన వివరాలు తెలియ రాలేదు. ఇతని శైలి రసవంతంగా ఉంది. మంజరీ ద్విపదలో రచన చేసినా దోషాలు అక్కడక్కడా ఉన్నాయట. (ద్వి. సా. చ_450)

పరాంకుశ భూపాలుడు

కాలం : క్రీ. శ. 19 వ శతాబ్దికి పూర్వం.

స్థలం : హుజూరు నగరం ప్రాంతం.

సాహిత్య ప్రియుడు. సంబతిఘలు అప్పలాచార్యులు రచించిన "ధరా సాగ రేశ చరిత్ర" కావ్యానికి కృతిపతి. (క. స_14)

**పరాశర మాధవమ్ (సం)**

కర్త : విద్యారణ్యుడు.

ఇది పరాశర స్మృతికి సంస్కృత వ్యాఖ్య. (తె. వి. స-4)

**పరస పెర్రన మంత్రి**

పెనుగంచిప్రోలు కృష్ణా జిల్లా వాస్తవ్యుడు. ఈయన గురించి ఒక చాటువు ఉంది. ఎవరు చెప్పారో తెలియదు. ఈయన పేరుమోసిన దాతయని చాటువు చెబుతున్నది. (చా. ప. ర.)

**పరికథ**

ఇది గద్య కావ్య భేదాలలో ఒకటి. ధర్మార్థ కామాదులలో ఒక దానిని అవలంబించి విచిత్ర ప్రకారాలతో అనంతంగా వర్ణితమైన గద్యప్రబంధమే పరికథ.
(తె. వి. స-6)

**పరికర శ్లోకము**

చూ. కారిక.

సంస్కృత కావ్య పరిభాష. కారికార్థాన్ని విశదీకరించి, విపులీకరించిన శ్లోకము పరికర శ్లోకము.

శాస్త్రకారులు అక్కడక్కడా శాస్త్రాలలో తాము వచన రూపంలో వివరించిన విషయాలను విద్యార్థులు కంఠపాఠం చేయడానికి వీలుగా శ్లోక రూపంలో వ్రాస్తుంటారు. కారికలు, పరికర శ్లోకాలు అలాంటివే. (కావ్యాలంకార సంగ్రహం)

**పరిచ్ఛేదము**

కొన్ని కావ్యాలలోని విభాగాలకు పరిచ్ఛేదాలని పేరు. దీనిచే కొంత విషయం విభజింపబడుతుంది కాబట్టి ఇది పరిచ్ఛేదం. ఈ పదాన్ని ఎక్కువగా శాస్త్ర విభాగాలకే ఉపయోగిస్తారు.

**పరిభాషేందుశేఖర వ్యాఖ్యా కాదంబిని (సం)**

కర్త : చూ. పేరి కాశీనాథశాస్త్రి.

సంస్కృత రచన. పరిభాషకు వ్యాఖ్యానము. వివరాలు తెలియవు.
(ఆం. సం. సా-427)

**పరిమళమ్ వ్యాఖ్య (సం)**

కర్త : అప్పయ్య దీక్షితులు.

శంకర భాష్యానికి వాచస్పతి మిశ్రుడు భామతి వ్యాఖ్య వ్రాశాడు. దీనికి అమలానందుడు వేదాంత కల్పద్రుమమనే వ్యాఖ్య వ్రాశాడు. వేదాంత కల్పద్రుమ వ్యాఖ్యకు వివరణ ఈ వ్యాఖ్య. (తె. వి స-6)

**పరిమళమ్ వ్యాఖ్య (సం)**

కర్త : కోలచల మల్లినాథసూరి.

సంస్కృతంలోని "స్వరమంజరి"కి మనోహరమైన సంస్కృత వ్యాఖ్య. (తె.వి.స-4)

**పర్యాయబంధము**

ఇది గద్య కావ్యాలలో ఒక భేదం. ఇది వసంత ఋతువునూ, మహారాజుల విజయ యాత్రాదులనూ వర్ణించే గద్య ప్రబంధం. (తె.వి.స-6)

**పర్వత నారద సంవాదము**

నామాంతరం : పర్వతనారదోపాఖ్యానము (చూ).
కర్త : పోలూరి గోవిందకవి.
అంకితం : చెరుకూరి సదాశివునికి.

పద్యకావ్యం. సంగీత శాస్త్రానికి సంబంధించిన రచన. భరత నాట్య శాస్త్రాన్ననుసరించి ఉంది. (ఆరుద్ర-12-158)

**పర్వతనారదోపాఖ్యానము**

కర్త : ఉపవినాయకుడు (చూ).

కావ్యం పూర్తిగా లభించలేదు. కర్తృత్వం విషయంలో భిన్నాభిప్రాయాలున్నాయి. ఇదే పేరుతో పోలూరి గోవిందకవి ఒక కావ్యాన్ని వ్రాశాడు. (ఆరుద్ర-12-159)

**పర్వత నారదోపాఖ్యానము**

నామాంతరం : పర్వతనారద సంవాదము (చూ).
కర్త : పోలూరి గోవిందకవి. (ఆరుద్ర-12-158)

**పర్వతన్న చాటువు**

కర్త : చూ. ఎడవల్లి పర్వతన్న.

అప్పకవీయంలో ఉదాహృతం. (ఆరుద్ర)

**పర్వత పదములు (అలభ్యం)**

కర్త : మల్లికార్జున పండితుడు.
రచనాకాలం : క్రీ.శ. 1150 ప్రాంతం.

శైవమత పరమైన రచనలు. వీటిని పద వాఙ్మయానికి చెందిన ప్రాచీన సారస్వతంగా పండితులు పరిగణిస్తున్నారు. (క.స-163)

**పర్వత పురాణము**

నామాంతరం : శ్రీశైల మాహాత్మ్యము.
కర్త : నాగలూటి శేషనాథుడు.
అంకితం : శ్రీశైల మల్లికార్జునస్వామికి.

ఆరు ఆశ్వాసాల కావ్యం. దీనిలో నుంచి ఒక పద్యాన్ని పెదపాటి జగ్గన్న తన ప్రబంధ రత్నాకరంలో ఉదాహరించాడు. ఆ పద్యం ముక్కంటి ప్రశంసకు

సంబంధించింది. ఇది సంస్కృత స్కాందపురాణంలోని శ్రీశైల ఖండానికి తెనిగింపు.
(ఆరుద్ర-9)

**పర్వత పురాణము (అలభ్యం)**

కర్త : పోలమరాజు.

దీనిలోని రెండు పద్యాలను పెదపాటి జగ్గన్న తన "ప్రబంధ రత్నాకరం"లో ఉదాహరించాడు. ఒక పద్యంలో సూర్యాస్తమయ వర్ణన, రెండోపద్యంలో రాజనీతి వర్ణన ఉన్నాయి. శ్రీశైలమాహాత్మ్యాన్ని తెలిపే కావ్యమని భావించవచ్చు.
(ఆరుద్ర-9)

**పర్వత మంత్రి లింగనకవి**

కాలం : నిర్ధారణకాలేదు.

రచన : వీర మాహేశ్వరాచార సంగ్రహము (రుద్రాక్ష మాహాత్మ్యము)(ద్విపద).

కవి పర్వత మంత్రి కుమారుడైన లింగన కావచ్చును. ఇతడు మల్లికార్జున పండితారాధ్యుని గురువుగా స్తుతించాడు. అతనికి ప్రత్యక్ష శిష్యుడో లేక అతన్ని గురుభావంతో పూజించాడో తెలియదు. పండితారాధ్యులు ఇరువురు ఉండటం వలన ఇతని కాలం నిర్ధారణ కాలేదు. ఇతని కావ్యం సంస్కృత గ్రంథానికి అనువాదం.
(ద్వి.సా.చ-300)

**పర్వతరాజు మల్లారెడ్డి కథ**

కర్త : తెలియదు.

జానపద చారిత్రక గేయం.

చూ. చారిత్రక గేయములు. (ఆం. వా.చ.)

**పర్వతాలు**

కాలం : క్రీ.శ. 18 వ శతాబ్దం.

సమకాలికుడు : అడిదము సూరకవి.

రచనలు : తెలియ రాలేదు.

ఈ పర్వతాలు ఆశుకవితలో కొట్రబాలకవి, అడిదం సూరకవులతో పోటీచేస్తే, కొట్ర బాలకవి ఈయనను సునాయాసంగా ఓడించాడట. (వా.ప.ర)

**పర్వము**

కావ్యంలోని కథాంశాల విభాగం. సాధారణంగా పర్వము అంటే చెఱకు మొదలైన వాటి కనుపు అని అర్థం. మహాభారతం చెఱకుగడ వంటిదని ప్రతీతి. భారత భాగాలకు పర్వములని పేరు.

**పలకలూరి గోపన్న**

కాలం : క్రీ. శ. 16 శతాబ్ది.

స్థలం : గుంటూరు ప్రాంతం.

రచనలు : తెలియరాలేదు.

దాచమరుసు మీద చెప్పిన ఒక చాటువు మాత్రం లభించినది. ఈయన గుంటూరు తాలూకాలోని పెదపలకలూరు లేక చినపలకలూరి నివాసి కావచ్చునని అంటున్నారు. ఈ గ్రామాలు కొండవీటి సీమలో ఉన్నాయి. అచ్యుతదేవరాయల మంత్రియైన దాచ మరుసయ్య కొండవీటి మంత్రిగా ఉన్నప్పుడు కొందరు బ్రాహ్మణులను హింసిస్తే, ఆ బాధ తట్టుకోలేక దాచమరుసును దూషిస్తూ అతనిమీద ఈ కవి చాటువు చెప్పాడు. ఈ దాచమరుసే రామయామాత్య భాస్కరుడని అంటున్నారు. ఈ చాటుపద్యాన్ని అప్పకవి ప్రమాణంగా స్వీకరించి నామాంత విశ్రమాలు చెప్పే సందర్భంలో "అరుసు" అనే మాటను పేర్కొంటూ ఉదాహరించాడు. ఈయన ఏమైనా కావ్యాలు వ్రాశాడేమో తెలియదు. అప్పకవి ఉదాహరించాడు కాబట్టి ఆనాటికి గోపన్న ప్రౌఢకవిగా పేరు పొంది ఉంటాడు. (ఆరుద్ర-9-253)

## పలనాడు

పల్నాటి యుద్ధం మూలంగా చారిత్రకంగాను, పలనాటి వీరచరిత్ర మూలాన సారస్వతపరంగాను ప్రసిద్ధం. ఇది పల్నాడు, పల్లినాడు అనే పేర్లతో కూడా వ్యవహృతం. గుంటూరు మండలంలో ఈ పల్నాడు తాలూకా ఉంది. పూర్వపు పలనాడు మూడు వందల గ్రామాలతో ఉండేదని ఒక శాసనం ద్వారా తెలుస్తున్నది. అప్పకవి "పల్లెనాటను నూట తొంబదియు నాల్గు గ్రామముల"ని చెప్పటంవల్ల అప్పకవి కాలానికి (క్రీ.శ. 1656) 194 గ్రామాలే ఉన్నట్లు నిశ్చయించవచ్చు. శ్రీనాథుని చాటువులలో, క్రీడాభిరామంలో, ప్రభావతీ ప్రద్యుమ్నంలో ఈ పల్నాటి ప్రశంస ఉంది. (సం.ఆ.వి.కో-5)

## పల్నాటి వీర చరిత్ర

కర్తలు : శ్రీనాథుడు, మల్లయ్య, కొండయ్య, తదితరులు.
రచనాకాలం : క్రీ. శ. 1424 తరువాత.
అంకితం : చెన్నకేశవ స్వామికి.

లభించిన గ్రంథం సమగ్రంగా లేదు. ఇది మంజరీ ద్విపదకావ్యం. తెలుగునాట పల్నాటి భారతంగా ప్రసిద్ధి పొందింది. శ్రీనాథుడు రాజాశ్రయంకోసం పల్నాటి ప్రాంతాలకు వెళ్ళినప్పుడు ఉత్తేజవంతమైన ఆ కథను విని కొన్ని భాగాలను ఆశువుగా ద్విపదలో వ్రాసి ఉంటాడని భావిస్తున్నారు. అతడు కావ్యంగా రచించాడనే వారు కూడా లేకపోలేదు. ఈ కావ్యం అంతా శ్రీనాథుని రచనకాదు. "బాలచంద్రుని యుద్ధం" అనేభాగం మాత్రం శ్రీనాథునిది. కొంత భాగాన్ని కొండయ్య, మల్లయ్య అనేవారు వ్రాశారు. మరి కొందరిపేర్లు తెలియరాలేదు. వీరంతా శ్రీనాథుని పేర్కొన్నారు. వీరు శిథిల భాగాలను పూరించారో స్వతంత్రంగా వ్రాశారో చెప్పడం కష్టం. శ్రీనాథుడు కాటమరాజు కథనూ, పల్నాటిచరిత్రనూ పద్యకావ్యాలుగా వ్రాశాడనీ కొందరంటున్నారు. ఆ శ్రీనాథుడు భిన్నవ్యక్తి కావచ్చును. పల్నాటి చరిత్రలోని బాలచంద్రుని యుద్ధభాగం మాత్రం శ్రీనాథకవి సార్వభౌమునిదేనని పండితాభిప్రాయం.

వీటిలో మొత్తం పదకొండు ప్రకరణాలున్నాయి.

ఇందులో కోళ్ళపోరు, గోవన్న వియ్యము అనే భాగాలు మల్లన వ్రాశాడు. కల్లి ప్రతిష్ఠ, బాలచంద్రుని యుద్ధము శ్రీనాథునివి. కొమ్మరాజు యుద్ధము కొండన్న వ్రాశాడు. పల్నాటి యుద్ధకాలం 1178-82 ప్రాంతం. (ఆధు.వ-1;ద్వి.సా.చ-388)

## పల్లవి గోపాలయ్య

నామాంతరం : రాజ గోపాల కవి వాగ్గేయకారాగ్రణి.

కాలం : క్రీ.శ. 18 వ శతాబ్దం.

స్థలం : తంజావూరు,

రచన : భక్తజన పారిజాతము.

మహారాష్ట్ర రాజుల ఆస్థానంలోని వాడు గోపాల కవి కుమారుడు. సంగీత ప్రపంచంలో పల్లవి బాగా పాడటంవల్ల పల్లవి గోపాలయ్యగా పేరు పొందాడు. అమర సింహుని (1787-98) కాలంలోనూ. శరభోజీ కాలంలోను (1798-1833) ఉన్నాడు. ఇతని పూర్వీకులు గుంటూరు వారు కావడంవల్ల ఇంటిపేరు గుంటూరి వారని కొందరంటున్నారు. (క.స.61; వ.దే.వా-302)

## పల్లవి శేషయ్య

కాలం : తెలియదు.

స్థలం : సేలం జిల్లాలో నేయకారంపట్టి గ్రామం.

తెలుగులో చక్కని పండితుడు. సంగీత లక్ష్యలక్షణాలలో విద్వాంసుడు. ఎంతకష్టమైన పల్లవినైనా తేలికగా మనోహరంగా పాడి పండితపామరులను తన్మయత్వములో ముంచేవాడు చాలా కృతులు, వర్ణాలు, తిల్లానలు మొదలయిన రచనలు చేశాడు. అపూర్వరాగాలలో కృతులు వ్రాశాడు చాలా సంస్థానాలలో తన విద్వత్తు చూపి సన్మానాలను పొంది, చివరిరోజులు మద్రాసులో గడిపాడట. (తె.వి.స-4)

## పశుపతి నాగనాథుడు

కాలం : క్రీ. శ. 1369 ప్రాంతం.

పోషకుడు : పద్మనాయక మొదటి అనపోతానాయకుడు.

రచనలు : 1. మదన విలాసమ్ (సంస్కృతం) (అలభ్యం) 2. విష్ణుపురాణము (అలభ్యం).

గురువు : విశ్వేశ్వర కవి చంద్రుడు.

విశిష్టత : ఈయన పశుపతి పండితుని పుత్రుడు. సంస్కృతాంధ్ర భాషలలో మంచి కవి. రాచకొండ నేలిన అనపోతనాయనికి సంస్కృతాంధ్ర భాషలలో శాసనాలు

రచించిపెట్టాడు ఒక శాసనం అయినవోలులో ఉంది. కవులలో కొరవి గోపరాజు నాగనాథుని నుతించాడు.

ఇతని సంస్కృత రచన మదన విలాసం దశరూపక భేదాలలో ఒకటైన భాణమట. (ఆరుద్ర-4)

## పశ్చిమ రంగ శతకము

కర్త : తెలియదు.

ఇక్కేరి రాజు మైసూరు ప్రజలను బాధిస్తుండగా ఒక కవి ఈ శతకం చెప్పాడట. కవి మైసూరు ప్రాంతపు వాడు కావచ్చును. దీని ప్రతి ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారంలో ఉంది. (ఆరుద్ర-12-311)

## పసుపులేటి రంగాజమ్మ

నామాంతరం : రంగాజి.

కాలం : క్రీ. శ. 17 వ శతాబ్దం.

రచనలు : 1. మన్నారుదాసవిలాసము (ప్రబంధం) 2. మన్నారుదాస విలాస నాటకము 3. ఉషాపరిణయము 4. రామాయణ సంగ్రహము (అలభ్యం) 5. భారత సంగ్రహము (అలభ్యం) 6. భాగవత సంగ్రహము (అలభ్యం) 7. పదములు (సంగీత కృతులు).

సత్కారము : విజయరాఘవుని చేత కనకాభిషేక గౌరవం పొందింది.

తండ్రి వేంకటాద్రి, తల్లి మంగమ్మ. చిత్ర విచిత్ర శతలేఖినీ విద్యలలో ప్రవీణురాలు. పద కవితలో దిట్ట. రాజనీతి విశారదురాలు. అష్ట భాషా కవితా విశారద. సులభగ్రాహ్యమైన శైలిలో కావ్యాలు రచించింది. క్రీ. శ. 1633-73 వరకు తంజావూరు నేలినవిజయ రాఘవుని ఆస్థానంలో ఉండేది.

నాటకాలను వ్రాసిన మొదటి మహిళ ఈమె. అలాగే ఉషా పరిణయాన్ని ప్రత్యేక పద్య కావ్యంగా వ్రాసిన వాళ్ళలో ఈమె మొదటిది. రంగాజమ్మ విజయ రాఘవుని భోగపత్నులలో ఒకతె అని పరిశోధకులు భావిస్తున్నారు. ఈమె రచించిన మన్నారు దాస విలాస ప్రబంధాన్నే పేరు మార్చి సౌందరి అనే ఆమె "అల్లాడ విజయ సింహభూపతి విలాసము" అనే పేర వ్రాసిందట రంగాజమ్మ వ్రాసిన ఒక దండకాన్ని ఆమె విజయసింహ భూపతికి అంకితంగా అదే రీతిలో రచించినట్టు ప్రాచ్యలిఖిత గ్రంథాలయం కేటలాగులో ఉంది. (కేటలాగు సంపుటి 2-భాగం-2-P-1041)

(ఆరుద్ర-11-118)

## పసుమర్తి శివరామన్న

కాలం : క్రీ శ. 17 వ శతాబ్దం.

ఈయన ఏదో సంస్థానంలో మంత్రిగా ఉండేవాడట. అక్కడకు వచ్చిన సోమరాజు రామకవిని ఈయన చిన్నచూపు చూడగా ఆ కవి ఈయన మీద నుతించినట్లూ, తిట్టినట్లూ ఉండే ఒకే పద్యాన్ని చెప్పాడు. (చా.ప.ర.)

పసుమర్తి హుళక్కిమంత్రి

స్థలం : వినుకొండ సీమలోని మురికిపూడి.

ఇతని దాన ధర్మాలను గూర్చి ఒక చాటు పద్యం ఉంది. చాటు పద్య కర్త పేరు తెలియదు. (చా.ప.ర.)

పస్పాశము

నామాంతరం : ఉపోద్ఘాతము.

పాంచాలికా రక్షణమ్ (సం)

కర్త : చూ. పేరి కాశీనాథశాస్త్రి.

నాటక రచన. (ఆం.సం.సా-427)

పాంచాలీ పరిణయము

కవి : కాకమాని మూర్తి కవి (చూ).

అంకితం : శ్రీరంగనాథునికి.

ఆయిదాశ్వాసాల ప్రబంధం. 403 గద్యపద్యాలున్నాయి, రచన ప్రౌఢం.

ఇతివృత్తం : ద్రౌపదీ కల్యాణగాథ. రచనలో సమకాలిక సంఘ జీవనంతో బాటు సమకాలిక భాషకూడ హృద్యంగా వినబడుతుంది. సంఘంలోని అన్నివర్గాల జీవన పద్ధతులనూ స్పృశించి చెప్పిన రచన. (అద్రప-11-71)

పాండవాభ్యుదయమ్ (సం)

కర్త : చూ. శివసూర్యుడు.

ఇది భారత కథను వర్ణించే ఎనిమిది సర్గల కావ్యం. (తె.వి.స-6)

పాండవాశ్వమేధ వృత్తాంతము

కర్త : తెలియదు.

రచనాకాలం : క్రీ. శ. 18వ శతాబ్దం.

ఈ గ్రంథము విజయరంగ చొక్కనాథుని కాలంలో అవతరించింది. మంచి వచన రచన గల గ్రంథం. (వ.వా-47)

పాండవులవారు

జానపద గాయకులు. గొల్లసుద్దులవారివలె వీరుకూడా భారత కథలను చీరలపై చిత్రించి, పెద్ద పెద్ద బొమ్మల సహాయంతో ప్రజలకు పాటలు పాడి వినిపిస్తుంటారు. వీరు తెలంగాణాలో నేటికీ ఉన్నారట. పాండవుల కథలను అద్భుతంగా గానం చేయడంవల్ల వీరికీపేరు వచ్చిందంటారు. వీరు భారత గాథలను తప్ప వేరే ఏ కథలను గానం చేయరట.

పురుషులు పాండవుల కథలను గానం చేస్తూ జీవిస్తుంటే - వీరి స్త్రీలు స్త్రీపురుషులకు పచ్చబొట్లు పొడిచి డబ్బు సంపాదిస్తారట. (నా.ర.చ-282)

## పాండురంగ మాహాత్మ్యము

కర్త : తెనాలి రామకృష్ణ కవి.

అంకితం : విరూరి వేదాద్రి మంత్రికి.

విస్తృతి : ఇది తెలుగు పంచ కావ్యాల్లో ఒకటి. ఐదు ఆశ్వాసాల ప్రౌఢ ప్రబంధం. వైష్ణవ పరమైన గ్రంథమైనా శివభక్తి అపారంగా కనిపిస్తుంది. మాధుర్య సౌకుమార్యాది లక్షణాలున్న చక్కని ప్రౌఢ రచన. రామకృష్ణ కవి శైలి సర్వస్వతంత్రం. తీర్చిదిద్దినట్లు పద్యాలు వ్రాయటం, రస భావాల మేళవింపు, కథా నిర్మాణ శక్తి, కథా రచనా శక్తి, పాత్ర చిత్రణ బాగా తెలిసినవాడు రామకృష్ణుడు. ఈ కావ్య రచనలో కవి శ్రీనాథుని, పెద్దనకు రాయలను అనుసరించినట్లు తోస్తుంది. కావ్యంలోని నిగమ శర్మో పాఖ్యానం, అయుతనియుతోపాఖ్యానం రామకృష్ణుని కవితకు మచ్చు తునకలు. అచ్చ తెలుగు మార్పులు చేయటంలో ఈ కవి మేటి.

పాండురంగ మాహాత్మ్యం భక్తి ప్రధానమయినది. క్షేత్ర మాహాత్మ్యాన్ని తెలిపే కావ్యం. ఎంతటి దురాచారవంతుడైనా, ఎన్ని పాపాలు చేసినా, ఎన్ని ఘోరాలు చేసినా భగవంతుడు ప్రత్యక్షమైతే మోక్షం వస్తుందని ఈ కావ్యం బోధిస్తుంది. స్థలము, కాలం, ఆ దేవతా మాహాత్మ్యం సన్నిహితంగా ఉంటే యాదృచ్ఛికంగా కొన్ని చెడ్డపనులు చేసినా, అది చివరకు భగవత్సేవగా పరిణమించి, ఆ పాపాత్మునికి భగవత్సాన్నిధ్యం లభిస్తుందని చెప్పటం ఈ కావ్యంలోని సర్వ పరమార్థం. ప్రౌఢ శైలీ నిర్మాణ నైపుణ్యాలవల్ల ఆంధ్ర భాషా సాహిత్య ప్రబంధాలలో ఈ కావ్యం మకుటాయమానమై నిలిచి ఉంది. ఇందులో "నిగమశర్మ అక్క"గా ప్రసిద్ధి పొంది పేరు తెలియని పాత్ర, చిరస్థాయిగా ఉంది. ఈమె తన తమ్ముడు నిగమశర్మకు ఉపదేశించిన పద్ధతి అపూర్వమైంది. (తె. వి. స-4)

## పాకనాటి గణపతి రెడ్డి

కాలం : క్రీ.శ. 19వ శతాబ్దం తొలి భాగం.

రచన : గోపాల విలాసము.

పిన్నమ్మ రెడ్డి కామాక్షమల పుత్రుడు. గోన బుద్ధారెడ్డిని తన వంశ కర్తగా స్మరించాడు. (య. వా. చ.)

## పాకనాడు

ఒక సీమా విభాగం. ఇది నెల్లూరు జిల్లాకు ఉత్తరంగా గుండ్లకమ్మ నుండి కందుకూరు తాలూకా వరకు, ప్రకాశం జిల్లాలో దక్షిణంగా ఒంగోలు తాలూకాతో కలిసి తూర్పు సముద్ర తీరం వరకు ఉన్న ప్రదేశం. నన్నె చోడుడు, పాకనాడు ఇరువది ఒక్క వేయి గ్రామాల ప్రదేశమని చెప్పాడు. కేయూర బాహుచరిత్రలో ఇది ఏక వింశతి సహస్ర గ్రామ సంఖ్యాకమని ఉంది. ఓపిలి సిద్ధి పద్య శాసనంలో "పాకనాటి యందిరువది యొక్క వేయి" అని గ్రామ సంఖ్య ఉంది.

దీనికి రాజధాని ఇప్పటి నెల్లూరు (విక్రమసింహపురి). వెండపూడి అన్నయ శ్రీనాథుని "పాకనాటింటివాడ."ని సంబోధించాడు. (సం. ఆ. వి. కో-1)

**పాకశాస్త్రము**

రచయిత్రి : సర్వ్వతీబాయి.

రచనాకాలం : క్రీ. శ. 1836 ప్రాంతం.

వచనగ్రంథం. దీన్ని కావలి వేంకట రామస్వామి ఆంగ్లభాషలోకి అనువదించినాడు. దీని ప్రతి బ్రిటిష్ మ్యూజియం గ్రంథాలయంలో ఉన్నది.

దీనిలో 3 భాగాలు ఉన్నవి. (వ. వా.)

**పాచికల ఆట**

కాలం : క్రీ.శ. 13, 14, 15 శతాబ్దాలు.

ఇది ప్రాచీన కాలంలో చక్కని క్రీడా విశేషం. ఈ ఆటను నాచన సోమన ఉత్తర హరివంశంలో వర్ణించాడు తరవాత పింగళి సూరన్న కళాపూర్ణోదయంలోను, కందుకూరి రుద్రకవి నిరంకుశోపాఖ్యానంలోనూ, విష్ణుమాయా నాటకంలోనూ ఈ ఆట ప్రసక్తి వచ్చింది.

ఇది ఆనాటి రాజులకు, రాణులకు చక్కని వినోద క్రీడ అని భావించవచ్చు. (ఆం. సాం. చ-85, 91, 92)

**పాచిపెంట**

వ్యవహారనామం : తేడ పాచిపెంట.

శ్రీకాకుళం జిల్లాలోని సాలూరు తాలూకాకు చెందిన మన్యసంస్థానం. ఈ సంస్థానాన్ని కొండరాజులు పాలించారు. వీరి ఇంటిపేరు "పూసపాటి వారు". పూసపాటి "తమ్మన్న దొర" ఈ సంస్థాన పాలకులలో మొదటివాడు.

పాచిపెంటను సాహిత్యకారులు ప్రాక్పురి, ప్రాచీపట్టణము, ప్రాచీపురము అని పేర్కొన్నట్లు తెలుస్తున్నది.

ఇది చిన్న సంస్థానమైనప్పటికి చారిత్రికంగా చాలా ప్రముఖమైనది. ఒకనాడు ఇది "జయపురం" సంస్థానానికి చెందిన ప్రాంతం. పాచిపెంట జయపురసంస్థానానికి దక్షిణ ద్వారంగా పేర్కొనబడింది. జయపురం సంస్థానానికి వెళ్ళే ఈ మార్గంలో పటిష్ఠమైన పహరా అవసరమని తలచి, ఆ సంస్థానాధిపతులు విశ్వాసపాత్రుడు, సమర్థుడూ అయిన "పూసపాటి తమ్మన్న దొర"ను ఈ ప్రాంతానికి అధికారిగా నియమించి, ఆతనికి "దక్షిణ కవాట యుగరాజు" అనే బిరుదాన్ని ప్రసాదించారు. పోషణార్థం, ఆ ఘాటీ ప్రాంతానికి పైభాగంలోను, క్రిందిభాగంలోను ఉన్న కొన్ని గ్రామాలను నిర్ణయించారు. ఇదే రాను రాను "పాచిపెంట" సంస్థానంగా రూపొందింది.

తమ్మన్న దొర మొదట "తేడ" గ్రామంలో కోటకట్టుకున్నాడట. అందుకే

దీనికి "తేర పాచిపెంట" అనే నామాంతరం ఉంది తరువాతి కాలంలో పాచిపెంట ప్రముఖం వగరమైంది.

ఈ సంస్థానానికి చెందిన వారిలో "వీరపరాజు" సమర్థుడు. వీరిలో ఇద్దరు వీరప రాజులున్నారు. మొదటి వీరపరాజు విజయనగరం "పెద విజయరామరాజు" సమకాలి కుడు. ఇతడు చారిత్రకంగా ప్రసిద్ధిచెందినవాడు. క్రీ. శ. 18వ శతాబ్దంలో సర్కారుం నవాబైన జాఫరలీఖాను, రఘోజీభాన్స్లే కుమారుని నాయకత్వంలో వచ్చిన మరాఠీ గుర్రపు దండుతోకలసి విజయనగరంపై దండెత్తినపుడు, విజయరామరాయలతో విసిగెత్తి ఉన్న ఈ వీరపరాజు జాఫరలీఖాను సైన్యానికి ఈ ఘాటీమార్గంలో సులభంగా విజయ నగరం చేరుకునే విధానం చూపాడట. దానితో విజయరామరాయలు చాలా నష్టం పొందాడు. ఆ తరువాత విజయ రామరాయలు ఇతడిని బంధించి ఖైదుచేయగా ఇతడు విర్బంధంలోనే మరణించినట్లు తెలుస్తున్నది. క్రీ. శ. 18 వ శతాబ్దం ద్వితీయార్ధంలో జరిగిన "పద్మనాభయుద్ధం" తరువాత కుంఫిణీవారు వీరపరాజు కుమారుడైన మల్లప రాజుకు పైతృకమైన ఆస్తిని తిరిగి కట్టబెట్టారు. ఇతని కుమారుడైన అన్నమరాజుకాలంలో శాశ్వత పరిష్కారం జరిగింది.

అన్నమరాజు మనుమడు రెండవ వీరపరాజు. ఈ వీరపరాజే పాచిపెంట సంస్థా నానికి సాహితీ గౌరవం సంక్రమింపచేశాడు. ఇతడు క్రీ.శ. 19 వ శతాబ్దానికి చెందినవాడు. ఆంధ్రపదాకరము, సూర్యనారాయణస్వామి శతకము, చిరుత వజీరు శతకము మొదలగు నవి ఇతని రచనలు.

పాచిపెంట సంస్థానాన్ని పాలించిన చివరి రాజా కూడ గొప్ప పండితులట. నిరంతర విద్వద్గోష్ఠులలో కాలం గడిపేవారని ప్రతీతి. (ఆం సం.సా_213-218)

**పాటీ గణితము**

రచనాకాలం : క్రీ. శ. 17 వ శతాబ్దం మొదటి భాగం.
కర్త : కోడూరి వల్లభసూరి.

ఈ గ్రంథానికి మూలం భాస్కరాచార్యుడు రచించిన లీలావతీ గణితమట కవి బొమ్మలాట కాళయ ప్రేరేపణతో దీన్ని రచించాడు. (క. స_216)

**పాటూరి నరసింహశాస్త్రి**

కాలం : క్రీ.శ. 19 వ శతాబ్దం.
స్థలం : మద్రాసు.
రచనలు : 1. హరిశ్చంద్ర కథ 2. రంగనాథరామాయణము (ఉత్తరకాండ) వచనము.

ఫోర్టుసెయింటు జార్జి కళాశాలలో తెలుగు మున్షీగా పనిచేశాడు. పాటూరి రామ స్వామిశాస్త్రులు సోదరుడు. (వ.వా_60)

**పాటూరి రంగాశాస్త్రులు**

కాలం : క్రీ.శ 19 వ శతాబ్దం.

రచన : విజయవిలాస వచనము.

పాటూరి రామస్వామి శాస్త్రిం సోదరుడు. ఫోర్టు సెయింటు జార్జి కళాశాలలో తెలుగు మున్షీగా ఉండేవాడు. (వ. వా.)

## పాటూరి రామస్వామిశాస్త్రి

కాలం : క్రీ. శ. 19 వ శతాబ్దం.

రచనలు : శుకసప్తతి కథలు.

ఈయన ఫోర్ట్ సెయింట్ జార్జి కళాశాలలో మారిస్ దొరవద్ద తెనుగు మున్షీగా ఉండేవాడు. నేడు లభ్యమవుతున్న శుకసప్తతి కథలు తెనుగు గ్రంథంలో కర్త పేరు కానరాదు. తేది 19-9-1843 న బ్రౌన్‌కు వ్రాసిన ఈతని లేఖనుబట్టి ఈ కథం కర్త రామస్వామిశాస్త్రి యేనని తెలుస్తున్నది. (వ.వా-95)

## పాత పాపయ్యశాస్త్రి

కాలం : 1820 ప్రాంతం.

స్థలం : కోరంట్ల.

రచన : విక్రమార్కీయము (అలభ్యం).

వివరాలు తెలియరాలేదు.

## పాతూరి తిమ్మయ

స్థలం : తుమ్మపూడి.

కాలం : క్రీ.శ. 18 వ శతాబ్దికి పూర్వం.

రచన : మైరావణ చరిత్ర (ద్విపద).

పేరమంత్రి సుతుడు. (ద్వి.సా.చ-217)

## పాదుకా సహస్రము (అలభ్యం)

కవి. విజయరాఘవ నాయకుడు. (చూ).

ద్విపద కావ్యం. దేవాలయోత్సవాలలో ప్రదర్శింపబడుతుండేదట.

(చ. దే. వా-89)

## పానార సీమ

ఈనాటి పశ్చిమ గోదావరి జిల్లాకు చెందిన కొవ్వూరు, నరసాపురము, భీమవరము తాలూకాలకు చెందిన ప్రదేశం. వసిష్ఠ, గోస్తని అనే గోదావరి శాఖలు ఈ సీమలో ప్రవహిస్తున్నాయి. ( క. స-2-44; ఆ. రా. చ.)

## పానుగల్లు

నవీనమైన యాజమాన్య సంస్థానం. ఈ ఎస్టేటు నెల్లూరు, ఉత్తర ఆర్కాడు మండలాలలోని కొన్ని గ్రామాలు కలిసి ఏర్పడింది. కాళహస్తి పట్టణానికి సమీపంలోఉన్న స్వర్ణముఖీనదీ తీరాన నవీనంగా నిర్మింపబడిన "పానుగల్లు" ఈ జమీందారులకు నివాసం.

ఈ సంస్థాన పాలకులు వెలమవారు. కాకతీయ సామ్రాజ్యం అంతరించే వరకు ఈ రాజులను సేవిస్తూ, తెలంగాణంలోని నల్లగొండ సమీపంలో ఉన్న 'పానుగల్లు' కోటకు అధిపతులుగా ఉండేవారట. బాలనాగమ్మ, మాయల మరాఠీల జానపద కథలకు ఈ పానుగల్లు ముఖ్యరంగం. తరువాతికాలంలో వీరు పానుగల్లుకోటపై అధికారం కోల్పోవడంచేత దక్షిణ సీమలకు వెళ్ళవలసి వచ్చింది.

వీరిలో ప్రఖ్యాతులైన వేంకటరామారాయణింగారు నెల్లూరు, ఉత్తరార్కాడులలో విలువైన భూములు సంపాదించారు. వీరి మనుమడైన శేషాచలపతిరాయడు కాలంలో కాళహస్తి పట్టణానికి సమీపంలో ఉన్న స్వర్ణముఖి నదీతీరంలో "పానుగల్లు" అనే నవీననగరం నిర్మింపబడింది. ఈ పాలకులు పూర్వుల రాజధాని పేరునే ఈ నూతన నగరానికి నిర్ణయించడం గమనార్హం.

వేంకటరంగారాయని పెద్ద కుమారుడు రామారాయణింగారు (క్రీ.శ. 1866-1926) రాజకీయ రంగంలోను, సాంఘిక సేవాకార్యక్రమాలలోను, విద్యారంగంలోను మిక్కిలి కృషిచేశారు. కొంతకాలం మదరాసు రాష్ట్రానికి విద్యాశాఖామాత్యులుగా, ముఖ్యమంత్రిగా వ్యవహరించి పేరు పొందారు. వీరి సోదరులు పానుగంటి పార్థసారథిరాయడు ఆంగ్లవిద్యా పట్టభద్రులు, సంస్కృతాంధ్రాలలో చక్కని అభినివేశం కలవారు. భగవద్గీతా మంజరి, కమలాకల్యాణము, సత్యాకృష్ణ సమాగమము వంటి వినూత్న రచనలు గావించి సాహిత్యసేవ చేశారు. (ఆం.సం.సా.-220-223)

**పాపన్నపేట**

మెదకు సంస్థానమని వ్యవహారనామం.

ఇది నేడు మెదకు మండలంలోని చిన్న సీమకు పరిమితమైన సంస్థానంగా కనిపిస్తున్నా చాలా పురాతనమైనదనీ, పూర్వం నిజాం రాష్ట్రంలోని అన్ని సంస్థానాలకన్న అధిక విస్తీర్ణంగలదిగా ఉండేదనీ చరిత్రకారుల అభిప్రాయం. ఫిరోజిషా చక్రవర్తుల కాలంలో స్థాపించబడిన ఈ సంస్థానం ఔరంగజేబు చక్రవర్తి కాలం వరకు చెక్కు చెదరకుండా ఉండి తరువాతి కాలంలో చిన్న సీమకు పరిమితమైందట.

ఈ సంస్థానపు పూర్వ చరిత్ర సమగ్రంగా లభించదు. సంస్థాన పాలకులలో 12వ తరానికి చెందిన "రాయబేగం రాణీ శంకరమ్మ" మిక్కిలి సమర్థురాలు. రాజ్యకార్య నిర్వహణలోను, రణతంత్ర నైపుణ్యంలోను రుద్రమాంబను, ఝాన్సీలక్ష్మీబాయిని మించిపోయిన వీరనారి. ప్రభుభక్తి పరాయణురాలైన ఈ రాణి నిజాము తరపున అనేకమార్లు పీష్వాలతో యుద్ధంచేసి వారిని ఓడించిందట. నిజాం ప్రభువు ఈమెను 'రాయె బాగన్' అనే బిరుదం (ఆడు సింహము అని అర్థం)తో గౌరవించాడు. అది కాలక్రమంలో 'రాయ బేగం'గా స్థిరపడింది.

శంకరమ్మ దత్తపుత్రుడు 'సదాశివారెడ్డి' సమర్థుడైన పాలకుడు. జానపద గీతాలలో ఇతని ప్రశంస ఉంది. ఇతడు దోమకొండ సంస్థానం నుంచి దత్తుతీసుకోబడ్డాడు.

క్రీ. శ. 1765 లో నిజాం కుటుంబంలోని రాజ్యాధికారపోరులో తలదూర్చి, నిజాం సలాబతుని పక్షం వహించి. నిజాంపై ఎదిరించి అనేక ఉద్యమాలు విజయం పొందాడట. ఇతని భార్య పార్వతమ్మ వీరనారి. భర్తకు యుద్ధరంగంలో అండగా నిలచిన సాధ్వి. చివరకు ఈ దంపతులు విశ్వాసఘాతకంతో నిజాంచేత బంధింపబడి చంపబడ్డారు.

క్రీ. శ. 20 వ శతాబ్దం ప్రారంభంలో రాజా వేంకట దుర్గారెడ్డి ఈ సంస్థాన పాలకుడుగా ఉన్నారు ఇతని ఏకాల మరణంచేత సంస్థానం ఇక్కట్ల పాలై క్రీ శ. 1927 ప్రాంతంలో కొంతకాలం 'కోర్టు ఆఫ్ వార్డ్సు' వశమైంది. ఆ తరువాత దుర్గారెడ్డిగారి భార్య "వెంకటలక్ష్మమ్మ సర్ దేశాయి గారు" పాలనను స్వీకరించారు. ఈమెరచయిత్రి. ఈమె "మానసబోధ" పద్యాలు లభిస్తాయి. ఈమె తరువాత రామచంద్రారెడ్డి బహాద్దుర సంస్థాధీశులైనారు.

సిద్ధాబా శంకరరాయకవి పాపన్నపేట సంస్థానంవారి ఆశ్రితుడు. "సుజ్ఞాన దీపము గురుగీతలు" ఇతని రచన.

రాజారామచంద్రారెడ్డి సాహిత్యప్రియుడు. సన్నిధానం సూర్యనారాయణశాస్త్రి గారి కావ్యాలంకార సంగ్రహ వ్యాఖ్యను ముద్రించుకోవడానికి వీరు భూరివిరాళం ఇచ్చారు.

తదనంతరకాలంలో ఈ సంస్థానం హైదరాబాదు రాష్ట్రంలో లీనమైపోయింది.

(అం.సం.సా_224_227)

## పాపాశాస్త్రి

కాలం : క్రీ. శ. 19 వ శతాబ్దం.

స్థలం : కడకుంట్ల గ్రామం (మహబూబ్‌నగర్ మండలం).

రచనలు : 1. భారత సంగ్రహము 2. భ్రమరాంబికా సంవాదము.

వీరు వనపర్తి సంస్థానం వారి పోషణక్రింద పైరెండు కావ్యాలను రచించినట్లు తెలుస్తున్నది (అం. సం. సా.)

## పారనంది సర్వేశ్వరశాస్త్రి

కాలం : క్రీ. శ. 19 వ శతాబ్దం తొలిభాగం.

స్థలం : గంజాం జిల్లా.

రచన : బ్రహ్మపురీశ శతకము.

ఇతని కవిత రసవంతంగా ఉంటుంది. బ్రహ్మపురి (బరంపురం) లోని వేంకటేశ్వరస్వామికి అంకితంగా శతకం రచించాడు. ఈ శతకం ఒక్కరోజులో చెప్పాడట. అక్కమరాజు భీమన, ఆదినారాయణశెట్టి, వేంకటరంగము అనేవారిని శతకంలో ఆశీర్వదించాడు. (శ.క.చ_536)

## పారమార్థిక గేయములు

వస్తు, రస ప్రాధాన్యాన్నిబట్టి జానపద గేయ వాఙ్మయం కొన్ని భాగాలుగా చేయబడింది. భక్తి జ్ఞాన కర్మ మార్గాలను అనుసరించి చెప్పబడిన గేయాలు పారమార్థిక గేయాలు.

భక్తి గేయాలలో కొన్ని శైవమత ప్రధానమైనవి, కొన్ని వైష్ణవ మత ప్రధానమైనవి శైవరచనల్లో తుమ్మెద పదాలు ఇప్పటికీ జానపదుల్లో నిలిచి ఉన్నాయి. వైష్ణవ పరమైన రచనల్లో తాళ్ళపాక వారి కీర్తనలు క్షేత్రయ్య, త్యాగయ్య మొదలగువారి కీర్తనలు ప్రచారంలో ఉన్నాయి. లాలిపాటలు, మేలుకొలుపులు, మంగళహారతిపాటలు మొదలగు పలురకాలున్నాయి.

వేదాంత గేయ రచనలకు "తత్త్వములు" అని పేరు. తత్త్వప్రధానమైన రచనలు కాబట్టి "తత్త్వాలని" పిలవబడుతాయి. వీటిలో అద్వైత వేదాంత రూపమైన తత్త్వరచనలు అధికంగా కనిపిస్తాయి. వీరబ్రహ్మము, వేమన, లింగమూర్తి వంటివారి రచనలు ఈ ప్రక్రియలో ప్రసిద్ధిచెందాయి. వీటిలో రాజయోగం, గురుభక్తి, అహింస, నీతి మొదలగునవి ప్రధానంగా బోధింపబడతాయి.

వ్రతాలు, నోములు, కర్మకాండలు మొదలగు వాటిని వర్ణించే గేయాలు అనేకాలున్నాయి. ఇందులో అధిక భాగం స్త్రీలపాటల రూపంలో ఉన్నాయి. స్త్రీలకందరకు "పూజ" విషయంలో శ్రద్ధ కలిగించాలన్నదే వీటి ప్రముఖ ప్రయోజనం. వరలక్ష్మీ వ్రతం, మంగళగౌరీ వ్రతం వంటివి ఇట్టి గేయాలు. (అం.వా.చ.)

## పారర్షి

అల్లసాని పెద్దన వ్రాసిన మనుచరిత్రలోని ఒక పాత్ర. మనుచరిత్ర ఆంధ్ర పంచ కావ్యాలలో ఒకటి. పారుడనే పేరుగల ఈయన మహా తపోధనుడైన బ్రహ్మర్షి. ఈతని తపస్సును విఘ్నమొనర్చడానికి దేవేంద్రుడు పుంజికస్థల అనే అప్సరసను పంపుతాడు. ఆమె పారర్షి తపస్సుకు విఘ్నం కలిగిస్తుంది. వీరి కుమార్తె కళావతి. తల్లి వదలిపోగా తండ్రి పారర్షి ఆమెను పెంచి పెద్దచేశాడు. దేవాపి అనే గంధర్వుడు కళావతిని వివాహమాడగోరి పారర్షిని అడిగితే పారర్షి నిరాకరించాడు. ఆ గంధర్వుడు పగబట్టి ఆనాటి రాత్రి ఈ మహర్షిని వధించాడు. కళావతి తరువాత స్వరోచిని వివాహమాడింది. లోకంలోని దౌష్ట్యమూ, దుర్మార్గమూ ఆయా పాత్రలద్వారా పఠితలకు పరిచయం చేయడం మహాకవుల కావ్యాలలో కనిపిస్తుంది. ఈ పాత్ర లోకవ్యవహారానికి అద్దంపట్టే పాత్ర. ఎవరికీ అపకారం తలపెట్టకుండా తన పని తాను చేసుకుపోతున్నవారికి కూడా విధివశాత్తు కొన్ని కష్టాలు కలగక మానవని ఈ పాత్రద్వారా తెలుస్తున్నది.

## పారిజాత నాటకము

కర్త : జ్యోతి రామయ్య.

అంకితం : చేజెర్ల చెన్నకేశవస్వామికి.

ప్రదర్శనకొరకు రచించిన యక్షగానం. ఇతివృత్తం సత్యభామ స్వగతం వలె ఉన్నది. ఆమె కృష్ణుని వెదకుతూ, తన పెండ్లి ముచ్చట చర్చిస్తూ వలపు వెళ్ళబోసుకోవడాన్ని దీనిలో కవి వర్ణించాడు. దీనిలో ద్విపదలు, పద్యాలు ఉన్నాయి.

(య వా.చ–109)

పారిజాత నాటకము

కర్త : వాయలూరి నారాయణకవి.

యక్షగానం. ప్రళయ కావేరి పట్టణానికీ చెన్నపురికీ మధ్యగల పొన్నేరి సీమ లోని వాయలూరి పురి జనార్దనునికి అంకితం. రచన ప్రౌఢంగా, పండిత సమ్మతంగా ఉంది. దీని ప్రతి కాకినాడ పరిషత్తుపుస్తక భాండాగారంలో ఉంది. (ఆం. సా.ప.ప సం_1650)

పారిజాత పల్లవి

కర్త : తెలియదు.

జానపద పౌరాణిక గేయం.

ప్రసిద్ధ కథ. భాగవతానికి సంబంధించినది.

చూ. పౌరాణిక గేయములు. (ఆం. వా. ప.)

పారిజాత ప్రబంధము

నామాంతరం : ఆట భాగవతం.

కర్త : చూ. సరుకూరి నారాయణప్ప

అంకితం : వెలుగోటి కుమార యాచమనాయనికి (1777-1804).

యక్షగాన ప్రబంధం. ఇతివృత్తం ప్రఖ్యాతం. కవి తిమ్మనగారి ప్రబంధం చూసి తానీ నాటకం వ్రాసినట్లు చెప్పుకొన్నాడు. దీనిమీద భామకలాప ప్రభావం ఉంది. రచన చక్కగా సాగింది. దీనిలో తాళప్రధానాలైన దరువులు, ద్విపదలు. పద్యాలు, కందార్థాలు గీతార్థాలు, ఏలలు, అర్ధ చంద్రికలు, శోభనములు, శ్లోకాలు, చూర్ణికలు ఉన్నాయి. పాత్రల స్వీయోదంతము, ముఖాముఖి సంభాషణలు ఉన్నాయి. నాటకీయత ప్రస్ఫుటంగా ఉంది. దీనికి ప్రదర్శనలలో విశేష ప్రచారం లభించింది. దీనికి "ఆట భాగవత"మని పేరు కూడా ఉంది. (ఆం. సం. సా_158; య. వా. చ_63)

పారిజాతము

కర్త : చూ. పురిజాల లక్ష్మీనారాయణదాసు కవి.

అంకితం : పాలకొండ జమీందారైన "రామభద్రరాజు"కు.

యక్షగాన కృతి. కృతిభర్త అయిన రామభద్రరాజు కృతికర్తను పిలిచి పారిజాతాపహరణ కావ్యాన్ని వ్రాయమన్నాడట. కవి దాన్ని "పారిజాతము" అనే పేర యక్షగానంగా వ్రాశాడు. ఈ గ్రంథం అముద్రితం. ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారంలో దీని తాళపత్ర ప్రతి (R. No. 438) ఉంది. ఇందులో అన్య దేశ్యాలు కొల్లలుగా వాడబడ్డాయి.

పురుషులు, స్త్రీ పాత్రలు ధరించడాన్ని కవి సమర్థించాడు.

(ఆం. సం. సా_231)

పారిజాతము

కర్త : భారతి రామరాజు.

ప్రదర్శనానుగుణమైన రచన. దీనిలో "రుక్మిణీ వేషము"కథ, నాయికా నాయకులకు "జాబు వ్రాసే సన్నివేశ" విశేషంగా ఉన్నాయి. (య. వా. చ-81)

## పారిజాతాపహరణ ప్రబంధము (అలభ్యం)

కర్త : రఘునాథ నాయకుడు.

ఈ కావ్యాన్ని రఘునాథుడు రెండు జాములలో ఆశువుగా చెప్పాడట. అతి కష్టం మీద వ్రాయసగాళ్ళు వ్రాయగలిగారని సాహిత్య రత్నాకరంలో చెప్పబడింది. ఈ శైలి మాకంద కుసుమం, మకరంద బంధురమూనట. ఈ ప్రబంధం చెప్పినందుకే తండ్రి ఇతనికి కనకాభిషేకం చేశాడు ఈ విషయాన్ని రాజ చూడామణి దీక్షితుడు యజ్ఞనారాయణ దీక్షితుడు పేర్కొన్నారు.

ఆనాడు ద్విపదను ప్రబంధంగా వ్యవహరిస్తుండేవారు. ఇది ద్విపద కావ్యం కావచ్చునని కొందరు పండితులు భావిస్తున్నారు (న. దే. వా-34; క. శ-12-10)

## పారిజాతాపహరణము

కర్త : నంది తిమ్మన.

రచనాకాలం : క్రీ. శ. 16వ శతాబ్దం.

అంకితం : శ్రీకృష్ణ దేవరాయలకు.

అయిదు ఆశ్వాసాల ప్రబంధం. సంస్కృత భాగవతంలోని మూడు శ్లోకాలు ఆధారం చేసుకొని కల్పనా చాతుర్యంతో కవి తిమ్మన సుమారు 500 గద్య పద్యాలతో మనోహర ప్రబంధంగా చెప్పాడు. దీనికి మూలం సంస్కృత హరివంశం (68-76) అని కొందరంటున్నారు. ఈ కథ హరివంశం, భాగవతం, విష్ణు పురాణాలలో అతి సంగ్రహంగా ఉంది. ఎర్రన హరివంశంలో ఈ కథను చాలా సంగ్రహంగా వ్రాశాడు. నాచన సోమన ఉత్తర హరివంశంలో పూర్తిగా విడిచాడు. తిమ్మన భాగవత, విష్ణుపురాణాలతో పాటు, హరివంశాన్ని కూడా చదివి ఈ గ్రంథం వ్రాసినట్లు తెలుస్తున్నది. నరకాసుర వధానంతరం పారిజాత పుష్పం తీసుకొని ద్వారకకు వచ్చి రుక్మిణీ మందిరంలో ఉన్నప్పుడు కృష్ణుని చేతిలో పెట్టి రుక్మిణీ, సత్యలలో ఎవరికివ్వాలో కొంచెం తికమక పెట్టి చివరకు రుక్మిణికి ఇచ్చేటట్లు కలహభోజనుడు కథా ప్రారంభం చేస్తాడు. తరవాత సత్యభామ అలక, విరహం, కృష్ణుని అనునయం, సత్య చివాట్లు రసవత్తరంగా జరిగినతర్వాత పారిజాత వృక్షం కోసం స్వర్గంమీద కృష్ణుడు దండయాత్ర చేస్తాడు. తల్లి అదితికి కుండలాలు ఇచ్చే నెపంతో నారదుని ద్వారా స్వర్గానికి కబురు చేస్తాడు. దేవతలను జయించి పారిజాత వృక్షాన్ని తెచ్చి ద్వారకలో నాటించిందాకా సత్యభామ విశ్రమించలేదు. తరవాత సత్య అహంకారం అణచటానికి నారదుడు సత్య చేత పుణ్యకవ్రతం చేయిస్తాడు.

పారిజాత వృక్షాన్ని నందనోద్యానం నుంచి హరించి తీసుకురావటమే దీనిలో ప్రధాన కథ కాబట్టి దీనికి పారిజాతాపహరణమని పేరొచ్చింది. సూర్యోదయ, అస్తమయాది వర్ణనలు సంస్కృత హరివంశంలో లేనివి తిమ్మన తెలుగులో చేశాడు. పుణ్యక

ప్రతిం మూలంలో విస్తారంగా లేదు పారిజాతం కోసం శ్రీకృష్ణుడు తపస్సుచేసినట్లు మూలంలో ఉంటే తిమ్మన దానిని విడిచివేశాడు.

నాచన సోముని హరివంశమయినట్లే హరివంశ శేషం పారిజాతాపహరణ కావ్యమని అనవచ్చును.

తిమ్మన కవిత్వం మృదుమధుర పద సంయుతం. మనోహరం. తిమ్మన కవితను "ముక్కు తిమ్మనార్యు ముద్దు పలుకు" అన్నారు సమకాలికులు.

రాయలకు రాయని దేవేరికి ఉన్న ప్రణయ కలహాన్ని దాస దాసీ జనాలవల్ల తిమ్మన తెలుసుకొని, సమయోచితంగా ఈ కావ్య రచన చేసి రాయలను మెప్పించినట్లు జనశ్రుతి. రాయలకు ప్రణయ కలహం వచ్చింది తిరుమల దేవితోనా, చిన్నాదేవితోనా అనే విషయంలో అభిప్రాయ భేదాలున్నాయి. ఏమైనా ఒక దేవేరికి అరణపు కవి అయిన తిమ్మన సమయోచితంగా రాయలకు దేవేరికి పొందు కూర్పటానికి శృంగార రస ప్రధానమైన ప్రబంధం వ్రాయటంలో ఔచిత్యముంది. (క. త-7)

## పారిజాతాపహరణము

కవి : శ్రీ నారాయణ తీర్థులు (చూ).

అంకితం : తమ్మెరాపురం (మేంటూరు) లో వెంచేసి ఉన్న వరదరాజ స్వామికి.

నాంది. సంస్కృత శ్లోకంతో ఆరంభం–ఒక శ్లోకంలో కథా సంగ్రహం చెప్పాక తెలుగు నాటకం ప్రారంభమవుతుంది. పారిజాతాపహరణ వృత్తాంతం ఇతివృత్తం. సమకాలీన నాటకాల వలె విఘ్నేశ్వర పాత్ర, సూత్రధారి వచనాలు, సంవాద దరువులు ఉన్నాయి. ఈ పద్ధతి రచన తంజావూరును పాలించిన మహారాష్ట్ర రాజుల నాటియక్షగాన నాటకాలలో కనిపిస్తుంది కృతి రచనాకాలం 1561–1614 ల నడుమ కావచ్చును.

(శారదాధ్వజం–132; ద. దే. వా–296)

## పారిజాతాపహరణము

కర్త : మాతృభూత కవి.

రచనాకాలం : క్రీ.శ. 18వ శతాబ్దం.

అంకితం : అమరసింహునికి.

నాటకం. అయిదంకాలున్నాయి.

తంజావూరును పాలించిన అమరసింహునికి (1788–89) అంకితంగా ఈ నాటకాన్ని కవి శివరాయ మంత్రి ప్రోత్సాహంతో రచించాడట. గ్రంథంలో గొల్లలను గూర్చి విశేషంగా ఉంది. పల్లవర్ణన ప్రత్యేకంగా ఉంది కవిసంగీత వైదుష్యం ఈ రచనలో ప్రతి ఫలిస్తున్నది. (ద. దే వా–272)

## పారిజాతాపహరణము (అలభ్యం)

కవి : విజయరాఘవ నాయకుడు.

రచనాకాలం : క్రీ.శ. 17వ శతాబ్దం.

ఇది మృదువచనాలతో కూడిన యక్షగానమట. (ద.దే.వా-88)

**పారిజాతాపహరణము**

నామాంతరం : రంగపురి పారిజాతము.

కర్త : శ్రీనివాసకవి.

అంకితము : శ్రీరంగేశునికి.

యక్షగానం. కథప్రసిద్ధం. దీనిలో శ్రీకృష్ణుడే సుంకరి కొండడై రావడం, శారద సత్యభామకు ఎఱుక చెప్పడానికి రావడం, పాత్రలు ప్రదర్శన ప్రవర్తకుడైన హాస్యగానిచే ప్రశ్నింపబడి స్వీయోదంతములు చెప్పడం ఉన్నది.

దీనిలో ప్రసిద్ధ రాగతాళాలలో దరువులు, ద్విపదలు, పద్యములు, కందార్థములు, ఏలలు ఉన్నాయి. (య.వా.చ-88)

**పారిజాతాపహరణ సత్కృతి**

కవయిత్రి: తరిగొండ వేంకమాంబ.

యక్షగానం. దీని వ్రాతప్రతి మద్రాసు ప్రాచ్యలిఖిత భాండాగారంలో ఉన్నదట. (అ. భా. కవయిత్రులు-75)

**పార్థ విజయము**

కర్త : నడిమింటి సర్వ మంగళేశ్వర శాస్త్రి (చూ).

కావ్యం.

**పార్థ సారథి విజయము**

నామాంతరం : (చూ) భాగవత (దశమస్కంధ) యక్షగానము.

కవి : ఆలూరి కుప్పన (చూ). (ద.దే వా-249)

**పార్థసారథి శతకము**

కర్త : తాడేపల్లి పానకాలరాయుడు.

వృత్త శతకం. "పార్థసారథీ" అనే మకుటంతో ఉంది. కవిత్వం హృదయంగమంగా ఉంటుంది. (శ. క. చ-464)

**పార్థసారథి శతకము**

కర్త : తోట విజయ రాఘవకవి

రచనాకాలం : క్రీ. శ. 19 వ శతాబ్ది.

ఇది ఏక ప్రాస కంద పద్య శతకం. క్రీ. శ. 1849 లో ముద్రితమట. భక్తిరస భరితమైన రచన. (క.స-219)

**పార్థ సారథి శతకము**

కర్త : చూ. పేరి కాశీనాథశాస్త్రి. (ఆం.సం.సా-427)

**పార్వతీ కల్యాణమ్ (సం)**

కర్త : చూ. వామన భట్టబాణుడు.

ఇది ప్రఖ్యాతమైన నాటకం. (తె.రా.చ.)

**పార్వతీ కల్యాణము**

కవి : నుదురుపాటి వెంకన్న (చూ).

అంకితం : మీనాక్షి సుందరేశ్వరులకు.

ప్రమకోటిట సంస్థానంలో వెలువడిన యక్షగాన కావ్యం. రాగతాళయుక్తాలైన తెలుగు కీర్తనలు - పదాలు - సంస్కృత గేయాలు ఉన్నాయి. కవి ఈ యక్షగానాన్ని రాయ రఘునాథుని ప్రోత్సాహంతోనే రచించి దైవాంకితం చేశాడు. (ద.దే.వా-428)

**పార్వతీ కల్యాణము**

కర్త : శహాజీ (చూ).

అంకితం : పరమేశ్వరునికి.

రచనాకాలం : క్రీ. శ. 18 వ శతాబ్దం.

ఈ నాటకం మొదట శహాజీ పేరున్నా చివర "శ్రీ చోళ నాయకాయ, శ్రీ వామ దేవకవి వచస్సంతుష్టాయ మంగళం" అని ఉండటంచేత పలువురు దీని కర్తృత్వాన్ని సందేహిస్తున్నారు.

హాస్యధోరణిలో నడచిన నాటకం. ఇందులో మహాసంకల్పానికీ, మంగళాష్టకాలకూ లోక వ్యవహారరీతి కల్పించబడింది. ఆనాటి సంఘంలోని లోపాలను సున్నితంగా ఎత్తి చూపిస్తూ హాస్యరసాన్ని పోషించడానికి చేసిన ప్రయత్నం ఇందులో కనిపిస్తుంది (ద దే వా-193)

**పార్వతీ దండకము**

రచనాకాలం : క్రీ. శ. 1760 ప్రాంతం.

కర్త : తక్కసీల వెంకన్న.

**పార్వతీ పరమేశ్వర పరిణయము**

కర్త : కృష్ణయ్య.

రచనాకాలం : క్రీ. శ. 19 వ శతాబ్దం.

మూడాశ్వాసాల ప్రబంధం.

**పార్వతీ పరిణయము (అలభ్యం)**

కర్త : చెంగల్వ వేంకటయ్య (చూ)

చెంగల్వ కాళకవి రాజగోపాల విలాసంలో దీన్ని గురించి చెప్పాడు. (ద. దే. వా-1 3)

**పార్వతీ పరిణయము**

కర్త : రాయ రఘునాథరాజు (చూ).

పుదుక్కోట సంస్థానంలో వెలువడినకావ్యం. ఆరాశ్వాసాల ప్రబంధం. ఉత్తమ కావ్యాలలో ఒకటి. మూలం కుమార సంభవగాథ. నన్నెచోడ శ్రీనాథుల తర్వాత ఈ ఇతివృత్తంతో వచ్చిన గొప్ప కావ్యం ఇదే. కల్పనలు, రసపోషణ, తెలుగు నుడికారపు సొంపులు మనోహరంగా ఉంటాయి. వేదాంత పరమైన జిజ్ఞాస గోచరిస్తుంది.

పంచమాశ్వాసంలో పార్వతీ పరమేశ్వరుల వివాహం షష్ఠాశ్వాసంలో కుమార జననం – ఉత్తర పల్లి అనే పేరుగల దేవసేనను పరిణయమాడటంతో ప్రబంధం ముగుస్తుంది.

దక్షిణాదిన వెలువడ్డ కావ్యాలలో, ఈవల్లీ పరిణయగాథకు చాలా ప్రాధాన్యం ఉంది. ఇది ప్రత్యేకంగా కూడా యక్షగానాలుగా, నాటకాలుగా, బహుళ ప్రచారం పొందింది. రఘు వంశ వర్ణన పద్యాలు, ఇతని ఆస్థాన కవి నుదురుపాటి వెంకన తన ఆంధ్ర భాషార్ణవంలో చెప్పినవి. అవి అతడు చెప్పినట్టుగానే రఘునాథుడు గ్రహించి తన [illegible]లో చేర్చుకొన్నాడు. ఈ గ్రంథ ప్రాశస్త్యాన్ని గురించి చాలా వ్యాసాలు వెలువడ్డాయి. (వ.దే.వా–415)

## పార్వతీ స్తోత్రమ్ (సం)

కర్త : వీరరాఘవ కవి.

## పాలకొండ

ఇది శ్రీకాకుళం జిల్లాలోని కొండ జమీందారీలలో ఒకటి. తక్కిన కొండ జమీందారీల వలెనే ఇది కూడా జయపురం సంస్థానం ద్వారా రూపొందింది.

సంస్థాన పాలకులు 'కోదు' లేక 'జాతాపు' అనబడే కొండజాతికి సంబంధించిన వారు. పాలకొండ, వీర ఘట్టములు జయపురం సంస్థానంలోనివి ఈ కొండ ప్రాంతం నుండి శత్రువుల దాడులు జరగకుండా రాజ్యాన్ని రక్షించుకోడానికి నమ్మకమైన వారి ఆధీనంలో గట్టి రక్షణను ఏర్పాటు చేయవలసిన అవసరం ఏర్పడింది. జయపురం రాజైన విశ్వంభరదేవు (క్రీ. శ. 1672–76) 'వన్నాయి' అనే వాని కుమారుని 'నరేంద్ర నాయుడు' అనే బిరుదంతో పాలకొండ వీరఘట్టాలకు జమీందారుని చేశారు. "వన్నాయి" ఈ పాలకుల వంశానికి మూల పురుషుడు.

నిరంతరం పరిసర రాజ్యాలతో కలహాలు, అడుగడుగునా గృహచ్ఛిద్రాలూ కలిగి ఈ సంస్థానం 20 వ శతాబ్దానికి పూర్వమే అంతరించి పోయింది. 1794 లో పాలకొండ జమీందారైన విజయరామరాజు కుంఫిణీ వారితో వైరం పెట్టుకున్నాడు. 1796 లో సంస్థానం నుంచి తొలగింపబడ్డ ఈ విజయరామరాజు వీరఘట్టంలో కొంత తిరుగుబాటు సేనతో చేరి అరాచకచర్యలు సాగించాడు. 1796 నుంచి 1798 వరకు సీతారామరాజు రాజ్యంచేసి కాలం చేశాడు. ఈతని సోదరుడైన వెంకటపతి రాజు విషయలోలుడు. అతి నమ్మకస్థులైన దివానులను చంపించి, చపలచిత్తుడై ప్రజల అభిమానాన్ని కోల్పోయాడు. క్రీ.శ. 1828 లో మరణించాడు

ఇతని కుమారుడైన "భాస్కరరాజు"ను కుంఫిణీ వారు 1829 లో సంస్థానాధిపతిగా నియమించి, సంస్థానాన్ని కోర్ట్ ఆఫ్ వార్డ్సు వశంలో ఉంచారు. గృహచ్ఛిద్రాలు అధికం కావడంచేత, పేష్కషు అధికంగా బకాయిపడి ఉండడం చేత క్రీ. శ. 1837 లో సంస్థానం పూర్తిగా ఆజమాయిషీలోకి వచ్చింది. ఆ తరువాత ప్రభుత్వ వశం అయింది.

తరువాత కుంఫిణీవారు ఈ జమీందారీ కుటుంబానికి సంబంధించిన 19 మందిని వెల్లటూరు రాయవేలూరు దుర్గంలోను, గుత్తి దుర్గంలోను బందీలుగా ఉంచారు. రాయవేలూరు కోటలోనే వీరి జమీందారీ ముగిసింది. ఈ వంశం వారు 20 వ శతాబ్దిన వెలుగు చూడలేదు. వీరిలో క్రీ. శ. 16 వ శతాబ్దంలో పాలకొండను పాలించిన రామభద్రరాజు సాహిత్య పోషకుడు. పులిజాల లక్ష్మీనారాయణ కవి ఇతని ఆశ్రయంలోని వాడు.

అనేక విధాలుగా ప్రసిద్ధి గాంచిన "నడిమింటి" వారికి ఈ జమీందారులు "..." గ్రామం దానం చేసినట్లు తెలుస్తున్నది. ఈ జమీందారులు భాస్కరరాజ పురాగ్రహారంలో నిర్మించిన విష్ణ్వాలయంలో వైష్ణవ పండితులు అనేకులున్నారు. ముడుంబ రాఘవాచార్యులకు ఈ జమీందారులు భూగృహదానాలు ఒసగించారట. పాలకొండ దివానుల కుటుంబానికి చెందిన ఆది నారాయణ పాత్రో విరచితమైన శ్రీ వరాహ చరిత్రము ఒకటి లభిస్తున్నది (ఆం.సం.సా-226-238)

## పాలకొండ రామభద్రుడు

స్థలం : పాలకొండ.

కాలం : క్రీ. శ. 16 వ శతాబ్దం.

పాలకొండ సంస్థానాధిపతి. కవి పండితపోషకుడు. పులిజాల లక్ష్మీనారాయణ కవిని ప్రోత్సహించి పారిజాత యక్షగానాన్ని రచింపజేశాడు. అడిదం సూరకవి చాటువులలో ఇతని ప్రసక్తి ఉంది (య వా ప-464)

## పాలచూరి కృష్ణభూపాలుడు

కాలం : క్రీ. శ. 16 వ శతాబ్దం.

స్థలం : గుంటూరు మండలం కావచ్చు.

గురువు : తిరుమల శ్రీనివాసాచార్యులు.

సాహిత్యపోషకుడు. తెనాలి రామభద్ర కవి రచించిన ఇందుమతీ పరిణయ ప్రబంధానికి కృతిపతి. (క.స.193)

## పాలపర్తి సోమేశ్వరుడు

కాలం : క్రీ. శ. 1590 కి ముందు.

రచనలు : 1. త్రిపురసంహార మకుటము 2. శరభలింగ మకుటము.

విశిష్టత : ఈయన వ్రాసిన పద్యమకుటాలను బట్టి ఇవి రెండూ కావ్యాలో లేక శతకాలో నిర్ణయించటం కష్టం. త్రిపుర సంహారాన్ని వర్ణించే 2 పద్యాలను పెదపాటి జగ్గన్న తన ప్రబంధ రత్నాకరంలో ఉదాహరించాడు. తొలి పద్యంలో "చిరశుభాంకః సోమ

శేఖరాంక" అనేది మకుటం లాగ చివర కనిపిస్తుంది. రెండోదానిలో "శరభలింగ" అని చివర ఉంది. పద్యాలలో మంచినడక ఉంది. (అరుద్ర-9)

## పాలమంగలము అప్పయ కవి

కాలం : క్రీ. శ. 19 వ శతాబ్దం.
స్థలం : కార్వేటి నగర సంస్థానం.

కార్వేటి నగర ప్రభువు కుమార వేంకటపెరుమాళ్ళరాజు బహద్దరు వారి ఆస్థానంలోని అష్టదిగ్గజాలలో ఒకరు ఇతని రచనలను గురించి వివరాలుతెలియవు. (ఆం.సం.సా)

## పాలవేకరి కదిరీపతి

నామాంతరం : తాడిగోళ్ళ కదిరీపతి.
కాలం : క్రీ. శ. 17 వ శతాబ్ది.
స్థలం : నెల్లూరు మండలం.
రచన : శుకసప్తతి

కరియ మాణిక్యమ్మప్పని పౌత్రుడు. కదిరిరాజు పుత్రుడు. ఈయన పూర్వులు కోలారుప్రాంతంలో సామంతరాజులుగా ఉండేవారు. కదిరి నృసింహస్వామి కృపవలన కవితాశక్తి పొందినాడట. కథాకథనంలో ప్రవీణుడు. ఈయన కావ్యంలో తన కాలంనాటి సాంఘిక పరిస్థితులను విపులంగా వర్ణించాడు. శైలి సులభం గాను, సహజంగాను ఉంటుంది. (తె.వి.స-6)

## పాల్కురికి సోమనాథుడు

కాలం : క్రీ.శ. 13వ శ. పూర్వార్ధం.
స్థలం : నైజాం మండలం. వరంగల్ జిల్లా, జనగామ తాలూకా పాలకురికి.
రచనలు : 1. బసవ పురాణము 2. పండితారాధ్య చరిత్ర 3. వృషాధిపశతకము 4. బసవోదాహరణము 5. అనుభవసారము 6. చెన్నమల్లు సీసములు 7. చతుర్వేద సారము 8 బసవ రగడ (కన్నడం) 9. బసవన స్తోత్రము 10. బసవాష్టకమ్ (సం) 11. అక్షరాంక గద్య (సం) 12. నమస్కార గద్య (సం) 13. పంచప్రకార గద్య (సం) 14. సోమనాథ స్తవము 15. వృషభాష్టకము 16. సోమనాథభాష్యమ్ (సం) 17. రుద్రభాష్యమ్ (సం) 18 బసవాఢ్య రగడ (కన్నడం) 19. సద్గురు రగడ (కన్నడం) 20. గంగోత్పత్తి రగడ (కన్నడం) 21. బసవోదాహరణమ్ (సం).

శ్రియాదేవి రామదేవుల పుత్రుడు. కట్టకూరి పోతిదేవుని భక్తుడు. ఈయన కాకతి రెండో ప్రతాపరుద్రుని సమకాలికుడని, ఈయన నివాసం వరంగల్ జిల్లా జనగామ తాలూకాలోని 'పాలకురికి' అని పండితాభిప్రాయం. దేశి మార్గ రీతులకు చెందిన ద్విపద కవిత్వానికే కాక శివకవి సమూహానికి, వీరశైవ సిద్ధాంతాలకు కూడ గురుపీఠమని చెప్పదగినవాడు.

ఈయన ఇతర మతస్థులను తీవ్రంగా ద్వేషించి, వీరశైవ సిద్ధాంతాలను, మత ప్రచారాన్ని తన సాహిత్యంద్వారా ప్రజలకు తెలిపి ప్రజలను చైతన్యవంతులుగా చేశాడు. సాహిత్యం ద్వారా వీరశైవ మత ప్రచారం చేసిన కవులలో ఇతడు అగ్రగణ్యుడు. 'జాను తెనుగు'ను గురించి చెప్పిన మొదటి తెలుగుకవి నన్నెచోడుడైతే ఈయన రెండో కవి.

పాఠకుల ఆలోచనకు ఏ విషయాన్నీ విడిచిపెట్టక ప్రతి విషయాన్ని విస్తృతంగా వర్ణించి చెప్పాడు శివునిగాని, బసవేశ్వరునిగాని వర్ణించేటప్పుడు ఇతని రచన ఆవేశ పూరితమై గంగా ప్రవాహం వలె ప్రవహిస్తుంది

కొన్ని ద్విపదలలో ప్రాసయతిని వాడాడు ద్విపదకు ద్విపదకు తెగ చెప్ప వలెననే నియమాన్ని పాటించక వాటిని ఏకధారగా నడిపాడు.

లాక్షణికులు దోషంగా పరిగణించే పదాలు, సంధులు, సమాసాలు ఈయన రచనలలో అక్కడక్కడ కనిపిస్తాయి. అయినప్పటికీ భాషలోని దేశీయత, వర్ణనలలో కనిపించే తన్మయత్వం, కవితకు అసాధారణమైన సౌందర్యాన్ని చేకూర్చాయి. ద్విపదను లోకంలోని పాటగా గాక వైవిధ్యంతో నడిపించి మహాకావ్యోపయోగిగా తీర్చిదిద్ది ద్విపద ఛందానికి అఖండమైన కీర్తి సంపాదించి పెట్టాడు. అందువల్ల తెలుగు ద్విపద కావ్యకర్తలలో కాలంచేతనే గాక కవితా ప్రతిభవల్ల కూడ ఈయనకు అగ్రస్థానం లభించింది. (వా చ; శ. క. చ-22)

## పాల్వంచ (సంస్థానం)

దీనిని కాకతీయుల కాలంలో శంకరగిరి అని పిలిచేవారట. ఇది వరంగల్లు జిల్లాలో ఉంది. క్రీ. శ. 1324లో అప్పన్న అశ్వారావు దీన్ని ప్రతాపరుద్రుని వద్దనుంచి పొందినట్లుగా తెలియవస్తుంది. ఆ తరువాత 18 తరాల వరకు, అంటే క్రీ. శ. 1697 ప్రాంతం వరకు ఈ వంశానికే చెంది ఉన్నది. ఈ సంస్థానం కుంఫిణీ యుగంలోనూ, ఆ తరువాతకూడా ప్రసిద్ధికెక్కింది.

శ్రీనాథుని వెంకట్రామయ్య అనే కవి వీరి పోషణలో అశ్వరాయ చరిత్ర లేక శ్రీరామ పట్టాభిషేకం అనే రచన చేశాడు. అయితే ఇది అముద్రితం, అలభ్యం కూడ (అముద్ర)

## పాల్వంచ సంస్థాన చరిత్రము

స్థలం : పాల్వంచ (సంస్థానం).
రచన : కొత్తపల్లి వెంకటరామ లక్ష్మీనారాయణశర్మ.
కాలం : క్రీ. శ. 19వ శతాబ్దం కావచ్చు.

పాల్వంచ సంస్థానాధీశ్వరులైన మహబూబ్ సర్వరాజవంతు శ్రీరాజా పార్థసారథి అప్పారావు సవై అశ్వారావు బహద్దరువారి జీవిత చరిత్ర ఇందలి విషయం. (అం. సం. సా.)

## పావకి నాటకము

కర్త : కంఠీరవరాజు.

నాట్య ప్రధానమైన రచన.

అష్టదిక్పాలక విలాస నాటకంలోని భాగం. అష్ట దిక్కులకు సంబంధించిన నాట్య కర్తలు తమ తమ నాట్య విద్యా వైదుష్యాలను ప్రదర్శించడం ఇందులోని ఇతివృత్తం. ఈ భాగం విడిగానూ ప్రసిద్ధం.

## పావులూరి గణితము

నామాంతరం : సారసంగ్రహ గణితము (చూ).

## పావులూరి మల్లన

కాలం : క్రీ. శ. 11వ శతాబ్దం.

స్థలం : పీఠపుర ప్రాంతం-అఖండవాడ.

రచన : సారసంగ్రహ గణితము (సంస్కృత గ్రంథానికి అనువాదం)

సిద్ధన్న, గౌరమల పుత్రుడు. ఇతని తాత పేరుకూడా మల్లన అట.

విశిష్టత : ఈ కవి గుంటూరు జిల్లాలోని పావులూరికి కరణమని పండితాభిప్రాయం. [illegible] ఇతను శ్రీకారంతో గ్రంథారంభం చేశాడు. గణితంలో కూడా శృంగారాన్ని, అప్పటి సాంఘిక విశేషాలను చెప్పాడు. క్రీ. శ. 9వ శతాబ్దికి చెందిన మహావీరాచార్యుడనే జైన పండితుని గణితసారసంగ్రహానికి ఇతని గ్రంథం అనుసరణ. మల్లన తాతయైన మల్లనకు రాజరాజు పీఠపుర ప్రాంతంలోని అఖండవాడను బహూకరించాడట. (ఆరుద్ర-2; క. స.)

## పావులూరి మల్లన

కాలం : 18వ శతాబ్దం.

స్థలం : పావులూరు.

రచన : భద్రాద్రి రామశతకము.

రామన్న మంత్రి, పాపమ్మల పుత్రుడు. గణితశాస్త్ర కర్తకంటె భిన్నుడు. (శ. క. చ-447; క. స-158)

## పాళిపదాలు

రచనా విశేషం.

యక్షగానాలలో ప్రయుక్తం. మొదటి పాదంలో తొమ్మిది మాత్రల దళాలు రెండు, రెండో పాదంలో ఎనిమిది మాత్రల దళాలు రెండు వీటిలో ఉంటాయి. ఎంబారయ్య కురవంజిలో ఇవి ఉన్నాయి. (య. వా-చ-280)

## పింగళి అమరనార్యుడు

కాలం : క్రీ. శ. 16 వ శతాబ్దం.

సాహిత్యప్రియుడు. పింగళి సూరన విరచిత ప్రభావతీ ప్రద్యుమ్న కావ్యం ఇతనికి అంకితం. ఈయన పింగళి సూరనకు తండ్రి. (తె.వి.స-4)

## పింగళి ఎల్లనార్యుడు

కాలం : క్రీ శ. 17 వ. పూర్వార్ధం.

స్థలం : కొండవీడు.

రచన : సర్వేశ్వర చరిత్రము (సర్వేశ్వర మాహాత్మ్యము) (తోభ్య చరిత్రము).

నాగయామాత్యుని పుత్రుడు. ఈ కవి మతవిషయంలో శైవుడయినా, క్రైస్తవ మత సిద్ధాంత ప్రతిపాదకంగా సర్వేశ్వర చరిత్రమనే 'తోభ్య చరిత్ర'ను వ్రాశాడు. ఈయన పై గ్రంథాన్ని తుమ్మరాయపరెడ్డి ప్రేరణవల్ల వ్రాశాడట. (తె.వి.స-6)

## పింగళి సూరన

కాలం : క్రీ. శ. 16 వ శతాబ్ది.

స్థలం : కర్నూలు మండలం.

రచనలు : 1. రాఘవ పాండవీయము - (ద్వ్యర్థి కావ్యము) 2. కళాపూర్ణోదయము (అపూర్వకల్పిత కథాప్రబంధం) 3. ప్రభావతీ ప్రద్యుమ్నము 4. గరుడ పురాణము (అలభ్యం) 5. గిరిజా కల్యాణము (అలభ్యం).

విశిష్టత : సూరన రాయల అష్టదిగ్గజాలలోని వాడని ప్రశస్తిఉంది. కాలాన్ని బట్టిచూస్తే ఈయన రాయలకాలంలో బాలుడై ఉన్నట్లు కనిపిస్తుంది ఇతని తాత పేరు కూడా సూరనయే. తండ్రి అమరన్న. తల్లి సుబ్బమ్మ.

ప్రభావతీ ప్రద్యుమ్నంలోని ఒక పద్యాన్ని బట్టిఈకవి వంశంలోని వారికి పింగలి (కృష్ణామండలం) అనే గ్రామంలో నివసించి నందువల్ల పింగళి వారని పేరు వచ్చినట్లు తెలుస్తుంది. కాలక్రమంలో ఈ వంశీయులు కృష్ణామండలం విడిచి, కందనూలు (కర్నూలు) మండలంలోని నంద్యాల, ఆకుమీడు సంస్థానాలను ఆశ్రయించినట్లు తెలుస్తున్నది.

ఆ వంశంలోని వారికి అనూచానంగా పాండిత్యంతోపాటు కవిత్వం కూడా అబ్బినట్లు కవి సూరన సాక్ష్యంగా కనబడతాడు. సూరన వ్రాసిన గ్రంథాలలో చివరిరెండు అలభ్యం. రాఘవ పాండవీయాన్ని పంపా విరూపాక్షదేవునికి, కళాపూర్ణోదయాన్ని నంద్యాల కృష్ణంరాజుకు, ప్రభావతీ ప్రద్యుమ్నకావ్యాన్ని తండ్రియైన అమరనార్యునకు కృతి ఇచ్చాడు.

కథాకథన విషయంలో, కల్పనాకౌశలంలో ఈయన అసాధారణ ప్రజ్ఞావంతుడు. ఈయన రాఘవ పాండవీయం తెలుగులో తొలి ద్వ్యర్థి కావ్యం. కళాపూర్ణోదయం అపూర్వమైన కవిత్వ కథాప్రబంధం. ప్రభావతీ ప్రద్యుమ్నం పరిణతమైన శృంగార ప్రబంధం.

రాఘవ పాండవీయ రచనాకౌశలం అనన్యసాధారణం. రాఘవపాండవ కథాద్వయ ఘటనాపై చిత్రికి సూరన మొదటివాడు. రామాయణ, భారత కథలు, శ్లిష్టార్థాలు

లేక, సులభపదాలతో, సులభశైలితో, సంపూర్ణ శ్లేషలతో వ్రాసి కవి తన శ్లేషా సామర్థ్యం చూపాడు.

కళాపూర్ణోదయం విచిత్రమయిన కల్పిత కథ. తెలుగులో సూరనకు ముందు ఏ కవి కూడా నూతన కథా చమత్కారాన్ని కల్పించలేదు. కథాకథన వైచిత్ర్యంలో బాణ భట్టు కాదంబరితో కళాపూర్ణోదయాన్ని పండితులు పోల్చడం కద్దు.

ప్రభావతీ ప్రద్యుమ్నం చక్కని స్వభావోక్తులతో, లలిత పద ఘటితమై, కథా చమత్కృతి గలిగి చదివేవారికి కర్ణరసాయనంగా ఉండే ప్రౌఢ ప్రబంధం. కవి బ్రహ్మ తిక్కన తరవాత ప్రౌఢ కావ్యరచనలో సర్వతోముఖ పాండిత్యమున్న కవి సూరన్న తప్ప ఇంకొకరు లేరు. (క.పూ.పీఠిక-కట్టమంచి; వి న చ-సూ.పే.రా)

## పిండచక్ర నిర్ణయము

నామాంతరం : ప్రభుదేవర వాక్యము

కవి : సిద్ధరామ కవి

## పిండిప్రోలు లక్ష్మణ కవి

కాలం : క్రీ. శ. 19 వ శతాబ్ది.

స్థలం : కుయ్యేరు (రామచంద్రపురం తాలూకా).

సమకాలికులు : శిష్టు కృష్ణమూర్తిశాస్త్రి, మొక్కపాటి పేరిశాస్త్రి, కృష్ణకవి మొదలగు వారు.

రచన : రావణ దమ్మీయము (వ్యర్థికావ్యం).

గోపాలామాత్యుని పుత్రుడు. తిట్టు కవిత్వంలో ప్రసిద్ధుడు. కోట రామచంద్ర పురం (తూర్పు గోదావరి జిల్లా) జమీందారు కాకర్లపూడి రామచంద్రరాజు పేర కృష్ణ కవి సర్వకామదా పరిణయం అనే గ్రంథాన్ని వ్రాశాడు. దీనిని రాజుకు వినిపించేనాటికి పెక్కుమంది కవిపండితులకు ఆహ్వానం పంపటం జరిగింది రాజు లక్ష్మణకవికి కూడా ఆహ్వానం పంపమని కృష్ణకవికి చెబితే – లక్ష్మణకవి పెళ్ళి సంభావనలకే అర్హుడని, పండిత సభలకు అనర్హుడని అధిక్షేపించాడట ఆహ్వానం లేకపోయినా లక్ష్మణకవి రామ చంద్రపురం రావటం, ఇప్పుడయినా ఆయన్ని ఆహ్వానించమని రాజు కృష్ణకవికి చెప్పటం, పిలవకపోయినా లక్ష్మణకవి సభకు వస్తాడని కృష్ణకవి రాజుకు చెప్పటం జరిగింది.

కృష్ణకవి, లక్ష్మణకవి ఆక్షేపించుకొన్నాక కృష్ణకవి లక్ష్మణకవి ఇచ్చిన సమస్యను పూరిస్తూ 'దాశరథి' శబ్దశ్లేషను ఆక్షేపించాడు. యుక్తిపరుడయిన లక్ష్మణకవి పదవిభాగం వేరొక రకంగాచేసి తాను కృష్ణకవిని పొగిడితే, దానికి తానే అనర్హుడనంటు న్నాడని హేళన చేశాడు.

లక్ష్మణకవి మేనల్లుడయిన మంగన్న అనే ఆయనకు దాయాదులతో వ్యాజ్యం వచ్చిన సందర్భంలో, న్యాయాధికారి లంచం తీసుకొని తన మేనల్లునికి అన్యాయం చేశా డని బ్రౌన్‌దొర దగ్గరకుపోయి, ఆయనను ఒక సీసమాలిక పద్యంతో మెప్పించి,

మంగన్నకు రావలసిన సగభాగం ఇప్పించాడట. ఈ సందర్భంలో లక్ష్మణకవి చాలా చాటువులు చెప్పాడు.

తన లంకభూమిని ధర్మారావు అనే వెలమకులజుడు అపహరిస్తే అతనిని రావణునితోను, క్షేత్రాపహరణ వృత్తాంతాన్ని రామాయణ కథతోనూ పోల్చి వ్యాజోక్తికావ్యం చెప్పాడు ఈయన చాటుపద్యాలు చాలా చెప్పాడు. (వా.ప.-87; చా.ప.ర.)

## పిచ్చుకుంటులవారు - కథలు

ఒకప్పుడు వీరు కేవలం యాచకవృత్తి కలవారుగా ఉండేవారట. పాల్కురికి సోమన్న పండితారాధ్య చరిత్ర పర్వత ప్రకరణంలో వీరి ప్రసక్తి ఉంది. వీరు వీర, శృంగార, కరుణరస గాథల్ని తెలుగుదేశంలో చెప్పటం కద్దు. కులగోత్రాలనుకూడా వల్లిస్తూ ఉంటారు. వీరి వేషధారణ చక్కగా ఉంటుంది. కథకునికి అందమైన తలపాగా, ఒక చేతిలో కత్తి, రెండో చేతిలో డాలు, కాళ్ళకు గజ్జెలూ ఉంటాయి. కథకులు పురాణాన్ని పాడుతూ ఉంటే - మిగతా వంతదార్లు ఇద్దరూ 'ఆఁ—'అంటూ దీర్ఘం తీస్తూ కథకుని గొంతులో గొంతు కలిపివేస్తారు. ఇంకొక వ్యక్తి తోలుతిత్తిని తగిలించుకొని గుక్కవిడువని శృతి పోస్తూ ఉంటాడు. ఇంపైన ఈ శృతి ఆధారంగా వీరి కథా విధానం నడుస్తుంది.

వీరు ప్రముఖంగా చెప్పే చరిత్రాత్మకమైన కథ శ్రీనాథుని పలనాటి వీరచరిత్ర. ఈ కథను ప్రారంభించి దాదాపు 15 రోజులు ఒకే పట్టుతో చెబుతారు.

కథలో వచ్చే ఆయాపాత్రల మనస్తత్వాల ననుసరించి కథకుడూ, వంతదార్లు కూడా ఆయా పాత్రలలో లీనమైపోతారు. పిచ్చుకుంటుల వారి కథా విధానం ఎట్లా ఉంటుందో పల్నాటి యుద్ధంలో బాలచంద్రుడు యుద్ధంలోదూకిన ఘట్టాన్ని వింటే బోధపడుతుంది. కథకుడు తన చేతులలోని కత్తితో, డాలుతో అచ్చంగా బాలచంద్రుడే యుద్ధంచేసినట్లు అద్భుతంగా అభినయిస్తాడు

వీరు ఇంకా ఖడ్గతిక్కన, కాటమరాజు కథలను గానంచేస్తారు. వీరి ఉనికి ఆంధ్రదేశమంతటా ఉంది. పలనాటి యుద్ధరంగానికి క్షేత్రమైన కార్యమపూడి (కారెంపూడి-గుంటూరు జిల్లా)లో ఈ నాటికీ పిచ్చుకుంటులవారున్నట్లు, వీరు పలనాటి వీర చరిత్రను గానంచేస్తున్నట్లు తెలియవస్తున్నది. (నా.ర.ప-314-316)

## పిఠాపురము

ఆంధ్ర ప్రాంతంలోని సంస్థానాలలో విజయనగరం తరువాత పేర్కొన దగింది పిఠాపురం. ఇది తూర్పు గోదావరి జిల్లాలోని అతి ప్రాచీన సంస్థానం. దీని రాజధానియైన "పిఠాపురం" చరిత్ర ప్రసిద్ధి చెందిన నగరం. సముద్ర గుప్తుని కాలంనుండి అనేక వంశపు రాజులు ఈ నగరాన్ని రాజధానిగా చేసుకొని తమ ప్రభుతను వెలయించారు.

క్రీ. శ. 17వ శతాబ్దంలో గోల్కొండ నవాబులు ఈ "పిఠాపురం" సంస్థానాన్ని "చిట్నీవీడి" రామారాయణికి ఇచ్చారట. ఈ రామారాయుడు నిస్సంతుడగుటచేత

ఈతని మేనల్లుడైన "తెనుగు రాయజంగారు" పిఠాపుర పాలకుడైనాడు. వీరి వంశనామం రావువారు. పిల్లలమఱ్ఱి చేతా నాయకుడు వీరి మూల పురుషుడు.

ఇతడు (క్రీ. శ. 1612-1672) మూల పురుషునికి పన్నెండవ తరం వాడు ఇతని తరువాత రంగరాయి (1611-1672) రాజ్యం చేశాడు. ఇతడు మొగల్ వైస్రాయిలతో అత్యంత సన్నిహితంగా మెలగుతూ, సంస్థానాన్ని అభివృద్ధి పరచాడు. "చంద్రా రాయజంగారు" తరువాతి పాలకుడు. ఈతని తరువాత సుమారు 10 తరాల వరకు గల పాలకులందరూ అత్యంత సమర్థులు. క్రీ. శ. 1788-1828కి చెందిన వెంకట నీలాద్రి రాయజం గారి కాలంలో శాశ్వత పరిష్కారం జరిగింది. ఇతని కుమారుడు "వెంకట సూర్యరాయుడు" 1844లో రాజ్యానికి వచ్చి క్రీ. శ 1850లో మరణించాడు. వీరి కుమా కుమారుడు రాజా రావు వేంకట మహీపతి గంగాధర రామారావు బహద్దరు (క్రీ. శ. 1844-1890) క్రీ. శ. 1861లో జమీందారైనాడు. ఇతడు సంస్థానాన్ని అత్యున్నత దశకు తీసుకు వచ్చాడు. 1879 నాటి రంప పితూరిని అణచడంలో బ్రిటిషు వారికి సహాయపడి, వారి మన్ననకు పాత్రుడైనాడు. ఇతని తరువాత జమీందారీని స్వీకరించింది, మహారాజా రావు వేంకటకుమార మహీపతి సూర్యరావు బహద్దరు (క్రీ. శ. 1906) ఇతని కుమారుడు రావు వేంకట మహీపతి గంగాధర రామారావు.

జమీందారీ రద్దు చట్టం మేరకు తదనంతర కాలంలో ఈ సంస్థానం ఆంధ్ర రాష్ట్రంలో అంతర్లీనమై పోయింది.

సాగరాంధ్ర ప్రాంతంలోని సంస్థానాధిపతులలో సాహిత్య పోషణ విషయంలో ప్రథమంగా పేర్కొనదగినవారు పిఠాపురం రావు వంశీయులు. క్రీ శ. 1679 నుండి 1704 వరకు పాలించిన మాధవరాయలు వక్కలంక వీరభద్ర కవి కృతిమైన "వాసవదత్తా పరిణయ" గ్రంథ కృతిభర్త. ఇతని మనుమడైన చిన మాధవరాయడు క్రీ. శ. 1759-1762 మధ్య కాలంలో తన్నాశ్రయించిన 'కూచిమంచి తిమ్మకవి'ని విశేషంగా గౌరవించి "కవిసార్వభౌమ" బిరుదు ప్రదానం చేసి అగ్రహారాలచే సత్కరించాడు. "కూచిమంచి జగ్గకవి" కూడా పిఠాపురం సంస్థానాధీశుల పోషణలోనివాడే. క్రీ.శ. 1862 నుండి 1890 వరకు రాజ్యపాలనచేసిన రావు గంగాధర రామారావుగారిది. పండిత పోషణలోను, కవిసన్మానంలోను అందెవేసిన చేయి. విశ్వవిఖ్యాతి గాంచిన "బులుసు పాపయ్యశాస్త్రి" ఈ సంస్థానాధీశుల ఆదరగౌరవాలకు పాత్రులుగా ఉన్నారు. ఆశు చిత్ర ప్రబంధాది కావ్యాలలో బహుళ ప్రఖ్యాతి చెందిన "అల్లంరాజు సుబ్రహ్మణ్యకవి" వ్రాసిన "భద్రా పరిణయ" రచన ఈ ప్రభువుకు అంకితం ఇవ్వబడింది. దేవులపల్లి సోదరకవులుగా ప్రసిద్ధిచెందిన "దేవులపల్లి సుబ్బరాయశాస్త్రి", "దేవులపల్లి వేంకట కృష్ణశాస్త్రి" వీరి ఆదరణలో ఉంటూ "రావు వంశ ముక్తావళి" అనే కావ్యాన్ని వ్రాసి పిఠాపుర సంస్థాన చరిత్రను, రావు వంశీయుల శౌర్య ఔదార్య, సౌశీల్యాలను లోకవిదితం చేశారు. "రావు వేంకట కుమార మహీపతి సూర్యరావు బహద్దరు" ఆంధ్రభాషకు, సంస్కృతికీ, కవిపండిత మండలికిచేసిన సేవ అనిర్వచ

...రు. అనంతర్యాంత్రి పేరుం పెట్టించి శాశ్వతమైన కొన్ని కార్యక్రమాలు చేపట్టారు. ఆంధ్ర సాహిత్య పరిషత్ స్థాపన, బ్రహ్మసమాజ మందిర నిర్మాణం, సూర్యరాయాంధ్ర నిఘంటు కార్యాలయం మొదలైనవి పేర్కొనదగినవి. వీరు స్థాపించిన సంస్థలను వీరి కుమారుడైన రాజా రావు వేంకట మహీపతి గంగాధర రామారావు అభివృద్ధి పరచారు.

పిఠాపురం సంస్థానాధీశ్వరులు నిర్వహించే "విద్వత్పరీక్షలు" ఆసేతు హిమాచలం ప్రసిద్ధిచెందాయి. పిఠాపురం పరీక్షలు, అని ఇవి ప్రసిద్ధి. శ్రీపాద లక్ష్మీ నరసింహశాస్త్రి, దెందుకూరి నరసింహశాస్త్రిలాంటి వారు ఈ విద్వత్పరీక్షల్లో పరీక్షాధికారులుగా ఉండేవారు. వారణాసి సుబ్రహ్మణ్యశాస్త్రి, మహామహోపాధ్యాయ తాతా సుబ్బరాయశాస్త్రి మొదలగువారు అప్పుడప్పుడూ ఈ సంస్థానానికి ఆహ్వానింపబడేవారు.

ఇక తెలుగు సారస్వతానికి గాని, కళాపోషణ విషయంలోగాని పిఠాపురం వారు చేసిన సేవ స్వల్పమైంది కాదు. సూర్యరాయాంధ్ర నిఘంటువు వీరి భాషాసేవకు పరాకాష్ఠ. వెంపరాల సూర్యనారాయణశాస్త్రివంటివారు ఈ నిఘంటు కార్యాలయంలో పనిచేశారు. వేపులపల్లి సోదరకవులు, వేంకటపార్వతీశ్వర కవులు జయంతి రామయ్య పంతులు, గిడుగు సీతాపతి, వేంకట రామకృష్ణ కవులు మొదలగువారు ఈ సంస్థానాధిపతులచేత ఆదరింపబడ్డారు. రఘుపతి వేంకటరత్నం నాయుడు కూడా పిఠాపురం రాజ గౌరవం పొందినవారే. కళాకారులు. నాటక కళానిపుణులు, గాయకులు, అనేకులు పిఠాపురం రాజుల గౌరవ సత్కారాలను పొందారు. (ఆం. సం. సా; కేశవపంతుల-సం.సా)

## పిడుగు వారు

అతిభయంకరమైన పిడుగునే కొందరు తమ ఇంటిపేరుగా పెట్టుకొన్నారు. పిడుగువారు గుంటూరు మండలంలోని కాకెంపూడి గ్రామంలో ఉన్నారట.

(భారతి-మా-45-230)

## పిడుగు వేంకటకవి

కాలం : క్రీ. శ. 16 వ శతాబ్దం.
స్థలం : దక్షిణ దేశం.
రచన : విప్రనారాయణ చరిత్ర (అసమగ్రం).

పిడుగు మల్లన్న కుమారుడు. ఇతన్ని గురించిన ఇతర వివరాలు తెలియ లేదు. (ద. దే. వా-385)

## పిడుపర్తి నిమ్మనాథుడు

కాలం : క్రీ. శ. 15 వ శతాబ్ది పూర్వార్ధం.
రచన : నిజలింగ చిక్కయ్య కథ (వివాదాస్పదం).

అష్ట భాషావిదుడు. ఈ కవి పాల్కురికి సోమన శిష్యుడయిన శివరాత్రి కొప్పయ్య (డోకిపర్రు దానగ్రహీత) కు మనుమని మనుమడు. డోకిపర్రును ప్రౌఢ దేవరాయల నుంచి మళ్ళీ సంపాదించిన పెద సోమయ్యకు పౌత్రుడు. గురు దీక్షాబోధను

ద్విపదగా రచించిన పిడుపర్తి (మొదటి) బసవకవికి ఇతడు పెద తండ్రి కుమారుడు. పద్య బసవ పురాణాన్ని వ్రాసిన పిడుపర్తి సోమనాథున కీతడు పెద తాత మనుమడు. క్రీ. శ. 1380-1440 ప్రాంతం వాడు.

విజలింగ చిక్కయ్య కథ కర్తృత్వాన్ని గురించి భేదాభిప్రాయాలున్నాయి. ఆ యక్షగానం రచించిన వాడు రెగళిగె విమ్మనాథుడని కొందరి అభిప్రాయం.

(క. స-112; క. త-6)

## పిడుపర్తి (మొదటి) బసవ కవి

కాలం : క్రీ.శ. 15 వ శతాబ్ది పూర్వార్ధం.
స్థలం : నైజాం మండలం-వరంగల్లు.
రచనలు : 1. గురుదీక్షా బోధ 2. పిల్లనైనారు కథ 3. బ్రహ్మోత్తర ఖండము.

పెద సోమయ్య ఇతని తాత. ఇతని రచనలన్నీ ద్విపద కావ్యాలే. ఈ బసవ కవి పాల్కురికి సోమనాథుని శిష్యుడైన శివరాత్రి కొప్పయ్య మనుమని మనుమడు. ద్రవిడ, కర్ణాటాంధ్ర, యవన భూములలో పేరుపొంది. దుర్గాధిపతులచే పూజలు పొందాడు. భవులకు కవిత చెప్పని సవినయుడట. ప్రత్యక్ష బసవేశుడని జనులు ఇతన్ని నుతించేవారట.

(క. త-6-25-27)

## పిడుపర్తి రెండో బసవకవి (ఇమ్మడి బసవ కవి)

కాలం : క్రీ. శ. 15 వ శతాబ్దం.
స్థలం : నైజాం మండలం.
రచన : ప్రభులింగ లీలలు.

నరసింహరాయలకు, ఇమ్మడి నరసింహరాయలకు సమకాలికుడు కావచ్చు.

విశిష్టత : సోమనాథ కవి తమ్ముడైన పాలనాయ్యని పుత్రుడు. అల్లమ ప్రభువనే శివభక్తుని లీలలను చామరసయ్య అనే కవి 25 గతులలో 1111 పదాలుగా వ్రాస్తే, దానిని పాల్కురికి సోమనాథుడు, పిడుపర్తి సోమనాథుడు ద్విపద కావ్యంగా వ్రాశారు. వా ద్విపదలకు పద్య రూపమే ఈ కవి వ్రాసిన ప్రభులింగ లీలలు.

ఈ రచన కృత్యాది లేకుండా ఒకసారి ముద్రితమైంది. (క. త-6)

## పిడుపర్తి సోమనాథ కవి

కాలం : క్రీ. శ. 15 వ శతాబ్దం.
రచనలు : 1. పద్య బసవ పురాణము 2. ప్రభులింగ లీలలు (ద్విపద).

బసవన పుత్రుడు. ప్రౌఢంగా రచన చేశాడు.

విశిష్టత : ఈ కవికి ముత్తాతయైన పెద సోమగురుడు "డోకిపర్రు" అగ్రహారాన్ని ప్రౌఢ దేవరాయల నుంచి మళ్ళీ సంపాదించినట్లు కవి పద్య బసవ పురాణంలో చెప్పాడు. సోమనాథ కవి జననం 1450 ప్రాంతం. గ్రంథ రచనా కాలం క్రీ.శ. 1480

ప్రాంతం కావచ్చు. ఇతడు అచ్చ భాషా కవిత్వ ప్రవీణుడు. పాల్కురికి సోమనాథుని ద్విపద బసవ పురాణాన్ని పద్య కావ్యంలో రచించి అతనికే అంకితం చేశాడు. (క. త-6)

### పినపాటి సర్వదేవారాధ్యుడు

కాలం : క్రీ.శ. 18 వ శతాబ్దం.

శైవమత ప్రచారం కోసం గ్రంథ రచనను ప్రోత్సహించాడు. బుద్ధిరాజు పేరయకవి చేత "సాత్త్విక బ్రహ్మవిద్యా విలాసము" అనే వైష్ణవ గ్రంథానికి ఖండనంగా సాత్త్విక బ్రహ్మవిద్యా విలాస విరసనము అనే రచన చేయించాడు. (వ వా.-40)

### పిన్నయ ప్రభాకరుడు

నామాంతరం : ఎలకూచి పినయాదిత్యుడు (చూ). (క. త-12-110)

### పిల్లనైనారు కథ

కాలం : క్రీ.శ. 15 వ శతాబ్ది పూర్వార్థం.

కర్త : పిడుపర్తి (మొదటి) బసవ కవి.

ద్విపద కావ్యం. కవి నడివయసులో దీన్ని చెప్పాడట. శైవ భక్తి ప్రతిపాదకమైన ఇతివృత్తం. (క. త-8-29)

### పిల్ల భాగవతము

నామాంతరం : బాల భాగవతము

కర్త : దోనూరి కోనేరునాథుడు.

### పిల్లలమర్రి పినవీరభద్రుడు

కాలం : క్రీ. శ. 15 శతాబ్ది ఉత్తరార్ధం. సాళువ గుండ నరసింహరాయల కాలం క్రీ. శ. 1456 - 1490 ప్రాంతం కావచ్చును.

స్థలం : నైజాం మండలంలోని పిల్లలమర్రి.

రచనలు : 1. అవతార దర్పణము (అలభ్యం) 2. నారదీయ పురాణము (అలభ్యం) 3. మాఘమాహాత్మ్యము (అలభ్యం) 4. మానసోల్లాససారము (అలభ్యం) 5. శృంగార శాకుంతలము 6. జైమిని భారతము.

విశిష్టత : గాదెయామాత్యుని పుత్రుడు. వాణీ కటాక్షం పొందిన మహాకవి, ఇతడు దూబగుంట నారాయణకవి, దగ్గుపల్లి దుగ్గన, నంది మల్లయ, ఘంట సింగయ జంటకు సమకాలికుడు. నెల్లూరు జిల్లా సోమరాజుపల్లె (బిట్రగుంట దగ్గర) నివాసి. చిల్లర వెన్నయ మంత్రికి శాకుంతలం కావ్యాన్ని అంకితం ఇచ్చాడు. జైమిని భారతాన్ని సాళువ గుండ నరసింహరాయలకు అంకిత మిచ్చాడు. నన్నయ ప్రబంధ ప్రౌఢ వాసనా సంపత్తి, తిక్కన వాక్కుల ఫక్కి, నాచన సోముని వాచా మాహాత్మ్య సౌరభం, శ్రీనాథుని పద

గుంఫనం ఈ కవిలో ఉన్నాయి. ఇతని వేట వర్ణనను అల్లసాని పెద్దన అనుసరించాడని అంటారు.

పిన వీరన ఎఱ్ఱనవలె ఉష్టరశాలనే పేర్కొన్నాడు. కాని పూర్వకవిస్తుతిలో ఎఱ్ఱనను స్తుతించలేదు. పిల్లలమఱ్ఱివారు తొలుత నల్లగొండ జిల్లాలోని పిల్లలమఱ్ఱి ప్రాంత గ్రామవాసులు. పిన వీరన మొదట నెల్లూరు జిల్లా బిట్రగుంట దగ్గరి సోమరాజు పల్లెలోను, తరువాత విజయనగర కర్ణాట ప్రభువుల ఆస్థానంలోను ఉన్నాడని తెలుస్తున్నది. శాకుంతలం నుండి ఇతని రచనలు తెలుస్తున్నాయి. (క.త-6, ఆద్ర-3-200)

## పిల్ల వసుచరిత్రలు

రామరాజ భూషణుని వసుచరిత్రను అనుసరించి చక్కని ప్రబంధాలను కొందరు కవులు వ్రాశారు. సంకుసాల నృసింహకవి వ్రాసిన కవికర్ణ రసాయనం, కనుపర్తి అబ్బయామాత్యుడు వ్రాసిన కవి రాజ మనోరంజనం, కూచిమంచి తిమ్మకవి విరచిత రసికజనమనోభిరామం, అడిదము సూరకవి వ్రాసిన కవి జన రంజనం, చెళ్ళపిళ్ళ నరసకవి వ్రాసిన యామినీ పూర్ణతిలకావిలాసం మొదలయినవి 'పిల్ల వసుచరిత్ర'లుగా ప్రసిద్ధాలు. (తె.వి స-6)

## పీఠిక

చూ. అవతారిక.

గ్రంథం మొదట్లో వ్రాసే ఆ గ్రంథానికి సంబంధించిన పుట్టుపూర్వోత్తరాలు తెలిపే రచన. పీఠిక ఉన్నత ప్రదేశం కాబట్టి దాని నధిష్ఠించిన వారికి క్రింది వస్తువులు స్పష్టంగా గోచరిస్తాయి. అలాగే గ్రంథ పీఠికగాని భూమికగాని చదివినవారికి గ్రంథంలో ఉన్న విషయం గోచరిస్తుంది. (కావ్యాలంకార సంగ్రహం)

## పీనపాటి శేషాచల మంత్రి

కాలం : తెలియదు.

ఈయన దాసశీలాన్ని నుతిస్తూ సుమారు ఎనిమిది చాటువులు ఉన్నాయి. చాటుకవి పేరు తెలియదు. (చా.ప.ర.)

## పుంగనూరు

నేటి చిత్తూరు మండలంలోని సంస్థానం. పడమటి పాళయాలలో ఇది ప్రాచీన చరిత్ర కలిగిన సంస్థానం.

తొలుత ఇది కడప జిల్లాలో ఒక భాగంగా ఉండేది. 1858లో జరిగిన దత్త మండలం సర్దుబాట్లలో ఉత్తరార్కాడు జిల్లాకు మార్చబడింది. ఆ దరిమిలా జరిగిన పునర్విభజనలో చిత్తూరు మండలాంతర్భాగంగా రూపొందింది.

పుంగనూరు పాళయగాండ్ర పూర్వులు క్రీ. శ. 13వ శతాబ్దం నుంచీ దీన్ని పాలిస్తూ వస్తున్నారట. పాలకులు "సుగుటూరివారు".

ఈ సంస్థానం కొంతకాలం విజయనగర సామ్రాజ్యానికి సామంత రాజ్యంగా ఉండేది. మైసూరు సీమలోని కొన్ని గ్రామాలు వీరి ఏలుబడిలో ఉండేవట. క్రీ. శ. 1642లో ఈ సంస్థానాధిపతులు "బీజపూరు" సుల్తాను చేత ఓడింపబడి కొంతకాలం అజ్ఞాతంగా ఉన్నారు. ఆ తరువాత హైదరాబాద్ నవాబు సహాయం పొంది, అవులపల్లి, పుంగనూరు జాగీరులను సంపాదించారు.

ఈ సంస్థానం చాలాకాలం అవ్యవస్థిత పరిస్థితుల్లో ఉండేది. క్రీ. శ. 1713లో కడప నవాబు "అబ్దుల్ అలీఖాన్" ఈ సంస్థానాన్ని బలవంతంగా తన కైవసం చేసుకున్నాడు. 1755లో జరిగిన మరాఠీ దండ యాత్రల వల్ల ఈ సంస్థానం పూర్వ పాలకుల వశంనుండి తప్పి పోయింది. తరువాత ఐదు సంవత్సరాలలో చాలా చేతులు మారింది. హైదరాలి, టిప్పుసుల్తానులు ఈ సంస్థానాలను ఆక్రమించారు. మొత్తంమీద 1799లో "టిప్పుసుల్తాన్" మరణానంతరం ఈ సంస్థానం పూర్వ పాలకుల వశమైంది. కుంఫిణీ వారి హయాంలో సంస్థానం చాలా వరకు క్షీణించింది. సొంత సేనలను ఉంచుకునే పద్ధతి రద్దు అయింది. క్రీ. శ. 1891లో పరిష్కారం కుదిరి, శాశ్వతపు పన్ను పన్నదు ప్రసాదింపబడింది. 1870 లో సంస్థానాన్ని పాలించిన రాజా సుగుటూరు ఇమ్మడి శంకరరాయ యశోవంతు బహద్దరు, అతని తరువాత రాజాసుగుటూరు ఇమ్మడి సాంబ శివచిక్కరాయ యశోవంత బహద్దరు ముఖ్యులైన పాలకులు.

సుగుటూరు వారు సాహితీ వేత్తలు. సాహిత్య పోషకులు. సుగుటూరి "ముమ్మడి తిమ్మభూపతి" స్వయంగా కవి. సంస్కృతాంధ్ర కర్ణాట భాషలలో రచనలు చేశారు. శివదర్పణ, రసికజన మనోరంజన కౌముదీ వ్యాఖ్యానాలు ఇతని సంస్కృత రచనలు. కుమారార్జునీయాదులు ఇతని తెలుగు రచనలు. శంకర సంహిత కన్నడ రచన. 16వ శతాబ్దానికి చెందిన సుగుటూరు చిక్కరాయ ప్రభువు "బద్దెపీటి వత్తప్ప కవి"ని పోషించి, "గణిత దీపిక" అనే రచనకు కారకుడైనాడు. రాఘవ యాదవ పాండవీయాది మహాప్రబంధ నిర్మాత అయిన ఉరుటూరు వేంకటకృష్ణకవి, కోడూరి వేంకటాచలకవి మొదలగువారు వీరి మన్ననలు పొందారు. పుంగనూరు చివరి పాలకుడైన ఇమ్మడి వీర బసవ చిక్కరాయ యశోవంత బహద్దరు ఆంధ్రసాహిత్య పోషకుడు. పూతలపట్టు శ్రీరాములురెడ్డి "కంబరామాయణ" గ్రంథ ప్రచురణ కొరకు భూరివిరాళాలిచ్చిన విద్వత్పక్షపాతి. (ఆం. సం. సా.)

పుండ్ర కళానిధి

కర్త : చూ. మతుకుమల్లి నరసింహశాస్త్రి.

సంస్కృత రచన. వివరాలు తెలియవు. (ఆం. ర.-20)

పుట్టిపాక ఓబయకవి

రచన : కృష్ణార్జున సంవాదము. (ఆం. సా. వ. ప.)

**పుణ్యకవ్రత నాటకము (అలభ్యం)**

కర్త : చూ. విజయరాఘవ నాయకుడు.

శ్రీకృష్ణ గాథ-ఉత్సవాదులలో ప్రదర్శించడానికి అనుగుణంగా వ్రాసిన నాటకం. (వ. దే వా-89)

**పుత్రకామేష్ఠి**

జానపద పౌరాణిక గేయ రచన.

ఇతివృత్తం రామాయణ కథకు సంబంధించినది.

చూ : పౌరాణిక గేయములు. (ఆం. వా. చ)

**పుత్తేటి రామభద్రుడు**

రచన : సకల కథాసార సంగ్రహము.

శ్రీకృష్ణదేవరాయలు రచించిన సకల కథాసార సంగ్రహాన్ని అయ్యలరాజు రామభద్రకవి ఆంధ్రీకరించాడని ప్రతీతి. కాని కొందరు ఈ రామభద్రుడు భిన్నుడనీ ఇతడు పుత్తేటి రామభద్రుడనీ భావిస్తున్నారు. (క. త; క. స-132)

**పుదుక్కోట సంస్థానము**

పుదుక్కోటను తెలుగులో కవులు నవఖండపురమనీ, కొత్తకోట అనీ వ్యవహరించారు. ఇది దక్షిణదేశంలోని సంస్థానం. చోళ పాండ్య మండలాలలో ఉంది. తంజావూరు తిరుచినాపల్లికి సమీపంలో ఉన్న ఈ తమిళ సంస్థానంలో 17, 18 శతాబ్దులలో తెలుగు సారస్వతం వెల్లివిరిసింది. తంజావూరు, మధురలతో సన్నిహిత సంబంధాలు ఉండటం వలన ఆ ప్రభావం ఇక్కడ కూడా పడిందని చెప్పవచ్చును. ఈ సంస్థాన పాలకులు తెలుగు కవులను పోషించారు. వీరికి "తొండమాన్" అనేది వంశనామం. వీరి ఇలవేల్పు బృహదంబిక. ఈ సంస్థాన ధ్వజం మీద "బృహదంబా సహాయం" అని తెలుగు లిపిలో వ్రాసి ఉండేదట. ఇక్కడి రాగి నాణాలపై విజయ అని తెలుగు లిపిలో ఉండేదట. ఈ రాజుల ఇంటిపేరు "కోటి" వారు. వీరికి నుదురుపాటి వారు వంశ పారంపర్యంగా ఆస్థాన కవులుగా ఉన్నారు.

17 వ శతాబ్దంనుండీ ఇక్కడ తెలుగు వాఙ్మయం కానవస్తున్నది. రఘునాథ తొండమాన్, రాయ రఘునాథరాజు, కోటి తిరుమల రాయలు, విజయరఘునాథుడు సాహిత్య పోషణ చేసిన రాజులలో ముఖ్యులు. వీరిలో రాయరఘునాథరాజు కృతికర్త కూడా. ఇతని పార్వతీ పరిణయం ప్రశస్తమైన ప్రబంధం. నుదురుపాటి సీతారామయ్య, వెంకన్న, సాంబశివ కవి, చిదంబర కవి, మన్నారయ్య, నవనప్ప నాటి కవులలో ప్రసిద్ధులు.

**పుదూరి సీతారామశాస్త్రి**

కాలం : క్రీ.శ. 19వ శతాబ్దం తొలిభాగం.

స్థలం : చెన్నపురి.

రచనలు : పెద్దబాలశిక్ష, ప్రశ్నోత్తరాంధ్ర వ్యాకరణము.

క్రీ.శ. 19వ శతాబ్ది ప్రారంభంలో ఉండిన విద్వాంసులలో ప్రఖ్యాతుడు. చెన్నపురిలోని హిందూ విద్యాసభలో సంస్కృత పండితుడుగా ఉండేవాడు. ఇతని పెద్దబాలశిక్ష బాలబాలికలకు ఎంతో ఉపయోగపడే గ్రంథం. (క. ప_292)

## పురాణం వారు

పురాణ కాలక్షేపం వృత్తిగా పెట్టుకొన్నందుకు ఇంటిపేరుగా స్థిరపడింది. ఈ ఇంటి పేరుతో చాలామంది ఉన్నారు. ఇది వృత్తి రీత్యా వచ్చిన ఇంటిపేరు.

(భారతి_మా_45_228)

## పురాణము

చూ. ఇతిహాసము.

కావ్యభేదం. దీనికి అయిదు లక్షణాలుంటాయని లక్షణకారులు చెప్పారు.

1. సర్గము (ప్రపంచోత్పత్తి) 2. ప్రతి సర్గము (బ్రహ్మాదులు చేసే ఉత్పత్తి) 3. వంశము (దేవాసుర విభేదోత్పత్తి) 4. మన్వంతరము_ (వేరు వేరు మనువుల తరాలు) 5. వంశాను చరితము (సూర్యచంద్ర వంశాల చరిత్ర.)

తొలుత ఈ అయిదు లక్షణాలే ఉన్నా తర్వాత పురాణాల్లో చాలా వర్ణనలు చేరాయి ఇవి నాడా ఇతిహాసాలకు, చిన్న కథలకు నిలయమైనాయి. ఇతిహాసానికీ పురాణానికీ ఉన్న అల్పభేదం పాటించకుండా పురాణమనే పదాన్నే ఇతిహాసానికి కూడా వాడుతున్నారు

## పురాణము కృష్ణశాస్త్రిలు

కాలం : క్రీ. శ. 19 వ శతాబ్దం.

స్థలం : మదరాసు.

రచనలు : అరేబియన్ నైట్స్ కథలు.

సులభశైలిలో వ్యావహారికంలో రచన చేశాడు. (వ.వా.)

## పురాణసారము

కవి : కూచిరాజు ఎర్రన (చూ).

అంకితం : పిన భైరవునికి (కొండపల్లి ఏలిక).

కృతిపతి కుంటముక్కుల మల్లమంత్రి సోదరుని కుమారుడట. రచన ప్రౌఢంగా ఉంటుంది. (అరుద్ర_6_103)

## పురాణసారము (అలభ్యం)

కాలం : క్రీ శ. 17 వ శతాబ్దం.

కర్త : గణపవరపు వేంకటకవి. (క.శ_12)

## పురాతన చరిత్రము

కర్త : పేరు తెలియదు.

కాలం : 'ఉదాహరణ పద్యములు' సంకలనం చేసిన అజ్ఞాత గ్రంథ సంఘాతకు పూర్వోక్త రచన. (క్రీ.శ. 16 వ శతాబ్ది)

ప్రత్యేకత : అజ్ఞాత గ్రంథ సంఘాత కావ్యం పేరే చెప్పి, కవి పేరు చెప్పకుండా వదిలాడు. ఈ కావ్యకర్త పేరు తెలియకపోయినా, ఉదాహృతమైన ఒకే పద్యాన్ని బట్టి, కావ్యం ప్రబంధ మనవచ్చు. పద్యం పురవర్ణనకు సంబంధించినది. (ఆరుద్ర-9)

## పురిజాల లక్షీ నారాయణ దాస కవి

కాలం : క్రీ.శ. 18వ శతాబ్దం.

స్థలం : పాలకొండ సంస్థానం.

రచన : 'పారిజాతము'.

గురువు : తిరుమల తాతాచార్యులు.

ఈ కవి క్రీ.శ. 18వ శతాబ్దంలో పాలకొండ సంస్థానాన్ని పాలించిన 'రామభద్ర రాజు' ఆస్థాన కోవిదుడు, పాపయరాజామాత్య పౌత్రుడు, అనంతమాంబా నాగయామాత్యుల పుత్రుడు. రామభద్రరాజు ప్రేరణచేత 'పారిజాతము' అనే యక్షగానాన్ని వ్రాశాడు. ఈ కావ్యం రామభద్రరాజుకే అంకితం ఇవ్వబడింది. (ఆం.సం.సా-230-231)

## పురుషార్థసారము (అలభ్యం)

కవి : మా. శివదేవయ్య.

దీనిలోనుంచి కొన్ని పద్యాలను మడికి సింగన తన సంకలన గ్రంథమైన సకలనీతి సమ్మతంలో ఉదాహరించాడు. లింగమకుంట తిమ్మకవి బాల బోధచ్ఛందంలోను పొత్తపి వేంకటరమణ కవి లక్షణ శిరోమణిలోను దీనిలోని పద్యాలు ఉదాహృతం.

ఇది శైవమత ప్రతిపాదకమైన నీతిశాస్త్ర గ్రంథం కావచ్చును.

(ఆరుద్ర-2-149-152)

## పురుషార్థ సుధానిధి

కర్త : సాయణాచార్యుడు.

పురుషార్థాలను ఉద్దేశించిన సర్వపురాణ వాక్య సంగ్రహమిది.

(తె.వి.స-4-1190)

## పురుషోత్తమ కవి

కాలం : క్రీ.శ. 17వ శతాబ్దం ఉత్తరార్ధం-18వ శతాబ్దం ప్రారంభం.

స్థలం : వేంకటగిరి సంస్థానం.

రచన : చతుష్షష్టి విద్యాసంగ్రహమ్ (సం).

క్రీ.శ. 1695-1748 లో వేంకటగిరి సంస్థానాన్ని పాలించిన కుమార యాచమ నాయనికి ఆశ్రితుడు. సంస్కృతాంధ్ర పండితుడు. (ఆం.సం.సా-155)

## పురుషోత్తమ ఖండము (అలభ్యం)

కర్త : కలిదిండి భావనారాయణ.

స్థల పురాణం. పూరీ క్షేత్ర మాహాత్మ్యాన్ని చెప్పే రచన. కవి పూరీ జగన్నాథంలోని సుభద్రాదేవి భక్తుడు కావటంవల్ల ఈ రచన చేశాడనీ, దీనికి మూలం సంస్కృతంలోని పురుషోత్తమ ఖండమనీ తెలుస్తున్నది. (అరుద్ర-3-233)

## పురుషోత్తమ దీక్షితులు

కాలం : క్రీ. శ 17 వ శతాబ్దం.

స్థలం : తంజావూరు.

రచన : తంజావూరు అన్నదాన మహానాటకము.

(నామాంతరం - సత్రమదులు)

ప్రహసన ధోరణిలో రచన చేసిన కవి. ఉత్తమ పాత్రలు లేకుండా మధ్యమాధమ పాత్రలతోనే హాస్యాద్భుత రసప్రధానంగా నాటకం రాశాడు.

క్రీ శ. 1633-73 నడుమ తంజావూరు నేలిన విజయరాఘవుని ఆస్థానంలో ఉండేవాడు. తంజావూరు నాయకరాజుల నిరతాన్నదానాన్ని వర్ణిస్తూ విజయరాఘవుని అవతార పురుషునిగా కీర్తించాడు. (అరుద్ర-11-136)

## పురూరవ చరిత్ర

కర్త : అఖండ సచ్చిదానంద అవధూత.

వేదాంత విషయ ప్రతిపాదకమైన కావ్యం.

ప్రత్యేకత : గ్రంథం ఎన్ని ఆశ్వాసాలో తెలియదు గాని దొరికింది ఒక్క ఆశ్వాసం మాత్రం. పురూరవ చక్రవర్తికి నారదుడు చేసిన తత్త్వోపదేశం దీనిలోని ఇతివృత్తం. కవికి సాంఖ్యయోగం అభిమాన విషయమని, వేదాంతమంటే బాగా ఇష్టమని ఈ గ్రంథాన్ని బట్టి తెలుస్తున్నది. (అరుద్ర-8-275)

## పురూరవ చరిత్ర

కర్త : కనుపర్తి అబ్బయామాత్యుడు.

చూ. కవిరాజ మనోరంజనము.

## పులహరి ఫిరోజి

కాలం : క్రీ. శ. 1829 - 1889 ప్రాంతం.

నివాసస్థలం : పత్తెనపల్లి (గుంటూరుమండలం).

రచన : సాత్రాజితీయము (యక్షగానం).

ఇతడు గుంటూరు మండలంలో స్థిరపడ్డ మహారాష్ట్రకుటుంబానికి చెందినవాడు. ఛత్రపతి శివాజీ వంశీయుడు. ఇతడు అనేక యక్షగానాలు రచించినట్లు తెలుస్తున్నది కాని లభించినది మాత్రం సాత్రాజితీయం ఒక్కటే. (య వా చ-120)

## పులికాట్

నామాంతరం : ప్రళయ కావేరి (చూ).

## పులిగడ్డ నారన

కాలం : క్రీ. శ. 16 లేక 17 శతాబ్దం కావచ్చు.

రచన : పురాభాండేశ్వరము (ద్విపద).

పులిగడ్డ అయ్యని పుత్రుడు. ఇతని రచన గాన యోగ్యంగా, సహజమైన శైలిలో ఉంది. (ద్వి. సా. చ-176)

## పులిజాల సోమయ్య

కాలం : క్రీ. శ. 1560 ప్రాంతం.

స్థలం : పెనుగొండ ప్రాంతం.

సాహిత్య పోషకుడు. తెనాలి అన్నయ్య విరచిత సువక్షిణాపరిణయం, బమ్మెర కేసన-మల్లన కవులు రచించిన దాక్షాయణీ పరిణయం ఇతనికే అంకితాలు.

విశిష్టత : ఈయన వాదాలి పట్టణంలో కోనేటి రామరాజు వద్ద ఉద్యోగిగా ఉండేవాడు. ఈ రామరాజు అళియరామ రాయల పెద తండ్రి మునిమనుమడు. ఇతడు క్రీ. శ. 1560 ప్రాంతంలో బహుశా, పెనుకొండపై అధిపత్యం వహించి ఉండవచ్చును. సోమయ్య ఒకనాడు అన్నయ్యను పిలిపించి కావ్యాన్ని వ్రాసి అంకితమిమ్మన్నాడు. కవి అన్నయ్య తన కవిత్వ తత్త్వాన్ని సోమయ్య నోటనే చెప్పించాడు.

బమ్మెర కేసన-మల్లన కవులు తాము రచించిన "దాక్షాయణీ పరిణయా"న్ని గురజాల పాలకుడైన పులిజాల సోమ మంత్రికి అంకిత మిచ్చినట్లు తెలుస్తున్నది. ఈ రెండు కావ్యాలను కృతిపొందినదీ ఇతడే కావచ్చును. (అరుద్ర-8-128; క. చ-45)

## పులి నృత్యము

జానపదుల నృత్య విశేషం.

తెలుగు దేశంలో పూర్వ కాలం నుంచీ ఈ నృత్యం గ్రామ సీమలలో ఉంది. ముఖ్యంగా దసరా ఉత్సవాలలోను, పీర్ల పండుగ (మొహర్రమ్)ల సందర్భాలలో సంక్రాంతి విచిత్ర వేషాలలోను పులి వేషాన్ని ధరించటం కద్దు.

నెమలి నృత్యం, గరుడనృత్యం, సింహనృత్యాల వంటిదే ఈ పులి నృత్యం కూడా. దీనిని పల్లె ప్రజలే ఎక్కువ ప్రచారంలోకి తెచ్చారు.

దక్షిణ దేశంలో దీనిని 'పులివాలకోలు' అంటారు. ఆంధ్ర దేశంలో దీనిని పులి వేషమని, పెద్దపులి వేషమని, దసరా పులి వేషమని పిలుస్తుంటారు.

ఈ నృత్యంలో పెద్దపులి-వేటగాడు అనేరెండు పాత్రలుంటాయి. ఈ నృత్యం ఎంతో ఆకర్షణీయంగా సాగుతుంది. డప్పు వాయిద్యగాళ్ళు పులివేష ధారిని కవ్విస్తూ వివిధ రీతుల్లో అడుగులు వేస్తూ, పులిని అడుగులు వేయిస్తూ, గుండ్రంగా తిరుగుతూ

ప్రేక్షకులను ఉత్తేజపరుస్తాయి. ఇది ఆంధ్రదేశపు జానపద నృత్యాలలో ముఖ్యమైంది (నా. ర. పు-285-286)

**పులిపాక రామమంత్రి**

కాలం : క్రీ.శ. 19 వ శతాబ్ది పూర్వార్ధం.

సాహిత్య ప్రియుడు. సీతయామాత్యుని పుత్రుడు. అక్కెనపల్లి నృసింహ కవి రచించిన వల్లభాంబా పరిణయము అనే ప్రబంధం కృతిపొందాడు. ఇది మూడాశ్వాసాల ప్రబంధం. విఘ్నేశ్వరుని వివాహ గాథ ఇందులోని కథ. (క.చ-3-211)

**పులిపాటి వారు**

ఇంటిపేరు. ఇది జంతువుల పేర్లతో ప్రసిద్ధమైన గ్రామ నామంతో ఉన్న ఇంటి పేరు. పులిపాటివారు గుంటూరు మండలంలో ఉన్నారు. (భారతి-మా-45-228)

**పులివర్రు రాజయ్య**

కాలం : తెలియదు (17, 18 శతాబ్దాలవాడు కావచ్చు).

స్థలం : గుంటూరు మండలంలోని పులివర్రు గ్రామం.

రచన : నరేంద్ర లింగ శతకము.

కవి పులివర్రులోని నరేంద్రస్వామిపై శతకం చెప్పాడు కాబట్టి అక్కడి వాడే అయి ఉంటాడని భావిస్తున్నారు. కవి లోకనీతులను తన రచనలో ధారాళంగా పొందు పరచాడు. బంగారాన్ని గురించి చక్కని పద్యం చెప్పాడు. (ఆంధ్ర-11-240)

**పుల్య దక్షిణామూర్తి శాస్త్రి**

కాలం : క్రీ. శ. 1830-1900.

స్థలం : గోదావరి మండలం కావచ్చు.

షడ్దర్శనాలలోను, షట్శాస్త్రాలలోను నిధి. ప్రసిద్ధ కాశీ పండితుడు. వీరి పాండితీ వైభవాన్ని, శాస్త్రాధ్యాపన రీతిని విని మన్యం మహాలక్ష్మమ్మ (గూటాల జమీందారిణి) మూడు కారులు పుష్కలంగా పండే భూములను ఇనాముగా ఇచ్చి గౌరవించారు. వీరు అన్నదేవరపేట ఎస్టేటు దారులైన పైడా వారిచే కూడా విశేషంగా సన్మానింప బడ్డారు. సమకాలీనులచేత ప్రశంసలు పొందారు. శ్రీపాదకృష్ణమూర్తిశాస్త్రి వీరిని ఇతోధికంగా ప్రశంసించారట. (ఆం.సం.సా-132-521)

**పుల్లకవి**

కాలం : తెలియదు.

చాటుకవి. లోభియైన ఒకని మీద ఈ పుల్లకవి విస్తరంగా చెప్పిన రెండు సీస పద్యాలు లభిస్తున్నాయి. (చా.ప.ర.)

**పువ్వాడ వేంకటరావు**

కాలం : క్రీ. శ. 19 వ శతాబ్ది పూర్వార్ధం.

రచన : మత్స్య పురాణసార సంగ్రహము.

ఇతడు తిమ్మరాజు లక్ష్మణరాయ కవితో కలసి పై రచన చేశాడు. వీరిరువురూ సులభమైన వచనంలో రచన చేశారట. (క స_207)

## పువ్వాడ వేంకటస్వామిసెట్టి

చూ : భారతుల పేరయ్యశాస్త్రి.

సాహిత్యప్రియుడు. ఈయన భారతుల పేరయ్యశాస్త్రికి వర్షాశనంగా ఒక్కవరహా అనవాయితీగా ఇచ్చేవాడట. ఎప్పుడో ఒక్క సంవత్సరం వరహా ఇవ్వకపోతే కవి కోపించి ఒక పద్యం చెప్పాడు. (చా.వ ర.)

## పుష్ప కోదండము

చూ. విద్యాపతి దండకము.

కర్త : గణపవరపు వేంకట కవి.

## పుష్పగిరి తిమ్మన

కాలం : క్రీ. శ. 17 వ శతాబ్ది.

స్థలం : కడప జిల్లా (ములికినాడు).

రచనలు : 1. సమీర కుమార విజయము 2. భాగవత సారము 3 నీతి శతకము 4. తిరువడాంబ శతకము 5. శ్రీశైల శతకము 6. సాధుమేధానిధి శతకము.

సమకాలికులు: కంకంటి పాపరాజు, కంకంటి నరసింహం, ఏకుమళ్ళ రంగశాయి.

బొబ్బాంబ, అప్పనార్యుల పుత్రుడు. కవిత్వ మహత్వవిదుడు. ఉదార వాక్చాతుర్యంతో సమకాలీన కవులకు మిత్రుడై వారికి రచనలలో సహకరించాడు.

ఇతనికి ఆంజనేయుడు స్వప్నంలో సాక్షాత్కరించి వేదాంతబోధ చేశాడట. కవి అన్నగారైన వెంకటకృష్ణయ్య, రాజయోగి ప్రబల రఘుపతయ్య, తాడిపర్తి కేశవ పెరుమాళ్ళు ఇతన్ని గ్రంథ రచనకు ప్రోత్సహించారు. ఇతని రచనలన్నీ దైవాంకితాలే. ఇతని భాగవత సారం తమిళంలోకి చిన్నయ్యన్ అనే అతడు పరివర్తనం చేశాడు. ఏకుమళ్ళ రంగశాయి ద్విపద భాగవత రచనలోనూ, కంకంటి నరసింహం ద్విపద విష్ణు విలాసం రచనలోనూ, కంకంటి పాపరాజు విష్ణుమాయా విలాస యక్షగాన రచనలోనూ తిమ్మన తోడ్పడినట్లు ఆయా కవులు చెప్పుకున్నారు. కవి సమయాలను జాతీయాలతో జోడించి చమత్కరించడం ఇతని ప్రత్యేకత.

ద్విపద భారత కర్త తిమ్మన ఇతడేనని కొందరంటున్నారు. ద్విపద భారత కర్త అతుకూరి తిమ్మన అనీ, బద్దెపాడు నివాసి అనీ వాద వివాదాలున్నాయి. వీరి కాలనిర్ణయంలో కూడ భిన్నాభిప్రాయాలున్నాయి. వీరిరువురూ ఒకేకాలం (18 వ శతాబ్దం)వారని కవి సప్తశతికారుల అభిప్రాయం. (ఆరుద్ర_10_137; ద్వి. సా.చ_324; క.స_85)

## పుసులూరి సోమరాజకవి

కాలం : క్రీ. శ. 17వ శతాబ్ది ప్రారంభం.

స్థలం : తణుకు తాలూకాలోని ఇల్లిందలపర్రు గ్రామం.

రచనలు : 1. ఇందు శతకము 2 నందనందన శతకము 3. బాలగోపాల శతకము.

ఉమాపతి పాపమ్మల పుత్రుడు. గోపాలకృష్ణుని భక్తుడు. అందువల్ల అతడు బాలకృష్ణదాసుగా కూడా ప్రసిద్ధుడు. ఇతని కవిత్వం మృదుమధురంగా ఉంటుంది. బాల గోపాలశతకంలో నిందాస్తుతి, స్తుతినింద మొదలైన విశేషాలున్నాయి. కృష్ణ గోపికా సంబంధాన్ని అద్భుతంగా చెప్పిన కవి. (శ.సా.వి-527)

**పూండ్ల చెంగయ కవి**

కాలం : క్రీ. శ. 1840 ప్రాంతం.

రచన : కోదండరామ శతకము.

పిచ్చయ పుత్రుడు. శేషయ పౌత్రుడు. రసవంతంగా కవిత్వం చెప్పాడు. (శ.క.చ-801)

**పూటకూళ్ళ ఇళ్ళు**

కాలం : క్రీ. శ 13, 14 శతాబ్దాలు.

ఈ ఇళ్ళ ప్రసక్తి క్రీడాభిరామంలో ఉంది. పూటకూళ్ళు పెట్టే ఇళ్ళు సుమారు 1000 సంవత్సరాల నుంచి తెలుగుదేశంలో ఉన్నాయి. పెద్ద పెద్ద ప్రాచీన నగరాలలో ఈ ఇళ్ళు ప్రబలంగా ఉండేవి ఒక్క రూకకు కప్పురభోగి వంటకం లభించేవట ఓరు గంటిలోని పూటకూటి ఇల్లు విలక్షణమైంది. ఈ గృహం 'బంధకీజారులకు దాయబారి యగుచు ...... పూటకూటింట నర్తించు పుష్పశరుడు' అనే విధంగా ఉండేది. దీనినిబట్టి ఆనాటి సంఘంలో ఈ ఇళ్ళు చాలా ప్రాముఖ్యాన్ని సంతరించుకొని ఉండేవని తెలియ వస్తుంది. (ఆం.సాం.చ.)

**పూడూరి కృష్ణయామాత్యుడు**

కాలం : క్రీ. శ. 16, 17 శతాబ్దాల నడిమికాలం.

స్థలం : పూడూరు (గద్వాల సంస్థానం).

రచన : భగవద్గీతార్థ దర్పణము.

గురువు: యోగానందుడు.

పూడూరి కొండయామాత్యుని పుత్రుడు. కాలాన్ని గురించి భిన్నాభి ప్రాయాలున్నాయి. యోగానంద గురువరుడే యోగానంద అవధూత అయి ఉంటాడని భావిస్తున్నారు. యోగానంద అవధూత గ్రంథాలు గద్వాల ప్రాంతంలో విరివిగా లభించడం కద్దు. (మ.మా.)

**పూతనా హరణము**

కవి : విజయరాఘవ నాయకుడు.

అంకితం : రాజగోపాలునికి.

రచనాకాలం : క్రీ. శ. 1651 ప్రాంతం.

నాటకం శ్రీకృష్ణుడు పూతనను సంహరించడం ఇతివృత్తం. కథాస్థలం రేపల్లెవాడ కాబట్టి గోపబాలకుల సంభాషణలు, గొల్ల పదాలు (ఉదా:బెస్తే పదాలు, శివాలాడ్డం) స్పష్ట వచనం, పరస్పరం జగడమాడ్డం, "వజ్రకుంత" అని తిట్లు, తప్పుమంత్రాలుచెప్పి, వట్టి హోమాలుచేసి నాలుగు పాడిఆవులు గ్రహించుకోడం మొదలయినవి సహజంగానూ పాత్రోచితంగానూ చెప్పాడు.

పూతన పాలివ్వడానికి వచ్చి, గోపకాంతలతో తాను రాజుల ఇళ్ళలో దాదినని చెప్పుకొని తనకు "దాలవర్తిని" అనే బిరుదు ఉందని చెప్తుంది. కథనం రసవత్తరంగా ఉంది. (వ.దే.నా-105)

## పూరుష ముఖ్య శతకము

కర్త . మంచెళ్ళ కృష్ణ కవి.

రచనాకాలం : 1840 కి ముందు.

ఇందులోని రచన రసవంతంగా ఉంటుంది ఉత్పలమాలా వృత్తాలున్నాయి. (క.స-38)

## పూర్ణ బ్రహ్మానంద యోగి

నామాంతరం : అప్పాశాస్త్రి (చూ).

## పూర్వ శాకుంతలము

కర్త : పేరి కాశీనాథశాస్త్రి.

ఇతివృత్తం ప్రఖ్యాతం. శకుంతలా దుష్యంతుల ప్రణయవృత్తాంతం ఇందలి కథావస్తువు. (ఆం.సం సా-427)

## పూసపాటి కృష్ణమరాజు

కాలం : క్రీ.శ. 16 వ శతాబ్దం ఉత్తరార్థం కావచ్చు.

స్థలం : విజయనగరం.

అంకితం : రుక్మిణీ పరిణయము.

ఇతడు పూసపాటి పెద కృష్ణభూపతి తమ్ముడైన రాచిరాజు కుమారుడు. సప్తసంతాన ప్రతిష్ఠాతగా, చతుష్షష్టి కళావిదుడుగా పేర్కొనబడ్డాడు. రుక్మిణీ పరిణయ ప్రబంధ కర్తగా "ఉషాభ్యుదయం"లో పేర్కొనబడ్డాడు. కాని ఈ గ్రంథానికి సంబంధించిన ఇతర వివరాలు తెలియవు. (ఆం.సం.సా-112)

## పూసపాటి చిన విజయ రామరాజు

కాలం : క్రీ.శ. 18 వ శతాబ్దం.

విజయనగర సంస్థానపాలకుడు (1760-1794).

సాహితీ పోషకుడు. ఇతని అసలు పేరు వెంకటపతిరాజు. పెద విజయ రామరాజు భార్య "చంద్రయ్యమ్మ" చేత దత్తుడు. క్రీ.శ. 1760-1794 మధ్య రాజ్య పాలన చేశాడు. దత్తు తీసుకోబడిన కాలంనాటికి ఇతడు బాలుడై ఉన్నందున ఇతని

సవతి సోదరుడైన సీతారామరాజు ఇతని పక్షం నుండే రాజ్యం చేశాడు. ఈ సీతారామ రాజు మిక్కిలి సమర్థుడు. ఇంతటి యుక్తులైన పాలకులున్నారని తమకు ముప్పు కలుగు తుందనే భావంతో కుంఫిణీ వారు ఈ విజయరామరాజుపై లేని నేరారోపణలు గావించి రాజ్య భ్రష్టుడిని చేయదలచారు. దీని పర్యవసానమే క్రీ. శ. 1794 జూలైలో జరిగిన “పద్మనాభ యుద్ధము”.

చిన విజయరామరాజు సాహితీ పోషకుడని, కవి పండితులకు ఎక్కువ అగ్రహారాదులు దానం చేశాడని తెలుస్తున్నది కాని నిర్దిష్టమైన ఆధారాలు దొరకవు.

అడిదము సూరకవి, పట్టి సత్యప్ప, పూజారి తమ్మన్న, పల్లా సుబ్బారాయశాస్త్రి ప్రభృతులు ఇతని ఆస్థానంలో ఉండే వారట. (ఆం.సం.సా-416)

## పూసపాటి తమ్మభూపాలుడు

కాలం : క్రీ. శ. 1620 – 1670 ప్రాంతం.
స్థలం : విజయనగరం సంస్థానం.
రచన : శ్రీకృష్ణ విజయము.
బిరుదులు : మన్నె సుల్తాను, మహీమండలరాయ, శ్రీ మన్మహామండలేశ్వర.

విజయనగర సంస్థానాన్ని పాలించిన “పూసపాటి” వారి వంశంలోని వాడు. గోపాల కృష్ణరాయ జగ్గమాంబల కుమారుడు. సాహిత్యాభిలాషి, సాహితీ పోషకుడు, చతుర్విధ కవితా చతురుడు. ఈ రాజకవి తన రచనను బెజవాడ “కనకదుర్గ”కు అంకితం ఇచ్చాడు. (ఆం.సం.సా-413)

## పూసపాటి నారాయణ గజపతిరాజు

కాలం : క్రీ. శ. 1794–1845.
స్థలం : విజయనగర సంస్థానం.

ఇతడు విజయనగరం సంస్థానాధిపతి రాజా చిన విజయ రామరాజు కుమారుడు. సాహిత్య పోషకుడు. బాల్యంలోనే సంస్థానాన్ని విడచి పారిపోయాడు. చాలాకాలం కొండ ప్రాంతపుటడవుల్లో తలదాచుకున్నాడు. కుంఫిణీవారు అనేక పర్యాయాలు ప్రయత్నించి ఎట్టి హాని కలుగజేయమని వాగ్దానాలు చేసిన తరువాత ఇతడు విజయనగరంలో కాలు పెట్టాడు, కాని ఎక్కువ కాలం అక్కడ నివసించలేదు సంస్థానాన్ని ప్రభుత్వ పర్యవేక్షణలో ఉంచి సాలుకు లక్ష రూపాయల “లవణము” మీద కాశీలో నివసిస్తూ క్రీ. శ. 1845లో అక్కడే మరణించారు.

ఇతడు సకల విద్యా విచక్షణుడని తుమురాడ పాపకవి కృతమైన వైరాగ్య దర్పణంలో పేర్కొనబడింది. ఇతని కొలువులో పెక్కురు కవి పండితులు ఉండేవారని, వారు ఈ ప్రభువుచేత అనేక దానాదికాలు పొందారని తెలుస్తుంది. చాటరాతి లక్ష్మీనరస కవి వంటి ప్రముఖ విద్వత్కవులు వీరి ఆస్థానంలోని వారే. జగత్ప్రసిద్ధి చెందిన నడి మింటి మంగళేశ్వర శాస్త్రి ఈతనిచేత సమ్మానింపబడ్డాడు. నడిమింటి రామయోగి కవికూడ ఈ నారాయణ గజపతి ఆశ్రితకోటిలోనివాడు. తంజావూరు నుండి విజయనగ

రానికి వచ్చి స్థిరపడిన ప్రసిద్ధ వాగ్గేయకారులు. సంగీత కళానిధి అయిన పెదగురు రాయాచార్యులు ఇతని ఆస్థాన విద్వాంసుడే. (ఆం. సం. సా-407, 408, 418)

## పూసపాటి పెద విజయరామరాజు

కాలం : క్రీ. శ. 1670-1756.
స్థలం : విజయనగర సంస్థానం.
రచనలు : తెలియరాలేదు.
బిరుదాలు : మీర్జా, రాజా, మన్యసుల్తానాదులు.

సాహిత్య పోషకుడు. ఇతడు విజయనగర సంస్థాన ప్రభువు. మొదటి ఆనందరాజు కుమారుడు. కడు సమర్థుడు. ఫరాసు సేనాని బుస్సీ దొరకు మిత్రుడు. బొబ్బిలి యుద్ధానికి బొబ్బిలి సామ్రాజ్య విచ్ఛిన్నానికి కారకుడు. కార్తీక మాహాత్మ్య కర్త వేంకట కవిచేత ఇతడు కవిలోక పాలకుడుగా పేర్కొనబడ్డాడు. ఇతడు కృతిభర్త, కృతికర్త కూడ అని విష్ణుభక్తి సుధాకరం అవతారికలో ఉంది కాని ఇతని రచనలు తెలియరాలేదు.

మండపాక పార్వతీశ్వరకవి పితామహుడైన "కామకవి" ఈ రాజుచేత సన్మానింప బడినట్లు "రాధాకృష్ణ సంవాద" కావ్యం నిరూపిస్తున్నది. గోగులపాటి కూర్మనాథ కవి ఈతని ఆస్థానంలోనివాడే. ఈ కవి బహు గ్రంథ కర్త. ఇతడు ఈ విజయరామ రాజుచేత బహుళంగా సన్మానింపబడి, సంప్రీతుడై "విజయరామ శతకాన్ని" కూడా రచించాడు. "విజయరామా, రామ తీర్థాశ్రయా" అనేది దీని మకుటం.

ఈయన "మాడుగుల" కోటను జయించిన సందర్భాన్ని గుర్తు చేస్తూ ఒక చాటువు దొరుకుతున్నది కాని ఆ చాటు కవి పేరు తెలియదు.

ఈ విజయరామరాజు "బొబ్బిలి" సంస్థానానికి చెందిన "తాండ్రపాపయ" చేతిలో హతుడైనాడట. (ఆం. సం సా-415)

## పూసపాటి మొదటి ఆనందరాజు

కాలం : క్రీ.శ. 17 వ శతాబ్దం ఉత్తరార్ధం - క్రీ.శ. 18 వ శతాబ్దం ప్రథమభాగం.
స్థలం : విజయనగర సంస్థానం.
రచన : నవరామయణము (అలభ్యం).

ఈతడు కేసమాంబా కృష్ణమరాజుల కుమారుడు. ఉషాభ్యుదయకర్త అయిన పూసపాటి వెంకటపతిరాజుకు తమ్ముడు పూసపాటి సీతారామచంద్రునికి దత్తుడు. ప్రతి పద్య చమత్కృతితో రచన చేయగల దిట్ట. (ఆం. సం. సా - 415)

## పూసపాటి రాచిరాజు

కాలం : క్రీ. శ. 1450-1520.
స్థలం : విజయనగర సామ్రాజ్యం.
రచన : వాసిష్ఠగోత్ర సీసమాలిక.

రాచిరాజు క్రీ.శ. 15వ శతాబ్దపు ఉత్తరార్ధంలో విజయనగర సంస్థానాధిపతిగా ఉండేవాడు. ప్రతాపరుద్ర గజపతికి అల్లుడట. అనగా శ్రీకృష్ణదేవరాయలు (1509 1530) కు తోడి అల్లుడు.

రాచిరాజు "నవభారతము" అనే కృతి ఆవిష్కృతికి కారకుడని "శ్రీ కృష్ణ విజయ" ప్రబంధం నుండి తెలుస్తున్నది. కాని ఇతడు ఆ గ్రంథానికి కృతికర్తనా, లేక కృతిభర్తనా అనే విషయాలు తెలియరావు. "నవభారతం" నేడు అలభ్యం.

(ఆం.సం.సా-411-412)

**పూసపాటి వారు**

ఆభరణవిశేషాలయిన పూసలతో 'పాటి' శబ్దం చివరలో ఉండి గ్రామ నామంతో ఉన్న ఇంటిపేరు. కళింగాంధ్ర దేశంలోని విజయనగర మహారాజుల ఇంటిపేరు ఇదే. విజయనగరం సమీపంలో పూసపాటిరేగ ఉంది. గుంటూరు మండలంలో పూసపాడు గ్రామముంది. (భారతి-మా-45-228)

**పూసపాటి విజయ రామరాజు**

కాలం : క్రీ.శ. 17వ శతాబ్ది ఉత్తరార్ధం.

స్థలం : విజయనగర ప్రాంతంలోని రేగులవలస.

రచనలు : విష్ణుభక్తి సుధాకరము, హోరా లక్షణము.

విద్వత్కవి. ఇతడు విజయనగర రాజకుటుంబానికి చెందినవాడు. రచన చక్కగా ఉంటుంది. (క.స-220)

**పూసపాటి వీరపరాజు**

కాలం : తెలియదు.

స్థలం : విశాఖమండలం.

రచన : చిరుత వజీరు శతకము.

మల్లపరాజు సోదరుడు. ఈ మల్లపరాజుకు 'దుగరాజు' అనే బిరుదు ఉన్నదట. చిరుత వజీరు శతకం అచ్చతెనుగులో ఉంది. నీతినిబోధించే రచన. (క.స-223)

**పూసపాటి వెంకటపతిరాజు**

కాలం : క్రీ.శ. 1669-1720.

స్థలం : విజయనగర సంస్థానం.

రచన : ఉషాభ్యుదయము.

విజయనగరాన్ని పాలించిన పెద జగన్నాథరాజు కోవలోని పొట్నూరి కృష్ణమరాజు కుమారుడు. సాహిత్యాభిమాని. పండితుడు. శ్రీరామతీర్థంలో వెలసిన సీతారామునికి ఈతని గ్రంథం అంకితం ఇవ్వబడింది. (ఆం.సం.సా-414)

**పృథు చరిత్రము**

కర్త : చూ. పట్టమట్ట సరస్వతిసోమయాజి.

అంకితం : ద్రాక్షారామంలోని భీమేశ్వరస్వామికి.

ఇది ప్రబంధం. దీనిలోని కవిత్వం శబ్దాలంకారాలతో ఉన్నప్పటికీ సరళంగా ఉంటుంది. (తె.వి.స-6)

## పెండెల నాగి

కాలం : కొండవీటి రెడ్డిరాజుల కాలం.

ఈమె జక్కుల కులానికి చెందిన జాణ. ఆనాటి యక్షగానాలలో స్త్రీ పాత్రలు ధరించి మంచిపేరు తెచ్చుకొన్నది.

ఈమెను ముద్దుగా 'నాగి' అని పిలిచేవారు. పెండెల నాగి ప్రవర్తించిన పాత్రలలో క్రీడాభిరామంలోని స్త్రీపాత్ర ముఖ్యమైనది. ఆనాటి వీథినాటకాలలో క్రీడాభిరామం ముఖ్యమైంది (సా.ప.ప-67)

## పెదూరి పెద్దామాత్యకవి

కాలం : తెలియదు.

స్థలం : తెలియదు.

రచనలు : తెలియవు

రోసనూరి వెంకటపతి తన "విష్ణుమాయా విలాస" కావ్యంలో ఇతన్ని, కాళికా వరప్రసాదం చేత కవిత చెప్పనేర్చిన మహనీయుడనీ, అతని వచో మాధుర్యం సాటిలేనిదనీ కీర్తించాడు. (క. త-12-213)

## పెద కాళహస్తి మాహాత్మ్యము

కర్త : ధూర్జటి లింగరాజు (చూ).

అంకితం : దామెర్ల వెంకటపతిరాయలకు.

12 ఆశ్వాసాల బృహత్ప్రబంధం. సంస్కృత శివరహస్య ఖండంలోని నూట యిరవై అధ్యాయాల కథ దీనికి మూలం.

ఇందులోని కవితా గాంభీర్యాన్ని కవిపుత్రుడైన వేంకటరాయకవి కీర్తించాడు. ఇందులోని కొన్ని పద్యాలు మాత్రం లభించాయి. (క త-12-253)

## పెద కెంపరాయడు

కాలం : క్రీ.శ. 1537-1569 ప్రాంతం.

స్థలం : బెంగుళూరు సమీపంలోని ఎలహంక.

రచన : గంగా గౌరీ విలాసము (యక్షగానం).

రాజకవి. కెంపగౌడ కుమారుడు. తెలుగువాడు. బెంగుళూరు నగరాన్ని ఈయనే 1537 లో నిర్మించాడు. వీరి ఇలవేల్పు కెంపమ్మ కాబట్టి, ఈయన పేరు అదేది కావచ్చు. విద్యానగర నిర్మాణంలో ఉన్నట్లుగానే, ఈ బెంగుళూరు నగర నిర్మాణ చరిత్రలో కూడా కుందేళ్ళు నక్కను తరిమే కథ ఉంది. కృష్ణదేవరాయల కాలంలో ఈయన ఎలహంక ప్రాంతాన్ని పాలించే వాడు. ఈయన తెలుగులో చకిత

ప్రకృతి వ్యాప్తిపై వికసించే కవిత్వాన్ని చెప్పాడు. ఇతని పదాలలో ఆదిప్రాసలతోపాటు అంత్యప్రాసలు కూడా ఉన్నాయి (ఆప్ర-9-229)

## పెదకోమటి వేమారెడ్డి

కాలం : క్రీ. శ. 1402 నుంచి 1420 వరకు.

రచనలు : 1. సాహిత్య చింతామణి (సం) 2. వీరనారాయణ చరితమ్ (సం) 3. సంగీత చింతామణి (సం) 4 శృంగార దీపిక (సం) 5. సప్తశతీ సారటీక (సం).

బిరుదులు : సర్వజ్ఞ చక్రవర్తి, వీరనారాయణుడు.

పెదకోమటి రెడ్డి కుమారుడు. కొండవీటిని పాలించిన రెడ్డి ప్రభువు. ఇతని రచనలన్నీ సంస్కృత గ్రంథాలు. "సాహిత్య చింతామణి" మమ్మటుని "కావ్య ప్రకాశమ్" పద్ధతిలో నడచిన అలంకార శాస్త్ర గ్రంథం. ఈ గ్రంథంలో "కుసుమాయుధుడు" అనే సంస్కృత కవిని కోమటివేముడు పేర్కొన్నాడు.

ఇతని ఆస్థానంలోనే శ్రీనాథుడు విద్యాధికారి పదవిని అలంకరించాడు. ఈయన విక్రమ సాహసాంకుడని, రాయ వేశ్యా భుజంగుడని, అతుల బల భీముడని చాటువులు చెప్తున్నాయి. ఇతడు సంగీత, సాహిత్యాలలో ప్రవీణుడు.

వేమ భూపాలచరితమ్ అనే సంస్కృత గ్రంథ రచయిత వామనభట్ట బాణుడు ఈయన ఆస్థానకవి.

గుంటూరుతాలూకా 'కుర్నూతల' రాతి శాసనంలో పెదకోమటి వేముడు 'సర్వజ్ఞ చక్రవర్తి'గా కనిపిస్తాడు. ఈ శాసనకర్త శ్రీనాథుడు వేముని విద్యాధికారి. పెదకోమటి వేమునికి 'వీరనారాయణుడు' అనే బిరుదు కూడా ఉంది.

విశిష్టత : 'అమరుక శతకమ్' మీద వ్రాసిన వ్యాఖ్యానాలలో, మాళవదేశపు రచయిత అర్జునదేవుని 'రసిక సంజీవని', పెదకోమటి వేముని 'శృంగార దీపిక', అత్యుత్తమమైనవని పండితాభిప్రాయం. 'వీరనారాయణ చరితమ్' పేరుతోనే ఒక 'భాణాన్ని' అదే పేరుతో వేరొక 'కావ్యాన్ని' వ్రాసినట్లు వేముడు పేర్కొన్నాడు. మూడోది 'సంగీత చింతామణి' అనే గ్రంథం. సంగీత శాస్త్రానికి సంబంధించినది. నాలుగోదైన 'శృంగార దీపిక', శృంగార కావ్యమైన అమరుక శతకానికి వ్యాఖ్యానం. అట్లే అయిదోదయిన 'సప్తశతీ సారటీక' శాతవాహన చక్రవర్తి హాలుని 'సప్తశతి'కి వ్యాఖ్యానం. హాలుని ఏడు వందల ప్రాకృతగాథల నుంచి ఒకవంద గాథలను ఎంచుకొని, వేముడు వ్యాఖ్యానించాడు.

'సప్తశతీసారటీక'కు 'భావదీపిక' అనే నామాంతరం ఉంది. (రె.రా.చ.)

## పెదపాటి జగ్గన్న

కాలం : క్రీ శ. 1580-1590 ప్రాంతం.

రచన : ప్రబంధ రత్నాకరము (సంకలన గ్రంథం).

చానమ్మ, గంగామాత్యుల పుత్రుడు. వీరి ఇంటిపేరు పెదపాటి అనీ, రామాప్రెగడ అనీ అంటున్నారు. కొన్ని గ్రంథాలు నామమాత్రావశిష్టం కాకుండా - కవుల, కావ్యాల పేర్లు చెబుతూ ఎన్నో పద్యాలను ఉదాహరిస్తూ సంకలన గ్రంథాన్ని వ్రాసి

సాహిత్యానికి ఉపకారంచేసి, చిరస్మరణీయుడైనవాడు జగ్గన్న. సంకలన గ్రంథకర్తలలో ఈయన మూడోవాడు. మొదటివాడు మడికి సింగన్న. పింగళి సూరన్న, రామరాజ భూషణులను జగ్గన్న తన ప్రబంధ రత్నాకరంలో ఉదాహరించలేదు. తెనాలి రామకృష్ణుని పద్యాలనూ, సాంబోపాఖ్యాన కర్త రామరాజు రంగప్పరాజు పద్యాలనూ ఉదాహరించాడు. ఇతడు మొదటి ఇద్దరికీ పూర్వుడై, తరువాతి ఇద్దరికీ అర్వాచీనుడు కావచ్చు.

జగ్గన్న కావ్యలక్షణ గణితాది సకలశాస్త్ర ప్రజ్ఞావిశేష వైభవాలున్నవాడు. రాజ విద్వత్సభలలో రసిక పాండవులు ప్రస్తుతించిన ధర్మాచార నియతి ఉన్నవాడు. జనసుతులైన కవీశ్వరుల సంస్కృతి సారాన్ని గ్రంథస్థం చేశాడు.

తన సంకలన గ్రంథంలో 60 మంది కవులపేర్లు, 78 గ్రంథాలపేర్లు చెప్పి కొన్ని వందల పద్యాలను ఉదాహరించాడు. ఆంధ్ర సాహిత్యంలోని ఏ ప్రబంధంలోని పద్యమైనా, జగ్గన్న చెప్పిన ఏ ఒక్క విషయ విభాగంలోనయినా ఇముడుతుంది. దురదృష్టవశాత్తూ ఈయన సంకలన గ్రంథంలోని మూడు ఆశ్వాసాలు మాత్రమే దొరికాయి. దీని వ్రాతప్రతి తంజావూరు సరస్వతీ మహలు గ్రంథాలయంలో ఉంది (ఆరుద్ర-9)

## పెదపాటి సోమయ్య

కాలం : క్రీ.శ. 1500 ప్రాంతం.

రచనలు : అరుణాచల పురాణము, కేదారఖండము, త్రిపురవిజయము, శివజ్ఞానదీపిక.

బిరుదు : కవిలోక బ్రహ్మ.

పిడుమర్తి తిమ్మకవి ఇతడిని ఉదాహరించాడు. ఇతని గ్రంథాలు, పద్యాలు సంకలన గ్రంథాలలో పేర్కొనబడ్డాయి. అన్నీ అలభ్యాలే. ఈ కవి రచన సరసంగా ఉంటుందని విమర్శకుల అభిప్రాయం. (క.స-308)

## పెద వేంకటపతిరాయలు

కాలం : క్రీ.శ. 1586-1614 ప్రాంతం.

సాహిత్య పోషకుడు. ఉప్పుగుండూరి పెరియన్న కవి రచించిన మీన కేతనాభ్యుదయ కావ్యానికి కృతిపతి.

విశిష్టత : ఈయన అళియ రామరాయలకు మనుమడు. రామరాజు అయిదో కుమారుడైన శ్రీరంగ రాయల కొడుకు. ఈయనను ప్రస్తుతిస్తూ చాలా చాటువులున్నాయి. (ఆరుద్ర-9)

## పెద వేదగిరినాయడు

కాలం : క్రీ.శ. 1384-1399 ప్రాంతం.

స్థలం : దేవరకొండ.

కవి పోషకుడు. దేవరకొండను పాలించిన పద్మనాయక ప్రభువు. భాస్కర రామాయణంలో యుద్ధకాండ శేషాన్ని పూరించిన అయ్యలార్యుని పోషించాడు. అయ్యలార్యుడు తాను పూరించిన యుద్ధకాండ భాగాన్ని ఇతనికే అంకితం ఇచ్చాడు. (రె.రా.చ.)

## పెద సోమభూపాలుడు

నామాంతరం : రాజా పెదసోమభూపాలుడు
కాలం : క్రీ.శ. 17వ శతాబ్దం చివర — 18వ శతాబ్దం ప్రారంభం.
స్థలం : గద్వాల.
రచనలు : 1. రతిశాస్త్రము 2. అష్టపది.

ఐక్కాంబా పెద్ద భూవిభుల కుమారుడు. ఇతడు గద్వాల కోటను క్రీ.శ. 1698-1704లో నిర్మించాడు. సర్వతోముఖ ప్రజ్ఞకలాప్రభువు. అతి ప్రసిద్ధుడు. దక్కను సుల్తానులను ఓడించడంలో ఔరంగజేబు చక్రవర్తికి సహాయపడి క్రీ.శ. 1704లో 'రాజా' బిరుదము పొంది, గద్వాలపై ఆధిపత్యం సంపాదించాడు.

ఇతడు ప్రామాణిక సాహిత్యంలోనే కాక, జానపద సాహిత్యంలోనూ ప్రశస్తి గాంచినవాడు. శోభనాద్రి అనే పేర జానపదుల వ్యవహారంలో ఉన్నాడు.

ఇతని ఆస్థానంలో హరిభట్టు, కొటికలపూడి వీరరాఘవకవి, కాణాదము పెద్దన సోమయాజి మొదలగు విద్వత్కవులుండేవారు.

ఇతడు 'రతిశాస్త్రము' అనే మూడాశ్వాసాల శృంగార ప్రబంధాన్ని, జయదేవుని అష్టపదులకు సంస్కృతాంధ్ర భాషలలో ఛందోబద్ధంగా సంపాదితమైన వ్యాఖ్యారూప విస్తృతి అయిన 'అష్టపది'ని వ్రాశాడు. ఈ 'అష్టపది' చినసోమ భూపాలుని కృతి అని కొందరి భావన.

ఇతడు ఆకాలంలో ఆంధ్ర భాషలోనికి అనువదింపబడిన భాస్కర రామాయణాదుల చేత ప్రభావితుడై వాల్మీకి రామాయణాన్ని యథాతథంగా అనువదించుటకు ఆస్థాన కవులను ప్రోత్సహించాడు. చిన సోమభూపాలుని కాలంలో ఈ ఆంధ్రీకరణం నిర్విఘ్నంగా కొనసాగి 'యథాశ్లోక తాత్పర్య రామాయణ ప్రబంధము' అనేపేర ప్రసిద్ధి చెందింది. ఈ గ్రంథం పలువురు కవుల చేత అనువదింపబడింది.

గద్వాల సంస్థానంలో ప్రతి ఏటా కార్తిక మాసంలో పండితులకు, మాఘ మాసంలో కవిగాయకులకు ఘనసన్మానం జరిగే సంప్రదాయాన్ని ఇతడే నెలకొల్పాడు. ఈ సంప్రదాయం నేటికి కూడా కొనసాగుతున్నది. (ఆం.సం.సా.)

## పెద్దదాసు

కాలం : క్రీ. శ. 17 వ శతాబ్దం.
స్థలం : తంజావూరు.

విజయ రాఘవుని కాలంనాటి గొప్ప పదకర్త. భక్తుడు. విజయరాఘవుని రాజ్య పతనానికీ, కొడుకైన మన్నారుదేవుని కారాగారంలో ఉంచడానికీ ఈ భక్తుని వారు అవమానించడమే కారణమని చెప్పే ఒక కథ ప్రచారంలో ఉంది ఈతని చరిత్ర సింగరిదాసు అనే ఆయన రాశాడు. ఈ పుస్తకం క్రీ. శ. 1870 నుండి పన్నెండుసార్లు ముద్రింపబడింది. (అరుద్ర-11-256)

## పెద్ద బాలశిక్ష

కర్త : పుదూరి సీతారామశాస్త్రి.

రచనాకాలం : క్రీ. శ. 1847 ప్రాంతం.

భారతీయ సంస్కృతి విజ్ఞానానికి మొదటి మెట్టుగా ఈ గ్రంథం ప్రశంసల నందింది. అక్షర క్రమము (గుణితము), ఎక్కములు, మాసములు, వారములు, నక్షత్రములు, ఋతువులు, పావులాంటి మల్లిన గణితశాస్త్రపద్యాలు, సంవత్సర విశేషాలు, సంఖ్యా వాచకాలు ఛందో లక్షణాలు ఈ గ్రంథంలో ఉన్నాయి. ఇది అనేక ముద్రణలు పొందింది. దీన్ని బాలల విజ్ఞాన సర్వస్వం అని చెప్పవచ్చు. (వ తా-88)

## పెద్దయ మంత్రి

కాలం : క్రీ. శ. 18 వ శతాబ్దానికి పూర్వం.

విక్రమార్క చరిత్ర (ద్విపద) కృతి ప్రోత్సాహకుడు. దేవయామాత్యుని పుత్రుడు. సాహిత్య ప్రీతి కలవాడు. సప్తసంతానాలలో కృతి ప్రశస్తమని చెప్పి కొండయ కవిని కావ్యరచనకు ప్రోత్సహించాడు. (ద్వి.సా.చ-457)

## పెద్దయామాత్యుడు

కాలం : క్రీ. శ. 13 వ శతాబ్ది పూర్వార్ధం.

స్థలం : నెల్లూరు.

రచనలు : అలభ్యం.

నెల్లూరును క్రీ. శ. 1285 నుంచి పాలించిన రెండో తిక్కరాజు ఆస్థానంలోనివాడు. విక్రమార్క చరిత్ర కృతికర్తయైన జక్కనకు తాత. ఇతన్ని జక్కన చాలా ప్రశంసించాడు.

1. సంస్కృత, ప్రాకృత, శౌరసేనీభాషల్లో గడియకు శతకం చెప్పటం 2. ప్రహసన, ప్రకరణ, భాణ రచన చేయటం 3. చక్రి, చతుర్భద్ర చతురుత్తర మొదలగు ముద్రికా రచన, 4. అంత్యాక్షరంలో ప్రబంధం చెప్పటం, 5. ఏ రీతిలోనైనా, ఏ ధాతువులోనైనా నవరసాల్లో మంచి వర్ణనలు చేయటం 6. ఏక సంధా, త్రిసంధలలో ధారణచేసి గడగడ చదవటం మొదలైన ప్రక్రియలలో నేర్పరి. ఆశు, మధుర, చిత్ర, విస్తర కవితలలో పేరెన్నికగన్నవాడు. సాహిత్య, విద్యా ప్రదర్శనలు పెక్కుకు మిక్కిలిగా చేశాడట.

(ఆరుద్ర-3-89)

## పెద్దశగిరి విజయము

కర్త : గణపవరపు వేంకటకవి.

రచనాకాలం : క్రీ.శ. 17వ శతాబ్దం.

నాలుగు శీర్షికలు గల ఉత్పలమాలా వృత్తమాలిక. చాటుకృతి. తూర్పు మాలిక, దక్షిణపు మాలిక, పడమటి మాలిక, ఉత్తరపు మాలిక అని నాల్గు భాగాలుగా

ఉంది. వాటిలోని ప్రాధాన్యం గల రచన. మహారాష్ట్ర రాజు ఏకోజీ తంజావూరుపై దండెత్తినప్పుడు మొదట, యుద్ధంలో ఓడిపోయి, ముద్దళగిరి అతన్ని ఓడించాడు. ఈ మాలిక ఆ విజయాన్ని వర్ణిస్తున్నది.

యుద్ధానికి, యుద్ధపరికరాలకు సంబంధించిన దేశీయ పదాలు, అన్యభాషా పదాలు ఇందులో చాలా ఉన్నాయి. (వ.దే.వా_328)

## పెద్దాడ నాగరాజామాత్యుడు

కాలం : క్రీ.శ. 1760 — 1845.

స్థలం : మచిలీపట్టణం.

రచన : శకుంతలాపరిణయము.

మచిలీపట్టణంలో ప్రఖ్యాతి వహించిన కవి. కొప్పెర్లకోట రామచంద్ర వేంకట కృష్ణారావు ప్రపితామహుడు. ఇతడు మొగలితుర్రు సంస్థానంలో సుమారు 30 సంవత్సరాలు విద్వత్కవిగా ఉన్నాడట. (ఆం.సం.సా_231)

## పెద్దాపురము

ఆంధ్రదేశంలోని తూర్పు ప్రాంతపు సంస్థానాలలో ప్రాచీన సంస్థానం. గోదావరి మండలంలోని చాలాభాగం, కృష్ణా, గుంటూరు జిల్లాలలోని కొంతభాగం, విశాఖ లోని కొన్ని గ్రామాలు, తోటపల్లి, రంపచోడవరం మొదలగు మన్యపు సీమలు ఒక కాలంలో ఈ సంస్థానానికి సంబంధించినవే. ఈ సంస్థానానికి ముఖ్య పట్టణం 'పెద్దాపురం'.

సంస్థానపాలకులు సూర్యవంశోద్భవులైన క్షత్రియులు. వీరికి మూల పురుషుడు దుర్జయుడు. ఈ వంశపు పూర్వులలో 'సాగి పోతరాజు' ఒకడు. ఈతని తరువాతి వాడైన 'శ్రీరామరాజు' 'వత్సవాయి' గ్రామంలో నివాసం ఏర్పరచుకోవడం చేత వీరికి 'వత్సవాయి' వారనే గృహ నామం కలిగింది.

క్రీ.శ. 16వ శతాబ్దం వాడైన 'వత్సవాయి చతుర్భుజ తిమ్మరాయ జగపతి బహద్దరు' ఈ సంస్థానాన్ని సంపాదించాడు. ఈ వంశం వారిలో ఈ తిమ్మరాయ జగపతి అత్యంత ప్రసిద్ధుడు. మిక్కిలి సమర్థుడు విద్వత్తిమ్మ జగపతి కుమారుడైన రాయజగపతి (క్రీ.శ. 1797_1804) కాలంలో కుంఫిణీవారి చేత శాశ్వత పరిష్కారం జరిగింది. కాని ఈతని తదనంతరం సంస్థానం చాలా చిక్కులలో పడింది. సుమారు 30 సంవత్సరాలు నిరంతర వ్యాజ్యంలో మునిగితేలింది. తుదకు 1838_1847లో జగన్నాథ రాజుగారి జ్యేష్ఠపుత్రుడైన రాజా సూర్యనారాయణ జగపతి సంస్థానాన్ని పాలించాడు. సంస్థానం ఆర్థికంగా దెబ్బతినడం వల్ల 1847లో కిర్లంపూడి, దొంతమూరు, వీరవరం, కోలంక, కడలి, గొల్లప్రోలు, జగ్గయపేట మొదలగు పెక్కు గ్రామాలు వేలంలో అన్యాక్రాంత మైనాయి. ఒక్క 'కొత్తాము' ఎస్టేటు మినహా తక్కిన భాగమంతా ప్రభుత్వపరమైంది. రాజా వత్సవాయి వేంకట సూర్యనారాయణ రాజు బహద్దరు క్రీ.శ. 1932లో జమీకి వచ్చాడు. సంస్థాన పాలకులలో ఇతడు చివరివాడు.

ఈ సంస్థానపాలకులలో చాలామంది విద్వత్ప్రభువులు. సంస్థాన సంపాదకుడైన తిమ్మ జగపతిరాజు 'వెలుతురుపల్లి విశ్వనాథ కవి' రచించిన 'శేషధర్మములు' అనే పద్యకావ్యాన్ని అంకితం పొందాడు. వత్సవాయి బలభద్ర జగపతిరాజు 'శ్రీరామ శతకము' వ్రాశాడు. కిరాతార్జునీయ గ్రంథానికి కృతికర్త. ఏనుగు కుటుంబ కవులు ఈ సంస్థానపు యశశ్చంద్రికలు అన్నిదిక్కులా వ్యాపింపచేశారు. ఏనుగువారు సంస్థాన విద్వత్కవులు. ఏనుగు లక్ష్మణకవి భర్తృహరి సుభాషితాలు తెనుగున అనువదించడం జగద్విదితమైన విషయం. ఈతని తాత 'పెద లక్ష్మణకవి (లక్ష్మకవి) తులా మాహాత్మ్యము, ధ్రువచరిత్రము మొదలగు కావ్యాలు వ్రాశాడు. భర్తృహరి సుభాషిత కర్త అయిన లక్ష్మణకవి 'రామేశ్వర మాహాత్మ్యము', "జాహ్నవీ మాహాత్మ్యము" మొదలగు గ్రంథాలు వ్రాశాడు. క్రీ. శ. 18వ శతాబ్దం వాడైన 'అడివిశ్వ వేంకటశాస్త్రి' చిత్ర చమత్కారమంజరి, అలంకారసుధాసింధువు, రసప్రపంచం, మాహేశ్వరకావ్యం, భాస్కర ప్రశస్తి, రుక్మిణీ కళ్యాణం వంటి పెక్కు రచనలు చేశాడు. నలజర్ల గంగరాజు, దావలి రామశాస్త్రి, పోతా వేంకటకృష్ణకవి, కవిభూషణం వేంకటనీలాద్రిరాజు, పరవస్తు వేంకట రంగాచార్యులు మొదలగువారు ఈ సంస్థానంలో పేరుమోసిన విద్వత్కవులు. కువలయామోదము, అప్పారాయ యశశ్చంద్రోదయము, అలంకార ముక్తావళి, జగత్ప్రతి సుభాషితము, ప్రభావతీ ప్రద్యుమ్నము, అభిజ్ఞాన శాకుంతలము, మేఘ సందేశము (అనువాద రచన) మొదలగు పెక్కు రచనలు ఈ సంస్థానం ద్వారా ఆంధ్ర సారస్వతానికి లభించాయి. కవిపండిత గాయకాదులు పెక్కురు ఈ సంస్థానాధిపతుల చేత ఈనాములు, వార్షికాలు పొందినారు. పెద్దాపురం సంస్థానానికి చెందిన శతాధిక చాటుపద్యాలు ఇప్పటికీ లభిస్తాయి. (ఆం సం సా)

## పెద్దిరాజు రామరాజు

కాలం : క్రీ. శ. 16 వ శతాబ్దం కావచ్చు.

రచనలు : లభించలేదు.

ఇతన్ని అప్పకవి పేర్కొన్నాడు. (క స-198)

## పెనుపల్లె దాపనామాత్యుడు

కాలం : నిర్ధారణ కాలేదు.

రచన : సీతా విజయము.

కోనయామాత్యుని పుత్రుడు. పండిత కవి, (క స-142)

## పెనుమర్తి వేంకటార్యుడు

కాలం : క్రీ శ. 16 వ శతాబ్ది.

రచన : లక్షణ విలాసము (లక్షణ గ్రంథం).

విశిష్టత : ఈయన, లాక్షణికులు అనేకులు "అనేక దార్ల" ఛందాలు చెప్పారని చెప్తూ, స్వేచ్ఛాయుత బుద్ధితో ఒక లక్షణవిలాస గ్రంథాన్ని వ్రాశాడు. ఈ కవి

గ్రంథాన్ని అప్పటివి తన పుస్తకంలో పేర్కొన్నాడు ఇతడు ఉదాహరించిన గ్రంథాలు కొన్ని దొరకటం లేదు. (అరుద్ర-9-218)

**పెనుమక్క సోమనామాత్యుడు**

కాలం : క్రీ. శ. 17వ శతాబ్దం.

స్థలం : విజయనగరం సంస్థానం.

రచన : సీమంతిని కల్యాణము.

గురువు : పెద్దనామాత్యుడు.

పూసపాటి తిమ్మభూపాలునికి (క్రీ. శ. 1626-1670) మంత్రి. తండ్రి నీలయామాత్యుడు. "పిల్లలమఱ్ఱి పినవీరభద్రుని" వంశానికి చెందినవాడినని చెప్పుకున్నాడు. ఆశ్వాసాంత గద్యలో, వీరి వంశంలోనివారు కులకామితులవద్ద "పెనుమక్క" గ్రామాన్ని బహుమతిగా పొంది అక్కడే నివసించినందువల్ల వీరికి "పెనుమక్క" గృహనామంగా స్థిరపడిందని చెప్పబడింది. (ఆం.సం.సా-414)

**పెనుమెచ్చ జగన్నాథరాజు**

కాలం : క్రీ. శ. 18వ శతాబ్దం.

స్థలం : విజయనగరం సంస్థానం.

"రామకథాసార సంగ్రహము" కృతిపతి. సాహితీప్రియుడు.

విజయనగర సంస్థానాధీశ్వరుడైన విజయరామ గజపతికి ప్రధానమంత్రి. మండ కామేశ్వరకవి రచించిన రామకథాసార సంగ్రహ గ్రంథ కృతికర్త. ఇతడు సంస్కృతాంధ్ర విద్యాపరిశీలనాధ్యక్షుడట. (ఆం.సం.సా-429)

**పెనుమెత్స అనంతరాజు**

కాలం : క్రీ శ. 16వ శతాబ్దం.

స్థలం : తూర్పు గోదావరి జిల్లాలోని ర్యాలి గ్రామం.

సాహిత్యపోషకుడు. అంబరీష చరిత్రాది కృతులు కృతినందినట్లు తెలుస్తున్నది "అంతర్వేది మాహాత్మ్యం" కావ్యం రచించిన పెనుమెత్స గోపరాజు ఇతని తండ్రి. ర్యాలి కేశవస్వామికి గోపురప్రాకారాదులు కట్టించాడట. విష్ణుభజనానంద కర్తలు బమ్మెర కేసన-మల్లకవులు ఇతన్నిగురించి చెప్పారు. (క.త-6-252)

**పెనుమెత్స గోపరాజు**

కాలం : క్రీ.శ. 1500 ప్రాంతం

స్థలం : ర్యాలి.

రచన : అంతర్వేది మాహాత్మ్యము (అలభ్యం).

విశిష్టత : ఇందుమతీ కల్యాణకర్త వేంకటాద్రి ఇతని సోదరుడు. బమ్మెర కేసకవి మల్లకవులు తాము వ్రాసిన "విష్ణుభజనానందం" కృత్యాదిలో ఈ కవిని గురించి చెప్పారు. ఇతడు పెక్కు కృతులు రచించాడట. అవి తెలియరాలేదు. (క.త-6-251)

**పెనుమెత్స నార భూపాలుడు**

కాలం : క్రీ. శ. 16వ శతాబ్దం.

స్థలం : తూర్పు గోదావరి జిల్లా ర్యాలి గ్రామం.

సాహిత్య పోషకుడు. జమ్మెల కేసన - మల్లకవులు రచించిన విష్ణు భజనానంద ప్రబంధం ఇతనికి అంకితం.

**పెనుమెత్స బుచ్చిరాజు**

కాలం : క్రీ. శ. 1870 ప్రాంతం.

స్థలం : కప్లపాలెము.

రచనలు : పంచతత్త్వ ప్రకాశిక.

విఖ్యాతుడైన వెంకటపతిరాజు ఇతని తండ్రి వేదాంత విషయాలను సుబోధకంగా చెప్పిన కవి. (క స-145)

**పెనుమెత్స వేంకటాద్రి**

కాలం : క్రీ. శ. 1500 ప్రాంతం.

నివాసం : ర్యాలి గ్రామం.

రచన : ఇందుమతీ కల్యాణము (అలభ్యం).

ఇతడు నాటకాలంకార [illegible] గీర్వాణాంధ్ర కవితా ప్రవర్తకుడు. తండ్రి పెద్దరాజు, తల్లి గన్నమాంబ.

విశేషత : జమ్మెల కేసకవి - మల్లకవులు తాము వ్రాసిన "విష్ణుభజనానందం" కృత్యాదిలో ఈ కవిని గురించి చెప్పారు. ఇతడు గోదావరి జిల్లా రాజోలు తాలూకా "ర్యాలి" గ్రామనివాసి. ఇతని తరవాత మరి పదకొండు మంది కవులు క్రీ. శ. 1500 నుండి 1900 వరకు ఇందుమతీ కల్యాణాన్ని కావ్యంగా వ్రాశారు.

(క.త-6-250; ఆరుద్ర-8)

**పెమ్మయ సింగధీమణి శతకము**

కర్త : తెలియదు.

"పెమ్మయ సింగధీమణీ" మకుటంతో చాలా పద్యాలు లభిస్తున్నాయి. అన్నీ చక్కని నీతులతో ఉన్నాయి.

**పెమ్మయ సింగరాజు**

ముప్పది ఇద్దరు మంత్రులున్న సీసమాలిక ఈయన గురించి చెబుతున్నది. ఈయనను గురించిన చాటువులు నీతిబోధకాలు. కొన్ని పద్యాలచివర పెమ్మయ సింగధీ మణీ అనే మకుటంకూడా కనిపిస్తుంది. శతకమే ఉండేదేమోనని పండితులు అనుమానిస్తున్నారు. (చా.ప.ర.)

**పెమ్మసాని తిమ్మ నాయకుడు**

కాలం : క్రీ. శ. 17వ శతాబ్దం.

స్థలం : కాపిపట్టి.

సాహిత్య పోషకుడు. చాటు చంద్రోదయ కర్త చెన్నమరాజు చెన్నమరాజును ఆదరించారు.

## పెమ్మసాని వారు

వీరు మన్నె దేవేంద్రులట. వీరిలో పెమ్మసాని అక్కభూపాలుడు, నరసింహుడు, చిన్న తిమ్మభూపాలుడు ప్రసిద్ధులు. వీరి కీర్తిని ప్రస్తుతిస్తూ చాలా చాటు పద్యాలున్నాయి. (చా.ప.ర.)

## పెరియప్పకవి

కాలం : క్రీ. శ. 17వ శతాబ్దం.

స్థలం : శహాజీ రాజపురం.

రచన : 1. శృంగార మంజరీ శాహజీయమ్ (సం)

బిరుదు : కవి తార్కిక సార్వభౌముడు.

గురువు : కృష్ణానంద సరస్వతి.

గురువే ఇతనికి బిరుదిచ్చినట్లు తెలుస్తోంది. 1684-1712 లలో తంజావూరును పాలించిన శహాజీకి ఆశ్రితుడు

దక్షిణదేశంలో స్థిరపడిన పండిత కుటుంబానికి చెందినవాడు. విజయనగరానికి చెందిన అన్నశాస్త్రి కుమారుడు.

శృంగారమంజరి శాహజీయం, శహాజీరాజు జీవితాన్ని చిత్రించే నాటకం. తిరువైయూరులో ఉత్సవ సందర్భాలలో దీన్ని ప్రదర్శించే వారు. (ద.దే.వా-179)

## పెరియాళ్వారు

చూ. విష్ణుచిత్తుడు

## పేరి కాశీనాథశాస్త్రి

కాలం : క్రీ.శ. 19వ శతాబ్దం.

రచనలు : i) తెలుగు : గౌతమతర్కము, పార్థసారథి శతకము, పూర్వశాకుంతలము, ప్రత్యూషప్రబోధ మననము భగవద్గీతాసారము వీథినాటకము, శృంగార రసమంజరి మొదలగునవి.

ii) సంస్కృతం : గంగాస్తవరాజమ్, గోదావరీలహరి, దుర్గా సౌందర్య శతకమ్, పరిభాషేందుశేఖర వ్యాఖ్యా కాదంబిని, పాంచాలికారక్షణమ్, యామినీపూర్ణతిలకమ్, శాకుంతల నాటకమ్, సర్వమంగళా విభుత్వ స్థాపనమ్ మొదలగునవి.

భాష్యాంత వ్యాకరణపండితుడు. తర్కాలంకారాలలో దృఢమైన వ్యుత్పత్తి

కలవాడు. సంస్కృత, ప్రాకృత, ఆంధ్ర భాషలలో కవిత్వం చెప్పాడట. ప్రాకృత రచనలు కనిపించవు గాని, ఇతని సంస్కృత, ఆంధ్రరచనలలో ముఖ్యమైనవి పైన పేర్కొన బడ్డాయి. (ఆం.సం.సా-427)

### పెరుంబూదూరి యతిరాజాచార్యులు

కాలం : క్రీ. శ 17 వ శతాబ్దం.

స్థలం : మధుర మండలం.

ఇతడు గణపవరపు వేంకటకవికి గురువు. ఇతని పేర వేంకటకవి యతిరాజ విజయ గద్యము రచించినట్లు తెలుస్తున్నది. ఆ గ్రంథం నేడు అలభ్యం.

### పేరు సోముల గణపయ్య

రచన : వాస్తుశాస్త్రము (పద్యకావ్యం).

వివరాలు తెలియవు. (వా.ప;వం.సు-404)

### పైడా రామకృష్ణయ్య

కాలం : క్రీ. శ. 19 వ శతాబ్దం (ప్రథమార్ధం).

స్థలం : అన్నదేవరపేట.

"శ్రావణ విజయము" అంకితం పొందాడు." అన్నదేవరపేట" ఎస్టేటు పాలకుడు. మూల పురుషుని తరువాత 4 వ తరంవాడు. సాహిత్యాభిలాషి

సాహిత్య విశారద కాశీభట్ట సుబ్బయ్యశాస్త్రి ఈ జమీందారుకు ఆశ్రితుడు. ఈ కవి వ్రాసిన "శ్రావణ విజయము" రామకృష్ణయ్యగారికి అంకితం.

(ఆం. సం. సా-522)

### పైడి గంటంవారు

ఇంటి పేరు. అబ్బామంత్రి అనే అయన ప్రౌఢదేవరాయలను (1423-50) మెప్పించి పైడిగంటం బహూమానంగా పొందాడట. అప్పటినుండీ ఆ వంశీయులకు పైడిగంటం వారనే ఇంటి పేరు వచ్చింది. హరి వంశంలోని ఆశ్చర్య పర్వాన్ని అనువదించిన తామరపల్లి తిమ్మయ్య ఈ వంశీయుడే. ఇతడు 16 వ శతాబ్దంలోని వాడు. (ఆరుద్ర-9-238)

### పైడిపాటి పాపయ్య

కాలం : క్రీ. శ. 19 వ శతాబ్దం.

స్థలం : మదరాసు.

రచన : రామాయణ వచనము.

కొండలయ్య పుత్రుడు. గోనబుద్ధారెడ్డి రచించిన ద్విపద రామాయణాన్ని వచన కావ్యంగా సాంద్రీసుదార అజ్ఞమేరకు రచించాడు. శైలి సులభమైన వ్యావహారికంలో ఉంది. (వ వా.)

**పైడిపాటి వేంకట నరసు**

కాలం : క్రీ. శ. 19వ శతాబ్ది పూర్వార్ధం.

రచనలు : 1. రాధికా సాంత్వనము వ్యాఖ్య 2. రాధా మాధవము వ్యాఖ్య 3. వైజయంతీ విలాసము వ్యాఖ్య 4. అనిరుద్ధ చరిత్ర వ్యాఖ్య.

ఈయన బ్రౌన్ దొర ఆస్థానంలోని పండితుడు. (ఆం.సా.విమర్శ-41)

**పైడిపాటి లక్ష్మణ కవి**

కాలం : తెలియదు.

రచన : నానార్థ నిఘంటువు (శతకం).

(శ.సా.వి)

**పైడిపాటి వేంకటనృసింహ కవి**

కాలం : 17వ శతాబ్దం.

స్థలం : నెల్లూరు మండలంలోని పైడిపాడు గ్రామం.

రచనలు : 1. లక్ష్మీనృసింహ విలాసము 2. రామచంద్ర శతకము 3. మన్నారు కృష్ణశతకము

లక్ష్మీపతి, వేంకమాంబల పుత్రుడు. నెల్లూరు మండలంలోని పైడిపాడు నివాసంవల్ల వీరికీ ఇంటిపేరు వచ్చిందట. ఈతడు నాలుగు గ్రామాలకు కరణంగా ఉండేవాడు. అష్టభాషా సంస్కార పరిష్కార మనీషావిశేషుడు. అయ్యలరాజు నారాయణామాత్యుడు ఇతని మేనల్లుడు. ఇతడు మరి కొన్ని శతకాలను కూడా రచించి నట్లున్నది రచన సరళంగా ఉంది. (ఆంధ్రవ-11-260; శ.క.చ-269)

**పైడిమర్రి వేంకటపతి**

కాలం : క్రీ. శ. 17వ శతాబ్దం.

గురువు : పైడిమర్రి పద్మనాభయ్య.

రచన : చంద్రాంగద చరిత్రము.

పర్వతరాజు పుత్రుడు. ఈయన సోదరులందరూ పండితులు, కవులు. ఇతని పూర్వీకులలో ఒకరికి, "కృష్ణరాయభూషణ" బిరుదముండేదట. ఇది ఇంటిపేరని కొందరి తలంపు. ఇతడు వైదుష్యం, ప్రతిభ ఉన్న కవి. శబ్ద రత్నాకరంలో ఇతని ప్రయోగాలు ఇచ్చారు. గురువుగారి ఊరి పేరుతోనే ఇతన్ని వ్యవహరిస్తున్నారు, (ఆంధ్ర-10-242)

**పొంపూరి గురవ మంత్రి**

కాలం : క్రీ. శ. 17వ శతాబ్దం.

స్థలం : జటప్రోలు ప్రాంతం.

సాహిత్య పోషకుడు. ఎలకూచి బాలసరస్వతి యాదవరాఘవ... ఇతనికే అంకితం. (క. త-12-110)

## పొట్లదుర్తి-మాలెపాడు శాసనాలు

కాలం : క్రీ. శ. 6వ శతాబ్ది చివరిపాదం.

కర్త : రేనాటి చోళుడు ఎరకల పోతరాజు.

ఇవి క్రీ శ. 6వ శతాబ్దానికి చెందిన తెలుగు శాసనాలలో మొదటిదని కొందరు పండితుల అభిప్రాయం. ఈ దాన శాసనాన్ని రేనాటి చోళుడు ఎరకల పోతరాజు వేయించాడు. పొట్లదుర్తి-మాలెపాడు గ్రామాలు రేనాటి సీమలో ఉన్నాయి. ఈ శాసనానికి కీ. శే. మల్లంపల్లి సోమశేఖర శర్మ చక్కగా అర్థాన్ని వివరించి చెప్పారు.

శాసనం : "స్వస్తిశ్రీ చోళ మహారాజుల్లొళన, ఇన్ద్రపోలి అణపోతులు, రేవణకాలు పన్ద్రణకాలు ఇచ్చిన పన్నస. పెన్బొఱ ఇఱెరేనికిన్ తేఱిఱచ్చిన వాన్డు పఞ్చ మహాపాతకుస్తకున్"-

అర్థము : "చోళమహారాజుల సమ్మతిని ఇన్ద్రపోల ఆజ్ఞప్తులు రేవణగారు పన్ద్రణగారు ఇచ్చిన పన్నస (పన్నులేవి భూమి). పెద్ద బ్రాహ్మణుడు గారికి. దీనిని చెడిపినవాడు పంచ మహాపాతకుండగు".

(చూ. గిడుగువారి సన్మాన సంచికలోని వివరణ)

(సా. చ. సం.

## పొట్లపాడి చినతిమ్మరాజు

కాలం : క్రీ. శ. 16 వ శతాబ్ది ప్రథమ భాగం.

సాహిత్యపోషకుడు, కృతిభర్త. దోనూరి కోనేరునాథ విరచిత ద్విపద బాల భాగవతం ఇతనికే అంకితం (చూ. చినతిమ్మరాజు.)

విశిష్టత : అళియరామరాజు పెద తండ్రియైన పొట్లపాటి తిమ్మరాజుకు ఈ చినతిమ్మరాజు కుమారుడు. ఇతని అన్న అయిన నల్ల తిరుమలరాజు ద్విపదబాల భాగవతాన్ని దోనూరి కోనేరు నాథుని చేత వ్రాయించి తమ్ముడు తిమ్మరాజుకు అంకితం ఇప్పించాడు. (ఆరుద్ర-6)

## పొట్లపాడి తిమ్మరాజు

అరవీటివంశజుడైన తిరుమలరాజే ఈ పొట్లపాడి తిమ్మరాజు.

చూ. తిరుమలరాజు.

## పొట్లపాడి నల్లతిరుమలరాజు

నామాంతరం : నల్ల తిమ్మరాజు (చూ)

సాహిత్య పోషకుడు. ఎలకూచి పినయాదిత్యుని ఆదిత్యపురాణం ఇతనికే అంకితం. (క. త-12-110)

**పొట్లదుర్తి-మాలెపాడు శాసనాలు**

కాలం : క్రీ. శ. 6వ శతాబ్ది చివరిపాదం.

కర్త : రేనాటి చోళుడు ఎరకల పోతరాజు.

ఇది క్రీ శ. 6వ శతాబ్దానికి చెందిన తెలుగు శాసనాలలో మొదటిదని కొందరు పండితుల అభిప్రాయం. ఈ దాన శాసనాన్ని రేనాటి చోళుడు ఎరకల పోతరాజు వేయించాడు. పొట్లదుర్తి-మాలెపాడు గ్రామాలు రేనాటి సీమలో ఉన్నాయి. ఈ శాసనానికి కీ. శే. మల్లంపల్లి సోమశేఖర శర్మ చక్కగా అర్థాన్ని వివరించి చెప్పారు.

శాసనం : "స్వస్తిశ్రీ సోఱ మహారాజుల్లొళన, ఇన్నుఱోలి అణపోతులు, రేవణకాలు పుద్దణకాలు ఇచ్చిన పన్నస. పెన్పుఱ ఇళెరేనికిన్ తేఱిఱచ్చిన వాన్దు పఞ్చ మహాపాతకున్డకున్"-

అర్థము : "చోళమహారాజుల సమ్మతిని ఇనుప్రోల అజ్ఞప్తులు రేవణగారు పుద్దణగారు ఇచ్చిన పన్నిస (పన్నులేని భూమి). పెద్ద బ్రాహ్మణుడు గారికి. దీనిని చెడిపినవాడు పంచ మహాపాతకుండగు".

(చూ. గిడుగువారి సన్మాన సంచికలోని వివరణ)

(సా. చ. సం.

**పొట్లపాడి చినతిమ్మరాజు**

కాలం : క్రీ. శ. 16వ శతాబ్ది ప్రథమ భాగం.

సాహిత్యపోషకుడు, కృతిభర్త. దోనూరి కోనేరునాథ విరచిత ద్విపద బాల భాగవతం ఇతనికే అంకితం (చూ. చినతిమ్మరాజు.)

విశిష్టత : అళియరామరాజు పెద తండ్రియైన పొట్లపాగి తిమ్మరాజుకు ఈ చినతిమ్మరాజు కుమారుడు. ఇతని అన్న అయిన నల్ల తిరుమలరాజు ద్విపదబాల భాగవతాన్ని దోనూరి కోనేరు నాథుని చేత వ్రాయించి తమ్ముడు తిమ్మరాజుకు అంకితం ఇప్పించాడు. (ఆరుద్ర-6)

**పొట్లపాడి తిమ్మరాజు**

ఆరవీటివంశజుడైన తిరుమలరాజే ఈ పొట్లపాడి తిమ్మరాజు.

చూ. తిరుమలరాజు.

**పొట్లపాడి నల్లతిరుమలరాజు**

నామాంతరం : నల్ల తిమ్మరాజు (చూ)

## పొడుగువారు

కొలత విశేషమైన "పొడుగు" ఇంటిపేరుగా కొన్ని కుటుంబాలవారు తెలుగు దేశంలో ఉన్నారు. ముప్పిడివారు అనే ఇంటిపేరు కూడా ఇలా వచ్చినదే.
(భారతి-మా-45-230-)

## పొణుగుపాటి వేంకటమంత్రి

స్థలం : విశాఖ మండలం.
కాలం : క్రీ. శ 1720-80 ప్రాంతం.

శృంగవరపు కోట జమీందారులైన ముఖీ కాశీపతి రావుగారి దివాను, సాహిత్య పోషకుడు. కవి పండిత పక్షపాతి. అడిదము సూరకవి ఇతన్ని పొగిడినట్లు ఎవరినీ పొగడ లేదట ఈ మంత్రిపై అతడు ఒక శతకం చెప్పాడని అంటారు. కాని 39 పద్యాలు మాత్రం లభించాయి. వీటికి చాలా ప్రచారం ఉంది. ప్రతి పద్యంలోనూ చివర "పొణుగుపాటి వెంకటమంత్రీ" అనేమకుటం ఉంది. (కవి సంశయవిచ్ఛేదం పీఠిక-24)

## పొత్తపినాడు

ప్రాచీన నాడులలో ఒకటి. కడప మండలంలోని రాజంపేట, ప్రొద్దుటూరు తాలూకాలు ఒకప్పుడు ఈ పేరుతో పిలువబడేవి. 'పొత్తపినాటిలోఁ బిపిన భూమిఁ గిరాతుల కాట పట్టు' అని ధూర్జటి దీన్ని పేర్కొన్నాడు. ఈనాడును పేర్కొన్న శాసనాలు రాజంపేట, ప్రొద్దుటూరు ప్రాంతాలలో దొరికాయి. (సం.ఆ వి.కో-5).

## పొత్తపి వెంకటామాత్యుడు

కాలం : క్రీ. శ. 17వ శతాబ్దం.
స్థలం : అనంతపురం మండలంలోని రావుల చెరువు గ్రామం.
రచన : నూటయెనిమిది దివ్యతిరుపతుల సుబ్బరాయశతకము (సుబ్బరాయ శతకము).

ఇతడు రాయలసీమకు చెందిన అనంతపురం మండలం వాడై ఉండవచ్చున ఊహిస్తున్నారు.

ఇతని తాత పేరు వెంకన. తండ్రి పేరు చెన్నయ్య. పొత్తపిగ్రామం కడప మండలంలో ఉంది. వీరి పూర్వీకులు అక్కడి వారు కావచ్చును. చినరెడ్డి గారి సుంకిరెడ్డి ప్రోత్సాహంతో రచనలు చేశాడు (మ.మా.)

## పొత్తపి వేంకటరమణ కవి

కాలం : క్రీ. శ. 17వ శతాబ్దం.
బిరుదు : లక్షణ చక్రవర్తి
రచన : లక్షణ శిరోమణి. (ఛం.ప.కో.)

## పొత్తూరి గోపన్న

కాలం : క్రీ. శ. 16 వ శతాబ్దం.

స్థలం : గుంటూరు మండలం.
రచన : తెలియరాలేదు.

ఒక పద్యం మాత్రం అప్పకవిచే ఉదాహృతం. ఇతని ఇంటి పేరు పొట్టూరిగా కూడా వ్యవహారంలో ఉంది. ఈయన గుంటూరు తాలూకా పొత్తూరు నివాసి కావచ్చు. ఈ కవిని ప్రామాణికునిగా ఎంచి, అప్పకవి నామాఖండ విశ్రమాలను చెబుతూ ఒక పద్యాన్ని ఉదాహరించాడు. (పొత్తూరి గోపన్న పెంగళామాత్యుని మీద చాటువు చెప్పాడు.) (ఆరుద్ర-9-255; అప్పకవీయం-3-224)

## పొనుగోటి జగన్నాథరాయలు

కాలం : క్రీ. శ. 18 వ శతాబ్ది తుది భాగం.
స్థలం : నల్గొండ జిల్లా పొనుగోడు.
రచన : కుముదపల్లీ విలాసము.
గురువు : సముద్రాల తిరుమలాచార్యులు.

ఇతడు గోలకొండ నవాబులకు విధేయుడుగా దేవాద్రి పట్టణాన్ని పరిపాలించేవాడు.

పొనుగోడు (పెనుగోడ) దేవరకొండ సీమలోనిదని అంటున్నారు. ఇతని కవిత్వం మృదువుగాను భక్తి రసపూరితంగాను ఉంటుంది.
(క త-12-218; ఆరుద్ర-11-262)

## పొన్నతోట ఓబళకవి (ఔబళకవి)

కాలం : క్రీ. శ. 16 వ శతాబ్ది.
స్థలం : మైసూరులోని చెన్నపట్టణ ప్రాంతం.
రచనలు : 1. వామన పురాణము 2. మార్కండేయ పురాణము (నష్టమైంది).

ఔబళుని కుమారుడు. మైసూరులోని ఒక ప్రాంతాన్ని పాలించిన రాణా వంశీయుల ఆస్థానంలో ఉండేవాడు. జగదేవరాయని ఆశ్రితుడు.

విశిష్టత : ఈయన అనువదించిన రెండు పురాణాలలో మార్కండేయ పురాణం నష్టమైంది వామనపురాణం అవతారికలో కృతిభర్త జగదేవరాయడు అధ్యాత్మ రామాయణాన్ని వ్రాశాడని ఓబళకవి చెప్పాడు. (ఆరుద్ర-9-234)

## పొన్నాడ పెద్దిరాజు

కాలం : క్రీ శ. 1590 కి పూర్వం.
రచన : ప్రద్యుమ్నచరిత్ర (అలభ్యం).

విశిష్టత : పింగళి సూరన్నకు ముందే తెలుగులో ఈ కవి ప్రద్యుమ్న చరిత్ర వ్రాశాడు. ఈయన ప్రద్యుమ్న చరితనుంచి సంకలనకర్తలు ప్రబంధరత్నాకరంలోను, ఉదాహరణ పద్యాలలోనూ ఉదాహరించారు. ఇందులో 18 పద్యాలు పురవర్ణనకు సంబంధించినవి. 3 పద్యాలలో ఒకటి నాయకవర్ణన, ఇంకొకటి నాయకీనాయకులు కలుసు

కున్నప్పటి చూపులవర్ణన, మరొకటి పురుష విరహాన్ని, నాలుగో పద్యం చకోరికా విరహాన్ని వర్ణిస్తుంది. ప్రద్యుమ్న చరిత్రను తెలుగులో ఫణిభపు మాధవుడనే కవి కూడా చెప్పాడు. కవి ప్రద్యుమ్నచరిత్రలోని చకోరికను గంపెడు సంతానమున్న తెలుగు ఇల్లాలిలాగా వర్ణించాడు. (ఆరుద్ర-9)

## పొన్నికంటి తెలగన్న

కాలం : క్రీ. శ. 16 శతాబ్ది పూర్వార్థం.

స్థలం : గోలకొండ ప్రాంతం.

రచన : యయాతి చరిత్ర.

విశిష్టత : భావనా మాత్యుని కుమారుడు. ఈయన తొలిసారిగా అచ్చ తెలుగు కావ్యం చెప్పాడు. అచ్చ తెలుగంటే ఇష్టమైన; అమీన్‌ఖాన్ అనే గోలకొండ కుతుబ్‌శాహి, సేనాపతి మరింగంటి అప్పన్నద్వారా ఇతని కావ్యం అంకితం పుచ్చుకొంటానని తెలగన్నకు కబురంపి, కావ్యం వ్రాయించి కృతి పుచ్చుకొన్నాడు కావ్యంలో వచ్చే బిరుదులు, పేర్లు సంస్కృతంలోనే చెబుతానని, మిగిలినవి అచ్చతెలుగులో చెబుతానని, అలాగే కఠోర నియమాలతో కావ్యం వ్రాసి, తెలగన్న అచ్చ తెలుగన్న అయ్యాడు. భారతంలోని కథను రసవత్తరంగా చక్కని ధారాశుద్ధితో చెప్పాడు. (అరుద్ర-8-141)

## పోచన

కాలం : క్రీ. శ. 18వ శతాబ్దం.

రచన : చంద్రాభ్యుదయము.

నృసింహ సోమయాజి పుత్రుడు. తన రచనను అమ్మనమంత్రి కుమారుడైన చిన్నయామాత్యునికి అంకిత మిచ్చాడు. (క. స - 135)

## పోచమ్మపాట

కర్త : తెలియదు.

జానపద పారమార్థిక గేయం.

పోచమ్మ ఒక గ్రామ దేవత. ఆ దేవత మాహాత్మ్యం తెలిపే గేయం.

చూ. పారమార్థిక గేయములు. (అం. వా. చ.)

## పోచిరాజు వీరన్న

కాలం : క్రీ. శ. 18వ శతాబ్దం.

స్థలం : గుంటూరు జిల్లాలోని కొలకలూరు.

రచనలు : కృష్ణార్జున సంవాదము, పంచ కావ్యములు, విభూతి మాహాత్మ్యము, మనువంశ పురాణము, ముక్తదేవుకథ, ఆనందలహరి, సౌందర్యలహరి, భర్తృహరి సుభాషితములు, భల్లాణ చరిత్ర.

పండితకవి. ఇతని గ్రంథాలు రెండు మాత్రమే లభించాయి. మూర్తమాంబ, వీరభద్రు లితని తలిదండ్రులు. (క. స - 222)

**పోడూరి కొండకవి**

కాలం : క్రీ. శ. 16 వ శతాబ్దం.
స్థలం : గోదావరి మండలంలోని పోడూరు.
రచనలు : 1. భార్గవాభ్యుదయము (అలభ్యం).

శివరామాభ్యుదయ కావ్యంలో ఇతని ప్రసక్తి ఉంది. (క.త-12-150)

**పోడూరి పెదరామామాత్యుడు**

కాలం : క్రీ. శ. 18 వ శతాబ్దం.
రచనలు : శివరామాభ్యుదయము, కౌసల్యాపరిణయము మొదలగునవి.

శివరామ మంత్రి సీతమాంబల పుత్రుడు. ఈతని వంశంలోని వారు విద్వత్కవులు. గురజాల పేరయార్యుని ప్రోత్సాహంతో ఇతడు రచనలు చేశాడు. ఇతని అన్న బాపన్న ఉషాభ్యుదయ కావ్యాన్నీ, తమ్ముడు రామన నిరోష్ఠ్య జానకీ కల్యాణాన్నీ రాశారట (క.స-128)

**పోడూరి బాపన్న**

కాలం : క్రీ శ. 17 వ శతాబ్దం.
రచన : ఉషాభ్యుదయము (అలభ్యం)

పోడూరి పెదరామామాత్యుని సోదరుడు. విద్వత్కవి.

(క.చ-3-196)

**పోడూరి వేంకటరాజ కవి**

కాలం : క్రీ. శ. 19 వ శతాబ్దం.
స్థలం : విజయనగర సంస్థానం.
రచనలు : రామలీలా విలాసము.

విజయనగర సంస్థానాధిపతి అయిన విజయరామ గజపతి (1826-1879) ఆశ్రితుడు, విజయరామ గజపతి పట్టాభిషేకోత్సవాన్నీ, ఆనాటి శ్రీరామలీలా విలాసోత్సవాదులనూ వర్ణించాడు. (ఆం.సం.సా-423)

**పోణంగి శాసనము (సం)**

కాలం : క్రీ. శ 848 ప్రాంతం.
శాసన కర్త : అజ్ఞప్తి పండరంగడు.

విషయం : గుణగ విజయాదిత్యుని సేనాని పండరంగని శాసనం. సంస్కృతం.

(తె.క.చ-24)

**పోతరాజు**

కాలం : "ఉదాహరణ పద్యములు" గ్రంథకర్త అయిన అజ్ఞాత గ్రంథ సంధాతకు పూర్వుడు. (క్రీ.శ. 16వ శతాబ్ది).
రచన : బేతాళ పంచవింశతి.

విశిష్టత : ఈ కవి కావ్యంలో నుంచి 17 పద్యాలను అజ్ఞాత గ్రంథ సంధాత ఉదాహరించాడు. పూర్వకవులు వెన్నెలకంటి అన్నయ్య షోడశకుమార చరిత్రలోను, కూచి రాజు ఎర్రన్న సకల నీతి కథా నిధానంలోనూ భేతాళుని కథలు చెప్పారు. వీరిద్దరికి చాలా పూర్వం కవి భల్లటుడు అనే కవి భేతాళపంచవింశతి వ్రాసినట్లు ప్రతీతి. ఈయన కావ్యంలోని కవిత ప్రబంధసాధారణమైనది చెప్పుకోదగ్గ విశేషాలు లేవు.

(అరుద్ర-9)

## పోతరాజు వీరయ్య

కాలం : 'ఉదాహరణ పద్యములు' సంకలనం చేసిన అజ్ఞాత గ్రంథ సంధాతకు పూర్వుడు. క్రీ. శ 16వ శతాబ్ది.

రచన : త్రిపుర విజయము (అలభ్యం).

విశిష్టత : ఈయన త్రిపురవిజయంలో నుంచి అజ్ఞాత గ్రంథ సంధాత 4 సీస పద్యాలను ఉదాహరించాడు.

(అరుద్ర-9

## పోతా ప్రగడ శ్రీరాములు పంతులు

కాలం : క్రీ.శ 19వ శతాబ్దం.

స్థలం : గోదావరి మండలంలోని గోపాలపురం గ్రామం.

కృతిపతి. ముక్కాలి మల్లికార్జున కవి రచించిన రాఘవశతకం అంకితం పొందారు ఈయన న్యాయవాదులుగా, జమీందారుల వ్యవహార కర్తలుగా ప్రసిద్ధులు. వంగూరి సుబ్బారావు పంతులు గారి పిన మామగారట. (శ.క.చ -606)

## పోరి

ఇది పూర్వం బాదామి చాళుక్య, తూర్పు చాళుక్యరాణుల పేర్ల చివర ఉపయుక్తం. రామేశ్వర స్తంభ శాసన ప్రదాత, రేనాటి చోళులలో ప్రముఖుడైన పుణ్యకుమారుని (క్రీ. శ. 625) భార్య పేరు "వసంత పోరి". ఈ "పోరి" తన భర్త బిరుదులను సూచిస్తూ శాసనాలు వేయించింది. ఈమె చాళుక్య వంశీయురాలై ఉంటుందని పండితులు ఊహిస్తున్నారు. ఇది గౌరవ సూచకంగా వాడిన పదం.

"పోరి" అనే మాట చాళుక్యరాజ కుమార్తెలలో తప్ప ఇంకెక్కడా కనిపించదు. బాదామి చాళుక్యరాజైన రెండో పులకేశి కుమారుడు చంద్రాదిత్యుని భార్య పేరు "విజయ మహాదేవి పోరి." అల్లే తూర్పు చాళుక్యరాజైన మంగి మహారాజు కుమార్తె పేరు 'పృథివి పోరి'. చరిత్రలో ఒక్క చాళుక్య రాకుమార్తెలలోనే ఈ 'పోరి' మాట ప్రత్యేకంగా ప్రయుక్తమనే విషయం గమనార్హం.

ఆధునిక సమాజంలో ఈ "పోరి" శబ్దం విలక్షణమైన పరిస్థితులలో ప్రయుక్తం. వయసులో చిన్నగా ఉండి, కొంచెం ఆకతాయి చేష్టలు చేసే పిల్లలపట్ల దీనిని ప్రయోగిస్తున్నారు. అల్లే 'పోరగాడు' అనేది బాలురపట్ల "పోరి" అనేది బాలికలపట్ల ఉపయుక్తమౌతున్నది. బాలబాలికలు విసిగించే పనులు చేసేటప్పుడు,

కోపం తెప్పించే పనులు చేసేటప్పుడు "దొంగ పోరగాడు, దొంగపోరడు, దొంగపోరి" అని కూడా వ్యవహరిచటం కద్దు

"పోరి" శబ్దాన్ని తెలంగాణా ప్రాంతంలో విశేషంగా ప్రయోగిస్తారు.

(ఆరుద్ర-1-58-59)

పోలమరాజు

కాలం : క్రీ. శ. 1590 కి ముందు

రచన : పర్వత పురాణము (అలభ్యం).

విశిష్టత : ఈయన వ్రాసిన పై కావ్యంలో 2 పద్యాలను పెదపాటి జగ్గన్న తన ప్రబంధ రత్నాకరంలో ఉదాహరించాడు. ఒక పద్యంలో కవి సూర్యాస్తమయాన్ని, రెండో పద్యంలో రాజనీతిని చెబుతూ-పాలకుడు తెలుసు కోవలసిన పదహారు సంధులను వివరించాడు. తెలుగు దేశంలో పర్వతం అంటే సంప్రదాయ సిద్ధంగా శ్రీశైలమే గుర్తొస్తుంది కనక ఈ కవి వ్రాసిన పురాణం శ్రీశైలమాహాత్మ్యాన్ని తెలియ జేస్తుందని భావించవచ్చు. (ఆరుద్ర-9)

పోలరాజు కథ

కర్త : కనకబండి గట్టయ్య.

ద్విపద. జానపదులు పాడుకోవడానికి అనువుగా ఉంది.

పోలవరము

గోదావరి మండలంలోని నవీనమైన ప్రొప్రయిటరీ ఎస్టేటు.

తూర్పు గోదావరి మండలంలోని 87 జమీందారీలలో ఇది ఒకటి. 1803లో 'రెడ్డి లక్ష్మీనారాయణదేవు' గారి పేర శాశ్వతకర నిర్ణయం జరిగింది. తరువాతి కాలంవాడైన "మంగపతిదేవు" కాలంలో మొత్తం ఎస్టేటు వేలం వేయబడింది. అపుడు నూజివీడు జమీందారు రామచంద్ర అప్పారావు ఖరీదు చేశాడు. 1814 లో అప్పారావు మరణించిన తరువాత "కొచ్చెర్లకోట" వంశపు బ్రాహ్మణులు దీన్ని కొన్నారు.

సంస్థానపాలకులు 'కొచ్చెర్లకోట' వంశీయులు 'కొచ్చెర్లకోట వేంకట జగన్నాథరావు' మొదటి పాలకుడు. ఆ తరువాత అతని కుమారుడు 'రామచంద్ర వేంకటకృష్ణారావు', అతని కుమారుడు 'వేంకట జగన్నాథరావు' రాజ్యం చేశారు ఈ వేంకట జగన్నాథరావుకు మంత్ర శాస్త్రంపై నమ్మకం ఎక్కువగా ఉండేదట.

ఇతడు పోలవరం సమీపంలో ఉన్న "పట్టసాచల క్షేత్రం"లో వెలసిన వీరభద్ర స్వామి దేవాలయంలో దేవీ ఉపాసన చేయగా, దేవి ప్రత్యక్షం కావడంతోనే భయపడి మరణించాడని ప్రతీతి. ఇతడు నిస్సంతుడు కావడంచేత "కృష్ణారావు" (1871-1919) అనే అయిదేండ్ల బాలుడిని దత్తుతీసుకున్నాడు. ఇతడే "రామచంద్ర వేంకట కృష్ణారావు" అనే పేర పోలవరం జమీందారీని పాలించాడు. వేంకట జగన్నాథరావు 1919 లో మరణించాడు. సంతానం లేక పోవడం చేత తరువాతి కాలంలో ఇతని దత్తపుత్రుడే జమీందారీని పాలించాడు.

కొచ్చెర్లకోట రామచంద్ర వేంకటకృష్ణారాయ బహద్దరు ప్రపితామహుడైన పెద్దాడ నాగరాజామాత్యుడు శకుంతలా పరిణయ గ్రంథాన్ని వ్రాశాడు. "మతుకుపల్లి కృష్ణశాస్త్రి" ఈ సంస్థానాధీశుడైన వేంకట జగన్నాథరావు ప్రేరణచేత "వీరభద్ర శతకం" వ్రాసి సన్మానింపబడ్డాడు. ఈ ఎస్టేటు పాలకులలో రామచంద్ర వేంకటకృష్ణారావు ప్రసిద్ధుడు. సంస్కృతాంధ్ర భాషలపై అమితాభిమానం కలవాడు. "ఆంధ్ర భాషో జ్జీవని" సంస్థాపకుడు. 1898 లో ఈ కృష్ణారావు "సరస్వతి" అనే సాహిత్య పత్రికను స్థాపించాడు. చిలకమర్తి లక్ష్మీనరసింహం, కొమర్రాజు వేంకట లక్ష్మణరావు వంటి పండితుల వ్యాసాలు, శ్రీనాథాదులైన ప్రాచీన కవుల రచనలు ఈ పత్రికలో చోటు చేసుకున్నాయి. సుప్రసిద్ధులైన 'తిరుపతి వేంకట కవులు' ఈ సంస్థానంలో ఆస్థాన కవులుగా ఉన్నారు. వీరి "బుద్ధచరిత్ర" రచన ఈ కృష్ణారావు గారికి అంకితం ఇవ్వబడింది.
(ఆం.సం.సా.)

## పోలిపెద్ది వేంకటరాయకవి

కాలం : క్రీ. శ. 1800–1875

స్థలం : కార్వేటి నగర సంస్థానం.

రచనలు : వేణుగోపాల శతకము, లావణ్యశతకము, తిట్ల దండకము మొదలగునవి.

విద్వత్కవి. కార్వేటి నగర ప్రభువులైన రాజకుమార వేంకట పెరుమాళ్లు రాజు ఆస్థానంలోని అష్ట దిగ్గజాలలో ఒకరు. వీరు వేణుగోపాలస్వామి భక్తులు. అతని పై శతకం రచించారు. రసవంతంగా హృదయంగమంగా కవిత్వం చెప్ప నేర్చిన కవి
(ఆం. సం. సా.)

## పోలు మంచి బసవన

కాలం : 1740 ప్రాంతం.

రచన : మైరావణ చరిత్ర (ద్విపద).

జన్నమ్మ మల్ల మంత్రుల కుమారుడు. కవిత్వ తత్త్వవిశారదుడు. ప్రౌఢంగా కవిత్వం వ్రాశాడు. (ద్వి సా.చ–216)

## పోలూరి గోవిందకవి

కాలం : క్రీ. శ. 16 వ శతాబ్దం.

స్థలం : చోళదేశం.

రచనలు : 1. తాళదశ ప్రాణప్రదీపిక 2. రాగతాళ చింతామణి 3. పర్వత నారద సంవాదము (అలభ్యం) 4. ఇందుమతీ పరిణయము.

సమకాలికులు : చల్లాపల్లి వెంకయ్య, గులిపల్లి గోపన్న.

ఓబయా మాత్యుని పుత్రుడు. చెరుకూరివారనే పంటరెడ్ల ఆశ్రయంలో ఉండేవాడు. ఇతని కాలాన్ని గురించి, నాయక రాజులనాటి వాడనీ, మహారాష్ట్ర రాజుల

కాలం వాడనీ భిన్నాభిప్రాయా లున్నాయి. సంగీత సాహిత్యసంప్రదాయాల ననుసరించి రచనలు చేశాడు.

ద్రావిడదేశంలోని వివిధ క్షేత్రాలను తన రచనలలో వర్ణించాడు.

(ఆరుద్ర 12-158; ద.దే.వా-235)

## పోలూరి గోవిందయ్య

నామాంతరం : పోలూరి గోవింద కవి (చూ).

## పోలూరు మాధవయ్య

కాలం : క్రీ. శ. 17 వ శతాబ్దం చివర.

రచనలు : తెలియరాలేదు.

ఆంధ్ర శబ్ద చింతామణికి "కవి శిరోభూషణమ"నే పేర సంస్కృత వ్యాఖ్య వ్రాసిన అహోబల పతికి ఈయన మేనమామ. గొప్ప విద్వాంసుడట. (తె.వి.స-6)

## పోలేరమ్మ దండకము

కర్త : చూ. ముడుంబై వేంకటకృష్ణమాచార్యులు.

"పోలేరమ్మ" అనే గ్రామదేవత పరమైన దండకం. (ఆం.సం.సా.)

## పోశెట్టి లింగకవి

కాలం : క్రీ. శ. 15 వ శతాబ్దం చివరిభాగం.

రచనలు : నవచోళ చరిత్రము, మలహణ చరిత్రము, శంకర దాసమయ్య చరిత్రము, వీరసంగయ్య దేవచరిత్రము, శిష్యప్రబోధము.

గురువు : గార్లపాటి లక్ష్మణ కవి.

ఇతని రచనలన్నీ ద్విపద కావ్యాలే. వీనిలో నవబోధ చరిత్ర మొక్కటే లభించింది కవిత్వం నిర్దుష్టంగా, ప్రౌఢంగా, మనోహరంగా ఉంది. శాస్త్ర విషయాలను వివరించడంలో కవి అద్వితీయుడు. (ద్వి సా.చ-138)

## పౌరాణిక గేయములు

జానపద గేయ వాఙ్మయం వస్తు రసాది భేదాన్ననుసరించి కొన్ని విభాగాలుగా చేయబడింది. అందులో ఈ పౌరాణిక గేయ విభాగం ఒకటి.

ఇతివృత్తం పౌరాణికమైనప్పుడు ఆ గేయాలు పౌరాణిక గేయాలనబడుతాయి. అంటే భారత రామాయణ భాగవతాది రచనలకు సంబంధించిన వస్తువు ఆధారంగా గేయాలు బయలుదేరితే అవి పౌరాణిక గేయాలని స్థూలంగా చెప్పవచ్చు

మనకు మొదట రామాయణ భారతాది రచనలు సంస్కృతంలో ఉండేవి. జానపద రచనల్లో ఆ వస్తువు గ్రహింపబడినప్పటికీ యథాతథంగా ఉండదు సంస్కృత కావ్యాలలో లేని విషయాలు అనేకం ఈ వాఙ్మయంలో కనిపిస్తాయి. రచన జరిగినప్పుడు సమకాలికంగా ఆ జానపదుల వ్యవహారంలో ఉన్న ఆచార విశేషాలు, కథలూ ఈ రచనల్లో చేర్చబడుతాయి. ఇది ఈ రచనల్లోని ఒక ప్రత్యేకత.

సంస్కృతంలోని పౌరాణిక కావ్యాలను తెలుగులోకి అనువదించేటప్పుడు పెక్కురు శిష్ట కవులు ఈ జానపద గేయాలలోని నూతన విషయాలను తమ రచనల్లో చేర్చి ఉండవచ్చు. అందుకే మూలంలో లేని విషయాలు అనేకం అనువాద రచనల్లో కనిపిస్తాయి.

మాచకొండ రామాయణము, మోక్షగుండ రామాయణము, ధర్మపురి రామాయణము, పుత్రకామేష్టి, నలచరిత్ర, సుభద్రాకల్యాణము, గయోపాఖ్యానము, ప్రహ్లాదచరిత్రము, గజేంద్రమోక్షం మొ॥ పెక్కు రచనలు ఈ పౌరాణిక గేయ వాఙ్మయానికి ఉదాహరణలు. (ఆం. వా. చ.)

## ప్రకరణము

కావ్యంలోని కథాంశాల విభాగం. ఉద్దేశించిన విషయసిద్ధికి ప్రకృష్టమైన సాధనం ప్రకరణం. కాబట్టి కథా విభాగాలకు ఈపేరు సముచితంగా ఉంది.

## ప్రకరణము

ఇది దశవిధ రూపకాలలో ఒకటి. శృంగార రసప్రధానమై, ఇతివృత్తం లోకంలోనిదై, కవిబుద్ధి విరచితంగా ఉండాలి. నాయకుడు ధీరశాంతుడైన అమాత్య విప్ర వైశ్యులలో ఎవరయినా కావచ్చు. నాయకుడు ధర్మార్థ కామతత్పరుడు, అపాయాంతరిత కార్యసిద్ధికలవాడు అయి ఉండాలి. ఇందులో కులజ కాని, వేశ్య కాని, ఇరువురూ గాని నాయికలు కావచ్చు. మాలతీ మాధవ, తరంగ దత్త, మృచ్ఛకటికములు, ప్రకరణానికి ఉదాహరణలు. నాటకంలో ఉన్న సంధులే దీనిలోను ఉంటాయి. ఇందులో పది అంకాలు ఉంటాయి. (తె.వి.స-6)

## ప్రకాశ భారతీయోగి

కాలం : క్రీ.శ. 14వ శతాబ్ది ఉత్తరార్ధం.

కొండవీటి అనవేమారెడ్డి ఆస్థానంలో ఉండేవాడు. శాసనకర్త. అనవేముని దక్షారామ శాసనం వ్రాశాడు.

విశిష్టత : ఇతడు సంస్కృతాంధ్రాలలో చాలా కావ్యాలు వ్రాశాడన్నారు కాని లభ్యం కాలేదు. ఈయన శాసన పద్యాలను కీ.శే. జయంతి రామయ్యపంతులు ఉదాహరించారు. (శ్రీనాథుడు-కొ.శ్రీ.మూ)

## ప్రకాశిక వ్యాఖ్య

కర్త : చిత్రకవి అనంతకవి.

రామరాజ భూషణవిరచిత హరిశ్చంద్ర నలోపాఖ్యానానికి వ్యాఖ్య. (ఆరుద్ర-9)

## ప్రక్రియా కౌముది (సం)

కర్త : శేషరామచంద్రాచార్యుడు.

ఇది సమస్త సంస్కృత వ్యాకరణాలను పరిశీలించి వ్రాసిన గ్రంథం. దీని

మీద శేష కృష్ణపండితుడు 'ప్రక్రియా ప్రకాశము' అనే సంస్కృత వ్యాఖ్య వ్రాశాడు. (తె.వి.స-6)

ప్రక్రియా ప్రకాశమ్ (సం)

కర్త : శేషకృష్ణ పండితుడు.

శేష రామచంద్రా చార్యుడు సంస్కృతంలో వ్రాసిన "ప్రక్రియా కౌముది" అనే వ్యాకరణ శాస్త్రగ్రంథానికిది వ్యాఖ్య. (తె.వి.స-6)

ప్రక్రియా ప్రసాద వ్యాఖ్య (సం)

కర్త : శేష విఠలుడు.

ఇది భట్టోజీ దీక్షితుని వైయాకరణ సిద్ధాంత కౌముదిని ఖండిస్తూ వ్రాసిన ఖండన గ్రంథం. (తె వి.స-6)

ప్రగడప్పు వారి కందములు

కర్త : తెలియదు.

కంద పద్యాలలో ఉన్న అచ్చ తెలుగు నిఘంటువు. దీనితోబాటు చౌడప్ప సీసాలు కూడ కలిపి ఉన్న ప్రతి ఒకటి కాకినాద సాహిత్య పరిషత్తులో ఉంది. (ఆం.సా.ప ప-19-2)

ప్రణయ కలహ కలాపము

కర్త : కోవెల రాఘవదాసు.

ఇది మిన్నెడ మడవారను తిరువాయిమొడి నుండి గ్రహించబడినది. శ్రీ కాంతు డొకనాడు భూకాంత వద్దకు వెళ్ళగా, శ్రీ కాంత అలగటం, అతడు ఆమె అలక తీర్చడం ఈ యక్షగాన-లోని కథ.

దీనిలో దరువులు, ద్విపదలు, పద్య గద్యాలు ఉన్నాయి. దీనిని కవి శృంగార నాటక గేయ ప్రబంధంగా పేర్కొన్నాడు. (య.వా.చ-133)

ప్రణయ కలహము (అలభ్యం)

కర్త. విజయ రాఘవ నాయకుడు.

చమత్కార భరితమైన కావ్యమట. (వ.దే.వా-89)

ప్రణవదర్పణము (సం)

కర్త : చూ. తిరుమల బుక్కపట్టణం (ఇమ్మడి) శ్రీనివాసాచార్యులు.

విశిష్టాద్వైత సిద్ధాంతపరంగా వ్రాయబడింది. సురపురం సంస్థానాధీశ్వరుల సమాదరణంలో వెలసిన గ్రంథ పరంపరలో ఒకటి.

(ఆం.సం.సా-516)

ప్రతాప చరిత్రము

కవి : ఏకామ్రనాథుడు.

ప్రత్యేకత : ఇది తెలుగులో తొలి చారిత్రక కావ్యం. కాకతీయుల వేయి సంవత్స రాల రాజ్యపాలన చరిత్ర దీనిలో ఉంది. దాదాపు 12 మంది రాజుల చరిత్ర ఉంది. గణపతిదేవుని పుత్రిక రుద్రమ్మను, ఆయన భార్యగా కవి పొరబడ్డాడు. మొల్ల, తిక్కన సమకాలికురాలని భ్రమించాడు. సుల్తాన్ మహమ్మద్‌ను, తుళువ వీరనృసింహ రాయలను పేర్కొన్నాడు, కాబట్టి, కవి వారికంటె అర్వాచీనుడు. దోనూరి కోనేరునాథుని సమ కాలికుడు కావచ్చును. ఈ కావ్యం వల్ల ఎన్నో చారిత్రక విషయాలు తెలుస్తున్నాయి. ప్రతాపరుద్రుని కవిపండిత మంత్రివర్యుల వివరాలు, నాటి వైభవాన్ని తెలిపే లెక్కలు ఉన్నాయి. ఆనాటి రాజకీయ, సాంఘిక చరిత్రకు ఈ వచన కావ్యం అద్దం వంటిది.

(ఆరుద్ర-9)

## ప్రతాప చరిత్రము

నామాంతరం : సిద్ధేశ్వర చరిత్రము

కర్త : కాసె సర్వప్ప.

## ప్రతాపరుద్ర యశోభూషణమ్ (సం)

రచనాకాలం : క్రీ శ 13వ శతాబ్దం.

కర్త : విద్యానాథుడు (చూ).

కృతిభర్త : కాకతి రెండో ప్రతాపరుద్రుడు

ప్రత్యేకత : సంస్కృతాలంకార శాస్త్ర గ్రంథాలలో పరమ ప్రమాణమైన గ్రంథం. అనంతర సంస్కృతాలంకార శాస్త్ర గ్రంథకర్తలు శాయన, విశ్వేశ్వరుడు, సర్వజ్ఞ సింగ భూపాలుడు మొదలగువారు దీనిని అనుసరించి తమ గ్రంథాలను వ్రాశారు.

(ప్రా.న.దే.చ.)

## ప్రతాపరుద్రుడు

కాలం : క్రీ శ. 12వ శతాబ్దం.

స్థలం : వరంగల్లు.

రచనలు : నీతిసారము (అలభ్యం).

బిరుదు : విద్యాభూషణుడు.

1158-95 ల నడుమ కాకతీయ మహా సామ్రాజ్యాన్ని పాలించిన చక్రవర్తి. ఇతనికి రుద్రదేవుడని పేరు. ఇతడు సంస్కృతాంధ్రాలలో విద్వాంసుడు. నీతిసారము అనే గ్రంథాన్ని తెలుగులోనూ సంస్కృతంలోనూ కూడా రచించాడు. ప్రబంధ రత్నా వళిలో కొన్ని పద్యాలు ఉదాహృతాలు. (క స-137)

## ప్రతాప సింహుడు

కాలం : క్రీ.శ. 18వ శతాబ్దం.

స్థలం : తంజావూరు.

క్రీ. శ. (1739-63) లలో తంజావూరును పాలించిన మహారాష్ట్ర రాజు. సాహిత్య పోషకుడు. ప్రతాపశాలి. మొదటి శరభోజి పుత్రుడు.

రాధికా సాంత్వనం రచించిన ముద్దుపళని ఇతని ఆస్థానంలో ఉండేది. ఇతని కాలంలోనే తొలిసారిగా ఇంగ్లీషువారు భారతదేశ సంస్థానాల వారసత్వపు తగాయిదాలలో కలుగచేసుకోవడం ఆరంభించారు. (ఆరుద్ర-12-143)

## ప్రతివాదభయంకర రాఘవాచార్యులు

కాలం : క్రీ. శ. 18 వ శతాబ్ది ఉత్తరభాగం - 19 వ శతాబ్దం ప్రారంభం.

స్థలం : పిఠాపురం సంస్థానం.

పిఠాపురం సంస్థానాస్థాన పండితుడు. రావు వేంకట నీలాద్రిరాయని (1778-1828) కాలంవాడు. తర్కశాస్త్ర పారంగతుడు. సహస్రావధాని. సమస్త సంస్థానాలు దర్శించి దిగ్దంతులవంటి పండితులను శాస్త్రవాదాలలో ఓడించి, పిఠాపురం సంస్థానం పేరు ప్రతిష్ఠలను విద్వల్లోకంలో మారుమ్రోగించిన ప్రతిభాశాలి. రావువేంకట నీలాద్రిరాయని చేత అర్ధాసనాది సత్కారాలు పొందాడు. (ఆం.సం.సా-247-248)

## ప్రత్యూష ప్రబోధ మననము

కర్త : చూ. పేరి కాశీనాథశాస్త్రి.

(ఆం.సం.సా-427)

## ప్రదీప చరిత్రము

నామాంతరం : సునందా పరిణయము (చూ).

కర్త : చింతకుంట కోదండరామ కవి.

(క.స-50)

## ప్రద్యుమ్న చరిత్ర (అలభ్యం)

కర్త : పొన్నాడ పెద్దిరాజు.

దీనిలోని పద్యాలను సంకలన కర్తలు ఉదహరించారు. ఆ పద్యాలను బట్టి ఈ కావ్యం ప్రౌఢ ప్రబంధమని పండితులు ఊహిస్తున్నారు. (ఆరుద్ర-9)

## ప్రద్యుమ్న విజయము (అలభ్యం)

రచన : ఫణిధవు మాధవుడు.

ఇందులోని పద్యాలను సంకలన కర్తలు ఉదాహరించారు. లభించినంత వరకు సూర్యోదయ వర్ణన, పుర వర్ణనలు రసవంతంగా ఉన్నాయి. (ఆరుద్ర-9)

## ప్రద్యుమ్నోత్తర చరిత్రమ్ (సం)

కర్త : మృత్యుంజయుడు.

పదకొండు సర్గల కావ్యం. ప్రద్యుమ్నుని కథ ఇతివృత్తం.

(తె.వి స-6-222)

## ప్రధాన ప్రతితంత్రదర్పణమ్ (సం)

కర్త : (చూ.) తిరుమల బుక్కపట్టణం (ఇమ్మడి) శ్రీనివాసాచార్యులు.

విశిష్టాద్వైత సిద్ధాంతపరంగా వ్రాయబడింది. సురపురం సంస్థానాధీశ్వరుల సమాదర ణలో వెలసిన గ్రంథపరంపరలో ఒకటి. (ఆం సం సా-516)

## ప్రపత్తి వాదము

కర్త : పరవస్తు వేంకట రంగాచార్యులు.

## ప్రపదన పారిజాతము

కర్త : కొటికెలపూడి కోదండరామకవి.

అంకితం : రాజా శ్వేతాచలపతి రంగారావు బహద్దరుకు (1810-62).

ఆంధ్రీకృత రచన. అయిదాశ్వాసాలుంటుంది. వైష్ణవ ప్రపత్తిరీతి రచన. విశిష్టాద్వైత సిద్ధాంత ప్రధానాలైన ద్వయ మంత్ర తిరుమంత్రార్థాలను భక్తి ప్రపత్తుల స్వరూపాలను, అత్యంతావశ్యకమైన ఆధ్యాత్మిక విషయాలను కొన్నింటిని ముముక్షువుల ఉపయోగార్థం నిరూపించే విశిష్ట రచన. (ఆం. సం సా-304)

## ప్రపన్న పారిజాతము

కర్త : బహుజనపల్లి సీతారామాచార్యులు.

అరవై పద్యాలున్న గ్రంథం. విశిష్ట భక్తి పూరితాలైన ఈ పద్యాలను కవి షష్టిపూర్తి సమయంలో సంతరించి ముద్రించారు.

## ప్రబంధము

ప్రకృష్టమైన పదబంధమున్న కావ్యం ప్రబంధము. అప్పకవి ప్రబంధంలో 22 వర్ణనలు ఉండవలెనన్నాడు వస్త్వైక్యము, ఏకనాయకాశ్రయత్వము, రసప్రాధాన్యము, వర్ణనాప్రాచుర్యము, శయ్యావైగనిగ్యము ప్రబంధ లక్షణాలు. సంస్కృతంలో కాళిదాసు తన మాళవికాగ్ని మిత్ర దృశ్య కావ్యాన్ని ప్రబంధమే అన్నాడు. తిక్కన్న భారత పర్వాలను ప్రబంధ మండలి అన్నాడు. తెలుగులో ఎర్రన నృసింహపురాణం, నాచన సోమన ఉత్తర హరివంశం, పినవీరభద్రుని శృంగార శాకుంతలం, శ్రీనాథుని నైషధం వచ్చిన తరవాతనే కావ్యజాతికి ప్రబంధమనే పేరును ఉపయోగించటం రూఢమైంది. మనుచరిత్ర, ఆముక్తమాల్యద, పారిజాతాపహరణం వంటివి ప్రబంధాలుగా స్థిరపడిపోయినాయి తెలుగులో ఇది విశిష్టమైన సాహిత్య ప్రక్రియ.

(తె.వా;తె.వి.స-6)

## ప్రబంధ రత్నాకరము

కర్త : పెదపాటి జగ్గన్న.

అంకితం : జగన్నాథ స్వామికి

సంకలన గ్రంథం. మూడాశ్వాసాలు మాత్రం లభించాయి.

ప్రత్యేకత : లభించిన తెలుగు సాహిత్య సంకలన గ్రంథాలలో ఇది మూడోది. మొదటిది మడికి సింగన్న సంకలనం "సకల నీతి సమ్మతం." రెండోది అజ్ఞాత సంధాన కర్త సంకలనం చేసిన ఉదాహరణ పద్యాలు. ఈ గ్రంథంలో 60 మంది

కవుల పేర్లు, 78 గ్రంథనామాలు కొన్ని వందల పద్యాలు ఉన్నాయి. సుప్రసిద్ధగ్రంథాల, నుంచి ఎన్నదగిన పద్యాలను ఏరి ఆయా శీర్షికలలోకి కవి చేర్చుకున్నాడు. ప్రథమాశ్వాసంలో 31 విషయ శీర్షికలు, ద్వితీయాశ్వాసంలో 33 విషయ శీర్షికలు, తృతీయాశ్వాసంలో 64 విషయ శీర్షికలు ఉన్నాయి. ఆంధ్ర సాహిత్యంలో నామమాత్రావశిష్టం కాకుండా కొందరు కవులు, కొన్ని కావ్యాలు - ఈ గ్రంథం మూలంగా శాశ్వతంగా నిలిచి ఉన్నాయి. ఈ గ్రంథం వ్రాతప్రతి తంజావూరు సరస్వతీమహల్ గ్రంథాలయంలో ఉంది. ఈ సంకలన గ్రంథంలో తెనాలి రామకృష్ణుడు ప్రసిద్ధులలో అర్వాచీనుడు. పింగళి సూరన్న. రామరాజభూషణ కావ్యాలనుంచి ఉదాహృతమైన పద్యాలు లేవు. కాబట్టి జగ్గన్న వీరికి పూర్వుడు కావచ్చు, లేక సమకాలికుడు కావచ్చు. ఉదాహరణ పద్యాలను సంతరించిన పూర్వ సంధాన కర్త గ్రంథాన్ని, పెదపాటి జగ్గన్న సంకలనమైన ఈ గ్రంథాన్ని కలిపి వేటూరి ప్రభాకరశాస్త్రి "ప్రబంధ రత్నావళి" అనే కొత్త సంకలన గ్రంథాన్ని ప్రచురించారు. (ఆరుద్ర-9)

## ప్రబంధ రాజ వేంకటేశ్వర విజయ విలాసము

కర్త : గణపవరపు వేంకటకవి.
అంకితం : బాలవేంకటేశ్వరునికి.

ఈ కావ్యం కవి చిత్రకవితా ప్రౌఢికి అపూర్వ నిదర్శనం. కథ వేంకటేశ్వరునికీ నాంచారుకూ జరిగిన పరిణయ గాథ.

882 పద్యాలున్నాయి ఏకాశ్వాసంగా ఉంది. కావ్యం చివర గద్యలేదు. ఇందులో నమస్కార శబ్ద కంఠవ్యయ గర్భిత వచనం ఒకటి ఉంది. అందులో నమస్కార శబ్దానికి కవి 108 పర్యాయ పదాలు, 108 దివ్య తిరుపతుల పేర్లు వాడాడు. ఒక సీసంలో ఇరవై బంధాలలో ఇమిడే కందం రాశాడు. ఒక పద్యంలో నలభై గర్భితాలు ఇరవై బంధాలు ఇమడ్చడం, ఇతనికి చిత్ర కవితపైగల మక్కువను తెలుపుతున్నాయి. చిత్రబంధ కవిత్వాలకు ఇది లక్ష్యగ్రంథం అనవచ్చు.

ఇందులోని నాగదత్తోపాఖ్యానం, తెనాలి రామకృష్ణుని నిగమశర్మోపాఖ్యానికీ, కందుకూరి రుద్రకవి నిరంకుశోపాఖ్యానికీ అనుకరణ. (ఆరుద్ర 11-161-167)

## ప్రబంధ శిరోభూషణ ప్రకృష్ట బలరామ చరిత్రము

నామాంతరం : బలరామ చరిత్రము.
రచనా కాలం : క్రీ. శ. 17వ శతాబ్ది తరవాతి కాలం
కర్త : గుడారు వేంకటదాసు

ఈ కావ్యం గణపవరపు వేంకటకవి వ్రాసిన ప్రబంధ రాజ వేంకటేశ్వర విజయ విలాసం పద్ధతిలో వెలువడింది. కవి తన చిత్రకవితా వైదుష్యాన్ని ప్రకటించడం కోసమూ, గణపవరపు వేంకటకవిని మించి రచన చేయాలనే కోరికతోనూ ఈ రచనచేసి ఉండవచ్చును.

ప్రబంధ సార శిరోమణి

పూర్వ. (చూ). కళావతి.

సంకలన గ్రంథం. ప్రసిద్ధ కావ్యాలలోని పద్యాలు కొన్ని ఇందులో కూర్చడం జరిగింది. (ఆరుద్ర-12-130)

ప్రబంధాంకము సూరపరాజు

కాలం : క్రీ. శ. 16 వ శతాబ్దం.
స్థలం : విజయనగరం.
రచన : తెలియరాలేదు.
బిరుదు : వేంకటరాయ భూషణుడు.

ఇతడు రామరాజభూషణ బిరుదాంచితుడైన మూర్తి కవి తండ్రి. ఎవరి ఆస్థానంలో ఉండేవాడో నిర్ధారణగా తెలియరాలేదు.

ప్రబోధ చంద్రోదయము

కర్త : చూ. కొటికెలపూడి వేంకటకృష్ణ సోమయాజి.

మూడాశ్వాసాలు గల రచన. కృష్ణమిశ్రుని సంస్కృత రచనకు ఇది అనువాదం. (ఆం.సం.సా-303)

ప్రబోధ చంద్రోదయము

కర్త : నంది మల్లయ-ఘంటసింగయ.
కృతిభర్త : చందలూరి గంగయామాత్యుడు.

ప్రత్యేకత : తెలుగు సాహిత్యంలో మకుటాయమానమైన ఆధ్యాత్మిక కావ్యం ఐదాశ్వాసాలున్నాయి. దీనికి మూలం కృష్ణ మిశ్రుడు సంస్కృతంలో వ్రాసిన నాటకం. ఇటువంటి నాటకాన్ని బౌద్ధ మతపరంగా అశ్వఘోషుడు వ్రాశాడు. ప్రబోధ చంద్రోదయంలో మానవ పాత్రలేదు. వేదాంత దేశికుడు దీనిని చూసి విశిష్టాద్వైత పరంగా సంకల్ప సూర్యోదయం వ్రాశాడు తెలుగులో సమగ్రమైనది అసమానమైనది ఈ ప్రబోధ చంద్రోదయ కావ్యం. వేదాంత పరిభాషలో ఉండే ప్రతి సంకేతాన్నీ సజీవ వ్యక్తిగా రూపొందించి వ్రాసిన మూల నాటకాన్ని ఈ కవులు చక్కని ప్రబంధంగా మలిచి, ఔచిత్యం కోసం కొన్ని మార్పులు చేశారు. సమకాలీన కవితారీతులు, తెలుగు నుడికారపు సొంపులు కావ్యం నిండా కొల్లలు (ఆరుద్ర-6-237)

ప్రబోధ చంద్రోదయ వ్యాఖ్య (సం)

కర్త : నాదెండ్ల గోపమంత్రి (చూ).

ప్రబోధ చంద్రోదయ సంస్కృత కావ్యానికి ఇది సంస్కృతంలో వ్యాఖ్య. (క.త-7)

ప్రభాత పదాలు

నామాంతరం : మేలుకొలుపు పాటలు.

ఉదయవేళల్లో పాడే మేల్కొలుపు పాటల వంటివి.

ఇవి యక్షగానాలలో ప్రయుక్తాలు. ప్రభాత సమయంలో దేవాలయాలలోవి దైవాలను ఈ ప్రభాత పదాలు పాడి మేలుకొలపటం తెలుగు దేశంలో పూర్వ కాలం నుంచీ వస్తున్న ఆచారం. "మేలుకో శ్రీరంగా ! మేలు కోవయ్యా !" అనే పాటలు ఇలాంటివే ఇవి ప్రత్యేకమైన ప్రక్రియ గల పాటలు కావు. (య.వా.చ-275)

## ప్రభా మండలమ్ (సం)

కర్త : యజ్ఞేశ్వరుడు

ఇది శాస్త్రదీపికకు వ్యాఖ్యానం. (తె వి స-4)

## ప్రభావతీ ప్రద్యుమ్నము

కర్త : గోపాలుని సింగయ్య.

ఇది పింగళి సూరనార్యుని ప్రభావతీ ప్రద్యుమ్న ప్రబంధానికి యక్షగాన రూప పరివర్తనం. దీనిలో దరువులు, ద్విపదలు ఎక్కువ. గద్య పద్యాలు కొద్దిగా ఉన్నాయి. అక్కడక్కడ అర్ధచంద్రికలు, ధవళము, శోభనము, ఏల, మంజరి కనిపిస్తాయి. దీనిలో పేరణి, ప్రబంధజక్కిణి, చిందు, కొరవంజి, జోగిణి, మొదలయిన నాట్యభేదాలు ఉన్నాయి. (య.వా.చ-67)

## ప్రభావతీ ప్రద్యుమ్నము

కర్త : పింగళి సూరన్న.

అంకితం : పింగళి అమరనామాత్యునకు.

శృంగార ప్రబంధం. కవి దీనిని తన తండ్రికే అంకితం ఇచ్చాడు.

ప్రత్యేకత : ఈ కావ్యం పరిణతమైన శృంగార ప్రబంధం. సానలు దీరిన నిక్కపు జాతి రత్నం. సూరన హరివంశపు గనిని త్రవ్వి ఈ రత్నాన్ని వెలికితెచ్చాడు. హరివంశం మూలం నుంచి 'వజ్రనాభ వధ' అనే కథలో కనిపించే అసంగతాలను సంస్కరించటంలో నేర్పు చూపాడు. రవివర్మ భూపుడనే (క్రీ.శ. 12-శతాబ్ది) రాజకవి సంస్కృతంలో వ్రాసిన ఒక నాటకాన్ని చూసి సూరన ప్రభావతీ ప్రద్యుమ్న ప్రబంధరచన చేసి ఉండవచ్చు. భాగవతంలోని ఉషాపరిణయ కథతో కూడా దీనికి పోలికలున్నాయి.

సంస్కృత హరివంశంలో వజ్రనాభ వధకు, ప్రభావతీ ప్రద్యుమ్నుల వివాహానికి సంబంధంలేదు. గదసాంబులకు చంద్రవతి గుణవతులతో వివాహం హఠాత్తుగా సంభవించటం, కృష్ణసంతతి వాడు భద్రుడనే మామూలు మనిషికి శత్రురాజ్యాన్ని అస్తమింప జేసే కార్యతంత్రాన్ని చెప్పి, వానికి ఆ కార్యసాధన అప్పగించటం వంటివి ఉన్నాయి. తరవాత దీనిని నాటకీకరణం చేసిన రవివర్మ శుచిముఖి పాత్రను పూర్తిగా తొలగించాడు. సూరన పైలోపాలను తన కావ్యంలో సవరించి, అసంగత భావాలను ఎట్లా సంగతం చేశాడో, వాటికి ఉపపత్తులు ఏవి చూపాడో చూస్తే అద్భుతావహంగా తోస్తుంది.

సూరన్న కావ్యంలో ప్రభావతీ ప్రద్యుమ్నుల వివాహానికి వజ్రనాభుని వద్ద ఉపసుమైనట్లు చెప్పాడు. అట్లే చంద్రవతీ గుణవతుల వివాహంలోని ఆకస్మికతను పోగొట్టటానికి చిలుక రాయబారాన్ని కల్పించాడు. ప్రభావతీ ప్రద్యుమ్నుల వివాహం పరమేశ్వరి ఆదేశమైతే, చంద్రవతీ గుణవంతులకు - గద సాంబులతో వివాహం నారదాదేశం. అక్క పెళ్ళికి హంస దౌత్యం చేస్తే, చెల్లెలి పెళ్ళికి చిలుక రాయబారం చేస్తుంది. సూరన ప్రబంధంలో భద్రనటునకు కార్యరంగ ప్రవేశమే లేదు. ప్రద్యుమ్నుని భద్రనట వ్యాజంతో వజ్రపురానికి తేలిగ్గా పంపవచ్చునని కృష్ణుడనుకొన్నట్లు సూరన భద్రుని ప్రయోజనం నామమాత్రం చేశాడు. పైవన్నీ సూరన కావ్యంలో చేసిన ప్రధాన సంస్కారాలు.

సూరన పాత్ర నిర్మాణ శక్తికి మంచి నిదర్శనం శుచిముఖి. హరివంశంలో శుచిముఖి పాత్ర ఉంది, కాని ఆ హంసికి కథలో వ్యక్తిత్వమే లేదు. సూరన ప్రబంధంలో కథ అంతా శుచిముఖి మీదుగా నడిచింది. వజ్రనాభుని వధించాలనుకొని ఉపాయం దొరకక బాధ పడుతున్న ఇంద్రకేశవులకు ఈ హంసి ఉపాయాలు చెప్పి గురుత్వం నెరపింది. వారి కార్యం సాధించిపెట్టి మంత్రిత్వంకూడా చేసింది. ప్రభావతీ ప్రద్యుమ్నుల పరస్పరానురాగం గాఢం కావటానికి శుచిముఖి దూతగా నిలిచింది. ప్రభావతీ ప్రద్యుమ్నుల గాంధర్వ వివాహానికి పౌరోహిత్యం చేసింది.

ప్రభావతీ ప్రద్యుమ్నం చక్కని స్వభావోక్తులతో, లలిత పదఘటితమై, కథా చమత్కృతి కలిగి, చదివే వారికి కర్ణపేయంగా ఉండే ప్రౌఢ ప్రబంధం. సూరన్న సర్వతోముఖ పాండిత్యం ఇందులో కనిపిస్తుంది. (తె.వి.స-4)

## ప్రభుదేవర వాక్యము

నామాంతరం : పిండ చక్ర నిర్ణయము.

కర్త : సిద్ధరామకవి.

ప్రత్యేకత : ఇది శైవ వేదాంతాన్ని వివరించే వచన గ్రంథం. వీర శైవ మత ప్రచారకులలో ఒకడైన మల్లయ ప్రభుని తత్త్వోపదేశం ఇందులో ఉన్నదట.

(ఆప్ర-8-274)

## ప్రభులింగ లీలలు

రచన కాలం : క్రీ.శ. 1510 ప్రాంతం.

కర్త : పిడుపర్తి రెండవ బసవకవి.

అంకితం : నాగనాథుని మల్లారాధ్యునికి.

పిడుపర్తి సోమనాథకవికి, ఈకవి 30సం॥ ముందు వాడు. విజయనగర నరసింహరాయలకు, ఇమ్మడి నరసింహరాయలకు సమకాలికుడు.

ప్రత్యేకత : ఐదాశ్వాసాల కావ్యం. అల్లమ ప్రభువనే శివభక్తుని లీలలను చామరసయ్య కవి కన్నడంలో 25 గతులలో 1,111 పదాలుగా వ్రాస్తే, దానిని పాల్కురికి సోమన్న, పిడుపర్తి సోమనాథుడు ద్విపద కావ్యంగా వ్రాశారు. వారి ద్విపదలకు పద్యరూపమే

ఈ కావ్యం. కవి ఒక్కొక్క విషయానికి ఒక్కొక్క గతి అని పేరు పెట్టాడు. కైలాస గతి, మాయోత్పత్తి గతి, బసవయ్య గతి మొదలగు గతులలో కావ్యముంటుంది. కృతిపతి చల్లపల్లి గ్రామకరణం. (క.త-6)

## ప్రభులింగ లీలలు

కర్త : పిడుపర్తి సోమనాథ కవి.

రచనాకాలం : క్రీ.శ. 1422-1447 తరువాత.

ఐదాశ్వాసాల ద్విపద కావ్యం.

ప్రత్యేకత : అల్లమ ప్రభువనే శివభక్తుని లీలలను చామరుసయ్య అనే ఆయన కన్నడంలో 25 గతులలో 1,111 పదాలుగా వ్రాస్తే, దానిని పాల్కురికి సోమన్న ద్విపదకావ్యంగా వ్రాశాడు. ఆ ద్విపదలనే ఈ కవి వ్రాశాడు. ఈ కావ్యం పైశ్యోత్తము డైన నెల్లూరి రామలింగయ్య ప్రోత్సాహంతో కవి వ్రాశాడట.

అల్లమ ప్రభువు వీరశైవ గురువులలో ప్రఖ్యాతుడు. శైవులు అతన్ని శివుని అవతారంగా ప్రస్తుతిస్తుంటారు. గొగ్గయ్య కథ, ముక్తాయ కథ, సిద్ధ రామయ్య కథ, ప్రసక్తాను ప్రసక్తంగా ఇతర శివభక్తుల కథలూ ఉన్నాయి. రచన చక్కని జాతీయాలతో కూడి ఉంది. (క త-6)

## ప్రమథకవి శ్రీగిరి

నామంతరాలు : 1. శ్రీగిరి 2. శ్రీగిరి అయ్యంగారు.

## ప్రయాగ కామేశ్వర కవి

కాలం : 18 వ శతాబ్దం.

స్థలం : విశాఖపట్టణ మండలం.

రచన : గోపాల లీలా సుధా లహరి.

సర్వేశ్వరుని పుత్రుడు. నరసింహుని పౌత్రుడు. తన కావ్యాన్ని శ్రీ రామ తీర్థంలోని శ్రీ రామునికి అంకితమిచ్చాడు. (క స-33)

## ప్రయోగ సారము

కర్త : కాచన బసవన.

ఇందులో ప్రాచీన కవుల ప్రయోగాలు చూపబడినవి. వ్రాతప్రతి ఆంధ్ర సాహిత్య పరిషత్తులో ఉంది. (కవిజనాశ్రయం పీఠిక-వావిళ్ళ)

## ప్రవరుడు

అల్లసాని పెద్దన రచించిన స్వారోచిష మనుసంభవమనే ప్రబంధంలోని పాత్ర. ఈ ప్రబంధానికి మూలం మార్కండేయ పురాణం అయినప్పటికీ, పెద్దన వరూధినీ ప్రవరుల పాత్రలను తెలుగు దేశంలో చిరస్థాయిగా నిలిచిపోయేలా తీర్చి దిద్దాడు.

ప్రవరుడు భూలోకంలోని శుద్ధ శ్రోత్రియ బ్రాహ్మణుడు. జననీజనకుల యెడ భక్తుడు. దివ్య సుందరమూర్తి. ఏకపత్నీ వ్రతుడు. వేదోదిత ధర్మ కర్మానుష్ఠానంతో పరమ పవిత్రుడైన ఆహితాగ్ని. అతిథి పూజా తత్పరుడు పుణ్య క్షేత్ర దర్శనోత్సాహియైన ప్రవరుడు ఒకానొక సిద్ధుడు ఇచ్చిన పాదలేపన ప్రభావంతో హిమవత్పర్వతం చేరుకొని అచటి వింతలు, విశేషాలు చూసి ఇంటికి చేరాలనుకొనేవేళకు పాదలేపనం కరిగిపోతుంది. ఆ కొండ కొమ్ము మీదనే దిక్కుతోచక తిరుగుతూ ఉన్న అతనికి వరూధిని అనే వరాప్సరస కనిపిస్తుంది. ఆమె అతిలోక సౌందర్యవతి. శృంగార రసమూర్తి. అతని లోకోత్తర సౌందర్యానికి ముగ్ధురాలైన ఆమె, తన కోరికను వ్యంగ్యంగా తెలిపి అతన్ని ఆకర్షించడానికి ప్రయత్నిస్తుంది. ఎన్నో యుక్తియుక్తాలైన ఉపన్యాసాలు చేస్తుంది. అవన్నీ తుచ్ఛసుఖాలని ప్రవరుడు నిరాకరిస్తాడు. తుదకు ఆమె హఠాత్తుగా మీద పడి కౌగలించుకోగా నెట్టివేసి, తన దేహానికి అంటిన ఆమె మేని గంధాన్ని నీటితో కడిగి వేసుకొని అగ్ని దేవుని కరుణతో ఇల్లు చేరుకుంటాడు. వలచి వచ్చిన అప్సరసను కూడా నిరాకరించిన అతని జితేంద్రియత్వమూ, సదాచార వర్తనమూ, తెలుగు నాట ప్రఖ్యాతాలై చిరస్థాయిగా నిలిచిపోయాయి. అపర ప్రవరాఖ్యుడు అనే మాట తెలుగు పలుకుబళ్ళలో చోటు చేసుకొన్నది. (మనుచరిత్ర)

### ప్రవేశిక

ముద్రిత గ్రంథాలకు తొలిపలుకు తర్వాత సాధారణంగా ప్రవేశిక ఉంటుంది. పుస్తకంలోని విషయాన్ని పఠితలకు పరిచయం చేయడం, విషయ సూచనం చేయడం దీని ప్రయోజనం.

### ప్రశస్తి కావ్యములు

చూ. బిరుదుగద్య.

రాజుల ఆస్థానంలో ఉండే స్తుతి పాఠకులు ఆయా రాజుల ప్రశస్తిని స్తుతిస్తూ సంబోధిస్తూ చేసిన స్తుతి ప్రధానమైన రచనలు. ఇవి క్రీ. శ. 3వ శతాబ్దినుంచి దక్షిణ దేశపు శాసనాలలో కనిపిస్తున్నాయి. స్ఫుటమై, మధురమైన శబ్దాలతోనూ, సమాసాలతోనూ బిరుదావళుల కూర్పు ఇందులో కనిపిస్తుంది. ఇదే కాలక్రమాన బిరుదుగద్యగా రూపొంది, కవుల కావ్యాలలో ఆశ్వాసాంతాలలోచేసే కృతిపతి వర్ణనలు బిరుద సమాస భూయిష్ఠాలై సంబోధ నాంతాలుగా ఉండటం సంభవించింది.

### ప్రశ్నోపనిషత్తు

రచనాకాలం : క్రీ. శ. 16 వ శతాబ్దం.
కర్త : పరవస్తు వేంకటరంగాచార్యులు.

అనువాదం. పద్యరూపంలో ఉంది. విషయం సూటిగా సరళంగా చెప్పడంలో ఈ కవి ప్రసిద్ధుడు.

### ప్రశ్నోత్తరాంధ్ర వ్యాకరణము

రచనాకాలం : క్రీ. శ. 19 వ శతాబ్దం.

కర్త : పుదూరి సీతారామశాస్త్రి.

వ్యాకరణ గ్రంథం. ఆంధ్ర శబ్ద చింతామణిని అనుసరించి ఉంది. ప్రశ్నో త్తర రూపంలో విద్యార్థులకు ఉపయోగకరంగా ఉండే విధంగా రచింపబడింది.

(క.న_290)

## ప్రసన్న రాఘవమ్ (సం)

కర్త : చెరుకూరు లక్ష్మీధరుడు.

ఇది సంస్కృత ప్రసన్న రాఘవ నాటకానికి సంస్కృతంలో రచించిన వ్యాఖ్యానం. (తె.వి.స_4)

## ప్రసన్న రాఘవము

కర్త : బొడ్డుచర్ల (చిన) తిమ్మన.

కృతిభర్త : నంద్యాల తిమ్మరాజు (కళాపూర్ణోదయ కృతిపతి కృష్ణమరాజుకు వరసకు సోదరుడు).

కర్తృత్వం వివాదాస్పదంగా ఉంది. బొడ్డుచర్ల తిమ్మయ్య కుమారుడైన లోక నాథుడు దీన్ని రచించాడని కొందరి అభిప్రాయం.

ఇది ఏడంకాల కావ్యం.

ప్రత్యేకత : సంస్కృతంలో జయదేవుడు వ్రాసిన ప్రసన్న రాఘవ కావ్యానికి (పిల్లమురారి) ఈ కావ్యం తెనిగింపు. సంస్కృతంలో దీనిని కర్త నాట్యప్రబంధ మన్నాడు. అనువాదం రమారమి నాటకంలాగే ఉంది. ఇందులో నాటక లక్షణాలు, ప్రబంధ లక్షణాలు ఉన్నాయి. దీనిని ఆశ్వాసాలుగా కాక, కవి అంకాలుగానే విభజించాడు. కథ, సీత స్వయంవర ఘట్టంతో మొదలై, రాముని అయోధ్యా ప్రవేశంతో ముగుస్తుంది. అనువాదం బాగా ఉంది. కవి అక్కడక్కడా స్వతంత్రించి వ్రాశాడు. ఇందులోని కొన్ని ప్రయోగాలకు అర్థాలు నిఘంటువులలో కూడా దొరకవు.

(ఆరుద్ర_9_192)

## ప్రసన్న రాఘవ శతకము

కర్త : వంగూరి నరస కవి.

ఉత్పలమాలా వృత్తాలతో ఉన్న రచన.

ఇది రామకథాత్మక శతకం. దీనిలో 200 పద్యాలున్నాయి. రాక్షస పీడితులైన దేవతలు విష్ణుమూర్తితో మొరపెట్టుకొనే ఘట్టంమొదలు రామపట్టాభిషేకం వరకు దీనిలో కథ సంగ్రహంగా ఉంది. ప్రాస వ్యాకరణ దోషాలున్నాయి. సీతారామ వివాహ ఘట్ట సందర్భంలో తెలుగువారి దేశీయాచారాలు వర్ణితం. 'ప్రసన్న రాఘవా' అనే మకుటముంది. రామాయణ కథను కవి రమణీయంగా చెప్పాడు.

(క.న_103; శ.సా.వి.)

## ప్రసన్న వేంకటేశ్వర విలాసము

కర్త : దళవాయి (పెద) తిమ్మప్ప.

యక్షగానం : రాయదుర్గ క్షేత్రస్వామి ప్రసన్న వేంకటేశ్వరుడు. ఆ స్వామి పురవీధులలో వేంచేయగా (ఊరేగుతుండగా), కళావతి అనే వేశ్యకన్య అతనిని చూచి వలచిన కథ ఈ యక్షగానంలో వర్ణింపబడింది. దీనిలోని రచన అతి ప్రౌఢము. ఇందులో దరువులు, ద్విపదలు, పద్యాలు, వచనములు, ఒక అష్టకము, ఒక చూర్ణిక ఉన్నాయి. దరువులు ప్రసిద్ధ రాగతాళాలలో ఉన్నాయి. దీనిలో 'నాట్యపద్ధతికి' అవి మరొక రాగ తాళాల జంటను కవి పేర్కొన్నాడు. దీనిని బట్టి ఈ యక్షగానం ప్రదర్శనకు కూడా ఉద్దిష్టమైనదని తెలుస్తున్నది. ద్విపదలకు రాగాలు పేర్కొనడం ఒక విశేషం. ఇందులో కన్నడ భాషలో మూడు దరువులున్నాయి. (య.వా.చ. 42)

## ప్రహసనము

ఇది దశవిధరూపకాలలో ఒకటి. నవ్వు పుట్టిస్తుంది కాబట్టి దీనికీ పేరు వచ్చింది. హాస్యం ప్రధానరసము. వస్త్వంగ, సంధి, తదంగలాస్యాంగాల విషయంలో ఇది భాణ తుల్యము. శుద్ధము, వికృతము, సంకీర్ణము అని మూడు రకాలు.

పాషండులు, శ్రోత్రియ బ్రాహ్మణులు, భిక్షువులు మొదలగు హాస్యకారుల చరిత్రతో కూడినదీ, చేట చేటీ విటాది ప్రయుక్తమైనదీ, వేషభాషణ చేష్టలవల్ల నవ్వు పుట్టించేదీ శుద్ధము. కంచుకి షండ తాపస వృద్ధాదులు, విట చోర భటాదులు కలవారుగా వర్ణింపబడటం వల్ల విపరీత ధర్మమున్నది వికృతము. ముఖ్య నిర్వహణ లాస్యాంగాలే గాక, ఉద్ఘాత్యకాదులయిన వీధ్యంగాలు కూడా ఎక్కువగా చూపబడి, చోర కితవాది ధూర్తులతో సంకరమై ఉండేది సంకీర్ణము. (తె.వి.స-6)

## ప్రహ్లాద చరిత్ర

కర్త : మేర(ల)త్తూరు వేంకటరామశాస్త్రి.

మేరత్తూరు భాగవత మేళ నృత్య నాటకం. సులలితమైన కైశికీ వృత్తిలో రచన సాగింది. ఆధునిక సంగీత రూపకాలను పోలిన రచన. (తె.వి స-4)

## ప్రహ్లాద చరిత్ర

రచనాకాలం : క్రీ. శ. 1670-72 ప్రాంతం.

కర్త : విజయరాఘవ నాయకుడు.

అంకితం : రాజగోపాలునికి.

ఈ రచనలో కవి తన కృతులన్నీ పేర్కొన్నాడు. కాబట్టి ఇదే ఆఖరిదై ఉండవచ్చునని పండితులు ఊహిస్తున్నారు. భాగవతంలోని ప్రహ్లాద కథ ఇతివృత్తం. ఇందులో ప్రహ్లాదుని విద్యాభ్యాస సందర్భంలో బ్రాహ్మణుల వస్త్రధారణ, అలంకరణం, సంభాషణలు చక్కగా వర్ణించబడ్డాయి. పురోహితులు, పాములవాళ్లు పాత్రోచితంగా మాట్లాడతారు. సమాజంలోని వివిధ వర్గాల చిత్రీకరణ రసవంతంగా చేశాడు కవి. విదూ

షక పాత్ర ప్రవేశించి హాస్యపు మాటలాడటం నాటకాలలో అప్పటికే అలవాటయింది.
(ఆరుద్ర-11-39; ద. దే. వా-108)

## ప్రహ్లాద చరిత్రము

కర్త : తెలియదు.

జానపద పౌరాణిక గేయం.

ఇతివృత్తం భాగవతానికి చెందినది. అత్యంత ప్రసిద్ధం.

చూ. పౌరాణిక గేయములు. (అం. వా. చ.)

## ప్రహ్లాద భక్త విజయము

కర్త : త్యాగరాజు (చూ).

సంగీత రూపకం. అయిదు అంకాలున్నాయి. మొత్తం 45 కీర్తనలు.

భాగవతంలోని ప్రహ్లాద గాథకూ దీనికీ తేడా ఉంది. ఇందులో ప్రహ్లాదుని ఆరాధ్యదైవం శ్రీరాముడు. భక్తి యోగంవల్ల సాధించే విజయం ఇందులో చూపబడింది.
(శారదాధ్వజం-173)

## ప్రళయ కావేరి

నామాంతరం : పులికాట్.

సముద్రతీరంలో ఉండే రేవు పట్టణం. ప్రస్తుతం ఇది చెంగల్పట్టు జిల్లా (తమిళ నాడు)లో ఉన్నప్పటికీ, 17వ శతాబ్దంలో ఆంధ్రుల ప్రాబల్యం ఇక్కడ హెచ్చుగా ఉండేది. మగదల వంశీయులు ఈ నగరాన్ని పాలించారు.

ధరణి దేవుల రామమంత్రి, వెలిదండ్ల వేంకటపతి-మొదలైన ప్రసిద్ధ కవులు తమ కావ్యాలను ఇక్కడే రచించి ఈ నగర పాలకులైన మగదల వంశీయులకు అంకితం ఇచ్చారు. (ద. దే వా-506)

## ప్రాచీన శాసనాలు

జాతి చరిత్రను, సంస్కృతిని తెలుసుకోవడానికి శాసనాలు చాలా ఉపయోగిస్తాయి.

ప్రాచీన శాసనాలలోని భాష, వర్ణ క్రమము, లేఖన పద్ధతి, పదాలు ఈనాటి పద్ధతులకు భిన్నంగా ఉండి అర్థం చేసుకోవటానికి కష్టంగా ఉంటుంది. ఆ కాలంలో ట, ఱ, ళ, ణ, వర్ణాలు బహుళ ప్రయోగంలో ఉండేవి. ఇప్పుడు "న" వ్రాసేచోట అప్పుడు "ణ" ఉపయోగించేవారు. "అనతి" అనటానికి "అణతి" అని, "పని" అనటానికి "పణి" అని వాడేవారు.

శాసనాలలో ప్రయుక్తమైన "ళ్", "ఱ"లు ఇప్పటి బహువచన రూపమైన "లు"కు సమాన వర్ణంగా చెప్పవచ్చు. "కొడుకులు" అనటానికి "కొడుకుళ్" "చెఱువులు" అనటానికి "చెఱువుఱ" అనే రూపాలు అప్పటి శాసనాలలో ఉన్నాయి.

శ, ష, స, శాసనాలలో తారుమారయ్యేవి. దీర్ఘానికి హ్రస్వం, హ్రస్వానికి దీర్ఘం శాసనాలలో కనిపిస్తుంది. "సాక్షి"కి "సక్షి" "మహారాజులకు" బదులు "మహారాజులాకు" అని శాసనాలలో ఉంది. "దీనిని నిల్పి" అనటానికి బదులుగా 'దెన్నిల్పి' అని శాసనాలలో కనిపిస్తున్నది. ఇట్టివి శాసన లేఖకుని పొరపాట్లు కావచ్చు.

శాసనాలలోని కొన్ని పద ప్రయోగాలు నేడు మనకు కొత్తగా కనిపిస్తాయి. "దీనికి" బదులు "తేనికి" అనీ, "రెడ్లు"కు బదులు "రట్టగుళ్ల" అనీ, "పాఱుడు" (బ్రాహ్మణుడు)కు బదులు "పాఱ" అని, "ఎనిమిది"కి "ఎఱుంబాది" అనీ రూపాలు న్నాయి.

ఇప్పుడు వింటున్న (ం) వాడేచోట ప్రాచీన శాసనాలలో వర్గ పంచమాక్షరాన్ని వాడారు. "పంచమి"కి బదులు "పఞ్చమి", "కార్తికేయుండు" అనటానికి బదులు "కార్తికేయుణ్డు", "వసంతీశ్వరము"కు బదులు "వసన్తీశ్వరము" ప్రాచీన శాసనాలలో కనిపించే రూపాలు. (సా. చ. సం.)

## ప్రాణాభరణమ్ (సం)

కర్త : జగన్నాథ పండితరాయలు.

కామరూప దేశపు ప్రభువైన ప్రాణనారాయణుని ప్రశంస 53 శ్లోకాలలో ఉన్న గ్రంథమిది. (తె. వి. స-4)

## ప్రాయశ్చిత్త సుధానిధి (సం)

కర్త : సాయణాచార్యుడు.

ఇది ధర్మ శాస్త్ర గ్రంథం. కర్మవిపాకమని దీనికి నామాంతరముంది. (తె.వి.స-4-1190)

## ప్రాసవచనము

ఇది యక్షగానాలలో ప్రయుక్తం. నెడాదూరు వేంకటాచార్యకవి వ్రాసిన 'సమగ్ర రామనాటకం' సగంగ్రంథం ఈ రకమైన ప్రాసవచనంతో నడిచింది. ఈ వచనంలో ప్రాసనియతి ఉంటుంది. చరణాలు గణబద్ధాలు కావుకాని, మాత్రల పరిమితి సుమారుగా సరిపోతూ ఉంటాయి. మాత్రలు ఒక్కొక్క చరణంలో 30 నుంచి 40 వరకు ఉండవచ్చు. ఒక్కొక్క చరణం రమారమి నడిమికి రెండు దళాలుగా విరుగుతుంది. యతిపాటింపు ఉంది. అంత్యప్రాస నియమము లేదు. దీని వరస పౌరాణిక పాఠధోరణికి సన్నిహితంగా ఉంటుంది. (య.వా.చ-273)

## ప్రిచ్చెట్ ఎడ్వర్డు

కాలం : క్రీ. శ. 19వ శతాబ్ది పూర్వార్ధం.

రచన : నూతన నిబంధనము.

క్రైస్తవ మత గ్రంథాన్ని తెలుగుభాషలోకి అనువదించిన విదేశీయుడు.

ఇతనికి మెకంజీ దొర గుమాస్తాలలో ఒకడైన అనందరాయరు అనువాదంలో సహాయపడ్డాడట. ఈ అనందరాయరే మంగళగిరి అనందకవి అని కొందరి అభిప్రాయం.

(తె.వి.స.6-663)

## ప్రెగ్గడపల్లి పోతయ్య

కాలం : నిర్ధారణగా తెలియదు. 1466 వాడని కొందరంటున్నారు.

స్థలం : గోదావరీ మండలం.

రచన : గోదావరీ శతకము.

కవిని గురించిన వివరాలు తెలియరాలేదు. గ్రంథం అసమగ్రంగా లభించింది. శైలి చక్కనిది. (శ.క.చ-అనుబంధం-788)

## ప్రేమాభిరామమ్ (సం)

కర్త : చూ. రావిపాటి త్రిపురాంతకుడు.

అలభ్యం. తెలుగు క్రీడాభిరామానికిది మూలగ్రంథం.

(ప్రా.ద.భా.చ-న.రా.అ)

## ప్రేమాభిరామము (అలభ్యం)

కర్త : మరింగంటి సింగరాచార్యులు.

ద్విపద కావ్యం. ఈ కవికి ముందే రావిపాటి త్రిపురాంతకుడు ఈ పేరుగల కావ్యాన్నే సంస్కృతంలో వ్రాశాడు. కవి దీనిని తన పదిహేనవయేట రచించాడట.

(తె.వి.స-6)

## ప్రోలని శాసనము

కాలం : క్రీ. శ. 1182.

శాసన ప్రదాత : ప్రోలడు.

ప్రస్తావిత వ్యక్తి : కేతరాజు.

శాసన విషయం : ప్రోలడు కేతరాజుకు మంత్రి అని, తన బుద్ధి బలంచేత రాజును మెప్పించి, శత్రువులను జయించి, దాన ధర్మాలతో బుధ మిత్ర శ్రేణులను రక్షిస్తూ ఉండేవాడని ఈ శాసనం వల్ల తెలుస్తున్నది. దీనిలో ఒక సీసం, ఒక మందాక్రాంత వృత్తం ఉన్నాయి. (తె.క.చ-310-a)

## ప్రోలమ

ఖడ్గ తిక్కన తల్లి. యుద్ధంలో పరాభూతుడై తిరిగివచ్చిన పుత్రునికి అన్నం పెడుతూ ఈమె చెప్పినట్టుగా ఉన్న చాటు వొకటి ప్రచారంలో ఉంది. ఆ పద్యం ఈమె చెప్పినదో ఇతరులు చెప్పినదో నిర్ధారణగా తెలియడం లేదు. ఆ పద్యం విని తిక్కన రణసీమకు తిరిగి వెళ్ళి విజయం సాధించి వీరస్వర్గ మలంకరించాడని జనశ్రుతి.

(క.చ-1).

### ప్రోలమ కుమారుని గండవర శాసనము

శాసన ప్రదాత : ప్రోలమ కుమారుడు (పేరు శాసనంలో స్పష్టంగా లేదు).
ప్రస్తావిత వ్యక్తి : తిరుకాళ దేవుడు (చోడ తిక్కరాజు).
కాలం : క్రీ. శ. 1230-31 ప్రాంతం.

శాసన విషయం : శాసన ప్రదాత తిరుకాళదేవునిచేత "బొండవాడ" గ్రామాన్ని పొంది, ఆ వూరిలో చెరువు త్రవ్వించినట్లు - ఆ వూరికి తన తండ్రిపేర 'దామవరము' అని పేరు పెట్టినట్లు తన తల్లికి ధర్మార్థంగా అక్కడ వేంచేసియున్న శివునకు గుడి కట్టించినట్లూ ఈ శాసనం ద్వారా తెలుస్తున్నది. దీనిలో ఒక సీసపద్యముంది. (తె క చ-321)

### ప్రోలమ (గణికా విభూషణి) పాలకొల్లు శాసనము

కాలం : క్రీ. శ. 1171.
శాసనం వేయించిన వారు : గణికా విభూషణి ప్రోలమ.
ప్రస్తావిత స్థలం : పాలకొల్లు రామేశ్వరాలయం.

శాసన విషయం : నాచినాయకునకు - చిన్నమాంబకు కుమార్తెయైన ప్రోలమ "గణికా విభూషణి" అనీ, ఆమె పాలకొల్లులో వేంచేసియున్న క్షీరారామేశ్వర స్వామికి అఖండదీపం నిలిపిందనీ ఈ శాసనంవల్ల తెలుస్తుంది. సాని వృత్తిలో జీవించే ఒక గణిక దేవునికి అఖండదీపం నిలపటం గమనించదగిన విశేషము. ఈ శాసనం రామేశ్వరాలయం లోని ప్రాకార స్తంభం మీద చెక్కి ఉంది. దీనిలో ఒక శ్లోకం, 2 పద్యాలు ఉన్నాయి. (తె.క చ-308-a)

### ప్రోలయ వేమారెడ్డి

కాలం : క్రీ. శ. 1324-1353.
స్థలం : పాకనాటి. అద్దంకి సీమ.

ఇతడు అద్దంకి రాజధానిగా రాజ్యంచేశాడు. ఇతని తండ్రి పేరు కూడా ప్రోలయయేనట. ఎర్రాప్రెగడ రచించిన రామాయణం, హరివంశాలకు కృతిపతి. కవి పండిత పోషకుడు. ఇతని దాన శాసనం ఒకటి లభించింది. గుండ్ల కమ్మతీరాన ఉన్న చదలవాడలో ఇతని తమ్ముడు మల్లారెడ్డి కట్టించిన రామాలయానికి ఒక అగ్రహారాన్ని ఇతడు దానంచేశాడు. (ఆరుద్ర-3)

### ప్రోలినాయకుని కొమ్మూరు శాసనము

కాలం : క్రి. శ. 1244.
శాసన ప్రదాత : ప్రోలి నాయకుడు.
శాసన ప్రదేశం : గుంటూరు జిల్లా-బాపట్ల తాలుకా-కొమ్మూరు గ్రామం.

శాసన విషయం : ప్రోలి నాయకుడు నాగి నాయకునకు నందనుండని, ముత్తియ నాయకునకు పౌత్రుడని, మిగుల రణశూరుడని, కొమ్మూరులో వేంచేసిన అగస్త్యేశ్వర

స్వామికి అఖండ దీపంతో పాటు దీపస్తంభాన్ని కూడా నిలిపాడని ఈ శాసనం వల్ల తెలుస్తున్నది. ఈ శాసనం కొమ్మూరు లోని కాశీనాథేశ్వర ఆలయంలో ఉంది. దీనిలో ఒక సీస పద్యముంది. (తె క.చ-320.d)

## ప్రోలుగంటి చెన్నశౌరి

కాలం ; క్రీ. శ. 15 వ శతాబ్దం.

స్థలం : కర్ణాట రాజ్యం.

రచనలు : 1. నరసింహ పురాణము (ద్విపద) 2. బాలభారతము (వచనం) 3. సౌభరి చరితము (యక్షగానం).

నాగశౌరి, దేవమ్మల పుత్రుడు. కవికి తాత యైన తిప్పన్న ప్రౌఢ దేవరాయలకు దండాధీశుడు. పిల్లల మర్రి పినవీర భద్రునికి, సాళువ నరసింహరాయలకు ఈ కవి సమకాలికుడై ఉండవచ్చు. హరిభట్టు వ్రాసిన నృసింహ పురాణాన్ని, అతని కొడుకు రాఘవ పండితుడు రంగన మంత్రికి కృతి యిచ్చాడు చెన్న శౌరికి రంగన మంత్రి పెద తండ్రి మనుమడు పైకృతిలో చెన్నశౌరిని స్తుతించాడు. ఇతడు అష్ట భాషా విశారదుడు. పైన చెప్పినవి కాక ఇంకా పెక్కు కృతులు వ్రాశాడట. అన్నీ అలభ్యాలే. ఇతడు నరసింహ రాయలచేత సంభావితుడై అగ్రహారాలు గ్రహించినట్లు నరసింహపురాణంలో ఉంది. (క.త-6-78)

## ప్రోలుగంటి రంగమంత్రి

కాలం : 16 వ శతాబ్దం.

సాహిత్య పోషకుడు. హరి భట్టు రచించిన నృసింహ పురాణం (ఉత్తర భాగం) ఇతనికే అంకితం. కవి మరణించిన తర్వాత కవి పుత్రుడైన రాఘవ మనీషి దీన్ని ఇతనికి అంకితం చేశాడు (క.స-311).

## ప్రౌఢ కవి మల్లన

కాలం : క్రీ. శ 15 శతాబ్ది.

రచన : ఏకాదశీ మాహాత్మ్యము.

అంకితం : భీమేశ్వర స్వామికి.

బిరుదు : ప్రౌఢ కవి.

గురువు : శక్తి నాథుడు.

విశిష్టత : ఈయన బమ్మెర పోతన కుమారుడని కొందరంటారు. కాని ఆధారాలు లేవు. అయితే బమ్మెర వంశీయులలో మల్లన పేరున్న ఒక కవిమాత్రం ఉన్నాడు. ఆ బమ్మెర మల్లన పుత్రులు జంట కవులైన కేసకవి-మల్లకవి అనేవారు. ఈ ప్రౌఢ కవి మల్లన ఈ జంటకవుల తండ్రి అని నిర్ణయించటానికి గాని, పోతన కుమారుడని నిరూపించటానికి గాని ఆధారాలులేవు. కవితా గుణాన్ని బట్టి ఇతనికి ప్రౌఢ కవి అనే బిరుదు వచ్చి ఉంటుందని పండితులు భావిస్తున్నారు.

పోతన శ్రీనాథుని బావమరిది అనే ప్రతీతిని పురస్కరించుకొని కొన్ని చాటు

కృతులు : 1. శకుంతలా పరిణయము 2. అమరపదకల్పద్రుమము 3. నారాయణ శతకము 4. కుమారీ శతకము 5. మదనసాయకా పరిణయము 6. కవిదర్పణచ్ఛందము 7. నారాయణ స్తవము.

విశాఖపట్టణం మిషన్ హైస్కూలులో ఆంధ్రోపాధ్యాయుడుగా ఉండేవాడు. ఇతని రచనలలో అమరపదకల్పద్రుమ కావ్యాన్ని కొందరు, ఆనందద్రుమకావ్యాన్ని కొందరూ పేర్కొన్నారు. ఈ రెండూ వేర్వేరో లేక ఒకే గ్రంథానికి నామాంతరాలో తెలియదు. సలక్షణంగా మనోహరంగా కవిత్వం చెప్పాడు.

(క.స-241: వీరేశలింగం - సమగ్ర పరిశీలన)

## ఫక్కి వేంకట నరసింహకవి

నామాంతరం : ఫక్కి వేంకటనర్సయ్య.

## ఫణికుండలకవి

కాలం : క్రీ. శ. 19వ శతాబ్ది పూర్వార్ధం.

స్థలం : మహేశ్వరం.

రచన : సీమంతినీ కల్యాణము.

విద్వత్కవి. ఇతని రచన ముద్రితమట. (క.స.137)

## ఫణిధవు మాధవుడు

కాలం : క్రీ. శ. 1590కి ముందు.

రచన : ప్రద్యుమ్న విజయము (అలభ్యం).

విశిష్టత : ప్రద్యుమ్నుని కథను పింగళి సూరన్నకు ముందే ఈ కవీ, పొన్నాడ పెద్దిరాజు అనే కవీ తెలుగులో కావ్యాలుగా చెప్పినట్లు, పెదపాటి జగ్గన్న ప్రబంధ రత్నాకరంలో ఉదహరించిన ఆయా కవుల పద్యాలవల్ల తెలుస్తున్నది. కవి ఒకపద్యంలో సూర్యోదయ వర్ణనను, మూడు పద్యాలలో వేగుచుక్క వర్ణనను, ఆరు పద్యాలలో పురవర్ణనను, ఒక పద్యంలో చంద్ర కిరణాల వర్ణనను, రెండు పద్యాలలో చెంచుభామల చిత్రణను చేశాడు. జక్కులవాళ్ళ వర్ణన కూడా ఉంది. (అరుద్ర-9)

## ఫణిహారం ఎంబారయ్య

కాలం : క్రీ. శ. 18వ శతాబ్దం.

రచన : కురవంజి.

ఈ కవి రచననుబట్టి, ఇతను విశిష్టాద్వైతి అని చెప్పవచ్చును. రామానుజా చార్యుడు కురవంజి వేషంతో కాంచీపురాధిపుని రాణి 'అరుందేవికాయి' దగ్గరకు వెళ్ళి విశిష్టాద్వైత పరంగా పాంచ భౌతిక దేహతత్త్వాన్ని గురించి చెప్పడం, అక్కడకు పెరియ పెరుమాళ్ళు (మహా విష్ణువు) సింగడై రావడం ఇతివృత్తంగా కురవంజి రచన చేశాడు.

(య.వా.చ-72)

**ఫాల్గుణోత్సవము (అలభ్యం)**

రచనాకాలం : క్రీ.శ. 17వ శతాబ్దం.
కర్త : విజయరాఘవుడు.

యక్షగాన నాటకం.

రాజగోపాలస్వామికి ప్రతిఏటా జరిగే ఫాల్గుణోత్సవాన్ని రగడలతోను చౌపదులతోను వర్ణించి చెప్పిన రచన అని తెలుస్తున్నది. (వ.దే.వా-89)

**ఫోర్టు సెయింట్ రాజకీయ వృత్తాంతిని**
(Fort St. George Gazette)

కాలం : క్రీ. శ. 1802 ప్రాంతం.

ఇది అప్పటి బ్రిటిష్ ప్రభుత్వంవారి రాజకీయ వృత్తాంతిని. దీని ముద్రణ మదరాసు కళాశాల ముద్రణాలయంలో జరుగుతుండేది.
(వీరేశలింగంపంతులు - సమగ్ర పరిశీలన - 183)

**బంగరు యాచమ నాయకుడు**

కాలం : క్రీ. శ. 1658-1707.
స్థలం : వెంకటగిరి సంస్థానం.

వెంకటగిరి సంస్థానాన్ని పాలించిన ప్రభువు. సాహిత్య పోషకుడు. కృతిపతి. రోసనూరి వెంకటపతి రచించిన "విష్ణుమాయా విలాసం" ఇతనికే అంకితం. ఔరంగజేబు ఢిల్లీ చక్రవర్తిగా ఉన్న కాలంలో ఇతడు నెల్లూరి నవాబైన జుల్ఫగారీ చేత చంప బడ్డాడు. (క.త-12-215)

**బంగారక్క-అల్లాటప్పగాడు**

తోలు బొమ్మలాటలో హాస్య ఘట్టంలో ప్రత్యక్షమయ్యే పాత్రలివి. జుట్టు పోలిగాడులాగే అల్లాటప్పాగాడు అఖండుడు. సాధారణంగా ఈ ప్రదర్శనలో వీరి అభినయం క్రింది విధంగా ఉంటుంది అల్లాటప్పాగాని గడసరి పెండ్లాం బంగారక్క. మొదట బంగారక్కకు-పోలిగానికి కయ్యం నడుస్తూ ఉంటుంది. కాసేపు బంగారక్క-పోలిగాడు అసభ్య శృంగారం అభినయించిన తరవాత ఇద్దరూ పోట్లాడుకొని అంత లోనే రాజీపడి పోతారు. పోలిగాడు తొందరగా వెళ్ళి పోతాడు.

సరిగ్గా ఇదే సమయంలో అల్లాటప్పగాడు ప్రవేశించి బంగారక్క దగ్గరనే నిలబడతాడు. శృంగారానికి బంగారక్క-అల్లాటప్పగాడు సమ్మతించుకొనిఉన్న సమ యంలో కేతిగాడు ప్రవేశించి రసాభాసం చేస్తాడు.

ఇది బొమ్మలాటలో కడుపు చెక్కలయ్యేటట్లు నవ్వించే మోటు శృంగార ఘట్టం. (నా.ర.చ)

చూ. బంగారక్క-జుట్టుపోలిగాడు; బంగారక్క-కేతిగాడు.

**బంగారక్క-కేతిగాడు**

బొమ్మలాటలలో బంగారక్క-జుట్టుపోలిగాడు; బంగారక్క-అల్లాటప్పగాని

వలెనే ఈ జంట కూడా తెలుగు దేశంలో ప్రసిద్ధమైంది. బంగారక్క మొదట జుట్టు పోలిగాని ప్రియురాలిగా, తరవాత అల్లాటప్పగాని ప్రియురాలిగా, ఆ తరవాత చివరలో కేతిగాని ప్రియురాలిగా రమ్యంగా కథ కల్పిస్తారు.

కేతిగాని బొమ్మ అన్ని బొమ్మల కంటె అతి చిన్నది. ఈ పాత్ర అతి విచిత్రమైంది. కేతిగాడు ఎక్కడ బడితే అక్కడ, ఎప్పుడు బడితే అప్పుడు-పానకంలో పుడకలాగ-ఒక అడుగుచోటు తెర మీద ఉంటేచాలు-హఠాత్తుగా ప్రవేశిస్తుంటాడు.

శృంగార ఘట్టంలో అల్లాటప్పగాడిని టకీమని ఒక్క దెబ్బ కొడతాడు కేతిగాడు. ఆ దెబ్బకు అల్లాటప్పగాడు పారిపోతాడు కేతిగాడు బంగారక్కను ఏడిపించటం మొదలు పెడతాడు. బంగారక్కను లోబరుచుకొని చివరకు తన శృంగారం కూడా తీర్చుకుంటాడు.

ఇలాంటి మోటు సరసంతో కూడిన ఘట్టాలు, పాత్రలు కడుపు చెక్కలయ్యే నవ్వు పుట్టించటమేగాక, ఈ హాస్యం ప్రేక్షకుల నిద్రమత్తును వదిలిస్తుంది. చాలా మంది ప్రేక్షకులు బొమ్మలాటల్లో అసలు కథ కంటె బంగారక్క-జుట్టుపోలిగాడు-అల్లాటప్పగాడు-కేతిగాడు మొదలయిన హాస్య పాత్రల కోసమే ఎదురు చూడటం కద్దు.

ఈ విధమైన మోటు హాస్యంతోనే బొమ్మలాట ప్రదర్శన తెల్లవార్లూ విజయవంతంగా నడుస్తుంది.

చూ. బంగారక్క-జుట్టుపోలిగాడు; బంగారక్క-అల్లాటప్పగాడు;
(నా.ర.చ-196)

## బంగారక్క-జుట్టుపోలిగాడు

ఇవి రెండూ తెలుగు దేశంలోని తోలు బొమ్మలాటలోని హాస్య పాత్రలు. బొమ్మలాట కథకు సంబంధంలేని పాత్రలే అయినా, కథ ప్రారంభనుంచి చివరి వరకు, ఒక ఘట్టం ఆయి రెండో ఘట్టం మొదలయ్యే సమయంలో వీరు ప్రత్యక్షమవుతారు. దీర్ఘ కాలం నడిచే బొమ్మలాటలో చక్కని హాస్యంతో ప్రేక్షకులను కడుపుబ్బ నవ్వించి నిద్రమత్తును వదల గొడుతూ ఉంటారు. సమాజంలోని కుళ్ళును, దురాచారాలను, అవినీతిని ఈ బంగారక్క-జుట్టుపోలిగాడి పాత్రల ద్వారా బయట పెడుతూ ఉంటారు. మధ్య, మధ్య సమాజంపై చక్కని విసుర్లుంటాయి. మరాఠీ బొమ్మలాటలోని గంధోళిగాడకి, బొమ్మలాటలోని జుట్టుపోలిగాడికి చాలా దగ్గర సంబంధముంది.

జుట్టుపోలిగాడు జాణ-బంగారక్క నెఱజాణ.

చూ. బంగారక్క-అల్లాటప్పగాడు, బంగారక్క-కేతిగాడు. (నా.ర.చ-195)

## బంగారు కామయ్య

కాలం : క్రీ.శ. 16వ శతాబ్దం.

ఇతన్ని తిడుతూ ఎడవల్లి పర్వతన్న అనే కవి ఒక చాటువు చెప్పాడు. ఆరింట తకారంగాని, అయిదింట హకారంగాని పెట్టి, తిడుతూ పద్యాలు వ్రాస్తే అది

శాపంగా పరిణమిస్తుందని లాక్షణికులు చెప్పారు. పర్వతన్న అయిదింట హ-కారం పెట్టి బంగారు కామయ్యను తిట్టాడట. దీనిని అప్పకవి ఉదాహరించారు.

(అప్పకవీయం-2-377)

## బంగారు తిమ్మరాజు కథ

కర్త : తెలియదు.

జానపద చారిత్రక గేయం. ఈ గేయంలోని కథ ప్రాచీన చరిత్రకు సంబంధించినదే గాని, సుస్పష్టంగా లేదు.

పెనుగొండను దేవరాయలు పాలిస్తున్న కాలంనాటి కథ ఇది. ఈ దేవరాయ లెవరో తెలియదు. కొందరు శ్రీ కృష్ణ దేవరాయలు కావచ్చునని కూడా అభిప్రాయపడినారు. ఈ దేవరాయలకు ఏడుగురు తమ్ములున్నారు. వారిలో "రఘుపతిరాజు" శేషపట్నానికి అధికారి. కథానాయకుడైన "తిమ్మరాజు" ఈ రఘుపతిరాజు కుమారుడు. [తిమ్మరాజును గూర్చి కూడ అభిప్రాయభేదాలున్నాయి.]

దేవరాయలుకు సంతానంలేదు. పైగా 'భోగం రంగాసాని', ఆమె సోదరుడు "నవరము నారప్ప" ఈతని ఆశ్రయంలో ఉన్నారు. నారప్పకు శేష పట్నం పాలకుడైన రఘుపతిరాజునకు అంతకు పూర్వమే శతృత్వం ఉంది. ఆ కారణంగా నారప్ప దేవరాయల ద్వారా, తన పాత కక్షను సాధించదలచుకున్నాడు. బంగారు తిమ్మరాజును ఏదో మిషచేత పెనుగొండకు రప్పించి చంపించాలని వారి అభిలాష. రంగాసాని ప్రయత్నంవల్ల రాజుగారు తిమ్మరాజును పెనుగొండకు పంపవలసిందిగా కబురుపెట్టాడు. అయితే దేవరాయలకు ఈ కుట్ర విషయం తెలియదు.

తిమ్మరాజు పెనుగొండకు ప్రయాణమౌతాడు. మాణిక్య దేవి తిమ్మరాజుకు భార్య. శోభనం కూడా జరుగని క్రొత్త పెళ్ళి కూతురు. ప్రయాణమైన తిమ్మరాజుకు దుశ్శకునాలు అగుపించడంచేత భార్య, తల్లులు మొదలగు వారంతా ప్రయాణాన్ని నిలిపివేయమంటారు. కాని, తిమ్మరాజు ఎవరి మాటలూ సరకు చేయక పెనుగొండవైపు సాగిపోతాడు.

నారప్ప, రంగాసాని కలసి తిమ్మరాజును వధించడానికి చాలాసార్లు ప్రయత్నించి, విఫలులౌతారు. రాజుకు చాడీలు చెప్పి, తిమ్మరాయలను వధింప చేయాలన్న ప్రయత్నం కూడా విఫలమౌతుంది. చివరికి దేవరాయలు వీరి కుట్రను గ్రహించి, నారప్పకు మరణదండన విధించి, శత్రు నిర్మూలనం జరిగాక "కాశీ" ప్రయాణంచేస్తాడు. అప్పుడు తిమ్మరాజు పెనుగొండలోనే ఉంటాడు.

రాజులేని సమయంలో రంగాసాని పెద్దసైన్యాన్ని కూడగట్టుకొని తిమ్మరాజుతో యుద్ధంచేసి, ఓడిపోయి సంహరింపబడుతుంది. తలారుల చేతులనుండి తప్పించుకున్న నారప్ప తిరిగి తిమ్మరాజుపై యుద్ధంచేసి బంధింపబడతాడు.

నారప్ప దాచిన ధనాన్ని తిమ్మరాజు వశపరచుకుంటాడు. అయితే, ఆ ధనాన్ని పంచుకునే విషయంలో బావ మరిది అయిన మేఘపు రాజుతో పేచీ వస్తుంది. మేఘపురాజు

తిమ్మరాజుపై చాడీలు వ్రాస్తూ దేవరాయలకు ఉత్తరం వ్రాసి పంపుతాడు. దేవరాయలు అది నమ్మి, పెద్ద సైన్యంతో తిమ్మరాజును తిరుపతివద్ద ఎదుర్కొని యుద్ధం చేస్తాడు. యుద్ధంలో తిమ్మరాజు మరణిస్తాడు. నిజం తెలిసిన దేవరాయలు మిక్కిలి దుఃఖించి ఆత్మహత్య చేసుకుంటాడు. తిమ్మరాజు తలిదండ్రులు, బంధువులు కూడ ఆత్మహత్య చేసుకుంటారు. ఆ తరువాత తిమ్మరాజు తమ్ముడు కృష్ణమరాజు శేషు పట్నానికి, పూల రంగరాజు పెనుగొండకు అధిపతులౌతారు.

ఈ కథలోని పాత్రల పేర్లు, స్థలాల పేర్లు చాలామటుకు చరిత్రతో సంబంధ మున్నవే. పరిశోధనల ద్వారా ముున్ముందు దీని చరిత్రను గ్రహించడానికి వీలుపడవచ్చు. (తె. జా.సా-262-269)

## బంగారు రంగప్ప

కాలం : క్రీ. శ. 1770 ప్రాంతం.
స్థలం : పిల్లలమఱ్ఱి (హైదరాబాదు మండలం).
రచన : బేతాళ చరిత్రము (ద్విపద).

విద్వత్కవి. రేచర్ల ప్రభువైన బేతాళ నాయకుని చరిత్రను ఈ కవి కావ్యంగా వ్రాశాడు. దీనికి మూలం అన్నసముద్రం చినపీరయ్య రచించిన సంస్కృత గ్రంథం. (క. ప-178)

## బండారు లక్ష్మీనారాయణ

(చూ). భండారు లక్ష్మీనారాయణ.
రచన : సంగీత సూర్యోదయమ్ (సం).

## బండి బాపనమ్మ

కాలం : క్రీ. శ. 1850 కి పూర్వం కావచ్చును.
రచన : మీనాక్షి శతకము.

ఈమె గోపాలుని సోదరి. అతి సొగసుగా కవిత్వం చెప్పింది. ఈమె కవిత మధురమైన భక్తి భావాలకు ఆలవాలం. (శ. క. చ-555)

## బంతులాట పాటలు

పెండ్లి వేడుకపాటలలో ఒక భాగం. యక్షగానాలలో ప్రయుక్తం. పెండ్లి వేడుక లలో ముత్తైదువలు వధూవరులచే పూలచెండ్లాడించే ముచ్చటకు సంబంధించిన పాటలు. చెండ్లాట, బంతులాట ఇంచుమించు ఒకటేగాని, రెండింటిలో గతి భేదం ఉంది. చూ. చెండ్లాట పాటలు. (య. వా. చ-338)

## బందా పరదేశి

కాలం : క్రీ. శ. 1716-1770 ప్రాంతం.

ఈయన అమరావతి నేలిన వాసిరెడ్డి వేంకటాద్రి నాయని రాజ్యంలో ఒక చిన్న పల్లెకు కరణం. నిరతాన్నదాత. ఈయన అన్నదానఖ్యాతి కాశీరామేశ్వరాల

పర్యంతం వ్యాపించి ఉండేవట. ఈయన దానశీలాన్ని తెలిపే చాటువులు దొరుకుతున్నాయి. (చా.ప.ర.)

బందా రమణప్ప

స్థలం : కొత్త పట్టణం (ప్రకాశం జిల్లాలోనిది).

చాటుకవి. ఈ కవి ఒంగోలు వెంకన్న అనే ఆయన మీద ఆగ్రహం వెలిబుచ్చుతూ ఒక పద్యం చెప్పాడు. (చా.ప.ర )

బంధకవిత

చతుర్విధ కవితా భేదాలలో ఒకటి. కొందరు దీన్ని చిత్రకవితలో భాగంగా చెప్పారు. గోమూత్రికా, ఛత్ర, గుచ్ఛ, నాగ, కంకణ, మర్దల, ఖడ్గ, చక్ర, పద్మ, సర్వతోభద్ర, రథ పుష్పమాలికాది చిత్రాలలోని ఇళ్ళలో పద్యాక్షరాలను ఇమడ్చటం బంధ కవిత అంటారు. అందులో రథ చక్రాది కతిపయ బంధాలలో కవినామం, కృతినామాలు వచ్చేటట్లు వ్రాయాలి పత్రాల మీద, ఖడ్గం మీద శాసనాలు వ్రాసిపంపే ఆచరణలో నుండి ఈ ఖడ్గ బంధాది కవిత్వం అవతరించి ఉండవచ్చునని పండితాభిప్రాయం. కవి ఎంతో నేర్పుతో, శ్రమతో రచించే ఈ బంధ కవిత పండితులకు క్రీడావినోదం. గణపవరపు వెంకటకవి, రావు కొండల రాయుడు, మండపాక పార్వతీశ్వరశాస్త్రి మొదలగు వారు ఈ కవితలో ప్రసిద్ధులు. (తె. వి. స–6)

బచ్చలి వీర వెంక కవి

కాలం : క్రీ. శ. 1750 ప్రాంతం.

స్థలం : నెల్లూరు మండలం–గోగులపల్లె ప్రాంతం.

రచన : రఘువంశము (ఆంధ్రీకరణం).

నెలూరులోని మారెళ్ళ సీమను అన్న కుమారుడైన సీతారామయ్యతో పాటుగా ఈ కవి పరిపాలిస్తుండేవాడు. ఈ జమీని ఆర్కాడు నవాబు బాకరల్లీఖాను వీరికి ఇచ్చాడట. (క శ–13–41)

బచ్చు సిద్ధకవి

కాలం : క్రీ. శ. 15వ శతాబ్దం.

రచన : మఠి బసవపురాణము (ద్విపద).

గురువు : సిరిపురి వీరసింగయ.

కవి తన రచనను తన దీక్షాగురువైన వీరసింగయకే అంకితం చేశాడు. రచనలో కర్ణాటక పదాలు హెచ్చుగా వాడాడు. రచనా విధానంలో, వర్ణనారీతులలో పాల్కురికి సోమనను అనుసరించాడు. భక్తిపారవశ్యంతో కవిత్వం చెప్పినకవి. (ద్వి.సా.చ–157)

బచ్చు సూర్యని శాసనము

కాలం : క్రీ. శ. 1218 ప్రాంతం.

శాసనప్రదాత : బచ్చు సూర్యుడు.

శాసన విషయం : మొదటి పద్యంలో బచ్చు సూర్యుని గురించి విపుల వర్ణనముంది. తరవాత సీసపద్యం నష్టమైంది. చివరి ఎత్తు గీతిలో సూర్యుడు గోపాలదేవునికి ఏదో ఒక దానాన్ని దేవభోగంగా ఇచ్చినట్లుంది. దీనిలో ఒక శార్దూలం, నష్టమైన సీస పద్యం, చివరఎత్తు గీతి ఉన్నాయి. (తె.క.చ-315)

**బట్టు మూర్తెన్న**

కాలం : క్రీ. శ. 17 వ శతాబ్దం.

సోమరాజు రామకవికి సత్కారం సరిగా జరగకుండా ఈ మూర్తెన్న అడ్డు మాట వేశాడట. అందుపై రామకవి ఈయనను తిడుతూ ఒక పద్యం చెప్పాడు. (చా.ప ర.)

**బట్టేపాటి తిమ్మయ్య**

కాలం : క్రీ. శ. 1600 ప్రాంతం.

స్థలం : నెల్లూరు మండలంలోని బట్టేపాడు.

రచనలు : 1. ద్విపద భారతము (కొన్ని పర్వాలు మాత్రమే) 2. నలచరిత్ర.

ద్విపద భారత కవిత్రయంలో మొదటి వాడు. ఇతని తండ్రి వల్లభసూరి. ప్రౌఢంగా, రసవంతంగా కవిత్వం చెప్పిన కవి. నరసయ్య గారి చౌడయ్య ఈ కవిని ప్రోత్సహించి రచనలు చేయించాడు. ద్విపద భారతంలో, ఆదిపర్వం నుండి ద్రోణ పర్వం వరకు (సభా పర్వం తప్ప) ఇతడే వ్రాశాడు. అంతే కాకుండా, అరణ్య పర్వం లోని కొన్ని కథలను ప్రత్యేక ద్విపద కావ్యాలుగా వ్రాశాడు. అందులో నలచరిత్ర మాత్రమే లభించింది.

వీరి ఇంటి పేరు అత్మకూరు వారనీ, బట్టేపాడు నివాసం వల్ల బట్టేపాడు తిమ్మనగా ప్రసిద్ధుడైనాడనీ అంటున్నారు. (అరుద్ర-10-19)

**బడగలనాటి నరసకవి**

కాలం : క్రీ. శ. 18 వ శతాబ్దం.

స్థలం : తంజావూరు.

రచన : ఏకవీరామాహాత్మ్యము (నింబజామాహాత్మ్యము).

తంజావూరులో ధేనువాశము గరిడికి చెందిన తొక్కడము మన్నారు జెట్టి ప్రేరణతో రచనలు చేశాడు.

ఇతని ఇంటి పేరును బడగల పాటిగా కొందరు పేర్కొన్నారు. ఇతని రచనలో కొన్ని దోషాలున్నా, శైలి సరళమై జనాదరణను పొందింది. (ద.దే.వా-291)

**బడగలపాటి నరసకవి**

చూ. బడగలనాటి నరసకవి.

## బణపతి (వనపతి)

నామాంతరం : శ్రీనాథుడు.

కాలం : క్రీ. శ. 1075-1081.

బిరుదులు : ఖండన విజయుడు, విజయగోపాలుడు, చలమర్తి గండడు.

శ్రీకాకుళం జిల్లా నరసన్నపేట తాలూకా దీర్ఘాసిశాసనం వేయించాడు.

ఈయన, కళింగదేశాన్ని క్రీ. శ. 1069-76 వరకు పాలించిన గంగవంశీయ దేవేంద్రవర్మకు దండనాయకుడు, మాండలికుడు. అనేక రాజ్యాలు జయించాడు. 1075 లో దీర్ఘాసిలో దుర్గాదేవి ఆలయానికి నాట్యశాల కట్టించాడు. దీపదానం చేశాడు ఈయన భార్య పద్మావతి, దక్షారామ భీమేశ్వరునికి అఖండదీపం నెలకొల్పి శాసనం వేయించింది.

(తె క.చ-166, 167)

## బణపతి దీర్ఘాసిశాసనము

కాలం : క్రీ. శ. 1075-1081 ప్రాంతం.

శాసన ప్రసక్తుడు : బణపతి (వనపతి).

శాసన స్థలం : శ్రీకాకుళం జిల్లా-నరసన్నపేట తాలూకాలోని దీర్ఘాసిగ్రామం.

శాసన విషయం : దీనిలో తెలుగులో సీసపద్యమాలిక ఉంది. వాఙ్మయ ప్రసిద్ధిగల శాసనం. కళింగ గంగరాజుకు, (దేవేంద్రవర్మ) చోళచాళుక్య రాజులకు సంబంధించిన చారిత్రక విషయాలను ఇది తెలియచేస్తుంది. దీనిలో 23 పంక్తులున్నాయి. 16 పంక్తులు సంస్కృతం, తక్కిన ఏడు పంక్తులు తెలుగు. ఇది దుర్గమెట్ట అనే చిన్న కొండపై ఒకరాతి పలకమీద చెక్కబడింది. (తె.క.చ-166)

## బతుకమ్మ పండుగ - బొడ్డెమ్మ పండుగ

ఆంధ్రదేశంలో ఒక్క తెలంగాణలోనే విశేష ప్రచారాన్ని పొందినవి ఈ రెండు పండుగలు. ఆశ్వయుజ శుద్ధ పాడ్యమినుంచి మహర్నవమి వరకు తొమ్మిది రోజులు ఈ పండుగ జరుగుతుంది.

బతుకమ్మ పండుగకు తొమ్మిది రోజుల పూర్వమే బొడ్డెమ్మ పండుగ జరుగతుంది. ఇది మహాలయ అమావాస్యతో పూర్తి అవుతుంది. బొడ్డెమ్మ కన్యకలకు ఆరాధ్యదైవం.

వెంపలిచెట్టును మట్టిముద్దలో నిలబెట్టి, ఆ ముద్దను కలశంపై పెట్టి, ఒకపీటమీద నిలిపి - ఆమెను కేంద్రస్థానంలో ఉంచి చుట్టూ బతుకమ్మలను ఉంచుతారు. పసుపు ముద్దలను గౌరమ్మగా భావించి పెండుకొబ్బరిచిప్పలో (కుడుక) పెట్టి, పూవులతో, పసుపు కుంకుమలతో, సుగంధ ద్రవ్యాలతో పూజించి బొడ్డెమ్మ పక్కన నిలుపుతారు.

బొడ్డెమ్మ వీధి మొత్తానికిగాని, ఊరి మొత్తానికిగాని ఒకటే ఉంటుంది. ఇంటింటి బతుకమ్మలను బొడ్డెమ్మ చుట్టూ నిలుపుతారు. ముత్తైదువలు, అవివాహితలైన కన్యలు. బాలికలు, చప్పట్లు చరుస్తూ, దాని చుట్టూ తిరుగుతూ, గౌరమ్మ పాటలు గానం చేస్తారు,

తొమ్మిదోరోజు బొడ్డెమ్మను పూజించి కలశంలో పిల్లలు ప్రతిరోజూ తెచ్చిపోసే బియ్యం పరమాన్నంగా వండి పంచిపెడతారు. తరవాత బొడ్డెమ్మను నీటిలో వదులుతారు. ఈ పండుగలో పాడే జానపద గేయాలు చాలా ఉన్నాయి.

ఇక బొడ్డెమ్మ పండుగ తరవాత వచ్చే పండుగ బతుకమ్మ పండుగ. దీనికి 'బతుకమ్మ పంతగ'వి వ్యవహార నామముంది. గ్రామసీమలో ఉండే రకరకాల పువ్వులతో బతుకమ్మను పేర్చి, దానిపై పసుపుతో తయారుచేసిన గౌరమ్మను నిలుపుతారు. ముత్తైదువులు అడుగులకు మడుగు లొత్తుతారు. పసుపు కుంకుమలతో నిండార నింపి, పగటి పూటనే బతుకమ్మలను ప్రతిష్ఠించి, సాయంత్రం నాలుగు గంటలకు విలువైన వస్త్రాలను భూషణాలను ధరించి, వీథిలో బతుకమ్మ ముందు చప్పట్లు చరుస్తూ, బతుకమ్మ పాటలు రమ్యంగా పాడుతారు. ఆ తరువాత బతుకమ్మలను తీసుకొని ఊరిబయట కాలువకో, చెరువుకో, బావికో వెళ్ళి బతుకమ్మలను అక్కడ నిలిపి, అందరూ చుట్టూ గుమిగూడి, వలయాకారంగా తిరుగుతూ, చప్పట్లు చరుస్తూ, పాటలుపాడుతూ, బతుకమ్మను ఆరాధిస్తారు. పాటలు పాడుతూ స్త్రీలుచేసే వలయాకార నృత్యం కన్నుల పండువుగా ఉంటుంది. ఈ పాటలలో లక్ష్మీ పార్వతుల స్తోత్రాలేగాక, పౌరాణిక గాథలు కూడా ఉన్నాయి.

బతుకమ్మ ఎందరో చనిపోగా చివరకు బ్రతికిన సంతానమనీ, అందుకే బతుకమ్మ అనే పేరు వచ్చిందనీ జానపద గేయాలను బట్టి తెలుస్తుంది. ఈ పండుగ తెలంగాణాలో విశిష్టమైందేగాక, అతి ప్రసిద్ధమైంది కూడ.

(చూ. గొండ్లి నృత్యం) (నా.ర.చ-288-291)

## బత్తీసుపుత్రి కథలు

రచనాకాలం : క్రీ.శ. 1847.

కర్త : వాద్రేవు వెంకయ్య

విక్రమార్క చరిత్రమని పేరు పొందిన సింహాసన ద్వాత్రింశిక అనే సంస్కృత గ్రంథానికి తెనుగుసేత. వచనరూపం. ఇందులో 32 బొమ్మల కథలు ఉన్నాయి. శైలి సరళ వ్యావహారికంలో ఉంది. (వ. వా-61)

## బదిర కృష్ణభూపాలుడు

కాలం : క్రీ.శ. 1700 ప్రాంతం.

స్థలం : సేలం ప్రాంతం.

బిరుదులు : గంగువాడ హదినెంట మన్నియర గండ.

ఇతడు గామాంబికా, చిన్న భూపాలుల కుమారుడు. సాహిత్య పోషకుడు. రేపూరి అనంతయ్య నుండి గాధేయోపాఖ్యానం అంకితం పొందాడు. యాదవరాయ స్థాపనాచార్యుడుగా పేర్కొనబడ్డాడు. ఇతని తండ్రి కూడ రేపూరి అనంతయ్యను కాంచనాంబర గజాశ్వ గ్రామ భూషాదులతో సత్కరించాడట. అతడుకూడ కవి అనీ, తారావళీ దండ

కాది చాటు కృతులు చెప్పాడనీ గాధేయోపాఖ్యానం అవతారికలో ఉంది.
(క. త-12-166; ఆరుద్ర-12-89)

## బద్దెన

కాలం : క్రీ. శ. 13వ శతాబ్ది పూర్వార్ధంగాని, ఉత్తరార్ధంగాని కావచ్చు.
రచనలు : నీతిశాస్త్ర ముక్తావళి, సుమతీ శతకము (కర్తృత్వం వివాదాస్పదం).
బిరుదు : కావ్య చతుర్ముఖుడు.

భద్రభూపాలుడు బద్ధి భూపతి, బద్ది నృపాలుడు, బద్ది నరేంద్రుడు మొదలగు 19 బిరుదు పేర్లతో కవి తన్ను చెప్పుకొన్నాడు. ఇతని శైలి చక్కగా ఉంటుంది. తిక్కన, నన్నె చోడుల రచనా శిల్పముంది. సుమతి శతకం బద్దెన వ్రాశాడని కొందరు పండితుల అభిప్రాయం. (ఆరుద్ర-2)

## బద్దెపూడి ఎల్లుభూపతి

కాలం : క్రీ. శ. 18 వ శతాబ్దం.
స్థలం : బద్దెపూడి (బద్యపూడి). మధుర మండలం.
రచన : యువజన హృదయానందము.

కృష్ణమహీపతి, మీనాంబల పుత్రుడు. బద్దెపూడిని పాలించిన సంస్థానాధిపతి. విజయరంగ చొక్కనాథుని సామంతుడు. అతనిచేత విశేష గౌరవాలను పొందినట్లు చెప్పుకొన్నాడు.

కవిస్తుతిలో రేవూరి అనంతయ్యను పేర్కొన్నాడు తన పూర్వులను ఇష్ట దేవతా స్తుతిలో దేవతల వలె స్తుతించాడు ఇతని రచన ప్రౌఢంగా రసవంతంగా ఉంటుంది (ద.దే.వా-382)

## బద్దెవీటి దత్తప్ప కవి

కాలం : క్రీ.శ. 16 వ శతాబ్దం - ఉత్తరార్ధం.
స్థలం : పుంగనూరు సంస్థానం.
రచన : గణిత దీపిక.

పుంగనూరు సంస్థానాశ్రితుడు. పుల్లయామాత్యుని పుత్రుడు. సుగుటూరి చిక్కరాయని (1560-75) కోరిక మేరకు "గణితదీపిక" రచించాడు. దీని వ్రాతప్రతి అడయారు గ్రంథాలయంలో ఉన్నదట.
(ఆం.సం.సా-261 ; ఆరుద్ర-9 ; ద.దే.వా-489)

## బప్పన కవి

కాలం : క్రీ. శ. 14 వ శతాబ్దం.
స్థలం : కొండవీడు.
రచన : ఆంధ్ర ప్రయోగ రత్నాకరము.

కొండవీటి రెడ్డిరాజుల కాలం వాడు. తన గ్రంథాన్ని తండ్రికే అంకితం ఇచ్చాడని తెలుస్తున్నది. ఇతడు గొప్ప వ్యాకరణ పండితుడట. (క.స-139)

### బమిడిపాటి (భమిడిపాటి) వేంకటనరసయ్య

కాలం : క్రీ. శ. 1829 ప్రాంతం.
స్థలం : మదరాసు.
రచన : రాధామాధవ సంవాద కావ్యానికి టీక.

విద్వత్కవి. ఆంధ్రభాషోద్ధారకుడైన బ్రౌన్ దొర ఇతనిచేత వెలిదండ్ల వేంకటపతి రచించిన రాధామాధవ సంవాదానికి టీక వ్రాయించాడు. ఈ పండితుని రచనలు తెలియరాలేదు. (వ.దే.వా-499)

### బమ్మెర కేసకవి - మల్లకవి

(తెలుగు జంటకవులలో అయిదో జంట.)
కాలం : క్రీ.శ. 16 వ శతాబ్ది చివర భాగం.
స్థలం : బమ్మెర (తెలంగాణాలో పాలకుర్తి సమీపగ్రామం).
రచనలు : 1. విష్ణు భజనానందము 2. దాక్షాయణీ పరిణయము.

విశిష్టత : వీరు బమ్మెర పోతన వంశపు వారు. కొందరు కేసనను పోతన్న కుమారుడంటారు. మరికొందరు మల్లన పోతన కుమారుడంటారు "ప్రౌఢ సరస్వతి" బిరుదాంకితుడైన మల్లనకు ఇద్దరి భార్యల వల్ల కేసకవి, మల్లకవి కలిగారని కొందరంటున్నారు. వీరు పోతనకు మునిమనుమలని మరికొందరి అభిప్రాయం. వీరు గోదావరి ప్రాంతాలకు వచ్చి అజ్జరం గ్రామంలో వియ్యమందారట. పెనుమత్స నారపరాజు ఈ కవులను పోషించి "విష్ణుభజనానందం" కృతి వ్రాయించాడు. ఒడయనంబి విలాసం కృతికర్త అజ్జరపు పేరయలింగం వీరికి దావమరిది. రసవంతమైన మనోహరమైన కవితా వైదుష్యం వీరిది. వీరి రచనల నుండి పూర్వకవులనేకులను గురించి తెలుస్తున్నది. (ఆంధ్ర-9; క.స-46)

### బమ్మెర పోతన

కాలం : క్రీ. శ. 1400 - 1450 ప్రాంతం.
స్థలం : రాచకొండ-దేవరకొండ రాజ్యం.
బిరుదు : సహజ పాండిత్యుడు.
రచనలు : 1. భాగవతము 2. భోగినీదండకము 3. వీరభద్ర విజయము.

ఈయన మహాభక్తుడు. రాజులకు లోబడకుండా వ్యవసాయంతో జీవించిన హాలికుడు. సహజ పాండిత్యమున్నవాడు. ఈయన కవిసార్వభౌముడైన శ్రీనాథునికి దావమరిది అని ప్రతీతి. ఆంధ్రభాగవతం ఈయన కీర్తికి పరాకాష్ఠ. పోతన ఆత్మీయాంశమైన భక్తిభావం భాగవతంలో మెండుగా కనిపిస్తుంది. ఇతని వర్ణనలు మిక్కిలి విశదాలై వర్ణ్యం పఠితలకు సాక్షాత్కరిస్తుంది. ఈయన శైలి అతి మధురమైంది. తెలుగు భాషకు విసర్గమైన సంగీత మాధుర్యం ఈయన భాగవతంలో సర్వతోముఖంగా కనిపిస్తుంది. ఈయనకు అలంకార ప్రీతి మెండు. వర్ణనల సందర్భంలో అంత్యాను ప్రాసాలంకారం ఎక్కువగా వాడాడు ఈయన భాగవతం తెలుగుదేశంలో పండితులకు, పామరులకు, వృద్ధులకు, బాలురకు, స్త్రీలకు, పురుషులకు - సర్వులకూ ప్రీతి పాత్రమైన మహాకావ్యము.

ఈయన తన కృతియైన భాగవతాన్ని సర్వజ్ఞ సింగభూపాలునికి అంకితం ఇవ్వలేదన్న కారణం వల్ల, రాజు పోతన్నను చాలా కష్టాలు పెట్టాడని, భాగవతం వ్రాత ప్రతిని నాశనం చేయించాడని తెలుగుదేశంలో బలమైన ప్రతీతి ఉంది. (వా.చ.)

**బమ్మెర మల్లన**

కాలం : క్రీ.శ. 16వ శతాబ్దం.

స్థలం : తెలంగాణాలోని పాలకుర్తి సమీపంలోని బమ్మెర గ్రామం.

రచనలు : తెలియరాలేదు.

బిరుదు : ప్రౌఢ సరస్వతి.

జంటకవులైన బమ్మెరకేసకవి, మల్లకవి ఇతని కుమారులని కొందరంటున్నారు ఇతడే ప్రౌఢకవి మల్లన్న అని మరి కొందరి అభిప్రాయం. (ఆరుద్ర-9)

**బయకార రామప్ప**

కాలం : క్రీ.శ. 16వ శతాబ్దం.

రచన : స్వరమేళ కళానిధి.

విశిష్టత : ఈయన అళియరామ రాయలకు దండనాథుడు, సంగీత విద్వాంసుడు. ఈ బయకార రామప్పకు పినతండ్రి అచ్యుత దేవరాయల మంత్రి బాచమరుసయ్య. (బాచమరుసు కొండవీటి సీమ బ్రాహ్మణులను హింసిస్తే పలకలూరి గోపన్న అతని మీద ఒక చాటువు చెప్పాడు). (ఆరుద్ర-9)

**బయ్యనసెట్టి శాసనము (కొణిదెన)**

కాలం : క్రీ.శ. 1150 ప్రాంతం.

స్థలం : పెనుగొండ.

శాసనప్రదాత : కాపయసెట్టి కుమారుడు బయ్యనసెట్టి.

ప్రస్తావిత స్థలాలు : గుండికర్రు, మొట్టవాడి, కొట్టియదొన (కొణిదెన).

శాసన విషయం : సూర్యవంశ క్షత్రియుడు, వెలనాటి తెలుగు చోడుడైన త్రిభువనమల్లుడు కమ్మనాటిని ఏలేటప్పుడు, శాసన ప్రదాత బయ్యనసెట్టి కొణిదెన సమీపంలోని కొండమీద వేంచేసిన కేశవస్వామికి అఖండ దీపం నిలిపినట్లు ఈ శాసనం ద్వారా తెలియవస్తుంది. దీనిలో ఎత్తు గీతితో ఒక సీస పద్యముంది. (తె క.చ-249)

**బలభద్రదాసి**

కాలం : క్రీ.శ. 1829కి పూర్వం.

రచన : కపోత వాక్యము.

అంకితం : కర్పూర చెన్నునికి.

ఈమె సోమయ సోముని భామయైన మల్లాంబిక పట్టి. పేరును బట్టి స్త్రీ అనే అనిపిస్తున్నది. తల్లి పేరు మాత్రమే స్పష్టంగా చెప్పుకోవడమూ, ఆమె సోమయ సోముని భామ అని అనడమూ పేరులో 'దాసి' అని ఉండడమూ, రచయిత స్త్రీ అనీ

దేవదాసి అయి ఉండవచ్చుననీ అనుకోవడానికి ఆధారాలుగా ఉన్నాయి.
(య.వా.చ-99)

**బలభద్ర విజయము**

కర్త : లోకేరావు సోమన (చూ).
స్థలం : క్రీ. శ. 1600 ప్రాంతం.

ద్విపద కావ్యం. దీని నుండి కవి ఇతర రచనలు తెలుస్తున్నాయి. ఇతి వృత్తం భాగవతంలోనిది. దుర్యోధనుని కుమార్తె లక్షణను సాంబుడు తీసుకొని రావడం, దుర్యోధనాదులు సాంబునితో యుద్ధం చేసి వారిని బంధించడం-శ్రీకృష్ణాదులు కౌరవుల మీదికి యుద్ధసన్నద్ధులు కాగా బలభద్రుడు (బలరాముడు) ఒక్కడే కొంత సైన్యంతో వెళ్ళి సాంబుని లక్షణను తీసుకరావడం దీనిలో రమణీయంగా వర్ణించబడ్డాయి. కవిత్వం నిర్దుష్టంగా, ప్రౌఢంగా, వీరరస ప్రధానంగా ఉంది. (ఆరుద్ర-10-231; ద్వి.సా.చ-241)

**బలరామ క్షేత్ర మాహాత్మ్యము**

కర్త : చూ. మండపాక కామకవి.

ఈ కవి రచనల్లో ఇది ప్రసిద్ధమైనది.

అయిదాశ్వాసాల స్థల పురాణం. శ్రీకృష్ణుని సోదరుడైన బలరాముడు వరాహ వర్తినీ విషయంలో ప్రతిష్ఠించిన అయిదు శైవ క్షేత్రాల కథ ఇందులో ఉంది.
(ఆం. సం. సా-308)

**బలరామ చరిత్రము**

నామాంతరం : ప్రబంధరాజ శిరోభూషణ ప్రకృష్ట బలరామ చరిత్రము. (చూ).
కర్త : గుడారు వేంకటదాసు.

**బలిజేపల్లి వారు**

"పల్లి" శబ్దం చివరగా ఉన్న గ్రామనామంతో ఉన్న ఇంటి పేరు. చింతపల్లి, గుంటుపల్లి ఇలాంటి ఇంటి పేర్లు. (భారతి-మార్చి-45-228)

**బవనీలవారు**

నామాంతరం : చూ. బైండ్లవారు.

**బసవ కల్యాణము**

కర్త : చెల్వూరు సన్యాసి.

ఈ యక్షగానంలో నీలమ కల్యాణమే విపులంగా వర్ణితమైనది. దీనిని యక్ష గాన ప్రబంధంగా కవి పేర్కొన్నాడు.

దీనిలో దరువులు, ద్విపద, పద్యాలు, లయగ్రాహి, రెండేసి రగడలు, చూర్ణి కలు, దండకములు, కొట్నము పాట, నివాళి పాట, శోభనము మొదలయినవి ఉన్నాయి.
(య వా.చ-362)

బసవ గీతములు (అలభ్యం)
రచనాకాలం : క్రీ. శ. 1150 ప్రాంతం.
కర్త : మల్లికార్జున పండితుడు

బసవన్న విషం త్రాగే కథ
ఇది పాల్కురికి సోమన విరచిత బసవ పురాణంలోని కథ. బసవన్న విషాన్ని నూరించటం, అది పొగలు గ్రక్కటం, అది శివునికి నైవేద్యం పెట్టి "గ్రోలండ"ని పేరు పేరునా భక్తులకు వడ్డించటం ఉత్తేజంగా ఉంటుంది. ఈ ఘట్టాన్ని అచ్చంగా శివుడే హాలాహలం త్రాగినట్లు సోమన్న వర్ణించాడు. (అరుద్ర-2-213)

బసవన స్తోత్రము
కర్త : చూ. పాల్కురికి సోమన.
రచనాకాలం : క్రీ. శ. 13 వ శతాబ్దం.
ఈ స్తోత్రంలో అయిదు మాలినీ వృత్తాలున్నాయి. (యు భా.చై.ల.)

బసవ పురాణము
కర్త : తుమ్మలపల్లి నాగభూషణ కవి.
పద్యకావ్యం. వీరశైవాంధ్ర వాఙ్మయ చరిత్రలో దీని ప్రసక్తి ఉంది.
(వీ. శై. వా. చ. 179)

బసవ పురాణము
కర్త : పాల్కురికి సోమనాథుడు.
రచనాకాలం : క్రీ. శ. 13వ శతాబ్దం.
శ్రోత : గొబ్బూరి సంగనామాత్యుడు.

తెలుగులో తొలి ద్విపద కావ్యం. ఏడు ఆశ్వాసాలున్నాయి.

విశిష్టత : ఇది శైవ మతోద్ధారకుడైన బసవేశ్వరుని చరిత్ర. ఇంకా సుమారు 75 మంది శివభక్తుల కథలున్నవి. కరస్థలం సోమనాథయ్య, రేంటాల మల్లినాథుడు, గోడగిరి త్రిపురారి మొదలగు వారు ఇతన్ని ఈ కృతి రచించమని ప్రోత్సహించారట. ఈ కావ్యాన్ని కన్నడ, తమిళ, సంస్కృతాలలోకి చాలామంది పరివర్తనం చేశారు. జాను తెలుగులో సర్వ సుబోధకంగా వీరశైవమత బోధ ఉంటుంది. "భక్తులచే విన్నమాడ్కి" దీనిని కవి చెప్పాడు. కథా కథనం అపూర్వం. వ్యాకరణ ఛందోనియమాలు కొన్ని సడలించి రచన చేయటం జరిగింది.

దీనిలోని కథలను గ్రహించి కన్నడంలో దీనిని చాలామంది ప్రత్యేక ప్రబంధాలుగా వ్రాశారు. భీమకవి (క్రీ. శ. 1369) దీనిని షట్పది వృత్తంలో మూలానుసారంగా వ్రాశాడు.

సింగరాజు క్రీ. శ. 1500 ప్రాంతంలో దీనిని 'సింగరాజు పురాణం' పేరుతో కన్నడంలోకి అనువదించాడు

వృషాంకకవి అనే ఆయన క్రీ. శ. 1655 ప్రాంతంలో 'బసవరాజు విజయం. లేక 'వృషభేంద్ర విజయ'మనే పేర చంపువుగా వ్రాశాడు.

కన్నడ దేశీయులకి గ్రంథం పరమ పవిత్రమైనది.

(ఆరుద్ర-2; క. త-3; సా. మంజూష-61)

**బసవ పురాణము**

కర్త : పిడుపర్తి సోమనాథ కవి.
రచనాకాలం : క్రీ. శ. 1480 ప్రాంతం.
అంకితం : పాల్కురికి సోమనాథునికి.

విశిష్టత : చంపూ కావ్యం. పాల్కురికి సోమన ద్విపద బసవపురాణానికి ఈ కావ్యం పద్యరూపం.

ఏడాశ్వాసాలున్నాయి. తండ్రియైన బసవ శౌరి అనతిపై కవి ఈ రచన చేసి పాల్కురికి సోమనాథునికి అంకితమిచ్చాడట. (క. త-6-80)

**బసవ మహిమామృత విలాసము**

కర్త : కానూరి వీరభద్రకవి.
అంకితం : కొలనుపాక సోమేశ్వర స్వామికి.

యక్షగానం. దీనిలో బలదేవ దండనాథపుత్రి అయిన గంగమను, రాజసోదరి నీలను బసవేశ్వరుడు వివాహమాడటం, తరవాత బసవేశ్వరుని ఔదార్యం మహిమలు మొదలయినవి వర్ణితాలు.

దీనిలో ద్విపద, దరువులు, లాలి, సివ్వి, అల్క, దండె ఆడింపు పాటలు, పద్యాలు, వచనాలు ఉన్నాయి. దీనిని కవి సంగీత ప్రబంధంగా పేర్కొన్నాడు.

(య. వా. చ-361)

**బసవ రగడ (కన్నడం)**

కర్త : పాల్కురికి సోమన.
రచనాకాలం : క్రీ.శ. 13వ శతాబ్దం.

విశిష్టత : 108 పాదాలతో ఉన్న ఒక సాహిత్య ప్రక్రియ. శైవ మత పరమైన ఇతివృత్తంతో చేసిన రచన. (యు. భా; శై. ల)

**బసవరాజు**

కాలం : క్రీ. శ. 15వ శతాబ్దం.

ఉదయగిరి దుర్గ పాలకుడు. కృతిపతి. దూబగుంట నారాయణకవి రచించిన పంచతంత్ర కావ్యం ఇతనికే అంకితం. ఇతడు పూసపాటి వంశీయుడు. గజపతులకు సామంతుడుగా ఉదయగిరిని పాలించాడు. (ఆరుద్ర-6-126)

**బసవరాజు నాగేంద్రకవి**

కాలం : క్రీ. శ. 17వ శతాబ్దం.

రచన : ఆనంద సుందరీ చాతుర్య విలాసము.

పాపనామాత్యుని పుత్రుడు. రమాధీశ్వర శతక కర్త ఇతడేనేమో అని కొందరు భావిస్తున్నారు. ఈ కవి రచన హృద్యంగా ఉంటుంది. ఇతడు విశిష్టాద్వైతి. (శ. క. చ-836)

**బసవ విజయము**

కర్త : నల్లనగంట్ల నారనారాధ్యుడు.

కాలం : క్రీ. శ. 18 వ శతాబ్దం కావచ్చును.

మూడాశ్వాసాల ద్విపద కావ్యం. బసవేశ్వరుని కథ ప్రధానేతివృత్తం. దీని ప్రతి వేంకటేశ్వర ప్రాచ్య పరిశోధనా సంస్థలో ఉంది (ద్వి.సా.చ-155)

**బసవ విజయము**

రచనా కాలం : క్రీ. శ. 18 వ శతాబ్దం.

కర్త : మల్లంపల్లి నాగభూషణకవి.

మూడాశ్వాసాల ప్రబంధం. వీరశైవ మత స్థాపకుడైన బసవేశ్వరుని చరిత్ర ముఖ్యంగా వర్ణితం పాల్కురికి సోమనాథుని ప్రసక్తి కూడా ఉన్నదట. కవిత్వం అంత ప్రశస్తం కాదని విమర్శకుల అభిప్రాయం. (క.న-107)

**బసవాఢ్య రగడ (కన్నడం)**

కర్త : పాల్కురికి సోమనాథుడు.

శైవధర్మ ప్రతిపాదకమైన రచన

**బసవాష్టకము**

కర్త : చూ. పాల్కురికి సోమన.

రచనాకాలం : క్రీ. శ. 13 వ శతాబ్దం.

ప్రత్యేకత : తెలుగు భాషలో 8 మాలినీ వృత్తాలతో స్తోత్రముంది. (యు భా: చై .ల.)

**బసవేశ్వరుని కథ**

ఇది పాల్కురికి సోమన్న విరచిత బసవ పురాణంలోని కథ. బసవేశ్వరుడు వీరశైవ మత ప్రవక్తలలో అగ్రగణ్యుడు. కైలాస వర్ణనతో కథ ప్రారంభమౌతుంది. శివుడు నందిని భూలోకంలో జన్మించి శైవ మతోద్ధరణ చేయమంటాడు. నంది బసవన్నగా జన్మిస్తాడు. ఉపనయనం అక్కరలేదని తల్లిదండ్రులతో వాదిస్తాడు. శివుడే ప్రత్యక్షమై బసవన్నకు శైవధర్మాలు ఉపదేశిస్తాడు. రెండో ఆశ్వాసంలో బసవని శివాచార విరతి, మంత్రి కావడం, వంగకాయలను లింగకాయలు చేయడం, జొన్నలను ముత్యాలు చేయటం మొదలయిన విషయాలున్నాయి. మరికొందరి దేశభక్తుల గాథలున్నాయి. మూడో ఆశ్వాసంలో బసవన్న తన భార్య చీర విప్పించి జంగాలకిచ్చిన కథ, ఇతర ముగ్ధ భక్తుల కథలు ఉన్నాయి. (చూ. బసవపురాణము) (అముద్ర-2-211-212)

**బసవోదాహరణము**

రచనాకాలం : క్రీ. శ. 13 వ శతాబ్దం.

కర్త : పాల్కురికి సోమన.

ప్రత్యేకత : ఉదాహరణ కావ్యం. ఒక సాహిత్య ప్రక్రియ. సోమన తెలుగు సంస్కృతాలలో రెండు బసవోదాహరణలు రచించాడట ఇందులో బసవనారాధ్యుని మహిమలు వర్ణితాలు. (క త-3-110; యు భా; చై .ప.)

**బహిరీ పెదనాయకుడు**

కాలం : క్రీ. శ. 19 వ శతాబ్దం.

సురపురం సంస్థానాధీశుడు సాహిత్యపోషకుడు.

క్రీ. శ. 1803 వరకు సురపురం సంస్థానాన్ని పాలించిన వేంకట నాయకుని వారసుడు. వేంకట నాయకుని భార్య 'కాటవ్వ' తరువాత ఈ పెద నాయకుడు సంస్థానాన్ని పాలించాడు. ఇతడు దేవబ్రాహ్మణ భక్తితత్పరుడు. భారతరామాయణాదులు ఇతని నిత్యపారాయణ గ్రంథాలు. వేద విదులైన బ్రాహ్మణులకు అనేక అగ్రహారాలు దానం చేశాడు. పూనాలోని వేదపండితులైన బ్రాహ్మణులకు శ్రావణ దక్షిణ క్రింద అనేక వేల రూపాయలు వ్యయం చేసిన దాత. (ఆం.సం.సా-518)

**బహుజనపల్లి సీతారామాచార్యులు**

కాలం : క్రీ శ. 1827 నుండి క్రీ. శ. 20-3-1891 వరకు.

జన్మస్థలం : నాగపట్టణం.

నివాసస్థలం : చెన్నపట్టణం.

రచనలు : సౌందర్య రాజస్వామి శతకము (1849), వైకృతదీపిక, పదార్థ నామ కోశము, బాల చంద్రోదయము (1871), అలఘు కౌముది (1872), త్రివిధ నీతిమాల (1872), సతీధర్మ సంగ్రహము, ప్రపన్న పారిజాతము (1887), ఆంధ్ర శబ్దమంజరి, ఉపాధ్యాయ బోధిని, వినాయక శతకము, త్రిలిఙ్గ లక్షణశేషము, శబ్ద రత్నాకరము (1885).

గురువు : పరవస్తు చిన్నయసూరి.

ఇతని బాల్యమంతా జన్మస్థలమైన "నాగపట్టణం"లోనే గడచింది. పండిత కుటుంబం కాబట్టి, ఇతని జనకుడే ఇతనికి విద్యాగురువైనాడు. కవితా రసధార బాల్యంలోనే కలిగింది. ఆకారణం చేత నాగపట్టణంలో ఉన్న సౌందర్య రాజస్వామిపై శబ్దాలంకార భరితమైన శతకం వ్రాశాడు. శతక రచనాకాలం నాటికి కవి వయసు 22 ఏండ్లు.

ఆ తరువాత కవి మద్రాసు పట్టణాన్ని చేరుకున్నాడు. అక్కడ చిన్నయసూరి, పురాణం హయగ్రీవశాస్త్రి వంటి ప్రముఖులతో పరిచయం కలిగింది. క్రీ.శ. 1864 లో ఇతనికి మద్రాసులోని బోధనాభ్యసన పాఠశాలలో ద్వితీయ తెలుగుపండితునిగా

ఉద్యోగం లభించింది. తరవాత కాలంలో ప్రథమ పండితస్థానాన్ని ఆక్రమించి, జీవిత పర్యంతం అక్కడే గడిపాడు. ఇతని రచనల్లో త్రిలింగ లక్షణశేషమనే ప్రౌఢ వ్యాకరణం, శబ్ద రత్నాకరం అత్యంత ప్రముఖమైనవి. చిన్నయసూరి "శబ్ద రత్నాకరం" రచనకు పూనుకొని క్రీ.శ. 1862 లో ఆ రచన పూర్తి కాకుండానే మరణించాడు. సీతారామాచార్యులు సూరి నిఘంటువును ఆదర్శంగా తీసుకొని, దానికి తత్సమ పదాలను జోడించి సర్వ ప్రశస్తంగా 'శబ్ద రత్నాకరము'ను పూర్తి చేశాడు. ఈ రచన క్రీ. శ. 1855 లో ఆవిష్కరింపబడింది. శబ్ద రత్నాకర రచనా కాలంలోనే ఈ కవి అనేక ఇతర కృతులు రచించాడు. నిఘంటువు నిర్విఘ్నంగా పూర్తి కావాలని 'వినాయక శతకం' రచించాడట. ఇతని కీర్తిని ఇనుమడింప జేసిన రచనల్లో ప్రౌఢ వ్యాకరణ మొకటి. చిన్నయసూరి వ్రాసిన బాలవ్యాకరణ రచనకు ఇది శేష గ్రంథమని భావించడం చేత దీన్ని "త్రిలింగ లక్షణశేషము" అని పేర్కొన్నారు. చిన్నయసూరి తరువాత ఇతడు ప్రముఖ లాక్షణికుడుగా పేర్కొనబడటానికి ఈ గ్రంథం కారణమయ్యింది.

(ఆం.ర-69-74)

## బహుళాశ్వ చరిత్ర (అలభ్యం)

కర్త : కాకమాని మూర్తి కవి (చూ).

కూచిమంచి తిమ్మకవి తన "సర్వలక్షణ సార సంగ్రహం"లో 'కాకమాని రాయని బహుళాశ్వ చరిత్రనుండి' అని ఉదహరించిన పద్యాలు దామెర్ల వెంగళరాజు బహుళాశ్వ చరిత్రలో కనిపిస్తున్నాయి. కస్తూరి రంగకవి కూడా కొన్ని పద్యాలను ఉదాహరించాడు.

(తె.వి స-6; అరుద్ర-11-61)

## బహుళాశ్వ చరిత్ర

కర్త : దామెర్ల వెంగళ భూపాలుడు (చూ).

అంకితం : దామెర్ల వెంకటాద్రి భూపాలునికి (కవి తండ్రి).

అయిదు ఆశ్వాసాల కావ్యం. 683 గద్య పద్యాలున్నాయి. కథ, గతాను గతికంగా వస్తున్న కావ్యాలకు భిన్నంగా ఉన్నది అవతారికలో కాళహస్తి ప్రభువులను గూర్చిన విశేషాలున్నాయి.

ఇతివృత్తం : శ్రీకృష్ణ బహుళాశ్వుల కథ. ఇందులో కళానిధి కథను కవి క్రొత్తగా కల్పించాడు వేశ్యా వ్యామోహంలో పడి అంతా పోగొట్టుకున్న కళానిధి అనే వాని కథను, శుకయోగి నోట పరీక్షిత్తుకు చెప్పించాడు. నూతన పద ప్రయోగాలతో పదబంధాలతో ప్రౌఢమైన కావ్యం. అపూర్వమైన భ్రమర కూజిత వృత్తాన్ని కవి ఇందులో ఒకచోట వాడాడు.

(అరుద్ర-11-46)

## బళ్లాస్వామి కవి

కాలం : తెలియదు.

రచన : మండపేట పాపమ్మ పేరంటాలమ్మ కథ.

ఈ కవి జీవిత విశేషాలు తెలియవు. ఇతని రచన మాత్రం క్రీ. శ. 1934లో ప్రకటించబడింది. (తె. జా. సా-614)

**బాచ మరుసయ్య**

నామాంతరం : రామయ భాస్కరుడు
కాలం : క్రీ.శ. 16వ శతాబ్దం.
స్థలం : పాదిరి కుప్పం.

విశిష్టత : ఈయన అళియ రామరాజు దండనాయకుడు. అచ్యుత దేవరాయలకు మంత్రి. "స్వరమేళ కళానిధి" కృతికర్త బయకార రామప్పకు ఇతడు పిన తండ్రి. ఎన్నో దాన ధర్మాలు చేశాడు. తిరుపతి దేవస్థానానికి ఎన్నో దానాలు చేశాడు. ఈయన శాసనాలు క్రీ. శ. 1534 నుంచి 1547 దాకా కనిపిస్తాయి. కొండవీడులో గోపీనాథ స్వామిని ప్రతిష్ఠించి, గోపీనాథ పురాన్ని నిర్మించాడు. ధైర్య సాహసాలతో "యవనుల" బలాన్ని గెలిచాడు. ఉద్యోగరీత్యా ఈయన కొండవీటిసీమలో బ్రాహ్మణులను హింసిస్తే ఈయన మీద పలకలూరి గోపన్న చాటువు చెప్పాడు. ఈ చాటువును అప్పకవి ఉదాహరించాడు. (అరుద్ర-9-253)

**బాణాల వీర శరభేంద్రుడు**

కాలం : తెలియదు.
రచన : మహాప్రభు శతకము గోరంట్ల గోపాలుడు.

ఇతడు ధూర్జటి కవి అనంతర కాలం వాడు. భద్రయ్య పుత్రుడు. కాళహస్తి శతకంలోని భావాలను తన శతకంలో వాడుకున్నాడు. (క. స-227)

**బాణాల శంభుదాసుడు**

కాలం : తెలియదు.
స్థలం : పెద్దాడ.
రచన : సారంగధర చరిత్ర.
గురువు : పల్లికొండ గోపాలుడు.

ఈయన కొండపల్లి గోపాలుని కరుణచేత తనకు కవిత్వం అబ్బిందని తన గ్రంథంలో చెప్పుకొన్నాడు. అయ్యప్ప, నాగమాంబల పుత్రుడు.

రసోత్తరమూ, మృదుమధురమూ అయిన ఇతని శైలిని పండితులు ప్రశంసించారు. ఇతని ఇతర రచనలు తెలియరాలేదు (తె. వి. స-6)

**బాణాసుర యుద్ధ-నాటకము**

కర్త : వెలిచేరు వేంకట రామ ప్రధాని.

**బాబా సాహెబు**

నామాంతరం : రెండవ ఏకోజీ (చూ).

**బారిగడుప్పల నృసింహ శతకము**

కర్త : ఏదుట్ల శేషాచలుడు (చూ)

నృసింహస్వామి - జటప్రోలు - సంస్థానాధీశ్వరుల - ఇలవేలుపు. కృతికర్త

వంశం వారు ముందు జటప్రోలు సంస్థానవాసులై ఉండడమే ఈ శతక రచనకు కారణం కావచ్చు.

ఈ గ్రంథంలో అన్నీ సీసపద్యాలే ఉన్నాయి. అన్ని పద్యాలలో ఎత్తుగీతి చివరి రెండు పాదాలు, మకుటం ఒకే విధంగా "ప్రీతి దయతోను నన్ను బ్రోవు యాతుధాన" అని ఉంది

నృసింహస్వామిని ఆపాదమస్తకం వర్ణించే పద్యాలు స్వామి వైభవాన్ని వర్ణించే పద్యాలు, షోడశోపచార వర్ణన పద్యాలు ఇందులో ఉన్నాయి. (మ మా )

## బొరుగడ్డుల ధర్మయామాత్యుడు

కాలం : క్రీ. శ. 18 వ శతాబ్దం కావచ్చును.

స్థలం : బొరిగడ్డుల గ్రామం (జటప్రోలు సంస్థానం)

రచన : నృసింహ పురాణము.

ఇతడు తిమ్మనామాత్య పుత్రుడు. ఇతని "నృసింహ పురాణం" రచనా వైఖరిని, లిపినిబట్టి ఇది సుమారు 250 సం॥ లకు పూర్వ గ్రంథమై ఉండవలయునని సాహిత్య కారుల అభిప్రాయం. ఇతడు నృసింహ పురాణ ద్విపదను కూడా వ్రాసినట్లు ఈ గ్రంథంలో ఉంది. కాని, అది లభ్యం కాలేదు. (మ. మా.)

## బారు వెంకన్న

కాలం : తెలియదు

ఈయని దానగుణాలను కీర్తిస్తూ ఒక చాటు పద్యం ఉంది. ఈ పద్యం తెనాలి రామకృష్ణుని చాటుపు "నరసింహ కృష్ణరాయని ...." పద్యాన్ని గుర్తుకు తెస్తున్నది. చాటు కవి వివరాలు తెలియవు. (చా. ప. ర.)

## బర్హావతంసమ్ (సం)

కర్త : లొల్ల లక్ష్మీధరుడు.

(తె. వి. స-4)

## బాలకవి సుబ్బన్న

కాలం : 17వ శతాబ్దం చివరిభాగం.

స్థలం : తంజావూరు శహజీ (1684-1712) ఆస్థానం.

రచనలు : 1. లీలావతీ శాహరాజీయము 2. పంచకన్యా పరిణయము 3. శాహ మహరాజ కల్యాణము (కర్తృత్వం-సందేహము).

బిరుదనామం : బాలకవి.

ఇతని రచనలన్నీ శహజీకే అంకితాలు. (ద. దే. వా-231)

## బాలకృష్ణదాసు

చూ. పుసులూరి సోమరాజకవి (శ. సా. వి-527)

**బాలకృష్ణలీలలు**

కర్త : తెలియదు.

జానపద పౌరాణిక గేయం. ఇతివృత్తం భాగవతానికి సంబంధించినది. ప్రసిద్ధం.

చూ. పౌరాణిక గేయములు.

**బాలకృష్ణ లీలావిలాసము**

కర్త : అక్కనామాత్యుడు.

అంకితం : వేంకటేశ్వరునికి.

ఇది భరతశాస్త్ర ప్రావీణ్యంతో రచించిన కృతి. పాటలు, పద్యాలు, ద్విపదలు. దరువులు ఉన్నాయి. కొన్ని పద్యాలు పోతన భాగవతాన్ని అనుసరించి వ్రాసినట్లున్నది.
(ఆరుద్ర-12-166; ద.దే.వా-234)

**బాల క్రీడావిహారము**

కర్త : దేవవరపు శోభనాద్రి.

అంకితం : కొడూరులోని సంతాన గోపాలునికి.

యక్షగానం. బలరామ కృష్ణుల బాల్యక్రీడలు వర్ణితాలు. శ్రీకృష్ణుని జన్మం మొదలు యమళార్జున భంజనం వరకుగల కథ ఈ యక్షగానంలో ఉంది. మంత్రసాని వాలక మొకటి ఇందులోని విశేషం. దీనిలోని దరువులు ప్రసిద్ధ రాగతాళాలలో ఉన్నాయి. ద్విపద లెక్కువ. వచనాలు, సీస గీత కందములు ఉన్నాయి. (య వా.చ-29)

**బాల గేయములు**

జానపద గేయాలలో పిల్లలది ఒక ప్రత్యేక శాఖ. పెద్దల వలెనే బాలలకూ కొంత గేయ సంపద ఉంది.

బాలగేయాలను రెండు రకాలుగా చూపవచ్చు. బాలురకోసం పెద్దలుపాడే పాటలు ఒకరకం. బాలురే పాడే పాటలు రెండవరకం.

పెద్దలు పిల్లల్ని లాలించడానికి, నిద్ర పుచ్చడానికి కొన్ని పాటలు పాడతారు. లాలిపాటలు, జోలపాటలు ఇటువంటివి. బాలబాలికలు ఈ గీతాల్లోని ధ్వనిసంగీతాలకు ఆకర్షింపబడి ఆనందంతో నిద్రిస్తారని ప్రతీతి. ఇదికాక—బాలబాలికలకు అర్థమయ్యే విధంగా నీతికథలనో, వింతకథలనో, మనోహర విషయాలనో వర్ణిస్తూ పెద్దలు రచించే పాటలుకూడా అనేకం ఉన్నాయి. ఇవన్నీ మొదటిరకం బాలగేయాలు. అంటే పిల్లల కోసం పెద్దలు సృష్టించిన గేయాలవి తాత్పర్యం.

బాలబాలికలకు కొంత వయసు వచ్చిన తరువాత—మాట్లాడే వయసులో — తలిదండ్రులను అనుకరించడం ప్రారంభిస్తారు. ఈ సాధనలోనే వాళ్ళు తమకు తెలిసిన లోకజ్ఞానంతో స్వతంత్రంగా గేయాలు పాడుకుంటారు. ఈ గేయాల్లో అర్థం ఉండదు. ఒక లయ ఉంటుంది. అది ఆ వయస్సు బాలబాలికలకు ఆనందం కలుగచేస్తుంది. పెద్దలు

బాలలకోసం సృష్టించిన గేయాల్లో అక్కడక్కడా కొంత నీతి, భక్తి ఉంటాయి. కాని, వాటి పాళ్ళు చాలా తక్కువ. ఎక్కువభాగం లయాన్వితమే.

పాశ్చాత్యులు, కొన్ని ప్రాంతాల్లోని భారతీయులుకూడా బాలగేయాల వైశిష్ట్యాన్ని గుర్తించి ఆ సాహిత్యానికి అపారమైన సేవచేశారు. కాని ఆ గేయసంపదలో ప్రస్తుతం ప్రచురింపబడిన శాతం చాలా తక్కువే. ఇటీవలికాలంలో కొంతకృషి జరుగుతున్నది.

## బాలగోపాల విలాసము

కర్త : వెణుతుర్ల ఒడ్డెయ్య (వడ్డికవి).

అంకితం : శ్రీకృష్ణునికి.

విశిష్టత : ఇది మూడాశ్వాసాల ప్రబంధం. నగ్నజిత్తు అనే కోసలరాజు కుమార్తె నీలను శ్రీకృష్ణుడు పెళ్ళి చేసుకోవటమే దీనిలోని ఇతివృత్తం. ఈ కావ్యానికి మూలం హరివంశం ఈ కథనే కూచిమంచి తిమ్మకవి నీలాసుందరీ పరిణయం అనే అచ్చ తెలుగు కావ్యంగా వ్రాశాడు.

సేలం కృష్ణ భూపాలుని మంత్రి ప్రోత్సాహంతో ఈ బాలగోపాల విలాసాన్ని కవి రచించి ఉంటాడని పరిశోధకులు భావిస్తున్నారు. (ఆరుద్ర-9-259; క.త-10-209)

## బాలగోపాల శతకము

రచన : పసులూరి సోమరాజామాత్య కవి.

ముద్రణకాలం : 1928.

కాత్యాయనీ గ్రంథమాలిక వారు తృతీయ పుష్పంగా దీన్ని అచ్చు వేశారు. ఇందులో 108 సీస పద్యాలున్నవి. భక్తి రస సంభరితమైన రచన. "బాలగోపాల కరుణాలవాల। నీల, శైల పాలావనీ పాల। చారులీల" అనేది మకుటం. దీనిలోని పద్యాలు కృష్ణ కర్ణామృతాన్ని అనుసరించి ఉన్నవి. నీలాచలేంద్రుడు కవి ఇష్టదైవం.

ఈ శతకానికి చారులీల శతకమనీ, ఉపకర్ణామృతమనీ పేర్లున్నాయి.

(శ. క. చ-384; అ. సా. ప. ప. 1/-5)

## బాలచంద్రోదయము

కర్త బహుజనపల్లి సీతారామాచార్యులు.

విద్యార్థులకు ఉపకరించే వ్యాకరణ గ్రంథం.

## బాలచక్రవేమ భవ్యనామ శతకము

కర్త : తొక్కడము రామాజెట్టి (చూ).

వేమన పద్యాలవంటి రచన. ఇందులో వేమనను గూర్చిన ప్రస్తావన ఉంది. ఆట వెలదులలో సమకాలీన సామాజిక వ్యవస్థను కవి చక్కగా విమర్శించాడు.

(ద. దే. వా-293)

## బాలనాగమ్మ కథ

జానపద గేయాలలో అద్భుత కథలన్నింటిలోకి ఇది అత్యంత ప్రచారం పొందింది. బాలనాగమ్మ పేరు ఆంధ్ర ప్రజలకందరికీ తెలిసినదే. వెండితెరకెక్కడమే ఈ కథయొక్క సార్వజనీనతకు ఉదాహరణం. మాయల ఫకీరు, తలారి రాముడు, గాండ్ల సంగు, చాకలి తిప్పడు, బాలవద్దిరాజు, వజ్రాయుధం మొదలయిన ఈ కథలోని పాత్రలకు ఆంధ్రదేశంలో మిక్కిలి ప్రచారం లభించింది.

ఈ కథ రెండు భాగాలుగా విభజింపబడింది. ప్రథమ భాగంలో నవాభోజరాజు-భార్య "భూలక్ష్మమ్మ" సంతానానికై పరితపించడం, సంతానం కలిగిన తరువాత నాగేంద్రుడికి ఆహారం కావడం, నవాభోజరాజు ద్వితీయ వివాహం, ఆ తదుపరి భూలక్ష్మమ్మ సంతానం సవతి తల్లివల్ల కష్టాలు అనుభవించడం, ఇంటినుంచి తరిమివేయబడడం, వారు 'పానుగల్లు' కోటనుచేరి వివాహితులు కావడం వరకు ఉంది.

ఉత్తరభాగంలో బాలవద్దిరాజు జననం, బాలనాగమ్మ అపహరణం, తలారి రాముని కథలు, చాకలి తిప్పని కథలు, బాలవద్దిరాజు పెద్దవాడై తల్లి చెరవిడిపించడం మొదలైన కథ ఉంది.

ఈ కథ తెలంగాణ ప్రాంతానికి సంబంధించింది ఇది ఒకరకంగా ప్రాంతీయ రామాయణం. బాలనాగమ్మను సీతగా, రావణునికి ప్రతిగా మాయల ఫకీరు, శ్రీరామునికి ప్రతిగా కర్యవద్దిరాజు మొదలగు పాత్రలను ఊహించవచ్చు.

బాలనాగమ్మ నివాసం 'పానుగల్లు'. ఇది మహబూబ్‌నగర మండలంలోని 'పానుగల్లు' కావచ్చునని పలువురి అభిప్రాయం. మాయల ఫకీరు నివాసం హైదరాబాదు సమీపంలోని 'మౌలాలీ' గుట్ట. వద్దిరాజులు 'గండికోట కార్యానికి' వెళ్లినప్పుడు మాయల ఫకీరు బాలనాగమ్మను మాయచేత అపహరించుకపోతాడు. అప్పుడు పసిప్రాయంలో ఉన్న బాలవద్దిరాజు పెరిగి పెద్దవాడై మాయల ఫకీరును సంహరించి, తల్లి చెర విడిపించడం ప్రధాన కథ.

భూలక్ష్మీదేవి సంతానం కొరకు పుట్టవద్దకు వెళ్ళడం, పండ్లు కోసుకురావడం, మాయల ఫకీరు బాలనాగమ్మను మాయలతో అపహరించడం, తలారిరాముని కథలు, మాయల ఫకీరు వద్దిరాజులను రాళ్ళగా మార్చడం, బాలవద్దిరాజు సప్తసముద్రాలు దాటి వెళ్ళి మాంత్రికుడి ప్రాణాలున్న చిలకను అపహరించడం మొదలగు పెక్కు సంఘటనల్లో అద్భుతరసం తారాస్థాయిని అందుకుంది.

## బాలపాపాంబ

కాలం : క్రీ. శ. 1565-1664.

రచనలు : 1. కాలజ్ఞానము 2. అక్క మహాదేవి బోధోల్లాసము (యక్షగానం).

వీర భోగ వసంతరాయల కుమార్తె. శైవ వాఙ్మయంలో ప్రసిద్ధురాలు. యోగ శాస్త్రంలో ప్రవేశమున్న విదుషీమణి. అక్కమహాదేవి-అల్లమ ప్రభువులకు సమకాలీనురాలు. ఈమెను గురించి కన్నడంలో చాలా గ్రంథాలున్నాయట. (తె. వి. స-4)

## బాల ప్రబోధమ్ (సం)

కర్త : కంచం ఎల్లయార్యుడు.

ఈ పుస్తకం వ్రాసినట్లు కవి స్మృతి కదంబంలో చెప్పారు. (తె.వి.స-4)

## బాల బోధచ్ఛందము

కర్త : లింగమగుంట తిమ్మకవి.

ప్రత్యేకత : సులక్షణ సారం అనే ఛందోగ్రంథాన్ని వ్రాసిన తిమ్మకవే దీనినీ వ్రాశాడని కౌలూరి ఆంజనేయ కవి తన "సుకవి కర్ణామృతం"లో చెప్పాడు. బాల బోధచ్ఛందం ప్రతి ఒకటి కాకినాడ ఆంధ్ర సాహిత్య పరిషత్తువారి కార్యాలయంలో ఉందట అనేక ప్రాచీన గ్రంథాల నుంచి దీనిలో ఉదాహరణలు ఉన్నాయట.

(ఆరుద్ర-8-135)

## బాల భాగవత చంపువు

నామాంతరం : పద్మరాజ చంపువు.

కర్త : అవసరాల పద్మరాజు.

అయిదు తరంగాలలో ఉన్న గ్రంథం. ప్రధాన రసం శృంగారం. కృతికర్త పేరుతో "పద్మరాజ చంపువు"గా పండిత లోకంలో ప్రసిద్ధి చెందింది. సమకాలిక ఆస్థాన పండితులైన "రామశాస్త్రి" దీనికి "సుధీచంద్రిక" వ్యాఖ్యానం వ్రాశారు. ఇదే రచనకు "కవి రంజని" వ్యాఖ్యానం రాఘవాచార్యులు వ్రాశారు. (ఆం. సం.సా-247)

## బాల భాగవతమ్ (సం)

కర్త : చూ. వారణాసి ధర్మసూరి.

సంస్కృతంలో రచింపబడ్డ కావ్యం. (తె వి.స-4)

## బాల భాగవతమ్ (సం)

కర్త : (అవసరాల) పద్మరాజు.

సంస్కృత చంపూ కావ్యం. ఆరు సర్గలున్నాయి. ఇదే గ్రంథం తెలుగులో కూడా ఉంది. ఇదే కథను ఇదే పేరుతో ధర్మసూరి అనే కవి కూడా రాశాడు.

(తె. వి. స-6-244)

## బాల భాగవతము

కాలం : క్రీ. శ. 1543 ప్రాంతం.

కర్త : దోనూరి కోనేరునాథుడు.

అంకితం : ఆరవీటి తిమ్మరాజుకు (పొట్లపాడి తిమ్మరాజు).

పద్యకావ్యం. కవి ఆరవీటి తిమ్మరాజు కుమారుడైన తిరుమలరాజు ప్రోత్సాహంతో దీన్ని రచించాడు ఆ తరువాత ఇదే కావ్యాన్ని ద్విపదగా వ్రాసి చిన తిమ్మరాజుకు (తిరుమలరాజు తమ్మునికి) అంకితమిచ్చాడు. రచన ప్రశస్తమైనది. సంస్కృత

భారతానికీ దీనికి ఎక్కువ భేదం లేదు. కొన్ని విషయాలు వైష్ణవ పురాణంనుండి గ్రహించాడట విశిష్టాద్వైత సంప్రదాయ విశేషాలు కావ్యంలో కనిపిస్తాయి.

ఈ కావ్యావతారిక ఆరవీటి రాజుల చరిత్రకు ముఖ్యాధారం. నవమస్కంధంలోని రాజవంశ చరిత్రకు అనుబంధంగా కూడా ఆరవీటి వారి వంశవర్ణన ఉంది. ఆరవీటివారినే పొట్లపాడి వారనీ, అవుకు వారనీ తర్వాత వ్యవహరించారు. ఇందులో షష్ఠ్యంతాలు ప్రయుక్తాలు. (క. స-50; ద్వి. సా చ-222)

**బాల భాగవతము**

కాలం : క్రీ శ. 1547 ప్రాంతం.
కర్త : దోనేరు కోనేరునాథ కవి.
అంకితం : ఆరవీటి చిన తిమ్మరాజుకు (అవుకు చిన తిమ్మరాజు).

ద్విపద కావ్యం. ఆరవీటి తిరుమల రాజు కోరికపై కవి ఈ గ్రంథం రచించి ఆతని తమ్ముడైన తిమ్మరాజుకు అంకితమిచ్చాడు.

సంస్కృత భాగవతానికీ దీనికీ అంత తేడా లేదు. తత్త్వోపదేశంలో ఇంచుక భేదం ఉంది. కోనేరు నాథుడు విశిష్టాద్వైత సంప్రదాయాలను విశేషంగా ప్రతిపాదించాడు. చక్కని రచన. శబ్ద వైచిత్రి అపూర్వం. ఈ గ్రంథం అవతారిక లేకుండా నాలుగాశ్వాసాలు మాత్రం ముద్రితమైంది. దీని అవతారిక ఆరవీటి రాజుల వంశచరిత్రకు ముఖ్యాధారంగా చరిత్రకారులు భావిస్తున్నారు. (ద్వి. సా. చ-222)

**బాల భారతమ్ (సం)**

కర్త : అగస్త్యుడు (చూ).

ఇది సంస్కృతంలో మహాకావ్యం. సాళువ తిమ్మమంత్రి దీనికి "మనోహర" వ్యాఖ్య వ్రాశాడు. (ప్రా.ద.దే.చ.)

**బాల భారతము (అలభ్యం)**

కర్త : తెలియదు.
అంకితం : కామినేని (మొదటి) ఎల్లారెడ్డికి.

దోమకొండ సంస్థానాధిపతి అయిన కామినేని (మొదటి) ఎల్లారెడ్డి "బాలభారతాన్ని" అంకితంగా పొందాడని, సూత సంహిత, శివధర్మోత్తరము, బ్రహ్మోత్తర ఖండము అనే ప్రబంధాల ద్వారా తెలుస్తున్నది. ఈ గ్రంథం అలభ్యం. (అం. సం. సా-180)

**బాల భారతము (అలభ్యం)**

కర్త : కాకమాని గంగాధరుడు.

అలభ్యం: దీనిలోని 15 పద్యాలను అజ్ఞాత గ్రంథ సంధాత తన ఉదాహరణ పద్యములులో సంకలనం చేశాడు. (ఆరుద్ర-9)

**బాల భారతము (అలభ్యం)**

కర్త : ప్రోలుగంటి చెన్నశౌరి (చూ).

వచన కావ్యం.

**బాలమనోరమా వ్యాఖ్య (సం)**

కర్త : వాసుదేవకవి.

సిద్ధాంత కౌముదికి వివరణ గ్రంథం. (అరుద్ర-12-162)

**బాలమ్మ పాట**

కర్త : తెలియదు.

జానపద పారమార్థిక గేయం.

"బాలమ్మ" ఒక గ్రామ దేవత. ఆ దేవత మాహాత్మ్యం వివరించే గేయం. పామరజనంలో ఎక్కువ ప్రచారంలో ఉంది.

చూ. పారమార్థిక గేయములు.

**బాలయ్య**

కాలం : క్రీ. శ. 1839 ప్రాంతం.
స్థలం : ఎట్టియాపురం సంస్థానం (తమిళదేశం).
రచనలు : తెలియరాలేదు.

జగదీశ్వర రామకుమార ఎట్టప్ప మహారాజు ఆస్థానంలోని తెలుగు పండితుడు. (ద. దే. వా-513)

**బాలరాజు కథ**

కర్త : కిన్నెర వీరాస్వామి.
స్థలం : కడియం.

నమ్మశక్యం కాని అద్భుత విషయాలతో నిండిన జానపద గేయం. 'వర్ణాంతర వివాహం' ఈ కథకు జీవం. పాటకజనంలో కూడ వర్ణాంతర వివాహాలు లేని కాలంలో ఈ కథ బయలుదేరింది. ఈ కథలో ఒకటి రెండు ఆధునిక భావాలున్నప్పటికీ పుక్కిటి పురాణాలతో నిండి ఉంటుంది.

బాలరాజు "చంద్రశేఖరుడు" అనే వెలమదొర కుమారుడు. "కలికి రాజ" నే కమ్మదొరకు సీత అనే కూతురుంది. బాలరాజుకు 16 సంవత్సరాల ప్రాయంలో "సీత" అతన్ని చూడడం తటస్థించింది. అతడినే వివాహం చేసుకోవాలని నిశ్చయించింది. బాలరాజు అపర ప్రవరుడిలా ప్రవర్తిస్తాడు. ఆమెను వదిలించుకోవడానికి మానవాతీతమైన పనులు ఎన్నో చేయమంటాడు. ఆమె వివిధ దేవతలను ప్రార్థించి అన్నీ సాధిస్తుంది. చివరకు బాలరాజును తలిదండ్రుల సమక్షంలో, సకల దేవతల సమక్షంలో వివాహం చేసుకొని కొంతకాలం స్వర్గంలో నివసించి, ఆ తరువాత వైకుంఠం వెళ్ళిపోతారు. జానపదులకు అద్భుత రసంపై ఎంత మక్కువ ఉంటుందో ఈ కథ నిరూపిస్తుంది.

**బాలరాజు-బ్రతుకమ్మపాట**

రచన : నరసింహమూర్తి.

ఈ నరసింహమూర్తి ఎవరో తెలియదు. ఒక జానపద కవి అని మాత్రం చెప్పవచ్చు.

ఈ రచన కొంత విచిత్రం. కవి "బాలరాజు కథ" "ధర్మాంగద- పాము పాట" అనే రెండు జానపద గేయాలను చదివి, వాటివల్ల ప్రభావితుడై ఆ రెంటినీ కలిపి ఈ గేయం సృష్టించినట్లు తెలుస్తున్నది.

"మోహిని" ఒక యక్షకన్య. ఆమె ఇంకొక యక్షుడిని ప్రేమిస్తుంది. కాని, ఇంద్రుడు మోహినిని మోహించి నిర్బంధిస్తాడు. ఈ యక్షిణీ యక్షులిద్దరూ శపించబడి మానవులై పుడతారు. యక్షుడి పేరు బాలరాజు. మోహిని "సీత"గా పుడుతుంది. "బాల రాజు కథ" గేయంలో మాదిరే సీత పెళ్ళిచేసుకొమ్మని బాలరాజును అడగడం, అతడు ఆమెను కొన్ని అద్భుత కృత్యాలు చేయమనడం జరుగుతాయి. కథ ఇంతవరకు "బాల రాజు కథ" అనే గేయాన్ని అనుకరిస్తుంది.

ఆ తరువాత "ధర్మాంగద-పాము పాట" లోని కథా విధానం అనుసరింప బడింది. అంటే-ఇంద్రుడి శాపం వల్ల బాలరాజు పాముగా మారుతాడు. మోహిని అతడిని తీసుకొని పుణ్య తీర్థాలన్నీ దర్శిస్తూ చివరకు సరయూనదిలో స్నానంచేసి భర్తకు యథారూపం కల్పిస్తుంది. ఆ తరువాత దేవతల ఆశీర్వాదాలతో సుఖజీవనం చేస్తారు.

**బాలరామాయణము (అలభ్యం)**

రచనాకాలం : క్రీ. శ 17వ శతాబ్దం.

కర్త : గణపవరపు వేంకటకవి.

ఇది ద్విపద కావ్యం. ఇతడు పూర్వోత్తర రామాయణాలు రెండింటినీ రచించి ఉంటాడని కొందరి అభిప్రాయం. (క. త-12)

**బాల వ్యాకరణము**

కర్త : పరవస్తు చిన్నయసూరి.

రచనాకాలం : క్రీ శ. 1858 ప్రాంతం.

ఇది వ్యాకరణ గ్రంథం. ఇందులో పది పరిచ్ఛేదాలు ఉన్నాయి. 1. సంజ్ఞ 2. సంధి 3. తత్సమ 4. ఆచ్ఛిక 5. కారక 6. సమాస 7. తద్ధిత 8. క్రియ 9. కృదంత 10. ప్రకీర్ణ .

దీనికి అనేక వ్యాఖ్యానాలు బయలుదేరాయి. దీన్ని శిష్టు కృష్ణమూర్తి పేరు చెప్పకుండా సంస్కృతీకరించాడు. దానిపేరే "హరికారికలు". అది బాల వ్యాకరణానికి మూలమన్న భ్రాంతిని కలిగించింది. (రమణీయం పీఠిక)

**బాలసరస్వతి**

కాలం : క్రీ.శ. 14వ శతాబ్ది.

స్థలం : కొండవీడు.

కొండవీటి అనవేమారెడ్డి (1364_86) ఆస్థానంలోని వాడు. ఇప్పగల్లు శాసన కర్త. ఇతడు అనవోతారెడ్డి కాలంలో కూడా శాసనాలు రచించాడట.

(శ్రీనాథుడు-కొ.శ్రీ.మూ.)

## బాలసరస్వతి

కాలం : క్రీ శ. 17వ శతాబ్దం.

స్థలం : మధుర.

రచన : సభాపర్వము (ద్విపద భారతం).

ద్విపద భారత కవిత్రయంలో (తిమ్మయ, బాలసరస్వతి, ఆత్మకూరి సోమన) ఒకడు. తంజావూరును శహాజీ పాలించిన కాలంలో (1684_1712) అతని చేత మన్ననలు పొందాడట. ఇతని రచన సరళమై హృదయంగమంగా ఉంటుంది.

ఇతని కుమారుడైన తిరుమల కవి మధురలో విజయరంగ చొక్కనాథుని ఆస్థానంలో ఉన్నాడట. (ద.వా_372)

## బాలసరస్వతీయము

రచనాకాలం : క్రీ శ. 17వ శతాబ్ది.

కర్త : ఎలకూచి బాలసరస్వతి.

సంస్కృతంలో నన్నయభట్టు రచించిన ఆంధ్ర శబ్ద చింతామణికి తెలుగులో వ్యాఖ్యానం. వాలసరస్వతి విజయనగరంలో నివసించేటప్పుడు ఒకానొక సిద్ధుడు అతనికి సంస్కృత గ్రంథాన్ని తెచ్చి ఇచ్చాడట. 88 ఆర్యా వృత్తాలతో 5 పరిచ్ఛేదాలతో ఉన్న ఈ వ్యాకరణం నన్నయదేనని విశ్వసించి బాలసరస్వతి దానికి వ్యాఖ్య వ్రాశాడు. ఈ సంఘటన కీలకనామ సంవత్సరం క్రీ.శ. 1698 లో జరిగినట్లు బాలసరస్వతి చెప్పాడు.

ఇందులో ఆర్యావృత్తాల్ని సూత్రాలుగా విభజించి వాటి భావం వివరిస్తూ అక్కడక్కడ ప్రాచీన కావ్యాల నుంచి లక్ష్యాలను కూడా ప్రదర్శించాడు. ఈ బాల సరస్వతీయం వల్లనే ఆంధ్ర శబ్ద చింతామణి ప్రచారంలోకి వచ్చింది.

(తె.వి.స_4 : అదు|ద_10_33)

## బాలాత్రిపురసుందరీ స్తోత్రము

కర్త : భారతుల పేరయ్యశాస్త్రి.

రచనాకాలం : క్రీ శ. 19 వ శతాబ్దం.

కర్నూలు మండలం త్రిపురాంతకంలో వెలసిన బాలాత్రిపురసుందరిపై చెప్పిన స్తోత్రం. (చా ప.ర.)

## బాలారాం పంతులు

కాలం : తెలియదు.

రచన : కేవలాత్మ శతకము. (శ.సా.వి.)

**బాలింత వేషము**

కర్త : భారతి రామరాజు.

అంకితం : బోల్లదుర్తి చెన్నునకు.

ప్రదర్శన కోసం రచించిన కృతి. యశోద గర్భవేదన, మంత్రసాని రాక, ప్రసవము మొదలయిన విషయాలు చర్చించి లాలిపాటతో గ్రంథాన్ని ముగించాడు కవి.

దీనిలో దరువులు, పద్యములు, ద్విపదలు ఉన్నాయి. (య.వా.చ-84)

**బాలికాగీత ముక్తాకలాపము**

కర్త : కవీశ్వర గిరియప్పకవి (చూ).

రచనాకాలం : క్రీ. శ. 19వ శతాబ్దం.

మైసూరులో మిక్కిలి ప్రచారంలో ఉన్న గ్రంథం. (గేయ కథానికల సంకలనం వంటిది). ఈ కవి మూడవ కృష్ణరాజు వొడయరు ఆస్థానంలో ఉంటూ అతనికి కథలు చెప్తూండేవాడట. (ద.దే.వా-480)

**బాహటము (అలభ్యం)**

కర్త : ఎలకూచి బాలసరస్వతి.

ప్రబంధం. సంస్కృత మూలానికి అనువాదమట. వివరాలు తెలియరాలేదు. (క త-11-144)

**బిక్కనవోలు**

దోమకొండ సంస్థానాధిపతులు మొదట "బిక్కనవోలు"ను రాజధానిగా చేసుకుని పాలించారు. తూర్పుగోదావరి మండలంలోని బిక్కనవోలు దీనికన్న భిన్నమైంది. ఇది నిజాం రాష్ట్రంలోని "మెదకు" సీమకు చెందింది.

వివరాలకు చూ : దోమకొండ. (ఆం.సం.సా-175)

**బిజ్జల తిమ్మరాజు**

కాలం : క్రీ. శ. 16వ శతాబ్ది.

స్థలం : కృష్ణానదీ తీరప్రాంతం.

కృతి : అనర్ఘ రాఘవము.

అంకితం : ప్రాకటూరి రామేశ్వరస్వామికి.

విశిష్టత : ప్రసన్న రాఘవాన్ని (పిల్ల మురారి) బొడ్డుచర్ల తిమ్మకవి అనువదిస్తే అనర్ఘరాఘవాన్ని (మురారికృతం) ఈ తిమ్మరాజు అనువదించాడు. ఈయన కృష్ణానది పరిసరాలలోని అలంపూరు, ప్రాకటూరి సీమలవాడు. గద్వాల సంస్థానంలోని బీచిపల్లి గ్రామానికి దేశాయి. ఈయనకు కృష్ణకవి అనే విద్వాంసుడు సహాయం చేశాడట. ప్రతిభ కరతలామలకంగా ఉన్న ఈ తిమ్మరాజు అనర్ఘరాఘవాన్ని అయిదు ఆశ్వాసాల ప్రబంధంగా అనువదించాడు. ఇతనికాలం క్రీ. శ. 18వ శతాబ్దమని గోలకొండ కవుల సంచికలో ఉంది. (ఆరుద్ర-9-196)

ఏ్రటుగుంట ప్రశస్తి (సం)
కర్త : భోగనాథుడు.

దీనిలోని శ్లోకాలు కొన్ని లభించాయి. దీనిలో కవి తాను ద్వితీయ సంగమ భూపాలుని నర్మసచివుడనని చెప్పుకొన్నాడు. (తె.వి.స.)

బిరుదావళి

కావ్యభేదం.

'గద్య పద్యమయీ రాజస్తుతిర్బిరుద ముచ్యతే' అని సాహిత్య దర్పణం చెప్తున్నది. దీనికి అప్పకవి లక్షణం చెప్పాడు. మొట్టమొదట సర్వవిభక్తులతో ఆశీర్వాద రూపమైన ఒక పద్యాన్ని చెప్పి, తరవాత గౌడీ రీతితో నాలుగు, లేక ఆరు, లేక ఎనిమిది, లేక పదునారు బిరుదు గద్యలు—తత్తత్ప్రభావ భుజ విక్రమాదులను వర్ణిస్తూ చెప్పాలి. ఈ బిరుదాలు మహారాష్ట్రి భాషామయాలవి చెబుతారు. మహారాష్ట్రి భాష అనేది ఉప లక్షణం ఏ దేశ భాషలో ఉన్నప్పటికీ, ఆయా బిరుదాలను ఆంధ్ర సంస్కృతాలలోకి మార్చకుండా, ఉన్న విధంగానే వ్యవహరిస్తారు. జగనొబ్బగండ, మూరురాయరగండ, ఉభయరగండ, గండభేరుండాది పదాలను అవి ఉన్నట్లే వ్యవహరించాలి. (తె.వి.స-8)

బిరుదుగద్య

గద్య భేదాలలో ఒకటి. సంబోధనాంత పద బంధురమై ఉంటుందని తెలుగు లాక్షణికులు చెప్పారు. చంపూ కావ్యాలలో ఆశ్వాసాంతంలో కవులు తమ బిరుదులను చెప్పుకోవడం అనేది కన్నడం నుంచి వచ్చిన సంప్రదాయంగా కనబడుతుంది.

తెలుగు కావ్యాలలో కవి ప్రథమ పురుషలో తన వృత్తాంతం చెప్పుకోవడం చేత ఈ గద్యలు సంబోధనాంతాలుగా ఉండవు. యమకాను ప్రాసలతో ఉంటాయి

సంబోధనాంతాలుగా బిరుదు గద్య చెప్పడం, కృతిపతి అభ్యుదయాన్ని, ప్రశస్తినీ వర్ణించే సందర్భాలలో కనిపిస్తుంది. రాజులను స్తుతిస్తూ సంబోధిస్తూ వచ్చిన రచనలు ఈ బిరుదు గద్యకు మార్గదర్శకాలైనవి. వీటిని "ప్రశస్తి కావ్యాల"ని అంటారు. ఇవి క్రీ.శ. 3 వ శతాబ్ది నుంచి శాసనాలలో కనిపిస్తున్నాయి. స్తుతి పాఠకులు రాజులను స్తుతిస్తూ చేసే సంబోధనలే మహాకావ్యాలలోని బిరుదు గద్య సంప్రదాయానికి మూల భూతమైనాయి. దీనికి "తాళగంధి" అనే సంకీర్తన లక్షణానికి పోలికలున్నవి.

బిల్హణీయము

రచనాకాలం : క్రీ.శ. 18 వ శతాబ్దం (1750 ప్రాంతం).
కర్త : చిత్రకవి సింగరయ్య.
అంకితం : శ్రీరామునికి.

మూడాశ్వాసాల ప్రబంధం. తండ్రి అనంతరం ఈ కవి కుమారుడైన నరసింహ కవి గ్రంథంలోని కృత్యాదిని, కొన్ని గద్య పద్యాలను తీసివేసి పందిపెద్ది కృష్ణస్వామికి ఇచ్చాడనీ, అతడు దీనిని తాను రచించిన కావ్యంగా ప్రకటించుకొన్నాడనీ

చెబుతారు. ప్రథమాశ్వాసం చివర ఉన్న చక్రబంధాన్ని బట్టి ఇది సింగరయ్య కృతమని తెలుస్తున్నదట. (క.స-289)

**బిల్హణీయము**

కర్త : సుదురుపాటి సాంబశివకవి.
అంకితం : క్రీ.శ. 1825-39లో పుదుక్కోటను పాలించిన రాయరఘునాథరాజుకు.
మూలం : సంస్కృత బిల్హణీయమ్.

రచన రసవత్తరమైనది. పూర్వ భాగం-ఉత్తర భాగం అని రెండుభాగాలుగా ఉంది. కవిత్వం రసవంతంగా ఉంది. (ద.దే.వా-444)

**బిల్హణోపాఖ్యానము**

కర్త : అరుణాచల కవి.
కాలం : క్రీ.శ 18 వ శతాబ్దికి పూర్వం.
అంకితం : కవి తల్లియైన సుబ్బమాంబికకు.

ఏకాశ్వాస ప్రబంధం. ద్విపద రచన. యామినీ పూర్ణతిలక బిల్హణుల కథ. రచన అంత ప్రశస్తం కాదు. యతిప్రాసాది దోషాలున్నా శైలి సరసంగా ఉంది. (ద్వి సా.చ-441)

**బీరన్నల వారు**

నామాంతరం : చూ. ఒగ్గుగొల్లలు, ఒగ్గువారు.

**బుక్కమ సాంబయ్య**

నామాంతరం : బుక్కమ సాంబయ్య
కాలం : క్రీ.శ. 1812 కు పూర్వుడు.
రచన : బల్లాణ రాజ చరిత్రము.

శివకవుల కోవకు చెందిన ఈ కవి ఇంటి పేరు బుక్కమ అని కొందరంటున్నారు. మహేశ్వరస్వామి భక్తుడు, వీరశైవుడు, యోగ విద్యాభ్యాసరతుడు. (య.వా చ.)

**బుక్కరాయపురము**

అగ్రహారం. దీని పూర్వనామం పెంచుకల దిన్నె. బుక్కరాయలు ఈ గ్రామాన్ని నాదన సోమనాథునికి మరో ఐదుగురికీ బుక్కరాయ పురమనే పేర దానం చేశాడట. ఈ దాన శాసన కాలం శా శ. 1266 అనగా క్రీ. శ. 1344 గా పండితులు నిర్ధారించారు.

**బుచ్చయ్యశాస్త్రి**

కాలం : తెలియదు.

ఈయన చాటుకవి. ఈయన తాడిగొల్ల చెన్నకేశవుని మీద చెప్పిన ఒక పంచచామరం లభించింది. (చా.ప.ర.)

## బుచ్చాలి గోపాలయ్య

కాలం : క్రీ. శ. 1700 ప్రాంతం.

స్థలం : దక్షిణ దేశంలో అరియలూరు ప్రాంతం.

రచనలు : 1. తారావళి 2. మంగాదుష్పాంసులావిలాసము (ద్విపద) 3. మధుర మంగా పుంశ్చలీవిలాసము (వచనం) 4. హనుమద్విన్నపము.

బిరుదు : వికటకవి.

ఆనెగొంది చినవెంగమరాజు ప్రోత్సాహంతో బండబూతుల కావ్యాలు వ్రాశాడని చెప్తారు. ఇతడు దేశాటనం చేస్తూ ఆనెగొంది సంస్థానానికి వచ్చి చినవెంగమరాజుకు రంగనాయకాంకిత తారావళి వినిపించాడట. తర్వాత రాజు ప్రోత్సాహంతో మంగాదుష్పాంసులా విలాసాన్ని రచించి విరూపాక్ష దేవునికి అంకితం ఇచ్చాడు. తరువాత చినవెంగమరాజు వలన ఇతనికి అపకారం జరిగిందనీ, అందుకనే ఆ రాజును తిడుతూ హనుమద్విన్నపం రచించాడనీ అంటారు. (అరు|ద్ర-12-86)

## బుచ్చివెంకు

ఈయన వాసిరెడ్డి వేంకటాద్రి నాయని ఆస్థానానికి ఒక గ్రంథాన్ని వ్రాసి తెచ్చాడట. ఆస్థానంలోని ఒకరిద్దరు కవులు బుచ్చివెంకు కులం తెలిసే సూచన చేస్తూ రాజుగారు అతన్ని నిరాదరించాలని ఎత్తి పొడుపు మాటలన్నారట. తనను ఆ కవులు చులకన చేస్తున్నారని తెలిసి, బుచ్చివెంకు మంచి సమయస్ఫూర్తితో తాను వ్రాసినది సత్ప్రబంధమని, చేమకూర వెంకన్న కళంకితమైన కులంలో జన్మించినా ఆయనను రాజు బాగానే సత్కరించాడని, కవిత్వ విషయంలో కుల ప్రసక్తి అనవసరమని పద్యం చెప్పాడు. అందుకు వేంకటాద్రి నాయుడు సంతోషించి బుచ్చి వెంకును సత్కరించి పంపాడట. చేమకూర వెంకన్న కులానికి సంబంధించి విమర్శకులలో ఉన్న సందేహాన్ని బుచ్చివెంకు తేల్చి చెప్పాడు. ఇతని రచనలు తెలియరాలేదు. (చా.ప.ర.)

## బుట్ట బొమ్మలాటలు

జానపద కళా రూపాలలో ఇదొకటి. నోటిమాట లేకుండా కేవలం వాయిద్యం ద్వారా, నృత్యం ద్వారా ఈ బొమ్మలను ఆడిస్తారు. పేడతో చేసిన ఈ బొమ్మలను పెళ్ళి ఊరేగింపులలోనూ, దేవుళ్ళకు ఉత్సవాలు జరిగేటప్పుడూ ప్రదర్శిస్తూ ఆడిస్తూ ఉంటారు. పీటికి పై భాగమంతా బొమ్మ ఆకారంగా ఉండి, లోపల డొల్లగా ఉంటుంది. బొమ్మ కాళ్ళ భాగంలోనూ నోటి దగ్గరా చిన్న రంధ్రాలుంటాయి.

ఆటగాడు బొమ్మ లోపలి భాగంలోకి దూరి నృత్యం చేస్తే కేవలం బొమ్మే నాట్యం చేసినట్లుంటుంది. ఈ బొమ్మలలో ఒకటి స్త్రీ రూపంలోనూ రెండోది పురుషుని ఆకారంలోనూ ఉంటాయి. కొన్ని బొమ్మలు సింగి-సింగడు ఆకారంలోకూడా ఉంటాయి. బొమ్మల నృత్యానికి తగ్గట్టు బొమ్మలను ఆడిస్తూ ఉంటారు. బొమ్మలకు ప్రణయ కలహం వచ్చి, మళ్ళీ రాజీపడి దగ్గర కొచ్చి కౌగలించుకొంటాయి. (నా ర.చ-200)

బుడిగె జంగాలు

దాసరు లందరూ వైష్ణవులైనట్లే, జంగా లందరూ శైవులు. వీరు జంగం కథలు చెబుతారు. వీరు కథలు చెప్పేటప్పుడు 'బుడిగె' అనే వాద్య విశేషాన్ని ఉపయోగిస్తారు కాబట్టి వీరికి బుడిగె జంగాలనే నామం సార్థకమైంది. వీరు ఉపయోగించే బుడిగెను డక్కి, డిక్కి, సమ్మెట అని కూడా అంటారు. వీరశైవమత ప్రచారకులు కావటం వల్ల వీరు చెప్పే కథలు వీరావేశంతో ఉంటాయి. అదిదం సూరకవి "జంగాల పాలు దేవాంగుల విత్తంబు" అన్నాడు. వీరు దేవాంగులను యాచిస్తారు.

వీరు ప్రారంభ దశలో శైవ కథలనే ప్రచారం చేసినా క్రమంగా దేశింగు రాజు కథ, విరాటపర్వం, బబ్బాణి, సిరియాళ, దేవయాని మొదలగు కథలు కూడా చెప్తూ ఉండేవారు. పగటి వేషాలు కూడా వేసేవారట. (నా.ర.చ–205)

బుణిగె కృష్ణ కవీంద్రుడు

కాలం : క్రీ.శ. 18 వ శతాబ్ది ప్రథమ పాదం.

స్థలం : మధుర సంస్థానం.

రచనలు : తెలియరాలేదు.

సమకాలికులు : శేషము వెంకటపతి, సముఖం వేంకటకృష్ణప్ప.

విజయరంగచొక్కనాథుని కాలంవాడు కావచ్చును. ఇతని సమకాలికులైన కవులు ఇతన్ని పేర్కొన్నారు. ఇతని రచనలు తెలియరాలేదు. (ఆరుద్ర–12–99)

బుధ మనోల్లాస శతకము

రచనాకాలం : క్రీ శ. 1830 ప్రాంతం.

కర్త : మాటూరి వేంకటేశకవి.

భక్తి రస భరితమైన శతకం. రచన అంత ప్రౌఢం కాదు. (క.స–260)

బుద్ధిరాజు కనకరాజు

కాలం : క్రీ. శ. 1820 ప్రాంతం.

రచన : శివశతకము.

వివరాలు తెలియరాలేదు (శ.క.చ–577)

బుద్ధిరాజు పేరయకవి

కాలం : క్రీ. శ. 18వ శతాబ్దం.

గురువు : ఇవటూరి వీరారాధ్యుడు.

రచన : సాత్విక బ్రహ్మ విద్యా విలాస నిరసనము.

కవి వీరశైవ సంప్రదాయానికి చెందినవాడు.

పినపాటి సర్వ దేవారాధ్యుని ప్రేరణతో సాత్విక బ్రహ్మ విద్యా విలాస నిరసనమనే గ్రంథాన్ని రచించాడు.

## బుర్ర కథలు

నామాంతరాలు : జంగం కథలు, తందాన కథలు.

పూర్వపు యక్షగానాలు, వీథి నాటకాలు, జంగం కథలు క్రమంగా బుర్ర కథలుగా పరిణామం చెందాయి. ఇందులో ఒకరు ప్రధాన కథకుడుగాను, ఇద్దరు గుమ్మెటలు పట్టే వంతదార్లుగాను ఉంటారు. వంతపాడే వారిలో ఒకరు హాస్యం, ఒకరు రాజకీయం చెబుతారు.

పూర్వం జంగం కథల ఫక్కీలోనే ఈ కథలు నడుస్తాయి. ఇందులో చారిత్రక పౌరాణిక గాథలు కూడా ఉంటాయి. దీనిలో ఉపయోగించే వాటినే జానపదులు గుమ్మెట్లు అంటారు. వంతలో "తందానతాన", తకిట తకధిమి, తధిగిణతోం, అరరె-అరరె, భళి భళీ ! అంటూ నవరస భరితంగా కథ రక్తి కడుతుంది. బుర్ర కథలో కథకుడు అభినయం, నృత్యం చక్కగా చేస్తుంటాడు. తెలుగు దేశంలో ప్రసిద్ధి పొందిన జానపద కళా ఖండాలలో దీనికి ఉత్తమస్థానముంది. (నా. ర- చ-921)

## బృందావన విహారము

రచనాకాలం : క్రీ.శ. 1845 ప్రాంతం.
కర్త : దామరాజు లక్ష్మీనారాయణ.
అంకితం : మల్కాపురంలోని సీతారామ స్వామికి.

మూడాశ్వాసాల ప్రబంధం. బృందావనంలోని శ్రీకృష్ణుని క్రీడలు వర్ణితం. (క. వ-208)

## బృహజ్జాతకము (తెలుగు భాష్యం)

కర్త : విష్ణువర్ధన మంత్రి.

వచన గ్రంథం. రచన నన్నయను తలపిస్తున్నది. గహనమైన విషయాలను కవి లఘుతరంగా, మధురంగా చెప్పాడు.

## బృహత్తటాకము నాగశాస్త్రి

కాలం : క్రీ. శ. 1740 ప్రాంతం.
స్థలం : దక్షిణదేశం.
రచన : సుబ్రహ్మణ్య శతకము (శ్రీ వాలసుబ్బరాయ శతకము).

తురుష్కులు హిందూ దేవాలయాలను ధ్వంసం చేసే సమయంలో ఈయన ఈ శతకం వ్రాసి తన హృదయంలోని బాధను సుబ్రహ్మణ్య స్వామికి నివేదించాడు. ఇతవి రచన సరళంగా హృదయంగమంగా ఉంటుంది. (శ. సా. వి.)

## బృహదారణ్యక వార్తిక సారమ్ (సం)

కర్త : విద్యారణ్యుడు.

ఇది బృహదారణ్యకోపనిషత్తుకు సంస్కృతంలో వివరణ. (తె. వి. స-4)

**బృహన్నాయికా దండకము**

కవి : నుదురుపాటి వెంకన్న. (చూ.)

అంకితం : బృహన్నాయికకు.

పుదుకోట రాజుల ఇష్టదైవం బృహదంబికకు అంకితంగా చేసిన రచన. రాజైన రాయరఘునాథుని గూర్చి తెలిపే దండకం. కవికిగల సంస్కృతాంధ్ర కవన పటిమ, ఇందులో సూచితం. ఇందులో కవి రఘునాథుని రాజాబహద్దర్ అని పేర్కొన్నాడు. దీనినుండి చారిత్రక అంశాలు కూడా కొన్ని తెలుస్తున్నాయి. కొన్ని అన్య దేశ్యపదాల ప్రయోగం కానవస్తున్నది. (వ దే.వా-429)

**బృహన్నారదీయము**

కర్త : చూ. కొత్తలంక మృత్యుంజయ కవి.

ఆరు ఆశ్వాసాలున్న పురాణగ్రంథం (తె.వి స-6)

**బృహన్నారదీయము**

కర్త ; చూ. వాసిరాజు రామయ్య.

విశిష్టత : 22 మహాపురాణాల్లో నారదీయం, 34 ఉప పురాణాల్లో బృహన్నారదీయం ఉన్నాయని పండితులంటారు. నారదీయాన్ని పిల్లలమర్రి పినవీరన తెనిగించాడు గాని అది దొరకలేదు నారదీయ పురాణాన్ని ఓరుగల్లు నివాసి అల్లాడ నరసింహ కవి వ్రాశాడు. దీని ప్రతి మద్రాసు ప్రాచ్య లిఖిత గ్రంథాలయంలో ఉంది. రామయ్యకు అర్వాచీనుడయిన కొత్తలంక మృత్యుంజయ కవి బృహన్నారదీయాన్ని తెనిగించాడు. వీరిలో రామయ్య కవిత జటిలమైనదని అంటారు. అసలు ఈ పురాణం నారద సనత్కుమారుల సంవాద రూపకమైన రచన. ఇందులో గంగావతరణ కథ, హైహయులకు ఓడి బృహస్పతి అడవులు పట్టడం, అతడు మరణించటం, గర్భవతియైన అతని భార్య సహగమనం చేయబోవటం, ఔర్వముని వారించటం, సగరునిపుట్టుక, ఆయన అశ్వమేధయాగ సంకల్పం, దాని విఘ్నం, సగర పుత్రులు భస్మం కావటం, భగీరథ ప్రయత్నాలు, గంగావతరణం మొ॥వి ఉంటాయి. అజ్ఞాత గ్రంథ సంకలన కర్త దీనిలోనుంచి 3 పద్యాలు ఉదహరించాడు. (ఆరుద్ర-8-88)

**బెంజమన్ షూల్జ్**

కాలం : క్రీ శ.1746 ప్రాంతం.

స్థలం : జర్మనీ దేశం.

రచించి ప్రకటించిన తెలుగుగ్రంథాలు.

1. సత్యమైన వేదంలో ఉండే జ్ఞాన ఉపదేశాల యొక్క సంక్షేపం (1746).
2. మోక్షానికి కొంచుపొయ్యే దోవ (1746).
3. బుద్ధిగలిగిన - నూరుజ్ఞాన వచనాల యొక్క చిన్న పుస్తకం(1747).
4. ఛక్రగురువు, అయిదు బ్రాహ్మలయొక్క - పెద్ద స్వామిమీద ప్రసంగించిన

తర్కామితె (1747).

అప్పటి తెలుగు ముద్రణలోని తెలుగు రూపం ఈతని గ్రంథాలనుండి తెలియ వస్తుంది. (వ.వా-51)

**పెండపూడి అన్నయ**

కాలం : క్రీ.శ. 15వ శతాబ్ది పూర్వార్ధం.

సాహిత్య పోషకుడు. శ్రీనాథుని 'భీమేశ్వర పురాణం' కావ్యానికి కృతిపతి. రాజమహేంద్రవరం ప్రభువైన అల్లాడ వేమారెడ్డి మంత్రి. అతని రాజ్యవ్యవహారాలన్నీ కడు దక్షతతో నిర్వహించేవాడట

ప్రత్యేకత : అల్లాడ వేమారెడ్డి 'రాజ్యోన్నతి సంతతాభ్యుదయ మొందగ' అన్నయ మంత్రి పారశీక భాషలో చక్కని వ్రాలుతో కాగితం మీద వ్రాసి 'అహమ్మదుషా' ఆస్థానానికి పంపినట్లు శ్రీనాథుని 'భీమేశ్వర పురాణ'కృత్యాదిలో ఉంది (తె.రా.చ.)

**బెజగము నరసయ్య**

కాలం : క్రీ. శ. 18 వ శతాబ్దం.

చూ : బొగ్గవరపు పెదపాపరాజు.

ఈయన అందచందాలు పొగడుతూ బొగ్గవరపు పెదపాపరాజు ఒక పద్యం వ్రాశాడు. (చా. ప. ర.)

**బెజ్జమహాదేవి కథ**

ఇది పాల్కురికి సోమన్న విరచిత బసవ పురాణంలోని కథ. ఈమె ఒక ముగ్ధ భక్తురాలు. ఈమె శివునకు తల్లి దండ్రులు లేరని శివుడు తన తనయుడేనని భావించి అతనికి "లాలనపాలన" చేస్తుంది. ఈశ్వరునికి తల్లి లేక పోవటంవల్ల ఈమె చింతిస్తుంది. శివునికి జలకాలు సైతం ఆడిస్తుంది. శివుడామెను పరీక్షించదలచి పాలు త్రాగటం మానివేస్తే, తనయునికి ఏమైందోనని బాధపడి, పెట్టింది తిని ఇంటిలో ఉండక ఇల్లిల్లు తిరిగి రోగం తెచ్చుకొన్నాడని విచారిస్తుంది. దుఃఖ భారాన్ని సహించలేక ఈమె ప్రాణం విడవటానికి సిద్ధపడితే శివుడు ప్రత్యక్షమై ఆమెకు నిత్యత్వమిస్తాడు. ఈమె నిజమైన మాతృదేవతా మూర్తికి ప్రతీక. (సా. మంజూష-56-57)

**బెల్లంకొండ**

ఇది గుంటూరు మండలంలోని గిరిదుర్గం. కొండవీటి రెడ్డి రాజులకు చెందినది. సిద్ధయమంత్రి మొదటి దేవరాయల రాజ ప్రతినిధి. ఈ సిద్ధయ జక్కన "విక్రమార్క చరిత్ర"కు కృతిపతి, పోషకుడు. ఈ సిద్ధయ బెల్లంకొండలోని భైరవ దేవుని కృపవల్ల ధనధాన్యాదులతో వర్ధిల్లాడని జక్కన కావ్యకృత్యాది పద్యాలవల్ల తెలుస్తున్నది. విజయ నగర రాజుల దండయాత్రల కాలంలో కొండవీడు, వినుకొండలతో పాటు, బెల్లంకొండ కూడా పతనమై ఒరిస్సా గజపతులకు వశమైంది. 1536 ప్రాంతంలో ఇది మహమ్మదీయుల వశమై కుతుబ్‌షాహీల పాలనలోకి వచ్చింది.

**బేతనభట్టు**

కాలం : క్రీ.శ. 1022 ప్రాంతం.

స్థలం : తూర్పు గోదావరి జిల్లా.

కోరుమిల్లి శాసనకర్త : ఈ శాసనంలో దేశీయ ఛందస్సు కవిపిస్తున్నది. ఇతని ఇతర రచనలు లభించలేదు. (తె.క.చ_109)

**బేతపూడి కృష్ణకవి**

కాలం : క్రీ.శ. 18 వ శతాబ్దం.

రచనలు : 1. జానకీ రాఘవము 2. అలమేలు మంగా వివాహము 3. పండిత మనోభిరామము.

విద్వత్కవి. (క.స_38)

**బేతాళ చరిత్రము**

రచనాకాలం : క్రీ. శ. 1770 ప్రాంతం.

కర్త : బంగారు రంగప్ప.

ద్విపద కావ్యం. రేచర్ల గోత్రజుడైన బేతాళ నాయకుని చరిత్ర ఇందులో ఉంది. ఇది అన్నసముద్రం చిన వీరయ్య సంస్కృతంలో రచించిన గ్రంథాన్ననుసరించి రచింపబడినదట. (క. స_178)

**బేతాళ పంచవింశతి (అలభ్యం)**

కర్త : చూ. కవిభల్లటుడు.

అప్పకవి దీనినుంచి కొన్ని పద్యాలను ఉదాహరించాడు. క్రీ.శ. 1150 ప్రాంతాలలో వెన్నెలకంటి అన్నయ రచించిన షోడశ కుమార చరిత్రలో లభ్యమైన భాగాలూ, కలిభల్లటునివిగా ఉదహరింపబడిన బేతాళ పంచవింశతిలోని భాగాలూ అభిన్నాలట. షోడశ కుమార చరిత్రలోని పద్యాలను బేతాళ పంచవింశతిలోనివిగా చిన్నయ సూరి చెప్పాడని పండితులు అంటున్నారు. (ఆరుద్ర_4; క. స_10)

**బేతాళ పంచవింశతి (అలభ్యం)**

రచనాకాలం : క్రీ. శ. 1560కి పూర్వం.

కర్త : పోతరాజు.

దీనిలోనుంచి 10 పద్యాలను అజ్ఞాత గ్రంథ సంధాత తన ఉదాహరణ పద్యములు"లో ఉదాహరించాడు. కవిత ప్రబంధ సాధారణంగా ఉంటుంది. చెప్పుకోదగ్గ విశేషాలు లేవు. (ఆరుద్ర_9)

**బేతాళ పంచవింశతి**

రచనాకాలం : క్రీ. శ. 19వ శతాబ్ద ప్రథమభాగం.

కర్త : చూ. మిక్కిలి మల్లికార్జున కవి.

సరళమైన రచన. (ఆం. సం. సా_254)

## బేరీజు పద్యములు

కర్త : చూ. విస్సాప్రెగ్గడ కామరాజుకవి.

వివరాలు తెలియవు. (ఆం. సం. సా-419)

## బైండ్లవారు

నామాంతరం : బవసీలు.

క్రీడాభిరామంలో వీరి ప్రసక్తి ఉంది. "ఏకవీర మహాదేవి ఎదుట నిల్చి పరశు రాముని కథ లెల్ల ప్రౌఢిపాడె- చారుతర కీర్తి బవసీల చక్రవర్తి" అని పై గ్రంథంలో ఉండటంవల్ల అప్పటి బవసీలే ఇప్పటి బైండ్ల వారు కావచ్చునేమో అని పండితులు అనుమానిస్తున్నారు.

వీరు తీరాంధ్ర దేశంలో మాలవారివి, మాదిగ వారివి యాచిస్తూ, తరచుగా చెంచు నాటకం వంటి యక్షగానాలను ప్రదర్శిస్తూ ఉంటారు. వీరి శైవులకు వినోదాన్ని కలిగిస్తూ ఉంటారు. శైవ మతస్థుల ఇళ్ళలో పెళ్ళి మొదలయిన శుభకార్యాలలోను, చావు మొదలయిన దుర్దినాలలో కథలు చెబుతూ ఉంటారు. పెళ్ళికి వేరే వాయిద్యాలను ఉప యోగిస్తుంటారు. (నా. ర. చ-296)

## బైచరాజు వేంకటనాథుడు.

కాలం : క్రీ. శ. 1500 - 1570

స్థలం : నెల్లూరు ప్రాంతం.

గురువు : శ్రీయఃపతి.

రచన : పంచతంత్రం.

పర్వతరాజు అన్నమాంబల పుత్రుడు. లింగాంబ లింగరాజుల పౌత్రుడు ఇతడు హిందూ ముసల్మానుల యుద్ధకాలంలో ఉన్నట్లు కనిపిస్తుంది. పాండిత్యంలో, కావ్యరచనలో ప్రౌఢుడు. కావ్య స్వరూపాన్ని గురించి 'పంచతంత్రం'లో ఇతడు చెప్పిన సత్యం విశ్వజనీనం. "అలంకారాని కొకరు, వార్తాసమృద్ధి కొకరు, శబ్దస్ఫూర్తికి ఒకరు, అర్థసృష్టికి వేరొకరు, రసభోగతకు మరొకరు, ఉపమా చర్చికకు, పద ప్రౌఢిమకు, జాతిశ్లాఘకు కొందరు సంతసిస్తారని, అందరినీ ఆనందింప చేయటం సాధ్యం కాదని, కావ్యంలో లోపాలు కూడా ఉండవచ్చునని" వేంకటనాథుడు చెప్పాడు. సామెతలు, పలుకుబళ్ల, నుడికారాలు ఇతని రచనలో కొల్లలు. ముత్తాతయైన బైచరాజు పేరే వీరి వంశనామంగా ప్రఖ్యాతమయింది (తె.వి.న-4)

## బైబిల్ అనువాదము

అనువాదకర్త : బ్రౌన్.

రచనా కాలం : క్రి. శ. 1827.

ఇది పూర్తి గ్రంథానికి అనువాదమో లేక కొంత భాగానికే పరిమితమో నిర్ధా

రణగా తెలియ రావడం లేదు. ఇది ఆనాటి కళాశాల, పాఠశాల విద్యార్థులకు పాఠ్య గ్రంథంగా ఉండేది. (తె.భా చ : భ-268)

**బొంగరాల ఆట**

కాలం : క్రీ.శ. 12, 13, 14 శతాబ్దాలు.

ఈ ఆట పలనాటి వీర చరిత్రలో ప్రసక్తం. పెద్దలు, సాటి వీరులందరూ యుద్ధం చేయబోతే, పల్నాటి బాలచంద్రుడు బాధ్యతలు మరచి స్నేహితులతో బొంగరాల ఆట ఆడటం, కాలిమీద బొంగరం దెబ్బతిన్న స్త్రీ బాలచంద్రుని నిందించటం, బాల చంద్రుడు సిగ్గుపడి కారెంపూడి కదనరంగానికి ఉరకటం పలనాటి వీరచరిత్రలో విస్తృతంగా వర్ణితం. నేటికి తెలుగుదేశంలో విస్తృతంగా ఆడే ఈ బొంగరాల ఆటలు ప్రాచీనకాలంనుంచీ ఉన్నాయి. ఇవి ముఖ్యంగా బాలురకు వినోద క్రీడలు. (ఆం.సాం.చ-93)

**బొంతవారు**

బొంత ధరించటం వల్లనో, బొంత కుట్టటం వల్లనో కొన్ని కుటుంబాలవారి ఇంటిపేరు బొంతవారుగా తెలుగు దేశంలో నిలిచి పోయింది. (భారతి-మా 45-230)

**బొక్కావారు**

ఇంటిపేరు. రంధ్రం వేయటమే వృత్తిగా పెట్టుకున్నందుకు వచ్చిందో, మరి ఇతర కారణాలవల్ల వచ్చిందో చెప్పటం కష్టం. ఈ ఇంటి పేరుతో కొన్ని కుటుంబాలు ఉన్నాయి. ఈ ఇంటిపేరు వారే బ్రహ్మాండంవారుగాను, బ్రహ్మాండం బొక్కా వారుగాను ప్రసిద్ధులు. (భారతి-మా-45-230)

**బొగ్గవరపు పెదపాపరాజు**

కాలం : క్రీ శ. 18 శతాబ్ది.

స్థలం : గుంటూరు జిల్లాలోని బొగ్గవరం గ్రామం.

చాటుకవి. చాలా సంస్థానాలు దర్శించాడు. తనకు కావలసిన భోజన సామగ్రిమీద తన సంసారస్థితిని గురించి ఈయన పద్యాలు చెప్పాడు. తన భాగస్థులకు బుద్ధి చెప్పమని బొగ్గవరపు వెంకట్రాయుణ్ని కోరుతూ ఒక పద్యం, బెజగం నరసయ్యమీద మరోపద్యం రాశాడు. ఇంతకుమించి ఇతని పద్యాలు దొరకలేదు. ఇతనికి తిరుమల బుక్కాపట్టణం తాతాచార్యులు చాలా సహాయం చేశాడట. (చా. ప. ర.)

**బొడ్డపాటి కొండయ్య**

కాలం : క్రీ.శ. 1590 కి పూర్వుడు.

రచన : అంగభవభంగ తిరుకాళహస్తి లింగ శతకము (అలభ్యం).

ఈ కవిని పెదపాటి జగ్గన్న పేర్కొన్నాడు. (ఆరుద్ర - 9)

**బొడ్డపాటి పేరయ్య**

కాలం : క్రీ. శ. 1590 కి పూర్వం.

రచనలు : 1 అనంత మాహాత్మ్యము (అలభ్యం) 2. పద్మినీ వల్లభము (అలభ్యం) 3 మంగళగిరి విలాసము (అలభ్యం) 4. శంకర విజయము (అలభ్యం) 5. సూర్యశతకము (అలభ్యం) 6. మల్లికార్జున లింగ శతకము (అలభ్యం).

విశిష్టత : పేరయ్య వ్రాసిన పై ఆరు గ్రంథాలలో నుంచి కొన్ని పద్యాలను జగ్గన్న ప్రబంధ రత్నాకరంలో ఉదాహరించాడు. రావిపాటి తిప్పన్న 'చంద్రతారావళి' ని చంద్రా ! రోహిణీ వల్లభా ! అనే మకుటంతో వ్రాసినట్లే పేరయ్య 'సూర్యా'! పద్మినీ వల్లభా ! అనే మకుటంతో సూర్య శతకం వ్రాశాడు. దీనిలో నుంచి పెదపాటి జగ్గన్న ఒక పద్యాన్ని ఉదాహరించాడు. సూర్య శతకం కాక పేరయ్య తన యిష్ట దైవమైన సూర్యుని మీద 'పద్మినీ వల్లభం' అనే ప్రబంధమే వ్రాశాడు ఈ గ్రంథం నుంచి జగ్గన్న 6 పద్యాలను ఉదాహరించాడు. అనంత మహాత్మ్యం అనే కావ్యంలో కూడా సూర్యుని నుతించాడు. ఈ కావ్యం నుంచి జగ్గన్న ఒక్క పద్యాన్ని ఉదాహరించాడు. జగ్గన్న ఇతని మంగళగిరి విలాసంలో నుంచి కూడా ఒక పద్యాన్ని సేకరించి ఉదాహరించాడు. ఈయన వ్రాసిన శంకర విజయంలో నుంచి జగ్గన్న 7 పద్యాలను ఉదాహరించాడు. ఇందులోని నాయిక మేనా పుత్రి.

విజయవాటిలోని మల్లికార్జున లింగం పైన పేరయ్య ఒక శతకం వ్రాశాడు. అందులో నుంచి జగ్గన్న ఉదాహరించిన మూడు పద్యాలు త్రిపుర సంహారానికి సంబంధించినవి. పేరయ్య యింటిపేరుతో ఉన్న కొండయ్య వ్రాసిన కాళహస్తి లింగ శతకంలో కూడా త్రిపుర సంహారాన్ని వర్ణించే మూడు పద్యాలనే జగ్గన్న ఉదాహరించటం గమనార్హం. బొడ్డపాటి గ్రామంలోని కవులిద్దరూ ఒకే రకమైన భావాలతో శతకాలను చెప్పడం వల్ల ఒకరిని యింకొకరు అనుసరించి ఉండవచ్చు. (ఆరుద్ర - 9)

## బొడ్డుచర్ల చినతిమ్మయ

కాలం : క్రీ.శ. 16 వ శతాబ్దం.
స్థలం : విజయనగర ఆస్థానం.
సమకాలికులు : అష్టదిగ్గజాలు.
బిరుదు : కవి దిగ్దంతి.

విశిష్టత : ఈయన వ్రాసిన కావ్యాలు లేవు గాని ఈయన శ్రీకృష్ణదేవరాయలతో చదరంగ మాడి తన ప్రావీణ్యాన్ని చూపేవాడని ఒక చాటువున్నది. (వి.న.చ.)

## బొడ్డుచర్ల తిమ్మన

కాలం : క్రీ.శ. 16 వ శతాబ్ది చివరి భాగం.
రచన : ప్రసన్న రాఘవము.
కృతిపతి : నంద్యాల తిమ్మరాజు (కళాపూర్ణోదయం కృష్ణమరాజుకు పరసతు సోదరుడు).

విశిష్టత : ప్రసన్న రాఘవ కర్త ఈయనేనని, ఈయన కాదని పండితుల

మధ్య భేదాభిప్రాయ ముంది కృష్ణదేవరాయల వద్ద చదరంగమాడి మెప్పించిన బొడ్డుచర్ల తిమ్మనకు ఈ కవి మనుమడు. ఈయన, సంస్కృతంలో జయదేవ విరచితమైన "ప్రసన్న రాఘవం" అనే నాట్య ప్రబంధాన్ని, రమారమి నాటకంలాగే అనువదించాడు. తన కావ్యాన్ని ఆశ్వాసాలుగా గాక అంకాలుగా విభజించాడు. (ఆరుద్ర-9)

## బొడ్డుచర్ల లోకనాథుడు

కాలం : క్రీ. శ. 16 వ శతాబ్దం (1575 ప్రాంతం).

జయదేవుని ప్రసన్నరాఘవాన్ని అనువదించిన వాడితడేనని కొందరి అభిప్రాయం. అది బొడ్డుచర్ల తిమ్మన కృతమని ప్రతీతి ఉంది. ఈ లోకనాథుడు ఆ తిమ్మన కుమారుడని కొందరూ, మునిమనమడని కొందరూ భావిస్తున్నారు. (ఆరుద్ర-9-194)

## బొడ్డెమ్మ పండుగ

చూ. బతుకమ్మ పండుగ-బొడ్డెమ్మ పండుగ.

## బొప్పరాజు గంగన్న

నామాంతరం : గంగన కవి.
కాలం : క్రీ. శ. 1450-1500 ప్రాంతం.
స్థలం : నైజాం మండలం.
రచన : భాగవతము-పంచమ స్కంధము.
అంకితం : శ్రీకృష్ణునికి.

భాగవతంలో పోతన విడిచిన పంచమ స్కంధం ఈ కవి రెండాశ్వాసాలుగా పూర్తి చేశాడు. రచన సరళం.

విశేషత : భాగవత పంచమ స్కంధం మొదటి ఆశ్వాసంలో ఇరవై కథలు, రెండో ఆశ్వాసంలో ఆరు కథలున్నాయి. ద్వితీయాశ్వాసంలో భూగోళ, ఖగోళ విషయాలెక్కువ. ఈ కవి తండ్రి బొప్పనామాత్యుడు. అందుచేత బొప్పరాజు గంగన్నగా ప్రసిద్ధుడయ్యాడు. (ఆరుద్ర-6)

## బొబ్బిలి

తూర్పు కనుమల చాలులో, నాగావళీ పరీవాహక సీమలో గజపతినగరం, చికాకోలు, పార్వతీపురం, పాలకొండ, సాలూరు తాలూకాల మధ్య – నేటి శ్రీకాకుళం మండలంలో, 'బొబ్బిలి' సంస్థానం వ్యాపించి ఉండేది.

సంస్థానపాలకులు 'వెలమదొరలు.' 'రావు వారు' వీరి వంశనామం. తక్కిన వెలమ దొరలకు వలెనే వీరి శాఖ కూడా 'బేతాళనాయడు' తో ప్రారంభమవుతుంది. ఈ పాలకుల మూలపురుషుడిని కూర్చిన విషయంలో వివాదాలున్నాయి. 'నిర్వాణ రాయప్ప నాయడనే' పెదరాయడే మూలపురుషుడు కావచ్చునని పలువురి అభిప్రాయం. ఇతడు ఈ వంశంలో పదునైదవ తరం వాడు.

క్రీ. శ. 17 వ శతాబ్దం మధ్యకాలంలో చికాకోలును 'షేర్ మహమ్మద్ ఖాను' అనే నవాబు పాలించాడట. సమకాలీన విజయనగరం పాలకుడు, ఈ నిర్వాణ రాయప్ప నాయడు ఇద్దరూ కలిసి ఈ నవాబుకు మన్యప్రాంతాలలోని పితూరీలను అణచడానికి సహాయపడి ఎస్టేటులు బహుమానం పొందారట. బొబ్బిలి వారికి 'రాజాము' ఎస్టేటు లభించింది.

ఈ నిర్వాణ రాయప్పనాయడు తన జమాలో కోటను కట్టుకొని దానికి ప్రభువు పేరున (షేర్ = బెబ్బులి) 'బెబ్బులి' అనే పేరు పెట్టాడట. అది కాలక్రమంలో 'బొబ్బిలి' అయింది. తరువాత పాలకుడైన 'లింగప్పనాయడు' తండ్రిని మించిన పరాక్రమశాలి. సంస్థానాన్ని విస్తరింప చేశాడు. కాలక్రమంలో బొబ్బిలి సంస్థానం 'పూసపాటి వారి' విజయనగర సంస్థానానికి పక్కలో బల్లెమైంది. కక్షలూ కావేశాలు అధికమైనాయి.

క్రీ. శ. 18 వ శతాబ్దంలో బొబ్బిలిని పాలించిన 'గోపాలకృష్ణ రంగారావు'కు విజయనగరం 'పెద విజయరామ గజపతి' (1717–1757) సమకాలికుడు. అంతకు పూర్వం మరాఠీ దండుకు బొబ్బిలివారు సహాయపడి 'విజయనగరం' విధ్వంసం చేయడంలో సాయపడ్డారనే పాత కక్షల కారణంగా, ఈ విజయరామరాజు క్రీ. శ. 1756 లో ఉత్తర సర్కారులలోని జమీందారీల పితూరీలను అణచడానికి వచ్చిన ఫ్రెంచి సేనాని 'బుస్సీదొర' కు సహాయంచేసి, ఆతనికి బొబ్బిలివారిపై విరోధం కలిగించి క్రీ. శ. 1757 జనవరి 24 వ తేదీనాడు జరిగిన 'బొబ్బిలి యుద్ధా' నికి కారకుడైనాడు. ఈ యుద్ధం జనవరి 24 వ తేదీన ఉదయం ప్రారంభమై మధ్యాహ్నంకు ముగిసింది. అయినప్పటికి చరిత్ర ప్రసిద్ధమైన సంఘటన.

పై యుద్ధంలో అందరూ నిహతులు కాగా ఈ వంశంలో బాలకుడైన 'గోపాల వెంకట రంగారావు' (క్రీ.శ. 1751–1801) మిగిలాడు. తదనంతర కాలంలో ఇతడే తిరిగి సంస్థాన ప్రభువైనాడు. కాని ఇతని జీవిత కాలంలో 10 సంవత్సరాలు అజ్ఞాతవాసంలోను, ఆతరువాత సుమారు 30 సం॥లు విజయనగరం వారి జైలులోను జీవితం గడిచింది.

బొబ్బిలి పాలకులు ఇంతవరకు సాహిత్యం విషయంలో చొరవ తీసుకోలేదనే చెప్పాలి. ప్రథమంలో సంస్థానం స్థాపించడానికి, ఆతరువాత దాన్ని విస్తరింప చేసి చక్కదిద్దు కోవడానికే కాలం సరిపోయింది.

తరువాతి పాలకుడైన 'రాజా రాయడప రంగారావు' (1790–1830)సాహిత్యం వైపు మొగ్గుచూపిన బొబ్బిలి పాలకులలో మొదటివాడు. ఇతడు కృతికర్తగా, కృతి భర్తగా పేరుపొందాడు. 'సంకల్ప సూర్యోదయం' ఇతని రచన. వివిధ సంస్థానాల నుండి స్వయంగా కవిపండితులను పిలిపించి, వారిచేత కవిత్వం చెప్పించి, సన్మానించడం ఇతని అలవాటు. 'కొటికెలపూడి వేంకటకృష్ణ సోమయాజి' ఇతని ఆస్థానంలోని వాడు. శతాధిక గ్రంథకర్తయట. ఈ కవి కుమారుడైన 'కొటికెలపూడి కోదండరామకవి' పై

రాజాగారి కుమారుడైన శ్వేతాచలపతి, రంగారాయ బహద్దరు గారి ఆస్థానంలోని వాడు. 'ప్రపదనపారిజాతా'ది బహుగ్రంథకర్త. ఈ శ్వేతాచలపతి రంగారావు గారికి 'జనార్దన రంగరాయ బహద్దర'నే సోదరు డున్నాడు. విద్వత్కవి. 'హరిభక్తి సుధోదయము' అనే తాత్విక ప్రబంధం, 'మిత్రవిందా పరిణయం' అనే శృంగార ప్రబంధం ఇతని రచనలు.

సుప్రసిద్ధులైన మండపాక వంశజులు ఈ సంస్థానాన్ని ఆశ్రయించిన విద్వత్కవులలో శ్రేష్ఠులు. మండపాక కామకవి, మండపాక పార్వతీశ్వర శాస్త్రి, మండ వేముల వేంకట రామకవి, మండవేముల సీతారామశాస్త్రి, ప్రభృతులు ఈ సంస్థానంలో పేరెన్నికగన్న విద్వత్కవులు. క్రీ. శ. 1881 లో బొబ్బిలి పాలన స్వీకరించిన (రంగ మన్నారు కృష్ణ యాచేంద్రులు) వేంకట శ్వేతాచలపతి రంగారావు బహద్దర్ గారు అత్యంత ప్రముఖులు. వీరు పండిత పోషకులే గాక స్వయంగా ఆంధ్రాంగ్ల భాషలలో అనేక రచనలు చేశారు. వీరి తరువాతి పాలకులైన జమీందారులు రాజా రావు సర్ వేంకట శ్వేతాచలపతి రామకృష్ణ రంగారావు గారు సాహిత్యపోషణ విషయంలో తండ్రిని మించిన ఘటికులు. తిరుపతి వేంకట కవులు, పిశుపాటి చిదంబర శాస్త్రి ప్రముఖులను సత్కరించారు.

బొబ్బిలి పాలకులు సాహిత్యంలోనే కాక సంగీతంపైన కూడా అభిమానం కలవారే. నందిగానం వెంకయ్య బొబ్బిలిసంస్థాన సంగీత విద్వాంసుడు. వీణానాద తత్వజ్ఞులైన వాసా దాసన్న, వాసా సాంబయ్య, వాసా కామయ్య మొదలగువారు బొబ్బిలి సంస్థానంలో పేరుగాంచిన వైణిక సార్వభౌములు.

బొబ్బిలి జమీందారులు ఆయుర్వేద విద్యనుకూడ అభిమానించి పోషించారట.
(ఆం. సం సా.)

**బొబ్బిలి మహారాజ వంశావళి**

రచనాకాలం : క్రీ. శ. 19వ శతాబ్దం.
కర్త : మండపాక పార్వతీశ్వర కవి

గద్యకృతి. చారిత్రాత్మకంగా కూడా విలువైన రచన. (క. న-124)

**బొబ్బిలిరాజు కథ**

కర్త : తెలియదు.

జానపద చారిత్రక గేయం.

బొబ్బిలి రాజైన గోపాలకృష్ణ రంగరాయలకు, "బుస్సిదొర"కు మధ్య జరిగిన యుద్ధం ఇందులోని వస్తువు. విజయనగరం పెద విజయరామరాజు కుతంత్రం, బొబ్బిలి వారి శౌర్యపరాక్రమాలు మొదలగునవి ప్రతిబింబించే రచన ఇది.

చూ. చారిత్రక గేయములు.

**బొమ్మకంటి అప్పయాచార్యుడు**

కాలం : క్రీ. శ. 14వ శతాబ్దం ఉత్తరార్ధం.

స్థలం : రాచకొండ-దేవరకొండరాజ్యం.
రచన : అమరకోశ వ్యాఖ్య.

ఇతనికి "మారపోత" నామాంతరమున్నట్లు తెలుస్తున్నది. ప్రాయికంగా ఈయన పేరు "పోతప్పయ్య" కావచ్చు. (తె. వి. స-8)

### బొమ్మకంటి నృసింహ కవి

కాలం : క్రీ. శ. 18వ శతాబ్దికి పూర్వం.
రచన : ధర్మాంగద చరిత్ర (ద్విపద).

నరసమాంబా మాధవుల పుత్రుడు. నిర్దుష్టంగా రసవంతంగా కవిత్వం చెప్పాడు. జాతీయాలు, జన సామాన్యంలో ఉన్న కొన్ని ప్రయోగాలు ఇతని రచనలో కనిపిస్తున్నాయి. (ద్వి సా. చ-438)

### బొమ్మరాజు

కాలం : క్రీ. శ. 19వ శతాబ్దం-ఉత్తరార్ధం.
స్థలం : కార్వేటినగర సంస్థానం (సంస్థానాధీశ్వరుడు).

సంస్కృతకావ్యమైన "పద్మావతీ పరిణయానికి" కృతిపతి, సాహిత్యపోషకుడు.

ఇతడు వేంకట పెరుమాళ్ల రాజు పుత్రుడు. క్రీ. శ. 1885లో జమీందారైనాడు. వీరి కాలానికి సంస్థానం పుట్టెడు అప్పులలో మునిగి ఉండడంచేత, వీరు ఎస్టేటులోని చాలాభాగం అమ్మివేయవలసి వచ్చింది. "చెట్టినాడు" జమీందారీ ఇలా అమ్మగా ఏర్పడిన భాగమే.

బొమ్మరాజు సంగీత, సాహిత్య ప్రియులు. రామచంద్ర యశోభూషణ కర్త అయిన కచ్ఛపేశ్వర దీక్షితులు వీరి ఆశ్రిత వర్గంలోని వారే. (ఆం. సం. సా.)

### బొమ్మరాజు నృసింహదాసు

కాలం : క్రీ. శ. 1807-1857 ప్రాంతం.
రచన : రంగనాయక శతకము.

### బొమ్మలాట కాళయ

కాలం : క్రీ. శ. 16వ శతాబ్దం.
స్థలం : విజయనగరం.
గురువు : కుమార తాతాచార్యులు.

సాహిత్య ప్రీతి కలవాడు. ఇతడు శ్రీకృష్ణ దేవరాయలను అచ్యుతదేవరాయలను కొలిచి వారి మన్ననలు పొందాడట కవి దేవేంద్రుడని బిరుదు పొందిన కోడూరి వల్లభ సూరిని ప్రోత్సహించి "పాటి గణితం" రచింప చేశాడు. ఆ కృతిని తానే అంకితం తీసుకొన్నాడు. పాటి గణితం భాస్కరాచార్యుని లీలావతీ గణితం నుండి రచింపబడినది. (క. స-216)

## బొమ్మలాట రామాయణము

కర్తలు : 1. గోన బుద్ధారెడ్డి 2. కాచభూపతి 3. విఠ్ఠలవిభుడు.

నామాంతరం : రంగనాథ రామాయణము.

ప్రత్యేకత : మంజరీ ద్విపదలో నడిచిన రచన. గాన యోగ్యమైంది. తెలుగు దేశంలోని బొమ్మలాటవారు రామాయణ పాత్రల కనుగుణంగా బొమ్మలను తయారు చేసి ఈ రామాయణాన్ని గానం చేస్తూ బొమ్మల నాడించడం గ్రామ సీమలలో పరిపాటి. జానపదులు ఈ రామాయణాన్ని బొమ్మలాట రామాయణమంటారు. మంజరీ ద్విపదలోని ఈ రామాయణం బొమ్మలాట వారికి జీవిక.

పూర్తి వివరాలకు చూ. రంగనాథ రామాయణం.

## బొమ్మలాటవారు

బొమ్మలాట ఆడించే వృత్తి రీత్యా కొందరి ఇంటిపేరు బొమ్మలాటగా దేశంలో నిలిచిపోయింది. బొమ్మలాట వారి కుటుంబానికి చెందిన "బొమ్మలాట" సాంబయ్య అనే వ్యక్తి (క్రీ.శ. 1750 ప్రాంతం) కిరాతార్జునీయం, సారంగధర చరిత్ర అనే యక్షగానాలు వ్రాశాడు. (య. వా. చ-ద్వి. భా-46-48)

## బొమ్మలాట సాంబయ్య

కాలం : క్రీ. శ. 1750 ప్రాంతం.

రచనలు : 1. కిరాతార్జునీయము (తెలుగు) 2. కరియబంటన విజయము (కన్నడం) 3. సారంగధర చరిత్రము (కన్నడం).

కర్ణాటాంధ్ర భాషలలో రచనలు చేశాడు. ఇతని కుటుంబంవారు బొమ్మలాటలు ప్రదర్శించేవారు. అందుకనుగుణంగా ఈ కథలను తీర్చి దిద్దినట్లు తెలుస్తున్నది. కవి సోదరులు కూడా రచనలలోనూ, ప్రదర్శనలోనూ కవికి తోడ్పడ్డారట. (య. వా. చ.)

## బొమ్మిరెడ్డి పిల్లి వారు

"పిల్లి" అంతంగా ఉన్న గ్రామ నామంతో ఉన్న ఇంటిపేరు. కామేపిల్లి, పారుపిల్లి మొదలయినవి ఇలాంటివి. (భారతి-మార్చి-45-228)

## బొల్లన పాములపాడు శాసనము

కాలం : క్రీ. శ. 1172 ప్రాంతం.

శాసనప్రదాత : బొల్లన.

ప్రస్తావిత స్థలం : గుంటూరు తాలూకా పాములపాడు గ్రామం.

శాసనవిషయం : బొల్లన పెన్నప రెడ్డికి, ప్రోలసానమ్మకు వరపుత్రుడట. ఈ శాసనం పాములపాడులో వేంచేసి ఉన్న మల్లికార్జున స్వామివారి ఆలయానికి ఎదుట ఉన్న నంది నాగస్తంభం మీద చెక్కి ఉంది. బొల్లన తన తల్లిదండ్రులకు ధర్మార్థంగా మల్లికార్జున స్వామికి అఖండ దీపం నిలిపినట్లు ఈ శాసనం వల్ల తెలుస్తున్నది. దీనిలో ఒక చంపకమాల, ఒక కంద పద్యం ఉన్నాయి. (తె. క. చ-308 d)

## బొల్లన శాసనము

కాలం : క్రీ. శ. 1171 ప్రాంతం.

శాసనప్రదాత : బొల్లన.

ప్రస్తావిత స్థలం : శ్రీగిరి పశ్చిమదేశంలోని శిరిపురం గ్రామం.

ప్రస్తావిత వ్యక్తి : వెలనాటి గొంకరాజు కుమారుడు.

శాసన విషయం : శాసనం స్పష్టంగాలేదు. బొల్లన కొండ పడమటి సీమలోని గ్రామం శిరిపురంలో వేంచేసియున్న శివునకు అఖండ దీపం నిలిపినట్లు శాసనంవల్ల తెలుస్తున్నది. దీనిలో అసమగ్రంగా ఒక మత్తేభం, ఒక సీసము ఉన్నాయి.

(తె.క.ప-309)

## బోయినపల్లి కుమార వేంకటరాయలు

కాలం : క్రీ. శ 17వ శతాబ్దం మధ్యభాగం.

స్థలం : పానుగల్లు (దుర్గాధిపతి).

రచన : ద్రౌపదీ కల్యాణము.

రాజకవి. గద్వాల సంస్థానాధీశుల పూర్వీకుడు. ఇతడు పానుగల్లు దుర్గాధిపతి. సాహిత్య పోషకుడు. బంధ గర్భ కవిత్వాలలో అందెవేసిన చేయి ద్రౌపదీ కల్యాణ ప్రబంధాన్ని రచించి, తిరుపతి వేంకటేశ్వర స్వామికి అంకితమిచ్చాడు. బోరవెల్లి నరసింహకవి ఇతనికి గురుస్థానంలో ఉండేవాడు. ఆ కవి ప్రేరణవల్లనే ఈతడు గ్రంథ రచన కొనసాగించాడు. (మ. మా.)

## బోరవెల్లి

తెలంగాణా ప్రాంతంలోని ఒక ప్రసిద్ధ సంస్థానం. ఇది మొదట స్వతంత్ర సంస్థానంగా ఉండి, తరువాతి కాలంలో గద్వాల సంస్థానంలో లీనమైపోయింది

ఈ సంస్థానాధీశ్వరులు పాకనాటి రెడ్లు. ఇంటిపేరు "ముష్టిపల్లి". గృహ గోత్ర శాఖా నామాలు సమానంగా ఉండడంబట్టి వీరు గద్వాల ప్రభువులకు సన్నిహిత జ్ఞాతులై ఉండవచ్చునని ఊహ.

సంస్థానం చిన్నదైనా వీరూ శక్తి మేరకు సాహిత్య పోషణ చేశారు. వీరి ఆశ్రయంలో వెలసిన కృతులు రెండు ఉన్నాయి. 1. లయగ్రాహి గరుడాచలకవి కృతమైన "కౌసలేయ చరితము" 2. చింతలపల్లి ఛాయాపతి రచించిన "రాఘవాభ్యుదయము" అనే ప్రబంధం.

ఈ సంస్థానాధిపతి చిన సోమ భూపాలుని భార్య రాణీ గిరియమ్మ, వారి దత్త పుత్రుడు వేంకటపతి ఈ రెండు కావ్యాల రచనకూ ప్రోత్సాహమిచ్చారు.

(ఆం. సం. సా.)

## బోరవెల్లి కృష్ణప్ప

కాలం : క్రీ శ. 17వ శతాబ్దం.

స్థలం : గద్వాల ప్రాంతంలోని బోరవెల్లి.
రచనలు : యయాతి చరిత్ర (అలభ్యం).

ఇతని తండ్రి దత్తన్న శబ్దశాస్త్రవేత్త.

తరిగొప్పులవారు బోరవెల్లిలో స్థిరపడటం వలన వారియింటి పేరు బోరవెల్లిగా మారిందనీ, తొలుత వీరు తరిగొప్పుల వారనీ, ఆ తరువాత రాయసం వారనీ పరిశోధకులు అంటున్నారు. ఈ కవి ప్రౌఢ ప్రబంధ నిర్మాణదక్షుడు. ఇతని కుమారుడు బోరవెల్లి నరసింహం కూడా కవే. (ఆరుద్ర-11-265)

## బోరవెల్లి గిరియమ్మ

కాలం : క్రీ. శ. 17 వ శతాబ్దం.
స్థలం : మహబూబునగర్ మండలం.

బోరవెల్లి సంస్థానపు రాణి.

కవి పండిత పోషకురాలు. లయగ్రాహి గరుడాచలకవి చేత, "కౌసలేయ చరిత్రం" వ్రాయించి తమ యిష్టదైవం కేశవ స్వామికి అంకితం చేయించింది.

ఆమె చేసిన సత్కార్యాలు, వేయించిన అన్న సత్రాలు లెక్కకు మిక్కిలి. ఈమె గద్వాల నేలిన పెదసోమ భూపాలుని కుమార్తె. బోరవెల్లి సంస్థానాధిపతి చిన సోమభూపాలుని ధర్మపత్ని. (ఆరుద్ర-11-215)

## బోరవెల్లి నరసింహం

కాలం : క్రీ.శ. 17 వ శతాబ్దం.
స్థలం : గద్వాల సమీపంలోని బోరవెల్లి.
రచన : సౌవర్ణాఖ్యానము (అలభ్యం).

యయాతి చరిత్ర కృతికర్త కృష్ణప్ప ఇతని తండ్రి. బోరవెల్లి సంస్థానాధిపతులకు గురువుగా ఉండేవాడట.

పెద పానుగల్లు దుర్గాధిపతీ, ద్రౌపదీ కళ్యాణ కర్తా అయిన బోయినపల్లి కుమార వేంకటరాయలు ఇతని శిష్యుడు. ఇతని కావ్యం నుండి బోరవెల్లివారిని గురించిన విశేషాలు తెలుస్తున్నాయి. (ఆరుద్ర-11-265)

## బోరవెల్లి వెంకటరెడ్డి

కాలం : క్రీ శ. 18 వ శతాబ్దం.
స్థలం : గద్వాల సమీపంలోని బోరవెల్లి.

సంస్థానాధీశుడు. సాహిత్య పోషకుడు. చింతలపల్లి ఛాయాపతి చేత తమ యిష్టదైవం కేశవస్వామికి అంకితంగా రాఘవాభ్యుదయ ప్రబంధం రచింపజేశాడు.

ఇతడు బోరవెల్లి రాణి గిరియమ్మ దత్త పుత్రుడట ఆమె తదనంతర సంస్థానానికి అధికారి అయ్యాడు. (ఆం.సం.సా.) (ఆరుద్ర-11-207)

### బోరవెల్లి శేషాచార్యులు

కాలం : క్రీ.శ. 18 వ శతాబ్దం.
స్థలం : గద్వాల.
రచన : యథాశ్లోక తాత్పర్య రామాయణము (చూ) (యుద్ధకాండము).

గద్వాల సంస్థాన పండితులలో ఒకడు. యథాశ్లోక తాత్పర్య రామాయణం లోని యుద్ధకాండ పూర్వభాగం 4 ఆశ్వాసాలుగా అనువదించాడు. ఇతర రచనలు తెలియ రాలేదు. (ఆం సం.సా.) (క.స-269)

### బ్రహ్మపురి

పట్టణం పేరు. నేటి బరంపురాన్నే పూర్వకవులు బ్రహ్మపురి అని వ్యవహ రించేవారు. పారనంది సర్వేశ్వర శాస్త్రి ఇక్కడి దేవుని "బ్రహ్మపురీశా" అని సంబో ధిస్తూ ఒక శతకం వ్రాశాడు. (క.స-285)

### బ్రహ్మపురీశ శతకము

రచనాకాలం : క్రీ.శ. 19 వ శతాబ్దం. 1840కి పూర్వం.
కర్త : పారనంది సర్వేశ్వర శాస్త్రి.
అంకితం : బరంపురంలోని వేంకటేశ్వర స్వామికి.

కందపద్య శతకం. "వేంకటేశ్వర, బ్రహ్మపురీశా" అనే మకుటంతో ఉంది. కవిత్వం రసవంతంగా ఉంటుంది. బ్రహ్మపురి అంటే బరంపురం.

### బ్రహ్మదేవుని (కొణిదెన) శాసనము

కాలం : క్రీ. శ. 1158 ప్రాంతం.
శాసన ప్రదాత : బ్రహ్మదేవుడు (బ్రాహ్మణుడు);
ప్రస్తావిత స్థలం : గుంటూరు జిల్లా, చిలకలూరుపేట తాలూకా, కొణిదెన గ్రామం.

శాసన విషయం : దీనిలో శాసన ప్రదాత వంశీయుల వర్ణన ముంది. కొట్టియదె'న (కొణిదెన)లో వేంచేసియున్న శ్రీశంకరేశ్వరునకు- తన తల్లిదండ్రులకు, తనకు పుణ్యం కలిగేటట్లు అఖండదీపం నిలిపినట్లు ఈ శాసనం వల్ల తెలుస్తున్నది. 4 కందపద్యాలు 1 సీసపద్యం ఉన్నాయి. (తె.క.చ-267)

### బ్రహ్మనాయుడు మేడ

నామాంతరం : వీరులగుడి (చూ).

### బ్రహ్మవిద్యా సుధార్ణవము

రచనాకాలం : క్రీ శ. 16 వ శతాబ్దం.
కర్త : పరమానంద తీర్థులు

ప్రత్యేకత : ఇది తెలుగులో చక్కని వ్యావహారిక వచనంలో ఉన్న కావ్యం. కవి వేదాంతి, యోగి. దీనిలో 13 ప్రకరణాలున్నాయి. దీని పేరును బట్టి

యిది వేదాంత గ్రంథమని కచ్చితంగా చెప్పవచ్చు. అముద్రితం. ఇది మద్రాసు ప్రాచ్యలిఖిత గ్రంథాలయంలో ఉంది (ఆరుద్ర-8)

## బ్రహ్మాండ పురాణము

కర్త : కాపూరి ఎల్లయ్య.

ఆరాశ్వాసాల కావ్యం. ఇందులో పరశురామ, బలరామ, కృష్ణావతారాల చరిత్ర ఉంది.

ప్రత్యేకత : ఈ కావ్యావతారికలో కవి వివరాలు లేవు. ఈ కావ్యం సంస్కృత బ్రహ్మాండ పురాణంలోని అర్థపంచక వివరణ ఖండాన్ని మాత్రమే తెనిగించినట్లు కవి చెప్పుకొన్నాడు. సంస్కృత బ్రహ్మాండ పురాణంలోని క్రమానికి, ఈ కావ్యంలోని వరసకు సంబంధం లేదట. కవి ఇంటిపేరు రాపూరిగా కొందరు భావిస్తున్నారు. (ఆరుద్ర-9-236)

## బ్రహ్మాండ వచనము

కర్త : మాచనామాత్యుడు.

రచనాకాలం : క్రీ.శ. 1750 ప్రాంతం.

బ్రహ్మాండ నిర్మాణ క్రమము, నాలుగు వేదాలు, పదునెనిమిది పురాణాల నుంచి విషయాలు గ్రహించి రచించిన ప్రశస్త వచన గ్రంథం. రచన గ్రాంథిక శైలిలో ఉంది. (వ.వా.)

## బ్రహ్మానంద శతకము

కర్త : చూ. గోపీనాథము వేంకటకవి.

అంకితం : శ్రీకృష్ణునికి.

శతక రచన. మొత్తం 130 సీస పద్యాలు ఉన్నాయి.

సర్వజ్ఞ కుమార యాచేంద్రుడు (వేంకటగిరి సంస్థానపాలకుడు) శ్రీకృష్ణుని నాయకునిగా గ్రహించి అతడు స్త్రీలను గూడి చేసిన లీలా విలాసాలు వర్ణించ మనగా కవి ఈ ఈ రచన చేశాడట. 6 వ పద్యం నుంచి 23 వ పద్యం వరకు శ్రీకృష్ణుని చరిత్ర సంగ్రహంగా చెప్పబడింది అ తరువాత, నర్మసచివుడైన ఉద్ధవునితో శ్రీకృష్ణుడు ఆత్మీయ శృంగార లీలా విహారాదులను వర్ణించినట్లుగా కవి రచన సాగించాడు. ఈ సందర్భంలో కామశాస్త్ర రహస్యాలన్నీ చెప్పబడ్డాయి. (అం.సం.సా-466)

## బ్రహ్మ నారద సంవాదము

కర్త : కొణిదెన నాగయకవి.

ఆరాశ్వాసాల ప్రబంధం. (ద దే.వా.పీఠిక-7)

## బ్రహ్మోత్తర ఖండము

రచనాకాలం : క్రీ.శ. 15 వ శతాబ్దం.

కర్త : పిడుపర్తి (మొదటి) బసవకవి.
ద్విపద కావ్యం. శైవమత ప్రాశస్త్యాన్ని తెలిపే రచన. (క.త-6)

బ్రహ్మోత్తర ఖండము
కర్త : చూ. మండపాక కామకవి.
అనువాద రచన. (ఆం.సం.సా-308)

బ్రహ్మోత్తర ఖండము
కర్త : చూ. పట్టమెట్ట సోమనాథ సోమయాజి
అంకితం : బిక్కనవోలులోని సిద్ధరామేశ్వరునకు.

అయిదు అశ్వాసాలు గల పద్యకావ్యం. సంస్కృత స్కాందపురాణంలోని బ్రహ్మోత్తర ఖండానికి అనువాదం. దోమకొండ సంస్థానాన్ని పాలించిన కామినేని కామిరెడ్డికి సోదరుడైన ఇమ్మడి ఎల్లారెడ్డి ప్రోత్సాహం చేత కవి ఈ రచన సాగించాడు. సూతసంహిత తరువాత వ్రాయబడిన రచన ఇది. కృతిపతి ఇమ్మడి ఎల్లారెడ్డి అని కొందరు భావిస్తున్నారు. కాని అతడు కృతి ప్రోత్సాహకుడు మాత్రమే.
(ఆం.సం.సా-183-184; ఆరుద్ర-9)

బ్రహ్మోత్తర ఖండము
కర్త : వుల్లయకవి.

ఈ కావ్య స్వరూపాన్ని గూర్చిన వివరాలు తెలియవు. చిన్నయసూరి అసమగ్రంగా రచించిన అకారాది నిఘంటువులో దీనిలోని మూడు ప్రయోగాలున్నవట.
(ఆం.సా.ప.ప-40-3, 4)

బ్రహ్మోత్తర ఖండము
కర్త : (చూ) ముత్తరాజు వేంకటకృష్ణ కవి.
అంకితం : జిన్నవాడ మల్లేశ్వరస్వామికి.

ఐదాశ్వాసాల పద్య కావ్యం. కవి దీనికి కృత్యాది రచించకుండానే మరణించి నందున, అతని కుమారుడు వేంకటాచలం మైనంపాటి కేశవకవి చేత కృత్యాది వ్రాయించాడట. (క త-13-18)

బ్రహ్మోత్తర ఖండము
రచనాకాలం : క్రీ శ. 1815
కర్త : శ్రీధరమల్లె వేంకటస్వామి.
అంకితం : అంబాపురంలోని పార్థివేశ్వరస్వామికి.

అయిదాశ్వాసాల కావ్యం. జ్యోతిరామన మొదలైనవారు ఇతన్ని ప్రోత్సహించి ఈ రచన చేయించారట. అంబాపురం సిద్ధవటం సమీపంలో ఉంది.

బ్రహ్మోత్తర ఖండము
రచనాకాలం : క్రీ శ. 16 వ శతాబ్దం.

కర్త : యాదాటి వేంకటనారాయణ.
అంకితం : కొమరగిరి సుబ్బయామాత్యునకు.

ద్విపద కావ్యం. శైవమత సంబంధమైన రచన. శివయోగి పూజా సత్కార మహిమను తెలుపుతున్నది దీనికి మూలం సంస్కృత స్కాందపురాణంలోని బ్రహ్మోత్తర ఖండం. అందులోని మందర, పింగళల కథ ఇందులో ప్రధానేతి వృత్తం.
(ద్వి.సా.చ-172)

బ్రౌన్, ఛార్లెస్ ఫిలిప్
కాలం : క్రీ.శ. 1798-1884.
రచనలు : 1. ఆంధ్ర-ఆంగ్ల నిఘంటువులు 2 తెలుగు వ్యాకరణము 3. బైబిల్ (తెలుగు అనువాదం) 4. వేమన పద్యాలు (ఆంగ్లానువాదం).

తెలుగు భాషకు విశేషమైన సేవ చేసిన ఆంగ్లేయుడు. క్రీ.శ. 1817 లో మద్రాసు సివిల్ సర్వీస్‌లో పని చేశాడు. బందురులో న్యాయాధిపతిగా, తెలుగు-ఫారసీ అనువాదకుడుగా, మద్రాసు పోస్టు మాస్టర్ జనరల్‌గా పని చేశాడు. విద్యా సంఘ సభ్యుడుగా గొప్ప భాషా సేవ చేశాడు. "క్రొనాలాజికల్ టేబిల్స్" ప్రకటించాడు. మద్రాసు జర్నల్ ఆఫ్ లిటరేచర్‌లో ఇతడు అనేక వ్యాసాలు వ్రాశాడు మద్రాసు విశ్వ విద్యాలయంలో గౌరవ ఆంధ్రాచార్యుడుగా పని చేశాడు. ఈయన తెలుగు భాషను ఎంతో శ్రద్ధతో నేర్చుకొని, ప్రాచీన కావ్యాలను అధ్యయనం చేసి, వాటిపై తన అభి ప్రాయాలను కూడా వ్రాసి పెట్టాడు.

వచన వాఙ్మయానికి ఈయన విశిష్టమైన సేవ చేశారు. మనుచరిత్ర, వసు చరిత్ర, విజయ విలాస, కళాపూర్ణోదయ, తారాశశాంక విజయం వంటి కొన్ని తెలుగు కావ్యాలకు టీకలు, వ్యాఖ్యానాలు వ్రాయించి ప్రకటించాడు.

మెకంజీ వ్రాయించిన వ్రాత ప్రతులలోని అక్షరాలు మాసిపోవటం చూసి వాటిని మంచి కాగితాలపై తిరిగి వ్రాయించాడు.

"స్థానిక సంపుటాలు" (Local Records) అనే పేర 62 సంపుటాలు వ్రాయించి మద్రాసు ప్రాచ్యలిఖిత భాండాగారంలో ఉంచాడు. ప్రసిద్ధుల లేఖలు సేకరించివాటిని సంపుటాలుగా వ్రాయించాడు. ఈ పనులకు తన సొంత డబ్బునే ఖర్చు పెట్టాడట. తెలుగు భాషపై అంతులేని అభిమానాన్ని పెంచుకొని, ఆ వాఙ్మయ వికా సానికి బహుముఖంగా కృషి చేశాడు. ఇప్పటికి దొరికిన ప్రాచీన కావ్యాలన్నీ బ్రౌన్ కృషి ఫలితంగానే ఖిలమై పోకుండా నిలిచాయి.

బ్రౌన్ ఆస్థానంలో జూలూరి అప్పయ్యశాస్త్రి (మను, వసుచరిత్రలకు, కవి కర్ణరసాయన విజయ విలాసాలకు టీకాకారుడు), గరిమెళ్ళ వెంకయ్య (దశావతార చరిత్ర), పైడిపాటి వేంకటనరసు (రాధికాసాంత్వనము, రాధా మాధవము, వైజయంతీ విలాసము, అనిరుద్ధ చరిత్రలకు వ్యాఖ్యలు), ములుపాక బుచ్చయ్యశాస్త్రి (వసుచరిత్ర

వ్యాఖ్య), నరసింహాచారి, మల్లంపల్లి మల్లికార్జునశాస్త్రి, రావిపాటి గురుమూర్తిశాస్త్రి ప్రభృతులు తమ పాండితీ ప్రకర్షలను వెలువరించి విశేషంగా సత్కారింపబడినారు.

తెలుగు భాషా సాహిత్యాలకు బ్రౌన్ చేసిన సేవ చిరస్మరణీయము.

(వ.వా-54; తె.సా.విమర్శ-91)

## బ్రౌన్ విలియమ్

చూ : విలియం బ్రౌన్.

## భంగిభీమన శాసనము

కాలం : క్రీ.శ. 1132 ప్రాంతం.
స్థలం : తెలియరాలేదు.
శాసనప్రదాత : భంగి భీమన.

శాసన విషయం : దీనిలో భంగి భీమన పూర్వీకుల వర్ణన, భీమన వర్ణన కూడా ఉంది. వీరంవరూ పరమధార్మికులని ఈ శాసనం చెబుతుంది. విద్యాదాన, హిరణ్య దాన, భూదాన, కన్యాదానాదులు చేశాడట. చాలా ధర్మ సత్రాలు పెట్టించాడట. దీనిలో 2 శార్దూలాలు, ఒక చంపకమాల, ఒక ఉత్పలమాల, ఒక కంద పద్యం ఉన్నాయి.

(తె.శ.చ-232)

## భండనారాతి భీమ శతకము

కర్త : చూ. చట్రాతి లక్ష్మీనరసకవి
రచనాకాలం : క్రీ.శ. 1750 ప్రాంతం.

సీస పద్య శతకం. సాంఘిక దురాచార నిరాసకంగా మూర్తి కట్టిన రచన. విజయనగర సంస్థానపు దివాను పూసపాటి సీతారామరాజు ప్రజలకు కలిగిస్తున్న కష్టాలు ఇందులో సూచితమైనవి. "భండనారాతి భీమ కోదండరామ" అనే మకుటంతో ఉంది. రచన హృదయంగమంగా ఉంది. (ఆం సం.సా-419; క.స-208)

## భండారు లక్ష్మీనారాయణ

కాలం : క్రీ.శ. 16 వ శతాబ్దం మొదట.
బిరుదులు : భరతాచార్యుడు, తోడరుమల్లు, సూక్ష్మభరతాచార్యుడు.
రచన : సంగీత సూర్యోదయము (లక్ష్మణ భరతం).

ఈయన శ్రీకృష్ణ దేవరాయల ఆస్థానంలోని వాగ్గేయకారుడు. (తె వి.స-4)

## భక్త కల్పద్రుమ శతకము (అలభ్యం)

కర్త : పురుషోత్తమ కవి.

## భక్త చింతామణి శతకము

కర్త : కూచిమంచి సోమసుందర కవి.

ఇది శైవభక్తి శతకం. మత్తేభ శార్దూల వృత్తాలలో ఉంది. భక్తి వైరాగ్య ప్రధానం. శివభక్తి వర్ణన వివిధ రీతులలో ఉంది. ఈశ్వర నింద తగదని ఈ శతకం

చెబుతున్నది. కవి కొన్నిచోట్ల పూర్వకవులను అనుసరించాడు. (శ.సా.వి.)

భక్తజన పారిజాతము

కర్త : పల్లవి గోపాలయ్య (చూ).

అయిదాశ్వాసాల ప్రబంధం. నాల్గు ఆశ్వాసాలు మాత్రమే పూర్తిగాలభించాయి.

ఇతివృత్తం పరమ భాగవతుల చరిత్ర. శ్రీరాముడు కలలో కనిపించి ఈ రచనకు ప్రోత్సహించినట్లు కవి చెప్పుకొన్నాడు. రచన రసవంతంగా ఒక్కని ధారతో ఉంది. (ద.దే.వా-302)

భక్తవత్సల విలాస నాటకము

కర్త : శహాజీ (చూ).

రచనాకాలం : క్రీ.శ. 17వ శతాబ్దం.

బాణాసురుడు తన భక్తితో శివుని తన కోట వాకిట ఉంచుకోవడం, గౌరీ విరహం, చెలికత్తె రాయబారం, బాణుడు ప్రార్థించి గౌరికడకు పంపడం ఇందులోని ఇతివృత్తం. ప్రదర్శన యోగ్యంగా కూర్చిన నాటకం (ద.దే.వా-208)

భక్త సంజీవని (సం)

కర్త : సారంగు తమ్మయ్య.

ప్రత్యేకత : సంస్కృతంలోని హరిభక్తి సుధోదయమ్ అనే ఇరవై అధ్యాయాల గ్రంథానికి ఇది సంస్కృత వ్యాఖ్యానం. (ఆరుద్ర-8-166)

భక్తాంఘ్రిరేణు చరిత్రము

కర్త : ఉత్తర రంగకవి.

యక్షగానం. ఇది ప్రసిద్ధుడైన విప్రనారాయణుని చరిత్ర. భక్తాంఘ్రిరేణువనేది అరవంలో "తొండరడిప్పొడి"కి సమానార్థకం. దీనిలో వాలకముల వర్ణనలు. ప్రసంగాలు జాతివార్తా చమత్కారంగా ఉన్నాయి. దరువులు, ద్విపదలు, పద్యాలుఉన్నాయి. (య.వా.చ-54)

భగవంతార్య మఖి

కాలం : క్రీ. శ. 18వ శతాబ్దం.

రచనలు : 1. రాఘవాభ్యుదయమ్ (నాటకం. సం.) 2. ముకుంద విలాస కావ్యమ్ (సం) 3. ఉత్తర చంపువు (సం).

అప్పయ్య దీక్షితుని వంశంవాడు. గంగాధర మఖి కొడుకు. 1712-28 నడుమ తంజాపూరును పాలించిన శరభోజీకి మంత్రిగా ఉన్నాడు. (ద. దే. వా-181)

భగవద్గీత

కర్త : కంభంపాటి నారప్ప.

రచనాకాలం : క్రీ.శ. 16వ శతాబ్ది ఉత్తరార్ధం.

అంకితం : హరిహరనాథ స్వామికి.

ఆరు ఆశ్వాసాల పద్యకావ్యం. పూర్తిగా దొరకలేదు. దొరికినంతవరకూ రచన సరళంగా సులభగ్రాహ్యంగా ఉంది.

విశిష్టత : మహాభారతంలో తిక్కన ఆంధ్రీకరించకుండా విడిచిన "గీత" భాగానికి ఈ గ్రంథం అంధ్రీకరణం. గీత మీద ఇది తెలుగులో తొలి గ్రంథం. తిక్కన లాగే తన గ్రంథాన్ని హరిహరనాథునికే అంకిత మిచ్చాడు. ఆ దేవుని మతించాడు. తిక్కన "శ్రీయన గౌరినా బరగు చెల్వ" అని లక్ష్మి పార్వతులకు అభేదం చెప్పగా నారప్ప "శ్రీయును, పార్వతీ సతియు" అన్నాడు. దీని ప్రతి మద్రాసు ప్రాచ్య లిఖిత గ్రంథాలయంలో ఉంది. (ఆరుద్ర-8-275)

**భగవద్గీత**

కర్త : తెలియదు.

జానపద పౌరాణిక గేయం.

చూ. పౌరాణిక గేయములు.

**భగవద్గీత**

రచనాకాలం : క్రీ.శ. 1650 ప్రాంతం.

కర్త : కర్పూరము కృష్ణమాచార్యులు.

అంకితం : చెర్లపల్లిలోని కేశవస్వామికి.

ద్విపదచ్ఛందంలో ఉన్న భగవద్గీత. సుబోధకంగా ఉంది. (తె. వి. స-6)

**భగవద్గీత**

రచనాకాలం : క్రీ.శ. 1730 ప్రాంతం.

కర్తలు : తుపాకుల అనంత భూపాలుడు, కళువె వీరరాజు.

వచన కావ్యం. సంస్కృతానికి ఆంధ్రీకరణం. ఇది మైసూరి దళవాయి వీరరాజు, చెంజి దుర్గ పాలకుడైన అనంతభూపాలుని సహాయంతో రచించిన వచన భారతంలోనిది. పారాయణ గ్రంథం కాబట్టి దీన్ని వేరుగా ముద్రించారు. ముద్రిత ప్రతులలోని గద్య అప్పటి వ్రాతపతులను బట్టి అనంత భూపాలుడు రచించినట్లుగా ఉంది. భారతానువాదంలో కొన్ని పద్యాలకు వీరరాజుదీ, అనంత భూపాలునిదీ రెండు గద్యలూ వేర్వేరుగా ఉన్నాయి ఈ భాగానికి మాత్రం అనంత భూపాలునిదే లభ్యమైనందున అచ్చులో అతని పేరే ఉంది. గద్య వెనుక గోపాలాంకితంగా రెండు పద్యాలున్నాయనీ అది వీరరాజు పద్ధతి అనీ, వీరు ఇరువురూ కలిసే ఈ భగవద్గీత రాశారనీ పండితులు అంటున్నారు. ఇది వీరరాజు కృతమైనదిగా చెప్పబడుతున్న భీష్మ పర్వంలో 23-40 అధ్యాయాలలోనిది. (క. స-3; ద. దే. వా-474)

**భగవద్గీత**

కర్త : మాధవ మంత్రి.

అంకితం : భద్రాద్రి రామునికి.

నాలుగాశ్వాసాల పద్య కావ్యం. దత్తోజీ పండితుని భగవద్గీత కంటె ఈ రచనలో వృత్తాలు ఎక్కువ. రచన ప్రౌఢంగా ఉంది. లక్షణ విరుద్ధమైన ప్రయోగా లున్నాయని విమర్శకు లంటున్నారు. (క.చ.-3-175)

## భగవద్గీత

రచనాకాలం : క్రీ.శ. 19 వ శతాబ్దం పూర్వభాగం.

కర్త : చూ. మిక్కిలి మల్లికార్జున కవి.

పద్య రచన. సంస్కృతంలోని భగవద్గీతను, కవి పద్యరూపంలో తెగించాడు. ఇది కవి తన జీవిత చరమదశలో చేసిన రచన. (ఆం.సం.సా-254)

## భగవద్గీతాయోగ శాస్త్రము

నామాంతరం. కృష్ణార్జున సంవాదము.

కర్త : వేముగంటి దత్తోజీ పండితుడు.

రచనాకాలం : క్రీ.శ. 1800 ప్రాంతం.

ప్రస్థానత్రయంలో ఒకటిగా పరిగణింపబడుతున్న గ్రంథం. రచన హృద్యమై సరళంగా ఉంది. (క-చ-3-153)

## భగవద్గీతార్థ దర్పణము

కర్త : పూదూరి కృష్ణయామాత్యుడు (చూ).

పదునేడధ్యాయాల గ్రంథం. ప్రథమాధ్యాయం కాక తక్కినవాటికి ఇది ఆంధ్రంలో అనువాదం. గ్రంథం ప్రతి 62 కమ్మలలో ఉంది. కొంత శిథిలమైంది. ఈ గ్రంథం భగవద్గీతకు కేవలానువాదం కాక టీకా ప్రాయమైన అనువాదం. శైలి సరళ సుందరంగా ఉంది. (మ.మా.)

## భగవద్గీతావచనము (అలభ్యం)

కర్త : తాళ్ళపాక పె తిరుమలాచార్యుడు. (క.త-6)

## భగవదీతాసారము

కర్త : చూ. గోపీనాథము వెంకటకవి.

పద్య కావ్యం. ప్రసిద్ధమైన భగవద్గీతకు ఇది పద్య రూపమైన ఆంధ్రీ కరణం. ద్వితీయాధ్యాయం నుండి మాత్రమే ప్రస్తుతం లభిస్తున్నది. అవతారికతో పాటు మొత్తం 460 గద్య పద్యాలున్నాయి. (అం.సం.సా-465)

## భగవదీతాసారము

కర్త : చూ. పేరి కాశీనాథశాస్త్రి.

సంస్కృతంలో చెప్పబడిన "భగవద్గీత" సారాన్ని తెలుగులో చక్కగా, సరళంగా, అందరికీ అర్థమయ్యేట్లుగా కవి వివరించాడు. (ఆం.సం.సా-427)

భట్టుమూర్తి

నామాంతరం : మూర్తికవి (చూ).

బిరుదు : రామరాజ భూషణుడు.

(తె. వి. స-4)

భట్టు లక్ష్మీనరసింహ కవి

కాలం : తెలియదు.

రచన : రేచర్ల లక్ష్మణరాయ ప్రతాపోదయము.

వివరాలు తెలియవు. (వా.చ; వం.సు-389)

భట్టోజీ దీక్షితులు

చూ. శేషవంశీయులు (16 వ శతాబ్దం).

రచన : వైయాకరణ సిద్ధాన్త కౌముది.

ఈయన ప్రముఖ సంస్కృత వ్యాకరణ పండితుడు. తన గురువైన శేష వీరేశ్వరుని, శేషకృష్ణ పండితుని, శేష రామ చంద్రాచార్యులను విమర్శిస్తూ పై గ్రంథం వ్రాశాడు. (తె. వి. స-6)

భట్ల పెనుమర్తి కోదండ రామయ్య

కాలం : క్రీ.శ. 17 వ శతాబ్దం.

స్థలం : శ్రీకాకుళం ప్రాంతం.

రచన : వల్లభాభ్యుదయము.

గురువు : తిరుమల తాతాచార్యులు.

సహజ పాండిత్యం గల కవి. శ్రీకాకుళాంధ్ర దేవుడు కవికి స్వప్నంలో ప్రత్యక్షమై, ఒక సంస్కృత కోశాన్నిచ్చి, అందులో వ్యత్యస్తంగా ఉన్న తన కథను ఒక క్రమపద్ధతిలో రచించమని అడిగాడట. కవి సంస్కృత మూల గ్రంథంలోనివే కాక, దేశంలో వ్యాపించి ఉన్న కథ లన్నింటినీ సమన్వయం చేసి, ఆహ్లాదకరంగా తెలుగుతనం ఉట్టిపడేటట్లు రచన చేశాడు.

ఆంధ్ర విష్ణువు కథను లభ్యమవుతున్నంత వరకు మొదట రచించిన వాడితడే. (ఆరుద్ర-10-29)

భద్రకవి లింగకవి

కాలం : క్రీ. శ. 16 వ శతాబ్దం.

స్థలం : కూడలి సంగమక్షేత్రం.

రచనలు : 1. దేవాంగ పురాణము (ద్విపద) 2. సానంద చరిత్ర.

గురువు : కాళహస్తి సంగమేశ్వరుడు.

విశిష్టత : ఈయన అచ్యుత దేవరాయల కాలంలో "ద్రావిడ మధ్యదేశం"లోని "పడవీడు" ప్రాంతాన్ని పాలించిన కాళహస్తి నాయకుని పోషణలోని వాడు. శివ భక్తు

డైన "దేవర దాసమయ్య" వంశీయుడు. "తెలుగుకు నెరహాది-ద్విపదకు రాజు". రాజు ఆనతిపై, దేవాంగుల కోరికమేరకు దేవాంగ పురాణాన్ని, వీర భద్రయ్య కోరిక మేరకు సానంద చరిత్రను వ్రాశాడు. ఈయన రెండో కృతిని సరసాకరంగా, చారుతరంగా, జనమనోహరంగా చెప్పాడు ఇతని తండ్రి రామయ్య ప్రభుడు. వంశవర్ణనను బట్టి చూస్తే ఒక సీమకు పాలకుడని అనిపిస్తుంది (ఆరుద్ర-9-229;వ. దే.వా.12)

## భద్రగిరి మాహాత్మ్యము (కన్నడం)

కర్త : కళువె నంజరాజు.

కన్నడ రచన

## భద్రగిరి శతకము

కర్త : భల్లా పేరయ్య కవి.

సీసపద్య శతకం. "భద్రగిరివాస, శ్రీరామ భద్రదాస పోష బిరుదాంక, రఘు కులాంబుధి శశాంక" అనే మకుటంతో ఉన్నది.

తురుష్కుల 'హిందూ దేవాలయ విధ్వంసకాండ' ఎక్కువై యావద్భారతదేశం బీభత్స వాతావరణంలో ఉన్న సమయంలో ఈ శతక రచన జరిగింది. భద్రగిరిపై తురుష్కులు దండయాత్ర చేస్తే, పూజారులు శ్రీరామ విగ్రహాన్ని పోలవరం తీసుకుని పోయారట. ప్రశాంత వాతావరణ మేర్పడిన తరవాత మరల రామ విగ్రహాన్ని పోల వరం నుంచి తెచ్చి, భద్రాద్రిలో పునఃప్రతిష్ఠించి, కల్యాణోత్సవాలు జరిపారట. తురకలు చేసిన ఆగడాలు ఈ శతకంలో విపులంగా ఉన్నాయి. కొన్ని చారిత్రకాంశాలు కూడా ఇందులో ఉన్నాయి. (శ.సా.వి.)

## భద్రాద్రి రామదాసు

నామాంతరం : కంచర్ల గోపన్న.
కాలం : క్రీ. శ. 1650 ప్రాంతం.
స్థలం : ఖమ్మం జిల్లాలోని నేలకొండపల్లి.
రచన : దాశరథి శతకము.

లింగన్న కామమ్మల పుత్రుడు. చిన్నతనంలోనే రామ భక్తిపరుడై, రామ తారక మంత్రాన్ని జపించి సిద్ధిపొందాడు. భద్రాద్రి తహసీల్‌లో ఉద్యోగిగా ఉండి సర్కార్ పైకం రామ కైంకర్యం చేశాడు. గోలకొండ తానీషా ఇతనిని బంధించి 12 సంవత్సరాలు చెరలో ఉంచాడట. చాలా కష్టాలు పడి చివరకు రామానుగ్రహం పొందాడు. చెరలో ఉన్నప్పుడు భక్త్యావేశంతోను, దుఃఖావేశంతోను రచించిన కీర్తనలు తెలుగునాట సుప్రసిద్ధాలు. సంగీత సాహిత్యాల మేలికలయిక ఇతనిలో కనిపిస్తుంది. (తె.వి.స-4)

## భద్రిరాజు మల్లమంత్రి

కవి పోషకుడు. ఏనుగు లక్ష్మణకవిని ప్రోత్సహించి రామేశ్వర మాహాత్మ్యం వ్రాయించాడు.

### భద్రాద్రి రామదాసు కీర్తనలు

కర్త : భద్రాద్రి రామదాసు.

కవి చిన్నతనంలోనే రామభక్తిపరుడై తారకమంత్రం జపించి చివరకు సిద్ధి పొందాడు. సర్కారు పైకంతో భద్రాద్రి రామునికి కైంకర్యాలు జరిపిన నేరానికి, తానీషా రామదాసును బంధించి గోలకొండ చెరలో ఉంచాడు. చెరలో ఉన్నప్పుడు భక్త్యావేశంతో, దుఃఖావేశంతో చెప్పిన కీర్తనలివి. భక్తులను పరవశులను చేసే మేల్తరాలయిన ఈ కీర్తనలను ఆబాలగోపాలం తెలుగు దేశంలో భజన కీర్తనలుగా ఉపయోగిస్తారు. వీటిలో 25 రాగాలు ఉపయుక్తం. భజన సమాజాల వారు దేశాటనం చేస్తూ వీటిని ఎక్కువగా పాడతారు. సంగీతసాహిత్యాల మేలికలయిక వీనిలో కనిపిస్తుంది. (తె.వి స-4)

### భద్రాద్రి రామశతకము

కర్త : పరశురామ నృసింహదాస కవి.

హఠయోగాన్ని అనుసరించి వేదాంత ప్రధానంగా వ్రాసిన శతకం. నిగూఢమైన తత్త్వరహస్యాలు స్పష్టంగా సంగ్రహరూపంలో ఉన్నాయి. ఈ శతకంలో ప్రపంచోత్పత్తి, నరప్రమాణము పంచభూత ధర్మాలు, పంచకోశములు, ఉపవాయు లక్షణాలు, గుణత్రయము, వస్తుధాతువులు, ఆధార, అనాహత చక్రాలు, పరబ్రహ్మ స్వరూపము, జ్ఞాని లక్షణాలు, అచలతత్వము, ఆత్మస్వరూపము మొదలయినవి క్రమంగా వర్ణితాలు. (శ.సా.వి-327)

### భద్రా పరిణయము

కర్త : నిశ్చయంగా తెలియదు

కాళ్ళకూరి వారి కుటుంబం కవితా వృత్తిలో ప్రఖ్యాతిగాంచినది. క్రీ.శ. 18 వ శతాబ్దం ఉత్తరార్ధానికి చెందిన కాళ్ళకూరి గౌరీనాథ కవి పూర్వులలో ఒకరు ఈ ప్రబంధాన్ని రచించినట్లు తెలియవస్తున్నది. గ్రంథరచయిత పేరుగాని, కృతిభర్త పేరుగాని లేదు. (ఆం.సం.సా-421)

### భద్రా పరిణయము

నామాంతరం : 'ముకుంద విలాసము'

కర్త : కాణాదము పెద్దన సోమయాజి (చూ).

గద్వాల సోమభూపాలుని ఆదరణలో కవి ఈ కావ్యం వ్రాశాడు. రచన చిత్ర కవితారీతులతో కూడి మృదుమధురంగా ఉంటుంది. (క.చ-3-83)

### భద్రాయురభ్యుదయము

రచనాకాలం : క్రీ శ. 18 వ శతాబ్దం.

కర్త : చూ. రాపాక లక్ష్మీపతి.

అంకితం : వేములవాడలో వెలసిన శ్రీరాజరాజేశ్వరునికి.

అయిదు ఉల్లాసాలతో కూడిన ప్రబంధం. క్రీ.శ. 18వ శతాబ్దంలో దోమకొండ సంస్థానాన్ని పాలించిన రాజన్నచౌదరి, రాపాక లక్ష్మీపతిని ఆస్థానానికి పిలిపించి, ఈ కావ్యాన్ని వ్రాయమని ప్రోత్సహించాడట.

దశార్ణ దేశాధినాథుడైన వజ్రబాహునికి భార్యఅయిన సుమతి వలన జన్మించిన 'భద్రాయువు' అనే రాజకుమారుడు నిషధ దేశాధీశుడైన చంద్రాంగదుని కూతురైన 'కీర్తిమాలి'ని పరిణయమాడిన వృత్తాంతం ఇందులో ఉంది. మూలకథ బ్రహ్మోత్తర ఖండంలోనిది.

ప్రబంధ సాధారణములైన పడికట్టు వర్ణనలు ఇందులో అధికంగా కనిపిస్తాయి అపరంజి, ఖుతుపశహా, కుందనము, జాళవా, జులుమతీ, తాయతు, తేజీ, నేజా, చాకు, శాలు-వంటి అన్య దేశ్యాలు ఇందులో ఉన్నాయి. వినేవా, వెలదులనేచేపు, చంద్రుండనే పంతు — మొదలగు వ్యాకరణ విరుద్ధాలైన ప్రయోగాలు కూడా అక్కడక్కడ కనిపిస్తాయి.
అముద్రితం. (ఆం.సం.సా-180, 186, 187)

**భద్రాయుశ్చరిత్రము**

కర్త : కాశీనాథుని వీరారాధ్యుడు.

పద్యకావ్యం. (క.స-227)

**భరతశాస్త్రమ్ (సం)**

కర్త : చెరుకూరు లక్ష్మీధరుడు. (తె.వి.స-4)

**భరతశాస్త్రము(అలభ్యం)**

కర్త : దామరాజు సోమయ్య.

దీనినుంచి పెదపాటి జగ్గన్న తన "ప్రబంధ రత్నాకరం"లో 5 పద్యాలను ఉదాహరించాడు. రాజుకొలువు, నటుని లక్షణాలు పై పద్యాలు తెలియజేస్తున్నాయి. భరత నాట్యాన్ని తెలుగులో విశదంగా చెప్పే గ్రంథాలలో ఇది మొదటిదికావచ్చు. (ఆరుద్ర-9)

**భరతశాస్త్ర సర్వస్వము**

కర్త : చూ. మతుకుమల్లి నరసింహ కవి.

అలంకార గ్రంథం. సంస్కృతంలో ఉన్న భరతుని నాట్యశాస్త్ర గ్రంథంలోని విషయాలు ఈ రచనలో వివరింపబడ్డాయి. (అం.ర-20)

**భరత సార సంగ్రహము**

కర్త : చిల్లకూర దివాకర కవి.

లక్షణ గ్రంథం. ముద్రితం.

**భరతార్ణవపోతము**

కర్త : విరించిమిశ్రుడు.

ఇది నాట్యశాస్త్ర గ్రంథం. (నా.ర.చ-85)

## భర్గ శతకము

రచనాకాలం : క్రీ శ. 1729.

కర్త : కూచిమంచి తిమ్మకవి.

కృతిపతి : కుక్కుటేశ్వరుడు.

భర్గ శతకంలో పార్వతీశ్వరుని లీలలు రసవంతంగా వర్ణితాలు. ప్రభువుల చిత్తవృత్తినీ సాంఘిక దురాచారాల్నీ వ్యక్తుల మానసిక ప్రవృత్తినీ అధిక్షేప ప్రధానంగా ఇందులో కవి వర్ణించాడు. రాజాదరణం పొంది కవిసార్వభౌమ బిరుదు నందుకొని కూడా ఈ కవి దుష్ట ప్రభువుల దుర్నీతిని ఖండించడాని కేమాత్రం జంకలేదు. (శ.సా.వి.)

## భర్తృహరి శతకాలకు అనువాదము

రచనాకాలం : క్రీ, శ. 19 వ శతాబ్దం.

కర్త : పడకండ్ల గురురాజ కవి.

## భర్తృహరి శతకాలు

రచనాకాలం : క్రీ. శ. 1600 ప్రాంతం.

కర్త : ఎలకూచి బాలసరస్వతి.

కృతిపతి : జటప్రోలు సంస్థానాధిపతి అయిన సురభి మల్లప్రభువు.

మూలం : సంస్కృతంలో భర్తృహరి రచించిన నీతి, శృంగార, వైరాగ్య శతకాలు.

నీతి శతకంలో "సురభిమల్లా నీతి వాచస్పతీ" అనీ, వైరాగ్య శతకంలో "సురభిమల్లా మావినీ మన్మథా!'' అనీ, వైరాగ్య శతకంలో "సురభిమల్లా వైదుషీ భూషణా" అనీ మకుటం ఉంది. మత్తేభ శార్దూల వృత్తాలలో రచన సాగింది. భర్తృహరిని తెనిగించిన వారిలో ఇతడే మొదటివాడు. ఇతని తరవాత పుష్పగిరి తిమ్మన, ఏనుగు లక్ష్మణ కవులుకూడాభర్తృహరిని ఆంధ్రీకరించారు.

ఈ మూడింటిలోనూ ఏనుగు లక్ష్మణ కవి రచనమేలు. తరువాత చెప్పతగ్గవి బాలసరస్వతివి. మూలభావాలను కొన్నిచోట్ల పెంచటం, కొన్నిచోట్ల తగ్గించటం జరిగింది. అనువాదం ప్రౌఢంగా సాగింది. కవి అక్కడక్కడ ప్రసిద్ధ కవుల పలుకుబళ్ళను వాడు కొన్నాడు. కృతిపతియైన మల్లానాయని కుమారుడు మాధవరాయలు కవికి రెండువేల దీనారాలు పారితోషికంగా ఇచ్చాడట. (అరుద్ర-10-37 క.శ-11-144)

## భర్తృహరి సుభాషిత త్రిశతి

కర్త : పుష్పగిరి తిమ్మన,

కవి భర్తృహరి సుభాషితాలనే మూడు శతకాలుగా తెనిగించాడేమో కాని, ఇప్పుడు ఒక్క నీతి శతకం మాత్రమే దొరుకుతున్నది. చంపక మాలికలతోకవి ఈ

శతకం చెప్పానన్నాడు. కాని దీనిలో ఉత్పలమాలలు కూడా ఉన్నాయి. దీనిలో కవి, ఎల్ల కూచి బాలసరస్వతి వలె మకుట నియమం పాటించలేదు. ఈయన శతక రచన, వృత్తాలలో ఉండటంవల్ల భాషాంతరీకరణం చాలచోట్ల మూలానికి భిన్నంగా ఉంటుంది. ఈ శతకానికి తెలుగుదేశంలో ప్రచారం అంతగా రాలేదు. (తె.వి.స-6)

**భర్తృహరి సుభాషిత రత్నావళి**

కర్త : ఏనుగు లక్ష్మణకవి.
అంకితం : పెద్దాడ సోమశంకరస్వామికి.
మూలం : భర్తృహరి సుభాషితాలు (సం).

ఇది తెలుగులో బాగా ప్రశస్తి, ప్రచారం పొందిన రచన. తెనిగింపులో కవి బాలసరస్వతివలె మకుటనియమం కాని, తిమ్మకవి వలె మకుటం లేకపోయినప్పటికి వృత్త నియమం గాని పెట్టుకోలేదు. మూలంలోని వృత్తాలను వృత్తాలుగాను, చిన్న శ్లోకాలను కంద, గీత, ఆట వెలది పద్యాలుగాను కవి వ్రాశాడు. రచన రమ్యంగా, సందర్భోచిత శైలితో సామాన్యులకు కూడా అర్థమయ్యే రీతిలో ఉంటుంది. సుబోధకంగా ఉండటంవల్ల దీనికి విశేష ప్రచారం వచ్చింది. (తె. వి. స-6-748)

**భర్తృహరి సుభాషితములు (అలభ్యం)**

కర్త : పోచిరాజు వీరన్న.

కవి వీనిని శతకంగా ఆంధ్రీకరించాడని భల్లాణ చరిత్రనుండి తెలుస్తున్నది. (క. చ-3-162)

**భల్లాణ చరిత్ర**

రచనాకాలం : క్రీ. శ. 18వ శతాబ్దం.
కర్త : పోచిరాజు వీరన్న.
అంకితం : దాము మొగ్గన్నకు.

ఇది కవి చివరిగ్రంథం కావచ్చు. దీనిలో ఇతని ఇతర రచనలన్నీ పేర్కొన బడ్డాయి. బందరు పట్టణాన్నీ కృతిపతి వంశాన్నీ కవి ఇందులో రమణీయంగా వర్ణించాడు. (క. చ-3-162)

**భల్లాణ చరిత్ర**

కర్త : మల్లవరపు వీరేశ్వరుడు (వాలేశ్వరుడని కొందరి అభిప్రాయం).
అంకితం : మల్లవరంలోని నాగేశ్వర స్వామికి.

విశిష్టత : అయిదాశ్వాసాల కావ్యం. భల్లాణుడనే రాజు దగ్గరకు శివుడు మిండజంగం వేషంలో వచ్చి తనకు వారకాంతలు కావాలని అడుగుతాడు. ఈ కథతో పాటు దనాభిరామము, వీర చోడవ్వ చరిత్ర, రుద్రాక్ష మహిమ, విభూతిధారణ ఫలం, పంచాక్షరీ మహిమ, గంగోత్పత్తి మొదలయిన గాథలున్నాయి దేవతామాహాత్మ్యాలే గాక, కవితా లక్షణమైన చమత్కారం కూడా ఉండటం వల్ల వివిధ భల్లాణ చరిత్రలలో ఇది ఉత్తమమైనదని పండితాభిప్రాయం. (క. త-11-220; అరుద్ర-9-248)

**భల్లాణ చరిత్రము**

నామాంతరం : రాజశేఖర విలాసము.
కర్త : కూచిమంచి తిమ్మకవి.
రచనాకాలం : క్రీ. శ. 1716 ప్రాంతం.
మూడాశ్వాసాల ప్రబంధం.

**భల్లాణ చరిత్రము (అలభ్యం)**

కర్త చూ. కొట్రా బాలకవి.
వివరాలు తెలియవు. (అం. సం. సా-301)

**భల్లాణ చరిత్రము (అలభ్యం)**

కర్త : లోకేనావు సోమన (చూ).
పద్యకావ్యం.

**భల్లాణ నాటకము**

కర్త : అలపాక పెద్ద.

ఈ యక్షగానంలోని కథ ప్రసిద్ధం. దీనిలో భల్లాణుడు మిండజంగము వేషంలో తనను పరీక్షింప వచ్చిన శివుని కడకు భార్యనే సాని వేషంలో పంపడం, శివుడు భల్లాణుని భక్తికి మెచ్చి కైవల్యమనుగ్రహించడం కవివర్ణించాడు.

ఈ గ్రంథమంతా వ్యావహారిక భాషలో ఉంది. దరువులు, ద్విపదలు హాస్య ప్రసంగాలు ఉన్నాయి. (య. వా. చ-86)

**భల్లాణ రాజ చరిత్రము**

కర్త : బుక్కమ సాంబయ్య (జక్కమ సాంబయ్య).

యక్షగానం. నారదప్రేరితుడైన శివుడు మిండజంగమై కఠోర వీరశైవ వ్రత దీక్షితుడైన సింధు కటకాధీశ్వరుని (భల్లాణుని)పరీక్షించడానికి రావడం ఇందులోని కథ.

దీనిలో దరువులెక్కువగా తాళ ప్రధానాలు. కర్ణాటక రాగప్రధానాలైనవి కొన్ని ఉన్నాయి. వచనములు, ఏలలు,జోలలు, త్రిభంగులు, అర్థ చంద్రికలుఉన్నాయి. (య. వా. చ-80)

**భల్లాణ రాయ చరిత్రము (అలభ్యం)**

కర్త ఏనుగు లక్ష్మకవి (చూ).

ఇదీ, రాజశేఖర చరిత్రమూ ఒకటేనేమో అని కొందరు భావిస్తున్నారు. (క. త-12-166)

**భల్లాణుడు**

బసవపురాణంలోని ఒక పాత్ర.

భల్లాణుడు సింధుకటక దేశాధిపతి. గొప్ప శివభక్తి పరాయణుడు. జంగము

లేమి అడిగినా లేదనకుండా ఇస్తానని శపథం చేశాడు. ఒకనాడు ఈశ్వరుడు జంగం వేషంతో రాజును పరీక్షించడానికి వచ్చాడు. ఆనాడు విటునితో కలియని వేశ్యను తనకు తెప్పించమని రాజు నడిగాడు. ఆ పట్టణంలోని ప్రతి వేశ్య ఇంటిలోనూ ఈశ్వరుడు విటుడై ఉంటాడు. రాజు తన మాట నిలుపుకోవడానికి తన భార్యనే వేశ్యావేషంతో జంగము దగ్గరకు పంపుతాడు. అతని భక్తికి మెచ్చి శివుడాతని భార్య హస్తమున బాలుడై ఆ దంపతులను ఆశీర్వదిస్తాడు. ఇది భల్లాణుని చరిత్ర. ఈ కథ బసవ పురాణంలోనూ, రాజశేఖర చరిత్రలోనూ, భల్లాణ చరిత్రలోనూ, భల్లాణ దండకంలోనూ ఉంది. (రాజశేఖర విలాసం)

## భల్లా పేరయ్య కవి

కాలం : క్రీ.శ. 1770 ప్రాంతం.

రచన : భద్రగిరి శతకము.

హిందువులపై అత్యాచారాలు చేసిన మహమ్మదీయులను నిందిస్తూ శతకం రాశాడు. ఇతడు రామ భక్తుడు. సమకాలీన పరిస్థితులను ప్రతిబింబిస్తూ రచన చేశాడు. అన్య భాషాపదాలు ఇతని రచనలో చాలా చోటు చేసుకొన్నాయి.

(శ.క.చ-760)

## భవనం వారు

ఇంటి పేరు. గ్రామంలో భవనం కట్టిస్తే ఆ పేరు వచ్చిందో లేక వూళ్ళో ఉన్న అన్ని ఇళ్ళకంటె ఈ 'భవనం' పెద్దగా ఉంటే ఆ పేరొచ్చిందో చెప్పలేము. ఇదే ఇంటి పేరుతో గుంటూరు మండలంలో కొన్ని కుటుంబాలవారున్నారు.

(భారతి-మా-45-230.)

## భవానీ ధవ శతకము

నామాంతరం : మహాదేవశతకము.

రచనాకాలం : క్రీ.శ. 1790 ప్రాంతం.

కర్త : దేవగుప్తాపు రామ భద్ర కవి.

మహాదేవా భవానీధవా" అనే మకుటంతో ఉన్న శతకం. రచన సరళంగా ఉంది. (శ.క.చ-403)

## భవానీ మనోహర వచనములు

రచనాకాలం : 1570 ప్రాంతం.

నామాంతరం : శంకర వచనములు

కర్త : శంకర కవి.

శైవవాఙ్మయంలో చాలా వ్యాప్తిలో ఉన్న వచనాలివి. నేటికీ కొందరు పారాయణం చేస్తున్నారు. వీటికి పూర్వము పురాతన శంకర వచనాలని పేరు. ఇవి చక్కని శైలిగలవి. 'నన్ను రక్షింపవే, భవానీ మనోహరా, అనే మకుటంతో ఉంటాయి.

ఇవి చాలా పెద్ద వచనాలు. 'మహిమ్నము' మొదలైన శివస్తవాల నుండి భావాలను గ్రహించి కవి ఇందులో కూర్చాడు. (వ.వా)

భాగవత చంపువు (సం)

కర్త : అయిదో డిండిమభట్టు (మూడో రాజనాథుడు) (చూ).

చంపూకావ్యం. (తె.వి.స-6)

భాగవత దశమస్కంధము

రచనాకాలం : క్రీ. శ. 14, 15 శతాబ్దాల మధ్యకాలం.

కర్త : మడికి సింగన.

అంకితం : కందనామాత్యునకు.

ద్విపద కావ్యం. (క.స-287)

భాగవత దశమస్కంధము

రచనాకాలం : క్రీ. శ. 17వ శతాబ్దం.

కర్త : రత్నాకరం గోపాలరాజు.

అంకితం : మదన గోపాలస్వామికి.

ద్విపదకావ్యం. కవి దశమస్కంధాన్ని పూర్తిగా చెప్పకుండా ఒక్క పూర్వ భాగాన్నే రచించాడని పరిశీలకులు భావిస్తున్నారు. కవిత రసోచితమైన వర్ణనలతో ప్రౌఢంగా ఉంది. పోతన అనుకరణలున్నాయి. ఈ గ్రంథప్రతిని నారాయణం మాదెన్న కుమారుడు బాలవీరన 9-7-1659 నాటికి పూర్తిచేశాడట. లభించిన ప్రతి సమగ్రంగా లేదు. ఇది వేంకటేశ్వర ప్రాచ్య పరిశోధనాసంస్థలో ఉంది. (ద్వి.సా.చ; ఆరుద్ర-12-170)

భాగవతము

చూ. ద్విపద భాగవతము.

రచనాకాలం : క్రీ. శ. 19వ శతాబ్దం.

కవయిత్రి : తరిగొండ వెంకమాంబ.

ద్విపదకావ్యం. పూర్తిగా పన్నెండు స్కంధాలనూ ఈమె రచించింది.

భాగవతము

రచనాకాలం : క్రీ. శ. 14వ శతాబ్దం.

కర్తలు : బమ్మెర పోతన. శిథిలభాగాలు పూరించినవారు 1. గంగన 2. ఏర్చూరి సింగన 3.వెలిగందల నారయ.

ప్రత్యేకత : భక్తిరస ప్రధానమైన గ్రంథం. వైష్ణవమత ప్రబోధం ఎక్కువ. 12 స్కంధాలున్నాయి. ఇందులోని గజేంద్ర మోక్షం, రుక్మిణీ కల్యాణం, ప్రహ్లాద చరిత్ర, మొదలయిన ఘట్టాలు బాగా జనాదరణ పొందినాయి. తెలుగుదేశంలో రామాయణ భారతాలకంటె ఈ భాగవతమే ఎక్కువ ప్రచారం పొందింది. ఇందులోని మొత్తం 12 స్కంధాలనూ పోతన రచించలేదనీ, అతని శిష్యులు కొంతభాగాన్ని

రచించారనీ పండితులంటున్నారు. పోతన రచన శిలమైపోగా ఆయాభాగాలను వారు పూరించారని కొందరి అభిప్రాయం.

పంచమస్కంధాన్ని గంగన, షష్ఠ స్కంధాన్ని ఏర్చూరి సింగన వ్రాశారట. ఏకాదశ ద్వాదశస్కంధాలు పోతన శిష్యుడైన నారయ రచన. దశమస్కంధంలోకూడా ఇతని రచన ఉన్నట్టు తెలుస్తున్నది. (రె రా.చ)

**భాగవతము (ఏకాదశ ద్వాదశ స్కంధాలు)**

రచనాకాలం : క్రీ. శ. 1450 ప్రాంతం.

కర్త : వెలిగందల నారయ

పోతన కృతమైన భాగవతంలో అతని శిష్యుడైన నారయ కొన్ని భాగాలను రచించాడు. ఏకాదశ, ద్వాదశ స్కంధాలేకాక, తృతీయ, దశమ స్కంధాలలో కూడా ఇతని రచన ఉన్నదని పండితులంటున్నారు. (క.స-109)

**భాగవతము - పంచమస్కంధము**

రచనాకాలం : క్రీ. శ. 1470 ప్రాంతం.

కర్త : గంగన కవి.

పోతన రచించిన భాగవతంలో శిథిలభాగాలను గంగన, సింగన, వెలిగందల నారయ పూరించారని ప్రతీతి. ఈ గంగన పంచమ స్కంధాన్ని పూరించాడో, ఆంధ్రీకరించాడో నిర్ధారణగా తెలియదు. ఈ భాగంలో పోతన రచనకూడ ఉన్నదని పండితుల అభిప్రాయం.

**భాగవతము - షష్ఠస్కంధము**

కర్త : ఏర్చూరి సింగన్న.

రచనాకాలం : క్రీ.శ. 1450 ప్రాంతం.

పోతన కృతంగా ప్రసిద్ధమైన భాగవతంలోని షష్ఠస్కంధం సింగన రాశాడని కొందరూ, నష్టమైన భాగాలను పూరించాడని కొందరూ అంటున్నారు.

**భాగవతము - షష్ఠస్కంధము (అలభ్యం)**

నామాంతరం : 1. శృంగార షష్ఠము 2. కవుల షష్ఠము.

రచనాకాలం : క్రీ.శ. 1520 ప్రాంతం.

కర్తలు : నంది మల్లయ్య, ఘంట సింగయ్య (రాచమల్లు కవులు).

అంకితం : చిక్క తిమ్మరాజు తనూజుడైన తిమ్మరాజుకు.

ప్రత్యేకత : ఏర్చూరి సింగన్న వ్రాసిన భాగవత షష్ఠస్కంధాన్ని వీరు మళ్ళీ వ్రాశారు. ఇది పూర్తిగా దొరకలేదు. ఇందులోని పద్యాలను ముద్దరాజు రామన్న, కూచిమంచి తిమ్మకవి, అడిదం సూరకవి మొదలయిన లాక్షణికులు ఉదాహరించారు. రాచమల్లు కవులు వ్రాయడంవల్ల దీనికి కవుల షష్ఠము అనీ, అజామిళో పాఖ్యానంలోని

శృంగార వర్ణనను బట్టి శృంగార షష్ఠము అనీ పేర్లు కలిగాయి.
(క.స-182); (ఆరుద్ర-6.250)

**భాగవతము (షష్ఠైకాదశ ద్వాదశ స్కంధాలు)**

కర్త : హరిభట్టు.
రచనాకాలం: క్రీ శ. 16 వ శతాబ్దం అనీ, 17 వ శతాబ్దం అనీ వివాదాలున్నాయి.
గ్రంథం అముద్రితం. (వా చ-56)

**భాగవత యక్షగానము (దశమ స్కంధము)**

నామాంతరం : పార్థసారథి విజయము.
కర్త : ఆలూరి కుప్పన (చూ).

యక్షగాన ప్రబంధం. మహాభాగవత కథ ననుసరించే చెప్పబడింది. మార్పులు లేవు ఈ కవి మహాభాగతాన్నంతా యక్షగానంగా రచించలేదనీ దశమ స్కంధాన్ని మాత్రమే పార్థసారథి విజయమనే పేర చెప్పాడనీ పండితాభిప్రాయం. ఇతడు రామాయణ, భాగవతాలను పూర్తి యక్షగానాలుగా రచించాడని కొందరు సాహిత్య చరిత్రకారులు చెప్తున్నారు. (వ.దే.వా-249)

**భాగవత వైభవము**

కర్త : సుంకసాల తిరుమల కవి.
అంకితం : లక్ష్మీదేవికి.

ద్విపద రచన. లక్ష్మీదేవి కవికి స్వప్నంలో సాక్షాత్కరించి తన్నామాంకితంగా భాగవత వైభవాన్ని రచించ మన్నదట. భగవంతుని పూజకంటె భగవద్భక్తుల పూజ ఉత్తమమని ఈ కావ్యం చెప్తున్నది (ద్వి సా.చ-265)

**భాగవత సంగ్రహము (అలభ్యం)**

రచనాకాలం : క్రీ శ. 17 వ శతాబ్దం.
కవయిత్రి : రంగాజమ్మ (చూ)

ఈ కవయిత్రి రచించిన ఉషాపరిణయ పీఠికలో ఈ గ్రంథ ప్రసక్తి ఉంది.

**భాగవత సారము**

రచనాకాలం : క్రీ.శ. 18 వ శతాబ్దం.
కర్త : పుష్పగిరి తిమ్మన్న (చూ).

వచనగ్రంథం. సరళంగా చక్కని వాడుక భాషలో సాగిన రచన. ద్వితీయ స్కంధంనుండి షష్ఠస్కంధము వరకు ఉన్న అయిదు స్కంధాల గ్రంథం మాత్రం లభించింది. కవి నామం మహా పురాణకవి తిమ్మనార్యుడని ఉంది.

పుష్పగిరితిమ్మన రచనను అనుసరించి "చిన్నయ్యన్" అనే అతడు తమిళంలో భాగవత సారాన్ని వ్రాశాడు. ఇతడు మూలంలోని పన్నెండు స్కంధాలనూ చూసి వ్రాసినట్లు చెప్పాడు (ఆరుద్ర-10-160)

### భాగవతుల నాయనప్ప

నామాంతరం : నవనప్ప (చూ).

### భాగవతుల వారు

భాగవతాలు వ్రాయటమో, ప్రదర్శించటమో చేస్తే ఇది వృత్తిరీత్యా ఇంటి పేరుగా నిలిచింది. కృష్ణాజిల్లా కూచిపూడి గ్రామంలో కొందరి ఇంటిపేరు భాగవతుల వారు. (భారతి-మా-45-229)

### భాగీరథీ పట్టణము

ప్రస్తుత భాగ్యనగరానికి (హైదరాబాదు) పూర్వపు పేరు గోలకొండ నగరం. ఇబ్రహీం కుతుబ్ షా (1550-1580) తన ప్రియురాలి పేర గోలకొండ నగరాన్ని భాగీరథీ పట్టణంగా మార్చాడు. 'మాహమ్నా' అనే పారశీక గ్రంథంలో ఈ నగర ప్రసక్తి ఉన్నదట. సారంగు తమ్మయ ఈ పట్టణాన్ని పేర్కొన్నాడు. ఇదే తరువాత భాగ్యనగరమైంది. (తె.వి.స-6-75; ఆరుద్ర-8-8)

### భాణము

ఇది దశవిధ రూపకాలలో ఒకటి. దీనిలోని ఇతివృత్తం కల్పితమై, ధూర్త చరిత్రగా ఉంటుంది. దీనిని సమర్థుడు, విటుడు అయిన ఒక్క పాత్రయే నిర్వహించవచ్చును. ఇందులో భారతీవృత్తి ఉపయోగించవచ్చు. సంబోధనాది ప్రత్యుక్తులు, ఆకాశభాషితాలూ ఉంటాయి. ఇందులో సాంగాలైన ముఖ నిర్వహణ సంధులను, గేయాది దశ లాస్యాంగాలను ఉపయోగించవచ్చు. శౌర్యవర్ణన వల్ల వీర రసాన్ని కాని, సౌభాగ్య వర్ణన వల్ల శృంగార రసాన్ని కాని సూచించటం జరుగుతుంది. (తె.వి.స-6)

### భానుకవి

కాలం : క్రీ.శ. 16 వ శతాబ్దం.

స్థలం : విజయనగరం.

రచన : పంచతంత్రము (చంపువు).

విశిష్టత : ఈయన కృష్ణదేవరాయల కాలంలోను, అచ్యుత దేవరాయల కాలంలోను ఉన్నాడు. తిప్పనమంత్రి పుత్రుడు. చిట్టన అనే అతడు భాను కవిని గూర్చి లక్ష్మీనారాయణునికి చెప్పి అతని నుండి కావ్యం అంకితం పొందాలని చెప్పగా, కృతిపతి భాను కవిని కృతి కొరకు అడిగి పంచతంత్ర కావ్యాన్ని కృతి పొందినట్లు తెలుస్తున్నది. కృతిపతి శ్రీకృష్ణదేవరాయల కాలంవాడు. ఈ చిట్టన రెంటూరి చిట్టనామాత్యుడు కావచ్చునని పండితులు భావిస్తున్నారు. ఈయనే గాక దూబగుంట నారాయణకవి, బైచరాజు వేంకటనాథుడు కూడా ఈ కావ్యాన్ని తెలుగులో చంపువుగా వ్రాశారు. (ఆరుద్ర-6-130)

### భానుమతీ పరిణయము

రచనాకాలం : క్రీ.శ. 17 వ శతాబ్ది ప్రథమ పాదం.

కర్త : రేటూరి రంగరాజు.

అంకితం : వెలుగోటి రాయమహేంద్రునికి.

నాలుగాశ్వాసాల శృంగార ప్రబంధం ఇతివృత్తం పౌరాణికం. శ్రీకృష్ణుని పినతండ్రి అయిన భానునికి పద్మిని అనే భార్యవల్ల కలిగిన పుత్రిక భానుమతి. ఈ భానుమతికిన్నీ, పాండవులలో చివరివాడైన సహదేవునికిన్నీ జరిగిన పరిణయ వృత్తాంతం దీనిలోని ఇతివృత్తం. శబ్దాలంకారాలు రచనలో ఎక్కువగా చోటు చేసుకున్నాయి. అయినప్పటికీ కవిత్వం ద్రాక్షపాక శైలిలో సులభగ్రాహ్యంగా ఉంది. (ఆం.సం.సా-454)

## భానుమద్విజయము

కర్త : వెలగపూడి కృష్ణయామాత్యుడు (చూ)

రచనాకాలం : క్రీ. శ. 1740 కాని 1760 కాని కావచ్చు.

అంకితం : అయిదాశ్వాసాల ప్రబంధం. ఈ గ్రంథానికి 'పద్మావతీ వివాహ' మనే పేరున్నట్లు తెలుస్తున్నది. గ్రంథాదిని పరబ్రహ్మస్తుతి ఉన్నది. చివరచివర దక్షిణామూర్తి స్తవం ఉన్నది. శంకరుడే కలలో కనిపించి కృతిపతిత్వాన్ని కోరినట్లు కవి చెప్పుకొన్నాడు.

మూలం : ఉత్తర కాశీఖండంలోని కథ. భానుమంతుడనే విప్రకుమారుడు, ఉజ్జయినీ రాకుమార్తె పద్మావతిని వివాహమాడడం ఇందులోని కథ.

యోగశాస్త్ర విషయాలు, అద్వైత వేదాంత ప్రతిపాదకములైన విషయాలు గ్రంథమంతటా కనిపిస్తాయి. ఈ గ్రంథానికి వ్యాఖ్యానం వ్యవహార భాషలో గ్రంథకర్తయే రచించి ఉండటం విశేషం. సులభమైన ఘట్టాలు కొన్నింటికి తప్ప, పూర్తి గ్రంథానికి టీక ఉంది.

అనువాదం : ఈ ప్రబంధం తమిళంలోకి 'అరియం పెరుమల్' అనే పేర అనువదించబడింది. 18 శతాబ్దంలోనే ఈ అనువాదం జరిగి ఉండవచ్చును.

(ద.దే.వా-391)

## భామా కలాపము

కర్త : సిద్ధేంద్ర యోగి.

దీనికి కవి పెట్టినపేరు "పారిజాతం" కాని ఇది భామా కలాపంగానే ప్రసిద్ధమయింది. భామ కలాపము యొక్క ప్రదర్శన ప్రక్రియ విశిష్టమైన దైనప్పటికీ రచనా ప్రక్రియ యక్షగాన ప్రాయమైనదే. అంతేగాక యక్షగాన రచనా ముఖ్యాంగాలైన దరువులు, ద్విపదలు, గద్యపద్యములు కూడా ఉన్నాయి. కాని ప్రదర్శన ప్రక్రియలో భామా కలాపము సామాన్య యక్షగానంవలె గాక, భరత విద్యావిధి నిబద్ధమైనది. నృత్యప్రధానమైనది. దీనిలో జయదేవుని గీతగోవిందంవలె నాయికా, నాయక సఖీ పాత్రలు మూడే ముఖ్యమైనవి. ఈ కలాపంలో సఖిపాత్రదాక ప్రత్యేకత. అది సిద్ధేంద్రుని అపూర్వ సృష్టి.

భామ అంటే సత్యభామ. భామా కలాపము తిమ్మనగారి పారిజాత కథలో సత్యా

స్వప్న కథనముగ ఇమిడినది. సిద్ధేంద్రుని చిత్రణలో ఆమె విప్రలబ్ధ. గ్రంథమంత ఆమె వలవంత కల, కలతవిదుర, చెలికత్తెతో సొద వెళ్ళబోసుకోవడం, నాయకునితో ఆమె రాయబారాలు, సంవాదాలు, చివరకు రుక్మిణితో సవతికయ్యము మొదలయినవి ప్రధానవిషయాలు. ఈ భామా కలాపము శృంగార రసపేశల సుధాకలశము అలంకార శాస్త్రసారవికషోపలము. రచన ప్రౌఢ భావబంధురము. భావోచిత పదబంధ సుందరము.

సిద్ధేంద్రుడు రచించిన మూలప్రతి అనేక రూపాంతరాలు పొందిందట. నేడు ప్రదర్శింపబడుతున్న భామాకలాపానికి ఆరువిధాల నకళ్లున్నాయని తెలుస్తున్నది. సిద్ధేంద్రుని రచన ఇరవయ్యో శతాబ్దంలో కాకినాడలో ముద్రితమైంది. ఈ ప్రదర్శనను నిర్వహించి ప్రఖ్యాతులైనవారు పిఠాపురం, పెండ్యాల, మానుపల్లి, మండపేట, కోటకొండ, నిమ్మలవలస, కసింకోట, జామి, బొబ్బిలి, పేరూరు, చోడవరం మొదలైన ప్రాంతాలలో ఉన్నారు. (య. వా. చ-31-33)

## భామినీ విలాసమ్ (సం)

కర్త : జగన్నాథ పండితుడు.

ఇది నీతిని తెలిపే సుభాషిత గ్రంథం. దీనిలో అన్యోక్తి, శృంగారము, కరుణ, శాంతము అనే నాలుగు భాగాలున్నాయి. భావగాంభీర్యం, ఓజస్సులతో ఉన్న మనోహర రచన. కరుణలో భామిని మరణం వల్ల కలిగిన దుఃఖం ఇతివృత్తం. భామిని బహుశః ఇతని భార్య కావచ్చునని పండితాభిప్రాయం. కవి ఆమె పేరే దీనికి పెట్టి ఉంటాడు. శాంతంలో జితేంద్రియత్వం, ఆత్మబోధలగురించి వివరంగా ఉంది. (తె.వి.స-6)

## భారత కథాసారము (అలభ్యం)

నామాంతరం : మహాభారత తాత్పర్య సంగ్రహము.

కృతికర్త : రఘునాథ నాయకుడు.

ఇందులో భారతకథ సంక్షేపంగా చెప్పబడిందట. ఇది సంస్కృత రచన అని పండితులు భావిస్తున్నారు. (తం.ఆం.నా-237)

## భారత చంపుకు వాఖ్యానము

కర్త : అంబాళం రాఘవాచార్యులు (చూ).

ముద్రితమే కాని ప్రతులు లభించడం లేదు. (ఆం.సం.సా)

## భారత తాత్పర్య సంగ్రహమ్ (సం)

కర్త : అప్పయ్య దీక్షితులు.

ఇది మహాకావ్యమని పండితులు చెబుతారు. (తె.వి.స-6)

## భారతము (అలభ్యం)

కర్త : అథర్వణాచార్యుడు.

దీని ఉనికిని గురించి తెలుగుదేశంలో చాలా ఐతిహ్యాలున్నాయి. ఈ కవి జైనుడవడంచేతనో, కవిత్రయ భారతం ఎదుట ఇతని రచనకు ఆదరణ లభించకపోవడం వల్లనో ఈ భారతం నష్టమైంది. ఇందులోని కొన్ని పద్యాలు లక్షణగ్రంథాలలో ఉదాహృతాలు. జిలిబిలి పలుకుల నుడికారం ఇందులో కనిపిస్తున్నదట.

(క.శ.-1 ; ఆరుద్ర-2)

భారతము (కన్నడం)

కర్త : కిఱువె నంజరాజు

(సా. చ. సం)

భారత సంగ్రహము

కర్త : చూ. పాపాశాస్త్రి.

పౌరాణిక కావ్యం. విశేషాలు తెలియవు. (ఆం.సం.సా.)

భారత సంగ్రహము

కవయిత్రి : రంగాజమ్మ (చూ).

కవయిత్రి ఉషాపరిణయ ప్రబంధావతారికలో ఈ రచనను పేర్కొన్నది.

(ద.దే.వా-132)

భారత సావిత్రి

కర్త : ఎల్లకర నరసింహకవి.

మూలం : "భారత సావిత్రి" సంస్కృత గ్రంథం.

ప్రత్యేకత : వచన కావ్యం. కర్త విషయంలో అభిప్రాయ భేదాలున్నా దీనికర్త నరసింహకవేనని చాలమంది అంగీకరించారు. ఇది తెలుగుదేశంలో బహుళ ప్రచారం పొందిన వచనగ్రంథం. విద్యార్థులకు ప్రాథమిక విద్యాస్థాయిలో ఇది అవశ్య పఠనీయ విషయంగా ఒకప్పుడు ఉండేది. రాయబారానికి వెళ్ళినప్పుడు శ్రీకృష్ణుడు విదురుని యింట విందు భోజనంచేయటం ఇందులో ఉంది. లభ్యమైన కృతులలో కర్తపేరు లేకపోయినా కర్త ఎల్లకర నరసింహకవేనని పండితులు చాలా మంది తేల్చారు.

(ఆరుద్ర-9-229)

భారతారణ్య పర్వశేషము

రచనాకాలం : క్రీ. శ. 14 వ శతాబ్ది.

కర్త : ఎఱ్ఱాప్రెగ్గడ.

కవిపోషణ : ప్రోలయవేముడు, మల్లారెడ్డి.

అంకితం : రాజరాజ నరేంద్రునికి.

ప్రత్యేకత : కవి భారతారణ్య పర్వశేషాన్ని తాను పూరిస్తున్నా నన్నయ పేరు మీదుగనే పూర్తిచేసి, ఆయనపట్ల వినయం ప్రకటించాడు. కవిత నన్నయకవితవలె ఇతిహాస శైలినీ, తిక్కన నాటకీయ శిల్పాన్నీ తలపింప చేస్తుంది. ఈ భాగంకూడా రాజరాజనరేంద్రునకే అంకితం. (రె.రా.చ.(

**భారతి రామరాజు**

కాలం : క్రీ. శ. 1813 ప్రాంతం.

స్థలం : పోట్లదుర్తి.

రచనలు : 1. జలక్రీడలు 2. గొల్లభామ వేషము 3. బాలింత వేషము 4. పారిజాతము.

మంచి (మంత్రి) రాజు కుమారుడు. కవి తన రచనలన్నీ పోట్లదుర్తి హరికి అంకితము చేసినాడు. ఇతని స్వస్థలమైన పోట్లదుర్తి కడపమండలంలో ఉన్నది. కాని ఇతడు నెల్లూరు జిల్లామాన్యూలులో (పుట 698-99), నెల్లూరు మండల కవి అయినట్లు క్రీ. శ. 1812 ప్రాంతంలో ఉన్నట్లు ఉన్నది. (య.వా.చ-82)

**భారతీ పరిణయము (అలభ్యం)**

కర్త : కుందుర్తి గోవిందయ్య

అంకితం ; వీర వేంకటపతిరాయలకు (17 వ శతాబ్ది).

ఇతని వంశీయుడైన కుందుర్తి వెంకటాచలకవి రచించిన 'మిత్రవిందా పరిణయ' ప్రబంధావతారిక నుంచి ఈ గ్రంథ విషయం తెలుస్తున్నది. (ద.దే.వా-365)

**భారతీ శతకము**

కర్త : చూ. కొటికెలపూడి కోదండరామకవి.

భారతీస్తవ రూపమైన శతకం. 'భారతీ' అనేమకుటంతో శార్దూల, మత్తేభ వృత్తాలున్నాయి. శైలి చక్కనిది. (ఆం.సం.సా-305)

**భారతీస్తుతి**

కర్త : చూ. విక్రాల నరసింహాచార్యులు.

ముద్రిత గ్రంథం. (ఆం.సం.సా.)

**భారతుల పేరయ్యశాస్త్రి**

కాలం : క్రీ.శ. 19 వ శతాబ్దం.

స్థలం : అన్నసముద్రం గ్రామం (కర్నూలు మండలం)

రచన : బాలాత్రిపుర సుందరీ స్తోత్రము.

కర్నూలు మండలంలో త్రిపురాంతకంలో వెలసిన బాలాత్రిపురసుందరి ఇతని ఉపాస్యదేవత.

పువ్వాడ వెంకట్రామసెట్టి ఈ కవికి వర్షాశనంగా ఒక వరహా ఇచ్చేవాడట. ఒకసారి ఆ వరహా ఇవ్వనందుకు అతన్ని తిడుతూ పద్యం మొదలుపెట్టి మూడు పాదాలు చెప్పి. వరహా ఇవ్వగానే నాల్గోపాదం మార్చి పద్యం పూర్తి చేశాడట. పొగాకు మీద, దూపాటి సీమమీద ఇతడు చెప్పిన చాటువులు ప్రసిద్ధమైనవి. (చా. ప. ర.)

**భార్గవ పురాణము**

రచనాకాలం : క్రీ.శ. 1800 ప్రాంతం.

కర్త : కాండూరి వేంకటదాసు.

కృత్యాదిలో కవి తనను గురించి చెప్పుకున్నాడు. (శ.క చ-486)

**భార్గవ పురాణము**

రచనాకాలం : క్రీ.శ. 18వ శతాబ్దం (1730 ప్రాంతం).

కర్త : బహిరీ పామ నాయకుడు.

అంకితం : సురపురంలోని వేణుగోపాలస్వామికి.

**భార్గవాభ్యుదయము (అలభ్యం)**

కవి : పోడూరి కొండకవి (చూ).

ప్రబంధం పోడూరి పెదరామామాత్యుడు ఈ కృతిని పేర్కొన్నారు.

**భార్యలను అమ్మిన భర్త**

ఇది సూరన్న కళాపూర్ణోదయంలోని ఒక పాత్ర. విరతాన్న దానవ్రతుడైన ఒక బ్రాహ్మణ పుత్రుడు యజ్ఞశర్మ. తండ్రి కిచ్చిన మాటమీద ఉన్న ఆస్తినంతా అమ్మి అన్నదానం చేశాడు. చివరకు తన నలుగురు భార్యల సొమ్ములను కూడ అమ్మాడు. తుదకు భార్యలను కూడా అమ్మి అన్నదాన వ్రతం కొనసాగించాలనుకున్నాడు. ఓడ వ్యాపారంతో ధనం సంపాదించాలనే సాకుతో, తన నలుగురు భార్యలను ఓడరేవుకు తీసుకొనిపోయి, ఒక సెట్టికి అమ్మి, వారిని నావ ఎక్కించి తాను ఒడ్డున నిలిచిపోయాడు. ఓడ కదలిన తరువాత అతని ఆర్తనాదం వల్ల భార్యలకు అసలు సంగతి తెలిసి వారు సముద్రంలోకి దూకారు. ఒక చేప వారిని మ్రింగి పైకి చిమ్మటం, వారు ఒక దేవతా విమానంలో పడటం జరుగుతుంది

అన్నదాన సువ్రతం మానకుండా నెరవేర్చడంవల్ల ఇతనికి అలఘువ్రతుడనే పేరు వచ్చింది. ఇతడే మృగేంద్ర వాహన ఆలయంలో కళాపూర్ణుని కథను పూర్తిగా వినగోరి, భువనేశ్వరీ మంత్రజపం చేసి, రెండేళ్ళ అనంతరం కళాపూర్ణుని కొలువులో పడతాడు మణికంధరు డిచ్చిన మణిహారం మధురలాలసకు బహూకరించి తద్వారా తన భార్యలను పుత్రులను కలుసుకుంటాడు.

సూరన లోకజ్ఞత అనంతం. యజ్ఞశర్మ వృత్తాంతంలో నాటి సమాజంలోని వ్యక్తుల ప్రకృతులు గోచరిస్తాయి.

(కళాపూర్ణోదయం - మున్నుడి - ఘ.,క్షో. రెడ్డి)

**భావదీపిక (సం)**

నామాంతరం : సప్తశతీసారటీక. (రె.రా.చ)

కర్త : చూ. పెదకోమటి వేమారెడ్డి.

## భావన పెమ్మన

కాలం : క్రీ.శ 1590 కి ముందుకాలం.

రచన : అనిరుద్ధ చరిత్ర (అలభ్యం)

విశిష్టత : ఈయన అనిరుద్ధ చరిత్రను అష్టాదశ వర్ణనలతో సలక్షణ ప్రబంధంగా వ్రాశాడు జగ్గన్న. ఆయనకు పూర్వ సంకలనకర్త - ఇద్దరూ ఈ కవి పద్యాలు 64 ఉదాహరించారు. జగ్గన్న 7 పద్యాలను, పూర్వ సంకలనకర్త 57 పద్యాలను సేకరించారు. పెమ్మన, బమ్మెర పోతనకు అర్వాచీనుడు కావచ్చు. ఉదాహరణ పద్యాలలో పూర్వ సంధాత ఇతని పద్యాలనే ఎక్కువగా స్వీకరించాడు. చిమ్మపూడి అమరేశ్వరుని పద్యాలకు రెండో స్థానం ఇచ్చాడు అమరేశ్వరుని నుతించిన కవులు ఉన్నారు గాని, అనుసరించిన వారు అరుదు. అయితే పెమ్మన అమరేశ్వరుని అనుసరించినట్లు కవితలో సాక్ష్యాలు కనిపిస్తున్నాయి. (అరుప్ర-9)

## భావనా పురుషోత్తమమ్ (సం)

కర్త : రత్నఖేట శ్రీనివాసదీక్షితుడు.

రూపకం. సంస్కృత సాంకేతిక రూపకంగా ప్రసిద్ధం.

## భావనారాయణ విలాసము

రచనాకాలం : క్రీ.శ. 18వ శతాబ్దం.

కర్త : శేషము రంగాచార్యులు.

యక్షగానం. పొన్నూరుక్షేత్ర మాహాత్మ్యమునకు సంబంధించిన గాథ. దీనిలో భావనారాయణస్వామి ప్రత్యక్షమై గోవిందునకు సాక్ష్యము చెప్పడం విశేషం. ఈ యక్షగానంలోని అమ్మలక్కల ప్రసంగాలు, తెనుగిండ్ల పెండ్లి ముచ్చటలకు చక్కని రూపకల్పన.

రచన ప్రౌఢంగా ఉన్నది. దీనిలో శ్లోకాలు, చూర్ణిక, మంజరీ, ద్విపదలు ఉన్నాయి. (య వా.చ. 91)

## భావనారాయణ శతకము (అలభ్యం)

రచనాకాలం : క్రీ.శ. 1800కు పూర్వం.

కర్త : నిర్ధారణగా తెలియదు.

తిరుక్కుడయూరి కృష్ణదాసు రచించిన "రామదాసు చరిత్ర"లో ఇందులోని కొన్ని పద్యాలు ఉదాహృతాలు. (క.స-39)

## భావలింగ శతకము

కవయిత్రి : దార్ల సుందరమ్మ.

రచనాకాలం : క్రీ.శ. 1829 ప్రాంతం.

సంఘంలోని మూఢాచారాలను విమర్శిస్తూ చెప్పిన శతకం. రచనలో

చక్కని ఆటవెలదులున్నాయి. కవితా ధోరణి తాత్త్వికం. ధారాశుద్ధి ఉంది. "పాప భయ విభంగ భావ లింగ" అనేది మకుటం.

ఈ కవయిత్రి పోతులూరి వీరబ్రహ్మంగారి శిష్యవర్గానికి చెందినది. గుంటూరు జిల్లా చెర్లగుడిపాడులోని గంట శ్రీరాములు, నాగమాంబల పుత్రిక. దార్ల శేషయ్య సతీమణి.

ఈ శతకాన్ని కొండవీటి వేంకటకవి అనంతర కాలంలో ప్రచురించారు.
(ఆం. కవయిత్రులు - 72 ; తె.వి స - 4)

## భావ శతకమ్

కర్త : కిరీటి వేంకటాచార్యులు (చూ).

సంస్కృత గ్రంథం. (ఆం.సం.సా.)

## భాషావివరణము

కర్త : ఎలకూచి బాలసరస్వతి.

రచనాకాలం : క్రీ.శ. 1600 ప్రాంతం.

లక్షణగ్రంథం.

## భాష్యంవారు

వేద వేదాంగాలకు, ఉపనిషత్తులకు భాష్యం చెప్పిన తెలుగువారు పూర్వకాలంలో ఉన్నారు. వారు భాష్యం చెప్పారు కనుకనే అతి సుప్రసిద్ధులై 'భాష్యంవారు' అనే ఇంటి పేరుతో చెలామణి అయివుండవచ్చు. ద్విభాష్యం ఇంటిపేరుతో కూడా దేశంలో కొన్ని కుటుంబాల వారున్నారు. (భారతి-మా-45-229)

## భాష్యము

కావ్య పరిభాష భాష్యమంటే స్వతంత్ర విమర్శనం అని చెప్పవచ్చును. సూత్రానుసారములైన వాక్యాలతో సూత్రార్థాలను వివరిస్తూనే, గ్రంథకర్త మధ్య మధ్య తన స్వంత మాటలను కూడా జతపరుస్తూ, వ్రాసిన వ్యాఖ్యను భాష్యమని అంటారు. ఇందులో విషయాన్ని జల్లెడ పట్టినట్లుగా పూర్వోత్తర పక్షాలతో విమర్శించటం జరుగుతుంది. (కావ్యాలంకార సంగ్రహం)

## భాష్యార్థ రత్నమాల

కర్త : అక్షింతల సుబ్బాశాస్త్రి (చూ).

బ్రహ్మసూత్ర భాష్యానికి ఇది వివరణ గ్రంథం. ఆర్యావృత్తాలలో వ్రాయబడింది. (ఆం సం.సా.)

## భాస్కర ఖండము

కర్త : అక్షింతల సింగరశాస్త్రి (చూ).

**భాస్కర దీక్షితుడు**

కాలం : క్రీ. శ. 17వ శతాబ్దం.
స్థలం : శహాజీ రాజపురం.
రచనలు : 1. రత్నతూలిక (సం) 2. లలితా సహస్ర నామావళీ వ్యాఖ్య (సం).

క్రీ. శ. 1684-1712 వరకు తంజావూరును పాలించిన శహాజీ ఆస్థానంలోని వాడు. తన శిష్యుడు కృష్ణానంద సరస్వతి "సిద్ధాంత సిద్ధాంజనమ్" అనే వేదాంత గ్రంథం వ్రాయగా ఇతడు దానికి 'రత్నతూలిక' అనే వ్యాఖ్యానం రాసి వ్యాప్తికి తెచ్చాడు.

(M. R. T. P-32)

**భాస్కర ప్రశస్తి (సం)**

కర్త : అనివిళ్ళ వేంకటశాస్త్రి.

కావ్యం. (తె వి. స-4)

**భాస్కర భవదూర మహీపతి**

కాలం : క్రీ. శ. 1343-1378 ప్రాంతం.
రచనలు : లభించలేదు.

ఇతడు సంగమ వంశపు మొదటి బుక్కరాయల కుమారుడు. కడప మండలం లోని "పోరు మామిళ్ళ" తటాక నిర్మాత. తండ్రి కాలంలోను, సోదరుని కాలంలోను ఆ మండలాన్ని పాలించినట్లు తెలుస్తున్నది. ఇతని నీతిపద్యాలు కొన్ని సంకలన గ్రంథాలలో కన్పిస్తున్నవట.

విశిష్టత : ఈ భవదూరుని, 'మల్హాణ చరిత్ర' కర్త ఎడపాటి ఎర్రన, 'నాగ ఖండ' రచయితలు తురగా రామకవి-అయ్యంకి బాలసరస్వతులు నుతించారు.

(క. త-4; ఆరుద్ర 3-8, 9)

**భాస్కరమంత్రి**

కాలం : క్రీ. శ. 1190-1220 ప్రాంతం.
స్థలం : గుంటూరు.
రచన : భాస్కర రామాయణంలోని బాల, అయోధ్య, అరణ్య కాండలు.

కవిబ్రహ్మ తిక్కన సోమయాజికి, ఇతడు పితామహుడట. నిర్వచనోత్తర రామాయణంలో ఇతని ప్రశంస ఉంది. గుంటూరును పాలించాడట.

ఇతడు రచించిన రామాయణ భాగాలు కొన్ని ఖిలమైనవి. భాస్కర రామాయణ మని పేరు పొందిన రామాయణాన్ని ఇతడే ప్రారంభించాడనీ హుళక్కి భాస్కరుడు, అయ్యలార్యుడు మొదలైన వారు దానిని పూర్తి చేశారనీ, కొందరు విమర్శకులు భావిస్తున్నారు.

(క. స-152)

## భాస్కర రామాయణము

రచనా కాలం : క్రీ. శ. 1291-1323 ప్రాంతం.

కర్తలు : 1. హుళక్కి భాస్కరుడు 2. మల్లికార్జున భట్టు 3. కుమారరుద్ర దేవుడు 4. అయ్యలార్యుడు

కృతిపతి : సాహిణి మారన కావచ్చు (ఈయన కాకతి రెండో ప్రతాపరుద్రుని సామంతుడు)

విశిష్టత : 1. హుళక్కి భాస్కరుడు, భాస్కర రామాయణంలో అరణ్యకాండ పూర్తిగా, యుద్ధకాండలో కొంతభాగం వ్రాశాడు ఇతడు ప్రతాపరుద్రుని ఆస్థానంలోనివాడని ప్రతాపరుద్ర చరిత్ర చెబుతున్నది. 2. మల్లికార్జున భట్టు భాస్కర రామాయణంలో బాల, కిష్కింధ, సుందర కాండలు వ్రాశాడు. కావ్యంలో ఎక్కువ భాగం ఈ కవే వ్రాశాడు. 3.కుమార రుద్ర దేవుడు భాస్కర రామాయణంలో అయోధ్యకాండమాత్రమే వ్రాసి;తండ్రి సాహిణి మారనకు అంకితంగా చెప్పాడు. 4.అయ్యలార్యుడు, భాస్కరుడు వ్రాయకుండా విడిచిన యుద్ధకాండ భాగాన్ని వ్రాసి కావ్యం పూర్తిచేశాడు. (ఆరుద్ర-3)

## భాస్కర వేంకటాచలకవి

కాలం : క్రీ. శ. 1731-1767.

స్థలం : దక్షిణదేశం.

రచన : సేతు మాహాత్మ్యము.

సూరయ వెంగాంబల పుత్రుడు. ఇతని సోదరుడు, శేషాచలపతి "నాంచారు పరిణయ" కర్త. ఆ కావ్యాన్ని కూడా ఇతడే రచించినట్లు కొందరు భావిస్తున్నారు. (ఆరుద్ర-12-308)

## భాస్కర శేషాచల కవి

కాలం : క్రీ. శ. 18వ శతాబ్దం.

స్థలం : దక్షిణదేశం.

రచన : నాంచారు పరిణయము (అలభ్యం).

సూరయ, వెంగాంబల పుత్రుడు.సేతు మాహాత్మ్య కర్త "భాస్కర వేంకటాచల కవి"కి సోదరుడు. (ద. దే. వా-402)

## భాస్కర శతకము

రచనాకాలం : అప్పకవికి పూర్వం.

కర్త : మారన వెంకయ్య.

విశిష్టత : ఇందులోని పద్యాన్ని అప్పకవి ఉదాహరించాడు. దీనిలోని ఒక పద్యంలోవి "పదార్థం" అనే మాటను నిత్య సమాస విశ్రాంతులలో ఒక ఉదాహరణకు అప్పకవి చూపించాడు. అప్పకవి నాటికే ఈ శతకం బాగా ప్రచారంలో ఉండి ఉండవచ్చు. ఇందులోని ప్రతి పద్యంలో మొదటి రెండు పాదాలలో ఒక సత్యముంటుంది. అ

సత్యాన్ని సమర్థిస్తూ, కడపటి రెండు పాదాలలో ఒక దృష్టాంతం ఉంటుంది. కవి దీనిలో భాగ్యరేఖ, పూర్వజన్మ సుకృతం, కర్మ, అదృష్టం, అనే వాటి గురించీ ధనిక వర్గాల మన స్తత్వాన్ని గురించీ చెప్పాడు.

ప్రజ్ఞావంతులు పాలకులుగా ఉండాలని, ప్రజల మన్నన పొందాలని, నీతి మార్గాల ద్వారా పన్నులు వసూలు చేయాలని, రాజ్య రక్షణకు నిరంతరం కృషి చేయాలని, శత్రువులను వేయి కళ్ళతో కని పెట్టాలని ఎన్నో దృష్టాంతాలు చెబుతూ సరసమైన లోకోక్తులతో ఎన్నో నీతులను ఈ శతకం చెప్తుంది.

సమకాలీన సంఘ జీవితానికి అద్దం పడుతున్న రచన. తెలుగు దేశంలో నేటికీ భాస్కర శతకానికి ఎక్కువ ప్రచారముంది. దీనిని బ్రౌన్ దొర అకారాది క్రమంలో వ్రాయించి భద్రపరిచాడట. (ఆరుద్ర-9-221; శ. సా. వి-377)

## భాస్కరాచార్యులు

కాలం : క్రీ. శ. 1500-1700 నడుమ.

స్థలం : గోదావరి జిల్లా-పెనుగొండ గ్రామం.

రచన : వైశ్య పురాణము (వాసవీ మాహాత్మ్యము, కన్యకాపురాణము).

బొల్లనార్యుని కుమారుడు.

విశిష్టత : ఈయన వైశ్యుల కుల గురువట మునుపు నైమిశారణ్యంలో సాలంకాయన మహర్షి, వైశ్యులకు చెప్పిన కథనే ఈయన చెప్పాడట. ఇది చారిత్రకం కాదని, కల్పితమని పండితుల మధ్య, భేదాభిప్రాయాలున్నాయి. ఇతని కవిత్వం మనోహరంగా ఉంటుంది. కవిస్తుతిలో పోతనను పేర్కొన్నాడు. (ఆరుద్ర-9-232)

## భాస్కరుని కేతన

కాలం : క్రీ. శ. 12 వ శతాబ్దం.

స్థలం : విక్రమసింహపురి.

రచన : కాదంబరి (4 పద్యాలు లభ్యం)

భట్టబాణుని సంస్కృత కాదంబరికి అనువాదం కావచ్చు.

విశిష్టత : తిక్కన తాతయైన మంత్రి భాస్కరుని కుమారుడు. కొట్టరువు వారి వంశంలోని "కేతన" కవిత్వం చెప్పినట్లు, మూల ఘటిక కేతన దశకుమార చరిత్రలో చెప్పాడు. పెదపాటి జగ్గన్న "ప్రయోగ రత్నాకరం"లో ఈతని పద్యాలను ఉదాహరించాడు. కస్తూరి రంగకవి ప్రాస యతికి ఉదాహరణ యిస్తూ "కేతన-కాదంబరి యందు" అని ఒక పద్యాన్ని ఉదాహరించాడు (ఆరుద్ర-2-727)

## భాస్కరుని బలరామన్న

చూ. రాళ్ళబండి పట్టాభిరామ కవి.

స్థలం : గుంటూరు జిల్లా-సరికొండపాలెం అగ్రహారం.

గొప్పదాత. పట్టాభిరామ భట్టు అనే కవి ఈయన దగ్గరకు యాచనకు వెళ్ళే

నాటికి చాలా పేద స్థితిలో ఉన్నాడట. తన శిరోవేష్టనం తీసి భట్టుకు సమర్పించాడు. ఆయన వితరణ శీలతను పొగడుతూ పట్టాభిరామ కవి పద్యం చెప్పాడు. (చా. ప.ర.)

**భీమఖండము**

నామాంతరం : భీమేశ్వర పురాణము (చూ).
కర్త : శ్రీనాథుడు.

**భీమన**

నామాంతరం : కొరవి సత్య నారన (చూ).

**భీమన ఏలూరు శాసనము**

కాలం : క్రీ. శ. 1199 ప్రాంతం.
శాసన ప్రదాత : భీమన.
శాసన ప్రదేశం : పశ్చిమ గోదావరి జిల్లా – ఏలూరు.
ప్రస్తావిత స్థలం : సరసీపురం సోమేశ్వరాలయం.

శాసన విషయం : శ్రీధరునకు – కొసనాంబకు పుత్రుడైన భీమన సరసీపురం (కొలని) సోమేశ్వరస్వామికి అఖండ దీపం నిలిపినట్లు ఈ శాసనం వల్ల తెలుస్తున్నది ఈ శాసనం ఏలూరు మసీదులోని ఒక రాతి స్తంభం మీద చెక్కి ఉంది. శాసనంలో ఒక పద్యం మాత్రమే ఉంది (తె.క.చ–310 b)

**భీమన కొండన పాములపాడు శాసనము**

కాలం : క్రీ శ. 1172 ప్రాంతం.
శాసన ప్రదాత : భీమన కొండన.
ప్రస్తావిత స్థలం : గుంటూరు తాలూకా – పాములపాడు గ్రామం.

శాసన విషయం : ఈ శాసనం పాములపాడులో వేంచేసియున్న మల్లికార్జున స్వామి వార ఆలయానికి ఎదుట ఉన్న నంది నాగ స్తంభం మీద చెక్కి ఉంది. భీమన కొండన, తన తల్లిదండ్రులకు పుణ్యాలోకాలు సంప్రాప్తించటం కోసం, మల్లికార్జునస్వామికి అఖండ దీపం నిలిపినట్లు ఈ శాసనం వల్ల తెలుస్తున్నది. దీనిలో ఒక ఉత్పలమాల, ఒక కంద పద్యం ఉన్నాయి. (తె.క.చ–308–c)

**భీమన ప్రెగ్గడ**

కాలం : క్రీ.శ. 11 వ శతాబ్దం.
రచించిన శాసనాలు : 1. సోమలదేవి ద్రాక్షారామశాసనం (1065).
2. రాజమహేంద్రవర మార్కండేయేశ్వర స్వామికి దీపదాన శాసనం (1072).

శాసనకర్త. ఈయన రాజరాజ నరేంద్రుని సవతి సోదరుడైన విజయాదిత్యునికి మంత్రి. నన్నయభట్టు కుమారుడని కొందరు ఊహిస్తున్నారు. (తె క.చ–163)

**భీమన్న**

కాలం : క్రీ శ. 16 వ శతాబ్దం.

రచన : దశావతార పద్యము.

విశిష్టత : ఈయన వ్రాసిన పద్యాన్ని 'భీమకవి దశావతార పద్యం' అని అజ్ఞాత గ్రంథ సంధాత ఉదాహరించాడు. ఇదే పద్యాన్ని కంచిరాజు సూరయ్య వ్రాసిన 'కన్నప్ప చరిత్ర' లోనిదని భావించి పెదపాటి జగ్గన్న 'ప్రబంధ రత్నాకరం'లో ఉదాహరించాడు. ఈ సంకలనకర్త లిద్దరిలో ఎవరు పొరబడ్డారో తెలియదు. తెలుగు సాహిత్యంలో దశావతార పద్యాలను వ్రాయటం, నందితిమ్మన్న పారిజాతాపహరణంలో మొదలు పెట్టాడు. శ్రీకృష్ణదేవరాయలు, పెద్దన, తెనాలి రామకృష్ణుడు దశావతార పద్యాలను వ్రాశారు. కాబట్టి ఈ భీమన్న ప్రబంధ కవులకు సమకాలికుడని చెప్పవచ్చు. భీమన్న అనగానే తెలుగు సాహిత్యంలో వేములవాడ భీమకవి గుర్తుకు వస్తాడు. కాని, ఈ దశావతార పద్యకర్త వేములవాడ కవి కాడు. ఈ భీమన్న భిన్నుడు. (ఆరుద్ర-9)

**భీమన్న దశావతార పద్యము**

కర్త : చూ. భీమన్న.

**భీమయ పండని చేబ్రోలు శాసనము**

కాలం : క్రీ. శ. 1145 ప్రాంతం.

శాసన ప్రదాత, రచయిత : భీమయ పండడు.

ప్రస్తావిత స్థలం : గుంటూరు జిల్లాలోని చేబ్రోలు

శాసన విషయం : దీనిలో పేర్కొనబడిన భీమయ పండడు ప్రశస్త కవి. మార్గదేశి కవితా పద్ధతులను తెలుపుతూ తెలుగు కవిత చెప్పిన పండయ కృతులు దొరకటంలేదు. ఈ శాసనంలోని పద్యాలలో ఈతని వంశీయుల వర్ణనముంది చేబ్రోలులో వేంచేసియున్న మహాసేనునకు (కుమారస్వామికి), తన తండ్రి భీమరాజుకు ధర్మార్థంగా అఖండదీపం నిలిపాడు. దీనిలో 1 శార్దూలం, 1 స్రగ్ధర, 2 ఉత్పలమాలలు, 2 చంపకమాలలు, 1 మత్తేభం, చివర గద్య ఉన్నాయి (తె.క.చ-242-244)

**భీమవిక్రమము**

కర్త : చూ. గండు సోమనాథ శాస్త్రి.

దశవిధ రూపకాలల్లో ఒకటైన వ్యాయోగము. (ఆం.సం.సా-523)

**భీమసింగి కవి రాజు**

కాలం : క్రీ.శ. 1794 కు పూర్వం.

స్థలం : భీమసింగి.

రచన : రాణీ రాజ విలాసము.

ఈ కవి అసలు పేరు తెలియరాలేదు. భీమసింగి ప్రాంతానికి చెందినవాడై ఉంటాడని పండితులు భావిస్తున్నారు. భీమసింగి విశాఖమండలంలోని శృంగవరపు కోట తాలూకాలోనిది. కావ్యంలో కవి జంపన విజయరామ భూపతి, జంపన అప్పలరాజులను పేర్కొన్నాడు. వీరు 1794 లో జరిగిన పద్మనాభ యుద్ధంలో పాల్గొన్న వీరులు.

ఇతని కావ్యంలో హిందీ భాష అక్కడక్కడా ఉంది. హిందూస్థానీ పదములు, టప్పాలు వాడాడు. (య.వా.చ-60)

భీమసేన విజయము

కర్త : అక్కయ.
అంకితం : తిరుమల వేంకటేశ్వరునికి.

దృశ్యకావ్యం. తిక్కన విరాటపర్వం ఆధారంగా రచితం ఉదాత్తమైన రచన.
(య.గా.సం-Vol-4) (ఆరుద్ర-12-164)

భీమసేన విజయము (అలభ్యం)

కవి : ఏనుగు లక్ష్మణకవి (చూ).

ఏనుగు లక్ష్మణకవి గ్రంథాలనుండి ఈ కృతి రచనా వృత్తాంతం తెలుస్తున్నది.

భీమేశ్వర పురాణము

నామాంతరం : భీమఖండము.
కర్త : శ్రీనాథుడు.
రచనాకాలం : క్రీ. శ. 1430 ప్రాంతం.
కృతిభర్త : బెండపూడి అన్నయ మంత్రి.

ఆరు ఆశ్వాసాల కావ్యం. ద్రాక్షారామ భీమేశ్వరుని మహిమలు కవి ఇందులో వర్ణించాడు. స్కాందపురాణంలోని గోదావరీ ఖండానికి ఇది అతి స్వతంత్రానువాదం. శివ పురాణంలోని కథలు ఎక్కువ. వ్యాసుని యాత్రలో మజిలీల వర్ణన ఎక్కువ. దక్షారామం విశిష్టత, వ్యాస నిష్కాసన ఘట్టం బాగా ఉంటాయి. అగస్త్యుడు, వ్యాసుడు, గోదావరి మండలం పర్యటించేట్లు చేసి, కవి వారిని దక్షారామంలో ప్రవేశపెడతాడు. క్షీరసాగర మథనం, హాలాహల భక్షణం ఇందులో ఉన్నాయి. (ఆరుద్ర-4)

భువన విజయము

కాలం : క్రీ. శ. 16 వ శతాబ్ది.

శ్రీకృష్ణ దేవరాయల సభాభవనానికి భువన విజయమని పేరు. దీనిలో ఎనిమిది దిక్కులలో ఎనిమిది మంది కవులు ఆసీనులయ్యేవారని, వారికి అష్టదిగ్గజాలని పేరని సాహితీవేత్తలు భావిస్తున్నారు. వీరిలో సంస్కృత కన్నడ కవులు కూడా ఉండేవారనే విషయంలో పండితులమధ్య భేదాభిప్రాయాలున్నాయి.

అల్లసాని పెద్దన, నంది తిమ్మన, అయ్యలరాజు రామభద్రుడు, ధూర్జటి, మాదయగారి మల్లన అనే అయిదుగురు కవులు రాయలకు సమకాలికులై భువన విజయంలో ఆసీనులై ఉండటం సర్వసమ్మతమైన విషయం. తెనాలి రామకృష్ణుడు, భట్టుమూర్తి, పింగళి సూరన అష్టదిగ్గజాలలో ఉన్నారని బలమైన ప్రతీతి ఉంది. కాని చారిత్రకంగా వారి కాలాలు వేరనీ, వారు రాయల అనంతరకాలం వారనీ తెలుస్తున్నది. వీరి స్థానంలో ముగ్గురు సంస్కృత కన్నడ కవులు ఆ సభలో ఉన్నారని అంటారు. ఎనిమిదో

కవి దిగ్గజంగా కందుకూరి రుద్రకవి ఈశాన్య దిక్సింహాసనస్థుడై ఉన్నాడనటానికి ఆధారాలున్నాయి. రుద్రకవి తాను రాయల సన్నిధిలో హర్షంబందినట్లు చెప్పుకొన్నాడు. ఇతడు పెద్దన, తిమ్మన, తాతాచార్యులు మొదలగు వారితో వాదించినట్లు, మంగలి కొండోజు సాయంతో రాయల ఆస్థానంలో చేరినట్లు తెలుస్తున్నది. కాబట్టి అష్టదిగ్గజాలలో ఎనిమిదో కవిదిగ్గజంగా కందుకూరి రుద్రకవి ఉన్నాడని నిశ్చయంగా చెప్పవచ్చు. అష్టదిగ్గజాలపేర్ల విషయంలో భిన్నాభిప్రాయాలున్నా, రాయల సాహిత్యగోష్ఠులన్నీ ప్రసిద్ధమైన ఈ "భువన విజయ"ంలోనే జరిగినట్లు కవి పండిత విమర్శకులందరూ అంగీకరించారు (తె.వి స-6-752)

## భూఖగోళదీపిక

రచనాకాలం : క్రీ. శ. 1843 ప్రాంతం.

కర్త : వైద్యనాథ సిద్ధాంతి.

వచన గ్రంథం. ఇది జ్యోతిశ్శాస్త్రంలో వివరించబడిన భూగోళ ఖగోళ విషయాలను, శ్రుతి స్మృతీతిహాస పురాణాదుల నుంచి సప్రమాణ గ్రంథాలలో చెప్పబడిన బ్రహ్మాండ విషయాలను, సకల జనోపయుక్తంగా తెలియజేస్తున్నది. ముద్రితం.

(వ వా-67)

## భూతపురీ మాహాత్మ్యము (అసమగ్రం)

రచనాకాలం : క్రీ. శ. 19వ శతాబ్దం.

కర్త : కరాలపాటి రంగయ్యకవి.

పద్యకావ్యం. కవి మూడాశ్వాసాలు మాత్రం పూర్తిగా రచించాడు. అతడు మరణించడంతో గ్రంథం అసంపూర్తిగా మిగిలిపోయింది. రచన సుందరంగా ఉంది.

(వీరేశలింగం పంతులు – సమగ్ర పరిశీలన)

## భూభ్రమణ భ్రాంతి నిరసనము

కర్త : చూ. సింగంపల్లి నరసింహ సిద్ధాంతి.

జ్యోతిశ్శాస్త్ర సంబంధమైన రచన. (అం. సం. సా.)

## భూమిక

చూ. అవతారిక.

కావ్యారంభంలో చేసే రచన. భూమిక అంటే అంతస్తు – ఉన్నత ప్రదేశం – దీని నధిష్ఠించిన వారికి క్రింది వస్తువులు స్పష్టంగా గోచరిస్తాయి. అలాగే కావ్యారంభంలో ఉండే ఈ భూమిక చదివితే కావ్యవిషయం గోచరిస్తుంది. పీఠిక కూడా ఇలాంటిదే.

(కావ్యాలంకార సంగ్రహం)

## భూమినాథ కవి

నామాంతరం : నల్ల దీక్షితుడు (చూ.).

## భూరమాదేవి శాసనము

కాలం : క్రీ.శ. 12 శతాబ్ది.

శాసనం వేయించినవారు : భూరమాదేవి.

శాసన విషయం : దీనిలో చతుర్థ కులజులైన ధనంజయుడు, వేతరాజు, గండభూపతి, ముమ్మడి భీముడు మొదలయినవారి వర్ణనముంది. వీరు వెలనాటి చోడ భూపతులు కావచ్చు. భూరమాదేవి గండభూపతి అర్ధాంగి. శాసన పద్యాలలోని విష యాలు అస్పష్టంగా ఉండటంవల్ల ఈమె ఏ దానాలు చేసిందో చెప్పలేము. దీనిలో రెండు చంపకమాలలు, ఒక ఉత్పలమాల, నాలుగు కంద పద్యాలు ఉన్నాయి.

(తె.క.చ-279, 280)

**భూరిగుణజాల శతకము**

రచనాకాలం : క్రీ.శ. 1850 ప్రాంతం కావచ్చు.

కర్త : మాటూరి వెంకటప్పయ్య.

ఈ శతకం ముద్రితం.

**భూషణార్థి**

సప్తవిధ కవులలో ఒకడు. ప్రతి పద్యం అలంకార యుక్తంగా రచించే కవి (అప్పకవీయం-26)

**భృంగపంచకమ్ (సం)**

నామాంతరం : తుక్కాపంచకము.

కవయిత్రి : తుక్కాదేవి.

**భృంగ సందేశమ్ (సం)**

కవయిత్రి : త్రివేణి.

ఇది వియోగ శృంగార రసాత్మకమైన సందేశ కావ్యం. దీని వ్రాత ప్రతి తంజావూరు సరస్వతీ మహల్‌లో ఉంది. (అ.భా. కవయిత్రులు)

**భృంగిస్తవము (అలభ్యం)**

రచనాకాలం : క్రీ.శ. 1150 ప్రాంతం.

కర్త : మల్లికార్జున పండితుడు.

**భృగుపాతము**

నామాంతరం : కనుమారి.

భక్తుడు శివైక్యం పొందటానికి కొండకొననుంచి దూకి చనిపోవటమే భృగుపాతం. దీనినే తెలుగులో "కనుమారి" అంటారని పండితులు కొందరు నిర్ధా రించారు. పాల్కురికి సోమన్న పండితారాధ్య చరిత్రలోను, నాచన సోముని ఉత్తర హరి వంశంలోను, తిక్కన భారత శాంతి పర్వంలోనూ ఈ "కనుమారి" ప్రసక్తి స్పష్టంగా ఉంది

శ్రీశైలం మీద కర్మారీశ్వరం అనే ఒక పుణ్య స్థలముందని, అది కొండ కొన కొమ్ము అనీ, అక్కడ నుంచి భక్తులు పుణ్యలోక ప్రాప్తి కోసం నేలమీదకు దూకి ప్రాణ త్యాగం చేస్తారని చెప్తారు. ముఖ్యంగా శివరాత్రినాడు అక్కడ చాలా మంది

భక్తులు ప్రాణత్యాగం చేస్తుంటారట. పండితారాధ్య చరిత్రలో బల్లహుడనే రాజు, తన భార్యతోపాటు మల్లికార్జునస్వామిని ధ్యానిస్తూ కొండ కొననుంచి పడి శివైక్యం పొందాడని ఉంది. 'కర్మారి' పదమే తెలుగులో "కనుమారి" అయిందని పండితులు తేల్చిన సారాంశం. కనుచుండగనే మారికి (చావుకు) బలికావటాన్ని "కనుమారి" అనటం స్పష్టం.

నాలుకలు కోసుకొని, చేతులు నరుక్కొని, చన్నులు కోసుకొని, తలలు నరుక్కొని, తనువులను అర్పించే వీరశైవులున్నప్పుడు కొండ కొన నుంచి దూకి చని పోయి శివైక్యం పొందే భక్తులున్నారనుకోవటం అసంగతం కాదు.

కాకతీయుల కాలం నాటికే ఇది ప్రసిద్ధమైన ఆత్మబలి దానంగా తిక్కన, నాచన సోమన, పాల్కురికి సోమనలు చెప్పారు. పింగళి సూరన్న "కళాపూర్ణోదయం"లో అభినవ కౌముది శల్యాసురుని చంపించటానికి కత్తితో పరుగెత్తే సమయంలో మణి కంధరుడు భృగుపాతం చేయటానికి సిద్ధంగా ఉన్నాడనేది కూడా పై విషయాలకు ఉపబలకంగా ఉంది. (ఆం.సాం.చ-114-116)

## భైమీ పరిణయమ్ (సం)

కర్త : రత్నఖేట శ్రీనివాస దీక్షితుడు.

నాటకం.

## భైరంపల్లి తిరుమలరాయకవి

కాలం : క్రీ.శ. 19 వ శతాబ్దం.

స్థలం : గద్వాల.

చాటుకవి. సంస్కృతాంధ్రాలలో అశువుగా కవిత చెప్పిన సమర్థుడు.

## భైరవకవి

కాలం : క్రీ.శ. 1410-1480 ప్రాంతం కావచ్చు.

రచనలు : 1. శ్రీరంగమాహాత్మ్యము 2. రత్నశాస్త్రము 3. కవిరాజ గజాంకుశము.

విశిష్టత : ప్రముఖ తెలుగు కవి గౌరన పుత్రుడు. ఈ కవి వ్రాసిన శ్రీరంగ మాహాత్మ్యాన్ని చూసి చాలా మంది తెలుగు కవులు అదే పేరుతో గ్రంథాలను వ్రాశారు. ఇతని కవిత్వం ప్రౌఢంగా, రమ్యంగా ఉంటుంది. ఇతనిని పోతరాజు భైరవునిగా కొందరు పేర్కొన్నారు. (కత-5-235; వా.చ; వం.సు-73)

## భైరవ తంత్రము

కాలం : క్రీ.శ. 11-15 శతాబ్దాల మధ్యకాలం.

పూర్తి వివరాలకు చూ. - భైరవీచక్రము.

## భైరవమూర్తి ముళువాగళు రాజు

కాలం : క్రీ. శ. 1700 ప్రాంతం.

స్థలం : మైసూరు (భైరవకూరు ప్రాంతం).

సాహిత్య పోషకుడు. కోడూరు వేంకటాచల కవిచేత స్కాంద పురాణంలోని శివరహస్య ఖండాన్ని తెనిగింపచేసి అంకితం పొందాడు.

ఇతని నివాసస్థలాన్ని బట్టి ఇంటిపేరు భైరవకూరు అని, భైరవమూరు అని, భైరకూరు అనీ భిన్నాభిప్రాయాలున్నాయి. (అరుద్ర-12-84; ద.దే.వా-490)

## భైరవీచక్రము

నామాంతరం : యోగినీ చక్రము, చక్రపూజ, భైరవతంత్రము, కులాచారము.

కాలం : క్రీ. శ. 11-15 శతాబ్దాల మధ్యకాలంలో ప్రచారంలో ఉంది.

తాంత్రిక మతంలో భైరవీచక్రము ఒక తాంత్రిక ప్రక్రియ. కాకతీయ - రెడ్డి - వెలమ రాజుల కాలంలో ఇది బహుళ ప్రచారంలో ఉన్నట్లు - అప్పటి సాహిత్యంవల్ల తెలుస్తున్నది. ఇది ఒకరకమైన శక్తి పూజా విధానం. ఈ పూజ ముగ్గులమధ్య ప్రధానంగా కేంద్రీకృతమై ఉంటుంది. ఈ ముగ్గుల పరిధిలోని కులాచారు లందరూ - తాంత్రిక మతాచారం ప్రకారం మద్యం సేవిస్తూ, మాంసమత్స్యాదులను భక్షిస్తూ, మైథునం నిర్వహిస్తూ, వేయించిన ధాన్యపు భోజనాన్ని భుజిస్తూ, పరమ జుగుప్సాకరంగా ప్రవర్తిస్తూ ఉండేవారు. ఈ చక్రపూజలో నిర్వహించే పై అయిదు కార్యాలనే "పంచమకారాలు" అంటారు. ఈ రకమైన శక్తి పూజ చేసేవారిని కులాచారులని, ఈ ఆచారాన్ని "కులాచారము" అనీ అంటారు. (తెలుగు-ఏ-జూ-77)

## భైరవుని గుడి

నామాంతరం : చంపుడుగుడి (చూ)

## భోగనాథుడు

కాలం : క్రీ శ. 14 వ శతాబ్దం.

రచనలు : 1. బిట్రగుంట ప్రశస్తి (సం) 2. రామోల్లాసమ్ (సం) 3. త్రిపుర విజయమ్ (సం) 4. శృంగార మంజరి (సం) 5. ఉదాహరణ మాల (సం) 6. మహాగణపతి స్తవమ్ (సం) 7. గౌరీనాథాష్టకమ్ (సం).

ఇతడు మాధవ, సాయణాచార్యులకు తమ్ముడు. కంపరాయల కుమారుడైన ద్వితీయ సంగమ భూపాలునికి నర్మసచివుడు ప్రతిభావ్యుత్పత్తులు దండిగా ఉన్న మహాకవి. ఈతని కవిత కావ్యవిదులకు ఉపదేశకమట. పదబంధ చమత్కారం, శ్రుతిహిత వివేచనం, అర్థగౌరవం మొదలయిన సాహితీ విశేషాలు ఈతని కవితలో ఉన్నాయి. (తె వి.స-4)

## భోగనృపాలుడు

కాలం : క్రీ.శ. 17 వ శతాబ్దం.

సాహిత్య పోషకుడు. గంగకవి రచించిన శతముఖ రామాయణం (నాలుగో ఆశ్వాసాన్ని) అంకితం పొందాడు. ఈ రామాయణానికి సీతా విజయమని నామాంతరం ఉంది.

## భోగావతీ ద్విపద

కర్త : తెలియదు.

ద్విపద రచన. భోగావతి సౌందర్య వర్ణన, నాయక వృత్తాంతం, విరహవర్ణన ఉన్నాయి. కృత్యాదిని శివస్తుతి ఉంది. రచనాధోరణి తమిళంలోని "ఉలా" ప్రబంధం వలె ఉంది. దక్షిణ దేశీయాంధ్రవాఙ్మయానికి చెందిన రచన కావచ్చును. దీని ప్రతి మదరాసులో ఉంది. (ద్వి.సా.చ. 437)

## భోగినీ దండకము

రచనాకాలం : క్రీ.శ. 1384-99 ప్రాంతం.

కర్త : బమ్మెర పోతన (చూ).

ప్రత్యేకత : సర్వజ్ఞ సింగ భూపాలుని వేశ్యను నుతిస్తూన్న దండకం ఇది. పోతన యౌవనంలో దీనిని రచించాడట. కవి మొదట ఈ రాజు ఆస్థానంలో ఉన్నాడనీ, తరవాత రాజును ఏవగించుకొని, భక్తిభావం పెంపొందించుకొని అతని కొలువు విడిచాడనీ అంటారు. ఈ దండకాన్ని పోతన వ్రాయలేదనేవారు కూడా ఉన్నారు. (రె.రా.చ)

## భోజకన్యా పరిణయము

రచనా కాలం : క్రీ.శ. 17వ శతాబ్దం చివరి భాగం.

కర్త : కోటీశ్వర కవి.

ఐదాశ్వాసాల ప్రబంధం. ప్రౌఢమైన రచన. రుక్మిణీ కృష్ణుల వివాహ గాథ వర్ణితం.

## భోజరాజీయము

రచనాకాలం : క్రీ.శ. 15వ శతాబ్ది.

కర్త : అనంతామాత్యుడు.

అంకితం : అహోబిల నరసింహస్వామికి.

ప్రత్యేకత : ఏడాశ్వాసాల కథాకావ్యం. ధారా నగరాధిపతియైన భోజరాజుకు సంబంధించిన ఆసక్తికరమైన కథలున్నాయి. కథ చారిత్రకం కాదు. కల్పితం. కథలలో ధర్మబోధ ప్రధానంగా ఉంది. పసిబాలుర హృదయాలకు హత్తుకొనేటట్లు కవి వీటిని వ్రాశాడు. తెలుగు సామెతల సమయోచిత ప్రయోగం, సుదీర్ఘ వర్ణనలు ఇందులోని ప్రత్యేకతలు. (రె.రా.చ)

## భోసల కోసలీయమ్ (సం)

కర్త : వివర్తి శేషాచల (పతి) కవి.

అంకితం : శాహమహారాజుకు (1684-1712).

మహారాష్ట్రరాజుల వంశచరిత్రను సవిస్తరంగా వర్ణిస్తున్న గ్రంథం.

**భ్రమరగీత (అలభ్యం)**

రచనాకాలం : క్రీ.శ. 17 వ శతాబ్దం.
కర్త : విజయ రాఘవనాయకుడు.

ఏవ కవితాశాఖకు చెందిన రచన. (ద.దే.వా_89)

**భ్రమరగీతము**

కర్త : తెలియదు.

జానపద పౌరాణిక గేయం.

చూ. పౌరాణిక గేయములు.

**భ్రమరగీతి ప్రబంధము (అలభ్యం)**

రచనాకాలం : క్రీ శ. 1600 ప్రాంతం.
కర్త : ఎలకూచి బాలసరస్వతి.

ఇది ప్రబంధమట. (క.త_11)

**భ్రమరాంబికా సంవాదము**

కర్త : చూ: పాపాశాస్త్రి.

విశేషాలు తెలియవు. (ఆం. సం. సా.)

**మంగళగిరి ఆనందకవి**

కాలం : క్రీ. శ. 18వ శతాబ్దం.
జన్మస్థలం : కృష్ణా మండలం.
రచనలు : 1. విజయనందన విలాసము(శశిరేఖాపరిణయము) 2. వేదాంత రసాయనము.

తిమ్మయామాత్యుని పుత్రుడు. లాక్షణికాగ్రగణ్యుడైన ప్రబంధ కవి. ఈతని కవిత్వం మృదుమధురమై అనర్గళధారతో రమణీయంగా ఉంటుంది. ఈ కవి రెండవ రచనలోని ఇతివృత్తం ఏసుక్రీస్తు చరిత్ర. అప్పటికి ఇతడు క్రైస్తవ మతం స్వీకరించాడేమోనని విమర్శకులు ఊహిస్తున్నారు మార్కు, మత్తయి, లూకా సువార్తలను గ్రీకు భాషనుండి అనువదించడంలో పాశ్చాత్య విద్వాంసులకు తోడ్పడ్డాడట. ఆనందరాయరౌగా ప్రసిద్ధుడు. (క.చ_78; క. త_13_81)

**మంగళగిరి విలాసము (అలభ్యం)**

కర్త : బొడ్డపాటి పేరయ్య,

పెదపాటి జగన్న తన "ప్రబంధరత్నాకరం"లో దీనినుంచి ఒకపద్యాన్ని ఉదాహరించాడు. (అరుద్ర_9)

**మంగళము**

నామాంతరాలు: హారతి, ఆరతి, ఆరాత్రికము, షష్ఠ్యంతము, నివాళి, ధవళము (చూ).

గీత ప్రబంధం. వివిధ గీతులతో నీరాజన ప్రయోజవ పురస్సరమైన ఈ గీతం

బహు యక్షగానాలలో ప్రయుక్తం. సాధారణంగా షష్ఠ్యంతంగాను, పాదాద్యంతాల మంగళ శబ్ద పురస్సరంగాను ఉంటుంది.

సంగీత రత్నాకరం ప్రకారం ఇది ఒక గీత ప్రబంధం. సాధారణంగా గ్రంథాంతాలలో ఉంటుంది శహాజీ ప్రభృతుల యక్షగానాలలో ఇది గ్రంథాదిలో ఉంది.

దీనిని తమిళంలో కోడై మంగళమంటారు. దక్షిణ దేశంలో హరికథా కాల క్షేపాలు, భాగవత మేళ నాటకాలు, భజన కూటాలు దీనితోనే ప్రారంభమవుతాయి. తాళ్ళపాక వారి కీర్తనలలో కూడా ఇది ఉంది (య. వా. చ-338-39)

**మంగా దుష్పాంసులా విలాసము**

రచన : బుచ్చాలి గోపాలయ్య.

అంకితం : విరూపాక్ష దేవునికి.

మంజరీ ద్విపదలో నడచిన కావ్యం. ఆనెగొంది చిన వెంగమరాజు ప్రోత్సాహంతో చేయబడ్డ రచన. అశ్లీలంగాను, జుగుప్సాకరంగాను ఉన్నది. మధురనేలిన రాణి మంగమ్మ మీది ద్వేషంతో ఈ కావ్యం సంతరించారని పరిశోధకుల తలంపు. ఇదే కావ్యాన్ని పద్యకావ్యంగా కూడా కవి రాశాడు (చూ."మధుర మంగాపుంశ్చలీ విలాసము). (ఆరుద్ర-12-86)

**మంగిపూడి వారు**

"పూడి" శబ్దం చివరలో ఉండి, గ్రామ నామంతో ఉన్న ఇంటిపేరు. కూచిపూడి, ద్వారపూడి మొ॥ ఇలాంటివి. (భారతి-మార్చి-45-228)

**మంచన**

కాలం : క్రీ.శ. 1182 - 1208 ప్రాంతం.

స్థలం : చందవోలు.

రచన : కేయూర బాహు చరిత్రము.

కవి కాలాన్ని గురించి భిన్నాభిప్రాయాలున్నాయి. ఈతడు "సకల కవి జన విధేయ మంచన నామధేయ" అని వినయంతో చెప్పుకొన్నాడు. "బాల రసాలసాల" అనే ప్రసిద్ధమైన పద్యాన్ని పోతనకంటె సుమారు 150 ఏళ్ళ ముందుగా ఇతడు చెప్పాడని పండితాభిప్రాయం. సంస్కృతంలో రాజశేఖరకవి వ్రాసిన "విద్ధసాల భంజిక" దృశ్యకావ్యం ఇతని కేయూరబాహు చరిత్రకు మూలం. మధ్య, మధ్య బోలెడు కథలు చేర్చాడు. పంచతంత్రంలోని కథలను బాగా వాడుకున్నాడు. ఇతనిది ప్రౌఢమై రస వంతమైన శైలి. (ఆరుద్ర-2)

**మంచన గళ వచనము (కన్నడం)**

కవి : శివలెంక మంచన.

శివభక్తి ప్రతిపాదకమైన వచన గ్రంథం. (తె.వి.స-4)

**మంచెళ్ళ కృష్ణకవి**

కాలం : క్రీ. శ. 1700-1800 మధ్యకాలం.

ఆస్థానం : వెలుగోటి వారి ఆస్థానం.

రచనలు : 1 వేంకట నగాధిప శతకము (వేంకటనాథ శతకము) 2. పూరుష ముఖ్య శతకము 3. రంగ శతకము 4 రఘుపుంగవ శతకము (అలభ్యం) 5. వరదరాజ శతకము (కృష్ణ శతకము) 6. కృష్ణ శృంగార కథావళి.

పాపయమంత్రి, లక్ష్మమ్మల కుమారుడు. హృదయంగమంగా రచన చేసిన కవి. తండ్రిపేరు 'బాలయ' అని కొన్ని ప్రతులలో ఉన్నది. ఇతని కృష్ణశతకం వరదరాజ శతకమనే పేర ముద్రితం ఈ కవిని బాలకృష్ణ కవిగా కొందరు పేర్కొన్నారు, తెలుగు శతక కవులలో ఇతనికి ప్రత్యేకస్థానం ఉంది ఈయన వెలుగోటి వారిమీద చాలా చాటువులు చెప్పాడు. వెలుగోటివారు వేంకటగిరి ప్రభువులు. ఈ కవిమీద కూడా కొన్ని చాటువులున్నాయి. ఇతడు కొమ్మూలపాటి ఓబన కవికి సవ్యాఖ్యాన వసుచరిత్రం పంపుతానని మాట ఇచ్చి, మూల గ్రంథాన్ని మాత్రమే పంపాడట. ఓబన కవి నిరాశచెంది ఇతన్ని ఒక పద్యంలో తిట్టాడు (శ.క.చ-574 98, 748 ; చా.ప.ర)

**మంజరి**

ద్విపద రచనా విశేషం. ప్రాసనియతి లేకపోవటం మాత్రమే దీనికి ద్విపదతో గల భేదం. ఇదికాక మంజరి పేరనే మరొక రచనా విశేషం యక్షగానాలలో అతి విరళంగా ప్రయుక్తమైంది ఇది ఏకతాళి నడకతో ఉంటుంది పాదానికి 16 + 12 మాత్రలుంటాయి. యతిస్థానం 17వ మాత్రాస్థానం. ప్రాస, అంత్యప్రాసలు విహితాలు. కొన్ని చోట్ల ప్రాసయతి కూడా ఉంటుంది. (య.వా.చ-259)

**మంజరి**

శ్రవ్య కావ్యభేదం. తెలుగులో నరసభూపాలీయంలో దీని లక్షణముంది. సాహిత్య దర్పణాదులలో దీని లక్షణం కనిపించదు.

స్త్రీల శృంగారము, విరహము, వసంత మన్మథాదుల విజృంభణ, సరఃకేళి, వనకేళి మొ॥ వాటి వర్ణనలే మంజరి. (తె.వి.స-6)

**మంజరీ ద్విపద ప్రబంధ నాటకము (అలభ్యం)**

రచనాకాలం : క్రీ. శ. 17వ శతాబ్దం.

కర్త : విజయ రాఘవనాయకుడు.

ఇది మంజరీ ద్విపద ప్రబంధమట. (ద.దే వా-88)

**మంజుల నైషధము**

కర్త : పరవస్తు వేంకట రంగాచార్యులు.

నైషధానికి అనుసరణ ప్రాయమైన కావ్యం. రచన రసవంతంగా సరళంగా ఉంది.

**మంజువాణి**

రామరాజభూషణుని వసుచరిత్రలోని పాత్ర. వసుచరిత్ర ఆంధ్ర పంచ కావ్యాలలో ఒకటి.

మంజువాణి గిరికకు చెలికత్తె. చతురురాలు. గిరిక విరహార్తగా ఉన్న సమయంలో వసురాజు చెంతకేగి, ఆయన సంగతి గ్రహించి- గిరిక పరిస్థితి తెలిపి, రాజు ఇచ్చిన అంగుళీయకాన్నితెచ్చి సఖికి ఆనందాన్ని కలిగించింది. తాను చేసిన ప్రయాణాన్ని చక్కగా వర్ణించినది. మంజువాణి, వసురాజు అంతఃపురంలోని రత్నాల బొమ్మలలో ఒక బొమ్మగా నిలుచుండి బొమ్మ మాట్లాడినట్లుగా రాజుతో మాట్లాడడం, గిరిక పంపున తెచ్చిన హారాన్ని రాజుపై విసరడం, అతి రమణీయమైన ఘట్టాలు. ఇంద్రుడే కోలాహలుని అడిగి వసురాజుతో గిరికా వివాహం జరుపుననే వార్తను గిరిక కెరుకపరచి ఆనందింప చేసిన స్నేహశీలి. ఈ పాత్రను చాతుర్యంలో భవభూతి రచించిన మాలతీ మాధవములోని కామందకి పాత్రతో పోల్చవచ్చును.

**మండ కామేశ్వర కవి**

నామాంతరాలు : మండ చిట్టికామశాస్త్రి. మండ నరహరికామయ్య.

కాలం : క్రీ. శ. 1824-1892.

స్థలం : విజయనగర సంస్థానం.

రచనలు : 1. తులసీరామాయణము 2. కూర్మపురాణము 3. మార్కండేయ పురాణము 4 రామకథాసార సంగ్రహము 5. ఆంధ్రమన్వర్థదీపిక 6 వరాహపురాణము 7. మత్స్యపురాణము 8. వాసంతికాస్వప్నము 9. దేవీలీలా తరంగిణీ 10 గరుడ పురాణము మొదలగునవి.

విజయనగరం సంస్థానాధిపతి అయిన విజయరామ గజపతి కాలంలోను, ఆనంద గజపతి మహారాజు కాలంలోను ఈ కవి వారి ఆస్థాన విద్వాంసుడుగా ప్రఖ్యాతి గాంచినాడు. తులసీరామాయణం విజయరామ గజపతి ఆజ్ఞమేరకు వ్రాశాడట. తక్కిన రచనలన్నీ ఆనంద గజపతి కాలంలోనివి. 'కూర్మపురాణము' మాత్రం విజయరామ గజపతికి అంకితం. ఇతని రచనల్లో ఎక్కువగా ఆంధ్రీకృత గ్రంథాలే కవిపిస్తున్నాయి.
(ఆం.సం.సా-428-429)

**మండ చిట్టి కామశాస్త్రి**

నామాంతరం : మండ కామేశ్వరకవి.

**మండనకొమ్మన పాములపాడు శాసనము**

కాలం : క్రీ. శ. 1172 ప్రాంతం.

శాసన ప్రదాత : మండన కొమ్మన.

ప్రస్తావిత స్థలం: గుంటూరు తాలూకా - పాములపాడు గ్రామం.

శాసన విషయం : ఈ శాసనం పాములపాడులో వేంచేసియున్న మల్లికార్జున స్వామివారి ఆలయానికి ఎదుట ఉన్న నంది నాగస్తంభం మీద చెక్కి ఉంది. మండన కొమ్మన, తన తల్లిదండ్రులకు ధర్మార్థంగా మల్లికార్జునస్వామివారికి అఖండ దీపం నిలిపినట్లు ఈ శాసనం వల్ల తెలుస్తున్నది. దీనిలో ఒక ఉత్పలమాల, ఒక కందపద్యం ఉన్నాయి. (తె.క.చ-308)

## మండ నరసింహకవి

కాలం : క్రీ.శ. 17 వ శతాబ్దం.

రచన : ఆంధ్రకౌముది.

విద్వత్కవి. ఇతన్ని గురించిన వివరాలు తెలియరాలేదు. (తె.వి.స-4)

## మండ నరహరి కామయ్య

నామాంతరం : మండ కామేశ్వరకవి.

## మండపాక కవులు

బొబ్బిలి సంస్థానాన్ని ఆశ్రయించిన కుటుంబాలలో మండపాకవారి వంశం చాలా ప్రసిద్ధి చెందింది వీరి పూర్వులు విజయనగరం పెద విజయరామరాజు వలన కూడా సన్మానింపబడ్డారట. బొబ్బిలి పట్టణానికి సమీపంలో ఉన్న "కామన వలస" వీరి నివాసం. ఇది కూడా పూర్వ ప్రభువుల చేత ఈ వంశంవారికి ఇవ్వబడిన అగ్రహారమే.

మండపాక పేరయ కవి, కామకవి, పార్వతీశ్వరశాస్త్రి, ఇమ్మడి కామకవి మొ॥ వారు సంస్థాన విద్వాంసులుగా ఉంటూ ప్రఖ్యాతి చెందినవారు. పేరయకవి నిరోష్ఠ్య దాశరథీ శతకం, కుముద్వతీ పరిణయము, ఇందుమతీ పరిణయము మొదలగు రచనలు చేశాడు. బొబ్బిలిలో మండపాక వారి ఇల్లు దహనమైపోవడం చేత ఈ రచనలు అలభ్యాలు. (ఆం సం సా-307)

## మండపాక కామకవి

కాలం : క్రీ.శ. 1810 - 1872.

స్థలం : బొబ్బిలి సంస్థానం (కామన వలస అగ్రహారం).

రచనలు : కార్తికవ్రత మాహాత్మ్యము, బలరామక్షేత్ర మాహాత్మ్యము, బ్రహ్మోత్తర ఖండము. జానకీరామ శతకము, రామచంద్ర ప్రభు శతకము, శ్రీ సూర్య నారాయణ శతకము మొదలగునవి.

బొబ్బిలి సంస్థానాశ్రితుడు. మండపాక పేరయ్యకవి కుమారుడు. తల్లి కోనమ్మ. బాల్యంలో తండ్రివద్దనే కావ్యపంచకం, అలంకార శాస్త్రం పూర్తిచేసి సాహిత్య విద్యలో కృషిచేశాడు. ఇతడు కొన్ని అష్టకాలు, దండకాలు కూడా రచించాడట. ప్రసిద్ధ విద్వత్కవియైన పార్వతీశ్వరశాస్త్రి ఇతని కుమారుడు. (ఆం.సం.సా-308)

## మండపాక పేరయకవి

కాలం : క్రీ.శ. 18 వ శతాబ్దం - ఉత్తరార్థం.

స్థలం : బొబ్బిలి సంస్థానం-కామన పలస గ్రామం
రచనలు : నిరోష్ఠ్య దాశరథీ శతకము, కుముద్వతీ పరిణయము, ఇందుమతీ పరిణయము, లక్ష్మీనృసింహమూర్తి స్తుతికృతులు మొదలగునవి.

"మండపాక లచ్చన్న" కుమారుడు. మండపాక కామకవి (క్రీ.శ. 1810-72)కి తండ్రి బొబ్బిలి సంస్థానాశ్రితుడు. వీరి ఇల్లు దగ్ధమైపోవడంవల్ల ఇతని రచనలేవీ లభ్యం కావడంలేదు. (ఆం.సం.సా-307)

## మండపాక రామస్వామి

కాలం : క్రీ.శ 19వ శతాబ్దం.
రచనలు : వేదాంతకృతి కదంబము, గంగాలహరి, గంగాస్తవము

విద్వత్కవి. మండపాక కామకవి పుత్రుడు. పార్వతీశ్వర కవికి అగ్రజుడు.

## మండపాక వారు

"పాక" శబ్దం చివరలో ఉండి గ్రామనామంతో ఉన్న ఇంటిపేరు. వీరు అన్ని వర్ణాలలోనూ ఉన్నారు బొబ్బిలి సంస్థానంలో (క్రీ శ. 19వ శతాబ్దం) ఆస్థాన కవులుగా వర్ధిల్లిన పార్వతీశ్వరశాస్త్రి ఇంటిపేరు "మండపాక." (భారతి-మా-45-229)

## మండపేట పాపమ్మ పేరంటాలమ్మ కథ

కర్త : చూ. బళ్ళాస్వామి కవి

కరుణరస పూరితమైన జానపద గేయం. ఈ కథ గోదావరీ మండలానికి సంబంధించినది. కరుణ రసాత్మక గేయాల్లో "పేరంటాండ్ర కథ"లకు జానపద సాహిత్యంలో ఒక ప్రత్యేకత ఉంది భర్తతోపాటు సహగమనం చేసిన స్త్రీని "పేరంటాలు" అంటారు. అట్టి స్త్రీలు దేవతలు అవుతారని, వారికి కొన్ని దివ్యశక్తులుంటాయని వారి అభిప్రాయం. ఈ పాపమ్మ కథ కూడ అట్టిదే.

మండపేట - మాండవ్యపురంలో లక్ష్మీకాంతమ్మ, మూలయ్య అనే దంపతులకు 'పాపమ్మ' పరమేశ్వరీ వరప్రసాదంతో జన్మించింది. చిన్నతనంలోనే తలిదండ్రులు చనిపోగా పెదతండ్రి రామయ్య నాయుడు, పెదతల్లి సీతమ్మ పెంచి పెద్దచేశారు. కలిగినింట వివాహం చేస్తామని, రాచర్లపుర నివాసులైన కుంచె బాపనమ్మ, రంగయనాయుల కుమారుడైన పాపయ్యతో వివాహం నిశ్చయిస్తారు.

రామయ్య నాయునికి "సుందరమ్మ" అనే చెల్లెలుంది. ఆమె తన కొడుకుకే పాపమ్మ నివ్వాలని, మేనరికం అతిక్రమించి పోరాదని అన్నలను వేడుకుంటుంది. కాని తలిదండ్రులు లేని పిల్లను మంచి ఇంటికే ఇవ్వాలని నిశ్చయించి రామయ్యనాయుడు పాపయ్యతో వివాహం చేస్తాడు. ఆడబిడ్డ ఉసురు మంచిది కాదని, పాపమ్మ ఎక్కువకాలం సుఖంగా కాపురం చేయలేదని సుందరమ్మ శపిస్తుంది.

అన్నట్లుగానే పాపమ్మ కొంతకాలం సుఖంగా కాపురం చేసింది. తరువాత అత్తగారి ఆరళ్ళు సహజంగా ఎదుర్కొన్నది.

ఒకసారి పాపమ్మ అట్లతద్దె పండుగకు పుట్టింటికె ళ్తుంది. తిరిగి వచ్చేవరకు భర్త ప్రాణాపాయస్థితిలో ఉంటాడు. పాపమ్మకు చివరిచూపు మాత్రం దక్కుతుంది. భర్తతో సహగమనం చేయడానికి నిశ్చయించి, మామగారి అనుమతి కోరుతుంది. తను అగ్నిప్రవేశం చేసిన మూడవనాటికి అగ్నిగుండంలో తన కాలిమెట్టెలూ, పట్టుచీర ఉంటాయని, వాటిని తన తల్లిగారికి పంపమనీ, పాపయ్య శిగబొందు, మంగళసూత్రాలు అలాగే ఉంటాయనీ, వాటిని మామగారే ఉంచుకోవాలనీ చెప్తుంది. కాని పాపమ్మ మామగారు అలా చేయకపోవడంతో, ఆమె శాపం తగిలి, అత్తగారి వంశం నాశనమౌతుంది. ఆమె దేవతా స్వరూపంలో ఉంటుందనీ, సంతానం లేని వారికి సంతానం ప్రసాదిస్తుందనీ, ఇతర కోర్కెలు కూడా నెరవేరుస్తుందనీ ప్రజల నమ్మకం. పుట్టింట పెదతండ్రి ఆమెకు ప్రతి ఏటా ఉత్సవాలు జరిపిస్తారట. అత్తవారి గ్రామంలో గ్రామమునసబు ఉత్సవాలు జరిపిస్తాడట (తె. జా. సా_615, 616)

## మండరాజు శాసనము

కాలం : క్రీ. శ. 1118 ప్రాంతం.
స్థలం : శ్రీగిరి పశ్చిమదేశం.
శాసన రచయిత : సూరడు.
శాసనప్రదాత : మండరాజు.

ఈ శాసనం మండరాజు ఔన్నత్యాన్ని, కవి సూరన శౌర్య ప్రతాపాలను వర్ణిస్తున్నది. దీనిలో ఒక కంద పద్యం, 4 చంపకమాలలు, 2 ఉత్పలమాలలు ఉన్నాయి.
(తె. క. చ)

## మండలిక భీమన శాసనము

కాలం : క్రీ. శ. 1124 ప్రాంతం.
శాసన ప్రదాత : మండలిక భీమన (బంగిన భీమన).

ఈయన వైభవ ప్రాభవాలను వర్ణిస్తూ పూర్తిగా ఒక ఉత్పలమాల, ఒక గీత పద్యం దొరికాయి. మరొక పద్యం అసమగ్రంగా ఉంది. (తె.క.చ_187)

## మండలేముల వేంకట రామకవి

కాలం : క్రీ. శ. 1810_1870.
స్థలం : బొబ్బిలి సంస్థానం.
రచన : క్రియాయోగసారము.

వెంకమాంబా బంగారాచార్యుల పుత్రుడు. బొబ్బిలి సంస్థానాశ్రితుడు. విద్వత్కవి. ఇనుగంటి రామరాయల (1810_1870) ప్రోత్సాహంతో రచన చేశాడు.
(ఆం.సం.సా_309)

## మంత్రపాద స్తవము (అలభ్యం)

కర్త : చూ. నెల్లూరి వీరరాఘవ కవి.

దీనిని వ్రాసినట్లు కవి "వసుంధరా పరిణయంలో" చెప్పాడు. (తె. వి. స_6)

## మంత్రసాని (పాత్ర)

ఇది తెలుగు యక్షగానాలలో ప్రయుక్తమైన పాత్ర. శ్రీకృష్ణ, ప్రహ్లాద, మార్కండేయ,ధర్మాంగదవంటి ప్రవర్తనలలో,జననాలకు ప్రాధాన్యమున్న యక్షగానాలలో కవులు కొందరు మంత్రసాని పాత్రను బాగా చిత్రించారు.

లక్ష్మణ కవి ధర్మాంగద నాటకంలో, దాసీ జనం రాణి గారికి ప్రసవ సమయం దగ్గర బడిందని మంత్రసానిని రమ్మంటారు. మంత్రసానికి ఎక్కడ లేని బెట్టుసరి వచ్చి పడుతుంది. సమయం వచ్చిందని ఆమె "అమావాస్యనాడు అట్లు పెడితిరే! పున్నమనాడు బూరెలు పెడితిరే!" అని దాసీ జనాన్ని బాగా ఎత్తి పొడుస్తూ మాట్లాడుతుంది. (య. వా. చ_206)

## మంత్రిప్రగడ సూర్యప్రకాశకవి

కాలం : క్రీ. శ. 1808_1873.

స్థలం : విశాఖమండలం.

కృతులు : 1. కృష్ణార్జున చరిత్రము (ద్వ్యర్థి కావ్యం) 2. సీతారామ చరిత్రము 3 భీమలింగ శతకము.

సమకాలికులు : 1. శిష్టు కృష్ణమూర్తి 2. అడిదం బాంభాస్కరుడు III.

విద్వత్కవి. మాడుగుల కృష్ణభూపతి (1813_1873) ఆస్థాన కవి. శరభ రాజామాత్య సీతమాంబల పుత్రుడు. ఈయన కవిత్వం మృదు మధుర పద గుంఫితంగా మనోరంజకంగా ఉంటుంది. (క. చ III-233)

## మంత్రి భాస్కరుడు

చూ. భాస్కరమంత్రి.

## మంథెన రామాయణము

రచనాకాలం : క్రీ.శ. 1834 ప్రాంతం.

కర్త : ముద్దయకవి.

ఇది ప్రసిద్ధమైన యక్షగానం. మంథెన ప్రాంతంలో పలువురు దీనిని కంఠస్థం చేసి పాడుతుంటారు. (య వా.చ_363)

## మందడి ప్రోలని శాసనము

కాలం : క్రీ.శ. 1149 ప్రాంతం

స్థలం : గుంటూరు జిల్లా_మంగళగిరి తాలూకా_మందడం గ్రామం.

శాసనప్రదాత : ముందడికోటని వంశీయుడైన మందడి ప్రోలడు

శాసన విషయం : ఈ శాసనం మందడం గ్రామంలో మల్లికార్జునస్వామి వారి ఆలయంలో ఉంది. ఈ శాసనంలో ప్రసక్తుడైన "మందడికోటడు" వెలనాటి గొంక

రాజు (క్రీ శ. 1130-1163) కు ఇష్టభృత్యుడట. దీనిలో అసమగ్రంగా ఒక ఉత్పల మాల, ఒక ఆటవెలది పద్యాలున్నాయి. (తె.క.చ-246 A)

## మకతల కృష్ణమ్మ

కాలం : తెలియదు.

స్థలం : ముక్తల (మహబూబ్‌నగర్ జిల్లా)

రచన : ఉదాహరణము (అలభ్యం).

ఈ కవిని గురించిన వివరాలు లభించలేదు. (క స-42)

## మగటపల్లి కామయ చంద్రా శతకము

కర్త : పచ్చమెట్ట పాపకవి.

కందపద్య శతకం. మగటపల్లి కామయ్య అనే శ్రేష్ఠిని గురించి చెప్పినది. "మగటపల్లి కామయ చంద్రా" అనే మకుటంతో ఉంది. కవిత చక్కనిది. (శ.క.చ.826)

## మగటపల్లి కామయ్య

కాలం : క్రీ శ. 19వ శతాబ్దం.

స్థలం : విశాఖ మండలం.

సాహితీ పోషకుడు. పచ్చమెట్ట పాపకవి చేత తన పేరిట ఒక శతకం చెప్పించుకొని కవిని సన్మానించాడు. 'మగటపల్లి కామయ చంద్రా' అనేది ఆ శతక మకుటం. ఇతని కుమారుడైన వెంకన్న అడిదం సూరకవి II శాపానికి గురైనాడట. (కవి సంశయ విచ్ఛేదం-పీఠిక-15)

## మగదల కృష్ణమంత్రి

కాలం : క్రీ.శ. 17, 18 శతాబ్దాల నడిమి భాగం.

స్థలం : ప్రళయకావేరి(పులికాట్).

సాహిత్య పోషకుడు. ధరణిదేవుల రామమంత్రి రచించిన 'దశావతార చరిత్రను' అంకితం పొందాడు. ఇతడు ఒలాందా (డచ్చి) వారి దగ్గర పులికాట్ రేవు పట్టణానికి అధికారిగా ఉండేవాడట.

ఇతని పుత్రుడు మగదల రామదాసు కూడా కవి పండిత పోషకుడే. (ద.దే.వా-506)

## మగదల రామదాసు

కాలం : క్రీ. శ. 17 వ శతాబ్దం.

స్థలం : ప్రళయకావేరి (పులికాట్).

సాహిత్యపోషకుడు. కృష్ణమంత్రి పుత్రుడు. వెలిదండ్ల వేంకటపతి చేత, 'రాధా మాధవ సంవాదం' రచింపచేసి అంకితం పొందాడు. (ఆరుద్ర-12-182)

**మచిలీపట్నం శాసనము (సం)**

కాలం : క్రీ. శ. 848 ప్రాంతం.

శాసనకర్త : ఆజ్ఞప్తి పండరంగడు.

విషయం: గుణగ విజయాదిత్యుని సేనాని పండరంగని శాసనం. సంస్కృతంలో ఉంది. (తె.క.చ-24)

**మట్ల అనంతరాజు (అనంత భూపాలుడు)**

కాలం : క్రీ. శ. 16వ శతాబ్ది చివరిభాగం.

స్థలం : పెనుగొండ ప్రాంతంలో ఒక సీమకు అధిపతి.

సమకాలికులు : వెంకటపతిరాయలు, తంజావూరి రఘునాథరాయలు, కస్తూరి రంగప్ప, నంద్యాల కృష్ణమరాజు, కొండ్రాజు తిరుపతిరాజు.

రచన : కకుత్థ్స విజయము.

గురువు : తిరుమల తోళప్పాచార్యులు.

విశిష్టత : ఈయన వసుచరిత్రను అంకితం పుచ్చుకొన్న తిరుమలదేవరాయల మూడో కుమారుడైన వెంకటపతి రాయలకు (పెనుకొండ) సేనాధిపతి. మట్ల ఎల్లమ రాజు కొడుకు. తల్లి రంగాంబ. మట్ల వారికి సిద్ధవటం, పొత్తపి సీమలలో పొందలూరు, పెనగలూరు, పొన్నంపల్లి అనే అమరగ్రామాలున్నాయి. కళాపూర్ణోదయం కృష్ణమరాజును కొండ్రాజు తిరుపతిరాజును యుద్ధాల్లో ఓడించి, రాజుకు బాగా సాయం చేశాడు. ఈయన కవనవీరుడేకాక కావ్యలోలుడు. ప్రబంధాలలో "కొరవంజి"ని తొలిసారిగా ఈయన పేర్కొన్నాడు యుద్ధ వర్ణనలు వీర రస పూరితంగా చేశాడు. కవులను పోషించాడు. చాలా దానాలు చేశాడు. కవి చౌడప్ప, ఘంటన అనే వారు ఈయన ఆస్థానంలో ఉండే వారట ఇతని ఇంటిపేరు "మట్లి" అని కొన్ని గ్రంథాల్లో ఉంది. ఇతని కవిత్వం నిర్దుష్టంగా ఉంది.

ఇతని కావ్యం ఉంగ్రికే అంకితం. (ఆరుద్ర-9-134)

**మట్ల ఎల్లమరాజు**

కాలం : క్రీ శ. 16వ శతాబ్దం.

కృతిపతి : మట్ల అనంతరాజు విరచిత కకుత్థ్స విజయానికి.

విశిష్టత : ఈయన కృతికర్త మట్ల అనంతరాజుకు తండ్రి. పెనుకొండ రాయల వారికి సామంతుడుగా సిద్ధవటం సీమను పాలించాడు. కళాపూర్ణోదయం కృతి పతి 'కృష్ణమరాజును' చంద్రగిరి కోటలో బంధించిన వీరుడు నంద్యాల కృష్ణమరాజు నుంచి, కొండ్రాజు తిరుపతి రాజునుంచి తిరిగి ఆమద భూములను స్వాధీనం చేసు

కొన్నాడు. తిరుపతి రాజును యుద్ధంలో చంపి 'రణము కుడిపించాడు.' ఈయన కొలువులో ఉప్పు గొండూరు వెంకటకవి అనే 'ఒక ఆంధ్ర కవితా పితామహుండు'న్నాడు. ఈయన ప్రేరణ వల్ల నే,కృతి శాశ్వతమని తలంచి ఎల్లమరాజు తన కుమారుడైన అనంత రాజు చేత కావ్యం వ్రాయించి, అంకితం పుచ్చుకొన్నాడు.

## మట్ల కుమారానంత భూపాలుడు

కాలం : క్రీ.శ. 1600–1650 ప్రాంతం.
స్థలం : బళ్ళారి మండలంలోని సిద్ధవటం.
రచన : కుముద్వతీ పరిణయము (అసమగ్రం).

రాజకవి. వీరి ఇంటి పేరు "మట్లి"గా కూడా వ్యవహారంలో ఉంది. తండ్రి తిరువేంగళనాథుడు. కకుత్థ్స విజయకర్త అనంతభూపాలుడు ఇతని తాత.

కలమూ, కత్తీ, అతినేర్పుతో ప్రయోగించగల దిట్ట. సంగీతంలో కూడా ప్రజ్ఞ గల కవి. సౌంభ హల్లీసకాల వంటి కవితలు వ్రాస్తానని చెప్పుకొన్నాడు. ఇతడు వెంకటాచలం నుండి శ్రీశైలం వరకూ, ప్రతి గ్రామంలోనూ, మృష్టాన్న సత్రాలు ఏర్పరచాడట (క.త–12–98)

## మట్ల వెంకట రామరాజు

కాలం : క్రీ.శ. 17 వ శతాబ్ది ఉత్తరార్థం–18 వ శతాబ్దం పూర్వార్థం,
స్థలం : కడప మండలం.

సాహిత్య ప్రియుడు. కృతిపతి. నదిమింటి వెంకటపతి రచించిన, "అభిషిక్త రాఘవం" ఇతనికే అంకితం. 1703 ప్రాంతంలో సిద్ధవటం సీమను పాలించిన మట్ల అప్పయ్యరాజు (తిరువేంగళరాజు)కు ఇతడు పినతండ్రి. (ఆంధ్ర–12–71)

## మఠం మడివ్యాళయ్య

కాలం : క్రీ శ 1830 ప్రాంతం.
స్థలం : బోర్లెం గ్రామం–నిజామాబాదు మండలం.
రచన : శారద రామాయణము.

కర్ణాటాంధ్ర భాషలలో ప్రవీణుడైన కవి. (క.స–155)

## మతమనూరు

ఈ గ్రామం నెల్లూరు మండలంలో ఉంది. ఈ ఊరి చెరువు గట్టు మీద ఉన్న ఒక రాతి మీద ఈ గ్రామ ప్రశస్తిని తెలిపే ఒక చాటువు చెక్కి ఉంది. కవిని గురించిన వివరాలు తెలియవు. (చా ప.ర )

## మడికి అనంతయ్య

కాలం : క్రీ.శ. 1347 – 1400 ప్రాంతం.
గ్రంథం : విష్ణుమాయా నాటకం.
సమకాలికులు : సబ్బినాటి ముప్పభూపాలుడు, కుంద.నామాత్యుడు.

అయ్యల మంత్రి కుమారుడు. సింగన్న కవికి తమ్ముడు.

విశిష్టత : చింతలపూడి ఎల్లనామాత్యునిదిగా ప్రఖ్యాతమైన విష్ణుమాయా నాటకానికి కర్త ఇతడే అని సాహిత్యవేత్తలు నిర్ణయించారు. విష్ణుమాయా నాటకాన్ని ఈతని తర్వాత నలుగురు రచించారని ప్రతీతి. ఈ కవి శైలి మిక్కిలి రసవంతమనీ మనోహరమనీ పండితాభిప్రాయం.

వీరి ఇంటిపేరు మొదట రావెలవారనీ, "మడికి" గ్రామనివాసంవల్ల మడికి వారైనారనీ అంటారు. (క.త; ఆరుద్ర-4)

## మడికి సింగన

కాలం : క్రీ.శ. 1375 ప్రాంతం.
స్థలం : కరీంనగరు మండలం.
బిరుదు : శృంగారరస కళాశ్రిత వచోధనుడు.
రచనలు : 1. పద్మపురాణము (ఉత్తరఖండం) 2. వశిష్ఠ రామాయణము 3. సకల నీతి సమ్మతము (సంకలన గ్రంథం) 4. దశమ స్కంధము (భాగవతం).

అయ్యల మంత్రి, సింగమాంబల పుత్రుడు. అల్లాడ మంత్రి మనుమడు. సబ్బినాటి రామగిరి దుర్గం రాజధానిగా, సబ్బినాటి నేలిన గురిజాల ముప్ప భూపాలునికి, మంత్రి కందనామాత్యునికి సమకాలికుడు. సబ్బినాడు నిజాం మండలంలోనిది

విశిష్టత : కాకతీయ యుగంలోని ఆరు మంది అజ్ఞాత కవులను గురించి సింగన తెలియజేశాడు. ఇతడు సంకలనం చేసిన సకల నీతిసమ్మతం, ప్రాచీన నీతి మంజరి ఇతని రచన సలక్షణమై మృదు మనోహరంగా ఉంటుంది.

(ఆరుద్ర-4; క.త-4-172)

## మడివాలు మాచయ్య కథ

ఈ కథ పాల్కురికి సోమన్న విరచిత బసవపురాణంలో నాలుగో ఆశ్వాసంలో ఉంది. ఇతడు రజక కులానికి చెందిన గొప్ప శివభక్తుడు. ఇతడు చెప్పిన మాటలు బసవన్న మన్నించి స్వయంగా తానే ఆచరించాడు. (చూ. బసవ పురాణము)

(ఆరుద్ర-2-212)

## మడ్డు పట్టుటం

ఇది మధ్య యుగాంధ్రదేశంలో ప్రచారంలో ఉండిన ఒక దారుణమైన శిక్ష. ఎర్రగా కాలిన ఒక ఇనుప గుండును చేతపుచ్చుకుని నేరస్తుడు నిర్ణీత దూరం నడిచి పోవడాన్ని 'మడ్డు పట్టటం' అంటారు. దీనిని అగ్నిపరీక్ష అని కూడ అంటారు.

నేరాన్ని రుజువు చేయటానికి ప్రబలమైన సాక్ష్యాధారాలు లేకపోతే, నేరస్తుల చేత ధర్మాధికారులు ప్రమాణం చేయించుకొనేవారు. దేవతా విగ్రహం ముందు నిలబడి తాను నిర్దోషినని ప్రమాణం చేయటం ముందు జరుగుతుంది. ప్రమాణమైన తరువాత

కాల్చిన ఎర్రని ఇనుప ముక్కను నేరస్తుడు నాలుకపై వేసుకోవాలి. నాలుక కాలకపోతే ఆ వ్యక్తిని నిర్దోషిగా తీర్పు చెప్పేవారు.

కొన్ని సందర్భాలలో, దేవతా విగ్రహం ముందు నేరస్తుడు ప్రమాణం చేసిన తరువాత- ఆ వ్యక్తిని ఎర్రగా కాల్చిన ఇనుపకడ్డీమీదగాని, ఇనుపరేకుమీదకాని నడిపించేవారు. కాళ్ళు కాలి గాయాలు కాకపోతే వ్యక్తిని నిర్దోషిగా నిర్ణయించి వదలి వేసేవారు.

"మడ్డునకు బోయునట్లొక - త్రెడ్డెడుకుకు పాయసంబు తెచ్చి యతనిచే - విడ్డ" అని భోజరాజీయంలో ఉంది. (తెలుగు-ఏ-జూ-77)

## మణిధ్వజ చరిత్రము

రచనాకాలం : క్రీ శ. 19వ శతాబ్దం.

కర్త : అల్లమరాజు సుబ్రహ్మణ్య కవి.

అంకితం : ఎనుముల రామనకు.

పద్యకావ్యం. "రహి మణి ధ్వజ చరిత్ర మొనర్చి యెన్ముల రామనదొర చేత భూమిగొంటి" అని-కవి శ్రీకృష్ణ కల్యాణంలో చెప్పుకొన్నాడు కవిత్వం నిర్దుష్టంగా ఉంది. (క. చ-3-253)

## మణి ప్రవాళము

ఇది శ్రవ్యకావ్య భేదాలలో ఒకటి. సంస్కృతాంధ్రాలను మేళవించిన రచనకు మణిప్రవాళం అంటారు. ఇది తెలుగులో అక్కడక్కడ ఉంది. పాల్కురికి సోమన వృషాధిప శతకంలో ఈ మణి ప్రవాళ కవిత్వముంది. రెండు భిన్న భాషలను కలిపి మాట్లాడడం గాని, వ్రాయడంగాని మణి ప్రవాళమని చెప్పవచ్చును. (తె. వి స-6)

## మణిహార వృత్తాంతము

పింగళి సూరన్న రచించిన కళాపూర్ణోదయ కావ్యంలో ఈ మణిహార వృత్తాంతానికి చాలా ప్రాముఖ్యం ఉంది. కావ్యంలోని అనేక కథలను కలిపి ఉంచిన హారం ఇది. దీనికి ఆదిమ ప్రభువు విష్ణువు. సుగ్రాహుడు విష్ణువును తపస్సు చేత మెప్పించి దీనిని పొందాడు. తరువాత బ్రాహ్మణశాపం వల్ల అతని పూర్వజ్ఞానమంతా పోయి, సత్వదాత్ముడనే రాజుగా పుడతాడు. కొంతకాలం రాజుగా ఉండి తరువాత కళాపూర్ణుని మంత్రిగా కుదురుతాడు సుగ్రాహుడు దేవతాలయంలో పెట్టి మరచిపోయిన ఆ హారాన్ని మధురాపురపు బ్రాహ్మణుడొకడు తెచ్చి, తన యింటిలో చాలాకాలం పూజచేసి ఉంచుకొని, ద్వారకకు పోయి దానిని శ్రీకృష్ణునికి సమర్పిస్తాడు. శ్రీకృష్ణుడు ఆ హారాన్ని మణికంధరునికి బహూకరిస్తాడు

మణికంధరుడు అలఘువ్రతునకు, అతడు కళాపూర్ణునికి, అతడు శిశుప్రాయయైన మధుర లాలసకు క్రమంగా యిస్తారు. సరస్వతీ చతుర్ముఖుల విలాస క్రీడపై కథను ఏకీభూతం చేసే కల్పనలలో ఇది ఒకటి. కళాపూర్ణోదయంలోని పూర్వోత్తర భాగ

లన్నింటికీ ఈ హారం సామాన్యమే గాక, కథ కంతటికీ ప్రాకిఉండే తీగ వంటిది.

ఈ మణిహారంలోని నాయకమణి ఎవరి హృదయ భాగాన్ని తాకుతుందో, వారికి భూత, భవిష్యద్వర్తమాన వృత్తాంతాలు అవగతమవుతాయి. ఈ మణి ప్రభావం వల్లనే శిశువుగా ఉన్న మధుర లాలస కథలో కొంత భాగాన్ని చెపుతుంది. పెరిగి పెద్దదై చిన్న నాటి హారాన్ని మళ్ళీ ధరించి మిగతా కథను చెప్పి చిక్కు విడదీస్తుంది.

(కళాపూర్ణోదయం)

## మతుకుమల్లి కనకాద్రి శాస్త్రి

కాలం : క్రీ. శ. 18 వ శతాబ్దం ఉత్తరార్ధం – 19 వ శతాబ్దం పూర్వార్ధం.

స్థలం : నరసరావుపేట సంస్థానం.

మతుకుమల్లి వారి కుటుంబం ఆంధ్ర దేశంలో సుప్రసిద్ధమైనది. ఈ కనకాద్రి శాస్త్రి క్రీ.శ. 18 వ శతాబ్దం పూర్వార్ధంలో నరసరావుపేట సంస్థానాన్ని పాలించిన పెద వేంకట గుండారాయణింగారి ఆస్థానంలోని విద్వత్కవి షట్శాస్త్రవేత్త. తర్కం వీరి అభిమాన విషయమట. 'అభినవ భారత' కర్త అయిన మాధవ మంత్రికి మనుమడు, దశావతార స్తవ గ్రంథకర్త అయిన మాధవశాస్త్రి ఇతనికి సోదరుడు. వీరి జ్యేష్ఠపుత్రుడు నరసింహశాస్త్రి (నృసింహకవి) 'వల్లూరు' సంస్థానంలోను, ద్వితీయ కుమారుడు కృష్ణశాస్త్రి 'పోలవరం' సంస్థానంలోను ఆస్థాన కవులుగా ప్రసిద్ధి చెందారు. ఇతడు మాణిక్యారావు మానూరి, వాసిరెడ్డి వారి సంస్థానాలలో కూడ తన పాండితీ పాటవం ప్రదర్శించి, ప్రభువులను మెప్పించి, మాన్యాలు గ్రహించినట్లు తెలుస్తున్నది

(ఆం సం.సా–194, 195, 391)

## మతుకుమల్లి నరసింహశాస్త్రి

కాలం : క్రీ శ. 1816 నుంచి క్రీ.శ. 1873 వరకు.

జన్మస్థలం : తెనాలి

రచనలు ; 1. ఆంధ్రమేఘ సందేశము 2. వేంకటాచల యాత్రా చరిత్రము 3. అజచరిత్రము 4. చెన్నపురీవిలాసము 5 శ్రీకృష్ణ జలక్రీడా విలాస నాటకము 6. నృసింహ సహస్ర నామావళి 7. పుండ్రకకళానిధి 8. ఆంధ్ర సిద్ధాంత కౌముది 9. భరతశాస్త్ర సర్వస్వము 10. సంగీత సారసంగ్రహము—మొదలగునవి.

మతుకుమల్లి కనకాద్రిశాస్త్రి కుమారుడు. నరసింహశాస్త్రి కొంత కాలం నరసరావుపేటలో ఉండి, ఆ తరువాత వల్లూరి సంస్థాన ప్రభువుల వద్ద ఉన్నాడు.

ఇతనికి పూర్వం 3 దశాబ్దాల నుంచి, ఈ వంశం వారు ప్రముఖ విద్వత్కవులుగా పేరు పొందారు. ఈ కవి పూర్వులను మించిన పండితుడు. మాల్యశైల నృసింహస్వామి భక్తుడు. వల్లూరు సంస్థానాధిపతియైన రాజా బొమ్మ దేవర నాగన్న నాయునికి ఆశ్రితుడు. ఈ సంస్థానంలో ఆస్థాన పండితుడుగా, పరీక్షాధికారిగా ఉన్నాడు.

సంస్థాన ప్రభువుల మన్ననలకు పాత్రుడై, పెక్కు సన్మానాలు పొందాడు. ప్రభల సుందర రామశాస్త్రి వంటి ప్రముఖులను శాస్త్రవాదాలలో ఓడించి ప్రఖ్యాతి చెందాడు.

ఈ కవి బాల్యం నుండి సుమారు 80 సంవత్సరముల వయస్సు వరకు పితురంతేవాసిగా ఉండి ఆ తరువాతనే వాక్యార్థాలకు, గ్రంథరచనకు పూనుకున్నట్లు తెలుస్తున్నది. ఉభయ భాషా ప్రవీణుడై సంస్కృతాంధ్రాలలో కావ్యరచన చేశాడు. (అం.ర.20-24)

## మతుకుమల్లి మాధవకవి

కాలం : క్రీ. శ 18 వ శతాబ్దం ప్రథమభాగం కావచ్చు.

రచన : అభినవ భారతము.

క్రీ. శ 18 వ శతాబ్దం ఉత్తరార్ధంలో నివసించిన మతుకుమల్లి కనకాద్రిశాస్త్రికి పితామహుడు. (అం సం సా-195-391)

## మత్తయి సువార్త

క్రైస్తవ మతగ్రంథం. వచనం. గ్రీకు భాష నుండి తెలుగులోనికి అనూదితం. ఈ అనువాదంలో మంగళగిరి ఆనందకవి పాశ్చాత్య విద్వాంసులకు చాలా తోడ్పడ్డాడు. (క.న-20)

## మత్స్య పురాణము

రచనాకాలం : క్రీ. శ. 18 వ శతాబ్దం.

కర్త : కాణాదము పెద్దన సోమయాజి (చూ).

అంకితం : రాజా బహిరీ పాము నృపాలునికి.

సంస్కృత మత్స్యపురాణానికి అనువాదం. కవిత్వం శబ్దాలంకారాలతో చిత్రకవితా విశేషాలతో కూడిఉంది. (అం.సం.సా.)

## మత్స్య పురాణము

రచనాకాలం : క్రీ. శ. 19 వ శతాబ్దం.

కర్త : చూ. మంట కామేశ్వర కవి.

సంస్కృతంలోని మత్స్యపురాణానికి అనువాదం. (అం.సం.సా-429)

## మత్స్య పురాణము [అలభ్యం]

రచనాకాలం : క్రీ. శ. 16 వ శతాబ్ది మధ్యభాగం.

కవి : లింగమకుంట రామకవి.

అనువాద గ్రంథం కావచ్చును. (ఆరుద్ర-8-133)

## మత్స్య పురాణము

రచనాకాలం : క్రీ. శ. 16 వ శతాబ్దం.

కర్త : హరిభట్టు.
అంకితం : శ్రీరంగేశునికి.

అయిదాశ్వాల కావ్యం. సంస్కృత మత్స్యపురాణానికి పూర్తి తెనిగింపు కాదు. విష్ణుధర్మోత్తర ఖండాలు మాత్రం ఉన్నాయి. విష్ణుపూజాఫలం, తులసీ మాహాత్మ్యం మొదలగు కథలున్నాయి. రచన సంస్కృత పద భూయిష్ఠమై మధురంగా ఉంటుంది.
(వా. చ - 56)

**మత్స్యపురాణ సారసంగ్రహము**

రచనాకాలం : క్రీ. శ. 19 వశతాబ్ది.
కర్తలు : తిమ్మరాజు లక్ష్మణరాయకవి, పువ్వాడ వేంకటరావు.

పురాణకథ. సులభమైన వచనంలో ఉంది. (శ. స - 207)

**మదన గోపాలవిజయము**

కర్త : చూ. ఋగ్వేది వేంకటనారాయణ కవి.

వివరాలు తెలియవు. (ఆం సం.సా.)

**మదన గోపాల శతకము (అలభ్యం)**

రచనాకాలం : క్రీ శ. 1850 ప్రాంతం.
కర్త : మేకా బాపన్న. (శ.క.చ-604)

**మదన గోపాల శతకము**

రచనాకాలం : క్రీ.శ 1800 ప్రాంతం.
కర్త : వంకాయలపాటి వేంకటకవి.

"మదన గోపాల, రాధికా హృదయలోల" అనే మకుటంతో ఉన్న సీస పద్య శతకం. ఇది నిందాగర్భ కావ్యంగా కనిపిస్తున్నది. కొన్ని మోటు పగాలున్నాయి.
(శ.క.చ-52)

**మదన ద్వాదశ వ్రతము**

కర్త : తెలియదు.

జానపద పారమార్థిక గేయం. ప్రసిద్ధం.

చూ. పారమార్థిక గేయములు.

**మదనపాలుడు**

రచన : శూద్రధర్మోత్పలద్యోతనీ స్మృతి కౌముది (సం).

ఇతడు సంస్కృత కవి. ఇతని రచననే శేషభట్టరు సింగరాచార్యులు యథాతథంగా తెలుగులో వ్రాసి బారిగడ్డుల నృసింహస్వామికి అంకితం ఇచ్చారు. (మ.మా.)

## మదన మహోత్సవము

పూర్తి వివరాలకు-చూ. వసంత మహోత్సవము.

## మదన మోహినీ విలాసము

రచనా కాలం : క్రీ.శ. 17 వ శతాబ్దం కావచ్చు.

కర్త : తక్కెళ్ళపాటి లింగన.

పద్య కావ్యం. లక్షణ విరుద్ధమైన ప్రయోగాలున్నాయి. రచనలో ధారాశుద్ధి ఉంది (క.చ-3-133)

## మదన విజయ భాణము

కర్త : కర్ణమకకల అనంతాచార్యులు (చూ).

(అం.సం.సా.)

## మదన విజయము (అలభ్యం)

రచనాకాలం : క్రీ.శ. 13వ శతాబ్దం.

కర్త : రావిపాటి త్రిపురాంతకుడు (చూ).

ఇది ఎనిమిది ఆశ్వాసాల కామశాస్త్ర గ్రంథం. సంజ్ఞాభియోగికం, భార్యాధికారం, పారదారికం, వైశికం అనే ప్రకరణాలున్నాయట. ఇందులోని రెండు పద్యాలు మాత్రం లభించాయి. (ఆరుద్ర-3-79)

## మదన విలాసమ్ (అలభ్యం)

రచనాకాలం : క్రీ.శ. 14వ శతాబ్దం.

కర్త : పశుపతి నాగనాథుడు.

అంకితం : అనవోత నాయకునకు.

ఇది సంస్కృత గ్రంథం. దశ రూపక భేదాలలో ఒకటయిన భాణం.

(ఆరుద్ర-4)

## మదన సంజీవనమ్ (సం)

రచనాకాలం : క్రీ.శ. 18వ శతాబ్దం.

కర్త : ఘనశ్యాముడు.

భాణం.

## మదన సాయక విలాసము

రచనాకాలం : క్రీ.శ. 18 శతాబ్దం.

కర్త : చదువుల సోమలింగయ్య.

అంకితం : శ్రీశైల మల్లికార్జున స్వామికి.

ఐదాశ్వాసాల శృంగార ప్రబంధం. కవిత్వం రసవంతంగా ఉన్నా నిర్దుష్టం కాదు. (క. చ-3-207)

## మదన సాయకా పరిణయము

కర్త : ఫక్కి వేంకటనరసయ్య.
రచనాకాలం : క్రీ. శ. 19 వ శతాబ్దం పూర్వార్ధం.
పద్యకావ్యం.

## మదన సేనము [అలభ్యం]

కర్త : నంది మల్లయ.

నంది మల్లయ - ఘంట సింగయ్యలలో మొదటివాడు

ప్రత్యేకత : నంది మల్లయ వ్రాసిన 'మదనసేనం' లోవివని, ఒక గీత పద్యాన్ని, మూడు సీస పద్యాలను పెదపాటి జగ్గన తన 'ప్రబంధ రత్నావళి'లో ఉదాహరించాడు. ఇది కూడా ఇరువురూ కలిసి వ్రాసినదే కావచ్చుననీ పెదపాటి జగ్గన ఒక కవినే ఉదహరించాడనీ కొందరి అభిప్రాయం. (ఆరుద్ర-6-253)

## మదనాభ్యుదయ భాణమ్ [సం]

రచనాకాలం : క్రీ.శ. 18 వ శతాబ్దం.
కర్త : చూ. శిష్టు కృష్ణమూర్తిశాస్త్రి.
రూపక విశేషం. (ఆం.సం.సా-326)

## మదరాసు కళాశాల ముద్రణాలయము

స్థాపన కాలం : క్రీ.శ. 1802 ప్రాంతం.

ఇది మద్రాసులోని ఫోర్టుసెయింట్ జార్జి కళాశాల నిమిత్తం, కాలేజి ప్రెస్ పేరున తొట్టతొలుత వెలసిన అచ్చుకూటం. ఆ కాలంలో దీనినుంచి ఫోర్టుసెయింట్ రాజకీయ వృత్తాంతిని, (Fort St. George Gazette) మాత్రమే తెలుగులో వెలువడుతూ ఉండేది. (వీరేశలింగంపంతులు-సమగ్ర పరిశీలన - 183)

## మదాలస చరితము

కాలం : క్రీ శ. 16 వ శతాబ్దం.
కర్త : చూ. శ్రీకృష్ణదేవరాయలు.

శ్రీకృష్ణదేవరాయలు దీనిని వ్రాసినట్లు ఆముక్తమాల్యదలో ఉంది. సంస్కృత గ్రంథమని పండితులు భావిస్తున్నారు. (తె.వి స-6)

## మదిన సుభద్రయ్యమ్మ

కాలం : క్రీ.శ. 18 వ శతాబ్దం.
స్థలం : విశాఖ మండలం.
రచనలు: శ్రీరామ దండకము, రఘునాయక శతకము, కేశవ శతకము, కృష్ణ శతకము, రాఘవ శతకము మొదలగునవి.

ఈమె రాజా గోడే నారాయణ గజపతిరాయని మేనత్త. సంస్కృతాంధ్రా

లలో పండితురాలు. ఈమె రచనలు నేడు లభించటంలేదు. గృహలక్ష్మి పత్రికలో లభించిన కొన్ని పద్యాలు ప్రచురితాలు. (క-చ-70; శ.క.చ.399)

## మద్దికాయల మల్లయ్య

కాలం : క్రీ.శ. 1590 కి ముందు

రచన : రేవతీ పరిణయము (అలభ్యం).

విశిష్టత : ఈయన వ్రాసిన పై కావ్యంలోనుంచి మూడు పద్యాలను జగ్గన్న తన ప్రబంధ రత్నాకరంలో ఉదాహరించాడు. ఒక పద్యంలో పుళింద విభుడు తెచ్చిన కానుకలను, రెండో పద్యంలో సూర్యాస్తమయ వర్ణనను, మూడో దానిలో దీపాలను వర్ణించాడు. దీపాలను వర్ణించిన పద్యం మనోహరంగా ఉంది. (ఆ.ప్ర.వ-9)

## మద్దెలవారు

వాద్య విశేష నామంతో తెలుగుదేశంలో నిలిచిపోయిన ఇంటిపేరు. కళింగాంధ్ర దేశంలో ఈ ఇంటిపేరుతో కొన్ని కుటుంబాలవారున్నారు డప్పులవారు, తప్పెట్లవారు ఇలాంటివి (భారతి-మా-45-230)

## మధుర కవిత

చతుర్విధ కవిత్వాలలో ఒకటి.

భాషా భావ ఛందాలలో దేశీలక్షణాలు కలిగిఉండి, సంగీతానుగుణమై, సామాన్య ప్రజల నాల్కలపై నాట్యమాడే కవితను మధుర కవిత అంటారు మధుర కవిత్వంలో నాటకాలంకారాలు, కళికోత్కళికలు, విభక్త్యధి దేవతోదాహరణలు, సప్త తాళనటనలు, నట్టొట్లు, గీతప్రబంధాలు, చతుర్భద్రికాష్టభద్రికలు, బిరుదావళి, నామావళి, భోగావళి, రంగఘోష, త్యాగఘోష, చతురుత్తర సంఘటనలు, యక్షగానాలలోని పదాలు, దరువులు, ఏలలు, ధవళాలు, మంగళహారతులు, శోభనాలు, ఉయ్యాలజోలలు, జక్కుల రేకు పదాలు, చందమామ సుద్దులు, అష్టకాలు, ఏకపద ద్విపద, త్రిపద, చతుష్పదాష్ట పదులు, అన్నీ చేరుతాయని వార్తాకవి రాఘవయ్య తన "లక్షణ దీపిక"లో చెప్పాడు. ఈ కవిత చాలాకాలం లిపికెక్కక, మౌఖికంగానే ప్రచారంలో ఉంది. చాలాకాలం వరకు పండితులు దీనిని సత్కవితలలో చేర్చని కారణంవల్ల ఇది చాలావరకు మరుగున బడిపోయింది (తె.వి స-6)

## మధురమంగా పుంశ్చలీ లీలా విలాసము

నామాంతరం : మధుర మంగా పుంశ్చలీ విలాసము.

## మధుర మంగా పుంశ్చలీ విలాసము

నామాంతరం : మధురమంగా పుంశ్చలీ లీలా విలాసము.

కర్త : బుచ్చాలి గోపాలయ్య.

రచనాస్థలం : ఆనెగొంది.

రచనాకాలం : క్రీ. శ. 18 వ శతాబ్దం.

3565 గ్రంథాలున్న వచన కృతి. గ్రంథం అంటే 32 అక్షరాలు. మధురనేలిన రాణి మంగమ్మమీద కిట్టనివారు వ్రాయించిన కృతి. చిన వెంగమరాజు ఈ కృతి ప్రేరకుడని కొందరూ, అతడే వ్రాశాడని కొందరూ అంటున్నారు. ఈ గ్రంథ కర్తృత్వాన్ని గురించి భేదాభిప్రాయాలున్నాయి.

ఇది చారిత్రకంగా మిక్కిలి విలువైన గ్రంథం. ఆనాటి ప్రముఖ రాజకీయ వ్యక్తులపేర్లు - సంఘటనలు ఇందులో ఉన్నాయి. "మంగా దుష్పాంసులా విలాసాన్నే కవి వచనంగా, మరింత అశ్లీలంగా ఈ రూపంగా రాశాడు కన్నడ, తమిళ భాషలలోని అశ్లీలాలుకూడా జోడించాడు.

ఇందులో రంగని భేటి, పక్షిక్రీడ, చిన వెంగమరాజు దినచర్య, శాక్తేయమతం మొదలగు శీర్షికలున్నాయి (వ.దే.వా-329; ఆరుద్ర-12-86)

## మధుర మీనాక్షిదేవి దాన శాసనము

శాసన కాలం : క్రీ.శ. 1739 ప్రాంతం.

శాసన రచయిత : శివరామయ్య.

ఇది తిరునల్వేలి మండలంలోని పంగునేరి తాలూకాలోని సేవల్లప్పేరి గ్రామానికి సంబంధించిన తామ్ర శాసనం మొత్తం 55 పంక్తులున్నాయి. అందులో సరిహద్దులను తెలిపే భాగం తమిళంలోనూ మిగిలినది తెలుగులోనూ ఉంది.

ఇది "శివల్లప్పేరి" గ్రామం (ముద్దు వేంకటలక్ష్మపతి భూపాల సముద్రము అని దీనికి మరోపేరు) లోని కొన్ని భూములను మధుర రాణి మీనాక్షిదేవి ఇమామ్ సాహెబ్ అనే ఫకీరుకు దానంగా ఇచ్చిన వివరాలను తెలిపే శాసనం. (వ.దే.వా-551)

## మధురవాణి

కాలం : క్రీ.శ. 17 వ శతాబ్దం.

ఆస్థానం : తంజావూరును పాలించిన రఘునాథుని ఆస్థానం.

స్థలం : తంజావూరు.

రచన : రామాయణమ్ (సం).

సన్మాన విశేషాలు : రఘునాథ నాయకుని చేత స్వర్ణాభిషేక గౌరవాన్ని పొందింది.

బిరుదులు : శుకవాణి.

సంస్కృతం, ప్రాకృతం మొదలైన షడ్భాషలలో ప్రవీణురాలు. శతలేఖిని విద్యలో దిట్ట. అరగడియలోనే (12 నిమిషాలు) వందశ్లోకాలు చెప్పగల నేర్పుగలది.

ఈమె రచనలు తెలుగులో ఏమీదొరకలేదు. రఘునాథ నాయకుని ఆస్థానంలో రామభద్రాంబ, మధురవాణి కవితా గోష్ఠిలో పాల్గొంటూ సమస్యా పూరణాలు చేస్తుండేవారని రఘునాథ నాయకాభ్యుదయం చెప్తోంది. రఘునాథ నాయకుడు రచించిన రామాయణాన్ని ఈమె సంస్కృతంలో వ్రాసి ఉండవచ్చునని కొందరు భావిస్తున్నారు. (ఆరుద్ర-11-114) (తం.ఆ.నా-237)

## మధురవాణీవిలాసము

కాలం : క్రీ శ. 17, 18వ శతాబ్దాల మధ్యకాలం.

కర్త : చింతలపల్లి చిన వీరరాఘవయ్య (చూ).

అంకితం : తిరుపతి వేంకటేశ్వరునికి.

కర్తృత్వాన్ని గురించి భిన్నాభిప్రాయాలున్నాయి.

ఐదు ఆశ్వాసాల గ్రంథం మాత్రం లభించింది. ప్రౌఢమైన కవిత్వం. కావ్యమంతటా కవి శాస్త్ర వైదుష్యం వెల్లడవుతున్నది. పాంచాలరాజు కుమార్తె మధురవాణిని కార్త్య వీరార్జునుడు వివాహమాడటం దీనిలోని ఇతివృత్తం. (ఆరుద్ర-11-213)

## మధురా పురాంధ్ర వాఙ్మయము

పూర్వపు పాండ్య మండలాన్నే మధుర సంస్థానంగా వ్యవహరిస్తున్నారు. దక్షిణదేశ సంస్థానాలలో ఇది ప్రముఖమైనది. ఇది ప్రాచీన కాలం నుండీ ద్రవిడ భాషా సంస్కృతులకు నిలయంగా ఉన్నది. కవియైన వానికే చోటునిచ్చే శంఖ ఫలకము పాండ్య దేశంలో ఉండేది. నక్కీరాది మహా కవులు అక్కడివారే.

శ్రీకృష్ణ దేవరాయల ప్రతినిధులుగా నాగమ నాయకుడు, అతని కుమారుడు విశ్వనాథ నాయకుడు ఈ మండలాన్ని జయించారు. ఆ వంశీయులే కొన్నాళ్ళు సామంతులుగా, తర్వాత స్వతంత్రులుగా ఈ మండలాన్ని పాలించారు. ఈ నాయకుల వెంట తెలుగు వారు చాలమంది ఈ దేశానికి తరలి వచ్చి అక్కడే స్థిరపడి పోయారు. తెలుగు కవులు, పండితులు తమ భాషా సారస్వతాలను ఈ తమిళ దేశంలో విస్తరింప జేశారు.

విశ్వనాథ నాయకుని స్థానాపతి రాయవాచకంతో ఇక్కడ తెలుగు వాఙ్మయం ఆరంభమైంది. రాయవాచకం చారిత్రక ప్రశస్తిగల రచన. వచన కావ్యం. మధురలో ముఖ్యంగా వచన వాఙ్మయం విస్తరిల్లింది లింగనమఖి శ్రీకామేశ్వర కవి, గణపవరపు వేంకటకవి, సముఖం వెంకటకృష్ణప్ప నాయకుడు, శేషం వేంకటపతి, కుందుర్తి కవులు, వీరిలో ప్రసిద్ధులు. మధురను పాలించిన నాయక రాజులు కూడా సాహితీ ప్రియులై కవి పండితులను పోషించారు. విజయరంగ చొక్కనాథుడు స్వయంగా కవి.

పాండ్య మండలంలోని చిన్న చిన్న సంస్థానాలు కూడా సాహిత్య సేవ చేశాయి. తమిళ కవులనే కాక తెలుగు కవులను కూడా వారు ఆదరించడం విశేషం. తురయ్యూరు, పుదుక్కోట, మైసూరు సంస్థానాలు ఇలాంటివే.

## మధురాపురాణము

నామాంతరం : చొక్కనాథ చరిత్ర (చూ).

కర్త : పచ్చకప్పురపు తిరువేంగళకవి (చూ).

## మధురా విజయమ్ (సం)

నామాంతరం : కంపరాయ చరితమ్.

కవయిత్రి : గంగాదేవి.
రచనా కాలం : క్రీ.శ. 14 వ శతాబ్దం.

విజయనగర సామ్రాజ్య చరమ కాలం నాటి చారిత్రక సామాజిక పరిస్థితులకు అద్దం పట్టే మహా కావ్యం. ఇది చారిత్రకంగానే కాక సాహిత్యపరంగా కూడా అమూల్యమైన గ్రంథంగా పండితులు భావిస్తున్నారు. సర్గకొకఛందం వాడి, కవయిత్రి తన వైదుష్యాన్ని వెల్లడించింది. అలంకార రచనలో కాళిదాసు ఛాయలు కనిపిస్తాయి. ఒక్కొక్కచోట కాళిదాసుకే మెరుగులుదిద్దిన కల్పనలున్నాయి. శైలి ద్రాక్షాపాకంలో ఉంది. ఈ కావ్యానికి తెలుగు అనువాదాలు, వివరణ గ్రంథాలు కూడా వెలువడ్డాయి (ప్రా.ద.భా చ)

## మధుసేనము (అలభ్యం)

కర్త : తెలియదు

అప్పకవి ఈ గ్రంథాన్ని పేర్కొన్నాడు.

## మధ్వతంత్ర ముఖమర్దనమ్ (సం)

కర్త : అప్పయ్య దీక్షితులు.

ఇది మతఖండన గ్రంథం. (తె.వి స-6)

## మధ్వపతి శేషగిరి రాయడు

కాలం : తెలియదు.

ఈయనను కీర్తిస్తూ కుంచాల సుబ్బారాయడనే కవి పద్యం చెప్పాడు. (చా.ప ర)

## మధ్వ విధ్వంసనమ్ (సం)

కర్త : అప్పయ్య దీక్షితులు.

ఇది మతఖండన చేసే వ్యాఖ్యాన గ్రంథం. (తె.వి.స-6)

## మనశ్శతకము

రచనాకాలం : క్రీ. శ. 18 వ శతాబ్దం.
కర్త : పరశురామ పంతుల లింగమూర్తి.

వేదాంత విషయ ప్రధానమైన కందపద్య శతకం. కవి దీనిని భద్రాద్రి శ్రీరామ చంద్రుని పేర వ్రాశాడు. ఈ శతకం పూర్వార్ధంలో గురుకీర్తనం, గురుదీక్ష, అన్యమత వాదనిరసనము, ఉత్తరార్ధంలో తత్త్వోపదేశం తదితరములైన అంశాలు ఉన్నాయి. "మనసా" అనే మకుటంతో ఉంది. (శ.క.చ-776)

## 'మనసా హరిపాదములాశ్రయింపవే' శతకము (అలభ్యం)

కర్త : కాసుల పురుషోత్తమకవి.

(శ.క.చ-487)

**మనస్సాక్ష్యము**

కర్త : చూ. వెలుగోటి సర్వజ్ఞ కుమార యాచేంద్రులు (క్రీ శ. 1832–92).

సకలమత స్వరూప నిరూపకమైన వచన రచన. (ఆం.సం.సా–461)

**మను చరిత్ర**

నామాంతరం : స్వారోచిష మను సంభవము (చూ).

కర్త : అల్లసాని పెద్దన. (క.త–7)

**మను చరిత్ర [ప్రతిపద టీక]**

రచనాకాలం : క్రీ. శ. 1851 ప్రాంతం.

కర్త : జూలూరి అప్పయ్యశాస్త్రి (చూ).

సుబోధకమై, వ్యావహారిక భాషలో ఉన్న ప్రతిపద టీక. ఇది చాలా ప్రసిద్ధి పొందినది (తె సా.విమర్శ–91)

**మనుమంచి భట్టు**

కాలం : క్రీ శ 1442–1456 ప్రాంతం కావచ్చు.

స్థలం : కర్ణాట మండలం.

రచన : హయలక్షణ విలాసము.

భైరవాచార్యుని పుత్రుడు. కవితాచాతురీ ధురీణుడు సాళువ కంపరాజు కాలం వాడు. కర్నూలు జిల్లా పెదచింతగుంట శాసనం ఈ కంపరాజుదే. ఇది క్రీ. శ. 1442 నాటిది. తన కావ్యాన్ని కవి కంపరాజుకే అంకితం చేశాడు. ఇతని కవిత్వం మృదువుగా ఉంటుంది. (క.త–6–117)

**మనుమసిద్ధి**

కాలం : క్రీ. శ. 1210–1288 ప్రాంతం.

నెల్లూరును పాలించిన రాజు. కవి పండిత పోషకుడు. నిర్వచనోత్తర రామాయణ కృతిపతి నెల్లూరు చోళరాజైన తిక్కరాజు కుమారుడు. ఈయన కవి తిక్కనకు మిత్రుడు, సహపాఠి అని పండితాభిప్రాయం. తిక్కన ఈయనకు మంత్రిగా, దండనాథుడుగా ఉండేవాడు. తిక్కరాజు మరణానంతరం మనుమసిద్ధి రాజ్యానికి వస్తే దాయాదులైన అక్కన బయ్యనలు, అతన్ని సింహాసన భ్రష్టుని చేశారు. అప్పుడు తిక్కన ఓరుగల్లు పోయి కాకతి గణపతిదేవుని సహాయమర్థించి, ఆ రాజుసాయంతో శత్రువులను పారద్రోలి మనుమసిద్ధిని సింహాసనంపై నిలిపాడు. అంతేగాక తన తొలి రచనమైన నిర్వచనోత్తర రామాయణాన్ని మనుమసిద్ధికే అంకితమిచ్చాడు. ఈయన జీవించి నంతకాలం తిక్కనను ఆదరించి పోషించాడు. (వా.చ)

## మనువంశ పురాణము

నామాంతరం : ఖండ కపాలాఖ్యానము.

రచనాకాలం : క్రీ. శ. 18 వ శతాబ్దం.

కర్త : పోచిరాజు వీరన్న.

అంకితం : బెజవాడలోని మల్లేశ్వరస్వామికి.

కవి తన ముప్పయ్యో ఏట దీన్ని రాశాడట. ప్రౌఢప్రబంధం. రచన చక్కని శైలిలో ఉంది. (క.చ-3-162)

## మనోబోధ

కర్త : కొలని గణపనారాధ్యుడు.

మంజరీ ద్విపద రచన. వేదాంత విషయ ప్రతిపాదకం. (ద్వి. సా. చ-289)

## మనోరమ

అల్లసాని పెద్దన రచించిన మనుచరిత్రలోని పాత్ర. మనుచరిత్ర ఆంధ్ర పంచ కావ్యాలలో ఒకటి.

మనోరమ ఇందీవరాక్షుడు అనే గంధర్వరాజు కూతురు. విభావసి, కళావతి ఈమె చెలికత్తెలు. వీరొక రోజు కైలాసంలో పువ్వులకోసం తిరుగుతూ ఒక గుహలో వికృతంగా ఉన్న మునిని చూస్తారు. మనోరమ బాల్యచాపల్యంతో ఆ మునిని తాకి చూస్తుంది. తపోభంగమై అతడు కోపించి రాక్షసుని వలన బాధలు పొందమని శపించి ఆమెను తన చేతిలోని నాగ బెత్తంతో మోదుతాడు. ఆమె చెలికత్తెలు అది చూడలేక అతన్ని మందలించబోగా ఆ ముని వారిని క్షయ రోగ పీడితులవుతారని శపిస్తాడు. శాప ఫలంగా మనోరమను ఒక రాక్షసుడు వెంట తరిమిబాధిస్తుండగా, ఆమె వేటకై వనానికి వచ్చిన స్వరోచిని శరణు వేడుతుంది. అస్త్ర హృదయమనే విద్యను స్వరోచికి ఉపదేశిస్తుంది. అంతలో రాక్షసుడు రావడం, స్వరోచి అతనితో యుద్ధంచేసి చంపడం జరుగుతుంది. ఆ రాక్షసుడు ఇందీవరాక్షుడే. స్వరోచికి మేనమామ వరుస వాడు. శాపంవలన ఆ రూపాన్ని పొంది స్వరోచివల్ల శాపవిముక్తుడైనాడు. తనకూతురు మనోరమను స్వరోచికిచ్చి వివాహం చేసి ఆయుర్వేద విద్యను అల్లునికి అరణంగా, ఇస్తాడు. వివాహమైన మనోరమ రోగపీడితలైన తన చెలికత్తెలను తలచుకొని దుఃఖిస్తుంది. కారణం తెలుసుకొన్న స్వరోచి తన ఆయుర్వేద విద్యతో వారిరువురినీ శాప విముక్తులను చేస్తాడు. మనోరమ చెలికత్తె లిరువురూ స్వరోచినే వరిస్తారు. వీరు ముగ్గురూ అన్యోన్యంగా ఉండటాన్ని కవి చక్కగా చిత్రించాడు. ఈమె స్నేహ శీలత, పతిభక్తి సాటిలేనివి. వీరి స్నేహానురాగాలను గురించి మానవులేగాక హంసలూ, చక్రవాక పక్షులూ కూడా మాట్లాడునట్లు కవి వర్ణించాడు. ఈమె పుత్రుడు విజయుడు.

## మనోరమాకుచమర్దనమ్ (సం)

కర్త : జగన్నాథ పండితరాయలు.

ఇది సంస్కృత వ్యాకరణ గ్రంథం. (తె. వి. స-4)

**మనోహర వ్యాఖ్య**

కర్త : మహామంత్రి తిమ్మరుసు.
మూలం : బాలభారతమ్ (సం).

అగస్త్యుడు సంస్కృతంలో వర్ణించిన పాండవుల చరిత్రయైన బాల భారతానికి సంస్కృతంలో వ్యాఖ్య. (తె. వి. స-6)

**మనోహర శతకము**

రచనాకాలం : క్రీ శ. 18వ శతాబ్దం.
కర్త : పరశురామ పంతుల రామమూర్తి.

వృత్త పద్య శతకం. "రఘువీర, మహీతనయా మనోహరా" అనే మకుటంతో చంపక మాలలూ, "అంబాల పురీశ రాఘవ నృపాల మహీతనయా మనోహరా" అనే మకుటంతో ఉత్పలమాలలూ ఉన్నాయి. రచన మధురమైనది. (శ. క. చ-405)

**మన్నారు కవి (మన్నారయ్య)**

కాలం : క్రీ. శ. 18వ శతాబ్దం

ఈయన పుదుకోట ప్రభువైన కోటి రఘునాథ రాయలను కీర్తిస్తూ చాలా చాటువులు చెప్పాడు. చూ. శ్రీమన్నారాయణయ్య. (చా. ప. ర.)

**మన్నారు కృష్ణ శతకము**

రచనాకాలం : క్రీ. శ. 1660 ప్రాంతం.
కర్త : పైడిపాటి వేంకట నృసింహకవి

"వారుకర మందహాస పోలూరివాస, వారి తామిక కృష్ణమన్నారు.కృష్ణ" అనే మకుటంతో చక్కని సీస పద్యాలున్నాయి. బాలదశకం, నీతిదశకం, దాసనంగ దశకం, జారదశకం, పితృమాతృదశకం, చోర దశకం, గోపాల దశకం, దుష్టనిగ్రహ దశకం, శిష్ట ప్రతిపాలన దశకం ఇత్యాదిగా దశక విభాగం ఉంది. (శ.క.చ-269)

**మన్నారు దాస విలాస నాటకము**

కవయిత్రి : (చూ) రంగాజమ్మ.
అంకితం : విజయరాఘవ నాయకునికి.
రచనాకాలం: క్రీ శ 17వ శతాబ్దం.

విజయరాఘవ నాయకుని వివాహ వృత్తాంతం ఇందులోని కథ. కవయిత్రి విద్యావిశేషాలు, జ్యోతిష పరిజ్ఞానం, లోకజ్ఞత, హాస్యరస సంవిధానం రచనలో వెల్లివిరుస్తున్నాయి. నాటి సాంఘిక పరిస్థితులను, ఆచార వ్యవహారాలను ప్రతిబింబిస్తున్న మనోహరమైన రచన. దీనినే కవయిత్రి ప్రబంధంగా కూడా రాసింది. (ద దే.వా-136)

**మన్నారు దాస విలాస ప్రబంధము**

కవయిత్రి : (చూ) రంగాజమ్మ.

అంకితం : విజయరాఘవ నాయకునికి (క్రీ. శ. 1633-73).

అయిదాశ్వాసాల ప్రబంధం. మన్నారుదాస విలాస నాటకంలోని కథనే క్షవ యిత్రి మరింత పరిపుష్టంగా ప్రబంధంగా సంతరించింది. నాయకరాజుల చరిత్రకు మిక్కిలి ఉపకరించే రచన. విజయరాఘవుని వైభవవిశేషాలు, ఫాల్గుణోత్సవ వైభవం, సమకాలీన సంఘజీవితం విస్తారంగా ఉన్నాయి. తంజావూరు నాయకరాజుల వంశవర్ణనం విపులంగా ఉంది. (ద.దే.వా-149)

## మన్నారు దాసుడు

నామాంతరం : విజయరాఘవ నాయకుడు.

తంజావూరును పాలించిన విజయరాఘవుడు (క్రీ. శ. 1633-73,) వీరవైష్ణవ శిఖామణి. రాజగోపాలుని (మన్నారు) భక్తుడు. తాను మన్నారుదాసుడనని చెప్పుకొన్నాడు.

సమకాలికులితన్ని మన్నారుదాసుగా పేర్కొన్నారు రంగాజమ్మ రాసిన మన్నారుదాస విలాస నాటకం విజయరాఘవుని ఉద్దేశించి రచించినదే.

## మన్నారు దేవుడు

కాలం : క్రీ. శ. 17వ శతాబ్దం.

రచనలు : 1. విజయ రాఘవాభ్యుదయము (అలభ్యం) 2. హేమాబ్జ నాయికా స్వయంవరము (నాటకము).

ఇతడు క్రీ శ. 1633-73ల నడుమ తంజావూరును పాలించిన విజయ రాఘవుని పుత్రుడు. రాజగోపాలాంబిక ఇతని తల్లి. మన్నారుదేవుడు ఏ కారణం చేతనో తండ్రిచేత కారాగారంలో పెట్టబడ్డాడు మధుర చొక్కనాథ నాయకుడు తంజావూరును ముట్టడించినపుడు క్రీ.శ. 1673 లో విజయరాఘవుడు కుమారుని చెరసాలనుంచి విడిపించాడనీ, ఇద్దరూ యుద్ధంచేసి వీరమరణం పొందారనీ చరిత్ర చెబుతున్నది. ఇతడు విజయ రాఘవాభ్యుదయాది ప్రబంధాలు రచించినట్టు చెప్పుకొన్నా దొరికింది మాత్రం హేమాబ్జ నాయికా స్వయంవరం ఒక్కటే.

ఇతడు కనకతులా ప్రముఖదానాలు చేశాడనీ, అగ్రహార ప్రతిష్ఠాత అనీ తెలుస్తున్నది. ఇతడు తండ్రి ఆస్థానంలో, సభలో ఉన్నట్లు రంగాజమ్మ ఉషాపరిణయంలో పేర్కొన్నది ఇతని రచన మృదుమధురంగా ప్రౌఢంగా ఉంది. (ద.దే.వా-168)

## మన్నారు రంగపదములు, కీర్తనలు

చూ. వంగల సీనయ్య పదములు, కీర్తనలు

## మన్నారు శతకము

నామాంతరం : సంపంగిమన్న శతకము (చూ.).

కర్త : పరమానంద తీర్థుడు.

## మన్నారు సాంగత్యము (అలభ్యం)

కర్త : విజయరాఘవనాయకుడు.

రచనాకాలం : క్రీ.శ. 17 వ శతాబ్దం.

## మన్మమండరాజు శాసనము

కాలం : క్రీ.శ. 1130 ప్రాంతం.

స్థలం : గుంటూరు జిల్లా,-నరసారావుపేట తాలూకా-నాదెండ్ల గ్రామం.

శాసన ప్రదాత : మనుమండరాజు.

శాసన విషయం : ఈయన శూద్ర కులానికి (చతుర్థ వంశ విస్తారకులు) చెందిన రాజట. ఈయన తాత ఎఱ్ఱమండరాజు, తండ్రి బుద్ధరాజు. ఈయన నాదెండ్లలో వేంచేసియున్న మూల స్థానేశ్వరునకు అఖండ దీపం ఇచ్చినాడు. దీనిలో రెండు ఉత్పల మాలలు, ఒక మత్తేభం, రెండు కంద పద్యాలున్నాయి. (తె క.చ-196,197)

## మయూఖావళి (సం)

కర్త : అప్పయ్య దీక్షితులు.

కుమారిల భట్టు మతాన్ని విశదపరిచే మీమాంసా గ్రంథం. ఇది మీమాంసకుల పొగడ్తల నందినదట. (తె. వి స-6)

## మయూర స్తవము (అలభ్యం)

రచనాకాలం : క్రీ. శ. 1150 ప్రాంతం.

కర్త : మల్లికార్జున పండితుడు.

## మరింగంటి

వంశనామం.

ఈ పేరు మరిగల్లు అనే గ్రామాన్ని బట్టి ఏర్పడిందని కొందరంటారు. ఒకప్పుడు భక్తాగ్రేసరులైన లక్ష్మణముని, కూరేశాచార్యులు, అసూరి సాధు భట్టారకుడు శ్రీరంగంలోని శ్రీరంగశాయిని దర్శించడానికి వెళ్ళారట. వారిలో మొదటి ఇద్దరినీ గుర్తించిన శ్రీరంగనాథుడు మూడవ అతన్ని గురించి, 'మరింగంటి నాతడెవ్వడని' అడిగాడట. అప్పటి నుండే సాధుభట్టారకుడు మరింగంటి సాధు భట్టారకుడుగా ప్రసిద్ధి పొందాడు. అతని వంశం వారంతా మరింగంటి వారయ్యారని చెప్తారు. (క.త-13-7)

## మరింగంటి అప్పలాచార్యులు

కాలం : క్రీ. శ. 16 వ శతాబ్దం.

స్థలం : నైజాం మండలం.

సమకాలికులు : గోలకొండ మల్కిభరాముడు, పొన్నిగంటి తెలగన్న, అమీన్‌ఖాన్ మొదలగు వారు.

గోలకొండ కుతుబ్షాహిల ఆస్థానంలో ఉండేవారు. సాహిత్యప్రియుడు. ఈయన దశరథరాజనందన చరిత్ర, సీతాకల్యాణం కావ్యాలను తెలుగులో తొలిసారి నిరోష్ఠ్యంగా వ్రాసిన సింగరాచార్యులకు పెద్దన్న. తెలగన్న అచ్చ తెలుగులో యయాతి చరిత్ర

వ్రాస్తున్న విషయం తెలుసుకొని, కుతుబ్‌షాహికి హితవరి అయిన అమీన్‌ఖాన్ తెలగన్న కావ్యాన్ని అంకితం పుచ్చుకోవాలని ఈ అప్పలాచార్యుల ద్వారా వర్తమానం పంపాడు. తెలగన్న సంతోషించి అమీన్‌ఖాన్‌కు తన కృతిని అంకితమిచ్చి ఎన్నో బహుమానాలు పొందాడు. తెలగన్న కావ్యరచనకు అప్పలాచార్యుల ప్రోత్సాహం లభించింది. ఈయన ఏమైనా కృతులు వ్రాశాడో లేదో తెలియదు. (అరుద్ర-8-260)

## మరింగంటి (ఆసూరి) రామానుజాచార్యులు

కాలం : క్రీ. శ. 16 వ శతాబ్దానికి ముందు.
స్థలం : నైజాం మండలం.

మరింగంటి వారి పూర్వీకులలో ఒకరు. ప్రసిద్ధ పండితులు గోలకొండ కుతుబ్ షాహిల కొలువులో ఉండేవారు వీరికి మొదట ఆసూరి వారనే ఇంటిపేరుండేదట. ఈ రామానుజాచార్యుల వారు శ్రీరంగం దర్శించినప్పుడు, ఆ దేవుడే అన్న పలుకులవల్ల వీరికి మరింగంటి వారనే వ్యవహారం వచ్చింది. (అరుద్ర-8)

## మరింగంటి కవులు

కాలం : క్రీ.శ. 16 శతాబ్దం నుంచి క్రీ.శ. 19 శతాబ్దం వరకు.
స్థలం : హుజూరునగర్ తాలూకా యాతవాకిళ్ళ గ్రామం.

ఆంధ్రకవులు. తరతరాలుగా సంస్కృతాంధ్ర భాషా వతంసులుగా పేరు మోసిన ఆసూరి మరింగంటి శ్రీవైష్ణవ కుటుంబాలకు తెలంగాణంలో నల్లగొండ మండలం నిలయం. విశిష్టాద్వైత మత ప్రవక్తలయిన శ్రీ రామానుజుల వారి ఇంటి పేరు కూడా ఆసూరి వారే. ఈ ఇంటి పేరుతోపాటు - 'మరింగంటి' అనే మరొక ఇంటి పేరు కూడా ఈ కుటుంబానికి రావటానికి కారణం- తాలాంక నందినీ పరిణయకర్తయైన మరింగంటి నరసింహాచార్యులు తన గ్రంథంలో చెప్పాడు.

వీరిలో ప్రముఖ కవులు :

1. మరింగంటి సింగరాచార్యులు 2. మరింగంటి (ప్రథమ) వేంకటనృసింహాచార్యులు 3. మరింగంటి వేంకట రాఘవాచార్యులు 4. మరింగంటి వేంకట (ద్వితీయ) నృసింహాచార్యులు 5. మరింగంటి చెన్నకృష్ణమాచార్యులు 6. మరింగంటి వేంకట (తృతీయ) నృసింహాచార్యులు 7 మరింగంటి రంగాచార్యులు 8. మరింగంటి వేంకట రామానుజాచార్యులు 9. మరింగంటి వేంకట (చతుర్థ) నృసింహాచార్యులు 10. మరింగంటి లక్ష్మణాచార్యులు 11 మరింగంటి లక్ష్మణదేశికులు. (తె వి.స-6)

## మరింగంటి చెన్నకృష్ణమాచార్యులు

కాలం : క్రీ శ. 19 వ శతాబ్దం పూర్వార్థం.
స్థలం : నల్లగొండ జిల్లా-కనగల్లు గ్రామం.
రచన : యాదగిరి నృసింహ శతకము.

(తె వి.స-6)

## మరింగంటి జగన్నాథసూరి

రచనలు : తెలియరాలేదు.

మరింగంటి కవులలోని వాడు. శతావధాని. బహు గ్రంథకర్త. సంస్కృతాంధ్రాలలో రచనలు చేశాడు. నేబతి కృష్ణమంత్రి ఇతన్ని తన రాజనీతి రత్నాకరమనే పంచతంత్రంలో నుతించాడు. ఇతడు కనకాభిషేకం పొందిన వాడట. (ఆరుద్ర-8-261)

## మరింగంటి లక్ష్మణదేశికులు

కాలం : క్రీ.శ. 19 వ శతాబ్దం.
స్థలం : వరంగల్లు జిల్లా, జనగామ తాలూకా, మల్లంపల్లి గ్రామం.
రచనలు : 1. కారికావళి 2. సూక్తి రత్నమాల 3. రామానుజాష్టోత్తరశతకము.
(తె.వి స-6)

## మరింగంటి వేంకట (తృతీయ) నరసింహాచార్యులు

కాలం : క్రీ శ. 19 వ శతాబ్దం.
స్థలం : కనగల్లు.
రచనలు : అనిరుద్ధ విలాసము (యక్షగానం).

వీరు పూర్వపు మరింగంటి కవులు వ్రాసిన తాళపత్ర గ్రంథాల నన్నింటిని పదిలపరిచిన శ్రీరంగాచార్యులకు జనకుడు. ఈయన కుమారులలో వేంకటరామానుజాచార్యులు - వేంకట (చతుర్థ) నృసింహాచార్యులు సుమారు 20 నాటకాలు వ్రాశారట. ఈయన కొడుకులలో చిన్నవాడైన లక్ష్మణాచార్యులు అనేక హరికథలు వ్రాసి ప్రచారం చేశారు. (తె.వి.స-6)

## మరింగంటి వేంకట [ద్వితీయ] నరసింహాచార్యులు

కాలం : క్రీ.శ. 1842 ప్రాంతం.
స్వస్థలం : నల్లగొండ జిల్లా - కనగల్లు గ్రామం.
రచన : 1 తాలాంక నందినీ పరిణయము 2. ఇందిరాల భాగవతము (ఇందిరాల గోదాపారిజాతము).

ఈతని కృతులు రెండూ అముద్రితాలు. ఈయన మరింగంటి సింగరాచార్యులకు ఎనిమిదో తరంవాడు.

## మరిగంటి వేంకట (ప్రథమ) నృసింహాచార్యులు

కాలం : క్రీ.శ. 1770 ప్రాంతం.
స్థలం : నల్లగొండ జిల్లా-కనగల్లు గ్రామం.
రచనలు : 1 జనక సుతాభ్యుదయము 2 శ్రీకృష్ణ శతానందీయము 3. చిలువ పడగలేని పేరణము 4. నృకంఠీరవాభ్యుదయము 5 క్షత్రబంధోపాఖ్యానము 6 జాంబవతీ కుమార శృంగార విలాసము 7. రామానుజాభ్యుదయము 8. శల్యపిళ్ళ రామచరిత్ర 9 విష్వక్సేన ప్రకారము 10 గోదా

వధూటీ పరిణయము 11. పద్మినీ కన్యకాభ్యుదయము 12. రతి మన్మథాభ్యుదయము 13. మిత్ర విందోపాఖ్యానము 14. శ్రీకృష్ణ తులాభారము (ద్విపద).

ఈయన మరింగంటి సింగరాచార్యులకు ఆరో తరం వాడట. కవి తాను 16 గ్రంథాలు వ్రాసినట్లు ఆశ్వాసాంత గద్యలో చెప్పాడు. శ్రీకృష్ణ తులాభారాన్ని ద్విపదగా చెప్పాడు వీటి తాళపత్ర ప్రతులు కనగల్లు అనే గ్రామంలో శ్రీరంగాచార్యులనే ఆయన గ్రంథాలయంలో ఉన్నాయట. (తె.వి స-6)

మరింగంటి వేంకట రాఘవాచార్యులు

కాలం : క్రీ.శ. 19 వ శతాబ్దం.
స్థలం : నల్లగొండ జిల్లా-కనగల్లు గ్రామం.
రచనలు : 1. కేశవస్వామి శతకము 2. క్షమావింశతి.

ఈయన సింగరాచార్యులకు ఎనిమిదో తరం వాడు (తె వి.స-6)

మరింగంటి వెంకటార్యుడు

కాలం : క్రీ.శ. 1700 ప్రాంతం.
రచన : మల్లాది చరిత్ర (ద్విపద).

కవి సంస్కృతాంధ్రాలలో దిట్ట. వర్ణనాత్మకంగా రచన చేశాడు. ఇతని ఇతర రచనలు తెలియరాలేదు. (ద్వి.సా.చ-153)

మరింగంటి సింగరాచార్యులు

కాలం : క్రీ. శ. 16వ శతాబ్ది ఉత్తరార్ధం.
స్థలం : నల్లగొండ జిల్లా-పణకరాజు పల్లె గ్రామం.
బిరుదు : కవిసార్వభౌముడు, శత ఘంటావధాని.
రచనలు : 1. వరదరాజస్తుతి 2. శ్రీరంగ శతకము 3. చక్రలాంఛన విధి 4. కవి కదంబము 5 శతసంహిత 6. రామకృష్ణ విజయము (ద్వ్యర్థి) 7. నాటకశాస్త్రం 8. ధనాభిరామము 9. ప్రేమాభిరామము 10. నల యాదవ రాఘవ పాండవీయము (చతురర్థి) 11. సకలాలంకార సంగ్రహ రాధా సుధా పూరణము 12. ఆంధ్ర భాషా భూషణము 13. దశరథరాజ నందన చరిత్ర (నిరోష్ఠ్య రామాయణము) 14. నిరోష్ఠ్య శుద్ధాంధ్ర సీతా కల్యాణము 15. తారకబ్రహ్మ రామ శతకము 16. శ్రీకృష్ణ శతానందీయము 17. కృష్ణతులాభారము 18. రతి మన్మథాభ్యుదయము 19 రామాభ్యుదయము.

సీతాపతి శతకం ఇతనిదే అని కొందరి అభిప్రాయం.

సమకాలికులు : పొన్నిగంటి తెలగనార్యుడు.

ద్వైక ప్రబంధ రచనాధురీణుడు, ఆశుకవి, అష్టభాషలలో కవిత చెప్పగల దిట్ట "శత ఘంటావధాన" అని "శారదా ప్రశ్న వివరణ" అనీ గద్యలో చెప్పుకొన్నాడు.

ఇతని జన్మస్థలం హుజూరునగర్ తాలూకా యాతవాకిళ్ళ గ్రామం అని కొందరంటున్నారు. వీరి ఇంటిపేరు మొదట "ఆసూరి వారు". మరింగంటి అనే ఇంటిపేరు రావడానికి కారణంగా ఒక కథ ప్రచారంలో ఉంది. ఇతని వంశంలో చాలామంది కవులు కుతుబ్‌షాహిల కొలువులో ఉండేవారు. విజయనగర పాలకులు ఇతనికి కవిసార్వభౌమ బిరుదం ఇచ్చి ఉంటారని ఊహిస్తున్నారు.

ఈయన ఇబ్రహీం కుతుబ్‌శాహి (మల్కిభరాముడు) కొలువులో ఉన్నాడు. రాజనీతి రత్నాకరమనే పంచతంత్రాన్ని వ్రాసిన నేబతికృష్ణమంత్రి ఈయనను నుతించాడు. ఈయన సకలైశ్వర్య ధురీణుడట. ఈయన తొలిసారిగా తెలుగులో నిరోష్ఠ్యంగా కావ్యాలు చెప్పాడు. ఈయన వ్రాసిన దశరథ రాజ నందన చరిత్ర, నిరోష్ఠ్య శుద్ధాంధ్ర సీతాకల్యాణం తెలుగులో తొలి నిరోష్ఠ్య కావ్యాలు. దొరికిన సాక్ష్యాలవల్ల ఈయన ఉద్దండ కవి అని చెప్పవచ్చు ఇతనిని అశ్వపతులు, నరపతులు, గజపతులు సమానంగా సత్కరించారు ఇతనికి "మల్కిభరాముడు" మదపుటేనుగులు, వెల్లగొడుగులు, ముత్యాల హారాలు, గుర్రాలు, అందలాలు, అగ్రహారాలు ఇచ్చాడట ఇతడు తొమ్మిది సంవత్సరాల వయసు నుంచే కవిత్వం చెప్ప నేర్చినకవి. ఇతని సోదరులలో అప్పలాచార్యులు, జగన్నాథసూరి ప్రసిద్ధులు. చిన్నతనంలో ఇతనికి సరస్వతీదేవి ప్రత్యక్షమై నాలుగు ప్రశ్నలు అడిగినట్లు, వాటికి ఇతడు సమాధానం చెప్పినట్లు తెలుస్తున్నది. ఆశ్వాసాంత గద్యంలోకవి ప్రయోగించిన శారదా ప్రశ్న వివరణ అనే మాట పైగాథను సూచిస్తుంది. 20 ఏళ్ళ వయసు లోపలనే పై కావ్యాలన్నీ వ్రాసాడట (క. త-13; శ. క. చ-393; ఆంధ్ర-8-259)

మరి బసవ పురాణము

రచనాకాలం : క్రీ. శ. 15వ శతాబ్దం.

కర్త : బచ్చు సిద్ధకవి

అంకితం : సిరిపురి వీరసింగయకు.

అయిదాశ్వాసాల ద్విపద ప్రబంధం. శైవ వాఙ్మయానికి చెందినది. ప్రసిద్ధ వీరశైవాచార్యుడైన బసవేశ్వరుడు కాక, మరియొక బసవాచార్యుని చరిత్ర ఇందులోని ఇతివృత్తం. కనుకనే కవి దీనికి మరి బసవపురాణమని నామకరణం చేశాడు. కవి అన్ని విధాలా పాల్కురికి సోమనాథుని అనుకరించాడు. కథాశ్రోత చరలింగ మర్దల పర్వతార్యుడు. కృతిపతి సిరిపురి వీరసింగయ సిద్ధకవికి దీక్షా గురువు రచనలో కన్నడపదాలు ఎక్కువగా కనిపిస్తాయి. (ద్వి.సా చ-157)

మరీచీ పరిణయము (అలభ్యం)

రచనాకాలం : క్రీ. శ. 16వ శతాబ్దం.

కవయిత్రి : మోహనాంగి.

ఐదాశ్వాసాల ప్రబంధమట. (ఆం. కవయిత్రులు-25)

మరుత్తరాట్చరిత్రము (అలభ్యం)

కర్త : శ్రీనాథుడు.

దీనిని కవి "చిన్నారి పొన్నారి చిఱుత కూఁకటినాడు" వ్రాశానని చెప్పాడు. అంటే 12 సంవత్సరాల ప్రాయంలోనే దీనిని వ్రాసినట్లు పండితులు నిర్ణయించారు. ఇది శ్రీనాథుని తొలిరచన. శృంగార నైషధంలోని ఒక పద్యం నుండి శ్రీనాథుని కృతులు పెక్కులు మామిడి ప్రెగడయ్యకు అంకితాలని తెలుస్తున్నది. అందులో ఈ మరుత్తరాట్చరిత్రకూడా చేరి ఉండవచ్చునని కొందరి అభిప్రాయం. మామిడి పెద్దన్న కుమారులు ముగ్గురు వేమనామాత్యుడు, ప్రెగడన్న, సింగనామాత్యుడు. ఇందులో ప్రెగడన్నకూ సింగనకూ శ్రీనాథుడు తన కృతులను అంకితం చేశాడు. సింగనామాత్యుని వంశవర్ణనం చేసేటప్పుడు వేమననూ, ప్రెగడన్ననూ శ్లాఘించాడు. వేమనామాత్యునికి కూడా కొన్ని కృతులు ఇచ్చి ఉండవచ్చును. (శ్రీనాథుడు-కొ.శ్రీ-69)

**మరుత్సందేశము (అలభ్యం)**

కర్త : వేములవాడ సోమనాథుడు (చూ).

**మరున్నందన శతకము**

కర్త : చూ. పట్టాభిరామకవి (కర్తృత్వం సందేహం).

ఆంజనేయస్వామి పరమైన శతకరచన. కొన్ని పద్యాలు మాత్రం దొరికాయి "తవదాసోహమ్మరున్నందనా" అనేది మకుటం. అప్పకవీయంలో పేర్కొనబడిన మరున్నందన శతకం పట్టాభిరామకవి కృతం కాదని పలువురి అభిప్రాయం. అప్పకవి లుప్త విసర్గవళికి ఉదాహరణగా మరున్నందన శతకంలో నుండి ఒక పద్యం చూపాడు. దానిని బట్టి ఆ కవి అప్పకవికి పూర్వుడై ఉండాలి. పట్టాభిరామ కవి అంత పూర్వుడు కాడని పండితాభిప్రాయం. ఇతడు వేరు కావచ్చు. (ఆం.సం.సా. 194)

**మర్యాద రామన చరిత్రము (అలభ్యం)**

కర్త : వెలగపూడి వంశానికి చెందిన కవి. పేరు తెలియదు.

ఈ గ్రంథాన్ని వెలగపూడి కృష్ణయామాత్యుడు తన భానుమద్విజయావతారికలో పేర్కొన్నాడు. (ద.దే వా-388)

**మల్లికృష్ణ భూపాలుడు**

కాలం : క్రీ శ. 1740 ప్రాంతం.

స్థలం : రామకృష్ణాపురం.

నెల్లూరి శివరామ కవికి ఆశ్రయ మిచ్చిన సర్దారు. సాహిత్యపోషకుడు. శివరామ కవిచేత యోగశాస్త్రాన్ని తెనిగింపజేసి దైవాంకితం చేయించాడు. ఇది రామగీతలనే పేర ప్రఖ్యాతమైంది. (ఆరుద్ర-12-151)

**మల్లిచ్ఛందము**

రచన : క్రీ.శ. 16 శతాబ్దికి పూర్వం.

కర్త : పేరు తెలియదు.

అంకితం : చదలవాడలోని శ్రీరామునికి.

మట్రికంటివారి ప్రయోగం అని ఒక ప్రయోగాన్ని పెనుమత్స వెంకటా ర్యుడనే లక్షణ గ్రంథకర్త తన 'లక్షణ విలాసం'లో చూపించాడు. ఈ మట్రికంటివారి ప్రయోగం 'మరింగంటి' వారి ప్రయోగమేమోనని పండితులు అనుమానిస్తున్నారు. "మట్రిచ్ఛందం" అనే పేరుతో ఒక గ్రంథం మద్రాసు ప్రాచ్యలిఖిత గ్రంథాలయంలో ఉంది. (ఆరుద్ర-9-249)

## మట్రి పేరయ్య నాయుడు

కాలం : తెలియదు.

స్థలం : గుత్తశైల సీమలోని దొడ్లేటి పట్టణం.

సాహిత్య పోషకుడు శేషభట్టరు అప్పలాచారి చేత, "రామకృష్ణ లీలావిలాసం" వ్రాయించి భద్రాద్రి రాముడికి అంకితం ఇప్పించాడు. (ఆరుద్ర-11-269)

## మలకాపుర శాసనము

కాలం : కాకతి గణపతిదేవ, రుద్రాంబలకాలం. క్రీ. శ. 13వ శతాబ్ది.

విషయం : గణపతిదేవుడు, రుద్రాంబల నుండి గ్రహించిన మందరం, వెలంగపూండి గ్రామాలను విశ్వేశ్వరుడు గోళకీమఠానికి ఇవ్వడం.

ప్రత్యేకత : ఈ శాసనంలో గణపతిదేవుని దీక్షాగురువు విశ్వేశ్వర దేశికుని చరిత్ర ఉంది ఆనాటి సాంఘిక పద్ధతులు, మతాలకు సంబంధించిన విషయాలున్నాయి. విశ్వేశ్వర గోళకీమఠం, శివాలయం, సత్రం, ప్రసూత్యారోగ్యశాలలు ఇందులో ప్రసక్తాలు. (క త-3)

## మలయమారుతము సర్వన్న

కాలం : క్రీ. శ. 16వ శతాబ్దం.

రచన : భాగవత షష్ఠ స్కంధము.

చూ. శిపుల షష్ఠము.

ఇతని షష్ఠస్కంధంలోని ఒక పద్యాన్ని జగ్గన్న తన ప్రబంధ రత్నాకరంలో ఉదాహరించాడు. పోతన భాగవతంలోని షష్ఠ స్కంధం ఖిలమైతే ఆ భాగాన్ని ఇతడు పూరించాడట. (క.స-284)

## మలయ రాజీయము (అలభ్యం)

రచనాకాలం : క్రీ. శ. 1150 ప్రాంతం.

కర్త : మల్లికార్జున పండితుడు.

శైవమత పరమైన రచన.

## మలయవతి (సం)

కర్త : చూ. నరసింహుడు.

గద్యకావ్యం. (ప్రా.ద.భా.చ-న.రా.అ)

**మలయాద్రి నారసింహచ్ఛందస్సు (అలభ్యం)**

కర్త : లింగరాజు.

అంకితం : శ్రీ మలయాద్రి నృసింహస్వామికి.

ఛందోగ్రంథం. "నృసింహ మాల్యాదిచ్ఛందస్సు" అనే కర్త తెలియని ఛందోగ్రంథమొకటి ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారంలో ఉన్నదట. ఆ గ్రంథం ఇదే కావచ్చునేమో. (క.స-213; కవిజనాశ్రయ-పీఠిక-213)

**మలరాజు గుండారాయణోపాఖ్యానము (అలభ్యం)**

రచనాకాలం : క్రీ. శ. 18 వ శతాబ్దం.

కర్త : రాళ్ళబండి పట్టాభిరామకవి.

కవి తొలుత మలరాజు పెద వెంకట గుండారావు ఆస్థానంలో ఉండి తర్వాత వాసిరెడ్డివారి సంస్థానంలో చేరాడు ఇది ఎప్పుడు రచించాడో తెలియరావడం లేదు. ఇతడు గుండారాయని పొగడుతూ రచించిన పద్యాలు, తిడుతూ వ్రాసిన పద్యాలుకూడా చాటువులలో దొరుకుతున్నాయి. వాసిరెడ్డివారి సంస్థానానికి చేరకముందే ఈ కావ్యం గుండారాయనిపేర రచించాడని కొందరు భావిస్తున్నారు. (చా.ప ర; ఆం.సం.సా-194)

**మలరాజు వేంకట నరసింహరాయలు**

కాలం : క్రీ.శ. 19 వ శతాబ్దం.

స్థలం : వినుకొండ.

ఈయన వినుకొండ ప్రభువు. కవి పండితపోషకుడు తన అస్థానానికి వచ్చిన మోచర్ల వెంకన్న కవిని తగురీతిగా బహూకరించి పంపాడట. (చా.ప.ర)

**మలహణము (అలభ్యం)**

కర్త : మల్లికార్జున పండితుడు.

శైవ మతపరమైన రచన.

**మల్కిభరాముడు**

నామాంతరం : (చూ) ఇబ్రహీం కుతుబ్‌షాహి.

తెలుగు దేశంలోని కొంత భాగాన్ని పాలించాడు. కృష్ణామండలంలోని ఇభరాంపట్నం ఇతనిపేరనే కట్టారు. ఈయనపై చాలమంది కవులు చాటు పద్యాలు చెప్పి బహుమానాలు పొందారట. (చా ప.ర)

**మల్రాజు కొండలరాయుడు**

కాలం : క్రీ. శ. 18 వ శతాబ్దం- ప్రథమభాగం.

స్థలం : నరసరావుపేట సంస్థానం.

సాహిత్యపోషకుడు. నరసరావుపేట సంస్థానాధిపతులలో ఆద్యుడైన మల్రాజు తిరుమలరాయని మనుమడు. తండ్రి మల్రాజు వల్లభరాయడు. తండ్రితరువాత క్రీ. శ.

18 వ శతాబ్దం ప్రథమభాగంలో ఇతడు సంస్థానాన్ని పాలించాడు. ఇతడు సాహిత్యానికి చేసిన సేవ ఎటువంటిదో వివరాలు అధికంగా తెలియవు కాని, రంగరాయ చరిత్రలో 'విద్వద్గృహాంగణావిర్భూత నిజరూప సంరంభయుత సౌరభ సౌరభేయి ... కవిజనానీక లోక ప్రమోదాపాది' అని పేర్కొనబడినాడు. (ఆం.సంసా -194)

## మల్రాజు పెద వేంకట గుండారాయడు

కాలం : క్రీ. శ. 18 వ శతాబ్దం చివర-19వ శతాబ్దం ప్రారంభం.

స్థలం : నరసరావుపేట సంస్థానం (సంస్థానాధీశ్వరుడు).

కవి పండిత పోషకుడు. క్రీ. శ. 18వ శతాబ్దం ఉత్తరార్ధంలో నరసరావుపేట సంస్థానాన్ని పాలించిన రాజా వేంకట నరసింహారాయణి జ్యేష్ఠ పుత్రుడు. వీరు అత్యంత సమర్థులైన పాలకులు. జమీందారీ శాశ్వతకర నిర్ణయం వీరి కాలంలోనే జరిగింది. పెద్దాపురం, రేపల్లె, సైదాపురం జమీందారీ భాగాలను వేలంలో ఖరీదు చేసి జమిందారీని విస్తరింప చేశారు. ఈ గుండా రాయణింగారే క్రీ. శ. 1797లో "అట్లూరు" గ్రామంలో కోట పేటలు కట్టించి రాజధానిని అక్కడకు మార్చి, దానిని తండ్రి పేర "నరసరావుపేట"గా మార్చారని కొందరి అభిప్రాయం. వేంకట నరసింహారాయడే స్వయంగా తనపేర ఆ నగర నిర్మాణం చేయించాడని మరికొందరి అభిప్రాయం.

ఇతడు దాన ధర్మాలకు పెట్టినది పేరు. వీరి భార్య రాణీ లక్ష్మమ్మ కూడా వితరణ గుణంలో భర్తను మించిపోయారు. ఇరువురూ సాహిత్య వ్యాసంగాలలో మంచి అభిరుచి కలవారు. తాడికొండ మల్లనారాధ్యులు, పట్టాభిరామకవి, మతుకుమల్లి కనకాద్రి శాస్త్రి మొదలగు కవి పండితులను ఆస్థానంలో ఉంచుకొని పోషించి, ఆంధ్రసాహిత్యానికి ఇతోధికంగా సేవచేశారు. రాళ్ళబండి పట్టాభిరామ కవిని గూర్చి ఒక కథ ప్రచారంలో ఉంది. ఈ కవి వాసిరెడ్డి వెంకటాద్రి నాయని కొలువుకు పోయి, గుండారావును కించ పరుస్తూ, వేంకటాద్రి నాయని పొగడుతూ పద్యాలు చెప్పాడట. అది విన్న గుండారావు పట్టాభిరామరాజు సీమలో అడుగు పెడితే ఫిరంగులతో కాల్చి చంపమని కట్టడి చేశాడు. విషయాన్ని తెలుసుకొన్న భట్టుకవి నాయడుగారి ఆస్థానంలోనే చేరి, వెలమ ప్రభువైన గుండారావును మరింత నిందిస్తూ పద్యాలు చెప్పాడు.

(ఆం. సం. సా-191, 192, 194; చా. ప. ర.)

## మల్రాజు రామారాయుడు

కాలం : క్రీ. శ. 18 వ శతాబ్దం.

స్థలం : నరసరావుపేట సంస్థానం.

కృతిపతి. నరసరావుపేట సంస్థానాన్ని పాలించిన "మల్రాజు" వారి వంశానికి చెందినవాడు. క్రీ. శ. 18వ శతాబ్దం ప్రథమ భాగంలో సంస్థానాన్ని పాలించిన మొదటి కొండ్రాయనికి కాంతమాంబ వలన కలిగిన మూడవ సంతానమే ఈ రామారాయుడు. ఇతడు విద్వత్కవి పోషకుడు. ఉట్టకవి నారాయణ కవిని చేరదీసి అతని "రంగరాయ

చరిత్ర"మనబడే "రంగరాయ కదనరంగ చరిత్ర" కావ్యాన్ని అంకితం పుచ్చుకున్నాడు. (ఆం. సం. సా-191, 194)

**మల్లాజువారు**

కాలం : క్రీ. శ. 18, 19 శతాబ్దాలు.

వీరు గుంటూరు మండలంలోని నరసరావుపేట జమీందారులు. ఈ వంశంలోని వేంకట నరసింహారావు కుమారుడు గుండారావు ప్రసిద్ధులు. వీరిని కీర్తిస్తూ ఎన్నో చాటువులు దొరుకుతున్నాయి. (చా. ప. ర.)

**మల్లాజు వేంకట నరసింహారావు**

కాలం : క్రీ. శ. 18 వ శతాబ్దం.

గుంటూరు మండలంలోని నరసరావుపేట జమీందారు. ఇతని గుణగణాలను కీర్తిస్తూ చక్కని చాటు పద్యాలు దొరికాయి. ఇతని కుమారుడు మల్లాజు గుండారాయడు. (చా. ప.ర.)

**మల్లంపల్లి నాగభూషణకవి**

కాలం : క్రీ.శ. 18 వ శతాబ్దం.

రచన : బసవ విజయము (ప్రబంధం)

త్రిపురాంతకారాధ్యుని పుత్రుడు బసవేశ్వరుని కథను ప్రబంధంగా వ్రాశాడు. శైవమత ప్రతిపాదనం ముఖ్యోద్దేశంగా రచన చేసిన కవి. కవిత్వం అంత ప్రశస్తం కాదనీ వ్యాకరణ విరుద్ధమైన ప్రయోగాలున్నాయనీ విమర్శకాభిప్రాయం. (క.చ-3-155)

**మల్లంపల్లి పండితారాధ్యుడు**

నామాంతరాలు : 1. మల్లంపల్లి మల్లికార్జున పండితుడు 2 మల్లికార్జున పండితారాధ్యుడు.

**మల్లంపల్లి మల్లికార్జున పండితుడు**

నామాంతరాలు : పండితారాధ్యుడు, మల్లికార్జున పండితారాధ్యుడు.

కాలం : క్రీ.శ. 1800 ప్రాంతం.

స్థలం . మల్లంపల్లి-పెడన గ్రామం కావచ్చు.

రచనలు : అగస్త్యేశ్వర శతకము, శ్యామలాంబా శతకము.

సకలశాస్త్ర పండితుడు. ఈయన కవిత చమత్కార పూరితంగా ప్రౌఢోక్తులతోనూ, సరసమైన జాతీయాలతోనూ నిండి ఉంటుంది. శ్యామలాంబా శతకంలో ఆర్త పశ్చాత్తాప భావాలు ఎక్కువగా కనిపిస్తున్నాయి. (శ.క.చ-777)

**మల్లన**

కాలం : తెలీదు.

కృతులు : "వాదాంగద చూడామణి". ఇది కవి పేరుతోనే వ్యవహరింపబడి మల్లన

వాదాంగద చూడామణిగా ప్రసిద్ధిపొందింది.

(కవిజనాశ్రయం పీఠిక-వావిళ్ళ)

## మల్లన

పల్నాటి వీర చరిత్రలో కోళ్ళపోరు, గోవన్నవిరుగు అనే భాగాలను రచించిన కవి. రచన రసవంతంగా ఉంది. శ్రీనాథుడు రచించిన దానిని పూరించాడో లేక అనుసరించి వ్రాశాడో చెప్పడం కష్టం. (ద్వి.సా.చ-387)

## మల్లన కవి

కాలం : క్రీ. శ. 17 వ శతాబ్దం.
స్థలం : బొబ్బిలి సంస్థానం
రచన : 'రాయప విజయము'.

మల్లన కవి బొబ్బిలి సంస్థానస్థాపకుడైన "నిర్వాణ రాయప్పనాయని" ఆస్థాన కవి అని, రాయపవిజయ గ్రంథ కర్త అని తెలుస్తున్నది. (ఆం.సం.సా-300)

## మల్లన యోగి

కాలం : క్రీ. శ. 1800 ప్రాంతం.
స్థలం : గంజాం జిల్లా పర్లాకిమిడి ప్రాంతం.
రచన : మల్లనయోగి శతకము.

ఈతని రచన ముద్రితం. ఇతడు యోగివేమన వంటివాడని పండితాభిప్రాయం. ఇతన్ని గురించి ఒక కథ ప్రచారంలో ఉంది. (శ.క.చ-442)

## మల్లనయోగి శతకము

కర్త : మల్లనయోగి. (చూ.)

రాజయోగప్రధానమైన శతకం. ఈ శతకంలో కవి పంచవింశతి తత్త్వాలు, సద్గురు లక్షణాలు, కపట మతాభిమానుల చర్యలు, విగ్రహారాధన కర్మయోగ నిరసనం, రాజయోగ వివరణ, పరబ్రహ్మ స్వరూపం, జ్ఞాని లక్షణాలు మొదలయినవి వివరించాడు. "విజ్ఞానభోగి మల్లనయోగీ" అనేది మకుటం.

అల్లక వీరభద్రుడు 166 పద్యాలు సేకరించి, 1901లో ప్రకటించాడు.

(శ.క.చ-443)

## మల్లయార్యుడు

నామాంతరం : శాకల్యమల్లుడు, కవిమల్లురు.

## మల్లన వాదాంగద చూడామణి

కర్త : మల్లన
కాలం : తెలియదు.

ఇది లక్షణ గ్రంథం. పూర్తిగా లభించలేదు.
(కవిజనాశ్రయం పీఠిక-వావిళ్ళ)

## మల్లవరపు వాలేశ్వరుడు

నామాంతరం : మల్లవరపు వీరేశ్వరుడు.
కాలం : క్రీ.శ. 16 శతాబ్ది (1580-1630 నడుమ కావచ్చును)
స్థలం : మల్లవరం, కృష్ణాజిల్లా, గుడివాడ తాలూకా.
రచన : భల్లాణచరిత్ర.
గురువు : ఇవటూరి వామనాలాధ్యులు.

సమకాలీనులు- 'శైవాగమ శిఖామణి' వ్రాసిన నెప్పల్లె అప్పన్న

ఇతడు పోలయామాత్యుని పుత్రుడు వర కవితా విశేష చాతుర్య మున్నవాడు. మల్లవర పురాధ్యక్షుడనని చెప్పుకొన్నాడు. ఈ మల్లవరం విన్నికోట సీమలోనిదని ఇతడే చెప్పాడు. ఆ గ్రామకరణం కావచ్చును. ఇతన్ని వీరేశ్వరుడిగా కొందరు పేర్కొన్నారు. చమత్కారమూ ధారాశుద్ధి, ఇతని కవితలో గోచరిస్తాయి.
(ఆరుద్ర-9-248) (క.త.11-218)

## మల్లవరపు వీరేశ్వరుడు

చూ-మల్లవరపు వాలేశ్వరుడు.

## మల్లాది చరిత్ర

కాలం : క్రీ.శ. 1700 ప్రాంతం.
కర్త : మరింగంటి వెంకటాచార్యుడు.

ద్విపద ప్రబంధం. నాల్గాశ్వాసాలున్నాయి. దీనిప్రతి వేంకటేశ్వర ప్రాచ్య పరిశోధనా సంస్థలో ఉంది. కృతయుగంలోని 'మందాది రాజు' అనే శివభక్తుని చరిత్ర. ఇతని వంశంలోనే రేణుక పుట్టిందట. రేణుక పుత్రుడు పరశురాముడు. క్షత్రియకులాన్ని నాశనం చేస్తున్న పరశురాముని వారినుండి తప్పించుకోడానికి గిరిరాజు, సిద్ధిరాజు అనేవారు సెట్టి వేషాలు ధరించి మల్లారి (మలహరి) స్వామిని పూజించడం వంటి వృత్తాంతాలూ, అనేక అవాంతర గాథలూ ఉన్నాయి. రచన చక్కనిది. (ద్వి సా.చ-153)

## మల్లారెడ్డి

కాలం : క్రీ.శ. 14వ శతాబ్ది పూర్వార్థం.
స్థలం : అద్దంకి.

కవి పండిత పోషకుడు. అద్దంకి రెడ్డిరాజ్య స్థాపకుడైన ప్రోలయ వేమారెడ్డికి తమ్ముడు. ఎఱ్ఱాప్రెగ్గడను ఆదరించాడు. కవి ఎఱ్ఱన గుడ్లూరువదలి చదలవాడలో నివాసం ఏర్పరచు కొన్నప్పుడు మల్లారెడ్డి తానభిమానించిన ఎఱ్ఱనను అద్దంకి ప్రభువు ప్రోలయ వేమారెడ్డి ఆస్థానంలో ప్రవేశపెట్టాడు. (ఆరుద్ర-3)

## మల్లారెడ్డి దేశాయి

కాలం : క్రీ. శ. 16 శతాబ్ది చివరిభాగం.
స్థలం : గంగాపురం (హైదరాబాదు మండలం).
రచన : గంగాపుర మాహాత్మ్యము (అసమగ్రం).

పర్వతరెడ్డి మనుమడు, రంగారెడ్డి పుత్రుడు. ఈ కవి పెద తాతగారైన మల్లారెడ్డి కులీకుతుబ్‌షాహి (గోలకొండ పాలకుడు 1518_1543) కాలంవాడు. నవాబు అతనికి అందలాలు మొదలగునవి బహూకరించి పట్టణచౌదరిగా చేశాడట. తన స్వగ్రామం "గంగాపురం" మీద కావ్యం వ్రాశాడు. (ఆరుద్ర_9_233)

## మల్లికార్జున పండితారాధ్యుడు

నామాంతరం : మల్లంపల్లి మల్లికార్జున పండితుడు (చూ)

## మల్లికార్జున పండితుడు

వ్యవహారనామం : మల్లికార్జున పండితారాధ్యుడు.
కాలం : క్రీ.శ. 12 వ శతాబ్దం (1150 ప్రాంతం).
స్థలం : గోదావరీ మండలంలోని దక్షారామ క్షేత్రం.
రచనలు : శివతత్త్వసారము (తెలుగు), సంస్కృతంలో రుద్రమహిమ, అష్టకాలు, హరలీల, మహిమ్నస్తవము, మలహణము. అనామయము, హాలాయుధము, పంచగద్యలు, రుద్రమహిమ, సంసార మాయాస్తవము, శంకరగీత, ఆనంద గీతలు, బసవ గీతములు, దక్షాధ్వరము, న్యాసాష్టకము, గణాడంబరము శారభము, తుమ్మెద పదములు, ప్రభాత పదములు, వాలేశు పదములు, నివాళిపదములు, పర్వత పదములు, ఆనంద పదములు, శంకర పదములు, గొబ్బి పదములు, వెన్నెల పదములు, సంజవర్ణన, గణవర్ణన పదములు, బాణగద్య, అక్షర గద్య, వర్ణాడంబరము, నీలకంఠస్తవము, మయూరస్తవము, మలయ రాజీయము, మౌని నందకము, మహాస్తోత్ర సూత్రములు, శతకము, దీపకళిక, మహానాటకము, ఉదాహరణములు, ముక్తకములు, గీతసూక్తములు, భృంగి స్తవము, రుద్ర సహస్రనామములు మొదలైనవి. వీనిలో ఏది సంస్కృతమో, ఏది కన్నడమో, నిర్ణయించటం కష్టం.

ఇతడు భీమన, గౌరాంబల పుత్రుడు. పండితత్రయంలో మూడోవాడు. ఈయన తెలుగుదేశంలో ఆరాధ్య సంప్రదాయాన్ని చిరస్థాయిగా నెలకొల్పిన మత సంస్కర్త. పాల్కురికి సోమన ద్విపద కావ్యానికి కథానాయకుడు. ఈ పండితుడు చూపిన మహిమలలో తన కన్నులను శివుని కర్పించి, తిరిగి కన్నులను పొందటం ముఖ్యమైనది. ఈయన చంద వోలులో వెలనాటి చోడుని ఆస్థానంలో బౌద్ధులను వాదంలో జయించినందువల్ల, ఆ మతా

చార్యుని ఒకరిని ఇతని శిష్యులు చంపారు. ఈయన తన శిష్యుల నేరాన్ని తానే మోపుకొని, తనకళ్ళను రెంటిని తానే పెరికివేసుకొని శివునికి అర్పించాడు. శివుడు ఈయన భక్తికి మెచ్చి, ఇదివరకున్న రెండు కళ్ళకు తోడుగా ఊర్ధ్వభాగంలో మరిరెండు కళ్ళు ఇచ్చాడు. ఈ నిలువు కన్నులు వచ్చిన విషయం శైవగ్రంథాలలో ఉంది.

ఈయన సంస్కృతాంధ్ర కర్ణాట భాషలలో ఉద్దండపండితుడేకాక ప్రశస్తకవి. ఈయన శ్రీశైలం చేరే సమయానికే శ్రీ బసవేశ్వరుడు లింగైక్యం పొందినాడట.

(మరికొన్ని వివరాలకు చూడు. పండితత్రయము). (తె.వి.స-4)

## మల్లికార్జునలింగ శతకము [అలభ్యం]

రచనాకాలం : క్రీ. శ. 16 వ శతాబ్దం.

కర్త : బొడ్డపాటి పేరయ్య.

ఇది విజయవాడలోని మల్లికార్జున లింగంపై కవిచెప్పిన శతకం. దీని నుంచి పెదపాటి జగ్గన్న తన "ప్రబంధ రత్నాకరం"లో 3 పద్యాలను ఉదాహరించాడు. ఈ పద్యాలు త్రిపురాసుర సంహారానికి సంబంధించినవి. బొడ్డపాటి ఇంటిపేరున్న కొండయ్యవ్రాసిన కాళహస్తి లింగ శతకం నుంచి కూడా-త్రిపురాసుర సంహార ఘట్టం నుంచి 3 పద్యాలను పెదపాటి జగ్గన్న తన "ప్రబంధ రత్నాకరం"లో ఉదాహరించటం గమనార్హం. (ఆరుద్ర-9)

## మల్లికార్జున సిద్ధయోగి

కాలం : క్రీ శ. 1700 ప్రాంతం.

స్థలం : హైదరాబాదు సమీపంలోని 'కొలనుపాక' గ్రామం.

రచన : గౌడ పురాణము (ద్విపద).

కొలనుపాకలో గౌడ మతస్థాపనను గురించినవృత్తాంతం ఈ యోగి గ్రంథస్థం చేశాడు. (క.శ-12-258)

## మల్లియ రేచన

కాలం : క్రీ. శ. 11వ శతాబ్ది.

రచన : కవి జనాశ్రయము.

విశిష్టత : ఈ కవి తెలుగులో ప్రథమ ఛందో లక్షణ గ్రంథమైన కవి జనాశ్రయాన్ని వ్రాశాడు. రేచన నన్నెచోడుని సమకాలికుడు కావచ్చని పండితాభిప్రాయం. రేచన "వస్తుకవి జనాశ్రయుణ్ణి" అని చెప్పుకొన్నాడు, కాబట్టి "వస్తు కవిత"ను ప్రస్తావించిన నన్నె చోడుని సమకాలికుడు కావచ్చు. కవి జనాశ్రయంలోని పద్యపు అనుకరణలు నన్నెచోడుని కుమారసంభవంలో ఉన్నాయట. ద్రావిడ భాషలోని "యాప్పిరుంగలమ్ కారికై" అనే ప్రాచీన ఛందో గ్రంథంలో రేచన ఛందం ఉదాహృతమట. (ఆరుద్ర-2)

## మల్లిరెడ్డి బెక్కల్లు శాసనము

కాలం : క్రీ. శ. 1176 ప్రాంతం.

స్థలం : వరంగల్లు జిల్లా జనగామ తాలూకా బెక్కల్లు గ్రామం.
శాసనప్రదాత : మల్లిరెడ్డి

శాసన విషయం : ఇది కాకతీయుల నాటి మత సామరస్యాన్ని తెలుపుతుంది. సామాన్య కుటుంబియైన ఈ మల్లిరెడ్డి కుటుంబం వారికి జైనము ముఖ్య మతమయినప్పటికీ, జైన, వైష్ణవ, శైవ, బౌద్ధమతాల ఆదర్శాలన్నీ ఒకటేనని, దైవం అన్నిటిలో ఒకటేనని బోధించే ఒక పద్యం ఈ శాసనంలో ఉంది. వీరశైవం వెర్రితలలు వేసి, బౌద్ధంలో వజ్రయానం ప్రబలిన ఆ రోజులలో మత సమరస భావాన్ని తెలిపే శాసనం ఉండటం గమనార్హం. (తె.శా-ప శా-99)

## మల్లు పురాణము

రచనాకాలం : క్రీ శ. 18 వ శతాబ్దం.
కర్త : సుదురుపాటి వెంకన్న (చూ).
అంకితం : బిరుదు కుప్పాల్ మల్లునికి (గంధర్వకోట ప్రాంతం).

నాల్గు ఆశ్వాసాల గ్రంథం. మల్లుల ఉత్పత్తి, మల్లయుద్ధానికి చెందిన 32 విన్నాణాలు ఇందులో ఉన్నాయి.

మూలం : సంస్కృత బ్రహ్మాండపురాణంలోని మల్లకులక్రమం కృతిపతి తన వంశ పురాణాన్ని తెలుగులో రచించమని కవిని కోరి ఈ పురాణం వ్రాయించు కున్నాడట. కుప్పాల్‌మల్లు రామనాథ పురాన్ని పాలించే రాజుదగ్గర (ముద్దువడుగు రాజు) సేనానాయకుడు. (ద.దే.వా-430)

## మల్హణ చరిత్ర

కర్త : ఎడపాటి ఎర్రన.
అంకితం : చుండి కాళామాత్యునికి.

ఇది మూడాశ్వాసాల చక్కని ప్రబంధం. శివభక్తుడైన మల్హణుని చరిత్ర దీనిలోని ఇతివృత్తం. కవిత్వం సరసంగా ఉంటుంది. దీనిలోని నాయిక వేశ్యాకన్య అయినా సుస్వభావం. మంచి శీలమున్న కన్య. శృంగార కావ్యాలలో ఇది ఉత్తమమైంది మంచిపలుకుబళ్ళు, జాతీయాలు, చక్కని పదాల కూర్పు ఉంది. కవి కావ్యాన్ని కృష్ణ రాయలకు అంకితమియ్యక ఎందుకో దాచి ఉంచి, తన బంధువైన కాళామాత్యునికి అంకిత మిచ్చాడు. (తె.వి.స-6-597) (సా చ.స-157)

## మల్హణ చరిత్రము (అలభ్యం)

రచనాకాలం : క్రీ. శ. 15వ శతాబ్దం.
కర్త : పోశెట్టి లింగకవి.

## మల్హణ స్తవము

కర్త : చూ. దేవులపల్లి సుబ్బరాయశాస్త్రి.

ఆంధ్రీకృత రచన. (తె.వి స-4-843)

## మహంకాళి వెంకటకవి

నామాంతరం : మహంకాళి వెంకయ్య (చూ).

## మహంకాళి వెంకయ్య

నామాంతరం : మహంకాళి వెంకటకవి.

కాలం : క్రీ. శ. 17 వ శతాబ్దం.

స్థలం : నైజాము మండలం.

రచనలు : అలభ్యం.

ఇతడు చతుర్విధ ప్రబంధ కల్పనాధురీణుడట. బహు ప్రబంధకర్త అట. చేకుమళ్ళ రంగశాయికి వాణీ విలాస వనమాలిక రచనలో సహాయపడినట్లు తెలుస్తున్నది.

## మహాదేవ శతకము

నామాంతరం : భవానీ ధవ శతకము.

కర్త : దేవగుప్తాపు రామభద్ర కవి.

"మహాదేవా, భవానీ ధవా" అనే మకుటంతో ఉంది. (శ. క. చ-403)

## మహమ్మద్ కులీ కుతుబ్ శాహి

క్రీ. శ. 1580-1612 ప్రాంతంలో గోలుకొండ రాజ్యాన్ని పాలించాడు. సాహిత్య ప్రియుడు. వైజయంతీ విలాస కావ్యకర్తయైన సారంగు తమ్మయ్యను ఆదరించినవాడు.

ఈయన గోలకొండ నవాబు ఇబ్రహీం కుతుబ్ శాహి మూడో కుమారుడు. వైజ్ఞానిక, సాంస్కృతిక, సాహిత్య, కళా విషయాలను ఈ నవాబు విశేషంగా పోషించాడు. ఇతడు చాలామంది ఉర్దూ కవులను కూడా పోషించి, ఉర్దూ భాషా సాహిత్యాలకు విశేషమైన సేవ చేశాడు. ఆ భాషలో కావ్యాలు రాశాడట. ఇతని కవిత్వంలో ఎక్కువ తెలుగు పదాలు ఉంటాయట. (తె. వి. స-4-731)

## మహమ్మద్ ఖేక్ సాహెబ్

కాలం : క్రీ.శ. 17వ శతాబ్దం.

ఈయనొక చిన్న జమీందారు. ఉదారుడు. ఈయన దగ్గరకు ఒక బ్రాహ్మణుడు వచ్చి పూర్వం మల్కిభరామ్ కవులను పోషించి, బహుకరించాడని, సాహెబ్ గారిని కూడా అల్లాగే బహూకరించమని వేడుకొన్నాడు. వెంటనే ఖేక్ సాహెబ్ తనమీద ఒక పద్యం చెబితే నూట పదార్లు ఇస్తానని చెప్పాడు. ఆ బ్రాహ్మణుడు కవి గాకపోయినా సమయస్ఫూర్తితో ఒక పద్యం చెప్పి, సాహెబ్ గారిని మెప్పించి నూట పదహార్లు బహుమానం అందుకొన్నాడు. ఈ చాటుకవి పేరు, వివరాలు తెలియవు. (చా. ప. ర.)

## మహాగణపతి స్తవమ్ (సం)

కర్త : భోగనాథుడు. (తె. వి. స-4)

**మహాదేవ కవి**

కాలం : క్రీ. శ. 17వ శతాబ్దం.
స్థలం : శహాజీ రాజపురం.
రచనలు : 1. అద్భుత దర్పణమ్ (సం) 2. శుక సందేశమ్ (సం).

తంజావూరు నేలిన శహాజీ (1684_1712) ఆస్థానంలోనివాడు. ఇతని అద్భుత దర్పణం ప్రబోధ చంద్రోదయాన్ని పోలిన రచన. శుక సందేశం దూత కావ్యాలవంటిది. (ద. దే వా_179)

**మహానాటక అగ్రజాతమ్ (సం)**

నామాంతరం : రామాభ్యుదయమ్.
కర్త : సాళువ నరసింహరాజు. (తె. వి. స_6)

**మహానాటకము (అలభ్యం)**

రచనాకాలం : క్రీ.శ. 1150 ప్రాంతం.
కర్త : మల్లికార్జున పండితుడు.

శైవమత సంబంధమైన రచన.

**మహానాటక సుధానిధి (సం)**

కర్త : చూ. రెండో ప్రౌఢ దేవరాయలు (1423_1446).
స్థలం : విజయనగరం.

శ్రీనాథునికి కనకాభిషేకం చేసిన ఈ దేవరాయలు దీనిని వ్రాశాడని పండితులు కొందరంటున్నారు (చూ. పేజి_665). (ఆరుద్ర_4_14)

**మహాప్రభు శతకము**

కర్త : బాణాల వీరశరభేంద్రుడు.

"సాంబశివా, మహాప్రభూ" అనే మకుటంతో ఐదు పాదాల ఉత్పల మాలికా వృత్తాలతో ఉన్న శతకం. దీనిలోని భావాలు ధూర్జటి కాళహస్తి శతకాన్ని అనుసరించి ఉన్నవట. కవిత్వం అంత ప్రౌఢమైనది కాదట. (శ. క. చ_455)

**మహాభారత తాత్పర్య సంగ్రహము (అలభ్యం)**

నామాంతరం : భారత కథాసారము.
కర్త : రఘునాథ నాయకుడు.

ఇది సంస్కృత రచన అని కొందరంటున్నారు (తం. ఆ. సా_237)

**మహాభారత నాటకమ్ [సం]**

కర్త : గంగాధరుడు

**మహాభాష్య ప్రకాశిక [సం]**

కర్త : శేషవిష్ణు సూరి.

పతంజలి మహాభాష్యానికిది సంస్కృత వ్యాఖ్య (తె. వి. స-6)

## మహామంత్రి తిమ్మరుసు

కాలం : క్రీ.శ. 15 వ శతాబ్దం.

రచన : అగస్త్యకృత సంస్కృత బాలభారతానికి "మనోహర" సంస్కృత వ్యాఖ్య.

శ్రీకృష్ణ దేవరాయల మంత్రి. ఇతడు సంస్కృతాంధ్రాలలో అసమానపాండిత్య మున్నవాడు ముప్పది యిద్దరు మంత్రుల సీసమాలికలో తిమ్మరుసు మంత్రి ప్రస్తావన ఉంది. తిమ్మరుసు పండితుడు, మంత్రియేగాక, దండనాయకుడై శ్రీకృష్ణ దేవరాయల యుద్ధ యాత్రలలో సహాయుడుగా ఉండి యుద్ధంలో జయం కలిగేటట్లు చేసేవాడు. కొండ వీటి దుర్గాన్ని పట్టుకోవటంలోను, గజపతిపై జరిగిన చివరి దండయాత్రలోను భేదో పాయంతో రాయలకు జయం కూర్చినది తిమ్మరుసు.

తిమ్మరుసు బాల్యం నుంచి శ్రీకృష్ణ దేవరాయలను రక్షించి, వీరనరసింహ రాయల నుంచి కృష్ణరాయలకు రాజ్యమిప్పించి కర్ణాటక సింహాసనాన్ని నిష్కంటకం చేశాడు. రాయల వివాహాల విషయాలలో, సప్తాంగ రక్షణలో తిమ్మరుసు అసాధారణ కౌశలం చూపాడు. వత్సరాజుకు యౌగంధ రాయణుని వలె శ్రీకృష్ణ దేవరాయలకు తిమ్మరుసు మహా మంత్రిగా తన ప్రభువు శ్రేయోభివృద్ధికి జీవితాన్ని ధారవోశాడు. రాయలు తిమ్మరుసు పట్ల పితృభావం వహించి "అప్పాజీ" అని పిలిచేవాడు.

తిమ్మరుసు బుద్ధి కౌశలం, రణకౌశలం తెలిపే కథలు చాటుపద్యాలు ఆంధ్రదేశంలో ప్రచారంలో ఉన్నాయి తిమ్మరుసు ధర్మ శాసనాలు కొన్ని ఉన్నాయి. రాయల కుమారు నికి తిమ్మరుసే విష ప్రయోగం చేయించాడని, చరమదశలో తిమ్మరుసును, అతని తమ్ముని కొడుకును బంధించి రాయలు చిత్రహింసల పాలుచేశాడని. తిమ్మరుసు నేత్రాలను రాయలు పీకించాడని చారిత్రకులంటారు. తిమ్మరుసు చెరసాలలో చనిపోలేదని, రాయల తరవాత 6 సంవత్సరాలకు మరణించి ఉంటాడని పండితాభిప్రాయం. (క.త-7)

## మహారాజ చరిత్రమ్ (సం) (అలభ్యం)

కర్త : చూ. శ్రీనివాసకవి.

చారిత్రక కావ్యం. అయిదు ఉల్లాసాలతో కూడిన గ్రంథం. కార్వేటి వంశీయుడైన "రాజరాజు" మొదలుగా "మాకరాజు" తనయుడైన "రామభద్ర రాజు" వరకు గల రాజుల వంశ చరిత్ర ఇందులో వర్ణించబడిందట. దీనికి ఆంధ్రంలో వ్రాయబడిన "టీక" లభ్యం అవుతున్నది. (ఆం సం.సా.)

## మహారాజ చరిత్ర వ్యాఖ్య

కర్త : తెలియదు.

చూ. మహారాజ చరిత్రము.

శ్రీనివాసకవి కృతమైన మహారాజ చరిత్రకు తెలుగులో వ్యాఖ్యానం. వ్యావ హారిక భాషలో ఉండడంచేత మిక్కిలి ప్రసిద్ధి చెందింది. ఈ వ్యాఖ్యానము 'చందా

న్యయ' రూపంలో ఉండడంచేత దీని మూలం సంస్కృత రచన అయి ఉంటుందని పండితాభిప్రాయం. (అం.సం.సా.)

**మహాస్తోత్ర సూత్రములు**

రచనాకాలం: క్రీ.శ. 1150 ప్రాంతం.
కర్త : మల్లికార్జున పండితుడు.
శైవమతపరమైన రచన.

**మహిమలూర్వారి వేంకట కృష్ణుడు**

కాలం : క్రీ.శ. 17వ శతాబ్దం ఉత్తరార్ధం.
స్థలం : మన్నారు గుడి ప్రాంతం.
రచనలు : శ్రీకృష్ణ కర్ణామృతము (వచనము)
గురువు : పరమహంస పరివ్రాజకాచార్య సదాశివతీర్థపాదుడు.
రంగయామాత్యుని కొడుకు. ప్రౌఢంగా రచన చేశాడు.

**మహిమ్న స్తవము (అలభ్యం)**

కర్త : మల్లికార్జున పండితుడు.
రచనాకాలం : క్రీ.శ 1150 ప్రాంతం.
శైవమతపరమైన రచన.

**మహిషాసుర మర్దనీ శతకము**

కర్త : దిట్టకవి రామచంద్రకవి.
చంపకోత్పల మాలలతో 101 పద్యాలున్నాయి "మహిషాసుర మర్దని పుణ్యవర్ధనీ"" అనే మకుటంతో ఉంది. మహిమ్నంలోని కొన్నిశ్లోకాలకు అనుసరణలు కన్పిస్తాయి. (శ.క.చ-840)

**మహిషాసుర మర్దనీ శతకము (అలభ్యం)**

రచనా కాలం : క్రీ.శ. 18వ శతాబ్దం.
కర్త : పచ్చమెట్ట పాపయకవి.
దీనిలోని పద్యం ఒక్కటి మాత్రం లభించింది. "మహిషాసుర మర్దనీ శివా" అనేది మకుటం. (శ క.చ-826)

**మహేంద్ర విజయము**

కర్త : చూ. దేవులపల్లి సుబ్బరాయశాస్త్రి.
ప్రబంధం. (అం సం.సా-252)

**మహేశ్వర మహాకావ్యమ్ (సం)**

కర్త : అవిషెళ్ళ వేంకటశాస్త్రి.
(తె వి.స-4)

**మాండలికము**

మండల సంబంధమైనది. మండలమంటే ఒక భూభాగానికి గాని వృత్తికి గాని కులానికి గాని సంబంధించిన పరిధి. ఆ పరిధిలోని జనసమూహం మాట్లాడే భాష మాండలికం,

**మాండూక్యోపనిషత్తు**

రచనా కాలం : క్రీ.శ. 19 వ శతాబ్ది పూర్వార్థం.
కర్త : పరవస్తు వేంకట రంగాచార్యులు.

సంస్కృతంలోని మాండూక్యోపనిషత్తుకు పద్యానువాదం. రచన సరళంగా ఉంది

**మాంధాతృ చరిత్ర**

నామాంతరం : (చూ) కవికర్ణ రసాయనము.
కర్త : సంకుసాల నృసింహకవి.

**మాక నృపతి**

కాలం, వివరాలు తెలియవుగాని ఈయనను కీర్తిస్తూ ఒక చాటువు దొరికింది. చాటు కవి పేరు తెలియదు. క్రీ.శ. 1530 ప్రాంతంలో కార్వేటి నగర పాలకుడైన మాకరాజు ఒకరున్నారు. అతని కుమారుడు తిమ్మరాజు విప్రనారాయణ చరిత్ర కృతిపతి (చా.ప.ర.)

**మాకము తిమ్మయ్యశెట్టి కథా యక్షగానము**

కర్త : వేంకట నారాయణకవి.

మాకము తిమ్మయశెట్టి జీవిత చరిత్రను తెలిపే కథ. (పీ యు-208)

**మాకరాజు తిమ్మరాజు [తిరుమలరాజు]**

కాలం : క్రీ.శ. 1580-1620 ప్రాంతం.
స్థలం : కార్వేటి నగరం.

సాహిత్య పోషకుడు చదలవాడ మల్లన విరచితమైన విప్రనారాయణ చరిత్రకు కృతిపతి. ఈయన కార్వేటి నగర పాలకుడు. మాకరాజు కుమారుడు. కార్వేటి మండలం క్రీ.శ. 1530 దాకా సాళువరెడ్ల పాలనలో ఉండేది. ఆ తరువాత మాకరాజు వంశీయుల హస్తగతమైంది. ఈ తిమ్మరాజు క్రీ.శ. 1580 ప్రాంతాలలో కార్వేటి నగరాన్ని పాలించాడు (ఆరుద్ర-8-149)

**మాకరాజు లక్ష్మీపతిరాజు**

కాలం : క్రీ.శ. 17 వ శతాబ్దం.
స్థలం కార్వేటి నగర సంస్థానం.

"సంవరణ చరిత్ర"కు కృతిపతి. సాహిత్య ప్రియుడు. క్రీ. శ. 1620 ప్రాంతంలో కార్వేటి నగర పాలకుడుగా ఉన్న 'తిరుమలరాజు'కు ఇతడు తమ్ముడు.

అన్నగారి పోషణలో ఉన్న చవలువాడ మల్లన రచించిన "సంవరణ చరితము"ను అంకితం పొంది, ఆ కవిని గౌరవించాడు (ఆం సం.సా.)

## మాకరాజు వేంకట పెరుమాళ్ళురాజు

కాలం : క్రీ. శ. 19 వ శతాబ్దం- మధ్యభాగం.

స్థలం : కార్వేటినగరం (సంస్థానాధీశ్వరుడు).

అత్యంత సాహితీప్రియులు. వీరు విజయనగర సామ్రాజ్యాధిపతులవలె తమ సంస్థానంలో అష్టదిగ్గజాలను పోషించారట. ఋగ్వేది వేంకట నారాయణకవి, పోలిపెద్ది వెంకటరాయడు, పాలమంగలం అప్పయకవి, సారంగపాణి, శ్రీశైలకవి, ముడుంబ అప్పయాచార్యులు, రాయభట్టు వీరరాఘవ కవి, అనంతరాజు సుబ్బరాయకవి అనే 8 మంది ఇతని ఆస్థానంలోని అష్టదిగ్గజకవులు. (ఆం.సం.సా.)

## మాగాపు శరభకవి

కాలం : తెలియదు.

ఈయన వత్సవాయి రాజైన రామభూపతిని దర్శించినప్పుడు ఆశువుగా పద్యం చెప్పాడు. అదే విధంగా 'ఇతఁడా' అనే ప్రారంభంతో మరికొన్ని పద్యాలు వ్రాశాడట. అవి దొరకలేదు. (చా.ప.ర.)

## మాఘ మాహాత్మ్యము

రచనాకాలం : క్రీ.శ. 1550-60 ప్రాంతం.

కర్త : ఒడ్డెపూడి పెద్దయ్య.

అంకితం : దాసరి చిన గంగన్నకు

ప్రత్యేకత : దీనికి మూలం సంస్కృత వాయుపురాణం. ఇదే కావ్యాన్ని ఇంతకు ముందే పిల్లలమర్రి పినవీరన వ్రాశాడు. కృతిభర్త కవిని పిలిపించి వాయు పురాణంలో ఉన్న మాఘ మాహాత్మ్యాన్ని "చమత్కృతి" కృతిగా చెప్పించాడు చమత్కారంతో పాటు ఔచిత్యమూ, రస పరిపుష్టి ఉన్న కావ్యం. కృతిపతి పురుషోత్తమ పుర నివాసి. (క.చ-3-5)

## మాఘ మాహాత్మ్యము (అలభ్యం)

రచనాకాలం : క్రీ.శ. 15 వ శతాబ్దం.

కర్త : పిల్లలమర్రి పినవీరభద్రుడు (చూ).

మంజుల వాగ్వైఖరితో చెప్పిన కావ్యమట. (ఆరుద్ర-6-201)

## మాఘ మాహాత్మ్యము

రచనాకాలం : క్రీ.శ. 1704-1731 ప్రాంతం.

కర్త : విజయరంగ చొక్కనాథుడు.

అంకితం : శ్రీరంగేశునికి.

ఇది పదిహేను అధ్యాయాల గ్రంథం. దీనిలో మొదట ఒక కంద పద్యం

ఉంది. మాఘ మాహాత్మ్యాన్ని తెలుపుతూ చక్కని వచన శైలిలో వ్రాసిన గ్రంథం. (వ.వా-43)

**మాచనామాత్యుడు**

కాలం : క్రీ.శ. 1750 ప్రాంతం.

రచన : బ్రహ్మాండ వచనము.

**సమకాలికుడు : సీతారామాంజనేయ సంవాద గ్రంథకర్త పరశురామ పంతుల లింగమూర్తి కవి.**

ఇతడు లక్కమాంబ, భైరవామాత్యుల పుత్రుడు. సకల శాస్త్ర పురాణాగమవేది. చక్కని గ్రాంథికంలో రచన చేశాడు ఈయన గుణ వైభవాలను ప్రశంసిస్తూ చాలా చాటువులున్నాయి. (వ.వా-38; చా.ప.ర.)

**మాచర్ల రామయామాత్యుడు**

కాలం : క్రీ. శ. 1780 ప్రాంతం.

స్థలం : పరకాల.

సాహిత్య ప్రియుడు. రాపాక శ్రీరామకవిని ప్రోత్సహించి అధ్యాత్మ రామాయణాన్ని యక్షగానంగా వ్రాయించాడు. ఈ రామాయణం ఇల్లిందకుంటలోని దేవునికి అంకితంగా ఇవ్వబడి, ఇల్లిందకుంట రామాయణమనే ప్రసిద్ధినిపొందింది. (య.వా.చ-360)

**మాచల్దేవి**

కాలం : క్రీ. శ. 14 వ శతాబ్ది పూర్వార్ధం.

ఈమె ఓరుగంటిలో పేరు మోసిన వారాంగన. సంగీత, సాహిత్య, నృత్య, చిత్రలేఖనాదులలో ప్రవీణ. విశేషించి రెండో ప్రతాపరుద్రునికి ఉంపుడుకత్తె అని కొందరు చరిత్రకారుల, సాహితీ వేత్తల అభిప్రాయం. క్రీడాభిరామంలో ఈమె ప్రసక్తి ఉంది ఈమె ఇంటిలోని అలంకరణ సామగ్రి, విలువైన వస్తువులు, క్రీడాభిరామంలో కవి వర్ణించాడు ఈమె శ్రీనాథుని శిష్యురాలని జనశ్రుతి అనాటి రాజకీయ కార్య కలాపాలలో ఈమె ప్రముఖపాత్ర వహించిందని కొందరంటారు. (తెలుగు-ఏ-జూ-77)

**మాచవరము పాపయామాత్యుడు**

కాలం : క్రీ. శ. 18వ శతాబ్దం.

స్థలం : మాచవరం,

రచన : నందవర చరిత్రము.

వేంకటాచల మంత్రి కొండమాంబల పుత్రుడు. కవి కుటుంబంవారు తిరుపతి సమీపంలోని కలువలపూడికి వలస వచ్చారట. అక్కడే స్వప్నంలో వేంకటేశ్వరుడు కనిపించి నందవర చరిత్ర రచించి తనకు అంకితం యిమ్మని అడిగాడట. కవి తన వంశీయుల (నందవరీకుల) పూర్వ చరిత్రను రమ్యంగా చెప్పాడు. (క. చ-3-183)

## మాచెర్ల చెన్నుడు

కాలం : క్రీ.శ. 13, 14 శతాబ్దాలు.

మాచెర్ల పట్టణంలో వెలసిన దైవం. క్రీడాభిరామంలోను, పలనాటి వీరచరిత్ర లోను ఈ దేవుని ప్రసక్తి ఉంది. మాచెర్ల చెన్నుడే చెన్నకేశవస్వామి. (చెన్నకేశవ స్వామి మార్కాపురంలో కూడా వెలిశాడు).

పలనాటి వీర చరిత్రలో బాలచంద్రుని తల్లి అయితమ్మ సంతానం కోసం నోచిన గజనిమ్మ నోములో ఈయన ప్రసక్తి ఉంది. మాచెర్ల చెన్నుని కృపవల్ల బాల చంద్రుడు పుట్టాడు కాబట్టి బ్రహ్మనాయుడు కుమారుని ముద్దుగా చెన్నా అని పిలిచేవాడట. ఈ చెన్నుని ఆలయంలో చాలా చారిత్రక శాసనాలున్నాయి. (ఆం. సాం. చ-53)

## మాటూరి వేంకటేశ కవి

స్థలం : మధిర సమీపంలోని మాటూరు.

కాలం : క్రీ.శ. 19 వ శతాబ్దం.

రచన : బుధ మనోల్లాస శతకము.

ఈ కవి 1830 ప్రాంతాల వాడట రచన అంత ప్రౌఢంగా లేదని విమర్శకుల అభిప్రాయం. (క.స-259)

## మాడభూషి నరసింహాచార్యులు

కాలం : క్రీ.శ. 19 వ శతాబ్ది పూర్వార్థం.

స్థలం : నూజివీడు.

రచనలు : వల్లభీవల్లవోల్లాసము, రుక్మిణీకల్యాణము, నీలాపనిందా నివారణము

వేదాంతాచార్యుని పుత్రుడు. నూజివీటి ప్రభువుల ప్రేరణతో రచనలు చేశాడు. "అభినవ పండితరాయలు" అనే బిరుదు పొందిన వేంకటాచార్యుడు ఇతని పుత్రుడు ఇతని కవిత్వం నాతికఠినంగా శ్రావ్యంగా ఉంటుంది. (క.చ-3-239)

## మాడయ కవి

కాలం : క్రీ.శ. 1485-1508 ప్రాంతం.

సమకాలికులు : తుళువ నరసనాయకుని కుమారుడు వీర నరసింహరాయలు.

స్థలం : కృష్ణాజిల్లా గుడివాడ ప్రాంతం.

రచనలు : 1 మైరావణచరిత్ర (చంపువు) 2. దేవేంద్ర విజయము (ద్విపద- అలభ్యం).

సర్వయామాత్యుని కుమారుడు.

కవి సర్వాగమ శబ్దశాస్త్ర చతురుడు అనేక మండలాధిపతులచేత సన్మానాలు పొందాడు. కావ్యలక్షణ లక్ష్యసాగరాన్ని క్రోడీకరించాడట. కర్ణాటకరాజైన వీరనరసింహ రాయలచేత సత్కృతులు పొందాడు కోట సింగన మంత్రి కొలువులో ఒక కవిని

వావనలో ఓకించాడట కిమిడి సంస్థానాధీశుడు ఇతనికి ఉత్తమాశ్వద్వయాన్ని కానుకగా ఇచ్చాడు. నందాపురీశుడితన్ని కాంచనాభరణాలతో సత్కరించాడట. (క.త-6-257)

**మాడుగుల**

విశాఖపట్టణం జిల్లాలోని కొండ జమీందారీలలో ఒకటి. సీలేరు నది సమీపంలో ఉంది ఇక్కడి మత్స్యకుండమనే తీర్థక్షేత్రం ప్రసిద్ధం. ఈ పాలకుల ధ్వజం మీద మత్స్య లాంఛనం ఉండేది.

ఈ సంస్థాన పాలకులలో మాడుగుల లింగభూపతి ప్రసిద్ధుడు. ఆ తర్వాతి కృష్ణభూపతి అభినవ కృష్ణదేవరాయలుగా ప్రసిద్ధుడై కవి పండిత పోషణచేశాడు. అల్లమరాజు రామకృష్ణకవి, ఇంద్రగంటి గోపాలశాస్త్రి, పేరి సర్వేశ్వరశాస్త్రి, మంత్రి ప్రెగ్గడ సూర్యప్రకాశకవి, అడివం బాల భాస్కరుడు, శిష్టు కృష్ణమూర్తిశాస్త్రి ఈయన ఆస్థానంలోనివారు. ఆధునికులలో పురాణం సూర్యనారాయణ తీర్థులు, భమిడిపాటి యజ్ఞ నారాయణవర్మ, త్యాడి వేంకటశాస్త్రి త్యాడి పట్టాభిశాస్త్రి మొదలైనవారు ఈ సంస్థానంలో మన్ననలు పొందారు (ఆం. సం. సా)

**మాతృభూతకవి**

కాలం: క్రీ. శ. 1788 ప్రాంతం.
స్థలం : తంజావూరు మండలం.
రచనలు : పారిజాతాపహరణము, కొన్ని పదాలు.

రంగయార్యుని పుత్రుడు. ఇతడు క్రీ. శ. 1788-98 నడుమ తంజావూరును పాలించిన అమరసింహుని ఆస్థానంలో ఉండేవాడు. ఇతన్ని ప్రోత్సహించినవాడు శివ రాయ మంత్రి.

కవి పేరును బట్టినీ, మాతృ భూతేశ్వరుని ఆలయం పుదుక్కోటలో ఉండటం వలననూ ఇతని నివాసం పుదుక్కోట ప్రాంతం అని ఊహిస్తున్నారు. ఇతని పదములు కొన్ని సంగీత సంప్రదాయ ప్రదర్శినిలో ఉన్నాయి. ఇవి "త్రిశిరగిరి" ముద్రతో భక్తి శృంగార, నీతిపరములైన రచనలు. (ద. దే. వా-274)

**మాతృ శతకము**

కర్త : పేరు తెలియదు.

"తల్లిని బోలరెవ్వరున్" అనే మకుటంతో ఉంది. దీనికి బ్రౌన్ దొర ప్రతి వ్రాయించారట. కవి కోటగిరి గోపరాజు పుత్రుడు. మదిగంటి రంగప్ప శిష్యుడు. శైలి సుబోధకంగా ఉంది. (శ. క. చ-534)

**మాతృ శతకము**

కర్త : అప్పావు మొదలి - మాత్తూరి.
రచనాకాలం : క్రీ.శ. 19వ శతాబ్ది పూర్వార్ధం.

చంపకోత్పలమాలలలో ఉన్న శతకం. "తల్లిని బోల రెవ్వరున్" అనే మకుటంతో ఉంది. చక్కని నీతులున్నాయి. రసవత్తరమైన ఈ రచనలో శివకేశవా భేదం, చక్కని భావ శబలత కనిపిస్తున్నాయి.

కోటగిరి గోపరాజు పుత్రుడు రచించిన ఒక మాతృ శతకం 1840 నాటికే ఉంది. అప్పావు మొదలి పుస్తకం అతని పుత్రుడు మీనాక్షిదాసు 1961లో ముద్రించారు. (శ.క.చ-529)

## మాదయగారి మల్లన

నామాంతరం : అయ్యంకి మల్లన.
కాలం : క్రీ.శ. 1480 - 1540 ప్రాంతం.
స్వస్థలం : అయ్యంకి (కృష్ణా మండలం).
రచన : రాజశేఖర చరిత్రము.
గురువు : అఘోర శివుడు.
సమకాలికులు : అల్లసాని పెద్దన, నందితిమ్మన, అయ్యలరాజు రామభద్రుడు, ధూర్జటి.

కృష్ణదేవరాయల ఆస్థానంలోని అష్టదిగ్గజాలలో ఒకడుగా ప్రసిద్ధుడు. తండ్రి మాదయ కనక మాదయగారి మల్లన అనే వ్యవహార నామం కలిగింది. రాజశేఖర చరిత్ర కావ్యం వ్రాసిన తరువాతనే లబ్ధప్రతిష్ఠుడై, రాయల ఆస్థాన సభా ప్రవేశ గౌరవం పొంది ఉండవచ్చు. కావ్యంలో తిమ్మరుసును కీర్తించాడు. తరవాత కావ్యాలు వ్రాయలేదు. "కాకరపండు వంటి జిగి కల్గిన మేలి పసిండి" వంటి ఈతని కవితలో అర్థగౌరవం అధికం. ఇతని భావన, ఫణితి మధురమైనవి. (తె.వి.స-4)

## మాదిరెడ్డి వారు

మనిషి పేరుతో ఉన్న ఇంటిపేరు. ఈ ఇంటి పేరుతో తెలుగుదేశంలో కొన్ని కుటుంబాలవారున్నారు. వేమారెడ్డి, కొమ్మారెడ్డి, నల్లపురెడ్డి, ఎంద్రెడ్డి ఇలాంటివి. (భారతి-మా-45-229)

## మాధవ కవి

కాలం : క్రీ శ. 15 వ శతాబ్ది.
రచన ; నరకాసుర విజయమ్ (సం).

ఈయన విరూపాక్షుని ఆస్థానకవి. (తె.వి,స-6)

## మాధవ భట్టు

కాలం : క్రీ.శ. 16 వ శతాబ్ది.
రచన : దానలీల (సం). (తె.వి.స-6)

## మాధవ మంత్రి

కాలం : క్రీ. శ. 19 వ శతాబ్దం.
స్థలం : గోదావరీ మండలం.
రచన : భగవద్గీతలు (పద్యకావ్యం)
గురువు : కిడాంబి వెంకటాచార్యులు.

గిరియనమంత్రిపుత్రుడు. లక్షణ విరుద్ధమైన ప్రయోగాలు చేశాడు.
(క.చ.3-175)

**మాధవ విలాస భాణము**

రచనాకాలం : క్రీ. శ. 19వ శతాబ్దం పూర్వార్ధం.

కర్త : చూ. దువ్వూరి విశ్వనాథశాస్త్రి.

శృంగార రసప్రధానమైన రచన. పిఠాపురంలో వెలసిన కుంతీ మాధవస్వామి రథోత్సవ సమయంలోని స్త్రీ పురుషుల శృంగార విలాసాలకు సంబంధించిన వర్ణన దీని లోని ఇతివృత్తం. దీనిని కవి రావు వేంకట నీలాద్రి రాయని (పిఠాపురం సంస్థానాధిపతి) ప్రోత్సాహంపై రచించాడట. రచన చక్కనిది. (ఆం. సం. సా-247)

**మాధవ శతకము**

కర్త : చూ. కొటికెలపూడి కోదండరామ కవి.

విష్ణుస్తుతి పరమైన వృత్త శతకం. "మాధవా" అనే మకుటంతో ఉంది. రచన ప్రౌఢమైనది. (ఆం. సం. సా-305)

**మాధవాచార్యుడు**

చూ. విద్యారణ్యుడు.

**మాధవాభ్యుదయము**

రచనాకాలం : క్రీ. శ. 18వ శతాబ్దం

కర్త : అవుదూరి కిచ్చయ్య.

ప్రబంధం కృతిప్రోత్సాహకుడు నూల్వీటి నాగయామాత్యుడు. ఈ ప్రబంధావతారిక నుండి నూల్వీటి హరియప్పను గురించి తెలియ వచ్చింది.
(క. చ-3-131; య. వా. చ-40)

**మాధవి**

ఈమె కూచిపూడి భాగవతుల అపూర్వ సృష్టి. సఖి పాత్రను నిర్వహించే భామాకలాపంలో ఈ పాత్ర విధిగా ఉంటుంది గొల్లకలాపంలో ఈ పాత్ర ఉనికి క్వాచిత్కం. మాధవి అక్కలలో అక్క, బావలలో బావ.

సత్యా కృష్ణులున్న యక్షగానాలలో కూడా ఈ పాత్ర కనిపిస్తుంది. మాధవి సూత్రధారునివలె కథానుసంధానం చేస్తుంది. విదూషకుని వలె హాస్యప్రసంగాలు వినిపిస్తుంది. పాత్రలను ప్రేక్షకులకు పరిచయం చేయటమేకాక, స్వయంగా పలకరిస్తుంది. కథాగత పాత్ర కాదుగాని కథకు కలసివచ్చే పాత్ర.

నాయికా నాయక పాత్రల స్వరూపాలను ప్రేక్షకుల ముందు పెట్టటానికి ఈ పాత్ర ఉపకరిస్తుంది. అభినయప్రధానాలైన కలాపాలలో స్వగతాలు విసుగు కలిగిస్తాయి. బహుశః ఆస్వగతాలు లేకుండా ప్రదర్శన రక్తికట్టించడానికే మాధవి పాత్రను కూచిపూడి భాగవతులు ప్రవేశపెట్టి ఉంటారు.

కూచిపూడి భాగవతులలో పురుషుడే మాధవి పాత్ర వేస్తాడు. పాత్రకు నిర్దిష్ట మైన అహార్యం ఏమీలేదు. ఒంటిమీద ఒక కండువా ఉంటేచాలు. పంచె కట్టుతో ప్రదర్శనకు వస్తాడు. నాయకుని పలకరించేటప్పుడు మగధీరునివలె కండువాను సవరిస్తాడు. నాయికను పలుకరించేటప్పుడు ఆ కండువానే పమిటగా సవరించి, సిగ్గుపడుతున్నట్లు బుగ్గమీద వ్రేలు, నడుముమీద చెయ్యి పెట్టుకొని-నడకలో, మాటలో "ఆడారి" వాటం తెచ్చి పెట్టుకొంటాడు. ఒయ్యారం ఒలకబోస్తాడు.

కూచిపూడి భామాకలాపంలో మాధవి పాత్రధారులు ప్రదర్శించే ఆంగికాభినయం, వాచికాభినయం మనోజ్ఞమైనవి మాధవి పాత్ర ప్రేక్షకులకు విసుగు పుట్టించక నాటకం చక్కగా నడవటానికి తోడ్పడుతుంది. (య. వా. చ-199-200)

## మధ్వ ముఖమర్దనమ్ [సం]

కర్త : నింబార్కుడు

వేదాంత గ్రంథం మధ్యాచార్యుల వాదానికి ఖండన గ్రంథం కావచ్చును. (తె. వి. స-7-488)

## మానవధర్మ శాస్త్రి టీక (సం)

కర్త : లొల్ల లక్ష్మీధరుడు.

ఇది సంస్కృత ధర్మశాస్త్ర గ్రంథము. (తె. వి స-4)

## మానసబోధ శతకము (అలభ్యం)

రచనాకాలం : క్రీ.శ. 18వ శతాబ్దం.

కర్త : చూ. కాసుల పురుషోత్తమకవి.

"మనసా హరి పాదము లాశ్రయింపుమా" అనే మకుటంతో వ్రాసినట్లు కవి చెప్పుకొన్నాడు. ఇదే మకుటంతో తాడేపల్లి పానకాలరాయకవి రచించిన శతకం నేడు ప్రచారంలో ఉంది. పురుషోత్తమకవి గ్రంథం కనిపించడం లేదు. పానకాలరాయకవి రచించినది చిత్తబోధశతకమనీ, ప్రస్తుతం ప్రచారంలో ఉన్న శతకం పురుషోత్తమకవిది కావచ్చుననీ పలువురు అభిప్రాయపడుతున్నారు. ఒకే మకుటంతో ఇద్దరు వ్రాయడం కూడా కద్దు (ఆం.సం.సా-159) (శ.క.చ-487)

## మానసబోధ శతకము

కర్త : తాడేపల్లి పానకాలరాయడు.

మనోహరమైన కవిత్వంగల శతకం. "మనసా, హరిపాదము లాశ్రయింపుమా" అన్న మకుటంతో ఉంది. చంపకోత్పలమాలా వృత్తాలున్నాయి. ఇదే మకుటంతో కాసుల పురుషోత్తమ కవి కూడా ఒక శతకం వ్రాశాడు. కాని అది అలభ్యం.

ఈ శతకం భక్తిరస ప్రధానం. పండిత పామర జనులలో ప్రఖ్యాతి పొందింది. (శ.క.చ-458)

**మానసోల్లాసము (అలభ్యం)**

కవి : చూ. శ్రీనాథుడు.

శ్రీనాథుడు ఒక కామశాస్త్రాన్ని వ్రాసినట్లు నెల్లూరు శివరామకవి వ్రాసిన కామకళానిధినుండి తెలుస్తున్నది. అది ఈ మానసోల్లాసము కావచ్చునని కొందరి అభిప్రాయం. (క.స-276)

**మానసోల్లాస వ్యాఖ్య (సం)**

కర్త : చూ. కందాడై అప్పళాండాచార్యుడు.

ఇది మను స్మృతికి సంస్కృత వ్యాఖ్య. (తె.పి.స,)

**మానసోల్లాస సారము [అలభ్యం]**

కవి : పిల్లలమర్రి పినవీరభద్రుడు (చూ).

సముల్లసితమైన శయ్యతో ఘనమైన బుద్ధికుశలత తేటపడేటట్లు వ్రాసినట్లు కవి చెప్పుకొన్నాడు. (ఆరుద్ర-6-202)

**మాన్నూరు గోపాలరాయ కవి**

కాలం : క్రీ శ. 18 వ శతాబ్దం.

స్థలం : మైసూరు.

రచన : కీర్తికాంతా స్వయంవరము.

మైసూరు ప్రభువైన కృష్ణరాజేంద్ర భూపాలుని ఆస్థానంలో ఉండేవాడు. విద్వత్కవి. సంస్కృతాంధ్ర కర్ణాట భాషలలో పండితుడు. (ద.దే.వా-480)

**మామిడి ప్రెగడయ్య**

కాలం : క్రీ. శ. 14వ శతాబ్ది ఉత్తరార్థం.

స్థలం : కొండవీడు

సాహిత్య పోషకుడు. శ్రీనాథుడు వ్రాసిన పండితారాధ్య చరిత్ర, ఇంకా అతనివే పెక్కు కృతులు ఇతనికి అంకితాలు.

ఇతడు పెద్దన్న, తల్లమాంబికల కుమారుడు. వేమనామాత్యుడు ఇతనికి అన్న. శృంగార నైషధాన్ని కృతిపొందిన సింగనామాత్యుడు ఇతని తమ్ముడు. కావ్యప్రియుడైన ప్రెగడయ్య, ఆహవ సవ్యసాచిగా కూడా పొగడ్తలు పొందాడు.

(ఆరుద్ర-4)

**మామిడి వారు**

చెట్టు పేరుతో ఉన్న ఇంటిపేరు "మామిడి" ఇంటి పేరుతో ఉన్న కృతిభర్తలు తెలుగు సాహిత్యంలో కనిపిస్తారు. శ్రీనాథ కవి విరచిత పండితారాధ్య చరిత్ర కృతిభర్త ప్రెగడయ్య, శృంగారనైషధ కృతిభర్త సింగన మామిడివారే. మర్రి, వేప, వెంపలి, తాడి మొదలైన చెట్ల పేర్లు ఇంటిపేర్లుగా ఉండటం సామాన్యం.

మర్రిచ్ఛందమనే ఒక ఛందోగ్రంథముంది. (భారతి-మా-45-229)

### మామిడి వేంకటార్యుడు

కాలం : క్రీ. శ. 1764 ప్రాంతం.
స్థలం : గోదావరీ మండలంలోని పాలకొల్లు పట్టణం.
రచన : శబ్దార్థ నిఘంటువు.
బిరుదు : పండిత రాజు.

వెంకనార్య విజయశ్రీ దంపతుల పుత్రుడు. సర్వవేదశాస్త్ర పురాణాది విద్యలు నేర్చిన వాడు.

పైనిఘంటు రచన క్రీ. శ. 1800-1900 మధ్యకాలంలో పూర్తి అయింది. శ్రీ శుద్ధచైతన్య స్వామిచే పరిష్కరించబడి 1961 న శ్రీవాసవీ గ్రంథప్రచురణ సమితి సంచికలో ప్రకటితమైనది.

ఈ నిఘంటువులో సిద్ధాంత కౌముదిలో శబ్దాలను సాధించిన విధంగానే సలక్షణంగా శబ్దార్థాలు వ్రాయబడి ఉన్నవి.

### మామిడి వేమనామాత్యుడు

కాలం : క్రీ.శ. 14 వ శతాబ్దం.
స్థలం : కొండవీడు.

సాహితీ ప్రియుడు. అనవేమారెడ్డి (1362-83) మహాప్రధాని అయిన మామిడి పెద్దనామాత్యుని కుమారుడు తల్లి తల్లమాంబిక. శ్రీనాథుడు ఇతనికి తన కృతులు కొన్ని అంకితం ఇచ్చి ఉండవచ్చునని ఊహిస్తున్నారు. ఇతని సోదరులైన ప్రెగడయ్యకూ, సింగనకూ శ్రీనాథుడు తన కావ్యాలను అంకితం చేశాడు. శృంగార నైషధంలో మంత్రి వేమనామాత్యుని ఒక చక్కని పద్యంలో నుతించాడు. సింగన్న శ్రీనాథునితో చెప్పినట్టుగా ఉన్న ఒక పద్యంలో అతడు తన అనుగు పెద్దన్నకూ ప్రెగడయ్యకూ కృతులు అంకితమిచ్చినట్లుగా ఉంది. శ్రీనాథుని అలభ్య కృతులలో ఏదో ఒకటి ఇతనికి అంకితమై ఉండవచ్చు. (అరుద్ర-130)

### మామిడి సింగనామాత్యుడు

కాలం : క్రీ.శ. 14 వ శతాబ్ది ఉత్తరార్థం.
స్థలం : కొండవీడు.
రచన : సోమ సిద్ధాంత వ్యాఖ్య (సం)

ఇతడు కవి, కృతిపతి కూడా. శ్రీనాథుని శృంగార నైషధ కావ్యం ఇతనికే అంకితం. ఇతడు మామిడి పెద్దన్న తల్లమాంబికల కుమారుడు, పెద కోమటి వేముని మంత్రిగా ప్రసిద్ధుడు. సామ్రాజ్య సంభరణ ప్రౌఢుడు. విద్వాంసుడు. దైవజ్ఞశిఖామణి. శ్రీనాథుని ప్రోత్సహించి నైషధ రచన చేయించాడు. తాను స్వయంగా సోమసిద్ధాంతమ్ అనే జ్యోతిష గ్రంథానికి వ్యాఖ్య వ్రాశాడు. త్రిభువనరాయ వేశ్యా భుజంగుడనీ, జగనొబ్బగండబిరుదాంకితుడనీ శ్రీనాథుడు ఇతన్ని కీర్తించాడు. (శ్రీనాథభారతం)

## మామిళ్ళ దాసామాత్యుడు

నామాంతరం : విడుమామిళ్ళ దానయామాత్యుడు.

సాహిత్య పోషకుడు. మంగళగిరి ఆనందకవి వ్రాసిన "వేదాంత రసాయన" మనే ఏసుక్రీస్తు చరిత్రకు కృతిపతి.

ఇతని సోదరుడు రాజప్ప కర్ణాటక దేశపువాడైన మహమదల్లీచేత సత్కరింపబడినట్లు "వేదాంత రసాయనం"లో ఉంది. (తె.వి.స_4)

## మాయలేడి పాట

జానపద పౌరాణిక గేయరచన.

చూ. పౌరాణిక గేయములు.

## మాయా చిదానంద మంజరి

చూ. చిదానంద మంజరి.

కర్త : ఉమాపతి.

## మాయా ప్రవరుడు

అల్లసాని పెద్దన రచించిన మనుచరిత్రలోని ఒక పాత్ర. మనుచరిత్ర ఆంధ్ర పంచకావ్యాలలో ఒకటి.

ప్రవరుని తిరస్కారంతో బాధపడుతున్న వరూధినిని ప్రవరవేషంతో సమీపించిన గంధర్వుడే మాయాప్రవరుడు. ఇతడు పూర్వమే వరూధినిని కోరి, ఆమెచే తిరస్కృతుడైనాడు. ప్రవరవృత్తాంతాన్ని గమనిస్తూ దొరికిన అవకాశాన్ని తనకు అనుకూలంగా మార్చుకొన్నాడు. ఈవిధంగా ఇతడు మనుచరిత్ర కథా-శాఖకి పిల్లకాలువ వలె ఉపకరించాడనవచ్చు. ఇతనివల్లనే వరూధినికి స్వరోచి కలగడం, అతడు స్వారోచిషమనువుకు తండ్రికావడం సంభవమైంది. కాబట్టే పెద్దన ఈ పాత్ర చిత్రణలో చాలా నేర్పు చూపించాడు. ఈ మాయా ప్రవరుని వైదిక నటనలు నిజప్రవరుని శ్రోత్రియత్వాన్ని మించిపోయినవి. ఇతని మాయావితనాన్ని ఏవగించుకోవడానికి బదులుగా, పఠితలుకూడా ఆ పాత్ర చాకచక్యానికి వరూధినితోపాటు ముగ్ధులయ్యేటట్టుగా పెద్దన ఇతన్ని తీర్చిదిద్దాడు. ప్రవరునిలో లేని శృంగారం, వింతమాధుర్యం ఇతనిలో కనిపిస్తాయి. తననుచూసి విష్ఠురాలు పలుకుతున్న వరూధినిని సమీపించడంలో ఇతడు చూపిన నేర్పు అపూర్వం. పితృభక్తి, వైదికధర్మ నిష్ఠ, గార్హస్థ్య ధర్మం-వీటిలో ప్రవరునికి తీసిపోకుండా మాట్లాడుతూనే వరూధిని సౌందర్యాన్నికూడా ప్రశంసించాడు. వరూధినితోడి పొందు సురభర్తకు కూడా దుర్లభమని చెప్పి తాను అందుకు సుముఖుడనే అన్న భావం స్ఫురింపచేశాడు. చివరికి, పరేకాని నీకోసం నా దీక్ష వదులుకుంటానని స్వార్థత్యాగాన్ని చూపినట్టు నటించాడు. ప్రవరుని మనస్తత్వం నుండి గంధర్వుని మనస్తత్వానికి దిగుతూ కొన్ని షరతులు కూడా పెట్టాడు. ఈ పాత్ర చిత్రణలో పెద్దన చూపిన నేర్పు అనితర దుర్లభం.

అందిన అవకాశాలను వినియోగించుకొని తమ దోషం బయటపడకుండా తప్పించుకొనే స్వభావంగల-వారికి ప్రతీక మాయాప్రవరుడు.

## మాయా విలాసమ్ (సం)

కర్త : తులగాన నీలకంఠ కవి.

పిడుపర్తి సోమన రచించిన ద్విపద ప్రభులింగలీలల నాధారంగా గ్రహించి రచించిన కావ్యం. అల్లమ ప్రభువి లీలలు - అతనిని వంచించడంకోసం పార్వతి తన తామస కళను "మాయ"గా భూలోకానికి పంపడం, అల్లముడు మాయకు లోబడకపోవడం వరకు ఉన్న కథమాత్రం ఇందులో ఉంది కవి తెలుగు కావ్యాన్ని యథామూలంగా అనువదించారట. (చూ. కర్రి సాంబమూర్తిగారి వ్యాసం. భారతి-అంగీరస-ఫాల్గునము).

(ద్వి.సా.చ-143)

## మాయిభంగమ్ (సం)

కర్త : కందాడై ఉప్పుకొండాచార్యుడు (తె.వి స-4)

## మారకేతని శాసనము

కాలం : క్రీ శ. 1163 ప్రాంతం.

శాసనప్రదాత : మారకేతడు.

ప్రస్తావిత స్థలం : చెంచెర్వుల గ్రామం.

శాసన విషయం : చెంచెర్వుల గ్రామంలో 4,444 శివలింగా లున్నాయట. ఆ లింగాల మధ్య వేంచేసి యున్న కపోతేశ్వరస్వామికి - తాడూరి గ్రామవాసియైన మారకేతుడు అఖండ దీపం విలిపినట్లు ఈ శాసనం వల్ల తెలుస్తున్నది. ఇది సీస పద్య శాసనం. (తె క చ-293)

## మారన

కాలం : క్రీ.శ. 1291-1323 ప్రాంతం.

రచన : మార్కండేయ పురాణము.

తిక్కమంత్రి కుమారుడు. తిక్కన సోమయాజి శిష్యుడు. గన్నయ నాయకుని ప్రోత్సాహంతో రచనలు చేశాడు. ప్రతాపరుద్ర చక్రవర్తి కాలం నాటివాడు. కొందరు ఇతన్ని తిక్కన సోమయాజి పుత్రునిగా పొరబడ్డారు.

విశిష్టత : ఇతడు సంస్కృత మార్కండేయ పురాణాన్ని అనువదించాడు. మొట్టమొదటిగా పురాణాన్ని అనువదించినవాడు ఇతడే ఇతని మార్కండేయ పురాణంలోని కథలే శంకరకవి హరిశ్చంద్రో పాఖ్యానానికి, పెద్దన మనుచరిత్రకు, మట్ల అనంత భూపాలుని బహుళాశ్వ చరిత్రకు మార్గదర్శకాలు. ప్రౌఢకవి మల్లన ఈ కవి యమలోక వర్ణనను సంగ్రహంగా తన రుక్మాంగద చరిత్రలో పొందుపరిచాడు. ఇతని కవిత్వం ప్రౌఢమై సలక్షణమై హృదయంగమంగా ఉంటుంది. (ఆరుద్ర-2)

## మారన వెంకయ్య

నామాంతరం : మారవి కవి.

కాలం : క్రీ.శ. 16వ శతాబ్ది. ఆరవీటి రాజుల కాలం.

రచన : భాస్కర శతకము.

విశిష్టత : ప్రఖ్యాతమైన భాస్కర శతకాన్ని ఇతడే వ్రాసినట్లు కొన్ని తాళ పత్ర ప్రతులలో చూసి బ్రౌను దొర నిర్ణయించారట. ఈ కవి చెప్పిన పద్యంలోని 'పదార్థం' అనే మాటను నిత్య సమాస విశ్రాంతులలో ఒక ఉదాహరణకు అప్పకవి చూపించాడు. అప్పకవి నాటికే ఈ కవి విరచిత భాస్కరశతకం ప్రచారంలో ఉందంటే, వెంకయ్య అప్పకవికి కనీసం ఒక యాభై సంవత్సరాలు పూర్వుడవుతాడు. (అప్పకవి కాలం క్రీ.శ. 1656 ప్రాంతం). ఈ కవి భాస్కర శతకంలోని ప్రతి పద్యలో మొదటి పాదాలలో ఒక సత్యం చెప్పి, దానిని సమర్థించటానికి కడపటి పాదాలలో ఒక దృష్టాంతం చెబుతాడు. ఇతడు సూర్యనారాయణుని భక్తుడట. ఈయన తన శతకాన్ని దశకాలుగా విభజించాడు. భాగ్యరేఖ, పూర్వజన్మ సుకృతం, కర్మ, అదృష్టం మొదలైన వానిని గురించి చెప్పాడు. బ్రౌనుదొర ఈ పద్యాలను అకారాదిక్రమంలో ఏర్పరచి ప్రచురించాడు. ఈ కవి గురించి చాల కథలున్నాయి. ఇతడు జీవితంలో నిరాశచెందినట్లు కనిపిస్తాడు. తనకన్నా తక్కువ పాండిత్యమున్న వాళ్ళు గద్దె నెక్కితే సహించలేనివాడుగా కనిపిస్తాడు. ఈయన భాస్కర శతకంలో అదృష్టహీనులను గురించి వ్రాసినా, భాస్కర శతక కర్తగా ఈయన తెలుగు శతక సాహిత్యంలో అదృష్టవంతుడు.

(శ.క.చ-231) (ఆరుద్ర-9-221)

## మారపండని శాసనము

కాలం : క్రీ.శ. 1132 ప్రాంతం.
స్థలం : తెలియదు.
శాసనప్రదాత : మారపండడు

విక్రమచోడదేవర కాలంవాడు.

శాసన విషయం : ఈయన మిక్కిలి అందగాడని, ధార్మికుడని, బంధువులందరినీ ఆదరించాడని, సత్రాలు పెట్టించాడని, శివాలయాలు నిర్మించాడని, చెరువులు త్రవ్వించాడని ఈదాన శాసనం చెబుతుంది. ఈ శాసనంలో ఎత్తుగీతితో ఒక సీస పద్యం, ఒక శార్దూలమున్నాయి. (తె.క.చ-198)

## మారవి కవి

కాలం : క్రీ.శ. 1660 కి పూర్వం.
రచన : భాస్కరశతకము. (శ.సా.వి-375)
చూ. మారన వేంకయ్య.

## మారుతీశతకము

కర్త : కొటికలపూడి కోదండరామకవి.

ఈ శతకంలో ఆంజనేయుని దివ్యలీలలను రామాయణ సంబంధమైన గాథలను కవి రసవంతంగా వర్ణించాడు. ఇది ప్రభవ కార్తిక బహుళ (4) శుక్రవారం వ్రాసినట్లు

ప్రతిలో ఉంది. వృత్తపద్యాలతో మారుతీ అనే మకుటంతో ఉంది. శైలి రసవంతమైనది. (ఆం.సం సా. 305)

## మారుపెద్ది చెంగల్వరాయకవి

కాలం : క్రీ. శ. 1810–1900 మధ్యకాలం.
ఆస్థానం : చెంగల్పట్టు జిల్లా, శెయ్యూరు సంస్థానం.
జన్మస్థలం : మరకాణము సమీపంలోని పెరుంపాడు గ్రామం.
రచనలు : 1. ముద్దుకుమార శతకము 2. చారులీలా విలాసము (అసంపూర్ణము) 3. పదములు 4. సుందరేశ్వర విలాసము (యక్షగానము) 5 వల్లీ నాటకమ్ (సంస్కరణ).

వేంకటరాయని పుత్రుడు. తిరుమలరాయని పౌత్రుడు సంగీత సాహిత్యాలలో విశేష ప్రజ్ఞ గలవాడు. భరతనాట్య విద్యాకుశలుడు. పచ్చికుండ పైని భరతనాట్యం అభినయించి ప్రసిద్ధిగన్న శెయ్యూరు శారదాంబ ఈతని శిష్యురాలు. శెయ్యూరు జమీందారు వైద్యనాథుడితన్ని ఆదరించాడు. ఇతడు వల్లీనాటకాన్ని ప్రదర్శనయోగ్యంగా సంస్కరించి ప్రచారంలోనికి తెచ్చాడు.

సర్వవాద్య విన్యాసమును (డెబ్బదిరెండు వాద్యముల విన్యాసము) సంశోధించి శెయ్యూరు దేవాలయంలో ప్రవేశపెట్టి పునరుద్ధరించిన ఘనత ఈతనిదే. ఈ సర్వవాద్య విధానము 'కామికాగమము'లో ఉన్నదట ఇతని పదాలు వెయ్యికి పైగా ఉన్నాయి. 360 కృతులు కంచి కామాక్షిమీద, 240 మధురమీనాక్షి మీద, 100 వేంకటేశ్వరుని మీద రచించాడు. కొన్ని తమిళంలో కూడా రాశాడు. (ద.దే.వా–510)

## మారుపెద్ది చెంగల్వరాయశాస్త్రి

నామాంతరం : మారుపెద్ది చెంగల్వరాయ కవి.

(ద.దే.వా–512)

## మారేపల్లి వేంకటయోగి

కాలం : క్రీ. శ. 18 వ శతాబ్ది.
రచన : తత్వ దీపిక బోధ (ద్విపద).
అంకితం : అలమేలు మంగాసహిత తిరుపతి వేంకటేశ్వరునికి.
గురువు : ముప్కడి మల్లనయోగి.
సమకాలికులు : జ్ఞాన సూర్యోదయ మనే (ద్విపద) వేదాంత గ్రంథం వ్రాసిన ఢిల్లీ వేంకట కవి.

వెంకటభట్టు, నరసమ్మల పుత్రుడు. కామయ్య పౌత్రుడు. అలమేలు మంగమ్మ కోరితే వేంకటేశ్వరుడు కరుణించి చెప్పిన వేదాంతాన్ని ఈయన తత్వదీపిక బోధ అనే పేర ద్విపద కావ్యంగా వ్రాశాడు. (ఆరు.ప్ర–8–274)

## మార్కండేయ చరితము (అలభ్యం)

రచనాకాలం : క్రీ. శ. 18 వ శతాబ్దం.

కర్త : పోవిరాజు వీరన్న.

కవి తన ఇరవై అరవ ఏట దీన్ని రాశాడట. (క.చ 3-162)

## మార్కండేయ చరిత్ర

కర్త : మేరత్తూరు వేంకటరామశాస్త్రి.

మేరత్తూరు భాగవతమేళ నృత్య నాటకం. సులలితమైన కైశికీవృత్తిలో ఉంది. భక్తిరస ప్రధానమైన సంగీత రూపకం (తె.వి.స-4)

## మార్కండేయ జననము

కర్త : తెలియదు.

జానపద పౌరాణిక గేయం. కథ మిక్కిలి ప్రసిద్ధమైనది

చూ. పౌరాణిక గేయములు.

## మార్కండేయ పురాణము

రచనాకాలం : క్రీ. శ. 16 వ శతాబ్దం (1511-68 ప్రాంతం).

కర్త : ఎల్లకర నరసింహ కవి.

అంకితం : కొమరవోలులోని రాజగోపాలస్వామికి.

ప్రత్యేకత : ఈ ద్విపద కావ్యానికి మూలం సంస్కృత మార్కండేయ పురాణం. పద్మసాలీల ప్రోత్సాహం వల్ల కవి దీనిని పద్మసాలీల వంశ చరిత్రగా వ్రాశాడు. సంస్కృతంలోని మార్కండేయ పురాణం అందరికీ అర్థం కాదని, వారి కోరిక మేరకు కవి దీనిని ద్విపదగా వ్రాశాడు. దీని అముద్రిత ప్రతి మద్రాసు ప్రాచ్య లిఖిత గ్రంథాలయంలో ఉంది. (ఆరుద్ర-9)

## మార్కండేయ పురాణము (అలభ్యం)

రచనాకాలం : క్రీ. శ. 16 వ శతాబ్దం.

కర్త : పొన్నతోట బొలిశ కవి.

అంకితం : ఇమ్మడి జగదేవరాయనికి.

పది ఆశ్వాసాల గ్రంథం. సంస్కృత మార్కండేయ పురాణానికి అనువాదం. (క స.)

## మార్కండేయ పురాణము

రచనాకాలం : క్రీ. శ. 19 వ శతాబ్దం.

కర్త : మంద కామేశ్వరకవి.

అంకితం : అలక రాజేశ్వరీ దేవికి.

ఆంధ్రీకృత గ్రంథం. ఎనిమిదాశ్వాసాలున్నాయి. సంస్కృత భాషలోని మార్కండేయ పురాణం దీనికి మూలం. విజయనగర సంస్థానాధిపతి విజయరామ గజపతి (1826-1879) భార్య అయిన అలక రాజేశ్వరీదేవి కోరికపైన కవి ఈ గ్రంథాన్ని తెనిగించి, ఆమెకే అంకితం చేశాడు. (క. త..3-160; ఆం. సం. సా-429)

### మార్కండేయ పురాణము

రచనాకాలం : క్రీ.శ. 13 వ శతాబ్దం.
కర్త : మారన.
కృతిభర్త : గన్నయ సేనాని.

ఎనిమిది ఆశ్వాసాల ప్రబంధం. సంస్కృతంలో వ్యాసమహర్షి రచించిన మార్కండేయ పురాణానికి మొదటి తెలుగు అనువాదం. మార్కండేయ పురాణం ధర్మ సందేహాలు నివృత్తి చేయటానికి పుట్టింది. జైమిని మార్కండేయుని సందేహాలు తీర్చమని అడిగితే, ధర్మ పక్షులను పంపి సందేహ నివృత్తి చేసుకోమంటాడు. శంకర కవి హరిశ్చంద్రోపాఖ్యానానికి, పెద్దన మనుచరిత్రకు, మల్ల అనంతుని బహుళాశ్వ చరిత్రకు, ప్రౌఢకవి మల్లన రుక్మాంగద చరిత్రకు మార్గదర్శకమైన గ్రంథమిది. చక్కని జాతీయాలు, సామెతలున్నాయి. అనువాదం మూలవిధేయం. (ఆరుద్ర-2)

### మార్కండేయ పురాణ సార సంగ్రహము

కాలం : క్రీ.శ. 19 వ శతాబ్దం.
కర్త : తిమ్మరాజు లక్ష్మణరాయకవి.

పురాణగాథ. సులభమైన వచనంలో రచించబడింది. (క.స-207)

### మార్కాపురము

ఈ గ్రామం ప్రస్తుతం ప్రకాశం జిల్లాలో ఉంది. ఇక్కడ సుప్రసిద్ధమైన చెన్నకేశ్వరస్వామి ఆలయమున్నది. కాకర్ల లింగన్నశాస్త్రి అనే కవి ఈ గ్రామం మీద పద్యం చెప్పాడు

ఈ ఊరుకు మార్కాపురమనే పేరు "మారిక" అనే గొల్లపిల్ల పేర వచ్చిం దని స్థానికులయిన పెద్దలు చెబుతారు. చాటువు వల్ల కూడా ఈ విషయం సూచనగా తెలుస్తున్నది. (చా.ప.ర.)

### మార్కు సువార్త

రచనాకాలం : క్రీ.శ 18 వ శతాబ్దం.

క్రైస్తవ మత గ్రంథం. మంగళగిరి ఆనందకవి ఈ రచనలో పాశ్చాత్య విద్వాంసులకు చాలా సహాయపడ్డాడట. దీనికి మూలం గ్రీకు భాషలో ఉంది. (క.స.)

### మార్కొండ ఆదెయామాత్యుడు

కాలం : క్రీ. శ. 19 వ శతాబ్దం-ప్రథమార్ధం.
స్థలం : మేరంగి సంస్థానం

మార్కొండ నీలయమంత్రి పుత్రుడు. సాహిత్యప్రియుడు. మేరంగి సంస్థానాధీశ్వరులైన చంద్రశేఖరరాజు (1798-1833), జగన్నాథరాజు (1824-1864) ల వద్ద దివానుగా ఉండేవాడు. వేంకటకవిని పోషించి, అతడు ఆంధ్రీకరించిన "కార్తీక మాహాత్మ్యము"ను అంకితం పొందాడు. (ఆం సం.సా-356, 357)

## మార్గ - దేశి కవితలు

దేశికవితలలోనే మార్గ-దేశిభేదాలతో రెండురకాల కవితలున్నాయని కొందరంటారు. నన్నెచోడుడు పాల్కురికి సోమన మొదలయినవారు దేశికవితను పుట్టించినవారని, నన్నయాదులు మార్గకవితను పుట్టించారని వారి భావం. కాని వాస్తవానికి కవిత మార్గ-దేశి భేదాలతో రెండేవిధాలు. సంస్కృత కవిత మార్గకవిత: ఆంధ్రాదిదేశ భాషా కవితలు దేశికవితలని చెప్పవచ్చు. నన్నయ మొదలు ఇప్పటివరకు తెలుగున అవతరించిన ఆంధ్ర కవిత అంతా దేశికవితగానే పరిగణించవచ్చునని పండితాభిప్రాయం దేశి కవిత అంటే దేశభాషా కవిత అని అర్థం చెప్పుకోవచ్చునట. (తె.వి.స-6.)

## మార్దవకుడు

కవులలో ఒక భేదం. సరళ పదాలలో విరళార్థ విస్ఫురణంగా రసభరితంగా కృతిని రచించే కవిని మార్దవకుడు అంటారు. కవిత్రయంలోనివాడైన ఎర్రాప్రెగ్గడ మార్దవకవిగా ప్రఖ్యాతుడు. (అప్పకవీయం-26.)

## మాల జంగాలవారు

జానపద గాయకులు.

ప్రస్తుతం బుర్రకథలుగా ప్రచారం పొందిన కథలనే వీరు ఒక ప్రత్యేక ఫక్కీలో చెబుతారు. వీరి తంబురా నెమలి ఈకలతో అలంకృతం. వీరు చేతి ఉంగరాలతో తంబురాబుర్రను తాళం ప్రకారం కొడుతూ కథ చెబుతూ ఉంటారు. వీరు చెప్పే కథలు కరుణ రస ప్రధానాలు. ఈ కథలు తెల్లవార్లూ జరుగుతుంటాయి. వీరి సాహిత్యం ఎటువంటిదో గ్రంథ రూపంలో దొరకటం లేదు. అయినా కథలు నడుస్తూనే ఉన్నాయి. డోలు, జమిలిక, తుడుంకొమ్ము వీరి ప్రధాన వాయిద్యాలు. (నా.ర.చ-283)

## మాలతీ మాధవము

కర్త : చూ. విక్రాల నరసింహాచార్యులు.

భవభూతి రచించిన సంస్కృత రూపకానికి ఆంధ్రీకరణ. (ఆం.సం.సా.)

## మాల దాసరి

నామాంతరం : తిరుప్పాణాళ్వారు.

ఆముక్త మాల్యదలోని పాత్ర. ఇతడు పన్నిద్దరాళ్వారులలో ప్రసిద్ధుడు. భగవంతుని శ్రీవత్సాంశ చేత పుట్టిన వాడు. పంచమ కుల సంజాతుడు. నిరంతరం హరి నామసంకీర్తనలో పొద్దుపుచ్చేవాడు శ్రీ రంగేశ్వరుని కీర్తనలు పాడుటయే ఇతని వ్రతం. తన స్వగ్రామానికి కొంతదూరంలో ఉన్న "కురుంగుడినంబి"ని గానం చేయడమే ఇతని దినచర్య.

ఒకనాడు స్వామివారు తన అర్చకునికి కలలో కనిపించి పంచముడని ఎంచక ఈ దాసరిని భుజంపై మోసుకరమ్మని ఆజ్ఞాపించాడట. పూజారి అదేవిధంగా ఇతన్ని తన భుజాలపైన మోసుకువస్తాడు. అప్పుడతడు భగవత్సౌందర్యాన్ని పది 'పాట్టు'లలో స్తుతించాడు, దానికే "అమలనాదిపిరాన్" అని పేరు. మునిపై అధివసించడంచేత

ఇతనికి మునివాహనుడనే పేరుకూడా వచ్చింది. శ్రీకృష్ణదేవరాయలు ఆముక్తమాల్యదలో ఇతని కథను చెప్పాడు. మాలదాసరి మహాభక్తుడు. జాత్యుచిత చరిత్ర కలవాడు. వీణను చేతబట్టి భగవంతుని గూర్చి పాడేటప్పుడు ఇతనికి దేహస్మృతి ఉండేది కాదు. ఆకలి దప్పులు అసలే లేవు. ఆతని భక్తి అంతటిది. ప్రతిదినం తెల్లవారుఝామున లేచి మంగళ కైశికీగానం చేస్తూ కురుంగుడి నంబిని సేవించడం ఇతని దినచర్య.

ఇట్టి వాడొకనాడు మార్గం తప్పాడు. ఫలితంగా ఒక బ్రహ్మ రాక్షసుని చేతిలో పడ్డాడు.

రాయలవారు మాలదాసరి కథను వ్రాసేటప్పుడు తిరుప్పాణాళ్వారుల దివ్య చరిత్రను దృష్టిలో ఉంచుకొన్నాడు కాబట్టి దానికి తగినట్లుగా కథను మలిచాడు ఈ బ్రహ్మ రాక్షసుడొక బ్రాహ్మణుడు. శాపవశాత్తు రాక్షసుడైనాడు. మాలదాసరి ఆళ్వారు కావడంలోని మర్మం ఇక్కడ కనిపిస్తుంది. ఆ సందర్భంలో ఆ పాత్రను పరిశీలించిన వారికి దాసరి చండాలు డనిపించడు. వాని ధార్మిక గుణం, సత్యనిరతి అలనాటి శిబి చక్రవర్తిని మించిపోయింది. తనను భక్షింతునని రాక్షసుడు బెదరించి నప్పుడు బెదరించిన రాక్షసునికి పరిణామ పేశలమైన ఈ శరీరాన్ని ఒక క్షుదార్తునికి బహూకరించడం వల్ల జన్మ తరిస్తుందనుకున్నాడు. కాని నాటిరోజు భగవంతుని గానం చేయలేదు కదా. అందుచేత బ్రహ్మ రాక్షసునితో వాదించి, మళ్ళీ తిరిగి వస్తానని మాట ఇచ్చి స్వామి సన్నిధికివెళ్తాడు. అవసాన దశలో కూడా అచంచలమైన భక్తిని ప్రదర్శించిన ఈతడు చిరస్మరణీయుడు. ఇచ్చిన మాట ప్రకారం ఆత్మార్పణం కొరకు తిరిగి రాక్షసుని కడకు వస్తాడు. బ్రహ్మ రాక్షసుని పూర్వజన్మ వృత్తాంతం విని, దయ కలిగి, తన కైశికీగానంవల్ల సంపాదించిన పుణ్యంలో కొంతభాగం అతనికి దానం చేసి శాపవిమోచనం కల్గిస్తాడు.

ఈ దాసరి పండితుడు కాడు. బ్రహ్మజ్ఞాని. రాక్షసునితో ఇతని సంభాషణ ఈ విషయాన్ని నిరూపిస్తుంది. ఇతడు వేదార్థాన్ని తెలుసుకున్నవాడు. కాని మంత్రాన్ని అనుసంధించడు. ఇది జాత్యుచిత చరిత్ర. ఇతడు ప్రత్యేకంగా శుష్కతర్కాదులను అభ్యసించలేదు కాని భగవత్సాక్షాత్కారం పొందినవాడు. తర్క మీమాంసాదులను అభ్యసించినవాడు పండితుడు. ఇతడు ఆళ్వారు. ఋషితుల్యుడు. ఇతని మార్గం భక్తి. దాని ద్వారానే భగవత్సాక్షాత్కారం పొంది మోక్షం సంపాదించాడు దివ్య సూరులలో ఒకడుగా స్థానం పొందాడు.

## మాలినీ మాధవీయము (అలభ్యం)

కర్త : వెలగపూడి కృష్ణయామాత్యుడు (చూ).

శృంగార కావ్యమట. కవి మరోరచన భానుమద్విజయంలో దీనిప్రసక్తి ఉంది. (ద.దే.వా-389)

## మాళవికాగ్ని మిత్రము

రచనా కాలం : క్రీ. శ. 19వ శతాబ్దం.

కర్త : చదలువాడ సీతారామశాస్త్రి

వచన నాటకం. సంస్కృత మూలానికి అనువాదం.

**మిక్కిలి మల్లికార్జునకవి**

కాలం : క్రీ.శ. 1805-1875 మధ్యకాలం.

స్థలం : గోదావరిమండలం- పెద్దాడ.

రచనలు : నాచికేతు చరిత్రము, నిర్వచన విక్రమార్క చరిత్రము, రామచంద్ర చరితము, బేతాళ పంచవింశతి భగవద్గీత, రాఘవశతకము.

విద్వత్కవి. బహుగ్రంథకర్త. 'నాచికేతు చరిత్రము' పిఠాపురం సంస్థానామాత్యుడైన 'వాడ్రేవు చలయయ్య' కు అంకితం. నందూరి కామయమంత్రికి 'నిర్వచన విక్రమార్క చరిత్రము' అంకితం. (అం.సం.సా-254)

**మిడితల**

నామాంతరం : గండతల.

**మితాక్షర (సం)**

కర్త : చూ. అన్నంభట్టు.

సంస్కృత రచన. బ్రహ్మ సూత్రాలకు వ్యాఖ్యానం. (తె.వి.స-4)

**మితాక్షరి (సం)**

కర్త : చూ అన్నంభట్టు.

ఇది సంస్కృతంలోని కాశికాగ్రంథానికి వ్యాఖ్య. యాజ్ఞవల్క్య స్మృతి వ్యాఖ్యకు కూడా మితాక్షరి అనే పేరున్నది. (తె.వి.స-4)

**మిత్రవిందా పరిణయము (అలభ్యం)**

కర్త : కావూరి ఎల్లయ.

ప్రబంధం. కవి పేరు రావూరి ఎల్లయ అని కొందరి అభిప్రాయం. (క.స-26)

**మిత్రవిందా పరిణయము**

రచనాకాలం : క్రీ.శ. 18 వ శతాబ్దం.

కర్త : కుందుర్తి వేంకటాచలకవి (చూ).

ఆరు ఆశ్వాసాల ప్రబంధం. 723 పద్యాలున్నాయి రచనలో ప్రబంధ కవుల పోకడలు కనిపిస్తాయి. వర్ణనాత్మకమైన రచన.

ఈ గ్రంథం 1888లో అముద్రిత గ్రంథ చింతామణి పత్రికవారు ముద్రించారు. (ద.దే.వా-366)

**మిత్రవిందా పరిణయము**

కర్త : చూ. జనార్దన రంగారాయ బహద్దరు.
అంకితం : శ్రీకృష్ణునికి.

శృంగార ప్రబంధం. నాలుగాశ్వాసాలున్నాయి. శ్రీకృష్ణలీలా విలాస ప్రదర్శక మైన శృంగార రచన. శ్రీకృష్ణుడు 'మిత్రవింద'ను వివాహం చేసుకోవడం ఇందులోని ఇతివృత్తం.

ప్రాచీన ప్రబంధ ధోరణిలో వ్రాయబడిన ఈ రచన శ్రీరామవిలాస గ్రంథ మాలా కుసుమంగా ప్రచురితం. (అం. సం.సా-307)

**మిత్రవిందోపాఖ్యానము**

కర్త : మరింగంటి వేంకట (ప్రథమ) నృసింహాచార్యులు. (తె. వి స-6)

**మీనకేతనాభ్యుదయము**

రచనాకాలం : క్రీ. శ. 1600 ప్రాంతం.
కర్త : ఉప్పుగుండూరి పెరియన్న కవి.
కృతిభర్త : శ్రీరంగరాయల కుమారుడు వెంకటపతిరాయలు.
అసమగ్రమైన ప్రతి మాత్రం లభించింది. ఇది శృంగార కావ్యం.

ప్రత్యేకత: కావ్యావతారికలో కవి పెరియన్న తాను "సత్కవి వేశ్యా భుజం గుడన"ని చెప్పుకొన్నాడు.

ఇది అముద్రితం. దీని వ్రాతప్రతి ఆంధ్రసాహిత్య పరిషత్ కార్యాలయంలో ఉంది కృతిపతి అరవీటి పెద వెంకట రాయలుగా ప్రసిద్ధుడు.
(క. త-11-86; అరుద్ర-9)

**మీనాక్షీ శతకము**

కవయిత్రి : బండి బాపనమ్మ.

మధురాపురిలోని మీనాక్షీ దేవిపై చెప్పిన కంద పద్య శతకం. రచన మనోహ రంగా ఉంది (శ. క.చ-555)

**మీమాంసా శాస్త్రి సారము**

నామాంతరం : కర్మజ్ఞాన వివరణము.
కర్త : నడిమింటి సర్వమంగళేశ్వర శాస్త్రి. (తె. వి. స-4)

**మీమాంసా సూత్ర దీపిక (సం)**

కర్త : కంచం ఎల్లయార్యుడు. (తె. వి. స-4)

**ముండకోపనిషత్తు**

రచనాకాలం : క్రీ. శ. 19వ శతాబ్దం పూర్వార్ధం.
కర్త : పరవస్తు వేంకట రంగాచార్యులు.

సంస్కృతంలోని మూలానికి పద్యానువాదం. రచన సరళంగా ఉంది.

## ముకుందయోగి

కాలం : క్రీ. శ. 16 వ శతాబ్ది.
రచన : శ్రీరంగ మాహాత్మ్యము (ద్విపద)
గురువు : కోవిల కందాళ అన్నంగారి కుమారుడు అప్పలాచార్యులు.

విశిష్టత : వైష్ణవమతం తెలుగుదేశంలో బాగా ప్రచారం పొందాక తెలుగు కవులు చేపట్టిన కథావస్తువు "శ్రీరంగ మాహాత్మ్యం". ఈ కావ్యాన్ని ఇంతకుముందే పద్యకావ్యంగా తెలుగులో భైరవుడు, చెన్నమల్లు శ్రీ గిరన్న వ్రాశారు.

(ఆరుద్ర-9-261)

## ముకుంద విలాస కావ్యమ్ (సం)

కర్త : భగవంతార్య మఖి

## ముకుంద విలాసము

కర్త : కాణాదము పెద్దన సోమయాజి (చూ).
నామాంతరం : "భద్రాపరిణయము" (చూ). (ఆం.సం.సా.)

## ముకుంద విలాసము (అలభ్యం)

కర్త : ధర్మవరము రామకవి (చూ).

ఒక పద్యం మాత్రం లభించినదట. (ఆం.సం.సా; క.స-184)

## ముక్కర సీతారామ భూపాలుడు

ఈయన మహబూబ్ నగర మండలంలోని ఆత్మకూరు సంస్థాన ప్రభువు. ఈయన కీర్తిని, దానగుణ శీలాన్ని, కవి పండిత పోషణను నుతించే చాటువులు దొరికాయి చాటుకవి పేరు గాని, వివరాలు గాని తెలియవు. (చా.ప.ర.)

## ముక్కు తిమ్మన

నామాంతరం : నంది తిమ్మన (చూ).

## ముక్తకము (శ్రవ్యకావ్య భేదం)

నామాంతరం : చాటువు.

ఇది అనిబద్ధకావ్యము. శ్రవ్యకావ్య భేదాలలో ఒకటి. క్రియా సమాప్తికై పద్యాంతరంతో సంబంధం లేకుండా రసభావాదులతో ఉన్న ఏక పద్యము.

ఈ ముక్తకాలలో 'అ'కారాది 'హ'కారాంతములు అద్యక్షరాలుగా గల పద్య సంగ్రహానికి వ్రజ్య అని పేరు. (తె.వి.స-6)

## ముక్తకము

సంస్కృత గద్యలలో ఇది ఒక భేదం. సమాస రహితంగా ఉంటుంది.
ఉదా : 'గురుర్వచసి', పృథురురసి మొదలగునవి. (తె.వి.స-6)

## ముక్తదేవుని కథ (అలభ్యం)

కర్త : పోచిరాజు పీరన్న.

కవి తన ముప్ఫయ్యారవ ఏట దీన్ని చెప్పాడట. భళ్ళాణ చరిత్రలో దీని ప్రసక్తి ఉంది. (క.చ. 3-162)

**ముక్తికాంతా కల్యాణము**

నామాంతరం : ముక్తికాంతా విలాసము. (ద.దే.వా-408)
కవయిత్రి : హోసూరి సాకమ్మ (చూ).

**ముక్తికాంతా పరిణయము**

రచనా కాలం : క్రీ.శ. 16 వ శతాబ్దం,
కర్త : పరమానంద తీర్థులు.

ప్రత్యేకత : యక్షగానం, పేరును బట్టి ఇది వేదాంత గ్రంథమని బోధపడు తున్నది. కవి వేదాంతి, యోగి. దీని ప్రతి లభించిందని పండితులు చెబుతున్నారు. వివేక జీవుడు ముక్తికాంతను పొందటం ఇందులోని ఇతివృత్తం. ద్విపదలు, దరువులు ఉన్నాయి. (ద.దే.వా. 209.)

**'ముక్తికాంతాప్రియా' శతకము**

కర్త : ముమ్మడి మల్లన్న.

మత్తేభ శార్దూల వృత్తాలున్నవి. "కృష్ణఘనుమల్లా ముక్తి కాంతాప్రియా" అనేది మకుటం. కొన్ని పద్యాలలో "కృష్ణఘనుమల్లా" అనేది లేదు. కృష్ణఘనుడు (కృష్ణ సచివుడు) కవి తండ్రి. శతకంలో ధేనుపుకొండ తిమ్మయ గురుని ప్రశంస ఉంది. (శ.క.చ-744)

**ముక్తికాంతా విలాసము (అలభ్యం)**

కవయిత్రి : తరిగొండ వేంకమాంబ.
యక్షగానం కావచ్చు. (అ.ఛా.కవయిత్రులు-75)

**ముక్తికాంతా విలాసము**

నామాంతరం : ముక్తికాంతా కల్యాణము.
కవయిత్రి : హోసూరి సాకమ్మ. (ద.దే.వా-408)

**ముక్తి చింతామణి**

రచనాకాలం : క్రీ. శ. 1600 ప్రాంతం.
కర్త : వేంకటాచార్యులు.

నాలుగాశ్వాసాల ప్రబంధం. జగన్నాథక్షేత్ర మాహాత్మ్యం దీనిలోని కథ. రాజమహేంద్రవర ప్రభువైన కోన తిమ్మరాజు ప్రేరణతో కవి ఈ రచన చేశాడు. రచన రసవంతంగా ఉంది. (క.స-258)

**ముక్తి శాంత భిక్షావృత్తి రాయడు**

కాలం : క్రీ. శ. 14 వ శతాబ్దం.

శ్రీశైలమఠాధిపతి. నవనాథ చరిత్రమును ద్విపదకావ్యంగా వ్రాయమని

గౌరవను కోరి, అతనిచేత ఆ కావ్యం వ్రాయించాడు. ఇది శ్రీశైల మల్లికార్జున స్వామికి అంకితం. ఇతని ప్రోత్సాహంతోనే శ్రీనాథుడు "శివరాత్రి మాహాత్మ్యం" వ్రాసి, ముమ్మడి శాంతయ్య అనే భక్తునికి అంకితమిచ్చాడు.

## ముక్తేవి పెరుమాళ్ళయ్య

కాలం : క్రీ శ 18వ శతాబ్దం
స్థలం చల్లపల్లి సంస్థానంలోని పెద ముక్తేవి గ్రామం.
రచన : హనుమంత శతకము.

క్రీ. శ. 1746-1791లో చల్లపల్లి సంస్థానాన్ని పాలించిన యార్లగడ్డ కోదండ రామన్న దేశాహి ఆస్థానంలోని ముఖ్య కవి. గొప్ప తపస్సంపన్నుడు. హనుమంత శతకమే గాక, "భద్రగిరి సౌధ సంచార భవ విదూర..." అనే మకుటంతో కూడిన 44 సీస పద్యాలు గల ఒక రామాయణ కథా కావ్యాన్ని కూడా వ్రాశాడట.

(ఆం. సం. సా-155, 156, 157, 158)

## ముక్తేవి సుందర రామదాస కవి

కాలం : క్రీ. శ. 18వ శతాబ్దం.
స్థలం : చల్లపల్లి సంస్థానం-పెద ముక్తేవి గ్రామం.
రచన : రామాయణసార సంగ్రహము.

ఇతడు సంస్కృతాంధ్రాలలో గొప్ప కవి. చల్లపల్లి సంస్థానంలో ఉండేవాడు. ఈతని తండ్రి ముక్తేవి పెరుమాళ్ళయ్య. చల్లపల్లి సంస్థానాన్ని పాలించిన కోదండ రామన్న దేశాహిని ఆశ్రయించినవాడు. (ఆం. సం. సా-158)

## ముక్త్యాల

"చింతలపాటి వంటు" అనేది దీని వ్యవహార నామం. కృష్ణా మండలంలోని ప్రాచీన సంస్థానాలలో ఒకటి. ముక్త్యాల జగ్గయ్యపేటకు ఆరుమైళ్ళ దూరంలో ఉంది. వాసిరెడ్డి వారు ఈ సంస్థాన పాలకులు.

తాతంభట్టు గురుమూర్తిశాస్త్రి, అమరవాది రామయకవి, కొప్పరాజు సుబ్బ రాయకవి, కొప్పరాజు నరసింహకవి, శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి, పిశుపాటి చిదంబరశాస్త్రి, చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రి, విశ్వనాథ సత్యనారాయణ, ఈ సంస్థానంలో గౌరవింపబడ్డారు.

ఈ సంస్థానం పాలకులు అనేక ప్రాచీన గ్రంథాలను అచ్చువేయించి కవి పండిత పోషణ గావించారు. భవానీ ముక్తీశ్వర ప్రసాదనాయడు, వారి పౌత్రుడు చంద్రమౌళీశ్వర ప్రసాదు, సదాశివప్రసాదు బహద్దరు, రామగోపాలకృష్ణ మహేశ్వర ప్రసాదు సంగీత సాహిత్య పోషకులుగా ప్రసిద్ధులు.

## ముఖలింగక్షేత్ర మాహాత్మ్యము

రచనాకాలం : క్రీ. శ. 1800 ప్రాంతం,
కర్త : కాకరపర్తి కృష్ణకవి.

పద్యకావ్యం. క్షేత్ర మాహాత్మ్యాన్ని తెలిపే రచన. శ్రీకాకుళం జిల్లాలోని ప్రాచీన క్షేత్రమైన ముఖలింగం యొక్క ప్రభావం వర్ణితం. కవిత్వం దోషరహితమై హృదయంగమంగా ఉంటుంది. (క.చ 3-216)

**ముచ్చటు**

ఇది ఒక విధమైన తూగుగల గద్యవిశేషం. 19-20 శతాబ్దులనాటి అనేక యక్షగానాలలో ఇది ప్రయుక్తం. ప్రాయికంగా పాత్రముఖంగా ప్రవర్తితమై "దేవా మహానుభావా" ఇత్యాదిగా సంబుద్ధ్యంతమై, అంత్యప్రాస విశిష్టమై ఉంటుంది. గుడిపాటి రామదాసకవి కాళిందీ విలాసాదులలోని "ముచ్చటలు" శబ్దాలంకార ప్రచురాలు. (య.వా.చ-273)

**ముటుకుల గుండయ్య**

కాలం : తెలియదు.

ఈయనను కీర్తిస్తూ రెండు చాటు పద్యాలు లభించాయి. (చా.ప.ర.)

**ముడియం వేంకట రమణ కవి**

కాలం : క్రీ. శ. 16 వ శతాబ్ది.

రచనలు : 1. రాధామాధవమ్ (సంస్కృత నాటకం. అలభ్యం) 2. కళాధరోపాఖ్యానము.

వేంకటపతి, ఓబమ్మల కుమారుడు. కసవమంత్రి మనుమడు.

విశిష్టత : తెలుగు కవులు పూర్వం తెలుగులో నాటకాలు వ్రాసేవారు కాు. కాని సంస్కృతంలో నాటకాలు వ్రాసేవారనటానికి ఈ వేంకటరమణ కవి నిదర్శనం. ఈయన సంస్కృతంలో నాటకం వ్రాశానని కళాధరోపాఖ్యానంలో చెప్పుకున్నాడు. ఈయన పెమ్మసాని వారి ఆస్థానంలో ఉండేవాడట. పెమ్మసాని తిమ్మానాయకునికి (క్రీ.శ. 1580 ప్రాంతం) సమకాలికుడు. ప్రౌఢంగా మనోహరంగా కవిత చెప్పాడు. (ఆరుద్ర-9-259)

**ముడుంబ అప్పయాచార్యులు**

కాలం : క్రీ శ. 19వ శతాబ్దం.

స్థలం : కార్వేటి నగర సంస్థానం.

క్రీ శ. 19 వ శతాబ్దం మధ్యకాలంలో కార్వేటినగర సంస్థానాన్ని పాలించిన మాకరాజు వేంకటపెరుమాళ్ళరాజు బహద్దరు ఆస్థానంలోని అష్టదిగ్గజ కవులలో వీరొకరు. రచనలను గూర్చిన వివరాలు తెలియవు. (ఆం.సం.సా)

**ముడుంబి అప్పయ్య దీక్షితులు**

కాలం : క్రీ. శ. 18 వ శతాబ్దం.

స్థలం : వేంకటగిరి సంస్థానం.

రచన : విష్ణుపురాణము.

వేంకటగిరి పాలకుల కోవలో 25 వ తరానికి చెందిన కుమార యాచమనాయని (క్రీ. శ. 1777–1804)కి ఆశ్రితుడు. రాజాజ్ఞ పురస్కరించుకొని "విష్ణుపురాణము" గ్రంథాన్ని ఆంధ్రీకరించి ప్రభువుచేత "అగ్రహారాన్ని" దానంగా పొందాడట.

(ఆం.సం.సా–458)

**ముడుంబి వేంకటాచార్యులు**

కాలం : క్రీ. శ. 1700 ప్రాంతం.

స్థలం : గోదావరి మండలం.

రచనలు : దేవహూతి విలాసము, రసప్రదీపిక,

వేదాంతాచార్యుల పుత్రుడు. ఇతని నివాసస్థలం గురించి భిన్నాభిప్రాయాలున్నాయి. ఇతడు వరంగల్లు వాడని కొందరంటున్నారు. (గో.కాం క.సం)

**ముడుంబై వేంకటకృష్ణమాచార్యులు**

కాలం : క్రీ. శ. 1800 ప్రాంతం.

స్థలం : తిరుత్తణి తాలూకాలోని అగరము (ఆగరము).

సంస్థానం : కార్వేటినగర సంస్థానం.

రచనలు : అధ్యాత్మ్య రామాయణము, ద్విపదోత్తర రామాయణము, పోలేరమ్మ దండకము, శ్రీరామ స్తవ చూర్ణిక, ఒక శతకం (పేరుతెలియదు).

అగరము గ్రామం చిత్తూరు జిల్లా లోనిది. వేంగళాంబా, వేంకటరమణ కవులు ఇతని తలిదండ్రులు. కార్వేటినగర సంస్థానప్రభువుల ఆశ్రయంలో ఉన్నాడు. ఈతని రచన సరళమై రసవంతంగా ఉంటుంది. (ఆం.సం.సా,)

**ముడుబాగళు భూపతి**

కాలం : క్రీ.శ. 17 వ శతాబ్దం.

స్థలం : ముళుబాగళు.

సాహిత్య పోషకుడు. ఇతడు కోడూరి వేంకటాచల కవికి పోషకుడు. వేంకటాచల కవి వ్రాసిన "శివరహస్య ఖండ" రచనను అంకితం పొందాడు. ఈభూపతి మేనల్లుడు ఇమ్మడి చిక్క దేవరాయల (1690 ప్రాంతం) కాలం వాడు.

"పుంగనూరు" సంస్థానాన్ని పాలించిన "సుగుటూరి" వంశ పాలకులు మైసూరు సీమకు చెందిన 'ముళుబాగళు' ప్రాంతాన్ని కూడా పాలించారు. ఈ "ముళుబాగళు" భూపతికి ఇంకేదైనా పేరు ఉన్నదేమో తెలియదు. ఇది ఇతని వ్యవహారనామం కావచ్చు.

(ఆం.సం.సా.)

**ముత్తరాజు**

ఇంటి పేరు. "నరహరి ప్రగడ" వారి వంశంలో ముత్తరాజు అనే ఆయన శ్రీకృష్ణ దేవరాయల కాలంలో యుద్ధగిరి, సర్వేపల్లి సర్కారులలో మిరాశీలను కల్పించి

కీర్తి పొందాడు. అప్పటి నుండి, అతని పేర వీరి యింటి పేరు "ముత్తరాజు" అయింది.
(క.శ-13-19)

## ముత్తరాజు వేంకట కృష్ణ కవి

కాలం : క్రీ.శ. 1700 ప్రాంతం.
స్థలం : జొన్నవాడ (నెల్లూరుకు ఆరు మైళ్ళ దూరం).
రచనలు : 1. బ్రహ్మోత్తర ఖండము 2. అష్టపదులు (అలభ్యం) 3. కర్ణామృతము (అలభ్యం).

సంస్కృతాంధ్ర భాషలలో పండితుడు. జయదేవుని అష్టపదులనూ, కర్ణామృతాన్నీ గేయ రూపంలో వ్రాశాడట.

వీరి యింటి పేరు మొదట 'నరహరి ప్రగడ' వారు. ముత్తరాజు అనే ఆయన ఈ వంశంలో ప్రసిద్ధుడవడం వల్ల, అతని పేర ఈ యింటి పేరు వ్యవహారంలోకి వచ్చింది. (క.శ-13-18)

## ముత్తుకుమార శతకము

నామాంతరం : ముద్దుకుమార శతకము.
కర్త : చెయ్యూరు చెంగల్వరాయ శాస్త్రి.

(తె.వి.స-4)

## ముత్యాలపాడు

నెల్లూరు మండలంలోని ప్రాచీన సంస్థానాలలో ఒకటి దీనికి "పెదపవని" అనే నామాంతరం ఉంది

చిన్నోని నరసారాయనింగారు ఈ సంస్థాన పాలకులకు మూల పురుషుడు. ఈ వంశంలోని 'ధర్మ భూపాల భాలేరాయనింగారు' ముత్యాలపాడు సంస్థానాధిపతుల కూటస్థుడు. ఇతడు ముస్లిమ్ పాలకుల పక్షం వహించి. అనేక యుద్ధాలలో వారికి తోడ్పడి, స్వామి భక్తికి చిహ్నంగా గండికోట మొదలగు జాగీరులను సంపాదించాడు. ఈ సంస్థాన పాలకులకు ఇంగ్లీషు కుంఫిణీ వారితో సత్సంబంధాలుండేవి. సంస్థాన పాలకులలో 11వ తరానికి చెందిన"రామచంద్ర భూపాల భాలేరావు", "రాజా" బిరుదాన్ని సంపాదించారు. రాజా సీతారామచంద్ర శ్రీరంగ భూపాల భాలేరావు క్రీ శ. 1911లో జమీందారైనారు వీరి కుమారుడు "వేంకట సత్యనారాయణ భూపాల భాలేరావు" చివరి జమీందారు.

మతుకుమల్లి వారు ఈ సంస్థానంలో దివానులుగా, కవులుగా, పండితులుగా అత్యంత ప్రసిద్ధి చెందారు. మతుకుమల్లి వెంగళప్ప, మాధవమంత్రి, కనకాద్రిశాస్త్రి ప్రభృతులు ఈ సంస్థానం యొక్క సారస్వత యశశ్చంద్రికలు నలువైపులా వ్యాపింపచేశారు.

ఈ సంస్థాన జమీందారులలో 12 వ తరానికి చెందిన "రాజా నృసింహ భూపాల

భాలేరావు" గారు ఆంధ్ర భాషా పోషకులు. "అముద్రిత గ్రంథ చింతామణి" అనే సాహిత్య మాస పత్రికకు నిత్య పోషకులుగాను, అనేక గ్రంథ ప్రచురణ సంస్థలకు రాజ పోషకులుగానూ ఉన్నారు. రాజా సీతారామచంద్ర శ్రీరంగ భూపాల భాలేరాయవిం గారు సంగీత సాహిత్యాలలో అత్యంతాసక్తి కలవారు. ఆంధ్ర సాహిత్య పరిషధ్యక్షులుగా ఉన్నారు. క్రీ.శ. 1919 లో నెల్లూరులో జరిగిన ఆంధ్ర సాహిత్య పరిషదష్టమ వార్షికోత్సవంలో పాల్గొని, తాతా సుబ్బరాయశాస్త్రి. వేదం వేంకటరాయశాస్త్రి ప్రభృతుల చేత విశేష మన్ననలను పొందారు (ఆం.సం.సా-342-345)

## ముదిగొండ బ్రహ్మయ లింగము

కాలం : క్రీ. శ. 1700 ప్రాంతం.

స్థలం : మెదకు మండలం.

రచన : శివరహస్య ఖండము (తత్త్వ ప్రకాశిని).

వేదాంత పరమైన రచనలు చేశాడు. రచన ప్రౌఢంగా ఉంది.

(గో. కొం. క. సం ; క. స-147)

## ముదిగొండ వీరభద్రుడు

కాలం : క్రీ. శ. 15వ శతాబ్దం.

స్థలం : నైజాము మండలం.

సాహిత్య పోషకుడు. భైరవ కవిని ప్రోత్సహించి రత్న పరీక్ష అనే కావ్యాన్ని వ్రాయించాడు. (క. త-5-237)

## ముద్దయ కవి

కాలం : క్రీ. శ. 1834 ప్రాంతం.

స్వస్థలం : మండెన (నైజాం మండలం).

రచన : మంథెన రామాయణము (యక్షగానం).

ఈ కవిని గూర్చిన వివరాలు తెలియరాలేదు. ఇతని రామాయణం ఆ ప్రాంతంలో ప్రజలు కంఠస్థం చేసి పాడుతుంటారు. (య. వా. చ-363)

## ముద్దరాజు పెద రామన

కాలం : క్రీ.శ. 16 వ శతాబ్ది.

స్థలం : కడప జిల్లా - గండికోట ప్రాంతం.

రచన : పింగళి సూరన్న రాఘవ పాండవీయానికి టీక.

విశిష్టత : ఈయన ముద్దరాజు గణపయ్య పెద్ద కుమారుడు. గణపయ్య ముగ్గురు కొడుకులకూ రామన్న అనే పేరే ఉంది. పెదరామన సారస్వత సంపదానందుడు. సూరన్న రాఘవ పాండవీయానికి, ఆదర్శవ్యాఖ్య వ్యావహారిక భాషలో వ్రాశాడు. ఆ వ్యాఖ్యానాన్ని ఈనాటి ముద్రాపకులు మార్చివేసి కృతక గ్రాంథికంలో అచ్చు వేశారు. ఈయన

తెలుగు కావ్యాలకు వ్యాఖ్యానాలు చెప్పిన వారిలో మొదటివాడు. "కవిజన సంజీవని" అనే లక్షణ గ్రంథాన్ని వ్రాసిన రామన్న ఇతని తమ్ముడు. (ఆరుద్ర-9-199)

## ముద్దరాజు రామన్న

కాలం : క్రీ. శ. 16 వ శతాబ్దం.
స్థలం : కడప జిల్లా - గండికోట ప్రాంతం.
రచన : కవిజన సంజీవని (లక్షణ గ్రంథం).

విశిష్టత : ఈయన ముద్దరాజు గణపయ్యకు మూడోకొడుకు. సూరన్న రాఘవ పాండవీయ వ్యాఖ్యాత ముద్దరాజు పెదరామన్నకు రెండో తమ్ముడు ఈయన ఉద్దండ పండితుడు. జేగీయమాన కవిత్వ విశారదుడు. ఈయన వ్రాసిన ఇతర లక్ష్య గ్రంథాల సంగతి తెలియరాలేదు ఈయన ప్రయోగాలను అప్పకవి, అహోబల పండితుడు, చిత్రకవి అనంతయ్య, కూచిమంచి తిమ్మన మొదలయిన లాక్షణికులు యథాతథంగా స్వీకరించారు. రాఘవ పాండవీయ వ్యాఖ్యను ఇతడే రచించాడని కొందరు భావిస్తున్నారు. (ఆరుద్ర-9; క-194)

## ముద్దు అళఘరి

కాలం : క్రీ. శ. 17వ శతాబ్దం.
స్థలం : మధుర.

కవి, సాహిత్య పోషకుడు, కృతిపతి. క్రీ. శ. 1674 లో తంజావూరును పాలించాడు. మధురను పాలించిన చొక్కనాథ నాయకుని (క్రీ. శ. 1659-82) సవతి తమ్ముడు.కలియుగ గోపాలుడనీ, సకలవిద్యా ప్రౌఢి సర్వజ్ఞుడనీ పొగడ్తలు పొందాడు. ఇతడు రచనలు చేశాడని తెలుస్తున్నది కాని రచనలు తెలియరాలేదు.

ఇతని యుద్ధ విజయాలను గణపవరపు వెంకట కవి "పెద్దళగిరి విజయం"గా వ్రాశాడు. అతని "విద్యావతీ దండకం" ఇతనికే అంకితం. లింగనమఖి శ్రీ కామేశ్వర కవికి ఆశ్రయం ఇచ్చి అతనిచేత రుక్మిణీ పరిణయం, సత్యభామా సాంత్వనం కావ్యాలు వ్రాయించి అంకితం పుచ్చుకొన్నాడు. (ఆరుద్ర-10-12)

## ముద్దుకుమార శతకము

కర్త : మారుపెద్ది చెంగల్వరాయ కవి.

సంగీత మాధుర్యభరితమైన సరళమైన రచన. ముత్తు కుమార శతకంగా ప్రసిద్ధం. (ద. దే. వా-510)

## ముద్దుపళని

కాలం : క్రీ. శ. 18వ శతాబ్దం.
ఆస్థానం : తంజావూరు మహారాజు ప్రతాప సింహుని (1739-63) ఆస్థానం.
రచనలు : 1. రాధికా సాంత్వనము (నామాంతరం-ఇళాదేవీయము) 2. సప్త పదులు (కర్తృత్వం సందేహం.)

పోటీపోటి, ముత్యాలు ఈమె తలిదండ్రులు. పళని అనేది దక్షిణ దేశంలో వేలాయుధుని పూజాక్షేత్రం. ఆ దేవ స్థలం పేరే ఈమె పేరు. ఈమె కృతులు రచించడమే కాక, కృతులు అందుకొన్నదట. అవి నేడు లభ్యం కావటం లేదు.

తెలుగు సాహిత్యంలో ఈమెకొక విశిష్ట స్థానం ఉంది. స్త్రీలలో ఇంత ప్రౌఢ కావ్యాలల్లిన వారు అరుదు. ఈమె రచనగా చెప్పబడ్డ సప్తపదులు, తమిళంలో (గోదాదేవి) ఆండాళ్ రచించిన పాశురములకు (తిరుప్పావై) తెలుగు సేత. ఇవి మొదట ముద్దుపళని విగా గుర్తించినప్పటికీ తరవాత కొందరు పరిశోధకులు, వాటిని సురపుర సంస్థాన విద్వాంసులైన శ్రీనివాస దేశికులు రచించినట్లు నిర్ధారించారు. ఈమె రచన ప్రౌఢమూ మంజులమూ. సమకాలీన సంప్రదాయాలనేకం ఈమె రచనలో గోచరిస్తాయి.

(ద. దే. వా-270)

## ముద్దు రంగ చొక్కనాథుడు

కాలం : క్రీ. శ. 18వ శతాబ్దం.
స్థలం : మధుర.
రచన : శ్రీరంగమాహాత్మ్యమును గురించిన గ్రంథం.

ఈతడు మధుర పాలకుడైన విజయరంగ చొక్కనాథుని పుత్రుడు. శ్రీరంగ నాథుని భక్తుడు. శ్రీరంగ మాహాత్మ్యమును గురించి ఒక గ్రంథం వ్రాశాడట. అది వచనమో పద్య కావ్యమో తెలియదు. (క. స-170)

## ముద్దు లక్ష్మీనారాయణ

కాలం : క్రీ. శ. 19వ శతాబ్దం.
స్థలం : బొబ్బిలి సంస్థానం.
రచన : సహస్రకంఠ రామాయణము.
గురువు : మండపాక కామకవి.

వివరాలు తెలియవు. (ఆం. సం. సా-308)

## ముద్రామాత్యము

కర్త : క్షేమేంద్రుడు (చూ)

ఇందులో నుండి మడికి సింగన తన "సకలనీతి సమ్మతం"లో ఉదహరించిన 32 పద్యాలు మాత్రం లభించాయి. కుటిల నీతిని చక్కని ఉపమానాలతో కవి చెప్పాడు. (అరుద్ర-2)

## ముద్రాలాభము (అలభ్యం)

కర్త : వేములవాడ సోమనాథుడు (చూ).

## మునగాల

నేటి కృష్ణామండలంలోని నందిగామ తాలూకాకు చెందిన ఎస్టేటు. బందరు-హైదరాబాదు మధ్య రహదారిలో, బందరుకు 125 మైళ్ళ దూరంలో ఈ సంస్థానం ఉంది.

సంస్థాన పాలకులలో పూర్వులు కొందరు కాకతీయ చక్రవర్తులకు సామంతులుగా ఉండేవారు.

గుర్లపాటి అయ్యన్నదేశాయి ఈ సంస్థాన పాలకుల పూర్వులలో ఒకడు. ఇతడు క్రీ.శ. 1693లో మరణించాడు. ఇతని కుమారుడు అంతకు ముందే మరణించి ఉండడంచేత సంస్థానం కోడలైన "సుభద్రమ్మ" పాలనలో ఉండేది. కాని, సుభద్రమ్మ గారికి సంస్థానాన్ని పాలించే శక్తి చాలకపోవడంచేత ఆమె సోదరుడైన "కీసర ముకుందప్ప" ఈ సంస్థానానికి పాలకుడైనాడు ఇతడు ఔరంగజేబు పాదుషా నుండి సన్నదు బసంపాదించాడు ముకుందప్ప తరువాత అతని కోడలైన 'లచ్చాయమ్మ' రాజ్యాధికారం వహించింది. ఈమె రాజ్యతంత్రంలోనూ, యుద్ధతంత్రంలోనూ ప్రసిద్ధురాలు. ఉత్తర సర్కారులలోని ఆధిపత్యం కొరకు ఫ్రెంచి వారికి ఇంగ్లీషువారికి జరిగిన యుద్ధంలో ఈమె ఇంగ్లీషు కుంఫిణీవారికి సహాయం చేసినట్లు తెలుస్తున్నది.

క్రీ.శ. 1850 లో మునగాల సంస్థానానికి పాలకుడైన కోదండ రామన్న దేశాయిగారి కుమార్తె 'లచ్చమ్మారావు' ప్రసిద్ధురాలు. ఈమె 1873లో జమీకి వచ్చింది. మంచి సాహిత్యాభిమానంగల వ్యక్తి. నాయని వెంకట్రామయ్య దేశముఖు ఈమె భర్త. వెంకటరామయ్యగారు చిన్న వయసులోనే పరమపదించారు. ఈ రాణిగారు నాయని వెంకటరంగారావుగారిని దత్తు తీసుకున్నారు. లచ్చమ్మారావు 1892లో మరణించడం జరిగింది. అప్పుడు నాయని వెంకటరంగారావుగారు 13 ఏండ్ల ప్రాయంలో ఉండడం చేత, సంస్థానం కొంతకాలం 'కోర్ట్ ఆఫ్ వార్డ్స్' స్వాధీనంలో ఉంది.

నాయని వెంకటరంగారావు క్రీ.శ. 1900లో జమీపాలనను స్వీకరించారు. సుప్రసిద్ధాంధ్ర పరిశోధకులు "కొమర్రాజు వేంకటలక్ష్మణరావుపంతులు"దివానుగా ఉండే వారు. ఈ వేంకటరంగారావు కూతురైన సరళాదేవి వనపర్తి సంస్థానాధీశుడైన రాజా కృష్ణదేవరాయల పట్టమహిషి. చాలాకాలం పార్లమెంటు సభ్యులుగా ఉన్న రాజా రామేశ్వరరావు బహద్దరు ఈ సరళాదేవి కుమారుడే. క్రీ.శ. 1958లో మునగాల సంస్థానాధీశుడైన నాయని వేంకటరంగారావుగారు స్వర్గస్థులైనారు. అంతకుముందే ఈ సంస్థానం అంతరించిపోయింది.

మునగాల ఎస్టేటు చిన్నదైనా, వీరు శక్తికొలది సాహిత్యాన్ని పోషించారు. లచ్చమ్మారావు (క్రీ.శ. 1873-1892) సాహిత్యాభిరుచికల పాలకురాలు.

వరదరాజు నందికేశ్వరకవి, కొమర్రాజు రామ లింగకవి, కొమర్రాజు వెంకట శివుడు,కొమర్రాజు వేంకట లక్ష్మణరావు మొదలగు ప్రముఖ కవి పండితులు ఈ సంస్థానానికి చెందినవారే. (ఆ.సం.సా)

## మునిపల్లె సుబ్రహ్మణ్య కవి

కాలం : క్రీ. శ. 1760-1820 మధ్యకాలం.

స్వస్థలం : తంజావూరు ప్రాంతం.

సంస్థానం : కాళహస్తి సంస్థానం.

రచనలు : అధ్యాత్మ్య రామాయణ కీర్తనలు.

సంగీత సాహిత్యాలలో దిట్ట. సుప్రసిద్ధ సంకీర్తనాచార్యుడు. కాళహస్తి సంస్థానాధీశుడైన దామెర్ల కుమార వేంకటప్పానాయని(1745-1795) ఆహ్వానం మీద ఈ సంస్థానానికి వచ్చి స్థిరపడిపోయాడు.

ఇతడు "శ్రీ శేషగిరిపతి" ముద్రతో "అధ్యాత్మ్యరామాయణ కీర్తనలు" వ్రాసి వెంకటప్పానాయని వారిచేత అగ్రహారాదులు పొంది, సత్కరింపబడ్డాడు. (ఆం.సం.సా)

## మున్నుడి

తొలిపలుకు. గ్రంథానికి ముందు దానిని గురించి చెప్పే ముందుమాటలు

చూ. అవతారిక.

## ముప్పది ఇద్దరు మంత్రుల సీసమాలిక

నామాంతరం : ద్వాత్రింశన్మంత్రి సీసమాలిక.

చారిత్రక ప్రశస్తి గల సీసమాలిక. ఇందులో ఆంధ్రదేశంలో ప్రఖ్యాతులైన 32 మంత్రుల గురించిన ప్రశంస ఉంది. గోపరాజు రామప్రధాని, సాహిణిమారుడు, కోట సింగరాజు, రాయని భాస్కరుడు మొదలైన వారి గురించి ఈ మాలిక చెప్తున్నది

## ముప్పిరాల సుబ్బరాయ కవి

కాలం : క్రీ. శ. 18 వ శతాబ్దం.

రచనలు : కృష్ణాభ్యుదయము, ప్రద్యుమ్న చరిత్రము, సావిత్రీ చరిత్రము, భద్రాద్రిరామ శతకము.

కృష్ణాభ్యుదయము ఇతని చివరి రచన. అందులో కవి పైరచనలన్నింటినీ పేర్కొన్నాడు. మృదుమధురంగా కవిత చెప్పాడు. (క.చ-3-191)

## ముముక్షు జనకల్పము

రచనాకాలం : క్రీ. శ. 1700 ప్రాంతం.

కర్త : అచ్చి రామానుజాచార్యులు.

వేదాంతపరమైన రచన. ముద్రితం. (క. స-200)

## ముముక్షు జనకల్పము

కర్త : అచ్చి లక్ష్మణాచార్యులు.

కాలం : క్రీ. శ. 18వ శతాబ్దం.

విశిష్టాద్వైత మత ప్రశస్తిని తెలిపే గ్రంథం. ఇందులో కవి ఆత్మ సంబోధనతో కూడిన సీసపద్యాలున్నవట. (క. స-206)

## ముముక్షు జన చంద్రహాసము

కర్త : పరశురామ పంతుల బ్రహ్మానందయోగి.

వచనంలో ఉన్న వేదాంత గ్రంథం. (వ. వా-41)

## ముమ్మడి తమ్మ భూపాలుడు

చూ. సుగుటూరి ముమ్మడి తమ్మభూపతి.

## ముమ్మడి దేవుల తిరుమల కవి

కాలం : క్రీ. శ. 19వ శతాబ్దం పూర్వార్థం.
స్థలం : చిత్తూరు.
రచన : గీత రఘునందనము.
గురువు : రామచంద్రయతి.

తండ్రి తిరుమలార్యుడు. తల్లి లక్ష్మమ్మ. రామాయణ కథను యథా వాల్మీకంగా రచించాడు. వస్తు ప్రధానమైన రచన. (య. వా. చ)

## ముమ్మడి మల్ల భూపాలుడు

కాలం : క్రీ. శ. 16, 17 శతాబ్దాల నడిమికాలం.
స్థలం : జటప్రోలు.

సాహిత్య పోషకుడు కృతిపతి. సురభివారి కూటస్థుడైన పెద్ద మహీపతి. మూడవ తరం వాడు. ఎలకూచి బాలసరస్వతి వ్రాసిన "సుభాషిత త్రిశతి"కి కృతిభర్తకి చంద్రికా పరిణయ కర్త అగు సురభి మాధవ రాయలకు తాత.

"సుభాషిత త్రిశతి" కృతిభర్త ఈ ముమ్మడి మల్ల భూపాలుని కుమారుడైన చినమల్ల భూపాలుడని కొందరు అంటున్నారు. (ఆం. సం. సా.)

## ముమ్మడి మల్లన్న

కాలం : క్రీ. శ. 16వ శతాబ్దం.
స్థలం : గుంటూరు మండలంలోని కొప్పురావూరు గ్రామం.
రచనలు : 1. తత్త్వ చంద్రోదయము (ద్విపద) 2. శ్రీరామ స్తవ రాజము (కావ్యం) 3. శతకాలు.
గురువు : ధేనువ కొండలోని తిమ్మయాచార్యుడు.

పై శతకాలలో ఒక శతకం మకుటం "కృష్ణ సచివుని మల్లా" అని, రెండో దాని మకుటం "ముక్తి కాంతా ప్రియా" అనీ ఉన్నదట.

విశిష్టత : కృష్ణమంత్రి రఘుపతమ్మల పుత్రుడు. గంగన్న సర్వాంబల పౌత్రుడు. వీరి పూర్వీకుడైన ముమ్మడి రాజు పేరు మీదుగానే ఇంటిపేరు వచ్చిందని సాహితీవేత్తలు నిర్ణయించారు. ఈయన చిన్నప్పుడే వేదాంత కావ్యం వ్రాశాడట. కవి, కృతిపతి కూడా. ద్విపదను శ్రీరామునికి, శ్రీరామ స్తవాన్ని శ్రీకృష్ణునికి అంకితమిచ్చాడు. ఈయన వ్రాసిన రెండు శతకాలు కూడా దొరికాయి. ఢిల్లీ వేంకటకవి వ్రాసిన జ్ఞాన సూర్యోదయం ఇతనికే అంకితం. (శ. క. చ-అనుబంధం-744; ఆరుద్ర-8-272)

## ముమ్మడి శాంతయ్య

కాలం : క్రీ. శ. 15వ శతాబ్ది పూర్వార్థం.

శ్రీనాథుని శివరాత్రి మాహాత్మ్యకావ్యానికి కృతిభర్త. శ్రీశైలంలోని భిక్షావృత్తి మఠంలో శాంతభిక్షావృత్తి యతీశ్వరుని మూలభృత్యుడు ఈ శాంతయ్య. ఈతడు పండితారాధ్య పీఠానికి సంబంధించినవాడు. శైవమత ప్రచారంకోసం శైవమతపరమైన సాహిత్యాన్ని వెలువరించడానికి కృషిచేశాడు. (ఆరుద్ర-4)

## ముమ్మిడిసెట్టి పార్థసారథిసెట్టి

కాలం : క్రీ. శ. 19 వ శతాబ్దం.
స్థలం : కాంచీపురం (దక్షిణదేశం).

సాహిత్యాభిమాని. వైద్యనాథ సిద్ధాంతి రచించిన భూగోళ దీపికను క్రీ శ. 1843 లో అచ్చువేయించి విజ్ఞాన వ్యాప్తికి తోడ్పడ్డాడు. (వ వా.)

## ములపాక బుచ్చన్నశాస్త్రి

కాలం : క్రీ.శ. 18 వ శతాబ్దం.
స్థలం : గుండ్లూరు, కోనసీమ
రచనలు : 1. వేంకటేశ్వర మాహాత్మ్యము 2. వసుచరిత్ర వ్యాఖ్య.
పోషణ : బ్రౌన్, ఛార్లెస్ ఫిలిప్.

కోదండరాముని పుత్రుడు. అష్టభాషా కవిత్వ కోవిదుడు. అనేక ప్రబంధాలు రచించాడట కాని అవి అలభ్యం. తనపూర్వులు పండితులని చెప్పుకొన్నాడు. బ్రౌనుదొర ఇతన్ని ఆదరించినట్టు. 1821 లో ఇతడు కడపనుండి బ్రౌనుకు రాసిన ఉత్తరంవల్ల తెలుస్తున్నది. (క.చ-3-173; తె సా.విమర్శ-91)

## ములికినాడు

ప్రాచీన నాడులలో ఒకటి. శాతవాహనులకాలం నుంచి ఇది ప్రసిద్ధి పొందింది. ఇందులో కడప మండలంలోని పులివెందల, రాజంపేట, ప్రొద్దుటూరు తాలూకాలు-బళ్ళారి, అనంతపురం, చిత్తూరు జిల్లాలోని ఉత్తరభాగం ఉండేవి. మూడు గ్రామముల గ్రాసము తోడఁ గూడుగ మోపూరు బాలించె ములికినాట, అని ములికినాడు ప్రశంస క్రీడాభిరామంలో ఉంది. ఉత్తరపు సరిహద్దు పెన్నా నది. (సం.ఆ వి కో-5)

## ములుగు పాపయారాధ్యులు

నామాంతరం : సంగమేశ్వరశాస్త్రి.
కాలం : క్రీ.శ. (1778-1852) మధ్యకాలం.
స్థలం : చింతలపల్లి.
సంస్థానం : అమరావతి
రచనలు : 1. ఆర్యాశతి శివస్తోత్రమ్ (సం) 2. ఏకాదశి చంపువు (సం) 3. శ్రీ కల్యాణచంపువు (సం) 4. అహల్యా సంక్రందనీయము 5. ఇంద్రాత్మజా పరిణయము 6. ఘూర్జర చరిత్రము 7. శంతను చరిత్రము 8. శ్రీదేవీ భాగవతము 9. శ్రీమద్వేమనారాధ్య చరిత్రము 10. సర్వమధురము 11. సరస హృదయ రంజనము.

బిరుదులు : అభినవ కాళిదాసు, పుంభావ సరస్వతి.

ఇతడు ద్వాదశారాధ్యులలో ఒకరైన వేమనారాధ్యుల వంశానికి చెందినవాడు. ఉభయ భాషాప్రవీణుడు. రెండు భాషలలోను నిండైన సాహిత్యం, మెండైన పాండిత్యం కలిగి ఆశు కవితావక్షుడై శర పరంపరగా కృతులను రచించినట్లు తెలుస్తున్నది యోగసాధనా ప్రవీణుడు, మంత్రశాస్త్రవేత్త.

వీరి పూర్వులు అమరావతి నేలిన వాసిరెడ్డి వెంకటాద్రి నాయనికి గురువులుగా ఆస్థాన పండితులుగా ఉండేవారు. వెంకటాద్రి నాయని దత్తపుత్రుడైన జగన్నాథబాబు ప్రేరణతో ఇతడు దేవీ భాగవతాన్ని రచించి శ్రీ కాశీవిశ్వనాథునికి అంకితం ఇచ్చినట్లు తెలుస్తున్నది. (తె.వి.స)

## మువ్వ వరదయ్య

నామాంతరం : క్షేత్రయ్య.

## మువ్వార్త వైభవము

రచనాకాలం : క్రీ. శ. 1794 ప్రాంతం.

కర్త : అనంతకవి.

ద్విపద కావ్యం. పరతత్వాన్ని గురించీ, నిరాకార సాకార విష్ణుతత్త్వాన్ని గురించీ విపులంగా ఉంది. భగవంతుని అవతారాలనుకూడా కవి చెప్పాడు. ఇందులో శ్రీ రామానుజులు చెప్పిన మువ్వార్తలను (పరతత్త్వ, ఊహ, అవతారముల వైభవములు) కవి కొనియాడినందువల్ల దీనికి మువ్వార్త వైభవమని పేరు వచ్చిదంట.

వైష్ణవ సంప్రదాయానికి చెందిన తమిళ పదాలనేకం ఇందులో ఉన్నాయి. (ద్వి.సా.చ-322)

## ముష్టిపల్లి వేంకటు భూపాలుడు

కాలం : క్రీ. శ. 17, 18 శతాబ్దాల నడిమికాలం.

స్థలం : గద్వాల సంస్థానంలోని రాజవోలు (రాజోళి).

రచనలు ; 1. దివ్యదేశ మాహాత్మ్య దీపిక 2. రాజవోలి వేంకటేశ్వర శతకము 3. రాజవోలి వేంకటేశ్వర కీర్తనలు.

గద్వాల రాజకుటుంబానికి చెందినవాడు. సంగీత సాహిత్యాలలో అసమాన పాండిత్యం సంపాదించిన వాగ్గేయకారుడు. వీరికి నాదగౌడరికం ఉండేది. దివ్యదేశ మహాత్మ్యదీపికలో ఇతని వంశవృక్షం కొంత ఉంది. వీరికాలం గురించి భిన్నాభిప్రాయాలున్నాయి, (మ.మా-64)

## మూలగూరమ్మగుడి

ఈ మూలగూరమ్మ కొండవీటి రెడ్డిరాజుల కులదేవత. ఈమెగుడి కొండవీటి దుర్గం సమీపంలోని అమీనాబాద్‌లో ఉంది. అనవేమారెడ్డి ఈ దేవతకు మూడుగ్రామాలను దానమిచ్చినట్లు శాసనముంది (పద్యశాసనం). మూలగూరమ్మగుడి దగ్గర రెండో శాసన

పద్యంలో పెదకోమటి వేముడు సర్వమాన్యతలిచ్చి, దేవతకు గుడి, ప్రాకారం, గోపురం, కట్టించినట్లు ఉంది పై రెండు శాసనాలు ఒకే సంవత్సరంలో వేయించినట్లు కనిపిస్తున్నది. అనవేమారెడ్డి దానమిచ్చిన గ్రామాలకు సీమలు, పెదకోమటి వేముని ఆలయ నిర్మాణం మొదలయిన విషయాల తరవాతనే ఉన్నాయి. ఈ శాసనాల కాలం క్రీ. శ. 1377 సంవత్సరం. (శ్రీనాథుడు-కొ.శ్రీ.మూ.)

**మూల ఘటిక కేతన**

కాలం : క్రీ. శ 16వ శతాబ్ది పూర్వార్ధం.

స్థలం : నెల్లూరు సీమ.

రచనలు : 1. దశకుమార చరిత్ర 2. కువలయాశ్వ చరిత్ర (కర్తృత్వం వివాదాస్పదం 3. ఆంధ్ర భాషాభూషణము 4. విజ్ఞానేశ్వరీయము.

బిరుదు : అభినవ దండి.

గురువు : తిక్కన సోమయాజి.

మానయ, గంగమాంబల పుత్రుడు. సంస్కృతంలో కావ్యాలు రాశాడట. ఇతని సంస్కృత కావ్యాలు లభింపలేదు.

విశిష్టత : కవిత చెప్పి "ఉభయ కవి మిత్రుని" మెప్పించాడు. ఈ కవి తెలుగులో తొలి కథా కావ్యాన్ని, మొట్ట మొదటి తెలుగు లక్షణ గ్రంథాన్ని, తెలుగులో మొదటి శాస్త్ర గ్రంథాన్ని రచించాడు. ప్రబంధ రత్నావళిలో కేతన కృతమైన కువలయాశ్వ చరిత్ర ఒకటి పేర్కొనబడింది. ఆ కేతన ఇతడో కాదో తెలియదు. (అరుద్ర-2)

**మూల ఘటిక నారాయణుని నాదెండ్ల శాసనము**

కాలం : క్రీ. శ. 1166.

శాసనప్రదాత : మూలఘటిక నారాయణుడు.

ప్రస్తావిత స్థలం : గుంటూరు జిల్లా-నరసరావుపేట తాలూకా-నాదెండ్లగ్రామం.

శాసన విషయం : నారాయణుడు మూల ఘటికాన్వయుడనీ, వెలంటూరికి దండనాయకుడైన వేమ నాయకుని కొడుకని, బడియ నాగరాజుకు మఱది అని శాసనం ద్వారా తెలుస్తుంది. నాదెండ్ల మూలస్థానేశ్వరునకు శాసన ప్రదాత అఖండ దీపం నిలిపినాడు. ఈ శాసనం నాదెండ్ల మూలస్థానేశ్వరుని దేవాలయపుటుత్తర ద్వారం మీద ఉంది. దీనిలో ఒక ఉత్పలమాల (అసమగ్రం.) రెండు చంపకమాలలు (ఒకటి అసమగ్రం), చివర గద్య ఉన్నాయి. (తె. క. చ-266)

**మూర్తికవి**

నామాంతరం : భట్టుమూర్తి.

బిరుదనామం : రామరాజభూషణుడు.

కాలం : 16వ శతాబ్దం.

రచనలు : 1. వసుచరిత్రము 2. హరిశ్చంద్ర నలోపాఖ్యానము (ద్వ్యర్థికావ్యం)

విశిష్టత : నరభూపాలీయంలో ఈయన పేరు మూర్తి కవి అని ఉంది. ఇతడు

కృష్ణరాయల సభలోని అష్ట దిగ్గజాలలో ఒకడని కొందరు, కాదని మరికొందరూ అభిప్రాయ పడుతున్నారు. వసుచరిత్ర, హరిశ్చంద్ర నలోపాఖ్యానాలలో ఇతడు రామరాజ భూషణుడనని చెప్పుకొన్నాడు. అళియ రామరాయలను ఆశ్రయించి "శారదామూర్తి" అని మెప్పు పొంది, "రామరాజభూషణ" బిరుదాంచితుడైనాడు. అళియ రామరాజు సోదరుడు తిరుమల రాయనికి వసుచరిత్రను కృతి ఇచ్చాడు. తరవాత హరిశ్చంద్ర నలోపాఖ్యానాన్ని వ్రాసి శ్రీరామచంద్రునికి అంకితం చేశాడు. "రామరాజ భూషణుడు" శ్రీరామ ఆంజనేయోపాసకుడు. ఏక దిన ప్రబంధ ఘటనా సమర్థుడు. పద్యశ్శత గ్రంథ కల్పనా శక్తి కలవాడు. సంగీత శాస్త్ర రహస్య వేది సంస్కృతాంధ్ర భాషా సామ్రాజ్య సర్వంకషుడు. చతుర్విధ కవితా నిర్వాహకుడు. సాహిత్య రస పోషకుడు.

ఇతని వసుచరిత్ర తెలుగు సాహిత్యంలో మేటి ప్రబంధం.

(వి. న. చ-నూ. పే. రా )

## మూర్ధాభినయము

కాలం : కాకతీయులు (12, 13 శతాబ్దాలు).

ఇది స్త్రీలు ప్రదర్శించే అభినయం. ఓరుగల్లు మైలార దేవుని పూజల సమయంలో మైలారు దేవుని భక్తురాండ్రయిన గొరగ పడుచులు పాటలు పాడుతూ, ఒక నీటి పాత్రలో ఒక వస్తువును వేసి, ముగ్గవాలి, వెనుకకు వంగి, నాలుకతో ఆ వస్తువును అందుకొని-తమ ప్రజ్ఞను భక్తి పురస్సరంగా తెలియజేసేవారట దీని ప్రసక్తి క్రీడాభిరామంలో ఉంది. (నా.ర.చ-63)

## మృగయా చంపువు (సం)

కర్త : కవిరాజు.

జీవితచరిత్రను గురించి చెప్పున్నరచన. వివరాలు తెలియవు.

(తె.వి.స-6-244)

## మృత్యుంజయ విలాసము

రచనాకాలం : క్రీ. శ. 17 వ శతాబ్దం.

కర్త : గోగులపాటి కూర్మనాథ కవి.

దైవాంకితం.

శివ పార్వతుల కల్యాణకథ దీనిలో వర్ణింపబడింది. దీనిలో కథా ప్రణాళిక కాళిదాసీయానికి విలక్షణంగా లేదు. కాని శివుని యెఱుకత వేషము, కటికము వంటి భృంగిరిటి హాస్యపాత్ర, గంగాగౌరుల సవతి మచ్చరము మొదలయినవి ఉన్నాయి. దీనిలో ప్రసిద్ధ రాగతాళ దరువులు, ద్విపదలు, పద్యగద్యాలు, సంస్కృత శ్లోకాలు, చూర్ణికలు, దండకాలు, రగడ, కొట్నము పాట, గౌరీ కల్యాణము, శోభనము ఉన్నాయి. కుమారోదయ వృత్తాంతం కూడా ఉంది. (య.వా.చ 52)

**మృత్యుంజయుడు**

కాలం : 17 వ శతాబ్దం.
స్థలం : ఆంధ్రదేశం.
రచన : ప్రద్యుమ్నోత్తర చరిత్రమ్ (సం).

ఇతడు రాజ చూడామణి దీక్షితుని మేనల్లుడట. సంస్కృతాంధ్రాలలో పండితుడు. ఇతని తెలుగు రచనలు తెలియరాలేదు. (తె.వి.స_6_222)

**మెకంజీ, కల్నల్ కాలిన్**

కాలము : క్రీ. శ. 1754_1821 ప్రాంతం.

తెలుగుజాతికి విశేషంగా సేవచేసిన పాశ్చాత్యుడు. ప్రపంచ చరిత్రలో ఒకే వ్యక్తి స్వయంకృషివల్ల ఒక దేశసంపూర్ణ చరిత్రకు సాధనసామగ్రి సమకూర్చినవాడన్న కీర్తి కర్తృడైనవాడు మెకంజీ.

వృత్తిచేత సైన్యాధిపతి (సర్వేయరు). కాని సంస్కృతిమూలంగా తెలుగువారి కతడు అత్యంత సన్నిహితుడు. మెకంజీ గురువులు, సహచరులు, తెలుగువారు. కావలి వేంకట బొర్రయ్యగారు హిందుదేశ చరిత్రలో ప్రథమ చారిత్రకులు. వారి సోదరులు లక్ష్మయ్య, రామస్వామి అనేవారు మెకంజీ సంపాదించిన చారిత్రక సామగ్రిని భద్ర పరచినవారు. ఈనాటి తెలుగుదేశ చరిత్రకు ఆధారాలైన కైఫీయత్తులు, శాసనాలు, పట్టాలు, గ్రంథాలు మొదలైన వాటినన్నిటినీ తెలుగువారి కందించిన మహనీయుడు మెకంజీ. తమిళ, కర్నాట, కేరళ, మహారాష్ట్రదేశాల చరిత్రలు తెలుగువారే సేకరించడం ఇందలి విశేషము.

**మెకంజీ వ్రాత ప్రతులు**

నామాంతరం : కైఫియతులు.

కాలం : క్రీ.శ. 19 శతాబ్ది.

స్థానికప్రజల, రాజుల, దేశ సమాచారాన్ని తెలిపే అమూల్య గ్రంథ రూపాలు కైఫీయతులు. ఉద్యోగరీత్యా మద్రాసులో ఇంజనీరుగా సర్వీసులో చేరిన 'కల్నల్ కాలిన్ మెకంజీ, దేశంలోని కొన్ని గ్రామాలను గురించి అనుశ్రుతంగా చెప్పుకొనే విషయాలనూ స్థానిక వీరుల చరిత్రలనూ, ప్రాచీన రాజవంశాల చరిత్రలనూ తెలియజేసే సమాచారాన్ని దేశంలోని విద్యావంతుల నుండి, పండితుల నుండి సేకరించాడు. మెకంజీ ఎన్నో కష్టాల కోర్చి సేకరించిన ఈ స్థానిక సమాచారాన్ని మద్రాసు ప్రాచ్య లిఖిత భాండాగారంలో కొన్ని సంపుటాలుగా భద్రపరిచాడు. దక్షిణ భారత దేశంలో తమిళ, కన్నడ, మళయాళదేశాలలో సమాచారాన్నేగాక విశేషించి తెలుగుదేశపు సమాచారాన్ని ఎక్కువగా సేకరించి భద్రపరిచాడు. ఆయన సేకరించిన అమూల్యమైన వ్రాతప్రతులను మెకంజీ వ్రాతప్రతులంటారు.

మెకంజీ సేకరించిన వ్రాతప్రతులు ముఖ్యంగా దక్షిణ భారతదేశ చరిత్ర. సాహిత్యానికి సంబంధించి ఉంటాయి. మెకంజీ సేకరించిన శాసనాలు, నాణేలు చరిత్ర

కారులకు చక్కగా ఉపయోగపడినాయి. సేకరించిన వ్రాతప్రతులలో సంస్కృతం అరబిక్, పర్షియన్, జావా, బర్మా భాషలకు సంబంధించినవాటివి, నాణేలు, శిలాప్రతిమలు, శిల్ప కళాఖండాలన్నింటిని ఇంగ్లండ్ పంపటం జరిగింది. సుమారు 5,00,000 పైచిలుకు దక్షిణదేశ భాషల వ్రాతప్రతులు, 8000 శాసనాలు మాత్రం మద్రాసులో ఉంచటం జరిగింది. పై వాటినన్నింటిని మొదట మద్రాసు కళాశాల గ్రంథాలయంలో భద్రపరచటం, ఆ తరవాత క్రీ.శ. 1830 ప్రాంతంలో మద్రాసు సాహిత్యసమితికి సమర్పించటం జరిగింది. క్రీ.శ. 19 శతాబ్దం చివర భాగంలో ఈ వ్రాతప్రతులు శిథిలం కావటమో, వ్రాసిన సిరా కనిపించకుండా పోవటమో జరిగింది. ఈ స్థితిలో పై వ్రాత ప్రతులనన్నిటినీ మద్రాసు ప్రాచ్య భాషా పుస్తక భాండాగారానికి సమర్పించారు.

ఈ వ్రాత ప్రతులలోని విశేషాలను తెలుసుకోవటానికి మెకంజీ కావలి వెంకట బొర్రయ్యను తన సొంత ఖర్చుతో ఉద్యోగిగా నియమించుకొన్నాడు. శాసనాల లోని భాషా సాహిత్యాలను, తద్వారా వెలికివచ్చిన మత విషయాలను తెలుసు కొనేందుకు మెకంజీదొర ఎంతో ఆసక్తి కనబరిచాడు.

ఆంధ్ర చరిత్ర కారులకు, సాహితీ వేత్తలకు మెకంజీ చిరస్మరణీయుడు.

(రె.రా.చ-12-14)

## మెదకు సంస్థానము

పాపన్న పేట సంస్థానానికి మెదకు సంస్థానం అనే వ్యవహారనామం ఉండేదట. ఇదే మెతుకు సీమగా ప్రసిద్ధం. వివరాలకు చూ. పాపన్నపేట.

## మేకా అప్పనృపాలుడు

సాహితీ ప్రియుడు. కృతిపతి. బొమ్మిడి వీరయకవి రచించిన "కుముద్వతీ పరిణయం" అంకితం పొందాడు.

## మేకా బాపన్న

కాలం ; క్రీ. శ. 19వ శతాబ్దం.

స్థలం : ఆచంట (నరసాపురం ప్రాంతం).

రచనలు : 1. ఆచంట రామేశ్వర శతకము 2.మదన గోపాల శతకము (అలభ్యం).

నాగయ్య, చెల్లమాంబల పుత్రుడు. రసవంతంగా కవిత్వం చెప్పాడు. "భూత లోకేశ, ఆచంట పుర నివేశ, భావభవనాశ, రామేశ, పార్వతీశ" అనే మకుటంతో రామేశ్వర శతకం కన్పిస్తున్నది. (శ. క. చ-605)

## మేకా వీర నరసప్పారావు

కాలం : క్రీ. శ. 17వ శతాబ్దం.

స్థలం : నూజివీడు.

నూజివీడు సంస్థానాధీశుడు. సాహిత్య ప్రియుడు. కృతిపతి. సరస్వతి తనకు ఒక పుస్తకం ఇచ్చినట్లుగా ఇతనికి కల వచ్చిందట ఆ సూచన ప్రకారం కుమార ధూర్జటి చేత ఇందుమతీ పరిణయం వ్రాయించి అంకితం తీసుకున్నాడు. (అరుద్ర-10-203)

## మేఘ సందేశము

కర్త : చూ. కొటికెలపూడి వేంకటకృష్ణ సోమయాజి.

అనువాద రచన. కాళిదాసు సంస్కృత మూలానికి అనువాదం.

(ఆం. సం. సా-303)

## మేరంగి

శ్రీకాకుళం మండలంలోని పార్వతీపురం తాలూకాకు చెందిన ప్రాచీన కొండ జమీందారీలలో ఇది ఒకటి తక్కిన కొండ జమీందారీల వలెనే, ఇదికూడా, విశ్వంభర దేవు (క్రీ శ. 1672-1676) కాలంలో జయపురం నుండే ఏర్పడింది.

"శత్రుచర్ల జగన్నాథరాజు" ఈ సంస్థాన పాలకులకు మూలపురుషుడు. "శత్రుచర్ల" అనేది వీరికి బిరుదం వంటిది మేరంగి, కురుపాము లు ఇరుగు పొరుగు సంస్థానాలు. కురుపాము పాలకుడై న "శివరామరాజు" మేరంగిని అన్యాయంగా ఆక్రమించగా అప్పటి విజయనగరం సంస్థానపు ప్రతినిధి "సీతారామరాజు" వీరిరువురినీ అధికారం నుంచి తొలగించి, ఈ రెండు జమీందారీలనూ విజయనగర సంస్థానంలో కలుపుకొన్నాడు. క్రీ శ. 1740-1794ల మధ్య కాలంలో ఈ సంస్థానం విజయనగరం సంస్థానంలో కలిసిపోయింది. కాని క్రీ.శ. 1795 తరువాత తిరిగి పూర్వపాలకులకే దఖలు పడింది. 1795లో "శత్రుచెర్ల గంగరాజు" సంస్థాన పాలకుడై నాడు. ఆ తరువాత చాలాకాలం వరకు సంస్థాన పాలకులు దాయాదుల బాధలకు గురై నందువల్ల, ఆర్థికంగా దెబ్బతిని పేష్కుషు బకాయి చెల్లించలేక పోవడంచేత, జమీందారీ 1821 నుండి 1833 వరకు కుంఫిణీవారి వశంలో ఉండింది. ఆ తరువాత శత్రుచెర్ల జగన్నాథరాజు, ప్రతాపరుద్రరాజు, బాలగంగాధర నారాయణరాజు ప్రభృతులు సంస్థానాన్ని పాలించారు.

మేరంగి సంస్థానాధీశ్వరుల దర్బారులో సాధారణమైన సాహితీ చర్చలు, శాస్త్ర గోష్ఠులతోపాటు శతఘంట కవనము, సమస్యా పూరణము మొదలగునవి ప్రసిద్ధంగా ఉండే వట గొర్తి సాంబమూర్తి శాస్త్రి, నడిమింటి సర్వ మంగళేశ్వర శాస్త్రి, వేంకటకవి, ఆచంట వేంకటరాయ సాంఖ్యాయన శర్మ, జగ్గరాజకవి మొదలగువారు ఈ పాలకులచే విశేష సన్మానాలు పొందారు. ఆచంట వేంకటరాయసాంఖ్యాయన శర్మ మేరంగి సంస్థానాధీశుల కీర్తి క్షేత్రానికి పొలిమేర. (ఆం.సం.సా-354-359)

## మేరత్తూరు వేంకట రామశాస్త్రి

- నామాంతరం : మేలత్తూరు వేంకట రామశాస్త్రి.

## మేలటూరి భాగవత మేళనాటకాలు-ప్రదర్శన తీరు తెన్నులు

కాలం : క్రీ. శ. 16,17, 18 శతాబ్దాలు.

తంజావూరు నాయక రాజుల కాలంలోను, మహారాష్ట్ర రాజుల కాలంలోనూ ఎక్కువ ప్రసిద్ధమైనాయి. నాటక ప్రారంభానికి ముందు భాగవతులు తిత్తిని, ముఖవీణను, మృదంగాన్ని, తాళాలను రంగస్థలం మీద ఉంచుతారు. నలుగురు వంత పాటలు పాడ

తారు. మొదట్లో ఒకరు శ్లోకాన్ని గాని, పద్యాన్ని గాని ఎత్తితే–మిగిలినవారు దానినే వంత పాడతారు. ప్రార్థన శ్లోకాలు, పద్యాలు పూర్తి కాగానే కొంటె కోణంగి అనే విచిత్రమైన పాత్ర ప్రవేశించి ప్రేక్షకులను చమత్కారంగా అలరిస్తాడు.

వెంటనే విఘ్నేశ్వర ప్రార్థన అయిపోయి, వినాయకుడు నాట్యం చేస్తూ విష్క్రమిస్తాడు. ఆ తరవాత రాజుగారి రాకను తెలిపే కటికము వాడు వచ్చి "గప్‌చిప్" చెప్పి విష్క్రమిస్తాడు. ప్రజలకు అర్థమయ్యేటట్లు ఈ భాగవతులు సంగీత, సాహిత్య, నృత్యాలను శృంగార హాస్య రసాలను సమపాళ్ళలో ఉంచి నాటకాన్ని నడుపుతారు. కొంటె కోణంగి, చోపుదార్ల (కటికము) విష్క్రమణానంతరం సంప్రదాయాను గుణంగా నృత్యం చేస్తూ–రాజపాత్ర అయితే "రాజు వెడలె" అనీ, స్త్రీ పాత్రలయితే 'భామనే, సత్యభామనే అనీ ఆయా పాత్రల ప్రవేశం జరుగుతుంది. నటులు నిపుణత్వంతో చమత్కారంగా తమ అభినయాన్ని ప్రదర్శిస్తారు. స్త్రీ పాత్రలను కూడా పురుషులే ధరిస్తారు.

ముగింపు : నాటకం అయ్యేటప్పటికి తెల్లవారుతుంది. భూపాల రాగంలో వరద రాజ పెరుమాళ్ స్వామికి మేలుకొలుపు పాడుతూ, గర్భగుడిలోకి పోయి స్వామికి అఖండ దీపారాధనలు, ప్రదక్షిణలు జరుపుతారు. తరవాత వేషాలతోనే వీధిలోకి వచ్చి ప్రతి యింటికిపోయి ప్రజలు ఇచ్చే మర్యాదలు స్వీకరించి, వేషాలను తీసివేస్తారు. ఈ భాగవతులు వసంతోత్సవ సమయాలలో తమ ప్రదర్శనను స్వామివారి సమక్షంలో తప్ప ఎక్కడా ప్రదర్శించరు. ప్రదర్శితమయ్యే నాటకాలన్నీ తెలుగు యక్షగానాలే. తరవాత తమిళంలోకి తెలుగు నాటకాలు అనూదితమై, ప్రదర్శింపబడుతున్నాయి.

(నా. ర. చ–106–108)

## మేలటూరి భాగవతులు-పూర్వ రంగం

కాలం : క్రీ.శ.15, 16, 17 శతాబ్దాలు.

కృష్ణాజిల్లా కూచిపూడి భాగవతులకు కాణాచి అయినట్లే,తంజావూరు జిల్లాలోని "మేలటూరు" భాగవత మేళాలకు కాణాచి. కూచిపూడి వారికి మేలటూరి వారికి చాలా దగ్గర సంబంధాలున్నాయి. కూచిపూడి భాగవతులు తంజాపురాంధ్ర నాయక రాజుల కాలంలో నానారాజ సందర్శన చేస్తూ తంజావూరు నాయక రాజులను ఆశ్రయించారు.

విజయనగర సామ్రాజ్యం తాళికోట యుద్ధానంతరం పతనమయ్యాక కవి పండిత గాయక కుటుంబాలవారు చెల్లాచెదరయి వివిధ ప్రాంతాలకు వలసవెళ్ళారు. అలా వలస పోయినవారు కొందరు, తంజావూరు చుట్టుప్రక్కల స్థిరనివాస మేర్పరచు కొని, నాయక రాజులను ఆశ్రయించారు. తంజావూరు రాజులు వీరిని ఆదరించి, మాన్యాలు, అగ్రహారాలు ఇచ్చారు. తెలుగు దేశపు భాగవతులు మేలటూరు గ్రామాన్ని అట్లే సంపాదించారని పండిత నిర్ణయం. (నా. ర. చ–103)

## మేలట్టూరు

నామాంతరాలు : అచ్యుతాబ్ధి, మేలత్తూరు (చూ).

## మేలత్తూరు

నామాంతరం : అచ్యుతాబ్ధి. మేలట్టూరు.

## మేలత్తూరు వేంకటరామ శాస్త్రి

నామాంతరం : మేరత్తూరు వేంకటరామశాస్త్రి.

కాలం : క్రీ. శ. 1807-1860 మధ్య కాలం.

స్థలం : మేరత్తూరు (తంజావూరు మండలం).

సమకాలికులు : శరభోజీ (1798-1833), శివాజీ (1833-1855).

రచనలు : 1 ప్రహ్లాద చరిత్ర 2. మార్కండేయ చరిత్ర 3. రుక్మాంగద చరిత్ర 4. ఉషా పరిణయము 5. హరిశ్చంద్ర నాటకము I & II 6 రుక్మిణీ కల్యాణము 7. శివరాత్రి నాటకము 8. సత్సంగ రాజ నాటకము 9. అసత్సంగ రాజ నాటకము 10. సీతా కల్యాణము 11. జగన్మోహన విలాస నాటకము.

ఇతని కాలం క్రీ. శ (1800-1850) అని కొందరంటున్నారు. ఈయన పల్లవి రాజగోపాలయ్య వంశీయుడు.

భాగవత సంప్రదాయానికి నిలయమైన మేరత్తూరువాసి. పౌరాణిక కథేతివృత్తాలతో, తెలుగు పాటలతో కూడిన భాగవత మేళ నృత్య నాటకాలకు, యక్షగానాలకు ఈయన జీవం, సౌందర్యం పోసి తెలుగులో వ్రాశాడు. ఈయన వ్రాసిన నృత్య రూపకాలకు కూచిపూడి సంప్రదాయానికి చాలా దగ్గర సంబంధముంది. సులలితమైన కైశికీవృత్తి కవితా రచనలో ప్రవీణుడు. ఈయన నృత్య రూపకాలలో సంగీతాన్ని గురించి తెలుసుకోవలసిన విషయాలు చాలా ఉన్నాయి. వీటిలో అరుదైన రక్తి రాగాలకు లక్ష్యాలున్నాయి. ఈయన త్యాగరాజుకంటె వయసులో పెద్దవాడట. త్యాగరాజు కీర్తనలను ఈయన మెచ్చుకొంటే, ఈయన సాహిత్యాన్ని త్యాగయ్య మెచ్చుకొనేవాడట కొన్ని చిందులు, అద్వైత కీర్తనలు కూడా వ్రాశాడట.

ఇతని ఇంటిపేరు మెరత్తూరుగా వ్యవహారంలో ఉంది. ఇతడు పండ్రెండు గ్రంథాలు రాశాడట. 11 మాత్రం తెలుస్తున్నాయి.

నాట్య శాస్త్రం అభ్యసించిన నటుడవటంచేత, ప్రదర్శించేటప్పుడు తానే నాయక వేషం ధరిస్తూండేవాడట. ఇతని నాటకాలు కొన్ని రాసినప్పటినుండీ నృసింహ జయంత్యుత్సవ సందర్భంలో తంజావూరి చుట్టుపట్ల ఊళ్ళలో ప్రదర్శింపబడుతున్నాయట. కొన్నిటిని ఆకాశవాణి (రేడియో) ప్రసారం చేసింది.

(తె. వి. స-4; శారదా ధ్వజం-124; ద. దే. వా-309)

## మేలుకొలుపు ద్విపద (అలభ్యం)

కర్త : తాళ్ళపాక పెద తిరుమలాచార్యుడు. (క.త-6)

**మేలుకొలుపు పాటలు**

నామాంతరం : ప్రభాత పదాలు (చూ).

**మైదోలు రామన మంత్రి**

కాలం : చూ. రాళ్ళబండి పట్టాభి రామరాజు.

స్థలం : మైదోలు గ్రామం.

మైదోలు (మైదవోలు) గ్రామం గుంటూరు జిల్లాలో కొండవీటి సీమలో యడ్లపాడు గ్రామ సమీపంలో ఉంది. రామన మంత్రి మైదోలు గ్రామవాసి కావచ్చు పట్టాభి రామరాజు అయోధ్య రామునికి, మైదోలు రామునికి సామ్యం చూపుతూ ఇతనిపై ఒక చాటువు చెప్పాడు. (చా. ప ర.)

**మైనంపాటి కేశవకవి**

కాలం : క్రీ. శ. 18వ శతాబ్దం.

రచనలు : తెలియరాలేదు.

ముత్తరాజు వేంకటకృష్ణ కవి బ్రహ్మోత్తర ఖండం రచించి కృత్యాది వ్రాయకుండానే మరణించాడు. అతని కుమారుడు వెంకటాచలం కోరికపై ఈ కేశవకవి ఆ గ్రంథానికి కృత్యాది రచించాడు. ఈ గ్రంథం జొన్నవాడలోవి మల్లేశ్వర స్వామికి అంకితం. కవి స్వీయ రచనలు తెలియరాలేదు. (క. త-13-18)

**మైరావణ చరిత్ర**

కర్త : పాతూరి తిమ్మయ.

ద్విపద కావ్యం. ప్రాస సహితంగా ఉంది. (ద్వి.సా.చ 217)

**మైరావణ చరిత్ర**

రచనాకాలం : క్రీ శ. 1740 ప్రాంతం.

కర్త : పోలుమంచి బసవన.

ద్విపద కావ్యం. రచన ప్రౌఢంగా ఉంది. దీని ప్రతి ఆంధ్ర సాహిత్య పరిషత్కార్యాలయంలో ఉంది. (ద్వి.సా చ-216)

**మైరావణ చరిత్ర**

కర్త : మాడయ కవి.

కృతిపతి : లేజెళ్ళ గోపమంత్రి.

మూడాశ్వాసాల కావ్యం. పురాణ ప్రసిద్ధమైన కథ. కృత్యాది పద్యాలు దొరకలేదు. కవిత్వం మృదువుగా మనోహరంగా ఉంది. కర్త మారయ కవి అని కందుకూరి వారు వ్రాశారు. (క.త-6-257; క చ-3-199)

**మైరావణ చరిత్ర**

రచనాకాలం : క్రీ.శ. 18 వ శతాబ్దం లోపు.

కర్త : తెలియదు.

ద్విపద కృతి. లేఖక దోషాలు హెచ్చుగా ఉన్నవి. మైరావణ చరిత్రను

తెలుగులో చాలా మంది వ్రాశారు. చంద్రగిరి చిన్నయ్య, కైప లక్ష్మీనరసింహశాస్త్రి, బసవప్పకవి మొదలైన వారి పేర్లు తెలియ వస్తున్నవి. (ద్వి.సా.చ-218)

## మైలమదేవి దక్షారామ శాసనము

కాలం : క్రీ.శ. 1099 ప్రాంతం.

శాసన కర్త : మైలమదేవి.

ప్రస్తావిత స్థలం : దక్షారామం.

శాసన విషయం : ఈ మైలమదేవి-వేములవాడ భీమకవి స్తుతించిన మైలమ భీమునికి తల్లి. ఈ శాసనం మైలమదేవి దక్షారామ భీమేశ్వరునికి అఖండ దీపం దానం చేసినట్లు తెలుపుతుంది (తె.క.చ-287)

## మైలమ భీముని దక్షారామ శాసనము

కాలం : క్రీ.శ 1168 ప్రాంతం.

ప్రస్తావించిన కవి : అమృతనాథుడు.

మైలమదేవి కుమారుడైన మైలమ భీముని ప్రస్తావిస్తూ అమృతనాథుడు ఒక పద్యం చెప్పాడు. ఆ పద్యాన్ని కాచన బసవన 'కవి సర్ప గారుడం'లో ఉదాహరించాడు. ఈ మైలమ భీముని వేములవాడ భీమకవి స్తుతించాడు. మైలమ భీముని శాసనం క్రీ.శ. 1168 నాటిది విశేషాలు తెలియరాలేదు. (తె.క.చ-287)

## మైలసంత

కాలం : క్రీ.శ. 13, 14వ శతాబ్దాలు.

ఈ సంత క్రీడాభిరామంలో ప్రసక్తం. ఇది ఓరుగంటి కోటకు బయటి భాగంలో ఉంది. సుంక నిర్ణయం చేసిన శాసనం ఇక్కడనే ఉంది (ఇప్పుడు ఈ స్థలాన్ని ఖాన్ సాహెబ్ తోట అంటారు) శాసనాధారాలను బట్టి ఈ సంతలో ఆకులు, కూరగాయలు, టెంకాయలు, మాదీఫలాలు, మామిడి పండ్లు, చింతపండు, నువ్వులు, గోధుమలు, పెసలు, వడ్లు, జొన్నలు, నూనె, నెయ్యి, ఉప్పు, బెల్లము, ఆవాలు, మిరియాలు, తగరము, సీసము, రాగి, చందనము, కస్తూరి, మంజిష్ఠ, దంతము, పట్టు, పసుపు, ఉల్లి. అల్లము అమ్ముతూ ఉండేవారని తెలుస్తున్నది. ఒకతె "ఓరుగంటి పురంబులో ఓరగ్రంత బెద్ద యెలుంగున నమ్మె సంపెంగ నూనె" అని క్రీడాభిరామంలో ఉంది. (ఆ.సాం.చ-76)

## మైలారభటులు

కాలం : క్రీ.శ. 11వ శతాబ్దం 15వ శతాబ్దం మధ్యకాలం.

వీరు కాకతీయులు, రెడ్లు, వెలమ రాజుల, కాలంలో ఉండేవారు. ఓరుగంటిలోని మైలార దేవుని భక్తులు. వీరు మైలార దేవుని పూజాదికాలు నిర్విఘ్నంగా కొనసాగటానికి మైలార దేవునికి సర్వవిధాలా సేవలు చేసేవారు. మైలార దేవుని గుడికి రక్షకులుగా కూడా వ్యవహరించేవారు. మైలార భటులను గురించిన విపులవర్ణన క్రీడాభిరామంలో ఉంది. వీరభద్రులు, వీరముష్టివారు చేసే సేవలన్నీ వీరు కూడా చేసేవారు.

(పూర్తి వివరాలకు చూడు-వీరభద్రుదులు-వీరముష్టివారు).
(తెలుగు-జ-మా-75)

## మైలారు దేవుడు

కాలం : క్రీ.శ. 13, 14 శతాబ్దాల కాకతీయుల నాటి కాలం.

క్రీడాభిరామంలో ఈ దేవుని ప్రసక్తి ఉంది. ఈయనను కొలిచేవారు మైలార భటులు. ఈయన మైలారం అనే గ్రామంలో వెలసిన దేవుడని పండితాభిప్రాయం. ఈ దేవుడు ఏకవీరాదేవి వలెనే తొలుత జైన దేవుడై తరవాత శైవ దేవుడయినాడేమోనని కొందరు సందేహిస్తున్నారు. భైరవుని తోడు జోడు మైలార దేవుడు, అని క్రీడాభిరామంలో ఉంది. కాకతీయుల కాలంలో ఈయన విశిష్టమైన దేవుడు అయి ఉండవచ్చు. (చూ. మైలార భటులు). (ఆ.సాం.చ-51)

## మైసమ్మ పాట

కర్త : తెలియదు.

జానపద పారమార్థిక గేయం. మైసమ్మ ఒక గ్రామదేవత ఆ దేవత మాహాత్మ్యం వర్ణించే పాట. పామర జనంలో ఎక్కువ ప్రచారంలో ఉంది.

చూ. పారమార్థిక గేయములు.

## మైసూరు-ఆంధ్ర భాషా పోషణ

కన్నడభాష ప్రధాన భాషగాగల మైసూరుప్రాంతంలో క్రి.శ 17,18 శతాబ్దాలలో ఆంధ్ర వాఙ్మయం విస్తరించింది. మైసూరును పాలించిన చిక్కదేవరాయలు, కంఠీరవరాయలు తెలుగు భాషను ఆదరించారు. చిక్కదేవరాయలపై కొన్ని చాటుపద్యాలు ఒక యక్షగానం, ఒక శతకం లభించాయి కంఠీరవరాయలు తెలుగులో సంగీత నృత్య ప్రధానాలైన రచనలు చాలా చేశారు. దేవనగిరి శాసన కర్త, రామాయణము తిరుమలాచార్యుడు ఇక్కడి వాడే. బెంగుళూరు నగర నిర్మాత పెద కెంపరాయని పూర్వులు ఆంధ్రులట. ఇతడు గంగాగౌరీ విలాసమనే యక్షగానాన్ని రచించాడు. ఇతని కుమారుడు ఇమ్మడి కెంపరాయడు బెంగుళూరు బల్లాపురపుపేటలోని రంగనాథ దేవాలయంలో వేయించిన శాసనం తెలుగులో ఉంది.

మైసూరులో దండనాయకులుగా ఉన్న "కళవె" వంశీయులు కన్నడంలోనూ తెలుగులోనూ రచనలు చేశారు. మైసూరులోని చెన్నపట్టణ సీమను పాలించిన రాజా వంశీయులు తెలుగు వారు. సంస్కృతాంధ్ర కవులను పోషించారు. పొన్నతోట బొబళ కవి వీరి ఆస్థానంలోనివాడే. వీరి శాసనాలు కొన్ని తెలుగులోనూ కొన్ని కన్నడంలోనూ ఉన్నాయి.

## మొగతాటి రామభద్రకవి

కాలం : తెలియదు.

ఈయన సేదమ యాచమంత్రి గొప్పతనాన్ని పొగుడుతూ ఒక పద్యం చెప్పాడు. (చా.ప.ర.)

## మొదటి కుమార యాచభూపతి

నామాంతరం : కుమారేచ భూపాలుడు.

కాలం : క్రీ.శ. 17 వ శతాబ్దం.

వెంకటగిరి సంస్థానాధీశుడు. సాహిత్య పోషకుడు. తన ఆస్థానంలోని రోస నూరి వెంకటపతికి "తిక్కయజ్వ" బిరుదిచ్చి గౌరవించాడు. ఇతడు బంగరు యాచమ నాయకుని తండ్రి. (క.త-12-213)

## మొదటి రామకృష్ణారావు

కాలం : క్రీ.శ. 19 వశతాబ్దం.

స్థలం : వనపర్తి సంస్థానం

బిరుదు : రాజాబహద్దరు.

సాహిత్య పోషకుడు. స్వయంగా మంచి పండితుడు. ప్రభువు.

ఈతని కాలంలోనే సంస్థానపు రాజధాని 'సూగూరు' నుండి వనపర్తికి మార్చబడింది. క్రీ.శ. 1817లో నిజాం నుండి వీరికి 'రాజా బహద్దరు' బిరువం లభించింది.

సాధువులను, సన్యాసులను, దర్వేషులను ఆదరించాడు. జ్యోతిశ్శాస్త్రంలో అఖండ ప్రజ్ఞ కలవాడు. (ఆం.సం సా.)

## మొల్ల రామాయణము

కాలం : క్రీ శ. 16వ శతాబ్దం పూర్వార్ధం.

కవయిత్రి : ఆతుకూరి మొల్ల

అంకితం : శ్రీరామునకు.

విశిష్టత : ఇది బహుళ ప్రచారం పొందిన రామాయణం. ఈ రామాయణ రచనలో స్త్రీ హస్తం స్పష్టంగా కనిపిస్తుంది ప్రధానమైన కథాంశాలతో రామాయణం సంక్షేపంగా చెప్పింది. కావ్యం శబ్దాలంకారాలతో మధురంగా నడిచింది. చంపకోత్పలాలు, కంద సీసాలను మాత్రమే ఈ కవయిత్రి విశేషంగా స్వీకరించింది. చూర్ణిక కూడా ఒకటి చెప్పింది. స్వభావోక్తి రమణీయమైన ఘట్టాలు, పద్యాలు ఈ కావ్యంలో కోకొల్లలు. ఈమెకు ఔచిత్యస్ఫూర్తి మెండని రసజ్ఞులు అంగీకరించారు. కావ్యంలో కొన్ని అపప్రయోగాలున్నాయి. "కందువ మాటల సామెత, లందముగా గూర్చి"న జాతీయమైన కవిత్వం ఈ కావ్యంలో ఉంది. (తె.వి.స-4)

## మోషగుండ రామాయణము

జానపద పౌరాణిక గేయ రచన.

చూ. పౌరాణిక గేయములు.

## మోక్ష సారము

రచనాకాలం : క్రీ.శ. 1700 ప్రాంతం.
కర్త : అచ్చి రామానుజాచార్యులు.

వేదాంతపరమైన రచన.

## మోక్షానికి కొంచుపోయే దోవ

రచనాకాలం: క్రీ.శ. 1746 ప్రాంతం.
కర్త : బెంజమన్ షూల్జీ.

క్రైస్తవ మత ప్రచారం కోసం వ్రాసిన వచన గ్రంథం. (వ.వా.)

## మోచర్ల నన్నయ

కాలం : క్రీ. శ. 17వ శతాబ్ది (1650కి పూర్వుడు)
స్థలం : నెల్లూరు మండలం.
రచనలు : కాశీ ఖండము (ద్విపద) 2. సాంబోపాఖ్యానము (ప్రబంధం).

విశిష్టత : ఆదికవి తరవాత నన్నయ పేరుతో ప్రత్యక్షమయిన కవి మోచర్ల నన్నయ. సింగయ్య, మాధవామాత్యుల పుత్రుడు. అన్నమార్యుని పౌత్రుడు. సరస కవిత్వ చాతుర్యధుర్యుడు. లక్షణయుక్తంగా కవిత చెప్పాడు. ఈ నన్నయకు పింగళి సూరన్నకు బంధుత్వముందట. ఆంధ్ర కవితా పితామహ బిరుదం అల్లసాని పెద్దనకే సుప్రసిద్ధమై ఉంటే, ఈ నన్నయ ఆది కవి నన్నయను ఆ బిరుదంతో పేర్కొన్నాడు. మోచర్ల, తుమ్మిడి గ్రామాలు నెల్లూరు మండలంలోనివి. ఈయన నివాసం మోచర్ల కానీ, తుమ్మిడి కానీ కావచ్చును. (ఆరుద్ర-9-239)

## మోచెర్ల దత్తప్ప

కాలం : క్రీ. శ. 18వ శతాబ్దం.
స్థలం : వెట్టు సంస్థానం.

ఇతడు వెట్టు సంస్థానంలోని ప్రసిద్ధ కవి. రచనలకు సంబంధించిన వివరాలు తెలియవు. సమస్యా పూరణంలోను, చాటువులు చెప్పడంలోను నేర్పరి. సోదరుడైన వెంకన్నతో కలిసి చెప్పిన చాటువులు ఇప్పటికీ లభిస్తాయి. వేంకటగిరి ప్రభువైన కుమార యాచేంద్రుని ఇతడు దర్శించి బహుమతులు పొందాడు.

దత్తప్ప కవి కృతంగా భావింపబడుతున్న సమస్యా పూరణ పద్యాలు నూరు దాక సేకరించి "తెలుగు సమస్యలు" అనే పేరున క్రీ. శ. 1880లో "వ్యవహార తరంగిణీ ముద్రాక్షరశాల" వారు ప్రచురించారు. (ఆం. సం. సా-175-176)

## మోచెర్ల వెంకన్న

కాలం : క్రీ. శ. 18వ శతాబ్దం.
స్థలం : వెట్టు సంస్థానం.

తెట్టు సంస్థానంలోని విద్వత్కవి. సోదరుడైన దత్తప్పతో కలిసి పద్యాలు చెప్పేవాడు. ఇతని రచనలను గురించిన వివరాలు తెలియవు. ఆశు కవిత్వంలోను సమస్యా పూరణంలోను దిట్ట. ఈ సోదర కవులు చెప్పిన చాటువులు, సమస్యా పూరణాలు అమితంగా లభిస్తాయి. వెంకటగిరి పాలకుడైన సర్వజ్ఞ కుమార యాచమనాయని సందర్శించి అనిషిద్ధాంత వర్ణములుగల దుష్కరప్రాస బద్ధమైన కంద శతకాన్ని చెప్పి ప్రభువును మెప్పించి గౌరవింపబడి వచ్చాడట. ఇతడు మిక్కిలి ఉదారుడు. గోదావరీతీరం నుండి వచ్చిన ఒక కవికి రాజదర్శనం చేయించడంలో సహాయపడ్డాడు. తన ఊరైన తెట్టును గురించి తన పేరును గురించీ చమత్కారంగా పద్యాలు చెప్పాడు (ఆం.సం.సా)

## మోచేతి పద్మమ్మ నోముపాట

కర్త : తెలియదు.

సుప్రసిద్ధ జానపద పారమార్థిక గేయం.

చూ. పారమార్థిక గేయములు.

## మోటుపల్లి

ప్రాచీన నామం మోసలపురం. కాకతీయుల కాలంలో అత్యున్నతదశలో ఉండిన ఓడరేవు. మార్కోపోలో అనె విదేశ యాత్రికుడు దీని వైభవాన్ని ప్రశంసించాడు. ఇక్కడ, వర్తకులకు వాణిజ్య సౌకర్యాలు కల్పిస్తూ కాకతి గణపతిదేవుడు క్రీ.శ.1244లో ఒక అభయశాసనం వేయించాడు. సముద్రయానంలో భగ్నమై ఒడ్డుపట్టిన నావలలోని వస్తువులకు రక్షణ ఇస్తూ కట్టడి చేయించాడు. ఆ కాలంలో కొద్ది శుల్కాలను మాత్రమే వసూలు చేసేవారు. క్రీ. శ. 1356 లో కొండవీటి ప్రభువు అనపోతారెడ్డి ఇక్కడమరొక ధర్మశాసన స్తంభం వేయించాడు విదేశ వర్తకులకు రక్షణ భూవసతులు ఏర్పాటుచేసి – ఇదివరకు ఉండిన సుంకాలలో కొన్ని మార్పులు చేశాడు. ఈ శాసన స్తంభం ఆంధ్రుల నౌకా వ్యాపారానికి మూల స్తంభం అని చెప్పవచ్చు. ద్వీపాంతర వాణిజ్యానికి ఈ నగరం గొప్ప కేంద్రంగా ఉండేది. ఇతడు దానశీలి అనీ నీతి పరుడనీ ఎవరో కవి చాటువు చెప్పాడు. (చా.ప.ర)

## మోదుకూరి పండరినాథ కవి

కాలం : క్రీ. శ. 19 వ శతాబ్దం పూర్వార్థం.

స్థలం : మదికొండ (నైజాం మండలం).

రచనలు : ఆధ్యాత్మ్య రామాయణము, రామకథా కల్పలత (సం).

ఇతడు హనుమకొండలో గ్రంథ రచన చేశాడు. సంస్కృతాంధ్రాలలో పండితుడు. (క.స–116)

## మోదుకూరి శంకర కవి

కాలం : తెలియదు.

రచన : ధీరధీ శతకము, చాటువులు.

వివరాలు తెలియలేదు. 1862 నాటికి ఇతని రచన ముద్రితం. కవి ప్రాచీనుడే. మట్లవారి ఆస్థానంలో ఉండేవాడు. ఈయన చాటువులు రెండు లభించాయి.

(శ.క.చ-596 చా.ప.ర.)

## మోసలపురము

నామాంతరం : మోటుపల్లి (చూ).

## మోహనాంగి

కాలం : క్రీ శ. 16 వ శతాబ్దం.

రచన : మరీచీ పరిణయము (అలభ్యం).

ఈమె సంస్కృతాంధ్రాలలో విదుషి. ఈమె సాహితీ సమరాంగణ సార్వభౌముడు కృష్ణ దేవరాయల కుమార్తె అనీ రామరాయల భార్య అనీ వాడుక ఉంది. కృష్ణ రాయల పుత్రిక మోహనాంగిని గూర్చి చారిత్రకాధారాలు లేవు. సంకుసాల నృసింహ కవి పద్యాలను ఈమె తొలుత చూచి తండ్రి దృష్టికి తెచ్చిందని అంటారు.

(ఆ. భా. కవయిత్రులు)

## మోహినీ దండకము

కర్త : తెలియదు.

అంకితం : అల్లాడ విజయసింహ భూపతికి.

ఈ రచన రంగాజమ్మ విజయరాఘవుని పేర రచించిన దండకాన్ని పోలి ఉన్నదంటున్నారు. మన్నారుదాస విలాస ప్రబంధంలోని దండకమే పేర్ల మార్పుతో మోహినీ దండకంగా రూపొందినదని విమర్శకుల అభిప్రాయం.

అల్లాడ విజయసింహభూపతి నరేంద్రునిపై మోహిని అనే ఆమె మరులు కొనడం-వారి సమాగమం ఇందులోని ఇతివృత్తం. ఈ దండకంలో రాజమహేంద్రపురి లక్ష్మీనారాయణ స్తుతి ఉన్నది. కృతిపతి రాజమహేంద్రవరం వాడు కావచ్చును.

(ద.దే.వా--157; మద్రాసు ప్రాచ్యలిఖిత గ్రంథాలయం No-2001)

## మోహినీ విలాసము (అలభ్యం)

కర్త : విజయరాఘవనాయకుడు (చూ).

ద్విపద నాటకం. ప్రదర్శన కొరకు రచింపబడిన నృత్య రూపకం కావచ్చు. ఇది యక్షగానంగానూ, నాటకంగానూ రెండువిధాలుగా రచితమని కొందరు అంటున్నారు.

(ద.దే.వా-88)

## మోళిగ మారయ్య కథ

ఇది పాల్కురికి సోమన విరచిత బసవ పురాణంలోని శివభక్తుని కథ.

(ఆరుద్ర-2-212)

## మౌని దండకము (అలభ్యం)

కాలం : క్రీ.శ. 1150 ప్రాంతం.

కర్త : మల్లికార్జున పండితుడు.

శైవమత పరమైన రచన.

**యక్షగానము**

నామాంతరం : జక్కులపాట.

ఇది మధుర కవితాశాఖకు చెందిన విభాగం. దేశి సారస్వతానికి చెందిన కవిత. దీనిని దేవజాతులైన యక్షులనే వారు గానం చేసేవారని ప్రతీతి. యక్షశబ్దభవంగా ఇది జక్కులపాట అయిందని కొందరు చెప్తున్నారు తొలుత జక్కులవారినోట అను స్యూతంగా గానం చేయబడే ఈ దేశి సారస్వతానికి తరువాత సాహిత్య గౌరవం లభించి, యక్షగానం అయిందని కొందరి వాదం.

దీనిని ఒకరకమైన ఉపరూపకంగా కూడా చెబుతారు. ఏలలు, జోలలు, సువ్వాలలు, ఆరతులు, ధవళాలు, చందమామసుద్దులు, వెన్నెలపదాలు, విరాళిపదాలు, తుమ్మెద పదాలు, గొబ్బిపదాలు, కోవెలపదాలు, చిలుకపదాలు, అల్లోనేరేళ్ళు, సీసార్థాలు, కందార్థాలు, త్రిభంగులు, ద్విపదలు, చౌపదులు, షట్పదులు, మంజరులు, జక్కులరేకులు మొదలయిన వివిధ దేశి ప్రక్రియలు యక్షగానంలో చేరి ఉంటాయి. తమిళ, కన్నడ భాషలలోకూడా ఈ సాహితీ ప్రక్రియ ఉంది. దీనిని తమిళంలో కొరవంజి అంటారు. దీనిని పూర్వం ఒక పదంగా ఇద్దరు ముగ్గురు కలసి గానంచేస్తూ ఉండేవారు. కాలక్రమంలో వీటిలో అభినయమూ, దృశ్య ప్రబంధరీతులూ పొడసూపి, ఇవి క్రమంగా యక్షగాన నాటకాలుగా రూపొందాయి. దక్షిణాంధ్ర సాహిత్యంలో ఈ ప్రక్రియ పుష్పించి కాయలు కాసింది. రఘునాథ నాయక, విజయరాఘవాదులు యక్షగాన రచన చేసి, చేయించి, రాజాస్థానాలలో వీటిని ప్రదర్శింపజేశారు. తెలుగులో సౌభరి చరిత్ర, సుగ్రీవ విజయాదులు తొలి యక్షగానాలు. చక్రపురి వీరరాఘవాచార్యుల విప్రనారాయణ చరిత్ర, కంకంటి పాపరాజు విష్ణుమాయావిలాసం ప్రసిద్ధమైన యక్షగానాలు. ఈ వాఙ్మయం తెలుగులో మిక్కిలి విస్తరించింది. సోదిచెప్పే ఎరుకతపాత్ర ఉన్న యక్షగానాలను కొఱవంజులని అంటారు. పాత్రోచిత వేషభాషలు ఈ యక్షగానాల ప్రత్యేకత. (తె.వా.)

**యక్షగానము (కన్నడం)**

కర్త : సుగుటూరి ముమ్మడి తమ్మభూపతి.

**యక్షోల్లాస భాణమ్ (సం)**

కర్త : చూ. శిష్టు కృష్ణమూర్తి శాస్త్రి.

రూపక విశేషం. (ఆం.సం.సా-326)

**యజ్ఞతంత్ర సుధానిధి (సం)**

కర్త : సాయణాచార్యుడు.

ఇది యజ్ఞ యాగాదుల విశేషాలను తెలిపే గ్రంథం. (తె.వి.స-4-1191)

## యజ్ఞదత్త సోమయాజి

శ్రీనాథ మహాకవి విరచిత కాశీఖండ కావ్యంలోని ఒక పాత్ర. కాశీ ఖండము రసభరితమైన కావ్యం.

యజ్ఞదత్తుడు కాంపిల్య నగరవాసి. వేదవేదాంగ వేదార్థ విత్తముడు. యజ్ఞ విద్యా విశారదుడు. ఇతనికి రాజు అనేక బహుమానాలు ఇచ్చాడట. ఇతని భార్య సోమి దేవమ్మ. బ్రాహ్మణాచార దూరుడై ద్యూతక్రీడారతుడై చెడిన గుణనిధి వీరి కుమారుడు. నవ రత్నాంగుళీయకం విషయంలో కొడుకును వెనకేసుకు వచ్చి అబద్ధమాడినందుకు సోమిదేవమ్మను వదిలివేసి మరొక శ్రోత్రియుని పుత్రికను పెండ్లాడిన నియమశీలుడు యజ్ఞదత్తుడు

యజ్ఞదత్తుడు ఒకనాడు రాజప్రాసాదం నుండి వస్తూ ఒక ద్యూతకారుని చేతిలో ఉన్న తన నవరత్నాంగుళీయకాన్ని చూసి 'ఇది నీ కెట్లు వచ్చెను,' అని నిలదీసి అడిగి,, వాని వలన గుణనిధి తనఇంటనుంచి తీసుకునివెళ్ళి కోమటింట కుదువపెట్టిన సోమిదేవమ్మ బంగారు నగల విషయమూ, 'భృంగారు కర్కరీ కలాచికలు తళియలు పళ్ళెరాలు' విషయమూ తెలుసుకున్నాడు. దీనితోబాటు గుణనిధి అంతటి అక్షధూర్తుడు మరొకడు లేడని కూడా గ్రహించాడు. వివాహితుడైన కొడుకు చెడిపోయినందుకు విచారించి తనతో అబద్ధాలు చెప్తూ వచ్చిన భార్యను నిందించి సుపుత్రత్వము కంటె అపుత్రత్వము మేలని నిశ్చయించుకొని మరొక కన్యను పెండ్లి చేసుకొన్నాడు. (కాశీ ఖండం)

## యజ్ఞ నారాయణ దీక్షితులు

కాలం : క్రీ. 17 వ శతాబ్దం

స్థలం : తంజావూరు-రఘునాథ నాయకుని ఆస్థానం.

కృతులు : 1. సాహిత్య రత్నాకరమ్ (సం) 2. అలంకార రత్నాకరమ్ (సం) 3. రఘునాథ భూపాలీయ నాటకమ్ (సం) 4. రఘునాథ విలాసమ్(సం)

గురువు : రఘునాథ నాయకుడు.

తంజావూరి మంత్రియైన గోవింద దీక్షితుని జ్యేష్ఠపుత్రుడు. తన కృతులన్నింటినీ రఘునాథునకే అంకితమిచ్చాడు. షడ్దర్శన పారగుడు. అపార ప్రతిభావంతుడు. ఇతని రచనలన్నీ సంస్కృతాలే. (తం.అం.నా-10)

## యజ్ఞేశ్వరుడు

కాలం : తెలియదు.

రచనలు : 1. అలంకార సూర్యోదయమ్ 2. అలంకార రాఘవమ్ 3. కావ్య ప్రకాశికకు వ్యాఖ్యానము 4. శాస్త్రదీపికకు ప్రభామండలమనే వ్యాఖ్యానము 5. పంచపాదికా వివరణోజ్జీవని అనే వేదాంత గ్రంథము.

ఈయన కొండు భట్టోపాధ్యాయుని కుమారుడు. చెరుకూరి లక్ష్మీధరుని మేనల్లుడు. సంస్కృతంలోనే ఎక్కువగా రచనలు చేశాడు. (తె.వి.స-4)

**యడవల్లి వెంకటయ్య**

కాలం : క్రీ శ. 17 వ శతాబ్దం.
స్థలం : మైసూరు.
రచన : అభిరామ వాసుదేవము (అలభ్యం).

ఇతడు కోడూరి వెంకటాచల కవికి విద్యా గురువు. (ద.దే.వా-491)

**యడవల్లి వేంకటకవి**

రచన : పతితపావన చరిత్ర.

ఇతడూ, అభిరామ వాసుదేవ కర్త వేంకటయ్య ఒకరో కాదో వివాద గ్రస్తంగా ఉంది (ఆరుద్ర-12-84)

**యతిప్రాసల సీసమాలిక**

కర్త : గణపవరపు వేంకటకవి (చూ).

కవి రచించిన సర్వ లక్షణ శిరోమణిలోని ప్రథమోల్లాసంలో ఈ గణయతి ప్రాసలక్షణ సీసమాలిక ఉంది. ఈ సీసమాలిక ప్రత్యేకంగా కూడా ప్రసిద్ధమైంది. (ఆరుద్ర-11-180)

**యతిరాజ దండకమ్ (సం)**

కర్త : కిరీటి వేంకటాచార్యులు (చూ)

(ఆం సం.సా.)

**యతిరాజ శతకము**

రచనాకాలం : క్రీ.శ. 1680 ప్రాంతం.
కర్త : తిరునగరి వేంకటాచార్యులు.

విశిష్టాద్వైత మత ప్రవక్తకమైన శతకం. కవి తన ఊరి పేరును కూడా ఇమిడ్చి "యతిపతీ హనుమద్గిరి రాజ మందిరా" అనే మకుటంతో వ్రాశాడు. ఇది రసవత్తరమైన శతకంగా ప్రసిద్ధిపొందింది. ముద్రితం. (ఆరుద్ర-11-239; క.స-256)

**యతిరాజ శేఖర వచనములు**

చూ : యతిరాజు బిరుదు గద్య.
కర్త : గణపవరపు వేంకటకవి.
రచనాకాలం : క్రీ శ. 17 వ శతాబ్ది మధ్య భాగం.

ఈ వచనాల కర్తృత్వం నిర్ధారణ కాలేదు. గణపవరపు వేంకట కవి కృత మని కొందరు భావిస్తున్నారు. ఇదే యతిరాజు బిరుదు గద్య కావచ్చును. (క.స-233)

**యతిరాజు బిరుదు గద్య (అలభ్యం)**

కవి : గణపవరపు వేంకటకవి.

పెరుంబుదూరి యతిరాజు గణవరపు వేంకటకవి గురువు. అతని మీద చెప్పిన బిరుదుగద్య కావచ్చును, (క.త-12-238)

## యథావాక్కుల అన్నమయ్య

కాలం : క్రీ. శ. 1280-1340 ప్రాంతం.

స్వస్థలం : గోదావరి మండలంలోని పట్టిసగ్రామం.

రచనలు : 1 సర్వేశ్వర శతకము 2. లీలానంద సర్వేశ్వర శతకము.

గురువు : దూదికొండ సోమేశ్వరారాధ్యుడు.

ప్రసిద్ధ శతక కర్త. ఇతని గురించి కొన్ని కథలు ప్రచారంలో ఉన్నాయి. సాత్వికభక్తుడై కొన్ని భయంకర శైవాచారాలను నిరసించాడు ఇతడు కృష్ణామండలం లోని 'జెట్టిపాలెం'లో స్థిరపడినట్లు తెలుస్తున్నది. కాకతి గణపతిదేవునికి సమకాలికుడు కావచ్చు. పాల్కురికి సోమనాథునికి పూర్వుడు.

తనకు పూర్వమున్న శైవాచార్యుల వాక్యాలను యథామాతృకంగా అనువదించటంవల్ల ఇతనికి యథావాక్కుల అన్నమయ్య అనే పేరు వచ్చిందంటారు. ఇతని తరవాత ఇతని వంశం వారిలో సోమరాజు ప్రసిద్ధుడు కావటంవల్ల వారికి సోమరాజువారనే ఇంటిపేరు వచ్చిందట. హృద్యమైన శైలి, అనర్గళమైన ధార ఈ కవి ప్రత్యేకతలు. ఈయన వ్రాసిన సర్వేశ్వర శతకమొక్కటే వ్యాప్తిలోఉంది.

(ఆరుద్ర-2; శ.క.చ-65, 725)

## యథాశ్లోక తాత్పర్య భారతము

కర్త : కొటికలపూడి వీరరాఘవాచార్యులు (చూ).

అంకితం : పూదూరి కేశవ స్వామికి.

ఇది అష్టాశ్వాస పరిమిత మహాప్రబంధం. గద్వాల సంస్థాన విద్వాంసులు పుల్లగుమ్మి వేంకటాచార్యుల చేత పరిష్కృతం. రాజా రామభూపాలరావు దీనిని ప్రచురించారు. (ఆం. సం. సా.)

## యథాశ్లోక తాత్పర్య రామాయణము

కర్తలు : 1. కాణాదము పెద్దన సోమయాజి (బాలకాండము) 2. కొత్తపల్లి రామచంద్రాచార్యులు (అయోధ్యాకాండము) 3. గార్గ్యపురము సుబ్బశాస్త్రి (అరణ్యకాండము) 4. కామసముద్రం అప్పలాచార్యులు (కిష్కింధాకాండము) 5. తిరుమల కృష్ణమాచార్యులు (సుందరకాండము) 6. బోరవెల్లి శేషాచార్యులు (యుద్ధకాండము).

స్థలం : గద్వాల సంస్థానం.

అనువాద గ్రంథం. ఇది పైన పేర్కొన్న ఆరుగురు కవులచేత అనువదించబడింది. వాల్మీకి రామాయణం దీనికి మూలం. గద్వాల సంస్థానాధీశ్వరుడైన పెద్ద సోమభూపాలుడు ప్రారంభించిన ఈ కావ్యం కొంతకాలం ఆగిపోయి, ఆ తరవాత చిన సోమ భూపాలుని కాలంలో పూర్తి అయింది. క్రీ. శ. 1818లో గద్వాల ప్రభువైన రాజా రామభూపాలరావు బహద్దరు వారు దీన్ని ముద్రించే ఏర్పాట్లు చేశారు.

ప్రథమ సంపుటం బైరంపల్లి తిరుమలరాయ కవి పరిష్కృతం. రెండవ సంపుటం ఆదిపూడి ప్రభాకర కవి పరిష్కృతం. (ఆం. సం. సా.)

**యదువంశ భూషణ శతకము**

రచనాకాలం : క్రీ.శ.1810 ప్రాంతం.
కర్త : జూలూరి అప్పయ్య.
అంకితం : శ్రీకృష్ణునికి.

"కృష్ణ, హరీ యదువంశ భూషణా" అనే మకుటంతో ఉన్న రచన. చంపకోత్పల మాలలున్నాయి. ధారాళమైన శైలిలో రచన ప్రౌఢంగా ఉంది. ముద్రితం. (శ. క. చ-524)

**యద్దనపూడి (ఎద్దనపూడి)**

గ్రామనామం. ఇంటిపేరుగా వ్యవహారంలో ఉంది. ఈ గ్రామం పూర్వం కమ్మనాటిలో (చిలకలూరిపేట తాలూకా) ఉండేది. దీన్ని గుండిమెడ అన్నమంత్రి 12వ శతాబ్దంలో పండితులకు అగ్రహారంగా ఇచ్చాడు.

**యమక శతకము (అలభ్యం)**

కవి : చూ. గణపవరపు వేంకటకవి.
రచనాకాలం : క్రీ. శ. 17వ శతాబ్దం.

నూనూగు మీసాల ప్రాయంలో చేసిన రచనగా కవి చెప్పుకొన్నాడు. (ఆరుద్ర-11-160)

**యమునావర్ణనమ్ (సం)**

కర్త : జగన్నాథ పండితరాయలు.

ఇది యమునను వర్ణిస్తూ సంస్కృతంలో ఉన్న చంపూ గ్రంథం. (తె.వి.స-4)

**యమునా స్తుతి (సం)**

నామాంతరం : అమృత లహరి (చూ).
కర్త : జగన్నాథ పండితరాయలు.

**యయాతి చరిత్ర**

రచనాకాలం : క్రీ.శ. 16వ శతాబ్ది ఉత్తరార్ధం.
కర్త : పొన్నికంటి తెలగన్న.
అంకితం : అమీన్‌ఖాన్ (గోలకొండ సేనాపతి)కు.

ప్రత్యేకత : ఇది అయిదాశ్వాసాల తొలి అచ్చ తెలుగు ప్రబంధం. భారతంలోని యయాతి కథ ఇతివృత్తం. యయాతి దేవయాని, శర్మిష్ఠలను పెళ్ళి చేసుకొనడం, వారి సంతాన వృత్తాంతం వరకు మాత్రమే దీనిలో ఉంది. ఇందులో కొన్ని చారిత్రక విషయాలు కూడా ఉన్నాయి. 1574-1586 వరకు కర్ణాటక రాజ్యాన్ని పాలించిన శ్రీరంగరాయల రాయబార వృత్తాంతం ఇందులో ఉంది. దీనిలో పురవర్ణన, ఋతు

వర్ణన, వన విహారం, జలక్రీడ, విరహం, ఉపాలంభనలు, వేట మొదలగు ప్రబంధ లక్షణాలన్నీ దీనిలో ఉన్నాయి. కొన్ని వర్ణనలలో కొత్తదనం కొట్టవచ్చినట్లుంటుంది. దీనిలో 101 గద్య పద్యాలలో రామాయణ కథ ఉంది. కవి కొన్ని చోట్ల తిక్కనను అనుకరించాడు. వెన్నెల పులుగుల (చకోరాల)ను రాధామాధవ కవి విరివిగా వర్ణించాడు. రాధామాధవ కవి ప్రభావం తెలగన్న మీద ఉంది. తెలగన్న చాలా మంది ప్రబంధ కవులను కూడా అనుకరించాడు. (ఆరుద్ర-8-141)

## యయాతి చరిత్ర (అలభ్యం)

కర్త : బోరవెల్లి కృష్ణప్ప (చూ).

## యల్లయ సూరి

నామాంతరం : కంచం యల్లయార్యుడు.

## యల్లుభట్టు

నామాంతరం : కంచం యల్లయార్యుడు.

## యాజ్ఞవల్క్య చరిత్రము

రచనాకాలం : క్రీ. శ. 1730-50 ప్రాంతం.

కర్త : ఘట్టు ప్రభువు

కృతిప్రోత్సాహకుడు ఉద్దండ లింగయామాత్యుడు. ఏడాశ్వాసాల పద్య కావ్యం. విశేష ప్రచారమొందింది.

రచన మంచి లోకోక్తులతోను, పదబంధాలతోను రమ్యంగా ఉన్నది. ఈ కవి కాలం 18 వ శతాబ్దమని కందుకూరి వారి అభిప్రాయం. ఇది నిడుదవోలు వారి పీఠికతో ముద్రితమైంది. ఈ కవి ఇతర కృతులలోని గద్యకూ ఇందులోని గద్యకూ భేదం ఉంది. ఈ కృతి కర్త, సురాభాండేశ్వర, కుచేలోపాఖ్యానాలు రచించిన ఘట్టు ప్రభువుకు భిన్నుడు కావచ్చును. (ఆరుద్ర. 12-58; క. చ-3-189)

## యాజ్ఞవల్క్య విజయము

కర్త : చల్లా గురవయ్య మంత్రి.

అంకితం : శ్రీరామచంద్రునికి.

ప్రోత్సాహకుడు : కృష్ణాపాత్రుని వేంకటమంత్రి.

ఆరు కాండలు గల ద్విపద కావ్యం. యాజ్ఞవల్క్య మహర్షి చరిత్ర ఇతివృత్తం. రచనలో చక్కని ధారాశుద్ధి ఉన్నది. జన్మకాండ, వేదకాండ, మైత్రేయకాండ, పరబ్రహ్మకాండ, యజ్ఞకాండ, విశ్వజిత్కాండము అని వాటిపేర్లు. నాలుగు కాండలు మాత్రం పూర్తిగా లభించాయి. అయిదోకాండ అసమగ్రం.

ఘట్టు ప్రభువు ఇదే చరిత్రను తర్వాతి కాలంలో రాశాడు.

(ద్వి. సా. చ-459; క. త-12-171)

యాదగిరి నరసింహ శతకము (అలభ్యం)

రచనాకాలం : క్రీ. శ. 19 వ శతాబ్దం పూర్వార్ధం.
కర్త : తిరువాయిపాటి వేంకట కవి.

కందపద్య శతకం. "యాదగిరి నరసింహా" అనే మకుటం గలదట. (శ. క. చ.-847)

యాదగిరి నృసింహ శతకము

కర్త : మరింగంటి చెన్నకృష్ణమాచార్యులు.

ఈ గ్రంథ ప్రతి కనగల్లు గ్రామ నివాసియైన మరింగంటి రంగాచార్యుల తాళ పత్ర గ్రంథాలయంలో ఉందట (తె. వి. స-6)

యాదగిరీంద్ర శతకము

రచనాకాలం : క్రీ. శ 1840 ప్రాంతం.
కర్త : తిరువాయిపాటి వేంకటకవి.

ముద్రితం. "యాదగిరీంద్ర మొక్కెదన్" అనే మకుటంతో ఉన్న వృత్త శతకం. కవిత్వం అంత ప్రౌఢం కాదు. దశావతారాలు, రామకథ ఇందులో ప్రసక్తంగా చెప్పాడు. (శ. క. చ-847)

యాదగిరి మాహాత్మ్యము

రచనాకాలం : క్రీ. శ. 18 వ శతాబ్దం.
కర్త : అనమగుర్తి రంగయ్య.
అంకితం : రావూరి వేంగామాత్యునికి.

అయిదాశ్వాసాల ప్రబంధం. కవిత్వం శ్రావ్యంగా ఉంది. (క. చ-3-194)

యాదవ చరిత్రము

రచనాకాలం : క్రీ. శ. 1850 ప్రాంతం.
కర్త : సోమనాథకవి (చూ). (క. స-305)

యాదవ భారతీయము

కర్త : చూ. చెన్నకృష్ణ కవి.
అంకితం : జనుంపల్లి వల్లభరాయలకు.

ద్వ్యర్థి కావ్యం. వనపర్తి సంస్థానంలో ముద్రితం. శ్రీకృష్ణుని కథ, భారత కథ కలిసి వచ్చేటట్లు చేసిన రచన. (అం. సం. సా.)

యాదవ రాఘవ పాండవీయము

కర్త : ఎలకూచి బాలసరస్వతి.

ఇది తెలుగులో మూడర్థాల కావ్యము.

**యాదవ రాఘవ పాండవీయము**

కర్త : నెల్లూరి (వీర) రాఘవ కవి (చూ).
రచనాకాలం : క్రీ. శ. 1717 ప్రాంతం.
అంకితం : శ్రీకృష్ణునికి (గోపాలకృష్ణ బ్రహ్మము).

నాలుగాశ్వాసాల త్ర్యర్థి ప్రబంధం. రామ,కృష్ణార్జునుల చరిత్ర దీనిలోని కథ. ఇందులో కవి పేరు రాఘవ కవి అని మాత్రమే ఉన్నది. క్రీ. శ. 1887లో ముద్రితం. క్రీ శ. 1949లో ఆచార్య సరిపెల్ల విశ్వనాథ శాస్త్రి దీనికి "ఆనంద జ్యోత్స్న" అనే పేరుతో టీక వ్రాసి ప్రకటించారు. కవి పాండితీ వైభవం ఈ రచనలో తేట తెల్ల మౌతున్నది. (ద. దే. వా-259)

**యాదవ రాఘవీయమ్ (సం)**

కర్త : వేంకటాధ్వరి.

ఇది ద్వ్యర్థి కావ్యం శ్లేషాలంకారాలు, అనుప్రాసలు ఎక్కువ. రామకృష్ణ చరిత్రలు దీనిలో వర్ణితం. ఈ కావ్యానికి కవి స్వయంగా వ్యాఖ్యానం రాశాడు. (తె. వి. స-6)

**యాదవ రాఘవీయ వ్యాఖ్య (సం)**

కర్త : వేంకటాధ్వరి.

ఇదే పేరుతో కవి వ్రాసిన సంస్కృత ద్వ్యర్థి కావ్యానికిది విపులమైన వ్యాఖ్య (తె. వి. స-6)

**యాదవ రాజ వంశావళి**

కర్త : కావలి వేంకట బొర్రయ్య. (తె. వి.స-4)

**యాదవాభ్యుదయ వ్యాఖ్య (సం)**

కర్త : అప్పయ్య దీక్షితులు.

వైష్ణవమత శిఖామణియైన వేదాంతదేశికుని గ్రంథానికిది వ్యాఖ్య. చిన తిమ్మ నాయకుని ప్రేరణతో అప్పయ్య దీక్షితులు ఈ వ్యాఖ్యానం వ్రాశాడట. (తం.ఆం.నా-21; తె.వి స-6)

**యాదవామాత్యకవి**

కాలం : క్రీ. శ. 16వ శతాబ్ది.
రచనలు : 1. చంద్రహాస విలాసము 2. విక్రమార్క చరిత్రము 3. యాదవామాత్య (లక్షణ శిరోమణి) ఛందస్సు.

బాపనార్యుని పుత్రుడు, వేంకటరాజు పౌత్రుడు. ఇతడు ఇక్షుపురీంద్రుడైన త్రివిక్రమదేవుని మదిలో నిలిపి రచనలు చేశాడు. ఇక్షుపురి అంటే చెరుకూరో, చెరకుమల్లియో, చెరకువాడయో కావచ్చును. ఇతని రచనలన్నీ భద్రాద్రిలోని శ్రీరామునికి

అంకితాలు. ఇతనిది మృదు మధురమైన శైలి. ఇతని పద్యాలు లింగమకుంట తిమ్మకవి ఉదాహరించాడు. (తె.వి.స_6)

**యాదవామాత్య ఛందస్సు**

నామాంతరం : లక్షణ శిరోమణి.
కర్త : యాదవామాత్యకవి,
రచనాకాలం : క్రీ. శ. 1550 కి పూర్వం.

ఈ గ్రంథంలో ఆత్మసంబోధన ఉండటం వల్ల యాదవామాత్యుడు కృతిపతి అని కొందరి అభిప్రాయపడి ఉన్నారు. (క.స_173)

**యాదాటి వేంకట నారాయణ**

కాలం : క్రీ. శ. 16 వ శతాబ్దం.
రచన : బ్రహ్మోత్తర ఖండము (ద్విపద)

కవి రామతీర్థంలోని నృసింహస్వామి భక్తుడు. లభించిన గ్రంథంలో అవతారికా భాగం లేదు. కవిని గురించిన వివరాలు తెలియరాలేదు కవి సంస్కృతాంధ్రాలలో పండితుడు. ఇతని రచన సంస్కృత స్కాందపురాణంలోని బ్రహ్మోత్తర ఖండంలోని కథకు ద్విపదానువాదం. శైలి ప్రౌఢంగా ఉంది. కొమరగిరి సుబ్బయామాత్యుని ప్రేరణతో గ్రంథం రచించి అతనికే అంకితమిచ్చాడు. (ద్వి.సా.చ_172)

**యానాది భాగవతులు**

కూచిపూడి ప్రభావం అనేక జాతులు, కులాలమీద పడటంవల్ల అనేక కులాలా భాగవతులు తయారయ్యారు. యానాది భాగవతులు పూర్వం ఎక్కువగా నెల్లూరు, గుంటూరు జిల్లాలలో ఉండేవారు. వీరి అసలు వృత్తి గ్రామాలను కావలా కాయడం. వీరిలో కొందరు ఉత్సాహవంతులు జట్లుగా, నాటక సమాజాలుగా ఏర్పడి అద్భుతంగా వీథి నాటకాలను ఆడేవారు. పురుష పాత్రలను పురుషులు. స్త్రీ పాత్రలను స్త్రీలు, పిల్లల పాత్రలను పిల్లలు ధరించేవారు.

ఒక రాత్రికి అందరికీ భోజనంపెట్టి పది రూపాయిలు ఇస్తే వీథినాటకం జరిగిపోయేది. ప్రేక్షకులు ఈ నాటకాలను విరగబడి చూసేవారట. ఈ భాగవతులు ముఖ్యంగా ఉషాపరిణయం, కృష్ణలీలలు, సావిత్రి, శశిరేఖా పరిణయం మొదలగునవి ప్రదర్శించేవారు. (నా.ర.చ_176)

**యామినీ పూర్ణతిలకమ్ (సం)**

కర్త : చూ. పేరి కాశీనాథశాస్త్రి.

సంస్కృత నాటకరచన. (ఆం.సం.సా_427)

**యామినీపూర్ణ తిలకా విలాసము**

కర్త : చెళ్ళపిళ్ళ నరస కవి.
రచనాకాలం : క్రీ.శ. 18 వ శతాబ్దం ఉత్తరార్ధం.

ఆరాశ్వాసాల శృంగార ప్రబంధం. రమణీయమైన శైలిలో ఉన్న ప్రౌఢమైన రచన. పిల్లవసుచరిత్రగా పేరుపొందింది. పూర్వోక్తములైన బిల్హణీయ రచనల కంటె ఇది రసవంతమైనది. (క చ 3-187)

## యాముజాల శేషాచలపతి

కాలం : క్రీ. శ 1814 ప్రాంతం.
స్వస్థలం : మధిర తాలూకా నాగవరప్పాడు.
రచన : రామాయణము (యక్షగానం) (వసిష్ఠ జనక సంవాదము).

వివరాలు తెలియ లేదు. (గోలకొండ కవుల సంచిక)

## యామునాచార్యుడు

శ్రీకృష్ణదేవరాయలు వ్రాసిన 'ఆముక్త మాల్యద'లో మూడు ముఖ్యమైన కథలున్నాయి. అందులో యామునాచార్యుల కథ ఒకటి. ఈ కథకు వక్త శ్రీ మహా విష్ణువు శ్రోత అతని సతీమణి లక్ష్మీదేవి.

ఆళ్వారులు పన్నిద్దరు. ఆచార్యులు ఆర్గురు అందులో నాథముని, యామునులు ప్రముఖులు. మహాత్ములు. ఆళ్వారులు భగవద్దర్శనం చేత తరించిన మహాభక్తులు. తద్దర్శన లక్షణాన్ని ప్రపంచించి లోకారాధన చేసి తరించిన మహాపురుషులు. కాబట్టి రాయల మొదటి కథ ఆళ్వారులది. రెండవ కథ యామునా చార్యునిది. ఈతని ద్వారానే శ్రీవైష్ణవం విశిష్టాద్వైతంగా రూఢికెక్కింది. మూలగ్రంథంలోని యామునా చార్యునికి, రాయల చిత్రణానికి చాలా భేదం కనిపిస్తుంది. మూలంలో ఇతడు విద్యాహంకారిగా చిత్రింపబడ్డాడు. కాని, రాయలవారి యామునుడు వినయశీలి.

యామునాచార్యుడు నాథమునికి పౌత్రుడు. గొప్పభక్తుడు. పసితనంలోనే సకలశాస్త్రాలు అభ్యసించాడు ఆ కాలంలో మధురానగరాన్ని పాలించేరాజు శైవమతస్థుడు. జందెం త్యజించి, వేదబాహ్యుడైనాడు. సనాతన వైదిక రాజనీతికి విరుద్ధంగా రాజ్యపాలన చేయడం ప్రారంభించాడు. కాబట్టి, భగవంతునికి ధర్మస్థాపన చేయాలన్న ఉత్సాహం జనించింది. ఆ ఉత్సాహం యామునుని హృదయంలో జనించింది కాబట్టి ఇతడు పాండ్యరాజు సభకు వెళ్లాలనుకుంటాడు.

యామునుడు ఆచార్యుడే. ఆళ్వారు కాదు. భగవద్దర్శనం లేనివాడు కాబట్టి భగవంతుడు ఇతనిని అంతరంగంలో ప్రేరేపించాడు. విష్ణుచిత్తునికి వలె ప్రత్యక్షంగా చెప్పలేదు భగవత్ప్రేరితుడై ఇతడు చిరుతప్రాయంలోనే పాండ్యసభలో వాదిస్తాడు. వాదనలో ఓడినవాడు మెడలో 'లింగం' ధరించి, శైవాన్ని అవలంబించాలని రాజుగారి నిర్ణయం.

చూపులకు యామునుడు చాలా పసివాడే, కాని గడుసరి. అద్వైతులనందరినీ ఓడించి, వైష్ణవ మతస్థాపన చేస్తాడు. నిర్ణయం ప్రకారం రాజుగారి సోదరిని వివాహ మాడుతాడు.

యామునుడు కేవలం పండితుడు. భగవద్భక్తుడే కాని, భగవద్దర్శనం ఉన్న వాడు కాడు. శ్రీవైష్ణవం ఇట్టి కేవల పండితులను, శుష్కతార్కికులను త్రోసివేసి వారి కైవల్యం మోక్షమే కాదన్నది. ఇప్పుడు యామునునకూ అదే జరిగింది. కేవలం పండితుడుగా ఉన్నంతకాలం అతడు భవవంతునికి దూరంగానే ఉండవలసి వచ్చింది. అందుచేతనే రాజ్యవ్యసనుడైనాడు. అసలీ యామునుని జీవలక్షణంలోనే కొంత భోగ వాంఛ కనిపిస్తుంది. రాజకన్యను వివాహమాడడం, ఉత్తరోత్తరా రాజు కావడానికి అంగీ కరించడం- మొదలైన విషయాలు దీన్ని ధ్రువపరస్తున్నాయి.

రాజైన తరువాత రాజ్యవ్యసనాలలో పడి, ఇతడు భగవంతుని మరచిపోతాడు' కాని విప్రపూజ, వినయశీలాన్ని మాత్రం విడువలేదు. అందుకే 'రామమిశ్రు'ని పిలిపించు కొని దర్శనం చేసుకున్నాడు. బ్రాహ్మణుడు వేద స్వరూపుడని నమ్మినవాడు కాబట్టి, చక్రవర్తి అయికూడా తానే స్వయంగా ఉత్థానం చేసి, నమస్కరించి, ఆ బ్రాహ్మణుని గౌరవించాడు. ఈ దివ్యలక్షణమే యామునుని ఆచార్య పురుషునిగా మార్చింది. ఈ రామమిశ్రుడు నాథమునికి శిష్యుడు. నాథముని యామునునికి పితామహుడు. ఆ సంబంధం దృష్టిలో ఉంచుకొని, రామమిశ్రుడు ఈ చక్రవర్తికి జ్ఞానోదయం కలిగించా లని సంకల్పించాడు చక్రవర్తికి శ్రీరంగనాథుని చూపించాడు, అది అతని పూర్వులు ఆర్జించి పెట్టిన నిధి. భగవద్దర్శనం చేతనే యామునుడు నిజం గ్రహించి, తాను అప మార్గంలో నడచినందుకు చింతించి, తన కుమారునికి రాజ్యభారం అప్పగించి, సన్యసిస్తాడు.

(ఆముక్త మాల్యద)

## యార్లగడ్డ కోదండరామన్న దేశాహి

కాలం : క్రీ. శ. 1746-1791 ప్రాంతం.

స్థలం : చల్లపల్లి.

సంస్థానాధీశ్వరుడు. కవిపండితులకు అగ్రహారాలు ఇచ్చి పోషించాడు. సంస్థాన స్థాపకుడైన యార్లగడ్డ గుర్వినీడునకు ఆరవ తరంవాడు. క్రీ. శ. 1746 లో సంస్థానపాలకు డయ్యాడు వ్యవహార నిపుణుడు. అంతకుముందు సుమారు 12 సం॥లు చిక్కులలో పడిఉన్న సంస్థానాన్ని పునరుద్ధరించి, విస్తరింపచేశాడు. ఫ్రెంచివారినుండి గూడూరు, ఆకులమన్నాడు లకు, దివిసీమలోని ఆరు లంకలకు ఫర్మానాసంపాదించి తమసంస్థానంలో కలుపుకున్నాడు.

ఆలయారామాదుల ప్రతిష్ఠను జరిపి, సాహిత్యపోషణ చేశాడు. మహాకవిగా, తపస్సంపన్నుడుగా పేరుగాంచిన 'ముక్తేవి పెరుమాళ్ళయ్య' ఇతన్ని ఆశ్రయించినవాడే. కాశీనాథుని మల్లనారాధ్యునికి ఇతడు 'మల్లేశ్వరపురాన్ని' అగ్రహారంగా ఇచ్చి గౌరవించి నట్లు తెలుస్తున్నది. దివి తాలూకాలోని పెదముక్తేవి గ్రామంలోని లక్ష్మీపతిస్వామి దేవా లయం, పంచలక్ష్మీనారాయణ క్షేత్రాలలో ఒకటి. కోదండరామన్న దీన్ని పునరుద్ధరించారు.

(ఆం.సం.సా-153, 155, 156. 158)

## యార్లగడ్డ శ్రీమతుంరాజా ఇమ్మడి అంకినీడు బహద్దరు

కాలం : క్రీ.శ. 1798-1819 ప్రాంతం.

స్థలం : చల్లపల్లి. సంస్థానాధీశ్వరుడు, సాహిత్యపోషకుడు.

బిరుదములు : 'శ్రీమంత్', రాజా బహద్దరు జబ్దితుల్ అక్రాన్.

ఇతడు చల్లపల్లి సంస్థానాధీశ్వరుడైన వెంకటరామన్న బహద్దరు దత్తపుత్రుడు. క్రీ. శ 1798_1819 మధ్య సంస్థానాన్ని పాలించారు. వ్యవహార నిపుణులు. క్రీ శ. 1802 లో కుంఫిణీవారినుండి "సన్నదు _ఇ_మిల్కియత్ ఇస్తిమిరార్" పొందారు. పూనాలోని పీష్వాగారి ద్వారా శ్రీమంత్ బిరుదాన్ని, నిజాము నవాబు నుండి రాజాబహద్దరు జబ్దతుల్ అక్రాన్ బిరుదాలను పొందారు. వీరి తరువాత ఈ వంశంవారు ఈ బిరుదాల్ని పరంపరగా ధరించారు. చల్లపల్లి కోటలోని రాచగరు కట్టించింది ఈ ప్రభువే ! ఇతని ఆస్థానంలోనివాడే కాసుల పురుషోత్తమకవి.

## యుగ్మకము

శ్రవ్యకావ్యభేదం.

క్రియాసమాప్తి కోసం పరస్పర సంబంధముండే పద్యాల జంట. అప్పకవి రెండు పద్యాల జంటకు ద్వికము అని పేరు పెట్టాడు. ద్వికంలో క్రియాసమాప్తి పరస్పరాపేక్ష లేదు. ఇక్కడ పరస్పరాపేక్ష ఉంటుంది. క్రియ రెండోపద్యంలో ఉంటుంది. (తె.వి.స_6)

## యుద్ధమల్లుని బెజవాడ శాసనము

కాలం : క్రీ. శ. 934 ప్రాంతం.

ఈ శిలాశాసనంలో ఐయిదు మధ్యాక్కరాపద్యాలు కనిపిస్తున్నాయి. ఈ మధ్యాక్కరలు దేశీయ వృత్తాలు. యుద్ధమల్లుడు బెజవాడలో కట్టించిన కుమార స్వామి దేవాలయం విషయం, స్థాపించిన మఠం, చేసిన దానాలు మొదలైనవి ఇందులోని ప్రధాన విషయాలు. దీనిలోని 'సత్యత్రిణేత్రుడు' అనవద్య విఖ్యాత కీర్తి' 'త్రిభువనా భరణుడు' మొదలగు పదాలు ఇంతకు ముందున్న శాసనాల పద్ధతిలోనే ఉన్నాయి. దీని జయంతి రామయ్యపంతులు ప్రచురించారు. (వా.చ; తె.వా; సా.చ.సం)

## యువజన హృదయానందము

కర్త : బద్దెపూడి ఎఱ్ఱభూపతి

శృంగార ప్రబంధం. రెండాశ్వాసాలు మాత్రం లభించాయి. ఇతివృత్తం తారా శశాంకుల కథ. ఇదే కథతో శేష - వేంకటపతి తారాశశాంక విజయం అప్పటికే ప్రసిద్ధమైంది. ఇందులోని రచన జటిలంగా ఉన్నా జాతీయోక్తులతో రమణీయంగా ఉంది. (ద.దే వా_380)

## యోగదీపిక (సం)

కర్త : లొల్ల లక్ష్మీధరుడు.

ఇది యోగశాస్త్ర గ్రంథం. (తె.వి స_4)

## యోగశాస్త్ర శతకము (అలభ్యం)

నామాంతరం : చతుర్విధ కందశతకము.

కర్త : వెలగపూడి కృష్ణయామాత్యుడు.

కంద పద్యశతకం. నాల్గుయోగాలను గూర్చిన విషయాలు ఇందులో పొందు పరుపబడ్డాయట. భానుమద్విజయంలో దీని ప్రసక్తి ఉంది. (ద.దే-వా-380)

## యోగానంద అవధూత

కాలం : క్రీ. శ. 16వ శతాబ్ది.

రచనలు : ఆత్మైకబోధము (ద్విపద); పరమానంద శతకము, గురుశిష్య సంవాదము (ద్విపద).

గురువు : చింతలపల్లి లింగావధానులు (ధేనుకొండ తిమ్మయ్య శిష్యుడు).

గురుబోధ, అనుభవార్థం ఇవే ముఖ్యంగాని యతి ప్రాసలు, వ్యాకరణం, ఛందస్సుల గొడవలు పట్టించుకోవద్దని చెప్పిన వేదాంతి. ఇతని రచనలలో స్వల్ప దోషాలున్నప్పటికీ విషయం ఉత్కృష్టమైనది. (ద్వి. సా. చ-294)

## యోగానంద ప్రహసనమ్ (సం)

కర్త : డిండిమ భట్టు II.

## యోగావళి

కర్త : అమలాపురపు సన్యాసి కవి.

ముప్పది కంద పద్యాలున్నాయి. "శ్రీరామేశా" అనేది మకుటం. యోగ విషయాలను తెలుపుతున్న మనోహరమైన రచన. (శ.క.చ-751)

## యోగినీ చక్రము

కాలం : క్రీ. శ. 11-15 శతాబ్ది మధ్యకాలం.

(పూర్తి వివరాలకు చూడు-భైరవీ చక్రము)

## యోగీశ్వర విలాసము

కర్త : సిద్ధేంద్ర యోగి (దూదేకుల సిద్ధప్ప).

అంకితం : బాల బ్రహ్మేశలింగమునకు.

ఇది ద్విపద రచన. ఈ కవి పోతులూరి వీరబ్రహ్మం శిష్యుడు. బాలబ్రహ్మేశ్వరము శ్రీశైల పాదక్షేత్రం. బాబిఖాన్ అనే శిష్యుని కోరికపై ఈ రచన చేశాడట. బాబిఖాన్ శైవమత దీక్ష పొందిన మహమ్మదీయుడు. శైవ వాఙ్మయంలో ప్రసిద్ధుడైన అల్లమ ప్రభువు, అక్కమహాదేవికి బోధించినట్లుగా శివయోగ సంప్రదాయం ఇందులో బోధింపబడింది. రచన సలక్షణంగా సుబోధకంగా ఉంది. ఇది మద్రాసు ప్రభుత్వ ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారం వారి బులిటిన్ (డి. నెం. 1177)లో ప్రచురితం. (ద్వి. సా. చ-285)

## రంగ కౌముదీనాటకము (అలభ్యం)

కర్త : ఎలకూచి బాలసరస్వతి.

నాటకమని తప్ప ఇతర వివరాలు తెలియటం లేదు. (క.త. 11-144)

## రంగనాథ రామాయణము

నామాంతరం : బొమ్మలాట రామాయణము.

రచనా కాలం : క్రీ.శ. 13 వ శతాబ్దం.

కర్తలు : చూ. గోన బుద్ధారెడ్డి, కాచ భూపతి, విఠ్ఠలరాజు.

విశిష్ఠత : ఇది సుబోధకమైన ద్విపద కావ్యం. దీనికర్త బుద్ధరాజు కాదని, రంగనాథుడనీ పండిత లోకంలో భేదాభిప్రాయాలున్నాయి. తోలుబొమ్మలాట వారు పాడేది ఈ రంగనాథ రామాయణాన్నే. ఇందులో అవాల్మీకాలు కోకొల్లలుగా చేరాయి. గ్రామ సీమల్లో ఈ రామాయణానికి ఆదరణ, ప్రచారం కూడా ఉంది.

ఇందులో పూర్వ భాగాన్ని బుద్ధరాజు వ్రాశాడనీ, ఉత్తర భాగాన్ని అతని కుమారులు కాచభూపతి, విఠ్ఠల రాజులు వ్రాశారనీ జనశ్రుతి. ఈ రామాయణాన్ని చక్రపాణి రంగనాథుడు రచించాడని కొందరంటారు. దానికి ఆధారాలు లేవు. గ్రంథంలో గోనబుద్ధారెడ్డి పేరే ఉన్నది. (అరుద్ర-3)

## రంగనాథ రామాయణము (ఉత్తరకాండ)

కర్త : పాటూరి నరసింహశాస్త్రి.

రచనాలకాలం: 1840 ప్రాంతం.

వచనకృతి. ఈయన గోనబుద్ధారెడ్డి వ్రాసిన ద్విపద రామాయణంలో ఉత్తర కాండను వచనంగా వ్రాశాడు. శైలి చిక్కనిది. (వ వా-80

## రంగనాథ రామయణము (వచనము)

కర్త : పైడిపాటి పాపయ్య.

రచనా కాలం : క్రీ.శ. 1840 ప్రాతం.

గోన బుద్ధారెడ్డి ద్విపదలో వ్రాసిన రామాయణానికి వచనానువాదం. సాంబ్రీసుదొర ఆజ్ఞమేరకు ఈ గ్రంథం వ్రాసినట్లు రచయిత చెప్పుకొన్నాడు. సులభమైన వ్యావహారికంలో ఉన్న రచన. (వ.వా-59)

## రంగనాథము శతకము (అలభ్యం)

కాలం : క్రీ.శ. 16 శతాబ్ది.

కర్త : పేరు తెలియదు.

ఒక్క పద్యం మాత్రం లభించింది. అజ్ఞాత గ్రంథ సంధాత కావ్యంపేరే చెప్పి, కవిపేరు చెప్పకుండా విడిచిపెట్టాడు. లభించిన పద్యం నడక బాగా ఉంది. (అరుద్ర-9)

## రంగనాథ సహస్రమ్ (సం)

కవయిత్రి : త్రివేణి.

ఇది సహస్ర నామకావ్యం. దీని వ్రాతప్రతి తంజావూరు సరస్వతి మహల్ గ్రంథాలయంలో ఉంది. (ఆ. భా. కవయిత్రులు)

## రంగనాయక శతకము

కర్త : బొమ్మరాజు నృసింహదాసు.

## రంగపురి పారిజాతము

నామాంతరం : పారిజాతాపహరణము.

కర్త : శ్రీనివాసకవి.

## రంగయ్యగారి అనంతయ్య

కాలం : క్రీ. శ. 17వ శతాబ్దం.

స్థలం : నెల్లూరు మండలం.

సాహిత్య పోషకుడు. కృతిపతి. రంగయ్య కుమారుడు కావచ్చు. ద్విపద భారతంలోని సభాపర్వం ఇతనికే అంకితం. సభాపర్వ కర్త బాలసరస్వతి ఇతన్ని దానకర్ణావతారునిగా కీర్తించాడు. (అరుద్ర-10-19)

## రంగరాజు లింగయ్య

కాలం : క్రీ. శ. 1650 కి పూర్వం.

రచనలు : తెలియరాలేదు.

అప్పకవి ఇతని పద్యాన్ని ఉదాహరించాడు.

## రంగరాట్ఛందము

నామాంతరం : లక్షణ చూడామణి.

కర్త : కస్తూరి రంగకవి.

అంకితం : ఆనందరంగ పిళ్ళైకు.

ప్రముఖ ఛందోగ్రంథం. (తె.వి.స-6)

## రంగరాట్సముదయమ్ (సం)

కవయిత్రి : త్రివేణి.

ఇది చంపూ కావ్యం. దీని వ్రాతప్రతి తంజావూరు సరస్వతీ మహల్‌లో ఉందట. (ఆ భా.కవయిత్రులు)

## రంగరాయ కదనరంగ చరిత్రము

నామాంతరం : రంగరాయ చరిత్రము.

కర్త : చూ. దిట్టకవి నారాయణ కవి

అంకితం : మల్రాజు రామారాయణిం గారికి (నరసరావుపేట జమీందారు).

చారిత్రక ప్రశస్తి గల మూడు ఆశ్వాసాల పద్యకావ్యం. రంగరాయ చరిత్రమనే పేర ప్రసిద్ధి గాంచింది. బొబ్బిలి సంస్థానాధిపతి అయిన రంగారావును గూర్చి వ్రాయ

బడినందుకే ఇది రంగరాయ చరిత్రమైనది. వీరరస ప్రధానం. బొబ్బిలి రంగారావు సేనలకు, బుస్సీదొర అధిపత్యంలో ఉన్న ఫ్రెంచి సేనలతో కూడిన విజయనగరం విజయరామ రాయల సేనలకును క్రీ. శ. 1757 లో జరిగిన యుద్ధం ఇందులో వర్ణింపబడింది. యుద్ధములో అపజయం పొందినప్పటికీ, బొబ్బిలి యోధులు ప్రదర్శించిన శౌర్యధైర్యాలు ఇందులో విపులంగా వర్ణించబడ్డాయి. రంగారావు కదనరంగ విశేషాలు ఎక్కువగా వర్ణింపబడడం చేతనే ఇది రంగరాయ కదనరంగ చరిత్ర అనేపేరుతో వెలసింది. కాని ఇందులో సందర్భాన్ననుసరించి హిందుస్థానీ పదాలను అనేకంగా వాడి ఉండడం గమనార్హం. (అం.సం.సా-194)

## రంగరాయ చరిత్రము

నామాంతరం : చూ. రంగరాయ కదనరంగ చరిత్రము.

కర్త : దిట్టకవి నారాయణ కవి.

(అం.సం.సా-194)

## రంగ విలాసము

కవయిత్రి : హోసూరి సాకమ్మ.

యక్షగానం. (ద. దే వా-408)

## రంగ శతకము

రచనాకాలం : క్రీ. శ. 1840 కి పూర్వం.

కర్త : మంచెళ్ళ కృష్ణకవి.

ఉత్పలమాలికా శతకం. రచన రసవంతంగా ఉంది. కవి పేరున్న పద్యం లోపించడంచేత ఈ శతకాన్ని గ్రంథముద్రాపకులు గుర్తించలేక పోయారనీ "రంగశాయి మనపాలగలండు విచారమేటికిన్" అనే మకుటంతో ఉన్న శతకం ఇదేనని కొందరంటున్నారు. ఇది అలభ్యమని కొందరి భావన. (శ.క.చ-747)

## రంగశాయి శతకము (అలభ్యం)

కర్త : తెలియదు.

తిరుక్కుడయూరి కృష్ణదాసు రచించిన రామదాసు చరిత్ర అనే యక్షగానంలో ఈ శతకంలోని కొన్ని పద్యాలు ఉదాహృతాలు. (క స-39)

## రంగాజి

నామాంతరం : పసుపులేటి రంగాజమ్మ (చూ).

## రండుబల్లి తామ్రశాసనము

శాసనకాలం : క్రీ. శ. 764 - 799 ప్రాంతం.

స్థలం : గుంటూరు జిల్లా బాపట్ల తాలూకాలోని రండుబల్లి.

ఈ శాసనంలోని 27వ పంక్తిలో 'కల్పట్టనము' అనేపదం ఉన్నది. శ్రీనాథ మహాకవి తన తాతాగారి ఊరు కాల్పట్టణమనీ, అది వారిధి తటంలో ఉన్నదని చెప్పాడు. ఈ

పట్టణం ఉనికిని గురించిన వివరాలకై సాహిత్యకారులు విశేష పరిశ్రమ చేశారు. ఈ శాసనం పూర్తిగా ప్రచురితం కాలేదు. (CP. No. 2/1914-15.)

(ప్రాచీనాంధ్ర శాసనాలు-199-బూ.రా.)

## రఘుకుల తిలక శతకము

కర్త : దిట్టకవి రామచంద్రకవి.

కందపద్య శతకం. 101 పద్యాలున్నాయి. "రఘుకుల తిలకనిటలతట నటదలకా" అనే మకుటంతో ఉంది. కొన్ని సంస్కృతంలో ఉన్నాయి. (శ.క.చ-839)

## రఘునాథ నాయకాభ్యుదయము

కవి : విజయరాఘవ నాయకుడు.

రచనాకాలం : క్రీ శ. 1634 - 44 ప్రాంతం.

అంకితం : మన్నారుగుడి రాజగోపాలునికి.

ఇది విజయరాఘవుని తొలిరచనలలోనిది. మూడాశ్వాసాల ద్విపదకావ్యం. రఘునాథ నాయకుని దైనందిన జీవితం, నాటి తంజావూరు స్వరూపం సహజంగా చిత్రించిన రచన. విజయరాఘవుని మరోరచన రఘునాథాభ్యుదయంలో కూడా ఇందులోని కథే కొంత సంక్షిప్తంగా ఉంది. రచన సరళ సుందరంగా సుబోధకంగా ఉంది. అభ్యుదయ కావ్యాలు తెలుగులో దక్షిణాంధ్రయుగంలో ఎక్కువ వెల్వడ్డాయి.

(రఘునాథ నాయకాభ్యుదయం పీఠిక-33)

## రఘునాథ నాయకుడు

కాలం : క్రీ. శ. 1575-1633 మధ్యకాలం.

స్థలం : తంజావూరు.

రచనలు : 1. సంగీత సుధ (సం) 2. భారతకథా సంగ్రహమ్ (సం) 3. రామాయణ కథాసారమ్ (సం) 4. అచ్యుతాభ్యుదయము (అలభ్యం) 5. పారిజాతాపహరణ ప్రబంధము (అలభ్యం) 6. రుక్మిణీ కృష్ణ వివాహ యక్షగానము (అలభ్యం) 7. జానకీ కల్యాణము (అలభ్యం) 8. గజేంద్రమోక్షము (అలభ్యం) 9. వాల్మీకి చరిత్ర 10. నలచరిత్ర 11. రామాయణము 12. శృంగార సావిత్రి (కర్తృత్వం సందేహం)

సన్మానాలు : యామద్వయంలో పారిజాతాపహరణ ప్రబంధాన్ని చెప్పి తండ్రియైన అచ్యుతరాయలచేత కనకాభిషేకం చేయించుకున్నాడు.

రాజకవి. తంజావూరును పాలించిన (1600-33)నాయకరాజు, కృతిపతి కూడా. అభినవ భోజరాజుగా పేరు పొందాడు. కావ్యాలంకృతి నాటకాది కల్పనా పారీణుడు. షడ్దర్శనీ పారంగతుడైన యజ్ఞ నారాయణ దీక్షితుడు ఇతని శిష్యుడట. ఇతని ఆస్థానం పండితులు, కవులు, కవయిత్రులతో అలరారుతుండేది. ఇతడు సాహితీ గోష్ఠులు జరిపే సభా భవనానికి విజయ భవన రాజము అని పేరు. ఇతని సభలో మెప్పు పొందడం

సామాన్యులకు సాధ్యం కాదని కవి చౌడప్ప చెప్పిన చాటువు ఒకటి ఉంది. ఇతని కవనంలో నయ, రసోదయ నుడికారాలు త్రివేణివలె ప్రవహిస్తుంటాయి. సంగీత సుధ ఇతని సంగీత శాస్త్ర వైదుష్యానికి ప్రతీక, దీన్ని ఇతడు తన మంత్రియైన గోవింద దీక్షితునితో కలిసి వ్రాశాడని అంటారు. ఇతని గ్రంథాలన్నీ ఇతని కుమారుడు విజయ రాఘవుడు తన "రఘునాథ నాయకాభ్యుదయం"లో పేర్కొన్నాడు.

మధురవాణి, రామభద్రాంబ, నారాయణ దీక్షితుడు, వేంకటమఖి, చేమకూర వేంకటరాజు ఇతని ఆస్థానంలోని కవి పండితులలో కొందరు.

సాహితీవేత్తలు ఇతన్ని కృష్ణదేవరాయలతో పోలుస్తారు. ఇతడు గొప్ప వీరుడు. సమకాలీనులలో శౌర్య సాహసాలకు పేరు పొందాడు. ఇతని తోపూరు యుద్ధం' దొంగల నాయకుడైన చోళగుని బంధించడం, నేపాళ రాజును ప్రతిష్ఠించడం వంటి వీర కృత్యాలను సమకాలీన కవులు కీర్తించారు. (ఆరుద్ర-10-58)

## రఘునాథ భూపాలీయ నాటకమ్ (సం)

కర్త : యజ్ఞ నారాయణ దీక్షితుడు.

అంకితం : రఘునాథ నాయకునికి (1600-33).

తంజావూరు పాలకుడైన రఘునాథుని జీవిత విశేషాలను తెలుపుతున్న నాటకం. మంత్రియైన గోవింద దీక్షితునకు రఘునాథుడు అర్ధాసన మిచ్చి గౌరవించినట్టు ఇందులో ఉంది. రఘునాథుని రచనలు, జైత్రయాత్రలు విపులంగా తెలిపే ఈ నాటకం చారిత్రక ప్రశస్తి గలది. ఈ కవి రఘునాథ నాయకుని దగ్గర శాస్త్రాలను అభ్యసించాడట. (తం. ఆం, నా-255)

## రఘునాథ భూపాలీయమ్ (సం)

కర్త : కృష్ణాధ్వరి.

అంకితం : రఘునాథ నాయకునికి.

ఇది అలంకార శాస్త్ర గ్రంథమట. కవి రఘునాథ నాయకుని (1600 - 33) ఆస్థానంలోనివాడు. కనుక అతనిపై ఈ కావ్యం చెప్పి ఉంటాడు. (ఆరుద్ర-10-213)

## రఘునాథ మేళ

విశేష మేళాంతరం.

క్రీ. శ. 1600-33 నడుమ తంజావూరును పాలించిన రఘునాథుడు సంగీతశాస్త్ర పారంగతుడు. ఇతడు తన పేర ఈ మేళాంతరాన్ని కల్పించినట్టు సంగీత సుధ చెప్తోంది. రఘునాథుని వాల్మీకి చరిత్రలో ఈ మేళాంతరం వర్ణితం.

## రఘునాథ విలాసమ్ (సం)

కర్త : యజ్ఞనారాయణ దీక్షితుడు.

అంకితం : రఘునాథ నాయకునకు (1600-33).

**రఘునాథ శతకము**

నామాంతరం : సాధుమేధానిధి శతకము (చూ).
కర్త : పుష్పగిరి తిమ్మన.

**రఘునాథాభ్యుదయమ్ (సం)**

కవయిత్రి : రామభద్రాంబ.
కృతిపతి : తంజావూరు నాయకరాజు రఘునాథ నాయకుడు (1600-1633)

పంద్రెండుసర్గలు, 900 శ్లోకాలున్న కావ్యం. రఘునాథనాయకుని చిన్నతనం నుంచి వార్ధక్యం వరకు ఆయన చేసిన పనులను తెలిపే చారిత్రాత్మకమైన కావ్యం. సమకాలీన సంఘ చరిత్ర, సంగీత సాహిత్య ప్రశంసలు-రాగాలు, నృత్య విశేషాలు, రావణహస్తం మొదలైన వన్నీ ఇందులో చెప్పబడ్డాయి. నాయక రాజుల కాలపు సంఘజీవితానికి చరిత్రకూ అద్దం పట్టిన కావ్యం ఇది. (ద.దే.వా-27)

**రఘునాథాభ్యుదయమ్ (సం)**

కర్త : చూ. వామనభట్ట బాణుడు.
విశిష్టమైన కావ్యం. (రె.రా.చ)

**రఘునాథాభ్యుదయము**

కర్త : విజయరాఘవుడు.
రచనా కాలం : క్రీ శ. 1643-44 ప్రాంతం.
అంకితం : రాజగోపాలునికి.

యక్షగాన నాటకం. చారిత్రక ప్రయోజనంగల రచన. కవి తన తండ్రి రఘునాథుని వైభవం, దినచర్యలను తెలుపుతూ చిత్రలేఖ అనే గణిక అతన్ని మోహించి రాయబారం పంపడం, వారిసమాగమం మొదలైన విషయాలతో ఈ కృతి రచించాడు. ఇందులో తంజావూరు పాలకుడైన రఘునాథరాయల ఆస్థానంలో జరుగుతుండే విద్యాగోష్ఠి వినోదాలు, రామభద్రాంబ, శుకవాణుల సమస్యా పూరణాలు, రాజ్యాంగ కార్యకలాపాలు, ఆదాయ వ్యయపరిశీలన - కమ్మవారి వక్కాణి, నాటి సంభాషణ రీతులు, సహజంగా చిత్రితాలు. (ద.దే.వా-97)

**రఘునాథీయము**

కవి : నుదురుపాటి వెంకన్న (చూ).
అంకితం : రాయరఘునాథునికి (పుదుకోట పాలకుడు)
రచనాకాలం : క్రీ.శ. 18వ శతాబ్దం.

అలంకార గ్రంథం. ప్రశస్తమైన రచన. అన్ని అలంకారాలు రాయ రఘునాథ తొండమాన్ పరంగా రచింపబడ్డాయి. ఇతడు 1769-89 నడుమ పుదుకోటను పాలించిన రాజు. (ద.దే వా-427)

### రఘునాయక శతకము

రచనా కాలం : క్రీ.శ. 18 వ శతాబ్దం.
కవయిత్రి : మదిన సుభద్రయ్యమ్మ.

వృత్తశతకం. 'రఘునాయక, దీనపోషకా' అనేది మకుటం. శైలి ధారాళంగా మృదు సమాన ఘటితంగా ఉంది. (శ క.చ_399)

### రఘుపుంగవ శతకము (అలభ్యం)

కర్త : మంచెళ్ళ కృష్ణకవి.

### రఘు వంశము

రచనాకాలం : క్రీ. శ. 18 వ శతాబ్దం.
కర్త : అవుదూరి కిచ్చయ్య.

పది ఆశ్వాసాల పద్యకావ్యం. ఇది కాళిదాసు సంస్కృతంలో రచించిన రఘువంశానికి తెలుగుసేత. రచన మనోహరంగా ఉంటుంది. (క.చ.3_131)

### రఘు వంశము

కర్త : (చూ) బచ్చలి వీరవేంక కవి.
అంకితం : విరించిపురంలోవి మార్గసహాయేశ్వరునకు.

నాలుగాశ్వాసాల పద్యకావ్యం. కాళిదాసు సంస్కృతంలో రచించిన రఘువంశానికి పూర్తి అనుసరణ. కవి ఆర్కాడుకు వెళ్ళి తిరిగివస్తూ విరించిపుర సమీపంలో రాత్రి బస చేసినప్పుడు కలలో భగవంతుడు కనిపించి, రఘువంశం తెలుగు చేసి తనకు అంకితం ఇమ్మని కోరాడట. హృద్యమైన రచన. (క త_13_41)

### రఘువీర చరితమ్

కర్త : కోలచల మల్లినాథసూరి.

ఇది సంస్కృత కావ్యం. (తె.వి.స_4)

### రణము కుడుపు

క్రీ. శ. 12_ 15 వ శతాబ్దాల మధ్యకాలంలో ఆంధ్రదేశంలోని ⸱ చారం. ఇది అతిభయంకరము, విచిత్రము అయిన ప్రక్రియ. భూతప్రేత పిశాచాదులను సంతృప్తి పరచటం కోసం రణనిహతులయిన శత్రురాజుల రక్తంతోను, ఎముకలతోను కలిపి వండిన బియ్యపు అన్నాన్ని అర్ధరాత్రివేళ రణభూమిలో బలిభోజనంగా సమర్పించటాన్ని రణము కుడుపు అంటారు. ఈ కర్మకాండ "వెలుగోటివారి వంశావళి"లో కనిపిస్తున్నది. రేచెర్ల వంశోద్భవులయిన రాచకొండ ప్రభువులు దీనిని నిర్వహించేవారట.

శత్రురాజుల ఖండిత శిరస్సులను రణభూమిలో పొయ్యిగా అమర్చేవారని, బందీలైన శత్రువులను రాతి తెరగళ్ళలో త్రోసి, వారి రక్తాన్ని పిండేవారని, చితికిపోయిన వారి పుర్రెలను పాత్రలుగా ఉపయోగించి, వాటిలో రక్తాన్ని ఎసరుగా పెట్టి బియ్యం పోసి వండేవారనీ తెలుస్తున్నది.

రేచెర్ల వెలమదొరలు రణరంగంలో శత్రువులను ఏ చోటులో వధించారో - అక్కడికి అర్ధరాత్రివేళ, ఒంటరిగా, దిసమొలతో, శరీరానికి బూడిదపూసుకొని, కిరీటాన్ని తీసివేసి, తలవెంట్రుకలను విరబోసుకొని వెళ్ళి, వండిన పిండాకూడును 'భూతబలి'గా సమర్పించేవారట. ఇది ఒక ఆగమశాస్త్ర కర్మకాండ అని వెలుగోటి వారివంశావళి వివరిస్తున్నది.
(వెలగోటి వారి వంశావళి-33-37) (తెలుగు-ఏ-జా 77)

రణరంగ విజయము

కర్త : చూ. అడిదము నీలాద్రికవి.

రచనాకాలం : క్రీ. శ. 15వ శతాబ్దం.

కృతిపతి పూసపాటి రాచిరాజుగాని అతని పుత్రుడు తమ్మరాజుగానికావచ్చు.చారిత్రక గ్రంథం. నీలాద్రికవి సాహిత్యంలోనే కాక, సమరాంగణంలోనూ నిపుణుడు. ఈ రణరంగ విజయము విజయనగర ప్రభువుల (కళింగరాజుల) జైత్రయాత్రలను వివరించే గ్రంథం. కవి పూసపాటి తమ్మభూపాలుని ఆస్థానంలోనూ, రాచిరాజు ఆస్థానంలోనూ ఉండేవాడు. ఈ రచన వారి విజయాలను తెలిపే గ్రంథం. (క.త-6-253; ఆం సం.సా-411)

రతి మన్మథ విలాసము

కర్త : పరశురామ పంతుల లింగమూర్తికవి.

ఇది శృంగార ప్రబంధం. కవి దీనిని యౌవనప్రాయంలో వ్రాసి ఉంటాడ పండితాభిప్రాయం. (వా.చ-88)

రతి మన్మథ విలాసము

కర్త : శేషము రంగాచార్యులు.

ఈ యక్షగానంలోని ప్రధాన విషయం సౌగంధిక పుష్పం కారణంగా మన్మథుని (ప్రద్యుమ్నుని) దేవేరుల నడుమ నారదుడు సవతి మచ్చరం కలిగించడం, చివరకు అందరూ కలిసి సుఖంగా ఉండడంతో కథ ముగుస్తుంది. రచన భామాకలాపం ఫక్కీలో నడిచింది. దీనిని కవి "శృంగార నాటక గేయ యక్షగానం"గా పేర్కొన్నాడు. రచన ప్రౌఢంగా ఉంది. దీనిలో చూర్ణిక, మంజరీ ద్విపదలు ఉన్నాయి. (య.వా.చ.-92)

రతి మన్మథాభ్యుదయము (అలభ్యం)

కర్త : మరింగంటి వేంకట (ప్రథమ) సింగరాచార్యులు.

రతి రహస్యమ్ (సం)

రచనా కాలం : క్రీ. శ. 17 వ శతాబ్దం కావచ్చు.

కర్త : హరిభట్టు.

ఈ గ్రంథాన్నే ముప్పిపల్లి పెదసోమ భూపాలుడు తెనిగించాడట. హరిభట్టు కాలాన్ని గురించి భిన్నాభిప్రాయాలున్నవి. (క.స-311)

రతి రహస్యము

నామాంతరం : కొక్కోకము (చూ).

కర్త : ఎర్రన కవి.

**రతి రహస్యము**

నామాంతరం : రతిశాస్త్రము.

కర్త : పెదసోమ భూపాలుడు (గద్వాల ప్రభువు.)

రచనా కాలల : క్రీ. శ. 18 వ శతాబ్దం.

మూడాశ్వాసాల పద్యకావ్యం. హరిభట్టు సంస్కృతంలో రచించిన రతిరహస్య కావ్యానికి అనువాదం. రచన ప్రౌఢంగా ఉంది.

ఈ గ్రంథకర్త చినసోమ భూపాలుడని కొందరి అభిప్రాయం.

**రతి శాస్త్రము**

నామాంతరం : రతిరహస్యము (చూ).

కర్త : పెద సోమ భూపాలుడు.

**రతీ కల్యాణము**

కర్త : శహాజీ (చూ).

రచనాకాలం : క్రీ. శ. 17వ శతాబ్దం.

అంకితం : త్యాగేశ సాంబ సదాశివునికి.

గౌరీస్తుతితో అరంభమైన నాటకం. గౌరీదేవికే అంకితమని కొందరు భావిస్తున్నారు.

విశేషం : ఈ కల్యాణం శాహ రాజేంద్రుని తంజాపురిలో జరిగినట్లు చెప్పబడింది. పురాణ గాథలు తమ కాలంలో తమ నగరంలో జరిగినట్లు చెప్పుకోవడం నాయక రాజుల కాలంలో కూడా కనిపిస్తుంది. సమాజంలోని వివిధ వర్గాల వేష భాషలు ఇందులో ప్రదర్శింప బడ్డాయి. ఆంధ్ర విశ్వ కళా పరిషత్తువారు ప్రకటించిన యక్షగాన సంపుటాలలో ఈ యక్షగాన నాటకం కూడా ఉంది. (ద. దే. వా-194)

**రతీ మన్మథ విలాసము (అలభ్యం)**

కవి : విజయరాఘవనాయకుడు.

కవి, తంజావూరు పాలకుడు (1633-73). తంజావూరు నాయకరాజుల కాలంలో నాటక ప్రదర్శనలు తరచుగా జరిగేవి. అట్టి ప్రదర్శన కోసం రాసిన సంగీత నృత్య ప్రబంధం కావచ్చు. (ద. దే. వా-87

**రత్నఖేట శ్రీనివాస దీక్షితుడు**

కాలం : క్రీ. శ. 15వ శతాబ్దం.

స్థలం : దక్షిణదేశం (తంజావూరు, చెంజి మండలాలు.)

కృతులు : 1. శితికంఠవిజయమ్ (సం) 2. భావనా పురుషోత్తమమ్ (సం)
3. భైమీ పరిణయమ్ (నాటకం. సం).

సమకాలికుడు : అప్పయ్య దీక్షితుడు.

బిరుదు : రత్నఖేట పండితుడు.

అపారమైన శాస్త్ర వైదుష్యం గల కవి. మొత్తం 18 నాటకాలూ 60 కావ్యాలూ రాశాడట ఇతని కుమారుడు రాజచూడామణి దీక్షితుడు విద్వత్కవి. (తె. వి. స-6-221)

**రత్నతూలిక (సం)**

కర్త : భాస్కర దీక్షితుడు (చూ).

సిద్ధాంత సిద్ధాంజనం అనే వేదాంత గ్రంథానికి వ్యాఖ్యానం.

**రత్నపరీక్ష**

కర్త : భైరవ కవి.

కాలం : క్రీ. శ. 1410-1480 ప్రాంతం.

కృతిభర్త : ముదిగొండ వీరేశ్వరుడు (దైవం).

విశిష్టత : 80 పద్యాల చిన్న కావ్యం. పూర్వం అగస్త్యముని చెప్పిన దానిని క్రోడీకరించి తాను చెప్పానని కవి చెప్పుకొన్నాడు. ఇందులో నవరత్నాల లక్షణాలు, వాటి మంచి చెడ్డలు, వాటి పరీక్షా విధానం మొదలయిన రత్నశాస్త్ర విషయాలు ఉన్నాయి. (క. త-5)

**రత్న పాంచాలిక (సం)**

నామాంతరం : కువలయావళి.

కర్త : చూ సర్వజ్ఞ సింగ భూపాలుడు. (ఆరుద్ర-3-4)

**రత్న షట్కాంగుళీయకము**

రచనాకాలం : క్రీ. శ. 19వ శతాబ్దం (1832-92).

కర్త : చూ. వెలుగోటి సర్వజ్ఞ కుమార యాచేంద్రులు.

లఘుకృతి. దైవం సత్యం, స్మరణం శరణం, ఉపకారః కార్యః, సద్ధర్మోన త్యాజ్యః, మానోరక్ష్యః భవిష్యదాలోచనీయమ్ - అనే ఈ ఆరు వాక్యాలను అంగుళీయాకృతిలో వ్రాసి, వాని మూలతత్త్వాన్ని సుబోధకమైన రీతిలో వివరించిన కృతి. (ఆం. సం. సా-461)

**రత్నాకర గ్రంథ టీక**

కర్త : తెలియదు.

చారిత్రక గ్రంథమైన "రత్నాకరము"నకు "దండాన్వయ" వ్యాఖ్యానం. ఈ "దండాన్వయ" వ్యాఖ్యానం ద్వారా మూల గ్రంథం సంస్కృత రచన కావచ్చునని పలువురి అభిప్రాయం. ఈ టీకాకారుడెవ్వరో తెలియదు. వ్యావహారికాంధ్ర భాషలో వ్రాయబడిన ఈ గ్రంథం మిక్కిలి ప్రసిద్ధి చెందింది. చూ. రత్నాకరము. (ఆం. సం. సా.)

**రత్నాకరము (అలభ్యం)**

కర్త : చూ. కంఠీరవ కవి.

అంకితం : రాజరాజుకు.

చారిత్రక గ్రంథం. కార్వేటి నగర సంస్థానానికి సంబంధించిన రచన. సంస్కృతంలో వ్రాయబడి ఉండవచ్చునని పండితాభిప్రాయం. మూడు తరంగాలలో వ్రాయబడిన ఈ కృతి అలభ్యం. కాని దీనికి ఆంధ్రంలో వ్రాయబడిన "రత్నాకరగ్రంథ టీక" అనే గ్రంథం లభ్యమౌతున్నది. (అం. సం. సా.)

**రత్నాకరము అప్పప్ప కవి**

కాలం : తెలియదు.

రచన : శశిరేఖా పరిణయము.

అంజనేయ కవి, శేషమాంబల పుత్రుడు. ఈ కవి కంకంటి పాపరాజును స్తుతించి ఉండడం చేత అతనికంటె నవీనుడని తెలుస్తున్నది. సంస్కృతాంధ్రాలలో ప్రజ్ఞావంతుడు. ఇతని రచన సరళంగా ఉంటుంది. (క. స-12)

**రత్నాకరము గోపాలరాజు**

కాలం : క్రీ. శ. 17వ శతాబ్దం.

స్థలం : నెల్లూరు జిల్లా ఆత్మకూరు.

రచనలు : భాగవత దశమస్కంధం, సౌగంధికా కుసుమ ప్రసవాపహరణము సకల లక్షణసార సంగ్రహము, తారావళులు, శతకాలు మొదలగునవి.

కృష్ణమరాజు కుమారుడు. రావెళ్ళ లింగమ నాయకుని ఆస్థానంలో ఉండేవాడు. ప్రౌఢ కవి. లక్ష్య లక్షణ జ్ఞానం గలవాడు. నిరోష్ఠ్యంగా నిరనునాసికంగా శతకాలకు శతకాలే చెప్పారట. బహులిపి మర్మ చాతుర్యాలు తెలిసినవాడు. ఇతడు తన లక్షణసార సంగ్రహంలో అనేక పూర్వ కావ్యాలలో నుండి ప్రయోగాలు ఇచ్చాడు ఇతని నుండి కొన్ని ప్రాచీన గ్రంథాలు తెలుస్తున్నాయి. (ఆరుద్ర-12-191)

**రత్నాపణ వ్యాఖ్య**

కర్త : కోలచల కుమారస్వామి సోమయాజి.

ప్రతాపరుద్రీయమనే సంస్కృతాలంకార గ్రంథానికి వ్యాఖ్య. (తె. వి. స-4)

**రత్నావళి**

వ్యవహారనామం : నవరత్నములు.

శ్రవ్యకావ్య భేదం. రత్నాలు తొమ్మిది కాబట్టి తొమ్మిది పద్యాలున్న కావ్యము రత్నావళి.

**రత్నావళీ పరిణయము**

రచనాకాలం : క్రీ. శ. 18వ శతాబ్దం.

కర్త : (చూ). ధూర్జటి వేంకటరాయకవి.

అంకితం : చేకూరి రామస్వామి మంత్రికి.

నాలుగాశ్వాసాల ప్రౌఢ కావ్యం. ఇందులో కాశీలోని రత్న లింగేశ్వర మాహాత్మ్యాన్ని కవి వర్ణించాడు. ప్రౌఢంగా, రసవంతంగా ఉన్న కావ్యం.

## రమాధీశ్వర శతకము

రచనాకాలం : క్రీ. శ. 1400 ప్రాంతం.
కర్త : నాగేంద్ర కవి.

వైష్ణవమత సంబంధమైన రచన. ప్రౌఢంగా ఉంది. "గోవిందా, రమాధీశ్వరా" అన్న మకుటంతో ఉంది. శైలి ధారాళమైనది.

## రమాపరిణయము (పెండ్లి పాట)

కవయిత్రి : తరిగొండ వేంకమాంబ. (ఆ. భా. కవయిత్రులు-74)

## రస గంగాధరమ్ (సం)

రచనాకాలం : క్రీ. శ. 17వ శతాబ్దం.
కర్త : చూ. జగన్నాథ పండితరాయలు.

ఇది పండిత రాజ కృతులలో సర్వోత్తమం. అలంకార శాస్త్రంలో ధ్వన్యాలోకంవలె, కావ్య ప్రకాశంవలె ప్రామాణికమైన గ్రంథం. దొరికిన గ్రంథం అసమగ్రం. కవి పాండిత్యానికి నికషోపలం. పండితరాజు దీనిలో ఇతరుల వాదాలను ఖండించి విస్పష్టమైన సిద్ధాంతాన్ని నిరూపించాడు. వ్యాకరణంలో పతంజలి భాష్యం, వేదాంతంలో శంకర భాష్యంవలె సాహిత్యంలో ఇది పండిత రాజ భాష్యమై ప్రశస్తి పొందింది. గ్రంథంలో ఆననము అనే విభాగముంది. తన గ్రంథం పంచాననాలున్న పరమ శివ సదృశమని పండిత రాజు భావించి ఉండవచ్చు.

సాహిత్య మూర్ధన్యమైన ఈ గ్రంథంలో ఈ క్రింది వైశిష్ట్యాలున్నాయి.

1. స్వశక్తి 2. కావ్యలక్షణము 3 కావ్యకారణము 4. కావ్య విభాగము 5. రసరహస్యము 6. రసప్రతీతి. 7. సంయోగ, వియోగ శృంగారము 8. వీర భేదములు 9. అనౌచిత్యము 10. గుణ చర్చ 11. రచనా పరిష్కారము. (తె. వి. స-4)

## రసజ్ఞానందమ్ (సం)

కర్త : వైయాకరణ గజకంఠీరవ యుణయవల్లి కృష్ణమాచార్యులు (చూ). (ఆం. సం. సా.)

## రస తంత్రము

కర్త : తెలియదు.
స్థలం : నరసరావుపేట సంస్థానం.

ఇది ఆయుర్వేద గ్రంథం. క్రీ. శ. 18వ శతాబ్దం చివరి భాగంలో నరసరావుపేట సంస్థానాన్ని పాలించిన రాజా పెద వేంకట గుండారాయణింగారి ఆస్థానంలో ఈ గ్రంథకర్త ఉండేవాడని, ఆతడే స్వయంగా దీనికి ఆంధ్ర టీకను జోడించి వ్రాశాడని తెలుస్తున్నది. మైసూరు మహారాజా వారి ఆస్థాన వైద్యులైన సూరి పండితుల ఇంటిలో దీని ప్రతి లభించిందని (ఆంధ్రభారతి, క్రీ. శ. 1912 నవంబరు) వైద్య రత్న పండిత డి గోపాలాచార్యులు పేర్కొన్నారు. (ఆం. సం. సా-195)

## రస ప్రదీపిక

రచనాకాలం : క్రీ. శ. 1700 ప్రాంతం.
కర్త : ముడుంబి వేంకటాచార్యులు.

మూడాశ్వాసాల వైద్య శాస్త్ర గ్రంథం. కవిత్వంలో కొన్ని స్ఖాలిత్యాలున్నా యట. శాస్త్ర గ్రంథాన్ని పద్య రూపంలో కవి చక్కగా చెప్పాడు. (క. చ-3-210)

## రస ప్రపంచమ్ (సం)

కర్త : ఆవిళ్ళ వేంకటశాస్త్రి.

అలంకార శాస్త్ర గ్రంథం. (తె. వి స-4)

## రస మంజరి

రచనాకాలం : క్రీ. శ 17వ శతాబ్దం.
కర్త : గుడిపాటి కోదండకవి (చూ).

శృంగార రస లక్షణ గ్రంథం. శృంగార రసమంజరిగా ప్రసిద్ధం. సంస్కృతంలో భానుకవి రాసిన "రసమంజరి" దీనికి మూలం. మూడు గుచ్ఛముల గ్రంథం. మొదటి రెండు గుచ్ఛాలలో నాయికల స్వరూప భేదాలు, మూడవ గుచ్ఛంలో నాయక లక్షణాలు ఉన్నాయి. ఈ గ్రంథం 1873లో ముద్రితం. కవిత్వం రసవంతంగా ఉంది.
(క.చ-3-135) (ద.దే వా-పీఠిక-181)

## రస మంజరి (అలభ్యం)

కర్త : చూ. నెల్లూరి వీరరాఘవ కవి.

సంస్కృత రసమంజరికి అనువాదం. దీనిని వ్రాసినట్లు కవి వసుంధరా పరిణయంలో చెప్పుకొన్నాడు. (తె.వి స-6)

## రస మంజరి (అలభ్యం)

కర్త : శ్రీకృష్ణ దేవరాయలు.

ఇది సంస్కృత గ్రంథం కావచ్చునని పండితులు అభిప్రాయపడుతున్నారు

## రస మంజరి

కవి : శ్రీమన్నారాయణయ్య (చూ).
అంకితం : విజయరఘునాథునికి (పుదుకోటరాజు).

నాలుగాశ్వాసాల గ్రంథం. దీనికి మూలం భానుకవి సంస్కృతంలో రచించిన రసమంజరి. అవతారికలో కృతిపతి వంశవృత్తాంతం విశేషంగాఉంది. అశ్వాసాంతగద్యను పద్యరూపంలో రాశాడు. ఈ గ్రంథానికి పీజె సుబ్బయ్య రాసిన వ్రాతప్రతి ఆంధ్ర సాహిత్య పరిషత్కార్యాలయంలో ఉంది. (ద.దే వా-435)

## రస వాద విద్య

కాలం : క్రీ. శ. 12 - 15 శతాబ్దాల మధ్యకాలం.

నామాంతరం : స్పర్శవేది - ధూమవేధ.

తక్కువ జాతి లోహాలను ఉత్తమ జాతి లోహాలుగా మార్చే విద్యను రసవాద విద్య అంటారు. క్రీ. శ. 12-15 శతాబ్దాల మధ్యకాలపు ప్రజలు ఈ విద్యను నమ్మి, ఆచరించినట్లు సమకాలీన సాహిత్యం ద్వారా తెలుస్తున్నది. దీనిలో రెండు పద్ధతులున్నాయి. మొదటి పద్ధతిని స్పర్శవేది (పరుసవేది) అని, రెండో పద్ధతిని "ధూమవేధ" అనీ వ్యవహరిస్తారు. ఈ రెండు పద్ధతులద్వారా ఆ కాలపు ప్రజలు ఇనుము, ఇత్తడి, రాగి, కంచు మొదలగు లోహాలను బంగారంగా మార్చేవారని అంటారు. అద్దంకి రాజధానిగా కొండవీటి సామ్రాజ్య స్థాపకుడయిన ప్రోలయ వేమారెడ్డి తండ్రి ప్రోలయరెడ్డి ఈ రసవాద విద్యలో ప్రవీణుడుగా (స్వర్ణకార ప్రసిద్ధిమ్ లబ్ధ్వా) కనిపిస్తాడు

"ధూమవేధ" అనే రసవాద విద్యాపద్ధతిని గురించి అనంతామాత్యుడు తన "భోజరాజీయము"లో ప్రస్తావించాడు. కవి ధూమవేధ విద్యా ప్రాశస్త్యాన్ని చెపుతూ భోజరాజు తన కొలువుచవికెను పంచలోహాలతో నిర్మింపజేశాడనీ, ఆ సభాభవనాన్ని "అనుగుమేడ" అనేవారని, అట్లాంటి భవనాన్ని ధూమవేధ రసవాద విద్యాపద్ధతి ప్రకారం "స్వర్ణ భవనము"గా మార్చివేయటం జరిగిందని వర్ణించాడు. అంతేగాక ఈ రసవాద విద్యాపద్ధతిని— ఒక సిద్ధుడు తనను చిరకాలం సేవించిన ఒక వేశ్యకు వివరించి చెప్పాడని కూడా కవివర్ణించాడు. (భోజరాజీయము-II, V-180: తెలుగు-ఏ-జూ-77)

## రస వినోదము

కర్త : తెలియదు.

కాళ్ళకూరి గౌరీకాంత కవి పూర్వులలో ఒకరు దీని కృతికర్త. వివరాలు తెలియవు. (అం సం.సా-421)

## రసాభరణము

రచనాకాలం : క్రీ. శ. 1435 ప్రాంతం.

కర్త : అనంతామాత్యుడు.

అంకితం : ధ్రువపట్టణంలో వేంచేసిన దేవుడు శ్రీకృష్ణునికి.

నాలుగాశ్వాసాల గ్రంథం. శృంగారాది రసచర్చ చేసిన గ్రంథాల్లో ఇది రెండోది. (మొదటిది విన్నకోట పెద్దన వ్రాసిన కావ్యాలంకార చూడామణి.) కవి పేర్కొన్న ధ్రువపట్టణం గుంటూరు జిల్లాలోని ధూళిపూడి అని కొందరి అభిప్రాయం. (రె.రా.చ)

## రసార్ణవ సుధాకరమ్ [సం]

రచనాకాలం : క్రీ శ. 1384-99 ప్రాంతం.

కర్త : పద్మనాయక రాజకవి సర్వజ్ఞ సింగభూపాలుడు.

మూడు విలాసాల (భాగాలు) నాట్యాలంకార శాస్త్రగ్రంథం. రస, భావ, నాట్య విషయాలకు లక్షణోదాహరణలతోసహా వివరణ ఉంది. (ఆరుద్ర-3; 4)

## రసికజన కంఠాభరణ శ్రీకృష్ణ దశావతార చరిత్రము

నామాంతరం : దశావతార చరిత్రము (చూ).

కర్త : ధరణిదేవుల రామమంత్రి.

## రసిక జన మనోభిరామము

కాలం : క్రీ. శ. 1750 ప్రమోదూత సంవత్సరం.

కర్త : కూచిమంచి తిమ్మకవి.

అంకితం : పిఠాపురంలోని కుక్కుటేశ్వరునికి.

దీనికి పిల్లవసు చరిత్ర అని ప్రతీతి ఉంది.

ఇతివృత్తం : కళ్యాణ పురాధిపతియైన ఋతుధ్వజ మహారాజుకు ఒక గంధర్వ స్త్రీకి కలిగిన కన్యకథ ఇది. కుమార్తెను ఒక గుహలో విడిచిపెట్టి, అక్కడికి వచ్చి ఆమెను పలుకరించినవాడే ఆమె భర్త అని చెప్పి తల్లి గంధర్వ లోకానికి వెళ్ళిపోయింది. ఎన్నోవేల సంవత్సరాలా కన్య అక్కడ తపస్సు చేయగా గౌతముడనే ముక్కిడి అక్కడకు రాగా ఆమె తపశ్శక్తి చేత తనికి ముక్కు, విద్య వచ్చాయి. ఆమెను గౌతముడు పెళ్ళి చేసుకున్నాడు. కాని చూసిన వాళ్ళు వృద్ధ భార్యను పడుచు మగణ్ణిచూసి ఆక్షేపించారు. దాన్ని సహించలేక మహర్షుల ఆదేశంతో గోదావరి మండలంలోని వృద్ధగౌతమీ సాగరసంగమంలో స్నానంచేసి ఇద్దరూ సమవయస్కులై పెంపొందడం ఇందులోని కథ ఇది అరాశ్వాసాల ప్రబంధం.

బ్రహ్మపురాణంలోని గోదావరీ ఖండంలోని వృద్ధప్రవంతి సరిద్వతీ సంగమ మాహాత్మ్యం దీనికి మూలం. పురాణాలు, ప్రబంధాలు, లక్షణ గ్రంథాలు, కోశాలు, నాటకాలు, అలంకారాలు అన్నీ శోధించి తేటతేనెవలె ఈ గ్రంథం వ్రాశానని కవి చెప్పుకొన్నాడు. దీనిని రచించిన తర్వాత ఇతడు సరసకవిగా పేరుపొందాడట దీనికి మూలమైన సంస్కృత గ్రంథం "సుజన మనః కౌముది చంద్రిక"ను తిమ్మకవి ముత్తాత తిమ్మకవి నామధేయుడు వ్రాశాడట. (ఆరుద్ర-12)

## రసిక జన మనోరంజనమ్(సం)

కర్త : చూ. సుగుటూరి ముమ్మడి తమ్మభూపతి.

రచనాకాలం : క్రీ. శ. 1614-30 ప్రాంతం. (ఆం.సం.సా-261)

## రసిక మానసోల్లాస భాణమ్ [సం]

కర్త : తిరుమల బుక్కపట్టణము వేంకటాచార్యులు.

రచనాకాలం : క్రీ. శ. 1730 ప్రాంతం.

## రసోదార భాణమ్ [సం]

కర్త : చూ. తిరుమల బుక్కపట్టణం (ఇమ్మడి) అణ్ణయదీక్షితులు. (ఆం.సం సా-516)

## రహస్యత్రయ సారార్థమ్ [సం]

కర్త : కందాడై అప్పకొండాచార్యుడు. (తె.వి.స-4)

**రాక్షస విరామ శతకము**

కర్త : తెలియదు.

"రాక్షస విరామ కస్తూరి రంగధామ" అనే మకుటంతో ఉంది. తురుష్కుల దుర్మార్గాలను అపమని దేవుని వేడుకొంటూ చేసిన రచన. (శ.క.చ.)

**రాగతాళ చింతామణి**

నామాంతరం : సంగీతశాస్త్ర ప్రబంధము.

కర్త : పోలూరి గోవిందమంత్రి.

అంకితం : శ్రీరామచంద్రునికి.

ఇది సంగీతశాస్త్రానికి సంబంధించిన పద్యకావ్యం. కట్టమూరి బుస్సన్న ప్రోత్సాహంతో చేసిన రచన. (తె.వి.స-4; ఆరుద్ర-12-159)

**రాగమేళ వివేకము**

కర్త : శహాజీ (చూ).

రచనా కాలం : క్రీ.శ. 18 వ శతాబ్దం.

శాస్త్ర గ్రంథం. కవి ఎనిమిది ప్రకరణాలలో రాగలక్షణాలను వివరించాడు. (ఆరుద్ర-12-133)

**రాఘవదాస కవి**

స్థలం : దక్షిణదేశం (తమిళదేశం)

రచనలు : అచ్యుతరాయ శతకము, తంజావూరి వరదరాజ శతకము.

వివరాలు తెలియవు. కవి పద్దెనిమిదవ శతాబ్దపు వాడుగాని, అంతకు పూర్వుడుగాని కావచ్చు. (ద.దే.వా. పీఠిక-7)

**రాఘవ పాండవ యాదవీయమ్ (సం)**

కర్త : చూ. చిదంబరుడు.

త్ర్యర్థి కావ్యం. కవి ప్రతిభావ్యుత్పత్తులకు, పాండితీ ప్రకర్షకు నిదర్శనమైన కావ్యం. 17 శతాబ్ది చివరి భాగంలో నెల్లూరి వీరరాఘవ కవి తెలుగులో మూడు అర్థాలు వచ్చే 'యాదవ రాఘవపాండ వీయాన్ని' వ్రాశాడు. (తె.వి.స-6)

**రాఘవ పాండవీయము**

రచనా కాలం : క్రీ.శ. 1545 ప్రాంతం.

కర్త : పింగళి సూరన.

అంకితం : పంపా విరూపాక్ష దేవునకు.

నాలుగు ఆశ్వాసాలున్న ఈ కావ్యం తెలుగులో తొలిద్వ్యర్థి కావ్యం. కవి ఈ కావ్యంలో రామాయణ భారత కథలు రెంటిని సంగ్రహంగా గాని, సమగ్రంగా గాని చెప్పాలని తలపెట్టలేదు. ఈ కావ్యానికి మాతృక గాని, మార్గదర్శకమైన సంస్కృత గ్రంథం కాని లేదు. రామాయణ కథను తీసుకొని వివరాల జోలికి పోకుండా, దాని

స్థూల రూపాన్ని రేఖా మాత్రంగా ఊహించి, భారత కథలో ఆ రామాయణ రేఖాఛ్ఛాయ
లున్న వాటినే తీసుకొని, రామాయణ స్థూలమూర్తికి, అనురూపమైన భారత స్థూలమూర్తిని
నిర్మించి, ఆ రెండు రూపాలు సదృశాలుగా కవిపించిన తరవాత రామకథ, భారత కథలను
జోడించి కవిత్వ రచన చేశాడు. ఉభయ కథలలోనూ ప్రాధాన్యం చెడకుండా అనన్యమైన
ప్రజ్ఞ చూపాడు.

అనేకార్థక శబ్ద మయమైన సంస్కృత భాషలో రెండర్థాలు చెప్పటం సుకరం
కాని తెలుగులో మాత్రం రెండర్థాలు సాధించటం దుర్ఘటం. అందులోనూ సాదృశ్యం
కాని రామాయణ, భారత కథలను జోడించి చెప్పటం దుష్కరం. ఈ దుష్కర కార్యాన్ని
సాధించటానికి కొన్ని నియమాలు పెట్టుకొని, సూరన శబ్ద సౌలభ్యంతో పాటు అర్థ
సౌలభ్యం కూడా సాధించాడు. సూరన నియమాలనే తరవాత కాలపు ద్వ్యర్థి కావ్య
కర్తలు అనుసరించినా సూరన వలె అర్థ సౌలభ్యాన్ని సాధించలేకపోయారు.

ఇందులో సుమారు 600 పద్యాలున్నాయి. భారత, రామాయణ సమానార్థ
కాలయిన పద్యాలు 50 లేక 60కి మించి లేవు. రాఘవ పాండవీయంలోని శ్లేషభంగులను
ఈ రకంగా చెప్పవచ్చు. 1. సంస్కృత భాషా సభంగశ్లేష 2 తెలుగు భాషాసభంగ
శ్లేష 3. ఉభయ భాషా సభంగ శ్లేష 4. సంస్కృత భాషా అభంగశ్లేష 5. తెలుగు
భాషా అభంగశ్లేష 6. ఉభయ భాషా అభంగశ్లేష 7. శబ్దాన్వయ విభేదం 8. అర్థాన్వయ
విభేదం 9. వృత్తిశ్లేష. అనంతర ద్వ్యర్థి కావ్యకర్తలు అర్థద్వయ ఘటనా చమత్కార
మున్న పద్యరచనలో సూరనను అనుసరించారు. కాని కథాద్వయ ఘటనా ప్రజ్ఞలో
సూరనకు దీటుగా నిలవలేక పోయారు. రాఘవ పాండవీయం సూరన బుద్ధి విశేషానికి,
పాండితీ మహత్త్వానికి నిదర్శన మవుతుందే కాని ఆయన కవితా ప్రతిభకు, శిల్పరచనా
కౌశలానికి నిదర్శనం కాదు. సూరన ప్రతిభ, శిల్పరచనా కౌశలం వెల్లి విరిసిన పట్టు
కళాపూర్ణోదయం. (తె.వి.స-4)

## రాఘవ పాండవీయము (అలభ్యం)

కర్త : చూ. వేములవాడ భీమకవి. (అరుద్ర-1)

## రాఘవ పాండవీయ వ్యాఖ్య

కర్త : చిత్రకవి వేంకటరమణ కవి.

ఇది సూరన్న రాఘవ పాండవీయానికి వ్యాఖ్య. (అరుద్ర-9)

## రాఘవ పాండవీయ వ్యాఖ్య

కర్త : ముద్దరాజు పెదరామన.

ప్రత్యేకత : పింగళి సూరన్న విరచిత రాఘవ పాండవీయ కావ్యానికి
తొలి వ్యాఖ్య. ఇది ఆ కాలపు వ్యావహారిక భాషలో ఉంది. ముద్రాపకులు మార్చి
కృతక గ్రాంథికంలో అచ్చువేశారు. పూర్వులు వ్రాసిన వ్యాఖ్యానాలు వ్యావహా
రికంలోనే ఉంటాయనే విషయానికి ఈ గ్రంథమే సాక్షి. వ్యాఖ్యాత తన వ్యాఖ్యకు 32

సంస్కృత గ్రంథాలను, 9 తెలుగు పుస్తకాలను ప్రమాణంగా చెప్పాడు. దీన్ని చూసి, తరవాత కాలంలో చిత్రకవి అనంతకవి అనే ఆయన భట్టుమూర్తి హరిశ్చంద్ర నలో పాఖ్యానానికి వ్యాఖ్య వ్రాశాడు. (అరుద్ర-9)

### రాఘవ పురము

చిన్న సంస్థానం. వాసిరెడ్డి వీరప్పనాయుని కుమారులు నందిగామ పరగణాలను పంచుకున్నప్పుడు (1683) అతని ద్వితీయ పుత్రుడు రామన్నకు రాఘవపురం లభించింది. అప్పటినుండి అతని సంతతివారు అక్కడే స్థిరపడ్డారు.

చినరామలింగన్న కాలంలో, వీరి పోషణలోనే దివి రమణకవి 'శృంగారధామము' అనే ప్రబంధం వ్రాయడం జరిగింది

(తరువాత కాలంలో ఈ భాగం తక్కిన రెండు వంశాల వారికి సంక్రమించి వారి జామీనులలో కలిసిపోయింది.) (ఆం.సం.సా.)

### రాఘవయాదవ పాండవీయము

కర్త : చూ. ఉరుటూరి వేంకట కృష్ణకవి.

శ్లేషకావ్యం. రామాయణ, భాగవత, భారత కథలు — మూడూ ఒకే కావ్యం ద్వారా స్ఫురించేట్టుగా వ్రాయబడింది. (ఆం.సంసా-261)

### రాఘవ యాదవ పాండవీయము

కవి : ఎలకూచి బాలసరస్వతి.

అంకితం : తిరుపతి వేంకటేశ్వరునికి.

నాలుగాశ్వాసాల త్ర్యర్థి కావ్యం, కవి భాషా పాండిత్యానికి, శాస్త్రవైదుష్యానికి ఇది ప్రతీక. ఆది కవుల గ్రంథాలకన్నా ఎక్కువ కీర్తి సంపాదించాలనే ఉద్దేశంతో, శ్లేషరచనైక ప్రౌఢితో, వాక్పాండిత్యంతో దీన్ని రచించినట్లు కవి చెప్పుకొన్నాడు. (క.త-11-144)

### రాఘవ యాదవ పాండవీయమ్ (సం)

నామాంతరం : చూ. రాఘవపాండవ యాదవీయమ్.

కర్త : చిదంబరుడు. (తె.వి,స-6)

### రాఘవ యాదవీయమ్ (సం)

కర్త : చూ. వింజమూరి సోమేశకవి.

శ్లేషకావ్యం. రామాయణ భాగవతార్థాలు రెండూ కలిసివచ్చే రీతిలో వివిధ వృత్తాలలో సంతరింపబడింది ఈ కవికి ఏడవతరం వాడైన "వింజమూరి వెంకన్న పంతులు" దీన్ని ప్రకటించారు. (ఆం.సం సా-245)

### రాఘవ రామశతకము

రచనా కాలం : క్రీ.శ. 18 వ శతాబ్దం.

కవయిత్రి : మదిన సుభద్రయ్యమ్మ.

వివరాలు లభ్యం కాలేదు. (శ.క.చ-399)

రాఘవ శతకము

కర్త : మిక్కిలి మల్లికార్జునకవి.

అంకితం : పోతాప్రగడ శ్రీరాములు పంతులుకు.

శార్దూల వృత్తాలతో ఉన్న శతకం. పద్యంలో మూడవ పాదం నుండే మకుటం మొదలవుతున్నది. "రాఘవా ! పోతాప్రగ్గడ రామమంత్రి హృదయాంభోజాబ్జినీ బాంధవా" అనేది మకుటం. రచన ప్రౌఢంగా సరసంగా ఉంది. (శ.క.చ-606)

రాఘవాభ్యుదయమ్ (సం)

కవి : భగవంతార్యమఖి.

రూపకమట.

రాఘవాభ్యుదయము

కర్త : చింతలపల్లి ఛాయాపతి (చూ).

అంకితం : కేశవస్వామికి (బోరవెల్లి సంస్థానం వారి ఇష్టదైవం).

ఆరు ఆశ్వాసాల ప్రౌఢ ప్రబంధం.

సంస్కృతంలో కాళిదాసు రచించిన 'రఘు వంశం' 4 5 6,7 సర్గలలోని కథ ఆధారంగా స్వకపోల కల్పనలతో, ప్రబంధోచితమైన వర్ణనలతో కూడిన రచన. అక్కడక్కడ ఉర్దూ మాటలు, మాండలికాలు కన్పిస్తాయి. ఈ కావ్యానికి బోరవెల్లి పాలకుడు వేంకటరెడ్డి శ్రోతగా ఉన్నాడట. బోరవెల్లి సంస్థాన విశేషాలు ఈ రచనలో అధికంగా లభిస్తాయి. శైలి చక్కనిది. (ఆరుద్ర-11-212)

రాఘవీయమ్ [సం]

కర్త : చూ. రావు మాధవ నాయకుడు (మాదా నాయకుడు).

(రె రా.చ-488)

రాఘవేంద్రాష్టకము [అలభ్యం]

కర్త : పడకండ్ల గురురాజకవి.

రాచకొండ - దేవరకొండ

కాకతీయ రాజ్య పతనానంతరం వెలమ ప్రభువులు ఈ రాజ్యాన్ని స్థాపించారు. రాచకొండ - దేవరకొండలు ప్రాచీనమైన గిరి దుర్గాలు ఈ వెలమ దొరలకు - కొండవీటి రెడ్లకు బద్ధ వైరం. ఈ రాజ్యాధి నేతలయిన వెలమ దొరలు రణశూరులే గాక సాహిత్య పోషకులు. పెద వేదగిరి నాయడు అనే వెలమదొర భాస్కర రామాయణంలో (అయ్యలార్యుడు) కొంత భాగానికి కృతిభర్త. రసార్ణవ సుధాకర, సంగీత సుధాకరాది గ్రంథకర్త సర్వజ్ఞ సింగభూపాలుడు, చమత్కార చంద్రికాది కృతికర్త

విశ్వేశ్వర కవిచంద్రుడు ఇక్కడివారే. తెలుగు సంస్కృత సాహిత్యాలు ఇక్కడ ఇతోధికంగా పోషింపబడ్డాయి. (రె.రా.చ)

## రాచపూడి వేంకటయ్య

కాలం : క్రీ. శ. 16 వ శతాబ్ది.
స్థలం : గుంటూరు మండలం.
రచన : ఒక చాటు ధార మాత్రం లభించింది.

విశిష్టత : రాచపూడి గ్రామం నేటి ప్రకాశం జిల్లాలో ఉంది కాబట్టి ఈయన ఒంగోలు ప్రాంతంవాడు కావచ్చు. నామాఖండ విశ్రాంతుల ఘట్టంలో వ్యక్తుల పేర్ల చివర "అయి" చేర్చి యతి నిలవవచ్చుననే సందర్భంలో అప్పకవి ఈయన పద్యాన్ని ప్రమాణంగా స్వీకరించి ఉదాహరించాడు. ఈయన "గంగ"ను "గంగాయి" అన్నాడు. ఇట్లాంటి "అయి" ఉన్న ప్రమాణాన్ని వణుకూరి గురవరాజు తన శమంతకమణి చరిత్రలో వాడాడు. గురవరాజు పద్యాన్ని, వేంకటయ్య పద్యాన్ని అప్పకవి ప్రమాణంగా స్వీకరించి ప్రయోగాలను ఉదాహరించాడు. ఈయన వ్రాసిన కావ్యాల పేర్లు తెలియవు.
(క.త-12-7,8; అరుద్ర-9)

## రాచమల్లు కవులు

నంది మల్లయ, ఘంట సింగయలకు రాచమల్లు కవులని పేరు.

పోతన రచించిన భాగవత షష్ఠస్కంధం శిథిలమైపోగా దానిని చాలా మంది తిరిగి రచించి పూరించారు. వారిలో రాచమల్లు కవులు ముఖ్యులు.

## రాచ రామన

నామాంతరం : కూచిరాజు ఎర్రన (చూ).

## రాచవేటి కవి

కాలం : క్రీ. శ. 18 వ శతాబ్దం.
రచన : గణికా గుణ ప్రవర్తన తారావళి.

ఇతని నిజ నామం తెలియ రావడం లేదు. రాచవేటి కవిగా ప్రసిద్ధుడు. "చిరతని పురనివాస" అని తారావళిలోని మకుటంలో పేర్కొన్నాడు. వేశ్యల మాయలు, వారి శరీరముల రోతలు, వారి కపటోపాయాలు కవి తేటతెల్లంగా చెప్తూ యువకులకు నీతి బోధకంగా రచన చేశాడు. (శ.క.చ-443)

## రాచ వేమారెడ్డి

కాలం : క్రీ. శ. 1420 – 1424 మధ్య కాలం.

కొండవీటి రాజులలో చివరివాడు. కుమారగిరి రెడ్డి పుత్రుడు. పురిటి సుంకాన్ని వసూలు చేసి ప్రజలను నానారకాల బాధలకు గురిచేశాడు. ఈయన నాలుగు సంవత్సరాలు కొండవీటిలో రాజ్యం చేసినట్లు ఒక చాటువువల్ల తెలుస్తున్నది. చాటుకవి వివరాలు తెలియవు. (చా. ప. ర)

## రాచూరు - రేపల్లె

ఇవి గుంటూరు మండలంలో వెలసిన ప్రాచీన సంస్థానాలు. మొదట ఈ రెండు సంస్థానాలు ఒక్కటిగానే ఉన్నాయి. కూచిపూడి, గుంటూరు, చీరాల, తాడికొండ, నాదెండ్ల, నూతక్కి. పొణం, పాలడ్లు, పులివర్రు, పత్తిపాడు, మంగళగిరి, మునిగోరు, రావిపూడి, సంతరావూరు అనే 14 సముతులతో కూడిన "మూర్తుజాన్నగరు సర్కారు" వీరి పూర్వుల సంస్థానం. "కొండవీడు" మొదట రాజధానిగా ఉండేది.

పద్మనాయక కుల సంభవులైన "కృష్ణానేని" వారు ఈ సంస్థాన పాలకులు. కృష్ణానేని మాణిక్యారావు గోల్కొండ నవాబైన కుతుబ్‌షాహికి కుడి భుజంగా నిలిచి అనేక యుద్ధాలలో సహాయపడి, ఈ సంస్థానాన్ని సంపాదించాడు. ఆ తరువాతి పాలకులంతా ఈ మాణిక్యారావు పేరునే ఇంటి పేరుగా ధరించారు. మాణిక్యరావు పుత్ర పౌత్రులనేకులు గోల్కొండ నవాబులకు ఆశ్రితులుగా ఉంటూ సంస్థానాన్ని చక్కదిద్దుకున్నారు. మాణిక్యారాయని కుమారుడైన కొండలరాయడు అబ్దుల్లా పాదుషాకు ఆశ్రితుడు. ఇతని మనుమడైన అప్పప్రభువు ఔరంగజేబు చేత సన్మానించబడ్డాడు. ఈ అప్పప్రభువే క్రీ.శ. 1705లో రేపల్లె కోటను నిర్మించాడు. ఈతని మనుమడైన కృష్ణానేని సీతన్న (క్రీ.శ. 1737-1778)కు జంగన్న, తిరుపతిరాయడు అని ఇద్దరు కుమారులు. ఈ అన్నదమ్ములే 1792లో మూర్తుజాన్నగరు సర్కారును రెండు విభాగాలుగా చేశారు. అందులో "రేపల్లె" వంతు జంగన్నకు, "రాచూరు" విభాగం తిరుపతి రాయనికి లభించాయి.

రాచూరు సంస్థానాధిపతియైన తిరుపతి రాయని కుమారులు ఇద్దరూ నిస్సంతుగా మరణించడం చేత సంస్థానం తిరిగి "రేపల్లె" వారి వశంలోకి వచ్చింది. జంగన్న కుమారుడు "భావయ్య" ఈ రెండు ఎస్టేటులను కలిపి పాలించాడు. ఇతని తమ్ముడు సీతన్న.

తదనంతర కాలంలో సంస్థానం ఆర్థికమైన ఇబ్బందులకు లోనైంది ఆ కారణంచేత పొన్నూరు మొదలగు పెక్కు గ్రామాలను అమరావతి పాలకుడైన రాజా వాసిరెడ్డి వేంకటాద్రి నాయనికిని, రాచూరు తాలూకా భాగాలను నరసారావుపేట పాలకుడైన మల్రాజు పెదగుండా రాయనికిని విక్రయించడం జరిగింది.

పై భావయ్యగారి తమ్ముని కుమారుడైన జంగన్నారావు క్రీ.శ. 1835-1846 వరకు సంస్థానాన్ని పాలించాడు. కాని, అనేక సంవత్సరాలనుంచీ పేష్కషు చెల్లించని కారణంగా క్రీ.శ. 1846లో రేపల్లె జమీందారీ జప్తుచేయబడి వేలం వేయబడింది. కంఫిణీ ప్రభుత్వ జమీని ఖరీదు చేసినట్లు తెలుస్తున్నది. అంతటితో ఈ సంస్థానం అంతరించిపోయింది.

క్రీ.శ. 1779-1811లో సంస్థానాన్ని పాలించిన జంగన్నారావు కవి పండితులను పోషించినట్లుగా ధనుర్విద్యా విలాస గ్రంథంలో ఉంది. అయితము వేదావధానులు, రాయప్రోలు సూరంభొట్లు, వద్దెము రామలింగ దీక్షితులు, పోతుకుచ్చి పాపంభొట్లు,

నేతి తెలగావధానులు, బూరుగల విమ్మంభొట్లు మొదలగు వేదశాస్త్ర పండితులు ఈతనిచే గౌరవింపబడినట్లు తెలుస్తున్నది.

క్రీ.శ. 1792 నుంచి రాచూరి పట్టణాన్ని పాలించిన తిరుపతి రాయడు అక లంక కృష్ణ కవిని ప్రోత్సహించి, ఆతనిచేత ధనుర్విద్యా విలాసాది కృతులను రచింప చేశాడు. ఉరుటూరి వేంకటకృష్ణ కవి వంటి ప్రముఖ కవులెందరో ఈ సంస్థానాధిపతుల చేత గౌరవింపబడినారు. (ఆం.సం.సా-360-366)

**రాజకన్యా పరిణయము**

కర్త : గిరిరాజ కవి (చూ).

అంకితం : శహాజీకి.

యక్షగానం. తంజావూరు పాలకుడైన శహాజీ నాయకుడు, ఒక రాజకన్య నాయిక, వారి ప్రణయం ఇతివృత్తం. ఇది గతానుగతికంగా చెప్పబడ్డ రచన. (య.గా.సం.3.పీఠిక)

**రాజగోపాల కవి వాగ్గేయకారాగ్రణి.**

నామాంతరం : పల్లవి గోపాలయ్య (చూ).

**రాజగోపాల దండకము [అలభ్యం]**

కర్త : విజయరాఘవ నాయకుడు (చూ).

తన ఇష్టదైవం రాజగోపాలునిపై కవి రచించిన దండకం. దక్షిణ ద్వారకగా ప్రసిద్ధి పొందిన మన్నారుగుడిలోని దైవం రాజగోపాలుడు. (ద.దే.వా-89)

**రాజగోపాల విలాస నాటకము [అలభ్యం]**

కర్త : విజయ రాఘవ నాయకుడు (చూ).

మన్నారుగుడి (దక్షిణ ద్వారక) లోని రాజగోపాలుని విలాసాలను వర్ణించే యక్షగానం. (ద.దే.వా-87)

**రాజగోపాల విలాసము**

కర్త : చెంగల్వ కాళయ.

అంకితం : క్రి. శ. 1633-73 నడుమ తంజావూరు నేలిన విజయరాఘవ నాయకునికి.

అయిదు ఆశ్వాసాల కావ్యం. 454 గద్యపద్యాలున్నాయి. ఇతివృత్తం దక్షిణ ద్వారక అనబడే మన్నారు గుడి క్షేత్ర మాహాత్మ్యం. దీన్ని చంపకారణ్య క్షేత్రం అనీ అంటారు. ఇది తంజావూరు జిల్లాలో ఉంది. సంస్కృతంలోని అగ్నికల్పం దీనికి మూల మట. సూతుడు శౌనకుని అడుగగా చంపక వనంలో తపస్సు చేసిన గోప్రళయముని కోరిక ప్రకారం పదారు వేల గోపికలతో, అష్ట మహిషులతో హరి శ్రీ కృష్ణావతార రూపంలో ఇక్కడ నిలిచాడనీ, దీనికి దక్షిణ ద్వారక అని పేరు వచ్చిందని చెప్తాడు. ఇదే కథ,

తెలుగులో ఉంది రాజగోపాలుని అష్ట భార్యలను అష్టవిధ శృంగార నాయికలతో పోల్చి కవి రమణీయంగా వర్ణించాడు. కావ్యం మొదట విజయరాఘవుని వంశ వర్ణనం ఉంది. ఆ భాగం "విజయ రాఘవ వంశావళి" అనే పేర వేరుగా ప్రకటితం. చంపక వనానికి దక్షిణ ద్వారక అనే పేరెలా వచ్చిందో సంస్కృత మూలాన్ననుసరించి చెప్తూ హరిద్రానది ప్రభావాన్ని కవి సవిస్తరంగా వర్ణించాడు. (ద.దే.వా-117-119)

**రాజగోపాల శతకము**

రచనాకాలం : క్రీ. శ. 1750 ప్రాంతం.
కర్త : ఉన్నవ యోగానందుడు.

సీసపద్య శతకం. "సురుచిరాకార ఉన్నవపుర విహార, రాజగోపాల రాధా మనోజ ఖేల" అనేమకుటంతో ఉంది రచన సరళంగా ఉంది. శతకాంతంలో సభాపతి లక్షణాలను కవి వివరించాడు. ఇతడు గుంటూరు సమీపంలోని ఉన్నవ గ్రామవాసి. ఇది ఆ పట్టణంలోని రాజగోపాల స్వామిపై చెప్పిన శతకం. (శ. క. చ-476)

**రాజ చూడామణి దీక్షితుడు**

కాలం : క్రీ. శ. 17వ శతాబ్దం.
స్థలం : తంజావూరు విజయరాఘవ నాయకుని ఆస్థానం
గురువు : వేంకటమఖి (గోవింద దీక్షితుని కుమారుడు).
కృతులు : 1 తంత్రశిఖామణి (సం) 2. రుక్మిణీ పరిణయమ్ (సం) 3. కమలినీ కలహంసమ్ (సం) 4 ఆనందరాఘవ నాటకమ్ (సం) 5. శంకరాభ్యుదయమ్ (సం) 6. కంసవధ 7. రామకథ 8 శృంగార సర్వస్వమ్ మొదలగునవి

శాస్త్ర గ్రంథాలు, నాటకాలు, కావ్యాలు చాలా రాశాడు. అన్నీ సంస్కృత రచనలే. సుప్రసిద్ధ పండితుడైన రత్నఖేట శ్రీనివాసదీక్షితుని కుమారుడు. రాజైన విజయ రాఘవునికి చాలాసన్నిహితుడు. రామాయణ యుద్ధకాండను చంపూ రూపంలో వ్రాశాడట. (తె. వి. స-6-243; తం. ఆం. నా-250)

**రాజనగరము**

వనపర్తి సంస్థానంలోని ఒక గ్రామం. సాహితీ కేంద్రంగా ఉండేది. ప్రతి సంవత్సరం కార్తిక పూర్ణిమకు ఈ గ్రామంలో వెలసిన శ్రీ రామకృష్ణ స్వామివారి బ్రహ్మోత్సవ సందర్భంలో వేదశాస్త్ర పండిత గోష్ఠులు జరిగేవి. అర్హులందరికి భూరి బహుమానాలు లభించేవి. (ఆం. సం. సా.)

**రాజ నరేంద్ర చరిత్ర [అలభ్యం]**

కర్త : తెలియదు.
కాలం : క్రీ. శ. 1670కి పూర్వపు రచన.

రత్నాకరం గోపాలరాజు ఈ కావ్యాన్ని పేర్కొన్నాడు. (ఆరుద్ర-12-191)

**రాజనాథుడు II**

నామాంతరం : డిండిమభట్టు III.

**రాజనాథుడు III**

చూ : డిండిమభట్టు V.

**రాజనీతి రత్నాకరము**

కర్త : నేబది కృష్ణమంత్రి.

ప్రత్యేకత : ప్రసిద్ధమైన పంచతంత్ర కావ్యానికి ఆంధ్రీకరణం. కథను కవి వైష్ణవ ఛాయలోనికి మార్చిరాశాడు. దాదాపు ఇరవై మంది కవులు తెలుగులో పద్య, గద్య కావ్యాలుగా పంచతంత్రాన్ని వ్రాశారు. ఈ కావ్యంలో కథ శ్రీరంగంలో మొదలవుతుంది. విష్ణుశర్మ శ్రీరంగంరాజు కొడుకులకు కథలు చెప్తాడు. ఇందులో సంజీవకాన్ని బేహారి తిరుపతి వెంకన్నకు సమర్పించి, అచ్చుపోసి విడిచివేసినట్లుగా కవి రాశాడు. ఇందులోని కవిత్వాన్ని కవికి గురువైన కందాళ రంగాచార్యులు చాలా శ్లాఘించాడట.

(ఆరుద్ర-9-252)

**రాజమహేంద్రవర మార్కండేయస్వామి శాసనము [సం]**

కాలం : క్రీ. శ. 1072 ప్రాంతం.

శాసనదాత, కర్త : భీమన ప్రెగ్గడ.

శాసన విషయం : రాజరాజ నరేంద్రుని సవతి సోదరుడైన విజయాదిత్యుని మంత్రియైన భీమన ప్రెగ్గడ వేయించిన దీపదాన విశేషాలను ఈ శాసనం తెలుపుతున్నది.

(తె.క.చ-163)

**రాజమహేంద్రవరము**

గోదావరీ తీరంలోని నగరం. తొలుత వేంగీదేశాన్ని ఏలిన తూర్పు చాళుక్యులకు ఇది ముఖ్యపట్టణం. రాజరాజ నరేంద్రుడు పోషించిన కవి పండితులు- నన్నయభట్టు, నారాయణభట్టు ఇక్కడివారే.

చాళుక్య-చోళ సామ్రాజ్యం క్షీణించిన తరవాత రెడ్డి ప్రభువులు రాజమండ్రి తాలూకాలోని కోరుకొండ వద్ద తమ ప్రభుత్వం ఏర్పరుచుకొన్నారు. క్రీ.శ. 1300 ప్రాంతం తరవాత ఇది కాకతీయుల ఆధీనంలో కొంత కాలం ఉండి, మళ్ళి కొండ వీటి రెడ్లపాలన కిందికి వచ్చింది కుమారగిరిరెడ్డి కొండవీటిరాజుగా ఉన్నప్పుడు రాజమహేంద్రవర రెడ్డి రాజ్యానికి తన బావమరది కాటయవేముని ఏలికగా నియమించాడు. కాటయవేముడు రణశూరుడేగాక పండితుడు. కాళిదాస నాటక త్రయానికి 'కుమారగిరి రాజీయమ్' అనే సంస్కృత వ్యాఖ్య వ్రాశాడు.

కాటయవేముని అల్లుడైన వీరభద్రారెడ్డికి- శ్రీనాథుడు తన కాశీఖండ కావ్యాన్నీ, అక్కడివాడే అయిన బెండపూడి అన్న మంత్రికి భీమఖండ కావ్యాన్నీ అంకితమిచ్చాడు. శివలెంక కొమ్మన శివలీలా విలాస కావ్యాన్ని దొడ్డారెడ్డికి అంకితమిచ్చాడు. ఇక్కడ సాహిత్య పోషణ విరివిగా జరిగింది.

తరవాత ఈ నగరం ఒరిస్సా గజపతుల పాలనలోను, నవాబుల పాలనలోను ఉండి- ఆ తరవాత ఫ్రెంచివారి వశమై, బ్రిటిష్ ప్రభుత్వ పాలనలోకి వచ్చింది.

## రాజమోహన కొరవంజి

కర్త : గిరిరాజ కవి (చూ).
అంకితం : శహాజీకి.

ఎరుకత పాత్ర విశిష్టంగా ఉన్న యక్షగానం. శహాజీకి ఒక రాజకన్యకూ మధ్య నడచిన వృత్తాంతం. దీనిలోని విషయం.

విశేషం : ఎరుకత (సింగి) సోదె, ఆమె తిరిగిన ప్రదేశాలు వర్ణించేటప్పుడు కవి వారి వేష భాషలను తదితర విశేషాలను విస్తృతంగా వర్ణించాడు. సింగి, సింగడు పాత్రలు ప్రవేశ పెట్టాడు కాబట్టి దీన్ని కొరవంజిగా పేర్కొన్నారు.
(య. గా. సం-3-పీఠిక)

## రాజయోగసారము

కవయిత్రి : తరిగొండ వేంకమాంబ.

ద్విపద కావ్యం. వేదాంతాన్ని సులభ శైలిలో బోధిస్తున్నది. వైరాగ్యాన్ని, ఆత్మానాత్మ వివేకాన్ని వేదాంత విషయాలను చెప్పే గ్రంథం. (సా. చ. స-236)

## రాజరంజన విద్యా విలాస నాటకము

కర్త : తులజాజీ (చూ).
అంకితం : ప్రణవ స్వరూపుడైన ఈశ్వరునికి.

అద్వైత తత్త్వ ప్రతిపాదకమైన ఉత్తమ నాటకం. సంస్కృతంలోని ప్రబోధ చంద్రోదయం వంటిది. మహారాష్ట్రి రాజులు ఒక అద్వైత యోగిని తమ గురువుగా భావించి సేవిస్తుండే వారనీ, వంశ పారంపర్యంగా తత్త్వ జిజ్ఞాస కలవారనీ చరిత్ర చెప్తోంది.

విశేషాలు : ఇందులోని పాత్రలన్నీ భావస్ఫోరకాలు. ఆత్మ మహారాజు, మాయాదేవి, కర్మ శర్మ, మోహుడు, ఇత్యాదిగా ఉంటాయి. నాటకం మార్గపద్ధతిలో ఉంది. దరువులలో కవి ముద్రాలంకారం వాడాడు. మోహుని రాక మోహన రాగంలోనూ, ఆనందుని రాక ఆనంద భైరవిలోనూ, శంకర సాక్షాత్కారం శంకరాభరణ రాగంలోనూ, చెప్పాడు. ఇలా చెప్పిన పూర్వ కవి నన్నె చోడుడు. (ద. దే. వా-245)

## రాజరాజ దేవర శాసనము

కాలం : క్రీ.శ. 1173 ప్రాంతం.
శాసన ప్రదాత : రాజరాజదేవర.

శాసన విషయం : ఈ శాసనంలోని మొదటి రెండు పాదాలు నష్టమైనాయి. శాసనప్రదాత నిర్మల ధర్మబుద్ధితో విష్ణు దేవునికి అఖండ దీపం నిలిపినట్లు ఈ శాసనం వల్ల తెలుస్తున్నది. దీనిలో ఉన్న చంపకమాల పద్యం అసమగ్రం. (తె.క.చ-310)

## రాజరాజ నరేంద్రుడు

కాలం : క్రీ.శ. 1023-1063 ప్రాంతం.

స్థలం : రాజమహేంద్రవరము.

సాహిత్య పోషకుడు. కృతిపతి. రాజమహేంద్రవరం రాజధానిగా వేంగి నాటిని పరిపాలించిన తూర్పు చాళుక్య చక్రవర్తి. విజయాదిత్యుని కుమారుడు. నన్నయ భట్టు, నారాయణభట్టు ఈయన ఆస్థానంలో ఉండేవారు. ఈయన తన వంశీయులయిన, కౌరవ పాండవుల కథను (మహా భారతాన్ని) తెనిగించమని నన్నయను కోరాడు. నన్నయ భారతం ఈయనకు అంకితం. కవి పండితులకు అగ్రహారాదు లిచ్చి పోషించాడు. లభించినంత వరకు తొలి తెలుగు మహా గ్రంథమైన భారతాన్ని కృతి పుచ్చుకొన్న ఘనత ఈ రాజుకే దక్కింది. (వా.చ.)

**రాజరాజాభిషేకము [అలభ్యం]**

కర్త : అంగర నరసింహం (చూ).

కృతిపతి : కొప్పుల వల్లభరాజు.

ఐదాశ్వాసాల కావ్యం. లక్షణ దోషాలున్నప్పటికీ రసవత్తరమైన రచన. మహాభారతంలోని కథనే కవి ప్రబంధోచితంగా తీర్చిదిద్దాడు. (క త-12-187)

**రాజరాజు**

కాలం : తెలియదు.

స్థలం : కార్వేటినగరం.

ఈ 'రాజరాజు' కార్వేటి నగరాధీశుడు. కార్వేటినగర సంస్థానానికి చెందిన 'కంఠీరవ కవి' రచించిన 'రత్నాకర'మనే సంస్కృత రచనకు కృతిభర్త. (అం.సం.సా.)

**రాజ రుద్రీయమ్ (సం)**

కర్త : కొలని రుద్రదేవుడు.

వ్యాకరణ కావ్యం. (ప్రా.ద.భా.చ-న.రా.అ)

**రాజలింగ కవి**

కాలం : క్రీ. శ. 16 వ శతాబ్దం.

స్థలం : కొరపుల్లపురం.

రచన : కూర్మపురాణము (చంపువు).

పోషకుడు : చెరుకు లక్ష్మణమంత్రి.

విశిష్టత : కూర్మపురాణాన్ని తొలిసారిగా తెలుగులోకి అనువదించాడు. వీర శైవ శాస్త్రాగమ మార్గ నిర్ణయనిరతుడు. మృదూక్తులతో లక్ష్మణమంత్రికి శివకథా కథ నాలు చేసేవాడు. ఆ మంత్రి ప్రోద్బలంతోనే రచనచేశాడు. లక్ష్మణమంత్రికి రాజలింగ కవి మేలువాడై, ఆప్తుడై, సచివుడై, హితవరుడై, సఖుడై చరించేవాడు. (అరుద్ర-9)

**రాజలింగ శతకము**

రచనాకాలం : క్రీ. శ. 1810 ప్రాంతం.

కర్త : సన్నిధిరాజు జగ్గరాజు.

అంకితం : వాకతిప్పలోని రాజశేఖరస్వామికి.

ఇది వియోగ శృంగార ప్రధానమైన శతకం. పార్వతి విరహాన్ని కవి మనోజ్ఞంగా వర్ణించాడు. "వనిత భవసాగరపు తెప్ప వాకతిప్ప, రాజలింగుని దేగదే రాజవదన" అనే మకుటంతో ఉంది. వాకతిప్ప పిఠాపురం మండలంలోనిది. కవిత రసవంతంగా ఉంది. (శ.క.చ-700; య.వా.చ-78)

## రాజవతంస శతకము

కర్త : చూ. కొటికెలపూడి కోదండరామ కవి.

శ్రీరామస్తుత్యాత్మకమైన 'కందపద్య శతకం'. "రామ రాజవతంసా" అనే మకుటంతో రచన సరసంగా ఉంటుంది. (ఆం.సం.సా-305)

## రాజవాహన విజయము

కర్త : కాకమాని మూర్తికవి (చూ).
అంకితం : శ్రీరంగనాథునికి.

అయిదాశ్వాసాల ప్రబంధం. కావ్యం అంతటా రచనాచమత్కృతి వెల్లివిరిసింది. దండి దశకుమార చరిత్రలోని రాజవాహనుని కథ దీనికి మూలం. సమకాలిక జీవితాన్ని విపులంగా వర్ణించి చేసిన రచన. చారిత్రక ప్రాధాన్యం కలది. ఈ కావ్యం వేంకటేశ్వరునికి అంకితమని కొన్ని గ్రంథాలలో ఉంది. కవి శ్రీరంగనాథునికీ వేంకటేశ్వరునికీ అభేదం చెప్పాడు. (ఆరుద్ర-11-69)

## రాజవోలి వేంకటేశ్వర కీర్తనలు

కర్త : ముష్టిపల్లి వేంకట భూపాలుడు (చూ).

ఈ కీర్తనలు రెండు సంపుటాలున్నాయి. మొత్తం అన్నీ కలసి 3476 కీర్తనలు. పేరునకివి వేంకటేశ్వరుని కీర్తనలే అయినా ఇందులో శివపరంగా కూడా కొన్ని కీర్తనలు ఉన్నాయి

ముష్టిపల్లి రెడ్లు మొదట ప్రోల్గంటి సోమేశ్వరుని భక్తులు. ఆ తరువాత వైష్ణవం స్వీకరించారు. ఈ కారణం చేతనే పై కీర్తనలలో శైవవైష్ణవ సమానత్వం కనిపిస్తుంది. ఎక్కువ కీర్తనలు రాజవోలు గ్రామదైవం కేశవస్వామిని ఉద్దేశించినవే. (మ. మా.)

## రాజవోలి వేంకటేశ్వర శతకము

కర్త : ముష్టిపల్లి వేంకటభూపాలుడు (చూ.)
అంకితం : రాజవోలిలోని వేంకటేశ్వరస్వామికి.

వేంకటేశ్వరుని స్తుతిస్తూ చేసిన రచన. ఇందులో కవిపేరు ఎక్కడా కానరాదు. కాని రచనను బట్టి ఈ కవిదే అయి ఉండవచ్చునని భావిస్తున్నారు. భక్తిరస ప్రధానమైన గ్రంథం. తాళపత్రప్రతి శిథిలావస్థలో ఉన్నది. ఇందులో మొత్తం 109 పద్యాలున్నాయి. అన్నీ కందపద్యాలే. (మ మా.)

**రాజవోలు**

ఇది గద్వాల సంస్థానంలోని ముఖ్యగ్రామాలలో ఒకటి. ఒక కాలంలో పాకనాటి వారూ, ముష్టిపల్లి ఇంటి పేరుగా గలవారూ అయిన రెడ్లు ఈ రాజవోలును రాజధానిగా చేసుకొని పాలించారు. వీరు గద్వాల ప్రభువులకు సామంతులో కాదో తెలియదు కాని, తదనంతర కాలంలో ఇది గద్వాల సంస్థానంలో భాగమై పోయింది. ఈ ప్రభువుల వంశంలో నాడగౌడు వేంకట భూపాలుడు కవి. గొప్ప భక్తుడు. ఇతడు దివ్యదేశ మాహాత్మ్యదీపికాది గ్రంథ కర్త. (మ.మా.)

**రాజవోలు సుబ్బారాయడు**

కాలం : క్రీ శ.17 వ శతాబ్దం.

స్థలం : రాజవోలు.

రచనలు : 1. జయవిజయాభ్యుదయము 2. చిత్రాంగదా పరిణయము (అలభ్యం) 3. గరుడాంజనేయ సంవాదము (అలభ్యం) 4. సుదంతా వివాహము (అలభ్యం) 5. కృష్ణార్జున సంవాదము (అలభ్యం).

గురువు : రమణయ్య.

తనకు గంభీర శబ్దార్థ గుంభనాచాతుర్యం, వాగ్ధాటి, శృంగార మృదువాక్య రచనాశక్తి ఉన్నదని కవి చెప్పుకొన్నాడు. ఇతడు పింగళి సూరనకు అనంతర కాలం వాడు అతన్ని అనుసరించి రచన చేశాడు. (ఆరుద్ర 10-249)

**రాజశేఖర చరిత్రము [అలభ్యం]**

కర్త : ఏనుగు లక్ష్మకవి (చూ).

**రాజశేఖర చరిత్రము**

కర్త : (చూ) మాదయ్యగారి మల్లన.

అంకితం : నాదెండ్ల అప్పయామాత్యునకు.

మూడాశ్వాసాల ప్రబంధం. ఇది కల్పిత కావ్యం. అవంచిపుర రాజు హేమ ధన్వుడికి శివానుగ్రహం వల్ల రాజశేఖరుడు పుట్టటం, ఈ రాకుమారుడు విశంకటుడనే రాక్షసుని చంపి, జటిల కౌశికుడనే ముని కుమార్తెను విడిపించటం, కాశీప్రసాదం వల్ల ఒక అద్భుత రత్నాన్ని పొందటం, రత్నపరిచారిక యోగినివల్ల 'త్రికాలదేవి' అనే చిలుకను పుచ్చుకోవటం - తిరిగి వచ్చేటప్పుడు 'ఉత్సవ' వనంలో సింధురాజ కుమార్తె కాంతిమతిని చూసి ప్రేమించటం, శుకదౌత్యం, కాంతిమతీ రాజశేఖరుల వివాహం - ఈ కావ్యంలోని ప్రధాన ఘట్టాలు.

మల్లన పద్యరచనా సమయంలో రసభావాలను చూపే సులువు, నేర్పు ఉన్నవాడు. రసానుకూలమైన భాష ఇతనిచేతిలో వెన్నపూస. ప్రభావతీ ప్రద్యుమ్నంలోని సూరన్న చిలుక "శుచిముఖి" అయితే, మల్లన్న చిలుక "త్రికాలవేది" అయింది. "ఉపమాతిశయోక్తి కామధేనువు"కు ఒజ్జబంతి అయిన ఈ చిలుక, వేద వ్యాసునితో

నైనా వాడిస్తానని. తాను చేయలేని రాయబారంలేదని ఘంటాపథంగా చెప్పింది. ఈ కావ్యానికి వన్నె తెచ్చిన పాత్రలు కాంతిమతి తల్లి, చిలుక. కాంతిమతీ రాజశేఖరుల వివాహ ఘట్టంలో కవి ప్రతిభ కనిపిస్తుంది. కాంతిమతి తల్లి, కాంతిమతిని "త్రికాలవేది"కి అప్పగించే సన్నివేశంలో రసం పరాకాష్ఠ నందుకొంటుంది.

కావ్యంలో ముత్తయిదువుల (పురస్త్రీలు) విసయవర్ణన మధురంగా ఉంటుంది. కాంతిమతిని అత్తవారింటికి పంపేటప్పుడు, తల్లి పల్లకి వద్దకు వచ్చిన సన్నివేశం అద్వితీయం. కవి సార్వజనీనం, సార్వకాలికం అయిన భావాలను నిత్యనూతనంగా మృదువుగా చెప్పాడు. దీనిలోని కవిత సుకుమారం, లలిత సుందరం. కవి అనాయాసంగా కావ్యంలో వాడిన జాతీయాలు, లోకోక్తులు కోకొల్లలు. (తె వి స-4)

## రాజశేఖర విలాసము

కాలం : క్రీ. శ. 1715 ప్రాంతం.

కర్త : కూచిమంచి తిమ్మకవి.

అంకితం : కుక్కుటేశ్వర స్వామికి.

ఇది మూడాశ్వాసాల చంపూ కావ్యం. ఇందులోని కథ భల్లాణరాజు చరిత్ర దీనికి మూలం బసవపురాణ కథ.

భల్లాణుడనే రాజు శివభక్తి పరాయణుడై జంగములు ఏమి అర్థించినా లేదనకుండా ఇస్తానని శపథం చేసినట్లు నారదుని వల్ల ఈశ్వరుడు విన్నాడు. అతని భక్తిని పరీక్షించడానికి జంగమ వేషంతో వచ్చాడు. ఆనాడు విటునితో కలియని వేశ్యను తనకు తెప్పించమని రాజునడిగాడు. ఆ పట్టణంలోని ప్రతి వేశ్య ఇంటను ఈశ్వరుడే విటుడై ఉంటాడు. రాజు విటునితో ఉండని వేశ్యను గానక తన భార్యనే వేశ్యా వేషంతో జంగం వేషంలో ఉన్న శివుని దగ్గరకి పంపుతాడు. శివుడాతని భక్తికి మెచ్చి అతని భార్య హస్తమున బాలుడై ఆ దంపతులకు మోక్షమిచ్చిన కథే ఈ రాజశేఖర విలాసంలో వర్ణితం. ఇది తిమ్మకవి రెండవ రచన. కవిత్రయేతర ప్రయోగాలూ, పూర్వ కవుల అనుకరణలూ ఇందులో ఉన్నాయి. (సా. చ-207; క. త-13-186)

## రాజా పెదసోమ భూపాలుడు

చూ. పెద సోమ భూపాలుడు.

## రాజా బహిరి గోపాలరాయలు

కాలం : క్రీ. శ. 17వ శతాబ్దం పూర్వార్ధం (1637)

స్థలం : వనపర్తి సంస్థానం.

రచనలు : 1 రామచంద్రోదయమ్ 2. శృంగార మంజరీభాణమ్.

బిరుదులు : అష్టభాషాకవి, బహిరీ, షడ్దర్శనీవల్లభ.

సమకాలికుడు : బిజ్జల తిమ్మభూపాలుడు (ప్రాగుటూరు).

ఇతడు ఈ సంస్థానపురాజులలో అత్యంత ప్రసిద్ధుడు. షడ్విధప్రాకృతాలలో,

సంస్కృతాంధ్ర భాషలలో దృఢమైన వ్యుత్పత్తి, గౌరవం కలవాడై "అష్టభాషా గోపాల రాయ"లనే పేర ప్రసిద్ధిచెందాడు. ఈ వంశంలో "బహిరీ" బిరుదాన్ని సంపాదించింది కూడా ఇతడే.

ఇతడు దక్షిణదేశ యాత్రలు చేస్తూ, ఆయా తీర్థాలలోని ఉత్తమ కవి పండితులను ఆహ్వానించి తన సంస్థానంలో ఉంచి పోషించేవాడట. ఇతని రచనలు రెండూ సంస్కృత గ్రంథాలు. రామచంద్రోదయానికి కవి స్వయంగా గీర్వాణభాషలో వ్యాఖ్య వ్రాశాడు. ప్రాగుటూరు పాలకుడైన బిజ్జల తిమ్మభూపాలుడు ఇతనికి మేనల్లుడు. ఈ ప్రభువు క్రీ. శ. 1637 లో పరమపదించాడు. (అం. సం. సా.)

## రాజా బహిరీ పామ నృపాలుడు

కాలం : క్రీ. శ. 1752–1773 మధ్య కాలం.

స్థలం : సురపురం (సంస్థానాధీశుడు).

రచన : భార్గవపురాణము.

సాహిత్య పోషకుడు. కణాదము పెద్దన రచించిన మత్స్యపురాణము, శేష శైలేశలీలలను అంకితం పొందాడు సురపురం వంశప్రభువులలో ఈ పామనృపాలుడు ప్రసిద్ధ సాహిత్య పోషకుడు. వైష్ణవ మతానుయాయి. సురపురం సంస్థానంలో మిక్కిలి ప్రసిద్ధిచెందిన తిరుమల శ్రీనివాసాచార్య, అణ్ణమాచార్య సోదర కవులను ఈ పామ నాయకుడే సంస్థానానికి రప్పించి, వారి ద్వారా వైష్ణవం స్వీకరించి, వారికి ఉచిత వసతులు కల్పించి, తన సంస్థానంలోనే స్థిరపడేట్లుగా ఏర్పాట్లు చేశాడు.

(అం.సం.సా–513,514,517)

## రాజా బహిరీ వేంకటు నాయకుడు

కాలం : క్రీ.శ. 18 వ శతాబ్దం ఉత్తరార్ధం.

సురపురం సంస్థానాధీశ్వరుడు. సాహిత్యపోషకుడు. ఇతడు పామనాయకుని కుమారుడు.

తండ్రి మరణానంతరం సంస్థానాధిపత్యం స్వీకరించి క్రీ. శ. 1773 నుంచి 1803 వరకు బహు సమర్థతతో రాజ్యపాలనచేశాడు. క్రీ శ. 1786లో దేవగిరిని సంస్థానంలో కలుపుకొని, సంస్థానాన్ని విస్తరింపజేశాడు. ఇతడు రాజకీయాలలోనే కాక సాహిత్యంలోనూ మంచి ప్రవేశం కలవాడు.

తిరుమల బుక్కపట్టణం ఇమ్మడి అణ్ణమాచార్య, శ్రీనివాసాచార్య సోదరులు ఇతని ఆస్థానంలోని వారే. (అం సం.సా–517,518)

## రాజా రామపాల చరితమ్ (సం)

కర్త : కేశవ పండితుడు.

చారిత్రక కావ్యం. (తె.వి.వ–6)

**రాజా రాయడప్ప రంగారావు బహద్దరు**

కాలం : క్రీ. శ. 1790-1830 ప్రాంతం.
స్థలం : బొబ్బిలి సంస్థానం (సంస్థానాధిపతి).
రచన : సంకల్ప సూర్యోదయము.
అంకితం : కూర్మక్షేత్ర మాహాత్మ్యము.

బొబ్బిలి సంస్థానాధిపతులలో 9వ తరం వాడు. కర్త, కారయిత సాహిత్య ప్రియుడు. కొటికెలపూడి వేంకటకృష్ణ సోమయాజి, గరిమెళ్ళ సుబ్బయ్య మొదలగువారితనికి ఆశ్రితులు.

ఇతని "సంకల్ప సూర్యోదయం," వేంకటనాథ వేదాంత దేశికుల "సంకల్ప సూర్యోదయ" మనే రూపకానికి, పద్యరూపమైన తెలుగు సేత. రంగారావు సుప్రసిద్ధ విద్వాంసులను దేశ దేశాలనుండి పిలిపించి, జీవన పర్యాప్తమైన అనేక అగ్రహారాలు ప్రసాదించి, వేద వేదాంగాది నానావిధ కళలను ప్రోత్సహించేవారట. కొటికెలపూడి వేంకటకృష్ణ సోమయాజి రచించిన "కూర్మక్షేత్ర మాహాత్మ్య" రచనకు ఈ ప్రభువు కృతిపతి. (ఆం. సం. సా-302)

**రాజా వాసిరెడ్డి వేంకటాద్రి నాయుడు**

కాలం : క్రీ.శ. 1761-1816 మధ్య కాలం.
బిరుదు : అద్యతన భోజరాజు.

అమరావతి సంస్థానాధీశుడు. కవి పండిత పోషకుడు. ఇతనికి పూర్వం ఈ వంశంవారు చింతపల్లి ప్రభువులని పిలవబడేవారు. ఇతని కాలం నుండి అమరావతి ప్రభువులనే పేరు వచ్చింది ఈ ప్రభువు మంచి వ్యవహార దక్షుడు. సంస్కృతాంధ్ర తురుష్క భాషలలో ప్రవీణుడు. ములుగు పాపయారాధ్యులు ఈతని ఆస్థాన కవిగా, గురువుగా ఉండేవాడు. కాని ఏ కారణం చేతనో అతని కృతులలో ఒక్కటి కూడా ఈ ప్రభువుకు అంకితమిచ్చినట్లు కనబడదు. అమరవాది రామకవి కృతులైన "ద్రౌపదీ పరిణయము" "వాసిరెడ్డీయము" అనే గ్రంథాలలో ఈతని గురించి విపులంగా ఉంది. (ఆం. సం. సా.)

**రాజా విజయ అప్పారావు సవై అశ్వరాయ బహద్దరు**

కాలం : క్రీ. శ. 19వ శతాబ్దం.
స్థలం : పాల్వంచ-భద్రాచలం.

భద్రాచలం సంస్థానాధీశ్వరులుగానున్న వీరు సాహిత్యాభిమానులు. బూర్గంపాడు, పాల్వంచ ప్రాంతాలలో నెలకొన్న ఆంధ్ర వాఙ్మయ సమితికి మహారాజ పోషకులు. అశ్వరావు పేటలోని అశ్వరాయాంధ్ర భాషా నిలయం ఈ సంస్థానాధీశుల భాషాభిరుచికి ప్రబల నిదర్శనం. (ఆం. సం. సా )

**రాజా శ్వేతాచలపతి రంగారాయ బహద్దరు**

కాలం : క్రీ. శ. 1810-1862 మధ్య కాలం.

స్థలం : బొబ్బిలి సంస్థానం.

బొబ్బిలి సంస్థానాధిపతి. సాహిత్య ప్రియుడు. కృతిపతి. రాజా రాయడప్ప రంగరాయ బహద్దరు కుమారుడు. క్రీ. శ. 1830 లో జమీకి వచ్చాడు. కొటికెలపూడి కోదండరామకవి ఇతనికి సహాధ్యాయి, ఆస్థాన విద్వాంసుడు కూడ. మండపాక కామకవి, మండపాక పార్వతీశ్వర శాస్త్రి, మండలేముల వేంకటరాయ కవి ప్రభృతులు పెక్కుఱు ఈ ప్రభువు ఆస్థానంలో అనేక సన్మానాలు పొందినవారే. కోదండరామకవి కృతమైన ప్రపదన పారిజాత రచనను అంకితం పొందాడు (ఆం. సం. సా_304)

## రాజేంద్ర చోడుడు

కాలం : క్రీ. శ. 12వ శతాబ్దం.

ఈయన, చందవోలు రాజధానిగా వెలనాటి నేలిన గొంకరాజు కుమారుడు చోడ భూపతికి పట్టం కట్టినట్లు, భుజబలం చేత "కొలని"ని జయించి భీముడనే రాజును చంపి, ఆంధ్ర దేశాన్ని దేవేంద్రునివలె పాలించినట్లు ఒక చాటువు వల్ల తెలుస్తున్నది. చాటు కవి వివరాలు తెలియవు. (చా. ప. ర.)

## రాజేంద్ర చోళ చరిత్ర (అలభ్యం)

రచనాకాలం : క్రీ. శ. 16వ శతాబ్దం.

కర్త : చూ. సుగుటూరి ముమ్మడి తమ్మ భూపతి.

చారిత్రక పద్య కావ్యం. (ఆం. సం. సా_261)

## రాణి శంకరమ్మ కథ

కర్త : తెలియదు.

జానపద చారిత్రక గేయం. రాణి శంకరమ్మ వనపర్తి (తెలంగాణా) సంస్థానాధీశురాలు.

## రాణి చెల్లయ్యమ్మారావు బహద్దరు

కాలం : క్రీ.శ. 18 వ శతాబ్దం.

కోలంక- వీరవరం జమీందారిణి. రాజా వేంకట సూర్యరాయని సతీమణి. సాహితీ పోషకురాలు. ఆంధ్ర ప్రచారిణీ గ్రంథమాలవంటి సంస్థలకు రాజపోషకురాలుగా ఉన్నారు. తమ ఆస్థానంలో కవి పండితులను విశేషంగా ఆదరించారు. కొత్తపల్లి లచ్చయ్యకవి, కూచిమంచి సుబ్బారావు ఈమె ఆశ్రితులు. రాణీ రమణయాంబ జీవిత చరిత్రను, రాణి జగ్గమాంబ జీవిత చరిత్రను ఈమె గ్రంథస్థం చేయించారు. ఈమె పైన కొత్తపల్లి లచ్చయ్య కవి చెల్లయ్యమ్మ శతకం రాశాడు.

## రాణీ రాజ విలాసము

కర్త : భీమసింగి కవిరాజు.

యక్షగానం. మగధ రాజపుత్రి స్వయంవరంలో కాశ్మీరపతిని వరించడంతో మొదలై, మృగయా విహారానికి వెళ్ళిన రాజు అక్కడ వైశ్య శూద్రముని కన్యలను

ఇరువురిని చేపట్టి అక్కడనే ఉండటం, రాణి ఇది తెలిసి తానే స్వయంగా బయలుదేరి వచ్చి సవతులతో, రాజుతో సంవాదం జరపడంతో ముగుస్తుంది.

ప్రసిద్ధ కర్ణాటక హిందుస్తానీ రాగతాళాలతో ఉన్న దరువులున్నాయి. చక్కని రచన. విరహ వేదన ఘట్టంలో ఖామాకలాపం పోకడలున్నాయి. పారిజాతాపహరణ రాధామాధవ సంవాద ప్రబంధాలలోని పద్యాలుఉన్నాయి. (య వా.చ. 61)

## రాణీ రావు జగ్గమాంబ జీవిత చరిత్రము

కర్త : చూ. కూచిమంచి సుబ్బారావు.

1762-1776 మధ్య పిఠాపురం సంస్థానాన్ని పాలించిన రావు నీలాద్రిరాయణిం గారి భార్య జగ్గమాంబ. ఆమె జీవిత చరిత్రయే ఈ రచన. జగ్గమాంబ కసింకోట వాస్తవ్యులయిన చెలికాని రామారాయణింగారి ద్వితీయ పుత్రిక. యుద్ధభూమిలో వీరస్వర్గ మలంకరించిన భర్తతోపాటు సహగమనం చేసిన సాధ్వీమణి. ఈమె జీవిత విశేషాలను సుబోధకమైన వచన రూపంలో కవి వివరించాడు. (ఆం.నం.సా-113)

## రాణీరావు రమణయాంబా జీవిత చరిత్రము

కర్త : చూ. కూచిమంచి సుబ్బారావు.

కవి వ్యక్తి జీవిత చరిత్రలు వ్రాయడంలో నేర్పరి, వారి ప్రధానమైన రచనల్లో 'రాణీరావు రమణయాంబా జీవితచరిత్రము' ఒకటి. రమణయాంబకోలంక - వీరవరం జమీందారుల కుటుంబానికి చెందినది. రాణి చెల్లయ్యమ్మారావు ప్రోత్సాహంతో కవి ఈ రచన చేశాడు. (ఆం నం.సా. 113)

## రాణీ శంకరమ్మ

కాలం : క్రీ.శ. 19 వ శతాబ్దం.

వనపర్తి సంస్థాన ప్రభ్విణి. రాజా ద్వితీయ రామేశ్వరరావు కన్న ముందు సంస్థానపాలకురాలు. వీరి పాలనలో సంస్థానంలోని సాహిత్య సేవ అత్యంత ఉన్నతంగా జరిగింది. శ్రీరంగాపురంలోను, రాజనగరంలోను వీరు కవి - పండిత గోష్ఠులు, సభా కార్యక్రమాలు చక్కగా నిర్వహించారు.

నంబాకం రాఘవాచార్యులు, శేరలూరి శేషాచార్యులు, ఆచార్య రంగాచార్యులు మొదలగు పెక్కురు మహావిద్వాంసులు వీరి ఆస్థానంలోనే ఉండేవారు.

(ఆం.నం.సా)

## రాధాకృష్ణ విలాసము

కర్త : కృష్ణదాసకవి.

మూడాశ్వాసాల పద్యకావ్యం. జయదేవుడు సంస్కృతంలో రచించిన గీత గోవింద కావ్యానికి ఇది అనువాదం. రచన రమణీయమైనది. (క.న. 38)

## రాధామాధవ కవి

నామాంతరం : చింతలపూడి ఎల్లయ (చూ).

రాధా మాధవమ్ (సం)

రర్త : చూ. ముడియం వేంకటరమణ కవి.

నాటకం.

రాధా మాధవము

రచనాకాలం : క్రీ. శ. 1520 - 30 ప్రాంతం.

కర్త : (చూ) చింతలపూడి ఎల్లయ.

అంకితం : శ్రీరామునకు.

ప్రత్యేకత : ఈ గ్రంథాన్ని వ్రాసిన కవి చింతలపూడి ఎల్లయ రాయలచేత "రాధామాధవకవి" బిరుదు పొందాడు. అయిదు అశ్వాసాలగ్రంథం. అచ్యుతదేవరాయలు ప్రతి సంవత్సరం వేంకటేశ్వరస్వామికి ప్రబంధ కుసుమార్పణం చేసేవాడట. అతని మంత్రియైన తిమ్మరుసు ఆజ్ఞమేరకు ఈ గ్రంథం రామాంకితమైంది. ఇది వేదాంతగ్రంథం. వ్యాకరణ దోషాలున్నప్పటికి రసవంతమయిన రచన. (తె.వి.స-4)

రాధా మాధవము వ్యాఖ్య

కర్త : పైడిపాటి వేంకటనరసు (చూ).

చింతలపాటి ఎల్లయ విరచిత రాధామాధవ కావ్యానికిది వ్యాఖ్య. బ్రౌన్‌దొర దీనిని వ్రాయించాడు. (తె.సా. విమర్శ-91)

రాధామాధవ వివాదము (అలభ్యం)

కర్త : విజయరాఘవ నాయకుడు.

కవి శృంగార తరంగితంగా చేసిన రచన అట. (ద.దే.వా-88)

రాధా మాధవ సంవాదము

కర్త : కొణిదెన నాగయకవి.

పద్యకావ్యం. (ద.దే.వా. పీఠిక-7)

రాధా మాధవ సంవాదము

కర్త : వెలిదండ్ల వేంకటపతి (చూ).

అంకితం : మగదల రామదాసుకు

మూడాశ్వాసాల శృంగార ప్రబంధం. కవి దశావతార చరిత్రలోని రాధామాధవ కథా సంవిధానాన్ని అనుసరించినట్లు తోస్తున్నది. కవిత్వం మృదులలితంగా ఉంది. పలుకు బళ్ళు, జాతీయాలు చక్కగా కూర్చిన రచన. (ద.దే.వా-509)

రాధా మాధవ సమాగమము

కర్త : తెలియదు.

ఈ పేరుతో ఒక కృతి చెన్నపట్టణంలోని ప్రాచ్య పుస్తక భాండాగారంలో ఉన్నదట. (ద.దే.వా-508)

## రాధికా పరిణయము

రచనాకాలం : క్రీ. శ. 19 వ శతాబ్దం పూర్వార్ధం.
కర్త : చూ. గోపీనాథం వేంకటకవి.
అంకితం : వెల్లంకి సూర్యరాయనికి.

శృంగార ప్రబంధం. ఇతివృత్తం ప్రఖ్యాతం. వెలుగోటి సర్వజ్ఞ కుమార యాచేంద్రుని బావమరది అయిన వెల్లంకి సూర్య రాయనికి ఇది అంకితం. కొందరు ఈ గ్రంథం శ్రీకృష్ణునికి అంకితమని భావిస్తున్నారు. (అం.సం.సా-466)

## రాధికా సాంత్వనము

నామాంతరం : ఇళాదేవీయము.
కవయిత్రి : ముద్దుపళని.
రచనాకాలం : క్రీ. శ. 1740 ప్రాంతం.

నాలుగాశ్వాసాల శృంగార ప్రబంధం. మొత్తం 585 గద్యపద్యాలున్నాయి. తెలుగు నుడికారపు సొంపులు, జాతీయాలు కొల్లలు. ఈమె సముఖము వేంకట కృష్ణప్ప నాయకుడు రచించిన రాధికాసాంత్వనం నుండి కొన్ని పద్యాలు గ్రహించిందని కొందరు అంటారు. సముఖము వేంకటకృష్ణప్పది ఏకాశ్వాస ప్రబంధం. ముద్దుపళనిది నాలుగాశ్వాసాల విస్తర గ్రంథం. (ప్రతి విలేఖకుల పొరపాటు వల్లకాని, ముద్దుపళనికి అపకీర్తి తేవాలనే ఉద్దేశంతో గాని ఈ పద్యాల మార్పిడి జరిగి ఉండవచ్చునని కొంద రంటున్నారు).

ఈ రెండూ వేర్వేరు గ్రంథాలు కావనీ ఏకకర్తృకమే అవి కొందరు అంటు న్నారు. ఈ గ్రంథం శృంగార భూయిష్ఠంగా ఉన్నదన్న కారణంతో 1911 లో రాష్ట్ర ప్రభుత్వం దీని ప్రతులను (ముద్రిత ప్రతులను) వశం చేసుకొన్నదట. 1947 లో ఆ నిషేధం తొలగించింది. ఈ గ్రంథం చాలాసార్లు ముద్రితం. (శారదాధ్వజం-232)

## రాధికా సాంత్వనము

రచనాకాలం : క్రీ. శ. 18 వ శతాబ్దం పూర్వార్ధం.
కర్త : సముఖము వేంకటకృష్ణప్పనాయకుడు (చూ).
అంకితం : శ్రీరంగ పతికి.

ఏకాశ్వాస శృంగార ప్రబంధం. 120 పద్యాలు, నడుమ చిన్నచిన్న వచనాలు ఉన్నాయి. కవి దీన్ని చాటు ప్రబంధంగా చెప్పుకొన్నాడు.

ఈ గ్రంథ రచనను గూర్చి భిన్నాభిప్రాయాలున్నాయి. ఇదేపేరుతో ముద్దు పళని రచించిన నాలుగాశ్వాసాల కృతికీ దీనికి పోలికలుండటంచేత ముద్దుపళని ఇతని పద్యా లను సంగ్రహించిందని కొందరంటారు. ముద్దు పళనికి అపకీర్తి తేవడానికి ఈ కృతిని మరెవ్వరో తరవాత రచించి, ఇతని పేరు పెట్టారని మరి కొందరంటున్నారు.

(ద. దే. వా-352; అరుద్ర-12)

**రాధికా సాంత్వనము వ్యాఖ్య**

కర్త : పైడిపాటి వేంకటనరసు (చూ).

ఇది ముద్దుపళని విరచిత రాధికా సాంత్వన కావ్యానికి వ్యాఖ్య. దీనిని బ్రౌన్ దొర వ్రాయించాడు. (తె సా. విమర్శ-91)

**రాపరది దేచిరాజు**

కాలం : క్రీ. శ. 16వ శతాబ్ది కావచ్చు.

చూ. అజ్ఞాత గ్రంథ సంధాత.

రచన : పేరు తెలియదు.

విశిష్టత : ఈ కవి వ్రాసిన పద్యమనిచెప్పి అజ్ఞాతగ్రంథ సంధాత తన "ఉదాహరణ పద్యములు"లో ఉదాహరించాడు కాని కావ్యం పేరు చెప్పలేదు. దొరికిన పద్యం పురవర్ణనకు సంబంధించినది. పద్యంలోని ఉత్ప్రేక్షవల్ల ఈ కవి ప్రబంధ రచన విరివిగా సాగే రోజులలోనివాడని మాత్రం ఊహించవచ్చు. (ఆరుద్ర-9)

**రాపాక లక్ష్మీపతి**

కాలం : క్రీ. శ. 18వ శతాబ్దం.

స్థలం : దోమకొండ సంస్థానం-పరకాల.

రచనలు : భద్రాయురభ్యుదయము, శ్రీకృష్ణ విలాసము, ఆచార్య విజయము, శ్రీమదుపాఖ్యానము, సీతా వివాహము మొదలగునవి.

ఈ కవి దోమకొండ సంస్థానానికి చెందినవాడు. క్రీ. శ. 18వ శతాబ్దంలో దోమకొండను పాలించిన రాజన్న చౌదరి ఆస్థాన విద్వాంసుడు. రాపాక రంగాచార్యుని కుమారుడు. శివరహస్యఖండ కృతికర్త అయిన రాపాక వేంకటదాసకవికి సోదరుడు. రాజన్న చౌదరి ప్రేరణచేత "భద్రాయురభ్యుదయ" రచించి వేములవాడలో వెలసిన రాజరాజేశ్వరునికి అంకితం చేశాడు. (ఆం.సం.సా.)

**రాపాక వేంకటు దాస కవి**

కాలం : క్రీ. శ. 18వ శతాబ్దం ప్రారంభం.

స్థలం : నిజాం రాష్ట్రంలోని పరకాల.

రచన : శివరహస్య ఖండము.

శివునూరి అచ్చనమంత్రి ప్రోత్సాహంతో రచనలు చేశాడు. ఈ కవి దోమకొండ సంస్థానంలోనివాడైన "రాపాక లక్ష్మీపతి"కి సోదరుడు. (ఆం.సం.సా-187)

**రాపాక శ్రీరామ కవి**

కాలం ; క్రీ. శ. 1780 ప్రాంతం,

స్వస్థలం : పరకాల.

రచన : అధ్యాత్మ రామాయణము (అలభ్యం).

రాపాక లింగన పుత్రుడు. ఇల్లిందకుంట దేవునికి అంకితంగా ఈ రామాయ

జాన్ని రచించాడు. మాచర్ల రామయామాత్యుడు ఈ కవిని ప్రోత్సహించి రచన చేయించాడట. ఈతవి రామాయణం ఇల్లిందకుంట రామాయణంగా ప్రసిద్ధం. (య.వా.చ-360)

## రామందొర (రామన్నదొర)

కాలం : క్రీ. శ. 19 వ శతాబ్దం.

"ఆంధ్ర" సంస్థానప్రభువు. కవి పండిత పోషకుడు. క్రీ. శ, 19 వ శతాబ్దం ప్రథమ భాగంలో "ఆంధ్ర" సంస్థానాన్ని పాలించిన "గారయదొర" గారి జ్యేష్ఠ పుత్రుడు. అతని తరువాత సంస్థానాన్ని పాలించినవాడు. తటాకారామాది ప్రతిష్ఠలు చేశాడు.

ఇంగిలాపల్లి వాస్తవ్యులైన నిష్ఠల కామయ్య శాస్త్రి, చిట్టివలస వాస్తవ్యుడు పంతుల బ్రహ్మయ్యశాస్త్రి, చల్లపేట వాస్తవ్యులు తాతా పెదకామయ్య, తాతా విశ్వనాథ శాస్త్రి, తాతా శ్రీరామశాస్త్రి వీరి ఆస్థాన పండితులు. (ఆం.సం.సా.)

## రామకథ (సం)

కర్త : రాజ చూడామణి దీక్షితుడు

## రామ కథాభిరామము

రచనాకాలం : క్రీ. శ. 17 వ శతాబ్దం.

కర్త : అనంతరాజు జన్నయకవి.

పది ఆశ్వాసాల కావ్యం. రామాయణ కథ మనోహరంగా నాతికఠినంగా మృదుపద గుంఫితంగా చక్కని శైలిలో ఉంది. (క.చ-3-100)

## రామ కథాసారసంగ్రహము

కర్త : చూ. మండకామేశ్వర కవి.

అంకితం: పెనుమెచ్చ జగన్నాథరాజు.

మూడాశ్వాసాల పద్యకావ్యం. ఆంధ్రీకృత గ్రంథం.

శ్రీరాముని కథ ఇందులోని ఇతివృత్తం. చంపూ రచన. యాజ్ఞవల్క్యుడు భరద్వాజునికి ఈ కథ చెప్పినట్లుగా వ్రాయబడింది. కృతిపతి పెనుమెచ్చ జగన్నాథ రాజు విజయరామ గజపతి ప్రధాన మంత్రి. (ఆం.సం.సా-429)

## రామకుమార విజయము

కర్త : చిదంబర కవి.

మూడాశ్వాసాల ద్విపద కావ్యం. కుశలవుల కథ దీనిలోని ఇతివృత్తం. దీని ప్రతి ఆంధ్ర సాహిత్య పరిషత్తులో ఉంది. (ద్వి.సా.చ-373)

## రామకృష్ణ చరితము (అలభ్యం)

కర్త : చూ. అసూరి మరింగంటి సింగరాచార్యులు.

ద్వ్యర్థి కావ్యం. ఈ కావ్య రచన వల్ల కవికి శబ్ద శాసన బిరుదం లభించి

నట్లున్నది. దీనిని రామకృష్ణ విజయంగా కొందరు పేర్కొన్నారు.
(ఆరుద్ర-8-262; క.త-13-9)

## రామకృష్ణమూర్తి కవి

కాలం : క్రీ.శ. 1780 ప్రాంతం.

రచన : "రామకృష్ణమూర్తి, రమ్యకీర్తి" అనే మకుటంతో ఉన్న శతకం కావచ్చును.

ఇతని శతకం పూర్తిగా లభించలేదు. 76 పద్యాలు (ఆటవెలదులు) మాత్రం లభించాయి. ఇందులోని విషయం అద్వైతతత్త్వ బోధకంగా ఉంది. ఇతడే ఈ శతక కర్త అని కొందరు భావిస్తున్నారు. ఇతడు పరశురామ పంతుల వారి వంశంలోని వాడని కొందరి అభిప్రాయం. (శ.క.చ-770; క.స-188)

## రామకృష్ణమూర్తి శతకము

కర్త : తెలియదు (రామకృష్ణమూర్తి కవి కావచ్చును).

ఆటవెలది పద్యాలలో "రామకృష్ణమూర్తి, రమ్యకీర్తి" అనే మకుటంతో ఉన్న శతకం. అసంపూర్ణంగా ఉంది. విషయం వేదాంత పరమైనది. శతక సముచ్చయం రెండవ భాగంలో ప్రకటితమైంది. దీని ప్రతి సత్యవోలు రాధామాధవరావు ఇచ్చారట.
(ఆం.సా.ప.ప-20-1)

## రామకృష్ణ విజయము

చూ. రామకృష్ణ చరితము.

కర్త : మరింగంటి సింగరాచార్యులు.

## రామకృష్ణ విలాసము

కర్త : శేషభట్టరు అప్పలాచారి (చూ.)

అంకితం : భద్రాద్రి రామునికి.

ఐగాశ్వాసాల ప్రబంధం. ఈ రచనను సల్లావణ్య యుక్తంగా వ్రాసినట్టు కవి చెప్పుకొన్నాడు. ఇతివృత్తం బలరామ కృష్ణుల లీలలు. (ఆరుద్ర. 11-269.)

## రామకృష్ణార్జున రూపనారాయణీయము

రచనా కాలం : క్రీ.శ.18 వ శతాబ్దం.

కర్త : ఓరుగంటి సోమశేఖర కవి.

అంకితం : పూసపాటి నారాయణరాజుకు.

నాలుగాశ్వాసాల త్ర్యర్థి కావ్యం. భారత భాగవత రామాయణాలకు సంబంధించిన కథలు ఇందులో ఉన్నాయి.

రామకృష్ణీయము

నామాంతరం : ఆంధ్రశబ్ద చింతామణి వ్యాఖ్య (చూ).

కర్త : అల్లమరాజు రామకృష్ణ కవి.

రామకృష్ణోపాఖ్యానము

కర్త : చూ. శ్రీపాద వెంకటాచలకవి.

ద్వ్యర్థి కావ్యం, (ఆం.సం.సా-422)

రామగీతలు

కవి : నెల్లూరి శివరామ కవి (చూ).

అంకితం : రామకృష్ణపురధాముడైన శ్రీరామునికి.

ఆరాశ్వాసాల పద్యకావ్యం. మూలం సంస్కృతంలోని రామగీతలు. మజ్జి కృష్ణ భూపాలుని కోరికపై ఇతడు వాటిని అనువదించాడట. ఇతివృత్తం యోగశాస్త్ర విషయం. ఈ గ్రంథం 1888 లో ముద్రింపబడింది. (వ.దే.వా-260)

రామచంద్ర కవి

చూ. రామ భద్రకవి.

రామచంద్ర చరిత్రము

కర్త : చూ. మిక్కిలి మల్లికార్జున కవి.

వివరాలు తెలియవు. (ఆం.సం సా-254)

రామచంద్ర యశోభూషణము

కర్త : చూ. కచ్ఛపేశ్వర దీక్షితులు.

అలంకారశాస్త్ర గ్రంథం. ప్రతాపరుద్రీయాన్ని పోలిన రచన. ఇందులో మూడు పరిచ్ఛేదాలున్నాయి. (ఆం.సం.సా.)

రామచంద్ర శతకము

కర్త : పైడిపాటి వేంకటనృసింహ కవి.

"నన్నుగైకొనుముపేంద్రా ! రామచంద్రా, హరీ" అనే మకుటంతో ఉన్న వృత్తశతకం. దశక విభాగం ఉంది. స్తుతి, సంసారము. మనోవృత్తి, వాక్యోన్నతి, దానసంగతి మొదలగు విభాగాలున్నవి. (శ.క.చ. 269)

రామచంద్ర శతకము

కర్త : చూ. మండలక్ష్మీ కామేశ్వర శాస్త్రి.

శతకరచన. (ఆం.సం.సా-430)

రామచంద్రోదయమ్ (సం)

కర్త : చూ. రాజా బహిరీ గోపాలరాయలు.

యమక కావ్యం. కవి తండ్రి అయిన ఇమ్మడి వెంకటరెడ్డి ప్రతిష్ఠించిన

కోదండరామస్వామి స్తోత్ర రూపంలో ఈ కావ్యం వ్రాయబడింది. దీనికి కృతికర్తయే సంస్కృత వ్యాఖ్య కూడా రచించాడు. ఇది ముద్రితం. (అం.సం.సా.)

**రామచంద్రోపాఖ్యానము (అలభ్యం)**

కర్త : రేవణూరి తిరుమల కొండయార్యుడు (చూ.)

ప్రబంధం. ఈ కవి శబ్దాలంకార పూరితంగా హృద్యంగా రచన చేయటంలో ప్రసిద్ధుడు. ఈ రచన రేవణూరి వేంకటార్యునిదని వీరేశలింగం వ్రాశారు. (క.చ. 3-161: క.స. 87; క.త.)

**రామచంద్రోపాఖ్యానము**

కర్త : వారణాసి వేంకటేశ్వర కవి.

ఆరాశ్వాసాల కావ్యం. ముద్రితం. రచన ప్రౌఢంగా రసవంతంగా ఉంది. ఈ కావ్య రచనలో కవికి అతని సోదరులు లక్ష్మీపతి, జోగన్నలు సహాయపడ్డారట. కథ పాతదే అయినా వినూత్న కల్పనలున్నాయి. (పీ.యు-162)

**రామచరిత మానస సరోవరము**

కర్తలు : శిష్టు కృష్ణమూర్తి శాస్త్రి, మంద కామేశ్వర శాస్త్రి, మంద నరహరికవి, తదితరులు.

ఇది తులసీదాస్ హిందీలో రచించిన రామాయణానికి అనువాదం. దోహా, చాంద్, చౌపా మొదలయిన వైభాషీయవృత్తాలిందులో వాడబడ్డాయి. విజయనగర సంస్థానాధీశ్వరులైన ఆనంద గజపతి మహారాజుగారి ప్రేరణపై కొందరు కవులు తులసీదాసు రామాయణాన్ని తెలుగులోకి అనువదించారు. అయోధ్యకాండను శిష్టు కృష్ణమూర్తిగారు రసవత్తరంగా అనువదించారట. అరణ్యకాండను మంద కామేశ్వరశాస్త్రిగారు, కిష్కింధాకాండను మంద నరహరికవి తెలుగుచేశారట. (గజపతిరాజులు-తె.సా-139)

**రామదాసు చరిత్రము**

కర్త : తిరుక్కడయూరి కృష్ణదాసు.

యక్షగానం. తెలుగుదేశంలో ప్రసిద్ధిపొందినది. ఇది భద్రాచల రామదాసు (గోపన్న) జీవితచరిత్ర. దీనిలో రామదాసు కీర్తనలను, రంగశాయి, జానకీపతి, మహీజాధిప, రామతారక, భావనారాయణాది శతకాలలోని పద్యాలను కవి అక్కడక్కడ ఉదాహరించాడు. (తె.వి.స-6)

**రామనాథపురం-సేతుపతులు**

దక్షిణదేశంలోని సంస్థానాలలో ఒకటి. సేతుపతులు దీన్ని పాలించారు.

ఇక్కడి భాష తమిళం అయినా వీరు తెలుగుభాషాభివృద్ధికి తోడ్పడ్డారు. మధుర, తంజావూరు నాయకరాజులవలె వీరుకూడా తెలుగు కవులను పోషించారు. విజయ రఘునాథ సేతుపతి (1709-20) యక్షగానాలనూ, నాటక ప్రదర్శనలనూ ప్రోత్సహించాడు. ఇతడొక నాటకశాలను కట్టించాడనీ, అందులో తెలుగు నాటకాలు ప్రదర్శింప

బడుతుందేవనీ తెలుస్తున్నది. ఇతని సోదరుడు వడుగనాథ సేతుపతి కూడా తెలుగు భాషను ఆదరించాడు. ఇతని దాతృత్వాన్ని కొనియాడే చాటువులు కొన్ని ఉన్నాయి.

(ద.దే.వా. పీఠిక)

**రామనామాత్యుడు**

కాలం : క్రీ. శ. 18 వ శతాబ్దం.

స్థలం : కృష్ణామండలం కావచ్చు.

రచన : కృష్ణార్జున సంవాదము (గయోపాఖ్యానము).

తిమ్మన మంత్రి పుత్రుడు. ఇతని జన్మస్థలం గురించి భిన్నాభిప్రాయాలున్నాయి. ఇతని రచన అహోబల నరసింహస్వామికి అంకితం. రచనలో లక్షణ విరుద్ధ ప్రయోగాలున్నా కవిత్వం రసవంతమైనదని పండితులు మెచ్చుకొన్నారు. (క.చ-3-205)

**రామ పంచాశత్కందములు**

రచనాకాలం : క్రీ. శ. 1810 ప్రాంతం.

కర్త : జూలూరి అప్పయ్య.

రచన ప్రౌఢంగా, అనుప్రాసాదులతో శ్రుతిమనోహరంగా ఉంది. (క.స-13)

**రామ పట్టాభిషేకము**

జానపద పౌరాణిక గేయరచన ఇతివృత్తం రామాయణకథకు సంబంధించినది.

చూ. పౌరాణిక గేయములు.

**రామ పట్టాభిషేకము**

కర్త : శహాజీ (చూ)

ప్రదర్శన యోగ్యంగా మలచిన యక్షగాన నాటకం. లంకలో రామపట్టాభిషేకం వరకు గల కథ ఇందులో ఉంది. (ద.దే.వా-195)

**రామబ్రహ్మయోగి**

కాలం : క్రీ. శ. 16 వ శతాబ్ది ఉత్తరార్ధం.

రచన : ఎరుక (యక్షగానము)

ఈ కవి తన రచనను గురువు అయిన రామబ్రహ్మంకే అంకితం ఇచ్చాడు. వేదాంత పరమైన విషయాలను సరళంగా చెప్పడం ఇతని ప్రతిభకు తార్కాణం.

(య.వా.చ.)

**రామభద్ర కవి**

నామాంతరం : రామచంద్ర కవి

కాలం : క్రీ. శ. 1800 కి పూర్వం.

రచన : జానకీపతి శతకము.

కవి తన రచనలో "రామభద్ర నీపేరిటివాడనయ్య" అని అనడంవల్ల ఈ కవి

పేరు రామభద్రుడుకు గాని రామచంద్రుడు గాని కావచ్చునని పండితులు ఊహిస్తున్నారు, రామదాసు చరిత్రలో ఇతని శతక పద్యాలున్నాయి. (శ క.వ-468)

## రామభద్ర దీక్షితుడు

నామాంతరం : అయ్యా దీక్షితులు.

కాలం : క్రీ. శ. 1684-1712 ప్రాంతం.

బిరుదు : అభినవ పతంజలి.

గురువులు : చొక్కనాథ దీక్షితుడు, నీలకంఠ దీక్షితుడు (అప్పయ దీక్షితుని మనుమడు)

స్థలం : శహాజీ రాజపురము

రచనలు : 1. పతంజలి చరిత్రమ్ (సం) 2. జానకీ పరిణయమ్ (సం) 3 శృంగారతిలక భాణమ్ (సం) 4. పరిభాషావృత్తి (అయ్యభాణమ్) వ్యాఖ్య (సం) 5. షడ్దర్శన సిద్ధాంత సంగ్రహ వ్యాఖ్య (సం)

తంజావూరును పాలించిన శహాజీ ఆస్థానంలోని వాడు. ఇతని రచనలన్నీ సంస్కృతాలే. శహాజీ క్రీ. 1693 లో తిరువిస నల్లూరు అనే గ్రామాన్ని శహాజీ రాజ పురమనే పేర 46 మంది విద్వాంసులకు అగ్రహారంగా ఇచ్చాడు. అందులో చాలామంది తెలుగువారట. ఆ 46 గురిలో ఇతడొకడు. ఇతని జానకీ పరిణయ నాటకాన్ని తెలుగులో పాలెపు వేంకటసూర్యగోపాలం గద్య పద్యాత్మకంగాను, నడకుదుటి వీరరాజు, "విభ్రమ తరంగిణి" అనేపేర వచన కావ్యంగానూ వ్రాశారు. (ద.దే.వా-178)

## రామభద్ర రాజు

కాలం : క్రీ. శ. 18 వ శతాబ్దం

స్థలం : పాలకొండ సంస్థానం,

సాహిత్యప్రియుడు. క్రీ. శ. 18 వ శతాబ్దంలో పాలకొండ సంస్థానాన్నిపాలించాడు పురిజాల లక్ష్మీనారాయణదాస కవినిపోషించి అతని "పారిజాతము" అనే యక్షగాన కృతిని అంకితం పొందాడు. (ఆం.సం సా-230)

## రామభద్రాంబ

కాలం : క్రీ. శ. 1600-1633 ప్రాంతం.

స్థలం : తంజావూరు (రఘునాథ నాయకుని ఆస్థానం).

రచనలు : రఘునాథాభ్యుదయమ్ (సం).

గురువు : చెంగల్వ కాళకవి.

రఘునాథుని ఆస్థానంలోని విద్వత్కవయిత్రి. ఈమె తెలుగు రచనలు లభించలేదు. సమస్యాపూరణం మాత్రం ఒక్కటి తెలుగులో వినవస్తున్నది. ఈమె

రఘునాథుని తన నాథునిగా చెప్పుకొన్నది. శతలేఖిని, సమయ లేఖినీ విద్యలలో దిట్ట. అష్టభాషా కోవిదురాలు. రఘునాథుని ఆస్థానంలో ఈమె, మధురవాణి శతావధానాలు చేసే వారట. 'ఓష్ఠ్య నిరోష్ఠ్యాది కోద్దామ రసగర్వ కవన చాతురి' గలదాన్నని చెప్పుకొన్నది.
(ద. దే. వా-27; తం. ఆం. నా-13)

## రామ భూపాలుడు

చూ. గద్వాల సంస్థానం.

ఈయన గద్వాల సంస్థానాన్నేలిన ప్రభువు. ఈయన గుణ గణాలను, దాన శీలాన్ని కవి పండిత పోషణను వివరిస్తూ చాలా చాటువులు దొరికాయి. ఈయన ముష్టి పల్లికుల శేఖరుడట. (చా. ప. ర.)

## రామయ భాస్కరుడు

కాలం : క్రీ. శ. 16వ శతాబ్దం.

స్థలం : కొండవీడు.

సాహిత్య పోషకుడు చదలవాడ మల్లన రచించిన ద్విపద రుక్మాంగద చరిత్రకు కృతిపతి. ఇతడు కొండవీటి పాలకుడని తెలుస్తున్నది.

## రామరాజ భూషణుడు

నామాంతరం : మూర్తికవి (చూ).

## రామరాజాభిషేక నాటకమ్ [సం]

కర్త : వీరరాఘవకవి.

నాటకం. ఆనాటి ఆలయోత్సవాదులలో ప్రదర్శింపబడుతుండేదట.
(ద. దే. వా-180)

## రామ రాజీయము

నామాంతరం : నరపతి విజయము (చూ).

కర్త : అందుగుల వెంకయ్య.

ఈ గ్రంథాన్ని "గస్తోవ్ ఓ పర్త్" అనే తెల్లదొర క్రీ.శ. 1893లో కొక్కొండ వేంకటరత్నం పంతులు సాయంతో పరిష్కరించాడు. చిత్రగర్భ కవిత్వాలు ప్రదర్శించటమే కాక కొన్ని అపూర్వ వృత్తాలను ఇందులో వాడాడు. (అరుద్ర-10-195)

## రామ రాజు

నామాంతరం : కోదండ రామరాజు (చూ).

## రామరాజు రంగప్పరాజు

కాలం : క్రీ.శ. 16 వ శతాబ్ది మధ్యభాగం.

రచన : సాంబోపాఖ్యానము (చంపువు).

విశిష్టత : ఈయన అళియ రామరాయల పెదతండ్రి పొట్లపాడి తిమ్మరాజు పెద్ద భార్య పెద్ద కొడుకైన పిన్న కొండ్రాజు కుమారుడు. తాత పేరు గాక ముత్తాత పేరును తన పేరుకు ముందు జోడించాడు. శ్రీరంగనాథుని పూజించటం కోసం సాంబో పాఖ్యానం వ్రాశాడట. తన కవితలో నన్నయ మార్గ కవిత పరిఢవిల్లిందని, తిక్కన సూక్తి ఫక్కిక పెంపొందిందని, ఎర్రన ఫణితి, నాచన సోమన్న గీర్విభవం, రావిపాటి తిప్పన్న వచస్థేమం, శ్రీనాథుని ఉక్తి రాణించాయని చెప్పాడు. ఈ కావ్య రచనలో కవి ఉద్దేశం రసప్రకటనమే కాని, కథా సంవిధానం కాదనిపిస్తుంది. ఇతని కావ్యంలో సమ కాలీన సంఘ పరిస్థితులు స్ఫుటంగా కన్పిస్తాయి. సత్కవిత్వం ఎలా ఉండాలో ద్వారక లోని భటులను వర్ణించేటప్పుడు చెప్పాడు. (ఆరుద్ర-9)

## రామలింగ భాస్కరుడు

ఈయన మహాదాతగా పేరొందిన రాయని భాస్కరునికి మనుమడు. తాతమీద ఉన్నట్లే, ఈయన దాతృత్వాన్ని చాటిచెబుతూ చాలా చాటువులు దొరుకుతున్నాయి. (చా.ప.ర.)

## రామలింగ శతకము [అలభ్యం]

కర్త : ఎలకుర్తి రామయ్య.

పెదపాటి జగ్గన్న ఇందులోని ఒక సీసపద్యాన్ని ఉదాహరించాడు. పద్యంలో శివుని అర్ధనారీశ్వరరూపం మనోహరంగా వర్ణించబడింది. "రాజహంస రథాంగ, శ్రీరామ లింగ" అనేది మకుటం. (శ.క.చ-252; ఆరుద్ర-9)

## రామలింగేశ శతకము

కర్త : అడిదం సూరకవి.

కవి కష్టదశలో దీన్ని వ్రాశాడు. బొబ్బిలి యుద్ధం అయ్యాక ఆనందరాజు మర ణానంతరం చిన విజయ రామరాజు కళింగసీమకు రాజయ్యాడు. కాని అతడు బాలుడు కనుక అన్నగారు సీతారామరాజు రాజ్యం పాలించేవాడు. ఇతడు చండశాసనుడు. ఆ పాలనలో ప్రజలూ, కవులూ పడ్డ కష్టాల్ని రామలింగేశునితో మొరపెట్టుకోవడమే ఈ ఈ శతకంలోని ఇతివృత్తం. "రామలింగేశ రామచంద్రపురవాస" అనే మకుటంతో ఉంది. రాజు దుశ్చర్యలు వర్ణితాలు. (ఆరుద్ర-12)

## రామలింగేశ్వర శతకము

కర్త : నిముషకవి రామయ్య.

ఈ శతకాన్ని గురించిన వివరాలు తెలియరాలేదు. (య.వా.చ.)

## రామలీల

కర్త : వేల్పూరి వేంకటకవి.

యక్షగానం. కవి రామాయణం ఆరుకాండలు సంగ్రహంగా నిర్వచనంగా రచించాడు దీనిలో పద్యాలు, ద్విపదలు ఉన్నాయి. రచన చక్కగా ఉంది. (య వా.చ-102)

## రామవర్మ

కాలం : క్రీ. శ. 18 వ శతాబ్దం (1757-89).

స్థలం : తంజావూరు.

రచనలు : 1. రుక్మిణీ పరిణయమ్ (సం) 2 శృంగార సుధార్ణవమ్ (సం)

ఇతడు తంజావూరు యువరాజట. తెలుగు రచనలు తెలియరాలేదు. పై రెండూ రూపకాలే. (తె.పి స-6-241)

## రామ విలాసము

కర్త : ఏనుగు లక్ష్మణకవి.

అంకితం : పత్సవాయ గోపరాజుకు.

రామాయణ కథను తెలిపే అయిదాశ్వాసాల ప్రబంధం. రచన హృదయంగమంగా ఉంది. కృతిపతి పెద్దా పురసంస్థానానికి చెందినవాడు. (తె.ఁ.స-6)

## రామ శతకము

రచనాకాలం : క్రీ. శ. 19 శతాబ్ది పూర్వార్థం.

కర్త : అకొండి వేంకటకవి.

ఈ కవి రచించిన రామశతకాలు రెండు లభించాయి. ఒకదానిలో "రామా" అనే మకుటం ఉంది రెండవదానిలో "రామప్రభూ" అనే మకుటం ఉంది. (క.స-232)

## రామ శతకము

కాలం : క్రీ.శ. 1600 ప్రాంతం.

కర్త : శతానందయోగి.

ప్రత్యేకత : ఇందులో 108 కంద పద్యాలున్నాయి. "రామా" అనే మకుటముంటుంది. కవి చౌడప్ప రచనా పద్ధతి దీనిలో కనిపిస్తుంది. ఈ శతకం లోకం పోకడ చెప్తూ, వేదాంతం బోధిస్తుంది. ఆడ వాళ్ళను నమ్మవద్దని, మగవాడికి కీర్తయినా, అప కీర్తయినా ఆడదే తెస్తుందని, ఆడవాళ్ళ వల్లనే తెలివి కూడా చెడుతుందని ఈ శతకం చెబుతున్నది.

శాంతానందయోగీ, శతానందయోగీ భిన్నులు కారనీ, ఒక్కరే అనీ కొందరి భావం. ఇరువురూ రామశతకాలు వ్రాయడం అందుకు కారణం కావచ్చును. శాంతానందయోగి 19 వ శతాబ్ది వాడని శతక కవుల చరిత్ర చెబుతున్నది.

(ఆర్థ్ర-9-225; శ.క.చ-540)

**రామ శతకము**

రచనాకాలం : క్రీ.శ. 19 వ శతాబ్దం పూర్వార్థం.

కర్త : శాంతానందయోగి.

వేదాంత బోధకమైన కంద పద్య శతకం. రామా అనే మకుటంతో ఉంది.
(శ.క.చ_540)

**రామస్తవ రాజము [అలభ్యం]**

కర్త : అల్లసాని పెద్దన.

పెద్దన కృతిగా ప్రఖ్యాతం.

**రామానుజ చరిత్ర [అలభ్యం]**

కర్త : (చూ) వంగల సీనయ.

అంకితం : శ్రీ వేంకటేశ్వరునికి.

పద్యకావ్యం. శశాంక విజయకర్త శేషం వేంకటపతి చేసిన కవి వంశవర్ణనను బట్టి ఈ కృతి కర్తృత్వం తెలుస్తున్నది. విశిష్టాద్వైతమత ప్రవక్తయైన శ్రీరామానుజుని చరిత్ర దీనిలోని ఇతివృత్తమట. (క.త_13_28)

**రామానుజాచార్యుడు**

కాలం : క్రీ. శ. 17వ శతాబ్దానికి పూర్వం.

విశిష్టాద్వైత మత స్థాపకుడు. సింహాద్రి వేంకటాచార్యులు తాను రచించిన లక్షణా పరిణయమనే శృంగార ప్రబంధాన్ని ఇతనికి అంకితం చేశాడు. సింహాద్రి వేంకటాచార్యుడు, అప్పకవి (1656)కి పూర్వుడు. (క.స_260)

**రామానుజాభ్యుదయము**

కర్త : మరింగంటి వేంకట (ప్రథమ) నృసింహాచార్యులు.

(తె.వి స_6)

**రామానుజాష్టోత్తర శతము**

కర్త : మరింగంటి లక్ష్మణదేశికులు.

అముద్రితం. (తె వి స_6)

**రామాప్రెగడ జగన్నాథ కవి**

చూ. పెదపాటిజగన్నాథకవి.

ఇతని ఇంటిపేరు రామాప్రెగ్గడ. అయినా పెదపాడులో నివసించడం వలన ఇతడు పెదపాటి జగ్గనగా ప్రసిద్ధుడయ్యాడు. రామమంత్రి, పిరమ్మల మనుమడు. చానమ్మ గంగామాత్యులు ఇతని తలిదండ్రులు.

పెదపాడు పడమటి గోదావరి జిల్లాలో ఏలూరుకు సమీపంలో ఉంది.
(క. స_72)

**రామా ! భక్త కల్పద్రుమా ! శతకము (అలభ్యం)**

కర్త : కాసుల పురుషోత్తమ కవి.

కొన్ని పద్యాలు మాత్రం ప్రచారంలో ఉన్నాయి ఇది కవి ప్రారంభ శతకమనీ, దీన్ని పంచ చామరాలలో వ్రాశాడనీ అంటున్నారు. "పరాకు భద్రశైల రామ, భక్త కల్పద్రుమా" అనేది మకుటం. ఇదే మకుటంతో ఒక శతకం పర్లాకిమిడిలో ఉన్నదట. కాని దాని వివరాలు తెలియరాలేదు. (శ క. చ_508)

**రామాభ్యుదయ చంపువు (సం)**

కర్త : చూ. దేవులపల్లి రామశాస్త్రి. (ఆం. సం. సా_247)

**రామాభ్యుదయమ్ (సం)**

నామాంతరం : మహానాటక అగ్రజాతమ్.

కర్త : చూ. సాళువ నరసింహరాజు.

ఇది 24 సర్గల కావ్యం. దీని గద్యలో కర్త సోనాద్రి అని ఉన్నది. (తె. వి. స_6)

**రామాభ్యుదయము**

కర్త : అయ్యలరాజు రామభద్రుడు.

రచనాకాలం : క్రీ. శ. 1550 ప్రాంతం.

అంకితం : గొబ్బూరి నరసరాజుకు.

ఇది ఎనిమిది ఆశ్వాసాల ప్రౌఢ ప్రబంధం. కవిత మృదువుగా, కల్పనా చాతుర్యంతో ఉంది శ్రీరాముని పట్టాభిషేకం వరకు ఉన్న కథ మాత్రం ఉంది ఉత్తర కాండ కథ లేదు. (ప. న. చ_నూ. పే. రా.)

**రామాభ్యుదయము**

రచనాకాలం : క్రీ. శ. 1830 ప్రాంతం.

కర్త మరింగంటి వేంకటనరసింహాచార్యులు.

**రామాభ్యుదయము (అలభ్యం)**

రచనాకాలం : క్రీ. శ. 18వ శతాబ్దం.

కర్త : మరింగంటి సింగరాచార్యులు.

**రామాయణంవారు**

దివ్య గ్రంథం రామాయణం పేరుతో వచ్చిన ఇంటిపేరు. (భారతి_మా_45_229)

**రామాయణ కథాసారమ్ (సం)**

కర్త : రఘునాథ నాయకుడు.

ఇందులో రామాయణ కథ సంగ్రహంగా చెప్పబడింది. కవి తెలుగులో ఈ రామాయణ కథను కావ్యంగా చెప్పాడు. ముద్రితమైన రఘునాథ రామాయణం తెలుగు

గ్రంథంలో గ్రంథాదిని, అవతారిక తర్వాత 50 పద్యాల్లో రామాయణ కథ సంగ్రహంగా ఉంది. అదే కథను కవి సంస్కృతంలో చెప్పి ఉంటాడనీ, అదే ఈ కథాసారం కావచ్చు నని పండితులు భావిస్తున్నారు. ఇది నేడు అలభ్యం. (ఆరుద్ర-10-75)

**రామాయణ చంపువు**

కర్త : కాణాదము పెద్దన సోమయాజి (చూ).

రచనాకాలం : క్రీ. శ. 18వ శతాబ్దం. (ఆం. సం. సా.)

**రామాయణ తాత్పర్య నిర్ణయ సంగ్రహమ్ (సం)**

కర్త : అప్పయ్య దీక్షితుడు.

**రామాయణపు గొబ్బిపాట**

జానపద పౌరాణిక గేయ రచన.

చూ. పౌరాణిక గేయములు.

**రామాయణమ్ (సం)**

నామాంతరం : శ్రీరామాయణ సార కావ్యతిలకమ్.

కవయిత్రి : మధురవాణి.

ఈ రామాయణం రఘునాథ నాయకుని తెలుగు రామాయణానికి సంస్కృతానువాదం. సుందరకాండ వరకు గల భాగం 14 సర్గలు మాత్రం లభించింది. మొత్తం 1500 శ్లోకాలున్నాయి. తన రామాయణాన్ని సంస్కృతంలో వ్రాయగల సమర్థులెవరా అని రఘునాథుడు ఆలోచిస్తుంటే శ్రీరామచంద్రుడే అతనికి కలలో కనబడి మధురవాణి పేరు సూచించాడట.

అయితే దొరికినంతవరకూ రఘునాథుని రామాయణంతో, మధురవాణి రామాయణం పోల్చిచూస్తే అది అనువాదం వలె కన్పించదు. సంస్కృతంలో కొంత విస్తృతి ఉన్నది. (అరుద్ర-10-80; ద.దే.వా-32)

**రామాయణము (అలభ్యం)**

కర్త : ఆరవీటి తిరుమలరాజు.

అంకితం : విరూపాక్ష దేవునికి.

ద్విపద కావ్యం. (ఆరుద్ర-10-199)

**రామాయణము**

కర్త : ఆలూరి కుప్పనకవి.

కాలం : క్రీ. శ. 18 వ శతాబ్దం.

కవి దీన్ని యక్షగానంగా రాశాడు. (క. స. 34)

**రామాయణము (అలభ్యం)**

కర్త : ఎఱ్ఱా ప్రెగ్గడ.

అంకితం : ప్రోలయ వేమారెడ్డికి.

రచనాకాలం : క్రీ. శ. 1324-49 మధ్యకాలం.

ప్రత్యేకత : దీనిలోని తొమ్మిది పద్యాలను కూచిమంచి తిమ్మకవి ఉదాహరించాడు. గణప వరపు వేంకటకవి మూడు పద్యాలను తన 'ప్రయోగరత్నాకరం'లో ఉదాహరించాడు. ఈ గ్రంథంలోనివని మరి నలభై ఎనిమిది పద్యాలను కీ. శే. వేటూరి వారు ఉదాహరించారు. కవి రామకథను భారతారణ్య పర్వశేషంలోనూ, హరివంశం పూర్వభాగంలో కూడా వర్ణించాడు. (వా.చ-24; ఆరుద్ర-3)

## రామాయణము

కర్త : కట్టా వరదరాజు.
అంకితం : శ్రీ వేంకటేశ్వరస్వామికి.
రచనాకాలం : క్రీ. శ. 1650 ప్రాంతం.

ద్విపద కావ్యం. కవిత్వం మిక్కిలి రసవంతంగా ఉంటుంది. ముద్రితం. జల్లి మాటలు, అపశబ్దాలు, పునరుక్తాలు లేకుండా సర్వోత్తమంగా వ్రాయాలనే పట్టుదలతో కవి దీన్ని రచించాడు. కథ యథా వాల్మీకంగా ఉంది. వేంకటేశ్వరుడు కలలో కనబడి కవిని ఈ రామాయణ రచనకు పురికొల్పాడట. (క.న-215; క.త-11-226)

## రామాయణము (అలభ్యం)

కర్త : కుందుర్తి వేంకటాచలకవి.
కాలం : క్రీ. శ. 18 వ శతాబ్ది పూర్వార్ధం.

వచన కావ్యమట. (క.న-253)

## రామాయణము (అలభ్యం)

కర్త : కొరవి సత్యనారన (చూ).

కొరవి గోపరాజు ఈ కృతికర్తను కవిస్తుతిలో నుతించాడు. (ఆరుద్ర-4)

## రామాయణము

కర్త : చిత్రకవి వేంకటరమణ కవి.
కృతిపతి: సుబ్బారాయుడు (వివరాలు తెలియవు).

ప్రత్యేకత : దీనికి "విద్వత్కవి కర్ణ రసాయన" మనే నామాంతర ముంది. ఇది సకల వర్ణనా పూర్ణ రామాయణ మని కవి చెప్పాడు. ఇది పిండిప్రోలు లక్ష్మణ కవి వ్రాసిన రావణ దమ్మీయం లాంటిదని చాగంటి వారన్నారు. "ఈ కవిపై నెవరో అభియోగము తేగా అతనిని రావణునిగాను, తనను రామునిగాను బోల్చి ఈ గ్రంథము రచించెనట." ఈ రామాయణంలో ఏడు కాండలున్నాయి. వివరాలు తెలిస్తేనే తప్ప దీనిలోని శ్లేష బోధపడదు. గ్రంథ ప్రతి శిథిలావస్థలో ఉంది. (ఆరుద్ర-9-209)

## రామాయణము

కర్త : చెన్నూరు రామన్న.
రచనాకాలం : క్రీ.శ. 1820 ప్రాంతం.

అంకితం : చిలుకూరులోని శ్రీరామస్వామికి.

సంస్కృత మూలానికి ఆంధ్రీకరణం. కవిత మిక్కిలి రసవంతమని పండితులు భావిస్తున్నారు. చిలుకూరు హుజూరు నగరం తాలూకాలోనిది. (క.స-191)

**రామాయణము**

కర్త : చేడ రాఘవరెడ్డి.
రచనాకాలం : క్రీ.శ. 1780 ప్రాంతం.

ద్విపద కావ్యం.

**రామాయణము**

కాలం : క్రీ.శ. 15 వ శతాబ్దం.
కర్త : తాళ్ళపాక అన్నమాచార్యులు.

ద్విపద కావ్యం. తెలుగులోని ద్విపద రామాయణాలలో ఒక విలక్షణతను సంతరించుకొన్న కావ్యం. దీని ప్రతి నష్టమైంది. (ఆరుద్ర-9)

**రామాయణము**

కర్త : తిరుమలాచార్యుడు
కాలం : క్రీ.శ. 1674 ప్రాంతం.

ఈకవి చిక్క దేవరాయల ఆస్థానంలోని వాడు. సంస్కృతాంధ్ర కర్ణాట భాషలలో ప్రవీణుడు. రామాయణం తిరుమాలాచార్యునిగా ప్రసిద్ధుడు. క్రీ.శ. 1674 నాటి దేవగిరి శాసనం ఇతడే రచించాడు. ఈతని రామాయణం అంతగా ప్రచారంలో లేదు. (ద.దే.వా-450)

**రామాయణము**

కర్త : తుపాకుల అనంత భూపాలుడు.
రచనాకాలం : క్రీ.శ. 1730 ప్రాంతం.

వచన కావ్యం. సుందర కాండను మాత్రమే ఇతడు వ్రాసినట్లు తెలుస్తున్నది.

**రామాయణము**

కర్తలు : దత్తాత్రేయులు, సింగరాజు వేంకట సుబ్బయ్య.
రచనాకాలం : క్రీ.శ. 1840 ప్రాంతం.

వచన కావ్యం. ఈ గ్రంథంలో దత్తాత్రేయులు రచించిన అరణ్యకాండ, కిష్కింధాకాండ - వేంకట సుబ్బయ్య రచించిన యుద్ధకాండ మాత్రం లభిస్తున్నాయి. గ్రాంథిక వచన రచన. (వ.వా)

**రామాయణము**

కర్త : దేవకి వేంకట సుబ్బకవి.

వచనకావ్యం. ఈ రామాయణంలో అరణ్య, కిష్కింధ, సుందర, యుద్ధ

కాండలు మాత్రమే లభ్యమైనాయి. సంస్కృత రామాయణానికి ఇది సరియైన ఆంధ్రీకరణం. దీనిలో ఇచ్చిన అధ్యాయ సూచన వల్ల ఈ విషయం తెలుస్తున్నది.
(వ. వా-46)

**రామాయణము (అలభ్యం)**

కర్త : బసవకవి.

ఇది సంస్కృత మూలానికి ప్రశస్తమైన అనువాదమని కావలి వేంకటరామస్వామి వ్రాశారు.

**రామాయణము (అలభ్యం)**

కర్త : మంత్రి భాస్కరుడు (చూ).

**రామాయణము**

కర్త : యాముజాల శేషాచలపతి.

ఇది యక్షగానం. అముద్రితం. (య. వా. చ-363)

**రామాయణము**

కర్త : రఘునాథ నాయకుడు.

కృతిపతి : శ్రీరాముడు.

బాలకాండలో 3 ఆశ్వాసాలు, నాల్గో ఆశ్వాసంలో 26 పద్యాలు మాత్రం లభించాయి. మొత్తం 467 గద్య పద్యాలు.

ప్రథమాశ్వాసంలో అవతారిక తర్వాత సంగ్రహరామాయణం (50 పద్యాలలో) చెప్పాడు. కోసలదేశం వర్ణించేటప్పుడు సుభిక్షమైన తంజావూరునే వర్ణించినట్లుంది.

దశరథుని పుత్ర కామేష్టి, అశ్వమేధం తదితర యాగాలను సహజంగా వర్ణించాడు. ఇందులోని భాష, సంభాషణారీతులు హృదయాహ్లాదకరంగా ఉంటాయి. ఈ రామాయణాన్ని అతని ఆస్థానంలోని మధురవాణి సంస్కృతంలో వ్రాసిందని అంటారు. ఈ రెండూ వేర్వేరు స్వతంత్ర కావ్యాలని పండితాభిప్రాయం. (ఆము్రద-10-80)

**రామాయణము**

కర్త : రెండవ ఏకోజీ (చూ).

రచనాకాలం : క్రీ.శ. 1730 ప్రాంతం.

ద్విపద రచన. ఆరు కాండలున్నాయి. కొందరు ఈ రచన మొదటి ఏకోజీ చేసినట్లు భావిస్తున్నారు. కాని కావ్యావతారిక నుండి ఇతడు రెండవ ఏకోజీ అని తెలుస్తున్నది. దీనికి మూలం వాల్మీకి రామాయణం. కవి మూలం నుండి కథను మాత్రం గ్రహించి స్వతంత్ర రచనగా తీర్చిదిద్దాడు. (ద. దే. వా-255)

**రామాయణము**

కర్త : ఖ్యామరాయకవి (చూ).

అంకితం : తుమ్మలపాటి సుబ్బరాయ శెట్టికి.

వచన రామాయణాలలో ఇదే తొలిదట. బాల, అయోధ్య, అరణ్యకాండలు మాత్రం లభించాయి. ఆయా సర్గల ప్రారంభంలో పద్యాలున్నాయి. ఇవి ఆయా సర్గల లోని విషయాలను సూచించేవిగా ఉన్నాయి. కలలో శ్రీరాముడు కనిపించి తన చరిత్రను తెనుగు చేయమనగా కవి అందుకు పూనుకొని ఈ రచన చేశాడు.

"చాతుర్వర్ణాశ్రమ జన సంఘంబులు పఠియింప యోగ్యంబుగా" ఈ రామాయణ వచన రచన సాగిందట. (ద. దే. వా-393)

**రామాయణము**

కవయిత్రి : హోసూరి సాకమ్మ (చూ).

యక్షగానం. ఇందులో దరువులు, లాలి పాటలు, కీర్తనలు, మంగళహారతులు, వచనాలు ఉన్నాయి. బాలకాండ మాత్రం క్రీ. శ. 1912లో కర్నూలులో చంద్రమౌళీశ్వర ముద్రాక్షర శాలలో ముద్రితం. అందులో కవయిత్రి అన్నదానము వేంకటాంబ అని ఉన్నది. తరువాత ఇది హోసూరి సాకమ్మ రచనగా పండితులు నిర్ధారించారు. హోసూరి సాకమ్మ బహుశః అన్నదానం వారి కోడలనీ, ఆమెకే వెంకటాంబ అన్నది నామాంతర మనీ కొందరి అభిప్రాయం. (ఆరుద్ర-12-323; ద. దే. వా-408)

**రామాయణము (సుందరకాండ)**

కర్త : పచ్చమెట్ల పాపయకవి.
కాలం : క్రీ.శ. 18 వ శతాబ్ది ఉత్తరార్ధం.

దండకం. కవి, సుందరకాండను దండకంగా రాశాడు.

**రామాయణ వ్యాఖ్య (బృహద్వివరణ)**

కర్త : ఈశ్వర దీక్షితుడు (చూ).

ఇది సంస్కృత రామాయణానికి బృహద్వివరణతో కూడిన వ్యాఖ్య.

**రామాయణ వ్యాఖ్య (లఘు వివరణ)**

కర్త : ఈశ్వర దీక్షితుడు.

ఇది సంస్కృత రామాయణానికి లఘు వివరణతో కూడిన వ్యాఖ్య.

**రామాయణ సంగ్రహము (అలభ్యం)**

కవయిత్రి : రంగాజమ్మ (చూ).

ఉషాపరిణయంలో ఈ కావ్య ప్రసక్తి ఉంది. (ద.దే.వా-132)

**రామాయణ సారసంగ్రహము**

కర్త : చూ. ముత్తేవి సుందర రామకవి. (ఆం.సం.సా-158)

**రామాయణ సారస్తవమ్ (సం)**

కర్త : అప్పయ్యదీక్షితులు.

ఇది మహా కావ్యమని పండితాభిప్రాయం. (తె.వి.స-6)

రామావఝ్ఝల కొండుభట్టు

కాలం : క్రీ.శ. 18వ శతాబ్దం.

రచన : కపిల గో సంవాదము.

నరసావధాని, అక్కమ్మల పుత్రుడు. మధురంగా, శ్రావ్యంగా కవిత్వం చెప్పాడు. ఇతని రచన అధ్యాత్మవిద్యా ప్రతిపాదకమైనది. (క చ-3-198)

రామేశం

నామాంతరం : విమిషకవి రామయ్య. (య.వా.చ)

రామేశ్వర మాహాత్మ్యము

కర్త : ఏనుగు లక్ష్మణకవి.

అంకితం : గురజానపల్లి మల్లేశ్వర స్వామికి.

క్షేత్ర మాహాత్మ్యాన్ని తెలిపే రచన. భద్రి రాజు మల్లమంత్రి కోరికపై కవి దీన్ని రాశాడు. ఆకరపల్లి కోదండరాముడు కవికి గురువని ఈ కావ్యం ద్వారా తెలుస్తున్నది. నందూరి కామమంత్రి కూడ ఈ రచనను ప్రోత్సాహించాడట. ఇందులోనుండి సమకాలీన విషయాలు చాలా తెలుస్తున్నాయి. (తె.వి.స-6)

రామేశ్వరరావు కథ

కర్త : తెలియదు.

జానపద చారిత్రక గేయం. ఈ రామేశ్వరరావు వనపర్తి సంస్థానాధీశుడు. అతనికి సంబంధించిన గాథ దీనిలోని ఇతివృత్తం.

రామేశ్వర విజయము

కర్త ; చూ. అర్చకం అయ్యమాచార్యులు.

వనపర్తి సంస్థాన ప్రభువైన రామేశ్వరరావుకు సంబంధించిన వివరాలు తెలిపే రచన. (ఆం.సం.సా)

రామోల్లాసమ్ (సం)

కర్త : భోగనాథుడు. (తె.వి.స-4)

రాయకవి తిప్పయ్య

నామాంతరం : అయ్యలరాజు త్రిపురాంతకుడు (చూ).

రాయని భాస్కరుడు

ఈయన వినుకొండ నేలిన మంత్రి. మహాదాత. ముప్పది ఇద్దరు మంత్రుల లోనివాడు. ఈయన దాతృత్వాన్ని తెలుపుతూ చాలా చాటు పద్యాలు శ్లోకాలూ దొరుకుతున్నాయి. (చా.ప.ర.)

రాయభట్టు వీరరాఘవకవి

కాలం : క్రీ.శ. 17వ శతాబ్దం కావచ్చు.

స్థలం : మోదుకూరు గ్రామం.
రచనలు : కస్తూరిరంగ శతకము, జలక్రీడా నాటకము, కృష్ణ లీలలు.

సలక్షణంగా రచన చేసిన కవి. కస్తూరిరంగ శతకంలో 75 పద్యాలు మాత్రం వ్రాశాడట. వాద్రేవు కామరాజు తక్కినవి తర్వాత కాలంలో పూర్తి చేశాడు. "శత్రు మదభంగ, నవఘన శ్యామలాంగ! సూరిచిత్తాబ్జ భృంగ, కస్తూరిరంగ" అనేది మకుటం.

మోదుకూరు తెనాలి తాలూకా చుండూరు సమీపంలోనిది. ఈ కవి ఇంకా చాలా రచనలు చేశాడని తెలుస్తున్నది. (శ.క.చ-450; క.స-225)

## రాయభట్టు వీరరాఘవ కవి II

కాలం : క్రీ.శ. 19 వ శతాబ్దం.
స్థలం : కార్వేటినగర సంస్థానం.
రచన : తెలియరాలేదు.

క్రీ. శ. 19 వ శతాబ్దం మధ్య కాలంలో కార్వేటి సంస్థాన పాలకుడైన వేంకట పెరుమాళ్ళరాజు బహద్దరు ఆస్థానంలోని అష్టదిగ్గజాలలో వీరొకరు. (ఆం.సం.సా)

## రాయ రఘునాథరాజు

కాలం : క్రీ.శ. 1769-1789.
రచనలు : 1. పార్వతీ పరిణయము 2. కవి జనోజ్జీవిని.

పుదుక్కోటను పరిపాలించిన రాజు. సంస్కృతాంధ్ర భాషలలో విద్వాంసుడు. దక్షిణ భారత దేశానికి చెందిన ప్రశస్త రాజ కవులలో పేర్కొనదగిన వాడు అగ్రహార ప్రతిష్ఠాత. కవి పోషకుడే కాక ప్రతాపవంతుడు కూడా.

బృహన్నాయిక భక్తుడు. తన కృతులలో అద్వైత పరతత్త్వాన్ని స్తుతించాడు. ఇతని ఆస్థానకవి సుదురుపాటి వెంకన ఈ రాజును గ్రంథ రచనకు ప్రోత్సహించాడు. ఇతని రచనలోని స్వతంత్ర కల్పనలు, జాతీయాలు, కవితాచాతురి, ఉత్తమ శ్రేణికి చెందినవని పండితాభిప్రాయం. ఇతడు వేయించిన శాసనాలలో ఒకటి తెలుగు భాషలో ఉంది. తనను "మహోద్దండ కవి విధేయు"నిగా చెప్పుకొని ఆస్థానకవి పట్ల గౌరవం చూపిన రాజు, ఇతడు. (ద.దే.వా-414)

## రాయవాచకము

రచనాకాలం : క్రీ.శ. 1529-64 ప్రాంతం.
కర్త : విశ్వనాథనాయకుని స్థానాపతి.

ప్రత్యేకత : ఇది విజయనగర రాజుల కాలపు రాజకీయ, సాంఘిక విషయాలను సమగ్రంగా తెలిపే వ్యావహారికాంధ్ర వచన కావ్యం. చారిత్రక విషయాలను తెలిపే తెలుగు గ్రంథాలలో ఇది మూడోది. ఇందులో కర్ణాటక రాజుల దినచర్య, విద్యారణ్య ప్రశంస, విద్యానగర నిర్మాణం, శంకుస్థాపన ముహూర్తం, కృష్ణరాయపట్టాభిషేకం,

రాయలకు మంత్రులు రాజనీతి ఉపదేశం, వేగులవారి నియామకం, కోశాదివివరణ, తిమ్మరుసు ప్రశంస, రాయలపట్టణ పరిశోధన, రాయల సేన వివరణ, విజయాపుర వృత్తాంతం, అశ్వపతి, గజపతి, నరపతుల తారతమ్యం, తురుష్కుల శీలం, అహమ్మదాబాదు, గోలకొండల వృత్తాంతం, ముస్లిముల దండన విధానం, గజపతులకు విషప్రయోగం, రాయలకు ముస్లిములతోడి యుద్ధాలు, వివిధ విజయాలు, దీనిలో సమగ్రంగా ఉన్నాయి. ఇది ఒక విధంగా కృష్ణరాయల చరిత్ర. వచన గ్రంథమయినా దీనిలో మొదట నాలుగు పద్యాలున్నాయి. దీనికి తెలుగు సాహిత్యంలో విశిష్టస్థానమున్నది.

కుమార ధూర్జటి కృష్ణరాయ విజయ కావ్యానికి ఇదే ఆధారగ్రంథం. ఇందుము నేసభాపతి విజయ ఋ అనే విశేష విషయ సంకలితమైన వచనం కూడా పొందుపరచబడి ఉంది. 16 వ శతాబ్దం నాటి తెలుగు భాషా స్వరూపాన్ని, రాజకీయాలలో ఉపయోగించే పద జాలాన్ని తెలిపే అధికారికమైన రచనలలో ఇది ఒకటి. చారిత్రకంగాను భాషా పరంగా కూడా అమూల్యమైన గ్రంథం. (ఆరుద్ర-9)

## రాయసము

వృత్తి పరంగా ప్రసిద్ధమైన ఇంటి పేరు. వ్రాయసకాడు లేక వ్రాయసము-అనేది పూర్వ కాలంలో ఒక ఉద్యోగం. రాజాజ్ఞలను, రాజ్య సంబంధమైన వ్యవహారాలను చక్కగా వ్రాయడం వీరి పని.

## రాయసము గణపయ్య

కాలం : క్రీ. శ. 16 వ శతాబ్ది కావచ్చు.

రచన : సౌగంధికాపహరణము (అలభ్యం).

విశిష్టత : ప్రబంధ రచన ప్రచారంలోకి వచ్చిన తరవాత కవులు పురాణేతిహాసాలలోని చిన్న చిన్న ఘట్టాలను తీసుకొని, అష్టాదశవర్ణనలు జోడించి కావ్యాలు వ్రాసేకాలంలో— కాకమానిమూర్తికవి భారతంలోనుంచి పాంచాలీ పరిణయఘట్టాన్ని తీసుకొని కావ్యం వ్రాసినట్లే, ఈయన 'సౌగంధికాపహరణం' కావ్యంగా వ్రాశాడు. ఈ కావ్యంలోని ఒక పద్యాన్ని అజ్ఞాత గ్రంథసంధాత 'ఉదాహరణ పద్యములు'లో చేర్చాడు. ఆపద్యం భీముడు, ఆంజనేయుడు సమావేశమైన ఘట్టంలోది. (ఆరుద్ర-9)

## రాయసము వేంకటపతి

కాలం : క్రీ. శ. 1574-1581 ప్రాంతం.

స్థలం : పెనుకొండ.

రచన : లక్ష్మీవిలాసము (చంపువు).

విశిష్టత : ఈయన శ్రీరంగరాయల దగ్గర వ్రాయసకాడు. శ్రీరంగరాయలు వసుచరిత్ర కృతిపతియైన తిరుమలదేవరాయల కొడుకు. రాయల చిత్తం చిగురించేటట్లు రాయసం వ్రాయటమేగాక, మంచి పద్యాలుకూడా చెప్పేవాడు. తిరుపతి వెంకన్న అనతి మేరకు కావ్యం వ్రాశాడు. ఇతడు సంస్కృతాంధ్రాలలో మంచి పండితుడేగాక సంగీత శాస్త్ర విశారదుడు కూడానట. (ఆరుద్ర-9)

రాయూరి అప్పన శాసనము

కాలం : క్రీ. శ. 1200 ప్రాంతం.
శాసన ప్రదాత : అప్పన.

శాసన విషయం : దీనిలో అప్పన పూర్వులు చేసిన దానప్రసక్తి ఉంది. దీనిలో రెండు శార్దూలాలు అసమగ్రంగాను, రెండు చంపకమాలలు, ఒక కంద పద్యం ఉన్నాయి. అప్పన దానశీలి. ఈయన అమరేశ్వరస్వామికి అఖండదీపం నిలిపినట్లు ఈ శాసనంవల్ల తెలుస్తున్నది. (తె.క.చ-312)

రావణ దమ్మీయము

కర్త పిండిప్రోలు లక్ష్మణకవి.
నామాంతరం : లంకావిజయము.

ఇది ద్వ్యర్థి కావ్యం. రెండు ఆశ్వాసాలున్నాయి. ధర్మరాయుడనే వెలమ కులజుడు కవిగారి లంకనేలను కొంత అపహరిస్తే-అతనిని రావణునితోను, క్షేత్రాప హరణ వృత్తాంతాన్ని రామాయణ కథతోను పోల్చి కవి ఈ కావ్యం వ్రాశాడు. భీమకవి, శ్రీనాథులు కూడా తనవలె తిట్టలేరని కవి చెప్పాడు. కావ్యం ప్రౌఢమైంది కాదు. చాలా చోట్ల అర్థ శ్లేష మాత్రమే ఉంది. వ్యాకరణ దోషాలు అక్కడక్కడా ఉన్నాయి. (క. చ-3-221; వా. చ-87)

రావిపాటి గురుమూర్తిశాస్త్రి

కాలం : క్రీ. శ. 19వ శతాబ్ది.
స్థలం : మదరాసు.
సమకాలికులు : సి.పి. బ్రౌన్‌దొర, జూలూరి అప్పయ్య, వఠ్యం అద్వైతబ్రహ్మశాస్త్రి

కృతులు : తెనుగు వ్యాకరణము, విక్రమార్క కథలు, పంచతంత్రము. సంస్కృతాంధ్రాంగ్లాలలో పండితుడు. ఇతడు సి. పి. బ్రౌన్ దొర గారికి తాళపత్ర ప్రతులను గ్రంథ రూపంలో వెలువరించడంలో చాల సహాయపడ్డాడు. కథా వాఙ్మయానికి మూలపురుషుడు. ఫోర్ట్‌సెయింటు జార్జి కళాశాలలో పండితుడుగా పనిచేశాడు. (తె.వి స-4)

రావిపాటి త్రిపురాంతకుడు

కాలం : క్రీ. శ. 14 శతాబ్ది పూర్వార్థం.
స్థలం : ఓరుగల్లు.
రచనలు : 1. త్రిపురాంతకోదాహరణము 2. మదన విజయము (రతిశాస్త్రము) (అలభ్యం) 3. చంద్రతారావళి 4. అంబికా శతకము (అలభ్యం) 5. ప్రేమాభిరామము (అలభ్యం).

అన వేమ, కుమారగిరి రెడ్లకు సమకాలికుడు కావచ్చు. ప్రేమాభిరామము క్రీడాభిరామానికి మూల గ్రంథమని కొందరి భావన. ఇది సంస్కృతంలో ప్రసిద్ధమైన రచన. ఈ త్రిపురాంతకునిదని చెప్పబడుతున్న ఒక చాటువును అప్పకవి ఉదాహరించాడు. సాహిత్య చింతామణిలో పెదకోమటి వేముడు ఒక శ్లోకాన్ని వాడుకున్నాడు. క్రీడాభి రామంలో శ్రీనాథుడు ఇతన్ని కీర్తించాడు. (రె. రా. చ.)

## రావిమెట్ల శాసనము

కాలం : క్రీ.శ. 1093 ప్రాంతం.

స్థలం : రాజమహేంద్రవర ప్రాంతం.

శాసన ప్రదాత : విజయాంక రక్షణుడు.

శాసన విషయం : విజయాంక రక్షణుడు అత్తిలి నాటికి రాజు. ఈయన ఎన్నో పుణ్యాలుచేసి, బంధువులను పోషించాడని శాసనంవల్ల తెలుస్తున్నది. 'వేగిమాద్య పలి'లో వెలసిన సకలేశ్వర స్వామికి అఖండ దీపం నెలకొల్పినట్లు ఈ శాసనం చెబుతుంది. ఇరుగరాజు తమ తండ్రులకు ధర్మంగా అఖండ దీపం పెట్టి, కొంత పొలాన్ని అక్కడి వారికి దీపారాధనకు కావలసిన నేతి నిమిత్తం దానం చేసినట్లు కూడా ఇందులో ఉంది. (తె.క.చ-169)

## రావిళ్ళ కొండ ప్రభువు

కాలం : తెలియదు.

స్థలం : జమ్మలమడక ప్రాంతం.

ఈయన జమ్మల మడక బైళ్ళమీద శత్రువులను గెలిచి రాజ్యం చేసినట్లు చాటువుల వల్ల తెలుస్తున్నది. ఈయన రావిళ్ళ ముద్దుకృష్ణయ్యకు తాత. రావిళ్ళవారు ఆరవీటి రాజుల సామంతులట. (చా.ప.ర)

## రావిళ్ళ ముద్దు కృష్ణయ్య

కాలం : తెలియదు.

వేంకటపతిరాజు కుమారుడు. ఈయన రావిళ్ళ వంశోద్ధారకుడని "గాయగోవాళ బల్లర గండ" బిరుదాంచితుడనీ చాటువుల వల్ల తెలుస్తున్నది. (చా.ప.ర)

## రావిళ్ళ వీరమల్లన్న

కాలం : తెలియదు.

ఈయనను స్తుతిస్తూ ఒక కవి చాలా చాటువులు చెప్పాడు. ఈయన వీరుడే గాక త్యాగధనుడట ఒకసారి ఒక కవికి మాన్యమిచ్చి పొరపాటున మళ్ళీ తీసుకొన్నాడట. ఆ కవి ఈయనను నిందిస్తూ పద్యాలు చెప్పాడు. (చాటుకవి వివరాలు తెలియవు) ఈయన 32 యుద్ధాల్లో గెలిచాడట. (చా. ప. ర.)

## రావిళ్ళ వేంకటపతిరాజు

కాలం : తెలియదు.

కొండప్రభువు కుమారుడు. రావిళ్ళ ముద్దు కృష్ణయ్యకు తండ్రి. మంచి పరా

క్రమ శాలి అని చాటువులవల్ల తెలుస్తున్నది. (చా. ప. ర.)

**రావిళ్ళ శేషనృపాలుడు**

కాలం : తెలియదు.

ఈయనను కీర్తిస్తూ కొన్ని చాటువులున్నాయి. చాటు కవిని గురించి తెలియదు (చా. ప. ర.)

**రావుకుమార వేంకట మహీపతిరాయలు**

కాలం : క్రీ. శ. 1765–1793 మధ్యకాలం.

స్థలం : పిఠాపురం.

పిఠాపురం సంస్థానాధిపతి సాహిత్య పోషకుడు. 1786 జమీకివచ్చి 1793 వరకు రాజ్య పాలన చేశాడు. దేవులపల్లి బాపన్న కవి ఇతని ఆస్థానంలోని వాడే. వేంకట మహీపతి రాయలు అతనికి "ఫకీరుద్దీన్ పాలెం" గ్రామంలో కొంత సుక్షేత్రాన్ని దానమిచ్చి సత్కరించాడట. (ఆం. సం. సా–247)

**రావు చిన మాధవరాయుడు**

కాలం : క్రీ. శ. 18వ శతాబ్దం (1710–1755).

స్థలం : పిఠాపురం.

పిఠాపురం సంస్థానాధిపతుల కోవలో 20 వ తరానికి చెందినవాడు. సాహితీ ప్రియుడు. బహుళ ప్రబంధ కర్తగా పేరు పొందిన "కూచిమంచి తిమ్మకవి"ని ఈ మాధవ రాయలు పరీక్షించి "కవి సార్వభౌమ" బిరుదం ప్రసాదించాడట. (ఈ విషయంలో వివాదాలున్నాయి). కూచిమంచి జగ్గకవి పుత్రుడూ, శతకంఠ రామాయణ కర్తా అయిన గంగన కవి కూడా ఈ మాధవ రాయలచేత సత్కరిపబడ్డారు. ఈ రాజుచేత బహూకరింపబడిన జల్లూరు చంద్రమపాలెం గ్రామాల కరణీకాలను, ఈనాములను, ఇప్పటికీ ఈ తిమ్మకవి వంశీయులే అనుభవిస్తున్నారట. (ఆం. సం. సా–246, 247)

**రావు మాధవ నాయకుడు**

నామాంతరం : మాదవ నాయకుడు.

రచన : రాఘవీయమ్ (సం).

ఈయన సింగభూపాలుని కుమారుడు. రాజకవి. (రె. రా. చ–488)

**రావు మాధవ రాయడు**

కాలం : క్రీ. శ. 1679–1704 మధ్య కాలం.

స్థలం : పిఠాపురం.

పిఠాపురం సంస్థానాధీశుడు. సాహిత్య పోషకుడు. "వాసవదత్తా పరిణయము" కృతిపతి. పిఠాపురం సంస్థానాధిపతుల కోవలో 18వ తరంవాడు. వాసవదత్తా పరిణయ గ్రంథకర్త "వక్కలంక వీరభద్రకవి" ఈతనికి ఆశ్రితుడు. మాధవరాయడు కవికి కోనసీమలో మాన్యాలు బహూకరించి గౌరవించాడు.

(ఆం. సం. సా–246)

రావు వేంకట నీలాద్రి రాయడు

కాలం : క్రీ. శ. 1778–1828.

స్థలం : పిఠాపురం.

సాహిత్యపోషకుడు. ఇతని కాలంలోనే కుంఫిణీ వారిచేత శాశ్వత పరిష్కారం జరిగి ఇతడు మొగల్‌పై స్రాయిచేత జమీందారుగా గుర్తింపబడ్డాడు: సమర్థుడైన పాలకుడు.

ఇతని సాహిత్య పోషణ అపారం పెక్కురు కవి పండితులను పోషించాడు. ఇతనికి మంత్రిగా ఉన్న "అవసరాల పద్మరాజు" స్వయంగా కవి. బాలభాగవత చంపూ ప్రబంధ కర్త దువ్వూరి విశ్వనాథశాస్త్రి, ప్రతివాద భయంకర రాఘవాచార్యులు ఇతని ఆస్థానంలోని పండితులు. దేవులపల్లి రామశాస్త్రి కూడ ఈ ప్రభువుకు ఆస్థాన విద్వాంసుడుగా ఉన్నాడు. లంకా విజయ ద్వ్యర్థి కావ్యకర్త "పిండిప్రోలు లక్ష్మణకవి" చెళ్ళపిళ్ళ నరసకవి (1795–1840) ప్రభృతులు ఈతనిచేత సత్కరింపబడ్డవారే. వక్కలంక వీరభద్రకవి పౌత్రుడైన "వక్కలంక చిన వీరభద్రకవి"ని ఈతడు సాదరంగా ఆస్థానానికి పిలిపించి, వాసవదత్తా పరిణయ గ్రంథానికి అనుబంధంగా తమ వంశచరిత్రను వ్రాయించినాడట. కూచిమంచి తిమ్మకవి పౌత్రుడైన "తిమ్మకవి" ఇతని కాలంలోనివాడే

బాలభాగవత చంపువు, రామాభ్యుదయ చంపువు, మాధవ విలాసభాణము సుజనమనః కుముద చంద్రిక మొదలగు రచనలు ఈ ప్రభువు కాలంలో పిఠాపురం సంస్థానం తరపున ఆంధ్ర సారస్వతానికి లభించాయి.

(ఆం. సం. సా–244, 247, 248, 249, 259)

రావు వేంకట సూర్యరాయడు

కాలం : క్రీ. శ. 19వ శతాబ్దం.

స్థలం : పిఠాపురం.

రావు వేంకట నీలాద్రి రాయని పుత్రుడు. పిఠాపురం సంస్థానాధిపతి. తనికెళ్ళ సుబ్బరాయ శాస్త్రి రచించిన సూర్యరాయ తారావళికి కృతిపతి. క్రీ. శ. 1844లో జమికి వచ్చాడు. క్రీ. శ. 1850లో మరణించాడు. ఇతడు జమీని పాలించింది అతి స్వల్పకాలం.

(ఆం. సం. సా–250)

రావూరి ఎల్లయ

నామాంతరం : కావూరి ఎల్లయ.

## రావూరి రాఘవరెడ్డి

కాలం : క్రీ. శ. 1526–1589 ప్రాంతం.

స్థలం : ఉదయగిరి.

సాహిత్యపోషకుడు. వెన్నెలకంటి సూరన విరచిత విష్ణుపురాణానికి కృతిపతి. ఈయన క్రీ. శ. 16 శతాబ్ది పూర్వార్ధంలో నెల్లూరు జిల్లా ఉదయగిరి రాజధానిగా రాజ్యం చేశాడు. ఈయన తండ్రి బసవరెడ్డి కటక ప్రభువులయిన గజపతులవల్ల, విజయనగర పాలకులవల్ల గౌరవ చిహ్నాలు పొందాడు. ఇతడు వేమారెడ్డి వంశానికి చెందినవాడు. (తె వి. స–4)

## రావూరి వేంగామాత్యుడు

కాలం : 1800 ప్రాంతం.

సాహిత్యప్రీతికలవాడు. అనమగుర్తి రంగయ్య రచించిన యాదవగిరి మాహాత్మ్యమనే ప్రబంధం ఇతనికే అంకితం. (క. ప–178)

## రావూరి సంజీవరాయ కవి

కాలం : క్రీ. శ. 1730–86 ప్రాంతం.

స్థలం : మందశము (మంగళగిరి తాలూకా–గుంటూరు మండలం)

బిరుదు : కవి విరాట్.

రచనలు : రుక్మిణీ పరిణయము, వీరనారాయణ శతకము, వసుదేవనందన శతకము, భాగవతములోని ఏకాదశ ద్వాదశ స్కంధములు, త్రివిక్రమ విలాసము, కృష్ణలీలా తరంగము మొదలగునవి.

గురవ కవీంద్ర పెద్దమాంబల పుత్రుడు రఘుపతి పౌత్రుడు ఇతని స్వగ్రామము మందశం (మందడం). ఇది బెజవాడకు సమీపంలో ఉంది ఇతని పూర్వీకులు తెనాలి తాలూకా పెదరావూరు వాస్తవ్యులట. అక్కడ గ్రామ కరణాలు వీరే. ఇతనిది కొలనుపాక అని కొందరి అభిప్రాయం. అక్కడ కూడా ఈ కవి భూములు సంపాదించాడు.

క్రీ శ. 1730 నాటికే ఇతడు కవిగా ప్రసిద్ధుడు. ఉభయభాషా విశేషరసగుణాలంకృతి కలవాడు. ఇతనిని గురించి చాలా కథలు ప్రచారంలో ఉన్నాయి ఇతనికి ఉర్దూ భాష కూడా వచ్చునట. నైజాం మండలంలోనూ, ఇతర సంస్థానాలలోను చాలా క్షేత్ర సంపాదనం చేశాడట.

రుక్మిణీపరిణయం ఇతనిది కాదనీ, కొప్పర్తి నరస కవి కృతమని కొందరి అభిప్రాయం. కాని ముద్రిత ప్రతులలో సంజీవరాయ కవిపేరే ఉంది

ఇతడు చిత్ర బంధ కవిత్వం కూడా చెప్పాడు. తాను వ్రాసిన కొన్ని పద్యాలకు తానే స్వయంగా సంస్కృతంలో అర్థం వ్రాశాడట. (శ.క.చ–373)

రావెళ్ళ లింగమనాయకుడు

కాలం : క్రీ. శ. 17 వ శతాబ్దం.

స్థలం : కొచ్చెర్లకోట సీమ (నెల్లూరు ప్రాంతం.)

సాహిత్యప్రియుడు. కృతిపతి. కొచ్చెర్లకోటసీమను పాలించిన రాజు. రావెళ్ల (రావిళ్ళ) వారు, అరవీటి రాజులకు సామంతులుగా ఉండేవారు. వీరి సాహితీపోషణనూ పరాక్రమాలనూ చాటుతూ చాలా చాటువులున్నాయి. లింగనాయకుడు గోల్కొండ పాలకుడైన సుల్తాన్ అబ్దుల్లాకి (1617-76) సమకాలికుడు.

రత్నాకరం గోపాలరాజు ఇతని ఆశ్రయంలో ఉండి రచనలు చేశాడు. అతని "సౌగంధికా కుసుమ ప్రసవాపహరణము" ఈ లింగమనాయకునికే అంకితం.

(అరుద్ర-12-189)

రాస క్రీడలు (అలభ్యం)

కవి : విజయరాఘవ నాయకుడు.

యక్షగానం. ప్రదర్శనార్థం రాసిన సంగీత నృత్య రూపకం కావచ్చు.

(ద.దే.వా-87)

రాస నాటకాలు

నామాంతరం : వెన్నెల నాటకాలు (చూ).

రాస ప్రబంధము

నాట్యానుగుణమయిన గీత రచనా విశేషం. "రాసము.... నాట్య కథా ప్రబంధ నోల్లాసము బంధ చిత్రిత విలాసము.... మండలీకృత విభాసిత తాళ లయాను సంధ విన్యాసము" అని శ్రీ గోపాలకృష్ణ విలాసంలో రామాయణం వేంకట నారసింహ కవి చెప్పాడు.

భాగవత దశమ స్కంధంలో "శంఖ పద్మ వజ్ర కందుక చతుర్ముఖ చక్ర వాళ చతుర్భద్ర సౌభద్ర నాగ నంద్యావర్త కుండలీకరణ కురళీబంధ ప్రముఖంబులు" రాస క్రీడా ప్రబంధాలుగా పేర్కొనబడ్డాయి.

నృత్య ప్రక్రియకు అనుకూలాలయిన గీత ప్రబంధాలే రాస ప్రబంధాలు. దీనికి సంగీత రత్నాకరంలో లక్ష్యముంది. కానుకొలను వేంకటదాసు 'శ్రీకృష్ణ నాటక యక్షగాన మహా ప్రబంధ రాస క్రీడ విలాసము' చెప్పాడు. (య.వా.చ-340-41)

రాళ్ళబండి పట్టాభి రామరాజు

కాలం : క్రీ.శ. 17 వ శతాబ్ది.

స్థలం : కుంకెళ్ళగుంట (కుంకులగుంట) గ్రామం.

ఈయన నరసారావుపేట సంస్థానాధిపతి అయిన మల్రాజు గుండారావు ఆస్థాన కవి. 'కృష్ణా' స్నానాలకు ఈయన అమరావతికి పోయి, ప్రభువైన వేంకటాద్రి నాయని త్యాగ శీలాన్ని విని, ఆయనను కీర్తించాడు. తన ఉప్పు పులుసు తిని, సాటి వారి సభలో పరాయి రాజును కీర్తించి, తనను కించపరిచినందుకు గుండారావు కోపించి

పట్టాభి రామరాజు తిరిగి నరసారావుపేట సీమలో అడుగు పెడితే ఫిరంగులతో కాల్చివేయ మని ఆజ్ఞాపించాడు. ఈ సంగతి తెలిసిన భట్టుకవి (పట్టాభి రామరాజు) భయపడి వేంక టాద్రి నాయని ఆస్థానంలోనే చేరిపోయాడు. వెలమ దొరల కొలువు వేయి సంవత్సరాలు చేసినా, కాసు పీసమైనా కనబడదని, వెలమవారు మెచ్చితే మంచి ముచ్చట్లు చెబుతారని, కోపిస్తే ప్రాణాలయినా తీస్తారని ఇంకొక పద్యం చెప్పాడు.

ఈయన మైదోలు రామన్న మంత్రి, భాస్కరుని బలరామన్న, కుడుముల రామన్న, కుడుముల వాసయ్య, కోట కోటీశము మొదలగు వారిమీద చాలా చాటు పద్యాలు చెప్పాడు. (చా.ప.ర)

రుంజలవారు

విశ్వ బ్రాహ్మణులను ఆశ్రయిస్తూ, వారిని ఆరాధిస్తూ, వారిపై ఆధారపడిన కళాకారులే రుంజలవారు. వీరి ముఖ్య వాయిద్యం 'రుంజ' కావటంవల్ల వారికి ఆ పేరు వచ్చిందంటారు.

వీరు సంచార జాతులుగా తెలుగు దేశంలో ఉన్నారు. వీరిని విశ్వబ్రాహ్మ ణులు ఎంతో ఆప్యాయంగా చూస్తారట. వీరు విశ్వకర్మ పురాణాన్ని గానంచేసి పారి తోషికాలు పొందుతూ ఉంటారు. ఒక్కొక్క జట్టులో "రుంజ" వాయించే వారు పది మంది వరకు ఉంటారు. అందరూ రుంజను అద్భుతంగా వాయిస్తారు.

(నా. ర. చ - 282)

రుక్మవతీ పరిణయము

కర్త : చూ. అనఘము కోదండరామకవి.

చూ. రుక్మావతీ పరిణయము. (ఆం.సం.సా-455)

రుక్మవతీ పరిణయము

కర్త : (చూ) రేవపల్లి సోమనాథకవి.

అంకితం : జాకర్లపూడి గోపాలరాయ పాయకరావుకు.

ఐదాశ్వాసాల ప్రబంధం. కృతిపతి వంశచరిత్ర విస్తరంగా చెప్పబడింది.

ఇతివృత్తం : మన్మథుడు ప్రద్యుమ్నుడుగా జన్మించడం మొదలుకొని, శంబరాసురుని వృత్తాంతం, అతని వధ, మేనమామ రుక్మి తనయ రుక్మవతిని స్వయంవరంలో గ్రహించటం వరకు ఉంది. మూలం భాగవత దశమస్కంధంలోని కథ. సమకాలీన చారి త్రిక విశేషాలు కొన్ని చెప్పబడ్డాయి. సంస్కృత పదభూయిష్ఠమైన రచన. ఓజస్సు, ప్రసాద గుణం కావ్యమంతటా కనిపిస్తాయి. (క.త-13-61)

రుక్మాంగద చరిత్ర (అలభ్యం)

కర్త : చదలవాడ మల్లన.

అంకితం : కొండవీటి పాలకుడు బాచమరుసయ్యకు (రామయ భాస్కరుడు)

ద్విపదకావ్యం. తెలుగులో దీనిని ఇంతకుముందే ఏకాదశ మహాత్మ్యం అనే పేరుతో ప్రౌఢకవి మల్లన కావ్యంగా వ్రాశాడు. దీనిని లాక్షణికులు ప్రమాణంగా అంగీక

రించారు. అప్పకవి అఖండయతులను చెప్పేటప్పుడు దీనిలో నుంచి రెండుపాదాలను ఉదాహరించాడు. (ఆరుద్ర-8-149)

రుక్మాంగద చరిత్ర
నామాంతరం : ఏకాదశీ మాహాత్మ్యము (చూ).
కర్త : ప్రౌఢకవి మల్లన.

రుక్మాంగద చరిత్ర
కర్త : మేరత్తూరు వేంకట రామశాస్త్రి.

మేరత్తూరు భాగవత మేళనృత్య నాటకం. సులలితమైన కైశికీవృత్తిలో రచన సాగింది. (తె.వి స-4)

రుక్మాంగద చరిత్ర
కర్త : వేంకటగిరి.
అంకితం : విష్ణునికి.

మూడాశ్వాసాల ద్విపద కావ్యం. కవి దీన్ని ఖండోజీరాయని కోరికమీద రాశాడట. పరమభక్తుడైన రుక్మాంగదుని చరిత్ర వర్ణితం. కృత్యాదిలో కవి వంశచరిత్రవల్ల ఇతని అన్న గిరిరాజ కవిని గురించికూడా తెలుస్తున్నది. ఇతనికంటెముందు చదలవాడ మల్లన రుక్మాంగద చరిత్ర ద్విపదలో వ్రాశాడు. (ద.దే.వా-227)

రుక్మావతీ పరిణయము
కర్త : అనఘము కోదండ రామకవి (చూ).

అయిదాశ్వాసాల శృంగార ప్రబంధం ప్రద్యుమ్నుడు తన మేనమామ కూతురిని పెళ్ళిచేసుకోవడం ఇందులోని కథ శైలి ధారాళంగా ఉంది. (ఆరుద్ర-10-254)

రుక్మిణీ కల్యాణమ్ (సం)
కర్త : విశ్వేశ్వరకవి.

నాటకం.

రుక్మిణీ కల్యాణము
కర్త : తెలియదు.

జానపద పౌరాణిక గేయం. కథ భాగవతానికి సంబంధించినది.

రుక్మిణీ కల్యాణము
కర్త : మేరత్తూరు వేంకటరామశాస్త్రి.

సంగీత నృత్య రూపకం. నృసింహ జయంత్యుత్సవాల్లో ప్రదర్శింపబడుతుండేది. దీనిని సంగీత రూపకంగా ఆకాశవాణి ప్రసారం చేసింది. రచన సులలితమైన కైశికీ వృత్తిలో ఉంది. (శారదాధ్వజం-124)

రుక్మిణీకల్యాణము (అలభ్యం)

కర్త : విజయ రాఘవనాయకుడు.

ఘనమైన యక్షగానంగా కవి దీన్ని పేర్కొన్నాడు. (ద.దే.వా-88)

రుక్మిణీ కృష్ణ వివాహము (అలభ్యం)

కర్త : రఘునాథ నాయకుడు.

యక్షగానం. ఈ కృతిని రఘునాథుని ఆస్థానంలోని విరిబోండ్లు వినిపిస్తుండే వారట. (ద.దే.వా-35)

రుక్మిణీపతి శతకము

కర్త : దిట్టకవి రామయోగి.

చక్కని ధారాశుద్ధిలో ప్రౌఢంగా ఉన్న రచన. (శ.క.చ-850)

రుక్మిణీ పరిణయ నాటకము

కర్త : వేంకటనారాయణ కవి.

ప్రదర్శనానుగుణమైన యక్షగాన నాటకం. (వీ యు-208)

రుక్మిణీ పరిణయమ్ (సం)

కర్త : ఆనివిళ్ళ వేంకటశాస్త్రి.

కావ్యం. (తె వి స-4)

రుక్మిణీ పరిణయమ్ (సం)

కర్త : చక్రకవి.

(తె.వి స6-222)

రుక్మిణీ పరిణయమ్ (సం)

కర్త : రాజ చూడామణి దీక్షితుడు.

చారిత్రక ప్రశస్తిగల 10 సర్గల కావ్యం. కావ్యావతారిక నుండి ఆనాటి చారిత్రకాంశాలు తెలుస్తున్నాయి.

ఇతివృత్తం రుక్మిణీ కృష్ణుల పరిణయం. (తె వి.స-6-242; తం.ఆం.నా-196)

రుక్మిణీ పరిణయమ్ (సం)

కర్త : రామవర్మ.

నాటకం. (తె.వి స-6)

రుక్మిణీ పరిణయము [అలభ్యం]

కర్త : తెలియదు.

కాలం : క్రీ. శ. 16 వ శతాబ్దం ఉత్తరార్ధం కావచ్చు.

అంకితం: పూసపాటి కృష్ణమరాజుకు.

'ఉషాభ్యుదయ' ప్రబంధం ద్వారా ఈ కావ్యం గురించి తెలుస్తున్నది. ఈ కృష్ణమరాజు క్రీ. శ. 16వ శతాబ్దం ఉత్తర భాగంలో సంస్థానాధీశుడై ఉండవచ్చును. (ఆం.సం.సా-412)

రుక్మిణీ పరిణయము

రచనాకాలం : క్రీ.శ. 1750 ప్రాంతం.
కర్త : ఉన్నవ యోగానందుడు.

కావ్యం, వివరాలు తెలియవు. (క.స-175)

రుక్మిణీ పరిణయము

కర్త : (చూ) కూచిమంచి తిమ్మకవి.
అంకితం: పిఠాపురంలోని కుక్కుటేశ్వరస్వామికి.
రచనాకాలం : క్రీ.శ. 1715 ప్రాంతం.

ఐదాశ్వాసాల శృంగార ప్రబంధం.

మూలం భాగవతంలోని రుక్మిణీ కల్యాణగాథ. ప్రౌఢమైన రచన. పిఠాపుర వర్ణన రమణీయంగా ఉంది. ఇది కవి తొలి రచన అని కొందరు భావిస్తున్నారు.

రుక్మిణీ పరిణయాన్ని సత్యవోలు భగవత్కవి, లింగనమఖి కామేశ్వరకవి, కొప్పర్తి నరసన్న, మణికొండ వెంకటరమణ, రావూరి సంజీవరాయ కవి ప్రబంధాలుగా వ్రాశారు. అన్నిటిలో తిమ్మకవి రచనయే మేలుగా ఉంది. (క త-13-168)

రుక్మిణీ పరిణయము (అలభ్యం)

కర్త : పడకండ్ల గురురాజకవి.

గద్యపద్యాత్మకమైన రచనగా కవి మరో రచనయైన "శేషధర్మములు"లో పేర్కొనబడింది.

రుక్మిణీ పరిణయము

రచనాకాలం : క్రీ. శ. 1786 ప్రాంతం.
కర్త : రావూరి సంజీవరాయకవి.

ముద్రితం. కృత్యాదిలో కవిని గురించి వివరంగా ఉంది. ఈ కావ్యం రచించినది కొప్పర్తి నరసకవి అని కొందరి అభిప్రాయం. రచన ప్రౌఢమైనది. చిత్ర బంధ కవితా రీతున్నాయి. (శ.స-281) (శ.క.చ-373)

రుకిణ్మీ పరిణయము (అలభ్యం)

కర్త : లింగనమఖి శ్రీ కామేశ్వరకవి (చూ).
అంకితం : ముద్దళఘరి (క్రీ. శ. 1675-78) కి.

కృతిపతి మధుర నాయకరాజు వంశానికి చెందినవాడు. (ద.దే.వా-321)

రుక్మిణీ పరిణయము

కర్త : సత్యవోలు భగవత్కవి.

అంకితం : అలమేలు మంగ, వేంకటేశ్వర స్వాములకు.

నాలుగాశ్వాసాల ప్రబంధం. భాగవతంలోని రుక్మిణీ కల్యాణగాథ దీనికి మూలం.

విశేషం : ఇందులో దశావతారాలను వర్ణిస్తూ చెప్పిన పదకొండు సీస పద్యాలు మిక్కిలి ప్రసిద్ధమైనవి. వీటిని బ్రాహ్మణ సంతర్పణలలో భోజనకాలంలో తరచుగా చదువుతుంటారు. ఇందులోని దండకం ఒకటి, విడిగా ప్రాచుర్యాన్ని పొందింది.

ఈ దశావతార పద్యాలను దిట్టకవి ప్రకాశవివిగా కాశీచయనుల లక్ష్మణకవి పేర్కొన్నాడు. భగవత్కృతి దశావతార పద్యాలలో 'వైకుంఠనాథ లక్ష్మీసనాథ రక్షణ పరాయణుండ, నారాయణుండ' అనే మకుటముంటుంది. (క.త-13-151; శ క చ-706)

## రుక్మిణీ సత్యభామా సంవాదము

కర్త : (చూ) శహాజీ.

కాలం : క్రీ. శ. 18 వ శతాబ్దం.

సంవాద నాటకం. రుక్మిణీ సత్యభామలలో కృష్ణుడు రుక్మిణితోనే మాట్లాడుతూ ఉంటే సత్యభామ ఆగ్రహించడం, వారి సంభాషణలు – చివరకు ఇద్దరూ కలిసి కృష్ణుని సేవించడం ఇందులోని కథ. (వ దే.వా-198)

## రుద్రదేవుడు

కాలం : క్రీ. శ. 1158-1195 ప్రాంతం.

స్థలం : ఓరుగల్లు.

రచన : నీతి సారము (సంస్కృతంలోనూ, తెలుగులోనూ.)

ఓరుగల్లు కాకతి రెండో ప్రోలరాజు కుమారుడు. ఇతడే మొదటి ప్రతాపరుద్రుడు.

మడికి సింగన ఈ రుద్రదేవుని నీతిసారంలోని కొన్ని పద్యాలను తన "సకల నీతి సమ్మతం"లో సంకలనం చేశాడు కాని కర్త పేరు చెప్పలేదు. (క.త-2)

## రుద్రమహిమ (అలభ్యం)

కర్త : మల్లికార్జున పండితుడు.

కాలం : క్రీ.శ. 1150 ప్రాంతం.

## రుద్రరాజు తిరుమల రాజు

కాలం : క్రీ శ. 1800 ప్రాంతం.

స్థలం : గోదావరీ మండలం.

సాహిత్య పోషకుడు. క్రొత్తలంక మృత్యుంజయ కవి రచనగా చెప్పబడుతున్న "నిరోష్ఠ్య నలచరిత్ర" కావ్యపు కొన్ని వ్రాత ప్రతులలో గద్యలో తిరుమల రాజు పేరున్నది. ఇతడే ఆ కావ్యం రచించినట్లున్నది. మృత్యుంజయ కవి ఇతని కాశ్రితుడై తన రచనలో ఇతని పేరు పెట్టి ఉండవచ్చును. ఈ నిరోష్ఠ్య నలచరిత్ర అంతర్వేది లక్ష్మీనృసింహ స్వామికి అంకితం. (క.చ-3-166)

రుద్ర సహస్ర నామములు

కర్త : మల్లికార్జున పండితుడు.

కాలం : క్రీ.శ. 1150 ప్రాంతం.

రుద్రాక్ష మాహాత్మ్యము

కర్త : అమలాపురపు సన్యాసికవి.

మూడాశ్వాసాల ప్రబంధం. ప్రతులు నేడు అలభ్యం. ఇది రుద్రాక్ష ఫల మాహాత్మ్యంగా ప్రసిద్ధం. దేవులపల్లి చంద్రశాస్త్రి, తుమురాడ పాపకవి ఈ కవిని గురించి చెప్పారు.

రూపకము

రూపక ప్రక్రియ నాట్యవేదానికి సంబంధించినది. నటవిటగాయక సంబంధి అయిన నాటక కళకు ఆధ్యాత్మికత్వం, పవిత్రత కల్పించి ప్రాచీనులు దీనిని ఉపవేదాలలో చేర్చారు. నాట్యం ఆధారంగా రూపకాలు, నృత్యం ఆధారంగా ఉపరూపకాలు వచ్చినాయని 'భావప్రకాశిక' చెబుతున్నది. పూర్వం రూపకాలను అప్సరసలు ప్రదర్శించేవారట.

ఇది దృశ్యకావ్యం. ఇందులో నాంది ప్రస్తావన, విష్కంభము, అంకము, రంగము, పంచసంధులు మొదలగునవి ఉంటాయి. సూత్రధారుడు రంగాధ్యక్షుడు. నాయికానాయకులు, నట, నర్తక, విట, విదూషకాదిపాత్రలుంటాయి. ఇంకా చాలా రకాల పాత్రలుంటాయి. రూపకంలోని పాత్రలు ఉత్తమ, మధ్యమ, అధమములనే భేదాలతో ఉంటాయి. పాత్రోచిత భాష నియతమై ఉంటుంది. భరతుడు తన నాట్య శాస్త్రంలో దశవిధ రూపకాలను, నాటికా లక్షణాలను చెప్పాడు.

భరతుడు చెప్పిన దశవిధ రూపకాలివి :

1. నాటకము 2. ప్రకరణము 3. భాణము 4. ప్రహసనము 5. డిమము 6. వ్యాయోగము 7. సమవాకారము 8. వీథి 9. అంకము 10. ఈహామృగము.

భరతుడు 'నాటిక'ను గురించి కూడా చెప్పాడు కాని ఉపరూపకాలను ప్రస్తావించలేదు. సాహిత్య దర్పణకారుడు, శారద తనయుడు కోహలుడు మొదలగు వారు 36 ఉపరూపకాలను గురించి చెప్పారు. (చూ-ఉపరూపకాలు). (తె.వి స-6)

రెంటూరి చిట్టనామాత్యుడు

కాలం : క్రీ.శ. 16 వ శతాబ్దం.

స్థలం : విజయనగరం.

సాహిత్య ప్రీతి కలవాడు. భానుకవి తెనిగించిన పంచతంత్రాన్ని అంకితం పొందమని లక్ష్మీనారాయణునికి ఆలోచన చెప్పినవాడు ఇతడే. ఇతడు శ్రీకృష్ణ దేవరాయల కాలంవాడు కావచ్చును (క.స-149)

రెండో వెంకటపతి రాయలు

కాలం : క్రీ.శ. 1586 – 1614 ప్రాంతం.

స్థలం : పెనుకొండ.

విశిష్టత : ఈయన కవి పండిత పోషకుడు. వసు చరిత్ర కృతిభర్తయైన తిరుమల దేవరాయల కుమారుడు. కర్నూలు జిల్లా, నంది కొట్కూరు తాలూకా తరిగొప్పుల గ్రామంలోని విద్వాంసులైన నరసన్నను, ఆయన కుమారులు అప్పయ్య, దత్తన్న, మల్లనలను ఆదరించి పోషించాడు. దత్తన్న ఈయన కొలువులో వ్రాయసకాడు. అక్లే "చంద్రభాను చరిత్ర" కృతికర్త, దత్తన్న సోదరుడు మల్లన కూడా ఈయన దగ్గర వ్రాయసకాడుగా ఉండేవాడు. ఈ రాయల దగ్గర మల్లనకు చాలా పలుకుబడి ఉండేది. (ఆరుద్ర-9)

రెట్టమత శాస్త్రము

కవులు : అయ్యల, భాస్కర కవులు.

అంకితం : కొండ్రాజు వెంకటాద్రికి.

కాల స్వరూపాదులను తెలిపే అయిదాశ్వాసాల పద్య కావ్యం.

ప్రత్యేకత : కన్నడంలో రెట్టడు అనే శాస్త్రజ్ఞుడు వ్రాసిన గ్రంథానికి తెనిగింపు. ప్రతి పద్యంలోను వెంకటాద్రి పేరుగాని రెట్టవిపేరుగావివచ్చేటట్టు వ్రాశారు. కవులుతమను గురించి ఏ వివరాలు చెప్పుకోలేదు ఇందులోవర్షానికి, పంటలకు సంబంధించిన వివరాలున్నాయి. ఇది ఒక రకంగా దోనయామాత్యుని సస్యానందం వంటిది. ఈ గ్రంథంలో చివర భాగం జ్యోతిష్యం. ప్రభవ, విభవ మొదలగు అరవై సంవత్సరాలకు ఫలితాలు ఉన్నాయి. (ఆరుద్ర-9)

రెడ్డిపల్లె ముద్దమరాజు

కాలం : క్రీ.శ. 16 వ శతాబ్ది.

స్థలం : రెడ్డిపల్లి.

రచన : అష్టమహిషీ కల్యాణము (అలభ్యం).

విశిష్టత : ఈయనకు ముందే అష్ట మహిషీ కల్యాణాన్ని తాళ్ళపాక చిన్నన్న ద్విపదలో రచించి ఉండవచ్చు. ఈ కవి చిన్నన్నకు అర్వాచీనుడు కావచ్చు. లభించిన పద్యాలను బట్టి కావ్యం చంపువు అని ఊహిస్తున్నారు. 2 పద్యాలను మాత్రమే అజ్ఞాత గ్రంథ సంధాత ఉదాహరించాడు. రెండూ అవతారికా పద్యాలు. ఒక పద్యంలో మంగళా చరణం. రెండోదానిలో వాల్మీకి ప్రశంస ఉంది. కవి అనంతపురం జిల్లా కదిరి తాలూకాలోని రెడ్డిపల్లి నివాసి కావచ్చునని పండితాభిప్రాయం. (ఆరుద్ర-9)

రెవరెండు క్యారీ

కాలం : క్రీ. శ. 1812 ప్రాంతం.

ఈయన వ్రాసి ముద్రించిన గ్రంథాలు :

1 దేవునియొక్క సువార్తలు (క్రీ. శ. 1812) 2. ఏసు క్రీస్తు నూతన నిర్ణయము (క్రీ. శ. 1818) 3. తెలుగు భాషా వ్యాకరణము (A Grammar of Telugu language).

ఆంగ్ల భాషలో తొలి తెలుగు వ్యాకరణాన్ని వ్రాశాడు. (వ. వా-51)

## రేకపల్లి సోమనాథకవి

వ్యవహారనామం : సోమప్ప శాస్త్రి.
కాలం : క్రీ. శ. 1720-90 ప్రాంతం.
స్థలం : గోదావరి మండలంలోని తాళ్ళపూడి.
సంస్థానం : సత్యవరము (విశాఖపట్టణం మండలం).
సమకాలికుడు : అడిదము సూరకవి
రచనలు : రుక్మవతీ పరిణయము.

తర్క వ్యాకరణాది శాస్త్రాలలో విష్ణాతుడు. సాంగ శిరస్క వేదాధ్యేత. గౌతమ రాజనే ఆంధ్ర పండితకవి దగ్గర ఆంధ్ర ఛందఃశాస్త్రం నేర్చుకొన్నాడట. సత్యవరం సంస్థానంలో కాకర్ల గోపాలరాయపాయకరావు ఆస్థాన కవిగా ఉండేవాడు.

ఇతని కావ్యంలో కుకవినింద సూరకవిని మనసులో పెట్టుకుని చేశాడని చెప్తారు. ఈతని నివాస స్థలాన్ని గురించి భిన్నాభిప్రాయాలున్నాయి. విశాఖ మండలంలోని సత్యవరం వాడని కొందరు అంటున్నారు.

అనేక సంస్థానాలు దర్శించి బహుమతులు పొందాడు. (క. త-13-81)

## రేకులు-రగడలు

రేకులంటే పాటలు లేక పదాలు అనవచ్చు. పూర్వకాలంనుంచి తెలుగులో వచ్చిన వివిధ యక్షగానాలలో ప్రచురంగా కనిపిస్తున్న జంపె, త్రిపుటాది తాళలయాశ్రయాలైన రచనలను తెలుగు లాక్షణికులు రేకులన్నారు. ఇవి వివిధ రగడలకు వికృతి రూపాలని కూడా పండితాభిప్రాయం. ఇవి తాళ ప్రధానాలు.

యక్షగాన ఉత్పత్తికి జక్కుల జాతికి ఉన్న సంబంధం సమంజసంగా కనిపిస్తున్నందువల్ల గాన కళా ప్రావీణ్య ప్రసిద్ధులైన జక్కులపురంధ్రుల పాటలే జక్కుల రేకులుగా ప్రాచీన యక్షగానాలలో రూపు రేఖలు దిద్దుకొన్న గాన రీతులని పండితులూహిస్తున్నారు.

కన్నడ లాక్షణికుడు నాగవర్మ పేర్కొన్న "రఘటాబంధ"మే ఈ రేకు కావచ్చును.

రగడ, గణనియమం విపర్యాసమున్నప్పటికి సమసంఖ్యగల మాత్రలతో తాళబద్ధమై ఉంటుంది. కన్నడ రగడ లక్షణం తెలుగు రగడ లక్షణానికి సరిపోతుంది. ఇవి క్రీ. శ. 11 శతాబ్దినుంచి తెలుగులో వాడుకలో ఉన్నట్లు రాజరాజు కోరుమిల్లి శాసనం వల్ల తెలుస్తుంది. పాల్కురికి సోమన, శ్రీనాథుల గ్రంథాలలో రగడలున్నాయి. విన్నకోట పెద్దన కావ్యాలంకార చూడామణిలో రగడలను పేర్కొన్నాడు. అనంతుడు తన

ఛందో దర్పణంలో రగడకు లక్ష్య పూర్వకంగా లక్షణ నిర్వచనం చేశాడు. క్రీ. శ. 15వ శతాబ్ది పూర్వార్ధం నాటికి జక్కుల రేకులు ప్రచారం పొందాయి.

I లాక్షణికులు చెప్పిన రేకులు : 1. త్రిపుటరేకు 2. జంపెరేకు 3. రచ్చరేకు 4. ఏకతాళి 5. అటతాళం.

II లాక్షణికులు చెప్పనివి-యక్షగానాలలో రేకుల పేర ప్రయుక్తాలు : 1. అదితాళ రేకులు 2. మటిమరేకులు 3. నడరేకులు 4. వెండిరేకులు 5. పాళిరేకులు 6. బాళి రేకులు 7. అర్ధ రేకులు.

III అనంతాదులు చెప్పిన నవ విధ రగడలు : 1. హయప్రచారం 2. తురగవల్గనము 3. విజయ మంగళం 4. ద్విరదగతి 5. జయభద్ర 6. మధురగతి 7. హరిగతి 8. హరిణగతి 9. వృషభగతి. (య. వా. చ-221-235)

## రేచర్ల కాటని శాశనము

కాలం : క్రీ. శ. 1235 ప్రాంతం.

శాసన ప్రదాత : రేచర్ల కాటడు.

శాసనంలో ప్రస్తావింపబడినవారు : కాకతి రుద్రుడు, కాకతి గణపతిదేవుడు.

శాసన విషయం : కాటడు గణపతి దేవునకు మహాప్రధానియని, ఆంధ్ర దేశంలోని "అనుమకొండ" కాకతీయుల రాజధానియని, కాటడు శూరుడని, చాలామంది శత్రువులను వధించాడని, దక్షారామ భీమేశ్వర దేవునికి అక్షయదీపాలను నిలిపాడని ఈ శాసనంవల్ల తెలుస్తుంది. దీనిలో 9 పద్యాలు, మధ్యలోనూ చివరలోనూ మూడుచోట్ల గద్యలు ఉన్నాయి. (తె.శ.చ-320-b; 320-d)

## రేచర్ల లక్ష్మారాయ ప్రతాపోదయము

కర్త : భట్టు లక్ష్మీనరసింహకవి.

దండకం. రేచర్ల ప్రభువైన లక్ష్మరాయడు మహమ్మదీయులతో చేసినయుద్ధం వర్ణితం. (వా.చ; వం.ము-389)

## రేటూరి భావనామాత్యుడు

కాలం : క్రీ. శ. 16 వ శతాబ్ది.

స్థలం : రేటూరు. (గుంటూరుజిల్లా, బాపట్ల తాలూకా).

రచన : కామేశ్వరి చరిత్రము (ద్విపద).

గురువు : అద్దంకి సింగరాచార్యులు.

'భానుమతీ పరిణయ' కావ్యకర్త రేటూరి రంగరాజు ఈయన వంశీయుడే.

ప్రెగడయ్య పౌత్రుడు. నాంచారమ్మ రామనల పుత్రుడు. శ్రీనాథుని కాలంనాటికే "కామవల్లీ మహాలక్ష్మి" (కామేశ్వరి) కథ బహుళ ప్రచారంలో ఉన్నట్లు ఆ కథను "జక్కుల పురంధ్రి" పాడినట్లు క్రీడాభిరామంవల్ల తెలుస్తున్నది. ఎఱ్ఱగుంట చెరువుదగ్గర వెలసిన కామేశ్వరీదేవి కవికి కలలో కనిపించి, తన కథను వ్రాయమని చెప్పి

నడచ. ఇతడు ప్రౌఢమైన కవిత చెప్పగలకవి. శైలి ధారాళమైనది. రేటూరునే రెట్టపురి అంటున్నారు. (ఆంధ్ర-9-246; క.త-11-133)

## రేటూరి రంగరాజు

కాలం : క్రీ. శ 17వ శతాబ్దం.

స్థలం : రేటూరు.

సంస్థానం : వేంకటగిరి సంస్థానం.

రచన : భానుమతీ పరిణయము.

గురువు : అద్దంకి సింగరాచారులు.

ముద్రాగురువు : కందాళ రంగాచార్యులు.

అష్టావధానాలు, శతావధానాలు చేసేవాడు. అష్టావధానంలోని అంశాలను స్పష్టంగా చెప్పాడు. తన రచనను వేంకటగిరి సంస్థానాధీశుడైన రాయమహేంద్రునికి అంకితం ఇచ్చాడు. ఈ కవి ఆంధ్ర, కర్ణాటక, చోళ రాజ్యాలలో చిత్రకవితా విశారదుడుగా ప్రసిద్ధిచెందినవాడని భానుమతీ పరిణయ ప్రబంధంలో చెప్పుకొన్నాడు.
(ఆం.సం.సా-453, 454) (ఆంధ్ర-9; క.త-11-171)

## రేనాడు

మొత్తం 7000 గ్రామాలున్న విభాగం ప్రస్తుతపు కడప మండలంలోని కమలాపురం, ప్రొద్దుటూరు, జమ్మలమడుగు తాలూకాలు, కర్నూలు మండలంలోని కోయిల కుంట్ల నంద్యాల తాలూకాలో కొంత భాగం, బనగానపల్లె తాలూకాలోని కొంత భాగం కలిసి ఉండేది. సంపూర్ణంగా తెలుగులో ఉన్న తొలి శాసనాలు రేనాడులోనే దొరికాయి

అయ్యలరాజు నారాయణ కవి ఈనాడును పేర్కొన్నాడు.
(సం. ఆ. వి. కో-5)

## రేపాల రాజలింగ శతకము

కర్త : కామరాజు వేంకటశివుడు.

ఇది శైవభక్తి శతకం. శైవ మతాధిక్యాన్ని చాటుతుంది. పండితా రాధ్యుని శివతత్త్వ సారంలోని భావాలను ఈ శతక కర్త అనుకరించాడు. హరిహరుల ప్రస్తావన ఉంది కాని, హరునకు ప్రాధాన్యం ఎక్కువ. 'శివుని మహిమలను కొని యాడుతూ హరి చర్యలను ఇది విమర్శిస్తుంది. పోతన్న భాగవతంలో కొన్ని వాస్త వాలను వదలి పెట్టాడని ఈ కవి ఇందులో వ్రాశాడు. (శ.సా.వి)

## రేఫ ఱకార నిర్ణయము (అసమగ్రం)

కర్త : గణపవరపు వేంకటకవి.

సర్వలక్షణ శిరోమణిలోని పంచమోల్లాసంలో ఈ భాగం ఉన్నది. దొరికి నంతలో అసమగ్రంగా ఉంది. (ఆంధ్ర-11-161)

రేఫ అకార నిర్ణయము

కర్త : తాళ్ళపాక పెద తిరుమలాచార్యుడు.

చూ. రేఫ అకార శతకము. (క.త-6)

రేఫ అకార శతకము

కర్త : తాళ్ళపాక పెద తిరుమలాచార్యుడు.

ఇది శతకం వంటి కృతి. మకుట సహితంగా దీనిలో 108 పద్యాలున్నాయి దీని మొదటి భాగంలో రేఫయుక్తాలయిన పదాలు, ఉత్తరార్ధంలో అకార యుక్తాలయిన. పదాలు పరిశీలింపబడినాయి. సాధురేఫ, శకట రేఫల ప్రాధాన్యాన్ని కవి నిరూపించాడు. (శ.సా.వి)

రేమెల వేంకటరాయకవి

కాలం : క్రీ.శ. 1820-1860

స్థలం : పిఠాపురం సంస్థానం, దుగ్గురువు గ్రామం.

రచన : ఉత్తరా పరిణయము.

పిఠాపురం సంస్థానాధిపతుల సమాదరం పొందినవాడు. ఇతని కాలం 1820-1847 అని కొందరు చెప్తున్నారు.

(ఆం.సం.సా-250; పీ యు-185)

రేవణూరి తిరుమల కొండయార్యుడు

కాలం : క్రీ.శ. 1450 ప్రాంతం.

స్థలం : కర్నూలు మండలం.

రచన : రామచంద్రో పాఖ్యానము (అలభ్యం).

ఈ కవి తాళ్ళపాక అన్నమాచార్యులకు అల్లుడు. (తాళ్ళపాక అన్నమయ్య కాలం క్రీ.శ. 1408-1503 మధ్య ప్రాంతం). ఈ కవి కర్నూలు జిల్లా కోయిలకుంట్ల ప్రాంతంవాడు కావచ్చు. "శకుంతలా పరిణయ" కావ్యకర్త రేవణూరు వేంకటార్యుడు ఈ కవికి కుమారుడు. రేవణూరు అనే ఇంటి పేరు గ్రామాన్ని బట్టి కలిగిందట. (క.త-6-290)

రేవణూరి వేంకటార్యుడు

కాలం : క్రీ.శ. 16 వ శతాబ్దం.

స్థలం : కర్నూలు మండలం.

రచనలు: శకుంతలా పరిణయము, శ్రీపాద రేణు మహాత్మ్యము.

తాళ్ళపాక అన్నమాచార్యుని దౌహిత్రుడు. తిరుమలాంబ, తిరుమల కొండయార్యులు ఇతని తలిదండ్రులు.

కమనీయంగా రచన చేశాడు. శకుంతలా పరిణయ కావ్యాన్ని ఒక రాజుకు అంకితం ఇవ్వాలనుకోగా ఒక కరణం అడ్డుపడ్డాడట. దానితో ఆ గ్రంథాన్ని వేంకటేశ్వరునికి అంకితం చేశాడు. రామచంద్రో పాఖ్యానం ఇతని రచన అని కందుకూరి వారు

రాశాడు. కాని అది కవి తండ్రియైన తిరుమల కొండయార్యుని రచన.
(క.చ-3-259) (క.న-259)

రేవతీ పరిణయము (అలభ్యం)

కర్త : మద్దికాయల మల్లయ్య.

ప్రబంధం. పెదపాటి జగ్గన్న సూర్యాస్తమయం, దీప వర్ణనలున్న మూడు పద్యాలు ఉదాహరించాడు. (ఆరుద్ర-9)

రేవతీ పరిణయము

కర్త : వద్దిపర్తి కోనరాట్కవి.

ప్రబంధం. (శ.క.చ-806)

రేవన శ్రీకూర్మం శాసనము

కాలం : క్రీ.శ. 1209 ప్రాంతం.

శాసన ప్రదాత : రేవన.

శాసన ప్రదేశం : శ్రీకాకుళం సమీపంలోని శ్రీకూర్మంలోని కూర్మేశ్వరాలయం.

శాసన విషయం : శాసన ప్రదాత రేవన అయితమ నాయకునకు - గండెమకు పుత్రుడు. ఈయన శ్రీ కూర్మేశ్వరునికి కొంత పొలాన్ని దానం చేసినట్లు, స్వామికి అఖండ దీపం కూడా నిలిపినట్లు ఈ శాసనంవల్ల తెలుస్తున్నది. దీనిలో ఒక సీస పద్య ముంది. (తె.క.చ-315-a)

రేవూరి అనంతయ్య I

కాలం : క్రీ. శ. 1700 ప్రాంతం.

స్థలం : దక్షిణదేశంలోని సేలం ప్రాంతం.

రచనలు : 1. గాంగేయోపాఖ్యానము 2. వృద్ధాచల మాహాత్మ్యము 3. శేషార్యోదాహరణము.

మధుర నాయక రాజుల కాలంలో దక్షిణదేశంలో స్థిరపడ్డ కుటుంబాలలో రేవూరి వారి కుటుంబం ఒకటి. ఇతడు మైసూరు, చెంజి రాజులచేత సన్మానింపబడ్డాడు. ఘటికాశత గ్రంథకర్త, దినైక ప్రబంధకర్త - చిన్ననాడే అష్టభాషలూ, చతుర్విధ కవితలు నేర్చాడట. ఇతనికి బాలకవి బిరుదున్నట్లు చెప్తున్నారు. శేషార్యోదాహరణ రచనలో ఈ బిరుదు కానవస్తున్నది.

ఇతని తండ్రి, తాత, సోదరులు, అందరు కవులట. ఇతని తండ్రి లింగకవి కాళాహస్తికవి ఇతని తాత. శ్రీ ముష్ణమాహాత్మ్యకర్త అనంతయ్య ఇతని పౌత్రుడు.
(ద.దే.వా-373)

రేవూరి అనంతయ్య II

కాలం : క్రీ. శ. 18 శతాబ్దం.

స్థలం : తిరుచినాపల్లి మండలం.

రచనలు : 1. శ్రీముష్ణ మాహాత్మ్యము 2. శివరహస్య ఖండము 3 నల్లందిగళ వంశావళి.

బిరుదు : బాలకవి.

కాళహస్తికవి పుత్రుడు. గాధేయోపాఖ్యానకర్త అయిన అనంతయ్యకు పౌత్రుడు. చాలామంది ఇతన్ని అనంతయ్యగానే పేర్కొన్నారు. బాలకవి బిరుదు తాతకూ మనుమనికీకూడా ఉందని కొందరి తలంపు. ఇతడు విద్వత్కవి. మృదుమధురమైన శైలిలో రచనలు చేశాడు. (ఆరుద్ర 12-123, ద.దే.వా-378)

## రేవూరి ఏకామ్ర కవి

కాలం : క్రీ శ. 1620 ప్రాంతం.

స్థలం : మైసూరు ప్రాంతం.

రచనలు : 1. సత్యా పరిణయమ్ (సం) 2. జాంబవతీ పరిణయమ్ (సం).

రేవూరి కుటుంబానికి చెందినవాడు. లింగకవి కుమారుడు. బహు భాషా కోవిదుడు. మైసూరు పాలకుల ఆస్థానంలో ఉండేవాడు. రాణా వంశీయుడైన జగదేవరాయని సోదర పుత్రుడైన - ఇమ్మడి అంకుశేంద్రుని ఆస్థానంలో ఉంటూ అతనికి అంకితంగా పై రెండు కావ్యాలూ రాశాడట.

ఇతని తెలుగు రచనలు తెలియరాలేదు. (ద.దే.వా-373)

## రేవూరి కాళహస్తి కవి

కాలం : 18వ శతాబ్దం.

స్థలం : మధుర సంస్థానం.

రచనలు : వసుచరిత్ర (సంస్కృతం).

గురువు : అప్పయ దీక్షితులు.

శిష్యుడు : కుందుర్తి వెంకటాచలకవి.

దక్షిణ దేశంలో స్థిరపడ్డ ఆంధ్ర విద్వత్కవి కుటుంబాలలో రేవూరి వారి వంశం ఒకటి. ఇతని గురించి మిత్రవిందా పరిణయావతారిక నుండి తెలుస్తున్నది తెలుగు కావ్యమైన వసుచరిత్రను సంస్కృతంలోకి పరివర్తనం చేశాడు.

(ద. దే. వా-373).

## రోసనూరి వెంకటపతి

కాలం : క్రీ. శ. 18వ శతాబ్దం.

స్థలం : వెంకటగిరి సంస్థానం.

బిరుదు : తిక్కయజ్వ.

రచన : విష్ణుమాయావిలాసము.

గంగన మంత్రి కుమారుడు. లింగనామాత్యుని పౌత్రుడు. కవి, నెల్లూరులో సూళ్ళూరుపేట సమీపంలోని రోసనూరుకు చెందినవాడు కావటంచేత ఆ ఇంటి పేరుతో ప్రసిద్ధుడయ్యాడు.

వెంకటగిరి సంస్థానాధీశులైన కుమారయాచ (1695-1748) బంగారుయాచ (1755-77) ప్రభువుల కాలంలో ఉన్నాడు కుమారయాచ భూపాలుడు ఇతనికి తిక్కయజ్వ బిరుదిచ్చి సత్కరించాడట. అతని కుమారుడు బంగారు యాచ ప్రభువు ఇతని కావ్యానికి కృతిపతి. సరళంగా రసవంతంగా కవిత్వం చెప్పాడు. (క. త-12-212; క. చ-3-17)

**రోసనూరు**

నెల్లూరు మండలంలో సూళ్ళూరుపేట తాలూకాలో ఉంది. ఇది ఒకప్పుడు వెంకటగిరి సంస్థానంలో ఉండేది. ఆ సంస్థానానికి రాజధానిగానో, ప్రధాన నగరాలలో ఒకటిగానో ఉంది ఉంటుందనడాని, సాహిత్య నిదర్శనాలున్నాయి. వెంకటగిరి ప్రభువైన బంగరు యాచమ నాయకుని (1755-77) రోసనూరి భూపతిగా "విష్ణుమాయా విలాస" కర్త వెంకటపతి సంబోధించాడు. ఈ గ్రామ నామం కొందరికి ఇంటిపేరుగా ఉంది.

**రౌచికుడు**

సప్తవిధ కవులలో ఒకభేదం. మృదు మధురోక్తులతో కావ్యాన్ని క్రమతో సంధించే కవిని రౌచికుడు అంటారు. (అప్పకవీయం-25)

**లంక సారథి**

కర్త : పేరు తెలియదు.

లభించిన ప్రతిలో మొదటి నాలుగు పుటలు లేవు. ఇది రామాయణగాథ. ఒక విషమైన పాటగా రచింపబడింది. దక్షిణాంధ్ర వాఙ్మయానికి చెందిన రచన కావచ్చు. "రాయవేలూరిలో మిరియాల రామనాయని కుమారుడు వెంకటస్వామి వ్రాసిన లంక సారథి పుస్తకం సంపూర్ణం" అని చివర ఉంది. ఇతడు ప్రతిలేఖకుడు కావచ్చు. ఈ సంపుటంలోనే పారిజాత నాటకమనే యక్షగానం వాయలూరి నారాయణ కవి కృతం కూడా ఉంది. (సా. ప. ప. సం-1650)

**లంక యోగము**

జానపద పౌరాణిక గేయ రచన.

చూ. పౌరాణిక గేయములు.

**లండన్ మిషన్ ప్రెస్**

స్థలం : విశాఖపట్టణం.

1840లో అడివము సూరకవి వ్రాసిన "ఆంధ్రనామ శేషము" గ్రంథాన్ని దీనిలో ముద్రించటం జరిగింది ఆంధ్రనామ సంగ్రహం మొదలగు గ్రంథాలు ఇందులోనే ముద్రితాలు.

**లంభకము (లంబకము)**

కావ్యాలలోని కథాంశ విభాగం. కథా సరిత్సాగరంలోని భాగాలకు లంభకాలని పేరు. ఏ భాగం వల్ల లంభకము (ఆనంద లాభము) కలుగుతుందో అది లంభకము. (కావ్యాలంకార సంగ్రహం)

## లకుమాదేవి

కాలం : చూ. కుమారగిరిరెడ్డి.

ఈమె పేరు మోసిన నాట్యకత్తె. కొండవీటి రెడ్డి ప్రభువైన కుమారగిరి ఆస్థానంలో ఉండేది ఈమె అందచందాలకు, సంగీత నృత్యాలకు కుమారగిరి ఆకర్షితుడై రాజ్య రక్షణ కార్యాన్నే నిర్లక్ష్యం చేశాడంటారు. లకుమాదేవి కుమారగిరి విరచిత వసంతరాజీయమనే నాట్య గ్రంథంలోని నూతనాంశాలకు అనుగుణంగా మనోహరంగా అభినయిస్తుండేదట.

ఈమె లక్ష్మికి సమానురాలని దానశీలి అని కూడా తెలుస్తున్నది

ఈమె నాట్య ప్రదర్శన ప్రతి వసంతోత్సవంలోను కొండవీటిలో జరుగుతుండేదట. ఈమెను గురించి కొండవీటి సీమలో ఈనాటికీ చాలా ఐతిహ్యాలున్నాయి. కుమారగిరి ఈమెతో కాలం గడుపుతూ సంగీత, నృత్య, సాహిత్య సభలలో ప్రొద్దు పుచ్చుతూ, ప్రజల యోగ క్షేమాలు పట్టించుకోని సమయం చూసి-పెద కోమటి వేముడు కుమారగిరిని రాజమహేంద్రవరానికి తరిమివేసి, రాజ్యాన్ని ఆక్రమించాడు.

(తెలుగు-ఏ-జూ-77)

## లక్క నృపాలుడు

కాలం : క్రీ, శ. 15వ శతాబ్దం

పొత్తపి నాటికి అధిపతి. సాహిత్య పోషకుడు. కడప జిల్లా రాజంపేట తాలూకా గుండ్లూరులోని లక్క నృపాలుని శాసనాలు ఇతనివే అని పండితుల అభిప్రాయం. ఇతని మీద చాటు పద్యాలున్నాయి. గౌరరాజు అనే కవి ఇతనిని పొగడుతూ చెప్పిన పద్యాన్ని అప్పకవి ఉదాహరించాడు. (క. త-8-56; అప్పకవీయం-3-158)

## లక్కవరము

లక్కవరం జమీందారీ "మంత్రి ప్రెగ్గడ" వారిది. గోదావరీ మండలంలోని లక్కవరం, బిల్లుమిల్లి ఎస్టేటులు ఈ జమీందారీకి చెందినవి. జంగారెడ్డి గూడెం, దిప్పకాయలపాడు, బయ్యనగూడెము, వెల్ల, సరిపల్లి మొదలగునవి బిల్లుమిల్లి ఎస్టేటులోని భాగాలు.

మంత్రి ప్రెగ్గడ వారి నివాసస్థానం "ఏలూరు". "గురురాజు" వీరి మూలపురుషుడు. ఏలూరులోని "మార్కండేయ గంగాధరాలయ" నిర్మాత ఈ గురురాజే. 'అప్పలరాజు' ఈ వంశంలో అతి ప్రసిద్ధుడట. ఈయన కుమారుడు భుజంగరాయడు సమర్థుడు. ఎస్టేటును విస్తరింప చేశాడు. సాంఘిక సేవా కార్యక్రమాలపై విశేషాసక్తి ప్రదర్శించి ప్రభుత్వం వారిచేత "రాజా బహద్దరా"ది బిరుదాలు సంపాదించాడు.

ఇతని కుమారుడు మల్లికార్జున ప్రసాదరావు. వీరి తరువాత సంస్థానాన్ని పాలించిన రెండవ భుజంగరాయలు (1876-1943) ఈ సంస్థానానికి సాహితీ లోకంలో అత్యున్నత స్థానాన్ని సంపాదించి పెట్టారు. వీరి తరువాత, కుమారుడైన పద్మనాభ

దుర్గా మల్లికార్జున ప్రసాదరావు బహద్దరు జమీందారీ వారసుడు. ఈ సంస్థానాధిపతులకు ఉర్లాము జమీందారులతో సంబంధ బాంధవ్యాలున్నాయి.

భుజంగరావు గారు శతాధిక గ్రంథ కర్త. "దర్శనాచార్య" బిరుదాంకితుడు. సంస్కృతాంధ్రాంగ్ల భాషా ప్రవీణులు. అనువాదాలు, అవధానాలు, చాటువులు, ఆశు కవిత్వం, కథలు, గాథలు, అనువాదాలు, జీవిత చరిత్రలు, నవలలు, నాటకాలు, ప్రబంధాలు, ప్రహసనాలు, వచన కావ్యాలు, శతకాలు - మొ॥న సాహిత్య శాఖలలో వీరి పరిశ్రమ కొనసాగింది.

వీరు అనేక కృతులను అంకితం పుచ్చుకొన్నారు. అనేక గ్రంథాలను ప్రచురించారు. శొంఠి భద్రాద్రి రామశాస్త్రి. దేవరకొండ మాణిక శాస్త్రి వంటి పలువురు ఆస్థాన కవి పండితులుగా ఈ సంస్థానంలో మన్ననలు పొందారు. ప్రసాద కృష్ణమూర్తి శాస్త్రి, తిరుపతి వేంకటకవులు, వేదం వేంకటరాయశాస్త్రి వంటి పెక్కురు విద్వత్కవులు ఈ సంస్థాన ప్రభువుల చేత విశేషంగా సమ్మానింప బడినారు. (ఆం సం.సా-369-373)

## లక్కాభట్టు

నామాంతరం : క్షేమేంద్రుడు

## లక్కిరెడ్డి పుల్లారెడ్డి

కాలం : తెలియదు

ఈయన దానశీలియని, ఆశ్రితకవి పోషకుడని ఒక చాటువువల్ల తెలుస్తున్నది కవి బృందాలకు కల్పతరువని వేరొక చాటువువల్ల తెలుస్తున్నది. పుల్లారెడ్డి గురించి కాని, చాటుకవి గురించి కాని వివరాలేమీ తెలియవు. (చా.ప ర.)

## లక్షణ చూడామణి

కర్త : కస్తూరి రంగకవి.

నామాంతరం : రంగరాట్ఛందము (చూ).

(తె వి.స-6)

## లక్షణ తిలకము (అలభ్యం)

కర్త : లింగమకుంట రామకవి.

ఛందో గ్రంథం.

ప్రత్యేకత : ఈ లక్షణ గ్రంథాన్ని గురించి అనంతర కాలంలో లక్షణ శిరోమణి వ్రాసిన పొత్తపి వెంకట రమణకవి చెప్పాడు. (అరుద్ర-8-134)

## లక్షణ దీపిక (సం)

కర్త : గౌరన.

కాలం : క్రీ.శ. 1384-1429 ప్రాంతం కావచ్చు.

ఛందః శాస్త్ర గ్రంథం. ఇది సంస్కృతంలో రచించిన ఆంధ్ర లక్షణ గ్రంథం. (రె.రా.చ; క.త-4-266)

**లక్షణ దీపిక**

కాలం : క్రీ.శ. 17 వ శతాబ్ది.
కర్త : వార్తాకవి రఘునాథయ్య.

ఛందో విషయాలే కాక కావ్య, వ్యాకరణ విషయాలు కూడా ఇందులో చర్చింపబడ్డాయి. అముద్రితం.

గౌరన వ్రాసిన లక్షణ దీపికకు దీనికి సంబంధం లేదు. (ఛం.వ.కో.)

**లక్షణ మంజరి**

రచనాకాలం : క్రీ.శ. 16 వ శతాబ్ది కావచ్చును
కర్త : నైషధం తిమ్మమంత్రి.
అంకితం : గరళ పురీశ్వరునికి.
నామాంతరం : గరళ పురీఛందము.

ప్రత్యేకత : ఇది తెలుగులో ఏకాశ్వాసంలో చెప్పిన లక్షణ గ్రంథం. ఇందులో తిమ్మ మంత్రి యాభై (50) యతి భేదాలను చెప్పాడు. అప్పకవి తన గ్రంథంలో 41 యతి భేదాలను చెప్పాడు. అప్పకవికి తరవాత వాడయిన కూచిమంచి తిమ్మకవి 23 యతి భేదాలను మాత్రమే చెప్పాడు. తిమ్మమంత్రి అప్పకవికి పూర్వుడని పండితులు నిర్ణయించారు. ఇందులోని లక్ష్యాలు కవి స్వయంగా రచించినవే కావటం విశేషం. (అరుద్ర-8) (క.న..85)

**లక్షణ విలాసము**

కాలం : తెలియదు.
కర్త : పేరు తెలియదు.

దీని వ్రాతప్రతి కాకినాడ ఆంధ్ర సాహిత్య పరిషత్తులో ఉంది. (కవిజనాశ్రయం పీఠిక-వావిళ్ళ)

**లక్షణ విలాసము**

నామాంతరం : యతిప్రాస విలాసము.
కర్త : పెనుమర్తి వేంకటార్యుడు.
రచనాకాలం : క్రీ.శ. 18 వ శతాబ్దం కావచ్చు.

లక్షణ గ్రంథం. ప్రతి అసమగ్రంగా లభించింది.

ప్రత్యేకత : ఇందులో "ఇరువ దార్యతు లిర్వది ప్రాస భేదముల్" కవి చెప్పాడు. ఇందులో ఎన్నో ప్రాచీన గ్రంథాలలోని ప్రయోగాలు లక్ష్య లక్షణాలు ఉన్నాయి. దీనిని అప్పకవి తన పుస్తకంలో పేర్కొన్నాడు. ఇందులో ఉదాహరించిన కొన్ని గ్రంథాలు దొరకటం లేదు. (అరుద్ర-9-248)

లక్షణ శిరోమణి

కాలం : క్రీ.శ. 17వ శతాబ్దం.

కర్త : పొత్తపి వేంకట రమణ కవి.

ఇందులో నాలుగాశ్వాసాలున్నాయి. మొదటి ఆశ్వాసంలో అక్షరాలను గూర్చి, రెండో ఆశ్వాసంలో గుణాలను గూర్చి, మూడో ఆశ్వాసంలో వృత్తాలను గూర్చి, నాలుగో ఆశ్వాసంలో యతిప్రాసలను గూర్చి వివరించారు. ఈ విషయంలో అప్పకవీయానికిది దీటుగా ఉంది. (ఛం.ప.కో)

లక్షణ శిరోమణి

నామాంతరం : యాదవామాత్యచ్ఛందము (చూ).

కర్త : చూ. యాదవామాత్య కవి.

లక్షణ సారము

కర్త : అడిదము భాస్కరుడు.

అంకితం : శ్రీరామతీర్థ క్షేత్రంలో వెలసిన శ్రీరామునికి.

ఛందో విషయాలను గురించీ, అక్షర ఫలాలను గురించీ వివరించే గ్రంథం.

శ్రీరామ తీర్థము పూర్వపు విశాఖ పట్టణం మండలంలోని విజయ నగరానికి సమీపాన ఉన్నదట. (క.న-143)

లక్షణ సారము (అలభ్యం)

కర్త : నన్నయభట్టు.

ఛందో గ్రంథం. నన్నయ ఈ గ్రంథాన్ని రచించనే లేదని కొందరి అభిప్రాయం.

లక్షణ సార సంగ్రహము

కర్త : చిత్రకవి పెద్దన.

రచనాకాలం : 16 వ శతాబ్దం పూర్వ భాగం.

అంకితం : హనుమంతునికి.

ప్రత్యేకత : మూడాశ్వాసాల గ్రంథం. దీనికి ముందు తెలుగులో చాలా లక్షణ గ్రంథాలున్నాయి గాని వాటిలో నాటకానికి లక్షణం ఏ లాక్షణికుడూ చెప్పలేదు. ఈ లక్షణ గ్రంథంలో తెలుగులో తొలిసారిగా నాటకానికి లక్షణం చెప్పబడింది. పూర్వ లాక్షణికులను కవి నుతించాడు 49 పద్యాలలో నాటక లక్షణాన్ని కవి విపులంగా చెప్పాడు. నాటక లక్షణం చెప్పాక పెద్దన తనకు ఇంటి పేరుగా నిలిచిన చిత్ర కవిత్వ లక్షణాలను వివరించాడు "కల్పిత కల్పవల్లికా బంధం" అని ఒకటి చెప్పాడు. నాలుగు చంపకమాలలనుంచి పదిహేడు వృత్తాలు పుడతాయని లక్షణాలను చెప్పాడు. ఛందో భాగం అనంతుని ఛందాన్ననుసరించి ఉందని పరిశీలకుల అభిప్రాయం.

(అరుద్ర-8)

**లక్షణాదేవి కల్యాణము (అలభ్యం)**
కర్త : లోకేరావు సోమన.
యక్షగానం.

**లక్షణా పరిణయమ్ (సం)**
కర్త : ఋగ్వేది వేంకట నారాయణ కవి.
లక్షణ శ్రీకృష్ణుని అష్ట భార్యలలో ఆఖరుది. మత్స్యయంత్రం కొట్టి కృష్ణు డీమెను వివాహ మాడాడు. ఈ గాథను చాలమంది కావ్యాలుగా వ్రాశారు. (అం.సం.సా)

**లక్షణా పరిణయము**
రచనాకాలం : క్రీ.శ. 17 వ శతాబ్దం.
కర్త : వానపాల నరసింహం.
అంకితం : తుల్యాద్రి నరసింహ స్వామికి.
ఆరాశ్వాసాల కావ్యం. (ఆరుద్ర-10-235)

**లక్షణా పరిణయము**
నామాంతరం : చమత్కార మంజరి.
కర్త : సింహాద్రి వెంకటాచార్యులు.
అంకితం : రామానుజాచార్యులకు.
శృంగార ప్రబంధం. మూడాశ్వాసాలలో లక్షణా శ్రీకృష్ణుల వివాహ వృత్తాంతం రసవంతంగా ఉంది. కవి అప్పకవికి పూర్వుడు. కృతిపతి రామానుజాచార్యులు విశిష్టాద్వైత మత స్థాపకుడట రచన ప్రౌఢంగా ఉంది. (క.స-258) (ఆరుద్ర-10-234)

**లక్షవత్తుల నోము పాట**
కర్త : తెలియదు.
జానపద పారమార్థిక గేయం. ప్రసిద్ధమైన ఇతివృత్తం.

**లక్ష్మణ కవి**
కాలం : క్రీ.శ. 1684-1712 (శహాజీ ఆస్థానం.).
స్థలం : తంజావూరు.
రచనలు : 1. శహాజీ రాజీయమ్ (సం). 2. శహరాజ సభా సరోవర వర్ణనమ్ (సం). (శారదా ధ్వజం-69)

**లక్ష్మణ దేవరనవ్వు**
జానపద పౌరాణిక గేయ రచన. ఇతివృత్తం రామాయణానికి సంబంధించింది.

**లక్ష్మణ భరతము**
కర్త : భండారు లక్ష్మీ నారాయణ.

చూ. సంగీత సూర్యోదయము (తె.వి.స-4)

## లక్ష్మణ మూర్ఛ

జానపద పౌరాణిక గేయ రచన. ఇతివృత్తం రామాయణ కథకు సంబంధించింది. యుద్ధ సమయంలో "లక్ష్మణుడు" ఇంద్రజిత్తనే రాక్షస వీరునితో యుద్ధం చేస్తూ మూర్ఛ చెందుతాడు. మూర్ఛనుండి తేరడానికి హనుమంతుడు సంజీవని తేవడం మొదలగునవి దీనిలోని కథా వివరాలు.

## లక్ష్మమ్మ కథ

కర్త : తెలియదు.

జానపద శృంగార గేయం. జానపదుల ఉత్తమ శృంగారం దీనిలో ప్రధాన రసం.

చూ. శృంగార గేయములు.

## లక్ష్మమ్మ కథ

కర్త : విడిగంటి వీరయ్యదేవర.

కరుణరస పూరిత జానపద గేయం. అతిశయోక్తులుగాని, అద్భుతాలుగాని ఈ రచనలో కనిపించవు. చూ. కరుణరస గేయములు.

## లక్ష్మీకల్యాణం పాట

ఇది గౌరీ కల్యాణంవంటి ఒక పెళ్ళి వేడుక పాట. వేంకటనాథుని పంచతంత్రంలోనూ చాలా యక్షగానాలలోనూ ఇది ప్రయుక్తం. ఇది అచ్చంగా ద్విపదకు మచ్చు. (య. వా. చ-260)

## లక్ష్మీదేవి శతకము

కర్త : తాదేపల్లి పానకాల రాయకవి.

కందపద్య శతకం. "శ్రీ మంగళశైల నారసింహువి రాణీ" అనే మకుటంతో ఉంది. కవి హరిభక్తుడు. తన భక్తి ప్రపత్తులను చక్కని శైలిలో మలిచాడు. (క. స-120)

## లక్ష్మీధరమ్ (సం)

కర్త : లొల్ల లక్ష్మీధరుడు.

ఇది శంకరాచార్యుల వారు వ్రాసిన "సౌందర్యలహరి"కి విపులమైన చక్కని వ్యాఖ్య. (తె. వి. స-4)

## లక్ష్మీ నరసింహము

నామాంతరం : నరసింగమయ్య.

కాలం : క్రీ. శ. 1850 ప్రాంతం.

స్థలం : గద్వాల.

రచన : నృసింహ విలాసము.

ఇతర వివరాలు తెలియరాలేదు. తెనాలి రామకృష్ణకవి "ప్రగడరాణ్ణరసా। విరసా। తుసా। బుసా।" అని నిందించిన నరసకవి ఇతడే అని శేషాద్రి రమణకవుల అభిప్రాయం. కాని ఇది నిర్ధారితం కాలేదు. (క. స-208; క. త-12-256)

## లక్ష్మీనాథ సహస్రమ్

కవయిత్రి : త్రివేణి.

ఇది సహస్రనామ కావ్యం. దీని వ్రాత ప్రతి తంజావూరు సరస్వతీ మహల్‌లో ఉంది. (అ. భా. రచయిత్రులు)

## లక్ష్మీనారాయణ సంవాదము

కర్త : గోగులపాటి కూర్మనాథ కవి.

దైవాంకితం. మూడాశ్వాసాల ప్రబంధం. మిక్కిలి ప్రచారం పొందింది. శ్రీరామతీర్థము, పద్మనాభము, సింహాచలం, శ్రీకూర్మం మొదలైన దేవస్థానాలలో ఇది నేటికీ పాడబడుతూ ఉన్నదట. ఇది జగన్నాథస్వామివారి రాయబారం"గా ప్రసిద్ధం (అం. సం. సా-416)

## లక్ష్మీనారాయణుడు

కాలం : క్రీ. శ. 16వ శతాబ్దం.

స్థలం : విజయనగరం.

సాహిత్య పోషకుడు. భానుకవి ఆంధ్రీకరించిన పంచ తంత్రాన్ని అంకితం పొందాడు. రెంటూరి చిట్టనామాత్యుని ప్రోద్బలంతో ఈ కృతి స్వీకరణ జరిగిందట రెంటూరి చిట్టన కృష్ణరాయల కాలంలోనివాడు. ఈ లక్ష్మీనారాయణుడు విజయనగరాస్థానం లోని రాజకీయ ప్రముఖుడై ఉండవచ్చును. (క. స.)

## లక్ష్మీనృసింహమూర్తి స్తుతికృతులు

కర్త : మండపాక పేరయకవి.

రచనాకాలం : క్రీ. శ. 1800 ప్రాంతం. (క. స-134)

## లక్ష్మీనృసింహ విలాసము

కర్త : పైడిపాటి వేంకట నృసింహకవి (చూ)

అంకితం : నృసింహదేవునకు.

మూడాశ్వాసాల పద్యకావ్యం.

ఇతివృత్తం చెంచులక్ష్మి కథ. రచన ప్రౌఢంగా ఉంది.

(ఆరుద్ర-11-260)

## లక్ష్మీ లహరి (సం)

రచనాకాలం : క్రీ శ. 17 వ శతాబ్దం (1596-1665).

కర్త : జగన్నాథ పండితరాయలు.

స్తుతి కావ్యం.

## లక్ష్మీ విలాస భవనరాజము

ఒక భవనం. తంజావూరును పాలించిన అచ్యుతనాయక, రఘునాథనాయక రాజుల కాలంలో కోటలోని మంత్రాలోచన సభకు ఈ పేరుండేది. యజ్ఞనారాయణ దీక్షితుని సాహిత్య రత్నాకరంలో (9-75) ఇది ప్రసక్తం. ఇది శివగంగ కోటలోని భాగం కాదు. నూతనంగా కట్టబడ్డ కోటలోని భాగమట. (తం.ఆం.వా-170-243)

## లక్ష్మీ విలాసము

కర్త : కంఠీరవ రాజు (చూ).

నృత్య ప్రధానమైన యక్షగానం. సంస్కృత శ్లోకంతో ప్రారంభం. మహాలక్ష్మి కంఠీరవరాజు సభలో నాట్యం చేసి అతన్ని ఆశీర్వదించినట్లుగా ఇందులో ఉంది. (ద.దే.వా-453)

## లక్ష్మీ విలాసము

రచనాకాలం : క్రీ.శ. 1575-81 నడుమ.

కర్త : రాయసం వేంకటపతి.

అంకితం : తిరుపతి వేంకటేశ్వరునికి.

అయిదాశ్వాసాల ప్రబంధం. ఇందులో క్షీరసాగర మధనం, హాలాహలం-అమృతం పుట్టటం మోహినీ రూపంలో విష్ణువు పక్షపాతం చూపటం, లక్ష్మి ఆవిర్భవించటం, సముద్రుడు ఆమెను విష్ణువుకు మీదుకట్టడం, ఆమె విరహం, లక్ష్మీనారాయణుల కల్యాణం 650 పద్యాలలో చెప్పబడ్డాయి.

ఈ లక్ష్మీ విలాసాన్ని ప్రతి పద్య శిరః కంపము, ప్రతిపద చిత్రార్థగోచరమూ అయిన కావ్యంగా వ్రాయాలని కవి ప్రయత్నించాడు. ప్రౌఢమైన రచన. వర్ణనలు రమ్యంగా ఉన్నాయి. (ఆరుద్ర-9-242)

## లక్ష్మీశదాసు

రచన : పద్మినీ దండకము.

కార్వేటి కొండరాజు పుత్రుడైన రాయప్ప ప్రభువు ఆస్థానంలోని వాడు. (వా.చ; వం ను-386)

## లక్ష్మీ సహస్రమ్ (సం)

కర్త : వేంకటాధ్వరి.

ఇది స్తోత్రం కావచ్చు. (తె.వి స-6)

## లఘు టిప్పణము

కావ్య పరిభాష. తేలిక అయిన టీకకు చిన్న వివరణ. చూ. టుప్టీక.

(బ్రౌన్-తెలుగు-ఇంగ్లీషు)

లఘువులు

గీత రచనా విశేషం. లఘు ప్రచురమై, పాదమునకు నాల్గేసి మాత్రలదళాలు నాలుగు కలిగి, తొమ్మిదోమాత్రాస్థానం యతి స్థానమై, రెండేసి పాదాలకు ప్రాసనియతి కలిగి, మధురగతితో ఏకతాళిరేకుల వలె నడిచే రచనావిశేషము. ఇవి అమరలింగా మాత్యుని పార్వతీకళ్యాణంలో చాలా ఉన్నాయి.

ఈ రచనా విశేషమే కొద్ది మార్పులతో విశ్వేశ్వరుని ధర్మపురీ మహాత్మ్యమనే యక్షగానంలో ప్రయుక్తమై "సమలఘువు"గా పేర్కొనబడినది. (య.వా.చ-342)

లఘు వ్యాకరణమ్

కర్త : పరవస్తు వేంకటరంగాచార్యులు.

సంస్కృతంలో రచించిన వ్యాకరణ గ్రంథం.

లఘు వ్యాకరణము

నామాంతరం : నరసాపుర వ్యాకరణము (చూ).

రచనాకాలం : క్రీ. శ. 19 వ శతాబ్దం.

కర్త : వేదం వేంకటరమణశాస్త్రి.

ఈ కవి నరసాపురంలో అధ్యాపకుడుగా ఉన్నప్పుడు ఈ వ్యాకరణాన్ని విద్యార్థుల ఉపయోగార్థం రచించినాడట. ఇది చిన్నయసూరి బాలవ్యాకరణం కంటె ప్రాచీనం. 1951 లో ముద్రితమైంది. ముద్రణకు ముందే బహుళ ప్రచారం పొందింది.

లయగ్రాహి గరుడాచల కవి

కాలం : 17 వ శతాబ్ది ఉత్తరార్థం, 18 వ శతాబ్దం పూర్వార్థం.

స్థలం : బోర్వెల్లి సంస్థానం.

రచన : కౌసలేయ చరిత్రము.

ఈ కవి గద్వాల పెదసోమభూపాలునకు సమకాలికుడు. నృసింహకవి కుమారుడు. యోగానందకవికి తమ్ముడు.

ఈ కవి వంశంలో ఇంచుమించుగా అందరూ కవులుగానే పేర్కొనబడ్డారు. వివరాలు తెలియవు. గద్వాల పెదసోమన భూపాలుని కూతురైన గిరియమ్మ బోర్వెల్లి సంస్థానపు రాణి. ఆమె ఆదేశంచేతనే ఈ కవి, కౌసలేయచరిత్రము వ్రాసి బోర్వెల్లిలోని కేశవస్వామికి అంకితం చేశాడు. ఇతని కవిత మధురంగానూ సరళంగానూ ఉంటుంది. (మ.మా-44-50)

లాలిపాటలు

చూ. ఊంజల్, జోలపాటలు.

ఇవి ఊయలపాటలు. వీటిలో సర్వసాధారణంగా జంపెగతి ఉంటుంది. అప్ప కవి చెప్పిన ఊయల లక్షణంలో మాత్రం ఏకతాళిగతి కలదిగా ఉంటుంది. దీనిలో "లాలి" అనే ఊతపదం ఆవృతమవుతుంది.

ఈ పాటలు బిడ్డపుట్టుక, భాషపుట్టుక, అసలు పాటపుట్టుక ఎంత ప్రాచీనాలో అంత ప్రాచీనాలు. ఇవి చాలా యక్షగానాలలో ప్రయుక్తం. (య.వా.చ-342)

**లావణి**

ఇది కన్నడ మహారాష్ట్రాది భాషా సంబంధియైన ఒక పదచ్ఛందం. క్రీ.శ 19 శ. నుంచి తెలుగు యక్షగానాలలో ప్రవేశించింది. దీని స్వరూప మిదియని నిర్ణయించడం సాధ్యంకాదు. ఒక్కొక్కచోట ఒక్కొక్క తీరుగా ఉందని పండితులంటున్నారు.

తిమ్మరాజు లక్ష్మణరావు రుక్మిణీ కల్యాణంలో లావణి ఉందికాని, దానిని పరిశీలిస్తే ఒక రకమైన చూర్ణికగా కనిపిస్తున్నది. (య.వా.చ-343)

**లావణ్య శతకము**

కర్త : చూ. పోలిపెద్ది వేంకటరాయకవి

కాలం : క్రీ.శ. 19 వ శతాబ్దం.

శృంగార సీసపద్యశతకము. మాకరాజు వేంకట పెరుమాళ్ళరాజు ఈ కృతి ప్రేరేపకుడు. పురుషవిరహాన్ని శ్రీహరినామ పరంగా కవి వర్ణించాడు. "వశమె శ్రీరామ రామ లావణ్య సీమ" అనేది మకుటం. (శ.క.చ-675)

**లావనూరి రామనార్యుడు**

కాలం : 18 వ శతాబ్దం లోపు.

రచన : కుశలవోపాఖ్యానము (ద్విపద).

గురువు : వింజమూరి తిరుమలాచార్యుడు.

బొబ్బామాత్యుని పుత్రుడు. సంగీత సాహిత్యాలలో చతురుడు. సిద్దన, గంగసలు ఇతని సోదరులు. కవి తన రచనలో స్వతంత్రంగా కొన్ని మార్పులు చేశాడు. మూలంలో లేని వర్ణనలు చేసి కావ్యానికి సౌందర్యాన్ని ఆపాదించాడు. (ద్వి.సా.చ-868)

**లాస్యము (అలభ్యం)**

కర్త : ఫురవి రామకవి.

సంస్కృతంలో అనంతుడు రచించిన భారత చంపువుకు వ్యాఖ్యానం. సంస్కృతమో తెలుగో తెలియరావటం లేదు. (అం.సం.సా)

**లింగకవి**

కాలం : క్రీ.శ. 17 వ శతాబ్దం.

స్థలం : వేదాద్రిపురం.

రచన : శతముఖ రామాయణము (మొదటి మూడాశ్వాసాలు) (సీతా విజయము)

గంగకవితో కలిసి శతముఖ రామాయణం రాశాడు. లింగకవి - గంగకవి ఇద్దరూ జంటకవులుగా ప్రసిద్ధికెక్కారు. ఇతడు తాను రచించిన మూడాశ్వాసాలనూ

చిన్నారెడ్డి పుత్రుడైన సోమన్నపాలునికి అంకితం చేశాడు. వీరి కవిత విర్దుష్టంగా రస వంతంగా ఉంటుంది. ఇతడు నీలకంఠోపాసకుడట.

కృతిపతి పోచన్నపాలుడని కందుకూరి వారు రాశారు.

(క.చ-3-141; క.స-211)

## లింగకవి - గంగకవి

జంటకవులు.

కాలం : క్రీ.శ, 17వ శతాబ్దం.

స్థలం : వేదాద్రిపురం.

రచన : శతముఖ రామాయణము. (సీతావిజయము)

లింగకవి మొదటి మూడు ఆశ్వాసాలనూ వ్రాయగా తరువాతి భాగాన్ని గంగ కవి వ్రాశాడు. (క.చ-3-141)

## లింగధారణ చంద్రిక

రచనాకాలం : క్రీ.శ. 13వ శతాబ్ది కావచ్చు.

కర్త : శరభాంక కవి.

వీరశైవ మత సంప్రదాయాలను తెలిపే గ్రంథం. ఈ కవి ఓరుగంటి ద్వితీయ ప్రతాపరుద్రుని దగ్గర మంత్రిగా ఉండేవాడు, (క.స-263)

## లింగనమఖి శ్రీ కామేశ్వర కవి

కాలం : క్రీ.శ 17వ శతాబ్దం (క్రీ శ. 1659-82) చొక్కనాథ నాయకుని కాలం.

స్వస్థలం : కాళహస్తి

ఆస్థానం : మధుర (1670 ప్రాంతం).

రచనలు : 1. రుక్మిణీ పరిణయము (అలభ్యం) 2. సత్యభామా సాంత్వనము 3. ధేను మాహాత్మ్యము.

ఇతడు ముద్దు అళఘరి, చొక్కనాథ నాయకుల ఆస్థానంలోనివాడు. సంగీత, సాహిత్య విశారదుడు. కామాక్షమ్మ, నాగనామాత్యుల పుత్రుడు. ప్రౌఢకవి. సలక్షణ మైన వచనంలో ఇతడు రచించిన దేను మాహాత్మ్యము ఆ కోవలో మొదటి గ్రంథంగా ప్రసిద్ధం. కాళహస్తిలోని జ్ఞాన ప్రసూనాంబిక అనుగ్రహంతో కవిత చెప్పనేర్చానని కవి గద్యలో చెప్పుకొనడాన్ని బట్టి ఇతడు కాళహస్తి ప్రాంతాల వాడని కొందరు భావి స్తున్నారు. మధుర నాయకుల నుండి శిత ఛత్ర చామ రాందోళికాది రాజోచితమైన బహుమానాలు పొందాడు. (క.చ-3-10) (క.త-12-177)

## లింగ నిర్ణయము

కర్త : గణపవరపు వేంకటకవి.

ఇతని కొన్ని ఇతర గ్రంథాలవలె ఇది కూడా సర్వాలక్షణ శిరోమణి లోనిదే

కావచ్చునని పండితాభిప్రాయం. దీన్ని కవి తన, "ప్రబంధ రాజ వేంకటేశ్వర విజయ విలాసం"లో పేర్కొన్నాడు. (ఆరుద్ర-11-180)

## లింగ పురాణము (అలభ్యం)

చూ. లైంగ ధర్మము.

రచనాకాలం : క్రీ.శ. 1550-80 నడుమ.

కర్త : కామినేని ఎల్లారెడ్డి.

ఈ కవి వాసిష్ఠ లైంగధర్మం రచించినట్లు తెలుస్తున్నది. ఈ రెండూ వేర్వేరు గ్రంథాలో ఒకే గ్రంథమో నిర్ధారణ కాలేదు. (క.త-11-17)

## లింగ పురాణము (అలభ్యం)

కర్త : తెనాలి రామకృష్ణ కవి.

తెనాలి రామకృష్ణుడు లింగ పురాణం రచించినట్లు కొందరు పరిశీలకులు భావిస్తున్నారు. ఇందుకు తగిన ఆధారాలు లేవు. (క.న-186)

## లింగమకుంట తిమ్మకవి

కాలం : క్రీ.శ. 16 వ శతాబ్ది.

స్థలం : నెల్లూరు మండలంలోని లింగమకుంట.

రచనలు : 1. సులక్షణ సారము 2. బాలబోధచ్ఛందము.

గురువు : భట్టరు చిక్కాచార్యులు.

విశిష్టత : ఈయన తెనాలి రామకృష్ణుని అల్లుడయిన లింగమకుంట రామయ్యకు తమ్ముడు. తిమ్మాంబా లక్ష్మణామాత్యులు తల్లిదండ్రులు. తాత సర్వకవి. అన్న రామయ్య మత్స్య, వామన పురాణాలు వ్రాసే సమయంలో తిమ్మకవి లేఖకుడుగా వ్యవహరించేవాడు. "లక్షణశాస్త్రము వెల్ల బరీక్షించుట కొంత కొంత యెరిగిన వాడన"ని చెప్పుకొన్నాడు. ఇంతకు పూర్వం ఛందో గ్రంథాలను వ్రాసిన వారిలో కొందరు చెప్పిన లక్షణాలు మరి కొందరు ఒప్పుకోలేదు. అందరి అభిప్రాయాలను తాను క్రోడీకరిస్తానని తిమ్మకవి చెప్పాడు. (ఆరుద్ర-8-134)

## లింగమకుంట రామకవి

కాలం : క్రీ.శ. 16 వ శతాబ్ది మధ్య భాగం.

స్థలం : లింగమకుంట.

రచనలు : 1. ఆనందకానన మాహాత్మ్యము 2. చతుర్వాటికా మాహాత్మ్యము 3. మత్స్య పురాణము (అలభ్యం) 4. వామన పురాణము (అలభ్యం) 5. వేంకట మాహాత్మ్యము (అలభ్యం) 6. లక్షణతిలకము (అలభ్యం).

గురువు : చిక్కాచార్యులు.

విశిష్టత : ఈయన తెనాలి రామకృష్ణుని అల్లుడు. లింగమకుంట సర్వకవి ఇతనికి తాత. తిమ్మకవి ఇతని తమ్ముడు. మొదటి రెండు గ్రంథాలు లభ్యమైనా అముద్రితాలు. మద్రాసు ప్రాచ్యలిఖిత గ్రంథాలయంలో వీటి ప్రతులున్నాయట. మత్స్య, వామన పురాణాలు, వేంకట మాహాత్మ్యం వ్రాశానని కవి ఆనందకానన మాహాత్మ్యంలో చెప్పాడు. ఈయన "లక్షణ తిలకం" అనే ఛందో గ్రంథాన్ని వ్రాసినట్లు

"లక్షణ శిరోమణి"లో పొత్తపి వేంకట రమణకవి చెప్పాడు. ఇతని కవిత్వం సరసంగా, సలక్షణంగా ఉంటుంది.

ఇతని తాత సర్వకవి కవి సార్వభౌముడట. (ఆరుద్ర-8-133)

## లింగమకుంట సర్వకవి

కాలం : క్రీ.శ. 15, 16 శతాబ్దాలకు ముందువాడు.

రచనలు : 1. ఆది పురాణము (అలభ్యం) 2. విరాటము (అలభ్యం)

బిరుదు : కవి సార్వభౌమ.

విశిష్టత : ఈయన తెనాలి రామకృష్ణునికి అల్లుడయిన లింగమగుంట రామయ్యకు తాత. తన తాత సర్వన్న కవి సార్వభౌముడని రామకవి చెప్పాడు గాని అతడు వ్రాసిన గ్రంథాలను చెప్పలేదు. అయితే సర్వదేవుడనే కవి వ్రాసిన ఆది పురాణం నుంచి 2 పద్యాలను, విరాటంనుంచి ఒక పద్యాన్ని అజ్ఞాత గ్రంథ సంకలన కర్త "ఉదాహరణ పద్యాలు"లో ఉదాహరించాడు. మల్హణ చరిత్ర కావ్యకర్త పెదపాటి ఎర్రన్న పూర్వ కవి స్తుతిలో 'సర్వదేవు'డనే కవిని నుతించాడు. సర్వదేవుని పద్యాలుగా ప్రసిద్ధి పొందిన ఆది పురాణం, విరాటాల్లోని పద్యాలను బహుశా ఈ లింగమకుంట సర్వన్న వ్రాసి ఉంటాడేమో నని విమర్శకుల అనుమానం. ఈయన కృష్ణదేవరాయలకు కొంచెం పూర్వుడో, సమ కాలికుడో అయిన లింగమకుంట సర్వదేవుడు కావచ్చు.

(ఆరుద్ర-8-132)

## లింగమగుంట మాతృభూతకవి

కాలం : తెలియదు.

రచన : అభినయదర్పణము.

కవిని గురించిన వివరాలు తెలియరాలేదు.

## లింగమూర్తి కవి

కాలం : క్రీ. శ. 1785 ప్రాంతం.

రచన : శివపారిజాతము (యక్షగానం)

కవిని గూర్చిన వివరాలు తెలియవు. (య.వా.చ)

## లింగయ్య

కాలం : తెలియదు.

రచన : సాముద్రిక శాస్త్రము.

సంస్కృతాంధ్రాలలో పండితుడు. సాముద్రిక శాస్త్రాన్ని పద్యకావ్యంగా వ్రాశాడు. కావలి వెంకటరామస్వామి ఈ కవిని గురించి వ్రాశాడు. (క.స.213)

## లింగరాజు

కాలం : తెలియదు.

రచన : "మలయాద్రి నారసింహచ్ఛందస్సు"

ఇతడు వ్యాకరణ విద్వాంసుడు. మలయాద్రి నృసింహస్వామి భక్తుడు. కవిత్వం కూడా రమణీయంగా చెప్పేవాడని తెలుస్తున్నది. (క.స-418)

**లీలానంద సర్వేశ్వర శతకము**

కర్త : యథావాక్కుల అన్నమయ్య.

అన్నమయ్య రచించిన సర్వేశ్వర శతకమొక్కటే వ్యాప్తిలో ఉంది. ఈ శతకాన్ని కూడా అతడు రచించాడని కొందరంటున్నారు. (శ.స-7)

**లీలావతి**

కాలం : క్రీ.శ. 11, 12 శతాబ్దాలు.
రచన : గణితశాస్త్రమ్ (సం).

గొప్ప మేధావిని. గణితశాస్త్ర పండితుడైన భాస్కరాచార్యుల కుమార్తె. ఈమె శ్లోకాలు, లెక్కలు చాల జటిలంగా ఉంటాయట. ఈమె కావ్యం ఆంగ్ల, ఫ్రెంచిభాషల లోనికి అనువదింపబడింది. (ఆం. కవయిత్రులు-36)

**లీలావతీ కల్యాణము**

కర్త : గిరిరాజకవి (చూ).
అంకితం : శరభోజీకి.

యక్షగాన ప్రాయమైన నాటకం. నాయకుడు శరభోజీ, నాయిక లీలావతి. శరభోజీ 1712-28 నడుమ తంజావూరును పాలించిన మహారాష్ట్రరాజు. శహాజీకి తమ్ముడు. ఇందులో రాజాస్థానపు మర్యాదలు విపులంగా వర్ణితాలు. (య. గా. సం-3-పీఠిక)

**లీలావతీ దండకము**

కర్త : చూ. పట్టాభిరామయ్య.
అంకితం : వెలుగోటి కుమారయాచమనాయుడు (1777-1804). (ఆం.సం. సా-459)

**లీలావతీ శాహరాజీయము**

కర్త : బాలకవి సుబ్బన్న (చూ).
రచనాకాలం : క్రీ.శ. 17వ శతాబ్దం.

యక్షగాన నాటకం. కాశ్మీర రాజపుత్రి లీలావతి, శహాజీల శృంగార గాథ వర్ణితం. శహాజీ తంజావూరును పాలించిన మహారాష్ట్ర రాజు. ప్రసక్తాను ప్రసక్తంగా ఆనాటి వేష భాషలు, సాంఘిక స్థితిగతులు వర్ణింపబడ్డాయి. (య. గా. సం-3 పీఠిక)

**లూకా సువార్త**

క్రైస్తవమత గ్రంథం. దీన్ని గ్రీకు భాష నుంచి భాషాంతరీకరించడంలో మంగళగిరి ఆనందకవి (1700 ప్రాంతం) పాశ్చాత్యులకు చాలా సహాయపడినాడట. (క. స-20)

**లేజెళ్ళ గోపమంత్రి**

కాలం : క్రీ.శ. 16వ శతాబ్దం చివరి భాగం.

కృతిపతి. మాదయకవి రచించిన, "మైరావణ చరిత్ర" ఇతనికే అంకితం. లేజెళ్ళ (లేజర్ల) అబ్బయామాత్యుని కుమారుడు. కృత్యాది పద్యాలు లభించకపోవడం

చేత వీరి వృత్తాంతం ఇంతకు మించి తెలియటం లేదు. ఇతని ఇంటిపేరు తొలుత "కాండవ" అని ఆశ్వాసాంత పద్యాలనుండి తెలుస్తున్నది. (క. శ-6-258)

## లేటవరపు పోతరాజు

కాలం : క్రీ.శ. 18 శతాబ్ది.

ఈయనమీద తురగా రామకవి శపిస్తూ, దీవిస్తూ, చాటువులు చెప్పాడు. రామకవి పోతరాజు ఇంటికిపోతే, ఇంట్లో ఉండికూడా లేడని చెప్పించాడు. అందుకు రామకవి కోపించి పోతరాజును శపిస్తూ పద్యం చెప్పాడు. పోతరాజు వెంటనే స్ఫ్రుహతప్పి పడిపోయాడు ఆయన భార్య భర్త తరఫున తప్పు క్షమించమని ప్రార్థిస్తే, రామకవి కరుణించి పోతరాజును లేవవలసిందిగా పద్యం చెప్పాడు. వెంటనే పోతరాజు లేచి రామకవిని క్షమించమని వేడుకొన్నాడట. (చా ప.ర.)

## లేపాక్షి

హిందూపురానికి తొమ్మిదిమైళ్ళ దూరంలో ఉన్న క్షేత్రం. ఇక్కడి ఆలయ చిత్రాలు సుప్రసిద్ధమైనవి. ఇక్కడి పాపనాశేశ్వర దేవాలయం పూర్వం ఒక గుహా విహారమట. బౌద్ధుల కాలం నుండీ ఈ ప్రాంతానికి బహుళ ప్రాముఖ్యం ఉన్నది. విజయనగర సామ్రాజ్యకాలంలో ఇక్కడి బౌద్ధ విహారాలు హైందవ ఆలయాలుగా రూపొందాయి. విరూపణ్ణ అనేశిల్పి ఇక్కడి వీరభద్రాలయాన్ని సునస్థితం చేశాడు. దుర్గాదేవి ఆలయం నేటికీ నిలచి ఉంది. ఈ క్షేత్రం పేర రామాయణ భారత నాటకాలు ప్రసిద్ధమైనవి.

## లేపాక్షి భారత నాటకము

కర్త : వేంకట నారాయణ కవి.

లేపాక్షిలోని దైవం పేర ప్రసిద్ధమైన యక్షగానం. నాలుగు రాత్రులు వరుసగా ప్రదర్శించడానికి అనువుగా రచింపబడింది. ఇందులోని పద్యాలు నేటికీ ప్రసిద్ధాలు. కవి లేపాక్షికి సమీపగ్రామంలోనివాడు.

## లేపాక్షి రామాయణము

కర్త : శీర్నీడు వేంకటరాయ కవి.

రచనాకాలం : క్రీ. శ. 1843 ప్రాంతం.

ఉత్తమోత్తమమైన యక్షగానంగా పండితుల ప్రశంసలు పొందింది. పాదుకా దానము, లంకాదండయాత్ర, రావణ సంహారము అనే మూడు భాగాలుగా విరచితం. మూడు రాత్రులు వరుసగా ప్రదర్శింపబడుతుండేది. ఇందులో వర్ణన తక్కువగా, ముఖ్య కథ విశదంగా ఉంటుంది. వీర, కరుణాద్భుత రసాలకు నిలయమై వచన రామణీయకతతో వెల్లి విరిసిన నాటకమిది. రచనలో వచనాలు, కందాలు, దరువులు, గీతాలు ఉన్నాయి. కర్త లేపాక్షికి సమీప గ్రామస్థుడవడం వల్లనూ కథలోని శ్రీరాముడు లేపాక్షి నిలయుడుగా పేర్కొనబడడం వల్లనూ ఇది లేపాక్షి రామాయణంగా ప్రసిద్ధమైంది. (పి. యు. 206)

## లైంగధర్మము (అలభ్యం)

నామాంతరం : లింగపురాణము.
కర్త : చూ. కామినేని ఎల్లారెడ్డి.
అంకితం : బిక్కనవోలులోని సిద్ధరామేశ్వరునకు.

దోమకొండ సంస్థానాన్ని పాలించిన కామినేని మల్లారెడ్డి రచించిన "శివ ధర్మోత్తరము" అనే గ్రంథం ద్వారా ఈ గ్రంథాన్ని గురించి తెలుస్తున్నది.
(అం.సం.సా-184)

## లొల్ల లక్ష్మీధరుడు

కాలం : క్రీ.శ. 1465-1530 మధ్యకాలం.
ఆస్థానం : శ్రీకృష్ణ దేవరాయల ఆస్థానం.
బిరుదు : మహోపాధ్యాయుడు.
రచనలు : 1. సరస్వతీ విలాసమ్ 2. సౌందర్యలహరీ వ్యాఖ్య 3. సాహిత్య లక్ష్మీధరమ్ 4. యోగదీపిక 5. మానవ ధర్మశాస్త్ర టీక 6. కర్ణావతంసమ్ 7. బర్హావతంసమ్ 8. లక్ష్మీధరమ్.
సమకాలికులు : ఈరదేచమంత్రి, తెనాలి రామలింగకవి, నాదెండ్ల గోపమంత్రి.

ఈయన తొలుత ఉత్కలదేశాధీశ్వరుడయిన ప్రతాపరుద్ర గజపతి ఆస్థానంలో ఉండేవాడు. శ్రీకృష్ణదేవరాయలు గజపతిని జయించి, అతని కుమార్తెను వివాహమాడి విజయనగరం తిరిగి వచ్చేటప్పుడు ఇతనిని కూడా విజయనగరం తీసుకొని వచ్చాడు. ఈయన సాహిత్య మహానటుడు. షడ్దర్శనీ పారంగతుడు. ఉదాత్త గ్రంథ నిర్మాత. నిఖిల యామళ తంత్రాన్ని మథించాడట. కొండవీటి పాలకుడైన నాదెండ్ల గోపమంత్రి ఆదరణలో ఉన్నాడు రచనలన్నీ సంస్కృత గ్రంథాలు. (తె.వి.స.-4)

## లొల్లా ప్రగడ కామమంత్రి

కాలం : క్రీ.శ. 18వ శతాబ్దం.

కవిపోషకుడు గొంతేటి సూరన రచించిన కృష్ణాభ్యుదయ ప్రబంధం ఇతనికే అంకితం.

## లోక బాంధవుడు

రచన : హరిశ్చంద్ర చరిత్రము.

కవి వివరాలు తెలియవు. ఇది కవి బిరుద నామమని కొందరి అభిప్రాయం.
(క. స 214)

## లోకేరావు

గ్రామనామం. శివదేవ మంత్రి ఈ ఊరు కట్టించాడట. అప్పటి నుండి ఆ కుటుంబం వారికి అదే ఇంటిపేరు అయింది. ఈ వంశంలో లోకేరావు సోమన్న అనే కవి ప్రసిద్ధుడు. (ఆరుద్ర-10-231)

**లోకేరావు సోమన్న**

కాలం : క్రీ.శ. 17వ శతాబ్దం.

రచనలు : 1. బలభద్ర విజయము 2. భల్లాణ చరితము (అలభ్యం) 3. శివరాత్రి మాహాత్మ్యము (అలభ్యం) 4. లక్షణాదేవి కల్యాణము(అలభ్యం) 5. శుక రంభా సంవాదము (అలభ్యం).

ప్రౌఢంగా, సరసంగా కవిత చెప్పిన కవి. బలభద్ర విజయంలో తాను రచించిన ఇతర గ్రంథాలను పేర్కొన్నాడు.

**లోకోత్తర స్వారస్యయుత శతకము**

నామాంతరాలు ; డిండిమ ప్రహసనము, శృంగార సీసపద్య శతకము (చూ).

(ద. దే. వా–449)

**లోలంబరాజు**

కాలం : క్రీ.శ. 14వ శతాబ్దం

రచనలు : 1. హరివిలాసమ్ (సం) 2. సుందర దామోదరమ్ (సం).

ఇతడు హరిహరరాయల కొలువులో ఉండేవాడు. (తె. వి. స–6)

**లౌకిక దృష్టాంత మంజరి**

కర్త : చూ. నడిమింటి సర్వమంగళేశ్వరశాస్త్రి.

ఇది ఒక నిరర్థక రచనగా పండితులు భావిస్తున్నారు. బూతు సామెతలను ఉదాహరణలుగా చూపుతూ, ఉదాహరింపరాని బూతు శ్లోకాలతో ఈ కావ్యం నిండి ఉన్నదట. (ఆం. పం. సా–543)

**వంకాయలపాటి వేంకటకవి**

కాలం : క్రీ.శ. 1800 ప్రాంతం.

స్థలం : గోదావరీ మండలం – కోలంక.

రచన : మదన గోపాల శతకము.

గురువు: గుండు వేంకట రాముడు.

వెంకయ్య, కామమాంబల పుత్రుడు. అనేక కృతులు రాశాడని చెప్తున్నారు. కాని వాటి పేర్లు తెలియ రాలేదు. (క.స–235)

**వంకాయల వారు**

కూరగాయల పేరుతో నిలిచి పోయిన ఇంటిపేరు. ఈ ఇంటిపేరుతో చాలా కుటుంబాలవారున్నారు. బీరకాయలవారు అనే ఇంటిపేరు ఇలాంటిదే.

(భారతి–మా–45–230)

**వంగల సీనయ్య**

కాలం : క్రీ.శ. 1706–1732 ప్రాంతం.

నామాంతరం ; ఘనం సీనయ్య.

ఆస్థానం : మధుర విజయరంగ చొక్కనాథుని ఆస్థానం.

కృతిపతి : శేషం వేంకట పతి కృత తారాశశాంక విజయానికి.
రచనలు : రామానుజ చరిత్ర, సుసంగ విజయము (కర్తృత్వం సందేహం) వంగల సీనయ్య పదములు (మన్నారు రంగపదములు).
సమకాలికుడు : శేషం వేంకటపతి.

ఈయన విజయరంగ చొక్కనాథుని మంత్రి. "ఘననయదేశీయ... సంగీత విద్యా విశారదుడు, వీణావినోద భూలోకనారదుడు, సరస పదపద్యగద్య రచనా భోజుడ"ని తారాశశాంక విజయావతారికవల్ల తెలియవస్తున్నది ఇతడు తానం లేక మధ్యమకాలంలో పాడటంలో ఘనుడట. అందుకే ఈయనను "ఘనం" సీనయ్య అని పిలిచేవారట. సంగీతంలో ఘనమైన ప్రజ్ఞను చూపి ఘనం సీనయ్యగా ప్రసిద్ధి కెక్కాడని కొందరంటారు

మన్నారు పోలూరు అనే గ్రామంలో ఇతడు తన చివరి దశలో నివసించినట్లు చెప్తారు. "శివదీక్షాపరురాలనురా" అన్న పదం ఇతనిదే.

(తె.వా.; అరుద్ర 12-113; ద.దే.వా. 360)

## వంగల సీనయ్య పదములు

నామాంతరం : మన్నారురంగ పదములు.
కర్త : వంగల సీనయ్య.

ఇతని పదములు 'మన్నారు రంగ' అనే మకుటంతో ఉంటాయి. అతిప్రసిద్ధమైన 'శివ పూజాపరురాలనురా' అనే పదం ఇతనిదే. శివ భక్తి పేరట శృంగారంతో పాటు వైష్ణవ ద్వేషం కూడా ఉంది. వైష్ణవ పరమైన క్షేత్రయ్య పదాలు, శైవపరమైన సీనయ్య పదాలు- పదలాలిత్యంలోను, భక్తి పేరిట రక్తిలోను సమానాలని పండితాభిప్రాయం. (తె వా)

## వంగూరి నరసకవి

నామాంతరం : వంగూరి ముద్దు నరసకవి.
కాలం : క్రీ.శ. 18 వ శతాబ్దం, 19 వ శతాబ్ది పూర్వార్థం.
రచన : ప్రసన్న రాఘవ శతకము.

అచ్చన పుత్రుడు. ప్రసన్న రాఘవ శతకంలో రెండు వందల పద్యాలలో రామాయణ కథను క్రావ్యంగా వ్రాశాడు. రచనలో భాషా దోషా లున్నవట.

(శ.క.చ-516; శసా.వి-691)

## వంగూరి ముద్దు నరసకవి

నామాంతరం : వంగూరి నరసకవి (చూ).

## వంచక పురోహితుడు

గౌరన రచించిన నవనాథ చరిత్ర కావ్యంలోని పాత్ర. రాజ పురోహితుడు రాజ కుమార్తె అంజిదిని మోహించి, ఆమెను అనుభవించవలె ననుకొన్నాడు. అందుకు

ఒక పన్నాగం పన్నాడు. గుర్రంవానితో లాలూచీపడి, "నేను చెప్పిన రోజు గుర్రపు శాలను తగులబెట్టు- అంతకు పూర్వం నేను జ్యోతిష్యం చెపుతాను. నా జ్యోతిష్యం నిదర్శనమయిన తర్వాత రాజు నాకు డబ్బిస్తాడు. అందులో నీకు సగం ఇస్తా"నని నమ్మకం పుట్టిస్తాడు. అన్నట్లే జరిగిపోయింది. ఈ పురోహితుడు గొప్ప జ్యోతిష శాస్త్రవేత్తగా పేరు పొందుతాడు. కొన్నాళ్ళ తరవాత "నీ రాజ్యానికి అరిష్టముంది, నీకూతుర్ని పెట్టెలో పెట్టి నదిలో వదిలి వేస్తే శని పోతుంద"ని రాజుతో చెబుతాడు. రాజు విధి లేక అట్లా చేస్తాడు. ఏట్లో కొట్టుకు వచ్చే ఆమందసాన్ని పట్టి అడవిలో రహస్యంగా ఉంచమని శిష్యులకు ఈ పురోహితుడు ముందే ఆజ్ఞాపించాడు. వాళ్ళు అట్లాగే చేయగా వంచక పురోహితునికి కలిగిన ఆనందానికి మేరలేదు. "వగ్గు కోతికి శివము వచ్చిన రీతి" కుప్పిగంతులు వేసి ఆనందించాడు రాజకుమార్తెను చూసే కుతుహలంతో శిష్యులను పంపివేసి ఒంటరిగా పెట్టె తెరచాడు. అందులోంచి ఒక ఎలుగుబంటు వచ్చి అతన్ని రక్కి- బాధించింది. కొన ఊపిరితో ఉన్న వంచక పురోహితునికి శిష్యులు వచ్చి ప్రథమ చికిత్స చేశారు. ఈ సంగతి ఎవరికీ చెప్పవద్దనీ రాజుకు తెలిస్తే కుక్కచ్చు లొత్తి వెడల గొట్టిస్తాడనీ రోదించి శిష్యులతో చెప్పి కాశీకి వెళ్ళిపోతాడు. ఈ కథను లోకవృత్తానికి నిదర్శనంగా కవి చిత్రించాడు.

(నవనాథ చరిత్రము)

వంశానుక్రమ దర్పణ టీక

కర్త : తెలియదు.

కార్వేటి నగర సంస్థాన ప్రభువైన వేంకట పెరుమాళ్ళ రాజు ఆస్థానంలో ఉన్న శ్రీశైల కవి రచించిన "వంశాను క్రమ దర్పణ" గ్రంథానికి ఇది టీక. కవి, టీకాకారులు ఎవరో తెలియదు. వ్యావహారిక వచన రూపంలో ఉన్న ఈ గ్రంథం మిక్కిలి ప్రసిద్ధి గాంచింది. ఇందులోని టీక "దండాన్వయ" రూపంలో వ్రాయబడడం వలన మూల గ్రంథం సంస్కృత రచన కావచ్చునని పలుపురి అభిప్రాయం.

(ఆం.సం.సా.)

వంశానుక్రమ దర్పణము

కర్త : చూ. శ్రీశైల కవి.

అంకితం : కావేరి రాజుకు.

కార్వేటి నగర రాజ వంశంలోని రామభద్రరాజు మొదలుకొని కావేరి రాజు వరకు గల వారి వంశ చరిత్ర ఇందులో వర్ణించబడింది. ఇది ఏకాశ్వాస గ్రంథం. ప్రస్తుతం అలభ్యం. ఇది సంస్కృత రచన కావచ్చును. (ఆం.సం.సా)

వంశావళి (అలభ్యం)

కర్త : చిత్రకవి అనంతకవి.

కవి కుమారుడైన చిత్రకవి వేంకట రమణకవి రచించిన సాంబ విలాసంలో దీని ప్రసక్తి ఉంది.

(ఆరుద్ర-9)

## వక్కలంక చిన వీరభద్రకవి

కాలం : 18, 19 శతాబ్దాల నడిమి కాలం.

స్థలం : పిఠాపురం సంస్థానం.

రచన : వాసవదత్తా పరిణయ గ్రంథానికి అనుబంధంగా చేర్చబడ్డ రావు వంశచరిత్ర.

పిఠాపురం సంస్థానాధిపతి రావు మాధవరావు (1679-1704) సమకాలికుడైన, వక్కలంక వీరభద్రకవి (క్రీ.శ. 1680-1740) కి పౌత్రుడు. పిఠాపురం రాజా రావు వేంకట నీలాద్రి రాయని ఆశ్రితుడు. రావు మాధవరావు కాలం నుండి, వేంకట నీలాద్రి రాయని కాలం వరకుగల రావు వంశ చరిత్రను రచించి, తన తాతగారు వ్రాసిన "వాసవ దత్తా పరిణయ" ప్రబంధానికి జత పరిచాడు. ఈ అనుబంధ రచన చారిత్రకంగా విలువైనది. (ఆం సం సా-250)

## వక్కలంక వీరభద్ర కవి

కాలం : క్రీ.శ. 1680-1740 ప్రాంతం.

స్థలం : పిఠాపురం సంస్థానం.

రచన : వాసవదత్తా పరిణయము, గౌరీ కల్యాణము.

సమకాలికులు : ఏనుగు లక్ష్మణకవి, భవానీశ కవి, కూచిమంచి తిమ్మకవి, జగ్గకవి.

భాస్కర కవి జగ్గాంబల పుత్రుడు. చంద్రశేఖరకవి పౌత్రుడు. క్రీ.శ. 1679-1704 మధ్య కాలంలో పిఠాపురం సంస్థానాన్ని పాలించిన రావు మాధవ రాయనికి ఇతడు ఆశ్రితుడు. తనరచనను పోషకుడైన మాధవ రాయనికి అంకితం చేశాడు. అతని చేత కోనసీమలోని వృద్ధ గౌతమీతీర సమీపంలో మాన్యాలు పొంది సత్కరింప బడ్డాడు. ఇతని రచనలు రెండూ ప్రసిద్ధ సంస్కృత కావ్యాలకు అనువాదాలు (ఆం.సం.సా-246; క.త-12-224)

## వచన కావ్యము

తెలుగులో వచన కావ్యాన్ని, గద్య కావ్యాన్ని ఇంచుమించు సమానార్థకాలుగా వ్యవహరిస్తున్నారు. కాని కొన్నిచోట్ల ఈ రెంటికీ కొంచెం అర్థభేదం పరిమిత ప్రయోగంలో రూఢమైంది. గద్య, బిరుదు గద్య, చూర్ణిక, వచనము, విన్నపము అనే పేర్లతో వచన భేదాలు ఏర్పడినాయి. ఇవన్నీ నియతమైన గణబంధం లేని వచన రచనలు.

భక్తి ప్రధానమైన వచనాలు, విన్నపాలను కృష్ణమాచార్యులు, తాళ్లపాక కవులు క్రీ. శ. 15 వ శతాబ్దంలో వ్రాశారు. ఈ వచనాలు భావ ప్రధానాలు కావటం వల్ల వీటిని కావ్య జాతిలో చేర్చవచ్చునని పండితులంటారు. కాశికాధీశ్వర వచనాలు, భవానీ మనోహర వచనాలు ఈ జాతివి.

భారత సావిత్రి (1550) అనే వచనం ప్రసిద్ధం. దీన్ని ఇప్పటికీ కొందరు స్త్రీలు పల్లిస్తూ ఉంటారు. మధుర నాయక రాజులు వచన వాఙ్మయాన్ని ఎక్కువగా ప్రోత్సహించారు. విజయరంగ చొక్కనాథుని రచనలు రెండూ వచన కావ్యాలే. 16వ శతాబ్దంనుంచి 19వ శతాబ్దం వరకు తెలుగులో వచన రచన విపరీతంగా జరిగింది.

పాశ్చాత్య సాహిత్య ప్రభావం వల్ల క్రీ. శ. 19వ శతాబ్దంలో వచన వాఙ్మయం తామర తంపరగా వచ్చింది. చిన్నయ సూరి నీతి చంద్రిక గద్య వాఙ్మయానికి వేగు చుక్క.

ఇతివృత్తం, రచనాశైలి మొదలైన భేదాలవల్ల ఇందులో అనేక అవాంతర భేదాలు ఏర్పడ్డాయి. (తె. వా.)

## వచన భాగవతము (అలభ్యం)

కర్త : కుందుర్తి వేంకటాచలపతి (చూ).

మిత్రవిందా పరిణయంలో దీని ప్రసక్తి ఉంది.

## వచన భారతము (కన్నడం)

నామాంతరం : నంజరాజ వాణీ విలాసము.

కర్త : కళువె నంజరాజు.

కన్నడ రచన. దీనిలో కొన్ని భాగాలలోని గద్యలో అప్పటి మైసూరు పాలకుడైన చిక్క దేవరాయల పేరుకూడా ఉంది. ఇది నంజరాజు, చిక్కదేవరాయలు కలిసి చేసిన రచన కావచ్చును. నంజరాజే తన పోషకుడైన చిక్క దేవరాయల పేరు జోడించి ఉంటాడని పరిశీలకులు భావిస్తున్నారు.

## వచన భారతము

కర్త : కళువె వీరరాజు.

అంకితం : కళువె గ్రామంలో వేంచేసిన గోపాలకృష్ణ దేవునికి.

ఈ రచనలో వీరరాజుకు తుపాకుల అనంత భూపాలుని తోడ్పాటు ఉందట. ఇది తెలుగులో సమగ్రంగా రచితమైన అమోఘమైన తొలి గద్య కావ్యం. దీనిలోని సభా, భీష్మ పర్వాలు మాత్రమే లభ్యం. ఇది వ్యాస భారతానికి సరైన తెనుగు సేత. దీర్ఘ వాక్యాలతో కూడిన వచన రచన దీనిలోని విశిష్టత. పూర్ణానుస్వార యుక్త పద ప్రయోగం దీనిలో ఎక్కువగా ఉంది. శైలి మృదువైనది. పాఠకుని హృదయాన్ని కదిలించే విధంగా ఉంటుంది. (తె. వి. స-6)

## వచన భారతము (అలభ్యం)

కర్త : కుందుర్తి వేంకటాచలకవి (చూ).

కవి మరొక రచన మిత్రవిందా పరిణయంలో దీని ప్రసక్తి ఉంది.

## వచనము-గద్యము

గద్యాన్నే తెలుగులో వచనమంటారు. వాక్యబంధురము వచనమని జయకీర్తి అన్నాడు. తెలుగులో "వచనములు" అనే ఒక రచనా ప్రక్రియ ఉన్నది. సింహగిరి వచనములు, వేంకటేశ్వర వచనములు మొదలగునవి ప్రసిద్ధాలు.

వచనం సామాన్యంగా కర్త కర్మాది క్రియలలో వాక్య రూపం దాలుస్తూ పఠితలకు అర్థమయ్యే రీతిగా కొనసాగుతుంది. ప్రాచీన చంపూ కావ్యాలలో పద్యాలకు మధ్య వ్రాసిన గద్యను వచనమనీ, కావ్యాలలో ఆశ్వాసాంతాలలో వ్రాసిన దానిని గద్య అనీ

అనేవారు గద్యలో తాము వ్రాసిన అంశాలనే కాక తమను గూర్చి కూడా కొన్ని సంగతులు తెలిపి-సంపూర్ణము అనడం (సమాప్తమనడం) పూర్వ కవుల సంప్రదాయం.

ఆధునిక యుగంలో చిన్నయసూరి రచించిన నీతిచంద్రిక వంటి వచన గ్రంథాలు తెలుగు సాహిత్యంలో వచ్చాయి. శ్రేష్ఠమైన వచనాన్ని ప్రవచనమన్నారు. "వేంకటేశ్వర వచనాలు" అని తాళ్లపాక కవులు లయగతికంగా వ్రాశారు. ఈ వచనం గాన వేద్యంగా ఉంటుంది.

నవలలు, కథలు, ఏకాంకికలు, వ్యాసాలు, లేఖలు, సంభాషణలు వచన ప్రక్రియకు సంబంధించినవే. వీటిలోని వచనం సమాస సంఘటితంగాను, చిన్న చిన్న పదాలుగాను ఉండటం సామాన్యం. ఆధునిక ప్రచార సాధనాలనబడే-పత్రికలు, రేడియోలు, టెలివిజన్‌లలో వచనం సర్వజన పఠన శ్రవణ వేద్యమై, విస్తృతమైన పరిధిలో వ్యాపించడం గమనించదగి ఉన్నది. ఆధునిక కవీంద్రులెందరో వచన పద్యం, వచన గేయం, వచన కవిత అనే రూపాలలో క్రొత్త ప్రయోగాలు చేసి గ్రంథాలను వెలువరించారు. వచన గతంగాని పదం లేనట్లే పదగతం గాని సాహిత్యం కూడా లేదనే మాట సమ్మతమైనదే.

వచన రామాయణము (అలభ్యం)

కర్త : తుందుర్తి వేంకటాచల కవి (చూ).

కవి మరొక రచన మిత్రవిందా పరిణయంలో దీని ప్రసక్తి ఉంది.

వజ్ర పంజర శతకము

కర్త : చూ. పట్టాభిరామ కవి.

పట్టాభిరామ కవి శతక రచనలో ఒకటి. అప్పకవీయంలో ఒక "వజ్ర పంజర శతకం" ఉదాహరింపబడింది. కాని ఇవిరెండు ఏక కర్తృకాలు కావని. ఇది భిన్నమైనదని పండితాభిప్రాయం. (ఆం. సం. సా-194)

వజ్ర భుజోపాఖ్యానము (అలభ్యం)

కాలం : తెలియదు.

కర్త : వెలగపూడి వంశానికి చెందినవాడు.

వెలగపూడి కృష్ణయామాత్యుని భానుమద్విజయావతారికలో ఈ కృతి పేర్కొనబడింది. (వ. దే. వా-388)

వజ్రాభ్యుదయము

కర్త : కోన నారాయణ (చూ).

కృతిపతి : హయగ్రీవస్వామి.

దీని ప్రతి పూర్తిగా దొరకలేదు.

ఇతివృత్తం : ఉషాపరిణయం కథ. ఉషా నిరుద్ధుల కుమారుడైన వజ్రుని పేర కావ్యాన్ని రాయమని హయగ్రీవుడు కవికి కలలో కనబడి చెప్పాడట. దానిపై కవి ఈ కావ్యాన్ని రసోచితంగా నిర్మించి, ఆ దేవునికే అంకితమిచ్చాడు. (అరుద్ర-11-283-)

## వర్ఘుల నరసింహ కవి

కాలం : క్రీ. శ. 18వ శతాబ్దం.

రచన : శకుంతలా నాటకము (దుష్యంత చరిత్రము-యక్షగానం).

నంద్యాల నారాయణరాజు, దేవ మహారాజుల ప్రోత్సాహంతో ఈ కవి రచన చేశాడట. రచన ప్రౌఢంగా ఉంది. (య. వా. చ-36)

## 'వటమూల మందిరా' శతకము

కర్త : వటమూలుడు.

విశిష్టత : ఈ శతక కర్త వటమూలుని కాల నిర్ణయం గురించి పండితులలో అభిప్రాయభేదాలున్నాయి. వటమూలుడు తన గురువులలో ఒకడని వేమన చెప్పాడు. ఈ శతకంలో కొన్ని పద్యాలు మాత్రమే దొరికాయి. ఉదాహృత పద్యాలవల్ల ఈ శతకంలో యోగ విషయాలు తేట మాటలలో స్పష్టంగా ఉన్నట్లు తెలుస్తున్నది దీనిలోని పద్యాలను వేటూరి వారు చాటుపద్యమణిమంజరి II లో ప్రచురించారు. యోగంలో కుండలినీ శక్తి ముఖ్యమైందని, దానిని తెలిసిన వాడే యోగి అని లభించిన పద్యాలు తెలుపుతున్నాయి. (ఆరుద్ర-8)

## వటమూలుడు

కాలం : క్రీ. శ. 15వ శతాబ్దం (1580కి పూర్వుడు).

రచన : వటమూల మందిరా శతకము.

విశిష్టత : ఈయన కాలాన్ని గురించి క్రీ. శ. 1580 ప్రాంతం వాడనీ, క్రీ.శ) 1450 ప్రాంతం వాడనీ భిన్నాభిప్రాయాలున్నాయి. వటమూలుడు తనకు గురువని వేమన చెప్పాడు కాబట్టి వేమనకు సమకాలికుడు కావచ్చు. క్రీ. శ. 1580 ప్రాంతపు జంట కవులు తురగా రాజకవి, అయ్యంకి బాలసరస్వతి ఇతన్ని పేర్కొన్నారు. ఈయనయోగ విషయాలను స్పష్టంగా తేట మాటలలో చెప్పినట్లు లభించిన పద్యాలను బట్టి తెలుస్తున్నది. వటమూలుడన్నది అసలు పేరు కాదనీ బిరుదు అనీ విమర్శకుల అభిప్రాయం.(ఆరుద్ర-8·

## వడ్లమన్నాటి వెంకటాచలం పంతులు

నామాంతరం : వడ్లమన్నాటి వెంకప్ప సోమయాజులు (చూ).

## వడ్లమన్నాటి వెంకప్ప సోమయాజులు

కాలం : క్రీ.శ. 19వ శతాబ్దం.

స్థలం : కృష్ణా మండలం.

సాహితీ పోషకుడు. తిరుమల బుక్కపట్టణము చిన శాతాచార్యులను ప్రోత్సహించి సంస్కృతంలోని "విశ్వగుణాదర్శ" గ్రంథాన్ని తెలుగులో పద్య కావ్యంగా రాయించాడు. (క.స-66)

## వణుకూరి గురవరాజు

కాలం : క్రీ.శ. 16 వ శతాబ్దం.
స్థలం : కృష్ణా జిల్లాలోని వణుకూరు.
రచన : శమంతకమణి చరిత్ర (అలభ్యం).

విశిష్టత : వణుకూరు గ్రామం కృష్ణా జిల్లా కంకిపాడు ప్రాంతంలో ఉంది. గురవరాజు ఇంటి పేరును బట్టి కవి ఆ ప్రాంతానికి చెందిన వాడుగా నిర్ణయించవచ్చు. ఈయన వ్రాసిన శమంతకమణి చరిత్ర కావ్యంలోని కృత్యాది పద్యాన్ని ఒక దానిని అప్ప కవి నామాఖండ విశ్రాంతుల ఘట్టంలో వ్యక్తుల పేర్ల చివర "అయి" అని చేర్చి, యతి నిల్పటానికి చూపే సందర్భంలో ఉదాహరించాడు. అప్పకవి ఉదాహరించాడు కాబట్టి ఈయన మంచి కవి అయిఉంటాడు (ఆరుద్ర-9)

## వణుకూరు

గ్రామనామం. ఇదే కొందరికి ఇంటి పేరుగా స్థిరపడింది. ఈ గ్రామం కృష్ణా జిల్లా కంకిపాడు సమీపంలో ఉంది. ఈ ఇంటి పేరు గల వారు ఇప్పటికీ ఆ గ్రామంలో ఉన్నారు. (ఆరుద్ర-9)

## వత్సవాయ జగన్నాథరాజు

కాలం : క్రీ.శ. 17 వ శతాబ్దం.
స్థలం : పెద్దాపుర సంస్థానం.

సాహిత్య పోషకుడు. రాజ బంధువు. ఏనుగు లక్ష్మకవి, "తులాకావేరీ మాహాత్మ్యం" ఇతనికే అంకితం. ఇతడు వత్సవాయ కస్తూరి రంగరాజు కుమారుడు. (క.త-12-170)

## వత్సవాయ జగపతిరాజు

కాలం : క్రీ.శ. 1750 ప్రాంతం.

ఈయన పెద్దాపురం సంస్థానాన్ని ఏలిన రాజు. సంస్కృతాంధ్రాలలో చక్కని కవి. సుప్రసిద్ధులయిన 'ఏనుగు' వంశీయులు వీరి ఆస్థాన కవులు. ఈయనను నుతిస్తూ చాటువులున్నాయి. (తె.వి స-4; చా.ప.ర.)

## వత్సవాయ జగ్గరాజు

కాలం : క్రీ.శ. 17 వ శతాబ్దం.
స్థలం : పెద్దాపుర సంస్థానం.

వెంకటరాజు పుత్రుడు సాహిత్య పోషకుడు రాజ బంధువు. ఏనుగు లక్ష్మకవి రచించిన ధ్రువచరిత్ర ఇతనికే అంకితం. (క.త-12-169)

## వత్సవాయ తిమ్మనృపాలుడు

కాలం : క్రీ.శ. (1555-1607).

స్థలం : పెద్దాపుర సంస్థానం.
బిరుదు : చతుర్భుజ తిమ్మ ప్రభువు.

సాహిత్య ప్రియుడు. ద్రాక్షారామ నివాసియైన వెణుతురుపల్లి విశ్వనాథ కవి రచించిన "శేషధర్మములు" అనే గ్రంథాన్ని కోరి అంకితం పుచ్చుకున్నాడు. ఏనుగు లక్ష్మకవి ద్రౌపదీ పరిణయము ఇతనికే అంకితం. (క.త-12-156)

## వత్సవాయ బలభద్రరాజ కవి

కాలం : క్రీ.శ. 17 వ శతాబ్దం.
స్థలం : పెద్దాపురం.
రచన : శ్రీరామ శతకము (అలభ్యం).

కవి పెద్దాపుర సంస్థానాధిపతుల వంశీయుడు, కృతిపతి కూడా. 'కిరాతార్జునీయం' అనే కావ్యాన్ని అంకితం పొందాడు ఇతని తండ్రి, అన్నగారు పెద్దాపురాన్ని పాలించారు. (క.త-12-151)

## వత్సవాయ రామభూపతి

కాలం : తెలియదు.

ఈయనపై మాగాపు శరభకవి అశువుగా ఒక చాటు పద్యాన్ని చెప్పాడు. 'ఇతడా' అనే ప్రారంభంతో మరి కొన్ని పద్యాలను, పై శరభకవి చెప్పాడట గాని ఆ పద్యాలు దొరకలేదు. రామభూపతి కాలం తెలియరాలేదు. (చా.ప.ర.)

## వద్దిపర్తి కోనరాట్కవి

కాలం : క్రీ.శ. 1754-1834 ప్రాంతం.
స్థలం : సర్వసిద్ధి.
రచనలు : శ్రీ మహాలక్ష్మీ పరిణయము, రేవతీ పరిణయము, వెంకటేశ్వరోపాఖ్యానము, జానకీరామ శతకము, జమాబందీ దండకము.

కవి వేంకట తమ్మయామాత్యుని పుత్రుడు. తల్లి రామాంబ. తాత రామరాజు. సలక్షణంగా రచన చేశాడు. ధారాశుద్ధి గల కవి. (క.స-49)

## వనదేవత

అల్లసాని పెద్దన రచించిన మనుచరిత్రలోని పాత్ర. మనుచరిత్ర ఆంధ్ర పంచ కావ్యాలలో ఒకటి. దీనికి స్వారోచిష మనుసంభవమనే పేరున్నది. స్వారోచికి వనదేవత వల్ల కలిగిన వాడే స్వారోచిషుడు. దేవతం కోరికపై వనదేవత లేడి రూపంలోని స్వరోచి వినమీపిస్తుంది.

ఒకనాడు స్వరోచి వేటాడుతూ అడవి పందిని చంపబోగా ఈ లేడి వెళ్ళి, దాని నెందుకు చంపడం-నన్ను చంపమని అడుగుతుంది. మృగ భాష నేర్చిన వాడు కనుక స్వరోచి, బ్రతుకు మీద ఇంత వైరాగ్యం ఎందుకని ప్రశ్నిస్తాడు అన్య స్త్రీలపై ఆసక్తిగల పురుషునిపై ప్రేమ కలిగినప్పుడు చావడమే మంచిదని లేడి సమాధానమిస్తుంది.

స్వరోచి కుతూహలంతో ఈమె వృత్తాంతాన్ని తెలుసుకుంటాడు. అతడు ఆలింగనం చేసుకోగానే ఆ లేడి దివ్యస్త్రీయై నిలుస్తుంది. దేవతల కోరికపై మనువుకాదగిన పుత్రుని కొరకు తాను అతని వద్దకు వచ్చానని చెప్తుంది. స్వరోచి ఆమె కోరిక నెరవేరుస్తాడు. ఈమెకు పుట్టిన వాడే స్వారోచిషుడు. పెద్దన ఈ పాత్రను కొన్ని ప్రకృతులకు ప్రతీకగా తీర్చిదిద్దాడు.

వనపర్తి

దీనిని "సూగూరు" సంస్థానమని కూడా వ్యవహరిస్తారు.

ఇది నేటి మహబూబ్ నగర మండలంలోని ప్రముఖ సంస్థానం. సంస్థాన పాలకులు "జనుంపల్లి" వారు. మోటాటి శాఖకు చెందిన రెడ్లు. వీరకృష్ణభూపతి లేక వీరకృష్ణారెడ్డి అనే అతడు వీరికి మూల పురుషుడు. ఇతడు సుమారు 400 ఏండ్ల క్రితం విజయనగర భూపతులకు సామంతుడుగా ఉంటూ, తదనంతర కాలంలో "సూగూరు" రాజధానిగా గల 124 గ్రామాలకు అధీశ్వరుడైనాడు. క్రీ.శ. 19 వ శతాబ్దం ఉత్తరార్థంలో మొదటి రామకృష్ణారావు సంస్థానాధీశ్వరుడుగా ఉన్నప్పుడు సంస్థానపు రాజధాని సూగూరు నుండి "వనపర్తి"కి మారింది.

క్రీ.శ. 17 వ శతాబ్దం ఉత్తరార్ధంలో సంస్థానాన్ని పాలించిన రాజాసవై వెంకటరెడ్డి తనవత్తు తండ్రి గోపాలరావు పేరు మీద "గోపాలపేట" అనే గ్రామాన్ని కట్టించి, దాని పాలనాధికారం తమ్ముడైన "రంగారెడ్డి"కి ఇచ్చాడు. అది తదనంతర కాలంలో ప్రత్యేక సంస్థానంగా రూపొందింది. ఈ సంస్థానాధిపతులలో రాజారామేశ్వర రాయలు చివరివాడు. ఇతని కాలంలోనే ఈ సంస్థానం భారత దేశంలో లీనమై పోయింది.

సాంస్కృతిక దీపం ఆరిపోకుండా నిలిపిన గౌరవం వనపర్తి వారికి కూడా దక్కింది. వీరిలో "రాజాబహిరీ గోపాలరాయలు" అతి ప్రసిద్ధుడైన రాజకవి. "అష్టభాషా కవి" బిరుదాంకితుడు.

ఈ సంస్థానాధీశులు ప్రతి సంవత్సరం వేదశాస్త్ర పరీక్షలు జరుపుతూ కవి పండితులను తగిన విధంగా సత్కరించేవారు. వీరరాఘవాచార్యులు, హొనదుర్గం కృష్ణమాచార్యుల వంటి ప్రముఖులు ఇక్కడి వారే. ఈ ప్రభువులు ఆ కాలంలోనే ఒక ముద్రణ యంత్రం తెప్పించి, అనేక తెనుగు, సంస్కృత గ్రంథాలను ముద్రింపించి సాహిత్య సేవ గావించి చరితార్థులైనారు. (ఆం.సం.సా.)

వనమాలి విలాసము

కవి : నారన్నగారి సూరన్న

అంకితం : కొండూరి అక్కదండ నాథునికి

ప్రత్యేకత : ఈ కావ్యంలో కవి మిత్రవిందా పరిణయాన్ని వర్ణించాడు. దీనిలోని కవిత్వం, "సలక్షణమై మృదువుగా" ఉంటుందని కొందరు, "ప్రౌఢమై సరస హృదయాను రంజకంగా" ఉంటుందని కొందరూ అంటున్నారు. దీని వ్రాతప్రతి లభించిందట.

ఇది కవి తొలి రచన. దీని తర్వాతది "ఉదయనోదయము". (అరుద్ర)

**వరదప్ప దాన శాసనము**

చెంజి నాయకరాజులలో చివరివాడు వరదప్ప. ఇది క్రీ.శ. 1660నాటి దానశాసనం.

భాష : తెలుగు.

స్థలం : మధుర.

మధుర తాలూకా తిరుప్పర కుంద్రం సుబ్రహ్మణ్యస్వామి దేవాలయంలోని గోపురం కుడివైపు గోడమీద ఈ శాసనం ఉంది.

25 పురుషాంతరాల చెంజి నాయకరాజుల వంశావళి వర్ణన ఇందులోని విషయం. (అరుద్ర 11-142, ARE 860 of 1917)

**వరదరాజ మంజరి**

నామాంతరాలు : కలియుగ మంజరి, కంచిదండకము

కర్త : అప్పన సుకవి.

ఈ గ్రంథం పేరు ఇదీ అని స్పష్టంగా ఎక్కడా లేదు. గ్రంథాదిని కంచి దండకమనీ, ముఖపత్రంపై వరదరాజ దండకమనీ ఉంది. కాని ఇది ద్విపద కావ్యం. మంజరీ ద్విపదలో ఉంది. వైశాఖ పౌర్ణమినాడు స్వామి వైకుంఠం నుండి కంచికి వేంచేసి వరదరాజస్వామి అయ్యాడు. స్వామి ఊరేగింపు, పూజా కైంకర్యాలు ఇందులో వర్ణితం.

ఈ కావ్యానికి రెండు భిన్న ప్రతులున్నాయి. ఒకటి కందుకూరి పుర సోమేశ్వర స్తవంతో ఆరంభమౌతుంది. చివర ఫలశ్రుతి ఉంది. ఇది కలియుగ మంజరిగా ప్రసిద్ధం. రెండవ ప్రతి శ్రీరామ స్తవంతో ఆరంభమైంది. ఇది వరదరాజ మంజరిగా ప్రసిద్ధం. విషయం ఒకటే. ఈ గ్రంథంలో తాతాచార్యుల ప్రశంస ఉంది. అతడు ఏ కాలంవాడో తెలియదు. 17వ శతాబ్దం వాడని కొందరి అభిప్రాయం. (ద్వి సా.చ-277)

**వరదరాజ శతకము**

కర్త : మంచెళ్ళ కృష్ణకవి.

భక్తి, జ్ఞాన, నీతి, శృంగార ప్రధానమైన ప్రకీర్ణ శతకం. శతక సముచ్చయంలో ముద్రితం. ఈ కవిని బాలకృష్ణ కవిగా కొందరు పేర్కొన్నారు. "మందరధర, కుంద సుందరరదా వరదా, ముర దానవాంతకా" అనేది మకుటం. అన్నీ చంపకమాలికలే. (శ. క. చ-746)

**వరదరాజ స్తవమ్ (సం)**

కర్త : అప్పయ్య దీక్షితులు.

ఇది విష్ణుస్తోత్ర ప్రధానమైన రచన. (తె. వి. స-6)

**వరదరాజ స్తుతి**

కర్త : మరింగంటి సింగరాచార్యులు. (తె. వి. స-6)

## వరదాంబికా పరిణయమ్ (సం)

కవయిత్రి : తిరుమలాంబ.

చారిత్రక ప్రాధాన్యం గల కావ్యం. అచ్యుత రాయల వివాహం, అతని విజయాలు, పట్టాభిషేకం, విజయనగర విశేషాలు వర్ణింపబడ్డాయి. తంజావూరు ప్రథమ నాయకరాజు, అచ్యుతరాయల తోడల్లుడూ అయిన చిన చెవ్వ నృపతి వియామకం ఇందులో ప్రస్తావింపబడింది. (తం. ఆం. నా_17)

## వరదాభ్యుదయ చంపువు (సం)

కర్త : వేంకటాధ్వరి.

ఇది హస్తిగిరివాసియైన వరదరాజస్వామి మహత్త్వాన్ని వర్ణించే చంపువు. (తె. వి. స_6)

## వరదామాత్యుడు

ఈయనను కీర్తించే చాటువొకటి దొరుకుతున్నది. కాని కవి ఎవరో తెలియదు. (చా.ప.ర)

## వరలక్ష్మీవ్రతము పాట

కర్త : తెలియదు

జానపద పారమార్థికగేయం. ఇతివృత్తం ప్రసిద్ధం.

చూ పారమార్థిక గేయము. (ఆం.వా.చ.)

## వరహాగిరి కొండ్రాజామాత్యుడు

కాలం : క్రీ. శ. 18 వ శతాబ్దం.

స్థలం : గంజాం జిల్లా.

రచన : జగన్నాయక శతకము.

ఇతని రచన సరసంగా హృదయంగమంగా ఉంటుంది. (శ.సా.వి_329)

## వరహాగిరి వరాహ వేంకటనృసింహకవి

కాలం : క్రీ. శ. 1790 ప్రాంతం.

స్థలం : విశాఖ మండలం.

రచన : సూర్యనారాయణ శతకము.

అరసవల్లిలోని సూర్యనారాయణునిపై చక్కని ధారాశుద్ధితో కవిత్వం చెప్పాడు. (శ.క.చ_842)

## వరహావతారము

కర్త : తెలియదు.

జానపద పౌరాణిక గేయం. కథ ప్రసిద్ధం.

చూ. పౌరాణిక గేయములు. (ఆం.వా.ప.)

**వరాహ పురాణము**

రచనాకాలం : క్రీ.శ. 1485–90 ప్రాంతం.
కర్తలు : నంది మల్లయ, ఘంట సింగయ.
కృతిపతి : తుళువ నరసరాజు (శ్రీకృష్ణ దేవరాయల తండ్రి).

ప్రత్యేకత : 12 ఆశ్వాసాల కావ్యం. ఇది వరాహ విష్ణువు భూదేవికి చెప్పిన పురాణం. వరాహావతారపు గాథ లేదు. కవులు దీనిలో ఉత్తర భాగాన్ని విడిచారు. దుర్జయోపాఖ్యానం, గౌతమ్యుపాఖ్యానం, ధర్మ వ్యాధ వృత్తాంతాలను రసవంతంగా నడిపి మూలంలో లేని వర్ణనలతో, పాత్ర చిత్రణతో కథ నడిపారు. శబ్ద గుంఫన విషయంలో ప్రబోధ చంద్రోదయం కంటె ఈ గ్రంథమే మేలైరంగా ఉంటుంది. వ్రతాలు, దానాలు, నోములు ఉంటాయి. అల్లసాని పెద్దన, భట్టు మూర్తి వీరిని అనుకరించారు. చిత్ర, బంధ, గర్భ కవిత్వాలున్నాయి. (ఆం.సా.చ: పింగళి)

**వరాహ పురాణము**

కర్త : చూ. మండ కామేశ్వర కవి.

సంస్కృత వరాహ పురాణానికి ఆంధ్రీకరణము. (ఆం.సం.సా–429)

**వరాహ పురాణము**

కర్త : హరిభట్టు.
అంకితం : కొలిపాక ఎఱ్ఱయామాత్యునికి.
రచనాకాలం : క్రీ.శ. 16 వ శతాబ్దం.

అముద్రితం. కవి ఇందులో పూర్వ భాగాన్ని మాత్రమే రచించాడట. (వా.చ–53)

**వరికూటి వారు**

వరి బియ్యపు అన్నం పేరుతో నిలిచిపోయిన ఇంటి పేరు. ఈ ఇంటి పేరుతో దేశంలో కొన్ని కుటుంబాలున్నాయి. జొన్నకూటివారు, సజ్జకూటివారు ఇలాంటివి. (భారతి–మా–45–230)

**వరూధిని**

అల్లసాని పెద్దన రచించిన స్వారోచిష మను సంభవ ప్రబంధంలోని పాత్ర. ఈ ప్రబంధానికి మూలకథ సంస్కృతంలోనిదే అయినా ఈ పాత్రను పెద్దన సర్వోత్కృష్టంగా మలిచాడు.

వరూధిని దేవలోకపు స్త్రీ. అతిలోక సౌందర్యవతి. శృంగార రసమూర్తి. సుర గరుడోరగాదులగు వారినెందరినో నిరాకరించిన, పురుష సంపర్కమెరుగని వరాప్సరస. గాన కళాకోవిదురాలు. మహాభాగ్యశాలిని.

ఆమె లోకోత్తర సౌందర్యశాలియైన ప్రవరుని చూసి కామించింది. ప్రవరుడు త్రోవతప్పి వచ్చాడని తెలిసి తన చాతుర్యంతోనూ, విలాసంతోనూ, అతన్ని ఆకర్షించాలని

ప్రయత్నించింది. ప్రవరుడు పిలచిన "భీతహరిణేక్షణా" సంబోధన ఆమెకు మరింత భ్రాంతిని కలిగించగా, తనవలపును వెల్లడించింది. అతని అనాసక్తతను పోగొట్టటానికి శాస్త్రచర్చలు కూడా చేసింది. తుదకు మోహాతిరేకంతో అతన్ని కౌగలించుకొంటుంది.

వరూధిని పాత్ర శృంగారానికి, ప్రవరునిపాత్ర శాంతానికి ఆలంబన విభావాలు. ఇవి రెండు భిన్నప్రకృతులకు చెందినవేగాక భిన్నలోకాలకు చెందినవి. ప్రవరుడు మానవుడు. వరూధిని గంధర్వ స్త్రీ. ప్రవరునిది కర్మభూమి, వరూధినిది భోగభూమి. స్వేచ్ఛా ప్రణయ వర్తనులైన గంధర్వులకూ, సదాచార సంపన్నుడూ, ఏకపత్నీ వ్రతుడూ అయిన ప్రవరునికీ గల విభిన్నధర్మాల సంఘర్షణలో జితేంద్రియుడైన ప్రవరుడు, వరూధినిని విదిలించివేసి అగ్నిదేవుని దయవల్ల ఇల్లు చేరుకొంటాడు.

విఫల మనోరథురాలయిన వరూధిని దిగులుగా అతనికోసం ఎదురుచూస్తున్న తరుణంలో మాయా ప్రవరుడు ఆమెకంటికి కనిపిస్తాడు. అతడు మరెవరోకాదు. అంతకు పూర్వమే ఆమెచేత నిరాకరింపబడిన కలి అనే గంధర్వుడు. ప్రవరుని వేష భాషలతో సమీపించిన ఆ గంధర్వుని వరూధిని ప్రవరునిగానే భావిస్తుంది.

అతనివల్ల వరూధినికి కలిగిన పుత్రుడే స్వరోచి. స్వరోచికి వనదేవత వల్ల కలిగిన పుత్రుడే స్వారోచిష మనువు. ఈ విధంగా మనువు పుట్టుకను గూర్చిచెప్పే ఈ కథలో వరూధిని దేవతా సంబంధమైన గుణాలతో ప్రవరునిపట్ల అనక్తయైన ఆమె విశృంఖలమైన మనోస్థితినీ తత్సంబంధియైన ప్రవరుని గుణగణాలనూ పెద్దన అద్భుతంగా పోషించాడు.

## వర్ణము

వర్ణమనే ఒకగీత ప్రబంధం వర్ణతాళ త్రైవిధ్యంతో కర్ణాటభాషలో బిరుదోప నిబద్ధంగా ఉందని సంగీత రత్నాకరంలో చెప్పబడింది.

రంగాజమ్మ మన్నారుదాస విలాస యక్షగానంలో ఈ వర్ణం ప్రయుక్తం. ఇది సంస్కృతి భాషలోనే ఉంది. కాని కర్ణాటక భాషలోలేదు. వర్ణతాళ త్రైవిధ్యం కలదిగాను, బిరుదోపబద్ధంగాను ఉంది. (య. వా. చ-345)

## వర్తమాన తరంగిణి

స్థలం : మద్రాసు.

కాలం : క్రీ. శ. 1842-50 ప్రాంతం.

వారపత్రిక. మత, సాంఘిక సంబంధమైన విషయాలు, వ్యాపార ప్రకటనలు కూడా ఇందులో ఉండేవి. 1842-43లో పైదాపురం ఉమాపతి మొదలారి కల్వికళంజమనే ముద్రాక్షరశాలలో అచ్చుపడిన మహాభారతం ఆదిపర్వాన్ని గురించిన ప్రకటనలు 1842 అగస్టు 4, 18, అక్టోబరు 27 వ తేదీనాటి సంచికలలో ఉన్నాయి. ఈ పత్రిక ప్రతులు మద్రాసు ప్రాచ్యలిఖిత గ్రంథాలయంలో ఉన్నవి. (తెలుగు-ఏ.జా-1980)

## వలపర్ల జమీందార్లు

ఈ జమీందార్లు ప్రస్తుత ప్రకాశంజిల్లాలోని వలపర్ల గ్రామానికి చెందినవారు.

తిరుమల బుక్కపట్టణం తాతాచార్యులు వారిని ఒక పెద్ద ఉత్పలమాలికలో పొగిడాడు.
(చా. ప. ర)

## వల్లభాంబా పరిణయము

రచనాకాలం : క్రీ. శ. 19 వ శతాబ్ది పూర్వార్ధం
కర్త : అక్కెనపల్లి నృసింహకవి.
అంకితం : పులిపాక రామమంత్రికి.

మూడాశ్వాసాల ప్రబంధం. విఘ్నేశ్వరుని వివాహగాథ దీనిలోని ఇతివృత్తం.
(క.స. 114)

## వల్లభాచార్యులు

కాలం : క్రీ శ. 1473-1531 ప్రాంతం.

వీరు ఆంధ్రులు. కృష్ణా గోదావరీ మధ్య దేశంలోని కాకరవాడ గ్రామానికి చెందినవారు. తలిదండ్రులు కాశీ యాత్ర చేస్తుండగా వీరు రాయపూర్ (మధ్యప్రదేశ్)లో పుట్టారని, ఈశ్వరాంశ సంభూతులనీ, మహా ప్రతిభావంతులనీ, ఈశ్వర సాక్షాత్కారాన్ని పొందిన మహా విద్వాంసులనీ తెలుస్తున్నది.

వీరు బాల్యంలోనే వేద వేదాంగాలను సమస్త సాహిత్యాన్ని అభ్యసించి, కాశీలో విద్యాభ్యాసం చేసి, కౌమార దశలోనే మహా పండితుల ప్రశంసలు పొందారు. అలహాబాదు ప్రాంతంలో సాహిత్య సేవ చేసి, వ్రజ భూమిలో తాను నమ్మిన మతాన్ని ఎక్కువగా ప్రచారం చేశారు.

వీరు వ్యాపింపజేసిన మతానికి శుద్ధాద్వైతమని పేరు శంకర, మధ్వ, రామానుజుల ద్వారా ప్రచారంలోకి వచ్చిన జ్ఞాన, కర్మ, భక్తి సిద్ధాంతాలకు కొత్త అర్థాలు చెప్పి వీరు పుష్టిమార్గము అనే నూతన సిద్ధాంతాన్ని వ్యాపింప చేశారు. శంకరుని మాయా వాదాన్ని ఖండించారు. వీరి మతంలో వర్ణ విచక్షణ, స్త్రీ పురుష భేదం లేదు.

వల్లభాచార్యుల అనుయాయులు భజించే దేవుడు గోవర్ధన నాథుడు (నాథ్‌జీ). ఆరాధన భాగవత ధర్మానుసారంగా ఉంటుంది. ఈశ్వర సేవే మోక్షసాధనమనేది ఈయన మత సిద్ధాంతం. శక్తి కొలది మానవ సేవ చేయాలని, స్నేహ భావాన్ని అలవరుచుకోవాలని ఈయన సందేశమిచ్చాడు.

ఈయన శుద్ధాద్వైతం గుజరాత్, రాజస్థాన్, ఉత్తరప్రదేశ్ పశ్చిమ ప్రాంతాలలో, విరివిగా వ్యాపించింది. వేలకొలది తెలుగు కుటుంబాలు ఈ మత ప్రచారం కోసం ఉత్తర భారత దేశం తరలిపోయి నివాసాలను ఏర్పాటు చేసుకున్నాయి. ఈయన విస్తృతంగా పర్యటించి మత ప్రచారం చేస్తూ, దక్షిణ దేశం వచ్చి శ్రీకృష్ణ దేవరాయల ఆస్థానంలో శాస్త్ర చర్చ జరిపి కనకాభిషేక గౌరవాన్ని పొందాడట.

ఈయన మహా విద్వాంసులు. వేదాలకు, భగవద్గీతకు, బ్రహ్మ సూత్రాలకు, భాగవతానికి భాష్యం వ్రాశారు. వేదాలలో వచ్చే సందేహాలు భగవద్గీతలోను, భగవద్గీతలో కలిగే సందేహాలు బ్రహ్మ సూత్రాలలోను, బ్రహ్మ సూత్రాలలో కలిగే సందేహాలు

భాగవతంలోను, తీరగలవని వీరు నిరూపించారు. వీరుసంస్కృతంలో ఎంతో స్వతంత్ర సాహిత్యాన్ని నిర్మించారు. వీరి మతానికి సంబంధించిన సాహిత్యం వ్రజ భాషలోను, గుజరాతీలోను, హిందీలోను, ఇంగ్లీషులోను విరివిగా దొరుకుతుంది.

(తె.వి.స-4-1066-1068)

## వల్లభాభ్యుదయము

కర్త ; భట్ల పెనుమర్తి కోదండ రామయ్య.

నాలుగాశ్వాసాల కావ్యం. శ్రీకాకుళాంధ్ర దేవుని కథ. 593 గద్య పద్యాలున్నాయి. చారిత్రక ప్రాముఖ్యం గల కావ్యం.

మూలం : శ్రీకాకుళేశ్వరుడు కవికి స్వప్నంలో ప్రత్యక్షమై ఒక సంస్కృత కోశాన్నిచ్చి, తదనుగుణంగా తన కథ వ్రాయమని చెప్పాడట. దీనికి మూలం సంస్కృత బ్రహ్మ పురాణము ఉత్తర ఖండం అని చెప్తున్నప్పటికీ నేడు లభిస్తున్న సంస్కృత బ్రహ్మపురాణంలో శ్రీకాకుళేశ్వరుని గాథలేమీ లేకపోవడంవల్ల కవి తానే దేశంలో ప్రచారంలో ఉన్న స్థల మాహాత్మ్య గాథలను సేకరించి సమన్వయం చేసి ఈ కావ్యం వ్రాసి ఉంటాడని పండితులు అభిప్రాయపడుతున్నారు.

శ్రీకాకుళక్షేత్ర నామోత్పత్తి-క్షేత్రాన్ని ఆదరించినరాజుల చరిత్ర-ప్రాశస్త్యం ఈ కావ్యానికి చారిత్రక ప్రాముఖ్యాన్ని ఆపాదిస్తున్నవి. శ్రీనాథుడు ఒక వల్లభాభ్యుదయాన్ని రచించినట్లు తెలుస్తున్నది. కాని అందులోని ఇతివృత్త మేమిటో తెలియరాలేదు. తెలుగులో లభిస్తున్నంతవరకు ఆంధ్ర విష్ణువు కథను తెలిపే తొలి కావ్యం ఇదే చివరలో లక్ష్మి శ్రీహరుల సంవాదం తెలుగు జానపద సారస్వతాన్ని గుర్తుకు తెస్తుంది. శ్రీ కోరాడ రామకృష్ణయ్య, శ్రీపాద లక్ష్మీపతి శాస్త్రిగారలు ఈ కావ్యానికి చక్కని పీఠిక వ్రాశారు. (ఆముద్ర-10-47)

## వల్లభాభ్యుదయము (అలభ్యం)

రచనాకాలం : క్రీ. శ. 1428 ప్రాంతం.
కర్త : శ్రీనాథుడు.
కృతిభర్త : తెలుంగాధీశుడు (శ్రీకాకుళాంధ్రదేవుడు) కావచ్చు.

ప్రత్యేకత: వల్లభాభ్యుదయం తెలుగు వల్లభుని చరిత్ర. కస్తూరి యొసగిన సాంపరాయని తెలుంగు రాయలకోరికపై కవి రచించాడు. ఇందులోని పద్యాలను పెదపాటి జగన్నాథకవి ప్రబంధరత్నాకరంలో ఉదాహరించాడు. శృంగార నైషధంలోని పద్యాలకు, లభించిన ఈ గ్రంథంలోని పద్యాలకు సామ్యముంది కాబట్టికర్త శ్రీనాథుడుకావచ్చు. ఇది ఆంధ్రవిష్ణువు చరిత్రయేకావచ్చుననీ, అతనికే అంకితమనీ పండితులు భావిస్తున్నారు.

(శ్రీనాథుడు-కొ. శ్రీ. మూ.)

## వల్లవీ వల్లవోల్లాసమ్ (సం)

కర్త : చూ. శిష్టు కృష్ణమూర్తిశాస్త్రి.

రచనాకాలం : క్రీ. శ. 18 వ శతాబ్దం.

భాణము.

(ఆం. సం. సా-326)

## వల్లీ కల్యాణము

కర్త : శహాజీ (చూ).

కాలం : క్రీ. శ. 17 వ శతాబ్దం.

శివస్తుతితో ఆరంభం. కుమారస్వామికి వల్లీదేవికి జరిగిన వివాహం ఇందులోని కథ. తెలుగులో కుమారస్వామి విజయగాథలున్నాయి గాని పరిణయగాథలు చాల తక్కువ. ఇవి దక్షిణాంధ్ర యుగంలోనే ఎక్కువగా కానవస్తున్నాయి. (ద.దే.వా-197)

## వల్లీ నాటకము

పరిష్కర్త : మారుపెద్ది చెంగల్వరాయకవి (చూ).

వల్లీ నాటకము అనే ప్రసిద్ధ నాటకాన్ని కర్త సంస్కరించి, ప్రదర్శింపచేసి, ప్రచారంలోకి తెచ్చాడట. దీని అసలు రచయిత ఎవరో తెలియరావటం లేదు.

(ద.దే.వా-511)

## వల్లీ పరిణయమ్ (సం)

కర్త : వీరరాఘవకవి.

నాటకం. ఇది ఆనాటి ఉత్సవాలలో ప్రదర్శింపబడేది. వల్లీ పరిణయాన్ని గురించిన రచనలు 17, 18 వ శతాబ్దాలలో తెలుగులో కూడా ఎక్కువగా వచ్చాయి.

(ద.దే.వా-180)

## వల్లీ పరిణయము (అలభ్యం)

కర్త : నెల్లూరి (వీర)రాఘవకవి. (ద.దే.వా-258)

## వల్లూరి నరసింహకవి

కాలం : క్రీ. శ. 18వ శతాబ్దం.

రచన : నాగ్నజిత్తీ పరిణయం.

హనుమత్కవి పుత్రుడు. హృదయాహ్లాదకరంగా కవిత్వం చెప్పాడు.

(క. స-105)

## వల్లూరి లక్ష్మీనారాయణ యోగి

కాలం : క్రీ. శ. 18వ శతాబ్దికి పూర్వం.

రచన : ఉత్తర గీతా మంజరి (ద్విపద).

గురువు : అమృతానంద యోగి.

శ్రీనివాసాచార్యుని పుత్రుడు. శిష్యుల కోరికపై ఉత్తరగీతలను ఆంధ్రీకరించాడట. సలక్షణంగా సుబోధకంగా రచన చేశాడు. (ద్వి. సా. చ-315)

## వసంత తిలక భాణము (అలభ్యం)

నామాంతరం : ఆంధ్ర వసంత తిలకభాణము.

కర్త : గణపవరపు వేంకటకవి.

చిత్రకవితా స్ఫోరకంగా రచించిన భాణం. సంస్కృత మూలాన్ని అనుసరించి రాశాడేమో అని పండితులు అభిప్రాయపడుతున్నారు. (క స_233)

## వసంత మహోత్సవము

నామాంతరాలు : మదన మహోత్సవము, సువసంతకము.

కాలం : క్రీ. శ 14_15 శతాబ్దాలు.

మధ్య యుగాంధ్ర దేశంలో ఈ ఉత్సవాన్ని ప్రజలూ రాజులూ కూడా అతి వైభవంగా జరిపేవారు ముఖ్యంగా కొండవీటిరెడ్లు, విజయనగర రాజులు దీనికి గొప్ప ప్రాధాన్యత ఇచ్చారు. దీనిని ఒక జాతీయోత్సవంగా జరపటమే గాక తాము కూడా పాల్గొనేవారు. ఈ సందర్భంలో విద్వద్గోష్ఠులు జరిగేవి

ఈ ఉత్సవాన్ని వసంత ఋతువులో జరుపుతారనేది స్పష్టం. అనవేమారెడ్డి, కుమారగిరి రెడ్డి (1383_1400) వంటి ప్రభువులు దీనిని విస్తృత ప్రాతిపదికమీద జరిపే వారు. వివిధ సుగంధ ద్రవ్యాలను చల్లుతూ, రంగు నీటిని చిమ్ముకొంటూ ప్రజలు ఆనందోత్సాహ క్రీడలలో మునిగి తేలేవారు. పిచికారులతో రంగు రంగుల సువాసన నీరు చల్లుకోవడం, బూరుగు చెట్టు కింద వెన్నెలలో ఆడడం, కాసిన మామిడి చెట్టుని ఎక్కకుండా, ముట్టకుండా, ఎగురుతూ కాయలు నోటితో అందుకొని కొరుక్కు తినడం, కదిమి పూలతో రక రకాల ఆయుధాలు చేసి యుద్ధం చేస్తున్నట్టు అభినయిస్తూ పాడుతూ ఆడడం, వివిధములైన సంగీత సాహిత్యాలతో కాలక్షేపం చేయడం _ ఈ ఉత్సవాలలో భాగాలుగా ఉండేవి.

పూర్వపు రాజులు కొందరు ఈ ఉత్సవాల్ని అత్యుత్సాహంతో నిర్వహించి, "వసంతరాయ" "కర్పూర వసంతరాయ" బిరుదాలను పొందారు. కుమారగిరిరెడ్డి తన బిరుదును బోధిస్తూ తాను వ్రాసిన నాట్య శాస్త్రానికి "వసంతరాజీయమ్" అని పేరు పెట్టాడు. వసంతోత్సవానికి సరఫరా చేసే సుగంధాల భాండాగారానికి అవచి తిప్పయ్య సెట్టి అధ్యక్షుడు. హరవిలాస కావ్యం తిప్పయ్యసెట్టి కొండవీటిలో ఒక సుగంధ భాండా గారాన్ని కూడా నడిపాడని చెబుతున్నది. భారతదేశాన్ని చూసిన విదేశీ యాత్రికులు ఈ ఉత్సవాన్ని బాగా ప్రస్తుతించారు. సింహాసన ద్వాత్రింశిక, భీమేశ్వర పురాణాది కావ్యాలు దీనిని వర్ణించాయి శ్రీనాథుడు మామిడి సింగన్నను "కర్పూర వసంతరాయా" అని సంబోధించడం చూస్తే ఆనాటి రాజోద్యోగులు కూడా ఈ ఉత్సవాలలో అత్యుత్సాహంతో పాల్గొనే వారని తెలుస్తున్నది. సుగంధద్రవ్యాలతో బాటు కర్పూర ఖండాలను కూడా చిమ్మడం రెడ్డిరాజుల కాలంలో ఉంది. ఈ వసంతోత్సవాలలో ఎడతెగకుండా జరిగే సంగీత సాహిత్య కాలక్షేపానికి "సువసంతకం" అనే పేరు కూడా ఉంది. (రె.రా.చ.)

**వసంత రాజీయమ్ (సం) (అలభ్యం)**

కర్త : చూ. కుమారగిరిరెడ్డి.

భరతుడు, భోజుడు చెప్పిన రీతిలోనే ఈ గ్రంథ రచన జరిగిందని కుమారగిరి బావమరది కాటయ వేమారెడ్డి, తాను వ్రాసిన 'కుమారగిరి రాజీయమ్' లో చెప్పాడు. ఇది భరతుని నాట్యశాస్త్రానికి వ్యాఖ్య అట. (రె.రా.చ.)

**వసంత విలాసము (అలభ్యం)**

కర్త : నాచన సోమనాథుడు (చూ).

అంకితం : మాచయ బ్రహ్మకు.

లక్షణకారులు కొందరు దీన్ని పేర్కొన్నారు. (వా.చ)

**వసంతోత్సవ విలాసము**

కర్త: కంఠీరవ రాజు.

ప్రశస్తమైన యక్షగానం. నాట్య ప్రబంధంగా చెప్పబడింది. నాచన సోమనాథుడు వసంత విలాసమనే కావ్యం రాసినట్లు తెలుస్తున్నది గాని, లభ్యం కాలేదు.

విశేషం : ఈ నాటకం కంఠీరవరాజు కొలువులో ఆయన ఎదుట ప్రదర్శింపబడేదట. నాటకాంతంలో మల్లిక అనే పాత్రధారిణి రాజును మోహించి తనను చేపట్టమని ప్రార్థించడంతో నాటకం ముగుస్తుంది. (వ.దే.వా–457)

**వసిష్ఠ గోత్ర సీసమాలిక**

కర్త : చూ. పూసపాటి రాచిరాజు (1450–1520.)

రచనాకాలం : క్రీ.శ. 15వ శతాబ్దం.

ఏబది ఆరు చరణాలతో కూడిన సీసమాలిక. చారిత్రకంగా ఉపయుక్తమైన రచన. పూసపాటి రాజవంశీయుల వంశావతరణం దీనిలో ఉంది. ఇది క్రీ.శ. 1484లో రచించబడి ఉంటుందని కొందరి అభిప్రాయం. (ఆం.సం.సా–412)

**వసిష్ఠ జనక సంవాదము**

కర్త : యాముజాల శేషాచలపతి (చూ)

రచనాకాలం : క్రీ.శ. 1810 ప్రాంతం.

యక్షగానం. అధ్యాత్మపరంగా చెప్పబడిన రామాయణగాథ. (క. త–13–145)

**వసుంధరా పరిణయము**

కర్త : నెల్లూరి (వీర) రాఘవకవి.

విలక్షణమైన కావ్యం. భారత, భాగవత, హరివంశ గాథలలోని విషయాలు కూర్చి చెప్పినగాథ. భూదేవి తపస్సు – సత్యభామగా జన్మించడం మొదలైన విషయాలున్నాయి

శబ్దార్థ వైచిత్రి, ధ్వని, శ్లేష మాధురీ గుణాలను సందర్భానుసారంగా పోషించాడు. కవి వంశ చరిత్ర ఇందులో విపులంగా ఉంది. ఇందులో కవి తన ఇతర గ్రంథాలను అయిదింటిని పేర్కొన్నాడు.

## వసుచరిత్ర (ప్రతిపద టీక)

రచనాకాలం : క్రీ. శ. 1844 ప్రాంతం.

కర్త : జూలూరి అప్పయ్యశాస్త్రి (చూ).

సుబోధకమై వ్యావహారిక భాషలో ఉన్న ప్రతిపద టీక. మిక్కిలి ప్రసిద్ధి పొందినది. (తె. సా-విమర్శ-91)

## వసుచరిత్రము

రచనాకాలం : క్రీ. శ. 16వ శతాబ్దం.

కర్త : మూర్తికవి (రామరాజభూషణుడు).

అంకితం : అళియ రామరాజు సోదరుడు తిరుమలరాయలకు.

విశిష్టత: తెలుగులోని అత్యుత్తమమైన ప్రౌఢప్రబంధం. పంచకావ్యాలలో ఒకటి కవి తన అసమాన సకల విద్యా విశారదత్వాన్ని, అప్రతిమ ప్రతిభను మేళవించి శబ్దార్థ శ్లేష వైచిత్రీ పూర్ణంగా, అనితర సాధ్య కవితా శిల్ప పారమ్యంతో, నానాలంకార లక్ష్యభూతంగా, రసజ్ఞ రసాయనంగా, వ్యంగ్య సమృద్ధంగా వ్రాసి తిరుమల రాయలకు అంకితం చేసి, తెలుగు కవి శిరోభూషణమైనాడు.

వస్తు కవితాశిల్ప సౌందర్యంలో వసుచరిత్ర పాఠకుల మనస్సుకు హత్తుకొని ఆనంద పారవశ్యాన్ని కలిగిస్తుంది. కవితా కళలో శిల్ప నైపుణ్యాన్ని మెరిసేటట్లు చేయటానికి కవి సరస భూపాలీయంలోని లక్షణాలకు అనువుగా లక్ష్యాలను కూడా కూర్చాడు. శ్లేష యమకాను ప్రాసాది నానాముఖ కవితా వైచిత్ర్య ప్రదర్శనకోసం వసుచరిత్ర వ్రాసినట్లు కనిపిస్తుంది రామరాజ భూషణుడు, ఉత్తమ నాయకునితో కూడిన, శృంగార రస ప్రధానమైన గిరికా వసువుల పెండ్లి కథ నిమిత్తంగా చేసుకొని, అద్భుతమైన భావనా మహిమను ప్రదర్శించాడు.

తెలుగులో ఎన్నో ప్రబంధాలున్నా, అప్పయ దీక్షితుల వారి శిష్యుడు కాళహస్తి కవి ఈ ప్రబంధాన్ని మాత్రమే ఆరుఆశ్వాసాల గ్రంథంగా సంస్కృతంలోకి అనువదించాడు. దీనినిబట్టి సంస్కృత కవులకు "వసుచరిత్ర" అంటే ఎంత అభిమానమో, గౌరవమో తెలుస్తుంది (తె. వి. స-4)

## వసుచరిత్రమ్ (సం)

రచనాకాలం : క్రీ. శ. 18వ శతాబ్దం.

కర్త : రేవూరి కాళహస్తి కవి.

తెలుగు వసుచరిత్రకు సంస్కృతానువాదం. అప్పయ్య దీక్షితుల శిష్యుడూ

కుందుర్తి వెంకటాచలకవికి గురువూ అయిన కాళహస్తికవి ఈ అనువాదాన్ని కవి పండిత రంజకంగా చేశాడు.

**వసుచరిత్ర వ్యాఖ్య (అలభ్యం)**

కర్త : చిత్రకవి వేంకట రమణకవి.

రామరాజ భూషణుని వసుచరిత్రకు వ్యాఖ్య. (అరుద్ర-9)

**వసుచరిత్ర వ్యాఖ్య**

కర్త : ములుపాక బుచ్చయ్యశాస్త్రి (చూ).

వసుచరిత్ర కావ్యానికి వ్యాఖ్య. దీనిని బ్రౌన్‌దొర వ్రాయించాడు. (తె. సా. విమర్శ-91)

**వసుచరిత్ర వ్యాఖ్యానము**

నామాంతరం : విద్వన్మనోరంజని.

కర్త : వేములవాడ సోమనాథుడు (చూ).

లభ్యం అవుతున్న వసుచరిత్ర వ్యాఖ్యానాలలో ఇదే మొదటిది. వసుచరిత్రను రచించినవాడు భట్టుమూర్తి అనే విషయం ఇతడే గ్రంథస్థం చేశాడు. (అరుద్ర-11-263)

**వసుచరిత్ర వ్యాఖ్యానము**

కాలం : క్రీ. శ. 19 వ శతాబ్ది పూర్వార్ధం.

కర్త : చూ. శిష్టు కృష్ణమూర్తి శాస్త్రి.

రామరాజ భూషణుని వసుచరిత్ర ప్రబంధానికి తెలుగులో వ్రాయబడిన విపులమైన వ్యాఖ్య. (ఆం.నం.సా-326)

**వసుదేవనందన శతకము**

రచనాకాలం : క్రీ. శ. 1780 ప్రాంతం.

కర్త : రావూరి సంజీవరాయకవి.

"కృష్ణ, హరీ వసుదేవ నందనా" అనే మకుటంతో ఉంది. (శ.క.చ.382)

**వసురాజు**

రామరాజ భూషణుని వసుచరిత్రలోని నాయకపాత్ర. వసుచరిత్ర ఆంధ్ర పంచ కావ్యాలలో ఒకటి. దీనికి మూలం మహాభారతంలోని ఉపరిచర వసువు కథ. అధిష్ఠానపురమును రాజధానిగా చేసికొన్న వసురాజు ఇంద్రుడిచ్చిన విమానము, దివ్య చిహ్నములు, ఇంద్రమాల, వేణు యష్టి ధరించి ప్రజలనేలినాడు.

కులీనత్వాది మహా గుణాలతో అనల్ప కల్పనా చాతుర్యంతో తీర్చిదిద్దిన పాత్ర ఇది. కోలాహల పర్వతాన్ని పాదంతో తొలగద్రోయడం ఇతని శిష్టరక్షణ దుష్ట శిక్షణా పరత్వాన్ని చాటుతున్నది. గిరికా గానాన్ని విని ఆకర్షితుడవడం అతని కావ్య గీత ప్రియత్వానికి నిదర్శనం. ఉత్తమ నాయక లక్షణాలను ప్రతిభావంతంగా ఇతనిలో కూర్చిన కవి ఇతని విరహాన్ని కూడా అపూర్వంగా వర్ణించాడు. మంజువాణి తెచ్చిన

నాయిక మణిహారాన్ని ప్రశంసించిన తీరు ఇతని గుణాలను ద్విగుణీకృతం చేసింది. గిరికా వసురాజుల వివాహ ఘట్టంలో శృంగార నాయక లక్షణాలను వసురాజులో సుకుమారంగా రూపు కట్టించాడు కవి. వివాహఘట్టంలో లలిత శృంగారము, ఇంద్రుని యెడ కృతజ్ఞతా భావము, ఇతని ఉత్తమ నాయక లక్షణాలకు నిండుతనాన్ని తెచ్చాయి. (వసుచరిత్ర)

## వస్తుకవిత

వస్తుకవిత రెండు రకాలు. 1. ఏకవస్తు కవిత 2. బహువస్తు కవిత. ప్రాచీనులు ఏకవస్తు కవితనే తరచుగా వర్ణించారు. ఏకవస్తు కవిత అంటే ఒకేఒక కథ వస్తువుగా ఉన్న కవిత. కుమార సంభవాది కృతులు ఈ వస్తుకవితకు లక్ష్యభూతాలు.

ఒకే ఒక కథ వస్తువుగా ఉన్నప్పటికీ మధ్య మధ్య ఉపకథ ఉండేది బహువస్తు కవిత. భారతాది కృతులు ఈ బహు వస్తు కవితకు లక్ష్యభూతాలు. (తె.వి.స-6)

## వాకోవాక్యము

శ్రవ్యకావ్యభేదం. వాక్యోపవాక్యాలు ఎక్కడఉంటాయో అది వాకోవాక్యము. దీనినే ఉక్తి, ప్రత్యుక్తిరూపమంటారు. ఈ ఉక్తి ప్రత్యుక్తిరూపాలు ఇద్దరికి, చాలా మందికి కూడా కూర్చవచ్చు. ఇది ఋజూక్తి, వక్రోక్తి, పైయాత్యోక్తి, ప్రశ్నోత్తరోక్తి చిత్రోక్తి అని అయిదు రకాలు.

ఉదా : "చనుదున్ సుందరి: పాంథుఁడా చనుము;"

అన్న పద్యంలో ప్రశ్న, సమాధానం రూపంలో సంభాషణ చిత్రితమైనాయి. (తె.వి.స-6)

## వాచకుడు

సప్తవిధ కవులలో ఒకడు. అనేకంగా అనుప్రాస పదబంధ నియమాలతో కవిత్వాన్ని చెప్పేరవి. (అప్పకవీయం-25)

## వాడాల శేషాచార్యులు

కాలం : క్రీ. శ. 18వ శతాబ్దం ఉత్తరార్ధంగాని, క్రీ. శ. 19వ శతాబ్దం పూర్వార్ధంగాని కావచ్చు.

రచన : మైథిలీ పరిణయము.

గద్వాల సంస్థానాధీశ్వరుల ఆస్థానకవి. వారిచే గౌరవప్రతిష్ఠలు పొందినవాడు. (ఆం.సం.సా.)

## వాడ్రేవు కృష్ణప్రభువు

స్థలం : గోదావరీ మండలం.

కాలం : క్రీ. శ. 1800 ప్రాంతం.

సాహిత్యప్రియుడు. ఎర్రమిల్లి సూర్యప్రకాశకవి రచించిన హనుమచ్చతకాన్ని అంకితం పొందాడు. ఇతడు కవి బంధువర్గంలోని వాడట. (క.స-301)

వా|డేవు వెంకయ్య

కాలం : క్రీ. శ. 19వ శతాబ్దం.
స్థలం : చెన్నపట్టణం.
రచనలు : బత్తీసుపుత్రి కథలు (విక్రమార్క చరిత్రము).

ఇది సింహాసన ద్వాత్రింశికమనే సంస్కృత గ్రంథానికి అనుకృతి. దీనిలో 32 కథలు ఉన్నాయి. కవి సరళమైన వచనంలో వ్రాశాడు. 1847 ప్రాంతంలో ఈ రచన చేసి ఉండవచ్చును. ఇందులోనివి విక్రమార్కుని సాహస గాథలు. (వ. వా-61)

వాణీ దర్పణ ముద్రాక్షరశాల

స్థాపన కాలం : క్రీ. శ. 1853 ప్రాంతం.
స్థలం : చెన్నపట్టణం.

ఇది పరవస్తు చిన్నయసూరి నెలకొల్పిన ముద్రాక్షరశాల. నీతిచంద్రిక దీనిలోనే ముద్రితం. క్రైస్తవులు నెలకొల్పిన ముద్రాక్షర శాలలుగాక, హిందువులు 8 ముద్రాక్షర శాలలు పెట్టారని సి. పి. బ్రౌన్ వ్రాతలవల్ల తెలుస్తున్నది. వాటి పేర్లు తెలియవు.
(వీరేశలింగం పంతులు- సమగ్ర పరిశీలన-185)

వాణీ విలాసము (అలభ్యం)

కర్త : నంది తిమ్మన (చూ).

కూచిమంచి వేంకట రాయకవి వ్రాసిన "కవి మనోరంజని" అనే అప్పకవీయ వ్యాఖ్యనుబట్టి తిమ్మన వాణీవిలాసం వ్రాసినట్లు తెలుస్తున్నది.

వాణీ విలాస వనమాలిక

కర్త : ఏకుమళ్ళ రంగశాయి.
అంకితం : వేంకటేశ్వరునికి.

వినూత్నమైన పద్ధతిలో చేయబడ్డ రచన. నాలుగాశ్వాసాలున్నాయి. ఇంకా ఉండిఉంటాయని పండితులు ఊహిస్తున్నారు. విజ్ఞాన సర్వస్వంవలె కవి సమస్త విషయాలనూ సేకరించి ఇందులో క్రోడీకరించాడు.

వేదశాస్త్ర పురాణాలు. షడ్దర్శనాలు మొదలుకొని వాస్తుశాస్త్రం వరకు ఇందులో ఉన్నాయి. ఈ రచనలో ఇతనికి మహంకాళి వెంకటపతి తోడ్పడ్డాడట.
(ఆరుద్ర-10-171) (క.శ-12-76)

వాత్స్య శ్రీరంగాచార్యులు

కాలం : క్రీ. శ. 18వ శతాబ్దం.
స్థలం : బూరుగుగడ్డ.
రచన : శాల్మలీ కందనందన విలాసము.

బూరుగుగడ్డ హైదరాబాదులోనిది. అక్కడి దేవాలయ మహాత్మ్యాన్ని ఈ కవి కావ్యంగా వ్రాశాడు. (క.వ-279)

వాత్స్యాయన గృహ్యసూత్రసరణి (సం)

కర్త : కంచం ఎల్లయార్యుడు.

ఈ పుస్తకం వ్రాసినట్లు కవి స్మృతికదంబంలో చెప్పాడు. (తె.వి.స-4)

వాద జయ కొఱవంజి

కర్త : నిశ్చయంగా తెలియదు. రామకవి అని కొందరి అభిప్రాయం.

కాలం : క్రీ. శ. 17 వ శతాబ్దం.

యక్షగానం. పేరులో ఉన్నట్లు, వాదము, జయము గాని కొఱవంజిపాత్రగాని ఈ రచనలోలేవు. మధ్యలో ఒక దరువులో రామకవిపేరు ఉంది. అతడే కృతి కర్తకానోపునని కొందరి అభిప్రాయం. గ్రంథమంతటా శాహరాజ ప్రసక్తి ఉంది. (య.గా.సం-3-పీఠిక)

వాద జయము

కర్త : గిరిరాజకవి (చూ).

అంకితం : శహాజీకి.

రచనాకాలం : క్రీ. శ. 18వ శతాబ్దం.

విషయం ఇరువురు వారవధూమణులకు నాట్య విద్యలో కలిగిన పోటీ. వారు శహాజీ మెప్పు పొందడానికి ప్రయత్నించడం ఇతివృత్తంగా ఆనాటి సంగీత నృత్య రీతులను కవి ఇందులో పొందు పరిచాడు.

విశేషం : శహాజీ సభాస్థలిలో సంగీత నాట్యాలకు గల ఆదరణ దీనివల్ల స్పష్టమవుతూంది. (య. గా. సం-3- పీఠిక.)

వాదాంగద చూడామణి

కర్త : మల్లన.

లక్షణ గ్రంథం. మల్లన వాదాంగద చూడామణిగా ప్రసిద్ధం. దీన్ని కస్తూరి రంగకవి పేర్కొన్నాడు.

వాదీంద్ర చూడామణి

కాలం : క్రీ శ. 1100కు పూర్వం.

రచనలు : ఆదిపురాణము, వాదీంద్రచూమమణి

ఇతడు జైనాచార్యుడు. రేచనకు గురువు. ఇతన్ని వాగీంద్ర చూడామణిగా కొందరు పేర్కొన్నారు. అప్పకవి ఇతని ఛందస్సును గురించి చెప్పాడు. (క. స-218)

వాదీంద్ర చూడామణి

రచనాకాలం : క్రీ. శ. 1100 పూర్వం.

కర్త : వాదీంద్ర చూడామణి (వాగీంద్ర చూడామణి).

ఛందోగ్రంథం. అప్పకవీయంలోని దీని ప్రసక్తి ఉంది. ఇది వాదాంగద చూడామణికంటె వేరైనది. కర్తపేరే కావ్యం పేరుగా ఉండడం విశేషం. (క. స-217)

**వాద్య రత్నావళి (సం) (అలభ్యం)**

కర్త : (చూ). జాయప సేనాని. (ప్రా. ద. భా. చ-న. రా. అ)

**వానపల్లి తామ్రశాసనము**

శాసనకర్త : చూ. త్రిలోచనాచార్యుడు.

అనవేమారెడ్డి ఆస్థాన సంస్కృత పండితుడైన త్రిలోచనాచార్యుడు ఈ శాసనం వ్రాశాడు. (రె. రా. చ)

**వానపాల నరసింహం**

కాలం : క్రీ. శ. 17వ శతాబ్దం.

రచన : లక్షణాపరిణయము.

కవి తాను సాహితీ తంత్ర స్వతంత్ర సత్కవి మిత్రుడనని చెప్పుకొన్నాడు. (అరుద్ర-10-235)

**వానస**

ఇంటిపేరు. నన్నయ్యకు మహాభారత రచనలో తోడ్పడినట్లుగా చెప్పబడుతున్న నారాయణభట్టు ఇంటిపేరు వానస. (భారతి-1950-జులై)

**వామన పురాణము**

కర్త : పొన్నకోట ఓబళ కవి (పొబళ కవి).

కృతిభర్త : రాణా జగదేవరాయడు (ఇమ్మడి జగదేవ రాయడు).

గురువు : కందాళ శ్రీరంగా చార్యుడు.

ఇది పది ఆశ్వాసాల కావ్యం. ఇందులోని 7,8 ఆశ్వాసాలను ఈవని వేంకటేశకవి రచించినట్లు గద్యలో ఉంది. అవతారికలో రాణా వంశీయుల చరిత్ర విపులంగా ఉంది (ద.దేవా-492; అరుద్ర-9-234)

**వామన పురాణము**

కర్త : లింగముకుంట రామకవి.

అనువాద గ్రంథం కావచ్చు. కవి రచించిన అనంద కానన మాహాత్మ్యంలో దీని ప్రసక్తి ఉంది. (అరుద్ర-8-133)

**వామనభట్టు బాణుడు**

కాలం : క్రీ శ. 1402-1420.

స్థలం : కొండవీడు.

రచనలు : అన్నీ సంస్కృత కావ్యాలే. 1. శృంగార భూషణ భాణమ్ 2. కనకలేఖా కళ్యాణమ్ 3. ఉషా పరిణయమ్ 4. పార్వతీ కళ్యాణమ్ 5. నలాభ్యుదయమ్ 6. రఘునాథాభ్యుదయమ్ 7. హంస సందేశమ్ 8. వేమ భూపాల చరితమ్ (వీర నారణీయ చరితమ్) 9. శబ్దరత్నాకరమ్ 10. శబ్ద చంద్రిక.

గురువు : విద్యారణ్యస్వామి.

బిరుదులు : 1. సాహిత్య చూడామణి. 2. కవి సార్వభౌముడు 3. గద్య కవి సార్వ భౌముడు 4. సాహిత్య సామ్రాజ్య దురంధరుడు.

సమకాలికులు : 1. పెద కోమటి వేమారెడ్డి 2. శ్రీనాథుడు.

కొండవీటి పాలకుడైన పెద కోమటి ఆస్థాన విద్వాంసుడు.

పై రచనలలో మొదటిది భాణమ్, రెండు నుంచి నాలుగు వరకు నాటకాలు. అయిదు నుంచి ఏడు వరకు పద్య కావ్యాలు. ఎనిమిదోది గద్య కావ్యం. తొమ్మిది, పది నిఘంటువులు. 'వీర నారయణీయ చరితమ్' అనే కావ్యంలోని వర్ణనలు భట్ట బాణుని కాదంబరి, హర్ష చరితమ్‌లో వలె ఉంటాయని పండితాభిప్రాయం.

ఈ కవి వ్రాసిన అన్ని గ్రంథాలు దొరికినాయి. (రె.రా.చ)

## వామన విజయము

కర్త : తెలియదు.

జానపద పౌరాణిక గేయం. ఇతివృత్తం ప్రసిద్ధం. భాగవతం లోనిది.

చూ. పౌరాణిక గేయములు. (అం.వా.చ)

## వాయలూరి నారాయణ కవి

రచన : పారిజాత నాటకము (యక్షగానం).

ఈకవి రామనార్యుని పుత్రుడు పొన్నేరిసీమలోని వాయలూరులో ఉండటం వల్ల వాయలూరి నారాయణకవిగా ప్రసిద్ధుడైనాడు అసలు వీరి ఇంటి పేరు చల్లావారు. ఇతని కవిత లక్ష్య లక్షణోపేతంగా ఉంటుంది. (అం. సా. ప. ప. 21-2)

## వాయవి నాటకము

కర్త : కంఠీరవ రాజు.

కాలం : క్రీ. శ. 18 వ శతాబ్ది పూర్వార్థం.

అష్టదిక్పాలకవిలాసంలోని భాగం. ప్రత్యేకంగా కూడా ప్రసిద్ధమైంది. సంగీత నృత్య ప్రధానమైన రచన.

## వాయుపుత్ర శతకము

కర్త : శిష్టు కృష్ణమూర్తి శాస్త్రి.

కాలం : క్రీ. శ 18 వ శతాబ్ది పూర్వార్థం.

## వారణాశి ధర్మసూరి

కాలం : క్రీ. శ. 15 వ శతాబ్దం నడుమకాలం.

స్థలం : గుంటూరు మండలంలోని కతెవరము.

రచనలు : 1. కృష్ణాస్తుతి, 2. సూర్యశతకమ్, 3. బాలభాగవతమ్, 4. హంస సందేశమ్, 5. కంసవధ, 6. నరకాసురవిజయమ్, 7. సాహిత్య రత్నాకరమ్.

ఇతడు మల్లినాథ సూరికంటె అర్వాచీనుడు. జగన్నాథ పండితరాయలకు పూర్వుడు. అప్పకవి (1556) ధర్మసూరి సాహిత్య రత్నాకరాన్ని పేర్కొన్నాడు. ఇతని రచనలన్నీ సంస్కృతాలే.

ఈయన అప్పకవికంటె పూర్వుడు. క్రీ. శ. 1414_1525 నడుమ రచనలు చేసి ఉంటాడు, ఆగమ పారదర్శియైన ఇతడు ఆర్గురు దర్శనకారుల అవతారమట. ఈ పుంభావసరస్వతి జనర్దనాచార్యుడనే ఒక వైష్ణవపండితుని విద్వత్సభలో ఓడించి అతని 'వాదికేసరి' బిరుదును ధరించాడు. అధీత వేదవేదాంగుడయినా విశేషించి చతుర్దశ విద్యాపారీణుడు; పదవాక్యప్రమాణ పారావార పారీణుడు. ప్రాకృతాది భాషావేత్త. తర్క-సాహిత్యాలలో, సంస్కృత ప్రాకృతాలలో, కావ్యనాటక నిర్మాణంలో ఈయనకు మొగ్గుయెక్కువ. న్యాయశాస్త్రవేత్త అయినప్పటికీ ఈయన కవిత తర్క కర్కశం కాలేదు. (తె. వి. స_4_853)

## వారణాశి వారు

దివ్యక్షేత్ర నామంతో తెలుగుదేశంలో ఉన్న ఇంటిపేరు. గుంటూరు మండలంలోని కతెవరం గ్రామనివాసి, "సాహిత్య రత్నాకర" కర్త, చతుర్దశ విద్యాపారీణుడు అయిన ధర్మసూరి పండితుని ఇంటిపేరు వారణాసి. (భారతి_మా_45_229; తె.వి.స_4_853)

## వారణాశి వేంకటేశ్వర కవి

కాలం : క్రీ. శ. 1820 ప్రాంతం కావచ్చు.
స్థలం : పిఠాపురం ప్రాంతంలోని కొత్త ఇసుకపల్లె.
రచన : రామచంద్రోపాఖ్యానము.

అచ్చమాంబ కామయ్యల పుత్రుడు. ప్రౌఢకవి. రసవంతంగా రచనచేశాడు. ఇతని సోదరులు లక్ష్మీపతి, జోగన్నకూడా కవిత్వం చెప్పనేర్చినవారు. ఇతనికి రచనలో సహాయం చేసేవారట. ఇతని రచన పిఠాపురంలోని కుక్కుటేశ్వరునికి అంకితం.

(పీ.యు_162)

## వారుణీ నాటకము

కర్త : కంఠీరవ రాజు.
కాలం : క్రీ. శ. 18 వ శతాబ్ది పూర్వార్ధం.

ఇది అష్టదిక్పాలక విలాసంలోని భాగం. సంగీత నృత్య ప్రధానమైన రచన.

## వార్తాకవి రఘునాథయ్య

కాలం : క్రీ. శ. 17 వ శతాబ్ది.
కృతి : లక్షణ దీపిక.

ఇతరమైన వివరాలేవీ తెలీవు. (ఛందఃపదకోశం)

## వార్త్తికము

పరిభాషాపదం. ఒక గ్రంథంలో చెప్పబడిన దానిలో, చెప్పబడని దానిని

గురించీ, దోషయుక్తంగా చెప్పబడిన దానిని గురించీ విచారించి, సవరించి, చెప్పే రచనను వార్తికము అంటారు ఈ రకమైన రచనలు సంస్కృత సాహిత్యంలో కానవస్తున్నాయి.

## వాలేశు పదములు (అలభ్యం)

కర్త : మల్లికార్జున పండితుడు.
రచనాకాలం : క్రీ. శ. 1150 ప్రాంతం.

శైవ వాఙ్మయానికి చెందిన పదాలు.

## వాల్మీకి చరిత్ర

కర్త : రఘునాథ నాయకుడు.
కృతిపతి : శ్రీరాముడు

మూడాశ్వాసాల కావ్యం. 450 గద్య పద్యాలున్నాయి. కవి ఇష్టదైవం శ్రీరాముడు కలలో కనబడి వాల్మీకి చరిత్రను రచించమని కోరాడట. ఒక కవి చరిత్రను ఇతివృత్తంగా తీసుకొని కావ్యం రచించిన తొలి తెలుగుకవి రఘునాథుడే సంస్కృతంలో స్కాంద పురాణంలోని ధర్మఖండంలో ఈ కథ ఉందనీ, అది దీనికాధారం అనీ పండితులు అంటున్నారు.

విశేషాలు : బదరికా వనంలోని మునులకు పర్వతుడు చెప్పిన కథ ఇది. సప్తర్షుల తీర్థయాత్రా సందర్శన అవకాశంగా కవి దక్షిణదేశ తీర్థాలన్నీ వర్ణించాడు. మూడవ ఆశ్వాసంలోని రంభోర్వశీ వివాద ఘట్టంలో నాట్య, సంగీత ప్రశంస ఉంది. రాజును మెప్పించిన వాళ్ళకు బిరుదులివ్వటం ఆనాటి ఆచారం. ఒకరికి బిరుదిస్తే రెండోవారు అసూయపడి వారిని వాదుకు పిలవడం, వారవనితల విలాస విభ్రమాలు, కాముకుల విస్రంభ లీలలు బాగా వర్ణించాడు. ఇవన్నీ సమకాలిక సంఘజీవనానికి అద్దం పడుతున్నాయి (అరుద్ర-10-85)

## వావిళ్ళ రామస్వామి శాస్త్రులు

కాలం : క్రీ. శ. 19 వ శతాబ్దం పూర్వార్థం.
స్థలం : నెల్లూరు జిల్లాలోని అల్లూరు.

భాషా పోషకుడు. సంస్కృతాంధ్రాలలో మంచిపండితుడు. వక్త. మదరాసులో వావిళ్ళ సంస్థను నెలకొల్పి సంస్కృతాంధ్ర గ్రంథాలనేకం ప్రచురించారు. మనుచరిత్ర, ఆముక్తమాల్యదవంటి కావ్యాలకు వ్యాఖ్యానాలు వ్రాసి ప్రకటించారు. కళాప్రపూర్ణ వావిళ్ళ వేంకటేశ్వరశాస్త్రి ఈయన కుమారుడు. (క.స-199)

## వాసంతికా పరిణయము

కర్త : క్రొంజ వేంకటాద్రి.

ఈ యక్షగానంలో కవి అహోబల నరసింహస్వామి వాసంతిక అనుచెంచెతను పెండ్లియాడిన వృత్తాంతమును వర్ణించినాడు. దీనిలో ధవళశోభనములు, సువ్వాల, ఏలలు త్రిభంగులు, అష్టకము మొదలయిన మధుర కవితారచనలు; జంపె, త్రిపుట మొదలయిన

తాళప్రధానాలయిన దరువులు, దీర్ఘద్విపదలు, వచనములు, కందములు ఉన్నాయి. ద్విపద వచనములలో కథాకథనము, దరువులందు పాత్రప్రవేశ సంభాషణలు ఎక్కువగా ఉన్నాయి. దీనికి మూలం శఠగోపజీయరు సంస్కృతంలో రచించిన వాసంతికా పరిణయమనే నాటకం కావచ్చునని పండితులు ఊహిస్తున్నారు, (య.వా.చ-29)

**వాసంతికా స్వప్నము**

కర్త : చూ. మండ కామేశ్వరకవి.

నాటక రచన వివరాలు తెలియవు. (ఆం.సం.సా-429)

**వాసమ ఏలూరు శాసనము - I**

కాలం : క్రీ. శ. 1201 ప్రాంతం.
శాసనప్రదాయిని : వాసమ
శాసన ప్రదేశం : పశ్చిమగోదావరిజిల్లా ఏలూరు మసీదు
ప్రస్తావితస్థలం : సరసిపురం.

శాసనవిషయం : వాసమ్మ వైశ్యకుల సంజాతయని, తన తల్లిదండ్రులైన వెన్నిసెట్టి-దారమ్మలకు ధర్మార్థంగా సరసిపురంలో అఖండదీపం నిలిపిందనీ ఈ శాసనం వల్ల తెలుస్తుంది దీనిలో ఒక చంపకమాల, చివర గద్య ఉన్నాయి.
(తె. క. చ-314. a)

**వాసమ ఏలూరు శాసనము - II**

కాలం : క్రీ. శ. 1202 ప్రాంతం.
శాసనప్రదాయిని : వాసమ.
శాసనప్రదేశం : పశ్చిమగోదావరిజిల్లా ఏలూరు.
ప్రస్తావితస్థలం : పద్మినీపురం (సరసిపురం).

శాసనవిషయం : వాసమ వైశ్యకుల సంజాతయని, వెన్నిసెట్టికి-దారమ్మకు పుత్రికయని పద్మినీపురంలో వేంచేసియున్న సోమనాథస్వామికి సంధ్యదీపాలు నిలిపిందనీ ఈ శాసనంవల్ల తెలుస్తుంది, దీనిలో ఒక చంపకమాల ఉంది. (తె. క. చ-314. b)

**వాసవదత్తా పరిణయము**

కవి : వక్కలంక వీరభద్రకవి.
అంకితం : పీఠికా పురాధీశులు రావు మాధవరాయ ప్రభువునకు (1679-1704).
మూలం : సుబంధుడు సంస్కృతంలో రచించిన వాసవదత్తరూపకం.

అనువాదం హృదయంగమంగా ఉంది. (తె. వి. న-6)
(క. శ-12-224)

**వాసవీ మాహాత్మ్యము**

నామాంతరాలు : 1. వైశ్య పురాణము 2. కన్యకా పురాణము.
కర్త : భాస్కరాచార్యులు.
కాలం : క్రీ.శ. 16వ శతాబ్దం. (ఆరుద్ర-9)

## వాసిరాజు రామయ్య

కాలం : క్రీ.శ. 16 వ శతాబ్ది.

రచన : బృహన్నారదీయము (అలభ్యం) (3 పద్యాలు దొరికాయి).

విశిష్టత : మహా పురాణాలు 22 అని, ఉప పురాణాలు 34 అని పండితులు చెబుతారు. పురాణాలలో నారదీయం, ఉప పురాణాలలో బృహన్నారదీయం అనే వైష్ణవ మత ప్రశంసాత్మకమైనవి ఉన్నాయి. ఈయన వ్రాయక ముందే పిల్లలమర్రి పిన వీరన్న నారదీయాన్ని తెనిగించాడట గాని అది దొరకలేదు. ఈయనకు అర్వాచీనుడయిన కొత్తలంక మృత్యుంజయుడనే కవి బృహన్నారదీయాన్ని తెనిగించాడు. నారదీయ పురాణాన్ని వరంగల్లు నివాసి అల్లాడ నరసింహ కవి ఆంధ్రీకరించాడు.

ఇతని శైలి జటిలమైంది. అజ్ఞాత గ్రంథ సంకలన కర్త ఈయన వ్రాసిన 3 పద్యాలను ఉదాహరించాడు. (ఆరుద్ర–8–88)

## వాసిరెడ్డి చంద్రమౌళి

కాలం : క్రీ.శ. 18 వ శతాబ్దం.

స్థలం : కృష్ణా మండలం.

కవి పోషకుడు. కృతిపతి. ఇతడు అమరావతి పాలకుడైన వాసిరెడ్డి వేంకటాద్రి నాయుని సోదర పుత్రుడు.

వేమనారాధ్యుల సంగమేశ్వరారాధ్యుడనే కవికి ఆశ్రయమిచ్చి అతనినుండి "అహల్యా సంక్రందన విలాసము"నే ఐదాశ్వాసాల ప్రబంధాన్ని కృతి పొందాడు. (క.చ–3–172)

## వాసిరెడ్డి రామలింగం

కాలం : క్రీ.శ. 17 వ శతాబ్దం.

స్థలం : గుంటూరు జిల్లాలోని అమరావతి.

ఇతడు అమరావతీ సంస్థానాధీశుల కుటుంబంలోని వాడు. సాహిత్య పోషకుడు. దివి రమణయ్య కవి చేత "శృంగార దామం" రచింపజేసి తమ కులదైవం మంగళగిరి పానకాల స్వామికి అంకితం ఇప్పించాడు. (ఆరుద్ర–10–247)

## వాసిరెడ్డి వేంకటాద్రినాయుడు

కాలం : క్రీ.శ. 17 వ శతాబ్ది.

స్థలం : అమరావతి–గుంటూరు మండలం.

ఈ ప్రభువు మహాదాత. ఆ కాలంలో 'పచ్చెపుగాళ్ళు' అనే దారి దోపిడి దొంగలు ప్రజలను దోచుకొని బాధించేవారట. ఇతడు చాలా ప్రయత్నాలు చేసి దొంగలను పట్టించి తలారుల చేత నరికించి, దొంగల బెడద తప్పించాడట.

ఈయన దానశీలి. త్రాసులో తానొక ప్రక్క కూర్చుని, త్రాసు రెండో ప్రక్క తన తూకానికి సరిపడేటట్లు బంగారం వేయించి తులాభారం తూగి–ఆ బంగారం మొత్తాన్ని

బ్రాహ్మణులకు కవి పండితులకు విరివిగా దానం చేసేవాడట. ఈయన అమరావతి, వైకుంఠపురాలను కట్టించాడు. ఎన్నో దేవాలయాలను కట్టించాడు. కవులు ఈయన మీద అసంఖ్యాకంగా చాటువులు చెప్పారు. (చా.ప.ర.)

### వాసిరెడ్డీయము

కర్త : అమరవాది రామకవి (1840-1918).

వెంకట లక్ష్మీనరసింహనాయని ప్రోత్సాహం చేత కవి ఈ గ్రంథం వ్రాశాడు. ఇది రెండాశ్వాసాల కృతి. వెంకటాద్రినాయని పాలనం వరకుగల చరిత్ర ప్రథమాశ్వాసంలో ప్రౌఢ ప్రబంధ ఫక్కీలో వ్రాయబడింది. ఆ తరువాత వారి దత్తపుత్రుల పాలనం, కుంఫిణీ వారి విషయాలు ద్వితీయాశ్వాసంలో వ్రాయబడినవి. రచనలో అన్య దేశ్యాలు ఎక్కువగా కనిపిస్తాయి. చారిత్రక ప్రాముఖ్యం గల గ్రంథం. (ఆం. సం. సా.)

### వాసిష్ఠము (అలభ్యం)

కర్త : చూ. కామినేని ఎల్లారెడ్డి

అంకితం : బిక్కనవోలులోని సిద్ధరామేశ్వరునకు.

కామినేని మల్లారెడ్డి (దోమకొండ పాలకుడు) రచించిన "శివధర్మోత్తరం" అనే గ్రంథంలో ఈ రాజకవి "వాసిష్ఠము" అనే గ్రంథాన్ని వ్రాసి బిక్కనవోలులో వెలసిన సిద్ధరామేశ్వరునికి అంకిత మిచ్చాడని పేర్కొనబడింది. (ఆం.సం.సా-184)

### వాసిష్ఠ రామాయణము

కర్త : మడికి సింగన.

కృతిభర్త : అహోబల నరసింహస్వామి.

అయిదాశ్వాసాల గ్రంథం. కందనామాత్యుని ప్రోత్సాహంతో కవి ఈ రచన చేశాడట.

ప్రత్యేకత : ప్రధానంగా వేదాంత బోధకమైన గ్రంథం. దీనిని సంస్కృతంలో జ్ఞాన వాసిష్ఠం అంటారు. విశ్వామిత్రుని సలహాపై వసిష్ఠుడు రామునికి జ్ఞానబోధచేస్తాడు. సింగన సంస్కృత గ్రంథాల సారాన్ని సంగ్రహంగా చేసి, తెలుగు సామెతలు, జాతీయాలు, చక్కని ఉపమానాలతో రంగరించి రచించాడు. (ఆరుద్ర-4)

### వాసుదేవ కవి

నామాంతరం : వాసుదేవ దీక్షితులు.

కాలం : క్రీ. శ. 17 వ శతాబ్దం.

స్థలం : తంజావూరు (శహజీ 1684-1712-ఆస్థానం)

రచనలు : 1. పార్వతీ పరిణయము (నాటకం) 2. బాలమనోరమా వ్యాఖ్య (సం)

3. సుభగానంద ప్రహసనము (వివాదాస్పదం)

గురువు : ఆనందరాయ మఖి (శహాజీమంత్రి).

ఇతని బాలమనోరమావ్యాఖ్య, సిద్ధాంత కౌముదికి చేసిన వివరణ. సుభగానంద ప్రహసన కర్త ఇతదేనని పండితుల అభిప్రాయం.

పార్వతీ పరిణయ నాటకం శహాజీ రచనగా ప్రసిద్ధిపొందింది.

(శారదాధ్వజం-76; అరుద్ర-12-162)

**వాసుదేవ దీక్షితులు**

నామాంతరం : వాసుదేవ కవి. (చూ)

**వాసుదేవ యోగి**

కాలం : క్రీ. శ. 18 వ శతాబ్దం.

రచన : జీవప్రబోధము.

ఇతని పూర్వనామం తెలియరావడంలేదు. యోగి వర్యుడుగా ప్రసిద్ధి పొందాడు. సలక్షణమైన భాషలో వేదాంతపరమైన రచనలు చేశాడు. (క.స-217)

**వాస్తు శాస్త్రము**

కర్త : పేరుసోముల గణపయ్య.

పద్యకావ్యం. గృహనిర్మాణం, ఆలయ నిర్మాణం మొదలైన వాటిని గురించి తెలిపే శాస్త్రం. (వా.చ;వం.సు-404)

**వింజమూరి సోమేశకవి**

స్థలం : పిఠాపురం సంస్థానం.

రచన : రాఘవయాదవీయము.

గురువు : గోవిందగురు.

వింజమూరి వంశంవారు తరతరాలుగా పిఠాపురం సంస్థానాధీశులను ఆశ్ర యించి ఉండేవారు. ఈ సోమేశకవి వింజమూరి నరసన్నభట్టు పౌత్రుడు, కృష్ణసూరి పుత్రుడు. ఉభయభాషా పండితుడు. (ఆం.సం.సా-245)

**వింటి పోలకవి**

కాలం : క్రీ. శ. 15, 16 శతాబ్దాలు కావచ్చు.

రచన : శివరహస్య ఖండము.

సిద్ధన కుమారుడు. ప్రౌఢకవి. రచనలో సమకాలీన సాంఘికాచారాలను పొందు పరిచాడు. (ద్వి.సా.చ-181)

**వికటకవి గోపాలరాయకవి**

వ్యవహారనామం : బుచ్చాలి గోపాలయ్య (చూ).

## వికృతి వివేకము (సం)

కర్త : అధర్వణాచార్యులు.

నామాంతరం : అధర్వణ కారికావళి.

అలభ్యం. (ఆరుద్ర-2)

## విక్రమ సింహపురి

నామాంతరం : నెల్లూరు.

తెలుగు సాహిత్యానికి ఆటపట్టయిన నగరం. ఇది పూర్వం కరికాల చోళుని వంశీయులైన తెలుగు చోడ భూపతులకు రాజధానిగా ఉండేది. చోడ తిక్కరాజు ఆస్థానంలో జిక్కన తాతయైన పెద్దయామాత్యుడు చతుర్విధ కవితా ప్రవీణుడై వివిధ సాహిత్య విద్యా విశేషాలను ప్రదర్శించేవాడట.

చోడ తిక్కరాజు కుమారుడు మనుమసిద్ధి. ఇతని ఆస్థానంలోనే కవిత్రయం లోని వాడైన తిక్కన సోమయాజి ఉండేవాడు. అతడు మనుమసిద్ధికి మంత్రిగా, నర్మ సచివుడుగా ఉండేవాడట. తిక్కన విక్రమసింహపురిలోనే తన మహాభారత రచన సాగించి ఈ నగరాన్ని విరాజిల్ల చేశాడు. (తె. క. చ-379)

## విక్రమసేనము

రచనాకాలం : క్రీ. శ. 14వ శతాబ్దంఉత్తరార్ధం.

కర్త : చిమ్మపూడి అమరేశ్వరుడు (చూ).

కావ్యం పూర్తిగా లభించలేదు.

విశిష్టత : విక్రమసేనంలోని పద్యాలను పెదపాటి జగ్గన్న కవి తన "ప్రబంధ రత్నాకరం"లో ఉదాహరించాడు. కూచిమంచి తిమ్మకవి, అప్పకవి కూడా "విక్రమసేనం" లోని పద్యాలను ఉదాహరించారు. కీ. శే. వేటూరి ప్రభాకరశాస్త్రిగారు ఈ గ్రంథంలోని పద్యాలను సుమారు 52ని తాను సంకలనంచేసి 'ప్రబంధ రత్నావళి'లో చేర్చారు. రసవంత మైన కవిత. (ఆరుద్ర-3)

## విక్రమార్క చరిత్ర (అలభ్యం)

కర్త : చూ. కవిభల్లటుడు.

సంస్కృతమో తెలుగో తెలియరాలేదు. (ఆరుద్ర-4)

## విక్రమార్క చరిత్ర

కాలం : నిర్ధారణగా తెలియదు.

కర్త ; కొండయ.

అంకితం : వేంకటేశ్వర స్వామికి.

ద్విపదకావ్యం. దేవయామాత్యుని పుత్రుడైన పెద్దయ మంత్రి ప్రేరణతో కవి ఈ రచన చేశాడు. కవి విక్రమార్కుని కథలు-జక్కన చెప్పిన రీతిలోనే చెప్పాడు. దీనిప్రతి మదరాసు ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారంలో ఉంది. (ద్వి. సా. చ-457)

విక్రమార్క చరిత్రము

రచనాకాలం : క్రీ. శ. 14వ శతాబ్ది పూర్వార్ధం.
కర్త : జక్కన.
అంకితం : వెన్నెలకంటి సిద్దయకు.

మూలం సంస్కృత కావ్యం. ప్రసిద్ధమైన విక్రమార్కుని కథలు మొత్తం ఎనిమిది అశ్వాసాలున్నాయి. ఇది ఉత్తమ కావ్యాలలో ఒకటి. ప్రబంధ రచనా ధోరణిలో ఉన్న కావ్యం. చారిత్రకం కాదు.

తెలుగు సామెతల సమయోచిత ప్రయోగం ఇందులో చూడవచ్చు. సుదీర్ఘ వర్ణనలున్నాయి. ప్రౌఢమైన రసవంతమైన కవిత్వం. (రె. రా. చ.)

విక్రమార్క చరిత్రము

కాలం : క్రీ. శ. 19వ శతాబ్ది పూర్వార్ధం.
కర్త : మిక్కిలి మల్లికార్జునుడు.
అంకితం : నందూరి కామమంత్రికి.

రచన సరళంగా ఉంది. (క స-165)

విక్రమార్క చరిత్రము

కర్త : చూ. యాదవామాత్యకవి.
అంకితం : భద్రాద్రిలోని శ్రీరామునికి.

ఇది వచన కావ్యం. కవిత్వం మధురంగా ఉంటుందట. (తె. వి. స-6)

విక్రమార్క చరిత్రము

నామాంతరం : బత్తీసు పుత్రి కథలు (చూ).
కర్త : వాద్రేవు వెంకయ్య.

విక్రమార్కీయము (అలభ్యం)

రచనాకాలం : క్రీ. శ 1820 ప్రాంతం.
కర్త : పాత పాపయ్య శాస్త్రి. (క. స-121)

విక్రమార్కుని కథలు

కర్త : తెలియదు.

ద్విపద కావ్యం. గ్రంథం అసంపూర్తిగా లభించింది. కవి ముప్పది రెండు కథలను చెప్పినట్లున్నా దొరికినవి మాత్రం ఇరవై యారు కథలు సలక్షణంగా సుందరంగా ఉంది. దీని ప్రతి తంజావూరు సరస్వతీ మహలు గ్రంథాలయంలో ఉంది. (ద్వి. సా. చ-459)

విక్రమార్కుని కథలు

కర్త : రావిపాటి గురుమూర్తి శాస్త్రి.

ఈ కథలు 1770 ప్రాంతంలో వ్రాయబడినవైనా, 1819లో ముద్రితమైనాయి తెలుగులో మొట్టమొదటి కథలుగా చెప్పవచ్చు. 1858 లోపల నాలుగుసార్లు ముద్రింపబడ్డాయి. (వ. వా.)

విక్రమార్జున విజయము (కన్నడం) (కన్నడ భారతము)

కర్త : పద్మకవి (పంప మహాకవి).

రచనాకాలం : క్రీ.శ. 941 ప్రాంతం.

కన్నడభాషలో తొలితగా భారత గాథను పంపమహాకవి ఈ పేరుతో రచించాడట. పంపకవీ పద్మకవీ ఒకరే అని కొందరు విమర్శకులు అంటున్నారు. ఈ కవి ఆంధ్రదేశంలోని వేంగీపుర వాస్తవ్యుడు. (క.స-117)

విక్రమేంద్రవర్మ చిక్కుళ్ళ శాసనము

కాలం : క్రీ.శ. 6వ శతాబ్ది.

విక్రమేంద్రవర్మ విష్ణుకుండిన వంశానికి చెందిన రాజు. ప్రాయికంగా విష్ణుకుండిన రాజుల శాసనాలన్నీ సంస్కృతంలోనే ఉన్నాయి. దీనిలో సంస్కృత పదాల నడుమ "విజయరాజ్య సంవత్సరంబుళ్" అనే పదం కనిపిస్తుంది. అమరావతిలోని ఒక శిలాఫలకం మీద "నాగబు" శబ్దం కనిపించింది. నాగబు శబ్దంలోని "బు" వర్ణమే దీనిలో "ంబు" అనే రూపాన్ని పొందినది. సంవత్సర"ము" అనే పదాన్ని "సంవత్సరంబు" అని దీనిలో ప్రయోగించారు. మువర్ణాంత పదానికి తెలుగులో "ంబు" "మ్బు" అనే రూపాలు ప్రాచీన తెలుగులో ఉన్నాయి

అట్లే చివరలో ఉన్న "ళ్" వర్ణం బహువచనాన్ని తెలుపుతుంది. ద్రావిడంలోని "కళ్" అనే బహువచన ప్రత్యయమే అనుచిత విభాగం వల్ల "ళ్" అనే రూపంగాను, తరువాత "ళు, లు," రూపాలుగాను మారింది. "ళు" ప్రస్తుత బహువచన రూపమైన "లు"కు పూర్వ రూపమని పండితాభిప్రాయం. ఇట్లా రూపం మారటానికి కొన్ని శతాబ్దాలు పట్టి ఉండవచ్చును. (వా.చ-10)

విక్రాల నరసింహాచార్యులు

కాలం : క్రీ.శ. 19వ శతాబ్దం.

స్థలం : రాజనగరము (వనపర్తి సంస్థానం).

రచనలు : కల్యాణి, భారతీస్తుతి, మాలతీ మాధవము, కురుసంధానము, జగన్మోహన భాణము, దూతాంగదము.

వనపర్తి సంస్థాన విద్వాంసులు. శతావధానులని పేరు పొందారు. సంస్కృతాంధ్రాలలో కవిత చెప్పగల దిట్ట. వీరి రచనలలో కల్యాణి, భారతీస్తుతి అనేవి ముద్రితాలు. మిగిలినవి అముద్రితాలు. (ఆం.సం.సా)

విక్రాల వేంకటాచార్యులు

కాలం : క్రీ.శ. 19వ శతాబ్దం.

స్థలం : వనపర్తి సంస్థానం.

వీరు వనపర్తి సంస్థానంలో ఆస్థాన విద్వాంసులుగా ఉన్నారు. రచనలు తెలియరాలేదు. (ఆం సం.సా)

## విఘ్నహర గణేశ పరిణయము

నామాంతరం ; విఘ్నేశ్వర పరిణయము (చూ).

కర్త : రెండవ ఏకోజీ (చూ)

## విఘ్నేశ్వర కల్యాణము

కర్త : శహాజీ (చూ).

అంకితం : త్యాగేశ సాంబశివునికి.

రచనాకాలం : క్రీ. శ. 1704 ప్రాంతం.

ఇతి వృత్తం క్రొత్తది. వినాయకుని పరిణయగాథను గూర్చి తెలుగులో కావ్య నాటక రూపంలో వచ్చినవి చాలా తక్కువ. (ద.దే.వా–198)

## విఘ్నేశ్వర పరిణయము

నామాంతరం : విఘ్నేశ్వర కల్యాణము, విఘ్నహర గణేశపరిణయము.

కర్త : రెండవ ఏకోజీ.

కాలం : క్రీ. శ. 18 వ శతాబ్ది పూర్వార్ధం.

మూలం : శహాజీ రాసిన విఘ్నేశ్వర కల్యాణ నాటకం నుండి కథను మాత్రం స్వీకరించి స్వతంత్రంగా తీర్చిదిద్దిన రచన.

నాటకం. దీనికి సంస్కృతాంధ్ర భాషలలో గద్యలు (రెండు) చెప్పబడ్డాయి. భాషలో సంస్కృతాంధ్రాలు కలిసిపోయి ఉన్నాయి.

సంస్కృతంలో చూర్ణికలో దీనిపేరు విఘ్నహర గణేశపరిణయమని చెప్పబడినది. (ద దే.వా–256; శారదాధ్వజం:–100)

## విచార దశకము

నామాంతరం : అజ్ఞాన ధ్వాంత చండ భాస్కరము.

కర్త : కంభంపాటి అమరేశ్వర శాస్త్రి.

పది ప్రకరణాల అద్వైత వేదాంత గ్రంథం.

## విచిత్ర రామాయణ కావ్యము

కర్త : వేల్పూరి వేంకటకవి.

రచనాకాలం : క్రీ. శ. 1804 ప్రాంతం

అంకితం : శ్రీరామతీర్థంలోని దైవానికి.

కవి విజయనగర మండలానికి చెందినవాడు. అక్కడి క్షేత్రస్వామికి అంకితంగా రామాయణ కావ్యాన్ని రచించాడు. మూలంలో లేని చిత్రకథలు ఇందులో ఉన్నాయట.

(య. వా. చ-102)

విచిత్ర రామాయణము

రచనాకాలం : క్రీ. శ. 1670 ప్రాంతం.

కర్త : గోపీనాథకవి.

వచనకావ్యం ఉత్కళభాషలో సిద్ధేంద్రయోగి రచించిన విచిత్రరామాయణానికి ఇది తెలుగుసేత. వాల్మీకి రామాయణంలో లేని చిత్రకథలు ఇందులో చాలా ఉన్నాయి.

విచిత్రరాయడు

కాలం : క్రీ. శ. 17 వ శతాబ్దం (మహారాష్ట్ర రాజులకాలం).

స్థలం : తంజావూరు.

సమకాలికులు : శహాజీ (1684-1712), శరభోజీలు (1712-28).

విచిత్రరాయావతంసుడుగా ప్రసిద్ధుడు. కవి పండితపోషకుడు. మహారాష్ట్ర రాజకుటుంబానికి చెందినవాడు. దర్భావేంకటగిరికవికి ఆశ్రయమిచ్చి రచనలు చేయించాడు.

విచిత్రరాయడనేది ఇతని బిరుద నామమేమో అని కొందరి అభిప్రాయం. ఇతని కుమారుడు ఖండోజిరాయడు అనేక కృతులు అంకితం పొందాడు.

(ఆరుద్ర-12-155)

విజయనందన విలాసము

నామాంతరం : శశిరేఖా పరిణయము.

కర్త : (చూ) మంగళగిరి ఆనందకవి.

అంకితం : దాట్ల వేంకటకృష్ణ నరపాలునకు.

రచనాకాలం : క్రీ. శ. 1750 ప్రాంతం.

మూడాశ్వాసాల ప్రబంధం

రమణీయమైన వర్ణనలతో విదగ్ధమైన కవిత్వంతో ప్రౌఢంగా ఉన్న రచన.

(క. త-13-81)

విజయనగరము

ఈ సంస్థానం పూర్వపు విశాఖ జిల్లాలోనిది. "పూసపాటి" వంశీయులు దీన్ని పాలించారు.

ఈ సంస్థాన పాలకుల పూర్వరాజధాని కుమిలి (కుమిళాపురము) అనే గ్రామం. ఆ తరువాత "పొట్నూరు" రాజధానిగా ఉంది. బొబ్బిలి యుద్ధకారకుడైన విజయరామ రాజు కాలంలో గాజుల రేగసీమలో వెలసిన "విజయనగరం" రాజధాని అయింది.

విజయనగర పాలకుల మూల పురుషులు సూర్యవంశ క్షత్రియులట. ఉత్తర భారతదేశంలోఉన్న "ఉదయపుర" రాజవంశీయులకు వీరికి సంబంధ బాంధవ్యాలున్నాయని చెప్పుకుంటారు. "ఉదయపూరు"కు చెందిన "విజయ భూపతి" తన దిగ్విజయ యాత్రలలో దక్షిణదిశకు వచ్చి పెక్కురాజుల నోడించి "బిజాపుర" ప్రాంతాన్ని రాజధానిగా చేసుకుని పెక్కు సంవత్సరాలు పాలించాడట. ఆ ప్రభువు పేర 'విజయపురము' నిర్మింపబడిందనీ, అదే 'బిజాపురం'గా మారిందనీ ఐతిహ్యం ఉంది. ఇతని కుమారుడు మాధవ వర్మ, బెజవాడ కనకదుర్గాదేవి ప్రసాదంచేత స్వతంత్రుడై "నిడుదవోలు" రాజధానిగా చేసుకుని రాజ్యం పాలించాడట. ఇతని పౌత్రుడు 'మైలమ భీముడు'. ఈతని వంశీయుడైన "అమలరాజు" కొండపల్లి సీమలో "పూష" వంశ క్షత్రియులు నివసించేందుకు వీలుగా "పూషవాటి" (పూష = సూర్య) నగరాన్ని నిర్మించాడట. ఆ కారణం చేతనే ఈ వంశంవారికి "పూసపాటివారు" అనే పేరు వచ్చింది.

ఈ సంస్థాన పాలకులు కార్యక్షేత్రాలలోనేకాక కవితా రంగంలోకూడా అసదృశమైన ప్రతిభను, అభిరుచిని ప్రదర్శించి పేరుపొందారు. కృతికర్తలుగా, కృతిభర్తలుగా, కృతిప్రేరకులుగా కూడా అనేక రసవత్కావ్యాల సృష్టికి నిర్వాహకులైనారు.

పూసపాటి రాచిరాజు, పూసపాటి తిమ్మభూపాలుడు, వేంకటపతిరాజు మొదలగువారు స్వయంగా కవులు. వీరు వరుసగా నవభారతము, శ్రీకృష్ణ విజయము, ఉషాభ్యుదయాది గ్రంథరచనలు చేశారు. సీమంతినీ పరిణయకర్త పెనుమళ్ళ సోమయామాత్యుడు తిమ్మభూపాలుని ఆస్థానంలోనివాడు. బొబ్బిలియుద్ధంలో మరణించిన విజయరామరాజు జ్యోతిషశాస్త్రవేత్త, ఆంధ్రపారాశరీహోర గ్రంథకర్త. ఈయన తరువాత సంస్థానాన్ని పాలించిన విజయరామరాజు చట్రాతి లక్ష్మీనరసకవిని పోషించాడు. అయన రచించిన "పద్మనాభయుద్ధ" కావ్యాన్ని కృతిగొన్నాడు.

ఇటీవలికాలంలో (క్రీ.శ. 1851 తరువాత) ఈగజపతి సంస్థాన కీర్తిచంద్రికలను దశదిశల వెదజల్లినవారు శ్రీ ఆనంద గజపతి మహారాజుగారు. ఈప్రభువు "ఆంధ్రభోజ" బిరుదాంకితుడు. ప్రసిద్ధ పాశ్చాత్య సంస్కృత పండితుడైన "మాక్సుముల్లర్" మహాశయుని "ఋగ్వేద సంపుటాలను" ముద్రింపించారు. "వాచస్పత్య నిఘంటువు"ను ప్రకటింపచేశారు. తిరుపతి వేంకటకవుల వంటి ఉద్దండ పండితులు పెక్కుమంది ఇతనిసంస్థానాన్ని దర్శించి విశేష గౌరవాదరాలు పొందారు.

అడిదము సూరకవి, నదిమింటి రామయోగికవి, కాళ్ళకూరి గౌరీకాంతశాస్త్రి, ముడుంబా నరసింహాచార్యస్వామి, పేరి కాశీనాథశాస్త్రి,మండ కామేశ్వరశాస్త్రి,కొల్లూరి కామశాస్త్రి, భాగవతుల లక్ష్మీనారాయణశాస్త్రి, నేమాని కోదండరామయ్య, గురజాడ శ్రీరామ

మూర్తి, గురజాడ వేంకట అప్పారావు, రాజామణిచెట్టి వంటి ప్రముఖకవి పండితులెందరో ఈ సంస్థానపు ప్రభువులచేతనూ, వారి బంధువులచేతను విరివిగా గౌరవింపబడ్డారు.

అలక నారాయణ గజపతి (క్రీ. శ. 1902–1937) కు కుమారుడైన విజయ రామ గజపతి కాలంలో జమీందారీ రద్దు చట్టం మేరకు ఈ సంస్థానం ఆంధ్రరాష్ట్రంలో లీనమై పోయింది. (ఆం.సం.సా–397 నుంచి 442; సం ఆ.వి.కో–158)
(కేశవపంతుల–సం.సా–1–4; తె.వి.స–4)

## విజయ భవనరాజము

క్రీ శ. 1600–1633 వరకు తంజావూరును పాలించిన రఘునాథ నాయకుని సభాభవనం.

ఇక్కడే చేమకూర వేంకటకవి రఘునాథునికి తాను రచించిన విజయవిలాస కావ్యాన్ని అంకితం ఇచ్చాడని అంటారు

విజయవిలాస కావ్యంలోనూ దీని సూచన ఉంది. (ద.దే.వా–56)

## విజయ రంగ చొక్కనాథుడు

కాలం : క్రీ శ. 1706–32 ప్రాంతం.
స్థలం : మధుర (సంస్థానాన్ని పాలించిన నాయక రాజు).
రచనలు : 1. శ్రీరంగ మాహాత్మ్యము 2 మాఘ మాహాత్మ్యము.

కవి, కవి పోషకుడు. గద్య రచనా సంప్రదాయాన్ని పోషించిన రాజకవి. మధురను పాలించిన తెలుగు నాయక రాజులలో ఇతడే ప్రముఖుడు. ఇతనిపై అనేక చాటువులున్నాయి. "విజయరంగ చొక్కవజీరా" అనే మకుటంతో కొన్ని లభించాయి. ఇతని రచనలు రెండూ వచన కావ్యాలు. సరళంగా నిర్దుష్టంగా ఉంటాయి. క్షేత్ర మాహాత్మ్యలు ఇతని కాలంలో ఎక్కువగా కావ్యేతివృత్తాలుగా స్వీకరింప బడు తుండేవి. ఈరాజు ఆస్థానంలో సముఖం వేంకట కృష్ణప్ప నాయకుడు, శేషము వేంకటపతి కుందుర్తి వేంకటాచలకవి ముఖ్యులు. సముఖం వేంకటకృష్ణప్పనాయకుని జైమిని భారతం విజయరంగ చొక్కనాథునికే అంకితం. (ద.దే వా–331)

## విజయ రంగ చొక్కనాథుని జంబుకేశ్వర శాసనము

శాసనకాలం : శా.శ. 1630 (వికృతినామ సంవత్సరం).
భాష : తెలుగు వచనం.
స్థలం : జంబుకేశ్వరం.
వేయించిన వారు : మధురరాజు విజయరంగ చొక్కనాథుడు (1706–32).

విషయం : విజయరంగ చొక్కనాథుడు లోక గురుస్వాములైన శ్రీశంకరా చార్యస్వాముల వారి గజారణ్య క్షేత్రంలోని పొన్వాశి కొండ్డాం వీథిలో ఉన్న మఠానికి నిరంతర అన్నదానాదుల కొరకై ఏర్పాట్లు చేసి ఇచ్చిన దానశాసనం. రాగిరేకుపై ఉంది. తొట్టియం సీమ, మహేంద్ర మంగలం, కృష్ణాపురం, కారక్కాడు, మంగమాంబాపురం

మొదలగు స్థలాలు ప్రస్తావితాలు నాటి వ్యవహారిక భాషా స్వరూపం ఈ శాసనం నుండి గ్రహించవచ్చును. (ద.దే.వా-549)

**విజయ రఘునాథరాయలు**

కాలం : క్రీ.శ. 17 వ శతాబ్ది చివర, 18 వ శతాబ్ది మొదట.

ఈయన పుదుక్కోట ప్రభువైన తిరుమలరాయల పుత్రుడు. ఈయనను నుతిస్తూ శేషయ్య అనే చాటుకవి కొన్ని చాటువులు, ఇంకొక కవి మరి కొన్ని పద్యాలు, సీతారామయ్య అనే కవి కొన్ని చాటువులు చెప్పారు. (చా ప ర.)

**విజయ రాఘవ కల్యాణము**

కర్త : కోనేటి దీక్షిత చంద్రుడు.
రచనాకాలం : క్రీ. శ. 1670 ప్రాంతం.
కృతిపతి : క్రీ.శ. 1633-73 నడుమ తంజావూరును పాలించిన విజయరాఘవుడు.

విజయరాఘవునికీ, మదనమంజరికీ జరిగిన కల్యాణగాథ ఇందులోని విషయం.

విశేషాలు ; చెంచుల వేషభాషలు, ఆటవికులపాటలు, పదాలు, కాటమరాజు మీద పదం, కంబసురాయనిపదం, కూనలమ్మపదాలు, 'దరమరాజు'మీదపదాలు, రాజసభలో శాస్త్రచర్చలు, సమస్యలు మొదలైనవన్నీ ఇందులో ఉన్నాయి. చక్కని హాస్యరసముంది. (వ దే వా. - 125; ఆరుద్ర 11-138)

**విజయ రాఘవ చంద్రికావిలాసము**

నామాంతరం : విజయరాఘవ చంద్రికావిహారము (చూ).

**విజయ రాఘవ చంద్రికావిహారము**

నామాంతరం : విజయరాఘవ చంద్రికావిలాసము.
కర్త : కామాసు వేంకటపతి సోమయాజి.
అంకితం : విజయ రాఘవ నాయకునికి. (క్రీ. శ. 1633-73 తంజావూరును పాలించిన రాజు)

ఇది నాటక చాటుకావ్యం. నాటకంలో ఎక్కువ గేయాలేఉన్నాయి. విజయ రాఘవునికి పూర్వజన్మవృత్తాంతం కల్పించి కవినాటకంగారాశాడు ఇందులోవి కమ్మవక్కాణ ఆనాటి లేఖా విధానాన్ని తెలుపుతున్నది. కవి నాటకంలో పాత్రోచితమైన భాష వ్రాశాడు. (ఆరుద్ర-11-128)

**విజయ రాఘవ నాయకుడు**

కాలం : క్రీ.శ. 1633-73 ప్రాంతం.
గురువు : చతుర్వేది శతక్రతు శ్రీనివాస తాతాచార్యులు.
రచనలు : 1. రఘునాథాభ్యుదయము 2. రఘునాథ నాయకాభ్యుదయము 3. కాళియ మర్దనము 4. పూతనా హరణము 5. విప్రనారాయణ చరిత్ర 6 ప్రహ్లాద చరిత్ర 7. శ్రీకృష్ణ విలాసము 8. చెంగమలవల్లి పరిణయము (అలభ్యం)

9. గోవర్ధనోద్ధరణము (అలభ్యం) 10. రతి మన్మథ విలాసము (ప్రబంధం) (అలభ్యం) 11. రాసక్రీడ (అలభ్యం) 12. నవనీత చోరము (అలభ్యం) 13. పారిజాతా పహరణము 14. రుక్మిణీ కల్యాణము (అలభ్యం) 15. రాధా మాధవ వివాదము 16. ధనాభిరామము 17. సత్యభామా వివాహము 18. ఉషా పరిణయ నాటకము 19. దక్షిణ ద్వారకా స్థల వర్ణన 20. మోహినీ విలాసము (ద్విపద) 21. మోహినీ విలాసము (నాటకం) 22. మంజరీ ద్విపద (ప్రబంధము) (నాటకం) 23. సముద్ర మాధవ నాటకము 24. పాదుకా సహస్రము (ద్విపద) 25. ప్రణయ కలహము 26. కంస విజయము 27. జానకీ కల్యాణ నాటకము 28. పుణ్యకవ్రత నాటకము 29. గోపికా గీతలు (సంస్కృతం నుంచి తెనుగు) 30. భ్రమర గీతలు 31. ఫాల్గుణోత్సవము (రగడ చాపదులతో) 32. రాజగోపాలవిలాస నాటకము 33. రాజగోపాల దండకము 34. వీరశృంగార సాంగత్యము 35. సంపంగి మన్నారు సాంగత్యము 36. వేడుకోలు విన్నపాలు. దరువులు, ఏలలు, విగి పదాలు, సంకీర్తనలు.

అధ్యాత్మలు, నాట్యరీతుల కనువైన పదాలు "వాల్వచి, గుజ్జరి విల్వేడు, దండు లాస్యము, కందుక క్రీడ, దురుపదము, మదనపద దూత్యము, జోగిపచవాళి, సవతి మచ్చరంబులు, నాట్యకదంబు మొదలగు నాట్యముల్" హావణించినట్లు ప్రహ్లాదచరిత్ర నాటకంలో ఉంది. మొత్తం 50 కి మించి రచనలు చేశాడు.

తంజావూరును పాలించిన కట్టకడపటి నాయకరాజు. రాజకవి. కృతికర్త. కృతిపతి కూడా. కళావతి, రఘునాథ నాయకుడు ఇతని తలిదండ్రులు. ఇతని ఆస్థానంలో రంగాజమ్మ, చెంగల్వ కాళకవి, కామరసు వెంకటపతి సోమయాజి, కోనేటి దీక్షిత చంద్రుడు, పురుషోత్తమ దీక్షితుడు మొ॥ వారు ఉండేవారు.

ఇతడు పరమ వైష్ణవ శిఖామణి. మన్నారు గుడిలోని రాజగోపాల స్వామి భక్తుడు. తన రచనలన్నీ అతనికే అంకితం ఇచ్చాడు. తనను మన్నారుదాసునిగా చెప్పుకొన్నాడు. ఇతని రచనల్లో మొదటి ఏడు మాత్రం లభించాయి.

బిరుదు విశేషాలు : అష్ట భాషాధురీణుడు, చతుర్విధ కవితా వేది.

"సాహిత్యరాయ పెండేరము"నే బిరుదు అందెను కాలికి ధరించేవాడు.కవి ఎక్కువగా శ్రీకృష్ణుని గాథలనే ఇతివృత్తంగా తీసుకుని సంగీత, నృత్యానుగుణంగా రాశాడు. యక్ష గానాలను మార్గ రీతిలో మలచడం జరిగింది. ఇతని రచనలు చాలవరకు సంగీత, నృత్య నాటికలని చెప్పవచ్చును. ఇవి అతని ఆస్థానంలో ప్రదర్శింపబడుతుండేవి. ఇతని సాంగత్య రచనలు తెలుగు సాహిత్యంలో కొత్త ప్రక్రియ. ఇవి కన్నడంలో ఉన్నాయట. ఇతని రచనలలో పాత్రోచితమైన భాష, నాటి వివిధ వర్గాల సంభాషణ తీరుతెన్నులు కనిపిస్తాయి.

ఇతడు విలాస జీవి. విరతాన్న దానపరుపరుడని సమకాలీనుల కావ్యాలు చెప్తున్నాయి. ప్రతిదినం 50 వేలమంది బ్రాహ్మణులకు అన్నదానం చేసేవాడట. ఇతని

ఆస్థాన కవుల రచనలు చాలావరకు ఇతనికే అంకితం. (తం.ఆం.నా-253)
(ద.దే.వా-95; ఆధ్ర-11-33)

విజయ రాఘవ నాయకుని నాగపట్నం శాసనము

శాసనకాలం : క్రీ. శ. 15-9-1658.

భాష : తెలుగు (వచనం).

వేయించినవారు : తంజావూరు రాజైన విజయరాఘవ నాయకుడు.

ఈ శాసనం వెండిరేకు పైన చెక్కబడింది. ఇండోనీషియాలోని బటేవియా పురాతత్త్వ శాలలో ఈ రేకు భద్రపరుపబడి ఉన్నదట.

విషయం : విజయరాఘవుడు నాగపట్నంలోని డచ్చి వారికి (ఒలాందా వారికి) ఇచ్చిన కౌలు నమ్మిక శాసనం. భాష వ్యావహారిక సరళిలో ఉంది. పరంగి, కుంఫిణీ అనే పదాలు ప్రయుక్తాలు. పరంగి పదం ఇందులో పోర్చుగీసు వారికి వాడారు. తరువాతి కాలంలో ఫ్రెంచివారిని కూడా పరంగీలుగానే వ్యవహరించడం జరిగింది.
(ద. దే. వా-546)

విజయ రాఘవ వంశావళి

కర్త : చూ. చెంగల్వకాళ కవి.

కాళకవి రచించిన రాజగోపాల విలాస కావ్యంలో మొదట తంజావూరి నాయక రాజుల వంశ ప్రశస్తి విపులంగా ఉన్నది. దాన్నే విజయ రాఘవ వంశావళి అనే పేర పేరుగా ప్రకటించారు. (నాయకరాజుల గూర్చిన అనేక విశేషాలు దీన్నుండి తెలుస్తున్నాయి). (వ. దే. వా-117-119)

విజయ రాఘవ విలాసము

ఒక మందిరం. తంజావూరును పాలించిన విజయరాఘవ నాయకుని (1633-73) నాట్య సభకు ఈ పేరుండేది. అందులో స్త్రీలు రక రకాల సంగీత వాద్యాలు వాయిస్తుండే కొందరు బిరుదు పాత్రలు రక రకాల నాట్య విశేషాలను అభినయించే వారట చెంగల్వ కాళకవి తన రాజగోపాలవిలాసంలో ఈ మందిరాన్ని వర్ణించాడు.
(రా. గో. వి-1-23)

విజయ రాఘవాభ్యుదయము (అలభ్యం)

కర్త : మన్నారు దేవుడు (చూ)

కాలం : క్రీ. శ. 17వ శతాబ్దం.

తండ్రి, తాతల వృత్తాంతాలను కావ్యాలుగా మలచటం తంజావూరు నాయక రాజులలో కనిపిస్తుంది. అదే రీతి మన్నారు దేవుడు తన తండ్రియైన విజయరాఘవుని గురించి వ్రాసిన ఈ ప్రబంధం అతని రెండవ కృతి హేమాబ్జ నాయికా స్వయంవరంలో ప్రస్తావించబడింది. (ద. దే. వా-163-172)

విజయరామ గజపతి పట్టాభిషేక మహోత్సవ రామలీలా విలాసము

కర్త : చూ. పోడూరి వెంకట రాజకవి.

మూడాశ్వాసాలు గల శృంగార ప్రబంధం. విజయరామ గజపతి (క్రీ. శ. 1826–1879) పట్టాభిషేక మహోత్సవం, అనాడు జరిగిన శ్రీరామలీలోత్సవాదులు ఇందులో వర్ణించబడడం చేత దీనిని 'విజయరామ గజపతి పట్టాభిషేక మహోత్సవ రామ లీలా విలాసము' అనే పూర్తి పేరు పెట్టబడింది.

శ్రీరామ కథతో బాటు, విజయరామ గజపతి సుగుణసంపత్తి కూడా ఇందులో వర్ణితం. (అం.సం.సా–423)

**విజయ రామ శతకము**

కర్త : చూ. గోగులపాటి కూర్మనాథ కవి.

శతక రచన. ఇందలి మూడు పద్యాలు మాత్రమే లభ్యమైనాయట. ఇది పూసపాటి పెద విజయరామరాజు (1670–1756)పై రచింపబడిందని ఊహిస్తున్నారు. (అం.సం.సా–416)

**విజయలక్ష్మీ నరసింహ విలాసము**

రచనాకాలం : క్రీ.శ. 18 వ శతాబ్దం.
కర్త : వెలిచేరు వేంకటరామ ప్రధాని.

యక్షగానం. (య.వా.చ.)

**విజయ విలాసము**

రచనాకాలం : క్రీ.శ. 1616 ప్రాంతం.
కర్త : చేమకూర వేంకటరాజు.
కృతిపతి : తంజావూరును పాలించిన రఘునాథ నాయకుడు (1600–33).

ఇతివృత్తం : అర్జునుడు తీర్థయాత్రలకు బయలుదేరి ఉలూచిని, చిత్రాంగదను, సుభద్రను వివాహమాడడం.

దక్షిణాంధ్ర యుగానికి చెందిన కావ్యాలలో బహుళ ప్రచారం పొందిన ప్రబంధం. మూడు ఆశ్వాసాల కథ. మహా భారతంలోని అర్జున తీర్థయాత్ర కథ దీనికి మూలం అయినా కవి దీన్ని స్వతంత్ర కావ్యంగా తీర్చిదిద్దాడు. వేదం వేంకటరాయశాస్త్రి, ఒలుసు వేంకట రమణయ్య (ముకుర టీక), తాపీ ధర్మారావు (హృదయోల్లాసము) గార్ల వంటి సుప్రసిద్ధ పండితులు ఈ కావ్యానికి వ్యాఖ్యానాలు వ్రాసి ప్రచురించారు.

రస పుష్టి, జాతి వార్తా చమత్కారాలు, శబ్దాలంకారాలు ఇందులో కొల్లలు. తెలుగు వారి ఆచార వ్యవహారాలు, సంప్రదాయాలు విస్తరించి వర్ణించిన కావ్యం ఇది. ప్రతి పద్యంలోనూ చమత్కృతి వెల్లివిరుస్తుంది.

రఘునాథ నాయకుడు నేపాళ, చోళగులను జయించి తిరిగి వచ్చిన తర్వాత విజయ విలాస భవనములో ఈ కృతి సమర్పణ మహోత్సవం జరిగిందట. (ద.దే.వా–62)

**విజయ విలాసము (టీక)**

రచనాకాలం : క్రీ. శ. 1831 ప్రాంతం.

కర్త : జూలూరి అప్పయ్యశాస్త్రి (చూ).

చేమకూర వేంకటకవి విరచిత కావ్యానికిది మనోహరమైన వ్యాఖ్య. సుబోధకమైన వ్యావహారిక భాషలో ఉంది. (తె.సా.విమర్శ-91)

**విజయ విలాస వచనము**

కర్త : పాటూరి రంగాశాస్త్రులు.

రచనాకాలం : క్రీ. శ. 1841 ప్రాంతం.

వచనకావ్యం. చేమకూర వేంకటకవి రచించిన విజయ విలాస పద్యకావ్యాన్ని అనుసరించిన వచన రచన. ఈయన రంగస్వామిశాస్త్రుల సోదరుడు. (వ.వా.)

**విజయసేనము (అలభ్యం)**

కర్త : తిక్కన సోమయాజి.

రచనాకాలం : క్రీ. శ. 1248-63 నడుమ కావచ్చు.

ఇందులోవి కొన్నిపద్యాలు పెదపాటి జగ్గన, ఇతర లాక్షణికులు ఉదాహరించారు. ఇది నిర్వచనోత్తర రామాయణం కంటె ముందు రచన అని పరిశీలకులు భావిస్తున్నారు. (ఆరుద్ర-2)

**విజయాంక రక్షణుడు**

కాలం : క్రీ. శ. 1093 ప్రాంతం.

స్థలం : రాజమహేంద్రవరం ఇలాకా రావిమెట్ట.

రావిమెట్ట శాసనప్రదాత. ఈయన అత్తిలినాటికి (పశ్చిమ గోదావరి) రాజు. సకలేశ్వరస్వామికి అఖండదీపం నెలకొల్పి, దానాలు చేసి, శాసనం వేశాడు. (తె. క. చ-169)

**విజ్ఞానేశ్వరీయము**

కర్త : మూలఘటిక కేతన (చూ.)

రచనాకాలం : క్రీ శ. 13 వ శతాబ్దం పూర్వార్ధం.

ప్రత్యేకత : పద్యకావ్యం. ఇది తెలుగులో తొలి ధర్మశాస్త్ర గ్రంథం. యాజ్ఞవల్క్యస్మృతికి 'మితాక్షరి' అనేపేరుతో విజ్ఞానేశ్వరుడు వ్యాఖ్య వ్రాశాడు. ఈ వాఖ్యయే తెలుగులో విజ్ఞానేశ్వరీయంగా వచ్చింది. పేరుకు అనువాదమైనా ఇది స్వతంత్ర గ్రంథమన్నంత జాతీయాలతో, నుడికారపు సొంపుతో ఉంది. ఈగ్రంథంవల్ల అనాటి ఆచార వ్యవహారాలు తెలుస్తున్నాయి. (ఆరుద్ర-2)

**విజ్ఞానేశ్వరీయము**

కర్త : చూ. కొటికెలపూడి వేంకటకృష్ణ సోమయాజి.

ఆంధ్రీకృత వచన అయిదు అధ్యాయాలున్నాయి. కవి ఇనుగంటి సీతారాయని ప్రేరణతో ఈ రచన ప్రారంభించాడట.

ఆచార, ప్రాయశ్చిత్త, వ్యవహారాలు అనే మూడు కాండలు గల యాజ్ఞవల్క్యస్మృతి ప్రాచీన ధర్మశాస్త్రం. దీనికి విజ్ఞానేశ్వరుడు 'మితాక్షరి' అనేవ్యాఖ్య వ్రాశాడు. అదే 'విజ్ఞానేశ్వరీయము' అని ప్రసిద్ధిచెందింది. ఈ "విజ్ఞానేశ్వరీయము" అనే శాస్త్రగ్రంథాన్ని కవి తెలుగులోనికి అనువదించాడు. (ఆం. సం. సా-303)

**విట్ఠలరాజు (విఠ్ఠలరెడ్డి)**

కాలం : క్రీ. శ. 1291-1323 ప్రాంతం.

రచన : రంగనాథ రామాయణము (ఉత్తర భాగం).

ఇతడు రంగనాథ రామాయణం (ద్విపద) పూర్వభాగ కర్తయైన బుద్ధరాజు కొడుకు. ఉత్తర భాగం సోదరుడు కాచభూపతిలో కలిసి వ్రాశాడు. కాకతి రెండో ప్రతాపరుద్రుని సమకాలికుడు గాని, ఆ తరవాత కాలం వాడు కాని కావచ్చు.

విశిష్టత : తండ్రి బుద్ధభూపతి అనతి మీద రామాయణ ఉత్తర భాగాన్ని ద్విపదలో వ్రాశాడు. (ఆరుద్ర-3)

**విట్ఠల వెర్రమంత్రి**

కాలం : తెలియదు.

ఈయన త్యాగధనుడని తెలిపే ఒక చాటువును గుండభట్టు నారాయణ కవి చెప్పాడు. (చా.ప.ర.)

**విద్దన మల్లన శాసనము**

కాలం : క్రీ. శ. 1151 ప్రాంతం.

శాసన ప్రదాత : విద్దన ప్రెగ్గడ కుమారుడు మల్లయ ప్రెగ్గడ.

ప్రస్తావిత స్థలం : ప్రేంపల్లి భావనారాయణస్వామి దేవాలయం.

శాసన విషయం : శాసన ప్రదాత తండ్రియైన విద్దన ప్రెగ్గడ-త్రిభువన మల్లదేవ పొత్తపి చోడ మహారాజుకు రాజ్యాధ్యక్షుడనీ, మల్లన కమ్మనాటిలోని ప్రేంపల్లెలో వేంచేసిన భావనారాయణ స్వామికి అఖండదీపం నిలిపినట్లు ఈ శాసనం వల్ల తెలుస్తున్నది. దీనిలో 2 కంద పద్యాలు, ఒక చంపకమాల, చివర గద్య ఉన్నాయి. (తె. క. చ-258)

**విద్యానాథుడు**

కాలం : క్రీ.శ. 1291-1323 ప్రాంతం.

స్థలం : వరంగల్లు.

రచన : ప్రతాపరుద్ర యశోభూషణమ్ (సంస్కృతం).

కృతిభర్త : కాకతి రెండో ప్రతాపరుద్రుడు (1291-1323).

కాకతి రెండో ప్రతాపరుద్రుని ఆస్థానంలోనివాడు.

విశిష్టత : సంస్కృతాలంకార శాస్త్ర గ్రంథాలలో ప్రామాణిక గ్రంథకర్త. అనంతర సంస్కృతాలంకారశాస్త్ర గ్రంథకర్తలు శాయన, విశ్వేశ్వరుడు, సర్వజ్ఞ సింగభూపాలుడు ఈ కవిని అనుసరించారు. (ప్రా.ద.దే.చ.)

విద్యా పరిణయము

కర్త : వేదకవి.

కాలం : క్రీ.శ. 18 వ శతాబ్దం.

సాంకేతిక నాటకంగా ప్రసిద్ధం. ఏడు అంకాలున్నాయి. ఆత్మకు, విద్యకు జరిగే వివాహం ఇతివృత్తం. (తె.వి.స-6-241)

విద్యారణ్యుడు

నామాంతరం : మాధవాచార్యుడు.

కాలం : క్రీ.శ. 1296-1386 ప్రాంతం.

స్థలం : విజయనగరం.

రచనలు : 1. పరాశరమాధవమ్ (సం) 2. కాల మాధవమ్ (సం) 3. జైమినీయ న్యాయమాలా విస్తరమ్(సం) 4. పంచదశి (సం) 4. జీవన్ముక్తి వివేకమ్ (సం) 6. వివరణ ప్రమేయ సంగ్రహమ్ (సం) 7. అనుభూతి ప్రకాశమ్ (సం) 8. అపరోక్షానుభూతి (సం) 9. బృహదారణ్యక వార్తిక సారమ్ (సం) 10. ఐతరీయోపనిషద్దీపిక (సం) 11. తైత్తిరయోపనిషద్దీపిక (సం) 12. ఛాందోగ్యోపనిషద్దీపిక (సం) 13. సర్వదర్శన సంగ్రహమ్ (సం) 14. శంకర విజయమ్ (సం) 15. సంగీత సారమ్ (సం).

ఈయన విజయనగర రాజ్య సంస్థాపకులైన హరిహర, బుక్కరాయలలకుగురువు పూర్వాశ్రమంలో ఈయన పేరు మాధవాచార్యుడు. ఈయన హరిహర బుక్కరాజాదులను ప్రోత్సాహించి, హిందూధర్మ రక్షణకై సన్నద్ధులను చేశాడు. మొదట హరిహరునకు కులగురువై, ముఖ్యమంత్రియై తుంగభద్రా తీరంలో విజయనగర రాజ్య సంస్థాపనకు విద్యానగర నిర్మాణానికీ కారణభూతు డయ్యాడు. హరిహరుని తరువాత బుక్కరాయలకు ప్రధానమంత్రి అయ్యాడు. ఆ కాలంలోనే ఈయన చాలగ్రంథాలు వ్రాశాడు. కాశికి పోయి, మళ్ళీ రాజు కోరికపై విజయనగరానికి తిరిగి వచ్చాడు.

ఈయన అసాధారణ ప్రతిభా సంపన్నుడు. మీమాంసా జ్యోతిష, ధర్మశాస్త్ర, వేదాంతాలలో మంచి గ్రంథాలు వ్రాశాడు. ఈయన శంకరమతానుయాయి. అద్వైత సంప్రదాయానికి ఈయన ప్రధానాచార్యు డంటారు. (తె.వి.స-4)

విద్యావతీ దండకము

నామాంతరం : చండ విద్యావతీ దండకము.

కర్త : గణపవరపు వేంకటకవి.

అంకితం : ముద్దళఘరి నృపాలునకు (క్రీ. శ. 1675-78).

విద్యావతి అనే ఆటవెలది మీద చెప్పిన దండకం. దీన్ని కవి "పుష్పకో దండకం" అన్నాడు. కవి కాలనిర్ణయానికి ఈ దండకం చాలా ఉపయోగించింది. దీన్ని 1948 లో మద్రాసు ప్రాచ్య లిఖిత గ్రంథాలయం వారు ప్రకటించారు.

(ఆరుద్ర_11_167; ద.దే.వా_326)

## విద్యుత్ప్రభా విలాసము (అలభ్యం)

కర్త : తక్కెళ్ళపాటి లింగన,

యక్షగానం. 'విద్యుత్ప్రభా విలాసమ్ము వేడ్కఘటియించితిని యక్షగానరీతి అని కవి ఉత్తర హరిశ్చంద్ర కథలో చెప్పాడు. (య.వా.చ.)

## విద్వత్కర్ణామృతము

నామాంతరం : సుబ్రహ్మణ్య విజయము.

కర్త : త్యాగరాజ మొదలి.

అయిదాశ్వాసాల ప్రబంధం. హృద్యమైన రచన. భక్తిరస స్ఫోరకమైన ఇతివృత్తం. (వీరేశలింగం పంతులు – సమగ్ర పరిశీలన)

## విద్వత్కవి కర్ణరసాయనము

నామాంతరం : సకల వర్ణనా పూర్ణ రామాయణము.

కర్త : చిత్రకవి వేంకట రమణకవి (చూ).

## విద్వత్కుమార యాచేంద్రులు

నామాంతరం : వెలుగోటి సర్వజ్ఞ కుమారయాచమ నాయడు (క్రీ. శ. 1695_1748).

## విద్వన్మనోరంజని

కర్త ; (వే)లేములవాడ సోమనాథకవి.

కాలం : క్రీ శ. 1650 ప్రాంతం.

అంకితం : వే(లే)ములవాడలోని రాజేశ్వరస్వామికి.

ఇది వసుచరిత్రకు వ్యాఖ్యానం. (క. స_305)

## వినుకొండ

ఇది గుంటూరు జిల్లాలోని గిరిదుర్గం. తొలుత కొండవీటిరెడ్ల అధీనంలో ఉంది. క్రీడాభిరామకర్త వినుకొండ వల్లభరాయనిది ఈఊరేనని పండితనిర్ణయం. 32 మంది మంత్రులలో దానానికి పేరుపొందిన "రాయనభాస్కరుడు" వినుకొండవాడట. ఈయనను నుతిస్తూ కొన్నివందల చాటువులున్నాయి. కొండవీటి రాజ్యపతనానంతరం ఈదుర్గంకూడా విజయనగరరాజుల వశమైపోయింది.

వినుకొండ వైభవాన్ని, ఈస్టిండియాతంపెనీ ప్రభుత్వంతో పోల్చి చెప్పిన చాటుపుఒకటి దొరికింది. కవిపేరు, వివరాలు తెలియవు.

ఇది కొందరికి ఇంటిపేరుగా ఉంది. (చా. ప. ర.)

## వినుకొండ వల్లభరాయడు

కాలం : క్రీ. శ. 1380–1430 ప్రాంతం.
రచన : క్రీడాభిరామము (కర్తృత్వం వివాదగ్రస్తం).
స్థలం : వినుకొండ.

ఇతడు మోపూరు పాలకుడు. శ్రీనాథునితోడ్పాటుతో క్రీడాభిరామం వ్రాశాడని పండితాభిప్రాయం. క్రీడాభిరామ అవతారికా పద్యాలనుబట్టి కర్త వల్లభరాయడే అని కొందరు నిర్ణయించారు. పద్యాలలో శ్రీనాథుని పద్యాలముద్ర కనిపిస్తుంది కాబట్టి శ్రీనాథుడే క్రీడాభిరామకర్త అని కొందరు పండితులు అభిప్రాయపడ్డారు. శ్రీనాథుడు కర్ణాటక రాజ్యసంచారం చేస్తున్నకాలంలో వల్లభరాయడు ఈ రచన చేశాడనీ, అతడు వ్రాసిన ప్రతిపద్యాన్నీ శ్రీనాథుడు సంస్కరించాడనీ మరికొందరంటారు.

ఇతరరచనలు తెలియరాలేదు (తె. వి. స–6) (అరుద్ర–4)

## విన్నకోట పెద్దన

కాలం : క్రీ. శ. 15 వ శతాబ్ది పూర్వార్ధం.
స్థలం : సర్వసిద్ధి (ఎలమంచిలి), తాలూకా విశాఖజిల్లా, కళింగాంధ్రదేశం.
రచన : కావ్యాలంకార చూడామణి

చాళుక్య విశ్వేశ్వర భూపతి ప్రోత్సాహంతో కవి రచనలు చేశాడు. విశ్వేశ్వర భూపతి ధైర్యసాహసాలను చిత్రిస్తూ కవి వ్రాసిన సంస్కృతశ్లోకం "పంచధార్ల" శాసనంలో ఉంది అదే శ్లోకం తెలుగుపద్యంగా ఇతనిగ్రంథంలో కనిపిస్తుంది.

ఇతని నివాసం రాజమహేంద్రవరమై ఉండవచ్చునని కొందరి తలంపు. కావ్య గుణాలను, అలంకారాలను పెద్దన తనగ్రంథంలో చూపాడు. (రె. రా. చ)

## విన్నపము

ఇదిఒక గద్యభేదం. ప్రసిద్ధులైన తాళ్ళపాక కవులకాలంనుంచి పరిగణింపబడుతూ వస్తున్నది (చూ–పెదతిరుమలయ్య వైరాగ్య రచనమాలికాగీతములు). అత్యంతాలతో సంబద్ధులతో నడుమ ఒకభక్తుడు భగవంతునిగురించిగాని, భృత్యుడు స్వామినిగురించిగాని చేసేవిన్నపం విషయప్రధానంగా–ఒకవిధమైన ఒడుపుతో, తూగుతో నడిచేరచన. విజయ రాఘవుని యక్షగానాలలో (కాళీయమర్దనం) దీనికెక్కువ ప్రాధాన్యం ఉంది.

(య. వా. చ–272)

## విప్రనారాయణ చరిత్ర

రచనాకాలం : క్రీ. శ. 1545 ప్రాంతం.
కర్త : చక్రిపురి రాఘవాచార్యులు.
యక్షగానం.

ప్రత్యేకత : యక్షగానాలపై పరిశోధనలుజరిపిన పండితులు, ఈ యక్ష గానాన్ని చక్రపురి రాఘవాచారి వ్రాశాడన్నారు. ఈగ్రంథకర్త క్రీ. శ. 1545 ప్రాంతంలో

నివసించిఉంటాడని, కందుకూరి రుద్రయ్యకంటె పూర్వుడని, సుగ్రీవవిజయం కంటె విప్రనారాయణచరిత్ర ప్రాచీనమనీ, తొలి యక్షగానకర్త రాఘవాచారి అనీ కొందరి అభిప్రాయం. ఈకావ్యం సలక్షణంగానేఉంది. అంత ప్రౌఢంగాలేదు. మద్రాసు ప్రాచ్య లిఖిత గ్రంథాలయంలో దీని ప్రతి ఉందంటారు. (ఆరుద్ర-9)

విప్రనారాయణ చరిత్ర

కర్త : చూ. చదలువాడ మల్లన్న.

అంకితం: తిరుమలరాజు (కార్వేటి సంస్థానపాలకుడు)కు.

ఐదాశ్వాసాల పద్యకావ్యం. ఇది వైష్ణవాచార్యుడైన విప్రనారాయణునికథ. సారంగుతమ్మయ-ఇతడూ ఇంచుమించుగా సమకాలికులు. అతని వైజయంతీవిలాసంలోనూ మల్లన విప్రనారాయణచరిత్రలోనూ కథఒకటే. ఈరెండింటికీ మూలం "పరమయోగి విలాసము" (తాళపాక చిన్నన్న) అని అంటారు.

తెలుగులోని విప్రనారాయణచరిత్రలలో మల్లనరచన విశిష్టమైనది. కథా సన్నివేశకల్పనలో అనేకచోట్ల మల్లన్న మిగతావారికంటె వేరుగావ్రాశాడని విమర్శకుల అభిప్రాయం. విప్రనారాయణుని సహజభక్తి వైరాగ్యాలను మల్లన మూలానుసారంగా చూపాడు. విప్రనారాయణుని దృఢచిత్తునిగా చెప్పిన చిన్నన్న ద్విపదకావ్యానికీ ఇతని కథకూ పోలిక ఎక్కువ. (ఆరుద్ర-8-157)

విప్రనారాయణ చరిత్ర

కర్త : పిడుగు వేంకటకవి (చూ)

వివరాలు తెలియరాలేదు. అసమగ్రప్రతి ఒకటి తంజావూరు పుస్తకశాలలో ఉండేదట. (ద. దే. వా-385)

విప్రనారాయణ చరిత్ర

కవి : విజయ రాఘవుడు.

అంకితం : రాజగోపాలునికి.

రచనాకాలం : క్రీ శ. 1652 ప్రాంతం.

యక్షగాన నాటకం.

ఇది పన్నిద్దరాళ్వారులలో ఒకడైన తొండరడిప్పొడియాళ్వారుచరిత్ర. ద్రావిడ దివ్యప్రబంధం, సంస్కృతంలోని దివ్యసూరిచరితం మొదలైనవానిలో ఈకథ ఉంది.

తెలుగులో దీన్ని ఇంతకుముందు చాలామంది ద్విపదగాను, ప్రబంధంగాను, యక్షగానంగానురాశారు. మూలకథకు తెలుగుకవుల రచనలకు కొంత వ్యత్యాసంఉంది. అయితే విజయరాఘవుని రచన ఈ అన్నింటికీ భిన్నంగా ఉంటుంది.

కథావృత్తాంతం విజయరాఘవుని సమక్షంలోనే జరిగినట్లు కవి వర్ణిస్తాడు. కథ శ్రీరంగంలోకాకుండా దక్షిణద్వారక అనబడే మన్నారుగుడిలో జరిగిందనీ, చోళరాజు విజయరాఘవుడే అన్నట్లూ, దేవదేవి విజయరాఘవునిఎదుట నాట్యంచేసి, ఆతర్వాత

విప్రనారాయణుని చూసినట్లూ, విప్రనారాయణుడు దొంగిలించిన బంగారుగిన్నె నేరవిచారణలో విజయరాఘవుడే చేసినట్లు ఈ రచనలో ఉంది.

పాత్రోచిత సంభాషణలున్నాయి. దేవదేవి విప్రనారాయణులు తొలిసారి కలుసుకొన్నప్పుడు సంస్కృతంలో సంభాషించడం, కొన్నిపాత్రలు తమిళంమాట్లాడటం ఈనాటక ప్రత్యేకత. (ద. దే. వా. 99_102

## విప్రనారాయణుడు

"తొండరడి ప్పొడి యాళ్వార"ని నామాంతరం.

పన్నిద్దరాళ్వారులలో ఒకడు. వైష్ణవ భక్తుడు. కావేరీ తటంలోని "మండ గుడి" అగ్రహారం ఇతని నివాస స్థలం.

వైష్ణవ సాంప్రదాయిక రచనల ప్రకారం ఇతడు క్రీ. శ. 3000 సం॥లకు పూర్వం వాడని తెలుస్తున్నది. కాని, ఆధునిక పరిశోధకులు క్రీ. శ. ఏడవ శతాబ్దంలోని వాడని నిర్ణయించారు.

దివ్యసూరి చరిత్రము, ప్రపన్నామృతము, గురుపరంపరా ప్రభావం మొదలగు ప్రాచీన సంస్కృత రచనల్లో ఈ పన్నిద్దరాళ్వారుల చరిత్ర విపులంగా వర్ణించబడింది.

వైజయంతీ విలాసకర్త అయిన "సారంగు తమ్మయ" సంస్కృతంలోని "ప్రపన్నామృత" రచనాధారంగానే ఈ రచన చేసినట్లు తెలుస్తున్నది. "వైజయంతీ విలాసం"లోని కథానాయకుడు "విప్రనారాయణుడు". ఇతడు పురాణపురుషుడూ కాడు, కల్పిత పురుషుడూ కాదు మానవ లోకంలో అందరిలా పుట్టి పెరిగిన సాధారణ మానవుడు కాని మహాభక్తి తత్పరుడు కావడంచేత, భగవద్దర్శనం పొందినవాడవడం చేత 'ఆళ్వారులు'లో ఒకడైనాడు.

విప్రనారాయణునికి "తొండరడిప్పొడి యాళ్వార"ని పేరు. తొండరడిప్పొడి అనేది ద్రావిడ భాషాపదం. "పాదాంఘ్రిరేణువు" అని అర్థం. వైష్ణవులకు వినయం, భక్తి చాలా ప్రధానమైన విషయాలు. "ఆచార్య సూక్తి ముక్తావళి" వంటి ఉత్తమ రచనలు చదివితే ఈ విషయం అవగతమవుతుంది. మహాభక్తుడైన ఈ నారాయణుడు భక్తులైన పెద్దలకు నమస్కరిస్తే మీ "పాదాంఘ్రిరేణువును" అనే వాడట కాబట్టి ఇతనికి తొండరడిప్పొడి అనే పేరు సార్థకమైంది.

ఇతడు వైజయంతీ మాలికాంశలో పుట్టాడు. శ్రీ మహావిష్ణువు మెడలో ధరించే మాలికకు "వైజయంతి" అనే పేరు. కావేరీ తటంలో వెలసిన శ్రీరంగనాథుడికి రోజూ పూలమాల అల్లి సమర్పించడం ఇతని దిన చర్య కాబట్టి రంగనాథుని ఆలయ ప్రాంగణంలోనే పశ్చిమము వైపున ఒక పూదోటను ఏర్పరచుకున్నాడు. ఇతనికి స్వామి కైంకర్యం తప్ప వేరు పనిలేదు బ్రహ్మచారి. నిష్ఠాగరిష్ఠుడు

ఆ పట్టణంలోనే "దేవదేవి" అనే వేశ్య ఉంటుంది ఒకనాడామె ఈ పూదోటలో విశ్రాంతికై ఆగింది. అటుగా పెత్తున్న విప్రనారాయణునికి నమస్కరించగా అతను

అన్యమనస్కుడై ఉండడంచేత ఈ విషయాన్ని గ్రహించడు. దానివల్ల దేవదేవికి పంతం పెరిగింది. తన సోదరితో పందెం వేసుకుంటుంది. మహా నిష్ఠాగరిష్ఠుడైన ఈ బ్రహ్మచారిని విటుడిని చేయడమే ఆ పందెం యొక్క ఫలితం. దేవదేవి సౌందర్యవతి. జాణ. తన చాకచక్యంతో విప్రనారాయణున్ని తన దాసునిగా చేసుకుంటుంది. దీనికి వెనుక 'జగన్నాటక సూత్రధారి' హస్తం ఉంది. అదే ముఖ్యకారణం.

నిర్ధనుడైన విప్రనారాయణుని వేశ్యమాత పరాభవించి, ఇంటినుండి వెడల గొట్టింది. భక్తుని మొరనాలకించి "రంగనాథుడే" స్వయంగా ఆలయంలోని బంగారు పాత్రను దేవదేవికి సమర్పిస్తాడు. విప్రనారాయణునికి తిరిగి వేశ్యా గృహంలో ప్రవేశం లభిస్తుంది.

విప్రనారాయణునికి ఈ విషయం తెలియదు. కాని రాజభటులు పాత్రను చౌర్యం చేసిన వానికొరకు వెదకి ఈతడిని బంధిస్తారు. నిండు సభలో కఠిన శిక్ష విధింప బడుతుంది. కాని, ఇంతలో శ్రీరంగనాథుడు ప్రత్యక్షమై అతడు నిర్దోషియని సభకు తెలిపి అందరూ చూస్తుండగా అతనిలోనే లీనమై పోతాడు. అప్పటినుండీ ప్రజలీతనికి బ్రహ్మ రథం పట్టి గౌరవిస్తారు.

ఇది విప్రనారాయణుని చరిత్ర. విప్రనారాయణుడే స్వయంగా తన చరిత్రను గ్రంథస్థం చేశాడు. దానికి "తిరుప్పళ్ళియెళుచ్చి" అని పేరు. ఇది వైష్ణవులకు విశ్వాసు సంధానం. అత్యంత ప్రాముఖ్యం కలిగినది. శ్రీ వైష్ణవ క్షేత్రాలలో ఇది చదివిన తరు వాతనే గర్భగుడి తలుపులు తెరచి స్వామి అర్చనాది కార్యక్రమాలు జరుపుతారు.

ఒక దృష్టితో పరిశీలిస్తే విప్రనారాయణుడు నిర్దోషి. లౌకిక వ్యవహారాలకు దూరంగా ఉంటూ, భగవత్సేవతో పొద్దుపుచ్చే అమాయకపు బ్రహ్మచారి. అకస్మాత్తుగా ఆపద సంభవించింది. లౌక్యం తెలియక దేవదేవికి చేరువైనాడు. అది క్రమంగా కామాన్ని ప్రేరేపించింది. పైగా దేవదేవి ప్రతిజ్ఞ చేసినట్లు ఇతనికి తెలియదు. ముందే తెలిసినట్లైతే కొంత జాగ్రత్తపడేవాడేమో. దేవదేవికి ఇతన్ని పతితుని చేయడమే ప్రత్యేకమైన పని. కుటిలత్వంతో వంచించింది. తెలియక చేసినప్పటికి చేసిన కర్మ అనుభ వించక తప్పదు.

ఇతని జీవితంలో ఇదొక విచిత్రమైన దుర్ఘటన. మానవంతులు ఇట్టి దుర్ఘట నల తరువాత వివేకవంతులై ఉదాత్త చరిత్రలకు ఉద్యమిస్తారు. విప్రనారాయణుడూ అలాగే చేశాడు. ఎంత వినయ విధేయతలను నటించినప్పటికీ, దుష్టులను తగు దూరంలో ఉంచాలనే నీతి ఈ చరిత్ర ద్వారా తెలుస్తుంది. ఎంతటి వ్యక్తికైనా బ్రహ్మచర్య, గార్హస్థ్య, వానప్రస్థాశ్రమాలను నియమానుసారం పాటించనిదే మోక్షం ప్రాప్తించదు.

దేవదేవి ఇతనిపై విజయం సాధించింది. దేహాభిమానాలను నివేదన చేసి, కడుదీనావస్థకు లోనై సాధించిన ఆమె విజయం తాత్కాలిక విజయం మాత్రమే. ఈ సంఘటన ద్వారా విప్రనారాయణుడి జీవితంలో అమూల్యమైన మలుపు వచ్చింది. అట్లే

ద్ధరణ జరిగింది మానవుడికి ఆక్రోశము, ఆవేదన, భగవద్గుణానుసంధానము మొదలగు క్రియా విశేషాలు రేకెత్తి, నశించిన తరువాతనే ఆత్మోద్ధరణ కలుగుతుందనే పరమ సత్యాన్ని ఈ భక్తుడి జీవిత చరిత్ర చాటి చెప్తున్నది.

ఈ కథను తెలుగులో చాలమంది కావ్యాలుగా, నాటకాలుగా, యక్షగానాలుగా వ్రాశారు. ఒక్కొక్క రచనలోనూ స్వల్పమైన భేదాలు కనిపిస్తాయి పాత్రచిత్రణలో సన్నివేశ కల్పనలలో భేదాలు ఉన్నా విప్రనారాయణుని పాత్ర అలౌకికమైన భక్తి భావానికి ప్రతీకగా ఉంటుంది.

## విప్రవినోదులు-గారడీ విద్య

కాలం : విజయనగర రాజుల కాలం.

చారిత్రకంగా ఈ గారడీ విద్య క్రీ. శ. 15-17 శతాబ్దాల నడిమి కాలంలో బహుళ వ్యాప్తిలో ఉన్నది. విప్రవినోదులు విజయనగర రాజుల కాలంనుంచే గారడీ విద్యలో ప్రవీణులుగా ఉండేవారు. విప్రులంటే బ్రాహ్మణులని, వారు గారడీ చేసి ప్రసిద్ధులు కావటం వల్లనే వీరికి విప్రవినోదులని, వీరి విద్యకు విప్ర వినోద విద్య అనీ పేర్లు వచ్చాయని కొందరి అభిప్రాయం. వీరు బ్రాహ్మణులలో ఒక జాతి బ్రాహ్మణులని, దేవతోపాసన, మంత్ర తంత్రాలవల్ల గారడీ విద్య ప్రదర్శిస్తుంటారన్నది కూడా వండితాభిప్రాయమే. గుంటుపల్లి ముత్తరాజు అనే విప్ర వినోది గోలకొండ నవాబుల టవరి కాలంలో ఉన్నట్లు, ఆయన గురించి ఒక చాటువుఉన్నట్లు సురవరం ప్రతాపరెడ్డి తమ ఆంధ్రుల సాంఘిక చరిత్రలో చెప్పారు.

ఇక ఆధునిక కాలంలో ఈ విప్రవినోదులనేవారు ఆంధ్రదేశం అంతటా ఉన్నట్లు ఆధారాలున్నాయి. తెలంగాణాలోని కరీంనగర్ జిల్లా మాణిక్యాపురంలోను, పశ్చిమ గోదావరి జిల్లా కొవ్వూరు తాలూకా బందపురంలోను, గుంటూరు తాలూకా వెంగళాయ పాలెంలోనూ ఉన్నట్లు రూఢిగా తెలుస్తున్నది. వీరి వృత్తి అన్ని జాతులవారిని యాచించుటమే.

గారడీవిద్య: ఇంద్రజాల ప్రదర్శనం విప్రుల ఇళ్ళలోనూ, బహిరంగ ప్రదేశాలలో జరుగుతుండేది. ప్రదర్శన సామగ్రి 5 లేక 6 శాలువాలు, ఒక్క కొయ్య అలమారా, ఒక తాళపత్ర గ్రంథం, రెండు ఇతల తాళాలు. ప్రదర్శన చిన్న పందిరి క్రింద జరుగుతుంది. పందిరి చుట్టూ శాలువలు కడతారు. తెరల మధ్యలో ఖాళీ అలమారా ఉంచుతారు. ఇద్దరు వ్యక్తులు చేరి ఒక ప్రక్కనుంచొని తాళాలు వాయిస్తారు ఇంతలో ప్రేక్షకులు వస్తారు. తెరలన్నీ ఎత్తి ఖాళీ అలమారా చూపుతారు. తరవాత దళనాయకుడు ప్రాచీన తాళపత్ర గ్రంథంతో తెరల మధ్యకు వెళతారు ఒక పావుగంటవరకు ఆయన బయటకు రాడు. ఈలోగా భజన జరుగుతూనే ఉంటుంది.

తరవాత తెరను తొలగిస్తారు. అది వరకు ఖాళీగా ఉన్న అలమారాలో దేవతా విగ్రహాలు, దీపారాధన చేసే కుందులు, పువ్వులు, కాయలు, పిండివంటలు, గంట,

శంఖు, వివిధ పూజా పాత్రలు ప్రత్యక్షమవుతాయి. ప్రదర్శన ప్రేక్షకులను ఆశ్చర్య చకితుల్ని చేస్తుంది.

చివరలో-విప్రవినోదులు ఇంటింటికీ తిరిగి యాచించేటప్పుడు విగ్రహాలు, కప్పలు, చిలకలు, విభూతి మొదలైన వాటిని తమ అరచేతిలో సృష్టించి ఇంద్రజాల మహేంద్రజాల విద్యను ప్రదర్శిస్తారు.

ఈనాటికీ తెలుగు దేశపు గ్రామ సీమలలో నివసించే విప్రవినోదులు కొందరు గారడీ విద్యను, గొల్లకలాప, యక్షగానాదులను ప్రదర్శించి జీవిస్తున్నారు.

(నా. ర. చ-89&284)

**విబుధానందమ్ (సం)**

కర్త : వేలాల మహదేవసూరి.

చూ. నీలకంఠ విజయచంపూ వ్యాఖ్య.

**విభక్తి కాంతావిలాసము**

రచన : కంఠీరవ రాజు (చూ).

కాలం : క్రీ. శ. 17వ శతాబ్దం, 18వ శతాబ్ది పూర్వార్థం.

సంగీత నృత్యభరితమైన రచన. ఉదాహరణ రచన కావచ్చునని విమర్శకుల అభిప్రాయం. (ద.దే.వా-451)

**విభక్తిబోధిని**

కాలం : క్రీ.శ. 19వ శతాబ్ది.

కర్త : పరవస్తు చిన్నయసూరి.

విభక్తుల గురించి బోధించే వ్యాకరణ గ్రంథం. (రమణీయం పీఠిక)

**విభక్తి విలాసము**

కర్త : నడిమింటి సర్వమంగళేశ్వర శాస్త్రి.

రచనాకాలం : క్రీ. శ. 18, 19వ శతాబ్దాల నడిమికాలం.

విభక్తి చమత్కృతులను చూపే గ్రంథం.

**విభావసి**

అల్లసాని పెద్దన రచించిన మనుచరిత్రలోని పాత్ర. మనుచరిత్ర ఆంధ్ర పంచ కావ్యాలలో ఒకటి. ఈమె విద్యాధరుడైన మందారుని పుత్రిక. పక్షుల, మృగాల భాషలు నేర్చినది. మనోరమకు చెలికత్తెగా వర్తించి ఋషి శాపవశాత్తూ క్షయరోగి అయినది. మనోరమ కోరిక మేరకు శాపవిముక్తి కలిగించిన స్వరోచిని వివాహమాడినది. ఈమె పుత్రుడు మేరునందనుడు. స్వరోచిని సకల కళాపూర్ణునిగా తీర్చిదిద్దడంలో అతనికి ఒక్కొక్క విద్యలో నిష్ణాతలైన వారిని భార్యలుగా కవి కల్పించాడు. స్వరోచి ఈమె నుండి మృగ, పక్షి భాషలను అర్థం చేసుకొనే విద్యను గ్రహించాడు. (మనుచరిత్ర)

విభీషణ బుద్ధి

కర్త : తెలియదు.

ద్విపద కావ్యం. గ్రంథం తుది, మొదలు లేవు. ఇది ఏదైనా ద్విపద రామాయణంలోని భాగం కావచ్చు. విభీషణుడు, ఇతరులు రావణునికి హితం చెప్పడం ఇందులోని విషయం. రావణుని తల్లి రావణునికి బుద్ధిచెప్పి అతడు వినకపోవడంతో సభాస్థలి నుండి లేచి వెళ్ళిపోవడంతో గ్రంథం ముగుస్తున్నది ఈ రచన ఇంతవరకే లభించింది.

ఈ ప్రతి తంజావూరు సరస్వతీ మహాలు గ్రంథాలయంలో ఉంది.

(ద్వి. సా. చ-212)

విభూతి మాహాత్మ్యము (అలభ్యం)

రచనాకాలం : క్రీ. శ. 18 వ శతాబ్దం.

కర్త : పోచిరాజు వీరన్న.

విమర్శ

కావ్య పరిభాష. ఒక గ్రంథం గురించి పరామర్శ చేయటం; విచారణ చేయటం అనే అర్థంలో వాడుకలో ఉంది. పూర్వోత్తర పక్షాలతో విషయాన్ని పూర్తిగా సమీక్షించడం విమర్శ అవుతుంది (చూ. భాష్యము). (బ్రౌన్-తెలుగు-ఇంగ్లీషు)

విమలాంగీ పరిణయము

కర్త : చూ. కొట్ర బాలకవి

అంకితం : వేంకటేశ్వర స్వామికి.

రెండాశ్వాసాలు గల ప్రబంధము.

ఇతివృత్తం : మాంధాతృచక్రవర్తి కుంతల దేశాధీశుని కుమార్తె అయిన విమలాంగిని పరిణయ మాడిన కథ.

ఈ గ్రంథం పూర్తిగా లభించలేదు. ఎన్ని ఆశ్వాసాలు ఉన్నాయో గాని లభించినవి మాత్రం రెండు ఆశ్వాసాలే. అందులో నాయికా శీతలోపచారాలూ, జలక్రీడల వరకు ఉంది. (ఆం.సం.సా-301)

వియన్నదీ పరిణయము

రచనాకాలం : క్రీ. శ. 17 వ శతాబ్దం.

కర్త : వెలిచేరు వేంకటరామ ప్రధాని.

విరాట పర్వము

కర్త : తెలియదు.

కథ ప్రసిద్ధం. మంజరీ ద్విపదలో ఉంది. కౌరవ పాండవుల జూదం, పాండవుల అరణ్యాజ్ఞాతవాసాలు సూచించినతర్వాత పాండవులు విరాటుని దర్శించడంతో

గ్రంథం ఆరంభమైంది. ఉత్తరా వివాహ ఘట్టంతో కథ ముగిసింది వర్ణనలు ఎక్కువ లేవు. రచన సంక్షేపంగా ఉంది.

**విరాటము (అలభ్యము)**

కర్త : లింగమకుంట సర్వకవి (సర్వదేవుడు).

ప్రత్యేకత : కావ్యం దొరకలేదు. సర్వకవి, తెనాలి రామకృష్ణునికి అల్లుడయిన లింగమకుంట రామయ్యకు తాత అట. అజ్ఞాత గ్రంథ సంకలన కర్తపై కావ్యంలో నుంచి ఒక పద్యాన్ని ఉదాహరించాడు. లింగమకుంట సర్వన్న, ఎడపాటి ఎర్రన (మల్హాణ చరిత్ర కర్త) నుతించిన సర్వదేవుడు ఒకరేననీ- భిన్నులనీ పండితుల మధ్య భేదాభిప్రాయాలున్నాయి. ఇందులోని ఇతివృత్తం మహా భారత విరాట పర్వం కావచ్చును. (ఆరుద్ర-8-131)

**విరాళి పదము**

గీత ప్రబంధం. ఇది బలభద్రదాసి విరచిత కపోత వాక్యమనే యక్షగానంలో ఉంది. దీని లక్షణం అస్పష్టమని పండితాభిప్రాయం. దీనివి వర్ణంగా ఏాడా కపోత వాక్యం చెప్తున్నట. ఇక్కడ ప్రసక్తమైన విరాళి పదం (వర్ణం) వట్టి ఏకతాళిరేకుగా ఉంది. నాలుగు పాదాలకు ఒకటే ప్రాస ఉంది. (య.వా చ-345)

**విరించి మిశ్రుడు**

కాలం : క్రీ.శ. 14 వ శతాబ్దం.

రచన : భరతార్ణవపోతము.

లొల్ల లక్ష్మీధరుడు తన సౌందర్యలహరీ వ్యాఖ్యానంలో ఈయనను, పై గ్రంథాన్ని పేర్కొన్నాడు. లక్ష్మీధరుని పూర్వులలో ఈయన అయిదో తరం వాడట. (లక్ష్మీధరుడు శ్రీకృష్ణ దేవరాయల పోషణలో ఉండేవాడు). (నా. ర. చ-85)

**విరిపాటి నృసింహరాజు**

నామాంతరం : వావిరిపాటి నృసింహరాజు.

కాలం : క్రీ శ. 1769 ప్రాంతం.

రచన : ఉషాపరిణయము (యక్షగానం).

ఈ కవి విషయంలో భిన్నాభిప్రాయాలున్నాయి. వేర్వేరు ప్రతులలో ఇతని పేరు వేర్వేరుగా ఉన్నదట. విరిపాటి అని ఒక ప్రతిలోనూ, వావిరిపాటి అని ఒక ప్రతిలోనూ ఉన్నదట. గ్రంథాంత గద్యలో లక్షణామాత్యుని పేరూ, విశ్వనాథ కవి పేరూ కనిపిస్తున్నాయట. (య.వా.చ)

**విరియాల కామసాని గూడూరు శాసనము**

కాలం : క్రీ. శ. 11 శతాబ్ది చివర.

స్థలం : వరంగల్లు జిల్లా జనగామ తాలూకా గూడూరు.

శాసనదానయిత్రి : విరియాల కామసాని.

చారిత్రక విషయాలు : దీనిలో కాకతీయ చక్రవర్తి బేతరాజు ప్రసక్తి ఉంది. బేతరాజు రాజ్యాన్ని శత్రువులు ఆక్రమించినప్పుడు కామసాని కుమారుడయిన సూరభూపతి సహాయం చేసి, బేతరాజును పునఃప్రతిష్ఠితునిచేసి ఉండవచ్చునని పండిత నిర్ణయం.

ఈ శాసనంలో మూడు చంపకమాలలు, రెండు ఉత్పలమాలలు ఉన్నాయి. శాసనంలోని ముఖ్యాంశాలు తెలిసినా సగభాగం శాసనార్థం స్పష్టంగా తెలియరాలేదు.

ఇంతకు ముందుకాలంలోని-పండరంగని అద్దంకి శాసనంలో తరువోజ, కందుకూరు-ధర్మవర శాసనాలలోని సీసపద్యాలు, యుద్ధమల్లుని బెజవాడ శాసనంలో మధ్యాక్కరలు దేశిఛందస్సుకు చెందినవికాగా, కామసాని శాసనంలోని చంపకమాలలు, ఉత్పలమాలలు, సంస్కృత(మార్గపద్ధతి) ఛందస్సుకు సంబంధించినవి. ఈ శాసనం సంస్కృత వృత్తాలలో ఉండటం విశేషం. (వా.చ-13; తె.క.చ-104)

## విరూపాక్ష రాయలు

కాలం : క్రీ. శ. 1377-1404 ప్రాంతం.

రచనలు : 1. నారాయణ విలాసము 2. ఉన్మత్త రాఘవము.

రాజకవి. ఈయన విజయనగర రాజైన రెండో హరిహరరాయల కుమారుడు. సంస్కృతాంధ్ర పండితుడు. (తె.వి.స-4)

## విరూరి వేదాద్రి మంత్రి

కాలం : క్రీ. శ. 1542 ప్రాంతం.

గురువు : అప్పలాచార్యులు.

సమకాలికుడు : వైజయంతీ విలాస కర్త సారంగు తమ్మయ.

సాహిత్య పోషకుడు. తెనాలి రామకృష్ణకవి విరచిత పాండురంగ మాహాత్మ్యం అంకితం పొందాడు.

విశిష్టత : ఈయన మంగయ గురువరాజు కొడుకు. పెదసంగ భూపాలుని వద్ద వ్రాయసకాడు. (తె.వి.స-4)

## విరోధ నిరోధమ్ (సం)

కర్త : చూ. తిరుమల బుక్కపట్టణం (ఇమ్మడి) శ్రీనివాసాచార్యులు.

సంస్కృత రచన. సురపురం సంస్థానాధీశ్వరుల సమాదరణలో వెలసిన గ్రంథ పరంపరలో ఇది ఒకటి. (ఆం.సం.సా-516)

## విరోధ వరూథినీ ప్రమాథినీ (సం)

కర్త : చూ. తిరుమల బుక్కపట్టణం (ఇమ్మడి) శ్రీనివాసాచార్యులు.

సంస్కృత రచన. ఖండన గ్రంథం. విశిష్టాద్వైత సిద్ధాంత పరంగా వ్రాయబడింది. సురపురం సంస్థానాధీశ్వరుల సమాదరణలో వెలసిన గ్రంథం. (ఆం.సం.సా-516)

## విలాస కావ్యాలు

ఆంధ్ర వాఙ్మయంలో విలాసము అను పేరు చివరన గల కావ్యాలు అనేకం.

కళా విలాసము—నన్నెచోడుడు; వసంత విలాసము—నాచన సోమన; హర విలాసము—శ్రీనాథుడు, శివలీలా విలాసము—నిశ్శంక కొమ్మన. ఇవన్నీ ఇతి వృత్తాన్ని బట్టి వర్ణనాత్మకంగా ఉన్న కావ్యాలు. దక్షిణాంధ్ర యుగంలో భవనము అనే అర్థంతో సంబంధించి వెలువడ్డ కావ్యాలు కొన్ని ఉన్నాయి.

విజయ విలాసము : విజయ విలాస భవనంలో రఘునాథ నాయకునికి కృతి ఇవ్వబడింది.

రాజగోపాల విలాసము : రాజగోపాల విలాస సభా భవనంలో విజయ రాఘవునికి కృతి ఇవ్వబడింది.

విలాసము అంటే చిరునామా అనే అర్థం ఉంది. ఇవి ఆ అర్థం ధ్వనిస్తున్న కావ్యాలు. అలాగే మన్నారు దాన విలాసము అనే కావ్యం మన్నారు రంగ కూటానికి చెందిన రచన.

## విలియమ్ బెంటింక్ ప్రభువు

కాలం : క్రీ. శ. 1828–1835 ప్రాంతం.

కావలి వేంకట రామస్వామి ఆంగ్లంలో వ్రాసిన దక్కన్ కవుల చరిత్రకు కృతిభర్త.

ఈయన ఇంగ్లండ్‌నుంచి భారతదేశపు గవర్నర్–జనరల్‌గా దేశానికి వచ్చారు. సతీ సహగమనం అనే దురాచారాన్ని రూపుమాపిన ప్రభువు.

కావలి వేంకట రామస్వామి – కల్నల్ కాలిన్ మెకంజీ దగ్గర పండితుడుగా, ప్రధాన అనువాదకుడుగా పనిచేసేటప్పుడు "దక్కన్ కవుల చరిత్ర" (Biographical Sketches of Deccan poets) ను వ్రాసి క్రీ. శ. 1820 లో అంకితమిచ్చారు.

(తె.సా.విమర్శ–86)

## విలియమ్ బ్రౌన్

కాలం : క్రీ. శ. 19 వ శతాబ్ది పూర్వార్ధం

రచన : జంటూ వ్యాకరణము (1817) (తెలుగుభాషా వ్యాకరణం).

ఈయన తెలుగు భాషకు వ్యాకరణం వ్రాసిన ఆంగ్లేయుడు. తెలుగు–ఇంగ్లీష్ నిఘంటు నిర్మాత చార్లెస్ ఫిలిప్ బ్రౌన్‌కంటె భిన్నుడేగాక, ముందుకాలంవాడు.

(వీరేశలింగం పంతులు – సమగ్ర పరిశీలన–305)

## విల్కిన్‌సన్ దొర

కాలం : క్రీ. శ. 1850 ప్రాంతం.

ఆంగ్లేయుడు. అనంతపురం జిల్లా కలెక్టర్‌గా ఉండేవాడు. అల్లాడి రామచంద్ర శాస్త్రి రచించిన సిద్ధాంత శిరోమణి ఇతనికే అంకితం. (వ.వా–66)

## వివరణ దీపిక (సం)

కర్త : శ్రీ నారాయణ తీర్థులు.

సంస్కృతంలో సురేశ్వరాచార్యుడు రచించిన పంచకరణ వార్తికానికి వివరణ గ్రంథం.

## వివరణ ప్రమేయ సంగ్రహమ్ (సం)

కర్త : విద్యారణ్యుడు.

ఇది సంస్కృత వేదాంత గ్రంథం. (తె.వి.స-4)

## వివేక చింతామణి

రచనాకాలం : క్రీ. శ. 16వ శతాబ్దం.

కర్త : పరమానంద తీర్థుడు (చూ).

వేదాంత ప్రతిపాదకమైన వచన గ్రంథం. ఉపనిషత్సారము, శైవసిద్ధాంతము, బ్రహ్మాండ ప్రపంచ భువనకోశ రచనావిచిత్ర సిద్ధాంతములనే మూడు పరిచ్ఛేదాలున్నవి. (శారదా ధ్వజం-121)

## వివేక విజయము

కర్త : ఒల్లా సూరయ (చూ).

అంకితం : దక్షిణ ద్వారకలోని రాజమన్నారు దేవునికి.

ద్విపద కావ్యం. దృశ్యకావ్యాను గుణంగా రచింపబడింది.

అనుసరణ : సంస్కృతంలో కృష్ణమిశ్రుడు రచించిన "ప్రబోధ చంద్రోదయా"నికి అనుసరణ. ప్రబోధ చంద్రోదయాన్ని మించిన వర్ణనలు ఇందులో ఉన్నాయి,

దీన్ని ఇంతకుముందు ఘంటసింగయ, నంది మల్లయలు ప్రబంధంగా వ్రాశారు ఇందులో అద్వైత సార్వభౌముడైన జీవేశ్వరుడు, ముక్తికాంతను కలిసి ఆనందంతో ఉండటం ప్రతిపాదింపబడింది. (ద. దే. వా-293)

## వివేక సారము

రచనాకాలం : క్రీ. శ. 18వ శతాబ్దం.

కర్త : పరశురామపంతుల రామమూర్తి.

వేదాంత రచన. (క.న-195)

## వివేక సారాధ్యాత్మ రామాయణము

కర్త : పరశురామపంతుల రామమూర్తి కవి.

ఇది వేదాంత గ్రంథం. (తె.వి.స-6-769)

## వివేక సింధువు

రచనాకాలం : క్రీ. శ. 1600 ప్రాంతం.

కర్త : కాశీ చెన్నబసవేశ్వరుడు.

మూలం : మహారాష్ట్ర భాషలో ముకుందయోగి వ్రాసిన వివేక సింధువు.

విశిష్టత : వచనంలో ఉన్న వేదాంతగ్రంథం. మహారాష్ట్రంలో ముకుందయోగి రచించిన వివేక సింధువు అనే వేదాంత గ్రంథాన్ని కవి తెలుగులో వచన గ్రంథంగా వ్రాశాడు. సరిగా ఇదేకాలంలో ఇదే వివేక సింధువును వేగినాటి కొండన్న తెలుగులో పద్యకావ్యంగా వ్రాశాడట. వచన వివేక సింధువు కర్త, పద్య వివేక సింధువు కర్త సమకాలికులు కావచ్చు. (ఆరుద్ర-9)

## వివేక సింధువు

రచనాకాలం : క్రీ. శ. 17 వ శతాబ్దం (1600 ప్రాంతం).

కర్త : వేగినాటి కొండన్న.

అంకితం : దత్తాత్రేయస్వామికి.

మూలం : మహారాష్ట్ర భాషలో ముకుందయోగి రచించిన వివేకసింధువు కావ్యము. ఇది వేదాంత గ్రంథం.

ప్రత్యేకత : ఈ తెలుగు కావ్యంలో ముకుందయోగి ప్రశంసఉంది. ఈ వివేక సింధువునే తెలుగులో వచన కావ్యంగా కాశీ చెన్నబసవేశ్వరుడు క్రీ. శ. 1600 ప్రాంతాలలో వ్రాశాడు కొండన్న చెన్నబసవేశ్వరునికి సమకాలికుడు కావచ్చు. (ఆరుద్ర-9-260)

## వివేకాదర్శము

స్థాపకుడు : పురాణం హయగ్రీవ శాస్త్రులు. ముద్రాక్షరశాల.

వైద్యనాథ సిద్ధాంతి రచించిన "భూ ఖగోళ దీపిక" అనే గ్రంథం క్రీ. శ 1843 లో ఇందులోనే అచ్చయింది. (వ. వా-67)

## వివేకి

గుణవర్ణ, శబ్దార్థ గుణదోషాలను పరీక్షించి చక్కగా కవిత్వం చెప్పేవాడు వివేకి రచనా వైవిధ్యాన్నిబట్టి లాక్షణికులు కవులను ఏడు విధాలుగా విభజించారు. (అప్పకవీయం-25)

## విశిష్ట సీసము

నామాంతరం : చౌషష్టి భేద చిత్రసీసము.

కర్త : గణపవరపు వేంకటకవి.

## విశిష్టాద్వైత నిర్ణయమ్ (సం)

కర్త : కందాడై అప్పకొండాచార్యుడు. (తె.వి.స-4)

## విశేషణ రామాయణమ్ (సం)

నామాంతరం : సప్తకాండ రామాయణమ్.

కర్త : చూ. నెల్లూరి వీరరాఘవ కవి.

ఇది సప్తకాండ పరిమితమైన సంస్కృత రామాయణమట. (తె.వి స-6)

## విశేషాంధ్రము

కర్త : చూ. చాటరాతి లక్ష్మీనరసకవి.

ఆంధ్ర పద్య నిఘంటువు. అచ్చ తెనుగు పదాలు మాత్రమే ఉంటాయి. ఆంధ్రనామ సంగ్రహంలో లేవి పదాలన్నింటినికూడా ఇందులో కవి జతపరచినాడట. మొత్తం 250 పద్యాలున్నాయి. (ఆం. సం. సా-419)

## విశ్వగుణాదర్శమ్ (సం)

కర్త : వేంకటాధ్వరి.

ఇది చంపూ కావ్యం. దీనిలో హిమాలయాలలోని బదరికాశ్రమం మొదలు సేతువు వరకు గల విష్ణు క్షేత్రాలు, తీర్థాలు, విమానారూఢులై దేశాన్ని పర్యటించే కృశాను, విశ్వావసులు అనే ఇద్దరు గంధర్వుల సంభాషణ రూపంలో వర్ణితం. దక్షిణ దేశంలోని ప్రజల ఆచార వ్యవహారాలు, సాంఘిక రాజకీయ వ్యవస్థలు,మత విషయాలు, దేశ వ్యవస్థ దీనిలో కవి ఉటంకించాడు. ఈస్టిండియా కంపెనీ వారయిన ఆంగ్లేయుల ప్రవర్తన గురించి విపుల వర్ణనముంది. దీనిలో శ్లేషయమకాదులకు ప్రాధాన్యమున్నా అర్థ గాంభీర్యత చెడలేదు. చరిత్ర పరిశోధకులకు అమూల్యమైన గ్రంథం.

దీనిని తెలుగులోకి నలుగురు పండితులు అనువదించారు. ముద్రితాముద్రితాలయిన ఆంధ్రానువాదకులు వీరు: కామేశ్వరరావు ఎస్. (1914), దేవరాజు పెరుమాళ్ళు పి. (1915), పి చిన్న తాతాచార్యులు (1877), వేంకట రామకృష్ణ కవులు తిరుమల ఒక్కపట్టణం తాతాచార్యులు. (తె.వి.స-6)

## విశ్వగుణాదర్శ వ్యాఖ్య (అలభ్యం)

కర్త : కురవి రామకవి.

విశ్వగుణాదర్శ చంపూ గ్రంథానికి ఈ కవి చక్కని వ్యాఖ్యానం వ్రాశాడట. ఈ వ్యాఖ్య తెలుగులోనో సంస్కృతంలోనో తెలీదు. (అం.సం.సా.)

## విశ్వగుణాదర్శ వ్యాఖ్యానము

కర్త : అంబాళం నరసింహాచార్యులు.

ఈ గ్రంథం ప్రతులు నేడు లభించడం లేదు. వివరాలు తెలియవు.

## విశ్వనాథ నాయకుడు

కాలం : క్రీ.శ. 16 వ శతాబ్ది చివర గాని, 17 వ శతాబ్ది మొదటగాని కావచ్చు.

విశిష్టత : కవి. పండిత పోషకుడు. క్రీ. శ. 1595 నుంచి 1601 వరకు మధురను పాలించిన రెండో కృష్ణప్ప సోదరుడే ఈ విశ్వనాథ నాయకుడు. ఈయన తన స్థానాపతి చేత "రాయవాచకం" అని వ్యవహరింపబడుతున్న శ్రీకృష్ణ రాయల చరిత్రను వ్యవహార భాషలో వ్రాయించాడట. (ఆంధ్ర ద-9)

## విశ్వనాథ నాయకుని స్థానాపతి

కాలం : క్రీ.శ. 1629-64 నడుమ.

స్థలం : మధుర.

రచన : రాయవాచకము.

ఈతని పేరు తెలియ రాలేదు. మధుర మండలాన్ని పాలించిన విశ్వనాథనాయకుని దగ్గర స్థానాపతిగా ఉండేవాడు. విజయనగర వృత్తాంతం-శ్రీకృష్ణ దేవరాయల దిన చర్య-నాటి రాజకీయ పరిస్థితులు-సామంత రాజ్యాలు వాని సంబంధబాంధవ్యాలు మొదలైన విషయాలన్నింటినీ గ్రంథస్థం చేశాడు. ఇది చరిత్రపరంగా మిక్కిలి విలువైన రచన.

## విశ్వనాథ వారు

కాశీ విశ్వనాథుని పేరుతో ఉన్న ఇంటి పేరు. ఈ ఇంటి పేరుతో కొందరు విజయవాడ ప్రాంతంలో ఉన్నారు. కాశీనాథుని వారు, గోవిందవారు ఇలాంటివే.

(భారతి-మా-45-229)

## విశ్వనాథుడు

కాలం : క్రీ.శ. 1291-1323 ప్రాంతం.

ఆస్థానం : కాకతి రెండో ప్రతాపరుద్రుని ఆస్థానం.

రచన : సౌగంధికాపహరణమ్ (సంస్కృతం).

సమకాలికులు : అగస్త్యుడు (విశ్వనాథుని మేనమామ అట).

భారతారణ్య పర్వంలోని వృత్తాన్ని కావ్యంగా వ్రాశాడు. (ప్రా.ద.దే.చ.)

## విశ్వనిఘంటు టీక

కర్త : పరవస్తు చిన్నయసూరి.

విశ్వ నిఘంటువుకు వ్రాసిన టీక ఇది. ఇంతకు మించిన వివరాలు తెలియవు.

(రమణీయం పీఠిక)

## విశ్వరూపము

కర్త : తెలియదు.

జానపద పౌరాణిక గేయం.

ఇతివృత్త ప్రసిద్ధం.

చూ. పౌరాణిక గేయములు.

## విశ్వావళి

శ్రవ్య కావ్యభేదం. విశ్వములు పదునాలుగు వలె పదునాలుగు పద్యాలున్న లఘుకావ్యం విశ్వావళి. (తె.వి.స-6)

## విశ్వేశ్వరకవి I

కాలం : క్రీ.శ. 16 వ శతాబ్ది.

రచన : విశ్వేశ్వరచ్ఛందము.

విశిష్టత : కస్తూరి రంగ కవి తన ఆనంద రంగరాట్ఛందంలో కొన్ని పద్యాలను విశ్వేశ్వరచ్ఛందం నుంచి ఉదాహరించాడు. ఈ కవి ఏ కాలంవాడో, ఎక్కడివాడో వివరాలు తెలియవు. తెలుగు కవులలో విశ్వేశ్వర నామధారులు పెక్కురున్నారు. ఒకరు శివతత్వ రసాయనం వ్రాసిన వారు, ఇంకొకరు కృష్ణ విలాస కర్త. వీరికి ఈ విశ్వేశ్వరచ్ఛందానికీ సంబంధం లేదని పండితాభిప్రాయం. (ఆరుద్ర-8)

## విశ్వేశ్వరకవి II

కాలం : క్రీ.శ. 17 వ శతాబ్దం.
స్థలం : తిరుచినాపల్లి మండలం.
రచన : కృష్ణ విలాసము.
బిరుదు : కవితార్కిక శిరోమణి.

సంస్కృతంలోనూ, తెలుగులోనూ అనేక రచనలు చేసినట్టు చెప్పుకొన్నాడు. పండితుడు. లక్ష్య లక్షణోపేతంగా ప్రౌఢంగా రచన చేశాడు. (ద.దే.వా-498)

## విశ్వేశ్వరకవి III

కాలం : క్రీ శ. 18 వ శతాబ్ది ఆరంభం.
రచన : 1 రుక్మిణీ కల్యాణమ్ (సం) 2. నవమాలిక (సం) 3. శృంగార మంజరి (సం)

(తె.వి.స-6-241)

## విశ్వేశ్వరచ్ఛందము

కర్త : విశ్వేశ్వరకవి.

ఇది ఛందస్సునుగురించి చెప్పేలక్షణగ్రంథం. కస్తూరిరంగకవి తన ఆనంద రంగరాట్ఛందంలో దీనినుంచి కొన్నిపద్యాలను ఉదాహరించాడు. (ఆరుద్ర-8)

## విశ్వేశ్వర దేశికులు

కాలం : కాకతిగణపతి, రుద్రాంబలకాలం.
(క్రీ. శ. 13 వ శతాబ్ది).
నామాంతరాలు : విశ్వేశ్వరశంభుడు, విశ్వేశ్వర శివుడు, విశ్వేశ్వర శివాచార్యుడు.
రచన : శివతత్త్వరసాయనము.

ఇతడు కాకతి గణపతిదేవునిగురువు. మలకాపురం శాసనంలో ఈతనిప్రసక్తి ఉంది. గణపతి, రుద్రాంబలు విశ్వేశ్వరునకు మందరం, వెలంగపూడి గ్రామాలను దానం చేసినట్లున్నూ, అతడు ఈ గ్రామాలను గోళకీమఠానికిచ్చినట్లూ తెలుస్తున్నది.

(క. శ-3)

## విశ్వేశ్వరుడు

కాలం : క్రీ. శ. 1805 పూర్వుడు.
స్థలం : గోదావరీ మండలం.

రచన : ధర్మపురీ మాహాత్మ్యము (యక్షగానం).

కవిపేరు నిర్ధారణగా తెలియదు. ఇతడు అభినవకవి రాఘవయ్య సేవకుడనని చెప్పుకొన్నాడు. ఇది విశ్వేశ్వరునికి అంకితమని కొందరు భావిస్తున్నారు.

(య. వా. చ-72)

## విశ్వేశ్వరోదాహరణము

కర్త : ఏనుగు లక్ష్మణకవి.

(తె. వి. స-6)

## విష్ణుకథా నిధానము (అలభ్యం)

కవి : జైతరాజు ముమ్మయ్య.

కాలం : క్రీ. శ. 1560 కి పూర్వం.

విష్ణుకథలనేగాక, హరిహరాభేదాన్నికూడా బోధించేగ్రంథం. 43 పద్యాలను సంకలనకర్తలు ఉదాహరించారు. అందులోని మూడుపద్యాలు శివతాండవాన్ని వర్ణించే పద్యాలు. (ఆరుద్ర-9)

## విష్ణుకాంచీ మాహాత్మ్యము (అలభ్యం)

కర్త : ఆంధ్రకవి రామయ్య.

రచనాకాలం : క్రీ. శ. 15 వ శతాబ్ది కావచ్చును.

ఇందులోని పన్నెండు ప్రబంధరత్నావళిలో ఉదాహరింపబడ్డాయి. అజ్ఞాత గ్రంథ సంధాత ఈకావ్యాన్ని పేర్కొన్నాడు. (ఆరుద్ర)

## విష్ణుచిత్తుడు

నామాంతరం : పెరియాళ్వారు.

ఇతడు వైష్ణవుడు. విష్ణుభక్తుడు. ద్రావిడదేశంలోని "విలిపుత్తూర్" గ్రామం నివాసి. నిరంతర యోగాభ్యాసంచేత ఈశ్వరుని హృదయంలో ప్రతిష్ఠించుకున్న మహా భక్తుడు. పన్నిద్దరాళ్వారులలో ఒకడు. ప్రపత్తియోగి. ఆండాళ్‌గా ప్రసిద్ధిచెందిన గోదాదేవికి తండ్రి.

"విలిపుత్తూర్" గ్రామంలో "శ్రీమన్ననారు" స్వామివెలిసిఉన్నాడు. ఆస్వామి కైంకర్యమే ఈతని దినచర్య. స్వామికి మాలికాకైంకర్యంచేస్తూ జీవితం వెళ్ళబుచ్చేవాడు

పన్నిద్దరాళ్వారులను గురించిన పరమయోగివిలాసం, ఆచార్య సూక్తిముక్తావళి వంటి రచనలున్నాయి. ఈ పెరియాళ్వారులనుగురించి విజయనగరసామ్రాట్టు శ్రీకృష్ణ దేవరాయలు ఒక వైష్ణవభక్తి పారమ్యమైనకావ్యం వ్రాశాడు. దానికి "ఆముక్తమాల్యద" అనిపేరు. దానికే "విష్ణుచిత్తీయం" అనే నామాంతరంఉంది. విష్ణుచిత్తీయ కావ్యానికి "విష్ణుచిత్తుడే" నాయకుడంటారు. కొందరు "శ్రీమన్నారాయణుడే" నాయకుడంటారు.

విలిపుత్తూరులో వెలసిన మన్ననారు స్వామికి వ్వమతస్థాపన చేయాలన్న సంకల్పం కలిగింది. అందుకు తగినవ్యక్తిగా "విష్ణుచిత్తుని" ఎన్నుకున్నాడు. ఇతడు

నిరంతర వైష్ణవారాధనంచేత ముని అయినాడు. భగవత్సాక్షాత్కారం పొందిన మహాత్ముడు. కారణజన్ముడు గరుత్మంతుని అంశచేత జన్మించినవాడు. దానశౌండుడు. నిరంతరాత్మీయ మర్యాదలతో దివ్యప్రబంధానుసంధానాలలో మునిగితేలువాడు. కాబట్టి ఇతడే మత స్థాపనకు తగినవ్యక్తి. మన్ననారుస్వామి ఇతడిని మధురా పురాధీశ్వరుడైన "మత్స్య ధ్వజుని" ఆస్థానానికివెళ్ళి వాదంలో ఇతరపండితులను ఓడించమని సెలవిచ్చారు.

"ఇతఃపురాపఠితశాస్త్రగ్రంథ జాత్యంధుడ"నుగదా, కాబట్టి నేను వెళ్ళనంటాడు విష్ణుచిత్తుడు. ఇక్కడొక ముఖ్యవిషయం గ్రహించాలి. విష్ణుచిత్తుడు అపండితుడుకాడు. షడ్దర్శనాదులనుచూడనివాడని భావంకాదు. కాణాదులను చదువకపోలేదు. కాకపోతే వేద వేదాంగ దార్శనికపాండిత్యంకలిగి, సర్వవైదిక వాఙ్మయాన్ని స్వమతానుకూలంగా వ్యాఖ్యానించి, మతప్రతిష్ఠాపన చేయగల పాండిత్యంలేదు. ఇతడు ముని. దేశభాషలతో పాటు సంస్కృతాధ్యయనమూ చేశాడు. పాండిత్యాదులలో నిష్ఠలేదు. ప్రపత్తియోగం ద్వారా భగవత్సాక్షాత్కారంపొందిన మహాత్ముడు. అనగా శుష్క తార్కికుడు కాక తత్త్వ దర్శనం కలవాడని భావం. శ్రీ రంగేశ్వరుని దర్శనం చేసినప్పుడు ఇతడు చేసిన స్తోత్రం అ పండితునికి సాధ్యంకాదు. తుదకు ప్రౌఢకథయైన దాసరి కథకు కూడ ఇతడే శ్రోత. ఇటువంటి కొన్ని సంఘటనల ద్వారా ఇతని పాండితీ ప్రకర్ష పటిమలకు తెలుస్తున్నది.

మన్ననారు స్వామి సహాయంతో పాండ్యరాజు సభలో పండితులతో వాదించి అందరినీ విచిత్ర గతిలో ఓడిస్తాడు

ఈ విష్ణుచిత్తుడికి ఒక పెంపుడు పూతురున్నది. ఆమెపేరు "గోదాదేవి". పరమ భక్తురాలు. ఆమె శ్రీరంగస్వామిని వరిస్తుంది. చివరకు యథా విధిని శ్రీరంగని వివాహ మాడుతుంది. స్వామివారికి కన్యాదానం చేసే సదవకాశం "విష్ణు చిత్తునికి" లభించింది.

ఆళ్వారులు శ్రీమన్నారాయణ సందర్శనంచేత మైమరచి దివ్య ప్రబంధాలు గానం చేశారు. ఇతడు "పెరియాళ్వారు". అనగా అందరికన్నా "పెద్ద" ఆళ్వారని అర్థం. దివ్య ప్రబంధంలోని ఇతని రచనలు ఇతని భావనా పటిమను తెలుపుతాయి. శ్రీకృష్ణునిపై వత్సల భక్తితో వ్రాసిన ప్రబంధంలో గొల్లల పద్ధతులు-ఆటలు ఎంతో మధురంగా వివరించాడు. హరివంశ పద్ధతిలో వ్రేపల్లె వర్ణనలను తలపించే ఊహలు ఇందులో కనిపిస్తాయి. కాబట్టి ఇతడు కవి.

విష్ణుచిత్తుడు భగవద్భాగవత కైంకర్యపరుడు. ఆకస్మాత్తుగా దివ్యసూరులలో ఒకనిగా ప్రసిద్ధిచెందినవాడు గోదాదేవికి తండ్రి. శ్రీమహావిష్ణువుకు మామ. "పల్లాండు"- "జయ జయ" - మొదలగు గీతరచనల ద్వారా వేదానికి ఓంకారంవలె ద్రావిడ వేదానికి ప్రథమ మంగళ గీతం పాడినవాడు. ఈ మహనీయుని కథను కృష్ణదేవరాయలు "విష్ణు చిత్తీయం"గా వ్రాశాడు.

**విష్ణుచిత్తీయము**

నామాంతరం : ఆముక్త మాల్యద (చూ).

కర్త : శ్రీకృష్ణ దేవరాయలు

విష్ణు చిత్తీయ వ్యాఖ్య (అలభ్యం)

కర్త : చిత్రకవి వేంకటరమణ.

శ్రీకృష్ణదేవరాయ విరచిత ఆముక్త మాల్యదకు వ్యాఖ్య. (ఆరుద్ర-9)

విష్ణు నామ సంకీర్తన ఫలము

నామాంతరం : (చూ) సింహగిరి వచనాలు.

విష్ణు పల్లకి సేవాప్రబంధము

కర్త : శహాజీ (చూ)

సంగీత, నృత్య రూపకం. ఆలయంలో దేవుని నిత్య పూజాకైంకర్యాలన్నీ పూర్వం సంగీత నాట్యయుక్తంగా దేవదాసీలు చేస్తుండేవారు.

ఆలయోత్సవాలలో దేవుని పల్లకీని ఊరేగించే టప్పుడు దీన్ని అభినయించే వారట.

ఆ సేవలు అలా కొనసాగుతుండ డానికి రాజులు ఈనాములు ఏర్పాటు చేసేవారు. (శారదా ధ్వజం-153)

విష్ణు పురాణము

కాలం : క్రీ.శ. 1545 ప్రాంతం.

కర్త : కలిదిండి భావనారాయణ.

అంకితం : పూరీ జగన్నాథస్వామికి.

నాలుగాశ్వాసాల కావ్యం.

ప్రత్యేకత : దీనికి సంస్కృత విష్ణుపురాణం మూలం. వెన్నెల కంటి సూరన్న ఆరు అంశాలను తీసుకొని తెనిగిస్తే, ఈ కవి నాలుగు అంశాలనే తీసుకొని విష్ణుపురాణాన్ని అనువదించాడు. సరసత, మృదుత్వం, చక్కదనం, అలంక్రియాస్ఫురణ ఉన్న కావ్యాన్ని దేవునికి అంకితమిస్తే అది సత్కృతి అవుతుందని, పరులకు కృతియిస్తే దుష్కృతి అవుతుందని కవి అంటాడు. ఇతని కృతి అముద్రితం. (ఆరుద్ర-9-234)

విష్ణు పురాణము

నామాంతరం : విష్ణుభక్త చరిత్ర (చూ).

కర్త : చక్రపురి రాఘవాచార్యులు (చూ).

విష్ణు పురాణము

కర్త : తుపాకుల అనంత భూపాలుడు (చూ).

వచన గ్రంథం : అయిదాశ్వాసాలున్నాయి. సంస్కృత మూలాన్ననుసరించి ఉంది. 14 అధ్యాయాలు మాత్రం ముద్రింప బడ్డాయి. కొంత అముద్రితంగా ఉన్నది. రచన ప్రౌఢం. సంస్కృత పద భూయిష్ఠం. తెలుగులోని

ఇతర విష్ణుపురాణాలకంటె ఇది విపులంగా ఉన్న రచన.
(క. త-13-110; ద. దే. వా-479)

**విష్ణు పురాణము (అలభ్యం)**

కర్త : దిట్టకవి వెంకటామాత్యుడు (చూ). (క. త-12-175)

**విష్ణు పురాణము (అలభ్యం)**

కర్త : చూ. పశుపతి నాగనాథుడు.

రచనాకాలం : క్రీ. శ. 14వ శతాబ్దం ఉత్తరార్థం.

ప్రబంధ రత్నావళిలో దీని ప్రసక్తి ఉంది. (అతు ద-4)

**విష్ణు పురాణము**

కర్త : చూ. ముడింబి అప్పయ్య దీక్షితులు.

ఆంధ్రీకృత రచన. సంస్కృత విష్ణుపురాణం దీనికి మూలం. కృతికర్త రాజాజ్ఞ మేరకు ఈ విష్ణు పురాణాన్ని ఆంధ్రీకరించినట్లు తెలుస్తున్నది. వేంకటగిరి పాలకుడైన కుమార యాచమ నాయకుని ప్రోత్సాహంతో ఈ రచన జరిగింది
(అం. సం. సా-458)

**విష్ణు పురాణము**

రచనాకాలం : క్రీ. శ. 16వ శతాబ్దం పూర్వార్థం.

కర్త : వెన్నెలకంటి సూరన్న.

అంకితం : రావూరి రాఘవరెడ్డికి (ఉదయగిరి పాలకుడు).

విశిష్టత : సంస్కృత పురాణాలలో విష్ణుపురాణం ప్రాచీనమని వాడుక. మైత్రేయుడు కొన్ని ప్రశ్నలడిగితే, పరాశర వ్యాసుడు చెప్పినసమాధానాలే విష్ణుపురాణం. ఈ మూల గ్రంథాన్ని సూరన్న ఆంధ్రీకరించాడు. సంస్కృతంలో విష్ణుపురాణం రెండు భాగాలుగా ఉంది. మొదటి భాగంలో విష్ణువు మాహాత్మ్యాన్ని తెలిపే కథలు, శ్రీకృష్ణుని చరిత్ర ఉన్నాయి. ఈ భాగాన్ని మాత్రమే సూరన ఆంధ్రీకరించాడు. రెండవ భాగంలో ధర్మ విషయాలు, వ్రత మాహాత్మ్యాలు, అర్థ శాస్త్రం, వేదాంతం ఉన్నాయి. ఇవి సూరన తెలుగు చేయలేదు.

ధర్మ ప్రతిపాదకమైన విష్ణుపురాణాన్ని సుబోధకమైన సరళ రీతిలో సూరన్న వ్రాశాడు. ఇందులోని ఏడు, ఎనిమిది ఆశ్వాసాల్లో కృష్ణుని చరిత్ర ఉంది కృష్ణునికి అవతార పురుషుని గుణాలే గాక మానవ సహజ గుణాలున్నట్లు ఈ కావ్యం చిత్రించింది. శమంతకమణి కోసం శ్రీకృష్ణ బలరాములిద్దరూ ఆశించారని ఈకావ్యంలో ఉంది కావ్యం చివరలో శ్రీకృష్ణ నిర్యాణం కూడా ఉంది. శృంగార రసభరితమైన కథలున్నప్పటికీ కవి సభ్యతకు లోటు లేకుండా ఔచిత్యాన్ని పాటించి వ్రాశాడు. మారీష కథ, తారాశశాంకుల కథ, ఉషానిరుద్ధుల కథలు సరసంగా వ్రాశాడు. ధ్రువ చరిత్ర, ప్రహ్లాద చరిత్ర సంగ్ర

హంగా ఉన్నాయి. ఈ కావ్యంలో ప్రహ్లాదుడు తన తండ్రి-హిరణ్యకశిపుని విష్ణుభక్తుని విగా మార్చినట్లుంది. జడ భరతోపాఖ్యానం, మాంధాతృ చరిత్ర మనోహరంగా ఉన్నాయి. (తె. వి.స-4)

## విష్ణు భక్త చరిత్ర

నామాంతరం : విష్ణుపురాణము.

కర్త : చక్రపురి రాఘవాచారి.

ద్విపదకావ్యం.

విశిష్టత : ఇది విష్ణు పురాణమనే పేర అచ్చు పడింది. కవి నిర్దేశించిన పేరు భక్త చరిత్ర. "ఈ ద్విపద ప్రబంధం"లో ఆళ్వార్లు మొదలయిన విష్ణుభక్తుల చరిత్రలు వర్ణితాలని పండితులన్నారు. ఈ కావ్యాన్ని కవి రెండు భాగాలుగా వ్రాశాడు. మొదటి భాగంలో యమలోక వర్ణన, అక్కడకు వచ్చే పాపాత్ములు చేసే పాతకాల వివరాలు ఉన్నాయట. రెండో భాగంలో రామానుజుల ప్రభావం, ఆ మత స్థాపన, దాని వైశిష్ట్యం ఉన్నాయట. ఈ గ్రంథం మద్రాసు ప్రాచ్య లిఖిత భాండాగారంలో ఉందట. (అరుద్ర-9)

## విష్ణు భక్తి సుధాకరము

రచనాకాలం : క్రీ. శ. 17వ శతాబ్దం ఉత్తరార్ధం.

కర్త : పూసపాటి విజయ రామరాజు.

ఐదాశ్వాసాల ప్రబంధం విష్ణుభక్తుడైన కులశేఖరాళ్వారు చరిత్ర ఇందులో రస వత్తరంగా ఉంది. (క. స-220)

## విష్ణు భజనానందము

రచనాకాలం : క్రీ. శ. 16వ శతాబ్ది పూర్వార్ధం.

కర్తలు : బమ్మెర కేసకవి-మల్ల కవులు.

అంకితం : పెనుమత్స నార భూపాలునకు.

ఆరాశ్వాసాల ప్రబంధం. పెనుమత్సవారి వంశవృత్తాంతం విపులంగా ఉంది. దీనిలోని కవిత్వం రసవంతంగా ద్రాక్షాపాకంలో ఉన్నదట. (క. త-6-231)

## విష్ణు మాయానాటకము

కర్త : మడికి అనంతయ్య.

రచనాకాలం : క్రీ. శ. 1347-1400 ప్రాంతం.

ఐదు అశ్వాసాల ప్రబంధం. మనోహరమైన కవిత.

విశిష్టత : ఈ పేరుగల కావ్యాన్ని తెలుగులో నలుగురు కవులు వ్రాశారు. చింతలపూడి ఎర్రనార్యుడు, (రాధా మాధవకవి) తారక బ్రహ్మ రాజీయమనే పేరుతోను, కంకంటి పాపరాజు (విష్ణుమాయా విలాసము) ఈ పేరుతో యక్షగానాన్ని, కంకంటి నర సింహ కవి ఇదే పేరుతో ద్విపదలోను, దోసనూరి వేంకటపతి, ఎర్ర గుడిపాటి వేంకట

పతి అనేవారు కావ్యంగాను వ్రాశారు. పుండరీకుడు బోయస్త్రీని చేసుకొని, సంసారం చేసి పామరుడై ముక్తి పొందటం ఇందులోని కథ. (ఆరు ద్ర-4)

విష్ణుమాయా విలాసము

రచనాకాలం : క్రీ. శ. 17 శతాబ్ది ఉత్తరార్ధం.

కవి : కంకంటి నరసింహ కవి (చూ)

అంకితం : శ్రీరామచంద్రునికి.

ద్విపదకావ్యం. అయిదు ఆశ్వాసాలున్నాయి.

మూలం : కంకంటి పాపరాజు రాసిన ఇదేపేరు గల యక్షగాన కావ్యం. తన అన్నగారైన కంకంటి పాపరాజు రచించిన యక్షయాగాన్నే నరసింహకవి ద్విపదగా రాశాడని చెప్తారు. కొందరు దీనికి చింతలపూడి ఎల్లయ కావ్యం ఆధారమని అంటున్నారు

ఇతివృత్తం : శ్రీకృష్ణావతారంలో విష్ణుమూర్తి మాయావిలాసాలు, అతడు సత్యభామ, మహాలక్ష్మి, నారదుడు, మహేశ్వరుడు, బ్రహ్మ మొదలైన వారి అహంకారాన్ని అణచడం ఇతివృత్తం. క్రీ. శ. 1865లో ముద్రితమట.

ఈ రచనలో కవికి పుష్పగిరి తిమ్మన సహాయపడ్డాడట. (క త-12-74)

విష్ణుమాయా విలాసము

కవి : కంకంటి పాపరాజు. (చూ)

అంకితం : మదనగోపాల స్వామికి.

రచనాకాలం : క్రీ. శ. 17 వ శతాబ్ది ఉత్తరార్ధం.

ప్రాచీన పద్ధతిలోనే నడచిన యక్షగానం. ఇంతకు పూర్వమే ఈ కథను చింతలపూడి ఎల్లన వ్రాశాడు. పాపరాజు రచన ముద్రితం. నేలటూరు వేంకటరమణయ్య ఈ గ్రంథానికి ఉపోద్ఘాతం వ్రాస్తూ అనేక చారిత్రక విషయాలను చర్చించారు.

(క త-10-165)

విష్ణుమాయా విలాసము

కర్త : చూ. రోసనూరి వేంకటపతి కవి.

అంకితం : వెలుగోటి బంగారుయాచమనాయనికి (1755-77).

ఆస్థానం : వేంకటగిరి.

మూడాశ్వాసాల పౌరాణిక రచన. భాగవతం అష్టమస్కంధంలోని "మోహిని అవతార ఘట్టం" ఈ రచనలోని ఇతివృత్తం. అతి కఠినమూ, అతి మృదులమూ కాని యథోచిత శైలిలో వ్రాయబడిన గ్రంథమిది. విష్ణువు మోహినీరూపంలో ఈశ్వరుని మోస గించే కథ రమణీయంగా ఉంది. విష్ణుమాయావిలాసం పేరుతో తెలుగులో చాలాకావ్యా లున్నాయి. వానిలోని ఇతి వృత్తాలలో స్వల్పభేదం ఉంటుంది. దేని ప్రత్యేకత దానిదే.

(ఆం.సా.సా-457) (క త-12-213)

విష్ణు మిత్రోపాఖ్యానము

కర్త : కొటికెలపూడి సోమనాథుడు.

కృతిభర్త : గుంటుపల్లి తిప్పమంత్రి (వినుకొండ ప్రాంతం.)

ప్రత్యేకత : ఇది అయిదాశ్వాసాల ప్రౌఢకావ్యం. కవిత్వం ఎలా ఉండాలో కవి కృత్యాదిలో చెప్పాడు. కవి కుకవుల పాలిటి గొడ్డలియట. ఈ కృతికర్తకు శారదాభరణాంకుడనే బిరుదుంది. (అరుద్ర-9)

విష్ణువర్ధన మంత్రి

కాలం : క్రీ. శ. 1100 ప్రాంతం.

రచనలు : 1. బృహజ్జాతకమునకు భాష్యం, కొన్ని శాసనాలు కూడా రచించాడట. కులోత్తుంగ చక్రవర్తి కాలంలో అతనికి ప్రధానిగా ఉండేవాడు. ఇతని రచన నన్నయ రచనను పోలి ఉందని అంటారు.

విష్ణు శాహరాజ విలాస నాటకం (తమిళం)

కర్త : తెలియదు.

తెలుగు లిపిలో తమిళ నాటకం. తంజావూరు పాలకుడైన శహాజీ (1684-1712)ని కీర్తిస్తూ రాసిన రచన. (M.R.T-30)

విష్ణు సంవేద్య రామేశ్వర పూజావిధానము

కర్త : నిమిష కవి రామయ్య.

రచనాకాలం : క్రీ. శ. 1758 ప్రాంతం.

విష్ణు సర్వోత్తమ శతకము

రచనాకాలం : క్రీ. శ. 19 వ శతాబ్దం.

కర్త : పత్రి రమణప్ప కవి.

వృత్తమయ శతకం. "విష్ణు సర్వోత్తమా" అనే మకుటంతో ఉంది. ముద్రితం. (క.స-181)

విష్వక్సేన ప్రకారము

కర్త : మరింగంటి వేంకట (ప్రథమ) నృసింహాచార్యులు. (తె.వి.స-6)

విస్తర కవిత్వము

చతుర్విధ కవితా భేదాలలో ఒకటి. అష్టాదశ వర్ణనాత్మకాలై, కథా సరణి కలిగిన కావ్యాలన్నీ విస్తర కవితకు చెందుతాయి. గద్య పద్య ప్రబంధాలు, ద్విపద కావ్యాలు, స్థలపురాణాలు మొదలైనవి.

దీనికే విస్తారమని మరొకపేరు. విస్తృత రూపమూ, దీర్ఘవర్ణన భూయిష్ఠమూ, సూక్ష్మాతి సూక్ష్మ బహువివర పరిపూర్ణమూ అయినది విస్తర కవిత.

## విస్సన మంత్రి

కాలం : తెలియదు.

ఈయన నిత్యాన్నదానం చేసేవాడని ఒక చాటువు చెప్తున్నది. కవి పేరు తెలియదు ఇతడు శ్రీనాథుని కాలంనాటి విస్సనమంత్రి కావచ్చునని పండితాభిప్రాయం. (చా.ప.ర.)

## విస్సాప్రెగడ కామరాజు

కాలం : క్రీ.శ. 19 వ శతాబ్ది పూర్వార్థం.

స్థలం : బొబ్బిలి.

రచన : పేరీజు పద్యములు.

గురువు : చాటరాతి లక్ష్మీనరసకవి.

చెల్లమాంబా జోగిరాజుల పుత్రుడు. చాటుకవి. చిత్రకవితా విశారదుడు. ఇతనిది అక్షర ప్రశ్నకు సంబంధించిన ఒక చాటు పద్యం లభించింది. ఇతని గురువు లక్ష్మీనరస కవి 1740 ప్రాంతం వాడు. వీరిరువురూ విజయనగర సంస్థానానికి చెందిన వారు. (ఆం.సం.సా-419)

## విశాత్తియం కృష్ణయామాత్యులు

కాలం : క్రీ శ. 1839 ప్రాంతం.

స్థలం : ఎట్టియాపురం సంస్థానం (తమిళ దేశం).

రచన : తెలియరాలేదు.

జగదీశ్వర రామకుమార ఎట్టప్ప మహారాజు ఆస్థానంలో ఆంధ్రవైయాకరణిగా ఉండేవాడు. (వ.దే.వా-513)

## వీక్షారణ్య మాహాత్మ్యము

కాలం : క్రీ.శ 19 వ శతాబ్ది.

కర్త : శిష్టు కృష్ణమూర్తి శాస్త్రి.

అంకితం : తుళ సింగిసెట్టికి.

(వీరేశలింగం పంతులు-సమగ్ర పరిశీలన; ఆం.సం.సా-326)

## వీణ

ఇంటి పేరు. దేశిరాజు కొండయామాత్యుడు వీణా వాదనంలో నేర్పరియై బిరుదులు పొందడం వల్ల వారి ఇంటి పేరు కొంత కాలం "వీణ"గా ప్రఖ్యాతమయింది.

ఈ వంశీయులే తర్వాత నెల్లూరులో స్థిరపడి "నెల్లూరు" వారయ్యారు. (చూ). నెల్లూరి వీరరాఘవ.కవి. (క.శ-13-74)

## వీణెము లక్ష్మీపతి

కాలం : క్రీ శ. 18 వ శతాబ్దం.

రచన : అభిమన్యు పరిణయము.

తండ్రి కృష్ణరాజు. తల్లి రంగమ్మ. శేషము చెన్ను భట్టారకుని రచన నను సరించి కావ్యం వ్రాశాడు (ద్వి.సా.చ-380; క.స-209)

**వీథి**

ఇది దశ విధ రూపకాలలో ఒకటి. వీథి వలెనే ఇది అంగాలకు మార్గం కావటంవల్ల దీనికీ పేరు వచ్చింది. ఇందులోని ఇతివృత్తం కల్పితము ఒకే అంక ముంటుంది. సాంగాలయిన ముఖ నిర్వహణ సంధులు, లాస్యాంగాలు ఉపయోగించ వచ్చు. ఉద్ఘాత్యకాదులయిన 13 వీథ్యంగాలు ఇందులో ఉపయోగించవచ్చు. కైశికీ వృత్తితో కూడిన శృంగార రసాన్ని ముఖ్యంగాను, ఇతర రసాలను ఔచిత్యానుగుణం గాను ఇందులో సూచించవచ్చు. దీనిలో ఒకటి లేక రెండు పాత్రలుంటాయి.

నాయకుడు ఒక్కడే ఉంటాడు. ఈ నాయకుడు ఉత్తమాధమ మధ్యములలో ఎవడయినా కావచ్చు. అతడు ఆకాశ భాషితాలకు ప్రతి భాషణ చేస్తాడు. అంటే నాయ కుడు ఒక్కడే కాబట్టి, తానే ఆకాశం వైపుచూసి "నీవేమను చున్నావు? ఓహో ఇట్లను చున్నావా?" అని ఎదుటిపాత్ర చెప్పవలసినదంతా తానే చెప్పి, దానికి సమాధానం చెబుతూ ఉంటాడు.

ముఖ్యంగా దీనిలో శృంగార రసం చూపి, కొద్దిగా ఇతర రసాలను చూపవలె. ముఖ నిర్వహణ సంధులు, అర్థ ప్రకృతులన్ని దీనిలో ఉంటాయి.

ఈ కావ్యము శృంగార రసానికి వీథి వంటిది. ఇది పరదారగమన, సురా పానాది సుఖలలితమైన కామ శృంగార ప్రధానం.

దీనిలో భాణంలో ఉన్నంతపచ్చి శృంగారముండదు. మధ్యమ శృంగారమే ఉంటుంది. దీనిలో ఉత్తమ నాయకుడు కూడా ఉండవచ్చునని ఒక వ్యాఖ్యాత చెప్పాడు. కాని లక్ష్యంలో ఉత్తమ నాయకుడు కనిపించదు.

తెలుగులోని క్రీడాభిరామం అనే వీథిక ఈ లక్షణము ముఖ్యార్థముచే పట్టము, గౌణార్థముచే పడుతుంది. ఈ వీథికే వీథి నాటకమని వ్యవహారనామముంది. (తె.వి.స-6)

**వీరకల్లు ప్రతిష్ఠ**

క్రీ. శ. 11-15 శతాబ్దాల నడుమ ఆంధ్ర దేశంలో ప్రచారంలో ఉండిన సంప్ర దాయం. మతం కోసంగాని, దేశం కోసంగాని బలైపోయిన వీరులస్మారక చిహ్నంగా శిలను ప్రతిష్ఠించడమే వీరకల్లు ప్రతిష్ఠ. ఇట్లా ప్రతిష్ఠితమైన రాళ్ళనే వీరకల్లులనే వారు. వీరకల్లు ప్రతిష్ఠలు జరిగినట్లు చారిత్రక, సాహిత్యాధారాలు దొరుకుతున్నాయి ప్రతిష్ఠించిన వీరకల్లులు కడప జిల్లా పులివెందుల తాలూకా మోపూరు గ్రామంలోని భైర వుని గుడివద్ద కొన్ని ఉన్నాయి. భైరవుని గుడి సమీపంలోని కొండ మీదనే వీరకల్లు ప్రతిష్ఠ జరిగినట్లు శాసనం కూడా అక్కడే ఉంది. (తెలుగు-జ-మా-75)

**వీరగాథలు**

పలనాటి వీరచరిత్ర, కాటమరాజుగాథ మొ॥ గాథలు తెలుగుదేశంలో ప్రముఖ

వీరగాథలు. ఈ వీరులందరికీ "కల్లుప్రతిష్ఠ" జరిపి, గుడులుకట్టి, పూజలుజరపడమే కాక వీరిగాథలను గానంచేయటంకూడా ప్రచారంలోఉంది. కనిగిరి-కందుకూరిప్రాంతపు యాదవులు "కాటమరాజు" కథను వీరగాథగా చెప్పించుకొని స్మరించుకొంటారు. అట్లే పలనాటిప్రజలు స్థానిక వీరులగాథలను చెప్పించుకొని బ్రహ్మన్న, బాలచంద్రాదులను గుర్తుచేసుకొంటూఉంటారు. పలనాటిసీమలో "పిచ్చుకుంట్లు" అనేవారు పలనాటి వీరగాథను రాగతాళయుక్తంగా అభినయిస్తూ గానంచేస్తారు. కనిగిరిసీమలో "పంబలవారు" యాదవ రాజులనుయాచిస్తూ 'కాటమరాజు' కథనే జీవికగా చేసుకొన్నారు.

(తెలుగు-జ-మా-75)

## వీర గీతములు

కర్త : తెలియదు.

చారిత్రకగేయాలనే వీరగీతాలంటారు.

వివరాలకు : చూ. చారిత్రక గేయములు. (ఆం. వా. చ)

## వీర చోడవ్వ చరిత్ర

కర్త : గుత్తుము చినకపోదయ్య

అంకితం : రొంపిచర్ల శంకరేశ్వరునికి.

యక్షగానం. దీనిలోనికథకు మూలం పండితారాధ్యచరిత్ర. దక్షారామంలో నన్య (నె్న) చోడి అనే భోగపుస్త్రీకి పార్వతిఅంశలో వీరచోడవ్వ పుట్టడం, భీమనాయకుడామె శీలాన్ని పరీక్షించడం, ఆమెకైలాసానికి వెళ్ళడం ఈ యక్షగానంలోని కథ.

రచన చక్కగాసాగింది. సంవాదాలెక్కువ. తాళప్రధానాలైన దరువులు విరివిగా ఉన్నాయి. ద్విపదలు, వచనములు, కొన్నిపద్యాలు, అర్ధచంద్రికలు, ఏలలు, జొళరేకులు, జొళరచ్చలు, పాళిరేకులు, మటిమెరేకులు, అనువులు, నడలు, త్రిభంగులు ఉన్నాయి. రొంపిచర్ల చిత్తూరుజిల్లా వాయల్పాడుతాలూకాలోవిదట.

(య. వా. చ. 87)

## వీర చోడుని శాసనము

కాలం : క్రీ. శ. 1150.

శాసనప్రదాత : వీరచోడుడు.

ప్రస్తావితస్థలం : బెజవాద మల్లేశ్వరస్వామి ఆలయం.

శాసనవిషయం : శాసనప్రదాతయైన వీరచోడుడు-తనకుమారై "ఎఱకమ" కు శుభం కలగటానికి బెజవాదలో వేంచేసిన మల్లేశ్వరస్వామికి అఖండదీపం విలిపినట్లు ఈ శాసనంవల్ల తెలుస్తుంది. దీనిలో ఒక 'తరువోజ' ఉంది. (తె. క. చ-218)

## వీరచ్ఛందస్సు

నామాంతరం: వీరభూపాలీయము (చూ). (ద. దే. వా 478)

## వీర నాగ కవి

కాలం : తెలియదు.

చాటుకవి. ఒక చొప్పకట్ట ("చొప్ప చొప్పు")ను పుట్టా కోదండ రామయ్య తనకు ఇస్తే "చాతుర్థికముల" బాధ తగ్గుతుందని ఈ కవి ఒక పద్యంలో చెప్పాడు. (చా. ప. ర.)

## వీర నారాయణ చరిత భాణమ్ (సం)

కర్త : చూ. పెదకోమటి వేమారెడ్డి.

దీనిని తాను వ్రాసినట్లు కవి సాహిత్య చింతామణిలో చెప్పుకొన్నాడు. (రె. రా. చ)

## వీర నారాయణ చరితమ్ (సం)

కర్త : చూ. పెదకోమటి వేమారెడ్డి.

ఈ పేరుతో సంస్కృతంలో ఒక భాణాన్ని ఒక కావ్యాన్నీ వ్రాసినట్లు పెదకోమటి వేమారెడ్డి సాహిత్య చింతామణిలో చెప్పుకొన్నాడు.

## వీరనారాయణ శతకము

కర్త : రావూరి సంజీవరాయకవి.

రచనాకాలం : క్రీ. శ. 1706 ప్రాంతం.

కొలనిపాక వీరనారాయణుని పేర రచించిన శతకం. రావూరి సంజీవకవి కృష్ణభక్తుడు కావడం వల్ల వీరనారాయణుని దివ్య రూపాన్ని వర్ణించి, దశావతార వర్ణన సందర్భంలో శ్రీకృష్ణుని లీలలను ప్రత్యేకంగా వర్ణించినాడు. (శ. సా. వి.)

## వీర పూజ

క్రీ.శ. 11-15 శతాబ్దాల మధ్య కాలంలో ఆంధ్రదేశంలో ప్రచారంలో ఉన్న ఆచారం.

యుద్ధంలో వీరమరణం చెందిన వీరులగాథలను అమిత భక్తి ప్రపత్తులతోగానం చేయడం, వారి చరిత్రను చిత్రఫలకాలమీద వ్రాయించి పూజించడం ఆంధ్రదేశంలో కానవస్తుంది.

ప్రజలు వీరుల స్మృతి చిహ్నంగా వీరకల్లులను ప్రతిష్ఠించడమే కాక అనేక విధాలుగా వారిపట్ల తమకుగల గౌరవాభిమానాలను వ్యక్తంచేసేవారు. "గచ్చు చేసిన చిత్రంపు గద్దె ఫలకంబు" మీద ఆయావీరుల చరిత్రను వ్రాసి పూజించడాన్నే వీర పూజ అంటారు దీన్ని వీరాచారమని కూడా అనేవారట. దీని ప్రస్తావన నాటి సాహిత్యంలో కానవస్తున్నది. (క్రీడాభిరామం-118,125,128)

## వీర బ్రహ్మయోగి

కాలం : క్రీ. శ. 17వ శతాబ్దం పూర్వార్ధం.

స్థలం : కర్నూలు జిల్లా బనగానపల్లి తాలూకా కందిమల్లయ పాలెం గ్రామం.
రచనలు : 1. కాలజ్ఞానతత్త్వములు 2. గోవింద వాక్యములు (గేయాలు).

విజయనగర సామ్రాజ్య పతనానంతరం దేశం మహమ్మదీయపాదాక్రాంత మైనప్పుడు ఆంధ్ర దేశంలో అవతరించిన సిద్ధ పురుషులలో ప్రముఖులు. ఉపనిషత్తులకు నూతన భాష్య కర్తగా, హిందూ మహమ్మదీయ మత సామరస్యానికి నవ సమాజ నిర్మాణానికి రాచబాట వేశారు. ఈయన కొండ గుహలో కూర్చొని కాలజ్ఞానం వ్రాసి, తన మహిమలను అచ్చమ్మ-వేంకటరెడ్డి దంపతులవద్ద ప్రదర్శించి, వారికి మంత్రోపదేశం చేశారు. కడప, కర్నూలు, సిద్ధవట్టం నవాబుల దగ్గరకు పోయి మత సామరస్య బోధ చేసి, మహిమలను ప్రదర్శించి,వారిని శిష్యులుగా చేసుకొని మత సామరస్యానికి పునాదులు చేశారు.

సిద్దయ్య అనే దూదేకుల సాహెబుల బాలుని శిష్యునిగా చేర్చుకొని ఉపనిషత్తులను, యోగతత్త్వ మార్గాలను ఉపదేశించారు. మహమ్మదీయ బాలునికి బ్రాహ్మణేతరులకు ఉపనిషద్బోధ చేయటం పుష్పగిరి అగ్రహారీకులకు, శంకర పీఠాధిపతులకు సహించరానిదై వీరిని వాదానికి ఆహ్వానించారు. వారిలో వీరు సమరస వాదం చేసి శంకరుని మతోద్దేశాన్ని తేట పరిచి, గుణకర్మలను బట్టి ఎవరైనా తత్త్వ విద్యాధికారి కావచ్చునని నచ్చ చెప్పారు. వీరి తత్త్వ బోధలకు అతిలోక మహిమలకు ముగ్ధులైన అగ్రహారీకులు ఈయనను బ్రహ్మ రథా రూఢుని చేసి ఊరేగించి పూజించారు వీరు అస్పృశ్యతా నివారణకు కూడా ప్రచారం చేశారు.

వీరు శిల్పవృత్తులైన కమ్మరం, వడ్రంగం చేసి దానిపై వచ్చిన ధనంతోనే జీవితం గడిపారట వీరి శిష్యులు చాలామంది గృహస్థులే. వీరి మతము "అచలమత" మని, 'శివాద్వైత' మని కొందరంటారు. ఎవరేమన్నా వీరి మతం అద్వైత వేదాంత మార్గమని చెప్పవచ్చు. అంత్య దశలో వీరు జీవత్సమాధి అయ్యారు. (తె. వి. స-4)

## వీరభద్ర కవి

కాలం : క్రీ. శ. 18 శతాబ్దానికి ముందు.
స్థలం : మరకాణము (దక్షిణదేశము).
రచన : సీమంతినీ చరిత్రము (యక్షగానం).

కాళమాంబా లింగనార్యులు తలిదండ్రులు. మేనమామ కుమారుడైన శాంతయ్య ప్రోత్సాహంతో రచనచేశాడు. ఈ కవి పితామహుడు నీలకంఠయ్య దేవీ కీర్తనలు రచించాడట. ముత్తాత చిన్నప్ప చరిత్రం రచించాడట. (య-వా.చ-435)

## వీరభద్ర చరిత్రము (అలభ్యం)

కర్త : గార్లపాటి లక్ష్మణకవి.
రచనాకాలం : క్రీ. శ. 16 వ శతాబ్దం.

ఈ కృతిని గురించి పోశెట్టి లింగకవి ద్వారా తెలుస్తున్నది. (క-స-207)

## వీరభద్ర పళ్ళెం పట్టడం

నామాంతరం : వీరభద్ర విన్యాస నృత్యం (చూ).

## వీరభద్రయ్య

కాలం : క్రీ. శ. 1530–40 ప్రాంతం.

నివాసస్థలం : అరుణాద్రి మంగళం గ్రామం.

భద్రకవి లింగకవి రాసిన సానంద చరిత్ర కృతిపతి. జంగమదేవర. అరుణాద్రి మంగళం అరుణాచలానికి ఉత్తరంగా ఉన్నదట. (ద.దే.వా–16)

## వీరభద్రయ్య

కాలం : క్రీ.శ. 18 వ శతాబ్దం.

స్థలం : తంజావూరు మండలం.

రచన : పదాలు.

పదకర్త. ఇతని స్వరజతులు, దరువులు, తిల్లానాలూ, మండూక శబ్దం, దశావతారశబ్దం మొదలగునవి ప్రఖ్యాతాలు.

మహారాష్ట్ర రాజుల కులదైవం ప్రతాప రామునిపై కీర్తనలు వ్రాశాడు. అవి "ప్రతాపరామ" మకుటంతో ప్రసిద్ధి చెందాయి. దేశీయ రాగాలకు ఈయన ప్రాముఖ్యం ఇచ్చాడు.

ఇతడు మహారాష్ట్ర రాజైన ప్రతాపసింహుని కాలం (1739–63) నాటి వాడని కొందరి అభిప్రాయం. ఇతడు 1741–65 ప్రాంతం వాడని కొందరు నిర్ధారించారు. (తె.వి.స–6; శారదాధ్వజం–160)

## వీరభద్రయ్య

కాలం : క్రీ.శ 19 వ శతాబ్దం.

స్థలం : గుంటూరు మండలం.

చాటుకవి. ఇతడు ప్రభుత్వోద్యోగి అట. వినుకొండ తాలూకా ఈపూరు ఫిర్కాలోని చిట్టాపురాన్ని వర్ణిస్తూ పద్యాలు చెప్పాడు.

## వీరభద్ర విజయము

రచనాకాలం : క్రీ.శ. 1384–99 ప్రాంతం.

కర్త : బమ్మెర పోతన (చూ).

విశిష్టత : నాలుగాశ్వాసాల ప్రబంధం. ఇది భాగవతానికి ముందు రచన అనీ, తరవాత రచన అనీ పండితుల మధ్య భేదాభిప్రాయాలున్నాయి. (ఆం.రా.చ.)

## వీరభద్ర విజయమ్ (డిమము) (సం)

కర్త : డిండిమభట్టు IV (చూ).

స్థలం : విజయనగరము.

ఇది డిమరూపకము. దీనిని రాజనాథ దేవుని ఉత్సవాలలో ప్రదర్శించే వారట. (తె.వి.స-6)

## వీరభద్ర విజయము

కర్త : శివలెంక మల్లనారాధ్యులు.

అంకితం : ఏలూరు జలాపహరీశ్వరునికి.

ఈ యక్షగానంలో వీరభద్రవిజయ కథ ప్రధానమైనది. ఇది మూడాశ్వాసాల గ్రంథం. కూర్మనాథకవి మృత్యుంజయవిలాస రచనా ప్రక్రియతో దీనికి చాలా పోలిక లున్నాయి.

దీనిలో దరువులు, ద్విపదలు, పద్యములు, వచనములు, కందార్థసీసార్థములు, సువ్వి, జోలలు, శోభనములు ఉన్నాయి. రచన చక్కగాఉంది. దీనిని కవి శృంగార నాటక గేయ ప్రబంధంగా పేర్కొన్నాడు. (య. వా. చ. 105)

## వీరభద్ర విజృంభణమ్ (అలభ్యం)

కర్త ; చూ. విశ్వేశ్వర కవిచంద్రుడు.

సంస్కృతగ్రంథం. (అరుద్ర-4)

## వీరభద్ర విన్యాస నృత్యము

నామాంతరాలు : 1. వీరభద్రపళ్ళెం పట్టటం

2. ఖడ్గనృత్యము

ప్రాచీనకాలంనుంచి ఆంధ్రదేశంలో వీరశైవసంప్రదాయంవారు ఈ విన్యాస నాట్యాలు చేస్తూఉండేవారు. శైవమతసంప్రదాయాన్ననుసరించే పద్మసాలీల దేవుడైన భావనాఋషిఉత్సవాలలో, విశ్వబ్రాహ్మణులు జరిపే వీరభద్రఉత్సవాలలో ఈ నృత్యం జరుగుతూఉండేది. పెద్ద పెద్దజాతర్లలోకూడా దీనిని నిర్వహించేవారు.

ఈ నృత్యసమయంలో పెద్దపెద్దప్రభలుకట్టి, ఆ ప్రభలను చక్కగా అలంకరిస్తారు. ప్రభకుముందూ వెనకా స్త్రీ పురుషులూ నడుస్తూఉంటారు. ప్రభముందు సన్నాయి వాయిద్యగాళ్ళుజట్టులు ఉంటాయి. ఈ నృత్యంలో వీరంగం అనే వాయిద్యంవాయిస్తారు. ఇది ప్రత్యేకమైనవాద్యం. కణకణమని అతివేగంగా డోళ్ళు మ్రోగుతాయి. సన్నాయి బూరలు తారాస్థాయిలో గుక్కపట్టి నృత్యకారుని చెవుల్లో ఊదుతారు. ముఖానికి, మనిషి ఉక్కిరి బిక్కిరి అయ్యేటట్లు సాంబ్రాణి ధూపం పట్టిస్తారు. దీనిలో నృత్యం చేసే వ్యక్తి వీరావేశంతో ఒక గెంతుగెంతి, "దళ్ళరభ, అళ్ళరభ," అంటూ-డోలు వాయిద్య గాళ్ళ, ప్రక్కన చేరి, డోలు వాయిద్య గాళ్ళను తప్పించి, ముక్తాయింపు లిప్పించి "దక్షుని దండకం" ప్రారంభిస్తారు.

ఖడ్గంపట్టి, దండకం చదువుతూ, వాయిద్యాల గమకాల ననుసరించి అపక్కకు ఈ పక్కకు అడుగు వేస్తూ, కంకణం కట్టిన కత్తిని వేగంగా త్రిప్పుతూ, చివరలో ఏ

గ్రామ దేవతను గాని, ఏ దేవుని పూజిస్తారో ఆ గ్రామం పేరు తలచి జై మంగళగిరి వీరభద్రా! అని ముగించి మ్యాళ్ల వాయిద్య గాళ్ళను అదలించి "శరభ" అంటూ హంగామా చేస్తూ ఆ కత్తిని, ఎవరైతే ఆ ఉత్సవాన్ని జరిపిస్తున్నారో అతని పళ్ళెంలో ఉంచుతాడు.
(నా. ర. చ-265-267)

## వీరభద్ర శతకము

కర్త : చూ. మతుకుమల్లి కృష్ణశాస్త్రి.

గోదావరీ మండలంలోని పట్టసాచల క్షేత్రంలో వెలసిన వీరభద్రేశ్వరుని పరంగా వ్రాసినరచన. 109 సీసపద్యాలతో కూడి ఉంటుంది. పోలవరం జమీందారు వేంకట జగన్నాథరావు ప్రేరణచేత కవి "రామచంద్ర వేంకటకృష్ణారావు" అభ్యుదయం కొరకు ఈ రచన చేశాడు. (ఆం.సం.సా-281)

## వీరభద్రారెడ్డి

కాలం : క్రీ శ. 15 వ శతాబ్ది పూర్వార్ధం:

అల్లాడ రెడ్డి కుమారుడు. అల్లాడ వేమారెడ్డి సోదరుడు. కాటయవేముని అల్లుడు. దొడ్డాంబిక కుమార్తె. అనితల్లి భర్త.

సాహిత్య పోషకుడు. శ్రీనాథుని "కాశీఖండం" కావ్యానికి కృతిభర్త.

విశిష్టత : ఇతడు రాజమహేంద్రవర రెడ్డి ప్రభువులలో చివరివాడు. సంగీత సాహిత్యాలలో ప్రవీణుడు. (రె.రా.చ)

## వీరభద్రులు

క్రీ.శ. 11-15 శతాబ్దాల మధ్య కాలంలో శివాలయ రక్షకులను వీరభద్రులని పిలిచేవారు. పరమ శివ భక్తులు. రుద్రమదేవి మలకాపుర శాసనాన్ని అనుసరించి వీరు చోళ దేశస్థులు, చతుర్థ వర్ణంలో జన్మించిన వారు. దేవతా పీఠం ముందు రక్తాన్ని చిందింప జేయటం, హృదయాన్ని, గర్భకుహరాన్ని చీల్చి కోవటం, కళ్ళను పెకిలించి వెలికి తీయటం మొదలగు పరమ భయంకర కృత్యాలను చేసేవారు. తమ అష్టాంగాల నుంచి నెత్తురు చిందింపజేసి, ఆ రక్తంతో శైవ దేవతలను పూజించేవారు. వీరు భక్త్యావేశాలతో ఎన్నో భయంకర కృత్యాలను చేసేవారట. క్రీడాభిరామం నుండి వీరి విషయాలు విపులంగా తెలుసుకోవచ్చును. కాకతీయుల కాలంలో వీరికి ప్రాచుర్యం ఎక్కువగా ఉండేది. (తెలుగు-జ-మూ-75)

## వీరభూపాలీయము

రచనాకాలం : క్రీ. శ. 1819 ప్రాంతం.
కర్త : తెలియదు.
నామాంతరం : వీరన ఛందస్సు.

కృతిపతి కళువె వీరరాజు కావచ్చు. ఆంధ్రశబ్దచింతామణికి వివరణగ్రంథం. గరళపురీఛందస్సు అనే లక్షణగ్రంథమూ, ఇదీ సమానంగా ఉన్నాయని కొందరు చెప్పారు.

దీని కర్త ఎవరో నిశ్చయంగా తెలీదు. అయితే వీరరాజు పేర, 'వీరనఛందస్సు'గా ప్రసిద్ధమైంది. ప్రతి అసమగ్రంగా లభించింది. (ద. దే. వా-478)

**వీరభూపాలుడు**

కాలం : క్రీ. శ. 15వ శతాబ్దం.

స్థలం : నైజాం మండలం.

ఒక సంస్థానాధిపతి. సాహిత్య పోషకుడు. సకలాగమ పురాణ సమ్మతమైన "గురుదీక్షా బోధ"ను, తెలుగులో పిడుపర్తి బసవకవి చేత వ్రాయించాడు. (క.త-6-29)

**వీరమహేశ్వరము (అలభ్యం)**

కర్త : శివలెంక కొమ్మన (చూ).

**వీరమాహేశ్వరాచార సంగ్రహము**

నామాంతరం : రుద్రాక్ష మాహాత్మ్యము.

కర్త : పర్వతమంత్రి లింగనకవి.

కాలం : క్రీ. శ. 12వ శతాబ్ది కావచ్చు. (16వ శతాబ్దికి పూర్వుడు).

ద్విపదకావ్యం. సంస్కృతంలో నీలకంఠ నాగనాథార్యుడనే శైవాచార్యుని కృతికి అనువాదం. పది ఆశ్వాసాలున్నాయి. కవి మల్లికార్జున పండితారాధ్యుని పేర్కొన్నాడు. విభూతి మహిమ, రుద్రాక్షమహిమ, పంచాక్షరీ మహిమ, హరనామ మహిమ, శివరాత్రి మహిమ, శంఖ చక్రోత్పత్తి, మార్కండేయ చరిత్ర, విష్ణుశాప విమోచనము, శరభేంద్రు మహిమ, వ్యాస శిక్ష ఈ పది అధ్యాయాలలోను ఉన్నాయి. బ్రౌను దొర ఈ గ్రంథాన్ని పరిశీలించాడట. (ద్వి. సా. చ-300)

**వీరమాహేశ్వరాచార సారోద్ధారమ్ (సం)**

నామాంతరం : సోమనాథ భాష్యము.

కర్త : పాల్కురికి సోమనాథుడు.

**వీరముష్టివారు**

కాలం : క్రీ. శ. 11-15 శతాబ్దాల మధ్య ప్రాంతం.

ఆంధ్రదేశంలో ఉండిన శివభక్తులు. శివాలయాలకు రక్షకులుగా ఉండేవారు. వీరు శైవులనే యాచించి జీవిస్తారు. వీరభద్రులు, మైలార భటులు చేసే మత కార్యాలనే వీరూ చేసేవారు. వీరు విశేషించి, రేణుకాదేవి భక్తులు. అష్టాంగాలనుంచి నెత్తురు చిందింపజేసి, ఆ రక్తంతో శైవ దేవతలను పూజించేవారు. అంతేకాక హృదయాన్ని, గర్భుతుహారాన్ని చీల్చుకోవటం, కళ్ళను పెకిలించి వెలికి తీయడం మొదలగు భయంకర కృత్యాలు చేసేవారు. వీరు స్వయంగా తమ శిరస్సును నరుక్కొని బలి అయిపోయే వారట. క్రీడాభిరామంలో వీరిని గురించిన వర్ణన ఉంది. (తెలుగు-జ-మా-75)

**వీరరాఘవకవి**

కాలం : క్రీ. శ. 18వ శతాబ్దం.

స్థలం : శహాజీరాజపురం.

రచనలు : 1. వల్లీ పరిణయమ్ (సం) 2. రామరాజ్యాభిషేక నాటకమ్ (సం)
3. పార్వతీ స్తోత్రమ్ (సం).

ఇతని మొదటి రెండు రచనలూ నాటి ఉత్సవాల్లో ప్రదర్శించేవారు. క్రీ. శ. 1684–1712 నడుమ తంజావూరు నేలిన శహాజీ ఆస్థానంలో ఉండేవాడు. శహాజీ రాజపురాగ్రహార ప్రతిగ్రహీతలలో నొకడు. (ద. దే. వా–180–M. R. T. –33)

## వీరరాఘవాచార్యులు

కాలం : క్రీ. శ. 1770 ప్రాంతం.
స్థలం : వనపర్తి సంస్థానం.
రచన : వీర రాఘవీయము.

విద్వత్కవి. వనపర్తి సంస్థానంలో ఆస్థాన పండితుడు. సంస్కృత భాగవతానికి విశిష్టాద్వైత పరంగా "వీరరాఘవీయ"మనే వ్యాఖ్యను రచించాడు.
(ఆం. సం. సా )

## వీరరాఘవీయ భూమిక

కర్త : చూ. హొసదుర్గం శ్రీనివాసరాఘవాచార్యులు.

వీరరాఘవాచార్యులు రచించిన వీరరాఘవీయానికి (వ్యాఖ్యకు) ఇది భూమిక కావచ్చు. (కేశవపంతుల–సం.సా.)

## వీరరాఘవీయము

కర్త : చూ. వీరరాఘవాచార్యులు.

సంస్కృత భాగవతానికి విశిష్టాద్వైతపరమైన వ్యాఖ్య. వనపర్తి సంస్థానాధీశ్వరులచేత ముద్రితం. విశిష్టాద్వైత ప్రపంచానికి శిరోధార్యమైన రచన. (ఆం.సం.సా.)

## వీరరాజమ్మ కథ

జానపదగేయం. కరుణరసాత్మకమైంది.

చూ. కరుణరస గేయములు.

## వీరరాజోక్తి విలాసము (కన్నడం)

కర్త : [illegible]ఠవె వీరరాజు.

ఇది కన్నడ భాషలో రచితమైన వైద్యశాస్త్ర గ్రంథం. దీనిలో ఔషధాలు చేసే ప్రక్రియలు, చికిత్సా విధానాలు విపులంగా వర్ణితాలు. (తె.వి.స–6)

## వీర వేంకటపతిరాయలు

కాలం : క్రీ. శ. 17 వ శతాబ్దం.

కవి పండిత పోషకుడు.

కుందుర్తి గోవిందయ్య విరచిత "భారతీ పరిణయ" కావ్యానికి కృతిపతి.

ఈయన కవి గోవిందయ్యకు మణీ కనకాభిషేకం చేశాడట. ఇతని కాలం 1586-1664 ప్రాంతమని ఆరుద్ర, 1680-1700 ప్రాంతమని నిడుదవోలు వారు వ్రాశారు.
(ద.దే.వా-365) (ఆరుద్ర-9)

## వీరవైష్ణవము-తెలుగు సాహిత్యము

వీరశైవ మతాన్ని తెలుగు దేశంలో ప్రచారం చేయటానికి తెలుగు సాహిత్యం ఎంత దోహదం చేసిందో, వీరవైష్ణవ మత ప్రచారం చేయటానికి కూడా అంతే దోహదం చేసింది.

విశిష్టాద్వైత మత ప్రవక్తయైన శ్రీమద్రామానుజుల వారి ముద్ర దక్షిణ దేశం నుంచి తెలుగు దేశం మీద పడింది. వైదిక మతేతరాభిమానియైన కులోత్తుంగ చోళుడు (రాజరాజ నరేంద్రుని తనయుడు) శ్రీరామానుజాచార్యుల వారిని అవమాన పరిచినట్లు చరిత్రవల్ల తెలుస్తున్నది. సర్వవర్ణ సమానత్వం, పతితజనోద్ధరణ, తిరుమంత్రోప దేశం ఉన్న ఈ మత విధానం వల్ల ప్రజలు శ్రీవైష్ణవులుగా మారతారని భావించి రామానుజులు ప్రజలకు ఉపదేశమిచ్చి, ఎందరినో తన వైపు త్రిప్పుకొన్నాడు. పలనాటి బ్రహ్మన్న వైష్ణవుడుగా మారటం, వివిధ వర్ణాల స్త్రీలను వివాహ మాడటం, చాపకూడు తినటం వైష్ణవ ప్రభావమే. పలనాటి యుద్ధానికి ఇది ఒక ప్రబల కారణమని పండితాభి ప్రాయం.

శైవులు బౌద్ధజైనాలయాలను శివాలయాలుగా మార్చగా, రామానుజులు వాటిని విష్ణ్వాలయాలుగా మారుస్తూ వచ్చినట్లు పరిశోధకులు చెబుతారు. రామానుజుల వారి ప్రభావం వల్ల విద్యానగర రాజులు, రాజాశ్రితులు, కవి పండితులు వైష్ణవం స్వీకరించారు (విజయనగర రాజులలో ఒక్క సంగమ వంశపు రాజులు మాత్రం వైష్ణవులు కారు). వైష్ణవ మత గ్రంథాలయిన గురుపరంపరా ప్రభావము, ఆచార్య సూక్తిముక్తావళి మొదలయినవి విశేష ప్రచారంలోకి వచ్చాయి. ద్రావిడ ప్రబంధాలు అనుయాయాలయినాయి. వైష్ణవ వాఙ్మయం ద్రావిడ భాషలో ఎక్కువ. 'దివ్య ప్రబంధ యుగాస్యలైన ద్రావిడాంగనలు" తెలుగు సాహిత్యంలో కూడా ప్రత్యక్షమయ్యారు.

ద్వాదశాళ్వారులు, నాథముని, యామునుడు, వేదాంత దేశికులు వైష్ణవ మత ప్రచారకులుగా దేశంలో సుప్రసిద్ధులు.

పొయ్గెయాళ్వార్, పూదత్తాళ్వార్, పేయాళ్వార్, తిరుమళిశైయాళ్వార్, పెరియాళ్వార్, కోతైయాళ్వార్ (గోదాదేవి), తొండరడిప్పొడియాళ్వార్, నమ్మాళ్వార్, తిరుమంగైయాళ్వార్ మొదలయిన వారు పన్నిద్దరాళ్వార్లలోనివారు. వీరు పాడిన పాటలకు 'దివ్య ప్రబంధము'లని పేరు. వీటికి తమిళంలో "నాలాయిరమ్" అని పేరు. అంటే ఈ దివ్య ప్రబంధాలన్నీ నాలుగు వేలన్నమాట. మొదటి ముగ్గురు ఆళ్వార్లు తలా నూరు పాటలు వ్రాశారు. ఈ పాటలను తిరుమంగైయాళ్వార్ ఎక్కువగా వ్రాశాడు. రెండోస్థానం నమ్మాళ్వార్‌ది, తరవాత విష్ణుచిత్తుడు పాశురాలను ఎక్కువగా

రచించాడు. గోదాదేవి నూటదెబ్బది మూడు పాశురాలు రచించింది. ఈమె మొదటి రచన తిరుప్పావై. రెండో రచన నాచ్చియర్ తిరుమొషి. తిరుమొషి అంటే పవిత్ర మైన వాక్కు. ఇది ముఖ్యంగా రంగని గురించి ఆమె పడిన విరహవేదనను తెలియ చేస్తుంది. తిరుప్పావై పరిమాణంలో చిన్నదైనా గుణంలో దొడ్డ రచన. దీని మీద తమిళంలో చాలా వ్యాఖ్యలున్నాయి తమిళ వాఙ్మయంలో ఈ ఆళ్వారుల రచనలకు విశిష్ట స్థానమున్నది.

తమిళ దేశంలోని వైష్ణవ మత ప్రభావం తెలుగు దేశం మీద పడటం వల్ల అప్పటి తెలుగు కవులు తమ కావ్యాలలో ఆళ్వారుల చరిత్రలను, వారి రచనలను చొప్పించి రచన చేసి వైష్ణవ మత ప్రచారానికి దోహదం చేశారు.

ఇక చారిత్రకంగా వీరశైవ - వీరవైష్ణవ మతాలు వృద్ధిచెందుతూ సాహిత్యాన్ని పెంచుతూనే, తత్ఫలితంగా విపరీతమైన స్పర్థలు పెంచుకొన్నాయి. అయినా రాజులు రెండు మతాలవారిని సమంగా ఆదరించారు. ప్రోలయవేముడు శైవుడైనా ఎర్రన రామాయణ, నృసింహపురాణాలను ఆదరించాడు. శ్రీ పర్వత సోపాన స్థాపకులైన రెడ్డి ప్రభువులు వైష్ణవం పట్ల ఆదరణ చూపారు. ఇంతకుముందే బసవ పురాణానికి ప్రతి స్పర్థిగా రంగనాథ రామాయణం వచ్చింది. భక్తుల చరిత్రను పాల్కురికి సోమన్న తీర్చిదిద్దితే, అవాల్మీకాలు - జనానురంజకాలయిన కథలతో రంగనాథ రామాయణ రచన జరిగింది ద్విపదకవితను ద్విపదతో ఎదుర్కొన్నాడు తాళ్ళపాక చిన్నన్న. పరమయోగి విలాసంలో పన్నిద్దరాళ్వారుల చరిత్ర వర్ణితం.

శ్రీ రామానుజుల వారి ప్రభావం 'తాతాచార్యులవారి ముద్ర'గా మారి, వైష్ణవం విజయనగర యుగంలో విజయ ధ్వజమెత్తింది. శ్రీకృష్ణరాయల దివ్య ప్రబంధమైన విష్ణు చిత్తీయం ఈ మత ప్రభావం వల్లనే విరచితం. నందవరీక బ్రాహ్మణుడైన పెద్దన శఠగోపయతికి శిష్యుడు. తెనాలి రామలింగడు రామకృష్ణుడై, భట్టరు చిక్కాచార్యుల ముద్రతో పాండురంగ మాహాత్మ్యాన్ని వ్రాశాడు. పింగళి సూరన్న శైవుడైనా వైష్ణవ మతాన్ని స్వీకరించిన నంద్యాల కృష్ణంరాజును ఆశ్రయించాడు. గోలకొండ నవాబుల కాలంలో గోలకొండకు కరణమై ఉండి సారంగు తమ్మయ్య వైజయంతీ విలాసం వ్రాసి వైష్ణవమత ప్రచారానికి దోహదం చేశాడు.

ఇక ఎందరో శతక యక్షగాన కర్తలు, సంకీర్తనాచార్యులు, పదకవులు' వచనకర్తలు మతాన్ని ప్రచారంచేయటం కోసం రచనలు చేశారు. దక్షిణాంధ్ర యుగంలో చాలా రచనలు ముఖ్యంగా నాయకరాజుల నాటి యక్షగానాలు విష్ణు పారమ్యాన్ని తెలియజేసే రచనలు. (సా. మంజూష-274-276) (వై.ఆ.యు.భా-129)

## వీర శృంగార సాంగత్యము (అలభ్యం)

కర్త : విజయరాఘవుడు

"సాంగత్య రచనలు" క్రొత్తప్రక్రియ. కన్నడ భాషలో ఇవి ఉన్నాయట.

ఇది యక్షగాన రచనాభేదం. ఇది వీరశృంగారావస్థలు పొందు పరచిన కావ్యం కావచ్చు.
(ద దే వా-89)

## వీర శైవ దీక్షాబోధ

నామాంతరం : గురుదీక్షాబోధ.

కర్త : పిడుపర్తి మొదటి బసవన.

ద్విపదకావ్యం. కవి వీర భూపాలుని ఆదేశంపై దీన్ని రచించాడు. మూలం కెరియ పద్మరసు సంస్కృత కన్నడాలలో రచించిన దీక్షాబోధ. కన్నడంలో ఇది రగడ రూపంలోఉంది.

ఈ కావ్యాన్ని ముదిగొండ శంకరారాధ్యులు, కొండూరు కుంకుమయ్య గార్లు ముద్రించారు.

## వీరశైవ మతము-తెలుగు సాహిత్యము

ఈ మతం తెలుగుదేశంలో ఎప్పుడారంభమైందో చెప్పటానికి ఆధారాలు లేవు. ఈ మతసాంప్రదాయగ్రంథాలు కొన్నిటిలో ఇది పంచాచార్యులనుంచి ఉద్భవించిందనీ, కొన్నింటిలో బసవేశ్వరుని నుంచి వెలువడిందనీచెప్పటం జరిగింది. పంచాచార్యులలో రేవణసిద్ధ, పండితారాధ్య, మరుళసిద్ధ, ఏకోరామ, విశ్వారాధ్యులున్నారు వీరిలో రేవణసిద్ధ పండితారాధ్య, ఏకోరామాదులు క్రీ. శ. 11-12 శతాబ్దాలమధ్యవారు. బసవేశ్వరుని కాలం కూడా 12 వ శతాబ్దమే. పై వారంతరూ ఈ మతధర్మప్రచారానికి బాగా కృషిచేశారు. వీరికి ముందు ఒకశతాబ్దికి పూర్వమే ఈ మతానికి ప్రాతిపదిక ఉన్నట్లు ఆ మతధర్మగ్రంథాలు చెబుతున్నాయి. పశ్చిమచాళుక్య జయసింహుడు క్రీ. శ. 11 శతాబ్దిలో పటంచెరువును పరిపాలించేటప్పుడు శివశరణులైన జేడరదాసిమయ్య, శంకరదాసిమయ్య, సుగ్గలదేవి మొదలగు వారు ప్రసిద్ధిపొందారు. ఈ శివశరణులందరికీ మకుటాయమానుడు అల్లమప్రభుడు.

ఇక దక్షిణదేశమైన ద్రావిడదేశంలో క్రీ.శ 7 శతాబ్ది నాటికే ఈమతం ప్రచారంలోఉన్నట్లు తెలుస్తున్నది.అప్పర్,తిరుజ్ఞానసంబంధనాయనార్, సుందరమూర్తినాయనార్ మొదలైన శివభక్తులు ఈమతాన్ని విశేషంగా ప్రచారం చేశారు. పై శివభక్తుల ప్రభావం కన్నడదేశంలో ఉదయించిన వీరశైవం మీద పడినది. కన్నడదేశంలోని శరణులు, బసవేశ్వరుడు, చెన్నబసవడు మొదలగు మహాపురుషులు, పంచాచార్యులు ఈ మతాన్ని బాగా ప్రచారం చేశారు.

ఆంధ్రదేశంలో ఈ వీరశైవమతాన్ని మల్లికార్జున పండితారాధ్యుడు, శివలెంక మంచన, శ్రీపతిపండితుడు విశేషంగా ప్రచారం చేశారు.

(చూ. పండితత్రయము)

ఈ పండితత్రయం వారి "భక్తిమీదివలపు-బ్రాహ్మ్యంబుతోపొత్తు" బాయలేని ప్రభావం శైవులపై బడినది. వీరశైవమతప్రవక్తయైన బసవేశ్వరునికంటె పండితారాధ్యుడు విద్వాంసులు, ప్రతివాదభయంకరులేగాని జనసామాన్యాన్ని ఉద్దీపింపచేయలేకపోయారు.

వీరశైవమత ప్రచారంకోసం అప్పటికి మల్లికార్జునపండితారాధ్యుడు శివతత్త్వ సారం మరికొన్ని గ్రంథాలను కూడా వ్రాశాడు. యథావాక్కుల అన్నమయ్య సర్వేశ్వర శతకం వ్రాశాడు.

అప్పటికి కన్నడ పండితత్రయం వారి వీరశైవ సాహిత్యం కన్నడ దేశంలో ప్రచారంలో ఉంది కన్నడకవులైన హరిహర,పద్మరస, రాఘవాంకు సుబోధకమైన వచన సాహిత్యం నిర్మించారు. హరిహరుడు 'రఘటా' ఛందంలో కావ్యరచనచేస్తే రాఘవాంకుడు దేశిపద్ధతిలో "షట్పది"ని స్వీకరించి కావ్యరచనచేశాడు.

కన్నడవచనాలను, రగడలను, షట్పదులను పాల్కురికి సోమన్నబాగా జీర్ణించుకొని వీరశైవమతప్రచారమే ధ్యేయంగా పెట్టుకొని మార్గపద్ధతికి భిన్నమైన దేశిపద్ధతిని స్వీకరించి కావ్యరచన చేశాడు. దేశిమీద సోమన్నకు విశేషఆదరమున్నప్పటికి, సంస్కృత సాహిత్యరీతులను, మార్గపద్ధతులను పూర్తిగా విరసించలేదు. సర్వసామాన్యమైన జాను తెనుగులో, సుబోధకంగా ఉండేటట్లు కావ్యరచన చేసి వీరశైవమతం ఆంధ్రదేశంలో పెంపొందటానికి విశేషంగా కృషిచేశాడు. తెలుగుసాహిత్యంలో దక్షిణాంధ్రయుగం మహారాష్ట్ర రాజులకాలంలో వచ్చిన యక్షగానాలు చాలావరకు శివపారమ్యాన్ని చాటే రచనలు. (చూ. వివరాలకు పాల్కురికి సోమనాథుడు) (యు. భా; చై. ల-87-103)

## వీరుల గుడి

నామాంతరం : బ్రహ్మనాయుడిమేద.

పలనాటి యుద్ధంలో మరణించిన వీరులకు కట్టించిన గుడి. వీరులకు కల్లు ప్రతిష్ఠ చేసి, కారెంపూడి, మాచర్ల వంటి చోట్ల గుడి కట్టించి, వీరపూజ జరిపినట్లు చారిత్రక, సాహిత్యాధారాలు ఉన్నాయి.

మాచర్ల శిలాశాసనం ప్రకారం వీరులకు మూడు గుళ్ళు కట్టించినట్లు, కారెంపూడి శాసనం ప్రకారం జీవరక్ష తిమ్మన అనే ఆయన వీరులందరికీ 'కల్లు ప్రతిష్ఠ' జరిపి వీరుల గుడి కట్టించినట్లు తెలుస్తున్నది. ఈ గుడిని కారెంపూడిలో స్థానికులు "బ్రహ్మనాయుడు మేడ" అంటారు. (తెలుగు-జ-మా-75)

## వీసర నాడు

ఇది గోదావరీ మండలంలోని మన్యప్రాంతం. రంపచోడవరం, ఎల్లవరం తాలూకాల ప్రాంతం కావచ్చు.ఏరువ భీమనృపాలుడు ఈ నాడు మీద దాడి చేసినట్లు (వీసర నాడును, చక్రగొట్టమున్) తెలుస్తున్నది. (సం.ఆ.వి.కో-5)

## వృత్తగంధి

సంస్కృతంలోని నాలుగు రకాల ప్రధాన గద్యాలలో ఇది ఒకటి. దీనికి వృత్తభాగాలు ఉంటాయి.

"సమర కండూతి నిబిడభుజదండ, కుండలీకృత కోదండ శింజినీ టంకారోజ్జాగరిత వైరినగర" మొదలగు దీర్ఘసమాసంలో 'కుండలీకృత కోదండ' అనే పద

సమూహం అనుష్టప్ వృత్తపాదము. పై విధంగా వృత్తభాగాలున్న గద్యభాగాన్ని వృత్త గంధి అంటారు.

గిడుగు రామమూర్తి పంతులుగారి "ప్రౌఢవ్యాకరణ గమ్మ"లో ఈ సంప్రదాయం పాటింపబడింది. 19 వ శతాబ్దిలో ముద్రితాలైన చాలా పుస్తకాల విషయసూచికలలోను, ముఖపత్రాలలోను ఈ వృత్తగంధి నియమాన్ని పాటించారు. (తె వి స-6)

## వృత్త ముక్తాహారస్తుతి (సం)

కర్త : చూ. హోసదుర్గం కృష్ణమాచార్యులు.

ఛందోగ్రంథం. సంస్కృత రచన. వేంకటేశ్వరుని స్తుతిపరంగా వ్రాయబడింది.

## వృత్తాంతిని (పత్రిక)

ప్రచురణకాలం : క్రీ. శ. 1835 ప్రాంతం.

స్థలం : చెన్నపట్టణం.

గిడుగు రామమూర్తి వ్రాసిన వివాహములను గురించి దుర్వ్యయము అనే లేఖ దీనిలో ప్రచురింపబడిందని, తమ గద్య చింతామణిలో ఈ పత్రికను ఉదాహరించారు.

తక్కిన వివరాలు తెలియవు.

(వీరేశలింగం పంతులు-సమగ్ర పరిశీలన-183)

## వృత్తి

కావ్య పరిభాష. సూత్ర మాత్రానికే చేసిన వ్యాఖ్యను వృత్తి అంటారు. ఇది విషయాన్ని మరీ లోతుగా స్పృశించకుండా చేసిన వ్యాఖ్య. (చూ. సూత్రము.)

## వృత్తి వార్తికమ్ (సం)

కర్త : అప్పయ్య దీక్షితులు.

ఇది అలంకార గ్రంథం. దీనిలో రెండు పరిచ్ఛేదాలున్నాయి. దీనిలో శబ్ద వృత్తులు అభిధ, లక్షణ అని రెండు రకాలు విభజితమైనాయి. సుదీర్ఘ చర్చ ఉంటుంది. (తె. వి. స-6)

## వృద్ధాచల మాహాత్మ్యము

కర్త : రేపూరి అనంతయ్య (చూ).

అంకితం : లింగారెడ్డికి (తురయూరును క్రీ. శ. 1632-67 వరకు పాలించినప్రభువు.)

వృద్ధాచల క్షేత్ర మాహాత్మ్యాన్ని వర్ణించే గ్రంథం. ఇది తిరుచినాపల్లి మండలంలోని పెరంబదూరు తాలూకాలో వెంగుళం సమీపంలో ఉంది.

కృతిపతి లింగారెడ్డి భార్య ఎఱ్ఱాంబికకు వృద్ధాచలేశ్వరుడు కలలో కనిపించి ఆలయ నిర్మాణం కావించమని కోరడం, వృద్ధాచల క్షేత్ర మహిమ ఇందులో విపులంగా వర్ణితాలు. (ద. దే. వా-377)

**వృషభాష్టకము**

రచనాకాలం : క్రీ. శ. 13వ శతాబ్ది ఉత్తరార్ధం.

కర్త : పాల్కురికి సోమన.

విశిష్టత : అష్టకము ఒక సాహిత్య ప్రక్రియ. ఈ వృషభాష్టకం ఎనిమిది వసంత తిలక వృత్తాలలో ఉన్న స్తోత్రం. (యు. భా, చె. ల.)

**వృషాధిప శతకము**

కాలం : క్రీ.శ. 13 వ శతాబ్ది ఉత్తరార్ధం.

కర్త : చూ. పాల్కురికి సోమనాథుడు.

ప్రత్యేకత : బసవేశ్వరుని నందీశ్వరుని అవతారంగా భావించి, ఆయనపై 108 చంపకోత్పలములతో చెప్పిన శతకం. తెలుగు శతకాల్లో మకుటాయమానమైనది. శబ్దాలంకార వైచిత్రిని, అష్టభాషా ప్రావీణ్యాన్ని కవి ఇందులో ప్రదర్శించాడు. శైలి వేగంగాను, చాలా తీక్షణంగాను ఉంటుంది. (శ.త-3)

**వెంకటగిరి**

కాలం : తెలియదు (18 వ శతాబ్దం లోపు).

రచన : కపోత వాక్యము (ద్విపద).

కవిని గురించిన విశేషాలు తెలియరాలేదు. గ్రంథ ప్రతి వేంకటేశ్వర ప్రాచ్య పరిశోధనా సంస్థలో ఉంది. కవి వర్ణనాత్మకంగా రచన చేశాడు. (ద్వి సా.చ-364)

**వెంకటపతి రాయలు III**

కాలం : క్రీ.శ. 1630-42 ప్రాంతం.

విజయనగర సామ్రాజ్యాన్ని పాలించిన చక్రవర్తి. కవి పండిత పోషకుడు. సాహిత్య ప్రియుడు. ఉప్పు గుండూరి పెరియన్నకవి రచించిన " మీనకేతనాభ్యుదయం " ఇతనికే అంకితం. ఇతని ఆస్థానంలో ఋగ్వేది తిరువేంగళయ్య అనే కవి కూడా ఉండేవాడట. మరో కవి ఇతని మీద దండకం చెప్పాడు దానిపేరు "వెంకటపతిరాయల దండకం".

**వెంకట రామశాస్త్రి**

కాలం : క్రీ.శ. 19 వ శతాబ్దం.

స్థలం : అయ్యవారిపల్లి (జటప్రోలు సంస్థానం).

ఆ సంస్థానాన్ని ఆశ్రయించిన మహా విద్వాంసులలో ఒకరు. వివరాలు తెలియవు. (కేశవపంతుల-సం.సా.)

**వెంకట రెడ్డి**

కాలం : క్రీ.శ. 18 వ శతాబ్దం.

స్థలం : బోరవెల్లి (సంస్థానాధీశ్వరుడు).

సాహిత్య పోషకుడు బోరవెల్లి రాణి గిరియమ్మ దత్తపుత్రుడు. వారి తరవాత సంస్థానానికి ప్రభువయ్యాడు.

చింతలపల్లి ఛాయాపతి రచించిన "రాఘవాభ్యుదయ" ప్రబంధానికి ఇతడు కథాశ్రోత. అది విన్న వెంటనే ఆ ప్రబంధాన్ని, తద్రచయితను మిక్కిలి గౌరవించి సమ్మానించిన రస హృదయుడు (అం.సం.సా.)

## వెంకటాచల రెడ్డి

కాలం : క్రీ. శ. 1790 ప్రాంతం.

స్థలం : తీర్థపురి (తురయూరు).

ఇతడు తీర్థపురి పాలకుడట. సాహిత్య పోషకుడు. కుందుర్తి వెంకటాచల కవి చేత కార్తిక మాహాత్మ్యం ప్రబంధాన్ని రచింపజేసి దైవాంకితం చేయించాడు. ఇతని పూర్వీకులు కృష్ణరాయల కాలంలో తీర్థపురి ప్రాంతాన్ని సర్వమాన్యంగా పొందారు. (అరుద్ర-12-119)

## వెంకటార్యుడు

చూ. కుమార ధూర్జటి.

## వెంకటేశ్వరోపాఖ్యానము

రచనాకాలం : క్రీ. శ. 18వ శతాబ్దం.

కర్త : పద్దిపర్తి కోనరాట్కవి.

ప్రబంధం.

## వెంగుళము కృష్ణ మహీంద్రుడు

కాలం : క్రీ. శ. 18వ శతాబ్దం.

స్థలం : వెంగుళం (దక్షిణదేశం).

బిరుదు : జగనొబ్బగండ.

వెంగుళం రాజధానిగా పాలించిన సంస్థానాధీశుడు. సాహిత్య పోషకుడు. వేమూరి చిన అనంతయ్య చేత శ్రీముష్ణ మాహాత్మ్యం వ్రాయించి అంకితం పుచ్చుకొన్నాడు. (అరుద్ర-12-122)

## వెచ్చ కస్తూరి రంగకవి

చూ, కస్తూరి రంగకవి.

శతక కవుల చరిత్రలో ఇతన్ని వెచ్చ కస్తూరి రంగకవిగా పేర్కొన్నారు. (శ. క. చ-704)

## వెణుతురుపల్లి విశ్వనాథకవి

నామాంతరం : దిట్టకవి విశ్వనాథకవి.

కాలం : క్రీ. శ. 1600 ప్రాంతం.

స్థలం : గోదావరీ మండలంలోని ద్రాక్షారామం.

సమకాలికుడు : ఏనుగు లక్ష్మణ కవి.

రచనలు : 1. శ్రీరామ విజయము (అలభ్యం) 2. గౌరీ వివాహము (అలభ్యం) 3. హరిశ్చంద్ర చరిత్ర (అలభ్యం) 4. శేషధర్మములు (అలభ్యం) 5. పారిజాతాపహరణము (సం).

విద్వత్కవి. సంస్కృతంలో కూడ రచనలు చేసినట్లు తెలుస్తున్నది. వేంకటామాత్యుని కుమారుడు ఈతని తండ్రికి దిట్టకవి అనే బిరుదం ఉండటం వల్ల వీరి ఇంటి పేరునే దిట్టకవిగా వ్యవహరించేవారట.

పెద్దాపుర ప్రభువైన వత్సవాయ తిమ్మజగపతి (1555-1607) ఆస్థానంలో ఉండేవాడు. తన రచనలను అతనికే అంకితం ఇచ్చాడు.

రచన సరళంగా ఉంటుంది. (క. త-12-156)

## వెలుతుర్ల ఒడ్డెయ్య

నామాంతరం : వెలుతుర్ల వడ్డికవి.

కాలం : క్రీ.శ. 1600 ప్రాంతం.

స్థలం : కర్నూలు జిల్లా వెలుతుర్ల గ్రామం కావచ్చు.

రచనలు : 1. శృంగార రసాలవాలము (అలంకారశాస్త్రం) 2. బాలగోపాల విలాసము (ప్రబంధం).

గురువు-దేశికాచార్యులు.

వెంగనార్యుని పౌత్రుడు. మంగళగిరి పుత్రుడు.

విశిష్టత : ఈయన అనుపమ బ్రహ్మ విద్యా విహారుడు; ఆంధ్ర గీర్వాణ భాషాద్రక్షకోవిదుడు. నాటకాలంకార నయ విశారదుడు ఈయన తన గ్రంథాలన్నింటినీ దేవునికే అంకిత మిచ్చాడట. ఈయన కవితా చమత్కారుణ్ణని చెప్పుకొన్నాడు కాని ఇతని చమత్కారాలు ప్రచారం పొందలేదు. ఈ కవి బహుశా పేలం కృష్ణభూపాలుని మంత్రి ప్రోత్సాహంతో బాలగోపాల విలాసాన్ని వ్రాశాదేమోనని చాగంటి వారు భావించారు. (అరుద్ర-9-259)

## వెలుతుర్ల వడ్డికవి

నామాంతరం : చూ. వెలుతుర్ల ఒడ్డెయ్య.

## వెన్నమ నాదెండ్ల శాసనము I

కాలం : క్రీ.శ. 1139 ప్రాంతం

స్థలం : గుంటూరు జిల్లా నరసరావుపేట తాలూకా నాదెండ్ల గ్రామం.

శాసన ప్రదాయిని : వదాలి కాటయ మనుమరాలు వెన్నమ

శాసన విషయం : నాదెండ్ల మూలస్థాన దేవరకు వదాలి కాటయ మనుమరాలు అఖండదీపం నిల్పటం. దీనిలో ఒక శార్దూలం, ఒక చంపకమాల, చివర గద్య భాగమున్నాయి (తె క.చ-233)

## వెన్నమ నాదెండ్ల శాసనము II

కాలం : క్రీ. శ. 1150 ప్రాంతం.

శాసన ప్రదాయిని : వడాలి కాటయ తనయ వెన్నమ.

ప్రస్తావిత స్థలము : గుంటూరు జిల్లా నరసరావుపేట తాలూకా నాదెండ్ల గ్రామం.

శాసన విషయం : వడాలి కాటయ - సూరాంబలకు శాసనప్రదాయిని వెన్నమ కుమార్తెయని, ఈమె మహా ధర్మపరురాలని, నాదెండ్ల గ్రామంలో వేంచేసి యున్న కేశవ స్వామికి వెన్నమ అఖండ దీపం నిలిపినట్లు ఈ శాసనం వల్ల తెలియవస్తున్నది. దీనిలో ఒక శార్దూలం (స్వస్తి), ఒక కందపద్యం ఉన్నాయి. (తె.శ.చ-249)

## వెన్నెకంటి చంద్రశేఖర కవి

కాలం : క్రీ. శ. 1700 ప్రాంతం.

స్థలం : వరంగల్లు.

రచనలు : హరిశ్చంద్ర చరిత్ర (రెండు భాగాలు). (గో.క సం.)

## వెన్నెలకంటి అన్నయ

కాలం : క్రీ శ. 15 శతాబ్ది ఉత్తరార్ధానికి పూర్వం కావచ్చు.

రచన : షోడశ కుమార చరిత్ర.

అన్నయామాత్యుని మనుమడు. సూరామాత్యుని కుమారుడు.

ఇతడు తన కావ్యాన్ని తండ్రికే అంకితమిచ్చాడు. ఈ కావ్యం పూర్తిగా లభించలేదు.

ఇతని ఆశ్వాసాంత పద్యాలను జక్కయ అనుసరించాడని అంటారు. అందుచేత ఇతడు 1250 ప్రాంతంవాడని కొందరు భావిస్తున్నారు. తన తండ్రిని పశ్చిమ చాళుక్య చక్రవర్తి అయిన సర్వజ్ఞ సోమేశ్వరునితోను, జగదేక మల్లునితోను పోల్చి చెప్పడంవల్ల ఇతడు 1150 ప్రాంతం వాడు కావచ్చునని కొందరంటున్నారు. మల్లంపల్లి వారు ఇతడు 1450 కి పూర్వుడని భావించారు. (ఆం.రా.చ-503) (క.స-10)

## వెన్నెలకంటి జన్నమంత్రి

కాలం : క్రీ.శ. 14శతాబ్ది ఉత్తరార్ధంకాని, 15వశతాబ్దిపూర్వార్ధం కానికావచ్చు.

రచన : దేవకీ నందన శతకము.

సిద్ధమంత్రి కుమారుడు. రెండో హరిహరరాయల కొడుకు దేవరాయలదగ్గర ఉద్యోగి. దేవకీనందన శతకకర్తృత్వంగురించి భిన్నాభిప్రాయాలున్నాయి. ఈ శతకకర్త జన్నమంత్రేనని, కవిరాక్షసుడుకాదని పండితులు నిరూపించారు. అనాటి ఉచ్చారణతో శిష్ట వ్యావహారికాన్ని గ్రంథస్థం చేసి ఇతడు మొదటివ్యావహారికభాషాకవి అయ్యాడు. విక్రమార్క చరిత్ర కృతిపతి సిద్ధయ ఈ జన్నయ కుమారుడు. (అరుద్ర-4)

## వెన్నెలకంటి వెంకటాచలం

కాలం : క్రీ. శ. 17 వ శతాబ్దం.

స్థలం : గుడ్లూరు.
రచన : కృష్ణవిలాసము.
గురువు : ములుగు గురులింగాచారి.

సంస్కృతాంధ్ర కవితావిశారదుడు. అష్టాంగ యోగాలు తెలిసినవాడు. రచన హృద్యంగా ఉంటుంది.

ఇతని తాత సూరపరాజు. మోజెర్ల వారివద్దగర మంత్రిగా ఉండేవాడు. ఇతని తండ్రి జగ్గనామాత్యుడు. క్రీ శ. 1600 ప్రాంతంవాడట. వీరి ఇంటిపేరు 'వెన్నెలకంటి'గా కొన్ని గ్రంథాలలో ఉంది (ఆరుద్ర-10-250)

## వెన్నెలకంటి సిద్ధయ

కాలం : క్రీ. శ. 15 వ శతాబ్దం.

సాహిత్యపోషకుడు. జక్కనరచించిన విక్రమార్కచరిత్రము ఇతనికే అంకితం. ఇతడు కర్ణాటకప్రభువైన దేవరాయల మంత్రి చామయామాత్యుని వలన మన్ననలందినట్లు తెలుస్తున్నది.

ఇతడు, "నన్నయగంధవారణంబునకు ప్రధానుడై" కీర్తింపబడినట్లు జక్కన చెప్పాడు. ఈరాజెవ్వరో తెలియరాలేదు. (శ. త-4-234)

## వెన్నెలకంటి సుబ్బారావు

కాలం : క్రీ. శ. 1759-1839 ప్రాంతం.
రచనలు : 1. వినోదకథలు 2. చరిత్రభూగోళాది గ్రంథాలు.

ఆంగ్లోద్యోగులు తెలుగునేర్వడానికి వీలుగా గ్రంథాలు ఉండవలెనన్నలక్ష్యంతో చిన్నచిన్న కథాగ్రంథాలు వెలువరింపజేయడానికి బ్రిటిషుప్రభుత్వం పూనుకొన్నరోజులలో ఈయన రచనలుచేశాడు. మదరాసు పాఠశాలల పుస్తకసంఘానికి ముఖ్యుడుగా ఉండేవాడు. చరిత్ర, భూగోళాది గ్రంథాలు వచనంలో ప్రచురించాడు. (వ. వా-58)

## వెన్నెలకంటి సూరన్న

కాలం : క్రీ.శ. 16వ శతాబ్ది పూర్వార్ధం.
స్థలం : గుడ్లూరు (నెల్లూరు ప్రాంతం.)
రచన : విష్ణు పురాణము.

అమరయామాత్యుని పుత్రుడు. సూరనార్యుని పౌత్రుడు.

విశిష్టత : క్రీ.శ. 16 శతాబ్ది పూర్వార్ధంలో ఉదయగిరి రాజధానిగా, కటక ప్రభువులయిన గజపతులవల్ల, విజయనగర పాలకులవల్ల గౌరవ చిహ్నాలు పొంది రాజ్యం చేసిన రావూరి బసవరెడ్డి కుమారుడు రాఘవరెడ్డికి తన కృతిని అంకితం ఇచ్చాడు. సూరన పూర్వులు ప్రోలయ వేముని వద్ద అనపోతుని వద్ద గౌరవం పొందారు. జక్కన పూర్వకవి స్తుతిలో ఇతన్ని పేర్కొన్నాడు. ధర్మ ప్రతిపాదకమైన విష్ణుపురాణాన్ని సుబోధకమైన సరళ రీతిలో ఆంధ్రీకరించాడు. (తె.వి స-4)

## వెన్నెలకంటి సూరామాత్యుడు

కాలం : క్రీ.శ. 15వ శతాబ్దం.

కావ్య పురాణవేత్త. షోడశ కుమార చరిత్ర కృతిపతి.

కావ్యకర్త వెన్నెలకంటి అన్నయ ఇతని కుమారుడే. ఇతడు సూరామాత్యుని పశ్చిమ చాళుక్య ప్రభువైన సర్వజ్ఞ సోమేశ్వరునితోను, జగదేక మల్లునితోను పోల్చారట.

## వెన్నెల నాటకాలు

ఇవి తెలుగు దేశంలో పూర్వకాలం నుంచీ ఉన్న నాటకాలు. పూర్వం ప్రతి వైశాఖ పౌర్ణమికీ, నిండు వెన్నెలలో రెండు మూడు రోజులు ఈ వెన్నెల నాటకాలను ఆడుతూ ఉండేవారు. వీటిని "రాస నాటకాలు" అని కూడా పిలిచేవారు. వీటిలో, భజన గీతాల మాదిరి ఉండే భాగవతంలోని భ్రమర గీతాలను పాడేవారు.

ఈ నాటక ప్రదర్శనకు – వెన్నెలలో ఇసుక దిబ్బల మీద తులసి కొమ్మలు పాతి, తులసి కొమ్మల చాటున గోపికాలీలలను ప్రదర్శించేవారు. తులసి అంటే బృంద. అందుకే వీటిని బృంద గీతాలు, బృందావన గీతాలు అనేవారు. ఇందులోని నటీనటులు – ఆయా కుటుంబాలకు చెందిన బాల బాలికలు. వీరిలో బాలురందరూ కృష్ణులుగాను, బాలికలందరూ గోపికలుగానూ ఒకే రకమైన రంగు బట్టలు ధరించి అభినయించే వారు.

(నా. ర. చ.)

## వెలగపూడి కవులు

కాలం : క్రీ.శ. 16, 17 వ శతాబ్దాలు.

రచనలు : 1. శ్రీకృష్ణ కర్ణామృతము (వెంగన) 2. గాంగేయోపాఖ్యానము (కర్త పేరు తెలియదు) 3. సుమంతోదయము (కర్త పేరు తెలియదు) 4. ఆంధ్ర కర్ణామృతము (కర్త పేరు తెలియదు) 5. వజ్రభుజోపాఖ్యానము (కర్తపేరు తెలియదు) 6. సేతు మాహాత్మ్యము (కర్త పేరు తెలియదు) 7. దత్తాత్రేయ చరిత్ర (కర్త పేరు తెలియదు) 8. మర్యాద రామన్న చరిత్ర (కర్త పేరు తెలియదు).

విశిష్టత : ఇందులో మొదటి కృతిని వెంగన్న వ్రాశాడన్నది స్పష్టం. క్రీ.శ. 1700 ప్రాంతాలలో భానుమద్విజయం వ్రాసిన వెలగపూడి కృష్ణకవి తన వంశీయులు పై గ్రంథాలను వ్రాశారనే చెప్పాడుగాని, ఎవరు దేనిని వ్రాశారో చెప్పలేదు. అయితే గాంగేయోపాఖ్యానం, సుమంతోదయం, ఆంధ్ర కర్ణామృతం అనే మూడు కావ్యాలను వెంగన్న వ్రాసి ఉంటాడని పండితులు ఊహిస్తున్నారు.

వీరు గుంటూరు జిల్లాకు చెందిన వారని తెలుస్తున్నది. (ఆరుద్ర–8–74)

## వెలగపూడి కృష్ణయామాత్యుడు

కాలం : క్రీ.శ. 18 వ శతాబ్ది పూర్వార్ధం.

స్థలం : పాండ్య మండలం.
రచనలు : 1. భానుమద్విజయము 2. మాలినీ మాధవీయము 3. గౌళికాశాస్త్రము 4. యోగశాస్త్ర శతకము (చతుర్విధ కంద శతకము) 5. వేదాంత సార సంగ్రహ శాస్త్రము.
చాటుకృతులు మరి కొన్ని.
గురువు : దక్షిణామూర్తి అవతారమని ప్రసిద్ధి చెందిన రామచంద్ర పరమహంస.

నరహరి మంత్రి కుమారుడు. విజయరంగ చొక్కనాథుని దండనాథుడైన సాంబయామాత్యుని మేనల్లుడు. బహు భాషా కోవిదుడు. ప్రౌఢంగా రసవంతంగా కవిత చెప్ప నేర్చినవాడు. మధుర సంస్థానంలో కృష్ణయామాత్యుని తండ్రి, బంధువర్గమూ, ఉన్నత పదవులలో ఉండేవారు. సాంబయామాత్యుని కుమారుడైన గోవిందామాత్యుడు శివరామయ్య మంత్రి తనను కావ్య రచనకు ప్రోత్సహించినట్లు కవి చెప్పుకొన్నాడు.

కవి రాజ కుటుంబానికి, ఉన్నతాధికార వర్గానికి చెందినవాడై ఉండటం వలన, ఇతని కృతులలో రాజకీయ పరిస్థితులు, రాజ్యాంగ నిర్వహణలోని లోటుపాట్లు ప్రతిబింబిస్తున్నాయి. చారిత్రకంగా ఇతని కృతులు అమూల్యమైనవి. పై కృతులలో భానుమద్విజయం ఒక్కటే నేడు లభిస్తున్నది.

ఇతని రచనలన్నీ భగవదంకితాలే. శంకరుడే స్వయంగా కృతిపతిత్వాన్ని కోరినట్లు కవి చెప్పుకొన్నాడు.

ప్రౌఢమూ, రసవత్తరము అయిన కవిత్వం చెప్పాడు. (వ.దే.వా-389)

## వెలగపూడి వెంగనన్న

కాలం : క్రీ శ. 16వ శతాబ్దం.
స్థలం : గుంటూరు మండలం.
గురువు : కృష్ణాశ్రయుడనే యోగి.
రచన : శ్రీకృష్ణకర్ణామృతము (చంపువు).
మూలం : సంస్కృతి శ్రీకృష్ణకర్ణామృతమ్.
కర్త : లీలా శుకనామాంతరంతో ఉన్న బిల్వ మంగళుడు.

విశిష్టత : ఈయన గుంటూరు జిల్లా వెలగపూడి గ్రామ నివాసి. ఈయన తండ్రి పెద్దయామాత్యుడు. వెంగన్నే కాకుండా వెలగపూడి వంశీయులు తరతరాలనుంచీ కవులనీ, వారు వ్రాసిన కావ్యాలు చాలా ఉన్నాయని భానుమద్విజయ కావ్యకర్త వెలగపూడి కృష్ణ కవి (క్రీ. శ. 1700) అనంతర కాలంలో చెప్పాడు.

ఇతని పద్య మొకటి లింగమగుంట తిమ్మకవి ఉదాహరించాడు. ఇతని రచన పలువురి ప్రశంసలను పొందింనదట. (వ. దే. వా-389)

## వెలనాటి గొంకరాజు మునుగోడు శాసనము

కాలం : క్రీ. శ. 1114 ప్రాంతం.
శాసన ప్రదాత : వెలనాటి గొంకరాజు

శాసనప్రదేశం : గుంటూరు జిల్లా పెదకూరపాడు ఇలాకా మునుగోడు గ్రామంలోని జినేశ్వరాలయం.

ఈయన చందవోలు (గుంటూరు జిల్లా) రాజధానిగా రాజ్యం చేసిన వెలనాటి చోదవంశీయుడు. శాసనం జినేశ్వరాలయం దగ్గర ఉంది, కాబట్టి ఆనాడు జైనమతం ప్రచారంలో ఉన్నట్లు చెప్పవచ్చు. (తె. క. చ-184)

## వెలనాటి చోడుని శాసనము

కాలం : క్రీ శ. 1165 ప్రాంతం.

శాసనప్రదాత : వెలనాటి చోడుడు.

శాసనంలో ప్రసక్తమైనవారు : వీరరాజేంద్రచోడుడు, గొంకరాజు కుమారుడు.

ప్రస్తావితప్రదేశం : ఆంధ్ర భూతలం.

శాసనవిషయం : దీనిలో 1 మత్తేభం, 1 చంపకమాల అనుప్రగంగా ఉన్నాయి. మొదటిపద్యంలో వీరరాజేంద్రచోడుని ప్రశంస, రెండోపద్యంలో గొంకరాజుకుమారుని ప్రశంస ఉన్నాయి. గొంకరాజు కుమారుడు ఎవరో శత్రురాజును చంపినట్లు దీనివల్ల తెలియవస్తున్నది. దీనిలో ఆంధ్రదేశం ప్రసక్తం. (తె. క చ-294)

## వెలనాటి చోళరాజ ప్రశంస శాసనము

కాలం : క్రీ. శ. 1158 ప్రాంతం.

శాసనప్రదాత : వెలనాటి చోళరాజు.

శాసనవిషయం: శాసనప్రదాత ఎన్నోచెరువులు త్రవ్వించినట్లు,సత్రాలుకట్టించినట్లు, ఎన్నోఅగ్రహారాలు దానంచేసినట్లు, కోటిశివాలయాలు కట్టించినట్లు,నూరుయాగాలుచేసినట్లు ఈశాసనం వల్ల తెలుస్తున్నది. పైనఇచ్చిన దానధర్మాలస్థితిని ఎవరయిన చెడగొడితే అపాపాత్ముడు క్రిమియై జన్మిస్తాడని శపిస్తూకూడా పద్యమున్నది. దీనిలో 2చంపకమాలలు 1 కందపద్యం ఉన్నాయి. (తె. క. చ-271)

## వెలనాటి పృథ్వీశ్వరుని పిఠాపురం శాసనము

కాలం : క్రీ. శ. 1186 ప్రాంతం.

శాసనప్రదాత : వెలనాటి చోడపృథ్వీశ్వరుడు.

ప్రస్తావితస్థలాలు : పిఠాపురం, తూర్పుగోదావరిజిల్లా నవఖండ్రవాటి, కోటపురి-గుంటూరుజిల్లా అమరావతిప్రాంతం.

శాసనవిషయం : పృథ్వీశ్వరుడు నవఖండవాడ (కమ్మనాడులోనిది) గ్రామాన్ని పిఠాపురంలో వెలిసిన కుంతీమాధవస్వామికి అర్పించినట్లు పైశాసనంవల్ల తెలుస్తున్నది (ప్రోలునాటిలో కూడా వేరొక నవఖండవాడ ఉన్నట్లు పండితాభిప్రాయం.)

(తె. క. చ-282)

## వెలనాడు

ఇది గుంటూరు మండలంలోని కమ్మనాటికి ఉత్తరంగా, కృష్ణామండలంలో దివి

తాలూకా గుంటూరు - రేపల్లె తాలూకాలు, సత్తెనపల్లి తాలూకాలో పల్నాటికి తూర్పు భాగం, బాపట్లతాలూకాలో ఉత్తరభాగం, తూర్పున సముద్రమున్న ప్రదేశము. దీనిలోని గ్రామాల సంఖ్య ఆరు వేలు. దీనిని దుర్జయ వంశీయులయిన రాజులు చోడ నామంతో పరిపాలించారు. దీనికి రాజధాని ఇప్పటి చందోలు (గుంటూరు జిల్లా). రాజధాని పూర్వపుపేరు ధనదుపురము లేదా సనదప్రోలు. ఈ నాడునుంచి వచ్చిన వారినే వెలనాటి వైదికులని, ఆరువేల నియోగులని వ్యవహరిస్తారు. ఒకప్పుడు ఈ నాడుకు రాజధానిగా ధరణికోట కూడా ఉండేదట. (సం.ఆం.వి.కో-5)

## వెలిగందల కందన మంత్రి

కాలం : క్రీ.శ. 15 శతాబ్ది పూర్వభాగం.
స్థలం : తెలంగాణాలోని సబ్బిమండలం.

ఈయన సబ్బిమండలం ప్రభువైన ముప్పయ భూపాలుని మంత్రి. మడికి సింగన విరచిత పద్మపురాణోత్తర ఖండ కావ్యానికి కృతిభర్త. (వా.చ-33)

## వెలిగందల నారయ్య

కాలం : క్రీ.శ. 1450-1500 ప్రాంతం.
స్థలం : వెలిగందల (కరీంనగరు జిల్లా).
రచన : భాగవతము (ఏకాదశ ద్వాదశ స్కంధాలు).

బమ్మెర పోతనకు ఈ కవి శిష్యుడని చెప్పుకొన్నారు. పోతనకు సమకాలికుడో అనంతరకాలంవాడో అయి ఉంటాడు. మహాభాగవతంలో ఏకాదశ ద్వాదశ స్కంధాలు వ్రాశాడు. ద్వితీయ స్కంధంలో కూడా 92వ పద్యం నుంచి నారయ్య రచన అనే ప్రవాద ముంది. పోతన కవితకు నారయ్య కవితకు చాలా తేడావుంది. రచనలో ఉత్తేజకరమైన కథనం లేదు. హరిభట్టు గ్రంథంలో నుంచి కొన్ని పద్యాలు తీసుకొని లేఖకులు నారయ్య రచనలో చేర్చారని పండితులు నిర్ధారణ చేశారు. కొన్నిచోట్ల పోతన వ్రాసినట్లు నారయ్య కూడా గారడీ కవిత వ్రాశాడు. ప్రౌఢకవి కాదు, వ్యాకరణ దోషాలు ఉన్నాయి. (ఆరుద్ర-6)

## వెలిచేరు వేంకటరామ ప్రధాని

కాలం : క్రీ.శ. 18వ శతాబ్దం.
రచనలు : 1. బాణాసుర యుద్ధ నాటకము. 2. విజయలక్ష్మీనరసింహ విలాసము 3. వియన్నదీ పరిణయము. 4. పంచ వింశతి శతకములు. 5. బాణాసుర యుద్ధము (నాటకము) 6. కృష్ణార్జున సంవాదము (ప్రబంధము)

వెలిచేరు జగ్గయ్య కుమారుడు. ఇతడు 1725కు ముందువాడనీ, 1850 ప్రాంతం వాడనీ భిన్నాభిప్రాయాలున్నవి. (య.వా.చ-40) (శ.క.చ-712)

## వెలిదండ్ల అళఘరి కవి

కాలం : క్రీ.శ. 18వ శతాబ్దం.
స్థలం : పాండ్య మండలం.

రచన : సుదంతా కల్యాణము (సుదంతా పరిణయము).

విజయరంగ చొక్కనాథుని కాలం (క్రీ.శ. 1704-31) నాటి వాడు. పెద రాఘవార్యుని కుమారుడు. వెంగళార్యుని పౌత్రుడు. వెలిదండ్ల వెంకటపతి ఇతని పెదతండ్రి. విజయరంగ చొక్కనాథుని ప్రోత్సాహంతో ఇతడు సుదంతా పరిణయం రచించి శ్రీరంగ పతికి అంకితం ఇచ్చాడు. ఇతని కవిత హృదయంగమంగా ఉంటుంది.
(ద.దే.వా-397)

## వెలిదండ్ల వేంకటపతి

నామాంతరం : అచ్చతెనుగు వెంగన్న.
కాలం : క్రీ.శ. 1740 ప్రాంతం.
స్థలం : ప్రళయ కావేరి (చెంగల్పట్టు జిల్లా పులికాటు).
బిరుదు : కవిసార్వభౌముడు.
రచన : రాధామాధవ సంవాదము.

తిరువేంగళార్యుని పుత్రుడు. అచ్చతెనుగులో కృతి సహస్రము రచియించి అచ్చతెనుగు వెంగనగా ప్రసిద్ధి పొందాడట. నేడవి అలభ్యాలు. ఇతని ఇంటిపేరుకు వెలిగండ్ల వెలిదిండ్ల అని పాఠాంతరాలున్నాయి.

ఇతని కవిత్వం హృదయంగమంగా ఉంటుంది. (ద.దే.వా-498)

## వెలివెల గౌతమరాజు

కాలం : క్రీ.శ. 18 వ శతాబ్దం.
స్థలం : విశాఖ మండలం.
రచనలు : తెలియరాలేదు.

పండితకవి. రేకపల్లి సోమనాథ కవికి ఆంధ్ర ఛందశ్శాస్త్రాన్ని చెప్పిన గురువు.
(క.త-13-62)

## వెలుగోటి యాచమ నాయుడు I

కాలం : క్రీ.శ. 17 వ శతాబ్దం.

సాహిత్య పోషకుడు. కర్ణాటక సామ్రాజ్యపు రాజకీయాలలో ప్రముఖ పాత్ర వహించిన వెలుగోటి నాయకరాజు. తంజావూరి రఘునాథరాయల సమకాలికుడు. అనఘం కొండయ్య అనే కవిని పోషించి అతనికి అభినవదండి అనే బిరుదు ప్రసాదించినట్లు రుక్మావతీ పరిణయం నుంచి తెలుస్తున్నది. (ఆరుద్ర-10-254)

## వెలుగోటి కుమార యాచమనాయుడు

కాలం : క్రీ. శ. 1777-1804 మధ్యకాలం.
స్థలం : వేంకటగిరి (సంస్థానాధీశుడు).

సాహిత్యపోషకుడు. కృతిపతి. పారిజాత ప్రబంధము, మణి మంటప ప్రభావము, లీలావతీ దండకము, తిరునాళ్ళ దండకము ఇతనికి అంకితాలు.

వేంకటగిరి సంస్థాన పాలకులలో 25వ తరంవాడు. ముడుంబి అప్పయదీక్షితులు, నరుకూరి నారాయణప్ప, ధూర్జటి లింగరాజకవి వంటి ప్రముఖులు వీరి ఆశ్రితులు. కస్తూరి రంగప్ప ఈతనిని దర్శించి నవ రత్నములను చెప్పి గౌరవింప బడ్డాడట. నారాయణప్ప వ్రాసిన పారిజాత ప్రబంధ యక్షగానం, ధూర్జటి లింగరాజకవి కృతమైన మణిమంటప ప్రభావము పట్టాభిరామయ్య కవికృతమైన లీలావతీ దండకము, అజ్ఞాతకవి కృతమైన తిరునాళ్ళ దండకం మొదలగు గ్రంథాలను అంకితం కొన్నవాడు.

(ఆం. సం. సా-458, 459)

## వెలుగోటి బంగారు యాచమనాయడు I

కాలం : క్రీ.శ. 1755-1777 మధ్యకాలం.

స్థలం : వేంకటగిరి సంస్థానం.

చూ. బంగారు యాచమనాయడు.

విష్ణుమాయా విలాస కృతిపతి వెంకటగిరి సంస్థాన పాలకుల వంశంలో 24 వ తరం వాడు. సాహిత్య పోషకుడు. విష్ణుమాయా విలాస కర్త అయిన "రోసనూరి వేంకటపతి"ని పోషించినవాడు. (ఆం.సం సా-456)

## వెలుగోటి బంగారు యాచమనాయడు II

కాలం : క్రీ.శ. 1804-1845 ప్రాంతం.

స్థలం : వేంకటగిరి (సంస్థాన పాలకుడు).

శత ఘంటం రంగన్న రచించిన 'హేమవతీ దండకం' కృతిపతి. సాహిత్య పోషకుడు. ఈతడు వేంకటగిరి పాలకులలో 26 వ తరానికి చెందిన వాడు. సాహితీవేత్త.

(ఆం.సం.సా-460)

## వెలుగోటి రాయ మహేంద్రుడు

కాలం : క్రీ.శ. 17 వ శతాబ్దం.

స్థలం : వేంకటగిరి సంస్థానం.

సాహిత్యపోషకుడు, కృతిపతి.

ఇతడు 'వేంకటగిరి' నిర్మాత అయినట్టి వెలుగోటి వెంకటాద్రి కుమారుడు. వెలుగోటి లింగమాంబికా రాయపల పౌత్రుడు. సాహితీప్రియుడు. రేటూరి రంగరాజ కృతిమైన భానుమతీ పరిణయ ప్రబంధానికి కృతిభర్త. వెంకటపతి రాయల కాలంలో ప్రసిద్ధుడైన కస్తూరి రంగప్పనాయనికి ఈతదు పెదతండ్రి మనుమడు. (ఆ.సం.సా-453)

## వెలుగోటి వారి వంశావళి

కర్తలు : వివిధ కాలాలలోని భట్టు కవులు.

ఇది పద్యమయమైన గ్రంథం. రాచకొండ-దేవరకొండ-వేంకటగిరి రేచర్ల వంశీయ రాజుల చరిత్రను, శౌర్య పరాక్రమాదులను, దానకార్యాలను తెలిపే గ్రంథం. పూర్వం భట్టురాజులు చెప్పిన పద్యాలన్నీ దీనిలో కూర్చి ఉన్నాయి. ఇది తరతరాల రేచర్ల వెలమ

నాయకుల చరిత్రను తెలుపుతున్నది. ఎంత చిన్న రాజైనా, ఆతని పరాక్రమాన్ని విస్తృతంగా వర్ణించిన పద్యాలు దీనిలో కోకొల్లలు. దీనిలోని కొన్ని పద్యాలు చరిత్ర కారులకు బాగా ఉపయోగపడ్డాయి. మరికొన్ని పద్యాలలో చెప్పిన విషయాలు నమ్మశక్యం కాకుండా ఉన్నాయి.

పూర్వకాలం నుంచీ భట్టుకవులు చెప్పిన పద్యాలన్నిటిని వేంకటగిరి రేవర్ల ప్రభువులు చాలా జాగ్రత్తగా భద్రపరిచారు. అతిశయోక్తులున్నప్పటికీ ఆసక్తికరమైన గ్రంథం. (రె.రా.చ.)

## వెలుగోటి వారు

వీరు నెల్లూరు మండలంలోని వేంకటగిరి నేలిన ప్రభువులు. ఈ ప్రభువులను కీర్తిస్తూ మంచెళ్ళ కృష్ణకవి మొదలయినవారు చాలా చాటువులు చెప్పారు.

(చా. ప. ర.)

## వెలుగోటి సర్వజ్ఞ కుమార యాచమనాయడు

నామాంతరం : విద్వత్కుమార యాచేంద్రులు.
కాలం : క్రీ. శ. 1695–1748 ప్రాంతం.
స్థలం : వేంకటగిరి (సంస్థానాధీశ్వరుడు).

విద్వత్కుమార యాచేంద్రులుగా ప్రఖ్యాతుడు.

వేంకటగిరి సంస్థాన పాలకుల కోవలో 23వ తరానికి చెందినవాడు. సంస్కృతాంధ్ర భాషాప్రవీణుడు. సాహితీ మర్మజ్ఞుడు. గ్రంథకర్తగా, కారయితగా ప్రసిద్ధి చెందినవాడు. కాళీభక్తుడు. కాళికాదేవి వరప్రసాదంచేత కాళహస్తి జ్ఞాన ప్రసూనాంబికపై ఒక "అష్టకం", ఒక చూర్ణిక వ్రాశాడట ఇవి సంస్కృత భాషలో వ్రాసినట్లు తెలుస్తున్నది.

"చతుష్షష్టి విద్యా సంగ్రహ" కర్త అయినట్టి పురుషోత్తమ పండితుడు, విష్ణుమాయావిలాస కర్త రోసనూరి వేంకటపతికవి మొదలగు వారు ఈతని ఆస్థాన విద్వాంసులు. ఒట్టు గ్రామవాస్తవ్యుడైన "మోచర్ల వెంకన్న కవి" ఈ ప్రభువును దర్శించి తన అభీష్టం నెరవేర్చుకున్నాడట. వెంకన్నకవి సోదరుడైన మోచర్ల దత్తప్ప వెంకటగిరివారి ఆస్థానకవి (ఆం. సం. సా–455–456)

## వెలుగోటి సర్వజ్ఞ కుమార యాచేంద్రుడు

కాలం : క్రీ. శ. 1832–1892 ప్రాంతం.

స్థలం : వేంకటగిరి (సంస్థానాధీశ్వరుడు).

రచనలు : 1. గీతార్థసార సంగ్రహము 2. నాస్తిక ధ్వాంత భాస్కరము 3. నిర్గుణ వాద నిరాకరణము 4. మనస్సాక్ష్యము 5. రత్నషట్కాంగుళీకయము 6. సందిగ్ధ తత్త్వరాద్ధాంతము 7. సభారంజని 8. సర్వమతసార సంగ్రహము 9. సహేతుక నీతి శాస్త్రము 10. హిందూమత విరోధ భంజని.

శృంగార కల్పవల్లికి కృతిపతి. వేంకటగిరి సంస్థానాధిపతి. రాజకవి. వేంకటగిరి వారి వంశంలో, రసార్ణవసుధాకర కర్త సర్వజ్ఞ సింగ భూపాలుని తరువాత అంతటి కీర్తి ప్రతిష్ఠలు పొందినవాడితడే. విద్యాపరిశ్రమలోను, విద్వజ్జన పరిశ్రమలోను వేతృత్వముగల వాడు. కృతిభర్త కృతికర్త కూడ. బహుశాస్త్రవేత్త. ఇతని రచనలు అన్నీ ఇంచు మించుగా తాత్త్విక రచనలు. వ్యావహారిక భాషకు అత్యంత సమీపంలో ఉన్న సరళ గ్రాంథికంలో వ్రాయబడ్డాయి.

వీరి ఆస్థానంలోని విద్వత్కవులలో గోపీనాథము వేంకటకవి ప్రముఖుడు. తర్కభూషణం వేంకటాచార్యులు, గన్నవరం అనంతకృష్ణ శాస్త్రిలు, గరుడాచల సోమ యాజులు వీరి ఆస్థానంలోని వారే. (ఆం. సం. సా-460, 461, 462)

## వెల్లంకి తాతంభట్టు

కాలం : క్రీ. శ. 15వ శతాబ్ది ఉత్తరార్ధం.
స్థలం : కృష్ణా మండలం.
రచనలు : 1. ఛందో దర్పణము 2. కవి (లోక) చింతామణి (కావ్యానుశాసనము).
2. సంక్షేప భాగవతం (కర్తృత్వం సందేహం)

ఆంధ్రలాక్షణికుడు. అనంతుని తర్వాతి కాలంవాడు. తర్క వ్యాకరణాది శాస్త్రాలలో నిష్ణాతుడు. వెల్లంకి అనే గ్రామం కృష్ణామండలంలో నందిగామ తాలూకాలో ఉంది. అది వీరి నివాసమై ఉండెనేమో అని విమర్శకులు భావిస్తున్నారు. "సులక్షణ సారము" అనే గ్రంథం ఇతని రచనగా ముద్రితమై ప్రచారంలో ఉంది కాని అది ఇతనిదికాదు. సంక్షేప భాగవత కర్తృత్వం కూడా నిర్ధారితం కాలేదు.

ఈయన గ్రంథంలో పిల్లలమర్రి పిన వీరన వరకు ఉన్న కవుల గ్రంథాలనుండి ఉదాహరణలున్నాయి. (క. వ-77)

## వెల్లంకి సూర్యరాయుడు

కాలం : క్రీ. శ. 19వ శతాబ్దం.
స్థలం : తిరువూరు.

"రాధికాపరిణయము" కృతిపతి. ఇతడు తిరువూరు జమిందారు. వేంకటగిరి పాలకుడైన సర్వజ్ఞ కుమార యాచేంద్రునికి బావమరిది. గోపీనాథం వేంకటకవి రచించిన రాధికాపరిణయం ఇతనికే అంకితం ఇవ్వబడిందని కొందరి అభిప్రాయం.

(ఆం. సం. సా-466)

## వెల్లంటి కనవ రాజు

కాలం : క్రీ. శ. 18వ శతాబ్దం పూర్వార్ధం.
స్థలం : కార్వేటి నగరం.

సాహిత్య పోషకుడు. ఋగ్వేది వేంకటాచలకవి రచించిన చంపూరామాయణాన్ని అంకితం తీసుకున్నాడు. (క. త-13-117)

## వెల్లకి గంగాధర మంత్రి శాసనము

కాలం : క్రీ. శ. 1117 ప్రాంతం.

శాసనప్రదాత/రచయిత : గంగాధర మంత్రి.

ప్రస్తావిత స్థలాలు : వేంగీమండలంలోని వెల్లంకిపురం, సబ్బిమండలం.

శాసనవిషయం : ఈయన క్రీ. శ. 1158 నుంచి క్రీ. శ. 1195 వరకు పాలించిన కాకతీయ రుద్రదేవుని కాలంలోనివాడు. తాను చేయించిన కార్యాలనన్నింటిని చాలా పద్యాలలో వ్రాసి శాసనం వేశాడు.

గంగాధర మంత్రి మొదట కాకతి ప్రోలరాజుచే ఓరుగల్లు రాజప్రాసాద రక్షకుడుగా నియమితుడై, తరవాత రుద్రదేవుని దగ్గర మహా నియోగ పదవి పొందాడు. చాలా దాన కార్యాలు చేశాడు. ఈయన మంచి కవి. 4 పద్యాలను తృతీయాంతాలుగా చెప్పాడు. దీనిలో 32 పద్యాలు, చివర కొంత గద్య ఉన్నాయి, (తె క. చ-295-303)

## వెల్లలూరి లింగన మంత్రి

కాలం : క్రీ. శ. 19వ శతాబ్దం.

రచన : సరసాంధ్ర వృత్తరత్నాకరము.

వేదాంత తర్క వ్యాకరణాది శాస్త్రాల్లో నిష్ణాతుడు.

## వెల్లాల నరసింగ కవి

కాలం : క్రీ. శ. 19వ శతాబ్ది పూర్వార్ధం.

రచన : సుభాషిత త్రిశతి (ఆంధ్రీకరణం).

భర్తృహరి సంస్కృతంలో రచించిన సుభాషిత త్రిశతిని ఆంధ్రీకరించాడు. ఇతని ఆంధ్రీకరణంలో, "వెల్లూరి వేంకటాచల రమణా" అనే మకుటం ఉన్నది చిన్న కంద పద్యాలలో భావాన్ని చక్కగా ఇమిడ్చి చెప్పాడు. (శ. క. చ-795)

## వెల్లాల రాఘవ జోస్యులు

కాలం : క్రీ. శ. 18-19 శతాబ్దాల నడిమికాలం.

స్థలం : అయ్యవారిపల్లె (జటప్రోలు సంస్థానం).

జటప్రోలు సంస్థానంలోని అయ్యవారిపల్లె గ్రామం పండితులకు నిధి. ఈ విద్వాంసుడు కూడా ఆ గ్రామ నివాసియే. వివరాలు తెలియవు. (కేశవపంతుల-సం.సా.)

## వెల్లాల శంకరశాస్త్రి

కాలం : క్రీ. శ. 19వ శతాబ్దం.

స్థలం : అయ్యవారిపల్లె (జటప్రోలు సంస్థానం).

జటప్రోలుకు సంబంధించిన విద్వాంసులలో ఒకరు.

వివరాలు తెలియవు. (కేశవపంతుల-సం. సా)

## వెల్లుట్ల నారాయణ కవి

కాలం : క్రీ. శ. 1600 ప్రాంతం.

స్థలం : బమ్మెర.
రచన : వజ్రాభ్యుదయము (ప్రబంధం).

ఇతడు బమ్మెర పోతనామాత్యుని వంశంలోని వాడట. ఇతని గ్రంథంలో మొదటి రెండాశ్వాసాలు మాత్రం లభించాయి. (క. స-111)

## వేంకటు కవి

కాలం : క్రీ. శ. 1790-1840 ప్రాంతం.
స్థలం : మేరంగి సంస్థానం.
రచన : కార్తిక మాహాత్మ్యము.
గురువులు : కావేటి వేంకటాఖ్యుడు, శ్రీనివాసార్యుడు.

గౌరీపతి పుత్రుడు, కృష్ణాఖ్యుని పౌత్రుడు. మేరంగి సంస్థానాధీశ్వరులైన, శత్రుచెర్ల చంద్రశేఖరరాజు, జగన్నాథరాజులకు సమకాలికుడు. ఈ జమీందారుల వద్ద దివానుగా ఉన్న మార్కొండ అదెయామాత్యునకు ఆశ్రితుడు. (ఆం. సం. సా-358-357)

## వేంకటు కృష్ణ కవి

నామాంతరం : కనకాశెట్టి వెంకటకృష్ణాశెట్టి.
కాలం : క్రీ. శ. 19వ శతాబ్దం పూర్వార్ధం.
ఆస్థానం : తంజావూరును పాలించిన చివరి మహారాష్ట్ర రాజు శివాజీ (1833-55) ఆస్థానం.
రచన : శివపారిజాతము.

ఇతడు బాల్యంలోనే రచన సాగించాడట. తాను శివాజీ మహీపాలుని తెలుగు కవినని చెప్పుకొన్నాడు. ఇతర రచనలు లభించలేదు. (వ. దే. వా-287)

## వేంకటు కృష్ణ దీక్షితుడు

కాలం : క్రీ. శ. 17వ శతాబ్దం.
స్థలం : తంజావూరు.
రచనలు : 1. నటేశవిజయమ్ (సం) 2. శ్రీరామచంద్రోదయకావ్యమ్ (సం) 3 ఉత్తర చంపువు (సం) 4. కుశలవ విజయ నాటకమ్ (సం)

శివాజీ (క్రీ శ. 1684-1719) ఆస్థానంలోని కవి. తిరుచినాపల్లి, చెంజి ఆస్థానాలలో కూడ సత్కరింపబడ్డాడు. (శారదాధ్వజం-69)

## వేంకటుగిరి

నామాంతరం : కవిగిరి.
కాలం : క్రీ శ. 17వ శతాబ్దం.
స్థలం : తంజావూరు,

రచనలు : 1. రుక్మాంగద చరిత్ర 2. అభినయ దర్పణము 3. ఘటికాచల మహాత్మ్యము (పీఠిక మాత్రమే).
బిరుదు : విచిత్రరాయవతంసుడు.
ఆస్థానం : శహాజీ బంధువులైన విచిత్రరాయని ఆస్థానంలోనూ, తర్వాత అతని కుమారుడైన ఖండోజీరాయని అస్థానంలోనూ ఉన్నాడు. శహాజీ ఆస్థానంలో ప్రఖ్యాతుడైన దర్భాగిరి రాజకవి ఇతని అన్న
సత్కారాలు : ఇతనికి ఖండోజీరాయడు అర్ధసింహాసన మిచ్చి గౌరవించాడట (కృతి స్వీకరించేటప్పుడు కావచ్చు). (ద. దే. వా.)

## వేంకటగిరి (సంస్థానం)

ఇది నెల్లూరు జిల్లాలోని విశాల భూభాగాన్ని ఆక్రమించిన పెద్ద సంస్థానం. ప్రాచీనమైన పడమటి సంస్థానాలలో పూర్వపు రాజవంశం వారి వశంలో విలిచిపోయిన సంస్థానం ఇది.

వెలుగోటి వంశీయులైన పద్మ నాయకులు దీనికి అధిపతులు. వీరికి మూల పురుషుడు చెవిరెడ్డి నామాంతరం కలిగిన పిల్లలమర్రి బేతాళరెడ్డి ఈ చెవిరెడ్డికి 10 వ తరము వాడు సర్వజ్ఞ సింగభూపాలుడు. ఇతడు తెలంగాణ ప్రాంతంలోని "రాచకొండ" రాజధానిగా రాజ్యం చేశాడు. శ్రీనాథాది మహా కవులను సత్కరించిన సాహితీవేత్త.

ఈ వంశంలో 15 వ తరంవాడు "నిర్వాణరాయప్ప నాయడు". ఇతడు విజయనగర శ్రీకృష్ణ దేవరాయలకు సామంతుడు వేంకటగిరి పాలకుల వంశకర్త. ఈ నిర్వాణ రాయప్ప నాయడు, అంతకు ముందు యవనులచేత ఆక్రమింపబడిన "వెలుగోడు"ను జయించి, తిరిగి విజయనగర ప్రభువులకు వశం చేశాడట. అప్పటి నుండి వీరి ఇంటి పేరు "వెలుగోటి" వారు అయింది. ఇతని మూడవ కుమారుడైన "కుమార తిమ్మానాయడు" ఈ వేంకటగిరి పాలకుల వంశానికి మూల పురుషుడు. ఈ తిమ్మా. నాయనికి మూడవ తరం వాడైన "వెంకటాద్రి" వేంకటగిరి నగర నిర్మాత. అప్పటి నుండే "వేంకటగిరి" వీరికి రాజధాని అయింది.

వేంకటగిరి పాలకులు సాహిత్య సేవలో మిక్కిలి ప్రసిద్ధి చెందినవార్కు కొందరు విద్వత్కవులైన పాలకులు కూడా ఉన్నారు. ఈ వంశంలో 27 వ తరానికి చెందిన "సర్వజ్ఞ కుమార యాచేంద్రుడు (క్రీ శ. 1832-1892) స్వయంగా కవి. పెక్కు గ్రంథాలను రచించాడు. "గీతార్థసార సంగ్రహం" మొదలగు వేదాంత గ్రంథాల రచయిత. సాహిత్యాభిమాని. తర్కభూషణం వేంకటాచార్యులు, గోపీనాథం వేంకట కవి వంటి ప్రముఖులను సమాదరించి, అగ్రహారాదులు దానం చేయించాడు. అనేక ధర్మ సత్రాలకు, దేవాలయాలకు భూరి దానాలిచ్చాడు. ఈ 'యాచమనాయని'కి ఏడుగురు కుమారులు, ఇరువురు కుమార్తెలు. వీరిలో మూడవ కుమారుడైన శ్రీరంగపున్నారు కృష్ణయాచేంద్రులను బొబ్బిలి వారికి దత్తత ఇచ్చారు (క్రీ.శ. 1871 లో). రెండవ కుమారుడైన శ్రీరామకృష్ణ యాచేంద్రుడు క్రీ శ. 1896 లో

పిఠాపురం వారికి దత్త కుమారుడైనాడు. జటప్రోలు రాజా వేంకట జగన్నాథరావు గారు ఇతని నాల్గవ పుత్రుడైన "నవనీత కృష్ణ యాచేంద్రులను" దత్తత స్వీకరించారు. ఈ ప్రకారంగా క్రీ. శ. 19 వ శతాబ్దంలో ఈ కుమార యాచమనాయని సంతతి బొబ్బిలి, పిఠాపురం, జటప్రోలు సంస్థానాలలో వ్యాపించింది. జ్యేష్ఠ పుత్రుడైన రాజ గోపాల కృష్ణయాచేంద్రుడు క్రీ. శ. 1878 లో వేంకటగిరి అధిపతి అయ్యాడు. ఈ వంశంలో అతిప్రసిద్ధి గాంచిన ఈ ప్రభువు క్రీ.శ. 1892 లో పరమపదించాడు

వేంకటగిరి పూర్వ రాజన్యులలో రేటూరి రంగరాజ కవి వ్రాసిన "భానుమతీ పరిణయము" అంకితం పొందిన రాయడప్ప నాయడును, ముడుంబి అప్పయ దీక్షితుల "విష్ణుపురాణం" అంకితం పొందిన కుమారయాచమ నాయడును స్మరణీయులు.

మండపాక పార్వతీశ్వరశాస్త్రి, చిలకపాటి వేంకట రామానుజశర్మ, తిరుమల శెట్టి జగన్నాథకవి, ఒడయరు వీరనాగయ మొదలగు కవులను ఈ సంస్థానం పోషించింది. ఇక సుప్రసిద్ధులైన వేదం వేంకటరాయశాస్త్రి, తిరుపతి వేంకటేశ్వర కవులు, అవ్వారి సుబ్రహ్మణ్యశాస్త్రి మొదలగు వారంతా ఎప్పుడో ఒకప్పుడు ఈ సంస్థానం వారిచే ఆద రింపబడిన వారే. శతావధాని పిశుపాటి చిదంబరశాస్త్రి గారు ఈ సంస్థాన విద్వత్కవి నని చెప్పుకున్నారు. ఈ సంస్థాన పాలకులకు చెందిన రాజగోపాల కృష్ణయాచేంద్రుడు, ముద్దుకృష్ణ యాచేంద్రుడు, వేణుగోపాలయాచేంద్రుడు, గోవింద కృష్ణయాచేంద్రుడు మొద లగు వారు కవి పండితాభిమానులై ఆంధ్ర సారస్వతానికి ఎంతో సేవ చేశారు. తదనంతర కాలంలో ఈ సంస్థానం తక్కిన సంస్థానాల వలెనే ఆంధ్ర రాష్ట్రంలో అంతర్లీనమై పోయింది. (ఆం.సం.సా-కేశవపంతుల-సం.సా.)

## వేంకట నగాధిప శతకము

కర్త : మంచెళ్ళ కృష్ణకవి.

ఈ శతకంలో కవి కలియుగ వైకుంఠంగా వాసికెక్కిన తిరుపతి క్షేత్ర వైభవాన్ని, కలియుగ దైవంగా ఆరాధింపబడుతున్న వేంకటేశ్వరునికి నామగుణ స్తుతులను అభివర్ణించాడు. (శ సా.వి-227)

## వేంకట నరసింహ అప్పారావు

కాలం : క్రీ శ. 19 వ శతాబ్దం.

స్థలం : పాల్వంచ.

ఇతడు పాల్వంచ సంస్థానాధీశ్వరుడైన నారయ్యాప్పారావు ముగ్గురి కుమారు లలో కడపటి వాడు. శిష్టా వేంకట సుబ్బయ్య వ్రాసిన "హృదయాభిరామం" అనే గ్రంథానికి కృతిభర్త. గొప్ప సాహిత్య పోషకుడు. (ఆం.సం.సా.)

## వేంకట నరసింహ కవి

నామాంతరం: అప్పల నరసింహ కవి.

కాలం : క్రీ.శ. 1840 ప్రాంతం.

చూ. పక్కి వేంకట నరసింహ కవి. (క స-241; శ.సా.వి-381)

## వేంకట నాథ శతకము (అలభ్యం)

కర్త : మంచెళ్ళ కృష్ణకవి.

ఈ కవి రచించిన వేంకట నగాధిప శతకం ఒకటి ఉన్నది. అదే ఇది కావచ్చును.

## వేంకట నారాయణ కవి

కాలం : క్రీ.శ. 19 వ శతాబ్దం పూర్వార్ధం.
స్థలం : హిందూపురం ప్రాంతం.
రచనలు : రుక్మిణీ పరిణయ నాటకము,మాళము తిమ్మయ్య శెట్టి కథా యక్షగానము, లేపాక్షి భారత నాటకము.

ఇతడు లేపాక్షి రామాయణ కర్త వేంకటరాయ కవికి బావ. గ్రామ కరణమని తెలుస్తున్నది. ఇతని రచనలు సాహితీ వేత్తల ప్రశంసలు పొందినవట. (వీ యు-208)

## వేంకటపతి రాయల దండకము

కర్త : తెలియదు

క్రీ శ. 1630-42 నడుమ విజయ నగరాన్ని పాలించిన మూడవ వేంకటపతి రాయలపై ఎవరో కవి చెప్పిన దండకం. సమకాలీన రాజకీయ విషయాలు ఇందులో సూచితాలు.

## వేంకట మంత్రి శతకము

కర్త : అడిదము సూరకవి.

కవి ఈ శతకాన్ని వేంకట మంత్రి స్తుతి ప్రధానంగా రచించినాడు. ఈవేంకట మంత్రి విశాఖ మండలంలోని శృంగవరపు కోట జమీందారు అయిన కాశీపతి గారి వద్ద దివానుగా ఉండేవాడు. కవి, వేంకట మంత్రి మాట విష్ణుమూర్తి వరమువలె తిరుగు లేనిదని, అతని వాక్యము బాణము వంటిదని వర్ణించినాడు. గుణ సంపదలో వేంకట మంత్రికి షట్చక్రవర్తులు సాటిరారట శతకాంశంలో నీతులు ఉన్నాయి. (శ.సా.వి-288)

## వేంకట మఖి

కాలం : క్రీ.శ. 17 వ శతాబ్దం.
స్థలం : తంజావూరు. విజయరాఘవ నాయకుని ఆస్థానం.
రచనలు : 1. చతుర్దండి ప్రకాశిక (సం) 2. కర్మాంత వార్తికమ్ (సం).

తంజావూరు మంత్రియైన గోవింద దీక్షితుని ద్వితీయ పుత్రుడు. విజయరాఘవ నాయకుని మంత్రి. అతని ప్రోత్సాహంతో రచనలు చేశాడు. విజయరాఘవుని సింహాసనాధిష్ఠుని చేసినదితడే అని అంటారు. (తం.ఆం.నా-250)

## వేంకట మాహాత్మ్యము (అలభ్యం)

కర్త : లింగమకుంట రామకవి.

(ఆరుద్ర-8-133)

## వేంకట రమణప్ప

కాలం : తెలియరాలేదు.

ఈయన దాన ధర్మాలను, గుణగణాలను కీర్తిస్తూ చక్కని చాటువులు దొరికాయి. చాటుకవి వివరాలు, ఈయన వివరాలు విశేషంగా తెలియరాలేదు. (చా.ప.ర.)

## వేంకట రమణ శతకము

రచనాకాలం : క్రీ.శ. 19 వ శతాబ్దం.

కర్త : పత్రి రమణప్ప కవి.

కంద పద్య శతకం. వేంకటరమణా! అనే మకుటంతో ఉంది. ముద్రితం.

(క స-181)

## వేంకట రామ విద్యానందుడు

కాలం : క్రీ శ. 1803-1899 ప్రాంతం.

రచనలు : 1. కైవల్య నవనీతము. 2. త్రివర్గదీపిక 3. అర్థకందములు.

(తె. వి. స-4)

## వేంకట లక్ష్మీ నరసింహనాయుడు

కాలం : క్రీ. శ. 19 వ శతాబ్ది.

ఇతడు అమరావతి సంస్థానాధీశ్వరుల వంశం (వాసిరెడ్డి) లోని వాడు. ఇతని కాలానికి ఈ సంస్థానం కుంఫిణీవారి ఆధీనంలోకి వెళ్ళింది. ఈ వంశం వారసులు కేవలం పింఛనుదారులుగామాత్రం మిగిలిపోయారు. ఇతడు వాసిరెడ్డి లక్ష్మీపతిగారికి దత్తపుత్రుడు. ఈతని దత్త జననీజనకులు చిరకాలం కాంచీపురంలో నివసించడం చేత, ఇతనికి కాంచీపుర విద్వజ్జనుల సమాగమం వలన బహుభాషాపరిచయం,కావ్యకళా మర్మజ్ఞత సిద్ధించాయి. అమరవాది రామకవి ఇతనిచేత పోషించబడ్డాడు. (ఆం. సం. సా.)

## వేంకటాచల మాహాత్మ్యమ్ (సం)

కర్త : తాళ్ళపాక అన్నమయ్య.

కాలం : క్రీ.శ. 15వ శతాబ్దం.

ఈ గ్రంథాన్ని అన్నమయ్య సంస్కృతంలో వ్రాశాడు. ఈ కథ వరాహ పురాణంలో అంతర్భాగంగా ఉంది. (ఆరుద్ర-6)

## వేంకటాచల మాహాత్మ్యము

కాలం : క్రీ. శ. 19 వ శతాబ్ది.

కర్త : శిష్టు కృష్ణమూర్తిశాస్త్రి.

పౌరాణికగ్రంథం. తిరుపతిక్షేత్రమహిమ వర్ణితం.

(వీరేశలింగంపంతులు–సమగ్ర పరిశీలన)

## వేంకటాచల మాహాత్మ్యము

కవయిత్రి : తరిగొండ వేంకమాంబ.

ఇది వేంకటగిరి ప్రాశస్త్యాన్ని వర్ణించే పద్యకావ్యం. ఈ కావ్యంలో కవయిత్రి శృంగారవర్ణన తాను చేయలేనని, శృంగారంపేర అసభ్యవర్ణనలు అసలే చేయజాలనని శ్రీకృష్ణునికి సముచిత రీతిలో విన్నవించింది. కావ్యంలో అనుచితమైన వర్ణనలు లేవు. కొంత పాండిత్యం కవయిత్రికి ఉన్నప్పటికీ వినయాన్ని ఈ కావ్యంలో ప్రదర్శించింది. కవయిత్రి తాను విద్యాధికురాలను కాదని, తన కావ్యాన్ని ఆదరించమని పండితులను వేడుకొన్నది.

సంస్కృత వరాహ భవిష్యోత్తర పద్మపురాణాలలో వచ్చిన వేంకటాచల మాహాత్మ్య ప్రశంసలు ఈ ప్రబంధానికి ఆధారం. వేంకటాద్రి ప్రభావాన్ని తెలపటానికి చెప్పిన మాధవుడనే బ్రాహ్మణయువకుని కథ ఇందులో ఉంది.

ఈ బ్రాహ్మణకుమారుడు యౌవన మదంతో చేయరానిపనులైన జారచోరత్వాలు చేసి, చండాలకన్యను కూడా కామించి, చివరకు వేంకటాచలక్షేత్రంలో ముక్తి పొందుతాడు.

పద్మావతీ–శ్రీనివాసుల కళ్యాణం చక్కగా వర్ణితం. స్త్రీల హృదయాలలోని బాధ, ఆత్మాభిమానం, ఆత్మగోపనం అతిసున్నితంగా వర్ణితాలు.

(సా. చ. ప–234, 235)

## వేంకటాచల యాత్రాచరిత్రము

కర్త : చూ. మతుకుమిల్లి నరసింహశాస్త్రి.

ఆంధ్రకావ్యం. తిరుపతియాత్రను వర్ణించే రచన. (ఆం. ర. 20)

## వేంకటాచల రమణ శతకము

నామాంతరం : శత్రుసంహారశతకము.

కర్త : తెలియదు.

ఇది చారిత్రక శతకం. ఈ శతకం తురుష్కులు ఆంధ్రదేశంలో హిందూ దేవాలయాలను ధ్వంసం చేసేటప్పుడు విరచితం. ఇందులో చిత్తూరు, నెల్లూరు మండలాల లోని దేవాలయాలను దోచుకొనేటప్పుడు జరిగిన తురుష్క విధ్వంసక చర్యలు వర్ణితం. సింహాద్రి నారసింహ, భద్రగిరి శతకాలవలె రచన జరిగింది. వారి దుశ్చర్యలకు తట్టుకోలేక క్షేత్రవైదికులు ఊరు వదలి పారిపోయినట్లు చాలాబాధతో కవి చెప్పాడు. రచన సరసంగా, చక్కగా ఉంటుంది. (శ. సా. వి)

## వేంకటాధ్వరి

కాలం : క్రీ. శ. 18 వ శతాబ్ది.

స్థలము : కాంచీపురము.

బిరుదు : శ్లేషయమక చక్రవర్తి.

రచనలు : 1. విశ్వగుణాదర్శము 2. లక్ష్మీసహస్రము 3. యాదవ రాఘవీయం 4. ఉత్తరచరిత్ర 5. వరదాభ్యుదయ చంపువు 6. ఆచార్యపంచాశత్ 7. శ్రవణానందము 8. సుభాషిత కౌస్తుభము 9. ప్రద్యుమ్నానందము 10. శృంగారదీపిక 11. సుభద్రా పరిణయము.

అన్నీ సంస్కృతగ్రంథాలే. వీటిలో కొన్ని మాత్రమే లభించాయి.

ఈయన కాంచీపుర నివాసి సంస్కృతకవి. ఈయన గ్రంథాలలో విశ్వగుణాదర్శం మిక్కిలి ప్రశస్తమైనది. ఈయన ఈస్టిండియాకంపెనీ పాలన విధానాన్ని వర్ణించాడు. ఆంగ్లేయులు శౌచాది క్రియాహీనులని, వారు పరధనాన్ని అపహరించరని, అసత్యమాడరని, ఆశ్చర్యకరమైన కాచాది వస్తువులు నిర్మిస్తారని, తప్పుచేసేవారిని శిక్షిస్తారని చెప్పాడు. ఈస్టిండియాకంపెనీ వారి పాలన కాలంనాటి సాంఘిక పరిస్థితులను వివరంగా చెప్పాడు. (తె. వి. స-6)

## వేంకటేశ శతకము

కర్త : తాళ్ళపాక శ్రీనివాసుడు.

"కమల వసుధేశ, సర్వయుగాదిపేశ విమల శశికోటి సంకాశ వేంకటేశ" అనే మకుటంతో ఉంది. రచనలో చాలా దోషాలున్నాయనీ అంత ప్రశస్తం కాదనీ విమర్శకుల అభిప్రాయం. దీనిప్రతి ఆంధ్ర సాహిత్య పరిషత్కార్యాలయంలో ఉంది.

(ఆరుద్ర-11-240)

## వేంకటేశాంధ్రము

కర్త : గణపవరపు వేంకటకవి.

కాలం : క్రీ. శ. 17 వ శతాబ్దం.

తెలుగులో మొదటి పద్య నిఘంటువు. సర్వలక్షణ శిరోమణిలోని ద్వితీయోల్లాసమే ఈ పేరుతో ప్రసిద్ధిపొందింది. మొత్తం 128 సీసపద్యాలున్నాయి. అయిదు వర్గులుగా ఉంది. చాలా నిఘంటువులకు ఇది ఆదర్శం.

దీన్ని అనుసరించే తెలుగులో పైడిపాటి లక్ష్మణకవి ఆంధ్రనామ సంగ్రహం మొదలైన ఇతర నిఘంటువులు వచ్చాయి.

వేంకటేశాంధ్రంలోని పద్యాలు "వేంకటేశ" అనే మకుటంతో కంఠస్థం చేయడానికి అనువుగా ఉన్నాయి. ఈ నిఘంటువును శతకమని కూడా అంటారు.

(ఆరుద్ర 11-162)

## వేంకటేశ్వర దీక్షితులు

నామాంతరం : తాళ్ళపాక చినతిరుమలాచార్యుడు (చూ).

## వేంకటేశ్వర మాహాత్మ్యము

కర్త : ములపాక బుచ్చన్నశాస్త్రి.

పద్యకావ్యం. కృత్యవతారికలో కవి తన వంశ విశేషాలు చెప్పుకొన్నాడు. రచన చక్కనిది. (క.చ. 3_173)

**వేంకటేశ్వర వచనములు**

రచనా కాలం : క్రీ.శ. 1493_1553 ప్రాంతం.

కర్త : తాళ్ళపాక పెద తిరుమలాచార్యులు.

విశిష్టత : పూర్వం సింహగిరి వచనాలు వ్రాసిన పద్ధతిలోనే ఈ వేంకటేశ్వర వచనం కవి వ్రాశాడు. (తె.వి.స_6)

**వేంకటేశ్వర విలాసము (అలభ్యం)**

కర్త : ఉప్పల సింహాద్రి నరసింహకవి.

ఈ గ్రంథం దొరకలేదు. పండితులు ఒక పద్యాన్ని చూపుతూ ఇది వేంకటేశ్వర విలాసంలో విరహ ఘట్టంలోనిదని చెబుతున్నారు. (చా.వ.ర.)

**వేంకటేశ్వర విలాసము**

కర్త : చూ. చెళ్ళపిళ్ళ నరసకవి.

ఈ కవి ఏకాంత సేవాకలాపమనే యక్షగానాన్ని రచించినట్లు తెలియవస్తున్నది. అదే వేంకటేశ్వర విలాసం కావచ్చును. (తిరుపతి కవుల కవితా సమీక్ష)

**వేంకటేశ్వర శతకము**

రచనా కాలం : క్రీ.శ. 16వ శతాబ్ది అనంతర కాలం.

కర్త : ఉండుమూడి సూరపరాజు.

చంపక మాలలతో ఉన్న శతకం. "ద్వారకా తిరుపతి వేంకటాచలపతీ – నను బ్రోవుము వేగ శ్రీపతీ" అనే మకుటంతో ఉంది.

**వేంకటేశ్వర శతకము**

రచనా కాలం : క్రీ.శ. 15వ శతాబ్ది.

కర్త : తాళ్ళపాక అన్నమయ్య.

అంకితం : అలమేలు మంగకు.

ప్రత్యేకత : ఇది "వేంకటేశ్వరా!" అనే మకుటంతో 105 పద్యాలున్న ఉత్పల చంపక వృత్తాల శృంగార శతకం. ఈ శతకంలోని పద్యాన్ని పెదపాటి జగన్నాథ కవి ప్రబంధ రత్నాకరంలో ఉదాహరించాడు. (శ వ_6)

**వేంకటేశ్వర శతకము**

రచనా కాలం : క్రీ.శ. 1493_1553 ప్రాంతం.

కర్త : తాళ్ళపాక పెదతిరుమలాచార్యుడు.

ప్రత్యేకత : శ్రీ తిరుపతి వేంకటేశ్వరుని స్తుతించే శతకం. (తె.వి.స_6)

**వేంకటేశ్వర శతకము**

కర్త : నామయోగి

కాలం : క్రీ.శ. 16వ శతాబ్దం.

ఇందులో వెంకటేశ్వరా! అనే మకుటంతో నలభై పంచచామరాలున్నాయి.

ప్రత్యేకత : శతకకర్త వేదాంత విషయాలను ప్రతిపాదించే పద్యాలను చెప్పాడు. యోగి అనేవాడు ఎలా ఉండాలో కవి ఈ శతకంలో చెప్పాడు. రతికి ఒప్పని వాడే రాజయోగి అని ఈ శతకకర్త చెప్పినా, ఈయన ఒకనాడు కాముకుడు. దొరికిన 40 పంచచామరాలతో ఉన్న ప్రతి ఒకటి తంజావూరు సరస్వతీ మహల్ గ్రంథాలయంలో ఉంది. (ఆరుద్ర 8-269)

## వేంకటేశ్వరాంధ్రము

నామాంతరం : వేంకటేశాంధ్రము

కాలం : క్రీ.శ. 17వ శతాబ్ది.

కర్త : గణపవరపు వేంకటకవి.

## వేంకటేశ్వరుల వేట

కర్త : తెలియదు.

జానపద పౌరాణిక గేయం. కథ ప్రసిద్ధం.

చూ. పౌరాణిక గేయములు.

## వేంకటేశ్వరోదాహరణము

రచనా కాలం : క్రీ.శ. 1493-1553 ప్రాంతం.

కర్త : తాళ్ళపాక పెదతిరుమలాచార్యులు.

ప్రత్యేకత : శ్రీ తిరుపతి వేంకటేశ్వరుని స్తుతిస్తూ వ్రాసిన ఉదాహరణ కావ్యం. (తె.వి.స-6)

## వేంగళామాత్యుడు

కాలం : క్రీ.శ. 16వ శతాబ్దం.

స్థలం : గుంటూరు సమీపం (కొండవీటి సీమ).

సముద్రపు పెదచిన్నన్న కుమారుడు. ఇతని మీద పొత్తూరి గోపన్న అనేకవి చెప్పిన ఒక పద్యాన్ని అప్పకవి నామాఖండ విశ్రమానికి ఉదాహరించాడు.

కవి గోపన్న పేర్కొన్న ఈయన పేరుమీద వెంగళాయపాలెం అనే గ్రామం వెలిసి ఉండవచ్చు. పొత్తూరు, వెంగళాయపాలెం అనే గ్రామాలు ప్రస్తుతం గుంటూరు తాలూకాలోనే (కొండవీటి సీమ) ఇరుగు పొరుగున ఉన్నాయి.

(ఆరుద్ర 9-255) (అప్పకవీయం 3-224)

## వేగినాటి కొండన్న

కాలం : క్రీ.శ. 1600 ప్రాంతం.

రచనలు: 1. వివేక సింధువు (వేదాంత గ్రంథం) 2. దత్తయోగీంద్ర కావ్యము (సీస శతకం).

విశిష్టత : ఈయన ఇంటిపేరు బళ్ళపల్లి వారట. ఇతడు "వేగి నాటి వంశ పయః పారావార నిశా కళత్రుణ్ణి" అని గద్యలో చెప్పుకోబట్టి ఈయనను వేగినాటి కొండయ్య - అని సాహిత్యకారులన్నారు. కొండయ్యకు ముందే వివేక సింధువును వచన కావ్యంగా ముకుంద యోగి వ్రాశాడని చెప్తూ కొండయ్య ఆయనకు నమస్కరించాడు. ముకుంద యోగి రచన మహారాష్ట్రి భాషలో ఉంది. ఈ వేదాంత గ్రంథాన్ని తర్వాత తెలుగులో వచన కావ్యంగా కాశీ చెన్న బసవేశ్వరుడనే కవి వ్రాశాడు. (ఆరుద్ర-9)

## వేగినాడు

నన్నయ తన భారతంలో వేంగినాటిని పేర్కొన్నాడు. కేతన, ఎర్రనలు కూడా దీన్ని ప్రస్తావించారు.

భారతావతారికలో "వేంగిదేశమునకు నాయకరత్నంబునుబోలి రాజమహేంద్రవర పురంబునందు" అని, "వేగి విషయాధీశ" "వేగినాథ", "వేగివల్లభ" అని రాజరాజ నరేంద్రుని నుతిస్తూ భారతంలో సూచనలున్నాయి. కేతన "వేగి విషయము" అని, ఎర్రాప్రెగ్గడ "వేగినాట" అని పేర్కొన్నారు.

ఈ వేంగినాడు గోదావరి మండలం నుంచి నెల్లూరు మండలం వరకు వ్యాపించి ఉన్నది.

వేంగినాటికి రాజధాని "వేగి". ఇది పశ్చిమ గోదావరి జిల్లాలో ఏలూరుకు సమీపంలో ఉంది. ఇందులో గ్రామాలు పదునారువేలని శాసనముంది. సముద్రగుప్తుని అలహాబాదు శాసనంలో కూడా "వేంగి" ప్రసక్తమైంది. (సం.ఆం.వి.కో-5)

## వేటూరి భావనామాత్యుడు

నామాంతరం : రేటూరి భావనామాత్యుడు.

కొన్ని గ్రంథాలలో ఇతని ఇంటిపేరు రేటూరిగా ఉంది.

## వేణుగోపాల శతకము

కర్త : చూ. కొటికెలపూడి కోదండరామకవి.

అంకితం : బొబ్బిలి వేణుగోపాలస్వామికి.

వేణుగోపాల స్వరూపమైన శతక రచన. "శ్రీ వేణుగోపాలకా" అనే మకుటంతో వ్రాయబడింది. (ఆం. సం. సా-305)

## వేణుగోపాల శతకము

కర్త : చూ. జనార్దన రంగారాయలు.

అంకితం : బొబ్బిలి వేణుగోపాలస్వామికి.

వంద సీసమాలికలతో కూడిన శతకం. "భవ్యగుణజాల వేణుగోపాల బాల" అనే మకుటంతో ఉంటుంది. (ఆం. సం. సా-307)

## వేణుగోపాల శతకము

కర్త : చూ. పోలిపెద్ది వేంకటరాయకవి.

కవి వేణుగోపాలస్వామి భక్తుడు. అందువలన వేణుగోపాలశతకమనే సీసపద్య శతకం రచించాడు. (ఆం. సం. సా.)

**వేణుగోపాల శతకము**

కర్త : చూ. సారంగపాణి.

ఈ శతకకర్త కార్వేటి సంస్థానాశ్రితుడైన సారంగపాణియని కొందరి అభిప్రాయం. (ఆం. సం. సా)

**వేడుకోలు విన్నపాలు (అలభ్యం)**

కర్త : విజయరాఘవ నాయకుడు (చూ).

కవి తన ఇష్టదైవాన్నుద్దేశించి చేసిన రచన అయి ఉండవచ్చు.

(ద. దే. వా-89)

**వేదం పట్టాభి రామశాస్త్రి**

కాలం : క్రీ. శ. 1760-1820 ప్రాంతం.

స్థలం : విరూరు గ్రామం.

రచనలు : 1. ధాతుమాల 2. పద్యాంధ్ర వ్యాకరణము 3 పట్టాభి రామ పండితీయము 4 తిరుక్కురళ్ (సంస్కృతం).

విరూరుగ్రామం నెల్లూరుజిల్లా ఆత్మకూరు తాలూకాలో ఉంది. ఇతడు సంస్కృతాంధ్ర తమిళాల్లో పండితుడు. ధర్మశాస్త్రవేత్త. వీరిని కుంపిణీ ప్రభుత్వంవారు 1812 లో ఆంధ్రపండితులుగా నియమించారు.చెన్నపురిలోని ఫోర్టుసెయింటు జార్జికళాశాలలో సంస్కృతాంధ్రాలలో ప్రధానోపాధ్యాయుడుగా ఉన్నారు. యఫ్. డబ్ల్యు. ఇల్లిస్ దొరకు ద్రావిడ భాషా పరిశోధనలో తోడ్పడ్డారు. (వ. వా-58) (తె. వి. స-6)

**వేదం వారు**

భారతీయుల పవిత్ర గ్రంథమైన వేదం ఇంటిపేరుగా ఉన్నవారు నెల్లూరు మండలంలో ఎక్కువగా ఉన్నారు (భారతి-మా-45-229)

**వేదం వేంకట రమణశాస్త్రి**

కాలం : క్రీ. శ. 19 వ శతాబ్దం.

రచన : లఘువ్యాకరణము (నరసాపుర వ్యాకరణము).

సంస్కృతాంధ్రాలలో విద్వాంసుడు. మదరాసు, రాజమహేంద్రవరం, కాకినాడ, నరసాపురము, పోడూరు, మొదలైన పట్టణాలలో అధ్యాపకుడుగా పనిచేశాడు, బాలబాలికల ఉపయోగార్థం లఘువ్యాకరణం వ్రాశాడు. ఇది చిన్నయసూరి వ్యాకరణం కంటె ప్రాచీనం. (తె. వ్యా. వికాసం)

**వేదకవి**

కాలం : క్రీ.శ. 17 వ శతాబ్దం.

స్థలం : శహాజీ రాజపురం.

రచనలు : 1. విద్యాపరిణయము (సంస్కృతనాటకం) 2. జీవానందము(సంస్కృత నాటకం).

తంజావూరును పాలించిన శహాజీ (క్రీ.శ. 1684_1728) ఆస్థానంలోనివాడు. పై రెండూ వేదాంత విషయ ప్రబోధకాలైన నాటకాలు. ఇవి ఆనందరాయమఖి కృతులుగా చెప్పబడుతున్నవి. ఇతడే రచించి ఆనందరాయమఖి పేరు పెట్టాడని అంటున్నారు.

(ద.దే.వా_179; M.R.T_32)

**వేదసారము**

కర్త : నడిమింటి సర్వమంగళేశ్వరశాస్త్రి.

కవి వైదిక వైదుష్యాన్ని తెలిపే గ్రంథం. సమాకాలీనుల ప్రశంసల నందుకొన్నది.

**వేదాంతం వారు**

భారతీయ వేదాంత గ్రంథ నామాన్ని ఇంటి పేరుగా ఉన్నవారు దేశంలో ఉన్నారు. సుప్రసిద్ధులైన కూచిపూడి భాగవతులు, నాట్యాచార్యులకు ఈ ఇంటిపేరుంది.

(భారతి_మా_45_225)

**వేదాంత కాలికావళి (సం)**

కర్త : తిరుమల బుక్కపట్టణం బుచ్చి వేంకటాచార్యులు (చూ).

సంస్కృత వేదాంత గ్రంథం. (కేశవపంతుల_సం.సా.)

**వేదాంత కృతి కదంబము**

రచనాకాలం : క్రీ.శ. 19 వ శతాబ్దం.

కర్త : మండపాక రామస్వామిశాస్త్రి.

**వేదాంత పారిజాత సౌరభమ్ (సం)**

కర్త : నింబార్కుడు.

వేదాంత దర్శనంలో ప్రథమ ప్రస్థానమైన బాదరాయణ సూత్రాలకు వ్యాఖ్యానం. భేదాభేదాన్ని లేదా ద్వైతాద్వైతాన్ని బోధించే గ్రంథం. ఇతని గ్రంథాలపై శ్రీనివాసుడు, పురుషోత్తముడు, దేవాచార్యుడు, కేశవాచార్యుడు టీకలు, వివరణలూ వ్రాశారట.

**వేదాంత మంజరి**

కర్త : తెలియదు.

అద్వైత వేదాంత విషయ ప్రతిపాదకమైన ద్విపద కావ్యం. వనితలకు వేదాంత విద్యలో అధికారం లేదు కాబట్టి వారికోసం తాను ఆ విషయాలను ద్విపదలో వ్రాస్తున్నానని కవి చెప్పాడు. రచనలో వ్యావహారిక పదాలున్నాయి. విషయం సుబోధకంగా ఉండాలన్నదే కవి ప్రధానంగా పరిగణించాడు. ఇతడు దక్షిణామూర్తి ఉపాసకుడు.

దీనిప్రతి మదరాసు ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారంలో ఉంది.

(ద్వి.సా.చ_316)

## వేదాంత రసాయనము

అంకితం : ధణి దాసమంత్రికి (నిడుమామిళ్ళ దాసయామాత్యుడు).

కర్త : చూ. మంగళగిరి ఆనందకవి.

రచనాకాలం : క్రీ. శ. 1760 ప్రాంతం.

ఇతివృత్తం : ఏసుక్రీస్తు చరిత్ర. నాల్గాశ్వాసాల పద్య కావ్యం.

కవి క్రైస్తవ మతం స్వీకరించిన తర్వాత ఈ కావ్యం వ్రాశాడట. గ్రంథారంభంలో సర్వేశ్వరస్తుతి, తర్వాత ఏసుక్రీస్తు, మరియమ్మ మొదలైన వారిస్తుతిఉన్నాయి. హిందూ పురాణాలలో కథలు సూతుడు శౌనకాది మహర్షులకు చెప్పిన రీతిగా ఈ కథను, "పర్వతయ్య" అనే అతడు "జ్ఞానప్ప" అనే వానికి చెప్పినట్లు కవి వ్రాశాడు.

(క.శ-13-89)

## వేదాంత వార్తికము

కర్త : పరమానంద తీర్థుడు.

గురుశిష్య సంవాదరూపకమైన వేదాంత వచన గ్రంథం. చక్కని వ్యవహార భాషలో ఉంది.

మూలం : విద్యారణ్యుడు సంస్కృతంలో రచించిన "వేదాంత వార్తికాని"కి తెనుగుసేత.

ఈ గ్రంథాన్ని "అర్థు తార్థోపన్యాసము" అనే పేరుతో తమిళ భాషలోనికి, చిత్ ఘనానందయోగి శిష్యుడు సదాశివయోగి అనువదించాడు. ఈ అనువాదం మణిప్రవాళ శైలిలో (తమిళ-సంస్కృతములు) సాగింది. (వ.వా-36)

## వేదాంత వ్యవహార సార సంగ్రహము

కర్త : దత్తాత్రేయ యోగి.

కాలం : క్రీ శ. 1550 ప్రాంతం.

వ్యావహారిక వచనంలో ఉన్న వేదాంత రచన. గ్రంథకర్త మహారాష్ట్రుడైనా చక్కని తెనుగులో ఈ రచన చేశాడు. అతని శిష్యులు ఈ రచనలో తోడ్పడి ఉండవచ్చును. (క.స-93)

## వేదాంత సార సంగ్రహ శాస్త్రము (అలభ్యం)

కర్త : పెలగపూడి కృష్ణయామాత్యుడు.

వచన కావ్యం. కవి అద్వైత వేదాంత వేత్త, దక్షిణామూర్తి మంత్రోపాసకుడూ కావటంచేత తన రచనలలో యోగ, వేదాంత శాస్త్రాంశాలను మిను మిక్కిలిగా ప్రస్తావించడమే కాక ప్రత్యేకంగా శాస్త్రాలుగా కూడా వ్రాశాడని తెలుస్తున్నది.

(భానుమద్విజయ అవతారిక) (ద.దే.వా-389)

## వేదాంతాచార్యులు, కవితార్కిక

కాలం : క్రీ. శ. 1694 ప్రాంతం.

స్థలం : నిజాం రాష్ట్రం మంచాలకట.
రచనలు : తెలియరాలేదు.
బిరుదు : కవి తార్కిక.

ఇతడు బహు గ్రంథ నిర్మాతగా, చతుస్తంత్ర వేత్తగా ప్రసిద్ధుడు.
(క.త-12-255)

## వేదాంతి షణ్ముఖ దాసు

కాలం : క్రీ. శ. 18 వ శతాబ్దం.
స్థలం : కాళహస్తి సంస్థానం.
రచన : శ్రీరామ వశిష్ఠ సంవాదము.
గురువు : నీలకంఠ యల్లమందయ్య దేవర.

ఇతడు గంగయ పుత్రుడు. కాళహస్తి ప్రభువులలో ఒకరైన రాజాదామెర్ల కుమార వెంకటప్పానాయని (క్రీ. శ. 1745-1795) ఆశ్రయంలోనివాడు. ఇతని 'శ్రీరామ వశిష్ఠ సంవాదము' కాళహస్తి పాలకుల సమాదరణంలో ప్రచురింపబడింది.
(అం.సం.సా-101)

## వేదార్థ ప్రకాశిక (సం)

కర్త : సాయణాచార్యుడు.

వేదాలకు చెప్పిన భాష్యం దీనిలో ఉంది. (తె.వి.సం-4-1191)

## వేమగుంట వేంకట్రాయుడు

కాలం : తెలియదు.

ఈయనను నిందిస్తూ చెప్పిన చాటువొకటి ఉంది. విధవ, మగనికి తిథిపెట్టి, కథలు విని, తీర్థయాత్రలు చేస్తుందని, ఈయన పరమలోభియై దానధర్మాలు చేయకుండా "విధవాయ" అయ్యాడని ఈ చాటువు చెబుతున్నది. (చా.ప.ర)

## వేమన

కాలం : క్రీ.శ. 1412-1480 ప్రాంతం.

వేమన జీవించిన కాలం గురించి, అతని జన్మస్థలం గురించి అభిప్రాయ భేదాలున్నాయి. వేమన కదిరి తాలూకా, కటారు పల్లెకు చెందినవాడని కొందరూ, నెల్లూరు జిల్లాలోని మూగ చింతపల్లె వాడని కొందరూ, ఒంగోలు తాలూకాలోని మూగచింతపల్లె వాడని మరికొందరూ, కొండవీటి వాడని ఇంకొందరూ అంటున్నారు.

విశిష్టత : వేమన కవిత్వం మనోహరమైనది. 'ఈతడు ఆటవెలది ప్రియుడు'. యౌవనంలో ఆటవెలది ప్రియుడై గడిపి, విరాగియై సర్వ సంగ పరిత్యాగియై వేదాంత బోధ చేసేటప్పుడు "ఆటవెలది" ప్రియుడే అయినాడు. నూటికి 90 వంతుల పద్యాలు

ఆత్మ సంబోధనమైన 'విశ్వదాభిరామ వినురవేమ'తో చెప్పాడు. ఇతడు ఒక శతకాన్ని వ్రాయాలని సంకల్పించుకొని చెప్పలేదు. ఏక కాలంలో చెప్పలేదు కనుక వస్తైక్యం లేదు. భావ పునరావృత్తి, వైరుధ్యం ఇతని కవితలో ఉంటుంది. వేమన పద్యాలలోని విషయాలను స్థూలంగా సంఘ విమర్శనం, మతాచార ఖండనం, సామాన్య నీతి ప్రబోధంగా విభజించవచ్చు. వేమన మూఢులకు, కొంచెం జ్ఞానవంతులకు, అభ్యాస స్థితిలో ఉన్న జ్ఞానికి, సంపూర్ణ సిద్ధునకు అందరికీ ఉపయోగపడే ధర్మాలను ఉపదేశించాడు. వేమనకు ఒకజాతిపైగాని, కులముపైగాని, ఒక ఆచారంపైగాని, ధర్మంపైగాని ద్వేషం లేదు. మానవులందరూ ఆత్మజ్ఞానులై, అద్వైతసిద్ధి పొందాలని, తరించాలని అతని కోరిక.

వేమనకు జాతి మత ఆచారాది భేదాలు లేవు. జాతిమత భేదాలను తీవ్రంగా ఖండించాడు. అన్యాయాన్ని, మోసాన్ని, కొంచెం కూడా సహించలేని చిత్తవృత్తి కలవాడు. ఎదుటివారి మనసులకు హత్తుకొనేటట్లు చిన్న చిన్న లోకోక్తులను చెప్పాడు. ఆహ్లాదకరంగా ఉండటానికి, హాస్యోక్తి గాని, చతురోక్తిగాని, జోడించి చెప్పాడు. అందుకే వేమన పద్యాలు పండిత పామర జనరంజకాలయినాయి. (క. శ-6; తె. వి. స-4)

## వేమన శతకము

కర్త : వేమన.

ఆంధ్రదేశంలో బహుళప్రచారం పొందిన శతకం. "విశ్వదాభిరామ వినురవేమ" అనే మకుటంతో ఉన్నాయి. ఈ శతకంలోని పద్యాలను తొలుత సి. పి. బ్రౌన్ అనే పాశ్చాత్య పండితుడు సేకరించి, ఆణిముత్యంవంటి ఆంధ్రకవి వేమనను వెలుగులోకి తెచ్చాడు. ఈ పండితుడే తనకు లభించిన పద్యాలను ఆంగ్లంలోకి అనువదించాడు. 5 వేల పద్యాలకు పైచిలుకుఉన్నాయని పండితులంటారు. కాని చాలా ప్రక్షిప్తాలు. రచన చేయాలనే సంకల్పంతో వేమన పద్యాలు చెప్పలేదు. కాబట్టి ఈ పద్యాలకు వస్తైక్యం లేకపోవటమేగాక, భావ పునరావృత్తి, వైరుధ్యం అక్కడక్కడా కనిపిస్తుంది. ఇందులోని విషయాలను సంఘవిమర్శన, మతాచారఖండన, సామాన్య నీతి ప్రబోధం అని స్థూలంగా విభజించవచ్చు. వేమనకవిత్వం మనోహరంగా ఉంటుంది. ఇందులో నూటికి 90 పద్యాలు ఆత్మసంబోధమైన, "విశ్వదాభిరామ వినురవేమ" అనే మకుటంతో ఉన్నవి.

వేమన జాతి మత సాంఘికాది భేదాలను తీవ్రంగా ఖండించాడు. అన్యాయాన్ని, మోసాన్ని కొంచెం కూడా సహించని చిత్తవృత్తి కలవాడు. స్థూలదృష్టితో చూసేవారికి వేమన వేదశాస్త్ర దూషకుడుగా కనిపిస్తాడు. వేమన వేదాలను, ఉపనిషత్తులను చదవలేదని కొందరు నిరసిస్తారు కాని అది పొరపాటు. వేమన ఎదుటివారి మనస్సులకు హత్తుకొనేటట్లు చిన్న చిన్న లోకోక్తులను చెప్పాడు. ఆహ్లాదకరంగా ఉండటానికి హాస్యోక్తిగాని, చతురోక్తిగాని జోడించిచెప్పాడు. అందుకే వేమనశతకంలోని పద్యాలు పండిత పామర

జనరంజకాలయినాయి. పెద్దపెద్ద వేదాంత విషయాలను సైతం చిన్నచిన్న సూక్తులతో ఆవిష్కరించటంలో వేమనతో సాటివచ్చే తెలుగుకవులు అరుదు.

వేమనకు బంగారం చేసే విద్యకూడా తెలిసేఉంటుందని ఈశతకంలోని కొన్ని పద్యాలను బట్టి చెప్పవచ్చు. (క. త-6) (తె వి. స-4)

## వేమనారాధ్య చరితము

రచన : పావయారాధ్యులు (చూ).

కవి వేమనారాధ్యుల వంశానికి చెందినవాడు కావడంవల్ల భక్తి రసస్ఫోరకంగా ఈ కావ్యం వ్రాశాడు. (ఆం.సం.సా.)

## వేమనారాధ్యుల సంగమేశ్వరారాధ్యుడు

కాలం : క్రీ.శ. 18 వ శతాబ్దం.

స్థలం : కృష్ణా మండలం.

రచన : అహల్యా సంక్రందన విలాసము.

ఈ కవి అమరావతి పాలకుడైన వాసిరెడ్డి వేంకటాద్రి నాయని సోదరపుత్రుడైన చంద్రమౌళి ప్రభువుకు ఆశ్రితుడు. తన గ్రంథాన్ని అతనికే అంకితం చేశాడు. ఇతని కవిత్వం ప్రౌఢమైనది. వ్యాకరణ విరుద్ధమైన ప్రయోగాలున్నవి. (క చ-3-172)

## వేమభూపాల చరితమ్ (సం)

కర్త : చూ. వామనభట్ట బాణుడు.

ఇది కొండవీటిరెడ్డి ప్రభువైన పెదకోమటి వేమునిచరిత్ర. గద్య కావ్యం దీనిలోని వర్ణనలు భట్టబాణుని కాదంబరి, హర్షచరిత్రలలో వలె ఉంటాయని పండితాభిప్రాయం. (రె రా.చ.)

## వేమల వేంకటు రామరాజు

(చూ) నక్కలపాటి సంజీవరాయకవి.

ఒక చిన్న జమీకి అధికారి. మట్ల అనంతరాజుకు విరోధి. మట్లవారి ఆశ్రితుడయిన సంజీవరాయకవి- ఈ వేమల వేంకటరామరాజు కొలువుకు పోయి మట్లవారిని కించపరిచే ధ్వనివచ్చేటట్లు, వేమలవారిని పొగిడినట్లు చాటుపద్యం చెప్పాడు. మట్లవారు ఆ కవిని పిలిపించి సంజాయిషీ అడిగితే, పద్యంలోని పదవిభాగం మరొకరకంగా చేసి, మట్లవారిని నుతించినట్లు చూపాడు. అందుకు మట్లవారు హర్షించి సంజీవరాయ కవిని బహూకరించారట. (చా ప ర)

## వేముగంటి దత్తోజీ పండితుడు

కాలం : క్రీ. శ. 18 వ శతాబ్దం.

రచన : కృష్ణార్జున సంవాదము (భగవద్గీతా యోగశాస్త్రము).

నాగమాంబ, నాగోజీల పుత్రుడు. హృద్యంగా రచన చేసిన కవి.

(క.చ.3-153)

## వేముని పాములపాడు శాసనము

కాలం : క్రీ. శ. 1172 ప్రాంతం.

శాసన ప్రదాత : వేముడు.

ప్రస్తావిత స్థలం : గుంటూరు తాలూకా పాములపాడు గ్రామం.

శాసన విషయం : ఈ శాసనం పాములపాడులో వేంచేసియున్న మల్లికార్జున స్వామి ఆలయానికి ఎదుటఉన్న నంది నాగస్తంభం మీద చెక్కి ఉంది. తన తల్లిదండ్రులకు ధర్మార్థంగా వేముడు మల్లికార్జున స్వామివారికి అఖండదీపం నిలిపినట్లు తెలుస్తున్నది. దీనిలో 2 ఉత్పలమాలలున్నాయి. (తె.క.చ-308b)

## వేముల చిన్నారాయడు

ఈయన కులధర్మం విడిచి, తలవెంట్రుకలు, గడ్డం పెంచి, భిక్షాటనతో జీవితం గడిపినట్లు తెలుస్తున్నది. ఈయనను దొంగ సన్యాసిగా చిత్రించే చాటువు ఒకటి ఉంది. (చా.ప.ర)

## వేములవాడ భీమకవి

కాలం : క్రీ.శ. 1121 ప్రాంతం.

రచనలు : 1. రాఘవ పాండవీయము 2. శత కంఠ రామాయణము 3. నృసింహ పురాణము 4. బసవ పురాణము (కన్నడం) (కర్తృత్వం సందేహం.)

బిరుదు : ఉద్దండ కవి.

భీమకవిని పోషించిన రాజు మైలమ భీమన క్రీ.శ. 1121 ప్రాంతంవాడు.

విశిష్టత : పై గ్రంథాలు అలభ్యం. చాటువులు కొన్ని దొరికాయి. శత కంఠ రామాయణం నుంచి 2 పద్యాలను, నృసింహ పురాణం నుంచి 2 పద్యాలను లాక్షణికులు ఉదాహరించారు. ఇతడే కవిజనాశ్రయ కర్త భీమకవి అని కొందరంటారు గాని అందుకు సంతృప్తికరమైన సాక్ష్యాలు దొరకవు. ఇతనిని లేములవాడ భీమకవిగా కొందరు పేర్కొంటున్నారు. లేములవాడ కరీంనగరు జిల్లాలో ఉంది. ఈ కవి గురించి చాలా కథలు ప్రచారంలో ఉన్నాయి.

తిట్టుకవిగా, శాపానుగ్రహ సామర్థ్యాన్ని వెల్లడించిన కవిగా ఇతడు ప్రసిద్ధుడు.

ఈ ఉద్దండ కవిని తెలుగులో శ్రీనాథ, గోపరాజు వంటి కవులుగాని, వెల్లంకి తాతం భట్టు, చిత్రకవి పెద్దన, లింగం కుంట తిమ్మన, కాకునూరి అప్పకవి వంటి లాక్షణి

కులు గాని మొత్తం 20 మంది దాకా నుతించిన వారూ ఉన్నారు. ఇతని చాటువులు చాలా ఉన్నాయి. ఇతడు కన్నడంలో బసవపురాణం వ్రాశాడని కొందరంటున్నారు.

(ప్రా.ద.దే.చ.) (క స_153) (ఆరుద్ర_1)

## వేములవాడ సోమనాథుడు

కాలం : క్రీ. శ. 17 వ శతాబ్దం.

స్థలం : వేములవాడ.

రచనలు : 1. విద్వజ్జన రంజని 2. చతుర్భుజాభిషేకం (అలభ్యం) 3. ధృవచరిత్ర. (అలభ్యం) 4. మరుత్సందేశము (అలభ్యం). 5. ముద్రాలాభము (అలభ్యం) 6. గంగాగౌరీ సంవాదము (అలభ్యం) 7. యావనచరిత్రము (కర్తృత్వం సందేహం)

పై రచనలలో "విద్వజ్జన రంజని" అనే పేరు గల వసుచరిత్ర వ్యాఖ్యానం ఒక్కటే లభిస్తున్నది. ఇతని గ్రంథాలన్నీ దైవాంకితాలే.

(క.త._12_97, ఆరుద్ర_11_262)

## వేలాల మహాదేవసూరి

కాలం : క్రీ. శ. 17వ శతాబ్దం తరవాత. (నీలకంఠ దీక్షితుని తరవాతవాడు.)

రచన : నీలకంఠ విజయ చంపూ వ్యాఖ్య (విబుధానందమ్).

ఈయన నీలకంఠ దీక్షితుని చంపూ కావ్యానికమనోహరమైన వివరణ వ్రాశాడు. ఈయన వివరణ చదవకపోతే నీలకంఠ విజయ చంపువు అర్థం కాదని పండితాభిప్రాయం. ఈయన నీలకంఠ దీక్షితుని మించిన పండితుడట. (తె. వి. స_6)

## వేల్పూరి విస్సన్న

కాలం : క్రీ. శ. 17వ శతాబ్దం.

స్థలం : కొంతకాలం వారణాసి క్షేత్రంలో ఉన్నాడు.

రచనలు : కాశికా విశ్వనాథ శతకము.

ఔరంగజేబు బలాలు కాశీలోని విశ్వనాథుని ఆలయాన్ని పడగొడుతున్నప్పుడు ఇతడు ఆవేశంతో కాశీ విశ్వనాథ అనే మకుటంతో 73 పద్యాలు చెప్పాడట. క్రీ. శ 1793లో ఇతని మనుమడు కొదవ పద్యాలు చెప్పి, శతకం పూర్తి చేశాడట.

(ఆరుద్ర_12_9)

## వేల్పూరి వేంకటకవి

నామాంతరం : వేల్పూరి వేంకటేశ్వరకవి.

కాలం : క్రీ. శ. 1780_1851.

స్థలం : రావివలస_శ్రీకాకుళం మండలం.

రచనలు : 1. గౌరీశంకర విలాసనాట్య ప్రబంధము 2. రామలీల (యక్షగానము) 3. విచిత్ర రామాయణ కావ్యము 4. జానకీరామ శతకము 5 గోవ్యాఘ్ర పరిచయము (గోవ్యాఘ్ర సంవాదము).

గురువు : గొంగాళ రామశాస్త్రి.

బ్రహ్మనామాత్యుని (బాపనామాత్యుని) పుత్రుడు. రావి వలన చీపురుపల్లికి సమీపంలో ఉన్నదట. ఇతని రచన శ్రావ్యంగా ఉంటుంది. ఇతని కృతులన్నీ విజయనగరం సమీపంలోని రామతీర్థ క్షేత్ర స్వామికి అంకితాలు. ఇతని మొదటి రెండు రచనలూ ముద్రితాలు. వ్యాకరణ విరుద్ధ ప్రయోగాలున్నా కవిత్వం శ్రావ్యంగా ఉంటుంది.
(క. చ-3-235; య. వా. చ-102)

## వేలూ్వరి వేంకటేశ్వరకవి

వ్యవహారనామం : చూ. వేలూ్వరి వేంకటకవి.

## వేశ్యా గృహాలు

కాలం : కాకతీయుల, రెడ్డిరాజుల కాలం (13, 14, 15, శతాబ్దాలు)

పూర్వం వేశ్యలను ఉంచుకోవటం ఘనతగా భావించేవారు. ఆ కాలపు రాజులు సామంతులు, అధికారులు ఆ విషయం సగర్వంగా ప్రకటించుకొనేవారు. నాగన్నమంత్రి "అంగనా హృదయ సరోజ షట్పద" మట. పూర్వపు రాజులు చాలమంది "రాయ వేశ్యా భుజంగ" బిరుదాంచితులు. కాకతీయులకాలంలో విటులకూ, వేశ్యలకూ వచ్చే తగవులు తీర్చడానికి "జార ధర్మాసనా" లుండేవి. ఒక విటుడు వేశ్యతో వివాదపడితే వానిని జార ధర్మాసనానికీడ్చి తీర్పు చెప్పేరట. ఓరుగంటిలో "అగణ్య వస్తు వాహన శోభితంబైన వేశ్యాగృహంబులు" చాలా ఉన్నాయని ఏకామ్రనాథుడు ప్రతాప చరిత్రలో చెప్పాడు. ఆ రోజులలో ఈ గృహాలు చాలా ప్రాముఖ్యమున్నవిగా చెప్పవచ్చు.

రెండో ప్రతాపరుద్రుని ఉంపుడుకత్తె అయిన మాచల్దేవి చరిత్ర ప్రసిద్ధురాలు. ఈమె ఇల్లు సకలాలంకారాలతో శోభిస్తూ ఉండేదట. సంగీత, సాహిత్య, నృత్య గోష్ఠులు ఈ గృహాలలో జరుగుతుండేవి.
(ఆం. సాం. చ-101)

## వైకృత దీపిక

కర్త : బహుజనపల్లి సీతారామాచార్యులు.

విద్యార్థులకు ఉపకరించే వ్యాకరణ గ్రంథం.

## వైజయంతీ విలాసము

కర్త : సారంగు తమ్మయ్య.
రచనాకాలం : క్రీ. శ. 16 వ శతాబ్దం.
అంకితం : శ్రీరామునికి.

నాలుగాశ్వాసాల ప్రబంధం. దీన్ని విప్రనారాయణచరిత్ర అని వ్యవహరిస్తారు. ఇందులో తొండరడిప్పొడి యాళ్వారుచరిత్ర వర్ణితం. ఈతడే విప్రనారాయణుడు. ఇతడు విష్ణుమూర్తి మెడలోఉండే వైజయంతి అనే మాలిక అవతారమట. అందుకే ఈ కావ్యానికి కవి ఆపేరు పెట్టాడు. పరమయోగివిలాసంలో ఉన్న ఈ కథను చదలువాడ మల్లన విప్రనారాయణ చరిత్రమనే పేరుతో చంపూకావ్యంగా రాశాడు. తమ్మయ్య రచన మిగతా వారందరి రచనకూ భిన్నంగా ఉంది. విప్రనారాయణుని సహజభక్తి వైరాగ్యాలను మొదటి

కవులు సహజంగా చిత్రించారు. విప్రనారాయణుని బ్రహ్మచర్య విఘ్నను, దేవదేవి విప్రనారాయణుల శృంగారాన్ని మానవస్వభావానికి అనుగుణంగా ఇతడు వర్ణించాడు. జాతీయోక్తులు, చక్కని హాస్యం కావ్యం నిండా గోచరిస్తాయి. రచన ఇంపైనది.

(అరుద్ర-8)

## వైజయంతీ విలాసము వ్యాఖ్య

కర్త : పైడిపాటి వేంకట నరసు (చూ).

సారంగు తమ్మయ విరచిత వైజయంతీ విలాస శృంగార ప్రబంధానికిది వ్యాఖ్య. బ్రౌన్‌దొర దీనిని వ్రాయించాడు. (తె. సా. విమర్శ-1)

## వైజర్సు అప్పయకవి (వైదర్సు అప్పయకవి)

కాలం : క్రీ. శ. 18 వ శతాబ్దం.

స్థలం : విశాఖపట్టణమండలం.

రచనలు : 1. కరివేల్పు శతకము, 2. ఉపమాక వేంకటేశ్వర శతకము.

కాకర్లపూడి రామభద్ర పాయకరాయప్రభువు కాలంలోనివాడు. ప్రౌఢంగా రసవంతంగా రచన చేశాడు. ఉపమాక విశాఖమండలంలోని ఒకక్షేత్రం. ఇతడు అక్కడి వేంకటేశ్వరునిపై శతకం చెప్పాడు. ఇతనిగురించి కొన్నికథలు ప్రచారంలో ఉన్నాయి. (శ. క. చ-335)

## వైదుంబ మహారాజు (గండత్రినేత్రుడు) వందాడి శాసనము

కాలం : క్రీ. శ. 830 ప్రాంతం.

స్థలం : కడపజిల్లా రాయచోటి తాలూకాలోని వందాడిగ్రామం.

శాసనప్రదాత : గండత్రినేత్రుడు.

శాసనవిషయం : త్రినేత్రుడనేరాజు యుద్ధంలో చనిపోతే, ఆయనను ఖననం చేసేటప్పుడు వేరొక సజీవుని రాజుదేహంతోపాటే ఖననం చేయటం, ఆ చనిపోయిన వాని సంతతికి మడిమాన్యాలను దానం చేస్తూ వేయించిన ఒక విలక్షణమయిన శాసనం. విషయం ఆసక్తికరమైంది.

రేనాటిచోళుల రాజ్యకాలం తరవాత క్రీ. శ. 8వ శతాబ్ది చివరలో కడపమండల ప్రాంతం బాణరాజులకు, వైదుంబరాజులకు వశమైంది. వారికి వైదుంబప్రోలు రాజధాని. రేనాటిచోళులను చంపిన తరవాత కొంతకాలం పొత్తపి (రాజంపేట తాలూకా), కలుగడ (వాయల్పాడు తాలూకా) రాజధానులయినట్లు శాసనాలున్నాయి.

రేనాటి చోళులవలె వీరుకూడ తెలుగు మాట్లాడేవారు. వీరు తెలుగు, కన్నడ బాషలలో శాసనాలు వేయించారు. వీరి శాసనాలు క్రీ. శ. 9, 10, 11, 12 శతాబ్దాలలో కనిపిస్తున్నాయి. ఈ శాసనాలు ఎక్కువభాగం యుద్ధాలను గురించి చెప్తూ, మరణించిన వీరుల స్మారకచిహ్నాలుగా కనిపిస్తాయి.

ఈ శాసనం, వైదుంబ మహారాజైన గండత్రినేత్రుడు యుద్ధంలో పాల్గొన్నట్లు, ఇతనిసేనాపతియైన 'కలిగెత్రినేత్ర' నామధేయుడు మరణించినట్లు తెలుపుతున్నది. చనిపోయిన వీరునికి స్మారకంగా వేయించినదీ ప్రశస్తి శాసనం. ఇతనిని ఖననం చేసేటప్పుడు ఒక బ్రతికి ఉన్నవాడిని కూడా గుంటలో వేసి పూడ్చిపెట్టడం దీనిలోని ఆసక్తికరమయిన విషయం. 'రాచపీనుగ తోడులేనిదే పోదు' అనే ప్రసిద్ధమైన సామెతకు ఈ శాసనం ప్రబల సాక్ష్యం. ఈ సందర్భంలో చనిపోయిన రాజు వస్త్రాలు, అలంకారాలను బ్రతికున్న వ్యక్తికి తొడిగి, ఆ వేషంతోనే ఆ వ్యక్తిని మృతదేహం మీద కూర్చుండబెట్టి పూడ్చేవారట.

రాజుగారితోపాటు సజీవంగా పాతిపెట్టబడిన వ్యక్తి సంతతికి ప్రతిఫలంగా మడిమాన్యాలు ఇచ్చే విషయం ఈ శాసనం తెలుపుతున్నది వీర మరణం పొందిన వారి స్మారక చిహ్నం ఈ శాసనం. (తె.శా-ప.శా-40,41,42)

## వైద్యనాథ సిద్ధాంతి

కాలం : క్రీ. శ. 19 వ శతాబ్దం.
స్థలం : కాంచీనగరము
రచన : భూ ఖగోళ దీపిక.

కవి జ్యోతిశ్శాస్త్ర విశారదుడు. భూగోళ ఖగోళ విషయాలలో పండితుడు. ఇతిహాస పురాణాదులలో సప్రమాణంగా చెప్పబడిన బ్రహ్మాండవిషయాలను తెలుగులో సకలోపయోగకరంగా భూ ఖగోళదీపికలో వివరించాడు. ఇతనికి ముమ్మడిసెట్టి పార్థసారథిసెట్టి ప్రోత్సాహమిచ్చాడట. ఇతని రచన ముద్రితం. (వ.వా.)

## వైద్యనాథుడు

కాలం : క్రీ. శ. 19 వ శతాబ్ది పూర్వార్థం.
స్థలం : చెయ్యూరు (చెంగల్పట్టు మండలం).

చెయ్యూరు జమీందారు (చెయ్యూరు తమిళ దేశంలోనిది). సంగీత సాహిత్యాలలో ఆసక్తి కలవాడు. ఆంధ్ర భాషాభిమాని. మారుపెద్ది చెంగల్వరాయశాస్త్రిని ప్రోత్సహించి, అతనిచేత 'సుందరేశ్వర విలాసమనే' సంగీత ప్రధానమైన రచనను చేయించాడు. (య.వా.చ-349)

## వైద్య సంహితాసారార్ణవము (కన్నడం)

కర్త : కళువె వీరరాజు.

ఇది వైద్యశాస్త్ర గ్రంథం. దీనిలో ఔషధాలు చేసే ప్రక్రియలు, చికిత్సా విధానాలు విపులంగా వర్ణితం. (తె.వి.స-6)

## వైయాకరణ గజకంఠీరవ యుణయవల్లి కృష్ణమాచార్యులు

కాలం : క్రీ. శ. 18, 19 శతాబ్దాల నడిమికాలం.
స్థలం : మంచాలకట్ట గ్రామం (జటప్రోలు సంస్థానం).

రచనలు : అష్టప్రాసరామశతకము, నిరోష్ఠ్యకృష్ణ శతకము, జాతకచంద్రిక వ్యాఖ్య, రసజ్ఞానానందము, శ్రీకృష్ణచంపువు మొదలగునవి.

జటప్రోలు సంస్థానాస్థాన విద్వాంసులుగా ఉండేవారు. వ్యాకరణశాస్త్ర పారంగతులు. సంస్కృతాంధ్ర భాషా పారంగతులు. పైవన్నీ సంస్కృత రచనలు. తెలుగు కృతులు తెలియరాలేదు. (ఆం.సం.సా)

## వైయాకరణము రామానుజాచార్యులు

కాలం : క్రీ. శ. 19వ శతాబ్దం.

స్థలం : చెన్నపట్టణం.

సమకాలికులు : చిన్నయసూరి.

రచన : ఆదిపర్వము (వచనము).

ఇతడు నన్నయ మహాభారతంలోని ఆదిపర్వాన్ని వచనంగా రచించాడు. మిగిలిన పర్వాలను కూడా రచించాడేమో తెలియరావడం లేదు. (వ. వా.)

## వైయాకరణ సిద్ధాన్త కౌముది (సం)

కర్త : భట్టోజీ దీక్షితులు.

ఇది వ్యాకరణ సిద్ధాంతపరమైన గ్రంథం. కర్త తన గురువైన శేషవీరేశ్వరుని, శేష కృష్ణ పండితుని, శేష రామచంద్రాచార్యులను విమర్శిస్తూ వ్రాసిన ఖండన గ్రంథం. దీనిని ఖండిస్తూ శేష విఠలుడు "ప్రక్రియా ప్రసాదం" అనే గ్రంథాన్ని వ్రాశాడు. అట్లే శేష విఠలుని సహాధ్యాయులైన జగన్నాథ పండితరాయలు, చక్రపాణి దత్తుడు కూడా దీనిని ఖండిస్తూ గ్రంథాలు వ్రాశారు. (తె. వి స-6)

## వైరాగ్య దర్పణము

కర్త : చూ. తుమరాడ పాపకవి.

విజయనగర సంస్థానాధీశులైన పూసపాటి వారి చరిత్రకు సంబంధించిన వివరాలు ఈ గ్రంథం నుండి తెలియవస్తున్నాయి. (ఆం. సం. సా-418)

## వైరాగ్య రచన గీతములు

చూ. వైరాగ్య వచన మాలికా గీతములు.

కర్త : తాళ్ళపాక పెద తిరుమలాచార్యుడు. (క. శ-6)

## వైరాగ్య వచన మాలికా గీతములు

నామాంతరం : వేంకటేశ్వర వచనములు.

కర్త : తాళ్ళపాక పెదతిరుమలయ్య (క్రీ. శ. 1468-1553).

వేంకటేశ్వర వచనాలలో కొన్ని ఈ పేరుతో ముద్రించబడ్డాయి.

## వైరాగ్య శతకమ్ (సం)

కర్త : నీలకంఠ దీక్షితులు.

దీనిలో వైరాగ్య ఫలం వర్ణితం. (తె.వి.స-6)

## వైశ్య పురాణము

నామాంతరాలు : 1. వాసవీ మాహాత్మ్యము 2. కన్యకాపురాణము.

కర్త : భాస్కరాచార్యులు.

అంకితం : పెనుగొండలోని వైశ్యసంఘానికి.

మూలం : నైమిశారణ్యంలో సాలంకాయన మహర్షి వైశ్యఋషులకు చెప్పిన కథ అని కవి చెప్పాడు. ఎనిమిది అశ్వాసాల పద్యకావ్యం.

ఇది కుసుమసెట్టి కుమార్తె వాసవీ కన్య మాహాత్మ్యాన్ని, వైశ్యుల చరిత్రను చెప్పేకావ్యం. ఇందులోని కథచారిత్రకమనీ కల్పితమనీ, పండితుల మధ్య భేదాభిప్రాయాలున్నాయి.తెలుగు దేశంలో వాసవీమాహాత్మ్యం గురించిన కథ బహుళ ప్రచారంలో ఉంది ఈ పురాణంలో మొదటి నాలుగు అశ్వాసాలలో సృష్టి నిర్మాణం, వైశ్య కుల సంభవం, బ్రహ్మ కుడి తొడ నుంచి 714 మంది వైశ్యులు సతీ సమేతంగా పుట్టటం, వాళ్ళు కైలాసానికి వెళ్ళటం – చిత్రకేతుడనే గంధర్వుడు వారిని శపించటం, వైశ్యులు అతనికి ప్రతిశాప మివ్వటం, కామదహనం, రతీ విలాపం, గిరిజా కళ్యాణం మొదలగు కథలున్నాయి. పంచమాశ్వాసం నుంచి వాసవీ కన్య చరిత్ర ఉంటుంది. కుసుమ సెట్టికి వాసవీకన్య జన్మించటం, ఆమెకు యుక్త వయస్సు వచ్చిన తరుణంలో విష్ణువర్ధనుడనే రాజు పెనుగొండకు రావటం, హారతి ఇచ్చే తరుణంలో వాసవీకన్యను రాజు చూసి మోహించటం, కుసుమ సెట్టిని అడగటం – అతడు వైశ్యులను సంప్రదించటం, అపకీర్తికన్నా అగ్నిప్రవేశం మేలనుకొని 714 గోత్రాల వారిలో 102 ఇళ్ళవారు అగ్ని ప్రవేశం చేయటం ల ఇందులోని కథాంశాలు వైశ్యులు వాసవీ కన్యతో పాటు తమ కులంలో ఇకముందు గుణవతులే తప్ప రూపవతులు జన్మించకూడదని బ్రహ్మదేవుని ప్రార్థించి అగ్ని ప్రవేశం చేశారు. నాటినుంచి వాసవీకన్య వైశ్యులకు ఇలవేలుపై పెనుగొండలో వెలిసింది. వాసవీ కన్య చరిత్ర మిగుల ప్రచారం పొందింది. కొందరీ కథ చారిత్రకం కాదని అంటారు. గేయ కథలుగా, బుర్ర కథలుగా వాసవి కథకు చాలా ప్రచారముంది. కన్యక కీర్తినీ, రాజు అపకీర్తినీ వ్రాసిన భాస్కరాచార్యులు తన గ్రంథాన్ని వైశ్య సంఘం కోరికమీద రచించి వారికే అంకిత మిచ్చారు. (ఆరుద్ర 9–233)

## వ్యవహారికత్త్వ ఖండన సారమ్(సం)

కర్త : చూ. తిరుమల బుక్కపట్టణం (ఇమ్మడి) అణ్ణయదీక్షితులు.

(అం. సం. సా–516)

## వ్యాఖ్య

కావ్యపరిభాష. పదవిభాగం, పదాల అర్థం, సమాస పదాలకు విగ్రహవాక్యం వ్రాసి వివరించడం, కావ్యంలోని అలంకారాలను సమన్వయించడం, వ్యాకరణం వంటి అంశాలపై ఆక్షేప సమాధానాలు–ఈ అయిదు లక్షణాలు కలది వ్యాఖ్య.

ఇందులో రెండురకాలున్నాయి. 1. గచ్ఛద్వ్యాఖ్యానము, 2. ధావద్వ్యాఖ్యానము.

ఇవి టుప్టీక, పంజికలుగా భావించవచ్చును. తెలుగులో ప్రసిద్ధ కావ్యాలకు వ్యాఖ్యానా లున్నాయి.

శ్రీకృష్ణదేవరాయల విష్ణుచిత్తీయానికి, భట్టుమూర్తి హరిశ్చంద్ర నలోపాఖ్యానానికి చిత్రకవి అనంతకవి వ్యాఖ్య వ్రాశాడు. సూరన్న రాఘవపాండవీయ కావ్యానికి, విష్ణుచిత్తీయ, వసుచరిత్రలకు చిత్రకవి వేంకటరమణ వ్యాఖ్యలు వ్రాశాడని పండితు లంటారు కాని అవి దొరకటంలేదు. వేములవాడ సోమనాథుడనే ఆయన వసుచరిత్ర కావ్యానికి "విద్వన్మనోరంజనీ వ్యాఖ్య" వ్రాశాడు.

## వ్యాఖ్యానము

చూ. వ్యాఖ్య.

## వ్యాయోగము

ఇది దశవిధ రూపకాలలో ఒకటి.

చాలామంది పురుషులు చేరతారు కాబట్టి దీనికీ పేరు వచ్చింది. ఇది ఏకాంకము. ప్రఖ్యాత వస్తుకము. దీనిలో ధీరోద్ధతులు చాలామంది నాయకులుగా ఉంటారు. గర్భావ మర్శములు గాక మిగిలన మూడు సంధులు, స్త్రీ నిమిత్తం కాని యుద్ధం ఇందులో ఉంటుంది. హాస్య శృంగార శాంతాలు గాక మిగిలిన ఆరు రసాలు, కైశికీవృత్తి గాక మిగిలిన మూడు వృత్తులను దీనిలో వర్ణించాలి ప్రస్తావనాదుల విషయంలో ఇది నాటక తుల్యము. (తె. వి. స-6)

## వ్యాస తాత్పర్య నిర్ణయమ్(సం)

కర్త : అయ్యన్న.

కవి శ్రీధర వేంకటేశ్వరుని శిష్యుడు. సంస్కృతాంధ్రాలలో అసమానమైన ప్రతిభ గలవాడు. ఈ గ్రంథం పండిత ప్రశంసలను పొందింది.

## శంకర కవి

కాలం : క్రీ శ. 1500-50 ప్రాంతం.

రచనలు : హరిశ్చంద్రోపాఖ్యానము (అలభ్యం), శంకర వచనములు(భవానీ మనోహర వచనములు).

దేచన పుత్రుడు. గౌరన ద్విపద హరిశ్చంద్ర చరిత్రను చూసే ఇతడు హరిశ్చంద్రోపాఖ్యానాన్ని వ్రాసి ఉంటాడని పండితాభిప్రాయం. కూచిమంచి తిమ్మకవి, "సర్వలక్షణ సార సంగ్రహం"లో శంకరకవి హరిశ్చంద్ర కావ్యం నుండి ఉదాహరణ లున్నాయి. గౌరన చేసిన ప్రయోగాలనే ఇతడు కూడా చేసిఉంటాడని కొందరి అభిప్రాయం.

ఈ కవి తండ్రి దేచన, ఉద్భటారాధ్య చరిత్ర కృతిపతి ఊర దేచమంత్రీ ఒక్కరేమో అని కొందరు అభిప్రాయ పడుతున్నారు. శంకర కవి రచన మృదు మధురంగా రసవంతంగా ఉంటుంది. (ఆరుద్ర-6-91)

**శంకర గీత (అలభ్యం)**

కర్త : మల్లికార్జున పండితుడు.
కాలం : క్రీ. శ. 1150 ప్రాంతం.

శైవమత పరమైన గ్రంథం.

**శంకర దాసమయ్య చరిత్రము (అలభ్యం)**

రచనాకాలం : క్రీ. శ. 15 వ శతాబ్ది చివర.
కర్త : పోశెట్టి లింగకవి.

ద్విపద కావ్యం. (క.స-210)

**శంకర పదములు (అలభ్యం)**

కర్త : మల్లికార్జున పండితుడు.
కాలం : క్రీ. శ. 1150 ప్రాంతం.

**శంకర పదాలు**

వీటిని పాల్కురికి సోమన్న పండితారాధ్య చరిత్రలో పేర్కొన్నాడు. ఇవి యక్షగానాలలో ప్రయుక్తాలు. ఇవి శివపరాలయిన సంబుద్ధులు కావచ్చును. బసవ పురాణంలో "ఏలలు పెట్టి పాడుదుర" న్న సోమన అభిప్రాయం ప్రకారం ఇవి ఏలలు కావచ్చు నని కొందరు భావిస్తున్నారు. (య. వా. చ-283)

**శంకర పల్లకి సేవా ప్రబంధము**

కర్త : (చూ) శహాజీ.

సంగీత నృత్య రూపకం.

తిరువారూరులో శ్రీ వీధీవిటంక త్యాగరాజస్వామి శయ్యాగారానికి పల్లకీ వేంచేసేటప్పుడు ఈ పల్లకి సేవాప్రబంధాన్ని ఆలయంలోని నర్తకీమణులు నృత్య సంగీతాత్మకంగా ప్రతి శుక్రవారం ప్రదర్శించేవారు.

ఈ పల్లకి సేవ వంశపారంపర్యంగా కొనసాగించగలందులకు శహాజీ వారికి పదిపేల ఎకరాల నేల సర్వమాన్యంగా ఇచ్చాడట. ఇటీవలి కాలం వరకూ ఈ పల్లకిసేవ జరుగుతుండేది. (శారదాధ్వజం-154)

**శంకర వచనములు**

నామాంతరం : భవానీ మనోహర వచనములు.
కర్త : శంకరకవి (చూ.).

శైవ వాఙ్మయంలో విశిష్టస్థానాన్ని ఆక్రమించిన వచనాలు.
(క. స-262)

**శంకర విజయమ్ (సం)**

కర్త : విద్యారణ్యుడు.

ఆనందగిరి అనే అతడు కూడా శంకరవిజయాన్ని రచించినట్లు తెలుస్తున్నది.
(తె. వి. స-4) (క.స. 34)

**శంకర విజయము (అలభ్యం)**

రచనాకాలం : క్రీ. శ. 1560కి పూర్వం.

కర్త : బొడ్డపాటి పేరయ్య.

దీనినుంచి పెదపాటి జగ్గన్న తన "ప్రబంధ రత్నాకరం"లో 7 పద్యాలను ఉదాహరించాడు. ఇందులో నాయిక మేనాశత్రి. (ఆరుద్ర-9)

**శంకర విజయము**

నామాంతరం : ఆచార్య విజయము.

కర్త : రాపాక లక్ష్మీపతి.

రచనాకాలం : క్రీ.శ. 1700 ప్రాంతం.

అసమగ్ర ప్రతి మదరాసు ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారంలో ఉంది.
(క.స-209)

**శంకర శంకరకవి**

కాలం : తెలియదు.

స్థలం : గోదావరి జిల్లా దొడ్డంపేట.

రచనలు : శతకాలు.

ఇతడు ప్రౌఢకవి "రాచబిడ్డ డెపుడు బ్రోచు మమ్ము" అనే మకుటంతో రామాయణకథ, రామనామ ప్రభావం తెల్ల మయ్యేటట్టుగా భక్తి, నీతి, వేదాంతాలను బోధించే ఒక శతకం వ్రాశాడు. రచన సరళంగా ఉంది. (శ.క.చ. 398)

**శంకర సంహిత**

కర్త : తెలియదు.

ద్విపద రచన. స్కాందపురాణాంతర్గతమైన శంకర సంహితకు తెలుగు సేత. ఆశ్వాస విభాగం లేదు. ఒకచోట అసుర కాండమని మాత్రం ఉంది.

రచన చక్కని జాతీయాలతో సుందరంగా ఉంది. దీని ప్రతి తంజావూరు సరస్వతీ మహాలులో అసమగ్రంగా ఉంది. శివరహస్య ఖండంలోని సంభవ, అసుర, వీరమాహేంద్ర, యుద్ధ, దేవ, దక్ష, ఉపదేశకాండల కథ ఇందులో ఉంది.
(ద్వి.సా.చ-167)

**శంకర సంహిత**

నామాంతరం : శివ రహస్య ఖండము (చూ.).

కర్త : కోడూరు వేంకటాచలకవి.

**శంకర సంహిత (కన్నడం)**

కర్త : చూ. నుగుటూరి ముమ్మడి తమ్మభూపతి.

శైవమత పరమైన గ్రంథం. (ఆం. సం. సా-261)

## శంకరానంద చంపువు (సం)

కర్త : చూ. శంకరానందుడు. (తె. వి. స-6)

## శంకరానందుడు

కాలం : క్రీ. శ. 16వ శతాబ్ది పూర్వార్థం.

రచనలు : 1. శంకరానంద చంపువు (సం) 2. కృష్ణ విలాసమ్ (సం).

ఈయన మొదటి రాజనాథుని (డిండిముడు I) దౌహిత్రుడయిన స్వయంభువు కుమారుడు. (తె. వి. స-6)

## శంకరాభ్యుదయమ్ (సం)

కర్త : రాజచూడామణి దీక్షితుడు.

ఆరు సర్గలు మాత్రం లభించాయి. జగద్గురు శంకరాచార్యులవారి చరిత్ర ఇందులోని ఇతివృత్తం. (తె. వి. స-6-222)

## శంతను చరిత్రి

రచన : పాపయారాధ్యులు (చూ). (ఆం. సం. సా.)

## శంతను విలాసము

రచనాకాలం : క్రీ. శ. 1841 ప్రాంతం.

కర్త : అల్లమరాజు రామకృష్ణకవి.

రచన ప్రౌఢంగా రసభావ బంధురంగా ఉంది. (క. చ-3-225)

## శంబర ధరుడు

కాలం : క్రీ. శ. 18 వ శతాబ్దం.

స్థలం : తంజావూరు.

రచనలు : కిరాతార్జునీయము.

బిరుదు : 1. బొమ్మలాట శాసనుడు. 2. ఘనకావ్య భూషణుడు.

ఇతడు మహారాష్ట్ర రాజులైన తులజాజీ, రెండవ ఏకోజీల ఆస్థానంలో ఉండేవాడు. బొమ్మలాటలు ఆడించడంలో నేర్పరి. ఈ ప్రదర్శనలో తెరవెనుకనుండి దరువులు, పాటలు పాడేవాడు. ఇతడు మహారాష్ట్రుడు కావచ్చు. నాటినుండి నేటివరకు ఎక్కువగా మరాటీలే తెలుగుదేశంలో తోలుబొమ్మల నాడిస్తూ వస్తున్నారు. (శారదా ధ్వజం-160)

## శకుంతల నాటకము

కర్త : నరసింహకవి.

అంకితం : విష్ణుమూర్తికి.

యక్షగాన నాటకం. మూలం మహాభారతంలోని కథ. నంద్యాల ప్రభువైన నారాయణరాజు ప్రోత్సాహంతో కవి ఈ రచన చేశాడు. కథా కల్పనంలో భామవేష కథ కూడా ఉంది. నారాయణరాజు స్వహస్తంతో దీని ప్రతిని వ్రాసుకొన్నాడు.

(ఆం. సా. ప. ప. 19-2)

**శకుంతలా నాటకము**

నామాంతరం : దుష్యంత చరిత్ర.

కర్త : వర్ఘుల నరసింహకవి.

అంకితము : పెనుశల (పెంచల) నరసింహస్వామికి.

దీనిలో భరతపట్టాభిషేక ముహూర్తం పేర్కొన బడింది. రచన ప్రౌఢంగా ఉంది. దరువులు ప్రసిద్ధ రాగతాళాలలో ఉన్నాయి. కందార్ధములు, సంధి వచనాలు, ద్విపదలు, పద్యాలతోబాటు సూత్రధార ప్రసక్తి, పాత్రలు తెర వెడలివచ్చి స్వీయోదంతాన్ని సభవారికి విపేదించటం మొదలయిన ప్రయోగాలున్నాయి కథారంభంలో హాస్యగాని పాత్ర ప్రవేశముంది. (య.వా.చ.-36)

**శకుంతలా పరిణయము**

కర్త : కృష్ణకవి.

(అకలంక కృష్ణమార్యుడు (చూ).)

ఇది శకుంతలా దుష్యంతులకు సంబంధించిన ప్రబంధం. దీనిలో మూడు ఆశ్వాసాలున్నాయి. చాలచోట్ల వసుచరిత్రకు అనుకరణ లుండడంవల్ల దీనిని "పిల్ల వసుచరిత్ర" అంటారు. దీనిని కవి, చిరుమామిళ్ళ పాపయ్య అనే కమ్మనాయకుని ప్రేరణవల్ల వ్రాశాడట.

ఈ ప్రబంధకర్తను కృష్ణకవిగా వీరేశలింగం పంతులుగారు పేర్కొన్నారు. ఇతడే అకలంక కృష్ణమార్యుడు. (క. చ-3-178; తె. వి. స.)

**శకుంతలా పరిణయము**

వ్యవహారనామం : శృంగార శాకుంతలము (చూ).

కర్త : పిల్లలమర్రి పినవీరభద్రుడు.

**శకుంతలా పరిణయము**

కర్త : చూ. పెద్దాడ నాగరాజామాత్యుడు.

రచనాకాలం : 19వ శతాబ్దం పూర్వార్థం.

మూడాశ్వాసాల శృంగార ప్రబంధం. ఇది భారతంలోని శకుంతల కథకు అనుసరణం. రచనలో మనుచరిత్ర ఛాయలు అధికంగా కనిపిస్తాయి.

పోలవరం జమీందారుచేత 1900లో మద్రాసులోని ఆనంద ముద్రాక్షరశాలలో ప్రచురితము. (ఆం. నం. సా-281

**శకుంతలా పరిణయము**

రచనాకాలం : క్రీ. శ. 1836 ప్రాంతం.
కర్త : ఫక్కి వేంకటనరసయ్య.

మూడు ఆశ్వాసాల ప్రబంధం. కవి పండితుల ప్రశంసలను పొందినకావ్యం.
(వీరేశలింగంపంతులు – సమగ్ర పరిశీలన)

**శకుంతలా పరిణయము**

రచనాకాలం : క్రీ. శ. 16 వ శతాబ్దం.
కర్త : రేవణూరి వేంకటార్యుడు.
అంకితం : శ్రీ వేంకటేశ్వరస్వామికి.

మూడాశ్వాసాల శృంగార ప్రబంధం. ఈ గ్రంథాన్ని కవి ఒకరాజుకు అంకితమివ్వాలని అనుకొన్నాడట. ఒక కరణం దానికి విఘ్నం కలిగించాడు. అందువల్ల కవి దీన్ని దైవాంకితం చేసినట్లు చెప్పుకొన్నాడు. ఈ కవి తాళ్ళపాక అన్నమాచార్యుని మనుమడు. (క. చ. 3_159)

**శకునాలు**

కాలం : క్రీ. శ. 12 _16 శతాబ్దాల మధ్యకాలం.

మధ్యయుగాంధ్ర దేశంలోని ప్రజలకు శకునాలమీద బాగా నమ్మకమున్నట్లు సమకాలీన సాహిత్యం ద్వారా తెలుస్తున్నది. ప్రజలు శకునబలాన్నిబట్టి నడచుకునేవారు. "క్రీడాభిరామకర్త" విజయానికి అనుకూలించే శుభసూచకమైన శకునాలను విపులంగా వర్ణించాడు. "సింహాసన ద్వాత్రింశిక" లో దుశ్శకునాలను గోపరాజు విపులంగా వర్ణించాడు. దీనినిబట్టి ఆనాటి తెలుగుదేశంలో ఈ శకునాలపట్ల నమ్మకం బాగా పాదుకొనిపోయి ప్రబలంగా వ్యాపించి ఉండేదని తెలుస్తున్నది. తాము చేయబోయే ప్రతికార్యానికీ లాభనష్టాలను గురించి ఆకాలపు ప్రజలు శకునశాస్త్ర ప్రవీణులను సంప్రతించేవారని గట్టిగా చెప్పవచ్చు. (తెలుగు_ఏ_జూ_77)

**శచీ పురందరము**

కర్త : శహాజీ (మా.)

నాటకం నాందిలో త్యాగేశస్తుతి–పూర్వ కవి స్తుతిలో సంస్కృత కవులనే పేర్కొనడం ఇందులోని ప్రత్యేకతలు.

శచీపురందరుల వివాహం ఇందులోని కథ. ఇది ఇంతవరకు నాటకంగారాలేదు. ఈ వివాహం శాహమహరాజు పాలించే తంజావూరులో జరిగినట్లు కవి కల్పించాడు. దేవాలయంలో జరిగే అవకతవకలు, నైవేద్యాలు, ఆలయాధికారులుభోగ స్త్రీల ఇళ్ళకుపోవడం, పూజారులు శుచిగా రాకపోవడం, వారి అలవాట్లు ధూమపానం మొదలైన వానిని విమర్శిస్తూ రాసిన నాటకం. విఘ్నేశ్వర పాత్ర ప్రవేశించినా పూజారి రాడు. వచ్చాక ఎక్కడికి పోయావని సూత్రధారుడు అడిగి అతని గుట్టంతా బయట పెడతానని బెదిరిస్తాడు. సమ

కాలీన సంఘ జీవితాన్ని ప్రతిబింబించే రచన. దీనిని రాజే వ్రాయడం గమనార్హం.
(ద. దే. వా-204)

## శతకంఠ రామాయణము

కర్త : తెలియదు.

యక్షగానం. ఇతివృత్తం ప్రఖ్యాతం. "శతకంఠుడు" మాయాపుర రాక్షసపతి తన జ్ఞాతియైన రావణుని చంపినందుకు రామునిపై పగతీర్చుకోవడానికి అవకాశం కోసం చూస్తూ ఉంటాడు. రాముడే సతీసమేతంగా వానిపై దండెత్తినట్లు, సీత శతకంఠుని సంహరించినట్లు చెప్పే ఈ చిత్రకథ వాసిష్ఠ రామాయణంలోనిదట.

రచన అంత ప్రశస్తంకాదు. దీని ప్రతి అడయారు లైబ్రరిలో ఉన్నది. ప్రతి విలేఖన కాలం 2-2-1810. లేఖకుడు బమ్మళ్ళ నారప్ప కుమారుడు రామప్ప.
(య, వా. చ-454)

## శతకంఠ రామాయణము

కర్త : కూచిమంచి గంగన.

ఇతివృత్తం ప్రఖ్యాతం. (ఆం. సం. సా-246)

## శతకంఠ రామాయణము (అలభ్యం)

కర్త : చూ. వేములవాడ భీమకవి.

దీనినుంచి లాక్షణికులు రెండు పద్యాలను ఉదాహరించారు. (అరుద్ర-1)

## శతకము

కావ్య ప్రక్రియలలో ఒకటి. ప్రాకృత, సంస్కృత ప్రక్రియలననుసరించే తెలుగులో శతక రచన మొదలైనట్లు కొందరి అభిప్రాయమున్నా, ఈ ప్రక్రియ తెలుగులో స్వతంత్రమైనదై విశిష్ట మర్యాదను పొందినది.

సర్గ బంధము లేని కావ్యమిది. దీనిని భామహుడు అనిబద్ధ కావ్యంగా పేర్కొన్నాడు. శతకములను అసర్గబంధములుగా, ఉపకావ్యములుగా విద్యానాథుడు భావించాడు. కాని శతకాన్ని ఒక ప్రత్యేక ప్రక్రియగా "శతేన శతకం ప్రోక్తమ్" అని శ్లోక సంఖ్యలననుసరిస్తూ అమృతానంద యోగి తన అలంకార సారసంగ్రహంలో స్పష్టం చేశాడు.

చిన్నకోట పెద్దన శతక లక్షణం చెబుతూ "శతకమన నొప్పు మరి పద్య శతము గూడ" అన్నాడు. కావ్యాలంకార చూడామణిలో శతక ప్రక్రియను గూర్చిన చర్చ ఉంది.

1. నూరు కాని, నూట ఎనిమిది కాని పద్యాలు ఉండటం, 2. మకుటంగానూ, నిర్మకుటంగానూ పద్యాలు ఉండటం, 3. ఒకే రకమైన పద్యాలైనా, భిన్నమైన పద్యాలైనా 100 నుంచి 108 వరకు ఉండటం, 4 వీర, శృంగార, కరుణ, హాస్యాది రసాలలో

ఏదైనా ఒక రసాన్ని పోషిస్తూ రచించటం, 5. విషయం ఏ పద్యానికా పద్యమే పరిమితం గానూ, లేదా సూత్రబద్ధంగానూ ఉండటం శతక లక్షణాలు.

ఆంధ్ర శతక వాఙ్మయం 12 వ శతాబ్దం నుంచి ఇప్పటివరకు క్రమ పరిణామంలో పరిపుష్టిని పొంది ఒక శాఖగా స్థిరత్వాన్ని కూర్చుకొన్నది. ఆంధ్ర, శతక సాహిత్య వికాస రీతులను పరిశీలించి వర్గీకరిస్తే వీనిలో భక్తి, నీతి, శృంగార, వైరాగ్య, అధిక్షేప, తత్త్వ, చారిత్రక, కథాత్మక, శాస్త్ర, సంకీర్ణ, సంకలన ప్రహేళికాది వివిధ వస్తుకమైనవే కాక, అనూదితములు కూడా ఉన్నాయి.

తెలుగులో భాస్కర, కాళహస్తీశ్వర, కుమారీ, సుమతి, వేమన, కృష్ణ ప్రసన్న రాఘవ, తాడిమళ్ళ రాజగోపాల, నరసింహ శతకాలు ప్రసిద్ధాలు. భర్తృహరి సుభాషిత త్రిశతి తెలుగులో నీతి, శృంగార, వైరాగ్య శతకాలుగా ప్రసిద్ధికెక్కింది.

**శతకము (అలభ్యం)**

కర్త : మల్లికార్జున పండితుడు.

శైవమత పరమైన రచన.

**శతఘంటము రంగన్న**

కాలం : క్రీ. శ. 19వ శతాబ్దం.

స్థలం : వేంకటగిరి సంస్థానం.

ఇతడు క్రీ. శ. 1804–1855 వరకు వేంకటగిరి సంస్థానాన్ని పాలించిన బంగారు యాచమనాయనికి ఆశ్రితుడు. రచనను ప్రభువైన బంగారు యాచమనాయనికే అంకితం ఇచ్చాడు. (ఆం. సం.సా–460)

**శతపక్షి సంవాదము (అలభ్యం)**

కవి : చూ. క్షేమేంద్రుడు.

వెల్లంకి తాతంభట్టు, మడికి సింగన ఇందులోవి కొన్ని పద్యపాదాలు ఉదాహరించారు. (ఆరుద్ర–2)

**శతముఖ రామాయణము**

నామాంతరం : సీతావిజయము.

కర్తలు : లింగకవి, గంగకవి.

నాల్గు ఆశ్వాసాల గ్రంథం. మొదటి మూడు ఆశ్వాసాలు లింగకవి రచించి చిన్నారెడ్డి పుత్రుడైన సోమభూపాలునికి అంకితం చేశాడు. నాల్గవ ఆశ్వాసం గంగకవి రచించిన భోగ నృపాలునికి అంకితమిచ్చాడు. రచన విదగ్ధంగా, రసవంతంగా ఉంది. (క.స–211)

**శతలేఖిని**

పాండిత్యప్రదర్శనంలో ఒక విద్య. నూరుగురు పండితులు నూరు ఘంటాలు, పత్రాలు చేతబట్టి ఉండగా కవి ఆశువుగా నూరు పద్యాలు చెప్పడం శతలేఖినీ విద్య.

దక్షిణాంధ్రయుగంలో రామభద్రాంబ, రంగాజమ్మ, మధురవాణి ఇట్టి సామర్థ్యం గలవారు. కృష్ణరాయల సమకాలికుడు చరిగొండ ధర్మన ఈ విద్యకు ప్రసిద్ధుడు. (ద.దే.వా-13)

**శతసంహిత (అలభ్యం)**

కర్త : మరింగంటి సింగరాచార్యులు.

కవి తన 12 వ యేట చేసిన రచన. (అకు్ద్ర-8-262)

**శతానంద యోగి**

కాలం : క్రీ. శ. 17 వ శతాబ్దం ప్రారంభం.

రచన : శతానందయోగి రామశతకము. (రామశతకము)

ఈ యోగి దత్తాత్రేయ యోగి గురు పరంపరలోని వాడు. రచన సరళంగానే ఉన్నా దోషాలు ఎక్కువ. శాంతానందయోగి ఇతడూ ఒకరే కావచ్చునని కొందరి అభిప్రాయం. (శ.సా.వి)

**శతానందయోగి రామశతకము**

కర్త : శతానందయోగి.

ఇది ప్రకీరణ శతకం. దీనిలో భక్తి, నీతి, వైరాగ్యం, అధిక్షేపం ఉన్నాయి. రచన కవి చౌడప్ప, వేమన శతకాలవలె ఉంది. వంశానికి కీర్తి తెచ్చినా, అపకీర్తి తెచ్చినా స్త్రీయే అని ఈ శతకం చెబుతున్నది, (శ.సా.వి)

**శతావధానము**

చూ. అవధానాలు.

**శత్రుసంహార శతకము**

కర్త : తెలియదు.

చూ. వేంకటాచల రమణ శతకము.

**శనైశ్వర శతకము**

కర్త : ఘటికాద్రి కవి.

108 పద్యాలున్న శతకం. "శని నాయక, దివ్య ఫల ప్రదాయకా" అనే మకుటంతో ఉంది. రచన అంత ప్రౌఢం కాదు. (శ క.చ-610)

**శబ్ద చంద్రిక (సం)**

కర్త : చూ. వామన భట్టబాణుడు.

విఘంటువు. (రె రా.చ.)

**శబ్ద చిత్ర కవిత**

చిత్రకవితలోని ఒక భేదం.

అక్షరాలకు, శబ్దాలకు సంబంధించిన కవితను శబ్దచిత్ర కవిత అంటారు. ఏకాక్షరి, ద్వ్యక్షరి, త్ర్యక్షరి,తలకట్లు, గుడులు, కొమ్ములు, నిరోష్ఠ్యము, అచలజిహ్వము,

అన్వర్ణము, అక్షర గుణితము, అనులోమ విలోమాలు, పాద పద్య భ్రమకాలు, ఏకపది, ద్విపది, త్రిపది, పాదగోపనము మొదలగునవి దీనికి ఉదాహరణలు. (తె.వి.స_6)

**శబ్ద జతి**

ఇది ఒక తాళప్రబంధం వంటిది. లయ ప్రక్రియా ప్రకృష్టమైనది. యక్ష గానాలలో ప్రయుక్తం. భాగవతుల శ్రీరంగ కవి శ్రీకృష్ణలీలలు అనే యక్షగానంలో ఇది ఉంది.

జతి అన్నది 'యతి' శబ్ద వికృతి కావచ్చునని పండితాభిప్రాయం. యతి అనేది తాళ దశ ప్రాణాలలో ఒకటి. సంగీత రత్నాకరంలో దీనిని ఒక వాద్య ప్రబంధంగా పేర్కొనటం జరిగింది. జతి అంటే ఒక గీతభేదమవి, నాట్య గాన శబ్దసంతతి అని సూర్యారాయాంధ్ర నిఘంటువు పేర్కొంటున్నది శ్రుతిలయలు గానప్రధానాంగాలు. శ్రుతి విశిష్టమైనది స్వరజతి, లయ విశిష్టమైనది శబ్దజతి కావచ్చునని పండితుల ఊహ. (య.వా.చ_346)

**శబ్ద మంజరి**

కర్త : నగిమింటి సర్వమంగళేశ్వర శాస్త్రి.

సంస్కృత భాషను నేర్చుకొనగోరే వారికి అవశ్యపఠనీయమైన లఘుగ్రంథం.

**శబ్దములు**

కర్త : చెయ్యూరు చెంగల్వరాయశాస్త్రి.

ఇవి నృత్యంలో ఉపయోగించే రచనలు. (తె.వి.స_4)

**శబ్ద రత్నసమన్వయము (సం)**

కర్త : శహాజీ (చూ.).

నిఘంటువు. శహాజీ కాలం నాటి సంస్కృత భాషా స్వరూపాన్ని తెలుపుతున్నది. (ద.దే.వా. పీఠిక_42)

**శబ్ద రత్నాకరమ్ (సం)**

కర్త : చూ. వామనభట్టబాణుడు

నిఘంటువు. (రె.రా.చ.)

**శబ్ద లక్షణ సంగ్రహము**

రచనాకాలం : క్రీ.శ. 1853 ప్రాంతం.

కర్త : పరవస్తు చిన్నయసూరి.

గాజుల లక్ష్మినరసింహశ్రేష్ఠి దీనిని మొదట ప్రకటించాడు.

'శబ్దశాసనం' వ్రాసిన తర్వాత దానినే మెరుగులు పెట్టి 1. సంజ్ఞా 2. సంధి 3. శబ్ద 4. క్రియా 5. ప్రకీర్ణము అనే అయిదు పరిచ్ఛేదాలతో దీనిని సూరి వ్రాశాడు. ఈ గ్రంథం కొండవీటి వేంకట కవిచే పరిష్కరింపబడి 1958 లో పునర్ముద్రితమయింది. (రమణీయం పీఠిక)

**శబ్ద శాసనము**

రచనాకాలం : క్రీ. శ. 1844.

కర్త : పరవస్తు చిన్నయసూరి.

వ్యాకరణగ్రంథం. చిన్నయసూరి తాను వ్రాసిన సూత్రాంధ్ర వ్యాకరణాన్ని అనువదించి తెలుగులో వచనంలో వ్రాశాడు. ఇది బాలవ్యాకరణ రచనకు ముందు వ్రాసిన మూడో వ్యాకరణగ్రంథం. (రమణీయం పీఠిక)

**శబ్దార్థ కల్పతరువు**

కర్త : మామిడి వేంకటార్యుడు.

దీనిలో సిద్ధాంత కౌముదిలో శబ్దాలను సాధించిన విధంగానే సలక్షణంగా శబ్దాలు సాధించబడి కూర్చబడినవి. నిఘంటురచన 1800 ప్రారంభమై 1900 మధ్యకాలంలో పూర్తి అయింది ఈ నిఘంటువును 1961 లో వావిళ్ళగ్రంథ ప్రచురణ సమితివారు ప్రచురించారు.

**శబ్దార్థ సంగ్రిహామ్ (సం)**

కర్త : శహాజీ (చూ).

నిఘంటువు. మహారాష్ట్రి రాజుల కాలంలో వాడుకలోఉన్న పదస్వరూపాలను తెలియపరుస్తున్నది. (ద. దే. వా. పీఠిక-42)

**శబ్దార్థ సర్వస్వ నిఘంటువు**

కర్త : పరవస్తు వేంకట రంగాచార్యులు.

**శమంతకమణి చరిత్రి (అలభ్యం)**

కర్త : చూ. పణుమూరి గురవరాజు.

నామాంక విశ్రాంతికి ఉదాహరణగా దీనిలోని పద్యాన్ని అప్పకవి పేర్కొన్నాడు. ఇది కృత్యాది పద్యమట. (అప్పకవీయం-3-237)

**శమంతకోపాఖ్యానము (అలభ్యం)**

కర్త : పట్లూరి రామకవి.

(ఆరుద్ర-9)

**శరణయ శాసనము**

కాలం : క్రీ. శ. 1181 ప్రాంతం.

శాసనప్రదాత : శరణయ మంత్రి,

ప్రస్తావితస్థలం : కొండ పడుమటి సీమ.

శాసనవిషయం : ఈశాసనం శరణయ వంశీయుల దానధర్మాలను తెలుపుతుంది. శరణయమంత్రి వెలనాటి గొంకరాజుకు ఇష్టభృత్యుడు. గొంకేశ్వర దేవుని ప్రతిష్ఠించి, దీపస్తంభం ఎత్తించినట్లు-బ్రాహ్మణులకు అగ్రహారాలు, సత్రపంశాలాలు దానం చేసినట్లు-

దూబవాడలో వేంచేసియున్న ఈశ్వరునికి దీపస్తంభం నిలిపినట్లు ఈ శాసనం వల్ల తెలుస్తున్నది. దీనిలో సుమారు 20 పద్యాలు, ఒక శ్లోకం, చిన్నవచనం ఉన్నాయి.
(తె. క. చ-289-293)

**శరణాగత ద్విపద**

కర్త : తెలియదు.

శ్రీరామానుజుల వారి స్తుతి రూపకమైన లఘు కృతి. దీని ప్రతి వేంకటేశ్వర ప్రాచ్య పరిశోధనా సంస్థలో ఉంది. (ద్వి.సా.చ-264)

**శరభ భూపాల కురవంజి**

కర్త : శరభోజీ I

సంగీత ప్రధానమైన నాటకం. ఇది శరభోజీ రచించాడన్నది సంశయ గ్రస్తంగా ఉంది. ఈ నాటకాన్ని ఆనాటి సంగీత బాణీలతోను, వరుసలతోను 20 వ శతాబ్దంలోని ప్రఖ్యాత నర్తకీమణులు జయమ్మ, ఆమె కుమార్తె బాల సరస్వతి ప్రదర్శించేవారట. (శారదాధ్వజం-159)

**'శరభలింగ' మకుటము (అలభ్యం)**

కర్త : పాలపర్తి సోమేశ్వరుడు.

ఇది శతకం కావచ్చు. దీనిలో నుంచి ఒక పద్యాన్ని పెదపాటి జగ్గన్న తన "ప్రబంధ రత్నాకరం"లో ఉదాహరించాడు. (ఆరుద్ర-9)

**శరభాంక లింగ శతకము**

కర్త : శరభాంకుడు.

రచనాకాలం : క్రీ. శ. 1291-1323 ప్రాంతం.

ఇది ప్రకీరణ శతకం. 5 పాదాల పద్యాలు 40 వరకు ఉన్నాయి. దూషణతో పాటు మంచి లోకజ్ఞానపు నీతులు కూడా ఉన్నాయి.

ప్రతాపరుద్రుని మహమ్మదీయులు చెరగొని పోయిన సందర్భంలో ఈయన ఢిల్లీని తిడుతూ వ్రాసిన పద్యాలు ఇందులో ఉన్నాయి. ఇతని ఒక తిట్టు పద్యాన్ని లింగమకుంట తిమ్మకవి ఉదాహరించాడు. మల్హణ చరిత్ర కర్త ఎడపాటి ఎర్రయ, అప్ప కవికి పూర్వుడైన రాజలింగ కవి (కూర్మ పురాణం), ఈ కవిని నుతించారు కాబట్టి ఈ కవి కూడా ప్రసిద్ధుడే. "గులాము" వంటి అన్య దేశ్యాలు, గ్రామ్యాలు కూడా కవితలో ఉన్నాయి. కపటయోగి దూషణ, సిసలైన యోగి ఉనికి ఈతడు చెప్పాడు.
(ఆరుద్ర-3)

**శరభాంకుడు**

కాలం : క్రీ.శ. 1291-1323 ప్రాంతం.

స్థలం : వరంగల్లు.

రచన : శరభాంక లింగశతకము.

ఇతడు రెండో ప్రతాపరుద్రుని మంత్రి అని సిద్ధేశ్వర చరిత్ర చెబుతున్నది. శతకంలో ఈయన దూషణతో పాటు మంచి లోకజ్ఞానపు నీతులు కూడా చెప్పారు. ప్రతాపరుద్రుని మహమ్మదీయులు చెఱగొని పోయిన సందర్భంలో ఇతడు ఢిల్లీని తిడుతూ పద్యాలు వ్రాశాడు. ఇతడు శివదేవయ్య, విశ్వేశ్వర దేశికులు—సోదరులని కొందరంటారు. కాని అది నిజం కాదు. వీరు విభిన్న గోత్రులు.

(ఆరుద్ర–3; క.స–283)

## శరభోజీ I

కాలం : క్రీ.శ. 1712–1728 ప్రాంతం.

రచనలు : 1. రాఘవ చరిత్రమ్ (సం) (సంగ్రహ రామాయణము) 2. శరభ భూపాల కురవంజి.

తంజావూరును పాలించిన మహారాష్ట్ర రాజు. ఏకోజీ కుమారుడు. మొదటి శహాజీ తమ్ముడు.

కృతికర్త, కృతిపతి కూడా. కవి పండితులను ఆదరించాడు. మంగపటము, శరభోజీ రాజపురం అగ్రహారాలుగా పండితులకు దానం చేశాడు. రాఘవ చరితంలో రామాయణ కథ సంగ్రహంగా చెప్పాడు. దీని కర్తృత్వాన్ని కొందరు పంచరత్నకవికి ఆపాదించారు. (ద.దే.వా–241)

## శరభోజీ II

కాలం : క్రీ. శ. 1798–1833 ప్రాంతం.

రచన : కుమార సంభవ చంపూకావ్యమ్ (సం).

తంజావూరును పాలించిన మహారాష్ట్రరాజు. రెండవ తులజాజీ పుత్రుడు. రాజకవి, బహుభాషావేత్త, ఆంగ్ల భాషా కోవిదుడు. సంగీత సాహిత్య విద్యా పోషకుడు. తంజావూరు పుస్తక భాండాగారం ఇతని పేరనే పిలువబడుతున్నది. ఈ భాండాగారంలో శరభోజీ పంచలోహ విగ్రహం ఉంది. సమకాలీన గ్రంథాలనే కాక పూర్వగ్రంథాలను, ఆంగ్ల గ్రంథాలను కూడా అసంఖ్యాకంగా సేకరించి భద్రపరిచాడు.

దేవనాగిరి లిపిలో తొలుత గ్రంథముద్రణ ప్రారంభించి కొన్ని గ్రంథాలు అచ్చువేశాడు ఇతడు స్థాపించిన ముద్రణయంత్రం ఆనాటి వాటిలో విశిష్టమైనదట.

(ద.దే.వా–278)

## శల్యాసురుని చరిత్ర

ఇది పింగళి సూరన్న కళాపూర్ణోదయంలోని అద్భుతమైన కల్పన. శల్యాసురుడనే రాక్షసుడు, మృగేంద్ర వాహనాశక్తి తన బంధువైన మహిషాసురుని చంపిన పగ మనసులో పెట్టుకొని, పగదీర్చుకొనే ఉపాయం ఆలోచిస్తూ ఉండగా అతనికి అభినవ కౌముది అనే అప్సరస కనిపిస్తుంది. ఆమెను చూడగానే అన్ని విషయాలు మరచి తన్నేలుకొమ్మని ఆమెను వేడుకొంటాడు. ఆమె నిరాకరించి, అతనిని చంపినవానినే వరిస్తానని ప్రతిన చేస్తుంది. అయినా ఆమెకు కీడు తలపెట్టక ఊరకొన్నాడు.

సూరన్న తన కావ్యంలో వర్ణించిన భిన్నప్రేమ స్వరూపాలలో శల్యాసురుని ప్రేమ వర్ణనాతీతమైనది. సున్నితమైన మనస్సు, సభ్యత విడవాడని ప్రవర్తనగల పరమ ధార్మికునిగా సూరన్న ఇతన్ని చిత్రించాడు. ఇదే విధమైన అసమాన ప్రేమ "విక్టర్ హ్యూగో" ఆంగ్లనవలలో కరుణరస భరితంగా కనిపిస్తుంది.

శల్యాసురుడు పేరుకు తగ్గవాడే. అతనిది శల్యరూపమట. మృగేంద్ర వాహన శక్తి ఇచ్చిన అమోఘమైన కత్తిని ధరించి, మణికంధరుని వెదకటానికిపోయే అభినవ కౌముదిని శల్యాసురుడు చూసి, తన్నే చంపటానికి వస్తుందని భయపడతాడు. 'తన్ను చంపువారు చత్తుర'నే, శక్తిఇచ్చిన వరాన్ని గుర్తు తెచ్చుకొని, తన చావుకు భయపడక ఆమె చనిపోతుందేమోనని వాపోయాడు. అభినవ కౌముది అతనిని మంచి మాటలతో మోసగించి, వెంటబెట్టుకొని వెళ్ళసాగింది. శల్యాసురుడు ఆమెనునమ్మి, తన ప్రతాపం చూపటానికి, ఆమెకు తగలకుండా - శలలప్రయోగం చేసి జంతువులన్నింటినీ చంపాడు. తన్ను వరించమన్నాడు. ఆమె వెళ్ళే చోటులలో తన బలం చూపి అందరినీ నాశనం చేస్తా నన్నాడు. తనమీద కరుణ చూపకపోయినా, తాను చంపే జంతువుల మీదనయినా కరుణ చూపి,తన్ను వరించమని ప్రాధేయపడతాడు ఇతనిలో కాఠిన్యంతోపాటు మార్దవం కూడా ఉంది. అభినవ కౌముది శల్యాసురుని మణికంధరుని చేత చంపించింది. అభినవ కౌముదిని నిష్కళంకంగా ప్రేమించాడు, కాబట్టి ఇతని ప్రేమ శోభితం.

(కళాపూర్ణోదయం పీఠిక-కట్టమంచి)

## శల్వపిళ్ళ రాయ చరిత్రము

కర్త : మరింగంటి వేంకట (ప్రథమ) నృసింహాచార్యులు.

(తె. వి. స-8)

## శశాంక విజయము

నామాంతరం : తారా శశాంక విజయము.
కర్త : శేషము వేంకటపతి.
అంకితం : వంగల సీనయకు.

శృంగారప్రబంధం. అయిదాశ్వాసాలున్నాయి.

ఈ కథను శ్రీనాథుడు తన కాశీఖండంలో పేర్కొన్నాడు. నైతికదృష్టి లోపించినట్లుగా విమర్శింపబడ్డ ఇలాంటిగ్రంథాలు ఆనాటి సంఘజీవనానికి, అభిరుచులకూ, ప్రతీకలని చెప్పవచ్చును. శృంగారభరితంగా రసవంతంగా ఉన్న ఈ కావ్యం అమిత ప్రాచుర్యాన్ని పొందింది.

బ్రౌనుదొర దీనికి "చకోరీయము", "తారకము", "తారాభావ ప్రకాశిక" అని మూడు వ్యాఖ్యానాలు రాయించాడు. ఆంగ్లేయ సూచికలు, పద్యాల అకారాది అనుక్రమణిక కూడా ఉన్నాయి. (ద. దే. వా-364)

## శశాంక శేఖర శతకము

కర్త : కొమరగిరి సంజీవకవి.

"శశాంక శేఖరా" అనే మకుటంతో ఉన్న వృత్త శతకం. కవి దీన్ని రెండు ఘడియల కాలంలో ముగించాడట. రచన సరళంగా ఉంది.

**శశికళ**

పదునారు (16) పద్యాలున్న కావ్యభేదం. (అప్పకవీయం)

**శశిబిందు చరిత్ర**

కర్త : చరిగొండ నరసింహకవి.

పద్యకావ్యం. ఇందులోని కథ పురాణాల నుండి గ్రహింపబడింది. శశిబిందుడనే రాజుకు లక్షమంది భార్యలట. ఒక్కొక్కతెకు చాలామంది బిడ్డలట. ఈ రాజు చాలా యాగాలు చేశాడట. వివాహవర్ణనలో కవి శృంగారాన్ని పచ్చిగా వర్ణించాడు. ఆ పద్యాలనే అప్పకవి ఉదాహరించాడు. ఈ గ్రంథం ముద్రితమేగాని ప్రతులు నేడు లభ్యంకావు. (ఆరుద్ర-9)

**శశిరేఖా పరిణయము**

కర్త : తెలియదు.

జానపద పౌరాణిక గేయం. ఇతివృత్తం ప్రసిద్ధం.

చూ. పౌరాణిక గేయములు. (ఆం. వా. ప)

**శశిరేఖా పరిణయము**

కర్త : రత్నాకరము అప్పకవి.

అంకితం : గోపాలదేవునికి.

ఐదాశ్వాసాల ప్రబంధం. శశిరేఖాభిమన్యుల వివాహ వృత్తాంతం వర్ణితం ఈ కవి పూర్వీకుడైన గోపాలరాజు రచించిన సౌగంధికా కుసుమ ప్రసవాపహరణమనే ద్విపద కావ్యం దీనికి ఆధారమని పండితాభిప్రాయం. (క. స-13)

**శశిరేఖా పరిణయము**

నామాంతరం : విజయనందన విలాసము( చూ).

**శహరాజ దండకము**

కర్త : తెలియదు.

కాలం : క్రీ. శ. 17 వ శతాబ్దం.

శహాజీ (క్రీ.శ. 1684-1712) మీద చెప్పిన దండకం. పూర్తిగా లభించలేదు. దీనిప్రతి తంజావూరు సరస్వతి మహలు గ్రంథాలయం (No. 426) లో ఉంది. (వ. దే. వా-240)

**శహరాజ నక్షత్రమాల (నం)**

కర్త : నారాయణ కవి.

క్రీ శ. 1684-1712 ల నడుమ తంజావూరు సంస్థానాన్ని పాలించిన శహాజీని స్తుతిస్తూ రచించిన గ్రంథం. (శారదాధ్వజం-89)

## శహరాజ సభా సరోవర వర్ణనమ్ (సం)

కర్త : లక్ష్మణకవి.

క్రీ.శ. 1684-1712 ల నడుమ తంజావూరును పాలించిన రాజకవి శహాజీ సభను వర్ణించే రచన. (శారదాధ్వజం-69)

## శహరాజాష్టపదీ (సం)

కర్త : శ్రీనివాసకవి.

తంజావూరు పాలకుడైన శహాజీ పై (క్రీ.శ. 1684-1712) చెప్పిన అష్టపది. (శారదాధ్వజం-69)

## శహాజీ

నామాంతరం : శాహ మహారాజు, శాహరాజు.

కాలం : క్రీ.శ. 1684-1712 ప్రాంతం.

స్థలం : తంజావూరు.

రచనలు : 1. కిరాతవిలాసము 2. కృష్ణలీలా విలాసము 3. గంగా పార్వతీ సంవాదము 4. జలక్రీడలు 5. త్యాగరాజ వినోదచిత్ర ప్రబంధ నాటకము 6. ద్రౌపదీ కల్యాణము 7. పంచరత్న ప్రబంధము 8. పార్వతీ పరిణయము (కర్తృత్వం సందేహం) 9. రతీ కల్యాణము 10. రామ పట్టాభిషేకము 11. రుక్మిణీ సత్యభామా సంవాదము 12 వల్లీ కల్యాణము 13 విఘ్నేశ్వర కల్యాణము 14. విష్ణుపల్లకి సేవా ప్రబంధము 15. శంకర పల్లకి సేవా ప్రబంధము 16. శచీ పురందరము 17. శాంతా కల్యాణము 18. సతిదాన శూరము 19. సతీ పతి దాన విలాసము 20. సీతా కల్యాణము 21. భక్తవత్సల విలాస నాటకము 22. సరస్వతీ కళ్యాణము (కర్తృత్వం వివాదాస్పదం) 23. శబ్దరత్న సమన్వయమ్ (సం. నిఘంటువు) 24. శబ్దార్థ సంగ్రహమ్ (సం. నిఘంటువు) 25. పదాలు (భక్తి, వైరాగ్య, శృంగార, హాస్య, నీతి) 26. రాగమేళ వివేకము.

ఏకోజీ-దీపాంబికల పుత్రుడు.

మహారాష్ట్రుడైనా తెలుగులో రచనలు చేసి తెలుగును రాజభాషగా గౌరవించాడు. కవి పండిత పోషకుడు. తంజావూరులో శరభోజి పేర ప్రసిద్ధమైన సరస్వతీ మహాలు గ్రంథాలయంలో తెలుగు గ్రంథాలను విశేషంగా భద్రపరిచిన ఘనత ఇతనిదే. లేఖకులను ఏర్పాటు చేసి ప్రాచీన గ్రంథాలకు ప్రతులు రాయించాడు. నన్నెచోడుని కుమార సంభవానికి, ద్విపద భారతానికి, ఇతడే ప్రతులు రాయించి భద్రపరిచాడు.

శహాజీ రాజపురం అనే అగ్రహారాన్ని కవి పండితులకు దానమిచ్చాడు. అగ్రహారాదు లిచ్చి అనేక కవిపండిత కుటుంబాలను పోషించాడు.

గిరిరాజకవి, సోమకవి, శేషాచలపతి, వాసుదేవకవి, రామకవి, బాలకవి

సుబ్బన్న మొదలైన తెలుగు కవులూ, రామభద్ర దీక్షితుడు, వేదకవి, అప్పాదీక్షితుడు శ్రీధర వేంకటార్యుడు మొదలగు సంస్కృత కవులూ ఇతని ఆస్థానంలో ఉండేవారు.

ఇతని నాటక రచనలో ఒక విలక్షణత కన్పిస్తుంది. నాటకాలను మార్గరీతి రూపకాలకు దగ్గరగా తెచ్చాడు. సామాన్య జనానికి అందుబాటులో ఉంటూనే పండిత పామరులకు వినోదంగా ఉండేలాగ రచన సాగించాడు.

ఇతని నాటకం సాధారణంగా కథా వస్తువును బట్టి శివస్తుతితోనో, కృష్ణస్తుతితోనో ఆరంభమవుతుంది (ఇదినాంది). సూత్రధారుడు కవి పేరు, నాటకం పేరు చెప్పి కథాక్రమం వినిపిస్తాడు. ఆ తర్వాత ప్రస్తావన, విఘ్నేశ్వరస్తుతి, తప్పక ఉంటాయి. విఘ్నేశ్వరుడు ప్రవేశించి పూజలందుకున్న తర్వాత నాటకం ఇతివృత్తానుసారం జరుగుతుంది. ఈ పద్ధతి మహారాష్ట్ర రాజుల నాటకాలలో కనిపిసుంది. భాషలో సంస్కృతం పాలు ఎక్కువ. దరువులు, ద్విపదలు, వచనాలు, వివిధ భాషలలో ప్రసంగాలు ఉంటాయి.

శహాజీ తిరువయ్యూరు త్యాగేశుని భక్తుడు. ఎక్కువగా శివ సంబంధమైన నాటకాలు వ్రాశాడు. అధికభాగం, "త్యాగేశ సాంబశివ పూర్ణానందార్పణమస్తు" అని ముగించాడు రచనలో పాండిత్య ప్రదర్శన హెచ్చు. వీనిలో సంగీత నృత్య రూపకాలుగా పేర్కొనదగినవి కూడా ఉన్నాయి. తెలుగులో ఇతని రచనలు మొత్తం 22 సరస్వతీ కల్యాణం, పార్వతీ పరిణయం కర్తృత్వం విషయంలో భేదాభిప్రాయాలున్నాయి.

ఇతడు సంస్కృత నిఘంటు నిర్మాణం కూడా చేశాడు. పదకర్తగా త్యాగేశుని మీద భక్తి, వైరాగ్యశృంగార, హాస్య, నీతి, మంగళ పదాలనే శీర్షికలతో రెండు వందలకు పైగా వ్రాశాడట. (న.దే.వా-182-211: పీఠిక-42)

## శహాజీ చరితమ్ (సం)

కర్త : శేశవ పండితుడు.

ఇది చారిత్రక కావ్యం. తంజావూరు పాలకుడైన శహాజీ చరిత్ర.

(తె. వి. స-6)

## శహాజీ దరువులు

తంజావూరు మహారాష్ట్ర ప్రభువు శహాజీ రచించిన యక్షగాన ప్రబంధాలలోని దరువులు మిక్కిలి అపూర్వమైనవి. వీటిలో అతని సంగీత సాహిత్య నాట్య విద్యా వైదుష్య వైభవం తెలుస్తున్నది. ఈ దరువులన్నీ వాద్య ప్రబంధాల కిందికో, తాళ ప్రబంధాల కిందికో చేరతాయి. పంచరత్న ప్రబంధంలో సలాము దరువు, ప్రబంధదరువు, పదాభినయ దరువు, మోహరం, గణపతి కవుత్తం, నెలకట్టు, సొల్లుకట్టు, త్రికాలస్వరం, వర్ణత్రికాలసొల్లు, జతి, వర్ణసొల్లుజతి మొదలైనవి-త్యాగ వినోద చిత్ర ప్రబంధంలో

సవ్యాపసవ్య సమపద లీలా దరువు, క్రమ సప్తస్వర వర్ణార్థ లీలా దరువు, స్వరజతి, స్వరసొల్లు జతి, పంచభూతము మొదలయినవి ఉన్నాయి. (య. వా. చ-300-306)

**శహాజీ రాజ పదములు**

రచన : శహజీ.

నామాంతరం : త్యాగేశ పదములు.

శహాజీ తన ఇష్టదైవం త్యాగేశుని పేర చెప్పిన పదాలు. రెండు సంపుటా లున్నాయి. ఒక దానిలో భక్తిభావ, వైరాగ్య, శృంగార, హాస్య, నీతి, మంగళపదాలు మొత్తం 208 ఉన్నాయి.

రెండవ దానిలో త్యాగేశునిపై భక్తి పదాలు సుమారు 200 ఉన్నాయి
(ద. దే. వా-237)

**శహాజీ రాజపురము**

అగ్రహారం. చోళమండలంలోని తిరువిసనల్లూరు గ్రామాన్ని క్రీ.శ.1693లో శహజీ (క్రీ.శ. 1684-1712) 46 మంది కవి పండితులకు అగ్రహారంగా దానం చేశాడు. వేదాంత తర్క, వ్యాకరణ, వైద్యాలలో విష్ణాతులైన శాస్త్రపండితులు కూడా వీరిలో ఉన్నారు. ఈ 46 మందిలోను తెలుగువారు అధికభాగం ఉన్నారని చరిత్ర చెబుతున్నది. (MRT-31)

**శహాజీ రాజీయమ్ (సం)**

కర్త : లక్ష్మణ కవి.

క్రీ.శ. 1684-1712 నడుమ తంజావూరు సంస్థానాన్ని పాలించిన మహారాష్ట్ర రాజు శహాజీపై రచించిన గ్రంథం. (శారదాధ్వజం-69)

**శాంత నామములు**

జానపద పౌరాణిక గేయ రచన.

చూ. పౌరాణిక గేయములు. (ఆం. వా. చ)

**శాంతా కల్యాణము**

కర్త : తెలియదు.

జానపద పౌరాణిక గేయ రచన. ఇతివృత్తం రామాయణానికి సంబంధించినది.

చూ. జానపద గేయములు. (ఆం. వా. చ.)

**శాంతా కల్యాణము**

కర్త : శహాజీ (చూ).

శివాంకితం. రోమపాదుని రాజ్యంలో క్షామం రావడం, ఋష్యశృంగుణ్ణి రప్పించి అతనికి తన కుమార్తె శాంత నిచ్చి వివాహం చేయడం – ఇందులోని కథ.
(ద. దే. వా-205)

**శాంతానంద యోగి**

కాలం : క్రీ. శ. 17వ శతాబ్ది.

రచన : రామశతకము.

గురువు : బ్రహ్మానందయోగి

రచనలో దోషాలున్నా నీతి బోధకంగా సరళంగా ఉంది. కవి కాలాన్ని గురించి, 19వ శతాబ్దివాడనీ, 1600 ప్రాంతం వాడనీ పండితులలో వాద వివాదాలున్నాయి. (క. స. 265)

**శాంతి విలాసమ్ (సం)**

కర్త : నీలకంఠ దీక్షితులు.

దీనిలో మనశ్శాంతి ఫలం వర్ణితమట. (తె.వి.స-6)

**శాకమూరి జన్నయ**

కాలం : తెలియదు.

శాకమూరి యల్లయ కొడుకు. పేరుపొందిన దానశీలి. ఇతని మీద చాటువు లున్నాయి. (చా. ప. ర.)

**శాకమూరి శ్రీరంగరాజు**

కాలం : క్రీ.శ. 1700 ప్రాంతం.

స్థలం : తెలియదు.

కవి పండిత పోషకుడు. ఇతని ఆస్థానంలోని కర్ణాటక కవి పర్వతవర్ధనుడు సంస్కృతంలో శృంగార మంజరి అనే కావ్యం రాశాడు. దాన్ని తర్వాత ఈదులపల్లి భవానీశ కవి తెనిగించాడు. ఇతని ఆశ్రయంలోని తెలుగు కవులు తెలియరాలేదు. (క. శ.-12-218)

**శాకల్య మల్లుడు**

నామాంతరాలు : మల్లయార్యుడు, కవి మల్లుడు.

కాలం : క్రీ.శ. 14వ శతాబ్ది పూర్వార్ధం.

రచనలు : 1. ఉదార రాఘవమ్ (సం), నిరోష్ఠ్య రామాయణమ్ (సం).

సమకాలికులు : సాయణాచార్యుడు, కాకతి రెండో ప్రతాపరుద్రుడు.

సర్వజ్ఞ సింగ భూపాలుని కొలువులో ఇతనికీ సాయణాచార్యునికి వాగ్వాదం జరిగిందని చెప్తారు. ఇతని కావ్యాల మీద అనంతర కాలంలో చాలా వ్యాఖ్యానాలు వచ్చాయి. (తె. రా. చ) (తె. వి. స-6-220)

**శాకవల్లి మల్లికార్జున భట్టు**

కాలం : క్రీ.శ. 1291-1323 ప్రాంతం.

స్థలం : నైజాం మండలం.

రచనలు : భాస్కర రామాయణంలో బాల,కిష్కింధ, సుందర కాండలు పూర్తిగా సంస్కరించి వ్రాశాడు.

హుళక్కి భాస్కరుని కుమారుడు. కాకతి రెండో ప్రతాపరుద్రుని కాలం వాడు. భాస్కర రామాయణంలో ఎక్కువ భాగం ఈయనే వ్రాశాడట. భాస్కర రామాయణంలో ఇతడు రచించినట్లుగా చెప్పబడుతున్న భాగాలను మొదట మంత్రి భాస్కరుడు వ్రాశాడనీ, అవి మరీ క్లుప్తంగా ఉన్నందున ఇతడు కొన్ని మార్పులు చేసి వ్రాశాడనీ అంటున్నారు.

హుళక్కి భాస్కరుడు తాను రచించిన యుద్ధకాండ భాగాన్ని సాహిణి మారనకు అంకితమిచ్చాడు. ప్రతి విలేఖకులు మల్లికార్జున భట్టు రచించిన భాగాలు కూడా సాహిణి మారనకే అంకితంగా పద్యాలు కూర్చారట. ఆశ్వాసాంత పద్యాలను బట్టి ఇతడు తాను సంస్కరించిన భాగాలను శివునికి అంకిత మిచ్చినట్లు తెలుస్తున్నదని కొందరూ, తన తండ్రి భాస్కరునికి అంకిత మిచ్చినట్లున్నదని కొందరూ అంటున్నారు. (ఆరుద్ర-3; క.వ-165)

**శాకుంతల నాటకమ్ (సం)**

కర్త : చూ. పేరి కాశీనాథశాస్త్రి.

ఇతివృత్తం ప్రఖ్యాతం. (ఆం.సం.సా-427)

**శాకుంతలము**

కర్త పరవస్తు వేంకట రంగాచార్యులు.

సంస్కృత మూలానికి ఆంధ్రీకరణం.

**శాకుంతలము (అలభ్యం)**

కర్త : సిద్ధన ప్రెగ్గడ.

దీనిలో నుంచి ఒక పద్యాన్ని అజ్ఞాత గ్రంథ సంధాత తన "ఉదాహరణ పద్యములు"లో సంకలనం చేశాడు. పద్యం పురవర్ణనకు సంబంధించినది. (ఆరుద్ర-9)

**శానంపూడి తిమ్మయ**

కాలం : క్రీ.శ. 18 వ శతాబ్దం.

సంస్థానం : సత్యవరము.

రచనలు : తెలియరాలేదు.

సత్యవరము పాలకుడైన గోపాల పాయకరావు ఆస్థాన కవి. రాజు ఇతనికి దోసలపాడు అగ్రహారంగా ఇచ్చి, గౌరవించాడట. (క-త-13-62)

**శారద**

కాలం : క్రీ.శ. 15 వ శతాబ్దం.

రచనలు : తెలియరాలేదు.

ఈమె దేవరాయల ఆస్థానంలో సంస్కృత కవయిత్రి. డిండిమ కవి చక్రవర్తి అరుణగిరినాథుడు ఈమెను స్తుతించాడు. (ఆం. కవయిత్రులు-38)

**శారదకాండ్రు**

వీరు పేరుమోసిన జానపద గాయకులు. ఎక్కువగా తెలంగాణా ప్రాంతంలో కనిపిస్తారు.

'ఓ భారతీ ! కరుణామతీ భళీ ! శారదా కరుణానిధీ!" అని పాడటం వల్లనూ, కథలు చెప్పేటప్పుడు వీరు ఉపయోగించే తంబురా పేరు శారద కావడం వల్లనూ కిరిపీ శారదకాండ్రనే పేరు వచ్చింది.

జట్టులో పురుషుడు కథ చెబితే, అతని భార్యలు వంత పాడుతుంటారు. వీరు శైవగాథలనే గాక చరిత్రాత్మకమైన గాథలను కూడా వీరావేశంతో గానం చేస్తారు వీరు ఎల్లమ్మ, పోచమ్మ దేవతలను పూజిస్తారు. వీరు ఎంతమంది భార్యలనైనా పెళ్ళిచేసుకో వచ్చునట. సదాశివరెడ్డి, పర్వాయిపాపడు, బాలనాగమ్మ కథ, బొబ్బిలియుద్ధం, పల్నాటి వీరచరిత్రలను సాధారణంగా గానం చేస్తూ ఉంటారు. ఒక్కొక్క కథను మూడు నాలుగు రాత్రులు కూడా చెబుతారు. వీరి కథలు రసాత్మకంగా ఉంటాయి. (నా.ర.చ-206)

**శారద రామాయణము**

జానపద పౌరాణిక గేయ రచన.

చూ. పౌరాణిక గేయములు. (అం.వా.చ)

**శారద రామాయణము**

రచనాకాలం : క్రీ. శ. 1830 ప్రాంతం.

కర్త : మరింం మడివాళ్ళయ్య.

అముద్రితం. (క.వ-155)

**శారదా దర్పణము (అలభ్యం)**

కర్త : తెలియదు.

లక్షణ గ్రంథం. అప్పకవి దీనిని పేర్కొన్నాడు.

**శారదా ధ్వజము**

నామాంతరం : సరస్వతీ ధ్వజం.

క్రీ. శ. 1633-73 నడుమ తంజావూరును పాలించిన నాయకరాజు విజయ రాఘవుని ఆస్థానంలో ప్రతిష్ఠింపబడి ఉండేది. విజయరాఘవుడు సరస సంగీత కళా పట్ట భద్రుడు. అష్ట భాషాధురీణుడు. "విజయరాఘవ విలాసము" నే ఇతని సభాభవనంలో సింహా సనం చెంగటనే శారదాధ్వజం ఉండేదట. అతని ఆస్థాన కవులు తమకావ్యాలలో దీన్ని ప్రస్తావించారు. చెంగల్వ కాళకవి "రాజగోపాల విలాసం"లో వర్ణించారు. (రా.గో.వి-1-18)

**శారీరోపనిషత్తు**

రచనాకాలం : క్రీ.శ. 18 వ శతాబ్దికి పూర్వం.

కర్త : దానప్ప.

ద్విపద రచన. నశ్వరమైన ఈ శరీరం కోసం ప్రాకులాడక శాశ్వతానంద ప్రదమైన బ్రహ్మపదం చేరడమే లక్ష్యమని ఈ గ్రంథం చెప్తున్నది. దీని ప్రతి మదరాసు ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారంలో ఉంది. (ద్వి.సా.చ-319)

**శాలివాహన సప్తశతి (అలభ్యం)**

కర్త : శ్రీనాథుడు.

ఇది శ్రీనాథుని రెండోరచన. దీనిని 'నూనూగు మీసాల నూత్న యౌవనము'లో వ్రాసినట్లు కవి చెప్పాడు. కాబట్టి 16 సంవత్సరాల ప్రాయంలో వ్రాసి ఉంటాడని పండితులు నిర్ణయించారు. (శ్రీనాథుడు-71, 72-కా.శ్రీ.మూ)

**శాలిహోత్రము (అలభ్యం)**

చూ. అశ్వలక్షణసారము

కర్త : తెలియదు.
అంకితం : గన్న నృపాలునికి.
రచనాకాలం : తెలియదు.

మడికి సింగన తన సకల నీతి సమ్మతంలో ఇందులోని కొన్ని పద్యాలు సంకలనం చేశాడు. ఈ గ్రంథంలో కవి, శాలిహోత్రుని గ్రంథాన్ని అనుసరించి అశ్వ లక్షణాలను వివరించాడు. ఆకారణంగా కవియే దీనికి శాలి హోత్రమని పేరు పెట్టాడో లేక సంకలన కర్త ఆ పేరు పెట్టాడో తెలియదు. అశ్వ లక్షణ సారమనే పేర ముద్రితమైన పుస్తకంలోని మొదటి 62 పద్యాలూ ఈ గ్రంథంలోని వనీ, ఇదే అశ్వ లక్షణసారమనీ పండితాభిప్రాయం. (క.త-5-266)

**శాల్మలి కందనందన విలాసము**

రచనాకాలం : క్రీ.శ. 18 వ శతాబ్దం.
కర్త : వాత్స్య శ్రీరంగాచార్యులు.

పద్యకావ్యం .హైదరాబాదు సమీపంలోని బూరుగుగడ్డ క్షేత్ర మాహాత్మ్యాన్ని తెలిపే కావ్యం.

**శాసనము**

శాతవాహనుల కాలం నుంచి-సుమారు క్రీ.శ. 8వ శతాబ్ది వరకు ఆంధ్రదేశంలో దొరికిన వాఙ్మయం శాసనాత్మకమైనదే. ఈ శాసనాలను సాధారణంగా రాజులు,మంత్రులు, దండనాయకులు వేయిస్తూ ఉండేవారు. ప్రాయికంగా ప్రాచీన శాసనాలన్నీ దానశాసనాలు. శాసనం వేయించిన కాలంలో రాజభాష ఏదో ఆ భాషలోనే శాసనం వ్రాయించి వేయించే వారు. రాగిరేకుల మీదనో, శిలల మీదనో వీటిని చెక్కుతూ ఉండేవారు. ఇవి ప్రాకృతం లోనూ సంస్కృతంలోనూ ఎక్కువగా కనిపిస్తున్నాయి. ఆంధ్రదేశంలో క్రీ. శ. ఆరవ శతాబ్దం తరువాతనే తెలుగు శాసనాలు దొరికాయి. దేశ చరిత్రనూ సంస్కృతినీ భద్రపరిచే అమూల్య సంపద ఈ శాసనాలే ।

శాసన విషయము

ఆంధ్రదేశంలో లభిస్తున్న శాసనాలు-ప్రాకృతంలో కొన్ని, సంస్కృతంలో కొన్ని, ప్రాకృతం - సంస్కృతం కలిసి కొన్ని, తెలుగులో కొన్ని లభించాయి. అన్ని శాసనాలలోని విషయం ప్రాయికంగా రాజులు చేసిన దానకార్యాలకు సంబంధించి ఉంటుంది. విజయ సూచకంగానో, ఏ దేవునికో, దేవాలయానికో, బ్రాహ్మణునికో, మఠాచార్యునికో ఇచ్చే దానాలను సూచించటానికో, యుద్ధంలో చనిపోయిన వీరుల పరాక్రమాన్ని వర్ణించటానికో వీటిని వ్రాయించేవారు. వీటిలో ఎక్కువ భాగం దేవాలయాల కుడ్యాల మీదనో, స్తంభాల మీదనో కనిపిస్తాయి.

శాసన గ్రంథంలో దాత, ప్రతి గ్రహీత, దాన మీయబడిన కాలం, దత్తమైన వస్తువు ప్రధానాంశాలు. దాన మిచ్చినది భూమి అయితే-అది ఏ గ్రామానికి చెందిందో, దాని విస్తీర్ణం, దాని సీమల వివరణ ఉంటుంది. ఈ శాసనాలలో దానమిచ్చిన పొలాలు, ఊళ్ళపేర్లు, వాటి సరిహద్దులు దేశ్యపదాలుగా ఉండటం విశేషం. తెలుగు ప్రజలకు స్పష్టంగా తెలియటం కోసం ఊరిపేర్లు, వ్యక్తుల పేర్లు దేశ్య పదాలతో ఈ శాసనాలలో చేర్చి ఉంటారు. రేవు పట్టణాల వద్ద సరుకుల రవాణాకు, సుంకానికి సంబంధించిన వివరాలతో శాసనాలు వేయించటం కూడా ఉంది. (వా.చ)

శాసనాలు — ఉచ్చారణ, అనుస్వార విశేషాలు

కాలం : క్రీ. శ. 6 వ శతాబ్ది నుంచి 8 వ శతాబ్ది వరకు.

క్రీ. శ. 6 వ శతాబ్దానికి ముందు తెలుగు భాషకు ప్రాకృత భాషా సంపర్కం ఎక్కువగా ఉండేది. రేనాటి చోళుల శాసనాలలో అనుస్వారాలతో ఉండే రూపాలే ఉండేవి. ఉదాహరణ : రాజ్యంచేయ, ధనంజయ, రాచమానంబున, ఫలంబు, అశ్వమేధంబు, చిఱుంబూరు మొదలయిన రూపాలు అనుస్వారాన్నే కలిగి ఉన్నాయి. "న్" స్థానంలో అనుస్వార రూపాలు అంతగా కనిపించకపోగా, వసన్తిపోరి, సామన్త కముళ్వాస్తు, పాతకున్జు అనే రూపాలు ఉండేవి. అట్లే "ణ" అక్షరం విషయంలో కూడా. ఉదాహరణ : వాణ్డు, కొణ్డయ, రెణ్డు, రేణాణ్డు మొదలగు రూపాలే ఉండేవి కాని అనుస్వార యుక్త రూపాలు అరుదు.

ప్రాకృత భాషా సంపర్కం తగ్గి, సంస్కృత భాషాప్రభావం ఎక్కువైనకొద్దీ అనుస్వారానికి బదులు వర్గానునాసికాలను వాడటం ఎక్కువగా కనిపిస్తుంది.

ఉదాహరణ : విక్కలపూణ్డి, సమరసఙ్ఘట్టణ, సమాలిఙ్గిత, పఞ్చమహాపాతక| రాజ్యఞ్చేయ, ప్రసాదఞ్చేసె, కుఞ్చేణ్డు, పన్డిత, వసున్ధరాం, నేణ్డి, సమ్బున్ముణ్డు మొదలయినవి,

ఉచ్చారణ దోషం వల్లనో, లేఖకుల పొరపాట్ల వల్లనో కొన్ని విలక్షణమైన రూపాలు శాసనాలలో కనిపిస్తున్నాయి. కొరవి శాసనంలోని "చాయంబడిన" అనే పదం ఇట్లాంటిదే. 'పొడిచిన' అనటానికి 'పొడిచ్చిన', 'అదాయంబు' వ్రాయటానికి బదులు 'అదెయమ్బు' వ్రాయటం ఇలాంటివి.

విలక్షణమైన ఉచ్చారణ ఉన్న కొన్ని పదాలు :

శ్రీ య్యైయరి కొడుకు మరమ=శ్రీ అయితయారి కొడుకు మారమ కావచ్చును
(ముద్దనూరు శాసనం)

నూట్లామ్బది=నూట యేమ్బది

సఖుత్తు దిగున్=సంయుక్తుణ్ణగున్

ఈ శాసనాలలోని సంధి విశేషాలు విలక్షణంగా ఉంటాయి. తరచు సంధి వివక్ష చేయకపోవటం కనిపిస్తుంది. (తె.శా-ప.శా-6, 7, 8)

**శాస్త్రకావ్యము**

రస ప్రధానమయిన కావ్య సాహిత్యంవలెనే, శాస్త్రవాఙ్మయంకూడా తెలుగులో కావ్య రూపంగా వచ్చింది. శాస్త్రకావ్యం విషయాన్ని తెలియజేస్తుంది. రసానందాన్ని ఇచ్చే గుణం ఇందులో తక్కువ. తెలుగులోని శాస్త్ర కావ్యాలు గద్య పద్యాత్మకంగానూ చంపూ రూపంలోనూ ఉన్నాయి. పావులూరి మల్లన్న సార సంగ్రహ గణితం ఈ కావ్యాలలో మొదటిది. బద్దెన నీతి శాస్త్ర ముక్తావళి నీతి శాస్త్ర కావ్యం. కేతన ఆంధ్ర భాషా భూషణం వ్యాకరణ శాస్త్రానికి, విజ్ఞానేశ్వరీయం ధర్మ శాస్త్రానికి సంబంధించినవి. మల్లియ రేచన కవి జనాశ్రయం, ఛందోలంకార విషయాలలో మొదటిది. అనంతుని ఛందస్సు లింగమకుంట తిమ్మకవి సులక్షణసారము ఛందస్సుకు సంబంధించిన గ్రంథాలు. అప్పకవీయం వంటి ఛందో వ్యాకరణాలంకార శాస్త్ర గ్రంథాలు తెలుగులో చాలా ఉన్నాయి. బద్దెపేటి దత్తప్ప గణిత దీపిక, నవనప్ప ఖడ్గ లక్షణ శిరోమణి కూడా శాస్త్ర గ్రంథాలే. తెలుగులో క్రమంగా ఈ శాఖ విస్తృత మవుతున్నది. (తె. వా.)

**శాహ మహారాజ కల్యాణము**

కర్తృత్వం నిశ్చయంగా తెలియదు. బాలకవి సుబ్బన్న కావచ్చు.

ఇతివృత్తం: రూపావతి అనే రాజకన్య, శహాజీల శృంగార గాథ. రాజు స్వారి వెళ్ళడం, పుర వర్ణన, నాటి సాంఘిక సంప్రదాయాలు వర్ణితం. ఆనాటి ఇతర నాటకాల రీతిలోనే ఉంది. (య. గా. సం-3-పీఠిక)

**శాహ మహారాజు**

నామాంతరం : శహాజీ (చూ).

**శాహ రాజ పదములు**

కర్త : గిరిరాజకవి (చూ).

అధిక భాగం శహాజీపైనా, కొన్ని అతని తర్వాత రాజ్యానికి వచ్చిన తులజాజీ (క్రీ. శ. 1712-1728) పైనా చెప్పబడ్డాయి.

కవి కాలంలోనే అతని పదాలు విశేషంగా ప్రచారం పొందాయి. శహాజీ రచనలలోని పాత్రలు ఈతని పదాలు పాడుతుండడం గమనార్హం. ఉదా:- "రతికల్యాణం".
(ద. దే. వా-219)

**శాహ రాజ విలాసము**

కర్త : (చూ) వివర్తి శేషాచలపతి.

యక్షగానం నాటకం. శహాజీని వలచిన ఒక కన్య విరహం, దౌత్యం, ప్రియ సమాగమం ఇందులోని విషయాలు కవి శహాజీ ఆస్థాన కవులు కొందరిని ఈ కావ్యంలో పేర్కొన్నాడు. (య. గా. సం-3-పీఠిక)

**శాహేంద్ర చరిత్ర**

కర్త : గిరిరాజ కవి (చూ).

అంకితం : శహాజీకి

యక్షగానం. శహాజీ స్వారికి పోవడం - సానికూతురు అతనిని మోహించడం ఇందులోని కథ.

విశేషం : శహాజీ దర్బారు విషయాలు ప్రాసంగికంగా చెప్పబడ్డాయి. (య.గా.సం-3-పీఠిక)

**శాహేంద్ర విలాసమ్ (సం)**

కర్త : శ్రీధర వేంకటేశార్యుడు.

ఎనిమిది సర్గల కావ్యం. శహాజీ (1684-1712) జీవిత విశేషాలను తెలిపే రచన.

**శిక్షలు**

మధ్య యుగాంధ్ర దేశంలో, శిక్షాస్మృతి ననుసరించి నేర నిర్ణయంచేసి, శిక్షలను విధించేవారు. రాజద్రోహ దేశద్రోహ నేరాలను పరమ దారుణమైనవిగా భావించి మరణ శిక్షను విధించేవారు. దేశద్రోహికి,రాజద్రోహికి ఎర్రని వస్త్రాలను ధరింపజేసి రక్షకభటులు వధ్య శిల వద్దకు తీసుకొని వచ్చి శిరచ్ఛేదన చేసేవారు.

ఆనాటి నేరస్థులకు విధించిన శిక్షలు, పెట్టిన చిత్రహింసలు అతిదారుణంగా కనిపిస్తాయి. నేరస్థుల ఒంటి చర్మాన్ని ఒలిపించటం, కాళ్లూ చేతులు నరికివేయటం, రాతి తిరగళ్ళు మెడ్డ వేయించడం, నేరస్థుని ఒంటి మీద గడ్డి వెంట్లు చుట్టి నిప్పంటిచటం మొదలగు శిక్షలు సాహిత్యం ద్వారా తెలుస్తున్నాయి.

శ్రీనాథకవి సార్వభౌముడు పన్ను చెల్లించలేకపోతే పొగడదండ వేసి శిక్షించారు. అట్లే కొన్ని అవయవాలను ఛేదించి ఉప్పుపాతర వేసే శిక్షలు కూడా సాహిత్యంలో కనిపిస్తాయి. (తెలుగు-ఏ-జూ-77)

**శితికంఠ విజయమ్ (సం)**

కర్త : రత్నఖేట శ్రీనివాస దీక్షితుడు.

**శిరో భూషణము (అలభ్యం)**

కర్త : చింతలపల్లి ఎల్లనార్యుడు

వివరాలు తెలియవు. (క.న)

**శిల్పకుడు**

యమకాలంకార భరితంగా కృతిని రచించేవాడు. సప్తవిధ కవులలో ఒకడు.
(అప్పకవీయం-25)

**శివ కామ సుందరీ పరిణయము**

కర్త : తులజాజీ (చూ).

నాటకం. శివ పార్వతుల వివాహేతివృత్తం. ప్రఖ్యాతమైన ఈ కథకు ప్రదర్శన యోగ్యంగా కవి కొన్ని మార్పులు చేశాడు.

ఇది ఉత్సవ సందర్భాలలో నగరి నాటకశాలలో ప్రదర్శింపబడేది.
(ద.దే.వా-224)

**శివ కేశవ పారిజాతము**

కర్త : శేషము రంగాచార్యులు.

యక్షగానం. ఇది ద్వ్యర్థియా అన్న అనుమానం కలుగుతుంది. కథాపాత్రలలోనేకాని సన్నివేశ సందర్భంలో భిన్నత్వం లేదు. దీనిలో శివుడు, కృష్ణుడు నాయకులు. పార్వతి, రుక్మిణి నాయికలు. గంగ, సత్యభామ ప్రతినాయికలు. కవి ఇందులో ఉభయ కథలను ఏకత్ర సంఘటించడం విశేషం. దీనిలో నాయికా నాయకులు జంట జంటలుగా రంగస్థలంపై ప్రవేశించి మాధవునితో (నర్మసచివుడు) స్వీయ వృత్తాంతం చెప్పుకొంటారు. సత్య చెలికత్తె మాధవి, గంగ చెలికత్తె శాంభవి. వీరిద్దరు శివకేశవుల వద్దకు వెళ్ళినపుడు నారదుడు పారిజాత పుష్పాన్ని తేవడం, అది సవతుల మచ్చరానికి కారణం కావడం, నంది తిమ్మన పారిజాతాపహరణ కథను తలపిస్తుంది. రచన ప్రౌఢంగా ఉంది. నాటకీయత ప్రస్ఫుటంగా ఉన్నది. (య. వా. చ)

**శివ జ్ఞాన దీపిక (అలభ్యం)**

రచనాకాలం : క్రీ. శ. 1500 ప్రాంతం.

కర్త : పెదపాటి సోమయ్య.

పద్య కావ్యం. కూచిమంచి తిమ్మకవి ఇందులోవి పద్యాన్ని ఉదాహరించాడు.
(క. స-308)

**శివ జ్ఞాన మంజరి**

కర్త : పరమానంద తీర్థుడు. (చూ.).

వేదాంత ప్రతిపాదకమైన ద్విపద కావ్యం. (ద. దే. వా-209)

**శివ తత్త్వ రసాయనము (అలభ్యం)**

కర్త : చూ. విశ్వేశ్వర దేశికులు. (క. శ-3)

**శివ తత్త్వ సారము**

కర్త : మల్లికార్జున పండితారాధ్యుడు.

శైవమత ప్రతిపాదకమైన కందపద్యమయగ్రంథం. 489పద్యాలు లభించాయి. శతకం వలె ఉన్నది. అన్య మతస్థులను నిరసిస్తూ కవిత నడుస్తుంది. కవి పాల్కురికి సోమనాథుని శివతత్త్వసారాన్ని చాలాసార్లు ప్రస్తావించాడు. ఒకే మకుటంతో పద్యాలు లేవు. కొన్ని పద్యాలకు అసలు ఏ మకుటమూ లేదు. ప్రౌఢమైన రచన.

(ఆరుద్ర-2)

## శివ దర్పణమ్ (సం)

కర్త : సుగుటూరి ముమ్మడి తమ్మ భూపతి.

సంకలన గ్రంథమట. (ఆం. సం. సా-261)

## శివ దీపిక (సం)

నామాంతరం : శ్రీకరభాష్యము (చూ).

కర్త : శ్రీపతి పండితుడు.

## శివ దేవధీమణి శతకము (అలభ్యం)

కర్త : శివదేవయ్య (చూ).

దీనిలోని పద్యాలు లింగమకుంట తిమ్మకవి బాల బోధచ్ఛందంలోను, పొత్తపి వేంకట రమణ కవి లక్షణ శిరోమణిలోను ఉదాహృతం. కవి తనను తాను సంబోధించు కొని చెప్పినట్లుగా ఈ పద్యాలున్నాయి. (ఆరుద్ర-2-149-152)

## శివ దేవయ్య

కాలం : క్రీ.శ. 1347 కు పూర్వుడు.

ఆస్థానం : ఓరుగల్లు.

రచనలు : 1. పురుషార్థ సారము (నీతిశాస్త్ర గ్రంథం) 2. శివదేవ ధీమణి శతకము (అలభ్యం).

బిరుదు : "సంస్కృతాంధ్ర కవితాపితామహ".

కాకతి గణపతి, రుద్రమలకు మంత్రిగా ఉండేవాడు. సాక్షాత్తు పరమేశ్వరుడని ప్రతాప చరిత్ర చెబుతుంది.

విశిష్టత : ఈ కవిని "మల్హణ చరిత్ర" కర్త ఎడపాటి ఎర్రన, "నాగరఖండ" కర్తలు అయ్యలంకి బాలసరస్వతి, తురగా "రాజకవి", శౌర్య చరిత్ర" కర్త పింగళి ఎల్లన స్తుతించారు. ఈ కవి "పురుషార్థసారం" నుంచి, మడికి సింగన చాలా పద్యాలను వాడుకున్నాడు. ఈ కవి పద్యాలు రుచిరార్థ వంతాలై, లోకజ్ఞతతో నిండి ఉన్నాయి

(ఆరుద్ర-2)

## శివ ధర్మోత్తర ఖండము

కర్త : చూ. కామినేని మల్లారెడ్డి.

అంకితం : సిద్ధ రామేశ్వరస్వామికి.

ఎనిమిదాశ్వాసాలు గల పద్య కావ్యం సకల శైవాచార సంప్రదాయాలు,

ఐహికధర్మ సముదాయం ఇందులో నిరూపింపబడినాయి. గ్రంథం ముద్రితం.

ఆస్థాన సభాసదుల ప్రోత్సాహంతో కవి ఈ గ్రంథం రచించినట్లు తెలుస్తుంది. ఈ రచన వలననే ఈ కవికి "భాషాశేషాహి" అనే బిరుదం లభించింది. ఈ రచనలోని శైలి ప్రసన్నంగా ఉంది. (అం.సం.సా-182)

**శివ నాటకము (అలభ్యం)**

చూ. శివ విలాసము.

కవయిత్రి : తరిగొండ వేంకమాంబ.

(అ.భా.క-74)

**శివ నాటకము**

కర్త : శిర్నీదు వేంకటరాయ కవి (చూ).

ప్రదర్శనానుగుణంగా రచించిన యక్షగాన నాటకం. (పీ.యు-206)

**శివ పారిజాతము**

కర్త : వేంకట కృష్ణకవి (చూ).

నాటకం. వేదాలలో అక్కడక్కడ ఉన్న శివుని గాథలు రసవత్తరంగా కూర్చి చెప్పబడ్డాయి. రచన జన సామాన్యానికి అర్థమయ్యే సులభ శైలిలో ఉంది. (ద.దే.వా-287)

**శివ పారిజాతము**

కర్త : లింగమూర్తి కవి.

రచనాకాలం : క్రీ.శ. 18 వ శతాబ్దం.

ఈ యక్షగానంలో పారిజాత ప్రసక్తి లేదు కాని శివసతుల మచ్చరము వర్ణింపబడింది. అంటే పారిజాత కథ సవతి మచ్చరానికి ఏర్పడ్డది కాబట్టి కవి ఆ పేరు పెట్టి ఉండవచ్చును. దీనిలో పదాలు, ద్విపదలు ఎక్కువ. పద్యాలలో సీసపద్యాల సంఖ్య ఎక్కువ. రచన నాటకీయంగా ఉంది.

బాల రుద్రవేషము, బైరాగివేషము వంటి వాటితో నాటకం గజిబిజిగా ఉంది. (య.వా.చ-65)

**శివ భక్త విలాసము (కన్నడం)**

కర్త : కళవె నంజరాజు.

**శివ భక్తి దీపిక (అలభ్యం)**

కర్త : చూ. చక్రపాణి రంగనాథుడు.

ఇది "నయనగతి రగడ"లో ఉన్న రచన అట. (క, త-3)

**శివ భక్తి విలాసము**

కర్త : చూ. మంద లక్ష్మీ కామేశ్వరశాస్త్రి.

నాటక రచన. ముద్రితం. (ఆం. సం. సా-430)

**శివ భారతమ్ (సం)**

కర్త : పరమానంద కవి.

రచనాకాలం : క్రీ. శ. 18వ శతాబ్ది పూర్వార్ధం.

చారిత్రక గ్రంథం. మహారాష్ట్ర నాయకుడు ఛత్రపతి శివాజీ వృత్తాంతాన్ని తెలిపే రచన. దీనికి ఆ కాలంలోనే "శివాజీ చరిత్రం" అనే పేర తమిళానువాదం కూడా వెలువడినదట. 20వ శతాబ్దంలో వచ్చిన గడియారం శేషశాస్త్రిగారి శివభారతానికి పై సంస్కృత గ్రంథమే ఆధారం. పరమానందకవి తంజావూరును పాలించిన మహారాష్ట్ర రాజు శరభోజీ (1712-28) ఆస్థానంలో ఉండేవాడు. (ద. దే. వా-242)

**శివ ముకుంద పరమానంద శతకము**

కర్త : పరమానంద తీర్థుడు (చూ).

వేదాంత ప్రతిపాదకమైన కందపద్య శతకం. హరిహర రూపాలను ఒక్కటిగా భావించి హరునకు ముకుందునకు అంకితంగా పరమానందయతి ఈ శతకాన్ని వ్రాశాడు. సద్గురు లక్షణాలు, ముక్తిమార్గం, రాజయోగ రహస్యం విపులంగా ఉన్నాయి. (ద. దే. వా-297)

**శివయోగ వచనములు**

నామాంతరం : కాశికాధీశ్వర వచనములు.

**శివయోగ సారము**

రచనాకాలం : క్రీ. శ. 17వ శతాబ్దం.

కర్త : అవియాది గణపతి దేవుడు.

ఎనిమిదాశ్వాసాల ప్రబంధం. రెండు భాగాలుగా ఉంది. కవిత్వం ప్రౌఢంగా హృద్యంగా ఉంది. శివభక్తుల కథలు, శివమాహాత్మ్యము వివరింప బడ్డాయి. (క. స-55)

**శివయోగ సారము**

రచనా కాలం : క్రీ శ. 15వ శతాబ్ది పూర్వార్ధం కావచ్చు.

కర్త : కొలని గణపతి దేవుడు.

కృతిభర్త : ఈడూరి సూకనారాధ్యుడు.

విశేషత : ఇందులో శివప్రతిపాదకమయిన అధ్యాత్మిక విషయం, కర్మయజ్ఞం తపోజపధ్యాన జ్ఞాన యజ్ఞాలను పంచ యజ్ఞాల రూపంగా కవి వివరించాడు. ప్రౌఢమయిన కవిత్వముంది. ఈ కావ్యానికి పూర్వోత్తర భాగాలున్నాయి. పూర్వభాగం ఎనిమిది అశ్వాసాలు, ఉత్తర భాగం నాలుగాశ్వాసాలట. (క. త-5)

**శివయోగి వీరభద్రయ్య**

కాలం : క్రీ. శ. 16 వ శతాబ్దం.

స్థలం : అరుణాద్రి మంగలం.

అరుణాచలానికి ఉత్తరాన ఉండే అరుణాద్రి మంగల నివాసియైన జంగమ దేవర.

భద్రకవి లింగకవి రచించిన సానందచరిత్ర ద్విపదకావ్యం ఇతనికే అంకితం. ఇతడు సంగయ దేవర కుమారుడు. (ద. దే. వా-16)

**శివ రహస్య ఖండము**

నామాంతరం : శంకర సంహిత.
కర్త : కోడూరి వేంకటాచలకవి.
అంకితం : ముదుబాగళ భూపతికి. (భైరవమూరి ముళువాగళరాజు)

పద్యకావ్యం. సంస్కృతంలోని అష్టాదశ పురాణాలలో "స్కాందపురాణం" ఒకటి. స్కాందపురాణాంతర్గతమైన "శంకరసంహిత" లో పన్నెండు ఖండాలున్నాయి. అందులో మొదటిదే "శివరహస్య ఖండము". దానికి ఇది అనువాదం.

ఈ రచన సంభవ, అసుర, వీర,మహేంద్ర, యుద్ధ,దేవ, దక్ష, ఉపదేశముఅనే ఏడుకాండాలుగా ఉంది. మొత్తం 28 ఆశ్వాసాలలో 15 మాత్రం లభించాయి. ఇందులోని సంభవకాండ, వీరమహేశ్వరకాండ పేరుగా ముద్రితాలు. (అం. సం. సా-261)
(ద. దే. వా-491)

**శివ రహస్య ఖండము**

కర్త : బాలకవి రేవూరి చినఅనంతయ్య. (చూ)
అంకితం : తురైయూరులోని నందీశ్వరునికి

తొమ్మిది ఆశ్వాసాల గ్రంథం నాలుగు కాండలు ఉన్నాయి. (సంభవము, అసురము, వీరమహేంద్రము, యుద్ధము). చివరిపత్రాలు లభించలేదు. దీనికి మూలం స్కాందపురాణం. ఈ రచన కోడూరి వెంకటాచలకవి రాసిన శివరహస్యఖండం కంటె భిన్నంగా ఉంది. ఇది అనేక ఉపాఖ్యానాలతో ఉన్న ప్రౌఢకావ్యం. తురైయూరునే, తీర్థపురి అని వ్యవహరిస్తారు. ఇది తిరుచునాపల్లి మండలంలోనిది. (ద. దే. వా-380)

**శివ రహస్య ఖండము**

రచనాకాలం : క్రీ. శ. 1700 ప్రాంతం.
నామాంతరం : తత్త్వ ప్రకాశిని.
కర్త : ముదిగొండ బ్రహ్మయ లింగము.

శైవమత ప్రబోధకమైన వచనకావ్యం. మూలం స్కాందపురాణం. ప్రౌఢమైన రచన. 1852 లో ముద్రితం. (క. వ-147)

**శివ రహస్య ఖండము**

రచనాకాలం : క్రీ.శ. 1700 ప్రాంతం.
కర్త : చూ. రాపాక వేంకటదాసకవి.

అంకితం : వేములవాడ రాజేశ్వరునకు.

శివునూరి అచ్చనమంత్రి ప్రోత్సాహంతో రచింపబడ్డ గ్రంథం. చందాపురపు విశ్వేశ్వరుని వర్ణిస్తూ చేసిన రచన. (అం. సం. సా-18)

**శివ రహస్య ఖండము**

కర్త : వింటి ఔబళకవి.

ద్విపద కృతి. ప్రతి అసమగ్రంగా ఉంది. కవిత్వం ప్రౌఢంగా రసవంతంగా ఉన్నది. శంకర సంహితకు అనువాదం కావచ్చు. (ద్వి. సా. చ. 161)

**శివరాత్రి నాటకము**

కవి : మేలత్తూరు వేంకటరామశాస్త్రి.

సంగీతరూపకం. నేటికీ నృసింహ జయంత్యుత్సవాలలో దీన్ని ప్రవర్తిస్తుంటారట. ఆకాశవాణికేంద్రం ఈ నాటకాన్ని సంగీతరూపకంగా ప్రసారం చేసింది. (శారదాధ్వజం-124)

**శివరాత్రి మహత్త్వము (అలభ్యం)**

కవి : లోకేరావు సోమన. (చూ)

ఏపనకావ్యమని కవి చెప్పుకొన్నాడు.

**శివరాత్రి మాహాత్మ్యము**

కర్త : తెలియదు.

అంకితం : మట్టివాడ పురీశునికి.

యక్షగానం. ఈ కవి గురుమూర్తి శిష్యుడు. ఈ రచన మట్టివాడ పురీశునికి అంకితం కాబట్టి కర్త పరశురామ పంతుల రామమూర్తి కావచ్చునేమో అని పరిశోధకులు అనుమానిస్తున్నారు. మహాభారతం ఆదిపర్వంలోని కల్మాషపాదుని కథ దీనిలోని ఇతివృత్తం. వచన వలక్షణమైనది, దీని ప్రతి ఆంధ్రసారస్వత పరిషత్తులో ఉన్నదట. (య. వా. చ-455)

**శివరాత్రి మాహాత్మ్యము**

కర్త : శ్రీనాథుడు.

కృతిపతి : ముమ్మడి శాంతయ్య.

ఈ గ్రంథం నాలుగాశ్వాసాలతో మాత్రం లభించింది. శివరాత్రి మహిమను తెలిపే కథ ఇందులో సుకుమారుని కథ విశిష్టమైనది అష్టే గుణనిధి కథకూడా. శ్రీశైలం మల్లికార్జున పీఠానికి ధర్మకర్త అయిన శాంతవృత్తి భిక్షారాయని కోరికపై శ్రీనాథుడు ఈ కావ్యం రచించాడట. కొండవీడు, రాజమహేంద్రవరరెడ్డి రాజ్యాల పతనానంతరమే దీన్ని శ్రీనాథుడు రచించి ఉంటాడని పండితాభిప్రాయం. (శ. ఆ-7)

**శివరామాభ్యుదయము**

కర్త : పోడూరి పెదరామామాత్యుడు.

రచనాకాలం : క్రీ.శ. 1740 ప్రాంతం.
అంకితం : ఆచంటలోని రామలింగేశ్వర స్వామికి.

ద్వ్యర్థి కావ్యం. గురజాల పేరయార్యుని ప్రోత్సాహంతో కవి ఈ కావ్యాన్ని రచించాడు. గ్రంథంలో కవి వంశవర్ణన, కృతి ప్రేరకుని వంశవర్ణన విపులంగా ఉన్నాయి. ఇందులోని కవిత పండితుల ప్రశంసలు పొందింది. (క. చ-3-196)

## శివరాయమంత్రి

కాలం : క్రీ.శ. 18వ శతాబ్దం.
స్థలం : తంజావూరు.

శంభాజీ పుత్రుడు. సాహిత్యప్రియుడు. తంజావూరు ప్రభువైన అమరసింహునికి మంత్రిగా ఉండేవాడు. మాతృభూత కవిని ప్రోత్సహించి "పారిజాతాపహరణము"నే నాటకం రచింపజేశాడు. (పారిజాతా. య. గా.)

## శివలింగారెడ్డి

కాలం : క్రీ. శ. 1324-1353 ప్రాంతం.
స్థలం : కందుకూరు.
రచన : తత్త్వప్రకాశిక (సం) (శ్రుతిసూక్తిమాల, చతుర్వేద తాత్పర్య సంగ్రహమ్)

కందుకూరును ఏలిన రెడ్డి యువరాజు. అద్దంకి ప్రభువుల తర్వాతివాడు కావచ్చు. రెండు శ్లోకాలలో ప్రోలయవేముని నుతించాడు. సంస్కృతంలో హరిదత్తాచార్యులు వ్రాసిన "గిరీశ శ్రుతి సూక్తిమాల" అనే 150 శ్లోకాల గ్రంథానికి ఇతని తత్త్వప్రకాశి వ్యాఖ్యాన గ్రంథం. (రె. రా. చ.-మ. సో. శ.)

## శివలీలా వర్ణనమ్ (సం)

కర్త : నీలకంఠ దీక్షితులు.

దీనిలో 22 సర్గలున్నాయి. (తె. వి. స-6)

## శివలీలా విలాసము

కవి : చూ. కూచిమంచి తిమ్మకవి.
అంకితం : పిఠాపురంలోని కుక్కుటేశ్వరునికి.
రచనాకాలం : క్రీ. శ. 1756.

శివుని లీలలను తెలిపే రెండాశ్వాసాల ప్రబంధం. మొత్తం 400 పద్యాలున్నాయి. కవి ముప్పది ఒక్క దినాలలో ఈ రచన పూర్తిచేశాడట. జాలరి వాని కుమార్తెగా భూలోకంలో పుట్టిన గంగను జంగమ వేషధారియైన శివుడు వివాహం చేసుకోవడం ఇతివృత్తం. ఈ కథ ఏలూరు పట్టణంలో జరిగినట్లు కవి వర్ణించాడు. (క.త-13-197)

## శివలీలా విలాసము

కర్త : శివలెంక కొమ్మన.

కృతిభర్త : రాజమహేంద్రవరరెడ్డి ప్రభువు అల్లాడి రెడ్డి కుమారుడైన దొడ్డారెడ్డి.

రచనాకాలం : క్రి. శ. 1435 ప్రాంతం.

ప్రత్యేకత : దొరికిన గ్రంథం అసమగ్రం.

ఇందులో శివుని విలాసాలు 36 వర్ణింపబడినట్లు కవి గ్రంథారంభంలో చెప్పాడు. దొరికిన రెండాశ్వాసాలలోను శివుని 11 లీలలు మాత్రమే ఉన్నాయి. (రె.రా.చ)

## శివలెంక కొమ్మన

కాలం : క్రి. శ. 15 వ శతాబ్ది పూర్వార్థం.

స్థలం : రాజమహేంద్రవరం.

వ్యవహార నామం : విశ్వంక కొమ్మన.

రచనలు : 1. వీరమహేశ్వర ౦ 2. శివలీలా విలాసము.

పోషకుడు : రాజమహేంద్రవర రెడ్డి ప్రభువు అల్లాడ రెడ్డి కుమారుడు దొడ్డారెడ్డి.

సమకాలికుడు : శ్రీనాథుడు.

అష్టభాషా కవితా ప్రవీణుడు. అనర్గళ ధారతో కవిత్వం చెప్పాడు. శివలెంక అనేది ఇతని శివభక్తి సూచకమేమో. (రె.రా.చ)

## శివలెంక మంచన పండితుడు

కాలం : క్రీ.శ. 1025 ప్రాంతం.

రచన : మంచన గిళవచనము (కన్నడం).

ఈయన పండిత త్రయంలో ఒకడు. ఆరాధ్యుడు. ఈయన చరిత్ర పాల్కురికి సోమన బసవపురాణంలో షష్ఠాశ్వాసంలో వర్ణితం. ఈయన కాశీ క్షేత్రంలో విశ్వేశ్వరాస్థానంలో ఉండేవాడు. అక్కడ ముప్పూటలు తన పది వ్రేళ్ళను శివునికి అర్పించేవాడట. మళ్ళీ ఆ వ్రేళ్ళు వాటంతట అవే వచ్చేవట. 'అన్యవర్ణనుల ముక్కుపై కత్తి' అని వ్రాయించి ఒక బెండాను కాశీలో ఎగురవేయించి-తనతో వాదనకు తలపడ్డవారిని ఓడించి పంపేవాడట. పండితులందరూ ఒకేసారి గుంపుగా ఆయనపై బడి వాదించగా ఈయనశ్రుతి స్మృతిపురాణ శాస్త్రార్థసహితంగా వారితో వాదించి తన అసమాన ప్రతిభావ్యుత్పత్తులతో వారిని ఓడించటమే గాక, అక్కడున్న విష్ణుదేవుని శివుని మ్రొక్కమని పిలిచి, వారందరూ చూస్తుండగానే శివునికి మ్రొక్కించాడట. వాదించటానికి వచ్చిన వారందరూ ఆశ్చర్యపడి మంచనభక్తి మాహాత్మ్యాన్ని కీర్తిస్తూ తమ ఇళ్ళకు వెళ్ళినారట.

కన్నడ కవిచరిత్ర నుంచికూడా ఈయన గురించి కొన్ని విషయాలు తెలుస్తున్నాయి. ఈయన తెలుగు కృతులు కాని, సంస్కృత రచనలు కాని లభించ లేదు. తెలుగు దేశంలోని శివలెంకవారు ఈ పండితుని వంశీయులే అని ప్రతీతి. (తె.వి.స-4)

**శివలెంక మల్లనారాధ్యులు**

కాలం : క్రీ.శ. 19 వ శతాబ్ది పూర్వార్ధం.
స్థలం : గోదావరీ మండలం (ఏలూరు ప్రాంతం).
రచన : వీరభద్ర విజయము.
గురువు : రామయ్య దేశికుడు.

తండ్రి మహాదేవారాధ్యుడు. తాత మల్లనారాధ్యుడు. గర్భకవిత్వంపట్ల కవికి ఆసక్తి ఎక్కువ. ఉదాత్తమైన వర్ణనలతో ప్రౌఢంగా రచన చేశాడు. (య.వా.చ-104)

**శివ విలాసము**

కవయిత్రి : తరిగొండ వెంకమాంబ.
అంకితం : రాచవీటి వీరభద్రునకు.
కాలం : క్రీ.శ. 19 వ శతాబ్దం.

యక్షగానం ఈ గ్రంథం శివనాటకంగా ప్రఖ్యాతమైంది. కొందరు ప్రతి విలేఖకులు దీన్ని శివపారిజాతమని వ్రాశారు. ఒక రత్నహారం కారణంగా శివుని భార్య లిరువురి నడుమ (గంగా గౌరుల నడుమ) కయ్యం జరగడం ఇందులో ఉంది కాబట్టి దీనికి పారిజాత సామ్యం కల్పించి, ప్రతివిలేఖకులు శివపారిజాతంగా పేర్కొన్నారు. ఇందులో కొరవంజి పాత్ర, సవతుల కయ్యం మనోహరంగా చిత్రితాలు. (య,వా చ-112)

**శివ శతకము**

కర్త : తెలియదు

ఇది శైవభక్తి శతకం. ఇది కృష్ణశతకానికి అనుసరణ. శివనామకీర్తన, విభూతి రుద్రాక్షమహిమలను ఈ శతకం వర్ణిస్తున్నది. కవి ఆత్మానుభూతిని వెల్లడిస్తున్న రచన. (శ. సా. వి)

**శివ శతకము**

కర్త : అమలాపురస్థ సన్యాసికవి.

శివభక్తి ప్రతిపాదకమైన కందపద్య శతకం. దుష్కరప్రాసంతో, శివా అనీ సాంబశివా అనీ మకుటాలున్న 128 పద్యాలున్నాయి. (శ. క. చ. 566, 749)

**శివ శతకము**

కర్త : కొండవీటి కోటయ్య.
రచనాకాలం : క్రీ. శ. 1800 ప్రాంతం.

కందపద్య శతకం. సంస్కృత నీతిశాస్త్రానికి అనువాదమట. రచన అంత ప్రశస్తం కాదని పండితాభిప్రాయం. (క. స-48)

**శివ శతకము**

కర్త : బుద్ధిరాజు కనకరాజు.

శివా! అనే మకుటంతో ఉంది. శైలి రమణీయమైనది. (శ. క. చ. 577)

## శివ సూర్యుడు

కాలం : క్రీ. శ. 16 శతాబ్ది పూర్వార్థం

రచన : పాండవాభ్యుదయమ్. (సం)

ఈయన రెండో రాజనాథ డిండిముని (చూ. డిండిమభట్టు 2.) దౌహిత్రుడు.

(తె. వి. స-6)

## శివాజీ మహారాజు

కాలం : క్రీ శ. 1833-1855.

రచన : అన్నపూర్ణా పరిణయము (నాటకం).

తంజావూరును పాలించిన కడపటి మహారాష్ట్రరాజు.

అహల్యాబాయి, శరభోజీల పుత్రుడు. బహుభాషా కోవిదుడు. కవిపండితులను విశేషంగా ఆదరించాడు. అన్నపూర్ణా పరిణయ నాటక గద్యలో శివాజీ మహారాజు ఛత్రపతి అని ఉంది. కాని ఇతడు ఛత్రపతి శివాజీ కాడు. అన్నపూర్ణా పరిణయం ఇతని 'ఆంధ్ర నాటకంగా' చెప్పబడడం చేత ఇతని రచనలు కొన్ని వేరే భాషలలో ఉండి ఉంటాయని పండితులు ఊహిస్తున్నారు. (ద.దే వా-283)

## శివాజీ సీసములు

కర్త : తెలియదు.

తంజావూరును పాలించిన చివరి మహారాష్ట్రరాజు శివాజీపై (1885-55) అతని ఆస్థానకవులు, కవిపుత్రులు చెప్పిన స్తుతిపరమైన సీసపద్యాలు. ఇవి తంజావూరు గ్రంథాలయంలో ఉన్నవి. (ద.దే.వా-288)

## శివానుభవ మంటపము

ఈ పేరుతో ఒక మంటపం పూర్వం కల్యాణ పట్టణంలో ఉండేదట. బసవేశ్వరుని సిద్ధాంతాన్ని ప్రచారం చేయడానికి తరచు ఇక్కడ అతని అనుయాయులు సమావేశమౌతుండేవారట. ఈ మంటపంలో తెలుగువారైన తెనుంగు బొమ్మయ్య, మోళిగె మారయ్య మొదలగు వారుకూడా సమావేశాలకు వస్తూ ఉండేవారట. బసవేశ్వరుని అనుయాయులను "శివశరణులని" వ్యవహరించేవారు. (ఆం.సా.ప.ప-1935)

## శివనూరి అచ్చన మంత్రి

కాలం : క్రీ. శ. 18 వ శతాబ్దం.

స్థలం : దోమకొండ సమీపంలోని పరకాల ప్రాంతం.

సాహిత్యపోషకుడు. రాపాక వేంకటదాస కవిని ప్రోత్సహించి అతనిచేత శివ రహస్యఖండము అనే గ్రంథాన్ని రచింప జేశాడు.

**శివోత్కర్ష మంజరి (సం)**

కర్త : నీలకంఠ దీక్షితులు. (తె.వి.స-6)

**శిశుపాల వధ**

కర్త చూ. గోపీనాథము వేంకటకవి.

నాలుగాశ్వాసాలుగల చంపూ ప్రబంధం. ఆంధ్రీకృత రచన. వేంకటగిరి పాలకుడైన రాజగోపాలకృష్ణ యాచేంద్రుని ఆదేశానుసారం వేంకటకవి ఈరచన చేశాడు. సంస్కృత మహా కావ్యాలలో మాఘం, నైషధం, కిరాతార్జునీయాలు కఠినమైనవి. మాఘం అన్నిటికన్న ప్రౌఢతరం మూలభావం చెడకుండా దానిని ఆంధ్రభాషలోనికి అనువదించడం కష్టసాధ్యమైనా వేంకటకవి నైపుణ్యంతో రచనచేసి ఫలితం సాధించాడు.

(ఆం. సం. సా-466)

**శిష్టా వేంకట సుబ్బయ్య**

కాలం : క్రీ. శ 19వ శతాబ్దం.

స్థలం : భద్రాచలం.

రచన : హృదయాభిరామము.

భద్రాచలానికి చెందిన శ్రీ రాజా వేంకటనరసింహ అప్పారావు ఆదరణలో ఉన్న విద్వత్కవి. ఆయన కోరికపై కావ్యం వ్రాసి, ఆయనకే అంకితం చేశాడు. మృచ్ఛకటిక నాటకాన్ని పోలి ఉంటుంది.

**శిష్టు కృష్ణమూర్తిశాస్త్రి**

కాలం : క్రీ. శ. 1700-1870.

స్వస్థలం : గొల్లపాలెం (గోదావరీ మండలం).

రచనలు : 1. నాటకదీపము 2. పంచతంత్రము 3. వసుచరిత్ర వ్యాఖ్యానము 4. వీక్షారణ్య మాహాత్మ్యము 5. వేంకటాచల మాహాత్మ్యము 6. సర్వకామదా పరిణయము 7. శ్రీ నీతిశాస్త్రము 8. హనుమచ్ఛతకము (వాయుపుత్ర శతకము) మొదలగు ఆంధ్ర రచనలు.

1. అశ్వశాస్త్రము 2. కంకణ బంధము 3. నీలశైలనాథీయము 4. మదనాభ్యుదయభాణము 5. యక్షోల్లాస భాణము 6. వల్లవీపల్లవోల్లాసభాణము 7. హరికారికావళి మొదలగునవి సంస్కృత రచనలు.

బిరుదము : అభినవ భట్టుమూర్తి, షడ్దర్శనీ స్వతంత్రుడు.

గురువు : బులుసు అచ్చయ్య పండితుడు.

గౌరమాంబా సర్వశాస్త్రిల పుత్రుడు. పిఠాపురం సమీపంలో ఉన్న రావర్తి గ్రామంలో జన్మించారు. రామచంద్రపుర జమీందారులు కాకర్లపూడి రామచంద్రరాజు ఆయన సోదరులు జగన్నాథరాజు ఈతనిని తమ ఆస్థాన విద్వాంసునిగా గౌరవించారు. ఉర్దూ, సంస్కృతాంధ్రాలలో పేరు పొందిన కవి. సంగీత సాహిత్యాలలో సమాన ప్రతిభ

కలవాడు పిండిప్రోలు లక్ష్మణ కవికి ప్రతిద్వంది. మాడుగుల, పిఠాపురం, కాళహస్తి, జగ్గంపేట, కోట రామచంద్రపురము, విజయనగరము మొదలగు పెక్కు సంస్థానాలలో విశేష గౌరవాదరాలు పొందాడు. రామేశ్వర యాత్ర నుండి తిరిగి వస్తుండగా కాళహస్తి ప్రభువులు ఇతన్ని ఆహ్వానించారట. దామెర్ల వెంకటపతి నాయని ఆస్థానంలో సుమారు 16 సంవత్సరాలున్నాడు. విజయనగరం ప్రభువైన "విజయరామ గజపతి" ఆస్థానకవి. మండ కామేశ్వర కవికి తులసీ రామాయణ రచనలో (అయోధ్యకాండను ఆంధ్రీకరించి) సహాయపడ్డారు. సర్‌వాల్టర్ ఇలియట్ దొరకు ద్రాక్షారామ శాసనాక్షర శోధనలో తోడ్పడ్డారట. ఇతని హరికారికావళిని గురించి పండిత లోకంలో చాలావాద వివాదాలు జరిగాయి.

సర్వకామదా పరిణయము కాకర్లపూడి వేంకటకృష్ణరాజుకు కృతి ఇవ్వవలెనని రచించాడట. ఈయన కాకర్లపూడి వారిపైన, కాళహస్తి రాజుపైన, దంతులూరి వేంకట కృష్ణంరాజుపైన, పిఠాపురం సంస్థానాధిపతి పైన, వేశ్యపైన చాలా చాటువులు చెప్పారు. మాడుగుల కృష్ణ భూపతిచేత విశేషంగా సత్కరింపబడిన వారిలో వీరొకరు. ఒకరాత్రిలో నాలుగు వందల శ్లోకాల సారదీయాశ్వ శాస్త్రాన్ని తెలుగు చేశారట. సాలీనా వేయి రూపాయల రాబడిగల మాన్యాన్ని పొంది వారి ఆస్థానంలోనే కవి పండిత శిరోభూషణమై అలరారి మాడుగులలోనే పరమపదించారు.

(ఆం. సం. సా.; పీ. యు. 133; క. చ-3-229)

## శిష్యప్రబోధము (అలభ్యం)

రచనాకాలం : క్రీ. శ. 15వ శతాబ్దం.

కర్త : పోశెట్టి లింగకవి.

ద్విపద కావ్యం. (క స-210)

## శిర్నిదు వేంకటరాయ కవి

కాలం : క్రీ. శ. 19వ శతాబ్ది పూర్వార్థం.

స్థలం : లేపాక్షి సమీపగ్రామం.

రచనలు : 1. కృష్ణ నాటకము 2. శివనాటకము 3. నాట్య ప్రదీపనము 4. లేపాక్షి రామాయణము.

వెంకటయ్య పుత్రుడు. ఇతని లేపాక్షి రామాయణం మిక్కిలి ప్రసిద్ధమైనది. తన వంశావళిని ద్విపదలో చెప్పుకొన్నాడు. పాత్రోచిత సంభాషణలు, రచనా శిల్పం ఇతనికొక విశిష్ట స్థానాన్ని సంపాదించి పెట్టాయి. (పీ. యు. 208; య. వా. చ-117)

## శీలము పాప నృపాలుడు

కాలం : క్రీ. శ. 1800 ప్రాంతం.

సాహిత్యప్రియుడు. పరశురామ పంతుల రామమూర్తి రచించిన ఈదులవాయి రామస్వామి శతకము ఇతనికి అంకితమని కొందరు భావిస్తున్నారు. ఇతడు కృతి ప్రోత్సాహకుడు కావచ్చును. (శ. క. చ-405)

శుక చరిత్రి
కర్త : పరశురామపంతుల రామమూర్తి కవి.
వేదాంత గ్రంథం. అయిదాశ్వాసాలున్నాయి. రచన మృదు మధురంగా ఉంటుంది. (తె. వి. స-6-769)

శుక రంభా సంవాదము (అలభ్యం)
కర్త : లోకేరావు సోమన (చూ).
యక్షగానం.

శుక సందేశమ్ (సం)
కవయిత్రి : త్రివేణి.
ఇది వియోగ శృంగార రసాత్మకమైన సందేశ కావ్యం. దీని వ్రాతపతి తంజావూరు సరస్వతీ మహల్‌లో ఉందట. (అ. భా. కవయిత్రులు)

శుక సప్తతి
రచనాకాలం : క్రీ శ. 1823 ప్రాంతం.
కర్త : చిత్తూరు గంగాధర కవి.
వచన కావ్యం.

శుక సప్తతి
కర్త : పాలవేకరి కదిరీపతి.
అంకితం : కదిరి నృసింహస్వామికి (దైవం).
ఇది చక్కని పద్య కథాకావ్యం. లభించిన ప్రతి అసమగ్రంగా ఉంది. నీతిని బోధించే రీతిలో కొందరు కాముకుల కథలను కవి, నాయికకు పెంపుడు చిలుకనోట చెప్పించాడు. మొత్తం డెబ్బై రాత్రులలో చెప్పిన ముప్పై కథలలోనూ అడుగడుగునా అబ్బురాలు కన్పిస్తాయి.

తెలుగులో ఇదేపేరుతో ఒక వచనకావ్యం ప్రచారంలో ఉంది. అందులో ధౌమ్యుడు ధర్మరాజుతో చెప్పినట్టుగా ఇలాంటి కథలే ఉన్నాయి. కథలలో శృంగార రసం ఎక్కువగా, కొన్నిచోట్ల నీతి బాహ్యంగా ఉంది. పూర్వ కావ్యాలలోని కథలు కొన్ని దీనిలో ఉన్నాయి. దీనిలోని చపల అనే విప్ర యువతి కథ సుగాత్రి - శాలీనుల (కళాపూర్ణోదయం) కథను పోలి ఉంటుంది. వణిజుని కథ నీతిమయంగా మనోహరంగా ఉంది. శైలి సులభ గ్రాహ్యమైనది. అకాలపు సాంఘిక పరిస్థితులు దీనిలో వర్ణితం. ఇ పారసీక, ఉర్దూ భాషలలోకి అనూదితం. (తె.వి.స-6)

శుక సప్తతి కథలు
కర్త : పాటూరి రామస్వామి శాస్త్రి.
రచనాకాలం : క్రీ.శ. 1840 ప్రాంతం.

ప్రాచీన పద్యకావ్యానికి వచనానువాదం. నేడు లభిస్తున్న ముద్రిత గ్రంథాలలో కర్తపేరు లేదు. కాని 19-9-1843 నాడు ఈ కర్త బ్రౌన్ దొరకు వ్రాసిన లేఖను బట్టి కర్తృత్వం నిరూపితమవుతున్నది. (వ.వా)

**శుకాభి పతనమ్ (సం)**

కర్త : కిరీటి వేంకటాచార్యులు (చూ.)

రచనాకాలం : క్రీ.శ. 1730 ప్రాంతం. (క.స-258)

**శుక్తిమతి**

రామరాజ భూషణుని వసు చరిత్రలోని పాత్ర. వసుచరిత్ర ఆంధ్ర పంచ కావ్యాలలో ఒకటి.

శుక్తిమతి ఒక నది. ఈమె ప్రవాహాన్ని కోలాహలుడు (పర్వతం) అడ్డగించాడట. ప్రవాహానికి అంతరాయం కలగడంతో నది గట్లు తెగి తీర గ్రామాలను ముంచెత్తుతుంది. వసురాజు ఆ పర్వతాన్ని తన పాదంతో తొలగద్రోసి ఆ ఉపద్రవాన్ని తొలగిస్తాడు. శుక్తిమతికి పర్వత సమాగమంతో గిరిక అనే కూతురు, వసుపదుడనే పుత్రుడు కలుగుతారు. వారిని శుక్తిమతి వసురాజుకు కానుకగా సమర్పిస్తుంది. ఈ కథ మహాభారతంలో ఉంది. వసుచరిత్ర ధ్వని కావ్యం. దీనిలోని పాత్రలను రామరాజ భూషణుడు కొన్ని కొన్ని గుణాలకు ప్రతీకలుగా తీర్చి దిద్దాడని కావ్య మర్మజ్ఞులు అంటారు.

గిరికను లోకోత్తర నాయికగా తీర్చిదిద్దడంలో శుక్తిమతి పాత్రను కవి హృదయంగమంగా చిత్రించాడు.

**శుద్ధాంధ్ర రామాయణము (అలభ్యం)**

కర్త : అడిదము బాస్కరుడు.

అడిదము సూరకవి తన, కవి సంశయ విచ్ఛేదములో ఇకారాది సంధికి లక్ష్యంగా ఈ గ్రంథంలోని చంపక మాలికా పాదాన్ని ఉదాహరించాడు. అంతకుమించి ఈ గ్రంథంలో నుండి ఉదాహరణలు కూడా లభించలేదు. ఇది కూచిమంచి తిమ్మకవి అచ్చ తెనుగు రామాయణం కంటె ప్రాచీనం. (కవి సంశయవిచ్ఛేదం-పీఠిక-1955)

**శూద్రక రాజ చరిత్ర (అలభ్యం)**

కర్త : చూ. కవిభల్లటుడు.

దీని నుంచి అప్పకవి కొన్ని పద్యాలను ఉదాహరించాడు. (అరుద్ర-4)

**శూద్రక రాజ చరిత్ర (అలభ్యం)**

కర్త : చూ. క్షేమేంద్రుడు.

ఇది క్షేమేంద్రుని కృతిగా వినవస్తున్నది. కవి బిరుదనామం క్షేమేంద్రుడు. (క. స-51)

**శూద్రధర్మోత్పల ద్యోతినీస్మృతికౌముది**

కర్త : శేషభట్టరు సింగరాచార్యులు (చూ.).

అంకితం : బారిగడ్పుల నృసింహస్వామికి.
రచనాకాలం : క్రీ. శ. 13-7-1760.

ఇది ధర్మశాస్త్ర గ్రంథం. మదనపాల విరచిత "శూద్ర ధర్మోత్పలద్యోతినీ స్మృతి కౌముది"కి తెనుగు సేత. అన్నిటా మూలాన్ని అనుసరించి ఉంది.

కవి ఈ గ్రంథానికి స్వయంగా విపులమైన పీఠిక వ్రాశాడు. సురభివారి వంశ చరిత్రను తెలుపడానికి ఏతద్గ్రంథ పీఠిక అత్యంతోప యుక్తము. సామాన్యంగా ప్రబంధాలలో ఉండే పురవర్ణనాదులు ఇందు కన్పిస్తాయి. చారిత్రక ప్రాధాన్యంగల రచన. (మ. మా.)

**శూద్రస్మృతి (సం)**

కర్త : పేరు తెలియదు.
కాలం : క్రీ. శ. 17వ శతాబ్దం చివరిపాదం.
స్థలం : జటప్రోలు.

కర్తను గురించిన వివరాలు తెలియరాలేదు. (ఆం. సం. సా.)

**శృంగవరపుకోట**

నామాంతరం : కాశీపురము (చూ).

**శృంగారకవి తిరుమలనాథకవి**

చూ. తిరుమలనాథ కవి. (క. వ-87)

**శృంగార కల్పవల్లి**

కర్త : చూ. తర్కభూషణం వేంకటాచార్యులు.
అంకితం : వెలుగోటి సర్వజ్ఞకుమార యాచేంద్రులకు (1832-92).

అలంకారశాస్త్ర గ్రంథం. కృతిపతి వేంకటగిరి పాలకుడు.
(ఆం. సం. సా-468)

**శృంగార కీర్తనలు**

కాలం : క్రీ. శ. 1460-1546 ప్రాంతాలు.
కర్త : తాళ్ళపాక పెదతిరుమలాచార్యులు.

కవి శ్రీ వేంకటేశ్వరునిపై చెప్పిన కీర్తనలు. మధుర భక్తి భరితంగా ఉన్నాయి. రచన మనోహరంగా ద్రాక్షా పాకంలో ఉంటుంది. ఇవి శృంగారాధ్యాత్మిక సంకీర్తనలుగా ప్రసిద్ధం. (క. వ-127)

**శృంగార గాధేయోపాఖ్యానము**

చూ. ధేయోపాఖ్యానము.
కర్త : రేవూరి అనంతయ్య.

గాధేయోపాఖ్యానంలోని శృంగార పట్టాన్ని ప్రత్యేకంగా ఈ పేరుతో

అచ్చు వేశారు. ఇది అసలు గ్రంథంలోని ఆఖరు ఆశ్వాసం మాత్రమే
(అరుద్ర-12-99)

## శృంగార గేయములు-జానపద సాహిత్యం

సంస్కృత ప్రాకృత భాషాల్లోను, దేశభాషాల్లోనూ శృంగార రస ప్రాధాన్యం కల రచనలు అధికం. ప్రపంచంలోని అన్ని భాషల్లోనూ కూడా శృంగార రసానికే అగ్రస్థానం. జానపద సాహిత్యంలోనూ సీతాదేవి అలుక, సీతాదేవి వేవిళ్లు, ఊర్మిళా దేవి నిద్ర మొదలగు వాటిలో సభ్యమైన శృంగారం కనిపిస్తుంది. 'సుందర కాండ పదము' అనే గేయంలో వియోగ శృంగారం రమ్యంగా పోషింపబడింది. శశిరేఖా పరిణయము ,నలచరిత్ర, సుభద్రా కల్యాణం మొదలగు భారత కథకు సంబంధించిన గేయాలు శృంగార రస పూరితాలు. సన్యాసమ్మ, లక్ష్మమ్మ, ఎరుకలనాంచారి, వీర రాజమ్మ మొదలగు గేయాలలో జానపదులకు సంబంధించిన ఉత్తమ శృంగారం వర్ణించ బడింది. ఇవికాక శృంగార ప్రధానాలైన చల్ మోహనరంగ, సిరిసిరిమువ్వ, నారాయణమ్మ మొదలగు పెద్ద పాటల్లోనూ, కాముని పున్నమి పాటలవంటి చిన్న పాటల్లోనూ ఆయా పాత్రలకు అనుగుణమైన భావాలుగాక జానపదులకు సంబంధించిన భావాలే ఎక్కువగా కనిపిస్తాయి.

## శృంగార తరంగిణీ నాటకమ్ (సం)

కర్త : కిరీటి వేంకటాచార్యులు (చూ).

(అం సం.సా )

## శృంగార దండకము (అలభ్యం)

కర్త : తాళ్ళపాక పెద తిరుమలాచార్యుడు.

(క.శ-8)

## శృంగార దీపిక (సం)

కర్త : చూ. పెద కోమటి వేమారెడ్డి.

ఇది సంస్కృత శృంగార కావ్యమైన అమరుక శతకానికి సంస్కృత వ్యాఖ్యానం. అమరుక శతకానికి వ్రాసిన వ్యాఖ్యానాలలో మాళవ దేశపు రచయిత అర్జున దేవుని "రసిక సంజీవని', పెద కోమటి వేముని "శృంగార దీపిక" అత్యుత్తమమైనవని పండితాభిప్రాయం. (రె.రా.చ.)

## శృంగార దీపిక (సం)

కర్త : వేంకటాధ్వరి.

ఇది దశవిధ రూపకాలలో ఒకటైన భాణం. (తె.వి.స-8)

## శృంగార ధామము

రచనాకాలం : క్రీ.శ. 18 వ శతాబ్దం.

రచన : దివి రమణ కవి.

అంకితం : మంగళగిరి నృసింహస్వామికి

రెండాశ్వాసాల ప్రబంధం. కవిత్వం అంత రసహీనం కాదని కవి, విమర్శకుల అభిప్రాయం. కవి రాఘవపురాధిపతి అయిన వాసిరెడ్డి చినరామలింగన్న ప్రేరణ చేత ఈ గ్రంథాన్ని నృసింహస్వామికి అంకితం చేశాడు. ఇది సంస్కృత రసమంజరికి తెలుగు సేత. (అం.సం.సా.)

శృంగార నైషధము

రచనాకాలం : క్రీ.శ. 1404 పూర్వం.

కర్త : శ్రీనాథుడు.

అంకితం : మామిడి సింగయకు.

ఎనిమిది ఆశ్వాసాల కావ్యం. తెలుగు పంచ కావ్యాలలో ఒకటి. సంస్కృత పంచ కావ్యాలలో ఒకటైన శ్రీహర్షుని నైషధ కావ్యానికి ఆంధ్రీకరణం. కవి "నిండు జవ్వనంబున" సంతరించినది. 'శబ్దంబనుసరించియు' ఇత్యాదిగా ఒక ప్రణాళికపై తానాంధ్రీకరించినట్లు కవి చెప్పాడు. విద్వదౌషధమైన, గాఢపాకమైన నైషధ కావ్యాన్ని తెలుగులో అంత ప్రతిభావంతంగానూ రచించాడు. పంచ నల ఘట్టాన్ని అనువదించేటప్పుడు, హంస దౌత్యసన్నివేశ కల్పనలోనూ, శ్రీనాథుడు చూపిన నేర్పు అపూర్వం (శ్రీనాథుడు-కొ. శ్రీ.మూ.)

శృంగార పదములు

కాలం : క్రీ.శ. 17 వ శతాబ్దం.

కర్త : తెలియదు.

మొత్తం 68 పదాలు, మహారాష్ట్ర రాజులైన, శహాజీ, శరభోజీ, తులజాజీలపై చెప్పబడినవి. ఇవి భిన్న కర్తృకాలు కావచ్చును.

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ ఓరియంటల్ మాన్యుస్క్రిప్టు లైబ్రరీ వాటిని 1972 లో ప్రచురించింది.

శృంగార పదాలు

రచనాకాలం : క్రీ.శ. 18 వ శతాబ్దం.

కర్త : తెలియదు.

క్రీ. శ. 1706-32 నడుమ మధుర పాలకుడైన విజయరంగ చొక్కనాథునిపై చెప్పిన పదాలు. ఆరు మాత్రం లభించాయి. (భారతి-ఫిబ్రవరి-1952)

శృంగార భల్లాణ చరిత్రము

రచనాకాలం : క్రీ.శ. 1823 ప్రాంతం.

కర్త : చిత్తూరు గంగాధరకవి.

శృంగార భూషణ భాణమ్ (సం)

కర్త : చూ. వామనభట్ట బాణుడు.

దశవిధ రూపకాలలో ఒకటయిన "భాణం" రూపంలో దీనిని కవి వ్రాశాడు
(రె రా.చ.)

శృంగార మంజరి

కర్త : ఈదులపల్లి భవానీశకవి.

అంకితం : శ్రీశైల మల్లికార్జునస్వామికి.

మూలం : పర్వత వర్ధనుడనే కర్ణాటక కవి సంస్కృతంలో వ్రాసిన శృంగార మంజరికిది అనువాదం. ఈ పర్వత వర్ధనుడు శాకమూరి శ్రీరంగరాజు ఆస్థాన కవి అట.

శృంగార నాయికా నాయక లక్షణాలు, లక్ష్యాలు వర్ణింపబడ్డాయి హరి చరిత్ర ఇందులోనే పొందుపరుపబడింది. (క.త-12-218)

శృంగార మంజరి (అలభ్యం)

కర్త : గణపవరపు వేంకటకవి (చూ).

కవి ఇరవయ్యో ఏట చెప్పిన ప్రౌఢకవితా కల్పన.

ఇది కర్ణాటక కవి పర్వత వర్ధనుని సంస్కృత శృంగార మంజరికి అనువాద మని కొందరి అభిప్రాయం. (ఆరుద్ర-11-180)

శృంగార మంజరి

కాలం : క్రీ.శ. 15 వ శతాబ్ది.

కర్త : తాళ్ళపాక అన్నమయ్య (చూ).

ప్రత్యేకత : ద్విపద కావ్యం. ప్రాసలో పోతనను, ద్విపద నడకలో గౌరనను మరపింపజేసే రచన. ప్రబంధ కవులు చేసే పుష్పాపచయం, విరహ వర్ణన, వసంతోత్సవం అన్నీ అన్నమయ్య ఈ ద్విపదలో చేశాడు. ఒక "బాల" వేంకటేశు పై మరులు గొంటే, ఆమెను 'కోకిలవాణి, చిగురాకుబోణి, వలపుల విశ్రాంతి, తలిరాకు బంతి, వలరాజు చిగురెల్లి, వలపులవెల్లి" అని వర్ణించాడు. చివరకు "బాల"ను కరుణించి తిరుమ లేశుడే ఏలుకొన్నాడని మధుర "శృంగార మంజరి"లో అన్నమయ్య చెప్పాడు.
(ఆరుద్ర-8)

శృంగార మంజరి (సం)

కర్త : భోగనాథుడు.

(తె పి.స-1)

శృంగార మంజరి (సం)

కర్త : విశ్వేశ్వరకవి.

సట్టకము.

శృంగార మంజరీ భాణమ్ (సం)

కర్త : చూ. రాజా బహిరీ గోపాలరాయలు

శ్రీరంగనాయకస్వామి వసంతోత్సవాలను వర్ణించే రూపకం. (ఆంధ్ర సం.సా.)

### శృంగార రస తరంగిణి (సం)

కాలం : క్రీ.శ. 1730 ప్రాంతం.
కర్త : కిరీటి వేంకటాచార్యులు (చూ).

### శృంగార రసమంజరి

కర్త : చూ. పేరి కాశీనాథశాస్త్రి.
వివరాలు తెలియవు. (అం.సం.సా–427

### శృంగార రసాలవాలము

కర్త : వెలుతుర్ల ఒడ్డెయ్య (వెలుతుర్ల వడ్డికవి)
అంకితం : శ్రీకృష్ణునికి.

ప్రత్యేకత : ఇది మూడాశ్వాసాల అలంకారశాస్త్ర గ్రంథం. ఇందులో కృష్ణ దేవుడు సల్పిన క్రీడలు శృంగార రస పూరితంగా ఉన్నాయి. దీనిని కవి "పూర్వ సత్కవినికాయ కావ్యలక్షణ లక్ష్య సంగతులు ఎరింగి" వ్రాశాడట. దీనిలోని లక్షణాలు విలక్షణాలుగా కనబడుతున్నాయని, ఇతనిలో స్వతంత్రత కనబడుతున్నదని పరిశోధకులు భావిస్తున్నారు. (క.చ–3–165)

### శృంగార లహరి (సం)

కర్త : కిరీటి వేంకటాచార్యులు (చూ).
(అం.సం.సా.)

### శృంగార వృత్త శతకము (అలభ్యం)

కర్త : తాళ్ళపాక పెద తిరుమలాచార్యుడు.
(క.శ–6)

### శృంగార శాకుంతలము

నామాంతరం : శకుంతలా పరిణయము.
కర్త : పిల్లలమర్రి పినవీరభద్రుడు.
కృతిభర్త : చిల్లర వెన్నయ మంత్రి.

నాలుగాశ్వాసాల ప్రబంధం. నన్నయ ప్రౌఢ ప్రబంధ వాసనా సంపత్తి, తిక్కన వాక్కుల ఫక్కి, నాచన సోమన్న వాచా మాహాత్మ్య సౌరభం, శ్రీనాథుని భాషా నిగుంభన పరిమళాలు కవి ఈ కావ్యంలో చూపాడు. భారతంలోని శాకుంతలోపాఖ్యానాన్ని, కాళిదాసు అభిజ్ఞాన శాకుంతలం నాటకంతో మిశ్రబంధం చేసి వ్రాశాడు.

కాళిదాసు కల్పించిన ఉంగరం, శాపం, నాయకుని మతిమరుపు మొదలైనవి పినవీరన స్వీకరించినా, భరతుడు పుట్టిన తరవాతనే శకుంతలను భర్త వద్దకు పంపడంలో మూలాన్ని అనుసరించాడు. శృంగారం వైపు మొగ్గినా, ఇతర వర్ణనలు సహజంగా చేశాడు. కాళిదాసు శాకుంతలంలోని శ్లోకాలనే కాకుండా కుమార సంభవంలోని శ్లోకాలను కూడా చక్కగా వాడుకున్నాడు.

కావ్యాలలో నాటకం, నాటకాలలో శాకుంతలం, దానిలో చతుర్థాంకం, అందులో ఆ నాలుగు శ్లోకాలు రమ్యంగా ఉంటాయంటారు. పినవీరన "అంపకాల సన్నివేశం" ప్రబంధ శైలిలో, జాతీయత ఉట్టిపడేటట్లు వ్రాశాడు. పినవీరన్న చిత్రించిన కణ్వుడు పూర్తిగా తెలుగు వాడు "తండ్రి బాయంగలేవి సంతాప జలమూ, అత్తగారింటి కేగెడు అహ్లాదమూ," కలగలుపై శకుంతల ఎలా సాగిందో ఇందులో కవి చక్కగా చిత్రించాడు. (ఆరుద్ర-6)

## శృంగార షష్ఠము

చూ. భాగవతము షష్ఠస్కంధము.

కర్త : నంది మల్లయ్య-ఘంట సింగయ్య కవులు.

## శృంగార సంకీర్తనలు

కాలం : క్రీ. శ. 15 శతాబ్దం.

కర్త : తాళ్ళపాక అన్నమయ్య.

ప్రత్యేకత : ఈ శృంగార సంకీర్తనలలో కవి వెలిబుచ్చిన భావాలు, చేసిన కల్పనలు, గుప్పించిన చమత్కారాలు, పచరించిన శిల్పాలు, వినిపించిన పలుకుబళ్ళు కోకొల్లలు. అన్నీ స్వతంత్రాలు. జాతిరత్నాలు. కోటిచల్లని వెలుగులు చిమ్మే మణిదీపాలు. (ఆరుద్ర-6)

## శృంగార సంకీర్తనలు

కాలం : క్రీ. శ. 1495-1553 ప్రాంతం.

కర్త : చిన తిరుమలాచార్యుడు.

శ్రీ వేంకటేశ్వరస్వామిపై భక్తిశృంగార పూరితంగా చెప్పిన సంకీర్తనలు (తె. వి. స-4)

## శృంగార సంజీవని (అలభ్యం)

రచనాకాలం : క్రీ. శ. 1600-33 ప్రాంతం.

కవి : కృష్ణాధ్వరి.

అంకితం : రఘునాథనాయకునికి.

సంస్కృతమో, తెలుగో వివాదాస్పదంగా ఉంది. అమరుక కావ్యానికి తెలుగని కొందరి ఊహ. (క. శ-12-34)

## శృంగార సర్వస్వమ్ (సం)

కర్త : నల్ల దీక్షితుడు.

రూపక భేదాంలో ఒకటైన భాణం. సమకాలీన సంఘ పరిస్థితులను ప్రస్ఫుటం చేస్తున్న రూపకం. ఆనాటి ఉత్సవాదులలో దీన్ని ప్రదర్శించేవారు.

(ద.దే.వా-180)

## శృంగార సర్వస్వమ్ (సం)

కర్త : రాజచూడామణి దీక్షితుడు.

భాణము.

## శృంగార సర్వస్వము

కర్త : తిరుమల బుక్కపట్టణం బుచ్చి వేంకటాచార్యులు (చూ).

(అం సం.సా.)

## శృంగార సావిత్రి

నామాంతరం : సావిత్రీ కల్యాణము.

కర్త : రఘునాథ నాయకుడు (నిర్ధారణ కాలేదు.).

రెండు ఆశ్వాసాల కావ్యం. 426 గద్య పద్యాలున్నాయి. ఉర్దూపదాలు ఎక్కువగా ఉన్నాయి.

సరస్వతీ మహల్ గ్రంథాలయంలోని సావిత్రీకల్యాణం అనే అసమగ్ర కావ్యాన్ని రఘునాథునిదిగా భావించి, శృంగార గ్రంథమాలవారు శృంగార సావిత్రి అనే పేరుతో అచ్చువేశారు. రఘునాథుని రామాయణంలోని పద్యాలు కొన్ని ఇందులోఉండడం చేత దీనిది రఘునాథునిగా భావించామని ప్రకాశకులు చెప్పారు. అయితే ఆ సాదృశ్యం లేదని విమర్శకులు అంటున్నారు. రఘునాథుడు రామాయణం వలెనే భారతకథను కూడా రాశాడేమో. నలచరిత్ర. సావిత్రీకల్యాణం అందులోని భాగాలేమోనని కొందరి అనుమానం

(శ. త-12-17)

## శృంగార సిరియాళ చరిత్రము

రచనాకాలం : క్రీ. శ. 1823 ప్రాంతం.

కర్త : చిత్తూరు గంగాధర కవి.

## శృంగార సీసపద్య శతకము

నామాంతరాలు : 1. లోకోత్తర స్వారస్యయుత శతకము. 2.డిండిమ ప్రహసనము.

కర్త : తెలియదు.

అంకితం : క్రీ. శ. 1672-1704 వరకు మైసూరును పాలించిన చిక్కదేవ రాయలకు.

ఈ శతకం అసంపూర్ణంగా లభించింది. సంస్కృత డిండిమ ప్రహసనానికిది అనువాదమని కొందరి అభిప్రాయం. (ద. దే. వా. 449)

## శృంగార సుధాకరమ్ (సం)

కర్త : రామవర్మ.

ఇది నాటకం. (తె. వి. స.)

## శృంగార సుధాసముద్ర పూర్ణచంద్రోదయము

. కర్త : చెన్నూరి శోభనాద్రి.

అంకితం : గుమ్మడపు పాపరాజుకు.

నాలుగాశ్వాసాల శృంగార ప్రబంధం. యామినీ పూర్ణతిలక, బిల్హణుల శృంగారగాథ. కవిత్వం చాలా ప్రౌఢంగా ఉంది. (క. చ-3-185)

శృంగారాధ్యాత్మ సంకీర్తనలు

కాలం : క్రీ. శ. 1493-1553 ప్రాంతం.

కర్త : తాళ్ళపాక పెదతిరుమలాచార్యులు.

చూ. శృంగార కీర్తనలు.

శృంగారామరుక కావ్యము

నామాంతరం : అమరుక కావ్యటీక.

కర్త : తాళ్ళపాక తిరువేంగళాచార్యులు.

(క.స-90)

శెంకి సుమాలు

కాలం : క్రీ. శ. 18 వ శతాబ్దం.

స్థలం : పుదుక్కోట.

ఖడ్గ లక్షణాలన్నీ తెలిసినవాడు."ఖడ్గ లక్షణ శిరోమణి"కర్త నవనప్పకు లక్షణ విషయాలను తెలిపాడట. (ఖ. ల. శి)

శెయ్యూరు సంస్థానము

ఇది చెంగల్పట్టు జిల్లాలోనిది. ఇక్కడి పాలకుల వివరాలు తెలియలేదు కాని వారి ఆస్థానకవి మూరుపెద్ది చెంగల్వరాయకవి పేరు తెలియవచ్చింది. ఈ కవి సంగీత విద్వాంసుడు కూడా. తమిళంలోనూ తెలుగులోనూ రచనలు చేశాడు. ఇతడు పెరియకాలప్ప ముదలియారు ఆశ్రితుడట. (ద. దే. వా.)

శేశలూరి శేషాచార్యులు

కాలం : క్రీ. శ. 19 వ శతాబ్దం.

స్థలం : వనపర్తి సంస్థానం.

రచనలు : తెలియరాలేదు.

వనపర్తి సంస్థాన విద్వాంసులు. (ఆం. సం. సా.)

శేషకవి

చూ. ఓట్టు ప్రభువు.

శేష కృష్ణ పండితుడు

కాలం : చూ. శేషవంశీయులు.

రచన : ప్రక్రియా ప్రకాశమ్ (సం).

శేష రామచంద్రాచార్యుడు సంస్కృతంలో వ్రాసిన "ప్రక్రియా కౌముది" వ్యాకరణ శాస్త్రానికి వ్యాఖ్య వ్రాశాడు. (తె. వి. స-6)

**శేష కృష్ణశాస్త్రి**

కాలం : క్రీ. శ. 16 వ శతాబ్ది.
రచనలు : తెలియరాలేదు.

శాస్త్ర విద్యాభ్యాసార్థం కాశికి వెళ్ళిన తెలుగువారిలో వీరొకరు. కాశీలో స్థిరపడి పోయారు. వీరి సంతతివారు కాశీలో ఉంటున్న మహారాష్ట్ర కుటుంబాలతో సంబంధ బాంధవ్యాలు ఏర్పరుచుకున్నారు. వీరికొడుకులలో ఒకరయిన శేష వీరేశ్వరశాస్త్రి జగన్నాథ పండితరాయల (రసగంగాధరకర్త) తండ్రి పేరంభట్టుకు గురువు. (తె వి. స-4)

**శేష చింతామణి**

కాలం : క్రీ. శ. 16 వ శతాబ్దం.
రచన : కైయట ప్రదీప వ్యాఖ్య.

ప్రసిద్ధ సంస్కృత పండితుడు. (తె. వి. స-6)

**శేష ధర్మములు**

కాలం : క్రీ. శ. 1700 ప్రాంతం.
కర్త : కానాల నరసింహకవి.
అంకితం : తరికొండలోని నృసింహస్వామికి.

ఎనిమిదాశ్వాసాల పద్యకావ్యం. మూలం హరివంశం ఆశ్చర్యపర్వంలోని శేషధర్మాలు. రచనలో విలక్షణ ప్రయోగాలున్నవట. కవిత్వం అనర్గళమైన ధారతో మృదు మధురంగా ఉంటుంది. (క. చ. 3-204)

**శేష ధర్మములు**

కాలం : క్రీ. శ. 1740 ప్రాంతం.
కర్త : తామరపల్లి తిమ్మయ్య.
అంకితం : శ్రీరామునికి.

ఐదాశ్వాసాల పద్యకావ్యం. కొన్ని అప ప్రయోగాలున్నా రచన చక్కనిదని పండితాభిప్రాయం. (క. చ-3-195)

**శేష ధర్మములు**

కర్త : తురిమిళ్ళ రామన (చూ).
అంకితం : శ్రీరామచంద్రునికి.

శేషధర్మాలలో ఇదే మొదటిది. ఆంధ్ర సారస్వత పరిషత్తులో ఈ తాళపత్ర ప్రతి ఉంది. అముద్రితం. (మ. మా.)

**శేష ధర్మములు**

రచనాకాలం : క్రీ. శ. 18, 19 శతాబ్దాల నడిమికాలం.
కర్త : పడకండ్ల గురురాజకవి.
అంకితం : సంజీవిరెడ్డికి (జోహరాపుర ప్రభువు).

తొమ్మిదాశ్వాసాల గ్రంథం. దీనిలో కవి తన ఇతర రచనలు పేర్కొన్నాడు. కవిత్వం రసవంతంగా ఉంది. (క॰ చ-3-252)

## శేష ధర్మములు

కర్త : వెణుతురుపల్లి విశ్వనాథ కవి (చూ).
అంకితం : వత్సవాయ తిమ్మనృపాలునకు (పెద్దాపుర సంస్థానాధీశుడు).

మూడాశ్వాసాల గ్రంథం. అవతారికలో కృతిపతి వంశవర్ణన విపులంగా ఉంది. ఆ భాగం మాత్రం ముద్రితమైనది. మిగిలిన గ్రంథం నేడు అలభ్యం. (క.త-12-156)

## శేషధర్మ రత్నాకరము

కాలం : క్రీ. శ. 17 వ శతాబ్దం.
కర్త : కొడిచెర్ల శ్రీనివాసకవి.

ఆరాశ్వాసాల గ్రంథం. కవిత్వం ప్రౌఢంగా ఉంటుంది. (క.చ.-3-49)

## శేష నాగోజీ

కాలం : చూ. శేష వంశీయులు.
రచన : కైయట ప్రదీప వ్యాఖ్య (సం).

ప్రముఖ సంస్కృత పండితుడు. (తె. వి. స-6)

## శేష నారాయణుడు

కాలం : చూ. శేష వంశీయులు.
రచన : సూక్తి రత్నాకర వ్యాఖ్య (సం).

ప్రముఖమైన సంస్కృత పండితుడు. (తె. వి. స-6)

## శేషభట్టరు అప్పలాచారి

కాలం : తెలియదు.
స్థలం : గుడివాడ సీమలోని దొడ్లేటి పట్టణం.
రచన : రామకృష్ణ విలాసము.

శృంగార వాఙ్మాధురి, శబ్ద సంగతులు విశేషంగా ఇతని రచనలో కనిపిస్తాయి. మంత్రి పేరయ్య గారి ప్రోత్సాహంతో రచనలు చేశాడు. (ఆరుద్ర-11-269)

## శేషభట్టరు సింగరాచార్యులు

కాలం : క్రీ. శ, 18వ శతాబ్దం.
స్థలం : జటప్రోలు సంస్థానం.
రచనలు : 1. శూద్రధర్మోత్పల ద్యోతినీ స్మృతి కౌముది 2. కేశవవిలాసము (అలభ్యం).

ఈ కవి జటప్రోలు సంస్థానాధిపతి అయిన చిన్న మాధవరావు (క్రీ. శ.

1742) ఆస్థానంలోనివాడు. వేంకటార్యుని పుత్రుడు. ఇతడు గడియకు నూరు పద్యాలు చెప్పగల దిట్ట. ఏకైక దిన ప్రబంధ నిర్మాణదక్షుడు. (మ. మా.)

### శేషము చెన్న భట్టారకుడు

స్థలం : గుంటూరు మండలం.
కాలం : క్రీ. శ. 1690 ప్రాంతం.
రచన : అభిమన్యు కల్యాణము (ద్విపద).

లక్ష్మమ్మ వెంకటార్యుల పుత్రుడు. చక్కని జాతీయాలతో వర్ణనాత్మకంగా కవిత్వం చెప్పాడు. (ద్వి. సా. చ-379)

### శేషము రంగాచార్యులు

కాలం : క్రీ. శ. 18వ శతాబ్దం పూర్వార్ధం.
స్థలం : గుంటూరు మండలం.
రచనలు : 1 భావనారాయణ విలాసము 2. రతిమన్మథ విలాసము 3. శివకేశవ పారిజాతము.

అభిమన్యు కల్యాణ కర్త చెన్న భట్టారకుడు ఇతని తండ్రి. తల్లి వేంకమాంబిక. భావనారాయణ విలాసం పొన్నూరు క్షేత్ర మాహాత్మ్యానికి సంబంధించిన కథ. ఇతని రచన చక్కగా ఉంటుంది. సన్నివేశ కల్పనలు తెలుగు వాతావరణాన్ని సహజంగా చూపుతున్నాయి. (య. వా చ-89)

### శేషము రఘునాథార్యుడు

కాలం : క్రీ. శ. 17వ శతాబ్దం.
స్థలం : గుంటూరు మండలం.
రచన : కులశేఖర మహీపాల చరిత్రము.

శేషము చెన్న భట్టారకుడు ఇతనికి తమ్ముడు. ఇతని రచన ముద్రితమట. (య. వా. చ-89)

### శేషము వేంకటపతి

కాలం : క్రీ. శ. 18వ శతాబ్దం.
స్థలం : మధుర.
రచన : శశాంకవిజయము (తారాశశాంక విజయము).
గురువు : కందాళ రామానుజాచార్యులు.
సమకాలీనులు: సముఖము వేంకట కృష్ణప్ప నాయకుడు. బు(పు) లిగె కృష్ణకవీంద్రుడు,

మధురను పాలించిన విజయరంగ చొక్కనాథుని (1706-32) ఆస్థానంలో ఉన్నాడు. కృష్ణయార్యుని పుత్రుడు. ఇతడు కృతిపరంపరలు రచించినట్టు చెప్పుకొన్నా ఏవీ లభ్యం కాలేదు. మధురమైన కవిత్వం చెప్పిన కవిగా వన్నెకెక్కాడు.
(ద. దే. వా.-363; క. చ-3-23)

### శేషయ కవి

కాలం : క్రీ. శ. 18వ శతాబ్దం.
స్థలం : పుదుక్కోట సంస్థానం.
రచనలు : లభించలేదు.

పుదుక్కోట ప్రభువైన విజయరఘునాథ తొండమాన్ (1730–1769) ఆస్థానం లోనివాడు అతనిపై చెప్పిన కొన్ని చాటువులు మాత్రం లభించాయి.

(ద. దే. వా–537–39)

### శేష రామచంద్రాచార్యుడు

కాలం : క్రీ. శ. 15 శతాబ్దం.
రచన : ప్రక్రియా కౌముది (సం).

ఈయన ఉద్దండుడయిన వ్యాకరణ పండితుడు.

(చూ. శేషవంశీయులు. తె. వి.స–6)

### శేష రామచంద్రుడు

కాలం : చూ. శేషవంశీయులు
రచన : స్వరప్రక్రియ (సం).

శేష వంశీయులలో ప్రముఖ పండితుడు. ఈయన నాగోజీ పండితుని పుత్రుడు.

(తె.వి.స–6)

### శేష వంశీయులు - కొందరు పండితులు

కాలం : క్రీ.శ. 15 నుంచి 17 శతాబ్దం నడుమ.

వీరు ఆంధ్రదేశానికి చెందిన పండితులు. కాశీలో ఉంటూ సంస్కృత వ్యాకరణ శాస్త్రాన్ని ప్రచారం చేశారు. యావద్భారత దేశానికి సంస్కృత వ్యాకరణ భిక్ష పెట్టినది వీరేనని పండితులంటారు.

వీరిలో శేష రామచంద్రాచార్యుడు అప్పటికి పొడచుతున్న సమస్త వ్యాకరణ శాస్త్రాలను పరిశీలించి "ప్రక్రియా కౌముది" అనే ప్రకరణ గ్రంథాన్ని వ్రాశాడు. ఆ గ్రంథం అచిరకాలంలోనే పఠన పాఠన యోగ్యమైందట.

శేష రామచంద్రాచార్యుని "ప్రక్రియా కౌముది" మీద శేష కృష్ణ పండితుడు "ప్రక్రియా ప్రకాశమ్" రచించాడు.

కృష్ణ పండితుని కుమారుడైన శేష వీరేశ్వరుని శిష్యుడే భట్టోజి దీక్షితుడు. ఈ దీక్షితుని సహపాఠులు శేష విఠలుడు, (ప్రక్రియా ప్రసాద కర్త), జగన్నాథ పండిత రాయలు (రస గంగాధర కర్త), చక్రపాణి దత్తుడు (చరక వ్యాఖ్యాత). భట్టోజి దీక్షితులు "వైయాకరణ సిద్ధాన్త కౌముది"ని రచించి, దానిపై "ప్రౌఢ మనోరమ" వ్యాఖ్య వ్రాశాడు. దానిలో తన గురువైన వీరేశ్వరుని, ఆయన తండ్రియైన కృష్ణ పండితుని,

"ప్రక్రియా కౌముది" కర్తయైన రామచంద్రాచార్యుని విమర్శించాడు. దీని మీద జగన్నాథ పండితరాయలు, చక్రపాణి దత్తుడు మొదలయినవారు ఖండన గ్రంథాలు వ్రాశారు.

శేష విఠలుడు "ప్రక్రియా ప్రసాదమ్" అనే వ్యాఖ్య వ్రాసి దీక్షితుని విమర్శలను ఖండించాడు.

శేష వంశీయులలో చింతామణి - నాగోజీల త్రైయటుని "ప్రదీపమ్"పై వ్యాఖ్యలు వ్రాశారు. శేష నారాయణుడు మహాభాష్యంపై "సూక్తి రత్నాకరమ్" వ్యాఖ్య వ్రాశాడు. శేష నాగోజీ పండితుని పుత్రుడు రామచంద్రుడు "స్వర ప్రక్రియ"ను వ్రాశాడు. శేష విష్ణుసూరి "మహాభాష్య ప్రకాశిక" వ్రాశాడు. (తె.వి.స-6)

**శేష విఠలుడు**

కాలం : చూ. శేష వంశీయులు.

రచన : ప్రక్రియా ప్రసాద వ్యాఖ్య (సం).

సమకాలికులు : జగన్నాథ పండితరాయలు, భట్టోజీ దీక్షితుడు, చక్రపాణి దత్తుడు.

ఈయన శేష వంశీయులలో ప్రముఖుడయిన సంస్కృత పండితుడు. శేష వీరేశ్వరుని, శేషకృష్ణ పండితుని, శేష రామచంద్రాచార్యుని విమర్శించిన భట్టోజీ దీక్షితుని ఖండిస్తూ పైగ్రంథాన్ని వ్రాశాడు. ఈయనతో పాటు జగన్నాథ పండిత రాయలు, చక్రపాణి దత్తుడు కూడా భట్టోజీని ఖండిస్తూ ఖండన గ్రంథాలు వ్రాశారు. (తె.వి.స-6)

**శేష విష్ణుసూరి**

కాలం : చూ. శేష వంశీయులు.

రచన : మహాభాష్య ప్రకాశిక (సం).

ప్రముఖ సంస్కృత పండితుడు. (తె.వి.స-6)

**శేష వీరేశ్వరుడు**

కాలం : క్రీ.శ. 16వ శతాబ్దం.

రచనలు : తెలియరాలేదు.

ఈయన శేషకృష్ణ పండితుని కుమారుడు. శేష విఠలుడు, భట్టోజి దీక్షితులు, రస గంగాధర కర్త జగన్నాథ పండితరాయలు, చరక వ్యాఖ్యాత చక్రపాణి దత్తుడు ఈ పండితుని శిష్యులు. భట్టోజి దీక్షితుడు - వీరేశ్వరుని, శేషకృష్ణ పండితుని, ప్రక్రియా కౌముది కర్తయైన రామచంద్రాచార్యుని విమర్శించాడు. భట్టోజీ దీక్షితుని విమర్శను జగన్నాథ పండితరాయలు, చక్రపాణి దత్తుడు ఖండించారు.

**శేషశైలేశ లీల**

కర్త : కాణాదము పెద్దన సోమయాజి (చూ.).

అంకితం : సురపురం సంస్థానాధీశ్వరుడైన రాజా బహిరీ పామ నృపాలునకు.

ఇది చిత్ర కవితా స్ఫోరకమైన ప్రబంధం. చిత్ర, బంధ, శ్లేష కవిత్వాలలో కవికున్న ప్రాగల్భ్యం ఇందులో కనిపిస్తుంది. పంచవర్గీయాక్షరాలు లేకుండా కవి ఈ ప్రబంధాన్ని రాశాడు. (ఆం.సం.సా.)

**శేష సుమతి**

నామాంతరం : నివృత్తి (నివర్తి) శేషాచల కవి. (ద.దే.వా-217)

**శేషార్యోదాహరణము**

కర్త : రేపూరి అనంతయ్య.

అంకితం : నల్లందిగళ శేషయ్యకు.

నల్లంటగళ్ వంశీయుడైన శేషార్యుని ప్రశంసిస్తూ చేసిన ఉదాహరణ కృతి అనంతయ్యలు ఇద్దరున్నారు. ఒకడు లింగకవి కుమారుడు అనంతయ్య, గాధేయోపాఖ్యాన కర్త. ఇంకొకడు ఇతని పౌత్రుడు శ్రీ ముష్ణమాహాత్మ్య కర్త అయిన అనంతయ్య. బాలకవి అనే బిరుదు ఇతనికే ఉన్నట్లుగా తెలుస్తున్నది.

ఇరువురికీ బాలకవి బిరుదున్నదని కొందరంటున్నారు. ఈ కృతిని మొదట అనంతయ్యే రచించినట్లుగా పండితులు నిర్ధారించారు.

(ఆరుద్ర 12-123) (ద.దే.వా-378)

**శైవ పురాణ తామసత్వ నిరాకరణమ్ (సం)**

కర్త : నీలకంఠ దీక్షితులు.

ఈ రచన నీలకంఠ దీక్షితుని పెదతండ్రియైన అప్పయ్య దీక్షితులు వ్రాశాడని ఆధునిక సంస్కృత పండితులు అభిప్రాయ పడుతున్నారు. (తె.వి.స-6)

**శైవ సిద్ధాంత శిఖామణి**

కర్త : చెన్నప్రెగ్గడ నాగేశ్వరకవి.

నాల్గాశ్వాసాల ద్విపదకావ్యం. వీరశైవ వేదాంత ప్రతిపాదకమైన రచన. ప్రథమాశ్వాసంలో పండితారాధ్య మహత్త్వము,గోవింద విజ్ఞానమహిమ, లింగధారణ మహాత్మ్యం మొదలైన విషయాలున్నాయి. ద్వితీయాశ్వాసంలో ఆదిభక్త స్థల వ్యాఖ్యానం-పూజాదికాల మహిమలూ ఉన్నాయి. తృతీయాశ్వాసంలో మాహేశ్వర స్థల వివరణలున్నాయి. చతుర్థాశ్వాసంలో ఎనభై యేడు లింగస్థలాల వివరణ ఉంది. (ద్వి. సా. చ-302)

**శైవాగమ శిఖామణి**

కర్త : నెప్పల్లె అప్పన్న.

అంకితం : శ్రీశైల మల్లికార్జునస్వామికి.

ప్రత్యేకత : ఇది అయిదాశ్వాసాల పద్యకావ్యం. విభూతి, రుద్రాక్షలు, శివలింగం మొదలైనవి ఎలా ధరించాలో, ధరిస్తే ఫలమేమిటో, శివపూజలో ఎంత మహత్మ్యముందో ఈ గ్రంథం వివరిస్తున్నది. అముద్రితం. (ఆరుద్ర-9)

**శైవాచార సంగ్రహము**

కర్త : తుంటుముక్కల తిమ్మయ్య.

శైవమత గ్రంథం.మద్రాసు ప్రాచ్యలిఖిత గ్రంథాలయంవారు గంటి సోమయాజి

గారి విపుల పీఠికతో ప్రచురించారు. దీనిలోని పద్యాలను పెదపాటి జగ్గన్న, అజ్ఞాత గ్రంథ సంధాత ఉదాహరించారు.

ఇందులో భస్మధారణవిధి, రుద్రాక్షధారణవిధి, ప్రముగ్గులలక్షణం, రకరకాల పుష్ప ఫల తారతమ్యాలు, మొదలైన శైవాచార విధానాలు సప్రమాణంగా నిరూపితాలు. దీనిలో 60 విషయాలున్నాయి. కవి 30 ప్రమాణగ్రంథాలు చూపాడు. ఇది కేవల విషయ ప్రధానమైన మతగ్రంథం.

శైవాచార పరాయణులకు బాగా ఉపయోగపడే ఈగ్రంథం పూవులు, ఆకులు నూనెలు మొదలగు వాటి భేదాలు చెప్పటం వల్ల ఇది పరిశోధకులకు విషయంటురచనలలో, తోడ్పడవచ్చు. (అరుద్ర-8)

**శొంఠి వారు**

ఎక్కువగా మందులలో వాడే శొంఠి కొన్ని కుటుంబాలవారి ఇంటిపేరుగా తెలుగుదేశంలో నిలిచిపోయింది.

అట్లే భోజన పదార్థాలలోవాడే "అల్లం" పేరే ఇంటిపేరుగా ఉన్న కుటుంబాలు కూడా ఉన్నాయి. మిరియాలవారు కూడా ఇలాంటిదే. (భారతి-మా-45-230)

**శోభన గీతాలు**

వివాహ సందర్భాలలో వధూవరులకు మంగళ హారతులిచ్చేవేళ, మంగళస్నానం చేయించే సమయంలో వీటిని పాడతారు. ఇవి చిరప్రసిద్ధమే గాక, బహు యక్షగానాలలో ప్రయుక్తాలు.

ధపకాలలో జంటపాటలుగా కూడా ఈ గీతాలు కనిపిస్తాయి. ఇవి అచ్చంగా ఆడువారి వేడుకపాటలు. సాధారణంగా ఇవి షష్ఠ్యంతాలు. వీటిచివర "శోభనమే" అనేది ఊతపదంగా వస్తుంది. వీటిరచనా ప్రక్రియకు ఒక నియతిలేదు. గతి వైవిధ్యం బహుళం. తరిగొండ వేంకమాంబ శివవిలాస యక్షగానంలో ఇవి ఉన్నాయి. (య. వా. చ-347)

**శ్యమంతకోపాఖ్యానము**

కర్త : చూ. పట్టాభి రామకవి.

పౌరాణిక రచన. భాగవతంలో చెప్పబడిన శమంతకమణి కథ ఆధారంగా వ్రాయబడిన గ్రంథం. (ఆం. సం. సా-194)

**శ్యామ రామకవి**

నామాంతరం : శ్యామ రాయకవి. (చూ)

**శ్యామ రాయకవి**

నామాంతరం : శ్యామరామకవి.

కాలం : క్రీ. శ. 18 వ శతాబ్దం.

స్థలం : మధుర మండలం.

రచన : రామాయణము (వచనం).

బిరుదు : "అసహాయకవి".

ఈ కవి తనపేరు చెప్పుకొన్న ప్రతిచోటా అసహాయ శ్యామరాయకవి నని చెప్పుకొన్నాడు షడ్దర్శనీ పారంగతుడు. కృష్ణయామాత్యుని పుత్రుడు. కృతిపతి అయిన సుబ్బరాయశెట్టి విజయరంగ చొక్కనాథుని కరుణా కటాక్షవీక్షణ పాత్రుడని చెప్పటంచేత కవికూడా ఆ ప్రాంతాలవాడే కావచ్చు. రామాయణం ఇంతవరకూ ఎవరూ వచనంగా రాయలేదనీ, తానే ప్రథముడననీ ఇతడు చెప్పుకొన్నాడు. (ద. దే. వా-393)

## శ్యామల వారు

కాళికాదేవిపేరే ఇంటిపేరుగా ఉన్న కొన్ని కుటుంబాలవారు తెలుగుదేశంలో ఎక్కువగా గుంటూరు మండలంలో ఉన్నారు. (భారతి. మా-45-230)

## శ్యామలాంబ శతకము

రచనాకాలం : క్రీ. శ. 1800 ప్రాంతం.

కర్త : పల్లంపల్లి మల్లికార్జున పండితారాధ్యుడు.

ఇది ప్రకీర్ణ శతకం. శ్యామలాంబ నామ కీర్తన ముంది. దేవీ అనుగ్రహం లభించకపోతే పార్వతీదేవిని వ్యాజోక్తులలో కవి దూలనాడాడు. రామలింగేశ, కుక్కుటేశ్వర శతకాలను పోలి ఉన్నది. (శ. సా. వి.)

## శ్యామశాస్త్రి

కాలం : క్రీ. శ. 1763-1823 ప్రాంతం.

స్థలం : తంజావూరు జిల్లా తిరువారూరు.

ఈయన పేరు పొందిన సంగీత విద్వాంసుడు. ఆంధ్ర పండితులైన సంగీత స్వామి దగ్గర విద్య నేర్చుకొన్నాడు. మధురకు వెళ్ళినప్పుడు మీనాక్షి దేవిని స్తుతిస్తూ తొమ్మిది కృతులు పాడారట. వీరి రచనలు కదళీ పాకాలు. ఆనందభైరవీ రాగంలో ఎక్కువ కృతులు వ్రాశారు. కృతులకు స్వరజతులను కూడా వీరే వ్రాసుకొన్నారట. (తె. వి. స-4)

## శ్రవణానందమ్ (సం)

కర్త : వేంకటాధ్వరి. (తె. వి. స-6)

## శ్రామిక గేయాలు

కవిత్వం కేవలం ఉల్లాసానికే కాక శ్రమ నివారణకు కూడా ఉపకరిస్తుంది. మానవుడు శ్రమించేటపుడు, శ్రమ తెలియకుండడానికి, అలసట రాకుండటానికి, ద్విగుణీకృతోత్సాహంతో పని చేయడానికి అప్రయత్నంగా కూనిరాగాలు తీస్తుంటాడు. సామూహికంగా పనులు చేస్తూ పాడే పాటలను శ్రామిక గేయాలనవచ్చు.

ఇల్లు అలికేటప్పుడు, పిండి విసిరేటపుడు, ధాన్యం దంచేటపుడు, వరినాటు, కలుపు, కోతలప్పుడు, మోట తోలేటపుడు, ఏతాం ఎత్తేటపుడు, నాగలి దున్నేటపుడు,

బరువులు మోసేటపుడు, రోడ్డు రోలర్లు లాగేటపుడు, పల్లకీలు మోసేటపుడు - పాడే గేయాలు జానపద వాఙ్మయంలో "శ్రామిక గేయాలు"గా స్థిరపడ్డాయి.

వీటిలో వస్తువు ఏదైనా ఉండవచ్చు. పౌరాణికాల వంటి దీర్ఘకాలిక గేయాలుగాని, చిన్న పాటలుగాని శ్రామికులు పాడుకుంటారు. వృత్తికి సంబంధించిన పాటలు, శృంగార గేయాలు, స్థానిక వృత్తాంతాలు, విషాదగాథలు, భక్తి గేయాలు మొదలైనవి శ్రామికుల వ్యవహారంలో ఉన్నాయి. ఇవి కూడ ఎక్కువ భాగం ముద్రితం కాలేదు. కొన్ని కాలోపకాలాల్లో అంతరించాయి.

శ్రామిక గేయాలన్నీ సాధారణంగా వారు చేసే పనికి సంబంధించిన 'లయ'కు సరిపోయేట్లుగా ఉండడం గమనించదగిన విషయం. శ్రామికుల కాలు చేతుల కదలికలో, ఊపిరితిత్తుల భారోచ్ఛ్వాస నిశ్వాసలో ఈ గేయాలకు తాళలయలు సమకూరుతాయి.

### శ్రావణ మంగళవారం నోముపాట

కర్త : తెలియదు.

జానపద పారమార్థిక గేయం. (అం.వా.చ.)

### శ్రావణ శుక్రవారం నోముపాట

కర్త : తెలియదు.

జానపద పారమార్థిక గేయం. (అం.వా.చ.)

### శ్రీకరభాష్యమ్ (సం) (అలభ్యం)

నామాంతరం : శివదీపిక.

కర్త : శ్రీపతి పండితుడు.

ఇది బ్రహ్మ సూత్రాలకు శివపరమైన వ్యాఖ్యానమట.

### శ్రీకాళహస్తి మాహాత్మ్యము

కర్త : ధూర్జటి.

అంకితం : శ్రీకాళహస్తీశ్వరునకు.

ఇది నాలుగు ఆశ్వాసాల ప్రబంధం. దీనికి మూలం 120 అధ్యాయాలతో ఉన్న "శివరహస్య సంగ్రహం". ప్రసిద్ధమైన తిన్నని కథ, చిరుతొండనంబి కథ, సిరియాళుని కథ ఈ గ్రంథంలోనివే. ఈ కావ్యాన్ని బట్టి యౌవనంలో ధూర్జటి వేశ్యాలోలుడైనా వయసు మళ్ళిన తరవాత శివభక్తుడైనట్లు ఊహించవచ్చు. చేసిన తప్పులు స్పష్టంగా కావ్యంలో ధూర్జటి చెప్పాడు. పశ్చాత్తప్తుడైన తరవాతనే శివభక్తాగ్రేసరుడైనట్లు నిర్ణయించవచ్చు. "ద్రాక్షారసోర్మికా పరిపాక విస్ఫూర్తి బరిఢవిల్ల" ధూర్జటి ఈ కావ్యం వ్రాశాడు. ఇత్వసంధులు, రేఫద్వయమైత్రి మొదలగు అవ్యాకృత ప్రయోగాలు ఈ కావ్యంలో కనిపిస్తాయి. చక్కని లోకోక్తులు, జాతీయాలతో కావ్యం మనోహరంగా ఉంటుంది. (క.త-7)

**శ్రీకాళహస్తి లింగ శతకము**

కర్త : శ్రీగిరి విరూపాక్షుడు.

సీసపద్య శతకం. బ్రౌనుదొర కాలంలోనే ముద్రితమైనది. రచనలో వేమన్న పోలికలున్నవి. ఉత్తమాధమ క్షత్రియుల గుణాలు, సామెతలు, లోకరీతి చక్కగా, రసవంతంగా కవి చెప్పాడు. "ప్రణుత ధవళాంగ, మౌని హృత్పద్మభృంగ, అమిత భవభంగ, శ్రీకాళహస్తి లింగ" అనే మకుటముంది. శైలి చాల చక్కనిది. (శ. క. చ_304)

**శ్రీకాళహస్తీశ్వర శతకము**

కర్త : ధూర్జటి.

అంకితం : శ్రీకాళహస్తీశ్వరునకు.

ఉత్తమ శతకాలలో ఒకటి. ధూర్జటిదని చెప్పబడుతున్న శతకం అతనిదే అనటానికి ఆధారాలులేవు. కాని శైలి, పదాల కూర్పు కాళహస్తిక్షేత్రమాహాత్మ్యంతో సరితూగుతున్నందున ఇది ధూర్జటి కృతియే అని అంటున్నారు. శతకంలోని పద్యాలనుబట్టి చూస్తే కవి నిరంతరం వేశ్యాలోలుడై యౌవనం గడిపినట్లు, వయసు మళ్ళిన తరవాత పశ్చాత్తప్తుడై పరమ శివభక్తాగ్రేసరుడైనట్లు తెలుస్తుంది. "స్తుతమతియైన" అనే చాటువు కూడా ధూర్జటి వేశ్యా ప్రియత్వాన్ని రుజువు చేస్తుంది. రాయల మరణానంతరం కొందరి రాజులను ఆశ్రయించి నిరాకృతుడై, విరక్తి చెంది శతకంలో ధూర్జటి పద్యాలు చెప్పి ఉంటవచ్చు. ఇందులో రాజులను నిశితంగా విమర్శించిన పద్యాలు పదికి మించి ఉన్నాయి. ఇందులోని పద్యాలు ద్రాక్షాపాకంలో మృదు పద ఘటితమై అనర్గళ ధారతో, భక్తి రసపూరితంగా మనోహరంగా ఉన్నాయి. కస్తూరి రంగకవి "అభేదయతి"కి ఉదాహరణగా ధూర్జటి శ్రీ కాళహస్తీశ్వర శతకంలోనిదని ఒకపద్యాన్ని ఉదాహరించాడు ఇందులో భక్తి వైరాగ్య భావాలు చక్కగా వర్ణితాలు. శివుడే తన ఎదురుగా ఉన్నట్లు భావించి కవి, దేవునితో వినయంగా, విస్ఫురంగా, కోపంగా, మాట్లాడుతున్నట్లు వ్రాశాడు. (శత_7)

**శ్రీకృష్ణ కర్ణామృతము**

కర్త : మహామల్వారి వేంకట కృష్ణుడు (చూ).

వచన గ్రంథం. వెలగపూడి వెంగనామాత్యుని ఆంధ్ర కర్ణామృతము అనే పద్య కృతికి వచనం. (వ. దే. వా_389)

**శ్రీకృష్ణ కర్ణామృతము**

నామాంతరం : ఆంధ్ర కర్ణామృతము (చూ).

కర్త : వెలగపూడి వెంగనామాత్యుడు.

**శ్రీకృష్ణ చంపువు (సం)**

కర్త : వైయాకరణ గజకంఠీరవ యుణయవల్లి కృష్ణమాచార్యులు (చూ).

చంపూ రచన. (ఆం. సం. సా)

**శ్రీకృష్ణ జననము**

కర్త : తెలియదు.

జానపద పౌరాణిక గేయం. కథ ప్రసిద్ధం.

చూ. పౌరాణిక గేయములు (అం. వా. చ.)

**శ్రీకృష్ణ జన్మఖండము**

రచనాకాలం : క్రీ. శ. 1700 ప్రాంతం.

కర్త : కుందావజ్ఝల గోపాలకృష్ణకవి.

ఈ గ్రంథానికి మూలం సంస్కృత బ్రహ్మవైవర్త పురాణం. గ్రంథ ప్రతులు హనుమకొండ పరిశోధక మండలిలోను, హైదరాబాదులోని లక్ష్మణరాయ పరిశోధక మండలిలోను ఉన్నవట. (క. స-60)

**శ్రీకృష్ణ జన్మఖండము**

కర్త : గోపీనాథము వేంకటకవి.

అంకితం : శ్రీరామునికి.

కవి దీనిని వేంకటగిరి పాలకుడైన సర్వజ్ఞ కుమార యాచేంద్రుని ప్రోత్సాహంతో రచించి అగ్రహార దానం పొందాడు. (చూ. కృష్ణజన్మఖండము)
(అం. సం. సా-484)

**శ్రీకృష్ణ జలక్రీడా విలాస నాటకము**

రచనాకాలం : 19వ శతాబ్ది పూర్వార్ధం.

కర్త : మతుకుమల్లి నృసింహకవి. (వీ. యు-139)

**శ్రీకృష్ణ తులాభారము**

రచనాకాలం : క్రీ. శ. 1830 ప్రాంతం.

కర్త : మరింగంటి వేంకట నరసింహాచార్యులు.

ద్విపద కావ్యం. కర్తృత్వం గురించి వాద వివాదాలున్నాయి. 1750 ప్రాంతాలలో మరింగంటి సింగరాచార్యులు కృష్ణ తులాభారం పేరుతో ఒక కావ్యం వ్రాశాడు.
(తె. వి. స-8)

**శ్రీకృష్ణ దేవరాయలు**

కాలం : క్రీ. శ. 1487-1530 ప్రాంతం.

స్థలం : విజయనగరం.

రచనలు : 1. ఆముక్తమాల్యద 2. మదాలస చరిత్ర 3. సత్యవధూ ప్రీణనము 4. సకల కథాసార సంగ్రహము 5. జ్ఞాన చింతామణి 6. రసమంజరి 7. జాంబవతీ పరిణయము.

బిరుదులు : ఆంధ్రభోజుడు, సాహితీసమరాంగణ సార్వభౌముడు, పరిభూతసురత్రాణుడు, మూరురాయరగండడు, యవనరాజ్య స్థాపనాచార్యుడు.

విజయనగర సామ్రాజ్యాన్ని పాలించిన రాజకవి. నాగమాంబ నరసనాయకుల పుత్రుడు. కవి పోషకుడు. అల్లసాని పెద్దన విరచిత స్వారోచిషమను సంభవము, నంది, తిమ్మన విరచిత పారిజాతాపహరణము ఇతనికి అంకితాలు. హిందూ ధర్మ ప్రతిష్ఠాతగా హిందూసామ్రాజ్య పరిరక్షకునిగా ఇతనికి చరిత్రలో ప్రత్యేక స్థానం ఉంది. ఇతడు అసాధారణమైన శౌర్య ప్రతాపాలతోబాటు అనుపమానమైన సాహిత్య జ్ఞానమున్నవాడని తిరుమల దేవస్థానంలోని శాసనంవల్ల తెలుస్తున్నది. ఇతడు అపరభోజుడు, కావ్యనాటకాలంకార రహస్యాలు తెలిసినవాడు. కర్ణాటక, సంస్కృతాంధ్రాలలో పండితుడు. ఇతని ఆస్థానంలో అష్టదిగ్గజాలనే ఎనమండుగురు కవులుండేవారు. వీరికేకాక చాలామంది సంస్కృత, కర్ణాటక పండితులను, సంగీత శాస్త్రజ్ఞులను, జ్యోతిష్యులను, నానావిధ శాస్త్ర విశారదులను రాయలు పోషించాడు. తన ఆస్థానంలో తరచు సంగీత, సాహిత్యగోష్ఠులు జరిపేవాడు. రాజకవులలో మేటి. ఇతడు కవి పండితగోష్ఠులు జరిపే సభకు "భువన విజయం" అని పేరుండేది దీని ప్రసక్తి సమకాలీన కవుల కావ్యాలలో కనిపిస్తున్నది, రాయల సభలోని అష్టదిగ్గజాలలో మొదటివాడైన పెద్దన రాయలకు గ్రంథ రచనలో సహాయపడ్డాడేమో అని కొందరు భావిస్తున్నారు. ప్రపంచ దర్పణమనే సంస్కృతగ్రంథం రాయలు రచనలుగా చెప్పబడే సత్యవధూ ప్రీణనము, రసమంజరి అల్లసాని పెద్దనవిగా చెప్తున్నది.

ఈయనను మెచ్చుతూ చాలా చాటువులున్నాయి. కృష్ణదేవరాయలు పుట్టిన సంవత్సరం, మాసం, పక్షం, తిథి మొదలగు విషయాలు తెలుపుతూ ఒక చాటువు రాయలను ఆశీర్వదిస్తూ ఒక చాటువు దొరికినాయి. ఇతని కన్నడ రచనలు తెలియరాలేదు. ఇతని ఆముక్తమాల్యద తెలుగులోని ప్రౌఢ ప్రబంధాలలో తలమానికమైనది. ఇతనిని గురించి ఎన్నో గాథలు ప్రచారంలో ఉన్నాయి. (క.త-7: చా.ప.ర)

**శ్రీకృష్ణ నాటక యక్షగాన మహాప్రబంధ రాసక్రీడా విలాసము**

రచనాకాలం : క్రీ. శ. 1816 ప్రాంతం.

కర్త : కానుకొలను వేంకటదాసు.

కవి తన పన్నెండవ యేట ఈ రచన చేశాడట. యక్షగానంలో గోపికాకృష్ణుల రాసక్రీడలు వర్ణింపబడ్డాయి. కవి సంగీతజ్ఞానం ఈ రచనలో ప్రతిబింబిస్తున్నది. (య వా.చ-108)

**శ్రీకృష్ణ భూపాలీయము**

కాలం : క్రీ. శ. 19వ శతాబ్ది పూర్వార్ధం.

కర్త : చంద్రకవి.

అంకితం : మైసూరు రాజైన శ్రీకృష్ణ రాజేంద్ర ఒడయరుకు.

లక్షణ గ్రంథం. (కవి జనాశ్రయం పీఠిక-వావిళ్ళ)

**శ్రీకృష్ణ మంజరి**

చూ. కృష్ణ శతకము.

కవయిత్రి : తరిగొండ వేంకమాంబ.

ఇదే ద్విపద కృష్ణశతకంగా ప్రసిద్ధమైంది. (అ. భా. క-75)

**శ్రీకృష్ణ రాయబారము (చాటు పద్యాలు)**

కురు పాండవ యుద్ధానికి ముందు శ్రీకృష్ణుని ధర్మజాదులు రాయబారిగా పంపే టప్పుడు ఇచ్చే సందేశాలు చాటు పద్యాల రూపంలో దొరుకుతున్నాయి. చాటుకవి వివ రాలు తెలియవు. (చా. ప. ర.)

**శ్రీకృష్ణ లీలా తరంగిణి (సం)**

చూ. కృష్ణలీలా తరంగిణి.

కర్త : శ్రీనారాయణ తీర్థులు.

**శ్రీకృష్ణ లీలా విలాసము**

కర్త : అక్కయ.

అంకితం : తిరుమల వేంకటేశ్వరునికి.

దృశ్యకావ్యం. దీనికి మూలం పోతన భాగవతం గోపికా వస్త్రాపహరణ గాథ, రాసలీలలు ప్రబంధోచితంగా వర్ణితాలు. రచన సరళంగా ఉంది.

(ఆరుద్ర-12-166; య. గా. సం-4)

**శ్రీకృష్ణ లీలా సుధారసము**

కర్త : తెలియదు.

అంకితం : కాకర్లపూడి గోపాలరాయ పాయకరావుకు (చూ).

కావ్యాన్ని గురించిన వివరాలు తెలియరాలేదు. (క. త-13-69)

**శ్రీకృష్ణ విజయము**

కర్త : చూ. పూసపాటి తమ్మభూపాలుడు.

అంకితం : బెజవాడ కనకదుర్గకు.

ఇది అయిదాశ్వాసాల శృంగార ప్రబంధం. శ్రీకృష్ణుడు ఇంద్రునితో యుద్ధం చేసి పారిజాతాన్ని అపహరించడం ఇందలి వృత్తాంతం. కథలో కొంత వైవిధ్యం ఉంది. పారిజాతాన్ని అపహరించడానికి సత్యభామ కోరిక కారణం కాకుండా, చేసిన మేలు మర చిన దేవతలను శిక్షించడం కారణంగా చెప్పబడింది. కవి ఉభయ భాషా వైదుష్యం, చతుర్విధ కవితా చాతుర్యం చాటే చక్కని ఉదాహరణలు, శ్లేష యమకాలు, చిత్ర కవిత్వ రీతులు కావ్యంలో కొల్లలుగా ఉన్నాయి.

పూసపాటి రాజుల వంశ వృత్తాంతం విపులంగా ఉంది. కవి పాండిత్య ప్రకట నలో ప్రబంధపు పోకడలున్నా ఔచిత్యం పాలు ఎక్కువ. (ఆరుద్ర-10-238)

**శ్రీకృష్ణ విలాసము**

కర్త : చల్లాపల్లి వేంకనార్యుడు (చూ).

అంకితం : శ్రీకృష్ణునకు (వేంకటేశ్వరునికి అని కొన్ని ప్రతులలో ఉంది).

నాల్గాశ్వాసాల కృష్ణ కథా ప్రబంధం. కవికి శ్రీకృష్ణుడు కలలో కనిపించి తన లీలలు వర్ణించమని చెప్పాడట. (ద.దే.వా-236)

శ్రీకృష్ణ విలాసము

కర్త : చూ. రాపాక లక్ష్మీపతి.

పౌరాణిక రచన. దోమకొండ ప్రభువులచే ముద్రితం. (ఆం.సం.సా-186)

శ్రీకృష్ణ శతానందీయము

కర్త : మరింగంటి వేంకట (ప్రథమ) నృసింహాచార్యులు.

ప్రబంధం. పింగళి సూరన్న మాయా నలకూబరుని కల్పించినట్లే, శ్రీకృష్ణుని పరాభవింపదలచిన బ్రహ్మకు గుణపాఠం నేర్పటానికి-కవి ఇంకొక బ్రహ్మను కల్పించి సరస్వతి దగ్గర ఇద్దరూ వాదులాడే ఘట్టాన్ని హాస్య రస స్ఫోరకంగా రచించాడు. కవి పూర్వీకులను గురించిన వివరాలు ఈ గ్రంథం నుండి తెలుస్తున్నాయి. (తె.వి.స-6)

శ్రీకృష్ణ శతానందీయము (అలభ్యం)

కర్త : మరింగంటి సింగరాచార్యులు.

శ్రీకృష్ణాభ్యుదయమ్ (సం)

కర్త : శ్రీశైల దీక్షితుడు

ఇది గద్య కావ్యం. (తె.వి.స-6)

శ్రీకొప్పులింగేశ్వర శతకము

నామాంతరం : కొప్పు లింగేశ్వర శతకము.

కర్త : పొచిమంచి సోమసుందర కవి.

ముద్రణ : క్రీ.శ. 1874 ప్రాంతం.

శైవభక్తి శతకం. గోదావరి మండలంలోని పలివెలలో వెలసిన దైవం కొప్పు లింగేశ్వరుడు. పూజారిని కాపాడటానికి ఆ దేవుడు కొప్పు ధరించాడట. దీని గురించి ఒక కథ ప్రచారంలో ఉంది. "శ్రీకొప్పు లింగేశ్వరా" అనేది మకుటం. (శ.క.చ-572)

శ్రీగండవరపమ్మ దండకము

కర్త : చేజెర్ల నారాయణ కవి.

పాతనాటి కుల్లూరు సీమలోని చేజెర్ల గ్రామంలో ప్రాచీన కాలంలో వెలసిన గండవరపమ్మను స్తుతించే దండకమిది. రచన సరళగ్రాంథికంలో సాగింది. (దా.వ.ర.)

శ్రీగవి రంగధామ శతకము

కర్త : కొండా రామకవి.

"మంగళోద్ధామ-శ్రీ గవి రంగధామ" మకుటంతో ఉంది.

ప్రత్యేకత : వసుచరిత్ర కృతిభర్త తిరుమల దేవరాయల కోరిక మేరకు రామకవి ఈశతకం చెప్పాడు. ఇందులో విజయనగర వర్ణన, తిరుమల దేవరాయలప్రశంస ఉన్నాయి. పేరుకు శతకమైనా, కావ్యలక్షణాలతో ఉన్నది. ఇష్టదేవతా ప్రార్థన, పూర్వకవి స్తుతి, కుకవి నింద ఉన్నాయి.

రచయిత తాను పామరుడనని చెప్పుకొన్నాడు. ఈ శతకం అంత ప్రౌఢం కాదని పండితాభిప్రాయం. రచనలో దోషాలున్నా, అనంతర కవులు కొందరు దీన్ని అనుసరించారు. నరసింహాశతకంలో దీని భావాల పోలికలు, పదాల పొంతరలు ఉన్నాయి.
(ఆరుద్ర-9)

శ్రీగిరి

నామాంతరాలు : ప్రమథకవి శ్రీగిరి, శ్రీగిరి అయ్యంగారు.
కాలం : క్రీ. శ. 14 వ శతాబ్ది పూర్వార్ధం.
ప్రదేశం : పాకనాటి అద్దంకిసీమ.
పోషకుడు : ప్రోలయ వేమారెడ్డి.
రచనలు : 1. నవనాథ చరిత్ర (పద్యకావ్యం), 2. శ్రీగిరీశ శతకము 3. శ్రీరంగ మాహాత్మ్యము.

క్రీ. శ. 1315 లో ఇతనికిచ్చిన దానశాసనం ఒకటి లభించింది. గౌరన తన నవనాథ చరిత్రలో ఈ శ్రీగిరి కవిని పేర్కొన్నాడు. ముసునూరి నాయకులు, ప్రోలయ వేముడు హిందూ ధర్మాన్ని కాపాడటానికి ఈ శ్రీగిరి ఉత్తేజాన్ని కలిగించాడు. ఇతని రచనలు నేడు నామమాత్రావశిష్టమైనవి. (రె. రా. చ) (క. త-4-161)

శ్రీగిరి అయ్యంగారు

చూ. శ్రీగిరి.

శ్రీగిరి విరూపాక్షుడు

కాలం : క్రీ. శ. 17 వ శతాబ్దికి పూర్వం.
స్థలం : కృష్ణా గోదావరీ మండలాలు.
రచన : శ్రీ కాళహస్తి లింగశతకము.

శ్రీగిరి మనుమడు పాపరాజు కుమారుడు. రసవంతంగా, సరళంగా రచనచేసిన కవి. ఇతని కాలాన్ని గురించి భిన్నాభిప్రాయాలున్నాయి. 1400 ప్రాంతంవాడని కొందరి అభిప్రాయం. ఇతని రచనలో వీరశైవాచారాలున్నవి.

(శ. క. చ. 304; క. వ. 221)

శ్రీగిరీశ శతకము (అలభ్యం)

కర్త : శ్రీగిరి (చూ).

"శ్రీగిరీశ" అనే మకుటంతో ఉన్న సీసపద్యశతకం. మడికి సింగన ఇందులోని ఒక పద్యాన్ని ఉదాహరించాడు. (శ. క. చ. 731)

## శ్రీతిరుమల వేంకటేశ్వర శతకము

కర్త : నల్లాన్ చక్రవర్తి సంపత్కుమార శ్రీనివాస వేంకటాచార్యుడు.

"తిరుమలగిరి వేంకటేశ-దేవాధీశా" మకుటంతో ఉంది. ఈ శతకంలో కవి శ్రీమన్నారాయణుడు వేంకటేశ్వరుని రూపంలో కలియుగ మానవులను, భక్తులను తరింప జేస్తున్నాడని వివరించాడు. ఇది ఏకప్రాస నియమంతో కందపద్యాలతో ఉన్న ప్రౌఢ శతకం. (శ. సా. వి. 228)

## శ్రీదేవి శాసనము

కాలం : క్రీ. శ. 1153 ప్రాంతం.

శాసన ప్రదాయిని : శ్రీదేవి.

శాసనవిషయం : శాసనంలోని రెండుపద్యాలు అసమగ్రంగా ఉండటంవల్ల విషయం స్పష్టంగాలేదు. శ్రీదేవి తెలుగుచోడ వంశానికి చెందిన రాణిగా తెలుస్తున్నది. ఎవరో ఒక చోడుని మరదలుగా, విజయుడనేరాజు కోడలుగా తెలుస్తున్నది. ఏ దేవునికో దానంచేసి, అఖండదీపం ఎత్తించి ఉండవచ్చు. దీనిలో అసమగ్రంగా ఒకసీసపద్యం, ఒక కందపద్యం ఉన్నాయి. చివర గద్య అసమగ్రంగా ఉంది. (తె. క. చ-261)

## శ్రీధరచ్ఛందస్సు

కర్త : శ్రీధరుడు.

కృతిభర్త : అర్వీటి రామరాజు ముత్తాత సోమభూపతి.

ఇదిఛందోగ్రంథం. అసమగ్రం. క్రీడాభిరామం నుండి నీతిశాస్త్రముక్తావళినుండి ఉదాహరణలున్నాయి. గౌరన, రంగకవి, అప్పకవి శ్రీధరుని ఉదాహరించారు. కృతిపతి మొదటి పిన్నమరాజు కుమారుడైన సోమభూపాలుడో, అరవీటి బుక్కరాజు సోదరుడైన సోమభూపాలుడో వివాదగ్రస్తంగా ఉంది. (కవిజనాశ్రయం పీఠిక) (క. చ-6-4)

## శ్రీధరమల్లె వేంకటస్వామి

కాలం : క్రీ. శ. 19వ శతాబ్దం.

స్థలం : సిద్ధవటం ప్రాంతం.

రచన : బ్రహ్మోత్తర ఖండము.

అయ్యవార్యుని పుత్రుడు. క్రీ.శ. 1815లో పైరచన చేశాడట. జ్యోతి రామన, లక్ష్మీనారాయణుడు చెంగల్వరాయడు ఇతని మిత్రులు. కావ్య రచనకు ప్రేరకులు. ఇతని కవిత హృదయ రంజకంగా ఉంది. (క. చ-3-208)

## శ్రీధర వేంకటేశార్యుడు

నామాంతరం : అయ్యవాళ్.

కాలం : క్రీ. శ. 17వ శతాబ్దం.

స్థలం : శహజీ రాజపురము (తంజావూరు మండలం).

రచనలు : శాహేంద్ర విలాసమ్ (సం), దయాశతకమ్ మొదలైన స్తుతి గ్రంథాలు 14 ఉన్నాయట.

తంజావూరును పాలించిన శహాజీ (1684–1712) ఆస్థానంలోని వాడు. శహాజీ జీవితాన్ని తెలిపే శాహేంద్ర విలాస కావ్యాన్ని ఎనిమిది సర్గలలో వ్రాశాడు. శృంగార రాధామాధవ సంవాద పీఠికలో ఇతని ప్రస్తావన ఉంది. (ద.దే.వా–178)

**శ్రీధరుడు**

కాలం : క్రీ. శ. 1350 ప్రాంతం.

కృతులు : శ్రీధరచ్ఛందస్సు.

ఆళియరామరాజు ముత్తాతయైన సోమభూపాలునికి ఈతని గ్రంథం అంకిత మట. ఈతని ఛందస్సు నుండి కొన్ని పద్యాలను అప్పకవి, కస్తూరి రంగకవి ఉదాహరించారు. ఇతని కాలాన్ని గురించి భిన్నాభిప్రాయాలున్నాయి (కవిజనాశ్రయం–పీఠిక)

**శ్రీనగాదీశ శతకము (అలభ్యం)**

కర్త : కాకునూరి అప్పకవి.

సీసపద్య శతకమనీ, నిందాస్తుతి భావాలతో శ్లేషాలంకార గర్భితంగా ఉండేదనీ తెలుస్తున్నది. (శ.క.చ. 308; అప్పకవీయము)

**శ్రీనాథుడు**

నామాంతరం : బణపతి (వనపతి) (చూ).

దీర్ఘాసి శాసన కర్త.

**శ్రీనాథుడు**

కాలం : క్రీ శ. 1370–1450 ప్రాంతం.

పోషణ : మామిడి సింగన, పెదకోమటి వేమారెడ్డి, కుమారగిరిరెడ్డి, అవచితిప్పయ్య సెట్టి, వీరభద్రారెడ్డి, బెండపూడి అన్నయామాత్యుడు, తెనుంగు రాయడు, పంటమైలార విభుడు, వినుకొండ వల్లభ రాయడు మొదలగువారు.

స్థలాలు : కొండవీడు, రాజమహేంద్రవరము.

బిరుదు : కవి సార్వభౌముడు.

రచనలు : 1. మరుత్తరాట్చరిత్ర (అలభ్యం) 2. శాలివాహన సప్తశతి (అలభ్యం) 3. శృంగార నైషధము 4. భీమేశ్వర పురాణము 5. కాశీ ఖండము 6. హర విలాసము 7. పండితారాధ్య చరిత్ర (అలభ్యం) 8. ధనంజయ విజయము (అలభ్యం) 9. నందనందన చరిత్ర (అలభ్యం) 10. వల్లభాభ్యుదయము 11. శివరాత్రి మాహాత్మ్యము 12. పల్నాటి వీరచరిత్రము 13. మానసోల్లాసము (అలభ్యం) 14. క్రీడాభిరామము (సందేహం).

కమలనాభామాత్యుని పౌత్రుడు. భీమాంబకు మారయామాత్యునికి పుత్రుడు.

శ్రీనాథుని తాత కమలనాభామాత్యుడు వారిధి తటీ కాల్పట్టణాధీశుడట.

తెలుగు సాహిత్యంలో శ్రీనాథునికి ఒక ప్రత్యేక స్థానముంది. ఈయన మహా విద్వాంసుడు. కావ్య రచనలో ఈయన తొక్కని మార్గమే లేదు. జీవితమంతా రసమయం చేసుకొని తన రచనలన్నింటిలోను తన రూపాన్ని దృగ్గోచరం చేసుకొన్నాడు. సంస్కృతంలో ఉన్న శ్రీ హర్షుని నైషధ కావ్యాన్ని ఆంధ్రీకరించి సంస్కృత ప్రౌఢికి, తెలుగు నుడికారాన్ని జోడించాడు. ఈయన హరవిలాస భీమేశ్వర కాశీఖండ కావ్యాలు శివపారమ్య బోధకు, కవితా ప్రౌఢికి ఎనలేని నిధులు. ఈయన నవ్య వాఙ్మయ మార్గంలోనే గాక శైలిలో, కల్పనలలో, శబ్దసృష్టిలో అప్రతిముడై ఆంధ్ర వాఙ్మయంలో శాశ్వత స్థానం సంపాదించుకొన్నాడు. ఈయన పలనాటి వీరచరిత్ర ద్విపద కావ్యాలలో మేటి రసగుళిక. దీనిలో తెలుగు జీవనం ప్రతిబింబించిన సజీవ మూర్తులను శ్రీనాథుడు సృష్టించాడు. కర్తృత్వం వివాదగ్రస్తంగా ఉన్న క్రీడాభిరామం ఒక మనోహర కావ్యం. ఈ గ్రంథం ఆనాటి సాంఘిక జీవనానికి అద్దం పడుతున్నది. ఇతడొక కామశాస్త్రాన్ని రచించినట్లు కామకళానిధి నుండి తెలుస్తున్నది. అదే మానసోల్లాస గ్రంథం కావచ్చునని కొందరి అభిప్రాయం. ఘోడె రాయడని ప్రసిద్ధి పొందిన భీమేశ్వరుని ఈ కవి తన కాశీఖండంలో పేర్కొన్నాడు. ఈ ఘోడె రాయడు శ్రీనాథునికి మిత్రుడని గురువని పలువురు భావిస్తున్నారు.

ఈయనను ఆనాటి రాజులు, మంత్రులు ఎన్నో విధాలుగా పోషించి, బహుమతులిచ్చి సత్కరించారు. ఈయన పెదకోమటి వేమారెడ్డి ఆస్థానంలో విద్యాధికారి. వీరభద్రారెడ్డి ఆస్థానంలో విద్వాంసుడు. దేశాటన చేస్తూ ప్రౌఢ దేవరాయల కొలువుకు (విజయనగరం) పోయి, వివాదంలో అక్కడి విద్వాంసుడైన "డిండిమభట్టు"ను ఓడించి కనకాభిషేక గౌరవం పొందాడు. రాచకొండ పోయి, పాండిత్యంతో వెలమ ప్రభువును మెప్పించి "నందికంత పోతరాజు కటారి"ని తీసుకొని కొండవీడు వెళ్ళాడు. ఈయన కర్ణాట. ఓఢ్ర దేశాలను కూడా సందర్శించాడట. వివిధ దేశాలను, వివిధ రాజాస్థానాలను దర్శించినప్పుడు రసవత్తరాలయిన చాటువు లెన్నో చెప్పాడు చాటువుల వల్ల ఈయన పరమ రసికుడనే ప్రతీతి తెలుగు దేశంలో నిలిచిపోయింది. ఈయన ఈశ్వరార్చన కళాశీలుడు. షట్కాల లింగార్చన చేసే మహాభక్తుడు. కొండవీడు-రెడ్డి రాజ్యాల పతనం తరవాత కవి సార్వభౌముడు చాలా దారిద్ర్యాన్ని అనుభవించాడట. ఆవసాన దశలో వ్యవసాయం చేసుకొని జీవించినట్లు, పంటలు పాడై శిస్తు కట్టలేక దారుణమైన శిక్షలు అనుభవించినట్లు ఒక చాటుధార వల్ల తెలుస్తున్నది. (తె.వా: వా.చ.)

శ్రీనాథుని వెంకటరామయ్య

కాలం : క్రీ. శ. 1700 ప్రాంతం.

స్థలం : అశ్వారావుపేట.

రచన : అశ్వరాయ చరిత్ర లేక శ్రీరామ పట్టాభిషేకం (అలభ్యం).

ఈ కవి పాల్వంచ సంస్థానానికి చెందినవాడు. ఈకవి తన గ్రంథంలో, పాల్వంచ సంస్థానాధీశులను గురించిన చారిత్రక విషయాలు అనేకం రాశాడని శేషాద్రి రమణ కవుల వలన తెలుస్తున్నది. (ఆం.సం.సా)

## శ్రీనారాయణ తీర్థులు

కాలం : క్రీ. శ. 1700 ప్రాంతం.

స్థలం : గోదావరి జిల్లా కోనసీమలోని కూచిమంచి అగ్రహారం.

రచనలు : శ్రీకృష్ణలీలా తరంగిణి (సంస్కృతం) పారిజాతాపహరణము (తెలుగు) హరిభక్త సుధార్ణవమ్ (సంస్కృతం), వివరణ దీపిక, కీర్తనలు వ్యాఖ్యానాలు.

గురువు : శివరామానంద తీర్థులు.

జయదేవ కవి అపరావతారంగా పేరు పొందాడు. వేదవేదాంగాలు, సంస్కృత సాహిత్యం, సంగీత నాట్యాదులు బాగా అభ్యసించిన పండితుడు. ఇతని అత్తవారి ఊరు కృష్ణాతీరంలోని వేదాద్రి కెదురుగా ఉన్న గ్రామమట. సన్యాసం పుచ్చుకొని తిరుమలకు పోయి యతి అయ్యాడు. బోధేంద్ర సరస్వతి తిరుమలలోనే ఈయనకు శిష్యుడయ్యారు. సిద్ధేంద్రయోగి ఇతని శిష్యుడని అంటారు.

వీరి కృష్ణలీలా తరంగిణి, కూచిపూడి భాగవతులకు కాణాచి. ఈయన తరంగాలను పాడి, ఆడటమేగాక చాలామంది శిష్యులకు తరంగాలను నేర్పినారట. భజన పద్ధతికి చాలా ముఖ్యులు. వివిధ క్షేత్రాలలో ఆయా దైవతాలపైన కీర్తనలు వ్రాశాడు.

వరహూరులో సిద్ధిపొందాడు. వరహూరు సమీపంలోని "తిరుపంతురుత్తి" అనే గ్రామంలో ప్రతి సంవత్సరం వీరి ఉత్సవం జరుగుతుంది. అక్కడ శ్రీకృష్ణ జయంతి నాడు "కృష్ణలీలా తరంగిణి" వంటివి పాడి, ఆడుతూ ఉంటారు.

ఇతని కాలాన్ని గురించి వాదోపవాదాలున్నాయి. ఇతడు తంజావూరు పాలకుడైన అచ్యుతప్పనాయకుని సమకాలీనుడని కొందరంటారు.

వేదాంత శాస్త్రానికి, సాంఖ్యశాస్త్రానికి, తర్కశాస్త్రంలోని పూర్వ మీమాంసకు వ్యాఖ్యానాలు వ్రాశాడు. సురేశ్వరాచార్యుని పంచకరణ వార్తికం పైన వివరణ దీపిక వ్రాశాడు. (ద.దే.వా-295; తె.వి.స-4)

## శ్రీనివాస కవి

కాలం : తెలియదు.

స్థలం : కార్వేటినగర సంస్థానం.

రచన : మహారాజ చరిత్రమ్ (సం).

బిరుదము : కవిసార్వభౌమ.

ఈ కవి రామరాయదత్త వాదిగజకేసరి బిరుదాంకితుడైన జగన్నాథ గురువరుని వంశానికి చెందినవాడు. కార్వేటిరాజుల వంశచరిత్రను తన రచనలో తెలిపాడు.

(ఆం. సం. సా)

**శ్రీనివాస కవి**

కాలం : క్రీ. శ. 18 వ శతాబ్దం.
స్థలం : తంజావూరు.
రచన : శహరాజాష్టపది (సం).

శహాజీ (క్రీ.శ. 1684-1712) ఆస్థానంలోని కవి. (శారదాధ్వజం-69)

**శ్రీనివాస కవి**

కాలం : క్రీ. శ. 1811 ప్రాంతం.
స్థలం : రామచంద్రపురం.
రచన : పారిజాతాపహరణము (నాటకం) (రంగపురి పారిజాతము).

ఇతనిని గురించిన వివరాలు తెలియరాలేదు. తన గ్రంథారంభంలో అహోబిల మఠపతియైన రంగనాథుని పేర్కొన్నాడు. సంగీత, నృత్య విశేషాలతో తన రచనను యక్షగానంగా తీర్చిదిద్దాడు. (య. వా. చ.)

**శ్రీనివాస కవి**

కాలం : క్రీ. శ. 1850 కి పూర్వం.
రచన : త్రిపురసుందరీ శతకము.

కవిని గూర్చిన వివరాలు తెలియరాలేదు. ఈ శతకం క్రీ.శ. 1888లో ఒకసారి అంతకుపూర్వం ఒకసారి ముద్రితమైనా లేఖక దోషాలు, ముద్రణదోషాలు ఎక్కువగా ఉండం చేత కవిత్వాన్ని గురించి చెప్పడం కష్టం. మ్లేచ్ఛం వలన కష్టాలపాలయ్యాడనీ పుత్ర పౌత్రాదులకు తలిదండ్రులకు దూరమైనాడనీ శతకంలోని పద్యాల నుండి తెలుస్తున్నది (శ. క. చ. 547)

**శ్రీనివాస తారావళి**

కాలం : క్రీ. శ. 1810 ప్రాంతం.
కర్త : జగ్గూరి అప్పయ్య.

ఈ గ్రంథం ముద్రితం. శ్రీనివాసునిపై చెప్పిన తారావళి. రచన మల్లికార్జున కలువాయి శతకాల రీతిలో ఉన్నదట. (క. స-13)

**శ్రీనివాస విలాస సేవధి**

రచనాకాలం : క్రీ. శ. 16 వ శతాబ్దం.
కర్త : శ్రేష్ఠలూరి వేంకటార్యుడు.
అంకితం : శ్రీ వేంకటేశ్వరునికి.

ఆరాశ్వాసాల ద్విపద ప్రబంధం. శ్రీ వేంకటేశ్వరుని విలాస విహారాలను వర్ణించే రచన. ఆ దేవుడే స్వయంగా కోరి ఈ రచన చేయించాడట. వేంకటేశ్వరుని గాథలు వరాహ, వామన, బ్రహ్మాండ, పద్మ, గారుడ, స్కాంద, మార్కండేయ పురాణాలలో ఉన్నవి. ఈ కథలలో ఒకదానికి మరొకదానికి పొందిక లేకపోవడంవల్ల చిక్కుదీర్చి రచింపమని వేంకటేశ్వరుడు కవిని ఆదేశించాడట.

ఇందులోని మొదటి మూడాశ్వాసాలూ వరాహపురాణ సరళిలో ఉన్నాయి. కొన్ని తీర్థక్షేత్రాల మహిమలు వామన, బ్రహ్మాండ పురాణాల ప్రకారం ఉన్నాయి. వేంకటేశ్వరుని కథలు విస్తృతంగాచెప్పే ఈ కావ్యంలో హిందూస్తానీ పదాలు, వింతప్రయోగాలు ఉన్నాయి. రచన రసవత్తరంగా వర్ణనాతీతంగా ఉంది.

కవి దీనిలో అవాంతర కథలు ఆత్మారాముని కథ, కుర్వపురి కుమ్మరి కథ, మాధవసోమయాజి కథ-మొదలైనవి రమణీయంగా చిత్రించాడు. (ద్వి.సా.చ-27)

## శ్రీపతి పండితుడు

కాలం : క్రీ. శ. 950-1000 ప్రాంతం.

స్థలం : విజయవాడ.

రచన : శ్రీకరభాష్యము (శివదీపిక) (అలభ్యం).

ఈయన పండితత్రయంలో ఒకడు. శివమహాత్మ్యాన్ని ప్రతిపాదించటానికి అగ్నిని తన వస్త్రంలో మూటగట్టుకొన్నాడట. బ్రహ్మవాదులైన వైదికబ్రాహ్మణులకు అగ్నిహోత్రం ప్రధానం. వైదికులు శివపారమ్యాన్ని అంగీకరించరు. వారిని జయించటానికి అగ్నిహోత్రాన్ని తనబట్టలో మూటగట్టి శివమహిమను ప్రదర్శించాడు బ్రాహ్మణులు అతని భక్తికిమెచ్చి, అగ్నిహోత్రాన్ని విప్పమని ప్రార్థించారు. అప్పటినుంచి శివమతం సుప్రతిష్ఠమై "కొంగున నిప్పును మూటగట్టుట," అనే నానుడి తెలుగుదేశంలో ప్రచారంలోకి వచ్చింది.

ఈయన బ్రహ్మసూత్రాలకు శివపరంగా "శ్రీకరభాష్యము" అనే గొప్ప వ్యాఖ్యానాన్ని వ్రాశాడు. పాల్కురికి సోమన ఈయనను కవిగా ఒకచోట చెప్పాడు. ఇతని తెలుగు కృతులు దొరకటంలేదు.

(వివరాలకు చూ. పండితత్రయము) (తె. వి. స-4)

## శ్రీపతి భాస్కర కవి

కాలం : క్రీ.శ. 16 వ శతాబ్ది.

రచన : చిత్రశతకము.

విశిష్టత : ఈయన హేతువాది. వేదాల పేరు చెప్పి ప్రజలను మోసపుచ్చే వారిని, విగ్రహారాధనను, వేద విహిత కర్మలనూ, మత విభేదాలనూ నిరసించాడు. సమాదరణ బుద్ధి కావాలంటాడు. వేదపారాయణం ఒప్పుకోడు. బౌద్ధంలోని మంచిని మెచ్చుకొన్నాడు. తత్వజిజ్ఞాస మాత్రం చెయ్యమని, "నిన్ను నీవు తెలుసుకో"మనీ చెప్పాడు. ఈయన రచనల వంటివి ప్రాచీన కాలంలో ఉన్నా కాలగర్భంలో కలిసిపోయి ఉంటాయని పరిశీలకులు భావిస్తున్నారు. (ఆప్ర-9-223)

## శ్రీపతి రామభద్ర కవి

కాలం : క్రీ.శ. 18 వ శతాబ్దం.

స్థలం : మధుర.

రచన : హాలాస్య మాహాత్మ్యము (వచన కావ్యం).

మధుర పాలకుడైన విజయరంగ చొక్కనాథుని కాలంవాడు. గిరియమ్మ సూరయల పుత్రుడు. సంస్కృతాంధ్ర భాషలలో పండితుడు. చిత్ర విస్తర కవిత్వాలపై గల ప్రీతి ఇతని రచనలో ప్రస్ఫుట మవుతున్నది. (వ.వా-46; ద.దే.వా-400)

**శ్రీపర్వత పురాణము**

నామాంతరం : పర్వత పురాణము (చూ).
(శ్రీశైలమాహాత్మ్యము).
కర్త : నాగలూటి శేషనాథుడు.

**శ్రీపాద రేణు మాహాత్మ్యము**

రచనాకాలం : క్రీ. శ. 16 వ శతాబ్ది పూర్వార్ధం.
కర్త : రేవణూరి వేంకటార్యుడు.
ఈ గ్రంథం దైవాంకితమట. (శ. వ-259)

**శ్రీపాద వెంకటాచలకవి**

కాలం : క్రీ. శ. 19 వ శతాబ్దం.
స్థలం : విజయనగర సంస్థానం.
రచనలు : కౌసల్యాపరిణయము, రామ్యరక్షోపాఖ్యానము.

క్రీ. శ. 1826-1879 కి చెందిన విజయరామ గజపతి ఆస్థానంలోని విద్వాంసుడు. (ఆం. సం. సా-422)

**శ్రీ బాల సుబ్బరాయ శతకము**

నామాంతరం : సుబ్రహ్మణ్య శతకము (చూ)
కర్త : బృహత్తటాకము నాగిశాస్త్రి.

**శ్రీ భక్త మందార శతకము**

రచనాకాలం : క్రీ. శ. 18 వ శతాబ్ది పూర్వార్ధం
కర్త : పిండిమంచి జగ్గకవి (చూ).
ముద్రణకాలం : క్రీ శ. 1935.

ఈ శతకం జగ్గకవి కృతమని కవి వంశస్థులైన శ్రీ శ్రీరామమూర్తి ప్రకటించారు. వీరే లముద్రితాంధ్ర గీర్వాణ గ్రంథమాలను స్థాపించి తొలుతగా ఈ శతకాన్ని అచ్చు వేశారు. ఈ శతకంలోని కొన్నిపద్యాలు, ప్రసిద్ధ పూర్వ శ్లోకాలకు, పద్యాలకు రూపాంతరాలుగా కనిపిస్తున్నాయి.

జగ్గకవికి "రంగతిమ్మ భూమండలేశ్వర వర్యార్పిత బేబదల్ బిరుదము" ఉన్నదని 101 వ పద్యం నుండి తెలుస్తున్నది. "రామా, భక్త మందారమా" అనేది మకుటం. (ఆం.సా.వ..వ-24-2)

**శ్రీ మదాంధ్రి మహాభారతము**

రచనా కాలం : క్రీ. శ. 11-13 శతాబ్దాల నడిమికాలం.

కర్తలు : కవిత్రయము. 1. నన్నయభట్టు 2 తిక్కన 3. ఎర్రాప్రెగ్గడ.
మూలం : వ్యాసుని సంస్కృత భారతమ్.

ఆంధ్ర వాఙ్మయంలో తొలి తెలుగు మహాకావ్యం. పంచమ వేదమని ప్రసిద్ధి. ఇందులో నన్నయ ఆదిసభాపర్వాలను, అరణ్య పర్వంలో 142 గద్య పద్యాలను వ్రాశాడు.

తిక్కన విరాటపర్వం మొదలుకొని మిగిలిన 15 పర్వాలు ఆంధ్రీకరించాడు

ఎర్రన, నన్నయ వ్రాయగా మిగిలి అరణ్యపర్వ శేషాన్ని తెనిగించి పూరించాడు. మహాభారతం అనేక భారతీయ భాషలలోనికి అనువాదం చేయబడింది. అయితే తెలుగులో వచ్చినంత ఉదాత్తమైన పరివర్తనం ఇతర భాషలలో రాలేదని అంటారు.

"సంస్కృత భారతం పురాణమైతే తెలుగు భారతం రమణీయమైన కావ్యం".

ఇది మానవుల భౌతిక, మానసిక, అధ్యాత్మిక జీవిత ప్రతిబింబం. చరిత్ర ప్రసిద్ధమైన కథను గ్రహించి సంఘంలో ప్రబలిన అనాచారాలు ఐహికముల పట్ల ఆసక్తి ఆముష్మికం పట్ల నిరాదరణ ఎత్తిచూపి, అవి భారత యుద్ధానికి దారితీసిన విధం వేద వ్యాసుడు ఇందులో చిత్రించాడు. గీతోపదేశంలో ధర్మబోధ చేసి – సంఘ పునరుద్ధరణకు,' కర్తవ్య పాలనకు ప్రేరేపించాడు. సామాన్య ప్రజలకు అందుబాటులో లేని వేదాంత రహస్యాలు ఇందులో ఉన్నందున దీనికి పంచమ వేదమని ప్రతీతి కలిగింది. దీన్ని తెలుగులో కవిత్రయ కవులు సర్వాంగ సుందరంగా తీర్చిదిద్దారు.

## శ్రీమదుపాఖ్యానము

కర్త : చూ. రాపాక లక్ష్మీపతి.

(ఆం. సం. సా-186)

## శ్రీమద్రామానుజ చరిత్రము

కర్త : చూ. గోపీనాథము వేంకటకవి.

వచన రచన. విశిష్టాద్వైత సిద్ధాంత ప్రతిపాదకుడైన శ్రీ మద్రామానుజుల జీవిత చరిత్ర ఇందు అభివర్ణితం. (ఆం.సం.సా-467)

## శ్రీమద్రామాయణము

నామాంతరం : గోపీనాథ రామాయణము (చూ.).
కర్త : చూ. గోపీనాథము వేంకటకవి.
శ్రీకృష్ణాంకితం

(ఆం.సం.సా-463)

## శ్రీమన్నిశ్శంక చరితము

కర్త : చూ. పరవస్తు వేంకట రంగాచార్యులు.

ఇది నిశ్శంకవారి చరిత్రను తెల్పే చారిత్రక కావ్యం.

సంగము వలన జమీందారైన మృత్యుంజయ నిశ్శంక బహద్దరు కవికి ప్రియ శిష్యుడు. శిష్య వాత్సల్యం చేతను, ఆ శిష్యునికి గల సాహిత్యాభిమానం వల్లను రంగాచార్యులు ఈ గ్రంథం వ్రాశారట. (ఆం.సం.సా.)

**శ్రీమహాలక్ష్మీ పరిణయము**

రచనా కాలం : క్రీ.శ. 1754-1834 ప్రాంతం.
కర్త : వద్దిపర్తి కోనరాట్కవి.
ప్రబంధం. సలక్షణమైన రచన.

**శ్రీముఖలింగ శతకము**

కర్త : అమలాపురపు సన్యాసి కవి.
కందపద్య శతకం. శివపరమైనది.

**శ్రీముష్ణ క్షేత్రంలోని శాసనము**

స్థలం : చిదంబరం (దక్షిణ ఆర్కాటు).
కాలం : క్రీ. శ. 1582 ప్రాంతం.

ఈ శాసనం తమిళ దేశంలోనిదైనప్పటికీ తెలుగు భాషలో ఉండటం విశేషం. పెనుకొండను వీర శ్రీరంగరాయదేవ మహారాజు పాలిస్తున్న కాలంలో కృష్ణప్ప నాయని గారి కుమారుడైన కొండమ నాయనిగారు భోనగిరి పట్నం సీమలోని పై ఆలయానికి చెందిన 32 ఊళ్ళ నుండి జోడి, వివిధ పన్నులను వసూలు చేసి, ఆ ఆలయానికి చెల్లించినట్లు శ్రీ ముష్ణ క్షేత్రంలోని ఈ శాసనంలో ఉంది. (N. M. 343)

**శ్రీముష్ణ మాహాత్మ్యము**

కర్త : తేవూరి చిన అనంతయ్య (బాలకవి) (చూ).
అంకితం : వెంగళము కృష్ణ మహేంద్రునికి.

ఐదాశ్వాసాల పద్య ప్రబంధం. తిరుచినాపల్లి మండలంలోని వెంగళము కృష్ణ మహేంద్రుని కోరికపై దీనిని తెనిగించి అతనికే అంకిత మిచ్చాడట. మూల గ్రంథం సంస్కృతంలోని శ్రీకృష్ణమాహాత్మ్యము కావచ్చును.

పాలవేకరి కదరీపతి తన శుక సప్తతిలో, శ్రీముష్ణ మహిమను రెండు కథలలో చెప్పాడు. ఆ తర్వాత ఈ క్షేత్రాన్ని గురించి విపులంగా చెప్తున్న గ్రంథం ఇదే. రచన ప్రౌఢమై మనోహరమైన శైలిలో ఉంది.

(ఆరుద్ర-12-123) (ద.దే.వా-379)

**శ్రీరంగం వారు**

దివ్యస్థలం నామంతో తెలుగు దేశంలో ఉన్న ఇంటిపేరు. (భారతి-మా-45-229)

**శ్రీరంగపట్టణ రాజవంశావళి**

కర్త : కావలి వేంకట బొర్రయ్య.

శ్రీరంగ పట్టణాన్ని ఏలిన రాజ వంశపు చరిత్ర. ఉమ్మత్తూరు సంస్థాపన వగైరాలన్నిందే దీనిలో ఉంది. (తె. వి. వ-4)

**శ్రీరంగ మాహాత్మ్యము**

కర్త : తెలియదు.

జానపద పౌరాణిక గేయం.
చూ. పౌరాణిక గేయములు. (అం. వా. చ.)

### శ్రీరంగ మాహాత్మ్యము

కర్త : కట్టా వరదరాజు (చూ).
అంకితం : తిరుపతి వేంకటేశ్వరునికి.

పది ఆశ్వాసాల కావ్యం. దీనికి మూలం గారుడ సంహితలోని శతాధ్యాయం. తిరుపతి వేంకటేశ్వరుడు కవికి కలలో కనబడి ఈ రచనకు పురికొల్పాడట. ఇతనికి ముందు చాలమంది కవులు తెలుగులో శ్రీరంగ మాహాత్మ్యం రచించారు. అయినా తానే తొలుతగా తెలుగులో ఈ కథ చెప్తున్నానని వరదరాజు చెప్పుకొన్నాడు. కావ్యంలో వ్యావహారిక ప్రయోగాలున్నాయి. (ఆరుద్ర-10-189)

### శ్రీరంగ మాహాత్మ్యము

కర్త : చేకూరు సిద్దయ్య.

అయిదాశ్వాసాల పద్య కావ్యం. రచన జటిలంగా సంస్కృత సమాస భూయిష్ఠమై ఉన్నదట. దీని ప్రతి ఆంధ్రసాహిత్య పరిషత్తులో ఉంది.

### శ్రీరంగ మాహాత్మ్యము

రచనాకాలం : క్రీ. శ. 1410-1480 ప్రాంతం.
కర్త : భైరవకవి
అంకితం : చాగయ రామదేవ పండితునికి.

ఐదాశ్వాసాల చంపూకావ్యం. ప్రసిద్ధవైష్ణవ క్షేత్రమయిన శ్రీరంగ మాహాత్మ్య కథ. ఈ కథ గరుడ పురాణంలోను, బ్రహ్మాండ పురాణంలోను ఉంది. కవి ఈ కథను గరుడ పురాణాన్ననుసరించి వ్రాశాడు. దీనిని కట్టా వరదరాజకవి, భాగవతుల రాయకవి గుంటుపల్లి జగన్నాథ కవి పద్య కావ్యాలుగా, ముకుంద యోగి ద్విపదగా వ్రాశారు. ఈ గ్రంథం తెలుగులో వచనంలో కూడా ఉంది. ఈ రచనలో చక్రబంధం, నాగబంధం, గోమూత్రికా బంధాలు కవి వ్రాశాడు. కవిత్వం భక్తి రసపూరితమై ప్రౌఢంగా ఉంది. (క. శ-6; ఆరుద్ర-6)

### శ్రీరంగ మాహాత్మ్యము

కర్త : ముకుందయోగి.
రచనాకాలం : క్రీ. శ. 1560 ప్రాంతం.

విశిష్టత : శ్రీరంగస్థల పురాణాన్ని తెలిపే ద్విపద కావ్యం. తెలుగులో శ్రీరంగ మాహాత్మ్యాన్ని భైరవుడు, చెన్నమల్లు శ్రీగిరన్న మొదలగువారు వ్రాశారు. ముకుందయోగి రచనకు మూలం బ్రహ్మాండ పురాణంలోని శ్రీరంగ క్షేత్రమహిమ. ఈ గ్రంథం 1892లో ముద్రితం. వ్రాతప్రతులు కూడా ఉన్నాయి. (ద్వి. సా. చ-276)

## శ్రీరంగ మాహాత్మ్యము

రచనాకాలం : క్రీ. శ. 18వ శతాబ్దం.
కర్త : ముద్దురంగ చొక్కనాథుడు.

గ్రంథకర్త మధురాపాలకుడైన విజయరంగ చొక్కనాథుని పుత్రుడు. ఇతడు శ్రీరంగ మాహాత్మ్యం గురించి ఒక గ్రంథం వ్రాశాడట. అయితే దానిపేరు నిర్ధారణగా తెలియరాలేదు (క. ప-170)

## శ్రీరంగ మాహాత్మ్యము

కర్త : విజయరంగ చొక్కనాథుడు.
అంకితం : వేంకటేశ్వరునికి.

పది అధ్యాయాల వచన గ్రంథం. ఇతివృత్తం శ్రీరంగ స్థల మాహాత్మ్యం. (క. త-13)

## శ్రీరంగ మాహాత్మ్యము (అలభ్యం)

కర్త : చూ. శ్రీగిరి.

## శ్రీరంగ రాయలు

కాలం : క్రీ. శ. 1574-1581 ప్రాంతం.

కవిపండిత పోషకుడు. వసుచరిత్ర కృతిపతి తిరుమల దేవరాయల కొడుకు. తండ్రి జీవిత కాలంలోనే ఈయన రాజ్యభారం వహించాడు. ఈ తండ్రీ కొడుకు లిరువురూ సాహిత్య పోషకులే. లక్ష్మీవిలాసం రచించిన రాయసం వేంకటపతి ఇతని దగ్గరనే ఉండేవాడు. (ఆద్ర-9-242)

## శ్రీరంగ శతకము (అలభ్యం)

కర్త : ఆసూరి మరింగంటి సింగరాచార్యులు.

ఇతివృత్తం వరదరాజ స్తుతి. కవి తన తొమ్మిదవ యేట దీన్ని చెప్పాడట. (క. త-13-9)

## శ్రీరంగాచార్యులు

కాలం : క్రీ. శ. 16వ శతాబ్దం.

శాసనకర్త. పండితుడు. కందాళ భావనాచార్యుల కుమారుడు. విద్వత్కవులైన తెనాలి అన్నయ, రంగనమంత్రి, కలిదిండి భావనారాయణ ఇతని శిష్యులు. 1545 నాటి ఈ శ్రీరంగాచార్యుల శాసనం ఒకటి తిరుపతిలో ఉన్నది.

## శ్రీరంగాపురము

నేటి మహబూబ్ నగర మండలంలోని ఒక గ్రామం. వనపర్తిసంస్థానంలోనిది. పూర్వం దీనికి సాహితీపరంగా ప్రత్యేక స్థానం ఉండేది. ప్రతి సంవత్సరం శ్రీ స్వామి వారి బ్రహ్మోత్సవ సందర్భంలో ఇక్కడ కవి గాయకులకు ఘనతర సన్మానాలు జరిగేవి.

ఈ గ్రామంలోని "శ్రీరంగ నాయకులు" వనపర్తి సంస్థానాధీశ్వరులకు కుల దైవం. గరుడాద్రి అనే కొండమీద వెలసిన ఈ దైవానికి అష్టభాషా బహిరీ గోపాల రాయలు (సంస్థాన ప్రభువు) గుడి కట్టించి, ఆ కొండ చుట్టూ నీరుండేట్లు "రంగ సముద్ర"మనే చెరువును త్రవ్వించాడు. (ఆం. సం. సా.)

## శ్రీరంగాభ్యుదయ చంపువు (సం)

కవయిత్రి : త్రివేణి.

ఇది చంపూ ప్రబంధం. దీని వ్రాతప్రతి తంజావూరు సరస్వతీ మహల్‌లో ఉంది. (అ. భా. కవయిత్రులు)

## శ్రీరమణ శతకము

రచనాకాలం : క్రీ. శ. 19వ శతాబ్దం పూర్వార్ధం.

కర్త : ఆకొండి వెంకటకవి.

భక్తి శతకం. "నారాయణ, భక్తపోషణా, శ్రీరమణా" అనే మకుటంతో ఉంది. (క. స-232)

## శ్రీరామ చంద్రప్రభు శతకము

కర్త : చూ. మండపాక కామకవి.

శ్రీరామ స్తవ రూపమైన శతకం. (ఆం. సం. సా.)

## శ్రీరామ చంద్రోదయ కావ్యమ్ (సం)

కర్త : వేంకటకృష్ణ దీక్షితుడు.

## శ్రీరామ దండకము

కర్త : ఆడిదం సూరకవి.

ఇది ఒక విలక్షణమైన దండకం. కవి తండ్రి భాస్కరయ్య అచ్చతెనుగులో రామాయణం వ్రాస్తే, ఈ కవి రామకథ అంతటినీ దండకంలో చెప్పాడు. ఇందులో రాముడూ, హనుమంతుడూ మొదలయినవారి సంభాషణలు సంస్కృత భాషతో ఉన్నాయి. (ఆరుద్ర- 12)

## శ్రీరామ నిత్యోత్సవ యక్షగానము

కర్త : అక్కెన ప్రగడ హరిదాసు.

రచనాకాలం : 18 వ శతాబ్దం.

శ్రీరామ పరమైన యక్షగానం. (య. వా. చ-66)

## శ్రీరామ పట్టాభిషేకము

రచనాకాలం : క్రీ. శ. 1700 ప్రాంతం.

నామాంతరం : అశ్వరాయ చరిత్ర. (చూ.)

కవి : శ్రీనాథుని వేంకటరామయ్య. (చూ.)

### శ్రీరామ వసిష్ఠ సంవాదము

కర్త : చూ. వేదాంతి షణ్ముఖదాసు.

ఇది అధ్యాత్మ గ్రంథం. వైరాగ్య ప్రశంస, శుశ్రూషలు, కామాదులు, మహా వాక్య వివరణ మొదలైన అనేక ఆధ్యాత్మిక విషయాలు శ్రీరామ వసిష్ఠ సంవాద రూపంలో వివరింపబడినాయి. మరికి సింగన వాసిష్ఠ రామాయణంకూడా శ్రీరామ వసిష్ఠ సంవాదాత్మక మైనదే. (ఆం. సం. సా-101)

### శ్రీరామ విజయము (అలభ్యం)

రచనాకాలం : క్రీ. శ. 1600 ప్రాంతం.

కర్త : వెలుతురుపల్లి విశ్వనాథకవి

దీనిని కవి చిన్ననాడే రచించినట్లు అతని మరో రచన శేషధర్మములు లో ఉంది (య. వా. చ-28)

### శ్రీరామ శతకము (అలభ్యం)

కవి: వత్సవాయ బంభర రాజకవి. (చూ.)

### శ్రీరామ స్తవ చూర్ణిక

కర్త : చూ. ముడుంబై వేంకట కృష్ణమాచార్యులు.

దేశి కవితా విధానానికి చెందిన రచన. (ఆం. సం. సా.)

### శ్రీరామ స్తవ రాజము

కర్త : ముమ్మడి మల్లన్న.

అంకితం : శ్రీకృష్ణునికి.

ప్రత్యేకత : ఇది మూడాశ్వాసాల కావ్యం. కవి దీనిని "ప్రబంధనాయక రత్నం" అన్నాడు. వ్యాసుడు శ్రీరామ మంత్ర ప్రభావాన్ని, వేదాంత విషయాలను బోధించిన వివరాలను ఈ గ్రంథంలో కవి చెప్పాడు. ఇది చాలా ప్రచారం పొందిన గ్రంథం. దీనికి చాలా ప్రతులున్నాయి. (ఆరుద్ర- 8-272)

### శ్రీరామ సౌధము

తంజావూరు కోటలోని ఒక భవనభాగం.

తంజావూరు నాయకరాజుల దర్బారు హాలులో రామ పట్టాభిషేక చిత్రపటం ఉంది. అందేత దీనికి ఈ పేరు వచ్చి ఉండవచ్చు. మహారాష్ట్ర రాజులకాలంలో శరభోజి శిలా విగ్రహాన్ని ఇందులో ప్రతిష్ఠించారు.

ఈ సభాభవనాన్ని మహారాష్ట్ర రాజులు మార్చి కట్టారు. నేడు నాయకరాజుల దర్బారు హాలని చెప్పబడేభాగమే పూర్వపు శ్రీరామ సౌధం. రఘునాథరాయల కాలంలో ఇది రాజకీయ గోష్ఠులకూ, సాహితీ గోష్ఠులకూ నెలవై ఉండేది. సమకాలీన సాహిత్యంలో దీని ప్రసక్తి ఉంది. (తం. ఆం. నా-244)

## శ్రీరామాయణము

కవి : కట్టా వరదరాజు. (చూ.)
అంకితం : వేంకటేశ్వరునికి.

ద్విపద రామాయణం. ఆరుకాండలు ఉన్నాయి. కవికి స్వప్నంలో వేంకటేశ్వరుడు కనిపించి ఈ రచనకు ప్రోత్సహించాడట యథా వాల్మీకంగానే వ్రాసినా, ధ్వనులు, వింతలు, జాతి వార్తాచమత్కారాలతో స్వతంత్ర కావ్యంవలె రూపు దిద్దుకొన్నది. కొన్ని శ్లోకాలను మేలుకొలుపు పాటలుగా, జోల పాటలుగా తెలుగుతనంతో కవి సింగారించాడు. ఇందులోవి కొన్ని ద్విపదలు రంగనాథ రామాయణంలో చేరాయట. ఈ రామాయణం నాలుగు సంపుటాలుగా ప్రకటింపబడింది. (ఆరుద్ర 10-191)

## శ్రీరామాయణ సార కావ్యతిలకమ్ (సం)

నామాంతరం : రామాయణము.
కవయిత్రి : మధురవాణి.

## శ్రీరామునిలో నవరసాలు

చాటువు. శ్రీరామునిలో నవరసాలు ఎట్లా ఉన్నాయో తెలిపే ఒక పెద్ద సీస పద్యం దొరికింది. కవిత్వం సరసంగా ఉంది. శ్రీరాముని జీవితంలో ఏయే రసాలు ఎక్కడెక్కడ ప్రవర్తిల్లినవో తెలిపే ఈ పద్యాన్ని రచించిన కవి పేరు తెలియదు. (చా. ప. ర)

## శ్రీరుక్మిణీ కురవంజి

కర్త : అత్తాను రామానుజాచార్యులు (చూ).
అంకితం : మదనగోపాలస్వామికి.

ఈ కృతి 24 తాళపత్రాలపై వ్రాయబడింది. మొదటి కమ్మ సగానికి విరిగింది. ప్రతి శిథిలావస్థలో ఉంది. దీని వచనాన్నిబట్టి ఇది ప్రాచీన యక్షగానములకును, కొరవంజి రచనలకెగకూ చెందినదని భావిస్తున్నారు.

ఇందులో జంపె, నువ్వాలలు, మంగళహారతులు, ద్విపదలు, ధవళము మొ॥ వివిధ గేయాలున్నాయి (మ మా)

## శ్రీరుక్మిణీ నాటకము (అలభ్యం)

కవయిత్రి : తరిగొండ వేంకమాంబ
యక్షగానం కావచ్చు. (ఆ.భా.క-75)

## శ్రీలలితా పంచదశమంత్ర వర్ణమాలా స్తోత్రమ్ (సం)

కర్త : నడిమింటి సర్వమంగళేశ్వరశాస్త్రి.

15 శ్లోకాల స్తోత్రం. కవి శ్రీ విద్యోపాసకుడు. ఈ స్తోత్రం చాలా ప్రచారం పొందింది.

**శ్రీవిశ్వనాథ శతకము**

కర్త : అమలాపురపు సన్యాసికవి.

ఇది వ్యాజోక్తి చమత్కృతులతో ఉన్న సీసపద్య శతకం. దీనిలోని ధార, శైలి, భావగాంభీర్యం హృదయానికి హత్తుకొనేటట్లు ఉంటాయి. పద్యాలు నీతిని బోధించేవిగా, అధిక్షేప ప్రధానంగా ఉన్నాయి. ఇవి చాలావరకు పూర్వకవులకు అనుకరణలుగా కనిపిస్తాయి. (శ.సా.వి)

**శ్రీవిష్ణు పురాణము**

నామాంతరం : విష్ణుభక్త చరిత్రము.

కర్త : చక్రపురి రాఘవాచార్యులు.

**శ్రీశైల కవి**

కాలం : క్రీ. శ. 19 వ శతాబ్దం.

స్థలం : కార్వేటి నగరసంస్థానం.

రచన : వంశానుక్రమ వర్ణనము.

కార్వేటి ప్రభువైన మాకరాజు వేంకటపెరుమాళ్ళరాజు బహద్దరు ఆస్థానంలోని అష్టదిగ్గజాలలో ఒకరు. ప్రభువుల కోరికపైన 'వంశానుక్రమవర్ణనము'నే ఏకాశ్వాస గ్రంథం రచించారు. (ఆం.సం.సా)

**శ్రీశైల దీక్షితుడు**

కాలం : క్రీ. శ. 1809_1878 ప్రాంతం.

నామాంతరం : తిరుమలాచార్యులు.

రచన : శ్రీకృష్ణాభ్యుదయము. (తె వి స_8)

**శ్రీశైల మల్లికార్జున రత్న పంచకము**

కర్త : అనంతల సింగరశాస్త్రి (చూ).

(ఆం.సం.సా)

**శ్రీశైల మాహాత్మ్యము (అలభ్యం)**

కర్త : తెనాలి శ్రీగిరికవి.

ప్రత్యేకత : ఇందుమతీ కల్యాణ కావ్యకర్త తెనాలి రామభద్రకవి తన వంశ వృత్తాంతంలో ఈ రచన విషయం చెప్పారు. శ్రీగిరి కవి రామభద్ర కవికి తాత.

(ఆరుద్ర8_128)

**శ్రీశైల మాహాత్మ్యము**

నామాంతరం : పర్వత పురాణము.

కర్త : నాగలూటి శేషనాథుడు.

(క.స_287)

**శ్రీశైలము వేంకటార్యుడు**

కాలం : తెలియదు.

రచన : చంద్రాష్టోత్తరైక శతక స్తవమ్. (సం).

కవి అణ్ణయ దీక్షితుని పుత్రుడు ఇతని తెలుగు రచనలు తెలియరాలేదు.

(ఆం.సా.ప.ప-25-4)

**శ్రీ శ్యామలాంబ శతకము**

కర్త : మల్లికార్జున పండితారాధ్యుడు.

పెదన పట్టణంలో వెలసిన రామలింగేశ్వరస్వామి దేవేరి శ్యామలాంబపై చెప్పిన శతకం. "రామలింగేశ్వరస్వామి వామభాగ, చంద్రకళాలా సభాలంబ శ్యామలాంబ" అనే మకుటముంది పెడనపురీ లలామ అని కవి పార్వతీదేవిని సంబోధించాడు. ఇది తొలుత సాహిత్య పరిషత్పత్రికలలో ప్రకటితమైంది.

**శ్రీసతి శతకము**

కర్త : చూ. కొటికెలపూడి కోదండరామకవి.

లక్ష్మీస్తుతి రూపమైన రచన. 'శ్రీసతీ' అనే మకుటం ఉంది కవి దీనిలో రచనాకాలాన్ని కూడా చెప్పాడు. (ఆం.సం.సా-305)

**శ్రీ సుదర్శన నుతి (అలభ్యం)**

కవి . (చూ) ఆ సూరి మరింగంటి సింగరాచార్యులు.

కవి తన పదవయేట చెప్పిన కృతి. దీన్నే "చక్రలాంఛన విధి"గా కొందరు పేర్కొన్నారు. (ఆరుద్ర-8-282) (క.త-13-9)

**శ్రీ సూర్యనారాయణ శతకము**

రచనాకాలం : క్రీ. శ. 1850 ప్రాంతం,

కర్త : రుయ్యూమారుత సుబ్బకవి.

ఈ శతకం ప్రౌఢశైలిలో ఉంది. దేవతా వర్గంలో సూర్యుని ప్రాధాన్యము, దివ్యతేజము, శక్తి, ఆదిత్యుని మహిమ మొదలయినవి వర్ణితాలు, ఈ శతకం వ్రాసి కవి ఆరోగ్యవంతుడైనాడట. ఇతడు వేంకటసుబ్బకవిగా విఖ్యాతుడు.

(శ. సా. వి-204)

**శ్రీ సూర్యనారాయణ శతకము**

కర్త : చూ. మండపాక కామకవి.

ఇందులో అరసవిల్లిలో వెలసిన శ్రీ సూర్యనారాయణుని ప్రశంస ఉంది.

(ఆం. సం. సా-308)

**శ్రుతి రంజని (సం)**

కర్త : చెరుకూరు లక్ష్మీధరుడు.

ఇది జయదేవుని గీతగోవిందానికి వ్యాఖ్య. (తె. వి స-4)

**శ్రుతి సూక్తిమాల (సం)**

నామాంతరం : తత్త్వప్రకాశిక (చూ).
కర్త : శివలింగారెడ్డి.

**శ్రేష్ఠలూరి వేంకటార్యుడు**

కాలం : క్రీ. శ. 16 వ శతాబ్దం
స్థలం : అనంతపురం జిల్లా.
రచన : శ్రీనివాస విలాస సేవధి (ద్విపద).
గురువు : అప్పలాచార్యులు.

లక్ష్మీ కృష్ణమాచార్యుల పుత్రుడు. సంస్కృత ప్రాకృత ద్రావిడ భాషలలో పండితుడు. ఆ భాషలలో గ్రంథరచన చేశాడట. కాని వాటినిగూర్చి తెలియరాలేదు. స్వయంగా శ్రీ వేంకటేశ్వరుడే ఇతన్ని గ్రంథరచనకు ప్రోత్సహించి, కృతిని కోరి అంకితం పొందాడు. 'శ్రీనివాస విలాస సేవధి' లో ఈ కవి షడ్విధ ప్రాకృతులలో స్తోత్రాలు రచించాడు. (ద్వి. సా. చ-267)

**శ్లేష కావ్యము**

శ్లేష శబ్దాలంకారాలలో ఒకటి. ఒకే అనుపూర్విలో ఉన్న పదంనుంచి కాని, పదసమూహంనుంచి కాని అనేకార్థాలు కలగటాన్ని శ్లేష అంటారు. ఇది ఒకే పదానికి భిన్నార్థాలుండటం వల్ల గాని, భిన్న వ్యుత్పత్తులుండటం వల్ల గాని కలుగుతూ ఉంటుంది. పదవిభాగంలో భేదం వల్ల, సమాస భేదం వల్ల కూడా ఈ శ్లేష రావచ్చు.

సంస్కృత కవులు చాలామంది శ్లేషకావ్యాలు వ్రాశారు. తెలుగులో భట్టుమూర్తి వసుచరిత్ర శ్లేషకు పేరుపొందిన కావ్యం. అట్లే పింగళి సూరన్న రాఘవ పాండవీయము, రామరాజ భూషణుని హరిశ్చంద్ర నలోపాఖ్యానాలు శ్లేష కావ్యాలుగాను, ద్వ్యర్థి కావ్యాలుగాను పేరుపొందాయి. (తె. వి స-8)

**శ్వేతాచల మాహాత్మ్యము**

రచనాకాలం : క్రీ. శ. 19 వ శతాబ్ది పూర్వభాగం.
కర్త : చూ. కొటికెలపూడి వేంకట కృష్ణ సోమయాజి.
అంకితం : రాజా రాయణప్ప రంగారావు బహద్దరుకు.
నామాంతరం : శ్వేతక్షేత్ర మాహాత్మ్యము.

మూడాశ్వాసాల ప్రబంధం. రచన ప్రౌఢంగా ఉంటుంది.
(ఆం. సం. సా-303)

**షట్చక్రవర్తి చరిత్రము**

రచనా కాలం : క్రీ శ. 18వ శతాబ్దం.
కర్త : చూ. కామినేని మల్లారెడ్డి.
అంకితం : బిక్కనవోలులోని సిద్ధ రామలింగేశ్వరునకు.

ఎనిమిది ఆశ్వాసాల ప్రబంధం. దీనికి అవతారిక లేదు. ఇందులో సుప్రసిద్ధులయిన హరిశ్చంద్రాది చక్రవర్తుల చరిత్ర వర్ణితం. మొదటి మూడాశ్వాసాలలోని 288 పద్యాలలో హరిశ్చంద్రుని కథ ఉంది. తక్కిన ఆశ్వాసాలలో మిగిలిన అయిదుగురు చక్రవర్తుల కథలు వివరింపబడ్డాయి. ఇందులో "హరిశ్చంద్రుని" కథకు ఎక్కువ ప్రాధాన్యం ఉంది. దీనిలో కవి సంస్కృతాంధ్ర పాండిత్యం కనిపిస్తున్నది. కవి తనకున్న శబ్దశాస్త్ర పరిచయం చూపటానికి వ్యాకరణ పదాలను, అలంకారాలను, రీతులను కూడా శ్లేషలలో చేర్చి పద్యాలు వ్రాశాడు తాను శ్లేష కవినని సగర్వంగా చెప్పుకొన్నాడు.

ఈ కావ్యం "నవరసాలంకార వివిధ శబ్ద చాతురీధ్వని గుణపాక శయ్యలు" కలదిగా ప్రసిద్ధి చెందింది. ఏకాక్షర కందం, ద్వ్యక్షర కందం, తలకట్ల కందం, గుణ్ల కందం ఏత్వముల కందం, అచల జిహ్వా కందం, నిరోష్ఠ్య కందం మొదలగు చిత్రబంధపు కసరత్తులు ఇందులో కనిపిస్తాయి. తుపాకి, మైజారు, రుమాళ్ళు, హజారము మొదలగు అన్యదేశ్య పదాలు కూడా ఉన్నాయి. తెలుగు నానుడులు పలుకుబడులతో ఈ కావ్యం మిక్కిలి రసవత్తరంగా ఉంది.

ఇది ఆరాశ్వాసాల కావ్యమనీ, మొదటి మూడాశ్వాసాలలో హరిశ్చంద్రునికథ, మిగిలిన మూడాశ్వాసాలలో అయిదుగురు చక్రవర్తుల కథలు ఉన్నాయని కొందరు అంటున్నారు ఆశ్వాస విభజనం ప్రతి విలేఖకులు చేసి ఉండవచ్చును.

(తె.వి.స-6; ఆరుద్ర-5) (ఆం.సం.సా. 182, 184)

### షట్పది

జాతి పద్య భేదాలలో ఒకటి. కర్ణాటక వాఙ్మయంలో మిక్కిలి ప్రచారం పొందింది. కన్నడ యక్షగానాలలో దీనికి ప్రాచుర్య మెక్కువ. తెలుగులో కేవల ద్విపద కావ్యాలున్నట్లే కన్నడంలో షట్పదీ కేవలాలయిన కావ్యాలున్నాయి. దీని ప్రయోగం యక్షగానాలలో అతి విరళం. హిందూపురం నివాసియైన బాగేపల్లి అనంత రామాచార్యుల వారి యక్షగానాలలో ఇది ఎక్కువగా ఉపయుక్తం. (య.వా.చ.-279)

### షట్ప్రిత్యయ ప్రస్తార సరణి

రచనాకాలం : క్రీ. శ. 17 వ శతాబ్ది మధ్యభాగం.
కర్త : గణపవరపు వేంకటకవి.

సర్వలక్షణ శిరోమణిలోని చతుర్థోల్లాసమే ఈ పేర ప్రసిద్ధమైంది.

(ఆరుద్ర-11-181)

### షడర్థ నిర్ణయము (అలభ్యం)

కర్త : కవి రాక్షసుడు.

ఇది నిఘంటువట. (తె.వి.స-6)

### షడ్భాషా చంద్రిక (సం)

కర్త : పెరుమాళ్ళ లక్ష్మీధరుడు.

ఇది ప్రాకృత భాషా వ్యాకరణం. (తె.వి.స-4)

### షడ్భాషా వివరణము (అలభ్యం)

కవి : ఎలకూచి బాలసరస్వతి (చూ).

శాస్త్ర గ్రంథం. ఆరుభాషలలోనూ కవికున్న శాస్త్ర వైదుష్యాన్ని ప్రతిఫలింప జేసే ఈ గ్రంథం లభించలేదు. (ఆరుద్ర-10)

### షణ్ముఖ సహస్రము

రచనాకాలం : క్రీ. శ. 18 వ శతాబ్దం.
కవి : (చూ) సీనయకవి.
అంకితం : కుమారస్వామికి.

పద్యకావ్యం. తిరుచెందూరు క్షేత్రంలో వెలసిన కుమారస్వామికి అంకితంగా వేయిన్ని ఎనిమిది పద్యాలున్నాయి. నూరేసి పద్యాలు ఒక భాగంగా ఉన్నాయి. ఇది కేవలం కృతినాయక పరంగా కాక, లోకనీతులు, పురాణ గాథలు, శాస్త్రచర్చలు అన్నీ ఇమిడి ఉన్న కృతి. కొన్ని పద్యాలు ప్రసిద్ధ సంస్కృత శ్లోకాలకు అనువాదాలు. కవిత్వం విశిష్టం కాకపోయినా సరళంగా ఉంది. (వ.దే.వా-404)

### షష్ఠ్యంతము

చూ. మంగళము

### షోడశ కుమార చరిత్ర

కర్త : వెన్నెలకంటి అన్నయ.
అంకితం : వెన్నెలకంటి సూరామాత్యునికి (కవి తండ్రి).

కథా కావ్యం. పూర్తిగా లభించలేదు. ఈ కావ్యం కేతన దశకుమార చరిత్ర, మంచన కేయూర బాహు చరిత్రల పద్ధతిలో ఉన్నది. ఆనాటి సామాన్య ప్రజలకు సిద్ధులు యోగులు చేసే మహిమలపట్లగల విపరీతమైననమ్మకాన్ని ఇందులో చూడవచ్చు. దీనిలోని పద్యాలను వేతాళ పంచవింశతి లోనివిగా చిన్నయసూరి పేర్కొన్నారు. రచన రసవంతంగా విస్పష్టంగా ఉంది. (తె. రా. ప.)

### షోడశ మహా దానములు

తెలుగు కవులు, దానశీలురైన రాజులను వర్ణించేటప్పుడు తరచుగా "గడియలో పదునారు దానాలు చేసిన మహాసీయులు"గా వారిని పేర్కొంటుంటారు. ఆ పదహారు మహాదానాలు ఇవి.

1. బ్రహ్మాండ దానము 2. విశ్వచక్ర దానము 3. ఘట దానము 4. మహా భూత దానము 5. రత్నధేను దానము 6. సప్త సముద్ర దానము 7. కల్పవృక్ష దానము 8. కాంచన కామధేను దానము 9. స్వర్ణభూమి దానము 10. హిరణ్యాశ్వరథ దానము 11. తులా పురుష దానము 12. గో సహస్ర దానము 13. హేమాశ్వ దానము 14. హేమ గర్భ దానము 15. కనక కరిరథ దానము 16. పంచలాంగలీ దానము.

పై వానిలో 1, 2, 4, 6, 7-సంఖ్యగల దానాలు చేసేటప్పుడు వాటికి తగిన ధనం దానంగా ఇస్తారు. తక్కిన దానాల విషయంలో బంగారుతో చేసిన ఆయా వస్తువులు దానంగా ఇవ్వాలి. తులా పురుష దానమంటే తాను తులాభారం తూగి, త్రాసులో ఒక వైపు తాను, వేరొక వైపు తన యెత్తు ధనము ఉంచి ఆ ధనమంతా దానం చేయడం.

ఈ షోడశ మహా దానాలను ఒక గడియలో చేయడం దుర్ఘటమైన కార్యం. అనవేమారెడ్డి, రఘునాథ నాయకుడు, విజయరాఘవుడు మొదలగువారు ఈ దానాలు చేశారట.

## షోడశ రాజ చరిత్రము (అలభ్యం)

కర్త : చూ. అమరూరి నరసింహ భట్టు.
రచనాకాలం : క్రీ. శ. 1560కి ముందు.

ఈ కావ్యంలోని ఒక పద్యాన్ని పెదపాటి జగ్గన్న "ప్రబంధ రత్నాకరం"లో ఉదాహరించాడు (క. స-105)

## సంకలన కావ్యము

అనేకమంది కవుల కావ్యాలలోనుంచి కొన్ని పద్యాలనుగాని శ్లోకాలనుగాని గ్రహించి కూర్చిన గ్రంథాన్ని సంకలన గ్రంథం అంటారు. ఈ సంకలన గ్రంథాలలో సంకలనకర్త రచనలుకూడా ఉండవచ్చు. కవులు వివిధ కాలాలకు చెందినవారు కావి సమకాలికులుకాని కావచ్చును. సంకలన గ్రంథంలోనికి గ్రహింపబడ్డ అంశాలలోకూడా వైవిధ్యం ఉండవచ్చు.

ఈ గ్రంథాలవల్ల కవుల కాలాలను, వారు వ్రాసిన శ్లోక, పద్యాలను, నష్టమైన రచనలను, కవుల పేర్లను తర్వాతి కాలంలోనివారు తెలుసుకొనే అవకాశం ఉంది. కవులు ఏ శీర్షికంపై ఏ భావాలను కల్పించారో, వారు ఏ రకమైన రచనా పాటవం ఉన్నవారో ఈ సంకలనగ్రంథం ద్వారా తెలుస్తుంది. ప్రాకృతంలోని శాలివాహన గాథా సప్తశతి ఇలాంటి సంకలన గ్రంథమే. మడికి సింగన సకలనీతి సమ్మతము, పెదపాటి జగ్గన ప్రబంధ రత్నాకరం తెలుగులో ప్రాచీన సంకలన గ్రంథాలు. వీటి ప్రయోజనం అపారం. (తె. వి. స-6)

## సంకల్ప సూర్యోదయము

కర్త : చూ. రాజా రాయడప్ప రంగారావు బహద్దరు.
అంకితం : వేణుగోపాలస్వామికి.

ఆంధ్రీకృత రచన. మూలం సంస్కృతభాషలో ఉంది. విశిష్టాద్వైత సిద్ధాంత సారాన్ని బోధించే రచన. తార్కికసింహ వేంకటనాథ వేదాంత దేశికులు సంస్కృతంలో 'సంకల్ప సూర్యోదయ' మనే పది అంకాల రూపకం వ్రాశారు. పంచవిధ శారీరక శాస్త్రార్థం ఇందులో వివరింపబడింది. దీన్ని యథామూలంగా గద్య పద్య సమ్మిళితం చేసి 10 అధ్యాయాలతో తెలుగులో రచించాడు.

గరిమెళ్ళ సుబ్బయ్యకవి, ఈ రచలో రంగారావు బహద్దరుగారికి తోడ్పడ్డాడట.
(ఆం. సం. సా-302)

## సంకీర్తన లక్షణమ్ (సం)

కవి : తాళ్ళపాక అన్నమాచార్యులు.

ప్రత్యేకత : తెలుగు పాటలకు సాహిత్యగౌరవం ఇవ్వటానికి సంస్కృతంలో రాసిన గ్రంథం. కవి ఉభయభాషా పండితుడు. పంచరాత్రాగమ సార్వభౌముడు. సంగీత నీతి చంద్రిక, సంగీతచూడామణి, సంగీత సుధాకరం, భరత శాస్త్రం మొ॥ గ్రంథాల్లో చెప్పిన పదలక్షణాలను పూర్తిగా పరిశీలించి దీన్ని వ్రాశాడు. (అరుద్ర-6)

## సంకీర్తన లక్షణము

కర్త : తాళ్ళపాక చిన తిరుమలాచార్యుడు.

ప్రత్యేకత : లక్షణగ్రంథం. అన్నమయ్య సంస్కృతంలో వ్రాసిన సంకీర్తన లక్షణాలు తెలుగులో సమగ్రంగా ఇందులో ఉన్నాయి. చంపులు, ఏలలు, ధవళములు, అర్ధ చంద్రికలు మొ॥ దేశిచ్ఛందోరచనలకు తెలుగులో వెలసిన ఏకైక లక్షణ గ్రంథమిది. (తె. వి. స-4)

## సంకీర్తనలు

చూ. కీర్తనలు, పదములు.

సంగీత కవితాశాఖకు చెందిన గేయరచనలు. ఇవి యక్షగానాలలో ప్రయుక్తం, సంకీర్తనలు, కీర్తనలు ఇంచుమించు ఒకే కోవకు చెందినవి. యక్షగానాలలో రేకులో, పదాలో, దరువులో ఉండవలసినచోట ఇవి ఉంటాయి. ఇవన్నీ ఒకేపాదునుంచి ప్రాకినతీగలు.

కీర్తన ఒక ముక్తక రచనఅని, పదం కుంతకం వంటిదని, రేకుతాళనిబద్ధతతో పాటు ఛందోనిబద్ధత కలదని- ఈ కోవకు కీర్తనలు- సంకీర్తనలు చెందుతాయని, పండితులంటారు. భగవన్నామ గుణావికాలను కీర్తించటంవల్ల వీటికి సంకీర్తనలని పేరు వచ్చింది. సంకీర్తన శబ్దమునే పదవాచక పర్యాయమని, సంప్రదాయం అతి ప్రాచీనమని స్పష్టమవుతుంది. తాళ్ళపాకవారు పెక్కు సంకీర్తనలకు కర్తలు.
(య. వా. చ-317-320)

## సంకుసాల నృసింహ కవి

కాలం : క్రీ. శ. 16 శతాబ్ది.
స్థలం : కడప మండలం.
గురువు : భట్ట పరాశరుడు.
రచన : కవికర్ణ రసాయనము. (మాంధాతృ చరిత్ర.)

విశేషాలు : ఈయన అష్టదిగ్గజాలలోని వాడు కాకపోయినా వారిలో కొందరికైనా సమకాలికుడు కావచ్చు. తాళ్ళపాక నరసింగన్న అనే అన్నమాచార్యుని కుమారుడే ఈ "నృసింహకవి" కావచ్చునని వేటూరి ప్రభాకరశాస్త్రి సందేహాన్ని వెలిబుచ్చారు. తన

కావ్యంలోని శృంగారరస వర్ణనం వింటే యతి అయినా పిటుడవుతాడని ఈ కవి చెప్పు కొన్నాడు.

అల్లసాని పెద్దన ద్వేషభావంతో ఈ కవికి రాయల అస్థానప్రవేశం నిరాక రింపచేశాడని, ఈ కవి పేదవాడు కావటంవల్ల తన 'కవికర్ణ రసాయనాన్ని' విపణివీధిలో అమ్ముకున్నాడని, రాయల కుమార్తె మోహనాంగికి ఆ కావ్యంలోని కొన్ని పద్యాలు దొరికితే, వాటిని ఆమె తండ్రికి చూపితే, రాయలు ఆ కవితనుమెచ్చి నృసింహకవికి కబురు పంపాడనీ, అప్పటికే కవి శ్రీరంగం చేరుకొని శ్రీరంగ పట్టణాధిదేవతకు తన కావ్యం కృతి ఇచ్చాడనీ, ప్రబలమైన జనశ్రుతి ఉంది. ఈ కవి తన కృత్యాదిలో రాజులను, కుకవులను చాలా తీవ్రంగా నిందించాడు. ఈతని కవిత ప్రౌఢమై రసవంతంగా ఉంటుంది. (తె.వి స-4,6; ద.భా.చ-K.A.N.శాస్త్రి)

## సంగీత కళానిధి

కర్తలు : తచ్చూరు సింగరాచార్యులు-చినసింగరాచార్యులు.

శాస్త్రగ్రంథం. (తె వి. స-4-1194)

## సంగీత చింతామణి (అలభ్యం)

కర్త : చూ. పెదకోమటి వేమారెడ్డి.

శాస్త్రగ్రంథం. (రె. రా. చ)

## సంగీత లక్షణమ్ (సం)

కర్త : తాళ్ళపాక అన్నమాచార్యులు.

గ్రంథకర్త మంచిపండితుడు. అనేక శాస్త్రగ్రంథాలు పరిశీలించి ఈ గ్రంథం రచించాడు. (క. త. 6)

## సంగీత శాస్త్రప్రబంధము

నామాంతరం : రాగతాళ చింతామణి.

కర్త : పోలూరి గోవిందమంత్రి (తె. వి. స-4)

## సంగీత సారమ్ (సం)

కర్త : విద్యారణ్యుడు.

(తె. వి. స-4)

## సంగీత సారసంగ్రహము

కర్త : చూ. మతుకుమల్లి నరసింహశాస్త్రి.

సంగీతశాస్త్రానికి సంబంధించిన తెలుగురచన. (ఆం. ర-20)

## సంగీత సుధ (సం)

రచనాకాలం : క్రీ. శ. 1600 ప్రాంతం.

కవి : రఘునాథ నాయకుడు.

సంగీత శాస్త్రగ్రంథం. తన ఆస్థాన పండితమండలి అభ్యర్థింపగా రఘునాథుడు దీన్ని రచించాడట. ఈ గ్రంథకర్తృత్వాన్ని గురించి వివాదం ఉంది. దీన్ని రఘునాథుని మంత్రియైన గోవిందదీక్షితుడు రచించాడని కొందరూ, ఇరువురూ కలసి రచించారని కొందరూ, గోవిందదీక్షితుడు రచిస్తే రఘునాథుడు తనపేరు పెట్టుకున్నాడని కొందరూ అంటున్నారు. గోవిందదీక్షితుడు రచించినట్లు చెప్పబడుతూన్న గ్రంథం పేరు సంగీత సుధానిధి అని చతుర్దండి ప్రకాశిక (135)లో వేంకటమఖి చెప్పాడు. అది నేడు అలభ్యం. ఈ రెండూ వేర్వేరు గ్రంథాలు కావచ్చు.

ఈ గ్రంథాన్ని పి. యస్. సుందరయ్యరు సంగీత పరిషత్పత్రికలో ప్రకటించారు. (తం. అం. నా-13)

## సంగీత సుధాకరమ్ (సం)

రచనాకాలం : క్రీ. శ. 1384- 1399 ప్రాంతం.

కర్త : సర్వజ్ఞ సింగభూపాలుడు.

సంగీత శాస్త్రగ్రంథం. ఇది శార్ఙ్గదేవుని సంస్కృత సంగీత రత్నాకరానికి వ్యాఖ్యానమట. (ఆరుద్ర-3-4)

## సంగీత సుధానిధి (అలభ్యం)

కర్త : గోవింద దీక్షితుడు.

కాలం : క్రీ. శ. 1600 ప్రాంతం.

సంస్కృత గ్రంథం. తంజావూరు పాలకుడైన రఘునాథుడు రచించినట్లుగా చెప్పబడుతున్న సంగీత సుధ, ఈ సంగీత సుధానిధి ఒక్కటేనని కొందరి అభిప్రాయం. కాని ఇవి భిన్నగ్రంథాలు. (తం. అం. నా-13)

## సంగీత సూర్యోదయమ్ (సం)

నామాంతరం : లక్షణ భరతము.

కర్త : బండారు లక్ష్మీనారాయణ.

అంకితం : శ్రీకృష్ణదేవరాయలకు.

సంగీత శాస్త్రగ్రంథం. శ్రీకృష్ణదేవరాయలు, మధ్వయతి కృష్ణాచార్యుల దగ్గర వీణా వాదనం నేర్చాడట. సంగీత శాస్త్రావగాహన కలవాడైన ఆ ప్రభువుకు ఇంపుగా కవి ఈ గ్రంథాన్ని తీర్చిదిద్దాడు. (తె.వి.స-4)

## సంగ్రహ రామాయణమ్ (సం)

నామాంతరం : రాఘవ చరితమ్.

కర్త : వంచిరత్నకవి.

## సంఘాతకము (సంఘాతము)

చూ. బంధకావ్యం

ఇది శ్రవ్యకావ్య భేదం.

## సంఘాతము (సంఘాతకము)

చూ. ఖండకావ్యం.

## సంజవర్ణన (అలభ్యం)

కర్త : మల్లికార్జున పండితుడు.
కాలం : క్రీ. శ. 1150 ప్రాంతం.
శైవమత ప్రతిపాదకమైన రచన. (శ.స-163)

## సంజీవనీ వ్యాఖ్య (సం)

కర్త : కోలచల మల్లినాథ సూరి.

సంస్కృతంలో కాళిదాసు వ్రాసిన రఘువంశ, కుమార సంభవ, మేఘ సందేశ కావ్యాలకు ఇది మనోహరమైన వ్యాఖ్య. (తె. వి. స-4)

## సంజీవిరెడ్డి

కాలం : క్రీ. శ. 18, 19 శతాబ్దుల మధ్యకాలం.
స్థలం : బళ్ళారి మండలం.

జొహరా పురాధిపతి. సాహిత్య పోషకుడు. పరకంఠ గురురాజకవిని ప్రోత్సహించి అతని "శేషధర్మములు" అంకితం పొందాడు. (శ. స-57)

## సంతాన సాగరము (వారిధి)

ఇది కొండవీటి సమీపంలోని ఫిరంగిపురం దగ్గర ఉన్న ఒక చెరువు. దీనిని పెద కోమటి వేముని భార్య సూరాంబిక తవ్వించింది. ఈ చెరువు త్రవ్వకం పెదకోమటి వేముని కాలంలోనే పూర్తి అయినా నీరు రావడానికి ఏర్పాటు చేసిన కాలువ అనంతర కాలంలో పూర్తయింది.

తన తల్లి సూరాంబ కట్టించిన 'సంతాన వారిధి' అనే చెరువుకు నీరు రావటానికి రాచ వేమారెడ్డి క్రీ శ. 1415లో "జగదొబ్బగండ"కాలువను త్రవ్వించినట్లు తెలిపే శాసనం ఒకటి లభించింది. (తె.వి స-3)

## సందానితకము

శ్రవ్యకావ్యభేదం. క్రియా సమాప్తికోసం పరస్పరాపేక్ష ఉండే మూడు పద్యాల సమూహము. దీనిని అప్పకవి త్రికమన్నారు కాని అక్కడ పరస్పరాపేక్ష లేదు. ఇక్కడ ఉంటుంది. క్రియ మూడో పద్యంలో ఉంటుంది. (తె.వి.స-6)

## సందిగ్ధ తత్త్వ రాద్ధాంతము

కర్త : చూ. వెలుగోటి సర్వజ్ఞకుమార యాచేంద్రులు (1832-92).

శిష్ట వ్యావహారిక భాషలో ఉన్న తాత్త్వికరచన. తాత్త్విక ప్రపంచంలో అస్తినాస్తి విచికిత్సలలోనైన దేవుడు, జీవుని స్వతంత్రత, పునర్జన్మ, మోక్షం, జగత్తు మొదలగు అనేక తాత్త్వికాంశాలు ఇందులో వివరింపబడ్డాయి. (అం.సం.సా.-461)

## సందేశ కావ్యము

సందేశ కావ్యం ప్రాయికంగా లఘుకావ్యం. రామాయణంలో హనుమత్సందేశ భాగాన్ని సందేశ కావ్యాలకు అంకురార్పణగా భావించవచ్చు. తరువాత కాళిదాసు మేఘ సందేశకావ్యం సందేశ కావ్యాలకు ఆదర్శ ప్రాయమైనది. ఈ సందేశాన్ని అనుకరించి, అవలంబించి, చాలా మంది కవులు సందేశ కావ్యాలు వ్రాశారు.

సందేశ కావ్యాలన్నింటిలోనూ విప్రలంభ శృంగారం ప్రధాన రసం. విప్రోషిత యైన ప్రియురాలికి వియోగ భారవ్యథితుడయిన ప్రియుడు మేఘ శుకాదులద్వారా సందేశం పంపడం సాధారణంగా ఇందులో ఉంటుంది. ఈ కావ్యాలన్నీ మేఘ సందేశానికి ప్రత్యక్షంగా కాని పరోక్షంగాకాని పుత్రికలనవచ్చు.

## సంపంగి మన్నారు సాంగత్యము (అలభ్యం)

కాలం : క్రీ.శ. 16వ శతాబ్దం.

కర్త : విజయరాఘవ నాయకుడు.

మన్నారుగుడి రాజగోపాలస్వామినే "సంపంగి మన్నారు" అని అంటారు ఆ స్వామిపై భక్తుడు చేసిన రచన ఇది. సాంగత్య రచనలు కన్నడ వాఙ్మయంలో ఉన్నాయి. తెలుగులో ఈ "సాంగత్య రచనలు" దక్షిణ దేశీయాంధ్ర వాఙ్మయంలోనే కనిపిస్తున్నాయి. దేశీ ఛందస్సుకు చెందిన రచన. ఇది యక్షగాన రచనా భేదం అని కొందరంటున్నారు. కన్నడం లోని సాంగత్య రచన రెండు పాదాలతో ఉంటుంది. తెలుగు లోని ద్విపదకన్నా ఒక మాత్ర ఎక్కువ. (ద.దే.వా. పీఠిక_89_151)

## సంపగిమన్న శతకము

నామాంతరం : మన్నారు శతకము.

రచనా కాలం : క్రీ.శ. 18వ శతాబ్దం.

కర్త : పరిమానంది తిప్పడు (చూ).

ఎక్కువగా కంద పద్యాలున్నాయి. చంపకారణ్య క్షేత్రంలో వెలసిన మన్నారు దేవుడే సంపంగి మన్నారు (రాజగోపాలస్వామి). అతనిపై చెప్పిన అద్వైత మత సంప్రదాయ ప్రధానమైన శతకం ఇది. విశేష ప్రచారాన్ని పొందింది. లోకోక్తులు, తెలుగు పలుకుబడులు చక్కగా కూర్చిన రచన. సద్గురు దీక్షవిధి లేనివారికి తనలోని బ్రహ్మము బీరకాయ పిక్కవలె తోస్తుందనీ, యోగశాస్త్ర మర్మాలను తెలుపడానికి గురుబోధ తోడ్పడుతుందనీ, కపటగురువు మోక్షమార్గాన్ని చూపలేడనీ కవి ఇందులో స్పష్టం చేశాడు. ఈ శతకంలో కవి చౌడప్ప, సుమతీ శతక పద్యాల పోకడలున్నాయి.

(ద.దే.వా. – 296: శ.సా.వి_314)

## సంబతిఘులు అప్పలాచార్యులు

కాలం : క్రీ.శ. 18వ శతాబ్దం.

స్థలం : శుక్రపీడు గ్రామం.
రచన : ధరాసాగరేశ చరిత్రము.

ఇతడు వేంకటాచార్యుల కుమారుడు. శుక్రపీడు గ్రామం హైదరాబాదు మండలంలోని హుజూరు నగరానికి చేటివనే ఉన్నదట. (క.న-14)

## సంవరణ చరిత్ర

కర్త : చదలువాడ మల్లన (నిర్ధారణ కాలేదు).
కృతిపతి : మాకరాజు లక్ష్మీపతిరాజు (కార్వేటి సంస్థానం).

విశిష్టత : చదలువాడ మల్లన తన విప్రనారాయణ చరిత్రను మాకరాజు తిమ్మరాజుకు అంకిత మిచ్చాడు. అందులో తిమ్మరాజు తమ్ముడు లక్ష్మీపతిరాజు "సంవరణ చరిత్ర"కు కృతిభర్త అని చెప్పాడు. ఆ 'సంవరణ చరిత్ర'ను బహుశా ఈచదలువాడ మల్లన్నే వ్రాసి ఉంటాడని కొందరు పరిశోధకులు భావిస్తున్నారు
(విప్ర.నా.చ-I-46) (ఆరుద్ర-8-138-139)

## సంసార మాయాస్తవము (అలభ్యం)

రచనాకాలం : క్రీ. శ. 1150 ప్రాంతం.
కర్త : మల్లికార్జున పండితుడు.

శైవమత ప్రతిపాదకమైన రచన. (క.న-163)

## సంస్కృతంలో ప్రశస్తి ఉన్న తెలుగు శాసనాలు

కాలం : క్రీ. శ. 6, 7, 8 శతాబ్దాలు.

ప్రాచీన తెలుగు శాసనాలలో కొన్నిట, రాజుల ప్రశస్తి సంస్కృత సమాస భూయిష్ఠంగా కనిపిస్తున్నది.

'సమర సజ్జట్టణోప లబ్ధ జయలక్ష్మీ సమాలింగిత వక్షస్థల' అని వైదుమ్బులు, "జగత్రయాభివన్దిత సురాసురాధీశ పరమేశ్వర ప్రతిహారీ కృత మహాబలి కులోద్భవ,"అని బాణరాజులు చెప్పుకొనేవారు. కాని రేనాటి చోళులు మొదట్లో ప్రశస్తులే చెప్పుకోలేదు. "స్వస్తిశ్రీ చోళమహారాజుల్లేళన్" "ఎరికల్మతురాజు ధనంజయుదు రేనాణ్డు ఏళన్" అంటూ ప్రారంభం చేసి, శాసన విషయం చెప్పేవారు. తరవాత "పృథివీ వల్లభ విజయాదిత్య చోడమహారాజుళ్"అని 'పృథివీ వల్లభ'అని మాత్రమే చెప్పుకొన్నారు. కొంతకాలం తరవాత అంటే క్రీ. శ. 9 శతాబ్దిలో "చరణ సరోరుహ విహిత విలోచన త్రిలోచన ప్రముఖాఖిల, పృథ్వీశ్వర కారిత కావేరీతీర, కరికాల కులరత్న ప్రదీప, అహితాంకుశ" అనే ప్రశస్తిని మొదలు పెట్టారు. 6, 7, 8 శతాబ్దాలలోని ప్రాచీన చోళ శాసనాలు అతి క్లుప్తంగా చిన్న చిన్న తెలుగు పదాలతోనో, సంస్కృత-ప్రాకృత తద్భవాలతోనో ఉండేవి. వీటిలో గ్రామ నామాలు,కొన్ని బిరుదులు,రెండు మూడు పదాలు సమాసాలుగా ఉండేవి. ఉదా: కాణ్డికొణ్డ, కాడ్ల జేవ, చియ్యంబ్రోలు, తర్కుపుద్రోలు, ఊరిస్వామున్, పేనూణ్డు, పెట్టనధి,ఇన్నల్వూరు,పొలంగరుపు,రట్టుగుళ్ళు,రాచమానుంబ,వీరుణ్డయ్యమొ॥నవి.

ఈ క్రింది శాసనాలలో సంస్కృత సమాసాలను యథాతథంగా వాడుకోవడం చూడవచ్చు.

ఉ: 1. "పరువశర్మ పుత్ర విన్న శర్మణాకు పెర్వాణ వంశ భుజంగది భూపాదిత్యులు" (అరకట వేముల శాసనం).

2. "కౌణ్డిల్య గోత్రస్య పెన్నాఉరేవ శర్మణ పుత్రస్య అగ్గి శర్మ్మారికిచ్చిన వత్తి (వాములూరి శాసనం). (తె. శా. ప.; శా. 8, 9)

## సంస్కృత ప్రాకృత శాసనాలు-గ్రామ నామాలు

శాతవాహనుల కాలం నుంచి క్రీ. శ. 7వ శతాబ్దం వరకు దొరికిన ప్రాకృత-సంస్కృత శాసనాలను పరిశీలిస్తే వానిలో చాలా తెలుగు పదాలు దొరికాయి. "విరిపలి, పాండూర, కండూర, చిల్లరిగె, కొలవాల, దాలూర, తాటికొంట, అంతుకొక్కుర, ఒంగోడు, వేంగీ, ఏలూరు, కురవక, అలుకొండె, గుడ్డూర, చెంచెలుప, కంబురాం చెఱువ, చిన్న పుర, పెంచుకలూర, కారుచేడు, కడాకుదురు, పెణుకపఱ్ఱు, పేరువాడ" ఇవి అన్నీ గ్రామ నామాలు.

ఈ పదాలు సంస్కృత-ప్రాకృత పదాలు కాదు. ఈ పేర్లున్న గ్రామాలు తెలుగు దేశంలో నేటికీ కొన్ని ఉన్నాయి. కొన్నిటి పేర్లు కొంచెం మారాయి. విప్పర్తి, కండూరు, చిల్లరిగె, దాలూరు, తాటికొండ, అతుకూరు, ఒంగోలు, చిన్నాపురము అనే గ్రామాలు నేటికీ నిలిచి ఉన్నాయి. ప్రజల నిత్య వ్యవహారంలో, తెలుగు పేర్లు గ్రామ నామాలుగా ఉన్నాయని స్పష్టంగా తెలుస్తున్నది. కొన్ని సంస్కృత శాసనాలలో తెలుగు పేర్లను సంస్కృతంలోకి మార్చి వ్రాసినట్లు గమనించవచ్చు. "చేంబ్రోలు" అనే తెలుగు పేరును, "తామ్రపురి" "శోణిపురి" అని, "కొలను" గ్రామాన్ని "సారసపురి" అని మార్చిన ఉదాహరణలు శాసనాలలో దొరుకుతున్నాయి.

శోణపురి అంటే ఎఱ్ఱని గ్రామమని అర్థం. చేంబ్రోలు అనే పదానికి అదే అర్థం. ఎఱ్ఱపాలెము, ఎఱ్ఱదుర్తి అనే గ్రామ నామాలకు "శోణిపురి" అనే పదం సమానార్థకం అవుతుంది. పేర్లను అట్లే, అవి పుట్టిన భాషలో ఉన్నట్లే వాడకుండా, ఇతర భాషలోకి అనువదించటంవల్ల కలిగే చిక్కులను మనసులో ఉంచుకొని-పొలాల పేర్లు వాటి హద్దులు, సీమలను వ్రాసేటప్పుడు "దేశీయత" చెడకుండా వాటిని అట్లే ఉంచారు. క్రీ. శ. 7వ శతాబ్ది నుండే శాసనాలలో కనిపించే పై పేర్లను బట్టి అప్పుడు తెలుగు దేశంలో తెలుగు వ్యవహారంలో ఉన్నదని నిశ్చయంగా చెప్పవచ్చు. (తె. వా.)

## సంస్కృత, ప్రాకృత శాసనాలు-వ్యక్తి నామాలు

క్రీ శ. 700 ముందు లభించిన సంస్కృత, ప్రాకృత శాసనాలలో కొన్ని తెలుగు పదాలు కనిపిస్తున్నాయి. గోలశర్మ, కొట్టిశర్మ, బొట్టిస్వామి, అగ్గిజ (అగ్గయ్య) మొదలగు వ్యక్తుల నామాలలోని పూర్వ భాగం తెలుగు శబ్దం. కొన్ని బిరుద పదాలు కూడా తెలుగు సామీప్యాన్ని బలపరుస్తున్నాయి. ఉదాహరణకు మహాతలవర, మహాతగవర

మొదలైనవి "తలవర" శబ్దం ఇప్పుడు "తలారి"గా మారి, నిత్య వ్యవహారంలో సేవార్థంలో ఉంది. ప్రాచీన కాలంలో పై పదానికి సేనాపతి, నాయకుడు అనే అర్థాలుండేవి. అట్లే తగవర బిరుదు శబ్దం "న్యాయాధీశుని" సూచిస్తుంది. ఈ శబ్దాలన్నీ క్రీ. శ. 700 నాటికే తెలుగు నాట జన వ్యవహారంలో బహుళంగా ఉండటంచేత అవే శాసనాలలో ప్రయుక్తమైనట్లు నిశ్చయించవచ్చు. (వా. ప; సా. చ. సం.)

## సంస్కృతము

ప్రాకృతభాషను సంస్కరించగా ఏర్పడినభాష సంస్కృతము. ఇదే దేవభాషగా ప్రసిద్ధం.

## సకల కథాసార సంగ్రహమ్ (అలభ్యం)

కర్త : చూ. శ్రీకృష్ణదేవరాయలు.

ఆముక్తమాల్యదలో ఈ కావ్యప్రసక్తి ఉంది. (తె. వి. ప-6)

## సకల కథాసార సంగ్రహము

రచనాకాలం : క్రీ. శ. 16 వ శతాబ్దం.

కర్త : అయ్యలరాజు రామభద్రుడు.

ఇది శ్రీకృష్ణదేవరాయల రచనకు ఆంధ్రీకరణమట. గ్రంథం పూర్తిగా లభించ లేదు. తొమ్మిదవ ఆశ్వాసంలో కొంతభాగం మాత్రం లభించింది. కవి దీనిని రాయల కాలంలోనే తెనిగించడానికి పూనుకొన్నాడనీ, ఆంధ్రీకరణం పూర్తికాకమునుపే రాయలు మరణించాడనీ కొందరంటారు.

ఈ రామభద్రుడు రాయలకాలంలోనివాడు కాడనీ ఇతడు ఘట్టుపల్లి రామభద్రుడనీ కొందరి తలంపు. (క. ప-192)

## సకల జన సంజీవనము

కర్త : సాయప వేంకటాద్రినాయకుడు (చూ)

అంకితం : వేంకటరమణునికి.

అయిదాశ్వాసాల వైష్ణవప్రబంధం. భగవద్రామానుజులవారి చరిత్రం ఇందలి ఇతివృత్తం. కవికి అచ్చతెనుగు రచనలో గల ప్రావీణ్యం ఈగ్రంథంలో కనిపిస్తుంది. పూర్వకవి సంస్మరణ కుకవి నింద మొదలైనవి లేవు. ఇష్టదేవతా ప్రార్థనానంతరం చూపాటి ప్రభువుల వంశవర్ణన విపులంగా ఉంది

ఈ కృతిమొత్తం 154 కమ్మలపైన వ్రాయబడింది. అత్యంత శిథిలావస్థలో ఉంది. మొత్తం 995 గద్యపద్యాలతో కూడిన ప్రౌఢతరకావ్యం. (మ. మా.)

## సకల జనాభిరామము

నామాంతరం : ప్ర : భిరామము (చూ)

కర్త : నూతనకవి సూరన.

(క. ప-298)

## సకల జీవన సంజీవనము (అలభ్యం)

కర్త : చిత్రకవి అనంతకవి.

(అయ్యద్ర-9)

## సకల నీతి కథానిధానము

కర్త : పూచిరాజు ఎర్రన.

కాలం : క్రీ. శ. 1450-1500 ప్రాంతం.

అంకితం : తిరుపతి వేంకటేశ్వరస్వామికి.

కుంటముక్కల పినభైరవ మంత్రి కోరికపై కవి ఈ రచన చేశాడు. ఐదాశ్వాసాలున్నాయి. దీనిలోని కథలన్నీ నారదుడు బలిచక్రవర్తికి చెప్పినట్లు కవి కల్పించాడు. ప్రథమాశ్వాసంలో విక్రమార్క చరిత్ర, ద్వితీయాశ్వాసంలో భేతాళ పంచ వింశతి, కేయూరబాహుచరిత్ర, తృతీయాశ్వాసంలో పంచతంత్రకథలు ఉన్నాయి. చతుర్థాశ్వాసంలో కవి దశకుమార చరిత్రలోని 125 నీతిపద్యాలు చొప్పించాడు. పంచమాశ్వాసంలో కథా సరిత్సాగరంలోని కథలు కొన్ని చెప్పారు. సంస్కృతమూలం నుంచే కాక తెలుగు కావ్యాలలో నుంచీ కొన్నింటిని తీసుకున్నాడు. కేయూరబాహు చరిత్రలో మంచన నీతి కథలను ఈ కవి యథాతథంగా అనుకరించాడు. సుకవుల రచనలు శిలాక్షరాలని, కుకవుల రచనలు జలాక్షరాలని చెప్పారు. ఇందులోని కొన్ని పద్యాల రచనలో బద్దెనను, సుమతి శతక కర్తను కవి అనుసరించాడు. చిత్ర, మధుర, బంధుర కవితలను పేర్కొన్నాడు. విశేషవృత్తాలను వాడాడు. అవి, వీరభద్రభూషణం, కవిరాజితం, నందన(రగడ) (మధుర గతి రగడ), దోదకం, (పాదపం, తోదకం, అనబడే దోదకవృత్తం,) గర్భకవిత్వానికి సంబంధించిన చతుర్విధవృత్తం మొదలైనవి. (అరుద్ర-6-95)

## సకల నీతి సమ్మతము

రచనాకాలం : క్రీ. శ. 15 వ శతాబ్దం ఆరంభం.

కర్త : మడికి సింగన.

అంకితం : కేశవస్వామికి.

ఇది సంకలనగ్రంథం. అయిదాశ్వాసాలుండేవట. మూడు ఆశ్వాసాలు మాత్రం లభించాయి. కాకతీయ యుగంలోని అరుగురు అజ్ఞాతకవులు ఈ గ్రంథంతో వెలికివచ్చారు. ఈ గ్రంథం ప్రాచీన నీతిమంజరి. పూర్వకవుల 17 గ్రంథాలనుంచి ఉదాహరణలున్నాయి. నీతిశాస్త్ర పఠనావశ్యకతను గుర్తించి కవి ఈ సంకలనం చేశాడు. సంకలనం చేస్తూనే సొంత పద్యాలు చెబుతూ "మదీయం" అని స్పష్టంగా చెప్పారు. కందనామాత్యుని

అగ్రజుడు కేశవమంత్రిచే ప్రతిష్ఠతమైన కేశవస్వామికి ఈ సంకలనం అంకితం. ఇందులో కామందకంలోని పద్యాలు ఎక్కువగా ఉన్నాయి. (ఆరుద్ర-4)

## సకల లక్షణ సారము

కర్త : అద్దనూరి రామదాసు

కాలం : తెలియదు.

దీనిప్రతి కాకినాడ ఆంధ్ర సాహిత్య పరిషత్తులో ఉన్నదట.

(తె. వి. స. 6-676)

## సకల లక్షణ సారసంగ్రహము

కర్త : ఉప్పులూరి వేంకటరెడ్డి.

కాలం : తెలీదు.

లక్షణగ్రంథం. (కవిజనాశ్రయం పీఠిక-వావిళ్ళ)

## సకల లక్షణ సార సంగ్రహము

రచనాకాలం : క్రీ. శ. 17వ శతాబ్దం.

కర్త : రత్నాకరం గోపాలరాజు.

ఛందో గ్రంథం. లక్ష్య లక్షణోపేతంగా ఉంది. ఇందులో సకల కృతులలోని ప్రయోగాలను పొందికగా కూర్చానని కవి చెప్పుకొన్నాడు. అపురూపమైన కావ్యాలలోని ప్రయోగాలు దీనిలో ఉన్నాయి. ఈ గ్రంథం వలన కొన్ని ప్రాచీన కావ్యాల పేర్లు తెలుస్తున్నాయి. దీని ప్రతి ఆంధ్ర సాహిత్య పరిషత్కార్యాలయంలో ఉంది.

(ఆరుద్ర-12-191)

## సకల వర్ణనాపూర్ణ రామాయణము

నామాంతరం : విద్వత్కవి కర్ణ రసాయనము.

రచనాకాలం : క్రీ.శ. 1820 ప్రాంతం.

కర్త : చిత్రకవి వేంకటరమణ కవి (చూ).

అంకితం : సుబ్బరాయనికి.

ఇందులో ఏడు కాండలున్నాయి. ఇది పింగళిప్రోలు లక్ష్మణకవి కృత రావణ దమ్మీయం వంటి కావ్యం. కవి తనపై అభియోగం తెచ్చిన ఒకవిని రావణునిగా భావించి ఈ కావ్యం వ్రాశాడని చెప్తారు. కవికి చతుర్విధ కవిత్వాలలో ఉన్న నేర్పు ఈ కావ్యంలో కనిపిస్తుంది. కృతిపతి సుబ్బరాయుడు మానవుడు కాడనీ సుబ్రహ్మణ్యేశ్వర స్వామి అనీ కొందరి అభిప్రాయం. దీనిప్రతి మిక్కిలి శిథిలావస్థలో ఉన్నదట. (క. శ-12-88)

## సకల వైద్య శాస్త్రార్థ సంగ్రహము

కర్త : చూ. తాడేపల్లి పానకాలరాయ కవి.

శాస్త్ర గ్రంథం. అసమగ్రంగా ఉంది. తెలుగులో లభ్యమవుతున్న వైద్య

శాస్త్ర గ్రంథాలలో ఉత్తమ శ్రేణికి చెందినది. కర్తృత్వాన్ని గురించి భిన్నాభిప్రాయాలున్నాయి. (క. శ-13-235)

## సకలాలంకార సంగ్రహ రాకా సుధా పూర్ణము

వ్యవహారనామం : అలంకార సంగ్రహము.

కర్త : మరింగంటి సింగరాచార్యులు.

కవి తన పదిహేనో యేట దీన్ని రచించాడట. (తె. వి. స-6)

## సకలేశ్వరు మాది రాజయ్య కథ

ఇదిపాల్కురికి సోమన విరచిత బసవ పురాణంలోని కథ. ఈ కథలో శివుడు కుటిల వేషం వేసుకొని గొల్లడుగా వస్తాడు. ఈ కథలో సోమన్న తన కాలపు గొల్లలు ఎలా ఉండేవారో చక్కగా వర్ణించాడు. (ఆరుద్ర-2-213)

## సజ్జనామృతమ్ (సం)

కర్త : కందాడై అప్పకొండాచార్యుడు.

(తె. వి. స-4)

## సతిదాన శూరము

రచనా కాలం : క్రీ.శ. 17వ శతాబ్దం.

కర్త : శహాజీ (చూ).

సంవాద నాటకం. శివాంకితం. ఇతి వృత్తం కొత్తది. ఒకానొక మతంగ స్త్రీపై మరులు కొన్న బ్రాహ్మణునికి ఆమె భర్త ఆమెను దానం చేయడం ఇందులోని కథ.ఇది రాజగోపాల స్వామి వసంతోత్సవాలలో జరిగినట్లు చెప్పబడింది. గ్రంథం నిండా వేదాంత వివేచనాపరమైన సంభాషణలు ఉన్నాయి. స్త్రీ వర్ణన మోహవైరాగ్య వృత్తాలతో చేయబడింది. అంటరానివారి ప్రసక్తి- మతంగస్త్రీ పతివ్రతా ధర్మం - మాదిగవాని నోట శ్లోకాలు - అర్థ వివరణాం ఇందులోని ప్రత్యేకతలు.

నాటకం చివర శివుడు ప్రత్యక్షమై నాటకంలోని పాత్రలు నల్గురికీ నాల్గు విధాల మోక్షం ఇచ్చి, ఏకోటా మతంగుని వివాహోత్సవాలు జరిగేలాగు కట్టడి చేస్తాడు.

బ్రాహ్మణునికి సాయుజ్యం, మాదిగవానికి సారూప్యం,మతంగస్త్రీకి సామీప్యం, విదూషకుడికి (బ్రాహ్మణుని శిష్యునకు) సాలోక్యం ఇచ్చాడు. ఈ నాటకం చివర "ఈ నాటకంలోవి నల్గురిలోనూ పెద్ద ఎవ్వరు ? అని విద్వాంసుల కొక ప్రశ్న ఉంది. ఈ సంవాద నాటకంలో కవి ప్రసిద్ధమైన ప్రాచీన శ్లోకాలు కొన్ని వాడుకొన్నాడు. మొత్తం 37 శ్లోకాలు ఉన్నాయి. (ఆరుద్ర 12-135) (యా.గా.నం-3)

## సతీధర్మ సంగ్రహము

రచనా కాలం : క్రీ.శ. 19వ శతాబ్ది పూర్వార్ధం.

కర్త : బహుజనపల్లి సీతారామాచార్యులు.

భారతాది పురాణ గ్రంథాల్లో నుండి సంగ్రహించిన నీతి పద్యాలను స్త్రీలకు సుబోధకంగా ఉండేటట్లు కూర్చి రచించిన గ్రంథం. (క.వ-293)

**సతీపతి దాన విలాసము**

రచనా కాలం : క్రీ.శ. 17వ శతాబ్దం.

కర్త : (మా.) శహాజీ.

యక్షగాన నాటకం. కృష్ణాంకితం. నారదుడు సత్యభామకు పతిదాన మాహాత్మ్యం చెప్పి కృష్ణుని దానం పట్టటం దీనిలోని కథ. ఇంచుమించు కృష్ణతులాభారం కథ అనవచ్చును. (వ దే.వా -206)

**సతీ శతకమ్ (సం)**

కర్త : అనివిళ్ళ వేంకటశాస్త్రి.

(తె.వి.వ-4)

**సత్యదూత (పత్రిక)**

కాలం : క్రీ.శ. 1835 ప్రాంతం.

ప్రచురణ స్థలం : చెన్నపట్టణం.

క్రీ. శ. 1835 ప్రాంతంలో క్రైస్తవ మత ప్రచారకులు తెలుగులో వార్తా పత్రికలు ప్రచురించటం మొదలు పెట్టారు. ఇది బళ్ళారి క్రైస్తవ సంఘం వారి యాజమాన్యంలో వెలువడింది. తెలుగు పత్రికలలో ఇది మొదటిదట. కేవలం క్రైస్తవ మత విషయాలకు సంబంధించిన వార్తలే దీనిలో ఉండేవి.

(వీరేశలింగంపంతులు - సమగ్ర పరిశీలన-183)

**సత్యభామా కృష్ణ సంవాదము**

రచనాకాలం : క్రీ. శ. 1800 ప్రాంతం.

కర్త : కాకరపర్తి తిరుపతి పాత్రకవి.

రచన నేడు లభ్యం కావడం లేదు. (క. వ-37)

**సత్యభామా విజయము**

రచనాకాలం : క్రీ. శ. 18 వ శతాబ్దం.

కర్త : పుట్టు శేషకవి.

అంకితం : విశ్వేశ్వరునికి.

ద్విపదకావ్యం. రచన సరళంగా ఉంది. రామాపురం కరణం నాళ్ళగట్టు ఎల్లయ్య కోరికపై కవి ఈ కావ్యం చెప్పాడట. నాళ్ళగట్టు వారు నందికొట్కూరు తాలూకా పాముల పాడుకు చెందినవారు. ప్రఖ్యాతులు. కృతికర్త పుట్టు శేషకవి పుట్టుప్రభువుగా ప్రసిద్ధుడు. నాళ్ళగట్టు వారికీ పుట్టువారికీ సంబంధం ఉండిఉండవచ్చును. (ఆరుద్ర-12-55)

**సత్యభామా విలాసము**

రచనాకాలం : క్రీ. శ. 1835 కు పూర్వం.

కర్త : అల్లమరాజు రామకృష్ణకవి.

కావ్యం. విశేషాలు తెలియరాలేదు. (క.చ-3-225;క. స-185)

**సత్యభామా వివాహము (అలభ్యం)**

కర్త : విజయరాఘవ నాయకుడు.

కాలం : క్రీ. శ. 17వ శతాబ్దం.

కర్త వ్రాసిన ప్రదర్శన యోగ్యాలైన యక్షగానాలలో ఇదొకటి. (ద.దే.వా-88)

**సత్యభామా సాంత్వనము**

కవి : లింగనమఖి శ్రీ కామేశ్వర కవి (చూ).

అంకితం : ముద్దళఘరి నృపాలునకు (క్రీ. శ. 1675-78).

నాలుగాశ్వాసాల శృంగార ప్రబంధం. తెలుగులో సాంత్వనమనే పేరుగల కావ్యాలలో ఇదే మొదటిది. భాగవత, హరివంశాలలో ప్రసిద్ధమైన నరకాసురవధ ఘట్టం ఈ రచనకు మూలం.

కృష్ణరాయల సత్యవధూప్రీణనమ్ చూచి కవి ఈ రచన చేసి ఉండవచ్చునని కొందరి అభిప్రాయం. రచనలో జాతీయాలు, అన్యభాషా పదాలు ఉన్నాయి. వరికొత్త వర్ణనలతో, సన్నివేశ కల్పనలతో ఒక ప్రత్యేకతను సంతరించుకొన్న కావ్యం. శృంగార వర్ణనలు మిక్కిలిగా ఉన్నాయి. (ద.దే.వా-323)

**సత్యమైన వేదంలో వుండే జ్ఞాన వుపదేశాల యొక్క సంక్షేపము**

కర్త : బెంజమన్ షూల్జి.

రచనాకాలం : క్రీ. శ. 1748 ప్రాంతం.

క్రైస్తవ మత ప్రచారం కొరకు రచించిన గ్రంథం. (వ.వా)

**సత్యవతీ పరిణయము**

కర్త : తెలియదు.

కృతిభర్త : కందుకూరి బసవరాజు.

అత్తలూరి పాపకవి రచించిన, "చెన్నబసవ పురాణం"లో ఈ కృతి ప్రసక్తి ఉంది. (క.చ-3-118)

**సత్యవతీ పరిణయము**

కాలం : క్రీ. శ. 19వ శతాబ్దం ఆరంభం.

కర్త : కాకరపర్తి బచ్చిపాత్ర కవి.

అంకితం : గోదే నారాయణ గజపతిరాయలకు (విశాఖపట్టణం జమీందారు).

ఐదాశ్వాసాల ప్రబంధం. సత్యవతీ శంతనుల వివాహ కథ, భీష్మ ప్రతిజ్ఞ దీనిలోని కథాంశాలు. కవి దీన్ని నారాయణ గజపతిరాయల తండ్రి గారికి అంకితమివ్వాలనుకొన్నాడట. కాని కృత్యాది, ఆశ్వాసాంత పద్యాలు రచించకుండానే మరణించాడట. అనంతరం అతని సోదర పుత్రుడు వేంకటశాస్త్రి, పౌత్రుడు సీతారామశాస్త్రి కృత్యాదులను పూరించి ఆ రచనను నారాయణ గజపతి రాయలకు అంకితమిచ్చారు. (క. చ-3-227)

## సత్య వధూప్రీణనమ్ (సం) (అలభ్యం)

కర్త : చూ. శ్రీకృష్ణ దేవరాయలు.

రాయలు దీనిని వ్రాసినట్లు ఆముక్తమాల్యదలో ఉంది.

(తె. వి. స-6)

## సత్యవోలు భగవత్కవి

కాలం : క్రీ. శ. 1730 ప్రాంతం.

స్థలం : గోదావరీ మండలం. రామచంద్రపురం తాలూకాలోని జన్నాడ గ్రామం.

రచనలు : 1. రుక్మిణీ పరిణయము 2. శతకములు (అలభ్యం) 3. తారావళులు (అలభ్యం).

సమకాలికుడు : ఏనుగు లక్ష్మణ కవి.

జనార్దన మంత్రి పేరమాంబల పుత్రుడు భగవన్నామత్యునికి పేరమాంబకు పౌత్రుడు. శతాధిక గ్రంథకర్త. మృదుమధురమైన కవిత్వం చెప్పాడు. ఇతడు నూరు శతకాలు, అనేక తారావళులు, దశావతారావళులు, ఉదాహరణములు, దండకములు చెప్పినట్లు రుక్మిణీపరిణయ కావ్యంలో ఉంది.

దశావతారాలను వర్ణిస్తూ ఇతడు రుక్మిణీపరిణయంలో చెప్పిన సీస పద్యాలు చాలా ప్రసిద్ధిపొందాయి. అందులోని దండకమొకటి మిక్కిలి ప్రశస్తమైనది. ఇతని కవిత్వం మృదుమధుర పద గుంభితం.

(క. త-13-157)

## సత్యహరిశ్చంద్రము

కర్త : తెలియదు.

జానపద పౌరాణిక గేయం. ఇతివృత్తం ప్రసిద్ధం.

చూ. పౌరాణిక గేయములు. (అం. వా. చ.)

## సత్యా పరిణయమ్ (సం)

కర్త : వేపూరి ఏకామ్రకవి (చూ).

అంకితం : ఇమ్మడి అంకుశేంద్రునికి.

శ్రీకృష్ణ పరమైన కావ్యం. (వ. దే. వా.)

సత్రమరులు

నామాంతరం : తంజావూరు అన్నదాన మహానాటకము (చూ).

సత్క్రియానుష్ఠానము

కర్త : పరశురామ పంతుల బ్రహ్మానంద రాజయోగి.

వచనంలో ఉన్న వేదాంత గ్రంథం. (వ. శా-41)

సత్రైస్తవ శతకము (అలభ్యం)

కర్త : చొవరి పురుషోత్తము (చూ).

సత్వదాత్ముడు

ఇతడు పింగళి సూరన్న "కళాపూర్ణోదయం"లో ఒకపాత్ర. మహారాష్ట్ర దేశాన్ని పాలించే సుగ్రహుడనేరాజు శత్రువులవల్ల రాజ్యం కోల్పోయి బృందావనంలో బాలకృష్ణుని కొలిచి మణిహారం పొందాడు. ఒకముని శాపంవల్ల పూర్వవృత్తాంతం మరచి కాసార పురాధీశ్వరుడైనాడు.

సుముఖాసత్తి, మణిస్తంభులు, క్రమంగా మగ ఆడువారుగా మారి విహరించే సమయంలో వారికి ఇతడు తటస్థ పడ్డాడు. ఈయన దాంభికుడేగాక నీరసపు ప్రేమోన్మాది. ఆమెను చూసి తన ఆభరణాలు, ఉంగిరాలు, కనిపించేటట్లు కోరమీసం దువ్వి నీచ శృంగార చేష్టలు చేశాడు.

ఆ దంపతులను బ్రతిమాలి, అందలంలో తన నగరికి ఎక్కించుకొనిపోయి, స్వయంగా తానే సపర్యలు చేశాడు. ఆమె భర్త ప్రక్కన ఉన్న సంగతే మరచిపోయి శృంగార చేష్టలు వెకిలిగా చేశాడు. ఆమె యుక్తిచేత చివరకు ఈయనను విఫల మనోరథుని చేసినది. భర్తకాంక్షుడై సహసంతో వ్యవహరించాడు. తుచ్ఛ విలాస ప్రియులైన వారికి ప్రతీగా సూరన ఈ పాత్రను చిత్రించాడు. శృంగారము-ప్రేమలలోని ఉదాత్త, అనుదాత్త తారతమ్యాలు కళాపూర్ణోదయ పాత్రలలో పఠితలకు గోచరిస్తాయి.

తుదకు మణిహార ప్రభావం వల్లనే ఇతనికి తన పూర్వవృత్తాంతం బోధపడుతుంది. (కళాపూర్ణోదయం)

సత్సంగ రాజనాటకము

కర్త : (చూ) మేలత్తూరు వేంకటరామశాస్త్రి.

సంగీత రూపకం.

సత్పురుష వర్ణనమ్ (సం)

రచనా కాలం : క్రీ.శ. 1800 ప్రాంతం.

కర్త : కావలి వేంకట బొర్రయ్య.

నూరు శ్లోకాల రచన. (పి.యు.-56)

## సదానంద యోగి (అవధూత)

కాలం : క్రీ.శ. 1450–1500 ప్రాంతం.
రచన : నవ్యతరభోగి శ్రీసదానందయోగి శతకము.

ఇతడు "పరతత్త్వ రసాయనం" రచించిన ఈశ్వర ఫణిభట్టుకు గురువు. ఆ గ్రంథానికి కృతిపతి. సదానంద వరద రాజయోగిగా ప్రఖ్యాతుడు. సదానంద యోగి శతకం రచించిన సదానంద యోగీ, ఈశ్వర ఫణిభట్టు గురువూ భిన్నులని కొందరు భావిస్తున్నారు. (క.శ–6–247) (శ.క.చ. 513,739)

## సదాశివ రెడ్డి కథ

కర్త : తెలియదు.

జానపద చారిత్రక గేయం. తెలంగాణా ప్రాంతానికి సంబంధించినది.
చూ. చారిత్రిక గేయములు. (ఆం.వా.చ)

## సదాశివ శతకము

కర్త : చూ. అనంతరాజు సుబ్బరాయ కవి.
కాలం : క్రీ. శ. 19 శతాబ్ది పూర్వార్ధం.

కార్వేటినగర సంస్థానప్రభువైన 'కుమార వేంకట పెరుమాళ్ళురాజు' ప్రేరణతో రచింపబడిన సీసపద్య శతకం. అక్కడక్కడ బంధ, చిత్ర, గర్భ కవిత్వాలున్న పద్యాలున్నాయి. రచన ప్రౌఢమైనది.

"నగపరశరాస, కార్వేటి నగరవాస, గిరిపుర శరా సదాశివ కృత్తివాస" అనేది మకుటం. కవి ఒక్కొక్కచోట సీస పద్యంలో మత్తేభం ఇమిడ్చి రాశాడు.
(ఆం సం.సా: శ.క.చ–790)

## 'సదాశివ సద్గురు ప్రభూ' మకుటము

కర్త : తెలియదు.

చాటువులు. పై మకుటంతో కొన్ని సుభాషితాలు దొరుకుతున్నాయి. సంఘంలోని వాస్తవాలన్నీ ఈ చాటువులలో సరసమనోహరంగా ఉన్నాయి. కవిత్వం చక్కగా ఉంది. (చా.ప.ర)

## సద్గురు రగడ (కన్నడం)

కర్త : పాల్కురికి సోమనాథుడు.

## సన్నతీ సున్నతీయమ్ (సం)

కర్త : నడిమింటి సర్వమంగళేశ్వరశాస్త్రి.

మతవిందాపరంగా వ్రాయబడిన గ్రంథం. సర్వమంగళేశ్వరశాస్త్రికి కొన్ని వర్గాలపైన, మతసాంప్రదాయాలపైన సదభిప్రాయం ఉండేదికాదు. అట్టివాటిని దూషించడంలో వారు సభ్యసంస్కారాదులను పాటించేవారు కారు.

తురుష్క మతాన్నీ, వైష్ణవ మతాన్నీ దూషిస్తూ వ్రాసిన ఈ గ్రంథంలో 12,000 శ్లోకాలున్నాయట. తురుష్క, వైష్ణవ నిందాపరంగా అర్థం రావడానికి కొన్నివేల లాక్షణిక వాక్యాలను ఉదాహరించారు. ఈ కవి ప్రతిభావ్యుత్పత్తులు ఈ విధంగా దూషణ కావ్యంలో వ్యర్థమైనాయని సమకాలీన పండితులు ఎంతగానో విచారించారట.

(ఆం.సం.సా-543)

## సన్నిధిరాజు జగన్నాథ కవి

కాలం : క్రీ. శ. 1810 ప్రాంతం.

స్థలం : ఉప్పాడ (పిఠాపురం దగ్గర).

రచన : 1. ఎరుకల కురవంజి (యక్షగానం) 2. రాజలింగ శతకము.

గురువు : శృంగేరీ మఠాధిపతి శంకరాచార్యులు.

జగ్గకవిగా ప్రసిద్ధుడు. ఇతని తాతపేరు కూడా జగ్గకవియే. తల్లి పేరమ్మ, తండ్రి అమ్మయ. వీరి ఇంటి పేరు 'సన్నిధానము' అని కొందరు భావిస్తున్నారు.

ఇతడు విద్వత్కవి. స్వతంత్రంగా కొన్ని శ్లోకాలను రచించి తన రచనలలో పొందుపరిచి వాటికి తెలుగులో వివరణం వ్రాశాడు. (య.వా.చ-78; శ.క.చ-700)

## సన్యాసమ్మ కథ

కర్త : తెలియదు.

కరుణ రసాత్మక జానపద గేయం. ఈ కథ విశాఖ మండలానికి సంబంధించి నది. అక్కడ ఈమెకు ఇప్పటికీ పూజలు జరుగుతుంటాయట. అత్తగారి ఆరడి, కోడి కోడండ్ర ఈర్ష్యాసూయలను సహించి భర్తతోపాటు సహగమనం చేసిన పతివ్రత సన్యాసమ్మ. సమిష్టి కుటుంబంలో సాధారణంగా స్త్రీలుపడే బాధల్ని చక్కగా చిత్రించాడు కవి.

దివిలింగ గ్రామానికి చెందిన దాల్నాయుడు, లక్ష్మమ్మలకు ఏడుగురు మగ పిల్లల తరువాత పుట్టిన కూతురు ఈ సన్యాసి. సన్యాసి పుట్టగానే తల్లి చనిపోయింది. తండ్రి ద్వితీయ వివాహం చేసుకుంటాడు. సన్యాసమ్మ అన్న పేరు రామన్న. అతడే సన్యాసమ్మను పెంచి పెద్ద చేస్తాడు. వీరి మేనత్త దాలమ్మ. దాలమ్మకు చెంచన్న అనే కుమారుడున్నాడు. ఇతనికి సన్యాసమ్మ నిచ్చి పెళ్ళి చేస్తారు. వివాహ సమయానికి సన్యాసమ్మ చిన్నపిల్ల కాబట్టి కొంతకాలం అన్నగారి దగ్గరే ఉంటుంది. అన్నగారు ఇంట్లో లేని సమయంలో పినతల్లి ఈమెను ఆరడి పెడుతుంది. (సన్యాసమ్మకు పుట్టుకతోనే కొన్ని వింత శక్తులు జానపదులచేత ప్రసాదింపబడ్డాయి.) ఆమె తన అద్భుత శక్తులు ప్రదర్శించి పినతల్లి ఆగడాలను ఎదుర్కొంటుంది. కాని, ఎక్కువకాలం అక్కడ ఉండలేక అత్తగారింటికి బయలుదేరుతుంది.

దాలమ్మ కొంతకాలం సన్యాసమ్మను చాలా ప్రేమగా చూస్తుంది. సన్యాసమ్మ అన్నగారైన రామన్న శ్రీమంతుడు. కాబట్టి చెల్లెలికి ధన ధాన్యాలను, 25 గ్రామాలను

అరణంగా ఇచ్చి పంపుతాడు. ఇంతలో చెంచన్న మచిలీ బందరులో ఇంగ్లీషు వారి సైన్యంలో చేరతాడు.

సన్యాసమ్మకు సూరమ్మ, సుబ్బమ్మలు తోడి కోడండ్రు. ఈర్ష్యాళువులై అత్త గారితో చాడీలు చెపుతారు. అవి వినగా వినగా కొంత కాలానికి దాలమ్మకు సన్యాసమ్మపై కోపం వచ్చి ఆమెకు అరణంగా వచ్చిన ధనాన్నంతా లాగుకుని ఇంటి పనులన్నీ అంట గట్టి బాధిస్తుంది. (సన్యాసమ్మ ఇక్కడ కూడా తన అద్భుత శక్తులు ప్రదర్శిస్తుంది అత్తగారు ఎన్ని అరళ్లు పెట్టినా ఓర్పుతో సహిస్తుంది.)

చివరకు అత్తగారి ఆరళ్ళు అధికమై, సన్యాసమ్మ ఆత్మ రూపంలో భర్తను కలసి తన బాధలను చెప్పుకుంటుంది. భర్త ఇంటికి తిరిగి వస్తాడు. మొదట దాలమ్మ చెప్పిన చాడీలను నమ్మి భార్యను దండించాలనుకుంటాడు. కాని తరువాత భార్య ద్వారా నిజం తెలుసుకుని బాధపడతాడు. అన్నగారితో పోట్లాడి వేరుపడతానంటాడు. అన్నను చంపలేక చివరికి తానే ఆత్మహత్య చేసుకుంటాడు. సన్యాసమ్మ సహగమనానికి సిద్ధ పడుతుంది.

ఆ కాలంలో సహగమనం చేయడానికి మచిలీ బందరులోని దొరల అజ్ఞ తీసుకో వాల్సి ఉంది. దొరలు సాధారణంగా అనుమతించరు. (ఇది అన్ని జానపద గాథల్లోనూ సామాన్యాంశం.) సన్యాసమ్మ దొరల ముందర తన అద్భుత శక్తులు ప్రదర్శించి వారి అనుమతితో సహగమనం చేస్తుంది. రామినాయుడు చెల్లెలికి గుడి కట్టిస్తాడు. అప్పటి నుండీ సన్యాసమ్మకు పూజలు జరుగుతూనే ఉన్నాయి.

ఈ కథలో అక్కడక్కడ అద్భుతరసం కనిపించినా, ఆదినుంచి అంతం వరకు కరుణమే ప్రధానంగా పోషింపబడింది. (తె.జా.వా.)

## సప్తకాండ రామాయణమ్ (సం)

నామాంతరం : విశేషణ రామాయణమ్.

కర్త : నెల్లూరి రాఘవకవి.

(వ.దే.వా–259)

## సప్తపదులు

కర్త : శ్రీనివాసదేశికులు.

రచనా కాలం : క్రీ. శ. 18 వ శతాబ్దం.

స్థలం : సురపురం సంస్థానం.

ద్రావిడ భాషలో "ఆండాళ్" రచించిన ముప్పది పాశురముల (తిరుప్పావై)కు అనుసరణ. ఇవి ముద్దుపళనివిగా మొదట ముద్రింపబడ్డాయి. శ్రీ బులుసు వేంకటరమణయ్య విశేష పరిశోధన చేసి అవి శ్రీనివాస దేశికుల వారివని నిర్ధారించారు.

(వ.దే.వా–270; శారదాధ్వజం–254)

## సప్తవిధ కవులు

కావ్య లక్షణకారులు కవులను ఏడు విధాలుగా చెప్పారు. వివేకి, వాచకుడు,

రౌచికుడు, ఆర్థికుడు, శిల్పి, భూషణార్థి, మార్దవకవి. అప్పకవీయంలో ఈ విభాగ ముంది.

గణవర్ణ శబ్దార్థ గుణదోషాలు పరికించి కవిత చెప్పేకవి వివేకి. అనుప్రాస పదబంధ నియమాలతో కృతి చెప్పేవాడు వాచకుడు. మృదు మధురములైన పలుకులను కూర్చి కావ్యం చెప్పేకవి రౌచికుడు. చిన్న చిన్న శబ్దాలలో అతి విపులమైన అర్థాన్ని ఇమిడించే కవి ఆర్థికుడు. యమకాలంకారాలను ఎక్కువగా చెప్పేవాడు శిల్పకుడు. అలంకారాలను ఎడనెడ పొందుపరచేవాడు భూషణార్థి. సరళమైన పదాలతో రసాత్మకంగా అర్థ విస్ఫురణ కలిగించేవాడు మార్దవకవి. వీరిలో రౌచిక, ఆర్థిక, మార్దవ కవులు మాత్రమే ఉత్తమ కవులనీ వారి కవిత్వమే శ్రేష్ఠమైనదనీ పండితులు భావించారు.

కవిత్రయ కవులలో నన్నయభట్టు రౌచికుడు. తిక్కన ఆర్థికుడు. ఎర్రాప్రెగ్గడ మార్దవ కవి. (కావ్యాలంకార సంగ్రహం)

సప్తశతి

ఏడు వందల పద్యాలున్న కావ్య భేదం. (అప్పకవీయం)

సప్తశతీసారటీక (సం)

కర్త : చూ. పెదకోమటి వేమారెడ్డి.

నామాంతరం : భావదీపిక.

ఇది హాలుని గాథా సప్తశతికి వ్యాఖ్యానం. హాలుడు సంకలనం చేసిన 700 గాథల నుంచి ఒక నూరు గాథలను మాత్రం ఎంచుకొని పెదకోమటి వేముడు వ్యాఖ్యానించాడు. (రె. రా. చ.)

సప్త సంతానములు

సప్త సంతానాలలో కావ్యం ఒకటి. తనయుడు, తటాకము, కావ్యము, నిధానము, అగ్రహారము, వనము, దేవస్థాపనము అనేవి సప్త సంతానాలుగా ప్రసిద్ధిపొందాయి. "తనయుడు" అనేదానికి బదులు "సత్రాలు వేయించడా"న్ని కొందరు గ్రహిస్తున్నారు. పైపుణ్యకార్యాలు చేయడంవల్ల ఉత్తమలోకాలు ప్రాప్తించడమేకాక తమ పేరు లోకంలో చిరస్థాయిగా నిలిచి ఉంటుందనే భావంతో చాలమంది సప్త సంతాన ప్రతిష్ఠపట్ల శ్రద్ధ చూపారు. కావ్యం రాయడం-రాయలేకపోతే కవులను పోషించి వారిచేత కృతి రాయించి అంకితం పుచ్చుకోవడం సర్వసాధారణమైంది. కృతి సప్త సంతానాలలో ఒకటి కావడం సాహిత్యాభివృద్ధికి దోహదం చేసింది.

సప్తార్ణవ సంగమాహాత్మ్యము

నామాంతరం : చూ. సాగర సంగ మాహాత్మ్యము.

కర్త : కూచిమంచి తిమ్మకవి.

## సభాపతి వచనము

రచనాకాలం : క్రీ. శ. 1550 కావచ్చును.

కర్త : తెలియదు.

దీనిలోని విషయాలు సమయస్ఫూర్తికి దోహదం చేస్తాయి. "సభాపతి ఎట్టి వాడుగా నుండవలెను" అనే వర్ణనతో ఈ రచన ప్రారంభం అవుతున్నది. అందుకే సభాపతి వచనమని దీనికి పేరు. రాయవాచకంలో దీనిలోని ఉదాహరణలున్నవి. తామరపల్లి శరణు మంత్రి రచించిన సభాభిరామమే ఈ సభాపతి వచనమని కొందరి అభిప్రాయం.

ఈ గ్రంథంలో ఇరువది ప్రాసలు–ఏబది యతులు చెప్పబడినవి.

(వ. వా–32)

## సభాపర్వము

కర్త : బాలసరస్వతి (చూ).

ద్విపద భారత భాగము. ద్విపద భారత కవిత్రయంలోని వాడైన బాలసరస్వతి రచించిన సభాపర్వం. సరళమైన శైలిలో ఉంది. (వ. దే. వా–372)

## సభాభిరామము (అలభ్యం)

రచనాకాలం : క్రీ. శ. 16వ శతాబ్దం.

కర్త : తామరపల్లి శరణుమంత్రి.

వచనకావ్యం. కవి పుత్రుడైన తిమ్మయ ఈ గ్రంథాన్ని పేర్కొన్నాడు

(ం. న–262)

## సభారంజనమ్ (సం)

కర్త : నీలకంఠ దీక్షితులు.

దీనిలో రాజసభలలోని సభ్యరంజన రీతులు, రాజనీతులు ఉన్నాయి.

(తె. వి. న–6)

## సభారంజని

కర్త : చూ. వెలుగోటి సర్వజ్ఞ కుమార యాచేంద్రులు (1832–82).

సంగీత నాట్య సంబంధియైన గ్రంథం. నాయికానాయక, రస సంగీత తాళ హిందూస్థానీ రాగతాళ నాట్యాభినయ శబ్ద వాద్య పాండిత్య రహస్యాలనే ఎనిమిది ప్రకరణాలు ఇందులో ఉన్నాయి. (ఆం. సం. పా–462)

## సమపదాలు

రచనా విశేషం. ఇవి యక్షగానాలలో ప్రయుక్తాలు. వీటిలోని పాదాలు సమత కలిగి అంత్య ప్రాస విశిష్టాలై ఉంటాయి. తిరుమలకవి చిత్రబాట మాహాత్మ్యంలో ఈ పదాలున్నాయి. (య. వా. చ–277)

## సమయలేఖిని

నామాంతరం : సమసమయలేఖిని.

ఒక విద్యా విశేషం. సంస్కృత శ్లోకాలుగాని, తెలుగు పద్యాలుగాని నిర్దిష్ట సమయంలో చెప్పడం కవి ప్రతిభకు తార్కాణం. సాధారణంగా గడియకు నూరు పద్యాలు చెప్పడం అనేది నియమం.

"ఘటికా శతగ్రంథ కల్పన" అనేది కూడా ఇందులోని భాగమే. గ్రంథ మంటే ముప్పది రెండక్షరాలు గల శ్లోక రచన. అదిదం సూరకవి, గణపవరపు వెంకట కవి మొదలైన వారు ఇలాంటి విద్యలలో దిట్టలు. స్త్రీలలో దక్షిణాంధ్ర యుగంలోని రామభద్రాంబ, రంగాజమ్మ మధురవాణి ఈ విద్యలకు పేరుపొందారు. మధురవాణి ఘటి కార్థ నిర్మిత శతశ్లోకి. (ద.దే.వా. - 14)

## సమవాకారము

ఇది దశవిధ రూపకాలలో ఒకటి.దీనిలోని ఇతివృత్తం ప్రఖ్యాతము. అంకాలు మూడు. ప్రసిద్ధులయిన దేవదానవులు పండ్రెండుగురు నాయకులు. సముద్ర మథనంలో వాసుదేవాదులకువలెనే వీరికి వేరువేరు ప్రయోజనాలు ఉండవచ్చు.దీనిలో వీరము అంగిగాను మిగిలినవి అంగాలుగాను ఉంటాయి. వృత్తులన్నీ ఉంటాయి. అవమర్శ సంధిగాక మిగిలిన నాలుగు సంధులు ఉపయోగించవచ్చును. ప్రతి అంకంలో కపటము, శృంగారము, ఉప ద్రవము అనే మూడింటిని వర్ణించాలి. దీనిలో 36 గడియల కాలం ప్రమాణము. వీథ్యం గాలను యథాలాభంగా వ్రాయాలి. అంటే బిందు ప్రవేశకాలను విధించకూడదని, ప్రస్తావ నాదులను వ్రాయవచ్చునని భావం. (తె.వి.స-6)

## సమ సమయ లేఖిని

నామాంతరం : సమయలేఖిని (చూ.).

## సమస్యా పూరణము : చాటువులు

సాహితీ వినోదం.దీనినే పాదపూరణం, పద్యపూరణం అని కూడా అంటారు కవి ప్రజ్ఞను పరీక్షించడానికి పండితులిచ్చే పద్యభాగాలను "సమస్యలు" అంటారు. ఒక శ్లోకంలోగాని, పద్యంలోగాని ఒకపాదం ఇచ్చి తక్కినది పూరించమనడం పండిత గోష్ఠులలో తరచుగా ఉండే వినోదం. అతి ప్రాచీన కాలం నుంచి తెలుగుదేశంలో కవి పండిత పరీక్షా సమయాలలో ఈ ప్రక్రియ చాలా విశిష్టంగా ఉండేది. రాజులో, మంత్రులో, కవులో, పండితులో, విదుషీమణులో ఎదుటి వారికి సమస్య లివ్వటం, ఆ సమస్యలను సమయస్ఫూర్తితో అతి చాకచక్యంగా ఎదుటి వ్యక్తులు పూరించటం పరిపాటి.

సంస్కృత, పాకృతాది అష్ట భాషలలోను ఈ సమస్యాపూరణాలు జరుగు తుండేవి. ఈ ప్రక్రియ తెలుగు సాహిత్యంలో చాటు పద్యాల ద్వారా ఎక్కువగా తెలు స్తున్నది. ఈ కోవకు చెందిన చాటువులు సాహిత్యంలో అసంఖ్యాకంగా ఉన్నాయి.

పుదుక్కోట సంస్థానంలో నడచిన సమస్యా పూరణాలు "కవి జనోజ్జీవని" అనే పేర గ్రంథంగా ప్రకటింప బడ్డాయి. (చా.ప.ర.) (ద.దే.వా-6)

## సమాస కుసుమావళి

కర్త : నడిమింటి సర్వ మంగళేశ్వరశాస్త్రి.

సంస్కృత భాషా పరిచయం కోరే విద్యార్థుల కోసం వ్రాసిన లఘు గ్రంథం. దేశంలో చాలా వ్యాప్తిలో ఉంది. (చా.ప.మం-98)

## సమీక్ష

కావ్య పరిభాష. ఒక విషయాన్ని పూర్వోత్తర పక్షాలతో కూలంకషంగా విమర్శించడం. భాష్యాన్నే మరింత చక్కగా చేసినట్లయితే అది సమీక్ష అవుతుంది. (చూ. భాష్యము)

## సమీర కుమార విజయము

కర్త : పుష్పగిరి తిమ్మన.

అంకితం : శ్రీరామునికి.

ఏడు ఆశ్వాసాల ప్రబంధం. హనుమంతుని కథ. కవికి శ్రీరాముడు స్వప్నంలో కనబడి ఈ కావ్యాన్ని అంకితం కోరాడట. పురాణేతిహాసాలలో అక్కడక్కడా హనుమంతుని గురించి చెప్పబడిన విషయమంతా సేకరించి సమగ్రంగా కవి ఈ కావ్యంలో పొందుపరిచాడు. రసోచిత వర్ణనలు, చిత్ర కవిత్వ ప్రక్రియలు, చమత్కారంతో కూడిన కవి సమయాలు, కావ్యం అంతటా కోకొల్లలు. ఇందులో నిరోష్ఠ్య దండకం ఒకటి ఉంది. (ఆంధ్ర-10-144)

## సముఖము వేంకట కృష్ణప్ప నాయకుడు

కాలం : క్రీ. శ. 18 వ శతాబ్దం.

స్థలం : మధుర.

రచనలు : జైమిని భారతము, అహల్యాసంక్రందనము, సారంగధర చరిత్ర, రాధికా సాంత్వనము.

సమకాలీనులు : శేషము వేంకటపతి, బుణిగె కృష్ణకవీంద్రుడు.

మీనాక్షి నాయకుని పుత్రుడు. మధుర పాలకుడైన విజయరంగ చొక్కనాధుని (1706—32) ఆస్థానంలో తండ్రీ కొడుకులు ఇరువురూ దండనాయకులుగా, సామాజికులుగా ఉండేవారు, ఇతడు ఏదైనా చిన్న సంస్థానానికి పాళెగారు అయి ఉండవచ్చును. శేషము వెంకటపతి, కృష్ణకవీంద్రుడు ఈ కవి వంశవర్ణనం చేశారు. సరళమూ, సుగ్రాహ్యమూ అయిన వచనరచన ఇతని కాలంలోనే మొదలైంది. ఈ రచన కొంత విలక్షణతను సంతరించుకొని ఉండటం గమనించవచ్చును. ఇతడు రచనలో ఎక్కడా అరసున్న వాడలేదు. "నేను" అనవలసినచోట "తాను" అనడం, "చెప్పెను" అనడానికి బదులు "పలుకరించెను" అనడం, ఇతని గ్రంథాలలో కనిపి

స్తాయి. ఇవి ఆనాటి భాషాధోరణులను ప్రతిబింబిస్తున్నవి. "ధర్మనందనుడు" అనేదాన్ని "ధర్మనంద్దనుండ్డు" గానూ "యుద్ధంబున" అనేదాన్ని "యుద్ధంబ్బున" అని వ్రాయడం నాటి అలవాటు. ఇందులో ప్రతి విలేఖకుల సవరణలు కూడా కొన్ని చేరి ఉండవచ్చును.

## సముద్ర మథన నాటకము (అలభ్యం)

కర్త : విజయరాఘవ నాయకుడు (చూ).

తంజావూరు నాయకరాజుల కాలంలో నాటక ప్రదర్శనలు హెచ్చుగా జరుగుతుండేవి ప్రదర్శన కోసం పురాణాలలోని ఘట్టాలను నాటకాలుగా మలిచి వ్రాయడం ఎక్కువ ప్రచారంలో ఉండేది. ఇదీ అటువంటి రచనే కావచ్చును. (వ.దే వా-88)

## సముద్రాల తిరుమలాచార్యులు

కాలం : క్రీ. శ. 17 వ శతాబ్దం.
స్థల : నల్గొండ జిల్లా.

సాహిత్యాచార్యుడు-కృతిభర్త ఇతని శిష్యుడైన పొనుగోటి జగన్నాథరాయలు రచించిన "కుముదవల్లీ విలాసం" ఇతనికే అంకితం. (ఆరుద్ర-11-262)

## సముద్రాల రామానుజాచార్యులు

కాలం : క్రీ. శ. 18 వ శతాబ్దం.
స్థలం : కరీంనగర్ జిల్లా కోరుట్ల.
రచన : సుశీలోపాఖ్యానము.

వివరాలు తెలియరాలేదు. (క.స. 201)

## సరస హృదయానురంజనము

కర్త : ములుగు పాపయారాధ్యులు.
ముద్రణకాలం : క్రీ. శ. 1932.

అయిదాశ్వాసాల మిశ్రకావ్యం. కొడిమెల రాజలింగాచార్యులు దీని ప్రతిని సంపాదించారట. కుమారస్వామి వివాహాది వృత్తాంతాలతో ఉన్న ఈ గ్రంథంలో సుమారు వేయిపద్యాలున్నవి. వరంగల్లు శైవప్రచారిణీ గ్రంథమాల వారు ప్రచురించారు. (ఆం.సా.ప.స-20-1)

## సరసాంధ్ర వృత్త రత్నాకరము

కాలం : క్రీ. శ. 19 వ శతాబ్ది.
కర్త : వెల్లంబారి లింగన మంత్రి.

ఇది లక్షణ గ్రంథం అముద్రితం. (కవిజనాశ్రయం పీఠిక-వావిళ్ళ)

## సరస్వతీ కల్యాణము

కర్త : వివర్తి శేషాచలపతి.

కాలం : క్రీ. శ. 17 వ శతాబ్ది.

ఈ నాటకం శాహరాజ ప్రణీతం అని అవతారికలో ఉంది. అయితే కథా క్రమం చెప్పేచోట ద్విపదలో, శేషాచలపతి శాహవిభుపేర వహించి దైవార వ్రాసినట్టు ఉంది. అనేకులు దీన్ని శేషాచలపతి కృతిగానే అంగీకరించారు.

సరస్వతీ చతుర్ముఖుల పరిణయగాథ కొన్ని మార్పులతో ఉంది
(ద.దే.వా–211)

## సరస్వతీ, చతుర్ముఖుల లీలాకేళి

ఈ ఘట్టం పింగళి సూరన్న కళాపూర్ణోదయంలోనిది. తెలుగు సాహిత్యంలో అపూర్వమైన కల్పన. మధురమూ, మార్దవమూ అయిన ప్రేమ స్వరూపాన్ని కవి ఇక్కడ వర్ణించాడు. ప్రకృతిని పాత్రల జీవితంతో కలిపి చెప్పటం ఈ ఘట్టంలోని ప్రత్యేకత. రంగం సరోవరం. సరస్వతి, ప్రణయ కోపంలో అటు తిరిగి పడుకొన్నది. ఆమె ముఖచంద్ర మండలం ఆ కాసారంలోని మణి స్తంభంలో ప్రతిబింబంగా కనిపిస్తుంది. బ్రహ్మ దానిని చూసి కొంతసేపు ఆనందించి, సరస్వతి కోపం తీరకపోతే – చెట్టుమీద ఉన్న చిలుకను పలకరించి ఒక కథ చెప్పమంటాడు. చిలుక బ్రహ్మనే ఒక కథ చెప్ప మని తిరిగి అడుగుతుంది.

బ్రహ్మ అప్పుడు జరిగిన శృంగారలీలను అన్యాపదేశంగా ఏదో కథ చెప్పి నట్లు వివరించడం మొదలు పెట్టాడు.

కాసారపురంలో ఒకరాజు, అతని పేరు కళాపూర్ణుడు. (ముఖ చంద్రుడు). అతడు స్వభావునిచే (స్వభావముచే) ఒక ఎర్రని మృగ శలాకను (పెదవిని) విల్లును (కనుబొమలను) బాణములను (చూపులు) సంపాదించి సరిరాజులందరినీ జయించాడు. ఇట్లా బ్రహ్మ చెబుతూ ఉంటే – సరస్వతి చిరునవ్వుతో చిలుకను పలకరించి – ఆ కళా పూర్ణుడెవరో, అతని తల్లితండ్రులెవరో అడుగుతుంటుంది. బ్రహ్మ చమత్కారంగా అతని తండ్రి "సుముఖాసత్తి, తల్లి మణిస్తంభుడు" (స్తంభ శబ్దం పుంలింగం కనక దానిలో ప్రతిబింబితం అనటం) అనగానే వాణి చిరునవ్వు నవ్వి, "జనని మగది" "జన కుడు" "ఆడువాడు" ఎట్లా పొసగుతుందంటూ, ఆరాజు ఏమయ్యాడని ప్రశ్నిస్తుంది. సరస్వతి ప్రసన్నవదనంతో అడుగగానే బ్రహ్మ మరికొన్ని సంగతులుచేర్చి కథ చెప్పటం మొదలు పెడతాడు. వెంటనే సరస్వతి గ్రహించి అప్పటి తమ కామకేళినే చెపుతున్నాడని, అదంతా తనకు తెలుసునని, హృదయ ప్రమోదంగా అన్నది.

పై ఘట్టం కళాపూర్ణోదయంలోని కథకు ఆయువుపట్టు. ఈ సన్నివేశంలోని సరస్వతీ–చతుర్ముఖుల, చర్యలు, సంభాషణలే మహత్తర కావ్యంగా విస్తృత పరిణతిని పొందాయి. ఇందులోని చిలుకయే కలభాషిణిగా, తరవాత మధురలాలసగా జన్మించింది.
(కళాపూర్ణోదయం పీఠిక–కట్టమంచి)

## సరస్వతీ బాయి

కాలం : క్రీ.శ. 19వ శతాబ్ది పూర్వార్థం.
స్థలం : మదరాసు కావచ్చును.
రచన : పాకశాస్త్రము. (వచనము)

ఈమె రచించిన పాకశాస్త్ర విషయాలను కల్నల్ మెకంజీ దొర పండితుడైన కావలి వెంకటరామస్వామి ఆంగ్లభాషలోకి పరివర్తనం చేశాడు. దీని ప్రతి బ్రిటీషు మ్యూజియం గ్రంథాలయంలో ఉన్నదట. (క. స. 283; వ వా. 64)

## సరస్వతీ విలాసమ్ (సం)

కర్త : లొల్ల లక్ష్మీధరుడు,

ధర్మశాస్త్ర గ్రంథం. లక్ష్మీధరుడు దీనిని వ్రాసి, ప్రతాపరుద్ర గజపతి పేరు పెట్టాడట. (తె.వి.స-4)

## సరిగమల పద్యాలు (చాటువులు)

పద్యాలలో "సరిగమ పదని" అనే ఏడు అక్షరాలు వచ్చేటట్లు కవులు పద్యాలు చెప్పారు. "సామని నీపని గాదా?" మొదలగు పద్యాలు చాటువులుగా ప్రసిద్ధమైనవి. ఈ కవుల వివరాలు తెలియవు. (చా. ప. ర.)

## సర్పపుర మాహాత్మ్యము

కర్త : కూచిమంచి తిమ్మకవి.
అంకితం : సర్పపురంలోని భావనారాయణస్వామికి.
రచనాకాలం : క్రీ. శ. 1764 ప్రాంతం.
ముద్రణకాలం : 1948.

మూడాశ్వాసాల కావ్యం. గోదావరీమండలంలో కాకినాడకు రెండుమైళ్ళదూరంలో ఉన్న సర్పపుర క్షేత్రమాహాత్మ్యాన్ని తెలిపే కథ. దీనికిమూలం బ్రహ్మవైవర్త పురాణంలో ఉన్నదట. సర్పపురంలోని మూడు సరస్సుల (అనంత, నారద, ముక్తి) కథలను కవి చక్కని ప్రౌఢశైలిలో చెప్పాడు. సర్పవరం దేవస్థానంవారు ఈ కావ్యాన్ని "శ్రీ సర్పపుర మాహాత్మ్యము" గా ముద్రించారు. (సా. ప. ప. 1948)

## సర్వంకష వ్యాఖ్య (సం)

కర్త : కోలచల మల్లినాథసూరి.

సంస్కృతంలో మాఘుడు వ్రాసిన "శిశుపాలవధ" కు మనోహరమైన వ్యాఖ్య. (తె. వి. స-4)

## సర్వకామదా పరిణయము

కాలం : క్రీ. శ. 19 వ శతాబ్ద పూర్వార్థం.
కర్త : చూ. శిష్టు కృష్ణమూర్తి శాస్త్రి.

అంకితం : కాకర్లపూడి వేంకటకృష్ణరాజుకు.

కవి రామచంద్రపురం జమీందారుల ఆస్థాన విద్వాంసుడు. కాకర్లపూడి వేంకటకృష్ణరాజు చేత సన్మానింపబడి వారికి అంకితమీయవలెననే తలంపుతో ఈ రచన చేశాడు. పిండిప్రోలు లక్ష్మణకవి కపటప్రబంధం వలన ఈ కృతి సమర్పణ ఆగిపోయిందనీ, కవికి అవమానం జరిగిందనీ ఒక గాథఉంది. కాని కృతిసమర్పణ నిర్విఘ్నంగా కొనసాగిందని, కృతిభర్త కవిని విశేషంగా గౌరవించారనీ కొందరు వ్రాశారు. ఈకావ్యం పిల్ల వసుచరిత్రగా ప్రసిద్ధిపొందింది. (ఆం. సం. సా-529, 328)

## సర్వజ్ఞ పద్మనాయక భూపాలుడు

కాలం : క్రీ. శ. 16 వ శతాబ్ది.

రచన : సారంగధర చరిత్ర (యక్షగానం).

విశిష్టత: రాచకొండ- దేవరకొండ రాజ్యాల నేలిన పద్మనాయక వంశీయుల్లో ముగ్గురు సర్వజ్ఞులున్నారు. వారి అందరి తల్లులూ పోచమదేవులే ; ఈ సర్వజ్ఞుని తల్లి కాచమదేవి.

ఇతడు ఆగమ పురాణేతిహాసవేది. వీణాది సంగీత విద్యా వినోది. సనాతన "గాన శాస్త్ర ప్రబంధకర్తల కరుణ వడసి" సారంగధర చరిత్ర వ్రాశాడట. ఈయక్షగానం అముద్రితం. (ము. మా.)

## సర్వజ్ఞ సింగభూపాలుడు

కాలం : క్రీ.శ. 14వ శతాబ్దం

స్థలం : రాచకొండ.

రచనలు : 1. రసార్ణవ సుధాకరమ్ (సంస్కృత అలంకార శాస్త్రం) 2. సంగీత సుధాకరమ్ 3. కందర్పసంభవమ్ (భాణం-అలభ్యం) 4. కువలయావళి (సంస్కృత నాటిక) (నామాంతరం. రత్నపాంచాలిక.)

రాచకొండ రాజధానిగా రాజ్యంచేసిన పద్మనాయక ప్రభువు (1384-99). ఇతని రచనలలో కందర్ప సంభవము తప్ప అన్నీ లభ్యాలు. రసార్ణవ సుధాకరమ్ మూడు విలాసాలు (భాగాలు)న్న నాట్యాలంకార శాస్త్ర గ్రంథం. రసభావనాట్య విషయాలను లక్షణోదాహరణలతో సహ వివరించాడు. స్వయంగా కొన్ని రూపక భేదాలను కూడా వ్రాశాడు. సంగీత సుధాకరం శార్ఙ్గదేవుని సంగీత రత్నాకరానికి వ్యాఖ్యానం. ఇతని ఆస్థానంలో విశ్వేశ్వరకవి, పశుపతి పండితుడు, పశుపతి నాగనాథుడు, అమరకోశ వ్యాఖ్యాత బొమ్మకంటి అప్పయామాత్యుడు, శాకల్య మల్లిభట్టు, అతనిని ఓడించిన వేదాంత దేశిక వరదాచార్యుడు ఉండేవారు. ఇతడు పాండితీ ప్రకర్షగల రాజ కవి. మొదట శైవుడు. తర్వాత వైష్ణవుడై వైష్ణవాన్ని ఆచరించాడు. సంస్కృతంలోని అలంకార, నాట్యశాస్త్ర గ్రంథాల్లో ఈ కవి రచించిన "రసార్ణవ సుధాకరా"నికి,

సంగీత సుధాకరానికి విశిష్ట స్థానముంది. తెలుగులో ఇతని కువలయావళి నాటకానికి చాలా అనువాదాలున్నాయి.

ఈ రేచర్ల వెలమ ప్రభువును కీర్తిస్తూ కొన్ని చాటువులున్నాయి. ఈయన రణ విజేతయైన తరవాత "రణముకుడుపు" ప్రక్రియ నెలా చేశాడో చాటు వొకటి వివరించింది. ఈయన సుకవుల పాండిత్యాన్ని మెచ్చుకొని ఉన్నత సత్కారాలతో వారిని గౌరవించి పంపేవాడట. (ఆరుద్ర-3 4.) (చా.ప.ర.)

## సర్వతోభద్ర (సం)

కర్త : కంపం యల్లయార్యుడు

ఈ పుస్తకం వ్రాసినట్లు కవి స్మృతి కదంబంలో చెప్పాడు. (తె.వి.స-4)

## సర్వదర్శన సంగ్రహమ్ (సం)

కర్త : విద్యారణ్యుడు.

(తె.వి.స-4)

## సర్వదేవుడు

కాలం : క్రీ. శ. 953 ప్రాంతం.

రచనలు : ఆదిపురాణము, విరాటము.

ఇతడు కన్నడంలో పొన్నకవి అని పేరు పొందినవాడట. ఇతని తెలుగు రచనలు అలభ్యాలు. ఎడపాటి ఎర్రన ఇతన్ని స్తుతించాడు. వేటూరి వారి ప్రబంధ రత్నావళిలో ఇతని పద్యాలు ఉదాహృతాలు. (క.స-283)

## సర్వపథీన వ్యాఖ్య (సం)

కర్త : కొలచెల మల్లినాథసూరి.

సంస్కృతంలో "భట్టి"కావ్యానికిది మనోహరమైన వ్యాఖ్య. (తె.వి.స-4)

## సర్వమంగళా విభుత్వ స్థాపనమ్ (సం)

కర్త : చూ. పేరి కాశీనాథశాస్త్రి.

(ఆం.సం.సా-427)

## సర్వమంగళీయము

కర్త : వవిలుంట సర్వమంగళేశ్వరశాస్త్రి.

వ్యాకరణ గ్రంథం.

## సర్వ మధురము

రచన : పాలయారాధ్యులు (చూ).

అచ్చతెనుగు కావ్యం అయోధ్యా నగరపాలకుడైన అంబరీషుని తనయ శ్రీమతి మహావిష్ణువును పరిణయమాడిన గాథ ఇందలి వృత్తాంతం. ఈ గ్రంథం మూడు భాగాలుగా

ఉంది. ఒక్కో భాగాన్ని ఒక్కో "విన్నపము"గా కవి పేర్కొన్నాడు మూడు విన్నపాలలో మొత్తం 520 పద్యాలున్నాయి. కవిత్వం మృదుమధురంగా ఉంది. వరంగల్ శైవ ప్రచారిణీ ముద్రాక్షరశాలలో ముద్రితం. (అం. సం. సా.)

**సర్వలక్షణ శిరోమణి**

కాలం : క్రీ. శ. 17 వ శతాబ్ది.

కర్త : గణపవరపు వేంకటకవి.

లక్షణగ్రంథం. ఇందులో పది ఉల్లాసాలు ఉన్నాయి. 6, 7, 8, 9 ఉల్లాసాలు అలభ్యం. మిగిలినవి లభ్యాలు. ఒక్కొక్క ఉల్లాసం ఒక గ్రంథంగా కనిపిస్తుంది. పేర్లు కూడా విడిగా ఉన్నాయి. మొదటి ఉల్లాసంలో అలంకార శాస్త్రవిషయాలు వివరింపబడ్డాయి. రెండో ఉల్లాసంలో "వేంకటేశాంధ్ర నిఘంటువు" చెప్పబడింది. మూడో ఉల్లాసం వ్యాకరణ విషయకం. దీన్నే "ఆంధ్రకౌముది" అంటారు. నాలుగో ఉల్లాసంలో ఛందోవిషయాల వివరణ ఉంది. ఐదో ఉల్లాసంలో రేఫ ఱకార-నిర్ణయం, పదో ఉల్లాసంలో "ద్విరూపకోశం" చెప్పబడ్డాయి అయితే పైవాటిలో రెండో ఉల్లాసం మూడో ఉల్లాసం మాత్రమే ముద్రితాలు. (ఛం. ప. కో) (క. శ-12-234)

**సర్వలక్షణ సారసంగ్రహము**

రచనాకాలం : క్రీ. శ. 1740 (రౌద్రిన.సంవత్సరం).

కర్త : కూచిమంచి తిమ్మకవి.

అంకితం : కుక్కుటేశ్వరస్వామికి.

దీనికి "లక్షణసార సంగ్రహం" అని నామాంతరం ఉంది. చిత్రకవి పెద్దన కూడా "లక్షణసార సంగ్రహం" అనే గ్రంథం వ్రాశాడు. దానికన్న ఇది భిన్నమనడానికే దీనికి "సర్వలక్షణ సార సంగ్రహం" అని వ్యవహారం కలిగింది.

ఇందులో మూడు ఆశ్వాసాలున్నాయి. మొదటి ఆశ్వాసంలో భాషావిభాగం, వర్ణాలు, కళలు, సంధులు, విభక్తులు: రెండో ఆశ్వాసంలో సమాసాలు, క్రియలు, విశేషణాలు, ప్రాసలు, యతులు, కొన్ని శబ్దస్వరూపాలు; మూడో ఆశ్వాసంలో రేఫ ఱకారములు వివరింపబడ్డాయి. ఛందస్సుకు సంబంధించినంతవరకు యతిప్రాసలే ఇందులో ఉన్నా పూర్వగ్రంథాలలో లేని కొన్ని విశేషాంశాలు ఇందులో ఉన్నాయి. అంతేకాకుండా అలభ్యమైన ఎర్రన రామాయణంలోని కొన్నిపద్యాలిందులో ఉదాహరింపబడటం విశేషం. ఇది ప్రధానంగా వ్యాకరణ గ్రంథం.

ప్రాచీనకవి ప్రయోగాలుండటం వలన లాక్షణికులు దీన్ని ప్రమాణగ్రంథంగా భావిస్తున్నారు. (ఛం. ప. కో) (తె. వి. స-4-815)

**సర్వలోకాశ్రయము (అలభ్యం)**

కర్త : దోనయామాత్యుడు

రచనాకాలం : క్రీ. శ. 14 వ శతాబ్దం.

చాళుక్యరాజైన ఉపేంద్రుని ప్రోత్సాహంతో ఈ రచన చేసినట్టు కవి చెప్పుకొన్నాడు.

## సర్వలోకేశ శతకము (అలభ్యం)

కర్త : చూ. నెల్లూరి వీరరాఘవ కవి.

దీనిని వ్రాసినట్లు కవి వసుంధరాపరిణయంలో చెప్పుకొన్నాడు.

(తె. వి. స-6) (ద. దే. వా. 259)

## సర్వశూన్య సహజా మనస్క నిరాలంబ మంజరి

కర్త . తెలియదు. (రామకృష్ణమ్మ కావచ్చును.)

కాలం : 18 వ శతాబ్దికి పూర్వం.

ద్విపదకావ్యం, పరబ్రహ్మలక్షణము, సృష్టిస్థితి-పరిణామములను చక్కగా, వివరిస్తున్నగ్రంథం. సుబ్రహ్మణ్యస్వామి అనేఅతను తన ఆత్మానుభవాన్ని ఉపదేశిస్తుండగా, అతని శిష్యుడు దీనిన్రవాసినట్లు తెలుస్తున్నది. ఆశిష్యుడు రామకృష్ణమ్మ కావచ్చును.

(ద్వి. సా. చ. 317)

## సర్వసిద్ధి వారు

ఇది ప్రజ్ఞాప్రకర్షల సూచకమైన ఇంటిపేరు. ఈవంశీయులలోని పూర్వులెవరో ఆయా విద్యలలో, సామర్థ్యాలను ప్రదర్శిస్తే వారికి అదే ఇంటిపేరుగా వచ్చి ఉండవచ్చునని ఒక అభిప్రాయం. భాట్లవారు, జనమంచివారు ఇలాంటి ఇంటిపేర్లు.

(భారతి-మా-45-229)

## సర్వాంగ సుందరీ విలాసము

కర్త : చూ. గిరిరాజకవి.

అంకితం : శహాజీకి

యక్షగాననాటకం. సర్వాంగసుందరికీ శహాజీకి జరిగిన పరిణయం ఇతివృత్తం ఇట్లాంటివి అనాది నద్య సాధారణంగా రాజుల గురించి ఆస్థానకవులు రచిస్తుండేవారు.

ఇది శహాజీ కాలపు సాంఘిక ఆచారాలు,వేషభాషలు విస్తరంగా తెలుపుతున్నది.

(య. గా. సం. 3-పీఠిక-2)

## సర్వాయి పాపని కథ

కర్త : తెలియదు.

జానపద చారిత్రక గేయం. J. A. Boyle దొర సేకరించిన జానపద గేయాలలో ఈ గేయం మొదటిది.

సర్వాయి పాపడు క్రీ. శ. 18వ శతాబ్దం ప్రథమార్ధానికి చెందినవాడు. ఈ

గేయానికి సంబంధించిన చారిత్రకాధారాలు Historic landmarks of Deccan T. W. Haig లోను, ఖాఫీఖాన్ చరిత్రము (రెండవ భాగం) అనే పారసీ గ్రంథం లోనూ లభిస్తాయి. ఈ పారసీ గ్రంథంలో పాపని కథ సుమారు 13 పేజీలలో వివరింపబడింది. ఆంధ్ర దేశంలో ప్రచారంలో ఉన్న గేయాన్ని అనుసరించి సర్వాయి పాపని కథ ఈ విధంగా ఉంది.

కథా నాయకుడు "బెలగాము"లో పుట్టి "తాటికొండ''లో పెరిగాడు. ఇంటి "నాశనోళ్లు". వీరికి అవులను కాయడం కులవృత్తి. పాపడు పెద్దవాడైన తరువాత అతనిలో రాజ్యకాంక్ష పెరిగింది. తల్లి అయిన "సర్వమ్మ"ను హింసించి, ఆమె దాచిన ధనమంతా తీసుకొని సైన్యాన్ని ప్రోగు చేసుకుంటాడు గోల్కొండ, వెల్లూరు, బందరు, కడప, కందనూలు, మైసూరు మొదలగు కోటలను కొల్లగొట్టడం అతని ఆశయం

ఏర్పరచుకున్న సైన్యంతో పాపడు గోల్కొండను ముట్టడించి, ఏడు గడియలు యుద్ధం చేసి కోటను వశపరచుకుంటాడు. తరువాత ఏడు గడియల కాలం గోల్కొండ సింహాసనాన్ని అధిష్ఠించాడు. అతని ఆశయం సిద్ధించింది. అంతలో శత్రువులు విజృంభించడంతో, పాపడు తనకు ఓటమి తప్పదని నిర్ణయించుకొని బాకుతో పొడుచుకొని చనిపోతాడు. ఇది కథ సారాంశం.

పాపడు వీరుడు. స్వతంత్రాభిలాషి. ఓరుగల్లునుండి గోల్కొండవరకున్న తురుష్క రాజులకు సింహ స్వప్నం. అందుకనే ఈ కథకు అంత ప్రాముఖ్యం లభించింది.

అయితే ఖాఫీఖాన్ చరిత్రలో ఇతడు దుర్మార్గుడుగా, క్రూరుడుగా, బందిపోటుగా వర్ణించబడ్డాడు

పాపడు ఇస్లాము మత ద్వేషి. సామ్రాజ్యాధికారాల మార్పు కాలంలో తెలంగాణ ప్రాంతంలో అల్లర్లు సృష్టించి, ముస్లిం రాజులకు కంటకమైనాడు. కాబట్టి మత పాక్షిక దృష్టితో అతడు చేసిన పనులను గోరంతలు కొండంతలు చేసి "ఖాఫీఖాన్ చరిత్ర"లో అట్లావ్రాసి ఉండవచ్చునని విమర్శకుల అభిప్రాయం. (తె. జా. సా.)

**సర్వేశ్వర చరిత్రము**

చూ. సర్వేశ్వర మాహాత్మ్యము.

**సర్వేశ్వర మాహాత్మ్యము**

నామాంతరాలు : తోళ్ళ చరిత్రము, సర్వేశ్వర చరిత్రము.

కర్త : చూ. పింగళి ఎల్లనార్యుడు.

అంకితం : సర్వేశ్వరుడైన క్రీస్తుకు.

క్రైస్తవ మత సిద్ధాంతాన్ని ప్రతిపాదించే నాలుగాశ్వాసాల ప్రబంధం. క్రైస్తవుడయిన ఎల్లనార్యుడు తుమ్మరాయపురెడ్డి ప్రేరణతో ఈ రచన చేశాడట. (తె. వి. స-8)

సర్వేశ్వర శతకము

కర్త : తెలియదు.

తమిళ దేశంలో వెల్వడిన తెలుగు శతకం. రచన మత్తేభ శార్దూల వృత్తాలలో ఉంది. యథావాక్కుల అన్నమయ్య కృతికంటె ఇది వేరైనది. (ద. దే. వా-పీఠిక-7)

సర్వేశ్వర శతకము

కర్త : యథావాక్కుల అన్నమయ్య.

రచనాకాలం : క్రీ. శ. 1242

విశిష్టత : వీరశైవ మత సంప్రదాయానుసారంగా 138 పద్యాలున్నాయి. శైవ మతంలోని 'దుస్తరభవోన్మాదం, 'వీరభక్తి' ఉంది. తీర్థ యాత్రల నిరసనముంది. కవితలో తత్సమ. తద్భవ శబ్దాలెక్కువ. శైలి హృద్యం. ధార అనర్గళం అన్నారుపండితులు. చక్కని పద్యాలున్నాయి. అన్నీ యథావాక్కులే. (ఆరుద్ర-3)

సవరం చిననారాయణ నాయకుడు

కాలం : 17వ శతాబ్దం.

స్థలం : చెంజి.

రచనలు : కువలయాశ్వ చరిత్ర.

గురువు : శఠగోపముని.

సవరం పెదనారాయణ నాయకుడీతని పెంపుడు తండ్రి. జనక పిత శ్రీరంగ రాయలు. సరస కవితా వైభవం గలవాడు. కథ చెప్పడంలో క్రొత్తదనం చూపాడు ఈ కవి కువలయాశ్వ చరిత్రను తన పెంపుడు తండ్రికే అంకిత మిచ్చాడు. చెంజి మండ లంలో కొంత భాగాన్ని ఈ నాయకులు పాలించేవారు. ఇతని కవిత్వం రసవంతంగా ఉంటుంది. (ఆరుద్ర-11-14)

సవరం పెదనారాయణ నాయకుడు

కాలం : 17 శతాబ్దం (క్రీ. శ. 1630 ప్రాంతం కావచ్చు.)

స్థలం : చెంజి మండలం.

సమకాలికుడు : మట్ల అనంతభూపాలుడు.

కువలయాశ్వ చరిత్ర కృతిపతి. సాహిత్య పోషకుడు. మూడవ వెంకటపతి రాయలకు విశ్వాసపాత్రుడుగా తుండీర మండలంలో కొంత భాగాన్ని పాలించేవాడు. ఇతని పెంపుడు కొడుకు సవరం చిన వెంకటపతిని తంజావూరు రాజు విజయ రాఘవుడు ఓడించి అక్కడ పంచనల్లూరు కట్టించాడట. కువల యాశ్వ చరిత్ర కృతికర్త చిన నారా యణ నాయకుడు ఇతని దత్తపుత్రుడు. (ఆరుద్ర-11-146)

సవిశేష నిర్విశేష శ్రీకృష్ణస్తవ రాజమ్ (సం)

కర్త : సంబార్యుడు.

స్తోత్ర గ్రంథం. (తె.వి.స-488)

సస్యానందము

కర్త : దోనయామాత్యుడు.

కృతిభర్త : సర్వసిద్ధి (ఎలమంచిలి) రాజధానిగా ఏలిన చాళుక్య ప్రభువు మూడో ఉపేంద్రుడు.

చంపూ కావ్యం. జ్యోతిషశాస్త్రాన్ని కవితతో మేళవించి వానరాకడను, పోకడను, చక్కని పద్యాల్లో చెప్పాడు. నిత్యం ప్రజలు వాడుకొనే కొన్ని మాటలున్నాయి, రచన దేశి పద్ధతిలో నడిచింది. కాళిదాసు "మేఘ సందేశం" లోని "ఆషాఢస్య ప్రథమ దివసే" ప్రాముఖ్యాన్ని సుబోధకంగా ఈ కావ్యంలో కవి వివరించాడు. (ఆరుద్ర-4)

సహస్ర కంధర రామాయణము

కర్త : చూ. ముద్దు లక్ష్మీనారాయణ కవి.

పౌరాణిక రచన. (ఆం.సం.సా-308)

సహస్ర ఘటాభిషేకము

కాలం : క్రీ.శ. 12, 15 శతాబ్దాల మధ్య కాలం.

ఆంధ్ర దేశంలో ఏ మూలనైనా క్షామ పరిస్థితులు సంభవిస్తే గ్రామ వాసులు ఆయా గ్రామాలలోని శివలింగాలకు శత ఘటాభిషేకంగాని, సహస్ర ఘటాభిషేకంగాని చేయించి శివుని పూజించటం కద్దు. ఈ సంప్రదాయం మధ్యయుగాంధ్ర దేశంలో ఎక్కువగా కనిపిస్తుంది. దీనివల్ల వరుణ దేవుడు కరుణించి దేశాన్ని సస్యశ్యామలం చేస్తాడని అనాటి ప్రజలు భక్తి పూర్వకంగా విశ్వసించేవారు.

(భా.పు-III-V-142; తెలుగు-ఏ-జా-77)

సహస్రావధానము

చూ. అవధానాలు.

సహేతుక నీతిశాస్త్రము

కర్త : వెలుగోటి సర్వజ్ఞకుమార యాచేంద్రులు.

నీతి సూత్రాలు వివరించిన రచన. (ఆం.సం.సా-462)

సాంఖ్యయోగము

కర్త : పరశురామపంతుల లింగమూర్తికవి.

సుబోధకంగా ఉన్న వేదాంత గ్రంథం. (తె.వి.స-4-789)

సాంఖ్య విచారము

కాలం : క్రీ.శ. 1800 ప్రాంతం.

కర్త : చెన్న బసవయ్య

ప్రత్యేకత : ఇది వచన రూపంలోని తత్వశాస్త్ర గ్రంథం. వాడుక భాషలో ఉంది. సాంఖ్యం షడ్దర్శనానాలలో ఒకటి. ఇందులో సాంఖ్య సూత్రాలు, వాటికి అనుగుణమైన ఇతర శ్లోకాలు, ఉదహరించి అద్వైత సిద్ధాంతాన్ని కవి విశదీకరించాడు. మహారాష్ట్రి భాషలో ముకుంద యోగి రచించిన వివేక సింధువును వచనంగా వ్రాసిన కాశ్చెన్న బసవేశ్వరుడు ఇతడే అయి ఉంటాడని పరిశీలకులు భావిస్తున్నారు. సాంఖ్య వర్ణనం ఉపలక్షణంగా దీనిలో అద్వైత వేదాంతార్థాలు ఉన్నవి. ఈ గ్రంథాన్ని చొక్కం నారాయణస్వామి ముద్రించారు. (వ.వా.-39) (ఆరుద్ర-9)

## సాంగత్య పదాలు

ఇవి కన్నడ పద ఛందస్సుకు సంబంధించినవి. ఇది కన్నడ భాషా ప్రభావం వల్ల తెలుగులో ప్రవేశించిన పద ప్రక్రియ. కన్నడంలో ఈ పదాలను రూపక తాళంలో గానం చేస్తారట. సాంగత్య పద మొక్కటి మన్నారు దేవుని హేమాబ్జ నాయికా స్వయంవర యక్షగానంలో కనిపిస్తున్నది. దీనిలోని చరణాలు ప్రశ్నోత్తర పరంపరగా సాగినవి. (య.వా.చ.-297)

## సాంత్వన రచనలు

సాంత్వనము అనే పేరు ఉన్న రచనలు. ఇవి విస్తర కవితాశాఖకు చెందినవి. అనునయించడం, ఊరడించడం ఈ కావ్యాలలో ప్రధాన ఘట్టంగా ఉంటుంది.

తెలుగులో దక్షిణాంధ్రయుగంలోనే ఇలాంటి రచనలు మొదలయినాయి. శృంగార ప్రధానాలైన రాధికాసాంత్వనం, సత్యభామాసాంత్వనం ఈ కోవకు చెందిన రచనలు.

## సాంపరాయని తెలుంగాధీశుడు

నామాంతరం : తెలుగురాయలు.

కాలం : క్రీ.శ. 15 శ. పూర్వార్ధం.

శ్రీనాథ విరచిత వల్లభాభ్యుదయ కావ్యానికి కృతిపతి.

శ్రీనాథ మహాకవి తనకు కస్తూరి దానంచేసిన తెలుగురాయల కోరికపై వల్లభాభ్యుదయం వ్రాసి అయనకు అంకితమిచ్చి ఉండవచ్చునని పరిశోధకుల నిర్ణయం. ఈయనపేరు కృష్ణాజిల్లా శ్రీకాకుళంలో వేంచేసియున్న తెలుగురాయల (ఆంధ్రవిష్ణువు) పేరు కావచ్చు. (శ్రీనాథుడు-156-159-కా. శ్రీ. మూ.)

## సాంబ నిఘంటువు

కర్త : కస్తూరి రంగకవి (చూ)

శతకరూపంలోఉన్న నిఘంటువు. సీసపద్యాలలో ఉంది. అచ్చతెనుగు పదాలకు సరైన సంస్కృతశబ్దాలు ఇందులో కవిచూపాడు. ఇతరనిఘంటువులలో లేని పదాలనేకం ఇందులో ఉన్నాయి. దీనిని సాంబమూర్తి రచించినట్లు కొందరు భావిస్తున్నారు.

"సకల సురచక్రవర్తి శ్రీ సాంబమూర్తి" అనే మకుటం ఉంది.

(శ. సా. వి; శ. క. చ. 704)

## సాంబమూర్తి

కాలం : క్రీ. శ. 1740 ప్రాంతం.

రచన : సాంబనిఘంటువు (శతకం)

కస్తూరిరంగకవిదిగా ప్రసిద్ధమైన సాంబనిఘంటుకర్త ఇతడని కొందరి అభిప్రాయం. (శ. సా. వి)

## సాంబవిలాసము

కవి : చిత్రకవి వేంకటరమణకవి. (చూ.)

అంకితం : సుబ్రహ్మణ్యేశ్వరంలోని స్వామికి.

కాలం : 16 వ శతాబ్దం చివరిభాగం, 17 వ శతాబ్ద ప్రారంభం.

మూడాశ్వాసాల శృంగార ప్రబంధం.

శ్రీకృష్ణుని కుమారుడైన సాంబునికి దుర్యోధనుని కుమార్తె లక్షణకు జరిగిన వివాహం ఇతివృత్తం. కవిత్వం సలక్షణంగా ప్రౌఢంగా ఉంది. దీనిప్రతి శిథిలావస్థలో ఉన్నదట. అప్పకవి దీనిలోనుండి లక్ష్యాలను గ్రహించాడు. ఇదే కథను సాంబోపాఖ్యానం పేరుతో రామరాజు రంగపరాజు, మోచర్ల నన్నయ పద్యకావ్యాలుగా వ్రాశారు.

(క. త-12-92)

## సాంబోపాఖ్యానము

కాలం : క్రీ.శ. 1600 కి పూర్వం.

కర్త : మోచర్ల నన్నయ.

అంకితం : తుమ్మిడి గ్రామం (నెల్లూరు)లోని బాలగోపాలస్వామికి.

ప్రత్యేకత : సర్వలక్షణాలు లక్షించి చెప్పిన ఐదాశ్వాసాల ప్రబంధం. ప్రముఖ లాక్షణికుడు అప్పకవి ఈ కావ్యంలోనుంచి రెండు ప్రయోగాలు స్వీకరించాడు. సాంబోపాఖ్యానాన్ని ఈ నన్నయకు ముందు రామరాజు రంగపరాజు ప్రబంధంగా చెప్పాడు. సాంబుడు కృష్ణునకు జాంబవతివల్ల కలిగిన పుత్రుడు. అతనికి దుర్యోధనుని పుత్రిక లక్షణతో జరిగిన వివాహం ఇందులోని కథ. హరివంశం మూలంలో ఈ కథ లేదు. సాంబోపాఖ్యానం కల్పిత ప్రబంధం. (ఆంధ్ర-9-238; క.త.)

## సాంబోపాఖ్యానము

కాలం : క్రీ.శ. 1550 ప్రాంతం.

కర్త : రామరాజు రంగప్పరాజు.

అంకితం : శ్రీరంగనాథునికి.

అష్టాదశ వర్ణనలున్న కావ్యం. శ్రీకృష్ణుని బాల్య క్రీడలు, ద్వారక వర్ణన,

రుక్మిణీ కృష్ణుల శృంగార క్రీడలు, ప్రద్యుమ్న జననం, శమంతకమణి కథ, జాంబవతీ కల్యాణం, సాంబుని జననం, సాంబుని పరిణయం మొదలయిన ఘట్టాలు ఇందులో ప్రబంధోచితంగా ఉన్నాయి. పేరు సాంబోపాఖ్యానమైనా సాంబుడు జన్మించేది నాలుగో ఆశ్వాసంలోనే. కవి కథలో చిన్న చిన్న మార్పులు చేశాడు. ఉత్తర హరి వంశంలో సంతాన ప్రాప్తి కోసం రుక్మిణి ప్రార్థిస్తే కృష్ణుడు తపస్సు చేయటానికి వెళతాడు. ఇందులో జాంబవతి కోరికపై కృష్ణుడు తపస్సుకు వెళ్ళినట్లు కవి రాశాడు.

ఈ కవి గురువూ, కళాపూర్ణోదయ కావ్య కృతిపతి గురువూ ఒక్కరే. కళాపూర్ణోదయంలోని కొన్ని వర్ణనలు చూసిన తరవాతనే రంగప్పరాజు సాంబోపాఖ్యానం వ్రాశాడనటానికి నిదర్శనాలున్నాయి. కళాపూర్ణోదయంలో మణిస్తంభుడు సుముఖాసత్తితో కలిసి సముద్రాన్ని చూసిన తరువాత వారికి కామోద్రేకం కలిగిందనీ, ఆ తరవాత పుత్రజననం జరిగిందనీ పింగళి సూరన్న వ్రాశాడు. సరిగ్గా ఇదే పద్ధతిలో రంగప్పరాజు సాంబోపాఖ్యానంలో కృష్ణుడు రుక్మిణితో కలిసి ఉప్పుకడలిని చూడటానికి వెళ్ళినట్లు, ఆ తరవాత ప్రద్యుమ్నుడు జన్మించినట్లూ చెప్పాడు. 9 పద్యాలలో సముద్ర వర్ణన ఉంది. రంగరాజు ఎవరిని అనుకరించినా అతని కవిత్వంలో కొన్ని సొగసులు లేక పోలేదు. (అరుద్ర-9)

## సాగర సంగ మాహాత్మ్యము

నామాంతరం : సప్తార్ణవ సంగ మాహాత్మ్యము.

కర్త : పంచిమంచి తిమ్మకవి.

అంకితం : పిఠాపురంలోని కుక్కుటేశ్వరస్వామికి.

రచనాకాలం : క్రీ.శ. 1740 ప్రాంతం.

లఘు కృతి. దీనికి మూలం బ్రహ్మాండపురాణంలోని వృద్ధప్రవంతీ సరిత్పతి సంగమ మాహాత్మ్యం కావచ్చును. ప్రౌఢమైన రచన. (తె.వి స-4-815; క.చ-3-27)

## సాతలూరి శాసనము (సం)

రచనాకాలం : క్రీ. శ. 848 ప్రాంతం.

శాసనకర్త : అష్టప్తి పండరంగడు.

శాసనప్రశస్తుడు : గుణగ విజయాదిత్యుడు.

విషయం : ఇందులో ప్రాసతో చంపకమాల ఉంది. సంస్కృత లక్షణానికి విలక్షణమయిన చంపకమాల వృత్తం, తెలుగు కవితా లక్షణమైన ప్రాసనియమం-నాటి తెలుగు భాష ప్రాచుర్యాన్ని తెలియచేస్తున్నాయి. (తె. క. చ-25)

## సాత్రాజితీయము

కర్త : పులహరి పిరోజి.

కాలం : క్రీ.శ. 19వ శతాబ్దం పూర్వార్థం.

ఈ యక్షగానంలో శమంతకోపాఖ్యానము, జాంబవతీ సత్యాకాళింది నాగ్నజిత్తి

భద్రాలక్షణా పరిణయ గాథలు, నరకాసుర సంహారకథ ఉన్నాయి.

దీనిలో ప్రసిద్ధ రాగతాళాలలో దరువులు, ద్విపదలు, కంద గీత సీసార్థాలు ఉన్నాయి. (య.వా చ.–121)

## సాత్త్విక బ్రహ్మవిద్యా విలాస నిరసనము

రచనా కాలం : క్రీ.శ. 1750 ప్రాంతం.

కర్త : బుద్ధిరాజు పేరయ కవి.

వచన గ్రంథం. శైవమత ప్రతిపాదికమైన రచన. పదకొండు ప్రకరణాలున్నాయి. ఇది వైష్ణవమత స్థాపక గ్రంథమైన సాత్త్విక బ్రహ్మ విద్యా విలాసానికి ఖండన గ్రంథం. శైవ మతమే సర్వోత్కృష్టమని చెప్పే ఈ రచన పినపాటి సర్వదేవారాధ్యుని ప్రేరణతో జరిగింది. అవతారిక మాత్రం పద్యాలలో ఉంది. మిగత గ్రంథమంతా వ్యావహారిక వచనంలో ఉంది.

దీనిలోని ప్రకరణాలు ఏకాదశ రుద్రుల ననుసరించి ఏర్పడ్డాయి. ప్రతి ప్రకరణారంభంలోనూ పద్యమున్నది. (క స.–133)

## సాత్త్విక బ్రహ్మవిద్యా విలాసము

కర్త : తెలియదు.

కాలం : క్రీ.శ. 18వ శతాబ్దం కావచ్చు.

వేదశాస్త్ర ప్రమాణ సిద్ధమయిన మతము వైష్ణవమా? లేక శైవమా అనే విషయాన్ని విపులంగా చర్చించి వైష్ణవమే సప్రమాణమైన మతమని ఈ గ్రంథం సిద్ధాంతీకరిస్తున్నది. వైదిక వ్యావహారికమైన వచనంలో రచింపబడింది. దీనిమీద శైవులు సాత్త్విక బ్రహ్మ విద్యా విలాస నిరసనమనే గ్రంథం రచించారు. (వ.వా–40)

## సాదము భైరయ కొణిదెన శాసనము

కాలం : క్రీ. శ. 1148 ప్రాంతం.

ప్రస్తావిత స్థలం : గుంటూరు జిల్లా చిలకలూరిపేట తాలూకా కొణిదెన.

శాసనప్రదాత : సాదము భైరయ.

శాసన విషయం : ఈ శాసనం–సాదము భైరయ అనే దాత కొట్యదొన (కొణిదెన)లో వేంచేసి యున్న భీమేశ్వరస్వామికి రెండు అఖండ దీపాలు నిలిపినట్లు చెబుతున్నది. దాత, భీమేశ్వర స్వామికి గుడి కట్టించాడట. దీనిలో ఒక కంద పద్యం, చివర గద్య ఉన్నవి. (తె. శ. చ–248)

## సాధనా శూరులు

జానపద కళాకారులు. ఒక గ్రామం నుంచి మరొక గ్రామానికి పోతూ ఆ గ్రామంలోని పద్మసాలీల అనుమతితో ప్రదర్శనలు ఇస్తుంటారు. పద్మసాలీలనే అర్థిస్తారు. వీరి ప్రదర్శన ఇంద్రజాలానికి సంబంధించింది. ఇది పగటివేళ సాధారణంగా

గ్రామ కూడలిలోని విశాల ప్రదేశంలో జరుగుతుంది. వీరు నిష్ఠతో ఉండి కనికట్టు గారడీ విద్యలు ప్రదర్శిస్తారు.

ఇద్దరు వ్యక్తులు రెండు రేకు పళ్ళేలు తీసుకొని, చేతులకు ఏదో ఆకుపసరు పూసుకుని దూరంగా నిలబడతారు. చేతులకు పూసుకొన్న పసరు ప్రభావం వల్ల వారి చేతులలో ఉన్న పళ్ళేలు ఒక్కసారి పైకెగిరి-రెండూ కొట్టుకొని మళ్ళీ యథాస్థానాన్ని చేరుకొంటాయి. ఇలాంటి అద్భుతమైన పనులు వీరు చాలా చేస్తారు. తెలంగాణాలోని కరీంనగర్ జిల్లా హుజూరాబాద్ తాలూకా వల్లభాపురంలో ఈ సాధనా శూరులు ఎక్కువగా ఉన్నారట. వీరు చేసే గారడీ, జానపదులను దిగ్భ్రాంతులను చేస్తుంది. (నా.ర.చ-294)

## సాధు మేధానిధి శతకము

నామాంతరం : రఘునాథ శతకము.

కర్త : పుష్పగిరి తిమ్మన.

"అనాథనాథ రఘునాథా సాధుమేధా నిధీ" అనే మకుటంతో అష్టోత్తర శత మత్తేభ శార్దూల వృత్తాలతో ఉంది. భక్తి వైరాగ్య ప్రధానమైన శతకం. చివరి పద్యాలు అసంపూర్తిగా ఉన్నాయి. రచన సుదీర్ఘ సమాసాలతో దుష్కర ప్రాసలతో ఉంది.

దీని ప్రతిని కేసరి సుందరరామశర్మ గారు సంపాదించి 1938 ప్రాంతంలో "స్వతంత్ర" వారపత్రికలో ప్రకటించారు. (శ.సా.వి-116)

## సాధ్వీజన ధర్మము (అలభ్యం)

కర్త : కాకునూరి అప్పకవి.

ఇది ద్విపద కావ్యం. కవి స్త్రీ ధర్మాలను ఇందులో పొందు పరచాడట. ఇది ధర్మ ద్విపదగా ప్రసిద్ధం. (అప్పకవీయం)

## సానంద గణేశ్వరము

నామాంతరం : ఆనందగణేశ్వరము (చూ).

కర్త : కొండముడుగు పురుషోత్తమకవి.

## సానంద చరిత్ర (అలభ్యం)

కర్త : నెల్లూరి వీరరాఘవ కవి (చూ).

## సానంద చరిత్ర

కర్త : భద్రకవి లింగకవి.

కృతిభర్త : శివయోగి వీరభద్రయ్య (జంగమదేవర).

మూడాశ్వాసాల ద్విపద కావ్యం. కవి ఈ కావ్యాన్ని నవరసాకరంగా, చారుతరంగా, జన మనోహరంగా చెప్పాడు. సానందుడనే ఋషి యమలోక వాసులను నరక బాధల నుంచి తప్పించే గాథ ఇది. ఈకథనే కోట శివరామకవి సానందోపాఖ్యానంగా రాశాడు. (ఆరుద్ర-9-228) (వ.దే.వా-16)

## సానందోపాఖ్యానము

రచనా కాలం : క్రీ.శ. 16వ శతాబ్ది.

కర్త : కోట శివరామ కవి.

ప్రత్యేకత : శృంగార వీర రసాలకే ప్రాముఖ్య మిచ్చి ప్రబంధాలు వ్రాసే కాలంలో అద్భుత భీభత్స భయానక రసాలకు ప్రాముఖ్య మిచ్చి, శాంతరసాన్ని దృష్టిలో పెట్టుకొని రాసిన గ్రంథం. నాలుగాశ్వాసాలున్నాయి. ధర్మ ప్రసంగుడనేముని, సానందు డనే ఋషికి చెప్పిన కథలు దీనిలో ఉన్నాయి పుణ్యాత్ములు పొందేగతులు, పాపాత్ములు చెందే వెతలు, కొందరు బాధలు పడటం, ఇంకొందరు సుఖాలనుభవించటం సానందుడు ప్రస్తావించి, దయామయుడయిన దేవుని పక్షపాతం చూసి విమర్శించటం దీనిలోని ఇతివృత్తం.

నరకాన్ని కళ్ళారా చూసి, గుండెకరిగి, శివపంచాక్షరీ మంత్రంతో పాపులందరికీ విమోచనం కలిగించాడు సానందుడు. దీనిలో యమయాతనలు, నరక బాధలు కళ్ళకు కట్టి నట్లు కవి చిత్రించాడు. మానవులు చేయగలిగినన్ని పాపాలు, వాటి ఫలితంగా అనుభవించే దుర్భర కఠిన శిక్షలు ఇందులో పేర్కొనబడ్డాయి ఈ సానందుని కథను అనపోటి రాజుల కాలంలో భద్రకవి లింగకవి మూడాశ్వాసాల ద్విపద కావ్యంగా చెప్పాడు.

(ఆంధ్ర 9-248)

## సామినేని ముద్దు నరసింహం నాయుడు

కాలం : క్రీ.శ. 19వ శతాబ్ది పూర్వార్థం.

రచనలు : తెలియరాలేదు.

గ్రాంథిక వ్యావహారిక భాషా వాదాలలో వ్యావహారిక భాషను సమర్థించిన పండితుడు. సిద్ధాంత చర్చచేసి అర్ధానుస్వార శకటరేఫలను తీసివేయాలని చెప్పిన వారిలో ఇతనే ప్రథముడు. వీరి వ్యాసాలు కొన్ని (1840లో రచించినవి) ఆయన మరణానంతరం 1862 లో అచ్చుపడ్డాయి. (తె.భా.చ.-269)

## సాముద్రిక శాస్త్రము (అలభ్యం)

కర్త : గంగరాజు చౌడయ్య.

రచనా కాలం : క్రీ.శ. 1560కి పూర్వం.

అంకితం : కసవయామాత్యునికి.

పెదపాటి జగ్గన తన ప్రబంధ రత్నాకరంలో ఇందులోని రెండు పద్యాలను ఉదాహరించాడు. (ఆంధ్ర-9)

## సాముద్రిక శాస్త్రము

కర్త : లింగయ్య

పద్య కావ్యం. (క.ప-213)

వేశాడనీ, తరువాత విజయవిలాసంలోని ఆశ్వాసాద్యంత పద్యాలు చేర్చి ప్రతి విలేఖరి ఈ కావ్య ప్రతి తయారు చేసుకున్నాడనీ అంటారు. ఈ కావ్యం చేమకూర కవిదే అని అన డానికి విజయ విలాసానికీ, దీనికీ ఉన్న శైలీ సాదృశ్యం ఒక్కటే ఆధారం.

పేర్లలో కొన్ని మార్పులు తప్ప ఈ కావ్యం అంతా గౌరన రచనను అనుసరించే ఉంది.

కవి ప్రతిభా స్ఫోరకాలైన పద్య రచనా చమత్కృతి, తెలుగు నుడికారం, కావ్యంలో కనిపిస్తున్నవి. తెలుగువారి ఆచార వ్యవహారాలు, లోకోక్తులు కావ్యం నిండా పుష్కలంగా ఉన్నాయి. శబ్ద శిల్పం విజయవిలాసం కంటె సారంగధర చరిత్రలోనే హెచ్చు అని పండితాభిప్రాయం.

వేట వర్ణన, వేట కుక్కలకు పేర్లు పెట్టుకోవడం–చెంచుల వేష భాషలు, విలక్షణమైన ప్రాంతీయ వేషభాషా స్వరూపాలను ఈ కావ్యంలో చూడవచ్చు.

(క. క–12–45)

## సారంగధర చరిత్ర

రచనాకాలం : క్రీ. శ. 18వ శతాబ్దానికి పూర్వం.
కర్త : పరశురాముడు.

ద్విపద కావ్యం. ప్రతి అసమగ్రంగా ఉంది. కథలో చిన్న చిన్న మార్పు లున్నాయి. రత్నాంగి, చిత్రాంగి ఇద్దరూ రాజరాజ నరేంద్రుని పట్టపు దేవులని కవి చెప్పాడు. రచన అంత ప్రశస్తం కాదట. దీనిప్రతి వేంకటేశ్వర ప్రాచ్య పరిశోధనా సంస్థలో ఉంది. (ద్వి.సా.చ–450)

## సారంగధర చరిత్ర

కర్త : చూ. దాణాల శంభుదాసుడు.

ఇది మూడాశ్వాసాల ద్విపద కావ్యం. దీనిని ప్రకటించిన వేదం వేంకటరాయ శాస్త్రి–ఇది రసోత్తరమని, మృదు మధురమని, నీతి ధర్మజ్ఞాన ప్రధానమని ప్రశంసించారు.

అప్పన్న రచన ననుసరించి తాను రచించానని కవి చెప్పుకొన్నాడు. శృంగార, కరుణ రసాలు అద్భుతంగా పోషించాడు. (తె. వి. స–6)

## సారంగధర చరిత్ర

కర్త : సముఖము వేంకటకృష్ణప్ప నాయకుడు.
అంకితం : శ్రీరంగేశ్వరునికి (చూ).

మూడాశ్వాసాల వచన కావ్యం. చేమకూర వేంకటకవి సారంగధర చరిత్ర చూసి, దీన్ని రచించి ఉంటాడని పండితాభిప్రాయం.

ఆశ్వాసాద్యంతాలలో పద్యాలున్నవి. రసవంతమైన శైలి. మొదటి ముద్రిత ప్రతిలో ఇందులోని కొన్ని భాగాలు వదిలి పెట్టారు. తర్వాత అవి గద్య చింతామణి

(వచన సంకలన గ్రంథం-1933)లోను, శృంగార కావ్యగ్రంథ మండలి వారి 3వ గ్రంథం మైన అహల్యా సంక్రందనంతోపాటు అచ్చయ్యాయి. (ద. దే. వా-352)

## సారంగధర చరిత్ర

కర్త : సర్వజ్ఞ పద్మనాయక భూపాలుడు.

ప్రాచీన యక్షగానాలలో ఒకటి. ఈ తాళపత్రప్రతి ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడెమిలో ఉంది రచన గౌరనను అనుసరించి ఉంది. సారంగధరుని చరిత్రను తెలుగులో తొలిసారిగా పరిచయం చేసినవాడు గౌరన. అతని నవనాథ చరిత్రలో సారంగధరుని కథ ఉంది. రాజమహేంద్రవర కథకు ఈ సారంగధరుని కథకూ ఏమీ సంబంధం లేకపోయినా ఈ గాథ రాజమహేంద్రవరంలో జరిగినట్లు ప్రఖ్యాతమైంది. సర్వజ్ఞ పద్మనాయక భూపాలుడు కూడా తన యక్షగానంలో రాజమహేంద్రవరంలోనే ఈ కథ జరిగినట్లు వ్రాశాడు. (మ. మా.)

## సారంగధర చరిత్రము (కన్నడం)

కర్త : బొమ్మలాట సాంబయ్య.

రచనా కాలం : క్రీ. శ. 1750 ప్రాంతం.

కన్నడ భాషలో బొమ్మలాటకు అనువుగా తీర్చిదిద్దిన యక్షగానం. కన్నడ ప్రాంతాలలో దీనిని ప్రదర్శించేవారట. కవిదీన్ని తెలుగులో కూడా వ్రాసి ఉండవచ్చును. కిరాతార్జునీయ యక్షగానాన్ని ఈ కవీ, అతని సోదరుడూ (శంభరధరుడు) కలసి రచించారని తెలుస్తున్నది. (య. వా. చ-48)

## సారంగధర నాటకము

రచనా కాలం : క్రీ.శ. 18 వ శతాబ్దం పూర్వార్ధం.

కర్త : సిరిప్రెగడ సుబ్బారాయడు.

శివాంకితం. ఈ యక్షగానాన్ని కవి నాటకంగా పేర్కొన్నాడు. ఇది పాడటానికి, ప్రదర్శనకు కూడా అనువుగా ఉంది. రచన వ్యావహారిక భాషలో సాగింది. (య.వా.చ-100)

## సారంగధర నృప చరిత్రము

నామాంతరం : సారంగధర చరిత్ర.

కర్త : చూ. కూచిమంచి తిమ్మకవి.

అంకితం : పిఠాపురంలోని కుక్కుటేశ్వరస్వామికి.

రచనాకాలం : క్రీ.శ. 1728 ప్రాంతం.

ద్విపద కావ్యం. కథ ప్రసిద్ధమైనదే. కొన్ని చిన్న మార్పులున్నాయి. కవి చిత్రాంగిని రాజు భార్యగా కాక భోగస్త్రీగా చిత్రించాడు.

కవికి ఈశ్వరుడు కలలో కనిపించి ఈ కావ్యాన్ని అంకితం కోరాడట శైలి

మనోహరంగా ఉంది. ఈ కథ తెలుగు దేశంలో రాజమహేంద్రవరంలో జరిగినట్లు కవి వ్రాశాడు. (క.త-13-190)

## సారంగధర-బతుకమ్మ పాట

కరుణరస ప్రధానమైన జానపద గేయం. ఇతివృత్తం ప్రసిద్ధం.

చూ. కరుణరస గేయములు. (ఆం.వా.చ.)

## సారంగ పదాలు

రచనా విశేషం. ఇవి తుమ్మెద, వెన్నెల పదాల వలెనే యక్షగానాలలో ప్రయుక్తాలు. లింగమూర్తి కవి వ్రాసిన శివ పారిజాత యక్షగానంలో ఉన్నాయి.

"సారంగ" పేరుతో ఒక సంగీత రాగం ఉంది. (య.వా.చ-279)

## సారంగపాణి

కాలం : క్రీ.శ. 19 వ శతాబ్దం.

స్థలం : కార్వేటినగర సంస్థానం.

రచనలు : సారంగపాణి పదములు, వేణుగోపాల శతకము మొదలగునవి.

సుప్రసిద్ధ పదకర్త. కార్వేటినగర సంస్థాన పాలకుడైన కుమార వేంకట పెరుమాళ్ళు రాజు బహద్దరు ఆస్థానంలోని అష్టదిగ్గజాలలో ఒకడు. ఇతని పదాలు నాయికా నాయకుల సంభృత ప్రేమకు ఆలవాలాలు. వేణుగోపాల శతకము కర్తృత్వం వివాదాస్పదంగా ఉంది. (ఆం.సం.సా.)

## సారంగపాణి పదములు

కర్త : చూ. సారంగపాణి.

పద సాహిత్యంలో మిక్కిలి ప్రసిద్ధిపొందినవి. నాయికా నాయకుల పవిత్ర ప్రేమకు ఆలవాలమైన పదాలు రచించడంలో ఈ కవిది అందెవేసిన చేయి. రచన పండిత పామర జన రంజకంగా చక్కని వ్యావహారిక భాషలో ఉంది. వ్యాకరణ విరుద్ధమైన ప్రయోగాలున్నాయి. (ఆం. సం. సా.)

## సారంగు తమ్మయ్య

కాలం : క్రీ. శ. 1680 ప్రాంతం.

స్థలం : గోలకొండ.

రచనలు : 1. వైజయంతీ విలాసము 2. భక్తిసంజీవిని (పం).

పోషణ : గోలకొండనవాబు మహమ్మద్ కుతుబ్ శాహి.

విశిష్టత : నరసింహమంత్రి పుత్రుడు. తమ్మయపౌత్రుడు. ఈయన గోలకొండ నవాబు మహమ్మద్‌షా కొలువులో ఉంటూ గోలకొండకు కరణీకం చేసేవాడు. వీరి మూల పురుషుని పేరు సారంగధరుడు కావడంవల్ల వీరిని సారంగు వారని వ్యవహరించేవారు. వీరు గణిత విద్యా విశారదులు. ఇతడు రాజకుదాలా సన్నిహితుడు. పన్నిద్దరాళ్వారులలో

ఒకడయిన విప్రనారాయణ చరిత్రను కావ్యంగా వ్రాశాడు. విప్రనారాయణుడు విష్ణుమూర్తి మెడలోఉండే "వైజయంతి" అనే మాలిక అవతారమట. అకారణంగా అకథకు వైజయంతీ విలాసమనే పేరు పెట్టివ్రాశాడు. తాళ్ళపాక చిన్నన్న రచించిన పరమయోగి విలాసంలోనూ, సిద్ధిరాజు తిమ్మరాజు రచించిన పరమయోగి విలాసంలోనూ విప్రనారాయణుని కథ ఉంది. దాన్ని ఇతడు ప్రత్యేకకావ్యంగా వ్రాశాడు. ఇతడు గోలకొండ నగరాన్ని తన సంస్కృత రచనలో భాగీరథీపట్టణంగా పేర్కొన్నాడు. అదే తరువాత భాగ్యనగరంగా మారింది. చక్కని హాస్యమూ, చల్లని జాతీయాలూ ఇతని సొత్తు. (అరుద్ర-8-166)

## సారసంగ్రహ గణితము

రచనా కాలం : క్రీ. శ. 16 వ శతాబ్దం ఉత్తరభాగం.

కర్త : ఎలుగంటి పెద్దన.

మూలం : వీరాచార్యుల సారసంగ్రహ గణితమ్.

ప్రత్యేకత : సంస్కృతంలో ఉన్న శాస్త్రగ్రంథాలను వివిధ యుగాలలో తెలుగు కవులు అనువదించారు. మొదటిసారిగా ఈ గ్రంథాన్ని పావులూరి మల్లన (చాళుక్యయుగం)తెలుగు చేశాడు. దానినే అనంతరం అరవీటి రాజులయుగంలో ఎలుగంటి పెద్దన అనువదించాడు. భిన్న ప్రకీర్ణ గణితాల ప్రతిఒకటి ప్రాచ్యలిఖిత గ్రంథాలయంలో అసమగ్రంగా, అముద్రితంగా ఉంది. (అరుద్ర-9-247)

## సావిత్రి కథ (అలభ్యం)

కవి : తులసి బసవయ్య.

ప్రబంధం. ఇందులోని 26 పద్యాలను పెదపాటి జగ్గన్న ఉదాహరించాడు. (అరుద్ర-9)

## సావిత్రీ కల్యాణము

నామాంతరం : శ్రీ-గారి సావిత్రి (చూ).

కర్త : రఘునాథ నాయకుడు

## సావిత్రీ చరిత్రము (అలభ్యం)

రచనా కాలం : క్రీ.శ. 17 వ శతాబ్ది ప్రథమభాగం.

కర్త : చూ. కుమార ధూర్జటి.

పౌరాణిక రచన. ఇది కుమారధూర్జటి రచన అని "కృష్ణ విజయం" అవతారిక ద్వారా తెలుస్తున్నది (క. త.)

## సాహిణి మారుడు (మారన)

కాలం : క్రీ. శ. 13 వ శతాబ్దం.

సాహిత్య పోషకుడు. కృతిపతి. ముప్పయి ఇద్దరు మంత్రులున్న సీసమాలిక ఈయన గురించి తెలుపుతున్నది. ఈయన పాలకుడుగా, సేనాపతిగా, అశ్వాధికారిగా

ఉన్నట్లు భాస్కర రామాయణంలోని కాండాంత పద్యాల వల్ల తెలుస్తున్నది. ఈయన దాతృత్వాన్ని తెలుపుతూ చాటువులున్నాయి.

హుళక్కి భాస్కరుడు ఇతని ఆస్థానంలో ఉండేవాడు. అతడు రచించిన భాస్కర రామాయణ యుద్ధకాండ, "దశగతులు" అనే గ్రంథం, ఈ సాహిణి మారనకు అంకితాలు. (వా. ప. ర.)

## సాహిత్య గోష్ఠులు (సభలు)

ఆంధ్రదేశంలో ప్రాచీన కాలం నుండి రాజాస్థానాలలో సాహిత్యగోష్ఠులు నిర్వహింప బడుతుండేవి. మధ్యయుగాంధ్ర దేశంలో కవి పండితులను ఆహ్వానించి రాజులు సాహిత్యగోష్ఠులు నిర్వహించినట్లు తెలియవస్తున్నది. ఈగోష్ఠులలోని కవి పండితులందరూ ఎదుటి వారి వాదాలను-(సాహిత్య విషయాలు గాని, శాస్త్రవిషయాలు గాని) పూర్వపక్షం చేసి తమ సిద్ధాంతాన్ని స్పష్టంగా స్థాపించేవారు. ఈ సభలలో వారివారి ప్రతిభా వ్యుత్పత్తులు, ధారణ కూడా గుర్తింపు పొందడానికి అవకాశాలు ఎక్కువగా ఉండేవి.

సాధారణంగా సాహిత్యగోష్ఠులలో కార్యక్రమము ఈ దిగువ విధంగా ఉండేది.

1. సంస్కృతం, ప్రాకృతం, శౌరసేని మొదలగు ఎనిమిది భాషలలోగాని, ఏ ఒక్క దానిలోనైనా గాని 24 నిముషాలలోపల ఆశువుగా 100 పద్యాలు చెప్పటం 2. ఊహించని విధంగా ఒకరడిగిన విషయాన్ని ఇచ్చిన ధాతువులను ఉపయోగించి గాని, అడిగిన రసపరంగా నిర్ణీతసమయంలో వర్ణించటం 3. ఒక పండితుడు గాని, కవిగాని ఏదైనా ఒక పద్యాన్ని రెండు మూడుసార్లు చదివి – తిరిగి ఎదుటివ్యక్తిని దానిని వెంటనే అప్పగించమనటం 4. అష్టావధాన, శతావధాన, చిత్రావధానాదులను నిర్వహించటం, 5. నిర్ణీతసమయంలో ఒక గీతికను రాగభావయుక్తంగా సభాసదులు మెచ్చేటట్లు గానం చేయటం, 6. ఏక సంథా గ్రాహిగా ధారణ చేసి ప్రశ్నించేవారి మనసులో ఉన్న భావాలను పేర్లను, గూఢకార్యాలను తెలుసుకొని – సభాసదులకు తెలియచెప్పటం, 7. నిషేధాక్షరి వంటి ప్రక్రియలో నిరోష్ఠ్యంగా, నిష్కంఠ్యంగా, ఆశువుగా పద్యాలు చెప్పటం; అడిగిన ఛందస్సులో పద్యాన్ని ఇమడ్చటం, 8. సమస్యా పూరణం.

జక్కన "విక్రమార్కచరిత్ర" కృత్యాది పద్యాలలో సాహిత్య గోష్ఠుల గురించి వర్ణించి-ఆయా విషయాలలో తాను నిష్ణాతుడని చెప్పుకొన్నాడు. అట్లే వెన్నెలకంటి అన్నయ తన 'షోడశ కుమార చరిత్ర'లో ఈగోష్ఠులను ప్రస్తావించి తానుపండితులు మెచ్చేటట్లు కావ్యరచన చేశానని చెప్పాడు.

విశేష ధారణాశక్తి, అపూర్వనైపుణ్యం, అనన్యసామాన్యమైన ప్రతిభా వ్యుత్పత్తులున్న కవి పండితులే రాజాస్థానాంలో జరిగే సాహిత్య గోష్ఠులలో పాల్గొనే వారు. ఈ గోష్ఠులకు శ్రీకృష్ణదేవరాయల "భువన విజయ సభ" రఘునాథ నాయకుని విజయభవనము, విజయరాఘవుని విజయరాఘవ విలాసము ప్రఖ్యాతాలు. (రె రా.చ)

## సాహిత్య చింతామణి (సం)

కర్త : చూ. పెదకోమటి వేమారెడ్డి.

ఇది మమ్మటుని "కావ్య ప్రకాశమ్" పద్ధతిలో నడిచిన అలంకార శాస్త్ర గ్రంథం. "కుసుమాయుధుడు," అనే సంస్కృత కవిని కర్త పేర్కొన్నాడు. (రె.రా.చ.)

## సాహిత్య రత్నాకరమ్ (సం)

కర్త : చూ. వారణాసి ధర్మసూరి.

దీనిలో కవి "ప్రతాపరుద్ర యశోభూషణ" కర్తయైన విద్యానాథుని రెండు సార్లు, "రసార్ణవ సుధాకరమ్" కర్తయైన సర్వజ్ఞ సింగభూపాలుని ఒకసారి పేర్కొన్నాడు.

ఇది బాగా కీర్తి ప్రచారాలను పొందిన గ్రంథం. ఉత్కల దేశ (ఒరిస్సా) పండితుడు సుమారు ఏభై సంవత్సరాల క్రిందట కూడా దీనికి వ్యాఖ్య వ్రాశాడు. ఒక నాట్య, నాటక ఒర్చ చెప్ప అన్ని విషయాలు దీనిలో సమీక్షించడం జరిగింది. మనుష్య మాత్రుడైన ప్రతాపరుద్రునికి విద్యానాథుడు తన "ప్రతాపరుద్ర యశోభూషణాన్ని" కృతి ఇచ్చినందుకు, తత్కర్త పేరెత్తకుండ అతనిని "కుక్షింభరి" అని దూషించి, ధర్మసూరి కృతిని "రామచంద్ర యశోఘనసార సురభిళం"గా వ్రాశాడట. దీనిలో లక్ష్యాలుగా చూపిన శ్లోకాలు అన్నీ రామచంద్ర గుణ కీర్తనాత్మకాలు. దీనిలో శృంగార మొక్కటే రసమనే భోజుని మతాన్ని నిరసించి, ధర్మసూరి సత్సంప్రదాయ లోభం వల్ల అభినవగుప్తపాదాచార్యుల అభివ్యక్తి పక్షాన్ని అంగీకరించి, కరుణ రసాదులలో కూడా రసత్వాన్ని సిద్ధాంతీకరించాడు. (తె.వి.స-4)

## సాహిత్య రత్నాకరమ్ (సం)

కర్త : యజ్ఞనారాయణ దీక్షితులు.

అంకితం : రఘునాథనాయకునకు (క్రీ.శ. 1600-33).

చరిత్రాత్మకమైన మహాకావ్యం. తంజావూరు, మధుర, చెంజిసంస్థానాల చరిత్రను సముకారీన సంఘటనలను తెలుపుతున్నది. (తం. ఆం. నా-10)

## సాహిత్యరాయ పెండేరము

కవులు, కవులు కాలికి బిరుదుగా ధరించే అందెను "గండ పెండేరము" అంటారు. శ్రీకృష్ణదేవరాయలు తన ఆస్థాన కవి అల్లసాని పెద్దనకు గండ పెండేరం బహూకరించాడు. క్రీ.శ. 1633-73 నడుమ తంజావూరును పరిపాలించిన విజయరాఘవ నాయకుడు తన సకల విద్యా సామ్రాజ్యానికి చిహ్నంగా ధరించిన అందెకు సాహిత్య రాయ పెండేరమని పేరు. ఇతడు రచించిన యక్షగానాలు, దండకాలు, పదపదాలు, కవితర సారస్వత ప్రక్రియలు అన్నీ మొత్తం 57 ఉంటాయని అంచనా.

విజయ రాఘవ నాయకుని "చతుర్విధ కవితా నిర్వాహక సార్వభౌమ బిరుదాంగద విరాజమాన చరిదాం భోజుని"గా అతని ఆస్థాన కవులు వర్ణించారు. నవరత్న ఖచితమైన ఈ పెండేరానికి అతడు జయించిన రాజుల బొమ్మలు వ్రేలాడుతుండేవట.

సభలో జరిగే తర్క వ్యాకరణ మీమాంస చర్చలు, చమత్కార భాషాగోష్ఠి వినోదాలు ఈ పెండేరానికి ఉపచారం చేస్తున్నట్లుండేవి. (వ.దే.వా-93)

## సాహిత్య లక్ష్మీధరమ్ (సం)

కర్త : లొల్ల లక్ష్మీధరుడు.

మీమాంసాగ్రంథం. (తె.వి.స-4)

## ''సాహెబా ! సల్లాములా !'' పదాలు

"సాహెబా! సల్లాములా" అన్న మాటలతో ముగిసే పదాలు. ఇవి కూచిపూడి భాగవతుల ప్రజ్ఞాపాటవాలకు నిదర్శనం. వీరు పూర్వం హైదరాబాదు, విజయనగరం, తంజావూరు మొదలగు సంస్థానాలను సందర్శించి సన్మానాలు పొందుతుండేవారు. అలా సంచారం చేసే రోజులలో తురుష్క ప్రభువులను కూడా మెప్పించి అనేక జాగీర్లను పొందారు. బనగానపల్లి నవాబు వీరిని ఆహ్వానించి వారి ప్రదర్శనలన్నింటినీ చూసి వారిని సత్కరించి కోటకొండ-విపట్టాల జాగీర్లనిచ్చారు.

కూచిపూడి వారు నవాబుల సన్నిధికి వెళ్ళినప్పుడల్లా ఒక స్తోత్రం చేస్తూ ఉండేవారు. పాటలో మొదట ఒకచోట మాత్రం 'సాహెబా'ని స్తుతించేవారు. మిగిలినదంతా రాముని మీదో, కృష్ణుని మీదో, విష్ణువు మీదో రచింపబడి ఉండేది. కీర్తన చివరలో మళ్ళీ 'సాహెబా! సల్లాములా' అని స్తుతించేవారు. అంటే ఇటు హిందువులకు ఆగ్రహం లేకుండా, మత సంప్రదాయం ప్రకారం రామకృష్ణులను స్తుతిస్తూ, ఇటు 'సాహెబా సల్లాములా' అని నవాబు మెప్పును కూడా పొందేవారు. ఇట్లా వీరు సమయజ్ఞతతో, లౌకిక వృత్తితో తమ కళా ప్రచారాన్ని అన్ని మార్గాలా, అన్ని మతాల ప్రజల్లోకి చొప్పించారు. (నా.ర.చ-157)

## సాహెబు రాణ రామన్న (సాహేబు రమణ కవి)

కాలం : క్రీ. శ. 1850 ప్రాంతం.

రచన : సీతాపతి శతకము.

వీరన్న రాజమాంబల పుత్రుడు. సాహెబు రాణ అనేది ఇతని పూర్వుల బిరుద నామం కావచ్చు. ఇతని కవిత్వం మృదు మధురంగా ఉంటుంది. (శ. స-191)

## సాళువ కంపరాయలు

కాలం : క్రీ. శ. 15 వ శతాబ్దం.

స్థలం : కర్నూలు మండలం.

మసుమంచి భట్టు రచించిన, "హయలక్షణ విలాస" కావ్యానికి కృతిపతి. తిరుపతిలోనూ, కర్నూలు జిల్లా పెద్దచింతకుంట గ్రామంలోనూ ఇతని శాసనాలు లభించాయి. (చూ. కంపభూపతి శాసనములు). (క.శ-6-121)

## సాళువ గుండ నరసింహరాయలు

కాలం : క్రీ. శ. 15 వ శతాబ్దం.
రచన : రామాభ్యుదయమ్ (సం).
ఆస్థానకవులు : పిల్లలమర్రి పిన వీరన, ప్రోలుగంటి చెన్నగౌరి, రాజనాథ డిండిముడు.
అంకితం పొందిన రచన : జైమిని భారతము.

సాళువ గుండయ దేవ మహారాజు పుత్రుడు. క్రీ. శ. 1486-93 లలో విజయనగరాన్ని పాలించిన కర్ణాటకరాజు. ఇతని పూర్వులు విజయనగర కర్ణాటప్రభువులైన సంగమ రాజుల దగ్గర సామంతులుగా, దండనాథులుగా ఉండేవారు. ఇతడే విరూపాక్ష రాయలను పదభ్రష్టుని చేసి విజయనగర సింహాసనాన్ని అధిష్ఠించాడు. ఇతని శాసనాలు చాలా లభించాయి.

1456 ప్రాంతాలలో వేంకటేశ్వరస్వామికి ఆలిపురం, మంగోడు, మూపాడుపేట మొదలగు గ్రామాలను దానం చేసినట్లు శాసనాలున్నాయి. 1485 నాటి ఒక శాసనంలో ఇతడు సార్వభౌముడిగా వర్ణితుడైనాడు.

రాజనాథ డిండిముడు ఇతనిపేరనే సాళ్వాభ్యుదయకావ్యం రచించాడు. ఈ నరసింహరాయలపేర నవరత్నాలు (రాజ్యాంగ పద్ధతుల పద్యాలు) లభించాయి. వాని కర్త పిన వీరన కావచ్చునని పండితాభిప్రాయం.

శ్రీ కృష్ణరాయల తండ్రి తుళువ నరసరాజు ఈ నరసింహరాయల దగ్గర సర్వ సైన్యాధ్యక్షుడుగా ఉండేవాడు. (క.త-6-42; ఆద్రు-6; వి. న. చ-నూ. పే. రా)

## సాళువాభ్యుదయమ్ (సం)

కర్త : డిండిమభట్టు III (రాజనాథడిండిముడు).
చూ. సాళువగుండ నరసింహ రాయలు.

ఇది 13 ఆశ్వాసాలున్న గ్రంథం. దీనిలో సాళువ గుండ నరసింహరాయల సింహయాత్రలు, పరాక్రమాదులు, వంశము, వర్ణింపబడ్డాయి. చారిత్రకంగా విలువైన గ్రంథం. (తె. వి స-6)

## సింగరాజు

చాటుకవి. ఈయన సాళువ తిమ్మభూపాలుని కొలువులో చిన్న ఉద్యోగియైన కామన్నను ఆశ్రయించి రాజు దర్శనం సంపాదించాడు. కామన్నను, సాళువ తిమ్మరాజును నుతిస్తూ పద్యాలు చెప్పాడు. ఒక పద్యం లభించింది. (చా. ప. ర.)

## సింగరాజు దత్తాత్రేయులు-సింగరాజు వేంకటసుబ్బయ్య

కాలం : క్రీ. శ. 1840 ప్రాంతం.
స్థలం : మదరాసు.

రచన : రామాయణ వచనము.

జంటకవులు. సులభ గ్రాంథికంలో రచన చేశారు. వీరి రామాయణం పూర్తిగా లభించలేదు. దత్తాత్రేయులు రచించిన అరణ్యకాండ, కిష్కింధా కాండలు, వేంకట సుబ్బయ్య రచించిన యుద్ధకాండ మాత్రం లభించాయి. (వ. వా-59)

## సింగరాజు వేంకట సుబ్బయ్య

కాలం : క్రీ.శ. 1840 ప్రాంతం.

రచన : రామాయణము (వచనకావ్యం).

సింగరాజు దత్తాత్రేయులుతో కలిసి రచనలు చేశాడు. ఇతని రచనలో యుద్ధ కాండ మాత్రం నేడు లభ్యమౌతున్నది రచన సులభశైలిలో ఉంది. (క. స-94)

## సింగి—సింగడు

ఎక్కువ యక్షగానాలలోను, గొల్ల కలాపాలలోను సాక్షాత్కరించే కొండజాతికి చెందిన పాత్రలు.

సింగని పాత్ర కంటె సింగి పాత్రకే ప్రాధాన్యత ఎక్కువ. ఈ దంపతులు కొండ జాతులకు చెందిన చెంచులు గాని, ఎరుకలు గాని, కొరవలుగాని కావచ్చు. తాము చెంచు పోబని-అంటే గరుడాద్రి నారసింహుని వారసులమని వారి విశ్వాసం.

సింగని వృత్తి వేట-సింగి వృత్తి సోది (ఎరుక-గిద్ద). సింగడు అడవి కోసలు తిరిగి వేళ్ళు వెల్లంకుల సంపాదన కూడా చేస్తాడు సింగి దేశదిమ్మరియై సోది చెబుతూ, వేళ్ళు, వెల్లంకులను అమ్ముతుంది.

వీరి వేష భాషలలో, కులాచారాలలో సగం ఆటవికత్వం, సగం దేశ దిమ్మరి తనం కనిపిస్తాయి. సింగి పచ్చ పొడిచి, కలుస సాముద్రికం కూడా చెప్పటం కొన్ని రచనలలో ఉంది. సింగి పేరనే ఎరుకుల కురవంజి వంటి యక్షగానాలు వచ్చాయి. సింగి మాచిపూడి గొల్ల కలాపాలలో వేదాంతోపన్యాసాలు కూడా చేస్తుంది.

సింగనికి "పోడిగాడు" అనే పేరు కొన్ని యక్షగానాలలో ప్రియుడు అనే అర్థంలో ప్రయుక్తం.

కొరవంజులలో సింగి పాత్ర విధిగా ఉంటుంది. యక్షగానాలలో యాదృచ్ఛికంగా ఉంటుంది.

కొరవంజి యక్షగానాలలో-సాధారణంగా సింగి పాత్ర ప్రవేశించే సందర్భంలో కథానాయిక తాను వలచిన ప్రియుని గురించి తలపోస్తూ ఉంటుంది. ప్రియుని పొందు కుదురునా, కుదరదా అనే ఆలోచనలో నాయిక ఉన్నప్పుడు ఎరుకత రంగ ప్రవేశం చేసి నాయికకు తన కులాచారాలు, దేశాటన విశేషాలు వివరిస్తుంది. ఎరుక చెప్పే ముందు ఎరుక దేవతలను ఏకరువు పెట్టి, ఆ తరువాత సోదె మొదలు పెడుతుంది. ఆ దైవాలలో తప్పక "కొల్లాపురమ్మ" ఉంటుంది.

సింగి సోది అయిపోయే లోపల సింగడు హడావిడిగా సింగిని వెదుక్కుంటూ రావటం, సింగి తాను సంపాదించిన డబ్బు చూపటం జరుగుతుంది.

సింగి సంపాదనకు సింగడు వెంటనే అనుమానపడి, సింగికి ఎవడో విటు డున్నాడని గుద్దులుపుతాడు. ఇక సింగి ఎంతో కష్టపడి, ఆయాసపడి తగిన సమాధానాలు చెప్పి సింగని అనుమానం తీర్చటానికి ప్రయత్నిస్తుంది. ఈ ఘట్టంలో సింగి-సింగని సంవాదం హాస్య రస స్ఫూర్తితో చక్కగా నడుస్తుంది. ఈ ఘట్టంలో సాధారణంగా మోటు సరసమే ఉంటుంది. (య. వా. చ-204-5)

**సింధుమతీ విలాసము**

కర్త : గోపన (చూ).

రచనాకాలం : క్రీ. శ. 1500 ప్రాంతం కాని 1870 ప్రాంతం గాని కావచ్చు.

రెండు ఆశ్వాసాల ప్రబంధం శృంగార రసప్రధానం. శైలి ప్రౌఢంగా ఉంది. ఇందులో జయుడనే వానికీ సింధుమతి అనే వేశ్యకూ గల సంబంధం వర్ణితం. మధ్య మధ్య సంస్కృత శ్లోకాలున్నాయి. (క. స-59; ద. దే. వా-4)

**సింహగిరి నరహరి వచనములు**

నామాంతరం : సింహగిరి వచనములు (చూ).

**సింహగిరి యాత్రాప్రకాశిక**

కర్త : చూ. మండ లక్ష్మీ కామేశ్వరశాస్త్రి.

సింహాచల యాత్రా విశేషాలను వర్ణిస్తున్న రచన క్రీ. శ. 1907లో జి. రామస్వామి శెట్టి గారి ముద్రాక్షరశాల (చెన్నపట్టణం)లో ముద్రితం. (ఆం. సం. సా-430)

**సింహగిరి వచనాలు**

కర్త : కృష్ణమాచార్యులు.

రచనాకాలం : క్రీ. శ. 1291-1323 ప్రాంతం.

నామాంతరం : సింహగిరి నరహరి వచనములు.

ఇది తొలి తెలుగు వచన రచన అని పండితాభిప్రాయం. సింహాచలంలోని వరాహ నరసింహ స్వామిని కీర్తిస్తూ వ్రాసిన వచనాలు. తెలుగు భాషా పరిణామాన్ని తెలుసుకొనడంలో మిక్కిలి ఉపకరిస్తాయి. దీని ప్రతి తంజావూరు సరస్వతీ మహలులో లభించుచున్నది. (ఆరుద్ర-3)

**సింహశైల మాహాత్మ్యము**

కర్త : (చూ) పిరాచిమంచి తిమ్మకవి.

అంకితం : పిఠాపురంలోని కుక్కుటేశ్వర స్వామికి.

అయిదాశ్వాసాల రచన. విశాఖపట్టణం చేరువనున్న సింహాచల క్షేత్రంలోని వరాహ నృసింహస్వామి మహత్తును తెలిపే గ్రంథం. రచన మనోహరమైనది.

(క. శ-13-188)

## సింహళ విజయము

రచనాకాలం : క్రీ. శ. 16 వ శతాబ్దం.

కర్త : తెలియదు.

చారిత్రక ప్రాధాన్యం గల రచన. మధుర పాలకుడైన విశ్వనాథ నాయకుని కుమారుడు కుమార కృష్ణప్ప క్రీ.శ.1564-72 సింహళాన్ని జయించిన వృత్తాంతం ఇందులో ఉంది. కృష్ణప్పపై కొందరు పాళెగాళ్లు తుంబిచ్చి నాయకుని నాయకత్వంలో తిరుగుబాటు చేశారట. కృష్ణప్ప ఆ తిరుగుబాటును అణచివేసి తుంబిచ్చి నాయకుని శిరచ్ఛేదం చేయించాడు. ఈ సంఘటనపై సింహళరాజు వ్యతిరేకపు మాటలాడగా కోపించి సింహళంపై దాడి చేశాడట. ఇందులో "నవపాషాణాల" వద్ద సైన్య సమీకరణ "మన్నారు"ను చేరుకోవడం, సేనా నాయకుల పేర్లు, మధుర నుండి సింహళం వరకు ఉన్న ప్రసిద్ధ క్షేత్రాల ప్రసక్తి ఉన్నాయి. ఈ యుద్ధంలో సింహళ సైనికులతోపాటు పోర్చుగీసు దళాలు కూడా పాల్గొన్నట్టు ఉంది. సింహళ రాజు మరణించగా కృష్ణప్ప ఆ రాజు కుమారునికి పట్టం కట్టి అక్కడ తన ప్రతినిధిగా తన బావమరది విజయగోపాల నాయకుని నిలిపి తిరిగి వచ్చాడట.

ఈ రచన మధుర ఆస్థానంలోని వారెవరో చేసి ఉంటారనీ, అందుచేతనే కృష్ణప్పను ఎంతో ఉదాత్తంగా చిత్రించారనీ, యుద్ధానికి అసలు కారణాలు వేరే ఉండి ఉంటాయనీ చరిత్రకారులు భావిస్తున్నారు. ఈ యుద్ధాన్ని గురించి తెలిపే చారిత్రకాధారాలున్నాయి. (N.M. (68-72), సిం. వి.)

## సింహాద్రి అంకన్న

కాలం : క్రీ.శ. 18 వ శతాబ్దికి పూర్వం.

రచన : జగన్నాయక శతకము.

ఈ కవి పేరు అంకన్న. సింహాద్రి కుమారుడు. విజయనగర (?) గారి సత్కారాలు పొందాడట. ఇతని పేరు కద్రయ్య అని కొందరు వ్రాశారు. (ఆంధ్ర-11-237)

## సింహాద్రి నారసింహ శతకము

కర్త : గోగులపాటి కూర్మనాథ కవి.

చారిత్రక శతకం. మిక్కిలి ప్రసిద్ధి చెందినది. మహమ్మదీయులు 18 వ శతాబ్దంలో హిందూ దేవాలయాలను ధ్వంసం చేస్తున్న సమయంలో వారి దుశ్చర్యలను చూసిన కవి నరసింహుని వ్యాజోక్తులతో గేలిచేస్తూ ఈ శతకం చెప్పాడు. తురుష్కుల దుశ్చర్యలను నిశితంగా ఖండించి, దేవుని స్థైర్యం కవి మేల్కొలిపాడు. కవి మొర ఆలకించి, స్వామి, కొండ గుహల నుంచి తుమ్మెదల దండును పంపి, మహమ్మదీయులను భయంకరంగా హింసించి, తరిమి వేసేటట్లు చేశాడు. ఈ శతకానికి తెలుగు సాహిత్యంలో విశిష్ట స్థానముంది. (శ.సా.వి.)

## సింహాద్రి రమాధిప శతకము

కర్త : అల్లమరాజు సుబ్రహ్మణ్యకవి.

ఇది ప్రకీర్ణ శతకం. భక్తి, నీతి ప్రధానంగా ఉంటుంది వైద్యుడు రోగాన్ని, వర్తకుడు కరువును కోరతాడని చెప్తూ వివిధ వృత్తులవారి వ్యాపారదృష్టినీ దుష్టస్వభావాన్ని ఈ శతకం విమర్శిస్తున్నది. దీనిని సింహాద్రి రామాధిపశతకంగా కొందరు పేర్కొన్నారు. (శ. సా. వి.) (శ. క. చ.)

## సింహాద్రి వెంకటయ్య

కాలం : క్రీ. శ. 17 వ శతాబ్దం.

రచన : లక్షణాపరిణయము (చమత్కార మంజరి).

సరస కవితాదక్షుడు ఇతని రెండు పద్యాలను అప్పకవి ఉదాహరించాడు. లక్షణాపరిణయాన్ని విడిగా శృంగారప్రబంధంగా రచించిన వారిలో ఇతడే మొదటివాడు. (ఆరుద్ర-10-232)

## సింహాసన ద్వాత్రింశతిక (సింహాసన ద్వాత్రింశిక)

కర్త : కొరవి గోపరాజు.

12 అశ్వాల కథాకావ్యం. కందుకూరి వారు కర్తను కొవలె గోపరాజుగా చెప్పారు. ఇవి తండ్రి కసువరాజు వేముగల్లు పురాధీశ్వరుడైన మల్లరాజుమంత్రి అట. గోపరాజు కాలం 17 వ శతాబ్దమని కవులచరిత్రలో ఉంది.

విక్రమార్కునికి సంబంధించిన 32 కథలను 32 సాలభంజికలు మాళవ భోజ రాజుకు చెప్పడం దీనిలోని ఇతివృత్తం. ఈ కావ్యం కాకతీయ, పద్మనాయక, రెడ్డిరాజుల కాలం నాటి సాంఘిక పరిస్థితులకు అద్దంపడుతున్నది. కవి సర్వతోముఖమైన ప్రజ్ఞకు ఇది నిదర్శనం. కవిత్వం రసవంతంగా ఉంది. తెలుగునాట అమిత ప్రాచుర్యాన్ని పొందిన గ్రంథమిది. (క. చ. 3-47, రె. రా. చ.)

## సిద్ధన ప్రెగ్గడ

కాలం : క్రీ. శ. 16 వ శతాబ్ది.

రచన : శాకుంతలము (అలభ్యం).

విశేషత : ఈయన పద్యాన్ని అజ్ఞాత గ్రంథసంధాత తన గ్రంథంలో ఉదాహరించాడు. ఉదాహృతి పద్యం పురవర్ణనకు సంబంధించినది. (ఆరుద్ర-9)

## సిద్ధప్ప (సిద్ధేంద్రయోగి)

కాలం : క్రీ.శ. 17వ శతాబ్ది.

నామాంతరం : దూదేకుల సిద్ధప్ప.

స్థలం : కర్నూలు జిల్లా బనగానపల్లె తాలూకా కంచిమల్లయపేట సమీప గ్రామం ముదుమాల.

రచనలు : 1. సిద్ధప్ప వచనాలు 2. కాళికాంబ, హంసకాళికాంబ శతకము
(400 పద్యాలు)
గురువు : వీరబ్రహ్మయోగి.

ఈయన తెలుగు దేశంలో సుప్రసిద్ధుడైన యోగి. దూదేకుల పీరుసాహెబ్, ఆదం బీబి అనే దంపతులకు ఒక హైందవ సిద్ధుని ప్రసాదంవల్ల జన్మించాడట. చిన్నతనం నుంచి ఈయన సిద్ధప్పగా ప్రసిద్ధుడై హైందవ తత్త్వమార్గాన్ని అనుసరించాడు. గురువుకు పన్నెండేళ్ళు శుశ్రూష చేసి తన కులాన్ని, తల్లితండ్రులను, సర్వస్వాన్ని వదిలాడు. అధ్యాత్మ విద్యను సాధించి దానిని సంఘ శ్రేయస్సు కోసం వినియోగించాడు. గురు పుత్రులు తిట్టినా, మహమ్మదీయులు బాధలు పెట్టినా తన లక్ష్యాన్ని సిద్ధింప చేసుకొన్నాడు.

గురువు ఈయనకు ఉపనిషత్తులు, యోగమార్గాలను బోధించాడు. గురువుగారి కాలజ్ఞాన తత్త్వాలను సిద్ధప్ప విశేషంగా ప్రచారం చేశాడు. పూలు తెమ్మని సిద్ధయ్యను పంపి, గురువు జీవత్సమాధి నొందాడట. పూలతో తిరిగి వచ్చిన సిద్ధప్ప మనస్సు వికలమై గురువుని చూడలేనన్నే దుఃఖావేశంతో, భక్త్యావేశంతో తల్లడిల్లి పోయాడని స్థానిక ఐతిహ్యాలవల్ల తెలుస్తున్నది.

బ్రహ్మంగారంతటి గురువు, సిద్ధప్పవంటి శిష్యుడు, వేమనవంటి యోగి లేడని తెలుగుదేశంలో నానుడి. గురుమార్గంలోనే ఈయన ప్రచారం చేసి జీవత్సమాధి నొందాడట. (తె.వి.స-4)

## సిద్ధప్ప వచనాలు

కర్త : దూదేకుల సిద్ధప్ప.

గురువైన బ్రహ్మం గారి కాలజ్ఞాన తత్త్వాలకు తోడుగా కవి ఈ వచనాలు రచించి ప్రజలలో ప్రచారం చేశాడు. తత్త్వాలను ఏలలు, పాటలు, పద్యాలలో మనోరంజకంగా చెప్పాడు. "ఏ కులమనినను-వివరమడిగితే, ఏమని చెల్పుదు లోకులకు" "పూజకు నేనా స్త్రీ" "నేజూచినానే బ్రహ్మమునాలోనేజూచినానే" అనేవి సుప్రసిద్ధమైన సిద్ధయ్య వచనాలు. వీటిని సర్వులూ ఆదరించారు. వీటిప్రతి మదరాసు ప్రాచ్యలిఖిత భాండాగారంలో ఉందేది. (తె.వి.స-4-1194)

## సిద్ధ రామకవి

కాలం : క్రీ. శ. 1530-1581 ప్రాంతం.
రచనలు : ప్రభుదేవర వాక్యము (వచనం). (నామాంతరం :పిండచక్ర నిర్ణయము). సిద్ధరామ శతకము.
గురువు : కేదార దేశికుడు.
సమకాలికులు : అద్దంకి గంగాధర కవి, శంకరకవి.

ఒక్కటిని ధారాశుద్ధి గలిగిన కవి. శైవ వేదాంతాన్ని తన రచనలలో ప్రచారం చేశాడు. (ఆరుద్ర-8-274)

## సిద్ధ రామ శతకము

కర్త : సిద్ధరామకవి.

కాలం : క్రీ. శ. 1580 ప్రాంతం.

విశిష్టత : సీసపద్య శతకం. "చిక్కానాధామ శ్రీగురు సిద్ధరామ" అనే మకుట ముంది. కవి ఇందులో లోకం పోకడ చక్కగా చెప్పాడు.

ఈ శతకం ప్రాచీన శైవసమయాచారాలను గూర్చి చెప్పినదట.

(ఆరుద్ర-8-274)

## సిద్ధ వీరేశ దేశికుడు

కాలం : చూ. పిడుపర్తి సోమనాథుడు.

శైవమతాచార్యుడు. పిడుపర్తి సోమనాథకవి రచించిన "ప్రభులింగ లీలలు" అనే ద్విపద కావ్యం ఇతనికి అంకితం. (క త-8-86)

## సిద్ధాంజనమ్ (సం)

కర్త : చూ. అన్నంభట్టు.

ఇది న్యాయశాస్త్ర గ్రంథం. జయదేవ తత్త్వచింతామణికి టీక. (తె.వి.స-4)

## సిద్ధాంజనమ్ వ్యాఖ్య (సం)

కర్త : కోలచల మల్లినాథ సూరి.

సంస్కృతంలోని "తంత్రవార్తికాని"కి మనోహరమైన వ్యాఖ్య. (తె.వి.స-4)

## సిద్ధాంత చింతామణి (సం)

కర్త : చూ. తిరుమల ఒక్కపట్టణము (ఇమ్మడి) శ్రీనివాసాచార్యులు.

విశిష్టాద్వైత సిద్ధాంతాల పరంగా వ్రాయబడిన రచన. కవి విశిష్టాద్వైతి. ఇతడు ఈ సిద్ధాంతాలను ప్రచారం చేయడం కోసం సాగించిన గ్రంథపరంపరలో ఇది ఒకటి. సురపురం సంస్థానాధీశ్వరులు సమాదరంలో వెలసింది. (ఆం. సం. సా-516)

## సిద్ధాంత లేశమ్ (సం)

కర్త : అప్పయ్య దీక్షితులు.

ఇది శంకర మతాన్ని వివరించే సిద్ధాంత గ్రంథం. (తె. వి. స-8)

## సిద్ధాంత శిరోమణి

చూ. సిద్ధాంత శిరోమణి ప్రకాశము.

## సిద్ధాంత శిరోమణి ప్రకాశము

నామాంతరం : సిద్ధాంత శిరోమణి.

కర్త : ఆల్లాడి రామచంద్రశాస్త్రి.

రచనాకాలం : క్రీ. శ. 1837; తొలి ముద్రణ క్రీ. శ. 1850.
అంకితం : విల్కిన్సన్ (అనంతపురం జిల్లాకలెక్టర్)కు.

ఈ గ్రంథం భూభ్రమణాది విషయాలను తెలుపుతున్నది. వ్యావహారిక వచనంలో ఉంది. పద్యాలు కూడా ఉన్నాయి. చివరి ఆరు పుటలు సంస్కృతం. కాశీలో రత్నేశ్వర పండితునకు రామచంద్రశాస్త్రికి మధ్య జరిగిన భూభ్రమణాన్ని గూర్చిన వాదమే ఈ గ్రంథము. (ప. వా-66, 67)

## సిద్ధాంత సారమ్ (సం)

కర్త : కందాడై అప్పకొండాచార్యుడు. (తె. వి. స-4)

## సిద్ధాంత సిద్ధాంజనమ్ (సం)

కర్త : కృష్ణానంద సరస్వతి.

అద్వైత వేదాంత శాఖకు చెందిన సిద్ధాంత గ్రంథం. దీనికి భాస్కర దీక్షితుడు అదే కాలంలో వ్యాఖ్యానం రాశాడట.

## సిద్ధిరాజు తిమ్మరాజు

కాలం : క్రీ. శ. 16వ శతాబ్ది మధ్యభాగం.
స్థలం : కొండవీటి సీమ.
రచన : పరమయోగి విలాసము (సంక్షిప్తం).

ఇతని ఇంటిపేరు సిద్ధరాజు అని కూడా వ్యవహారంలో ఉంది.

ఈయన రాజకవి. క్రీ. శ. 1554 ప్రాంతంలో కొండవీటిని పాలించాడు. అళియ రామరాయల మేనల్లుడు. తాళ్ళపాక చిన్నన్నకు సమకాలికుడు. కవి, వీరుడు కూడా. నియోగం మీద 60 వేల ఫౌజుతో కొండపల్లి, మచిలీపట్టణాలపై దండు వెళ్ళాడు. గోలకొండపై రామరాజు చేసిన దండయాత్రలో పాల్గొన్నాడు. ఈయన పరమయోగి విలాసాన్ని పద్య కావ్యంగా వ్రాస్తే, తాళ్ళపాక చిన్నన్న ద్విపద కావ్యంగా వ్రాశాడు. వైష్ణవ సంప్రదాయం ప్రకారం ఆళ్వారులు 12 మంది అయితే, తిమ్మరాజు వారి సంఖ్య 15 కు పెంచాడు. అప్పకవి ఇతన్ని ప్రమాణంగా అంగీకరించి ఒక ప్రయోగం ఉదాహరించాడు. ఇతడు కొండవీటి పాలకుడుగా ఉన్నప్పుడే కావ్య రచన చేశాడట.

(క. స-86; ఆంధ్ర-8)

## సిద్ధేంద్ర యోగి

కాలం : క్రీ. శ. 1672-1685 ప్రాంతం.
స్థలం : కృష్ణా మండలం.
రచనలు : 1. భామాకలాపము (పారిజాతం) 2. గొల్లకలాపము.

సిద్ధేంద్రయోగి కూచిపూడి భాగవతుల కులపతులలో సుప్రసిద్ధుడు. భామాకలాప సృష్టి ప్రతిష్ఠామహితుడు. ఇతని స్వస్థలాన్ని గురించి వివాదాలున్నాయి. దేశాటనం చేస్తూ

కూచిపూడి చేరాడనీ అక్కడే సువాణం జోగావధాన్ల కుమార్తెను వివాహం చేసుకొని స్థిర పడ్డాడనీ ప్రతీతి. తొలుత భామాకలాపంలోనే గొల్లకలాపం కలిసి ఉండేదనీ, తర్వాత కాలంలో అది ప్రత్యేక రూపకంగా రూపొందిందనీ అంటారు.

ఇతని భామాకలాపాన్ని క్రీ. శ. 1672-1685 ల మధ్య గోలకొండను పాలించిన తానీషా అబుల్ హసన్ మెచ్చుకొని అగ్రహారం ఇచ్చాడట.

## సిద్ధేశ్వర చరిత్రము

నామాంతరం : ప్రతాప చరిత్రము.

కర్త : కాసె సర్వప్ప.

అంకితం : సిద్ధేశ్వరునికి.

కాలం : క్రీ. శ. 15వ శతాబ్దం.

చరిత్ర ప్రధానమైన గ్రంథం. సిద్ధేశ్వర చరిత్ర-ప్రతాప చరిత్ర ఈ రెండూ వేర్వేరని కొందరూ, ఒక్కటే అని కొందరూ భావించా-. లభించిన ప్రతిలో మొదటి మూడాశ్వాసాలు ద్విపద-తరువాత వచనం ఉన్నాయి. ద్విపద రచనలోని మొదటిభాగంలో శివుడు శిద్దేశ్వర నామంతో హనుమకొండపై నెలకొనడం, రెండవ భాగంలో కాకతీయ రాజుల చరిత్ర ఉన్నాయి. వచన భాగంలో ప్రతాపరుద్రుని చరిత్ర ఉంది. కవిత నిర్దుష్టం కాకపోయినా కావ్యంలో దేశీయత వెల్లివిరుస్తున్నది. కవి కవితా విషయం కంటె చరిత్రాంశాలకే ప్రాధాన్యం ఇచ్చాడు. వ్యాకరణ విరుద్ధమైన ప్రయోగాలున్నాయి.
(క. న-284; ద్వి. సా. చ-381)

## సిరిపురి వీరసింగయ

కాలం : క్రీ. శ. 15వ శతాబ్దం తుదిభాగం.

శైవాచార్యుడు. కృతిపతి. ఇతని శిష్యుడైన బచ్చు సిద్ధకవి మరో బసవపురాణం రచించి ఇతనికి అంకితం చేశాడు. ఈ గ్రంథం పాల్కురికి సోమన గ్రంథాన్ని అనుసరించి ఉంది.
(ద్వి. సా. చ-158)

## సిరిప్రెగడ ధర్మనామాత్యుడు

కాలం : క్రీ. శ. 17వ శతాబ్దం.

స్థలం : ఇందుర్తి సీమ (కృష్ణామండలం).

రచన : నలచరిత్రము.

తిప్పయామాత్యుని పుత్రుడు. శ్రీనాథుని నుతించాడు. ఈ కవి మేనమామలు పేరూరి వారట. పేరూరు గోదావరీ మండలంలోనిది. ఇతని కవిత నిర్దుష్టంగా ఇంపుగా ఉంటుంది.
(క. చ-3-145)

## సిరిప్రెగడ సుబ్బారాయుడు

కాలం : క్రీ. శ. 18వ శతాబ్ది పూర్వార్ధం.

స్థలం : ఉత్తర ఆర్కాటు మండలం.
రచనలు : 1. సారంగధర నాటకము 2. నల నాటకము.

వెంకట్రామయ్య పుత్రుడు. వ్యావహారిక భాషలో రచన చేశాడు. రచన అంత ప్రౌఢం కాదు. నల నాటకం, బిల్వ పురీశునికి అంకితం. ఉత్తరార్కాటు మండలంలోని "తిరువలము" అనే క్షేత్రాన్ని బిల్వపురి అంటారు. కవి ఆ మండలంవాడు కావచ్చును. (య. వా. చ.-100)

## సిరియాళ చరిత్ర

కర్త : తెలియదు.

జానపద పౌరాణిక గేయం. కథావస్తువు మిక్కిలి ప్రసిద్ధి చెందింది.

చూ. పౌరాణిక గేయములు. (అం. వా. చ.)

## సిరిసిరిమువ్వ పదాలు

కర్త : తెలియదు.

జానపద శృంగార పదాలు.

చూ. శృంగార గేయములు. (అం. వా. చ.)

## సీతపాట

కర్త : చూ. పరశురామపంతుల లింగమూర్తి.

వేదాంతపరమైన రచన. రాజయోగాన్ని గురించి చెప్పబడింది.

రాజయోగము సాంఖ్య, తారక, అమనస్కములని మూడు విధాలు. సాంఖ్యము పరబ్రహ్మ స్వరూపం ఇట్టిది అని తెలియచేస్తుంది. తారకము మనస్సును పరిశుద్ధం చేస్తుంది. అమనస్క నీవె పరబ్రహ్మమవు అనే జ్ఞానాన్ని కలుగచేస్తుంది. ఈ మూడు విధాల రాజయోగాన్ని సీతపాటక్లుప్తంగా తెలుపుతుంది. ఇది ముఖ్యంగా స్త్రీలు పాడుకోవ డానికి అనుగుణంగా వ్రాయబడింది.

ఈ కవి రచించిన "సీతారామాంజనేయ సంవాదము" లో కూడా రాజయోగమే చెప్పబడింది. సీత పాటకు, ఈ రచనకు చాలా పోలికలున్నాయి. కొన్నిచోట్ల వాక్యాలకు వాక్యాలే రెండింటిలో సమానంగా కనిపిస్తాయి. (తె. జా. సా.)

## సీతమ్మ చెర

జానపద పౌరాణిక గేయ రచన.

చూ. పౌరాణిక గేయములు. (అం. వా. చ.)

## సీత వసంతము

జానపద పౌరాణిక గేయ రచన.

చూ. పౌరాణిక గేయములు. (అం. వా. చ.)

**సీత వామన గుంటలు**

జానపద పౌరాణిక గేయ రచన.

జానపద గేయాలు సమాజానికి ఎంత సన్నిహితంగా ఉంటాయో ఇలాంటి గేయాలే నిరూపిస్తాయి. సాధారణ ప్రజల వ్యవహారంలో ఉన్న ఈ ఆటను పౌరాణిక పాత్రలకు జతపరచారు.

చూ పౌరాణిక గేయములు. (అం. వా. చ.)

**సీత సమర్త**

జానపద పౌరాణిక గేయ రచన.

చూ. పౌరాణిక గేయములు. (అం. వా. చ.)

**సీత సురటి**

జానపద పౌరాణిక గేయరచన.

చూ. పౌరాణిక గేయములు. (అం. వా. చ.)

**సీతాకల్యాణము**

కర్త : తెలియదు.

జానపద పౌరాణిక గేయం.రామాయణానికి సంబంధించినది. సీతమ్మ ఆడుతూ పాడుతూ ఒకనాడు జనకునింటిలో ఉన్న శివధనస్సును ఎత్తిందట. శివధనస్సును ఎత్తడం సాధారణమైన పని కాదు. అది చూసిన జనకుడు ఈ ధనస్సును ఎక్కుపెట్టగలవాడికే కూతురినిస్తానని స్వయంవరం ప్రకటించాడు.తక్కిన కథంతా కూడా ఇలా సాధారణంగానే ఉంటుంది

ఇందులో కథ రామాయణాత్మకమైనా సంఘటనలన్నీ సాధారణంగా ఇండ్లలో జరిగేవే వర్ణింపబడ్డాయి. రచన ప్రబంధ మార్గానికి దగ్గరగా ఉంది. కొన్ని నూతనమైన ఉపమానాలను కవి ప్రయోగించారు. (తె. జా. సా.)

**సీతాకల్యాణము**

రచనాకాలం : క్రీ. శ. 17, 18 శతాబ్దాల నడిమి కాలం.

కర్త : అగస్త్యరాజు రామన.

ఈ యక్షగానంలోని కథ ప్రసిద్ధము. దీనిలో సీతదగ్గరకు శ్రీరాముడే ఏణుకతయై రావడం విశేషం. రచన ఒక్కగా ఉంది. దీనిలో పామూరు మదనగోపాలస్వామి ప్రశంస ఉంది. ఈ గ్రంథం ముద్రితం. (య. వా. చ-98)

**సీతాకల్యాణము**

కర్త : (చూ) మేలత్తూరు వేంకటరామశాస్త్రి.

సంగీత రూపకం.

**సీతాకల్యాణము**

కర్త : శహాజీ (చూ.).

అంకితం : శ్రీరామునికి.

కథ ప్రఖ్యాతమైన రామాయణగాథ. కవి నాటకంగా మలిచాడు.
(ద. దే. వా. 207)

**సీతాకల్యాణము**

నామాంతరం : జానకీ పరిణయము.

స్థలం : దుండిపల్లి సంస్థానం.

కర్త : పాలయాకరి (పాలవేకరి) వంశానికి చెందినవాడు. మల్లభూవిభుడు కావచ్చు.

యక్షగానం. ప్రతిలో గ్రంథాంత వాక్యాలు సరిగా లేనందువల్ల కవిని గూర్చిన వివరాలు తెలియలేదు. అదుసుమిల్లి వశవాయి వేంకటపతినాయని వారి సీతాకల్యాణము అని ప్రతి చివర ఉంది. కాకినాడ సాహిత్యపరిషత్తులో (గ్రం. సం. 354) ఈ ప్రతి ఉంది. రచన మనోహరమైనది.
(ఆం. సా. ప. వ. 21-3)

**సీతాగ్నిప్రవేశము**

జానపద పౌరాణిక గేయ రచన. ఇతివృత్తం రామాయణానికి సంబంధించినది.

చూ. పౌరాణిక గేయములు.
(ఆం. వా. ప.)

**సీతాదేవి అలుకపాట**

కర్త : తెలియదు.

జానపద శృంగార గేయం. కథ రామాయణానికి సంబంధించినది. సీతమ్మ రామునిపై అలిగి కూర్చుంటే రాముడు చిలుకతో ఎంతు సాధ్లు రాయబారం పంపుతాడు. అయినా చిలుక రాయబారం ఫలించలేదు. చివరికి చిలుక పంపి ప్రయత్నాలు మాని భేదోపాయం పాటిస్తుంది. రామునికి అస్వస్థతగా ఉంటున్న వార్త విని సీత అలుకమాని పతిని చూడబోయింది. జానపద రచనే అయినా కొన్నిచోట్ల వర్ణనలు శిష్ట సాహిత్యాన్ని తలదన్నేట్లుగా ఉన్నాయి. వియోగ శృంగారాన్ని ధ్వనితో మేళవించి చక్కగా తీర్చిదిద్దాడు కవి.
(తె. జా. సా.)

**సీతాదేవి వేవిళ్ళపాట**

కర్త : తెలియదు.

జానపద శృంగార గేయం. కథ రామాయణానికి సంబంధించిందే అయినా ఇందులోని వర్ణనలన్నీ సాధారణ గృహజీవనానికి సంబంధించినవే. ఈ గేయంలో ప్రథమంలో శృంగారం ఒకటి రెండు చోట్ల వాచ్యంగా చెప్పబడినా తరువాతి రచన అతి సుందరంగా, మనోజ్ఞంగా ఉంటుంది.
(తె.జా.సా.)

సీతాపతి శతకము

రచనాకాలం : క్రీ. శ. 1850 ప్రాంతం.

కర్త : సాహెబు రాణా రామన్న.

వృత్త శతకం "సీతాపతీ" అనే మకుటంతో ఉంది. శైలి మృదు మధురమైనది. కొన్ని చోట్ల పూర్వకవుల పోకడలున్నాయి. (శ.క.చ.)

సీతారామ చరిత్రము

రచనాకాలం : క్రీ శ. 19 వ శతాబ్ది.

కర్త : మంత్రిప్రగడ సూర్యప్రకాశకవి.

(వీరేశలింగం పంతులు–సమగ్ర పరిశీలన)

సీతారామ విజయము

కర్త : త్యాగరాజు (చూ).

సంగీత రూపకం. ఎక్కువ ప్రసిద్ధిని పొందలేదు. (శారదాధ్వజం–176)

సీతారామ శతకము

రచనాకాలం : క్రీ.శ. 1760 ప్రాంతం.

కర్త : తక్కసీల వెంకన్న.

(క.స–229)

సీతారామ శాస్త్రి

కాలం : క్రీ.శ. 18 వ శతాబ్దం.

స్థలం : కొలనుపాక.

సాహిత్యాభిలాష కలవాడు. కాసూరి వీరభద్ర కవిని ప్రోత్సహించి కొలను పాకలోని సోమేశ్వరస్వామికి అంకితంగా బసవ మహిమామృత విలాసాన్ని రచింప జేశాడు.

సీతారామాంజనేయము (అలభ్యం)

కర్త : పరశురామపంతుల రామమూర్తి కవి.

ఇది యక్షగానం. సీతారామాంజనేయ సంవాదమనే పేరుతో కవి తండ్రియైన లింగమూర్తి కావ్యం వ్రాశాడు. రామమూర్తి కృతి కూడా సీతారామాంజనేయ సంవాదమే అని కొందరంటున్నారు. (తె.వి.స–4–769) (య.వా.చ–362)

సీతారామాంజనేయ సంవాదము

కర్త : పరశురామపంతుల లింగమూర్తి కవి.

మూడాశ్వాసాల వేదాంతగ్రంథం. జీవబ్రహ్మైక్య సిద్ధాంతం దీనిలో వివరింపితం. మూడు అశ్వాసాలలోనూ వరసగా తారక యోగము, సాంఖ్యయోగము, రాజయో

గము ఉన్నాయి. గూఢమైన వేదాంత విషయాలున్న రసవంతమైన కావ్యం. సందర్భోచితాలు, అనుభవ సిద్ధాలు అయిన ఉపమానాలతో కవి వేదాంతాన్ని సర్వజన సుబోధకంగా చేశాడు. (వా.చ-90,91)

**సీతా విజయము**

నామాంతరం : శతముఖ రామాయణము.

కర్తలు : లింగకవి, గంగకవి.

**సీతా స్వయంవరము (అలభ్యం)**

కర్త : సభాపతయ్య.

సంగీత కృతులతో కూర్చిన నాటకమట.

(వ.దే.వా-306)

**సీనయ కవి**

కాలం : క్రీ. శ. 18వ శతాబ్దం.

స్థలం : సెంది (సంది).

రచన : షణ్ముఖి సహస్రము.

తిరుమలాచార్యుని పుత్రుడు. ప్రౌఢకవి. సెంది గ్రామం తిరునల్వేలి మండలం లోనిది. ఇదే నేటి తిరుచెందూరు కుమారస్వామి క్షేత్రం. అక్షేత్ర స్వామిపై ఇతడు రచన చేశాడు. (వ.దే.వా-404)

**సీమంతినీ కల్యాణము**

కర్త : చూ. పెనుమళ్ళ సోమనామాత్యుడు.

అంకితం : శ్రీశైల భ్రమరాంబికాధీశునకు.

అయిదాశ్వాసాలు గల ప్రబంధం. స్కాందపురాణంలో బ్రహ్మోత్తర ఖండం లోని "సీమంతినీ చరిత్ర" ఈ కథకు మూలం. సోమవార చరిత్రను వివరించే ఈ కథ శివపారమ్య నిరూపకము. (ఆం. సం. సా-414)

**సీమంతినీ కల్యాణము**

కాలం : క్రీ. శ. 19 వ శతాబ్దం పూర్వార్ధం.

కర్త : ఫణికుండల కవి.

ప్రబంధం. ముద్రితం. (క.వ. 137)

**సీమంతినీ చరిత్రము**

కర్త : కీరభద్ర కవి.

అంకితం : అరణీపురంలోని చంపకేశ్వరస్వామికి

కాంతయ్య ప్రోత్సాహంతో కవి ఈ యక్షగానాన్ని వ్రాశాడు. రచన చక్కనిది. సోమవార వ్రత మాహాత్మ్యం కథ ఇతివృత్తం. (య.వా.చ-435)

## సుంకరి కొండడు

ఇది గొల్లకలాపంలోని పాత్ర. ఇతని వేషధారణమే ప్రేక్షకులకు విపరీతమైన నవ్వు పుట్టిస్తుంది. గొల్ల కలాపాలన్నింటిలోను ఇతని పేరు కొండడే. "సుంకరి కొండని వేషము కథ" అనే యక్షగానంలో ఇతని పాలకం విపులంగా ఉంది. ఇతడు ఏలపాట పాడుకొంటూ హేలగా వస్తాడు. వచ్చిన కొండడు చిలిపిగా గొల్ల భామను సమీపించి సుంకం గాని, దానికి బదులు "ముద్దు"గాని ఇవ్వమని బహిరంగంగానే అడుగుతాడు.

గొల్లభామ తప్పించుకోవటానికి ప్రయత్నిస్తుంది. ఇద్దరికి వాగ్వివాదం జరుగుతుంది. వాదం సరదాగానూ, మోటుగానూ కూడా ఉంటుంది. అత్తగారిని పిలిచి నీ పని చెప్తానని కొండని బెదిరిస్తుంది. చివరకు కొండడు చేయి పట్టుకొనే సరసానికి కూడా దిగుతాడు.

కొన్ని గొల్ల కలాపాలలో అత్త రంగం మీదికి వచ్చి కొండని గద్దించి కోడలు పిల్లను తీసుకొని పోతుంది. దాబులు కొట్టిన కొండడు అత్తను చూసి ఉడాయిస్తాడు. కొన్ని కలాపాలలో అత్త రాకుండానే కొండడు గొల్లభామను, సరసంగా గాని, బలాత్కారంగా గాని లాగుకొని పోతాడు.

ఇది నాటి సుంకరి-గొల్లభామల అల్లరి చిల్లర ప్రవర్తనను ప్రతిబింబించే కలాపం.

ఈ గొల్ల కలాపంలో ఒక అంతరార్థముంది. సుంకరి శ్రీకృష్ణునికి, గొల్ల భామకు సంకేతం. దీనిలో గోపికా కృష్ణుల ప్రణయతత్త్వముంది. ఒకానొక యక్షగానంలో శ్రీకృష్ణుడే సుంకరి పాత్రధారి (రంగపురి పారిజాతం)గా కనిపిస్తాడు.

(య.వా.చ-201-2)

## సుంకసాల తిరుమల కవి

కాలం : క్రీ.శ. 18 వ శతాబ్దికి ముందు.

రచన : భాగవత వైభవము.

గురువు : కొకొ్కండ భట్టరుడు.

రఘునాథుని పుత్రుడు. ఇతడు కావ్య రచనా సంకల్పంతో ఉండగా లక్ష్మీదేవి స్వప్నంలో సాక్షాత్కరించి తనకు అంకితంగా భాగవత వైభవాన్ని చెప్పు మన్నదట్లు ఇతని రచన శ్రవ్యంగా ఉంది. (ద్వి.సా.చ-285)

## సుంకులు చెరిగే పాటలు

నామాంతరం : సువ్వి-సువ్వాలపాటలు, అల్లోనేరేళ్ళు (చూ).

## సుందర కాండ పదము

కర్త : తెలియదు.

జానపదగేయం. ఇతివృత్తం పౌరాణికం.

చూ. శృంగార గేయములు. (ఆం. వా. చ.)

## సుందర కాండము

కర్త : తుపాకుల అనంతభూపాలుడు (చూ).

అయిదాశ్వాసాల వచన గ్రంథం.

ఈ కవి మొత్తం రామాయణాన్ని వచన గ్రంథంగా రాశాడట. అందులో సుందరకాండ మాత్రమే నేడు లభ్యమవుతున్నది. చాలా విపులంగా వ్రాయబడిన ప్రామాణికమైన రచన. (క. త-13-112; వ. దే. వా-479)

## సుందర దామోదరమ్ (సం)

కర్త : చూ. లోలంబరాజు.

శ్రీకృష్ణుని వృత్తాంతం ఇందులోని కథా వస్తువు. (తె. వి. స-6)

## సుందరి (సౌందరి)

కాలం : తంజావూరు నాయకరాజుల అనంతరకాలం.

స్థలం : రాజమహేంద్రవరం.

రచన : అల్లాడ విజయసింహ భూపతి విలాసము.

ఈమె అల్లాడ విజయసింహ భూపతి భార్య. రాచవీటి నరపతి కుమార్తె. తన భర్త పేర రచించిన పై ప్రబంధం, రంగాజమ్మ రచించిన మన్నారుదాస విలాసాన్ని పోలి ఉన్నదనీ గ్రంథంలోనూ, గద్యలోనూ పేర్ల మార్పు తప్ప ఆ రెండింటికీ తేడా లేదని పండితుల అభిప్రాయం. (వ. దే. వా-157)

## సుందరి, కమల (జంట కవయిత్రులు)

కాలం : క్రీ. శ. 18వ శతాబ్దం.

స్థలం : తంజావూరు.

రచన : విద్ధసాలభంజికకు వ్యాఖ్య (సం).

వీరు తుక్కోజీ మంత్రియైన ఘనశ్యాముని భార్యలు. విదుషీమణులు. రాజశేఖరుని విద్ధసాలభంజికకు వ్యాఖ్య వ్రాశారట. (తె. వి. స-6-241)

## సుందరీమణి శతకము

కర్త : గోగులపాటి కూర్మనాథకవి.

రసికజన మనోరంజకమైన శతకం. చంపకోత్పలమాలా వృత్తాలతో కూడి ఉంది. కవి దీనిలోని కొన్ని పద్యాలు లక్ష్మీనారాయణ సంవాదంలో చొప్పించాడు. (ఆం. సం. సా-418)

## సుందరేశ్వర విలాసము

కర్త : మారుపెద్ది వెంగల్వరాయకవి (చూ).

యక్షగానం ముద్రితం. ఈ కవి చెయ్యూరు జమీందారుల ఆస్థానంలో ఉండటం వలన చెయ్యూరు చెంగల్వరాయశాస్త్రిగా ప్రసిద్ధుడయ్యాడు. వైద్యనాథుడనే జమీందారు కోరికపై ఈ సుందరేశ్వర విలాసాన్ని చెప్పాడు. మధుర మీనాక్షి - సుందరేశ్వరుల విలాసం ఇందులో వర్ణితం. కవి చిత్ర కవితను సంగీత యుక్తంగా చెప్పాడు. 'సరిగమ పదనిస'లతో ఒక కందం చెప్పాడు. (య.వా.చ-349; ద. దే. వా-511)

## సుకవి కర్ణామృతము

రచనా కాలం : క్రీ.శ. 16వ శతాబ్ది కి తర్వాతిది.

కర్త : కౌలూరి ఆంజనేయకవి

లక్షణ గ్రంథం. దీని ప్రతి ఆంధ్ర సాహిత్య పరిషత్తులో ఉంది,

(కవిజనాశ్రయం పీఠిక-వావిళ్ళ)

## సుకవి మనోరంజనము

రచనా కాలం : క్రీ.శ. 19వ శతాబ్దం పూర్వార్ధం.

కర్త : ముంచిమంచి వేంకటరాయడు.

లక్షణ గ్రంథం. ప్రధానంగా అప్పకవీయానికి విమర్శ గ్రంథం. ఇందులో నాలుగాశ్వాసాలున్నాయి. మొదటి ఆశ్వాసంలో తెలుగు అక్షరాల సంఖ్యానిర్ణయం, ప్రాస భేదాలు, రెండో ఆశ్వాసంలో స్వర, వ్యంజనయతులు, మూడో ఆశ్వాసంలో ఉభయ యతులు, నాలుగో ఆశ్వాసంలో రేఫ-ఒకార నిర్ణయం, పలు శబ్ద రూపాలు వివరింపబడ్డాయి. విమర్శ అంతా వచనంలో సాగడం ఈ గ్రంథ ప్రత్యేకత. (చం.ప.కో.)

## సుకుమారుడు

శ్రీనాథ విరచిత శివరాత్రి మాహాత్మ్యంలోని ఒకపాత్ర. ఇతడు నిగమశర్మ, గుణనిధి పాత్రల వంటివాడు. యజ్ఞదత్తుడు, అతని భార్య సుశీల ఎన్నో పూజలు చేస్తే చిరకాలానికి ఈ సుకుమారుడు పుడతాడు. చక్కగా విద్యాభ్యాసం చేసినా యౌవన దశ రాగానే జూదగాడుగా, త్రాగుబోతుగా, వ్యభిచారిగా మారిపోతాడు. సర్వ అవలక్షణాలకు ఇతడు పతిత. తల్లి తండ్రులు ఎన్ని విధాలచెప్పి చూసినా తన ప్రవర్తన మార్చుకోడు. రాజు ఇతని దుర్వృత్తి చూసి దేశబహిష్కారం చేస్తాడు. ఇతడు అడవిలో పోతూ ఒక చండాలాంగననుచూసి మోహించి, ఆమెతో కాపురం పెడతాడు. కపట మార్గాలతో కడుపు నింపుకొని, దారులుకొట్టి, పరమ దారుణాలు చేసి జీవిస్తాడు. కొన్నాళ్ళ తరువాత ఆ ప్రాంతంలో జీవించలేక చండాలాంగనతో వలసపోతాడు.

చండాలాంగన వలన ఇతనికి ఇద్దరు కుమార్తెలు, ఇద్దరు కుమారులు కలుగుతారు. వయసు ముదిరినా ఇతనికి వ్యసనాలు వదలలేదు. చండాలాంగన మరణానంతరం కడుపున పుట్టినతనయలతోనే కామ పనులు చేసిన పరమ నికృష్టుడితడు. ఉన్న ఊరివాళ్ళు దాదా ఇతనిని వెళ్ళ గొడతారు. ఒకనాడు కూతుళ్ళ కోసం పువ్వులు తెద్దామని తప్పతాగి శివాలయం వద్దకు వెళతాడు.

ఆనాడు శివరాత్రి. నాగేశ్వరాలయంలో భక్తులు చేస్తున్న ఉత్సవాన్ని సుకుమారుడు చూస్తాడు. తరువాత కొన్నాళ్ళకు మరణిస్తాడు. ఇతని ప్రాణం తీసుకొని పోవటానికి యమదూతలతో పాటు శివదూతలు కూడా వస్తారు. శివరాత్రి ఉత్సవ దర్శన మాత్రం చేతనే సుకుమారుడు పుణ్యం చేసుకొన్నాడని, అందువల్ల అతడు శివలోకం చేరుకొంటాడని శివదూతలు చెప్తారు. యమదూతలకు మారుగా శివదూతలే ఇతనిని శివలోకం చేరుస్తారు. ఇతడు చివరకు శివుని అనుగ్రహం వల్ల ప్రమథగణంలో చేరి పోతాడు.

మహా పాపాలు చేసినప్పటికీ శివరాత్రి దర్శన భాగ్యంవల్ల పుణ్యలోకాలు పొందటమనేది ఇతని కథలోని తాత్పర్యం.

శివరాత్రి మాహాత్మ్య కావ్యానికి మూలమైన ఈశాన సంహితలో సుకుమారుడు చండాలాంగనను కూడటమే పాపమని ఉంది. మరి ఆమెవల్ల జన్మించిన తనయలనే రమించిన ఈతడు ఎంతటి పరమ దుర్మార్గుడో చెప్పనలవి కాదు. తెలుగు సాహిత్యంలో ఇది ఒక పతితమైన పాత్ర. (శివరాత్రి మాహాత్మ్యం) (ఆంధ్ర 4-208-210)
(శ్రీనాథుడు 960-971-డా. శ్రీ. మూ.)

## సుగాత్రీ-శాలీనులు

పింగళి సూరన్న రచించిన కళాపూర్ణోదయ కావ్యంలోని ఈ జంట విశిష్టమైంది. సుగాత్రి శారద పూజారియైన ఒక బ్రాహ్మణుని కూతురు. ఆమె భర్త శాలీనుడు. ఇల్లటపుటల్లుడు. అలంకారాలు, చందాలు, అట్టహాసాలు ఈయనకు నచ్చవు. సహజ సౌందర్యాన్నేగాని, వేషభూషణాదుల వలన కలిగే సౌందర్యాన్ని మెచ్చడు. సర్వశృంగార సన్నాహాలతో భార్య పడకటింట్లోకి వస్తే-ఆమెను కన్నెత్తి అయినా చూసేవాడు కాదు. సుగాత్రికి ఈ విషయంలో చెలులిచ్చిన సలహాలు కవి లోకజ్ఞతను, కవితా శక్తిని ప్రస్ఫుటం చేస్తున్నాయి. కవి ఇక్కడ లలితమైన శృంగారాన్ని వర్ణించాడు. వర్ణనలో గాని, సంభాషణలోగాని ఎక్కడా అశ్లీలం వాక్యాలుండవు. చెలికత్తెలు ఇంత ప్రౌఢంగా సంభాషించటం ఏ కావ్యంలోనైనా అరుదు. సుగాత్రి బయటి సిగ్గును, లోపలి ఆశను ఈ ఘట్టంలోని పద్యాలు చక్కగా తెలియ చేస్తాయి.

అత్తగారు విసిగి అల్లుని తోట పనికి వియోగిస్తుంది. అతడు చక్కగా పని చేసి పూదోటలు పెంచాడు. కొన్నాళ్ళకు సుగాత్రి కూడా తోటకు పోయి భర్తకు పనులలో సహాయం చేస్తుంది.

అలంకారాలు లేకుండా కనిపించే సుగాత్రిని చూసి, శాలీనుడు ముగ్ధుడై పోయాడు. ఆమెను తన కౌగిట చేర్చుకొన్నాడు. శాలీనుని ప్రేమ స్వభావం చిత్రమైనది. స్నేహ, మార్దవాలతో కూడిన శృంగారం అతనిది. ఇతడు ముక్కోపి కూడా. కపట సిద్ధునిగా ఉన్నప్పుడు (ఇతడే మణిస్తంభుడు) ఇతని మనసు చిత్రమైన పోకడలు పోయింది. దేశకాలానుగుణమైన మానసిక విశ్లేషణను సూరన్న ఇతనిలో అద్వి

తీయంగా చూపాడు. ఇతనిలో సిద్ధునిగా తాను తామస ప్రవృత్తినీ, మణిస్తంభునిగా రాజస ప్రవృత్తినీ చిత్రించాడు.

సుగాత్రిపాత్ర తెలుగు సాహిత్యంలో అపురూపమైనది. ప్రేమానుభావానికి వెలియైనా భర్త కష్టాన్ని పంచుకోవడానికి సిద్ధపడింది. అతని క్షేమాన్ని కాంక్షించింది. ఈమె సాత్త్విక ప్రవృత్తి మూర్తీభవించిన సౌశీల్యవతి. ఒద్దికయే సుఖసంసారానికి బీజమని కవి సుగాత్రిపాత్ర ద్వారా సూచిస్తున్నాడు.

సుగాత్రీ శాలీనులే తర్వాత సుముఖాసత్తి, మణిస్తంభులయ్యారు. కళాపూర్ణుని తల్లి మగడి తండ్రి అనువారు అపుతాదని బ్రహ్మవాక్కు. అందుకు అనుగుణంగానే శారదా పీఠంలోని సరస్వతీదేవి సుగాత్రీ, శాలీనులకు వరాలిచ్చింది. మణికంధరుడే, కళాపూర్ణుడుగా, సుముఖసత్తి, మణిస్తంభులకు జన్మిస్తాడు. స్నేహ మర్యాదానుగుణమైన శృంగారాన్ని నవ్యలీలా లలితంగా మలచి ప్రతిభావ్యుత్పత్తులతో కవి, సుగాత్రీ శాలీనుల పాత్రలను తీర్చిదిద్దాడు (కళాపూర్ణోదయం పీఠిక-కట్టమంచి)

## సుగుటూరి చిక్కరాయలు

కాలం : క్రీ.శ. 1510-1575 ప్రాంతం.

సాహిత్య పోషకుడు. "గణిత దీపిక" అనే శాస్త్ర గ్రంథానికి కృతిపతి. బద్దె పీటి ఎత్తిప్పను ఆదరించి గ్రంథ రచనకు ప్రోత్సహించాడు.

ఈయన మైసూరులోని కోలారు ప్రాంతానికి ప్రభువు. ఈ ప్రాంతం పుంగనూరు సంస్థానంగా ప్రసిద్ధమైంది. (ఆరుద్ర-9; వ.దే.వా-489)

## సుగుటూరి ముమ్మడి తమ్మభూపతి

కాలం : క్రీ. శ. 17 వ శతాబ్దం.

స్థలం : మైసూరులోని కోలారుప్రాంతం (పుంగనూరు సంస్థానం).

రచనలు : 1. రాజేంద్రచోళచరిత్ర (అలభ్యం) 2. కుమారార్జునీయము (అలభ్యం) 3. సౌందరేశచరిత్ర (అలభ్యం) 4. రసికజన మనోరంజకము (సం) 5. కౌముదీవ్యాఖ్య (సం) 6. శంకర సంహిత (కన్నడం) 7. యక్షగానము (కన్నడం) 8. శివదర్పణమ్ (సం).

మైసూరు పాలకుల క్రింది సామంతరాజు. భాషాత్రయ ప్రబంధ నిర్మాణదక్షుడు. ఇతని తెలుగు రచనలేమీ దొరకలేదు. శివదర్పణము సంకలన గ్రంథమట. ఇతడు 1614-30 ప్రాంతం వాడని కొందరంటున్నారు. (వ. దే. వా-495)

## సుగుటూరు

చూ. పుంగనూరు సంస్థానం.

దక్షిణదేశంలో మైసూరు ప్రాంతాలకు చెందినభాగం. పుంగనూరు సంస్థానంగా ప్రసిద్ధం. ఇక్కడిరాజులు కర్ణాటకరాజులకు విధేయులు. ఇక్కడ తెలుగుభాషను ఆదరించిన

వారిలో ముమ్మడి తమ్మ భూపాలుడు (1614-30), చిక్కరాయలు ప్రసిద్ధులు. తమ్మ భూపాలుడు సంస్కృతాంధ్ర కర్ణాటక భాషలలో స్వయంగా రచనలు చేశాడు. బద్దెపీటి దత్తప్ప ఈ సంస్థానం వారి ఆశ్రితుడు.

భైరవకూరి ముళువాగళు ప్రభువులు వీరి బంధువర్గంలోని వారు. కోడూరి వేంకటాచలకవి ఇక్కడివాడే. (ద. దే. వా-పీఠిక)

## సుగ్రీవ విజయము

కర్త : కందుకూరి రుద్రకవి.

అంకితం : కందుకూరిలోని జనార్దనస్వామికి.

ప్రత్యేకత : యక్షగానాలలో ఇది మొదటిది. కొందరు చెన్నశౌరి వ్రాసిన "సౌభరి చరిత్ర" తొలి యక్షగానమంటున్నారు గాని అది అలభ్యం.

కిష్కింధాకాండలోని మంచి రసవత్తరమైన పట్టును తీసుకొని కవి యక్షగానంగా వ్రాశాడు. ఇందులో త్రిపుట, జంపె, కురుచజంపె, అటతాళం, ఏకతాళం మొ॥ గతులతో పాటలు, అర్ధచంద్రికలు, ఏలలు, ధవళాలు, ద్విపదలూ ఉన్నాయి. గ్రంథంలో మొదట్లో ఒక ఉత్పలమాల, చివర ఒక సీసపద్యం, అక్కడక్కడ వచనాలు, గీతాలు కూడా ఉన్నాయి. దీనిని "కరుణభాసుర యక్షగాన ప్రబంధం" అని రుద్రకవి పేర్కొన్నాడు.

రామబాణం తగిలి వాలి పడిపోయాక వాలివిలాపం దీనిలో చాలా బాగా ఉంటుంది వాలి మాటలలో ఏడుపు, కోపం, తర్కం, తిట్లు మొదలయినవి అన్నీ వరవలాగా కనిపిస్తాయి. రాముడువాలినివధించకముందు సీతమ్మనగలనుచూసి పలవించేపట్టం అత్యంత కరుణాత్మకంగా ఉంది. వాలివధ తరవాత అక్కడి చెంచెతలు ఏలలు పాడి, రామాయణం సుఖాంతమని సూచిస్తారు.

(త్రిపుటతాళంలో రుద్రకవి వ్రాసినవన్నీ గురజాడ "ముత్యాల సరాల" లక్షణానికి సరిపోతాయి. "ముత్యాల సరం" ఛందస్సు మన యక్షగానాలలో తొలినుంచీ ఉందనేది స్పష్టం.) (ఆర్ప్ర-8-167)

## సుగ్రీవ విజయము

జానపద పౌరాణిక గేయ రచన. ఇతివృత్తం రామాయణానికి సంబంధించింది

చూ. పౌరాణిక గేయములు. (అం, వా. చ.)

## సుజన మనః కుముద చంద్రిక

రచనాకాలం : క్రీ. శ. 1758 ప్రాంతం.

కర్త : కూచిమంచి తిమ్మకవి. (సందేహం).

కూచిమంచి తిమ్మకవి కృతులలో పూర్వాంధ్ర కవి చరిత్రకారు లెవరూ ఈకృతిని పేర్కొనలేదు. దీనిని గురించిన వివరాలు తెలియరాలేదు. ఇదే పేరు గల సంస్కృత కావ్యమొకటి తిమ్మకవి నామధేయుడైన కవి వ్రాశాడు.

(సా. చ. సం-208; తె. వి. వ-4; ఆం. సం. సా-481)

## సుజన మనః కుముద చంద్రిక (సం)

కర్త : చూ. కూచిమంచి తిమ్మకవి II

శివ పారమ్య బోధకమైన గద్య రచన. కేరళాధిపతి సంగదొమ్మని కుమారుడైన కరాళవక్త్రుని యొక్క, అతని నాయిక "మంజరి" యొక్క జీవిత విశేషాలు ఇందులోని ఇతివృత్తం. "మహాభాగుడు" అనే కళింగదేశ బ్రాహ్మణుడు స్వర్గానికి వెళ్ళి ఇంద్రునితో సంభాషిస్తూ ఈ కథ చెప్పినట్లుగా వ్రాయబడింది.

ఈ రచన విషయంలో కొన్ని వివాదాలున్నాయి. ఇది చంపూకావ్యమనీ, కూచిమంచి (మొదటి) తిమ్మకవి వ్రాసిన "రసికజన మనోభిరామ" గ్రంథానికి సంస్కృతీకరణమనీ కొందరి అభిప్రాయం. కాని, ఈ కావ్యానికి, రసిక జన మనోభిరామానికి ఎట్టి సామ్యంలేదు. కథాగమన విధానం కూడా ఒకటికాదు. ఈ రచనలో భిన్న భిన్న వృత్తాలు అక్కడక్కడ శ్లోకాలు వినిపిస్తాయి. కాని, వాటి సంఖ్య అల్పం. ప్రముఖంగా ఇది గద్య కావ్యం. ఇది తిమ్మకవి మునిమనుమడు వ్రాశాడని కొందరంటున్నారు. అతని పౌత్రుడు వ్రాశాడని మరి కొందరు అంటున్నారు. (సా. చ సం-206; ఆం. సం. సా-481, 248)

## సుజన రంజని

సంస్థాపకులు : పరవస్తు చిన్నయ సూరి.

క్రీ. శ. 19వ శతాబ్ది పూర్వార్ధంలో వెలసిన ప్రముఖ సాహిత్య పత్రిక. ఈ పత్రిక మూలంగా సూరి తెలుగు భాషా సాహిత్యాలకు ఎనలేని సేవ చేశారు. ఆ కాలంలో ఇది ప్రామాణికమైన తెలుగు సాహిత్య పత్రిక. ఈ పత్రికకు సూరి సంపాదకుడని కొందరంటున్నారు.

ఈ విషయంలో భేదాభిప్రాయాలున్నాయి. (తె. వి. స-4-796)

## సుజ్ఞానపెరుక

నామాంతరం : ఎరుక.

కర్త : రామబ్రహ్మయోగి.

## సుదంతా కల్యాణము

నామాంతరం : సుదంతా పరిణయము.

రచనాకాలం : క్రీ. శ. 18వ శతాబ్దం.

కర్త : వెలివెండ్ల ఆళశూరి (చూ).

అంకితం : శ్రీరంగనాథునికి.

శృంగార ప్రబంధం. నాలుగాశ్వాసాలున్నాయి. శ్రీకృష్ణుని ఆరవ భార్య సుదంత. ఈమె పేరును సత్యకీర్తి అని తాళ్ళపాక వారూ, సునంద అని చెంగల్వ కాళకవి పేర్కొన్నారు. కూచిమంచి తిమ్మకవి "నీలాసుందరి"గా చెప్పాడు. శ్రీకృష్ణునకు సుదంత తోడి పరిణయ గాథను హృదయంగమంగా వర్ణించిన ప్రబంధమిది.

(ద. దే. వా-397)

**సుదంతా పరిణయము**

నామాంతరం : సుదంతా కల్యాణము (చూ).

కర్త : వెలిదండ్ల అళఘరి.

**సుదంతా వివాహము (అలభ్యం)**

కర్త : రాజవోలు సుబ్బారాయడు.

కాలం : పింగళి సూరన తర్వాతికాలం.

ద్విపద. శృంగార మృదువాక్య సంగతితో చెప్పిన కావ్యమని కవి చెప్పుకొన్నాడు. (క. స-294)

**సుదక్షిణా పరిణయము**

కాలం : క్రీ. శ. 16వ శతాబ్దం.

కర్త : తెనాలి అన్నయ్య.

అంకితం : పులిజాల సోమయ్యకు.

విశిష్టత : ఇది అయిదాశ్వాసాల ప్రబంధం. రఘువంశంలోని దిలీపుడు సుదక్షిణ అనే రాచబిడ్డను వివాహమాడటం ఇందులోని కథ. సరస్వతి దేవి కర్పూరపు పలుకులు చల్లినట్లు, చంద్రమామ వచ్చి వెన్నెల కురిపించినట్లు, మన్మథుడు చెంగలువల తూపులు వేసినట్లూ తన కవిత్వముంటుందని కవి చెప్పుకున్నాడు. దీనిలోని ఉపమానాలు పింగళి సూరనన్నకు అనుకరణలు. దీనిలోని పాత్రలే కథను నడుపుతాయి, వర్ణనలు చేస్తాయి. కథా నాయకుని ప్రవేశ ఘట్టంలో కవి వసుచరిత్రను అనుకరించాడు. నన్నెచోడుని కాలంనుంచి ప్రబంధాలలో మధుపాన వర్ణన ఉంది. ఇందులో తప్ప తాగిన కప్పుర గంధుల మాటలు తడబడటాన్ని అన్నయ మనోహరంగా సరికొత్తగా వర్ణించాడు.
(ఆంప్ర-8-128)

**సుదర్శన రగడ (అలభ్యం)**

కర్త : తాళ్ళపాక పెద తిరుమలాచార్యుడు (క. త-6)

**సుధా తరంగము**

కర్త : చూ. కొటికెలపూడి కోదండరామకవి.

రచనాకాలం : క్రీ. శ. 1844 ప్రాంతం.

గణితశాస్త్ర గ్రంథం. ఆర్యభట్టీయ గణితంలోని కుట్టీకారగణిత రీతిని తెలిపే ఆర్యవృత్తి ద్వితీయానికి వ్యావహారికాంధ్రానువాదం. వ్యాఖ్యతో ఉంది. దీనిని మదరాసు ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారం వారు ప్రచురించారు.
(ఆం. వం. సా-305; శ. క. ద-780)

**సుధాలహరి (సం)**

కర్త : చూ. జగన్నాథ పండితరాయలు (క్రీ. శ. 1590-1665).

స్తుతి కావ్యం. దీనినే సూర్యస్తుతి అని కూడా అంటారు. (తె. వి. స-6)

**సునందా పరిణయము**

నామాంతరం : ప్రదీప చరిత్రము.

కర్త : చింతకుంట కోదండరామకవి.

రచనాకాలం : క్రీ. శ. 1790 ప్రాంతం.

ఐదాశ్వాసాల ప్రబంధం. రచన రసవంతంగా హృద్యంగా ఉంది. (క. చ-3-126)

**సుబోధినీ సుధాసారమ్ (సం)**

కర్త : చూ. అన్నంభట్టు.

ఇది "రాణకోజ్జీవినీ" మీమాంస గ్రంథం. (తె. వి. స-4)

**సుబ్బమాంబిక**

బిల్హణోపాఖ్యాన కర్తయైన అరుణాచలకవి తల్లి. అరుణాచల కవి తన రచనను తల్లికే అంకితం చేశాడు. (ద్వి. సా. చ-441)

**సుబ్బరాయ శతకము**

కర్త : తెలియదు.

తమిళదేశంలో వెల్వడిన తెలుగు శతకం. రచన సీస పద్యాలలో ఉంది. (ద. దే. వా-పీఠిక)

**సుబ్బరాయ శతకము**

కర్త : పొత్తపి వెంకటయ్య (చూ).

సీసపద్య శతకం. 108 దివ్యతిరుపతులను పర్ణిస్తూ "మహిత రూపాయ ధూర్జటి మతి విధేయ, సూర్యశతకోటి విభవాయ సుబ్బరాయ" అనే మకుటంతో చేయబడ్డ రచన. కొన్ని సీతి పద్యాలు ఉన్నాయి. (ఆం.ప్ర-12-85)

**సుబ్బరాయుడు**

కృతిపతి. చిత్రకవి పెంకట రమణకవి రచించిన సకల వర్ణనా పూర్ణ రామాయణం సుబ్బరాయనికి అంకితం. ఇతని వివరాలు తెలియరాలేదు. అయితే కవి చెప్పిన సుబ్బరాయుడు సుబ్రహ్మణ్యేశ్వరస్వామియే కాని మానవుడు కాదనీ చాగంటి శేషయ్యగారు అభిప్రాయపడ్డారు. (క. త-12-91)

**సుబ్రహ్మణ్య కవి**

చూ. మునిపల్లె సుబ్రహ్మణ్యకవి.

**సుబ్రహ్మణ్య విజయము**

నామాంతరం : విద్వత్కర్ణామృతము.

కర్త : త్యాగరాజ మొదలి.

**సుబ్రహ్మణ్య శతకము**

నామాంతరం : శ్రీబాల సుబ్బరాయ శతకము.

కర్త : బృహత్తటాకం నాగశాస్త్రి.

ఇది చారిత్రక శతకం. తురుష్కులు హిందూదేవాలయాలను ధ్వంసం చేసే సమయంలో ఈ శతకం విరచితం. సింహాద్రి నారసింహ శతకంలో వలె రచన సాగింది. కూర్మనాథకవి సింహాద్రి అప్పన్నకు నివేదించినట్లే, కవి సుబ్రహ్మణ్యస్వామికి తనబాధను నివేదించాడు. మండలాధికారులను, మంత్రులను, రాజాధికారులను స్వార్థపరులయినందుకు నిందించాడు. "శూర సంహార, కిరిగిరి సువిహార, సుకవి జనగేయ, శ్రీబాల సుబ్బరాయ" అనే మకుటంతో శతకరచన సాగింది. (శ. సా వి.)

## సుఖగానంద ప్రహసనము

కర్త : వాసుదేవకవి. (కర్తృత్వం సందేహం).

అంకితం : శహాజీకి

హాస్య నాటకం. అసభ్యత హెచ్చుగా ఉన్నది.

(ఆరుద్ర-12-182) (శారదాధ్వజం-76)

## సుభద్రా కల్యాణము

కర్త : తెలియదు.

జానపద పౌరాణిక గేయము. ఇతివృత్తం భారతికథకు సంబంధించింది. ప్రసిద్ధం.

చూ. పౌరాణిక గేయములు. (అం. వా. చ)

## సుభద్రా కల్యాణము

రచనాకాలం : క్రీ. శ. 15 వ శతాబ్ది తొలి భాగం.

కవయిత్రి : తాళ్ళపాక తిమ్మక్క.

ద్విపద కావ్యం. మహాభారతం ఆదిపర్వంలోని విజయవిలాస ఘట్టం ఈ ద్విపద కావ్యానికి మూలం. స్వతంత్ర కల్పనలున్నాయి. అర్జునుడు తీర్థయాత్రలు చేస్తూ అహోబిలం, తిరుపతి, కంచి దర్శించినట్లు ఉంది. తిమ్మక్క చిత్రించిన సుభద్ర అచ్చమైన తెలుగు కన్నె. ఈడుకు తగ్గ ఆటలు ఆడింది, బొమ్మల పెళ్ళిళ్ళు చేసింది. ఇందులో చిలుక రాయబారం ఉంది. కావ్యంలోని నెరజాణయైన ఈ చిలుకను చేమకూర వేంకటకవి ఎరవు తీసుకున్నాడు. ఇందులోని నర్మగర్భితమైన సంభాషణలు, వర్ణనలు కూడా చేమకూర యథాతథంగా వాడుకున్నాడు. ఇందులోని సుభద్రార్జునుల పాత్రపోషణ అపూర్వం. తెలుగుదనం ఉట్టిపడుతున్న రచన. ముద్రితం. (ద్వి. సా. చ. 337)

## సుభద్రా పరిణయ నాటకమ్ (సం)

కర్త : నల్ల దీక్షితుడు.

దక్షిణదేశంలోని మధ్యార్జున క్షేత్రంలో జరిగే ఉత్సవాలలో ఈ నాటకం రచయిత కాలంలోనే ప్రదర్శింపబడుతుండేదట. (న. దే. వా-180)

**సుభద్రా పరిణయమ్ (సం)**

కర్త : వేంకటాధ్వరి.

నాటకం. రెండు అంకాలు మాత్రమే దొరికింది. (తె. వి. స-8)

**సుభద్రా పరిణయము**

కర్త : చూ. రూచిమంచి జగ్గకవి.

ఆరాశ్వాసాల రసవత్ప్రబంధం. ఇతివృత్తం ప్రఖ్యాతం. శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి "విజయవిలాస కృతి విమర్శ"లో చేమకూర వెంకన్న విజయవిలాసాన్ని, రూచిమంచి జగ్గకవి సుభద్రాపరిణయంతో పోల్చి, తారతమ్య వివేచన చేశారు. (ఆం. సం. సా-246; క. స-74)

**సుఖా భక్తుడు**

కాలం : క్రీ. శ. 18 వ శతాబ్దం.

స్థలం : పుదుక్కోట.

ఖడ్గశాస్త్ర విశారదుడు. "ఖడ్గ లక్షణ శిరోమణి" కర్త నవనప్ప ఇతని నుండి అనేక విషయాలను తెలుసుకొన్నాడట. (ఆ. శ.)

**సుభాషిత కౌస్తుభమ్ (సం)**

కర్త : వేంకటాధ్వరి.

ఇది అయిదు ప్రకరణాల గ్రంథం. (తె. వి. స-8)

**సుభాషిత త్రిశతి**

రచనాకాలం : క్రీ. శ. 1810-70 ప్రాంతం.

కర్త : ఎలకూచి బాలసరస్వతి.

అంకితం : ముమ్మడి మల్ల భూపాలునికి.

భర్తృహరి సంస్కృతంలో రచించిన శతకాలకు అనువాదం. నీతిశతకము, శృంగార శతకము, వైరాగ్య శతకమనే మూడు శతకాల కలయిక. మత్తేభ శార్దూల వృత్తాలలో ఉంది. (ఆం. సం. సా.)

**సుభాషిత త్రిశతి**

రచనాకాలం : క్రీ. శ. 18 వ శతాబ్ది.

కర్త : పుష్పగిరి తిమ్మన.

గ్రంథం పూర్తిగా లభ్యం కాలేదు. నీతిశతకం ఒక్కటే లభించింది. (శ. క. చ)

**సుభాషిత త్రిశతి**

రచనాకాలం : క్రీ. శ. 1830 ప్రాంతం.

కర్త : వెల్లాల నరసింగకవి.

భర్తృహరి సుభాషిత త్రిశతికి అనువాదం. "వెల్లూరి వేంకటాచల రమణా"

అనే మకుటంతో ఉంది. కంద పద్యాలలో కవి మూలభావాన్ని చక్కగా ఇమిడ్చిచెప్పాడు.
(క. స-103)

**సుభాషిత సుధానిధి (సం)**

కర్త : సాయణాచార్యుడు.

కవుల సుభాషితాలు, సమకాలిక కవుల సూక్తులు ఇందులో ఉన్నాయి.
(తె. వి. స-4-1190)

**సుమంతోదయము (అలభ్యం)**

కర్త : వెలగపూడి వంశీయుడు. పేరు తెలియరాలేదు.

భానుమద్విజయ కర్త వెలగపూడి కృష్ణయ్య ఈ కృతిని పేర్కొన్నాడు.
(వ. దే. వా-388)

**సుమతి శతకము**

కర్త : భద్ర భూపాలుడు (బద్దెన).

కాలం : క్రీ. శ. 13 వ శతాబ్దం.

దీనిని బద్దెన వ్రాశాడని, వ్రాయలేదని పండితులలో భేదాభిప్రాయముంది. దీనిలో చక్కని నీతులున్నాయి. తెలుగు నీతి శతకాలలో తలమానికమైనది. తెలుగు దేశంలో బహుళ ప్రచారంలో ఉంది. (క. స-139) (శ. సా. వి-370)

**సుమతి శతకము (అలభ్యం)**

కర్త : వేములవాడ భీమకవి (నిర్ధారణ కాలేదు)

భీమకవి ఒక సుమతి శతకాన్ని చెప్పాడని కూచిమంచి తిమ్మకవి సర్వ లక్షణ సార సంగ్రహంలోని ఉదాహృతిని బట్టి తెలుస్తున్నది. (క.స-139)

**సుమతీంద్ర జయపురుషమ్ (సం)**

రచనాకాలం : క్రీ.శ. 18 వ శతాబ్దం.

కర్త : సుమతీంద్రుడు.

(శారదాధ్వజం-89)

**సుమతీంద్రుడు**

కాలం : క్రీ శ. 18 వ శతాబ్దం.

స్థలం : తంజావూరు.

రచనలు : సుమతీంద్ర జయపురుషమ్ (సం).

క్రీ. శ. 1684-1712 నడుమ తంజావూరును పాలించిన శహాజీ ఆస్థానంలో సమ్మానాలు పొందాడు. (శారదాధ్వజం-89)

**సుమనో మనోభిరంజనము**

రచనాకాలం : క్రీ.శ. 1845 ప్రాంతం.

కర్త : ఓగిరాల జగన్నాథ కవి.

ఇదు ఉల్లాసాల ప్రబంధం. కవిత్వం రసవంతంగా నిర్దుష్టంగా ఉంది. ఇది అనేక పర్యాయాలు పట్ట పరీక్షకు పఠనీయ గ్రంథంగా ఉంది. (వి.యు-137)

## సురతాణి కల్యాణము

కర్త : తెలియదు.

కాలం . క్రీ.శ. 1850 కి పూర్వం.

అంకితం : అచ్యుత విజయరంగ కి.

యక్షగానం. వారణాసి అచ్యుత రామకవి ఈ యక్షగానం ఆధారంగా సురతాణి పరిణయ ప్రబంధం వ్రాశాడు. బీబి నాంచారి కథ దీనిలోని ఇతివృత్తమట. (య.వా.చ-456)

## సురపురము

ఇది నేటి గుల్బర్గా మండలంలోని ఒక సీమ. పూర్వం నిజాం రాజ్యంలో ఉండేది. దీనికి సోరాపురం, షోలాపురం, సూరాపురం అని వ్యవహార నామాలు ఉన్నాయి.

ఈ సంస్థానానికి "పీర బొమ్మి నాయకుడు" మూల పురుషుడు. ఈ వంశం వారు, శ్రీరామ భక్తుడగు గుహుని సంతతి వారనీ, మృగయా జీవులనీ స్థానికంగా పేరు చేసుయలని తెలుగు కైఫియత్తుల ద్వారా తెలుస్తున్నది

పీరబొమ్మి నాయకుడు కృష్ణా తుంగభద్రా నదుల దక్షిణ భాగంలో సర్దేశముఖీ పదవిలో ఉండి సమకాలికుల మన్ననలను పొందినవాడు. ఈ వంశం వారు గోల్కొండ, బీజాపూర్ సుల్తాన్‌లకు రాజకీయ వ్యవహారాల్లో తోడ్పడేవారు.

కల్లప్ప చిన్న హనుమానాయకుడు "బహిరీ వసంతరావు"ను రణరంగంలో ఓడించి విజయ సూచకంగా బిరుదాన్ని గ్రహించాడు. అప్పటి నుంచి "బహిరీ" అనే బిరుదం ఓరు వంశ పారంపర్యంగా ధరిస్తున్నారు. ఈ పాలకులు మొదట మహారాష్ట్రులకు సామంతులు. పీతాంబర పెదనాయక భూపాలుని కాలం నుంచి నిజాంకు కప్పం కట్టేవారు. క్రీ.శ. 1713 లో పాము నాయకుడనే ప్రభువు హసనాపురం కొండ చాలులో "సురపురం" అనే నగరాన్ని నిర్మించి, దానినే రాజధానిగా చేసుకొని సంస్థానాన్ని పాలించాడు.

వేంకటనాయకుడు, ఈశ్వరమ్మ, రాజా వేంకటప్ప ఈ పాలకులలో ప్రసిద్ధులు. రాజా వేంకటప్ప కుంపిణీ వారిని ధిక్కరించి అరబ్బులను, రోహిల్లాలను సైన్యంలో చేర్చుకొన్నాడు. సిపాయిల తిరుగుబాటులో నానాసాహెబ్ మొదలైన వారికి సహాయం చేయడం చేత కుంఫిణీ వారు ఇతనిని సంస్థానాధిపత్యం నుండి తొలగించి శిక్షించారు. శిక్షాకాలం పూర్తి కాకముందే ఇతడు ఆత్మహత్య చేసుకున్నట్లు తెలుస్తున్నది. ఈ సంస్థానం క్రీ.శ. 1861 మార్చి 1 న కుంఫిణీ వారిచే హైదరాబాదు నిజాంకు ఇవ్వబడినది.

సురపురం సంస్థానాధీశ్వరులు దిగ్దంతులవంటి పండితులను, కవులను పోషించి సాహిత్య లోకంలో అచిరకీర్తి సంపాదించారు. రాజా బహిరీ పామ నృపాలకుడు కృతి

భర్త, కృతికర్త కూడ. ఇతని భార్గవ పురాణం సాహితీ పటుత్వానికి చక్కని నిదర్శనం. తిరుమల బుక్కాపట్టణం వంశానికి చెందిన శ్రీనివాస, అణ్ణయ దీక్షిత, కిరీటి వేంకటాచార్య, బుచ్చి వేంకటాచార్య, రంగాచార్య పండితులు సురపుర రాజన్యుల కీర్తి పతాకలు. కాణాదము పెద్దన, వరకూరి వేంకటశాస్త్రి, పురుషకారి కేశవయ్య వంటి కవి ప్రకాండులు ఈ సంస్థానములో ప్రసిద్ధులు.

అహోబలస్వామి, మైసూరు పరకాల బ్రహ్మ తంత్రస్వామి, రాజగురువు తిరుమల బుక్కాపట్టణం వేంకటాచార్యులు, కృష్ణమాచార్యులు, రాజ విద్యా గురువులు త్రివేది వరదాచార్యులు, రాజ పురోహితుడు బాగలకోట రాఘవప్ప, పూజారి గోపాలయ్య మొదలగు వారికి సర్వాగ్రహారాలు ఒసగి మన్నించిన సంస్థానమిది. ఈ పాలకులు పరీక్ష ప్రదర్శనలు, సాహిత్య చర్చా సభలు ఏర్పరచి కవి పండిత నర్తక గాయకాదులకు భూరి సంభావనలిచ్చి ఆర్ష ధర్మాన్ని, భారతీయ కళా సంస్కృతులను వికసింపచేసి కీర్తి ప్రతిష్ఠలు పొందారు. (ఆం.సం.సా_512_519)

## సురపురము కేశవయ్య

కాలం : క్రీ.శ. 1760 ప్రాంతం.
స్థలం : మహబూబ్‌నగర్ మండలంలోని 'ఆత్మకూరు'.
రచన : నిరోష్ఠ్య రామాయణము.

ఆత్మకూరు సంస్థానాధీశ్వరుడు రాజా సోమభూపాల్ ఆస్థానంలోని కవులలో ముఖ్యుడు. విద్వత్కవి. ఇతడు చాలా రచనలు చేశాడట. అవి లభ్యం కాలేదు. (ఆం.సం.సా.)

## సురభి గ్రామము

మహబూబ్‌నగర్ జిల్లా కల్వకుర్తి తాలూకాలో ఉంది. దీని పూర్వ నామం గోదలు (గోడక్). సురభి వారికి ఇంటి పేరుగా ఉంది. వీర వేంకటపతిరాయలు ఈ సురభివారికి ఫసలి 1000 లో జటప్రోలు సంస్థానాన్ని ఇచ్చాడట. వీరిలో సురభి మల్లానాయకుడు ఎలకూచి బాలసరస్వతి తెనిగించిన సుభాషితాలకు కృతిపతి. సురభి మాధవరాయలు చంద్రికాపరిణయ ప్రబంధ కర్త. వీరు విజయనగర రాజ సింహాసనానికి విధేయులు. సంగీత సాహిత్యాలకు ప్రసిద్ధులు. (అరుద్ర_10_38)

## సురభి నరసింగరావు

కాలం : క్రీ.శ. 17 వ శతాబ్దం.
స్థలం : జటప్రోలు సంస్థానం.
రచన : క్షత్రఖేలనమ్ (సం.).

రాజకవి. సురభి మాధవరాయల కుమారుడు. జటప్రోలు సంస్థానాధిపతి. (ఆం.సం.సా.)

## సురభి మల్లభూపాలుడు

కాలం : క్రీ.శ. 1610_1670 ప్రాంతం.

సాహిత్య పోషకుడు. కృతిపతి. జటప్రోలు సంస్థానాధిపతి. మహా మహోపాధ్యాయ బిరుదాంచితుడు, శతాధిక ప్రబంధ కర్త అయిన ఎలకూచి బాలసరస్వతిని పోషించాడు. బాలసరస్వతి తెనిగించిన భర్తృహరి సుభాషిత త్రిశతిని అంకితం పొందాడు. ప్రతి పద్యంలోనూ ఇతని పేరు వచ్చేటట్లుగా "సురభిమల్లా" అనే మకుటంతో బాల సరస్వతి సుభాషితాలు వ్రాశాడు. (తె ప.స-6) (అరుద్ర-10-37)

## సురభి మాధవరాయలు

కాలం : క్రీ. శ. 17వ శతాబ్దం ప్రారంభం.
స్థలం : జటప్రోలు.
రచన : చంద్రికాపరిణయము.
సమకాలికుడు : రామరాజ భూషణుడు.

కవి, పండిత పోషకుడు. జటప్రోలు సంస్థానాధీశ్వరులలో 19 వ తరం వాడైన మల్లా నాయని మూడవ కుమారుడు. కావ్య నాటకాలంకారాది శాస్త్రాదులందు విఖ్యాతుడు "ఎలకూచి బాలసరస్వతి" వీరి ఆస్థాన కవిగా ఉండేవాడు. ఇతడే భర్తృహరి సుభాషితాల్ని తెలుగులో ఆ కవి చేత అనువదింపచేసి, మల్ల భూపాలునికి అంకితం చేయించాడు. ఇతడు చేసిన అగ్రహార దానాలు, ఆలయ నిర్మాణాలు లెక్క లేనివి. సింగపట్నంలోని "నరసింహ సాగరము"నే తటాకం ఇతడు నిర్మించినదే. తరిగొప్పుల మల్లన చంద్రభాను చరిత్రను ఈ కవి అనుసరించాడని అంటారు. రెండూ కల్పితేతివృత్తం గల ప్రబంధాలే. (సం. సా-కేశవపంతుల) (అరుద్ర-10-41)

## సురాభాండేశ్వరము

కర్త : తెలియదు.

జానపద పౌరాణిక గేయం. ప్రసిద్ధమైన కథ. కాశిలో ఒకానొక మధువిక్రేత భార్యముక్కలి రూపవతి. ఒక వేద వేదాంగవిదుడైన బ్రాహ్మణుడు ఆమెనుచూసి మోహించి ఆమె ఇంటికి వెళ్తాడు. బ్రహ్మహత్యా పాతకానికి భయపడి ఆమె అతని కోరిక తీరుస్తుంది. ఇంతలోనే భర్త రాగా ఆ బ్రాహ్మణుని సురాభాండంలో దాచి, భర్తకు విషయమంతా చెప్పి, తనను చంపి కైవల్యానికి పంపమని వేడుకొంటుంది. సురాభాండంలోని బ్రాహ్మణుడు బ్రహ్మ రంధ్రం ద్వారా ప్రాణ త్యాగం చేస్తాడు. బ్రాహ్మణుని సురాభాండంలో ఉంచినందుకు భర్త ఆమెను నిందించి, తాను ఆత్మహత్యకు పూనుకొంటాడు. అతని భార్య శివుని ప్రార్థింపగా సురాభాండంలో ఈశ్వరుడు ప్రత్యక్షమై సురాభాండేశ్వరుడుగా ప్రసిద్ధుడౌతాడు.

## సురాభాండేశ్వరము

కాలం : 18వ శతాబ్దానికి పూర్వం.
కర్త : గురవయ్య కవి.
అంకితం : శ్రీరామచంద్రునికి.

ద్విపద కావ్యం. కవికి స్వప్నంలో శ్రీరాముడు కనబడి కావ్య రచనకు పురి

కొల్చారట. దీనికి మూలం కాశీఖండంలో ఉన్నదని కవి చెప్పాడు. వర్ణనాదులు శృంగార ప్రబంధంలో వలె ఉన్నాయి. రచన ప్రశస్తమైనది.

దీనిప్రతి మదరాసు ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారంలో ఉంది.

(ద్వి. సా. చ-175)

## సురాభాండేశ్వరము

రచనా కాలం : క్రీ.శ. 16వ శతాబ్దం.

కర్త : ఘట్టు ప్రభువు.

పద్య కావ్యం. విశేష ప్రాచుర్యాన్ని పొందిన ఇతివృత్తం. (క.చ-65)

## సురాభాండేశ్వరము

కాలం : 16, 17 శతాబ్దాల మధ్యకాలం కావచ్చు.

కర్త : పులిగడ్డ నారన.

ద్విపద కావ్యం. ఈశ్వర స్తుతితో ఆరంభమైంది. గాన యోగ్యంగా ఉంది. దీని ప్రతి మదరాసు ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారంలో ఉంది. (ద్వి.సా చ. 177)

## సులక్షణ సారము

కర్త : లింగముకుంట తిమ్మకవి.

అంకితం : చదలువాడలోని శ్రీరామచంద్రునికి.

ప్రత్యేకత : ప్రామాణికమైన ఛందో గ్రంథం. తెలుగు పద్య రచన చేయటానికి అప్పకవీయాన్ని పెద్ద బాలశిక్షగా, దీనిని చిన్న బాలశిక్షగా తెలుగునాట చదువుతారు పూర్వపు లక్షణ శాస్త్రాలన్నింటినీ పరిశీలించి, అందరి అభిప్రాయాలను కవి ఇందులో క్రోడీకరించాడు ఈ గ్రంథం 1862లో ముద్రితమైంది.

క్రీ.శ. 1950 వరకు దీని కర్త వెల్లంకి తాతంభట్టు అనే ప్రచారం ఉండేది. రావూరి దొరస్వామి శర్మ పరిశీలించి, పరిష్కరించాక తిమ్మకవి పేర దీనిని వావిళ్ళవారు ప్రచురించారు. (అరుద్ర-8-135)

## సువసంతకము

చూ. వసంత మహోత్సవము.

## సువ్వాలాలి పాటలు

నామాంతరం : సువ్వి - సువ్వాల పాటలు (చూ).

## సువ్వాల ద్విపదలు

జానపద వాఙ్మయానికి చెందిన పాటలు. సువ్వి సువ్వాల అనేవి తెలుగు దేశంలో దంపుళ్ళ పాటలుగా ప్రసిద్ధాలు. ఇవి అనేక యక్షగానాలలో ప్రయుక్తాలు. అప్పకవీయంలో, లక్షణ సార సంగ్రహంలో ఇవి పేర్కొనబడ్డాయి. ద్విపదకు ద్విగుణమైన తరువోజ కావ్యాలంకార చూడామణిలో చెప్పబడింది. ఇది రోకటి పోటు-ఒడుపులో

ఒక వేగాన్ని సూచిస్తుంది. "సువ్వీ సువ్వాలే" అనేది చివర ఒక ఊతపదం పల్లవి వంటిది.

(య.వా.చ-258)

**సువ్వాల ధాతువులు**

నామాంతరం : సువ్వి - సువ్వాల పాటలు (చూ).

**సువ్వి - సువ్వాల పాటలు**

నామాంతరాలు : సువ్వాలాలి, సువ్వాల, సుంకుల పాటలు, కొట్నముల పాటలు సువ్వాల ద్విపదలు, సువ్వాల ధాతువులు.

ఇవి చిర ప్రసిద్ధమైన దంపుళ్ళ పాటలు. చాలా యక్షగానాలలో వివాహ సందర్భాలలో ప్రయుక్తాలు.

కొన్ని యక్షగానాలలో "సుంకులు దంచే పాట" సువ్విగను, "సుంకులు చెరిగే పాట" సువ్వాలగను కనిపిస్తుంది. ఇవి నందిపాటివారి మిత్రవిందా పరిణయంలోను, మామిళ్ళపల్లి వారి ఏకాంతసేవ లోనూ ఉన్నాయి. (య.వా.చ-348-49)

**సుశీల**

శ్రీనాథ మహాకవి వ్రాసిన కాశీఖండ కావ్యంలోని ఒక మహోత్కృష్టమైన పాత్ర. తెలుగు సాహిత్యంలోని స్త్రీ పాత్రలలో మణిపూస. ఈమె కాశీవాసియైన హరిస్వామి కూతురు. మహాభక్తురాలు. సౌందర్యవతి.

ఒకసారిగా పండు వెన్నెలలో నిద్రిస్తున్న ఈమెను ఒక విద్యాధరుడు మోహించి ఆమెను ఎత్తుకొని మలయాద్రికి తీసుకొని పోతుంటాడు. దారిలో విద్యున్మాలి అనే రాక్షసుడు తటస్థపడి, సుశీల చక్కదనం చూసి మోహితుడై విద్యాధరునితో యుద్ధం చేస్తాడు. ఇరువురూ యుద్ధంలో చనిపోతారు. సుశీలను వలవరిస్తూనే విద్యాధరుడు చనిపోతాడు. తన కోసం చనిపోయిన విద్యాధరుడే తనకు నిజమైన భర్త అని సుశీల నిశ్చయించుకొన్నది.

ఈమె అభం, శుభం తెలియని అమాయకురాలు. తన్ను తండ్రి వివాహం నిశ్చయించలేదు, ఎత్తుకొని వచ్చిన విద్యాధరుడు తాళికట్టనూ లేదు. కాని అతనినే తన భర్తగా భావించి సహగమనానికి సిద్ధపడిన నిజమైన సుశీల. సహగమనోచితమైన పూలదండ ధరించి, కాశిని, విశ్వనాథుని స్మరించి, తల్లి తండ్రులను తలచుకొని సహగమనానికి సిద్ధపడిన ఆమె స్వగతం హృదయ విదారకంగా కవి వర్ణించాడు.

ఈ ఘట్టం కాశీఖండంలో కరుణరస నిర్భరమైనది. కాష్ఠాగ్నికి ప్రదక్షిణం చేసి అందరినీ ఆశీర్వదిస్తూ, తన పుట్టినిల్లు పురోభివృద్ధి నొందాలని, తన తల్లి శాశ్వతంగా ముత్తైదువుగానే ఉండాలని, తండ్రి ఉత్తమ శ్లోకుడు కావాలని, తమ ఇంటిలో నిరంతరం వేదపఠనం, త్రికాల శివలింగార్చన జరగాలని కోరుకొన్నది. తన బంధువర్గమంతా తీగవలె కొనలు సాగి బ్రతకాలని మనస్ఫూర్తిగా కోరుకొన్నది.

ఈమె సహగమనమే ఒక ఇతిహాసం. ఈ ఘట్టంలో విషాద రేఖా కలితమైన ధర్మవీర మున్నది. చంద్రుడు సూర్యునిలో ప్రవేశించినట్లు సుశీల అగ్నిలో ప్రవేశిస్తుంది. సుశీల మరుజన్మలో విద్యాధరుని అర్ధాంగిగా పుట్టాలని కోరుకొన్నది. ఆమె పుణ్యం ఫలించి ఆమె కళావతిగాను, విద్యాధరుడు మాల్యకేతుడుగాను జన్మించి దంపతులైనారు.

(శ్రీనాథుడు–892,905—కా.శ్రీ మూ.)

**సుశీల (సం)**

కర్త : పరవస్తు కృష్ణమాచార్యులు.

సంస్కృత గద్య కావ్యం. దీనిలో సమకాలిక సాంఘిక పరిస్థితులు ప్రతిబింబిస్తున్నాయి. (తె వి స–6)

**సుశీలోపాఖ్యానము**

కాలం : క్రీ. శ. 18 వ శతాబ్దం.
కర్త : సముద్రాల రామానుజాచార్యులు.

ప్రబంధం. (క స–201)

**సుశోభా వివాహము**

కాలం : క్రీ. శ. 18 వ శతాబ్దం.
కర్త : అల్లమరాజు రామకృష్ణకవి.

ప్రబంధం. (వీ.యు–184)

**సుసంగ విజయము**

కర్త : ఘనం (వంగల) సీనయ్య.
అంకితం : వేంకటేశ్వరునికి.

ప్రబంధం. (తె వి స–4)

**సుసర్ల బ్రహ్మన్నశాస్త్రి**

కాలం : తెలియదు.
స్థలం : కృష్ణామండలం, పెదకళ్ళేపల్లి.
రచనలు : తెలియరాలేదు.

సంస్కృతాంధ్ర పండితుడు. ఇతని శ్లోకాలు కొన్ని చాటు పద్య మణి మంజరిలో ఉదాహృతాలు. (చా.ప మ–98)

**సూక్తి రత్నమాల**

కర్త : మరింగంటి లక్ష్మణ దేశికులు.

అముద్రితం. (తె.వి.స–6)

**సూక్తి రత్నాకర వ్యాఖ్య (సం)**

కర్త : శేషనారాయణుడు.

పతంజలి మహా భాష్యానికిది వ్యాఖ్య. (తె.వి.స.-8)

## సూగూరు

వనపర్తి సంస్థానానికి పూర్వపు రాజధాని. చూ. వనపర్తి. (ఆం.సం.సా.)

## సూతసంహిత

కర్త : చూ. పట్టమెట్ట సోమనాథ సోమయాజి.
అంకితం : బిక్కనవోలులోని సిద్ధరామేశ్వరునకు.

దోమకొండ (బిక్కనవోలు) సంస్థాన పాలకుడైన కామినేని కామారెడ్డి ప్రేరణచేత కవి ఈ గ్రంథం వ్రాశాడు. ఏడు అశ్వాసాలున్నాయి. సంస్కృత సూత సంహితకు అనువాదం. మూలం స్కాంద పురాణంలో ఉంది. కవిత్వం గంగా ప్రవాహం వలె ఉండాలని కవి దీనిలో చెప్పాడు. ఈ గ్రంథ ప్రేరేపకుడు కామిరెడ్డిని కృతి పతిగా కొందరు పేర్కొన్నారు. (ఆం.సం.సా.-183; అరుద్ర-9)

## సూత్రధారుడు

దృశ్య కావ్యమైన నాటక ప్రయోగానికి, ప్రదర్శనకూ చెందిన బాధ్యతలను వహించేవాడు సూత్రధారుడు. నాటక ప్రయోగానుష్ఠాన బాధ్యత అనే సూత్రము ధరించే వాడు కాబట్టి ఇతన్ని సూత్రధారుడని అన్నారు. ప్రాచీన మార్గ రీతికి చెందిన నాటకాలలో సూత్రధారులు ఇద్దరుంటారు. ఒక్కడే ఉండటం కూడా కద్దు.

ఇతడు నటబృందానికి నాయకుడు. కవి, నాయక, కథా వస్తువుల గుణ విశేషాలను ప్రసంగించడం, నాంది, ప్రస్తావన, భరత వాక్యం మొదలైన వాటిని నిర్వహించడం ఇతని విధులు. సాధారణంగా ఇతడు సంగీత సాహిత్యాలలో నిపుణుడై ఉంటాడు.

## సూత్రధారుడు-వీథినాటకాలు

పూర్వకాలం నుంచీ తెలుగు దేశంలో ప్రదర్శితమయ్యే అనేక జానపద నాటక కళారూపాలల్లో సూత్రధారునికి విశిష్టత ఉంది. వీథి భాగవతాంలోను, తోలు బొమ్మలాటల లోనూ కొన్ని పౌరాణిక నాటకాలలోను-నాటకానికి ముందు ఇతడు ప్రవేశిస్తాడు.

పూర్వం వీథినాటకాలనబడే యక్షగానాదులు వీథులలో ప్రదర్శింపబడేవి. ప్రేక్షకులు నిర్ణీతతి సమయానికి ముందే వచ్చి నాటాన్ని ప్రదర్శన ప్రారంభించమని ఒత్తిడి చేసేవారు. కాలయాపనకోసం వీథినాటకాలలో సూత్రధారునిచేత చాలాసేపు నాంది ప్రస్తావన చెప్పించేవారు. ఇతడు ప్రదర్శించబోయే నాటకంలోని కథనంతటినీ టూకీగా తెలుపుతూ, మధ్యమధ్య మనోజ్ఞమైన హాస్య కల్పన చేసి, అప్రస్తుత విషయాలను చెప్పి ప్రేక్షకుల దృష్టి మరల్చి, వారిని ఆకట్టుకొనేవారు. అనంతరం అసలు ప్రదర్శన మొదలయ్యేది. (నా. ర. చ-178)

### సూత్రము

కావ్యపరిభాష. సూచించునది సూత్రము. తక్కువ పదాలతో అనంతమైన అర్థాన్ని బోధిస్తుంది. సూత్రం సారవంతమై బుద్ధిబలంతో తెలిసికోదగిన అర్థం కలదై ఉండాలి. దారపుఉండ చూడ్డానికి చిన్నదిగా ఉండినా విప్పినపుడు పొడవుగాఉండి అనేక వస్తువులను బంధించగలిగినదై ఉంటుంది సూత్రంకూడా అలాంటిదే. అన్ని లక్ష్యాలను సమన్వయించగలిగినదై ఉంటుంది. వ్యాకరణాదులలో ఈ సూత్రాలు ప్రయుక్తాలు.

(కావ్యాలంకార సంగ్రహం)

### సూత్రాంధ్ర వ్యాకరణమ్ (సం)

రచనాకాలం : క్రీ. శ. 1842.

కర్త : పరవస్తు చిన్నయసూరి.

బాలవ్యాకరణ రచనకు ముందు చిన్నయసూరి వ్రాసిన నాలుగు వ్యాకరణ గ్రంథాల్లో ఇది రెండోది.

ఇది "అష్టాధ్యాయి" మార్గంలో సాగింది. (రమణీయం పీఠిక)

### సూరడు

కాలం : క్రీ. శ. 1118.

ఇతడు శాసనకవి కొండపడుమటి సీమకధిపతియైన ఎర్రమంచరాజు వల్ల సమస్త రాజ చిహ్నాలు పొందాడు. విశ్వకర్మ కులజుడని శాసనంలో చెప్పుకొన్నాడు. శౌర్యవంతుడు. చేబ్రోలులో వెంచేసియున్న కుమారస్వామికి అఖండదీపం వెలగొల్పాడు

(తె. క. చ-187)

### సూరని శాసనము

స్థలం : కొండపడుమటి సీమ (శ్రీగిరి పశ్చిమదేశము)

శాసన ప్రదాత : సూరడు.

ఈ శాసనంలో కొండపడుమటి రాజ్యాధిపతి మంచరాజు వైభవప్రాభవాలు. సూరని శౌర్య పరాక్రమాలు వర్ణితం. గుంటూరుజిల్లా చేబ్రోలులో వెంచేసిన కుమారస్వామికి సూరడు అఖండ దీపాలు నిల్పినట్లు ఈ శాసనం చెబుతున్నది. దీనిలో ఒక కందం, ఒకసీసం, చివర గీతిపద్యం అన్నాయి. (తె. క. చ-187)

### సూరమ (నాదెండ్ల) శాసనము

కాలం : క్రీ. శ. 1153.

శాసనంవేయించిన వారు : సూరమ.

ప్రస్తావిత స్థలం : గుంటూరు జిల్లా నరసరావుపేట సమీపం నాదెండ్ల గ్రామం.

శాసనవిషయం : దామమ పరిషత్రియైన సూరమ్మ నాదెండ్ల మూలస్థానేశ్వరు

నికి అఖండదీపం నిలిపినట్లు ఈ శాసనం తెలియజేస్తున్నది. దీనిలో రెండు కందపద్యాలు, ఒక చంపకమాల, చివర గద్య ఉన్నాయి. (తె.క.చ,)

## సూరసానమ్మ కథ

ఇది పాల్కురికి సోమన విరచిత బసవ పురాణంలోని గాథ. కన్నప్ప, చిరుతొండనంబి కథలవంటి శైవభక్తి పూర్వకమైన కథే ఇది. (ఆం.వా.చ-18)

## సూర్యతనయా పరిణయము

కవి : తరిగొండ్లపాటి లింగన.

కాలం : క్రీ. శ. 18వ శతాబ్దం.

ప్రబంధం. ఉత్తర హరిశ్చంద్ర కథలో దీని ప్రసక్తి ఉంది.

(క చ.3-132)

## సూర్యనారాయణ శతకము

రచనాకాలం : క్రీ. శ. 1790 ప్రాంతం.

కర్త : వరహగిరి వరాహవేంకట నృసింహ కవి.

అరసవిల్లిలోని సూర్యనారాయణునిపై చెప్పిన శతకం. ఈ క్షేత్రం విశాఖకు ఉత్తరంగా శ్రీకాకుళం జిల్లాలో ఉంది. "శ్రీ సూర్యనారాయణా" అనేది మకుటం.

(శ.క.చ-842)

## సూర్యమాల

పంద్రెండు పద్యాలుండే కావ్యం సూర్యమాల. (అప్పకవీయం)

## సూర్యరాయ తారావళి (సం)

కర్త : చూ. తణికెళ్ళ సుబ్బరాయశాస్త్రి.

అంకితం : రావు వేంకట సూర్యరాయనికి.

పిఠాపురం సంస్థానాధీశ్వరుడైన రావు వేంకట సూర్యరాయని (1844-1850) పై చెప్పిన తారావళి. (ఆం.సం.సాం-250)

## సూర్య శతకమ్ (సం)

కర్త : ఏనుగు లక్ష్మణకవి.

(తె.వి.స-6)

## సూర్య శతకమ్ (సం)

కర్త : చూ. వారణాసి ధర్మసూరి.

స్తోత్రప్రాయమైన శతకం. (తె.వి.స-4)

## సూర్య శతకము (అలభ్యం)

కాలం : క్రీ.శ. 16 వ శతాబ్ది ప్రారంభం.

కర్త : బొడ్డపాటి పేరయ్య.

"సూర్యః పద్మినీవల్లభా" అనే మకుటంతో వ్రాసిన శతకం. దీని నుంచి పెదపాటి జగ్గన్న తన "ప్రబంధ రత్నాకరం"లో ఆరు పద్యాలను ఉదాహరించాడు. (అరుద్ర-9)

## సూర్య శేఖరకవి

కాలం : క్రీ.శ. 18 వ శతాబ్దం.

స్థలం : పుదుక్కోట సంస్థానం.

ఈ కవి పుదుక్కోట ప్రభువైన కోటి రఘునాథరాయలను (1769-89) నుతిస్తూ చాలా చాటువులు చెప్పాడు. (చా.ప.ర.)

## సూర్యస్తుతి (సం)

నామాంతరం : సుధాలహరి.

కర్త : జగన్నాథ పండితరాయలు.

## సూర్యాష్టకమ్ (సం)

కర్త : నడిమింటి సర్వమంగళేశ్వరశాస్త్రి.

కవికి ఒకప్పుడు కడుపులో శూల బయలుదేరగా, తన్నివారణార్థం ఈ అష్టకాన్ని రచించి శూలనుండి విముక్తుడైనాడట. (వె.వి.స)

## సేతు ఖండము

నామాంతరం : సేతు మాహాత్మ్యము (చూ).

కర్త : చూ. దామెర్ల వేంకటరాయభూపాలుడు.

(ఆం సం.సా-101)

## సేతు మాహాత్మ్యము (అలభ్యం)

కాలం : తెలియదు.

కర్త : వెలగపూడి వంశానికి చెందిన కవి.

ఈ గ్రంథం వెలగపూడి కృష్ణయామాత్యుడు రచించిన భానుమద్విజయావతారికలో పేర్కొనబడింది. (వ.దే.వా-388)

## సేతు మాహాత్మ్యము

నామాంతరం : సేతు ఖండము

కర్త : చూ దామెర్ల వేంకటరాయ భూపాలుడు.

అంకితం : బొబ్బిలి వేణుగోపాలస్వామికి

రామేశ్వరసేతుమహాత్మ్యం ఇందులో వర్ణించబడింది. స్కాందపురాణాంతర్గతమైన సంస్కృత సేతుఖండానికి ఇది ఆంధ్రీకరణం. (ఆం. సం.సా-101)

## సేతు మాహాత్మ్యము

కర్త : భాస్కర వేంకటాచలకవి.

రచనాకాలం : క్రీ. శ. 18 వ శతాబ్దం. (1731–67) ప్రాంతం.

పద్యప్రబంధం. నాలుగాశ్వాసాల కృతి. దీని అసమగ్రప్రతి ఆంధ్రసాహిత్య పరిషత్తులో ఉన్నదట. ఇందులో శ్రీరామకథ, సేతువృత్తాంతం, రామేశ్వర క్షేత్ర మాహాత్మ్యం వర్ణింపబడ్డాయి.

రచన ప్రశస్తం కాకపోయినా సులభ శైలిలో ఉంది. (ద. దే. వా– 402)

## సేదము యాచమంత్రి

కాలం : తెలియదు.

ఈ మంత్రి కీర్తిని ప్రశంసిస్తూ మొగలాటి రామభద్రుడనే కవి ఒక పద్యం చెప్పాడు. (చా. ప. ర)

## సోమకవి

కాలం : క్రీ. శ. 17 వ శతాబ్దం.

స్థలం : తంజావూరు.

రచనలు : శాహరాజ పదములు.

తంజావూరును పాలించిన శహాజీ ఆస్థానంలోని కవి. శహాజీమీద శృంగార రస ప్రధానాలైన పదాలు చెప్పాడు. (ద. దే. వా–298)

## సోమదేవ రాజీయము

కర్త : కాచిమంచి జగ్గకవి.

ఇది కాసె సర్వప్ప సిద్దేశ్వర చరిత్రను అనుసరించి వ్రాయబడింది. కాకతి ప్రతాపరుద్రుని వంశాన్ని వర్ణించే మూడాశ్వాసాల చారిత్రక కావ్యం.

(వా. చ–31) (ఆం. సం. సా. 246)

## సోమన

కాలం : క్రీ. శ. 18 వ శతాబ్దికి పూర్వం.

రచన : గురుబోధ (ద్విపద).

గురువు : దేవణ.

శివకవియైన వీరభద్రుని పుత్రుడు. శైవ వేదాంత ప్రతిపాదకంగా రచనచేశాడు. దీనిప్రతి మద్రాసు ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారంలో ఉన్నది.

(ద్వి. సా. చ.298)

## సోమన ప్రెగ్గడ దక్షారామ శాసనము

కాలం : క్రీ. శ. 1178 ప్రాంతము.

శాసనప్రదాత : సోమన ప్రెగ్గడ.

ప్రస్తావిత స్థలాలు : తెలుగు దేశంలోని పంచారామాలు.

శాసన విషయం : సోమన ప్రెగ్గడ దక్షారామాది పంచారామాలలో వెలసిన శివునికి అఖండ దీపం, సప్త సంతానాలను నిలిపినట్లు, దాన ధర్మాలు చేసినట్లు ఈ శాసనంవల్ల తెలుస్తున్నది. దీనిలో ఒక శార్దూలం, ఒక ఉత్పలమాల ఉన్నాయి. (తె. శ. ౬-310)

## సోమన ప్రెగ్గడ శాసనము

కాలం : క్రీ. శ. 1146.

శాసనప్రదాత : సోమన ప్రెగ్గడ.

ప్రస్తావిత స్థలాలు : పంచారామాలు, చేబ్రోలు, పిఠాపురం, బెజవాడ, గుంటూరు, (గొంటూర ?).

శాసన విషయం : ఈ శాసనంప్రకారం దాత పత్రామాత్యుని కుమారుడని, దాన శీలియని తెలుస్తున్నది. ఈయన పంచారామాలలోని శివాలయాలలోను, చేబ్రోలులోని మహాసేనునికి, పిఠాపురంలోని కుంకారశంకరికి, బెజవాడ మల్లేశ్వరునికి అఖండదీపాలు నిలిపాడు. గుంటూరులో చెరువు త్రవ్వించి గుడులు కట్టించాడు. పుత్ర సంతాన సమృద్ధుడై సప్త సంతానాలను అమలు జరిపాడు. (చెరువు, ధర్మము, వివాహం, గుడి, ఉద్యానవనం, సత్పుత్రులు మొదలగునవి). దీనిలో ఎత్తు గీతితో ఒక సీసపద్యం, ఒక శార్దూలం, ఒక ఉత్పలమాల ఉన్నాయి. (తె. శ. ౬-244-245)

## సోమనాద్రి కథ

కర్త : తెలియదు.

జానపద చారిత్రక గేయం. తెలంగాణా ప్రాంతానికి సంబంధించినది. సోమనాద్రి గద్వాల ప్రభువు. ఆ వీరుడు నవాబులను ప్రతిఘటించడం, గద్వాల కోటను నిర్మించడం మొదలగు విషయాలు తెలిపే గాథ. ఈ సోమభూపాలునిపై చాలా చాటువులున్నాయి. చూ. చారిత్రక గేయములు. (ఆం. వా. ౬: చా. ప. ర.)

## సోమనాథ భాష్యమ్ (సం)

రచనాకాలం : క్రీ. శ. 13వ శతాబ్ది ఉత్తరార్ధం.

కర్త : పాల్కురికి సోమనాథుడు.

విశిష్టత : ఇది 25 ప్రకరణాల గ్రంథం. దీనికి బసవ రాజీయము, వీర మహేశ్వరాచార సారోద్ధారము అని నామాంతరాలున్నాయి. కవి వీర శైవంలోని 25 విషయాలను గ్రహించి శ్రుతి స్మృతి పురాణేతిహాసాగమాది ప్రమాణాల చేత సమర్థించాడు. వీర శైవం తాంత్రికం కాదని, శుద్ధ వైదికమని ఈ గ్రంథం నిరూపిస్తున్నది. (యు.భా:వై.ల.)

## సోమనాథ స్తవము

కాలం : క్రీ. శ. 13వ శతాబ్ది ఉత్తరార్ధం.

కర్త : చూ. పాల్కురికి సోమన.

విశిష్టత : ఇది సోమన ద్విపద లఘుకృతి. (యు. భా: చై. ం.)

## సోమన్న

చూ. ఆత్మకూరు సోమన్న.

ద్విపద భారత ముద్రితప్రతిలో ఈ కవిపేరు సోమన్న అనే ఉంది

## సోమప్ప శాస్త్రి

నామాంతరం : రేకపల్లి సోమనాథ కవి (చూ).

## సోమప్రభువు

కాలం : క్రీ. శ. 17 వ శతాబ్దం.

సాహిత్యాభిలాష కలవాడు. కృతిపతి. చిన్నారెడ్డి కుమారుడు. లింగకవి రచించిన శతముఖ రామాయణం (మూడు ఆశ్వాసాలు) అంకితం పొందాడు.

## సోమయాజుల వారు

ఈ "సోమయాజుల" అనేది ఇంటి పేరుగా ఉన్న కుటుంబాలవారు దేశంలో ఉన్నారు. యజ్ఞం చేసినవారే సోమయాజులు కావటం సంప్రదాయ సిద్ధంగా వస్తున్న ఆచారం. అయల సోమయాజుల వారు, మేరు సోమయాజుల వారు ఇలాంటివి.

(భారతి-మా-45-230)

## సోమరాజు రామకవి

కాలం : క్రీ. శ. 17 వ శతాబ్ది.

చాటుకవి. సోమరాజు శ్రీగిరి కవికి తమ్ముడు. ఈయన ఒక సంస్థానంలో మంత్రిగా ఉన్న ఎ.సు.మూర్తి శివరామన్న తనను చిన్నచూపు చూస్తే, అతనిని పొగిడినట్లు, తెగిడినట్లు ఒకే పద్యంలో చెప్పాడు.

ఇట్లాగే వేలాం తాపులో భట్టుమూర్తెన్న అనే అయన ఈయనకు సరిగా సత్కారం జరగకుండా అడ్డు మాటలుచెబితే అతన్ని తిడుతూ పద్యం చెప్పాడు

(చా.ప.ర.)

## సోమరాజు రామలింగ కవి

కాలం : క్రీ. శ. 18 వ శతాబ్ది.

స్థలం : గుంటూరు జిల్లా పలనాటి సీమలోని విలేశ్వరం.

ఈయన ఆశుకవి. సుంకాలు వసూలు చేసే ఉద్యోగి. గిట్టనివారు కొందరు ఈయనకు చేతబడి (రాతబడి) చేయిస్తే తొలగించమని ప్రార్థిస్తూ కవి తనకు ఉపాస్య దైవమైన బగళాంబ మీద ఒక్కవరసలో ఆశువుగా 36 పద్యాలు చెప్పాడట.

ఈయనకు మిరియాల (పలనాడు) గ్రామంలో మాన్యాలున్నాయి. మాన్యాలలో భాగస్వామి అయిన చింతా శంకరయ్య ఇబ్బందులు పెడితే, కోపించి అతనిపై ఒక తిట్టు పద్యం కూడా చెప్పాడట. (చా.ప ర.)

## సోమరాజు శ్రీగిరి కవి

కాలం : క్రీ. శ. 17 వ శతాబ్ది.

స్థలం : గుంటూరు జిల్లా - పలనాటి సీమలోని చర్లగుడిపాడు గ్రామం.

రచనలు : తెలియరాలేదు.

ఆశుకవి. చర్లగుడిపాటికి స్పష్టంగా పొలిమేర లేకపోతే ఈయన పొలిమేర తొక్కి హద్దులను ఏర్పాటు చేశాడట. ఈ విషయాన్ని తెలుపుతూ ఆ గ్రామంలోని శిల మీద ఒక పద్యం ఉంది. (చా.ప.ర)

## సోమలదేవి

కాలం : క్రీ. శ. 1065 ప్రాంతం.

స్థలం : గోదావరీ మండలం.

ఈమె రాజరాజ నరేంద్రుని సవతి సోదరుడైన విజయాదిత్యుని కుమార్తె. దక్షారామంలో ఒక శాసనం వేయించింది. (తె.క.చ-163)

## సోమలదేవి (కడలుపల్లి) శాసనము

కాలం : క్రీ. శ. 1154.

శాసనం ప్రదాయిని : సోమలదేవి.

ప్రస్తావిత స్థలం : కడలుపల్లి.

శాసనవిషయం : సోమలదేవి రాజకుమార్తె కావచ్చును. ఈమె బల్లాధినాథుని అర్ధాంగి. ఇతడు చాళుక్య భీమభూపాలునికి-అబ్బలదేవికి తనయుడు. సోమలదేవి "కడలు పల్లి"లో వేంచేసియున్న నాగేశ్వరస్వామికి అఖండదీపం నిలిపినట్లు ఈ శాసనం వల్ల తెలుస్తున్నది. దీనిలో ఒక సీసపద్యముంది. (తె.క.చ-283)

## సోమలదేవి దక్షారామ శాసనము

కాలం : క్రీ. శ. 1065 ప్రాంతం.

స్థలం : దక్షారామం.

శాసనకర్త : భీమన ప్రెగ్గడ.

శాసన ప్రదాయిని : విజయాదిత్యుని కుమార్తె సోమలదేవి.

దీనిలో ఒక సంస్కృత శ్లోకం, ఒక సీసపద్యం, ఒక ఆటవెలది ఉన్నాయి. దక్షారామ దేవునికి దానమిచ్చిన సర్వవిషయాలు ఈ శాసనంలో వివరంగా ఉన్నాయి. సీస పద్యంలో ప్రాసయతి పాటింపబడింది. (తె.కచ-163-164)

## సోమవార మాహాత్మ్యము

కర్త : తెలియదు.

కాలం : క్రీ. శ. 16, 17 శతాబ్దుల నాటి రచన కావచ్చును.

ద్విపద కావ్యం. కార్తీక సోమవార మాహాత్మ్యాన్ని ప్రతిపాదించే కథ

లున్నాయి. సీమంతినీ కథ అని పేరున్న మరొక ద్విపద ప్రతిలో కూడ సోమవార మాహాత్మ్యాన్ని సూచించే కథలున్నవట. (ద్వి.సా.చ-179)

## సోమవార మాహాత్మ్యము

కర్త : శ్రీగిరి మల్లికార్జునస్వామి.

ద్విపద కావ్యం. సోమవార మాహాత్మ్యాన్ని గురించి నందీశ్వరుడు మునులకు చెప్పినట్లుగా ఉంది. సోమవార వ్రత విధానము-ఉద్యాపన విధానము-ధనపాలశెట్టి కథ ఇందులో ఉన్నాయి. రచన మంజరీ ద్విపద వికారమైన గేయ ఛందస్సులో ఉంది. కవిత్వం అంత ప్రౌఢంగా లేకపోయినా గానయోగ్యంగా ఉన్నది.

దీని ప్రతి మద్రాసు ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారంలో ఉంది. (ద్వి.సా.చ-178)

## సోమవార వ్రత మాహాత్మ్యము

కర్త : అమలాపురపు సన్యాసికవి.

మూడు ఆశ్వాసాల పద్యకావ్యం. సోమవార వ్రత విధానాన్ని, మహిమలనూ తెలుపుతున్నది. మృదుమధుర పదభరితమైన రచన. కవి నిత్య సోమవార వ్రత దీక్ష దురంధరుడు. (శ.క.చ-752)

## సోమిదేవమ్మ

శ్రీనాథ మహాకవి విరచిత కాశీఖండంలోని ఒక పాత్ర. కాశీ ఖండము రస విస్ఫురమైన కావ్యము. యజ్ఞవిద్యా విశారదుడైన యజ్ఞదత్తుని భార్య సోమిదేవమ్మ. గుణనిధికి తల్లి. గార్హస్థ్యధర్మ నిర్వహణలో ఆమెకామెయే సాటిగా చెప్పదగినది.

ఆమె భర్త చేతి నవరత్నాంగుళీయకాన్ని నలుగు పెట్టిన వేళ తీసి, పెట్టెలో దాచి ద్యూతవ్యసన విలోలుడై తిరుగుతున్న గుణనిధికి ఇచ్చింది. యజ్ఞదత్తుడు అడిగి నప్పుడు ఎక్కడో పెట్టెలో పెట్టినట్లు అబద్ధమాడింది.

సోమిదేవమ్మ కుమారుని మీద ప్రేమతో అతనికి నీతులు చెపుతూనే అడిగి నప్పుడల్లా డబ్బు, ఆభరణాలు ఇస్తుంది. కొడుకు సత్ప్రవర్తనతోనే ఉన్నాడని భర్తను నమ్మిస్తుంది. చివరికి నిజం తెలుసుకొన్న యజ్ఞదత్తుడు, భార్యను "నీ మాటలు విని పుత్రుని భ్రష్టుని గావించుకొన్నాను", అని నిందించి ఆమెను తిరస్కరించాడు. కుపుత్ర త్వం కంటె అపుత్రత్వము మేలని నిశ్చయించుకొన్నాడు.

ప్రేమానురాగాలతో పిల్లలను మందలించకుండా, శిక్షించకుండా ఉండే తల్లులకు ప్రతీక ఈ పాత్ర. కవి ఈ పాత్రలో లోకరీతిని చిత్రీకరించాడు. (కాశీఖండం)

## సోమేశ్వర శతకము

రచనాకాలం : క్రీ. శ. 1707 ప్రాంతం.

కర్త : తుమ్మలపల్లి శివరామయ్య.

అంకితం : నారాయణ పట్టణంలో వెలసిన లింగమూర్తికి.

వీరశైవ మత ప్రబోధకమైన వృత్తశతకం. 106 పద్యాలున్నవి. కవి దీనికి వేదాగమ శాస్త్ర సారమైన వ్యాఖ్యానాన్ని కూడా వ్రాశాడు. ప్రాచ్యలిఖిత గ్రంథాలయంలో దీని ప్రతి ఉంది. (శ. క. చ. 772) (అము|వ-12-314)

## సోలిగాడు

నామాంతరం : చోడిగాడు (చూ).

## సోలిగాని కలాపము

నామాంతరం : చోడిగాని కలాపం (చూ).

## సౌందర రాజస్వామి శతకము

రచనాకాలం : 19 వ శతాబ్దం.

కర్త : బహుజనపల్లి సీతారామాచార్యులు.

ఇది కవి చిన్ననాడే చెప్పిన రచనపద్య శతకం. గంభీర భావ బంధురంగా శబ్దార్థాలంకార యుతంగా రచన సాగింది. సుందరరాజ శతకంగా ప్రసిద్ధం. (శ. క. చ. 538) (క. స. 293)

## సౌందరేశ చరిత్ర (అలభ్యం)

రచనాకాలం : క్రీ. శ. 17 వ శతాబ్దం.

కర్త : చూ. నుగుటూరి ముమ్మడి తిమ్మభూపతి

(ఆం. సం. సా-261)

## సౌందర్య లహరి (అలభ్యం)

కర్త : పోచిరాజు వీరన్న.

శంకరాచార్యుని సంస్కృత కృతికి శతక రూపమైన ఆంధ్రీకరణం. భల్లాణ చరిత్రలో కవి దీన్ని పేర్కొన్నాడు. (క. చ. 3-162)

## సౌందర్య లహరీ వ్యాఖ్య (సం)

కర్త : లొల్ల లక్ష్మీధరుడు.

ఇది సరస్వతీ విలాసనామ ధర్మశాస్త్ర గ్రంథానికి విపులవ్యాఖ్య. ఈ వ్యాఖ్యలో గ్రంథకర్త మొదటిగ్రంథాన్నికూడా తానే వ్రాశానని చెప్పుకొన్నాడు. (తె. వి. స-4)

## సౌగంధికాహరణమ్ (సం)

కర్త : చూ. విశ్వనాథుడు.

భారతారణ్య పర్వంలోని ఘట్టానికి కావ్యరూపం. (ప్రా. వ. దే. చ)

## సౌగంధికా కుసుమ ప్రసవాపహరణము

నామాంతరం : సౌగంధిక ప్రసవాపహరణము.

కర్త : రత్నాకరం గోపాలరాజు.
కాలం : 17వ శతాబ్దం.
అంకితం : రావెళ్ళ లింగమ నాయకునికి.

మూడాశ్వాసాల ద్విపద కావ్యం. భారతారణ్యపర్వంలోని సౌగంధికాపహరణ వృత్తాంతం ఇందులోని కథ. రచన ప్రసన్న గంభీరంగా ఉంది. కవి కొన్ని మార్పులు చేశాడు. ఇది ముద్రితం. కుందూరి ఈశ్వరదత్తు దీనికి విపులమైన ఉపోద్ఘాతం వ్రాశారు. ఈకావ్యాన్ని అనుసరించే రత్నాకరం అప్పకవి పద్య కావ్యం వ్రాశాడు.

కావ్యంలో చక్కని వర్ణనలున్నాయి. కవి చిత్ర కవితా చాతుర్యం, అలంకారం ప్రియత్వం కావ్యంలో వెల్లివిరిశాయి. (అరుద్ర-12-190)

## సౌగంధికాపహరణము (అలభ్యం)

కాలం : క్రీ. శ. 1560 కి పూర్వం.
కర్త : రాయసం గణపయ్య.

దీనిలో నుంచి ఒక పద్యాన్ని అజ్ఞాత గ్రంథ సంధాత తన "ఉదాహరణ పద్యములు"లో సంకలనం చేశాడు అ పద్యం భీమాంజనేయులు సమావేశమైన ఘట్టంలోనిది (అరుద్ర-9)

## సౌపర్ణాఖ్యానము

కర్త : బోరవెల్లి నరసింహం (చూ)
అంకితం : అలంపూరు నరసింహస్వామికి.

ఉభయ భాషా విశేషోక్తులతో రచింపబడ్డ కావ్యం.
(మ. మా.; అరుద్ర-11-265)

## సౌభరి చరితము (అలభ్యం)

కాలం : క్రీ. శ. 15వ శతాబ్ది ఉత్తరార్ధం.
కర్త : చూ. ప్రోలుగంటి చెన్నశౌరి.

ఇది తెలుగులో తొలి యక్షగానమని కొందరు పండితులంటారు. హరిభట్టు రచించిన నృసింహ పురాణానికి అతని మరణానంతరం చేర్చబడ్డ కృత్యాదిలో చెన్నశౌరి ప్రసక్తి ఉంది. (క. వ-70)

## స్కంధము

కావ్యంలోని కథాంశాల విభాగము. స్కంధము అంటే కాండము. చెట్టుమొదలు నుండి బయలుదేరిన ఈ కాండము కొంత సాగిన తర్వాత, దీనికి నలువైపులా నాలుగు శాఖలు బయలుదేర నానా శాఖోప శాఖలతో చెట్టు విస్తరిస్తుంది.

నానా శాఖలతో వర్థిల్లే జగద్వృక్షానికి స్కంధం భగవంతుడే కాబట్టి భగవన్మాహాత్మ్య వర్ణనం గలది స్కంధము. భాగవత భాగాలకు స్కంధమనే పేరు తగి ఉన్నదని పండితులు భావిస్తున్నారు. -(కావ్యాలంకార సంగ్రహం)

## స్కాంద పురాణము (అలభ్యం)

కర్త : చూ. వల్లారెడ్డి.

సంస్కృత స్కాంద పురాణానికి ఆంధ్రీకరణమట. (వ. దే. వా-370)

## స్తంభోద్భవ గద్య (అలభ్యం)

కర్త : నెల్లూరి వీర రాఘవకవి (చూ).

ఈ రచన కవి "వసుంధరా పరిణయం"లో ప్రసక్తమైంది.

## స్తబకము

కావ్యంలోని కథాంశ విభాగాలను సూచించే పదం. స్తబకమనగా పూలగుత్తి. దీని వలన కావ్యం పూలచెట్టుగా సూచితం. (కావ్యాలంకార సంగ్రహం)

## స్తోత్రములు

ఇవి వేద సంహితల కాలం నుంచి వాఙ్మయంలో ఉన్నవని పండితాభిప్రాయం. అధర్వణవేదంలో చాలా స్తోత్రాలున్నాయి. ఇవి ఒకానొక దేవతాస్వరూపానికి పర్యాయ పదాలుగానో, కీర్తిని వర్ణించేవిగానో, ప్రభావాన్ని శ్లాఘించేవిగానో, చరిత్రను ఉగ్గడించేవిగానో ఉంటాయి. సహస్ర నామావళులు, అష్టోత్తర నామావళులు ఈ కోవకు చెందినవే. ఈ స్తోత్రాన్ని చదివినంతనే కోర్కెలు సిద్ధిస్తాయని ప్రజలలో విశ్వాసముంది. వీటికి మంత్రాలతో సమానమైన గౌరవం ఉంది. స్తోత్ర గ్రంథాలు సాహిత్యంలో చాలా వెలువడ్డాయి. (తె. వి. స-8)

## స్త్రీధర్మమ్ (సం)

కర్త : త్ర్యంబక రాయమఖి.

## స్త్రీ నీతి శాస్త్రము

కర్త : చూ. శిష్టు కృష్ణమూర్తి శాస్త్రి.

అంకితం : తుళ సింగసెట్టికి.

కాకినాడలో జిల్లా కలెక్టరు కచేరిలో సిరస్తాదారుగా ఉండిన తుళ సింగసెట్టి ప్రోత్సాహంతో కవి ఈ రచన చేశారట. స్త్రీలకు సంబంధించిన నీతులను పురాణాల నుంచి గ్రహించి చక్కగా కూర్చారు. (ఆం.వం.సా-328)

## స్త్రీల పాటలు

జానపద గేయ సాహిత్యంలో స్త్రీల పాటలకు విశిష్ట స్థానముంది. ఈ పాటలు సాధారణంగా గృహ వాతావరణానికి దగ్గరగా ఉంటాయి. ఇవి, నిత్యకృత్యాలు చేసుకుంటూ పాడుకునేందుకు అనుగుణంగానూ, భక్తి రసోద్దీపకాలుగానూ, ఉత్తమమైన శీలాన్ని ప్రబోధించేవిగానూ ఉండటం సర్వసాధారణంగా కనిపిస్తుంది. రామాయణానికి చెందిన పాటలు ఎక్కువ ప్రచారంలో ఉన్నాయి. సాంఘిక సమస్యలను ప్రతిబింబించే గాథలు కూడా లేకపోలేదు.

కొన్ని పాటల్లో సంతానానికై స్త్రీలు పడేపాట్లు, నోచే నోములు వర్ణితమైనాయి. గొడ్రాలైన స్త్రీకి సంఘంలో ఎలాంటిస్థానం ఉంటుందనేది, అలాంటి దశనుంచి కాపాడు కోవడానికి వారు ఎన్నిపాట్లు పడతారనేది కొన్నిపాటల్లో ప్రతిబింబిస్తుంది. కొన్నిచోట్ల లాలిపాటలు, జోలపాటలు కనిపిస్తాయి. కొన్ని పాటలు వివాహానికి సంబంధించినవి. పెండ్లిలో జరిగే వేడుకలు అన్నింటిని వర్ణించే పాటలున్నాయి. వంశంలపాట, బువ్వం బంతిపాట, తలుపుదగ్గరపాట, నలుగుపాట, అలకపాట, అప్పగింతలపాట మొదలగునవి ఇట్టి పాటలు. లోకవ్యవహారాన్ని బోధించే పాటలు ఎన్నో ఉంటాయి. అత్తమామల పైని, భర్తపైని, ఆడుబిడ్డలపైని చూపించే భక్తిని, వారితోడ, ఇతరులతోడ మెలగవల సిన విధానాన్ని వర్ణించే పాటలు ఎక్కువగా ఉన్నాయి. అత్తలు, ఆడుబిడ్డలు మొదలగు వారు పెట్టే బాధలు వర్ణించే కరుణ రసాత్మకమైన పాటలు కూడా అనేకం ఉన్నాయి.
(తె.జా సా)

## స్థల పురాణము

చూ. క్షేత్రమాహాత్మ్యము.

## స్థానాపతి

కాలం : క్రీ. శ. 1600 ప్రాంతం.
స్థలం : మధుర.
రచన : రాయ వాచకము.

ఈతని అసలుపేరు తెలియదు. మధుర పాలకుడైన విశ్వనాథ నాయకుని దగ్గర స్థానాపతిగా ఉండేవాడు. ఈ విశ్వనాథ నాయకుడు రెండో కృష్ణప్ప సోదరుడని పరిశీలకులు భావిస్తున్నారు.

ఇతని రాయవాచకం వ్యావహారిక భాషలో ఉంది. తెలుగులోని చారిత్రక గ్రంథాలలో ఇది మూడోది. (అరుద్ర-9)

## స్పర్శవేది - ధూమవేధ

చూ. రసవాద విద్య.

## స్మృతి కదంబమ్ (సం)

కర్త : కంచం ఎల్లయార్యుడు.
కవి దీనిలో తాను వ్రాసిన పుస్తకాలనన్నింటినీ పేరుపేరునా చెప్పాడు
(తె. వి. స-4)

## స్వ ప్రకాశ శతకము

కర్త : ఎడ్ల రామదాసు.

తత్వ ప్రధానమైన శతకం. తారక, సాంఖ్య, అమనస్క యోగాలు వివరింప బడ్డాయి. తలిదండ్రుల సేవ, గురుసేవ, పతిభక్తి మొదలయినవి ఉత్తమగుణాలని కవి నిరూపించి చెప్పాడు. (శ. సా వి-318)

స్వభావ పద్ధతి

కర్త : చూ. హోసదుర్గం శ్రీనివాస రాఘవాచార్యులు.

విశేషాలు తెలియవు. (కేశవపంతుల-సం.సా)

స్వర ప్రక్రియ (సం)

కర్త : శేష రామచంద్రుడు.

(తె. వి. స-6)

స్వర మంజరి (అలభ్యం)

కర్త : గౌరన.

కావ్యం. తత్త్వ శాస్త్ర సారాన్ని ఈ పేరుతో కవి రచించినట్లు తెలుస్తున్నది.
(క. స-64)

స్వర మంజరి

కర్తలు : తచ్చూరు సింగరాచార్యులు-చిన సింగరాచార్యులు

సంగీత శాస్త్ర గ్రంథం. (తె. వి. స-4-1194)

స్వర మేళ కళానిధి

కర్త : చూ. బయకార రామప్ప

ఈ గ్రంథాన్ని అప్పకవి పేర్కొన్నాడు.

స్వర శాస్త్ర మంజరి

నామాంతరం : స్వరశాస్త్రము.

కర్త : గణపనారాధ్యుడు (చూ).

స్వర శాస్త్రము

కర్త : తెలియదు.

కాలం : క్రీ. శ. 18 వ శతాబ్దానికి ముందటి రచన.

ద్విపదకావ్యం. పిండోత్పత్తి క్రమము, నాడులు-సృష్టిలక్షణం-అభ్యవహారములు-స్వప్నజ్ఞానం-శకున శాస్త్రం - వశ్యయోగములు-సాముద్రికము మొదలైన అనేక విషయాలున్నాయి.

దీని ప్రతి మద్రాసు ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారంలో ఉంది.
(ద్వి. సా. చ. 482)

స్వర శాస్త్రము

నామాంతరం : స్వరశాస్త్ర మంజరి.

కర్త : గణపనారాధ్యుడు (చూ).

రచనాకాలం : క్రీ. శ. 1323-45 ం నడుమ.

ద్విపదకావ్యం. పూర్తిగా లభించలేదు. దీన్నికవి స్వరశాస్త్ర మంజరిగా పేర్కొన్నాడు. యోగశాస్త్రాలన్నీ తరచిచూసి ఈ రచన చేశాడట.

స్వరమంజరి అనేపేర తత్త్వశాస్త్రసారాన్ని గౌరన అనే కవి కూడా రచించి నట్లు తెలుస్తున్నది. (క. స. 55) (క. త. 4-51)

స్వరోచి

అల్లసాని పెద్దన రచించిన మను చరిత్రలోని పాత్ర. ఆంధ్ర పంచ కావ్యాలలో మనుచరిత్ర ఒకటి. మాయా ప్రవరుడైన గంధర్వునివలన వరూధినికి పుట్టినవాడు స్వరోచి. అందువల్ల ఇతడు దేవ గంధర్వుడయ్యాడు. దీప్త హుతాశన సమతేజస్వంతుడు కావడంవల్ల మునులు ఇతనికి స్వరోచి అని పేరు పెట్టారు. ధనుర్వేద సహితంగా వేద వేదాంగాలు నేర్చి సకల కళా ప్రపూర్ణుడైనాడు. క్షత్రియ ధర్మరతుడై మందరాద్రిలో విశ్వకర్మ నిర్మించిన పట్టణానికి ఏలిక అయ్యాడు. అస్త్ర హృదయ విద్య తెలిసిన మనోరమను రాక్షసుని దారినుండి కాపాడి ఆమెను పెండ్లి చేసుకొన్నాడు. ఆమె తండ్రి ఇందీవరాక్షుడొసగిన ఆయుర్వేద విద్యను పొంది, మనోరమ కోరిక మేరకు ఆమె చెలికత్తెలైన విభావసి, కళావతుల క్షయ రోగాన్ని అంతమొనర్చి వారియువురిని పెండ్లియాడి వైభవంగా రాజ్యం చేశాడు.

వేటకు వెళ్ళిన స్వరోచి, దేవతల కోరికపై వనదేవత యందు స్వారోచిష మనువును కని పుణ్యలోకాలు పొందినాడు. మనువుకు తండ్రి కాదగినట్లుగా ఈ స్వరోచి పాత్రను సంపూర్ణ బ్రాహ్మణ ధర్మ పరాకాష్ఠలో పెద్దన తీర్చిదిద్దాడు. ప్రవర పాత్ర కల్పనము, మాయా ప్రవరుని వృత్తాంతము, స్వారోచిష మనుసంభవానికి అనుగుణంగా రూపొందించబడ్డవి. స్వరోచి పాత్ర సాహసౌదార్యాది గుణాలకూ, వీర, శాంత ధర్మాలకూ ప్రతీక.

ఇతడు సహజంగానే సకల విద్యానిధి. తేజస్వంతుడు. ఇందీవరాక్షుని నుండి ఆయుర్వేద విద్యనూ, మనోరమ నుండి అస్త్ర హృదయాన్నీ, కళావతి నుండి మృగపక్షి భాషలనూ, విభావసి నుండి పద్మినీ హృదయాన్నీ గ్రహించి మరింత పరిపూర్ణుడైనాడు. ఆ వెనువనే ఇతనికి వనదేవత వలన స్వారోచిషుడు కలిగినట్లు చెప్పడం పెద్దన అపూర్వ ప్రతిభా విశేషాలకు నిదర్శనం. (మనుచరిత్ర)

స్వర్ణమంజరి (సం)

కర్త : చెరుకూరు లక్ష్మీధరుడు.

(తె.వి.స-4)

స్వారోచిష మనుసంభవము

రచనాకాలం : క్రీ. శ. 16 వ శతాబ్దం.

నామాంతరం : మనుచరిత్ర.

కర్త : అల్లసాని పెద్దన.

అంకితం : శ్రీకృష్ణ దేవరాయలకు.

తెలుగులో తొలి ప్రబంధంగా ప్రసిద్ధమైంది. ఆరాశ్వాసాలున్నాయి. తెలుగు పంచకావ్యాలలో ఇది ఒకటి. దీనికి మూలం మారన మార్కండేయ పురాణంలో 150 పద్యాలలో చెప్పిన చిన్న కథ. మను చరిత్రలో స్వారోచిష మనువుకు సంబంధించిన చరిత్ర కంటె స్వరోచి పుట్టక ముందు వృత్తాంతం విపులంగా ఉంది. అందువల్ల పెద్దన దీనికి స్వారోచిష మను సంభవమనే పేరు పెట్టి గద్యలో అట్లాగే చెప్పాడు. పండితులు సౌకర్యం కోసం దీన్ని "మనుచరిత్ర" అన్నారు. ప్రసిద్ధమైన వరూథినీ ప్రవరుల వృత్తాంతం ఈ కావ్యంలోనే ఉంది. పూర్వులయిన నాచన సోమన, శ్రీనాథుల ప్రబంధ రీతులను పెద్దన స్వకపోల కల్పనలతో పెంచి మనోహరమైన ప్రబంధంగా వ్రాశాడు. తరవాత కాలంలో తామర తంపరగా వచ్చిన ప్రబంధాలకు మనుచరిత్ర మార్గదర్శకమైంది. ఇందులోని కవితాధార నిరర్గళం. సంస్కృతాంధ్ర పద సంయుతమై సందర్భోచిత లోకోక్తులతో, స్వాభావిక వర్ణనలతో, అలంకార భూయిష్ఠంగా ఉంటుంది. పాత్రపోషణ చక్కని నేర్పుతో ఉంటుంది. మనుచరిత్రలో ఇతివృత్తం చాలావరకు అస్వాభావిక సంఘటనల మీద ఆధారపడి ఉంది. పాదలేపన మాహాత్మ్యం, అశ్వప్రదానం, మాయా రూపధారణ మొదలగునవి ఇందుకు నిదర్శనలు. ఈ కావ్యం పాఠకులను తన్మయులుగా చేసి రసాస్వాదన నిమగ్నులుగా చేస్తుంది. ఏ పద్యం చదివినా రసవంతంగా ఉంటుంది. వసు, మను చరిత్రలలో ఏది మంచిది అనే వాదాలు బయలుదేరి విమర్శన, ఖండన గ్రంథాలు అనేకం వెలువడ్డాయి. (క.త-7)

## స్వారోచిషుడు

ఇది ఆంధ్ర పంచ కావ్యాలలో ఒకటైన మను చరిత్రలోని ముఖ్యపాత్ర. మనుచరిత్రకు స్వారోచిష మనుసంభవమనే పేరు ప్రసిద్ధం. ఈ ప్రబంధంలో స్వారోచిష మనువు పుట్టుక ప్రధాన గాథ. ఈ కథ మార్కండేయ పురాణాంతర్గతమైనది.

బ్రాహ్మణ శ్రేష్ఠుడైన ప్రవరుని రూపం దాల్చిన గంధర్వునికీ దివ్యస్త్రీయైన వరూథినికీ పుట్టినవాడు స్వరోచి. ఆ స్వరోచికి వనదేవతవల్ల పుట్టినవాడు స్వారోచిషుడు. ఇతడు మనువులలో రెండోవాడు. దయసత్యశౌచాల పట్ల ఆసక్తుడు. చక్రవర్తి లక్షణా లున్నవాడు. అంతరింద్రియ నిగ్రహం కలవాడు. ఇతడు శ్రీమన్నారాయణుని గురించి తపస్సు చేసి సాలోక్యము కోరాడు. (సాలోక్యము = చతుర్విధ ముక్తులలో ఒకటి) విష్ణువు ఇతన్ని రెండవ మనువుగా ప్రతిష్ఠించి ఆ వెనుక సాలోక్య ముక్తి నిచ్చాడట.

పెద్దన, మనువు పుట్టుకకు కారణభూతులైన వారి కథలను అపూర్వంగా మలిచాడు. వరూథినీ ప్రవరులలో శాంత శృంగారాలను, మాయా ప్రవరునిలో వింతమాధుర్యాన్ని రంగరించి ఆయా గుణాల యందు విశిష్టమైన వరూథిని మనస్సులో ప్రవరుని బ్రాహ్మణతేజమే రూపుకట్టినట్లు భావింపజేశాడు. వరూథిని కుమారుడైన స్వరోచిలో బ్రాహ్మణతేజము, క్షాత్రధర్మము మూర్తీభవించాయి. ఇతనికి వనదేవతవల్ల కలిగిన స్వారోచిషుడు, పితృపితామహుల నుండి సాహసౌదార్యాది మహనీయ గుణాలనూ, వైదిక

## హంపి-విజయనగరము — తెలుగు సాహిత్య పోషణ

విజయనగర రాజ్యాన్ని పాలించిన సంగమ, సాళువ, తుళువ, అరవీటి వంశపురాజులు తెలుగు సాహిత్యాన్ని విశేషంగా ఆదరించి పోషించారు.

మొదటి బుక్కరాయల కుమారులలో ఒకడైన భాస్కర భవదూర మహీపతి, కొన్ని గ్రంథాలు వ్రాశాడని, సంకలన కర్తలు కొన్ని పద్యాలను ఉదాహరించారు. ఎడపాటి ఎర్రన, తురగా రాజకవి - అయ్యంకి బాలసరస్వతులు ఇతడిని పూర్వ కవి స్తుతిలో పేర్కొన్నారు. మొదటి బుక్కరాయలు ఉత్తర హరివంశ కృతికర్త అయిన నాచన సోమునికి, మరి ఐదుగురు బ్రాహ్మణులకు కడప మండలంలోని "బుక్కరాయపురం" (పెంచుకల దిన్నె) అనే గ్రామాన్ని అగ్రహారంగా దానం చేశాడు.

మొదటి దేవరాయల (1404-1422) కాలంలో "విక్రమార్క చరిత్ర"ను వ్రాసిన జక్కన కవి, తన కృతిని దేవరాయల గణకుడైన సిద్దనకు (వెల్లంకొండ నివాసి) అంకితం చేశాడు. సంగమ వంశీయులలో ఎనుబది వాడైన రెండవ ప్రౌఢదేవరాయలు (1423-46) శ్రీనాథమహాకవికి కనకాభిషేకంచేసి, కవిసార్వభౌమ బిరుదాన్నిప్రసాదించాడు.

సాళువ నృసింహరాయలకు, పిల్లలమర్రి పిన వీరన్న తన "జైమినీ భారతం" కృతిని అంకితమిచ్చాడు.

"సౌభరి చరితము" అనే యక్షగాన కృతికర్త ప్రోలుగంటి చెన్నశౌరి, సాళువ నృసింహరాయలచేత సన్మానితుడై ఎన్నో అగ్రహారాలు పొందాడు.

సాళువ నృసింహుని మంత్రియైన తుళువ నరసరాజు, నందిమల్లయ-ఘంట సింగయలు రచించిన "వరాహ పురాణానికి" కృతిభర్త.

తుళువ వంశీయులలో అతి ప్రసిద్ధుడైన శ్రీకృష్ణదేవరాయలు స్వయంగా కవియే గాక, సంస్కృతాంధ్ర కన్నడ కవులను పోషించాడు. కవి పండిత గోష్ఠులను విరివిగా నిర్వహించేవాడు. "అష్టదిగ్గజాల"ని ప్రసిద్ధి పొందిన కవులను "భువనవిజయం" అనే సభామందిరంలో సమావేశ పరిచేవాడు. కృష్ణదేవరాయలు "ఆముక్తమాల్యద" వంటి చక్కని గ్రంథాలు వ్రాశాడు.

అల్లసాని పెద్దన (మనుచరిత్ర), నంది తిమ్మన (పారిజాతాపహరణము), భట్టుమూర్తి (వసుచరిత్ర), ధూర్జటి (శ్రీకాళహస్తి మాహాత్మ్యము), మాదయ్యగారిమల్లన (రాజశేఖర చరిత్రము), అయ్యలరాజు రామభద్రుడు(రామాభ్యుదయము), పింగళి సూరన (కళాపూర్ణోదయము), తెనాలి రామకృష్ణుడు (పాండురంగ మాహాత్మ్యము) అనే ఎనిమిది మంది కవులు రాయల ఆస్థానంలోని అష్టదిగ్గజాలని ప్రతీతి ఉంది. మొదటి అయిదుగురు కవులు రాయల అష్టదిగ్గజాలలో ఉన్నారనే విషయం, చారిత్రకంగా పొసగుతుంది. కాని, చివరి ముగ్గురు అష్టదిగ్గజాలలో ఉన్నారనటానికి చారిత్రకంగా బలమైన ఆధారాలు లేవనీ, అష్టదిగ్గజాలలోని మిగిలిన ముగ్గురు కవులు సంస్కృత కన్నడ కవులై ఉంటారని పండి

తుల అభిప్రాయం. "కందుకూరి రుద్రకవి" అష్టదిగ్గజాలలో ఉన్నాడని కొందరి అభిప్రాయం.

శ్రీకృష్ణ దేవరాయనకు సమకాలికులైన సంకుసాల నృసింహకవి "కవికర్ణ రసాయనం", చింతలపూడి ఎల్లయ "రాధామాధవం" అనే గ్రంథాలు వ్రాశారు. రాయలమంత్రియైన తిమ్మరుసు మేనల్లుళ్ళలో ఒకడైన నాదెళ్ళ గోపమంత్రి (కొండవీటి పాలకుడు) "కృష్ణార్జున సంవాదము" అనే ద్విపద కావ్యం వ్రాయగా, మరొక మేనల్లుడు నాదెండ్ల అప్పయామాత్యుడు, మాదయగారి మల్లన వ్రాసిన "రాజశేఖరచరిత్ర" కావ్యానికి కృతిపతి.

భట్టుమూర్తి (రామరాజ భూషణుడు) "నరస భూపాలీయము" తొరగంటి దుర్గాధ్యక్షుడైన ఓబయ నరసరాజు (రామరాయల మేనల్లుడు)కు అంకితం. అయ్యలరాజు రామభద్రుని "రామాభ్యుదయ" కావ్యం గొబ్బూరి నరసరాజుకు అంకితం. పింగళి సూరన "కళాపూర్ణోదయ" కావ్యం నంద్యాల కృష్ణంరాజు (విజయనగర సామంతుడు)కు అంకితం. రామరాజభూషణుని "వసుచరిత్ర" ఆరవీటి తిరుమల రాయలకు (అళియరామ రాయల తమ్ముడు) అంకితం.

పాండురంగ మాహాత్మ్య కావ్య కర్తయైన తెనాలి రామకృష్ణుడు, శ్రీకృష్ణదేవ రాయల కాలం మొదలు వేంకటపతిరాయల కాలం వరకు జీవించాడని కొందరు పండితుల అభిప్రాయం.

## హంపి-విజయనగరము-సంస్కృత సాహిత్య పోషణ

విజయనగర రాజ్యాన్ని పాలించిన సంగమ, సాళువ, తుళువ, ఆరవీటి వంశపు రాజులు సంస్కృత సాహిత్యాన్ని విశేషంగా ఆదరించి, పోషించారు. విద్యారణ్యులు (సాయణ మాధవాచార్యులు) ఎన్నో స్మృతులకు, మీమాంసలకు వ్యాఖ్యానాలు వ్రాశారు. వీరి భాష్యాలు కొన్ని బుక్కరాయలకు అంకితం. తరువాత వీరు సన్యసించి శృంగేరి పీఠాధిపతులై ఎన్నో వేదాంతాలు వ్రాశారు.

మొదటి బుక్కరాయల కోడలు-కంపరాయల అర్ధాంగి అయిన గంగాదేవి, తన భర్తయొక్క దక్షిణదేశ దండయాత్రనువర్ణిస్తూ "మధురావిజయమ్" అనే గ్రంథాన్ని వ్రాసింది.

సంగమవంశీయులు డిండిమకవులలో కొందరిని పోషించారు. మొదటి ప్రౌఢ దేవరాయల కాలంలోని మొదటి డిండిమభట్టు తన వైదుష్యం ప్రదర్శించి, రాయల వద్దర అగ్రహారం పొందాడు. శ్రీనాథుని చేతిలో ఓడిపోయిన డిండిమభట్టు II, "యోగానంద ప్రహసనం" అనే గ్రంథాన్ని వ్రాశాడు. "మహానాటక సుధానిధి" అనే గ్రంథాన్ని రెండవ ప్రౌఢదేవరాయలే వ్రాశాడని పండితుల అభిప్రాయం. సాళువ నృసింహరాయని (1480) ఆదరణలో డిండిమభట్టు III, "సాళువాభ్యుదయమ్" అనే 13 అధ్యాయాల కావ్యాన్ని వ్రాసి, రాయలవంశాన్ని, దండయాత్రలను, పరాక్రమాన్ని చక్కగా వర్ణించాడు.

తుళువ వీరనరసింహ శ్రీకృష్ణదేవరాయలల కాలంలోని డిండిమభట్టు IV "వీరభద్రవిజయమ్" అనే డిమరూపకాన్ని వ్రాశాడు.

శ్రీకృష్ణ దేవరాయల సవతితల్లి కుమారుడైన అచ్యుతదేవరాయల కాలంలోని డిండిమభట్టు V "భాగవతచంపువు", "అచ్యుత రాయాభ్యుదయమ్" అనే గ్రంథాలు వ్రాశాడు. అచ్యుత రాయాభ్యుదయంలో డిండిమకవి అచ్యుతదేవరాయల వంశయాత్రలను, పరాక్రమాన్ని చక్కగా వర్ణించాడు

శ్రీకృష్ణదేవరాయల ఆస్థానంలోని లొల్ల లక్ష్మీధరుడు "శివానందలహరి" "దైవజ్ఞవిలాసమ్" అనే గ్రంథాలు వ్రాశాడు. మహామంత్రి తిమ్మరుసు అగస్త్యకృత బాలభారతానికి "మనోహర" వ్యాఖ్య వ్రాయగా, అతని మేనల్లుడు నాదెండ్ల గోపమంత్రి ప్రబోధ చంద్రోదయమనే సంస్కృతకావ్యానికి వ్యాఖ్య వ్రాశాడు. కృష్ణదేవరాయల ఆస్థానంలోని సంగీతవిద్వాంసుడైన లక్ష్మీనారాయణపండితుడు 'సంగీతసూర్యోదయా'న్ని వ్రాశాడు. శ్రీకృష్ణదేవరాయలు "మదాలసచరిత్ర","సత్యవధూప్రీణనమ్" అనే సంస్కృత గ్రంథాలు వ్రాశాడట.

శ్రీకృష్ణదేవరాయల సవతితల్లి కుమారుడైన అచ్యుతదేవరాయల అర్ధాంగి తిరుమలాంబ "వరదాంబికా పరిణయం" వ్రాసింది.

శ్రీకృష్ణదేవరాయల అల్లుడైన అళియ రామరాయలు రామయామాత్యుడనే విద్వాంసుని పోషించి "స్వరమేళ కళానిధి" అనే గ్రంథాన్ని రచింపచేశాడు.

## హంసలదీవి గోపాల శతకము

కర్త : కాసుల పురుషోత్తమ కవి.

కృష్ణాసాగర సంగమంలోని హంసలదీవిలో వేంచేసి ఉన్న గోపాలస్వామిమీద చెప్పిన శతకము. (శ.సా.వి)

## హంస వింశతి

కర్త : అయ్యలరాజు నారాయణామాత్యుడు (చూ).

అంకితం : శ్రీరామునికి.

ఐదాశ్వాసాల శృంగార ప్రబంధం. మొత్తం 1396 గద్యపద్యాలున్నాయి. నాయికకు పెంపుడు హంస చెప్పినట్లుగా నీతిని బోధించే ఇరవై శృంగార కథలున్నాయి. ప్రౌఢమైన కల్పనలున్నప్పటికీ, ఆనాటి సమకాలీన సంఘజీవితాన్ని చక్కగా ప్రతిబింబిస్తున్న రచన. కవి శాస్త్ర పరిజ్ఞానం అపారం. ఈ గ్రంథం, శుకసప్తతిని అనుసరించి చేసిన రచనగా పలువురు భావిస్తున్నా, స్వతంత్ర రచనా గౌరవాన్ని పొందింది. (అయ్రవ-11-248)

## హంస వింశతి

కర్త : ధూర్జటి లక్ష్మీపతి.

అయ్యలరాజు నారాయణ కవి వ్రాసిన హంస వింశతి పద్యకావ్యానికి వచన రూపం. శైలి సులభంగా ఉంది. (వ.వా)

హంస సందేశమ్ (సం)

కర్త : చూ. వామనభట్ట బాణుడు.

ప్రశస్త కావ్యాలలో ఒకటి. (రె.రా.చ.)

హంస సందేశమ్ (సం)

కర్త : చూ. వారణాసి ధర్మసూరి.

(తె.వి.స-4)

హంస సందేశమ్ (రసాస్వాదన వ్యాఖ్య)

కర్త : చూ. హోసదుర్గం కృష్ణమాచార్యులు.

వేదాంత దేశికుల వారు రచించిన హంస సందేశమనే గ్రంథానికి ఇది వ్యాఖ్యానం. సంస్కృత రచన.

హనుమంత శతకము

కర్త : చూ. ముత్తేవి పెరుమాళ్ళయ్య.

ఆంజనేయస్వామి పరమైన కంద పద్య శతకం.

కృతికర్త గొప్ప తపస్సంపన్నుడని ప్రతీతి. క్రీ.శ. 1765-1785 ప్రాంతంలో విజామలీ అధిపత్యంలో హైదరాబాదు నవాబు నుండి ఒక గుర్రపు దండు బయలుదేరింది. ఇది దేవరకోట (చల్లపల్లి) సంస్థానాన్ని దోచుకోవాలని వచ్చిందట. అప్పటి చల్లపల్లి సంస్థాన ప్రభువు కోదండ రామన్న దేశాహి, పెరుమాళ్ళయ్యను పిలిపించి వృత్తాంతం వివరించి, శత్రువులను రాకుండా చేయమన్నారట. కవి శ్రీకాకుళ క్షేత్రంలో, స్వామి వారి సన్నిధానంలో నెలకొని ఉన్న ఆంజనేయస్వామిని ప్రార్థిస్తూ నవాబు దళం పైన పిడుగుల వర్షం కురిసేట్లుగా పద్య శతకం చేత స్తుతించారట. ఆ పద్య శతకమే "హనుమంత శతకము".

"శత్రుహంత శ్రీహనుమంతా..." అనే మకుటంతో ఉంది.

(అం.సం.సా-156)

హనుమకొండ రామయ

కాలం : తెలియదు.

ఈయన గోవయ రామయగా ప్రఖ్యాతుడు. తండ్రి గోవయ. ఈయనపై ఒక చాటు పద్యం దొరికింది. గోపరాజు రామప్రధాని ఇతని కంటె భిన్నుడని కొందరి అభిప్రాయం. (చా.వ.ర.)

హనుమచ్ఛతకము

కర్త : ఎఱ్ఱమిల్లి సూర్యప్రకాశకవి.

అంకితం : వాఁడ్రేవు కృష్ణ భూపాలునికి.

ఈ శతకంలో కవి హనుమంతుని బలపరాక్రమాలను వర్ణించి అతడు అమా

నుష శక్తి సంపన్నుడని కీర్తించాడు. శతకారంభంలో కృతిపతి వంశ వృత్తాంతం ఉంది.
(శ.సా.వి-218)

హనుమచ్ఛతకము

నామాంతరం : వాయుపుత్ర శతకము.

కర్త : చూ. శిష్టు కృష్ణమూర్తిశాస్త్రి.

అంజనేయస్వామి పరమైన సీసపద్యశతకం. రచన ప్రౌఢంగా అంత్యప్రాస, సర్వతఃప్రాస, ముక్తపదగ్రస్త, వ్యత్యనుప్రాసాలంకారయుతంగా ఉంది. "వారి రుహబంధు సుత మిత్ర ; వాయు పుత్ర" అనేది మకుటం.
(ఆం. సం. సా. 328) (శ. క. చ. 765)

హనుమదాఖ్యానము

కాలం : క్రీ. శ. 1830 ప్రాంతం.

కర్త : అల్లమరాజు రామకృష్ణకవి.

కవి తన చకోర చంద్రోదయంలో ఈ రచనను పేర్కొన్నాడు. వివరాలు తెలియరాలేదు.
(క. స-185)

హనుమద్విజయము

రచనాకాలం : క్రీ. శ. 1830 ప్రాంతం.

కర్త : పరశురామపంతుల అనంతరామకవి.

గ్రంథప్రతి అసమగ్రంగా లభించింది.
(క. స-8)

హనుమద్విన్నపము

కర్త : బుచ్చాలి గోపాలయ్య (చూ).

అంకితం : ముళువాయి హనుమంతునికి (అరియలూరు గ్రామదేవత).

దైవపరమైన విన్నపం. ఈ కవి ఇంటలేనపుడు అనెగొంది చిన వెంగమరాజు ఇతవి భార్యను బలాత్కరించగా కవి ఆ వృత్తాంతాన్ని హనుమంతునికి విన్నవిస్తూ, "ముళువాయి హనుమంతా ఆ విర్భాగ్య చినవెంకవి చంపవే" అంటూ ఆవేదనతో ఈ విన్నపం వ్రాశాడవి కొందరంటారు.
(అరుద్ర-12-89)

హయగ్రీవ దండకమ్ (సం)

కర్త : కిరీటి వేంకటాచార్యులు (చూ.)

భగవంతుడైన హయగ్రీవులను గురించిన స్తోత్రం.
(ఆం. సం. సా.)

హయగ్రీవ ప్రాబోధిక స్తుతి (సం)

కర్త : చూ. హోసదుర్గం కృష్ణమాచార్యులు.

భగవాన్ హయగ్రీవుల పరమైన సుప్రభాత స్తోత్రం.

హయలక్షణ విలాసము

చూ. అశ్వలక్షణసారము.

కర్త : మనుమంచి భట్టు.

కృతిభర్త : సాళువ కంపరాజు (కంప పృథ్వీపతి).

సుమారు130 పద్యాలున్నాయి. కవిత మృదుపద సంయుతంగా, మనోహరంగా ఉంటుంది. వ్యాకరణదోషాలు, లేఖక, ముద్రాపకదోషాలు ఉన్నవి. ఇది క్రీ. శ.1929లో అశ్వలక్షణ సారమనేపేర ముద్రితమైంది. ఇందులో ఇద్దరు కవులు రచించిన రెండు గ్రంథాలు కలసిపోయి ఉన్నవి. ఇందులో ఒకటి, "అశ్వ లక్షణ సారము" రెండవది "హయలక్షణ విలాసము" అని పండితాభిప్రాయం. తాళపత్ర ప్రతిలో గ్రంథవిభాగాలు "అధికారములు" గా విభజింపబడి ఉండగా, ముద్రిత ప్రతులలో "అంకురములు" గా గుర్తింపబడ్డాయి. (క. త. 5-263)

## హరదత్తోపాఖ్యానము (అలభ్యం)

చూ. హరిదత్తోపాఖ్యానము.

కర్త : నందూరి మల్లయకవి.

రచనాకాలం : క్రీ. శ. 1560 కి పూర్వం.

జగ్గకవి ప్రబంధ రత్నాకరంలో దీనిలోనిపద్యాన్ని ఉదాహరించాడు. ఇదిప్రబంధ మట దీన్ని హరిదత్తోపాఖ్యానంగా కొందరు పేర్కొన్నారు. లభించినపద్యం పురవర్ణనకు సంబంధించినది. (క. స-161) (ఆరుద్ర-8)

## హర లీల (అలభ్యం)

కర్త : మల్లికార్జున పండితుడు.

రచనాకాలం : క్రీ. శ. 1150 ప్రాంతం.

శైవమత సంబంధమైన రచన. (క.స. 163)

## హర విలాసము (అలభ్యం)

కర్త : నాచన సోమనాథుడు.

దీనిపేరు "హరివిలాసము" అనికొందరి అభిప్రాయం. సోముని హరివిలాసము లోనివవి నాల్గు కందపద్యాలను కస్తూరి రంగకవి తన "అనంద రంగరాట్ఛందస్సు" లో ఉదాహరించాడు. (వా. చ)

## హర విలాసము (అలభ్యం)

కర్త : చూ. వేములవాడ భీమకవి.

## హర విలాసము

కర్త : శ్రీనాథుడు.

రచనా కాలం : క్రీ. శ. 1425 ప్రాంతం.

అంకితం : అవచి తిప్పయసెట్టికి.

ఏడు ఆశ్వాసాల కావ్యం. ఆంధ్రభాషా నైషధాబ్జభవుని అని ప్రవక్తమకుటం వల్ల ఈకావ్యం నైషధం తరువాత రచన అవుతుంది. ఇందులో తిప్పయ పూర్వీకుడయిన

సిరియాళునికథ ఉంది.కవి వివిధ గ్రంథాలనుంచి దీనిలోకి కథలను తీసుకొన్నాడు.కాళిదాసు కుమార సంభవం నుంచి గిరిజాకల్యాణం వృత్తాంతాన్ని, భారవి కృతినుంచి కిరాతార్జునీయ వృత్తాంతాన్ని గ్రహించి అనువదించాడు. శివుని లీలలు అతని భక్తవశత్వం – కుమార జననం తదితరగాథలు ఇందులో రమణీయంగా కూర్చాడు.

(అరుద్ర-4)

హరి కథా సారము (అలభ్యం)

కర్త : అల్లసాని పెద్దన.

హరి కథా సుధారసము (అలభ్యం)

కర్త : ఆలూరి కుప్పన.

ఆచార్య విజయపీఠిక నుండి ఈగ్రంథ వృత్తాంతం తెలుస్తున్నది.

(ద. దే. వా-250)

హరికారికలు (సం)

నామాంతరం : హరికారికావళి.

కర్త : శిష్టు కృష్ణమూర్తి శాస్త్రి.

హరికారికావళి (సం)

నామాంతరం : హరికారికలు.

కర్త : శిష్టు కృష్ణమూర్తిశాస్త్రి.

రచనాకాలం : క్రీ. శ. 19 వ శతాబ్ది పూర్వార్థం.

సంస్కృత వ్యాకరణగ్రంథం. బాలవ్యాకరణానికిది అనువాద రూపమైన రచన అయినా ఇదే బాలవ్యాకరణానికి మూలమేమో అన్నభ్రాంతిని కలిగించింది. దీన్ని చూసే చిన్నయసూరి బాలవ్యాకరణం రాశాడని కొందరు ప్రచారం చెయ్యడంతో పండితలోకంలో దీనిపై వాదోపవాదాలు చెలరేగాయి. ఇలాంటి ప్రచారానికి గుప్తార్థప్రకాశికాకర్తలు కల్లూరి వేంకటరామశాస్త్రిగారు ప్రధానకారకులు. కాని వారి వాదం నిలవలేదు.

1927, 1928లలో ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రికా ముఖంగా బాలవ్యాకరణమే మూలగ్రంథమని దువ్వూరి వేంకటరమణశాస్త్రి ఒకవ్యాసంలో నిరూపించారు. దానితో పై వాదం పరిసమాప్తమయింది. (రమణీయం-పీఠిక) (ఆం. సం. సా-328)

హరిదత్తోపాఖ్యానము (అలభ్యం)

కర్త : నందూరి మల్లయ్య.

చూ. హరదత్తోపాఖ్యానము.

(అరుద్ర-9)

హరిభక్తామృత సారము (అలభ్యం)

కవి : చేకూరి సిద్ధయ్య.

ఈ రచన గురించి కవి తన శ్రీరంగమాహాత్మ్యగద్యలో చెప్పాడు.
(ఆరుద్ర-12-308)

## హరిభక్తి సుధార్ణవమ్ (సం)

కర్త : చూ. శ్రీ నారాయణ తీర్థులు.

ఇది భగవత దశమ స్కంధంలోని కథాసంగ్రహంతో కూడిన గ్రంథం. బహుళప్రచారం పొందింది. దీనిలోని మంగళశ్లోకాన్ని తెలుగుదేశంలోని హరికథా భాగవతార్లు నేటికీ పాడుతుంటారు. భజనకూటాలలో "శ్రీనారాయణ తీర్థ సద్గురువరం తన్నౌమి ముక్తి శ్రీ యై' అనే మకుటమున్న దీనిలోని ధ్యాన శ్లోకాన్ని చదువుతారు.
(తె. వి. స-4)

## హరిభక్తి సుభోదయము

కర్త : చూ. జనార్దన రంగారాయ బహద్దరు.

తాత్త్వికప్రబంధం. "శ్రీమన్నారదీయము" అనే 25 అధ్యాయాలున్న సంస్కృత రచనకు తెలుగుసేత. (ఆం. సం. సా-307)

## హరి భజనలు

తెలుగుదేశంలో ఈ భజనలు పూర్వకాలం నుంచి ప్రచారంలో ఉన్నాయి. ప్రజలు భక్తిభావంతో హరిని స్మరిస్తూ ఈ భజనలు చేస్తుంటారు. ఈ భజనలలో నృత్యానికి స్థానంలేదు, ముఖ్యంగా సంక్రాంతిరోజుల్లో తెల్లవారకముందే లేచి, పరిశుభ్రమైన బట్టలుధరించి తెల్లనినామాలతో, చేతితాళాలతో, హార్మోనియం, మద్దెల సహాయంతో ఊరు నాలుగుమూలలా ప్రచారంచేస్తూ పాడుతుంటారు. తెలుగులో చాలామంది కవులు హరి భజనకు సరిపోయే కీర్తనలు వ్రాశారు. (నా. ర. చ-307)

## హరిభట్టు

కాలం : క్రీ. శ. 17 వ శతాబ్దం.

స్థలం : నిజాం రాష్ట్రంలోని "కంభముమెట్టు" (కంబముమెట్టు) ప్రాంతం.

రచనలు : వరాహపురాణము, రతిరహస్యమ్ (సం), మత్స్యపురాణము (ముద్రితం) నరసింహపురాణము (ముద్రితం), భాగవతము (షష్ఠైకాదశ ద్వాదశ స్కంధములు).

బిరుదు : "అష్ట ఘంటావధాన పరమేశ్వర".

గోలకొండ నవాబులు కులీ కుతుబ్‌శాహి, జంషిద్ కుతుబ్ శాహి లకు సమకాలికుడు కావచ్చు. రామ పండితుని పుత్రుడు. ఈయన రచన సంస్కృతాంధ్ర పద భూయిష్ఠమై మధురంగా ఉంటుంది. ఇతని కాలాన్నిగురించి భిన్నాభిప్రాయాలున్నాయి. ఇతడు శ్రీకృష్ణదేవరాయల కాలం వాడని కొందరి అభిప్రాయం.

ఇతని మరణానంతరం కవికుమారుడైన రామవమనీషి నరసింహ పురాణాన్ని ప్రోలుగంటి రంగమంత్రికి అంకితం చేశాడట.

(వా. చ-56) (క.చ.3-1;తె.వి.వ-6)

**హరిమణి దర్పణమ్ (సం)**

కర్త : చూ. తిరుమల బుక్కపట్టణం (ఇమ్మడి) శ్రీనివాసాచార్యులు.

విశిష్టాద్వైత సిద్ధాంతపరంగా ఉన్న రచన. (ఆం. సం. సా-516)

**హరిలీలా విలాసము (అలభ్యం)**

కర్త : (చూ.) తెనాలి రామకృష్ణ కవి.

(క. స-186)

**హరివంశము (పూర్వోత్తర భాగాలు)**

రచనాకాలం : క్రీ. శ. 1330-40 ప్రాంతం.

కర్త : ఎఱ్ఱాప్రెగ్గడ.

అంకితం : ప్రోలయ వేమారెడ్డికి.

పూర్వభాగంలో తొమ్మిది ఆశ్వాసాలు, ఉత్తరభాగంలో పది ఆశ్వాసాలు ఉన్నాయి. విశ్రుతమైన పురాణగ్రంథం. తెలుగుతనం ఉట్టిపడే రచన. భారత పరాంశమైన హరివంశం తెలుగులో లేనిదే మహాభారతరచన సంపూర్ణం కాదని పండితులు భావించేవారు. ఆ కొరతను ఎఱ్ఱన తీర్చాడు.

ప్రత్యేకత : కవి ఎఱ్ఱన నరసింహావతారాన్ని మిక్కిలిగా అభిమానించినట్లు తెలుస్తున్నది. నృసింహపురాణంలోను, హరివంశం పూర్వభాగంలోను (21గద్య పద్యాలు) హరివంశం ఉత్తరభాగంలోను (47 గద్య పద్యాలు) నరసింహుని విస్తరంగావర్ణించాడు. రచన రసవంతమైనది. (ఆరుద్ర-3)

**హరివంశము (అలభ్యం)**

కర్త : గూళికల్లు వేంకట రమణకవి.

అంకితం : శ్రీ వేంకటేశ్వర స్వామికి.

ఈ కవి రెండోరచన "కనకరంజిత శిఖామణీ పరిణయం" లో ఈ హరివంశాన్ని గురించిన ప్రస్తావన ఉన్నది. ఇది సంస్కృతానికి ఆంధ్రీకరణమట.

(ఆరుద్ర-9-288)

**హరివంశము (ఆశ్చర్యపర్వం-శేషధర్మాలు)**

కర్త : తామరపల్లి తిమ్మయ్య.

అంకితం : శ్రీరామునికి.

విశిష్టత : ఎఱ్ఱన ఆంధ్రీకరించకుండా వదిలిన పర్వాలలో ఈ ఆశ్చర్యపర్వమొకటి. దీనిలోని ధర్మబోధలనే శేషధర్మాలంటారు. పాండవులు వనవాసంలో ఉన్నపుడు కృష్ణుడు, భీష్ముడు అడవికిపోయి ధర్మరాజుకుకొన్ని ధర్మాలు బోధిస్తూ కథలు చెబుతారు, భూదానం, అన్నదానం, జలదానం, కన్యాదానం మొదలైన వాటివల్ల వచ్చే పుణ్యాలు, తిరుపతి మొదలైన క్షేత్రాలు చూసినందువల్ల కలిగే మేళ్ళు, కొన్ని వ్రతాలను గురించి చెప్పే కథలు,దీనిలో ఉన్నాయి.కవి ప్రబంధ యుగంలోవి వాడయినా ఈ శేష ధర్మాలను చాలావరకు పురాణ ధోరణిలోనే అనువదించాడు. (ఆరుద్ర-9-238)

హరివంశసార చరిత సర్వంకష వ్యాఖ్య (సం)

కర్త : అప్పయ దీక్షితులు.

గోవింద మంత్రి కృతమైన హరివంశ సార చరిత్రకు సర్వంకషమైన వ్యాఖ్య. (తె. వి. స-6)

హరి విలాసమ్ (సం)

కర్త : లోలంబరాజు (చూ).

ఇది 5 సర్గల కావ్యం. శ్రీకృష్ణ చరిత్ర వర్ణన దీనిలో ఉంది. (తె. వి. స-6)

హరి విలాసము (అలభ్యం)

నామాంతరం : హరవిలాసము (చూ).

కర్త : నాచన సోమనాథుడు.

ఈ గ్రంథంలోని నాల్గు కంద పద్యాలను కస్తూరి రంగకవి ఉదాహరించాడు. ఈ గ్రంథం పేరు హరవిలాసమని కొందరు భావిస్తున్నారు. సోమన రచించినట్లుగా చెప్పబడుతున్న "వసంత విలాసము" ఈ హరివిలాసము అభిన్నములని మరి కొందరి అభిప్రాయం. (క. వ-303)

హరిశ్చంద్ర కథ

రచనాకాలం : క్రీ.శ. 1780 ప్రాంతం.

కర్త : కనకబండి గట్టయ్య.

ద్విపద కావ్యం. సులభమైన శైలిలో ఉంది. (క. స-54)

హర్యశ్చంద్ర కథ (అలభ్యం)

రచనాకాలం : 15వ శతాబ్దం (1480-1530) ప్రాంతం.

కర్త : చంద్రమౌళి కవి.

పద్యకావ్యం. జగ్గకవి ప్రబంధ రత్నాకరంలో దీని ప్రసక్తి ఉంది. తెలుగులో వచ్చిన హరిశ్చంద్ర కథలు చాలవరకు మారన మార్కండేయ పురాణం ఆధారంగా రచించబడినవే. ఈ గ్రంథం నుండి లభించిన రెండు పద్యాలలోనూ ఒక దానిలో వద్నాలుగు రాజదోషాలు వరుసగా కవి చెప్పాడు. కొందరీ గ్రంథాన్ని హరిశ్చంద్రోపాఖ్యానంగా పేర్కొన్నారు. (క. స-85; అరుద్ర-6-88)

హరిశ్చంద్ర కథ

రచనాకాలం : క్రీ. శ. 1840 ప్రాంతం.

కర్త : పాటూరి నరసింహశాస్త్రి.

వచన కావ్యం. పురాణ గాథలు సులభమైన శైలిలో చదువరులకు అందించే ఉద్దేశంతో కవి ఈ రచన చేశాడు. (వ. వా-60)

హరిశ్చంద్ర చరిత్ర (అలభ్యం)

కాలం : క్రీ.శ. 1560కి పూర్వం.

కర్త : దేవరాజ భట్టు.

రెండు పద్యాలు మాత్రం ప్రబంధ రత్నావళిలో ఉదాహృతాలు. కొందరు దీన్ని హరిశ్చంద్రోపాఖ్యానంగా పేర్కొన్నారు.

(ఆరుద్ర-6-92; ప్రబంధరత్నావళి-వేటూరి ప్రభాకరశాస్త్రి)

**హరిశ్చంద్ర చరిత్ర (అలభ్యం).**

కర్త : లోక బాంధవుడు.

కావలి వేంకటరామస్వామి ఇతనిని గూర్చి తెలిపాడు. వివరాలు తెలియరాలేదు.

(క. వ-214)

**హరిశ్చంద్ర చరిత్ర (అలభ్యం)**

కర్త : పెణుతురుపల్లి విశ్వనాథకవి (చూ).

నిరోష్ఠ్య ప్రబంధము.

**హరిశ్చంద్ర చరిత్ర**

రచనాకాలం : క్రీ. శ. 1700 ప్రాంతం.

కర్త : వెన్నెకంటి చంద్రశేఖరకవి.

పద్యకావ్యం. రెండు భాగాలుగా ఉంది. (గో. కొం. క. సం.)

**హరిశ్చంద్ర నలోపాఖ్యానము**

కాలం : 16వ శతాబ్దం.

కర్త : రామరాజ భూషణుడు.

కృతిపతి : శ్రీరామచంద్రుడు.

ద్వ్యర్థి కావ్యం. కవి హరిశ్చంద్ర కథను, నల కథను కలిపి జోడించాడు. ఈ కావ్యంలోని అవతారికా పద్యాలను పరిశీలిస్తే కవి తన పాండిత్య ప్రకర్షను ప్రకటించటానికి కాక కేవలం ఆముష్మిక ఫల ప్రాప్తికి సంకల్పించినట్లు కనిపిస్తుంది. తెలుగులో మొదటి ద్వ్యర్థి కావ్యం సూరన్న విరచిత రాఘవ పాండవీయం. ఈ కావ్యం రెండోది.

ఈ కావ్యంలో కథా సంఘటన నిర్దుష్టం గాను, సొగసుగాను ఉంది. మూల గ్రంథాల్లో లేకపోయినా శ్లేషోపయోగానికి రామరాజభూషణుడు కల్పించిన విషయాలు లోక ప్రసిద్ధాలై ప్రౌఢంగా ఉన్నాయి. వర్ణనలు చేయటంలో కవి సిద్ధహస్తుడు. రాజహంస వర్ణన సంస్కృత నైషధం కంటె మిన్నగా ఉంది. మునులను, జల పక్షులను శ్లేషతో వర్ణించిన చోట్లు హృదయంగమంగా ఉన్నాయి. వేట, అభ్యవహార వర్ణనలు, మాయా కురంగాన్నీ హంసనూ జోడించి వర్ణించిన పట్టులు, ముని హంసలను, మాతంగీవిరహిణులను, తాడిత మాతంగ స్త్రీలను వారదుని జోడించిన వర్ణనలు సొగసుగా ఉంటాయి.

భాషా పాండిత్య విషయంలో కవికి సంస్కృతంలో ఉన్నంత స్వాతంత్ర్యం తెలుగులో కనిపించదు. ఈ కావ్యంలోని శ్లేషలు ఎక్కువగా సంస్కృతానికి సంబంధించినవే; కవి తెలుగులో సభంగాభంగ శ్లేషలను ఎక్కువగా వాడలేదు. ఈ మహాకవి

అప్పకవి చెప్పినట్లు "భూషణార్థి". శ్రవః పేయమయిన శబ్దాలంకారశోభ, మనోహరమయిన అర్థాలంకార సౌభాగ్యం ఈ కావ్యంలో అడుగడుగున వెల్లివిరిశాయి. (తె. వి. స-4)

## హరిశ్చంద్ర నలోపాఖ్యాన వ్యాఖ్య

రచనాకాలం : క్రీ. శ. 1580 ప్రాంతం కావచ్చు.

కర్త : చిత్రకవి అనంతకవి.

విశిష్టత : భట్టుమూర్తి విరచిత ద్వ్యర్థి కావ్యానికిది వ్యావహారిక భాషలో రచించిన వ్యాఖ్య. దీనిని పండితులు కృతక భాషలోకి తర్జుమా చేశారట. అసలు వ్యావహారికంలో వ్రాసిన వ్యాఖ్యాన ప్రతిని కాకరపర్తి కృష్ణకవి చూచితానుకూడా అవ్యావహారికంలోనే వ్రాసుకొన్నాడట. అనంతయ్య వ్యాఖ్యలో వాడిన వ్యావహారిక రూపాలు "రామరాజ భూషణుని ప్రయోగములవలె ప్రమాణిములే" అని వఝ్ఝల చిన సీతారామస్వామి శాస్త్రి మెచ్చుకొన్నారు. తెలుగువారికోసం తెలుగు కవులు వ్రాసిన కావ్యాలకు టీకా తాత్పర్యాలు చెప్పిన వారిలో మొదటివాడు రాఘవ పాండవీయ వ్యాఖ్యాత ముద్దరాజు పెద రామన. రెండోవాడు హరిశ్చంద్ర నలోపాఖ్యాన వ్యాఖ్యాత చిత్రకవి అనంతయ్య.

(ఆరుద్ర-9)

## హరిశ్చంద్ర నాటకము

కర్త : (చూ) మేలత్తూరు వేంకటరామ శాస్త్రి.

సంగీత రూపకం. రెండు భాగాలుగా ప్రదర్శితం. కైశికీ వృత్తిలో ఉంది.

(ద. దే. వా-309)

## హరిశ్చంద్రోపాఖ్యానము

కర్త : తెలియదు.

పద్యప్రబంధం. 18 తాటాకులు మాత్రం లభించాయి. శ్రీరామునికి అగస్త్యుడు ఈ కథ చెబుతున్నట్లుగా ఉంది. (ఆరుద్ర-8-94)

## హరిశ్చంద్రోపాఖ్యానము

రచనాకాలం : క్రీ. శ. 1384-1429 ప్రాంతం.

కర్త : గౌరన.

ద్విపద గ్రంథం. స్కాందపురాణోక్త కథకు ఇది స్వేచ్ఛానువాదమట. శంకర కవి, వీరశరభకవి ఈకావ్యాన్ని అనుసరించి పద్య కావ్యాలు వ్రాశారు. హరిశ్చంద్రుని కథ ఋగ్వేదంలోను, స్కాంద, మార్కండేయ పురాణాలలోను, దేవి భాగవతములోనూ ఉంది. గౌరన స్కాంద పురాణాన్ని ఆధారంగా తీసుకున్నా మూలానికి భిన్నంగా కొన్ని మార్పులు చేశాడు. హరిశ్చంద్రుని సత్యవ్రత నిరూపణంలో గౌరన చేసిన మార్పులు కావ్యానికి వన్నె తెచ్చాయి. నక్షత్రక పాత్ర పోషణం అద్భుతంగా చేశాడు. ఈర్ష్యా క్రోధాలతో నూరుకొన్న పాత్రల మనస్తత్వ చిత్రణ, దానికి తగిన సంభాషణల కూర్పు కావ్యంలో కన్పిస్తాయి. కవి, లోకోక్తులు, అలంకారాలు రమణీయంగా ప్రయోగించాడు.

దేశీయ ఛందస్సులో హరిశ్చంద్రుని కథను తెలుగువారి స్వంతంవలె చెప్పినకావ్యం ఇది.
(రె. రా. చ.; ద్వి. సా. చ-399)

**హరిశ్చంద్రోపాఖ్యానము**

రచనాకాలం : 16వ శతాబ్దం చివర 17వ, శతాబ్దం ప్రారంభం.

కర్త : కంచి వీర శరభకవి.

**అంకితం : శ్రీశైల మల్లికార్జున స్వామికి.**

ఐదాశ్వాసాల ప్రబంధం. కంచి కావ్యంగా ప్రసిద్ధం. (అరుద్ర-9)

**హరిశ్చంద్రోపాఖ్యానము (అలభ్యం)**

రచనాకాలం : 16వ శతాబ్దం.

కర్త : శంకరకవి (చూ)

**అంకితం : ఈదూరి ఎల్లయామాత్యునకు.**

ఐదాశ్వాసాల ప్రబంధం. కొన్ని పద్యాలు మాత్రం లాక్షణికుల ఉదాహరణల నుండి తెలుస్తున్నాయి. కవిత్వం మృదుమధురంగా ఉంది. ఎాచిమంచి తిమ్మకవి "సర్వ లక్షణ సార సంగ్రహం"లో ఈకావ్యం నుంచి, "అకటాజు త్తెదు నేలకుందగదె" మొద లయిన ఆరు ప్రయోగాలను ఆరు పద్యాలనుంచి ఉదాహరించాడు, గౌరన చేసిన ప్రయో గాలనే శంకరకవి కూడా చేసి ఉంటాడని పండితాభిప్రాయం. (క. న-282)

**హరిహరశ్లేషోదాహరణము (అలభ్యం)**

కర్త : చూ. చిత్రకవి అనంతకవి.

చిత్రకవి పేంకటరమణ కవి రచించిన సాంబవిలాసంలో దీని ప్రసక్తి ఉంది.
(క. స-3)

**హరిహర సంవాదము**

రచనా కాలం : క్రీ.శ. 1790 ప్రాంతం.

కర్త : కొమరగిరి సంజీవకవి.

కవి ఈ రచన ఆశువుగా రెండు గడియల కాలంలో చెప్పాడట. రచన సర శంగా ఉంటుంది. (శ. క. చ-475)

**హరిహరీః పదాలు**

ఇవి తెలుగు దేశంలో ప్రాచీన కాలం నుంచీ ప్రచారంలో ఉన్నాయి. కళిం గాంధ్ర దేశంలో ఎక్కువ. "హరిహరీ నారాయణా-ఆదినారాయణా; కరుణించి మమ్మేలు కమలలోచనుడా!" అనేది ఈపదాల పల్లవి. ఈ పదాలన్నీ దాదాపు పైపల్లవిలోనే నడు స్తాయి. ఈ పేరుతో చాలా కథలను సుద్దుల రూపంలో చెప్పటం కద్దు.

వీటినే "జంపె"లని కూడా అంటారు. ఈ పదాలవంటివే తెలుగు యక్షగానా లలో చాలా ప్రయుక్తం. పదాల నడక మొదటినుంచి చివరివరకు ఒకే రకంగా నడుస్తుంది.

మధ్య మధ్య కథకులు కథా గమనాన్ని అనుసరించి, వచనంలో తేటతెల్లంగా కథయొక్క అర్థాన్ని చెబుతుంటారు. సన్నివేశాలను బట్టి కొన్ని కీర్తనలు కూడా పాడతారు. కథకుడు పదం పాడితే వంతదారులు "అ—" అంటూ శృతిని సాగదీసి, శృతి పక్కంగా ఒక గమకాన్ని జత కలుపుతుంటారు. రామాయణంలోని పాతాళహోమం, శతకంఠ రామాయణం, భారతంలోని నలచరిత్ర, శశిరేఖాపరిణయం, విరాటపర్వం, ఉత్తరగోగ్రహణం) మొదలగునవి–గంగా వివాహం, సారంగధర చరిత్రలను వీరు ఈ పదాల రూపంలో చెబుతారు. (నా.ర.చ–317)

## హలాయుధము (అలభ్యం)

కర్త : మల్లికార్జున పండితుడు.

రచనాకాలం : క్రీ.శ. 1150 ప్రాంతం.

(క. స–163)

## హారతి

చూ. మంగళము.

## హాలాస్య మాహాత్మ్యము

కర్త : కటువె నంజరాజు.

అంకితం : కులదైవం నంజుండేశ్వరునకు.

తొమ్మిది రెండు అధ్యాయాల వచన గ్రంథం.

మధురలోని మీనాక్షి సుందరేశ్వరుల లీలలు ఇతివృత్తం. శైలి నాతి కఠినమై సలక్షణంగా ఉంది. అధ్యాయం మొదట, చివర పద్యాలున్నాయి. ఈ కథ నంజరాజు మొదట కన్నడంలో రాసి తర్వాత తెలుగులో రాశాడట. దీనికిమూలం స్కాందపురాణం లోని అగస్త్య సంహిత. (ద.దే.వా–481.; 524.

## హాలాస్య మాహాత్మ్యము (కన్నడం)

కర్త : కటువె నంజరాజు.

సంస్కృత స్కాందపురాణంలోని అగస్త్య సంహితకు అనువాదం. దీన్నే ఇతడు తెలుగులో కూడా రచించాడు.

## హాలాస్య మాహాత్మ్యము

కర్త : శ్రీపతి రామభద్రకవి (చూ.).

వచన కావ్యం. ఎనిమిది ఆశ్వాసాలున్నాయి. సుందరేశ్వరుని ప్రభావ విశేషాలు వర్ణితాలు. ఈ రచన మాఘమాహాత్మ్య, శ్రీరంగ మాహాత్మ్యాదులను పోలిఉన్నది. భాష సంస్కృత పద జటిలమై యమకాదులతో కూడి ఉంది. కటువె నంజరాజు కృతికి దీనికి చాలా భేదముంది. (వ.వా–48; ద.దే.వా–400)

## హాలాస్యాభ్యుదయమ్ (సం)

కర్త : నీలకంఠ దీక్షితులు.

(తె.వి.స_6)

## హాస్యరస గేయములు-జానపద సాహిత్యము

బ్రహ్మానంద సహోదరమైన హాస్యం జానపద సాహిత్యంలోకూడా చోటు చేసుకున్నది. ఈ హాస్యం కొంత పద సంబంధి. కొంత ఆకార వికార సంబంధి. కొంత సంఘటన వైచిత్ర్య సంబంధి.

పద సంబంధమైన హాస్యం గంగాగౌరీ సంవాదము, సీతా శాంత సంభాషణము, లక్ష్మి పార్వతి సంవాదము - కృష్ణ చెంచులక్ష్మి సంవాదము మొదలగు గేయాల్లో కనిపిస్తుంది. "శశిరేఖా పరిణయం"లో సంఘటనా వైచిత్ర్యమైన హాస్యం కనిపిస్తుంది. పల్నాటి వీరచరిత్రలో వేశ్యమాతకు సంబంధించిన వర్ణనలోనూ, అడవిగోవింద నామాలతో కుంభకర్ణుని వర్ణనలోను ఆకార వికార సంబంధమైన హాస్యం కనిపిస్తుంది. పెళ్ళి పాటలలో సందర్భానుసారంగా వివిధ రకాలైన హాస్యం ఉంటుంది. కొన్ని సందర్భాల్లో మోటు హాస్యం ప్రవేశించినా అది ఆనందావహమే అవుతుంది. (జా.గే.సా)

## హిందీ-తెలుగు నిఘంటువు

రచనా కాలం : క్రీ.శ. 18 శతాబ్ది ఉత్తరార్ధం.

కర్త : వావిలమంచి సుబ్బారావు.

హిందీలో మంచి ప్రావీణ్యమున్న ఈ రచయిత ఈ నిఘంటువును సంధానించి ప్రకటించారు. పిఠాపురం జమీందారిణి రావు రామాయమ్మారావు దీనిని ముద్రింపించారు. (ఆం.సం.సా-113)

## హిందూ ధర్మశాస్త్ర సంగ్రహము

కర్త : పరవస్తు చిన్నయసూరి.

తొలిముద్రణ : క్రీ.శ. 1858 ప్రాంతం.

Indian Penal Code కు ఇది తొలి తెలుగు అనువాదం. మదరాసు ప్రభుత్వం వారి ఆదేశాన్ననుసరించి తెలుగువారి కోసం కవి ఆంగ్లం నుంచి తెలుగులోకి అనువదించారు.

కర్నూలు నరహరిగోపాల కృష్ణమ్మసెట్టి ఈ గ్రంథ రచనలో చిన్నయ సూరికి తోడ్పడ్డాడు. శాస్త్రీయ గ్రంథాలు గ్రాంథిక భాషలో ఉంటే సామాన్యులకు బోధపడవనే మాటను వమ్ముచేయగల గ్రంథమిది. దీనిలో బంగాళాదేశ శాస్త్ర సంప్రదాయాలు, మళయాళదేశ శాస్త్ర సంప్రదాయాలు, శాస్త్రోత్పత్తి క్రమము, వివాహము, రక్షకత్వము, దాయాధికారము మొదలైనవి చక్కగా చెప్పబడినవి. అప్పటి న్యాయవాదులకు ఇది పఠనీయ గ్రంథంగా ఉండేది.

దీని ప్రతిని లండన్ బ్రిటీషు మ్యూజియం గ్రంథాలయం నుంచి తెప్పించి ఇటీవల మళ్ళీ ప్రకటించారు. (వ.వా_84; రమణీయం పీఠిక)

## హిందూమత విరోధ భంజని

కర్త : చూ. వెలుగోటి సర్వజ్ఞ కుమార యాచేంద్రులు (1832-92).

క్రైస్తవ మతంలోని పరస్పర విరుద్ధాంశాలకు సంబంధించిన విమర్శక గ్రంథం. (ఆం.సం.సా-462)

## హుళక్కి భాస్కరుడు

కాలం : క్రీ.శ. 1291-1323 ప్రాంతం.

ఆస్థానం : కాకతీయ రెండో ప్రతాపరుద్రుని ఆస్థానం.

రచనలు : భాస్కర రామాయణంలోని అరణ్యకాండ, యుద్ధకాండలో కొంతభాగం, దశగతులు.

విశిష్టత : ఈ భాస్కరుని ప్రసక్తి ప్రతాపరుద్ర చరిత్రలో ఉంది. ఇతడు వ్రాసిన గ్రంథంలో సాహిణి మారన ప్రసక్తి ఉంది. ఇతని "దశగతులు" సాహిణి మారనకు అంకితమట. (ఆరుద్ర-3)

## హృదయాభిరామము

కర్త : శిష్టా వెంకటసుబ్బయ్య (చూ.)

కాలం : క్రీ.శ. 19వ శతాబ్దం.

కృతిభర్త : శ్రీ రాజ వేంకట నరసింహ అప్పారావు బహద్దర్.

ఇది నాల్గు ఆశ్వాసాల శృంగార ప్రబంధం. ఇతివృత్తం అత్యాధునికం, సాంఘికం. ఈ కావ్యంలో నాయిక ఒక వేశ్య పేరు. సుందరి. నాయకుడు విరజాపుర వాస్తవ్యుడు, బ్రాహ్మణుడు. సదాచార సంపత్తిగలవాడు. ఇందులో మృచ్ఛకటికచ్ఛాయలు కన్పిస్తాయి. రచన రసవంతంగా ఉంది. (ఆం.సం.సా.)

## హెచ్చరిక

ఇది గీత రచనా విశేషం. "సుఖంగా నిద్రపట్టైనా" అని రాజాదులను పలుకరించే సుప్రభాత గీతం. ఈ పనిని నిర్వర్తించేవారిని సౌఖ్య గాయనికులు అంటారు.

తాళ్ళపాకవారి గీత సముచ్చయంలోను, సారంగపాణి పదాలలోను, త్యాగయ్య ఉత్సవ సంప్రదాయ కీర్తనలలోను ఈ హెచ్చరికలు కనిపిస్తాయి.

కొన్నిచో ఇవి వచన ఘటికాలుగా కూడా ఉన్నాయి. వీటిని దేవదాసీ జనం-చక్కగా ఒక సన్నని రాగవరసతో రమ్యంగా చదవటం సంప్రదాయం.

(య.వా.చ-350-51)

## హేమవతీ దండకము

కర్త : చూ. శతఘంటము రంగన్న.

అంకితం : వెలుగోటి బంగారు యాచమ నాయనికి.

వేంకటగిరి సంస్థానంలో "హేమావతి" అనే పేరుగల సౌందర్యవతి ఉండేదట. ఆమెపైన కవి ఈ హేమవతీ దండకాన్ని వ్రాసి ప్రభువుకు అంకితం ఇచ్చాడు.

కర్తృత్వం విషయంలో భిన్నాభిప్రాయాలున్నాయి. "సీతారామకవి" ఈ దండకాన్ని రచించాడని కొందరి అభిప్రాయం. (ఆం.సం.సా-460)

**హేమాబ్జనాయికా స్వయంవరము**

కర్త : మన్నారు దేవుడు.

రచనా కాలం : క్రీ.శ. 1670 ప్రాంతం

యక్షగానం. కవి దీన్ని నాటకమని చెప్పుకొన్నాడు. ఇతడు చెరసాలలో ఉండగా తండ్రిని మెప్పించడానికి ఈ కృతి రాశాడని అంటారు.

రాజగోపాలస్వామికీ హేమాబ్జ నాయికకూ విజయ రాఘవుడే పెళ్ళి జరిపించినట్లు ఇందులో కవి వ్రాశాడు. ఇలా వ్రాయడంలో మన్నారు దేవుని పితృభక్తి వెల్లడవుతున్నది. పురోహితుల సంభాషణలు, పేరంటాండ్ర సంభాషణలు - క్షీర సాగర మథనం చేసేటప్పుడు దేవదానవుల మాటలు, పాము మంత్రం, తడికట్టడం, ఇత్యాదులు ఆనాటి సమాజ స్థితిని అర్థం చేసుకునేందుకు ఉపకరిస్తాయి.

సల్లాము పదాలు, దరువులు, నాటికలోవలె అక్కడక్కడ ప్రదర్శనానుకూల సూచనలు కూడా ఇందులో ఉండటం విశేషం. (హే.నా.స్వ.)

**హొసదుర్గం శ్రీనివాస రాఘవాచార్యులు**

కాలం : క్రీ. శ. 19వ శతాబ్దం.

స్థలం : వనపర్తి సంస్థానం.

రచనలు : వీరరాఘవీయ భూమిక, ఆచార్య వైభవము, స్వభావ పద్ధతి.

వనపర్తి సంస్థానంలో ధర్మాధికారులుగా ఉన్నారు. విద్వత్కవి.
(కేశవపంతుల-సం.సా.)

**హోరా లక్షణము**

రచనా కాలం : క్రీ.శ. 17వ శతాబ్ది ఉత్తరార్థం.

కర్త : పూసపాటి విజయరామరాజు.

జ్యోతిష గ్రంథం. ముద్రితము. (క.స. 220)

**హోసూరి సాతమ్మ**

నామాంతరం : అన్నదానము వెంకమాంబ.

కాలం : క్రీ.శ. 1760 ప్రాంతం.

స్థలం : సేలం జిల్లా, హోసూరి తాలూకా "జోగిరి" గ్రామం.

రచనలు : 1. రామాయణము, 2. ముక్తికాంతా కల్యాణము, 3. రంగ విలాసము 4. గురుశిష్య సంవాదము.

గురువు : నారాయణ యతి.

సాకమ్మ సరస్వతి నారాధించి ప్రసన్నం చేసుకొని కవిత్వం చెప్ప నేర్చిందట. వేంకటాంబా వేంకట్ల రామావధానులీమె తలిదండ్రులు. తోగిరిని కడవె వీరరాజు "వీర రాజాంబుధి అగ్రహారము" అనే పేర అగ్రహారంగా బ్రాహ్మణులకు దానమిచ్చాడట

సాకమ్మ రచించిన రామాయణం హోసూరులో చాలా ప్రచారంలో ఉంది. ఇందులోని బాలకాండ ముద్రితం. ముద్రితప్రతిలో గ్రంథ ముద్రాపకులు కవయిత్రిపేరును అన్న దానము వెంకటాంబగా ప్రచురించారు. ఈమె అన్నదానంవారి కోడలు కావచ్చునని కొందరు పండితులంటున్నారు. ప్రచారంలో ఉన్న రామాయణం సుందరకాండలో సాకమ్మ పేరున్నదట. ఈమె రామాయణాన్ని అన్నదానం రామలక్ష్మమ్మగారు క్రీ. శ. 1912లో ప్రకటించారు.

(ఆరుద్ర 12-323; వ.దే.వా-407)

# అనుబంధము

## అకలంక రంగార్యుడు

కాలం : క్రీ.శ. 18 వ శతాబ్దం కావచ్చు.

రచనలు : తెలియరాలేదు.

పండితుడు. కువలయానంద ప్రకాశ రచనలో కటికనేని రామయ కవికి తోడ్పడ్డాడు.

## అచ్చతెనుగు కిరాతార్జునీయము

కర్త : పేరు తెలియదు. (రామయ్యగారి దశరథ రామయ్యగారి కావచ్చు).

అంకితం : బొబ్బిలిలోని గోపాలస్వామికి.

అయిదాశ్వాసాల కృతి. సంస్కృత కిరాతార్జునీయానికి తెనుగు సేత. కవి పేరు అచ్చతెనుగు పద్యంలో చెప్పుకొన్నాడు. ఇదమిత్థమని నిర్ణయించడానికి వీలు లేకుండా ఉంది. పిఠాపురం రాజావారు ఇచ్చిన ప్రతి ఒకటి కాకినాడ సాహిత్య పరిషత్తులో ఉంది. గ్రంథ సంఖ్య 4607. పఠన ప్రశస్తంగా ఉంది. చిత్రమైన శబ్దాలంకారాలు, అనులోమ విలోమ రీతులలో వివిధ బంధాలలో పద్యాలు ఇందులో చూడవచ్చును. (ఆం.సా.ప.ప-21-3)

## అచ్యుత దేవరాయల చిడిపిరాళ్ళ శాసనము

కాలం : క్రీ.శ. 1542 ప్రాంతం.

స్థలం : కడప జిల్లా కమలాపురం తాలూకా చిడిపిరాళ్ళ గ్రామంలోని అగస్త్యేశ్వర స్వామి గుడి.

శాసన విషయం : శ్రీకృష్ణదేవరాయలకు సవతి తల్లి కుమారుడైన అచ్యుత దేవరాయల కాలంనాటి శాసనమిది. సుంకాధికారాన్ని నిర్వహించే కొండయ చిడిపిరాల గ్రామంలో ఉన్న అగస్త్యేశ్వరస్వామికి అఖండదీపం వెలుగుతూ చేసిన దాన విషయం దీనిలో ప్రసక్తం. దీనిలో దానం చేయబడిన సుంకాలు; కోమటి వర్తకులపై పన్ను, తెలికవారి గానుగలపై పన్ను, సాలెవారి మగ్గాలపైపన్ను, నారకో తాళ్ళు పేనే వారిపై పన్ను, కల్లు గీతవారిపై విధించే పన్ను, గొల్లవారిపై విధించే పన్ను, ఉప్పరి వారిపై విధించే పన్ను మొదలగునవి.

గ్రామీణ వృత్తులపై కూడా పన్నులుండేవని ఈ శాసనం వల్ల తెలుస్తున్నది. ఇల్లే బొమ్మరి పన్ను, మంగలిపన్ను, విప్రవినోది పన్ను మొదలగు పన్నులు కూడా ఆ రోజులలో ఉండేవట. (తె.శా-ప.శా-98, 97)

**అన్నదానము వేంకటాంబ**

నామాంతరం : హోసూరి సాకమ్మ (చూ).

**అనిరుద్ధ చరిత్ర వ్యాఖ్య**

కర్త : పైడిపాటి వేంకటనరసు (చూ).

కనుపర్తి అబ్బయామాత్యుని అనిరుద్ధ చరిత్రకు ఇది వ్యాఖ్య. దీనిని బ్రౌన్ దొర వ్రాయించాడు. (తె.సా.విమర్శ-91)

**అన్యవాద కోలాహలము**

రచనాకాలం : క్రీ.శ. 1750 కి పూర్వం.

కర్త : ఏకోరామనాథుడు.

శైవమత పరమైన గ్రంథం. ముద్రితం. కర్త సోమేశ్వరుడనీ శివయోగీంద్రుడనీ భిన్నాభిప్రాయాలున్నాయి. (అరుద్ర-12-314)

**అభినయ దర్పణము**

కర్త : లింగముగుంట మాతృభూత కవి.

సంస్కృతంలో నందికేశ్వరుడు రచించిన గ్రంథానికి అనువాదం. మూడాశ్వాసాలున్నవి. మద్రాసు ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారం వారు దీన్ని ప్రకటించారు.

**అమలాపురపు సన్యాసి కవి**

కాలం : క్రీ.శ. 1760 ప్రాంతం.

స్థలం : పాలతేరు, విశాఖమండలం.

రచనలు : సోమవార వ్రత మాహాత్మ్యము, కుమ్మరి గుండయ్య కథ, గౌరీరమణ శతకము, యోగావళి, పంచముఖేశ లింగ ద్వాత్రింశత్తు, సర్వాంధ్ర సార సంగ్రహము, ముఖలింగ శతకము, పంచముఖేశ శతకము, శివ శతకము, విశ్వనాథ శతకము, పంచముఖేశ్వర ప్రభూత శతకము.

గురువు : కట్టమూరి కామేశ్వర కవి.

కాశీపతి, గంగా భవానుల పుత్రుడు. నాటకాలంకార సాహితీ వైభవుడు. కోమల కవితా చమత్కార సామర్థ్యమున్న వాడు. ప్రసిద్ధ పుణ్య క్షేత్రాలను దర్శించాడట. ఇతన్ని స్తుతిస్తూ తుమరాడ పాపకవి, దేవులపల్లి చంద్రశాస్త్రి పద్యాలు చెప్పారు. (శ.క.చ-751)

**అలంపురము**

నేటి మహబూబ్ నగర మండలానికి చెందిన నగరం. పౌరాణికంగా, చారిత్రకంగా చాలా ప్రశస్తిగాంచినది. 'దక్షిణ కాశి' అనీ, "శ్రీశైలానికి పశ్చిమ ద్వారమనీ" ప్రసిద్ధి పొందింది. జోగులాంబ, బ్రహ్మేశ్వరస్వామి మొదలగు దేవతలు వెలసిన ఈ పుణ్య క్షేత్రం "బ్రహ్మేశ్వరమనీ", హేమలాపురమనీ" స్థలపురాణాలలో ప్రసక్తం.

పాల్కురికి సోమనాథుని పండితారాధ్య చరిత్రలో కూడా దీన్ని గురించిన విపుల వర్ణన కనిపిస్తుంది.

"బిజ్జులవారి" పాలనలో ఇది సంస్థానంగా ఉండేది. బిజ్జులవారు బహమనీలకు కుతుబ్‌షాహీలకు, విజయనగర ప్రభువులకు, అసఫ్ జాహీలకు కూడా సామంతులుగా ఉంటూ, సుమారు క్రీ.శ. 1850 వరకు ఈ ఆలంపురం సీమలో ఎక్కువ భాగానికి అధిపతులై ఉండేవారు. ఈ పాలకులలో సాహిత్య పరంగా పేర్కొనదగిన వాడు "బిజ్జుల తిమ్మ భూపాలుడు". ఇతడు స్వయంగా కవి. "అనర్ఘ రాఘవము" అనువాద రచన. గ్రంథ రచనలో ఈ ప్రభువుకు, "కృష్ణకవి" మిక్కిలి తోడ్పడ్డాడట. ఇతడే కాక పలువురు ప్రముఖ విద్వత్కవులీతని ఆస్థానంలో ఉన్నట్లు "అనర్ఘరాఘవం" తెలుపుతున్నది. అలంపురం తాలూకాలోని కవి పండిత వంశాలవారనుభవించిన ఇనాములలో ఎక్కువ భాగం ఈ "బిజ్జులవారే" దానం చేసినట్లు తెలుస్తున్నది. (శేషప్పంతుల-సం.సా.)

## ఆంధ్ర చింతామణి

కర్త : దేవులపల్లి వేంకట నరసకవి.

వల్లభాచార్యుని వైద్య చింతామణికి ఆంధ్రీకరణం. (ఆం.సం.సా-251)

## ఆకాశ రావణ సంహారము

కర్త : చూ ఉదుటూరి వేంకట కృష్ణకవి.

అంకితం : ఉదయవిలో వెలసిన కోదండరామస్వామికి.

గ్రంథ కర్త ఉదుటూరి వేంగన్నమంత్రి కుమారుడు. కోదూరి వేంకటాచల కవికి అల్లుడు. రాచూరు సంస్థానాధిపతియైన తిరుపతి మాణిక్యారాయని ఆశ్రితుడు. ఈ తిరుపతి రాయని ప్రేరణ చేతనే ఈ గ్రంథం వ్రాసి, కోదండ రామస్వామికి అంకితం చేశాడు. ఈ గ్రంథంలోని అవతారిక పూర్తిగా లభించలేదు. లభించినంత వరకు (కృతి ప్రేరేపకుని వంశావతార వర్ణన భాగం,) అకలంకము కృష్ణకవి వ్రాసిన "ధనుర్విద్యా విలాస" గ్రంథావతారికలోని వర్ణనకు పూర్తి నకలుగా కనిపిస్తుంది. ఈ ధనుర్విద్యా విలాస ప్రబంధ ప్రేరేపకుడు కూడా పై తిరుపతి రాయడే.

పై రెండు గ్రంథాలు ఏక కాలానికి చెందినవి కాబట్టి, ఎత్తి వ్రాసేటప్పుడు ఒక దానిలోని పుటలు ఇంకొక దానిలో కలిసి ఉండవచ్చు.

వేరు లభిస్తున్న ఆకాశరావణ సంహార కావ్య ప్రతిలోయుద్ధకాండ కథా భాగం మాత్రం ఉన్నదట. రావణుడు శత్రు బలాన్ని గురించి చింతిస్తున్న పద్యంతో ఇది ఆరంభమౌతున్నది. ప్రతి శిథిలావస్థలో ఉంది. (ఆం.సం.సా-365)

## ఆర్బత్‌నాట్ దొర ఏ. జె.

కాలం : క్రీ.శ. 19 వ శతాబ్ది పూర్వార్ధం.

పరవస్తు చిన్నయసూరి విరచిత నీతిచంద్రిక గ్రంథానికి ఈయన కృతిభర్త.

ఈయన మద్రాసు ప్రెసిడెన్సీలోని సమస్త విద్యాశాలలకు ముఖ్యాధికారిగా పని చేశారు. మద్రాసు విశ్వవిద్యాలయానికీ, ఫోర్టు సెయింట్ జార్జి కళాశాలకు కార్యదర్శిగా ఉండేవారు. (వ.వా-75-76)

**ఇల్లిస్ యఫ్. డబ్ల్యు.**

కాలం : క్రీ.శ. 1780-1819 ప్రాంతం.

రచనలు : తెలుగు భాషా వ్యాకరణము (ఆంగ్లం) మిరాశీహక్కులు (ఆంగ్లం) న్యాయశాస్త్ర సంబంధమైన లఘు రచనలు (ఆంగ్లం).

పాశ్చాత్య దేశీయుడైనా భారతీయ భాషలను నేర్చుకొని వాటిని గూర్చి ఆంగ్లంలో రచనలు చేశాడు. మద్రాసులో కలెక్టరుగా ఉంటూ దాక్షిణాత్య భాషలను గురించి అధ్యయనం చేశాడు. తెలుగు, తమిళ, కన్నడ, మళయాళ, సంస్కృత భాషలు నేర్చుకొన్నాడు. ఉద్యోగరీత్యా విషయ సేకరణచేసి ఇతడు రచించిన "మిరాశీహక్కులు" అనే గ్రంథం నేటికీ ఆ విషయంలో ప్రమాణ గ్రంథంగా ఉంది. ద్రావిడ భాషలు నాల్గింటికీ వేర్వేరుగా భాషాతత్త్వ గ్రంథాలు వ్రాశాడు. అందులో తెలుగు, మళయాళ భాషలకు సంబంధించిన గ్రంథాలు మాత్రమే లభించాయి.

తెలుగును గురించి ఆంగ్లేయ భాషలో వెల్వడిన గ్రంథాలలో ఇతని రచన మొదటిది, శ్రేష్ఠమైనది కూడా.

ఫోర్టు సెయింటు జార్జి కళాశాలలోని పండితులైన వేదం పట్టాభిరామశాస్త్రిని ప్రోత్సహించి తెలుగులో ధాతుపాఠము తయారు చేయించాడు. తిరుక్కురళ్‌ను తొలుతగా ఆంగ్లంలోనికి అనువదించిన ఘనత ఇతనిదే. దాన్ని తెలుగులో కూడా ద్విపదలో అనువదించాడట. అయితే ఈ రచన అసమగ్రంగానే ఉండి పోయింది. (తె.వి.స-6)

**ఉద్దండ లింగయామాత్యుడు**

కాలం : క్రీ.శ. 18 వ శతాబ్దం.

స్థలం : ప్రాతకోట గ్రామం (కర్నూలు మండలం కావచ్చు).

సాహిత్య పోషకుడు. మల్లయామాత్యుని పుత్రుడు. ఘట్టు ప్రభువుగా పేరొందిన శేషకవిని ప్రోత్సహించి యాజ్ఞవల్క్య చరిత్ర కావ్యంగా వ్రాయించాడు. ఆ గ్రంథం ఇతనికే అంకితమైనదేమో నిర్ధారణగా తెలియదు. ఘట్టు ప్రభువు స్వస్థలం కర్నూలు మండలమని కొందరూ నెల్లూరని కొందరూ అంటున్నారు. ప్రాతకోట నంది కొట్కూరు తాలూకాలో ఉన్నది. (అరుద్ర-12-58)

**ఉపయుక్త గ్రంథకరణ దేశ భాషాసభ**

స్థాపనకాలం : క్రీ.శ. 1820 ప్రాంతం.

తెలుగు పాఠ్య గ్రంథ నిర్మాణానికై ఏర్పడిన సభ. తొలుత శిష్ట వ్యావహారిక భాషలోనే పాఠ్య గ్రంథ రచన జరిగింది. 1848 లో చిన్నయసూరి ఈ సభకు అధ్యక్షుడైన తర్వాత రచనా పద్ధతిలో గ్రాంథికాన్ని ప్రవేశపెట్టాడు.

### ఉపాగ్రంథ దీప (సం)

కర్త : అప్పాశాస్త్రి.

(M.R.T-34)

### ఉమామహేశ్వర సంవాదము

కర్త : నిజానందయోగి.

వేదాంత పరమైన వచన రచన. మూడు ప్రకరణాలు మాత్రం లభించాయి. మూడో ప్రకరణం అసమగ్రంగా ఉంది. రెండో ప్రకరణంలో నిజానందయోగి కృతమని ఉంది. కాగితపు ప్రతి. పార్వతికి శివుడు తత్త్వ విషయాలు చెప్పినట్లుగా ఉంది.

(ఆం.సా.ప.ప-13-34)

### కచ్చి రంగరాజ దండకము

కర్త : తెలియదు.

సమాస భూయిష్ఠంగా, విశేష పద వర్ణనలతో ఉంది. కవి దక్షిణ దేశీయుడు కావచ్చును. 40 పత్రాలున్న ప్రతి కాకినాడలో ఉంది. (ఆం.సా.ప.ప-13-2)

### కటికనేని రామయ కవి

కాలం : క్రీ. శ. 18వ శతాబ్దం కావచ్చు.

రచన : కువలయానంద ప్రకాశము.

సూరన బుచ్చమ్మల పుత్రుడు. సంస్కృతాంధ్రాలలో పండితుడు. అకలంక రంగార్యుని తోడ్పాటుతో పై రచన చేశాడట. ఇతని చాటువులు కొన్ని ప్రచారంలో ఉన్నాయి. (క.చ- 3-169.)

### కనకవల్లి

కర్త : చిల్లరిగె యోగానందకవి.

అంకితం : మంత్రి ప్రెగ్గడ భుజంగరావు గారికి.

నవల. 19వ శతాబ్దం ఉత్తరార్ధంలో రచితమైంది. (కృతిపతిని గూర్చిన వివరాలు సాహిత్య కోశం రెండవ భాగంలో చేర్చడం జరిగింది). (ఆం.సం.సా. 372)

### కన్న శతకము

కర్త : తెలియదు.

గురువు : పిల్లలమర్రి బుచ్చన్న.

135 కంద పద్యాలతో ఉంది. దక్షిణ దేశీయాంధ్ర వాఙ్మయానికి చెందిన రచన కావచ్చును. వేదాంత రహస్య ప్రతిపాదకమైన గ్రంథం. "యెరగుడి కన్నా", "యిన కులకన్నా", "రవికులకన్నా" అనే మకుటాలున్నాయి. కొన్ని పద్యాలు ప్రక్షిప్తాలు కావచ్చును. కర్త గురువిచే బాలాంబ ప్రసాదం పొంది కవిత్వం చెప్ప నేర్చాడట. ఇతని పేరు తర్లయ్యగాని కన్నయ్యగాని కావచ్చునని పండితాభిప్రాయం.

(ఆం.సా.ప.ప-13-3,4)

## కవి కర్ణ రసాయనము (టీక)

కర్త : జూలూరి అప్పయ్యశాస్త్రి.

సంకుసాల నృసింహ కవి రచించిన కావ్యానికిది టీక. సుబోధకమైన వ్యావహారిక భాషలో ఉంది. (తె. సా. విమర్శ-91)

## కస్తూరిరంగ శతకము

కర్తలు : రాయభట్టు వీర రాఘవకవి(17వ శతాబ్దం), వాద్రేవు కామరాజు (19వ శతాబ్దం).

ఈ శతకంలోని మొదటి 75 పద్యాలు వీరరాఘవకవి "శత్రు మద భంగ, నవ ఘన శ్యామలాంగా ; సూరి చిత్తాబ్జ భృంగ కస్తూరి రంగ" అనే మకుటంతో రాశాడట. అనంతర కాలంలో వాద్రేవు కామరాజు అదే మకుటంతో దాన్ని పూర్తి చేశాడు. ఇది పుట 169లో పేర్కొనబడిన కస్తూరి రంగ శతకం కంటె భిన్నమైనది. "రాత్రి చర వైరి కస్తూరి రంగశౌరి" అనే మకుటంతో వ్రాసిన కవి పేరొకరు కావచ్చు. (శ. క.చ-460)

## కాంతాలలామ శతకము

ముద్రణ కాలం : క్రీ. శ. 1903 ప్రాంతం.

కర్త : తెలియదు.

కర్త ప్రాచీనుడే అని పండితులు భావిస్తున్నారు. ఇది పురుష విరహ ప్రధానమైన శతకం. (శ. సా. వి-562)

## కాటమరాజు కథ

కర్త : గంగుల పిన ఎల్లయ.

ద్విపదకావ్యం. ఇది శ్రీనాథుని వచన పద్ధతిని అనుసరించి చెప్పినట్టు కవి చెప్పుకొన్నాడు. శ్రీనాథుడు పల్నాటి వీరచరిత్రవలె కాటమరాజు కథను కూడా చెప్పాడని కొందరు విశ్వసిస్తున్నారు.

నెల్లూరు రాజైన నల్లసిద్ది రాజుకూ కనిగిరి రాజైన యాదవ కాటమ రాజుకూ పుల్లరి విషయమై జరిగిన పోరాటం దీనిలోని ఇతివృత్తం. బట్టు రాయబారము, కోటిపాటి తాటి వృక్షము తెచ్చేకథ, ఎర్రగడ్డపాటి పోట్లాట, అగుమంచి కథ దీనికి సంబంధించిన కథలే. (ద్వి. సా. చ-392)

## కార్తిక మాహాత్మ్యము

కర్త : చూ. వేంకటకవి.

అంకితం : మార్కొండ అదెయామాత్యునికి.

మూడాశ్వాసాల రచన. స్కాంద పురాణంలోని కథ దీనికి ఆధారం. దీని ప్రతి ప్రాచ్యలిఖిత గ్రంథాలయంలో ఉంది. (ఆం. వం. సా-358)

### కార్వేటి వేంకటేశ్వరాష్టకము (అలభ్యం)

కర్త : ఋగ్వేదకవి వెంకటాచలకవి.

కార్వేటి నగరంలోని వెంకటేశ్వరునిపై చెప్పిన అష్టకం. (ఆరుద్ర-12-327)

### కావలి వేంకట రామస్వామి

కాలం : క్రీ.శ. 19 వ శతాబ్ది పూర్వార్ధం.

స్వస్థలం : ఏలూరు.

రచన : Biographical sketches of Deccan poets. (దక్కన్ కవుల చరిత్ర) (ఆంగ్లము).

కర్నల్ కాలిన్ మెకంజీ సేకరించిన చరిత్ర గ్రంథాలు, కైఫీయతులు, శాసనాలను వ్రాయటం కోసం ఉద్యోగులుగా చేరిన కావలి సోదరులలో ముఖ్యుడు. ఇతని సోదరులు వేంకట బొర్రయ్య, వేంకట లక్ష్మయ్య మిక్కిలి సాహిత్య సేవ చేశారు, బొర్రయ్య మరణం తరవాత రామస్వామి మెకంజీ వారవద్ద లేఖకోద్యోగిగా, పండితుడుగా కుదిరి ఆయన చనిపోయే వరకు పని చేశాడు. ఈయన వ్రాసిన గ్రంథం దక్షిణాపథంలో వెలువడిన మొదటి కవుల చరిత్రగా చెప్పవచ్చు. ఈయన ఉద్యోగిగా కలకత్తా, మద్రాసు నగరాలలో పనిచేసి విశేషంగా విషయ సేకరణ చేశాడు.

ఈయన తన గ్రంథాన్ని అప్పటి భారత దేశ గవర్నర్-జనరల్ అయిన లార్డు విలియమ్ బెంటింక్ (1828-35)కు అంకితం చేశాడు. ఆంగ్లంలో కవుల చరిత్ర వ్రాసిన తెలుగువారిలో ఈయన తొలి స్మరణీయుడు. (తె.సా.విమర్శ-85-88)

### కిమ్మూరి జగన్నాథ రాజు

కవి పోషకుడు. అమలాపురపు సన్యాసి కవి చేత సర్వాంధ్ర సార సంగ్రహమనే నిఘంటువును రచింప జేశాడు. (శ.క.చ-750)

### కుమ్మరి గుండయ్య కథ

కర్త : అమలాపురపు సన్యాసికవి.

మూడాశ్వాసాల ప్రబంధం. అరువది ముగ్గురు నాయనార్లలో ఒకడైన తిరు నీలకంఠ నాయనారు చరిత్ర ఇది. రచన సంతృప్తికరంగా ఉంది. (శ. క. చ-750)

### కూచిమంచి సుబ్బారావు

కాలం : క్రీ. శ. 18 వ శతాబ్ది ఉత్తరార్ధం.

స్థలం : పిఠాపుర సంస్థానం.

రచనలు : 1. రాణీజగ్గమాంబారావు జీవితచరిత్ర 2. రాణీ రమణయ్యాంబా జీవిత చరిత్ర 3. హిందీ-తెలుగు నిఘంటువు.

వీరు సుప్రసిద్ధ కవివంశమైన కూచిమంచి కుటుంబానికి చెందినవారు. రాణీ రామయ్యమ్మారావు బహద్దరువారి సంస్థానాన్ని అలంకరించారు. జీవిత చరిత్రల వ్రాయుటలో నేర్పు కలవారు. (ఆం. సం. సా-113)

## కృష్ణ నాటకము

కర్త : శిర్నీడు వేంకటరాయకవి.

యక్షగాన నాటకం. (వి. యు. 206)

## కృష్ణలీలా తరంగము

కర్త : రావూరి సంజీవరాయకవి.

## కృష్ణానదీ మాహాత్మ్యము

కర్త : చూ. తాతంభట్టు గురుమూర్తిశాస్త్రి.

అంకితం : ముక్త్యేశ్వరపురంలో వెలసిన భవానీ ముక్తీశ్వరస్వామికి.

మూడాశ్వాసాల పద్యకావ్యం. కృష్ణానదీ మాహాత్మ్యం ఈ కావ్యంలోని ఇతివృత్తం.

ముక్త్యాలప్రభువైన రాజా వాసిరెడ్డి చినవేంకటాద్రి (1787-1828) కోరికపై కవి ఈ కావ్యం వ్రాశాడు. ముక్త్యాల రాజాగారి పుస్తకాలయంలో ఉన్న జీర్ణతాళపత్రప్రతి ఆధారంతో, ముక్త్యాలవారి స్వకీయ మహిష్మతీ ముద్రాలయంలో ఈ కావ్యం ముద్రితం. కృతిప్రేరేపకుని ప్రపౌత్రుడైన రాజా వాసిరెడ్డి చంద్రమౌళీశ్వర ప్రసాద బహద్దరుగారే దీన్ని ప్రచురించారు. (అం. సం. సా-333)

## కొండపర్తి శాసనము

కాలం : క్రీ. శ. 9 వ శతాబ్దం.

స్థలం : వరంగల్లు సమీపంలోని కొండపర్రు చెరువులోని కొండరాయి.

శాసన రచయిత : కమ్మరి నాగయ.

శాసన ప్రసక్తుడు : ప్రావకుల భీమయ (సేద్యకాడు).

శాసనవిషయం : సేద్యభూమిని సమభాగం పాలుపంచుకొనే విషయానికి కట్టడి ఏర్పాటు చేస్తూ తాంబూలం పుచ్చుకోవటం దీనిలోని ఆసక్తికరమైన విషయం. వివాహాది శుభకార్యాల విషయంలోవలె సేద్యభూమిని కౌలుకు ఇచ్చేటప్పుడు కూడా తాంబూలం ఇచ్చి పుచ్చుకోవటం పూర్వం ఉండేది. తాంబూలం పుచ్చుకోవటమంటే నిర్ణయానికి కట్టుబడి ఉండటం.

ఆకాలంలో వివాహాది శుభసమయాలలో అవసరమైన భజంత్రీలవారు, పల్లకీలు మోసేవారు, వంటవారుకూడా ఆయా పనులను తప్పక చేయవలెననే నిర్ణయం తీసుకున్నపుడు తాంబూలాలు పుచ్చుకోవటం ఉండేదట.

ప్రతి ముఖ్యమైన కట్టుబాటుకు ఇద్దరు, లేక అంతకుమించి ఎక్కువమంది పరస్పరం ఒప్పందం మీద చేసుకొనే నిర్ణయాలకు తాంబూలస్వీకరణం అతిముఖ్యమైన సాంఘికాచారంగా ఉండేదని ఈశాసనంవల్ల తెలుస్తున్నది. సాక్షులుకూడా తాంబూలాలను తీసుకొనేవారు. భూమిలో సేద్యానికి దిగేముందు సేద్యకాడు కొంతసొమ్మును భూస్వామికి

చెల్లించాలని, పంట వచ్చినతరువాత కొంతసొమ్ము చెల్లించాలని ఈ శాసనం తెలుపుతున్నది. (తె. శా-వ. శా-45, 46, 47)

## కొప్పు లింగేశ్వర శతకము

కర్త : పూచిమంచి సోమసుందరకవి.

చూ. శ్రీ కొప్పు లింగేశ్వర శతకము.

## కొరవి శాసనము

కాలం : క్రీ. శ. 935 ప్రాంతం.

స్థలం : వరంగల్లు జిల్లా మానుకోట (మహబూబాబాద్) తాలూకా కొరవి గ్రామంలోని వీరభద్రేశ్వరుని ఆలయంలోని శాసనస్తంభం.

శాసన ప్రదాతలు : ముదిగొండ చాళుక్యరాజులయిన గొణగయ్య, నిరవద్యుడు.

ప్రస్తావిత వ్యక్తులు: చాళుక్యభీముడు (వేంగి), రాష్ట్రకూటరాజు కృష్ణుడు, రెండో అరికేసరి, యుద్ధమల్లుడు, రాష్ట్రకూట గోవిందుడు, మూడో అమోఘవర్షుడు మొదలయినవారు.

శాసన విషయం : వేంగి - ముదిగొండ చాళుక్యలు ఉమ్మడిగా రాష్ట్రకూట రాజులను ఎదుర్కొని ఓడించటం-కుసుమాయుధుడు వేంగిచాళుక్య రాజైన భీముని పట్టాభిషిక్తునిచేయటం - కుసుమాయుధుని తరవాత అతని కుమారులు గొణగయ్య, నిరవద్యుడు రాజ్యంచేయటం, చాళుక్య ఇమ్మడిభీముని ప్రాపుతో నిరవద్యుడు అధికారాన్ని పొందటం మొదలైన విషయాలు.

ముదిగొండ చాళుక్యరాజులు ధరించే ఒక ఆసక్తికరమయిన కంఠాభరణం విషయం దీనిలో ప్రసక్తం. కుసుమాయుధుని పూర్వులయిన బాదామీ చాళుక్యరాజా రణమర్దుడు మెడలో "రణమర్ద కంఠియ" అనే ఆభరణాన్ని రాజ్యాధికార సూచకంగా ధరించేవాడని, ఆ వంశంలోనివారందరూ రాజలాంఛనంగా అదే కంఠియను మెడలో వేసుకొనేవారని తెలుస్తున్నది.

కొరవి శాసన ప్రసక్తుడయిన కుసుమాయుధుడు రణభూమిలో చనిపోగా, మృతదేహం శత్రువులవశం కాకముందే అతని శరస్సును, అతడు ధరించిన "రణమర్ద కంఠియ"ను కుసుమాయుధుని పెద్దకుమారుడయిన గొణగయ్య కాపాడిన విషయాన్ని ఈ శాసనం చెబుతుంది.

రాష్ట్రకూట గోవిందుని ధాటికి ఆగలేక గొణగయ్య పారిపోయి వేములవాడ చాళుక్యరాజైన రెండో అరికేసరి శరణుజొచ్చాడు వేంగిలో యుద్ధమల్లుడుపోయి రెండో చాళుక్యభీముడు, రాష్ట్రకూట రాజ్యంలో గోవిందుడు చనిపోయి మూడో అమోఘవర్షుడు రాజు అయిన తరుణంలో, కుసుమాయుధుని రెండో కుమారుడైన నిరవద్యుడు వేంగిరాజు ఇమ్మడి భీముని సహాయంతో ముదిగొండ రాజ్యానికి రాజయిన తరవాత ఈ కొరవిశాసనం

రెండో భాగం ప్రారంభమవుతున్నది. నిరవద్యుడు ఈ చిన్నరాజ్యాన్ని దక్కించుకొని తన అధికారాన్ని స్థాపించుకొన్న విషయం ఈ శాసనం రెండో భాగంవల్ల తెలుస్తున్నది.

ఈ శాసన విషయం అసమగ్రంగా ఉంది. దీని నుండి ఆనాటి వివిధ సాంఘికాచారాలు, నేరాలు, శిక్షలు, అపరాధ సుంకాలు తెలియవస్తున్నాయి.

(తె.శా.ప.శా.-48 నుంచి 70 వరకు)

## క్రిసెంట్ (పత్రిక)

ప్రచురణ కాలం : క్రీ. శ. 1844 ప్రాంతం.
స్థలం : మద్రాసు.
నిర్వాహకుడు : గాజుల లక్ష్మీనరసింహసెట్టి.
సంపాదకుడు : హార్లీ దొర.

ఇది ఆంగ్ల పత్రిక. దేశీయుల అభివృద్ధికి, మత విషయాల ప్రచారానికీ ఈ పత్రిక కృషిచేసింది. రాజకీయోద్యోగుల అక్రమాలను నిశితంగా విమర్శించింది. అప్పటి ప్రభుత్వం వారికి ఈ పత్రిక కంటగింపైనందున ప్రభుత్వం ఎట్టిధనసహాయం చేయలేదు. రాజకీయ సంస్కరణలకోసం ఈ పత్రిక పాటుపడింది. నిర్వాహకుడు ఎన్నో కష్టాల కోర్చి ఈ పత్రికను నడిపాడు. (వీరేశలింగం పంతులు-సమగ్రపరిశీలన-182)

## గన్నయ

బిరుదు - రాయ సాహత్తిమల్ల.

శాలిహోత్ర కృతిపతి. మల్లయామాత్య భీమాంబల పుత్రుడు. కొంకణపతి. ఇతను కాకతి రాజుల దగ్గర ఉండేవాడనీ, పినమల్లదేవుని తనయుడనీ పండితాభిప్రాయం.

(క-త-5-267)

## గయోపాఖ్యానము

నామాంతరం : కృష్ణార్జున సంవాదము (చూ).
కర్త : నాదెండ్ల గోపమంత్రి.

## గరిమెళ్ళ వెంకయ్య

కాలం : క్రీ, శ. 19 వ శతాబ్ది పూర్వార్ధం.
రచన : దశావతార చరిత్ర వ్యాఖ్య.

ఈయన తెలుగు భాషకు విశేషమైన సేవచేసిన బ్రౌన్ దొరకు సమకాలికుడు. ఆయన ఆస్థాన పండితులలో ఒకడు. (తె.సా.విమర్శ-91)

## గొట్టి సాంబమూర్తి శాస్త్రి

కాలం : క్రీ. శ. 18వ శతాబ్దం ఉత్తరార్ధం-19వ శతాబ్దం ప్రారంభం.
స్థలం : మేరంగి సంస్థానం.
రచనలు : తెలియవు.

ఈయన షడిమింటి సర్వమంగళేశ్వరశాస్త్రికి బాల్య స్నేహితుడు. మేరంగి

సంస్థానాధీశ్వరులితన్ని విశేషంగా సన్మానించి నాగావళి నదీ ప్రాంతంలో ఒక గ్రామాన్ని అగ్రహారంగా ఇచ్చారట ఇప్పటికీ ఇది "సాంబన్న వలస"గా పిలువబడుతున్నది.
(ఆం. సం. సా_358)

## గోడగి త్రిపురారి

కాలం : క్రీ. శ. 13వ శతాబ్దం.
అంకితం : అనుభవసారము
గురువు : గురులింగము.

శైవాచార్యుడు. పాల్కురికి సోమనాథుడు వ్రాసిన "అనుభవసారం" గ్రంథానికి కృతిపతి. ఈ త్రిపురారికీ, పాల్కురికి సోమనాథునికి కూడా "గురులింగమే" గురువని బాగంటి శేషయ్య వ్రాశారు. ఈ విషయంలో పండితుల మధ్య వివాదాలున్నాయి.
(ర. త_91,92)

## గోపాలపేట

నేటి మహబూబ్‌నగర్ మండలంలోని చిన్న సంస్థానం. "వనపర్తి"కి అత్యంత సమీపంలో ఉంటుంది. "జనుంపల్లి" వారు దీని ప్రభువులు.

ఇది మొదట "వనపర్తి" సంస్థానంలోని భాగమే. వారిలోనుండి చీలిన వారే ఈ సంస్థాన పాలకులుగా స్థిరపడ్డారు. వనపర్తి పాలకులలో ఒకరైన "అష్టభాషా బహిరీ గోపాలరావు" కుమారుడైన నవై "వెంకటరెడ్డి" చంద్రపేట ఈ "గోపాలపేట"ను నిర్మించాడు. అనంతర కాలంలో ఇది ప్రత్యేక సంస్థానంగా స్థిరపడింది.

ఈ సంస్థాన పాలకులు సాహితీ ప్రియులు. వల్లా నరసింగ శాస్త్రి, ఒక్కపట్టణం రాఘవాచార్యులు, కేశవపంతుల సింగయ్య సిద్ధాంతి మొదలగు పెక్కు కవి పండితులు ఈ సంస్థానంచేత పోషింపబడినా. .

ఒక్కపట్టణం రాఘవాచార్యులు వ్యాకరణ శాస్త్రంలో ఉద్దండ పండితుడు. ఇతని కుమారుడు రామచంద్రాచార్యులు శతావధాని. అనంత రామాయణాది బహుగ్రంథ కర్త. శతాధిక రచనలు చేశాడని ప్రతీతి. ఇతని తమ్ముడైన శ్రీరంగాచార్యులు సంగీత సాహిత్యవేత్త.

గోపాలపేట సంస్థానపు "రాణీ రంగనాయకమ్మ" గారు జంధ్యాల సుబ్రహ్మణ్య శాస్త్రి ప్రముఖులను సత్కరించడమే గాక, "కేసంపేట" తిరునాళ్ళలో విద్వత్కవి గాయక సన్మానాలు యథోచితంగా జరిపించిన వదాన్యురాలు.
(కేశవపంతుల_ఆం. సం. సా.)

## గోవింద దీక్షితుడు

కాలం : క్రీ. శ. 16వ శతాబ్దం.
స్థలం : తంజావూరు.
రచనలు : సంగీత సుధానిధి, సాహిత్య సుధ మొదలగునవి.

గొప్ప విద్వాంసుడు. తంజావూరును పాలించిన అచ్యుత నాయక, రఘునాథ

నాయకులకు మంత్రిగా, దండనాథునిగా, హితవరిగా ప్రఖ్యాతుడు. ఇతని పుత్రులు–వేంకట మఖి, యజ్ఞనారాయణ దీక్షితుడు నాటి రాజాస్థానాలలో గౌరవాదరాలు పొందారు. ఇతనిని నాయకరాజులు మిక్కిలి మన్నించే వారనీ, ఇతడు చేసిన యజ్ఞయాగాదులకు దక్షిణలు వారే ఇచ్చారనీ తెలుస్తున్నది.

**గ్రాంజెస్ ఎ. డి.**

కాలం : క్రీ. శ. 19వ శతాబ్దం పూర్వార్థం.

స్థలం : వంగదేశం–శ్రీరామపురం.

రచన : దేవునియొక్క సువార్తలు.

ఇతడు మార్కు, మత్తయి, లూకా సువార్తలను జిక్రాన్, ఆనందరాయర్ల సహాయంతో, గ్రీకు భాష నుండి తెలుగులోకి అనువదించాడు. (వ. వా–52)

**జనాశ్రయ ఛందో విచ్ఛిత్తి**

కర్త : నిర్ధారణగా తెలియదు (గణస్వామి కావచ్చు).

కాలం : క్రీ. శ. 5, 6 శతాబ్దాలు.

సంస్కృత ఛందశ్శాస్త్ర గ్రంథం. ప్రతి అసమగ్రంగా లభించింది. విష్ణుకుండిన రాజులలో నాలుగవ మాధవవర్మకు జనాశ్రయ బిరుదం ఉంది. ఈ గ్రంథం అతని పేర రచింప బడినదని కొందరు భావిస్తున్నారు. ఆరవ శతాబ్దికి పూర్వమున్న కవుల ప్రసక్తి మాత్రం ఉంది. ఆ కాలంలో వాడుకలో ఉన్న వివిధ గద్య పద్యాలకు ఇందులో నియమాలున్నాయి. ఐదవ అధ్యాయంలో పేర్కొన బడిన "శీర్షిక" అనే ఒక పద్య భేదం తెలుగు సీస పద్యానికి దగ్గరగా ఉంది. శీర్షికయే సీసంగా పరిణమించిందనీ, సీస పద్యానికే కవి లక్షణాలు చెప్పి 'శీర్షిక'గా పేర్కొన్నాడనీ వాదాలున్నాయి.

(ఆం. సాం. చ–241; శాస్త్రి.బి.యన్.)

**తర్కసారము**

కర్త : వేపులపల్లి కృష్ణశాస్త్రి.

న్యాయశాస్త్ర గ్రంథం.

**తాతంభట్టు గురుమూర్తి శాస్త్రి**

కాలం : క్రీ. శ. 18వ శతాబ్దం చివర.

స్థలం : నందిగామ తాలూకా–ఏటూరు గ్రామం.

రచన : కృష్ణానదీ మాహాత్మ్యము.

ఇతడు "ముక్త్యాల" సంస్థాన పాలకుడైన రాజా వాసిరెడ్డి చిన వెంకటాద్రి (క్రీ. శ. 1787–1828) ఆస్థానంలోనివాడు. ఈ ప్రభువుచేత "చింతలపాడు" గ్రామంలో ఈనాములు పొంది, సన్మానితుడైనాడు. ఇతని ఇతర రచనలేవీ ప్రస్తుతం లభించడంలేదు.

(ఆం. సం. సా–353)

**తిన్నెవెల్లి శాసనము**

కాలం : క్రీ. శ. 1657 ప్రాంతం.
స్థలం : తిన్నెవల్లి (మధుర మండలం).
శాసనకర్త : రంగకృష్ణ ముత్తు వీరప్ప నాయకుడు.

విషయం : చొక్కనాథ నాయకుని పుత్రుడూ తిరుమల నాయకుని పౌత్రుడూ మధుర పాలకుడూ అయిన రంగ కృష్ణ ముత్తు వీరప్ప శా. శ 1579 (హేవిళంబి)లో తిరుమల సముద్రం, పదుక్కలమ్ గ్రామాలలోని కొంత భూమిని ఒక బ్రాహ్మణునికి దానమివ్వడం. N M. (S. c. p. No. 52)

**తుమ్మలపాటి సుబ్బరాయ శెట్టి**

మధురరాజైన విజయరంగ చొక్కనాథుని ఆశ్రితుడు. వేంకటసామిశెట్టి, కృష్ణమాంబల పుత్రుడు.

సాహిత్యపోషకుడు. శ్యామరాయకవి రచించిన వచనరామాయణం అంకితం పొందాడు. ఇతడు దానశీలియట, తామ్రపర్ణీతీరంలో అన్నసత్రాలు నెలకొల్పినట్లు రామాయణ గద్యనుండి తెలుస్తున్నది. (ఎ. దే. వా-393)

**తుళ సింగసెట్టి**

కాలం : చూ. శిష్టు కృష్ణమూర్తి శాస్త్రి.
స్థలం : కాకినాడ.

సాహిత్యాభిమాని. గోదావరీమండల కరగ్రాహి (శిరస్తాదారు) గా ఉండేవాడు. శిష్టు కృష్ణమూర్తిశాస్త్రిని ఆదరించి అతనిచేత "శ్రీ సీతికాస్త్ర" మనే వ్యాఖ్యానరచన చేయించాడు. తర్వాత అతని "పీఠారణ్య మహాత్మ్యము" కృతిపొందాడు. (క. చ. 3 - 229)

**తెలుగుభాషా వ్యాకరణము (ఆంగ్లం)**

కర్త : ఇల్లిస్. ఎఫ్. డబ్ల్యు.
రచనాకాలం : క్రీ. శ. 1818.

తెలుగుభాషను గురించి ఆంగ్లంలో వెలువడ్డ గ్రంథాలలో మొదటిది. తెలుగు సంస్కృత జన్యంకాదనీ, ద్రావిడభాషాకుటుంబంలోనిదనీ ఈ గ్రంథం నిరూపిస్తున్నది. ఈ వాదాన్ని సమర్థించిన కాల్డ్వెల్ 1814 లో జన్మించాడు. అప్పటికే ఇల్లిస్ ఆ వాదాన్ని ప్రతిష్ఠించాడు. ఈ వాదాన్ని నిరూపించడంకోసం తెలుగులో ధాతుపాఠాన్ని తయారు చేయడం జరిగింది. (తె. వి. వ-8)

**దక్కన్ కవుల చరిత్ర (1820)**

(Biographical sketches of Deccan Poets)

కర్త : కావలి వేంకట రామస్వామి.
అంకితం : విలియమ్ బెంటింక్ ప్రభువుకు.

ఆంగ్లగ్రంథం. ఇది దక్షిణాపథంలో వెలువడిన తొలి కవుల చరిత్ర. కాబట్టి దీనికి విశిష్టస్థానముంది. చారిత్రకసాధన సంపత్తి విశేషంగా దొరకనికాలంలో సాహసోపేతంగా విరచితమైన గ్రంథమిది.

దీనిలో ఆంధ్ర, సంస్కృత, తమిళ, కన్నడ, మహారాష్ట్ర, ఘూర్జర భాషలకు చెందిన 108 మంది కవుల జీవితచరిత్రలున్నాయి. శంకరాచార్యులతో ప్రారంభమై, వేంకటబొర్రయ్యతో ఈ గ్రంథం ముగుస్తుంది. శ్రీకృష్ణదేవరాయలు, అల్లసానిపెద్దన, భట్టుమూర్తి, మొల్ల మొ॥వారి చరిత్రలు విస్తరంగా ఉన్నాయి. మెకంజీతోకలిసి దేశంలో తిరిగినప్పుడు దొరికిన సామగ్రితో కవి దీనిని వ్రాసిఉంటాడు.

దీనిపీఠికలో రచయిత విమర్శక హృదయం కనిపిస్తుంది. కవిత్వాన్ని గురించిన ప్రాచ్య-పాశ్చాత్య మతాలు దీనిలో చర్చకువచ్చాయి. రామస్వామి ఆంగ్లభాషాపాండిత్యానికి ఇది నిదర్శనం. కావ్యాలలోని ఘట్టాలను ఆంగ్లంలోకి అనువదించి, వాటిలోని సొగసులను ఆంగ్లభాషాభిజ్ఞులకు చక్కగా చూపాడు. (తె సా. విమర్శ-86)

## దేవులపల్లి కృష్ణశాస్త్రి

కాలం : క్రీ. శ. 18 వ శతాబ్దం.
స్థలం : పిఠాపురం.
రచనలు : విశ్వగుణాదర్శవ్యాఖ్య, తర్కసారము, సాహితీసారము.

రామశర్మ తమ్ముని కుమారుడు. విద్వత్కవి. (ఆం. సం. సా. 261)

## దేవులపల్లి వేంకట నరసకవి

రచన : ఆంధ్ర చింతామణి.

శ్రీనివాసమంత్రి పుత్రుడు. ఈకవి పిఠాపుర సంస్థాన కవులకంటె భిన్నుడు.

## ధనుర్విద్యా విలాసము

కర్త : అకలంక కృష్ణకవి కావచ్చును.

పద్య గ్రంథం. దివ్యాస్త్ర మంత్రతంత్ర ప్రయోగాలను గూర్చిన వివరణలున్నాయి. దీన్ని తుని రాజా వారు ప్రకటించారు. ప్రతులు నేడు అలభ్యం. వేటూరి వారి పీఠికతో ముద్రితమైన ధనుశ్శాస్త్ర గ్రంథం కంటె ఇది విపులంగా ఉన్నదట. కృష్ణా నేని వారి ప్రేరణతో వచ్చిన రెండు గ్రంథాలలో ఇది ఒకటి కావచ్చును. (చూ. పుటలు 237, 401) ఈ గ్రంథాలు రెండూ వేరువేరో కాదో కృతికర్త, కృతి ప్రేరకులు, భిన్నులో కాదో నిర్ధారితం కాలేదు. (ఆం.సా.ప.ప. 38-4,6)

## నవగ్రహ స్తోత్రములు (అలభ్యం)

కర్త : గౌరన.

నవగ్రహ స్తవము, ఇదీ, ఒకటే అని కొందరి అభిప్రాయం.

## నాట్యప్రదీపనము

కర్త : శిర్నీడు వేంకటరాయకవి.

శాస్త్ర గ్రంథం. రచన సుబోధకంగా ఉంది. (వీ.యు-200)

**పుణ్యకుమారుని తిప్పలూరి శాసనము**

కాలం : క్రీ. శ. 630 ప్రాంతం.
స్థలం : కడప జిల్లా, కమలాపురం తాలూకాలోని తిప్పలూరు గ్రామం.
శాసన ప్రదాత : చామణకాలు అనే ఉద్యోగి.

శాసన విషయం : ఎరికల్ ముతురాజు పుత్రుడైన పుణ్య కుమారుడు రేనాడును ఏలేటప్పుడు వేయించిన దాన శాసనం. ఈ శాసనంలో క్రియ లేకుండా వాక్యం ముగిసింది. దీని రచనాకాలం నాటికి తెలుగు వాక్య రచన సరిగా రూపొందలేదు. కొన్ని పదాలకు సరిగా అర్థం తెలియకపోవటమే గాక వాక్యాలలో కర్త, కర్మ, క్రియ పదాలను తెలిపే పదాలు కూడా స్పష్టంగా లేవు.

(తె.శా- ప.శా- 21-24)

**పుల్లయ కవి**

కాలం : క్రీ. శ. 19 వ శతాబ్దికి పూర్వం.
రచన : బ్రహ్మోత్తర ఖండము.

ఇతని రచనలో లక్షణవిరుద్ధ ప్రయోగాలుండటం వలన చిన్నయసూరి ఇతని మూడు ప్రయోగాలను మాత్రమే తన నిఘంటువులో చెప్పాడట. చాటుకవిగా పేర్గొను బడ్డ పుల్లకవి ఇతడేనా అన్నది నిర్ధారణ కాలేదు (ఆం.సా.ప.ప, 40-34)

**ప్రాయశ్చిత్త దీపికా (సం)**

కర్త : అప్పాశాస్త్రి.

(M.R.T-34)

**బేతాళ పంచ వింశతి**

కర్త : తెలియదు

ద్విపద కావ్యం. అసమగ్రంగా లభించింది. తొమ్మిది కథలు మాత్రం సంపూర్ణంగా ఉన్నాయి. దీని ప్రతి తంజావూరులో ఉంది. (ద్వి.సా.చ-481)

**బేతాళ పంచ వింశతి కథలు**

కర్త : తెలియదు.
తొలిముద్రణ : క్రీ. శ. 1848.

ఇది కథాసరిత్సాగరానికి అనువాదం, వాడుక భాషలో ఉంది. ఎక్కువ వ్యాప్తిపొంది అనేక ముద్రణలు పొందింది. (వ,వా-82)

**మందపాటి వారు**

ఒంగోలు సంస్థాన పాలకులు. విజయనగర సామ్రాజ్యకాలంనుంచి, క్రీ. శ. 18వ శతాబ్దం వరకు ఒంగోలును పాలించారు.

మందపాటి అయ్యపరాజు, వీరికి మూలపురుషుడు. "కొణిజేడు" వీరికి మొదటి రాజధానిగా ఉండేదట. ఆ తరువాత క్రీ. శ. 1706 ప్రాంతంలో "ఒంగోలు" రాజధాని అయింది.

"తెట్టు" సంస్థాన పాలకులయిన "వేజెళ్ళ" వారికి, ఈ మందపాటివారితో బాంధవ్యం ఉండేనట.

మందపాటివారి సంస్థానం అటు వేంకటగిరి రాజులకు, ఇటుకొండవీటిరాజులకు పక్కలో బల్లెంగా ఉండేది. అందువల్ల పై రెండు రాజ్యాల వత్తిడి వీరిపై ఎక్కువగా ఉండేది. ఈ కారణంచేత సంస్థానం క్రమంగా క్షీణించి పోయింది. 18వ శతాబ్దానికి చెందిన రామచంద్ర, రామభద్రరాజులు ఒంగోలు రాజన్యులలో ప్రముఖులు.

వేంకట రామరాజు (1792-1806), శాశ్వతకర నిర్ణయం నాటి ప్రభువు. ఇతని కాలంలోనే సంస్థానం కుంఫిణీ వారి వశమై పోయింది. వేంకటరామరాజు, రామచంద్రరాజు (1806-1816), కృష్ణమరాజు, వేంకట నరసింహరాజు (1822-1842)లో పింఛను దారులుగా ఉన్నారు. ఆ తరువాత వీరికి వారసులున్నప్పటికి, కుంఫిణీవారు లవణును నిలిపివేశారు.

ఈ పాలకులు సాహిత్యాభిమానులు. వీరి విద్యాభిమానం, క్షాత్రశక్తి ఇప్పటికినీ ఆ ప్రాంతాల్లో పాటల రూపంలో నిలిచి ఉన్నాయి. మందపాటి రామరాజు, నారాయణ రాజులు కవి పండితాభిమానులు. ఇంచిమంచి జగ్గకవి తన "సోమదేవ రాజీయాన్ని" ఈ నారాయణరాజు ప్రేరణ చేతనే వ్రాశాడట. రాజువారిపాలెం వాస్తవ్యులైన నరసింహ రాజు, వారి తండ్రి తాతలు, కూడా పండిత పోషకులు, అక్కిరాజు రామచంద్రరాజు ఈ నరసింహరాజు ప్రేరణచేతనే "రామచంద్ర విజయ" నాటకాన్ని వ్రాశాడట.

(ఆం. సం. సా-576-579)

మందసా

కళింగసీమలోని పురాతన సంస్థానాలలో ఇది ఒకటి. మందసావారి కోవలో జగన్నాథ రాజమణి రాజదేవు ప్రముఖుడు. అతని తరువాత వాసుదేవ రాజమణి రాజదేవు, శ్రీనివాస రాజదేవులు, రత్నమాలా రాణిగారు రాజ్యం పాలించారు.

మందసా పాలకులు విద్వత్పక్షపాతులేగాక, స్వయంగా విద్వాంసులూ, కృతికర్తలు కూడ. జగన్నాథ రాజమణి రాజదేవు సి. ఐ. ఇ. బిరుదాంకితుడు. కవి పండితాభిమాని. వాసుదేవ రాజమణి రాజదేవు, ప్రసిద్ధ పండితులైన ముడుంబి రాఘవాచార్యులు, నరసింహాచార్యులకు వార్షికాలిచ్చి గౌరవించాడు. శ్రీనివాస రాజమణి రాజదేవు, పెళ్ళపిళ్ళ వారిని గౌరవించి ప్రశంసా పాత్రుడైనాడు. గోమఠం శ్రీనివాసాచార్యులు, కణితి భాస్కరము వంటి ప్రముఖులు ఈ రాజుకు ఆశ్రితులు. శ్రీనివాసాచార్యుల "కమలావ హరణము", వేమూరి జగన్నాథశర్మ "బాల దేవీ భాగవతము" ఈ రాజాగారికి అంకితం.

వల్లవరాయ శతకమను నామాంతరం కల "భాస్కరమూర్తి శతకము",

"పెంకె పంతులు"-వంటి కొన్ని రచనలను ఈ సంస్థానం సారస్వత లోకానికి అందించింది. (ఆం.సం.సా-579, 580)

## మదాను వేంకయ్య

కాలం : క్రీ.శ. 18 వ శతాబ్దం కావచ్చు.

రచన : కామమ్మ కథ.

జానపద గేయ రచయితగా ప్రఖ్యాతుడు. (జా.గే.వా.)

## ముక్తి కాంతా విలాసము

కర్త : కాటమరాజు వేంకట యోగి.

యక్షగానం. (య.వా.చ.)

## రాజా వాసిరెడ్డి చినవేంకటాద్రి

కాలం : క్రీ. శ. 1787-1828.

స్థలం : ముక్త్యాల (సంస్థానం).

ముక్త్యాల సంస్థాన పాలకుడు. ముక్త్యాల దుర్గ నిర్మాత అయిన రామలింగన్న (1745-1763) కు పౌత్రుడు. వాసిరెడ్డి జగ్గన్నపాలెకి కుమారుడు. సాహిత్యాభిమాని. కవి పండిత పోషకుడు. కాశింభట్టు గురుమూర్తిశాస్త్రి ప్రోత్సహించి "కృష్ణానదీ మహాత్మ్య" కావ్య రచనకు కారకుడైనాడు. (ఆం.సం.సా-332,333)

## విశ్వగుణాదర్శ వ్యాఖ్య

కర్త : దేవులపల్లి కృష్ణశాస్త్రి.

## వెల్లంగుడి శాసనము

కాలం : క్రీ.శ. 1613 ప్రాంతం.

స్థలం : మధుర మండలం.

శాసన విషయం : విజయనగర సామ్రాజ్యాన్ని వీరవేంకటపతిరాయలు పాలిస్తున్న కాలంలో తిమ్మరసు కుమారుడు వెంకటాద్రిభట్టు వెల్లంగుడి (వీరభూపాలసముద్రం)లోని ఆలయంలో, కామేశ్వరి, కృష్ణవిగ్రహాలను ప్రతిష్ఠించి పూజాదికాల నిమిత్తం కొంతభూమిని దానంచేయడం. ఈ భూమిని వెంకటాద్రిభట్టు అప్పటి మధుర పాలకుడైన వీరప్ప నాయకుని నుండి సంపాదించినట్టుగా ఉంది. (N.M-350)

## శ్రీమద్వేమనారాధ్య చరిత్రము

చూ. వేమనారాధ్య చరితము.

కర్త : ములుగు పాపయారాధ్యులు.

## సాహిత్య సుధ (సం)

కర్త : గోవింద దీక్షితుడు.

ఈ రచననుండి సమకాలీన విషయాలు తెలుస్తున్నాయి. తంజావూరు నాయకరాజు రఘునాథనాయకుని రచనలను ఈ గ్రంథం పేర్కొన్నది.

## సాహితీ దర్పణము

కర్త : దేవులపల్లి రామశాస్త్రి.

అలంకారగ్రంథం. కర్త సాహిత్యచక్రవర్తి బిరుదాంచితుడు సుధీచంద్రికను. కూడా రచించాడు. (ఆం. సం. సా-251)

## సాహితీ సారము

రచనాకాలం : క్రీ. శ. 18 వ శతాబ్దం.

ఇందులో న్యాయ, కావ్య, రస దోష గుణ శబ్దాలంకార అర్థాలంకారాలనే ఏడు ప్రకరణాలున్నవి. క్రీ. శ. 1798 లో మంత్రిప్రెగ్గడ కామరాజుచే లిఖితమైన వ్రాతప్రతి ఆంధ్ర విశ్వకళా పరిషత్తులో ఉంది. (ఆం. సం. సా. 251)

# ఉపయుక్త గ్రంథాలు

## సంకేత సూచి


1. అప్పకవీయము : అప్పకవీయము-వావిళ్ళ
రావూరి దొరస్వామిశర్మ (ప్రథమ ముద్రణ-1987)

2. అ. భా. క. అఖిలభారత కవయిత్రులు
ఊటుకూరు లక్ష్మీకాంతమ్మ (1965)

3. అష్టదిగ్గజములు : అష్టదిగ్గజములు

4. ఆం. కవ : ఆంధ్ర కవయిత్రులు-ఊటుకూరి లక్ష్మీకాన్తమ్మ
(ప్రథమ ముద్రణ (1958)

5. ఆం. చ-సం. : ఆంధ్రుల చరిత్ర-సంస్కృతి
ఆచార్య ఖండవల్లి లక్ష్మీరంజనం
ఆచార్య ఖండవల్లి బాలేందు శేఖరం
(నాలుగవ ముద్రణ-1974)

6. ఆం. ప్ర.-ఆ. వి : ఆంధ్ర ప్రబంధములు-అవతరణ వికాసములు
ఆచార్య కాకర్ల వేంకట రామ నరసింహము
(ప్రథమ ముద్రణ-1984)

7. ఆం. ర : ఆంధ్ర రచయితలు
మధునాపంతుల సత్యనారాయణ మూర్తి
(రెండవ ముద్రణ-1973)

8. ఆం. స : ఆంధ్ర సర్వస్వము
ఆంధ్ర సర్వస్వ కేంద్రం-మద్రాసు (1942)

9. ఆం. సం. సా : ఆంధ్ర సంస్థానములు-సాహిత్య పోషణ
ఆచార్య తూమాటి దోణప్ప(ప్రథమముద్రణ 1969)

10. ఆం. సా. ప. ప : ఆంధ్ర సాహిత్య పరిషత్ పత్రికలు (కాకినాడ)

11. ఆం. సాం. చ : ఆంధ్రుల సాంఘిక చరిత్ర
బి. యస్. శాస్త్రి (ప్రథమ ముద్రణ 1975)

12. ఆం. సాం. చ : ఆంధ్రుల సాంఘిక చరిత్ర
సురవరం ప్రతాపరెడ్డి (ప్రథమ ముద్రణ–1956)

13. ఆరుద్ర : సమగ్రాంధ్ర సాహిత్య సంపుటాలు–
ఆరుద్ర (ప్రథమ ముద్రణ–1965)

14 ఉ. వా. చ : ఉదాహరణ వాఙ్మయ చరిత్ర
నిడుదవోలు వేంకటరావు(ద్వితీయముద్రణ–1968)

15. క. చ : ఆంధ్రకవుల చరిత్ర
కందుకూరి వీరేశలింగం పంతులు

16. క. జీ : కవి జీవితములు
గురజాడ శ్రీరామమూర్తి

17. క. త : ఆంధ్ర కవి తరంగిణి సంపుటాలు–
చాగంటి శేషయ్య
(మొదటి సంపుటము, ద్వితీయ ముద్రణ–1955)

18. కవి జనాశ్రయం : కవి జనాశ్రయము–వావిళ్ళ (1950)

19. క. స : ఆంధ్ర కవి సప్తశతి
బులుసు వేంకట రమణయ్య (1956)

20 కా. ల : కావ్యలహరి
యువభారతి, సికింద్రాబాదు (ప్రథమ ముద్రణ)

21. కావ్యాలంకార సంగ్రహము: వ్యాఖ్యాతలు
,, 1. శిరోమణి సన్నిధానం సూర్యనారాయణశాస్త్రి
(మూడో ముద్రణ–1965)
,, 2. చెలమచెర్ల రంగాచార్యులు

22. ఖ. ల. శి : ఖడ్గ లక్షణ శిరోమణి
నవనప్ప

23. గో. కా. క. సం : గోలకొండ కవుల సంచిక
సురవరం ప్రతాపరెడ్డి

24. చా. ప. మ : చాటు పద్య మణిమంజరి
వేటూరి ప్రభాకరశాస్త్రి (ద్వితీయ భాగము–1952)

25. చా. ప. ర : చాటుపద్య రత్నాకరము
దీపాల పిచ్చయ్యశాస్త్రి (తృతీయ ముద్రణ 1961)

26. చై. ల చైతన్యలహరి
యువభారతి, సికింద్రాబాదు (ప్రథమ ముద్రణ–1972)

27. ఛం. ప. కో : ఛందః పద కోశము
తెలుగు అకాదమి-హైదరాబాద్

28. తం. ఆం. నా. చ : తంజాపుర ఆంధ్ర నాయకరాజ చరిత్రము
కురుగంటి సీతారామయ్య (1932)

29. తి. క. స : తిరుపతి కవుల సమీక్ష

30. తె. క. చ : తెనుగు కవుల చరిత్ర
విరుదవోలు వేంకటరావు
(Lives of Telugu poets) (1968)

31. తె. జా. సా : తెలుగు జానపద గేయ సాహిత్యము
ఆచార్య బి. రామరాజు (ప్రథమ ముద్రణ 1958)

32. తెలుగు : తెలుగు పత్రిక
తెలుగు అకాడమి-హైదరాబాదు (1976-1977)

33. తె. వా : తెలుగు వాఙ్మయము
గంటి జోగి సోమయాజి (ప్రథమ ముద్రణ-1960)

34. తె. వి. స : విజ్ఞాన సర్వస్వ సంపుటాలు 1, 2, 3, 4, 6, 7
తెలుగు భాషా సమితి-మద్రాసు
ప్రథమ ముద్రణ (1967-1) (1961-6)
(1961-4) (1959-3) (1962-7)

35. తె. వ్యా. వి : తెనుగు వ్యాకరణ వికాసము
డా. బొడ్డుపల్లి పురుషోత్తం (1969)

36. తె. శా : తెలుగు శాసనాలు
జి. పరబ్రహ్మశాస్త్రి (1975)

37. తె. సా. విమర్శ : తెలుగులో సాహిత్య విమర్శ
డా. యస్వీ. రామారావు, ప్రథమముద్రణ 1974

38. ద. దే. వా : దక్షిణ దేశీయాంధ్ర వాఙ్మయము
విరుదవోలు వేంకటరావు

39. ద. భా. చ : History of South India
K. A Nilakantha Sastri
(దక్షిణ భారతదేశ చరిత్ర)
(ద్వితీయ ముద్రణ 1958)

40. ద. సా : దక్షిణాంధ్ర సాహిత్యము
వేలూరి వేంకట రమణయ్య

41. ద్వి. వా : ద్విపద వాఙ్మయము
డా. జి. నాగయ్య (1967)

42. ద్వి. సా. చ : ఆంధ్ర ద్విపద సాహిత్య చరిత్ర
డా. టి. సుశీల (1979)

43. నా. ర. చ : ఆంధ్ర నాటక రంగ చరిత్ర
మిక్కిలినేని రాధాకృష్ణమూర్తి
(ప్రథమ ముద్రణ 1969)

44. ప్ర. క : ఆంధ్ర ప్రబంధ కథలు

45. ప్ర. పా : ప్రబంధ పాత్రలు

46. ప్ర. వా. వి : ప్రబంధ వాఙ్మయ వికాసము
డా. పల్లా దుర్గయ్య

47. ప్రా. ఆం. శా : ప్రాచీనాంధ్ర శాసనాలు
డా. బూదరాజు రాధాకృష్ణ (ప్రథమముద్రణ 1971)

48. ప్రా. కా. మం : ప్రాచీన కావ్య మంజరి
విద్వాన్ గంటి జోగిసోమయాజి (1954)

49. ప్రా. ద. దే. చ : The Early History of the Deccan.
Parts VII–XI (1960)
Ed. G. Yazadani
(ప్రాచీన దక్షిణదేశ చరిత్ర)

50. ప్రా. ద. భా. చ : ప్రాచీన దక్షిణ భారత చరిత్ర
నందూరి రామకృష్ణమాచార్యులు (1967)

51. భారతి సంపుటాలు : భారతి సంపుటాలు
మద్రాసు

52. మ. మా : మరుగున పడ్డ మాణిక్యాలు
ప్రథమ ముద్రణ 1966
ప్రజాప్రచురణ, పవరుపేట–ఏలూరు

53. య. గా. వా. సం : ఆంధ్ర యక్షగాన వాఙ్మయ సంపుటాలు
(ఆంధ్ర విశ్వవిద్యాలయ ప్రచురణలు)

54. య. వా. చ : ఆంధ్ర యక్షగాన వాఙ్మయ చరిత్ర
డా. యస్వీ. జోగారావు (1958)

55. రమణీయము : రమణీయము
దువ్వూరి వేంకట రమణ శాస్త్రి

56. రా. గో. వి : రాజగోపాల విలాసము
చెంగల్వ కాళకవి

57. రె. రా. చ : History of the Reddi Kingdoms
M. Somasekhara Sarma (1948)
(రెడ్డి రాజ్యాల చరిత్ర)

58. ల. రం. వ్యా : లక్ష్మీరంజన వ్యాసావళి
ఆచార్య ఖండవల్లి లక్ష్మీరంజనం (1968)

59. వ. వా : ఆంధ్ర వచన వాఙ్మయము
నిడుదవోలు వేంకటరావు (1977)

60. వా. చ : ఆంధ్ర వాఙ్మయ చరిత్రము
ఆచార్య దివాకర్ల వేంకటావధాని
(ఏడవ ముద్రణ 1974)

61. వా. చ. సం : ఆంధ్ర వాఙ్మయ చరిత్ర సంగ్రహము
కల్లూరి వేంకట నారాయణరావు (1951)

62. వా. చ; వం. సు : ఆంధ్ర వాఙ్మయ చరిత్రము
వంగూరి సుబ్బారావు పంతులు

63. వి. న. చ : విజయ నగర చరిత్ర
సూతలపాటి పేరరాజు

64. వి. న. చ : విజయ నగర చరిత్ర
నేలటూరి వేంకట రమణయ్య

65. వీ. యు : వీరేశలింగం యుగము
కల్లూరి వేంకట నారాయణరావు
(ప్రథమ ముద్రణ 1985)

66. వీరేశలింగం పంతులు-సమగ్ర పరిశీలన
డా. అక్కిరాజు రమాపతిరావు
(ప్రథమ ముద్రణ 1972)

67. వీ. శై. వా. చ : వీరశైవాంధ్ర వాఙ్మయ చరిత్ర
శిష్ట్లా రామకృష్ణశాస్త్రి

68. శ. క. చ : శతక కవుల చరిత్రము
వంగూరి సుబ్బారావు పంతులు
(ద్వితీయ ముద్రణ 1957)

69. శ. సా. వి : ఆంధ్ర శతక సాహిత్య వికాసము
డా. కె. గోపాలకృష్ణారావు
(ప్రథమ ముద్రణ 1976)

70. శా. ధ్వ : శారదా ధ్వజము

71. శృం. శ్రీ : శృంగార శ్రీనాథము

72. శ్రీనాథ భారతము : శ్రీనాథ భారతము
ఉస్మానియా విశ్వవిద్యాలయం తెలుగుశాఖ
విద్యార్థులు (1964)

73. శ్రీనాథుడు-కొ శ్రీ.మూ : శ్రీనాథుడు-డా. కొర్లపాటి శ్రీరామమూర్తి
(ప్రథమ ముద్రణ 1971)

74. శ్రీ.నా. శృం : శ్రీనాథుడు శృంగారియా?
దీపాల పిచ్చయ్యశాస్త్రి

75. సం. ఆం. వి. కో : సంగ్రహాంధ్ర విజ్ఞాన కోశం
సంపుటాలు-హైదరాబాదు (1964)

76. సం. సం. ప్ర : సంగీత సంప్రదాయ ప్రదర్శిని

77. సం. సా : సంస్థానముల సాహిత్యసేవ
కేశవపంతుల నరసింహశాస్త్రి
(ప్రథమ ముద్రణ 1979)

78. సా. చ : ఆంధ్ర సాహిత్య చరిత్ర
పింగళి లక్ష్మీకాంతం (1954)

79. సా. చ. సం : ఆంధ్ర సాహిత్య చరిత్ర సంగ్రహము
ఆచార్య ఖండవల్లి లక్ష్మీరంజనం (1956)

80. సా. మంజూష : సాహితీ మంజూష
కళాప్రపంతి, నల్లకుంట, హైదరాబాదు (1976)

81. సిం. వి. : సింహళ విజయము
(Bulletin of the Govt. Oriental Ms. Library, Madras. Vol II
(Part 1. pp. 72-91) — 1949

82. హే. నా. స్వ : హేమాబ్జ నాయికా స్వయంవరము
మన్నారు దేవుడు

83. M. R. T. : Marata Rajas of Tanjore
K. R. Subramanian

84. N. M. : History of the Nayaks of Madura (R. Sathyanatha Aiyar)

85. History of Telugu Literature : G. V. Sitapati Saahitya Akademi 1968 (New Delhi)

86. అన్యవాద కోలాహలము (1949)

87. ఆముక్తమాల్యద

88. ఉత్తర హరి వంశము

89. ఉషాపరిణయము (రంగాజమ్మ)

90. కళాపూర్ణోదయము

91. కవి సంశయ విచ్ఛేదము

92. కాశీఖండము

93. కేయూర బాహుచరిత్ర

94. క్రీడాభిరామము

95. తెలుగు-ఇంగ్లీష్ నిఘంటువు (బ్రౌన్)

96. దక్షిణాంధ్ర యుగ వాఙ్మయ చరిత్ర (కె. వి. ఆర్. నరసింహం)

97. నవనాథ చరిత్ర

98. నిరంకుశోపాఖ్యానము

99. పండితారాధ్య చరిత్ర

100. పల్నాటి వీర చరిత్ర

101. పాండురంగ మాహాత్మ్యము

102. పారిజాతాపహరణము (మాతృభూత కవి)

103. పార్వతీ పరిణయము (రాయ రఘునాథరాయుడు)

104. ప్రబంధ రత్నాకరము

105. ప్రబంధ రత్నావళి (వేటూరి)

106. బసవ పురాణము

107. భీమేశ్వర పురాణము

108. భోజరాజీయము

109. మనుచరిత్ర

110. మన్నారు దాసవిలాసము (ప్రబంధం)

111. రఘునాథ నాయకాభ్యుదయము, రఘునాథాభ్యుదయము

112. రాజగోపాల విలాసము

113. రాయవాచకము

114. వసుచరిత్ర

115. విక్రమార్క చరిత్ర

116. విజయ విలాసము

117. విప్రనారాయణ చరిత్ర (విజయరాఘవ నాయకుడు)

118. వెలుగోటి వారి వంశావళి

119. శివరాత్రి మాహాత్మ్యము

120. శృంగార నైషధము

121. శృంగార శ్రీనాథము (వేటూరి)

122. శైవభక్త చరిత్రము (వచన గ్రంథం)

123. శ్రీకాళహస్తి మాహాత్మ్యము

124. సింహాసన ద్వాత్రింశిక

125. సిద్ధేశ్వర చరిత్ర

126. హర విలాసము

127. హరి వంశము

128. హరిశ్చంద్ర చరిత్ర

# సవరణ పత్రము

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 7 | 27 | అగస్త్య వ్యాకరణోక్త సంగ్రహ | అగస్త్య వ్యాకరణోక్త శబ్ద సంగ్రహ |
| 15 | 19 | అద్భుత రసా | అద్భుత రస |
| 18 | | అధ్యాత్మ రామాయణ కర్తృక ణాదము పెద్దన, ఆధ్యాత్మిక రామాయణ కర్త కాణాదము పెద్దన ఒక్కరే. | |
| 30 | 11 | అప్పారావు మొదలి మాత్తురి | అప్పావు మొదలి మాత్తూరి |
| 34 | | అమరుక కావ్యము, అమరుక శతకము (పుట 35) నామాంతరాలు. | |
| 78 | 8 | అందుగల | అందుగుల |
| 85 | 9 | జయాప | జాయప |
| 89 | 21 | సంనసంవను | సందువి |
| | 22 | సిపే తెంపుటల్ | సిపేతెంపుటల్ |
| 95 | 9 | ఉపవి పెద్దిరాజు రామరాజు, పుట 832 లోని పెద్దిరాజు రామరాజు ఒకరే | |
| 98 | 8 | వృత్త గ్రంధి | వృత్తి గంధి |
| | చివరి | ద్వి. వా. చ. | ద్వి. సా. చ. |
| 99 | 16 | శంభోటీ | శరభోటీ |
| 107 | 15 | వేంటేశ్వర | వేంకటేశ్వర |
| 110 | 7 | ఉషా పరిణయము (సం) | ఉషా పరిణయము |
| 113 | 4 | వేంకటాచలపతికవి | వేంకటాచల కవి |
| | 25 | పరకవి గంగి | పరకవి గంప |
| 140 | చివరి | "గీతను" ను | "గీత" ను |
| 148 | 28 | తన్నప్ప | తిన్నప్ప (తిన్నడు) |
| 168 | 18 | మల్లయార్యుడు కవి మల్లునికి నామాంతరం | |
| | 21 | లక్షణ కవులు | లక్షణకారులు |
| 168 | 13 | కరిస్తూ రంగకవి | కస్తూరి రంగకవి |
| | 28 | కరిస్తూ రంగప్ప | కస్తూరి రంగప్ప |
| 170 | 9 | కిరాధరోపాఖ్యానము | కిరాతరోపాఖ్యానము |
| 194 | 8 | కాలామృతము | కాలామృతమ్ (సం) |
| 204 | | కాళహస్తి కవి, రేవూరి కాళహస్తి కవి (పుట. 930) ఒకరే. | |
| 204 | | కాళహస్తి మాహాత్మ్యము, పుట 826 లోని పెదకాళహస్తి మాహాత్మ్యము నామాంతరాలు. | |

